# శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు

ప్రథమ సంపుటము

పునర్ముద్రణ

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పక్షాన

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి ప్రచురణ




ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవనము, సైఫాబాదు, హైదరాబాదు.

# తొలి పలుకు

శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు పునర్ముద్రణ చేయవలెనని ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వము నిశ్చయించి యీ బాధ్యతను ఆంధ్ర ప్రదేశ సాహిత్య అకాడమీకి అప్పగించినది. మొత్తము ఎనిమిది సంపుటాలలో నాల్గు సంపుటాల పునర్ముద్రణ కార్యము ఇప్పటివరకు పూర్తియైనది. ఈ నాలుగు సంపుటాలను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము పక్షాన, ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ, ఆంధ్రమహా జనులకు ఈనాడు (28-1-1979) అర్పిస్తున్నందుకు మిక్కిలి సంతోషిస్తున్నాను. కడమ నాలుగు సంపుటాలు కూడ ఈ సంవత్సరాంతములోగా అచ్చు కాగలవు.

శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు మొదటి నాలుగు సంపుటాలు స్వర్గీయులైన శ్రీ రావువేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరుగారి అండదండలతో, సంపూర్ణ ఆర్థిక సహకారముతో, స్వర్గీయ జయంతి రామయ్య పంతులుగారి పర్యవేక్షణలో, సిద్ధమై కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్తు పక్షాన ప్రకటితమైనవి. తర్వాత 5, 6, 7 సంపుటాలు 1957 సంవత్సరములో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల సహాయముతో ముద్రితమైనవి. ఏడవ సంపుటము అనుబంధము మాత్రము ముద్రణకాకుండగా, 1965 సంవత్సరములో ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ రూ. 5,000/ ఆర్థిక సహాయము గావించి దీని ముద్రణకు తోడ్పడినది. ఈ అనుబంధ సంపుటము 1974 సంవత్సరము హైదరాబాదు నగరములో, ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ వేదికపైన ఆవిష్కృతమైనది. ఆ సందర్భములో అకాడమీ అధ్యక్షులు డా. బెజవాడ గోపాలరెడ్డి గారు, శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటువు అన్ని సంపుటాలు మరొక పర్యాయము నిర్దుష్టంగా ప్రకటించవలసి యున్నదని భావించి ఆపని నిర్వహించవలసినదని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమును కోరినారు. అప్పటి ముఖ్యమంత్రి శ్రీ. జె. వెంగళరావు గారు ఈ కోరికను అంగీకరించి అందుకు కావలసిన ఏర్పాట్లు చేయగలనని వాగ్దానము చేసినారు.

ముఖ్యమంత్రిగారి వాగ్దానాన్ని అనుసరించి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము ఈ విషయాన్ని పరిశీలించవలెనని, ప్రభుత్వ పురావస్తు శాఖ డైరెక్టర్, డా. రమేశన్ గారి అధ్యక్షతన డా.బి. రామరాజు, ఉస్మానియా విశ్వవిద్యాలయ తెలుగు శాఖాధ్యక్షులు, శ్రీ దేవులపల్లి రామానుజరావు, కార్యదర్శి, ఆంధ్ర ప్రదేశ సాహిత్య అకాడమీ, శ్రీ.ఎన్. వెంకటస్వామి, డైరెక్టర్, తెలుగు అకాడమీ, డా.పి.యస్.ఆర్. అప్పారావు, అప్పుడు ఆఫీసర్ ఆన్ స్పెషల్ డ్యూటీ, గార్లతో కూడిన ఒక సంఘాన్ని నియమించినది. ఈ సంఘము సమావేశమై ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము పక్షాన శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు అచ్చుకావలెననీ, అచ్చుపర్యవేక్షణ ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీకి అప్పగించవలెననీ, తొలిముద్రణములోని అచ్చుతప్పులను సవరించవలెనని, ఇందుకు కావలసిన పూర్తిడబ్బును ప్రభుత్వము యీయవలెనని సిఫారసు చేయగా ఈ సిఫారసును ఆంధ్రప్రదేశ ప్రభుత్వము అంగీకరించినది. తత్ఫలితంగా ఈ సంపుటాల పునర్ముద్రణ కార్యక్రమము ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ చేపట్టినది. ఈ నిఘంటువులలోని అను

బంధాలను గ్రంథభాగములో చేర్చవలెనని కూడ పై సంఘము నిర్ణయించినది. ఈ నిర్ణయానుసారము ఆయా సంపుటాలలోని అచ్చుతప్పులను సవరించి అనుబంధభాగాన్ని గ్రంథములో చేర్చే బాధ్యత మొదటి నాలుగు సంపుటాలమట్టుకు శ్రీయుతులు ఎన్. సి. యస్. పార్థసారథి. బి. వి. శ్రీనివాసాచార్యులు, చీమకుర్తి శేషగిరిరావు, ఎన్. ఎస్. సుందరేశ్వరరావు గార్లకు అప్పగించనైనది. మిగిలిన నాలుగు సంపుటాలు అనగా, 5, 6, 7, 8 సంపుటాలను సవరించే బాధ్యత డా. నిడదవోలు వేంకటరావు గారు, అకాడమీ కోరికపైన నిర్వహించినారు. వీరందరికి అకాడమీ పక్షాన కృతజ్ఞతలు.

ఈ సంపుటము అచ్చుపని శివాజీ ప్రెస్స్, సికిందరాబాదు వారికి అప్పగించి, ముద్రణ పర్యవేక్షకులుగా శ్రీ ఎన్. సి. యస్. పార్థసారథి, శ్రీ ఎన్. ఎస్. సుందరేశ్వరరావు గార్లను నియమించనైనది. వీరందరికి అకాడమీ పక్షాన కృతజ్ఞతలు.

ఈ బాధ్యతను ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీకి అప్పగించి కావలసిన డబ్బును పూర్తిగా మంజూరుచేసి, సగము డబ్బును ఇప్పటి వరకు విడుదల చేసి, సాహిత్య అకాడమీ పట్ల విశ్వాసము ప్రకటించిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమునకు అకాడమీ పక్షాన ధన్యవాదాలు.

ఈ సంపుటాల ముద్రణకు కావలసిన కాగితము కేంద్రప్రభుత్వము, ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వము ద్వారా సరసమైన ధరకు అకాడమీకి ఇచ్చినది. ఇందుకు వారికి కూడ అనేక ధన్యవాదాలు.

హైదరాబాదు
28-1-79

దేవులపల్లి రామానుజరావు
కార్యదర్శి
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి



# సూర్యరాయాంధ్ర నిఘంటువు

## ప్రథమ సంపుటము

## అ - ఔ

పండిత సాహాయ్యమున

**జయంతి రామయ్య పంతులు** బి. ఏ., బి. ఎల్.

గారిచే రచింపఁబడి

**కాకినాడ**

**ఆంధ్ర సాహిత్య పరిషత్తు**

వారిచేఁ బ్రకటింపఁబడినది.



వాణీ ముద్రాక్షరశాల

బెజవాడ

**1936**



---

ప్రథమ ముద్రణము - ముఖపత్రము.



మహారాజా రావు వేంకట కుమార మహీపతి
సూర్యారావు బహద్దరు C. B. E. గారు



# సూర్యరాయాంధ్రనిఘంటువు

## పీ ఠి క.

---

సంస్కృతమునందుఁబోలె నాంధ్రమందును బూర్వులాక్షణికకృతము లగు నిఘంటువులు కొన్ని గలవు. నాకుఁ దెలిసినంతవఱ కా గ్రంథములపే ళ్లీక్రింద నుదాహరించుచున్నాఁడను.

1. కస్తూరిరంగకవికృతసాంబనిఘంటువు.
2. పైఁడిపాటి లక్ష్మణకవిప్రణీతాంధ్రరత్నాకరము
3. పైఁడిపాటి కవిలక్ష్మణప్రణీతాంధ్రనామసంగ్రహము.
4. అడిదము సూరకవిప్రణీతాంధ్రనామశేషము.
5. గణపవరపు వేంకటకవిప్రణీతవేంకటేశాంధ్రము.
6. ఆకవియే రచించిన అకారాదిదేశీయాంధ్రనిఘంటువు.
7. శ్రీరాజా త్యాడి పూసపాటి వీరపరాజు రచించిన యాంధ్రపదాకరము.
8. ప్రెగడపువారి కందములు.
9. చౌడప్ప సీసములు.
10. నుదురుపాటి వేంకటకవిప్రణీతాంధ్రభాషార్ణవము.

వీనిలో నెల్ల నాంధ్రభాషార్ణవ ముత్తమ మయినది ఇది సంస్కృతములోని యమరకోశమురీతిని గూర్పబడినది. చాలవఱకు సమగ్రమయిన దని చెప్పవచ్చును. ఈ నిఘంటువు లన్నియుఁ బద్యాత్మకములు. కొన్ని కొన్ని శబ్దములకుఁ గల నానార్థము లిందుఁ జూపఁబడి యున్నను మొత్తముమీఁద నీగ్రంథములన్నియుఁ బర్యాయపదమాలికలే యని చెప్పవచ్చును. ఇవి వేదమువలెఁ గంఠపాఠముగా పఠించినవారికే యుపకరించును. కావ్యములు చదువునప్పు డే దయిన నొకశబ్దము యొక్క యర్థమునుగూర్చి సందేహము చప్పునఁ దీర్చుకొనుట కీ నిఘంటువు లనుకూలింపవు. అక్షరక్రమముగాఁ గూర్పఁబడిన నిఘంటువులే యిందున కుపయోగించును. సంస్కృతభాషయందుఁ గేశవనిఘంటువులో నాద్యక్షరనియమమును, విశ్వనిఘంటువులో నంత్యాక్షరనియమమును, మేదిని నిఘంటువులో నాద్యంతాక్షరనియమమును గలవు. కాని పదగతసర్వాక్షరక్రమనియమ మాంగ్ల నిఘంటువులనుండి గ్రహింపఁబడినది.

తెలుఁగులో మొట్టమొదట నిట్టి యక్షరక్రమనిఘంటువు కూర్చినయాతఁడు ఏ. డి. కాంబెలు (Mr. A. D. Campbell) అను నాంగ్లపండితుఁడు. ఈయన రాజకీయోద్యోగము (Indian Civil Service) నందుండియు నాంధ్రభాష శ్రద్ధతో నభ్యసించి కొంత పాండిత్యము సంపాదించుకొనెను ఆయన రచించిన నిఘంటువులోఁ దెనుఁగుపదములును వానికి సరియైన యాంగ్లార్థములును జూపఁబడినవి. ఈనిఘంటువు తెనుఁగు చదువుకొను పాశ్చాత్యులకే ముఖ్యముగా నుపకరించును. వారికొఱకే యీకోశము కూర్పఁబడినది. ఈ నిఘంటువు సంగ్రహరూపముగా నున్నది ఇందులోఁ జేరనిశబ్దము లనేకము లున్నవి. చేరినశబ్దములకైన నున్నయర్థము లన్నియు వివరింపఁబడలేదు. పిదపఁ గొంతకాలమునకు సి. పి. బ్రౌను (Mr. C. P. Brown) మహాశయుఁడు కూర్చిన పెద్దనిఘంటువునందీ లోపములు చాలవఱకుఁ దొలగింపఁ బడినవి. కాంబెలుగారివలెనే బ్రౌనుగారును రాజకీయోద్యోగము (Indian Civil Service లో నుండి యనేక పండితుల నాకర్షించి యాంధ్రవాఙ్మయమునందు మంచి ప్రవేశము సంపాదించుకొనిరి. తెనుఁగుపదములకాంగ్లార్థములు గలది యొక్కటియు నాంగ్లపదములకుఁ దెనుఁగర్థములు గలది యొక్కటియు రెండునిఘంటువు లీయన కూర్చెను. కాంబెలునిఘంటువులో లేని యనేక పదము లీనిఘంటువునందుఁ గలవు. శబ్దార్థముల స్పష్టపఱచులోకోక్తులును బూర్వకవిప్రయుక్తములు నచ్చటచ్చట నుదాహరింపఁబడినవి. ఈ నిఘంటువుకూడ నాంగ్లేయభాషాపరిచయము గల వారికే యుపకరించునదిగా నున్నది, సమగ్రమును గాదు ఆంధ్రజనసామాన్యమున కుపకరించునట్టియుఁ బండితాదరపాత్రమగునట్టియు నిఘంటువు గూర్పవలయు నని పరవస్తు చిన్నయసూరిగారును, బహుజనపల్లి సీతారామాచార్యులుగారును బ్రయత్నించిరి. సూరిగారి ప్రయత్నము తుదముట్టలేదు. ఆయన పదములపట్టికమాత్రము సిద్ధముచేసిరి, అర్థనిర్ణయమునకుఁ గావలసిన పూర్వకవిప్రయుక్తవాక్యములఁ గొన్నిటి నెత్తి వ్రాసిరి, కాని పెక్కుశబ్దముల కర్థనిర్ణయము చేయలేదు, చేసినపని యయినను సమగ్రముగా లేదు. సీతారామాచార్యులుగారు శబ్దరత్నాకరమను నిఘంటువును గూర్చిరి. ఇందు శబ్దములరూపనిర్ణయమును శాస్త్రసమ్మతముగా నొనర్చిరి. అచ్చటచ్చట గ్రంథములనుండి ప్రమాణవాక్యము లుదాహరించిరి. పూర్వ నిఘంటువులకంటె నిది బహువిధముల మేలయిన దనుటకు సందేహములేదు ఇదికూడ సమగ్రము కాదనియు భాషలోనున్న శబ్దముల రూపములు నర్థభేదములును సప్రమాణముగాఁ దెలుపునట్టిబృహన్నిఘంటువావశ్యకమనియుఁ గీర్తిశేషులగు కందుకూరి వీరేశలింగముపంతులుగారు మొదలగు విద్వత్కవు లనేకులు తలంచుచుండిరి. అట్టి నిఘంటువును రచింపించి ప్రకటించుట యాంధ్రసాహిత్యపరిషత్తు ముఖ్యోద్దేశములలో నొకటి. పరిషన్ముఖ్య ప్రతిష్ఠాపకులును, మాతృభాషాభిమాన్యగ్రేసరులును, మహోదారులును, శ్రీపీఠికాపురాధీశ్వరులును నగు మహారాజా శ్రీ రావు వేంకటకుమారమహీపతి

సూర్యారావు బహదరుగారు నిఘంటునిర్మాణమునకుఁ గావలసినధనమంతయుఁ దామె యిచ్చెద మని ప్రతిజ్ఞ చేసి పరిషత్తు సీఘనకార్యము నిర్వహించుటకు సమర్థ మయినదానినిగా నొనర్చిరి. ఈమహోపకారమునకు బరిషత్కృతజ్ఞతను సూచించుటకై నిఘంటువునకు "శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటు" వను నామకరణము చేసితిమి.

నేఁటి కజాదిశబ్దము లున్నియుఁ గల ప్రథమసంపుటము పూర్తియయినది. మిగిలిన గ్రంథ మంతయు శీఘ్రముగాఁ బూర్తి యగునట్లు సర్వేశ్వరుఁ డనుగ్రహించుఁ గాక. గ్రంథ నిర్మాణములో మే మవలంబించినపద్ధతి నించుక వివరించెద.

గ్రం థ ని ర్మా ణ ప ద్ధ తి.

ఆంధ్రభాషలోని పదములు తత్సమములు, అచ్చికములు, అన్యదేశ్యములు నని మూఁడువిధములుగా విభాగింపవచ్చును. అచ్చికములు వైకృతములు దేశ్యములు నని రెండు విధములు గ్రామ్యము అను విభాగ మొక్కటి కలదు గాని గ్రామ్యశబ్దములు లక్షణవిరుద్ధములై బహువిధములుగా నుండుటచే వాని నీగ్రంథమునఁ జేర్పలేదు.

తత్సమములు:- ఆంధ్రప్రత్యయాదులు చేర్పఁబడినసంస్కృతశబ్దములు తత్సమము లనఁబడును. తత్సమశబ్దనిర్మాణవిధాన మాంధ్రవ్యాకరణములందు నిర్ణయింపఁబడి యున్నది. ఈనియమము ననుసరించి సంస్కృతశబ్దముల బహుళముగాఁ దెనుఁగులోనికిఁ దెచ్చుకొనవచ్చును తత్సమపదములు పరిశీలనపూర్వకముగా సంస్కృత నిఘంటువుల నుండి గ్రహింపఁబడినవి. సంశయము గలిగినప్పుడు కావ్యాదిమూలగ్రంథములఁబట్టియు వ్యాకరణశాస్త్రమునుబట్టియు శబ్దస్వరూపార్థనిర్ణయము చేయఁబడినది. శబ్దముల కుందు నానార్థములు చూపఁబడినవి. ప్రయోగవిశేషము లున్నప్పుడుమాత్రము గ్రంథములనుండి ప్రమాణవాక్యము లుదాహరింపఁబడినవి. తెలుఁగులోఁ బృథక్ప్రయోగార్హములు గాకున్నను సమాసములలో నుపయోగింపఁబడును గనుక ఉపసర్గశ్రతంతాదిశబ్దములుగూడ నిందు గ్రహింపఁబడినవి. ఈ నిఘంటువునం దున్న సంస్కృతపదజాలము శబ్దరత్నాకరము నందున్నదానికంటెఁ బెక్కుమడుఁగు లధికము. ఈవిషయములో నీ నిఘంటువు సంస్కృత విద్యార్థులకుఁగూడ మిక్కిలి యుపకరించు నని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును.

"ఆంధ్రవాఙ్మయమునం దీవఱలోఁ బ్రయోగింపఁబడియున్న సంస్కృతశబ్దములను మాత్రమే నిఘంటువులోఁ జూపవలయును గాని యితర సంస్కృతశబ్దములఁ జూపరా"దని కొందఱ యభిప్రాయము. ఈ యభిప్రాయము ననుసరించినచో నాంధ్రవాఙ్మయమందుఁ గల సంస్కృతశబ్దములనన్నింటిని పరిశోధించి యెత్తివ్రాయవలయును. అనేక శబ్దములు సమాసములలో నిమిడియున్నవి. ఒక్క యుదాహరణము చూడుఁడు.

అటఁ జని కాంచె భూమిసురుఁ డంబర చుంబి శిరస్సరఝ్ఝరీ
పటలముహుర్ముహుర్లుఠదభంగతరంగమృదంగనిస్వన
స్ఫుటనటనానురూపపరిఫుల్లకలాపకలాపిజాలమున్
గటకచరత్కరేణుకరకంపితసాలము శీతశైలమున్. మనుచ. 2. 3.

ఈ పద్యమందలి దీర్ఘసమాసములో నిరువదిశబ్దము లున్నవి వానిలోఁ జిట్ట చివరది మాత్రమే విభక్తిప్రత్యయముతోఁగూడి తత్సమశబ్దముగా నున్నది. తక్కిన శబ్దముల యర్థము కూడఁ బాఠకుడు తెలిసికొనవలసిన వాఁడే కదా! కావున నీ శబ్దముల నన్నింటిని దత్సమరూపములతో వేఱువేఱుగా నిఘంటువులోఁ జూపవలని యుండును. ఈ ప్రకారము చేసినచో శబ్దరత్నాకరమునం దున్న శబ్దములకంటె నధిక శబ్దము లనేకములు దొరకు ననుటకు సందేహము లేదు. మఱియు, సంస్కృత శబ్దము లేవియో కొన్ని తప్పఁ దక్కినవి యథేచ్ఛముగాఁ దెనుఁగులో వాడవచ్చును. వానిని దత్సమములుగా మార్చుట కాంధ్రవ్యాకరణములలో సూత్రము లేర్పడి యున్నవి. కావునఁ బూర్వకవులు ప్రయోగించియుండని శబ్దముల భావికవులు ప్రయోగింపవచ్చును. మఱియు నిఘంటువు పాఠకులకు మాత్రమే గాక గ్రంథరచనము చేయువారికిఁగూడ నుపయోగించు నట్టిదిగా నుండవలయును. గ్రంథరచనము చేయువారు సంశయము గలిగినప్పు డెల్ల నిఘంటువులఁ జూచుచుండుట యనుభవ సిద్ధము. ఈ హేతువు లన్నింటినిబట్టి పెక్కు సంస్కృతశబ్దము లీ నిఘంటువులోఁ జేర్పఁ బడినవి. కిట్టెలుమహాశయసంకలితకర్ణాటాంగ్లేయనిఘంటువునందుఁగూడ నీపద్ధతియే యనుసరింపఁబడినది. సంస్కృతశబ్దములకు 'ఇంచు'గాగమము చేర్చినచోఁ దత్సమక్రియ లగుననుసామాన్యశాస్త్రము కలదు గాని పూర్వకవి ప్రయుక్తములనుమాత్రమే గ్రహించుట యాచారమై యున్నది. మేము నీయాచార మవలంబించి యచ్చతెనుఁగు శబ్దములకువలెనే తత్సమక్రియలకును దఱచుగాఁ బూర్వకవి ప్రయోగాదివివరణము లిచ్చినారము.

ఉకారాంతసంస్కృతపదములు రెండురూపములును గల మహద్వాచక విశేష్యము లైనపుడు 'డు' వర్ణాంత 'వు' వర్ణాంతరూపములు రెండును నీయఁబడినవి. ఉదా: అమృతాంశువు(ఁడు). విశేషణములైనపుడు మూఁడులింగములకు నుపయోగించు 'వు' వర్ణాంత రూపముకూడ నుండునని యెఱుంగునది. ఉదా: అతప్తతనువు.

'అన' అనునది యంతమునఁ గల 'ఆర్దనము' మున్నగు తత్సమవిశేషణశబ్దముల స్త్రీలింగరూపములు కర్తృకరణాద్యర్థభేదము ననుసరించి అకారాంతములుగాను ఈకారాంతములుగాను గూడ నుండును. కాని ప్రయోగప్రాచుర్యమునుబట్టియు నిఘంటువులను బట్టియుఁ బెక్కువట్ల నొకరూపముమాత్రమే చూపఁబడినది. (చూ. అంకనము, అనురంజనము.)

**అచ్చతెలుఁగులు :—** వైకృతములు దేశ్యములు నని యచ్చతెలుఁగు శబ్దములు రెండు విధములు. ఆంగ్లేయభాషలోనికి లాటిను (Latin) భాషాపదములు ఫ్రెంచి (French) భాషాద్వారమున వచ్చి చేరినట్లు తద్భవశబ్దములలో ననేకములు సంస్కృతమునుండి ప్రాకృత భాషాద్వారమున వచ్చి తెలుగులోఁ జేరినవి. ప్రాకృతము మాతృభాషగాఁగల యాంధ్ర వంశ్యాదిరాజులు కొందఱు ప్రాచీనకాలమందుఁ దెలుఁగుదేశము నాక్రమించి పాలించినట్లు శిలాశాసనములవలనఁ దెలియుచున్నది. ఆకాలమందే తద్భవశబ్దము లనేకములు పుట్టి యుండును. ఇటీవల నాంధ్రకవులు కొన్నితద్భవములను గల్పించియుందురు. కాని వీని సంఖ్య యధికముగా నుండ దని తోఁచుచున్నది. సంస్కృతశబ్దము లనేకములు తొలుతఁ గొన్నిమార్పులఁ జెంది ప్రాకృతము లనుపేరు కలిగినది. రూపమం దీశబ్దములు దేశ్యశబ్ద నిర్విశేషములుగా నుండును.

దేశ్యవైకృతవిభాగము శబ్దరత్నాకరమందుఁ జేయఁబడినది. కాని పెక్కు తావులం దీనిర్ణయము తప్పిపోయిన దని పండితులయభిప్రాయము. ప్రాకృతాంధ్రభాషలకుఁగల సంబంధము చక్కఁగాఁ దెలుపు గ్రంథము లిప్పుడంతగా లేవు. ఈసంబంధమింకను విమర్శన పూర్వకముగా నిర్ణీతము కావలసియున్నది వర్తమానకాలమం దీవిభాగముచేయుట సాహసముగా నుండునను భీతిచేత మానివేయుటయైనది. కాని పెక్కు శబ్దములకు సంస్కృత ప్రాకృతములందును దమిళకర్ణాటాది ద్రావిడ భాషలందును గల సజాతీయపదములను సాధ్యమయినంతవఱకుఁ జూపియున్నారము. ఈసామగ్రినిబట్టి మూలశబ్దము లేవియో జన్య శబ్దము లేవియో పండితులు నిర్ణయింతురుగాక.

తెలుఁగుశబ్దముల రూపములు నర్థములు నిర్ణయించుటకుఁ గొంతవఱకు వ్యావహారిక భాషయుఁ జాలవఱకు వాఙ్మయమును నాధారములు. ఇందుకై వాఙ్మయమంతయుఁ గ్రొత్తగాఁజదివి యర్థసహితముగా నొక్కొక్కశబ్ద మొక్కొక్క కాగితపుముక్కమీఁద నెత్తి వ్రాసి పిదప నీముక్కల నన్నింటిని గలిపి యక్షరక్రమముగా విభజనముచేసి యర్థాదులను రెండుమూఁడుతడవలు పరిశీలించి నిర్ణయించుటయైనది. ఈవిషయములో మేము చేసిన పరిశీలనము కొందఱ కతిమాత్ర మని తోఁ నను దోఁపవచ్చును అయినను సాధ్యమయినంతవఱకుఁ బ్రమాదములు లేకుండఁ జేయవలయు ననునూహతో నీవిషయములో నధికశ్రమము పడవలసివచ్చినది. ఈశ్రమమునకుఁ దగినఫలము లభించిన దని మాయాశయము. నిఘంటువును సహృదయభావముతో విమర్శించువిద్వాంసుల కది గోచరింపకమానదను నమ్మకమును గలదు.

**శబ్దస్వరూపనిర్ణయము :-** శబ్దస్వరూపముల నిర్ణయించుటకుఁ గొంతవఱకు లోక వ్యవహారమును జాలవఱకుఁ బద్యగ్రంథములును నాధారములు. శబ్దస్వరూపము మార్చి

నచో ఛందోభంగ మగునట్టి ప్రయోగము లిందునకుఁ బరమప్రమాణములు. అట్టి ప్రమాణములు దొరకనప్పుడు శిష్టప్రయోగబాహుళ్యమునుబట్టి రూపములను నిర్ణయించుట యైనది. ఈసందర్భమున గ్రంథముల యచ్చుప్రతులుమాత్రమే గాక సందేహములు కలిగినప్పుడు తాటియాకువ్రాఁతప్రతులుకూడఁ బరిశీలింపఁబడినవి.

అర్థనిర్ణయము :- ఒక్కొక్కశబ్దమున కొక్కొకటే యర్థమున్నచో నది నిర్ణయించుట సులభము. అట్లుగాక బహ్వర్థములుగల శబ్దములనేకములు కన్పట్టుచున్నవి. ఈయర్థములలోనొకటి మూలార్థము. తక్కినవి యామూలార్థము కాలక్రమమున మాఱఁగా నేర్పడినవి. ఈ సంప్రదాయము సర్వభాషలయందును గలదు. ఏయేయర్థ మెప్పుడెవ్వుడేరీతిగా నేర్పడినదో నిర్ణయించుటకుఁ దగినసాధనసామగ్రి మాకు దొరకలేదు. నన్నయభట్టారకునినాఁటికే యీ మార్పు లనేకములు కలిగినట్లు కనుపట్టు చున్నది. అర్థముల ఛాయాభేదములు సువ్యక్తము లైనప్పుడు వానిని వేఱువేఱర్థములుగాఁ జూపుట యైనది. ఛాయాభేదములు స్వల్పము లయినప్పుడు వాని నేకార్థముగానే చూపి భేదమును (-) ఈగుర్తుచేతఁ జూపుట యైనది. ఉదా:- ఆడు. అ. క్రి. 8. సంచరించు, తిరుగు; విహరించు - ఇచట సంచరించు, తిరుగు నను రెండుశబ్దములును సమానార్థకములు. సంశయవిచ్ఛేదమునకై యొకయర్థమునే రెండుపర్యాయపదములచేఁ జూపుటయైనది. ఈపదములు కేవలపర్యాయపదములే కాని వీని కర్థభేదము లేదని సూచించుటకై వీని రెంటికి నడుమ కామా (,) గుర్తుంపఁబడినది ఈ శబ్దమునకే 'విహరించు' నను నర్థముకూడఁ జూపఁబడినది. ఈయర్థమునకును సంచరించు శబ్దార్థమునకును నీషద్భేదము కలదు గాని యది ప్రత్యేకార్థముగాఁ జూపవలసినంతటిది కాదు. ఈషద్భేదము కలదని సూచించుటకై ఈపదమునకును బూర్వపదమునకును నడుమ 'సెమికోలను' (;) గుర్తుంపఁబడినది. ఈనియమమే యితరస్థలములందుఁగూడఁ బాటింపఁబడినది. అనఁగా, 'కామా'చే విభజింపఁబడినపదములు సమానార్థకములనియు. 'సెమికోలను'చే విభజింపఁబడినపదముల కీషదర్థభేదము కలదనియు నూహించునది. అర్థనిర్ణయమునందే యింకొక్క విశేషముకూడఁ గలదు. అన్న యనుశబ్దమునకు 'తండ్రి' యనునది ప్రథమార్థముగాఁ జూపఁబడినది ఈయర్థమునందే (క) కన్నవాఁడు. (చ) వాత్సల్యమును దెలుపును. (ట) పురుషనామముల కనుప్రయుక్తము అని మూఁడవాంతరభేదములు సూచింపఁబడినవి. ఈ మూఁడర్థములకును దండ్రియను భావము సమానమే. కాని రెండవమూఁడవయర్థములలో నది గూఢముగానున్నది. ఇట్టివివేచనము సందర్భానుసారముగా నితరస్థలములందుఁగూడఁ జూడనగు. (చ) (ట) సంజ్ఞలుగల యర్థములకుఁ గేవల పర్యాయపదము లిచ్చుట యనుకూలపడకుండుటచే నాయర్థములను వాక్యమూలముననను సమష్టిపదములమూలముననను సూచించుటయైనది. ఈ పద్ధతి యచ్చటచ్చట నితరస్థలములందునుగూడఁ గనుపట్టును.

**ఉదాహరణములు :-** అర్థముల కుదాహరణము లిచ్చుపద్ధతి యాంగ్లేయనిఘంటువుల నుండి గ్రహింపఁబడినది. ఉదాహరణములవలనిప్రయోజనములు రెండు. అర్థసిద్ధి యెట్లయి నదియుఁ దెలుపుట యొకటి. ఆయాయర్థములలో నాయాశబ్దముల నెట్లు ప్రయోగింపవల యునో తెలుపుట యొకటి. అర్థము తెలిసినంతమాత్రమున నౌచిత్యభంగము కాకుండ శబ్ద ములను బ్రయోగించుట తెలియదు, గ్రంథపరిచయమువలనఁ దెలియును. అట్టిపరిచయము లేనివారలకు నిఘంటువులలో నుదాహరణము లావశ్యకములు. పద్యములుగాని పద్య భాగ ములు గాని యుదాహరింపకుండ గ్రంథముల నామములును ఆశ్వాసములయొక్కయుఁ బద్య ములయొక్కయు సంఖ్యలును మాత్ర మిచ్చినఁ జాలు నని కొందఱయభిప్రాయము. కిట్టెలు కర్ణాటాఁగ్లేయ నిఘంటువు మొదలగు కొన్నినిఘంటువులలో నీపద్ధతి యవలంబింపఁ బడినది. కాని యందఱకు నన్ని గ్రంథములు లభింపవు కావున నీపద్ధతి కొలఁదిమందికి మాత్రమే యుపకరించును. ప్రమాణవాక్యముల నుదాహరించుటయే ప్రసిద్ధాంగ్లేయ నిఘంటుసంప్రదా యము. ఇది బ్రౌణ్యమునందును శబ్దరత్నాకరమందును ననుసరింపఁబడినది. కాని యా నిఘంటువులలో నిచ్చిన యుదాహరణములు మిక్కిలి కొంచెముగా నున్నవి.

సాధారణముగా నొకయర్థమున కొకయుదాహరణము చాలును కాని కొన్నితావులం దర్థాతరస్ఫూర్తిని దొలగించుటకై ప్రయోగాంతరము లావశ్యకములు కొన్నియుదాహరణ ములు శబ్దస్వరూపమును నిర్ణయించుటకే యధికముగా నుపకరించును. కొన్ని యర్థస్ఫూ ర్తికి మాత్రమే యుపకరించును. ప్రయోగౌచిత్యమును సూచించుటకుఁ గూడ నుదాహరణ బాహుళ్యము కావలసియున్నది. ఈకారణములచేతఁ గొన్నితావులందుఁ బ్రమాణవాక్యము లను విపులముగా నుదాహరింపవలసివచ్చినది స్థూలదృష్టితోఁ జూచినవారి కిది యతిమాత్ర మని తోఁపవచ్చును.

అర్థస్ఫూర్తికిఁ గావలసినంతవాక్య ముదాహరింపవలయునుగదా! ఒకప్పుడు చిన్న వాక్యమువలననే యర్థస్ఫూర్తియగును. ఒకప్పుడు పద్య మంతయు నుదాహరించినఁ గాని యర్థస్ఫూర్తిగాదు. అంగడి శబ్దమునకు "అగసాలె మున్నగువారుపనిచేయుచోటు" అను నర్థమునకు మత్తేభవృత్తపద్య ముదాహరింపఁబడినది. అంగడి శబ్ద మీపద్యముచిట్టచివర నున్నది. కాని యర్థస్ఫూర్తి కలుగఁజేయుమాటలు పద్యమం దచ్చటచ్చటఁ గలవు కావునఁ బద్యమంతయు నుదాహరింపవలసివచ్చినది కొన్నిచోటులఁ బ్రధానపద్యమునకుఁ బూర్వ మందుఁగాని పరమందుఁగాని యున్న పద్యములుగాని పద్యభాగములుగాని యుదాహరింప వలసివచ్చినది. కొన్నితావుల ననేకపద్యములు చదివినఁగాని యర్థస్ఫూర్తికాదు. ఆ పద్యము లన్నియు నుదాహరించుటకు వీలులేక వానివలనఁ దెలిసికొనఁదగిన విషయము సంగ్రహవాక్య

రూపముగా నుదాహృత ప్రధానపద్యమునకు ముందుఁ జేర్పఁబడినది  పాల్కురికి సోమ
థుని కవిత్వమం దిట్టియవతారికవాక్యములు పెక్కు తావులయం దావశ్యకములగును

ఇచ్చినప్రయోగములలోఁ బాఠాంతరములున్నపట్లఁ బ్రశస్తతమము లని తోఁచిన
ములే గ్రహింపఁబడినవి. అచ్చతెనుఁగు శబ్దములకుఁబోలెఁ దత్సమక్రియాపదములక
దెలుఁగులోమాత్రము కానవగు నర్థవిశేషములుగలతత్సమవిశేష్యవిశేషణశబ్దములకును బ్రమ
వాక్యము లుదాహరింపఁబడినవి. కొన్ని యెడల భిన్నపదములకూడికచే వేఱుశబ్ద
లేర్పడుటయు వాని కవయవార్థముకంటె భిన్నమయినయర్థ మేర్పడుటయుఁ గలదు.
సమష్టిపదములను బ్రధానపదముల యడుగున నిచ్చి వానియర్థము సప్రమాణముగఁ జ
లిమి. వీలునుబట్టి యన్నియో కొన్నియో జన్యశబ్దములనుగూడఁ బ్రధానశబ్దములయడు
నుదాహరించి వాని యర్థాదు లక్షరక్రమమున నాయాశబ్దములు వచ్చినపుడు చూపితి
ఉదాహరణవాక్యములు గ్రంథములనుండిమాత్రమే గాక సందర్భోచితముగా నచ్చటచ
లోకవ్యవహారమునుండియుఁ బ్రాచీనశిలాశాసనములనుండియు గ్రహింపబడినవి. ఉదాహ
వాక్యములం దెచ్చటనయిన లక్షణవిరుద్ధప్రయోగము లుండవచ్చును. అట్టివాక్యము లే
విషయములకై యుదాహరించబడినవో ఆయా విషయములందుమాత్రమే ప్రమాణము
గ్రహింపవలయును.

రూపమం దభిన్నములయ్యు నర్థమందుఁగాని వ్యుత్పత్తియందుఁగాని సంబంధమేమిఁ
లేని శబ్దములు కొన్ని గలవు. వానిని వేఱువేఱుశబ్దములుగా గ్రహించి వానిమీఁద 1,
మొదలగు నాంగ్లసంఖ్యారూపచిహ్నము లుంచఁబడినవి. (చూ. అంట, అందు. అప్పన

( = ) ఈసమచిహ్నము సమష్టిపదాదుల కిచ్చునర్థములముందఱను సమానార్థక పదమ
మధ్యమునను నక్కడక్కడ రూపాంతరములనడుమను నుపయోగింపఁబడినది.

సమానార్థకపదములలోఁ బ్రధానముగా గ్రహింపఁబడిన పదమున కర్థము లంతెల
నీయఁబడినవి. తక్కు వానియర్థములు తఱచు కుండలీకృతములై యుండును, చూ. ఉబ్బరిం
ఉబ్బు.) ఇట్టి పదములలో నేదానిక్రిందనైనను బ్రయోగాదర్శనముచేఁ దక్కువానికిఁగల కొ
యర్థము లీయబడకపోయినను ఆయర్థము లుండవచ్చునని భావించుకొనవలయును. (చ
అకరు, ఆకరువు.). వ్యుత్పత్త్యర్థమును వివరణాదులను దెలుపువాక్యమునకు వెనుక
ముందును దీర్ఘరేఖలు(- -) ఉంపఁబడినవి.

పూర్వకవిప్రయోగము నాధారముచేసికొని కొన్ని మాఱుమూలపదములును నర్థ
లును బూర్వనిఘంటుకర్తలు గ్రహించినారు. వా రుదాహరించిన ప్రమాణవాక్యములక
బాఠాంతరములు కొన్ని చోటలఁ గనుపట్టుచున్నందున నిం దాపదములను నర్థములను ద్యజి
చుటయైనది శబ్దరత్నాకరమందలి 'అంక, అనుము = ఒప్పు' మొదలగునవి యట్టిత్యక్తము

లోనవి. కొన్ని శబ్దములు ప్రమాణరహితముగఁ బూర్వనిఘంటువులలో గ్రహింపఁబడినవి వానికిఁ దగిన యాధారము మాకు దొరకకపోయినను నెక్కడనైన వాడుకలో నుండుట కని పట్టి నిఘంటుకర్తలా పదములను గ్రహించియుందు రను నమ్మకముతో నా శబ్దములను మేమును గ్రహించి వానికిఁ బ్రమాణముగా నాయా నిఘంటునామములను జూపినారము ఇట్టి శబ్దము లీనిఘంటువునం దచ్చటచ్చటఁ గాననగు (చూ అల్లితెమ్మెర. ప్రౌ. అవుటము. వి ని)

'అంగమచ్ఛము, అంతరదామర' ఇత్యాదిపదములు ప్రామాణికగ్రంథములందుఁ బ్రయోగింపఁబడియుండుటచే వానిని మేమును గ్రహించినారము గ్రామ్యపదములను బరిహరించితిమి యుక్తము లని తోఁచిన కొన్ని యన్యదేశ్యములను గ్రహించినారము (చూ. ఆనకట్ట, ఈదు)

అర్థము స్పష్టముగాఁ దెలియుటకై వివరణములోఁ జెప్పఁబడు శబ్దరత్నాకరమునందు వలె విసంధు లుపయోగింపఁబడినవి

పీఠికాపురము
24-?-19?6.

జయంతి రామయ్య.

| సంకేతములు. | వివరణము. |
|---|---|
| అ. | అకారాంతము - ఇట్లే:- ఆ, ఈ, చ్, జ్, మొదలగునవి తత్తదంతములుగా గ్రహించునది. |
| అ. ఆ; ఈ. అ. | పుంలింగవిశేషణమయినపుడు అకారాంతము. స్త్రీలింగవిశేషణ మయినపుడు ఆకారాంతము లేక ఈకారాంతము. నపుంసకలింగ విశేషణమయినపుడు అకారాంతము. స్త్రీలింగములలో విశేషము లున్నపుడు అవి సూచింపఁబడినవి. చివర యచ్చులను బట్టి యవి తత్తదంతములుగా గ్రహించునది. ఉదా;- (1) అంకకుఁడు. విణ. (అ. కికా. అ.) ఇట స్త్రీలింగరూపము ఆకారాంతమగు ''అంకికా. (2) అంతర్ధాత. విణ. (ఋ. త్రీ. ఋ.) ఇట స్త్రీలింగరూపము ఈకారాంతమగు 'అంతర్ధాత్రీ. (3) అంకి. విణ. (న్. నీ. న్ ). ఇట స్త్రీలింగరూపము ఈకారాంతమగు 'అంకినీ'. (4) అపటువు విణ. (ఉ. ఉ, ట్వీ. ఉ ) ఇట ఉకారాంతమగు 'అపటువు'ను ఈకారాంతమగు 'అపట్వీ' యును స్త్రీలింగరూపములు. (5) అనామము. విణ. (న్, న్, మ్నీ, అ. న్). ఇట నకారాంతమగు 'అనామ' యును ఈకారాంతమగు 'అనామ్నీ'యును ఆకారాంతమగు 'అనామా' యును స్త్రీలింగ రూపములుగా నెఱుంగునది. |
| అ. క్రి. | అకర్మక క్రియ. |
| అనౌ. | అనౌపవిభక్తికము. |
| అప. | అపదము. (ఆగమము మొదలగునవి.) |
| అలం. | అలంకారశాస్త్రము. |
| అవ్య. | అవ్యయము. |
| ఆమ్రే. | ఆమ్రేడితము. |
| ఉదా. | ఉదాహరణము |
| ఉప. | ఉపపదము. (చూ. అసి - తెలుఁగు ) |
| ఉభ. | ఉభయము. (సంస్కృతమును తెనుఁగును.) |
| ఏ. | ఏకవచనాంతము. |
| ఔ. | ఔపవిభక్తికము. |
| క. | కన్నడము. |
| కు. | కుయిభాష. |
| క్రి. | క్రియ. |
| క్రి. విణ. | క్రియావిశేషణము. |
| క్షేత్రగ. | క్షేత్రగణితము. |
| గణిత. | గణితశాస్త్రము. |
| చూ. | చూడుఁడు. |
| ఛంద. | ఛందశ్శాస్త్రము. |
| జ్యోతి. | జ్యోతిశ్శాస్త్రము. |
| త. | తమిళము. |

| సంకేతములు. | వివరణము. |
|---|---|
| తంత్ర. | తంత్రశాస్త్రము. |
| తర్క. | తర్కశాస్త్రము. |
| తు. | తులుభాష. |
| ద్రు. | ద్రుతాంతము. |
| ద్వి. | ద్వివచనాంతము. (తెనుఁగున బహువచనాంతములో నంతర్భూతము.) |
| ధర్మ. | ధర్మశాస్త్రము. |
| న. | నపుంసకలింగము. |
| నాటక. | నాటకపరిభాష. |
| నాట్య. | నాట్యశాస్త్రము. |
| పా. | పాళీభాష. |
| పీఠి. | పీఠిక. |
| పుం. | పుంలింగము. |
| పుం. న. | పుంనపుంసకలింగము |
| పుం. స్త్రీ. | పుంస్త్రీలింగము. |
| ప్ర. | ప్రత్యయము. |
| ప్రా. | ప్రాకృతము. |
| బ. | బహువచనాంతము. |
| బీజగ. | బీజగణితము. |
| మంత్ర. | మంత్రశాస్త్రము |
| మ. | మళయాళము. |
| మహా. | మహారాష్ట్రము. |
| మి. | మిశ్రము – సంస్కృతపదము సంస్కృతేతరపదముతోఁ గాని తెలుఁగుకృత్ప్రత్యయముతోఁ గాని తెలుఁగుతద్ధితప్రత్యయముతోఁ గాని కలిసినపదము. |
| మొ. | మొదలైనవి. |
| యోగ. | యోగశాస్త్రము. |
| రూ. | రూపాంతరము. |
| వా. | వాడుక. |
| వి. | విశేష్యము. |
| విణ. | విశేషణము. |
| వేదాంత. | వేదాంతశాస్త్రము. |
| వైద్య. | వైద్యశాస్త్రము. |
| వ్యతి. | వ్యతిరేకార్థకపదము. |
| వ్యవ. | వ్యవహారము. |
| వ్యాక. | వ్యాకరణశాస్త్రము. |
| శత్ర. | శత్రంతము (దీనికి తెనుఁగున వ్యస్తప్రయోగము లేదు.) |

| సంకేతములు. | వివరణము. |
| --- | --- |
| శ. సం. | శకసంవత్సరములు. |
| శ్లో. | శ్లోకము. |
| స. | సర్వనామము. |
| సం. | సంస్కృతము. |
| సంగీ. | సంగీతశాస్త్రము |
| స. క్రి. | సకర్మకక్రియ. |
| సా. | సామెత. |
| స్త్రీ. | స్త్రీలింగము. |
| హిం. | హిందూస్థానీభాష. |
| √ | (మూలచిహ్నము) ఇది ఆనకపదములకు ముందుపయోగింపఁబడును. |
| = | (సామ్యచిహ్నము) ఇదిరూపమందుఁ గాని యర్థమందుగాని సామ్యముగల పదముల నడుమ నుపయోగింపఁబడును. |
| వృ. వి. | చెట్టు లత మొదలగువానిగుఱ్ఱు. |

(తక్కినవి స్పష్టము.)

| సంఖ్య. | గ్రంథసంకేతములు | గ్రంథనామములు. | గ్రంథములయందలి ఆశ్వాసాదుల సంఖ్య | గ్రంథకర్తలనామములు. |
|---|---|---|---|---|
| 1 | అచలా. | అచలాత్మజాపరిణయము. | ఆ. 3. | వేంకటాచార్యకవి. |
| 2 | అచ్చ. భా. | అచ్చ తెలుఁగు భాగవి. | ఆ. 5. | శ్రీరామకవి |
| 3 | అచ్చ రా. | అచ్చ తెనుఁగు రామాయణము. | | కూచిమంచితిమ్మకవి. |
| | | బాల. బాలకాండము. | | |
| | | అయో. అయోధ్యాకాండము. | | |
| | | ఆర. ఆరణ్యకాండము. | కాం. 6. | |
| | | కిష్కి. కిష్కింధాకాండము | | |
| | | సుం. సుందరకాండము. | | |
| | | యు యుద్ధకాండము. | | |
| 4 | అధ్యా. | అధ్యాత్మరామాయము. (బాలకాండాదులుఆఱునుఉత్తరకాండమును కలిసి ఏడు కాండములు.) | కాం. 7. | కోటమరాజు నాగయామాత్యుఁడు. |
| | | ఉ. ఉత్తరకాండము | | |
| 5 | అని. | అనిరుద్ధచరిత్రము. | ఆ. 5. | కనుపర్తి అబ్బయామాత్యుడు. |
| 6 | అప్ప | అప్పకవీయము. (లక్షణగ్రంథము.) | ఆ. 5. | కాకునూరి అప్పకవి. |
| 7 | అ. మ. క. | అష్టమహిషీకల్యాణము (ద్విపద) | | తిరువేంగళనాథుఁడు. |
| 8 | అహ | అహల్యాసంక్రందనము. | ఆ. 3. | సముఖము వేంకటకృష్ణప్ప నాయకుఁడు. |
| 9 | ఆం. చం. | ఆంధ్రచంద్రాలోకము. | | అడిదము సూరకవి. |
| 10 | ఆం. భా. | ఆంధ్రభాషార్ణవము (నిఘంటువు) | కాం. 3. | నుదురుపాటి వేంకనార్యుఁడు. |
| 11 | ఆం. శే | ఆంధ్రనామశేషము. (నిఘంటువు) | | అడిదము సూరకవి. |
| 12 | ఆం. సం. | ఆంధ్రనామసంగ్రహము. (నిఘంటువు) | | పైడిపాటి లక్ష్మణకవి. |
| | | దేవ. దేవవర్గు. | | |
| | | మాన. మానవవర్గు. | | |
| | | స్థా. స్థావరవర్గు. | వర్గులు. 5. | |
| | | తి. తిర్యగ్వర్గు. | | |
| | | నా. నానార్థవర్గు. | | |
| 13 | ఆము. | ఆముక్తమాల్యద. | ఆ. 5. | శ్రీకృష్ణదేవరాయలు. |
| 14 | ఇందు. | ఇందుమతీపరిణయము. | ఆ. 6. | కుమారధూర్జటి. |
| 15 | ఇందు. రా. | ఇందుమతీపరిణయము. | ఆ. 4. | తెనాలిరామభద్రకవి. |
| 16 | ఉ. రా. | ఉత్తరరామాయణము. | ఆ. 8. | కంకంటి పాపరాజు. |

| సంఖ్య. | గ్రంథసంకేతములు. | గ్రంథనామములు | గ్రంథములయందలి ఆశ్వాసాదుల సంఖ్య. | గ్రంథకర్తలనామములు |
|---|---|---|---|---|
| 17 | ఉ. హరి. | ఉత్తరహరివంశము. | ఆ. 6. | నాచన సోమనాథుఁడు. |
| 18 | ఉ. హరిశ్చ. | ఉత్తరహరిశ్చంద్రోపాఖ్యానము. | ఆ. 4 | తెక్కళ్లపాటి లింగన. |
| 19 | కకు. | కకుత్స్థవిజయము. | ఆ. 5. | మల్లె అనంతభూపాలుఁడు. |
| 20 | కలు. శ. | కలువాయిశతకము. | | డబ్బీరు సరసు. |
| 21 | కవిక | కవికర్ణరసాయనము. | ఆ. 6. | సంకుసాల నృసింహకవి. |
| 22 | కవిచౌ. శ. | కవిచౌడప్పశతకము. | | కవిచౌడప్ప |
| 23 | కవిజ. | కవిజనరంజనము. | ఆ. 3. | అడిదము సూరకవి. |
| 24 | కవిజనా | కవిజనాశ్రయము (లక్షణగ్రంథము) | అధికారములు. 4. | వేములవాడ భీమకవి. |
| | | సంజ్ఞా. సంజ్ఞాధికారము. | | |
| | | వృత్తా. వృత్తాధికారము. | | |
| | | జాతి. జాత్యధికారము. | | |
| | | దోషా. దోషాధికారము. | | |
| 25 | కవిరా. | కవిరాజమనోరంజనము | ఆ. 5. | కనుపర్తి అబ్బయామాత్యుఁడు. |
| 26 | కవిస. | కవిసర్పగారుడము (లక్షణగ్రంథము. | ఆ. 2. | కాచన బసవన్న. |
| 27 | కళా. | కళాపూర్ణోదయము. | ఆ. 8. | పింగళి సూరన్న. |
| 28 | కార్తిక. | కార్తికమాహాత్మ్యము. | | కుందుర్తి వేంకటాచలపతి |
| 29 | కావ్యా. | కావ్యాలంకారచూడామణి. (లక్షణగ్రంథము) | ఉల్లాసములు. 9. | విన్నకోట పెద్దన్న. |
| 30 | కాశీ. | కాశీఖండము. | ఆ. 7. | శ్రీనాథుఁడు. |
| 31 | కాళ. | కాళహస్తిమాహాత్మ్యము. | ఆ. 4. | ధూర్జటి. |
| 32 | కాళ. శ. | కాళహస్తీశ్వరశతకము. | | ధూర్జటి. |
| 33 | కిరా. | కిరాతార్జునీయము. | ఆ. 5. | గోపాలుని సింగయ. |
| 34 | కుచే. | కుచేలోపాఖ్యానము. | ఆ. 3. | గట్టుప్రభువు. |
| 35 | కువల | కువలయాశ్వచరిత్రము. | ఆ. 5. | సవరము చిననారాయణకవి. |
| 36 | కు. సం. | కుమారసంభవము. | ఆ. 12. | నన్నె చోడుఁడు. |
| 37 | కృ. క. | కృష్ణకర్ణామృతము. | ఆ. 3. | వెలఁగపూడి వెంగన. |
| 38 | కృ. శకుం. | శకుంతలాపరిణయము. | ఆ. 3. | కృష్ణకవి. |
| 39 | కృష్ణ. | కృష్ణరాయవిజయము. | ఆ. 4. | కుమార ధూర్జటి. |
| 40 | కృష్ణ శ. | కృష్ణశతకము. | | నృసింహకవి. |
| 41 | కృష్ణా. | కృష్ణాభ్యుదయము. | ఆ. 6 | గొంతేటి సూరన్న. |
| 42 | కేయూర. | కేయూరబాహుచరిత్రము. | ఆ. 4. | మంచన. |
| 43 | క్రీడా. | క్రీడాభిరామము. | ఆ. 1. | వల్లభ రాయకవి. |

| సంఖ్య | గ్రంథసంకేతములు | గ్రంథనామములు | గ్రంథములయందలి ఆశ్వాసాదుల సంఖ్య. | గ్రంథకర్తలనామములు |
|---|---|---|---|---|
| 44 | గంధ | గంధవహము | ఆ. 1. | మంచెళ్ల వాసుదేవకవి. |
| 45 | ఘటికా. | ఘటికాచలమాహాత్మ్యము. | ఆ. 8. | తెనాలి రామకృష్ణుఁడు. |
| 46 | చంద్ర. | చంద్రభానుచరిత్రము. | ఆ. 5. | తరిగొప్పుల మల్లన్న. |
| 47 | చంద్ర వి. | చంద్రరేఖావిలాపము. | ఆ. 3. | కూచిమంచి జగ్గకవి. |
| 48 | చంద్రా | చంద్రాంగదచరిత్రము | ఆ. 6. | పైఁడిమఱ్ఱి వేంకటపతి |
| 49 | చంద్రి. | చంద్రికాపరిణయము | ఆ. 6. | శ్రీసురభి మాధవరాయ ప్రభువు |
| 50 | చం. రా. | చంపూ రామాయణము. | ఆ 8. | ఋగ్వేదికవి వేంకటాచలపతి. |
| 51 | చమ. | చమత్కారమంజరి. | ఆ. 3. | సింహాద్రి వేంకటాచార్యుఁడు. |
| 52 | చిత్రభా | చిత్రభారతము. | ఆ. 8. | చరిగొండ ధర్మన్న. |
| 53 | చి. ని. | చిన్నయసూరినిఘంటువు. (వ్రాఁతది) | | పరవస్తు చిన్నయసూరి. |
| 54 | చెన్న. | చెన్నబసవపురాణము. | ఆ. 5. | అత్తనూరి పాపకవి. |
| 55 | జాహ్నవీ. | జాహ్నవీమాహాత్మ్యము. | ఆ. 4. | ఏనుఁగు లక్ష్మణకవి |
| 56 | జై. భా. | జైమినిభారతము. (అశ్వమేధపర్వము) | ఆ. 8. | పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు. |
| 57 | తపతీ. | తపతీసంవరణోపాఖ్యానము. | ఆ. 5. | అద్దంకి గంగాధరకవి. |
| 58 | దశకు. | దశకుమారచరిత్రము. | ఆ. 12. | కేతన. |
| 59 | ద. శా. | దక్షిణహిందూస్థానశాసనము. | సంపుటములు. 6. | |
| 60 | దశా. | దశావతారచరిత్రము. | ఆ. 10. | ధరణిదేవుల రామయామాత్యుఁడు. |
| 61 | దా. శ. | దాశరథిశతకము. | | కంచెర్ల గోపన్న. |
| 62 | దిలీప | దిలీపచరిత్రము. | ఆ. 4. | కొటికలపూడి వేంకటకృష్ణ కవి. |
| 63 | ద్వా. | (సింహాసన)ద్వాత్రింశిక. | ఆ. 12. | కొఱవి గోపరాజు. |
| 64 | ద్వి కో. భాగ | ద్విపదభాగవతము. | స్కం. 12. | కోనేరునాథుఁడు. |
| 65 | ద్వి. శి. సా. | ద్విపదసారంగచరిత్రము. | ఆ. 2. | కూచిమంచి తిమ్మకవి. |
| 66 | ద్వి. నల. | ద్విపదనలచరిత్రము. | భా, 5. | చక్రపురి రాఘవాచార్యులు. |
| 67 | ద్వి పరమ. | ద్విపదపరమయోగివిలాసము. | ఆ. 8. | తాళ్లపాక తిరువేంగళనాథుఁడు. |
| 68 | ద్వి. భార. | ద్విపదభారతము. (విరాటపర్వము-వ్రాఁతప్రతి.) | ఆ. 5 | తిమ్మన. |
| 69 | ద్వి శ. సా. | ద్విపదసారంగధరచరిత్రము. | ఆ. 8. | బాణాలశంభుదాసుఁడు. |

| సంఖ్య. | గ్రంథసంకేతములు. | గ్రంథనామములు. | గ్రంథములయందలి ఆశ్వాసాదుల సంఖ్య. | గ్రంథకర్తలనామములు |
|---|---|---|---|---|
| 70 | ద్వి. భాగ | ద్విపదభాగవతము. (దశమస్కంధము | స్కం. 1. | మడికి సింగన్న. |
| 71 | ద్వి. హరిశ్చ | ద్విపదహరిశ్చంద్ర చరిత్రము. | భా. 2. | గౌరన. |
| 72 | ధనా. | ధనాభిరామము. (వ్రాతప్రతి) | ఆ 8 | సూరన. |
| 73 | ధర్మ. | ధర్మఖండము. | ఆ. 9. | ఈదులపల్లి భవానీశంకరుడు |
| 74 | నరస. | నరసభూపాలీయము (లక్షణగ్రంథము.) | ఆ. 5. | మూర్తికవి. |
| 75 | నవ. (నాథ.) | నవనాథచరిత్రము. (ద్విపద- (వ్రాతప్రతి) | భా. 5 | గౌరన |
| 76 | నా. పంచ. | పంచతంత్రము. | ఆ. 5. | నారాయణకవి. |
| 77 | నార. | నారసింహపురాణము. (ఉత్తర భాగము ) | ఆ. 5. | హరిభట్టు. |
| 78 | నిరం. | నిరంకుశోపాఖ్యానము. | ఆ. 4. | కందుకూరి రుద్రయ. |
| 79 | నిర్వ. | నిర్వచనోత్తర రామాయణము. | ఆ. 10. | తిక్కన సోమయాజి. |
| 80 | నీతి. | నీతిసీసపద్యశతకము. | | తాళ్ళపాక తిమ్మయ. |
| 81 | నీలా. | నీలాసుందరీపరిణయము. | ఆ. 8. | కూచిమంచి తిమ్మకవి |
| 82 | నృసిం. | నృసింహపురాణము. | ఆ. 5. | ఎఱ్ఱాప్రెగ్గడ. |
| 83 | నైష. | శృంగారనైషధము. | ఆ. 8. | శ్రీనాథుడు. |
| 84 | పండితా. | పండితారాధ్యచరిత్రము (ద్విపద) | | పాలకురికి సోమనాథుడు. |
| | | దీక్షా. దీక్షాప్రకరణము. | | |
| | | పురా. పురాతనప్రకరణము. | ప్రకరణములు. 6. | |
| | | వాద. వాదప్రకరణము. | | |
| | | మహిమ. మహిమప్రకరణము. | | |
| | | పర్వ. పర్వతప్రకరణము. | | |
| 85 | పద్మ. | పద్మపురాణము (ఉత్తరఖండము) | ఆ. 11. | మడికి సింగన్న. |
| 86 | పరమ. | పరమయోగివిలాసము. | ఆ. 5. | తిమ్మనృపాలుడు. |
| 87 | పాంచా | పాంచాలీపరిణయము. | ఆ. 5. | కాకమాని మూర్తికవి. |
| 88 | పాండు. | పాండురంగమాహాత్మ్యము. | ఆ 5. | తెనాలి రామకృష్ణుడు |
| 89 | పారి. | పారిజాతాపహరణము. | ఆ. 5. | నంది తిమ్మన |
| 90 | పార్వ. | పార్వతీపరిణయము. | ఆ. 6. | కోట శ్రీ రాయ రఘునాథ తొండమాన్ మహీపాలుడు. |
| 91 | పి. శకుం. | శకుంతలాపరిణయము. | అ. 4. | పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు. |
| 92 | పె. శకుం. | శకుంతలాపరిణయము. | ఆ. 8. | పెద్దాడ నాగరాజు. |

| సంఖ్య. | గ్రంథసంకేతములు. | గ్రంథనామములు | గ్రంథములయందలి ఆశ్వాసాదుల సంఖ్య | గ్రంథకర్తలనామములు |
|---|---|---|---|---|
| 93 | ప్రబంధ. | ప్రబంధరాజ వేంకటేశ్వరవిజయ విలాసము | ఆ. 1. | గణపవరపు వేంకటకవి. |
| 94 | ప్రబోధ. | ప్రబోధచంద్రోదయము. | ఆ. 5. | నందిమల్లయ, ఘంటసింగయ. |
| 95 | ప్రభా. | ప్రభావతీప్రద్యుమ్నము. | ఆ. 5. | పింగళిసూరన. |
| 96 | ప్రభు. (లిం) | ప్రభులింగలీల. (ద్విపద.) | ఆ. 5. (ఒకొక్క ఆశ్వాసము నకుఅయిదైదుగతులుగలవు. | పిడుపర్తి సోమయ. |
| 97 | బస. పు | బసవపురాణము (ద్విపద) | ఆ. 7. | పాలకురికి సోమన. |
| 98 | బహుళ. | బహుళాశ్వచరిత్రము. | ఆ. [illegible]. | దామరల వేంగళనాయకుఁడు. |
| 99 | బిల్హ. | బిల్హణీయము. | ఆ. 3. | పండిపెద్ది కృష్ణస్వామి. |
| 100 | బ్రహ్మోత్త. | బ్రహ్మోత్తరఖండము. | ఆ. 5. | శ్రీధరమల్లె వేంకటరామకవి. |
| 101 | బ్రౌ. | బ్రౌణ్యనిఘంటువు. | | బ్రౌనుదొర. |
| 102 | భర్తృ. | భర్తృహరిసుభాషితము | శతకములు 3. | ఏనుగు లక్ష్మణకవి. |
| | | నీతి. నీతిశతకము. | | |
| | | శృం. శృంగారశతకము. | | |
| | | వై. వైరాగ్యశతకము. | | |
| 103 | భల్లా. | భల్లాణచరిత్రము. | ఆ. 5. | వాలేశ్వరుఁడు. |
| 104 | భాగ. | భాగవతము | స్కం. 12. | బమ్మెరపోతరాజు. |
| 105 | భాను. | భానుమతీపరిణయము. | ఆ. 4. | రెంటూరి రంగరాజు. |
| 106 | భార. | భారతము. | పర్వములు 18 | కవిత్రయము. (నన్నయ, తిక్కన, ఎఱ్ఱాప్రెగ్గడ.) |
| | | ఆది. ఆదిపర్వము. ఆ. 8. | | |
| | | సభా. సభాపర్వము. ఆ. 2. | | |
| | | అర. అరణ్యపర్వము. ఆ. 7. | | |
| | | విరా. విరాటపర్వము ఆ. 5. | | |
| | | ఉద్యో. ఉద్యోగపర్వము. ఆ. 4 | | |
| | | భీష్మ. భీష్మపర్వము. ఆ. 5. | | |
| | | ద్రో. ద్రోణపర్వము. ఆ. 5. | | |
| | | కర్ణ. కర్ణపర్వము. ఆ. 2. | | |
| | | శల్య. శల్యపర్వము. ఆ. 2. | | |
| | | సౌ. సౌప్తికపర్వము. ఆ. 2. | | |
| | | స్త్రీ. స్త్రీపర్వము. ఆ. 2. | | |
| | | శాం. శాంతిపర్వము. ఆ 6. | | |

| సంఖ్య. | గ్రంథసంకేతములు. | గ్రంథనామములు. | గ్రంథముల యందలి ఆశ్వాసాదుల సంఖ్య. | గ్రంథకర్తలనామములు. |
|---|---|---|---|---|
| | | అను. అనుశాసనికపర్వము. ఆ. 5. అశ్వ. అశ్వమేధికపర్వము. ఆ. 4. ఆశ్ర. ఆశ్రమవాసపర్వము. ఆ. 2. మౌ. మౌసలపర్వము. ఆ. 1. మహా. మహాప్రస్థానికపర్వము. ఆ. 1. స్వ. స్వర్గారోహణపర్వము ఆ. 1. | | |
| 107 | భా. రా. | భాస్కరరామాయణము. (అచ్చు. తెనుగు రామాయణము కడ నున్నట్లుదీనికి కాండము తెలియంగునది.) | కాం. 6. | భాస్కరుఁడులోనగువారు. |
| 108 | భా. శ | భాస్కరశతకము. | | మారద వెంకయ్య. |
| 109 | భీమ. | భీమేశ్వరపురాణము | ఆ 6. | శ్రీనాథుఁడు. |
| 110 | భేష. | భేషజకల్పము | ఆ. 4. | బహుపాద వేంకటాచార్యుఁడు. |
| 111 | భోజ. రా | భోజరాజీయము. | ఆ. 7. | అనంతామాత్యుఁడు. |
| 112 | భోజసుతా. | భోజసుతాపరిణయము. | ఆ. 5. | కోటీశ్వరకవి. |
| 113 | మనుచ. | మనుచరిత్రము. | ఆ. 6. | అల్లసాని పెద్దన. |
| 114 | మల్ల. | మల్లభూపాలీయము. (భర్తృహరికడనున్నట్లే దీనికి శతకము తెలియంగునది. | శతకములు3 | ఎలకూచి బాలసరస్వతి. |
| 115 | మల్లుపు. | మల్లుపురాణము. (దేవమల్ల చరిత్రము-వ్రాఁతప్రతి.) | ఆ. 4. | నుదురుపాటివేంకనార్యుఁడు. |
| 116 | మల్హణ. | మల్హణచరిత్ర. | ఆ. 8. | ఎడపాటి ఎఱ్ఱన. |
| 117 | మార్కం. | మార్కండేయపురాణము. | ఆ. 8. | మారన. |
| 118 | ముకుంద. | ముకుందవిలాసము. | ఆ. 3. | కాణాదిపెద్దన. |
| 119 | మృ. వి. | మృత్యుంజయవిలాసము. | ఆ. 3. | గోఁగులపాటికూర్మదాసుఁడు. |
| 120 | మై. | మైరావణచరిత్రము. | ఆ. 3. | మాడయకవి |
| 121 | మొ. రా. | మొల్ల రామాయణము. (అచ్చు తెనుఁగు రామాయణము కడ నున్నట్లు దీనికి కాండము తెలియంగునది.) | కాం. 6. | మొల్ల. |
| 122 | యయా | యయాతిచరిత్రము. | ఆ. 5. | పొన్నిగంటి తెలగనార్యుఁడు. |
| 123 | రంగా. | రంగారాయచరిత్రము. | ఆ. 3. | దిట్టకవి నారాయణకవి. |
| 124 | రం. రా. | రంగనాథరామాయణము(ద్విపద) | కాం. 6. | రంగనాథుఁడు. |

| సంఖ్య. | గ్రంథసంకేతములు. | గ్రంథనామములు. | గ్రంథములయందలి ఆశ్వాసాదుల సంఖ్య. | గ్రంథకర్తలనామములు. |
|---|---|---|---|---|
| | | (అచ్చతెనుఁగు రామాయణముకడనున్నట్లు దీనికి కాండము తెలియుంగునది.) | | |
| 125 | రం. రా. ఉ. | రంగనాథరామాయణము. ఉత్తరకాండము-(ద్విపద.) | కాం. 1. | కాచభూపతి, విట్ఠలరాజు. |
| 126 | రఘు | రఘువంశము | ఆ. 10. | అవుడూరి కిచ్చయ్య. |
| 127 | రఘునా. | రఘునాథాభ్యుదయము (వ్రాంత | | విజయరాఘవకవి. |
| 128 | రత్న. | రత్నపరీక్ష. (ప్రతి. | | భైరవకవి. |
| 129 | రస | రసమంజరి. (లక్షణగ్రంథము.) | గుచ్ఛములు 3 | సురతాని కోదండపతి. |
| 130 | రసా. | రసాభరణము. (లక్షణగ్రంథము ) | ఆ. 4. | అనంతామాత్యుఁడు. |
| 131 | రసిక. | రసికజనమనోభిరామము | ఆ. 7. | కూచిమంచి తిమ్మకవి. |
| 132 | రాఘవ. | రాఘవపాండవీయము | ఆ. 4. | పింగళి సూరన్న. |
| 133 | రాజగో. | రాజగోపాలవిలాసము. | ఆ 5. | కాళయ. |
| 134 | రాజ. చ. | రాజశేఖరచరిత్రము. | ఆ. 3. | మాదయగారి మల్లన్న. |
| 135 | రాజ వి రాజశేఖరవిలాసము. | రాజశేఖరవిలాసము. | ఆ. 8. | కూచిమంచి తిమ్మకవి. |
| 136 | రాధికా | రాధికాసాంత్వనము. | ఆ. 4. | ముద్దుపళని. |
| 137 | రామ | రామరాజీయము. | ఆ. 1. | వెంకయ్య |
| 138 | రామలిం. | రామలింగేశ్వరశతకము. | | అడిదము సూరన్న. |
| 139 | రామా. | రామాభ్యుదయము. | ఆ. 8. | అయ్యలరాజు రామభద్రుఁడు. |
| 140 | రామే | రామేశ్వర మాహాత్మ్యము | ఆ. 5. | ఏనుఁగు లక్ష్మణకవి. |
| 141 | రా వి. | రాజవాహనవిజయము. | ఆ. 5. | కాకమాని మూర్తికవి. |
| 142 | రుక్మాం. | రుక్మాంగదచరిత్రము. | ఆ. 5. | ప్రౌఢకవి మల్లన్న. |
| 143 | రుక్మి | రుక్మిణీపరిణయము. | ఆ. 5. | కూచిమంచి తిమ్మకవి. |
| 144 | ల. వి. | లక్ష్మీవిలాసము | ఆ. 5 | రాయసము వేంకటపతి. |
| 145 | వరాహ. | వరాహపురాణము | ఆ. 12. | నందిమల్లయ్య, ఘంటసింగన్న |
| 146 | వసు. | వసుచరిత్రము. | ఆ. 6. | రామరాజభూషణుఁడు. |
| 147 | వా. రా. | వాసిష్ఠరామాయణము. | ఆ. 5. | మడికి సింగన. |
| 148 | వాల్మీ. | వాల్మీకిచరిత్రము. | ఆ 3. | రఘునాథభూపాలుఁడు. |
| 149 | విక్ర. | విక్రమార్కచరిత్రము. | ఆ. 8. | జక్కన. |
| 150 | విజ. వి | విజయవిలాసము. | ఆ. 3. | చేమకూర వేంకటకవి. |
| 151 | విజ్ఞా. | విజ్ఞానేశ్వరీయము. | కాం. 3. | కేతన. |
| 152 | వి. నం. | విజయనందనవిలాసము. | ఆ. 3. | మంగళగిరి ఆనందకవి. |
| 153 | వి. పు. | విష్ణుపురాణము. | ఆ. 8. | వెన్నెలకంటిసూరన. |

| సంఖ్య. | గ్రంథసంకేతములు. | గ్రంథనామములు. | గ్రంథములయందలి ఆశ్వాసాదుల సంఖ్య. | గ్రంథకర్తలనామములు. |
|---|---|---|---|---|
| 154 | విప్ర. | విప్రనారాయణచరిత్రము. | ఆ. 5. | చెదలవాడమల్లయ్య |
| 155 | వీథి. | వీథినాటకము. | | శ్రీనాథుఁడు. |
| 156 | వీర. | వీరభద్రవిజయము. | ఆ. 4 | బమ్మెర పోతన్న |
| 157 | వేంక. | వేంకటేశాంధ్రము (నిఘంటువు) | వర్గులు 5. | గణపవరపు వేంకటకవి |
| 158 | వేం. పంచ | పంచతంత్రము | ఆ. 5. | వేంకటనాథుఁడు. |
| 159 | వేం. మా. | వేంకటాచలమాహాత్మ్యము. | ఆ. 6. | తరిగొండ వెంకమ్మ. |
| 160 | వేణు. (వేణు గో. శ.) | వేణుగోపాలశతకము. | | |
| 161 | వేమన. | వేమనశతకము. | భాగ. 2. | వేమనయోగి. |
| 162 | వైజ. | వైజయంతీవిలాసము. | ఆ. 4. | సారంగు తమ్మయ్య. |
| 163 | శబ్ద. | శబ్దరత్నాకరము. (నిఘంటువు) | | బహుజనపల్లి సీతారామాచార్యులు. |
| 164 | శశాం. | శశాంకవిజయము. | ఆ. 5. | శేషము వేంకటపతి |
| 165 | శా. ప. మ. | శాసనపద్యమంజరి | | |
| 166 | శివధ. | శివధర్మోత్తరము. | ఆ. 8. | మల్లారెడ్డికవి |
| 167 | శివర. | శివరహస్యఖండము. | ఆ. 10. | కోడూరి వేంకటాచలకవి. |
| 168 | శివరా. | శివరాత్రిమాహాత్మ్యము. | ఆ. 4. | శ్రీనాథుఁడు. |
| 169 | శివ. సా. | శివతత్వసారము. | | మల్లికార్జునపండితారాధ్యుఁడు. |
| 170 | శుక. | శుకసప్తతి. | ఆ. 4. | కదిరీపతినాయకుఁడు. |
| 171 | శుక. చ. | శుకచరిత్రము. | ఆ. 5. | పరశురామపంతుల రామమూర్తికవి. |
| 172 | శేష | శేషధర్మము. | ఆ. 5. | తామరపల్లి తిమ్మయ. |
| 173 | శ్రీరం. | శ్రీరంగమహత్త్వము. | ఆ. 5. | భైరవకవి. |
| 174 | శ్రీరం. మా. | శ్రీరంగమాహాత్మ్యము. | ఆ. 10. | కట్టా వరదరాజేంద్రుఁడు. |
| 175 | ష. చ. | షట్చక్రవర్తిచరిత్రము. | ఆ. 8. | మల్లారెడ్డికవి. |
| 176 | షోడ. | షోడశకుమారచరిత్రము. | ఆ. 8. | వెన్నెలకంటి అన్నయ |
| 177 | సమీర. | సమీరకుమారవిజయము. | ఆ. 7. | పుష్పగిరి తిమ్మన. |
| 178 | సాం. ని. | సాంబనిఘంటువు. | వర్గలు. 5. | కస్తూరి రంగకవి. |
| 179 | సాంబో. | సాంబోపాఖ్యానము | ఆ. 5. | రంగప్పరాజు. |
| 180 | సానందో. | సానందోపాఖ్యానము. | ఆ. 5. | శివరామకవి. |
| 181 | సారంగ. | సారంగధరచరిత్రము. | ఆ. 3. | చేమకూర వేంకటకవి. |
| 182 | సిం. నార. | సింహాద్రినారసింహశతకము. | | గోగులపాటి కూర్మదాసుఁడు. |
| 183 | సీతారా. | సీతారామాంజనేయసంవాదము. | ఆ. 3. | పరశురామపంతుల గురులింగమూర్తి. |

| సంఖ్య. | గ్రంథసంకేతములు. | గ్రంథనామములు | గ్రంథములయందలి ఆశ్వాసాదుల సంఖ్య. | గ్రంథకర్తలనామములు |
|---|---|---|---|---|
| 184 | సీతావి. | సీతావిజయము.(శతకంఠ రామాయణము.) | ఆ. 4. | మర్దనకవి. |
| 185 | సీమం. | సీమంతినీకల్యాణము | ఆ. 5. | పెనువాళ్ల సోమమంత్రి. |
| 186 | సుద. | సుదక్షిణాపరిణయము. | ఆ. 5. | తెనాలి అన్నయ్య. |
| 187 | సుదంతా. | సుదంతాపరిణయము. (వ్రాఁత ప్రతి.) | ఆ. 4. | అళుఘురికవి. |
| 188 | సురా. | సురాభాండేశ్వరము. | ఆ 1. | గట్టుప్రభువు. |
| 189 | సు. శ. | సుమతిశతకము. | | బద్దెనకవి. |
| 190 | సేతు. | సేతుఖండము. | ఆ. 6. | వక్కలంక వీరభద్రకవి. |
| 191 | హంస. | హంసవింశతి | ఆ. 5. | అయ్యలరాజు నారాయణామాత్యుఁడు. |
| 192 | హ. న. | హరిశ్చంద్రనలోపాఖ్యానము. | ఆ. 5. | రామరాజభూషణుఁడు. |
| 193 | హర. | హరవిలాసము. | ఆ. 7. | శ్రీనాధుఁడు. |
| 194 | హరి. | హరివంశము. | | ఎఱ్ఱాప్రెగ్గడ. |
| | | పూ - పూర్వభాగము. | ఆ. 9. | |
| | | ఉ - ఉత్తరభాగము. | ఆ. 10. | |
| 195 | హరిశ్చ. | హరిశ్చంద్రోపాఖ్యానము. | ఆ. 5. | శంకరకవి. |
| 196 | హ. వరాహ. | వరాహపురాణము. | ఆ. 5. | హరిభట్టు. |

(కడమవి స్పష్టము.)

| సంఖ్య. | గ్రంథసంకేతములు | గ్రంథనామములు. | గ్రంథము లందలి సర్గాదుల సంఖ్య. | గ్రంథకర్తలనామములు. |
|---|---|---|---|---|
| 1 | అ. ని. | అప్తునిసంస్కృతాంగ్లనిఘంటువు | | వామనశివరామాప్తుఁడు. |
| 2 | ఉ. చ. | ఉత్తరరామచరితము. | అంకములు 7 | భవభూతి. |
| 3 | కల్ప. | శబ్దకల్పద్రుమము. (నిఘంటువు) | | సర్. రాజా రాధాకాంతదేవ బహదరు. |
| 4 | కాదం. | కాదంబరీకావ్యము. | భాగములు 2 | బాణకవియుఁదత్పుత్రుఁడును. |
| 5 | కావ్యాద. | కావ్యాదర్శము. | పరిచ్ఛేదములు 3. | దండికవి. |
| 6 | కే. ని. | నానార్థార్ణవసంక్షేపనిఘంటువు | కాండములు 6. | కేశవమిశ్రుఁడు. |
| 7 | గీత. | భగవద్గీత. | అధ్యాయములు 18 | వ్యాసమహర్షి. |
| 8 | గీతగో. | గీతగోవిందము. | సర్గములు 12 | జయదేవుఁడు. |
| 9 | త్రి. ని. | త్రికాండశేషము. (నిఘంటువు) | కాండములు 3 | పురుషోత్తముఁడు. |
| 10 | పరా. | పరాశరస్మృతి | కాండములు 2 | పరాశరమహర్షి. |
| 11 | భట్టి. | భట్టికావ్యము. | సర్గములు 22. | భట్టి. |
| 12 | భామినీ. | భామినీవిలాసము. | ఉల్లాసములు 4. | జగన్నాథపండితరాయలు. |
| 13 | మను. | మనుస్మృతి | అధ్యాయములు. 12. | మనువు. |
| 14 | మహా. | మహావీరచరిత్రము | అంకములు 7. | భవభూతి. |
| 15 | మాలతీ. | మాలతీమాధవము. | అంకములు 10. | భవభూతి. |
| 16 | మాళవి. | మాళవికాగ్నిమిత్రము. | అంకములు 5 | కాళిదాసుఁడు |
| 17 | ముద్రా. | ముద్రారాక్షసము | అంకములు 7 | విశాఖదత్తుఁడు. |
| 18 | మురా. | అనర్ఘరాఘవము. | అంకములు 7. | మురారి. |
| 19 | మృచ్ఛ. | మృచ్ఛకటికము. | అంకములు 10 | శూద్రకుఁడు |
| 20 | మే. ని. | మేదినినిఘంటువు. | | మేదినికరుఁడు. |
| 21 | మేఘ. | మేఘదూతము. | భాగములు 2 | కాళిదాసుఁడు. |
| 22 | యాజ్ఞ. | యాజ్ఞవల్క్యస్మృతి.<br>ఆచా. ఆచారకాండము.<br>ప్రా. ప్రాయశ్చిత్తకాండము.<br>వ్యవ. వ్యవహారకాండము. | కాండములు 3 | యాజ్ఞవల్క్యమహర్షి. |
| 23 | రం. ని | లఘుశబ్దార్థసర్వస్వనిఘంటువు. | | మహామహోపాధ్యాయ పరవస్తు వేంకటరంగాచార్యులు |
| 24 | రత్నా. | రత్నావళి. | అంకములు 4 | శ్రీహర్షదేవుఁడు. |

| సంఖ్య. | గ్రంథసంకేతములు. | గ్రంథనామములు | గ్రంథములయందలి సర్గాదుల సంఖ్య. | గ్రంథకర్తలనామములు |
|---|---|---|---|---|
| 25 | రస. | రసగంగాధరము. | | జగన్నాథపండితరాయలు. |
| 26 | రా. ని. | రాజనిఘంటువు. | వర్గములు 21 | నరహరిపండితుఁడు. |
| 27 | వాచ. | వాచస్పత్యనిఘంటువు. | | తారానాథతర్కవాచస్పతి. |
| 28 | విక్రమో. | విక్రమోర్వశీయము. | అంకములు 5 | కాళిదాసుఁడు |
| 29 | వి. ని. | విశ్వనిఘంటువు. | | మహేశ్వరసూరి. |
| 30 | విల్యమ్సు. | విల్యమ్సు సంస్కృతాంగ్ల నిఘంటువు. | | సర్. మోనియర్ విల్యమ్సు. |
| 31 | వేణీ | వేణీసంహారము. | అంకములు 6 | భట్టనారాయణుఁడు. |
| 32 | వై. ని | వైజయంతీనిఘంటువు. | కాండములు 8. | యాదవప్రకాశుఁడు. |
| 33 | శాకుం. | అభిజ్ఞానశాకుంతలము. | అంకములు 7 | కాళిదాసుఁడు. |
| 34 | శా. ని | శాశ్వతనిఘంటువు. | | శాశ్వతుఁడు |
| 35 | శిశు. | శిశుపాలవధము. | సర్గములు 20 | మాఘకవి |
| 36 | సం. కిరా. | కిరాతార్జునీయము. | సర్గములు 18. | భారవి. |
| 37 | సం. కు. సం. | కుమారసంభవము. | సర్గములు 17. | కాళిదాసుఁడు |
| 38 | సం. చం. రా. | చంపూరామాయణము. | కాండములు 6. | భోజరాజు. లక్ష్మణసూరి. |
| 39 | సం. దశకు. | దశకుమారచరిత్రము. | | దండికవి. |
| 40 | సం. నైష. | నైషధీయచరితము | సర్గములు 22. | శ్రీహర్షకవి |
| 41 | సం. పంచ. | పంచతంత్రము | తంత్రములు 5. | విష్ణుశర్మ |
| 42 | సం. ప్రబోధ. | ప్రబోధచంద్రోదయము. | అంకములు 6. | కృష్ణమిశ్రకవి. |
| 43 | సం. భర్తృ. | భర్తృహరిసుభాషితము. | శతకములు 3 | భర్తృహరి |
| 44 | సం. భాగ. | భాగవతము. | స్కంధములు 12. | వ్యాసమహర్షి. |
| 45 | సం. భార. | భారతము. | పర్వములు 18 | వ్యాసమహర్షి. |
| 46 | సం. రఘు. | రఘువంశము. | సర్గములు 16. | కాళిదాసుఁడు. |
| 47 | సం. రామా. | రామాయణము. | కాండములు 8 | వాల్మీకిమహర్షి. |
| 48 | సా. ద. | సాహిత్యదర్పణము. | పరిచ్ఛేదములు 10. | విశ్వనాథకవిరాజు |
| 49 | హలా. ని. | అభిధానరత్నమాలానిఘంటువు. | కాండములు 5 | హలాయుధుఁడు. |
| 50 | హితో. | హితోపదేశము. | భాగములు 4. | నారాయణపండితుఁడు. |
| 51 | హేమ. ని. | అనేకార్థసంగ్రహము. (నిఘంటువు) | కాండములు 7 | హేమచంద్రుఁడు. |

అ³ అవ్య. 1. అవధారణార్థకము.

సీ. కామించి యున్నఁ దశాక్రమ రాగంబున యతిరేకమునఁజేసి యాతఁడంబ. గీ. తనకు శుక్లపాతంబైన ... భాగ. ఆది. 5. 595

చ. ...కులప్రయుక్తమగుచున్న సనాతనధర్మ మిత్తెఱంగ దపానకర్మ మొల్ల మదిగా నిదిగాముగ నిశ్చయించి ... భార. విరా. 1. 179.

2. స్వయముగా అనునర్థమును - పరాపేక్ష లేమిని తెల్పును.

ఉ. ఇమ్మగ సర్వధర్మములు నీవయెఱుంగుదు ... కళా. 4. 126.

3. బొత్తిగ, ఎంతమాత్రము. అనెడి యర్థమును తెల్పును.

చ. ...పెక్కుభంగుల బుధకోల్ప నెవ్వగును గొల్లల నేయవేమి సెప్పుదుర. భాగ. ద్రో. 2. 59.

(ఈయర్థమున క్రియల వ్యతిరేకార్థకరూపములకే యనుప్రయుక్తమగును.)

4. మధ్యమపురుష "ము, డు"లకు ప్రార్థనార్థమందు వికల్పముగా సనుప్రయుక్తమగును.

క. కనుఁగొండ యితని ధైర్యము, వెనుఁగొండగు... పాండు. 1. 58.

5. ఆక్షేపగర్భిత ప్రశ్నమును తెలుపును.

ఉ. అంతట మూర్ఛదేటి పులియా యెలుఁగా యెనుపోతసింగమా, కాంతుము ... కకు. 4. 106.

6. ప్రశ్నార్థకము (ఇది స్వరభేదముచేత ప్రశ్నించిన విషయముయొక్క వ్యతిరేక నిశ్చయమును - కాక్వర్థమును - తెలుపును.)

ఉ. ...నా, యాస నిరాకరింపఁ దగవా మగవాఁడవుకావ యర్జునా. హర. 7. 129.

7. ఒకానొకప్పుడు అర్థవిశేషము లేకయే యుపయోగింపఁబడును

చ. అది సభయే ప్రియం బెసఁగ నార్యులు నిల్వని యేని యార్యులే, మదిఁ దలఁపంగ వారలు సమంచితధర్మము వల్క రేని ... ... భార. ఉద్యో. 2. 70.

8. ఏకాక్షరములు కాని మధ్యమపురుష క్రియలకు విభక్తి లోపించి 'రా' పరమం దున్నప్పుడు వచ్చునది.

శ్లో. మధ్యమస్థే క్రియార్థేతు నిత్యమత్వమిహేష్యతే, నైకవర్ణస్య తు తథా రాయోగస్య తథాగతేః. అథర్వణకారికావళి. క్రియా 28.

ఉదా: మానరా, చేయరా, పోరా, తేరా

మ. ...అలకింపరే యేరా యధరామృతం బొసఁగినఁ మన్నింపరా ... సాంగ. 2. 1?9.

ఉ. ఏంర యాచలంబుడిగి యేల ... మనుచ ?. 9?.

అ సం. వి. అ. పుం. 1. బ్రహ్మ. 2. శివుఁడు 3. విష్ణువు. 4. వాయువు. (తెనుఁగున వ్యస్త ప్రయోగము లేదు.)

అవ్య. సమాసమున వచ్చెడి 'నఞు' యొక్క లుప్తశేషరూపము. ఇది అజాదిపదములు పరమగునపుడు 'అన్' అగును. (ఉదా: అనారోగ్యము మొ.)

1. సదృశము, పోలికగలది

ఉదా: అబ్రాహ్మణుఁడు - బ్రాహ్మణునివంటి వాఁడు, బ్రాహ్మణ చిహ్నములు కొన్ని కలిగియు బ్రాహ్మణుఁడు కాని ద్విజుఁడు.

2. అభావము, లేమి.

ఉదా: అజ్ఞానము - జ్ఞానము లేమి.

3. భిన్నము, వేఱైనది.

ఉదా: అపటము - పటముకంటె వేఱైనది.

4. అల్పము.

ఉదా: అనుదర - అల్పమైన ఉదరము కలది.

5. అప్రశస్తము, తగనిది, కూడనిది.

ఉదా: అకాలము = తగనికాలము
అకార్యము = కూడనిపని.

6. విరుద్ధము.

ఉదా: అధర్మము = ధర్మమునకు విరుద్ధమైనది.

అ ఆ లు. వి. బ. 1. 'అ, ఆ' అను రెండక్షరములు.

క. అఆలై బొలకు మఱి, ఇఈలుఋకారసహిత మెపలకునౌ, ఉ ఊ ల్తమలో నొడఁబడి, ఒ ఓలకు పళ్ళుగు న్నయోన్నతచరితా. కవిజనా. సంజ్ఞా. 63.

2. అచ్చులు.

(వ్యవ) నాకు అఆలు వచ్చినవి. కాఖాలు చెప్పుకొనుచున్నాను.

**అంకకరణము** నం. వి. అ. న. అంకము చేయుట - 1. గుఱుతుపెట్టుట. 2. అపరాధియని తెలియుటకు గుఱుతుగా వాఁత వేయుట.

**అంకకాఁడు** వి. విశే. (క. అంకకాఱ.) బ. అంకకాఱు, అంకకాండ్రు.

1. మొనగాఁడు, ముఖ్యుఁడు; శూరుఁడు.

ద్వి. ... పండిత మల్లికార్జున ప్రభువు, హరుని భక్తులయాజ్ఞ శిరమునఁ దాల్చి, గడికెక్కినయంకకాఁడును బోలె, నెడ విడివడ్డ మత్తభంబువోలె ... పండి. వార. 176 పొ.

గీ. ఎలసి యేప్రొద్దుఁ గనువొందనీక మరుఁడు, కలహమున కంకకాఁడయి కాలుద్రవ్వ. ఆము. 5. 64.

2. చలపాది, మాత్సర్యశీలుఁడు.

ఆ. ప్రతిన వలదు వైరిపట్టున నృపతికి, దండు వెడలఁ దీరకుండఁ దీరఁ, గాక యుండియుండి కాలాంతమునఁ దాఁ, గార్యకాఁడొ యంకకాఁడొ నృపుఁడు. ఆము. 4. 267.

3. పంతము గలవాఁడు.

మ. ... ప్రపంచంబుదాయలు గాడ్పుల్ శశియంకకాఁడు పికమయ్యయ్యో గ్రాహియి,బ్బలవద్ద్వేషులలోన నెట్లు విహరింపఁ వచ్చు నాంబోటికిన్. వి. న. 2. 122.

చ. హిమకరుఁ డంకకాఁడు మధువెప్పుడు జాతివిరోధి ... కవిక. 3. 96.

ఇట "అంకకాఁడు" అనఁగా ఒకపక్షమున "కళంకము కలవాఁడు" అనియు, ఒకపక్షమున "చలపాది" యనియు నర్థము.

**అంకచండాలము** నం. వి. అ. పుం. రోఁత.

ఉ. ఆఁట చండిపాపఁడట యంగడి లేదె పచారముల్ గృహంబు, జేల ప్రవాసిగాఁడె తన కెక్కడనైనఁ బరుండ రాదె యీ, నేలయెకాని నిల్వఁ జెలనేల మనోజ్ఞము గాదె యంకచండాలము గాదె యిట్లునికినా నది రెడ్డి నిఁజూచి యిట్లనున్. వేం. పంచ. 4. 450. (ఈ శబ్దము తెనుఁగుననే కలదు.)

**అంకణము** వి. (నం. అంగణం, అంగనం. ప్రా. అంగణం. త. అంగణం. క. అంకణ.)

1. ముంగిలి, చత్వరము. 2. ఇంటిలో రెండు దూలములకుఁగాని రెండు స్తంభములకుఁగాని నడిమిప్రదేశము.

(వ్యవ) ఇది నాలుగు అంకణముల యిల్లు.

వ. అంతరాళికమును ఆముందరను తొమ్మిది అంకణాలరంగమంటపమును ఆముందరను భోగమంటపమైన మూండు అంకణాల భద్రమున్ను కట్టించి...ద.శా. 4.789.

**అంకతంత్రము** నం. వి. అ. న. అంకశాస్త్రము గణితశాస్త్రము.

**అంకతలము** నం. వి. అ. న. అంక ప్రదేశము.

మ. నను నీయంకతలంబునం నిదురింపఁజేయవే వేఁడెదన్. విక్ర. 3. 94.

**అంకతి** నం. వి. ఇ. పుం. 1. గాలి. 2. అగ్ని. 3. బ్రహ్మ. 4. ఆహితాగ్నియగు బ్రాహ్మణుఁడు.

**అంకధారణ** నం. వి. అ. స్త్రీ. (ము) అ. న. చిహ్నములఁ దాల్చుట; తప్తముద్ర మొదలగు వైష్ణవాది చిహ్నములను దాల్చుట.

**అంకన** నం.వి. అ స్త్రీ. (ము). అ. న. 1. గుఱుతు. చిహ్నము. 2. గుఱుతు పెట్టుట. 3. స్తోత్రము.

ద్వి. చిత్రంబు వెండియుఁజెప్పెనే లనుచు, నఖిలభక్తానీక మంకనల్ సేయ, సుఖలీల మల్లికార్జున విభుండంతఁ, బరితృప్తిగాఁ గణపర్వంబుఁజేసి. పండి. మహి. 294 పొ.

ద్వి. తవిలి జంగమజిహ్వ తప్పకయుండ, శివునంకనములు వ్రాసినపుస్తకంబు...పండి. దీక్షా. 66. పొ. (ఈ యర్థము సంస్కృత గ్రంథములందుఁ గానరాదు. ఆంధ్రమున శైవకవి సంప్రదాయమునఁ గలదు. చూ. అంకము 28. అర్థము).

-ము- విశే. (అ. ఈ. అ.) ముద్రలు వేయుటకు సాధనమైనది.

**అంకనీయము** నం -అంక్యము. విశే.

**అంకపరివర్తనము** నం. వి. అ. న. 1. ఒత్తగిల్లుట. 2. అంకముమీఁదదొర్లుట, 3. ఆలింగనము.

**అంకపరివర్తి** నం. విశే. (న్, నీ. న్.) ఆలింగనము చేసికొనువాఁడు.

వ. భర్తురంకపరివర్తినీ భవ. మాళవి. 3.

**అంకపాలి** సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. - ఒడిలో నుంచుకొని పాలించునది - దాది. ఉపమాత. 2. ఆలింగనము, కౌగిలి.

శ్లో. తావద్గాఢం వితర సకృద స్యాంకపాలీం ప్రసీద. మాలతీ. 8. 2.

3. వక్షము, ఱొమ్ము. 4. వేదికయనుగంధ ద్రవ్యము.

**అంకపాళి** సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. ఒడి; తొడ.

గీ. అంకపాళినటద్దుకూలాంచలములు. మనుచ 1. 12.

2. అంకపాలి, ఆలింగనము, కౌగిలి.

క. కురువీరవసింపంగ నీ, కురువీరదృఢాంక పాళిఁ గోరినదానన్. విజ. వి. 1. 80.

గీ. ... మృగిత్వయై వహించు నక్షిద్వయంబు, భానుబింబుగఁ దనయంకపాళిలోన. మించు క్రొమ్మించు నుపమించు మెంతయగుచు. మనుచ. 6. 96.

**అంకపూరణము** సం. వి. అ. న. 1. అంకమును పూరించుట. 2. అంకెలను గుణించుట.

**అంకపొంకములు** - అంకాపొంకములు. (గ్రా.)

**అంకబంధము** సం. వి. అ. పుం. — అంకము యొక్క బంధము — 1. వీరాసనము, రెడ్డిగము. 2. పురుషుని మొండెమువలె గుఱుతు ఏర్పడునట్లుగా వ్రాతవేయుట.

**అంకము** సం. వి. అ. పుం. 1. ఒడి. 2. తొడ.

ఆ. కొడుకుఁ గూఁతు నెత్తికొని నలుంపు, హర్ష పులకితంబు లయిన నిజాంకంబు, లందువారి నునిచి యాదరమున. భాగ. అర. 2. 198.

సీ. దక్షిణపాదంబు దక్షిణాంకమున న,దక్షిణ పాదంబు దక్షిణాంకమున నిడి యుంగరేలు వెనుకగా వీడ్వడ ... యునికి పద్మాసన మనంగ నొప్పు. కళా. 5. 152.

3. వక్షము. 4. చిహ్నము గుఱుతు. 5. కళంకము, మచ్చ. 6. అంకె. 7. తొమ్మిదియను సంఖ్య. 8. నాటకమున నొక భాగము. 9. దశరూపకములలో నొకటి. 10. సమీపము దగ్గఱ; పార్శ్వము. 11. వంకర యయిన పనిముట్టు, 12. భూషణము. 13. యుద్ధము చిత్రయుద్ధము, వినోదమునకై చేయు యుద్ధము 14. చోటు. 15. కటిప్రదేశము. 16. రేఖ. 17. వంపు. 18. దేహము. 19. పర్వతము. 20. పాపము. 21. తప్పు. 22. తప్పు లెంచుట; ఆక్షేపము.

ఉ. ...సభాస్థలి బ్రాహ్మణుల్ నిశ్శంకఁ జరించు చున్ సుకవిసంఘముమెల్కొల మెచ్చ కూడకే, యంకము సేయవచ్చు ... మైరా. 1. 13.

23. స్తోత్రము. (చూ. అంకన. 3.)

సీ. గీల నీశ్వరు నంకమాలికల్ వాడుచో, గీత భేదంబుల రీతు లెటిఁగె. కు సం. 3. 231.

సీ. వీణాంక మాలికా గానవము. కు. సం. 11. 620.

ఈతుది రెండర్థములు సంస్కృతమున గ్రంథము లలోఁ గనఁబడవు. నన్నెచోడుని కవిత్వమున సంస్కృత సమాసమున నడుమఁ గొన్నిచోట్ల దేశ్యపదములు కనఁబడుటచే నిది దేశ్యమని నను ననవచ్చును. చూ. అంచు. 6.

**అంకముఖము** సం. వి. అ. న. - అంకముఖ సూచనగంధ - (నాటక) విచ్ఛిన్నమగు నుత్త రాంక కథాభాగమును సూచించు పూర్వాం కాంత భాగము.

**అంకమ్మ** వి. (త. అంగమ్మాళ్) ఒకానొక గ్రామ దేవత,

జ. అంకమ్మసివాలు.

**అంకమ్మ సివాలు** వి. బ. (✓ అంకమ్మ) అంకమ్మ దేవత పూనినవాని చేష్టలు.

**అంకలోపము** సం. వి. అ. పుం 1. అంకము యొక్క లోపము.

2. ఒక యంకెనుండి మఱియొక అంకెను తీసి వేయుట, వ్యవకలనము.

**అంకవన్నియ (న్నె)**-అంకెవన్నియ. వి. (క. అంగ వడి, అంకోణి, త. అంగపడి, అంగవడి) రికాబు, గుఱ్ఱము నెక్కుటకు ప్రక్క నమర్చిన మెట్టు,

సీ. అరుదార మగరాల యంకవన్నియలు గిత్న విచిత్రమగు ఖలీనంబు మెఱయ. ఇందు. 2. 54.

గీ. ...పాయము డిగ్గెం బ్రద్యుమ్నుండు ఉండె వెన్నె, యొకటి సాహిణి యవ్వల నూరిది పెట్టె. ప్రభా. 2. 58.

"అశ్వపాంర్యా వ్వపాంబిట్ జూవు" అని ఆం. భా. 2. 200.

**అంకవిద్య** సం. వి. అ. స్త్రీ. గణితశాస్త్రము.

**అంకాపొంకములు** - అంకపొంకములు. వి. బ.

1. కోపము.

క. కింకిరి లచేటి సంతటా, అంకకు వేగంద నందినా పిసి యంచెం, పొంకలు సింకొ నంగ నిపంకుక సంపించి సముద్భవగు నిశ ముఖుండె. రామాం. 7. 49.

2. పరోక్షము.

సీ. బెడిదపు శృంగారసీధుత్వముంకు సాకా పొంకములు ... కవిసా. 1. (శ. ర.)

విశ. సిత్తము, తీవ్రము.

(స్యావ) బిడ్డకు జ్వరము అంకాపొంకాలుగా వచ్చినది.

**అంకాలమ్మ** -అంకమ్మ.

**అంకావతారము** సం. వి. అ. పుం. — అంకము యొక్క దిగుట యంది —(నాటక) విష్కంభాదు లక్కఅలేకు ఉనే అవిచ్ఛిన్నమగు నుత్తరాంకకథను సూచించు పూర్వాంకాంత కథా భాగము (విచ్ఛిన్నమగు నుత్తరాంక కథా భాగమును సూచించునది "అంకముఖము" అనబడును.)

**అంకాస్యము** సం. - అంకముఖము.

**అంకి** సం. విశ (న్. ని. న్.) అంకముకలది.

వి. న్. పుం. న. ఒడిలోఁ బెట్టుకొని వాయించు మృదంగాది వాద్యము.

**అంకించు** అ క్రి. ఒప్పు, ప్రకాశించు.

(వెన్నెల వర్ణనము) వ. ...అఖిల భువనమండ్యంబులఁ దొంగిలుచుఁ బంకజ భవాండ మండపము సంకుచేసిన పొంకంబున నంకి చుచు ... విజృంభించు సమయంబున... వసు, 4. 28.

స. క్రి. 1. తాల్చు, పూను, వహించు.

గీ. కినిసి కైదువు కేల నంకించి లెక్క,సుండు గాళ్ళను రెక్కలుఁ జెండివైచె. అచ్చ.రా. అర. 75.

ద్వి. జగములో ధర్మమేజయ మనుమాట, తగుఁ గదాయని కొంత ధైర్య మంకించి. ద్వి. శ. సా. 1, 47 పొ. 16 ప.

2. పట్టుకొను.

శా. ...చెక్కు నొక్క కడు బల్మిం గుబ్బపాలిండ్లు నంకించుచున్ గోఁగటు శయ్యకుం దిగిచి చొక్కించుచున్ గళంపైఖగన్. శృం. శకు. 3. 47.

3. భావించు.

సీ. అంకించి నలోన నఖిలప్రపంచంబు శ్రీవిష్ణుమయమని చెలఁగువాని. భాగ. 7. 160.

4. కలిగించు.

సీ. అల సుప్రాగ్గగనమున్యాదిలాసమును జూపి మోహమంకించుచు మునుముట్టెన. శుక.చ 1. 81.

5. త్రిప్పు, ఆడించు.

సీ. కురులు గగ్గపడియింప నెంసిన నెమ్మొగ, ముడ్డ మంకించి చూ పిలపించి. సిద్వి. 8. 38.

సీ. కంలుని భాతిని వారంబు లంకించి యాలంబునకు ననియాడువాడు. సీతా వి. 2. 39.

వ. ... వారల బలంబుని కుద్దమించి మించిన పరాక్రమంబున జక్రశరశూలముద్గరములు లాది సాధనంబు లంకించుచు నవ్వీరుని జుట్టుముట్టిన ... జై. భా, 2. 31.

6. స్తుతించు.

ద్వి. శివభక్తితత్త్వగోష్ఠిప్రసంగమున నవిలి నూతన పురాతన భక్తమహిమ, లంకించుచును నిజాపాగపంక్తాత్రకు, కంకణంబులు రాలఁగరుణ నన్ జూచి. పండి. దీక్షా. 8 పా.

క. ...దీనపరాధీన దేవదేవ మహేశా.

వ. అని మఱియును సముచిత సంభాషణంబుల నంకించుచున్న యప్పరమ వైష్ణవీ సత్ర్యంబును,...భాగ. 8.134. (చూ.అంకము.23.)

7. ఉగ్గడించు.

వ. ...బిగుదు లంకించి తమ్ముసుపలాలించు పరిపాలకుల నస్తపంబునకుం జెవి దార్చె ననఁ గర్ణకిసలయంబులు ప్రేలంబడి ... ఉండు జాగిలంబులను. మనుచ. 4. 27.

8. అపహరించు.

క. సంకెలలు బడ్డవారే, యంకింతురు నీదు రాజ్యమర్థము ననువుల్. కృష్ణా. 2. (శ.ర.)

**అంకిణి** వి. మల్లబంధ విశేషము.

సీ. ముడిఁగి గడ్డము క్రింద ముడ్డి యానించి యంకిణిగొట్టి సీసానఁగినిసినిలువ. ప్రబంధ. 89.

**అంకితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఎంచఁబడినది. 2. గుఱుతిడఁబడినది. 3. రాజాదుల నామములచే చిహ్నితమైనది, కృతియీయఁబడినది. (గ్రంథము)

**అంకితవ్యము** సం. – అంక్యము.

**అంకిని** సం. వి. ఈ. స్త్రీ. 1. చిహ్నముల సముదాయము. 2. వాఁతలు మున్నగు గుఱుతులు గల స్త్రీ.

**అంకియ** – అంకె. (శ. ర.)

**అంకియము** – అంకెము. (శ. ర.)

**అంకిలి**[1] వి. 1. తాలుమూలమందలి కీలు, దౌడ కీలు. (బ. అంకిళ్లు.)

గీ. పిక్క యంకిలి చంకిలి ప్రక్క డొక్క, మూఁపు వీఁపునుఁ గాళ్లేలు ముక్కుఁ జెక్కుఁ, గన్ను వెన్నవకుండఁ జీకాకుపఱిచె, సుడుసుడులుగట్టి యగ్గుండ్లసోన వాన. రంగా. 3. 90.

(వ్యవ) ఈమాట అప్పుడేల చెప్పవైతివి? నీ కంకిళ్లు పడిపోయినవా?

2. మర్మము, కీలకము.

ఉ. అంకి తెలియఁగి యానరసుఁడంత వివాహవిధిజ్ఞుఁడైన మీ,నాంకుఁ డొనర్చినాఁ డిది శుభైకముహూర్తము రమ్మటంచుఁ బ, ర్యంకముమీఁద నచ్చెలిఁ గరగ్రహణం బొనరించె. విజ. వి. 1. 105.

ఆ. అంకి తెలియఁగి మాటలాడ నేర్చినపుడు, పిన్న పెద్దతనము లెన్న నేల, పిన్నచేతి దివ్వె పెద్దగా వెలుఁగదా, విశ్వదాభిరామ. వేమన. 1. 121.

**అంకిలి**[2] వి. 1. నిరోధము, అడ్డగింత; అడ్డు.

గీ. ... చరించె, మహీధరము సేయు నంకిలి మానుటయును, వనజవనబాంధవుని తేరి వారువములు. కాశీ. 3. 11. జాహ్నవీ. 2. 187.

2. క్షోభము, కలఁత.

క. అనుచరులలోని భూసురు, లనుసయవచనములఁ దేర్ప నతఁ డంకిలిదే. లినమదితో నశ్రులు మఱియును గ్రమ్మం గరతలమున నొత్తుచుఁ జూచుచు. భా. మౌ. 1. 164.

చ. అరియఁగ నెల్లలోకములు నంకిలి నొందమహార్ణవంబులో, నొంగ నివగ్నమైనధరనుద్ధతిఁగొమ్మునన్ నెత్తినట్టి యా, కిటపతి... భాగ. 6. 304.

3. ఆపద.

క. ఇంకని జలములు గలిగిన, యింకొక్కయుగావధి నిడివం జాలుచు, సంకోచి పక మము నీ, యంకిలిఁ బాపుటకు నీవ యర్హుండ వెందుచు. నా. పంచ. 1. 222.

4. భంగము, నాశము.

సీ. పంకిలిబ్బిదోరలా వంకిలి నొందించి కొంగ వాలున గట్లగొంగ గెలిచె. అచ్చ. రా. యు. 474.

జ. అంకిలిపడు, అంకిలిపాటు, అంకిలిపెట్టు.

**అంకిలిప(వ)డు** అ. క్రి. (√ అంకిలి[2]) 1. అడ్డుపోవు, అడ్డిపోవు.

క. సంకల్పభంగ మగునని, శంకింపకు మానవులవశమె దైవికమై, యంకిలిపడియెడు పనులకు, సంకటపడు టదియు నొక విచారమె చెపుమా. భోజరా. 6. 376.

2. నాశము నొందు.

చ. ... నా ప్రభుత్వపుం బలుకుల బిడ్డ నెక్కడని పంచితి వాసవుఁ డేమిపన్నె నం, కిలివడ కున్నె యంశుమతికిం దను వేగతిఁ జిక్కఁ జెప్పినన్. కకు. 4. 161.

**అంకిలిపాటు** వి. (√ అంకిలి[2]) 1. అడ్డపాటు 2. భంగము, నాశము.

ఉ. ధర్మువు దప్పి తాపసమతంబున కంకిలిపాటొనర్పఁ గ్రో,ధోర్మిమహాత్ములై తపసులు. హరి. పూ. 1. 61.

**అంకిలిపె(వె)ట్టు** సం. క్రి. (√ అంకిలి[2]). 1. బంధించు; నిరోధించు, అడ్డగించు.

ఉ. ...నిశాటు లాగ్రహంము పుట్టఁగ రావణు తోడఁ జెప్ప వాఁ, డాయతశక్తినన్ను నిటు నంకిలివెట్టిన నప్డు రామభూ, నాయకు నాజ్ఞ గైకొనిన నాపని చెల్లక గాలివోవదే. భా. రా. సుం. 71.

2. బాధించు.

ద్వి. కపటనాటకుఁడైన కౌశికుఁడంత్యుఁ, గృప మాలి మనం నంకిలివెట్ట ... ద్వి. హరిశ్చ. పూ. 1950.

**అంకు**[1] అ. క్రి. దొరకు, లభించు.

(వ్యవ) వాని కది అంకలేదు. అంగీనంతవరకు తీసికొని పోయెను.

**అంకు**[2] వి. అంకిలి. దాడకీలు.

ఆం. భా. 2. 143.

**అంకుటము** సం. వి. అ. పుం. తాళపుఁజెవి; దించె కోల.

**అంకుడు** వి. ఒకానొక చెట్టు.

**అంకురకము** సం. వి. అ. పుం. పశుపక్ష్యాదుల మనికిపట్టు.

**అంకురము** సం. వి.అ.పుం.న. 1. మొలక, మోసు 2. ముకుళము మొగ్గ. 3. నీరు. 4. నెత్తురు. 5. వెండ్రుక.

**అంకురార్పణము** సం. వి అ. న. 1. మొలకలెత్తుటకై విత్తులు చల్లుట; శుభకార్యములందు అంకురోత్పత్తికొరకు పాలికలందు నవధాన్యములు చల్లుట. 2. ప్రారంభము, మొదలు.

క. ఇది వేళగాదు చొరఁబడి, వెదకఁగ నని యున్న యతని వెరపుత్రిలోకాభ్యుదయాంకురార్పణంబీ కదలిక యీడేర్తు నన్న గతి వి్రగుంకెన్. రామా. 6. 106.

చ. ... చెల్వపుఁ గ్రొవ్వు పెంపునన్, బోద లెడు రంభకున్ సవతిపోరు గణించుట కంకురార్పణం, బిది యిటు కొంతచేసితి ... కళా. 2. 3.

**అంకురించు**-అంకూరించు. సం. అ. క్రి.

1. మొలకెత్తు, మొలచు.

సీ. చెమట తొల్కరి వానచే నంకురించు కందళముల భంగి లేసగవు మొనయ. వరాహ. 4. 162.

2. పుట్టు, కలుగు.

ఉ. వేడుక నంకురింపఁ బృథివీవరు కౌఁగిలి మందుసోఁకి సి, గ్గూడని జాడిన న్నగు ... వేం. పంచ. 4. 408.

**అంకురితము** సం. విశ. (అ. ఆ. అ.) మొలకయెత్తినది.

**అంకురిల్లు (లు)** సం. అ. క్రి. అంకురించు. మొలకెత్తు; పుట్టు, కలుగు.

క. అని దెలిపినమార్గంబుల, నవయమువినయము మనమున నంకురిలంగన్. భేష. 3.23.

**అంకులు** వి. బ. ఆభరణవిశేషము.

ద్వి. ఆలోన గోపిక లంచులు గూడి, ...అంకులు గంజులు నడ్డముఁగఁలు, ...తోరంబులాది, యగు సొమ్ము లిడి. ద్వి. సి. భాగ. 1.8.పొ.

**అంకుశగ్రహుఁడు** సం.వి అ.పుం.—అంకుశమును పట్టుకొనువాఁడు - మావటివాఁడు.

**అంకుశదుర్ధరము** సం. విశ. (అ.ఆ. అ.)అంకుశమునకు లొంగనిది. (ఏనుఁగు)

**అంకుశము** సం. వి. అ. పుం న. 1. ఏనుఁగు కుంభస్థలమును బొడిచెడి యాయుధము.

2. అంకుశమువలె నివారించునది-ప్రతిబంధము.

ఉదా : నిరంకుశుఁడు.

**అంకుశముద్ర** సం. వి. అ. స్త్రీ. వ్రేళ్ల చేత నంకుశాకారముగా పట్టెడి యొక ముద్ర.

**అంకుశి** సం. విశ. (న్. నీ. న్.) అంకుశము కలవాఁడు.

**అంకుశితము** సం. విశ. (అ. ఆ. అ.) అంకుశప్రయోగము కలది (ఏనుఁగు).

**అంకుసము** వి. (సం. అంకుశః, క. అంకుస.) అంకుశము. ఆం. భా. 2. 195.

**అంకుసముమాద్రి** వి. అంకుశాకారముగల నక్షత్రము మూలానక్షత్రము. (శ. ర.)

**అంకూరము** సం. - అంకురము.

**అంకూరించు** సం. - అంకురించు.

(పుట్టు, కలుగు)

(చక్రవాకయుగము, సీ. మొగడలబిగి వీడు తొగల నంకూరించు క్రొత్తనెత్తావి మూర్కొనుచు నులుకు. కవిక. 4. 71.

**అంకె** - అంకియ. వి. (సం. అంకః, క. తు. అంకె.)

1. సంఖ్యను తెలుపు రేఖ

ఉదా : 1, 2, 3 మొ.

2. సామీప్యము, చేరువ; వశము, అధీనత.

ఉ. అంగన నమ్మరాదు తనయంకెకురాని మహా బలాఢ్యు వేశ్యభంగుల మాయలొడ్డి చెఱుపం దలపెట్టు ... భాస్క. శత. 9.

జ. అంకెగొను.

**అంకెగొను** స. క్రి. (√ అంకె) ఆక్రమించు, క్రమ్ము.

గీ. ...మబ్బు, లదరి పూర్తిగ్రాలి (విమధ్య మంకెగొనఁగ, దిక్కు వడక చరించు నం దొక్కకరటి. రా. వి. 3. 49.

**అంకెన** వి. ఒకానొక ఫలవృక్షము.

సీ. వెలగపండులు పుల్లవెలఁగపండులు మోపి పండ్లు నంకెనపండ్లు బలుసుపండ్లు. కాశీ. 3. 69.

**అంకెము** – అంకియము. వి. 1. రికాబు, గుఱ్ఱము నెక్కుటకు ప్రక్కనమర్చిన మెట్టు.

ఆ. బ్రహ్మ గుఱ్ఱమాయె భవుఁడు పల్లకీ బాయె, నాది విష్ణు వెన్న నంకె మాయె, నందు మీఁదివాఁడు ఆఁడుదో మగవాఁడొ, విశ్వదాభిరామ వినుర వేమ. వేమ. 2. 267

2. ఎద్దు మొదలగు వానిపై వేయు బరువులో సగము. (రెండంకెములు ఒకగోనె)

(వ్యావ) గోనె కంకెములు తఱిఁగినవి-సగము తఱిఁగినది.

3. అంకెముధాన్యము పట్టెడి సంచి.

**అంకెవన్నియ (న్నె)** – అంకవన్నియ.

సీ. గోమేదకంబులఁ గొమరొందు కళ్లెంబు వజ్రాల మేలంకెవన్నియలును. ఉ. రా. 7. 397.

(అశ్వవర్ణనము.) మ. ఇలఁ బాదద్వయి రాయ నశ్వోన్నసఁగు నెందేఁ బాలుచో నంకెవన్నెలు రెండై లభిమం దకీర్తి యిడు మున్నే యెక్కుచో...ఆము. 2. 29.

ఈపదమునకు సజాతీయములగు ద్రావిడ కర్ణాటక పదములంబట్టి 'అంక' అనుటయే యుక్తమనఁ దగినను కొన్ని ప్రతులలో 'ఎ' కార సహితముగా నుండుటచేతను దీనికి 'అంకెము' పర్యాయపదముగా నుండుటచేతను రెండు రూపములును గ్రహింపఁబడినవి.

**అంకోటము** సం. – అంకోలము.

**అంకోలము** సం. వి. అ. పుం. ఊడుగు. (వ్య. వి.)

**అంకోలసారము** సం. వి. అ. పుం. ఊడుగుచెట్టు నుండి తీయు నొకవిధమగు విషము.

**అంక్యము** సం. విశ. (అ. ఆ. అ.) 1. ఎంచదగినది. 2. గుఱుతిడఁ దగినది. 3. వాఁతవేయఁ దగినది. వి. అ. పుం. కరకకాయవలె నుండెడి యొకానొక మృదంగము.

**అంగ** వి. (√ అగలు? క అగల. అ గల – విడిపడ యుండుట) 1. వేగముగాఁ బోవుటకై కాళ్లు చాచి వేయుట.

ఉయ్యగ్గా ... మహీవలయము గడఁకమీఱు నొకయంగఁ గొనువేగ మెనయ నగరిన శేకఱ. కువల. 2. 16.

2. పూర్తిగా చాఁచియుంచిన రెండుకాళ్లకును నడిమి ప్రదేశము; దాని పరిమాణము.

(వ్యావ.) నాలుగంగలు వేసి దొంగను వాఁడు పట్టుకొనెను.

**అంగకము** సం. వి. అ. న. 1. అవయవము. 2. దేహము.

**అంగకర్మము** సం. వి. న్. న. 1. అంగమునకు పరిమళ ద్రవ్యములు అలఁదుట, నలుఁగు పెట్టుట, 2. ప్రధానకర్మమునకు అవయవమగు క్రియ.

**అంగగ్రహము** సం. వి. అ. పుం. మూర్ఛాదులందు శరీరమునఁ గలుగు కంపము.

**అంగజము** సం. విశ. (అ. ఆ. అ.) 1. శరీరమందు పుట్టినది. 2. శరీరము వలన పుట్టినది. వి. అ. న. 1. నెత్తురు. 2. వెంట్రుక. పుం. 1. కైపు మదము. 2. రోగము.

**అంగజాలలు** వి. బ. (సం. అంగజాలం = శరీరకవచము) – అంగరక్షకులు – 1. సావిదల్లులు, అంతఃపురిపుఁ గావలివారు.

వ. ఆనిర్ఘోషంబు విని గుండియలవిసి బెండువడి యంగజాలలు గాలుకాలంబెనఁచికొని చాఁప కట్టువడం గూలిన...కాశీ. 6.227, సారంగ. 2. 270.

2. రాజభటులు.

గీ. గజముఖుని నేను బ్రార్థింతు బ్రజములోనఁ
బాలకుని నేతి కుండ్రాల బ్రాల కిచటి,
గొల్లలకుఁ జెప్పి నన్నుఁ దోడ్కొనిచనంగ,
నంగజాలము నను ధరాధినాథ. పి శకు.
2. 10,

దీనికి ఏకవచన ప్రయోగము కనఁబడలేదు.

**అంగజుఁడు** సం. వి. అ. పుం. 1. కుమారుఁడు. 2. మన్మథుఁడు.

**అంగజ్వరము** సం. వి. అ. పుం. రాజయక్ష్మము, క్షయరోగము.

**అంగడి** వి. (సం. అంగణం. క. తు. అంగడి. త. అంగాడి.)

1. ఆపణము, దుకాణము.

చ. కొనుఁడు పరార్థ్యరత్నములు గొనవాని
న యిత్తుమ స్తెఱుంగునఁ బచరింతు రంగ
డులఁ గొమటు లప్పురి సిద్ధరత్నముల్.
భా. ఆది. 8. 76.

2. అంగడివీథి; వీథి.

సీ. మలయజ మృగమదావిలసలిలంబుల నిమ్ము
గా నార్ద్రీకృతమ్ములయిన, గీ. యంగళుల
నొప్పెఁ గర్పూర రంగవల్లులు ... భార.
ఆది. 6. 148.

3. అగసాలె మున్నగువారు పనిచేయుచోటు.

మ. ప్రతిసూర్యాం డనుకమ్రటంబు మఘుపద్మా
రాసమన్యాలు రో, హిత మన్వేరిటి యూఁ
దుఁ గ్రోవిచపలోపేతాంత రాంభోదసం, తతి
యన్మచ్చుల సంచికావి రను నిద్రాటీకముల
గన్పడన్, జతసౌన్నారి బెడంగునష్టనర
వర్షావేళ విన్నంగడిన్. చంద్రా. 4, 17.

4. కొలువుకూటము, రచ్చ, సభ; న్యాయసభ.

క. పవనజుగద యును నీగాండివమును నెటవో
యె నంగడికిఁ బాంచాలిం, దివిచికొనివచ్చు
నెడఁ బరి,భవ మెఱుఁగవె బీర మేల పలు
కుదు తోడ్తోన్. భార. ఉద్యో. 4. 199.

ఉ. అంగవిహీనునైన వికలాంగునినైనఁ బ్రసిద్ధ
రోగదుష్టాంగునినైనఁ జూచి చెడనా
డుట యొప్పనివానిఁ జూచి సౌ, మ్యాంగుఁ
డంగడు వీని నెన యన్యులు లేరని గేలి
గొంటత,ప్పంగడి మూఁడురూకలును నష్టగ
నముగు వానిపైఁ బడున్. విజ్ఞా. ప్రా. 42

సా. 1. అంగడిలోని బెల్లపుముక్క ఆలయము
లోని దేవునికి నైవేద్యము. 2. అంగడిలో
నన్నియు నున్నవి, అల్లునినోట శనియున్నది.
ఇ. అంగడికెక్కు, అంగడివెట్టు.

**అంగడికెక్కు** అ. క్రి. (√ అంగడి) వీథికెక్కు. బయలుపడు- ప్రకటమగు.

ఉ. మాంటినిచేతిఘూర నభిమానము వోవ సఖీ
జనంబుచే, నాఁటిడి గప్పిన స్వల్పపు అంగడ
కెక్క కకోటనప్పుడే, ఘూరమిపల్ల ఘుం గని
కోర్క ఫలింపి సుఖించుఁ స్పియల్, భాఘు
నిష్ఠఁ బూని తోలుబాముఁ నోముల నేమి
నోఁచిరో. కవి. . 82.

**అంగడివెట్టు** స. క్రి. (√ అంగడి) వీథిఁబెట్టు, బయలుపఱుచు.

చ. ... నెంత మోహపరతాపము గల్గిన
దాఁచుకొందురో, యలయిక లేక యీకణి
నంగడివెట్టుదురో ...కుచేల. 3. 43.

**అంగణము** సం—అంగనము.
(ప్రదేశము)

వ. అప్పుర బహిరంగణమున. భా. ఆది.
5. 206.

**అంగతి** సం. వి. ఇ. పుం. 1. వాహనము. 2. అగ్ని. 3. బ్రహ్మ. 4. అగ్నిహోత్రి.

**అంగద** వి. (త. అంగదం = ఏనుఁగుయొక్క ఆహారము. తు. అంగ్ — అత్యాశ.)

1. ఆబ, తిండిమీఁదియత్యాశ; ఆఁకలి.

చ. అలుగునె యుక్కుగుండు కడునంగదఁ బ్రమిం
గిన నూఁచి చూచినన్, విఱుగునె మేరు
భూధరము. భా. రా. అర. 2. 121.

ఉ. అంగద సంకవర్తి హరిణాభ్యవహార విలోల
బుద్ధియై, ప్రమింగు విధుంతుదుం డనెడు
మేటి భుజంగమ మీశశాంకు ... నైష.
8. 173.

2. ఉత్సాహము, కుతూహల

క. గదగొని పోఁకి మఱి నం,గదగొని చను
దెంచువానిఁ గని ధనపతి బి,ట్టదరిపడ నేసె
దానివుఁ, దుదరిపడ ధాత్రి దనుజు
లుల్లల నుడుకన్. కు. సం. 12. 306,
వై ష. 3. 24.

3. కోపము.

చ. ... ఇటు లదంభుత సంగ మైనచోటన,య్య
నిమిషనాథుఁ బట్టుకొని యంగద పృత్రుఁడు
ప్రమింగె ... భార. ఉద్యో. 1. 1??.

శ్లో. తతో జగ్రాహ దేవేంద్రం, పృత్రో పి
కృతక్రమమ్, అపాహృత్యాథిప స్వర్గే,
శక్రః కోపసమన్వితః. సం. భార. ఉద్యో.
9. 60.

4. దుఃఖము, మనోవ్యథ.

ఉ. చెంగిని తాల్మికిల్మి రఘుసింహము డెందము
నందుఁ గుందె పే, రంగదుఁ బర్ణశాల కల
య గను ముంగిటఁ జగటంగనున్. రామా.
6. 231.

క. కావున నొండయని రంగదం, గావింపకతలఁచు
కొన్న కజ్జంబెల్లన్, ఠవిం గొనసాగింపుము.
అచ్చ. రా. అయో. 55.

5. ఉపద్రవము, విపత్తు.
(అంబోతులవలని యుపద్రవమును ప్రజలు
రాజుతోఁ జెప్పుకొనుట.) క. ఓరాయఁడ
యీ యంగద, కోరువలే కిటకు వచ్చె నూ
ళ్లన్నియు మే, మూరక దబ్బఱలాడఁగ, నే
రము నుఃఖార్లకయిన నీయాన సుమీ. నీలా.
3. 58.

**అంగద** సం. వి. ఆ. స్త్రీ. పడమదిక్కునందలి
ఆఁడేనుఁగు.

**అంగదట్టము** మి. వి. (క. అంగదట్ట.)—శరీ
రము కప్పు ముదుగుబట్ట — పావడ. గాగరా.

సీ. తత నితంబాభోగ ధవళాంశుకము లోని యంగ
దట్టపుఁ గావిరంగువలన. మనుచ. 2. 27.
'యోషాంతరీయము' అని ఆం. భా. 2. 158.

**అంగదనిర్వ్యూహము** సం. వి. అ. పుం. భుజకీర్తి
యందు చూడాకారముగ నుండు అగ్ర
భాగము.

**అంగదము** సం. వి అ. న. కేయూరము, భుజకీర్తి.

**అంగదుఁడు** సం. వి. అ. పుం. 1. వాలికొడుకు
2. లక్ష్మణుని కొడుకు. 3. ధృతరాష్ట్రుని
పుత్రులలో నొకఁడు.

**అంగద్వీపము** సం. వి. అ. పుం. ఉపద్వీపము లాఱిం
టిలో నొకటి.

**అంగన** సం వి. ఆ. స్త్రీ. 1.-ప్రశస్తమైన యవ
యవములు కలది — అందమైన యాఁడుది.
2. ఆఁడుది. 3, కన్యారాశి. 4. ఉత్తర
దిక్కునందలి యాఁడేనుఁగు.

**అంగనము** సం. వి. అ. న. 1. ముంగిలి, ఇంటి
ముందుచోటు; చోటు, ప్రదేశము. 2. వాహ
నము. 3. పోవుట, నడచుట.

**అంగనాప్రియము** సం. విశ. (అ. ఆ. అ.) స్త్రీల
కిష్టమయినది. వి. అ. పుం. అశోకము (వృ. వి.)
(దీని పువ్వులచేత స్త్రీలలంకరించుకొనఁ బ్రియ
పడుదురు.)

**అంగన్యాసము** సం. వి. అ. పుం. విహితమగు
మంత్రభాగములను హృదయాద్య స్థానముల
యందు ఉంచునట్లు సూచించుటకై ఆయా
స్థానములు స్పృశించుట.

**అంగపంచకము** సం. వి. అ. న. (రాజనీతి) ఉపా
యము, సహాయులు, దేశకాలవిభజనము,
ఆపదకుఁ బ్రతిక్రియ, కార్యసిద్ధి — అను
నైదంగములు.

**అంగపాలిక** సం. వి. ఆ. స్త్రీ—అంగపాళి.

**అంగపాళి(లి)** సం. వి. ఇ. ఈ. స్త్రీ. ఆలింగనము,
కౌఁగిలి.

**అంగప్రత్యంగము** సం. వి. అ. న. సర్వావయవ
సమూహము.

**అంగప్రదక్షిణము** సం. వి. అ. న. దేవాల
యాదుల చుట్టును దొరలుచు చేయు ప్రదక్షి
ణము. (గ్రా.)

**అంగప్రాయశ్చిత్తము** సం. వి. అ. న. 1. ఆశౌచ
నివృత్తికైన కర్మము. 2. పంచసూనాజన్య
పాపక్షయకర మగు దానరూప ప్రాయ
శ్చిత్తము.

**అంగవిల్ల(క్ల)** మి. వి. ఆఁడుపిల్లల మొలనుగట్టెడు బిళ్ల. (శ. ర.)

**అంగభంగము** సం. వి. అ. పుం. 1. పక్షవాత రోగము, తిమ్మిరివాయువు. 2. ఒడలు విఱుచుకొనుట. 3. శరీరనాశము.

**అంగభవుఁడు** సం. వి. అ. పుం.—అంగభువు.

**అంగభువు** సం. విణ. (తత్. తత్. ఉ.) శరీరము నుండికాని మనస్సునుండికాని పుట్టినది. వి. తత్. పుం. 1. కొడుకు. 2. మన్మథుఁడు.

**అంగమచ్చము** మి. వి. ఒడలి గుఱుతు, జాడ; అడియాలము, ఆనవాలు.

క. చనుచో వెదకుచు మార్గంబున దైత్యుని యంగ మచ్చములు గన్గొని యంతనె పువ్వుఁబోఁడి జాడలు,గని వింటిమి పులుఁగు చెప్పఁగా నొకచోటన్. రామా. 5. 266.

శా...చిక్కె నిదిగో నీయంగమచ్చంబు నా, చే నీలోననె రాజురాపలెఁ గదా చెక్కంతు నీ కీలుకీల్ ... సాంగ. 2. 187.

**అంగమర్దకుఁడు** సం. విణ. (అ. ద్రికా. అ.) వి. అ. పుం.—అంగమర్దుఁడు.

**అంగమర్దనము** సం. వి. అ. న.—అంగమర్దము.

**అంగమర్దము** సం. వి. అ. పుం. ఒడలుపట్టుట.

**అంగమర్ది** సం. విణ. (న్. నీ. న్.) వి. న్. పుం. —అంగమర్దుఁడు.

**అంగమర్దుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) ఒడలు పట్టువాఁడు. వి. అ. పుం, ఒడలుపట్టు సేవకుఁడు.

**అంగమర్షము** సం. వి. అ. పుం. కీళ్లనొప్పులు గలుగు వాతరోగవిశేషము.

**అంగము** వి. (క. అంగ.) రీతి, విధము.

ఉ. అంగము జాళువా పసిఁడియంగము క్రొన్నెల వంక వెన్నొసల్. విజ. వి. 1. 40.

**అంగము** సం. వి. అ. న. 1. దేహము 2. అవయవము. 3. భాగము.

ఉదా: చతురంగములు.

4. సహకారిగ్రంథాదికము.

ఉదా: వేదాంగములు.

5. ఉపాయము. 6. అప్రధాన విషయము. 7. (వ్యా.) ప్రత్యయమునకు పూర్వముండున్న శబ్దభాగవిశేషము. 8. ఆఱనెడు సంఖ్య. 9. (నాటక) ముఖము మొదలగు పంచసంధుల యొక్క అంతర్భాగము. 10. (జ్యోతి) లగ్నము. 11. మనస్సు. పుం. దేశవిశేషము.

గీ. అంగముల కెవ్వని చమూ తురంగకోటి, ధాటికాఘాతధూళి వరాంగదాళిపట్టు. వసు. 1. 73.

**అంగమొల** వి. వస్త్రహీనమైన మొల. (శ. ర.)

**అంగమొలవేల్పు** వి. దిగంబరుఁడు శివుఁడు. (శ. ర.)

**అంగరంగభోగములు** సం. వి అ. పుం. బ. అంగమునకు (—దేవతల యొక్క విగ్రహమునకును) రంగమునకును (—ఆలయమునకును) చేయు భోగములు. అమీన్ బాదాశాస. శక. 1298.

**అంగరంగవైభవములు** సం. వి. అ. న. బ.—అంగరంగభోగములు.

వ... వీరేశ్వరుని ... అంగరంగ వైభవాలకు పాలుమను చేసి. ద. శా. 4. 703.

**అంగరకా** వి. (సం. అంగరక్షా. హిం. అంగరఖా) —అంగములను రక్షించునది—అంగీ.

**అంగరక్తము** సం. విణ. (అ. ఆ. అ.) ఎఱ్ఱని అవయవములు కలది. వి. అ. పుం. న. గుడారోచన (వృ. వి.)

**అంగరక్ష** సం. వి. అ. స్త్రీ. 1. శరీరరక్షణము. (ఇది ఈ క్రింది శాసనమున 'శరీరరక్షకుడు' అను నర్థమునఁ గన్పట్టుచున్నది)

వ. శ. సం. 1200. స్వస్తిశ్రీమన్మహామండలేశ్వర కాకతియ్యరుద్రదేవమహారాజులఅంగరక్ష బొల్లాయునికిం బుణ్యముగాను అప్పారాయండు కొండముట్టను ఇచ్చినవరిచేను. గుంటూరుజిల్లా, ఉప్పూరుశాసనము.

2. శిశువుల శరీరరక్షణార్థము చేయు క్రియ; అందులకై కట్టిన తేకు. (వా)

**అంగరక్షకుఁడు** సం. విణ. (అ. క్షికా.అ.) ప్రభువు దేహమును గాపాడుటకై యతనితోడ నుండువాఁడు. వి. అ. పుం. బంటు.

జావున కంగవించి వెలుచన్ జనుచుండఁగ ... పాండు. 3. 51.

న. క్రి. మించు ; జయించు.

సీ. ఈక్షణజితపద్మ నితని నేత్రక్రమమున విమల పద్మము లంగవింపఁ జాలు. నై. ష. 5.145.

**అంగవికలుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) అస్వాభావికమైన యవయవములు కలవాడు; అవయవములు ఎక్కువగాఁ గాని తక్కువగాఁ గాని కలవాఁడు.

**అంగవికృతి** సం. వి. ఇ. స్త్రీ. 1 అంగవికారము. 2. అపస్మారరోగము.

**అంగవిక్షేపము** సం. వి. అ. పుం. అంగచాలన రూపమైన నృత్యభేదము.

**అంగవిద్య** సం. వి. ఆ. స్త్రీ. 1. వేదాంగములగు వ్యాకరణాదిశాస్త్రము. 2. అవయవములచేత సూచితములగు శుభాశుభములను దెలిపెడి విద్య.

**అంగవిధి** సం. వి. ఇ. పుం. ప్రధాన విధిచేత విహితమయిన కర్మమునకు అంగకర్మమును దెలుపు విధి.

**అంగవైకృతము** సం. వి. అ. న. 1. హృదయ భావమును తెలుపునట్టి ముఖాద్యవయవచేష్ట. 2. అంగవికారము.

**అంగవైగుణ్యము** సం. వి. అ. న. ప్రధానకర్మమునకు అంగములగు ద్రవ్యాదుల యొక్క వ్యత్యాసము.

**అంగసంగము** సం. వి. అ. పుం. శరీరముల కలయిక ; సంభోగము.

**అంగసంస్కరణము** సం. వి. అ. న.—అంగసంస్కారము.

**అంగసంస్కర్త** సం. విణ. (ఋ. త్రీ. ఋ.)- అంగ సంస్కారుఁడు.

**అంగసంస్కారకుఁడు** సం. విణ. (అ. ఠికా. అ.) —అంగసంస్కారుఁడు.

**అంగసంస్కారము** సం. వి. అ. పుం. 1. దేహపరిశుద్ధికై చేయుస్నానము 2. నలుఁగు పెట్టుట; చందనాదులు పూయుట.

**అంగసంస్కారుఁడు** సం విణ (అ. ఈ. అ.) అంగ సంస్కారమును చేయువాఁడు; దేహమును అలంకరించువాఁడు.

**అంగసంస్కృతి** సం. వి. ఇ. స్త్రీ. - అంగసంస్కారము.

**అంగసంస్క్రియ** సం. వి. ఆ. స్త్రీ. - అంగసంస్కారము.

**అంగసంహతి** సం. వి. ఇ. స్త్రీ. 1. అవయవములొండొంటికి పొందికగానమరి గుత్తమైయున్న మేనికూర్పు 2. అవయవసముదాయము.

**అంగహారము** సం—అంగవిక్షేపము.

**అంగహారి** సం. వి. ఇ. పుం. 1.—అంగవిక్షేపము 2. నృత్తరంగము.

**అంగహీనుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) 1. అంగవికలుఁడు, అవయవ లోపము కలవాఁడు. 2. ఉపలసిన ప్రమాణమునకుఁ దక్కువగా నుండు హస్తపాదాద్యవయవములు గలవాఁడు. వి అ. పుం అనంగుఁడు, మన్మథుఁడు.

**అంగాంగిభావము** సం. వి. అ. పుం. అంగమునకును అంగికిని గల సంబంధము, గౌణముఖ్యభావము, ఉపకార్యోపకారక భావము.

**అంగారకమణి** సం. వి. ఇ. పుం. అంగారక గ్రహమునకు ప్రియమగు మణి - పగడము.

**అంగారకము** సం. వి. అ. పుం. న. 1. ఇంగలము, బొగ్గు. 2. మంగళవారము. 3. గుంటకలగర, భృంగరాజము (వ్యు. వి.) 1. అగ్నికణము, మిడుఁగుఱు 2. ఒక టినును మండునూనె.

అంగారకవారము సం. వి. అ. పుం. మంగళవారము.

**అంగారకారి** సం. విణ. (న్. ఈ. న్. ) బొగ్గులను జేయువాడు. వి. ఇ. పుం. (జ్యోతి) అంగారకునకు శత్రువు—బుధుఁడు.

**అంగారకితము** సం విణ. (అ. ఆ. అ.) బొగ్గుగాఁ జేయఁబడినది.

**అంగారకుఁడు** సం. వి. అ. పుం. 1. ఒకానొక గ్రహము, కుజుఁడు. 2. వాయుపురాణమందు చెప్పఁబడిన యేకాదశరుద్రులలో నొకఁడు.

**అంగారకుష్ఠకము** సం. వి. అ. పుం. హితావలి అనెడి యోషధి.

**అంగారధాని** సం. వి. ఈ. స్త్రీ. కుంపటి (దీని యందు బొగ్గులు ఉంచఁబడును)

**అంగారధానిక** సం. వి. ఆ. స్త్రీ—అంగారధాని.

**అంగారపరిపాచితము** సం. వి. అ. న. కట్టెకు గ్రుచ్చి బొగ్గు నిప్పులమీఁద చక్కఁగాఁ గాల్చిన మాంసాదికము.

**అంగారపర్ణుఁడు** సం. వి. అ. పుం. చిత్రరథుఁడను గంధర్వుఁడు.

**అంగారపాత్రి** సం. వి. ఈ. స్త్రీ. కుంపటి.

**అంగారపుష్పము** సం. వి. అ. పుం.—నిప్పువలె ఎఱ్ఱగానుండు పుష్పములుగలది - ఇంగుది, గార (వృ. వి.)

**అంగారమంజరి** సం. వి. ఈ. స్త్రీ. ఎఱ్ఱకానుగు (వృ వి.)

**అంగారమంజి** సం—అంగారమంజరి.

**అంగారము** సం. విశ. (అ. ఆ. అ.) ఎఱ్ఱనిది. వి. అ. పుం. న. 1. నిప్పారిన బొగ్గు. 2. కాలుచున్న బొగ్గు. 3. హితావలి యను నోషధి. న. ఎఱుపు, రక్తవర్ణము.

**అంగారవల్లరి** సం. వి. ఈ. స్త్రీ. నిప్పువలె ఎఱ్ఱగానుండు పూవుగుత్తులు గల కానుగు (వృ. వి.)

**అంగారవల్లి** సం. వి. ఈ. స్త్రీ.—నిప్పువలె ఎఱ్ఱగా నుండు పువ్వులుగల వల్లి 1. ఎఱ్ఱగురివెంద (వృ. వి.) 2. బాఁడింగి (వృ. వి.)

**అంగారవేణువు** సం. వి. ఉ. పుం. నిప్పు వన్నెగల యొకజాతి వెదురు (వృ. వి.)

**అంగారశకటి** సం. వి. ఇ. ఈ. స్త్రీ. కుంపటి.

**అంగారావర్తయణము** సం. వి. అ. న. నిప్పు ఆరిపోవుటకు ఉపయోగించు సాధనము.

**అంగారావక్షేపణము** సం వి. అ. న. బొగ్గులను త్రోసివేయుటకుపయోగించు సాధనము.

**అంగారి** సం. వి. ఇ. స్త్రీ. కుంపటి.

**అంగారిక** సం. వి. ఆ. స్త్రీ. 1. కుంపటి 2. చెఱకుగడ. 3. మోదుగుమొగ్గ.

**అంగారిణి** సం. వి. ఈ. స్త్రీ. 1. కుంపటి 2. (జ్యోతి) సూర్యుఁడు అప్పుడే విడిచి పెట్టిన దిక్కు.

**అంగారిత** సం. వి. అ. స్త్రీ. 1. కుంపటి. 2. మొగ్గ.

**అంగారితము** సం. విశ—అంగారకితము. వి. అ. పుం. న. మోదుగు మొగ్గ.

**అంగారీయము** సం. విశ. (అ. ఆ. అ.) బొగ్గులు చేయుట కుపయోగపడునది. (కట్టె, మొ.)

**అంగారుఁడు** సం. వి. అ. పుం. 1. అంగారక గ్రహము. 2. మాంధాతతోఁ బోరిన యొక రాజు,

**అంగార్య** సం. వి. ఆ. స్త్రీ. బొగ్గులకుప్ప.

**అంగి** —అంగీ. (సం. అంగికా. క. తు. త. అంగి.) మీఁగాళ్లదాఁక వ్రేలాడుచొక్కా.

సీ. తన యుదగ్రసమగ్రతనువిగ్రహమునకు నింగి దట్టపు నీలియంగిగాఁగ. సమీ. 1. 74.

"కూర్పాసము" అని ఆం. భా. 2. 156.

**అంగి** సం. విశ. (న్. నీ. న్.) 1. అవయవములు గలది. 2. దేహము గలది 3. ముఖ్యమైనది, ప్రధానము.

**అంగిక** సం. వి. ఆ. స్త్రీ. 1. అంగికా; చొక్కా. 2. ఆవిక.

**అంగిటిగుంట** వి. (√అంగిలి) గళగర్తము వాకిఁట. కుత్తుక మొదట నుండుగుంట.

క. తొంటిసడ గుంటుపడినం, బంటుతనము గుంటుపడక పరుషధ్వనితో, మింటికి నిమ్ముగ నంగిటి, గుంటదనుక నోరు దెఱచికొని యున్ముఖుఁడై. రామా. 8. 155.

**అంగిటిముల్లు** (వి. √అంగిలి). క. అంగుళముళ్, అంగుళీయముళ్.) 1. ఉపజిహ్వక, కొండనాలుక,

ద్వి. చెన్నుగాఁ బసుపార్చి చేయుమజ్జనము, కన్నులుఁ జెవులును గాఁడగ నూఁదు, నంగిటిముల్లొత్తు నందంద వ్రేల. బస. పు. 3. 340.

2. ఉపజిహ్వాకారరోగము, గళాంకురము, కొండ నాలుకయందుఁ బుట్టు రోగము.

ద్వి. పొంగెడుఁ గడుపు ముప్పునను బొప్పనికి; నంగిటిముల్లయ్యె నని నరు లనఁగ, నడ లుచుఁ గడు శోకజలధిఁ దేలుచును. బస. పు. 3. 368.

3. గంలిమున్న గునవిపోఁకకుండ బిడ్డలమెలకుఁ గట్టు త్రిశూలాకారమగు నాభరణ విశేషము. (వా.)

**అంగిరస** సం. వి. స్. పుం. ప్రభవాది సంవత్సరములలో నొకటి.

శ్లో. అంగిరోఽబ్దేఽఖిలాలోకాః భూపాస్సుస్థిరః కలహోత్సుకాః (అంగిరః. వా.)

**అంగిరసుఁడు** సం. వి. స్. పుం—అంగిరుఁడు

**అంగిరుఁడు** సం. వి. అ. స్. పుం. బ్రహ్మమానస పుత్రులలో నొకఁడు.

**అంగిలి** వి. ఔ. (క. అంగుళ.) అంతర్గళము,లో కుత్తుక, కొండనాలుక యుండు చోటు.

సీ. తనవక్త్రబిలము సొచ్చినమహాశివిబిని గం తద్గిలంబు లంగిటను వెడలె. ఉత్త. 1. 169.

క. ఆపిసినినక్క చాపము,కోసంగిట నిలికి సగముఁ గొఱికిన సింధసింబేపారి మిడిసి మర్మని,రూపిణ మొసరిడిసి నక్క రోఁ జుచుఁ గూలెన్. వే.. సంచ. 9. 109.

ఉ. అంగిటిగుంట, అంగిటిముల్లు.

**అంగీ** —అంగి.

సీ. తొడిగిన వెలిచల్వ సడరునంగీజోడు జీరా డునడికట్టు చెఱఁగుకొనలు. హంస. 2. 29.

సీ. తనుకాంతి గనిపింపఁ దనరునంగీజోడు వలిపెపుసాలువవల్లెవాటు. శుక.2, 406.

**అంగీకరణము** సం. వి. అ. న—అంగీకారము.

**అంగీకరణీయము** సం—అంగీకార్యము.

**అంగీకరించు** సం. అ. క్రి. స. క్రి. ఒప్పుకొను, సమ్మతించు.

(వ్యవ) మీరు చెప్పినదానికి నే నంగీకరించితిని. మీరు చెప్పిన దెల్లను నే నంగీకరించితిని.

స. క్రి. స్వీకరించు.

క....ద్రోణుఁడు దాల్చెన్. వ. ధర్మపత్నిగ నంగీకరించె. మార్క. 1. 45.

**అంగీకర్త** సం. విశే. (పు. స్త్రీ. పు.) అంగీకరించువాఁడు.

**అంగీకర్తవ్యము** సం—అంగీకార్యము.

**అంగీకారకుఁడు** సం. విశే. (అ. రకా. అ.) అంగీకరించువాఁడు.

**అంగీకారము** సం. వి అ. పుం. 1. సమ్మతి, ఒప్పుకొనుట. 2.పుచ్చుకొనుట, స్వీకారము

**అంగీకార్యము** సం. విశే. (అ. ఆ. అ.) అంగీకరింపఁదగినది.

**అంగీకుర్వత్** సం. (శ(త.) అంగీకరించుచున్న.

**అంగీకుర్వాణము** సం. విశే. (అ. ఆ అ.) అంగీకరించుచున్నది.

**అంగీకృతము** సం. విశే. (అ. ఆ. అ.) అంగీకరింపఁబడినది.

**అంగీకృతి** సం. వి. ఇ. స్త్రీ—అంగీకారము.

**అంగీక్రియమాణము** సం. విశే. (అ. ఆ. అ.) అంగీకరింపఁబడుచున్నది.

**అంగీయము** సం. విశే. (అ. ఆ. అ.) 1. దేహసంబంధమైనది. 2. అంగదేశ సంబంధమైనది.

**అంగు** వి. (క. అంగ) అంగము 1. విధము, రీతి.

వ. సూత్రధారుని తీరున బొమ్మలాడించుచు ఫలాహారిదానిం బండ్లు గొలుకుచు...కృష్ణ భుజంగంబునంగున బుసలం బో విడుచుచు ...చంద్రా. 6. 93.

ఉ. ... మాయెకిమీనితోడనే, యంగున మాట లాడితి ధరాధిపుఁ డేమని సెల్కెఁ దెల్పు ...సని. 5. 76.

2. అందము.

క. అంగగుతోడవుఁ బూఁతల, సంగుగనై సేసి యందు నాడెడుతమిచేఁ, బొంగారెడుపేడు కతో, సింగారపుఁదోఁట కరిగెఁ జెలువలుఁ దానుఁ. యయా. 3. 52.

**అంగుటము** - ఉంగుటము. వి. (సం. అంగుష్ఠః ప్రా. అంగుట్ఠో. క. తు. అంగుట, ఉంగుట.) అంగుష్ఠము, బొటనవ్రేలు.

చ. ... వాగధుల్ పుడిసిలించుచునె మడచి
మంగుటంబునన్, జీఱుముదునే... భా. రా.
అర. 2. 104.

'అంగుష్ఠ విశేషము' అని అం. భా. 2. 139.

**అంగుడుదుడిపి** — అంగుడుదుడుపు. విశే. కొండె
ములు చెప్పువాడు, చాడీగోట్టు. (శ. ర. (బ్రౌ)

**అంగుడుదుడుపు** — అంగుడుదుడిపి. (బ్రౌ)

**అంగురి** సం. — అంగుళి.

**అంగుళ(ల)ము** సం. వి. అ. పుం. 1. వ్రేలు.
2. బొటనవ్రేలు. పుం. న. ఎనిమిది యవోదర
ముల ప్రమాణము, అంగుళ ప్రమాణము.

**అంగుళి(లి)** సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. వ్రేలు.
2. తొండము చివర. 3. అంగుళ ప్రమాణము.
4. గజకర్ణిక (వృ. వి.)

**అంగుళితోరణము** సం. వి. అ. న. చందనాదుల
చేత నొసట అర్ధచంద్రాకారముగా బెట్టిన
తిలకము.

**అంగుళిత్రము** సం. వి. అ. న. అంగుళీకవచము,
అత్రము, గోధ. (వింటినారి దెబ్బ మున్నగు
నవి తగులకుండ ఉడుముతోలుతో గుట్టి చేతికి
దొడుగుకొను కవచము.)

**అంగుళిత్రాణము** సం. — అంగుళిత్రము.

**అంగుళిముద్ర** సం. వి. ఆ. స్త్రీ. ముద్దుటుంగ
రము.

**అంగుళిముద్రిక** సం. — అంగుళిముద్ర.

**అంగుళిమోటనము** సం. వి. అ. న. చిటిక.

**అంగుళిషంగ** సం. వి. ఆ. స్త్రీ. — వ్రేలితో అంటు
కొను పచ్చనుగలట-జావ.

**అంగుళిషంగము** సం. వి. అ. పుం. అంగుళి
స్పర్శము, వ్రేలితాకుడు.

**అంగుళిసంజ్ఞ** సం. వి. ఆ. స్త్రీ. వ్రేలితోఁ
జేయు సైగ.

**అంగుళిసందేశము** సం. వి. అ. పుం. చిటికె లు
వేసికాని నెటికలువిఱిచి కాని హస్తముతో సైగలు
చేయుట.

**అంగుళిస్ఫోటనము** సం. వి. అ. న. నెటిక;
నెటికె.

**అంగుళీ(లీ)యకము** సం. — అంగుళీయము.

**అంగుళీ(లీ)యము** సం. వి. అ. న. ఊర్మిక,
ఉంగరము.

**అంగుష్ఠమాత్రము** సం. విశే. (అ. ఆ. ఈ. అ.)
బొటన వ్రేలికొలందిగలది.

**అంగుష్ఠము** సం. వి. అ. పుం. 1. బొటన
వ్రేలు. 2. బొటనవ్రేలి పరిమాణము.

**అంగుష్ఠ్యము** సం. వి. అ. పుం. బొటనవ్రేలి
గోరు.

**అంగూషము** సం. వి. అ. పుం. 1. ముంగి. 2.
బాణము.

**అంగ్యము** సం. — అంగీయము.

**అంఘస్సు** సం. వి. స్. న. పాపము,
అంహస్సు.

శ్లో. ... విఘ్నతు ఘృణయః శ్రీఘ్రమంఘో
విఘాతమ్. సూర్యశతకము. 6.

**అంఘ్రి** సం. వి. ఇ. పుం. 1. కాలు. 2. వేరు.
3. పద్యచరణము. (వృక్షాదు శాస్త్రాకరము.
1. 14.)

**అంఘ్రిపము** సం. వి. అ. పుం. పాదపము; చెట్టు.

**అంఘ్రిపర్ణి** సం. వి. ఈ. స్త్రీ. అంఘ్రిపర్ణిక,
కోలపొన్న (వృ. వి.)

**అంఘ్రిపర్ణిక** సం. వి. ఆ. స్త్రీ. — అంఘ్రిపర్ణి.

**అంఘ్రివల్లి** సం. — అంఘ్రిపర్ణి.

**అంఘ్రిస్కంధము** సం. వి. అ. పుం. చీలమండ.

**అంచే** వి. (సం. హంసః, త. అంజం, క. అంచ.)
హంస.

జ. అంచగమలంపొన్న, అంచగుబ్బ పుల్కోడు,
అంచతత్తడి చెలియ, అంచపనిము, అంచ
యాన, అంచ (ను) రౌతు.

**అంచే²** వి. (క. అంచె.) పార్శ్వము, ప్రక్క;
సమీపము.

మానిని ... సురల్ ప్రణతాస్త్రయటంచు,
చంచలారా నిగమావళి వందిచయంబు బయి
మ్రోల నుతుల్ సలుపన్, శ్రీరం. మా.
3. 70.

**అంచితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. వంకర యైనది.

శ్లో. స్వసితాంచితమూర్ధజా. సం. భార.

(అంచిత మూర్ధజములు — నెఱికురులు, వంకరగానున్న కురులు)

1. వంపఁబడినది.

శ్లో. అంచితసవ్యజానుః సం. రఘు. 18. 51.

3. పూజింపఁబడినది. 4. సుందరము, ఒప్పిదమయినది.

శ్లో. ఉభావలంచక్రతు రంచితాభ్యాం, తపోవ నావృత్తిపథం గతాభ్యాం సం. రఘు. 2. 18.

**అంచియ** — అంచె.

**అంచు**[1] **(న్చు)** — అనుచు. సం. క్రి. పోవునట్లు చేయు, పంపించు, పుచ్చు.

చ. ...పైఁ బడిన తమ్ముని నంతకు ప్రోలి కన్చి ... భాగ. ద్రో. 1. 344.

ఉ. ... రాజు ని, న్న చెద నేఁడు దండిగ కంచతిరోషకపాయితాతుఁడై. ఉ. రా. 4. 67.

**అంచు**[2] **(న్చు)** స. క్రి. (√పనుచు[2]) ఆజ్ఞాపించు.

చం. ... ఇన్నదిఁ గ్రుంకి యుఁగఱున్, బుపులిఁకఁ గోసి తెండు శివపూజ కటంచు దశాస్యుఁ డంచినన్.

ఉ. స్వామి హాసా దటంచు శుకసారణ ముఖ్య సమస్తసైనిక, గ్రామణులు ... సుమాపచయం బొనరించిరి ... ఉ. రా. 3. 199, 200.

అంచిపుచ్చు — అనుమతించి పంపు.

చ. అనపుడు నక్కిరీటి దగ నయ్యదువంశవరేణ్యుతోడ నిట్లను నటులేనిఁ బోవలయు హాస్తిపురంబున కిత్తెఱంగు సెప్పిన నిను ధర్మనందనుఁడు ప్రీతిగ నందుఁ గన్చిపుచ్చున, య్యనుమతి గల్గునట్లు దగ నాడెద నవ్విభుపాల నచ్యుతా. భార. అశ్వ. 3. 4.

**అంచు**[3] స. క్రి. (√అణఁచు) అణఁగఁజేయు, త్రొక్కు; బాధించు.

చ. కనుకని నిఁ దొల్లి దానిదెసఁ గన్నులఁ జూచిన వాని నేయునా, మనసిజుఁ డంచుఁ గోయి లలు మట్టు నలుల్ నవయించుఁ దెమ్మెరల్, గనుకని నిన్ను నిప్పు డిది గన్నులఁ జూచిన దాని నేసె నా, మనసిజుఁ డంచెఁ గోయిలలు మట్టె నలుల్ నవయించెఁ దెమ్మెరల్. కు. సం. 8. 153.

(ప్రయోగాంతరము కనఁబడలేదు.)

**అంచు**[4]. వి. (సం. అంచలః. క. అంచు)

1. అగ్రము, కొన.

మ. యవసం బంచుల నాడఁగా నెగసె వాత్యాళిన్ రజశ్చక్రముల్. ఆము. 2. 48.

ఉదా; దిండెయంచు, గిన్నెయంచు, కత్తియంచు.

2. బట్టచెఱఁగు, చీరచెఱఁగు. 3. (బట్ట) కమ్మి.

సీ. రాయంచ యంచుఁ జీరకు జోకయగుఁ గాక పచ్చియేనికతోలు పచ్చడంబు. హర. 4. 28.

4. పార్శ్వము, ప్రక్క, ఓర. 5. అరము, బండికంటియాకు.

వ. పండ్రెండంచులు నాఱుగమ్ములును మూఁడు దొలులుంగలిగి సంవత్సరాత్మకంబయియేక చక్రంబయిన సూర్యుని రథము. భాగ. 5. 2. 81. వ. యస్యై కం చక్రం ద్వాదశారం షణ్ణేమి త్రినాభి. సం. భాగ. 5. 21. 11.

6. విధము.

క. అంచు మగుత్తుని కథ విని, పించిన మునితోడ జననభీరువులకు నే, యంచున నిహాపరములు సిద్ధించు ననుచు నడుగ నయ్యధిష్ఠిరు తోడన్. జై. భా. 3. 26.

శ. అంచుకమ్మలు. అంచుముట్టు. అంచులవాఁడు.

**అంచుకమ్మలు** వి. బ. (√అంచు[4]) చెవులకు పెట్టుకొను ఒకవిధమగు నగ.

సీ. లక్కాకు లివియేల చొక్కంపు టంచుకమ్మలు ధరించు మటంచు నలుకఁ గాంచు. శుక. 2. 456.

**అంచుకయించుక** అవ్య. కొంచెము, ఇంచుక.

ఉ. ఆడదుగాని మాట లోకయంచుకయించుక వీను లొగ్గి నా, యాడినమాట లెల్ల విను. పి. శకుం. 2. 159.

**అంచేముట్టు** అ. క్రి. (√అంచే[4]) తుదముట్టు, సమాప్తమగు.

సీ...తమి యంచుముట్టునంతనె బలారి.గీ.వచ్చునఁట విఁడునకు నిందు వనిత నడుగ. వసు. 4.124.(తమియంచుముట్టు నంతనె-రాత్రి కడవఁగానే.)

**అంచేలవాఁడు** వి. (√అంచే[4]) చిత్తరువు వ్రాయు వాఁడు.

గీ. చెలఁగు నంచులవాఁ డనఁ జిత్రకారి. అం. భా. 2. 282.

**అంచె** వి. (క. అంచె. త. అంజల్.)

1. దూరప్రయాణముచేయు జనులునుబండ్లును మార్గమున అక్కడక్కడ నిలిచెడు ఘట్టము ; అట్టి ఘట్టమునకును ఘట్టమునకును నడుమ నుండు దూరము,

(వ్యవ.) వాఁ డంచెగుఱ్ఱములమీఁగ వెళ్ళి నాఁడు—కొంతదూరమొక గుఱ్ఱము మీఁదను మఱికొంతదూరము వేఱొకగుఱ్ఱము మీఁదను వెళ్ళినాఁడు.

జాబు లంచెల మీఁద వచ్చినవి - కొంత దూరము ఒకని చేతను మఱికొంత దూరము మఱి యొకనిచేతను తీసికొనిరాఁబడినవి.

2. వరుస, బారు ; గుంపు.

సీ. అనిలంబు లేడును నంచెలంచెలు గట్టి యాకాశవీథి నందంద నడవ. కాశీ. 1. 182.

ఉ. అంచెలుగట్టి కాలితొడుసై చననీవుగదమ్మ ప్రోది రా,యంచలు ... మనుచ. 5. 61. అంచె లంచెలన్ - అక్కడక్కడ.

వ. ఇట్లాఖేటఖేలనంబున వివిధమృగవిహాగవధం బాచరించి యంచెలంచెలం బంచతా పతిత చమరిసృమరకిరిహారిణ రురుమహిషపృషదంశ గోధికా శశ పిశిత ఖండ బు లొండొండ యుద్వేత్తుగా నాకుఁ బొత్తరలన్ గట్టియు ...మనుచ. 4. 60.

వ. ...గ్రక్కున గిఱుక్కున మల్లి కంకణాంగద ఝుణఝుణత్కారంబు లుల్లసిల్ల నగ్గలంబగు సిగ్గు తమకంబు లిగ్గులాడ నంచెలం చెల నించించుక తిరిగితిరిగి చూచుచు...ఉ. హరిశ్చ. 3. 87.

**అంజె** వి. 1. అడుగు, పాదము.

దండకము ... గుజ్జురూపూని మూఁ డంజలన్ముజ్జగంబు ల్కరం బబ్బురం బొప్ప నాఁకట్టి ... నీలా. 2. 41.

2. అడుగుదూరము.

సీ. అట రెండు మూఁడంజ లరుగునప్పుడకాళ్లఁ బంకజాతాక్షికిఁ దొట్రుపాటు గదిరె. మనుచ. 3. 91.

3. —అంగ.

సీ. పదియైదునంజల పరువెత్తి చనలేక దగదొట్టి పెగవులు దడుపువారు. పి. శకుం. 3.105.

5. సమీపము,

గీ. కెలన దా పంజ దగ్గఱ ప్రేవ పొంత,యంచ యొద్దన నికటాఖ్య యగు మహేశ. అం. భా. 3. 21.

జ. అంజగొను. అంజమెడపట్టు.

**అంజెగొను** స. క్రి. (√ అంజె) ఆకర్షించు.

ఆ. కన్నియల మొగంబు గిన్నియలను గల్లు, లంజెకాండ్ర డెంద మంజగొనియె. అచ్చ. భా. 2. 45. పా.

**అంజన** నం. వి. అ. స్త్రీ. 1. ఉత్తరపుదిక్కునం దలి యాఁడేనుఁగు. 2. హనుమంతుని తల్లి. 3. (అలం) వ్యంజనయను శబ్దవృత్తి. చూ. అంజనము.

**అంజనకాఁడు** మి. వి, (త. అంజనక్కారన్.) అంజనమువేసి చోరనిక్షేపాదులఁ గనిపట్టు వాఁడు. (గ్రా.)

**అంజనకి** నం. వి. ఈ. స్త్రీ. ఒకానొక మందు మూలిక.

**అంజనకేశి** నం. వి. ఈ. స్త్రీ. హట్టవిలాసిని (వృ. వి.) (ఇది వెంట్రుకలకు మిక్కిలి నలుపు కలిగించును.)

**అంజనగిరి** నం. వి. అ. పుం. ఒకానొక పర్వతము.

**అంజనామిక** నం. వి. అ. స్త్రీ. కనుఱెప్పమీఁది కాయ.

**అంజనము** నం. వి. అ. పుం. 1. ఒక జాతి బల్లి. 2. **తిందుకము**, తుమికి (వృ. వి.) 3. ఒకానొక పర్వతము. 4. **పశ్చిమదిగ్గజము**. న. 1. **పూయుట**, చమురుట. 2. మైపూఁత. 3. ప్రకటించుట, వికసింపఁజేయుట. 4. కాటుక 5. మాలిన్యము. 6. రసాంజనము. 7. సౌవీరము. 8. వ్రాఁత కుపయోగించు సిరా. 9. రాత్రి. 10. (అలం.) వ్యంజన యను శబ్దవృత్తి. (ఇది వాచ్యలక్ష్యార్థములకంటె అన్యమగు వ్యంగ్యార్థమును బోధించును.)

**అంజనశలాక** నం. వి. ఆ. స్త్రీ. కంటికి కాటుక నుంచుకొనుటకైన సలాక (కడ్డి)

**అంజనాద్రి** నం. వి. ఇ. పుం. నల్లని యొక కొండ.

**అంజనాధిక** నం. వి. ఆ. స్త్రీ. — కాటుకకంటె ఎక్కువ నలుపైనది–ఒక జాతి బల్లి.

**అంజనావతి** నం. వి. ఈ. స్త్రీ. ఈశాన్యదిక్కున దలి యాఁడేనుఁగు.

**అంజని** నం. వి. ఈ. స్త్రీ. 1. చందన కుంకుమాదు లచే అలంకరించుకొను స్త్రీ. 2. ఒక **రోహిణి** (వృ. వి.) 3. కాలాంజని (వృ. వి.)

**అంజనిక** నం. వి. అ. స్త్రీ. 1. ఒక జాతి బల్లి. 2. చుంచు. 3. సుప్రతీకమను దిగ్గజము యొక్క భార్య.

**అంజెమెడపట్టు** వి. (√ అంజె) సుగ్రంథవిశేషము, ముప్పదిరెండు విన్నాణములలో నొకటి. ఆ. భా. 2. 209.

**అంజలి** నం. వి. అ. పుం. 1. చేమోడ్పు. 2. దోసిలి. 3. కుడప మను పరిమాణము 4. అభినయహస్త విశేషము. (బొటనవ్రేలు వంచి చూపుడు వ్రేలి మొదటఁ గూర్చి తక్కిన వ్రేళ్లు చాఁచిన రెండు చేతులను గూర్చి పట్టినది.) ఇది ద్విగు సమాసమున ద్వి. త్రి. శబ్దములకు పరమగునపుడు అకారాంతముకూడ నగును.

**ఉదా**: ద్వ్యంజలము ద్వ్యంజలి. మొ.

**అంజలిక** నం. వి. ఆ. స్త్రీ. పిల్లెలుక.

**అంజలికారిక** నం. వి. ఆ. స్త్రీ. 1. చేతులు మోడ్చి కొనియున్న మట్టి బొమ్మ. 2. లజ్జాలువు అను ఓషధి, సోఁకుడుముడుఁగు (వృ. వి.)

**అంజలిగుంజలి** అవ్య. క్షోభపడునట్లు, చీకాకు పడునట్లు; బాధలుకలుగునట్లు.

ద్వి. తుండంబు చేపట్టి త్రోచి రాఁ దిగిచి, యంజలిగుంజలి యల్లాడ్చి వేచి, భంజించుచును ... 4. 97.

**అంజలిపుటము** నం. వి. అ. పుం. న. దొప్పవలె పట్టినదోసిలి.

**అంజసము** నం. విశ. (అ. ఆ. అ.) వక్రము కానిది, సరళము, ఋజువైనది.

**అంజస్సు** నం. వి. స్. న. 1. వేగము. 2. బలిమి. 3. ఆర్జవము, సరళత.

**అంజి** వి. బాలికా క్రీడావిశేషము.

క. పరితేనియల సొగటాలరుగు జూదంబు నెత్తపుచ్చనగండ్లన్, పసుగు నోమనగుంటలు, సరసమొయి నాడుచున్న సతులం గనియెన్. భోజరా. 5. 76.

**అంజి** నం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. మంగళము 2. పేషణయంత్రము. (తిరుగలి, రుబ్బురోలు మొ.) ఇ. పుం. 1. మంగగుంటి. 2. నాగకేసరము (వృ. వి.)

**అంజిక** వి. (√ అంజె. క. తు. అంజికె. త. అంజి. తె. తు. అసిక, అవిశ్వాసము.

ద్వి. ...ఇనతనూజుని మ్రతినే వాయుసుతుండ, నాంజనేయుండ భీతుకాల్పని నిటకు, నజమిచట మాయ వచ్చితిని. (ఇట 'అంజి' అపముద్రితము.) రం. రా. కిష్కి. 300. పో. 1. ఆ. భా. 1. 199.

**అంజిష్ఠుఁడు** నం. వి. అ. పుం. సూర్యుఁడు.

**అంజిష్ణుఁడు(వు)** నం. వి. ఉ. పుం. సూర్యుఁడు.

**అంజీరము** నం. వి. అ. పుం. అంజూరపుచెట్టు. న. అంజూరపుపండు.

**అంజు** అ. క్రి. (క. త. అంజు. తు. అంజుని.) భయపడు, జంకు; వెనుదీయు; సందేహించు.

శ్లో. తస్య పూర్వాం రథః పృథ్వ్యా శ్చతురంగుల ముచ్ఛ్రితః, బభూవైవం చ తేనోక్తే తస్య వాహాః స్పృశ న్మహీమ్. సం. భార. ద్రో. 191. 55.

వ. ... అరదంబుల నరదంబులతో నంటసిల నడుచుచుఁ దురగంబులఁ దురగంబులతోఁ దుత్తుమురుగా దూఁటుచు. ఉ. హరి. 4. 261.

శా. శీలం గాలును గేలు నంటసిల బల్మిం బట్టి పీడించి ముంగాలం గ్రుమ్మ్చు గాఢముష్టిఁ బొడువన్ ... పద్మ. 9. 324.

**అంటి** – అనఁటి. వి. అరఁటి, కదళి (వ్య. వి.) ఆం. భా. 2. 58, రుక్మాం. 1. 6.

**అంటించు** స. క్రి. (√ అంటు) అంటఁజేయు, తగిలించు.

మ. అనిశం గాలిశశూలము ల్చెవులలో నంటించినట్లైన...సారంగ. 2. 99.

(వ్యవ) వాఁడు కొంప అంటించినాఁడు. (= ఇంటికి నిప్పుపెట్టినాఁడు.) వాఁడు వెళ్లుచు వెళ్లుచు అంటించినాఁడు. (= విరోధములు కలిగించినాఁడు.) ఆసమయమున వాఁడు తగిన మాట అంటించినాఁడు. జాబు అంటించి పంపుము. వానిని మాకు అంటించి వెళ్లినాఁడు.

**అంటింత** – అంట్రింత.

(వ్యవ) ఆపిల్ల యెదుగుఁ బొదుఁగు లేక అంటింతకాయలాగున అలాగుననే యున్నది.

**అంటిన** వి. (√ అంటు,) 1. (బట్టలకంటుకొను) అంట్రింతగడ్డ 2. సంబంధము. (శ. ర.)

(వ్యవ) వానికిని దానికిని కొంచెము అంటిన యున్నట్లున్నది.

**అంటు** స. క్రి. (క. తు. అంటు) 1. స్పృశించు, తాఁకు, ముట్టుకొను.

ఉ. ఏ నొకపాపభావమును నెద్దఁ దలంపక యుండునట్లుగా, నానతి వైర నీయడుగు లంటఁగ నోపుదు...భార. అర. 2. 214.

క. ఏకాంతమైనఁ బురుషుం, దేకాంతము నందుఁ జేరనేనియు నతనిన్, లోకాపవాద మంటదె, చీకాకుగ ధైర్యమెడలఁ జేయఁడె మరుఁడుఁ. సారంగ. 2. 26.

2. తగులుకొను, విడువకుండు.

వ. పూర్వజన్మంబునం జేసిన పుణ్యపాపంబులు వెంబడి నీజీవుల నంటియుండి సుఖదుఃఖంబు లనుభవింపఁజేయు ... కుచేల 1. 58.

3. (యుద్ధమున) కవియు, తాఁకు.

చం. అడఁగిన చంద్రునిప్పు నికటార్జునముం దెగ టార్చి పేర్చి కం,అడవి దహించుమాడ్కి- లవుఁ డంటిన సేనలఁ బెక్కు భంగులన్, బొడవడఁగించి మండి బలుమూఁకల వెంపరలాడుచుండె ... జై. భా. 6. 177.

4. రతియందుఁ గూడు.

మ. తనున నంటన్ సతు లౌటఁ గోరు మునిబృం దంబుల...ఆము, 6. 52.

ఉ. నన్నంటఁగ బెల్లునే జనకు నంటిన పిమ్మట నంటవైన నీ, యంటున నంటు గామి నెటు లంటును గెంటక మేనఁ బ్రాణముల్. సారంగ. 2. 94.

5. ఆశ్రయించు.

సీ. అవివేకియగురాజు నంటిన ప్రజలందు నెట్ట వారును మతిహీను లగుదు,రు ... నా. పంచ. 1. 138.

6. అవలంబించు.

సీ.- ఎంత కాలము గిరుల్ న తతాభ్యున్నతి నల హంసపద్ధతి నంటియుండు. వసు. 1. 85. (యోగిమార్గ మవలంబించు అని ఒక యర్థము)

7. పట్టుకొను.

ఉ. ... మృణాళాంకురశంక నంటెడుగజా స్యునిఁ గొల్తు ... మనుచ. 1. 4.

ఉ. పద్మముఖ వేణి కరంబున నంటి నిల్పి నీ, కంటికి నింపుగా నెనరు గైకొన కేఁగెదు చౌకచేసి...దశా. 7. 129.

8. కూడు, కలియు.

గీ. శిష్యు, లంటి చనుదేర నచ్చోటి కరుగు దెంచి. కువల. 2. 76.

వెంటనంటు–వెంబడించు, అనుసరించు.

ఉ. ...ప్రమథావలి యుబ్బుచు వెంటనంటఁగా, గిబ్బవయాళితేజి దుమికించుచు వచ్చె మహేశుఁ డత్తఱిన్. దశా. 2. 69.

మ. శతపత్రేక్షణ వెంటనంటిన వసు క్ష్మాపాలకా లోకముల్ ... వసు. 3. 75.

ఉ. పాఱె నమ్మేకము జాగిలముల్ వెస వెంట నంటఁగన్. శుక. 1. 179.

9. పొందు, చెందు.

క. అంటిన మాత్రన హరిచే, ఘంటాకర్ణుండు మెఱసె గంధర్వపదం, బంటినగతి సిద్ధపదం, బంటినగతి దివ్యతేజ మంటిన కతనన్. ఉ. హరి. 2. 153.

10. (నూనె మొదలగునవి) రాచు.

సీ. కమనీయగతిఁ దలో త్తమ నేర్చుఁగాక నూని యయంట నెవ్వారు నేర్తురు. వసు 5. 74.

ఉ. కూలికి నూనెలంటి కలగూరలకై పాల మెల్లఁ జుట్టి ...శుక. 2. 363.

అ.క్రి. 1. ప్రాప్తించు, అబ్బు.

సీ. ... అతని కంట, దయ్యె వేదాదివిద్యల యందొకటియుఁ, బరిమయత్నంబుతో నెన్ని పాట్లుపడిన. కళా. 6. 79.

2. అత్తు, కూడు, కలియు.

సీ. తఱిగె నెవ్వఁడు ఖడ్గధారాంచలంబున నగ్గి నాలుక లేదు నంటఁబట్టె. కాశీ. 3. 32.

సీ. కొంగవాల్ నఱకు లంగులులఁ బట్టుక జబ్బ లంటఁ గుట్టెడ వెజ్జు నరయువారు. ఆము. 6. 85.

3. లగ్నమగు, తగులుకొను.

సీ. అళిక భాగంబున నంటిన కురులతోఁ గరఁగిన యంగరాగములతోడ. విక్ర 5.61.

సీ. ఆకురాలుపు గండ్ల నానెడు నాస నింతడు గూఁది బంకంటి యంగలార్చు. ఆము. 5. 117.

4. నాటుకొను.

ఉ. ఆ రమణీ లలామ మది నంటిన కోరిక యంబు నిల్పఁగా, నేరక ...పారి. 1. 134.

చ. వనజదళాయతాక్షి మగవాఁడు పరాంగన పొందుఁ గోరువాఁ,డని వినవేమొ యట్టి చవు లంటినచో మఱి చౌక సేయఁడే, నిను ...శుక. 1.495.

5. అంటుకొనియుండు, నిలుచు.

ఉ.... నన్నంటఁగఁ జెల్లునే జనకు నంటిన పిమ్మట నంటినైన నీ. యంటున నంటుగామి నెటులంటును గొంటక మేనఁ బ్రాణముల్. సారంగ 2. 94.

6. కలుగు, పుట్టు.

చ. భవదనుజాత్మజుఁ డసున్నృపాలుఁడు నైకొను నెల్లి నేఁట నయ్యావని వరప్రసాదమున నంటదువో భవదీయ జాతికిం, బవిభయ మంచు ... వసు. 4. 4, హంస 1. 187.

7. దీని తుమున్నంతమునకు ఇతర ధాతువు లను ప్రయుక్త మగునపుడు 'మొదలంట, నిండ, గట్టిగా, బిగ్గరగా' మొదలగు నర్థములు ఊహించునది.

సీ. పొదవ హత్తుకొని సమున్నద వృత్తిఁ జను హత్తి కొమ్ములంటఁ బెకల్చి కొట్టినొకఁడు. శుక. 1. 174.

గీ. చటులతూర్య వ్రజము నంటఁ బఱచె ... వసు. 5. 69.

శా. కాలంటన్ ద్రొక్కి (—కాలిబలము కొలఁది ద్రొక్కి.) వరాహ. 11. 111.

ఉ. మంటయుఁ బోని శాత్రవసమాజము నించు కయేని శంక లే,కంటఁగఁ దాఁకి వెండితెగటార్చె మహాద్భుతశక్తిశాలి ... భార. విరా. 3. 228.

వ. పెక్కండ్రతోడం బెనంగుపుత్త్రునిం గనుంగొని యర్జునుం డంట నార్చి యడరి యందఱ కన్ని రూపులై నొప్పించి ... భార. భీష్మ. 2. 182.

(వ్యవ.) వాఁడు చేను అంటఁ గోసినాఁడు. వానిని తేలు అంటఁగుట్టినది. ఆచేను అంట లేదు. (—మొలవలేదు). అంటరానివాఁడు (—అస్పృశ్యుఁడు). మొదలంటఁ గోసినాఁడు. చెట్టు చివరంటఁ బూచినది. ఆ పుస్తకము కడంటఁ జదివినాఁడు. కుట్టు వానితో కడకంట వెళ్లి రమ్ము. ప్రాణములు కడంటినవి. అతఁడు అంటకుండ ముట్టకుండ ఉన్నాఁడు.

విశ. 1. అంటుకలది.

ఉదా:- అంటుపట్టె. అంటుగిన్నె. అంటుచేయి.

2. అంటుకొనునది.

ఉదా: అంటురోగము. అంటుపేను.

వి. 1. స్పర్శము, తాఁకు.

గీ. జంటముకాల్పి శౌర్యడాలంటు చేత, మలి నమౌనలినము లుండు బలుకొలంకులు. ప్రబంధ. 155.

2. కూడిక.

సీ. గమనించుతలి మందగమన శృంగారాప్తి నంటు వాయక వెంట వెంట నెయిదు. శుక. 1. 201.

3. విటవిటసంబంధము.

వ... చాటూక్తి వాచాటలగు జరఠవనితలు తమకు ప్రమొక్క దాటు ప్రమొక్క కొక్కించుక యోరమోమిడి వారయిరుపక్కియల నొదిగి తొంటియంటుఁ దలంచి తలవాంచిన ...ఆము. 4. 55.

4. అతుకు.

సీ. ఇది శిలావృత్తాంత మింద్రదనంబిన నీవు తటుకునఁ జని రింతలమునందు, నంటుము విడివడు నశ్వమేధ హాయంబు నతియును శాపమోక్షంబు గాంచు, ననిన నమ్మునికి సాష్టాంగంబుగా మ్రొక్కి యమరేంద్ర నందనుఁడట్ల చేయ, శిలతోడ నంటు వాసె హాయంబు ... జై. భా. 4. 109.

5. (తలవెంట్రుకలు మొదలగువాని) చిక్కు.

క. రమణునికడ కనుప మనో, రమకున్ మజ్జనము దీర్చి రవరివకచపిం,ఛమునకుఁ గాలాగురుధూపము వెట్టి జవాది నంటు వాపి నిపుణతలు. మనుచ. 6. 4.

6. (క.) తాఁకరాని దానిని తాఁకుటవలనఁ గలిగిన యపరిశుద్ధత, మైల; మలిన పదార్థము.

ఉ. అంటితివేమొ పుష్పవతియౌ లతకూన నచైనవంటు న, న్నంటకు మున్గుదాఁక నని యవ్వలి కేఁగిన ... ఉ. రా. 6. 57.

(వ్యవ) గిన్నెకు అంటు వదలలేదు. (అంటు-అంటుకొన్నమని మొ.)

(చ.) ఖ. అంట్లు—వంటచేత అపరిశుద్ధమైన పాత్రలు.

ఉదా: ఇంకను అంట్లు తోమలేదు.

7. అస్పృశ్యము, ముట్టు.

(వ్యవ) ఆమెకు అంట్లుడిగినవి.

8. ఒక చెట్టుకొమ్మను వంచి భూమిలో పాఁతుట వలనఁ బుట్టిన మొక్క; ఒక చిన్న మొక్కను పెద్దచెట్టు కొవటను అంటఁ గట్టఁగా పయలుదేలిన మొక్క.

ఉదా: చేమంతి అంటు, మామిడి అంటు. దబ్బ అంటు మొ.

మ. అల మాకందము కుదిరించుపలుగు నియ్యాలవ్యకంచో పయంగా నల సంగకిఁ బ్రచుప్పట విడఁ వలెఁ...విప్ర. 2. 69.

9. తమ్ముటు. (అంట్లు—అంటు, తమ్ముట్లు.)

10. మిత్రుఁడు, నెయ్యుఁడు.

ఆ. భా. 3. 186.

11. (బ.) అంటుపేలు.

గీ. ఎలయు సీతాస్నముంతోడ నీళ్లు గ్రుక్క, యంటు సొంటులు పరికించి యంట్లఁ బొడిచె. పాం. మ. 5. 30.

జ. అంట², అంటఁగట్టు, అంటనిదు, అంటని వేల్పు, అంటరాని వేల్పు, అంటసిలు, అంటించు, అంటిస, అంటుకత్తియ. అంటుకాఁడు, అంటుకొను, అంటుకోడు, అంటుపడు, అంటుపేను, అంటుపోఁగులు, అంటుమెడ, అంటుఱాయి.

**అంటుకత్తియ (త్తె)** వి. (√ అంటు) విటకత్తె.

**అంటుకాఁడు** వి. (√ అంటు) విటుఁడు.

క. వలపు గలయంటుగానికిఁ, బిలుపే దేవేంద్ర పదవి ప్రియురాలు దనుఁ, బిలిచె నను వార్తవిన్నను, నిలిచినచో నిలువ నేర్చునే నిముసంబున్. వైజ. 4. 34.

**అంటుకొను** స. క్రి. (√ అంటు) — అంటు. (తాఁకు) — స్వార్థమందు కొను—

గీ. అడుగు లోపలఁ దాటిపండదిమినట్టు, లడుగుదునె కాని పాతాళ మంటుకొనఁగ. కాశీ. 1. 114.

(ఆశ్రయించు, పట్టుకొను.)

**అండకోశము** సం. వి. అ. పుం. ముష్కము, వృష ణము.

**అండగొట్టు** అ. క్రి. (√అండు) వెనుదీయు; మసలు, ఆలస్యముచేయు.

వ... నవాపం ... వహ్నిపోత్పు ... చాయ ... జన వెలచి ... గొట్టుచు నిలుచుండుట యు... మ. 1. 175.

**అండగొను** స. క్రి. (√ అండు. త. అడైక్కోళ్.)

1. అండచేసికొను, ఆశ్రయించు.

చ... భీష్ముఘుం... ప్రముఖ లోకము... లె వెక్కుడీ, ... గొని తప్పు... జూపున... చునున్నవాఁడు... భార. ఉద్యో. 4. 205.

అ. క్రి. వెనుదీయు.

గీ. ఇన్నిరోజు ... హీనవృత్తి వచను నిన్నేమిచెప్ప నా కుచితవృత్తి; నిన్ని రాజ్యము క్రమ్మఱఁ బుచ్చికొనఁగ ... నీ ... గొని యొ... యిచ్చె. మా... 1. 182.

... మానిని ... డున్, ... అండపాలు ... గాయఁడు, న ... గొన పోర చు ... మొ ... అన్న. ... యు. 333.

**అండగోడ** వి. (√ అండు) గోడకు ఆనురాగా కట్టిన గోడ. (బ్రౌ.)

**అండజ** సం. వి. ఆ. స్త్రీ. కస్తూరి.

**అండజము** సం. విణ. (అ.ఆ.అ.) గ్రుడ్డువలనఁ బుట్టినది. వి. అ. పుం. 1. పక్షి. 2. చేఁప. 3. పాము. 4. బల్లి.

**అండప్రసువు** సం. విణ. (ఈ. ఈ. ఉ.) 1. అండజము, గ్రుడ్డును ... పుట్టునది. 2. గ్రుడ్లను పెట్టునది.

**అండము** సం. వి. అ. పుం. న. 1. వృషణము. 2. గ్రుడ్డు. 3. కస్తూరిపుట్టుతిత్తి. 4. వీర్యము, శుక్లము.

**అండా** వి. (క. హండా. త. అండా.) పెద్దగుండిగ, గాబు; కటాహము, గంగాళము. (శ. ర.)

**అండాకర్షణము** సం. వి. అ. న. అండములు తీసివేయుట.

**అండాలువు** సం. వి. ఉ. పుం. గ్రుడ్లతోఁ గూడిన చేప.

**అండి(డె)** వి. (క. అండె, హండె.) గుండిగ మొ. లోహపాత్రవిశేషము. (శ. ర.)

**అండియ(డె)** వి. (క. తు. అండె) చిమ్మనగ్రోవి, నీళ్లు మున్నగునవి చిమ్మెడుగొట్టము.

గీ. కువలయంబున బుట్టటకొమ్ము నాఁగ, నండె యనఁగ ... లాడునట్టి, కొమ్మునకుఁ జేర్లు... దేశ్య. (శ.ర.) 'ఒకవిధమైనచిమ్మనగ్రోవి' అని ఆం. భా. 2. 178.

**అండియ(డె)ము** వి. (క. అండిగె.) అంకెము. ఆం. భా. 2. 266.

**అండీరుఁడు** సం. వి. అ. పుం. పూర్ణముగా ఎదిగిన మనుష్యుఁడు, బలవంతుఁడు.

**అండు** — అందువు — అనుధాతువుయొక్క తద్ధర్మార్థక మధ్యమపురుషైకవచనరూపము.

క. ... డము కాషాయ ... బును, ముండితయుఁ గమ ... లుపును మోతు మొనఁగ వెట్టండేని ... భాగ. శాం. 6. 178.

బ. న. అండురు (డ్రు) = అందురు.

క. మగవానిఁ ... లె మునుపుగ, మగువ కెడలుఁ బ్రాయ మండ్రు మానవతి... కళా. 4.47.

గీ. ... క్రియాచార విధిక ... ణి యండ్రు... నైష 4. 5.

డ్రు—అందును. అనుధాతువు యొక్క తద్ధర్మార్థకోత్తమపురుషైకవచనరూపము.

బ. వ. అండుము—అందుము.

**అంత.** వ. (సం. తావత్, క. అనితు, అనిత్తు. త. అనైత్తు.) దీని పూర్వభాగమగు 'అ' కారము సర్వనామమగు 'ఆ' యొక్క హ్రస్వరూపము. ఉత్తర భాగమగు 'ంత' పరిమాణ వాచకమగు నొకానొకశబ్దము యొక్క లుప్తశేషము కావచ్చును. ఈలాగుననే 'ఇంత' లోనగు పదముల స్వరూపములని యూహించునది. 'అంత' తొలుత పరిమాణవాచకమయి యుండి పిదప దేశ వాచకమును కాలవాచకమును గూడ నయినది. వృత్తియందు తచ్ఛబ్దార్థము విడిచి కేవలపరిమాణాదివాచక మయినది. కొన్ని చోట్ల కేవలతచ్ఛబ్దార్థకమే యయినది. క్రమముగా భిన్నార్థములు తెలుపునదియైనది.

**వి. అనా.** 1. ఆపరిమాణము ఆది, ఆపాటిది ఆరీతిది, అట్టిది- కొన్నిపట్ల ఉత్కర్షమును దెలుపును - (పరిమాణము పూర్వము నిర్దేశింపఁబడినపుడు నిర్దిష్ట పరిమాణమును దెలుపును. అట్టినిర్దేశము లేనిచోట మనస్సులో ఉద్దేశింపఁబడినట్టి పరిమాణమును తెలుపును. ఈయర్థములందు బహువచనాంత రూపములును వానియామ్రేడితరూపములు నుగూడఁ గలవు.)

క. నీ వెఱుఁగకుండఁ గర్వము,తో విజయుం డా సుభద్రఁ దోడ్కొని బలిమిం, బోవఁగ నం త సమర్థుఁడె... భా. ఆది. 8. 207.

ఉ. ...నన్నుఁ బనయంతటమానిసిఁ జేసి యుం డు...భా. భీష్మ. 1. 167.

క. సంతోషామృతసుఖిత, స్వాంతుం డగునేని న ట్టివాఁడు గృహస్థుం, డంత తా దేశమును నాక్రాంతగ నిల్చిన వృత్తి నలోభుఁ గుఱ. భా. శాం. 5. 237.

క. విను పృథివియును సరస్వతి, యును గోవు ను దానవిధికి నొక్కంతలుగా, విని యుం డుదు... భా. అను. 2. 411.

సీ. ఇట్లు పల్కెడునంతహృదయసాహసమున దాక్షిణ్యము లవంబుఁ బనకు లేమి. రాఘవ. 3. 23. (రామాయణార్థమున)

గీ. అలరఁ జేసితి నిషధరాజంతవాని. నైష. 2. 92, భాగ. 8. 622.

సీ. ... విధిమోహమునసైన విరసభావ, మావహిల్లినఁ బుట్టె నంతలుపనులు... భా. ఆశ్ర. 1.34.

ఉ....అట్లంతలురాజులెల్ల సమయం గని... భా. శల్య. 1.352.

గీ. ఎదిరిఁ దమ్ముని నెఱిఁగిరి యేని వారు, అంత లంతలు సేయుదురయ్య నాఁడు. భా. ఉద్యో. 4.73.

క. చెలిమియు సంభాషణమును, బలిమి వివా హంబుఁ బ్రోపుఁ జాడియుఁ దమయం, తల వారితోన తగు నది, కులహీనులతోడ నైనఁ గొంటగా దధిపా. భా. ఉద్యో. 2.46.

ఉదా: గోరంత, కాసంత, కొండంత. మొ.

2. రెట్టి, మడుఁగు.

వ....జంబూద్వీపవిష్కంభంబుకొలఁది నూను బదివేలునాలుగునూఱుయోజనంబులు దీనిరెం టంతలు దొడంగి లవణేక్షుసురాఘృత దధిక్షీర శుద్ధజలములు బులయినమహార్ణవం బుల విష్కంభంబులు... భా. భీష్మ. 1.27.

సి. (క. అనితుమ్. అనిత్తుమ్. త. అనైత్తుమ్.) సర్వము, ఎల్ల.

క. అంత విఁగుచ్చిరిఁ దక్షిమత, మంతయు సను కూలుయును...మనుచ. 2.124.

(వ్యవ) అంతకును నీవే యున్నావు. అంతటికిని దేవుఁడే యున్నాఁడు.

4. కొన్ని సర్వనామములతోఁ గూడ ప్రాయ ముగా (= ఇతఃప్రేరణముగాని, ఇతర సాహాయ్యముగాని లేక) అను నర్థ మిచ్చును. (ఈయర్థమున 'అంతట, అంతన్' అను రూప ములతోనే యుండును.)

గీ. గళితశృంఖలలయ్యె నకాలనిద్ర, గనుఁగ వలఁద్రాలఁ దమయంతఁ గనలవయ్యె, దానఁ దాధోరణ ప్రయత్నమునఁగాని, నముచిమథనునిపీఁ కుండాలఘటలు. పారి. 1.67.

(వ్యవ) ఈ వ్యవహారము మీయంతట మీరు తెచ్చి పెట్టుకొనినారు. ఇది నాయంతట నేనే వ్రాసినాను.

5. తచ్ఛబ్దార్థకము. (ఈయర్థమున ప్రథమేతర ములగు కొన్ని విభక్తులయందే ప్రయో గములు కనఁబడుచున్నవి.

క....వివేకశూన్యులకడ నుండెడునంతకంటెఁ గష్టము గలదే. భా. ఆది. 2. 149.

ఆ. జలము పృథివికంటె జలముకంటెను దేజ, మంతకంటె వాయువు...భా. శాంతి.4. 196.

క....ఇంక నుద్ధురుం డగుమద్రేశుం గూల్చు మంతతోడఁ దెగుఁ గురుపతిపని జయంబు గొనుము కడంక భా. శల్య. 1. 94.

అంతమీఁదట—తదనంతరము. దశా. 1. 108.

5. నాశము 6. మరణము. 7. నిర్ణయము, సిద్ధాంతము.

శ్లో. ఉభయోరపి దృష్టోంత స్త్వనయో స్తత్త్వద ర్శిభిః. గీత. 2. 16.

8. స్వభావము. 9.స్వరూపము. 10.మొత్తము. 11. లోపలిభాగము.

'యుష్మదీయం చ జలాంతే గృహం' సం. పంచ. 4.

**అంతర్** సం. అవ్య. 1. మధ్యమున; లోపల. 2. క్రింద. (తెలుఁగున ఇది సమాసపూర్వపద ముగానే యుండును. ఉత్తరపదములోని మొదటియక్షరమును బట్టి రేఫము సంధివశ మున మాఱుచుండును.)

ఉదా : అంతర్గతము, అంతఃకలహము. మొ.

**అంతరంగము** సం. విశ. (అ. అ. అ.) 1. లోపలిది, అంతర్భూతము. 2. అత్యంతప్రియము, మిక్కిలి యిష్టమైనది. 3. ముఖ్యమైనది, సాక్షాదుపకారకమైనది.

ఉదా : బ్రహ్మసాక్షాత్కారమునకు శ్రవణ మననిదిధ్యాసనములు అంతరంగసాధనములు. (ఇట అంతరంగసాధనము లనఁగా బ్రహ్మ సాక్షాత్కారమునకు మఱియొకసాధన మ పేక్షింపక తమంతటనే యుపకరించునవి అని తాత్పర్యము.) వి.అ.న.1. హృదయము మనస్సు. 2.(వ్యాక) పరనిత్యబహిరంగము లకు బాధకమైన నైమిత్తికకార్యభేదము; దానిని బోధించుశాస్త్రము.

**అంతరగ్ని** సం. వి. అ. పుం. - లోపలియగ్ని - జఠరాగ్ని.

**అంతరజ్ఞుఁడు** సం. విశ. (అ. అ. అ.) తారత మ్యము నెఱిఁగినవాఁడు. 2. లోపల నున్న దానిని ఎఱిఁగినవాఁడు,పరేంగితము తెలిసిన వాఁడు.

**అంతరదము** సం.విశ.(అ.అ.అ.) 1.హృదయము ను చీల్చునది. 2. హృదయము నిచ్చునది.

**అంతరదామర** మి. వి. (క. అంతరదామరె. అం తరము + తామర)జలవల్లి ,ఒకజాతినాఁచు.

చ. అలరుఁ బురింబునం దొగల నంతరదామరఁ బ్రాఁచిఁ గప్పవు, న్వలపులు మీఱ...పురా తనతీర్థకుండముల్. ఆము. 1.71, ఆం.భా 1. 165.

**అంతరదిశ** సం. వి. అ. స్త్రీ. విదిక్కు, మూల దిక్కు.

**అంతరవల్లటి(టీ)** మి. వి. నడుమ వల్లటులు గొట్టుపావురము. ఆం. భా. 2. 89.

గీ...జింకదాఁటుపగిది బంతి యెగయుదారి... అంతరవల్లటివరుస బిరుదు, పాత్రవశ్నానాఁ గలచిత్రపత్రమునకు. ప్రబం. 181, సాం.ని. శిర్య. 79.

**అంతర ప్రభవుఁడు** సం. విశ. అ. పుం. సంకీర్ణ జాతివాఁడు.

**అంతరము** సం. విశ. (అ.అ.అ) 1. లోపలిది. 2. తనది, ఆత్మీయము. 3. సాటియైనది. 4. వేఱైనది, అన్యము. (ఈయర్థమున సమాసో త్తరపదముగానే యుండును. ఉదా: గ్రామాం తరము, దేశాంతరము. మొ.)5. వెలుపలిది. వి. అ. న. 1. లోపలిభాగము, 2. రంధ్రము. 3. మనస్సు, హృదయము. 4. (దేశకాలము లందలి) వ్యవధానము, అవకాశము. 5. నడిమిచోటు. (ఉదా : భుజాంతరము) 6. అవధి, మేర. 7. సమయము. 8. భేదము, తారతమ్యము. (ఉదా, హస్తిమశకాంతరము. మొ.) 9. పరోక్షత దగ్గఱలేమి. 10. తరము. (ఉదా: పురుషాంతరము.) 11. కష్టదశ. 12. పరిధానము, కట్టుబట్ట. 13. అదృశ్య మగుట, అంతర్ధానము. 14. తాదర్థ్యమును (ఒకదానికొఱ కగుటను) తెలుపును.

శ్లో. అవైమి కార్యాంతరమానుషస్య. సం. రఘు. 16. 82.

15. వెలుపల. 16. (గణిత) శేషము. పుం. పర మాత్మ.

**అంతరా** సం. అవ్య. మధ్యమున, నడుమను. (దీ నికి తెనుఁగున వ్యస్తప్రయోగము లేదు. చూ. అంతరాభవదేహము).

**అంతరాకాశము** సం. వి. అ. పుం. హృదయమం దున్న యాకాశము; బ్రహ్మము.

**అంతరాత్మ(ము)** సం. వి. న్. పుం. 1. మనస్సు, హృదయము. 2. జీవాత్మ. 3. పరమాత్మ.

**అంతరాపత్య** సం. వి. ఆ. స్త్రీ - లోపల శిశువు గలది-గర్భిణి, చూలాలు.

**అంతరాభవదేహము** సం. వి. అ. పుం. మరణమునకును తర్వాతిజన్మమునకును నడిమియవస్థయం దున్న ప్రాణి.

**అంతరాభవసత్త్వము** సం. వి. అ. న = అంతరాభవదేహము.

**అంతరాయము** సం. వి. అ. పుం. 1. విఘ్నము, అడ్డు. 2. నడుమనడుమను వచ్చురాబడి. ద. శాస. 4. సం. 1268.

**అంతరారాముఁడు** సం. విశే. (అ.అ.అ.) పరమాత్మయందు క్రీడించువాఁడు, బ్రహ్మానందమనుభవించువాఁడు.

**అంతరా (ల) శదిక్కు** సం. వి. ౯. స్త్రీ. విదిక్కు. మూలదిక్కు.

**అంతరా (ల) శము** సం. వి. అ. న. 1. (దేశకాలముల) నడిమిభాగము. 2. సంకీర్ణజాతి.

**అంతరించు** సం. అ. క్రి. 1. చచ్చు.

గీ. స్నానమర్దనవేళల మేనిచర్మ, మదరువాఁడై దుసెలలకు నంతరించు. జై. భా. 8.98.

2. చెడు, భ్రష్టమగు.

తరల....కన్యకావ్రత మంతరించిన నెట్లు మ, జ్జనకునింటికిఁబోవ నేర్తు. భార.అది.3.40

స. క్రి. కడచు, అతిక్రమించు,

ఉ....అశ్వమే ధీయహాయంబు మారుతగతిఁబహుదేశము లంతరించుచుఁ. జై.భా.5. 105. (ఇది శ. ర, ముద్రిత, పాఠము. ప్రయోగాంతరములేదు. 'దేశములఁ దరించుచుఁ' అని యున్నను సరిపోవును.)

**అంతరింద్రియము** సం. వి. అ. న. - లోపలియింద్రియము-మనస్సు.

**అంతరి(రీ)క్షము** సం. వి. అ. న. 1. ఆకాశము. 2. అభ్రకము.

**అంతరి(రీ)క్ష్యము** సం. విశే. (అ. అ. అ.) ఆకాశమందుండునది.

**అంతరితము** సం. విశే. (అ. అ. అ.) 1. నడుమఁజొచ్చినది, అంతర్గతము. 2. మఱుఁగుపఱుపఁబడినది, కప్పఁబడినది. 3. నశించినది, అంతరించినది. 4. వ్యవధాపితము, ఎడము కలుగఁజేయఁబడినది. 5. తక్కువపఱుపఁబడినది, తిరస్కరింపఁబడినది. 6. తొలఁగింపఁబడినది, పోఁగొట్టఁబడినది. 7. (గణిత) శేషము.

**అంతరీపము** సం. వి. అ. పుం. నీటినడిమిదిబ్బ, ద్వీపము.

**అంతరీయము** సం. వి. అ. న. పరిధానము, కట్టుబట్ట.

**అంతరువు** వి. (సం. అంతరమ్.) 1. కొంచెము దూరము, కొంతయెడము.

క...పాన్పుపయి నొఱగి యావల ధరణీశ్వరుఁడును నీవల నొకయంతరువునఁ జిక్కాంగి చెలులుఁ దా నుండఁగఁ. సారంగ. 3.45.

2. తారతమ్యము.

చ....పెద్ద పిన్న యంతరుపు లెఱింగి మాట జవదాఁటక...విజ. వి. 1. 26.

**అంతర్గడువు** సం.విశే. (తే.) నిష్ప్రయోజనము, పనికిమాలినది.

**అంతర్గతము** సం. విశే. (అ. అ. అ.) 1. నడుమఁజొచ్చినది. 2. లోపలఁ జేరినది, లోపలనున్నది. 3. దాఁపఁబడినది. 4. మఱవఁబడినది. 5. నశించినది.

**అంతర్గర్భము** సం. విశే. (అ. అ. అ.) చూలుగలది, కడుపుతోనున్నది.

**అంతర్గామి** సం. విశే (న్. నీ. న్.) అంతర్గత మగునది.

**అంతర్గిరము** సం.అవ్య. అ. న. పర్వతములోపల.

**అంతర్గిరి** సం. అవ్య. ఇ. న—అంతర్గిరము.

**అంతర్గుదవలయము** సం. వి. అ. పుం. (వైద్య) మలమూత్రవిసర్జన నాళములను మూయు మాంసచక్రము.

**అంతర్గృహము** సం. వి. అ. న. కాశియందలి యొకపుణ్యతీర్థము.అవ్య.అ.న.ఇంటిలోపల.

**అంతర్ఘణము** సం. వి. అ. పుం. న. 1. ప్రాకారమునకు లోపలను ఇంటికి ముందఱను ఉండు తెఱప ప్రదేశము.

శ్లో. తస్మిన్నన్తర్ఘణే పశ్యన్ ప్రఘాణే సాధసద్మనః. భట్టి. 7. 62.

2. బాహ్లికదేశమందలి గ్రామవిశేషము. (ఈయర్థమున 'అంతర్ఘనము' అనియుఁగలదు.)

**అంతర్జ్యోతి** సం. వి. స్. న. లోపలితేజస్సు, బ్రహ్మతేజస్సు.

**అంతర్జ్వలనము** సం. విణ. (అ. ఆ. అ.) లోపల మంట కలది. వి. అ. న. 1. కడుపులోనిమంట. 2. మనస్తాపము. 3. జఠరాగ్ని.

**అంతర్దధత్** సం. (క్రి.) 1. లోపల ధరించుచున్న. 2. అంతర్ధానమగుచున్న, మఱుఁగుపడుచున్న.

**అంతర్దధనము** సం. వి. అ. న. పదార్థములను మద్యముగాఁ జేయువస్తువు.

**అంతర్దధానము** సం. విణ. (అ. ఆ. అ.) 1. లోపల ధరించుచున్నది. 2. అంతర్ధాన మగుచున్నది.

**అంతర్దశ** సం. వి. ఆ. స్త్రీ. (జ్యోతి) ఒక గ్రహముయొక్క మహాదశనడుమ వచ్చుగ్రహముల దశ.

**అంతర్దశాహము** సం. అవ్య. అ. న. పదిదినముల యవకాశమున, పదిదినముల మధ్యమున.

**అంతర్దృష్టి** సం. వి. ఇ. స్త్రీ. లోనిచూపు; దివ్యదృష్టి.

**అంతర్ద్వారము** సం. వి. అ. న. రహస్యద్వారము, ప్రకోష్ఠద్వారము.

**అంతర్ధ** సం. వి. అ. స్త్రీ. 1. తిరోధానము, మఱుఁగు. 2. ముసుఁగు, కప్పు.

**అంతర్ధాత** సం. విణ. (ఋ. క్రి. ఋ) = అంతర్ధాయకుఁడు.

**అంతర్ధానము** సం. వి. అ. న. మఱుఁగుపాటు, మాయమగుట.

**అంతర్ధానముచేయు** అ. క్రి. మఱుఁగుపడు, మాయమగు.

వ. అమ్మహాముని యంతర్ధానంబు సేయఁ దానును మరలి వచ్చి... భార. ద్రోణ. 5. 418.

**అంతర్ధాపనీయము** సం = అంతర్ధాపయితవ్యము.

**అంతర్ధాపయితవ్యము** సం. విణ. (అ. ఆ. అ.) అంతర్ధానము పొందింపఁదగినది.

**అంతర్ధాపితము** సం. విణ. (అ. ఆ. అ.) అంతర్ధానము పొందింపఁబడినది.

**అంతర్ధాప్యము** సం. = అంతర్ధాపయితవ్యము.

**అంతర్ధాయకుఁడు** సం. విణ. (అ. ఋకా. పుం.) 1. అంతర్ధానమగువాఁడు, మాయమగువాఁడు. 2. అంతర్ధానముపొందించు వాఁడు మాయముచేయువాఁడు.

**అంతర్ధి** సం. వి. ఇ. పుం. 1. మఱుఁగు 2. ఆచ్ఛాదనము. 3. అంతర్ధానము.

**అంతర్నగరము** సం. వి. అ. న-లోపలినగరము-అంతఃపురము.

శ్లో. దశాననాంతర్నగరం దదర్శ. సం. రామా. అవ్య. అ. న. నగరమధ్యమున.

**అంతర్బాష్పము** సం. విణ. (అ. ఆ. అ.) లోపలనే అడఁపఁబడినబాష్పములుకలది. వి. అ. న. వెలికి రాకుండ అడఁపఁబడినకన్నీరు.

**అంతర్భవము** సం. విణ. (అ. ఆ. అ.) లోపలిది. లోపల నున్నది.

**అంతర్భవించు** సం. అ. క్రి. (లోన) చొచ్చు.

వ. పినాకి..దివ్యభవనాంతరస్థంబైన జ్యోతిర్లింగంబునం దంతర్భవించె. కాశీ. 6. 158.

**అంతర్భావన** సం. వి. ఆ. స్త్రీ. 1. అంతర్భావము. 2. (బాహ్యచేష్టాదులవలన వ్యక్తము కాని) లోపలియాలోచన.

**అంతర్భావము** సం. వి. అ. పుం. 1. సముదాయమునడుమఁ జేరి యుండుట. లోపల ఇమిడి యుండుట. 2. మఱుఁగుపడుట. కనఁబడక పోవుట. 3. నైసర్గికభావము, స్వాభావికస్థితి.

**అంతర్భావితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. లోపల భావింపఁబడినది. 2. నడుమఁ జొనుపఁబడినది, లోపల నుంపఁబడినది.

**అంతర్భూతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. లోపల నున్నది. 2. లోపల అడఁగినది 3. నడుమ నున్నది.

**అంతర్భూమి** సం. వి. ఇ. స్త్రీ - అంతర్గతభూమి-భూమిలోపలిభాగము.

**అంతర్భేదము** సం. వి. అ. పుం. 1. లోపలిభేదము. 2. లోపలికలహము.

**అంతర్మనస్కుఁడు** సం. విణ. (స్.) దుఃఖాదులచే బాహ్యవ్యాపారమున మనస్సులేనివాఁడు- 1. దుఃఖము నొందినమనస్సు గలవాఁడు, విమనుఁడు, వ్యాకులచిత్తుఁడు. 2. ధ్యానమందు మగ్నుఁడైనవాఁడు.

**అంతర్మాతృక** సం. వి. అ. స్త్రీ. (తంత్ర) దేహముులోని యాఱుపద్మములందు న్యాసము చేయఁబడు అకారాదివర్ణసమూహము.

**అంతర్ముఖము** సం. విణ. (అ. అ. ఈ. అ. చూ. అభిముఖుఁడు) 1. లోపలిప్రక్క ముఖము కలది. 2. బాహ్యవిషయములను విడిచి పరమాత్మయందుఁ బ్రవేశించినది (చిత్తాదికము) వి.అ.న. (వైద్య) వ్రణస్రావణశస్త్రభేదము

**అంతర్మృతము** సం.విణ. (అ. అ. అ.) కడుపులోనే మరణించినది (శిశువు).

**అంతర్యము** సం. విణ. (అ. అ. అ.) 1. లోపలిది 2. నడిమిది.

**అంతర్యాగము** సం. వి. అ. పుం. 1. మానసికయజ్ఞము. 2. మానసికపూజ.

**అంతర్యామము** సం. వి. అ. పుం. శ్వాసమును లోపల నిరోధించుట, ఊపిరి బిగఁబట్టుట.

**అంతర్యామి** సం. వి. న్. పుం. 1. (లోపలఁజొచ్చి యింద్రియములను గాని జీవుని గాని తమతమ కర్మములందు మెలఁగఁజేయు) పరమాత్మ. 2. వాయువు. 3. జీవాత్మ.

**అంతర్యోగము** సం. వి. అ. పుం. సమాధి.

**అంతర్లంబము** సం. విణ. (అ. అ. అ.) (క్షేత్రగ) లఘుకోణములుగలది. వి. అ. పుం. లఘుకోణములుగల త్రిభుజము.

**అంతర్లాప** సం. వి. అ. స్త్రీ. ప్రశ్నోత్తరములు లోపలనే గూఢముగా నుండునట్టిపద్యము. (అట్టి సమస్య అని కొందఱు)

ఆ. చెప్పినాఁడ రెండు చిత్రోత్తరము లిందు,
నలజయంతిరామయార్యవరుని, సువచన
మున నేదదవిలోఁజరించు నెద్దిశ్వరునికిఁ
బ్రియము వెక్కుడవఁగ. (అల్లమరాజు
సుబ్రహ్మణ్యకవి చాటువు.)

క. ఎద్దీశ్వరవాహన మనఁగ సరసపద్మత
మగుమఱా. ఆం.చం. 188. (ఇది ఉత్తరాలంకారమున కుదాహరణము.)

**అంతర్లాపిక** సం— అంతర్లాప.

**అంతర్వంశము** సం. వి. అ. పుం. అంతఃపురము.



**అంతర్వంశికుఁడు** సం. వి. అ. పుం. అంతఃపురమునందుఁ గావలికై యేర్పఱుపఁబడినవాఁడు (కుబ్జవామనాది.)

**అంతర్వణము** సం. అవ్య. అ. న. అడవిలోపల.

**అంతర్వత్ని** సం. వి. ఈ. స్త్రీ-లోపల (శిశువు) కలది-గర్భిణి, చూలాలు.

**అంతర్వమి** సం. వి. ఇ. పుం. అజీర్ణరోగము.

**అంతర్వర్తి** సం. విణ. (న్. నీ. న్.) లోపల నుండునది.

**అంతర్వాణి** సం. విణ. (ఇ.)-లోపల విద్యకలవాఁడు-శాస్త్రముల నెఱిఁగినవాఁడు, పండితుఁడు.

**అంతర్వేగము** సం. వి. అ. పుం. 1. అంతర్గతజ్వరము. 2. మనస్తాపము.

**అంతర్వేది** సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. గంగాయమునలమధ్యముననున్న దేశము. (ఇదియార్యుల ముఖ్యవాసక్షేత్రము. ఇదియే బ్రహ్మావర్తమనియు శశస్థలి యనియుఁ జెప్పఁబడును.) 2. గోదావరిశాఖ యగువసిష్ఠనదితీరమందలి పుణ్యక్షేత్రము. అవ్య.అ.న. వేదిమధ్యభాగమున.

**అంతర్వేశము** సం. వి. అ. పుం. అంతఃపురము.

**అంతర్వేశికుఁడు** సం. వి. అ. పుం. అంతఃపురపు కావలివాఁడు. (కంచుకి, మొ.)

**అంతర్వేశ్మము** సం. వి. న్. న. అంతఃపురము.

**అంతర్వేశ్మికుఁడు** సం— అంతర్వేశికుఁడు.

**అంతర్హాసము** సం. వి. అ. పుం. లోపలినవ్వు.

**అంతర్హితము** సం. విణ. (అ.అ.అ.) 1. మఱుఁగుపడినది. 2. అంతర్ధానమైనది, మాయమైనది. 3. దాఁపఁబడినది, కప్పఁబడినది.

**అంతలపొంతలవాఁడు** వి. పరంపరాసంబంధి, దూరపుఁజుట్టము. ఆం. భా. 2, 118.

**అంతవంతము** సం. విణ. (త్. వతీ. త్.) అంతము కలది, నశించునది.

**అంతవత్తు** విణ. (అంత+వత్తు) 1. అపరిమాణము కలది, అకొలఁదిది.

సీ... కురురాజుఁ జెలుపన తిరిగితి నిఖిలరాజులఁ దదనీకములను. ఆ. నామ మడఁచి తెల్ల భూములఁ గాడయ్యె, నంతవట్టుఫలము నను భవింపు,మే పథంగ నిన్ను శాపానలజ్వాల, దగ్ధమూర్తిఁ జేయుదాన వినుము. భార. స్త్రీ. 2. 159.

2. అంతయు.ఎల్ల . (ఈయర్థమున సముచ్చయ సహిత మగును.)

గీ. నేలనాలుగుచెఱఁగులన్నృపులు నీకు, నధికన మ్రులై తమసొమ్ము లంతవట్టు. నిచ్చి బ్రతికిరి ...హరి. పూ. 9. 157.

**అంతవట్టువారు** స. (అంతవట్టు + వారు) ఎల్లరు, అందఱు.

ఆ. మీరు నాహితంబు గోరుదురేని శిఖండి మున్నుగాఁగఁగడఁగి యంత,వట్టువారు నొక్క పెట్ట కాఁ బైఁబడి, యేయుఁడింకఁ దడవు సేయవలదు. భార. భీష్మ. 2. 367.

**అంతవాసి** సం. విశే. (న్. సి. న్.) 1. దగ్గఱ నుండువాఁడు. 2. పొలిమేరయొద్దనుండువాఁడు. వి. న్. పుం. 1. శిష్యుడు. 2. చండాలుఁడు.

**అంతశయ్య** సం. వి. ఆ. స్త్రీ - కడపటిపడుక- 1. మరణము. 2. (మరణకాలమందలి)భూశయ్య. 3. శ్మశానము.4. పాడె,శవవాహనము. 5. చితి.

**అంతశ్శల్యము** సం. విశే. (అ. అ. అ.) లోపల శల్యముకలది. వి. అ. న. లోపల నుండు శల్యము (బాణము, మొ.)

**అంతస్తాపము** సం. విశే. (అ. అ. అ.) లోపల తాపముకలది. వి. అ. పుం. లోపలితాపము.

**అంతస్తు** వి. (సం. అంతస్థం. క. అంతస్తు. తు. అంతస్తి = 1. రహస్యము, 2.మేడపై భాగము.) 1. కక్ష్య, తొట్టికట్టు.

ద్వి. అంతఃపురము వాసి యల్లన నివలి, యంతస్తునకు వచ్చునంతటిలోన. విష్ణుమాయా విలాసము. ఉ. 4. అ. (శ. ర.)

2. మేడపై భాగము, నిలువు.

ఉదా: ఏడంతస్తులమేడ.

**అంతస్థము** సం. విశే. (అ. అ. అ.) 1. లోపల నుండునది. 2. నడుమ నుండునది. వి. అ. పుం. (వ్యాక.) య,ర,ల,వ అనువర్ణములకు పేరు.

**అంతస్సంజ్ఞము** సం. విశే. (అ. అ. అ.) లోపల చైతన్యము గలది, గూఢమైన సుఖాద్యనుభవము గలది. (చెట్టు, మొ.)

**అంతస్సత్త్వ** సం. వి. ఆ. స్త్రీ. 1. గర్భిణి, చూలాలు. 2. నల్లజీడిగింజ.

**అంతస్సత్త్వము** సం. విశే. (అ. అ. అ.) లోపల శక్తిగలది. వి. అ. న. లోపలిబలము.

**అంతస్సలిలము** సం. విశే. (అ. అ. అ.) 1. లోపల నీరుగలది. 2. భూమియడుగునఁ బ్రవహించునది (నది).

**అంతస్సారము** సం. విశే. (అ. అ. అ.) లోపల సారము గలది. వి. అ. పుం. లోపల నుండు సారము.

**అంతావశాయి** సం. వి. న్. పుం. గ్రామాంతమున నుండువాఁడు- చండాలుఁడు.

**అంతావసాయి** సం. వి. న్. పుం. 1. నఖకేశాంతములను ఛేదించువాఁడు- మంగలి. 2. తన పొట్టకై జంతువులను చంపువాఁడు-చండాలుఁడు.

**అంతిక** సం. వి. ఆ. స్త్రీ. 1. (నాటక) అక్క. 2. పొయ్యి. 3. సాతల మనెడియోషధి, సంబరేను (వృ. వి.)

**అంతికము** సం. విశే. (అ. అ. అ.) 1. సమీపము, దగ్గఱది. 2. తుదవఱకు సాగునది, పర్యంతవ్యాపకము.

ఉదా: బ్రాహ్మణునిదండము కొలఁతయందు కేశాంతికము, వైశ్యునిదండము నాసాంతికము.

వి. అ. న. 1. సమీపదేశము. 2. సమీపకాలము.

**అంతికలు** వి. బ. గడ్డి తడకలు. (గ్రా.)

**అంతిపురము** = అంతిపురి.(సం. అంతఃపురమ్.ప్రా. అంతెఉర - పా. అంతెపురం. క. అంతపుర.) 1. అంతఃపురము, రాణివాసము, రాజస్త్రీలుండుచోటు.

ఉ. అంతిపురంబులోనఁ గలయంగవ లెల్లను నె మ్మనంబులం, సంతస మందఁగాఁ బసులఁ జ య్యనఁదెచ్చెద నంచుఁబూని...భార. విరా 4. 58.

2. అంతఃపురజనము, రాణివాసము.

క. అంతిపురము చుట్టఁటికం, బెంతయుఁగిడు ...భటునకుఁ. భార. విరా. 1. 131.

**అంతిపురి**—అంతిపురము (సం. అంతఃపురి)

గీ. రథము డిగి వెంట సతిసుతుల్ రాఁగ నంతి, పురిఁ బ్రవేశించె నప్పు డప్పుడమిఱేఁడు. ఉ. హరివం. 1. 89.

**అంతిమము** సం. విణ. (అ. ఆ. అ.) 1. దగ్గఱది, సమీపము. 2. కడపటిది, చరమము.

**అంతియ** – అంతె. న. 1. అపాటిదే, అంతమాత్ర మే; మాత్రమే.

వ. ఇట్లు పదునొకండువేల యోజనంబులతనర్పు ను నంతియ పొడవును గలమంథరనగంబు.. భార. ఆది. 2. 11.

చ. అనుపమదివ్యమూర్తియను నంతియ కాదు భవాప్తమూర్తులంౘదును వరమూర్తి... కు. సం. 1.6.

2. అంతగా; ఆవిధముగా, అట్లు.

వ. ధర్మరాజును దమ్ముఁడు సేసినమహాసంరంభం బునకుఁ జతురంభోధిపర్యంతమహీ రాజ్యంబ ప్పుడు తనకుసంప్రాప్తంబై నంతియ సంతోసి ల్లి ...(సంప్రాప్తంబై నంతియ—సంప్రాప్తమై నట్లు) భార. అర. 4.91, కు. సం. 5.508.

**అంతు** వి. (సం. అంతః. ప్రా. అంతో. క. అంతు = 1. మొత్తము 2. తుద.) 1. చివర,తుద,పర్య వసానము.

(వ్యవ) బుద్ధి మంతుఁడు ప్రారంభించినకార్యము అంతు చూడక విడువఁడు.

2. (గణిత) మొత్తము, వెరసి.

**అంతె** – అంతియ.

(మాత్రమే.)

గీ. అట్టికన్నులు లేవను టంతె కాక,యుత్తముఁ డు కాఁడె...భార. ఆది. 5. 11.

**అంతేవాసి** సం—అంతవాసి.

**అంత్య** సం.వి.ఆ.స్త్రీ. 1. కడజాతి స్త్రీ. 2. ముస్త, తుంగ (వృ.వి.)

**అంత్యఋణ(ర్ణ)ము** సం. వి. అ. న. దేవర్షి పితృ ఋణములలో కడపటిఋణము - పితృఋ ణము.

(ఇది పుత్రోత్పాదనముచే తీఱును.)

**అంత్యకర్మము** సం. వి. న్. న. – అంత్యక్రియ.

**అంత్యక్రియ** సం. వి. అ. స్త్రీ. మృతునకుఁ జేయు దేహసంస్కారము, ఉత్తరక్రియ.

**అంత్యజుఁడు** సం. వి. అ. పుం. 1. శూద్రుఁడు. 2. చండాలుఁడు, మాల. 3. రజకాదు లేడ్వుర యం దొకఁడు.

శ్లో. రజకశ్చర్మకారశ్చ,నటో వరుడ ఏవచ, కైవర్తమేదభిల్లాశ్చ సప్తైతే చాన్త్యజా స్మృతాః. (అత్రిసంహిత.)

**అంత్యభము** సం. వి. అ. న. 1. తుదినక్షత్రము- రేవతి. 2. తుదిరాశి-మీనము.

**అంత్యము** సం విణ. (అ. ఆ. అ.) 1. కడపటిది. 2. దగ్గఱది. 3. తరువాత నుండువది.

ఉదా: అష్టమాంత్యము—తొమ్మిదవది.

4. అధమము, నీచము. వి. అ. పుం. 1. తుంగ, ముస్త. (వృ.వి.)2. (తర్క) నిత్యద్రవ్యవృత్తి ధర్మవిశేషము· న· పరార్థ మనుసంఖ్యలో నూఱవవంతు.

**అంత్యయోని** సం. వి—అంత్యజుఁడు.

**అంత్యానుప్రాసము** సం. వి. అ. పుం. పాదాంత వర్ణముగాని పదాంతవర్ణముగాని మరల మరల వచ్చుశబ్దాలంకారభేదము.

**అంత్యావసాయి** సం. వి. న్. పుం. 1. చండాలు నికి నిషాదస్త్రీయందుఁ బుట్టినవాఁడు. 2. చండాలాదులు ఏడ్వురయం దొకఁడు.

శ్లో. చండాలశ్శ్వపచఃక్షత్తా, సూతో వైదేహక స్తథా, మాగధాయోగవౌచైవ, సప్తైతేఽ న్త్యావసాయినః.(అంగిరస్స్మృతి)

**అంత్యావసాయిని** సం. వి. ఈ. స్త్రీ. చండాలునికి నిషాదస్త్రీయందుఁ బుట్టినస్త్రీ.

**అంత్యాహుతి** సం. వి. ఇ. స్త్రీ. ఆహితాగ్నికి చే యు ఉత్తరక్రియ.

**అంత్యుఁడు** సం. వి. అ. పుం. 1. చండాలుఁడు మాలవాఁడు. 2. మ్లేచ్ఛుఁడు.

**అంత్యేష్టి** సం.-అంత్యాహుతి.

**అంత్రంధమి** సం. వి. ఇ. స్త్రీ. కడుపుబ్బునట్టి అజీర్ణరోగవిశేషము.

**అంత్రకూజనము** సం. వి. అ. న. - అంత్రకూజము.

**అంత్రకూజము** సం. వి. అ. పుం. ప్రేగులలో గుబ్బుగబ్బు మనుధ్వని.

**అంత్రమాంసము** సం. వి. అ. న. ప్రేగులసంబంధమైనపక్వమాంసభేదము.

**అంత్రము** సం. వి. అ. న. ఆంత్రము, ప్రేగు.

**అంత్రవృద్ధి** సం. వి. ఇ. స్త్రీ. ఒబుబీజము.

**అంత్రాదము** సం. వి. అ. పుం-ప్రేగులను తినున ది-ప్రేగులయందలిపురుగు.

**అంత్రి** సం. వి. ఈ. స్త్రీ. ఒకానొకయోషధి. (ఇది కడుపునొప్పి తొలఁగించును.)

**అందంద** అవ్య. (అందు + అందు + అ) 1. అచ్చటచ్చట. అక్కడక్కడ.

సీ. అనిలంబు లేదును నంచెలంచెలుగట్టి యాకాశవీథి నందంద నడువ. కాశీ. 1. 182.

2. అప్పటికప్పుడే, ఆసమయముననే. వెంటనే.

గీ. ఈఁగ వాలిన నందంద యెలుఁగులొనఁగు,వట్టినకినలమంచంబులాడిగాఁగ.మనుచ. 6.8.

3. మఱిమఱి,తఱచుగా, మాటిమాటికి.

మాలిని. అని విభుఁడెద నుంచుఁ హార మందంద గాంచుఁ...వసు. 4. 98.

4. మిగుల, మిక్కిలి.

వ.... వేఁరాఁకలి స్వేచ్ఛాకార్చిచ్చుమం బోలెఁ శె ఛ్ఛు పెచ్చిఁగి యందంద కడుపు మండింప... కాశీ. 4. 118.

**అందకత్తె(త్తియ)** విశే. √అందము. (క. అందకాత్తి,అందగాఱు. త. అందక్కారి.) సౌందర్యవతి, అందము గలది (స్త్రీ).

**అందగాఁడు** విశే. √అందము. (క. అందగాఱ. త. అందక్కారన్. తు. అందగారె.) అందము గలవాఁడు, సౌందర్యవంతుఁడు.

గీ. అందములకెల్ల నెల్లయానందగాని. చంద్రా. 2. 186.

**అందగించు** అ. క్రి. (√అందము) రమ్యమగు ఒప్పు.

సీ. స్తనము లుత్తుంగభద్రనులీల దళింపుచు వారు నివ్వెరికృతి నందగించు. హంస. 5. 20.

స. క్రి. 1. ఎంచు.

సీ. భద్రేభగమన నీప్రమదాశ్రుకణజాల మర్ఘలీ లోయమ్ముగా నవధరింతుఁ, గలికి వికటగింటిగరువంపు తేఁజాడ్కు లలరులనోనగా నందగింతు. కృ. శకుం. 2. 69.

2. ఏర్పఱచు, నిర్మించు, రచించు.

సీ. జడ వేగ వదలించి ముడిపూలు విదిలించి యళజడిఁ గిల్గంటు నందగించి. రాధికా. 3. 56.

(ఈరెండర్థములందు ప్రయోగాంతరము కానరాదు.)

**అందగింపు** వి. √అందగించు (క. అందగిప్పు.) ఒప్పు. సొగసు.

సీ.... వనితతోఁ బరిహాసు మాడుచో మాటలో నందగింపు. కువల. 5. 5.

సీ. వినరకుమునికాళవృంతపుత్రి నదల్చి యందఱ నవ్వించునందగింపు. దశా. 3. 141.

**అందచందము** విశే. (√అందము.) అందమయినది, మనోహరము.

గీ... అందచంద మగుచు,నొవరు సుచైత్రశ్రావణంబు నేత్రోత్సవముగ. దశా. 2. 227.

**అందదుకు** విశే. (√అదుకు) అతుకులు కలది.

మ... ముఁ రాతసాం, గనచే నందదుకై నయ మ్యొడలు ప్రక్కల వాపెదఁ గ్రమ్మఱఁ. హరి. ఉ. 1. 15.

క. కుందనపుఁగావాళంబులు, పొం దెఱఁగెనకు యెన్ని బిరుదములు పలికినఁ దమ్మందదుకులనుచు నాలిక, యిందీవరనయనలును తీర నమాడుఁ. వరాహ. 11. 44.

**అందనుక**—అంతదనుక.

మ...సీమవోవల్ల ఘుణ్, గని పెండ్లాడుదు గాని యందనుకఁ జిక్కంబట్టుమీ ధైర్యముణా. చంద్రా. 5. 87.

**అందపడు** అ. క్రి. √అందము. (క. అందంబడె. త. అందప్పడు) అందగించు; ఒప్పు.

గీ. కుందనము గూర్ప నర్హమై యందపడి, పృథులరత్నంబు వెండిలోఁ బెట్టె నేని, రత్నమున కేమి కొఱయగు..., నా.పంచ.1.181.

**అందము** వి. (సం. అంతః = రమ్యము. క. తు. అంద. త. అందం.) 1. సౌందర్యము, చక్కఁదనము.

సీ. కాళ్ల యొప్పిద మాఁడ్డుఁగట్ట మణ్ణ్యలము నేయంగ సంకుల బాహు లంద మెడల. భార. విరా. 1. 228.

2. అందము తెచ్చునది-అలంకారము.

మ...కృతజ్ఞతయువాత్సల్యంబుసద్భావముణా, సరసీజాసనవాహనాన్వయవతంసా హంస నీ కందముల్. నైష. 2. 102.

3. విధము, రీతి.

క. ఈతమ్ము లిరువురును దన,చేతులయందమునఁ బనులు నేయఁగ...వి. పు. పీఠి. 1. 75.

విణ. 1. చక్కనిది. ఒప్పునది.

మ...విజ్ఞానదీపాంకురా,కృతినందం బగునందకం బఘలతాచ్ఛేదిచ్ఛిదం జేయుతణా. ఆము.1.6.

2. యోగ్యము; యుక్తము, తగినది.

క. అరయఁగల సాక్షిఁ గోరక,తెలవవడక యందమని మది న్నమ్మి సుతుం, బరుసని పొటులఁ బఱిచితి...సారంగ. 3. 227.

మ. తనమిత్రత్వము లోకబాంధవత యందంబౌ నె తాపార్త్రిఁ జెంద నొనర్చె న్భువనాళి... ఇందు. 4. 84.

(వ్యవ) వాఁడు అన్ని అందాల( = అన్నివిషయములలోను) చెడినాఁడు. వాఁడు అందము చందములేనివేషము వేసికొన్నాఁడు.

జ. అందకత్తె, అందగాఁడు, అందగించు, అందగింపు, అందచందము, అందపడు.

**అందము** నం. వి. అ. పుం. కట్టుట, బంధించుట.

**అందఱు** — అందోఱు. వ. అ. అంతశబ్దమునకు మహన్మహత్వార్థకరూపము. 1. అంతస్సంఖ్యగల వారు. (ఈయర్థమున ఇది 'ఎందఱు' అను దానిని అపేక్షించును.)

ఉదా: మీ రెందఱు వచ్చెదరో మే మందఱము వచ్చెదము.

2. ఎల్లవారు. (ఈయర్థమునందు ప్రాయికముగా సముచ్చయార్థకసహితమయి యుండును.)

వ....అందఱుం గ్రమంబునం దేఱిరి ...భార. శల్య. 1. 10

క. అనుటయు నాతం డందఱు,కును బొలపునఁ జెప్ప...భార. శల్య. 1. 12

క. దనుజుఁ బరిమార్చి యందఱ,కిని దానవబాధఁదీర్చి కృతకృత్యుండై ...వి. శకుం. 3. 144

**అందల** వి. మితి, మేర.

(ఈపదము మందలపదముతో కలిసియే కన్పడుచున్నది.)

క. అందలమందల లేకిపు, డందలమంద లయి యున్న వయ్యో మేకంబుల్. సారంగ1,67.

**అందలము** వి. (సం. ఆందోళః. ప్రా అందోళో.. క. అందళ, అందణ.) 1. పల్లకి.

అ. సమ్మదంబుగాఁగ సప్తర్షిగణము నా యందలంబు మోవ నరుగుదెంతు. భార. ఉద్యో. 1. 179.

2. ప్రక్కలను కప్పులేక కుర్చీవలె నుండువాహనము.

సీ. పొందుగా వందలంబులు పల్లకీలు దఘత నాయితము నేయుణై విభులును. కళా. 8. 29.

(వ్యవ) వాఁ డందల మెక్కి నంత అవంద మొందినాఁడు. అందఱును అందల మెక్కిన మోయువా రెవరు.

పా:-అధికార మందలము, సోమవారము కొలె.

3. అ. కాలక్రీడావిశేషము.

సీ. కోలక్రోఁతులు విల్లగోళ్లు దూరపుగోల లందలంబులు మఱి కుందిళాళ్లు. గీ. అదిగా

శైశవక్రీడలాడి రచట, రామకృష్ణులు గోపచారకులఁగూడి. వి. పు. 7. 202.

**అందలి** (చూ. అందుల. 3.) విశే. అందున్న.

ఉదా: అందలివారు, లోకమందలివారు, నాయందలి కరుణ.

వ...గంధమాదనమందలి కొలనికిఁజని...భార. ఆది. 1. 38.

**అందాఁక** = అంతదనుక

సీ. అహిలోకతల మంటునందాఁక నూరక పడి నయఁట్లొ మేను ప్రభువతంస.మనుచ.5.24.

**అందించు** స. క్రి. (√అందు¹) అందునట్లుచేయు, పొందించు, లభింపఁజేయు.

సీ. నిలువనీయఁగరాదు నెలఁతనందిందును దిరుగఁగైదండ నందింపరాదె. ఇందు.2.5.

శా...వా,శ్యామోదంబునవెల్లి గొల్పి ప్రమదం బందించె నయ్యందఱన్. హరి. ఉ. 4.186.

క...అఘసం, హరమగువా కృతిభ నాకు నందింపఁగదే. వి. పు. 2. 73.

**అందిక** వి. (√అందు²) 1. చేరువ, సమీపము.

సీ. నీలంపుటిరుసుటందిక నమర్పఁ దలిర్చు కెంపు రాములువుఁడెక్కైంబుతోడ.కృ.శకుం.1.55.

2. అవలంబనము, ఊఁత.

ఉ. పూవులతావులందనరి పొందిక కందికలియ్య శయ్యలం, దీవల నావలం బెనఁగి యింపు రహింప సతుల్ పతుల్ ...పీవఁ దొడంగె కమ్మతెమ్మెరల్. కృ. శకుం. 3. 55.

విశే. చేరికగా నున్నది, చేరువ నున్నది.

చ...అందఱును గృద్ధనజాహ్నవిదాఁటనిల్చిరో, య్యన మిథిలాపురంబునకు నందిక యామునిపల్లె నానిశన్. అధ్యా. బాల. 19. పొ.

**అందిండేఁపు** వి. (√అందు²) అందుపాటులో నున్నవానిని చేయి చాఁచి కొట్టుదెబ్బ.

ఉ. ...అ,వ్వీరవరుల్ ...వేశెమువాఱుచు నింత నంతనుం, జేరుచు నందిదాఁపులను జిమ్ముక టార్లటు పొఱఁదట్టుచున్. క. 8. 99.

**అందిచ్చు** స.క్రి. (√అందు²)అందించు,పొందించు, చేర్చు; ఇచ్చు.

క. నమ్మము కైదువు మోపగు,ఇమ్మి వెసం బ్రాఁకి విడిచి చాపము నాకం,దిమ్మనుడుఁ జేయువది లే,కమ్ముగ్గుం డమ్మహీజములసత నెక్కెన్. భార. విరా. 4. 112.

క...వానిం, గాలుని కందిచ్చె రౌద్రఘనవాయుగతిన్. ఉ. హరి. 1. 148.

ద్వి. తొంబది యేఁడులు తొడిఁ దొడిఁ జనియె, సాంబుఁడు నాయిష్ట మందియ్యఁడింక. పండితా. వాద. 201 పొ.

శా....పిశాచి నీదుకఱకు ట్లందీ నదప్రాలశాం, తారాంతర్నృకపాలకుం దవిగళన్నైర్మరేయముం గ్రోలెదన్. ఆము. 6. 25.

**అందిపొందినవాఁడు** (√అందు²) – అంతలపొంతలవాఁడు. ఆం. భా. 2. 112.

**అందియ** – అందె. వి. (సం. అందుకః. క. అందుగ, అందుగె.అందిగె.) నూపురము, స్త్రీలకాలినగ; బిరుదుగా కాలికిఁ దొడుగుకొను నగ.

ఉ....ఇం, పై నఖలీనముం బిరుదుటందియ గజ్జలపేరుఁ బూన్చి దా, సానిపటానిఁ దెచ్చె మహిజానికి రాతెఱగంటి తేనికిన్. రా. వి. 2. 46.

**అందియిచ్చు** – అందిచ్చు.

గీ. ప్రీతిఁ బేర్వేరఁ బిలిచి చేనేత సోమ, మమ్మహాయోగి యందియీ నెమ్మిఁ బాన, మాచరించి...భార. అశ్వ. 1. 108.

ఉ. గోపిక లందియీఁబసిఁడికోర సుదారసుగంధిశీధు వి,ద్వాంఃరిపూర్తిగాఁ గొని...హరి. ఉ. 2. 81.

క. అందు నమదినము సంయమి, నందను లేతెంచి వేఁడినం దరువులమీఁ,దం దిరుగుచు నుండి నమి,త్సందోహము లందియిచ్చు శాఖామృగముల్. వరాహ. 4. 91.

**అందు**¹. అవ్య. ప్ర. (మొదట ఇది కళగా నుండి 'ఆ చోటు' అనునర్థ మిచ్చి యుండును. పిదప దానికి సప్తమ్యర్థకద్వితీయావిభక్తిప్రత్యయమగు 'ను' చేర్పఁగా 'అందును' అయి 'ఆ చోటను' అనునర్థ మిచ్చి,

క్రమముగా అధికరణ ప్రత్యయవిశిష్టతచ్ఛబ్దార్థకమయి 'దానిలో,వానిలో,వారిలో, దానియందు' మొదలగు అర్థములు తెలిపి, తర్వాత కేవలసప్తమీ విభక్తి ప్రత్యయముగా మాఱియుండును. ఈ యర్థములందే భట్టారకుని ప్రయోగములు కానవచ్చు చున్నవి. తర్వాతి కవుల ప్రయోగములలో కళయై కొన్ని ఇతర విభక్తులతోఁ గలిసి కేవలతచ్ఛబ్దార్థకమైనది.)

1. అచోటను; చోటను.

క. అనఘులు పరిహితచరితులు, జనసంభావ్యులును బుణ్యచరితులు నగు నం,దములను బడయుదు రెవ్వరు, దనరఁగ వా రిందు వందు ధన్యులు గారే. మార్క. 5. 265.
(అందు = పరమున)

ఉ. ...జనపదంబులు పుణ్యనదీనదంబులుం, జూచితి నందునందుఁ గలచోద్యములంగనుఁ గొంటి. మనుచ. 1. 70.

ఆ. ఇట్టిదైన మనకు నిందుండఁగా నేల, యరిగిముంద రున్నయంద యుండి. భార. ఆది. 6.153.

2. వానిలో, వారిలో, వారియందు, దానియందు.

గీ. అంగములలోన మేలుత్తమాంగ మందు, నుత్తమంబులు గన్నుల... భార. ఆది. 5.11.

సీ...ఇరువురయందు భోగేచ్ఛ సలిపి, యం దప త్యంబు వడయుదు నని తలంచి. భార. సభా.1.185. (అందు-ఆయిరువురయందు)

వ. స్త్రీలను గోబ్రాహ్మణులఁ గూడు వెట్టువారిని విశ్వసించినవారిని వధియించుట మహాపాతకం బని పెద్దలు సెప్పుదు రట్టియందు గోవిందుండు స్త్రీవధయును గోవధయును జేసె. భార. సభా. 2. 42.

క. విను సుమతి విషయముల నం, దునికి గలిగెనేనిఁ బొందఁ డుదకంబులఁ బొం,దని బిసరుహపత్త్రము చా,డ్పున నది విజ్ఞాన ఫలము భూపవరేణ్యా. భార. శాం.5.527.
(అందు = వానియందు)

సీ...అతని పుత్త్రు.గీ.లలఘుభుజులు వత్సుఁడు భార్గవాహ్వయుండు, నందు వత్సుఁడు పితృభక్తి నతిశయిల్లి. హరి. పూ. 3. 88.
(అందు = వారిలో)

(ఇది కొన్నిచోట్ల క్రియాజన్య విశేషణపూర్వకముగా నుండును.)

క. దొరకొననిదానిఁ గోరక, దొరకొనినందును మమత్వతుష్టహృదయతం, బొరయక విగత స్పృహులగు, పురుషులు శుచు లేల తీర్థములువారలకుఁ. భార. అను. 4. 244.

(దొరకొనినందు = లభించినదానియందు)

క. వినఁ జూడంబడునం దెల్లను సమతం బరముఁగనుచు... భార.శాంతి. 6.285.(చూడంబడునందు = చూడఁబడుదానియందు)

3. (అధికరణమునందు వచ్చు) సప్తమీవిభక్తి ప్రత్యయము. అధికరణ మనఁగా ఆధారమైనకారకము. ఆధారము మూఁడు విధములు. (క) అభివ్యాపకము = అంతటను నిండి యుండుటను తెలుపునది. (చ) వైషయికము = గుఱించి అనునర్థము తెలుపునది. (ట) ఔపశ్లేషికము = ఒద్ద, దగ్గఱ మొ. అర్థములను తెలుపునది.

(అభివ్యాపకము.) ఉదా: బ్రహ్మము ప్రపంచమందున్నది. తిలలయందుఁ దైలముకలదు (వైషయికము) ఉదా : సుఖమందిచ్ఛకలదు

ఆ. అధికదుష్టచిత్తుఁడై యర్థతృష్ణతో, మిత్రబంధుసుతకళత్రమాతృ, సహజ పితృధములు చౌర్యంబు గావించు,నతని యండ విష్ణుఁ డలిగి యుండు. వి. పు. 4. 125.

ఉ. నారకయాతనాంబుధికి నావ నిబద్ధకవాటగోపుర,ద్వారమునందుఁ గుంచిక భవత్పదజంబునకుం ఫలంబు...పుత్రునిం బడయ గోరుట యెప్పుడె యెట్టివారికిఁ. కవిక. 1. 42.

(ఔపశ్లేషికము) క ... ఇట్టి సభఁగామా వలోకేశ్వరులం ,దే నెన్నఁడుఁ జూచి వి యునెఱుఁగ ధరిత్రిఁ, భార. సభా. 1.56

(మానవులలో శ్వరులందుఁగా = భూపతులసకల లో - ఇట నిర్ధారణార్థమున సప్తమి)

చ. కావలాని మర్త్యలోకమునకుం ఐని సమ్మని నాథ యిందు నా, యునికియు రాజసూయ మఖమున్నతిఁ జేసినధన్యు లింద్రునం, దుని కియు...భార. సభా. 1. 88.

సీ. కడఁగి యత్యుత్తమక్షత్రియ చరితంబు వందువర్తిల్లుదు నంటి...భార.సభా. 1.188.

గీ. ...తదుత్సవమున, కిందు మీయందుఁ గల వస్తు వెద్దియైన, నమ్మహీనాథుసామ్రాజ్య మతిశయిల్ల. భార. సభా. 1. 238.

చ. తలవరులార రంగపతిధామమునందునఁ బై డిగిన్నె ముచ్చిలిన దురాత్ము లీదురిత చిత్తులునంబులు...విప్ర. 5.24.(అందున = అందు).

4. తృతీయార్థమును తెలుపును.

స్వాగ. అగిరింద్రనుత హర్షముతో దై.వాగ మోదితవిధాయతితో ను, స్వాగతాభిమత వాక్యములం ద,త్స్వాగతోచిత సపర్యలఁ దన్పెఁగా. కు. సం. 7.886.

శా....వరాంగములు సోఁకుఁగా బుష్కరాగ్రం బునం, చాటోపం బొనరించు. కు. సం. 1. 100.

గీ. ముప్పురము గూడ నీశిలీముఖమునందుఁ, దెగితిమి...భా.రా. అయో. 181.

స్ర. ఇది శిలావృత్తాంత మింద్రనందన నీవు తటు కునఁ జని కరతలమునందు,నంటుము విడివడు నశ్వమేధహయంబు. జై.భా. 4.103.

5. 'వలన' అనునర్థము నిచ్చును.

ఆ. ఆహిరణ్యకశిపునందు నీమామిడి,క్రిందిసోమ రెట్లు బొందియెత్తెఁ, బులిక మేఁక మఱక పుట్టినట్లు య్యె...నార. 2. 59.

సీ...నరేంద్ర,... మనువర్యునియందుఁబడయు వెన్నిక...వచ్చితి ననురాగవతి నై న నను వరించి, పడయుము నాయం దపత్యంబు. మనుచ. 6.98.

6. తచ్ఛబ్దార్థకము. (అది,అవి, వాఁడు, వారు, ఆమె, మొదలగువానిని తెల్పుపును.) ఇది సర్వనామమువలె విభక్తిప్రత్యయములనుచెందు టయు, ఇతర పదములతో సమసించుటయుఁ గూడఁ గలదు.

క. అని భీష్ముఁడు వెండియు నిట్లను నాపన్ని రువురును ధరాధిపయోగ్యత్వ నిరూఢు లెల్ల కర్ణుం,బున కారుమఁ డందులోన ముఖ్యుం డరయఁగా. భార. అను. 2. 255.

సీ. శిలత్రేవఁ గల దొక్కబిల మందులో రెండు సాధనతామ్రశాసనము లుండు.దశకు.3.23.

ఉ. స్కందపురాణసంహితకు ఖండము లేఁబది యందులోన నా, నందవనానుభావకథనంబు న శ్లోతకు వక్తకుఁగా శుభా,నందపరంపరా వహము...కాశీఖండము. కాశీ. 1.8.

క. అందునఁ గనలి హయంబులఁ, గ్రందుగఁ దటిమియును...రామా. 7.284.

సీ. వేశ యొక్కందుకై విటమోహమున నూ ఱుతాగాలు వైచు కప్రంపుబరణి. బహు. 5.129.

సీ. అందు కచ్చెరు వూన...చంద్రా. 3.6.

గీ. జలధి మథియింపుఁ డందునఁ గలుగు నమృ త,ము...దశా. 2.85.

గీ. వసుధ నానంతవేళ యెవ్వారికైన, నంగ జోద్రేక మొనరించు నందుమీఁదఁ, గొమ రుఁడ్రాయంబు చెలువును గూర్మి గలుగు, దితికి రతివాంఛ యరుదె తద్విలసనమున. దశా 3.16.

క...అందుకతమునఁగా...జై. భా. 8. 119.

ఙ. అందంద, అందలి, అందుల.

**అందు²**. స. క్రి. (క. అందు.) 1. పొందు.

ఆ. ...మృగాకులోగ్రవనంబుల, కరుగ నేల యిడుమ లంద నేల. భార. అర. 2.71.

సీ....వీరు లొక్క, మొగమయి తాఁకిన వెగ డందకుందునే మననేవ...భార. ఉద్యో. 4. 257.

2. అందుకొను; చేరు.

గీ. దెంతమును వాక్కు వెన్వని నందలేవు. కాశీ 2.4.

3. అంటు, తాఁకు.

ఉ...ఆశనం, బందినయట్టిమ్రోత విని. భార. సౌ. 1. 5.

4. కను, (సంతానముగా) పడయు.

గీ. జలజనయనునందు రుక్మిణీజాంబవతుల, యం దుఁబ్రద్యుమ్నసాంబుల నందినట్లు. నరస. 1.44.

5. గ్రహించు, పుచ్చుకొను, పట్టుకొను.

గీ. గ్రాస మాచ్ఛాదనంబు దక్కంగ నెవ్వఁ, డర్థి నెయ్యది యిచ్చిన నందకేక,వారభోజి యగు చు...భార. అశ్వ. 2. 172.

గీ.అందునది భూతిఁ దొలుత నీయనుఁగుభార్య, యందుకొనువాఁడ వీవు ననంతరమున. హర. 2.60.

మ....విల్లందినన్. జై. భా. 2. 90.

అ. క్రి. దొరకు, చిక్కు.

చ. అవునవు నందినన్ సిగయు నందకయుండినఁ గాళ్లుఁ బట్టుకొం,దువు హరిణాంక...విజ.వి. 3. 51.

ఉ. అందని మ్రానిపండులకు నఱ్ఱులు సాఁచురె ...భా. రా. సుం.192.

గీ....ఈవరిపాటి గారవమున, నాదరించుజనం బుల కందు ముక్తి. భార. శాం. 5. 549.

(వ్యవ) నాకు ఏఱు అందలేదు. (నన్నుమించిన లోఁతు కలిగియున్నది – అనిభావము.) జుట్టు ముడికిఅందలేదు. ( = చాలలేదు, సరిపోలేదు. చదువులోవానికి వీఁడు అందఁడు. ( = చాలఁ డు. తక్కువవాఁడు–అనిభావము.) ఉత్తరము నేఁడే అందినది.( = చేరినది.) అందని పొందని మాటలు ( = సందర్భములేని మాటలు.)

జ. అందించు అందిక, అందిచాఁపు, అందిచ్చు, అందిపొందినవాఁడు,అందియిచ్చు అందుకొను, అందుకోలు, అందుపాటు, అందుబడి.

**అందు(దూ)కము** సం. వి. అ. పుం = అందువు.సం.

**అందు(ది)కొను** స. క్రి. (√అందు[2]) 1. గ్రహించు; పుచ్చుకొను.

సీ. పచ్చిక్కి తోలి బట్టెచుక్కాటి మెట్లంటికొనఁ దావ యూరెల్ల గుత్తపట్టు. ఆము. 6.69.

క...శా,సుత అందుకొనక మురయోధనుని నియమించెను. భాగ. 10. ఉ. 770.

శా. అట్టేకాకని భూతి నందుకొని శైవాచార సంపన్నుఁడు...హర. 2. 8.

(వ్యవ) ఆమె వాయన మందుకొన్నది. రాజు కృతి నందుకొనెను.

2. పట్టుకొను.

వ. విచిత్ర వేగంబునఁ గలభాపిణకొప్పుఁ బట్టి పట్టింబు జళిపించి వ్రేయ నెత్తుటయు నెత్తి నచెయి తత్క్షణంబ యందుకొని మృగేంద్ర వాహన...కళా. 3. 120.

గీ. వీడియం బందుకొని మొక్క యూడిగంపు, బుడుత తనవెంట నడువ నవ్వువ్వఁబోఁడి. శుక. 1. 65.

3. స్పృశించు, అంటు.

క. ఉదితజ్యాఘోషంబులు,చదలందుకొనంగ.. జై. భా. 6. 172.

4 కలియు, కూడు.

చ....చెపుమ ముద్దియ యేగతి నట్లు రంభరూ, పుమ ధరియింప నేర్చితివి పొందుగ నెమ్మెయి నందుకొంటివా,యనఘుని నట్లు గూడఁగఁ జిరాభిమతం బిది నీకు నావుడున్.కళా.4.3.

5. (ఒకకొంతచేసి విడిచినపని) కొనసాగింపఁ బూను, కైకొను.

ఆ. వీరమూర్తు సున్న, తంద్రికయ్య మఘుడు తా నందికొని సుకు,మారుఁ డట్టహాసఘోర భంగి. కళ. 2. 145.

(వ్యవ) ఆయనపాట అయినది ఈయన అందుకొన్నాఁడు. దానిజగడ మయినది ఇఁక ఇది అందుకొన్నది. సాధరు గందుకొనుము చూతము. నీవుముందు వెళ్లుము ఒకనిమిష ములో నే నందుకొందును. తండ్రిశక్తి యు డుగువచ్చుటికి కొడు కందుకొన్నాఁడు.

**అందు(ది)కోలు** వి. (√అందు[2])అందుకొనుట.

వివ. అందుకొనుశంతచేరికలో సున్నది, ఏమీ వము.

సీ. పవనస్ఫురితకొమ్మ లెక్కియాడంగ దిగంత
వాలికలకు నందుకోలు. ద్వా. 5. 53.

**అందుగు(వు)** వి. (క. అందుగు.) సల్లకి (వృ.వి.)
(ఇది ఏనుఁగులకు మిక్కిలి ప్రియము.)
సీ. తొండముల్ సాఁచి యందుగుఁజిగుళ్ళకు
నిక్కు కరుల దంతచ్ఛాయ గడలుకొనఁగ.
మనుచ. 2. 7.

**అందుపాటు** వి. (√అందు²) సామీప్యము, చేరిక.
(వ్యవ) ఆపొలము వ్యవసాయమునకు అందు
పాటులో లేదు.
విశే. సమీపము.
ద్వి...రథము, నందుపాటుగఁ దోలు మనుచుఁ
దోలించి, కదియఁబోవుటయు... ద్వి.హరిశ్చ.
పూ. 696.

**అందుబడి** విశే. (√అందు²) అందుట కనుకూల
ముగా నున్నది, సమీపమం దున్నది; సులభము.
గీ. అవని నాబాలగోపాల మగుసమస్త జీవులకు
నందుబడియైనదేవభూజ, మయ్యె నేదైవ
మట్టిమహానుభావు, నాదినృసింహదేవుని
నాశ్రయించి. భోజరా. 1. 79.
(వ్యవ) పొలము వ్యవసాయమునకు అందు
బడిగా లేదు( = సమీపముగా లేదు.)
వి. అందిక, చేరిక, సామీప్యము.
(వ్యవ) ఊరికి మాపొలము అందుబడిలో
నున్నది.

**అందుల** = అంధు¹.
(ఆచోటు.)
క....అరుగు మంబురుహానన యెందుండి వచ్చి
తందులకు వడిగా. భార. ఆది. 4.76.
చ....ఇత్తెఱంగు సెప్పిన నిను ధర్మనంద
నుఁడు ప్రీతిగ నందుల కన్పిపుచ్చు. భార.
అశ్వ. 3. 4.
(అది, అవి.)
గీ. ఎన్న రానట్టిచలిపను లెన్నియేని, జేయ మే
మందులను లేక సేగిఁ బొందు, చున్నకన్నిఱు
మెల్లన నుస్సురనుచుఁ, బొరలి యిట్లని పలి
కె...నీలా. 3. 33.

వ....చదువ దొరఁకొనిననరునకుఁ గాలంబు నా
లంబు విఘ్నంబు లఖిలోద్యమఘ్నంబులందు
లగు సామగ్రి గిటగిటవ...ఆము. 1. 78.
( = అందలి–అందున్న, అందుఁగల.)
వ. అందుల లాభన(గా)లు పాళ్ల వెరవున నడుపు
కొనువారు. ద. శా. 970.
(ఇటీవలికవులును లాక్షణికులును ఈయర్థమందు
'అందలి'అనురూపము గ్రహించినారు. ముద్రిత
భారతపుప్రతులుకొన్నిటియందును ఆరూపమే
కనఁబడుచున్నది. కాని పూర్వ శాసనములందు
'అందుల'అనురూపము మాత్రము కాన్పించు
టచే భట్టారకుని కాలమం దారూపమే యు
న్నట్లు తోఁచుచున్నది.)
(సప్తమీవిభక్తిప్రత్యయము.)
వ. ...నీయందుల మాకు నొండుకార్యంబుగలు
గుటంజేసి నీయిచ్చున ఖర్వంబుగొననొల్లము.
భార. సభా. 1. 184.

**అందువు** నం. వి. ఉ. ఈ. స్త్రీ. 1. సంకెల, గొ
లుసు. 2. ఏనుఁగుకాలికిఁ గట్టెడుగొలుసు. 3.
అందియ, నూపురము.

**అందె** = అందియ. మనుచ. 6. 31.

**అందెబందెలు** వి. బ. నిర్బంధము, చిక్కు, జం
జాటము.
(వ్యవ) వాఁడు అందెబందెలు లేకుండఁగఁ
దిరుగుచున్నాఁడు ( = స్వేచ్ఛగా తిరుగుచు
న్నాఁడు.

**అందొఱు**–అందఱు.
క...అపారబలంబుల్, మెఱయునెడ భీమునకు
నం, దొఱుఁ గీడ్వడఁ దొడఁగి రుద్ధతులు రాజ
సుతుల్. భార. ఆది. 5. 164, భార. ఆది.
7. 252, భార.అర.1.267.
గీ....యువరాజు తగినరీతి, దొరల భృత్యుల
సఖుల నందొఱను బనిచి. సారంగ. 2. 144,
ప్రబంధ. 658.

**అందోళనము** నం. వి. అ. న. ఊఁగుట, ఊఁగా
డుట.

**అంధంకరణము** నం. విశే. (అ. ఈ. అ.) అంధుని
జేయునది.

**అంధంభవిష్ణువు** సం.విణ.(ఉ.) గ్రుడ్డియగునది.

**అంధంభావుకము** సం. విణ. (అ. ఆ. అ.) – అంధంభవిష్ణువు.

**అంధకరిపువు(ఁడు)** సం. వి. ఉ. పుం–అంధకాసురునిశత్రువు–శివుఁడు.

**అంధకారము** సం. వి. అ. పుం. న. – అంధునిగాఁ జేయునది. చీఁకటి.

**అంధకారి** సం. విణ. (స్. ఈ. స్–అంధ+కారి) అంధునిగాఁ జేయునది. వి. అ. పుం. (అంధక+అరి)–అంధకునిశత్రువు–శివుఁడు.

**అంధకుఁడు** సం. విణ. (అ.ఆ.అ.) గ్రుడ్డివాఁడు. వి. అ. పుం. 1. కశ్యపునకు దితియందుఁ బుట్టిన యొకానొక రాక్షసుఁడు. 2. ఒకానొక యాదవుఁడు. (ఇతఁడు యుధాజిత్తుపుత్త్రుఁడు. క్రోష్టునకుఁ బౌత్త్రుఁడు. అంధక వంశమునకు మూల పురుషుఁడు.) 3. బృహస్పతి యన్నయగునట్టి ఉతథ్యునకు మమతయందుఁ బుట్టిన ముని.

**అంధకూపము** సం. వి. అ. పుం. 1. గడ్డి మొదలగువానిచే పయిని కప్పువడిననూయి. పాడునూయి. 2. ఒకానొకనరకము.

**అంధతమసము** సం. వి. అ. న. కటికిచీఁకటి, గాఢాంధకారము.

**అంధతామసము** సం – అంధతమసము.

**అంధతామిస్రము** సం. వి. అ. పుం. న. 1. కటికి చీఁకటి. 2. ఒకానొకనరకము. 3. (వేదాంత) దేహము నశింపఁగా నేనునశింతు ననెడిజ్ఞానము.

**అంధపూతన** సం. వి. ఆ. స్త్రీ. ఒకబాలగ్రహము.

**అంధము** సం. విణ. (అ.ఆ.అ.) 1. గ్రుడ్డిది. 2. అంధుని జేయునది.

ఉదా: అంధతమసము. అంధకూపము.

వి. అ. న. 1. చీఁకటి. 2. అజ్ఞానము, అవిద్య. (ఇది యథార్థజ్ఞానమును గప్పిపుచ్చును.) 3. జలము. 4. (జ్యోతి) నష్టద్రవ్యలాభాలాభములను తెలుపునట్టిరాశి.

**అంధమూష** సం. వి. ఆ. స్త్రీ. మీఁద కప్పును ప్రక్కరంధ్రమును గల చిన్నమూస.

**అంధమూషిక** సం.వి.ఆ.స్త్రీ. దేవతాళము(వృ:వి.) (దీనిని సేవించుటచేత చూపు చక్కఁగా నుండు నని వైద్యశాస్త్రము.)

**అంధస్సు** సం. వి. స్. న. అన్నము.

**అంధాతమసము** సం. – అంధతమసము.

**అంధాహి** సం. వి. ఇ. పుం. 1. విషములేనిపాము. 2. కుచిక యనెడియొకజాతి చేఁప.

**అంధిక** సం. వి. ఆ. స్త్రీ. 1. రాత్రి. 2. జూదము. (దీని చేత మనుష్యుఁడు వివేకశూన్యుఁ డగును) 3. ఒకయాట, దాఁగిలిమూఁతలాట. 4. ఒక విధమగుకంటిరోగము. 5. సర్షపి, ఆవమొక్క (దీనిని మిక్కిలి సేవింపఁగా చూపునశించు నని వైద్యశాస్త్ర ప్రసిద్ధి.)

**అంధుఁడు** సం. విణ. (అ. అ. ఆ.) 1. గ్రుడ్డివాఁడు 2. వివేకము లేనివాఁడు.

ఉదా: కామాంధుఁడు. గర్వాంధుఁడు.

వి. అ. పుం. బాహ్యదృష్టి లేనిసన్యాసి.

**అంధులము** సం. వి. అ. పుం. శిరీషము, దిరిసెనము (వృ. వి.) (దీని పూవుచూడఁగానే విరహులకు అంధత్వము కలుగును.)

**అంధువు** సం. వి. ఉ. పుం. కూపము, నూయి.

**అంధ్రకోసలము** సం. వి. అ. పుం. దేశవిశేషము

వ. ఇవ్విధంబునఁ బనుపంబడి యంధ్రకోసలదేయులగు నమ్మల్లు లిద్దఱు నమ్మహావీరు మార్గంబునం గడంగి రందులోనఁ జాణూరుండు. హరి. పూ. 9.101.

**అంధ్రము** సం. వి. అ. పుం. దేశవిశేషము.

**అంధ్రుఁడు** సం. వి. అ. పుం. ఒకానొక సంకీర్ణజ వాఁడు. మను. 10. 36,48.

**అంపకట్టె** వి. (√అమ్ము') బాణము.

క. అఱచేతిత్రాలు గను నత్తఱిఁ బడె నియంపకట్టె దానికి నిలువం, బిఱుబిఱ్ఱ జాలువడెం, దెఱపియుఁ గనలేమి సాదిరుగుడువడియెఁ. ఆము. 6.74.

**అంపకము** వి. √అంపు (క. అంపక.) 1. పంపు

వ. బంధుమిత్రులకు సపారంబులైనకానుక కట్నంబు లిచ్చి యుచితసత్కారంబుల సకంబుఁ జేసి...మృ. వి. 3. 69.

**అంపకయ్యము** వి. (√అమ్ము¹) బాణయుద్ధము.

**అంపకాఁడు** వి. √అమ్ము¹ (క. అంబుగాఱ. తు. అంబుగారె.) - అంబులు గలవాఁడు - విలుకాఁడు; విలువిద్యయందు నేర్పరి.

ఆ. లక్ష్యసిద్ధిదాఁక లావున శర మూఁగి, కాఁడ నిడుముదంపకాఁడు వోలె. ఆము. 4.246.

(ఇట'వింటివాఁడు'అనిపాఠాంతరముకలదు.)

**అంపకోల** వి. (√అమ్ము¹) బాణము.

గీ. నీగట్టిహృదయసంపుటముఁ దాఁకి, కుంఠితములయ్యె మరునంపకోలలెల్ల. నైష. 8.189.

**అంపగఱి** వి. (√అమ్ము¹) బాణమునకు కట్టుపక్షి ఱెక్క.

**అంపతప్పు** వి.(√అమ్ము¹)బాణము తగులకుండఁగ తప్పించుకొనుశక్తి.

గీ. ఇన్నినాళ్లకు నాచేతియేటు దప్పె,నౌర యీజడదారుల కంపతప్పు, గలదు గాఁబో లుననుచును గలకుచులుకుఁ, జూపు లదరంగ నటువారిఁ జుట్టువాఱి. వాల్మి. 2. 95.

**అంపదొన** వి. (√అమ్ము¹) అంబులపొది. రా.వి. 2. 46.

**అంపపొది** = అంబులపొది. వి. (అమ్ము¹) తూణీరము, బాణము లుంచుపొది.

ఆ. అంపపొదుల నిగుడునంకువితానంబు, దీప్రమరకతముల దీధితులుగఁ, దాలిమియును బెంపుఁ దనకు నైజములుగ, విజయరోహ ణాద్రి వెడలి వెలిఁగె. భార. భీష్మ. 1. 106.

**అంపపోకడ** వి. (అమ్ము¹) 1. బాణముపోవుట. 2. బాణవ్యయము.

సీ. అంపపోకడ చేయునాహవం బేటికిఁ బలిన పట్టుము నిల్పి బంట నైన. నై. భా. 5.82.

**అంపముల్కి (లికి)** వి. (√అమ్ము¹) బాణపుటలుఁగు.

సీ. లీలాబ్జ మంపముల్కియు నై చెలంగు నేయుస ను నైత్రవునకు నొసలికన్ను. చం. రా.8.28.

**అంపఱ** వి. (√అమ్ము¹) 1. బాణపరంపర, బాణసమూహము.

క...నృపపుంగవులం, బఱ కోర్వక ఫిలుపక్షిరవి, వెలిచి...భార. ఆది. 4. 202.

క. గురునుతు బెడిదపుటంపఱ నరనారాయణులు నొచ్చినఁ ...భార. భీష్మ. 2. 305, ఆం. భా. 2. 218.

2. బాణము.

శా....మారుఁడు పూవుటంపఱగముల్ తెంపొప్పఁ బై గుప్పఁగఁ. ఇందు. 2. 184.

సీ....లకోరి యంపఱ నారస మమ్ము...శరాఖ్యలు మించు. సాం. ని. మా. 45.

**అంపవెల్లి** వి. (√అమ్ము¹) బాణప్రవాహము; బాణసమూహము.

వ....వాలంపవెల్లిం బెల్లుగాఁ బఱపిన...పి. శకుం. 3. 183.

**అంపాసారము** వి. (సం. అంబ్వాసారః అంభ ఆసారః ?) ధారాపాతము.

క. సంపాదితశంపావళిఁ, బెంపారినమేఘచయము పృథివియు నభముఁ,గంపింపఁగ బెట్టుఉరుముచు, నంపాసారంపువాన లప్పుడు గురిసెఁ. వి. పు. 7. 68. (దీనిః ప్రయోగాంతరము మృగ్యము.)

ద్వి. వలి పిరిగాలితో వలి మీఱి మీఱి, బలువిడివానయంపాసార మైన, యలజడిచేత... ద్వి. పరమ 4. 291. పా.

**అంపించు** స. క్రి. (√అంపు-స్వార్థమందు ఇంచు) పంపు.

మ....న న్నంపింపుఁ డంచత్కృపఁ. ఉ. రా. 7. 50.

**అంపించుకొను** స. క్రి. (√అంపు) అంపునట్లు చేసికొను; వెళ్లుటకు సెలవు పుచ్చుకొను.

వ....నేను నిలింపవైరిచేత నంపించుకొని వచ్చునెడ...దశా. 2. 118.

ఆ. మునుకుమారుఁ జూచి జననాథ యంపించుకొనుమనంగ నతఁడు మునికి నెఱఁగి, దీవనలు వరించి తా బేడ్కతో వచ్చి, యరదమెక్కె...కళా. 8. 189.

**అంపియ** — అంపె.

**అంపు** న. (స్త్రీ. (ప్ర. అనుప్పా.) = అంచు¹.

క. అంపఁ దగువారిఁ గనరుచు, నంపి నగరు సొచ్చి వెలఁదు లారతు లీఁగా,నింపఱఁ గళాభిహతులఁ, బంపించిరి వారి నన్నిళా మధ్యమునఁ. మనుచ. 6. 23.

వి. అమ్మవారి నంపునపుడు చేయు ఉత్సవ విశేషము.

గీ. పండు వనఁగ,నుత్సవము తద్విశేషంబు లొప్పఁ దేవ, తంతు సాకము నంపు జాతర లొలు పన ఆం. భా. 1. 148.

ఇ. అంపకము, అంపింపు, అంపించుకొను, అంపుదోడు.

**అంపుదోడు** విఇ. √అంపు. (త. అనుప్పుత్తుణై.) ప్రయాణమందలితోడు,యాత్రాసహాయుఁడు. (శర,బ్రౌ.)

వాఁడు అంపుదోళ్లకు ( = యాత్రాసహాయకృత్యములకు) బిడ్డకాన్పులకుఁ దిరుగుచున్నాఁడు = అన్ని పనులకు తోడు అగుచున్నాఁడు. (బ్రౌ.)

**అంపె** – అంపియ. వి. పటచ్చరము, పాఁత, చింపి గుడ్డ. (బహువచనముననే ప్రయోగము కనఁబడుచున్నది.)

ఉ. అంపెలు గట్టిచేత నొకయష్టి ధరింపుచు... ప్రార్థనా, లంపటుఁ డయ్యు మేనికి బలం బొడఁగూడమిఁ గుందువిప్రునిఁ. హ్రా. 10. 71. (ప్రయోగాంతరము మృగ్యము.)

**అంబ** సం. వి. అ. స్త్రీ. 1. అమ్మ, తల్లి. (ఇది ప్రేమతోఁ గాని గౌరవముతోఁ గాని స్త్రీని సంబోధించుటయందుఁ గూడ ఉపయుక్తము.) 2. దుర్గ. 3. చేఁదుసొఱ (వృ. వి.). 4. పులిచింత (వృ. వి.). 5. అంబాళము, అడవిమామిడి (వృ. వి.) 6. కాశీరాజుకూఁతురు. (ఈమె భీష్మునిచే నిరాకరింపఁబడి వానిని జయించుటకు తపమ్ముచేసి జన్మాంతరమున శిఖండియై పుట్టి పగ తీర్చుకొనెను.)

**అంబకము** సం.వి.అ.న. 1. కన్ను. 2. బాణము.

**అంబకళము** వి. (త. అంబకళ.) 1. అంబలి, జావద్వి. వసుధలో నీయుంటిరసరసాయనము, లతని నగరఁ గాంచునంబకళంబు, ప్రతివచ్చునే యెన్ని భంగులనైన. బస. పు. 5. 265.

2. అంబలివలె కాఁచినరుచ్యముగుపదార్థము.

వ... పానకంబులతోడఁ దిమ్మనంబులతోడ దధి పిండఖండంబులతోడ మీఁగడలతోడ మజ్జిగలతోడ మూరుఁగాయలతోడనంబకళంబుల తోడరసావళులతోడం గూడ. కాశీ. 7. 185.

**అంబటిచేయి** వి. (√అంబలి)అంబలి త్రాగుచెయ్యి-కుడిచెయ్యి. (దీనికి పశ్చిమాంధ్రమువనే వాడుక.)

**అంబటిజోరిగాఁడు** వి. పక్షివిశేషము.

సీ... కాకి యంబటిజోరిగాఁడు మూఁగ.హంస. 3.12. (శ. ర.) 'అంబటికారిగాఁడు' అని ముద్రితము.

**అంబటిప్రొద్దు** వి. (√అంబలి) అంబలిత్రాగువేళ-మధ్యాహ్నకాలము.

**అంబరదము** సం. వి. అ. న. అంబరములను ఇచ్చునది-దూది.

**అంబరమణి** సం. వి. ఇ. పుం. సూర్యుఁడు.

**అంబరము** సం. వి. అ. న. 1. ఆకాశము 2. శూన్యము, సున్న. 3. వస్త్రము, 4. కుంకుముపువ్వు. 5.అభ్రకము. 6. అంబరు అనెడిగంధ ద్రవ్యము. 7. దూది, 8. దూష్యాదివ్యసనము.

**అంబరాంతము** సం. వి. అ. పుం. 1. చెఱఁగు, బట్టకొంగు. 2. దిక్చక్రము, చుట్టును భూమియు ఆకాశము కలిసినట్లు అగపడు ప్రదేశము.

**అంబరీషము** సం. వి. అ. న. 1. వేఁపుడుచట్టి, మంగలము. 2. యుద్ధము. 3. పశ్చాత్తాపము. 4. నరకవిశేషము. పుం. 1. పిల్లజంతువు. 2. అమ్రాతకము, అంబాళము. (వృ. వి.)

**అంబరీషుఁడు** సం. వి. అ. పుం. 1. విష్ణువు. 2. శివుఁడు. 3. సూర్యుఁడు. 4. బాలకుఁడు. 5 సూర్యవంశ్యుఁడైన యొక రాజర్షి.

**అంబరు** వి. (సం. అంబరం. ఫ. అంబర.) ఒక విధ మగుపరిమళద్రవ్యము.

గీ. అల్లు శ్రీగంధ మగరు కేసరి కదంబ,మం
జరు పునుంగు జవ్వాది హరిణమదము,
బుక్కయత్తరు...హంస.5.140.('అత్తరు'
అని అపముద్రితము.)

**అంబలి** వి. దే. (క. త. అంబలి-బ.అంబళులు, అంబళ్లు.)
1. పిండితో కొంచెము పలుచగా కాఁచినపదార్థము.
సీ. అట్ట లెత్తినప్రాఁత మెట్టులు కడుగుటంబటి చాటికలతోడి పరువకాళ్లు. వేం. పంచ. 1.588.
2. అంబలివలె పలుచగా కాఁచిన పదార్థము.
చ. తెలినులివెచ్చ యోగిరముఁ దియ్యనిచేరులుఁ దిమ్మనంబులుఁ, బలుచనియంబళుల్ చెఱకుపా లెడనీళ్లు రసావళుల్. ఆము. 1. 81.
సా:- అంబలియేఱు వచ్చినది అత్తగారా! అనఁగా కొలబుఱ్ఱ నాచేతిలోనే యున్నది కోడలా! అన్నదఁట. అంబలిత్రాగువారికిమీసాలొత్తువాఁడొకఁడా?
జ. అంబలిచేయి, అంబలిప్రొద్దు.

**అంబష్ఠ** సం. వి. అ. స్త్రీ. 1. యూథిక, అడవిమొల్ల (వృ.వి.) 2. పులిచింత (వృ. వి.) 3. చిఱుబొద్ది. పాఠ (వృ. వి.) 4. సరస్వతితీఁగ. 5. అడవిమామిడి (వృ. వి.)

**అంబష్ఠకి** సం. వి. ఈ. స్త్రీ. చిఱుబొద్ది, పాఠ (వృ. వి.)

**అంబష్ఠము** సం. వి. అ. పుం. 1. ఒకానొక దేశము. 2. బరు నడ్డసరము. (వృ. వి.)

**అంబష్ఠి** సం. వి. ఈ. స్త్రీ. అంబష్ఠునిభార్య.

**అంబష్ఠుఁడు** సం. వి. అ. పుం. 1. బ్రాహ్మణునకు వైశ్యకన్యయందుఁబుట్టినవాఁడు. (వీని వృత్తి చికిత్స) 2. మావటివాఁడు.

**అంబస్తు** విశే. అజ్ఞుడు. తెలివిలేనివాఁడు.
సీ... జ్ఞుఁ డు దగు దమ్ముఁ డంబస్తనంగను... ఆం. భా. 3. 12 (ప్రాఁతప్రతి పా)

**అంబారము**—అంబారు. వి. (క. అంబార. త. అంబారం.) ధాన్యరాశి.

**అంబారి** వి. (క. త. అంబారి. తు. అంబరి అంబారి.) ఏనుఁగుమీఁదఁ గూర్చుండుటకై కట్టెడు పీఠము, చౌడోలు.

**అంబారీ** — అంబారి.
శా. శ్రీరంజిల్లుకడానిపైఁడిజలతారీమాహురీ కెంపుటం,బారీయేనుఁగు నెక్కి...రంగా. 1.161.

**అంబారు**—అంబారము.

**అంబారుపిడుఁత** వి. (క. అంబారుణ్ణి.) పశువుల నంటిపట్టిరక్తము పీల్చుపురుగు, కొణుజు.

**అంబాలిక**. సం.వి.ఆ.స్త్రీ. 1. తల్లి, అమ్మ 2. కాశీరాజుచిన్న కూఁతురు. (విచిత్రవీర్యుని భార్య, పాండురాజుతల్లి) 3.అంబష్ఠ,మాచిక (వృ.వి.)

**అంబాళము**. వి. (సం. ఆమ్రాతకః. ప్రా. అంబాతకో. క. అంబాడె.) ఆమ్రాతకము, కపీతనము (వృ. వి.)
ద్వి. కొరవులు నెరవులు గురివిందపొదలు, నరుదుగాఁ బొదలినయంబాళములును. రం.రా. ఉ. 116. పా. 15. పం.
సా:- నోరు అంబాళపుపండు చేయి బలుసుముల్లు = తియ్యనిమాటలేకాని పెట్టుటకు చేయి రాదు.

**అంబిక**. సం.వి.ఆ.స్త్రీ. 1. అమ్మ, అంబ. 2. మేనమామభార్య, మేనత్త. 3. పార్వతి. 4. కాశీరాజు నడిమికూఁతురు. (విచిత్ర వీర్యుని పెద్ద భార్య, ధృతరాష్ట్రుని తల్లి) 5. కటుకరోహిణి (వృ. వి.)

**అంబు**—అమ్ము' (సం. అంబకః, క.త.తు. అంబు.) బాణము.
చ. బిసవల్లి సముద్భవసౌకుమార్యకం,దళముల కంబుజల్ బుజలు...చమ. 1.25. (శ.ర.)
జ. అంబులపొద.

**అంబుకంటకము**. సం. వి. అ. పుం. నీటిలో కంటకమువలె నుండునది-మొసలి.

**అంబుకిరాతము** సం. వి. అ. పుం. మొసలి.

**అంబుకీశము** సం వి. అ. పుం. శింశుమారము, ఒకానొకజలజంతువు.

**అంబుకూర్మము** సం. — అంబుకీశము.

**అంబుశేఖరము** సం. వి. అ. పుం. ఖోలంగము, మాదీఫలము (వృ. వి.)

**అంబుక్రియ** సం. వి. అ. స్త్రీ. జలతర్పణము.

**అంబుఘనము** సం. వి. అ. పుం. వడగల్లు,కరక.

**అంబుచత్వరము** సం. వి. అ. న. తటాకము చెఱువు.

**అంబుచరము** సం.విశ. (అ. ఈ. అ.) నీట చరించునది (చేఁప, మొ.).

**అంబుచామరము** సం. వి. అ. న. శైవాలము, నాఁచు (వృ. వి.)

**అంబుజన్మము** సం. వి. న్. న. పద్మము. పుం. 1. సారసము, బెగ్గురుపక్షి. 2.అగ్ని, నిప్పు. 3. శంఖము.

**అంబుజన్ముఁడు** సం. వి. న్. పుం. 1. చంద్రుఁడు. 2. అగ్ని.

**అంబుజము** సం. విశ. (అ.ఆ.అ.) నీటఁబుట్టునది. వి. అ. పుం. 1. హారతికర్పూరము. 2. సారస పక్షి. 3. శంఖము. 4. నిచులము (వృ. వి.) న. 1. పద్మము. 2. వజ్రాయుధము.

**అంబుజాసన** సం. వి. ఆ. స్త్రీ. పద్మము గద్దెగాఁ గలది - లక్ష్మి.

**అంబుజాసనుఁడు** సం. వి. అ. పుం. పద్మము గద్దెగాఁ గలవాఁడు-బ్రహ్మ.

**అంబుజుఁడు** సం. వి. అ. పుం.—అంబుజన్ముఁడు.

**అంబుతస్కరుఁడు** సం. వి. అ. పుం. నీటిని కిరణములచే అపహరించువాఁడు-సూర్యుఁడు.

**అంబుతాలము** సం. వి. అ. పుం. నీటియందు ఉండునది-నాఁచు (వృ.వి.)

**అంబుదము** సం. విశ. (అ. ఆ. అ.) నీటి నిచ్చునది. వి. అ. పుం. మేఘము.

**అంబుధరము** సం. వి. అ. పుం. నీటిని ధరించునది- మేఘము 2. ముస్తకము, తుంగ (వృ.వి.) 3. అభ్రకము.

**అంబుధి** సం. వి. ఇ. పుం. 1. సముద్రము. 2. (గణిత) నాలుగు.

**అంబుధిస్రవవ** సం. వి. అ. స్త్రీ. ఘృతకుమారి, ఒక జాతి కలబంద (వృ.వి.)

**అంబునిధి** సం. — అంబుధి.

**అంబుపత్ర** సం. వి. అ. స్త్రీ. ఉచ్చట, వట్టువముస్తె (వృ.వి.)

**అంబుపము** సం. విశ. (అ.ఆ.అ.) జలముమ త్రాగునది. వి. అ. పుం. 1. సముద్రము. 2. చక్రమర్దనము, తగిరస (వృ.వి.)

**అంబుపాతము** సం. వి. అ. పుం. 1. సెలయేటి ప్రవాహము.2. కొండనుండి సెలయేఱు ధారలుగా క్రింద పడుట. 3. సెలయేఱు పడు చోటు.

**అంబుపుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) 1. జలములకు రాజు. 2. నీరు త్రాగువాఁడు. వి. అ. పుం. వరుణుఁడు.

**అంబుప్రసాదనము** సం. వి. అ. న. - అంబుప్రసాదము.

**అంబుప్రసాదము** సం. వి. అ. పుం. నీటిని నిర్మలముగాఁ జేయునది-చిల్ల కతకము. ఇందుగు కాయ.

**అంబుభృత్తు** సం. వి. త్. పుం. 1. మేఘము. 2. అభ్రకము. 3. ముస్తె (వృ. వి.) 4. సముద్రము.

**అంబుముక్కు** సం. వి. చ్. పుం. నీటిని విడుచునది-మేఘము.

**అంబుముచము** సం. - అంబుముక్కు.

**అంబురాశి** సం. వి. శ పుం. జలరాశి, సముద్రము.

**అంబురుహ** సం. వి. ఆ. స్త్రీ. మెట్టతామర(వృ.వి.)

**అంబురుహము** సం. - అంభోరుహము.

**అంబురుహిణి** సం. వి. ఈ. స్త్రీ. తామరతీఁగ.

**అంబులపొది** — అంపపొది (√అంబు.)

**అంబువాచి** సం. వి. ఈ. స్త్రీ. ఆషాఢకృష్ణపక్ష దశమి మొదలు త్రయోదశివఱకును భూమికిఁ గలపేరు. (ఈకాలమున భూమి ఋతుమతి యనియు అశుచి యనియుఁ బ్రతీతిని బట్టి సేద్యము జరుపఁబడదు.)

**అంబువాసి** సం. — అంబువాసిని.

**అంబువాసిని** సం. వి. ఈ. స్త్రీ. కలిగొట్టు, పాటల (వృ.వి.)

**అంబువాహము** సం.విశే. (అ. అ. అ.) నీరు మోయునది. వి.అ.పుం. 1. మేఘము. 2. చెఱువు. 3. తృణవిశేషము (వృ. వి.)

**అంబువాహి** సం. విశే. (న్. ఈ. న్.) నీళ్లు మోయువాఁడు. వి. న్. పుం. 1. మేఘము. 2. ముస్త (వృ.వి.)

**అంబువాహిని** సం. వి. ఈ. స్త్రీ. 1. కట్టుచేఁద, కొయ్యతొక్కెన. 2. ఎత్తుడునీరుపోయుటకై తొలిచి కాలువ మొదట నుంచెడుతాటిపట్టె లోనగునది, దోనె. 3. నీళ్లు మోయుస్త్రీ.

**అంబువిస్రవ** సం. వి. అ. స్త్రీ. ఘృతకూమారి, ఒకజాతి కలబంద (వృ.వి.)

**అంబువు** సం. వి. ఉ. న. 1. ఉదకము, నీరు. 2. (జ్యోతి) లగ్నమునకు నాలుగవస్థానము. 3. (ఛంద) ఒకానొక వృత్తము.

**అంబువేతసము** సం. వి. అ. పుం. నీటి ప్రబ్బలి (వృ.వి.)

**అంబుసర్పిణి** సం. వి. ఈ. స్త్రీ. జలగ.

**అంబుసేచని** సం. వి. ఈ. స్త్రీ. ఓడనుండి నీళ్లెత్తి పోయుతొక్కెన.

**అంబూకృతము** సం. విశే. (అ. అ. అ.) 1. నిష్ఠీవముతోఁగూడినది. (మాట,ధ్వని.) 2. నీరుగాఁ జేయఁబడినది. వి. అ. న. నిష్ఠీవముతోఁగూడిన మాట; నిష్ఠీవముతోఁగూడినధ్వని.

**అంబే** వి. (సం. అంభా. క. అంబే, అంబా. తు. అంబ, అంబా, అంబో.) ఇది గోజాతిఅఱపు యొక్క అనుకరణశబ్దము.

క. ఉల్లములు గలఁగి మొదవుల, వెల్లువ లన్నియును తేచి విచ్చలవిడితోఁ, జెల్లాచెదరై పాఱెను, బెల్లుగ నంబే యటంచు బెబ్బులిగాలిచ్. భాగ. 9. 36.

**అంబేడ** విశే. దిట్టతనము లేనివాఁడు, పిఱికి; అసమర్థుఁడు.

ఉ. వేదులు వల్కిన న్నదర ప్రేయఁగఁ జూచెద విందు నంతయుం,జేదలు తేరు నీవుగడుఁ బెద్దతికాల్ వచరించి తూరక షేవాదవరేవిరేలు. సారంగ. 3. 56.

సీ. పరిదిక్పతులయిం డ్లకరుగువేళఁ జైకనిక్కి వీనులఁజక్కి వెక్కరాదు. గీ. పగలు రేలుమ జాల స్వర్గటు లానర్చు, దుడుకుతే వేలుపున్నినికొడుకుఁగుట్టు, కక్కటక్కట పూష శక్యంబె వజ్రధరువ కిటువంటి యంబేడ దొరతనంబు. చం. రా. 2. 25.

**అంబ్లము** సం. విశే. (అ. అ. అ.)అమ్లము, పుల్లనిది. వి. అ. పుం. పులుసు.

**అంభస్సారము** సం వి. అ. న. 1. ముత్యము. 2. నీటిసారము.

**అంభస్సు** సం. వి. స్. న. 1. నీరు. 2. కురువేరు. (వృ.వి.) 3. (జ్యోతి) లగ్నమునకు నాలుగవ స్థానము. 4. (యోగ) నవవిధతుష్టులయందుఁ బ్రకృతి యనుఆధ్యాత్మికతుష్టి.

**అంభా** సం. వి. ఆ. స్త్రీ. గోవులయఱపునకు అనుకరణశబ్దము.

వ. తమకంబులం దమతమయంత నంభారవంబులు సేయుచు...భాగ. 10. పూ. 1196.

**అంభోజజని** సం. వి ఇ. పుం. బ్రహ్మ.

**అంభోజజన్ముఁడు** సం. వి. న్. పుం. బ్రహ్మ.

**అంభోజము** సం. విశే. (అ. అ. అ.) నీటఁ బుట్టినది. వి. అ. న. తామరపువ్వు,పద్మము. పుం. సారసపక్షి, బెగ్గురు.

**అంభోజయోని** సం. వి. ఇ. పుం. బ్రహ్మ.

**అంభోజిని** సం. వి. ఈ. స్త్రీ. 1. తామరతీఁగ. 2. పద్మసమూహము. 3. తామరకొలను.

శ్లో. అంభోజిన్యాశ్శిశిరసరసంకాసరీ వాచ్యమంథః,కైకేయ్యాస్స్వహృదయ మదయేం మంథరా నిర్మమంథ. సం. చం. రా.అయో.9.

**అంభోజాఁడు** సం. విశే. (అ. అ. అ.) నీటఁబుట్టినవాఁడు. వి.అ.పుం. 1. చంద్రుఁడు. 2. అగ్ని.

**అంభోదము** సం. విశే. (అ. అ. అ.) నీటి నిచ్చునది. వి.అ.పుం. 1. మేఘము. 2. ముస్త (వృ.వి.)

**అంభోధరము** సం. వి. అ. పుం. 1. నీటిని ధరించునది-మేఘము. 2. ముస్త (వృ.వి.)

**అంభోధి** సం. వి. అ. పుం. సముద్రము.

**అంభోధిమల్లకము** సం. వి. అ. పుం. సముద్రపు పగడము.

రూపములే కనఁబడుచున్నవి. దీనికి అవి మూల రూపము లయినచో ఇందు బిందు వుండదు. తరువాతికవిత్వములందు 'అంట' అనురూపము కనఁబడుటచే బిందుసహితముగా ఇందు గ్రహింపఁబడినది. 'అనుట, అంట, అఁట' అని రూపావతారము.) 1. వృత్తాంతకథనాదులను దెలుపును. (క) వృత్తాంతకథనము.

ఆ. మనయశోద చిన్నిమగవానిఁగనె నఁట, చూచివత్త మమ్మ సుదతులార. భాగ. 10. పూ. 184.

(చ) ఉత్కర్షము.

గీ. దాత వఁట నీవు మేము సంధాతల మఁట, గారవపుఁ బెండ్లికూఁతురు గౌరి యఁట. హర. 4. 65.

(ట) ఆక్షేపము.

క. తునియలు తొమ్మిది యఁట పదు, నెనమండ్రఁట మోచువారనేకపకిటికూ, ర్మన గాహు లేటిలావరు, లని తావక బాహు వొకఁడ యవని భరించెఁ. ఆము. 1. 35.

(త) ఆశ్చర్యము.

గీ. అతనుఁడఁటఁకోదు పూమొగ్గ యఁట శరంబు, చించినదియఁట తద్ధైర్యకంచుకంబు, నలుని దమయంతితోఁగూర్పఁదలఁచియున్న, ధాత మదియెత్తికో లుదిఁదాఁక కున్నె. నైష. 1. 80.

ఎట్టు, ఏమి, ఎన్ని, ఎవఁడు, ఏది మున్నగు శబ్దములకు అనుప్రయుక్తమై అయినను అనునర్థము ఇచ్చును.

మ. నిరవద్యస్థిరభక్తితోడ ననుఁ గానీ శంభుఁ గానీ రమేశ్వరుఁ గానీ గుఱియించి యెవ్వరఁట యీసారస్తవంబుల జపింతురు వారందఱకేమ ముప్పూరము సంతుష్టిం బ్రసాదింతు మిం, పరుదార న్ధనధాన్యపౌత్రపశురక్షాయుస్సుఖారోగ్యముల్. కాశీ. 2. 9.

ద్వి...ఏమఁట వరంబులు వేఁడు మనిన. రం. రా. ఉ. 28. పా.10. పం.

(వ్యవ) ఎవ్వఁడఁట రానీ నే నిక్కడనుండి కదలను. ఎవ్వడఁట కానీ నేను వానిని లక్ష్యపెట్టను.

3. అర్థవిశేషము లేకయే కొన్నిచోట్ల ప్రయోగింపఁబడును.

క...పలుకు బంగారఁటవే. విజ. వి. 2.183.

(వ్యవ) మొన్న వచ్చినవాఁడవు నీవఁటరా!

**అక** – అక్క.

సీ. ఆయక లంక నున్నది...రాఘవ. ౬. 38.

**అకట** – అకటకట, అకటకటా, అకటా, అక్కటా, అక్కటకట, అక్కటకటా, అక్కటక్కట, అక్కటక్కటా, అక్కటా, కట, కటకట, కటకటా, కటా, కట్ట, కట్టా **అవ్య.** (సం. ఆః కష్టమ్, ఆఃకష్టకష్టమ్. క. అకట, అకటా, అక్కట, అక్కటా, అకటకట, అకటకటా, అక్కటకట, అక్కటకటా, కట, కటకటా, త. అక్కడి.)

1. అయ్యో. (సంతాపమును దెలుపును.)

2. అహహ. (ఆశ్చర్యమును దెలుపును.)

చ. అకట యజాతశత్రుఁడనునప్పలు కిప్పుడు నిక్కమయ్యె వా, నికిఁ గురునాథ యిట్టులత నిం దెగఁజూచుట కోరి కాజిఁ బట్టికొనుట గోరి తివ్విధము దెప్పరి మెంతయు...భారి. ద్రోణ. 1. 109.

**అకటకట (టా)**–అకట.

**అకటవికటము**–అకటావికటము. విణ. (క. అకట వికట, అగడవిగడ, త. అకడవికడం.) వ్యత్యస్తము, తాఱుమాఱు, అడ్డదిడ్డము.

గీ. కణఁగి వడ్లును బెరుఁగును గలుపుభంగి, నకట వికటంబు లగుప్రశ్న లడిగె నదియు. వా. రా. 2. 132.

**అకటా**– అకట. విక్ర. 5. 147.

**అకటావికటము**– అకటవికటము.

క. అకటా మరుఁ డిపు డుల్లం, బకటావికటముగఁ జేసి యడలూన్చెను...రసిక. 3.79.

**అకము** నం. వి. అ. పుం. న. 1. దుఃఖము. 2. పాపము.

**అకిర.** నం. వి. అ. స్త్రీ. ఉసిరిక (వృ.వి.)

**అకరణము** నం. విణ. (అ. అ. అ.) 1. అకృత్రిమము, స్వాభావికము. 2. ఇంద్రియములు లేనిది వి. అ. న. పనిచేయమి.

**అకరణి** నం. వి. ఇ. స్త్రీ. అకరణము, చేయకపోవుట.(ఇది తిట్టునపుడే యుపయోగింపఁబడును) శ్లో. 'తస్యాకరణిరేవాస్తు.' అని వాచస్పతి.

**అకరు**—అకరువు. (కింజల్కము, కేసరము)

సీ...పొదిగొన్నయకరులు సెదరకుండ గీ. మున్న కొనివచ్చి గణికాసమూహితోడ, గిరిజ పూజించెఁ బసిఁడితామరల వరదు. కు.సం. 3.351.

సీ. ఆంధ్రభూభువనమధ్యము పుండరీకంబు... ...అకరులు చారుదివ్యస్థలములు. భీమ. 3.50.

**అకరువు**—అకరు. వి. 1. (పద్మము మున్నగువాని లోని) కర్ణిక, దుద్దు.

సీ. ఆకాశమండలం బనునల్లకలువకు నగరు వాద్యుండు లోలార్కమూర్తి. కాశీ. 1.2.

2. కేసరము, కింజల్కము, ఆం. భా. 1.165.

**అకర్ణము** నం. విశ. (అ. ఆ. అ.) చెవులు లేనిది. వి. అ. పుం. చక్షుశ్శ్రవము, పాము.

**అకర్తనుఁడు** నం.విశ. (అ. ఆ. అ.) 1 కత్తిరింపని వాఁడు. 2. పొట్టివాఁడు, మఱుగుజ్జు.

**అకర్మకము** నం. విశ. (న్.) 1. పని లేనిది.2. కర్మాధికారము లేనిది, భ్రష్టము. 3. (వ్యాక) కర్మపదములేని క్రియ,అకర్మకము. వి. న్. న. 1. పనిలేమి. 2, విహితకర్మములు లేకుండుట. 3. దుష్కార్యము, పాపకార్యము.

**అకల్క** నం. వి. అ. స్త్రీ - మాలిన్యము లేనిది- వెన్నెల,

**అకల్యము** నం. విశ. (అ. ఆ. అ.) 1. అస్వస్థము, రోగముగలది.2. సత్యమయినది.

**అకస్మాత్తు** నం. అవ్య. ఉన్నట్టుండి, తటాలున.

**అకాండపాతము** నం. వి. అ. పుం. ఆకస్మికముగా సంభవించుట.

**అకాండము** నం. విశ. (అ. ఆ. అ.) 1. సమయోచితము కానిది. 2. ఉన్నట్టుండి కలిగినది, ఆకస్మికము. 3. కాండములేనిది.

**అకామము** నం. విశ. (అ. ఆ. అ.) 1. కోరిక లేనిది. 2. వలపు లేనిది, మన్మథవికారము లేనిది. 3. బుద్ధిపూర్వకముగానిది.

**అకాయుఁడు** నం. విశ. (అ. ఆ. అ.) శరీరము లేనివాఁడు. వి. అ. పుం. 1. రాహువు. 2. పరమాత్మ. 3. అనంగుఁడు, మన్మథుఁడు.

**అకారణము** నం. విశ. (అ. ఆ. అ.) కారణము లేనిది, తనంతటనే కలిగినది. వి. అ. న. కారణములేమి. క్రి. విశ. కారణము లేక, వ్యర్థముగా.

ఉ... అకారణంబ మది నెవ్వగ లేటికిఁ బట్టు కొల్పెదన్. భార. ఉద్యో. 2. 240.

**అకారతుగా** క్రి. విశ. క్రియ. (నం. అకారణాత్. క. అకారణ్.) అకారణముగా, హేతువు లేకుండఁగ. (శ.ర.)

(వ్యవ) వాఁడు నన్ను అకారతుగా తిట్టినాఁడు.

**అకార్యకరణము** నం. వి. అ. న. 1. చేయఁ దగని పని చేయుట, నిషిద్ధకార్యము చేయుట. 2. చేయఁదగినపని చేయకుండుట.

**అకార్యకారి** నం. విశ. (న్. ణీ, న్.) 1. చెడు పని చేయువాఁడు. 2. విహితకృత్యము మానువాఁడు. 3. కార్యకారికానిది, పని చేయనిది.

**అకార్యము** నం. విశ, (అ. ఆ. అ.) చేయఁదగనిది, అయుక్తము. వి. అ. న, చెడ్డపని, నిషిద్ధకార్యము.

**అకాలము** నం. విశ. (అ. ఆ. అ.) 1. కాలములేనిది. 2. నలుపు కానిది, తెల్లనిది. వి. అ. పుం. అయుక్తకాలము, అనర్హకాలము.

ఉదా: అకాలమృత్యువు. అకాలభోజనము.

**అకాలసహము** నం. విశ. (అ. ఆ. అ.) 1. కాలవిలంబము సహింపనిది. 2. చిరకాలము (ముట్టడి మొదలగువానికి) ఆఁగ లేనిది. (దుర్గము, మొ.)

**అకించనత** నం. వి. అ. స్త్రీ. 1. దారిద్ర్యము. 2. సర్వద్రవ్యమును పరిత్యజించుట. (ఇది సన్న్యాసమునకు అంగమగు యమవిశేషము.)

**అకించనిమ(మము)** నం. వి. న్. పుం. అకించనత, దారిద్ర్యము.

**అకించనుఁడు** నం, విశ. (అ. ఆ. అ.) - కొంచెమైనను లేనివాఁడు-నిఱుపేద.

**అకించిజ్ఞుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) కొంచెమైనను తెలియనివాఁడు, జ్ఞానశూన్యుఁడు.

**అకించిత్కరము** సం. విణ. (అ. ఈ. అ.) - కొంచెమైనను చేయనిది-పనికిమాలినది.

**అకీర్తి** సం. విణ. (ఇ) కీర్తి లేనివాఁడు. వి. ఇ. స్త్రీ. అపకీర్తి.

**అకుంఠము** సం. విణ. (అ. ఆ. అ.) 1. మొక్కవోనిది, వాఁడియైనది. 2. అడ్డులేనిది, ప్రతిబంధము లేనిది. 3. స్థిరము.

**అకుంఠితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. మొక్కవోనిది, వాఁడియయినది. 2. ప్రతిబంధము లేనిది, అడ్డు లేనిది. 3. చెడఁగొట్టఁబడనిది.

**అకుతోభయుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) - దేనివలనను భయము లేనివాఁడు-నిర్భయుఁడు.

**అకుప్యము** సం. వి. అ. న. - కుప్యముకానిది-1. బంగారు. 2. వెండి.

**అకూపారము** సం. విణ. (అ. ఆ. అ.) మేర లేనిది. వి. అ. పుం. 1. సముద్రము. 2. ఆదికూర్మము.

**అకూపారుఁడు** సం. వి. అ. పుం. సూర్యుఁడు.

**అకూపారము** సం—అకూపారము.

**అకృతబుద్ధి** సం. విణ. (ఇ.)—శిక్షితము కానిబుద్ధి కలవాఁడు—మూర్ఖుఁడు. వి. ఇ. స్త్రీ. అశిక్షితమగుబుద్ధి.

**అకృతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. చేయఁబడనిది. 2. తప్పుగాఁ జేయఁబడినది. 3. సిద్ధము చేయఁబడనిది, ఆయితము కానిది (అన్నము, మొ.) 4. సృజింపఁ బడనిది. 5. అశిక్షితము. (ఉదా: అకృతాస్త్రుఁడు, మొ.) వి. అ. న. 1. చేయకుండుట. 2. చేయఁబడని కార్యము.

**అకృతాత్ముఁడు** సం. విణ. (న్. న్. అ. న్.) 1. అశిక్షితబుద్ధికలవాఁడు, మూర్ఖుఁడు. 2. బ్రహ్మానుసంధానము లేనివాఁడు.

**అకృతాస్త్రుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)—అస్త్రము లభ్యసించని వాఁడు — విలువిద్యయందు అరితేఱనివాఁడు.

క....అకృతాస్త్రుఁడ బాలుఁడ. భార. విరా. 4. 53.

**అకృత్యము** సం. విణ. (అ. ఆ. అ.) చేయరానిది. వి. అ. న. తగనిపని, నిషిద్ధకార్యము.

**అకృష్టపచ్యము** సం. విణ. (అ. ఆ. అ.) దున్నని భూమియందు పండునది, దున్నకయే పండునది (నివ్వరి, మొ.)

**అకృష్టము** సం. విణ. (అ. ఆ. అ.) 1. దున్నఁబడనిది. 2. లాగఁబడనిది.

**అకృష్టరోహి** సం. విణ. (న్. ఈ. న్.)—అకృష్టపచ్యము.

**అకృష్టకర్ముఁడు** సం. విణ. (న్.న్.అ.న్.) పుణ్యకర్ముఁడు, మంచిపనులు చేయువాఁడు.

**అకేశుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) వెంట్రుకలు లేనివాఁడు.

**అకోటము** సం. వి. అ. పుం. పోఁకచెట్టు.

**అక్క**—అక. వి. (సం. అక్కా—అమ్మ. అర్కా—జ్యేష్ఠభగిని. ప్రా. క. అక్క. త. అక్కాళ్.)

1. స్త్రీ.

సీ. వండలేనక్కకు వగపులు బలుమెండు తేనేర నన్నకుఁ దిండి మెండు. వేము. 17.

(వ్యావ) వంటలక్క.

2. పూజ్యస్త్రీ.

వ. అంతఃపురదాసి యాదాసీవ్య గర్భంబైన వైదర్భితలం పెటింగి వేఱొక్క దెస చూపి యక్క యిటు గనుంగొనుము. నైష. 5. 127.

3. స్త్రీల పేర్లకు 'అమ్మ' అనుదానివలె చేర్పఁబడునది.

ఉదా: సీతక్క, రామక్క.

4. అప్ప, పెద్దతోఁబుట్టువు.

గీ. అపుడు కుంభకుఁ డెదురుగా నరుగుదెంచి, యక్కకును బావకును మ్రొక్కి.... నీలా. 3. 53.

5. వంటలక్క, వంటకత్తె. చూ. అక్కలవాడ.

6. బ.వ. దేవతాత్వమునుబొందిశుభకార్యారంభములయందుఁ గొందఱచేఁ బూజింపఁబడు పూజ్యస్త్రీలు. (వారు ఆఱుగురును అక్కచెల్లెండ్రులయి సుగుణములచే దేవతాత్వమును పొందిరని ప్రసిద్ధి.)

అవ్య. ఔరా. (ఆశ్చర్యమును దెలుపును.)

గీ. మెల్లనె కళావతీసతి మేలుకాంచి, ప్రక్క వేఱొక మగఁడున్న బాగుఁ దెలిసి, యక్క యిది యేమి చోద్యమో యనుచు మిట్టి, పడి కళావికయై యొండుకడకుఁ జేరి. శుక. 1. 223.

జ. అక్కలవాడ, అక్కవాడ.

**అక్క** సం. వి. ఆ. స్త్రీ. తల్లి.

**అక్కజపడు** అ. క్రి. (√అక్కజము) ఆశ్చర్య పడు, వింతపడు.

చ. గజపతి వచ్చె నంచు నొకగంధగజంబు గుఱించి యొక్కఁ డక్కజపడి పల్కినన్ ...నైష. 5. 133.

**అక్కజము** విశే. (సం. అక్షయః. ప్రా. అక్ఖఓ, పా. అక్ఖయో. క. అక్కజ.) 1. అధికము, హెచ్చైనది.

క. చక్కనగు మనిన రక్కసుఁ డక్కజముగఁ జెరఁగి యియ్యెయగు నిప్పుడునీ,యుక్కును బీరముఁ జూచెదఁ, జిక్కన నిలు మనుచుఁ గడువిజృంభించి వడిన్. భార. ఆది. 6.203.

సీ...సహస్రోత్తమబ్రాహ్మణకృత మైనబ్రహ్మరథము, నెక్కి బ్రాహ్మణులకు నక్కజం బగునవమానము సేసినదాన నాకు. భార. అర. 4.119.

2. శక్తికి మీఱినది, అశక్యము.

సీ....ఘోరబృంహితబృహద్ఘోషణముల, నివి ఘనబృందంబు లివి గజయూథంబు లని విచారింపంగ నక్కజంబు, లై లలితోత్తుంగ శైలకుంజంబులఁ ద్రిమ్మరుజలధరద్విరదతతుల. భార. అర. 3. 555.

మ...ఆతన్వంగి వేమాఱునుం, బ్రజ లెల్లం గావిను తింప విందుమొదలం బఱింద్ర యూహింప నక్కజ మీ విప్పుడు సంస్తుతింప నది సాక్షాత్కారముం బొందెడుఁన్. నైష. 2. 29.

3. ఆశ్చర్యకరము.

సీ...ఒక్కవనిత, కతమున నడురేయి గంధర్వు లతిరహస్య ప్రకారంబునఁ జంపి రదియు, నక్కజంబాయుధవ్యవహార మేమియు లేదు ...భార. విరా. 3. 88.

వి. ఆశ్చర్యము.

గీ...మృగేంద్ర, పోతకంబులు నాల్గ్రేవులును గదుపుఁ, గట్టుకొని కూడిమాడ నక్కజముఁ జెంది. పి. శకుం. 2. 49.

జ. అక్కజపడు.

**అక్కజుఁడు** విశే. (చూ. అక్కజము) అధికుఁడు; బలాధికుఁడు.

సీ....నాగాయుతసత్త్వ జరాసంధు నెక్కటి యోర్చినయక్కజుండు. భార. అర.1.102.

క. పరివిలయవేళ మేరువుఁ, బరిమార్చుటఁ జేసి మేరుపాతనుఁ డనఁగాఁ, బరఁగినగణనాయకుఁ డొకఁ, డరు దెవ్వరికైనఁ బొగడ నక్కజుఁడు శివా. శివ సా. 349.

**అక్కట**—అకట.

జ: అక్కటపడు.

**అక్కటకట**—అకట.

**అక్కటకటా**—అకట. నైష. 1. 108.

**అక్కటక్కట(టా)**—అకట.

**అక్కటపడు** అ. క్రి. (√అక్కట) సంతాపపడు.

ద్వి. అక్కటపడి తండ్రి యాత్మజుఁ జూచి, మిక్కుటంబుగఁ దొలిమేనిదుష్కర్మ, ఫల మిది మఱియొంటఁ బాయ దేథంగి, మల హరుసద్భక్తమహిమన కాని. పండితా. దీక్ష. 35 పొ.

**అక్కటా**—అకట. నైష. 2. 123.

**అక్కటిక** వి. కనికరము, దయ.

చ. ...న, న్నిట్టలమైనయక్కటిక నీవరకార్తుల కిచ్చి తక్కితిఁ. మార్క. 2. 127.

సీ. ఆదివరాహంబవై యారసాతలగత నైన నన్ను నక్కటికతోడ, నుద్ధరించితివి. ... భాగ. 4. 486.

జ. అక్కటికించు.

**అక్కటికము**—అక్కటిక.

ఉ. ...ఈ దురాత్మకుం, డక్కటికంబు లేక పతి నంతలు సేసినను గృపారతిం,దక్కకతండ్రి పాలదిగెధర్మజుఁడు...భార. కల్య.2.321.

సీ. అనపరాధులము మాయందు నక్కటికంబు
పాటింపుమయ్య కృపీటజన్మ. నైష. 7. 90.

**అక్కటికించు** అ. క్రి. (√అక్కటిక) కరుణించు, జాలిపడు.

ఉ. నీజనని...అడల నక్కటికింప విదేమి పుత్త్రికా. శ్రీరం. మా. 10. 73.

**అక్కడ** వి. (అ + కడ : అక్కడనుండి, అక్కడకు. మొ. వృత్తియందు ఔపవిభక్తికమగును. ఉదా : అక్కడివారు, అక్కడిది. మొ.) 1. ఆచోటు. 2. ఆవైపు.

**అక్కర** వి. (క. అక్కరే.) ఆంధ్రభాషలోని జాతి పద్యవిశేషము. (ఇది మధ్యాక్కర, మహాక్కర, మధురాక్కర, అంతరాక్కర, అల్పాక్కర అని యయిదువిధములు. అక్కరశబ్దము సంజ్ఞావాచకముగాన సంస్కృత పదముతో సమసించినది.)

క. ...మహామధ్యా, మధురాంతరాల్పపూర్వ, గ్రథితాక్కర లైదు దనరు గ్రంథములందున్. అప్ప. 4. 279.

**అక్కరము** వి. (సం. అక్షరం, ప్రా. అక్ఖరం, అక్ఖరో. క. అక్కర. త. అక్కరం.)

1. అచ్చరము, అకారాదివర్ణము, వ్రాయి.
2. అక్కర.

మధ్యా. కర మొప్ప నిప్పాట నాఱుగణములు మధ్యాక్కరంబు. కవిజనా. జాతి. 26.

**అక్కఱ** వి. (క. అక్కఱ, అక్కఱు, అక్కఱె- 1. లోపము. 2. ప్రేమ. త. అక్కఱై.)

1. కొఱఁత, లోటు.

క. ఱెక్కలకొనలం గలిగిన, యిక్కాంచన మానపడియెదే నృప నీకే, యక్కఱ దీనం దీఱెడు,నక్కట నీహారతేశ మద్ధికిఁబోలెన్. నైష. 1. 108.

2. ఇబ్బంది, కష్టము.

గీ. నీమహత్త్వంబు మునివర్ణనీయ మట్లు, గాన దివిజుల కైనయక్కఱ దొలంగఁ,జేయుము. హరి. పూ. 4. 124.

ద్వి. కావున నిప్పు డక్కఱ వాపికొనఁగ, నేవిధంబున వెర వేమియుఁ గాన, మెడపక వను విక్రయించి చెల్లింపు,కడఁబడుఁ గొంతైనఁ గొఱకుఋుణము. ద్వి. హరిశ్చ. ఉ. 208.

క. రక్కసులఁ దునిమి దాసుల, యక్కఱ దీఱుచు జనార్దనాహ్వాయమూర్తిన్.ఘటికా 1. 103.

3. ఆవశ్యకకార్యము, కావలసినపని ; ఆవశ్యకత, అవసరము.

గీ. చాల నక్కఱ యొదవినవేళ వచ్చి, పుచ్చుకొనియెదనుంచు నీవిచ్చువిత్త,ము.హరిశ్చ. 1. 205.

4. అపేక్ష, కోరిక.

గీ. మఱియుఁ గోరినవారియక్కఱలు తీర్చి. ఆము. 3. 53.

మ. ...నిన్ గ్రుచ్చి య,క్కఱ దీఱం బొరి నక్కనం గరము వీఁకం జేర్చ నీకిమ్మెయిన్, వఱదం ద్రోవఁగఁజేసెనే యకట దైవం బెందుఁ బొత్తున్ సుతా. భార. అర. 7. 342.

5. పూజ్యులయందలి అనురాగము.

(సారంగధరుఁడు కాళ్ళుచేతులువచ్చి యింటికి రాఁగా నతనిం జూచి తల్లి దండ్రులనుమాట.)

సీ. మానేరమి మనంబులో నుంప కిటు వచ్చి తక్కఱ గలయట్టి యనుఁగుఁబట్టి. సారంగ. 3. 264.

ఉ. ఇక్కరణిన్ సుహృజ్జనము లెంతయుఁగన్నులఁ గప్పుకొంచుఁ బే, రక్కఱఁ బూజసేయ...సారంగ. 3. 265.

6. స్నేహము, చెలిమి.

క. కాయమునకుఁ బ్రాణములకు, నేయక్కఱ యట్టిచెలిమి యానరునకుఁ బ,ద్మాయతలోచనునకు నే,నేయనువున మొఱఁగి యతనికిది యొఱఁగింతున్. చిత్ర భా. 5. 182.

(వ్యవ) ఆపండు నాకక్కఱలేదు. అక్కఱకు మాలినపని. వాఁడు అక్కఱకురాఁడు. అప్పు అక్కఱకు వచ్చునా! నీయక్కఱ తీఱినది.

ఐ. అక్కఱకత్తె. అక్కఱకాఁడు. అక్కఱగండఁడు. అక్కఱపడు. అక్కఱపాటు.

**అక్కఱకత్తె** విశే. (√అక్కఱ) అక్కఱ గలది. (స్త్రీ.)

**అక్కఱకాఁడు** విశే. √అక్కఱ (త. అక్కరైక్కారన్.) అక్కఱకలవాఁడు.

**అక్కఱగండఁడు** విశే. (√అక్కఱ) అక్కఱ దీర్చువాఁడు.

ద్వి. ...సెట్టికొడుకులు దన్ను,వారిక నడుజాము వచ్చివేఁడినను, గోరినధనములు కొండు కొండనుచు, నక్కఱగండఁడై యప్పటప్పటికి, వెక్కసంబున నూర్వేలు నప్పిచ్చి. ద్వి.హరిశ్చ. ఉ. 477.

**అక్కఱపడు** అ. క్రి. √అక్కఱ. (త. అక్కరైప్పడు.) ఆశపడు, కక్కుఱితిపడు.

చ...ని, న్నుఅవుగ నేను వేఁడుకొనయుక్తుఁడఁగాక మొఱంగి నన్ను న,క్కఱపడ నీవు వేఁడుటిది గర్జమె నిర్జితదైత్య చెప్పుమా. భార. అర. 7. 366.

క. కూటికి నక్కఱపడ యీ,లాటేశ్వరువీట లోపలన్...భి,క్షాటనమొనర్తు. దశకు.4.6.

2. ఇబ్బందిపడు, కష్టపడు.

చ. తెఱచిననోరితో నొదవు తీవ్రపు మృత్యువు కోఱ యీఁతగం, నఱుముటగాదె మాధవు నకప్రియ మిట్లొనరించు టింద్రుఁడుం,బఱిపఱిగాక పోఁగలఁడె బాహుమదంబున వాసుదేవు న,క్కఱపడఁజేసి రిట్టివిధిఁ గానరుగాక దురాత్ము లేమియున్. హరి. ఉ. 8. 7.

**అక్కఱపాటు** వి. √అక్కఱ (త. అక్కరైప్పాడు.)

1. లోపము, కొఱఁత.

(వేను) క. మఱియుఁ బ్రమాదాదులఁ జే,డు ఱఁగక పైపాటుకు లేక యొక్కటి శయ్యం, గఱచుకొని తనకు నేయ,క్కఱపాటును లేక కొంతకాలము గడపెన్. వేం. పంచ. 1. 415.

2. ఇబ్బంది, కష్టము.

ఉ. అక్కఱపాటు వచ్చుసమయంబునఁ జుట్టము లొక్క రొక్కరిన్, మక్కువ నుద్ధరించుటలు మైత్రికిఁ జూడఁగ యుక్తమేసుమీ. భా. శత. 3.

**అక్కలకర** వి. (సం. ఆకారకరభః. సాల, ని., ప్రా. అక్కారా. మరా. అక్కలకరా. హిం. అకరకరా. క. అక్కల, అక్కలకరే. త. అక్కిరాకరం, అక్కిరాకారం.) మూలికా విశేషము.

సీ. అన్నభేదియు వస యక్కలకర పంచలవణ చవ్యములు లోశము మణిసిల. హంస. 2.227.

(వ్యవ) అక్కలకఱ్ఱ.

**అక్కలవాడ** వి. (√అక్క) వంటలక్కలుండువీథి.

గీ. అంత మధ్యాహ్నసమయ మౌనపుడుగాని, వేడుకై యుండ దక్కలవాడ సొరఁగ. క్రీడా. 114.

**అక్కలి** వి. తరంగము, అల.

క. తగులువడి యపుడు వడిసెడి, గగనమణిరథంబు దోఁగలువడి నిలిచెన్, బొగరుమొగకడలియక్కలిఁ, దగిలి నిలువఁబడిన ఘనవితతియుంబోలెన్. కాశీ. 1.183, 2.98.

**అక్కలు** అ. క్రి. ముడుఁగు.

ఉ. ప్రక్కలు వంచు వంచి మునిపండ్లను బండ్లను రాచు రాచిలో,మ్మక్కలఁజేయుఁ జేసి తల యల్లనఁ గాళుల సందు సంది లో,చక్కికి నొక్కు నొక్కి యిరుచంబడ గుమ్మడిమూట గట్టి వీఁ,పెక్కి దువాళిచేసి చలి యిక్కడ నక్కడఁ బెట్టు వేకువన్. క్రీడా. 46.

జ. అక్కళించు.

**అక్కళించు** స. క్రి. √అక్కలు. (క. అక్కుళిసు, అక్కళిసు.) - పొట్ట, బొమ్మ - ముడుఁగఁజేయు, తగ్గించు.

సీ. ఐణేయమైన యొడ్డాణంబులవణిచే నక్కళించిన పొట్ట మక్కళించి. మనుచ. 1.59.

(వ్యవ) ఏదీ నీపొట్ట అక్కళింపుము చూచెదను.

**అక్కవాడ**—అక్కలవాడ.

గీ. దర్భపోటులఁ దిని లేనితఱుల మైత్రి,నంటి పిత్రుశేషము భుజించి యదియు నెడల, నక్కవాడల నఱకూళ్లు మెక్కి...ఆము. 6.69.

గీ. వార్చి వచ్చెద నటువోయి వనరుహాక్షి, యెచ్చటికి వార్వఁబోయెద రెఱుఁగఁజెప్పుఁ, డక్కవాడకు మేము బ్రాహ్మణుల మగుట. క్రీడా. 189.

**అక్కసము** వి. (క. అక్కస-ప్రేమ) 1. దయ, కనికరము.

సీ. ...అక్కటికం బన నక్కస మన, నిబ్బరిక మనఁ గనికరం బనంగను గారుణ్యసంజ్ఞలై మీఱుచుండు. ఆం భా. 1. 131.

2. ఆగ్రహము, కోపము.

గీ. ...అక్కస మెసంగి రావణుఁడు...

క. పడవాళ్లఁ బిలిచి...దురమున కేఁగుదేరవలెనని...బేరి వ్రేయఁగాఁ జేయుటయున్. అచ్చ. రా. యు. 200, 201.

**అక్కసి** విశే. (√అక్కసు) అక్కసు గలవాఁడు. (శ. ర.)

**అక్కసు**-అక్కస్సు. వి. ఆగ్రహము, కోపము. (శ. ర.)

జ. అక్కసి, అక్కసుకాఁడు.

***అక్కసుకాఁడు** విశే. అక్కసు కలవాఁడు, ఆగ్రహము కలవాఁడు (శ. ర.)*

**అక్కస్సు**-అక్కసు. (వ్యవ.)

**అక్కి** వి. చర్మరోగవిశేషము. (బ్రౌ.)

**అక్కిబిక్కిదండ** వి. బాలక్రీడావిశేషము. హంస. 3. 146.

**అక్కిలి**-అంకిలి². వి. కలఁత; విచారము.

ఉ. ఒక్కటి మున్ను వచ్చుటయు నున్నవి రామికి బెగ్గడిల్లుదు,న్మక్కువమన్కిపట్టునకు మాపున నన్నియువచ్చెనేని నే,నక్కిలి తేఱి తక్కుళల మారయ నుండుదు రేయి. మార్క. 8. 66.

జ. అక్కిలిపడు.

**అక్కిలిపడు** అ. క్రి. (√అక్కిలి) 1. కలఁతపడు.

ద్వి. అక్కిలిపడి తెప్పలల్ల మోదుచును. బస. పు. 7. 691.

2. పోవు, చెడు.

ద్వి. గ్రక్కునఁ బఱతెంచి కాళ్లపైఁ బడిన, వక్కిలిపడుచె నీయయగారితనము. పండితా. పురా. 101 పొ.

**అక్కు** వి. 1. ఱొమ్ము, వక్షము.

సీ. చెలువంపుఁ జలువరాపెజ్జఁ బండినవాని నక్కున సిరి నిడి చొక్కువాని. అచ్చ. రా. బాల. 62.

2. గుండె.

క. ...మౌనిపృథుహుంకార, మ్మక్కు పగలఁ జేయఁగ...దశా. 2. 38.

ద్వి. అక్కుమాలినభంగి నగ్రహారంబు, సక్కన మీకెట్లు సనఁజొర వచ్చు. బస. పు. 7. 181. (అక్కుమాలినభంగి — గుండెలు లేనట్లు; నిర్భయముగా.)

జ. అక్కుగొట్టు, అక్కుముల్లు.

**అక్కుగొట్టు** వి. (√అక్కు — చూ. కొట్టు). హృదయశల్యము.

సీ. అమరాదులకు వెల్ల నక్కుగొట్టైనకుజంభు భయంకరుఁ జంపి. ...మార్క. 7. 279.

(మనస్సునకు బాధ కలిగించువాఁడు అని భావము.)

***అక్కుపక్షి** వి. బక్కవానికి ఉపమానముగా గ్రహింపఁబడు నొకానొకపక్షి ?*

ఉదా : వాఁడు అక్కుపక్షివలె ఉన్నాఁడు.

**అక్కుముల్లు** వి. (√అక్కు—చూ. ముల్లు.) హృదయకంటకము, మనస్సునకుఁ గలుగు బాధ.

ద్వి ...వింశతిభుజుని..., నిఖలబంధులతోడ నెట్టన చంపి, తఖలలోకములకు నక్కుముల్లణఁగ. రం. రా. ఉ. 107 పొ 9 పం.

**అక్కుళ్లు** వి. బ. (క. తు. అక్కి-బియ్యము. త. అక్కమ్-ధాన్యము.) ఒక విధమగు వరిధాన్యము. (వీనిలోని భేదములు — సన్నక్కుళ్లు, తూర్పుక్కుళ్లు. మొ.)

**అక్తము** సం. విశే. (అ. ఆ. అ.) 1. పూయఁబడినది. (ఉదా : శోణితాక్తము, ఘృతాక్తము, తైలాక్తము. మొ.) 2. వ్యక్తము, స్పష్టమైనది. 3. వన్నె పెట్టఁబడినది. 4. వ్యాప్తము. 5. గతము. 6. పరిచ్ఛిన్నము, పరిమితము.

**అక్త్రిము** సం. వి. అ. న. కవచము. (వాచ.)

**అక్రమము** సం. విశే. (అ. ఆ. అ.) 1. క్రమము లేనిది. 2. పాదములు లేనిది. వి. అ. పుం. 1. క్రమముతప్పుట, గజిబిజి. 2. గమనము లేమి. 3. ఔచిత్యము లేమి, మర్యాద మీఱుట.

**అక్రాంత** సం. వి. అ. స్త్రీ. వాఁకుడు (వృ. వి.)

**అక్రియ** సం. వి. అ. స్త్రీ. 1. పనిలేకుండుట. 2. ముఖ్యకృత్యములు మానుట.

**అక్రియుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) 1. పని చేయనివాఁడు, సోమరి. 2. ముఖ్యకృత్యములు లేనివాఁడు. 3. విహితాచారములు అనుష్ఠింపనివాఁడు.

**అక్రూరుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) క్రూరుఁడు కానివాఁడు, సౌమ్యుఁడు. వి. అ. పుం. శ్రీకృష్ణుని చుట్టమగు నొకానొక యాదవుఁడు.

**అక్రోధనుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) కోపములేనివాఁడు.

క. ...అక్రోధనుఁడు కరం బధికుఁ డింద్రుడు తత్త్వవిధిజ్ఞుల్. భార. ఆది. 3. 146.

వి. అ. పుం. అయుతాయువుపుత్త్రుఁ డగునొక రాజు.

**అక్లిక** సం. వి. అ. స్త్రీ. నీలిమొక్క.

**అక్లిన్నవర్త్మము** సం. వి. న్. న. ఒకానొక నేత్రరోగము.

**అక్లిష్టము** సం. విణ. (అ. ఆ. అ.) 1. అలయిక చెందనిది. 2. చెడనిది. 3. అక్రమముగా సాధింపఁబడినది. 4. సుబోధము, క్లిష్టముకానిది (పదము, అన్వయము.)

**అక్షకము** సం. వి. అ. పుం. తినిశము, నెమ్మి (వృ.వి.)

**అక్షకూటము** సం. వి. అ. పుం. కంటిపాప, కనీనిక.

**అక్షగ్లహము** సం. వి. అ. పుం. జూదము.

**అక్షజము** సం. వి. అ. న. 1. ప్రత్యక్షజ్ఞానము. 2. వజ్రాయుధము. 3. వజ్రము.

**అక్షణము** సం. విణ. (అ. ఆ. అ.) 1. కాలోచితము కానిది. 2. తెఱపి లేనిది.

**అక్షత** సం. వి. అ. స్త్రీ. కర్కటశృంగి యను ఓషధి.

**అక్షతత్త్వము** సం. వి. అ. న. ద్యూతకళ.

**అక్షతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. నొప్పింపఁబడనిది, గాయపడనిది. 2. విఱువఁబడనిది. 3. పగులఁగొట్టఁబడనిది. 4. దంపఁబడనిది. వి. అ. పుం. 1. బియ్యము 2. యవధాన్యము. న. 1. ధాన్యము. 2. క్షయములేమి; శుభస్థితి.

**అక్షతయోని** సం. వి. ఇ. స్త్రీ. సంభోగ మెఱుఁగని స్త్రీ.

**అక్షత(ము)లు** (ఇది చరిత్రాదులలోనిది.) సం.వి. అ. పుం. బ. సేసఁబ్రాలు, అక్షింతలు. వసు. 1. 152. మనుచ. 5. 95.

**అక్షతుఁడు** సం. వి. అ. పుం. 1. శివుఁడు. 2. నపుంసకుఁడు.

**అక్షదర్శకుఁడు** సం. వి. అ. పుం. 1. న్యాయవిచారణకర్త. 2. జూదమందలిన్యాయాన్యాయములను పరిష్కరించువాఁడు.

**అక్షదృక్కు (దృశుఁడు).** సం. వి. శ్. పుం— అక్షదర్శకుఁడు.

**అక్షదేవి** సం. వి. న్. పుం. జూదరి.

**అక్షద్యువు** సం. వి. ఊ. పుం. జూదరి.

**అక్షద్యూతము** సం. వి. అ. న. జూదము.

**అక్షద్యూతికము** సం. వి. అ. న. జూదమునందలి జగడము.

**అక్షద్రుగ్ధుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) జూదమున మోసపోయినవాఁడు, జూదమున ఓడినవాఁడు.

**అక్షధరము** సం. వి. అ. పుం. 1. శాఖోట మను ముండ్లచెట్టు. 2. చక్రము.

**అక్షధరుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) అక్షము ధరించువాఁడు. వి. అ. పుం. విష్ణువు.

**అక్షధూర్తిలము** సం. వి. అ. పుం. బండియెద్దు.

**అక్షధూర్తుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) జూదరి.

**అక్షపటలము** సం. వి. అ. పుం. 1. న్యాయసభ. 2. వ్యవహారపత్రములుంచుకొట్టు. 3. అక్షిపటల మనునేత్రరోగము. కంటిపొర.

**అక్షపటలుఁడు** సం. వి. అ. పుం, న్యాయాధికారి.

**అక్షపాదుఁడు** సం. వి. అ. పుం-పాదమున కన్నుగలవాఁడు-గౌతముఁడు. (ఇతఁడు న్యాయశాస్త్రకర్త.)

**అక్షపీడ** సం. వి. అ. స్త్రీ. 1. ఇంద్రియములకుఁ గలుగుబాధ. 2. యవతిక్త అనుతీఁగ.

**అక్షమ** సం. వి. అ. స్త్రీ. 1. ఓర్వలేమి, ఈర్ష్య. 2. ఓర్పులేమి.

**అక్షమదము** సం. వి. అ. పుం. 1. ద్యూతవ్యసనము. 2. ఇంద్రియములమత్తత.

**అక్షమము** సం. విణ. (అ. ఆ. అ.) 1. శక్తిలేనిది, అశక్తము. 2. ఓర్పులేనిది.

**అక్షమాల** సం. వి. ఆ. స్త్రీ .1-అకారము మొదలు క్షకారము వఱకుఁ గలవర్ణములమాలిక; ఆ వర్ణములకు మాఱుగా స్ఫటికములు. మొ. గ్రుచ్చినమాల-తావళము. 2. అరుంధతి.

**అక్షము** సం. వి. అ. పుం. 1. ఇరుసు. 2. జ్యోతిశ్చక్రముయొక్క అక్షదండము. 3. బండి, రథము. 4. బండిచక్రము. 5. తుషము, ఊఁక. 6. తులాదండము. త్రాసుగడ. 7. (జ్యోతి) దక్షిణోత్తరధ్రువమధ్యప్రదేశము. 8. పాచిక, సారె. 9. రుద్రాక్షము (వృ.వి.) 10. పదునాఱుమాషములయెత్తు, కర్షము. 11. విభీతకము, తాండ్ర (వృ.వి.) (దీనివిత్తులు పాచికలుగా ఉపయోగింతురు.) 12. ఇంద్రాక్షము (వృ వి.). 13. సర్పము 14. జూదము. 15. వ్యవహారము; అభియోగము, వ్యాజ్యము. 16. కణఁతక్రింది భాగము. న. 1. ఇంద్రియము. 2. సౌవర్చలమనెడియుప్పు. 3. మైలుతుత్తము.

**అక్షయ** సం. వి. ఆ. స్త్రీ. అక్షయపుణ్యమును గలిగించునొకతిథి.

**అక్షయతృతీయ** సం. వి. ఆ. స్త్రీ. వైశాఖశుక్లతృతీయ.

**అక్షయము** సం. విణ. (అ. ఆ. అ.) 1. క్షయములేనిది, తఱుఁగనిది; నశింపనిది. 2. ఇల్లు లేనిది. వి. అ. పుం. పరమాత్మ.

**అక్షయ్యనవమి** సం. వి. ఈ. స్త్రీ. ఆశ్వయుజశుక్లనవమి.

**అక్షయ్యము** సం. విణ. (అ. ఆ. అ.) క్షయింపజేయుటకు శక్యము గానిది.

**అక్షయ్యోదకము** సం. వి. అ. న. శ్రాద్ధమున పిండదానమునకుఁ బిదప తేనెయును నువ్వులును గలిపి యిచ్చెడుజలము.

**అక్షరచణుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) అక్షరముల వ్రాఁతయందు నేర్పరి, వ్రాఁతకాఁడు.

**అక్షరచుంచువు** సం. విణ. (ఉ.) —అక్షరచణుఁడు.

**అక్షరచ్ఛందస్సు(దము)** సం. వి. స్. న. అక్షరగణములచే నేర్పడువృత్తములఁగూర్చి చెప్పెడి ఛందస్సు.

**అక్షరచ్యుతకము** సం. వి. అ. న. పదములో నొక యక్షరమును తీసివేయుటచే మిగిలినదానికి మఱియొక యర్థము స్ఫురింపఁజేయుచిత్రకవిత్వభేదము. (కరేణుశబ్దమందలి 'క' తీసివేయఁగా శేషించిన 'రేణు' శబ్దమువలన 'పరాగ' మను నర్థము స్ఫురించుచున్నది.

**అక్షరజనని** సం. వి. ఈ. స్త్రీ-అక్షరములను పుట్టించునది-లేఖని. (క) గంటము. (చ) కలము.

**అక్షరజీవకుఁడు** సం. విణ. (అ. ఇకా. అ.) వ్రాఁతవృత్తివలన జీవించువాఁడు.

**అక్షరజీవి** సం. విణ. (న్. నీ. న్.) —అక్షరజీవకుఁడు.

**అక్షరజీవికుఁడు** సం—అక్షరజీవకుఁడు.

**అక్షరతూలిక** సం. వి. ఆ. స్త్రీ—చిత్తరువు వ్రాయుటకు తూలికవలెనే అక్షరములు వ్రాయుటకుపయోగించునది—లేఖని, కలము.

**అక్షరన్యాసము** సం. వి. అ. పుం. 1. లిపి. 2. వ్రాయుట. 3. వ్రాయఁబడినపత్రిక. 4. వర్ణసముదాయము. 5. తంత్రశాస్త్రప్రకారము అక్షరము లుచ్చరించుచు హృదయాదిస్థానములు స్పృశించుట.

**అక్షరభూమిక** సం. వి. ఆ. స్త్రీ. వ్రాయుట కుపయోగించుపలక.

**అక్షరము** సం. విణ. (అ. ఆ. అ.) 1. నశింపనిది. (జీవాత్మ, పరమాత్మ.) 2. స్థిరమైనది, మాఱనిది. వి. అ. పుం. ఖడ్గము. న. 1. అకారాదివర్ణము. 2. ఓంకారము. 3. పరబ్రహ్మము. 4. తపస్సు. 5. యజ్ఞము. 6. జలము, 7. ఆకాశము. 8. మోక్షము. 9. ఒకకాలమానము. (కాష్ఠలో అయిదవపాలు)

**అక్షరముఖుఁడు** సం. విణ, (అ. ఆ, ఈ. అ. మా, అభిముఖుఁడు.) 1. అక్షరాస్యుఁడు, అక్షరములు వచ్చినవాఁడు. 2. శాస్త్రములు వచ్చినవాఁడు.

**అక్షరముష్టిక** సం. వి. అ. స్త్రీ. వ్రేళ్ల సంజ్ఞలచేత మాటాడుట.

**అక్షరవిన్యాసము** సం—అక్షర న్యాసము.

**అక్షరార్థము** సం. వి. అ. పుం. శబ్దార్థము. (వ్యతి. తాత్పర్యార్థము)

**అక్షరాస్యుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) — అక్షర ముఖుఁడు.

**అక్షరి** సం. వి. ఈ. స్త్రీ. వర్షాకాలము.

**అక్షర్యము** సం. విశ. (అ. ఆ. అ.) 1. అక్షరముల నుండి పుట్టునది. 2. అక్షరములయందుండునది.

**అక్షవతి** సం. వి. ఈ. స్త్రీ. జూదము, పాచికలాట.

**అక్షవాటము** సం. వి. అ పుం. జూద మాడుచోటు. 2. నెత్తపలక. 3. జెట్లు పట్లుపట్టుచోటు, మల్ల భూమి.

**అక్షవాముఁడు** సం. వి. అ. పుం. జూదమున అన్యాయముగా ప్రవర్తించువాఁడు.

**అక్షవిద్య** సం. వి. అ. స్త్రీ. ద్యూతకళ.

**అక్షవృత్తము** సం. విశ. (అ. ఆ. అ.) 1. జూదమున ఆసక్తికలది. 2. జూదమున జరిగినది.

**అక్షశౌండుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) జూదమందు నేర్పరి.

**అక్షసూత్రము** సం. వి. అ. న. జపమాల.

**అక్షహృదయము** సం. వి. అ. న. 1. ద్యూత రహస్యము, జూదమందలిగుట్టు. 2. అధిక సంఖ్యాకములగు వస్తువులనైనను లెక్కింపకయే చూచిన మాత్రమున మొత్తము చెప్పఁ గలశక్తి నిచ్చువిద్య.

క. ఇది యక్షహృదయ మనఁగా, విదితం బగు విద్య ...భార. అర. 2. 175.

**అక్షాంతి** సం.వి.ఇ.స్త్రీ. 1. ఓర్వలేనితనము, ఈర్ష్య. 2. ఓర్పులేమి.

**అక్షారలవణము** సం. వి. అ. న. 1—చవుటిమట్టిచే కలుగు కృత్రిమపుటుప్పు కానిది-స్వభావసిద్ధమైన యుప్పు. (సైంధవలవణము, మొ.) 2. ఆవుపాలు, ఆవునెయ్యి, బియ్యము, మొ. కొన్ని పదార్థములవర్గము. (గోక్షీరం గోఘృతం చైవ ధాన్యముద్గా స్తిలా యవాః, సాముద్రం సైంధవం చైవ అక్షార లవణం స్మృతం.)

**అక్షావపనము** సం. వి. అ. న. నెత్తపలక, పాచిక లాడెడుపలక.

**అక్షావాపుఁడు** సం. వి. అ. పుం-పాచికలు వేయువాఁడు — జూదరి.

**అక్షి** సం. వి. ఇ. న. 1. కన్ను. (అవ్యయీభావము లోను బహువ్రీహిలోను ఉత్తరపదమైనప్పుడు అకారాంత మగును. ఉదా: సమక్షము. జల జాక్షుఁడు-స్త్రీ లింగమున 'జలజాక్షి'.) 2. రెండనుసంఖ్య.

**అక్షింతలు** వి. బ. (సం. అక్షతాః. 'అక్షతలు' అనుపదమునుండి వచ్చిన రూపము.) పూజించునప్పుడును ఆశీర్వదించునప్పుడును ఉపయోగించు బియ్యము; బొట్టుగా నుపయోగించు బియ్యము; తిలకమున కుపయోగించు కుంకుమ, మొ. ద్రవ్యము.

మ. పరదేశంబు విభుండు చన్న పిదపన్ ప్రాణేశురాకన్ నిరంతరమున్ గోరుచు మేను మాసి చెవుల స్రుక్కా కులున్ జేతు లన్, సొరిదిం గాజులు నల్లపూస లయుతన్ జూపట్టుచుండంగ నుందరి యక్షింతల బొట్టునుం బసుపు మోదం బొప్పఁ దాల్పం దగున్. రుక్మాం. 4.89.

**అక్షికంపము** సం. వి. అ. పుం. ఱెప్పపాటు.

**అక్షికము** సం. వి. అ. పుం. రంజనద్రుమము (వృ.వి.)

**అక్షికూటకము** సం. వి. అ. న. నేత్రగోళము, కనుగ్రుడ్డు.

**అక్షిగతుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) 1. కంటిలో మెర మెరలాడువాఁడు-ద్వేషింపఁదగినవాఁడు. 2. కంటిని పొందినవాఁడు — గోచరుఁడు, కనఁబడువాఁడు.

**అక్షిగోళము** సం. వి. అ. పుం. కనుగ్రుడ్డు.

**అక్షిజాహము** సం. వి. అ. పుం. నేత్రమూలము, కంటికొలికి.

**అక్షిపటలము** సం. వి. అ. న. కంటిపొర.

**అక్షిభేషజము** సం. వి. అ. న. 1. కాటుక, కంటి మందు. 2. ఎఱ్ఱలొద్దుగు, పట్టికాలోధ్రము (వృ.వి.) (ఇది నేత్రరోగములకు మందు)

**అక్షిభ్రువము** సం. వి. అ. న. కన్నులును కనుబొమ్మలును. (సమాహారద్వంద్వము.)

**అక్షివికూణితము** సం. వి. అ. న. — లజ్జాదులచే కొంచెము సంకుచితమైన కంటిచూపు—కడగంటి చూపు,కటాక్షదృష్టి, క్రేగంటిచూపు.

**అక్షీకము** సం. అక్షికము.

**అక్షీణము** సం. విశ. (అ. ఆ. అ.) మత్తులేనిది, మత్తిల్లనిది. వి.అ.పుం. శోభాంజనము, మునగ (వృ.వి.) న. సముద్రలవణము.

**అక్షీవము** సం—అక్షీబము.

**అక్షుఁడు** సం. వి. అ. పుం. 1. గరుడుఁడు. 2. రావణునికొడుకులలోనొకఁడు. 3. ఆత్మ. 4. ఆత్మజ్ఞాని.

**అక్షేత్రము** సం. విశ. (అ. ఆ .అ.) చేలు లేనిది. వి. అ. న. 1. పండనిపొలము,ఊషరక్షేత్రము. 2. (క్షేత్రగ) అనుపపన్న క్షేత్రము.

శ్లో. ధృష్టోద్దిష్ట మృజుభుజం క్షేత్రం యత్రైకబాహుత స్స్వల్పా,తదితరభుజయుతి రథ వా తుల్యా జ్ఞేయం తదక్షేత్రం (లీలావతి. క్షేత్రవ్యవహారము.)

**అక్షోటము** సం. వి. అ. పుం. కొండగోఁగు (వృ.వి.)

**అక్షోడము** సం— అక్షోటము.

**అక్షోభము** సం. విశ. (అ. ఆ. అ.) కలఁత లేనిది. వి. అ. పుం. 1, ఏనుఁగుమ కట్టు కంబము, ఆలానము. 2. కలఁతలేమి.

**అక్షోహిణి** సం—అక్షౌహిణి.

క. బాహుబలఘనుఁడు భీముఁడు, సాహసరసికాత్ముఁడయిన సాత్యకియు మహో, గ్రాహవభూమి సహస్రా,క్షోహిణు లట్లగుట మీరు మూడరె యెందుఁ. భార. ఉద్యో. 1. 286.

(దీనికి ప్రయోగముక్వాచిత్కముగా నున్నది.)

**అక్షౌహిణి** సం. వి. ఈ. స్త్రీ. సేనావిశేషము. (21870 రథములును, అన్నియే గజములును, 65610 అశ్వములును, 109350 పదాతులును గలిగినసేన.)

**అఖండద్వాదశి.** సం. వి. ఈ. స్త్రీ. మార్గశీర్ష శుక్లపక్షద్వాదశి.

**అఖండము** సం. విశ. (అ. ఆ. అ.) సంపూర్ణము, నిండైనది.

**అఖండితము** సం. విశ. (అ. ఆ. అ., 1. విభజింపఁబడనిది. 2. అవిచ్ఛిన్నమైనది, ఎడతెగనిది. 3. అకుంఠితము; తక్కువ పఱుపఁబడనిది. (పౌరుషము, మొ.) 4. ఖండింపఁబడనిది. (వాదము, మొ.)

**అఖట్టము** సం. వి. అ. పుం. ప్రియాలము, మోరటి (వృ.వి.)

**అఖర్వము** సం. విశ. (అ. ఆ. అ.) 1. పొట్టిది గానిది. 2. అల్పము కానిది, అధికము.

**అఖాతము** సం. విశ. (అ. ఆ. అ.) త్రవ్వఁబడనిది. వి. అ. న. మనుష్యులచేత త్రవ్వఁబడని సముద్రాదికము, దేవఖాతము.

**అఖిలము** సం. విశ. (అ· ఆ. అ.) 1. సమస్తము. 2. దున్నఁబడినది. (నేల)

**అఖ్యాతి**[1] సం. వి. ఇ. స్త్రీ· అపకీర్తి.

**అఖ్యాతి**[2] భ్రమవిషయమున మీమాంస మతము (ఈమతమున 'ఇదం రజతం' అను భ్రమస్థలమున ఇదంపదార్థ మగుశుక్తికి ప్రత్యక్షము రజతమునకు స్మృతి అని జ్ఞానద్వయమును ఈ జ్ఞానద్వయమునకు భేదాగ్రహమును అటులే తద్విషయములకు భేదాగ్రహమును అంగీకరింపఁబడినవి· మఱియును రజతార్థికి ఇదం పదార్థమందు ప్రవృత్తి ఇదంపదార్థరజతములకు భేదాగ్రహము ఇదంపదార్థ ప్రత్యక్షము రజతస్మృతి అనుకారణ త్రయమువలన కలుగును అని సమర్థింపఁబడినది)

**అగంత్రపాటు** వి. ఒకానొక మొక్క (గ్రా.)

**అగచరము** సం. వి. అ. పుం. చెట్టుఁ ద్రిమ్మరి, కోఁతి.

**అగచాటు** వి. ఆపద. కష్టము

గీ···అగచాటు కా మనఁ బరఁగుఁ గష్టము...ఆం. భా. 1. 150.

**అగచాటులు(ట్లు)** వి. (క. అగచాట్లు,అగచాటులు. అగచు–నొక్కు) కష్టములు, ఆపదలు, కడగండ్లు.

ఉ. ఓయగజాత ! యేమిటి కయో యగచాటులు చెందుకార్యముల్. పార్వ. 4. 154.

వ. దైవమా ! ఇటువంటియగచాట్లు పగవారికైనఁ దగవునుమీ యని కన్నీరు నించువారును... ఉ. రా. 6.348.

జ. అగచాట్లపోతు, అగచాట్లమారి.

**అగచాట్లపోతు.** విశ. (√అగచాట్లు)-కష్టములు కలిగించుస్వభావము కలవాఁడు-దుష్టుడు.

సీ....మొప్పెగోవు పోలెవాఁ డగచాట్లపోతు దుర్మార్గుండు...హంస. 5. 113.

**అగచాట్లమారి**—అగచాట్లపోతు.

'కష్టాత్ముఁడు' అని ఆం. భా. 3. 14.

**అగజము** నం. విశ. (అ. ఆ. అ.) 1. పర్వతము నుండి పుట్టినది. 2. పర్వతమందు పుట్టినది. 3. చెట్టునుండి పుట్టినది. వి. అ. న. సిలాజిత్తు.

**అగజాత** నం. వి. అ. స్త్రీ. 1. పార్వతి. 2. గిరిక. (వసురాజు భార్య)

**అగడత**— అగడ్త, అగడిత. వి. (నం. ఆఖాతః. ప్రా. ఆహోడ,ఆహోత. క. అగడ, అగడు, అగడత, అగడ్తె. అగడు– త్రవ్వు. త. అగళి. తు. అగర్, అగళ్.) 1. పరిఖ, కందకము.

వ. అగడతం బడి మునింగి దరిఁజేరి...రా. వి. 5. 32.

2. బురదగుంట.

క. నక్కలు బొక్కలు వెదకును,నక్కఱతోనూరఁబంది యగడత వెదకుఁ.నూరినచాటువు.

**అగడాడు** అ. క్రి. (√అగడు) ప్రేలు, వదరు. (విరహిణి చేసెడియుపాలంభము.)

చ. అల జలజారి వైరి యగడాడెడుచిల్కయనఁ బజాతి బల్,తులువ చకోరి... చంద్రా. 4. 183.

**అగడిత**—అగడత.

(పరిఖ, కందకము)

ద్వి. వడిఁ ద్రొచ్చి యట్టట్ల వడిఁ గూలఁదన్ని, యదరి కోటలఁ ద్రొక్కి యగడిత లూన్చి. రం. రా. యు.281. పొ. 31. పం.

**అగడు**—అవడు. వి. (క. అగడు—కొంటెతనము, నీచత్వము. త. అగడు—దౌష్ట్యము.) నింద, అవ్వ.

సీ. దానికే ల్వసులఁక్కిఁ బూనఁజేయనిట్టి తమ్ములఁ బంకాప్తిఁ దార్చునగడు. వసు. 1. 107.

విశ. 1. హీనము, నీచము, నింద్యము.

అ...అగడుమనికిఁ దలఁచి. ప్రబంధ. 743.

2. బెదరినది, చెదరినది.

లయగ్రా...కా,శ్మీరకృత సేతువులదారిఁ జనుచో నచటఁ గూరుకలహంస లగడై రొదలు సేయఁ. వసు. 2.22, ఉ. హరిశ్చ. 3.67.

జ. అగడాడు, అగడుఁగాకి, అగడుచేయు, అగడుపడు, అగడుపఱుచు.

**అగడుఁగాకి** విశ. (√అగడు)అల్లరి చేయువాఁడు.

గీ. ...అగడీలు మహాధూర్తు లగడుఁగాకు,లుద్ధతులు గొంట్లు పలుగాకులు...గయ్యాళు లగుచు...హరి. 5. 10.

**అగడుచేయు** స. క్రి. (√అగడు) 1. నిందించు.

వ...వేదంబు ప్రమాణంబు గాదనియును నాగమంబుల నగడుసేసియు ధర్మంబులమర్త్యంబు లుచ్చిపోనాడియు. నైష. 7. 88.

2. రట్టుచేయు, అల్లరిచేయు.

సీ. అపకీర్తి వచ్చిన నడఁపక యింటివారిగడు చేయుట దోస మనెడువారు. శుక. 4. 46.

గీ. ఏ లగడుసేసెదరె ముద్దరాలి ననుచుఁ బలికె రుక్మిణి...విజ. వి. 3. 28.

3. చిన్నపుచ్చు, తక్కువపఱచు.

చ. చెలియలలోన నన్నగడుసేసెదవే రఘురామ యంచుఁ జెంగలువ వధూటి భర్తయెదఁ గ్రమ్మఁగ వైచిన...ఉ. రా. 6. 104.

(చీఁకటి వర్ణనము.)

సీ. ఋభుగణ ప్రభుమణిఘృణుల మల్లసమాడి హాళికటీపటలీల నగడుచేసి. పె. శకుం. 2. 182.

**అగడుపడు**(ద్పడు) అ. క్రి. (√అగడు) 1. నింద
గీ. గుట్టు నానయు విడనాడి కొంగుపట్టిచి, యగడుపడి పడిచి పడసినట్టిపసిండి, కటకటా యేమిటికి వెక్కి గడనవంక, నేమి గంటిని దొడుసు నా కేల యనుచు. విప్ర. 5. 17.

2. క్షోభపడు, కలత నొందు.

క. బెగడ వల దనుచు బెట్టిద,మగువెవ్వగ నగడు పడుచు నాఁడుపడుచు లే,పగవారికి వల దన నా,పగవారికి నేల యొసఁగెఁ బద్మజుఁ డనుచున్. వసు. 6. 62.

చ. గడితపు టెక్కు గాడ్పుల జగంబు అగడ్పడి తాఱుమాఱుగా ..అచ్చ. రా.యు. 162.

**అగడుపఱుచు** స. క్రి. (√అగడుపడు)—అగడు చేయు.

(నలఁగఁజేయు, పీడించు.)

సీ. అంటినఁ గందుపూవంటినీనునుమేను మగువ యేదుర్జాతి యగడుపఱిచె.ఉ.రా. 4. 227.

**అగడ్త**—అగడత.

(పరిఖ, కందకము)

సా: అగడ్తలోఁబడ్డ పిల్లికి అదే వైకుంఠము. గచ్చకాయలకుఁ గొన్నగుల్లము అగడ్తదాఁటునా?

**అగణ్యము** సం. విణ. (అ. ఆ. అ.) 1. లెక్కింప శక్యము గానిది; అమితము. 2. ఎన్నఁదగనిది, లెక్క సేయఁ దగనిది.

**అగతి** సం. విణ. (ఇ.)—అగతికము. వి. ఇ. స్త్రీ. -గతిలేమి- 1. ఉపాయములేమి. 2. దిక్కులేమి, ఆధారములేమి. 3. గమనములేమి.

**అగతికము** సం. విణ. (అ. ఆ. అ.) గతిలేనిది— 1. దిక్కుమాలినది ఆధారములేనిది. 2. ఉపాయాంతరము లేనియప్పుడు చేయఁదగినది
శ్లో...దండస్త్వగతికా గతిః. యాజ్ఞ. 1.346.
3. గమనములేనిది.

**అగత్యము** విణ. (సం. అగతికమ్ ప్రా. అగతిఅం. క.తు. అగత్యత. అగత్తియం.) ఆవశ్యకము, అనివార్యము, తప్పనిది.
ఉదా: నే నగత్యమైనపనిమీఁద వెళ్లినాను.
నేను అగత్యముగా వెళ్లవలసివచ్చినది.
వి. ఆవశ్యకత.
ఉదా: ఆనష్టము పెట్టుకొనుటకు నా కగత్యము లేదు.
(ఇది వాడుకభాషలోనే కాన్పించుచున్నది.)

**అగదంకారుఁడు** సం. వి. అ. పుం - ఆరోగ్యవంతునిగాఁ జేయువాఁడు – వైద్యుఁడు.

**అగదము** సం. విణ. (అ. ఆ. అ.) 1. తెవులు లేనిది; ఆరోగ్యము కలది .2. భాషింపనిది, పలుకనిది. వి. అ. పుం. 1. మందు,ఔషధము. 2. ఆరోగ్యము. 3. ఆయుర్వేదమున విషాదులవిఱుగుడును దెలుపు భాగము.

**అగప** వి. (క. అగపె. అగె–త్రవ్వు. త. అగప్పై.)
1. పెద్దతెడ్డు, అబక, కొయ్యగరిఁటె.
చ...నారికడవుంబోఁటియల్ దవిలించి వండన, యయ్యగపల ముంచి పెట్టుఁ గలమాన్నము... ఆము. 1. 80. ఆం. భా. 2. 244.

**అగపడు** అ. క్రి. √అగ్గము. (త. అగప్పడు.) 1. వశమగు, లోఁబడు, చిక్కు.
క. శోకక్రమతృష్ణలకున్, నీకలిమియ మూలమగుట నీ కగపడువాఁ, డేకర్తవ్యము గానం, డోకామము నిన్నుఁ దొఱఁగి యుండెద సుఖనై. భార. శాం. 3. 73.
ఆ...అతఁడు సకల,భూతకోటివలనఁబొందఁడు భయమురా,గాదిదుఃఖములకు నగపడండు. భార. అశ్వ. 1. 210.
2. లభించు, దొరకు, ప్రాప్తించు, సిద్ధించు.
క. తగు సంతసింపఁ గుజనుల, కగపడనివిశిష్టగతికి నస్మద్దివ్యా,శుగములచేఁ బోఁగనుటకు.... భార. ద్రో. 1. 237.
క. అనవుడు ననిమిషపతి యే, యనువున నీశాంతి నీకు నగపడియె మహా,జనపూజ్య చెప్పవే ...భార. శాం. 4. 382.
3. తెలియు, ఎఱుకపడు.
(జారపొందు) సీ. బంధుల కగపడ్డఁ బాయు నన్వయ మనుకలఁక మైఁ జెమటలు గ్రమ్మదేర. భార. విరా. 2.70.
ద్వి. తగువారిఁబనిచి యాతని నడిగింపు, మగపడుఁ దద్వృత్తం బంతయు నపుడు. ద్వి. తి. సా. 2.27 పా.

4. గోచరమగు, కనఁబడు.

సీ. కరశాఖనాసికాగ్రమ్ముపై నిడి చూడ గ్రహ తారకలు రెండుగా నగపడె. భాగ. 10.పూ. 1299.

5 సంభవించు, కలుగు

క...మగువా బెగడంగనేల మాయన్నకు శేఁ టగపడియె నేని జేజేల్, ముగురును గడ తేని గోరములపా ల్గారే. అచ్చ.రా.అర.47.

**అగపాటు** వి. (√అగపడు) అగపడుట.

(వశపడుట, లొంగుట. చిక్కుట.)

వ. అధర్మం బైన నూరుభంగంబు సేయుమని కృష్ణానుమతి జిష్ణుండు వనిచె నాకు నొండు మెయి నెట్లునుం బగతునగపాటు లేక తక్క-నేనవ్విధం బాచరింతు. భాగ. శల్య. 2. 275.

క. నిగిడి కడు నలసి యట నొక, మృగయూథ ముఁ జొరఁగఁబోవు మెయిఁ దోడనె వెం, దగిలి యగపాటు గని యొఱ, పగువెరవున నిల్చి రాముఁ డయ్యేణంబున్. భా. రా. అర. 2. 58.

(ఎఱుకపడుట, తెలియుట)

క. మనశ స్త్రాస్త్రంబులు ద,క్కినయవి యొక భంగి వీటికిని గాండివము, గొనిపోయితి మేని సుయోధనునకు నగపాటు నిశ్చితం బూహింపన్. భార. విరా. 1. 158.

ద్వి. అగపాటు లేకుండ నడవికిఁ దీసి, పగ వారు చంపిరో పసిబాలు గోల. ద్వి. శ. సా. 2. 92 పా. 9 పం.

**అగమము** నం. విణ. (అ. ఆ. అ.) నడువ లేనిది. వి. అ. పుం. చెట్టు.

సీ...అగమకోటికిఁ బల్ల వాభివృద్ధి.వసు.3.134.

(పై రెండిటి కిదియే ఉదాహరణము)

**అగము** నం. విణ. (అ ఆ. అ.) నడువలేనిది, పోవ లేనిది. వి. అ. పుం. 1. వృక్షము. 2. కొండ 3. పాము 4. సప్తసంఖ్య.

**అగమ్యము** నం. విణ. (అ. ఆ. అ.) 1. నడువఁ దగనిది, పోవఁదగనిది (మార్గము మొ.) 2. పొందఁ దగనిది, చేర రానిది (పర్వతాది.) 3. సంగమింపఁ గూడనిది. (పంకజ్రాది. ఉదా: అగమ్యాగమన దోషము.) 4. తెలియ రానిది, గ్రహింపరానిది. (అర్థము, మొ.)

**అగరి** నం. వి. ఈ. స్త్రీ. 1. విషమును హరించు వస్తువు. 2. దేవతాళము (వృ.వి.). (ఇది మూషికవిషమును హరించును.)

**అగరు**—అగురు, అగలు[2], వి. (సం. అగరు,అగురు, ప్రా. అగరు, అగలు. పా. అగరు. క. అగళు, అగుళు,అగిలు.త. అగల్.తు. అగెల్,అగెల.) ఒకజాతిచెట్టు; అగరు కఱ్ఱనుండి తీసినపరిమళ ద్రవ్యము.

గీ. పంటకట్టెలకై తెచ్చి వాము లిడిన, యగరు మ్రాఁకులపై నిండ నాఁటఁబెట్టు, కప్పురంపు టనంటులు గలిగి మెఱయు. నెఱుకుబల్లియ లొకకొన్ని యెసఁగఁగాంచి యయా. 1. 47. ఆం. భా. 3. 162.

**అగరువు** నం. వి. ఉ. న. అగలు,చందనవిశేషము.

**అగలము** వి. (క. అగల. అగల్—విశాలమగు. తు. అగెల. త.అగల్వు, అగులున్, అగల్.) వైశా ల్యము వెడలుపు.

క. అప్పర్వతంబుయామ్యాగ, కుప్పునఁ బురి కామరూప కోటులయిరవౌ, ముప్పది నలు వది రెండును, నప్పురికిని యోజనంబు లగ లముఁ జాఁపున్. వరాహ. 10, 142.

**అగలించు**—అగల్చు.

(భేదించు)

ఉ...నామనసుపాఁ తగలించి వెలార్చినట్టియా, మాటలు మూఁడు నుంకువగ మానవ నాయక నీకు దక్కితిన్. విక్ర 8. 104

(పెల్లగించు)

ఉ...నామనసుపాఁ తగలించి...విక్ర 8. 104

**అగలు**[1]—అగులు. అ. క్రి. (క, త, అగలు,) 1. నగులు, భేదిల్లు,

గీ...అతనిమకుట, మతఁడు ఘనతోమరంబున నగలఁ జేయ. భార. ద్రోణ. 1. 353.

లయగ్రా. ...కోటతుదల న్నెగడుకొమ్మల్, మిన్నగల రాయ...మనుచ. 5. 80.

గీ. మాటిమాటికిఁ గ్రేఁగంట మఱ్ఱు మగలఁ, గలయఁ దిలకించునొక మచ్చెకంటిఁ గంటి. చంద్రా. 4. 99.

2. క్షీణమగు, చెడు.

చ. వినివినవంతలోనఁ దనవీనులు వ్రయ్యఁగ మేను దుర్విషం, బునఁ బరివీతమైన క్రియఁ బొల్పగలక... భా. రా. యు. 1387.

క. అని శ్రీపతి యానతియి,చ్చిన మందల విడిచె నతని సిద్ధవిభుఁడు వాఁ,డును గులగులలై లావగ, లినమై విదిలించుకొనుచు లేచెఁ గిదుకుచుఁ.. పాండు. 4. 297.

3. దుఃఖించు.

ద్వి. అగలక మునినాథునప్పన కొక్క, తెగ సేయవలయునో దేవి యొకైన. ద్వి.హరిశ్చ. ఉ. 16.

ద్వి. వగపు లన్నియుఁ బాయ వర మిచ్చె దైవ, మగల నేటికిఁ జావ నని తలపోసి. ద్వి. హరిశ్చ. ఉ. 2374.

జ. అగల్చు. అగలించు.

**అగలు²**—అగరు. వి. 1. పరిమళ ద్రవ్యము.

గీ. అగలు గంధర్వయక్షోరగాదులకుఁ బ్రియం బు ధూపదానమునెడ నధిపవర్య. భార. అను. 4. 12.

2. బొట్టుపెట్టుకొనుటకై నూకలు మున్నగునవి మాడ్చి పరిమళద్రవ్యములను జేర్చి చేయు పదార్థము. (వా. అగులు.)

**అగలుసత్తు** వి. (త. అగిల్‌సత్తు.) గంధద్రవ్య విశేషము.

**అగలుసొంటి** వి. పొత, చిఱుబొద్ది. (వృ.వి.)

**అగల్చు(లుచు)** స. క్రి. (√అగలు¹)

1. భేదించు, పగులఁగొట్టు.

మ. నిరతిశ భూమి నగల్చుచోటను మహానిర్ఘాతసంకాశని,ష్ఠుర భూరిధ్వని మ్రోయ... భా. రా. బాల. 414.

మ. ...ఇంద్రవదిబాణంబుల బొమ్మగల్చి...... ఉ.రా. 4. 302.

2. ఉన్మూలించు, పెల్లగించు, పెఱుకు.

సీ. ప్రేవులు గండలు పెఱికి పేటాడి యంగద గొని మెదళు లగల్చికొనుచు. భార. స్త్రీ. 2. 9.

**అగవుతగవులు** వి. బ. తగవులు, ఆఁడుబిడ్డమున్నగువారికి ఇచ్చు బహుమాన విశేషములు.

గీ. అట్టిద కదా వధూటుల కల్లుఁ డనుచు,నగవు తగవు లటంచు వెయ్యంబు లంచు, నంపకము లంచు మఱికొన్నియైనఁ గలవు. ...కువల. 3. 65.

గీ. అల్లుఁ డని యాఁడుబిడ్డని యగవుతగవు, లంపకము శుభశోభన మని యిల్లెల్ల. సంతసము చేయుఁ గన్యకాజనములకును. దశా. 9. 77.

**అగసాలి**—అగసాలె.

ద్వి. ఇచ్చుచో నెఱిఁగి కల్లచ్చులనూకి, యచ్చుల న్గొఅగొనునగసాలి యతఁడ. బస.పు. 4. 67.

గీ. ఊరఁ గల్గినయగసాలివారి నెల్ల, నింటి యొద్దకు నొండొరు నెఱుఁగకుండ, రేయిఁ బిలిపించి...వైజ. 4. 72. ఆం. భా. 2. 284.

**అగసాలె** వి. (క. అగసాల, అగసాలె. త. అక్కసాలై - బంగారుపనివానిదుకాణము.) స్వర్ణకారుఁడు, బంగారుపనివాఁడు.

వ. ...అవ్వీటిమేటిసాలె యగసాలె పటుసాలె వానె వైజాతి సాఁతు లేతులకొమిరెలు... ఆము. 4. 35.

**అగస్తి** సం. వి. ఇ. పుం. 1. అగస్త్యుఁడు. 2. ఆఋషి పేరినక్షత్రము. 3. అగిసె (వృ.వి.) స్త్రీ. అగస్త్యునివంశమునఁబుట్టి నస్త్రీ.

**అగస్త్యము** సం. వి. అ. పుం. అగిసె (వృ.వి.)

**అగస్త్యుఁడు** సం. వి. అ. పుం. 1. అగస్తి, ఒకానొకఋషి. 2. శివుఁడు.

**అగస్త్యోదయము** సం. వి. అ. పుం. అగస్త్యనక్షత్రముయొక్క ఉదయము. (ఇది భాద్రపదమాసాంతమున వగును,అప్పుడు జలములు తేఱును.)

**అగాదు** వి. (పిరంగి, మొ. వానిని ప్రేల్చుట వలనఁ బుట్టు) ధ్వని.

(వ్యవ) పిరంగి ప్రేల్చినపుడు పెద్ద అగాదు అయినది.

**అగాదుచేయు** స. క్రి. (పిరంగి. మొ. వానిని) ప్రేల్చు.

చ. ...గొప్పపిరంగిని జాయమందులోఁ, గొంత లెడువిమ్ము మానికపుగుండు ఘటించి యగాదుచేసినన్. రసిక. 4. 95.

**అగాధము** సం. విశ. (అ. ఆ. అ.) 1. మిక్కిలి లోఁతుగలది, అతిగంభీరము. 2. తెలియరానిది, దురవగాహము. వి. అ. పుం. న. లోఁతయిన బిలము.

**అగారము** సం. వి. అ. న. ఇల్లు.

**అగిని**—అగ్గి.

క. అగినిగణంబున కిరుదెస,నగణముతోఁ గూర్చి చెప్ప. ...కవిజనా. సం. 50.

ద్వి. దిగనిలభానువార్ధిపులు నశ్వినులు, నగిని యింద్రుఁ డుపేంద్రుఁ డమిత్రవరులు. ద్వి. సిం. భాగ. 2. (శ. ర.)

**అగిసియ(సె)** — అవిసియ. వి. (సం. అగస్త్యః. అగస్తిః) అతసి, అవిసె (వృ. వి.)

క. అగిసెవిరుల్ కరువలిచే, నెగయన్. ... యయా. 4. 11.

జ. అగిసెయాకుబొట్టు.

**అగిసెయాకుబొట్టు** వి. (√అగిసె) అవిసెయాకు వంటి యాకారముగలబొట్టు.

గీ. చుక్కబొట్టగిసెయాకు, బొట్టు పూర్ణచంద్ర తిలకంబు...ఒకటిగాదని యొకటి యాయువిద దాల్చె. ప్రభా. 4. 137.

**అగు(వు)** — దే. అ. క్రి. (క. అగు,ఆగు. త. ఆ. అగు. తు. కు. ఆ.—కాక, కానిమున్నగు విశేష రూపము లాయాపట్ల చూచునది.) 1. కలుగు. (క) సంభవించు, ఒనగూడు.

ఉ. ...పుత్త్రజన్మమై,నంతన యేను మీదయఁ గృతార్థతఁ బొందుదు సమ్మునీశ్వరా. భార. సభా. 1. 140.

ఆ. మనకుఁ బాండురాజతనయ వర్గమునకుఁ, గయ్య మయ్యె...భార. భీష్మ. 1.75.

(చ) పుట్టు.

సీ. వెలకుఁ జూపవు పొన్నవిరి యంత గోప్య మాయది యరంటులలోన నయ్యెఁజుమ్ము. కవిరా. 1. 81.

గీ. వినఁగ వేడుక యయ్యె నవిస్తరముగ. పారి. 1. 36.

(ట) ప్రాప్తించు, ప్రాప్తమగు.

క. కం మిష్టము సేసితి మా,కరిసూదన దీన నీకు నగు సత్ఫలముల్. భార. ఆది. 1. 119.

ఆ. విను మసత్యలోభమున సిరియగునె...భార. ఉద్యో. 3. 338.

ఉ. భాసురలీల నయ్యె నిలపై మధుమాసము. ...కవిక. 4. 2.

గీ....అహిళయాను,నర్చనము సేయుటకు వేళ యయ్యె ననుచు, నతిరయంబున సహ్యకన్యకకు నరిగి. విప్ర. 5. 2.

2. ప్రవర్తిల్లు, జరుగు.

సీ. ...నన్మునిక్రప జనకునింటను వివాహ, మగుటకు మున్ను... రాఘవ. 2. 32.

3. గతించు, కడచు.

శా. ...మన్మథవివాహోల్లాసవిభ్రాంతిచేఁ, బాయం బాయెను. ...కాశ. శ. 14.

చ. కను దెఱవాడు చంటికి మొగం బటుచేరఁడు నేఁడ్వఁ డెప్పుడుఁ, దినములు చాల నయ్యెను. పరమ. 2. 133.

4. సిద్ధించు, నెఱవేఱు.

ఉ...కావనిసట్ల యుండి యవుఁ గార్యములు ...భార. ఉద్యో. 3. 73.

సీ. పడుచుదూడలచేతఁ బని యానె...కువల. 2. 26.

5. తగు, యుక్తమగు, అర్హమగు.

ఉ. కాదన కిట్టిపాటియుపకారముఁ దక్షుకుఁ డేక విప్రసంబోధనఁ జేసి చేసె...భార. ఆది. 1. 124.

క. దానన,యలవడు నీయడుగు ప్రశ్నకగునుత్తరముల్. భాగ. 10. ఉ. 1286.

6. సమర్థమగు, చాలియుండు.

క....కర్ణునకు రథంబు గడప నీ,వగు దని కోరిన కౌరవ, జగతీశ్వరు ప్రార్థనంబు సలుపఁగ వలయున్. భార. ఉద్యో. 1. 111.

క. భూనాయక దుందుభియను,దానికళేబరము నెత్తవాలి యొకం డౌ,నే వొకఁడ నగుదుఁ

దక్కిన, వానికి నాడొక్క వెత్తవచ్చునె జగతిన్. భా. రా. కిష్కిం. 94.

7. ధాతువుల తుమున్నర్థకరూపముల కను ప్రయుక్తమై విధ్యర్థమును-అనఁగా 'వలయు' అనునర్థమును-దెలుపును.

క. తాన సుతుఁడగుట తెలియం, గానగు... భార. శాం. 5. 505.

క. ...వివాదమొకటి తీర్పనగుననన్, మీవాదము తీర్చెదరు స, భావరులు...జై. భా. 8.206.

8. పరిణమించు, మాఱు.

క. ఉత్తమగుణములు నీచున, కెత్తెఱఁగునఁ గలుగ నేర్చు నెయ్యెడలఁ దా, నెత్తిచ్చి కరఁగిపోసిన, నిత్తడి బంగారమౌనె యిలలో సుమతీ. సు. శ. 14. (బంగారమౌనె-బంగారముగా మాఱునా?)

9. శక్యమగు, అలవియగు.

క. ...అ, ద్దేవి పవిత్ర పతివ్రత, గావున నకుచులకుఁ గానఁ గాదనవద్యా. భార. ఆది. 1. 96.

ఉ. ...నీవు నా, పొంతకు వచ్చి తింక నెటు వోనగు నం చొకదొడ్డనారసం, బెంతయు బెట్టిదంపువడి నేయుడు... భార. ద్రోణ. 2. 99.

చ. చెలఁగెడురోగ మౌషధముచే విషముం దగు మంత్రయుక్తి ని, మ్మలఁ దగఁ బక్కఁజేయ నగు మూర్ఖునిమూర్ఖత మాన్ప వచ్చునే. భర్తృ. మూర్ఖ. 11.

10. అనుకూలమగు.

క. అరివర్గవ్యతికరమున కగుదురు వీరిఁ, సరిఁ దన కొడుకులు మెలఁగిన, తెరువున మెలఁగింపవలదె ధృతరాష్ట్రనకుఁ. భార. ఉద్యో. 1. 359.

క. బలమును బుద్ధియుఁ జేవయు, నలఘుమతీ యుల్లసిల్లు నగుకాలమునఁ, బొలియుం గాలవిపర్యయ, కలనంబున బుధుల కుబ్బుఁ గలఁకయుఁ గలవే. భార. మౌ. 221.

చ. ఎడరున నైనచుట్టమున కెవ్వరుసాటి ఒగత్త్రియంబునఁ. కవిక. 4. 37.

11. ఏకమగు, కలియు.

మ. ...విజయుండు నేను నయి సంగ్రామంబులో నేకకా, లమునఁ దాధృతరాష్ట్రజాధముల నెల్లం జంపి... భార. అర. 1. 394.

తరువోజ... ఈశానుఁ డేఁ దనయింటికిఁ బన్ప, నవమాన్యుఁజేసె నాయల్లురు నేను, నైతన్నుఁ జేయుదు నాగమబాహ్య. ...కు. సం. 2. 141.

12. యథార్థమగు, నిజమగు.

వ. కృష్ణసారథికంబగుజిష్ణురథం బప్రతిహత మనోరథంబగుట యెఱుంగవలవదె యనుటయు నమ్మహీపతి యతని కిట్లనియె. క. అది యగునైనను నను జెం, పొదవఁగఁ గాచికొని యిచట నుండుట కంటెన్ ... భార. ద్రోణ. 3. 296.

13. సిద్ధమగు.

(వర్షాకాలవర్ణనము)

సీ... మగువ నే నేన్నాళ్లు నుండియుఁ గుడువఁ గూడొదవకునికి. గీ. వేఁడి యగుదాఁక నోరువ... పాండు. 4. 153.

సీ. ...కల్గదు కూడు దానఁ గలిగె, నేని కూరగుట మందు... ఆము. 4. 127.

14. తోఁచు, మనస్సునకు స్ఫురించు.

ఉ. ...మూర్ఛలు నంత నింతి పై, కొన్నటులైన లేచు వగఁగుందుచు భూపతి సాత్త్వికార్తిచే ...కవిరా. 5. 266.

15. కలదియగు, కలిగియుండు.

క. ...శంభుం, గని సతి నివ్వెఱఁగై ని, ల్చెను వడఁకుచు...కు సం. 7. 896.

క. ...ప్రతిసై, న్యముదెస మొగమయ్యెఁ బటు గుణధ్వని సెలఁగన్. భార. ద్రోణ. 5.112.

మ. ఖుసిమీఱన్ సురధాణి నిండుకొలువై ... హర. పీఠి. 22.

గీ. ఆలు మగఁడును నొకకుత్తుకైనఁ గాక. యిట్టి ధర్మంబు మిన్నక యెట్టు కలుగు. హర. 2. 60.

16. అధీనమగు, పాలగు. (ఈయర్థమం దిది షష్ఠీ విభక్తితోనే యన్వయించును.)

ఉ. ...నిందకునైతి నేమనన్. భా. రా. యు. 970.

సీ. గాదెలధాన్య మెల్కలకయ్యెగుత్తకై యెన సినగ్రామంబులెల్ల నెండె. శుక. 2. 360.

17. సంబంధించు.

క. దేహము తాఁగానని నిజమూహింపఁగ నేర్చునట్టి యుత్తమునకుఁ దద్దేహమున కయినబాంధవదేహంబులు మిథ్యలనుచుఁ దెలియంబడవే. కవిరా. 1. 152.

ఉ. ...ఎందుకుఁ గాక రెంటిమధ్యంబునఁ బాఱెడిన్ ...ప్రభా. 2. 71.

(వ్యవ) అయినవానికి ఆకులలోను, కానివానికి కంచములోను పెట్టినట్లు.

18. ఉండు.

ఉ. ...ఒడ్డుగలంగఁగఁ జేసి భీష్ముఁ డేదిక్కునఁ దానయై దిశలు దీటుకొనన్ శతకోటి నింప ...భార. భీష్మ. 2. 30.

శా. ...ఏచాయం జూచినఁ దానయై మెలఁగుచున్. పారి. 1. 40.

19. వ్యతిరేకార్థకరూపములపై అర్థములేకయే అనుప్రయుక్తమగును. అట్టిచో దీనికి ప్రాయికముగా భూతకాలిక ప్రయోగములే కలవు. కాని కొన్నిచోట్ల తద్ధర్మార్థిక ప్రయోగములుకూడఁ గనఁబడుచున్నవి.

(క) భూతకాలికమునకు.

గీ. ...విప్రులవలనఁ బుట్టరైరె సత్క్షత్రియ ప్రభులవనిఁ గాన. భార. ఆది. 6. 59.

సీ. ...తడయకేల, బోధింపవైతని భూసుర ప్రవరుండు...భార. ఆది. 2. 158.

గీ. అకట గురుదక్షిణ యొసఁగనయితి నంచు. ఆము. 3. 53.

(చ) తద్ధర్మార్థకమునకు.

చ. అన విని ధర్మరాజసుతుఁ డాతని కిట్లను నాదుతమ్ములంగనుఁగొను నంతకున్ సుఖముగాఁ గొననయ్యెద నిత్తెఱంగు...భార. మహా. 70.

చ. అకట యదేమియో యెఱుఁగనయ్యెద... పారి. 1. 73.

20. సమాప్తమగు, ముగియు, పూర్ణమగు.

(వ్యవ) గ్రంథరచనము అయినది. భోజనము అయినది. పురాణముచెప్పుట అయినది.

21. వ్యయమగు.

(వ్యవ) పెండ్లికి నాలుగు వేలయినవి.

22. వివాహపర్యాయములకనుప్రయుక్తమై 'చేసికొను' అనునర్థ మిచ్చును.

వ. ...ఇది నాకుఁ దొల్లి వరియింపఁబడినభార్య. పదంపడి భృగుండు పెండ్లియయ్యె...భార. ఆది. 1. 130.

ఇట్లే వివాహమగు, పరిణయమగు, కల్యాణమగు. మొ. ఈ యర్థమందే వ్యస్తముగా ప్రయోగ మొకటి కనఁబడుచున్నది.

ఉ....ఏ మును దాల్చినమాల్యమిచ్చునప్పిన్నది రంగమం దయినపెండిలి సెప్పుము. ఆము. 1. 14.

23. కొన్నిపట్ల అభేదమును దెలుపును.

క. దురమునఁ గుపితుఁ డగుని న్నెదుర్కొన నాకో, క్కరునకు శక్యమె...భార. ద్రోణ. 3. 73.

క. దేహము తాఁ గా నని...కవిరా. 1. 152.

విశే. సంఖ్యావాచకములపై పూరణార్థమున వచ్చు 'అవ' ఆగమమునకు పూర్వరూపము. దీనికి 'అవు' అనురూపమును గలదు. ప్రాచీన శాసనములందు 'అవ'కు మాఱుగా 'అగు, అవు'అను రూపములే కనఁబడుచున్నవి. దీనికిఁ గవిత్రయ ప్రయోగములును కొన్ని ప్రతులందుఁ గలవు. తర్వాతికవుల గ్రంథములలో 'అవ' అనియే కలదు. చూ. అవ.

వ. శకవర్షంబు 1070 అగునేంటి విషుసంక్రాంతి నిమిత్తమున. ద. శా. 4. 678.

వ. ముప్పినాయకుణ్డు భీమేశ్వరమహాదేవరకు బో (లునలుపు) రుంబూణ్టగా నాఁవునడవు ముత్సకాబ్రహ్మని వసమునం బెట్టినకులోత్తుంగ గద్యలు. 10. ద. శా. 4. 1051.

గీ. వీఁడు పుట్టినపదియగునాఁడు పెలుచఁబడియె నాదేశనుండి...భార. ఆది. 6. 281.

సీ. ఇది పదుమూఁడగునేఁడు మా కజ్ఞాతవా
సంబు సలుపంగవలయు నిందు. భార. విరా. 1. 47.

క. ...అధర్మమునందు నాలుగగునంశము ని,
ర్బాధముగఁ బొందు...హరి. ఉ. 5. 57.

**అవ్య.** ద్రు. 1. అంగీకారమును దెలుపును - సరే: సరేకాని.

చ. అగునగు మేలుమేలు మనుజాధిపుఁడున్
మహియేలు మాటలన్, మగఁటిమి యిమ్మె
యిన్ నెఱపినం జెడుఁ బాండుతనూజకోటి
యున్. భార. ద్రోణ. 5. 99. (ఇట ఆక్షేప సూచకము.)

మ. అవు కావా యమృతంబు ముందు మన
దైత్యశ్రేణికిం బంతునో, దివిజుల్ గుయ్యిడ
కుండముందొసఁగి యందే కొంత తర్వాత
దా,నవ దైత్యాసుర రాక్షసావళులకున్
వడ్డింతునో...దశా. 2. 854.

2. సత్యమే, అక్లే.

చ. అవునవు నందినన్ సిగయు నందకయుండినఁ
గాళ్లు పట్టుకొం,దువు హరిణాంక వేలకొలఁ
దుల్ గద నీనడకల్ దలంపఁగన్. విజ. వి. 8. 51.

3. (ప్రశంసను దెలుపును.) చూ. ఔ.

అగు (వు) ఁబొమ్ము — సరే. (అంగీకారమును దెలుపును.

క. అని చెప్పిన విని యగుఁబొ,మ్మని కైకొని
ధర్మతనయుఁడు...భార. విరా. 1. 114.

(చూ. అగులెమ్ము.)

అగు(వు)లెమ్ము. అగు(వు)లెండు. అగు(వు)లే— సరే. (ఇది వ్యతిరేకలక్షణచే అసమ్మతిని దెలుపును.)

శా. నా కీజీవిత మిచ్చినాఁడ వవులే నన్నంద
ఱున్ నవ్వఁగా...దశా. 5. 6.

(చూ. ఔలెమ్ము, ఔలెండు.)

**జ.** అగుగాములు, అగుదెంచు, మొ.

**అగు(వు)ఁగదే**—ఔఁగదే. **అవ్య.** (అగును+కదే) ఔర. (ప్రశంసావాచకము.)

సీ. అవుఁగదే లావణ్యమవుఁగదేమాధుర్యమవుఁ
గదే సతి నవయౌవనంబు. భాగ. 8. 805.

**అగు(వు)ఁగా**—ఔఁగా. **అవ్య.** (√అగు). 1. అది యుక్తమే. 2. సరేకాని. (వెనుకటివిషయమందనాదరము సూచించి ప్రకరణాంతరమునఁ బ్రవేశపెట్టునపు డుపయుక్తము.)

మ. అవుఁగా మీ రిటమున్న గన్గొనని చాయల్
లేవుగా నాఁటనుండి విశేషంబులు గొన్ని
మిమ్ము నడుగన్ వేడ్కయ్యెడున్ నాకు...
విజ. వి. 2. 162.

8. ప్రశంసాద్యోతకము.

చ. అని తెలుపన్ మహీశుఁ డవుఁగా యని
మెచ్చి...కువల. 2. 69.

**అగు(వు)ఁగాక**—ఔఁగాక (చూ) **అవ్య.** (√అగు) సరియే, మంచిదే. (అంగీకారమును దెలుపును.)

**అగు(వు)ఁగాదను** — ఔఁగాదను. **అ.** క్రి. స. క్రి. (అగు-వు-ను+కాదు+అను) 1. ఇది యుక్తము ఇది అయుక్తము అని యాలోచించు; ఆలోచించు. (చూ. ఔఁగాదను.)

చ. కరుణ యొకింత లేక యవుఁగాదనునట్టి
తలంపు లేక భూ,సురుఁ డనుశంక లేకయిటు
సూతుని వేఁ దెగఁజూతునే సురా,పరిణత
దుర్మదాంధ్యమునఁ బాపముఁ జేసితి ...
మార్క. 1. 138.

2. విమర్శించు.

చ. సువిభవభూతిఁ బేర్చుహరిసొం పవుఁగాదను
శ్రీమదాత్మవై,భవము....రాఘవ. 3.18.

(ఇట ఉపమావాచకము)

**అగు(వు)గాములు** — ఔగాములు. (చూ) **వి. బ-** అగుటయుఁగాకపోవుటయును. 1. సత్యాసత్యములు. 2. సుఖదుఃఖములు.

క. ...అనయము నగు నలువకైన నవుగాము
లొగిఁ. యయా. 3. 83.

1. యుక్తాయుక్తములు, మంచిచెడ్డలు.

**అగుణము** సం. విణ. (అ. అ. అ.) 1. గుణరహితము. (బ్రహ్మము) 2. సుగుణములు లేనిది.
**వి. అ. పుం.** దోషము, తప్పు.

**అగుణవాది** సం. విణ. (న్. సి. న్.) తప్పులు పట్టువాఁడు.

**అగుదెంచు**—అగు.
(గతించు, కడచు.)

మధ్యా. ఏనేఁడు అగుదెంచె నర్జునుం డేఁగి యింతకేతెంచు... భార. అర. 4. 3.

చ. తడ వగుదెంచె జమ్మికిఁ బ్రదక్షిణవృత్తిగఁ దేరు వోవని,మ్ము... భార. విరా. 4.171.

(కలదియగు)

ఉ. అంత సరోరుహాప్తుఁడుదయంబగుదెంచె ... నిర్వ. 6. 87.

**అగు(వు)నఁటే** – ఔనఁటే. **అవ్య.** (అగు - వు - ను + అట + ఏ) ఔనే.

**అగు(వు)నగు(వు)ఁగదే** – ఔనౌఁగదే. **అవ్య.** ఔఁగదే. (ప్రశంసావాచకము)

**అగు(వు)నె(నే)** – ఔనె. **అవ్య.** (√అగు) నీచ మిత్రస్త్రీసంబోధనంబున నుపయుక్తము.

**అగు(వు)ర(రా)**–ఔర, ఔరా. (అగు-వు-ను+ర.) **అవ్య.** 1. ప్రశంసను దెలుపును. (ఆమ్రేడిత మందు 'అగురగుర')

క. అగురగుర ...రామా. 7. 39.

2. ఆశ్చర్యమును దెలుపును.

**అగురు**–అవురు, ఔరు. **వి.** పీంణము. అవురుగడ్డి.

**అగురువు** సం. **విణ.** (అ. త. ద్వి. స.) 1. తేలిక యైనది. 2. చిన్నది. **వి. అ. పుం.** 1. (ఛంద) లఘువు. (వ్యతి. గురువు.) 2. గురువు కాని వాఁడు. న. 1. అగలు. చందనవిశేషము. 2. ఇరుగుడు, శింశుప (వృ. వి.)

**అగుర్వు** విణ. (త. అగుర్వు.) అధికము; శ్రేష్ఠము.

చ. అరుణపరాగ మంబరమునందుఁగడల్కొనఁ బుష్పవృష్టి పైఁ,గురసెఁ బురారిసూతికి నగుర్వుగ...కు. సం. 12. 972.

ఉ. అక్కజమై మహార్థనివహంబు సదుక్తులు మెచ్చఁ జూచినన్, గ్రుక్కెడమైనసత్కృతి యగు ర్వగుఁగా కిలఁ జీకు లావుకం, బ్రొక్కిన యట్లు నోరతాలఁదుల్ పురతాల్పఁగ నందులోన నొ,క్కొక్కఁడు సక్కనైనఁ గృతియుం గృతి యందురె వాని మెత్తురే. కు. సం. 1. 48.

**అగులు** అ. త్రి.–అగలు'.

(పగులు)

వ....సారథులం జంపియు సైంధవంబుల దంపియు శిరంబుల నొగిలించియు సీసకంబు లగిలించియు ఛత్రంబుల నుఱుమాడియు .... భాగ. 6. 370.

**అగువు** సం. **విణ.** (అ.) గోవులు లేనివాఁడు. (చూ. గోవు.) **వి. అ. పుం.** 1. రాహువు. 2. చీఁకటి.

**అగూఢగంధము** సం. **విణ.** (అ. ఆ. అ.) దాఁపరానిపరిమళము గలది. **వి. అ. న.** ఇంగువ.

**అగోచరము** సం. **వి. అ. పుం.** గోచరముకానిది, మనస్సునకును ఇంద్రియములకును విషయము కానిది. (మనస్సుచేతను ఇంద్రియములచేతను గ్రహింప రానిది)

**అగౌక(స)ము** సం. **విణ.** (స్.) అగము నివాసముగాఁ గలది. **వి. స్. పుం.** 1. శరభమృగము. 2. సింహము. 3. పక్షి.

**అగ్గడి** వి. (సం. అగ్రమ్. హిం. అగాడీ.) ముందఱ అగ్రభాగము.

సీ. దర్పకజైత్రయాత్రావార్తఁ జైత్రుఁడగ్గడిఁ జాటుతలిరుజేగంట యనఁగ ...ఆ. అంతఁ దోఁచె...,తుహినరోచి...కకు. 3. 102,

**అగ్గపడు** – అగపడు.

**అగ్గపాటు** వి. (√అగ్గపడు. త. అగప్పడుదల్.) అగ్గపడుట.

**అగ్గము** విణ. 1. అధీనము, వశమయినది.

క. నరసుతున కగ్గమయ్యెం, గురుధరణీవల్లభుం డకుంఠితగతి మీ,రరుగుం డేయుం డడ్డము, చొరుఁడు...భార. ద్రోణ. 2. 21.

క. హరిచేతి కగ్గమై చెచ్చెరఁ గూలక యసుర యింతసే పోర్చె...హరి. పూ. 8. 49.

చ. తరుణి ననన్యకాంత నతిదారుణ పుష్పశిలీముఖవ్యథా, పరవివశాంగి నంగభవుకారికి నగ్గము సేసి క్రూరుఁడై . మనుచ. 3. 10.

2. అందుపాటుగా నున్నది,సమీపించినది.

సీ. హైహయుండు సుమిత్రుఁ డనురాజు వేఁట వోయినచోటఁ దనచేత నేటువడిన, మృగ మమ్ముతోఁ బాఱఁ దగిలె వెన్వెంటన యది

యను నొకమరి యగ్గమయ్యు, నొకమరి దవ్వయ్యు నొకమరి దృష్టి కగోచరం బయ్యును... భార. శాంతి. 3. 151.

3. గోచరమైనది, కనఁబడినది.

ఉ. ఇమ్మెయి నిప్పు డగ్గమయి యెప్పటియట్టుల డాఁగురించి నీ,విమ్ములఁ బాఱిపోవ కొక యించుక నిల్చితివేని నీదుకం, ఠమ్మువికుంఠి తాస్త్ర వికటప్రహతిం దునుమాడువాఁడ ...హరి. ఉ. 2. 29.

సీ. ఇది దుశ్చరిత్ర నా నెవ్వతె చరియించు నట్టి బ్రాహ్మణి మీకు నగ్గమైనఁ,గని...భోజరా. 3. 117.

జ. అగపడు, అగపాటు, అగ్గపడు, అగ్గపాటు.

**అగ్గలము** *విఆ.* (త. అక్కళిప్పు. క. అగ్గళము. అగ్గళే.) అధికము, ఎక్కువది.

గీ. ...ఆత్మగతకు నగ్గలంబు, ధర్మగతయ యుత్తమధార్మికులకు. భార. ఆది. 6.217.

క. విలువిద్య నొరులు నీకగ్గలముగ లేకుండ నిన్నుఁగఅపుడు నని... భార.ఆది .5.239.

గీ....దైవ మగ్గలంబు, పౌరుషముక లె... భార. ద్రోణ. 1.80. కు. సం. 4. 400.

చ. అనితల నిట్టులగ్గలములాడినయట్టులుగాదు నేఁతచౌ, ష్పనయము ద్రేఁగు...హరి. ఉ. 1. 114. (అగ్గలములు—పెద్దమాటలు)

క. పగ్గములు వదలి వేగిర. మగ్గలముగ రథము గడపునాకంసుఁడు. భాగ. 10. పూ. 22.

*క్రి. విఆ.* మిగుల, అధికముగా.

గీ. ...కౌశికుం డుదితమహిముఁ, డానరేంద్ర నందనుచేఁత కాత్మలోన, నగ్గలము మెచ్చి వర మిత్తు నడుగు మనిన. హరి. పూ.2.46.

*వి.* ఆధిక్యము, అతిశయము.

సీ. కుంతీమహాదేవి కోడండ్ర లోపల నగ్గలంబునఁ గొనియాడఁ బరఁగి. భార. విరా. 2.216.

వ. పలుమరి మురువులఁ జలమరితనంబున జయింప నగ్గలంబు గలగళంబులు. ప్రబంధ. 40.

జ. అగ్గలించు, అగ్గలిక, అగ్గలికము.

**అగ్గలించు** *అ. క్రి.* √అగ్గలము. (క. అగ్గళించు) 1. అతిశయించు, ఎక్కువగు, వ్యాపించు, విజృంభించు.

ఆ....అధికబలస,మగ్రసార యోగమహిమయు నంతంత, కగ్గలించు వ్రతము లగ్గలింప. భార. శాం. 5. 580.

గీ. ...ఇట్టితిమిర, మెఱుఁగ మెన్నఁడు నా జనులెల్ల బెగ్గ,లించునట్లుగఁ గడు నగ్గలించెఁ దమము. నిర్వ. 6. 39.

2. ఉత్సహించు, పూను.

(కీచకుఁడు)చ ...మదిఁగోర్కులు పేర్చిన నప్పళించు నె,ట్టన తెగ నగ్గలించు...భార. విరా. 2.31.

**అగ్గలిక—అగ్గలికము.** *వి.* √అగ్గలము. (క. అగ్గళికె. త. అక్కళిప్పు.) 1. ఆధిక్యము, పెంపు. అతిశయము.

ఉ. అచ్చెరువైనవిక్రమమునగ్గలికన్ సమరంబు గోరి యీ,వచ్చుచునున్నవాఁడు బలవద్రిపు భీషణబాహుఁ డైనవి, వ్యచ్చుఁడు...భార. విరా. 4. 181.

2. ఉత్సాహము, పూనిక; విజృంభణము.

ఆ. అనిన నట్లకాక యని సర్వసేనాధి,పత్య భార పట్టబంధమునకు, నియ్యకొని యె భీష్ముఁ డయ్యగ్గలికఁ గొని,యాడె విభుఁడు ప్రముదితాత్ముఁ డగుచు. భార. ఉద్యో. 4. 155.

గీ. అధిపతియు నస్త్రగురుఁడుఁ బేరగ్గలికలఁ. దఱుముఁ జతురంగములు పేర్చి యుఱక వారి,మొనలతోఁ దాఁకి. ...భార. ద్రోణ. 5. 133.

**అగ్గలికము—అగ్గలిక.**

(విజృంభణము.)

ద్వి. అగ్గదాధరువెన్క నవ్యదర్పనులు, నగ్గలికము చెడి యరుదెంచుచుండ. బస. పు. 6. 763.

సీ. అర్చినఁ బేర్చినయగ్గలికంబున నామాత నందనుఁ డతనిమాతుఁ, జంపి కేతువుఁ ద్రుంచి...భార. కర్ణ. 2. 191.

**అగ్గి**—అగిని. వి. (సం. అగ్నిః. ప్రా. అగ్గి, అగ్గీ. క. తు. అగ్గి. త. అంగి, అగ్గి.) నిప్పు.
భాం. భీష్మ. 2. 163.

జ. అగ్గికంటి, అగ్గికోల, అగ్గిచూలి. అగ్గితత్తడి అగ్గితూపు, అగ్గిములికి.

**అగ్గించు** స. క్రి. (సం. అర్ఘః—పూజ. ప్రా. అగ్ఘ.) స్తుతించు, పొగడు, కొనియాడు.

ఆ. అరులగుణము లైన నగ్గించు రెప్పుడు, గలయఁ బెంచినపుడు కలిగినంబు, మెఱ యుదురు మహాత్ములు... భాం. విరా. 4. 223.

జ. అగ్గింపు.

**అగ్గింపు** వి. (√అగ్గించు) స్తుతి, పొగడ్త,
ఆం. భా. 1. 114.

**అగ్గికంటి** వి. (√అగ్గి) అగ్నినేత్రుండు. వేఁడికంటి, శివుఁడు.

**అగ్గికోల** వి. (√అగ్గి) ఆగ్నేయాస్త్రము.
అచ్చ. భా. 5. 86.

**అగ్గిచూలి** వి. (√అగ్గి)—అగ్నినుండి పుట్టినవాఁడు. 1. కుమారస్వామి. 2. జలము, నీరు.

**అగ్గితత్తడి** వి. (√అగ్గి.) - అగ్నిదేవుని గుఱ్ఱము. అగ్నివాహనము - పొట్టేలు.

**అగ్గితూపు** వి. (√అగ్గి) ఆగ్నేయాస్త్రము. అగ్గికోల. రామా. 8. 210.

**అగ్గిములికి** వి. (√అగ్గి) ఆగ్నేయాస్త్రము, అగ్గితూపు. అచ్చ. రా. యు. 318.

**అగ్గువ** విశే. (క. అగ్గ—చౌక తు. అగ్గ.) వెలతక్కువ యయినది, చౌక.

గీ. చాటఁగాఁ బంచె నతఁడు రాక్షసుల కెల్లఁ, గ్రోఁతిమాంస మగ్గువ యయ్యెఁ గొనుఁ డటంచు. రామా 8. 25

**అగ్గువ** వి. (సం. అర్ఘః) మూల్యము, వెల.

క. వెలవెల రాజొక యగ్గువ, నిలిపిన నాయగ్గువనన నిచ్చల నమ్మ, న్వలయుం బారొక యగ్గువ, నిలుపుట వణిజులకుఁ దప్పునిక్కం బరయన్. విజ్ఞా. ప్రా. 73.

**అగ్గెడ** వి. (అ + గెడ)—అక్కడ.

ఉ. దిగ్గియనంచ దూఁడు కొని తింవనేతువు వంక మీఁదుగా, నగ్గెడ పుల్ల కేసరముననందు వసింపఁగ... ఆము. 5. 122.

**అగ్నాయి** సం. వి. ఈ. స్త్రీ. స్వాహా, అగ్నిభార్య.

**అగ్ని** సం. వి. ఇ. పుం. 1. నిప్పు. 2. గార్హపత్యము దక్షిణాగ్ని ఆహవనీయము అను మూఁడువిధములగు శ్రౌతాగ్ని; గృహ్యాగ్ని. 3. అగ్న్యధిష్ఠానదేవత. 4. దిక్పాలకులలో నొకఁడు. 5. జఠరాగ్ని. 6. పిత్తము. 7. బంగారు. 7. మూఁడు (సంఖ్య). 9. చిత్రమూలము. (వృ.వి.) 10. నల్లజీడి (వృ.వి.) 11. నిమ్మ. (వృ.వి.)

**అగ్నికణము** సం. వి. అ. పుం. విస్ఫులింగము, నిప్పుక.

**అగ్నికము** సం. వి. అ. పుం. ఆరుద్రపురుగు.

**అగ్నికర్మము** సం. వి. న్. న. 1. హోమము. 2. వాఁతవేయుట. 3. అగ్నిచేయుపని (కాల్చుట)

**అగ్నికార్యము** సం. వి. అ. న. — అగ్నికర్మము.

**అగ్నికుండము** సం. వి. అ. న. అగ్నినిల్పుగుండము.

**అగ్నికుక్కుటము** సం. వి. అ. పుం. కొఱకచ్చు; నిప్పుతొంట,

**అగ్నికుమారము** సం. వి. అ. పుం. ఔషధ విశేషము.

**అగ్నికుమారుఁడు** సం. వి. అ. పుం. కుమారస్వామి, కార్తికేయుఁడు.

**అగ్నికేతువు** సం. వి. ఉ. పుం. పొగ. ధూమము.

**అగ్నికోణము** సం. వి. అ. పుం. ఆగ్నేయదిక్కు.

**అగ్నిక్రియ** సం. వి. ఆ. స్త్రీ. 1. దహనకర్మాది. 2. వాఁతవేయుట.

**అగ్నిక్రీడ** సం. వి. ఆ. స్త్రీ. 1. బాణసంచు. 2. దీపోత్సవము.

**అగ్నిగర్భ** సం. వి. ఆ. స్త్రీ. 1. జమ్మి, శమి (వృ. వి.) 2. భూమి. 3. జ్యోతిష్మతి, మానేరు, ఎక్కుడుతీఁగ.

**అగ్నిగర్భము** సం. విణ. (అ. ఆ. అ.) లోపల అగ్ని కలది. వి. అ. పుం. అగ్నిజారవృక్షము. 2. సూర్యకాంతమణి. 3. అరణి.

**అగ్నిగృహము** సం. వి. అ. న. అగ్నిహోత్ర శాల.

**అగ్నిఘృతము** సం. వి. అ. న. జఠరాగ్నిని హెచ్చించుటకై నేతితోఁ జేయఁబడు నొకానొక యౌషధము.

**అగ్నిచయనము** సం. వి. అ. న—అగ్నిచయము.

**అగ్నిచయము** సం. వి. అ. పుం. 1. అగ్న్యాధానము, అగ్నిని మంత్రపూర్వకముగా నిలుపుట. 2. అగ్నిహోత్ర మంత్రము. 3. నిప్పుల కుప్ప.

**అగ్నిచిత్తు** సం. వి. త్. పుం. మంత్ర పూర్వకముగా అగ్నిని స్థాపించుకొన్నవాఁడు - అగ్నిహోత్రి, ఆహితాగ్ని.

**అగ్నిచిత్య** సం. వి. ఆ. స్త్రీ. అగ్న్యాధానము.

**అగ్నిజము** సం. విణ. (అ. ఆ. అ.) అగ్నినుండి పుట్టినది. వి. అ. పుం. అగ్నిజారవృక్షము న. 1. బంగారు. 2. నీరు.

**అగ్నిజాతము** సం—అగ్నిజము.

**అగ్నిజిహ్వ** సం. వి. ఆ. స్త్రీ. 1. అగ్నిజ్వాల; అగ్నియొక్క నాల్క. (ఇవియేడు-కరాళీ ధూమినీ శ్వేతా లోహితా నీలలోహితా, సువర్ణా పద్మరాగాచ జిహ్వాస్సప్తవిభావసోః.) 2. లాంగలికీ వృక్షము.

**అగ్నిజిహ్వుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) 1. తీక్ష్ణమైన వాక్కులు గలవాఁడు, పరుషవాక్కులు గలవాఁడు. 2. అగ్నియే జిహ్వగాఁ గలవాఁడు (వరాహమూర్తి.)

**అగ్నిజుఁడు** సం. వి. అ. పుం. 1. కుమారస్వామి. 2. విష్ణువు.

**అగ్నిజ్వాల** సం. వి. ఆ. స్త్రీ. 1. నిప్పుమంట 2. ధాతకి, ఆరె (వృ.వి.)

**అగ్నిదగ్ధుఁడు** సం. విణ. (అ. ఆ. అ) 1. అగ్నిచేఁ గాల్పఁబడినవాఁడు. 2. చితిమీఁదఁ గాల్పఁబడినవాఁడు. వి. బ. బ్రతికియున్నప్పుడు నిత్యాగ్నిహోత్రముచేసి పిమ్మట ఆయగ్నిచేతనే దహనసంస్కారము నందినవారు – పితృదేవతలలో నొక తెగవారు.

**అగ్నిదమని** సం. వి. ఈ. స్త్రీ. వాఁకుడు (వృ.వి.)

**అగ్నిదము** సం. విణ. (అ. ఆ. అ.) 1. అగ్నిని ఇచ్చునది. 2. ఆఁకలి పుట్టించునది, జఠరాగ్నిదీపనము కలిగించునది.

**అగ్నిదాత** సం. వి. ఋ. పుం. అగ్ని పెట్టువాఁడు- యథాశాస్త్రముగా దహనకర్మము చేయువాఁడు.

**అగ్నిదాయకుఁడు** సం. విణ. (అ. యీ. అ.) – అగ్నిదుఁడు.

**అగ్నిదీపనము** సం. విణ. (అ. ఆ. అ.) ఆఁకలి పెంచునది, జఠరాగ్నిని హెచ్చించునది. వి. అ. న. ఆఁకలి హెచ్చించుట.

**అగ్నిదీప్త** సం. వి. ఆ. స్త్రీ. జ్యోతిష్మతి, మానేరు తీఁగ.

**అగ్నిదీప్తి** సం. వి. ఇ. స్త్రీ. 1. అగ్నియొక్క ప్రకాశము. 1. చులుకుగా ఆఁకలివేయుట.

**అగ్నిదుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) 1. నిప్పుఇచ్చువాఁడు. 2 ఇల్లు మొ. కాల్చువాఁడు. (వీఁడు ఆఱుగు రాతతాయులలో నొకఁడు.)

**అగ్నిదూషితము** సం. విణ. (అ. ఆ. అ.) వాఁత వేయఁబడినది.

**అగ్నిదేవ** సం. వి. అ. స్త్రీ. కృత్తికానక్షత్రము.

**అగ్నినిర్యాసము** సం. వి. అ. పుం. అగ్నిజారవృక్షము.

**అగ్నిపరిక్రియ** సం. వి. ఆ. స్త్రీ. హోమరూపమైన అగ్నిపరిచర్య.

**అగ్నిపరీక్ష** సం. వి. ఆ. స్త్రీ. అగ్నిదివ్యము, అగ్నిచే దోషాదోషములను పరీక్షించుట.

**అగ్నిపర్వతము** సం. వి. అ. పుం. నిప్పుకొండ.

**అగ్నిపురాణము** సం. వి. అ. న. వ్యాసుఁడు రచించిన 18 మహాపురాణములలో నొకటి.

**అగ్నిప్రతిష్ఠ** సం. వి. ఆ. స్త్రీ. గృహ్యాగ్నిని (వివాహాగ్నిని) నిలుపుట.

**అగ్నిప్రస్కందనము** సం. వి. అ. న. అగ్నిహోమ కార్యములను మానుట.

**అగ్నిప్రస్తరము** సం. వి. అ. పుం. చెకుముకిఱాయి.

**అగ్నిబాహువు** సం.వి.ఉ.పుం. 1. పొగ. 2. ప్రథమ మనువుయొక్క పుత్త్రుఁడు. 3. ప్రియవ్రతునకు కామ్యయందుఁ బుట్టినవాఁడు.

**అగ్నిబీజము** సం. వి. అ. న. 1. బంగారు. 2. రేఫాక్షరము.

**అగ్నిభము** (సం. వి. అ. న. 1. బంగారు. 2. కృత్తికా నక్షత్రము.

**అగ్నిభువు** సం. వి. ఊ. పుం. కుమారస్వామి.

**అగ్నిమంథనము** సం. వి. అ. న. - అగ్నిమంథము.

**అగ్నిమంథము** సం. వి. అ. పుం. 1. రాపిడివలన నిప్పును పుట్టించుట. 2. నెల్లి, శ్రీపర్ణము (వృ. వి.)

**అగ్నిమణి** సం. వి. ఇ. పుం. సూర్యకాంతము.

**అగ్నిమథుఁడు** సం. వి. అ. పుం. నిప్పుకొఱకు అరణి మథించువాఁడు.

**అగ్నిమాంద్యము** సం. వి. అ. న. ఆఁకలి తగ్గుట.

**అగ్నిమిత్త్రుఁడు** సం. వి. అ. పుం. న. - అగ్నిమిత్త్రము - వాయువు. పుం. ఒకానొక రాజు.

**అగ్నిముఖము** సం. వి. అ. పుం. 1. చిత్రమూలము (వృ.వి.) 2. జీడి. (వృ.వి.) 3. బలకరమైన యొక యోషధ చూర్ణము. 4. నల్లి. న. అగ్ని సాధ్యమగుకర్మములకు పూర్వమందు చేయు అంగకర్మ సముదాయము.

వ. ... మహామునులు ... అగ్నిముఖంబు సేసి వేల్వం దొడంగిన ...భార. ఆది. 2. 210.

సీ. ...అగ్నిముఖము సేసి వేల్వ...భార. ఆది. 7. 167.

**అగ్నిముఖి** సం. వి. ఈ. స్త్రీ. 1. నల్లజీడి.(వృ.వి.) 2. లాంగలికి (వృ.వి.)

**అగ్నిముఖుఁడు** సం. వి. అ. పుం. 1. దేవత, వేలుపు. 2. అగ్నిహోత్రి. 3. బ్రాహ్మణుఁడు.

**అగ్నిరజము(స్సు)** సం. వి. స్. పుం. ఆరుద్రపురుగు. న. బంగారు.

**అగ్నిరుహ** సం. వి. ఆ. స్త్రీ. మాంసాదని (వృ.వి.)

**అగ్నిరేతస్సు** సం. వి. స్. న. - అగ్నివీర్యము - బంగారు.

**అగ్నిరోహిణి** సం. వి. ఈ. స్త్రీ. నొప్పితోను మంటతోను గూడిన చంకలోనికురుపు.

**అగ్నివల్లభము** సం. వి. అ. పుం. 1. సాలము. మద్ది (వృ.వి.) 2. మద్దిజిగురు.

**అగ్నివాహనము** సం. వి. అ. న. 1. గొఱ్ఱె. 2. మేఁక.

**అగ్నివాహము** సం. వి. అ. పుం. 1. మేఁక. 2. గొఱ్ఱె. 3. పొగ.

**అగ్నివీర్యము** సం. వి. అ. న. బంగారము.

**అగ్నిశాల** సం. వి. ఆ. స్త్రీ. 1. అగ్నిహోత్రములుంచు గృహము; అగ్నిహోత్ర ముంచెడు స్థానము.

**అగ్నిశాలము** సం. వి. అ. న-అగ్నిశాల.

**అగ్నిశిఖ** సం. వి. ఆ. స్త్రీ. 1. మంట, జ్వాల. 2. లాంగలికి (వృ.వి.)

**అగ్నిశిఖము** సం. విశే. (అ. ఆ. అ.) నిప్పువంటి కొనలు గలది. వి. అ. పుం. 1. దీపము. 2. బాణము. 3. అగ్నిబాణము. 4. కుంకుమపువ్వు. 5. కుసుంభవృక్షము. 6. జాంగలి, దూలగొండి (వృ.వి,) న. 1. పసుపు. 2. బంగారు.

**అగ్నిశేఖరము** సం. వి. అ. పుం. 1. కుసుంభవృక్షము. 2. కుంకుమవృక్షము. 3. లాంగలికి (వృ.వి.) న. బంగారు.

**అగ్నిష్టోమము** సం. వి. అ. పుం. 1. వసంతకాలమందుఁ జేయఁబడు నొక యాగము. (ఇది జ్యోతిష్టోమ సంస్థలలో మొదటిది) 2. అగ్నిష్టోమవిధానమును దెల్పుకల్పము.

**అగ్నిష్ఠము** సం. విశే. (అ. ఆ. అ.) అగ్నియందుఁగాని దానిసమీపమునఁగాని యుండునది. వి.అ. న. ఇనుపవేఁపుడుచట్టి; ఇనుపపెనము.

**అగ్నిష్వాత్తులు** సం. వి. అ. పుం. బ. ఒక తెగపితృదేవతలు.

**అగ్నిసంభవము** సం. విశే. (అ. ఆ. అ.) అగ్నినుండి పుట్టినది. వి. అ. పుం. అరణ్యకుసుంభవృక్షము.

**అగ్నిసంస్కారము** సం. వి. అ. పుం. 1. అగ్నిని సంస్కరించుట. 2. అగ్నిచేత సంస్కరించుట. 3. చితిమీఁద పెట్టి దహనము చేయుట.

**అగ్నిసఖుఁడు** సం. వి. అ. పుం. వాయువు.

**అగ్నిసాక్షి** సం. విశ. (న్. ఈ. న్.) — అగ్నిసాక్షికము.

**అగ్నిసాక్షికము** సం. విశ. (అ. ఆ. అ) అగ్నిసాక్షిగాఁ గలది, అగ్నియెదుట జరిగినది.

**అగ్నిసాదము** సం. వి. అ. పుం. అజీర్ణవ్యాధి.

**అగ్నిసారము** సం. వి. అ. న. రసాంజనము, ఒకవిధమైన కంటిమందు.

**అగ్నిసూత్రము** సం. వి. అ. న. ఉపనయనమునందు బ్రాహ్మణుఁడు ధరించుముంజదర్భమొలత్రాడు, మౌంజీమేఖల.

**అగ్నిస్తంభనము** సం—అగ్నిస్తంభము.

**అగ్నిస్తంభము** సం. వి. అ. పుం. 1. అగ్నియొక్క దహనశక్తి నాఁపుట; దాని కుపయోగించు మంత్రము. 2. అగ్నిస్తంభనౌషధము.

**అగ్నిస్తోకము** సం—అగ్నికణము.

**అగ్నిహోత్రము** సం. వి. అ. పుం. 1. హావిస్సు. 2. అగ్ని.

శ్లో. హావిర్హ్వహ్నిచాగ్నిహోత్రం. (త్రి. ని.)

న. హోమము.

గీ. సూర్యతేజంబు గైకొన్న శుచికిఁ జంద్ర,
కాంతియు నొసంగుభంగి దుగ్ధముల నగ్ని,
హోత్రమొనరించి వేసంజ హోమశాల,
నేకతంబున నున్న ప్రాణేశుఁ గాంచి. దశా. 3.27.

**అగ్నిహోత్రి** సం. వి. న్. పుం. అగ్నిహోత్రమును చేయువాఁడు.

**అగ్నీయము** సం. విశ. (అ. ఆ. అ.) అగ్నిసమీపమున నున్నది; అగ్నిసంబంధమైనది.

**అగ్నీషోమీయము** సం. విశ. (అ. ఆ. అ.) అగ్నియు సోముఁడును దేవతలుగాఁ గలది. (యాగము, మొ.)

**అగ్న్యాధానము** సం. వి. అ. న. అగ్నిని నిలుపుట.

**అగ్న్యాధేయుఁడు** సం. వి. అ. పుం. ఆహితాగ్ని, అగ్నిహోత్రి.

**అగ్న్యాహితుఁడు** సం. వి. అ. పుం. ఆహితాగ్ని.

**అగ్న్యుత్పాతము** సం. వి. అ. పుం. ఉల్కాపాతము, ధూమకేతువు (తోఁకచుక్క) మొ.

**అగ్న్యుద్ధరణము** సం. వి. అ. న. 1. అరణినుండి నిప్పును బుట్టించుట. 2. అగ్నిహోత్రమును జేయుటకు ముందు బూడిద తొలఁగించి అగ్నిని పైకిఁదీయుట.

**అగ్న్యుద్ధారము** సం. వి. అ. పుం. అగ్న్యుద్ధరణము.

**అగ్న్యుపస్థానము** సం. వి. అ. న. 1. అగ్న్యుపాసనము. 2. అగ్న్యుపాసనమంత్రము.

**అగ్రకేశము** సం. వి. అ. పుం. కేశాగ్రము. బ. వ. ముంగురులు.

**అగ్రగణ్యుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) మొదటివాఁడుగా నెన్నఁదగినవాఁడు, ముఖ్యుఁడు.

**అగ్రగామి** సం. వి. న్. పుం. — అగ్రగుఁడు.

**అగ్రగుఁడు** సం. వి. అ. పుం. ముందు నడచువాఁడు; మొనగాఁడు.

**అగ్రజ** సం. వి. ఆ. స్త్రీ. అక్క, జ్యేష్ఠభగిని.

**అగ్రజంఘ** సం. వి. ఆ. స్త్రీ. పిక్కయొక్క ముందు భాగము.

**అగ్రజన్ముఁడు** సం. వి. న్. పుం. 1. అన్న. 2. బ్రాహ్మణుఁడు. 3. బ్రహ్మ.

**అగ్రజాతుఁడు** సం. — అగ్రజుఁడు.

**అగ్రజుఁడు** సం. విశ. (అ. ఆ. అ., మొదట పుట్టినవాఁడు. వి. అ. పుం. 1. అన్న. 2. బ్రాహ్మణుఁడు.

**అగ్రణి** సం. విశ. (ఈ. ఈ. ఇ.) ముఖ్యుఁడు, శ్రేష్ఠుఁడు.

**అగ్రతస్సరుఁడు** సం. విశ. (అ. ఈ. అ.) ముందు నడచువాఁడు మొదటివాఁడు.

**అగ్రనిరూపణము** సం. వి. అ. న. భవిష్యత్తు చెప్పుట.

**అగ్రపర్ణి** సం. వి. ఈ. స్త్రీ. అజలోమము (వృ.వి.)

**అగ్రపాణి** సం. వి. ఈ. పుం. — అగ్రహస్తము.

**అగ్రపాతి** సం. విశ. (న్. నీ. న్.) ముందు సంభవించునది.

**అగ్రపాదము** సం. వి. అ. పుం. పాదముయొక్క ముందుభాగము, పాదాగ్రము.

**అగ్రపూజ** సం. వి. ఆ. స్త్రీ. మొదట చేయఁబడు పూజ, ప్రథమసత్కారము.

**అగ్రబీజము** సం. వి. అ. పుం. ముత్తమామిడ, జీడి మామిడి (వృ. వి.)

**అగ్రభుక్కు-(క్కుఁడు)** సం. విశ. (క్) 1. మొదట తినువాఁడు. 2. ఔదరికుఁడు, తిండిపోతు.

**అగ్రభువు** సం. వి. ఊ. పుం. 1. అన్న. 2. బ్రాహ్మణుఁడు. స్త్రీ. అక్క.

**అగ్రమాంసము** సం. వి. అ. న. 1. హృదయము నందు పద్మాకారముగా నున్న మాంసవిశేషము. 2. ఒకానొకరోగము. (ఇందు కాలిజము పొంగును.)

**అగ్రము** సం. విశ. (అ. ఆ. అ.) 1. ప్రథమము, మొదటిది. (ఉదా: అగ్రమహిషి.) 2. ప్రధానము, ముఖ్యము. 3. మిక్కుటము, అధికము. వి. అ. న. 1. కొన, చివర. 2. పై భాగము. 3. పురోభాగము, ముందు. 4. ఆలంబనము ఆశ్రయము. (ఉదా: ఏకాగ్రచిత్తుఁడు.) 5. మొదలు. 6. సమూహము. 7. పెచ్చు, పై చిల్లర. (ఉదా; సాగ్రంత్రిసహస్రమ్. రామా.) 8. నాలుగుకబళముల భిక్ష. 9. పల మనెడు పరిమాణము. 10. ప్రాంతప్రదేశము.

**అగ్రయానము** సం. విశ. (అ. ఆ. అ.) ముందు నడచునది. వి. అ. న. 1. ముందునడక. 2. ముందుండు సేన, ఎలగోలు సేన.

**అగ్రయాయి** సం. విశ. (న్, నీ, న్.) 1. ముందు పోవువాఁడు, అగ్రగామి. 2. మొదటివాఁడు, శ్రేష్ఠుఁడు.

**అగ్రయోధి** సం. వి. న్. పుం. ముఖ్యవీరుఁడు.

**అగ్రలోహిత** సం. వి. ఆ. స్త్రీ. చిల్లి. చిట్టికూర (వృ. వి.)

**అగ్రసంధాని** సం. వి. ఈ. స్త్రీ. యమపంజిక, ప్రాణివర్గము యొక్క పూర్వకర్మానుసారముగఁ గలుగు శుభాశుభములను దెలుపునట్టి యముని కవిలె, యమపట్టిక.

**అగ్రసంధ్య** సం. వి. ఆ. స్త్రీ. ప్రాతస్సంధ్య, తొలి సంజె.

**అగ్రసరుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) – అగ్రయాయి.

**అగ్రహస్తము** సం. వి. అ. పుం. 1. చేతి చివరి భాగము. 2. తుండాగ్రము.

**అగ్రహాయణము** సం. వి. అ. పుం. మార్గశీర్షమాసము.

**అగ్రహాయణేష్టి** సం. వి. ఇ. స్త్రీ. నవసస్యేష్టి, ఆగ్రయణము.

**అగ్రహారము** సం. వి. అ. పుం. 1. పోషణముకై రాజు బ్రాహ్మణుల కిచ్చుభూమి. 2. బ్రాహ్మణ నివాసమునకై నిర్మింపఁబడిన గ్రామభేదము.

**అగ్రాంశువు** సం. వి. ఉ. పుం. తేజఃకేంద్రము, కిరణములు పుట్టుచోటు.

**అగ్రాక్షి** సం. వి. ఇ. న. ప్రక్కగన్ను, అపాంగము.

**అగ్రానీకము** సం. వి. అ. న. ముంగలిసేన.

**అగ్రామ్యము** సం. విశ. (అ. ఆ. అ.) 1. గ్రామ్యము కానిది, నగరమందలిది. 2. అపభ్రంశము కానిది, శాస్త్రసమ్మతము (పదము. మొ.) 3. వన్యము (మృగాది)

**అగ్రాహ్యము** సం. విశ. (అ. ఆ. అ.) – గ్రహింపఁదగనిది. 1. పుచ్చుకొనఁ దగనిది. 2. తెలిసికొనఁ దగనిది. 3. అంగీకరింపఁ దగనిది. 4. నమ్మఁదగనిది. 5. పరిగణింపఁ దగనిది, లెక్క సేయఁ దగనిది.

**అగ్రిముఁడు** సం. విశ. (అ. ఆ. అ.) 1. మొదటివాఁడు, ముందటివాఁడు. 2. శ్రేష్ఠుఁడు, ఉత్తముఁడు; ప్రధానుఁడు. 3. పెద్దవాఁడు. వి. అ. పుం. అన్న.

**అగ్రియుఁడు** సం. – అగ్రిముఁడు.

**అగ్రీయుఁడు** సం. – అగ్రిముఁడు.

**అగ్రేదిధిషువు** సం. వి. ఊ. పుం. మాఱుమనువు దానిని పెండ్లాడినద్విజుఁడు. స్త్రీ. అక్కకు ముందు పెండ్లాడినచెల్లెలు.

**అగ్రేవణము** సం. అవ్య. అ. న. (అగ్రే+వనము) వనాగ్రము, అడవిచివరను.

శ్లో. అగ్రేవణం వ్రజమానే ప్రతీచ్యాం చంద్రమండలే.

**అగ్రేసరుఁడు** సం. – అగ్రసరుఁడు.

**అగ్ర్యుఁడు** సం. – అగ్రియుఁడు.

**అఘటమానము** సం. విశ. (అ. ఆ. అ.) ఘటిల్లనిది, సంభవింపనిది.

క. మానవునకు నెఱుఁగు టఘటమానముగాదే. భార. అర. 1. 331.

**అఘభోజి** సం. విశ. (న్. సీ. న్.) దేవపిత్రతిథులకు పెట్టక తాను తినువాఁడు.

**అఘమర్షణము** సం. వి. అ. న. పాపమునశించుటకై జపించునట్టి మంత్రము. (ఇది ఋగ్వేదమున 190. వ. సూక్తము. జలములందుండి మూఁడుమాఱులు దీనిని జపింపఁగా గురుతల్పగమనాది మహాపాతకములు గూడ నశించును.)

**అఘము** సం. వి. అ. న. 1. పాపము. 2. ద్యూతాది వ్యసనము. 3. అశౌచము. 4. దుఃఖము.

**అఘశంసి** సం. విశ. (న్. సీ. న్.) ఇతరులదోషములు ప్రకటించువాఁడు.

**అఘాయువు** సం. విశ. (న్.) పాపకార్యమునకై వినియోగపడెడి యాయువు గలవాఁడు, ఎల్లప్పుడును పాపము చేయువాఁడు.

**అఘాహము** సం. వి. అ. పుం. అశౌచదినము.

**అఘోరప్రమాణము** సం. వి. అ. న. అతిఘోరమైనఒట్టు, పెద్దఒట్టు.

**అఘోరము** సం. విశ. (అ. ఆ. అ.) 1. భయంకరము కానిది. 2. దేనికంటె ఘోరము లేదో అది – అతిభయంకరము, వి. అ. పుం. రుద్రుని మూర్తిభేదము. న. శివుని అయిదుముఖములలో నొకటి.

**అఘోరుఁడు** సం. వి. అ. పుం. 1. రుద్రుఁడు. 2. రుద్రునిదుర్గను ఇరువురను అర్చించువాఁడు.

**అఘోషము** సం. విశ (అ. ఆ. అ.) ధ్వని లేనిది. వి. అ. పుం. (వ్యాక) వర్ణోత్పత్తికైనబాహ్య ప్రయత్నభేదము; ఆప్రయత్నముతోఁ గూడిన వర్ణము. (క. ఖ. చ. ఛ, మొ.)

**అఘ్నతి** సం. వి. ఆ. స్త్రీ. — చంపఁ దగనిది—ఆవు.

**అఘ్న్యుడు** సం. వి. అ. పుం. చంపనివాఁడు–సృష్టికర్త, బ్రహ్మ.

**అఘ్రేయము** సం. విశ. (అ. ఆ. అ.) 1. ఆఘ్రూణింపఁ దగనిది. 2. ఆఘ్రాణింప శక్యము కానిది. వి. అ. న. మద్యము. కల్లు.

**అచేటు–అచ్చోటు.**

క. అనిశితాస్త్రం బెయ్యది, యో నాకుం దెలియ దది మహోగ్రగత నాటం,గా నొచ్చి పడితినర దము,పై నప్పుడు సూతుఁ డచటు వాపె రథంబున్. భార. ఉద్యో. 4. 328.

చ. ...అట్లు గాన నా,కచటు నివాస మయ్యె విను మన్యతలంబులు దానిఁ బోలునే. భార. అను. 4. 438.

సీ. అమ్ముని మెలఁగినయచట నెల్లను దాను వర్తింప నొక దువ్వవైరమెత్తి. భార. శాం. 3. 92.

క. ...విప్రుండొకఁడు ప్రసంగవశమునం,జది వెను నొగి నీపద్యము, అది యెఱుఁగఁగ వలయు నచటికరిగెద భట్టీ. విక్ర. 2. 45.

గీ. అచటివృత్తాంత మంతయు నరసిపోయి. పారి. 1. 68.

**అచతురము** సం. విశ. (అ. ఈ. అ.) 1. నాలుగు లేనిది. 2. నేర్పరికానిది,

**అచరము** సం. విశ. (అ. ఆ. అ.) కదలనిది, స్థావరము.

**అచే(చ్చె)లించె** (√అచ్చెలము) అ. క్రి. ఆగ్రహించు.

ద్వి. సచివానుమతి శూద్రసమితిఁదే నంప, నచలించి యమకింకరాకృతి మెఱయు, తలవరుల్ గరువాలదంతపాశములు. నవ. 5. 260 పా. 22 పం.

**అచల** సం. వి. ఆ. స్త్రీ. భూమి.

**అచలకీల** సం. వి. ఆ. స్త్రీ. భూమి.

**అచలజ** సం. వి. ఆ. స్త్రీ. పర్వతపుత్రి, పార్వతి.

**అచలత్విట్టు** సం. విశ.(ష్.) స్థిరమైనకాంతిగలది. వి. ష్. పుం. కోకిలము. స్త్రీ. స్థిరమైనకాంతి.

**అచలము** సం. విశ. (అ. ఆ అ.) చలింపనిది, స్థిరము, శాశ్వతము. వి. అ. పుం. 1. కొండ. 2. ఏడు అనుసంఖ్య. 3. మేకు న. బ్రహ్మము,

**అచలుఁడు** సం. వి. అ. పుం. 1. శివుఁడు,స్థాణువు, 2. ఆత్మ.

**అచాపలము** సం. విశ. (అ. ఆ. అ.) చాపల్యము లేనిది, స్థిరము. వి. అ. న. స్థైర్యము.

**అచాపల్యము** సం. — అచాపలము.

**అచింతనీయము** సం. — అచింత్యము.

**అచింతితము** సం. విశ. (అ. ఆ. అ.) 1. తలఁపఁబడనిది, అనుకొనఁబడనిది. 2. ధ్యానింపఁబడనిది.

**అచింత్యము** సం. విశ. (అ. ఆ. అ.) చింతింపరానిది.

**అచిత్తి** సం. వి. ఇ. స్త్రీ. తెలివిలేమి, అజ్ఞానము.

**అచిరద్యుతి** సం. వి. ఇ. స్త్రీ. — క్షణికకాంతికలది-మెఱపు, విద్యుత్తు.

**అచిరప్రభ** సం. వి. అ. స్త్రీ. — అచిరద్యుతి.

**అచిరము** సం విశ. (అ. ఆ. అ.) 1. అల్పకాలముండునది, క్షణికము. 2. అల్పము. దీర్ఘము కానిది. (కాలము.) 3. కొలఁదికాలము క్రిందటిది, క్రొత్తది, ఇటీవలిది. వి. అ. న. అల్పకాలము.

**అచేతనము** సం. విశ. (అ. ఆ. అ.) చైతన్యము (సుఖదుఃఖానుభవము) లేనిది, జడము.

**అచేతస్కము** సం. విశ. (అ. ఆ. అ.) మనస్సు లేనిది, జడము.

**అచేష్టుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) నిశ్చేష్టుఁడు, వ్యాపారరహితుఁడు.

**అచౌటు** — అచ్చోటు.

గీ. ఈనెలవును బృందారకాధీన మిదియ,మనకు రావలసినచో టనిన నతం డ,సహ్యదుర్గంధ ఘోరదర్శనత నచౌటు, చిత్తమతిదుఃఖితంబుగఁ జేయుటయును. భార. స్వ. 19.

**అచ్చేటు**—అచ్చోటు.

అ. అది పవిత్రదేశ మచ్చటు సూచుచుఁ,గడచి చనఁగ...భార. అను. 2. 5.

సీ. ...దేవతాసన్మునీంద్ర, హర్షంబుగావించు నట్టివారచ్చటి కరుగుదు రేనొల్ల నచ్చటనియె. భార. అను. 4. 67.

వ. హరివాసరోపవాసం బచ్చటఁ గావింప. ... అను. 1, 11.

చ. ...అచ్చటినందనపాలురు...పారి. 4. 55.

**అచ్చెతబొట్టు** వి. (క. అచ్చతె—అక్షతలు) అక్షతలతోఁ బెట్టుకొనుబొట్టు.

ఉ....ఫాలాంచలసీమ లేఁబసుపుటచ్చతబొట్టుఁ జెవాకు గాజులున్. పి. శకుం. 4. 78.

**అచ్చెనగండ్లు** వి. బ. (√అచ్చెనలు.) 1. బాలికాక్రీడావిశేషము.

క. ...గచ్చకాయలు,నచ్చనగం డ్లాడుసరివయస్యలతోడన్. పాంచా. 1. 57.

2. గిరియకములు,అచ్చనగం డ్లాడెడు చిన్న చిన్న రాలు.

ఉ. ...మధులోలభృంగముల్,వారక సారెకున్ నెగసి వ్రాలుచునొప్పెఁ దదంబుదేవతల్, నేరుపుతోడ నాడు హరినీలపుటచ్చనగండ్లకై వడిన్. కళా. 6. 229.

**అచ్చెనగాయలు** — అచ్చెనగండ్లు.

(బాలికా క్రీడావిశేషము)

సీ కరకంకణధ్వనుల్ ఘలుఘల్లు రని యింపుగావింప నచ్చనగాయ లాడు. రుక్మి. 1. 86.

**అచ్చెనగుండ్లు**—అచ్చెనగండ్లు.

(అచ్చనగం డ్లాడెడు చిన్నచిన్నరాలు)

సీ. ఒచ్చికన్నియ యాడునచ్చనగుండ్లు నాఁగొండ లేవార్ధిలో నుండు నొకట. రామా. 5. 121.

**అచ్చెనలు** వి. బ. (వృత్తియందేకవచనాంతమగును. చూ. అచ్చనగాయలు, అచ్చనగండ్లు.)

1. బాలికాక్రీడావిశేషము. 2. నృత్యము.

ద్వి. చెచ్చెర సుతుప్రాణమిచ్చిన నేఁడె, యచ్చనలాడెద నభవ మీ కనక...పండితా. 160పా.

క. హెచ్చినశోకము మదిలో,నచ్చన లాడంగ ననియె నమ్మునితోడన్. జై. భా. 1. 55.

జ. అచ్చనగండ్లు, అచ్చనగాయలు, అచ్చనగుండ్లు.

**అచ్చెము** విశ—దీనికి వృత్తియం దంత్యవర్ణలోపము వికల్పముగ నగును-(సం.ప్రా. అచ్ఛం, త. అచ్చం. క. తు. అచ్చ.)

1. స్వచ్ఛము, నిర్మలము.

సీ....ఒందువిధంబులఁ బడయంగ రానియెక్కు-
డుపదంబు. గీ. అచ్చమైనతపంబున వచ్చుఁ
బడయ. భార. అశ్వ. 2.208.

సీ. అచ్చవెన్నెలచాయ నవఘళింపఁగఁ జాలు
నిద్దంపువెలిపట్టునెఱికఁ గట్టి. నైష. 6.22.

2. కేవలము, మిశ్రముగానిది, శుద్ధము.

సీ. అచ్చతెలుఁగు నభిరామ మగునొక్క-
యశ్వంబుఁ గాంచితిమి...భార. అను. 1.198.

క. అచ్చమగుభోగమోక్షము,లచ్చోటం దొర
కుఁ గరతలామలకముగన్. భీమ. 3.19.

మ....ఈవిపుడు గూర్పం బూనునీయచ్చపుం,
దెనుఁగుంగబ్బము...నీలా. 1.16.

అచ్చతెలుఁగు — శుద్ధాంధ్రము.

(వ్యవ) నా కాపుస్తకము అచ్చముగా ఇచ్చి నాఁడు. (అచ్చముగా — సర్వస్వామ్యముల తోను.)

3. తెల్లనిది.

(రాజముత్యాలవారి మునుజూచి ఆటవికులు అనినమాట.)సీ....ఈయచ్చగురిజవే రెండుఁ
గలిగె. యయా. 1.120.

**అచ్చేర** వి. (సం. అప్సరాః. ప్రా. అచ్ఛరా, క. అచ్చరె.) అప్సరస్త్రీ దేవవేశ్య.

మ....అయ్యచ్చరఁ జూచి చేరఁబని పల్కె-న్
వాఁడు విభ్రాంతుఁడై. మనుచ. 3.38.

జ. అచ్చరనది.

**అచ్చేరనది** వి. (√అచ్చెర) ఆకాశగంగ, సురనది.

క....చిచ్చఱకనుదేవర పై, నచ్చరనదిఁ
దాల్చు చెలువ మచ్చుపడంగా. దశా. 2.17.

**అచ్చేరము** వి. (సం. అక్షరమ్. ప్రా. అక్ఖరం. క. అచ్చర. త. అచ్చరం.) అక్షరము, వర్ణము. వై జ. 2.95.

**అచ్చేరువడు** అ. క్రి. (√అచ్చేరువు) విస్మయమందు, ఆశ్చర్యపడు.

చ. ...క్రౌంచు నొకయించుక పెంపునగెల్చె
వేల్పుల,చ్చరువడి పిచ్చలింప భుజశక్తియు
షణ్ముఖునుగ్రశక్తియున్.కు.సం. 10.486.

**అచ్చేరువు—అచ్చెరువు.** వి. (సం. ఆశ్చర్యమ్. క. అచ్చరి. అచ్చరియ.) ఆశ్చర్యము.

చ....వీరహ్వా. త్సరసిరుహాంబులోలి వవతంస
విభూతిగఁ దాల్చి దాల న,చ్చరువు పిశాచ
కాంతలు పిశాచములందవిలించి రొప్పులన్.
కు. సం. 11. 768.

జ. అచ్చరువడు.

**అచ్చేలము** వి. చలము, పట్టుదల.

క. బలహీనులై నవారలు, బలవంతుల నొడుచు
నపుడు బహుమాయల న,చ్చలమునఁ
జేయుట యెందును,గలయదియ జయంబ
కాదె కర్తవ్యమిలన్. భార. సభా. 2.170.

జ. అచ(చ్చ)లించు.

**అచ్చాశి(కు)** విశ. (క. అచ్చాకు—దృఢుఁడు.) జంజాటములేనివాఁడు, సంసారపుపీఁకులాట లేనివాఁడు.

ద్వి. చారుశీలాముఖ్యజలజలోచనలఁ, జేరికా
బంధులఁ జెలుల నీతణమె ప్రగఅకుఁజొర
రాకబహుదుర్గమార్గ, మగుకోహాళమహార్షి
యాశ్రమస్థలిని, జేరిచి మనము నిశ్చింతనే
తెంచి, యారూఢబలయుక్తి నచ్చాశిగాఁగ,
ననికి సన్నద్ధులమై యుందు మవల. పతివ్ర
తామాహాత్మ్యము. (బ్రౌ.)

**అచ్చిక—అచ్చికము¹.** వి. (క. అచ్చిగ, అచ్చగ—కలఁత) 1. కలవరము, శోకము.

ఉ. నిచ్చలు నమ్మహామణి...దా,నెచ్చటనుండె
నచ్చటికి నేయుపసర్గము నేభయంబు నే,
యచ్చికయున్ జనింపక సముచితసుస్థితి
నిచ్చు నిచ్చలున్. హరి. పూ. 3.174.

2. కొఱఁత, లోపము.

ఉ. అక్కట నీ కొకందులకు నచ్చిక లేక మెలం
గ విష్ణుదా, సెక్కడిభర్తగాఁగ సృజియించె
నజుండు...హంస. 1.89.

**అచ్చికబుచ్చిక** వి. (క. అచ్చికెముచ్చికె.) 1. కలుపుకోలుతనము, మైత్రి.

ఉ. అక్కఱఁజూడ వేటి కలయచ్చికబుచ్చికనే
యునంచలన్...విజ. వి. 3.30.

వ. సారంబు లగువన్యాహారంబులు దెచ్చి యిచ్చుచు నచ్చికబుచ్చిక లడరఁ గొంత కాలంబు గడపి... వేం. పంచ. 2.68.

2. కలుపుగోలుమాట; బెల్లింపుమాట.

ద్వి. అచ్చుగాఁదీర్తుమీయ ప్పని కొన్ని,యచ్చిక బుచ్చికలాడి...ద్వి. హరిశ్చ. ఉ. 636.

(ఈయర్థమున బహువచనమునందే ప్రయోగము కనఁబడుచున్నది.)

**అచ్చికము¹** — అచ్చిక.

(కొంత, లోపము.)

చ. అదె ఘృతతండుల ప్రకర మల్లవె చీరలు భూషణాదిసంపద లవె రాజురాక కులుపా యొనగూర్చినయట్లు గీతెఱుఁగ, ముదితల కేమి యచ్చికము...కళా. 6.133.

**అచ్చికము²** — అచ్చము.

(ప్రసన్నము, తేటినది.)

ఆం. భా. 1.158.

**అచ్చికలుబుచ్చికలు** వి. బ.—అచ్చికబుచ్చిక.

(కలుపుగోలుతనము.) చంద్రా. 3.45.

**అచ్చివచ్చు** అ. క్రి. (√అచ్చు⁴) అనుకూలమగు, క్షేమకారియగు.

(వ్యవ) నా కాయిల్లు అచ్చివచ్చినది. ఈ గ్రామము నాకచ్చిరాలేదు.

**అచ్చు¹** వి. (క. అచ్చు. హచ్చు–చేర్చు. త. అచ్చు. తు. అచ్చి.) 1. నాణెము కాగితము మున్నగువాని పై అక్షరములు బొమ్మలు మొ. వానిని ఒత్తుసాధనము, ముద్ర.

చ. సరసమృదూక్తులన్ . . తలో,దరిమది గాఢమై తగిలె దర్పకుఁ డచ్చునొత్తి నట్లయై...భాగ. 10. ఉ. 330.

2. చెంబు మొదలగునవి పోఁతపోయుటకును, ఇటుక మొదలగునవి తీయుటకును కూర్చిన మొదటియాకృతి, కరువు.

సీ. నెత్తమ్మిరేకుల మెత్తఁదనము దెచ్చి యచ్చునఁ బెట్టినట్లుందమొంది. భార. విరా.2.52.

3. ఆదర్శము, ప్రథమదృష్టాంతము.

ఆ. మగలఁ గోరి తొల్లి మగువలు తపములు, చేసినవసి రనివచిట్ట లెందుఁ,గలవె దీనికచ్చు నిలిపితి నీవ నీ,వలన సతులపురులు వాలి నెగాక. కు. సం. 7. 867.

4. చిహ్నము, గురుతు.

సీ. అమరారి తనవేరియచ్చులు వెట్టించి సురధేనుసమితిఁ గిలారముసేసె. కు. సం. 4. 367.

ద్వి. మొగములయం దచ్చు లొత్తి...బస. పు. 6. 599.

గీ. దానిఁ జతురంశములు చేసి దానధర్మ,ములకు నొకపాలు గైకొని మూఁడుపాళ్ళు, వెచ్చమునకును రానీక యచ్చువొడిచి, డాఁపవలయు విభుండు భండారమునను. పి. శకుం. 4. 175.

5. ముద్రవేసిన తూనికరాయి, మొ.

క. అచ్చులుఁ ద్రాసులుఁ దూములుఁ, బొచ్చెంబుగఁజేసి కపటమున నమ్మెడియా, ముచ్చువణిజులు...విజ్ఞా. ప్రా. 65.

6. విధము, పద్ధతి.

ఉ...నీ,మెచ్చున కె తవాఁడ నను మీపదభక్తులలోనఁ గూర్చి యీ,యచ్చున నానతిచ్చు భవదాదరణం బిది కోటిసేయదే. భోజరా. 7. 15.

7. ప్రతిబింబము, ప్రతిరూపము.

కవిరాజ...విశారదు లాదట సంభృతులై, యనఘ సుదుస్తరమైన భవంబున కచ్చగుసీయితిహాసము బోధన మహనీయ విధంబునఁ జెప్పిరి...భార. స్త్రీ. 1. 51. ఆం. భా. 3. 302.

8. అచ్చునఁ బోసి తీసినవస్తువు.

ఉదా: బెల్లపుటచ్చు.

(వ్యవ) అచ్చుపోసి విడిచినయాఁబోతు.

జ. అచ్చుకట్టు, అచ్చుకుప్ప. అచ్చుకూటము, అచ్చుపెద్దు, అచ్చొత్తు.

**అచ్చు²** వి. (సం. ప్రా. అచ్ఛం.) పరిశుద్ధి, నైర్మల్యము.

క. అచ్చుగలకులమువారై, విచ్చలవిడిఁదేలువారు వేశ్యల నోలిన్, సచ్చరితులై నఁగవ

యుదు రిచ్చ మెయిన్ సుఖపరాత్ము లిమ్మహి లోనన్. విజ్ఞా. ప్రా. 114.

విశ. 1. శుద్ధము, దోషము లేనిది.

క. మ్రుచ్చును బట్టినమాత్రనఁ, జెచ్చెర దండింప కతనిచేఁ దెలిగొని వాఁ, డచ్చైన విడుపు నిక్కపు, మ్రుచ్చైనం దగినదండమును గొనవలయున్. విజ్ఞా. ప్రా. 91.

గీ. చూడవచ్చిన నచ్చు మ్రుచ్చో యెఱుంగ, కాడరా దేల యీపాప మనెడువారు. శుక. 4. 46.

2. స్పష్టము.

శా. ...ఈదిక్కు చిర్నవ్వుతో, నీమోమ చ్చుగఁ జూపవే తెలవవే నేత్రాబ్జముల్ ... హరి. పూ. 7. 38.

3. యథార్థము, సరియైనది.

ఉ. అచ్చుగ మున్ను నే సలిపినట్టులె సల్పితివి ...ఉ. రా. 2. 316. (అచ్చుగ–సరిగా)

రగడ. అచ్చుగ నినుఁ దెలియవు తొలిచదువులు. ఉ. రా. 3. 92.

4. తగినది, ఉచితము.

క. వచ్చినమునిసంఘములకు, విచ్చలవిడి నర్ఘ్యపాద్యవిధు లొనరింపన్, మెచ్చుగుకనకాసనముల, నచ్చుగఁ గూర్చుండి వసరుహాక్షుని తోడన్. భాగ. 11.13. (అచ్చుగ–ఒప్పుగా, యథార్థముగా.)

సీ. పరిపరియచ్చులు పడకుండ యూడితి ... హంస. 2. 11.

జ. అచ్చుపడు, అచ్చుపఱుచు, అచ్చుపాటు.

**అచ్చు[3]** వి. (సం. అక్షః. క. అచ్చు.) 1. పాచిక.

సీ. మేటిజూదరి యన వాటమైతివుటమై నాడుచుండుదు నే నహర్నిశములు, దృష్టి యేమఱక సందియు జాగరంబును దిగయును గరయునాఁ దేటపడిన, యచ్చులలోన నే యచ్చైనఁ గైకొని మాటలోడినయట్లు వేటు గలుగ. ద్వా. 10. 88.

2. సాలెవాఁడుపయోగించు నేఁతపనిముట్టు.

3. ఇరుసుమ్రాను. (గ్రా.)

జ. అచ్చుకట్టువాఁడు.

**అచ్చు[4]** అ. క్రి. 1. అప్పుపడు, ఋణపడు.

క. ఇచ్చితి పప్పుగ మును ధన, మచ్చినయా సొమ్ము దీర్పకయ్యో చనఁగా. వచ్చునె యది నీచేతికి, వచ్చిన విహరింతు నిచ్చ వచ్చినభంగిన్. శేష. 3. 221.

ద్వి. ఇచ్చి నాచేఁ గొన నీశుండు నోపఁ, డచ్చి నాయెదుర బ్రహ్మకుఁ బోవరాదు. ద్వి. హరిశ్చ. ఉ. 728.

2. పూచిపడు, పూఁటపడు.

గీ. ...క్రోధభైరవుండు, కాశికాపట్టనం బైదు క్రోశములును, నవహితుండై యతండు చేటచ్చి కాచు. కాశీ. 5. 125.

స. క్రి. (దండుగు పన్ను అప్పు మొదలగునవి) విధిగా చెల్లించు.

క. ప్రీతిఁ గులశ్రేష్ఠునిపై, నాతతముగ లేని బ్రహ్మహత్యాదిమహా, పాతకము పెట్టి తిట్టిన, యాతం డేనూటనాలు గచ్చుఁ బణంబుల్. విజ్ఞా. ప్రా. 48.

వ. ఆలవెల్లియందు భూమి విలిచికొని యాలవెల్లి వార కృషి సేసి యరి యచ్చి నడపం గలవారుగాం బహిండి యిచ్చి యిరువండ్రు బ్రహ్మణులకు నాచంద్రార్కమునకు సత్ర(ము) నిల్పిరి. ద. శా, 4. 1281.

వ. అఖండవతిన్ లోహదండుదివియ ఒడ్డికిబోలు సలువుంపూంటను కెలరప్రోతెబోయని వశమునం బెట్టినమోదాలు 50 త్రిభువనాంకుశమాన (నేయి) అచ్చంగలాండు. ద. శా. 4. 1163.

జ. అచ్చుకొను, అచ్చుదల, అచ్చివచ్చు, అప్పు అప్పుపప్పులు.

**అచ్చు** సం. వి. ప్. పుం. స్వరము, ప్రాణాక్షరము. (అకారాదికము.)

**అచ్చుకట్టు** స. క్రి. (√అచ్చు[4]) 1. (పాలము) మడిమడిగాఁ జేయు.

గీ. అది మఱియు మెత్తగాదున్ని యచ్చుకట్టి, విత్తనాల్ చల్లి యలరుఁదీవియలయంట్లు, నాటి కారీషరజము సాంద్రముగఁ జల్లి, విసువ కేతానవెత్తుఁ గావేరినీరు. వైజ. 1.85.

2. పర్వులుచు, విభజించు.

వ. ...దీవు లేర్పఱచి భువనంబు లచ్చుకట్టి భువనాధిపతుల నిర్ణయించి ...హరి. ఉ. 9. 158.

క. ...ఆగమ, ఘట్టమునకు నడవ యచ్చు కట్టిన మునిరా,ట్పట్టాభిషిక్తు ...పాండు. 1.11.

ఉ. వేదము నచ్చుకట్టి శ్రుతివీథులతత్త్వముఁ బట్టిచూచి...నృసింహ. పీఠి. 1. 8.

**అచ్చేకట్టువాఁడు** వి. (అచ్చే[2]) బట్టలనేఁత కుప యోగించుటచ్చులు కట్టువాఁడు. (ఈజాతి వారు సామాన్యముగా కంటివైద్యము చేయుచుందురు.

**అచ్చేకుప్ప** విశ. (√అచ్చే[1]) ధనవంతుఁడు. అం. భా. 3. 3.

**అచ్చేకూటము** వి. (అచ్చు[1]) ముద్రాశుంశాల.

**అచ్చేకొను** అ. క్రి. (√అచ్చే[4]) పూచిపడు.

(వ్యవ) నూఱురూపాయలిచ్చుటకు వాఁడచ్చు కొన్నాఁడు.

**అచ్చేఎద్దు** వి. (√అచ్చే[1]) అచ్చుపోసి స్వేచ్ఛగా తిరుగ విడిచినవృషభము, ఆఁబోతు. (శ.ర.)

**అచ్చేదల** వి. (√అచ్చే[4]) 1. అంగీకారము, ఒప్పు దల.

ఉ. అచ్చపునీలవర్ణదృషదావళి నల్లనికల్వలేక డుం,బచ్చనిరాలు బిల్వనవపత్రములే యరు ణాశ్మభంగముల్, విచ్చిన యెఱ్ఱదామ రలె విశ్వపతీ విరసోపలంబు లె, ట్లచ్చు దలయ్యె నీకు నవియందునె గంధమృదుత్వ శైత్యముల్. కాశ. 2.120.(అచ్చు దలయ్యె-అంగీకృతమయ్యె అనిభావము)

2. అచ్చుట, అప్పుపడుట. 3. అచ్చివచ్చుట.

**అచ్చేపడు** అ. క్రి. √అచ్చే[2]. విణ. (ద. అచ్చు వ్వడు) 1. స్పష్టపడు, తెల్లమగు;బయలుపడు.

గీ. వలయుకొలఁది నెలుం గెత్తి వర్ణసమితి, యచ్చుపడఁగ నశ్వత్థామ నచ్చెననియె. భార. ద్రోణ. 5.315.

సీ. కాంచనస్తంభముల్ గవుసెనల్ పుచ్చి రింపారుశిల్పము లెల్ల నచ్చుపడఁగ. హరి. ఉ. 3.159.

(1 - 6)

ఉ. ఔర నిశాట దొంగతనమచ్చుపడెఁగా నెఱ దొంగ వౌదు...భాగ. 10. పూ. 1184.

2. అబ్బు, అలవడు, సిద్ధించు.

ఉ. అకమనీయశైశవమునప్పటినుండియు వార ధర్మవి,ద్యాకుశలత్వ మాత్మజుల కచ్చుపడ న్వలె నంచు...కాశ. 4.13.

క. తలఁపఁగఁగయ్యపు వెగవును,నలవును, నీ కచ్చుపడుట యచ్చెరువు...విక్ర. 6.98.

3. తగియుండు, ఉచితమగు; సార్థకమగు.

గీ. మలసి అంకెలు వైచుచు మాఱుకొనిన. వృషభములభంగి నక్కురువృషభు లిట్లు, సమదగతిఁ జేరునెడఁ జూచి రమరు లర్థి, ననిమిషత్వంబు దమ కపు డచ్చుపడఁగ. భార. విరా. 5. 165.

4. పర్వడు. 5. (√అచ్చే[1]) ముద్రితమగు.

(వ్యవ) నీపుస్తక మచ్చుపడినదా?

**అచ్చేపఱు(ఱు)చు** స. క్రి. (√అచ్చేపడు)

1. నియమించు, నియోగించు.

క. ఇచ్చట నొక్కకయ్యంబునఁ,జచ్చెమదీయాగ్ర జన్మసారథి తగువాఁ,డెచ్చోటలేమి నాతం, డచ్చుపఱుపఁడయ్యె నీక్రియకు నొండొక. నిన్. భార. విరా. 4. 28.

2. ప్రాప్తింపఁ జేయు, కలిగించు.

క. విచ్చలవిడి నింద్రియముల,నెచ్చటికైనను జనంగ నిచ్చిన నరకం, బచ్చుపఱచు... భార. అను. 5. 234.

3. పర్పఱుచు.

సీ. కొమరారుననఁటికంబములసోయగ మెల్లఁ దెచ్చి యూరులు గాఁగ నచ్చుపఱచి. పద్మ. 2. 9.

**అచ్చేపాటు** వి. (√అచ్చేపడు.) అచ్చేపడుట. (స్పష్టత)

ఆ. అవఘవశముగాదు మనను గోడంద్ర మీ,వ దినెఁ జుట్టములను సదనములకుఁ,బచ్చు మనియెఁ బలుకులచ్చుపా టడఁచుగ,గ్గదిక దైన్యమెసఁగ విదురుతోడ. భార. శల్య. 1. 11.

**అచ్చెరియము** - అచ్చెరువు. వి. (సం. ఆశ్చర్యమ్. ప్రా. అచ్చేర. క. అచ్చరి,అచ్చర్య,అచ్చరియ.) ఆశ్చర్యము, అద్భుతము. విశ. ఆశ్చర్యకరము,

ఉ. ...కాయము లేదట నీకు లోకముల్, కొంచెతనంబునన్ గెలిచికో లిది యచ్చెరి యంబు మన్మథా. కృ. శకుం. 2. 179.

**అచ్చెరువ(ప)డు**-అచ్చెరువుపడు. అ. క్రి. (√అచ్చెరువు) ఆశ్చర్యపడు.

గీ. ...తజ్జ్ఞులమనము లచ్చెరువడగ. నిర. 10. 156.

క. ఇచ్చటిబంధులు నీవును, నచ్చెరువడి వినుచు నుండ... భార. ఉద్యో. 3. 11.

**అచ్చెరువా(పా)టు**-అచ్చెరువుపాటు. వి. (√అచ్చెరువడు) ఆశ్చర్యము.

ఉ. ...అసభ యపూర్వమనః ప్రమదంబుతోడఁ బేరచ్చెరువాటు నొందె ... భార. శాం. 8. 446.

**అచ్చెరువు(ర్వు)** – అచ్చెరియము, అచ్చేరువు. వి. ఆశ్చర్యము.

చ. ...చూపులు అచ్చెరు వంది చూడఁగన్... ఉ. రా. 4. 329.

విశ. ఆశ్చర్యకరము.

మ. ...భాషావిశేషంబు లచ్చెరువై వచ్చునరేటి యన్నవికి... భీమ. 1. 72.

సీ. అచ్చర లోకచాయ పొచ్చుకోపుల మెచ్చు లచ్చెర్వు గాఁగ నాట్యములు సలుప. అహ. 1. 102.

జ. అచ్చెరువ(ప)డు, అచ్చెరువా(పా)టు, అచ్చెరువుపడు. అచ్చెరువుపాటు.

**అచ్చెరువుపడు**—అచ్చెరువడు.

**అచ్చెరువుపాటు** - అచ్చెరువాటు. (√అచ్చెరువుపడు.)

ల. ...శల్యకుంభజకుసురాజు లచ్చెరువుపాటు భయంబును బొందఁ జేయుమీ, భార. భీష్మ. 2. 88.

**అచ్చొటు**—అచ్చోటు.

క. ... కొడు కేచ,కర్కటిఁ బడియున్నాడో యచ్చొటు నూపెడువారు లేరె చూచెద వానిన్. భార. ద్రోణ. 2. 251.

మ. ... అచ్చొటను దోఁచి గ్రసింపఁబోలుఁ గలశీసూనుండు...ఆము 4. 145.

**అచ్చొత్తు** స. క్రి. (√అచ్చు[1]) 1. చిహ్నితము చేయు, గుఱుతు గలదానిఁగాఁ జేయు.

ద్వి. నీకు దీనినిజంప నేమమే చెపుమ,యాకాంత దీనిన యచ్చొత్తినదియె. బస. పు. 5.31. (దీనిన యచ్చొత్తినదియె-తనకుఁ గావలసిన దిదియేయని ఆనవాలు పెట్టినదా?)

2. ముద్రించు.

గీ. ...ఆత్మమూర్తి,యబలతలఁపున నచ్చొత్తి నట్లు సేసె. పార. ఉ. 7.83. (ఆత్మమూర్తి- ఆత్మమూర్తిని.)

**అచ్చో** అవ్య. క్రమ. (√అచ్చోటు) 1. ఆస్థలమున, ఆప్రదేశమున.

శా. ...అచ్చో నిల్వ కచ్చెల్వ త,ద్భూభృన్మేఖల వెంటఁ గానలఁబడన్ దుఃఖార్ధినిర్మగ్నయై. మనుచ. 3. 3.

2. ఆకాలమున, ఆసమయమున.

మ. మనుజాశిప్రభు నేయఁగాఁ దెగియె రంభాస్తంభము బోలి త, త్తను వచ్చో నగణోద యంబయిన చందం బొప్ప రక్తౌఘము, ల్వనధిం దేలె. ... పశా. 1. 301.

**అచ్చోటు** వి జౌ. (ఆ + చోటు—ఆచోటు,అచ్చోటు. దీనిస ప్తమ్యంతమగు 'అచ్చోటన్' అనుదానిలో 'ట' వర్ణము లోపించి 'అచ్చోన్' అను రూపము సిద్ధించినది. 'అచ్చోటు' అనుదానిలోని 'ఓ' కారము హ్రస్వమై 'అచ్చొటు' అనియు అందలి 'ఒ' కారస్థానమున 'అ' కారము రాఁగా 'అచ్చటు' అనియు పైవానిరెంటిలోను ద్విత్వము పోయి 'అచొటు, అచటు' అనియు రూపములు సిద్ధించినవి. 'ఆ + చోటు' అనుదానిలో 'చో' అనునది లోపించి తచ్ఛబ్దార్థకమగు 'ఆ' కారమునకు హ్రస్వమును, ముందువర్ణమునకు ద్విత్వమును రాఁగా 'అట్టు' అనురూపము సిద్ధించి అందు టకారద్విత్వము లోపించి 'అటు' అయినట్లును అవి ప్రకారార్థమున

'లు' తోఁగలసి 'అట్టులు, అటులు' అనురూపములు గూడ పొందినట్లును దోఁచుచున్నది. 'అచోటు, ఆవైఖు' అనునర్థ మిచ్చు 'అట్టు' అనునది క్రమముగా 'అప్రకారము' అను నర్థమును తెలిపినది. ఇతరిపదములతో సమసించునపుడు దాని తుది ఉకారమునకు ఇకారము ఆదేశముగా వచ్చును. పైవాని కుదాహరణములు యథాప్రయోగముగా గ్రహించునది. ఇక్లే 'ఇచ్చోటు' మొదలగువానిరూపావతారము గ్రహించునది.) అస్థలము, అప్రదేశము.

క. అచ్చోటఁ గడలిరాయని, నచ్చుగ వీక్షించి కౌతుకాయత్తమతిన్, మెచ్చుకొని చేసనరిగె...శుక. 1. 106.

జ. అచటు, అచోటు, అచటు, అచ్చొటు, అచ్చో.

**అచ్ఛభల్లము** నం. వి. అ. పుం. ఎలుఁగుగొడ్డు

**అచ్ఛము** నం. విశ. (అ. ఆ. అ.) స్వచ్ఛము, నిర్మలమైనది. వి అ. పుం. 1, ఎలుఁగుగొడ్డు. 2. పటికపుఱాయి, స్ఫటికము,

**అచ్ఛావాకుఁడు** నం. వి. అ. పుం. సోమయాగమున శంసనకర్తయై హోతకు సహకారిగా నుండు ఋత్విజుఁడు.

**అచ్ఛిద్రము** నం. విశ. (అ. ఆ. అ.) 1. రంధ్రము లేనిది. 2. లోపము లేనిది.

**అచ్ఛిన్నపత్త్రము** నం. వి. అ. పుం. శాఖోటకము (వృ.వి.)

**అచ్ఛిన్నము** నం. విశ. (అ. ఆ. అ.) 1. ఛేదింపఁబడనిది. 2. నివారింపఁబడనిది, తొలగింపఁబడనిది. (ఉదా: అచ్ఛిన్నసంశయము,) 3. ఎడతెగనిది, సంతతము.

**అచ్ఛేద్యము** నం. విశ. (అ. ఆ. అ.) 1. ఛేదింప శక్యము గానిది. 2. ఛేదింపఁ సగనిది.

**అచ్యుతము** నం. విశ. (అ. ఆ. అ.) 1. జారనిది, పడనిది. 2. నాశము లేనిది, స్థిరమైనది. 3. భ్రష్టము కానిది. 4. కాఱనిది.

**అచ్యుతవాసము** నం. వి. అ. పుం. అశ్వత్థము, రావి (వృ.వి.)

**అచ్యుతుఁడు** నం. వి. అ. పుం. విష్ణువు.

**అజ** నం. వి. ఆ. స్త్రీ. 1. (సాంఖ్య) ప్రకృతి. 2. ఆఁడుమేక.

**అజంభము** నం. విశ. (అ. ఆ. అ.) పండ్లు లేనిది, దంతములు లేనిది. వి. అ. పుం. కప్ప.

**అజంభుఁడు** నం. వి. అ. పుం సూర్యుఁడు. (దశార్ద్వాదశ్యాంశకాలమున నీ భద్రుఁడు ఉదితనిపుల్లుండఁ గొట్టినాఁడు - అనిపురాణము.)

**అజక** నం. వి. ఆ. స్త్రీ. కలిజబ్బులలో నొకటి.

**అజకర్ణము** నం. వి. అ. పుం. 1. వేఁగిస (వృ.వి.) 2. మద్ది, సాలము. (వృ.వి.) 3. మిరియము, మరీచము (వృ.వి.)

**అజకవము** నం.—అజగవము. అ. పుం. వాయింట. (వృ.వి.)

**అజకాజాతము** నం. వి. అ. పుం.—అజక.

**అజకావము** నం. — అజగవము. అ. పుం. శివుని యెద్దు.

**అజగంధ** నం. వి. ఆ. స్త్రీ. వాయింట (వృ.వి.)

**అజగంధిక** నం. వి. ఆ. స్త్రీ. వాయింట (వృ.వి.)

**అజగంధిని** నం. వి. ఈ. స్త్రీ. అజశృంగి, జుట్టుపుచెట్టు.

**అజగరము** నం. వి. అ. పుం.- మేఁకలను మ్రింగునది - కొండచిలువ, పెనుఁబాము.

**అజగరి** నం. వి. ఈ. స్త్రీ. ఒకానొకయోషధి.

**అజగల్లిక** నం. వి. ఆ. స్త్రీ. శిశువులకు వచ్చునొకానొకరోగము.

**అజగవము** నం. వి. అ. న. శివునివిల్లు, పినాకము.

**అజగుఁడు** నం. వి. అ. పుం. 1. విష్ణువు. 2. అగ్ని.

**అజజీవికుఁడు** నం.—అజజీవుఁడు.

**అజజీవుఁడు** నం. వి. అ. పుం. మేఁకలవలన బ్రతుకువాఁడు.

**అజట** నం. వి. ఆ. స్త్రీ. 1, భూమ్యామలకి, నేలయుసిరిక (వృ.వి.) 2. కపికచ్ఛువు. దూలగొండి (వృ.వి.) 3. ఎలుకచెవి. మూషికపర్ణి. (వృ.వి.)

**అజత** నం. వి. ఆ. స్త్రీ. 1. నేలయుసిరిక (వృ.వి.) 2. దూలగొండి (వృ.వి.)

**అజథ్య** నం. వి. ఆ. స్త్రీ. 1. అడవిమొల్ల (వ్య.వి.) 2. మేఁకలమంద.

**అజన్మము** నం. విశ. (న్. న్, ఆ. న్.) జన్మము లేనిది. వి. న్. పుం. జన్మములేమి, మోక్షము.

**అజన్యము** నం. విశ. (అ. ఆ. అ.) 1. పుట్టనిది. 2. పుట్టింపఁ దగనిది. 3. జనులకు హితము కానిది. వి. అ. న. అశుభసూచక మయిన భూకంపము తోఁకచుక్క మొదలగునుత్పాతము.

**అజప** నం. వి. ఆ. స్త్రీ. ఉచ్ఛ్వాసనిశ్వాసములచేత నే అక్షరములను పుట్టించు- అనఁగాఁబలికించు- నట్టి మంత్రము. (ఇదియే 'హంసః' అనుమంత్రము. చూ. కాశీ. 5. 244.)

**అజపథము** నం. వి. అ. పుం.- అజవీథి.

**అజపాదము** నం. వి. అ. పుం. పూర్వాభాద్రపదా నక్షత్రము.

**అజపాదుఁడు** నం. వి. అ. పుం. ఏకాదశరుద్రుల లో నొకఁడు.

**అజపుఁడు** నం. విశ. (అ. ఆ. అ.) 1. కుపాఠకుఁడు, మంత్రములు క్రమముగాఁ జదువని వాఁడు. 2. అవైదిక గ్రంథములను చదువు వాఁడు. 3. మేఁకల కాపరి.

**అజభక్షము** నం. వి. అ. పుం. వర్వరి వాయింట. (వ్య.వి.)

**అజమారము** నం. వి. అ. పుం. అజమీరు అను దేశము.

**అజమారుఁడు** నం. వి. అ. పుం— మేఁకలఁ జంపు వాఁడు-కటికివాఁడు.

**అజమీఢము** నం—అజమారము.

**అజము** నం. విశ. (అ. ఆ. అ.) పుట్టుక లేనిది. వి. అ. పుం. 1. మేఁకపోతు. 2. గొఱ్ఱెపోతు. 3. మేషరాశి. 4. ఒకదినుసుధాన్యము. 5. మాక్షిక ధాతువు.

**అజముఖుఁడు** నం. వి. అ. పుం-గొఱ్ఱెతల తలగా నమర్పఁబడినవాఁడు-దక్షప్రజాపతి.

**అజమోద** నం. వి. ఆ. స్త్రీ. 1. ఓమము (వ్య.వి.) 2. బూరుగుబంక.

**అజమోదిక** నం—అజమోద.

**అజయ** నం. వి. ఆ. స్త్రీ. 1. గంజాయి, భంగి. (వ్య.వి.) 2. దుర్గాదేవి చెలికత్తెలలో నొకతె. 3. మాయ.

**అజయము** నం. వి. అ. పుం. అపజయము, ఓటమి.

**అజయుఁడు** నం. విశ. (అ. ఆ. అ.) గెలుపు లేని వాఁడు, జయములేనివాఁడు. వి. అ. పుం. 1. అజవాహనుఁడు, అగ్ని. 2. విష్ణువు. 3. ఒకానొక సంస్కృతనిఘంటుకర్త.

**అజయ్యము** నం. విశ. (అ. ఆ. అ.) జయింప శక్యముగానిది.

**అజర** నం. వి. ఆ. స్త్రీ. 1. కలబంద (వ్య.వి.) 2. బల్లి.

**అజరము** నం. విశ. (అ. ఆ. అ.) 1. ముదిమి లేనిది. 2. క్షీణింపనిది. వి. అ. న. పరమాత్మ. పుం. బొద్ది, వృద్ధదారకము (వ్య.వి.)

**అజరుఁడు** నం. వి. అ. పుం-ముదిమి లేనివాఁడు-దేవత, వేలుపు.

**అజర్యము** నం. విశ. (అ. ఆ. అ.) క్షీణింపనిది, తఱుఁగనిది. (మైత్రీవాచకమునకు విశేషణ మైనప్పుడే యీరూపము సిద్ధించును. ఇతర స్థలములందు ఋకారాంతమగు 'అజరిత' అగును.)

**అజలంబనము** నం. వి. అ. న. నీలాంజనము, సౌవీరాంజనము. (సుర్మా.)

**అజలోమము** నం. వి. న్. పుం. 1. దూలగొండి, శూకశింబి (వ్య.వి.) 2. మేఁకవెండ్రుక.

**అజవీథి** నం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. మేఁకలత్రోవ. 2. ఆకాశమునందలి ఛాయాపథ విశేషము. (ఇది మొదలుకొని అగస్త్యస్థానమువఱకు పితృయానపథము.)

**అజశృంగి** నం. వి. ఈ. స్త్రీ. జుట్టుపుమొక్క.

**అజస్రము** నం. విశ. (అ. ఆ. అ.) ఎడతెగనిది. క్రి. విశ. అ. న. ఎల్లప్పుడు, అనవరతము.

**అజహ** నం. వి. ఆ. స్త్రీ. దూలగొండి (వ్య.వి.)

**అజహత్** నం. శతృ. విడువకున్న.

**అజహత్స్వార్థ** నం. వి. ఆ. స్త్రీ. (అలం) ఒకవిధ మైనలక్షణ. ఉపాదానలక్షణ. (ఇది స్వార్థమును విడువకయె అర్థాంతరమును దెలుపును. 'కా

వళ్లు వెళ్లుచున్నవి' అనునప్పుడు కావళ్లను పదము కావళ్ల నే కాక లక్షణచే కావళ్లుమోయు వారిని గూడఁదెలుపును. ఇట్లే 'గొడుగులు వెళ్లుచున్నవి' మొ.)

**అజహల్లింగము** సం. వి. అ. పుం. నియతలింగమైన విశేషణము. (విశేష్యము మఱియొకలింగము గలిగియుండఁగా దానికి విశేషణమయ్యుఁ దనలింగమును విడువకుండు విశేషణశబ్దము. ఉదా: దరిద్రుఁడు దానపాత్రము, సాక్షియే ప్రమాణము.)

**అజాంత్రి** సం. వి. ఈ. స్త్రీ. నీలవుష్ప (వృ.వి.)

**అజాగరము** సం. విణ. (అ. ఆ. అ.) మెలఁకువ లేనిది. వి. అ. పుం. దేనికంటె జాగరము కలిగించునది లేదో అది, బొత్తిగా నిద్రపట్టనీయనిది- గుంటగలిజేరు, గుంటగలగర, భృంగరాజము. (వృ.వి.)

**అజాగళ(ల)స్తనము** సం. వి. అ. పుం. మేఁకమెడచన్ను. (దానివలె నిరర్థకమగుదానిని దెలుపుట కుపయోగించును.)

**అజాగ్రత్త** సం. వి. ఆ. స్త్రీ. జాగరూకతలేమి, మెలఁకువలేమి.

**అజాజి** సం. వి. ఈ. ఇ. స్త్రీ. 1. తెల్లజీలకఱ్ఱ (వృ.వి.) 2. కాకిమేడి (వృ.వి.)

**అజాజీవుఁడు** సం—అజజీవుఁడు.

**అజాతకకుత్తు** సం. వి. ద్. పుం. బాగుగా మూఁపురము పెరుఁగనిగిత్త, లేఁతగిత్త.

**అజాతము** సం. వి. (అ. ఆ. అ.) పుట్టనిది.

**అజాతవ్యంజనుఁడు** సం. విణ. (అ.ఆ.అ.)స్ఫుటముగాని యౌవనచిహ్నములు గలవాఁడు.

**అజాతవ్యవహారుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)వ్యవహారము చేయఁదగినవయసు రానివాఁడు.

**అజాతశత్రువు(త్రుఁడు)** సం. వి. ఉ. పుం. యుధిష్ఠిరుఁడు.

**అజాదని** సం. వి. ఈ. స్త్రీ. దురాలభ, తీఁటకసింద (వృ. వి.)

**అజాని** సం. వి. ఇ. పుం. భార్యలేని పురుషుఁడు.

**అజాపత్వము** సం. వి. అ. న. దగ్గు మొదలగువానిని బోఁగొట్టుటకు మేఁకనేయి మున్నగువానితోఁ జేసినమందు.

**అజారము**—హజారము వి. (క. అజార, హజార.) 1. ఆస్థానమండపము, కొలువుకూటము. 2. మొగసాల.

సీ. రాజవర్గ పరాకజారమున దొరలు, గాచి
నారని హెగ్గడికత్తె తెలుప. కువల. 2. 3.

**అజావికము** సం. వి. అ. న. మేఁకలయొక్కయు గొఱ్ఱెలయొక్కయు సముదాయము.

**అజితము** సం. విణ. (చూ. అజితుఁడు.) వి. అ. న. 1. విషమును హరించునొకమందు. 2. విషము గల యెలుక.

**అజితుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) గెలువఁబడనివాఁడు. వి. అ. పుం. 1. విష్ణువు, 2. శివుఁడు. 3. బుద్ధుఁడు.

**అజినపత్ర** సం. వి. ఆ. స్త్రీ-చర్మమువంటి ఱెక్కలు గలది - గబ్బిలము.

**అజినఫల** సం. వి. ఆ. స్త్రీ - తిత్తివలె నుండుపండ్లు గలది - ఒకానొకఓషధి.

**అజినము** సం. వి. అ. న. లేడి మున్నగువాని చర్మము.

**అజినయోని** సం వి. ఇ. పుం. లేడి, హరిణము.

**అజినవాసి** సం. విణ. (న్. నీ. న్.) అజినమును ధరించువాఁడు.

**అజిరము** సం. వి. అ. న. 1. ముంగిలి. 2. విషయము. 3. శరీరము. 4. గాలి. 5. కప్ప.

**అజిరీయము** సం. విణ. (అ. ఆ. అ.) అజిరమునకు సంబంధించినది.

**అజిహ్మగము** సం. విణ. (అ. ఆ. అ.) తిన్నగా-వక్రము గాకుండఁగ - పోవునది వి. అ. పుం. బాణము.

**అజిహ్మము** సం. విణ. (అ. ఆ. అ.) 1. కుటిలము కానిది, ఋజువైనది, 2. సరియైనది, నిష్కపటము, న్యాయ్యమైనది.

**అజిహ్వము** సం. విణ. (అ. ఆ. అ.) జిహ్వ లేనిది. వి. అ. పుం. కప్ప. (ఇది అగ్నికి నపరాధము చేసి యతని శాపమున నాలుకఁబోఁగొట్టుకొన్నదని పురాణప్రసిద్ధి.)

**అజీకవము** సం. వి. అ. న. శివునివిల్లు, పినాకము.

**అజీగవము** సం.—అజగవము.

**అజీగావము** సం.—అజగవము.

**అజీర్ణము** సం. విశే. (అ. అ. అ.) జీర్ణము కానిది, అఱుగనిది. వి. అ. న. అన్నాదికము అఱుగనట్టి వ్యాధి.

**అజీర్ణి** సం. విశే. (న్. నీ. న్.) అజీర్ణరోగముకల వాఁడు. వి. ఈ. స్త్రీ. అజీర్ణరోగము.

**అజీవనము** సం. విశే. (అ. అ. అ.) 1. జీవనము-ప్రాణము-లేనిది. 2. జీవనాధారము లేనిది వి. అ. న. బ్రతుకులేమి, మరణము.

**అజీవని** సం. వి. ఈ. స్త్రీ. మరణము. (ఇది శపించునప్పుడే ప్రయోగింపఁబడును. ఉదా: అజీవనిస్తే శఠ భూయాత్—శఠా! నీకు మరణము కలుగుఁగాక.)

**అజీవము** సం. విశే. (అ. ఆ. అ.) జీవము లేనిది. వి. అ. పుం. మరణము.

**అజుఁడు** సం. వి. అ. పుం. 1. భగవంతుఁడు. 2. బ్రహ్మ. 3. విష్ణువు. 4. శివుఁడు. 5. చంద్రుఁడు. 6. కాముఁడు. 7. జీవుఁడు. 8. దశరథుని తండ్రి. 9. ఒకానొక ఋషి.

**అజేయము** సం. విశే. (అ. ఆ. అ.) గెలువఁదగనిది. వి. అ. న. (వైద్య) విషహారి మగుఘృత విశేషము.

**అజైకపాత్తు** సం. వి. త్. పుం. 1. ఏకాదశరుద్రులలో నొకఁడు. 2. పూర్వాభాద్రపదానక్షత్రము.

**అజైడకము** సం. వి. అ. న. (అజ+ఏడక)—అజావికము.

**అజ్జ¹** = పంజ్జే. వి (తు.అజె.) 1. అడుగు, పాదము.

క....చాగ మొనఁగెడిచో యుంఁ, డజ్జల ముజ్జగములుగొని, యుజ్జ్వేగెంగఁ గ్రిందికనిచితివిగదా. అచ్చ. రా. బాల. 155.

2. అడుగుజాడ.

ద్వి. మోచియును మోవకునికిఁ, దొక్కిన యజ్జలుదోఁపకు డుండయు.ఏ డితా. పర్వ. 241పా.

3. అడుగుపరిమితి గల ప్రదేశము.

ఉ....నాలు గయి దజ్జలు వెంటనె యేఁగుదెంచి...చంద్ర. 2.91.

జ. అజవాలు.

**అజ్జ²** వి. (సం. అద్య ప్రా. అజ్జ. క. అజ్జ = సమయము. హిం. ఆజ్.) సమయము, అదను.

గీ. అజ్జపాటించి మది వెఱ యుజ్జగించి, నయము, మెఱయ నప్పాంచాలరాజసుతుఁడు, గదిసి యెగసి కుంభస్థలి గదఁబగుల్పఁ, గొండ గూలిన ట్లక్కరి గూలె నధిప. భాగ. శల్య. 1.320.

ఉ....మీ,నజ్జను జేరి యజ్జగని భక్తియొనర్చుచు విద్య నేర్చి...శశా.2.43. (బ్రౌ. పాఠము- 'ఒజ్జగని.' అని అపముద్రి.) ఆం. శే. 4.

విశే. 1. అనుకూలము, తగినది.

క. అని పలికె నగియు మొదలుగ, వెనుతీయక యజ్జయైనవేళల నెల్లన్, జనుదెంచువాని రతి నవ్వనితామణి తనివిలేక వర్తిలఁ దొడఁగెన్, శుక. 3, 498.

2. ఒప్పు, బాగు.

అజ్జగాఁ దిలకంబు హవణించి నుదుట. (బ్రౌ.)

**అజ్జేవాలు** వి. (√అజ్జ¹) - పాదములే ఆయుధముగాఁ గలది - చరణాయుధము, కోడి.

ఉ.... వే జరుగు మంచును వెన్నెలచేనికేఁపడన్, జాలు ననఁగఁ గూఁత లిడఁజాగెఁడుటాంపుటజ్జవాల్గముల్.అచ్చ. రా. అయో. 38.

**అజ్జుక** సం. వి. అ. స్త్రీ. వేశ్య.(దీనికి నాటకమందుఁ దప్పఁ దక్కనచోఁ బ్రయోగము లేదు.)

**అజ్ఝటి** సం. వి. ఆ. స్త్రీ. నేలయుసిరిక (వృ.వి.)

**అజ్ఝము** వి. (సం అధ్యాయః. ప్రా. అజ్ఝాయ.) కొన్ని పనసలు గల వేదభాగము.

ఉ. ...ఈ, యజ్ఝములోన నాపనస యన్న... పాంచా. 4. 25.

**అజ్ఝరె**—అజ్ఝరే, అజ్ఝారె, అజ్ఝారే. అవ్య. ప్రశంసార్థకము, బళిరే,

మ. ...ఔరౌఁ వక్షోజముల్, వదనం బజ్ఝరె యంచు...మల్ల. శృం. 18.

ఉ. అజ్ఝపలోచనల్ పలుకునప్పుడు విప్రులు హోమవేళ మీ,రొజ్ఝలు రెండు రెండు సమిదుతరం మీయవధాని ।బహ్వా యీ,య జ

ములోన నాపనస యన్న వసిష్ఠులు మీరు
శ్రౌతముం, దజ్ఝరె యంచుఁ బంచుకొని
యందలు వేల్చుచు ద్రవ్యదక్షిణల్. పంచా.
4. 25.

('అజ్జరె' అని శ. ర.)

**అజ్ఝరే**—అజ్జరె.

**అజ్ఝారె**—అజ్ఝరె.

శా. ...అ,య్యారే చక్కవ సైకపుంగవునుతీ
రజ్ఝారె...ఇందు. 5. 114.

**అజ్ఝారే**- అజ్ఝరె.

శా. ...ఆవావిలాసంబుల,జ్ఝారే జవ్వన మద్దిరా
వగలు మజ్ఝారె తనూవిభ్రమ ము...శశాం.
3. 23.

**అజ్ఝలము** సం. వి. అ. న. 1. పలక, కేడెము.
2. నిప్పున్న బొగ్గు.

**అజ్ఞాతచర్య** సం. వి. ఆ. స్త్రీ. 1. తెలియఁబడని
ప్రవర్తనము. 2. అజ్ఞాతవాసము.

శ్లో. వాంసాస్సంప్రతి పాండవా ఇవ వనాదజ్ఞాత
చర్యాంగతాః. మృచ్ఛ. 5. 6.

**అజ్ఞాతము** సం. విశ. (అ. ఆ. అ.) తెలియఁబడనిది.
**ఉదా**: అజ్ఞాతభుక్తము — తెలియకుండఁ దినఁ
బడినది.

**అజ్ఞాతవాసము** సం. వి. అ. పుం. ఒరులకుఁ దెలియ
కుండ వర్తించుట.

**అజ్ఞానము** సం. విశ. (అ. ఆ. అ.) తెలివి లేనిది,
బుద్ధిలేనిది. వి. అ. న. 1. తెలియమి ఎఱుక
లేమి. 2. (వేదాంత) జ్ఞానవిరోధియగు భావ
రూపపదార్థము, అవిద్య, మాయ.

**అజ్ఞాని** సం. విశ.(న్. నీ. న్.) జ్ఞానములేనివాఁడు.

**అజ్ఞుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) 1. తెలియని
వాఁడు, ఎఱుఁగనివాఁడు, మూర్ఖుఁడు.
2. కొంచెె మెఱిఁగినవాఁడు, అల్పజ్ఞుఁడు.

**అట** వి. ప. 1. అక్కడ, అచ్చోటు.

క. అంత నట నక్కుమారుం, డెంతయుఁ
గరుణమ్మొదవ నేడ్చుచు నుండన్. నిర్వ.
2.58.

చ. ...హోమదీక్ష గై,కొనఁ జనె నింద్రజి
త్తటకు గొబ్బునలక్ష్మణుఁబంపుము...దశా.
7.141.

సీ. అటసాగ జమిత్రలోయఁబడి వేగ దహించె...
ప్రతాపాగ్ని. ఆము. 1. 56. (అటన్ -
అచ్చటను అని.)

2. ఆ కాలము, ఆసమయము.

గీ. ఆడురాచూరుఁడును బాలె నటకుమునుపు.
మనుచ. 6.51.

3. తచ్ఛబ్దార్థకము. చూ. అటమున్ను, మొ.

ద్వి. ఇటు సేయుమన్నవాఁడసకులాధిశుఁ, డట
నాసహోదరుం డగు రాజ్యకర్త, యట
మీఁద నీకొర్కె యడపడ నేల, కటకటా
కైకేయి కడు ముగ్ధవైతి. రం. రా.
అయో. 97.పా. 5. పం. (అటమీఁదన్ -
తదుపరి, దానిమీఁద.)

4. కొన్నిపట్ల అర్థవిశేషము లేకయే ప్రయో
గింపఁబడును.

సీ. వినవయ్య నహుషుఁడన్ జనపతి నేను మీ
పూర్వజులకు నటపూర్వజుండ. భార. అర.
4.119.

సీ. శీతమున సుధాసింధుశీకరావళికంటె నట
మున్న యెగసె శీతాంశురుచులు. కి. సిం.
7.888.

**అవ్య.** క్రమ 1. ఆవల, ఆప్రదేశముతరువాత.

**సీ.** హిమాచలమును నావల హేమకూటంబును
నట నిషధంబు నొప్పు. భార. భీష్మ. 1.21.

2. పిమ్మట, అనంతరము.

క. దేవవ్రతుండు గీర్వాణావాసంబునకుఁ
జనినయటఁ గురునికరం, బేవాని నడిగి
తెలియునొ,కో విశ్రుతధర్మసంప్రయోగ
విధంబుల్. భార. స్త్రీ. 2.117.

చ. ...అనిఁ బేర్చువాఁడ నట భూవర దైవమ
నేర్చు నావుడున్, భార. ద్రోణ. 4.293.

జ. అటమున్ను, అటమొన్న.

**అట** సం. వి. ఆ. స్త్రీ. 1. భిక్షలోనగువానికొఱకు
తిరుగుట, పర్యటనము. 2. భ్రిమ్మరితనము,
వృథాభ్రమణము.

**అటకలి** *వి.* జిడ్డుపోవుటకై రుద్దుకొనెడి పదార్థము.

చ....చందనం, బటకలిఁ బ్రామె నొక్కకుటి లాలక యంబరరాజుపట్టికిఁ. ప్రబంధ. 572. *యయా. 4.89.*

**అటతాళము** *సం. వి. అ. పుం. (సంగీత)* తాళ భేదము,

**అటనము** *సం. వి. అ. న.* త్రిమ్మరుట, తిరుగుట.

**అటని** *సం.వి.ఇ.ఈ.*స్త్రీ. వింటికొప్పు, గనయము.

**అటమట**-అటమటము.

(మోసము, వంచన, మాయ)

క. కటకట గురువులతోనే, గుటగుటలా నేను గోరుకోరిక వితగా, నటునిటు ప్రొద్దులు పుచ్చుచు, నటమటఁ బెలుగాయనుద్దులాడెద వౌరా. శశాం. 3.78.

(దుఃఖము, బాధ.)

క....అయ్యో,రక్కసులచేత మడిసెనె, యక్కట తనుఁగన్న తల్లి యటమట గుడువన్. యయా. 3.124.

(అపలాపము)

గీ. అటమట యనంగ నపలాప మలరుచుండు. ఆం. భా. 1,116.

**అటమటకత్తె** *విశే.* (√అటమటము) మోసకత్తె, వంచకురాలు. ద్వి. శ. సా. 3. 103 పొ.

**అటమటకాఁడు**-అటమటీఁడు.

**అటమటము**—అటమట *వి.* (*క.* అటమట, అట మటె—మోసము. *త.* అడవైముడవై. *తు.* అటమట.) 1. వంచన, మోసము, మాయ.

వ....కుటిలాత్మ యటమటమ్మున విద్య గొనుటయుం గాక. మనుచ. 5.19.

2. దుఃఖము, బాధ. 3. అపలాపము, మోసపు మాట. *విశే.* 1. అసత్యము.

క. ఇటు చూచినఁ జెలిపైఁ, బ్బటు చూచిన సుతుని నేర మవుఁగాదనఁగా, నెటువలె వచ్చునొ మీఁదట, నటమటమో లేక నిజమొ యది యెఱుఁగముగా. సారంగ. 2. 253.

2. వ్యర్థము,

చ. అటమటమయ్యె నాథజనమంతయు భూవర నేఁడు సూడుమా, యిటువలె గారవించు జగదీశుఁడు కృష్ణుఁడు లేనిపిమ్మటం,బటుతర దేహలోభమునఁ బ్రాణము లున్నవి వెంటఁ బోక...భాగ. *1. 373.*

*క. ఇటువలె వెదకియుఁ దమ త్రి,ప్పట గురువిం హితులమంత్రపరనం బెటు ల,ట్లటమటమై పోఁజొచ్చిన, గటకటపడి యొక్కొకపుడు కపు లడియాసన్ రామా. 6.65.*

3. శుబ్ధము, కలఁత నొందినది.

క. చటులోగ్ర ప్రళయంబున, నటమటమై యున్నయప్పు డంభోరాశిన్, వటపత్రము నందా హరి, యెటువలె వర్తింపుచుండు నెఱిఁగింపుమయా. వేం. మా. 6. 241.

4. భగ్నము, చెడిపోయినది.

క. ఇటువలెఁ బెక్కుతెఱంగుల, నట వనటఁ దొలంగి రాక యారటపడఁగాఁ, దటుకున నిటు రా జెఱిఁగిన, నటమట మగుఁ గార్య మనుచు నాశీజనముల్. సారంగ. 3. 105.

జ. అటమటకత్తె,అటమటకాఁడు, అటమటించు. అటమటీఁడు.

**అటమటించు** *అ. క్రి.* (√అటమటము. *క.* అట మటిసు.) బాధపడు.

గీ. తావు గానంతె చాలుఁ గాంతారమైనఁ, జాలుఁ గొలువిందుఁ జొన్ప నామాలుడు గును, చనుట మేలిఁకఁ బనికిరా దనిరిబంటు, లరిది సీతున దండులో నటమటించి. రా. వి. 2. 70.

*స. క్రి.* 1. వంచించు, మోసపుచ్చు.

గీ. యతి ననుచు వేషభాషల నటమటించి, పొంచి తటివేచి కన్నియఁ గొంచు నరిగె. విజ, వి. 3. 161.

2. అపహరించు.

సీ. అప్పు లిచ్చినచోట నటమటించిరి డాఁచి కొనినపత్రంబులు చినిఁగిపోయె,శుక.2.360.

**అటమటీఁడు** — అటమటకాఁడు. *విశే.* (√అటమ టము. *త.* అడామడియన్.) వంచకుఁడు, మోస గాఁడు.

ఆ. వాదులానితోడ వాట్లీనితోడను, బూతు తోడఁ దిండిపోతుతోడ, నటమటీనితోడ నడ

యరితోడను,వెలకు నెత్తమాడ వెరవుగాదు. ఉ. హరి. 3. 112.

సీ. శితికంఠునకును నెచ్చెలికాఁడు కాఁడొకో యటమటీఁడై నయీయక్షభర్త.కాశీ.7.60.

**అటము** సం. విశ. (అ. ఆ. అ.) త్రిమ్మరునది, తిరుగునది.

**అటమున్న** అవ్య. (√అట) తత్పూర్వము, అంతకు ముందు.

సీ. ...విచిత్రుఁడనఁగ,దైత్యేంద్రుఁ డటమున్న తత్కుమారద్వయసఖుఁడై నవాఁడు వాసవునితోఁడఁ, బోటాడ్డి గెలిపించెఁ బూర్వగీర్వాణుల...ఉ. హరి. 4. 220.

**అటమొన్న** వి. (√అట) మొన్నటికి పూర్వపు దినము; మొన్నటికి సన్నిహితభూతకాలము.

సీ. అటమొన్న పుణ్యంబునకు స్వర్గ మిచ్చితా నడవుల కేఁగెఁగాక...దశా. 2. 418.

(అటమొన్న :- అచిరకాలము క్రిందట అని భావము.)

**అటరుషము** సం. వి. అ. పుం. అడ్డసరము (వృ.వి.)

**అటరూషము** సం.—అటరుషము.

**అటవి** సం. వి. ఇ. ఈ. స్త్రీ. అడవి, అరణ్యము.

**అటాట్య** సం. — అట.

**అటిక**—అట్టిక[1]. వి. మూతివెడల్పుగల చిన్నకుండ, దాక; కుండ.

క. అంతటఁ బసిండియటికల,దొంతులు గావించి ...రాజ. చ. 2. 128.

**అటికమామిడి** వి. ఒకానొకయోషధి.

సీ. మామెనయను నేలమామెన యటికమామిడి దూలగోవెల మేఁకమేయు. గీ. నాకునల్లేరు ...హంస. 4. 10.

**అటు**—అట్టు[2], (చూ. అచ్చోటు.) 1. ఆవైపుగా.

క. జనపతి యటు చనక నిలిచి సంతాపమునన్. ఆము. 2. 77.

చ. ...అసియాడులేఁగవును నిట్టటుఁ దొట్రిలు పద్ద్వయంబు...ఉ. రా. 6. 65.

క. కన్నియ కమండలూదక, మున్నది నీ వటు దొలంగకుండఁగ దండం, దిన్నఁదనంబున నుండుము. విప్ర. 3. 78.

2. ఆప్రకారముగా.

క. మాయాశబలుండై యటు, నేయకపోరామి భూతసృష్టి యొనర్చుఁ. భార.శాం.5.163.

గీ. అక్కటా దైవ మటు నేయదయ్యెఁ గాక. నైష. 2. 123.

3. అర్థవిశేషము లేకయే అనుధాతువునకుఁ బూర్వమం దుపయోగింపఁబడును.

గీ. ప్రార్థనము చేకొను మటంచుఁ బలికె జముఁడు. నైష. 3. 74.

వి. తచ్ఛబ్దార్థకము. చూ.అటువంటి,అటువలె.

**అటావలియెల్లుండి** = ఆవలియెల్లుండికి తరువాతి దినము, నేటికి తరువాత నాల్గవదినము.

అటుగనుక = (అటు అగును గనుక) అందుచేత, కాఁబట్టి. కిరా. 1. 73.

అటుగావున—(అటు అగును గావున) అందుచేత, కాఁబట్టి, కావున. భార. శాం. 3. 453.

జ. అటుండు, అటుపెట్టు, అటుమొన్న, అటులు (ట్లు), అటువంటి, అటువలె, అట్టు[2], అట్టులు.

**అటుండు** అ. క్రి. (√అటు.) ఆలాగున నుండు (అనాదరమును సూచించును.

క. రాతిరి పగల్లు దృఢనే,వాతాత్పర్యమున నున్నవారలటుండన్,నీతోడ మాటలాడుం, బాతివ్రత్యమునఁ గాదె భారతి కృపతోన్. కళా. 4. 130.

**అటుక** - అట్టుక, అట్టుగ (వ). వి. (సం. అట్టః) వస్తువు లుంచుట కింటిలోపల గోడలమీద అడ్డముగా కొయ్యలు లోనగువానిచే నేర్పఱచిన మంచె. హంస. 3. 94. శుక. 2. 188.

**అటుకులు**—అడుకులు.

సీ. తనకుచేలత్వ మట యథార్థంబుగాఁగఁ, జింపి దోవతికొంగునఁ జేరెఁడంత,ముడిచి తెచ్చిన యటుకులు పిడికెఁ డంటి,మమతఁ గృష్ణుఁడు మెసవెడిసమయమందు. దశా. 8. 426.

సీ. ...అటుకులడుకులు నా నగుఁ బృథుకంబులు...అం. భా. 2. 253.

**అటుపె(వె)ట్టు** స. క్రి. (√అటు) - ఆలాగున నుంచు-విసర్జించు; నిరాకరించు.

సీ. కరిచర్మమటువెట్టి కటిసీమఁ బసిఁడికమ్ములఁ
బొల్చు తెలిపట్టువలువగట్టి. జాహ్నవీ. 1. 131.

గీ. పాలవంటికులంబు గాడ్పుఅచి యుటికె, మగని నటువెట్టి రెండవమగని వెంట. పాండు. 3.81.

**అటుమొన్న** — అటుమొన్న (√అటు). (మొన్నటికి సన్నిహితభూతకాలము)

సీ. అటుమొన్న భార్గవజటికి శౌనకమౌని కొక వాడు మైనొంటకుఁడఁ జేసె కువల.2.80.

(అటుమొన్న :- అచిరకాలము క్రిందట అని భావము.)

**అటులు(ట్లు)** - అట్టులు అవ్య. (√అటు. చూ. అచ్చోటు.) 1. ఆప్రకారము.

చ...ఎట్లు సెప్పె నటులు ధరిత్రిమసడువు ... భార. విరా. 1. 252.

అ. అనిన నట్లకాక యని సర్వసేనాధిపత్య భారపట్టబంధమునకు, నియ్యకొనియె భీష్ముఁడు... భా. ఉద్యో. 4. 155.

2. దీనికి వృత్తియందు తచ్ఛబ్దార్థముపోయి ప్రకారార్థము మాత్రము నిలుచును.

చ. ప్రమదము మూర్తిమైనటులు రాగము రూపువహించినట్లు...నిర్వ. 8. 71.

క. నాయట్లు వడినయంగన, లేయెడలం గలరె ...భార. శాం. 1. 103.

ఉ. యామవతీ కళత్రుఁ డుదయంబయినట్లుగ. నైష. 1. 20.

3. దీనిపై 'కైవడి,పోలె' మున్నగునవి అర్థ విశేషము లేకయే అనుప్రయుక్తమగును.

గీ...ఉచ్చారణదతుచేత, నభిహితంబగు శబ్దం బునట్లపోలె...భా. ఆది, 3. 127.

('అట్లఁ' అనియు కొన్నిచోట్లఁ గనఁబడు చున్నది.)

చ....ఏఁగెదఁ గాన నేను మీ.పనిచినయట్లనే భరితుఁ బట్టముగట్టు సవిత్రి ధాత్రికిన్. భా, రా. అయో. 39.

క. అనిన నది యెంత గలదట్లన సేసెద నంచుఁ జని యటం దా నొకనాఁడును బెట్టుకొని మెలంగని, యనువైన సుమంతుపావలది లాగించెఁ. సాంగ. 3. 135.

**అటువంటి** విశ, (√అటు) తాదృశము, అట్టి.

చ...అటువంటి నీపురాతనమగు దివ్యమూర్తి విదితంబుగఁ జూపితివి...వి. పు 7. 371.

**అటువలె** అవ్య. (దు. (√అటు) 1. అట్లు, ఆవిధముగా.

చ. అటువలె నటులాడు పనినంత...శశాం. 4. 28.

2- ఇవార్థకము— వలె, రీతిగ.

క....మహాశ్వర్యం బుత్కటమై గడియ కుడు కునీ, అటువలె పెంచ్చులి ...... సాంగ. 3. 128.

**అటె**—అట్టె అవ్య. (చూ. అటు.)

(వృత్తాంతకథనమునకు)

క....తా, నేకశతసుతులఁ బడయఁగ, నాకన్య కవరము వడసెనటె వారువేతఁ. భా. ఆది. 5. 9.

(ఉపాలంభమునకు)

చ. అనఘవి నీవు పుడుదటె సత్యము దండ్రికి నెప్పనట్టె నా, యనుజుఁడు నేఁ యేలునటె ...భా. రా. అయో. 39.

(ఆక్షేపమునకు)

ఉ మాలఁడు సోమువంటి యటె మాలకు రాజటె యాజకుండు చం, డాలముఖంబునం గుడుప నల్వునఁ బాలులు వత్తురట్టె ...భా. రా. బాల. 601.

(ఆశ్చర్యమునకు)

క. పెడయొులగఁ జేతికైదువు,నడ నిను నీ వెఱుఁగకున్న ధరిగనియుఁ గప్పడి యూఁకుండునటె చెప్పదుకొలదియె వానికరుణ పెంపు కుమారా. భార. విరా. 5. 216.

(ఆక్షేపమునకు)

మ...విక్రమాభ్యుదిలో నేనును వాసుదేవుఁడ నతండున్ వాసుదేవుండటె. ఉ.హరి.3.12

**అట్టు**[1] వి. (క. అట్టె. త. అట్టెయూడల్.) కబంధము, మొండెము.

గీ. కామఁ జాసినకమలంబుకరణిఁ బొలుచు, కర్ణుతల యిలఁబడియు నుదీర్ణకాంతి, నొప్పు నట్టయుఁ జూచి కలుష్యందు నిడము, దెస్సి మోడై న యరదంబు ద్రిప్పె నధిప. భార. కర్ణ. 3. 371.

**అట్ట**² వి. 1. చెప్పులకు క్రిందిభాగమున నుండు తోలిముక్క. 2. ఒకదాని కొకటియంటుకొని దళసరిగా ఏర్పడినకాగితము, మొ.
(వ్యవ) పుస్తకము మీఁదిఅట్ట దట్టముగాలేదు. వానిజుట్టు అట్టకట్టుకొనిపోయినది.
3. అట్టియ. (మూఁక, గుంపు.)
వ. ...ఆ రాజులలోఁ బరస్పర మనోవైరం బులు పుట్టించిన నాడండు రెం డట్టలై.
మ. తమలోఁ బోరుచు...ద్వా. 6. 89,90.
(రెండట్టలై –రెండు పక్షములుగా ఏర్పడి.)
జ. అట్టకట్టు.

**అట్టకట్టు** అ. క్రి. (√అట్ట²) అట్టగా ఏర్పడు.
గీ. జిగి దలిర్చిన క్రొమ్మావిచిగురుఁబఱుపు, పెట్టు పెట్టినచందాన నట్టకట్టె...పి. శకుం.3.176.
(వ్యవ) కుఱుపులు అట్టకట్టినవి.

**అట్టకము** నం. వి. అ. పుం. 1, మేడమీఁదిగది. 2. నగరు.

**అట్టచెమ్మ** వి. (అట్ట–నం. అష్ట = ఎనిమిది+చెమ్మ–నం. చతుః-నాలుగు) నాలుగుగవ్వలతో ఆడెడు ఒకానొకయాట. (పందెము వేసెడి నాలుగు గవ్వలును బోరగిలఁబడినచో ఎనిమిదిగాను వెలికిలఁబడినచో నాలుగుగాను ఈ యాటలో లెక్కపెట్టుదురు.)

**అట్టట్టహాసము** నం. వి. అ. పుం. మిక్కిలి పెద్దనవ్వు.
శ్లో. అట్టట్టహాస మశివం శివదూతీ చకార. హ. (వాచ.)

**అట్టడి** వి. (నం. అట్టః. ప్రా. అట్టొ. క. అట్టళె. తు. అట్టళు.) బురుజుపై యిలు.
సీ. కోట సింగారించి క్రొత్తళంబుల నెల్ల నట్టళ్లు పన్నించి...ఉ. హరి. 2. 92.
శా. ప్రాకారంబు లగడ్త లట్టడులు యంత్రవ్రాతముల్ ...భా. రా. యు. 15.

**అట్టనము** నం. వి. అ. న. 1. చక్రాకారఫలకాస్త్రము. 2. అనాదరము, పాటింపమి.

**అట్టము** నం. విశే. (అ.ఆ.ఆ.) ఎండినది, శుష్కము.
వి. అ. పుం. 1. మేడ మున్నగువానిమీఁదిగది. 2. వధ, హింస. 3. అతిశయము. న. అన్నము, వంటకము.

**అట్టహసితము** నం. వి. అ. న. – అట్టహాసము.

**అట్టహాసకము** నం. వి. అ. పుం. మొల్ల, కుందము (వృ. వి.).

**అట్టహాసము** నం. వి. అ. పుం. పెద్దనవ్వు.

**అట్టహాసి** నం. విశే. (న్. నీ. న్.) పెద్దనవ్వు నవ్వువాఁడు. వి. న్. పుం. శివుఁడు.

**అట్టహాస్యము** నం. వి. అ. న. – అట్టహాసము.

**అట్టాలకము** నం. – అట్టాలము.

**అట్టాలము** నం. వి. అ. పుం ప్రాసాదము మున్నగువానిమీఁదిగది.

**అట్టాలిక** నం. వి. ఆ. స్త్రీ. ప్రాసాదము, ఉన్నతమైన నగరు.

**అట్టాలికాకారుఁడు** నం. వి. అ. పుం. 1. నగళ్లను కట్టెడికాసెవాఁడు, తాపిపనివాఁడు. 2. కులట యగు శూద్రస్త్రీకి చిత్రకారునివలనఁ బుట్టిన వాఁడు.

**అట్టి** విశే. (అట్టు² + ఇ.) 1. తచ్ఛబ్దార్థకము.
గీ. భట్టహర్షుఁడు ప్రౌఢవాక్ప్రౌఢిమమున, నెద్ది రచియించె బుధలోకహితముపొంగె, నట్టి నైషధ సత్కావ్య మాంధ్రభాష, ననఘ యొనరింపు నాపేర నంకితముగ. నైష. 1. 16.
2. తాదృశము; సదృశము.
ఉదా: అర్జునుఁడు మహావీరుఁడు, అట్టివాఁ డింకొకఁడు లేఁడు,
సీ. ఉడుగక యొలుపంగఁబడియు మున్న పనీత మైన తద్వస్త్రంబు నట్టివలువ, లలితాంగి జఘనమండలమునఁ బాయక యొప్పుచున్న ...భార. సభా. 2. 23.
గీ. ...వారిజముల యట్టికనుదోయి గలయతం, డర్జునుండు. భా. ఆశ్ర. 2. 40.
3. క్రియాజన్యవిశేషణములకు ఒకానొకప్పుడు అర్థవిశేషము లేకయే అనుప్రయుక్తమగును.
సీ. ...అయినట్టిదాన...భాగ. శాం. 5. 8.

**అట్టీఁడు** వి॰. (అట్టి+వాఁడు– వి. అట్టిరు-బహువచనమున మహతీవాచకముగూడ నగును.) తాదృశుఁడు, అటువంటివాఁడు; సదృశుఁడు.

చ. ...అట్టిరు తక్కుఁగల్గు భూ,రమణులు... భార. శల్య. 1. 44.

చ. ...లతాలలనల్ మృదులానిలాప వర్జిత కుసుమాతతాపళులు... సేసలువెట్టినయట్టి రై రి...భార. ఆది. 4. 17.

క. విమల తపోవిభవంబునఁ, గమలజునట్టిండ *విగతకల్మషుఁ డా స్తీక మహామునీ... భార. ఆది. 2. 219.*

**అట్టిక**[1]–అటిక.

గీ. అంగనలు వడ్డనకుఁ దెచ్చునట్టిపసిఁడి,యట్టికలు లాగిశాకముల్ పెట్టె...బహు. 4. 20. పాండు. 4. 176.

**అట్టిక**[2] వి. (సం. అట్టాలికా.) అల్పహర్మ్యము, చిన్నమేడ. ఆం. భా. 2. 17.

**అట్టిటు** – అట్టిట్టు. అవ్య. (√అట్టు[2]) 1. ఆవైపు ఈవైపు.

గీ. అట్టిటు దొలంగిపోనీక చుట్టుముట్టి, వేఁట లాడిరి మృగయులు వేడ్క నలర. ఇందు. 2. 62.

2. ఆలాగున ఈలాగున, ఏదో యొకవిధముగా (సరిగాఁ గాకుండ), వ్యత్యస్తముగా.

సీ. అట్టిటుతొడిగినయంఘ్రులరత్నంపు సమ్మాళిగలు సారె జాఱుచుండ. కళా. 2. 17.

(ఇక్లే అటిటు, అటిట్టు.)

**అట్టిటుసేయు** స. క్రి. (√అట్టిట్టు) క్షోభపెట్టు, కలఁతనొందించు. కళా. 1. 26.

**అట్టిట్టగు** అ. క్రి. (అట్టు+ఇట్టు+అగు) కలఁత నొందు, క్షుబ్ధమగు.

క. ...అ,య్యనిమిషలోచనకు హృదయ మట్టిట్టయ్యెన్. నిరం. 4. 41.

**అట్టిట్టు**–అట్టిట్టు.

(ఆవైపు ఈవైపు)

గీ. ఇవ్వ లవ్వల దైత్యు లట్టిట్టు ద్రోయ. దశా. 2. 101.

**అట్టిట్టు(టు)పడు** అ. క్రి. (√అట్టిట్టు) 1. వ్యత్యస్తమగు, తాఱుమాఱగు.

(ఆదివరాహవర్ణనము.)

గీ. ముట్టెతాఁకున దిక్కులట్టిట్టుపడఁగ. పద్మ. 7. 22.

2. క్షోభపడు, కలఁగు.

చ. ...అమనుజేశుఁడు మంగలంబునం,బెటిలిన పేలగింజవలె మిక్కిలి పుత్త్రవియోగబాధ న,ట్టిటుపడి ధారుణీస్థలిపయిం బడి... సారంగ. 3. 223.

**అట్టియ**–అట్ట[1]. వి. (క. అట్టి–కూడు) గుంపు.

క. అట్టియెడఁ జెలిమికత్తియ, లట్టియలుగఁ గూడి చేడియం గని యనిరి...నీలా. 2. 86.

**అట్టె**[1] వి. (క. అట్టు. అడు–వండు.) భక్ష్యవిశేషము.

గీ. పొలిచె మాపటిపండువెన్నెల చకోరి, పోత వితతికిఁ జాఁపట్టు వోసినట్టు. ఆము. 2. 60.

(వ్యవ) అట్టుమాఁడునట్టు కొట్టినాఁడు. అట్టు పుట్టు అనవాళ్లు. ఊరంతయు అట్టుడికినట్టుడుకుచున్నది. అట్లతద్దె. అట్టు పిట్టు ఆసాది వానిది అవ్వఅట్టు గంగనమ్మది.

**అట్టు**[2]–అటు, అటులు, అట్టులు, అట్లు. అవ్య. (చూ. అచ్చోటు.)

1. ఆప్రకారముగా, ఆవిధముగా.

2. ప్రకారము, విధము; ప్రకారముగా, విధముగా.

క. అట్టియుపాయము నీకుం,దట్టిన నృపుపొందు మాట దలఁపుము లేదా,గట్టిగ నీమగఁడెఱిఁగిన, యట్టయినఁ సిగ్గుపాటు లేఁగదె చెలియా. హంస. 2. 127.

గీ. చంద్రగుప్తుండు గావించె సరసగోష్ఠి, వట్టి మ్రాఁకులఁ జిగురులు పుట్టునట్టు. విక్ర. 1. 112.

3– అటు. (ఆవైపు)

ఉ. పట్టన మెల్ల దేవిగుడిఖామిని యారసి తోడి తెచ్చునో, కట్టెదురం నృపాలుఁ గని క్రమ్మఱ నా కెఱిఁగింప వచ్చునో, యిట్టును నట్టునుం దిరిగి యొందును గావక తానె వచ్చునో. విక్ర. 6. 122.

**అట్టుక**—అటుక.

గీ. సెట్టియరుదెంచెవానిఁజో కొట్టి నిన్నుఁ,బను తునంచాఁక నట్టుకపై వసింపు. శుక. 3. 215. హంస. 4. 44.

**అట్టుగ(వ)**—అటుక.

మ. పగలెల్ల న్వెలి నిల్చి రాతి రరుదౌత్సంగిఁ స్వగేహంబు న,ట్టుగమీఁదఁ వసియించి భార్య పయిదృష్టుల్ నిల్పి యుండంగ... కేయూర. 3. 239.

ఉ. ఒక్కనిఁ దోడితెచ్చి మఱియొక్కని నట్టువ మీఁద దాఁచి యిం,కొక్కనితో రమింతు ...ద్వా. 11. 43.

**అట్టుప్పు** వి. (అట్టు + ఉప్పు) ఒకదినుసుఉప్పు,వంట ఉప్పు.

**అట్టులు**—అటులు ($\sqrt{}$అట్టు²) కొన్నిపట్లదీనిపైని 'కైవడి, పోలె' మొదలగునవి అర్థవిశేషము లేకయే ప్రయుక్తమగును.

ఆ. అతని మేను కుంతియట్టులకైవడి, యరయ ...భార. శాం. 1. 12.

క. ...అది లేనియట్టులపోలెఁ. భార. శాం. 4. 185.

**అట్టె**—అఁట. (క. అష్టె)

(వృత్తాంతకథనమునకు)

ఉ. వీఁ డొకమంత్రసిద్ధుఁ డగువిప్రుఁ డసాధ్య బలుఁ బకాసురుఁ, నే ఁడనిఁ జంపెనట్టె యితనిం జని చూతము... భార. ఆది. 6. 306.

(ఆక్షేపమునకు)

ఉ. ఇమ్ముదివెట్టి వీనిఁ బరమేశ్వరుఁగాఁ గొని యాడె ధర్మజ,త్వమ్ములు పాండవేయు లును దానును గాని యెఱుంగరట్టె ... భార. సభా. 2. 39.

(ఉత్కర్షమునకు)

చ. జననివి నీవు వేఁడుదటె సత్యము దండ్రికి నెక్కునట్టె నా,యనుజుఁడు నేల యేలునటె ...భా. రా. అయో. 39.

(ఆశ్చర్యమునకు)

ఉ. అట్టి మహోగ్ర కోపదహనాంబకుఁడట్టె... ...దయాగుణంబు దాఁ,బుట్టిమనోజు నిచ్చు నటె...కు. సం. 5. 576.

(ప్రశ్నమునకు)

క. అడవులు నేఱులు నవి నీ,పడసినయవియట్టె ...భార. ఆది. 7. 40.

**అట్టె¹**- అట్టే, అవ్య. (అట్టు¹ + ఎ) 1. ఆప్రకారము గానే; తదేకదృష్టిగా, అదేపనిగా.

సీ. వీథి నేఁగెడుప్రౌఢవిటుఁడు పాడెడువింత యేలపదాలట్టె యాలకించు. శుక. 2. 172.

2. వెంటనే, శీఘ్రముగా,

గీ. సుదతి వడ్డించునపుడు పయ్యెద యొకింత, తొలఁగ గుబ్బలుచూచునబ్బలియుఁ బల్క, రింప లేఁడయ్యెఁ దాఁ బల్కరింపఁ దెలిసి, యట్టె పయ్యెద గప్పునో యనుభయమున. దశా. 2. 362.

**అట్టెడ** వి. 1. అడుసు మున్నగునవి యెత్తుట కుప యోగించుతట్ట. (శ.ర.) 2. కళ్లములో ఎగురఁ బోసినధాన్యమును జల్లించుజల్లెడ. (శ.ర.) 3. కాయధాన్యములందలి మట్టిగడ్డలు మొదలగు వానిని వెలువరించుటకు గోఁగుకట్టెలు మొద లగువానితోఁ గట్టినమోపు. (శ. ర.) 4. వంతెన (శ.ర.) 5. అధక పరిమాణధాన్యము పట్టెడుగోనె. ఆం. భా. 2. 166.

**అట్టెపెట్టు**—అట్టేపెట్టు.

(విడుచు.)

ద్వి. తన్ను మోచినచోటఁ దగ వట్టెపెట్టి,మిన్న క నురిఁగిన మెత్తురే జనులు. ద్వి. హరిశ్చ. ఉ. 2478.

**అట్టె**—అట్టె¹. (అట్టు¹ + ఏ) 1. ఉన్నది ఉన్నట్టు గానే, వెంటనే, శీఘ్రముగా.

క. ఈ మెఱుఁగుగండగత్తెర, చేమిడిదల యిచ్చు సాహసికుఁడు శిరం బ,ట్టే మగుడఁగ నదుకు కొనం,గాముని చంపుఁదనుఁ జంపఁగడఁగిన వానిఁ. కళా. 3. 109.

2. అధికము; అధికముగా.

(వ్యవ) అట్టేసేపు ఉండకుము. కార మట్టేతినఁ గూడదు.

**అట్టెపెట్టు** స. క్రి. (అట్టు² + ఏ + పెట్టు) 1. అధికముగా పెట్టు.

(వ్యవ) పిల్లవానికి అన్నము అట్టెపెట్టకుము అజీర్ణము చేయును.

2. విగులుచు; దిగవిడుచు; విడుచు.

(వ్యవ) కొన్నినాళ్లు రేపటికట్టెపెట్టుకొనుము. వడ్డించినభక్ష్యము లన్నియు అట్టే పెట్టిపోయినాఁడు. ఆసంగతి అట్టేపెట్టి నీవు వచ్చిన పనియేమో చెప్పుము.

**అట్ఠము** (ప్రాకృతసమము) వి. (సం. అష్టకం ప్రా. అట్ఠఅ.) ఎనిమిదిపన్నములు గలవేదభాగము. ఉదా: వాఁడు మూఁడుఅట్ఠాలసంహిత వల్లించినాఁడు. ఆం. భా. 1. 111.

**అట్య** సం—అట.

**అడ¹** వి. (క. అడె. త. అడై—అంటుకొను.) అట్ట, ముద్ద.

(వ్యవ) చింతపండుఅడ. తల అడలుకట్టనది. జ. అడగొను.

**అడ²** వి. (క. అడ, అడకె. చూ. అడకత్తెర. మొ.) పోఁక.

జ. అడకత్తెర, అడకొత్తు అడగొంటు.

**అడఁకువ**—అణఁకువ. వి. √అడఁగు. (క. అణకువె. త. అడక్కం.) 1. వంగుట.

వ....ఉత్తరీయంబులు వట్టి తివియ నీడిగిలంబడుచుం దనులతలయడంకువలం దఱుఁగని వడంకులం దనుఁదాన ముడి సడలునిద్దంపు వలువలు...వసు. 4, 23.

2. నమ్రత, అణఁగి యుండుట, గర్వము లేక యుండుట. భార. ఉద్యో. 2. 35.

**అడఁగఁగట్టు** స. క్రి. (√అడఁగు) తగ్గించు.

చ. ... చెఱఁగుమాసిన దోసమువచ్చునంచు న, గ్గలికలఁ దల్లికూ డడఁగఁగట్టె...శుక. 2. 154.

**అడఁగఁద్రొక్కు** స. క్రి. (√అడఁగు) 1. అడఁగునట్లు త్రొక్కు. దశా. 2. 159.

2. నిర్జించు, ఓడించు.

క. అల్పములకేమి కృతసం, కల్పులమైయడఁగఁ ద్రొక్కఁగలమోలేమో, పాల్పడి రిమ్మను మాయల, కల్పాంతము నాఁటియేడు గాడ్పుల నిటఁకః. రామా. 7. 70.

**అడఁగారు** అ. క్రి. (అడఁగు + అరు) ఉపశమిల్లు. అడఁగు.

**అడఁగించు**—అడఁచు. (క. అడగిసు, అణగిసు.) (నశింపఁజేయు, పోఁగొట్టు)

ఉ. ... భీష్మ మహాభ్రమెట్లు డంగించెనొకో శిఖండి యను కృత్రిమవాయువు దాఁకి దైవమా. భార. భీష్మ. 1. 52.

(ఉక్కడఁగించు, గీటడఁచు, పొడవడఁగించు, గండడఁచు, మొదలగునవి శబ్దపల్లవములుగా గ్రహించునది.)

**అడఁగిమడఁగి** అవ్య. (అడఁగి + మడఁగి) వినయముగలిగి, వినయముతో.

వ....వ్రీడావశంబున నడఁగిమడఁగి యథాపూర్వస్థితిఁ బ్రవర్తిల్లుచుండె...కళా. 4. 93.

**అడఁగు**—అణఁగు. అ. క్రి. (క. అడగు, అడంగు, అణగు, అణంగు. త. అడంగు.) 1. దిగఁబడు, క్రుంగు.

సీ. సాకతంబునఁ గాదె చక్రాయుధుఁ డడంపఁ బాతాళబిలములో బలి యడంగె. కాశీ. 2. 107.

చ. జలనిధులైన మెట్టలగు శైలములైన నడంగు నవ్వియ, త్తలమయినం దలంబయగు .. హరి. పూ. 1. 117.

2. నమ్రమగు; లొంగు, లోఁబడు.

సీ. పగతు రకంపనుపై నెత్తివచ్చి కయ్యము సేసి యాతని నడఁగఁబట్టి, కొనుటయుఁజూచి ...భార. ద్రోణ. 2. 154.

క. కొండలమెండును మూరెటి, పండులసోయగము జక్కవలకూడికపూఁ, జెండులవసయును బంగరు, కుండలమెఱుఁగు న్వెలంది గుబ్బల కడఁగుఁ. నీలా. 2. 24.

3. ఇముడు; అంతర్గతమగు, అంతర్భూతమగు.

మధ్యా. ప్రోవై నభస్థంబు వాయుఁ ద్రోచి యబ్ధాదిలో నడఁగి, యేవురుగొడుకుల తోఁ దనందొక్కయింతి యుర్వ్యగ్ర, పావక దగ్ధయై యున్నఁ జూచి. భా. ఆది.6.165.

ఆ. జ తుసటిము తెల్లగంతిపద బులో, నడఁగు క్రియ నహి సద్యస్క సకల, ధర్మములు నడఁగు... భార. శాం. 5. 115.

మధుకర. అరుగుఁ గఁబిడికిట నడఁగెడునడుములన్ హస్తిసమానపృథుయానములున్. శిశు.1.18.

చ. క్షితి హలాకృష్టిఁ బుట్టి యడఁగెన్ క్షితి యందున సీత యంచు...ఆము. 4.28.

4. దాఁగు, మఱుఁగుపడు.

ఆ. నీచదిశకు వచ్చి నిషధాచలంబున, కరిగి సురవరేణ్యుఁ డడఁగియుండె. భా. ఉద్యో. 1. 142.

క....టి,వా ధము వెలుఁగుఁ గని గొంది నడఁగినభంగిన్. మను. 2. 56.

5. నిరుద్ధమగు.

గీ. పుచ్చికొనఁడు ము ఁటఁబై ఁడభ్రోకయున్న, వలుద హొడిమియుఁ బోడువను నడువఁ దొడఁగఁ, బట్టఁదూన్త్రిపికునివేత నడఁగ కున్నె,పాణియవిఱుడువాకిలి బంధు ముగ. భా. శాం. 5. 319.

సీ. భాసురహారముల్ ప్రభ దప్పి యున్నవి ముదిత ముఖజ్యోత్స్న యొదవకునికిఁ, బ్రియ నెమ్మిఁ బటముఁ బెట్టకయున్న నోళ్లడఁగియున్నవియేల హంసకమ్ము,లనుచు ...భా. రా. కిష్కి. 57.

6, అంతర్ధానమగు, మాయమగు,అదృశ్యమగు.

క. మునినాథ చెప్పఁ జిట్టలు, మనయనిరుద్ధుండు నిన్న మగువలు గొలువ, ననయుంటరాత్రి నెమ్మది, మునిఁగలిగెఁ బిదప నున్నయునికిన యడఁగెన్. ఉ. హరి. 6. 5.

గీ. వివిధసంకల్ప కల్పనావేశముననొ, కన్నె క్రొక్కాఱు మెఱుఁగుదీఁగయును బోలెఁ, బోలిచియప్పుడ యడఁగుపూఁబోణిమూర్తి, నక్కుమారుండు నలుదిక్కులందుఁ గాంచు. నైష. 3. 88.

7 నశించు; చెడు.

సీ. అగుటలంగి యుధిష్ఠిరుఁడాదియగుభవద్భాంధవులు నీపరిపాలనమున, నుల్లసిల్లిరి.... భా. శల్య. 1. 368.

గీ. తానవంబుగ దోఁ జేయువాని మంత్ర, మునకు వేగమె లోఁజేయఁ జనదు వాఁడు, క్రొత్తమన్నన రహి ననుఁగులకుఁ జెప్ప, నయిన నది చెడు మఱివాఁడు నడఁగుఁ గాన. ఆము. 4. 260.

('రూపడఁగు' మొదలగునవి శబ్దపల్లవములుగా గ్రహించునది.

జ. అడఁకువ, అడఁగఁగట్టు, అడఁగఁద్రొక్కు. అడఁగారు, అడఁగించు, అడఁగిమడఁగి, అడఁచు.

**అడఁచు** – అడఁగించు. అణఁగించు, అణఁచు. స. క్రి. √అడఁగు. (త. అడచు, అణచు. క. అడక్కు.) 1. క్రుంగఁజేయు. దిగఁబడఁ జేయు. కాశీ. 2. 107.

2. లొంగఁదీయు, నమ్రము చేయు.

గీ. సాంబు నడఁచినదాఁక వ్రతంబు పట్టి,జలజ సంభవతనయుఁడు చలపకారి, ద్వారవతి కేఁగుదెంచె...కాశీ. 6.9.

3. తుఱుము, (కొప్పులో) ఉంచు.

సీ. నుడి గొన్న చిగురాకుజొంపంబు గెంపారఁ దల మీఁద మల్లికాదామ మడఁచి. ఉ.హరి. 5. 56.

5. కప్పిపుచ్చు, దాఁచు.

క. ...దినకరసుతునిన్, భావమునఁ దలఁపు మేనా,దేవసమునిపుట్టు వడఁచితిం గట మునన్. భా. ఆశ్ర. 1. 152.

గీ. చెప్పనోరాదు దేమని చెప్పువాఁడ, నెఱిఁగి నర్థంబు చెప్పక యెట్లడంతు, కాశీ. 4.35.

6. ప్రతిహతము చేయు, ఆఁపు.

శా. సోఁక న్వచ్చుశిలీముఖంబుల నడంచున్ ... వసు. 5. 100.

7. నశింపఁ జేయు, పోఁగొట్టు.

గీ. అది ప్రసిద్ధము విను తృష్ణ యడఁచి కర్మ, వృత్తి విడిచి నిరాలంబచిత్తుఁడై న,యాతఁడో

సుఖ దోషదుఃఖాకరంబు, లగుధనంబులు గోరెడునతఁడొ చెపుమ. భార. శాం. 1. 140.

గీ. వింధ్యగిరిగర్వసంరంభవిభవ మడఁప. కాశీ. 2. 105.

గీ. దండగల్గిన బుద్ధిమంతుండు దనకు, బలిమి కలిమియుఁ గొనసాగ వలసెనేని, శత్రువు ఋణంబుఁ జిచ్చు నెచ్చరికతోడఁ, గడమ వెట్టక కడముట్ట నడఁపవలయు. ప్రబోధ. 5. 4.

**అడకత్తెర**—అడకొత్తు. వి. √అడ². (క. అడగత్తి, అడగత్రి. తు. అడ్డకత్తెరి, ఇడకత్తిరి, ఇడకత్తి.) పోఁకలు కత్తిరించుకత్తెర. (ఇది వాడుకలోని పదము.)

**అడకము** విణ. (క. అడక, అడకు—నొక్కు, అడఁచు త. అడక్కం.) అంతర్భూతము, లోపల ఇమిడి యున్నది.

ద్వి. నానామరేంద్రబృందముమాయ లెల్ల, వారి మాయలోపల నడకముల్...విష్ణు. పూ. 1. (శ. ర.)

**అడకించే**—అణకించే, స. క్రి. (క. అణకిసు.) 1. అపహసించు, పరియాచకముచేయు.

క. మునురుకొను జరిభరంబున, నసురునురై యున్న మమ్ము నడకించితి వి, ట్లునురుమనఁ బట్టువడు మొక, యసురకు నీ వనుచుఁబలికె నాగ్రహ మెసఁగన్. మనుచ. 4. 84.

చ. పలికిన నట్లయున్నదియె పత్రికలో నడకించెదో ననున్, జెలి యిటు చూపుమా యనుచుఁ జేరఁగఁ బోవుచుఁ జేయి సాఁచె నా, యలినిభవేణి తత్క్షణయు నట్టిటు పాఱుచు దేవునాన యేఁ, గలయది యంత యుం జదువఁగా విను చూచెదు కాని నావుడున్. ప్రభా. 3. 135.

ఉ. గుబ్బలిఱేనిఁ దాలిమి నగు న్నిజభూరి విభూతిసంపదన్, గిబ్బవయాళికోడు నడకించు...రామా 1. 84.

2. మోసపుచ్చు, వంచించు,

ఆ. అసురవరుల నెల్ల నడకించి సురలను, దడవు సేయవలదు ద్రావుఁ డనుచు, వచ్చుకొలఁది నమృతవారి విభాగించెఁ, దరుణి దివిజు లెల్లఁ దనిసి పొగడ. భాగ. 8. 318.

**అడకు** స. క్రి. (క. అడకు, అడగు—నొక్కిపెట్టు, దొంతరగా నుంచు. త. అడక్కు—దాఁచు.) దాఁచు, గుప్తముగాఁ బెట్టు.

ద్వి. పరికింప నందొక్క పడిగంబుక్రింద, విడియ లతో రెండువేలమాడలను, నడకి యమ్మకు శరణార్థి సేయుచును. బస. పు. 5. 275.

ద్వి. పడిగంబుక్రిందట బనవఁడు మున్న, యడకినమాడలవిడియలుగాంచి. బస. పు. 5. 290.

**అడకొత్తు** వి. (√అడ². క. అడకొత్తు.) పోఁకకత్తిరించుకత్తెర.

ఉ. ...వీఁడె దవిలెం బథికుం డడకొత్తులోని పోఁకట్టుల నంచు,...సారంగ, 2. 167.

ఉ. ఓర్వరు బంధుజాల మడకొత్తున నొత్తును మామగారు...శశాం. 3. 67.

(క, అడకె+ఒత్తు?)

**అడగొంటు** వి. (అడ²+గొంటు) మొద్దుపోఁకచెక్క.

క. గడెతడవు వేసటలచే, నుడివడ కటు తనదు ప్రాంతనుద్దులు విన్నన్, వడి నిచ్చు నొక్క వుచ్చిన, యడగొంటుం బడుక క్రింది యాకులు రెండున్. శుక. 3. 22.

**అడగొను** అ. క్రి. (√అడ¹ త. అడైగొళ్.) అట్ట కట్టు, ముద్దకట్టు. (శ. ర.)

**అడగోలుగొను** స. క్రి. (√అడ¹ + కోలు + కొలు = సర్వము కొల్లగొను) అపహరించు.

ఉ. ...అవె శంకరార్ధదే, హం బడగోలుగొన్న సతియద్భుతరూపవిలాసగేయముల్. హరి. ఉ. 6. 16.

సీ. ఇల్లడసొమ్ము నడగోలుగొని త్రోచు నతని గతికి ..., చనుదాన శార్దూలగణవరేణ్య. భోజరా. 6. 14.

**అడజేడి**—అలజేడి. వి. (త. అడసడి.) దుఃఖము.

జ. అడజేడిపెట్టు.

**అడజేడిపెట్టు** స. క్రి. (√అడజేడి) దుఃఖపెట్టు.

చ. ...నీవు మృదుభాషిణి వక్కట యింత కోర్చిన, న్నడజడిపెట్టుమాట యిటులాడఁగఁ గూడునె యీయవాచ్యము, ల్వ్రీడువు లతాంగి...మార్క. 1. 199.

**అడప** విశే. (√అడపము) తాంబూలకరండవాహి. (తాంబూలము చుట్టి యిచ్చు సేవకుఁడు, సేవకురాలు.)

చ. కలికివరాటరాజడప గప్పురవీడెము పెట్టె నవ్వుచు, న్నలునడపంబువానికిఫణాధరవల్లి దళాంతరంబునన్, బలితపుఁదేలు మైన మునఁ బన్ని యతండది చూచి భీతిఁ ద, మ్ములమిల వైచిన న్నగిరి మూఁగినరాజకుమారు లందఱున్. నైష. 6. 141. (చి. ని. శ. ర.)

'అడప' అని కొన్ని పాఠములును 'అపుడు' అని కొన్ని పాఠములును గలవు. దీనికి ముందటి వచనము చివర 'అప్పుడు' అని అన్ని ప్రతుల లోను ఉండుటచే చి. ని. శ. ర. లు 'అడప' అనుపాఠము గ్రహించియుందురు. కాని 'అపుడు' అనుపాఠమే మూలానుసారముగా నున్నది. శ్లో:- దమార్పితాంతర్ముఖవాసనిర్మితం. సం. నైష. 16. 110. ఇట దముఁడు — కలికివరాటరాజు. ఆపక్షమున పూర్వపువచనమందలి 'అప్పుడు' అనునది తీసివేయవలయును.

**అడపకత్తె(త్తియ)** వి. (√అడపము. క. అడపగార్తి. త. అడప్పక్కారి.) తాంబూలకరండము పట్టుకొనెడియాఁడుది, తాంబూలమిచ్చుస్త్రీ.

గీ. కప్పురపుఁదావి చిలుకుబాగాలొసంగ, నడపకత్తెలు తెలనాకుమడుపు లొసఁగ. వైజ. 1. 113.

**అడపకాఁడు** వి. (√అడపము. క. అడపగాఱ త. అడప్పక్కారన్.) వక్కలాకు లుండుతిత్తిగాని బరిణిగాని పట్టుకొనువాఁడు, తాంబూలమిచ్చు సేవకుఁడు.

**అడపట్టె**—అడ్డపట్టె వి. పొలములో విత్తనములు చల్లి మిట్టపల్లములు సమ మగుటకై ఎడ్లచే లాగించెడు మ్రాను, దిండు.

**అడపడు** అ. క్రి. సంశయపడు.

ద్వి. ఇటు సేయుమన్న వాఁ డినకులాధీశుఁ,డట నానవహోదరుం డగు రాజ్యకర్త, యట మీఁద నీకోర్కి యడపడ నేల, కటకటా కైకేయి కడు ముగ్ధ వైతి. రం. రా. అయో. 97 పౌ.

**అడపది** వి. (√అడపము) —అడపకత్తె.

సీ. పెచ్చువాసనవక్క లిచ్చి చుట్టినయాకుమడుపు లీఁ దివిరెడునడపదాని. ఉ. రా. 4. 223.

**అడపము**—హడపము. వి. (తె. అడప, హడప. త. అడైప్పై,అడైప్పై అడై - తములపాకు+పై —తిత్తి.)

1. వక్కలాకులుంచుతిత్తి, బరిణి, మొదలగునది.

గీ. మెలఁత యడపముఁ దేఁ జరన్మేరువనఁగ... భోగినీసంగతికి రాజు వోవుచుండి. ఆము. 2. 75.

2. రాజాదులకు తాంబూల మందించు భృత్యుఁడు, అడపమువాఁడు. (ఈయర్థమున ప్రాచీన శాసనములయందే ప్రయోగము కనఁబడుచున్నది.)

'శ్రీమతు మాంచయనాయనింగారికింబుణ్యముగాను వారిఅడపము పోచూలెంకంగారు కారెంపూండిని శ్రీసూరేశ్వర దేవరగుడికి... సున్నము వెట్టించెను. 1229. శ. సం. కారెంపూడిశాసనము.

3. మంగలతిత్తి. శ.ర. (ఈయర్థము క. త. తు. భాషలలోఁగూడఁ గలదు.

జ. అడప, అడపకత్తె, అడపకాఁడు, అడపది, అడపమువాఁడు.

**అడపమువాఁడు** — అడపకాఁడు. (√అడపము.) నైష. 6. 141.

**అడపు**—హడపు. వి. (ఇది ప్రాచీనశాసనములందు మాత్రమే కనఁబడుచున్నది.)

1. ఉపదర్శనము, కనుపెట్టిచూచుట.

'నెఱియబోలబాదని యడపున కన్నబోలనూం కనివసమున విడ్చినఇనుపఎడ్లు పంభది. 50. ద. శా. 5సం. 1020.

2. వరుస, వంతు.

'...శకసం 1164 లో...నూంకనబోయుని కొడుకు చోడపనాయకుండు శ్రీమదు (దా) క్షారామభీమేశ్వర మహాదేవరకుం బెట్టిన యఖండవత్తిక లోహదండుదివి యొక్కండు మొదలియడపున నారిబోలకామండును రెండవు

నడపున కాటబోలనూంకండును...కా బెరసి మూనెండునెఇఆచంద్రార్కం ముంబోయంగల వారు...ద. శా. 4. సం. 1367.

ఈ క్రిందిదిపై రెండర్థములకునుదాహరణము. 'శకవర్ష 1070 గునే(ణ్టి) శ్రీకులోత్తుంగ చోడదేవర విజయరాజ్యసంవత్సర (1)రెక్షాహి దిన 28 సా శ్రీభీమేశ్వరమహాదేవరకు రెణ్డవు నడపున కాటబోలమా (వె) అడపున కొమ్మ బోలకొమ్మయ తమతల్లి తణ్డ్రులకు దమ్మార్థత్థముగాం బెట్టిన అఖణ్డవర్తిలోహదణ్డ దివియ ఒణ్టికి బోలునలువురుం బూణ్టగా... ద. శా. 10. 44.

**అడపొడ** వి. రూపు; జాడ.

చ. తొడిఁబడఁ జాటి పైకురికి ధూర్జటికంటి
కడిందిమంటలో, నడపొడ గానరాక తెగ
టాటియుఁ గాలినయట్టిమోడునై, వడి రతి
లోచనాంబువులవాన నిగిర్చితె పాంథ
బాధకై, మడియ కనంగ ...మనుచ. 3.46.

చ....జనాధిపుల్ దనకుఁగన్యల నిచ్చెదమంచు
నెందజే, బడిబడిఁజెప్పిపంప నది పాటిగఁ
బట్టక వారియానుచే, నడపొడ లేక పోయె
నఁట.... కళా. 7. 44.

**అడబాల** వి. (క. అడబళ. అడ = వంట. బళ, ప్రత్యయము-వాఁడు) వంటవాఁడు.

సీ. పోనీక కపటియై భూపాలగృహమున నడ
బాల తనమున నర్థిఁగొలిచి, యుండ వసిష్ఠున
కుర్వీశుఁ డొక్కనాఁ డన్నంబు సేయంగ
నతనిఁ బనుప. భాగ. 9. 237.

క. రాజు నగరియడబాలలు, రాజీవముకడుపు
వచ్చి రాజనిభాస్యున్, రాజశిశువుఁ గని
చెప్పిరి, రాజీవదళాక్షుయైనయతికి నరేంద్రా.
భాగ. 10. ఉ. 7.

**అడరించు**- అడరుచే(ర్చు). స. క్రి. (√అడరు. క. అడరిసు, అడర్చు. త. అడర్.)

1. ప్రయోగించు.

సీ కోపంబు గదిరి ప్రాగ్జ్యోతిషపతి చతుర్దశతో
మరము లింద్రతనయుమీఁద, నడరించుటయు
నవి పొడిసేసి... భార. ద్రోణ. 1. 353.

క. ...హరునిమీఁద జలజాతుఁడు స, మ్మోహన
శిలీముఖం బ, వ్యాహతజయశాలి యగుచు
నడరించె నృపా. భాగ. 10. ఉ. 411.

2. ప్రవర్తిల్లఁజేయు, నడపు,

ఆ. అన్నియింద్రియముల నడరింప మగుడఁజే,
యంగ మనసు సాలు... భార. ఆను. 5.251.

3. వశపఱచు, ఒప్పగించు,

క. చిరకాల తపమునైనను, హరియింపఁగ
నోపుఁ జిత్తమని పెద్దలున, మ్మరు జారులకున్
జారిణి, కరణిని నడరించుమనసు కామాదు
లకున్. భాగ. 5. 1. 86.

(జారిణి తనభర్తను హానిచేయుటకై జారులకు ఒప్పగించునట్టు మనస్సు యోగిని కామాదులకు ఒప్పగించును-అని భావము. చూ. సం. భాగ. 5. 6. 3, 4. వ్యా.)

4. వ్యాపింపఁజేయు.

సీ. అరవిరినెత్తావి నడరించు నున్నిద్రవిట పీటి
సౌరభవితతి వొదల. భార. ఉద్యో. 2.112.

5. వర్ధిల్లఁజేయు.

ను. ...భార్గవభుజాభూరిప్రతాపాఖ్యచి, త్రత
రాగ్నిన్ హరిచాపచారుశరసంధానంబుచే
నార్చి యం, చిత దివ్యాంబుద మూర్తి
రాముఁ డడరించెన్ రాజవంశంబులన్.
హ. న. అవ. 23.

6. కలిగించు.

సీ. గగనభాగం బెల్లఁగప్పి క్రాలుచు బెగడడ
రించె నుగ్రంపుఁ బడగపఱపు. భార. విరా.
4. 180.

క. పరసముఁ జెప్పఁ బూనిన, నారస మాలించు
వారి కడరింపనియా, నీరసపుఁ గావ్యశవ
ముల, దూరమునన పరిహరింపుదురు నీతి
జ్ఞుల్. కవిక. పీఠి. 1. 12.

7. చేయు.

క. తడవాయె భూప్రదక్షిణ, మడరింపఁగఁ
బోయి యామహామహుఁడు పదం, పడి
పుణ్యస్థలముల నెన్నఁడు మీరందందు
నరుగ నరుఁ గానరుగా. విజ. వి. 2. 165.

**అదరు** అ. క్రి. (క. అడరు. త. అదర్.) 1. ప్రజ్వలించు.

ఆ. కర్ణునగవు లోకగర్హితుండగు దుస్స,సేను చెయిదికంబె శిఖయపోలె, నదరి నామనంబు నతి దారుణక్రియ, నేర్చుచున్న యది... భార. అర. 1. 139.

2. అతిశయించు.

సీ. ఆదట నుపకరణావలి వెడవెడ యాదరించుట రాగమదరఁదొడరి. భార. విరా. 2. 208.

3. ప్రసరించు, వ్యాపించు, పర్వు.

సీ. పదతలంబులకెంపు పరిఁగినతలము కుంకుమలిప్తమైనచందమువహింప, నంగంబునునుఁ గాంతి యడరినగోడలు వేదులు మణిమయ విధమునొంద. భార. విరా. 1. 308.

4. కడఁగు, పూను; సిద్ధపడు.

క. మీ రాఁకలిపెల్లున నా,హారంబుగ శవముఁ గొనుట కడరితి రిల్లే,లా రం డిచ్చెద మీ కా,హారంబులు వలసినట్టివి... భార. అను. 3. 212.

శా. ...వాహద్విష,ద్వావహోత్తంసము నెక్కి పోరి కడరెన్వైవస్వతుం డుద్ధతిన్. హరి. 4. 79.

5. (యుద్ధమున) కవియు.

వ. రాధేయుండును. క. తటిమి పయి నడరుటయు విలు, విఱుగంగా నేసె నరుఁడు విక్రమలీలన్. భార. విరా. 5. 100.

6. తిరుగు; సంచరించు.

వ. వావిలి యిందుగు మొదలగుతరుల వఱలు పొదలరొదలఁ బొదలురకముగల మెకము లడరుజాడ లరసి తత్తదుచితస్థలంబులఁ దెర లెత్తించి వలలు హత్తించు...ఇందు 2. 60.

7. కలుగు, పుట్టు.

క. కడు లజ్జయు దైన్యంబును,నదరి మునుఁగు వడఁగ నాకు నాత్మగతమునం, బుడమి వివరంబులేదే, యడఁగెద నన్నట్టిదయ్యె నప్పుడు కర్ణా. భార. అర. 6. 14.

క. అనుటయు భగభగ మండెడు, కనుఁగవతో నొడల నడరు కంపముతో ... మునిపతి యుండెన్. ఉ. హరి. 4. 89.

8. ఒప్పు, శోభిల్లు.

చ. అడరఁగ ధర్మనందనుఁ డహర్పతిచేత వరంబు పేర్మితోఁ,బడసి మహీసురోత్తముల భవ్యులఁ బల్వురి నిర్వహించె ... భార. అర. 1. 44.

గీ. ...అసురదర్పనం బనఁగ నింగిఁ బ్రతిసూర్య బింబ మడరె. ఆము. 4. 108.

9. కలఁగు, క్షోభపడు.

క. వీరోత్సాహమున భేరి వేయించుటయున్.

చ. చెదరె గిరుల్ దివం బడరె శ్రీపతి దిగ్గున నిద్రమేల్కొనెన్. శశాం. 5. 12, 13.

గీ. ...దశకంఠుఁ డేఁగి మధుని,పట్టనముమీఁద విడసె నప్పొరు లడరి. ఉ. రా. 4. 133.

గీ. అట్లువచ్చు నాగదఁ గని యచటియోధు, లలికి తమతమ మీఁదన యడరుననియుఁ, దలఁచి యొదిఁగిరి రారాజుఁ దలఁపరైరి, ప్రాణభయ మెట్టివారి గీడ్వఱుపకున్నె... భార. భీష్మ. 3. 58.

న. క్రి. అరుముకొను, ఆవరించు.

క. గురివెంద వేము నడరిన, పరుసున నవ్విశకట వర్గపాల్పడి చెన్నుం బొరయక మెలఁతుక యెప్పుడు, విసాంతఃకరణ యగుచు వేదనఁ బొందున్. దశకు. 7. 43.

వి. ఆధిక్యము, అతిశయము, విజృంభణము; ఒప్పు.

గీ. అరయఁ దీవంచవాల్వి పుటగ్గిపట్ల, నడుమ నడరొందునాడె పుఁ బుడమిఱేఁడు, తెల్లఁ గదలింపలేని యువ్విల్లు దునిమె,నిప్పు డితని మగతనం బెన్నఁదరమె. అచ్చ. రా. బాల. 184.

క. గొనములసంద్రమ యిత్తెఱఁ,గునఁజాలుపు తేర్గఱేఁడు గొదయొదవని పెం,పున నడ రొందుచు నొకనాఁ,డెనమీఱినవేడ్క నుల్ల మిగు రొత్తంగన్. అచ్చ. రా. అయో. 3.

2. (—ఎడరు) క్షోభము, కలఁత; ముప్పు; ఆపద; దైన్యము.

గీ. ముప్పునకు నోమదయ్యెనె ముగ్ధ యీ యశోద నందగోపున కుగ్రశోకజలధి, యీఁదఁ గోలఁది గాదయ్యెనె యిట్టిదైన, యడరు వెట్టెనె పెన్నిధి యనుఁగుబిడ్డ. హరి. పూ. 7. 42.

గీ. కేళికందుక మెత్తినలీలఁ గొండ, యెత్తి గోవులయడరు నీ విట్లుడుపుట, వలన మందర ధర నీదు వైష్ణవంపుఁ, దేజ మఖిలలోకము లకుఁ దేటపడియె. హరి. పూ. 7. 203.

గీ. రమణతో నాదిదానులరాసి కెక్కి, దీనజన ములయడ రెల్లఁ దీర్చుచున్న, యనఘ చారిత్రు...శా. ప. మ. 11. 1.

3. (= ఎడరు) సమయము, అదను.

వ. ఇట్లు ప్రతిగృహంబున భిక్షాటనంబు సేయుచు మహోక్షలాంఛనుఁడు వాంఛానుకూల ప్రకారంబునం జోరరత వ్యాపారపారాయ ణుండై మగలఁ గన్నుమొఱంగి సంధ్యా సమయంబుల ననుష్ఠానార్థంబు పురుషులు సమిత్కుశఫలాహరణార్థం బెందేనిం జనిన యడరు వేచి...సంభోగంబు లభిలషించు నారంభోరువుల మనంబు లెఱింగి...హర. 5. 54.

జ. అడరించు, అడరుచు(ర్చు), అడరుపడు, అడరుదెంచు.

**అదరుచే(ర్చు)**—అడరించే. (√అడరు.) (ప్రయోగించు)

ఉ. వెండియు నాగ్రహంబున సువేగునిమధ్యము ద్రెవ్వనొక్కబ. ల్కాండ మడర్చె...జై. భా. 7. 10.

**అదరుదెంచే** (అడరు + తెంచు — స్వార్థమున.) అ. క్రి — అడరు. (అతిశయించు)

ఆ రెండు దరులు ముంచి యొండొండ వెల్లువ, యగ్గలింప నురువు లడరుదేర. మార్క. 5. 230.

**అదరుపడు** అ. క్రి. (√అడరు. వి.) విజృంభించు.

వ. అడిదంబులు పొడిపొడియై పుడమిఁ బడినఁ జిడిముడిపడి వడి నడరుపడి మగుడఁ గచా కచిఁ బెనంగురక్కసులు...ఉ.రా.4.291.

**అదలడి** వి. (√అడలు)అలజేడి, శోకము, దుఃఖము.

క. అడలడిఁ బడఁగా మమ్మును, విడిచితి గురువైన శోకవేదనయే మిం, కుడిపికొనునప్పటికిఁ దో, డ్పడు నీదగు సద్గుణములు బంధులవోలెన్. భార. ఆశ్ర. 1. 99.

శ్లో. త్యక్తా వయం తు భవతా దుఃఖశోకపరాయణాః, భవిష్యామ శ్చిరం రాజ న్నృవద్గుణశతై ర్హృతాః. సం. భార. ఆశ్ర. 11. 18.

క. కరువునఁ బూరితమై లో, హరసము లోఁ గాలునట్టు లంగజశోకో, ద్ధురశిఖ రతితను విమ్ముగఁ గరఁగియుఁ బొడవడఁక లోనఁ గాలుచు నుండెన్. వ. ఇట్లెడయుడుగని యడ లడింబడి. కు. సం. 1. 578, 579.

**అదలిపోవు** అ. క్రి. (√అడలు.) అడలు, భయపడు.

(వ్యవ) ఆమాటవిని వాఁడుఅడలిపోయినాఁడు.

**అదలు** అ. క్రి. (క. అడలు, అటిలు)

1. శోకించు, మనసునఁ గుందు.

క. కొడుకులదెస నెవ్వగఁ జే, డ్పడి వందురి యున్న యానృపాలు నడుగులం, బడి భీష్ము పాటు సెప్పుచు, నడలి కరుణనాద మెసఁగ నాక్రందించెన్. భార. భీష్మ. 1. 45.

సీ. అడలి రాజ్యము దక్కి యడవికిఁ జనిన బేలందురుగాక మేలండ్రె జనులు. భార. శాం. 1. 49.

సీ. అహితసామంతుల నడలించి తఖిలయాదవ వంశమునకు నుత్సవ మొనర్చితి... హరి. పూ. 9. 178.

2. రోదనము చేయు, ఏడ్చు; విలపించు,

గీ. నాకునా యిన్ని పాట్లంచు నాకులమతి, నడలెఁ గన్నుల బొటబొట నశ్రులొలుక. కళా. 3. 241.

సీ. తనయులు రా కేల తడసిరి పతివియోగము కాక పుత్త్రశోకంబు నకట, సిద్ధించె నను సృజించి విరోధులకు హారిగొఱియలఁ జేసె నొకో విధాత, యని విలాపింప నూరార్చి యేటికిఁ గ్రేపుఁ బాసి గోడ్డాఱలెడుపగిది నడలె, దు....జై. భా, 6. 265.

3. భయపడు, బెదరు.

గీ. ఉసుఱులూడాడ విసవిస విసరి ముసరి,
దోసఁగు లెసఁగించుసుర గాడ్పుతుటుము
దాడి, కడలి తద్దయు గడగడ వడఁకుదాని,
వేల్పురాకన్నెఁ గాంచిరి వెలఁదు లపుడు.
రసిక. 4. 47.

4. చలించు, అదురు.

గీ. హాహా హా యని పల్కిరి యర్థి మడల.
కాశీ. 7. 36.

5. కాంతిహీనమగు.

గీ. ...ఆశంభులింగమూర్తి, భీమవరంవహ్నిపుర
ములఁ ద్రేల్చునపుడు, నగ్నిసెగ దాఁక
కేమియు నడలకుండె. భీమ. 4. 145.

శ్లో. శోభాసంపద్విరహితం న బభూవ మనాగపి.
సం. భీమ. 19వ. అధ్యాయము.

సీ. దగరతేఁటులకప్పుపగఱనీటులఁ గప్పువలుఁద
పెన్నెఱికొప్పు వదలె నేల, మెఱపునక్కులఁ
జిక్కుపఱపుటెక్కుల నిక్కులఁదినిద్దపుఁ
జెక్కు లడలె నేల. చంద్ర. 4. 58.

వి. (శ. అడలు.) 1. శోకము.

క. వెడవెడ యప్పలుకులు చెవి, నిడి శోండొక
నేపు చింత యొసకంబునఁ జొల్పడి యూర
కుండి చిత్తం, బడలువఁ జిక్కువడ నిట్టు
లను నర్జునుతో శా. భార. శాం. 1. 56.

2. కష్టము, బాధ.

(రావణుఁడు నరకబాధల ననుభవించువారిని మొదటఁజూచిస్వర్గసుఖముల ననుభవించువారిని లిమ్మటఁ జూచెను.) ఆ. చూచి నేను మొదటఁ
జూచినవారి క,య్యడలొనర్పవీరి నధికసౌఖ్య,
యుక్తి మెలఁగఁజేసె నోహో యముఁడు పక్ష,
పాతి యనుచుఁబలికి పంక్తిముఖుఁడు. ఉ. రా.
3. 327.

3. భయము, బెదరు.

(వ్యవ) నాపేరు చెప్పిన వానికి అడలు. ఆమాట వినినప్పటినుండియు వానికి అడలుపుట్టినది.

జ. అడలడి, అడలించు, అడలిపోవు, అడలుకొను.

**అడలుకొను** - అడలు. క్రి. (√అడలు.)
(శోకించు)

గీ. అత్తెఱం గెల్ల నాలించి యపుడు బాల్పు,
టంరదములదొర దద్దయు నడలుకొనుచు.
అచ్చ. రా. అయో. 87.

గీ. అపుడు రాచూలి దద్దయు నడలుకొనుచు,
నప్పలుఁగువంగడపుదొర కగ్గిపనులు, తొలి
మినుకుజాడ నొనరిచి...అచ్చ. రా. అర.
116.

**అడవి** వి. (సం. అటవీ. ప్రా. అడవీ. క. తు. త. అడవి.) అరణ్యము, వనము.

అడవిఁ గాసినవెన్నెల:-ఉపయోగము లేనిదాని కుపమానముగా చెప్పఁబడును. రసిక. 6. 98.

ఇట్లే: అడవికోనల నెమి ళ్లాడినట్లు. కలు. 4. 37.

అడవియుసిరికకాయ సముద్రపుటుప్పు కలసినట్లు:- దగ్గఱసంబంధము లేనివారు కలయుట కుపమానముగా గ్రహింపఁబడును.

ఆ. అడవియామలకము నంబుధి లవణంబుఁ,
గూడినట్లు...కుచేల. 2. 78.

జ. అడవికంద, అడవికాఁకర, అడవికిక్కస. మొ.

**అడవికంద** వి. సర్పనాశము (వృ.వి.)

**అడవికాఁకర** వి. వనకారవేల్లము (వృ.వి.)

**అడవికిక్కస** వి. దేవనాళము (వృ.వి.)

**అడవికుక్క** వి. అరణ్యశునకము.

**అడవికోడి** వి. వనకుక్కుటము.

**అడవిగీము** వి. - అడవి యిల్లుగాఁ గలవాఁడు - వానరుఁడు.

గీ. అని యొనర్పఁగఁ దొడఁగిన నడవిగీము,
బంట్లుమ్రాఁకులు పడుకులు పట్టుకొనుచు.
అచ్చ. రా. యు. 206.

**అడవిగెనసు.** వి. పిండాలుకము (వృ.వి.)

**అడవిచెఱకు** వి. కాంతారము (వృ.వి.)

**అడవిచేమ** వి. శకుటము (వృ.వి.)

**అడవితి(ది)రుగుడు** వి. (అడవి+తిరుగుడు) వనచరుఁడు, వానరుఁడు, క్రోఁతి. (బ. అడవితిరుగుడులు, అడవితిరుగుళులు, అడవితిరుగుళ్లు.

క. అని పలుక నంగదాదులు, వెనుకొని హను
మంతుఁ డపుడు విభుఁ డంపినయప్పనిఁ
బూని యడవితిరుగుడు, మొన గొలువఁగ

దక్షిణాభిముఖుఁడై చనియెఁ. రామా. 6. 60.

క. ఏఁగి పురద్వారము వెట్టాఁగి నిలిచి తన్నుఁ జూడ నడవితిరుగుడుల్, మూఁగికొన గగన మట్టెటు, గాఁగ లయాంబుదములీల గర్జించుటయుఁ. ఉ. రా. 3. 269.

**అడవితొగరి** వి. తువరిక (వృ.వి.)

**అడవితొలసి** వి. క్షుపకము (వృ.వి.)

**అడవిత్రిమ్మరి** వి. – అడవిలోఁదిరుగునది – వనచరము, మర్కటము, క్రోఁతి.

సీ. అడవిత్రిమ్మరిఱేఁడ తడ వేల కిష్కింధ కరిగి మీయన్నతో దుర మొనర్పు. అచ్చ. రా. కిష్కిం. 39.

**అడవిదున్న** వి. వనమహిషము.

**అడవిదోమ** వి. దంశి.

**అడవినట్టు** వి. (అడవి + నట్టు) వనౌకసము, క్రోఁతి.

చ. నటికిన సోలి యయ్యడవినట్టుజగా మొనగాంద్రమిన్న యుత్కలిక మొకింతసేపునకుఁ గ్రమ్మఱఁ దెప్పిటి...అచ్చ. రా. సుం. 115.

**అడవినువ్వులు** వి. బ. జర్తిలము.

**అడవినెలవరి** వి. వనవాసి, ముని. ఆం. భా. 2. 178.

**అడవిపంది** వి. వనసూకరము.

**అడవిపిల్లి** వి. ఒకజాతిపిల్లి.

**అడవిపెసలు** వి. బ. వనముద్గములు.

**అడవిప్రత్తి** వి. భారద్వాజి (వృ.వి.)

**అడవిబచ్చలి** వి. వనోపోదక (వృ.వి.)

**అడవిబీఱ** వి. కోశఫల (వృ.వి.)

**అడవిమన్కిపట్టు** వి. వనవాసి, ముని

గీ. అనినఁ దద్దయుఁ బొంగి యయ్యడవిమన్కి-పట్టుబల్దిట్ట యమ్మేటిపచ్చవారు, వపువజీరు కొలంపుఁ గల్వలయనుంగుఁ, గాంచి నునుఁదియ్యపల్కులు గదురఁ బలికె. అచ్చ. రా. బాల. 94.

**అడవిమల్లె** వి. ఆస్ఫోట (వృ. వి.)

**అడవిమామిడి** వి. ప్రియాలము (వృ. వి.)

**అడవిమామెన** వి. శారిబాభేదము (వృ. వి.)

**అడవిమునగ** వి. వనశిగ్రువు (వృ. వి.)

**అడవిమేఁక** వి. ఇడిక్కము, వనచ్ఛాగము.

**అడవిమొల్ల** వి. యూథిక (వృ.వి.)

**అడవియీఁగ** వి. దంశము.

**అడవియులవలు** వి. బ. వనకులుత్థములు.

**అడవిసదాప** వి. శాలేయము (వృ. వి.)

**అడసాల** వి, (సం. అట్టశాలా. క. అడిగెసాలె. అడిగె–వంట.) మహానసము, వంటయిల్లు. (శ. ర.)

**అడావ(వు)డి** వి. (క. అడావడి, అడావుడి, అడాడి హిం. హడబడీ.) 1. సంభ్రమము, వేగిరపాటు, తొందర. 2. అల్లరి, గడబడ. (శ.ర.వా.)

**అడి**[1] వి. (సం. ఆధిః) కుదువ, తనఖా. (దీనికి వ్యస్త ప్రయోగము కనఁబడలేదు. చూ. అడిపెట్టు,)

**అడి**[2] విశే. (దీనికి వ్యస్తముగా ప్రయోగము లేదు. చూ. అడికుడుపు. మొ.) 1. వట్టిది కేవలము, 2. అల్పము.

ఉదా: అడికునుకు, అడిమేఁత, మొ.

క. కడలిదొంగ కూర్మియల్లుని, యడుగులఁ బడి విడువఁ జాల కన్నరపాలుం, డడిచెమట ముజ్జగంబులు, గడిగినపాదములు కడిగెఁ గన్నీటిజడిన్. బహు. 3, 18.

('నరపతియున్, దడిచెమట' అని ముద్రితము.)

ఉ. అడికుడుపు, అడిబండ, అడిబీరము, అడియాస. అడిసిగ్గు.

**అడికుడుపు** వి. (√అడి[2]) వట్టిభుక్తము, లిఖితాదులులేని యనుభవము.

క. ఎడవడకుండం గుడిచిన, కుడుపు ప్రమాణంబుగాదు కొన్నతెఱంగున్, బడసినతెఱఁగును దెలుపని, యడికుడుపునఁ బాడి గెలువ దక్షినవదరండీ. విజ్ఞా. వ్యవ. 49.

**అడిగండ్లు** వి. బ. (తె. అడి + కండ్లు. వి. అడి–అడుగుభాగము) ధాన్యాదులు చెరుగునప్పుడు అడుగునకుఁ జేరుతాలు.

ఆ. అలయఁజేసి మలఁచి యడిగండ్లు మలిగండ్లు, తిరిపె మిడెడుకటికి దేజరిల్ల, నెలమి

మన్నుదినెడు నెట్టులై పుట్టును, విశ్వ... వేమన. 3. 34.

**అడిగము** వి. (క. అడ్లిగె, హడ్లిగె.) ఒకవిధమైన గంప. హంస. 5. 97.

**అడిగట్లు** వి. (త. అడి- అడుగు.) పావ, పాదుక.
ద్వి. హరగణంబుల కెల్ల నడిగట్లు నన్ను, గురు మహేశ్వర యేల కొనియాడె దనుడు. ప్రభు. 118 పొ. 4 పం.

**అడిగొట్టు** విశ. (అడి² + గొట్టు) కుత్సితుఁడు, తులువ.
గీ. కఱటి యడిగొట్టు పలువ... మొండి, కట్టె నాఁగను గుజనాఖ్యగాఁ జెలంగు. ఆం. భా. 3. 7.

**అడిచిపడు** అ. క్రి. (√అడుచు) 1. త్వరపడు, తొందరపడు.
జ. జడనిధిచందంబున ని,మ్మడు వొప్పఁగనిప్పు డేమి మాఁడెను నిమ్మె,నడిచిపడ రిత్త నెవ్వగ,లుడుగుఁడు... భార. శాం. 3.189. (ప్రాఁప్రతతి) భార. విరా. 2. 261.
2. ఎగిరిపడు, మిట్టిపడు, మిడిసిపడు.
అ. తిండిపోత నీకు ఖండన చేటికిఁ, గడవఁజేరి మనసు కాంక్షదీఱ,నోపు కొలఁది క్రిమ్మరి యూరక నీ వింటి,కడనయుఁడు మింకనడిచి పడక. భార. ద్రోణ. 4. 239, 5. 108.
3. కోపపడు.
ఆ. ఆయశోద వచ్చి యాబండిలో[6] నిండి,యుండి నట్టి కుంభభాండతతుల, పాలు నెయ్యి నేలపాలైనఁ జిడిముడి,పడుచుఁబడుచుమీఁద నడిచి పడుచు. వి. పు. 7. 119.

**అడిచిపాటు** వి. (√అడిచిపడు) అడిచిపడుట. (తొట్రుపాటు, సంభ్రమము.)
సీ. అడఁగంగఁ బొదివిన నడిచిపాటించుకయును లేక వీఁక నొండొరుల నడరి. గీ. యడఁగఁ బొదువుచు...భార. విరా. 2. 347.
(విజృంభణము)
సీ. కృష్ణుఁ దోడుగఁ గొని కిడ్పడి వీరలువచ్చినఁ జెప్పితి వధవిధంబు, సమర ముపేక్షించి శాంతిమైనుండెద నడిచిపాటేటికి ... భార. భీష్మ 3. 396.

**అడితి** వి. (త. అడుత్తి-లాభము.) 1. ఒకవర్తకుఁడు మఱియొకఁ డంపెడుసరకుల నమ్మి మరలవానికి సరకులు గొని పంపుటకై వాని యొద్ద నూటికింత యని పుచ్చుకొనెడుతఱుఁగు. (శ. ర.)
2. అమ్ముటకై కట్టులుంచుచోటు. (వా.)
జ. అడిసాటా.

**అడిదపుమెకము** వి. (√అడిదము) ఖడ్గమృగము.
సీ. ఎక్కుడుమెకపుసూళ్లిగుదల గ్రుడ్డుకాను పులుఁ బిల్లులు నడిదపుమెకములు. అచ్చ. రా. అర. 4.

**అడిదము** వి. ఖడ్గము, కత్తి.
సీ. అడిదంబు సేకొని యరిదంబుడిగి కృపాచార్యునిథ్యంబుఁ జంపి... భార. కర్ణ. 3.185.

**అడిపెట్టు** స. క్రి. (√అడి¹.) ఆధిపెట్టు, తనఖాపెట్టు.
సీ. క్షేత్రంబు లడిపెట్టి చేసితి నప్పులు ... శేష. 3. 261.

**అడిబంద** విశ. (√అడి²) వట్టిబంద, మూర్ఖుఁడు.
సీ. అకతాయ బికారి యడిబంద గుండఁడు మొండికట్టెగులాము మొప్పె గోపు. హంస. 5. 113.

**అడిబీరము** వి. (√అడి²) వట్టిపౌరుషము, మిథ్యాపౌరుషము.
క. తొడరెడుకొలఁదియె వానికి, వడముడిభుజ విక్రమంబు వారల మన మె,ప్పుడు వినమొ కర్ణువినమో, యడిబీరపుఁదులువ గెలుచు నటె పాండవులన్. భార. ద్రోణ 4. 184.

**అడియ**—అడియఁడు. విశ. (క. త. అడి—అడుగు, పాదము. క. అడియ. త. అడియవన్. అడియాన్.) పాదసేవకుఁడు, దాసుఁడు.
చ. ...నీవు నా, యొడయఁడ వేను నీయడియను... శ్రీరం. మా. 2. 67.

**అడియఁడు**—అడియ.
క, తిరువాముడి పఠియించుచు, హరిభక్తులఁ గన్న భక్తినడియఁడ ననుచున్, శిరములు వంచుచు...విప్ర. 2. 31.

ద్వి. హారగణంబుల కెల్లనడియఁడ...ప్రభు. 4. 118 పొ. 4 పం.

**అడియరి** విశ. (త. అడి-పాదము) 1. పాదసేవకుఁడు, కింకరుఁడు.

సీ. అడియరితనమున నప్పాండవుల నాశ్రయింపఁగఁజాలను...సం. భార. సౌ. 1. 7.

శ్లో. ప్రేష్యభూతః...భార. సౌ. 1. 12.

2. బుద్ధుఁడు.

ఆ. దీన నేమి తప్పు కానకు నేఁగిన, యతఁడు సమయవృత్తి నాక్రమించి, తండ్రిపాలు మాకుఁదగు నంచు నడియరితనము నేసి రాక తప్పుగాక. భార. ఉద్యో. 1. 250.

క. యాగార్థ మడిగినర్థము, యాగమునకుఁ బెట్టవలయు నడియరియై తా, భోగార్థముగా దాఁచిన, యాగమబాహ్యుండు కాకియై జన్మించుః. విజ్ఞా. ఆచా. 87.

**అడియాలము** వి.(క. అడయ-ల.త.అడై యాళం.) 1. ఆనవాలు, గుఱుతు; (రాజధ్వజాదుల) చిహ్నము.

క. కురుపాండవసైన్యంబుల, దొరల డియాలముల యొప్పుతో మెఱయు సముద్ధురవీరధ్వజములఁ బోలి,చిరి...భార. భీష్మ. 1. 246.

2. చిహ్నములతోఁ గూడిన రాజధ్వజాదికము.

క. అరులఁ జనఁ దోలి యార్తుల, నరుదారంగాచి హాతులయడియాలములః, బిరుదంబులఁ గైకొనున, న్నరపతివిజయంబు కీర్తనము చేయఁదగుః. కావ్యా. 3.157.

3. ఋజువు, ప్రమాణము.

ఆ. నమ్మఁదగదు మొదల నమ్మి తా రాత్మకా, ర్యమున కొరులఁబనిచి యందువారి,లఱయ నేసి రేని యడియాల మెఱుఁగక, వేగపడుట యెల్ల వెఱ్ఱితనము. కేయూర. 3. 184.

**అడియాన** వి. (అడి² + ఆస)వట్టియాస, వ్యర్థమైన యాశ.

చ. విను మటుగాక బల్లిదపు వేసడముల్ వలతేని నిత్తుఁ గై,కొనుము కడంగి వామ్యములఁ గోరక పొమ్మడియాన లేటికిః. భారం. ఆర. 4. 349.

ఉ....చెప్పెడువారలబుద్ధి నాఁడ మన్నింపఁడయింక నేలయగు నీ వడియాసల వచ్చిరి త్తగా,రింపక మానుము...భార. ఉద్యో. 1. 314.

**అడిసాటా** వి. (√అడితి) తఱుగుబేరము, రుసుము పుచ్చుకొని చేయువ్యవహారము. (శ. ౨.)

**అడిసిగ్గు** వి. (√అడి²) నునుసిగ్గు, కొంచెముసిగ్గు.

క. అడిసిగ్గులు తమకంబులు, నుడివోవఁగఁ గేళి కడఁక లొదవఁగ. ...రతిక్రీడసలిపి రతి వయుఁ బతియుః. మార్క. 8. 195.

**అడుకు** స. క్రి. (క. అడుకు. త. అడుక్కు.) దొంతిగా నిడు. వి. (క. అడక.) దొంతి. (శ.ర.)

**అడుకులు**—అటుకులు. వి. బ. చిపిటములు, పృథుకములు. (నానఁబోసి వేఁచి కొట్టినవడ్లు)

క. అడుకులు దిన్నట్లగునే, కడుపునఁ గుట్టెత్తినపుడు ...భార. ద్రోణ. 4. 89.

**అడుగంటు** అ. క్రి. (అడుగు¹ + అంటు) అడుగునకుఁ బోవు; క్షీణించు.

(వ్యవ) నూతిలో నీ రడుగంటినది. వాని తెలివితేట లడుగంటినవి.కూర అడుగంటినది(—మాడినది.)

**అడుగంట్లు** వి. బ. (√అడుగు¹) అడుగంటినపదార్థములు; హీనమైనపదార్థములు.

ఉ. లేకి నిధివ్రజంబు లవలేశము కాంచన భూధరంబు ర,త్నాకరరత్నరాసు లడుగంట్లు మరున్మణి కామధుక్సురా, నోకహముల్ క్రయోచితవినూతనవస్తువు లిట్టి వట్టివః, వాకుల కందరాని పురవైశ్యుల సంపదలెన్ని చూపుచోః. కవిక. 1. 11. (శ. ర. పా.) 'అడిగంట్లు' అని అపముద్రితము.

**అడుగడుగుపొదలికదండ** వి. (√అడుగు¹) మల్లవిద్యయందలి దండలలో భేదము. ప్రబంధ. 78. చూ. దండ.

**అడుగిడు**—అడుగుపెట్టు (√అడుగు¹). (ప్రవేశించు, చొచ్చు)

క. ఆ,హాలిక గ్రామంబున నతఁ, డలరుం బరులెవ్వరైన నడుగిడకుండః. శుక. 2. 439.

**అడుగు**[1]—అడ్గు[1], అడుపు[1]. వి. (క. త. తు. అడి.)

1. పాదము.

గీ. సంతసంబున వచ్చి యాసంయమీంద్రు, నడుగులకు నెఱఁగుడును. పారి. 2. 22.

2. పద్యపాదము.

క. ...అదియె నాల్గడు,గులకడఁ బ్రాసముల మొదలఁ గూర్పఁగ వలయుఁ. అప్ప. 3. 389.

3. అడుగుదూరము; అడుగుపరిమాణము.

గీ. అలరుఁబోఁడికి నొకయడు గామ డయ్యె. ఉ. రా. 2. 137. (వ్యవ) ఒకఅడుగుగుడ్డ.

4. అధోభాగము, క్రిందిప్రదేశము; మూలము;

సీ. అడవిలో నొకమట్టి యడుగునలాఁగలఁ బలితుండు నానొక్క యెలుక యుండ. భార. శాం. 3. 203.

అ. అఖిలధీవరజన మడుగుగానఁగ లేని, మడుఁగు లోన...దశా. 1. 144.

చూ. అడుగుమాలిపోవు.

5. అధోలోకము, పాతాళము.

(రాక్షసులు రావణునితోఁ బలికినమాట)

గీ. మిగులఁ గోపించి తన్నినభృగుమహర్షి, యడుగు పట్టినవేల్పురాయిడికి వెఱచి, యడుగుపట్టిన దైత్యులయాపదబ్ధి, కధిప యుష్మత్ప్రతాపమౌర్వాగ్ని యయ్యె. ఉ. రా. 2. 217.

విశే. క్రిందిది, తక్కువది.

ఆ. తమ్ములయ్యె ననుచుఁదమ్ములఁగని కొమ్మ, యడుగులకును జిగురు లడుగులయ్యె. అని. 1. 88.

అడుగడుగున (అడుగునన్ + అడుగునన్) — మాటిమాటికి.

(వ్యవ) అడుగడుగున నతనికేవో ఆటంకములు వచ్చుచునే యున్నవి.

అడుగడుగునకు. (అడుగునకున్ + అడుగునకున్) = మాటిమాటికి.

సీ. అడుగడ్గునకు మాధవానుచింతనసుధామాధుర్యమున మేను మఱచువాని. భాగ. 7. 160.

అడుగులకుమడుఁగు లొత్తు — గౌరవార్హులు క్రింద నడువకుండఁగ ముందుముందు బట్టలు పఱచు; అధిక గౌరవము చేయు.

జ. అడుగంటు, అడుగంట్లు, అడుగడుగుపొదలిక దండ, అడుగిడు, అడుగుచూపరి, అడుగు దప్పు, అడుగుదాఁటు, అడుగుదీయు, అడుగు దోదుమి, అడుగుపట్టు, అడుగుపడు, అడుగు పఱచు, అడుగుపుట్టుపు, అడుగుపెట్టు, అడుగుమానిసి, అడుగుమాలిపోవు.

**అడుగు**[2]—అడ్గు[2], అడుపు[2]. స. క్రి. 1. ప్రశ్న చేయు, పృచ్ఛించు.

క. నీయడిగినయర్థాభిప్రాయములకు నుత్తరంబు...భార. ఆర. 4. 125.

(వ్యవ) అడుగువానికిఁ జెప్పువాఁడు లోఁకువ.

2. వాంఛించు, అభిలషించు.

గీ. చనునె యిమ్మాటలాడ సజ్జనులకాఁడుఁ, బుట్టువులతోడ నీవును బుట్టినాఁడ, వట్లు గాకయు హీనవంశాభిజాత, నైన పతిపత్ని నగు నన్ను నడుగఁదగునె. భార. విరా. 2. 50.

3. యాచించు, వేఁడు.

క. అడుగకయు విప్రవరులకు, నడరఁగ నద్దేశమున గృహస్థులు భక్తిం, గుడువఁగఁ బెట్టుదురు...భార. ఆది. 7. 30.

4. అనుమతింపఁ జేయు, ఒప్పించు.

ఆ. ఒకనిపొలములోన నొకఁడు ధర్మార్థంబు, కొలను బావి నుయ్యి గ్రొచ్చుచోట, నడిగి చేయవలయు నొడయునిచేనికి, హానికల్గునేని నాఁగఁదగును. విజ్ఞా. వ్యవ. 149.

జ. అడుగుకొను.

**అడుగుకొను** స. క్రి. (√అడుగు[2])

1. బిచ్చమెత్తు. 2 బతిమాలు, ప్రార్థించు.

**అడుగుచూపరి** వి. (√అడుగు[1]) — పాదమందు కన్నుకలవాఁడు- అక్షపాదుఁడు, గౌతముఁడు,

గీ. అడుగుచూపరిజడదారియొుడయనింటి, కోడి ...దశా. 5. 26.

**అడుగుదప్పు** అ క్రి. (√అడుగు[1]) అడుగుమాత్రము తప్పు. (దీనికి వ్యతిరేకమునను వ్యతిరే

కార్థక ధాతుయోగమందును మాత్రమే ప్రయోగముకలదు.)

క. పతిమాట కడుగుదప్పక, సతులకు ననుకూల బుద్ధిఁ జరియింపఁ దగుఁ. రుక్మా. 4. 79.

(అడుగుదప్పక—అడుగుమాత్రమైనను తప్పక, ఇంచుకైనను ప్రతికూలముగా ప్రవర్తింపక.) (వ్యవ)ఆమె భర్తమాటకు అడుగుదప్పియెఱుఁగదు.

**అడుగుదాఁటు** స. క్రి. అ. క్రి. (√అడుగు¹) అడుగుమాత్రమునుమీఱు, కొంచెమునుమీఱు. (దీనికి వ్యతిరేకార్థమునను వ్యతిరేకార్థకధాతు యోగమునను మాత్రమే ప్రయోగములు కనఁబడుచున్నవి.)

ఆ. స్నేహముమునను దను వశీకృతుఁ గావింప, నడుగుదాఁటఁడయ్యె నతనిమాట. సేతు. 2. 67. పా.

(అడుగుదాఁటఁడు—ఇంచుకైనను మీఱఁడు.) (వ్యవ) ఆమె భర్తమాటకు అడుగుదాఁటి యెఱుఁగదు.)

**అడుగుదీయు** అ. క్రి. (√అడుగు¹) 1. అడుగు కదలుచు, అడుగుఎత్తు.

(వ్యవ) వాఁడు అడుగుదీసి అడుగు పెట్టలేకున్నాఁడు.

2. వెనుదీయు. (ఈయర్థమున వ్యతిరేకముననే ప్రయోగముకలదు.)

ద్వి. కడఁగి సింహము మీఁదఁ గవిసిననయిన, నడుగుదీయక గుండె లవియ మోఁదుదుము. ద్వి. హరిశ్చ. పూ. 572.

**అడుగుదోదుమి** వి. (అడుగుఁ దోదుమి)—అడుగే ఆయుధముగాఁ గలది—చరణాయుధము, కోడి. చం. రా. 2. 8.

**అడుగు(వ)పట్టు** అ. క్రి. (అడుగు¹+పట్టు) అడుగునుపొందు, క్రిందికిఁ బోవు.

చ. ...పయఃపయోధి నిస్తరంగతిఁ ద్రచ్చుచో నడుగువట్టినతగ్గిరి యెత్తనేఘులీ, పరివృత మూర్తియై ...పారి. 3. 29.

2. ఓడించు,

ఆ. వెల్లివిరిసెఁ బెంటివిద్యలు మగవిద్య, లడుగు పట్టెఁ గ్రిందువడిరి బుధులు, హీనజాతి పురుషు లెచ్చిరి. వేం. పంచ. 2. 182.

3. కాళ్లఁబట్టుకొను; నమ్రమగు.

చ. శివుఁ డిటు రమ్మటంచు దయ చేసినచోఁ దలకెక్కి తుగ్రవై భవమునఁ జూచుచో నడుగువట్టితి వేమనవచ్చు నీగుణం, బవునవు నందినన్ సిగయు నందకయున్నను గాళ్లఁ బట్టుకొం,దువు హరిణాంక వేలకొలఁదుల్ గద నీ నడకల్ దలంపగన్ విజ. వి. 3. 51.

**అడుగుప(వ)డు** అ. క్రి. (√అడుగు¹) క్రిందికి బోవు, అడుగంటు. (శరత్కాలవర్ణనము).

వ. ...నారి వండటియె...అస లడుగువడియె నెటి నిసుక దిబ్బచూపె. కాశీ. 3. 23.

**అడుగుపఱచు** స. క్రి. (√అడుగుపడు) క్రిందిదిగాఁ జేయు, తక్కువచేయు.

క. లలిఁ గొప్పెక్కించితి మధుపుల శుకుల నడుగుపఱచితి పుష్పాస్త్రా మాఁ,లలకును మంచంబులు శాఁ,పలకును బీఁట లనుమాట బళి నిజమయ్యెన్. చంద్రా. 5. 91.

**అడుగుపుట్టువు** వి. (√అడుగు¹) పాదజుఁడు, శూద్రుఁడు.

క. ...బలితపుఁగలుములఁ, బొలుతురు నెటి నచటియడుగు పుట్టువు పెద్దల్. అచ్చ. రా. బాల. 42.

**అడుగుపె(వె)ట్టు**—అడుగిడు, అ. క్రి. 1. పాదము పెట్టు; నడచు.

సీ. అడుగువెట్టదు సవ్యాహరిచందన లతాంత సరణిపైఁగాని యీ యరుణచరణ. వసు. 3. 58.

(దానకన్య)

సీ. అల బలీంద్రునిచేత నడుగువెట్టఁగ నేర్చి ధారాధరముచేత నీరువోసి. నరస. 1. 116.

2. ప్రవేశించు, చొచ్చు.

సీ. అడుగుపెట్టఁగ నేరఁ డపయశం బగుత్రోవఁ జనఁగ నేరం డాప్తజనము విడిచి. ప. శకుం. 1. 95.

(వ్యవ) వాఁడడుగు పెట్టినచోట నెల్ల ధ్వంసమేయగుచున్నది. కోడ లడుగుపెట్టినవేళ మంచిదే.

3 కదలు.

గీ. అర్థమిప్పించి యవ్వలనడుగు వెట్టు. శుక. 3. 40.

**అడుగుమానిసి** వి. (√అడుగు[1] అడియ). పాద సేవకుఁడు,

చ. యదుకులనాథ యిప్పుడితఁ డాగ్రహవృత్తి నొనర్చు నిగ్రహం,బిదియ ననుగ్రహంబ యగు నింద్రియరాజికి బంటు సేయ శ్రీ,మదము నణంచి నీయడుగుమానిసిగా నను జేసెఁగాన...పాండు. 4. 304.

**అడుగుమాలిపోవు** అ. క్రి. (√అడుగు[1]) మొదలంట నశించు.

గీ. అనుజతనుజులుఁ జెలులు వియ్యములు నడుగు, మాలిపోదురు నీకుఁగా మనుజనాథ. భార. ఉద్యో. 3. 341.

**అడుచు** స. క్రి. (త. అడి.) మోఁదు, కొట్టు, తాడనముచేయు.

చ. అడిచినఁ దిట్టినన్ మఱి మహాపురుషంబులు పల్కయల్కతో...భార. ఆది. 1. 138.

క. పడయుఁడు పొడువుం డడువుఁడు, డ్రేయుఁ డనుచు వారు జాహ్నవీతనయుఁ గడున్, డాయుడు...భార. భీష్మ. 3. 409.

(ఇది 'వెడలు, పోవు' ధాతువులకు అవ్యవహితముగాఁ గాని వ్యవహితముగాఁ గాని అనుప్రయుక్త మగునపుడు ప్రేరణార్థమును సూచించును.)

క. గురుతల్పగు భ్రూణహనున్, నరేంద్రవిద్వేషి బ్రాహ్మణఘ్నునిఁ జెలుచన్,ధరణి వెడల నడుపవలయు, శరీరనిగ్రహము సేయఁ జనదెయ్యెడలన్. భార. శాం. 2. 176.

క. ...అలుం, గొడుకులు నాయర్థ మెల్లఁ గొని వెడలఁగ న,న్నడిచిన ... మార్క. 6. 14.

2. కొట్టిచంపు; చంపు.

చ. ...కుక్కయందు దా,ని నడిచి తెచ్చి వండి తిను నీచపుమాలనియందుఁ దుల్యద,ర్శనులు దదంతరాత్ముని నిరంజనునిం గనునట్టి పండితుల్. భార. శాం. 5. 109.

3. పొడుచు.

అ. హరియుఁ గావ్యనేత్ర మటఁ గుశాగ్రంబున, నడువ నేకనేత్రుఁడయ్యె నతఁడు. భాగ. 8.609.

జ. అడిచిపడు: అడిచిపాటు, అడుపు, ఆటు.

**అడుజా**—అణుజా. వి. ఒకజాతిదేగ. (శ. ర.)

**అడుప** వి. పశువుల పాదమునఁబుట్టు రోగవిశేషము.

సీ. పశుపాదరోగంబు పరుఁగు నడుప యన... ఆం. భా. 2. 125.

**అడుపు** వి. (√అడుచు. త అడిప్పు.) దెబ్బ,కొట్టు.

(వ్యవ) ఆకోపమున వానిని ఒక అడుపు అడిచినాఁడు.

**అడువు**[1]—అడుగు[1]. (శ. ర.)

**అడువు**[2]—అడుగు[2].

(ప్రశ్నించు)

గీ. అనుచు మన్యువేగంబున నడువ ... హ. న. 5. 13.

(నలకథయందు 'అడుగఁగా' అనియు హరిశ్చంద్ర కథయందు 'కొట్టఁగా' అనియు, అర్థములు.)

**అడుసు** వి. (క. అడుసు.) పంకము, బురద. ఆం. సం. స్థా. 22.

సా : అడుసుత్రొక్కనేల కాళ్లుకడుగనేల.

అడుసు కన్నులు — అడుసువలె అంటుకొను కన్నులు.

**అడ్గు**[1]- అడుగు[1].

**అడ్గు**[2]—అడుగు[2].

సీ. పను లడ్గరాఁడ జంభారి శాసనమున కన లుండు రాఁడ...కు. సం. 10. 555.

**అడ్డ**[1] వి. (సం. అర్ధం. క. త. అడ్డ.) 1. కుంచములో సగము. 2. గుంటక మొదలగువాని కమర్చిన దిండువంటికొయ్య. 3. పల్లకీబొంగు చివర తగిలెడి అలంకారవిశేషము.

ఉదా: అడ్డలపాలకి.

జ: అడ్డపచ్చ, అడ్డుగ.

**అడ్డ²** విశ. వృత్తియందు 'అడ్డము'లోని 'ము' వర్ణము లోపింపఁగా నిలిచినరూపము.

ఉదా: అడ్డపాప, అడ్డబొట్టు. మొ.

జ. అడ్డంచు, అడ్డకట్ట, అడ్డకట్టు, అడ్డకత్తి, అడ్డకమ్మ, అడ్డకమ్మి, అడ్డకొడమ, అడ్డగడియ, అడ్డగట్టు, అడ్డగాలు, అడ్డగించు, అడ్డగింపు, అడ్డగొడ్డము, అడ్డగోలుగా, అడ్డచాఁపు, అడ్డదిడ్డము, అడ్డపట్టు, అడ్డపెట్టె, అడ్డపడు, అడ్డపాటు, అడ్డపాప, అడ్డపెట్టు అడ్డబాస, అడ్డబొట్టు, అడ్డమాను, అడ్డలాఁగు, అడ్డవాటు, అడ్డవాతియమ్మ అడ్డవేడెము, అడ్డసారె, అడ్డసాళ్లు, అడ్డాదిడ్డము, అడ్డాదిడ్డి, అడ్డాయుధము.

**అడ్డ³** న. (జూదమందు) నాలుగు అనుసంఖ్య.

సీ....తిగవంచ చౌకమ్ముతీవంచ యడ్డ, యనఁగఁ జతుష్కాఖ్య యగును ... గీ. అరయ నీరీతి ద్యూతసంఖ్యలు చెలంగు. ఆం. భా. 2. 306.

**అడ్డ⁴** వి. ఒకానొకతీఁగ.

ఉదా: అడ్డాకులవిస్తరి.

**అడ్డంకి** వి. (√అడ్డు) నిరోధము, ఆటంకము.

క. రాదాయెఁ జూచితే యను, రాదా యడ్డంకిఁ బట్టి రా దను నిగ్మ, ర్యాదలు సీమంతిను లను, హాదైవమ ప్రొద్దువోయెనని తల యూఁచుచు. వేం. పంచ. 4. 248.

**అడంచు** వి. (√అడ్డ²) బట్టకు అడ్డముగా వేయు అంచు, అడ్డకమ్మి.

**అడ్డకట్ట** వి. (√అడ్డ²) కాలువలు మొదలగువానికి అడ్డముగా కట్టుగట్టు.

**అడ్డకట్టు** స. క్రి. (అడ్డ² + కట్టు. క. అడ్డకట్టు. త. అడ్డిగట్టు.) నిరోధించు:, ఆఁపు, వారించు.

ఉ. ...కొండలకాలువ లడ్డకట్టుదుర్, నీరికి... హరి, ఉ. 9. 57.

గీ. హరి ప్రయోగించె మహేశ్వరాస్త్ర మప్పు, డతఁడు రౌద్రాస్త్రమునఁ దోవ యడ్డకట్టె. ఉ. హరి. 4. 289.

ఆ. ...వింధ్యశిఖరి యపుడు, పెరిఁగె నిఖిల భువన భీకరమై దిక్కు, లడ్డకట్టె... నేతు. 3. 85. పొ.

వి. అడ్డముగాఁ గట్టెడుకట్టు.

సీ. అలకముల్ మాటి యాాదలఁ బాగఁ జుట్టిపై నడ్డకట్టు రుమాలుగుడ్డ కట్టి. వైజ. 2. 57.

**అడ్డకత్తి** వి. (√అడ్డ²) ఆయుధవిశేషము, పట్టిసము, మొహదా. ఆం. భా. 2. 215.

**అడ్డకమ్మ** (√అడ్డ²) ఒకవిధమగు నాసాభూషణము. చెన్న. 2. 207.

**అడ్డకమ్మి** వి. (అడ్డ² + కమ్మి) 1. అడ్డముగా వేయుకట్టు. 2. నాస, ద్వారముపై కమ్మి. 3. చీర మొదలగువానికి అడ్డముగా వేయుఅంచు.

**అడ్డకొడమ** వి. (√అడ్డ²) చేఁపలఁ బట్టెడి యొకానొక సాధనము.

గీ. కొడమ తిట్టు డ్డకొడమ ద్రొబ్బుడుపటంబు, చాఁపయె త్తెలగూడయు...హంస. 4.184.

**అడ్డగడియ** వి. (√అడ్డ²) తలుపునకు అడ్డముగా వేయు గడియ.

**అడ్డగట్టు** వి. (√అడ్డ²) 1. తలుపుమొదలగువానికి అడ్డముగా వేయుకట్టు. 2. విఘ్నము, అడ్డు,

విశ. విఘ్నకరము, అడ్డు కలిగించునది.

క. నీయడ్డగట్టుమాటల, కీయెడఁ బనిలేదు నిల్వు మెప్పటివలెనే. రుక్మాం. 5. 90.

బ, సుఖరోగవిశేషము.

గీ. బిడ్డరో నీకు మును వుండునడ్డగఱలు, పెక్కుమాఱులు తగిలిన సుక్క కీవె, మార్చుకొంటివి...చంద్ర. వి. 2. 60.

**అడ్డగాడిద** వి. భ్రష్టుఁడు, పనికిమాలినవాఁడు అను నర్థమును సూచించుట కుపమానముగా తేఁబడు పదము.

(వ్యవ) వాఁడు అడ్డగాడిద లాగున తిరుగు చున్నాఁడు.

**అడ్డగాలు** వి. (√అడ్డ²) 1. అడ్డుగాపెట్టినకాలు. 2. అడ్డముగా తిరిగినకాలు.

అడ్డగాలువేయు—నిరోధము కల్పించు, విఘ్నము చేయు.

క. తలగలిగినఁ గుళ్లాయులు,గల వేవగనై నసీవు గలిగినఁ దాన్యుక్కులఁ టవము లెన్నియైనన్, గలిగెడుఁ బోకుమని యడ్డగాత్వేయంగన్. సారంగ. 2. 16.

**అడ్డగించు** స.క్రి. (√అడ్డ² క.అడ్డగిను, అడ్డయిను.) 1. నిరోధించు, అడ్డు. ఆం. భా. 8. 120.

2. అడ్డుగా నుంచు.

గీ. అపుడు చెవిదండఁ జేరి కేలడ్డగించి, మంత నంబున ... తలారి. వానివెత లాఱిపోవ భూవరున కనియె. సారంగ. 3. 159.

**అడ్డగింపు** వి. (√అడ్డగించు) నిరోధము, అరికట్టుట.

సీ. అడ్డగింపులకు లోనై రి మరుత్తులు ... ఉ. రా. 1. 285.

**అడ్డగొడ్డము** వి. (√అడ్డ²) వక్రోక్తి, అడ్డుమాట.

ద్వి.అడ్డ గొడ్డంబులు నొడ్డారంములును.పండితా. పురా. 117. పా.

**అడ్డగోలుగా** క్రి. విశ. క్రమ. (√అడ్డ²) అడ్డుగా, ప్రసక్తిలేకుండ.

గీ. ...ఇది యేమి కలకలం బలుకు నినుచు, ననుదురా జడ్డగోలుగా నగ్గడీని, వెగ్గలంబుగ మ్రోయించు వెలమఱేని, యనుపమంబైన నౌబత్తు నివదమనఁగ. రంగా. 2. 206.

**అడ్డచాఁపు** వి. (√అడ్డ²) అడ్డదూలము. (బ్రౌ)

**అడ్డదిడ్డము** — అడ్డాదిడ్డము, అడ్డాదిడ్డి. విశ. (√అడ్డ²) అక్రమమైనది, తిన్నగా లేనిది.

(వ్యవ) వాఁడు అడ్డదిడ్డముగా మాటలాడును. అడ్డదిడ్డపుఁబనులు.

**అడ్డనము** సం. వి. అ. న. వేత్రాదికృతమగు ఒక విధమైనడాలు. (వై. ని.)

సీ. కవదొనల్ విండ్లును గత్తులంబులు కుంత ములు గరువాలముల్ పలక లీఁచె, లడ్డన ములు. కు. సం. 12. 784.

**అడ్డపచ్చ** వి. (√అడ్డ¹) సగము పచ్చరంగు.

వ. సుకుమారశుకచ్ఛదచ్ఛటాదాయాదంబులై యడ్డపచ్చఁ గొనునవియును...ఐన ప్రాసఁ గుంజేలును. కాశీ. 7. 26.

**అడ్డపట్టు** వి. (√అడ్డ²) శిశువులను పట్టుకొనుటకై చేతులడ్డముగాపెట్టి పట్టినపట్టు.

ద్వి. ...నీసుతుఁడు, అడ్డపట్టులపాప యవునచే. ద్వి. శ. సా. 2. 307. పం.

**అడ్డపట్టె(ట్టియ)** వి. (√అడ్డ²) 1. అడ్డముగా నుండుపట్టె. 2. వరిమడి మొదలగునవి చదును చేసెడిపలక. (బ్రౌ)

**అడ్డుపడు** అ. క్రి. (√అడ్డ²) 1. నిరోధకమగు, అడ్డమువచ్చు.

ఆ. అప్పు డగ్గునుండు దప్పకచూచి యీ,బలము పసులకడ్డపడకయుండ,నెడపొరంగవలయు. భార. విరా. 4. 267. భాగ, శాం. 3. 297.

2. నిరోధకముగాఁ బడు.

గీ. తనదు ప్రాణేశ్వరుని పదద్వయముమీఁద, వేగఠా నడ్డపడియైన వేఁడుకొనెదఁ,గాక యని...సారంగ. 4. 74.

3. (శత్రువులు ఆపదలు మొదలగు వానినుండి తప్పింప) అడ్డుగా వచ్చు.

వ. నొచ్చియు నీడంబోక చెలులకుం జుట్టంబు లకు నడ్డపడువారును మార్బలంబునం జేరి చుట్టంబని తప్పింపక నొప్పించువారును... భార. భీష్మ. 1.267. భా. రా. అర. 2.115.

(వ్యవ) ఈ వ్యవహారములో వాఁడు అడ్డపడి యిరువురకు సంధిచేసినాఁడు. వాఁడు గోదావరిని విడిచేతులతో అడ్డపడినాఁడు.

**అడ్డపాటు** వి. (√అడ్డపడు) 1. నిరోధము; ప్రతిబంధము, అడ్డు.

మ. అదె నాబిడ్డలఁ బట్టి దొంగలు మహాహంకారులై కొంచు నున్నడులైపోయెద రడ్డపాటునకు సామర్థ్యంబునన్ హీనుఁడై, కదలం డీమగపంద ... భాగ. 9. 405. హరి. ఉ. 8. 207.

2. కప్పు, మఱుఁగు ఆం. భా. 1. 76.

**అడ్డపాప** వి. (√అడ్డ²) 1. చేతులలో నుంచుకొనఁ దగిన శిశువు, స్తనపాయి, అడ్డాలలో నుంపఁ దగిన వయసు గలబిడ్డ.

ఉ....నోరిలోపలఁ, వ్రేలిడినప్పుడుం గఱవ నేరఁడు నీసుతుఁ డడ్డపాప గాఁ,దే లరి శాంగి...సారంగ. 3. 58.

2. దూరదృష్టిలేని వానికన్నులలోని పాప. (శ. ర.)

**అడ్డపుఁబట్టీ** వి. (అడ్డము+పట్టి) అడ్డపాప, స్తన పాయి.

ఆ. అట్లు సంతసిల్లి యడ్డంపుఁబట్టిగా, నధిక తేజుఁడైన యక్కుమారు, నక్కునందుఁ జేర్చి యక్కొమ్మయొప్పె...పరమ. 1. 136

**అడ్డపెట్టు** స. క్రి. (√అడ్డ². త. అడ్డిపుడుత్తు.) నిరోధించు, ఆఁపు.

గీ. అడ్డపెట్టెదఁ గాక తీవ్రాంశురథము. కాశీ. 1. 116.

వి. నిరోధము, అడ్డగింపు.

వ....అడ్డపెట్టు లేక విహరించుటకు....ప్రభా. 1. 121.

**అడ్డబాస** వి. (√అడ్డ²) స్త్రీలుముక్కునఁ బెట్టుకొను అలంకారవిశేషము.

**అడ్డబొట్టు** వి. (అడ్డ²) అడ్డముగాఁ బెట్టుబొట్టు, తిర్యక్పుండ్రము. (వ్యతి. నిలువుబొట్టు)

**అడ్డమాను** వి. (√అడ్డ²) తలుపునకు అడ్డముగా వేయుకఱ్ఱ, అడ్డగడియ.

**అడ్డము** వి. (క. అడ్డ. త. తు. అడ్డి.)

1 ఆటంకము, నిరోధము.

చ. అలిగిన భీమఫల్గునుల కడ్డములేమి యెఱుంగుదు...భార. ఉద్యో. 3. 201.

2. వెడలుపు, అడ్డకొలత.

సీ. అస్తుంబు నిడుపు నాఁబడ్డ లగతి మనునిల్లు డొంకలనుండి క్రేళ్లుదాఁట. మనుచ. 2. 7.

3. చాటు, మఱుఁగు.

గీ. అడ్డి యడ్డము మూయిక ప్పడ్డపాటు, మఱుఁగుచాటోల మోలిమి మాటుమూఁత, యనఁగ వ్యవధానమౌ...ఆం. భా. 1. 76.

4. తాకట్టు.

ఉదా: కంచె అడ్డముగాపెట్టి వందరూపాయలు తెచ్చుకొన్నాఁడు.

బ. అడ్డాలు—పిల్లలనుంచుకొనుటకై అడ్డముగా పట్టుచేతులు.

(వ్యవ) పిల్లను అడ్డాలలోఁ బెట్టుకొని తల్లి పాలిచ్చుచున్నది.

సా: అడ్డాలనాఁడే బిడ్డలుగాని గడ్డాలనాఁడు బిడ్డలా?

విశ. 1. విరోధకము, అడ్డగించునది.

క. ...నీ వలిగిన నడ్డమె పురహరాజకేశవు లయినను. భార. ఆది. 4. 184.

క. సాహసమున మద్బాహుఁగ, దాహితదుర్యోధనాదు లగురిపులజగ, ద్ద్రోహులఁజంపుదు నత్యుగ్రాహవమున హరిహరాదు లడ్డం బైనన్. భార. సభా. 2. 295.

2. నడుమనుండునది.

మ. అనికిందారిచి తోడు తెచ్చుకొని మిమ్మడ్డంబుగానొడ్డుచున్, దనమై సోఁకకయుండఁగాఁ దిరిగెదున్ దవ్వైజరాసంధుఁ డిట్ల నిమిత్తంబు నశింప నేమిటికి...హరి. ఉ. 1. 111.

సీ. అని పల్క నిశ్శంక నాసీత తృణ మడ్డముగఁ బెట్టుకొని పంక్తిముఖుని కనియె. భా. రా. అర. 2. 201.

3. అడ్డుగవచ్చునది.

సీ. కన్నుదోయికి నన్యకాంత లడ్డంబైన మాతృభావముఁజేసి మరలువాఁడు. ('గోచరమైన' అని తాత్పర్యము) భాగ. 7. 115.

సీ. అర్కమండలి కభ్రమడ్డమైనంతనె యెరమాని మోము బిట్టెత్తి చూచి. ఆము. 4. 181.

4. విరుద్ధము, వ్యతిరిక్తమైనది, ప్రతికూలము.

క. ఐనను నొకపలు కడ్డముగా నొడివెద దాని లెస్సగావిని యది మేలైనను జేసెదు గాదే, న్నామెద వేర్పుఁగ వినుము మనుజాధీశా. భార. శల్య. 1. 49. ఆం. భా. 3. 25.

5. అడ్డముగావచ్చినది, ప్రాప్తించినది, తటస్థించినది,

(వ్యవ) అడ్డమైనగడ్డి తినుచున్నాఁడు—యుక్తాయుక్తవిచారణ లేక తటస్థించిన దెల్ల తినుచున్నాఁడు.

ఇట్లే: వాఁడు అడ్డమైనవారితోనుగలిసి తినుచున్నాడు. వాఁడు అడ్డమైనమాటలు నన్నాడుచున్నాఁడు. అడ్డమైనతిట్లు తినుచున్నాఁడు. ఏదోఒకటిఅఁకటికడ్డమైనది అంతే

చాలును. నాలుగు వంకాయముక్కలు అడ్డము వేసి పులుసు కాచినారు.

క్రి. విశే. అడ్డముగా, అడ్డుగా.

ఉదా: అడ్డమాడు. అడ్డముగదల్చు, అడ్డము చెప్పు, అడ్డముచొచ్చు. మొ.

గీ....ఆతనిమాటకు నడ్డమాడ, వెఱచి... భార. విరా. 4. 38.

శా. మో మడ్డంబుగదల్చి...హరి. 2. 57.

క. మీ రిడ్డ ముసెప్పక యీ, గౌరవము మదీప్సితంబుగా సిద్ధింపం, గోరుదని పలికి...హరి. ఉ. 10. 249.

సీ. అతఁడు నొచ్చినతఱి నడ్డంబుసొచ్చెద మని వచ్చువారు లేరైరె యచట. భార. భీష్మ. 1. 58.

సీ. అడ్డంబుదిరిగి తలాహతిఁ బడి రొండి హస్తంబులిడి యంగలార్చుకపుల. ఆము. 6. 18.

వ....అడ్డంబుపఱతెంచి...రాఘవ. 3. 92.

అడ్డముపెట్టు– 1. వినిమయముచేయు.

ఉదా: ఆతఁడు పిల్లనుఅడ్డముపెట్టి పిల్లవానికి పెండ్లి చేసినాఁడు.

2. తాకట్టుగా నుంచు.

ఉదా: ఈవస్తువుఅడ్డముపెట్టి పదిరూపాయలు తీసికొనిరమ్ము.

అడ్డముల్ వడు – అడ్డ పడు, నిరోధకముగా పడు.

మ. హరిఁ బోనీకుఁడు నిల్వరే యనుచు నేఁడర్భింతమా వేల్పులౌ, హరిపాదంబుల కడ్డముల్ వడుదమా హాదైవమాయంచు... భాగ. 10. పూ. 1219.

అడ్డమువట్టు– అడ్డముగాపట్టు.

సీ. పాండ్యుఁ డడ్డమువట్టుపానడ మఱుఁగున లాట భూభర్తకాళాంజి పూన. దశా. 1.98.

జ. అడ్డపుఁబట్టి.

అడ్డ ముదిగటము – అక్రమముగా, ఒక పద్ధతి లేకుండఁగా.

సీ. అరచట్ట దొడిగి మైనడ్డంబుదిగటంబు వలిపెదుప్పటి వల్లెవాటు వేసి, వైజ. 2. 47.

క. గడగడ నొడలు వడంకఁగ, దడ దడ దడమంచు గుండె తల్లడమందన్, బడి బడి నడ్డముదిగటము పడి పడి మ్రొక్కుచును శాహి పాహి యనఁగన్ దశా. 2. 213.

**అడ్డలాఁగు** వి. (√అడ్డ[1]) నాట్యగతివిశేషము.

సీ. దిరిదిరిఁజక్రంబు దిరుగుచందంబున లగువు గన్పడ నడ్డలాఁగు లెత్తి. ప్రబంధ. 109.

**అడ్డవాటు** వి. (√అడ్డ[1]) 1. అడ్డముగాఁ గొట్టిన దెబ్బ.

(వ్యవ) వాఁడు అడ్డవాటుగాఁ గొట్టినాఁడు.

2. విఘ్నము, అడ్డు.

(వ్యవ) నీవేలదానికి అడ్డవాటు వేసెదవు. (శ.ర.)

**అడ్డవాతియమ్ము** వి. (అడ్డ+వాయి+అమ్ము.) ఒకవిధమైన బాణము. (శ. ర.)

**అడ్డవేడెము** వి. (అడ్డ[2]) అశ్వధారా విశేషము, రేచితము, పామునడకవంటి గుఱ్ఱపునడక.

ఉ....అహాయదత్ప మెక్కినతఁ,గక్కిన మేమి లేక చవగాలును జోడన యడ్డవేడెము, ల్దుక్కు దువాళి జంగనడలుం గనిపించుచుఁ బోయిపోయి. సారంగ. 1. 82.

**అడ్డసరము** వి. (సం. అటరూషః. ప్రా. అడరూస, క. అడ్డసర.) ఒకానొకయోషధి.

**అడ్డసారె** వి. (అడ్డ[1]) సారె, పాచిక.

సీ. సారెయంచన నడ్డసారె యంచనఁగనుసొగటమంచనఁగను దగును శారి.అం. భా.2.805.

**అడ్డసాళ్లు** వి. బ. (అడ్డ[1]) అడ్డసారెలు.

క. మాయలు జూదముతోడన, పోయెంగాకింక నిచటఁ బోసఁగునె యది మ,త్న్యాయకము లడ్డసాళ్లే, నీయాచవి లేదు పొమ్ము నిలువక మామా. భార. ద్రోణ. 1. 362.

ఆ. శకుని చేతియడ్డసాళ్లులు.భార.ద్రోణ.5.29.

**అడ్డాదిడ్డము**–అడ్డదిడ్డము.

(వ్యవ) వాఁడు అడ్డాదిడ్డముగా మాట లాడుచున్నాఁడు.

**అడ్డాదిడ్డి**–అడ్డదిడ్డము. విశే. (క. తు. అడ్డాదిడ్డి. త. అట్టాదుట్టి.) 1. అక్రమము, అనర్థము. (మాట. మొ.)

సీ. వినయంబుతోఁ జేరిపని యేమి యనువాఁడె
యరయకడ్డాదిడ్డులనుపసాగె. కువల. 2.24.
(వ్యవ) వాఁడు అడ్డాదిడ్డి మాటలాడుచున్నాఁడు.
2. వంకరయైనది.
సీ. తులసిపూసలు బోడితలయు నడ్డాదిడ్డి పట్టెనామములు సంభ్రమము నొప్ప. శుక. 2. 548.

**అడ్డాయుధము** వి. (√అడ్డ[1] త. అడ్డాయుధ, అడాయుధ.) చివర వంపు గలిగినఖడ్గము.
ద్వి. హరమహత్త్వం బనునడ్డాయుధమున. బస. పు. 5. 719.

**అడ్డి**—అడ్డము. వి. (క. త. తు. అడ్డి.)-(శ.ర.)
జ. అడ్డిపడు.

**అడ్డిగ** వి. (క. అడ్డిగె. త. అడ్డిగై.)
1. రెండు గురివెంటగింజలయెత్తు, అరచిన్నము.
2. స్త్రీలకంఠాభరణమునందు గ్రుచ్చుటకై బంగారుతోఁ జేసినపూసవంటిచిన్నవస్తువు. (ఇది ఒడ్డాణమందుఁ గూడ గ్రుచ్చెదరు.)
సీ. కటిబద్ధకనకాంశుకంబుపై మణులయడ్డిగల యొడ్డాణంబుజిగి దలిర్ప. ఉ. రా. 8.296.
3. ఒకవిధమగు కంఠాభరణము.

**అడ్డిపడు**—అడ్డపడు. (శ. ర.)

**అడ్డు** స. క్రి. అడ్డగించు, నిరోధించు.
(వ్యవ) వాఁడు వెళ్లుచున్నవానిని అడ్డినాఁడు.
అ. క్రి. ఆఁగు, నిలిచిపోవు.
ఉదా: పెండ్లికొడుకు రాకపోవుటచేత పెండ్లి అడ్డినది.
వి. విశ. క్రి. విణ—అడ్డము.
(వ్యవ) కంచె అడ్డుపెట్టి కావలసినసొమ్ము తెచ్చుకో. నీప్రాణాలకు నాప్రాణాలు అడ్డు.
అడ్డుగాళ్లువైచు—అడ్డగాలువేయు, నిరోధము కల్పించు, విఘ్నముచేయు.
క. ఒకనికిఁ దెలియఁగ వేఱొక, నికిఁ దెలియక యుండుఁ గార్యనిర్ణయ మితఁడే, టికివడ్డు గాళ్లువైచెనో, యకటా యిది యెల్లఁ దెలియ నడుగఁగ వలయుఁ. శుక. 3.388.

అడ్డుచొచ్చు—అడ్డుగాచొచ్చు.
సీ. ...పౌర నేత్రముల కడ్డుచొరక మున్న, కాశీ. 3. 84.
అడ్డుదాఁకు — అడ్డుగాతాఁకు, అడ్డుగావచ్చు. రసిక. 4. 10.
జ. అడ్డంకి. అడ్డుకొను, అడ్డుపడు, అడ్డుపాటు.

**అడ్డుకొను** స. క్రి—అడ్డు.
సీ. చల్లలమ్మఁగఁ బోవుగొల్లకొమ్మలనడ్డుకొని సిగ్గులెడలించి...నీలా. 1. 76.
అ. క్రి. ఆఁగిపోవు, నిలుచు. (స్వార్థమున 'కొను')
ఉదా: పనివాండ్రు రాకపోవుటచేత పని అడ్డుకొన్నది.

**అడ్డుగ** వి. (అడ్డ[1]) రూకలో సగము.
సీ;...పణార్ధసంజ్ఞ. గీ యొప్పు నడ్డుగ యనఁగఁ జాదోనపణము, వఱలు ముప్పాతిక యనంగఁబణము రూక, యనఁగఁ జెన్నొందు ...ఆం. భా. 2. 272.
ఉ. అంగట మూఁడురూకలును నడ్డుగ దండుగు వానిపైఁబడుఁ. విజ్ఞా. ప్రా. 42.

**అడ్డుపడు**—అడ్డపడు (√అడ్డు)

**అడ్డుపాటు** వి. (√అడ్డుపడు) ఆటంకము.
ఆ...వాతాయన, పథమునందు నడ్డుపాటులేక, తగిలి గృహగృహంబు తప్పక ప్రత్యూష, మారుతంబు వీచె...భోజరా. 2. 115.

**అఱియు** స. క్రి. (క. అఱి. త. అఱి.) భగ్నము చేయు, పగులఁగొట్టు. (ఈశబ్దమిప్పుడు వాడుకలో లేదు. అగీడ్డుత లేని శకటరేఫమువలెనున్న ఈపదమధ్యాక్షరము తమిళపదము చివరయక్షరమువలె ఉచ్చరింపవలెను.)
మధ్యా. అఱియఁ బైవారల వెల్వరించిన నశ్వమేధంబు, ఫల ముపేక్షించిన లింగ మఱిసిన పాపంబు దమకు, శా. ప. మ. 2.

**అణఁకువ** (√అణఁగు)- అడఁకువ.
(ఇమిడిక)
క. ప్రణవస్వరూపియైతగ, నణఁకువగఁ దదక్షరమ్ము లన్నియు నుండం, గణుతించి యంబకలముని, గణ ముమ యని యపుడు నామకరణముచేసెఁ. పార్వ. 2. 12.

**అణఁగారు** (√అణఁగు)—అడఁగారు.

**అణఁగు**—అడఁగు.

(నశించు)

క. మణికర్ణిక మణికర్ణిక, మణికర్ణిక యనుచు నుడువుమనుజుల కెల్లన్, గణనాతీతపు దోషము, లణఁగి శతక్రతుఫలంబు లగు నని తలఁచెన్. హంస. 1. 165.

జ. అలఁకువ, అణఁగారు, అణఁచు.

**అణఁచే**—అడఁచే. (√అణఁగు క.అణచు, అణంగు.)

**అణక** వి. మెడమీఁద నున్నకాఁడి మొదలగువానిని మెడక్రిందికి తెచ్చుకొనుట.

సీ. వెగడొంది యవితేరినొగలఁ గట్టినయట్టి వాహంబు లణకలు వైచుకొనియె. విక్ర. 4. 50.

**అణకము** వి. (క. అణక.) పరిహాసము,నవ్వులాట.

ద్వి. అక్కట యక్రూరుఁ డనువాఁడు మనకుఁ, దెక్కలివలె నిటఁ దేరలెచ్చె,నక్రూరుఁడగు వీని జను లెల్లఁ గూడి, యక్రూరుఁడని పేరు టణకంబు గాదె. ద్వి. భాగ. 2. 45 పా.

జ. అణకించు.

**అణకము** సం. విణ. (అ. ఆ. అ.) అల్పము,నీచము.

వి. అ. పుం. ఒకజాతిపక్షి.

**అణకించే** (√అణకము)—అడకించే.

(పరియాచకము చేయు)

ద్వి. గణుతింప నట్టేల కలకంఠుభక్తు, లణకించి పలికిన నదియె హితంబు. పండితా. పురా. 104. పా.

గీ. కలఁ వమ్ముల నణకించుగళరవమ్ము. పాండుగ. 2. 98. (ఇట ఔపమ్యద్యోతకము)

**అణవీనము** సం—అణవ్యము.

**అణవ్యము** సం. విణ. (అ. ఆ. అ.) చిఱువఫ్లు మొదలగునవి పండునది (పొలము)

**అణా** హిం. వి. రూపాయలో పదునాఱవవంతు; రూపాయలో పదునాఱవవంతువిలువ గల నాణెము, (వా)

**అణి** సం. వి. ఇ. పుం, ఇ, ఈ. స్త్రీ. 1. ఇరుసుతుది చీల. 2. సూదిమొన. 3. ఎల్ల. 4. ఇంటియందు మృగాదులను వధించుటకైనయొకమూల,



**అణిమ(ము)** సం. వి. న్. పుం. 1. అణుస్వభావము, అల్పత్వము. 2. అష్టైశ్వర్యములలో నొకటి. (ఈయైశ్వర్యమువలన మిక్కిలిసూక్ష్మకాగ మొంది సర్వత్రప్రవేశించుట శక్తిగలుగును.)

**అణి(ణీ)మాండవ్యుఁడు** సం. వి. అ. పుం. కొఱుత వేయఁబడిన యొకానొకఋషి.

**అణిష్ఠము** సం. విణ. (అ. ఆ. అ.) సూక్ష్మతమము, మిక్కిలి చిన్నది.

**అణీయము** సం. విణ. (స్. యసీ. స్.) సూక్ష్మతరము, మిక్కిలి చిన్నది.

**అణుకము** సం. విణ. (అ. ఆ. అ.) 1. మిక్కిలి చిన్నది, అతిసూక్ష్మము. 2. నేర్పరి, నిపుణము.

వి అ. పుం. చిఱువడ్లు.

**అణుజు**—అడుజు.

చ....చేనణుజుల్గలవేగ వేఁటరుల్. చంద్ర. 2.23.

గీ. సాళువము గిడ్డ లగుడు వేసడము కురుజు, బాజు జుంకల్లె జాలియ వైల యణుజు, నోరణంబును నాదిగాఁ బేరుపడిన, వేఁట డేగల గిఱికొన విడిచి కడిమి. హరిశ్చ. 2.22.

అణుజు వి 2 ఈఁకలు రాల్చినపక్షి

గీ. గూఁటిగువ్వన ణుజునఁ గురు జనఁగ, నీఁక రాల్చినపక్షి యా నిందుమౌళి ఆం. భా. 2. 98.

**అణుతైలము** సం. వి. అ. న. ఒకానొకమందు నూనె.

**అణుమాత్రము** సం. విణ. (అ. ఆ, ఈ. అ.) సూక్ష్మపరిమాణము గలది.

**అణురేణువు** సం. వి. ఉ. పుం. స్త్రీ. ధూళినలుసు.

**అణురేవతి** సం. వి. ఈ. స్త్రీ. దగతి (వ్య. వి.)

**అణువాదము** సం. వి. అ. పుం. పరమాణువులు జగత్కారణములనియు నిత్యములనియు చెప్పెడి తార్కికవాదము.

**అణువీక్షణము** సం. వి. అ. న. 1. సూక్ష్మాంశము లను బరిశీలించుట. 2. సూక్ష్మదర్శని. (యంత్రము)

**అణువు** నం. విశ. (త.త, వ్యా.త.) అత్యల్పము, మిక్కిలి చిన్నది. వి. అ. పుం. 1. నలుసు. 2. అతి సూక్ష్మకాలము, ఒక ముహూర్తమందు (48నిమిషములలో) 55675000 వంతు. 3. ఆవాలు మొదలగు చిన్న కాయధాన్యములు. 4. శివుఁడు. న. మాత్రయందు (లఘ్వక్షర కాలములో) నాలవపాలు.

**అణువ్రీహి** నం. వి. ఇ. పుం. చిఱువడ్లు.

**అతంద్రితుఁడు** నం—అతంద్రుఁడు.

**అతంద్రుఁడు** నం. విశ (అ. అ. అ.) 1. నిద్ర లేనివాఁడు. 2. అలసుఁడు కానివాఁడు.

**అతఁడు**—అతఁడు.

క. ప్రతికూలుండై, ఋతువిఫలత్వము సేసిన, నతనికి మఱి భ్రూణహత్యయగు నంద్రు బుధుల్. భార. ఆది. 3.188.

**అతకడచు** స. క్రి. 1. అతకరించు, దాఁటు.

క. అతిగర్వోదాసీనత, గతభయుండై శివశివో పకరణ ద్రవ్య, వ్రతతులు గాల్లందన్నిన, నతకడచినద్రోహి రౌరవాగ్నులఁ గాలుఙా. శివ. సా. 294.

2 నిరాకరించు. నిర్లక్ష్యము చేయు.

క. వేదములు ప్రమాణములుగ, నాదిన యొుఁబడియు వాని నతకడచి భవ, త్పాద నుతి విడిచి చెడియెను, బాగఱి దతుండు వీరభద్రుని చేతఙా. శివ. సా. 201.

**అతకరించు** స. క్రి. (నం. అధఃకరించు)-క్రిందు పఱుచు-1. మించు.

సీ. అంబుధినాదంబు నతకరించుచుఁ బర్వె నథ మునఁ బాంచజన్యస్వనంబు. నృసిం. 1.75.

2. అలక్ష్యము చేయు; నిరాకరించు.

సీ ఆచార్యులదు మిమ్ము నతకరించుట దోస మైనను నొకమాట యాఁడ పలసె. నృసిం. 4.97.

సీ. ఆయువు సత్వరి మైశ్వర్య మతిశ్రీఘ మని కఁదె తమతండ్రి నతకరించి, మాతాత సాధుసమ్మతుఁడు ప్రహ్లాదుండు నీపాదర మలంబు నియతిఁ జేరె. భాగ. 8.648.

3. ఓడచు.

సీ. లవణపాథోధివేలావేష్టితం బైనయల్లొనే రెడు దీవి నతకరించి, యిక్షురసాబ్ధిపరీతాం చలం బైన ప్లక్షాంఘ్రిపద్వీపపరిధిఁ గడచి. కాశీ. 5.781.

**అతకుఁడు** నం. వి. అ. పుం. త్రిమ్మరిఁడు, తెరువరి, పథికుఁడు.

**అతగాఁడు**—అతగాఁడు. (వా)

**అతగుఁడు** విశ. (నం. హతకః) హీనుఁడు, దుర్బలుఁడు, అల్పుఁడు.

క. అతగులచే ద్రుపదుఁ డనవ.హితుఁడై పట్టువడ నుతహీనుఁ డె. భార. ఆది. 6.68.

ద్వి. నలి మూఁడు గన్నులు గల త్రినేత్రు నకు, నల రెఁడుగన్నుఁ యతగులు సరియె. బస. పు. 6.842.

**అతలము** నం. విశ. (అ. అ. అ.) ఒడ్డులేనిది; ఒడు దొడుకైనది, ఒఱకము. వి. అ. పుం. 1. పర్వతముయొక్క ఉచ్ఛస్థానము, భృగువు. 2. భూమియొక్క క్రిందిభాగము.

**అతద్గుణము** నం. వి. అ. పుం. (అలం) ఒక యర్థాలంకారము. (హేతువున్నను నొకదాని గుణమును మఱియొకటి పొందకుండుట యిందు వర్ణింపఁబడును).

ఉదా:చ.భవదృశ బుచేఁ,దెలుపగునిందులాంఛనము... గాని త్వత్కథలనిపుడుఁ గ్యశోరుచి వితానము తెల్పయియుంన దెన్నఁడుఙా. నరస. 5.122.

**అతనువు** నం. విశ. (ఉ.) 1. శరీరము లేనివాఁడు. 2. కృశింపనివాఁడు, చిక్కనివాఁడు. 3. అహీనుఁడు, అధికుఁడు. వి. త. పుం. మన్మథుఁడు.

**అతప్తతనువు** నం. విశ. (ఉ.) 1. తప్తముద్రచే చిహ్నితము కానిదేహము గలవాఁడు. 2. వ్రతాదులచేత దేహమును క్రుక్కిఁపనివాఁడు.

**అతప్తము** నం. విశ. (అ. అ. అ.) 1. కాల్పఁబడనిది. 2. తపింపఁజేయఁబడనిది.

**అతర్క్యము** నం. వి. అ. పుం. 1 యుక్తిలేమి, హేతువులేమి. 2. కుతర్కము.

**అతర్కితము** సం. విశే. (అ. అ. అ.) 1. ఊహింపఁబడనిది 2. ఆకస్మికము.

**అతర్కితోపనతము** సం. విశే. (అ. అ. అ.) ఆకస్మికముగాఁ బ్రాప్తించినది.

**అతర్క్యము** సం. విశే. (అ. అ. అ.) ఊహింప శక్యము కానిది, తలఁప శక్యము కానిది.

**అతలకుతలము** విశే. (క. అతలకుతల, అత్తల కొత్తల. త. అతలకుతలం.) తాఱుమాఱైనది, వ్యత్యస్తము; క్షోభపడినది.

క. అకరుణతో మీరు బుభుక్షుకులై భూలోకమతలకుతలముగాఁ జేయక పోయి వసింపుఁడు త.ప్పక యిచ్చితి నతల వితల పాతాళంబుల్. వరాహ. 6.76.

వ. దెసచెడి కలగుండువడి హల్లకల్లోలమై యతలకుతలమైయట్టిట్టయిట్టుఁ దలఁగి. ప్రబంధ. 788.

**అతలము** సం. వి. అ. న. (భూమిక్రింది దనున్న) సప్తపాతాళలోకములలో మొదటిది. (అతల, వితల, సుతల, తలాతల, మహాతల, రసాతల, పాతాళము లని యివి యేడు)

**అతలస్పర్శము** సం. విశే. (అ. అ. అ.) మిక్కిలి లోఁతయినది, అతిగభీరము.

**అతలస్పృశుకు (స్పృశము)** సం. విశే. (?) అతలస్పర్శము

**అతసము** సం. వి. అ. పుం. 1. గాలి. 2. ఆత్మ. 3. జనపనారగుడ్డ.

**అతసి** సం. వి. ఈ. స్త్రీ. 1. నూనెయగిసె (వ్యా.వి.) 2. జనపమొక్క.

**అతి** సం. అవ్య. 1. విశేషణములకు పూర్వమున నుండునపుడు 'అత్యంతము, ఎక్కువగా' అను నర్థమును దెలుపును. (ఉదా : అతికృశుఁడు, అతిదుష్టుఁడు. మొ.)

2. విశేష్యములకుఁ బూర్వముననుండి 'అధికము, ఎక్కువ' అను అర్థమును తెలుపును. (ఉదా: అత్యాదరము, అత్యాశ. మొ.)

3. ప్రాదిసమాసమున 'అతిక్రాంతము, అతిక్రమించినది' అనునర్థము తెలుపును. (ఉదా: అతిమర్త్యము–మర్త్యుని నతిక్రమించినది. అతీంద్రియము–ఇంద్రియములను దాఁటినది.)

**అతికందకము** సం. వి. అ. పుం. హస్తికందము. (వృ. వి.)

**అతికథ** సం. వి. ఆ. స్త్రీ. 1. మితిమీఱిన వర్ణనము. 2. అధిక ప్రసంగము, వ్యర్థభాషణము.

**అతికథము** సం. విశే. (అ. ఆ. అ.) 1. అధికముగా వర్ణింపఁబడినది, నమ్మఁదగనిది. 2. కథనుండి దాఁటిపోయినది–నశించిపోయినది.

**అతికర్షణము** సం. విశే. (అ. అ. అ.) మిక్కిలి రాపిడి గలిగించునది, మిక్కిలి ఒత్తుడు కలిగించునది. వి. అ. న. 1. అతివర్షశ్రమము, ఎక్కువకృషి. 2. మిక్కిలి రాపిడి. మిక్కిలిపీడ.

**అతికాయుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) అసాధారణమైన శరీరము గలవాఁడు, పెద్దదేహము కలవాఁడు. వి. అ. పుం. రావణునికొడుకు. (ఇతఁడు లక్ష్మణునిచే హతుఁ డయ్యెను.)

**అతికృచ్ఛ్రము** సం. విశే (అ. ఆ. అ.) మిగుల కష్టమైనది. వి. అ. పుం. న. 1. మిక్కుటమైన కష్టము. 2. ప్రాయశ్చిత్తరూపముగా పండ్రెండురాత్రు లాచరింప వలసినయొక వ్రతము.

**అతికృతము** సం. విశే. (అ. ఆ. అ.) మితిమీఱి చేయఁబడినది.

**అతికృతి** సం. వి. ఇ. స్త్రీ. మితిమీఱి చేయుట.

**అతికేశ(స)రము** సం. వి. అ. పుం. పెక్కుకింజల్కములు కలది– కుబ్జకము, గొజ్జఁగి (వృ.వి.)

**అతిక్రమణము** సం. వి అ న–అతిక్రమము.

**అతిక్రమణీయము** సం. విశే. (అ. ఆ. అ.) అతిక్రమింపఁదగినది.

**అతిక్రమము** సం. వి. అ. పుం. 1. (మేర, మర్యాద ఆజ్ఞ మున్నగువానిని) ఉల్లంఘించుట, దాఁటుట 2. కడచుట, గతించుట.

ఉదా: కాలాతిక్రమము, వేళాతిక్రమము మొ.

3. మీఱుట; అడఁచుట.

ఉదా: స్వభావో దురతిక్రమః.

4. సరకుసేయమి, అనాదరము సేయుట.

**అతిక్రమించు** సం. అ. క్రి. జరిగిపోవు, గతించు.
వ. సర్వభూతభయావహం బగుచుం గాలం బతిక్రమించుచుండ. భార. శాం. 5.380.
స. క్రి. 1. కడచు, దాటు.
చ...వివిధశైలములు న్నదులు న్మహావనం, బులును నతిక్రమించి మార్క. 1.189.
2. సరకుచేయకుండు, అనాదరము చేయు.
వ. అని పలుకుచున్న భీష్మభీములం నతిక్రమించి శిశుపాలుండు జనార్దనున కభిముఖుండయి యిట్లనియె. భార. సభా. 2. 62.
3. మించు, మీఱు.

**అతిక్రమిత** సం. విణ. (ఋ. క్రీ. ఋ.) అతిక్రమించువాడు.

**అతిక్రమితవ్యము** సం—అతిక్రమణీయము.

**అతిక్రమ్యమాణము** సం. విణ. (అ. ఆ. అ.) అతిక్రమింపబడుచున్నది.

**అతిక్రమ్యము** సం—అతిక్రమణీయము.

**అతిక్రాంతము** సం. విణ. (అ ఆ అ.) 1. అతిక్రమించినది. 2. అతిక్రమింపబడినది.

**అతిక్రాంతి** సం. వి. ఇ. స్త్రీ—అతిక్రమము.

**అతిక్రామకుడు** సం. విణ. (అ. మిశ్ర. అ.) అతిక్రమించువాడు.

**అతిక్రామత్** సం. శతృ. అతిక్రమించుచున్న.

**అతిక్రామి** సం. విణ. (న్. జీ. న్.) అతిక్రమించువాడు.

**అతిక్రామ్యత్** సం-అతిక్రామత్.

**అతిక్రూరము** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి క్రూరము. వి. అ. పుం. (జ్యోతి) వక్రగతి గల క్రూరగ్రహము (శని, అంగారకుడు.)

**అతిక్షిప్తము** సం. విణ. (అ. ఆ. అ.) దూరముగా చిమ్మబడినది. వి. అ. న. (నరము మొగలగువాని) బెణకు, ఎముకలు తమ స్థానమునుండి తొలగుట.

**అతిగండము** సం. విణ. (అ. ఆ. అ.) 1. పెద్దచెంప గలది. 2. గండమునతిక్రమించినది. వి.అ.పుం. 1. (జ్యోతి) ఒకయోగము. 2. పెద్దగండ స్థలము.

**అతిగంధము** సం. విణ. (అ. ఆ. అ.) ఎక్కువ వాసన గలది. వి. అ. పుం. 1. గంధకము 2. సంపెంగ, చంపకము (వృ.వి.) 3. భూతతృణము, నిమ్మగడ్డి. 4. ముద్గరము, ఒకజాతి మల్లె (వృ.వి.)

**అతిగము** సం. విణ. (అ. ఆ. అ.) మీఱిపోవునది, అతిక్రమించునది.
శ్లో. సంఖ్యాతిగాస్సంపదః. సం.భర్తృ.3.132.

**అతిగవుడు** సం. విణ. (అ. ఈ. అ.) 1. గోవు నతిక్రమించినవాడు. 2. బుద్ధి లేకపోవుట యందు గోవు నతిక్రమించినవాడు-మూర్ఖుడు. 3. వాక్కులకు అగోచరుడు, పరమాత్మ.

**అతిగహనము** సం. విణ. (అ. ఆ. అ.) 1. మిక్కిలి లోతుగలది. 2. చొరరానిది, దుర్భేదము.

**అతిగహ్వరము** సం—అతిగహనము.

**అతిగుహ** సం. వి. ఆ. స్త్రీ. పృశ్నిపర్ణి, కోలపొన్న (వృ.వి.)

**అతిగ్రహణము** సం. వి. అ. న—అతిగ్రహము.

**అతిగ్రహము** సం. విణ. (అ. ఆ. అ.) 1. గ్రహింప శక్యము కానిది, దుర్బోధము 2. విస్తారముగా గ్రహించునది. 3. విషయములను గ్రహించునది (ఇంద్రియాది). వి. అ. పుం. 1. ఇంద్రియము (జ్ఞానేంద్రియము, కర్మేంద్రియము). 2. యథార్థజ్ఞానము, సరిగా గ్రహించుట.

**అతిఘము** సం. వి. అ. పుం—మిక్కిలిహింసించునది-1. ఆయుధము. 2. కోపము.

**అతిచర** సం. వి. ఆ. స్త్రీ. 1. తామరతీగ. 2. మెట్టతామర తీగ 3. చాచల, అత్తిమ్మ.

**అతిచారము** సం. వి. అ. పుం. 1. అతిక్రమించి చరించుట; మేర మీఱి ప్రవర్తించుట. 2. (జ్యోతి) గ్రహము సామాన్యవిహిత కాలము కంటెను ముందుగ మఱియొక రాశికి బోవుట.

**అతిచారి** సం. విణ. (న్. జీ. న్.) అతిక్రమించి చరించువాడు.

**అతిచ్ఛత్ర** సం. వి. ఆ. స్త్రీ. 1. కుక్కగొడుగు (వృ.వి.). 2. సోంపు (వృ.వి.) 3. సదాప (వృ.వి.)

**అతిచ్ఛత్రక** సం—అతిచ్ఛత్ర.

**అతిచ్ఛత్రము** సం. వి అ. పుం. 1. కుక్కగొడుగు (వృ.వి.) 2. సోంపు 3. జలతృణభేదము. 4 గ్రుడ్డికామంచి, గొడుగుగడ్డి.

**అతిజాగరము** సం. విణ (అ. ఆ. అ.) ఎల్లప్పుడును మేలుకొని యుండునది. వి. అ. పుం. నల్లకొంగ.

**అతిజాతుఁడు** సం విణ. (అ. ఆ. అ.) తండ్రికంటె నెక్కుడైనవాఁడు. (వ్యతి - అతిజాతుఁడు.)

**అతితారము** (సం. విణ. అ. ఆ. అ.) ఎక్కుడుధ్వనిగలది. వి. అ. పుం. 1. ఎక్కుడుధ్వని. 2. ముత్యములు మొదలగు వానిని శుద్ధిచేయుట.

**అతితీక్ష్ణము** సం. విణ—అతితీవ్రము. వి. అ పుం శోభాంజనము, మునగ (వృ.వి.)

**అతితీవ్రము** సం. విణ. (అ. ఆ అ.) 1. మిక్కిలి పదను గలది, వాఁడియయినది. 2. మిక్కిలి కారము గలది.

**అతిథి** సం. వి. ఇ. పుం. 1—తిథ్యాదినిమిత్తము లేకుండ క్షుత్పిపాసానివారణార్థము వచ్చినవాఁడు-భోజనసమయమున వచ్చినవాఁడు, ఆగంతుకుఁడు.

శ్లో. తిథిపర్వోత్సవాస్సర్వే త్యక్తాయేన మహాత్మనా, సోఽతిథి స్సర్వభూతానాం శేషాన భ్యాగతాన్ విదుః.—మన్వాదియుగాది ప్రశస్తిషు తిథివిశేషేషు ద్రవ్యలాభముద్దిశ్య యే అభ్యాగచ్ఛంతి తేఽభ్యాగతాః, తాదృశం తిథి విశేష మనపేక్ష్య యదాకదాచిత్ క్షుత్తృష్ణాద పరిపీడ యోపగతోఽతిథిః. పరా. 1. అ. 42.

శ్లో. వ్యాఖ్య.

సీ. అన్నింట నగ మతిథ్యభ్యాగతార్థంబు భాజనంబుల నించి పాయఁబెట్ట. కాశీ. 7.178.

మ. అతిథిం గాలసమాగతున్ ఘనబుభుక్షార్తుం బథిశ్రాంతు నా,తతమార్గోత్థితధూళిధూసరితగాత్రస్వేదబిందూత్కరా, న్వితు నజ్ఞాత కులాభిధానుఁ గని యవ్విప్రు న్మహాత్ముం బ్రజాపతిఁగా నాత్మఁ దలంచుచున్ సుముఖుఁడై భక్తిన్ బ్రయత్నంబునన్. మార్కం. 3.158.

2. ఉగ్రకోపము. 3. కుశునికొడుకు, రాముని మనుమఁడు.

**అతిథిక్రియ** సం వి. ఆ స్త్రీ. అతిథులకుపచారము చేయుట, అతిథులను సత్కరించుట.

**అతిథిదేవుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) అతిథిని దేవునివలె భావించువాఁడు.

**అతిథిధర్మము** సం. వి. అ. పుం. 1. అతిథిభావము 2. ఆతిథ్యము, అతిథిసత్కారము.

**అతిథిపతి** సం. వి. ఇ. పుం. ఆతిథ్యము చేయువాఁడు, అతిథి నాదరించువాఁడు.

**అతిథిపూజ** సం.—అతిథిక్రియ.

**అతిథిసత్కారము** సం. వి. అ. పుం.—అతిథిక్రియ.

**అతిథిసత్క్రియ** సం.—అతిథిక్రియ.

**అతిథిసేవ** సం.- అతిథిక్రియ.

**అతిదీప్యము** సం. వి. అ. పుం. ఎఱ్ఱచిత్రమూలము, రక్తచిత్రకము (వృ.వి.).

**అతిదేశము** సం వి. అ. పుం. ఒకదాని ధర్మమును వేఱొకదానియందారోపించుట.

**అతిధన్వుఁడు** సం. వి. న్. పుం. మిక్కిలి గొప్ప విలుకాఁడు.

**అతిధృతి** సం. వి. ఇ. స్త్రీ. 1. పాదమునకు పందొమ్మిది యక్షరములు గల ఒకానొకఛందస్సు. 2. అత్యంతమైన ధైర్యము.

**అతినిద్రుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) 1. మిక్కిలి నిద్రపోవువాఁడు. 2. నిద్రలేనివాఁడు.

**అతినువు** సం. వి. ఉ. న. ఓడనుండ దిగుమతియైన వస్తువు.

**అతిపతనము** సం. వి. అ. న. అతిక్రమము. అతిక్రమించుట.

**అతిపత్తి** సం. వి. ఇ. స్త్రీ. 1. కడచిపోవుట. (ఉదా: కాలాతిపత్తి) 2. జరుగకుండుట. ఉదా: క్రియాతిపత్తి)

**అతిపత్త్రము** సం. వి. అ. పుం. టేకు, హస్తికందము (వృ.వి.)

**అతిపథము** నం. విశ. (అ. ఆ. అ.) మార్గము నతిక్రమించినది.

**అతిపన్నము** నం. విశ. (అ. ఆ. అ.) అతిక్రాంతము, కడచిపోయినది. (శ్రాద్ధాది)

**అతిపరిచయము** నం. వి. అ. పుం. మితిమీరిన చనవు. శ్లో. అతిపరిచయా దవజ్ఞా, సంతతగమనా దనాదరో భవతి, మలయే భిల్లపురంధ్రీ, చందన తరుకాష్ఠ మింధనం కురుతే. (చాటువు).

**అతిపరోక్షము** నం. విశ. (అ. ఆ. అ.) చూపునకు మిక్కిలి దవ్వయినది, కనుఁగొన రానిది.

**అతిపాతకము** నం. వి. అ. న. మిక్కిలి ఘోరమైన పాపము, మాతృగమనాదిపాతకము.

**అతిపాతము** నం. వి. అ. పుం. 1. కాలాతిక్రమణము. 2. ఉల్లంఘించుట. అతిక్రమించుట. 3. సంభవించుట. (ఉదా: దుఃఖాతిపాతము).

**అతిపాతి** నం.విశ. (న్. నీ. న్.) అతిక్రమించునది.

**అతిపాత్యము** నం. విశ. (అ. ఆ. అ.) 1. అతిక్రమింపఁ దగినది. 2. కాలాంతరమునకు ఆఁపఁ దగినది. (కామ మనతిపాత్యం ధర్మకార్యం దేవస్య. శాకుం. 5.)

**అతిప్రవృద్ధుఁడు** నం. విశ. (అ. ఆ. అ.) 1. మిగులఁ బెరిఁగినవాఁడు. 2. గర్వశీలుఁడు, పొగరుఁబోతు.

**అతిప్రశ్నము** నం. వి. అ. పుం. మర్యాదమీఱిన ప్రశ్నము, తగినయుత్తరము చెప్పినను మఱిమఱి యడుగుట.

**అతిప్రసంగము** నం. వి. అ. పుం 1. అత్యంతాసక్తి. 2. ప్రసంగము నతిక్రమించి మఱియొకదానితో సంబంధించుట. (లక్ష్యమందు లక్షణసంబంధము ప్రసంగము. అలక్ష్యమందు లక్షణసంబంధము అతిప్రసంగము.) 3. మిక్కిలి యెడతెగనికూడిక, అవిచ్ఛేదసంగము. సం. కిరా. 8. 33.

4. మిక్కిలి మాటాడుట.

**అతిప్రసక్తి** నం. వి. ఇ. స్త్రీ. అతిప్రసంగము.

**అతిబల** నం. వి. ఆ. స్త్రీ. 1. ముత్తవపులగము (వృ.వి.). 1. ఒకానొకవిద్య. (దీనిని విశ్వామిత్రుఁడు రాముని కుపదేశించెను. 3. దక్షుని కూఁతులలో నొకతె.

**అతిభారగము** నం. వి. అ. పుం. కంచరగాడిద, వేసడము.

**అతిభారము** నం. వి. అ. పుం. 1. ఎక్కువబరువు. 2. అతిశయము, ఆధిక్యము.

**అతిభూమి** నం. విశ. (ఇ) భూమిని (1. స్థానమును 2. మర్యాదను) అతిక్రమించిన వాఁడు. వి. ఇ. స్త్రీ. 1. అతిమర్యాద, పరమావధి, కడపటిమేర. 2. మర్యాదాతిక్రమము, మేర తప్పుట. 3. ఔన్నత్యము. 4. ఆధిక్యము, అతిశయము. 5. అతీతస్థానము, అందనిచోటు.

సీ స్వామియై నిగమాతిభూమియై. వసు. 4.36.

**అతిభోజనము** నం. వి. అ. న. మితిమీఱి తినుట, తిండిపోతుతనము.

**అతిమంగల్యము** నం. వి. అ. పుం. బిల్వవృక్షము, మారేడు (వృ.వి.).

**అతిమర్త్యము** నం. విశ. (అ. ఆ. అ.) మనుష్య శక్తికి మించినది, దివ్యమైనది

**అతిమర్యాదము** నం. విశ. (అ. ఆ. అ.) హద్దు మీఱినది.

**అతిమాంసము** నం. విశ. (అ. ఆ. అ.) ఎక్కువ మాంసముగలది (జంఘ, అధరోష్ఠము, మొ.)

**అతిమాత్రము** నం. విశ. (అ. ఆ. అ.) కొలఁదికి మించినది, అధికము.

**అతిమానము** నం. విశ. (అ. ఆ. అ.) కొలఁదికి మీఱినది. వి. అ. పుం. దురభిమానము, గర్వము.

**అతిమానుషము** నం.—అతిమర్త్యము.

**అతిమాయుఁడు** నం. విశ. (అ.ఆ.అ.) 1. మాయను దాఁటినవాఁడు, ముక్తుఁడు. 2. మిక్కిలి మాయ కలవాఁడు.

**అతిమారుతము** నం. విశ. (అ. ఆ. అ.) మిక్కిలి గాలిగలది. వి. అ. పుం. పెద్దగాలి, తుపాను;

**అతిమిత్రము** నం. వి. అ. న. 1. అత్యంత స్నేహితుఁడు. (రూ. అతిమిత్రుఁడు) 2. (జ్యోతి) పరమమిత్రతార.

**అతిముక్తకము** నం. వి. అ. పుం. 1. తిందుకము, తుమ్మికి, నల్లచేవమ్రాను (వృ.వి.). 2. తాళవృక్షము. 3. పూలగురివెందతీఁగ.

**అతిముక్తము** సం. విశ. (అ. ఆ. అ.) 1. విషయసంగమునుండి బొత్తిగా వీడినది. 2. పూర్తిగా మోక్షమును పొందినది. వి. అ. పుం 1. మాధవీలత, పువ్వుల గురివెందతీఁగ. 2. తినాసము, నెమ్మి (వృ.వి.).

**అతిమృత్యువు** సం. విశ. (ఉ.) మృత్యువును జయించినవాఁడు. వి. ఉ. పుం. మోక్షము.

**అతిమోద** సం. వి. ఆ. స్త్రీ. నవమల్లికాలత.

**అతిరక్తము** సం. విశ. (అ. ఆ. అ.) 1. మిక్కిలి యెఱ్ఱనిది. 2. మిక్కిలి ప్రేమ గలది. వి. అ. న. ఒకానొక మౌక్తికమణిదోషము.

సీ. అతిరక్త మనుదోషమది విద్రుమచ్ఛాయ ధూమ్రాంకమనునది ధూమకాంతి. రత్న.48.

**అతిరథుఁడు** సం. వి. అ. పుం. అనేక రథికులతో ఒంటరిగ పోరఁగలయోధుఁడు, ఉత్తమరథికుఁడు. —అర్ధరథ రథ (సమరథ) మహారథుల కంటె పై వాఁడు.

**అతిరభసము** సం. వి. అ. పుం. 1. అతివేగము. 2. తొందర, ముందువెనుకలు చూడమి.

శ్లో. అతిరభసకృతానాం కర్మణా మావిపత్తేః. సం. భర్తృ. 2. 99.

**అతిరస** సం. వి. ఆ స్త్రీ. 1. క్లీతనకము తీఁగ, అతి మధురము (వృ.వి.). 2. చాఁగ, మూర్వ (వృ.వి.). 3. రాస్న, సన్నరాస్టము (వృ.వి.).

**అతిరసము** సం. వి. అ. పుం. భక్ష్యవిశేషము.

సీ. అతివేడి నీచేతి యతిరసరుచి రసజ్ఞానంద మయ్యె నేమనఁగవచ్చు. అని. 1. 106.

**అతిరాజు** సం. వి. న్. పుం. గొప్పరాజు, పూజ్యుఁడగు రాజు.

**అతిరాజుఁడు** సం. విశ. (అ. ఈ. అ.) రాజు నతిక్రమించినవాఁడు.

**అతిరాత్రము** సం. వి. అ. పుం. జ్యోతిష్టోమమందలి ఒకభాగమగుయజ్ఞము.

**అతిరిక్తము** సం. విశ (అ. ఆ. అ.) 1. అతిశయించినది, హెచ్చినది. 2. మితి మీఱినది, మీఁదు మిక్కిలియైనది. 3. వేఱయినది, వ్యతిరిక్తము 4. గొప్పది, శ్రేష్ఠము. 5. మిక్కిలిరిక్తయైనది, వట్టిది.

**అతిరేకము** సం. వి. అ. పుం. 1. హెచ్చు, అతిశయము. 2. శ్రేష్ఠత. 3. వలసినదానికంటె ఎక్కువ, పయిపెచ్చు. 4. వేఱుపాటు, భేదము.

**అతిరోమశ** సం. వి. ఆ. స్త్రీ. నీలబుహ్నా (వృ.వి.) (ఆకుకూర)

**అతిరోమశము** సం. విశ. (అ. ఆ. అ.) దట్టమైన రోమములుగలది. వి. అ. పుం. 1. అడవిమేఁక. 2. పెద్దకోఁతి.

**అతివ** వి. స్త్రీ. ఆఁడుది; భార్య. ఆం. భా. 2.104.

చ. అతివ యపాయముం బొరయునప్పుడు గావకతక్కనేని యా పతి పతియే...భార. విరా. 3. 41

**అతివక్తి** సం. విశ. (ఋ. త్రీ. ఋ.) మాటలమారి. వదరుఁబోతు.

**అతివర్ణాశ్రమి** సం. వి. న్. పుం. వర్ణాశ్రమాతీతుఁడగు జ్ఞాని.

**అతివర్తనము** సం. వి. అ. న. 1. క్షమింపఁదగిన నేరము. 2. నేరముచేసినను కొన్ని సందర్భములందు ధర్మశాస్త్రప్రకారము శిక్షవిధింపకుండుట. 3. మితి మీఱి ప్రవర్తించుట.

**అతివర్తి** సం. విశ. (న్. నీ. న్.) అతిక్రమించువాఁడు.

**అతివర్తించు** సం. స. క్రి. దాఁటు, అతిక్రమించు.

క. సుత విను శబ్దబ్రహ్మము, నతివర్తించి భువనత్రయమునను యోగాన్వితుఁడగుముని గను నజు శాశ్వతు నచలుఁ బురాణతము నజరుఁ బరమాత్ముకా. భార. శాం. 5.123.

**అతివర్తులము** సం. విశ. (అ. ఆ. అ.) మిక్కిలి గుండ్రనిది. వి.అ.పుం.గుండ్రనికాయధాన్యము (సెనగలు, బటానిగింజలు, మొ.)

**అతివస** వి. (సం. అతివిషా. ప్రా. అతివిసా. క. అతివిస. అతిబజే. త. అదివిడయం.) ఒకానొక మూలిక.

**అతివాతము** సం. వి. అ. పుం. 1. అతిమారుతము. 2. (వైద్య) వాతప్రకోపము.

**అతివాదము** సం. విశ. (అ. ఆ. అ.) వాదము నతిక్రమించినది. వి. అ. పుం. 1. అధికవాదము, అనావశ్యకవాదము. 2. పరుషవాక్యము,

నిందావాక్యము. 3. అతిశయోక్తి, మితి మీఱి చెప్పుట.

**అతివాది** నం. విశే. (న్. నీ. న్.) 1. అతిసంభాషణము చేయువాఁడు, తనమాట నిలఁబెట్టుకొనుటకు బండవాదము చేయువాఁడు.

**అతివాసము** నం. వి. అ. పుం. శ్రాద్ధదినమునకు పూర్వదినమందు చేయుఉపవాసము.

**అతివాహకుఁడు** నం. వి. అ. పుం. అగ్న్యాద్యభిమానియగునొక దేవత. (ఇతఁడు ఈశ్వరనియుక్తుఁడై జీవుని అర్చిరాదిమార్గముసఁ గొని పోవును.

**అతివాహనము** నం. వి. అ. న. 1. (కాలము) గడపుట. జరపుట. 2. ఎక్కువబరువు మోయుట. 3. పంపుట. 4. తప్పించుకొనుట. (కథమస్యాతివాహనం భవిష్యతి. నం. పంచ.)

**అతివాహము** నం. వి. అ. పుం. 1. ఒకస్థానమునుండి మఱియొకస్థానమునకుఁ దీసికొనిపోవుట. 2. ఐహికభోగసాధనమగు అదృష్టముక్షీణింపఁగా సూక్ష్మశరీరముతో నున్నజీవుని దేహాంతరాదులను బొందించుటకై కొనిపోవుట.

**అతివాహికుఁడు** నం. విశే. (అ. ఆ. అ.) అతివాహమును చేయువాఁడు.

**అతివాహితము** నం. విశే. (అ. ఆ. అ.) జరుపఁబడినది, గడపఁబడినది. (కాలము) వి. అ. న. సూక్ష్మశరీరము.

**అతివికటము** నం. విశే. (అ. ఆ. అ.) మిక్కిలి భయంకరము. వి. అ. పుం. దుష్టగజము,

**అతివిష** నం. వి. ఆ. స్త్రీ. అతివస (వ్య.వి.) ఓషధి.

**అతివిషము** నం. విశే. (అ. ఆ. అ.) 1. మిక్కిలి విషముగలది. 2. విషమును విఱిచివేయునది.

**అతివృష్టి** నం. వి. ఇ. స్త్రీ. మిక్కుటమైనవాన. (ఇది దేశోపద్రవకరములైనయీతిబాధలలో నొకటి)

**అతివేలము** నం. విశే. (అ. ఆ. అ.) 1. చెలియలికట్టను మీఱినది; మేర మీఱినది, అతిశయించినది. 2. వేళ దాఁటినది.

**అతివ్యాప్తి** నం. వి. ఇ. స్త్రీ. 1. మితి మీఱి వ్యాపించుట. 2. (తర్క) ఒకలక్షణదోషము, అలక్ష్యమందు లక్షణప్రవృత్తి-గోవునకు శృంగిత్వము (కొమ్ములుండుట) లక్షణమను నెడల ఆశృంగిత్వము మహిషాదులందు నుండుటచే దాని యందు అతివ్యాప్తిదోషము గలదు.

**అతిశయనము** నం. వి. అ. న. 1. మీఱుట, అతిరేకము, అతిశయము. 2. మితి మీఱి పరుండుట.

**అతిశయము** నం. విశే. (అ. ఆ. అ.) ఎక్కువైనది. అధికము.

వ. అతిశయంయశాలినా. కాదంబరి.

వి. అ. పుం. ఆధిక్యము, ఎక్కువ.

**అతిశయించు** నం. అ. క్రి. హెచ్చు అగ్గలించు ఉ. రా. 1. 270,

స. క్రి. మించు, మీఱు.

(వ్యవ) ఈరాజు యశస్సున పూర్వుల నతిశయించి యున్నాఁడు.

**అతిశయితము** నం. విశే. (అ. ఆ. అ.) 1. మీఱఁబడినది, అతిక్రాంతము.

శ్లో. అతిశయిత సురాసుర ప్రభావం. సం ఉ. రా. 5. 4.

2. మీఱినది, మిక్కిలియైనది.

**అతిశయిల్లు(లు)** నం. అ. క్రి. మించు, హెచ్చు, అగ్గలించు. మార్క. 1. 142.

సీ. అమ్మానికరుణచే హరిభక్తి తీర్థయాత్రాది పుణ్యంబుల నతిశయిలుట. కళా. 5. 184.

**అతిశయోక్తి** నం. వి. ఇ. స్త్రీ 1. కొలఁదికిమీఱిన వర్ణనము. 2. ఒకయర్థాలంకారము.

**అతిశాయనము** నం. వి. అ. న. ఆధిక్యము.

**అతిశాయి** నం. విశే. (న్. నీ. న్.) మీఱునది, అతిశయించునది.

**అతిశ్వము** నం. విశే. (అ. ఆ. అ.) 1.(బలములో) కుక్క నతిక్రమించినది (అడవిపంది. మొ.). 2. (నీచత్వమున) కుక్కను మించినది, కుక్కకంటె హీనమైనది.

**అతిశ్వానము** నం. వి. న్. పుం. మంచికుక్క.

**అతిసంధానము** నం. వి. అ. న. మోసపుచ్చుట, మోసము.

శ్లో. పరాతిసంధాన మధీయతే యై ర్విద్యేతి. శాకుం. 5. 25.

**అతిసర్గము** సం. విశే. (అ. ఆ. అ.) 1. నిత్యము. 2. ముక్తము. వి. అ. పుం. 1. దానము, ఈవి. 2. ఇచ్చవచ్చినట్లు చేయుటకు అనుజ్ఞ. (కామ చారానుజ్ఞ.

**అతిసర్జనము** సం. వి. అ. న. 1. ఇచ్చుట, ఈవి, దానము. 2. హింస. వధ.

**అతిసౌమ్య** సం. వి. ఆ. స్త్రీ. మధుయష్టి, అతిమధు రము (వృ.వి.).

**అతిసారకి** సం. విశే. (స్. జి. స్.) అతిసార రోగము గలవాడు.

**అతిసారఘ్ని** సం. వి. ఈ. స్త్రీ. బల (వృ.వి.)

**అతిసారము** సం. వి. అ. పుం. విరేచనములు మిక్కుటముగా నగురోగవిశేషము.

**అతిసారి** సం. విశే. (స్. జి. స్.) అతిసారరోగము కలవాడు.

**అతిసౌరభము** సం. విశే. (అ. ఆ. అ.) మిక్కిలి పరిమళముగలది. వి.అ.న. ఎక్కువపరిమళము.

**అతిసౌహిత్యము** సం. వి. అ. పుం. ఎక్కువగా తినుట, తెగదినుట. మను. 4. 62.

**అతిస్నేహము** సం. వి. అ. పుం. మిక్కిలిప్రేమ. వ. అతిస్నేహాః పాపశంకీ. శాకు. 4.

**అతిస్పర్శుడు** సం. విశే. (అ. ఆ. అ.) 1. దాన హీనుడు, పిసినిగొట్టు. 2. అధముడు.

**అతిహసితము** సం. వి. అ. న. శరీరకంపముతోఁ గూడినవవ్వు.(ఇదిషడ్విధహాసములలోను అధమ మైనది.)

**అతీంద్రియము** సం. విశే. (అ. ఆ. అ.) ఇంద్రియ ములకు గోచరింపనిది, అప్రత్యక్షము. వి.అ.న. (సాంఖ్య) ప్రధానము, గుణత్రయసామ్యావస్థా రూపమైన ప్రకృతి.

**అతీంద్రియుడు** సం. వి. అ. పుం. (సాంఖ్య) పురు షుడు, ఆత్మ.

**అతీతము** సం. విశే. (అ. ఆ. అ.) 1. అతిక్రమింపఁ బడినది. 2. అతిక్రమించినది. 3. మృతము, చచ్చినది. మను. 5. 71.

**అతీరేకము** సం—అతిరేకము.

**అతీవ** సం. అవ్య. (అతి+ఇవ) మిక్కిలి, మిగుల. (తనుఁగున సమాసపూర్వపదముగానే యుం డును.)

చ. ఇనకులతేజ వింటివె యతీవభుజక్రమవిక్రమ క్రియా, ఘను లగుపోటుబంటులకు ఉ. హరి. 5. 28.

**అతీసారము** సం—అతిసారము.

**అతుకడము** వి. (√అతుకు) అతుకుట.

క. ప్రతిపద్యంబుఁ జమత్కృతిఁ, బ్రతిపదమును బ్రౌఢి మివులఁబఁగినసృతి స త్కృతి గాక యల్లిమాటల, యతుకడపుందడిక సభల కవ్వంబగునే. ప్రబ ధ. 21. (అతకడపుం దడిక. అముద్రి).

**అతుకు**—అదుకు. అ. క్రి. (క.అతుకు,అదుకు,అదకు) (అంటుకొను, కూడు, అత్తు).

(వ్యవ) చెంబునకు మట్టు బాగుగా అతుకుకొన లేదు.

(పొసఁగు, సరిపడు)

(వ్యవ) మగనికిని పెండ్లామునకును అతుక లేదు. ఆమాట అతుకలేదు. (సా) గతికినచో అతుకదు.

స. క్రి. (సంధించు, లగ్నముచేయు.)

క. తుందిలదనుజకబంధము,నం దొక గజమస్త కంబు నతికి. దశా. 2. 486.

(వ్యవ) కంచరి జారికి కొమ్ముగట్టిగా నతుకలేదు. వి. (అతుకుట; మాసిక; అతికినతావు.) అం. భా. 2. 158.

(వ్యవ)అతుకుసరిగాలేదు. అతుకులబొంత.అతు కులబ్రతుకు. అతుకులోనుండి నీళ్లు కాఱు చున్నవి.

జ. అతుకడము, అతుకుబడి.

**అతుకుబడి** వి (√అతుకు) అమరకము, పొలము రయితులకు అమర్చుట.

(వ్యవ) భూములఅతుకుబడి అయినది.

**అతులము** సం. విశే. (అ. ఆ. అ.) సాటిలేనిది. వి. అ. న. బొట్టుగు, తిలకము (వృ.వి.)

**అతులితము** సం. విశే. (అ. ఆ. అ.) సరిపోల్పఁ బడనిది; సాటి లేనిది.

**అతుల్యము** సం. విశే. (అ. ఆ. అ.) సరిలేనిది.

**అతుషారము** సం. విశే. (అ. ఆ. అ.) చల్లనిది కానిది, వేఁడిది.

**అతృణాదము** సం. విశే. (అ. ఆ. అ.) గడ్డి తిననిది. వి. అ. పుం. గడ్డి తినలేనిచూడ, క్రొత్తగాఁ బుట్టినదూడ.

**అత్త** వి. (సం. ప్రా. అత్తా—1. తల్లి, 2. అక్క. క. తు. అత్తె. త. అత్తై.)

1. శ్వశ్రువు - పెనిమిటితల్లి; భార్యతల్లి.
2. తండ్రి సోదరి, మేనత్త. 3. మేనమామభార్య.
4. వేశ్యామాత, లంజెతల్లి.

సీ. ...కత్తిగొంటులయినయత్తగుంతు. కు. సం. 8. 185. (అత్తగుంతు—వేశ్యామాతలసముదాయము.)

అత్తవారల్లు. కాశీ. 7. 100.

అత్తిల్లు—అత్తవారిల్లు. కృ. శకు. 3. 99.

**అత్త** సం. విశే. (ఋ. త్రి. ఋ.) తినువాఁడు, భక్షకుఁడు. వి. అ. స్త్రీ. 1. తల్లి. 2 అప్ప. 3. స్త్రీయొక్క అత్తగారు.

**అత్తకోడలియాట** వి. (√అత్త) బాలికాక్రీడావిశేషము.

*సీ. అత్తకోడలియాట యాలు మగలయాట కాటిచెల్లాట... దశా. 8. 81.*

**అత్తడి**—అత్తళి. వి. బడబాబుతువు, ఆఁడుగుఱ్ఱమునకుఁ గలిగినది.

సీ. బడబాబుతుసమాఖ్య యడరునత్తడ యన ...ఆం. భా. 2. 197.

**అత్తపత్తి** వి. లజ్జాలువు సోఁకుడుముడుఁగు (వృ.వి)

**అత్తమిల్లు(లు)** అ. క్రి. 1. ఒఱగు, వ్రాలు.

సీ. ప్రాలేయకిరణబింబంబు వెల్వెలఁబాటి యస్తాచలంబుపైనత్తమిల్ల. కాశీ. 1. 122.

సీ. ఇలఁ జుట్టువడుతొండముల మించు పూర్వాంగ మెత్తరంబై పిఱుం దత్తమిల్ల. మనుచ. 5. 98.

2. అంటయుండు: ఉండు.

చ. ఘనంబున నత్తమిల్లున, త్రోలకరిమించు మించు నలతోయ్యలి. చం. రా. 3. 130.

3. శయనించు, పరుండు.

క. అత్తదయామతిఁ దనకడ, నత్తమిలక నిద్రవోవ దహరహమందుణ. రాజ. చ. 2. 34. అచ్చ. రా. బాల. 182.

4. మూర్ఛపోవు.

క. అత్తెఱఁగున సైదోడని, నత్తమిలిగినఁ జూచి రాముఁ డలుక నిగుడఁగా. అచ్చ రా. యు. 219.

**అత్తము** వి. 1. అరఁటిగెలలో నొకభాగము, కాయలగుత్తి, పెడ. (ఉదా; ఇది ఆ అత్తముల గెల, అందులో పై అత్తము పండినది.

2. గుంపు, సమూహము.

సీ. అత్తమ్ము దిమ్ము, గుబురు గుమురు గుంపు గుమిపిండు మొత్తము... గీ. తుటుము మొల్లము...వర్గము తగు... ఆం. భా. 2. 100.

**అత్తరము**—ఆత్రము. వి. (సం. ఆతురం. త. అత్తిరం.) త్వర, వేగము.

గీ. మానశాలిని శాలీనతానతిమగు, నానసాంభోజ మెత్తుమీ యత్తరమున. నైష. 5. 117.

**అత్తరు**—అత్తరువు.

ద్వి. అత్తరుగబ్బును నలవేములీవు, మెత్తని రాయియు మేదినిఁ గలవె. (చాటువు.)

**అత్తరువు**—అత్తరు. వి. (క. తు. అత్తరు అత్తర్. త. అత్తర్.) తైలరూపముగా నుండు పరిమళద్రవ్యసారము. రసిక. 5. 145.

**అత్తళ(ల)ము** వి. ప్రాసము, ఈఁటె: బల్లెము.

క. పెనుఁగడఁత దొడ్డయత్తళ,మున పైచిన నతఁడు మూర్ఛ మునిఁగి...భార. శల్య. 1. 581.

శ్లో. ప్రాసేన సహదేవస్య శిరసి ప్రాహరద్భృశమ్. సం. భార. శల్య. 27. 6.

ఉ. ...ఈఁటెల డొంకెనలం గటార్ల బల్లెత్తుల నత్తలంబులను...కళా. 8. 57.

**అత్తళి**—అత్తడి.

జ. అత్తళువు.

**అత్తరువు** వి౽. (√అత్తరీ) ఎదపోయినది. (ఆఁడు గుఱ్ఱము.)

గీ. అనుచు విప్రుండు తమకించి యంటుకొనియె, సమ్మతించియె యుండె నాచంద్రవదన, కూకలాశ్వంబు వనరేవఁ జొచ్చినప్పుడను మతింప దెయ్తత్తరువై నబడబ. శివరా. 3. 69. వరాహ. 5. 97.

**అత్తవ్యము** సం. వి౽. (అ. ఆ. అ.) తినఁదగినది.

**అత్తి** వి. (క. త. అత్తి. తు. అత్రి.) మేడి, బొడ్డ చెట్టు. దశా. 6. 51.

అత్తిపూచినట్లు–ఇది అసంభవవిషయమును దెలుపును. (అత్తిచెట్లు పువ్వులు లేకయే కాయలు కాచును. ౹బౌ.)

**అత్తి** సం. వి. ఇ. స్త్రీ. (నాటక) 1. అక్క. 2. తల్లి. 3. స్త్రీయొక్క అత్తగారు.

**అత్తిక** సం. వి. ఆ. స్త్రీ. (నాటక) 1. అక్క. (ఇదినాటకేతరములందుకూడకన్పించుచున్నది.)

గీ. అత్తికాభర్తతో నవ్వసల్పసరణి. పాండు. 3. 46.

2. తల్లి. 3. స్త్రీయొక్కఅత్తగారు.

**అత్తికాఁడు** వి౽. (√అత్తు–క. పత్తిగ, పత్తిగాఁ.) సన్నిధానవర్తి, దగ్గఱ నుండువాఁడు.

గీ. ఊడిగపుటత్తికాఁడొకఁడొఱగుఁ జేర, విభునిచెవిలోన నేమేమొ విన్నవింప. కువల. 2. 87.

**అత్తు**–హత్తు. అ. క్రి. (క. హత్తు, పత్తు. త. అత్తు.)

1. కలియు.

క. ఉత్తమమగుద్రవ్యంబును, విత్తంబును నగ్రజునికి వింశాంశంబున్, బొత్తువనిచ్చి సహోదరు, లత్తి సమాంశంబుగొనుట యర్హంబెండున్. విజ్ఞా. వ్యవ. 126.

లయగ్రా ... ఒండొరుల నెత్తికొని మాంసం, బత్తితిమటన్, భార. స్త్రీ. 2. 8.

2. తగులువడు; అనుకూలమగు.

చ. మలసి ఋణానుబంధమహిమన్ హృదయేశ్వరుఁడత్తవత్తమా, మలతలగాకయుండఁ బతిమానురు కాంతలు. వేం. పంచ. 4. 379.

3. అంటుకొను

క. హార లేవనెత్తి యుర్విఁ, నుఱ మత్తిన యిసుము దుడిచి. బహు. 3. 20;

స. క్రి. 1. కూడు, పొందు.

అ. మత్తగిల్లు సత్తుగిత్తతత్తడి నెక్కి, మిత్తి మొత్తి సత్తి నత్తి బత్తిఁ, బత్తిరడిన ముత్తి బుత్తులు రెండును, నొత్తి గుత్తగట్టుచుండు జూఁడ. నీలా. 1. 118.

2. అద్దుకొను, ఒత్తుకొను.

సీ. కనుమెన్నఁ డిదిగదా యనుచుఁ గన్నులఁ గదియఁగఁ బారిజాతంబు నత్తియత్తి. రా. వి. 1. 37.

ఇ. అత్తికాఁడు, అత్తుగడ, అత్తెసరు.

**అత్తుగడ** వి. (√అత్తు) చేరుగడ.

క. దుత్తూరప్రసవముగతి, నత్తుగడన్ హేమనాళ మలరించి కడున్, బిత్తులు దళ్ఖలు నమరిచి, యత్తటిబెడిదముగ జ్వాల లల్లాడు తటిన్. శ్రీరం. మా. 8. 28.

**అత్తెము** వి. (సం. హస్త్రత్రాణమ్) హస్తకవచము, ఢేగకాలిగోళ్లు గ్రుచ్చుకొనకుండ చేతికిఁ గట్టుకొను చర్మము.

గీ. మేలిఢేగ, తెగలఁదగ నేర్పరించి యత్తెముల నుంచి, కదలె నృపువెంబడిన యూడిగము లగములు. ఉ. రా. 7. 403.

**అత్తెసరు** వి. (√అత్తు) గంజి వారకుండఁగ అన్నములో ఇగిరిపోవుటకు సరిపడునట్లు బియ్యముతో పెట్టినఎసరు.

(వ్యవ) పచ్చిపులును అత్తెసరు మెతుకులతోఁ గాలము గడపుచున్నాను. వానిరాబడి వాని వ్యయమునకు అత్తెసరు పదనుగా సరిపడును (హెచ్చుతగ్గులు లేక సరిగా నుండుననుట.)వాని దంతయు అత్తెసరు పదను (వానిమనసు సున్నితమయినదనుట).

**అత్యంకుశము** సం. వి౽. (అ. ఆ. అ.) అంకుశమునకు లొంగనిది. (ఏనుఁగు)

**అత్యంతగతుఁడు** సం. వి౽. (అ. ఆ. అ.) ఎప్పటికిని రాకుండఁ బోయినవాఁడు, పునరాగమనము లేనివాఁడు.

**అత్యంతగామి** సం. విణ. (స్. సి. స్.)—అత్యంతగుఁడు.

**అత్యంతగుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలిగా నడచువాఁడు, వడిగా నడచువాఁడు.

**అత్యంతనివృత్తి** సం. వి. ఇ. స్త్రీ. పూర్తిగాఁ బోవుట, పూర్తిగా నశించుట.

**అత్యంతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. అధికము. 2. పూర్ణము. (ఉదా: అత్యంతనివృత్తి, మొ.) 3. తుదలేనిది, శాశ్వతము.
క్రి విణ. 1. మిక్కిలిగా, పెల్లు. 2. ఎల్లప్పుడు, ఎప్పటికిని.
శ్లో. అత్యంత మాత్మసదృశేక్షణ వల్లభాభి, రాహశో నివత్స్యతి సమం హరిణాంగనాభిః. శాకుం. 1. 24.

**అత్యంతవాసి** సం. వి. స్. పుం. గురువుకడనే యెప్పుడును నిలిచియుండు శిష్యుఁడు.

**అత్యంతసంయోగము** సం. వి. అ. పుం. ఎడతెగని కూడిక, సంతతసంబంధము.

**అత్యంతసుకుమారము** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి కోమలమయినది. వి. అ. పుం. 1. కంగుని, కొఱ్ఱు (వృ.వి.).

**అత్యంతాభావము** సం. వి. అ పుం. త్రికాలము లందును లేకుండుట, నిత్యాభావము.

**అత్యంతీనము** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి నడచునది, మిక్కిలి వడిగా పోవునది.

**అత్యగ్ని** సం. విణ. (ఇ.) అగ్నిని అతిక్రమించినది. వి. ఇ. పుం. జబ్బుచేఁగలుగు మిక్కుటమైన యాఁకలి.

**అత్యగ్నిష్టోమము** సం. వి. అ. పుం. అగ్నిష్టోమానంతరమున చేయఁబడు యాగము.

**అత్యమ్లు** సం. వి. ఆ. స్త్రీ. వనబీజపూరము, ఒక జాతి అడవిదబ్బ (వృ.వి.).

**అత్యమ్లపర్ణి** సం. వి. ఈ. స్త్రీ.--అత్యమ్ల.

**అత్యమ్లము** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి పుల్లనిది. వి. అ. పుం. చింతచెట్టు.

**అత్యయము** సం. వి. అ. పుం. 1. అతిక్రమించుట. 2. లేకపోవుట. 3. ముగియుట. 4. నాశనము, చేటు; అపాయము. 5. దోషము. 6. దుఃఖము, బాధ. 7. శిక్ష, దండము.

**అత్యయి** సం. విణ. (స్. నీ. స్.) మీఱునది, మించునది, అతిక్రమించునది.

**అత్యర్థము** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కుటమైనది, అత్యధికము. క్రి. విణ. మిక్కిలిగా, మితిమీఱి.

**అత్యహ్నము** సం. విణ. (అ. ఆ. అ.) ఒకదినమును మించినది.

**అత్యాకారము** సం. వి. అ. పుం. 1. తిరస్కారము, నింద. 2. స్థూలశరీరము.

**అత్యాచారము** సం. విణ. (అ. ఆ. అ.) విహితాచారములను విడిచినది. వి. అ. పుం. అనుచితము లైనవానిని అనుష్ఠించుట. మతవిరుద్ధముగా నడచుట. 2. మిక్కుటమైన యాచారము. 3. అతిక్రమణము, ఉల్లంఘనము.

**అత్యాధానము** సం వి. అ. న. 1. పైనుంచుట, 2. అతిక్రమణము. 3. శ్రౌతాగ్నిహోత్రమును విడుచుట.

**అత్యాయము** సం. విణ. (అ. ఆ. అ.) అతిక్రమించునది. వి. అ. పుం. 1. అతిక్రమము. 2. ఆధిక్యము. 3. గొప్పలాభము.

**అత్యారూఢము** సం. విణ. (అ. ఆ. అ.) 1. మిక్కిలి పయికెక్కినది. 2. మిక్కుటముగాఁ బెరిఁగినది. వి. అ. న.—అత్యారూఢి. సం. రఘు. 10 .42.

**అత్యారూఢి** సం. వి. ఇ. స్త్రీ. 1. మిక్కిలి పయికెక్కుట; ఉన్నతస్థితి, 2. మిక్కిలి ప్రసిద్ధి.

**అత్యాలము** సం. వి. అ. పుం. ఎఱ్ఱచిత్రమూలము (వృ.వి.).

**అత్యాశ** సం. వి. ఆ. స్త్రీ. పేరాస, తీరనియాశ.

**అత్యాహితము** సం. వి. అ. న. 1. మహాభయము. 2. సాహసకృత్యము, చావునకు తెగించిచేయు కార్యము.

**అత్యుక్తి** సం. వి. ఇ. స్త్రీ. 1. కొలఁదికిమీఱినవర్ణనము, అతిశయముగాఁ జెప్పుట. 2 యర్థాలంకారము.

**అత్యుగ్రము** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి తీవ్రమైనది. వి. అ. న. ఇంగువ.

**అత్యుపధుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) నిష్కపటుఁడు, నమ్మఁదగినవాఁడు.

**అత్యూహ** సం. వి. ఆ. స్త్రీ. నీలికి (వ్య.వి.).

**అత్యూహము** సం. విణ. (అ. ఆ. అ.) ఊహాము నతిక్రమించినది. వి. అ. పుం. 1. చక్కఁగా ఆలోచించుట, వివేచనము. 2. దాత్యూహము, కూకురుగుండె. 3. గజమేఢ్రము. (వై.వి.)

**అత్రత్యము** సం. విణ. (అ. ఆ. అ.) ఇక్కడనున్నది.

**అత్రి** సం. వి. ఇ. పుం. సప్తర్షులలో నొకఋషి.

**అథర్వణుఁడు** సం. వి. అ. పుం. 1. శివుఁడు. 2. ఒకానొక ఆంధ్ర వ్యాకరణకర్త. (ఈయనను అథర్వణాచార్యులందురు.)

**అథర్వము** సం. వి. న్. పుం. వ. అ. పుం. వేదములలో నొకటి, నాల్గవవేదము.

**అథర్వుఁడు** సం. వి. న్. పుం. 1. అగ్నిహోముల నారాధించు ఋత్విజుఁడు. 2. బ్రాహ్మణుఁడు. 3. ఒకానొకముని. (ఇతఁడు బ్రహ్మకు ఒకానొక కల్పమున జ్యేష్ఠపుత్రుఁడు. ఇతని చేత తొలుత పఠింపఁబడుటవలన ఆ వేదమునకు అథర్వమనుపేరు కలిగినది. ఈ యర్థమున. అ. పుం. గూడ అని వాచస్పత్యము) 4. శివుఁడు. 5. వసిష్ఠుఁడు.

**అథవా** సం. అవ్య. అట్లు గాకున్న, పక్షాంతరమున.
క. తిథి యని చేసిన నథవా, విధవానందనుల ఖలుల వృషలీపతులన్, బధిరుల నష్టైష్ణవుల స,న్యధనాపహరులను గానియర్హులఁ జెప్పన్. వై. భా 4.93. పరాహ. 2.156.

**అదంతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. దంతములు లేనిది 2. దంతములు రానిది. (శిశువు) వి. అ. పుం. జలగ.

**అదంత్యము** సం. విణ. (అ. ఆ. అ.) 1. దంత్యము కానిది. (వర్ణము) 2. దంతములకు బాధాకరమైనది.

**అదక** వి. (√అదుకు?) ప్రాతచెప్పు.
సీ. పాదరక్షాభిధఁ బరఁగును జెప్పన...అది జీర్ణమై,నపుడు పల్కంబడు నదక యనఁగ.

**అదక్షిణము** సం. విణ. (అ. ఆ. అ.) 1. కుడిది కానిది, ఎడమది. 2. దక్షిణలేనిది. (యాగము, మొ.) 3. నేర్పులేనిది. 4. అనుకూలముకానిది.

**అదక్షిణ్యుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) దక్షిణపుచ్చుకొనుటకు తగనివాఁడు, అదక్షిణీయుఁడు.

**అదటు** వి. (క. అదటు. త. అదట్టు-తర్జనము)
1. బలము.
గీ. అచిల చాలనచణమైన యదటుగలిగె,నసురభావంబు నను జెందు నవసరమున. మనుచ 5. 24. (మదము. అని. శ. ర.
2. గర్వము.
వ. అని గర్వించి పలికినకాళరాత్రిం జూచి కనలి రాత్రించరేశ్వరుండు.
సీ. అట్టహాసము చేసి యారా ప్రతాపోక్తులాఁటదానికి నింత యదటు వలదు. కాశీ. 6. 220, 221.
3. ఉద్రేకము. అతిశయము.
సీ. అంతకంతకు మించువింతమగంటిమి యదటున సింగంపుఁగొదమలనఁగ. రాఘవ.3.3.
4. భయమువలనఁ గలిగినకంపము, అదరు.
(వ్యవ) అతనివికృతాకారము చూచి భయపడితిని అప్పటియదటు ఇప్పటికిని పోలేదు.

**అదత్** సం. (శత్ర.) తినుచున్న.

**అదత్త** సం. వి. ఆ. స్త్రీ.-వివాహార్థమీయఁబడనిది- పెండ్లికానిపడుచు.

**అదత్తము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఈయఁబడనిది. 2. అన్యాయముగా నీయఁబడినది. వి. అ. న. ఈయఁబడనిదానితో సాటియైన యీవి, చెల్లనియీవి.

**అదనము** విణ (స. అతను. వి. అదన.) పెద్దది, స్థూలము; అధికము.
ఉ. కలదు లేదటంచుఁ బలుకంగ నోవ్వని,యట్టి నడుముసతికినదనమయ్యె. జాహ్నవి.1.86.
క. అదిగాక బాహువిక్రమ, మదనం బితనికి మహాత్ముఁ డని తోఁచుచు నున్నది. ఉ. రా. 5. 50.

**అదనము** సం. వి. అ. న. తినుట.

**అదనీయము** సం. విణ. (అ. ఆ. అ.) తినఁదగినది.

**అదను**–హదను. వి.ఔ.అనా. (√పదను) 1. యుక్త సమయము, తఱి.

సీ. అడరి పోరాటకు నదనైనచో నొప్పు పొలి వోవఁ బోవుట వోలునొక్కొ. భార. భీష్మ. 1. 154.

క. ...పెద్దలయ్యె యదనునఁ జూపుదురు నిగ్రహానుగ్రహముల్. భీమ. 2. 11.

(వ్యవ) సస్యములు వేయుట కిది యదను.

2. సమయము వేళ.

మ ...ఈ, యదనం గూరలు చల్లనాగవె మహోత్కా యోగిచూడామణీ హర. 2.131.

3 విధము.

ఉ. ఉదయోపరి విసింహము, మద మాతఁగ నస్తశైల మత్తద్విపము ...బోరువ గమకించి డుమికిన, యదనున దినకరుఁడు పశ్చిమా శకుఁ జేరెన్. హంస. 1. 140.

విణ (క. హదను.) అర్హము, తగునది.

క. మదనా నీదాడికి మే, మదనా మదనాగ యాన నాయి తురె రా. వి. 4 59.

(లక్ష్యము. వి. వి.) అదనుగ–ఒప్పుగా(బ్రౌ)

చ. చదువునఁ బ్రజ్ఞ దాననుఁ సజ్జత...దానిసే, నదనుగ గెలు నంపదలు...గల్గు. శశా. 2. 35.

**అదవు** (హిం అదబ్.) భయము.

(వ్యవ) బిడ్డల నదవులోను పవలెను. (మిశ్ర. బ్రౌ.)

**అద్రభము** సం. విణ. (అ ఆ. అ.) కొంచెముకానిది. అధికమైనది.

**అదయము** సం. విణ. (అ. ఆ. అ.) 1. దయలేనిది; క్రూరము. 2. గాఢము.

శ్లో. ...ఇచ్ఛామి చైనమదయం పరిరబ్ధు మంగైః. విక్రమో. 5. 29.

**అదరంట** క్రి. విణ క్రదు. (√అదరు. వి.)–మర్మ స్థాన మంటునట్లు–గాఢముగా, తీవ్రముగా.

ద్వి. అంగదుఁ డాదైత్యు నదరంటఁ బ్రేయఁ, బొంగిరక్తము వాత బొడబొడ వెడలి. రం. రా. కిష్కిం. 226. పొ. 26. పం.

మ. ...గుఱిచేసి యేసె నదరంటం గాఁడి మెసోలఁగన్. నీలా. 3. 13.

ద్వి. అలోన నడఁగినయ మ్మహాభుజగ, మాలోహి హితాస్యుని నదరంటఁగఱచె. ద్వి. హరిశ్చ. ఉ. 1816.

**అదరవైచు** స. క్రి. (√అదరు. క్రి.) జడిపించు, బెదరఁగొట్టు.

గీ. మరియు నెన్నియెం బిసిబిసిమాట లమరఁ, బ్రియముచెప్పియునదరవైచియుహితాను, వృత్తిఁదెలిపియు నొకకొంత మెత్తఁబడఁగఁ, జేసి కేల్పట్టి తిగిచెనా చెలువఁగదల. ప్రభా. 5; 27.

**అదరవ్రేయు** స. క్రి. (√అదరు. క్రి.) భయపెట్టు. అడలఁగొట్టు.

ఉ. వేదులువల్కిన న్నదరఁ బ్రేయఁగఁ జూచెద వుందు నంతయుం, బేదలు లేరు...సాంగ. 3. 56.

**అదరించు** స. క్రి. (√అదరు. క్రి.) గద్దించు, అద లించు.

సీ. అదరంచ నల్వంక బెదరు నేసలతోడ నదిగె విష్వక్సేనుఁ దదటుమాని. గశా. 4. 101.

**అదరిపడు** అ. క్రి. (√అదరు. క్రి.) 1. మిట్టిపడు, ఎగిరిపడు.

క. అనవుడు రోషారుణలో,చనుఁడై గొంరముఖ మౌనిసత్తముఁడు విరో,చను జూచి బొమలు నటియింప నిజతమ చెదరి నదరిపడి యిట్లని యెన్, వరాహ. 5. 14.

2. ఉలికిపడు, అకస్మాత్తుగా భయకంపితుఁడగు.

గీ. చని యధిశ్రయణిని వహ్ని సంగ్రహించి, యింటినడికొప్పు తగిలించి యెలుఁగనట్లు, ముంగిటికిఁబోయి రొదగాఁగ మొఱలుపెట్ట, నదరిపడి లేచి గృహదాహ మనుచు బెదరి. శుక. 3. 104.

**అదరిపాటు** వి. (√అదరిపడు) అదరి పడుట, ఆకస్మికత్వము.

(ఇదితృతీయావిభక్త్యర్థక'న'ప్రత్యయముతోఁ గూడి 'అకస్మాత్తుగా, ఏమఱుపాటుగా' అను నర్థమునిచ్చును.)

గీ. పాపకర్ముండు కాంతారపథమునందు. నదరి పాటున నొంటిబ్రాహ్మణుల మొత్తి,యప హరించిన విత్తము. శివరా. 2. 116.

క్రి. విశే. అకస్మాత్తుగా, డబ్బాటుగా.

గీ, అదరిపా టెవ్వఁడీక్షించు నాకసమున, పాటకపుఁ గృష్ణపింగళుం డైనపురుషు. కాశీ. 5. 258.

**అదరు**—అదురు. అ. క్రి. (క. అదరు, అదురు అద్రు. త. అదిర్. తు. అదరు.) 1. చలించు, కదలు. వడఁకు.

సీ. పతి యెఱింగినఁ దనప్రాణంబుపై వచ్చునను భయంబున నుల్లమదరుచుండ. భా. విరా. 2. 71.

వ. కోపావేశంబునఁ బెదవులదర. కాశీ.4.110.

చ. మాట తొట్రుపా టెనయఁగఁ బేరెలుంగదర నిట్లని పల్కె భయార్తమూర్తియై. వా. రా. 1. 77.

2. భయపడు.

ద్వి. అదరకు భూదేవి యాత్మలో నీవు, చెదరి చలింపకు శేషాహి నీవు. రం. రా. బాల. 65 పా. 28 పం.

అదరక బెదరక—భయపడక.

ద్వి. అదరక బెదరక యాత్మలోఁ దాల్మి,వదలక వగవక వనజాప్తకులజుండు. ద్వి. హ. శ్చ. పూ. 1177.

వి, 1. భయము: జంకు.

సీ. అజశిరోదళనుఁ డన్నదరు లేదేనియుఁ గాలారి యనునోటకండలేక...అ. పంచెనల్లె యుగ్రుపై నిన్ను ... దివిజవిభుఁడు. కు. సం. 4. 417.

క, ...బెట్టిదుసేఁదిఁ గాని వైవకు. మగరొండెదు వానిమీఁద నని పీడ్యోనియెన్. ఉ. రా. 2. 284.

2. మర్మస్థానము. (చూ. అదరంట.)

జ. అదరంట, అదరవైచు; అదరవేయు, అదరించు, అదరిపడు, అదరిపాటు, అదరుగడ, అదరుగుండె. అదరుఁగ్రోవి. అదరులు, అదరువేటు. అదరుబ్రేఁత.

**అదరుఁగ్రోవి**—అదురుఁగ్రోవి. వి. (√అదరు. వి.) తుణుకి.

చ. ...అదరుఁగ్రోవులు గాల్పఁగ బిట్టు మందు చిందెడిపోగ నా నజాండమున నిండె నఖండతమః ప్రకాండముల్. రా. 2. 4. 41.

**అదరుగడ**—అదరిపాటు. (√అదరు) కువల. 2. 78.

**అదరుగుండె**—అదురుగుండె. (√అదరు)

**అదరులు** వి. బ. (√అదరు) మిణుఁగురులు, నిప్పు కణములు. (వృత్తియందు 'లు'వర్ణము లోపించును. అదరుటగ్గి. మొ.)

క. చిచ్చులఁ దన్నదరు లెగయ,విచ్చినఁ గసిలత్వమొందె విబుధప్రకరం, బచ్చెరువందుచుఁ గన్గొన, నచ్చెరువ సొరిభేయు లమలంచరిత్రా. భాం. అను. 2 22.

సీ. అదరుటగ్నులకోటులు. హరి. ఉ. 8, 280.

**అదరువేటు**—అదురువేటు. వి (√అదరు. త. అదివ్వేట్టు.) 1. వేలెడు బాణము.

గీ. అదరువేటుల రోసి బ్రహ్మా మగలు. గశా. 7. 93.

2. ఉపాకాయ మున్నగనవి వ్రేలుఁ.

**అదరుబ్రేఁత**—అదురుబ్రేఁత. వి. (√అదరు) అదరునట్లు కొట్టుదెబ్బ.

వ. పరిహాసగర్భంబుగా బలుకుచు రజారోషభూషితంబులైన యాయోషారత్నంబు చేతియదరుబ్రేఁతలు తమకు నూతనోత్సవంబు లగుచుఁ గౌతుకంబొనరించుచుండ ... ప్రభా. 5. 67

**అదర్శనము** సం. విశే. (అ. ఆ. అ.) 1. కన్నులు లేనిది. 2. దృష్టిగోచరము కానిది. వి. అ. న. 1. చూఁకుడుట; ఉపేక్ష. 2. కనఁబడకుండుట.

**అదలించు**—అదలుచు. స క్రి. (√అదలు. క. అదలిసు) 1. కదలించు, తొలఁగించు. 2. తర్జించు, భర్జించు. బెదరించు. జడిపించు, గద్దించు.

సీ. అదలించి రొప్పంగ నాలమందలు గాపు గంధగజేంద్రసంఘములుగాని. భాగ. 10. పూ. 1541.

సీ. పొదలమాటున నుండి యదలించుచును
రొప్పి కదియంగఁ జూచిన బెదరి తొలఁగు.
విక్ర. 2. 135.

సీ. అర్చుచుఁ బేర్వాడి యదలింపుచుఁ గడ క
నెఱపుచు బుజములు సఱచుకొనుచు. అచ్చ.
రా. యు. 195.

క. తగ విశ్వేశ్వరుచే సిరి, నెగడిన సత్కవులు
దానవిపుణతఁ గర్ణున్, నగుదురు కల్పమహీ
జముఁ, దెగడుదు రదలింతు రమరధేనువు
నైనన్. కావ్యా. 4. 48. (ఇట 'తిరస్క
రింతురు' అని తాత్పర్యము)

వ. రుక్మియనువాఁడు హరికొలంది యెఱుఁగక
సారథి నదలించి రథంబుగూడఁ దోలించి.
భాగ. 10. పూ. 1768.

**అదలింపు** వి. (√అదలించు) అదలించుట.

చ. ...ఒక్కవరాహ మేఁగెఁ జే,వకలిమినప్పు
డా యెఱుకువాండ్రదలింపుల కేమి నద్దు
సే,యక తనయిచ్చగా. సారంగ. 1. 94.

**అదలిక** వి. (√అదలు) 1. అదలుట. 2. భయము;
ఆజ్ఞ.

చ. కదలిక యిచ్చటం దడవుగా నిలువం బని
లేదు పొమ్ము వే, కదలికలాపకుంతలలకం ను
శరవ్యథ మాన మెల్లగ, క్కంగలి కలఁగ
కుందఁ దమకాంతునిఁదెచ్చె దమన్న మాఱు
లే,కదలికఁ బెట్టుదున్ శుకపికాదుల నింక
నటంచు వేడుకన్.వరాహ.4.42. చూ.43.

**అదలు** అ. క్రి. (క. అదలు) కదలు; తొలఁగు.

క. అదలదు ప్రాణము లదలినఁ, గదలదు
సర్వాంగకములు గదలుచు నుడన్, వదలదు
నిగుడులు వదలినఁ, గదిలే దీప్సన్న దీనిఁ
ద్రుంపఁగనలయున్. భాగ. 9. 576.

క. ఒదవెడుకృతిపైఁ గల సొబ,గదలక యెం
దాఁక నిష్టమగు సందాఁకన్, మృదుమధుర
రచన సవిశా,రదుఁడై సాగించునతఁడు
రౌచికుఁ డెడుదున్. కావ్యా. ఉల్లా. 84.

జ. అదలించు, అదలింపు, అదలిక, అదలుచు
(ల్చు), అదలుపు(ల్పు).

**అదలుచే(ల్చు)** — అదలించే. (√అదలు)
(గద్దించు)

క. అదలిచి ద్రోణుఁడుభీష్ముఁడు, మదమునని లు
నిలు మనంగ మఱియును మొగక,ట్టిద సేన
భీమసేనుఁడు, గదిసి పిఱుఁద నంటనాశ్వఁ
గౌరవనాథా. భార. భీష్మ. 2. 113.

క. బవరము కీడని యెఱుఁగుదు, నవనీతుండైన
కొడుకు నదలిచి యుడుపం, దివిరియు
నోరాడమి దై,వవశం బప్పునికి మనకు వగ
పిం కేలా. భార. ఉద్యో. 4. 183.

వ. ఆచార్యుండు గోపావేశంబును బటువిక్ర
మంబును నావేశింప నీసైనికుల నిలునిలు
మని యదల్చి తూణీరంబు బిగియించి భార.
ద్రోణ. 1. 198.

**అదలుపు(ల్పు)** వి. (√అదలుచే) 1. కదలించుట.

సీ. సవలయధ్వని గాఁగ సారె వేయునదల్పు
యతినైన గుండె ఝల్లనఁ గల ప... పాత్ర
ముల్ నెత్తమాడు. ఆము. 1. 59.

2. అదలించు, బెదరింపు.

సీ. నిలునిలుమీ దైత్యనిను వ్రత్తునని పేర్చునద
లుపు ప్రహ్లాదం మ్రదువఁజేయ. భాగ.
అను. 2. 118.

సీ. దానవ్వ మొందు యదల్పుఁ దిట్టుల నాటుఁ
బడుచుండు నట్టి నీచులు... భాగ. అను.
5. 107.

**అదప** విశ. (సం. అధవః — అనాథః) రక్షకుఁడు
లేనిది, దిక్కుమాలినది.

వ. ...కంసుండు గదనంబున మదంబు లడంచిన
వదనంబులు వంచికొని సదనంబులు విడిచి
యదవలై యదవులు పదవులు. భాగ. 10.
పూ. 56.

జ. అదవెట్టు.

**అదవద** వి. (క. అదవదె.) 1. కలఁత, క్షోభము,
వ్యాకులత; చింత, దుఃఖము.

ద్వి. వెదకి కానక తోడిపేయలు వగల,నదవదఁ
బొందుచు నంత నత్యుగ్ర, మృగములు
మెసఁగి చంపినవికాఁదలఁచి. నవ. 2.157.
పొ. 10. పఁ.

క. మాయట్టిమంత్రులుండఁగ, నీయదవద యేల నీకు నిప్పుడె మమ్ముం, బాయక పంపుము యుద్ధము, చేయుదు మెదపకయ నీదు చిత్తము రాఁగన్. సీతా. వి. 3. 80.

2. వేగిరపాటు, తొందర.

(గౌతమరూపము ధరించిన యింద్రునితో అహల్యయన్న మాటలు)

చ. ఇదె తెలవాఱవచ్చెఁగదవే యిది సంధ్యకు వేళగాదె స,మ్మదమున నిత్యకర్మవిధిమానక దీర్పుదు రాత్రివేళ మీ,మది సరిపోవురీతి నను మన్ననసేసెద రింతెగాకయీ యదవద మేర గాదని మృగాక్షి గృహాంతరసీమ కేఁగఁగా. దశా. పూ. 128.

విశే. 1. క్షుబ్ధము, కలఁత చెందినది.

క. ఇదియేమోయని యెదవడి, యదవదయై గుండెఝగ్గుమనితల్లడపా,టొదవఁగబలుకుల దీనత, గదురఁగ నదియేమి దెల్పఁగద యయ్య యనన్. సారంగ. 2. 269.

2. చెదరినది, తాఱుమాఱైనది.

వ. వాహినులు చిక్కుపడి చిందఱవందఱై ... యనువుదప్పి యదవదయై యంతంత నిల్చి ...పోయినపోకై పోయినన్. ఉ. హరి. 1. 148.

3. శ్రమపడినది, కష్టపడినది.

చ. ఉదరమునన్ ధరించి ప్రసవోద్భవవేదనఁ బొంది పిమ్మటన్, ముదిముదియైనపితఁ బడి మూత్రమునం బడి లజ్జ వందుగా, నదవద యైనతల్లికిఁ బ్రియంబొనుతుండు వృథాభిమానదు,ర్మదుఁడగు తండ్రికిం బ్రియుఁడొ మానసవీథిఁ దలంచి చూడుమా. హర. 2. 68.

జ. అదవదపడు.

**అదవదపడు** అ. క్రి. (√అదవద) విచారపడు, కలఁతనొందు, వ్యాకులమగు.

క. పదపద రాఘవ నిలునిలు,నుదవదపడవలదు దశరథాధిప నీకున్, మొదమొదవఁదెత్తు మఖరిపు, మదవదనురవథ యొనర్చి మగుడన్ సుతులన్. రామా. 4. 19.

**అదవెట్టు** అ. క్రి. (అదవ + పెట్టు—అనాథవనియను) మొఱపెట్టు, ఆక్రోశించు.

వ. అని యిట్లు ధరణీసురుం డదవెట్ట భాగవత శోభంబునకు భువనభర్తయు భయంపడి··· ఆము. 6. 112.

**అదస్** సం. స. (స్.) ఈ. (దీనికి తెనుఁగున వ్యస్త ప్రయోగము లేదు)

చ. ...అదఃకరవాడిధార — వీనియొక్క కరవారపు ధార. నైష. 5. 126,

మ. అదఃఖడ్గాహి—వీనియొక్క ఖడ్గాహి. నైష. 5. 157.

అదఃపురము—ఈపురము.

**అదసీయము** సం. విశే. (అ. ఆ. అ.) వీని (వీరి) సంబంధమైనది. వీని (దీని) సంబంధమైనది. శివరా. 2. 57.

**అదళ** సం. వి. ఆ. స్త్రీ. ఘృతకుమారి, కలుబంద (వృ. వి.)

**అదళము** సం. విశే. (అ. ఆ. అ.) 1. ఆకులులేనిది. 2. విభాగములు లేనిది. వి. అ. పుం. హిజ్జలము, ఎఱ్ఱగన్నేరు (వృ. వి.)

**అదాటుగా** అవ్య. గ్రా. (సం. హఠాత్. త. అడాత్తు.) అకస్మాత్తుగా.

మ. ఇల యద్వీత యదాటుగా నయిన నెంతే వాణి ప్రత్యక్షమౌ. చం. రా. 8. 2.

**అదాయికము** సం. విశే. (అ. ఆ. అ.) దాయాదులు లేనిది (ధనాది)

**అదాయుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) దాయమునకు అర్హుఁడు కానివాఁడు. (పతితుఁ డగుజ్ఞాతి మొ.)

**అది—అద్ది** స. (అ + ది—అది, అద్ది, అది అనిరూపావతారము. 'అది' అనునది ప్రస్తుతము భాషలో లేదు. క. అదు, అద్దు. త, అదు. తు. అవు.) 'అ' అనుదానికి మహత్త్వర్థమందును (తిర్యగ్జడములను దెలుపునపుడును) ప్రథమైకవచనమున వచ్చురూపము. ప్రథమాబహువచనమున స్త్రీవాచకమగునపుడు 'వారు' అనియు, తిర్యగ్జడవాచక మగునపుడు 'అవి' అనియు రూపము

లుండును. ద్వితీయాదివిభక్తులలో ఏకవచనమున రెండిటికిని 'దాని' అనురూపముండును. ద్వితీయాదిబహువచనములందు స్త్రీవాచనమునకు 'వారి' అనియు, తిర్యగ్జడవాచకములకు 'వాని' అనియు రూపము లుండును.

1. తచ్ఛబ్దార్థకము. (*దూరముగానుండి గోచరమగునట్టిదానిని గాని పూర్వము నిర్దేశింపఁబడినదానిని గాని తెలుపును*)

ఇది వాడుకలో నీచత్వమిశ్రత్వములందే ప్రయోగింతురు. గ్రంథములయందీ భేదము లేదు.

ఉ. దాని సుభద్రఁగా నెఱిఁగి తత్క్షణజాతమనోజ సంచలస్వాంతుఁడై నయవ్విజయు మానుగఁ జూచి.... భార. ఆది. 8. 179.

సీ. ...ధృతరాష్ట్రునియాశ్రమంబు, నెఱిఁగిన వారిదెయదె యంచుఁ జేర్కొని చూపి... భార. ఆశ్ర. 2. 31.

వ.... శకుంతలయు...వలయు ననిన నమ్మహాముని కరుణించి దానికోరినవరం బిచ్చి. భార. ఆది. 4. 62.

2. సంబంధార్థమున పదముల కనుప్రయుక్తమగును.

వ. అవ్వా నీ వెవ్వరిదానవు. భార. ఆర. 2.98. (స్వస్వామిభావసంబంధము)

క. ...ఎక్కడిదానవు....భార. ఆది. 4. 75. (ఆధారాధేయభావసంబంధము.)

ఉదా : నల్లది, కుంటిది. (ధర్మధర్మిభావసంబంధము.)

ఉదా : గొల్లది, కాఁపుది. (జన్యజనకభావ సంబంధము.)

3. క్రియలపై వచ్చి విధ్యర్థమును దెలుపును.

క. ఇచ్చునది ధనము పాత్రునకు. (ఈచ్చునది– ఈయవలయును) భార. ఆది. 3. 204.

4. (క) క్రియాజన్యవిశేషణములమీఁద వచ్చి భావార్థమును దెలుపును.

క. అహితుల నెల్లవిధంబుల, విహతులఁగాఁ జేయునది వివేకము. భార. సభా. 2.271.

సీ. ...వీ రేమి పనికి నెచటి, కరిగెద రని పతి నడిగె భవాని యాతఁడు దశుచేయున ధ్వరమునందుఁ, గీ. దమమహావిర్భాగములు గొనుదాని కనిన. భార. శాం. 5. 437.

చ. నను భవదీయదాసుని మనంబున నెయ్యపుఁ గిన్కఁబూనితాఁ, చినయదినాకు మన్ననయ ...(*తాఁచినయది–తాఁచుట*)పారి. 1.223.

(చ) క్రియాజన్యవిశేషణములకువిభక్తి వివక్షించునపుడు అనుప్రయుక్తమగును.

వ. అర్ధ్రంబును శుష్కంబును గానిదాన నముచి దానవుండు దెగు. దశా. 2. 433.

గీ. విటుల కెకిమీని వీనిఁ గావింపనేని, యుగ్మలీ నీకు దాసినై యుండుదాన. విప్ర. 2. 84.

వ... అనేకశోభనపరంపరలం దెలుపుచున్నయది ...ఆము. 1. 18.

5. పాదపూరణముగా నుపయోగింపఁబడును.

క. పాండవులవిభవ మదియా, ఖండలువిభవంబు కంటెఁ గడు మిక్కిలియై. భార. సభా. 2.

క. ...మనఃప్రీతిద మగుచు నాదిపర్వం, బది వినఁగా నొప్పు భారతాఖ్యంబగుచుణ. భార. ఆది. 1. 35.

6. కొన్నిపట్ల మహద్వాచకముగాఁ గూడ నుపయుక్తమై కనవ్పట్టుచున్నది. (చూ. ఇది.)

సీ. అది యెవ్వరని ప్రతీహారు లెవ్వరినన్నఁ దన్నుఁగాఁ దలఁచి చిత్తమునునులుకు... నైష. 3. 84.

అదియటులుండె–అది యాలాగుననుండనిమ్ము.

సీ. ...నావిభవంబు గానంగరాదు, గుప్తమై యున్నదిగుహయందు నానకిచ్చపుట్టినప్పుడ పొలిచితోఁచు, నదియటులుండె నీ వధికుండ వల్బుల యెదురుంజజ్జులు వల్కుటేటిపెంపు, పొమ్ము... భార. శాం. 4. 392.

అదియిదియేల – అతిప్రసంగమేల, పలుమాట లేల.

ద్వి. అదియిదియేల నీవావధూమణికి, నొదుఁ గుచుఁ దాసినై యుండఁగ వలయు. రం. రా. అయో. 90. పొ. 4. పం.

జ. అదిగాక, అదిగాన, అదిగావున, అదిగొ, అదిగో, అదె, అదేమొ, అదేమొకాని.

**అదిగాక** అవ్య. (√అది) మరియు, అంతేకాక.

క. ఇదియెల్లను నదికారికి, విదితంబుగఁదెలుపఁ దగునె వెసఁ దెలుపనిచోఁ, దుదనేరమి మనదెస నగుఁనదిగా కిపొమ్ము నరువుమందు రిటంచున్. విప్ర. 5. 7. (ఇట్లే అదియుఁ గాక, అదియునుగాక, అదియునుంగాక. భా. ఉద్యో. 3. 16.)

**అదిగాన**—అదిగావున. (√అది)

ద్వి. ఆనుతి క్తీవా రిప్పుడాడుచున్నార,లదిగాన గొలను పంచాప్సరం బయ్యె. రం. రా. అర. 150 పా. 19 పం.

**అదిగావున** అవ్య. (√అది) అందువలన, ఆకారణముచేత. (చూ. కాన, కావున.)

క. అదిగావునఁ గార్యార్థము, మదనగురుని కడకు నిపుడు మన మూఁగ పో, విదితము గాదు...కుచేల. 1. 112.

**అదిగొ**—అదిగో. (√అది)

గీ. అమ్మ నీమాట మీఱరాదనుచు నదిగొ,నిలిపి వచ్చితి నొకనిందునీటుకాని. శుక. 3.301.

**అదిగో**—అదిగొ. అవ్య. ఇది కళగాను ద్రుతప్రకృతికముగాను గూడ కనఁబడుచున్నది. చూ. ఇదిగో. (క. అదుగో: అదో. త. అదో.) దూరవస్తువును చూపునపు డుపయుక్తమగును.

క. ఈకుధరేంద్రము లోకా, లోకపుబల్గోడ దట్టలో నికటాద్రుల్, మేకులుగా మెఱయుచు నది,గో కానఁగఁబడియెఁ దెల్లగొల్లెనభంగిన్. వరాహ. 7. 84.

ఉ. అచ్చెడుగుల్ ...వచ్చి రదిగోనని పౌరులు దల్లడిల్లఁగన్. ఉ. రా. 3. 18.

మ. అదిగో చూచితె బ్రహ్మచారివలె దైత్యారాతి యేతెంచె దశా. 5. 83.

**అదితి** నం. వి. ఇ. స్త్రీ. 1. కశ్యపునిభార్య. (దేవతలకు తల్లి) 2. పునర్వసునక్షత్రము.

**అదితిజుఁడు** నం. వి. అ. పుం. ఆదితేయుఁడు, వేలుపు.

**అదిరి**—అద్దిర. (అది+ర)

క. అదిచదివి కొంత సేపా,మదవతి నివ్వెఱఁగుకతన మ్రాన్పడి మఱియుం, బదివికొని యదిరి తారా, మదిరేక్షణ కింతభోగమూకావనెనే. కువల. 5. 42.

**అదిరయ్య** (అదిర+అయ్య)=అద్దిర.

శా. నాభాగ్యఁ బదిరయ్య యీయతివయందం బిందు భావించి నా, కేభంగిం గవయంగఁ గల్గునని యూహింపన్....కువల. 3. 51

**అదిరా**- అద్దిర. (అది+రా)

క. అదిగని యూర్వశి నవ్వుచు, నదిరా మది జాయివంటి దనియెడుపలుకు, జేదరె నుపమాన మొక్కటి, వెదకవలయు వీని మదికి విశ్వములోనన్. వాల్మీ. 3. 185.

**అదిరిపడు** అ. క్రి. (√అదురు. త. అదిర్ పడు.) ఉలికిపడు,

గీ. అదిరిపడి మేలుకని. హరి, ఉ. 7. 64.

**అదిరిపాటు**—అదరిపాటు. క్రి. విఙ. (దబ్బాటుగా)

గీ. అప్రభావంబు గాదెన న్నదిరిపాటు, కాశి వెడలంగఁ ద్రోచె నిష్కారణంబ. కాశీ. 2. 157.

**అదీనుఁడు** నం. విఙ. (అ. ఆ. అ) 1. దుఃఖము లేనివాఁడు, ఉల్లాసముగలవాఁడు, 2. ధీరుఁడు. 3. దరిద్రుఁడు కానివాఁడు.

**అదుఃఖనవమి** నం. వి. ఈ. స్త్రీ. భాద్రపదశుక్ల నవమి. (దీనియందు స్త్రీలు భావిసంవత్సర దుఃఖము తొలఁగుటకై దేవిని అరాధింతురు)

**అదుకు**—అతుకు. అ. క్రి. అంటుకొను, కూడు, అత్తు.

సీ. నిమ్మలు... తేరుమామిళ్లును నేరేళ్లుఁ గడుఁ జెల్వమై పండి వానిపై నదికియుండు. కు. సం. 6. 930.

క. తఱిగినతలలును నదుకును, మాఱి గోసిన నాలుకలను మసలక వచ్చుం, గఱకంఠుని భక్తులకని. యెఱుఁగరె సద్యఃప్రతాపు లీశ్వరభక్తుల్. శివ. సా. 187.

చ. అది గని సైనికుల్ గడు భయంబునఁ జేరి మహాొవలంబుతో, నదికినరీతి నున్న సవనాశ్వము...జై. భా. 4. 77.

వ. క్రి. సంధించు, కలుపు, లగ్నముచేయు.

గీ. అమృతజలంబాలమున సంధు లదికియదికి, వేయు నక్షత్రముల నొక్క విధము వానిఁ, జేర్చి విధి చందురునిఁగా నొనర్చెనేని, లలన! నీమోము సరి సకళంకుఁ డితఁడు. వైష. 8. 189.

క. ఇది నీకోరినఫలమని, సుదతికి ననిరుద్ధుఁ దెలుప చూపి యిటులనున్, మదిసొచ్చి నీకుఁ గూరిమి, యదికి నవలరాజుచుట్ట మవునో కాఁడో. ఉ. హరి. 5. 191.

సీ. ప్రకృతార్థభావంబు పాదుకో నదుకుచు నుపపత్తి యొందు నత్యూర్జితముగ. ప్రభా. 2. 3.

వి. అతుకు; అదుకుకొనినతావు.

మ ...రవిదీప్తిం గ్రుంగి పాతాళగ,వ్యాగముం దూఱినవాని నీయదకుఁ ద్రాక్షా తెచ్చు. ఆము. 2. 66. కళా. 6. 52.

జ. అందదుకు, అదుకుకొను.

**అదుకుకొను** అ. క్రి. (√అదుకు – స్వార్థమున కొను) అదుకు.

ద్వి. మొదలికి నతికిన నదికికొన్తరులు. బస. పు. 3. 1007. పం.

**అదుబిదుకు** వి. భయము.

ద్వి. ...గడిదొంగరై కౌరి, నదనముల్ సొరఁ గాటి సవరేయి నాలఁ, బిదికి వెండియు నదుబిదుకింత లేక, ...వ్రేలు వ్రేతలుఁజూడ వెన్నలు, నేయి, పాలు గోపాలురపాలు గావింప. అ. మ. క. 1. 33 పా. 1 పం.

**అదుము** స. క్రి. (క. అదుము,అదము.) 1, నొక్కు; దగ్గఱగా నొక్కు.

ఆ. ఎత్తికొని చనంగ నిమ్మగునట్లుగా, మెదలు చున్న బ్రయ్య లదిమి రెంటి, భార. సభా. 1. 147:

క. ...అయ్యస్త్రంబున్, జలజాతుఁడు గని పంచాం,గుళమాత్రముర్థముధరణిఁగ్రుంగ నదుముడున్. భార. కర్ణ. 3. 319.

2. నొంగఁదీయు, నిర్జించు.

సీ. ...పరమండలంబుల ధరణిపతుల, నదిమి కప్పంబుల ముదముతోఁ గొనుచును బలిమి నీయని భూమివలయపతుల, నుక్కడఁగించుచు. భార. ఆది. 1. 7.

3. పోఁగొట్టు, నశింపఁజేయు.

క. భూపాల భవజ్జనకుని, చూ పందఱమానస ముల శోకము నదుమున్. భార. ఆశ్ర. 2. 18.

జ. అదుముడు.

**అదుముడు** వి. (√అదుము) అదుముట; పీడనము. ఆం. భా 1. 150.

**అదురు**—అదరు.

(భయపడు)

క. అదురుదురే పగదాయకుఁ- జెదురుదురే ధైర్యమెడలి జీవితవాంఛన్, ముదురుదురే మూలల నరి, కెదురుదురేకాక శూరులెచ్చో నైనన్. చంద్రా. 6. 96.

జ. అదిరిపడు, అదిరిపాటు, అదురుగడ, అదుర్పు, అదురుఁగ్రోవి, అదురుఁద్రిక్క, అదురువేటు, అద్రుచు.

**అదురుఁగ్రోవి**—అదరుఁగ్రోవి. (√అదురు)

**అదురుఁద్రిక్క** వి. (√అదురు) పశురోగవిశేషము. భాగ. విరా. 1. 286.

ఆ. నరిడిపుప్పుకప్పనావురు గడుపూఁద,యదురుఁద్రిక్క యనఁగ నడరి మఱియుఁ, దెవులు లెన్నియేని దవిలి యెంతయుమహోగ్రంబు లయ్యెఁ బశుగణంబునందు. హరి. పూ. 6. 45. (శ.ర.) 'అదరుఁద్రిక్క' ముద్రి.

**అదురుగడ** వి. (√అదురు)—అదరిపాటు.

క. ...మంచిముహూర్తం, బిది యని భార్గవ నందను, లదురుగడజ వచ్చి తెలుప నద్దళ ముఖుఁడుజ. ఉ. రా. 2. 257.

చ. అది మటుమాయలాఁడి యని యంటవిగా యొకనాఁడురానివాఁ, డదురుగడం దదీయ నిలయంబునకేటికివచ్చె... సారంగ. 3.70, 3. 40.

**అదురుగుండె** వి. (√అదురు)—అదరుగుండె. (క. అదరుగుండిగె,) అదరునట్టిగుండెకాయ; పిఱికితనము.

ఆ. పేర్మి నదురుగుండె పిక్కచెదరు లేక, యుం
డవచ్చుఁ బేద యులుకు దక్కి, రమణ
గోఁచిపాత రాయఁడు దొంగల, మిండఁ
డనెడిమాటమేలు దెలిసి. కుచేల. 3. 47.

విశ. పిఱికివాఁడు.

(వ్యవ) వాఁడు వట్టిఅదురుగుండె. (బ్రౌ)

**అదురుచే(ర్చు)** – అద్రుచే (√అదురు) అ. క్రి. చలించు. వడఁకు.

మ. ధరణీచక్రముదిర్దరం దిరిగె మార్తాండుండు
గుంకీభవ,త్కిరణుండయ్యెదిశావి తానము
వడంకెఁ మిన్నదిర్చెఁ... భారం. ద్రోణ.
5. 377.

**అదురేవేటు** (√అదురు)–అదరువేటు.

**అదువ** విశ. (సం. అధ్రువమ్,) స్థిరము కానిది.

సీ....లాఁగలఁ గ్రుస్సి యదువకాఁపురి ముందు
నాఖుతతుల. ఆము. 6. 15.

వి. అద్దె. (చూ. అదువకాఁపు.)

**అదువకాఁపు** వి. (√అదువ) సిస్తునకు భూమి సేద్యము చేయురయితు, అద్దెకాఁపు.
ఆం, భా. 3. 29.

**అదూరము** సం. విశ. (అ. అ. అ.) దూరము కానిది, దగ్గఱది. .వి. అ. న. సామీప్యము.

**అదూషితము** సం. విశ. (అ. అ. అ.) 1. చెఱుపఁబడనిది. 2.కళంకములేనిది. 3.నిందింపఁబడనిది.

**అదృక్కు(కుఁడు)** సం. విశ. (క్.) గ్రుడ్డివాఁడు.

**అదృశ్యకరణము** సం. వి. అ. న. కనఁబడకుండఁ జేయుట. (ఇది ఇంద్రజాలక్రియలలో నొకటి)

**అదృశ్యము** సం. విశ. (అ. అ. అ,) 1. కనఁబడనిది. చూడశక్యము గానిది. 2. చూడఁదగనిది.

**అదృష్టకర్ముండు** సం. విశ, (న్. న్, అ. న్.) ఆచరణము ఎఱుఁగనివాఁడు, అనుభవము లేని వాఁడు.

శ్లో. కర్మస్వదృష్టకర్మా యః, శాస్త్రజ్ఞోఽపి
విముహ్యతి. హితో. 3. 54.

**అదృష్టచరము** సం. విశ. (అ. ఈ. అ.) – అదృష్టపూర్వము.

**అదృష్టపురుషము** సం. వి. అ. పుం. ఇరువదివిధము లగుసంధులలో నొకటి. (ఇందు మధ్యస్థుఁడు లేకయే రెండుతెగలవారునుసంధి చేసికొందురు)

**అదృష్టపూర్వము** సం. విశ. (అ.అ.అ.) పూర్వము చూడఁబడనిది.

**అదృష్టఫలము** సం. విశ. (అ. అ. అ.) తేలనిపర్యవసానము గలది. వి. అ. న. రాబోవుకర్మఫలము.

**అదృష్టము** సం. విశ. (అ. అ. అ.) 1. చూడఁబడనిది. 2. ఎఱుఁగఁబడనిది. వి. అ. న. 1. కర్మజన్యములై సుఖదుఃఖహేతువు లగుధర్మాధర్మములు–వీనిని మీమాంసకులు 'అపూర్వ' మందురు. 2. అగ్నిజలాదులవలని కీడు.

**అదృష్టి** సం. విశ. (ఇ.) చూపులేనిది, గ్రుడ్డిది. వి. ఇ. స్త్రీ. 1. రూషముచే క్రూరమైనచూపు. 2. చెడుదృష్టి, కనుఁబాటు. 3. కనఁబడకుండుట, దృష్టిలేమి.

**అదె(దే)** = అదిగో (√అది)

గీ. పోయెనదె వాఁడు రారె రారే యటంచుఁ,
బాఱి వారునుదానును బట్టుకొనుడు. ఆము.
6. 23.

**అదేమొ(మో)** అవ్య. (√అది) ఎందుచేతనో, ఏకారణముననో.

ఉ. ఇప్పు డదేమొ నాదుదురదృష్టమునం బరి
భావ మొందినా,ను...దశా. 2. 93.

**అదేమొ(మో)కాని**–అదేమొ. (√అది)

సీ...పలికి నే వచ్చుటఁ దెలుపుఁడనుచు, మంత్రుల
కెఱిఁగింప మంచిదె యనుట గా కెవ్వరుఁ
దెల్పరదేమొకాని. దశా. 2. 97.

**అదేయము** సం. విశ. (అ. అ.అ.) ఈయఁ దగనిది.

**అదేశము** సం. వి. అ. పుం. 1. తగనిచోటు. 2. దుష్టదేశము.

**అదేశస్థుఁడు** సం. విశ. (అ. అ. అ.) 1. దుర్దేశమం దున్నవాఁడు.2. స్వదేశమందు లేనివాఁడు.

**అదోహము** సం. వి. అ. పుం. 1. పాలు పితుకఁ దగనికాలము. 2. పాలు పిదుక కుండుట.

**అద్ద** వి. (సం. అర్ధం. ప్రా. అద్ధం. క. అద్ద. త. అద్దం.) 1. నగము. (ఈయర్థమున వ్యస్త

ప్రయోగము లేదు) ఉదా: అర్ధరూపాయ.
2. అరసోల.

సీ. తనరారు సోల యంచనఁగ నికుంచాఖ్య యద్ద యంచనఁగఁ దదర్థ మొప్పు. ఆం. భా. 2. 270.

3. గోడ పరికుప్ప మొదలగువాని అడుగు భాగము, మట్టు.

జ. అద్దగోడ, అద్దమరాతిరి, అద్దమరెయి, అద్దమరే, అద్దమరేయి.

**అద్దకము** వి. (√అద్దు. క. అద్దక, అద్దికె.) బట్టలు మొదలగువానికి రంగు వేయుట.

**అద్దగోడ** వి. (√అద్ద) వంట చేయుస్థలమునకును భోజనము చేయుస్థలమునకును నడుమఁ బెట్టిన సిగముగోడ.

**అద్దమరాతిరి** వి. (√అద్ద. సం. అర్ధరాత్రః) నడురేయి.

చ... అద్దమరాతిరి కాడ బిచ్చముం, గొనునెప మూని... చెన్న. 2. 30.

**అద్దమరెయి**—అద్దమరేయి. (√అద్ద)

గీ. అవనిసురభామినియుఁ బోలె నద్దమరెయి, స్వప్నమున వచ్చి... కుచేల. 1. 6.

**అద్దమరే** వి. (√అద్ద)—అద్దమరేయి. ఆము. 6. 11.

**అద్దమరేయి** (√అద్ద)—అద్దమరాతిరి.

ఉ. అద్దమరేయిదాఁకఁ బొల మూరసి... పాండు. 3. 71.

**అద్దము** వి. (సం. ఆదర్శః. ప్రా. అద్దాఅ. త. అద్దం)
1. గాజుబిల్ల,
ఉదా: అద్దాలతలుపు, అద్దాలమేడ.
2. ముఖము మున్నగునవి ప్రతిఫలింపఁ జేయుటకై గాజులోహముమున్నగువానితోఁ జేసిన వస్తువు, దర్పణము. ఉ. హరి. 5. 157,

**అద్ది**—అది. ధ. స్తృ. వై. 15, 41.

**అద్దికము** విజ. (సం. అధ్యక్షః. క. అద్దిక.) కను పెట్టి చూచువాఁడు, అధ్యక్షుఁడు.

గీ.... తాటోటుచేసి, యటమటింపకయుండఁబై యద్దిః ముగ, నేవఁ దిరుగాడువిశ్వాసులెపుడు మాకు, జాగిలంబులు సుమ్ము మాసామికాన. సారంగ. 1. 73.

**అద్దిర** (అద్ది+ర)—అదిర, అదిరా, అద్దిరమ్మ, అద్దిరయ్య, అద్దిరా. అవ్య. ప్రశంసాదులతోఁ గూడిన ఆశ్చర్యమును దెలుపును.

ఉ. ఔర విలోచనాంబుజము లద్దిర ముద్దుల నెమ్మొగంబు... శుక. 1. 278.

**అద్దిరపాటు** వి. ఏమఱిపాటు. ఆకస్మికత్వము.

చ. అని తలపోయ వానిపొలు పద్దిరపాటునఁ జూచి విస్మయం, బనుపమలీలఁ దొట్టిన భయంబును జిల్లర సేయ... శుక. 3. 585.

ఉ... ఒయార మొలర్కఁగా, నావనజాతు లున్న యెడ కద్దిరపాటున వచ్చి నిల్చినన్. కువల. 3. 57.

**అద్దిరమ్మ**—అద్దిర.
(భయముతోఁ గూడిన ఆశ్చర్యమును దెలుపును.)

గీ. అద్దిరమ్మ యనుచు నామైత్రి మూర్ఛిల్ల. ప్రబోధ. 3. 78.

**అద్దిరయ్య**—అద్దిర.
(భయమునకు)

క... చూచి వనేచరు లేచిన వెఱఁ, దవిలినమతి నద్దిరయ్య దయ్యం బనుచున్. మనుచ. 4. 102.

**అద్దిరా**—అద్దిర. (అద్ది+రా)
(కోపమునకు)

సీ. అద్దిరా నీకుఁ గ్రొవ్వెటుగదేఁ జూతుగా కని తల నూపక యడఁగువారు. భార. విరా. 3. 36.

(ప్రశంసకు)

సీ. అద్దిరా యెలనాఁగముద్దురాజీలు మొగం బిందునందుఁ గళంక మొందఁ జేయు. ఇందు. 2. 188.

**అద్దు** స. క్రి (క. అద్దు — 1. రంగువేయు. 2. ముంచు.) 1 తాఁకించు, తగిలించు; అదుము.

చ. ...తత్పరిభుక్తముక్తమాల్యనికర మహీయుగ్మమున నద్దుచు నించుక సేవు రంజిలెన్. ప్రభా. 5. 146.

అ.... తమశిరంబు లల్లనల్ల నద్దుచును దదీయ మగుపాదయుగళి వాంఛిరి... కళా. 1. 50. చంద్రా. 2. 105.

2. (రంగు) పట్టించు.

చ. అలక నిజీబులోఁ గుసుమ మద్దినపావడ దోఁప ...మనుచ. 6. 31.

3. ముంచు.

ద్వి. నిద్దముగా నీట నద్దుము పాల,నద్దుము మా కింక నన్యథాలేదు. బస. పు. 5. 161.

జ. అద్దకము, అద్దుకొను.

**అద్దుకొను** స. క్రి. (√అద్దు) తాఁకించు; అదుము.

గీ...భక్తిఁ జేరి, యతనిపదములు కన్నుల నద్దుకొనుచు. పం.మ. 2. 222.

**అద్దె(ద్దియ)** వి. 1. బాడిగ,ఇల్లు బండి మున్నగు వానికై నియమితకాలమున కిచ్చు సొమ్ము.

సీ. ప్రేమ నెదుర్కొలు పెండ్లివారలకిచ్చి తెవులైనవారి కద్దెలకు నొసఁగి. హం.స. 5. 10.

**అద్ధా** సం. అవ్య. సత్యము, యథార్థము (ఇది తెనుఁగున వ్యస్తముగా నుండదు)

శా. అద్ధావాగ్విబుధ మ్మహోవచనకవ్యాహార మహోవచస్సిద్ధమ్ము ... గెల్పుటుత్సవము నందియ్యెన్నభ మ్మంతయున్ ఆము.4.6.

**అద్ధాపురుషుఁడు** సం. వి. అ. పుం. సరియైన మనుష్యుఁడు, నిజముగా మనుష్యుఁడని చెప్పఁదగినవాఁడు.

**అద్భుతము** సం. విణ. (అ. ఆ. అ.) వింతయైనది, ఆశ్చర్యకరము. వి. అ. పుం. న. ఆశ్చర్యము. పుం. నవరసములలో నొకటి.

**అద్భుతసారము** సం. వి. అ. పుం. ఖదిరసారము, కవిరి.

**అద్మరుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కుటముగాఁ దినువాఁడు, తిండిపోతు.

**అద్య** సం. అవ్య. 1. ఈదినమందు. 2. ఈదినము, ఈకాలము.(దీనికి తెనుఁగున వ్యస్తప్రయోగము లేదు.)

**అద్యతనము** సం. విణ. (అ. ఈ. అ.) నేఁటిది; ఈకాలపుది. వి. అ. పుం. (వ్యాక) కడచిన రాత్రియొక్క అంత్యయామము మొదలుకొని రాఁబోవు రాత్రియొక్క ప్రథమయామము తుదవఱకు నుండుకాలము. (నిన్నటి యర్ధరాత్రము మొదలు నేఁటియర్ధరాత్రమువఱకు నుండుకాలము అని కొందఱు)

**అద్యప్రభృతి** సం. విణ. (ఇ.) నేఁడు మొదలుగాఁ గలది. క్రి. విణ. నేఁడు మొదలుకొని.

**అద్యమానము** సం. విణ. (అ. ఆ. అ.) తినఁబడుచున్నది.

**అద్యశ్వీనము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ప్రసవించుటకు సిద్ధముగా నున్నది, ఆసన్నప్రసవము. 2. నేఁడో రేపో సంభవించునది, ఆసన్నము.

**అద్యావధి** సం. విణ. (ఇ.) నేఁడు అవధిగాఁగలది. క్రి.విణ. 1.నేఁటివఱకు.2.నేఁడు మొదలుకొని

**అద్రి** సం. వి. ఇ. పుం. 1. కొండ. 2. రాయి. 3. చెట్టు. 4. సూర్యుఁడు. 5. మానవిశేషము. 6. ఏడు అనుసంఖ్య.

**అద్రికర్ణి** సం. వి. ఈ. స్త్రీ. గిరికర్ణి, దింటెన (వృ. వి.)

**అద్రికాకము** సం. వి. అ. పుం. ఒకజాతికాకి, కొండకాకి.

**అద్రికీల** సం. వి. ఆ. స్త్రీ. భూమి.

**అద్రికుక్షి** సం. వి. ఇ. స్త్రీ. కొండగుహ.

**అద్రిజ** సం. వి. ఆ. స్త్రీ. 1. సింహపిప్పలి (వృ.వి.) 2. పార్వతి.

**అద్రిజము** సం. విణ. (అ. ఆ. అ.) పర్వతమునఁ బుట్టినది. వి. అ. న. 1. సిలాజిత్తు. 2. గైరికాదిధాతువు.

**అద్రిజాతము** సం. విణ. (అ. ఆ. అ.) పర్వతమునఁ బుట్టినది. వి. అ. పుం. 1. కార్చిచ్చు.2.హంస. 3. రూపము. 4. పరమాత్మ.

**అద్రిద్రోణి** సం. వి. ఇ, ఈ. స్త్రీ. 1. కొండకనుమ. 2. కొండవాఁగు.

**అద్రిభి(త్తు)దుఁడు** సం. వి. ద్. పుం. ఇంద్రుఁడు.

**అద్రిభువు** సం. విణ. (ఊ. ఊ. ఉ.) 1. పర్వతమందుఁబుట్టినది. 2.పర్వతమువలనఁ బుట్టినది. వి. ఊ. స్త్రీ. 1. గిరికర్ణి (వృ.వి.)2. పార్వతి.

**అద్రిసారము** సం. వి. అ. పుం. అశ్మసారము, ఇనుము.

**అద్రుచు** అ. క్రి. (√అదురు) – అదరుచే(ర్చు) (ఇందలిఱకారము లఘువు)

ఆ. కురిసెఁ బుష్పవృష్టి సురదుందుభిధ్వనుల్. సెలఁగె సకల భువనవలయ మద్రువ. భార. ఆది. 6. 124.

గీ. వాయువేగంబు లైనతద్వాహనములు, భీష్ముతేరె త్రిగొని పాఱెఁ బృథివి యద్రువ. భార. భీష్మ. 2. 82. భార. సభా. 1,211. నైష. 7. 86.

**అద్వయము** సం. వి. అ. న. అద్వైతము.

**అద్వయవాది** సం. వి. న్. పుం. 1. సమస్తమును చిత్స్వరూపముదానికంటె రెండవది లేదని వాదించువాఁడు, అద్వైతి. 2. బుద్ధుఁడు.

**అద్వయానందము** సం–అద్వైతానందము.

**అద్వయుఁడు** సం. వి. అ. పుం. బుద్ధుడు. (హేమ. ని)

**అద్వారము** సం. విశ. (అ. ఆ అ.) 1–ద్వారము లేనిది–దుర్గమము, ప్రవేశింప శక్యము కానిది. 2. ఉపాయశూన్యము వి. అ. న. ద్వారవ్యతిరిక్తప్రదేశము. మను. 4. 78.

**అద్వితీయము** సం. విశ. (అ. ఆ. అ.) 1. రెండవది లేనిది. 2. సాటిలేనిది. 3. తోడు లేనిది· ఒంటరి. 4. ఒక్కటి, ఏకము.

**అద్వైతము** సం. విశ. (అ. ఆ. అ.) 1. రెండు విధములు కానిది. ఒక్కరూపైనది. 2. భేదము లేనిది. వి. అ. న. 1. రెండుకామి, ఏకత్వము, అభేదము; జీవబ్రహ్మైక్యము. 2. బ్రహ్మము. 3. ఐక్యమును బోధించుమతము.

**అద్వైతవాది** సం–అద్వయవాది. 1.

**అద్వైతానందము** సం. వి. అ. పుం. జీవబ్రహ్మైక్యానుభవమువలనఁ గలుగుఆనందము.

**అద్వైతి** సం. వి. న్. పుం. జీవేశ్వరైక్యమును బోధించుమతమువాఁడు.

**అధఃకరణము** సం. వి. అ. పుం. క్రిందుపఱుచుట; తక్కువపఱుచుట.

**అధఃకరించు** సం. స. క్రి. క్రిందుగాఁ జేయు, క్రిందుపఱచు; అవమానపఱుచు.

గీ. వినుము నీ చెప్పినట్టుల నరినొరులఁ, ధఃకరించుట లోకహితంబు గాదు. భార. కర్ణ. 3.25. వరాహ 10.82.

**అధఃకారము** సం. వి. అ. పుం. క్రిందుపఱుచుట, తక్కువపఱుచుట.

**అధఃకృతము** సం.–అధరితము.

**అధఃక్రియ** సం. వి. ఆ. స్త్రీ –అధఃకరణము.

**అధఃఖననము** సం. వి. అ. న. క్రింద త్రవ్వుట.

**అధఃపాతము** సం. వి. అ. పుం. అధోగతి.

**అధఃపుష్పి** సం. వి. ఈ. స్త్రీ. 1. అవాక్పుష్పి, సదాప(వృ.వి.). 2. గోజిహ్వా, బెండ (వృ.వి.).

**అధనుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) ధనము లేని వాఁడు, దరిద్రుఁడు.

**అధమభృతకుఁడు** సం.–అధమభృతుఁడు.

**అధమభృతుఁడు** సం. వి. అ. పుం. నీచసేవకుఁడు. (భృత్యులు మూఁడువిధములు: ఆయుధీయుఁడు ఉత్తమభృతుఁడు. కృషీవలుఁడు మధ్యమభృతుఁడు. భారవాహి అధమ భృతుడు.)

**అధమము** సం. విశ. (అ. ఆ. అ.) తక్కువైనది, నీచము.

**అధమర్ణి** సం. విశ (న్. నీ. న్.) అధమర్ణుఁడు·

**అధమర్ణికుఁడు** సం.–అధమర్ణుఁడు.

**అధమర్ణుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) అప్పు పుచ్చుకొనువాఁడు. (వ్యతి–ఉత్తమర్ణుఁడు.)

**అధమాంగము** సం· వి. అ. న. పాదము (వ్యతి – ఉత్తమాంగము.)

**అధమార్ధము** సం. వి. అ. న. దేహమునందు బొడ్డునకుఁ గ్రిందిభాగము.

**అధరకము** సం. వి. అ. న. కుచములయందు చేయుచుంబనము.

సీ. చెవుల నిమిత్తంబు చెక్కుల స్ఫుటితంబు... చనుదోయి నధరకంబు. హంస. 5. 148.

**అధరకాయము** సం. వి. అ. పుం. దేహముయొక్క క్రిందిభాగము.

**అధరపానము** సం. వి. అ. న. పెదవి క్రోలుట, మోవి యానుట.

**అధరమధువు** సం. వి. ఉ. న. అధరామృతము.

**అధరము** సం. విశ. (అ. ఆ. అ.) 1. క్రిందిది. 2. హీనము, నీచము. వి. అ. పుం. క్రిందిపెదవి; పెదవి.

**అధరామృతము** నం. వి. అ. న. మోవితేనె.

**అధరితము** నం. విశే. (అ. ఆ. అ.) 1. క్రిందుపఱు పఁబడినది. 2. తక్కువపఱుపఁబడినది.

**అధరీకృతము** నం.—అధరీభూతము.

**అధరీభూతము** నం. విశే. (అ. ఆ. అ.) తక్కువ పడినది. కీడ్పడినది.

**అధరోత్తరము** నం. విశే. (అ.ఆ.అ.) వ్యత్యస్తము, తాఱుమాఱైనది. విశే. అ. న. (రూ. అధ రోత్తరములు.) 1. క్రిందిదియు మీఁదిదియును. 2. తక్కువదియు ఎక్కువదియును.

**అధరోష్ఠము** నం. వి. అ. పుం. క్రింది పెదవి.

**అధర్మము** నం. విశే. (న్. న్. అ. న్.) ధర్మము లేనిది. వి. అ. పుం. 1. విరుద్ధధర్మము, పాపము. 2. ధర్మవిరుద్ధమగుకార్యము. (హిం. మొ.)

**అధర్మి** నం. విశే. (న్. ణీ. న్.) ధర్మము లేనిది, దుష్టము.

**అధర్మ్యము** నం. విశే. (అ. ఆ. అ.) ధర్మమునుండి తొలఁగినది, అన్యాయము: దుష్టము.

**అధవ** నం. వి. ఆ. స్త్రీ. విధవ, భర్తలేనిస్త్రీ.

**అధశ్చరుఁడు** నం. విశే. (అ. ఈ. అ.) క్రింద తిరుగువాఁడు. వి. అ. పుం. దొంగ.

**అధశ్శయుఁడు** నం.—అధశ్శయ్యుఁడు.

**అధశ్శయ్య** నం. వి. ఆ. స్త్రీ. 1. నేల పరుండుట. మను. 2. 108. 2. క్రిందవేసినపక్క.

**అధశ్శయ్యుఁడు** నం. విశే. (అ. ఆ. అ.) నేలను పరుండువాఁడు.

**అధశ్శిర(స్స)ము** నం. విశే. (న్.) అధోముఖ ముగా నున్నది. వి. న్. న. నరకభేదము.

**అధస్** నం. అవ్య. (దిగ్దేశకాలములందు) 1. క్రిందు. 2. క్రిందినుండి. 3. క్రింద. (దీనికి తెనుఁగున వ్యస్త ప్రయోగములేదు.
ఉదా: అధఃపతితము, అధోగామి, అధోముఖము. అధోంశుకము, అధఃఖననము, అధస్థితుఁడు మొ.

**అధస్తనము** నం. విశే. (అ. ఈ. అ.) 1. క్రింద నున్నది. 2. పూర్వపుది

**అధస్పదము** నం. వి. అ. న. 1. అఱకాలు. 2. కాలిక్రిందిచోటు.

**అధామార్గవము** నం. వి. అ. పుం. అపామార్గము, ఉత్తరేను (వృ. వి.)

**అధి** నం. అవ్య. తెనుఁగున వృత్తియందుండి తఱ చుగా నీ క్రిందియర్థములనిచ్చును. 1. అధికము. ఉదా: అధిరాజు. అధిభోజనము (—అధిక భోజనము.)
2. అధిరూఢము.
ఉదా: అధిజ్యము, అధిరథుఁడు.
3. కొన్నిచోట్ల నిరర్థకముగానే యుండును
ఉదా: అధిజననము — జననము. అధివాసము- వాసము. నివాసము.

**అధికమాసము** నం. వి. అ. పుం. మలమాసము, సూర్యసంక్రమణము లేనిచాంద్రమాసము.

**అధికము** నం. విశే. (అ. ఆ. అ.) ఎక్కువది, పెద్దది, గొప్పది: అధికము. వి. అ. పుం.(అలం) ఆధారాధేయములకు అనురూప్యములేమిన దెలుపునట్టియొక అర్థాలంకారము.
లక్ష్యము: చతుర్దశభువనములను గర్భమందుఁ దాల్చినశ్రీమహావిష్ణువు సముద్రపైనొకమూల శయనించినాఁడు.

**అధికరణభోజకుఁడు** నం. వి. అ. పుం. న్యాయాధి కారి, ధర్మాధికారి.

**అధికరణమండపము** నం. వి. అ. పుం. న. న్యాయ విచారస్థలము, కచ్చేరిచావడి.

**అధికరణము** నం. వి. అ. న. 1. అధికారమునందు నియోగించుట. 2. అధికారము. 3. (వ్యాక) సప్తమీకారకము, కర్తృకర్మద్వారమున క్రియా శ్రయం బగు కారకము. 4. ఆధారము, ఆశ్ర యము. 5. (మీమాంస) విచారణీయవిషయము సందేహము పూర్వపక్షముఉత్తరమునిర్ణయము అను అయిదింటితోఁ గూడిన గ్రంథభాగము. 6. న్యాయవిచారణస్థలము.

**అధికరణి** నం. విశే. (న్. నీ. న్.) అధికారి.

**అధికరణికుఁడు** నం. వి. అ. పుం. 1. న్యాయ విచారణకర్త. 2. రాజకీయోద్యోగస్థుఁడు.

**అధికరించు** నం. న. క్రి. 1. నేర్చు, అభ్యసించు. సీ. అధికరించితి వస్మదాచార్యకంబునఁ జతు రంబు లగుదివ్యసాధనములు. హరి. 7.144.

2. ప్రధానముగాఁ జేసికొను.

వ. మత్స్యపురాణంబులోన గాయత్రి నధికరించి ధర్మవిస్తరంబును వృత్రాసురవధంబును నెందుఁ జెప్పంబడు నదియ భాగవతం బని పలుకుటం జేసి యీపురాణంబు శ్రీమహాభాగవతం బన నొప్పుచుండు. భాగ. 1.35.

3. వహించు, పూను.

వ. వరుణుండు ప్రత్యగ్దిశానుశాసియై నిలిచెఁ గుబేరుం డుత్తరహరిత్పాలనం బధికరించె. హరి. ఉ. 10. 267.

4. అధిష్ఠించి అధికారిగా నుండి నడపు.

సీ. కార్యవర్గంబును గారణసంఘంబు నధికరించి చరించు నాత్మతత్త్వ. మధ్యాత్మ మనఁబడు. భాగ. 1. 56.

**అధికర్మకరుఁడు** సం. విశ. (అ. ఈ. అ.) 1. సేవకుఁడు. 2. పనివాండ్రపై యధికారి. (మేస్త్రి)

**అధికర్మము** సం. వి న్. న. 1. గొప్పకార్యము. 2. అధికారము.

**అధికర్మికుఁడు** సం. వి. అ. పుం. అంగళ్ల నుండి వర్తకులవలన సుంకములు మొదలగునవి పుచ్చుకొనుటకు నియుక్తుఁడైనవాఁడు, ఘట్టాధ్యక్షుఁడు, సుంకరి.

**అధికర్ముఁడు** సం. వి. న్. పుం. పరిపాలనకర్త, అధికారి.

**అధికాంగము** సం. విశ. (అ. ఆ. ఈ. అ.) ప్రమాణములోఁ గాని సంఖ్యలోఁ గాని అధికమైన యవయవములు గలది. వి. అ. న. యోధులు కవచము గట్టిగానుండుటకై కట్టెడి నడికట్టు.

**అధికాధికము** సం. విశ. (అ. ఆ. అ.) అత్యధికము.

**అధికామము** సం. విశ. (అ. ఆ. అ.) ఎక్కువ వాంఛగలది. వి. అ. పుం. తీవ్రవాంఛ.

**అధికారము** సం. వి. అ. పుం. 1. అధ్యక్షత, పై యధికారిగానుండి చూచుట. 2. ఉపక్రమము. (వై.ని.) 3. పరిపాలనము. దొరతనము. 4. స్వామ్యము. 5, కర్మాచరణాదులకు అర్హత. 6. ఆశ్రయము, స్థానము.

ప. మహాత్ములు పురుషాధికారం జ్యోతిః. మాళవి. 1, 7. గణనము, లెక్కించుట.

శ్లో. సంసత్సు జాతే పురుషాధికారే,న పూరణీతం సముపైతి సంఖ్యా. సం. కిరా. 3.50.

8. (వ్యాక) వాక్యాంతరోపకారక మగుశబ్ద విశేషము; ఉత్తరసూత్రములతోఁ గలసి అన్వయించు ప్రధానసూత్రము.

**అధికారస్థుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) ఉద్యోగస్థుఁడు.

**అధికారి** సం. విశ. (న్. ఈ. న్.) అధికారము గలవాఁడు,

**అధికృతి** సం. వి. ఇ. స్త్రీ. అధికారము.

**అధికృతుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) అధికారమునం దేర్పఱుపఁబడినవాఁడు.

**అధికృత్యము** సం. వి. అ. న. అధికర్మము.

**అధిక్రమణము** సం. వి. అ. న,—అధిక్రమము.

**అధిక్రమము** సం. వి. అ. పుం. 1. ఎక్కుట. 2. పైఁబడుట, దండెత్తుట.

**అధిక్రియ** సం. వి. ఆ. స్త్రీ. అధికారము.

**అధిక్షిప్తము** సం. విశ. (అ. ఆ. అ.) 1. ఉంపఁబడినది, స్థాపితము. 2. నిందితము, తిరస్కృతము. 3. బెదరింపఁబడినది. 4. ప్రేరితము. 5. త్రోసివేయఁబడినది, చిమ్మఁబడినది.

**అధిక్షేపము** సం. వి. అ. పుం. 1. దూఱుట, నిందించుట. 2. త్రోసిపుచ్చుట. 3. తిరస్కరించుట. 4. స్థాపనము. 5. పురకొలుపుట, ప్రేరణము.

**అధిక్షేపించు** సం. స క్రి. 1. ధిక్కరించు; తృణీకరించు.

వ. వేఁటపంతంబు దప్పి మమ్ము నధిక్షేపించితి వీతప్పునకుఁ దపసివి గాన నిన్ను శిక్షింపను. హర. 7. 61.

2. పొంఱఁదోలు.

ప. గంధర్వుల బంధించి గుహ్యకుల సంహరించి యక్షుల నధిక్షేపించి ఖేచరుల గీటడంచి. హర. 3. 9.

3. ఆక్షేపించు.

వ. దుర్మదంబున ద్రోణాచార్యుల నధిక్షేపింపవచ్చు నంతియకాక ...దుర్జయుండగువర్జునునకుఁ దలసూపవచ్చునే. భార. విరా. 4. 195.

అ. క్రి. దోషమారోపించు, నేరముమోపు.

వ. అందఱుఁగూడి యొక్కట నచ్చేడియమీఁద నధిక్షేపించి. హరి. పూ. 5. 227.

**అధిగంత** సం. విశ. (ఋ. త్రీ. ఋ.) పొందువాఁడు.

**అధిగంతవ్యము** సం. — అధిగమ్యము.

**అధిగతము** సం. విశ. (అ. ఆ. అ.) పొందఁబడినది, సంపాదింపఁబడినది. 2. చదువఁబడినది, చక్కఁగా నేర్చుకొనఁబడినది; తెలిసికొనఁబడినది.

**అధిగమనము** సం. వి. అ. న.—అధిగమము.

**అధిగమనీయము** సం.—అధిగమ్యము.

**అధిగమము** సం. వి. అ. పుం. 1. పొందుట, పడయుట. 2. చదువుట. నేర్చుట. 3. తెలిసికొనుట. 4. ధనప్రాప్తి, లాభము. 5. ఒప్పుకొనుట, స్వీకారము.

**అధిగమించు** సం. న. క్రి. 1. పొందు.

గీ. ...పార్థివేంద్రు నధిగమించి. వసు. 1.44.

2. ధరించు, తాల్చు.

గీ. అట్లుగాంచి ముని వేషమధిగమించి. రామా. 7. 26. 2.

3. చదువు.

వ. సువ్రతుండనై వేదంబు లధిగమించి నిఖల విద్య లభ్యసించి. మార్క. 5. 266.

4. తెలిసికొను.

సీ. గంధంబు ఘ్రాణంబ కాని తక్కినయాఱు నధిగమింపఁగ నోపవు. భార. అశ్వ. 2. 29.

అ. క్రి. 1. ప్రవర్తించు.

గీ. అవని నసహాయశూరత నధిగమించు... బిరుద వరాహమూర్తి. వసు. 1. 68.

2. చొచ్చు, ప్రవేశించు.

సీ. ...అచ్యుతుం డఖిలభూతములందు నధిగమించి, భువన ప్రపంచంబుఁ బుట్టింప మదిఁ గోరి...పద్మ. 6. 16.

**అధిగమ్యము** సం. విశ. (అ. ఆ. అ.) పొందఁ దగినది. 2. తెలిసికొనఁదగినది.

**అధిగామి** సం. విశ. (న్. నీ. న్.) 1. పొందువాఁడు. 2. తెలిసికొనువాఁడు.

**అధిగుణము** సం. విశ. (అ. ఆ. అ.) 1. గొప్ప గుణములు గలది. 2. ఎక్కుపెట్టఁబడినది(విల్లు). వి. అ. పుం. గొప్పగుణము.

**అధిజిహ్వ** సం. వి. ఆ. స్త్రీ. 1. చిఱునాలుక, కొండనాలుక. 2. నాలుకయందుఁగాని కొండ నాలుకయందుఁగాని కలిగెడువాఁపు. (రోగ విశేషము).

**అధిజిహ్వము** సం. వి. అ. పుం. — ఒకటికంటె అధిక ముగుజిహ్వలు కలది — సర్పము, ద్విజిహ్వము.

**అధిజిహ్విక** సం. — అధిజిహ్వ.

**అధిజ్యము** సం. విశ. (అ. ఆ. అ.) మోపెట్టినది, ఎక్కిడినది. (విల్లు)

**అధిత్యక** సం. వి. ఆ. స్త్రీ. కొండమీఁదినేల, నెత్తము.

**అధిదంతము** సం. వి. అ. పుం. పంటిమీఁద మొలచిన పల్లు. (దంతరోగవిశేషము.)

**అధిదేవత** సం. వి. ఆ. స్త్రీ. 1. అధిష్ఠించియుండు దేవత, అభిమానిదేవత. 2. దేవుఁడు, సర్వాధిపతియగు పరమేశ్వరుఁడు.

**అధిదేవనము** సం. వి. అ. న. 1. నెత్తపలక, జూద మాడుపలక. 2. జూద మాడుచోటు.

**అధిదేవుఁడు** సం. వి. అ. పుం. అధిదేవత.

**అధిదైవతము** సం. వి. అ. న. — అధిదేవత.

**అధిదైవము** సం.—అధిదైవతము.

**అధినాథు(ధు)ఁడు** సం. వి. అ. పుం. సర్వాధికారి.

**అధిపతి** సం. విశ. (ఇ. ఇ. త్నీ. ఇ.) అధిపుఁడు, ప్రభువు. వి. ఇ. పుం. తలలోని యొకభాగము. (ఇట గాయము తగిలినతోడనే మరణము కలుగునని సుశ్రుతము).

**అధిపుఁడు** సం. వి. అ. పుం. ఏలిక, రాజు.

**అధిపురుషుఁడు** సం. వి. అ. పుం. పరమేశ్వరుఁడు.

**అధిప్రజుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) 1. పెక్కు బిడ్డలు గలవాఁడు. 2. పెక్కుప్రజలు కలఁవాఁడు. (రాజు)

**అధిభువు** సం. విశ. (ఉ. ఊ. ఉ.) అధిపతి, నాయకుఁడు.

**అధిభూతము** సం. వి. అ. న. — భూతములందెల్ల వర్తించుచుండునది—పరమాత్మ.

**అధిమంథనము** సం. వి. అ. న. 1. నిప్పునకై కఱ్ఱ తరుచుట. నిప్పునకై మథించుకఱ్ఱ. (అరణి, మొ.)

**అధిమంథము** సం. వి. అ. పుం. 1. తీవ్రమైన నేత్రరోగవిశేషము. 2. అధిమంథనము.

**అధిమంథితుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) అధిమంథమను నేత్రరోగముకలవాఁడు.

**అధిమాంసకము** సం. వి. అ. పుం. ఇగుళ్ళ వెనుక పుట్టినపుండు. దంతరోగవిశేషము.

**అధిమాంసము** సం. వి. అ. పుం. కంటితెల్లగ్రుడ్డునందు కండ పెరుఁగు నేత్రరోగవిశేషము.

**అధిమాత్రము** సం. విణ. (అ. ఆ. అ.) అధికప్రమాణము కలది.

**అధిమానము** సం—అధికమాసము.

**అధియోగము** సం. వి. అ. పుం. (జ్యోతి) ప్రయాణాదులకు శుభకరిమైన యోగము.

**అధియోధుఁడు** సం. వి. అ. పుం. మేటిజోదు.

**అధిరథుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) రథముమీఁద నున్నవాఁడు. వి. అ. పుం. 1. సారథి. 2. కర్ణుని పెంపుడుతండ్రి యగు సూతుఁడు.

**అధిరాజు** సం. వి. అ. పుం. సమ్రాట్టు, చక్రవర్తి.

**అధిరాజ్యము** సం. వి. అ. న. గొప్పరాజ్యము: రాజ్యము.

**అధిరాట్టు(ట్టు)** సం. విణ. (జ్.) అధికశోభాయుక్తుఁడు. వి. జ్. పుం—అధిరాజు.

**అధిరూఢము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఎక్కినది. 2. పెరిఁగినది. 3. హెచ్చినది.

**అధిరోపణము** సం. వి. అ. న. ఎక్కించుట; ఎత్తుట.

**అధిరోహణము** సం. వి. అ. న. 1. ఎక్కుట. 2. ఎక్కించుట; ఎత్తుట.

**అధిరోహణి** సం. వి. ఈ. స్త్రీ. నిచ్చెన; మెట్లవరుస.

**అధిరోహము** సం. వి. అ. పుం. ఎక్కుట.

**అధిరోహి** సం. విణ. (న్. నీ. న్.) ఎక్కువాఁడు.

**అధిరోహించు** సం. స. క్రి. ఆరోహించు, ఎక్కు.

వ. ఉత్తుంగతరదివ్యయానల లామంబు... అధిరోహించి. ఉ. రా. 7. 205.

**అధిరోహుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) ఎక్కువాఁడు; గజాదులపయి నెక్కువాఁడు. (మావటివాఁడు. మొ.)

శ్లో... శాయయతి... గజపతిమధిరోహః. శిశు. 11. 8.

**అధివసించు(సియించు)** సం. అ. క్రి. నివసించు; కూర్చుండు.

వ. సహోదరిమైనమహోదధికన్యకచందంబునఁ గెందమ్మి నధివసించెనో యన శోణమణిభాజనంబుల నున్నవారణి. వరాహ. 4. 155.

గీ. అచట నొకరెండుదివసంబు లధివసించి, కదలి చేరెను... రంగా. 2. 131.

క.... హేమమయాసనముల నధివసియింపఁగా, వరాహ. 10. 4.

2. ఉండు.

సీ. భ్రూవల్లరీయుగ్మమునకు మధ్యంబుననానందవనతీర్థ మధివసించు కాశి. 2. 117.

**అధివాసనము** సం. వి. అ. న. గంధమాల్యాది సంపర్కముచే పరిమళింపఁ జేయుట. 2. దేవతాప్రతిష్ఠ, యజ్ఞారంభమునకుఁ బూర్వము చేయు దేవతావాహనపూజాదికము.

**అధివాసము** సం. వి. అ. పుం. 1. ఉనికిపట్టు, నివాసము. 2. అడిగిన దిచ్చువఱకుఁ గదలనని భోజనము చేయకుండ చలపట్టి కూర్చుండుట. 3. యజ్ఞము నారంభించుటకు ముందటిదినమునఁ జేయు దేవతాస్థాపనాదికర్మము. 4. గంధమాల్యాదులు ధరించుట. 5. పరిమళము.

**అధివాసి** సం. విణ. (న్. నీ. న్.) 1. నివసించువాఁడు. 2. పరిమళింపఁ జేయువాఁడు.

**అధివాసించు** సం. స. క్రి. పరిమళింపఁ జేయు.

వ. నిశ్వాసధారాసారంబుల వాసా గారంబధివాసించు నెడనెడ. నైష. 7. 187.

**అధివాసితము** సం. విణ. (అ. ఆ. అ.) పరిమళింపఁ జేయఁబడినది.

**అధివాసుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) 1. కాఁపురముండువాఁడు. 2. ఇరుగుపొరుగువాఁడు.

**అధివాహనము** సం. వి. అ. న. 1. కొనిపోవుట. 2. మీఁది కెత్తుట.

**అధివిన్న** సం. వి. అ. స్త్రీ. తాను బ్రతికియుండఁగా మఱియొకదానిని పెండ్లాడినమగఁడుస్త్రీ.

**అధివేత్త** సం. వి. ఋ. పుం. భార్య యుండఁగా మఱియొకదానిని పెండ్లాడినపురుషుఁడు.

**అధివేదనము** సం. వి. అ. న—అధివేదము.

**అధివేదము** సం. వి. అ. పుం. భార్యయుండఁగా మరలఁ బెండ్లాడుట.

**అధిశయితము** సం. విశ. (అ. అ. అ) పరుండినది.

**అధిశ్రవణము** సం. వి. అ. న. పాచనము వండిం చుట.

**అధిశ్రయణము** సం. వి. అ. న. ప్రొయ్యిమీఁదఁ బెట్టుట; ప్రొయ్యిమీఁదఁ బెట్టి వండుట.

**అధిశ్రయణి** సం. వి. ఈ. స్త్రీ. ప్రొయ్యి.

**అధిశ్రయము** సం. వి. అ. పుం. 1. ఆశ్రయము. 2. ప్రొయ్యిమీఁదఁ బెట్టి వండుట.

**అధిషవణము** సం. వి. అ. న. 1. సోమరసము పిడిచి తీయుటకై తోలు మున్నగువానితోఁ జేయఁబడిన పనిముట్టు. 2. సోమరసము పిడు చుట, అభిషవము.

**అధిష్ఠాత** సం. విశ. (ఋ. త్రి. ఋ.) 1 అధ్య క్షుఁడు; నియామకుఁడు. 2. అధిదేవత.

**అధిష్ఠానము** సం. వి. అ. న. 1. దగ్గఱ నుండుట. 2. వసించుట. 3. ఉనికిపట్టు,వాసస్థానము. 4. ఆధారము, ఆశ్రయము. 5. చక్రము, బండి కన్ను. 6. ప్రాభవము,అధికారము; పలుబడి. 7. ఒకానొక పట్టనము.

**అధిష్ఠించు** సం. స. క్రి. ఆశ్రయించు, ఉనికిపట్టుగాఁ జేసికొను.

వ. అప్పరమధామంబు నే నధిష్ఠించి...పాండు. 2. 80.

**అధిష్ఠితము** సం. విశ. (అ. అ. అ.) 1. నివాస ముగాఁ జేసికొన్నది, ఆశ్రయించినది. 2. ఆశ్రయింపఁబడినది, నివాసముగాఁ జేసికొనఁ బడినది. 3. నియంత్రితము, నడపఁబడినది. 4. ఎక్కఁబడినది.

**అధీకారము** సం—అధికారము.

**అధీతము** సం. విశ. (అ. అ. అ.) 1. చదువఁబడి నది. 2. జ్ఞప్తియం దుంచుకొనఁబడినది.

**అధీతి** సం. విశ. (న్. నీ. న్.) చక్కఁగాఁ జది వినవాఁడు. వి. ఇ. స్త్రీ. 1. అధ్యయనము, చదువుట. 2. జ్ఞప్తిలోనుంచుకొనుట.

**అధీనము** సం. విశ. (అ. అ. అ.) లోఁబడినది, వశ మైనది.

**అధీమంథము** సం—అధిమంథము.

**అధీయమానము** సం. విశ. (అ. ఆ. అ.) చదువఁ బడుచున్నది.

**అధీయానుఁడు** సం. వి. అ. పుం. చదువుకొనుచున్న వాఁడు, విద్యార్థి.

**అధీర** సం. వి. ఆ. స్త్రీ. 1. మెఱపుఁదీగ. 2. శృం గారనాయికాభేదము. (రోషమునఁ బరుష వాక్యములాడి భర్తనుభేద పెట్టునది మధ్యాధీర. తర్జనతాడనములచే భర్తనుపీడించునది ప్రౌఢా ధీర.)

**అధీరము** సం. విశ. (అ. ఆ. అ.) 1. పిఱికియైనది; కలవరపడునది. 2. నిలుకడ లేనిది; చంచలము, కదలునది. 3. మూఢము.

**అధీశుఁడు** సం. వి. అ. పుం. ప్రభువు.

**అధీశ్వరుఁడు** సం.—అధీశుఁడు.

**అధీష్టము** సం. వి. అ. పుం, సత్కారపూర్వకముగా ఇష్టకార్యమందుఁ బ్రవర్తింపఁ జేయుట.

**అధీష్టుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) సత్కారపూర్వ కముగా ఇష్టకార్యమందుని యోగింపఁబడిన వాఁడు.

**అధునాతనము** సం. విశ. (అ. ఈ. అ.) ఇప్పటిది, ఆధునికము,

**అధురము** సం. విశ. (అ. ఆ. అ.) భారములేనిది. (శకటము. మొ.)

**అధృతి** సం. విశ. (ఇ.) ధృతి లేనివాఁడు. వి.ఇ.స్త్రీ. 1. అధైర్యము. 2. ఇంద్రియనిగ్రహములేమి. 3. సౌఖ్యములేమి. 4. సంతోషములేమి.

**అధృష్టుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) పెంకెతనము లేనివాఁడు, అడఁకువ గలవాఁడు.

**అధృష్యుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) 1. ఎదిరింప రానివాఁడు, తలపడ రానివాఁడు; డాయరాని వాఁడు. (వ్యతి: అభిగమ్యుఁడు) 2. సిగ్గరి 3. అప్రగల్భుఁడు.

**అధైర్యము** సం. విశ. (అ. ఆ. అ.) ధైర్యము లేనిది. వి. అ. న. ధైర్యములేమి, మనస్సు కుదురులేమి, దిట్టతనములేమి.

**అధోంశుకము** సం. వి. అ. న. క్రిందివస్త్రము, కట్టుబట్ట.

**అధోక్షజుఁడు** సం. వి. అ. పుం.—జితేంద్రియులకుఁ బ్రత్యక్షమగువాఁడు—విష్ణువు.

**అధోగంత** సం. వి. ఋ. పుం. మూషికము, ఎలుక.

**అధోగతి** సం. వి. ఇ. స్త్రీ. 1. క్రిందఁబడుట. 2. కీడ్పాటు, తక్కువస్థితి. 3. నరకమునుబొందుట.

**అధోగమనము** సం. వి. అ. న. — అధోగతి.

**అధోగతుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) 1. క్రిందికిఁ బోయినవాఁడు. 2. తక్కువస్థితికిఁ బోయిన వాఁడు.

**అధోఘంట** సం. వి. ఆ. స్త్రీ. — క్రిందినుండియు గంటల వంటి కాయలు — అపామార్గము, ఉత్తరేను (వృ.వి.)

**అధోజానువు** సం. వి. ఉ. న. మోఁకాలి క్రింది భాగము.

**అధోజిహ్వక** సం. వి. ఆ. స్త్రీ. కొండనాలుక.

**అధోదిక్కు** సం. వి. శ్. స్త్రీ. 1. క్రిందిదిక్కు. 2. దక్షిణదిక్కు.

**అధోదృష్టి** సం. విశ. (ఇ.) క్రిందిచూపుగలవాఁడు; యోగాభ్యాస సమయమున నాసికాగ్రము చూచువాఁడు. వి. ఇ. స్త్రీ. క్రిందికూపు.

**అధోభక్తము** సం. వి. అ. న. భోజనము చేసినపిదప త్రాగెడినీరు, మందు, మొ.

**అధోభాగము** పుం. వి. అ. పుం. క్రిందిభాగము.

**అధోభువనము** సం. వి. అ. న. పాతాళలోకము.

**అధోముఖము** సం. విశ. (అ. ఆ, ఈ. అ. — చూ. అభిముఖము.) 1. ముఖము వంచినది. 2. తల క్రిందైనది, వ్యత్యస్తము. వి. అ. న. 1. (జ్యోతి) మూలాది నక్షత్రగణము. 2. ఒకా నొక నరకము. 3. వంగినమోము. 4. (మంత్ర) ముద్రావిశేషము.

**అధోముఖి** సం. వి. ఈ. స్త్రీ. గోజిహ్వా, బెండ (వృ.వి.)

**అధోయంత్రము** సం. వి. అ. న. సారాయిబట్టి.

**అధోరక్తపిత్తము** సం. వి. అ. న. మలమూత్ర ద్వారములనుండి రక్తము పడురోగవిశేషము.

**అధోలంబము** సం. వి. అ. పుం. 1.సీసకసూత్రము, సీసముగుండు కట్టినత్రాడు. (ఇది నీటిలోఁతు కొలుచుటకును గోడమున్నగునవి వెనుకకు ముందునకు ఒఱగకుండ నిట్ట నిలువుగానున్నవో లేవో చూచుటకును ఉపయోగించును.) 2. (క్షేత్ర) నిలువుగీటు, లంబరేఖ. 3. పాతాళము.

**అధోవాయువు** సం. వి. ఉ. పుం. అపానవాయువు.

**అధ్యండ** సం. వి. ఆ. స్త్రీ. 1. అజశృంగి, జుట్టుపు చెట్టు. 2. భూమ్యామలకి, నేలయుసిరిక (వృ. వి.)

**అధ్యక్షము** సం. వి. అ. న. ప్రత్యక్షజ్ఞానము. పుం. పాలచెట్టు, క్షీరిక (వృ.వి.)

**అధ్యక్షించు** సం. .అ. క్రి. ఆధిపత్యము నెఱపు, ఏలికగా నుండు.

వ. ఏడవదిక్కున నిరవధిక నిధిసమూహోద యన క్షత్రవిభుండు యక్షవిభుం డధ్య క్షించు. వరాహ. 10.114.

స.క్రి. ఏలు.

శా. దాక్షారామచళుక్య భీమవరగంధర్వాప్స రోభామినీ, వక్షోజద్వయగంధసారఘు సృణద్వైరాజ్యభాగంబు న, ధ్యక్షించుఙ గవిసార్వభౌమ!భవదీయ ప్రౌఢసాహిత్య ముల్. కాశీ. 1.14,

**అధ్యక్షుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) 1. ఇంద్రియ ములకు గోచరించువాఁడు. 2. పనులు కను పెట్టి చూచువాఁడు. వి. అ. పుం. అధిష్ఠాత, నియంత.

**అధ్యగ్నికృతము** సం. వి. అ. న. వివాహకాలము నందు అగ్నిసన్నిధిని స్త్రీకి యీయఁబడు ధనము.

**అధ్యగ్న్యుపాగతము** సం = అధ్యగ్నికృతము.

**అధ్యయనము** సం. వి. అ. న. 1. చదువుట. 2. గురుముఖమున వేదమును జదువుట. (ద్విజు లకు విహితములైన షట్కర్మములలో నొకటి)

**అధ్యయనించు** సం. స. క్రి. అధ్యయనము చేయు, చదువు.

సీ. భ్రమరనాదము వేరెఁ గొనుచుఁ డధ్యయ నించుచటి రాలి నెరసినట్లుఁదప్పలనఁగ. చంద్రా. 4.36.

**అధ్యయనీయము** సం.—అధ్యేతవ్యము.

**అధ్యయము** సం. వి. అ పుం. స్మరణము.

**అధ్యర్థము** సం. విశ. (అ. ఆ. అ.) సగపా లెక్కువగా నున్నది. (ఉదా: అధ్యర్థయోజనశతం—150 యోజనములు)

**అధ్యర్బుదము** సం. వి. అ. న. కంతి.

**అధ్యవసానము** సం. వి. అ. న. 1. పూనిక, ప్రయత్నము; ఉత్సాహము. 2. (అలం) ప్రకృత అప్రకృతములయొక్క అభేదనిశ్చయము.

**అధ్యవసాయము** సం. వి. అ. న. 1. నిశ్చయము. 2. పూనిక. 3. (అలం) అధ్యవసానము.

**అధ్యవసాయి** సం విశ. (న్. నీ. న్.) 1. పూనిక గలవాఁడు, 2. నిశ్చయము గలవాఁడు.

**అధ్యశనము** సం.వి.అ.న. మిక్కుటముగా తినుట; తిన్నది యఱుగకమునుపే మరల దినుట.

**అధ్యస్తము** సం. విశ. (అ. ఆ. అ.) 1. పైనిఁ బెట్టఁబడినది. 2. (తప్పుగా) ఆరోపింపఁబడినది. (ముత్తెపుచిప్పను వెండిగాఁ దలఁచినపుడు శుక్తియందు రజతము అధ్యస్తము)

**అధ్యస్థి** సం. వి. ఇ. న. ఎముకపైఁ బెరిఁగిన యెముక.

**అధ్యాఖ్యానము** సం.—అభ్యాఖ్యానము.

**అధ్యాత్మజ్ఞానము** సం. వి. అ. న. ఆత్మస్వరూప జ్ఞానము.

**అధ్యాత్మదృక్కు (కుఁడు)** సం.విశ.(శ్) బ్రహ్మ సాక్షాత్కారమును బడసినవాఁడు.

**అధ్యాత్మము** సం. అవ్య. అ. న. ఆత్మస్వభావము.

**అధ్యాత్మయోగము** సం. వి. అ. పుం. మనస్సును బాహ్యవిషయములనుండి మరలించి ఆత్మయందు సమాహితము చేయుట.

**అధ్యాత్మరామాయణము** సం.వి.అ.న. ఒకానొక రామాయణము. (ఇది పరమాత్మకును జీవునకును గలసంబంధము రామకథారూపమునఁ దెలుపును!)

**అధ్యాత్మవిదుఁడు** సం. విశ. (ద్.)—అధ్యాత్మదృక్కు.

**అధ్యాత్మవిద్య** సం.వి.ఆ.స్త్రీ. 1. బ్రహ్మజ్ఞానము. 2. బ్రహ్మజ్ఞానమును బోధించుశాస్త్రము.

**అధ్యాపకుఁడు** సం. విశ. (అ. విశా. అ.) చదువు చెప్పువాఁడు; వేదమును జెప్పువాఁడు (గురువు)

**అధ్యాపనము** సం. వి. అ. న. వేదమును నేర్పు, (ఇది బ్రహ్మణునిషట్కర్మములలో నొకటి); చదువు చెప్పుట.

**అధ్యాపయిత** సం. విశ. (ఋ. త్రీ. ఋ.) చదువు చెప్పువాఁడు, ఉపాధ్యాయుఁడు; వేదాధ్యయనము చేయించువాఁడు. (గురువు)

**అధ్యాపితుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) చదివింపఁబడినవాఁడు, పాఠితుఁడు.

**అధ్యాప్యము** సం. విశ. (అ. ఆ. అ.) చదివింపఁదగినది.

**అధ్యాయము** సం. వి. అ. పుం. 1. అధ్యయనము, చదువుట. 2. వేదాదిపఠనార్హకాలము. (వ్యతి: అనధ్యాయము) 3. వేదపాఠము. (ఉదా:స్వాధ్యాయోఽధ్యేతవ్యః) 4. గ్రంథభాగము.

**అధ్యాయి** సం. విశ. (న్. నీ. న్.) చదువువాఁడు.

**అధ్యారూఢము** సం. వి. (అ. ఆ. అ.) 1. ఎక్కినది. 2. ఎక్కఁబడినది; ఆక్రమింపఁబడినది.

**అధ్యారోపణము** సం. వి. అ. న. 1. ఎక్కించుట. 2. విత్తులు చల్లుట.

**అధ్యారోపము** సం. వి. అ. పుం. 1. (వేదాంత) అధ్యాసము. మిథ్యాజ్ఞానము. 2. ఎక్కించుట.

**అధ్యారోపితము** సం. విశ. (అ. ఆ. అ.) 1. అధ్యస్తము, ఆరోపింపఁబడినది. 2. ఎక్కింపఁబడినది. 3. మొలవేయఁబడినది.

**అధ్యావాపము** సం. వి. అ. పుం. 1. విత్తులుచల్లుట. 2. విత్తులు చల్లినపొలము.

**అధ్యావా(వ)హనికము** సం. వి. అ. న. కూఁతు నత్తవారింటికిఁ బంపునపుడు తండ్రి యిచ్చు ధనము, సారె.

శ్లో. యత్పునర్లభతే నారీ నీయమానా, తుపైతృకాత్, అధ్యావాహనికం నామ తత్స్త్రీస్వధనముదాహృతం. మను. 9.194. వ్యాఖ్య.

**అధ్యాసనము** సం. వి. అ. న. 1. కూర్చుండుట. 2. పీఠము, కూర్చుండెడిచోటు. 3. ఆక్రమణము, పైఁబడుట.

**అధ్యాసము** సం. వి. అ. పుం. 6. ఆరోపము, తప్పుగాఁ దెలియుట, మిథ్యాజ్ఞానము, ఒకటిని మఱియొక్కటిగాఁ దలఁచుట. 2. పైని ఉంచుట.

**అధ్యాసించు** సం. అ. క్రి. కూరుచుండు.

వ. పటకుటికామండపమధ్యంబున నధ్యాసించి. పాండు. 5. 192.

**అధ్యాహరణము** సం. వి. అ. న.—అధ్యాహారము.

**అధ్యాహారము** సం. వి. అ. పుం. 1. ఆకాంక్షితమైన పదములను దెచ్చుకొనుట. 2. ఊహము, తర్కము.

సీ. ప్రతిబింబమో కాని రజనివల్లభున కధ్యాహారమో కాని యమృతరుచికి కాశీ. 4. 191. (ఇట 'ప్రతిబింబము, సాటి' అని భావము.)

**అధ్యుషితము** సం. విణ. (అ. ఆ. అ.) అధిష్ఠింపఁబడినది, నివాసముగాఁ జేసికొనఁబడినది.

**అధ్యుష్ట్రము** సం. వి. అ. పుం. ఒంటెలు లాగు బండి.

**అధ్యూఢ** సం. వి. ఆ. స్త్రీ.—అధివిన్న.

**అధ్యూఢము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఎత్తఁబడినది. 2. మిక్కిలియైనది. ఎక్కుడు. 3. సమృద్ధము.

**అధ్యూఢుఁడు** సం. వి. అ. పుం. శివుఁడు.

**అధ్యూధ్ని** సం. వి. ఈ. స్త్రీ. పొద్దపొదుఁగు గల యావు.

**అధ్యేత** సం. విణ. (ఋ. క్రీ. ఋ.) చదువువాఁడు, విద్యార్థి.

**అధ్యేతవ్యము** సం. విణ. (అ. ఆ. అ.) అధ్యయనము చేయఁదగనది, చదువఁదగినది.

**అధ్యేయము** సం.—అధ్యేతవ్యము.

**అధ్యేషణ** సం. వి. ఆ. స్త్రీ. 1. తన కిష్టమగు కార్యముల యందు సత్కారపూర్వకముగా గుర్వాదులను ప్రవర్తింపఁజేయుట. 2. అధిక ప్రార్థన.

**అధ్యేషణము** సం. వి. అ. న.—అధ్యేషణ.

**అధ్రువము** సం విణ. (అ. ఆ. అ.) 1. అస్థిరము, చంచలము. 2. అనిశ్చితము, సందిగ్ధము. వి. అ. న. అనిశ్చయము, సందేహము.

**అధ్రుషము** సం. వి. అ. పుం. జ్వరముతోఁ గూడిన యొకవిధమైన ఉబ్బురోగము, శోథ రోగ విశేషము.

**అధ్వగ** సం. వి. ఆ. స్త్రీ. ఆకాశగంగ.

**అధ్వగభోగ్యము** సం. వి. అ. పుం. ఆమ్రాతకము, అంబాళపుచెట్టు.

**అధ్వగము** సం. వి. అ. పుం. 1. ఒంటె. 2, కంచర గాడిద.

**అధ్వగుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) బాటసారి, తెరువరి, వి. అ. పుం. సూర్యుఁడు.

**అధ్వజ** సం. వి. ఆ. స్త్రీ. స్వర్ణపుష్పి (స్వ.వి.).

**అధ్వనీనుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) 1. ప్రయాణము చేయుటకు సమర్థుఁడు. వేగముగా పయనము చేయువాఁడు. 2. తెరువరి, పథికుఁడు.

**అధ్వన్యుఁడు** సం.—అధ్వనీనుఁడు.

**అధ్వపతి** సం. విణ. (ఇ.) మార్గపాలకుఁడు, వి. ఇ. పుం. సూర్యుఁడు.

**అధ్వము** సం. వి. న్. పుం. (సమాసమున ఉపసర్గముపూర్వపదము గానున్నపుడు అకారాంతముగా మాఱును. ఉదా: ప్రాధ్వము, అత్యధ్వము. మొ.) 1, త్రోవ, పథము. 2. దూరము. 3. పయనము. 4, వేదశాఖ. 5. కాలము, 6. ఆకాశము. 7. సంస్థానము, మకాము, ప్రయాణమునందు నిలిచెడు స్థలము. 8. ఉపాయము, సాధనము.

**అధ్వరకల్ప** సం. వి. ఆ. స్త్రీ. కామ్యేష్టి, యాగ విశేషము.

**అధ్వరథము** సం. వి. అ. పుం. ప్రయాణమున కుపయోగించుబండి.

**అధ్వరథుఁడు** సం. వి. అ. పుం. ప్రయాణమందు నిపుణుఁడగుదూత.

**అధ్వరమీమాంస** సం. వి. ఆ. స్త్రీ. పూర్వమీమాంస.

**అధ్వరము** సం. విశే. (అ. ఆ. అ.) 1. హింసారహితము. 2. సావధానము. వి. అ. పుం. యజ్ఞము; సోమయాగము. పుం.న. ఆకాశము.

**అధ్వరుఁడు** సం. వి. అ. పుం. అష్టవసువులలో రెండవవసువు.

**అధ్వర్యుఁడు(వు)** సం. వి. ఉ. పుం. యజుర్వేద తంత్రమును నడుపు ఋత్విజుఁడు.

**అధ్వశల్యము** సం. వి. అ. పుం.—కాళ్లకును బట్టలకును అంటుకొని మార్గస్థులను శల్యమువలె బాధించునది-అపామార్గము,ఉత్తరేను(వ్య.వి.)

**అధ్వాంతము** సం. వి. అ. న. కనుచీఁకటి, సంజ చీఁకటి.

**అధ్వాంతశాత్రవము** సం. వి. అ. పుం. శ్యోనాక వృక్షము, దుండిగము (వ్య.వి.).

**అధ్వాతి** సం. వి. ఇ. పుం. తెరువరి, బాటసారి.

**అధ్వాధిపుఁడు** సం. వి. అ. పుం. బాటలపై యధికారి.

**అధ్వాయనము** సం. వి. అ. న. పయనము.

**అన**[1]—అన్న[1] వి. 1. అగ్రజుఁడు. (ఈయర్థము వృత్తియందే కనఁబడుచున్నది.)

క. అనుజుఁ డొకఁడు వెంగలియై,నను దప్పెడుఁ గాని పెద్దనకుఁ గార్యజ్ఞా,నని రూఢి లేక తక్కిన,ననుజన్ములు సిక్కువడుదు రవనీనాథా. భార. అను. 4. 133.

2. పురుషనామముల కనుప్రయుక్తము.

ఉదా: కొమ్మన. పోతన. భీమన.

3. ప్రార్థనార్థమున క్రియలకనుప్రయుక్తము. (ఇది దీర్ఘాంతముగానే ప్రయోగములందు కనఁబడుచున్నది.)

క.... బావు, శ్రీవిశ్రుతకృష్ణుపనుపు సెల్లింపవనా. భార. మౌ. 1. 123.

క. కరుణావరుణాలయునిఁ, దరుణామృత కిరణ ధరుని దర్శింపవనా. భీమ. 3. 145.

**అన**[2]—నన. వి. చిగురు, పల్లవము.

చూ. అనలుఁగొనలుఁబాఱు.

**అన**[3] (**అనఁగ, అనఁగా**) —నా, నాఁగ, నాఁగా. అవ్య. ద్రు. అనుధాతువుయొక్క తుమున్నాద్యర్థకరూపము. 1. అనుటకు, అనఁగా, మొ. (వ్యవ) అనఁగూడని మాటలు వాఁడట్లన నేనిట్లంటిని.

2. ఉత్ప్రేక్షావాచకముగాను ఉత్ప్రేక్షావాచకమునకు అనుప్రయుక్తముగాను ఉపయోగింపఁబడును.

మ.... వారిశాం,తలు తద్వీథుల వత్తు రచ్చిగురుఛాయా రౌతు లేజీ లనఁ. శశాం. 2. 30.

ఉ... ఖాస్వదసితోత్పలవర్ణుఁడు సేంద్ర చాపశం, పారుచిమేఘమో యనఁగఁ బాండవమధ్యముఁ డొప్పె...భా. అది. 6. 16.

3. ఇది కొన్నిచోట్ల ఉపమావాచకముగాఁ గూడ కనఁబడుచున్నది.

(వస్తుప్రతివస్తూపమ కుదాహరణము.)

క.అవనిఁబరిష్కృతమయ్యెఁ, దివిదంశం బొబ్బశారద సింహునిచే, దివిచంతరుభూషితమై, నవనవగతిఁ బొల్చునందనవనం బనఁగఁ. నైష. 5. 27.

అనఁగానఁగా :- కథచెప్పునపుడు మొదట నుపయుక్తము.

క. విను మనఁగానఁగా నిల, ఘనమణివర మనెడు పుర ముగలదొకటి...హంస.2.180.

**అనంగక్రీడ** సం. వి. అ. స్త్రీ. 1. మన్మథక్రీడ. 2. ఒక మాత్రావృత్తము. (దీనికి పాదములు రెండు. మొదటిదానియందు 16 గురువులును రెండవదానియందు 32 లఘువులునుఉండును.)

**అనంగత్రయోదశి** సం. వి. ఈ. స్త్రీ. చైత్ర శుక్లత్రయోదశి. (అనాఁడు అనంగవ్రతము చేయుదురు.)

**అనంగము** సం. విశే. (అ. ఆ. అ.) అంగములేనిది. వి. అ. న. 1. ఆకాశము. 2. మనస్సు.

**అనంగలేఖము** సం. వి. అ. పుం. మదనలేఖ, వలపుఁగమ్మ.

**అనంగవ్రతము** సం. వి. అ. న. చైత్రశుక్లత్రయోదశినాఁడు మన్మథుని గూర్చి చేయువ్రత విశేషము.

**అనంగుఁడు** సం. వి. అ. పుం. మన్మథుఁడు.

**అనంజనము** సం. విశే. (అ. ఆ. అ.) 1. కాటుకలేనిది. 2. దోషములేనిది. 3. సంబంధములేనిది.

వి. అ. న. 1. ఆకాశము, 2. నిరంజనము, పరబ్రహ్మము.

**అనంత** నం. వి. ఆ. స్త్రీ. 1. భూమి. 2. ఒకటి అనుసంఖ్య. 3. పార్వతి. 4. శారిబ, మాామెన (వృ.వి.). 5. ఎద్దునాలుకచెట్టు. 6. గఱిక (వృ.వి.). 7. ఉసిరిక (వృ.వి.). 8. తిప్పతీఁగ. 9. నెల్లిచెట్టు. 10. జీలకఱ్ఱ. 11. నీరుపిప్పలి (వృ.వి.). 12. తీఁటకసింద (వృ.వి.). 13. కరక (వృ.వి.). 14. అగ్నిశిఖ, తరిగొఱ్ఱ (వృ. వి.). 15. శ్యామలత. ప్రేంకణము (వృ.వి.) 16. పిప్పలి (వృ.వి.).

**అనంతచతుర్దశి** నం. వి. ఈ. స్త్రీ. భాద్రపదశుక్ల చతుర్దశి. (ఆనాఁడు అనంతునిఁ బూజింతురు.)

**అనంతము** నం. విశ. (అ. ఆ. అ.) 1. తుదలేనిది. సమాప్తి లేనిది. 2. మేర లేనిది. 3. నాశము లేనిది, శాశ్వతము, నిత్యము. వి. అ పుం. 1. విష్ణునిశంఖము. 2. మేఘము. 3. అభ్రకము. 4. సిందువారము, వావిలి (వృ.వి.). 5. శ్రవణ నక్షత్రము. 6. అనంతచతుర్దశియందు కుడిచేతఁ గట్టుకొను పదునాలుగుముళ్ల తోరము. న. 1. ఆకాశము. 2. మోక్షము. 3. పరబ్రహ్మము.

**అనంతముడులు** మి. వి. బ. అనంతునిగంట్లు, కర్ణభూషావిశేషము, నాగుపోఁగులు.

సీ. కడవన్నియ యనంతముడులడాల్ లంబకర్ణ ద్వయిఁ బలుమాఱు నాట్యమాడ. ఇందు. 5.7.

**అనంతమూలము** నం. వి. అ. పుం. శారిబ, శామెన (వృ.వి.)

**అనంతరజ** నం. వి. ఆ. స్త్రీ. 1. పురుషునకు తన యనంతరవర్ణపుభార్యయందుఁ గలిగినకూఁతురు, 2. అక్క. 3. చెల్లెలు,

**అనంతరజుఁడు** నం. వి. అ. పుం. 1. పురుషునకు తన యనంతవర్ణపుభార్యవలనఁ గలిగినకుమారుఁడు. 2. అన్న. 3. తమ్ముఁడు.

**అనంతరము** నం. విశ. (అ. ఆ. అ.) 1. లోపలి భాగము లేనిది. మధ్యభాగము లేనిది. 2. ఎడ లేనిది, వ్యవధానము లేనిది. 3. వెంబడిది, అవ్యవహితోత్తరము. 4. అవ్యవహితపూర్వము. (ఉదా: అనంతరోదీరితలక్ష్మభాజౌపాదౌ-వృత్తరత్నాకరము. 3. 'అనంతరోక్తో దోషః' = పూర్వము చెప్పినదోషము. సూత్రభాష్యము.) 5. పొరుగైనది. చేరికైనది. 6. తరువాతి జాతిది. 'పుత్త్రాయేనంతరస్త్రీజాః' మను. 10.14. క్రి. విశ. పిమ్మట. వి. అ. న. సామీప్యము. అనంతరంవిహితే చాస్యాసనే, కాదం.

**అనంతరాయము** నం. విశ. (అ. ఆ. అ.) అడ్డు లేనిది, నిర్విఘ్నము.

**అనంతరీయము** నం. విశ. (అ. ఆ. అ.) తరువాతి వానికి సంబంధించినది.

**అనంతవాతము** నం. వి. అ. పుం. శిరోరోగవిశేషము.

**అనంతవిజయము** నం. విశ. (అ. ఆ. అ.) అంతము లేనిజయము కలది. వి. అ. పుం. యుధిష్ఠిరుని శంఖము.

**అనంతవ్రతము** నం. వి. అ. న. అనంతచతుర్దశి నాఁడు చేయువ్రతవిశేషము.

**అనంతశయనము** నం. వి. అ. న. అంతము లేని పడుక, చావు. 2. తిరువామ్కూరునందలియొక విష్ణుక్షేత్రము.

**అనంతుఁడు** నం. వి. అ. పుం. 1. విష్ణువు. 2. శేషుఁడు. 3. వాసుకి.

**అనంతునిగంట్లు** వి. బ. అనంతముడులు, కర్ణభూషావిశేషము, నాగుపోఁగులు.

చ.... పెనంగ నెల్లువముఁ ద్రెంచి యనంతుని గంట్లకూనపుం,జెవులుగ... దోఁపునొల్చిపోఁ౯. ఆము. 6. 81,

**అనంశము** నం. విశ. (అ. ఆ. అ.) 1. దాయ భాగము లేనిది; దాయభాగార్హము కానిది. 2. విభాగము లేనిది. (ఆకాశము, పరబ్రహ్మము.)

**అనంశుమత్ఫల** నం. వి. ఆ. స్త్రీ. అరఁటి (వృ.వి.)

**అనఁగిపెనఁగు** అ. క్రి. (అనఁగి+పెనఁగు—అనఁగునకు విడిగా ప్రయోగములేదు.) కలియు, కూడికొను.

గీ. అనఁగిపెనఁగి నాఁడెల్ల నిచ్ఛానురూప,వృత్తి వర్తిల్లుచుండిరి.... భార. ఆశ్ర. 2. 126.

గీ. జలకణంబులుఁ జెమటలుఁ జెలిమిసేయ, నళిరవంబులుఁ బలుకులు ననఁగి పెనఁగ. వరాహ. 4. 66.

ద్వి. ననిచినవరునితో నాతి యనంగి పెనఁగిన ట్లీశుతో ననఁగి పెనంగి. పండితా. దీక్షా. 61.

**అనఁటి**—అంటి, అరఁటి. వి. కదళి (వ్య.వి.)

సీ....అనఁటిపండ్లుం బూరియలు ఘృతంబు. నాదిగాఁగ...హర. 6. 55.

మ. బలుకప్రంపుటనంటికప్పురపుఁ దిన్పుల్. వసు. 1. 139.

**అనక**—నాక. అవ్య. (అనుధాతువుయొక్క వ్యతిరేక క్త్వార్థకరూపము. చూ. అను.)

(మాత్రమేకాక అనుతాత్పర్య మిచ్చును.)

చ. ...నీదుపంపునన్, బనివిని తీవగుం బనక పాండురసైకతనిర్మరీతటం, బనక దరీపుటం బనక యన్నియు నారసి...వసు. 2. 28.

ఉ. అందును వారువీరనక యందఱు ధర్మధురీణులైనవారు....కళా. 1. 21.

(లక్ష్యముసేయక అనుభావమును తెలుపును.)

గీ. పండువెన్నెల యనక యాంపయి విధూపి, లాంబు లనక యాత్రోవ రత్నాంకురార్చు. లనక యామీఁద నారెకు లనక చనిరి, శరుణు లోకకొండ అవియెల్ల నరసి కొనుచు. వసు. 4. 66.

**అనకము** సం—అణకము.

**అనక్షరము** సం. విశే. (అ. ఆ. అ.) 1. అక్షరములు రానిది, చదువు లేనిది 2. ఉచ్చరింప రానది, అవాచ్యము. 3. అక్షరశూన్యము, మాటలు లేనిది, సైగలతోకూడినది,

(ఉదా: అనక్షరంపప్రచ్చ. అనక్షరం—అనక్షరగా, సైగలతో. కాదం.)

**అనక్షి** సం. వి. ఇ. న. మందదృష్టి గలకన్ను.

**అనగారుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) ఇల్లులేనివాఁడు. వి. అ. పుం. పరివ్రాజకుఁడు, సన్న్యాసి.

**అనగ్నిదగ్ధుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) దహన సంస్కారము లేనివాఁడు. వి. అ. పుం. బ. ఒకతెగ పితృదేవతలు.

**అనఘము** సం. విశే. (అ. ఆ. అ.) 1. పాపము లేనిది. 2. దోషము లేనిది. 3. విపత్తు లేనిది. (శ్లో. కచ్చిన్మృగీణా మనఘా ప్రసూతిః. సం. రఘు. 5. 7.) 4. దుఃఖము లేనిది. 5. నిర్మలము. వి. అ. పుం. తెల్లఆవ (వ్య.వి.).

**అనడుహి** సం. వి. ఈ. స్త్రీ. ఆవు.

**అనడ్వాహము** సం. వి. హ్. పుం. 1. బండి లాగునది—ఎద్దు. 2. వృషభరాశి.

**అనడ్వాహి** సం. — అనడుహి.

**అనద**—విశే. (సం. అనాథ, అనాథః.)

1. నాథుఁడు లేనిది; దిక్కు లేనిది, దిక్కు లేనివాఁడు.

ఆ. వీరపత్నినయ్యు వీరసహోదరి,నయ్యు నీకుఁజూడ ననదవోలె, నున్నదాన...భార. ఆర. 6. 184.

గీ. అకట మిన్నులు పడ్డచో ననదవోలె. దిక్కుమాలినప్రేతనై తిఱవలసె. కాశీ. 3. 125.

2. నాథుఁడు కానివాఁడు—అశక్తుఁడు, దుర్బలుఁడు; అల్పుఁడు.

ఆ. పలువు రొకని కోడి పాఱుట బల్లిదు,లనద చేతఁ జెడుటయును ఘటించు. భార. ఉద్యో. 3. 17.

సీ. ...భూవరులు మేర, దప్పి లోకములోని ధాన్యముల్ గొన నధర్మం బంతకంతకుఁ బ్రబ్బ నధికు, లనదలఁ జెఱుపంగ...భార. శాం. 3. 280.

జ. అనదతనము.

**అనదతనము** వి. (√అనద) 1. అనద యగుట. 2. హైన్యము; దైన్యము.

క. అనదతనంబును బెడిదపుఁ, దనమును లేకుండఁ బరఁగి దరి రెం తెడునే,ఱును బోలె నొత్తవలయును, మనుజేంద్రుఁడు మార్దురం గ్రమంబున నధిపా, భార. శాం. 3. 24.

ఆ. అతఁడు పూజనీయుఁడగు నే నెఱుంగుదు, నైన ధనము తీగి వనదతనము,వచ్చుఁ బెచ్చుపెరిఁగి వైరులు గర్వింతు, రేల పగ యడంగునిట్టులైన. భార. ఉద్యో. 3, 164.

**అనద్యతనము** సం. విణ. (అ. ఈ. అ.) నేఁటిది కానిది. వి. అ. పుం. అద్యతనము కానికాలము. (చూ. అద్యతనము. వి.)

**అనద్యము** సం. వి. అ. పుం. తెల్ల ఆవ (వృ.వి.).

**అనధికారము** సం. వి. అ. పుం. అధికారములేమి.

**అనధికారి** సం. విణ. (న్. త్రీ. న్.) అధికారి కాని వాఁడు.

**అనధిగతము** సం. విణ. (అ. ఆ. అ.) అధిగతము కానిది. (1. పొందఁబడనిది. 2. చదువఁ బడనిది.)

**అనధీనుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) ఇతరుల వశమున లేనివాఁడు, స్వతంత్రుఁడు.

**అనధ్యయనము** సం. వి. అ. న.—అనధ్యాయము.

**అనధ్యాయము** సం. వి. అ. పుం. అధ్యయనమునకు నిషిద్ధమైనకాలము; ఆటవిడుపు దినము. 2. అధ్యయనములేమి.

**అననము** సం. వి. అ. న. శ్వాసము విడుచుట.

**అననుభాషణము** సం. వి. అ. న. 1. చెప్పినది మరలఁ జెప్పకుండుట, (వాదాదులయందు) అనువదింపక పోవుట. 2. మాఱుమాటాడకుండ ఒప్పుకొనుట.

**అనన్యగతి** సం. విణ. (ఇ.) గత్యంతరము లేనిది. వి. ఇ. స్త్రీ. మఱియొకదారిలేమి, సాధనాంతరము లేమి.

**అనన్యగతికము** సం. విణ. (అ. ఆ. అ.) వేఱుగతి లేనిది, వేఱుదిక్కు లేనిది.

**అనన్యగురువు** సం. విణ. (ఉ.) తనకంటె గొప్పది గాని బరువైనది గాని లేనిది. (మిక్కిలి గొప్పది. 2, మిక్కిలె బరువైనది.)

**అనన్యచింతుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) మఱియొకచింత లేనివాఁడు, తదేకధ్యానము గలవాఁడు.

**అనన్యచిత్తుఁడు** సం. విణ. (అ ఆ. అ.) ఏకాగ్రమైనమనసు గలవాఁడు.

**అనన్యజుఁడు** సం. వి. అ. పుం — అనన్యునకు (విష్ణునకు) పుట్టినవాఁడు — మన్మథుఁడు.

**అనన్యత** సం. వి. అ. స్త్రీ. వేఱుకామి, ఒక్కటియే యగుట, తాదాత్మ్యము.

**అనన్యత్వము** సం. వి. అ. న—అనన్యత.

**అనన్యదృష్టి** సం. విణ. (ఇ.) ఏకాగ్రమైనదృష్టి గలవాఁడు, ఒకదానియందే దృష్టినిలుపువాఁడు, ఇతరదృష్టి లేనివాఁడు. వి. ఇ. స్త్రీ. ఇతరదృష్టి లేమి, ఏకాగ్రదృష్టి.

**అనన్యపరత** సం. వి. అ. స్త్రీ. ఏకాసక్తి, ఒకదానియందే ఆసక్తిగలిగి యుండుట, ఇతరాసక్తి లేమి.

**అనన్యపరాయణుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) ఒకదానియందే ఆసక్తిగలవాఁడు, ఇతరాసక్తి లేనివాఁడు.

**అనన్యపూర్వ** సం. వి. అ. స్త్రీ – పూర్వ మెవ్వఁడును భర్తగాలేనిది – పెండ్లికానిస్త్రీ, కన్య.

**అనన్యపూర్వుఁడు** సం. వి. అ. పుం–ఇంతకుపూర్వము భార్యలేనివాఁడు – పెండ్లి కానివాఁడు.

**అనన్యము** సం. విణ. (అ. ఆ. అ.) 1. వేఱుకానిది. 2. ఏకము, మఱియొకటి లేనిది. 3. మఱియొక విషయము లేనిది, ఏకాగ్రమైనది.

**అనన్యవిషయము** సం. విణ. (అ. ఆ. అ.) మఱియొకటి విషయముగా లేనిది, ఇతరులకు చెందనిది. వి. అ. పుం. అభిన్నవిషయము, ఏకవిషయము.

**అనన్యవృత్తి** సం. విణ. (ఇ.) 1. వేఱువృత్తి (ఇతరజీవనాధారము) లేనివాఁడు. 2. ఒకవిషయముననే మనస్సు నిల్పినవాఁడు, ఏకాగ్రుఁడు. వి. ఇ. స్త్రీ. ఏకవృత్తి.

**అనన్యశాసనుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) మఱియొకరియాజ్ఞ లేనివాఁడు, స్వతంత్రుఁడు.

**అనన్యసదృశుఁడు** సం. విణ. (అ. ఈ. అ.) సాటి లేనివాఁడు.

**అనన్యసాధారణము** సం.—అనన్యసామాన్యము.

**అనన్యసామాన్యము** సం. విణ. (అ. ఆ. అ.) అసాధారణము, ఇతరులకు లేనిది, విశేషించి ఒకనికి మాత్రమే యున్నది.

**అనన్యాదృశము** సం. విణ. (అ. ఈ. అ.) మఱియొకదానివంటిది కానిది; నిరుపమానము.

**అనన్యాశ్రితుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) 1. ఇతరుల నాశ్రయింపనివాఁడు, స్వతంత్రుఁడు. 2. ఇతరులచే నాశ్రయింపఁబడనివాఁడు.

**అనన్వయము** సం. విశే. (అ. ఆ. అ.) అన్వయము (పరస్పరసంబంధము) లేనిది. వి. అ. పుం. 1. అన్వయములేమి; అసంగతి. 2. ఒకఅర్థాలంకారము.

**అనన్వితము** సం. విశే. (అ. ఆ. అ.) 1. సంబంధము లేనిది, అసంబద్ధము. 2. కూడుకొననిది.

**అనన్వీతము** సం. — అనన్వితము.

**అనపకరణము** సం. వి. అ. న. 1. అపకారము చేయకపోవుట. 2. (దత్తధనాది) పునర్గ్రహణము, మరల పుచ్చుకొనుట. 3. (ఋణము) తీర్పకుండుట. 4. (వేతనాలు) ఈయకుండుట.

**అనపకర్మము** సం. వి. న్. న—అనపకరణము.

**అనపక్రియ** సం. వి. ఆ. స్త్రీ.—అనపకరణము.

**అనపత్యుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) బిడ్డలు లేనివాఁడు.

**అనపత్రపుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) సిగ్గుమాలినవాఁడు.

**అనపభ్రంశము** సం. వి. అ. పుం. అపశబ్దము కానిది, సుశబ్దము.

**అనపము** సం. విశే. (అ. అ. అ.) స్వల్పజలము కలది. (నీటిగుంట, మొ.)

**అనపరాధము** సం. విశే. (అ. ఆ. అ.) తప్పులేనిది. వి. అ. పుం. తప్పులేమి.

**అనపరాధి** సం. విశే. (న్. నీ. న్.) తప్పు చేయనివాఁడు.

**అనపసరుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) - అపసరము లేనివాఁడు - న్యాయ్యమైన ప్రతిగ్రహాక్రయాదులవలనఁగాక అన్యథా భూమ్యాదుల నాక్రమించుకొనువాఁడు. (చూ. అపసరము. 2.)

**అనపాయము** సం. విశే. (అ. ఆ. అ.) 1. ఎడఁబాటు లేనిది.2. నాశము లేనిది; క్షీణము కానిది. వి. అ. పుం. నాశములేమి; క్షీణతలేమి.

**అనపాయి** సం. విశే. (న్. నీ. న్.) 1. ఎడఁబాయనిది, వీడనిది. 2. క్షీణతలేనిది; నాశములేనిది.

**అనపేక్ష** సం. వి. ఆ. స్త్రీ. అపేక్షలేమి.

**అనపేక్షము** సం. విశే. (న్. నీ. న్.) అపేక్షింపనివాఁడు.

**అనపేతము** సం. విశే. (అ. ఆ. అ.) 1. కడచిపోవనిది. 2 తొలఁగనిది, వీడనిది.

**అనఫ** సం. వి. ఆ. స్త్రీ. (జ్యోతి)ఒకజాతకయోగము. (చంద్రునకు ద్వాదశస్థానమున సూర్యవ్యతిరిక్తమైనగ్రహ ముండుట.)

**అనభిజ్ఞుఁడు** సం. విశే. (అ.ఆ.అ.) జ్ఞానశూన్యుఁడు, ఎఱుఁగనివాఁడు.

**అనభిలాషము** సం. విశే. (అ. ఆ. అ.) కోరికలేనిది. వి. అ. పుం. కోరికలేమి, వాంఛలేమి.

**అనముఁడు** సం. వి. అ. పుం—నమస్కరించినప్పుడు మరల నమస్కరింపక ఆశీర్వదించువాఁడు - బ్రాహ్మణుఁడు. (త్రి.ని.)

**అనయము** అవ్య. ద్రు. 1. అత్యంతము, మిక్కిలి.

చ. అనయము నొచ్చుచున్న యవి యంగము లెల్లను వేగ వచ్చుట,న్మనము వశంబు గాదు జననాయక ప్రొద్దును బోయె... భార. ఉద్యో .2. 15.

చ. అనయము నెల్లయర్థులకు నన్నరపాలకుఁ డిచ్చు నిచ్చలుఁ. విక్ర. 2. 18. అచ్చ. రా. బాల. 118.

2. సతతము, ఎల్లప్పుడును.

సీ. వేళనాటికలందు విహరించు వలరాజు నన యంబుఁ జెఱకువిల్లును ధరించి. భీమ.2.54.

3. మాటిమాటికి, మఱిమఱి.

సీ. అది యేమి యెఱిఁగింపు మని యాలతాంగి తన్ననయంబు నడుగ నిట్లనియె నతఁడు. కళా. 3. 46, 5. 61.

4. కేవలము,

క. అని చెప్పి బాదరాయణి,మనుజేంద్రునివలను సూచి మఱి యిట్లనియెఁ,విను యొకనాఁడీ యుద్ధవుఁ, డనయము నైదేండ్ల బాలుఁ డయియున్నతఱిఁ. భాగ. 3. 78.

౬. ఇంకను, మఱియు,

క. **అనయము** నాయకనుగుణము,లనేకములు
గలవు వాని నతివిస్తరభీ,తి నిరూపింపఁగ
లేనిఁక, ననుపమదాతృస్వరూప మభినుతి
యింతుఁ. నరస. 1. 120.

**అనయము** సం. విణ. (అ. ఆ. అ.) 1. నయము లేనిది, నీతిలేనిది. 2. అయము లేనిది, అదృష్టము లేనిది, దురదృష్టవంతము. వి. అ. పుం. 1. నీతిలేమి, పాడిదప్పుట. 2. దుర్మార్గము. చెడునడవడి. 3. ఇడుమ, విపత్తి. 4. ఒకవిధమైనపాచికలాట. 5. అయములేమి, దురదృష్టము. 6. ద్యూతపానాదివ్యసనము.

**అనరు** వి. సంకటము, కష్టము.

గీ. శరనిధులమాఘ్యములుదీఱమరునకిట్టి,యన
రునజయింతుమనికదా...ఆము. ౬. 111.

(శ. ర. వేదమువారిపాఠములు. 'అదరు' పాఠాంతరము)

**అనర్గల(ళ)ము** సం. విణ. (అ. ఆ. అ.) అడ్డులేనిది.

**అనర్ఘము** సం. విణ. (అ. ఆ. అ.) అమూల్యము, అధికమగునెల గలది.

**అనర్ఘ్యము** సం. విణ. (అ. ఆ. అ.) 1-దేనికంటెపూజ్యము లేదో అది - మిక్కిలిపూజ్యము. 2. అనర్ఘము. సం. కు. సం. 1. 57.

**అనర్థకము** సం. విణ. (అ. ఆ. అ.) 1. వ్యర్థమైనది. నిరర్థకము. 2. పరస్పరాన్వయము లేనిది, అసంబద్ధము (వాక్యము.)

**అనర్థకరుఁడు** సం. విణ. (అ. ఈ. అ.) 1. ఉపయోగము లేనిపనులు చేయువాఁడు. 2. కీడుచేయువాఁడు.

**అనర్థకారి** సం. విణ. (న్. జీ. న్.)—అనర్థకరుఁడు.

**అనర్థము** సం. విణ. (అ. ఆ. అ.) పనికిమాలినది, వ్యర్థమైనది. 2. అర్థము లేనిది (శబ్దాది) 3. ధనము లేనిది, పేద. వి. అ. పుం. 1. కీడు. హాని. 2. ప్రయోజనములేమ. 3. నిర్ధనత. పేదఱికము. 4. (పదాదులకు) అర్థము లేకుండుట.

**అనర్హము** సం. విణ. (అ. ఆ. అ.) అర్హముకానిది, తగనిది.

**అనల** సం. వి. అ. పుం. (జ్యోతి) ప్రభవాదిసంవత్సరములలో ఏఁబదియవసంవత్సరము.

శ్లో. ప్రమాద్యథానందమతః పరంయత్స్యాద్రా
క్షసంచానల సంజ్ఞితంచ. చూ. వాచ. గురు
వర్ష శబ్దము, (దీనికి 'నళ' అనియు వ్యవ
హారము కలదు.)

**అనలదీపనము** సం. విణ. (అ. ఆ. అ.) 1. అగ్నిని జ్వలింపఁ జేయునది. 2. ఆఁకలి పుట్టించునది.

**అనలప్రభ** సం. వి. ఆ. స్త్రీ. జ్యోతిష్మతి. మాఁనేరుతీఁగ.

**అనలము** సం. వి. అ. పుం. 1. అగ్ని. 2. జఠరాగ్ని. 3. పిత్తము. 4. చిత్రమూలము (వృ.వి.). 5. నల్లజీడి (వృ.వి.). 6. అగ్నిబీజ మగురేఫాక్షరము. 7. మూఁడు అను సంఖ్య. 8. కృత్తికానక్షత్రము.

**అనలుగొనలుఁబాఱు** అ. క్రి. (అనలును+కొనలును+పాఱు.) ననుచు, చిగుర్చు; వర్ధిల్లు.

క. అనలుంగొనలుంబాఱుచు, మనమున నా
కోర్కితీఁగె...కళా. 6. 212.

గీ. అదిమొదలు సృష్టి వర్ధిల్లె ననలుఁగొనలుఁ
బాఱి బ్రహ్మకు మిక్కిలి నూఁటటయ్యె.
వరాహ. 11. 24.

**అనల్పము** సం. విణ. (అ. ఆ. అ.) తక్కువకానిది. అధికము.

**అనవకాశము** సం. విణ. (అ. ఆ. అ.) ఎడము లేనిది, తెఱపినది. వి. అ. పుం. అవకాశము లేమి.

**అనవగ్రహము** సం. విణ. (అ. ఆ. అ.) 1. దుర్నివారము, అడ్డులేనిది. 2. అనావృష్టి లేనిది, వఱపు లేనిది. (కాలము, దేశము.)

**అనవచ్ఛిన్నము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఎడతెగనిది. 2. అమేయము,కొలువశక్యముకానిది. 'దిక్కాలాద్యనవచ్ఛిన్న...'సం.భర్తృ. 1. 1.

**అనవద్యము** సం. విణ. (అ. ఆ. అ.) నింద్యము కానిది.

**అనవధానత** సం. వి. ఆ. స్త్రీ. అవధానములేమి, ప్రమాదము.

**అనవధానత్వము** సం. వి. అ. న–అనవధానత.

**అనవధానము** సం. విణ. (అ. ఆ. అ.) ఏకాగ్రత లేనిది, ప్రమాదము కలది. వి. అ. న. ప్రమాదము, ఏమఱుట.

**అనవధి** సం. విణ. (ఇ.) అవధి లేనిది, మేర లేనిది.

**అనవరతము** సం. విణ. (అ. ఆ. అ.) నిరంతరము, ఎడతెగనిది. క్రి. విణ. ఎడతెగకుండ, ఎల్లప్పుడు.

**అనవరార్ధ్యము** సం. విణ. (అ. ఆ. అ.) – అవరార్ధ్యముకానిది-శ్రేష్ఠము, గొప్పది, ముఖ్యము.

**అనవలంబనము** సం. వి. అ. న–అనవలంబము.

**అనవలంబము** సం. విణ. (అ. ఆ. అ.) 1. నిరాధారము, ఊఁత లేనిది. 2. స్వతంత్రము. వి. అ. పుం–ఇతరునియాధారములేమి–1. స్వాతంత్ర్యము. 2. ఆధారములేమి.

**అనవసరము** సం. విణ. (అ. ఆ. అ.) 1. సమయోచితము కానిది. 2. ఆవశ్యకము కానిది. (ఈయర్థము తెనుఁగుఁలోఁగలదు.) వి. అ. పుం. అనుచితకాలము.

**అనవస్కరము** సం. విణ. (అ. ఆ. అ.) తొలఁగింపఁబడిన మాలిన్యము గలది, శోధితము.

**అనవస్థ** సం. వి. ఆ. స్త్రీ. 1. నిలుకడలేమి. 2. ఏర్పాటులేమి. 3. కుదురులేనినడవడి- స్వైరవర్తనము. 4. ఒకానొకతర్కదోషము. (ఉపపాద్యోపపాదకములకు తెంపు లేకపోవుట.)

**అనవస్థము** సం. విణ. (అ. ఆ. అ.) నిలకడ లేనిది, స్థిరము కానిది.

**అనవస్థానము** సం. విణ. (అ. ఆ. అ.) నిలుకడ లేనిది, చంచలము, అస్థిరము. వి. అ. పుం. వాయువు. న. 1. నిలుకడలేమి. 2. విచ్చలవిడియైన నడవడి.

**అనవస్థితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. నిలకడ లేనిది, చంచలము. 2. మాఱునది. 3. వ్యభిచారి. (నారీర్హ్యాత్వాఽనవస్థితాః. మను. 11. 139.

**అనవస్థితి** సం. వి. ఇ. స్త్రీ–అనవస్థ.

**అనవుడు–నావుడు.** అవ్య. ద్రు, (అనుధాతువుయొక ఆనంతర్యార్థకరూపము) అనుడు, అనినపిమ్మట.

చ. అనవుడు నల్ల నవ్వి మనుజాధిపుఁ డిట్లను... ఆము. ౪. 58.

**అనశనము** సం. విణ. (అ. ఈ. అ.) ఆహారము లేనిది. వి. అ. న. ఉపవాసము, పస్తు.

**అనశ్వరము** సం. విణ. (అ. ఈ. అ.) నశింపనిది, శాశ్వతమైనది.

**అనసూయ** సం. వి. ఆ. స్త్రీ. 1. ఈర్ష్యలేమి. 2. అత్రిమహామునిభార్య. (ఈమె పాతివ్రత్యమునకు ప్రసిద్ధికెక్కినది.)

**అనసూయుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) అసూయ లేనివాఁడు.

**అనసూయువు** సం. విణ. (ఉ.) – అనసూయుఁడు.

**అనస్సు** సం. వి. స్. న. బండి.

**అనాకారము** సం. విణ. (అ. ఆ. అ.) 1. రూపము లేనిది (పరమాత్మ). 2. కురూపి. వి. అ. పుం. 1. రూపములేమి. 2. కురూపము.

**అనాకారి** సం. విణ. (న్. నీ న్.) 1. ఆకారము లేనివాఁడు. 2. కురూపి.

**అనాకులము** సం. విణ. (అ. ఆ. అ.) వ్యాకులము కానిది, కలఁత లేనిది; చెదరనిది, స్థిరము.

**అనాక్రాంత** సం. వి. ఆ. స్త్రీ. కంటకారిక, వాఁకుడు (వృ.వి.)

**అనాక్రాంతము** సం. విణ. (అ. ఆ. అ.) ఆక్రమింపఁబడనిది.

**అనాగతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. రానిది. 2. రాఁబోవునది, భావి. 3. పొందఁబడనిది. వి. అ. న. భవిష్యత్కాలము.

**అనాగతవిధాత** సం. విణ. (ఋ. త్రీ. ఋ.) రాఁగల యనిష్టములకు ముందుగా ప్రతికారము చేసికొనువాఁడు.

**అనాగతావేక్షణము** సం. వి. అ. న. రాఁబోవుదానిని కనిపెట్టుట, దూరదృష్టి.

**అనాగతి** సం. వి. ఇ. స్త్రీ. 1. రాకుండుట. 2. ప్రాప్తింపకుండుట.

**అనాగమము** సం. విణ. (అ. ఆ. అ.) 1. రానిది. 2. స్వత్వహేతువు లైన క్రయప్రతిగ్రహాద్యాధారములు లేక చిరకాలమునుండి అనుభవ

ములో నుండునది. వి. అ. పుం. 1. రాకపోవుట. 2. ప్రాప్తింపమి.

**అనాగమోపభోగము** సం. వి. అ. పుం. క్రయప్రతి గ్రహాదికము లేకుండ సొత్తునుభవించుట.

**అనాగసుఁడు(గుఁడు)** సం. విశే. (స్.) 1.పాపము లేనివాఁడు. 2. అపరాధము లేనివాఁడు.

**అనాచారము** సం. విశే. (అ. ఆ. అ.) ఆచారము లేనిది; యుక్తప్రవర్తనము లేనిది. వి. అ. పుం. ఆచారములేమి; అయుక్తప్రవర్తనము. (విహితములను అనుష్ఠింపకుండుట నిషిద్ధములను అనుష్ఠించుట - అని అనాచారము రెండు విధములు.)

**అనాతపము** సం. విశే. (అ. ఆ. అ.) ఎండ లేనిది, వి. అ. పుం. ఎండలేమి; నీడ.

**అనాతురుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) 1. పీడితుఁడు కానివాఁడు. 2. వేగిరపడనివాఁడు.

'పరాధీనదర్శనా...మాలవికా భవానపి సూనో పరిచరో గృధ్రఇవామిషలోలుపో భీరుకశ్చ తస్మాదనాతురో భూత్వా కార్యసిద్ధిం ప్రార్థయమానో మే రోచసే.' మాలవి. 2. 56. పొ.

**అనాత్మజ్ఞుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) 1. తన్నుఁదా నెఱుఁగనివాఁడు. 2.పరమాత్మస్వరూపము తెలియని వాఁడు.

**అనాత్మము** సం. విశే. (న్. ఆ, న్. న్.) 1. ఆత్మ లేనిది. 2. ఆధ్యాత్మికము కానిది, దేహసంబంధమయినది. 3. మనోనిగ్రహము లేనిది. వి. న్. పుం. ఆత్మకానివస్తువు, ఆత్మకంటె వేఱైన పదార్థము (శరీరాదికము)

**అనాత్మవంతుఁడు** సం. విశే. (త్. వతీ. త్.) ఇంద్రియములను వశపఱచుకొననివాఁడు.

**అనాత్మవేది** సం. విశే. (న్. నీ. న్.) - అనాత్మజ్ఞుఁడు.

**అనాథ(ధ)ము** సం. విశే. (అ. ఆ. అ.) నాథుఁడు లేనిది, దిక్కులేనిది.

**అనాదరణము** సం. విశే. (అ. ఆ. అ.) ఆదరణము లేనిది. వి. అ. న. ఆదరములేమి.

**అనాదరము** సం. విశే. (అ. ఆ. అ.) ఆదరము లేనిది. వి. అ. పుం- ఆదరములేమి- (క) అవమానము, తిరస్కారము. (చ.) అశ్రద్ధ, అవగణన.

శ్లో. అనాదరోపాత్తధృతైకసాయకం. సం. కిరా. 14. 36.

**అనాది** సం. విశే.(ఇ.) ఆదిలేనిది, మొదలు లేనిది.

**అనాదినిధనుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) జనన మరణములు లేనివాఁడు.

**అనాదిమధ్యాంతము** సం. విశే. (అ. ఆ. అ.) మొదలుమధ్యమును తుదియు లేనిది,శాశ్వతము.

**అనాదీనవము** సం. విశే. (అ. ఆ. అ.)- అదీనవము లేనిది - తప్పిదము లేనిది, దోషములేనిది.

శ్లో. యద్వాసుదేవే నాదీన మనాదీనవమీరితం. శిశు. 2. 22.

**అనాదృతము** సం. విశే. (అ. ఆ. అ.) 1. ఆదరము చేయఁబడనిది. 2. ఆదరము లేనిది. ఆదరింపనిది; లెక్కసేయనిది.

శ్లో. అనాదృతస్యామరసాయకేష్వపి. సం. కిరా. 14. 10.

వి. అ. న. అగౌరవము, తిరస్కారము.

**అనాదేయము** సం. విశే. (అ. ఆ. అ.) స్వీకరింపరానిది.

**అనాద్యంతము** సం. విశే. (అ. ఆ. అ.) మొదలును తుదయును లేనిది, శాశ్వతము.

**అనాద్యము** సం. విశే. (అ. ఆ. అ.) 1. అనాది. 2. అభక్ష్యము, తినఁగూడనిది.

**అనాధారము** సం. విశే. (అ. ఆ. అ.) ఆధారము లేనిది.

**అనాధి** సం. విశే. (ఇ.) 1. మనోవ్యాధి లేనివాఁడు, మనస్తాపము లేనివాడు. 2. తాకట్టు లేనిది. వి. ఇ. పుం. 1. మనోవ్యథలేమి. 2. తాకట్టులేమి.

**అనాప్త** సం.విశే. (ఋ, త్రీ. ఋ.) పొందనివాఁడు.

**అనాప్తుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) 1. ఆప్తుఁడు కానివాఁడు, 2. ఆప్తుఁడులేనివాఁడు.

**అనామకము** సం. విశే. (అ. మికా. అ.) వి. అ. న.- అనామము.

**అనామధేయుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) 1. పేరు లేనివాఁడు. 2. ప్రసిద్ధిలేనివాఁడు.

**అనామము** సం. విణ. (న్, న్, మీ, ఆ. న్.) 1. పేరులేనిది. 2. ప్రసిద్ధిలేనిది. వి. న్. పుం. అధికమాసము. న. అర్శోరోగము, మూలవ్యాధి.

**అనామయము** సం. విణ. (అ. ఆ. అ.) రోగము లేనిది. వి. అ. న. ఆరోగ్యము.

**అనామిక** సం. వి. ఆ. స్త్రీ-పేరులేనిది — ఉంగరపు వ్రేలు. (దీనితో శివుఁడు బ్రహ్మశిరస్సును ఛేదించెను. కావున అపవిత్ర మగు ఈవ్రేలు వైదిక కర్మములయందు ఉచ్చరింపరాని నామము కల దగుటచే అనామిక యయ్యె. కడమవ్రేళ్లకు అంగుష్ఠాదినామము లున్నట్లు దీని కేనామము లేకపోవుటచే అనామిక యయ్యెననికొందఱు.)

**అనామిషము** సం. విణ. (అ. ఆ. అ.) ఆమిషము లేనిది. వి. అ. పుం. న. ఆమిషభిన్నపదార్థము. (చూ. ఆమిషము.)

**అనాయకము** సం. విణ. (అ. ఆ. అ.) నాయకుఁడు లేనిది; అరాజకము.

**అనాయత్తము** సం. విణ. (అ. ఆ. అ.) ఒకరికి లోను గానిది, స్వతంత్రము.

**అనాయాసము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఆయాసయలేనిది. 2. సులువైనది. వి. అ. పుం. ఆయాసములేమి.

**అనాయుష్యము** సం. విణ. (అ. ఆ. అ.) దీర్ఘాయువునకు భంగకరమైనది. (అతిభోజనాది)

**అనారంభము** సం. విణ. (అ. ఆ. అ.) ప్రారంభము లేనిది. వి. అ. పుం. ప్రారంభములేమి.

**అనారతము** సం. విణ. (అ. ఆ. అ.) ఎడతెగనిది. నిరంతరము. క్రి. విణ. ఎడతెగకుండ; ఎల్లప్పుడు.

**అనారోగ్యకరము** సం. విణ. (అ. ఈ. అ.) రోగమును గలిగించునది.

**అనారోగ్యము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఆరోగ్యము లేనిది. 2. దేనివలన ఆరోగ్యము కలుగదో అది—అనారోగ్యకరము. (అతిభోజనాది) వి. అ. న. రోగము.

**అనార్జవము** సం. విణ. (అ. ఆ. అ.) కుటిలమైనది; కపటమైనది. వి. అ. న. 1. కుటిలత; కాపట్యము. 2. రోగము.

**అనార్తవ** సం. వి. ఆ. స్త్రీ. రజస్వల కానిపడుచు.

**అనార్తవము** సం. విణ. (అ. ఈ. అ.) 1. అకాలమునఁ గలుగునది (పుష్పాదికము). 2. ఋతునియమము లేక సర్వకాలములందు నుండునది.

సీ. అనలాతుఘనజటావనవాటి కెవ్వాఁడువనె

వెట్టునవార్తవంపుఁబువ్వు. అము. 1. 19.

**అనార్యకము** సం. వి. అ. న. అగరువు (వృ.వి.)

**అనార్యజము** సం. విణ. (అ. ఆ. అ.) నీచవంశమునఁ బుట్టినది. వి. అ. న – మ్లేచ్ఛదేశమునఁ బుట్టినది - అగరుపు (వృ.వి.)

**అనార్యతిక్తము** సం. వి. అ. పుం. నేలవేము (వృ.వి.)

**అనార్యుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) ఆర్యుఁడు కానివాఁడు.

**అనార్షము** సం. విణ. (అ. ఈ. అ.) ఆర్షము కానిది — 1. వేదమందు లేనిది. 2. ఋషిచే కనిపట్టఁబడనిది.

**అనాలంబము** సం. విణ. (అ. ఆ. అ.) ఆలంబము లేనిది, ఊఁత లేనిది. వి. అ. పుం. ఆలంబము లేమి, ప్రాపులేమి.

**అనాలంబి** సం. వి. ఈ. స్త్రీ. శివునివీణ.

**అనాలాపము** సం. విణ. (అ. ఆ. అ.) మాటలాడకుండునది. వి. అ. పుం. మాటలాడకుండుట.

**అనాలోచితము** సం. విణ. (అ. ఆ. అ.) ఆలోచింపఁబడనిది.

**అనావర్తి** సం. విణ. (న్. నీ. న్.) తిరిగి రానిది, మరల రానిది.

శ్లో: అనావర్తికాలః...సం. భర్తృ. 3. 116.

**అనావర్షము** సం. వి. అ. పుం. న. అనావృష్టి.

గీ. ధరణిపై నెన్నిబిందువుల్ దొరఁగె నన్ని,

వర్షములుగల్గునిందనావర్షభయము. భార. విరా. 5. 261.

**అనావిద్ధము** సం. విణ. (అ. ఆ. అ.) 1. తొలవేయఁబడనిది, రంధ్రము చేయఁబడనిది. (అనావిద్ధం రత్నం. శాకుం. 2, 10.) 2. బాధింపఁబడనిది.

**అనావిలము** నం. విశ. (అ. ఆ. అ.) కలుషము గానిది, స్వచ్ఛము. (జలము, మనస్సు, మొ.)

**అనావృత్తి** నం. వి. ఇ. స్త్రీ. 1. మరల రాకుండుట. 2, పునరావృత్తిలేమి, ముక్తి.

**అనావృష్టి** నం. వి. ఇ. స్త్రీ. వానలు లేకపోవుట. వఱపు. (ఇది ఈతిబాధలలో నొకటి.)

**అనాశకము** నం. విశ. (అ. శా. అ) 1-మంచి అశనము లేనిది-యథేష్టభోగము లేనిది. 2. అనశ్వరము, నాశములేనిది. 3, నశింపఁ జేయ నిది. వి. అ. న. (చావువకై చేసెడు) అన శనము, ఉపవాసము. యాజ్ఞ. 3. 154.

**అనాశము** నం. విశ. (అ. ఆ. అ.) 1. ఆశలేనిది. 2. నాశము లేనిది. 3. తిండిలేనిది.

**అనాశ్రమి** నం. వి. న్. పుం. బ్రహ్మచర్యాద్యా శ్రమములలో నొకటియు లేనివాఁడు.

**అనాశ్రవుఁడు** నం. విశ. (అ. ఆ. అ.) 1. చెప్పిన మాట విననివాఁడు, 2. ప్రతిజ్ఞ లేనివాఁడు.

**అనాశ్రితము** నం. విశ. (అ. ఆ. అ.) 1. ఆశ్ర యింపనిది. 2. ఆశ్రయింపఁబడనిది.

**అనాశ్వాంసుఁడు** నం. విశ. (న్. శుషీ. న్. ఇది విద్వచ్ఛబ్దమువంటిది.) భుజింపనివాఁడు; అనుభ వింపనివాఁడు.

**అనాస** వి. (క. అనాస, అనాస్. త. అన్నాసి.) ఒకానొకపండ్ల మొక్క, మొగలిపనస (వృ.వి.)

**అనాసాదితము** నం. విశ. (అ. ఆ. అ.) పొందఁ బడనిది, ప్రాప్తము కానిది.

**అనాస్థ** నం. వి. ఆ. స్త్రీ. అనాదరము. ఉపేక్ష.

**అనాస్థుఁడు** నం. విశ. (అ. ఆ. అ.) ఆస్థ లేనివాడు, ఆసక్తి లేనివాఁడు.

**అనాస్వాదము** నం. విశ. (అ. ఆ. అ.) చవిలేనిది, రుచిలేనిది. వి. అ. పుం. రుచిలేమి,

**అనాస్వాదితము** నం. విశ. (అ. ఆ. అ.) రుచి చూడఁబడనిది.

**అనాహతము** నం. విశ. (అ. ఆ. అ.) 1. కొట్టఁబడ నిది. 2, ఉత్తరింపఁబడనిది. (క్రొత్తవస్త్రము.) 3, (గణిత) గుణింపఁబడనిది. వి. అ. పుం. వ. 1. హృదయమందు సుషుమ్న నడుమనున్న ద్వాదశ దళపద్మము. (ఇది దేహమందలి షట్చక్రములలో నొకటి.)
2. తాల్వాద్యవయవస్పర్శము లేకుండనుత్పన్న మగుధ్వని, మధ్యమావాగ్వృత్తి.

**అనాహము** నం. వి. అ. పుం. – మలాశయమును వదులు చేయునది–గ్రహణీరోగము.

**అనాహారము** నం. విశ. (అ. ఆ. అ.) భోజనము లేనిది. వి. అ. పుం. వస్తు, ఉపవాసము,

**అనాహారి** నం. విశ. (న్. ఈ. న్.) ఆహారము లేని వాఁడు. పస్తుండువాఁడు.

**అనాహార్యము** నం. విశ. (అ. ఆ. అ.) 1. స్వాభా వికము, అకృత్రిమము, 2. అభక్ష్యము.

**అనాహూతుఁడు** నం. విశ. (అ. ఆ. అ.) పిలువఁ బడనివాఁడు.

**అని**[1] వి. యుద్ధము, కలహము.

క. నీ వని నేయ బలాఢ్యుఁడ, వీవిశ్వంబునను నీకు నెదురెవ్వరు లేరు...హరి. 7. 146.

2. (క. త. అణి.) సేన.

క. తెమ్మెర నీ కెం తెమ్మెర, గమ్మనివిలుకాని దొరవు గమ్మని నెలఁబై..మ్మని యలిపికం తుకనిక,రమ్మనిగా నిలిపి ముందరగ వచ్చి తివా. విజ. వి. 3. 48.

(ప్రయోగాంతరము మృగ్యము.)

**అని**[2]–అన్ని.

సీ. వినుము ఋగ్వేదాదివేదముల్ నాలుగుఁ గల్పాదులైన యంగంబు లాఱు, జెప్పి విద్యలు పదిపేర్చు పురాణంబు లనియును నొకవిద్య యధిప ధర్మ, విదులు సెప్పెడు శాస్త్రవితతియంతయు నొకవిద్య...భార. శాం. 3. 119.

**అని**[3] అవ్య. అనుధాతువుయొక్క క్త్వార్థకరూపము.
1. చెప్పి, పలికి, భావించి. మొ.
2. ఇత్యర్థకము. ఇది తనకు పూర్వమందుండు నది శబ్దస్వరూపమని గాని ప్రాతిపదికార్థ మని గాని వాక్యార్థ మనిగాని తెలుపుచు దానిని క్రియతో నన్వయింపఁ జేయును. తదంతర్గతములగు మఱికొన్ని అర్థములను గూడ తెలుపును.

(క) శబ్దస్వరూపము.

ఉ. అమ్మని యాఁప వోపకపు డల్లన తెప్పలు విచ్చుఁ గ్రమ్మఱన్, గ్రమ్మఱఁ గృష్ణ కృష్ణ యని గ్రక్కున మోడ్చు...కళా. 3. 19.

శా...ఔ, నౌ మేల్మేలని యార్యయల్ల...వసు. 1. 5. భార. ఉద్యో. 3. 87, 88.

(ఎ) ప్రాతిపదికార్థము.

క. బాణుఁ డని బుధులు మురిజి,ద్బాణుం డని విమతభూమిపాలురు సుమనో, బాణుఁడని సతులుఁ దలఁచుచు, రేఖాంకసమాను నోబ శేంద్రు నృసింహున్. నరస. 5. 61.

(ఐ) వాక్యార్థము.

వ. తమవారలెదిరివార లని నిరూపింప నశక్యం బగుటయు...భార. ద్రోణ. 1. 213.

(ఒ) కారణమును దెలుపును.

ఆ. తల్లి వనిచె నని యధర్మువు సేయంగ, నగునె ...భార. ఆది. 2. 34.

(ఓ) ఉద్దేశమును తెలుపును.

క. మునులార నన్ను విధియే,మని మునుపుట్టించె నట్టు లయ్యెడుఁగా కీ,వినఁ జవి గానిపలుకు లకుఁ,బని గలదే యుడుగుఁ డింక బహుభాషణముల్. భార. ఉద్యో. 3. 325.

సీ. ...భూసురులకు, నఖిల భూములఁ గల యర్థంబు లెల్లను దనకని యేమియునునుప కిచ్చె. భార. శాం. 1. 237.

(దీనిస్థానమున 'అంచు' అనియుఁ గలదు.)

ఉ. అంబిక కంచుఁ దెచ్చిన మహామణిసంఘము ప్రోకపోసి...కాశీ. 6. 167.

3. వాక్యాలంకారము.

వ. ఒక్కనాఁ డాత్మగతంబున నిట్లని వితర్కించితి...కాశీ, 1. 6.

**అనిక్షువు** నం. వి. ఉ. పుం. నిజమైనచెఱకు గాక దానివలె మధురరసము గల ఒకజాతిఱెల్లు, నల్లచెఱకు (వృ.వి.)

**అనిగీర్ణము** నం. విశ. (అ. అ. అ.) 1. మ్రింగఁబడనిది. 2. దాఁపఁబడనిది, వ్యక్తీకరింపఁబడినది.

**అనిచ్ఛ** నం. వి. అ. స్త్రీ. ఇచ్ఛలేమి, ఉపేక్ష.

**అనిచ్ఛకుఁడు** నం. విశ. (అ. చ్ఛికా. అ.) – అనిచ్ఛుఁడు.

**అనిచ్ఛుఁడు** నం. విశ. (అ. అ అ.) ఇచ్ఛలేనివాఁడు, ఇష్టపడనివాఁడు.

**అనిచ్ఛువు(ఁడు)** నం. విశ. (ఉ.) అనిచ్ఛుఁడు. ఇచ్ఛగింపనివాఁడు.

**అనితము** నం. విశ. (అ. అ. అ.) 1 అప్రాప్తము, పొందఁబడనిది. 2. పోఁవనిది.

శ్లో. ...ఇష్టసమాగమనిర్వృతిం, వనితయోఽనితయా...సం. రఘు. 9. 38.

**అనిత్యము** నం. విశ. (అ. అ. అ.) 1. శాశ్వతముకానిది, నశ్వరము. 2. నిలుకడలేనిది, చంచలము, అస్థిరము. 3. నిశ్చితముకానిది, సంశయాస్పదము. 4. తాత్కాలికము, అప్పటికుండునది.

**అనిదంపూర్వము** నం. విశ. (అ. అ. అ.) ఇంతకు మునుపు లేనిది, అపూర్వము; అద్భుతము.

మ. వనితానేత్ర చకోరచంద్రిక యశోవల్లీ వసంతోదయం, బనిదంపూర్వకథా సుధాబ్ధి భుజగర్వాదిత్యపూర్వాచలం, బు.. నీయాకారము...నా. సి. 6. 49.

**అనిద్ర** నం. వి. అ. స్త్రీ. నిద్రలేమి; జాగరూకత.

**అనిద్రము** నం. విశ. (అ. అ. అ.) 1. నిద్రలేనిది. 2. జాగరూకతకలది. 3. నిర్నిద్రము, వికసించినది.

**అనిపిం(న్పిం)చు** స. క్రి. (√అను) అనునట్లు చేయు.

(అని భావింపఁజేయు).

గీ. ప్రథమసంగకేళియప్పటికినంత, ముగ్ధయనిపించి పిదప నమ్మోహనాంగి, జాతివారాంబు జేతుణల్ సైతమింత, నేరననిపించెఁ గల యిక యాంగజముల. శుక. 4. 26.

(అని పలుకునట్లుచేయు)

గీ. అదియందును నాచేత నది వంముగఁ, దనకు నిచ్చితి ననిపించుకొనుట యిపుడు, హృదయమున నిల్పి యాపలు కింతచేసె, ననుచుఁ దార్కాణ నేసె రెండును నిజంబ. కళా. 4. 208.

మ. అలరుందూపుల మన్నెవాని మగవాఁ
డన్పించుఁ డక్కాంత...శుక. 4. 15.

**అనిపిం(న్పిం)చే**[2] స. క్రి (√అనుచే. అనుపు) పంపునట్లు చేయు (అనిపించు[1], అనిపించు[2] లకు ఇదే యుదాహరణము)

గీ.ఉరుగుణాద్భుత జనకదుశోదయమహి,మాతి
శయము సాధించి పుణ్యజనకాంత, సుగుణ
యనిపించుకొనిన భాసురవురమణిఁ, జూపు
తగులువహించె నుత్సుకతనతఁడు. రాఘవ. 2. 44.

**అనిభృతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. రహస్యము కానిది, దాఁపఁబడనిది. 2. చంచలమైనది. 3. దిట్టయైనది, అడఁకువలేనిది.

**అనిమశము** సం. వి. అ. పుం. 1. కప్పు. 2. కోకిల. 3. తుమ్మెద 4. పద్మకేసరము. 5. ఇప్పచెట్టు.

**అనిమిత్తము** సం. విణ. (అ. ఆ. అ.) కారణము లేనిది. వి. అ. న. 1. కారణములేమి. 2. అపశకునము

**అనిమిషము** సం. విణ. (అ. ఆ, అ.) 1. రెప్పపాటు లేనిది. 2. జాగరూకము. 3. తెఱచినది, వికసించినది (కన్ను, పువ్వు, మొ.) వి. అ. పుం. చేఁప.

**అనిమిషీయము** సం. విణ. (అ. ఆ. అ.) దేవతా సంబంధమైనది.

**అనిమిషుఁడు** సం. వి. అ. పుం. దేవత.

**అనిమేషము** సం—అనిమిషము.

**అనిమేషీయము** సం- అనిమిషీయము.

**అనిమేషుఁడు** సం—అనిమిషుఁడు.

**అనియతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. కట్టుపడనిది. 2. ఏర్పాటు లేనిది. 3 నిలుకడ లేనిది. 4. అనిశ్చితము.

**అనియమము** సం. విణ. (అ. ఆ, అ.) 1. నియమములేనిది. 2. క్రమములేనిది. 3.నిశ్చయములేనిది. వి. అ. పుం. 1. కట్టులేమి. 2.ఏర్పాటులేమి. 3. క్రమములేమి. 4. అనిశ్చయము, సందేహము.

**అనిరుక్తము** సం. విణ. (అ. ఆ. అ.) 1. స్పష్టముగా ఉచ్చరింపఁబడనిది. 2. స్పష్టముగాఁ దెలుపఁబడనిది.

**అనిరుద్ధపథము** సం. విణ. (అ. ఆ. అ.) అడ్డులేని త్రోవగలది. వి. అ. న. ఆకాశము. పుం. అడ్డులేనిత్రోవ.

**అనిరుద్ధుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) 1. అడ్డగింపఁబడనివాఁడు. 2. లొంగనివాఁడు. వి. అ. పుం. 1. వేగులవాఁడు. గూఢచారుఁడు. 2. ప్రద్యుమ్నునికొడుకు 3. విష్ణువు. 4. శివుఁడు.

**అనిర్ణయము** సం. వి. అ. పుం. నిర్ణయములేమి, అనిశ్చయము.

**అనిర్దశము** సం. విణ. (అ. ఆ. అ.) జాపాశౌచము గాని మృతాశౌచము గాని పదిదినములు గడవనిది.

**అనిర్దశాహము** సం — అనిర్దశము.

**అనిర్దిష్టము** సం. విణ (అ. ఆ. అ.) నిర్దేశింపఁబడనిది, ప్రత్యేకించి తెలుపఁబడనిది.

**అనిర్దేశము** సం. విణ. (అ. ఆ. అ.) నిర్దేశములేనిది. వి. అ. పుం. నిర్దేశములేమి.

**అనిర్దేశ్యము** సం. విణ. (అ. ఆ. అ.) నిర్దేశింపశక్యము గానిది.

**అనిర్ధారితము** సం. విణ. (అ. ఆ. అ.) నిర్ధారణదియఁబడనిది, నిశ్చయింపఁబడనిది.

**అనిర్లోడితము** సం. విణ. (అ. ఆ. అ.) బాగుగా ఆలోచింపఁబడనిది.

**అనిర్వచనీయుడు** సం. విణ. (అ. ఆ. అ.) 1. నిర్వచింపశక్యము గానిది. 2. వచింపఁ గూడనిది, అవాచ్యము.

**అనిర్వచనీయఖ్యాతి** సం. వి. ఆ. స్త్రీ. భ్రమవిషయమున అద్వైతమతము. (అనిర్వచనీయమనఁగా సదసద్విలక్షణము. 'ఇదం రజతం' అను భ్రమస్థలమున రజతము ప్రతీత మగుటవలన అసద్విలక్షణము, ప్రమోత్తరమున బాధింపఁబడుట వలన సద్విలక్షణము. కావున సదసద్విలక్షణమై శుక్తియందు రజతము విశేషణముగా భాసించును.)

**అనిర్విణ్ణుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఖిన్నుఁడు కానివాఁడు; అసంతుష్టుఁడు కానివాఁడు. 2. విరక్తుఁడు కానివాఁడు.

**అనిర్వృతము** సం. విణ. (అ. ఆ. అ.) సంతోషము లేనిది, సుఖములేనిది.

**అనిర్వృతి** సం. వి. ఇ. స్త్రీ. 1. విచారము, దుఃఖము. 2. దారిద్ర్యము.

**అనిర్వృత్తము** సం.విణ. (అ. ఆ. అ.) నెఱవేఱనిది.

**అనిర్వృత్తి** సం. వి. ఇ. స్త్రీ. నెఱవేఱమి.

**అనిర్వేదము** సం. వి. అ. పుం. 1. విరక్తిలేమి. 2. ఖేదములేమి; ధైర్యము.

'అనిర్వేదప్రాప్యాణి శ్రేయాంసి.' విక్రమో. 4. 28. 181 పొ.

**అనిలఘ్నకము** సం. వి. అ. పుం. — వాతరోగము లను పోఁగొట్టునది — విభీతకము, తాండ్ర (వృ.వి.).

**అనిలఘ్నము** సం. విణ. (అ. ఆ. అ.) వాతరోగములను పోఁగొట్టునది.

**అనిలము** సం. వి. అ. పుం. 1. గాలి. 2 దేహము నందలి వాతధాతువు, 3. నాయుబీజ మగు 'య' అనువర్ణము. 4. వాతరోగము. 5, స్వాతీ నక్షత్రము.

**అనిలసఖుఁడు** సం. వి. అ. పుం. అగ్ని.

**అనిలాంతకము** సం. వి. అ. పుం.—వాతరోగమును పోఁగొట్టునది—ఇంగుది, గార (వృ.వి.)

**అనిలాత్మజుఁడు** సం. వి. అ. పుం. — వాయు పుత్త్రుఁడు- 1. భీముఁడు. 2. హనుమంతుఁడు.

**అనిలాశనము** సం. విణ. (అ. ఆ. అ,) గాలి యాహారముగాఁ గలది. వి. అ. పుం. పాము.

**అనిలాశి** సం. విణ. (న్. నీ. న్.) వి. న్. పుం.— అనిలాశనము.

**అనిలుఁడు** సం. వి. అ. పుం. 1. వాయుదేవుఁడు. 2. అష్టవసువులలో నొకఁడు. 3. మరుత్తులలో నొకఁడు.

**అనివర్తనము** సం. విణ. (అ. ఆ. అ.) తొలఁగి పోనిది, వెనుదీయనిది. వి. అ. వ. నివర్తనము లేమి.

**అనివర్తి** సం. విణ. (న్. నీ. న్.) 1. తొలఁగి పోవనివాఁడు, వెనుదీయనివాఁడు. 2. మరల రానిది. 'యౌవనమనివర్తి యాతం ను' కావ్య ప్రకాశము 10.

**అనివారణ** సం. వి. ఆ. స్త్రీ.—అనివారణము.

చ. ...అతఁ డమ్మహీశ్వరు మహనీయచాప మనివారణఁ ద్రుంచిన నొండువిల్లు భీకర తర శీఘ్రలీలఁ గొని... భార. భీష్మ. 1.255.

**అనివారణము** సం. విణ. (అ. ఆ. అ.) అడ్డులేనిది. వి. అ. న. నివారణములేమి, అడ్డులేమి.

**అనివార్యము** సం. విణ. (అ. ఆ. అ.) నివారింప రానిది.

**అనిశము** సం. విణ. (అ. ఆ. అ.) ఎడతెగనిది, నిరంతరం. క్రి. విణ. సదా, ఎల్లప్పుడు.

**అనిషిద్ధము** సం. విణ. (అ. ఆ. అ.) నిషేధింపఁ బడనిది.

**అనిష్టము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఇష్టముకానిది, అప్రియము. 2. యజింపఁబడనిది. (దేవాది) వి. అ. న. 1. నెబ్బరి, కీడు. 2. దుఃఖము. 3. పాపము, దోషము.

**అనిష్టశంక** సం. వి. ఆ. స్త్రీ. కీడువలని భయము, కీడు వచ్చునను భయము,

**అనిష్టహేతువు** సం. వి. ఉ. పుం. 1. అనర్థకారణము. 2. దుర్నిమిత్తము, దుశ్శకునము.

**అనిష్టానుబంధి** సం. విణ. (న్. నీ. న్.) అనిష్టము లతోఁ గూడినది.

('విషయోపభోగేషు అనిష్టానుబంధిషు య స్సుఖబుద్ధి మారోపయతి.' కాదం.)

**అనిష్టాశంసి** సం. విణ. (న్. నీ. న్.) అశుభసూచకము,

**అనిస్స్రుతము** సం. విణ. (అ. ఆ. అ.) వార్పఁ బడనిది,

ఉదా: అనిస్స్రుతాన్నం గురు బలపుష్టికరం. వైద్య. (అనిస్స్రుతాన్నము—అత్తెసరన్నము)

**అనీకము** సం. వి. అ. పుం. న. 1. సేన. 2. సమూహము, గుంపు.

శ్లో: నవాంబుదానీక ముహూర్త లాంఛనే, ధనుషి...సం. రఘు. 3. 53.

3. యుద్ధము.

**అనీకస్థము** *సం. వి. అ. పుం.* 1. అంగరక్షకవర్గము. 2. యుద్ధ వాద్యము, వీర మర్దళము. 3. చిహ్నము, గుఱుతు.

**అనీకస్థుఁడు** *సం. వి. అ. పుం.* 1. యోధుఁడు. 2. రాజాంగరక్షకుఁడు. 3. గజశిక్షకుఁడు, మావటివాఁడు.

**అనీకిని** సం. వి. ఈ. స్త్రీ. 1. సైన్యము, 2. అక్షౌహిణిలో పదియవపాలు, మూఁడు చమువులు. (2187. రథములు, అన్నియే యేనుఁగులు, 5561 గుఱ్ఱములు, 10935 కాల్బ్వురుగలసేన.)

**అనీతి** సం. విశే. (అ.) 1. నీతిలేనిది, 2. ఈతిబాధలు లేనిది. (దేశము) వి. అ. స్త్రీ. 1. నీతి లేమి. 2. ఈతిబాధలు లేమి.

**అనీశుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) 1. పైయధికారి లేనివాఁడు; స్వతంత్రుఁడు. 2. ఏలిక కానివాఁడు. 3. అసమర్థుఁడు. 4. అస్వతంత్రుఁడు. వి. అ. పుం. విష్ణువు.

**అనీశ్వరుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) 1. నియంత లేనివాఁడు, స్వతంత్రుఁడు, 2. అసమర్థుఁడు.

శ్లో. శయితా సవిధే ప్యనీశ్వరా, నఫలీకర్తు మహో మనోరథాన్. భామినీ. 2. 182.

3. నాస్తికుఁడు, దేవుఁడు లేఁడనువాఁడు.

4. ఈశ్వరునికంటె వేఱైనవాఁడు.

6. ఈశ్వరసంబంధి కానివాఁడు.

శ్లో. ...దహేత్ ... ధ్యానే నానీశ్వరాన్ గుణాన్. మను. 6. 72.

**అనీహ** సం. వి. ఆ. స్త్రీ. 1. కోరికలేమి. 2. ఉత్సాహములేమి, ప్రయత్నములేమి.

**అనీహుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) 1. కోరిక లేనివాఁడు. 2. యత్నము లేనివాఁడు.

**అను** *న. క్రి.* (కొన్నిపట్ల దీనికి పూర్వము ఇత్యర్థకమగు 'అని' అనునది యన్వయముకై యనుసంధించుకొనవలెను. దీని తద్ధర్మార్థక విశేషణ రూపమగు 'అను' నకు హల్లు పరమగునపుడు ఉత్వము లోపించుటయుఁ గలదు. 'సనావుడు' మున్నగు విశేషరూపము లాయచోట్ల చూచుకొనునది.) 1. వచించు, ప్రతిపాదించు.

(క) పలుకు, చెప్పు.

క. అతివకు సురనదికి నిట్టు లని రవ్వనువుల్

*భార. ఆది. 4. 126.*

క. ...ఇంక జననాయకుఁ డెప్పరుసున నానతి యిచ్చెను,దొర లేమని రట్లచేయఁ దుదిఁ గార్యమగున్. భార. విరా. 2. 122,

క. వెలయంగ సంస్తుతించుచు, నలఘులు మా కభయ మభయ మని రయ్యనలున్. భార. ఆది. 8. 311. (అనిరి-అని పలికిరి.)

క. సీతాదత్త శిరోమణి, వాతూల తనూజుఁ డానవాలని యొసఁగెన్. రామా. 7. 15.

(అని-అనిచెప్పి.)

(చ) రూపకసంభావనలయందు – అనఁగా ఒక వస్తువును మఱియొక వస్తువుగా నిరూపించునపుడును ఒకవస్తువుయొక్క నామనిర్దేశము చేయునవుడును-ఉపయుక్తమై అభేదమును దెలుపును.

సీ. వదనశాశాసనవ్యక్తముక్తములైనపలుకు లన్కడు వాఁడిబాణతతుల. భార. ఆది. 3. 206.

చ. ...వరుణుఁ డన్మునిచే ... భార. ఆది. 4. 156.

క. ...పూర్వార్ధతనుసహితుఁ డరుణుఁ డనం,గానుదయించె సుతుండు...భార. ఆది. 2. 6.

ఉ. ఆలును దాసియున్ సుతుఁడు నన్నవివాయనిధర్మముల్ మహిన్. భార, ఆది. 3.174.

(ట) ప్రశంసించు.

క. కాలము నే మనవచ్చును, గాలముఁ గాలంబ పోలుఁ గాకొంటికి నీ.లీలలు గలవే లెస్సగ ...భార. మహా. 6.

ఆ. మంచిమగఁడు వలయు నంచుఁ గోరుచునుండ,మంచిమగఁడుగలిగె మఘవసుతుఁడు, మనసుభద్రసుకృతమహిమ యేమనవచ్చు,

మనసుభ్రమయ్యె మనకు నెల్ల. విజ. వి. 3. 88.

(త) నిందించు, ఆక్షేపించు.

ఆ. ఇట్టు లాడఁదగునె యిది నీక పోలు ని, న్నె మనంగ నేర్తుని త్రిజగంబు, పాడిగాఁగఁ బూని పలుకంగఁజెవి యొడ్డి, యాదరించువారి నందుఁ గాక. భార, ఉద్యో. 1. 23.

గీ. నిన్ను నే మన నున్నది నిరభిమాన, గుణత నినుఁ జేరున న్ననుకొనుట గాక. కళా. 3. 241.

సా: అని యనిపించుకొనుట యత్తగారా నీ నైజమా?

(ప్ర) వ్యాజముగా చెప్పు, మిషగాచెప్పు.

చ. పలుమఱు నేటినీటి కని జానిసఁ బిల్చెద నంచు లోలురోఁ,కలి కని కూరగాయ కొనఁగా వలెనంచు...శుక. 2. 103.

(గ) ప్రశ్నించు, అడుగు; ఉత్తరమిచ్చు.

ఆ. ఇచ్చియాదరించి యెయ్యది నీనామ మెచట నుండి యిచటి కేటి కిప్పు, డేఁగుదెంచినాఁడ వెఱిఁగింపు మనుటయు, నిట్టులనియె భూసు రేశ్వరుండు. విక్ర. 1. 108.

(జ) పాడు, గానముచేయు.

సీ. ననుఁ గని పాట నిల్పినతుంబురుని జూచి యాతాన మీసారి యను మటంచు. కువల. 4. 63, 111.

ఆ. అనఁగ ననఁగ రాగ మతిశయిల్లుచు నుండు ...వేమన. 1. 83.

(డ) అనుకరణశబ్దముల కనుప్రయుక్తమగును.

సీ. చిగురుఁదామరపాకు జివ్వంచుఁ జనుదోయి మొనలకొ వ్వేఁడిని మురుఁగఁజాఱె.నైష. 2. 119.

సీ ...కొంగలు చెలఁగి కొంగొంగురనఁగ.హర. 5. 16.

2. భావించు, పరిగణించు.

(క) తలఁచు, ఎంచు.

ఆ. ఎట్టు మాచిచూచి యిది పాప మనక య, య్యనురవాతఁ ద్రోతు నదయవృత్తి. భార. ఆది. 6. 247.

సీ. సభ కేకవస్త్రం రజస్వల యనక నా దలవట్టి యీడ్చినతప్పు...భార. శాం. 1. 94.

క. పలు కెడలోఁ జే, కొనఁడేని వాఁడు తన యుం, డనఁబడునే...భార. ఆది 8. 199.

గీ. అమరకార్యం బవిచ్చిన్న మగుట దలఁచి, యంతరంగంబులోననిట్లనుచునుండె. నైష. 4. 92.

(చ) భ్రమచేభావించు.

క. విను శూన్యస్థానంబున, నునికి యతికిఁగృత్య మగుట నుర్వీశ్వర ము, క్తునిమానసంబు శూన్యం, బని చొచ్చితి ముక్తి లేమి నది తప్పయ్యెన్. భార. శాం. 6. 203.

గీ. చెలులు శిశిరోపచారముల్ సేయుపొంటెఁ, ద్రోవు లిడ్డమృణాళకర్పూరవితతిఁ, గాంచి వైరికృమదిలోనఁగళవళించె,జాలకాయాత చంద్రికాజాలమనుచు. నైష. 2. 116.

**అను** సం. అవ్య. సమాసపూర్వపదముగా నుండి తఱచుగా ఈక్రింది యర్థముల నిచ్చును.

1. ఆశ్రయము.

(అనుజీవి—ఒకరి నాశ్రయించి జీవించువాఁడు.)

2. అనుగతము, ప్రాప్తము.

(అన్వర్థము—పొందిన అర్థము కలది.)

3 సాదృశ్యము, పోలిక.

(అనుగర్జితము—గర్జితమును పోలినది, ప్రతి గర్జితము.)

4. అనంతరము, తరువాత.

(అనుజుఁడు—తరువాతపుట్టినవాఁడు,తమ్ముడు.)

5. అర్హము, తగినది.

(అనుకాలము — కాలమునకు తగినది.)

6. ఆనుపూర్వి, క్రమము,

(అనుజ్యేష్ఠము—జ్యేష్ఠక్రమముగా.)

7. వీప్సార్థము.

(అనుదినము- దినదినము, ప్రతిదినము.)

8. సామీప్యము.

(అనువనము వనసమీపము.)

9. అప్రధానము.

(అనుకల్పము—అముఖ్యవిధి, గౌణవిధి.)

10. ఆయామము, దైర్ఘ్యము.
(అనుగవము—గోవంతపొడుగైనది.)
11. సహార్థము.
(అనుపానము—మందుతోఁ గూడ సేవించునది. తేనె, మొ.)
12. పునరర్థము.
(అనువాదము—మరల చెప్పుట.)
13. అనుకూల్యము.
(అనువర్తనము—అనుకూలవర్తనము.)
14. కొన్నిచోట్ల నిరర్థకముగానే యుండును.
(అనులేపము—లేపము, పూత.)

**అనుగలము** వి. ఆశ్రయము, స్థానము.
క...ఉదారుండు లేమి కనుగల మయ్యెన్ దశ. 5. 81.

**అనుఁగు** విశే. (సం. అనుగః. త. అణుక్కన్ — దగ్గఱవాఁడు.)
1. ప్రియుఁడు, ఇష్టుఁడు.
క. నరుఁ డనుఁగుబంటు గావునఁ, బోరిగొనఁ జోర వీవు...భార. ద్రోణ. 5. 26.
చ. అరయ ననుంగుఁజుట్టము క్రియన్ భువి నతట సల్లిబిల్లివై ...కవిరా. 3. 135.
2. ప్రియురాలు; ననుపుకత్తె.
వ. ఏను వంద యనునప్సరసఁగు బేరుననుంగ... భార. ఆది. 8. 153.
వ. శ్రీకులోత్తుంగచోడదేవర అడువు లొత్తెడినంగాడ్డికూఁత్తులు ఉయ్యమకూంత్తులు కోన రాజేంద్రచోడయరాజుల అనుంగ్గు పెరియాడ్డి...ద. శా. 1249.
3. ఇంపైనది, మనోజ్ఞము.
సీ. వనవిహంగములయనుఁగు తెలుంగులాహ్వానంబుచేయుఁగై వల్యఖగము. నృసిం. 5. 167.
సీ. త్రేతలుగరఁగంగ వేడుకఁ బిల్లఁగ్రో వెనయఁ జేర్చినదె యీయనుఁగుమోవి. హరి. ఉ. 9. 214. చి. ని. ('ఈయిగురు మోవి' ముద్రి.)
4. సహాయుఁడు.
సీ. ...అనుఁ గనఁగను సహాయాఖ్యదనరు. అంభా. 2. 210.

వి. 1. మిత్రుఁడు, ఆప్తుఁడు.
సీ. సభ కేకవస్త్ర రజస్వల యనక నన్ దలవట్టి యీడ్చినతప్పుఁదనదు. గీ. తొడలు మాపిన తప్పును దుష్టకష్ట, తరవచనములఁ బలిచిన తప్పుననుజు, నందు దుర్యోధనునియందు ననుఁగునందుఁ, గాంచి దండించి తిట్టెది కల్మషంబె. భార. శాం. 1. 94.
గీ. మాపు హరిమూర్తియైనతామరలయనుఁగు, భూరితేజంబు మాకిచ్చిప్రోచుఁగాత. వా. రా. 1. 4.
2. ప్రేమ, ప్రీతి.
ద్వి. అనుఁగు రెట్టింపంగ హరిచిత్తుదేవి, తన పట్టిఁజేరి యెంతయు బుజ్జగించి. ద్వి. పరమ. 5 ఆ. 538 పొ. 11 పం.
జ. అనుఁగుఁగత్తె, అనుఁగుమొగసాల.

**అనుఁగుఁగత్తె(త్తియ)** వి. (√అనుఁగు) చెలికత్తె, సఖి.
క. అనుఁగుంగత్తియలు...రసిక. 4. 40.

**అనుఁగుమొగసాల** వి. (అనుఁగు) రాజమందిర ప్రధానద్వారమునకుఁ జేరి యుండుశాల.
వ. రాజమందిరద్వారంబు ప్రవేశించి కక్ష్యాంతరంబులు గడచి యనుంగుమొగసాలఁ జొచ్చి రథంబుడిగ్గి. భార. ఉద్యో. 3.177.
(ఇది భా. ల. వ్యా. పాఠము. 'ఏనుంగుమొగసాల' ముద్రి.)
క. చనుదెంచి సర్వజనములు, దనుఁ గౌతూహల తరంగతరళతరవిలో, చనులై కనుఁగొనఁగ నగరి, యనుంగుమొగసాలగవనికవతీర్ణుండై. హరి. ఉ. 3. 17.
గీ. సైన్యముల నెల్ల వెలి నుండఁ జాటఁబనిచి, వలయుపడవాళ్ల రాకుమారులను దొరల, నిషధ నాయకుఁ గొలిచి రా నియతిచేసె, ననుఁగు మొగసాలఁ గ్రథకైశికావనిపుఁడు. నైష. 6. 86.

**అనుకంప** సం. వి. అ. స్త్రీ. కరుణ, కనికరము.

**అనుకంపకుఁడు** సం. విశే. (అ. విశా. అ.) దయ చూపువాఁడు.

**అనుకంపనము** సం. వి. అ. న. దయ.

**అనుకంపనీయుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) దయ చూపఁ దగినవాఁడు.

**అనుకంపమానుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) కరుణించుచున్నవాఁడు.

**అనుకంపి** సం. విశే. (న్. నీ. న్.) దయ చూపువాఁడు.

**అనుకంపిత** సం. విశే. (ఋ. త్రీ. ఋ.) దయ చూపువాఁడు.

**అనుకంపితము** సం. విశే. (అ. ఆ. అ.) కరుణింపఁబడినది.

**అనుకంపితవ్యుఁడు** సం—అనుకంప్యుఁడు.

**అనుకంప్యమానుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) దయతో చూడఁబడుచున్నవాఁడు.

**అనుకంప్యుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) దయ చూపఁదగినవాఁడు. వి. అ. పుం. తపస్వి.

**అనుకనీయుఁడు** సం. విశే. (స్. యసీ. స్.) కనిష్ఠునికంటె పూర్వుఁడు. (నలుగురు కొడుకులలో మూఁడవవాఁడు అనుకనీయుఁడు.)

**అనుకరణము** సం. వి. అ. న. 1. అనుకరించుట, ఇతరులు చేసినటులు చేయుట. 2. ధ్వన్యాదులను అనుకరించునపు డుపయోగించు శబ్దము. (పటపట, తళతళ. మొ.)

**అనుకరణీయము** సం — అనుకార్యము.

**అనుకరించు** సం. స. క్రి. విడంబించు. (ఒకరుచేసినట్లు చేయు.)

**అనుకర్త** సం. విశే. (ఋ. త్రీ. ఋ.) అనుకరించువాఁడు (నటుఁడు, మొ.)

**అనుకర్తవ్యము** సం—అనుకార్యము.

**అనుకర్మము** సం. వి. న్. న. 1. అనుకరణము. 2. పిమ్మట చేయఁబడుకర్మము.

**అనుకర్షము** సం. వి. అ. న—అనుకర్షము.

**అనుకర్షము** సం. వి. అ. పుం. 1. ఆకర్షణము, కూడ నీడ్చుకొని పోవుట. 2 (వ్యాక) పూర్వసూత్రమందలిపదమును పరసూత్రమునందు అనువర్తింపఁ జేయుట. 3. బండిపోలుగఱ్ఱచివర క్రింద ఎత్తుగా నుంచెడు మోపుదుకొయ్య. కోడిపీఁట.

**అనుకల్పము** సం. వి. అ. పుం. 1. గౌణకల్పము, బదులు, ప్రతినిధి. (ఒకకర్మమునందు ముఖ్యముగా విధింపఁబడినది ప్రథమకల్పము. అది దొరకనిచో దానికి బదులుగా విధింపఁబడినది గౌణకల్పము. ముఖ్యమయిన యవలు దొరకనిచో అనుకల్పముగా బియ్యము గోధుమలు మొదలగునవి విధింపఁబడును.) 2. వేదాంగమగుకల్పమునకు సంబంధించిన గ్రంథము.

**అనుకాంక్ష** సం. వి. అ. స్త్రీ. కోరిక.

**అనుకామీనుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) ఇచ్చ చొప్పున నడచుకొనువాఁడు.

**అనుకారము** సం. వి. అ. పుం — అనుకరణము.

**అనుకారి** సం. విశే. (న్. నీ. న్.) అనుకరించువాఁడు.

**అనుకార్యము** సం. విశే. (అ. ఆ. అ.) అనుకరింపఁదగినది.

**అనుకాలము** సం. విశే. (అ. ఆ. అ.) కాలమునకుఁ దగినది

**అనుకీర్తనము** సం. వి. అ. న. కీర్తనము, కథనము.

**అనుకు** విశే. కొంచెము పలుచనది.

మ.... క,మ్మని పచ్చాగ్గముతోడ బూరెగమితో మండెంగతండంబుతో, ననుకుంబాసెము తోడఁ బాండుకలమాహారంబుతో నేతితో ...భీమ. 2. 67. (దీనిఆమ్రేడితరూపము అన్ననుకు—అనుకు+అనుకు)

చ. అరుణకరోత్తరాభిహతి నన్నను కయ్యెడు సాంద్రచంద్రికాంతరమునఁ దూలితూలి ...ప్రభాతసమీరణ మంత వీచె...కు. సం. 8. 182.

1. మృదువు, మెత్తనిది.

క. ...త్రిజిహ్వుఁడ, బనవిరి కఠినంబయ్యెనె, యను కైనమనంబు దైవమా నీ కనుచుఁడ కకు. 5. 85.

**అనుకుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) కాముకుఁడు.

**అనుకుర్వత్** సం. శత్ర. అనుకరించుచున్న.

**అనుకుర్వాణుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) అనుకరించుచున్నవాఁడు.

**అనుకూల** సం. వి. అ. స్త్రీ. దంతీవృక్షము.

**అనుకూలము** సం. విణ. (అ. ఆ. అ.) 1. అనుగుణమైనది, సరిపడునది. 2. సహాయమైనది. 3. హితము, ఇష్టము. (వ్యతి: ప్రతికూలము.)

**అనుకూలించు** సం. అ. క్రి. అనుకూలమగు. రంగా. 2. 58.

**అనుకూలుఁడు** సం. విణ. (చూ. అనుకూలము) వి. అ. పుం. (అలం) నాయికలలో ఒకనాయిక యందు విశేషానురక్తుఁడై యుండు నాయకుఁడు.

**అనుకృతము** సం. విణ. (అ. ఆ. అ.) అనుకరింపఁబడినది.

**అనుకృతి** సం. వి. ఇ. స్త్రీ—అనుకరణము.

**అనుకొను** స. క్రి. (√అను) తలఁచు, భావించు.
క. ఐన న్నే నటువలెఁ గా, నీ ననుకో రాదు... దశా. 2. 336.

**అనుక్రమణము** సం. వి. అ. న. 1. వరుసగాఁ బోవుట. 2. వెంబడించుట.

**అనుక్రమణి** సం. వి. ఈ. స్త్రీ. విషయసూచిక.

**అనుక్రమణిక** .సం. వి. అ. స్త్రీ. విషయసూచిక.

**అనుక్రమము** సం. విణ. (అ. ఆ. అ.) క్రమము ననుసరించినది. వి. అ. పుం. 1. యుక్తక్రమము, పరిపాటి. 2. విషయసూచిక.

**అనుక్రియమాణము** సం. విణ. (అ. ఆ. అ.) అనుకరింపఁబడుచున్నది.

**అనుక్రోశము** సం. వి. అ పుం. కనికరము, జాలి.

**అనుక్రోశుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) క్రోశము నడచినవాఁడు. (వాచ.)

**అనుక్షణము** సం. అవ్య. అ. న. ప్రతిక్షణము ఎప్పుడును.

**అనుగంత** సం. విణ. (ఋ. క్రి. ఋ.) వెంబడించువాఁడు, అనుసరించి పోవువాఁడు.

**అనుగతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. అనుసరింపఁబడినది, వెంబడింపఁబడినది. 2. పశ్చాద్వ్యాప్తము, వెనుకభాగమున కప్పఁబడినది.
శ్లో. ...శివ మివానుగతం గజచర్మణా. సం. కిరా. 5, 2.
3. పొందఁబడినది. 4. వెంబడించినది, అనుసరించినది. 5. సరివడినది, తగినది, అనుగుణమైనది. 6. అనుకరించినది.

ఉదా: 'భవతి పరితుష్టోస్మి పితర మనుగతో వత్స ఇతి.' మాళవి. 5. 150. పా.

**అనుగతి** సం. వి. ఇ. స్త్రీ. అనుసరించుట, వెంబడించుట,

**అనుగమనము** సం. వి. అ. న—అనుగమము.

**అనుగమము** సం. వి. అ. పుం. 1. వెంబడించుట, 2. ఆశ్రయణము, సేవ.
శ్లో. కృతేతు దీయతేగత్వా, త్రేతాయా మాహృతాయవై, ద్వాపరే యాచమానాయ కలౌత్వనుగ మాన్వితే. శబ్దకల్పద్రుమము.
3. గ్రహించుట.

**అనుగమించు** సం. స. క్రి. అనుసరించు, వెంబడించు.
ఆ. తనకుఁ దాన కలఁడు జననంబునప్పుడు, మరణమునను సుగతి నరకమునను, దల్లిదండ్రి దక్కు నెల్లబంధులుశరీరంబు ననుగమించి క్రమ్మఱుదురు. భార. అను. 4.250.

**అనుగర్జితము** సం. వి. అ. న. ప్రతిధ్వని, మాఱుమ్రోఁత.

**అనుగలము** విణ. (సం. అనుకూలం. ప్రా. అనుఉలం, అనుఉలం.) 1. అనుకూలము, ఇష్టము.
క. వినిపించె రాజధర్మున. కనుగల మగు సఖుఁడననియు సతనిపనుపునఁ. భార. శాం. 3. 488.
ఆ. రామణీయకంబు రమియించు నిక్కులు, సొంపుగనులు చైత్రసంపదలకు, ననుగలంపుటిరవు లనఁగ రమ్యంబులై, యొప్పు నుపవనంబులప్పురమున. నిర్వ. 1.61. కాశీ. 6.60.
2. సాటి, సమానము.
క. పై నిగుడు మంచు తువ్వర, వానలచేఁదడిసి కమలవనలక్ష్మిహారి, ధ్యాననిమీలితలోచన, యానల రాధావధూటి యనుగలమయ్యెఁ. పాండు. 4.10.
3. సహాయము, తోడు. ఆం. భా. 2.210.
జ. అనుగలించు.

**అనుగలించు** అ. క్రి. (√అనుగలము) ప్రియపడు, ఇష్టపడు.

క. చూచివిసర్జితపరిధీ, డాచింతకుఁడై తదీయ సౌందర్యసరో, వీచికలలోన మునుఁగుచు, తేలుచు నిజహృదయ మనుగలింపఁగ మఱియుఁ. వరాహ. 6.51.

**అనుగవము** నం. విశే. (అ. ఆ. అ.) గోవంత పొడుగైనది. (శకటము)

**అనుగవీనుఁడు** నం. విశే. (అ. ఆ. అ.) గోవులను కాచువాఁడు.

**అనుగామి** నం. విశే. (న్. నీ. న్.)- అనుగుఁడు.

**అనుగాముకము** నం. విశే. (అ. ఆ. అ.) వెంబడించుస్వభావము గలది.

**అనుగీతము** నం. వి. అ. న. అనుసరించి పాడుట.

**అనుగీతి** నం. వి. ఇ. స్త్రీ. 1. అనుసరించి పాడుట. 2. ఆర్యావృత్తభేదము.

**అనుగుఁడు** నం. విశే. (అ. ఆ. అ.) వెంబడించువాఁడు.

**అనుగుణము** నం. విశే. (అ. ఆ. అ.) 1. సమాన గుణము గలది. 2. అనుకూలమైనది, తగినది.

**అనుగుప్తము** నం. విశే. (అ. ఆ. అ.) 1. దాఁపఁబడినది. 2. రక్షింపఁబడినది.

**అనుగృహీతము** నం. విశే. (అ. ఆ. అ.) అనుగ్రహింపఁబడినది.

**అనుగృహ్ణాత్** నం. శతృ. అనుగ్రహించుచున్న.

**అనుగృహ్ణానుఁడు** నం. విశే. (అ. ఆ. అ.) అనుగ్రహించుచున్నవాఁడు.

**అనుగృహ్యమాణుఁడు** నం. విశే. (అ. ఆ. అ.) అనుగ్రహింపఁబడుచున్నవాఁడు.

**అనుగ్రహణము** నం. వి. అ. న—అనుగ్రహము.

**అనుగ్రహణీయము** నం. విశే. (అ. ఆ. అ.) అనుగ్రహింపఁదగినది.

**అనుగ్రహము** నం. వి. అ. పుం. అనుగ్రహించుట, దయచూపుట. (హితసంపాదనాహితనివారణ ప్రవృత్తి)

**అనుగ్రహించు** నం వ. క్రి. 1. దయతోనిచ్చు, ప్రసాదించు. (దీనికి సందర్భానుసారముగా 'దయతో నుపదేశించు, దయతోఁ గావించు' మొదలగునర్థములు వచ్చును.)

వ. దీనికంటె వినవలయునది గలదె దీనిన సువ్యక్తంబుగా ననుగ్రహింపవే. భార. శాం. 5.160.

శా. తండ్రీ నాకు ననుగ్రహింపఁగదె వైద్యం బంచు...మనుచ. 5.17.

2. దయతోఁజూచు.

ఉదా: న న్ననుగ్రహింపుము.

వ. అని శాపం బిచ్చి పదంపడి యనుగ్రహించి ...ఒక్క సత్పురుషునిదర్శనంబున దురితంబులఁ బాసి పుణ్యలోకంబులఁ బడయువాఁడవనిన. భా. ఉద్యో. 1.201.

**అనుగ్రహీత** నం. విశే. (ఋ. త్రీ. ఋ.) అనుగ్రహించువాఁడు.

**అనుగ్రహీతవ్యము** నం. విశే. (అ. ఆ. అ.) అనుగ్రహింపఁదగినది.

**అనుగ్రాసకము** నం. వి. అ. పుం నోరెఁడుకబళము.

**అనుగ్రాహకుఁడు** నం. విశే. (అ. హికా. అ.) అనుగ్రహించువాఁడు.

**అనుగ్రాహ్యము** నం. విశే. (అ. ఆ. అ.) అనుగ్రహింపఁదగినది.

**అనుఘటన** నం. వి. ఆ. స్త్రీ—అనుఘటనము.

**అనుఘటనము** నం. వి. అ. న. సంఘటనము, కూర్చుట.

**అనుచరించు** నం. న. క్రి. అనుసరించు, వెంబడించు; సాగనంపు.

గీ. ప్రాణబాంధవుఁడై నయప్పుడిరాజు, నశ్రమార్గంబునం దొయ్య ననుచరింపఁ నశ్రుధారా ప్రవాహంబ యవధిగాఁగ, దైన్యమందుచు మరలె వైదర్భిచూడ్కి. నైష. 2. 100.

**అనుచరితము** నం. విశే. (అ. ఆ. అ.) అనుసరింపఁబడినది. వి. అ. న. ప్రవర్తనము, నడత.

**అనుచరుఁడు** నం. వి. అ. పుం. 1. సహాయుఁడు. 2. భృత్యుఁడు.

**అనుచారకుఁడు** నం. విశే. (అ. రికా. అ.) సేవకుఁడు.

**అనుచింత** సం. వి. ఆ. స్త్రీ. 1. తలఁచుట, ధ్యానించుట. 2. జ్ఞప్తికిఁ దెచ్చుకొనుట. 3. ఎడతెగని చింత.

**అనుచింతన** సం. వి. ఆ. స్త్రీ.—అనుచింత.

**అనుచింతనము** సం. వి. అ. న.—అనుచింతన.

**అనుచితము** సం. విశ. (అ. ఆ. అ.) 1- ఉచితము కానిది-అయుక్తము, తగనిది. 2. అపరిచితము.

**అనుచు** — అంచు¹, అనుపు, అన్పు, అంపు. స. క్రి. (√పనుచు¹) 1. పోవునట్లు చేయు, పుచ్చు.

క. అన విని సత్యవతికిఁ జెప్పిన నాయమ వనుపనంబఁ బెంపుగ వృద్ధాంగనలం దోడుగ నప్పుడ, పనిచి యనిచితిని జనంబు ప్రస్తుతి సేయఁగ. భార. ఉద్యో. 4. 276.

2. వీడ్కొలుపు (పోవుట కనుమతించు.)

గీ. యక్షగంధర్వసాధ్య విద్యాధరులను, నిజపురంబుల కనిచె నిందీవరాక్షుఁ, డుడుగరలొసంగ విభవంబు గడలుకొనఁగ. మనుచ. 5. 103.

3. సాగనంపు.

చ...దారుకసారథియైన దివ్యకాం, చనరథమెక్కి యాక్షణమ సాత్వతకుంజరుఁ డేఁగె భక్తి నాతని ననిచెఁ యుధిష్ఠిరుఁడు దమ్ములుఁ దానును బాదచారియై. భార. సభా. 2. 84.

గీ. అప్రతీపంబు గంధవాహంబు ననిచి, మరలి పోవుతటాకంబుతరఁగ వోలె. నైష. 7. 6.

అనిచిపుచ్చు—అనుమతించి పంపు. అంచిపుచ్చు భార. శాం. 2. 37.

**అనుచ్ఛిష్టము** సం. విశ. (అ. ఆ. అ.) 1. ఉచ్ఛిష్టము కానిది. 2. అనుభవింపఁబడనిది. ('అనుచ్ఛిష్టయావనా.' సం. దశకు.)

**అనుజ** సం. వి. ఆ. స్త్రీ. 1. చెల్లెలు. 2. త్రాయమాణ, కలుకానుగు (వృ. వి.)

**అనుజన్ముఁడు** సం. వి. న్. పుం. తమ్ముఁడు.

**అనుజము** సం. వి. అ. న. ప్రపౌండరీకము (వృ. వి.)

**అనుజాత** సం.—అనుజ.

**అనుజాతుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) తర్వాతఁ బుట్టినవాఁడు. వి. అ. పుం. 1. తమ్ముఁడు. 2. గుణములచేత తండ్రిని పోలినపుత్త్రుఁడు. (చూ. అపజాతుఁడు.)

**అనుజీవి** సం. విశ. (న్. నీ. న్.) ఆశ్రయించి బ్రతుకువాఁడు. వి. న్. పుం. సేవకుఁడు, భృత్యుఁడు.

**అనుజీవ్యుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) సేవింపఁ దగినవాఁడు, ఆశ్రయింపఁ దగినవాఁడు. (ప్రభువు.)

**అనుజుఁడు** సం.—అనుజాతుఁడు.

**అనుజ్ఞ** సం. వి. ఆ. స్త్రీ. 1. అనుమతి, ఇయ్యకోలు. 2. సెలవు, ఆజ్ఞ.

**అనుజ్ఞప్తి** సం. వి. ఇ. స్త్రీ.—అనుజ్ఞాపనము.

**అనుజ్ఞాతుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) 1. ఆజ్ఞాపింపఁబడినవాఁడు. 2. అనుమతి యీయఁబడినవాఁడు.

**అనుజ్ఞానము** సం. వి. అ. న.—అనుజ్ఞ.

**అనుజ్ఞాపకుఁడు** సం. విశ. (అ. వికా. అ.) 1. ఆజ్ఞాపించువాఁడు. 2. అనుమతించువాఁడు, అంగీకార మిచ్చువాఁడు.

**అనుజ్ఞాపనము** సం. వి. అ. న. 1. ఆజ్ఞాపించుట. 2. అనుమతించుట.

**అనుజ్యేష్ఠము** సం. అవ్య. అ. న. జ్యేష్ఠానుక్రమముగా.

**అనుజ్యేష్ఠుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) పెద్దవానికి తరువాతివాఁడు, రెండవవాఁడు.

**అనుతప్తము** సం. విశ. (అ. ఆ. అ.) 1. కాల్పఁబడినది. 2. పశ్చాత్తాప పడినది.

**అనుతరము** సం. వి. అ. న. ఆతరము, పడవకేవు.

**అనుతర్షణము** సం. వి. అ. న. 1. మద్యము త్రాగుట. 2. మద్యపానపాత్రము.

**అనుతర్షము** సం. వి. అ. పుం. 1. దప్పి. 2. కోరిక. 3. మద్యము. 4. మద్యపానమునం దిచ్ఛ. 5. మద్యముత్రాగుట. 6. కల్లు త్రాగెడుగిన్నె.

**అనుతాపనము** సం. విశ. (అ. ఈ. అ—కరణార్థమున.) 1. పశ్చాత్తాపము కలిగించునది. 2. తాపమును కలిగించునది.

**అనుతాపము** సం. వి. అ. పుం. 1. తాను చేసినది తప్పని యెఱిఁగి దానిఁగూర్చి పిదప దుఃఖపడుట, పశ్చాత్తాపము. 2. తాపము.

**అనుతాపి** సం. విణ. (న్. నీ. న్.) 1. పశ్చాత్తాపము గలవాఁడు. 2. తాపము గలవాఁడు.

**అనుతాపించు** సం. అ. క్రి. తపించు, తాపము నొందు

క. ఈమతము సేయు మనపుడు, నామాటకు నంగ మెల్ల ననుతాపింపఁగ, మోమున దైన్యం బొదవఁగ, దామోదరు మొగముఁ జూచి తగనిట్లంటిన్. పద్మ. 6. 165.

**అనుత్కము** సం. విణ. (అ. ఆ. అ.) ఉత్కంఠితము కానిది, స్వస్థము.

**అనుత్తమము** సం. విణ. (అ. ఆ. అ.) 1. దేనికంటె మేలయినది లేదో అది, మిక్కిలి శ్రేష్ఠము. 2. ఉత్తమము కానిది.

**అనుత్తర** సం. వి. ఆ. స్త్రీ. దక్షిణదిక్కు.

**అనుత్తరము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ముఖ్యము, అత్యంతశ్రేష్ఠము. 2. దేనికి ప్రత్యుత్తరము లేదో అది. (పూర్వపక్షాదికము) 3. ప్రత్యుత్తరము చెప్పనిది. 4. చలింపనిది, స్థిరము. 5. నీచము. 6. దక్షిణదిక్కున నున్నది. వి. అ. న. 1. సరికాని సమాధానము. 2. ఉత్తరము లేకుండుట.

శ్లో: భవ త్యవజ్ఞా చ భవత్యనుత్తరాత్. సం. నైష. 9. 25. (ఉత్తరం మీయకుండుట వలన-అని తాత్పర్యము.)

**అనుత్సాహము** సం. విణ. (అ. ఆ. అ.) ఉత్సాహము లేనిది. వి. అ. పుం. ఉత్సాహములేమి.

**అనుత్సేకము** సం. వి. అ. పుం వినయము. ('అనుత్సేకః ఖలు విక్రమాలంకారః' విక్రమో. 1.)

**అనుదరుఁడు** సం. విణ. (అ. ఈ. అ.) సన్నని నడుము కలవాఁడు.

**అనుదర్శనము** సం. వి. అ. న. 1. పరీక్షించుట, కనుపెట్టి చూచుట. (ఉత్థితశ్చాప్రమత్తశ్చ బలానామనుదర్శనే రామా.) 2. కనిపట్టుట, తెలిసికొనుట. (జన్మమృత్యుజరావ్యాధి దుఃఖదోషానుదర్శనం. గీత. 13. 8.)

**అనుదాత్తము** సం. వి. అ. పుం. నీచైస్స్వరము, ఉదాత్తానుదాత్తస్వరితములలో రెండవది; ఉచ్చారణసాధనము లగుతాల్వాదిస్థానముల యధోభాగమున ఉత్పన్న మగుఅచ్చు.

**అనుదారుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఉదారుఁడు కానివాఁడు. 2. మిక్కిలి ఉదారుఁడు. 3. భార్యననుసరించినవాఁడు. 4. అనుసరించిన భార్యకలవాఁడు.

**అనుదితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. చెప్పఁబడనిది, ఉచ్చరింపఁబడనిది. 2. ఉదయింపనిది. వి. అ. పుం. అక్కడక్కడ నక్షత్రములు గల సూర్యోదయపూర్వకాలము.

**అనుదినము** సం. అవ్య. అ. న. ప్రతిదినము.

**అనుదివసము** సం. అనుదినము. (అనుదివసం పరిహీయసేంగైః-నానాఁటికిచిక్కుచున్నావు. శాకుం. 3.)

**అనుద్యము** సం. విణ. (అ. ఆ. అ.) పలుకఁగూడనిది, చెప్పరానిది. (అనుద్యం గురునామ. కౌముది.)

**అనుద్యూతము** సం. వి. అ. న. పునర్ద్యూతము, మరల నాడు జూదము.

వ. వారల ననుద్యూతంబునఁ బరాజితులంగావించి విరళదేశ నిర్వాసితులం జేయుట కార్యంబనిన విని. భాగ. సభా. 2. 274.

**అనుద్రుతము** సం. విణ. (అ. ఆ. అ.) వెంబడింపఁబడినది. వి. ఆ. న. (సంగీ) అర్ధద్రుతము, పాతికమాత్ర. (తాళమందలి కాలభేదము.)

**అనుధావనము** సం. వి. అ. న. 1. వెంటఁ బరుగెత్తుట. 2. పరిశోధనము, తత్త్వాన్వేషణము. 3. పరిశుద్ధిచేయుట.

**అనుధ్యాతము** సం. విణ.(అ. ఆ. అ.) 1. ధ్యానింపఁబడినది, తలఁపఁబడినది. 2. అనుగ్రహింపఁబడినది.

**అనుధ్యానము** సం. వి. అ. న. 1. ధ్యానము, తలఁచుట. 2. అనుగ్రహము.

అనుధ్యాన 'మనుగ్రహే' ఉత్పలమాల. ని.

**అనుధ్యేయుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) 1. తలఁపఁదగినవాఁడు. 2. అనుగ్రహింపఁ దగినవాఁడు. 'అనుదధ్యౌ రనుధ్యేయమ్.' సం. రఘు. 17. 36.

**అనునయము** సం. వి. అ. పుం. 1. సాంత్వనము, ఊఱడించుట. 2. ప్రార్థనము.

శ్లో. రతేర్గృహీతానునయేన కామం ప్రత్యర్పిత స్వాంగమీ వేశ్వరేణ సం. రఘు. 6. 2

**అనునయించు** సం. న. క్రి. ఊఱడించు, బతిమాలు.

వ. ఆ శిశుపాలు పిఱుందన చని ధర్మనంద నుండు వానిం బ్రియవచనంబుల ననునయిం చుచు నిట్లనియె. భార. సభా. 2. 16.

**అనునాదము** సం. వి. అ. పుం. 1. ప్రతిధ్వని. 2. ధ్వని.

**అనునాది** సం. విణ. (న్. నీ. న్.) 1. ప్రతి ధ్వనించునది. 2. ధ్వనించునది.

**అనునాయకుఁడు** సం. విణ. (అ. యికా. అ.) అనునయించువాఁడు.

**అనునాయిక** సం. వి. ఆ. స్త్రీ. నాయిక ననుసరించి యుండు చెలికత్తె, దాసి. మొ.

శ్లో. సఖీ ప్రవ్రజితా దాసీ ప్రేష్యా ధాత్రే యికా తథా, అన్యాశ్చ శిల్పకారిణ్యోవిజ్ఞే యాహ్యనునాయికాః. (వాచ.)

**అనునాసికము** సం. విణ. (అ. ఈ. అ.) ముక్కుతో నుచ్చరింపఁబడునది. (వర్ణము).

**అనునీతి** సం. వి. ఇ. స్త్రీ.—అనునయము.

**అనునీతుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) అనునయింపఁ బడినవాఁడు.

**అనుపఠితము** సం. విణ. (అ. ఆ. అ.) గురువు చెప్పినదాని ననుసరించి మరలఁ జెప్పఁబడినది.

**అనుపతనము** సం. వి. అ. న. 1. ఒకటి వెనుక నొకటిగాఁ బడుట. 2. ఒకటివెనుక నొకటిగా వ్రాలుట. 3. వ్రాలుట. 4. వెంబడించుట. 5. (గణిత) త్రైరాశికము.

**అనుపథము** సం. విణ. (అ. ఆ. అ.) మార్గము ననుసరించినది. వి. అ. పుం. అనుకూలమైన మార్గము. అవ్య. అ. న. మార్గానుసారముగా.

**అనుపదము** సం. విణ. (అ. ఆ. అ.) అడుగుల ననుసరించునది. 2. మాటమాటను అనుసరించు నది. (వ్యాఖ్యానము. మొ.) వి. అ. న. 1. సంగీ తమున చరణచరణము పిమ్మటను తిరుగఁ దిరుగఁబాడెడి గీతభాగము.(పల్లవి) 1. కంఠము నందు చేయుచుంబనము.

సీ. చిత్తజు గృహమున నుత్తర స్ఫుటితంబు పొక్కిట సంపుటంబుమ శిరోధి, ననుపదం బూరుల నన్వితం బననొప్పు దశ చుంబన ములు దత్తత్స్థలముల. హంస. 5, 148.

అవ్య. అ. న. 1. పాదము పొడుగునను, పాద ప్రమాణముగా. 2. అడుగుల వెంబడివే, తోడుతో. 3. అడుగడుగునకు. 4. మాట మాటకు. ప్రతిపదనమునకు.

**అనుపది** సం. విణ. (న్. నీ. న్.) 1. వెంటఁ బోవు వాఁడు. 2. వెదకువాఁడు. శిశు. 9. 70.

**అనుపదికము** సం. విణ. (అ. ఆ. అ.) వెంబడించు నది, వెంటఁ బోవునది.

**అనుపదీన** సం. వి. ఆ. స్త్రీ. కాలికి సరిపడిన పాద రక్ష.

**అనుపపత్తి** సం. వి. ఇ. స్త్రీ. — ఉపపత్తిలేమి — 1. పొసఁగుపాటులేమి, సరిపడకుండుట. 2. యుక్తిలేమి. 3. సిద్ధింపమి, నెఱవేఱమి.

**అనుపపన్నము** సం. విణ. (అ. ఆ. అ.) 1. అసం గతము, పొసఁగనిది. 2. అయుక్తము. 3. యుక్తియుక్తము కానిది.

**అనుపమ** సం. వి. ఆ. స్త్రీ. నైరృత దిక్కునందలి యాఁడేనుఁగు.

**అనుపమము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఉపమా నము లేనిది, సాటి లేనిది. 2. మేలైనది, శ్రేష్ఠము.

**అనుపమితము** సం. విణ. (అ. ఆ. అ.) — పోల్పఁ బడనిది — సాటిలేనిది.

**అనుపమేయము** సం. విణ. (అ. ఆ. అ.) — పోల్ప రానిది — సాటిలేనిది.

**అనుపయుక్తము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఉప యోగింపఁబడనిది. 2. ఉపయోగము లేనిది, పనికిమాలినది. 3. యుక్తము కానిది, తగనిది.

**అనుపయోగము** సం. విణ. (అ. ఆ. అ.) ఉప యోగము లేనిది. వి. అ. పుం. ఉపయోగము లేమి.

**అనుపరి** వి. (√అనుపు) సుంకరి, సుంకము పుచ్చుకొను అధకారి.

**అనుపలంభము** సం. వి. అ. పుం.—అనుపలబ్ధి.

**అనుపలబ్ధము** సం. విశ. (అ. ఆ. అ.) 1. పొందఁబడనిది. 2. గ్రహింపఁబడనిది, తెలిసికొనఁబడనిది.

**అనుపలబ్ధి** సం. వి. ఇ. స్త్రీ. 1. పొందుటలేమి. 2. గ్రహింపమి, తెలిసికొనమి.

**అనుపల్లవము** సం. వి. అ. పుం గీతావయవము. (పల్లవము వెంబడిని పాడఁబడునది. చూ. పల్లవము. దీనికి ప్రాచీనగీత గ్రంథములందు ప్రయోగము కనఁబడదు. అనుపల్లవి అని వ్యవహారము.)

**అనుపవీతుఁడు** సం. విశ. (అ. ఆ. అ.)—ఉపవీతము లేనివాఁడు—ఉపనయనము కానివాఁడు.

**అనుపసంహారి** సం. వి. న్. పుం. (తర్క) ఒక హేత్వాభాసము. (ఇది అనైకాంతికములలో నొకటి. దీనికి అన్వయమందును వ్యతిరేకమందును దృష్టాంతము లేకుండుటవలన నిది దుష్టము.)

**అనుపాఖ్యము** సం. విశ. (అ. ఆ. అ.) ప్రత్యక్షము కానిది, అనుమేయము.

**అనుపాతకము** సం. వి. అ. న. మహాపాతకసదృశమగుచౌర్యము వధము మొదలగుపాపము. (అనుపాతకములు 35 అని విష్ణుస్మృతి.-30అని మనుస్మృతి.)

**అనుపాతము** సం. వి. అ. పుం.—అనుపతనము.

**అనుపాతి** సం. విశ. (న్. నీ. న్.) 1. వెంబడించునది, 2. అనుసరించునది.

**అనుపానము** సం. వి. అ. న. మందుతోఁగాని మందు వెంబడిని గాని పుచ్చుకొనెడి వస్తువు.

**అనుపాలనము** సం. వి. అ. న. పోషించుట, రక్షణము.

**అనుపు(న్పు)**—అనుచు.

(పుచ్చు)

చ. ...కంజముఖి యనుమాన మున్న ని, ప్డను పుము దవ్వుగాఁ జెలుల వచ్చుటసత్క్రియ లెల్లఁ జెప్పెదన్. కళా. 2, 156.

గీ. నాకు నాయంతవారల ననుపంగఁ గల్గె. కాశీ. 6. 66.

(వీడ్కొలుపు.)

గీ. అతని దీవించి నీవు పొమ్మ్మచటి కేము.నరుగు దెంచెద మని ప్రీతి ననుప నరిగి. భార. ఉద్యో. 8, 146.

(సాగనంపు)

చ. అని గమనోన్ముఖుం డయి మురాంతకుఁ డా ద్రుపదుండు ధర్మనం,దనుఁడు వృకోదరాదులగు తమ్ములు మత్స్యమహీవిభుండుఁ ద, న్ననుప...నిజపట్టనంబునకు, బోయె... భార. ఉద్యో. 1. 47. నైష. 7. 4.

వి. 1. అనుచుట, అనుపుట.

2. ప్రయాణము చేయువారితోకూడఁ బంపు తోడు; కావలి.

సీ.తస్కరబాధ నొందకయుండ నెడరైనయటవీ స్థలంబున ననుపుఁ బెట్టు. కాశీ. 4. 61.

3. పథికులు చెల్లించుసుంకము.

సీ. ...కాలరి నాఁగ ననుపు నాఁగ, నధిగంతృ భాగధేయము చెలంగును. ఆం.భా. 2.192.

గీ, తెఱవ లిటు నీరువోయుపందిరియ చేరి, యవలఁ గొఱగాక పిచ్చుకుంతై యనంగుఁ, డనుపుఁ గొనఁజొచ్చెఁ గల్లగుట్టమర వారి, కధ్వగులు లాఁచి యిడువిడియములపేర. ఆము. 2, 58.

**అనుపురుషుఁడు** సం. వి. అ. పుం.—అనుచరుఁడు.

**అనుపుష్పము** సం. వి. అ. పుం. జెల్లు (వృ.వి.).

**అనుపూర్వము** సం. విశ. (అ. ఆ. అ.)—ముందటిదానికి తగినపరిమాణము కలది — ఆఁదోఁకగా నున్నది.

శ్లో; వృత్తానుపూర్వేచ నచాతిదీర్ఘే. సం. కు. సం. 1. 31,

**అనుపేతుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) 1. (ధనాదులతో) కూడుకొనని వాఁడు. 2. అనుపనీతుఁడు, నడుగు కానివాఁడు.

**అనుప్రయోగము** సం. వి. అ. పుం. తరువాతప్రయోగించుట.

**అనుప్రవచనము** సం. వి. అ. న. గురుముఖమున నుచ్చరింపఁబడినదానిని మరలఁ జెప్పుట.

**అనుప్రవేశము** సం. వి. అ. పుం. 1. అనుసరించుట, ఒకని మనస్సునకుఁ దగినట్లు నడచుకొనుట. 2. చొచ్చుట.

**అనుప్రశ్నము** సం. వి. అ. పుం. ఉపాధ్యాయుఁడు చెప్పినదాని ననుసరించి యడిగినప్రశ్న.

**అనుప్రాప్తము** సం. విణ. (అ. ఆ. అ.) 1. పొందినది, 2. పొందఁబడినది.

**అనుప్రాప్తి** సం. వి. ఇ. స్త్రీ. పొందుట.

**అనుప్రాసము** సం. వి. అ. పుం. శబ్దాలంకారభేదము.

సీ. ముక్కంటిదరహాసమున కనుప్రాసంబు... గీ...మంత్రియన్నయదేవయ్యమహిత యశము భీమ. 1; 58. (ఇట 'ప్రతిబింబము, సాటి' అని భావము)

**అనుప్లవుండు** సం. — అనుచరుఁడు.

**అనుబంధకము** సం. విణ. (అ. ఆ. అ.) సంబంధించినది.

**అనుబంధనము** సం. వి. అ. న — అనుబంధము.

**అనుబంధము** సం. వి. అ. పుం. 1. కట్టు, బంధము. 2. సంబంధము. 3, సంసారబంధము. 4. అనుసరించుట. 5. ఎడతెగకుండుట. 6. పరంపర, వరుస. 7. శుభాశుభకర్మఫలము. 8. ప్రధానము ననుసరించి యుండెడియప్రధానవిషయము. 9. గ్రంథాదియందు నిర్ణయింపఁదగు విషయప్రయోజనాధికారి సంబంధ చతుష్టయము. 10. దోషము, దోషప్రకటనము 11. (వ్యాక) సంస్కృతమున ఇత్సంజ్ఞకము; తెలుఁగున ధాతువునకుఁ జేర్పఁబడెడి 'ఉన్న, కల, పడు.'

**అనుబంధి** సం. విణ. (న్. నీ. న్.)—అనుబంధము గలది. –1. సంబంధించునది. 2. అనుసరించునది. 3. ఎడతెగనిది. వి. ఈ. స్త్రీ. 1. దప్పి. 2. ఎక్కిళి.

**అనుబంధించు** సం. అ. క్రి. ఎడతెగకకలుగు, అనుస్యూతమగు.

వ. మేలు లనుబంధించు మేలులట్లకీళ్లును ననుస్యూతంబులై తొడరు నాకర్ణింపుము. భార. శాం. 4. 71.

**అనుబంధుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) తల్లితండ్రి గురువు లోనగుపెద్దలననుసరించి నడచువాఁడు.

**అనుబద్ధము** సం. విణ. (అ. ఆ. అ.) 1. కట్టఁబడినది. 2. సంబంధించినది. 3. ఎడతెగనిది. 4. లగ్నమైనది. తగిలియున్నది.

**అనుబలము** సం. వి. అ. న. సేనవెనుక సహాయముగా పోవుసేన.

**అనుబోధనము** సం. వి. అ. న. జ్ఞప్తికిఁ దెచ్చుట.

**అనుబోధము** సం. వి. అ. పుం. 1. పూర్వ మలఁదుకొన్న చందనాదులకు పరిమళముపోఁగా పరిమళమునకై మరలఁబూసికొనుట, ప్రబోధనము. 2. పశ్చాదోద్బోధము, స్మృతి.

**అనుభవము** సం. వి. అ. పుం. 1. స్మృతి భిన్న జ్ఞానము, ప్రత్యక్షాదిజ్ఞానము. 2. (సుఖదుఃఖాదులను) పొందుట.

**అనుభవి** సం. విణ. (న్. నీ. న్.) అనుభవముకలవాఁడు.

**అనుభవించు** సం. స. క్రి. (సుఖదుఃఖములు) పొందు. భార. ఆది. 3. 193. మార్క. 1.185.

**అనుభావకము** సం. విణ. (అ. వికా. అ.) తెలుపునది, గ్రహింపఁ జేయునది, సూచించునది.

**అనుభావనము** సం. వి. అ. న. ముఖవికాసాది చిహ్నములచేత మనస్సునందలి భావమును సూచించుట.

**అనుభావము** సం. వి. అ. పుం. 1. ప్రభావము, తేజస్సు. 2. అధికారము. 3. భావమునుదెలిపెడి ముఖవికాసాది.

**అనుభావి** సం. విణ. (న్. నీ. న్.) 1. అనుభవము గలవాఁడు; అనుభవించువాఁడు. 2. ముఖవికాసాదులచేత భావమును సూచించువాఁడు.

**అనుభావ్యము** సం. విణ (అ. ఆ. అ.) అనుభవింపఁదగినది.

**అనుభాష** సం. వి. ఆ. స్త్రీ. అనువాదము.

సీ....నలువశుద్ధాంతంబున కనుభాష...గీ... మంత్రియన్నయదేవయ్య మహితయశము

భీమ. 1.53. (ఇట 'ప్రతిబింబము, సాటి' అనిభావము.)

**అనుభాషణము** సం. వి. అ. న. 1. సహభాషణము, ముచ్చటించుట. 2. అనువదించుట, మరలఁ జెప్పుట.

**అనుభాషిత** సం. విశ. (పు. స్త్రీ. పు.) ఉత్తరము చెప్పువాఁడు.

**అనుభుక్తము** సం. విశ. (అ. ఆ. అ.) అనుభవింపఁబడినది.

**అనుభుక్తి** సం. వి. ఇ. స్త్రీ. అనుభవము

**అనుభూతము** సం. విశ. (అ. ఆ. అ.) అనుభవింపఁబడినది.

**అనుభూతి** సం వి. ఇ. స్త్రీ. 1. అనుభవము. 2. (తర్క.) ప్రత్యక్షాదిప్రమాణజన్యజ్ఞానము.

**అనుభోగము** సం. వి. అ. పుం. 1. అనుభవము. 2. చేసినకొలువునకై యిచ్చెడుమాన్యక్షేత్రము, (ఈనాము.)

**అనుభోగించు** సం. స. క్రి. అనుభవించు.

క. తనవునకు నాత్మవేఱంట,యనుభోగించునఁట పిదప నాముష్మికముల్. ప్రబోధ. 2. 31.

**అనుభ్రాత** సం. వి. ఋ. పుం. అనుజుఁడు,తమ్ముఁడు.

**అనుమ** సం. వి. ఆ. స్త్రీ. (తర్క.) 1. అనుమితి 2. అనుమానము. సం. నైష. 11. 12.

**అనుమంత** సం. విశ. (పు. స్త్రీ. పు.) సమ్మతించువాఁడు.

**అనుమంత్రణము** సం. వి. అ. న. యాగాదులందు మంత్రోచ్చారణపూర్వక మగునొకసంస్కారవిశేషము.

**అనుమఁడు** వి. (సం. హనుమాన్. ప్రా.హనుమా. క. తు. అనుమంత. త. అనుమాన్.) హనుమంతుఁడు.

క. వినుమనుమఁడ వినుమనుమఁడ, వనఁదనరివ నీకు నెందు నడ్డముగలదే, యని కౌఁగిట నిడుకొని దీవెన లెన్నేనియు నొసంగి వీడ్కొలు పుటయుఁ. అచ్చ. రా. యు 406.

**అనుమతము** సం. విశ. (అ. ఆ. అ.) 1. సమ్మతింపఁబడినది, ఒప్పుకొనఁబడినది. 2. ప్రియము, ఇంపయినది. వి. అ. న. 1. అనుజ్ఞ. 2. అనుమోదము, సమ్మతి.

**అనుమతి** సం. వి. ఇ. స్త్రీ. 1. అంగీకారము,సమ్మతి. 2. ఒక్కకళ తక్కువైనచంద్రుఁడుగలపున్నమ.

**అనుమతించు** సం. అ. క్రి. 1. ఒడఁబడు. సమ్మతించు.

సీ. నిటలాక్షుధనువుఁ ద్రుంచుటకుఁ గౌశికుఁ డెట్టు లనుమతించె నటంచు నమరు లనఁగ ఉ. రా. 1. 88.

స. క్రి. సెలవిచ్చి పంపు.

చ. ...పనుభవదీయ సమాగతిఁ జేసిధర్మసం, స్థిత మతినైతి నన్ననుమతింపు గుణాకర పోయివచ్చెదన్. వ. అని వానికిం బ్రదక్షిణంబు సేసి వీడ్కొనిచని కౌశికుండు. భార. అర. 5. 144, 145.

**అనుమతిపత్రము** సం. వి. అ. న. ఒడంబడికపత్రము.

**అనుమతుఁడు** సం. వి. అ. పుం. ప్రియుఁడు,వలపుకాఁడు.

శ్లో. ...పరరేఖిరే ఘనమతో నమతో నుమతాః ప్రియాః. శిశు. 6. 65.

**అనుమననము** సం. వి. అ. న. 1, అనుచింతనము, మననము చేయుట. 2, సమ్మతి.

**అనుమరణము** సం. వి. అ. న. 1. సహమరణము. సహగమనము. 2. మరణించినభర్తయొక్క దేహము దొరకనప్పుడు అతనిపాదుకాదులను గొని భార్య వేఱుచితి నెక్కి దేహమును విడుచుట. (ఇదిభర్తకు దేశాంతరమరణము కలిగినపుడు చేయునది. దీనికి క్షత్రియాదిస్త్రీలకే యధికారము, విప్రస్త్రీకిలేదు.)

**అనుమాత్ర** సం. విశ. (పు. స్త్రీ. పు.) అనుమితి చేయువాఁడు.

**అనుమానము** సం. వి. అ. న. అనుమితికి సాధనము, ప్రత్యక్షానుమానోపమానశాబ్దము లనెడి ప్రమాణములలో నొకటి. 2, ఊహించుట, ఊహ. 3. ఒకఅర్థాలంకారము. 4. సందేహము, సంశయము.

మ. అనుమానాకులతం బదంబు మృదుశయ్యం గూర్పఁగా లేక...కవిక. 4. 167.

క. జననీవధంబు చేసిన, ననుమానమె నరక మగుట...భార. శాం. 5, 267,

(ఈఅర్థము ఆంధ్రగ్రంథములందే కనఁబడు చున్నది, తెలుఁగుపదమని ఆం. శే. 32.)

**అనుమానపడు** మి. అ. క్రి. అనుమానము నొందు, అనుకొను, ఊహచేయు.

ద్వి. ననుఁ జూడ రావని నాలోన నేను, నమ మానపడఁగ నేఁ డనుకూల మాయె ద్వి. శసా. 1 472. పం.

**అనుమానించు** సం, అ. క్రి. సంశయించు, సందేహ పడు

మ. అనుమానింపక యానుబాంధసులు మాయా కల్పనావంచనం,బున వైశ్వానరునిఁ హరిం చిరి...కాశీ. 5. 311.

క. ...ఆతం,డనుమానింపఁ డఖలక్రియలుం బోఁద్రోచున్...భార. శాం. 6, 328.

స. క్రి. 1. ఊహించు.

గీ. పద్మముఖతోడ నెవ్వరేఁ బారిజాత. పుష్ప వృత్తాంత మెఱిఁగింపఁ బోలునొక్కొ.

క. అని యనుమానించుచు నొ,య్యనఁ గోప గృహంబు సేరి యాసాత్రాజి,త్తనయ ముసుంగిడి యుండఁగ, ననువు మెఱయఁ జొచ్చి మాయ యచ్చుపడంగన్. పారి. 1. 106. 107.

2. అనుమాన ప్రమాణముచే తెలిసికొను.

మ. ...మన మానందముఁ బొందె నిట్లగుడు సన్మానించి యే నత్తఱిన్, గనుదో యల్లన విచ్చి మేదినియు నాకాశంబునుం జూచితిన్ దశకు. 9. 5.

('అన్మానించు' అనుసంశ్లిష్టరూపము 'అనుమా నము' తెనుఁగనుటకు సాధనము చూ. అను మానము.)

**అనుమాపకము** సం. విశ. (అ. వికా. అ.) ఊహ కలిగించునది, అనుమితికి హేతువైనది.

**అనుమానము** సం. వి. అ. పుం. తరువాతినెల, ఆవలినెల. అవ్య. అ. న. ప్రతిమాసము.

**అనుమితి** సం. వి. ఇ. స్త్రీ. 1. (తర్క) అనుమాన ప్రమాణమువలనఁ గలిగినజ్ఞానము, పరామర్శ జన్యజ్ఞానము. 2. ఊహ.

**అనుమిత్స** సం. వి. అ. స్త్రీ. అనుమితి చేయ నిచ్ఛ, ఊహింపనిచ్ఛ.

**అనుము(న్ము)** వి. సస్యవిశేషము.

(వృత్తియందు 'ప' వర్ణము ఆదేశముగా వచ్చును.)

ఉదా: అనుపగింజ, అనుపచేను, మొ.

బ. నిష్పావములు, ధాన్యవిశేషము.

చ. ...ఇ,ట్లను నివె పొట్టికందులును నన్ములు నున్నవి. ...భోజరా. 6. 242.

**అనుమృతుఁడు** సం. విశ. (అ. ఆ, అ.) చచ్చిన వానివెంట (శోకాదులచే) చచ్చినవాఁడు.

**అనుమేయము** సం. విశ. (అ. ఆ. అ.) అనుమతి చేయఁదగినది; ఊహింపఁ దగినది.

**అనుమోదనము** సం. వి. అ. న. 1. సమ్మతి. ఒప్పు దల. 2. సంతోషించుట. 3 సంతోషపెట్టుట.

**అనుమోదము** సం. వి. అ. పుం. 1. సంతోషము. 2. సమ్మతి, అంగీకారము.

**అనుమోదించు** సం. అ. క్రి. సంతోషించు.

క, ...విప్రవరుఁడు మునిజనములు పూ,జనము నొనరింప ఖేచరు,లనుమోదింప విహరించె నప్రతిహతుఁడై. భార. శాం. 5. 361.

స. క్రి. సమ్మతించు, అంగీకరించు.

క. ఏవాఁ డెమ్మెయిఁ జెప్పిన, నావసుధా ధిపుఁడు దాని ననుమోదించున్, భావము సంతోషశ్రీ, భావితమగుచుండఁ గురు నృపాలప్రవరా. భార. శాం. 4. 341.

**అనుమోదిల్లు** సం. అ. క్రి. హర్షించు, సంతో షించు.

క. అనినన్ మీజననియు నే ననుమోదిల్లితిమి మీకు నాశుభవార్తల్, వినిపింపవచ్చితి... ముకుంద. 3. 180.

**అనుయాజము** సం. వి. అ. పుం. యాగాంగ మగు కర్మవిశేషము.

**అనుయాత** సం. విశ. (ఋ. క్రి. ఋ.) అనుసరించి పోవువాఁడు.

**అనుయాత్ర** సం. వి. అ. స్త్రీ. వెంటఁ బోవుట.

**అనుయాత్రము** సం. విణ. (అ. ఆ. అ.) వెంటఁ బోవునది. వి. అ. పుం. పరిజనము, పరివారము.

**అనుయాత్రికుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) అనుచరుఁడు.

**అనుయానము** సం. వి. అ. న. వెంటఁ బోవుట.

**అనుయాయి** సం. విణ. (న్. నీ. న్.) 1. వెంటఁ బోవువాఁడు. 2. అనుసరించువాఁడు. 3. ఆశ్రితుఁడు.

**అనుయుక్తుఁడు** సం.విణ. (అ. ఆ. అ.) 1. ప్రశ్నింపఁబడినవాఁడు. 2. భృతకాధ్యేత, డబ్బిచ్చి చదువుకొనువాఁడు,

**అనుయోక్త** సం. విణ. (ఋ. త్రీ. ఋ.) 1. ప్రశ్నమడుగువాఁడు - ప్రాశ్నికుఁడు. 2 అధ్యాపకుఁడు: భృతకాధ్యాపకుఁడు.

**అనుయోగము** సం. వి. అ. పుం. 1. ప్రశ్నము. 2. ప్రయత్నము, 'అనుయోగం వినా తైలంతిలానాం నోపజాయతే.' సం. పంచ. 2. 147.

**అనుయోగి** సం. విణ. (న్. నీ. న్.) 1. కూర్చునది. 2. సంబంధించునది. 3. ప్రశ్నించువాఁడు.

**అనుయోజనము** సం. వి. అ. న.—అనుయోగము.

**అనుయోజ్యము** సం. విణ. (అ. ఆ. అ.) ప్రశ్నింపఁదగినది.

**అనుయోజ్యుఁడు** సం. వి. అ. పుం. సేవకుఁడు,

**అనురంజకుఁడు** సం.విణ. (అ.జికా.అ.) 1. సంతోషపఱచువాఁడు. 2. రంగులు వేయువాఁడు.

**అనురంజనము** సం. విణ. (అ. ఆ. అ.) 1. సంతోషపెట్టునది. 2. రంగులు వేయునది. వి. అ. న. 1. సంతోషపెట్టుట. 2. రంగులు వేయుట.

**అనురంజితము** సం. విణ. (అ. ఆ. అ.) అనురక్తముగాఁ జేయఁబడినది.

**అనురక్తము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఎఱ్ఱనిది. 2. రంగుగలది. 3. అనురాగము గలది.

**అనురక్తి** సం. వి. ఇ. స్త్రీ.—అనురాగము.

**అనురణనము** సం. వి. అ. న. 1. గంటలు మొదలగువాని ధ్వనివెంబడి వెడతెగక వినఁబడుచుండు ప్రతిధ్వని. 2. (అలం) ధ్వనిభేదము.

**అనురతి** సం. వి. ఇ. స్త్రీ. అనురాగము.

**అనురథ్య** సం. వి. ఆ. స్త్రీ. పెద్దబాటకు ప్రక్కనున్నత్రోవ.

**అనురసము** సం. వి. అ. పుం. 1. ప్రతిధ్వని. 2. (అలం) కావ్యమునందలి యప్రధానరసము. 3. ఒకరుచి ననుసరించినరుచి, అప్రధానరుచి.

**అనురసితము** సం. విణ. (అ. ఆ. అ.) శబ్దించినది; మాఱుమ్రోఁగినది. వి. అ. న. ప్రతిధ్వని.

**అనురాగము** సం. వి. అ. పుం. ప్రేమ.

**అనురాగి** సం. విణ. (న్. ణీ. న్.) అనురాగము గలవాఁడు.

**అనురాగించు** సం. అ. క్రి. ప్రేమచూపు, అనురాగము చూపు.

వ. అట్టియెడ రెండుబలంబులవారును బాండవులు తొల్లి పడినపాట్లు సెప్పుకొని వగచుచు వారు సంధికై చేసినయత్నాలు వాక్రుచ్చి మెచ్చుచు నప్పుడు గురుజనంబులయెడఁ బాటించినవినయంబు వర్ణించియనురాగించుచుండి రని చెప్పిన. భార. భీష్మ. 1. 170.

**అనురాగిల్లు(లు)** సం. అ. క్రి. 1. అనురక్తినొందు, ప్రేమగలిగి యుండు.

సీ. సంపూర్ణయౌవను సర్వలక్షణయుక్తుఁ గని యనురాగిల్లి కమలనిలయ. భార. ఆర. 5. 221.

2. సంతోషించు.

క. అని పలుకుచెంచుపలుకుల, కనురాగిలి వేఁట కేప యని పురిఁ జాటం, బనిచె...చంద్రా. 2. 67. కు. సం. 5. 276.

3. ఎఱ్ఱవాఱు, ఎఱ్ఱనగు,

క. తనరాగంబునఁ ద్రిజగము, ననురాగిల్లెనొ జగంబునను రాగముతో, ననురాగిల్లెనొ తా మఱి, యన జగములతోన చంద్రుఁ డనురాగిల్లెన్. కు. సం. 8. 109.

**అనురాధ** సం. వి. ఆ. స్త్రీ.—రాధ (విశాఖ) తరువాత వచ్చునది—ఇరువదియేడునక్షత్రములలో పదునేడవది. (అ. పుం. బ. అనికొందఱు.)

**అనురూపము** సం. విణ. (అ. ఆ. అ.) 1. అనుగుణము, తగినది. 2. సాటియయినది, ఈడయినది.

**అనురోదనము** సం. వి. అ. న. — ఏడ్చువానితో నేడ్చుట — సమదుఃఖత్వము.

**అనురోధకుఁడు** సం. విశే. (అ. ధికా. అ.) — అనురోధి.

**అనురోధనము** సం. వి. అ. న. — అనురోధము.

**అనురోధము** సం. వి. అ. పుం. అనుసరించుట.

**అనురోధి** సం. విశే. (న్. నీ. న్.) అనుసరించువాఁడు.

**అనులాపము** సం. వి. అ. పుం. ముహుర్భాషణము, మాటిమాటికి పలుకుట.

**అనులీనము** సం. విశే. (అ. ఆ. అ.) 1. దాఁగినది. 2. అంటి యుండినది.

**అనులేపకుఁడు** సం. విశే. (అ. వికా. అ.) చందనాదులు పూయువాఁడు.

**అనులేపనము** సం. వి. అ. న—అనులేపము.

**అనులేపము** సం. వి. అ. పుం. 1. చందనాదుల పూఁత. 2. పూసికొనెడిచందనాదికము,

**అనులేపి** సం. విశే. (న్. నీ. న్,)—అనులేపకుఁడు.

**అనులోమ** సం. వి. ఆ. స్త్రీ. పెనిమిటికంటె తక్కువజాతి భార్య.

**అనులోమజుఁడు** సం, విశే. (అ. ఆ. అ.) పెనిమిటి కంటె తక్కువ జాతికళత్రమందుఁ బుట్టినవాఁడు.

**అనులోమము** సం. విశే. (అ. ఆ. అ.) 1. క్రమము ననుసరించి యున్నది. (వ్యతి. విలోమము. ప్రతిలోమము) 2. అనుకూలమైనది.

**అనువందు** అ. క్రి. (√అనువు¹) ఒప్పు.

క. ఏనువిందైై యొకపురవరమనువందుఁ భువిమదేభవాయభటంభం, జనమై...శుక. 1. 418.

**అనువక్త** సం. విశే. (ఋ. క్త్రీ. ఋ.) 1. అనుసరించి చెప్పువాఁడు. 2. (వేదాదికము) సంతచెప్పుకొనెడువాఁడు.

**అనువచనము** సం. వి. అ. న. 1. చెప్పినది మరలఁ జెప్పుట. 2. యజ్ఞమున ప్రైషము ననుసరించి మంత్రములు పఠించుట.

**అనువచించు** సం. న. క్రి. మరలఁజెప్పు.

సీ. మఱవక నే నన్నమాట యొచ్చరికించి యడిగితిఁ గాన నీ కనువచింతు. శ్రీరం.మా. 4.4.

**అనువత్సరము** సం. వి. అ. పుం. 1. సంవత్సరము. 2. (పంచవర్షమానమున) ఐదేండ్లలోని నాలుగవయేఁడు. బార్హస్పత్యమానమందు అఱువదిసంవత్సరములలో సంక్రాంతుల పరిమితి గల యైదవభాగము.

**అనువదించు** సం. న. క్రి. 1. అనువాదముచేయు. 2. ఉపన్యసించు, ప్రసంగించు.

సీ....ఘనతర్కశాస్త్రంబు లనువదింప. రంగా. 2. 4.

**అనువయించు** సం, న. క్రి. సేయు.

వ. అందు సితాసితతంతుసంతానపటంబు ననువయించు చున్నవారి నిద్దఱ స్త్రీలను. భార. ఆది. 1. 108.

**అనువరి** విశే. (√అనువు¹) ఉపాయశాలి, నేర్పరి.

చ...మఱుమాట లాడ నయకోవిదుఁ డెవ్వఁడు ధీరుఁ డెవ్వఁడింక,దనువరి యెవ్వఁడంచు నచలాకృతులై నెఱి నూరకుండఁగఁ. భార. ఉద్యో. 3. 285.

**అనువర్ణించు** సం. న. క్రి. క్రమముగా వర్ణించు.

క.అమ్మహితాంశములు దెలియ ననువర్ణింతుఁ. భార. భీష్మ 1.24.

**అనువర్తనము** సం. వి. అ. న. 1. వెంబడించుట. 2. అనుసరించి నడచుకొనుట. 3. (వ్యాక) పూర్వసూత్రమునుండిపదము అన్వయార్థము పరసూత్రమునకు వచ్చుట.

**అనువర్తి** సం. విశే. (న్. నీ. న్.) అనువర్తించువాఁడు.

**అనువర్తించు** సం. న. క్రి. అనుసరించు; వెంబడించు.

క. ఎఱుఁగవె యజాతశత్రుని, నెఱియును ధర్మంబు సత్యనిష్ఠయు మిము నెఱుంగున ననువర్తించెనొ,యెఱుఁగవె తగుచేవగలుగు టెఱుఁగవె యధిపా. భార. ఉద్యో.3.278.

(ఇట 'విధేయతతో ప్రవర్తించు'అని భావము.)

వ. మార్తాండు ననువర్తించుఛాయా దేవియుం బోలె. నైష. 2. 46.

**అనువశుఁడు** నం. విశ. (అ. ఆ. అ.) లోఁబడిన వాఁడు, అధీనుఁడు.

**అనువహము** నం. వి. అ. పుం. అగ్నియొక్క యేడు జిహ్వాలయం దొకదాని పేరు,

**అనువాకము** నం. వి. అ. పుం. 1. మరలఁ జెప్పుట. అర్థుము, కొన్నిపనసలు గలవేదభాగము.

**అనువాచనము** నం. వి. అ. న. అధ్వర్యునిప్రైషము చొప్పున హోత ఋక్కులను పఠించుట.

**అనువాదకము** నం. విశ. (అ. దెశా. అ.) 1. అనువదించునది. 2. సదృశము, సమానము.

**అనువాదము** నం. వి. అ. పుం. 1. ఒకరు చెప్పిన దానిని మరలఁ జెప్పుట. 2. భాషాంతరీకరణము.

**అనువాది** నం. విశ. (న్. నీ. న్.) — అనువాదకము.

(సదృశము, సమానము.)

శ్లో. తదనువాదిగుణః కుసు మోద్గమః. సం. రఘు. 9. 33.

**అనువాద్యము** నం. విశ. (అ. ఆ. అ.) అనువదింపఁ దగినది.

**అనువారము** నం. అవ్య. అ. న. మాటిమాటికి.

**అనువారు** అ. క్రి. (√అనువు¹ + అరు) ఒప్పు.

ద్వి. ఘనుఁడ చిత్తంబునఁ గలమనోరథము,లను వారి సిద్ధించె నధికభాగ్యమున. రం. రా. ఉ. 25. పొ.

**అనువాసన** నం. వి. అ. స్త్రీ. 1. అనుగత మగు గంధము. అనుసరించి వచ్చినపరిమళము.

మ...చం.దనకాలాగరుసల్లకీతరులయుద్యద్ధూమధూపానువా,సనసొంపైఁ సురభీకృతంబులగుచుఁ సంక్రీడమానామృతా, శనవిద్యాధరసద్విమానవితతుల్...భార. ఆది. 8. 262.

2. అనువాసనము, పరిమళింపఁజేయుట.

**అనువాసనము** నం. వి. అ. న — అనువాసము. పుం. న. 1. చిమ్మనగ్రోవి. 2. ఒకవిధమగువస్తి కర్మము. 3. వస్తికర్మమందు ఎక్కించు తైలాదికము.

**అనువాసము** నం. వి. అ. పుం. పరిమళింపఁజేయుట, అంచులను పరిమళద్రవ్యములలో ముంచి వస్త్రమునకు పరిమళము గలిగించుట.

**అనువాసరము** నం. అవ్య. అ. న. ప్రతిదినము.

చ. ...మధుగర్భము నాఁ జను మేడి దానిపై, మను ననువాసరంబు బహుమానుఁడు... వేం. పంచ. 4. 69.

**అనువాసితము** నం. విశ. (అ. ఆ. అ.) 1. ధూపాదులచే పరిమళింపఁ జేయఁబడినది. 2. గుదద్వారమున లోనికి ఎక్కింపఁబడినది. (మందు, మొ.) 3. వస్తికర్మముచేత చికిత్స చేయఁబడినది.

**అనువిత్తి** నం. అ. ఇ. స్త్రీ. 1. తెలిసికొనుట. 2. పొందుట.

**అనువిద్ధము** నం. విశ. (అ. ఆ. అ.) 1. గ్రుచ్చఁబడినది; తొలివేయఁబడినది. 2. క్రమఁబడినది. ఆవరింపఁబడినది. 3. సంబంధించినది, కూడినది. 4. చెక్కఁబడినది, ఖచితము.

**అనువిధానము** నం. వి. అ. న. ఉత్తరువుప్రకారము చేయుట.

**అనువిధాయి** నం. విశ. (న్. నీ. న్.) 1. ఉత్తరువు ప్రకారము చేయువాఁడు. 2. పోలినది.

శ్లో:నిజవధూశ్వసితానువిధాయిని. శిశు. 6. 23.

**అనువు¹** వి. (క. అను, అనువు) 1. పద్ధతి, విధము, రీతి.

గీ. అనఘ యింద్రియముల విషయములమీఁద, నిగుడనీక మనంబుతో మగుడఁ దిగిచి, యాత్మఁ గూర్చుట సాంఖ్యులయనువు... భార. శాం. 5. 97.

సీ....పురూరవు,పునిమాడ్కి సగరులాగునఁ గార్తవీర్యునియనువున గయునట్టు...శుక. 1.10.

2. ఉపాయము, నేర్పు.

క. తనవున విఱిగినయలుఁగుల, ననువునఁ బుచ్చంగ వచ్చు నతినిష్ఠురతఁ, మనమున నాటినమాటలు,విను మెన్ని యుపాయము లను వెడలునె యధిపా. భార. ఉద్యో. 2. 62. మార్క. 8. 318.

3. అనుకూల్యము.

క. కర్కాటిరికాఁడు కార్యము, చక్కటియెఱుఁ
గండు సంధ్యాజామున నతనిన్, ద్రొక్కపడ
నీవు కొఱల, నొక్కిన నది తెలియ మన
కనువు దప్పుఁ జుమీ. నా. పంచ. 1. 320.

4. పాటవము, సామర్థ్యము.

గీ. దారుణాస్త్రజాలాంశుల వైరిసైన్య, తాప
మొనరించి యానూతతనయతరణి, పార్థ
దుస్తరకాలవైభవము గడవ, ననువులేమి
నవ్విధమున నస్తమించె. భార.కర్ణ. 3.366.

ఆ. సీఁపు వంగె బొమలు ప్రేలఁబడియెఁ
గన్నులనువుదప్పెఁ గదలె దంతంబులు.
భోజరా. 6. 169.

5. అవకాశము, వీలు.

వ. కలభాషిణికంఠంబునకుఁ దనకంఠంబు
నడ్డంబుసేర్చి ప్రేటున కను వీక దాని నిరు
గేలం బొదుగఁబట్టుకొని...కళా. 3. 120.

6. ఒప్పు, బాగు.

చ. ...నీ, వనువున రాజసూయము రయంబునఁ
జేయుము...శశాం. 5. 131.

విశ. 1. అనుకూలము, వీలైనది.

క. అనుమాటలు విని సంక్రం, దనందనుఁ
డిట్లనియె దైవంబుకతంబున నాకు
నొక్కచందంబనువై యున్న యది దీని నొఁ
గాదనుఁడా. భార. విరా. 1. 86.

ఆ. అనువు గానిచోట నధికుల మనరాదు.
వేమన. 1. 23.

2. వశమైనది, అధీనము.

గీ. అయుపాయముల్ మూఁటికి ననువు గాని,
యట్టి పగతుని యెడ భేదమాచరింప. వలయు
...భా. శాం. 2. 416.

3. యుక్తము, తగినది.

క. విను చదువు చెప్పినతఁడుం, దనతండ్రియు
నొక్కరూప తలఁపఁగ నది గా,వున నీవు
నాకు, జెల్లెల,వను వగునా యిట్టిమాట
లాడఁగ నీకున్. యయా. 3. 155.

జ. అనువగు, అనువరి, అనువారు, అనువు
కాఁడు, అనువుకొను, అనువుకొల్పు, అనువు
చేయు, అనువుపడు, అనువుపఱచు, అను
వొందు, అనువొప్పు.

అ. క్రి. (√అనువు) పొందుపడు, అనుకూల
మగు.

సీ. మెచ్చులు వచ్చిన మిగుల నానందించు మన
ముల తలఁపోత కనువుకొనుచు నిర్వ. 8.76.

**అనువు**[2] విశ. (సం. అణుః) సూక్ష్మము, సన్ననిది.

చ. అను వగు కౌనుదీఁగె లసియాడఁ బయోధర
ముల్ వణంకఁగా...భీమ. 5. 103.

**అనువుకాఁడు** విశ. (√అనువు[1]) నేర్పరి, ఉపాయ
శాలి.

సీ. అనువుకాఁడయి తనయక్క అదితిని నచటికే
చనుఁ గదా యనుమిటారి. కువల. 5. 10.

**అనువుకొల్పు** స. క్రి. (√అనువు[1]) పొందుపఱుచు.

గీ. ఈయలంకారముల కెల్లనిలఁ బ్రధాన,మైన
యుపమయ ముందుగా ననువు కొల్పి,
యొకటి కొకటికి భేదముల్ ప్రకటములుగ,
సరవి నెఱిఁగింతు లక్ష్మలక్ష్యంబు లెలమి.
నరస. 5. 6.

**అనువుచేయు** స. క్రి. (√అనువు[1]) సిద్ధపఱుచు,
ఆయత్తపఱుచు.

క. మొన లొఱపుగఁ దీర్చికొనుఁడు, దనతన
వాహనము లాయుధము లెల్లజనంబును
ననువు నేసికొనుఁడు...భార. విరా. 4.89.

**అనువుపడు** అ. క్రి. (√అనువు[1]) 1. ఏర్పడు,
కలుగు.

క. చనుఁగవ ఘనమో జఘనము, ఘనమో
యని నడిమిచక్కిఁ గమిచి విధికరంబునఁ
దూఁచె దీనిఁ గాకిట్లనువుపడునె వళులపేర
నంగుళిరేఖల్. నైష. 5. 16.

సీ. అసురజయలక్ష్మి రాఁ ద్రోవయనువుపడఁగఁ,
దాటకాఖిలవక్షఃకవాటదళన, మాచరించిన
కుంచికయై వెలింగె, రామబాణంబు దోష
నిర్వాపణంబు. రామా. 4. 34.

2. అనుకూలపడు, వీలుపడు.

గీ. వెనుకఁ దొడ్డొకనిపోవ నా కనువుపడదు,
పిల్లలిఁకలువచ్చి వర్ధిల్లుదాఁక. కళా.2.160.

3. నెఱవేఱు.

గీ. యత్న మొనరింతు నీకార్య మనువుపడఁగఁ,
జనుఁడు మీమీ నివాసదేశముల కర్థి. కాశీ.
2. 100.

4. ఒప్పు.

చ. ...లోకముల్, తనయుదయారుణద్యుతివి తానము పేరిఁ బోఁగుణంబుచే, ననువుపడన్ సృజింపఁ గమలాసనుఁ డై ద్విజరాజు రా... వసు. 5, 16.

**అనువుపఱ(ఱు)చు** స. క్రి. (√అనువు¹) 1. పొందు పఱచు.

సీ. కస్తూరికామిశ్రగంధసారంబున నలికంబునఁ ద్రిపుండ్ర మనువుపఱచి. శివరా. 3. 12.

2. కలిగించు.

క. లీలాసంక్రమవేళల, బాలా నీచరణలాక్ష ప్రథమాద్రిశిలా, జాలములఁ గృతకగైరిక, బాలాతపశంక ననువుపఱుచుంగాతన్. నైష. 5. 49.

3. నెఱవేర్చు.

క. కనుఁగొని నాతలఁచినపని, యనువుపఱిచి మఱచితియైన నటయక వేగంబున వత్తు... ఉ. హరి. 2. 91.

4. అలవఱుచుకొను.

గీ. ...అష్టాంగయోగంబు ననువుపఱిచి, యంత నద్వైతభక్తిఁ గృతార్థుఁ డగుచు. భీమ. 5. 161.

5. ఏర్పఱుచు.

సీ. ...ప్రేమతోడ; నెనమదల్ వీరన్న కిరవుగాఁ బ్రాకారమును భోగరాగంబు లనువుపఱచె. శా. ప. మం. 101.

**అనువృత్తము** సం. విణ. (అ. అ. అ.) 1. అనుస రించి వర్తించినది. 2. ఆఁదోఁకగా వట్టువ యైనది. 3. (వ్యాక) వెనుకసూత్రమునుండి తేఁబడినది. 4. ఎడతెగకుండ ఉంపఁబడినది, ఎడతెగకుండ చూపఁబడినది.

వి. అ. న. అనుసరణము. ఉదా; అంబ అను వృత్త స్త్వయాభగీరథ గృహే ప్రసాదః. ఉ. చ. 7.

**అనువృత్తి** సం. వి. ఇ. స్త్రీ. 1. అనువర్తించుట, అనుసరించుట. 2. సేవ. 3. పోలుట. 4; మరల వచ్చుట. (ఉదా ; వర్ణానామనువృత్తిరను ప్రాసః.) 5. (వ్యాక) ఒకసూత్రము నుండి తర్వాతి సూత్రములోనికి పదము అన్వయా ర్థము వచ్చుట.

**అనువేధము** సం. వి. అ. పుం. 1. తొలివేయుట. 2. సంబంధము, కూడిక. 3. క్రమ్ముట, అవ రించుట.

**అనువేల్లితము** సం. విణ. (అ. అ. అ.) అనుగుణ ముగా వంపఁబడినది. వి. అ. న. వ్రణాదులకు కట్టుకట్టుట.

**అనువేశము** సం. వి. అ. పుం. 1. వెంబడినిచొచ్చుట. 2. పెద్దవానికి పెండ్లి గాకుండఁగా చిన్నవాఁడు పెండ్లాడుట.

**అనువేశ్యుఁడు** సం. విణ. (అ. అ. అ.) ప్రక్క యింటివానికి అవలి యింటివాఁడు, మను 8. 392.

**అనువేలము** సం. అవ్య. అ. న. అనుక్షణము, ఎప్పుడును.

**అనువొందు** అ. క్రి. (√అనువు¹) ఒప్పు.

గీ. అవనిఁ జిరకాల మనువొందు మనుచుఁ బనిచె, నందనామణిఁ బొత్తు నానందగరిమ. పె. శకుం. 3, 191.

**అనువొప్పు** అ. క్రి. (√అనువు¹) ఒప్పు.

క. తనతలపై వడి బల్లిదుఁ, డనువొప్పఁగఁ గ్రొత్తముత్తియపుఁదలఁ బ్రాల్వోసిన = నీలా. 1, 115.

**అనువ్యంజనము** సం. వి. అ. న. అప్రధాన చిహ్నము.

**అనువ్యాధము** సం. - అనువేధము,

**అనువ్యాహరణము** సం. వి. అ. న. అనువాదము, మరలఁ జెప్పుట. 2. సహాకథనము, ఒకదానితోఁ గూడఁ జెప్పుట.

**అనువ్యాహారము** సం. వి. అ. పుం. — అనువ్యా హరణము.

**అనువ్రజనము** సం. వి. అ. న. వెంటఁ బోవుట, ఇంటికివచ్చిపోవు స్నేహితులు మొదలగువారిని సాగనంపునపుడు వెంబడించి పోవుట.

**అనువ్రజ్య** సం. వి. ఆ. స్త్రీ. — అనువ్రజనము.

శ్లో. ఆసనావసథౌశయ్యా మనువ్రజ్యాముపా సనాం. మను. 8. 107.

**అనువ్రతుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఒకని కనుకూల మగుపనులు చేయువాఁడు, అనుకూలుఁడు. 2. అనుసరించువాఁడు. 3. ఒకనివ్రతము ననుసరించి చేయువ్రతముగలవాఁడు.

**అనుశతికము** సం. విణ. (అ. ఆ. అ.) నూటిచేఁ గొనఁబడినది.

**అనుశయము** సం. విణ. (అ. ఆ. అ.) హస్తగతము. వి. అ. పుం. 1. పశ్చాత్తాపము, 2. దీర్ఘ ద్వేషము. 3. అత్యంతసంబంధము, అనుబంధము 4. (వేదాంత) అనుభవింపఁగా మిగిలినకర్మము.

**అనుశయానుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) పశ్చాత్తాప పడువాఁడు.

**అనుశయి** సం. విణ. (న్. నీ. న్.) అనుశయము కలవాఁడు. వి. ఈ. స్త్రీ. పాదరోగభేదము.

**అనుశస్త్రము** సం. వి. అ. న. శస్త్రమునకుమాఱుగా నుపయోగించుసాధనము.

**అనుశాసకుఁడు** సం. విణ. (అ. సికా. అ.) అనుశాసించువాఁడు.

**అనుశాసనము** సం. వి. అ. న. 1. ఆజ్ఞ. 2. ఉపదేశము. 3. నిరూపణము, వ్యాఖ్యానము, కలరూపును దెలుపుట. (ఉదా ; నామలింగానుశాసనము.)

**అనుశాసి** సం. విణ. (న్. నీ. న్.) అనుశాసించువాఁడు.

**అనుశాసించు** సం. స. క్రి. అజ్ఞాపించు.
వ. .. యముండు ధర్మజు ననుశాసించుటయు ...భార. ఆది. 1. 28.

**అనుశాసిత** సం. విణ. (ఋ. త్రీ. ఋ.) అనుశాసించువాఁడు.

**అనుశిష్టము** సం. విణ. (అ. ఆ. అ.) అనుశాసింపఁబడినది.

**అనుశిష్టి** సం. వి. ఇ. స్త్రీ. 1. ఉపదేశము. 2. అజ్ఞ.

**అనుశీలనము** సం. వి. అ. న. నిరంతర మభ్యసించుచుండుట, ప్రతిక్షణ మాచరించుచుండుట.

**అనుశీలితము** సం. విణ. (అ. ఆ. అ.) నిరంతరాభ్యస్తము, విడువక యభ్యసింపఁబడినది.

**అనుశోకము** సం. వి. అ. పుం. 1. పశ్చాత్తాపము. 2. శోకము.

**అనుశోచకుండు** సం. విణ. (అ. చికా. అ.) 1 పశ్చాత్తాప పడువాఁడు. 2. పశ్చాత్తాపమ గలిగించువాఁడు. 3. దుఃఖించువాఁడు.

**అనుశోచనము** సం. వి. అ. న. — అనుశోకము.

**అనుశోచి** సం. విణ. (న్. నీ. న్.) — అనుశోచకుఁడు.

**అనుశ్రవము** సం. వి. అ. పుం. వైదికసంప్రదాయము; సంప్రదాయము.

**అనుశ్రుతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. వేదసంప్రదాయము ననుసరించి వచ్చినది. 2. వంశసంప్రదాయము ననుసరించి వచ్చినది, కులక్రమాగతము. (ఈయర్థము వాడుకలోనిది.)

**అనుషంగము** సం. వి. అ. పుం. 1. సంబంధము, కలయిక, కూడిక. 2. ఒకచోటనుండు పదమును అన్వయార్థము మఱియొక చోటికితెచ్చుట, ఒక వాక్యమందలి శబ్దమును ఇంకొక వాక్యమున అన్వయముకొఱకు అకర్షించుట. 3. ప్రకరణమును డట్టి పదమును అధ్యాహరించుకొనుట. 4. ఒకదాని నుద్దేశించి ప్రవర్తించునపుడు మఱియొకటికూడ సిద్ధించుట, 5. ప్రసంగవశమునఁ జెప్పుట. 6. దయ.

**అనుషంగి** సం. విణ. (న్. నీ. న్.) సంబంధించినది, కూడినది, కలిసినది.

**అనుషక్తము** సం. విణ. (అ. ఆ. అ.) 1. మిక్కిలి సంబంధించినది. 2. లగ్నమైనది.

**అనుష్టుప్పు** సం. వి. ప్. స్త్రీ. 1. పాదమునకు ఎనిమిది వర్ణములుగల శ్లోకము. 2. అట్టి ఛందస్సు. 3. సరస్వతి.

**అనుష్ఠాత** సం. విణ. (ఋ. త్రీ. ఋ.) అనుష్ఠించువాఁడు.

**అనుష్ఠాతవ్యము** సం. — అనుష్ఠేయము.

**అనుష్ఠానము** సం. వి. అ. న. చేయుట, అచరణము.

**అనుష్ఠాపకము** సం. విణ. (అ. పికా. అ.) చేయించునది, ఆచరింపఁ జేయునది.

**అనుష్ఠాపనము** సం. వి. అ. న. అనుష్ఠింపఁజేయుట, చేయించుట.

**అనుష్ఠాయి** సం. విణ. (న్. నీ. న్.) అనుష్ఠించువాఁడు.

**అనుష్ఠించు** నం. న. క్రి. ఆచరించు, చేయు.
క. ...ఎఱిఁగినదానిని, మఱవ కనుష్ఠించునది సమంజసబుద్ధిన్. భార. ఆది. 3. 203.

**అనుష్ఠితము** నం. విశ. (అ. ఆ. అ.) అనుష్ఠింపఁబడినది.

**అనుష్ఠేయము** నం. విశ. (అ. ఆ. అ.) అనుష్ఠింపఁదగినది.

**అనుష్ణము** నం. విశ. (అ. ఆ. అ.) 1. వేఁడిలేనిది, చల్లనిది. 2. చులుకులేనిది, సోమరి. వి. అ. పుం. చల్లనిస్పర్శము. న. నల్లకలువ.

**అనుష్ణవల్లిక** నం. వి. ఆ. స్త్రీ. నల్లగఱిక (వృ.వి.)

**అనుసంతతి** నం. వి. ఇ. స్త్రీ. ఎడతెగనివరుస, అవిచ్ఛిన్న పరంపర.

**అనుసంధానము** నం. వి. అ. న. 1. చింతనము. 2. అన్వేషణము, పరిశీలనము. 3. కూర్చుట. 4. (భక్తిగ్రంథముల) పఠనము.
శా. ...దివ్యప్రబంధానుసంధానధ్యానము... ఆము. 1. 84.

**అనుసంధాయకుఁడు** నం. విశ. (అ. యికా. అ.) అనుసంధించువాఁడు, అనుసంధానము చేయువాఁడు.

**అనుసంధాయి** నం. విశ. (న్. ఈ. న్.)—అనుసంధాయకుఁడు.

**అనుసంధించు** నం. న. క్రి. 1. కూర్చు. 2. చింతించు, మననముచేయు, ధ్యానించు.
క. ...నిత్యము నీయధ్యాత్మము ననుసంధింపు పాసెదవు దురితములన్. భార. అశ్వ. 2. 223.
వ. నీవును నాదలి తాత్పర్యం బనుసంధించి శాంతినొందుమని చెప్పినఁ గుంతీతనయుండు ... భార. శాం. 4. 20.
3. (భక్తిగ్రంథములు) పఠించు.

**అనుసంహితము** నం. విశ. (అ. ఆ. అ.) అనుసంధింపఁబడినది.

**అనుసరణము** నం. వి. అ. న. 1. వెంబడించుట. 2. ఒకదానిప్రకారము చేయుట. 3. పోలుట. 4. ఉపరోధము, అడ్డు.
శ్లో. ఇందోర్దైన్యం త్వదనుసరణ క్లిష్టకాంతేర్బిభర్తి. మేఘ. 2. 21. (అనుసరణేన—ఉపరోధేన—అని మల్లినాథవ్యాఖ్య.)

**అనుసరించు** నం. న. క్రి. వెంబడించు, అనువర్తించు.
క. ఊతిపతి ప్రభూతరాగాన్వితుఁడై తను ననుసరింప విపరీతమతిన్, ప్రతికూలయగుచు నపమాననిరతుఁగాఁ బతిఁ జేయు నతివ నీచచరితయై. మార్క. 5. 128.

**అనుసరుఁడు** నం. వి. అ. పుం. — అనుసరించువాఁడు—1. సహచరుఁడు. మిత్రుఁడు. 2. అనుచరుఁడు, సేవకుఁడు.

**అనుసామము** నం. విశ. (అ. ఆ. అ.) సామోపాయము ననుసరించినది.

**అనుసాయము** నం. అవ్య. అ. న. ప్రతిసాయంకాలము.

**అనుసారకుఁడు** నం. విశ. (అ. రికా. అ.) అనుసరించువాఁడు.

**అనుసారణి** నం. వి. ఈ. స్త్రీ. రెండవసారణి, వీణకు ప్రక్కను డు మూఁడుతంత్రులలో నొకటి. (దీనిని 'ప్రక్కసారణి' అనియు అందురు.)

**అనుసారము** నం. వి. అ. పుం—అనుసరణము.

**అనుసారి** నం. విశ (న్. ఈ. న్.) — అనుసారకుఁడు.

**అనుసార్యకము** నం. వి. అ. న. పరిమళద్రవ్యము (చందనము, అగరు, మొ.)

**అనును** వి. చేతిపట్టి పల్లకిబొంగు మొదలగువానికి చివర వేసెడులోహపుకట్టు, పొన్ను. ఆం. భా. 2. 202.
గీ. తళుకుఁబు త్తడియనును బెత్తంబుకట్టెఁ బట్టి సేనాధిపతి బరాబరులు సేయ. చంద్రా. 1. 69.
(పల్లకీవర్ణనము.)
సీ. అపరంజిమొనలివాయనునులశింసుతోఁగను పులు తొమ్మిది గలుగుకొమ్ము, నలసూర్యపుటము పొన్నానెంపు సరిగమేల్ కుట్టుపనుల హెచ్చుపట్టుకుచ్చు. రా. వి. 2. 48.

**అనుసూచకము** నం. విశ. (అ. వికా. అ.) సూచించునది.

**అనుసూచనము** నం. వి. అ. న. సూచించుట.

**అనుస్మృతి** నం. వి. ఇ. స్త్రీ. 1—అనుసరణము. 2. అంకుటాలు.

**అనుసృష్టి** సం. వి. ఇ. స్త్రీ. 1. క్రమముగా సృజించుట. 2. ప్రత్యుత్పన్నమతి యగుస్త్రీ, సమయస్ఫూర్తిగలస్త్రీ.

**అనుసేవి** సం. విశే. (స్. సి. స్.) 1. ఎప్పుడును సేవించువాఁడు. 2. ఎప్పుడును ఆచరించువాఁడు.

**అనుస్తరణి** సం. వి. ఈ. స్త్రీ. ప్రేతయొక్క ఉత్తరగతులకై చంపఁబడుగోవు.

**అనుస్మరణము** సం. వి. అ. న. 1. జ్ఞప్తికిఁ దెచ్చుకొనుట. 2. చింతనము, ధ్యానము. 3. మాటిమాటికి ధ్యానించుట.

**అనుస్మరించు** సం. స. క్రి. ధ్యానించు.

గీ. అని జపించి సర్వావస్థలందు నను వి, శిష్టభక్తి ననుస్మరించినయతండు, సకలపాపంబులను బాసి శాంతినొంది, యవ్యయానందపదమున నతిశయిల్లు. భాగ. శాం. 4. 249.

**అనుస్మృతి** సం. వి. ఇ. స్త్రీ—అనుస్మరణము.

**అనుస్యూతము** సం. విశే. (అ. ఆ. అ.) 1. ఒక్కటిగాఁ గుట్టఁబడినది. 2. వరుసగాఁ గూర్పఁబడినది. 3. ఎడతెగనిది.

**అనుస్వానము** సం. వి. అ. పుం. 1. అనుసరించి ధ్వని చేయుట. 2. ప్రతిధ్వని.

**అనుస్వారము** సం. వి. అ. పుం. బిందువు, సున్న.

**అనుహరణము** సం. వి. అ. న. అనుకారము, పోలిక.

**అనుహారము** సం. వి. అ. పుం—అనుహరణము.

**అనుహార్యము** సం. విశే. (అ. ఆ. అ.) అనుకరింపఁదగినది.

**అనూకము** సం. వి. అ. పుం. 1. వెన్నెముక. 2. పూర్వజన్మము. న. 1. వంశము. 2. శీలము, స్వభావము.

**అనూక్తము** సం. విశే. (అ. ఆ. అ.) మరలఁ జెప్పఁబడినది. వి. అ. న 1. అనువాదము. 2. వేదాధ్యయనము.

**అనూచానుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) 1. వినయము గలవాఁడు. 2. గురుముఖమున సాంగవేదాధ్యయనము చేసినవాఁడు.

**అనూఢుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) 1. వహింపఁబడనివాఁడు. 2. పెండ్లి కానివాఁడు.

**అనూదితము** సం. విశే. (అ. ఆ. అ.) అనువదింపఁబడినది.

**అనూద్యము** సం. విశే. (అ. ఆ. అ.) అనువదింపఁదగినది.

**అనూనము** సం. విశే. (అ. ఆ. అ.) 1. తక్కువగానిది. 2. నిండైనది, పూర్ణము.

**అనూనయించు** సం. స. క్రి. (ఇందలి యడాగమము విచార్యము.)-అనూనునిగాఁ జేయు- గౌరవించు, పూజించు.

ఉ. ...గద్యపద్యసంభారయుతంబుగా నొక ప్రబంధ మొనర్పు మదంకితంబుగాన్.

వ. అని యనూనయింపుచు ... జనఘోటీపరంపరాదిసత్కారంబులఁ బ్రియంబుఁ గొలుపుటయు...రంగా. 1. 15, 16.

చ. అనిచతురాననుండు సదయాత్మకుఁడై తను నాదరించి పల్కిన విని యావిధూముఁడు నకల్మిషు ధాత ననూనయించి వేఁచని తన యిల్లుచేరి తగఁ జర్చ యొనర్చు... సేతు, 1. 41.

**అనూపజము** సం. విశే. (అ. ఆ. అ.) జలసమృద్ధి గల నేలయందుఁబుట్టినది. వి.అ. పుం. అల్లము (వృ.వి.)

**అనూపము** సం విశే. (అ. ఆ. అ.) జలసమృద్ధి గలది (నేల) వి. అ. పుం. న. 1. జలసమృద్ధి గలదేశము. 2. ఒకానొకదేశము. 3. (నదీపర్వతముల) పార్శ్వము. 4 ఎనుఁబోతు. 5. కప్ప. 6. ఏనుఁగు. 7. ఒకజాతి కాఁజుపిట్ట. 8. చెమ్మనేల.

**అనూప్యము** సం. విశే. (అ. ఆ. అ.) అనూపమందుండునది.

**అనూరాధ** సం—అనురాధ.

**అనూరుఁడు** సం. విశే. (త.) తొడలు లేనివాఁడు. వి. త. పుం. అరుణుఁడు. (ఇతఁడు గరుత్మంతుని యన్న, సూర్యునిసారథి.)

**అనృజువు** సం. విశే. (త.) 1. వంకరైనది. 2, కుటిలుఁడు.

**అనృణి** నం. విశ. (న్. సి. న్.)—అనృణుఁడు.

**అనృణుఁడు** నం. విశ. (అ. అ. అ.) అప్పులేని వాఁడు; అప్పుతీర్చుకొన్నవాఁడు.

**అనృతకుఁడు** నం. విశ. (అ. ఇకా. అ.) కల్లలాడు వాఁడు.

**అనృతము** నం. విశ. (అ. అ. అ.) అసత్యమైనది, కల్ల, వి. అ. న. 1. అసత్యము, కల్ల. 2.కృషి, సేద్యము.

**అనృతవాది** నం. విశ. (న్. సి. న్.) అసత్యమాడు వాఁడు.

**అనృతి** నం. విశ. (న్. సి. న్.) కల్లలాడువాఁడు.

**అనృతువు** నం. వి. ఉ. పుం. 1 తగనిఋతువు. 2. తగనికాలము.

**అనేకకాలము** నం. వి. అ. పుం. బహుకాలము. వ...అనేకకాలంబు తపంబు సేసె...భార. ఆది. 1. 120.

ద్వి. పసిబిడ్డ నాఁడు నీపాదపద్మముల, వెనఁగు వ్రాఁతలు చూచి యెఱిఁగినవారు, ఎన్నిక మీఱ ననేకకాలంబు, చెన్నొంద మను నని చెప్పిరికాని. నవ.2. ఆ. 99. పా. 4. పం.

**అనేకగోత్రుఁడు** నం. వి. అ. పుం. ఒకగోత్రము నుండి మఱొకగోత్రమువానిచే స్వీకరింపఁబడిన పుత్త్రుఁడు.

**అనేకచరము** నం. విశ. (అ. ఈ. అ.) మందలో నుండునది,విడిగా నుండనిది (జంతువు.)

**అనేకజము** నం. వి. అ. పుం. ద్విజము, పక్షి.

**అనేకపము** నం. వి. అ. పుం. ద్విపము, ఏనుఁగు.

**అనేకము** నం. విశ. (అ. అ. అ.) ఒక్కటి గానిది, పెక్కు.

**అనేకముఖము** నం. విశ. (అ. ఈ. అ. అ - చూ, అభిముఖము.) 1. పెక్కుముఖములు గలది. 2. చెల్లాచెదరైనది.

**అనేకలోచనుఁడు** నం. వి. అ. పుం. 1. సహస్రాక్షుఁడు, ఇంద్రుఁడు. 2. పరమేశ్వరుఁడు, విరాట్టు.

**అనేకవర్ణము** నం. వి. అ. పుం. (బీజగ) ఒకటి కంటె ఎక్కువగా నుండు అజ్ఞాతసంఖ్యలు గల రాశి.

**అనేకవర్ణసమీకరణము** నం. వి. అ. న. (బీజగ) అనేకాజ్ఞాత సంఖ్యలుగల రాసులను జ్ఞాత సంఖ్యలుగలవానితో సమముగాఁ జేయుట.

**అనేకశఫము** నం. విశ. (అ. అ. అ.) చీలినడెక్కలు గలది. (ఆవు, మొ.)

**అనేకాంతము** నం. విశ. (అ. అ. అ.) 1. నియమము లేనిది. 2. అనిశ్చితఫలకము, సందిగ్ధమైనఫలము గలది. 3. అనైకాంతికము.

**అనేకాంతవాదము** నం. వి. అ. పుం. స్యాద్వాదము, జైనమతము. (దైవము ఉన్నదనికాని లేదని కాని నిశ్చితముగాఁ జెప్పనిమతము)

**అనేకార్థము** నం. విశ. (అ. అ. అ.) 1. పెక్కు అర్థములు గలది. (పదము) 2. పెక్కువిషయములు గలది.

**అనేకాశ్రయము** నం. విశ. (అ. అ. అ.) పెక్కింటి నాశ్రయించునది.

**అనేడమూకుఁడు** నం. విశ. (అ. అ. అ.) 1, చెవుడును మూఁగతనమును గలవాఁడు, చెవిటి మూఁగ. 2. శఠుఁడు, మోసగాఁడు.

**అనేడుఁడు** నం. విశ. (అ. అ. అ.) జడుఁడు. మందబుద్ధి.

**అనేహస్సు** నం. వి. స్. పుం. సమయము,కాలము.

**అనైకాంతికము** నం. విశ. (అ. ఈ. అ.) 1. నిశ్చితము కానిది. 2. (తర్క) హేత్వాభాసము లయిదింటిలో నొకటి. (ఇదియే సవ్యభిచార మనఁబడును.)

**అనైక్యము** నం. వి. అ. న. 1. బహుత్వము. 2. ఐకమత్యములేమి.

**అనైతిహ్యము** నం. విశ. (అ. అ. అ.) పరంపరా శ్రవణ మనెడు ఐతిహ్యప్రమాణము లేనిది. వి. అ. న. ఐతిహ్యప్రమాణములేమి.

**అనోంకృతము** నం. విశ. (అ. అ. అ.) 1. ఓంకారోచ్చారణ రహితముగాఁ జేయఁబడినది. (అధ్యయనాది) 2. అంగీకరింపఁబడనిది.

**అనోకహము** నం. వి. అ. పుం.—బండినడకకు అడ్డు వచ్చునది—వృక్షము.

**అనౌచితి** నం. వి. ఈ. స్త్రీ. అనర్హత.

**అనౌచిత్యము** నం. వి. ఇ. న.—అనౌచితి.

**అనౌద్ధత్యము** సం. వి. అ. న. గర్వములేమి, అడఁకువ.

**అన్న**[1] వి. (సం. జనకః, ప్రా. జణ్ణఓ. క. మ. అణ్ణ. త. అణ్ణన్. తు. అణ్ణె.) 1. తండ్రి.

(క) కన్నవాఁడు. (ఈయర్థము 'నాయన, నాన్న' అనుచోట్లఁదక్క ఇతరస్థలములందు వ్యవహారమున లేదు.

గీ. తల్లి బోధించుఁ దత్పరత్వంబు గలిగి, యన్న మీయన్న చెప్పిన యట్లు చేయు, ధూర్త సంగతి విడువ సాధువులతోడఁ, బరిచయము సేయుమని పుత్త్రుఁ బ్రతిదినంబు. కాశీ. 4. 88.

(చ) వాత్సల్యమును దెలుపును.

సీ. కద్రువ కొడుకులకడ కేఁగి యేను మిమ్మందఱ వేఁడెద నన్నలార. భార. ఆది. 2. 84.

(ట) పురుషనామములకు అనుప్రయుక్తము. ఉదా; రామన్న.

2. అగ్రజుఁడు, జ్యేష్ఠసోదరుఁడు.

ఉ. ...మీ,యన్నను నన్నుఁ జూడుము భయం పడకుండుమ యంచు.... భార. ఆది. 6.202.

3. అవ్య. పురుషుల నుద్దేశించిన ప్రార్థనమందు క్రియల కనుప్రయుక్తము.

ఉ. వెన్నుఁడు ప్రీతిఁ జెప్పినసవిస్తరవాక్ప్రపచ యంబు త్రోవఁబో,వన్న ...భార. ఉద్యో. 3. 348.

**అన్న**[2] (అనిన) అవ్య. ద్రు. (√అను.)

1. అనినప్పటికి. 2. అనినయెడల.

(కొన్ని చోట్ల సందర్భానుసారముగా అర్థములు గ్రహించునది.)

చ. ...మహాత్మ మాకు గురుఁడన్నను ధర్మవిధోపదేష్ట యన్నను బరదైవమన్నను మనఃప్రియకార్యకలాప కర్తయ,న్నను విను నీవ నీదు వచనంబున కడ్డము పల్కువాఁడనే భార. అర. 1. 47.

(గురుఁడన్నన్–గురుఁడు ఎవరు అన్నయెడల. ఇట్లే ఇతరస్థలములం దూహించునది.)

ద్వి. వాఁ డన్నఁ గులగిరుల్ వడవడ వడఁకు. రం. రా. బాల. 66 పొ. 29 పం.

(వాఁడన్నన్–వాని పేరు చెప్పినయెడల.)

**అన్నకిట్టము** సం. – అన్నమలము.

**అన్నకూటము** సం. వి. అ. పుం. అన్నరాశి.

**అన్నగంధి** సం. వి. ఇ. పుం. 1. గ్రహణీరోగము. 2. నీళ్లవిరేచనము.

**అన్నగకు** వి. అన్నగారు, వేత్రహస్తుఁడు, కంచుకి.

సీ. ఇరువంక నుడిగపువిరిఁబోండ్లు రా నన్నగకు ముందు సందడిఁ గడలకొత్త...దశా. 6.84.

**అన్నగారు** వి. (క. అన్నగన్ – పేడి.) వేత్రహస్తుఁడు, కంచుకి.

వ. మహాకాంతుండు...పారిపోవ నుత్సహించి రాణువవారి కెఱిఁగింపనన్నగారి నింబంప...

దరువు. అమావటివేళ నన్నగారు వచ్చె, వేమఱు బెత్తంబు విసరుచు నపుడు. ...అని రాణువదొరల నాకర్షించి హర్షంబుతో వర్షధరుండు మరలెనఁట...రఘునా. 15పొ.

వ. ...విన్నవింప నన్నగరియన్నగార్లు వచ్చిరఁట...మన్నారుదాసనాటకము. 57 పొ.

**అన్నజలము** సం. వి. అ. న. అన్నోదకములు.

**అన్నట్టు** అవ్య. (√అను) మఱచిన విషయము స్మృతికి వచ్చినట్టు సూచించును. (ఉదా:అన్నట్టు వానిపని యేమయినది?)

**అన్నదాత** సం. విశ. (ఋ. త్రి. ఋ.) అన్నము పెట్టువాఁడు.

**అన్నదాసుఁడు** సం. వి. అ. పుం. అన్నమాత్రమునకుఁ గొలుచు సేవకుఁడు.

**అన్నదుఁడు** సం. విశ (అ. అ. అ.) అన్నము పెట్టువాఁడు.

**అన్నదోషము** సం. వి. అ. పుం. 1. నిషిద్ధమగు అన్నము తినుటవలని పాపము. 2. అన్నమందలి దోషము. 3. అన్నము తినుటవలనఁ గలుగు వాతప్రకోపాదిదోషము.

**అన్నద్వేషము** సం. వి. అ పుం. అన్నమం దిష్టము లేమి.

**అన్నన్న** – అన్నన్నా. అవ్య. ప్రశంసాదులను దెలుపును.

(ప్రశంసకు)

క. అన్నన్న మొగము వెన్నుని, యన్నన్న జయించు....విజ. వి. 1. 88.

(సంతాపమునకు)

క. కన్నుల బాష్పము లురలఁగ, నన్నరవరుఁ
జేరనరిగియతిదైన్యముతో,నన్నన్న యాఁక
లయ్యెడి.నన్నము నా కిపుడు పెట్టు మని
యడుగుటయున్. మార్క. 1. 203.

**అన్నన్నా**—అన్నన్న.

(ప్రశంసకు)

శా. ...నేఁ, డన్నన్నానలకూబరుండె ప్రబలుం
డంచున్ సుధాంధుల్ నుతుల్, పన్నన్
సాగిరి కారలం బడినబాలల్ వొందిరా
నందమున్. ఉ. రా. 4. 239.

**అన్నపాకము** నం. వి. అ. పుం. 1. అన్నమును వండుట. 2. అన్నము జఠరాగ్నియందు పక్వ మగుట.

**అన్నపూర్ణ** నం. వి. అ. స్త్రీ. అన్నపూర్ణాదేవి, కాశీవిశ్వేశ్వరునిపత్ని, పార్వతి.

**అన్నప్రదుఁడు** నం. విశ. (అ. ఆ. అ.) అన్నము పెట్టువాఁడు.

**అన్నప్రాశనము** నం. వి. అ. న. బిడ్డలకు మొట్ట మొదట అన్నముతినిపించెడియొకసంస్కారము. (ఇది 16 సంస్కారములలో నొకటి.)

**అన్నభక్తుఁడు** నం—అన్నదాసుఁడు.

**అన్నమయకోశము** నం. వి. అ. పుం. పంచకోశము లలో మొదటిది, స్థూలశరీరము.

**అన్నమయము** నం. విశ. (అ. ఈ. అ.) 1. అన్న వికారమైనది, అన్నముచే ఏర్పడినది. 1. అన్న ముచే నిండినది. (యజ్ఞాది) వి. అ. పుం. అన్న మయకోశము.

**అన్నమలము** నం. వి. అ. న. 1. పురీషము. 2. మద్యము, సుర.

**అన్నము** నం. విశ. (అ. ఆ. అ.) తినఁబడినది. వి. అ. న. 1. వంటకము, కూఁడు. 2. ఆహారపదా ర్థము.

**అన్నరసము** నం. వి. అ. పుం. 1. జఠరాగ్నివలన పరిపాకమునొందినయన్నముయొక్క సారము. 2. ఆహారపదార్థములసారము. 3. అన్నము యొక్కరుచి.

**అన్నవత్తి** వి. (శ. అన్నపూర్తి. అన్నమ్+ఊర్తి—హంస+వాహనము.) హంసవాహనము.

సీ. అది సుధాకరబింబమా కాదు మడికానువన్నె
వేలుపుటన్నవత్తి గాని. వేం. పంచ. 4.238.
(మడికానువన్నె వేలుపు—సరస్వతి.)

**అన్నసాధకుఁడు** నం. వి. అ. పుం. అన్నము సిద్ధము చేయువాఁడు, వంటవాఁడు.

వ. అశ్వత్థామ రహస్యంబున నన్నసాధకుంబిలిచి
యెన్నండును నరునకు నంధకారంబునఁ
గుడువం బెట్టకుమీయని పంచిన. భా॰ ఆది.
5. 227.

**అన్నా** అవ్య. ఆశ్చర్యసంతాపాదులను దెలుపును.
ఉదా: అన్నా! వాఁ డెంతవాఁ డయ్యెను!
అన్నా! ఎంతపని జరిగినది!

**అన్నాది** నం. విశ. (న్. నీ. న్.) అన్నము తిను వాఁడు.

**అన్నాదుఁడు** నం. విశ. (అ. ఈ. అ.) 1. అన్నము తినువాఁడు. 2. జఠరదీప్తిగలవాఁడు, మంచి యాఁకలి కలవాఁడు.

**అన్ని** — అని[2] వ. బ. (అంతశబ్దముయొక్క అమ హదర్థకబహువచనరూపము. ఇది ప్రథమా విభక్తియందు తఱచుగా సముచ్చయార్థక మగు 'ఉన్'తోఁ గలిసి యుండును.)

1. తావన్మాత్రసంఖ్యగలవి, అంతసంఖ్యగలవి.
(వ్యవ)భక్తుఁ డెన్నికోరెనో అన్నియు నిచ్చెను.

2. సర్వము, సమస్తము.

క. దురితము లనేకములుగల, వరయఁగ లోక
మున వానియన్నిటికం టెన్. భార. అను.
4. 43.

**అన్ను** అ. శ్రీ. అన్నుకొను, మత్తిలు, పరవశమగు.

చ. అలరులమందహాసమున నన్నినషట్పదమంజు
గీతి...అభిరామమయ్యె సహకారలతాంగి
మధుప్రసంగతిన్. కు. సం. 4. 468, 6.
702, 2. 163.

వి. 1. పారవశ్యము, ఒడలెఱుఁగమి.

ఉ. ఎన్నఁడు నిట్టిసాహసము లింక నొనర్పకు
మయ్య దుర్జనుం, డన్నువసాహసక్రియల
యందుఁ గడంగి నశించుఁ గావునన్, భార.
అర. 5. 434. మమచ. 8. 117.

2. (శ. అద్రై.) శోభ, ఒప్పు.

గీ. చెలఁగుకన్నులుఁజన్నులుఁ జిన్నిమొగము,
కలువఱేకులచెన్ను జక్కవలయన్ను, నిండు
చందురుచందంబు నెరయ గెలిచి, మాని
నీత్వంబుగై కొన్నమకరిఁ గాంచె. భా. రా.
యు. 1660.

ద్వి. చెన్నును నన్నును చెలువును నలువు,నున్నతి
సన్నుతి యొప్పును మెప్పు. పండితా. దీక్షా.
60 పా.

3. (క. అణ్ణు. త. అణంగు.) మదవతి; స్త్రీ.
ఆఁడుది.

క. అన్నులతిన్నని నవ్వులఁ, బ్రన్నినముఖచంద్ర
రుచులు పర్వఁగఁ దమపై, వెన్నెలఁ బయ
నము నడచిన,చెన్నున సుఖలీలనమం సేనలు
నడచెా. కు. సం. 11. 596.

గీ. నిన్ను వడ్డించు మందుమె యన్ను మిన్న
హర. 6. 113.

వి. 4. కన్య.

ఉ. అన్ను తలంచు రూపము హితాళి తలంచుఁ
గులంబు తల్లి దా,నెన్ను సువస్తువుల్ వరుల
నేర్చుతటిన్ ...వక్కలంక వీరభద్రకవి కృత
కుమారసంభవము కవులచరిత్ర 3.398 పా.

శ్లో. కన్యా వరయతే రూపం మాతా విత్తం
పితా శ్రుతం, బాంధవాః కులమిచ్ఛంతి...

జ. అన్నుకొను. అన్నుకొలుపు.

**అన్నుకొను** అ. క్రి. (√అన్ను) మత్తిల్లు. పార
వశ్యము నొందు.

సీ. లక్ష్మీకటాక్షలీలా సీధుమదమున మనము
లోపల నన్ను కొననివాఁడు. కాశీ. 4.203.

**అన్నుకొలుపు** స. క్రి. (√అన్ను) మత్తిలఁ జేయు,
పారవశ్యము నొందించు.

ఉ. సిబ్బితివేరు పోఁదుడిచి సీధుమదం బపు డన్ను
కొల్పుచుఁ, బ్రబ్బఁగ మాట లక్షరవిభా
గము చాలక యేమొయేమొ తబ్బిబ్బులు
గాఁగ వెల్వడియె...కళా. 6. 128.

**అనువ** విణ. 1. అల్పము, సన్నము.

సీ. అన్నువకౌఁదీఁగయందంబు మది నిల్పు
జఘన చంక్రబుపైఁ జలుపు దృష్టి. భార.
ఆది. 3. 38.

ఉ. అన్నువ యైనకౌను గుణలాలకపంక్తియు
...ద్వా. 1. 203.

2. హీనుఁడు; దుర్బలుఁడు.

ఆ. మన్ను ఱేఁడ కొంద అన్నువనంజుడు,దిండి
బంట్లఁ బోరఁ జెండినాఁడ,నంచు నిక్కెదిపు
డొకించుక నాలావె, ఱుంగనేర వెట్టివెంగలి
వాకొ. అచ్చ. రా. యు. 495.

3. కొంచెము, తక్కువ; కొఱఁతవడినది.

వ. సర్వవర్ణంబులకుం గామక్రోధవశంబున
నవజ్ఞలు నేయక భక్ష్యాన్నపానాదులు
గడపవలసిన వెల్ల నన్నువలు గాకుండఁ
బెట్టుఁడు...భా. రా. బాల. 104.

సీ. కన్నె గేదఁగిరేకు అన్నువగాఁ గొనల్
గాన్పింప నిడినకీల్గంటుకొప్పు. కళా. 3.204.

4. చిన్నది.

ఉ. కొండొకవాలముఁ కులుచకొమ్ములునన్ను
వతై నవీనులుఁ. విక్ర. 3. 75

5. మనోహరము.

ఉ. ఆయురుమంజిముత్తియపు టన్నువ పోరణ
గండ్లయంద మా, చాయలకెంపుటోవరుల
చందము...సారంగ. 2. 62.

వి. అన్ను, స్త్రీ.

చ. అలరుచు వీణెమీటుతనయన్నువచన్నులు
వీణెకాయలం, గలయఁగఁ జూచి గుబ్బలని
గానరసంబునఁ జాలఁ జొక్కె...శివ.ధ.1.4.
(అన్నువ—భార్య.)

**అన్నువు**— అన్ను. వి.
(శోభ; మెఱుఁగు)
(చంద్రోదయవర్ణనము.)

సీ. నలువచెందొవల ఱేకులకు నన్నువుపెట్టఁ
గొరకావించినగుళిక యనఁగ. భార. ద్రోణ.
5. 275.

(స్త్రీ)

ఉ. అన్నువులార నావలపు నంగడిఁ బెట్టకురమ్మ
... ప్రదీపచరిత్రము 4 ఆ. కవులచరిత్ర 3.
463 పా.

**అన్నెకాఁడు** విణ. (√అన్నెము¹) అన్యాయకారి.
'అన్నెకాఁడయి వాఁడు నావల పెల్ల నారు
దూఱు సేసెనే. క్షేత్రయ.' (శ.ర.)

**అన్నెము**[1] న. (సం. అన్యత్.) ఇతరము, వేఱగునది.
సీ. తన్ను శివునికంటనన్నెంబు గాకుండనెఱిఁగి తలఁకుండు డిదియెముక్తి. కు. సం. 6.79.

**అన్నెము**[2] వి. (సం. అన్యాయః. క. అన్నెయ.) పాపము.
సీ. ఎవ్వరిమన మెవ్వఁ డెఱుఁగు నన్నెముపున్నెమును దేవుఁడె యెఱుఁగు ననెడివారు. సారంగ. 3. 83. శుక. 2. 110.
జ. అన్నెకాఁడు.

**అన్య** సం. వి. అ. స్త్రీ. (అలం) పరకీయ. (నాయికలు 'స్వీయ, సామాన్య, అన్య' అని మూఁడువిధములు, అందు అన్య అవివాహిత గాని మఱొకనిభార్యగాని యగును.)

**అన్యకారుక** సం. వి. అ. స్త్రీ. మలములోనిపురుగు.

**అన్యచిత్తుఁడు** సం. విణ. (అ. అ. అ.) మఱియొక దానియందు మనస్సుగలవాఁడు.

**అన్యతమము** సం. విణ. (అ. అ. అ.) పెక్కింటిలో నొక్కటి.

**అన్యతరము** సం. విణ (అ. అ. అ.) రెంటిలో నొకటి.

**అన్యత్ర** సం. అవ్య. 1. ఇతరస్థలమున. 2. ఇతర సమయమున. 3. ఇతరవిషయమున. (దీనికి తెనుఁగున వ్యస్తప్రయోగములు కనఁబడవు.

**అన్యథా** సం. అవ్య. మఱియొకవిధముగా. (దీనికి తెనుఁగున వ్యస్తప్రయోగములు కనఁబడవు.)

**అన్యథాకరించు** సం. స. క్రి. చేయవలసినట్లుచేయక భిన్నముగాఁజేయు, మీఱు, అతిక్రమించు.
ఆ. గురులలోనఁ బరమగురువు తల్లియ యట్టి, తల్లి వచనమును విధాతృకృతము, నన్యథాకరింప నది వియేయనిన... భా. ఆది. 7.259.

**అన్యథాకారము** సం. వి. అ. పుం. వేఱువిధముగాఁ జేయుట.

**అన్యథాఖ్యాతి** సం. వి. ఇ. స్త్రీ. భ్రమవిషయమున తార్కిక మతము. (ఈ మతమున 'ఇదం రజతం' అను భ్రమస్థలమున ఇదం పదార్థమగు శుక్తియందు రజతము తాదాత్మ్య సంబంధముచే-రజతత్వము సమవాయ సంబంధముచే-విశేషణమై భాసించును.)

**అన్యథాత్వము** సం. వి. అ. న. వేఱొకరీతి, భిన్నప్రకారము.
ఆ. ధర్మములకు సంజ్ఞదద్వేదు లగుమహాత్ములు దగంగఁ జెప్పుదురు నరేంద్ర, వినుము కాలపాకమున నది యన్యథాత్వంబు గలిగి యవిశగత్వమొందు. భా. అను. 5. 407.

**అన్యథాభావము** సం. వి అ. పుం — అన్యథాత్వము.

**అన్యథావాది** సం. విణ. (న్ సీ. న్.) భిన్నముగాఁ జెప్పువాఁడు.

**అన్యథాసిద్ధము** సం. విణ. (అ. అ. అ.) (తర్క) అన్యథాసిద్ధిదోషమున కాశ్రయమయినది. వ్యవహితకారణమైనది, అప్రధానకారణమైనది. (కుండకు దండత్వము మన్ను తెచ్చినగాడిద మున్నగునవి అన్యథాసిద్ధకారణములు.)

**అన్యథాసిద్ధి** సం. వి. ఇ. స్త్రీ. 1. ప్రకారాంతరమున సిద్ధించుట, 2. (తర్క) కారణత్వమునకు ప్రతిబంధకముగా నుండుదోషము.

**అన్యథాస్తోత్రము** సం. వి. అ. న. నిందాప్రధానమగుస్తుతి, ఎగతాళి.

**అన్యదర్థము** సం. విణ. (అ. అ. అ.) మఱియొక యర్థము గలది. వి. అ. పుం. మఱియొక యర్థము.

**అన్యదాశ** సం. వి. అ. స్త్రీ. 1. మఱియొక దానియందలి కోరిక. 2. మఱియొకయాశ. (షష్ఠీతృతీయాంతములతోడి సమాసములందు 'అన్యాశ' యని యుండును.)

**అన్యదాశీస్సు** సం. వి. స్. స్త్రీ. అన్యమగు నాశీర్వాదము (షష్ఠీతృతీయాంతములతోడి సమాసములయందు 'అన్యాశీస్సు' అని యుండును.)

**అన్యదాస్థ** సం. వి. అ. స్త్రీ. 1. మఱియొకదాని విషయమున ఆసక్తి, 2. మఱియొక యాసక్తి. (షష్ఠీతృతీయాంతములతోడ సమాసములయందు 'అన్యాస్థ' అని యుండును.)

**అన్యదీయము** సం. విణ. (అ. అ. అ.) అన్యసంబంధమైనది, అన్యునిది.

**అన్యదుత్సుకుఁడు** సం. విణ. (అ. అ. అ.) మఱియొకదానియందు వేడుకగలవాఁడు. (షష్ఠీ

తృతీయాంతములతోడి సమాసములయందు 'అన్యోత్సుకుఁడు' అని యుండును.)

**అన్యద్రాగము** సం. వి. అ. పుం. మఱియొకదాని యందలి రాగము (షష్ఠీతృతీయాంతములతోడి సమాసములయందు 'అన్యరాగము' అని యుండును.)

**అన్యనాభి** సం. విశే. (ఇ.) భిన్నకుటుంబమువాఁడు. (వ్యతి. సనాభి)

**అన్యపరము** సం. విశే. (అ. ఆ. అ.) 1. ఇతరమైనదానియందాసక్తిగలది. 2. మఱియొకదానిని దెలుపునది.

**అన్యపుష్టము** సం. విశే. (అ. ఆ. అ.) ఇతరునిచేఁ బోషింపఁబడినది. వి. అ. పుం-తల్లి కంటె వేఱగు దానిచే అనఁగా కాకిచే పెంపఁబడినది-కోయిల, కోకిలము.

**అన్యపూర్వ** సం. వి. ఆ. స్త్రీ. ఒక పురుషునకు వాగ్దాదులచే దత్తయై మఱియొక పురుషునకు వివాహము చేయఁబడినస్త్రీ.

**అన్యభృతము** సం — అన్యపుష్టము.

**అన్యభృత్తు** సం. వి. త్. పుం-అన్యమును అనఁగా కోకిలను పెంచునది- కాకి.

**అన్యమాతృజుఁడు** సం. వి. అ. పుం. సవతితల్లి కొడుకు.

**అన్యము** సం. విశే. (అ. ఆ. అ.) 1. భిన్నము, ఇతరము; మఱియొకటి. 2. అసాధారణము, సర్వసామాన్యము కానిది.

శ్లో:...అన్యాజగద్ధితమయీ మనసః ప్రవృత్తిః. భామినీ. 1, 69.

**అన్యవాది** సం. విశే. (న్.న్.న్.) 1.అభియోగమునందు తాను మొదట చేసినప్రతిజ్ఞకుభిన్నముగా వాదించువాఁడు. 2. ప్రతివాది.

**అన్యవాపము** సం. వి. అ. పుం-తన గ్రుడ్లను మఱియొకపిట్టగూఁటిలోఁ బెట్టునది-కోకిలము.

**అన్యాదృక్కు** సం. విశే. (శ్.)- అన్యాదృశము.

**అన్యాదృక్షము** సం. విశే. (అ. ఆ. అ.) — అన్యాదృశము.

**అన్యాదృశము** సం. విశే. (అ. ఈ. అ.) మఱియొకటితో సరియైనది, మఱియొకదానివంటిది; అపూర్వము, క్రొత్తది.

'యాత్రాప్రతినివృత్త మన్యాదృశం భవంత మవధారయామి' మాళవి. 1.

'అన్యాదృశీ రచనా కస్యాపి వలీముఖస్య.' మహా. 6.

**అన్యాయము** సం. విశే. (అ. ఆ. అ.) న్యాయము లేనిది, వి. అ. పుం. 1. న్యాయములేమి. 2. దోషము, కళంకము.

మ. అకటా నిక్కము నీవు నాపతివిగా వన్యుండ వీరూపుమై, నకలంకం బగుమచ్చరిత్రమున కన్యాయంబు గావించి తింతకు శంకింపక ...హరి. పూ. 9, 73.

**అన్యాయ్యము** సం. విశే. (అ. ఆ. అ.) న్యాయ్యము కానిది, న్యాయముతప్పినది.

**అన్యార్థము** సం. విశే. (అ. ఆ. అ.) 1. వేఱైన యర్థము గలది. 2.వేఱైనప్రయోజనముగలది. వి. అ. పుం. ఇతరమైనఅర్థము.

**అన్యూనము** సం. విశే. (అ. ఆ. అ.) తక్కువ కానిది.

**అన్యూనాధికము** సం. విశే. (అ. ఆ. అ.) తక్కువయు ఎక్కువయు కానిది.

**అన్యోఢ** సం. వి. ఆ. స్త్రీ. ఇతరునిభార్య.

**అన్యోదర్య** సం. వి. ఆ. స్త్రీ. సవతితల్లి కూఁతురు. (వ్యతి — సోదర్య.)

**అన్యోదర్యుఁడు** సం. వి. అ. పుం. సవతితల్లి కొడుకు. (వ్యతి — సోదర్యుఁడు,)

**అన్యోన్యము** సం. విశే. (అ. ఆ. అ.) — తెనుఁగున వ్యస్తముగా నుండునపుడు అన్నిలింగములయందును సర్వవిభక్తివచనములయందును 'అన్యోన్యము' అనురూపముతోనే యుండి పనులపరస్పర వినిమయమును దెలుపును.—పరస్పరము, ఇతరేతరము. వి. అ. పుం. ఒక యర్థాలంకారము.(రెండును ఒకకార్యమునే పరస్పరము చేసికొనుటను దెలుపును.)

ఉదా: రాత్రిచేతఁ జంద్రుఁడును జంద్రునిచేత రాత్రియును శోభిల్లును.

**అన్యోన్యాధ్యాసము** సం. వి. అ. పుం. ఒండొంటియందు ఒండొంటితాదాత్మ్యమును ధర్మములను ఆరోపించుట. (శరీరాదులందు ఆత్మ

ధ్యాసమును ఆత్మయందు శరీరాద్యధ్యాస మును అన్యోన్యాధ్యాస మనఁబడును.

**అన్యోన్యాభావము** సం. వి. అ. పుం. (తర్క) అభావములలో నొకటి. (ఉదా: ఘట మెప్పుడును పటముకాదు, పట మెప్పుడును ఘటము కాదు.)

**అన్యోన్యాశ్రయము** సం. విణ. (అ. ఆ. అ.) పరస్పరసాపేక్షము, ఒండొంటిని ఆశ్రయించి యుండునది. వి. అ. పుం. వాక్యార్థ దోష విశేషము. (రెండువిషయములు ఒండొంటిపై ఆధారపడియుండుట.)

**అన్వక్కు** సం. విణ. (చ్. అనూచీ. చ్.) వెంబడించువాఁడు.

**అన్వక్షము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ప్రత్యక్షము. 2. వెంబడించునది. అవ్య. అ. న. తోడ్తో, వెనువెంట.

**అన్వయము** సం. వి. అ. పుం. 1. వెంబడించుట. 2. కూడిక, సంబంధము. 3. పదములకుఁ గాని పదార్థములకుఁ గాని పరస్పరము గల సంబంధము. 4. కులము. వంశము: సంతతి. 5. (తర్క) వ్యాప్తి విశేషము, హేతువునకును సాధ్యమునకును గల నియతసంబంధము.

**అన్వయి** సం. విణ. (న్. నీ. న్.) అన్వయము గలది.

**అన్వయించు** సం. అ. క్రి. తోఁచు, కనఁబడు.

సీ. ఎడఁతెవ్వియుండు నెయ్యేదియేని యది కూడ నదికినచందాన నన్వయింప. పి. శకుం. 1. 118.

2. తెలియఁబడిన పదార్థ సంబంధము గలది యగు.

ఉదా: ఆశ్లోకము ఇప్పు డన్వయించినది.

3. సంబంధించు.

ఉదా: వాఁ డాడినయెత్తిపొడుపుమాటలు నా కన్వయించుచున్నవి.

స. క్రి. 1. పొందికపఱచు. (శ.ర.) 2. తెలియఁబడిన పదార్థ సంబంధముగలదిగాఁ జేయు.

ఉదా: వాఁ డీపద్యమును బాగుగా నన్వయించినాఁడు.

**అన్వర్థము** సం. విణ. (అ. ఆ. అ.) పొసఁగిన యర్థము కలది, సార్థకము.

సీ. ఇతనివైరులు వనప్రతతిలోఁ గాఁపుండ నన్వర్థమై ధాత్రి యవనియయ్యె. నైష. 1. 68.

**అన్వర్థసంజ్ఞ** సం. వి. ఆ. స్త్రీ. సార్థకమైనపేరు.

**అన్వవసర్గము** సం. వి. అ. పుం. కామచారానుజ్ఞ, విచ్చలవిడిగా నడచుకొన నిచ్చుట.

**అన్వవాయము** సం. వి. అ. పుం. వంశము.

**అన్వవేక్ష** సం. వి. ఆ. స్త్రీ. ఆలోచన.

**అన్వహము** సం. అవ్య. అ. న. ప్రతిదినము.

**అన్వాచయము** సం. వి. అ. పుం. ఒక ముఖ్య కార్యము చెప్పినపిదప అముఖ్యకార్యమును గూడఁ జెప్పుట.

(భో! భిక్షామట గా చానయ-ఓయీ! బిచ్చము నకుఁ బొమ్ము గోవును దెమ్ము. అనుచోట భిక్షయేముఖ్యము. అభిచినచో గోవును దెమ్ము-అని అముఖ్యముగూడ నిర్దేశింపఁబడినది.)

**అన్వాచితము** సం. విణ. (అ. ఆ. అ.) – ప్రధాన కార్యముతోఁగూడ నప్రధానముగాఁ జెప్పఁబడినది–అముఖ్యము, గౌణము.

**అన్వాదేశము** సం. వి. అ. పుం. పూర్వము చెప్పిన దానినే (పదమునో వస్తువునో) వేఱుకార్యము విధించుటకై మరలఁ జెప్పుట, అనుకథనము. (వీఁడు వ్యాకరణము చదివెను వీనికి న్యాయ మును గఱపుము–అనుచోట పూర్వోక్తుఁ డగు వానినే న్యాయమునుగఱపుటయను కార్యాంతరమునకై మరలఁ జెప్పుట అన్వాదేశము.)

(బుధునివర్ణనము)

సీ. వినిమయంబోకాని విధువ కన్వాదేశమో కాని యత్రినేత్రోద్భవునకు. కాశీ. 4. 191.

(ఇట 'ప్రతిబింబము, సాటి' అని భావము.

**అన్వాధి** పుం. వి. ఇ. పుం. 1. తనయొద్ద నుంచిన వస్తువును హక్కు గలవాని కిమ్మని మఱియొకని కిచ్చుట; అట్లిచ్చినవస్తువు. 2. ఎడతెగని మనో వ్యథ.

**అన్వాధేయకము** సం. – అన్వాధేయము.

**అన్వాధేయము** సం. వి. అ. న. వివాహమైనపిమ్మట భర్తృకులమునుండియో పితృకులమునుండియో మాతృకులమునుండియో పొందెడు ధనము, స్త్రీధనము.

**అన్వారోహణము** సం. వి. అ. న. భార్య మృత భర్తతోఁగూడఁగాని పిదపఁగాని **చితినెక్కుట**, సహగమనము.

**అన్వాసనము** సం. వి. అ. న. 1. కొలువు, సేవ. 2. వెనుక కూర్చుండుట. 3. కారుశాల, కమ్మరి మొదలగువారు పనిచేయు చోటు. 4. వస్తి కర్మభేదము, అనువాసనవస్తి. 5. అనుతాపము, పశ్చాత్తాపము.

**అన్వాసీనుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) ఒకనివెనుకను గాని ప్రక్కనుగాని కూర్చున్నవాఁడు.

**అన్వాహార్యకము** సం. - అన్వాహార్యము.

**అన్వాహార్యము** సం. వి. అ. న. 1. నాందీముఖ శ్రాద్ధము. 2. ప్రతిమాసమును అమావాస్య యందు పితృదేవతలఁగూర్చి చేయుశ్రాద్ధము. 3. ఇష్టిదక్షిణ.

**అన్వాహితము** సం. విణ. (అ. ఆ. అ.) హక్కుగల వానికిమ్మని మఱియొకనియొద్ద ఉంపఁబడినది. (చూ. అన్వాధి. 1.)

**అన్వితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. సహితము, కూడుకొన్నది. 2. అన్వయము (పదాదుల పరస్పర సంబంధము) గలది, అన్వయించినది.
వి. అ. న. ఊరువులయందు చేయుచుంబనము.
సీ. శిరోధి, ననుపదం బూరుల నన్వితం బన నొప్పు దశ చుంబనములుఁద త్తత్ స్థలముల. హంస. 5. 148.

**అన్వితాభిధానవాదము** సం. వి. అ. పుం. 'వాక్యము నందలి పదములు ఒండొంటితో నన్వయించి వాక్యతాత్పర్యమును దెలిపినతర్వాత తమతమ ప్రత్యేకార్థమును దెలుపును' అను ప్రభాకరుల వాదము. (వ్యతి- అభిహితాన్వయవాదము.)

**అన్విష్టము** సం. విణ. (అ. ఆ. అ.) వెదకఁబడినది.

**అన్వీక్ష** సం. వి. ఆ. స్త్రీ. 1. ప్రత్యక్షాగమములచేత దృష్టమైన విషయమును మరల నాలోచించుట; ఆలోచన. 2. వెదకుట.

**అన్వీక్షణము** సం. వి. అ. న. — అన్వీక్ష.

**అన్వీతము** సం. — అన్వితము.

**అన్వీపము** సం. విణ. (అ. ఆ. అ.) అనుకూలము. (వ్యతి- ప్రతీపము.)

**అన్వేషకుఁడు** సం. విణ. (అ. ఇకా. అ.) వెదకు వాఁడు.

**అన్వేషణ** సం. వి. ఆ. స్త్రీ. వెదకుట.
'దేవి! తస్యైవ భూర్జ పత్రస్య అన్వేషణా వర్తతే.' విక్రమో. 2. 87 పొ.

**అన్వేషణము** సం. వి. అ. న. వెదకుట.

**అన్వేషణీయము** సం.—అన్వేష్టవ్యము.

**అన్వేషమాణము** సం. విణ. (అ. ఆ. అ.) వెదకు చున్నది.

**అన్వేషము** సం. వి. అ. పుం. వెదకుట.

**అన్వేషి** సం. విణ. (న్. ఈ. న్.) వెదకువాఁడు

**అన్వేషించు** సం. స. క్రి. వెదకు.
క. ఒకవిప్రునిసతి నెవ్వఁడొ, యొకరుఁడు గొని చనిన దానినొగి నన్వేషించుచుకుతూహలమున మునినాయక వచ్చితి నివ్వనమున కదియట్లుండెన్. మార్క. 5. 151.

**అన్వేషితము** సం—అన్విష్టము.

**అన్వేషితవ్యము** సం-అన్వేష్టవ్యము.

**అన్వేష్ట** సం. విణ. (ఋ. స్త్రీ. ఋ.) వెదకువాఁడు.

**అన్వేష్టవ్యము** సం. విణ. (అ. ఆ. అ.) వెదకఁదగినది.

**అన్వేష్యమాణము** సం. విణ. (అ. ఆ. అ.) వెదకఁబడుచున్నది.

**అన్వేష్యము** సం—అన్వేష్టవ్యము.

**అప** సం. అవ్య—సమాసపూర్వపదముగా నుండి యీ క్రిందియర్థముల నిచ్చును.
1. విపరీతము.
ఉదా: అపకీర్తి—విపరీతకీర్తి, దుష్కీర్తి.
2. అపగతము.
ఉదా: అపక్రమము- క్రమము తప్పినది.
3. అపకృష్టము, చెడ్డది.
ఉదా: అపకర్మము—చెడ్డపని.
4. కొన్నిచోట్ల నిరర్థకముగానే యుండును.

ఉదా : అపవిద్ధము–విద్ధము.

(ఇంకను సంస్కృతమున విశేషప్రయోగములు గలవు.)

**అప**–అప్ప. (చూ. అప్ప.)

**అపండితుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) పండితుఁడు కానివాఁడు, జ్ఞానము లేనివాఁడు.

**అపకరణము** సం. వి. అ. న. 1. అక్రమముగాఁ జేయుట. 2. అపకారము చేయుట.

**అపకర్త** సం. విణ. (ఋ. త్రీ. ఋ.) అపకారము చేయువాఁడు.

**అపకర్మము** సం. విణ. (న్. అ. న్. న్.) దుష్టాచరణము గలది. చెడ్డకార్యము గలది. వి. న్. న. 1. అపాకరణము (ఋణము) తీర్చుట. 2. చెడ్డకార్యము.

**అపకర్షకము** సం. విణ. (అ. ర్షికా. అ.) తొలఁగించునది. 2. తగ్గించునది. 3. అవమానపఱుచునది.

**అపకర్షణము** సం. వి. అ. న. 1. తొలఁగించుట. 2. తగ్గించుట. 3. అవమానపఱుచుట.

**అపకర్షము** సం. వి. అ. పుం. 1. తగ్గుట. 2. అవమానము. 3. (శ్రాద్ధాదికమును) విహితకాలమునకు ముందుగాఁ జేయుట. 4. (వ్యాకరణాదులందు) పరసూత్రమందలి పదమును అన్వయముకొఱకు పూర్వసూత్రమున గ్రహించుట. 5. ఆకర్షణము, లాగుట.

**అపకర్షించు** సం. న. క్రి. తొలఁగించు, పోఁగొట్టు.
వ. కృష్ణుఁడు...సలిలగతం బయినకలుషంబును శరత్కాలంబు నివారించుచందంబున నాత్మగతం బయిన మాలిన్యంబు నపకర్షించు. భాగ. 2. 218.

**అపకారకుఁడు** సం. విణ. (అ. రికా. అ.)–అపకర్త.

**అపకారము** సం. వి. అ. పుం. 1, అపకృతి, కీడు. 2. ద్రోహము. 3. చెడ్డపని.

**అపకారి** సం. విణ. (న్. ణీ. న్.) అపకారము చేయువాఁడు.

**అపకీర్తి** సం. వి. ఇ. స్త్రీ–కీర్తికి విపరీతమైనది–దుర్యశము.

**అపకృతము** సం. విణ. (అ. ఆ. అ.) అపకారము చేయఁబడినది, అపకారము పొందినది. వి. అ. న. అపకారము.

**అపకృతి** సం. వి. ఇ. స్త్రీ. 1. అపకారము, కీడు. 2. చెడ్డపని.

**అపకృత్య** సం. వి. అ. స్త్రీ–అపకృతి.

**అపకృత్యము** సం. వి. అ. న–అపకృతి.

**అపకృష్టము** సం. విణ. (అ ఆ అ.) 1. తొలఁగింపఁబడినది, 2. ఆకర్షింపఁబడినది. 3. అధమము, నీచము, (వ్యతి. ఉత్కృష్టము.) 4. పరసూత్రమునుండి అన్వయముకొఱకు పూర్వసూత్రమున గ్రహింపఁబడినది.

**అపకృష్టి** సం. వి. ఇ. స్త్రీ–అపకర్షము.

**అపక్తి** సం. వి. ఇ. స్త్రీ. పరిపక్వముకామి.

**అపక్రమణము** సం. వి. అ. న.–అపక్రమము.

**అపక్రమము** సం. విణ. (అ. ఆ. అ.) క్రమము లేనిది, అక్రమము. వి. అ. పుం. యుద్ధాదులనుండి వెనుకకుఁ బోవుట.

**అపక్రమి** సం. విణ. (న్. ణీ. న్.) అపక్రమము కలది,

**అపక్రమించు** సం. అ. క్రి. (యుద్ధాదులనుండి) వెనుకకుఁ బోవు.

**అపక్రియ** సం. వి. ఆ. స్త్రీ–అపకృతి.

**అపక్రోశనము** సం. వి. అ. న. నిందించుట, తిట్టుట.

**అపక్రోశము** సం. వి. అ. పుం.–అపక్రోశనము.

**అపక్వము** సం. విణ. (అ. ఆ. అ.) 1. పండనిది. 2. ఉడుకనిది. 3. పరిపాకదశకు రానిది, పరిణతము కానిది. 4. జీర్ణము కానిది.

**అపక్షయము** సం. వి. అ. పుం. తఱుఁగుట, తగ్గుట.

**అపక్షీణము** సం. విణ. (అ. ఆ. అ.) క్షీణించినది, తఱిఁగినది.

**అపక్షేపణము** సం. వి. అ. న.–అపక్షేపము.

**అపక్షేపము** సం. వి. అ. పుం. 1. త్రోయుట, పడఁద్రోయుట 2. క్రిందవైచుట.

**అపఖ్యాతి** సం. వి. ఇ. స్త్రీ. అపకీర్తి.

**అపగండుఁడు** సం. వి. అ. పుం. బాలుఁడు.

**అపగతము** సం. విణ. (అ. ఆ. అ.) పోయినది.

**అపగతి** సం. వి. ఇ. స్త్రీ. 1. పోవుట. 2. దుర్గతి, దురవస్థ.

**అపగమము** సం. వి. అ. పుం. 1. గమనము, పోవుట. 2. అపసరణము, తొలఁగుట.

**అపగుణము** సం. విణ. (అ. ఆ. అ.) గుణములు లేనిది.

**అపఘనము** సం. విణ. (అ. ఆ. అ.) మబ్బు లేనిది. వి. అ. పుం. శరీరావయవము (పాణియు పాద మును అని కొందఱు.)

**అపఘాతకుఁడు** సం. విణ. (అ. ఈ. అ.) 1. కొట్టువాఁడు. 2. నశింపఁజేయువాఁడు; చంపు వాఁడు.

**అపఘాతము** సం. వి. అ. పుం. 1. కొట్టుట. 2. దుర్మరణము.

**అపఘాతి** సం. విణ. (న్. నీ. న్.) 1. కొట్టు వాఁడు. 2. నశింపఁజేయువాఁడు;చంపువాఁడు.

**అపచయము** సం. వి. అ. పుం. 1. తగ్గుట. 2. పుష్పా దులు కోయుట.

**అపచయించు** సం. స. క్రి. (పుష్పాదులు) కోయు. తే. విగతశంకా ప్రశాంతికై విబుధపతికి, నార్ద్ర పర్యంకనిధికిఁగా నపచయింపఁ, బనుల లేములు వాపంగఁ జాలుపిడిన, యమరతరువుల కొదవెఁ బుష్పములలేమి. నైష. 4. 26.

**అపచరించు** సం. స. క్రి-అపచారము నొందించు- అవమానించు.

క. అన్యులకపచారంబులనం,బున్ఁబుట్టినపాతకంబు వోవుం దా నెవ్వని నపచరించెఁ దగ నా, తనిఁ బ్రీతుంజేయ ధర్మతత్త్వప్రవణా. భార. శాం. 1. 310.

**అపచరితము** సం. వి. అ. న. దుశ్చేష్ట,అకార్యము.

**అపచాయితుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) అప చితుఁడు, పూజింపఁబడనివాఁడు.

**అపచారము** సం. వి. అ. పుం. 1. పోవుట. 2. పెద్దలయెడ చేయుతప్పు, అపరాధము. 3. తప్పి దము చేయుట. 4. అపకారము. 5. అపథ్యము; అపథ్య పదార్థము.

శ్లో. కృతాపచారో౽పి పరైరనావిష్కృతవిక్రి యః,అసాధ్యః కురుతే కోపం ప్రాప్తేకాలే గదోయథా. శిశు. 2. 84. (నాల్గవయర్థము నకును నిదియే ఉదాహరణము.

6. లోపము.

శ్లో. మహోర్ధ్వరేవిధ్యపచారదోషః, సం, కిరా. 16.48.

**అపచారి** సం. విణ. (న్. నీ. న్.) అపచారము చేయువాఁడు.

**అపచి** సం. వి. ఈ. స్త్రీ. గ్రంథిరూప మయనకంఠ రోగవిశేషము. (ఉపచి యని కొందఱు)

**అపచితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. పూజింపఁ బడినది. 2. కృశించినది, చిక్కినది. 3. హీనము, తఱిఁగినది. వి. అ. న. 1. పూజించుట, 2. క్షీణత్వము, తఱుఁగుట.

**అపచితి** సం. వి. ఇ. స్త్రీ. 1. హాని. 2, క్షీణించుట. 3. వ్యయము, 4. ప్రాయశ్చిత్తము. 5. పూజ.

**అపచ్ఛాయ** సం. వి. ఆ. స్త్రీ. 1. అశుభమైననీడ. 2. పిశాచము.

**అపచ్ఛాయము** సం. విణ. (అ. ఆ. అ.) 1. నీడ లేనిది. 2. కాంతి లేనిది. 3. అశుభమైననీడ గలది.

**అపచ్యుతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. జాఱినది. 2. నశించినది, పోయినది. 3. కాఱినది.

**అపజయము** సం. వి. అ. పుం. పరాజయము.

**అపజాతుఁడు** సం. వి. అ. పుం. గుణహీనుఁ డగు కొడుకు; గుణములందు తల్లిదండ్రులకంటె తక్కువ యగుపుత్రుఁడు.

శ్లో. మాతృతుల్యగుణో జాత స్త్వనుజాతః పితు స్సమః, అతిజాతో౽ధిక స్తస్మాదపజాతో౽ధ మాధమః.

**అపటి** సం. వి. ఈ. స్త్రీ. తెర.

**అపటీక్షేపము** సం. వి. అ. పుం. తెరను త్రోసి వేయుట. (నాటకాదులందు తెర తీసి పాత్రను ప్రవేశపెట్టుటకు మాఱు ఆపాత్రమొందఱతో స్వయముగా తెర తొలగించుకొని రంగమునకు వచ్చినట్లు చెప్పునప్పుడు 'అపటీక్షేపముతోఁ బ్రవేశించి'అని యందురు.)

**అపటువు** సం. విణ. (ఉ. ఉ, ట్వీ. ఉ.) 1. నేర్పరి కానివాఁడు. 2. వ్యాధితుఁడు, తెవులుగొంటు.

**అపతంత్రకము** సం. వి. అ. పుం. (వైద్య) వాత రోగభేదము.

**అపతర్పణము** సం. విణ. (అ. ఆ. అ.) తృప్తి లేనిది. వి. అ. న. 1. (రోగాదులందలి) ఉపవాసము, లంకణము. 2. తృప్తిలేమి.

**అపతీర్థము** సం. వి. అ. న. చెడ్డతీర్థము.

**అపతోక** సం. వి. ఆ. స్త్రీ. ఈచుకపోయినయావు.

**అపత్త్రము** సం. విశ. (అ. ఆ. అ.) 1. ఆకులు లేనిది. 2. ఱెక్కలు లేనిది. వి. అ. పుం. 1. వెదురుమొలక (వృ.వి.). 2. అంకురము, మొలక.

**అపత్నీకుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) పత్ని లేనివాఁడు.

**అపత్యపథకము** సం. వి. అ. పుం. యోని, ఆఁడుగుఱి.

**అపత్యము** సం. వి. అ. న. సంతానము. (కొడుకుగాని కూఁతురుగాని – పౌత్రాదులుకూడ అపత్యమేయని కొందఱు.)

**అపత్యశత్రువు** సం. వి. ఉ. ఈ. ఆఁడుఎండ్రి (పిల్ల దీనిపొట్ట వ్రచ్చికొని పుట్టుటచే దీనికి మరణము కలుగుట ప్రసిద్ధము) పుం. 1. ఎండ్రి. కర్కటము. 2. సర్పము, (ఇది తన సంతతిని నశింపఁజేయును.)

**అపత్రప** సం. వి. ఆ. స్త్రీ. పరులవలనఁగలిగినసిగ్గు, సిగ్గు.

**అపత్రపము** సం. విశ. (అ. ఆ. అ.) సిగ్గు లేనిది.

**అపత్రపిష్ణువు** సం. విశ. (ఉ.) లజ్జాస్వభావము గలవాఁడు, సిగ్గరి.

**అపత్రస్తుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) భయపడినవాఁడు.

**అపథము** సం. విశ. (అ. ఆ. అ.) మంచిమార్గము లేనిది (గ్రామాదికము) వి. అ. న. న్. పుం. 1. తప్పుత్రోవ. 2. నీతిబాహ్యమార్గము.

**అపథ్యము** సం. విశ. (అ. ఆ. అ.) హితముకానిది.

**అపదము** సం. విశ. (అ. ఆ. అ.) 1. కాలులేనిది. 2. స్థానము లేనిది. వి. అ. పుం. (పాము మొదలగు) ప్రాఁకెడిజంతువు. న. 1. యుక్తముకాని చోటు; తప్పుచోటు. 2. నీచస్థలము. 3. (వ్యాక)-పదము కానిది-ప్రత్యయాదికము.

**అపదాంతరము** సం. విశ. (అ. ఆ. అ.) అవ్యవహితము, సంసక్తము.

**అపదానము** సం. వి. అ. న. 1. పరిశుద్ధి గావించు కర్మము. 2. జరిగిన ప్రశస్తకర్మము, చక్కఁగా నిర్వర్తింపఁబడినకార్యము; విడచినపని. 3. ఖండనము.

**అపదిశము** సం. అవ్య. అ. న. రెండుదిక్కులమధ్యభాగమునందు, అయిమూలయందు.

**అపదిష్టము** సం. విశ. (అ. ఆ. అ.) చెప్పఁబడినది.

**అపదూఱు** మి. వి. (క. అపదూఱు, అవదూఱు. త. అవదూఱు.) అపనింద, దోషములేనివానియందు ఆరోపించిననింద.

**అపదేశము** సం. వి. అ. పుం. 1. ఉపదేశము, చెప్పుట. 2. నెపము, మిష, 3. కారణము. 4. హీనస్థానము.

**అపదేశి** సం. విశ. (న్. నీ. న్.) మాయకాఁడు.

**అపదేశ్యము** సం. విశ. (అ. ఆ. అ.) 1. హీనస్థానమందు కలుగునది. 2. నెపము మీఁది చెప్పఁదగినది. 3. చెప్పఁదగినది.

**అపద్రవ్యము** సం. వి. అ. న. చెడ్డవస్తువు.

**అపద్వారము** సం. వి. అ. న. అప్రధానద్వారము.

**అపధూపము** సం. విశ. (అ. ఆ. అ.) పొగ లేనిది.

**అపధ్యానము** సం. వి. అ. న. కీడు తలఁచుట, అనిష్టచింతనము.

**అపధ్వంసజుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) హీనజాతిపురుషునివలన ఉచ్చజాతిస్త్రీయందుఁ బుట్టినవాఁడు.

**అపధ్వంసము** సం. వి. అ. పుం. 1. నాశము. 2. హీనత్వము, నీచస్థితి.

**అపధ్వంసి** సం. విశ. (న్. నీ. న్.) నాశము చేయువాఁడు.

**అపధ్వస్తము** సం. విశ. (అ. ఆ. అ.) 1. నిందితము, తిరస్కరింపఁబడినది. 2. విడువఁబడినది. 3. అవచూర్ణితము, నలఁగఁగొట్టఁబడినది. 4. నాశము చేయఁబడినది.

**అపనమ్మిక** మి. వి. (క. అపనంబికె, అపనంబికె. త. అపనంబిక్కై.) 1. విశ్వాసము లేకుండుట. ద్వి. వీరబాహుని జూచివిమ మని పలికె, నీకేటి నపనమ్మి కేల నామీఁద. ద్వి. హరిశ్చ. ఉ. 1524.

2. అనుమానము (వస్తువు లేనిచోట అవస్తువు కలదేమో అనుభావము.)

క. నో మ్మొకచో నుండఁగ నపనమ్మిక యొక చోట నుండు నరులకు నెపుడు, న్నెమ్మదిఁ బరికించి వివేకమ్మునఁ దెలియఁగ వలయుఁ గల్లయు నిజముగా. హరిశ్చ. 5. 186.

**అపనయనము** సం. విశే. (అ. ఆ. అ.) కన్నులు లేనిది. వి. అ. న. 1. దూరీకరణము, తొలఁగించుట.

ఉదా: శ్రమాపనయనము, ఋణాపనయనము. మొ.

2. (రోగములకుఁజేయు) ప్రతీకారము,చికిత్స, 3. అపకారసాధనము.

**అపనయము** సం. విశే. (అ. ఆ. అ.) నీతి లేనిది. వి. అ. పుం. 1. తొలఁగించుట. 2. దుర్నీతి. 3. అపకారము.

**అపనయించు** సం. న. క్రి. తొలఁగించు, తీసివేయు.

గీ. కంక, ణాదిమణిభూషణోత్కర మపనయించి, యొప్పు పోలిపోయి దీనత నుండె ...మార్క. 1. 168.

2. నివారించు,పోఁగొట్టు. 3. మాను, విడుచు.

ఆ.నీదారిద్ర్య,మపనయింతుఁ జింతనపనయింపు. భార. శాం. 3. 482. (ఇది 2. 3. అర్థములకు ఉదాహరణము.)

**అపనసము** సం. విశే. (అ. ఆ. అ.) ముక్కు లేనిది.

**అపనామము** సం. విశే. (న్. న్, మ్ని, అ. న్.) చెడ్డ పేరు గలది. వి. న్. న, చెడ్డపేరు.

**అపనింద** సం. వి. ఆ. స్త్రీ. అపదూఱు.

**అపనీతము** సం. విశే. (అ. ఆ. అ.) దూరీకృతము, తొలఁగింపఁబడినది. వి. అ. న. చెడ్డనడత, దుష్ప్రవర్తనము.

**అపనుత్తి** సం. వి. ఇ. స్త్రీ. తొలఁగించుట; పోఁగొట్టుట.

**అపనుదము** సం. విశే. (అ. ఆ. అ.) ఇది శోకశబ్దపూర్వకముగానే యుండి మొత్తముమీఁద 'సుఖాహరణము—సుఖము కలిగించునది' అనునర్థము నిచ్చును.

ఉదా: శోకాపనుదః పుత్రోజాతః.

కాని కర్మమునకు శేషత్వవివక్షయందు ఇతరపదపూర్వకముగాఁ గూడనుండి 'తొలఁగించునది, పోఁగొట్టునది' అనునర్థము నిచ్చును.

చ. జయజయ కిల్బిషాపనుద.ఉ. హరి. 6. 19.

**అపనెపము** మి. వి. అపనింద.

ద్వి. అటుపోయినంతలో నపనెపమౌను. ద్వి. శ. సా. 1. ఆ. 19. పా. 16. పం.

**అపనేయము** సం. విశే. (అ. ఆ. అ.) తొలఁగింపఁదగినది; పోఁగొట్టఁ దగినది.

**అపనోదనము** సం. విశే. (అ. ఆ. అ.) తొలఁగించునది; పోఁగొట్టునది. వి. అ. న. తొలఁగించుట; పోఁగొట్టుట.

**అపనోది** సం. విశే. (న్. నీ. న్.) తొలఁగించునది.

**అపనోదము** సం. వి. అ. పుం—అపనుత్తి.

**అపపాఠము** సం. వి. అ. పుం. తప్పుపాఠము.

**అపపాడి** మి. వి. అన్యాయము.

ఆ. అవనిపతులు పలువు రపపాడి నొక్కనిఁ, దన్నుఁ బొదివికొనినఁ దరల కెదిరి. మార్క. 8.113. (శ. ర. పా.)

**అపపాత్రితుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) గొప్ప పాపముచేత జాతిభ్రష్టుఁడై బంధువులపాత్రములందు భోజనాదులు చేయరానివాఁడు; వెలిపెట్టఁబడినవాఁడు.

**అపపాత్రుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) బహిష్కృతపాత్రుఁడు. (చండాలాది - వీరు భోజనము చేసినపాత్రములు అపకృష్టములు. అవి యితరులు భుజించుటకు అనర్హములు.)

**అపప్రజాత** సం వి ఆ స్త్రీ. గర్భస్రావము గలిగిన యాఁడుది.

**అపప్రథ** సం. వి. ఆ. స్త్రీ. అపకీర్తి.

**అపప్రయోగము** సం. వి. అ. పుం. తప్పు ప్రయోగము.

**అపభయము** సం. విశే. (అ. ఆ. అ.) భయము లేనిది.

**అపభాషణము** సం. వి. అ. న. 1. నిందించుట, 2. చెడ్డమాట.

**అపభ్రంశము** సం. వి. అ. పుం. 1. పడుట, జాఱుట. 2. అపశబ్దము. 3. (కావ్యములందు)

ఆభీరాదులు మాటాడుతక్కువరకమగు ప్రాకృత భాష. 4. (శాస్త్రములందు) సంస్కృతముకంటె వేఱయినభాష.

శ్లో. ఆభీరాదిగిరః కావ్యే ష్వపభ్రంశ ఇతి స్మృతాః, శాస్త్రేషు సంస్కృతాదన్య, దపభ్రంశతయోదితం. కావ్యాద. 1.36.

**అపభ్రష్టము** సం. విణ. (అ. ఆ. అ.) 1. జాఱినది. 2. పాడైనది, చెడినది. (భాషాది)

**అపమండలము** సం. వి. అ. న. (జ్యోతి) క్రాంతి వృత్తము.

**అపమర్దము** సం. వి. అ. పుం. 1. ఒంపిడి. ఒత్తుడు. విమర్దనము. 2. బాధ, నొగులు.

**అపమానము** సం. వి. అ. పుం. అవమానము.

**అపమాని** సం. విణ. (న్. సీ. న్.) అపమానించు వాఁడు.

**అపమార్గము** సం. వి. అ. పుం. 1. తప్పుత్రోవ. 2. ప్రక్కత్రోవ. 3. అంగపరిమార్జనము, ఒడలు రాచుట.

శ్లో. అమృతద్రవైః ర్విదధ దబ్జదృశా మపమార్గమోషధిపతి స్సశ్మ కరైః శిశు. 9.36.

**అపమార్జనము** సం. వి. అ. న. శుద్ధిచేయుట (కడుగుట, తుడిచివైచుట, మొ.)

**అపముఖము** సం. విణ. (అ. ఆ. ఈ. అ. చూ. అభిముఖము) పెడమొగము కలది. వి. అ. న. పెడమొగము.

**అపమృత్యువు** సం. వి. ఉ. పుం. స్త్రీ. ఆకస్మికమైన చావు. చూ. మృత్యువు.

**అపయశము** సం. విణ. (స్.) కీర్తి లేనిది. వి.స్.న. అపకీర్తి.

**అపయానము** సం. వి. అ. న. పాఱిపోవుట.

**అపర** సం. వి. ఆ. స్త్రీ. 1. పశ్చిమదిశ. 2. (వేదాంత) బ్రహ్మవిద్యేతరవిద్య. (వ్యతి, పర.) 3. జరాయువు, మావి.

**అపరంజి** వి. (క. త. అపరంజి.) బంగారము; మేలిమిబంగారము.

సీ. తనశౌర్యశిఖిశిఖాతతికి జాంబూనదభూధరం బపరంజిపూదె గాఁగ. వసు. 1.116.

గ. ఎలుకలరాచతేజిసెలయొక్కుడుగాఁ డపరింజిపైఁడిని గ్గులు గలమేని పెన్వడుగు. రాజ. చ. 1.5.

**అపరకర్మము** సం. వి. న్. న. – అపరక్రియ. (దీనికి 'అపరము' అనియు వాడుక.)

**అపరక్తము** సం. విణ. (అ. ఆ. అ.) 1. నెత్తురు లేనిది, పాలిపోయినది. 2. అనురాగము లేనిది. 3. ఎఱుపు పోయినది.

**అపరక్రియ** సం. వి. ఆ. స్త్రీ. ఉత్తరక్రియ, చచ్చిన వాని గుఱించి చేయుకర్మము.

**అపరతి** సం. వి. ఇ. స్త్రీ. విరామము, ఉడుగుట.

**అపరపక్షము** సం. వి. అ. పుం. 1. కృష్ణపక్షము. 2. ప్రతివాదిపక్షము.

**అపరభాగము** సం. వి. అ. పుం. 1. పృష్ఠభాగము, వెనుకభాగము. 2. ఉత్తరభాగము, తరువాతి భాగము.

**అపరము** సం. విణ. (అ. ఆ. అ.) 1 – దేనికంటె మేలైనది లేదో అది–అనుత్తమము, సర్వోత్కృష్టము. 2. నికృష్టము, తక్కువైనది. 3. ఇతరము, వేఱైనది. 4. (దేశకాలములందు) కడపటిది.

ఉదా: అపరాహ్ణము – పగటి మూఁడుభాగములలోను కడపటిది. అపరమద్రము – మద్రదేశముయొక్క కడపటి భాగము (వ్యతి. పూర్వము) 5. (దేశకాలములందు) దగ్గఱది.

పాటలీపుత్రాత్ ప్రయాగ మపేక్ష్య కాశీ అపరా–పాటలీపుత్రమునకు ప్రయాగము కంటె కాశిదగ్గఱది. (తర్కసంగ్రహము. నృసింహ వ్యాఖ్య.)

6. పడమటిది. (ఉదా : అపరదిక్కు).

7. (తర్క) న్యూనవృత్తి, అల్పదేశవృత్తి. (మనుష్యత్వ బ్రాహ్మణత్వములలో మనుష్యత్వము అధిక దేశవర్తి. బ్రాహ్మణత్వము న్యూనదేశవర్తి)

వి. అ. పుం. ఏనుఁగు వెనుకపాదము. న. ఏనుఁగు శరీరముయొక్క వెనుకటి భాగము.

**అపరరాత్రము** సం. వి. అ. పుం. రాత్రి కడపటి భాగము.

**అపరలోకము** సం. వి. అ. పుం. పరలోకము.

**అపరస్పరము** సం. విణ. (అ. ఆ. అ.) క్రియాసాతత్యము కలది, ఎడతెగనిది, అవిచ్ఛిన్నము.

సీ. అపరస్పరంబులై యాకాశవీథికిఁ గొన్ని భాస్కరకరాంకురములు తెగనె. నైష. 8.5.

అవ్య. అ. న. ఎడతెగకుండ.

శ్లో. నిర్దిష్టం కర్మసాతత్యే, సుధీభిరపరస్పరం. అని భాగురి.

ఉదా: సార్థాః అపరస్పరం గచ్ఛంతి.

**అపరహైమనము** సం. విణ. (అ. ఈ. అ.) హేమంతము యొక్క కడపట పుట్టినది.

**అపరాంగము** సం. వి. అ. న. (అలం) గుణీభూత వ్యంగ్యము నగు అష్టవిధమధ్యమ కావ్యములలో నొకటి.

**అపరాంతము** సం. వి. అ. పుం. పడమటిదిక్కు యొక్క చివర నున్న దేశవిశేషము

**అపరాగము** సం. వి. అ. పుం. అప్రీతి; ద్వేషము

**అపరాగ్ని** సం. వి. ఇ. పుం. 1. కడపటియగ్ని, అంత్యేష్టికర్మమునకు (అనఁగా దహనమునకు) ఉపయోగించుఅగ్ని. 2. బ. గార్హపత్యదక్షిణాగ్నులు. (ఈయర్థమున సంస్కృతమందు ద్వివచనాంతముగానే యుండును.)

**అపరాజిత** సం. వి. ఆ. స్త్రీ. 1. (విజయదశమి నాఁడు కొలువఁదగు) దుర్గ. 2. తక్కిలి (వృ.వి.) 3. విష్ణుక్రాంత (వృ.వి.) 4. సోమిదము (వృ.వి.) 5. గటిక (వృ.వి.) 6. నల్లవావిలి (వృ.వి.) 7. శంఖిని, కట్లతీఁగ 8. వేఁగిస (వృ.వి.) 9. తాయెతుగాకట్టు ఒకానొక యోషధి (వృ.వి.) శాకుం. 7.

10. ఒకమంత్రవిద్య. విక్రమో. 2.

11. ఈశానదిక్కు. 12. యోగినీభేదము.

**అపరాజితుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) గెలువఁబడనివాఁడు. వి. అ. పుం. 1. విష్ణువు. 2. శివుఁడు.

**అపరాతిరి** మి.వి. అర్ధరాత్రము, నడురేయి (శ.ర.)

**అపరాద్ధము** సం. విణ. (అ. ఆ. అ.) 1. తప్పు చేసినది. 2. గుఱితప్పినది. (ఉదా: అపరాద్ధపృషత్కుఁడు–గుఱితప్పినబాణముగలవాఁడు.)

3. అతిక్రమించినది.

ఉదా: అపరాద్ధాఽభిషేకవేళోపాధ్యాయస్య. విక్రమో. 2.

వి. అ. న. అపరాధము.

**అపరాధము** సం. వి. అ. పుం. తప్పు, నేరము.

**అపరాధి** సం. విణ. (న్. నీ. న్.) అపరాధము గలవాఁడు.

**అపరాలు** సం. వి. బ. కందులు పెసలు మున్నగు పైరధాన్యములు. (వరిపంటకు తరువాత పండునవి.)

**అపరాహ్ణకము** సం. విణ. (అ. హ్ణికా. అ.) అపరాహ్ణమందు పుట్టినది.

**అపరాహ్ణతనము** సం. విణ. (అ. ఈ. అ.) అపరాహ్ణమందయినది, అపరాహ్ణమందలిది.

**అపరాహ్ణము** సం. వి. అ. పుం. న. దినశేషభాగము; పగటియొక్క చివరిభాగము. (పగటిని రెండు భాగములుగా విభజించినపుడు రెండవసగము, మూఁడుగా విభజించినపుడు మూడవభాగము. ఐదుగా విభజించినపుడు అయిదవభాగము రాత్రుసవేళయై కర్మానర్హమగును కనుక నాలుగవభాగము.)

**అపరాహ్ణేతనము** సం—అపరాహ్ణతనము.

**అపరిగ్రహము** సం. వి. అ. పుం. 1. ప్రతిగ్రహము లేమి, స్వీకరింపమి. 2. పాతంజలోక్త మగు నొకానొకయమము. (దేహయాత్రకు వలయు దానికంటె నెక్కువగా భోగసాధనములకు ధనాదులను గయికొనకుండుట.)

**అపరిగ్రహుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఏదియు స్వీకరింపనివాఁడు. 2. భార్యలేనివాఁడు. వి. అ పుం. పరివ్రాజకుఁడు. (దేహయాత్రకు వలయుకౌపీనాదులకంటె నెక్కువ సంగ్రహింపనివాఁడు.)

**అపరిచ్ఛదుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)–అప్రశస్తమయినవస్త్రములు కలవాఁడు – దరిద్రుఁడు. మను. 8. 406.

**అపరిమితము** సం. విణ. (అ. ఆ. అ.) పరిమితము కానిది, మితి లేనిది.

**అపరిమేయము** సం. విణ. (అ. ఆ. అ.) పరిమితి తెలుప శక్యము కానిది.

**అపరిహరణీయము** సం. విణ. (అ. ఆ. అ.) 1. పరిహరింప శక్యముకానిది. 2. పరిహరింప యోగ్యము కానిది.

**అపరిహార్యము** సం—అపరిహరణీయము.

**అపరుట్టు** సం. విణ. (ష.) కోపము లేనివాఁడు.

**అపరూపము** సం. విణ. (అ. ఆ అ.) వికృత రూపము గలది. వి. అ. న. వికృతరూపము.

**అపరోక్షము** సం. విణ. (అ. ఆ. అ.) ప్రత్యక్షము.

**అపరోక్షానుభూతి** సం. వి. ఇ. స్త్రీ. ప్రత్యక్షానుభవము.

**అపరోపము** సం. వి. అ. పుం. (రాజ్యాదులనుండి) భ్రంశము, చ్యుతి.

శ్లో. శ్రుత్వా స్వామ్యపరోపరౌద్రవిషమా
నాఘాతతూర్యస్వనాన్న ధ్వస్తం... మదీ
యం మనః. ముద్రా. 2. 21.

**అపర్ణ** సం. వి. ఆ. స్త్రీ – తపస్సు చేయునపుడు ఆకులుకూడ తిననిది – పార్వతి, దుర్గ.

**అపర్యాప్తము** సం. విణ. (అ. ఆ. అ.) 1. అసంపూర్ణము, చాలనిది. 2. (స్వకార్యమునకు) అసమర్థము. 3. అపరిచ్ఛిన్నము, మేర లేనిది.

**అపర్యాప్తి** సం. విణ. (ఇ.) మేర లేనిది. వి, ఇ. స్త్రీ. 1. చాలమి. 2. సామర్థ్యములేమి. 3. అపరిచ్ఛేదము, కొలఁదిలేమి.

**అపర్యాయము** సం. విణ. (అ. ఆ. అ.) క్రమము లేనిది వి. అ. పుం. క్రమములేమి.

**అపర్యుషితము** సం. విణ. (అ. ఆ. అ) – పర్యుషితము కానిది – నిలువయుండనిది; క్రొత్తది. (అన్నము పువ్వు, మొ.)

'అపర్యుషితప్రతిజ్ఞే మారుతౌ' వేణీ. 6. 169.
(అపర్యుషితప్రతిజ్ఞే – నిర్వహింపఁబడిన ప్రతిజ్ఞ గలవాఁడగు.)

**అపర్వదండము** సం. వి. అ. పుం. 1. రామతృణమనెడియొక ఱెల్లు (వృ.వి.) (దీనికి తక్కిన ఱెల్లులకుఁబోలె కనుపులుండవు) 2. ఒకదినుసు చెఱకు (వృ.వి.)

**అపలపనము** సం. వి. అ. న.—అపలాపము.

**అపలపించు** సం. స. క్రి. కప్పిపుచ్చు. మఱుఁగు పఱుచు.

సీ. ఘనసారబహుళచందన విలేపనమున నా
పాండుభావంబు నపలపించు. నైష. 1.84.

**అపలము** సం. విణ. (అ. ఆ. అ.) మాంసములేనిది. వి. అ. న. కీలము, మేకు.

**అపలాపము** సం. వి. అ. పుం. 1. మఱుఁగుపఱిచి చెప్పుట, కప్పిపుచ్చి చెప్పుట; మఱుఁగుమాట, మోసపుఁబలుకు. 2. ఆచ్ఛాదనము, కప్పుట.

శ్లో. సదివం సముచిచ్ఛిద చ్ఛరౌఘైః కృతరి
గ్మద్యుతిమండలాపలాపైః. శిశు. 20. 28.

3. ప్రేమము. (మే. ని.)

**అపలాపి** సం. విణ. (న. నీ. న.) అపలాపము చేయువాఁడు, మఱుఁగుపఱుచువాఁడు.

**అపలాపించు** సం. స. క్రి—అపలపించు.

క. నెల్లూరి తూముకాలువ,హల్లకములకమ్మఁ
దావి నపలాపించుఁ,సల్లలితలీలఁ దిప్పయ,
వల్లభరాయ ప్రధానవాగ్డంబరముల్.
క్రీడా. 29.

(అవమానించు, తక్కువపఱుచు)

మ. విపరీతస్థితి నొంది ఘోరవిపినోర్వీవాసులై
నిత్యదుఃఖపరాధీనతఁ దూలిరంచు మనలన్
గర్వాంధితస్వాంతుడై, యపలాపింపఁగవచ్చి
దుర్నయపరుండా ధార్తరాష్ట్రుండు దో,
షపరీతాంతుఁడు తత్ఫలంబు గుడిచెన్
సత్యంబు సామాత్యుఁడై భార.అర.5.406.

**అపలాషి** సం. విణ. (న. నీ. న.) ధనాదులందు అనుచిత తృష్ణాశీలుఁడు.

**అపలాషిక** సం. వి. ఆ. స్త్రీ. 1. అధికతృష్ణ,ఆకాంక్ష. 2. పిపాస, దప్పి. ('అపలాషిక' అని వై. ని.)

**అపలాషుకుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)—అపలాషి.

**అపవచనము** సం. వి. ఆ. న. 1. దుర్భాషణము లాడుట. 2. దుర్భాష.

**అపవనము** సం. వి. అ. న. — కృత్రిమవనము-ఉప వనము, తోఁట.

**అపవరకము** సం. వి. అ. పుం. గర్భాగారము, లోపలిగది.

**అపవర్గము** సం. వి. అ. పుం. 1. (కార్యము యొక్క) సమాప్తి. 2. సిద్ధించుట,నెఱవేఱుట. 3. మోక్షము. 4 దానము, ఈవి. 5. విడుచుట. విసర్జించుట.

**అపవర్జనము** సం. వి. అ. న. 1. విడుచుట. 2. (ప్రతిజ్ఞను) నెఱవేర్చుట.3. (ఋణాదికమును) తీర్చుట. 4. దానము, ఈవి. 5. మోక్షము.

**అపవర్జితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. విడువఁబడినది.2. ఈయఁబడినది. 3. నెఱవేర్పఁబడినది.

**అపవర్తనము** సం. వి. అ. న. 1. ఒకవిధముగా నున్నదిమఱొకవిధముగా నగుట, మాఱుట. 2. ఒకవిధముగా నున్నదానిని మఱొకవిధముగా చేయుట, మార్చుట. 3. అపహరించుట. 4. (గణిత) సంఖ్యావిశేషము- రెండుసంఖ్యలలో పెద్దసంఖ్యను చిన్నసంఖ్యచేభాగించి వచ్చిన శేషముచే అల్పసంఖ్యను భాగింపవలెను. అట్లు చేయఁగా వచ్చినశేషముచేత చివరివిభాజక సంఖ్యను భాగింపవలెను. ఇట్లుచేయుచు పోఁగా ఏసంఖ్యచేత భాగించినపుడు శేషము ఉండదో ఆసంఖ్యయు, అట్టిసంఖ్యచే మూలసంఖ్యల రెంటిని విభజించుటయును, గూడ 'అపవర్తనము' అనఁబడును.

ఉదా; 221, 195 ఈరెండుసంఖ్యలకు అపవర్తనము 13. ఈ13 చేపై రెండు సంఖ్యలను (221, 195) విభజించుటగూడ అపవర్తనము అనఁబడును.

**అపవర్తము** సం. వి. అ. పుం.—అపవర్తనము.

**అపవాదకము** సం. విణ. (అ. దీ. అ.) 1. నిరసించునది; సామాన్యవిధిని త్రోసివేయునది. (విశేషవిధి)2. నిందించునది. 3, అపకీర్తికరము.

**అపవాదము** సం. వి. అ. పుం. 1. నిందించుట. 2. అపకీర్తి, 3. కల్లలాడుట. 4. చెడ్డవాదము. 5. విశేషవిధి (ఇది సామాన్యవిధిని బాధించును. 'మా హింస్యాత్సర్వాభూతాని — ఏజంతువును హింసింపరాదు'అనుహింసానిషేధవిధి సామాన్యశాస్త్రము 'వాయవ్యం శ్వేతమాలభేత—వాయుదేవతాక మగు శ్వేతపశువును హింసింపవలయును'అనునది విశేషశాస్త్రము. ఇది'వాయవ్యపశువునుదక్క మిగిలిన పశువులను చంపఁగూడదు' అని సామాన్యశాస్త్రమునకు అర్థమును కల్పించును.) 6. నమ్మకము,విశ్వాసము. 7. ప్రేమ. 8. ఆజ్ఞ, 9. కుత్సితమైన వాద్యధ్వని (శీకు. 6. 9.) 10. వాదఖండనము.

**అపవాది** సం. విణ. (న్. నీ. న్.) 1. వాదఖండనము చేయువాఁడు. 2. నిందించువాఁడు.

**అపవారకము** సం. వి. అ. పుం. 1, కప్పు, ఆచ్ఛాదనము. 2. తెర, జవనిక, 3. పాషాణము, ఱాయి.

**అపవారణము** సం. విణ. (అ. ఆ. అ.) ఆచ్ఛాదించునది, కప్పునది. వి. అ. న. అంతర్ధానము, మఱుఁగుపడుట.

**అపవారితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. కప్పఁబడినది. 2. (నాటక) రహస్యముగాఁ జెప్పఁబడినది. (మాట.)

**అపవాహనము** సం. వి. అ. న. — అపవాహము.

**అపవాహము** సం. వి. అ. పుం. 1. ఒకచోటనుండి మఱియొకచోటికిఁ జేర్చుట. 2. (గణిత) భిన్నాంకములయొక్క వ్యవకలనము.

**అపవిఘ్నము** సం. విణ. (అ. ఆ. అ.) నిర్విఘ్నము, విఘ్నములేనిది.

**అపవిత్రము** సం. విణ. (అ. ఆ. అ.) పవిత్రము కానిది.

**అపవిద్ధము** సం. విణ. (అ. ఆ. అ.) 1. విడువఁబడినది, త్యక్తము. 2. నిరాకరింపఁబడినది,

**అపవిద్ధుఁడు** సం. వి. అ. పుం. తలిదండ్రులు విడువఁగా మఱొకరిచే పుత్రుఁడుగాఁ జేకొనఁబడినవాఁడు. (వీఁడు ద్వాదశపుత్త్రులలోనొకఁడు)

**అపవిద్య** సం. వి. ఆ. స్త్రీ. (వేదాంత) అవిద్య, అజ్ఞానము,

**అపవృత్తము** సం. విణ. (అ. ఆ. అ.) 1, మరలినది. 2. తలక్రిందైనది. 3, ముగిసినది, సమాప్తము. వి. అ. న. క్రాంతివృత్తము, సూర్యగమన మార్గము.

**అపవృత్తి** సం. వి. ఇ. స్త్రీ. సమాప్తి.

**అపవేధము** సం. వి. అ. పుం. (మణులు మొదలగు వానికి) తప్పుగా బెజ్జము వేయుట.

**అపవోఢ** సం. విణ. (ఋ. త్రి. ఋ.) ఒకచోటనుండి మఱొకచోటికి తీసికొనిపోవువాఁడు.

**అపవ్యయమానుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) 1. దుర్వ్యయము చేయువాఁడు. 2. ఋణము పుచ్చుకొని లేదనువాఁడు.

**అపవ్యయము** సం. విణ. (అ. ఆ. అ.) 1. క్షయము లేనిది. 2. వ్యయము లేనిది. వి. అ. పుం. దుర్వ్యయము.

**అపవ్రతుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) నియమము తప్పినవాఁడు.

**అపశంకుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) శంక లేని వాఁడు.

**అపశకునము** సం. వి. అ. న. దుశ్శకునము.

**అపశదుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) నీచుఁడు.

**అపశబ్దము** సం. వి. అ. పుం. వ్యాకరణశుద్ధము కానిమాట. అసాధుశబ్దము.

**అపశ్చిమము** సం. విణ. (అ. ఆ. అ.) 1. దేనికంటె పశ్చిమము (కడపటిది) లేదో యది, కట్టకడపటిది. 2. మొదటిది, శ్రేష్ఠము. 3. అంతము లేనిది, అపరిమితము.

**అపశ్రీకుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) శ్రీ లేనివాఁడు.

**అపశ్లిష్టము** సం. విణ. (అ. ఆ. అ.) 1. శ్లేష లేనిది (కావ్యాది) 2. కూడిక లేనిది.

**అపష్ఠము** సం. వి. అ. న. అంకుశపు మొన.

**అపష్ఠురము** సం. విణ. (అ. ఆ. అ.) ప్రతికూలము, విపరీతము.

**అపష్ఠువు** సం. విణ. (ఉ) 1. ప్రతికూలము, విరుద్ధము. 2. ఎడమవైపుననున్నది. వి. ఉ. పుం. కాలము.

**అపసదుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) నీచుఁడు. వి. అ. పుం. బ్రాహ్మణునకు క్రింది మూఁడు వర్ణముల స్త్రీలయందును క్షత్త్రియునకు క్రింది రెండువర్ణముల స్త్రీలయందును వైశ్యునకు శూద్రస్త్రీయందును గలిగినపుత్రుఁడు. మను. 10. 10.

**అపసరణము** సం. వి. అ. న. తొలఁగుట.

**అపసరము** సం. వి. అ. పుం. 1. తొలఁగుట. 2. ఒకనినొత్తు మఱొకనికి చెందుటకు యుక్తి సాధనముగుప్రతిగ్రహక్రియాదికము.

**అపసరిల్లు** సం. అ. క్రి. తొలఁగు. (శ. ర.)

**అపసర్జనము** సం. వి. అ. న. 1. వదలిపెట్టుట. 2. దానము. 3. వధము.

**అపసర్పణము** సం. వి. అ. న. 1. మరఁగుపోవుట. 2. గూఢచారుఁడై విశేషములు కనిపట్టుట.

**అపసర్పము** సం. వి. అ. పుం. — అపసర్పణము.

**అపసర్పుఁడు** సం. వి. అ. పుం. అక్కడక్కడ తిరిగి సమాచారము తెలిసికొనివచ్చి రాజునకుఁ జెప్పువాఁడు, గూఢచారుఁడు.

**అపసవ్యము** సం. విణ. (అ. ఆ. అ.) 1. దక్షిణము, కుడివైపున నున్నది. 2. ప్రతికూలము. విపరీతము. 3. కుడిబుజముమీఁదనుండి యెడమచేతి క్రిందికి ధరింపఁబడినది. (జన్నిదము — మొ. వ్యతి ; సవ్యము.)

**అపసారణ** సం. వి. ఆ. స్త్రీ.—అపసారణము.

**అపసారణము** సం. వి. అ. న. 1. తొలఁగించుట. 2. బహిష్కరించుట.

**అపసారము** సం. వి. అ. పుం. 1. తొలఁగించుట. 2. బహిష్కరించుట. 3. పాఱిపోవుట.
శ్లో. సనిగడ చరణత్వా త్స్వవేశాపసారః. మృచ్ఛ. 2. 3.
4. నిర్గమనమార్గము, వెలికి పోవుత్రోవ.

**అపసారితుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) 1. తొలఁగింపఁబడినవాఁడు. 2. తఱుమఁబడినవాఁడు.

**అపసిద్ధాంతము** సం. వి. అ. పుం. విరుద్ధసిద్ధాంతము. తప్పుసిద్ధాంతము.

**అపసృతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. తొలఁగినది. 2. ఏయఁబడినది. (బాణము)
'అపసృత మివ శస్త్రం' మహా. 2.

**అపస్కరము** సం. వి. అ. పుం. న. రథావయవము. (చక్రము తప్పఁ దక్కిననొగ కాఁడి మొదలగు రథావయవము—అని కొందఱు)

**అపస్కిరణము** సం. వి. అ. న. (ఆహారార్థము గాని ఆశ్రయార్థము గాని హర్షాదులచేఁ గాని

కోడి మున్నగుపశువులును కుక్క ఎద్దు మున్నగు చతుష్పాత్తులును) నేలకొక్కరించుట,దువ్వుట.

**అపస్నాతుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) జ్ఞాతి మొదలగువారు మృతినొందుటవలన స్నానము చేసినవాఁడు. (పుత్రాదులచే స్నానసంస్కారము చేయింపఁబడిన మృతుఁడు - అని సుబోధినీ కారుఁడు.)

**అపస్నానము** సం. వి. అ. న. 1. చచ్చిపోయిన జ్ఞాతి మొదలగువారికై చేయుస్నానము. 2. మృతునికిఁ జేయించు స్నానసంస్కారము. 3. స్నానముచేయఁగా మిగిలినజలము.

శ్లో. ఉద్వర్తనమపస్నానం నాధితిష్ఠేత్తుకామతః. మను. 4. 132.

**అపస్మారము** సం. వి. అ. పుం. మోహదుఃఖాదులచేఁ గలిగెడియావేశము. స్మృతిదప్పుట, ఒడలెఱుఁగమి.2. రోగవిశేషము. (క్రిందపడిపోవుట పండ్లుకొఱుకుట నురుఁగులు గ్రక్కుట కాళ్లును చేతులును కొట్టుకొనుట మున్నగునవి దీనిలక్షణములు)

**అపస్మారి** సం. విణ. (న్. నీ. న్.) అపస్మారరోగము కలవాఁడు.

**అపస్మృతి** సం. విణ. (ఇ.) స్మృతి దప్పినవాఁడు. వి. ఇ. స్త్రీ.—అపస్మారము.

**అపస్వరము** సం. వి. అ. పుం. తప్పుస్వరము.

**అపహతము** సం. విణ. (అ. ఆ. అ.) పోఁగొట్టఁబడినది; నశింపఁజేయఁబడినది.

**అపహతి** సం. వి. ఇ. స్త్రీ. పోఁగొట్టుట, నాశనము.

**అపహరణము** సం. వి. అ. న 1. బలవంతముగాఁ దీసికొనిపోవుట 2. దొంగిలించుట.

**అపహము** సం. విణ. (అ. ఆ. అ - సమాసోత్తర పదముగానే యుండును) తొలఁగించునది, పోఁగొట్టునది, నాశము చేయునది.

ఉదా: క్లేశాపహము. తమోఽపహము.

**అపహరించు** సం. స. క్రి. 1. దొంగిలించు.

వ. దుగ్ధంబు లపహరించినవాఁడు కొక్కెర యగు. మార్క. 2. 118.

2. పోఁగొట్టు.

గీ. తిరిసియేనియు నన్నంబుఁ దెచ్చి శిథిల,లైన విప్రులయాఁకలి యపహరించు. భార. అను. 4. 272.

3. తయింపఁజేయు, తగ్గించు.

క. మేలివి గీడివి యని భూ,పాలక యేఁ జెప్పినట్టి పనులెఱుఁగుము నీ.వోలినయాయువుఁ జెనుపం,జాలు ననియునపహరింప శక్తము లనియుఁ. భార. అను. 4.95.

4. బలాత్కారముగాఁ దీసికొనిపోవు.

**అపహర్త** సం. విణ. (ఋ. త్రీ. ఋ.) అపహరించువాఁడు.

**అపహసత్** సం. (శత్ర.) అపహసించుచున్న.

**అపహసనము** సం. వి—అపహసితము.

**అపహసనీయము** సం. — అపహసితవ్యము.

**అపహసించు** సం. అ. క్రి. 1. వికృతముగానవ్వు. 2. అకారణముగా నవ్వు. స. క్రి. గేలిసేయు, పరిహసించు.

గీ. ఆదురాత్ముండు శ్రోత్రియు నపహసించు. నైష. 7. 130.

**అపహసిత** సం. విణ. (ఋ. త్రీ. ఋ.) అపహసించువాఁడు.

**అపహసితము** సం. విణ. (అ. ఆ. అ.) గేలిసేయఁబడినది. వి. అ. న. 1. అకారణపునవ్వు. 2. వెకలినవ్వు. 3. గేలిసేయుట, ఎగతాళి.

**అపహసితవ్యము** సం. విణ. (అ. ఆ. అ.) అపహసింపఁ దగినది.

**అపహస్తము** సం. వి. అ పుం, గళహస్తము, గెంటుటకై మెడమీఁద పెట్టినచేయి. 2. అపహస్తము, కరపృష్ఠభాగము, పెడచేయి. మీఁజేయి.

శ్లో. సారథిం చాస్య దయిత మపహస్తేన జఘ్నివాన్. సం. భార. ఆది. 137. 45. సం. భార. వన. 12.88. (అపహస్తేన - హస్తపృష్ఠేన—అని వ్యాఖ్య.)

**అపహస్తితుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) 1. మెడమీఁద చేయి వేసి గెంటఁబడినవాఁడు. 2. నిరసింపఁబడినవాఁడు, త్రోసివేయఁబడినవాఁడు. మాలతీ. 9. 19.

**అపహసనము** నం. వి. అ. న. విడుచుట.

**అపహారకుఁడు** నం. విశే. (అ. రిశా. అ) 1. దొంగిలించువాఁడు. 2. తొలఁగించువాఁడు. 3. దాఁచువాఁడు (ఆత్మాపహారకుఁడు—తనకులాదులను మఱుఁగుపఱుచువాఁడు) 4. మఱొకచోటికి లాగుకొని పోవువాఁడు, 'జాలాపహారకాః పక్షిణః' (హితో. 1.) 5. నశింపఁజేయువాఁడు.

**అపహారము** నం. వి. అ. పుం. 1. దొంగిలించుట. 2. తొలఁగించుట. 3. కొనిపోవుట; బలాత్కారముగా తీసికొనిపోవుట, 4. దాఁచుట. 'కథమాత్మాపహారం కరోమి' (శాకుం. 1.) 5. తగ్గుదల, అపచయము. 6. హాని.

**అపహారి** నం. విశే. (న్. ఙీ న్.)—అపహారకుఁడు.

**అపహాసకుఁడు** నం. విశే. (అ. సికా. అ.) అపహసించువాఁడు.

**అపహాసము** నం. వి. అ. పుం.—అపహసితము.

**అపహాస్యమానుఁడు** నం. విశే. (అ. ఆ. అ.) అపహసింపఁబడుచున్నవాఁడు.

**అపహాస్యము** నం. విశే. (అ. ఆ. అ.) అపహసితవ్యము. వి—అపహసితము.

**అపహృతము** నం. విశే. (అ. ఆ. అ.) 1, దొంగిలింపఁబడినది. 2. బలాత్కారముగాఁ దీసికొనిపోఁబడినది. 3. తొలఁగింపఁబడినది.

శ్లో. పశ్చాత్పుత్రై రపహృతభరః. విక్రమో. 3. 1.

**అపహృతి** నం. వి. ఇ. స్త్రీ—అపహరణము.

**అపహ్నవము** నం. వి. అ. పుం. 1. కప్పిపుచ్చుట. 2. మఱుఁగుమాట. అపలాపము. 3. ఒక అర్థాలంకారము. 4. ప్రేమము, స్నేహము.

**అపహ్నవించు** నం. న. క్రి. 1. మఱుఁగుపఱుచు. 2. భగ్నముచేయు, పాడుచేయు.

వ. తపోధను లగువారలతపంబులను నీరూపంబున పహ్నవించినదానవు. ఈచక్కఁదనంబేమితపంబున సంపాదించితివి... భాగ. 5. 1, 40.

శ్లో. రూపం తపోధన తపశ్చరతాం తపోఘ్నం, హ్యేతన్ను కేన తపసా భవతోపలబ్ధం. సం. భాగ. 5. 2. 15.

**అపహ్నుతము** నం. విశే. (అ. ఆ. అ.) అపహ్నవింపఁబడినది.

**అపహ్నుతి** నం. వి. ఇ. స్త్రీ. — అపహ్నవము.

**అపహ్రానము** నం. వి. అ. పుం క్షీణించుట తగ్గుట.

**అపాంక్తుఁడు** నం. విశే. (అ. ఆ. అ.) పంక్తిభోజనమునకు అనర్హుఁడు, వెలివేయఁబడినవాఁడు.

**అపాంక్తేయుఁడు** నం—అపాంక్తుఁడు.

**అపాంక్త్యుఁడు** నం—అపాంక్తుఁడు.

**అపాంగదృష్టి** నం. వి. ఇ. స్త్రీ. కడకంటిచూపు, ఓరచూపు.

**అపాంగము** నం. విశే. (అ. ఆ. ఈ. అ.) 1. అంగహీనము. 2. వికలమైనఅవయవములు గలది. వి. అ. పుం. 1. కడకన్ను, నేత్రాంతము. 2. నొసటను పెట్టుకొనెడిబొట్టు. 3. ఉత్తరేను (వ్య.వి.)

**అపాంపతి** నం. వి. ఇ. పుం. 1. సముద్రుఁడు. 2. వరుణుఁడు.

**అపాకము** నం. విశే. (అ. ఆ. అ.) 1; పక్వము కానిది. 2. జీర్ణముకానిది, వి. అ. పుం. 1. అజీర్ణము, 2. పరిపక్వముకామి.

**అపాకరణము** నం. వి. అ. న. 1. తొలఁగించుట. 2. నిరాకరించుట. 3. (ఋణాదికము) తీర్చుట.

**అపాకరించు** నం. న. క్రి. 1, తొలఁగించు.

వ. దుర్వివేకం బపాకరించుటకు. చం. రా. 3. 98.

2. (ఋణము) తీర్చు.

**అపాకరిష్ణువు** నం. విశే. (ఉ.) 1. తొలఁగించుశీలముగలవాఁడు. 2. నిరాకరించునది, మించునది.

శ్లో, వర్ణసన్స్వర్ణ మపాకరిష్ణుః. సం. భర్తృ. శృం. 5.

**అపాకర్మము** నం. వి. న్. న. 1. తొలఁగించుట. 2. (ఋణము) తీర్చుట.

**అపాకశాకము** నం. వి. అ. పుం న. అల్లము.

**అపాకృతము** నం. విశే. (అ. ఆ. అ.) 1. తొలఁగింపఁబడినది, నివారింపఁబడినది. 2. తీర్పఁబడినది. (ఋణాది) 3. దూరీకృతము, త్యజింపఁబడినది.

'యత్స్వయమభియోగదుఃఖై రపాకృతంతదేవ రాజ్యం సుఖయతి' ముద్రా. 1.

**అపాకృతి** నం. వి. ఇ. స్త్రీ. 1—అపాకరణము. 2. కోపాదివికారము.

శ్లో. నిశమ్య సిద్ధిం ద్విషతానుపాకృతీ స్తత స్తతస్త్యావినియంతు మక్షమా. సం. కిరా. 1. 27.

**అపాక్కు** నం. విశే. (చ. వి. చ.) దక్షిణపుది. (వై. ని.)

**అపాక్రియ** నం. వి. ఆ. స్త్రీ—అపాకర్మము.

**అపాచి** నం. వి. ఈ. స్త్రీ. దక్షిణదిక్కు.

**అపాచీనము** నం. విశే. (అ. ఆ. అ.) 1. దక్షిణపుది. 2. విపర్యస్తము. (శా. ని.)

**అపాచ్యము** నం. విశే. (అ. ఆ. అ.) దక్షిణపు దిక్కుది.

**అపాటవము** నం. విశే. (అ. ఆ. అ.) 1. నేర్పు లేనిది. 2. శక్తిలేనిది. వి. అ. న. 1. శక్తి లేమి. 2. రోగము. 3. నేర్పులేమి.

**అపాత్రము** నం. వి. అ. న. 1. దుష్పాత్రము. 2. అనర్హుఁడు. (రూ. అపాత్రుఁడు) 3. అనర్హము.

**అపాత్రీకరణము** నం. వి. అ. న - బ్రాహ్మణుని అపాత్రునిగాఁ జేయునది - నిందితప్రతిగ్రహాది దోషము.

శ్లో. నిందితేభ్యోధనాదానం,వాణిజ్యం శూద్ర సేవనం, అపాత్రీకరణం జ్ఞేయమసత్యస్యచ భాషణం. మను. 11. 67.

**అపాదానము** నం. వి. అ. న. 1. తొలఁగించుట. 2, (వ్యాక) పంచమీవిభక్తికారకము, ఎందుండి పాయునో యది. (పండు చెట్టునుండి పడు చున్నది-అనుచోట చెట్టు అపాదానము)

**అపాధ్వము** నం. వి. అ. న. అపమార్గము,చెడ్డత్రోవ.

**అపానద్వారము** నం. వి. అ. న. గుదస్థానము.

**అపాననము** నం. వి. అ. న. 1. ఊపిరిపీల్చుట. 2. మూత్రపురీషాదులను విడుచుట.

**అపానము** నం. వి. అ. పుం. 1. మూత్రాదులను క్రిందుగాఁ ద్రోసివేయునట్టి యొకానొక వాయువు (ఇది ప్రాణాదిపంచవాయువులలో నొకటి. ఇదిగుదస్థానమందుండును.) న. 1. గుదస్థానము. 2, వృషణము. (వై. ని.)

**అపామార్గము** నం. వి. అ. పుం. ఉత్తరేను (వృ.వి.)

**అపామార్జనము** నం. వి. అ. న. 1. శుద్ధిచేయుట, 2. రోగము అశుభము మున్నగువానిని తొలఁగించుట.

**అపాయము** నం. వి. అ. పుం. 1. పోవుట. 2, విశ్లేషము, వేఱుపాటు; 3. నాశము. 4. చెఱుపు, కీడు.

**అపారము** నం. విశే. (అ. ఆ. అ.) 1. అవలి దరి లేనిది; మితి లేనిది. 2. దాఁటుటకు శక్యము కానిది; జయింప శక్యముకానిది.

శ్లో. రావణశ్చమహాశత్రు రపారః ప్రతిభాతిమే. రామా.

వి. అ. న. ఈవలిదరి, అవారము.

**అపార్థకము** నం. విశే. (అర్థి. శా. అ.)—అపార్థము.

**అపార్థము** నం. విశే. (అ. ఆ. అ.) 1, అర్థము లేనిది. 2. వ్యర్థము. వి. అ. పుం. 1. తప్పైన యర్థము. 2. వాక్యదోషవిశేషము,

**అపాలంకము** నం. వి. అ. పుం. ఱేలచెట్టు.

**అపావరణము** నం. వి. అ. న—అపావృతి.

**అపావర్తనము** నం. వి. అ. న. 1. మరలుట. 2. దొర్లుట. 3. తొలఁగించుట.

**అపావృతము** నం. విశే. (అ. ఆ. అ.) 1. తెఱవఁబడినది. బయలుపెట్టఁబడినది. 2. కప్పఁబడినది, మూయఁబడినది. 3. విచ్చలవిడియైనది, స్వతంత్రము.

**అపావృతి** నం. వి. ఇ. స్త్రీ. 1. తెఱచుట,బయలు పెట్టుట. 2, కప్పుట, మూయుట.

**అపావృత్తము** నం. విశే. (అ. ఆ. అ.) నివృత్తము, మరలినది. వి. అ. పుం. (అశ్వాదులు) నేలపైని పొరలాడుట.

**అపావృత్తి** నం. వి. ఇ. స్త్రీ—అపావర్తనము.

**అపాశ్రయము** నం. విశే. (అ. ఆ. అ.) ఆశ్రయము లేనిది; ప్రాపు లేనిది. వి. అ. పుం. నీచాశ్రయము.

**అపాసనము** నం. వి. అ. న. 1. త్రోసివేయుట, 2. చంపుట.

**అపాసితము** నం. విశే. (అ. ఆ. అ.) 1. త్రోసి వేయఁబడినది. 2. చంపఁబడినది.

**అపాసువు** నం. విశే. (ఉ.) ప్రాణములు పోయిన వాఁడు.

**అపాస్తము** నం. విశే. (అ. ఆ. అ.) 1. చిమ్మఁబడినది. 2. నిరసింపఁబడినది, తొలగింపఁబడినది. 3. మరలింపఁబడినది.

**అపి** నం. అవ్య. (ఇది తెనుఁగున సమాస పూర్వ పదముగానే యుండును, ప్రత్యేకార్థము లేదు సంస్కృతమున దీనికి గర్హాసంభావనాసందేహాద్యర్థములు కలవు. కొన్ని యెడల వికల్పముగ అకార లోపము కనఁబడుచున్నది)
ఉదా :- అపినద్ధము, పినద్ధము, అపిహితము, పిహితము.

**అపితృకుఁడు** నం. విశే. (అ. ఆ. అ.) తండ్రిలేని వాఁడు.

**అపిధానము** (రూ. పిధానము) నం. వి. అ. న. 1. కప్పుట. 2. తిరోధానము. మఱుఁగుపడుట. 3. మూఁత.

**అపినద్ధము** (రూ.పినద్ధము) నం. విశే. (అ. ఆ. అ.) 1. కట్టఁబడినది, ధరింపఁబడినది. (వస్త్రము-మొ.) 2. తొడుగఁబడినది (కవచము-మొ.)

**అపిహితము** (రూ.పిహితము) నం. విశే. (అ.ఆ.అ.) కప్పఁబడినది, మూయఁబడినది.

**అపుంస్క** నం. వి. ఆ. స్త్రీ. మగఁడు లేనియాఁడుది.

**అపుడు(ప్డు)**—అప్పుడు.
క. మగతనమునాఁడు మీరు, న్మగువతనమున పుడు వీరు నాయం దుదయం, బగుటను దోడం బుట్టువు,లగుదురు ధర పంచి కుడువుఁ డందఱు ననుడున్. భార. అను. 1. 292.
సీ....ఒకయప్డు. భార. అను. 3. 21.

**అపుణ్యము** నం. విశే. (అ. ఆ. అ.) పుణ్యము లేనిది. వి. అ. న. పాపము.

**అపునర్భవము** నం. వి. అ. పుం. 1. మోక్షము. 2. మోక్షమునకు హేతువైన తత్త్వజ్ఞానము. 3. (రోగాదులు) మరలఁ బుట్టకుండుట.

**అపురూపము** విశే. (నం. వేద. అపరూపమ్. శ. అపురూపు.) అపూర్వము, వింతయైనది.
ఉ.వీణియ ముట్టుటల్ మిగుల వింతలు పెంపుడు చిల్కబోదతో, రాణ దలిర్పఁబల్కుట కరం బపురూపము. కళా. 6. 217.
ఉ. ముత్తియముల్ ప్రవాళదళముల్ గన నాకృతిఁ గూడినట్టులై, క్రొత్తగ నొర వీని యపురూపపురూపిది యంచు విస్మయో, దాత్తమనస్కులై సకలతైర్థికులుం గొనియాడ... పాండు. 5. 285.

**అపుష్టము** నం. విశే. (అ. ఆ. అ.) 1. పోషింపఁబడనిది. 2. సన్ననిది. వి. అ. పుం. ప్రకృతార్థమును పోషింపకుండుట యనెడియర్థదోషము.

**అపుష్పము** నం. విశే. (అ. ఆ. అ.) పువ్వులు లేనిది, పువ్వులు పూచుస్వభావము లేనిది. వి. అ. పుం. ఉదుంబరము, అత్తి (వృ.వి.)

**అపూపము** నం. వి. అ. పుం. 1. పిష్టకృతభక్ష్యము, పిండివంట. 2. అప్పము. (ఆం.భా. 2. 254.) 3. పురోడాశము.

**అపూపీయము** నం. విశే. (అ. ఆ. అ.) అపూపమునకుపయోగించునది (పిండి)

**అపూప్యము** నం—అపూపీయము.

**అపూరణి** నం. వి. ఈ. స్త్రీ. బూరుగ (వృ.వి.)

**అపూర్వము** నం. విశే. (అ. ఆ. అ.) 1. పూర్వము కలుగనిది, క్రొత్తది. 2. అపురూపము, వింతయైనది. 3. మొదటిదికానిది. వి. అ. న. విహితనిషిద్ధ క్రియవలనఁబుట్టినదై కాలాంతరమునఁగలుగఁ గలసుఖదుఃఖములకు హేతువగు పుణ్యమును పాపమును.
సీ. ఫలియించుఁ గ్రియయ నా'ఫలమత' ఇత్యాది సర్వేశుఁ గొననియపూర్వవాది... గెలిచె. ఆము. 3. 8.

**అపూర్వవాదము** నం. వి. అ. పుం. 1—చేసినకర్మములవలన పుణ్యపాపరూప మగుఅపూర్వము కలుగు నని చెప్పునది—పూర్వమీమాంస. 2. క్రొత్త వాదము.

**అపూర్వవిధి** నం. వి. ఇ. పుం. ఇతర ప్రమాణము వలన ప్రాప్తముకాని విషయమును విధించు వాక్యము.

**అపూర్వీయము** నం. విశే. (అ. ఆ. అ.) అపూర్వసంబంధమైనది.

**అపేక్ష** సం. వి. అ. స్త్రీ. 1. కాంక్ష, కోరిక. 2. అనుసరణము. 'దండం శక్త్యపేక్షం' యాజ్ఞ. 2. 36. 3. దృష్టి; ఆలోచన.

శ్లో. నక్షుద్రోఽపి ప్రథమ సుకృతాపేక్షయా సంశ్రయాయ, ప్రాప్తే మిత్రే భవతి విముఖః... మేఘ. 1. 17.

**అపేక్షణము** సం. వి. అ. న.- అపేక్ష.

**అపేక్షణీయము** సం. – అపేక్ష్యము.

**అపేక్షి** సం. విణ. (న్. ఈ. న్.) అపేక్షించువాఁడు.

**అపేక్షించు** సం. స. క్రి. కాంక్షించు, కోరు. హం. 3. 56.

**అపేక్షితము** సం. విణ. (అ. ఆ. అ.) అపేక్షింపఁబడినది వి. అ. న.—అపేక్ష.

**అపేక్షితవ్యము** సం.—అపేక్ష్యము.

**అపేక్ష్యము** సం. విణ. (అ. ఆ, అ.) అపేక్షింపఁదగినది.

**అపేతము** సం. విణ. (అ. ఆ. అ.) 4, తొలఁగినది. 2. పోయినది.

**అపేతరాక్షసి** సం. వి. ఈ. స్త్రీ. తులసి (వృ. వి.). (ఇది రాక్షసునివంటిపాపమును తొలఁగించును )

**అపేయము** సం. విణ. (అ. ఆ. అ ) 1. త్రాగఁదగనిది, త్రాగఁగూడనిది. 2. త్రాగశక్యముకానిది.

**అపోగండుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) 1. మిక్కిలి పిఱికి, అతిభీరువు. 2. వికలాంగుఁడు, 3. ముడుతలు పడినశరీరము కలవాఁడు. 4. శిశువు. 5. అయిదేండ్లు మించనివాఁడు (పదియాఱేండ్లు మీఱినవాఁడు—అని కొందఱు)

**అపోఢము** సం. విణ. (అ, ఆ. అ.) 1. తీసికొనిపోఁబడినది. 2. నిరసింపఁబడినది. 3. విడువఁబడినది.

**అపోదిక** సం. వి. అ. స్త్రీ. ఉపోదకి, బచ్చలి (వృ.వి.)

**అపోసానము**—అపోసనము. వి. (సం. ఆపోశానమ్. క. ఆపోచన.) ఆపోశనము, భోజనాదియందును భోజనాంతమందును పుడిసిట జలము పోసికొని మంత్ర పూర్వకముగాఁ బుచ్చుకొనుట; అట్లు పుచ్చుకొనుజలము.

క. కానీ యీదివసంబున, నే నిన్నటియట్లకాక యేమనఁగ నపోసానంబులు వడ్డించిరి, మానవతీజనులు లీల మహిదివిజులకున్. భీమ. 2. 186.

**అపోహనము** సం. వి. అ. న.—అపోహము.

**అపోహనీయము** సం. – అపోహ్యము.

**అపోహపడు** అ. క్రి. (అపోహము+పడు) భ్రమపడు, భ్రాంతినొందు.

(వ్యవ) నే నేదియో అపకారము చేసితినని వాఁడు అపోహపడినాఁడు.

**అపోహపుచ్చు** - అపోహముపుచ్చు.

**అపోహము** సం వి. అ. పుం. 1. తొలఁగించుట. 2. త్యాగము, విడుచుట. 3. అతద్వ్యావృత్తి, ప్రతిపాదింపఁ దగినవిషయమును ఇది యిట్టిది అని తెలుపక దానికంటె భిన్నమగుదాని నెల్ల అదికాదని నిషేధించుట. 4. ఎదిరివారి తర్కమును నిరసించుటకుఁ జేయువిపరీతతర్కము. 5. విరుద్ధమైనయూహ, తప్పుటూహ. భ్రమము.

**అపోహముపుచ్చు** స. క్రి. 1. అపోహముకలవానినిగాఁజేయు, భ్రమింపఁజేయు. 2. పోఁగొట్టు; చెడఁగొట్టు.

చ. ఎలపోఁ వోనిమేను నవయించియు రాగరసంబునిండుఁగుండలో యనువీఁగుఁజన్నుల బెడంగెడలించియు మారుపువ్వుఁదూపుల నగులోలదృగ్గుచు లపోహము పుచ్చియు భోగవృద్ధి నిష్ఫలముగఁ జేసి యుండెడి తపంబున నయ్యెడి దేమి సెప్పుమా. కు. సం. 7. 87చ.

**అపోహితము** సం. విణ. (అ. ఆ. అ.) పోఁగొట్టఁబడినది.

శ్లో. ...న చ సామర్థ్యమపోహితం క్వచిత్, సం. కిరా. 2. 27,

**అపోహితవ్యము** సం. – అపోహ్యము.

**అపోహ్యము** సం. విణ. (అ. ఆ. అ.) తొలఁగింపఁదగినది.

**అపౌరుషము** సం. విణ. (అ. ఆ. అ.) పౌరుషములేనిది, పిఱికిది. వి. అ. న. 1. పిఱికితనము. 2, అమానుషశక్తి, దివ్యశక్తి.

**అపౌరుషేయము** సం. విణ. (అ. ఈ. అ.) పురుషకృతము కానిది.

**అప్చరము** సం. విణ. (అ. ఈ. అ.) జలచరము, నీటియందుఁ దిరుగునది.

**అప్ప** వి. (ఆయప మొదలగుచోట్లను నామాంతములయందును దీనిద్విత్వము లోపించుటయుఁ గలదు—ఉదా: సూంపరాజు. నన్నపార్యుఁడు. మనుచ. 1. 8.)

1. తల్లి, అమ్మ.

(క) వాత్సల్యమును దెలుపును.

ఉ. ఏటికిఁ గుందెదమ్మ మా, యప్పవుగా... వసు. 4. 53.

(చ) స్త్రీవాచకములకుఁ జేర్పఁబడును.

ఉదా: సుబ్బప్ప.

2. జ్యేష్ఠసోదరి, అక్క (ఈయర్థమునసే భారత ప్రయోగములు కలవు)

క. అప్పయుఁ బరిజనములుఁ దనుఁ, దప్పక కనుఁగొనుచు నుండఁ దగవేది కరం,బొప్పని తమకము చిత్తముఁ, గప్పికొనుట నుత్తలంబు గదురఁగ నచ్చోన్. భార. విరా. 2. 36.

3. (క. అప్ప. త. అప్పన్.) తండ్రి.

(క) జనకుఁడు.

క. అప్పా జగములు మూఁడును, విప్పారెడు కడిమి గెలిచి వెలసిననీ పీ,చొప్పున నొక కోఁతికినై, తప్పక పలుమఱుఁ గలంగఁ దగవే చెపుమా. అచ్చ. రా. సు. 127.

(చ) పూజ్యతను దెలుపును.

క. అప్పా నను(బ్రోవు వెంకటప్పా కృష్ణా. కృష్ణశ. 85.

(ట) ఆదరమును దెలుపును.

సీ. అప్ప రా రమ్మని యాదరింపఁగ నేర్పు మెప్పు రాజిలఁగ నమిత్రమైన. ఇందు. 1, 127.

(త) పురుషనామాంతములకుఁ జేర్పఁబడును.

ఉదా: వెంకటప్ప, రంగప్ప.

**అవ్య.** (ఆమ్రేడితరూపము అప్పప్ప) ఆశ్చర్య ప్రశంసాదులను దెలుపును.

(ఆశ్చర్యము.)

ఉ. ముప్పదిమూఁడుకోటులసుమూర్తులవేల్పుల నేలువ్రజ్రి య,ప్పప్ప యవార్య శౌర్య కరుణాదుల పట్టున వించు కేనియున్,జెప్పని వాఁడెయట్టినయశీలి... వేం. పంచ 3.340. కవిక. 2. 78.

(ప్రశంస)

ఉ. అప్పఁ మేశ్వరుండె యిటు లానతియిచ్చిన నెంతభాగ్య మ,ప్పప్ప భవత్ప్రభావ విభవాఢ్యత యేమని సన్నుతింపఁగన్. సారంగ. 1. 31.

**అప్పఁడు** వి. తండ్రి.

క. అప్పప్ప చూడవలదా, యప్పనికో వెల పటీర హైమజలంబుల్, గప్పురము పునుఁగుమృగమద, మెప్పట్టునఁ దావి గుప్పు భృగువారమునన్. రా. వి. 1. 38.

(ఇట దేవునే తండ్రిగా భావించినాఁడు.)

**అప్పగించు**—ఒప్పించు, ఒప్పగించు.(సం. అర్పించు. (పా. అప్పెయి.) స. క్రి. 1. వశమున నుంచు; వశముచేయు, అధీనపఱుచు.

ఆ. నీవు చతురమతివి నీకు నిక్కన్నియ, నప్పగింప నేలయైన నాదు, హృదయమతులు దీనియెడఁ గడు నార్ద్రమై,యుండుఁ గాన చెప్పకుండరాదు భారం. విరా. 1. 240.

సీ. ...మిమ్ము నెల్లభంగులఁ దన, పరిపాలనంబునఁ బరమసుఖులఁ,గా నొనర్పువాఁడుగా నప్పగించిన, వాఁడ...భారం. ఆశ్ర. 1.98.

గీ. అవ్వధూమణి యిది యకార్యం బటంచు, నెంచకిల్లగ్ని కై యప్పగించి.శుక ...3.814.

2. చదివినపాఠములను కంఠస్థము చేసికొని గురువులయెదుట మరలఁ జదివి వినిపించు.

ఉదా: పాఠము తిన్నగా అప్పగించినాఁడు.

(వ్యవ) నక్షత్రకునిలాగున వీనిని నాకు బాగుగా అప్పగించినావు. (తగిలించినావు—అనిభావము)

జ. అప్పగింత.

**అప్పగింత** వి. (√అప్పగించు) అప్పగించుట, ఒప్పగింత.

**అప్పచి**—అప్పచ్చి.

అప్పచికొండ—అప్పచ్చుల రాశివలె మిక్కిలి ప్రియమయినది.

ఉ, ...ఈ,యప్పచికొండ పుట్టె సకియా యిఁక నోడకు మన్న...కకు. 3. 144.

బ. (అప్పచేలు) బాలక్రీడావిశేషము.

ఉ. అప్పచు లాడుచున్ నగవు లాడుచు... చంద్రా. 2. 6.

**అప్పచ్చి** – అప్పచి. వి. (క. త. అప్పచ్చి.) 1. అప్పము. (ఆం. భా. 2. 254.) 2. భక్ష్యము

**అప్పటము** విణ. (క. అప్పట. త. అప్పటమ్.) స్వచ్ఛమైనది, మిశ్రమకానిది. (గ్రా.)

**అప్పడము** వి. – అప్పళము. (సం. పర్పటః. ప్రా. అప్పడ. క. అప్పళ, అప్పడ. త. అప్పళం.) భక్ష్యవిశేషము. ఉ. రా. 6. 122.

**అప్పతి** సం. వి. అ. పుం. 1. వరుణుఁడు. 2. సముద్రుఁడు.

**అప్పన**[1]–అప్పనము. వి. 1. ఇచ్చుట. (చూ. అప్పన చేయు) 2. కానుక.

క. ధనములజాలెలు రతనపుఁ, బని తగునొక వరుససొమ్ముఁ బనిచిన గణనా,థున కీవచ్చుఁ గదా యవి, యని కోమటికొమిరె వాని యప్పనఁ గొనుచున్. శుక. 2. 216.

ద్వి. ఏదిక్కువారితో నించుక పలుక, నాదిక్కువారెల్ల నతిసంభ్రమమున, నయ్య ప్రసాద మౌనని మోదమందఁ, జయ్యన నప్పనల్ సంఘటింపంగ, హరుఁడెట్లు పలికిన నట్ల యౌననుచు. ద్వి. ప్రభు. 2. 18 పా. 23 పం.

జ. అప్పనచేయు.

**అప్పన**[2] వి. (సం. ఆజ్ఞాపనం. క. తు. అప్పణె. త. అప్పణై.) ఆజ్ఞ; అనుమతి.

క. అప్పుడు రమ్మని మురహరుఁ, డప్పనయిడఁ గూరుచుండి హరిహస్తాబ్జం, బప్పార్థివుఁ డొదల నిడి. బహు. 3. 28.

**అప్పనచే(సే)యు** స. క్రి. (√అప్పన[1]) ఇచ్చు; అప్పగించు, అధీనముచేయు.

ఉ. ...మా, యమ్మ భవాని సంయమికులాగ్రణి కూరిమిబిడ్డ నిచ్చి రా,పొమ్మన వచ్చితిన్ శిఖరిపుత్రిక సేవకురాల నాదు గే,హమ్మున నున్న యప్పుడుచు నప్పనచేసెద నంచుఁ బల్కినన్. రాజ. చ. 2. 95.

ఉ. పాపనిఁ బట్టరమ్మ యని బాధల కోర్వక తెచ్చి తెచ్చి తన్,గోపిక లయ్యశోదకును గుప్పున నప్పనసేయఁ జేయ నా,గోపియు. హరి. పూ. 5. 200.

క. తనవెనుక భీతిఁ బొందిన, జనునిన్ రక్షింప లేకశాత్రవునకు న,ప్పన సేసినయధమాధము, గనియలుగాఁ గోయలేదు కరపత్త్రములన్. రుక్మాం. 2. 44.

**అప్పనము**–అప్పన[1]. వి. (సం. అర్పణమ్, క. అప్పన.) 1. అప్పగింత, ఒప్పనము. 2. కరము, పన్ను.

ఆ. మనుజభక్షుఁ డిదియ తనకు నప్పనముగా, నూరులవలనిబాధ పొందయకుండ, దీనిఁగాచు చుండు నీనాఁటిరాజును, దలఁపఁ డసుర నోర్వ బలిమిలేమి. భార. ఆది. 6. 266.

గీ. ...అప్పనంబు, పలుకుబడి దప్పికొనియెడు పతియు గోవు, ముక్కుఁగుట్టెడువాఁడుఁ దన్నుమెచ్చుఘాతి, యగునతఁడు నధోగతి కరుగువారు. భార. అను. 2. 62.

3. కానుక.

గీ. ఇలసనుస్తంబు నేలు రాజులరు మీర,లధిపయే మరి యప్పన మిచ్చి భృత్య,మాత్రవర్తించు పెద్దకోమటులము. మార్క. 7. 207.

గీ. రాజ నీచేతఁ జేయింతు రాజసూయ, మప్పు డమరులు నీకిత్తు రప్పనములు. శశాం. 5. 119.

జ. అప్పనముగొను, అప్పనముచేయు.

**అప్పనముగొను** స. క్రి. (√అప్పనము) పన్నుగాఁ బుచ్చుకొను.

సీ. ...రాజు లన్యోన్యవైరములు దక్కి ... ఆఅవపా లప్పనముగొని ప్రజల మనిచి. హరి. పూ. 5. 6.

**అప్పనముచేయు** స. క్రి. (√అప్పనము) అధీనము చేయు, వశపఱచు.

ద్వి. ...అవ్వనజాక్షి నపుడు, బెడిదంపుబావురుఁ బిల్లివాతికిని, దొడిఁబడ రాచిల్కఁ ద్రోయు చందమునఁ,దగ నప్పనము సేసి. ద్వి.హరిశ్చ. ఉ. 2437.

**అప్పము** వి. (సం. అపూపః. త. అప్పం.) గుడాపూపము, బెల్లము పిండియుఁ గలిపి చేసిన గుండ్రని భక్ష్యము. ఉ. రా. 6. 122.

**అప్ప(ల)ళము¹**—అప్పడము.

చ. వలపులు గ్రమ్మఁగాఁ బొగచి వండినకారపుఁ గాయగూర ల,ప్పళములు. ఉ. రా. 5.288.

వ. డాకినుల వెంబడిం బడినయేనుఁగడుగు లేనుఁగడుగుగా రెలు నప్పలంబు లప్పలంబులును ...సదామోదకంబులుగా మెసవు బ్రహ్మ రాక్షసులును. చంద్రా. 6. 93.

**2.** బాలక్రీడావిశేషము.

సీ. చిడుగు డుప్పులపోటి చెండుగట్టినబోదియల్లి యుప్పనఁబట్టె లప్పళాలు. కాళ. 3. 43.

ద్వి. బంతు లాలంకి యప్పలములు పాలి;గంతు లుద్దులు గ్రచ్చకాయలాటలును. అ. మ. క. 1. 50 పా. 26 పం.

**అప్పళము²** అవ్య. బిరాన, శీఘ్రముగా. ఆం. భా. 3. 71.

**అప్పళించు** స. క్రి. (సం. ఆస్ఫాల్. ప్రా. అప్ఫాల. క. అప్పళిసు.) 1. ఆస్ఫాలనముచేయు, చఱచు, తట్టు.

గీ. అగ్గలించి నాయెదుర బా హప్పళించి, కడఁగెఁ జాలెదు మల్లులఁ గాన నెందు. భార. విరా. 2. 7.

ఉ. ఆనరనాయకాగ్రణి హాయం బనురాగము నందునట్లుగా, నానన మల్ల దుర్వి వినయం బునఁ గంధర నప్పళించి. చిత్రభా. 5. 23.

2. కొట్టు.

దండ. చాణూరుజానూరువుల్ నూఱుమాఱు ల్వడిం ద్రిప్పి నీ వప్పళింప న్భయభ్రాంతుఁడై పాఱ. పారి. 3. 88. రా. వి. 3. 65.

3. పట్టుకొను; అదిమి పట్టుకొను.

ఉ. కొన్నిటిపొట్టలు వ్రచ్చు లీలమైఁ, గొన్నిటి నప్పళించుకొని కోలెముకల్ నుఱుమాడు నిట్టుల,య్యన్నిటి నయుడిలూకము రయం బెసఁగన్ వధియించె ఘూవరా. భార. సౌ. 1. 18.

వ. పుత్రగాత్రంబు నఖర దంష్ట్రాంకురంబుల నప్పళించుచు. జై. భా. 7. 211.

గీ. అతివ యీాగతి నుపరతి నలసినొలసి, యప్ప ళించుక వ్రాలె నాయకునియెదను. దశా. 7. 153.

4. తాఁకు, స్పృశించు.

సీ. ... నాథు,లప్పళించి సముద్ధతాంచిత స్తన తటంబులు గౌఁగిలించి. హరి. పూ. 8.38.

5. అతిక్రమించు, క్రమ్ము.

సీ. కహకహా యనియెడుకంఠనిర్గతమైనచప్పుడు బ్రహ్మాండ మప్పళింప. భా. రా. అర. 1.14.

సీ. అఖిలాల బ్రహ్మాండమప్పళించినయట్టి చిన్ని వేల్పుల రాజుఁగన్నతండ్రి. భీమ. 1. 44.

6. మూయు, కప్పు.

వ. ...మెఱుంగుఁజూపులఁ దొంగలిఱెప్పలనప్ప ళించుచు. ఉ. రా. 2. 201.

7. అలఁదు, రాచు; అద్దు.

సీ. ...దేహమునఁ గుంకుమరసం బప్పళించి. వేం. పంచ. 4. 391.

గీ. అప్పళింపు మందారిక యడుగులందుఁ, జల్లఁగాఁ బుండరీకకింజల్కధూళి. నైష. 2. 141. 1. 92.

8. తుడుచు.

గీ. చెంత నందఱ నిడుకొని చేరెఁదేసి, కన్ను లను గ్రమ్ముకన్నీరు కరతలమున, నప్పళిం చుచు గాద్గద్యమడఁచి...ఉ. రా. 6. 207.

అ. క్రి. ఉత్సహించు; తమకించు.

ఆ. అనుచుఁ జూచుఁజేరు నమ్ముగ్ధపలుకులు, వినఁగ గోరుఁగేలు దనదుకేలఁ,గీలుకొలుపఁ దలఁచుఁ గీచకాధముఁడు ·ని, జానురక్తి దెలుప నప్పళించు. భార. విరా. 2. 45.

గీ. వానిఁగలలోనఁ గాననివనజముఖియు,వాని మార్పునఁ జేరోకనిమానవతియు,వానిఁగా నాత్మ భావించి వరునిఁ గవయ,నప్పళింపని సతియు లేదయ్యె నచట. నై ష. 1. 60.

జ. అప్పళింత.

**అప్పళింత** వి. (√అప్పళించు) అప్పళించుట. (చఱపునకు)

ఉ. కించుఁదనంబు లేక వలకేల నొకించుక యప్ప ళింత కా,వించినఁ బండ్లు వీడు. రామా. 7. 168.

**అప్పనము** అవ్య. నిచ్చలు, సతతము.

చ. పసిరిక పాముపంటి దని పల్కుడు రీయలి

వేఁడివేఁడిన,ప్పసమును నిండుఁగుండలయి
భాసిలు నీలలితాంగిగుబ్బలు, శుక. 1. 335.

గీ వేయు నేటికి తరిమల వెండికొండ, తావి
గుబ్బలి కడగట్టుతావులందు, నప్పసం బుప్ప
తిల్లుచు మెప్పుఁగన్న, యట్టికొరవంజు లెల్ల
మాసుట్టలయ్యె. ప్రబంధ. 1. 160. రా.
వి. 4. 119. ఆం. భా. 1. 66.

**అప్పసము²** వి. చిన్నకాలువ. (శ.ర.)

**అప్పా** అవ్య. - అప్ప.

(ప్రశంసకు.)

శా. ...చొక్కింపఁగా, నప్పా యప్పురిఁ జెప్ప
నొప్పుదురు రూపాజీవికా రత్నముల్. రా.
వి. 1. 58.

**అప్పిత్తము** సం. వి. అ. న.—నీటికి పిత్తమువంటిది,
నీటిని శోషింపఁజేయునది—అగ్ని.

**అప్పు** సం. వి. స్. స్త్రీ. (సంస్కృతమున నిత్య
బహువచనాంతము.) జలము, నీరు.

సీ అప్పుపాలై నశుభ్రాబ్జంబురుచి యెంత.
నస. 1. 67.

క. అప్పులఁ బడి యొకచేడియ, తెప్పునఁదేలఁగ
లేక...రసిక. 4. 76.

**అప్పు** వి. (√అచ్చు. త. అప్పు.) ఋణము.

ఆ. ...కురురాజు మన్నన, యప్పుదీర్తుఁ బ్రాణ
మానపడక. భార. కర్ణ. 2. 21.

అప్పునప్పులు—అప్పులు.

ఉ. లేవడిమీఁద బానిసలు లేనికతంబున నూర
కుండినం, బోవమి నప్పునప్పులకుఁ బోవుట
వేఱుగఁ దోఁచె నేమొకో. శుక. 2. 375.

**అప్పుఁబుట్టువు** వి. (√అప్పు. సం.) అబ్జము,
పద్మము.

సీ. ముదితగుబ్బలు నీరుమోపరుల గణింపవప్పుఁ
బుట్టువుఁ గాచు నతివకేలు. హ. న. 4. 48.

**అప్పుడు** — అపుడు, అప్డు. వి. కొ. ఏ. (త. అప్పొ
ళదు, అప్పొదు.) — దీని రూపాంతరములగు
'అపుడు, అప్డు' అనునవి ఇతరవిభక్తులతోఁ
గూడియుండవు — ఆ కాలము, ఆ సమయము.
(సమాసోత్తరపదమగునపుడు కేవలకాలవాచక
మగును.)

క. ...అప్పటిఁ గోలెను. భార. ఆది. 6. 192.

సీ....అప్పటికంటెను, కు. సం. 11. 702.

సీ. మదహస్తిఁగని గిత్తబెదరి చిల్లరగోనెఁబడ
వైచి కదలునప్పంటిగోడు. రా. వి. 2. 69.

క. ఎప్పటికెయ్యది ప్రస్తుత,మప్పటి కామాట
లాడి...సు శ. 18.

క. ..., కయ్యమునప్పుడు ... భార. భీష్మ.
1. 165.

వ. అర్ధరాత్రంబునప్పుడు. భార. ఆది. 7. 114.

చ. ...అప్పటఁ గనువిచ్చునప్డు. కాశీ. 3. 99.

(వ్యవ)అప్పుడు కాచిననెయ్యి-సద్యోఘృతము.
వాఁడు రానప్పుడు నే నేమి చేయుదును.వాఁడు
నామాట విననప్పుడు నే నేమి చేయుదును.
అప్పటికప్పుడు వచ్చినాఁడు. అప్పు డప్పుడు
వచ్చుచున్నాఁడు. అప్పుడే వచ్చితి వేమిరా?

**అప్పులవాఁడు** వి. ఉత్తమర్ణుఁడు, అప్పిచ్చినవాఁడు.
ఆం. భా. 2. 329.

**అప్యయము** సం. వి. అ. పుం. లయము, నాశము.

**అప్రకాండము** సం. విశ. (అ. ఆ. అ.) స్కంధము
లేనిది. వి. అ. పుం. తుప్పు, చిన్నపొద.

**అప్రకాశము** సం. విశ. (అ. ఆ. అ.) 1. ప్రకాశము
లేనిది, కాంతి లేనిది. 2. రహస్యమైనది.
వి. అ. పుం. 1. ప్రకాశములేమి. 2. దాఁచుట,
గోపనము. 3. స్పష్టము గాకుండుట.

**అప్రకృతము** సం. విశ. (అ. ఆ. అ.) ప్రస్తుత
విషయమునకు సంబంధింపనిది. వి అ.న. (అలం)
ఉపమానవస్తువు (వ్యతి. ప్రకృతము — ఉప
మేయము.)

**అప్రకృతి** సం. వి. అ. పుం. 1. (ప్రకృతిభిన్నుఁడైన)
పురుషుఁడు. 2. స్వభావసిద్ధము కానిగుణము.
3. (వ్యాక) ప్రత్యయాది.

**అప్రగల్భుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) 1. ప్రతిభా
వంతుఁడు కానివాఁడు. 2. అధృష్టుఁడు,
గడుసరి కానివాఁడు.

**అప్రగుణము** సం. విశ. (అ. ఆ. అ.) ఆకులము,
కలఁగినది.

**అప్రణసుఁడు** సం. — అప్రజుఁడు.

**అప్రజాత** నం. వి. అ. స్త్రీ. గొడ్రాలు.

**అప్రజుఁడు** నం. విశే. (స్.) ప్రజ లేనివాఁడు. (ప్రజ—1. సంతానము. 2. జనము.)

**అప్రతర్క్యము** నం. విశే. (అ. అ. అ.) ఊహింప శక్యము కానిది.

**అప్రతి** నం. అవ్య. సాటి కానిది, సరి రానిది.
గీ. అతివ నీకనుబొమల కప్రతి యటంచు,
వెట్టి ధర్మంబుపై నాన యిడఁగ వచ్చు.
సారంగ. 2. 204. (ఇట్టి సమాసములు క్వాచిత్కములు.)

**అప్రతికర్మము** నం. విశే. (స్. అ. స్. స్.) 1. ప్రతిక్రియ లేనిది. 2. సాటి లేనిపనులు చేయునది.

**అప్రతికారము** నం. విశే. (అ. అ. అ.) ప్రతిక్రియ లేనిది. వి. అ. పుం. మాఱుసేయమి.

**అప్రతిక్రియ** నం. వి. అ. స్త్రీ. మాఱుసేయమి, ప్రతికారములేమి.

**అప్రతిద్వంద్వుఁడు** నం. విశే. (అ. అ. అ.) 1. ఎదిరి లేనివాఁడు, శత్రువు లేనివాఁడు. 2. సాటి లేనివాఁడు.

**అప్రతిపక్షుఁడు** నం. విశే. (అ. అ. అ.) 1. శత్రువు లేనివాఁడు. 2. సాటి లేనివాఁడు.

**అప్రతిభటుఁడు** నం. విశే. (అ. అ. అ.) ఎదురు లేనివాఁడు (యోధుఁడు)

**అప్రతిమము** నం. విశే. (అ. అ. అ.) సాటి లేనిది.

**అప్రతిరథుఁడు** నం. విశే. (అ. అ. అ.) ఎదిరి లేనివాఁడు.

**అప్రతిరవము** నం. విశే. (అ. అ. అ.) 1. ఆక్షేప వచనము లేనిది, వివాదము లేనిది. 2. ప్రతిధ్వని లేనిది.

**అప్రతిరూపకథ** నం. వి. అ. స్త్రీ. 1. ప్రత్యుత్తరము లేనిమాట. 2. సాటి లేనికథ.

**అప్రతిరూపము** నం. విశే. (అ. అ. అ.) సాటి లేనిది.

**అప్రతివీర్యుఁడు** నం. విశే. (అ. అ. అ.) సాటి లేని పౌరుషము గలవాఁడు.

**అప్రతిశాసనము** నం. విశే. (అ. అ. అ.) రెండవ వాని యాజ్ఞ లేనిది, ఒకరాజువశమువనే ఉన్నది. (రాష్ట్రము.)

**అప్రతిష్ఠ** నం. వి. అ. స్త్రీ. 1. కుదురులేమి, స్థిరత్వము లేమి. 2. అగౌరవము.

**అప్రతిష్ఠము** నం. విశే. (అ. ఆ. అ.) 1. ఆధారము లేనిది. 2. నిలుకడ లేనిది. 3. నిష్ఫలము. 4. గౌరవము లేనిది. 5. మాహాత్మ్యము లేనిది. వి. అ. పుం. ఒక నరకము. న. బ్రహ్మము.

**అప్రతిహతము** నం. విశే. (అ. అ. అ.) అడ్డులేనిది,

**అప్రతీకారము** నం — అప్రతికారము.

**అప్రత్యక్షము** నం. విశే. (అ. అ. అ.) ఇంద్రియ గోచరముకానిది.

**అప్రదక్షిణము** నం. విశే. (అ. అ. అ.) కుడి ప్రక్కనుండి ఎడమ ప్రక్కకు తిరిగినది. వి. అ. న. కుడిప్రక్కనుండి ఎడమప్రక్కగాఁ దిరిగి వచ్చుట.

**అప్రధానము** నం. వి. అ. న. (ప్రధానశబ్దము మిత్రాదులలోనిది.) 1. అముఖ్యము, గౌణము 2. ఉత్కృష్టము కానిది, తక్కువది.

**అప్రధృష్యము** నం. విశే. (అ. అ. అ.) ఎదుర్కొన రానిది, గెలువ రానిది.

**అప్రమ** నం. వి. అ. స్త్రీ. అయథార్థజ్ఞానము, భ్రాంతి.

**అప్రమత్తుఁడు** నం. విశే. (అ. అ. అ.) సావధానుఁడు, ప్రమాదము లేనివాఁడు.

**అప్రమాణము** నం. విశే. (అ. అ. అ.) 1. ప్రత్యక్షాదిప్రమాణము లేనిది. 2. మేర లేనిది.

**అప్రమితము** నం. విశే. (అ. అ. అ.) 1. అపరిమితము. 2. ప్రత్యక్షాది ప్రమాణములచేత సిద్ధింపనిది.

**అప్రమేయము** నం. విశే. (అ. అ. అ.) 1. ఇంత యని మితి యేర్పఱుప శక్యము కానిది. 2. ఇది యిట్టి దని నిశ్చయింప శక్యము కానిది, సరిగాఁ దెలిసికొన శక్యము కానిది.

**అప్రయత్నము** నం. విశే. (అ. అ. అ.) ప్రయత్నము లేనిది. వి. అ. పుం. ప్రయత్నములేమి.

**అప్రయుక్తము** నం. విశే. (అ. అ. అ.) ప్రయోగింపఁబడనిది. వి. అ. పుం. (అలం) పదదోష విశేషము.

**అప్రయోజకుఁడు** సం. విణ. (అ. త్రి. అ.) కార్య నిర్వాహకుఁడు కానివాఁడు, పనికిమాలిన వాఁడు. (ఈయర్థము తెనుఁగుననే కలదు)

**అప్రయోజనము** సం. విణ. (అ. ఆ. అ.) ప్రయో జనము లేనిది. వి. అ. న. ప్రయోజనములేమి.

**అప్రవృత్తి** సం. వి. ఇ. స్త్రీ ప్రవృత్తిలేమి.

**అప్రశస్తము** సం. విణ. (అ. ఆ. అ.) 1. శ్రేష్ఠము కానిది. 2. దుష్టము. 3. నిందితము.

**అప్రసన్నము** సం. విణ. (అ. ఆ. అ.) 1. సంతో షింపనిది. 2. కలుషము, స్వచ్ఛము కానిది.

**అప్రసాదము** సం. విణ. (అ. ఆ. అ.) 1. (అలం) ప్రసాదగుణము లేనిది. (కావ్యము) 2. సంతుష్టి లేనిది. 3. అనుగ్రహము లేనిది. వి. అ. పుం. 1. అనుగ్రహములేమి. 2. సంతోషములేమి.

**అప్రసిద్ధము** సం. విణ. (అ. ఆ. అ.) ప్రసిద్ధము కానిది,

**అప్రసిద్ధి** సం వి. ఇ. స్త్రీ. ప్రసిద్ధిలేమి.

**అప్రస్తుతప్రశంస** సం. వి. ఆ. స్త్రీ. 1. ఒకయర్థా లంకారము. (దీనియందు అప్రకృతవిషయవర్ణ నమువలన తత్సదృశ మగు ప్రకృతవిషయము స్ఫురించును.) 2. ప్రస్తుత విషయమునకు సంబంధింపని సంభాషణము.

**అప్రస్తుతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ప్రకృత విషయమునకుఁ గాని ప్రకృత కాలమునకుఁ గాని సంబంధింపనిది, అసంగతము. 2. స్తుతిం పఁబడనిది. 3. మొదలు పెట్టఁబడనిది.

**అప్రహతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. దున్న నిది. (నేల) 2. కొట్టఁబడనిది. 3. ఉతుకఁ బడనిది, క్రొత్తది. (బట్ట)

**అప్రాకృతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ప్రకృతి (మాయ) వలనఁగలుగనిది. (ఈశ్వరలీలాది కము) 2. స్వాభావికము కానిది. 3. అసామా న్యమైనది. 4. గ్రామ్యము కానిది, నాగ రకము,

**అప్రాప్తకాలము** సం. విణ. (అ. ఆ. అ.) 1. సమ యోచితము కానిది. 2. యుక్తకాలము రానిది.

**అప్రాప్తము** సం. విణ. (అ. ఆ. అ.) 1. పొందఁబడ నిది. 2. రానిది, అనాగతము 3. ప్రమాణాం తరము చేత సిద్ధింపనిది.

**అప్రాప్తవ్యవహారుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) వ్యవహారయోగ్యమగువయసు రానివాఁడు.

**అప్రాప్తి** సం. వి. ఇ. స్త్రీ 1. లాభాభావము, పొం దుటలేమి. 2. ప్రమాణాంతరమువలన సిద్ధిం పమి. 3. అసంభవము. 4. అనుపపత్తి, పొసఁ గమి.

**అప్రామాణికము** సం. విణ. (అ. ఈ. అ.) 1. ప్రమాణము లేనిది. 2. ప్రమాణము కానిది.

**అప్రామాణ్యము** సం. విణ. (అ. ఆ. అ.) ప్రామా ణ్యము లేనిది. వి. అ. న. ప్రామాణ్యములేమి.

**అప్రియంవదుఁడు** సం, విణ. (అ. ఆ. అ.) పరుష వాక్యములు పలుకువాఁడు.

**అప్రియము** సం. విణ. (అ. ఆ. అ.) అనిష్టము వి. అ. న. 1. అనిష్టకార్యము. 2. అనిష్టవచనము.

**అప్రియవాది** సం. విణ. (న్. నీ. న్.) – అప్రి యంవదుఁడు.

**అప్రియుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) ఇష్టుఁడు కానివాఁడు. వి. అ. పుం. శత్రువు.

**అప్సరము** సం. విణ. (అ. ఆ. అ.) నీటియందుఁ దిరుగునది. వి. అ. పుం. జలజంతువు.

**అప్సరస** సం. వి. స్. స్త్రీ. స్వర్గవేశ్య, అచ్చర. కాశీ. 3. 199.

**అప్సరస్సులు** సం. వి. స్. స్త్రీ. బ. అప్సరస్త్రీలు. గీ. నారి నీకన్నఁ జక్కనివారె యప్స, రస్సు లారయ. దశా. 2, 322. అచలా 2.4.

**అఫల** సం. వి. ఆ. స్త్రీ. 1. ఒకజాతికలబంద (వృ. వి.) 2. నేలయుసిరిక (వృ.వి,)

**అఫలము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఫలములేనిది, పంట లేనిది, గొడ్డుది. 2. వ్యర్థము, ప్రయో జనము లేనిది. 3. వృషణములు లేనిది; అండ ములు తీసివేయఁబడినది. వి. అ. పుం. 1. ఝూబుకము, సన్ననియాకులు గలవక్కెచెట్టు. 2. మేషము, పొట్టేలు.

**అబందర** విణ. (సం. అబంధురః: క. అబందరె.) తాలుమాలైనది; చెడినది.

(వ్యవ) వాని వ్యవహార మంతయు అబందరంగా నున్నది.

**అబంధకము** నం. విశే. (అ. బీశా. అ.) 1. బంధింప నిది. 2. బంధించువాఁడు లేనిది. 3. ఆకట్టు లేనిది. (విడిబుణము)

**అబంధనము** నం. విశే. (అ. ఆ. అ.) అడ్డులేనిది. వి. అ. న. బంధనములేమి.

**అబక** వి—అగప.

1. మహాతండువు, పెద్దతెడ్డు. ఆం.భా. 1.224.

2. అద్రి, కొయ్యగుద్దలి. ఆం. భా. 1. 157.

**అబద్ధము** నం. విశే. (అ. ఆ. అ.) 1. బద్ధము కానిది, స్వతంత్రము. 2. అసంగతము, పరస్పరవిరుద్ధము. (వాక్యము)

ఉదా. శ్లో:—యావజ్జీవమహం మౌనీ బ్రహ్మచారీతు మే పితా, మాతా తు మమ వంధ్యాసీదపుత్రశ్చపితామహః — నేను యావజ్జీవము మౌనిని. నాతండ్రి బ్రహ్మచారి. నాతల్లి గొడ్రాలు. నాపితామహుఁడు కొడుకులు లేనివాఁడు.

3. నిష్ప్రయోజనము.

వ. నాకు నిది యెంతదొడ్డుమంచిదానంబలె బోధించి శ్రద్ధపని యెల్ల నబద్ధంబుచేసెదనని సంతంబులు పలుకుచున్న మిథ్యాదృష్టి. ప్రబోధ. 2. 78.

వి. అ. న. అసత్యవాక్యము.

ఉ. మాలనిచేతనైన విను మానిని దానము లోలిఁ గొందు దుశ్శీలతచే దురన్నము భుజింతు నబద్ధము లాడుచుందు. జాహ్నవీ. 4. 116.

క. వృథా,బద్ధము లఱచెడి జైనుని, సిద్ధాంతము వీడుకోలు చేయు మటన్నాఁ. ప్రబోధ. 3. 50.

**అబద్ధముఖుఁడు** నం. విశే. (అ. అ, ఈ. అ.) నోటికి వచ్చినట్లు మాటలాడువాఁడు, ముఖరుఁడు.

**అబల** నం. వి. అ. స్త్రీ. ఆఁడుది.

**అబలము** నం. విశే. (అ. అ. అ.) బలము లేనిది. వి. అ. పుం. వరుణము. ఉలిమిరి (వృ.వి.) న. బలము లేమి.

**అబాధము** నం. విశే. (అ. ఆ. అ.) 1. బాధ లేనిది. 2. అడ్డులేనిది. వి. అ. పుం. 1. బాధలేమి. 2. అడ్డులేమి.

**అబాసి** విశే. (√అబాసు) దుష్టుఁడు, నీచుఁడు.

సీ. ...అబాసి, కడుఁ బ్రేత నడపీన్గు గలపడింపు. హంస. 5. 118. (అభాసి. ముద్రి.)

**అబాసు** వి. (క. అబాస. అబాసు.)

దౌష్ట్యము, అల్లరి.

(అబాసానరించు—అల్లరిచేయు.)

క. భూసురు లందఱుఁ దన్ను న,బాసానరించుటయు సిగ్గువడి వనవాసా, యాసమున కోర్చి మౌనిని, వాసం బగునొక్క-పుణ్యవనమునకుఁ దగఁ. సేతు. 4. 133 పా.

**అబాహ్యుఁడు** నం. విశే. (అ. ఆ. అ.) 1. లోపలి వాఁడు. 2. పరిచయము గలవాఁడు.

'గీతనృత్యవాద్యాదిష్వబాహ్యః' సం. దశకు.

**అబింధనము** నం. వి. అ. పుం. బడబాగ్ని.

**అబిసీ** వి—అబిసీనియాదేశస్థుఁడు—రౌతు.

సీ. ఇది గాడ్పువాలాల నెక్కి క్రొవ్విరితావి యబిసీల్ దువాళించునట్టిబయలు. చంద్రా. 4. 102. చంద్ర. వి. 2. 54.

**అబీజము** నం. విశే. (అ. ఆ. అ.) 1. బీజశూన్యము, విత్తులేనిది (ఫలాది) 2 కారణము లేనిది. 3. మొలవనిది (గింజ)

**అబీజుఁడు** నం. విశే. (అ. ఆ. అ.) ఉత్పాదన శక్తి లేనివాఁడు.

**అబుద్ధిపూర్వకము** నం. విశే. (అ. ర్వితా. అ.) — అబుద్ధిపూర్వము.

**అబుద్ధిపూర్వము** నం. విశే. (అ. ఆ. అ.) అజ్ఞానకృతము, తెలియక చేసినది.

**అబోధనీయము** నం — అబోధ్యము.

**అబోధము** నం. విశే. (అ. ఆ. అ.) తెలివి లేనిది. వి. అ. పుం. అజ్ఞానము, తెలివిలేమి.

**అబోధ్యము** నం. విశే. (అ. ఆ. అ.) 1. తెలిసికొన శక్యము కానిది. 2. మేలుకొలుప శక్యము గానిది.

**అబ్జజుఁడు** నం. వి. అ. పుం. తమ్మిచూలి, బ్రహ్మ.

**అబ్జబాంధవుఁడు** సం. వి. అ. పుం. సూర్యుఁడు.

**అబ్జభోగము** సం. వి. అ. పుం. 1. తామరదుంప. 2. పెద్దగవ్వ.

**అబ్జము** సం. విణ. (అ. ఆ. అ.) నీటఁబుట్టినది. వి. అ. పుం. 1. హారతికర్పూరము. 2. నిచులము, నీటి ప్రబ్బలి (వృ.వి.) పుం. న. శంఖము. న. 1. పద్మము. 2. నూఱుకోట్లు. 3. ఉప్పు.

**అబ్జయోని** సం. వి. ఇ. పుం. బ్రహ్మ, పద్మభవుఁడు.

**అబ్జారి** సం. వి. ఇ. పుం. చంద్రుఁడు, చందమామ.

**అబ్జిని** సం. వి. ఈ. స్త్రీ. 1. తామరసనమూహము. 2. తామరతీఁగ. 3. తామరకొలను. (చూ. అంభోజిని.)

**అబ్జుఁడు** సం. వి. అ. పుం. 1. చంద్రుఁడు. 2. ధన్వంతరి.

**అబ్దము** సం. విణ. (అ. ఆ. అ.) జలము నిచ్చునది. వి. అ. పుం. 1. మేఘము 2. సంవత్సరము 3. తుంగముస్త (వృ.వి.) 4. ఒకానొకకొండ, వర్ష పర్వతము.

**అబ్దసారము** సం. వి. అ. పుం. ఘనసారము, పచ్చకర్పూరము.

**అబ్ధి** సం. వి. ఇ. పుం. 1. సముద్రము. 2. సరస్సు 3. (గణిత) నాలవసంఖ్య.

**అబ్ధికఫము** సం. వి. అ. పుం. సముద్రపునురుఁగు.

**అబ్ధిజ** సం. వి. ఆ స్త్రీ. సముద్రమునుండి పుట్టినది- 1. సుర, మద్యము 2. లక్ష్మీదేవి.

**అబ్ధిజము** సం. విణ. (అ. ఆ. అ.) సముద్రమునఁ బుట్టినది, వి. అ. పుం. శంఖము.

**అబ్ధిజుఁడు** సం. వి. అ. పుం. 1. చంద్రుఁడు. 2. ధన్వంతరి. బ. అశ్వినీసుతులు, దేవవైద్యులు. (ఈయర్థమున సంస్కృతమున ద్వివచనాంతము)

**అబ్ధినగరి** సం. వి. ఈ. స్త్రీ. ద్వారకాపురము.

**అబ్ధినవనీతకుఁడు** సం. వి. అ. పుం. కడలివెన్న, చంద్రుఁడు.

**అబ్ధిఫేనము** సం-అబ్ధికఫము.

**అబ్ధిమండూకి** సం. వి. ఈ. స్త్రీ. ముత్తెపుఁజిప్ప.

**అబ్ధిమేఖల** సం. వి. ఆ. స్త్రీ. భూమి.

**అబ్ధిశయనుఁడు** సం. వి. అ. పుం. విష్ణువు.

**అబ్ధిసారము** సం. వి. అ. పుం. రత్నము.

**అబ్బ** వి. (సం అంబః.క.అబ.) 1. జనకుఁడు,తండ్రి.

సీ. అబ్బ మే లోర్వలేనట్టివాఁడై నను మోహంబు గలతల్లి మూఁగదైన. గీ. నరునిభేదంబు వర్ణింపఁదరము గాదు. వేణుగో. శ. 12.

2. పూజ్యతను దెలుపును.

క. దబ్బఱలుగఁ జూడకు మో, యబ్బా... నీలా. 2.55.

అవ్య. (రూ. అబ్బా) ప్రశంసాదులను దెలుపును.

(ప్రశంస.)

ఉదా: అబ్బా! యెంతవాఁడవైతివి.

(ఆశ్చర్యము.)

అబ్బ! అంతజంతువును నే నెప్పుడును చూడలేదు.

(సంతాపము)

అబ్బా! ఈయెండలు సహించుట యెట్లు?

దీని ఆమ్రేడితము అబ్బబ్బ.

1. విసుగును దెలుపును.

సీ. అబ్బబ్బ పదగదె గబ్బియంచు నదల్చు తరలాక్షిఁ గ్రొవ్విరిదండఁ గొట్టె. రసిక. 5.160.

2. ఆశ్చర్యము దెలుపును.

క. అబ్బబ్బ యిదేమి శౌర్య మని వా రాడన్. పార్వ. 2.17.5

3. సంతాపమును దెలుపును.

ఉ....అబ్బబ్బ నితాంత కంతువిశిఖాగ్ని శిఖాపరితాప మాఱునే. రసిక. 3.59.

జ. అబ్బఁడు అబ్బాయి, అబ్బి.

**అబ్బఁడు** — అబ్బ వి. తండ్రి.

క....రేఖల వలరా, యబ్బఁడు... శ్రీపాదజే నియబ్బఁడుభ్రాత్రిన్. బహు: 1. 20.

**అబ్బుకాఁడు** విణ. అభాగ్యుఁడు, అదృష్టహీనుఁడు.

క. అని చిందరేఁగియట్ల,చ్చెనఁటిధరానురుఁడు చెంతఁ జేపడిననిధిన్, మునిగాలఁ దన్ని చనుగతి, ఘనజఘనం బాసి యబ్బుకాఁడయి పోయెన్. వేం. పంచ. 4.262, (చి.ని. పాఠము.)

**అబ్బగించు** అ. క్రి. తాళు, సహించు, ఓర్చు.

వ. తదీయాతిహేతిప్రహతి కబ్బగింపక వెన్నిచ్చి .. కు. సం. 12.841, 10.563.

(ఈపద మీ గ్రంథమందే వ్యతిరేకక్త్వార్థకము గానే కనిపించుచున్నది.)

**అబ్బరము** విశ. (సం. అపారం.) అపారము, అమితము.

చ....వింట గొనయంబు దవిల్చి మెఱుంగుటమ్ము లబ్బరముగఁ బూన్చి యయ్యతి యబంటులనిద్ధపుమేను లెల్ల వావిరి నలియంగ నేసి... అచ్చ. రా. యు. 189.

**అబ్బాటు** వి. (క. వంబె, వంబె–ఊష్మము) కాఁక ఉక్క.

వ. ఇంపాగుకలపంబు లబ్బాటునన్ జేటులెత్తి యుడొంలయె త్తడి బోడిపాడిదై... మనుచ. 5.71.

**అబ్బాయి** వి. √అబ్బ. (త. అప్పాయి.) పిల్లవాఁడు.

**అబ్బాలాడు** అ. క్రి. తడఁబడు, సంభ్రమించు. (శ. ర.)

**అబ్బి** వి. √అబ్బ (త. అప్పి)

1. బాలకుఁడు, అబ్బాయి.
2. హీనపురుష సామాన్యవాచకము.

(వ్యవ) ఆవంకాయబ్బిని పిలువుము.

**అబ్బు** అ. క్రి. (సం. అప్) 1. దొరకు, లభించు.

గీ....తనకుఁ దా నబ్బినట్టి, కాసు పదివేలనిష్కముల్ గాఁ దలంచి. భాగ. 10. ఉ. 965.

(సా) చిదు మబ్బును గాని సిరి యబ్బదు.

2. సిద్ధించు.

ఆ. అకట దినములోన నాసైంధవునిఁ జంప, నబ్బకున్న నతని కగ్ని సొరఁగ వలయు, నాతఁ డనృతవాది గాఁ డికక్కడ్డ, మెట్టు లగునొ మనకు నేది గతియొ. భార. ద్రోణ. 2.343. భార. అను. 3. 293.

గీ. అతని భజియింప మనకోర్కు లబ్బుటరుదె. ఉ. రా. 2. 159.

3. వశమగు, చిక్కు.

క. ...మోసంబు గాక ధర్మజుఁ డట్లబ్బినఁ బోనిచ్చుట రాధాతనయునకున్ బుద్ధి యగునె... భార. కర్ణ. 3. 8.

గీ. ఎవ్వఁ డబ్బిష్ణుఁ డతఁడు నా కిచట నబ్బెఁ, బగయడంగింపఁ గను చెట్టిభాగ్యఫలమొ. హరి. పూ. 4. 162.

4. అలవడు, అభ్యస్తమగు, పట్టువడు.

(వ్యవ) వానికి చదువు అబ్బలేదు.

**అబ్బురపడు** అ. క్రి. (√అబ్బురము) ఆశ్చర్యపడు. యయా. 2. 18.

**అబ్బురపాటు** వి. (√అబ్బురపడు) అబ్బురపడుట; ఆశ్చర్యము.

ఉ. అబ్బురపాటుతోడ నరునాంబుజముల్ మిసిమి... మనుచ. 2. 23.

**అబ్బురము–అబ్రము.** విశ. (సం. అపూర్వమ్.)

1. అరిది, దుష్కరము.

సీ. ...ఎట్టి? గీ. పాకనుంయియుండఁబుట్టిన బహిర బహిః, గాతివ్యజయ బజ్రమును గలిగి, వస్త్రలుకు యబ్బురము గాన పగపు గలదు, చిత్తమున నాకు నో మహాసిద్ధపుర్య. కళా. 5. 189.

2. ఆశ్చర్యకరము, వింతయైనది. (చూ. అబ్రము.)

వి. ఆశ్చర్యము; ఆశ్చర్యకరమగు కార్యము, మొ

గీ. చూచి యాచెల్వ చెల్వంబు లోచనముల, కబ్బురంబును గాంతియు నుబ్బునర్ప. ఉ. రా. 3. 104.

గీ. నెలఁత నీ కేతలోదరి నేర్పుమీఱ, నబ్బెసము చేసె నిటువంటియబ్బురంబు. సీమం. 3. 188.

జ. అబ్బురపడు, అబ్బురపాటు.

**అబ్బెంద** వి. వృక్షవిశేషము. యయా. 4.25, 5.48.

**అబ్బెగాలు** వి. శిశువులు ప్రాఁకు నప్పుడు వంపుగాఁ బెట్టినకాలు.

గీ. అబ్బెగాలిడి యొకపాణి నవని నూఁది, యన్యకరమున నవనీత మవధరించి, బాల్యమునఁ గ్రీడ సల్పు గోపాలకృష్ణు. దశా. 3. 185.

**అభ్యసనము** వి. (సం. అభ్యాసః) అలవాటు.

గీ. మౌనమును శౌచమును యంత్రమంత్ర ములును,గావు కారణములు యోగకలనము నకు,నిశ్చయంబును నభియోగనిశ్చలతయుఁ, గడఁకయును నభ్యసముఁ గాని కలశజన్మ. కాశీ. 5. 232.

గీ. నెలఁత నీ కేతలోదరి నేర్పినీఱ,నభ్యసము చేసె నిటువంటియబ్బురంబు. సీమం. 3. 138.

**అబ్భక్షము** సం. విణ. (అ. ఆ. అ.) జలము ఆహారముగాఁగలది. వి. అ. పుం. సర్పభేదము.

**అబ్రపడు** — అబ్బురపడు. (√అబ్రము.)

చ. హంహారు లిద్దఱుం గదిసి యావాపకేళి యొనర్చ రుద్ధతిన్, సురనికరంబు లబ్రపడి చూడఁగ... అని. 4. 56.

**అబ్రము** వి. విణ. — అబ్బురము. (ఆశ్చర్యకరము.)

సీ. ఏమేటియడుగుఁగెందామరబల్లాఁపుఁరివుచే ర్ల తేనె కబ్రంపుఁదెప్ప. అచ్చ. రా. బాల. 11.

క. ...అహహా నాక,స్వామికి నబ్రమగు ప్రీలు వసుమతిఁగలిగెన్. ప్రభా. 1. 56. పారి. 4. 47. కవిరా. 1. 81.

జ. అబ్రపడు.

**అబ్రహ్మణ్యము** సం. విణ. (అ. ఆ. అ.) బ్రాహ్మణునకుఁ దగనిది. (హింసాది) వి. అ. న. చంపవలదని పెట్టు మొఱ్ఱ; మొఱ్ఱ.

మ. ...బలభిన్ముఖ్యులు పాహి పాహి యని యబ్రహ్మణ్యముం బెట్టఁగా...దశా. 3. 399.

శా. ఖామా యేఁదపమాచరింతు విధి కబ్రహ్మణ్యమున్ బెట్టుచున్. మనుచ. 3. 102.

**అబ్ధి** సం. వి. అ. పుం. నీటిప్రోగు, సముద్రము.

**అబ్రాహ్మణుఁడు** సం. వి. అ. పుం. 1. అప్రశస్త బ్రాహ్మణుఁడు. 2. బ్రాహ్మణసదృశుఁడు. (క్షత్రియుఁడుగాని వైశ్యుఁడుగాని) 3. శూద్రాది.

**అభంగము** సం. విణ. (అ. ఆ. అ.) భంగములేనిది.

**అభంగశ్లేషము** సం. వి. అ. పుం. శ్లేషాలంకారభేదము. (వ్యతి-సభంగశ్లేషము.) సా. ద. 10. 12.

**అభంగురము** సం. విణ. (అ. ఆ. అ.) నశింపనిది; స్థిరమైనది.

**అభయ** సం. వి. ఆ. స్త్రీ. 1. కరక (వృ. వి.) 2. దుర్గామూర్తిభేదము.

**అభయడిండిమము** సం. వి. అ. పుం. భయములేదని సేనలను ప్రోత్సాహపెట్టుటకై యుద్ధమున వాయించుఢక్కాదివాద్యము.

**అభయదక్షిణ** సం. వి. ఆ. స్త్రీ. 1. భయమునుండి కాచెద నని మాటయిచ్చుట, రక్షణ ప్రతిజ్ఞ చేయుట. 2. భయమునుండి రక్షింపఁబడినవాఁడు రక్షించినవాని కిచ్చుదక్షిణ.

**అభయదానము** సం. వి. అ. న. అభయమిచ్చుట. భయము లేదని మాటయిచ్చుట.

**అభయదాయి** సం. విణ. (న్. నీ. న్.) — అభయప్రదుఁడు.

**అభయదుఁడు** సం. — అభయప్రదుఁడు.

**అభయపత్త్రము** సం. వి. అ. న. భయమునుండి కాచెదనని వ్రాసియిచ్చినపత్త్రము.

**అభయప్రదానము** సం. — అభయదానము.

**అభయప్రదుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) అభయమిచ్చువాఁడు.

**అభయము** సం. విణ. (అ. ఆ. అ.) భయములేనిది. వి. అ. న. 1. పరమాత్మము. 2. పరమాత్మజ్ఞానము. 3. భయములేమి, భయనివృత్తి. 4. రక్షణము. 5. వట్టివేరు (వృ.వి.). 6. అభయహస్తము. పుం. (జ్యోతి) ప్రయాణాదుల కనుకూలమగునొకయోగము.

**అభయముద్ర** సం. వి. ఆ. స్త్రీ. — అభయహస్తము.

**అభయవచనము** సం. వి. అ. న. రక్షింతునని చేసిన ప్రతిజ్ఞ.

**అభయహస్తము** సం. వి. అ. పుం. భయము లేదని సూచించుటకు అఱచేతివ్రేళ్లను నిలువుగాఁబట్టి ముందటికి చాఁచినచేయి. (ఇది తంత్ర శాస్త్ర ప్రసిద్ధము — తఱచుగా దేవతావిగ్రహముల యందుఁ గానఁబడును.)

**అభర్తృక** సం. వి. ఆ. స్త్రీ. — భర్తలేనిది. 1. విశంతువు 2. పెండ్లికానిస్త్రీ.

**అభవము** నం. వి. అ. పుం. 1. పుట్టుకలేమి. 2. సంహారము, వినాశము; ప్రళయము.

శ్లో. భవాయసర్వభూతానాం, మభవాయచరక్షసాం. రామా. (మత్తపవభవాభవౌ.) గీతా.

3. మోక్షము.

**అభవుఁడు** నం. విశ. (అ. అ. అ.) పుట్టుకలేనివాఁడు. వి. అ. పుం. ఈశ్వరుఁడు.

**అభవ్యము** నం. విశ. (అ. ఆ. అ.) 1. అమంగళమైనది. 2. దుర్దృష్టసూచకము 3. దైవనిర్ణీతము కానిది. 4. అనుచితము. వి. అ. న. అమంగళము.

**అభాగ్యము** నం. విశ. (అ. ఆ. అ.) భాగ్యములేనిది. వి. అ. న. భాగ్యములేమి.

**అభావము** నం. విశ. (అ. ఆ. అ.) 1. అనురాగములేనిది. 2. లేనిది వి. అ. పుం. 1. లేమి. 2. నాశము.

**అభావసంపత్తి** నం. వి. ఇ. స్త్రీ. అధ్యాసము, లేని ధర్మమును ఆరోపించుట.

**అభాషణము** నం. వి. అ. న. మాటాడకుండుట, మౌనము.

**అభి** నం. అవ్య. ఇది సమాసపూర్వపదముగా నుండి తఱుచుగా నీ క్రిందియర్థములను దెలుపును.

1. ఎదురు.

ఉదా: అభిముఖము, అభియానము.

2. సామీప్యము.

ఉదా: అభ్యాగతము—సమీపముగా వచ్చినది.

3. అంతటను.

ఉదా: అభిచరించు—అంతటను దిరుగు.

4. అత్యంతము.

ఉదా: అభిరుచి—ఎక్కువప్రీతి.

5. కొన్నిచోట్ల నిరర్థకముగానే యుండును.

ఉదా: అభ్యనుజ్ఞ - అనుజ్ఞ.

అభివందనము—వందనము.

**అభికంపనము** నం. వి. అ. న. వణఁకుట.

**అభికాంక్ష** నం. వి. ఆ. స్త్రీ. అభిలాషము.

**అభికాంక్షి** నం. విశ. (న్. నీ. న్.) కోరువాఁడు.

**అభికామము** నం. విశ. (అ. ఆ. అ.) ప్రేమించునది. వి. అ. పుం. 1. ప్రేమ. 2. కోరిక.

**అభికుఁడు** నం. విశ. (అ. ఆ. అ.) వలపుగలవాఁడు, కాముకుఁడు.

**అభిక్రందము** నం. వి. అ. పుం. కూఁత, అఱపు.

**అభిక్రమణము** నం. వి. అ. న.—అభిక్రమము.

**అభిక్రమము** నం. వి. అ. పుం. 1. ఆరంభము. 2. ఎక్కుట. 3. తలపడుట, ఎదుర్కొనుట. 4. యుద్ధము.

**అభిక్రాంతి** నం. వి. ఇ. స్త్రీ. - అభిక్రమము.

**అభిక్రోశకుఁడు** నం. విశ. (అ. కా. అ.) 1. నిందించువాఁడు. 2. అఱచువాఁడు. 3. మొఱపెట్టువాఁడు.

**అభిక్రోశము** నం. వి. అ. పుం. 1. అఱచుట. 2. మొఱపెట్టుట. 3. నిందించుట.

**అభిఖ్య** నం. వి. ఆ. స్త్రీ. 1. ప్రకాశము 2. చెప్పుట. 3. నామము 4. కీర్తి.

**అభిఖ్యాతము** నం. విశ. (అ. ఆ. అ.) 1. చెప్పఁబడినది. 2. ప్రసిద్ధమైనది.

**అభిఖ్యానము** నం. వి. అ. న. 1. చెప్పుట. 2. కీర్తి, ప్రసిద్ధి.

**అభిగంత** నం. విశ. (ఋ. త్రీ. ఋ.) 1. ఎదురుగాఁబోవువాఁడు. 2. సమీపించువాఁడు. 3. పొందువాఁడు. 4. భోగించువాఁడు.

**అభిగతము** నం. విశ. (అ. ఆ. అ.) 1. ఎదుర్కొనఁబడినది. 2. సమీపింపఁబడినది. 3. భోగింపఁబడినది. 4. పొందఁబడినది.

**అభిగమనము** నం. వి. అ. న. 1. సమీపించుట. 2. ఎదురుగాఁబోవుట. 3. పొందుట. 4. సంభోగము. (ఉదా: పరదారాభిగమనము.)

**అభిగమము** నం. వి. అ. పుం. - అభిగమనము.

**అభిగమించు** నం. స. క్రి. ఎదుర్కొను. (ప్రత్యుత్థానముచేయు.)

క. యజమానులు ఋత్విజులును, యజనసమేతులయి యున్నయనిమిషులుఁ బ్రమోదజాత్ములగుచు నప్పిశ్వజగద్విభు నభిగమించి సముదితభక్తిన్.

గీ. అర్ఘ్యమర్పించి ప్రాంజలులై ...హరి. పూ. 4. 190, 191.

**అభిగమ్యము** సం. విశే. (అ. ఆ. అ.) 1. ఎదురుగాఁ బోఁదగినది. 2. సమీపింపఁదగినది. 3. పొందఁదగినది. 4. భోగింపఁ దగినది.

**అభిగర్జనము** సం. వి. అ. న. గర్జించుట.

**అభిగర్జితము** సం.—అభిగర్జనము.

**అభిగామి** సం. విశే. (న్. నీ. న్.) 1. ఎదురుగాఁ బోవువాఁడు. 2. సమీపించువాఁడు. 3. పొందువాఁడు. 4. సంభోగించువాఁడు.

**అభిగాముకుఁడు** సం. విశే. (అ. ఆ. అ.)—అభిగామి.

**అభిగీతము** సం. విశే. (అ. ఆ. అ.) 1. పాడఁబడినది. 2. స్తుతింపఁబడినది.

**అభిగుప్తి** సం. వి. ఇ. స్త్రీ. రక్షణము.

**అభిగోప్త** సం. విశే. (ఋ. త్రీ. ఋ.) రక్షకుఁడు.

**అభిగ్రహణము** సం. వి. అ న.—అభిగ్రహము.

**అభిగ్రహము** సం. వి. అ. పుం. 1. చూచుచుండఁగా దొంగిలించుట; దొంగలు దారికొట్టుట. 2. అభియోగము, వ్యాజ్యము. 3. యుద్ధము. 4. గౌరవము.

**అభిఘరించు** సం. స. క్రి. సంస్కారార్థము (నేయి) కొంచెముగా వేయు.

సీ. ప్రక్షాళితంబైన పసిఁడిచట్టువమున నన్నంబు నునిచి నెయ్యభిఘరించి. కాశీ. 7. 141.

**అభిఘర్షణము** సం. వి. అ. న. 1. రాపిడి. 2. నూఱుట.

**అభిఘాతకుఁడు** సం. విశే. (అ. తికా. అ.) 1. కొట్టువాఁడు. 2. నాశనముచేయువాఁడు. వి. అ. పుం. శత్రువు.

**అభిఘాతము** సం. వి. అ. పుం. 1. దెబ్బ. 2. కొట్టుట. 3. సమూలనాశనము.

**అభిఘాతి** సం. విశే. (న్. నీ. న్.) 1. కొట్టువాఁడు, 2. బాధించువాఁడు. వి. అ. పుం. శత్రువు.

**అభిఘారణము** సం. వి. అ. న. సంస్కారార్థము హవ్యాదులమీఁద నేయి మొదలగువానిని కొంచెముగా వేయుట.

**అభిఘారము** సం. వి. అ. పుం. 1. సంస్కారార్థము హవ్యాదులమీఁద నేయి మొదలగువానిని కొంచెముగా నేయుట. 2. అభిఘరించెడు నేయి మొదలగునది.

**అభిఘ్రాణము** సం. వి. అ. న. మూర్కొనుట, ఆఘ్రాణించుట.

**అభిచరణము** సం. వి. అ. న. 1. శత్రుహింసార్థము చేయుకర్మము. (శ్యేనయాగాదికము.) 2. పిశాచములను వదలించుటకు చేయుక్రియ.

**అభిచరించు** సం. అ. క్రి. అంతటను దిరుగు, పరిభ్రమించు.

గీ. కోకిలాలాపములు విని కొమ్మ దన్నుఁ, బిలిచెనో యవి యాలించుఁ బ్రేమతోఁడ మన్మథాతురుఁడగుచున్న త్తవృత్తి నతఁడువనవాటికలయ దు నభిచరించు. వి. పు. 6. 91.

**అభిచరుఁడు** సం.విశే. (అ.ఈ.అ.) 1. సహాయుఁడు. అనుచరుఁడు. 2. అంతటను దిరుగువాఁడు.

**అభిచారకుఁడు** సం. విశే. (అ. రికా. అ.) అభిచారము చేయువాఁడు.

**అభిచారజ్వరము** సం. వి. అ. పుం. మంత్రాది ప్రయోగమువలనఁ గలుగుజ్వరము.

**అభిచారము** సం. వి. అ. పుం.—అభిచరణము

**అభిచారి** సం. విశే. (న్. ణీ. న్.)—అభిచారకుఁడు.

**అభిజనము** సం. వి. అ. పుం. 1. కులము,వంశము. 2. తనపూర్వులువసించినస్థానము, జన్మభూమి. 3. సుజనము. 4. కులాగతమైనకెక్కెముల్లో నగుబిరుదు,

**అభిజనవంతుఁడు** సం. విశే. (త్. వతీ. త్.) గొప్పవంశమువాఁడు.

**అభిజనుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) ప్రవీణుఁడు. నేర్పరి. (వై. ని.)

**అభిజాతము** సం. విశే. (చూ. అభిజాతుఁడు) మనోహరము, మధురము.

'ప్రత్యభిభాషితాయా మభిజాతవాచి'. కు. సం. 1. 45.

వి. అ. న. గొప్పపుట్టుక.

**అభిజాతి** సం. వి. ఇ. స్త్రీ. గొప్ప కులమునందు పుట్టుక.

**అభిజాతుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) 1. పుట్టినవాఁడు. 2. గొప్పవంశమునఁ బుట్టినవాఁడు. 3. పండితుఁడు. 4. న్యాయవంతుఁడు. 5. శ్రేష్ఠుఁడు.

**అభిజిత్తు** నం. విశే. (త్.) 1. గెలుచునది, జయించునది. 2. అభిజిన్నక్షత్రమునఁ బుట్టినవాఁడు. వి. త్. పుం. 1. విష్ణువు. 2. (జ్యోతి.) (క.) ఒకానొక నక్షత్రము. (ఉత్తరాషాఢా చతుర్థపాదమును శ్రవణప్రథమపాదమును కలిసినది-ఉత్తరాషాఢతుదిని పదియేనుగడియలును శ్రవణము మొదట నాలుగుగడియలును గలసినది-అని కొందఱు) (చ) సూర్యుఁ డున్న రాశికినాలుగవ లగ్నము. (ట) - అభిజిన్ముహూర్తము.

**అభిజిన్ముహూర్తము** నం. వి. అ. పుం. సూర్యోదయము మొదలు ఎనిమిదవముహూర్తము, పగలు పదునాలుగుగడియలు దాఁటినతరువాత రెండుగడియలకాలము.

**అభిజ్ఞ** నం. వి. ఆ. స్త్రీ. 1. స్మరణము. 2. ప్రత్యభిజ్ఞ, గుఱుతుపట్టుట.

**అభిజ్ఞాతము** నం. విశే. (అ. ఆ. అ.) 1. గుఱుతుపట్టఁబడినది. 2. తెలిసికొనఁబడినది.

**అభిజ్ఞానము** నం. వి. అ. న. 1. చిహ్నము, గుఱుతు. 2. ప్రత్యభిజ్ఞానము, గుఱుతుపట్టుట; జ్ఞప్తికిఁ దెచ్చుకొనుట. 3. జ్ఞానము.

**అభిజ్ఞాపకము** నం. విశే. (అ. ఆ. అ.) 1. తెలుపునది. 2. జ్ఞప్తికిఁ దెచ్చునది.

**అభిజ్ఞుఁడు** నం. విశే. (అ. ఆ. అ.) 1. తెలిసినవాఁడు. 2. నిపుణుఁడు. 3. పండితుఁడు.

**అభిడీనము** నం. వి. అ. పుం. ఎదురుగా ఎగురుట.

**అభితప్తము** నం. విశే. (అ. ఆ. అ.) 1. కాల్పఁబడినది. 2. కాఁగునట్లు చేయఁబడినది. 3. తాపము నొందినది

**అభితర్పణము** నం. వి. అ. న. తృప్తిపొందుట, ఆపోవుట.

**అభితాడనము** నం. వి. అ. న. 1. కొట్టుట 2. చఱచుట.

**అభితాపము** నం. వి. అ. పుం. 1. మిక్కిలివేఁడిమి. 2. సంతాపము, దుఃఖము.

**అభిదర్శనము** నం. వి. అ. న. చూచుట.

**అభిదర్శించు** నం. న. క్రి. చూచు. (శ.)

**అభిద్రవణము** నం. వి. అ. న-అభిద్రవము.

**అభిద్రవము** నం. వి. అ. పుం. 1. (శత్రువుల)పైఁబడుట; ఆక్రమణము. 2. పరుగెత్తుట.

**అభిద్రుతము** నం. విశే. (అ. ఆ. అ.) ఆక్రమింపఁబడినది.

**అభిద్రోహము** నం. వి. అ. పుం. 1. ఆక్రోశము, నింద. 2. అపకారము. 3. కీడు తలఁచుట.

**అభిధ** నం. వి. ఆ. స్త్రీ. 1. పేరు. 2. సంకేతితార్థమును స్ఫురింపఁ జేయుశబ్దశక్తి. (అభిధ లక్షణ వ్యంజన అని శబ్దశక్తులు మూఁడు.)

**అభిధర్షణము** నం. వి. అ. న. 1. నలఁగుడుపెట్టుట, పీడించుట. 2. ఆస్ఫాలనము చేయుట, చఱచుట. 3. భూతాదులావేశించుట దయ్యము సోఁకుట.

**అభిధర్షణుఁడు** నం. వి. అ. పుం రాక్షసుఁడు.

**అభిధాంతరము** నం. వి. అ. న. మాఱుపేరు, నామాంతరము.

(బుధునివర్ణనము)

సీ. అభిధాంతరము కాని యంబిందువై ఱికి ... కాశీ. 4 191.

సీ... అమృతాంబునిధి కభిధాంతరంబు గీ... మంత్రియన్నయ దేవయ్య మహితయశము భీమ. 1. 53. (ఇట 'ప్రతిబింబము, సాటి' అని భావము)

**అభిధానము** నం. వి. అ. న. కథనము, చెప్పుట. 2. నామము, పేరు. 3. కోశము, (శబ్దార్థములను దెల్పు) నిఘంటువు.

**అభిధాయకము** నం. విశే. (అ. యశా. అ.) 1. వాచకము, చెప్పునది. (శబ్దము.) 2. పలుకునది, చెప్పునది, (మనుష్యాది)

**అభిధాయి** నం. విశే. (న్. నీ. న్.) - అభిధాయకము.

**అభిధావకుఁడు** నం. విశే. (అ. వికా. అ.) పైఁబడువాఁడు, మీఁదికి వచ్చువాఁడు.

**అభిధావనము** నం. వి. అ. న. ఆక్రమణము, పైఁబడుట.

**అభిధేయము** నం. విశే. (అ. ఆ. అ.) చెప్పఁ దగినది, పేర్కొనఁ దగినది. వి. అ. న. 1. శబ్దార్థము. 2. గ్రంథప్రతిపాద్యమగువిషయము.

సం. వి. అ. స్త్రీ. 1. పరద్రవ్యాపేక్ష. 2. కోరిక. 3. చింతనము, తలపోయుట.

**అభిధ్యానము** సం. వి. అ. న-అభిధ్య.

**అభినందనము** సం. వి. అ. న-అభినందము.

**అభినందనీయము** సం. విణ. (అ. ఆ. అ.) అభినందింపఁ దగినది.

**అభినందనుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) 1. సంతోష పెట్టువాఁడు. 2. ప్రోత్సాహపఱుచువాఁడు. 3. పొగడువాఁడు.

**అభినందము** సం. విణ. (అ. అ. అ.) 1. సంతోష పెట్టునది. 2. ప్రోత్సాహపఱుచునది. 3. ప్రశంసించునది, పొగడునది. వి. అ. పుం. 1. సంతోషము. 2. పొగడుట. 3. ప్రోత్సాహపఱుచుట.

**అభినంది** సం. విణ. (న్. నీ. న్.) 1. సంతోషించు వాఁడు. 2. సంతోషపెట్టువాఁడు.

**అభినందించు** సం. అ. క్రి. సంతోషించు.

వ. పాకశాసనుం డతనివివేకపాకంబున కచ్చెరు వొంది యభినందించి యతని కిట్లనియె. భార. శాం. 4. 448.

స. క్రి. 1. ప్రశంసించు, శ్రేష్ఠమనిచెప్పు.

క. కొందఱు కర్మకరణ మభినందింతురు వారలకు జననమరణములం, బొందిక పోరాదు ... భార. శాం. 5. 126.

2. సంతోషపెట్టు.

వ. అతని నుచితాశీర్వాదంబుల నభినందించె. మార్క. 3. 273.

**అభినందితము** సం. విణ. (అ. ఆ. అ.) అభినందింపఁ బడినది.

**అభినంద్యము** సం-అభినందనీయము.

**అభినమ్రము** సం. విణ. (అ. ఆ. అ.) 1. మిక్కిలి వంగినది. 2. మిక్కిలివిధేయమైనది.

**అభినయము** సం. వి. అ. పుం. 1. హృద్గతములైన భావములను సూచించు శరీరచేష్టావిశేషము. 2. కథానాయికాదులను వేషభాషాదులచేత అనుకరించు. (ఇది ఆహార్యము వాచికము ఆంగికము సాత్త్వికము-అనిచతుర్విధము.)

**అభినయించు** సం. న. క్రి. (అంగవిక్షేపాదులచే) సూచించు, ప్రకటించు. వరాహ. 6. 34.

**అభినవము** సం. విణ. (అ. ఆ. అ.) క్రొత్తది. వి. అ. పుం. ముఖస్తుతి.

**అభినవాయము** సం. వి. అ. పుం. క్రొత్తరాబడి. ది. శా. 4. సం. 1268. (చూ. ఆయము.)

**అభినవించు** సం. అ. క్రి. క్రొత్తగాఁ గలుగు; కలుగు.

చ. అలంతుల నిల్పు హస్తములు హస్తవిలాసముతోఁ బెనంగఁ జూడ్కులు దెలిచూడ్కులందెలమిఁ గూడి రమింప మనంబు తన్మనో, బలమున నుల్లసిల్ల నిజభావము భావవిశేష సంపదల్, వెలయ రసంబులం దభినవించె రసంబులు సాంగికంబుగాన్. కు. సం. 9. 237.

**అభినవోద్భిదము** సం. వి. అ. పుం. అంకురము, మొలక.

**అభినహనము** సం. వి. అ. న. దృఢబంధనము. గట్టికట్టు.

**అభిని** వి. (సం. అహిఫేనమ్, అఫేనమ్. త. అపినీ. హిం. అఫీమ్.) నల్లమందు.

సీ. అభిని యంచనఁగ నిర్యాసు మొప్పు. ఆం. భా. 2. 304.

**అభినిధనము** సం విణ. (అ. ఆ. అ.) చచ్చుటకు సిద్ధముగా నున్నది.

**అభినియుక్తుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) కార్యమందు పట్టుదలకలవాఁడు.

**అభినియోగము** సం. వి. అ. పుం. అభినివేశము, పట్టుదల.

వ. వత్స కార్యాభినియోగ ఏవాస్మాన్ వ్యాకులయతి. ముద్రా. 1. 20 పా.

**అభినిర్మించు** సం. న. క్రి. నిర్మాణము చేయు, రచించు.

క. పంచమవేదం బభినిర్మించినముని ... భీమ. 2. 75.

**అభినిర్ముక్తుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) 1. విడువఁ బడినవాఁడు. 2. ఎవఁడు నిద్రించుచుండఁగా సూర్యుఁ డస్తమించునో అట్టివాఁడు.

**అభినిర్యాణము** సం. వి. అ. న. 1. బయలుదేఱుట, ప్రయాణము. 2. దండెత్తుట.

**అభినిర్వృత్తము** సం. విశ. (అ.ఆ.అ.) నెఱవేఱినది, నిష్పన్నము.

**అభినిర్వృత్తి** సం. వి. ఇ. స్త్రీ. నెఱవేఱుట.

**అభినివిష్టము** సం. విశ. (అ. ఆ. అ.) 1. అభిని వేశముగలది, పట్టుదలగలది. 2. ప్రవిష్టము.
శ్లో: గురుభిరభినివిష్టం (గర్భం) లోకపాలాను భావైః. సం. రఘు. 2. 75.
వి. అ. న. పట్టుదల.

**అభినివేశము** సం. వి. అ. పుం. 1. అవశ్యము చేయవలయుననెడు పట్టుదల. 2. అభిలాషము, 'ప్రియంవదా — తదుద్యుక్తమస్యా అభిలాషో అభినందితుం.
అనసూయా — ఏథా యథా భణసి.
ప్రియంవదా-(ప్రకాశం) సఖ దిష్ట్యా అనురూప స్తేఽభినివేశః.' శాకు. 3. 14 పం.

**అభినివేశి** సం. విశ. (న్. నీ. న్.) అభినివేశము గలవాఁడు.

**అభినిష్పత్తి** సం. వి. ఇ. స్త్రీ. 1. నెఱవేఱుట. 2. ఉత్పత్తి, పుట్టుక.

**అభినిష్పన్నము** సం. విశ. (అ. ఆ. అ.) 1. సిద్ధించినది, నెఱవేఱినది. 2. పుట్టినది.

**అభినీతము** సం. విశ. (అ.ఆ.అ.) 1. న్యాయముతోఁ గూడినది, యోగ్యము. 2. సంస్కరింపఁబడినది, చక్కఁజేయఁబడినది. 3. అభినయింపఁబడినది. 4. ఎదురుగా తేఁబడినది. 5. క్రోధము గలది.
'అభినీతన్స్వయుక్తేస్యా, దమర్ష వతి సంస్కృతే' (వై. ని)

**అభినీతి** సం. వి. ఇ. స్త్రీ. 1. ప్రియవాక్యాదులతోఁ గూడినయుక్తి. 2. న్యాయము. 3. ఎదురుగాఁ దెచ్చుట. 4. అభినయము.

**అభినుతము** సం. విశ. (అ. ఆ. అ.) స్తుతింపఁబడినది.

**అభినుతి** సం. వి. ఇ. స్త్రీ. స్తుతి, పొగడ్త.

**అభినుతించు**—అభినుతియించు. సం.న.క్రి. స్తుతించు.
గీ. ...ఉదయదర్క ధామనిభమై వెలిఁగెడు దానిఁ గాంచి, మ్రొక్కి ఋగ్వేదమంత్రసముత్కరమున, నభినుతింపంగ నంత నయ్యండ మనఘ. మార్క. 7. 104.

**అభినుతియించు** సం. న. క్రి. స్తుతించు, పొగడు.
క. నీసత్త్వ మెఱుంగవుగా, కీసకలములోనఁ జూడ నేవేల్పులు నీ,తోసరియని బహువిధముల, నానర్వేశ్వరుఁడు నన్ను నభినుతియించెన్. వరాహ. 10. 86.

**అభినేత** సం. విశ. (ఋ. త్రీ. ఋ.) అభినయించువాఁడు.

**అభినేతవ్యము** సం. విశ. (అ. ఆ. అ.) 1. అభినయింపఁదగినది, (దేవ° చేష్టాదులచేత) అనుకరింపఁ దగినది. 2. ఎదురుగా తేఁ దగినది.

**అభినేయము** సం.—అభినేతవ్యము.

**అభిన్నము** సం. విశ. (అ. ఆ. అ.) 1. వేఱుకానిది, ఏకరూపము గలది. 2. విఱువఁబడనిది; పగులఁ గొట్టఁబడనిది; చీల్పఁబడనిది. 3. భిన్నము కానిది, పూర్ణము (అంక.) 4. అసంభిన్నము, అసంగతము, కలియనిది.
శ్లో: రవికిరణ సహిష్ణు స్వేదలేశై రభిన్నం. అపచిత మపి గాత్రం...శాకుం. 2. 4.

**అభిపతనము** సం. వి. అ. న. 1. మూర్కొనుట, మైఁబడుట. 2. ఎదురుగాఁ బోవుట. 3. సమీపించుట.

**అభిపత్తి** సం. వి. ఇ. స్త్రీ. 1. ఎదురుగాఁ బోవుట. 2. సమీపించుట. 3. నిష్పత్తి సిద్ధి.

**అభిపన్నుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) 1. ఎదురుగాఁ బోయినవాఁడు. 2. సమీపించినవాఁడు. 3. ఆపద నొందినవాఁడు. 4. అంగీకరింపఁబడినవాఁడు. 5. తప్పు చేసినవాఁడు. 6. శత్రువుచే ఆక్రమింపఁబడినవాఁడు. 7. శరణు చొచ్చినవాఁడు. 8. దాక్షిణ్యము గలవాఁడు. 9. పొందినవాఁడు.
శ్లో: త్వమనన్యమాకారమభిప్రపన్నః. సం.కిరా. 3. 46.

**అభిప్రవర్తనము** సం. వి. అ. న. 1. అంతటను ప్రవర్తించుట, 2. (చెమట) పైకి వచ్చుట, స్రవించుట.

**అభిప్రవృత్తము** సం. విశ. (అ. ఆ. అ.) 1. అంతటను వ్యాపించినది. 2. (కార్యమునందు) ప్రవర్తించినది. 3. జరిగినది.

**అభిప్రాయము** సం. విణ. (అ. ఆ. అ.) పొందినది, చెందినది. (పాణిని. 1: 3. 72.)
వి. అ. పుం. 1. తలఁపు, ఉద్దేశము. 2. భావము, తాత్పర్యము. 3. అభిలాషము.

**అభిప్రీతి** సం. వి. ఇ. స్త్రీ. 1. సంతోషము, 2. కోరిక.

**అభిప్రేతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. కోరఁబడినది. 2. ఉద్దేశింపఁబడినది, తలఁపఁబడినది. 3. ప్రియమైనది. 4. అంగీకృతము, సమ్మతము.

**అభిప్లవము** సం. వి. అ. పుం. 1. అంతటను వెల్లివిరియుట. 2. ఉపద్రవము.

**అభిప్లుతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. అంతటను వ్యాపించినది. 2. అంతటను తడుపఁబడినది. 3. తిరస్కరింపఁబడినది, అభిభూతము. (శం. ని.)

**అభిభవనము** సం. వి. అ. న—అభిభవము.

**అభిభవము** సం. వి. అ. పుం 1. పరాజయము. 2. తిరస్కారము. 3. ఆక్రమించుట.

**అభిభవించు** సం. స. క్రి. పరిభవించు, అవమానించు.

గీ. వాఁడు వరగర్వమునఁజేసి వాఁడి మిగిలి, యమరవతిఁ దొట్టివేల్పుల నభిభవించు. భార. అర. 4. 401.

గీ. ...పాదముష్టి, యష్టివాక్చిత్తముల గోపు నభిభవింప,కుండవలయు... భార. అను. 3. 91.

**అభిభావకుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) — అభిభావి.

**అభిభావనము** సం. వి. అ. న. 1. పరాభవింపఁ జేయుట. అవమానింపఁ జేయుట. 2. ఓడింపఁ జేయుట, గెలిపించుట.

**అభిభావి** సం. విణ. (న్. నీ. న్.) 1. అవమానపఱుచువాఁడు. 2. ఓడించువాఁడు.

**అభిభావుకుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) — అభిభావకుఁడు.

**అభిభాషణము** సం. వి. అ. న. మాటలాడుట, సంభాషణము.

**అభిభాషి** సం. విణ. (న్. నీ. న్.) మాటాడువాఁడు.

**అభిభాషించు** సం. అ. క్రి. మాటలాడు.

మ. ...వేఱొక్కవిన్నాణితో, నభిభాషింతురు. దుర్మతుల్ జలరుహాస్యల్...మల్ల. శృం. 50.

**అభిభూతి** సం. వి. ఇ. స్త్రీ. 1. పరాభవము, అవమానము. 2, ఓడించుట. 3. ఆక్రమించుట.

**అభిభూతుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఓడింపఁబడినవాఁడు. 2. అవమానింపఁబడినవాఁడు. 3. ఆక్రాంతుఁడు.

**అభిమంత** సం. విణ. (ఋ. త్రీ. ఋ.) అభిమాని.

**అభిమంత్రకుఁడు** సం. విణ. (అ. త్రికా. అ.) అభిమంత్రించువాఁడు.

**అభిమంత్రణము** సం. వి. అ. న—అభిమంత్రము.

**అభిమంత్రణీయము** సం—అభిమంత్ర్యము.

**అభిమంత్రము** సం. వి. అ. పుం. 1. పిలుపు. 2. మంత్రించుట. 3. మంత్రమును పఠించుచు చేయువిధానాది సంస్కారము.

**అభిమంత్రయిత** సం. విణ. (ఋ. త్రీ. ఋ.) —అభిమంత్రకుఁడు.

**అభిమంత్రించు** సం. స. క్రి. 1. పిలుచు.

క. మంత్రపరీక్షార్థం బభి,మంత్రించితిఁ గాని దేవ మదనక్రీడా, తంత్రంబుఁగోరి చీరను, మంత్రించినతప్పుసైఁచి మఱలు దినేశా. భాగ. 9. 718.

2. మంత్రముచే సంస్కరించు.

వ. దానిం బుచ్చుకొని యభిమంత్రించి చండకౌశికుండు బృహద్రథున కిచ్చి యీఫలంబు వలన నీ కొక్కపుత్త్రుం డుద్భవిల్లు నని చెప్పిన. భార. సభా. 1. 143,

**అభిమంత్రితము** సం. విణ. (అ. ఆ. అ.) అభిమంత్రింపఁబడినది.

**అభిమంత్రితవ్యము** సం—అభిమంత్ర్యము.

**అభిమంత్ర్యము** సం. విణ. (అ. ఆ. అ.) అభిమంత్రింపఁదగినది.

**అభిమతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. సమ్మతము, ఒప్పుకొనఁబడినది. 2. ఆదరింపఁబడినది. 3. అభీష్టము, ప్రియమైనది. 4. కోరఁబడినది. వి. అ. న. 1. మమకారము. 2. కోరిక. 3. సమ్మతి.

**అభిమతి** సం. వి. ఇ. స్త్రీ. 1. అభిమానము, మమకారము. 2. ఆదరము. 3. సమ్మతి. 4. అభిలాషము.

**అభిమతుఁడు** సం. వి. అ. పుం. వల్లభుఁడు, ప్రియుఁడు. శిశు. 10. 9.

**అభిమనస్కుఁడు** సం. విణ. (అ. ఆ అ.) – కార్యమునకు – అభిముఖమైనమనస్సు కలవాఁడు.

**అభిమన్యుఁడు** సం. వి. ఉ. పుం. అర్జునునకు సుభద్రయందుఁ బుట్టినకొడుకు.

**అభిమరము** సం. వి. అ. పుం. 1, యుద్ధము. చంపుట. 2. స్వపక్షమువలనిభయము.

**అభిమరుఁడు** సం. వి. అ. పుం. ధనాశచేఁ బ్రాణములను లెక్కింపక పులి యేనుఁగు మొదలగువానితోఁ బోరఁ బూనినవాఁడు.

**అభిమర్దనము** సం. విణ. (అ. ఈ. అ.) 1. రాయిడపెట్టునది, మర్దనము చేయునది. 2. బాధపెట్టునది. వి. అ. న. 1. రాయిడి, మర్దనము. 2. బాధ.

**అభిమర్దము** సం. విణ. (అ. ఆ. అ.) మర్దించునది. వి. అ. పుం. 1, నిష్పీడనము, రాయిడి. 2. యుద్ధము.

**అభిమర్శకుఁడు** సం. విణ. (అ, రికా. అ.) 1. తాఁకువాఁడు. 2. (పరస్త్రీని) అంటువాఁడు. చెఱచువాఁడు.

**అభిమర్శనము** సం. వి. అ. న–అభిమర్శము.

**అభిమర్శము** సం. వి. అ. పుం. 1, స్పర్శము, తాఁకుట. 2. (పరస్త్రీని) అంటుట, చెఱచుట. (ఉదా: పరదారాభిమర్శము.)

**అభిమర్శించు** సం. స. క్రి. 1. తాఁకు. 2. పొందు.

క. క్లేశంబును సౌఖ్యంబును, నాశువునను గుంభజన్ముఁ డభిమర్శించెఁ, గాశీవిరహము దక్షిణ, కాశీసంగమము వరుసఁ గలిగిన కతనన్. కాశీ. 3. 26.

**అభిమాదము** సం. వి. అ. పుం. మత్తు.

**అభిమానకత్తె** మి. విణ. (అభిమానము+కత్తె) అభిమానము గలయాఁడుది, మానిని.

ద్వి. అభిమానకత్తెదానగుట...బస. పు. 5.53.

**అభిమానము** సం. వి. అ. పుం. 1. ధనకులాదుల వలనఁ గలుగుదర్పము, గర్వము. 2. ప్రేమము. 3. ఆత్మగౌరవము.

శ్లో. సిద్ధాభిమానైకధనాహి మానినః. శిశు. 1. 67.

4. జ్ఞానము. (కే. ని. వై. ని.) 5. మానము. స్త్రీలకు ప్రియునియెడఁగలుగు కోపవిశేషము– 6. నాగ తీర్చుకొనుట. వైరనిర్యాతనము. వి. కిరా. 2. 19. 7. హింస.

**అభిమాని** సం విణ (న్. నీ. న్.) అభిమానము గలవాఁడు.

**అభిమానించు** సం. స. క్రి. అభిమానముతోఁ జూచు, తనది యనుకొను.

మ. అభిమానించిన మీరు లేడ్చువరుఁ బ్రతిష్ఠాంశభకాలంబున, దభిషేకించిన తిగ్మభానుఁడును నేకాగ్రక్రియఁ బ్రమించువాండ్రు... భీమ. 4. 207.

క. తను నభిమానించినయది, మనముగుటఁ బుద్ధివలన మఱిదోఁచినవెల్లను మిథ్యగానెఱింగిన, ననఘా దేహాభిమాన మంతయు నడఁగుఁ. సమీ. 4. 107.

**అభిమానితము** సం. విణ. (అ. ఆ. అ.) అభిమానము గలది. వి. అ. న. సంభోగము, సురతము.

**అభిమాయుఁడు** సం. విణ. (అ. ఆ. అ.)–అవిద్యను పొందినవాఁడు – ఇతికర్తవ్యతామూఢుఁడు, కర్తవ్యాంశము ఎఱుఁగనివాఁడు.

**అభిముఖుఁడు** సం. విణ. (అ. ఆ, ఈ. అ–ముఖము స్వాంగము కానప్పుడు స్త్రీలింగ మాకారాంతమే యగును. ఉదా: అభిముఖాశాలా.) 1. ఎదురుమొగమైనవాఁడు, సమ్ముఖుఁడు. 2. సిద్ధముగా నున్నవాఁడు. 3. అనుకూలుఁడు. (వ్యతి – విముఖుఁడు.)

**అభిమృష్టము** సం. విణ. (అ. ఆ. అ.) 1. తాఁకఁబడినది. 2. తుడువఁబడినది, శుద్ధి చేయఁబడినది.

**అభియాత** సం. విణ. (ఋ. త్రీ. ఋ.) 1. ఎదురుగాఁ బోవువాఁడు. 2. యుద్ధమున ఎదుర్కొనువాఁడు. (శత్రువు)

**అభియాతి** సం. వి. ఇ. పుం. శత్రువు. స్త్రీ. ఎదు ర్కొనుట.

**అభియానము** సం. వి. అ. న. 1. ఎదురుగాఁ బోవుట. 2. మార్కొనుట.

**అభియాయి** సం. విశ. (న్. నీ. న్.)—అభియాత.

**అభియుక్తుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) 1. ఆసక్తుఁడు. 2. పండితుఁడు. 3. ఆప్తుఁడు. 4. ఎదుర్కొనఁ బడినవాఁడు. 5. శత్రువుచే నిరోధింపఁబడిన వాఁడు. 6. ప్రతివాది. 7. నియుక్తుఁడు, ఏర్పాటుచేయఁ బడినవాఁడు. 8. కూడినవాఁడు.

**అభియోక్త** సం. విశ. (ఋ. త్రీ. ఋ.) 1. ఎదిరించు వాఁడు. 2. నేరము మోపువాఁడు, వ్యాజ్యెము తెచ్చువాఁడు (వాది)

**అభియోక్తవ్యుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) 1. నిషేధింపఁ దగినవాఁడు. 2. నేరము మోపఁ దగినవాఁడు (ప్రతివాది.) 3. కూర్పఁదగిన వాఁడు. 4. ఎదుర్కొనఁ దగినవాఁడు.

**అభియోగము** సం. వి. అ పుం. 1. పూనిక, ఉత్సా హము. 2. ఆసక్తి. 3. పాండిత్యము. 4. పట్టు దల. 5. వ్యాజ్యెము 6. శత్రువు నెదురిం చుట. 7. నిరోధము, ముట్టడి, 8. శపథము.

**అభియోగి** సం. విశ. (న్. నీ. న్.) 1. పూనిక గలవాఁడు. 2. ఎదిరించువాఁడు, 3. ముట్ట డించు వాఁడు 4. వ్యాజ్యెము తెచ్చువాఁడు. (వాది) 5. కూర్చువాఁడు,

**అభియోగించే** సం. స. క్రి. (పగచే) చెప్పు.

మ. అభియాతుల్ మొదలిమతంబునకు మాయా వాదు లాడ్కొయదు, వ్యక్షభిచారంబిది మేరు వంతయిన మాయణమిథ్య లేదంద్రుపెల్లభి యోగింపుదు దివ్యదుష్కృతము గోరం తైనఁ గొండంతగా... వై జ. 4. 99.

**అభియోజనము** సం. వి. అ. న. 1. కట్టినదానిని మరల బిగించి కట్టుట, 2. ఎదిరించుట, 3. వ్యాజ్యెముతెచ్చుట.

**అభియోజ్యుఁడు** సం.—అభియోక్తవ్యుఁడు.

**అభిరక్ష** సం. వి. ఆ. స్త్రీ. పూర్ణముగా రక్షించుట.

**అభిరక్షకుఁడు** సం. విశ. (అ. ఇకా. అ.) పూర్ణముగా రక్షించువాఁడు

**అభిరక్షణము** సం. వి. అ. న.—అభిరక్ష.

**అభిరక్షిత** సం. విశ. (ఋ. త్రీ. ఋ.) పూర్ణముగా రక్షించువాఁడు.

**అభిరక్షితుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) పూర్ణముగా రక్షింపఁబడినవాఁడు

**అభిరతి** సం. వి. ఇ. స్త్రీ. ఆసక్తి.

**అభిరతుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) అత్యంతా సక్తుఁడు.

**అభిరాట్టు (టు)** సం. విశ, (జ్.) మిక్కిలి ప్రకా శించువాఁడు. వి. జ్. పుం. అధీశ్వరుఁడు సమ్రాట్టు.

**అభిరాద్ధుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) ఆరాధింపఁ బడినవాఁడు.

**అభిరామము** సం. విశ. (అ. ఆ. అ.) ప్రియము, మనోహరము, ఇంపయినది

**అభిరుచి** సం. వి. ఇ. స్త్రీ. 1. అత్యంతమైన రుచి; రుచి. 2. అత్యంతాసక్తి, ప్రీతి. 3. కాంతి.

**అభిరుచితుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) మిక్కిలి యిష్టుఁడు. వి. అ. పుం. ప్రియుఁడు, వల్లభుఁడు.

**అభిరుచిరము** సం. విశ. (అ. ఆ. అ.) మనోహర మైనది, ఇంపైనది.

**అభిరుతము** సం. వి. అ. న. ధ్వని. పక్షి మొదలగు వానికూఁత.

**అభిరూపము** సం. విశ. (అ. ఆ. అ.) 1. అనురూ పము, తగినది. 2. మనోహరము, ఇ పయినది.

**అభిరూపుఁడు** సం. విశ. (చూ. అభిరూపము.) వి. అ. పుం. 1. చంద్రుఁడు. 2. శివుఁడు. 3. విష్ణువు. 4. మన్మథుఁడు. 5. పండితుఁడు.

**అభిలంఘనము** సం. వి. అ. న. 1. దాఁటుట. 2. (శత్రువుల)పైఁ బడుట. 3. అతిక్రమించుట, మీఱుట,

**అభిలక్షితము** సం. విశ. (అ. ఆ అ.) 1. చూడఁ బడినది. 2. ఆలోచింపఁబడినది. 3. చిహ్నితము, గుఱుతులుగలది.

**అభిలషణము** సం. వి. అ. న. కోరిక, ఇచ్ఛ.

**అభిలషణీయము** సం. – అభిలషితవ్యము.

**అభిలషత్** సం. శత్ర. కోరుచున్న.

**అభిలషమాణము** సం. విణ. (అ. ఆ. అ.) కోరు చున్నది.

**అభిలషించే** సం. స. క్రి. వాంఛించు, కోరు.
గీ. ...ఎట్లు ముక్తి యభిలషించెదు...మార్క. 5. 323.

**అభిలషిత** సం. విణ. (ఋ. త్రీ. ఋ.) — అభిలాష కుఁడు.

**అభిలషితము** సం. విణ. (అ. ఆ. అ.) కోరఁబడినది. వి. అ. న. కోరిక.

**అభిలషితవ్యము** సం. విణ. (అ. ఆ. అ.) కోరఁ దగినది.

**అభిలష్యత్** సం. శత్రు. కోరుచున్న.

**అభిలష్యమాణము** సం. విణ. (అ. ఆ. అ.) 1. కోరు చున్నది. 2. కోరఁబడుచున్నది.

**అభిలాపము** సం. వి. అ. పుం. 1. కథనము, చెప్పుట. 2. మాట.

**అభిలావము** సం. వి. అ. న. కోయుట.

**అభిలాష(ము)** సం. వి. అ. పుం. కోరిక.

**అభిలాషకుఁడు** సం. విణ. (అ. శా. అ.) అభిల షించువాఁడు, కోరువాఁడు.

**అభిలాషి** సం. విణ. (న్. ఈ. న్.) అభిలషించు వాఁడు.

**అభిలాషుకుఁడు** సం. విణ. (అ. ఆ. అ)—అభిలాష కుఁడు.

**అభిలాష్యము** సం. — అభిలషితవ్యము.

**అభిలీనము** సం. విణ. (అ. ఆ. అ.) 1. అణఁగి యున్నది. 2. వ్యాప్తము.
శ్లో. తదీయమానీలముఖం స్తనద్వయం, తిరశ్చ కార భ్రమరాభిలీనయోః, సుజాతయోః పంకజకోశయోశ్శ్రియం...సం. రఘు. 3. 8.

**అభిలూత** సం. వి. ఆ. స్త్రీ. ఒకవిధమైన సాలె పురుగు.

**అభివందనము** సం. వి. అ. న. ప్రణామము, నమ స్కారము.

**అభివర్ణనము** సం. వి. అ. న. 1. పొగడుట. 2. వివరించుట.

**అభివర్ణనీయము** సం.—అభివర్ణ్యము.

**అభివర్ణించే** సం. స. క్రి. 1. వివరించు, తెలుపు.
వ. మధ్యమాధమోత్తమః వివిధ బుద్ధులను వ్యా ఖలు నభివర్ణించి...వరాహ. 1. 17.
క. అనఘా యతనములతెఱఁగు నభివర్ణింతున్. భార. శాం. 6. 67.
2. స్తుతించు.
క. ...అగ్రావ్యాకారు చేయి వెలఁగుచుండియా నిను నప్పుణ్యనాథు నభివర్ణింతున్. భా. శాం. 4. 257.

**అభివర్ణితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. పొగడఁ బడినది. 2. వివరింపఁబడినది.

**అభివర్ణ్యము** సం. విణ. (అ ఆ. అ.) 1. పొగడఁ దగినది. 2. వివరింపఁ దగినది.

**అభివర్తనము** సం. వి అ. న. 1. ఎదురుగా వచ్చుట. 2 ఎదిరించుట, మార్కొనుట.

**అభివర్తి** సం. విణ. (న్. ఈ. న్.) 1. మార్కొను వాఁడు. 2. ఎదురుగా వచ్చువాఁడు.

**అభివర్షణము** సం. వి. అ. న. 1. కురియుట. 2. తడుపుట.

**అభివర్షి** సం. విణ (న్. ఈ. న్.) 1. వర్షించునది. 2. తడుపునది.

**అభివర్షించే** సం. అ. క్రి. వానకురియు.
మ....ప్రావృడ్వారిదం బెల్లచో,నభివర్షించఁగ జాతకంబునకు నాల్గైదంబుబిందుల్ గదా, లభియించున్ ...మల్ల. నీతి. 90.
స. క్రి. కురియు.

**అభివాదకుఁడు** సం. విణ. (అ. దికా. అ.) మ్రొక్కు వాఁడు.

**అభివాదనము** సం. వి. అ. న. — అభివాదము.

**అభివాదనీయుఁడు** సం. — అభివాద్యుఁడు.

**అభివాదము** సం. వి. అ. పుం. తనగోత్రనామములు చెప్పి పాదములకు నమస్కరించుట.

**అభివాదయిత** సం. విణ. (ఋ. త్రీ. ఋ.)—అభివాది.

**అభివాది** సం. విణ. (న్. ఈ. న్.) నమస్కరించు వాఁడు.

**అభివాద్యుఁడు** సం. విణ. (అ ఆ. అ.) నమస్కరింపఁ దగినవాఁడు.

**అభివిఖ్యాతము** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి ప్రసిద్ధమైనది.

**అభివిధి** సం. వి. ఇ. పుం. అభివ్యాప్తి, అవధిగాఁ జెప్పబడిన విషయము ప్రధానవిషయములో నంతర్గత మగుట. (వ్యతి. మర్యాద–చూ.అ.)

**అభివినీతుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) 1. మంచి నడవడిగలవాఁడు. 2. శిక్షితుఁడు, బోధింపఁ బడినవాఁడు.

**అభివినుతించు** సం. స. క్రి. పొగడు.

క. ...సమస్తేశ్వరి యైనయోగనిద్రను, హరి బోధార్థముగ నిట్లు లభివినుతించెన్. మార్క. 6. 57.

**అభివిశ్రుతుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి ప్రసిద్ధుఁడు.

**అభివీక్షణము** సం. వి. అ. న. 1. చూచుట. 2. చూపు.

**అభివీక్షించు** సం. స. క్రి. చూచు.

వ....ఒక్క వణిక్కన్యక ననన్యసామాన్యరూపా భిశోభిత యవుదాని నభివీక్షించి తదాసక్త చిత్తుండై ...మార్క. 7. 205.

**అభివృద్ధి** సం. వి. ఇ. స్త్రీ. పెంపు, పెరుఁగుట.

**అభివృష్టము** సం. విణ. (అ. ఆ. అ.) 1. వర్షింపఁ బడినది. 2. తడుపఁబడినది.

శ్లో. స్థలీ నవాంభఃపృషతాభివృష్టా. సం.రఘు. 7. 69.

3. వర్షించినది.

**అభివేష్టించు** సం. స. క్రి. చుట్టుకొను.

వ. జరాసంధుండు సవ్యమండలభ్రమణంబుల నభివేష్టించిన ముష్టికాంతకుండవ్వీరవు గడి యింపక దక్షిణభ్రమణమండలంబులఁ జుట్టు కొని తిరుగ నిరువురుం కైదువులు నొండొంటిఁ దాఁకి...హరి. ఉ. 2. 61.

**అభివ్యంజనము** సం. వి. అ. న. ప్రకటించుట.

**అభివ్యక్తము** సం. విణ. (అ. ఆ. అ.) స్పష్టము, తెల్లము.

**అభివ్యక్తి** సం. వి. ఇ. స్త్రీ. 1. బయలుపడుట; స్ఫుట మగుట. 2. ప్రతిబింబము.

శా. (శ్రీభూపుత్రి) వివాహవేళ నిజమంజీరాగ్ర రత్నస్వలీ, లాభివ్యక్తి వరాంఘ్రిరేణుభవ కన్యాలీల యం చున్మదిఁగ, దా భావింప... వసు. 1. 1.

**అభివ్యాపకము** సం. విణ. (అ. విశా. అ.) 1. అంత టను వ్యాపించునది. 2. (వ్యాక) ఆధార భేదము (ఔపశ్లేషికము వైషయికము అభి వ్యాపకము అని ఆధారములు మూఁడు.)

**అభివ్యాపి** సం విణ. (న్. నీ. న్.) అంతటను వ్యాపించునది.

**అభివ్యాపించు** సం. స. క్రి. వ్యాపించు; ఆక్ర మించు.

వ....బ్రహ్మాండం బంతయు నద్దేవి తాన యభి వ్యాపించియుండు. మార్క. 6. 247.

వ. ఇంద్రానుజుండవై త్రివిక్రమంబులఁ ద్రిజ గంబుల నభివ్యాపించిన విశ్వరూపధరుం డవు... భాగ. అం. 1. 127. (శ్లో. శిశు ర్భూత్వా దివం ఖం చ పృథివీం చ పరంతప, త్రివిక్రమశ్చైః కృష్ణ క్రాంతవానసి. సం. భాగ. అం. 12. 27.)

**అభివ్యాప్తి** సం. వి. ఇ. స్త్రీ. అంతటను వ్యాపిం చుట.

**అభివ్యాప్యము** సం. విణ. (అ. ఆ. అ.) అంతటను వ్యాపింపఁదగినది.

**అభివ్యాహరణము** సం. వి. అ. న. 1. చెప్పుట. 2. ఉచ్చరించుట. 3. మాట.

**అభివ్యాహారము** సం—అభివ్యాహరణము.

**అభివ్యాహారి** సం. విణ. (న్. నీ. న్.) 1. చెప్పునది. 2. ఉచ్చరించునది.

**అభిశంక** సం. వి. ఆ. స్త్రీ. 1. సంశయము. 2. భ్రమము. 3. భయము.

**అభిశంకితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. సంది గ్ధము. 2. భ్రాంతము. 3. భయపడినది.

**అభిశంసకుఁడు** సం. విణ. (అ. విశా. అ.) 1. దూషించువాఁడు. 2. నేరము మోపువాఁడు.

**అభిశంసనము** సం. వి. అ. న. 1. దూషించుట. 2, నేరము మోపుట.

**అభిశంసి** సం. విశ. (న్. సీ. న్.) అభిశంసకుఁడు.

**అభిశపనము** సం. వి. అ. న—అభిశాపము.

**అభిశస్తము** సం. వి. అ. న—అభిశస్తి.

**అభిస్తిశ** సం. వి. ఇ. స్త్రీ. 1. దూఱుట, అపవాదము. 2. యాచన.

**అభిశస్తుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) 1. లేనినింద మోపఁబడినవాఁడు. 2. పీడింపఁబడినవాఁడు.

**అభిశాపము** సం. వి. అ. పుం. 1. శాపము, తిట్టు. 2. లేనినేరము మోపుట.

**అభిశీతము** సం. విశ. (అ. ఆ. అ.) శీతస్పర్శము. గలది. చల్లనిది.

**అభిశీనము** సం. విశ. (అ. ఆ. అ.) పేనది, గడ్డకట్టినది.

**అభిశోకము** సం. వి. అ. పుం. మిక్కుటమైన దుఃఖము.

**అభిశోచనము** సం. విశ. (అ. ఆ. అ.) దుఃఖముఁ జేయునది. వి. అ. న. మిక్కుటమైనశోకము.

**అభిశోచము** సం. విశ. (అ. ఆ. అ.) మిక్కిలి దుఃఖము కలిగించునది.

**అభిశ్యానము** సం—అభిశీనము.

**అభిశ్రవణము** సం. వి. అ. న. శ్రాద్ధభోక్తలు భుజించునప్పుడు చేయువేదమంత్రపఠనము.

**అభిషంగము** సం. వి. అ. పుం. 1. ఆసక్తి. 2. పరాభవము, అవమానము. 3, తిట్టు. 4. శపథము, ఒట్టు. 5. దుఃఖము. 6. భూతాద్యావేశము. 7. లేనినింద మోపుట. 8. సంపర్కము.

**అభిషంజనము** సం. వి. అ. న—అభిషంగము.

**అభిషవణము** సం. వి. అ. న—అభిషవము.

**అభిషవణి** సం. వి. ఈ. స్త్రీ సోమరసము తీయుటకుపయోగించుసాధనము.

**అభిషవము** సం. వి. అ. పుం. 1. (సోమరసము మొదలగునవి) పిండుట. 2. సారాయి మొదలగు వానిని చేయుట. 3, యజ్ఞాంగస్నానము. 4. స్నానము. 5. సోమరసము త్రాగుట. 6. యజ్ఞము.

న. 1. కల్లుతేట. 2. పులికడుగు.

**అభిషావకుఁడు** సం. వి. అ. పుం. సోమరసము తీయుఋత్విక్కు.

**అభిషిక్తుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) 1. తడుపఁబడినవాఁడు. 2. స్నానము చేయింపఁబడినవాఁడు. 3. స్నానము చేసినవాఁడు. 4. పట్టాభిషేకము చేయఁబడినవాఁడు.

**అభిషుతము** సం. విశ. (అ. ఆ. అ.) పిండఁబడినది. నిష్పీడితము, (సోమాది) వి. అ. న. పులికడుగు.

**అభిషేకము** సం. వి. అ. పుం. 1. తడుపుట. 2. స్నానము చేయించుట. (ఉదా: రుద్రాభిషేకము, క్షీరాభిషేకము) 3. పట్టాభిషేకము, రాజులకు పట్టము గట్టునపుడు చేయించుస్నానము. 4. స్నానము, 5. స్నానార్థమగుజలము.

**అభిషేకించు** సం. స. క్రి. 1. స్నానము చేయించు.

క. పిన్నిటిగంధజలంబున, నన్నయతల్లఁ బ్రధానుఁ డభిషేకింపన్, కన్నపిపిక్కిలిసీరను, గన్నయరోచకము వాయఁ గళంకరుకున్. భీమ. పీఠ. 52.

2. పట్టాభిషిక్తునిచేయు.

ప. నాగేంద్రత్వమునకు వాసుకి నభిషేకించిరి. భాగ. కల్య. 2. 159.

**అభిషేక్త** సం. విశ. (ఋ. త్రీ. ఋ.) అభిషేకము చేయువాఁడు.

**అభిషేచనము** సం. వి. అ. న.—అభిషేకము.

**అభిషేచనీయుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) 1. అభిషేకమునకుఁ దగినవాఁడు. 2. పట్టాభిషేకమునకుఁ దగినవాఁడు.

**అభిషేచ్యుఁడు** సం. — అభిషేచనీయుఁడు.

**అభిషేణనము** సం వి. అ. న. యుద్ధార్థము శత్రువునకెదురుగా సేనతోఁ బోవుట.

**అభిష్టవము** సం. వి. అ. పుం. స్తోత్రము.

**అభిష్టుతము** సం. విశ. (అ. ఆ. అ.) స్తుతింపఁబడినది.

**అభిష్యందనగరము** సం. వి. అ. న. శాఖానగరము, పేఁట.

**అభిష్యం(స్యం)ది** సం. విశ. (న్. నీ. న్. మా. అభిస్యందము.) కాఱునది, స్రవించునది.

**అభిష్వంగము** సం. వి. అ. పుం. 1. అభిరుచి, ఆసక్తి. 2. ఆత్మభిన్న మగు దేహాదులయందుఁ గలిగెడియహంబుద్ధి. 3. మిక్కిలికలయిక.

**అభిసంచారి** సం. విణ. (న్. ఈ. న్.) 1. త్రిమ్మరువాఁడు. 2. చంచలుఁడు.

**అభిసంతాపము** సం. వి. అ. పుం. 1. అభిశాపము తిట్టుట. 2. మిక్కుటమగుబాధ. 3. యుద్ధము.

**అభిసంధ** సం. వి. ఆ. స్త్రీ.—అభిసంధి.

**అభిసంధకుఁడు** సం. విణ. (అ. ధికా అ.) - అభిసంధుఁడు.

**అభిసంధానము** సం. వి. అ. న—అభిసంధి.

**అభిసంధాయము** సం. వి. అ. పుం. అభిసంధి.

**అభిసంధి** సం. వి. ఇ. పుం. 1. ప్రతిజ్ఞ. 2. ఉద్దేశము; అభిప్రాయము. 3. ఒడంబడిక, సంధి. 4. వంచనము. 5. కూడిక.

**అభిసంధుఁడు** సం. విణ. (అ. అ. అ.) 1. పరగుణములను స్వైరముగ ఆక్షేపించువాఁడు, నిందించువాఁడు 2. వంచకుఁడు, మోసగాఁడు.

**అభిసంపన్నము** సం. విణ. (అ. ఆ అ.) సంసిద్ధము, పూర్తిగా నెఱవేఱినది.

**అభిసంపాతము** సం. వి. అ. పుం. 1. పడుట. 2. ఒకనది మఱియొకనదిలోఁ బడుట, నదుల కలయిక. 3. యుద్ధము.

**అభిసంశ్రయము** సం. వి. అ. పుం. ఆశ్రయము, ప్రాపు.

**అభిసంహితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఉద్దేశింపఁబడినది. 2. కూర్పఁబడినది.

**అభిసరణము** సం. వి. అ. న. నాయకుఁడు నాయికకొఱకుఁ గాని నాయిక నాయకునికొఱకుఁ గాని సంకేతస్థానమునకుఁ బోవుట.

**అభిసరించు** సం. న. క్రి. (నాయిక నాయకునిగాని నాయకుఁడు నాయికనుగాని సంకేతస్థలమునఁ గూడుటకై) అనుగమించు, వెంబడించు.

గీ. రేయి నిజనాథుఁ నభిసరించిపోయి, తెల్లవాఱఁగ మఱల నేతెంచి రేఁగఁ, బఱచుఁ జీఁకటు లెంతంతఁ దలఁగిపోవఁ, దెల్లమిగఁ గానఁగానయ్యె నెల్లటకలు. కవిక. 4.182.
(ఇట 'పోయి' అనునది ఘటకక్రియ.)

**అభిసరుఁడు** సం. వి. అ. పుం. 1. అనుచరుఁడు, సేవకుఁడు. 2. సహాయుఁడు, సహచరుఁడు.

**అభిసర్గము** సం. వి. అ. పుం. సృష్టి.

**అభిసర్జనము** సం. వి. అ. న. 1. దానము. 2. చంపుట.

**అభిసర్తృ** సం. విణ. (ఋ. త్రీ. ఋ.)—అభిసారి.

**అభిసాంత్వనము** సం. వి. అ. న. బతిమాలుట.

**అభిసాంత్వము** సం. వి. అ. పుం. బతిమాలుట.

**అభిసారణము** సం. వి. అ. న. నాయకుఁడు నాయికను గాని నాయిక నాయకుని గాని సంకేతస్థానమునకు రప్పించుకొనుట.

**అభిసారము** సం. వి. అ. పుం. 1. నాయకుఁడు నాయికను గాని నాయిక నాయకుని గాని ఉద్దేశించి సంకేతస్థానమునకుఁ బోవుట. 2. నాయికానాయకుల సంకేతస్థానము.

శ్లో॥ స్వగితముపై తి న కథమభిసారం, హరిరితి వదతి సఖీ మనువారం. గీతగో॥. 6. 5.

3. యుద్ధము. 4. ముట్టడి.

శ్లో॥ శ్వోభిసారః ఘోరః స్యాదితి. సం, రామా.

5. సాహాయ్యము. 6. శక్తి.

**అభిసారి** సం. విణ. (న్. ఈ. న్.) 1. అభిసరించువాఁడు. 2. అనుచరుఁడు. 3. ఎదురుగాఁ బోవువాఁడు. 4. ఎదుర్కొనువాఁడు.

**అభిసారిక** సం. వి. ఆ. స్త్రీ. 1. ప్రియుని గూర్చి సంకేతస్థానమునకుఁ బోవునాయిక. 2. ప్రియుని సంకేతస్థానమునకు రప్పించుకొను నాయిక.

**అభిసారిణి** సం. వి. ఈ. స్త్రీ—అభిసారిక.

**అభిసారుఁడు** సం. వి. అ. పుం. 1. అనుచరుఁడు. 2. సహచరుఁడు.

**అభిస్ఫురితము** సం. విణ. (అ. ఆ అ.) పూర్తిగా వికసించినది. (పువ్వు, మొ.)

**అభిస్యం(ష్యం)దము** సం. వి. అ. పుం. (అప్రాణివాచకము కర్తయగునపుడు రెండురూపములు నుండును. తక్కినపట్ల "అభిస్యందము" అను సకారయుక్తరూపము మాత్రమే యుండును.) 1. కాఱుట, స్రవించుట. 2. కన్నులనుండి నీరు మున్నగునవి కాఱురోగవిశేషము. 3. జాఱుట. 4 అతిరేకము, ఎక్కువగా నుండుట.

**అభిహతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. కొట్టఁబడినది. 2. (గణిత) గుణింపఁబడినది. 3. బాధింపఁబడినది. (ఉదా: శోకాభిహతము.)

**అభిహతి** సం. వి. ఇ. స్త్రీ. 1. దెబ్బ. 2. బాధించుట. 3. (గణిత) గుణించుట.

**అభిహరణము** సం. వి. అ. న. 1. దగ్గఱకు తీసికొని వచ్చుట. 2. దొంగిలించుట. 3. అరణము, వివాహకాలమున కన్యకకిచ్చు ద్రవ్యము.

**అభిహరము** సం. వి. అ. పుం. తీసికొనిపోవుట, దొంగిలించుట.

**అభిహర్త** సం. విణ. (ఋ. స్త్రీ. ఋ.) బలవంతముగా పట్టుకొని పోవువాఁడు

**అభిహవము** సం. వి. అ. పుం. 1. పిలుపు, 2. హోమము

**అభిహారము** సం. వి. అ. పుం 1. మార్గమున, పైఁబడుట. 2. దొంగిలించుట. 3. వ్యాపారము. 4. ఆయుత్తపడుట, సన్నాహము.

**అభిహాసము** సం. వి. అ. పుం పరిహాసము.

**అభిహితాన్వయవాదము** సం. వి. అ. పుం వాక్యమునందలి పదములు విడివిడి ప్రత్యేకార్థమును తెలిపినపిమ్మట పరస్పరాన్వయముచే వాక్యార్థమును దెలుపును—అను భాట్టులవాదము. (వ్యతి- అన్వితాభిధానవాదము.)

**అభిహితి** సం. వి. ఇ. స్త్రీ. చెప్పుట.

**అభిహూతి** సం. వి. ఇ. స్త్రీ. పిలుపు.

**అభీకుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఉత్సుకుఁడు. తమకపడువాఁడు. 2. కాముకుఁడు. 3. భయము లేనివాఁడు. 4. భయంకరుఁడు, క్రూరుఁడు. వి. అ. పుం. 1 ప్రియుఁడు, భర్త. 2. కవి 3. ఒడయఁడు, ప్రభువు.

**అభీక్ష్ణము** సం. విణ. (అ ఆ. అ) 1. మాటిమాటికి అగునది, సారెసారెకు సంభవించునది. 2. ఎడ తెగనిది, నిత్యము 3. అతిశయితము, అధికము. క్రి. విణ 1 మాటిమాటికి 2 ఎడతెగకుండ ఎప్పుడును. 3. మిక్కిలి

**అభీఘాతము** సం- అభిఘాతము

**అభీతి** సం. విణ. (ఇ.) భయము లేనివాఁడు. వి. ఇ. స్త్రీ. భయములేమి.

**అభీప్సితము** సం. విణ. (అ. ఆ. అ.) అభీష్టము, కోరఁబడినది. వి. అ. న. కోరిక.

**అభీప్సువు** సం. విణ. (ఉ.) కోరువాఁడు.

**అభీరపల్లి** సం. వి. ఇ. ఈ. స్త్రీ. గొల్లపల్లె.

**అభీరుఁడు** సం. వి. అ. పుం. ఆలకాపరి, గొల్ల.

**అభీరు(లు)కుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) అభీరువు, భయము లేనివాఁడు.

**అభీరుపత్త్రి** సం వి. ఈ. స్త్రీ. శతావరి, పిల్లపీచర (వృ. వి.)

**అభీరువు** సం. విణ. (ఉ.) భయము లేనివాఁడు. వి. ఉ స్త్రీ పిల్లపీచర, శతావరి (వృ. వి.) న. యుద్ధస్థానము.

**అభీషు(శు)వు** సం. వి. ఉ. పుం. 1. అశ్వాదుల జ్ఞుపు, పగ్గము, దాడు. 2. కిరణము. (తెలుఁగులో ఒకచోట 'అభిషువు' అని హ్రస్వపూర్వరూపము కలదు. కాని అది చింత్యము.)

మ. అగళద్భూరి తీక్ష్ణ భానుప్రభాభీషువాత్యాఘాత సంతప్త . . . . . . . ఉష్ణాగమమయ్యెఁ దొల్లి . . . . . . వై. వే. పంచ. 3. 68.

**అభీష్ట** సం వి. అ. స్త్రీ. 1. ప్రియురాలు. 2. తాంబూలపల్లి (వృ.వి.).

**అభీష్టము** సం. విణ. (అ. ఆ. అ.) 1. కోరఁబడినది. 2. ఇష్టమైనది. వి. అ. న. 1. ఇష్టవస్తువు. 2. కోరిక.

**అభుక్తమూలము** సం. వి. అ. న. (జ్యోతి) జ్యేష్ఠ కడపటి యొక గడియయును మూల మొదటి యొక గడియయును గలిసినకాలము. (జ్యేష్ఠ కడపటి రెండుగడియలును మూల మొదటి రెండు గడియలును గలిసిన కాలము అని కొందఱు.)

**అభుగ్నము** సం. విణ. (అ. ఆ. అ.) 1. వంకరకానిది, సక్రమమైనది. 2. ఆరోగ్యము గలది.

**అభూతతద్భావము** సం. వి. అ. పుం. ఒకపదార్థము ఇంతకు లేనిరూపమును పొందుట. (పుత్త్రీకృతము-పుత్త్రుఁడుకానిదిపుత్త్రుఁడుగాఁజేయఁబడినది. మొదట లేనిపుత్త్రత్వము పిమ్మట వచ్చినది. కనుక ఇట అభూతతద్భావము కలదు.)

**అభూతపూర్వము** నం. విణ. (అ. ఆ. అ.) ఈవఱకు లేనిది, అపురూపము.

**అభూతము** నం. విణ. (అ. ఆ. అ.) 1. గతింపనిది. 2. లేనిది. 3. కల్లయైనది.

**అభూతాహరణము** నం. వి. అ. న. ప్రస్తుతమునకు ఉపయోగపడునట్లు నెపముపెట్టి చెప్పుమాట (ఇది నాటకమున గర్భసంధ్యంగములలో నొకటి-ధర్మరాజు ఏనుఁగుచావు నెపముగాఁ గొని అశ్వత్థామ చచ్చెనని ద్రోణునితో జెప్పిన మాట యిట్టిది.)

**అభూతి** నం. వి. అ. స్త్రీ. 1. అభావము. 2. దారిద్ర్యము.

**అభూమము** నం. విణ. (న్. న్, మ్మి, అ. న్.) అధికము కానిది, స్వల్పము

**అభూమి** నం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. అనాశ్రయము, అవిషయము (అభూదభూమిః ప్రతిపక్ష జన్మనాం, ధియాం... శిశు. 1 42.) 2. అప్రశస్త భూమి 3. భూమి కానిపదార్థము.

**అభేదము** నం. విణ (అ ఆ. అ.) భేదము లేనిది వి. అ. పుం. ఏకీభావము, భేదములేమి.

**అభేద్యము** నం. విణ. (అ. ఆ. అ.) భేదింపశక్యము గానిది. వి. అ. న. వజ్రము.

**అభోజనము** నం. వి. అ. న. పస్తు, ఉపవాసము.

**అభౌతికము** నం. విణ. (అ. ఈ. అ.) స్థూలభూతములచేఁ గలుగనిది.

**అభ్యంగము** నం. వి. అ. పుం. తలంటు; ఒడలికి నూనె మొదలగునవి రాచుట.

**అభ్యంజనము** నం. వి అ న. 1 అభ్యంగము, తలంటు. 2. చమురు. 3. కంటికి కాటుక పెట్టుట. 4. కాటుక.

**అభ్యంజనీయము** నం. విణ. (అ. ఆ. అ.) 1. అలఁదుటకుఁ దగినది (చందనాదికము) 2. రాచుటకుఁ దగినది. (తైలఘృతాదికము)

**అభ్యంతరము** నం. విణ. (అ. ఆ. అ.) 1, లోపలిది. (వ్యతి: బాహ్యము) 2. అభిజ్ఞము, తెలిసినది. 'భర్తుః సంగీతేఽభ్యంతరేస్వః' మాళవి. 5. 140; 3. అంతరంగికము, దగ్గఱ సంబంధము గలది. వి. అ. న. 1. రెంటినడిమిచోటు. 2. నడిమికాలము. 3. అంతఃకరణము. 4. అడ్డు, ఆటంకము.
(ఈయర్థమున తెనుఁగులోనే వాడుక.)

**అభ్యంతరారాముఁడు** నం. విణ. (అ. ఆ. అ.) ఆత్మారాముఁడు, యోగి.

**అభ్యంతరీకరణము** నం. వి. అ. న. 1. నడుమనుండువట్లు చేయుట. 2. విద్యాదులందుఁ ప్రవేశపెట్టుట. 3. దగ్గఱసంబంధిగాఁ జేయుట.

**అభ్యక్తము** నం. విణ. (అ. ఆ. అ.) 1. తైలాదులచే) అంటఁబడినది, అభ్యంజనము చేయఁబడినది. 2. (చందనాదులచే) పూయఁబడినది.

**అభ్యగ్రము** నం. విణ. (అ. ఆ. అ.) 1. దగ్గఱది. 2. క్రొత్తది, నూత్నము. వి. అ. న. 1. సమీపదేశము. 2. సమీపకాలము,

**అభ్యధికము** నం. విణ. (అ. ఆ. అ.) 1. ఎక్కువయైనది, హెచ్చు. 2. మిక్కిలి మేలైనది.

**అభ్యనుజ్ఞ** నం. వి. ఆ. స్త్రీ. 1. అనుమతి, అంగీకారము. 2. ఆజ్ఞ, ఉత్తరువు

**అభ్యనుజ్ఞాతము** నం. విణ. (అ. ఆ. అ.) 1. అంగీకరింపఁబడినది, అనుమతింపఁబడినది. 2. ఆజ్ఞాపింపఁబడినది, నియోగింపఁబడినది.

**అభ్యనుజ్ఞానము** నం. వి. అ. న. 1. అనుమతి, అంగీకారము. 2. ఆజ్ఞ, నియోగము. ('భరద్వాజాభ్యనుజ్ఞానాచ్చిత్రకూటస్య దర్శనం' సం. రామా.)

**అభ్యమనము** నం. వి. అ. న. 1. రోగము. 2. అపథ్యసేవనము.

**అభ్యమితుఁడు** నం. విణ. (అ. ఆ. అ.) 1. రోగి, తెవులుగొంటు. 2. బాధితుఁడు, పీడింపఁ బడినవాఁడు.

**అభ్యమిత్రము** నం. క్రి. విణ. అ. న. శత్రువునకెదురుగా, శత్రువునకు అభిముఖముగా.

**అభ్యమిత్రీణుఁడు** నం. విణ. (అ. ఆ. అ.) శత్రువును శౌర్యముతో మార్కొనువాఁడు.

**అభ్యమిత్రీయుఁడు** నం.—అభ్యమిత్రీణుఁడు.

**అభ్యమిత్ర్యుఁడు** నం.—అభ్యమిత్రీణుఁడు.

**అభ్యర్చ** సం. వి. ఆ. స్త్రీ. - అభ్యర్చనము.

**అభ్యర్చన** సం. వి. ఆ. స్త్రీ. - అభ్యర్చనము.

**అభ్యర్చనము** సం. వి. అ. న. పూజించుట; పూజ.

**అభ్యర్చించు** సం. స. క్రి. పూజించు.

వ. ...మార్తాండుఁడు రోషంబున మండుచు మామయింటికిం జనిన సతండు నతని నభ్యర్చించి సాంత్వనవచనంబులననునయించి యిట్లనియె. మార్క. 7. 11

**అభ్యర్చితుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) పూజింపఁబడినవాఁడు

**అభ్యర్చ్యుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) పూజింపఁదగినవాఁడు.

**అభ్యర్ణము** సం. విశే. (అ. ఆ. అ.)—దేశకాలము లందు—సమీపమున నున్నది. వి. అ. న. 1. సమీపదేశము. 2. సమీపకాలము.

**అభ్యర్థన** సం. వి. ఆ. స్త్రీ. ప్రార్థనము.

**అభ్యర్థనము** సం. వి. అ. న. ప్రార్థనము.

**అభ్యర్థనీయుఁడు** సం. - అభ్యర్థ్యుఁడు.

**అభ్యర్థి** సం. విశే. (న్. నీ. న్.) యాచించువాఁడు; కోరువాఁడు.

**అభ్యర్థించు** సం. స. క్రి. యాచించు, మార్క. 4. 154.

**అభ్యర్థితుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) యాచింపఁబడినవాఁడు; కోరఁబడినవాఁడు.

**అభ్యర్థ్యుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) యాచింపఁదగినవాఁడు; కోరఁదగినవాఁడు.

**అభ్యర్దనము** సం. వి. అ. న. మిక్కిలి నొప్పించుట, బాధపెట్టుట.

**అభ్యర్దితుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) మిక్కిలి బాధింపఁబడినవాఁడు.

**అభ్యర్హణ** సం. వి. ఆ. స్త్రీ. పూజ, సమ్మానము.

**అభ్యర్హణము** సం. వి. అ. న. — అభ్యర్హణ.

**అభ్యర్హణీయుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) పూజింపఁదగినవాఁడు.

**అభ్యర్హితుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) 1. పూజితుఁడు. 2. అర్హుఁడు, తగినవాఁడు.

**అభ్యవకర్షణము** సం. వి. అ. న. నాటిన ముల్లు శల్యములోనగువానినూడఁదీయుట, నిర్హారము. (పైకునకు విఘాతకారమైన గాదము మొదలయిన వానిఁ దీయుట, కలుపు దీయుట—అని కొందఱు.)

**అభ్యవస్కందనము** సం. వి. అ. న. — అభ్యవస్కందము.

**అభ్యవస్కందము** సం. వి. అ. పుం. శత్రువులను ముట్టడించుట. (ప్రవర్గాదులచే శత్రువులను బలహీనులనుగాఁ జేయుట—అని అమరసుధ.)

**అభ్యవహరణము** సం. వి. అ. న. తినుట, భోజనము.

**అభ్యవహారము** సం. వి. అ. పుం. 1. భుజించుట 2. భోజనపదార్థము

**అభ్యవహరించు** సం. స. క్రి. భక్షించు, తిను.

వ ... శ్వేతమృత్యుమభ్యవహరించెఁ గపాలి ... నైష. 6. 99.

**అభ్యవహార్యము** సం. విశే. (అ. ఆ. అ.) తినఁదగినది. వి. అ. న. ఆహారము.

**అభ్యవహృతము** సం. విశే. (అ. ఆ. అ.) తినఁబడినది.

**అభ్యసనము** సం. వి. అ. న. అభ్యసించుట.

**అభ్యసనీయము** సం. విశే. (అ. ఆ. అ.) అభ్యసింపఁదగినది, నేర్చుకొనఁ దగినది.

**అభ్యసించు** సం. స. క్రి. 1. నేర్చు, కఱచు; అలవాటు చేసికొను.

సీ. కోరి భిక్షాశియై గురుప్రీతి బ్రహ్మచర్యముఁ దాల్చి వేదంబు లభ్యసింపు. మార్క. 2. 93.

గీ. అందియలు మోయంబున నరుగుదెంచి, ప్రోడ రాయంచ సయమునఁ బోవు నవ్విధంబు దగనభ్యసించు చందమునఁ దోఁప, చనఁగ నుత్తమ స్త్రీసశాలకరిగె. భార. విరా. 4. 26.

**అభ్యసూయ** సం. వి. ఆ. స్త్రీ. గుణములయందుఁ గూడ దోషారోపణముచేయుట, అసహనము.

**అభ్యసూయకుఁడు** సం. విశే. (అ. యికా. అ.) అసూయ గలవాఁడు, మంచిగుణములందుఁ గూడ దోష మారోపించువాఁడు.

**అభ్యస్తము** సం. విణ. (అ. ఆ. అ.) అభ్యసింపఁబడినది.

**అభ్యాంతుఁడు** సం. – అభ్యమితుఁడు.

**అభ్యాకర్షము** సం. వి. అ. పుం. మల్లులు పోరాటమున దండకొట్టుకొనుట. మల్ల చఱచుట.

**అభ్యాకాంక్షితము** సం. విణ. (అ. ఆ అ.) కోరఁబడినది. వి. అ. న. 1. అసత్యపువ్యాఖ్యము, మిథ్యాభియోగము. 2. కోరిక.

**అభ్యాఖ్యాతుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) లేనితప్పు మోపఁబడినవాఁడు.

**అభ్యాఖ్యానము** సం.వి. అ. న. మిథ్యాభియోగము, అసత్యపువ్యాఖ్యము.

**అభ్యాగతుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) వచ్చినవాఁడు. వి. అ. పుం. తిథి పర్వము ఉత్సవము మొదలగు సందర్భములందు ద్రవ్యాపేక్షతో వచ్చినవాఁడు. (చూ. అతిథి.)

క. జనవరుఁడు పురాణములం, దనఘా యభ్యాగతస్స్వయం విష్ణువు నా,విగఁబడు... జై. భా. 7. 208.

(కాని, కవులు 'అతిథి, అభ్యాగతుఁడు' అను రెండుపదములను అభేదముగా వాడినారు.)

క. ఈ విధమున నభ్యాగత, సేవాపరతంత్ర సరల జీవనుఁడై భూ,దేవ కుమారకుఁడుండం,గా ... మనుచ. 1. 58. (చూ. 1-57 పద్యము.)

**అభ్యాగమనము** సం. వి. అ. న. 1. ఎదురుగా వచ్చుట. 2. వచ్చుట.

**అభ్యాగమము** సం. వి. అ. పుం. 1. వచ్చుట. 2. ఎదురుగా వచ్చుట. 3. సామీప్యము. 4. ఎదుర్కొనుట, మార్కొనుట. 5. పగ, విరోధము. 6. యుద్ధము. 7. చంపుట.

**అభ్యాగారికుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) కుటుంబభరణమునకై పాటుపడువాఁడు.

**అభ్యాఘాతము** సం. వి. అ. పుం. 1. కొట్టుట. 2. చంపుట.

**అభ్యాఘాతి** సం. విణ. (న్. ఈ. న్.) కొట్టువాఁడు, హింసాశీలుఁడు.

**అభ్యాత్తము** సం. విణ. (అ. ఆ. అ.) గ్రహింపఁబడినది, పొందఁబడినది.

**అభ్యాదానము** సం. వి. అ. న. 1. పుచ్చుకొనుట, 2. ప్రారంభము.

**అభ్యామర్దనము** సం. వి. అ. న.—అభ్యామర్దము.

**అభ్యామర్దము** సం. వి. అ. పుం. యుద్ధము.

**అభ్యావృత్తి** సం. – ఆవృత్తి.

**అభ్యాశము** సం. విణ. (అ. ఆ. అ.) సమీపమున నున్నది. వి. అ. పుం. 1. సమీపదేశము. 2. సమీపకాలము.

**అభ్యాసము** సం. విణ. (అ. ఆ. అ.) అభ్యాశము, దాపైనది. వి. అ. పుం. 1. ఆవృత్తి. (మరల మరల చెప్పుట చేయుట, మొ.) 2. అలవాటు, వాడుక. 3. సాధన. (ఉదా: యోగాభ్యాసము, శస్త్రాభ్యాసము, మొ.) 4 = అభ్యాశము. 5. (వ్యాక) ద్విరుక్తమగు ధాతువుయొక్క మొదటి భాగము. 6. (గణిత) గుణించుట.

**అభ్యాసాదనము** సం. వి. అ. న. 1. శస్త్రాదులచే శత్రువును నిర్బలునిగాఁ జేయుట. 2. శత్రువును మార్కొనుట. 3. ముట్టడి.

**అభ్యాసి** సం. విణ. (న్. ఈ. న్.) అభ్యసించువాఁడు; అభ్యాసముగలవాఁడు.

**అభ్యాసించే** సం. వ. క్రి. – అభ్యసించే.

సీ. బహు దేశభాష లభ్యాసింప వాంఛించు శల్యతంత్రముమీఁదఁ జాఁపు మనసు. శివరా. 3. 111.

**అభ్యాహతము** సం. విణ (అ ఆ. అ.) 1. కొట్టఁబడినది. 2. అడ్డగింపఁబడినది. 3. పీడింపఁబడినది.

శ్లో. అభ్యాహతం కీర్తివిపర్యయేణ. (హృదయం) సం. రఘు. 14. 33.

**అభ్యాహననము** సం. వి. అ. న. 1. కొట్టుట. 2. అడ్డగింత.

**అభ్యాహారము** సం. వి. అ. పుం. 1. సమక్షమునకుఁ దీసికొని వచ్చుట. 2. దొంగిలించుట.

**అభ్యాహార్యము** సం. విణ. (అ. ఆ. అ.) 1. దొంగిలింపఁ దగినది. 2. తీసికొని రాఁదగినది.

**అభ్యుక్షణము** సం. వి. అ. న. 1. అధోముఖమైన హస్తముతో జలాదులను చల్లుట.

శ్లో: ఉత్తానేనైవ హస్తేన ప్రోక్షణం పరికీర్తితం, న్యంచతాభ్యుక్షణం ప్రోక్తం తిరశ్చావోక్షణం స్మృతం.

2. తడుపుట, సేచనము సం. రఘు. 16. 57.

**అభ్యుక్షితము** సం. విణ. (అ. ఆ. అ.) అభ్యుక్షణము చేయఁబడినది. (యజ్ఞపాత్రాది.)

**అభ్యుచ్చయము** సం. వి. అ. పుం. పెంపు, వృద్ధి.

**అభ్యుచ్ఛ్రయము** సం. వి. అ. పుం. 1. ఉన్నతి. 2. అభివృద్ధి.

**అభ్యుచ్ఛ్రితము** సం. విణ. (అ.ఆ.అ.) 1 ఉన్నతము, ఎత్తైనది. 2. అభివృద్ధి నొందినది.

**అభ్యుత్థానము** సం. వి. అ. న. 1. లేచుట. 2. ఆస నముచేఁ గాని గౌరవముచేఁ గాని లేచుట. 3. ప్రత్యుద్గమనము, గౌరవముచే లేచియెదురు వచ్చుట. 4. పూనిక, ఉద్యమము 5. పుట్టుట. 6. బయలుదేఱుట. 7. పెరుగుట, అభివృద్ధి నొందుట. 8. గౌరవము. (వై. వి.)

**అభ్యుత్థాయి** సం. విణ. (న్. సీ. న్.) అభ్యుత్థానము చేయువాఁడు.

**అభ్యుత్థితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. లేచినది. 2. లేచి ఎదురుగా వచ్చినది. 3. పెంపొందినది, ఉన్నతస్థితికి వచ్చినది.

**అభ్యుత్పతనము** సం. వి. అ. న. మీఁదికిదుముకుట, పైఁబడుట.

**అభ్యుదయము** సం. వి. అ. పుం. 1. (సూర్యాదుల) ఉదయము. 2. సంభవము, కలుగుట. 3. శుభము, మంగళము. 4. వృద్ధి. 5. అభీష్టకార్యముల సిద్ధి, ఇష్టప్రాప్తి. 6. ఉత్సవము.

**అభ్యుదయి** సం. విణ. (న్. సీ. న్.) 1. ఉదయించునది. 2. అభ్యుదయము కలది.

**అభ్యుదయించు** సం. అ. క్రి. ఉదయించు, కలుగు, పుట్టు. స. క్రి. (అభ్యుదయ మొనరుట్లు చేయు)ఉదయింపఁజేయు, కలిగించు, పుట్టించు.

సీ. అధరారుణద్యుతి నభ్యుదయింపవే పాలఁతి నీయాననాంభోజ మలర, దరహాసచంద్రి కాస్ఫూర్తిఁ బూరింపవే రమణి నీనయనోత్పలములు వొలయ. కు. సం 5. 614.

**అభ్యుదితుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఉదయించినవాఁడు. 2. అభివృద్ధినొందినవాఁడు. 3. సూర్యుఁ డుదయించెడువేళ నిద్రించువాఁడు.

**అభ్యుద్గతి** సం. వి. ఇ. స్త్రీ—అభ్యుద్గమము

**అభ్యుద్గతుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) 1. గౌరవముచే లేచి యెదురువచ్చినవాఁడు. 2. ఉన్నతస్థితికి వచ్చినవాఁడు.

**అభ్యుద్గమనము** సం. వి. అ. న—అభ్యుద్గమము.

**అభ్యుద్గమము** సం. వి. అ. పుం. 1. అభ్యుత్థానము, గౌరవార్థముచే లేచి యెదురువచ్చుట. 2. పుట్టుట, కలుగుట.

**అభ్యుద్ధరించు** సం. స. క్రి. 1. పెల్లగించు. (శ. ర.) 2. పైకెత్తియు; ఉన్నతస్థితికిఁ దెచ్చు.

గీ. పుట్టలోపలిపాము నభ్యుద్ధరించు, వశ్యమంత్రము పాములవాఁడ పోలె, భర్తనభ్యుద్ధరించుఁ బాపంబువలన, నగ్నినుఱికినయట్టి పద్మాయతాక్షి. కాశీ. 3.87.

**అభ్యుద్ధృతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. పైకెత్తఁబడినది. 2. పైకిఁ దీయఁబడినది.

**అభ్యుద్యతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. పయికెత్తఁబడినది. 2. ఉద్యుక్తము, సిద్ధముగా నున్నది. 3. అయాచితముగా తేఁబడినది.

శ్లో. ఏధోదకంమూలఫలమన్న మభ్యుద్యతంచ యత్, సర్వతః ప్రతిగృహ్ణీయాన్మధ్వథాభయదక్షిణాం. మను. 4.247.

**అభ్యున్నతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఎత్తైనది. 2. గొప్పది.

**అభ్యున్నతి** సం. వి. ఇ. స్త్రీ. 1. మిక్కిలిపొడుగు. 2. అభివృద్ధి, ఉన్నతస్థితి.

**అభ్యుపగతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. స్వీకృతము, కైకొనఁబడినది. 2. అంగీకరింపఁబడినది. 3. సమీపించినది. 4. పొందఁబడినది.

**అభ్యుపగమము** సం. వి. అ. పుం. 1. సమీపించుట. 2. స్వీకారము, కైకొనుట. 4. అంగీకారము. 4. పొందుట.

**అభ్యుపగమించు** సం. స. క్రి. 1. అంగీకరించు, ఇయ్యకొను (శ.ర.) 2. అధిగమించు; పరిశీలించు.

సీ. కరవల్లిఁ జింతించుఁ గరము సంశోధించుఁ బ్రాణోపనిషదభిప్రాయ మరియుఁ, బరిపాటి ముండకోపనిషత్తుఁ దాపనీయోపనిషత్తు నభ్యుపగమించు. కాశీ. 2. 151.

**అభ్యుపపత్తి** సం. వి. ఇ. స్త్రీ. 1. అనుగ్రహము 2. సాంత్వనము, ఊఱడింపు. 3. రక్షణము. (మను. 8, 349.) 4. అంగీకారము.

**అభ్యుపపన్నము** సం. విశే. (అ. ఆ. అ.) అనుగ్రహింపఁబడినది.

**అభ్యుపస్థితము** సం. విశే. (అ. ఆ. అ.) 1. సంభవించినది. 2. పొందఁబడినది. 3. పొందినది, 4. సమీపమున నున్నది, చేరినది.

**అభ్యుపాయము** సం. వి. అ. పుం. 1. అంగీకారము, సమ్మతి. 2. ఉపాయము.

**అభ్యుషము** సం. వి. అ. పుం, పోళి, గుగ్గిళ్లు.

**అభ్యుషితుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) దగ్గఱనున్నవాఁడు.

**అభ్యుషీయము** సం — అభ్యుష్యము.

**అభ్యుష్యము** సం. విశే. (అ. ఆ. అ.) రొట్టెమున్నగువానికి పనికివచ్చునది. (పిండి, మొ.)

**అభ్యూఢము** సం. విశే. (అ. ఆ. అ.) 1. దగ్గఱకుఁ దీసికొని రాఁబడినది. 2, మోయఁబడినది.

**అభ్యూషము** సం — అభ్యుషము.

**అభ్యూష్యము** సం. - అభ్యుష్యము.

**అభ్యూహము** సం. వి. అ. పుం. తర్కము, ఊహ.

**అభ్యోషము** సం - అభ్యుషము.

**అభ్యోషీయము** సం — అభ్యుష్యము.

**అభ్యోష్యము** సం — అభ్యుష్యము.

**అభ్రంకషము** సం. విశే. (అ. ఆ. అ.) ఆకాశమునొరయునది, మిక్కిలి ఎత్తయినది.

**అభ్రంలిహము** సం. విశే. (అ. ఆ. అ.) ఆకాశమును స్పృశించునది, మిక్కిలి ఎత్తయినది.

**అభ్రకము** సం. వి. అ. పుం. న. గిరిజము, బేగడ. (ఇది వైద్యమున కుపయోగించుధాతువులలో నొకటి.)

**అభ్రపథము** సం. వి. అ. పుం. 1. ఆకాశము. 2. ఆకాశమార్గము.

**అభ్రపిశాచము** సం. వి. అ. పుం. రాహువు.

**అభ్రపుష్పము** సం. వి. అ. పుం. వేతసము, ప్రబ్బలి (వృ.వి.) న. 1. నీరు 2. ఆకాశపుష్పము. (ఇది అసంభవవిషయమును దెలుపును.)

**అభ్రమాంసి** సం. వి. ఈ. స్త్రీ. జటామాంసి (వృ.వి.)

**అభ్రమాతంగము** సం. వి. అ. పుం-ఆకాశమునందు సంచరించు ఏనుఁగు — ఐరావతము.

**అభ్రము** సం. వి. అ న. 1. మేఘము. 2 ఆకాశము. 3. అభ్రకము. 4. బంగారు. 5. హారతికర్పూరము. 6. తుంగముస్తె (వృ.వి.) 7. (గణిత) సున్న. 8. ఒకవిధమైనఱెల్లు (వృ.వి.)

**అభ్రమువల్లభము** సం. వి. అ. పుం. ఐరావతము.

**అభ్రమువు** సం. వి. ఉ. స్త్రీ. తూర్పుదిక్కునందుండెడి ఆఁడేనుగు. (ఇది ఐరావతమునకు భార్య.)

**అభ్రి** సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. ఓడలోని ప్రాఁకుడు గోఁకివేయుట కుపయోగించుకొయ్యగుద్దలి. 2. కుద్దాలము, గుద్దలి.

**అభ్రితము** సం విశే. (అ. ఆ. అ.) మబ్బుక్రమ్మినది, మబ్బుగలది.

**అభ్రియము** సం. విశే. (అ ఆ. అ.) మేఘమునందుఁ గలిగినది.

**అభ్రేషము** సం. వి. అ. పుం. ఉచితధర్మములనుండి తొలఁగకుండుట, న్యాయము, పాడి.

**అమ** — అమ్మ, (దీనికి ప్రాయికముగాఁ బ్రవృత్తియందే ప్రయోగములు కలవు.)

(స్త్రీ)

క.... ఈయమతోడ ... భాగ. విరా. 2. 100.

క ... ఏమెయోసమ, మల్లడిగొని పెనఁగెదవుడు మాతో ... రసిక. 5. 161.

(స్త్రీనామాంతములందుఁ జేర్పఁబడును.)

క. గౌరమ సుగుణాపాళి శా, గౌరమ...పళా. 1. 24.

(కొన్ని పురుషనామములం తుదను 'అయి'కు మాఱుగాఁ జేర్పఁబడును.)

ఉ. అనరసింగభూపతి ... కాంచె ... భానునిభ తేజునిఁ గృష్ణమరాజు నున్నతిన్ పళం. 1. 74.

**అమ** సం. వి. అ స్త్రీ. 1. అమావాస్య. 2. చంద్రుని పదియాఱవకళ.

**అమంగల(ళ)ము** సం. విణ. (అ. ఆ. అ.) మంగళము కానిది, అశుభమైనది. వి. అ. పుం. ఆము దపు చెట్టు. న. అశుభము, కీడు.

**అమంగల్య(ళ్య)ము** సం. విణ—అమంగళము.

**అమండము** సం. విణ. (అ. ఆ. అ.) మండము లేనిది. (చూ. మండము) వి. అ. పుం. ఆము దపుచెట్టు.

**అమంత్రకము** సం. విణ. (అ. త్రికా. అ.) — అమంత్రము.

**అమంత్రము** సం. విణ. (అ. ఆ. అ.) మంత్రము లేనిది.

**అమందము** సం. విణ. (అ. ఆ. అ.) మందము కానిది.

**అమడ** వి. (సం. యమళం. క. అమళ్.) జంట. అమడకాయ—జంటగా నున్న కాయ. అమడయమరు మొగ్గ. చంద్రా. 6. 128. అమడలు—కవలు.

గీ. సమ్యగభ్యస్తవిద్య విజ్ఞాన మింద్రియుజయ మును గాంచునటువలె నమడలైన, సుతుం లక్ష్మణశత్రుఘ్న శుభకరాఖ్యధానులనుగాంచె మగధభూధవకుమారి. రఘు. 6. 42.

**అమతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. సమ్మతము కానిది. 2. ఎఱుఁగఁబడనిది. వి. అ. పుం. 1. మృత్యువు. 2. కాలము. 3. రోగము. 4. రేణువు.

**అమతి** సం. విణ. (ఇ) 1. దుష్టుఁడు. 2. జ్ఞాన హీనుఁడు, వి. అ. పుం. 1. కాలము. 2; చంద్రుఁడు. స్త్రీ. 1. అజ్ఞానము. తెలియమి. 2. చెడ్డబుద్ధి. 3. మరణము.

**అమతిపూర్వము** సం. విణ. (అ. ఆ. అ.) బుద్ధి పూర్వకము గానిది, ఉద్దేశపూర్వకము గానిది.

**అమత్రము** సం. వి. అ న. పాత్రము భాజనము.

**అమదు**—అముదుపడి.

ఆ. అచ్చనకు మేలియమదునకును, దేవ భోగముగను దేవరకాచు (ద్రతాంరకముగఁ జెఱుపునూరునిచ్చె. చెన్నుపల్లి శాసనము. 1078.

**అమనస్కయోగము** సం. వి. అ. పుం. బ్రహ్మ ధ్యానముచే మనస్సు లయింపఁ జేయు యోగ భేదము.

**అమనస్కుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) 1. కార్యమునకుఁ జాలినట్టిమనస్సు (వివేకాదికము) లేనివాఁడు. (బాలుఁడు, మొ.) 2. అన్య మనస్కుఁడు, మఱియొక విషయమునందు మనస్సుగలవాఁడు. 3. స్నేహశూన్యుఁడు. 4. మనోవ్యాపారశూన్యుఁడు. (యోగి) 5. మనస్సు లేనివాఁడు. (పరమాత్మ.)

**అమని** సం. వి. ఇ. స్త్రీ. 1. మార్గము. 2. గమనము. 3. పశువంశుణము, పశువుయొక్కగజ్జ (వై. ని.) 4. దారుజలపాత్రము, కొయ్యతోఁ జేసిన జలపాత్రము. (వై. ని.)

**అమనుష్యము** సం. విణ. (అ. ఆ. అ.) మనుష్యులు లేనిది (స్థానము.)

**అమనుష్యుఁడు** సం. వి. అ. పుం. 1. జాతిమాత్ర మనుష్యుఁడు. (జాతిచే మనుష్యుఁడైనను మనుష్య ధర్మములు లేనివాఁడు.) 2. మను ష్యుఁడు కానివాఁడు. (రక్షఃపిశాచాది.)

**అమముఁడు** సం. విణ. (అ. ఆ. అ.) నిర్మముఁడు, మమకారము లేనివాఁడు.

**అమయు** అ. క్రి. ఉపయుక్తమగు.

వ. ...రథులకుతూహలంబునకు యోగ్యంబు లగు యుగ్యంబు లమరి సమరసమయంబున కమయం దగుకణయ...ఖండవాల ప్రముఖ ప్రహరణంబులు నిండ...ఉ. హరి. 4. 218.

**అమర** సం. వి. అ. స్త్రీ. 1. అమరావతి. (ఇంద్రుని నగరము.) 2. నాభినాళము. 3. జరాయువు.

మావి. (గర్భస్థశిశువు దీనిచేఁగప్పఁబడి జఠరాగ్ని వలన అపాయము నొందకుండును.) 4. స్థూణ, ఇంటికంబము. 5. తిప్పతీఁగ. 6. వృశ్చికాళి, తేలుకొండి (వృ. వి.). 7. గలిక (వృ. వి.). 8. ఘృతకుమారి, ఒకజాతి కలబంద (వృ.వి.) 9. జెముడు (వృ.వి.) 10. మట్టి (వృ.వి.). (నఱకఁబడినను మఱలమఱల మొలచుచుఁ జావు నొందకుండుటచే వీనికిట్టి పేరు.)

**అమరకము** వి. (√అమరు — చూ. అమరము.) 1. అమరుట. 2. అమర్చుట. 3. భూమిని అమర్చుట, ఏర్పఱచుకొనినసిస్తునకు భూమిని వ్యవసాయము చేయువాని కిచ్చుట.

**అమరకోశము** సం. వి. అ. పుం. అమరసింహుఁడు రచించిననిఘంటువు, నామలింగానుశాసనము.

**అమరగాఁడు** వి. (√అమరము. త. అమరక్కారన్.) అమరము ననుభవించి రాజసేవచేయుభటుఁడు; యుద్ధభటుఁడు.

సీ. అడ్డెలు విడివేల్పు లమరగాండ్రసురేంద్రు, కార్యకర్తలబందుగట్టికొనఁగ. కువల. 3.9.

**అమరగురువు(ఁడు)** సం. వి. ఉ. పుం. బృహస్పతి.

**అమరజము** సం. వి. అ. పుం. ఒకజాతి చండ్ర (వృ. వి.).

**అమరతటిని** సం. వి. ఈ. స్త్రీ. గంగ.

**అమరతరువు** సం. వి. ఉ. పుం. 1. దేవతావృక్షము. కల్పవృక్షము. (ఇది కోరికలనిచ్చునని ప్రసిద్ధి.) 2. దేవదారువృక్షము.

**అమరదారువు** సం. వి. ఉ. పుం. దేవదారువృక్షము.

**అమరద్విజుఁడు** సం. వి. అ. పుం. దేవలకుఁడు, పూజారి.

**అమరనాయఁకరము** వి. (√అమరము) అమరనాయఁకుని అధికారము. (శా.)

**అమరనాయఁకుఁడు** వి. (√అమరము) అమరపు గ్రామముల నేలుదొర. (శా.)

**అమరపురము** సం. వి. అ. న. స్వర్గము.

**అమరపుష్పము** సం. వి. అ. పుం. 1. కేతకి, మొగలి (వృ.వి.). 2. మామిడి (వృ. వి.). 3. కల్పవృక్షము. 4. ఱెల్లుగడ్డి.

**అమరపుష్పి** సం. వి. ఈ. స్త్రీ. అవాకుపుష్పి, సదాప (వృ.వి.).

**అమరప్రభువు(ఁడు)** సం. వి. ఉ. పుం. 1. ఇంద్రుఁడు. 2. విష్ణువు.

**అమరము** వి. (√అమరు. త. అమరం — చూ. అమరకము.) ఆవశ్యక మయినప్పుడు కొంత దండును తీసికొని రావలయు నను నిబంధనము మీఁద చిన్న రాజులకు ఈయఁబడుభూమి.

గీ. భటులు వెయ్యింటి కెన్న నిర్వదియు నాల్గు, వేలుగా లక్షయిర్వదివేల ప్రజకుఁ, జెల్లు నల్వదిలక్షలు జీతమనఘ, యమర మేలెడి దొరల కీక్రమమె సుమ్మి. కృష్ణ. 2, 78.

జ. అమరగాఁడు, అమరనాయఁకరము, అమరనాయఁకుఁడు.

**అమరము** సం. విశ. (అ. ఆ. అ.) చావు లేనిది. వి. అ. పుం. 1. పాదరసము. 2. ఎముకలప్రోగు. (ఇది భూమియందు బహుకాల ముండినను జీర్ణింపదు.) 3. జెముడు (వృ.వి.). (ఇది నఱికినను మఱలమఱల మొలచుచుండును గాని నశింపదు.) 4. బంగారు. 5. ముప్పదిమూఁడు అనుసంఖ్య (ఇది దేవతలసంఖ్య.) 6. ఒకవిధ మగు దేవదారువృక్షము.

**అమరరత్నము** సం. వి. అ. న. 1. చింతామణి. 2. పటికపుఱాయి.

**అమరలోకము** సం. వి. అ. పుం. స్వర్గము.

**అమరశిలాగంధకము** సం. వి. అ. పుం. ఒక విధ మైనగంధకము.

**అమరసరిత్తు** సం. వి. త్. స్త్రీ. గంగ.

**అమరసింహుఁడు** సం. వి. అ. పుం. అమరకోశ కర్త. (నవరత్నము లని ప్రసిద్ధికెక్కిన విక్రమార్కునియాస్థానపండితులలో నొకఁడు.)

**అమరాపగ** సం. వి. ఆ. స్త్రీ. గంగానది

**అమరాలయము** సం. వి. అ. పుం స్వర్గము.

**అమరావతి** సం. వి. ఈ. స్త్రీ. 1. ఇంద్రనగరము. స్వర్గము. 2. ఒకానొకపట్టనము.

**అమరి** సం. వి. ఇ. స్త్రీ. దేవతాస్త్రీ.

క....అమరీ, మండలి వీచోపు లిడఁగ, నుడి కమంగొనుచు నుండె నుజ్జ్వలభంగిఁ. భార. విరా. 4.241.

**అమరించే**-అమరుచే స. క్రి. (√అమరు.)
1. కావించు, చేయు.
క. ... నృపుఁ డెంతేఁ, గూరిమి తనుజునకు శాస్త్రారూఢిన్ నామకరణ మమరించు మదిన్. ఇందు. 2. 12. (చూ. 2. 13.)
2. ఒదించు, ఏర్పఱుచు, పెట్టు.
గీ. అరవిరులకొప్పు అమరించి యాదిగించి. హంస. 5.311.
ఉ....దుకాణముఁ బహి, ర్వేదిని భద్రకారుఁడమరించుక... హంస. 2.205.
3. నియోగించు, నియమించు.
ఆ. అధమవృత్తి కధికు నమరించుటలి బిట్టు, గుడుచుఁ గాదె... వే. పంచ. 1.172.

**అమరిక** వి. (√అమరు.) 1. ఒప్పు, అందము.
సీ. సొమ్ముల యమరికల్ సొరిది సిరికిఁబొటి కలవాని సుతుఁ డింత కన్నువేయ.పాంచా. 4. 15.
2. కుదిరిక, అనుకూల్యము.
గీ. అమరికకు మెచ్చి కెమ్మోవి యాన నిచ్చు. శశాం. 3. 112. (చూ. 3. 110.)

**అమరు** అ. క్రి. (క. అమరు. త. అమర్.) 1. ఒప్పు.
మ. ...మహాభాంతపారిజాత మమరున్ ధాత్రీ సుర ప్రార్థ్యమై. భార. ఆది. 1. 65.
గీ. వేఁడి వెలుఁగెండఁ గ్రాఁగిన విన్ను మేన, నెక్కొను చెమటబొట్లు నాఁ జుక్కలమరె. పారి. 2. 86.
2. కలుగు.
గీ. అతనుతాపజ్వరంబు మై నమరియుండ. నైష. 2. 110.
3. లభించు. అబ్బు.
గీ. నెలఁతతోఁ గూడి క్రీడింపఁ గలిగెనేని, యతనుసామ్రాజ్యమంతయు నమరినట్లు. విల్హ. 2. 84.
4. సిద్ధించు, నెఱవేఱు.
గీ. అమరులు వినఁగా మన మా, యమరేంద్రుని సమ్ముఖమున నసుమాటలు నేఁడమఁక పోయెఁగదా యని, యమరసతుల్ మంత నములాడుచు క్రీడన్. ఘటికా. 2. 118.
క. ...నిక్కముగ నీవు డెల్లకోర్కు లు,నమరెం గద మిమ్ముఁ జూచినంతనె మాకున్. అచ్చ. రా. బాల. 180.
5. సిద్ధమగు.
సీ. ...సుభామముల నెల్ల సంఘటించి, యజ్ఞాచరణమున కమరి యున్నాఁడ నీ వుపదర్శ నంబు సేయుటకుఁ మ్ము. భార. అశ్వ. 1.40.
వ. సమయంబునకు నమరుండనునవసరంబున ...ఉ. హరి, 6. 147.
క. ...వసు యమరియున్న డటన్నన్. బహు. 4. 4.
6. సరిపడు, తగు.
సీ. ...వేదికాస్థలి మణికనకాల్పిక యై ముప్ప దాఱు యోజనముల దైర్ఘ్యము నంత కమరు విస్తారంబుఁ గలుగంగ నొనరించి క్రతువు సేసి. భార. శాం. 1. 240.
7. కుదురు, అనుకూలమగు.
క. అమరుదు నీవింతుప్పృథా, గ్రముఁ బెట్టకుభో క్త వీవు భక్ష్యమ నేను... వే. పంచ. 2. 49.
(వ్యవ) ఇంటిలో భోజన మమరినట్లు పొందుగిం టిలో నమరదు.
8. ఏర్పడు, పొసఁగు. (చూ. అమర్పు.)
బ. అమరికము, అమరము, అమరించు,అమరిక, అమరుచు.

**అమరుఁడు** నం. విశే. (అ. అ అ.) చావులేనివాఁడు.
శ్లో. అజరామరవ త్ప్రాజ్ఞో విద్యామర్థం చ సాధయేత్. హితో.
వి. అ. పుం. 1. దేవత. 2. అమరసింహుఁడు. (అమరకోశకర్త.)

**అమరుచే(ర్చు)** – అమరించే. న. క్రి. (√అమరు) అమరఁజేయు.
(కూర్చు, సంఘటిల్లఁజేయు)

ఉ. ...ఇంక నేఁ,నన్యన్నృపాలపుత్త్రిక లనాత్మఁ దలంప శుభస్య శీఘ్ర మన్, మాన్యవచః క్రమంబున నమర్పుము తద్రమణీలలా మమున్. ఇందు. 2. 179

(కావించు, చేయు.)

ఉ. తూర్పు రుణంబు గాఁడొడఁగె దుష్టనిశాచర వేళయయ్యెడున్, మార్పుము కాలయాపన మమర్చక యప్పిశితాశిఁబట్టి పాఁలాఱఁగ నేల నావుడు. భార. ఆది. 6. 212.

వ. ...అతఁ త్త్రియులతో వైరం బమర్చుకొని తన్నిమిత్తంబున దేహంబులు విడిచితిమి. భార. ఆది. 7. 140.

(తాల్చు, ధరించు.)

సీ. పచ్చ్యోసిమాఱుఁగాఁ జాఱుటాకు సమర్చి చాఁదునఁ దిలకంబు సంతరించి. పాం. 5. 57.

సీ. పసుపుబొట్టిడయేల నొసట విభూతిరేఖ యమర్చి కొమ్ముచుఁ గంటగించు. శుక. 2. 456.

(ఏర్పఱుచు)

వ. ...అప్పోత్రంబు దెచ్చి సముద్రంబులో వైచి దానిక్రింద నాధారంబుగాఁ గూర్మ రాజు నియమించి యోక్త్రంబుగా వాసుకి నమర్చి...భార. ఆది. 2. 11.

గీ. చూడు మాచార్య నీదుశిష్యుండు ద్రుపద, సుతుఁ డమర్చినయది పాండుసుతులసేన, పెంపుబలువును గలిగి యొప్పినది. ...భార. భీష్మ. 1. 173.

గీ. విసము లాదట నందఱుఁ జెఱికి రొంపి, వోవ నీటఁ దెమల్చి మోపుగ నమర్చి...భార. అను. 3. 223.

(సిద్ధపఱుచు)

(వ్యవ) అమర్చినదానిలో అత్తగారు వ్రేలు పెట్టినది.

(అమరకము చేయు, సిస్తుకట్టి భూములను సేద్యమున కిచ్చు.)

(వ్యవ) రైతునకు భూమి అమర్చినాఁడు.

**అమరువు(డు)** నం. వి. ఉ. పుం. అమరుశతకమును రచించినయొకకవి.

శ్లో. కవిరమరః కవిరమరుః...(చాటువు)

**అమర్త్యుఁడు** నం. విశే. (అ. ఆ. అ.) చావు లేనివాఁడు. వి. అ. పుం. వేల్పు.

**అమర్యాద** నం. వి. ఆ. స్త్రీ. 1. మర్యాదలేమి, అగౌరవము. 2. మేరలేమి.

**అమర్యాదము** నం. విశే. (అ. ఆ అ.) 1. మేర లేనిది. 2. సమ్మానము లేనిది.

**అమర్షణుఁడు** నం. విశే. (అ. ఆ. అ.) 1. ఓర్వనివాఁడు, సహనము లేనివాఁడు. 2. కినుక గలవాఁడు, క్రోధనుఁడు.

**అమర్షము** నం. విశే. (అ. ఆ. అ.) ఓర్వనిది,సహింపనిది. వి. అ. పుం. 1. అసహనము, ఓర్వలేనితనము. 2. కోపము.

**అమర్షహాసము** నం. వి. అ. పుం మనస్సునఁ గోపించుకొని పైకి నవ్వినవ్వు.

**అమర్షి** నం. విశే (న్. ఈ. న్.)—అమర్షణుఁడు.

**అమర్షితుఁడు** నం—అమర్షణుఁడు.

**అమల** నం. వి. ఆ. స్త్రీ. 1, లక్ష్మి. 2. నేలయుసిరిక (వృ.వి.) 3. సంబరేను, సాతల (వృ.వి.) 4. బొడ్డుకాఁడ, నాభినాళము.

**అమలము** నం. విశే (అ. ఆ. అ.) 1. నిర్మలము. 2. దోషము లేనిది. 3. తెల్లనిది. వి. అ. న. అభ్రకము, బేగడ.

**అమవస**- అమాస. వి. (నం. అమావస్యా. అమావాస్యా. క. అమవాసె, అమాసె. త. అమావాసి) అమావాస్య.

క. అమవస గావున నేఁడు, కమలజుఁ గొలువఁగ మహర్షిగణములు పితృసంఘములను బోదురు...భార. ఆది. 5. 66.

క. అమవస నమవసఁ బిత్ర్యయ, జ్ఞముఁ దగఁ బ్రధానసహితముగా భక్తి మెయిణ జేయునతఁడు...భార. అను. 5. 159.

**అమాంసము** నం. విశే. (అ. ఆ. అ.) 1. మాంసము లేనిది. 2. దుర్బలము, కృశము.

**అమాత్యుఁడు** నం. వి. అ పుం. మంత్రి.

**అమాతృకుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) తల్లి లేనివాఁడు.

**అమాతృభోగీణుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) తల్లియొక్క సుఖమునకు అనుకూలింపనివాఁడు. తల్లిని సుఖపెట్టనివాఁడు.

**అమాత్రము** సం. విణ. (అ. ఆ. అ.) ఇంత అనరానిది, కొలఁది లేనిది.

**అమానవము** సం—అమానుషము.

**అమానవి** సం—అమానుషి.

**అమానవుఁడు** సం—అమానుషుఁడు.

**అమానస్యము** సం. వి. అ. న. దుఃఖము, అమనస్యము.

**అమానుషము** సం. విణ. (అ. ఆ. అ.)—మనుష్యసంబంధము కానిది—1. మనుష్యశక్తికి మించినది. 2. మనుష్యధర్మములు లేనిది, క్రూరము. (అ. ఆ. అ.) మనుష్యులు లేనిది, నిర్జనము. వి. అ. పుం—మనుష్యభిన్నమైనది—పశుపక్ష్యాదికము. మను 9. 94.

**అమానుషి** సం. వి. ఈ. స్త్రీ—మనుష్యజాతిది గాని స్త్రీ—రాక్షసి, మొ.

**అమానుషుఁడు** సం. వి. అ. పుం—మనుష్యభిన్నుఁడు రాక్షసాది.

**అమామసంస్య** సం—అమావస్య.

శ్లో...దర్శోఽమావాస్యమావసీ, అమావస్యా
వ్యమావాస్యా, వ్యమామంస్యా వ్యమా
మసీ. (వై. సి.)

**అమామ(మా)సి** సం—అమావసి.

**అమాయము** సం. విణ. (అ. ఆ. అ.) 1. కపటము లేనిది. 2. పరిమితి లేనిది. వి. అ. న. బ్రహ్మము.

**అమాయి** సం. విణ. (న్. నీ. న్.)—అమాయికుఁడు.

**అమాయికుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) మాయ లేనివాఁడు.

**అమార్గము** సం. విణ. (అ. ఆ. అ.) మార్గములేనిది. (అడవి, మొ.) వి. అ. పుం. చెడ్డమార్గము.

**అమావ(వా)సి** సం. వి. ఈ. స్త్రీ—అమావస్య.

**అమావ(వా)స్య** సం. వి. ఆ. స్త్రీ—కూడియున్న చంద్రసూర్యులు గలది—కృష్ణపక్షమున కడపటి దినము, అమవస.

**అమావాస్యకము** సం—అమావాస్యము.

**అమావాస్యము** సం. విణ. (అ. ఆ. అ.) అమావాస్యయందు పుట్టినది.

**అమాస**—అమవస.

గీ మగుపనెటీకప్పుఁగొప్ప నమాస యనుచు,
బోలఁలినెమ్మోము గన్గొనఁ బున్న మనుచు.
బ్రమసి...రా. ౦ 381. పూర్వ. ది 4.

**అమితము** సం. విణ. (అ. ఆ. అ. మితి లేనిది, కొలఁది లేనిది.

**అమిత్రుఁడు** సం. వి. అ. పుం. శత్రువు.

**అమిషము** సం. విణ. (అ ఆ. అ.) 1. నెపము లేనిది, నిష్కపటమైనది. వి. అ. న. 1. భోగ్యవస్తువు. 2. ఆమిషము మాంసము 3. కపటములేమి, మిషలేమి.

**అముక్తము** సం. విణ. (అ. ఆ. అ.) 1. విడువఁబడనిది. 2. ముక్తినొందనిది. వి. అ. న. విసరివేయక చేతఁ బట్టుకొనియే ప్రయోగించు కత్తి సురియ మొదలగు ఆయుధము.

**అముక్తహస్తుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) 1—పిడికిటిపట్టు వదలనివాఁడు—వ్యయము చేయనివాఁడు, లోభి. 2. మితముగా వ్యయము చేయువాఁడు. మను. 5. 150.

**అముక్తి** సం. వి. ఇ. స్త్రీ. 1. విడుపులేమి, నిర్బంధము. 2. స్వేచ్ఛలేమి.

**అముత్ర** సం. అవ్య. (తెనుఁగున దీని వ్యస్తప్రయోగము లేదు—వ్యుత్ప. ఇహ. ) పరలోకమందు.

ఉదా: ఇహాముత్రఫలభోగవిరాగము

**అముదుపడి** వి. (సం. అమృత. త. అముదు—అన్నము)—అమృతపడి.

అముదుపడి నైవేద్యము — దేవాలయములో ప్రతిదినము సమర్పించు అన్ననైవేద్యము. ద. శా. 4. 1288.

**అమూదృక్కు** సం. విణ. (క్.) ఇట్టివాఁడు.

**అమూదృశుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) ఇట్టి వాఁడు.

**అమూదృక్షుఁడు** సం. విశ. (అ. ఈ. అ.) ఇట్టి వాఁడు.

**అమూర్తము** సం. విశ. (అ. ఆ. అ.) రూపము లేనిది. వి. అ. న. (శా౯్ర) భూజలతేజోవాయు మనస్సులకంటె భిన్న మగుపదార్థము.

**అమూల** సం. వి. ఆ స్త్రీ. అగ్నిశిఖ. తరిగొఱ్ఱి (వృ.వి.)

**అమూలకము** సం విశ. (అ. లిశా. అ.) — అమూలము.

**అమూలము** సం. విశ. (అ. ఆ. అ.) 1. వేరులేనిది. 2. ఆధారము లేనిది; ప్రమాణము లేనిది; కారణము లేనిది.

**అమూల్యము** సం. విశ. (అ. ఆ. అ.) 1. వెల లేనిది. 2. మిక్కిలి వెలగలది.

**అమృణాళము** సం. వి. అ. న. వట్టివేరు. వీరణ మూలము.

**అమృత** సం. వి. ఆ. స్త్రీ. 1. సుర, మద్యము. 2. ఉసిరిక (వృ.వి.) 3. కరక (వృ.వి.) 4. తిప్ప తీఁగ. 5. పిప్పలి (వృ.వి.) 6. తులసి (వృ.వి.) 7. పెద్దపాఁపర (వృ.వి.) 8. జ్యోతిష్మతి, మానేరుతీఁగ. 9. గోరుచుద్దు (వృ.వి.) 10. అతివస (వృ.వి.) 11. గలిక (వృ.వి.) 12. దేహమందలియొకనాడి. 13. సూర్యకిరణ భేదము. (ఆకిరణము అమృతము - జలము - నిచ్చును. అది వర్ష హేతువు. సూర్యకిరణము లలో అట్టివి నాలుగువందలు కలవు.)

**అమృతకలశము** సం. వి. అ. పుం. న. అమృతముతో నిండినకలశము. న. భక్ష్యవిశేషము. వ. ...సుకియ లమృతకలశమ్ములు సౌఁగులు ...హంస. 1. 105.

**అమృతకిరణుఁడు** సం. వి. అ. పుం. చంద్రుఁడు.

**అమృతజట** సం. వి. ఆ. స్త్రీ. జటామాంసి (వృ.వి.)

**అమృతతరంగిణి** సం. వి. ఈ. స్త్రీ. వెన్నెల.

**అమృతపడి** మి. వి. (అమృతము + పడి.) నిత్యము దేవునకు నివేదింపఁబడుఅన్నము, నైవేద్యము. ద. శా. 4. 800.

**అమృతపుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) అమృతము త్రాగువాఁడు. వి. అ. పుం. దేవుఁడు, వేల్పు.

**అమృతఫల** సం. వి. ఆ స్త్రీ. 1. ఉసిరిక (వృ.వి.) 2. ద్రాక్ష (వృ.వి.)

**అమృతఫలము** సం. వి. అ. పుం. 1. పొట్ల, పటోలిక (వృ.వి.) 2. పారావతవృక్షము. కోఁతి తుమికి (వృ.వి.) న. రుచిఫలము. (ఈఫలము ముద్గలదేశమందుండును.)

**అమృతభల్లాతకి** సం. వి. ఈ. స్త్రీ. (వైద్య) నల్ల జీడిగింజలతోఁ జేయునొకఘృతము.

**అమృతమయము** సం. విశ. (అ. ఈ. అ.) 1. అమృతవికారమైనది, 2. అమృతముతో నిండినది.

**అమృతము** సం. విశ. (అ. ఆ. అ.) 1. మృతము కానిది, జీవించియున్నది. 2. మృతి లేనిది; శాశ్వతము. 3. చావు లేకుండఁ జేయునది. 4. ఇంపయినది. వి అ. పుం. 1. అడవిపెసర (వృ.వి.) 2. నేలతాటిగడ్డ. న. 1. చావులేమి. 2. మోక్షము. 3. సుధ. (వ్యతి. విషము.) 4. సోమరసము. 5. యజ్ఞశేషము. 6. అయాచిత జీవనము. (వ్యతి. మృతము.) 7. నీరు. 8. నెయ్యి. 9. పాలు. 10. ఆహారము, అన్నము. 11. స్వాదుపదార్థము. 12. బంగారు. 13. పాదరసము. 14. విషము. 15. వత్సనాభము, ఒకవిషౌషధి (వృ.వి.) 16. విషహారి, విషమునకు విఱుగుడుమందు. 17. బ్రహ్మము. 18. (జ్యోతి) ఒకానొకవారనక్షత్రయోగము;ఒకానొకతిథి వార యోగము.

**అమృతరస** సం. వి. ఆ. స్త్రీ. 1. నల్లద్రాక్ష (వృ.వి.) 2. ఒకవిధమైన భక్ష్యము.

**అమృతరసము** సం. వి. అ. పుం. 1. అమృతము. 2. అమృతసారము. 3. పరమాత్మ.

**అమృతలత** సం. వి. ఆ. స్త్రీ. తిప్పతీఁగ.

**అమృతవల్లి** సం. వి. ఇ. ఈ. స్త్రీ. తిప్పతీఁగ.

**అమృతసంయావము** సం. వి. అ. న. భక్ష్య భేదము.

**అమృతసారజము** సం. వి. అ. పుం. బెల్లము.

**అమృతసూతి** సం. వి. ఇ. పుం. చంద్రుఁడు.

**అమృతస్రవ** సం. వి. ఆ. స్త్రీ. రుదంతి యనుతీఁగ.

**అమృతాంధసుఁడు(ధుఁడు)** సం. వి. స్. పుం. – అమృతము ఆహారముగాఁగలవాఁడు–వేలుపు.

**అమృతాంశువు(డు)** సం. వి. ఉ. పుం. – అమృతమయమైన కిరణములు గలవాఁడు–చంద్రుఁడు.

**అమృతాశనుఁడు** సం. వి. అ. పుం.–అమృతాంధసుఁడు.

**అమృతాశి** సం. వి. న్. పుం.–అమృతాంధసుఁడు.

**అమృతాశుఁడు** సం. వి. అ. పుం. వేల్పు.

**అమృతాశ్మము** సం. వి. అ. పుం. సజీవమయిన ప్రస్తరఖండభేదము, ఒకవిధమగు చిన్న ఱాయి (వాచ).

**అమృతుఁడు** సం. వి. అ. పుం. 1. చావులేనివాఁడు–వేలుపు, దేవత. 2. ధన్వంతరి.

**అమృతేశయుఁడు** సం. వి. అ. పుం. – నీటిపై శయనించువాఁడు–విష్ణువు.

**అమృతోత్పన్నము** సం. వి. అ. న. ఖర్పరీతుత్థము.

**అమృతోద్భవము** సం. వి. అ. న. ఖర్పరీతుత్థము. పుం. బిల్వము, మారేడు (వృ.వి.)

**అమేధసుఁడు(ధుఁడు)** సం. విశే. (స్) మేధ లేనివాఁడు, మూర్ఖుఁడు.

**అమేధ్యము** సం. విశే. (అ. ఆ. అ.) అపరిశుద్ధమైనది. వి. అ. న. పురీషము.

**అమేయము** సం.విశే. (అ. ఆ. అ.) అపరిచ్ఛేద్యము, మితిలేనిది.

**అమోఘ** సం. వి. ఆ. స్త్రీ. 1. పాటలి, కలిగొట్టు (వృ వి.), 2. కరక (వృ.వి.). 3. వాయువిడంగము (వృ.వి.). 4. పొట్లతీఁగ.

**అమోఘము** సం. విశే. (అ. ఆ. అ.) వ్యర్థము కానిది, సఫలమైనది.

**అమ్మ**–అమ. వి. (సం. అంబా. ప్రా. అమ్మా) 1.జనని,
(క) తల్లి. భాగ. 1. 10.
(త) పూజ్యతను దెలుపును.
(చెలికత్తె సత్యభామతో ననినమాట.)
క. అమ్మా యేమని చెప్పుదు...పారి. 1. 75.
(ట) వాత్సల్యమును దెలుపును.
గీ. ప్రొక్కినను లేవనెత్తి యమ్మ ముద్దుకూఁతు, నక్కునను జేర్చి యోయమ్మ యగ్రవర్ణుఁ, బెట్టిపెట్టియు బెండెంబుఁ బెట్టెఁదగునె ఎరా. 6. 85.
2. స్త్రీనామములతుదను కొన్ని పురుషనామములతుదను జేర్పఁబడును.
ఉదా: సీతమ్మ, వెంకమ్మ, క్రిష్ణమ్మ ఇంతులు, మొ.
అవ్య. 1. స్త్రీనుద్దేశించిన ప్రార్థనార్థక క్రియలకును ముందు, కడపలకును అనుప్రయుక్తము
ఆ. మనయశోద చిన్నిమగవానిఁ గనెనఁట, చూచి వత్తమమ్మ సుదతులారా. భాగ. 10. పూ. 184, 1742.
2. ఆశ్చర్య ప్రశంసాసంతాపాదులను దెలుపును. (ప్రశంసకు)
గీ. అమ్మ యీరాజు ప్రతిగాన మమ్మయెచట. విజ. వి. 2. 73.
ఇ. అమ్మకచెల్ల, అమ్మకక్క, అమ్మక్కలు, అమ్మగారు, అమ్మచెల్ల, అమ్మచెల్లగా, అమ్మడుగులు, అమ్మతల్లి, అమ్మనేచెల్ల(గా), అమ్మమ్మ, అమ్మయ్య, అమ్మయ్యో, అమ్మరో, అమ్మరో, అమ్మలక్కలు, అమ్మవారు, అమ్మాయి.

**అమ్మకచెల్ల**–అమ్మచెల్ల. (√అమ్మ.)
ఉ. అమ్మకచెల్ల యెవ్వఁడో నిశాటుఁడు భిక్షుకవేషమూని మోహమ్మునవచ్చెఁ గాదన సమర్థులు లేరట నేమి సేయుదుస్. దశా. 7.59.
ఉ. అమ్మకచెల్ల సామ్రాజ్యము మమ్మర చెల్లఁడు వీనికియ్యెడన్. విజ. వి. 1. 70.

**అమ్మకము** అమ్ముడు. (√అమ్ము[2].)

**అమ్మకక్క** అవ్య. (√అమ్మ) ఆశ్చర్య ప్రశంసాసంతాపాదులను దెలుపును.
ఉ. ...నవపంచశరుండుగని భోజకన్యయమ్మకక్క యనఁగఁ జాలువిభవాతిశయంబున విట్లు పిఁగుచున్. చంద్రి. 1. 86.
ఉ. ...అ, మ్మక్క యదేమనంగ సిపు ఉందు శతాంశము తెల్పలేరు...విజ. వి. 1. 41.
ద్వి. ...గందంపుఁ, గొమ్మలో యనఁ బెడ్డికూఁతు లొప్పారి, రమ్మక్కయని సతులక్కజంబందు. రం. రా. బాల. 76 పొ. 12 పం.

**అమ్మక్కరొ(రో)**—అమ్మక్క.
(ఆశ్చర్యము)

క. ఎమ్మెలు దాముందరనా, యమ్మక్కరో... రుక్మా. 5. 88.

**అమ్మక్కలు**—అమ్మలక్కలు. వి. బ. (√అమ్మ) స్త్రీలు (ఇది ప్రాయికముగా ఆక్షేపమును సూచించును.)

ఉ. నిక్కుచుఁ జూడు చిత్రమిది నెమ్మది వేడుక నోలలాడు న,మ్మక్కలగుట్టు బట్టబయలై గనిపించఁగ శౌరి పొన్నపై ,నెక్కి రమించు చున్కి...సారంగ. 1. 80.

**అమ్మగారు** వి. (√అమ్మ.) 1. తల్లిగారు. 2. స్త్రీ దేవత.

గీ. గ్రామదేవత యగునమ్మగారి గుడికి, దిన దినంబును జని...శుక. 3. 358.

(దేవతాపర్యాయము 'అమ్మవారు' నియు, జననీ పర్యాయము 'అమ్మగారు' నియు వాడుక)

**అమ్మచెల్ల** అవ్య. (√అమ్మ) ఆశ్చర్యసంతాపాదు లను దెలుపును.

చ. కలయనివింతవారి దెదురుగా నడతేరఁగ డాసి యవ్వలిం, బెళుకుచు నమ్మచెల్ల తరుణీ చెలఁగించుచు నోరికె దానికిం, దలఁపునఁనేమి సేయునొకదా యని...శుక. 2. 104.

(వైశ్యకదళ ధునితో ననినమాటలు.)

చ. ...అమ్మచెల్లయా,శ్రుతము నిరాకరించు టకుఁ జూచెద వేమనవచ్చు నింక నీ,శ్రుతము వివేకపాకమును సూన్నృతమున్ మనువంశ వల్లభా. చం. రా. 4. 25.

**అమ్మచెల్లగా** అవ్య. (అమ్మ + చెల్ల + కా) — అమ్మచెల్ల.

చ. కనుఁగొని మౌనికాంతలు కకావిక లౌమది నమ్మచెల్లగా యనుచు...కువల. 2. 30. ఇ. రా. 4. 205.

**అమ్మడుగులు** వి. బ. (అమ్మ + అడుగులు—ఇవి పోలేరమ్మయొక్క అడుగులని భావింపఁబడును.) బంగారుతో పాదములవలె చేసి దారంమునఁ గూర్చి స్త్రీలు కంఠమున గట్టుకొనుభూషణము.

క. కమ్మలుఁ గడెములు గాజులు, నమ్మడుగులుఁ జుక్కబొట్టు నమరఁగ రతితం,త్రమ్ములఁ బసగలిగి ప్రమోదమ్ము పతికిఁజేయు కూర్మితరుణి ధరిత్రిన్. ఁసా. 4. 87.

**అమ్మతల్లి** వి. (అమ్మ + తల్లి.) అమ్మవారు, గ్రామ దేవత.

**అమ్మనములు(అమ్మనలు)** వి. బ. బాలికలు గచ్చకాయలు మున్నగునవి యెగుర వేయుచు నాడెడియాట. దశా. 8. 81. చంద్ర. 4. 6.

**అమ్మనేఁజెల్ల(గా)** — అమ్మచెల్ల. (√అమ్మ)
(ఆక్షేపమునకు.)

గీ. ఇట్టి మీవారినడతలు గట్టపెట్టి, యమ్మనేఁ జెల్లన్యాయంబు లాడెదౌర. శశాం. 2.81.
(పరిహాసమునకు)

గీ. అబలలము మూఁడుమాటల కాఱు తప్పు, లమ్మనేఁ జెల్లగా పరిహాసకంబు, చేసెదీవిట్టి పనులు మాచేత నౌనె. దశా. 2. 330.

**అమ్మమ్మ** వి. (√అమ్మ) తల్లితల్లి, మాతామహి. అవ్య. (అమ్మయొక్క యామ్రేడితము) ప్రశంసాశ్చర్యసంతాపాదులను దెలుపును.

సీ. అమ్మమ్మ యనునాఁడె యారాజ గరిమచే నమ్మమ్మ యనిపించె నఖిలజనుల. ఘటికా. 1. 45.

**అమ్మయము** నం. విశ. (అ. ఈ. అ.) జలమయము.

**అమ్మయ్య** అవ్య. (√అమ్మ) 1. సంతాపమును దెలుపును. కవిరా. 3. 82.

2. కష్టము గడచుటను సూచించును.

ఉదా: అమ్మయ్య! ఈవ్యవహారం మిప్పటికి తేలినది.

**అమ్మయ్యో** అవ్య. (√అమ్మ.) ఆశ్చర్యభయాదు లను దెలుపును.

ఉదా: అమ్మయ్యో! అదేమి రూపే?

**అమ్మరొ(రో)** అవ్య. (అమ్మ + రో.) ఆశ్చర్యప్రశం సాదులను దెలుపును.

ఉ....ధర్మకర్మరుం,దమ్మరో ధర్మరాజుఁ గొని యాడఁగఁ జెల్లదె యెల్లదేశముల్. పాంచా. 5. 76.

**అమ్మలక్కలు**—అమ్మక్కలు. (√ అమ్మ)
సీ. బొడ్డు గోయరె యేమి పురుటి టిలోఁ
బొచ్చి మన పతివ్రత బిడ్డఁ గనియె నిప్పు.
గీ. దనుచుఁ గేరడములు నింటియమ్మ
లక్కలాడికొన... శుక. 4.35.

**అమ్మవారు** వి. (√అమ్మ) 1. స్త్రీ దేవత; గ్రామ దేవత. (చూ. అమ్మగారు.) 2. పూజ్యస్త్రీ.
గీ.... ఇది యయ్యవారిసంసేవ వేళ, నమ్మవా రుగ్గడించిరో యనుచు నడిగె. కళా. 5.46.

**అమ్మాయి** వి. (√అమ్మ) బాలిక, చిన్నపిల్ల.

**అమ్మి** వి. (సం వేద. అంబిః—తల్లి.)
1. అమ్మాయి. 2. నీచజాతిస్త్రీవాచకము.

**అమ్మిక** వి. (సం. అంబికా.) పార్వతి.
ఉ.... చండి యమ్మికి దుర్గ, యనఁగ నీనెంత యంరు నభవ. అం. భా. 1.40.

**అమ్ము**[1]—అంబు వి. (ప్రథమయందు తఱచుగా 'అంప' అగును.) బాణము.
సీ. నాగపాశంబున వడి నిన్నుఁ గట్టినవాని నొక్కమ్మునఁ గూలనేసె. భా. రా. సు. 441. ప్రభా. 2.64.
జ. అంపకట్టె, అంపసయ్యము, అంపకాఁడు, అంపకోల, అంపగఱి, అంపతిప్పు, అంప దొన, అంపపొది, అంపపోకడ, అంప ములికి, అంపఱ, అంపవెల్లి, అమ్ముపేటు నేల.

**అమ్ము**[2] స. క్రి. విక్రయించు.
గీ. విడుతు రాప్తుల ఒప్పుఁ వేలు గన్న. నమ్ముదురు కులకాంతల నగరేశ, జనితు లగువారు... భాగ. స్క. 9.111.
అ. క్రి. అమ్మఁబడు.
మ. కురిసె న్వానలు సస్యవృద్ధి గలిగెన్ గొల్చెక్కుడై యమ్మె ... వి. పు. 6.525.
జ. అమ్మకము, అమ్ముడగు, అమ్ముడు, అమ్ముడుకొండిగెలు, అమ్ముడుపడు, అమ్ముడుపెట్టు, అమ్ముడుపోవు.

**అమ్ముడగు** అ. క్రి. (√అమ్ముడు) అమ్మఁబడు, విక్రీతమగు.
ఉదా: తెచ్చినధాన్య మంతయు అమ్ముడైనది.

**అమ్ముడు**—అమ్మకము వి. (√అమ్ము[2]) అమ్మటు. విక్రయము. (చూ. అమ్ముడగు, అమ్ముడు పడు, అమ్ముడుపెట్టు, మొ.)

**అమ్ముడుకొండిగెలు** వి. బ. (√అమ్ముడు) ధాన్యవి శేషము.
సీ. తుమ్మిపూరాజనాలమ్ముడుకొండిగెలు జీను వముకుక్కులు చిలుకముక్కులు... హంస. 4.128.

**అమ్ముడుపడు** అ. క్రి. (√అమ్ముడు.) 1. అమ్ము డగు. 2. (అమ్మఁబడినట్లు) అధీనమగు, వశ మగు.
సీ. హరిఁ దెత్తువే నీకు నమ్ముడువడి యుండ.. ప. సం. 6.674.

**అమ్ముడుపెట్టు** స. క్రి. (√అమ్ముడు) విక్ర యించు, అమ్ము.
ఉ. ముచ్చిలియైన జీవధనముల్ దెగ నమ్ముడు పెట్టియైనను, బెచ్చుగ నంత గంచి శమ పేదటికంబు దం... మముల్, దెచ్చి యనుంగువేశ్యలకుఁ దీర్తురు పండు గదండుగల్ విటుల్. వై. జ. 2.80.

**అమ్ముడుపోవు** అ. క్రి. (√అమ్ముడు) 1. విక్రయ మగు అమ్ముడగు.
ఉ. ఎంత పెనంగినఁ గృహిణి యిప్పటి కమ్ముడుపోదు నా కుపా, యాంతర మేమియుం బొడమదు... హరిశ్చ. 4.114.
2. (అమ్మఁబడినట్లు) అధీనమగు, వశమగు.
చ. అగుదగునీవపమ్మునకు నమ్ముడువోయితి నేలుకొమ్మ నీ, పరివుడ నంచు శూలి... హం. 4.36.

**అమ్ముపేటునేల** వి. (√అమ్ము[1]) బాణము పోయి పడునంతదూరము గలభూమి.
వ. అమ్ముపేటు నేలకంటెను దూరంబుగాఁ జని... మాత్ర పురీషోత్సర్జనంబులు సేయ వలయు. వి. పు. 4.190.

**అమ్లకము** సం వి. అ. పుం. గజనిమ్మ (వ్య. వి.)

**అమ్లకాండము** సం. వి. అ. న. లవణతృణము. (వ్య. వి.)

**అమ్లకేశరము** సం. వి. అ. పుం. బీజపూరము, మాదిఫలము (వృ. వి.)

**అమ్లగోరసము** సం. వి. అ. న. పులిమజ్జిగ.

**అమ్లచుక్రిక** సం. వి. ఆ. స్త్రీ. ఒకజాతి పులిచింత (వృ. వి.)

**అమ్లచూడ** సం. వి. ఆ. స్త్రీ. సం- అమ్లచుక్రిక.

**అమ్లనాయకము** సం. వి. అ. పుం. అమ్లవేతసము, పుల్లప్రబ్బలి (వృ. వి.)

**అమ్లనింబకము** సం. వి. అ. పుం. నిమ్మ (వృ.వి.)

**అమ్లపంచకము** సం. వి. ఆ. న. అమ్లఫలపంచకము ఐదుగురు కములు పుల్లనిపండ్లు.

శ్లో. కొలం చ దాడిమం చైవ వృక్షామ్లం చుక్రికాంతథా, అమ్లవేతసమిత్యేతదమ్లప చ ఫలం స్మృతం.- రేగు, దానిమ్మ, చింత, పులిచింత, పుల్లప్రబ్బలి- ఈఐదును అమ్ల పంచకము.

(జంబీరం నాగరంగం చ తథామ్లం వేతసం పునః, తింత్రిడీకం బీజపూరం మమ్లపఞ్చఫలం స్మృతమ్-నిమ్మ, నారింజ, పుల్లప్రబ్బలి, చింత మాదిఫలము- ఈఐదును అమ్లపంచక మని కొందఱు.)

**అమ్లపత్త్రము** సం. వి. అ. పుం - పుల్లనియాకులు గలది - అశ్మంతకము (వృ. వి.)

**అమ్లపత్త్రి** సం. వి. ఈ. స్త్రీ. 1. పలాశీలత. 2. క్షుద్రామ్లిక యను మొక్క.

**అమ్లపిత్తము** సం. వి. అ. న. తిన్నపదార్థమును పులియఁ జేయుపిత్తరోగ విశేషము.

**అమ్లపూరము** సం. వి. అ. న. చింత (వృ వి.)

**అమ్లఫలము** సం. వి. అ. పుం. చింత (వృ. వి.) న. చింతపండు.

**అమ్లభేదనము** సం. వి. అ. పుం. పుల్లప్రబ్బలి (వృ వి.)

**అమ్లము** సం. విశే. (అ. ఆ. అ.) పుల్లనిది. వి. అ. పుం. 1. షడ్రసములలో నొకటి యగుపులుసు. 2. పులిచింత (వృ.వి.) 3. దబ్బ (వృ.వి.) న. 1. పాతికపాలు నీళ్లు చేర్చినమజ్జిగ. తక్రము. 2. పులిపెరుఁగు.

**అమ్లమేహము** సం. వి. అ. పుం. ఒకవిధ మైన మూత్రరోగము.

**అమ్లలోణి** సం. వి. ఈ. స్త్రీ. పులిచింత (వృ.వి.)

**అమ్లవాస్తూకము** సం. వి. అ. పుం. చుక్రము, పుల్లప్రబ్బలి (వృ.వి.)

**అమ్లవృక్షము** సం. వి. అ. పుం. చింత (వృ.వి.)

**అమ్లవేతసము** సం. వి. అ. పుం. పుల్లప్రబ్బలి (వృ వి.)

**అమ్లశాకము** సం. వి. అ. న. చింతపండు.

**అమ్లసారము** సం. వి. అ. పుం. 1. పుల్లప్రబ్బలి (వృ.వి.) 2. నిమ్మ (వృ.వి.) 3. హింతాళము, గిలకతాడు (వృ.వి.) న. పులికడుగు.

**అమ్లాంకుశము** సం. వి. అ. పుం. అమ్లవేతసము, పుల్లప్రబ్బలి (వృ.వి.)

**అమ్లానము** సం. విశే. (అ. ఆ. అ.) 1. వాడనిది. (పూవు, మొ.) 2. తేటయైనది. (ముఖము, మొ.) 3. మాయనిది. వి. అ. పుం. 1. పెద్ద రేకులు గలచేమంతి (వృ.వి.) 2. పెద్దగోరింట (వృ.వి.) న. తామరపువ్వు.

**అమ్లాని** సం. విశే. (న్. నీ. న్.) వాడనిది. వి. ఆ. స్త్రీ. 1. వాడమి. 2. తేటఁదనము.

**అమ్లి** సం. వి. ఈ. స్త్రీ. పులిచింత (వృ.వి.)

**అమ్లిక** సం. వి. ఆ. స్త్రీ. 1. పులిత్రేఁపు. 2. చింత (వృ.వి.) 3. పులిచింత (వృ.వి.) 4. పలాశీలత. 5. పుల్లనిరసము.

**అమ్లిమ(ము)** సం. వి. న్. పుం. పుల్లఁదనము.

**అమ్లోద్గారము** సం. వి. అ. న. పులిత్రేనుపు.

**అయ**-అయ్య. వి. 1. పురుషనామములకు అను ప్రయుక్తము.

ఉ.... భీమయదేవుఁడు... భీమ. 1. 1.

2. పూజ్యతను తెలుపును.

చ. ...ఇది యేలయా వందటంచు... పర్మ. 9. 172.

**అయంత్రితము** సం. విశే. (అ. ఆ. అ.) 1. నిర్బంధము లేనిది, కట్టఁబడనిది. 2. ఇచ్చవచ్చినట్లు ప్రవర్తించునది.

**అయగాండ్రు**-అయ్యగాండ్రు. వి. బ. పూజ్యపురుషులు.

క.ఏపాటిపనిఁడిగిన్ని యు,కో పాపంబని యొకింత కొంకక యెంతే,నీపెదపెదయయగారు డ్రను, బాపురె యిటువంటిపాట్లఁ బఱచెదఁ నినఁగా. పరమ. 3. 284.

**అయగారికఅలచీర** వి. పురుషులు కట్టుకొనెడు నొకవిధమగు చాలులు గలవస్త్రము.

సీ. మొలకు సగంబును దలకు సగంబుగాఁగట్టిన యయగారికఅలచీర, పై నల్లకమ్మగవచ్చు డమ్మును...శుక. 2. 412.

**అయగారు**- అయ్యగారు. వి గురువు.

సీ. అరయ వేల్పుల కెల్ల నయగారగు దగు నుడుగు జేనికిఁ గుంక్కొడుకుఁ గుట్ట. యయా, 3. 131.

2. పూజ్యపురుషుఁడు.

వ. కయ్యపుటగి వుటయగారిపాం వినుజాణ ...ప్రబంధ. 216.

**అయత్నము** సం. విశ. (అ. ఆ. అ.) ప్రయత్నము లేనిది. వి. అ. పుం. యత్నములేమి.

**అయత్నలభ్యము** సం. విశ. (అ. ఆ. అ.) ప్రయత్నము లేకుండ (సులభముగా) పొందఁదగినది.

**అయథాతథము** సం. విశ (అ. ఆ అ.) - యథాతథము కానిది - 1. ఉండవలసినట్లుండనిది, తగనిది. 2. వ్యర్థమైనది, పనికిమాలినది.

**అయథార్థము** సం. విశ. (అ. ఆ. అ.)- యథార్థము కానిది - 1. అన్వర్థము కానిది, అర్థము ననుసరించి లేనిది. 2. అసత్యము. (ఉదా: అయథార్థానుభవము.)

**అయనము** సం. వి. అ. న. 1. గతి, పోవుట. 2. త్రోవ. 3. ప్రదేశము. 4.ఆశ్రయము,స్థానము. 5. సైన్యవ్యూహమునఁ బ్రవేశించుద్వారము. 6. (జ్యోతి) సూర్యుఁడు దక్షిణోత్తరదిశలకుఁ బోవుట 7. (జ్యోతి) సూర్యుని యొక్క దక్షిణోత్తర దిగ్గమనములకు పట్టుకాలము, అర్ధసంవత్సరము. (ఉత్తరాయణము, దక్షిణాయనము.) 8. మోక్షము.

**అయము** సం. వి. అ. పుం. 1. శుభావహ మగువిధి, శుభకర్మము. 2. మంగళము, శుభము.

**అయవారు**-అయ్యవారు.

(ఆచార్యుఁడు)

మ, అయవారై చరియింప వచ్చుఁ దనపాదాంభోజతీర్థంబులఁగా, దయతోఁ గొమ్మనవచ్చు ...కాళ. 4. 73.

**అయశము(స్సు)** సం. వి. స్. న. అపకీర్తి.

**అయశ్శంకువు** సం. వి. ఉ. పుం. 1. ఇనుపబల్లెము, ఈఁటె 2. ఇనుపమేకు.

**అయశ్శూలము** సం. వి. అ. న. ఇనుపబల్లెము.

**అయస్కంసము** సం. వి. అ. పుం. న. ఇనుపపాన పాత్రము.

**అయస్కాండము** సం. వి అ. పుం. 1. ఇనుప బాణము. 2. ఇనుపదండము.

**అయస్కాంతము** సం. వి. అ. పుం - ఇనుమున కిష్టమైనది, ఇనుము నాకర్షించునది-సూదంటురాయి.

**అయస్కారుఁడు** సం. వి. అ. పుం. ఇనుపపనిచేయు వాఁడు, కమ్మరి.

**అయస్కుంభము** సం. వి. అ. పుం. ఇనుపకుండ ఇనుపకాగు, మొ.

**అయస్కృతి** సం. వి. ఇ. స్త్రీ. (వైద్య) కుష్ఠనివారణముకై చేయుచికిత్సాభేదము.

**అయస్థూణ** సం. వి. ఆ. స్త్రీ. ఇనుపస్తంభము.

**అయస్పాత్రము** సం. వి. అ. న - అయస్కుంభము.

**అయస్సు** సం. వి. స్. న. 1, ఇనుము. 2. ఉక్కు.

**అయాచితము** సం. విశ. (అ. ఆ. అ.) అడుగకయే ప్రాప్తించినది. వి. అ. న-అయాచితవృత్తి.

**అయాచితవృత్తి** సం. వి. ఇ. స్త్రీ. అడుగకయే వచ్చినదానితో జీవించునది.

**అయాచితవ్రతము** సం. వి. అ. న - అయాచితవృత్తి.

**అయాజ్యయాజనము** సం - అయాజ్యసంయాజ్యము.

**అయాజ్యసంయాజ్యము** సం. వి. అ. న. యజ్ఞము చేయుట కర్హతలేనివానిచేత యజ్ఞము చేయించుట.

**అయాజ్యుఁడు** సం. విశ. (అ. ఆ. అ.)-యజ్ఞమెవనిచేతఁ జేయింపరాదో వాఁడు- యజ్ఞముచేయఁదగనివాఁడు.

**అయాథాతథ్యము** సం. వి. అ. న. ఉండవలసినట్లు లేకుండుట.

**అయాథార్థ్యము** సం—అయాథాతథ్యము.

**అయానయము** సం. వి. అ. న. 1. (సమానాసమద్వంద్వము) మంచిసెబ్బలు, ఎగ్గులగ్గులు, మేలుకీళ్లు. 2. పాచికపలకమీఁది పంటగడి.

**అయానయీనము** సం. వి. అ పుం. పంటగడిలోనికి తీసికొని పోఁదగినపాచిక.

**అయారె** — అయ్యారే అవ్య. ఆశ్చర్యప్రశంసాదులను దెల్పును.

ఉ. ఆ మునిమనోహరునొయారి నయారెనుతి. పం. రెన్నగురు. ఇందు. 2. 109.

మ.... యారాయబాలకథన ప్రాగల్భ్య శమద్యబులు, పరుపజేయ యారె వీటను సుధాస్వాదానపటుభవముల్. కాశీ. 2. 20.

**అయారే**—అయ్యారే. శశా. 4 67.

**అయి**—. అవ్య. అగుధాతువుయొక్క భూతార్థకాసమాపకక్రియారూపము, క్త్వార్థకము.

ఉదా: జలము నీరైపోయి యున్నది.

**అయితి** — ఐతి. అయితు. విశ. 1. ఉచితము. 2. శక్యము, సాధ్యము. (ఉదా: ఆపని నాకు అయితికాదు.)

**అయిద**—ఐదు.

**అయిదు**—ఐదు.

ఉదా: అయిదింటి, అయిదుగురు, అయిదిటి, అయిదుంటి.

జ. అయిదు కైదువులజంత అయిదుగురు, అయిదు పదిగావించు, అయిదుపదిసేయు, అయిదు మోములవేల్పు.

**అయిదుకైదువులజంత** — ఐదుకైదువులజంత. వి. —పంచబాణుఁడు—మన్మథుఁడు.

**అయిదుగురు** వి. (అయిదునకు మహన్మహత్వార్థకరూపము) అయిదుమంది.

**అయిదుదాయులు**—ఐదుదాయులు.

**అయిదుపదిగావించు** — ఐదుపదిగావించు స. క్రి. —ఖండించి ఐదుపదియగునట్లు చేయు. ముక్కలు చేయు, ఖండించు. అ. క్రి—అయిదుపదిసేయు.

**అయిదుపదిసేయు**—ఐదుపదిసేయు.

**అయిదుమోములవేల్పు** —ఐదుమోములవేల్పు. వి. —పంచవదనుఁడు—శివుఁడు.

**అయిదువ**—ఐదువ. వి. (క. అయిదె — సువాసిని. అయ్దు — కూడియుండు.) పతివత్ని, సువాసిని, పుణ్యస్త్రీ.

ఎ. అత్తటి నయిదువ లాఁతు, లెత్తుచు ధవళములువాడ... బిల్హ. 3. 207.

ముత్తయిదువ — (క. ముత్తు—ముదుసలి అయిదువ—సువాసిని.) వృద్ధసువాసిని. ఆ. భా. 3. 107.

జ: అయిదువతనము, అయిదువప్రాడు, అయిదువరాలు.

**అయిదువతనము**— ఐదువతనము (√అయిదువ) సౌమంగల్యము, సువాసినీత్వము.

**అయిదుప్రాడు**—ఐదువప్రాడు (√అయిదువ)

**అయిదువరాలు** — ఐదువరాలు (√అయిదువ)

**అయిన** — ఐన. విశ. అగుధాతువుయొక్క భూతార్థక విశేషణము.

అయినయింటివాఁడు — పెద్దవంశము లోనివాఁడు.

సా: అయినవారికి ఆకులలోను కానివారికి కంచాలలోను.

అవ్య. క్రియ. అగుధాతువుయొక్క చేదర్థకరూపము. (వికల్పము గాని పక్షాంతరము గాని తెలుపును.)

(గృధ్రజంబుకోపాఖ్యానమందలిది)

క. దయమాలి పోవ నేటికిఁ, బ్రయత్నమునఁ బొదువ దైవబలమున మీకుం, బ్రియ మెసఁగ బ్రదుకు బ్రదుకండయినను మఱి పోవరాదె యని చెప్పుటయును. భా. అను. 3. 73. (ఇట పక్షాంతరము.)

**అయినిల్లు**—ఐనిల్లు.

**అయిపు**—ఐపు.

(గుఱుతు, ఆనవాలు, జాడ.)

ద్వి. బీద నొక్కని నూరు పేరు లేకుండఁ, జెయిగాళ్లు గోసి కుత్సితముగ మీకు, నయిపుఁ గన్నులఁజూపి యాకాశవాణి,చెప్పెనంచును

మాయఁ జేసిరి గాని, యెప్పరిమాటకు నుర్వీతలేంద్ర. ద్వి. శ. సా. 3. 103 పొ. 8 పం.

(వ్యవ) వాఁడు అయిపు లేకుండ వెళ్లినాఁడు.

**అయిపోవు**—ఐపోవు. అ. క్రి. (√అగు) సమగ్రముగా అగు. (చూ. పోవు.)

చ. అడలున రాజధర్మములయందు జనించె ననూయ నీకు నిప్పుడు మును నిప్పృహుఁ డయిపోవఁగఁగన్నఁగులంబువారు నిప్పుడ మిన్నృపాలురు బ్రదికిపోదురు ... భా. శాం. 1. 63.

(వ్యవ) వియ్యము అయిపోయినవి. పనులు అయిపోయినవి.

**అయిమూల** — ఐమూల.

**అయిర** — ఐర. వి. నేత్రరోగవిశేషము. కంటిలో పెరుఁగు ఎఱ్ఱని దుర్మాంసఖండము. అవిరి.

ద్వి. మయిలకన్నును మసమసగొనుకన్ను, నయిరకన్నును బాయ కదరెడుకన్ను. పండితా. మహి. 273 పొ.

**అయిరకొను** — ఐకొను.

**అయిరగట్టు**—ఐరగట్టు.

**అయిరేని**—ఐరేని.

**అయిలారము**—ఐలారము.

**అయివచ్చు**—ఐవచ్చు. అ. క్రి. అచ్చివచ్చు.

ఉదా: ఈ యిల్లు మాకు అయివచ్చినదికనుక విడువము.

**అయుక్కు** నం. విశే. (శ.) విషమము, బేసిది. (వ్యతి. యుక్కు.)

**అయుక్ఛదము** నం. వి. అ. పుం. ఏడాకులయనంటి (వృ.వి.)

**అయుక్తము** నం. విశే. (అ. అ. అ.) 1. కూర్పఁబడనిది, చేర్పఁబడనిది. 2. అనవహితము, పరాకుపడినది. 3. అనుచితము, తగనిది, 4. యుక్తిలేనిది.

**అయుక్తి** నం. విశే. (ఇ.) 1. యుక్తిలేనిది. 2. సంబంధము లేనిది. 3. అప్రాప్తతలేనిది వి. ఇ. స్త్రీ. 1. ఎడఁబాటు. 2. పొసఁగుపాటులేమి. 3. అనర్థత్వము.

**అయుగనేత్రుఁడు** నం. వి. అ. పుం. విషమనేత్రుఁడు, బేసికంటి, శివుఁడు.

**అయుగము** నం. విశే. (అ. అ. అ.) 1. జతలేనిది. ఒంటిది. 2. విషమసంఖ్యగలది, బేసి. 3. కాఁడిలేనిది. (రథాది)

**అయుగల(శ)ము** నం. విశే. (అ. అ. అ.) 1. జతలేనిది, ఒంటిది. 2. బేసిది.

**అయుగశరుఁడు** నం. వి. అ. పుం. పంచబాణుఁడు, మన్మథుఁడు.

**అయుగసప్తి** నం. వి. ఇ. పుం - బేసిగుఱ్ఱములుగలవాఁడు-సప్తాశ్వుఁడు, సూర్యుఁడు.

**అయుగార్చి** నం. వి. స్. పుం. సప్తార్చి, అగ్ని.

**అయుగ్బాణుఁడు** నం. వి. అ. పుం. మన్మథుఁడు.

**అయుగ్మచ్ఛదము** నం. వి. అ. పుం. సప్తపర్ణము, ఏడాకులయనంటి (వృ.వి.)

**అయుగ్మనేత్రుఁడు** నం—అయుగనేత్రుఁడు.

**అయుగ్మబాణుఁడు** నం —అయుగశరుఁడు.

**అయుగ్మము** నం — అయుగము.

శ్లో. యుగ్మాసు పుత్రా జాయంతే స్త్రియో యుగ్మాసు రాత్రిషు, తస్మా ద్యుగ్మాసు పుత్రార్థీ సంవిశే దార్తవే స్త్రియమ్. మను. 3. 48.

**అయుగ్మవాహుఁడు** నం. వి. అ. పుం — బేసి (7) గుఱ్ఱములు గలవాఁడు — సూర్యుఁడు.

**అయుగ్మసప్తి** నం. వి.ఇ.పుం—అయుగ్మవాహుఁడు.

**అయుతము** నం. విశే. (అ. అ. అ.) సంబంధము లేనిది. (అ. న.) పదివేలసంఖ్యగలది, వి. అ. న. పదివేలు.

**అయుతసిద్ధము** నం. విశే. (అ. అ. అ.) (తర్క) ఏరెండింటిలో నొకటి రెండవదాని నాశ్రయించియే యుండునో ఆ రెండును అయుతసిద్ధములు. (అవయవావయవులు, జాతివ్యక్తులు, గుణగుణులు, క్రియాక్రియావంతములు, నిత్యద్రవ్యవిశేషములు.)

**అయో**—అయ్యో. (అ.మే. అయయో.)

క. మీఁదట వియోగసాగర, మీఁదంగలవాలతాంగి యయో మెఱుఁగ వయో. విజ. వి. 2. 102.

**అయోగము** సం. విశ. (అ. అ. అ.) సంబంధము లేనిది, కూడిక లేనిది. వి. అ. పుం. 1. కూడిక లేమి. 2. పొసఁగమి, అసంభవము. 3. (జ్యోతి) తిథి వారాదులయొక్క దుష్టయోగము. 4. గట్టిపూనిక. 5. ఇనుపసుత్తె; సమ్మెట. 6. (వమనము చే నుపశమింపఁ దగు) రోగవిశేషము.

**అయోగవి** సం. వి. ఈ. స్త్రీ. 1. శూద్రునకు వైశ్య స్త్రీయందుఁ బుట్టినస్త్రీ. 2. అయోగవుని భార్య.

**అయోగవుఁడు** సం. వి. అ. పుం. శూద్రునకు వైశ్య స్త్రీయందుఁ బుట్టినవాఁడు (వీనివృత్తివడ్రము)

**అయోగుఁడు** సం. వి. అ. పుం. భార్యావియోగము నొందినవాఁడు-విధురుఁడు.

**అయోగ్యము** సం. విశ. (అ. ఆ. అ.) అస్పష్టము, తగనిది,

**అయోగ్రము** సం. వి. అ. న - ఇనుపకట్టు గాని పొన్ను గాని వేసినది - రోఁకలి.

**అయోఘనము** సం. వి. అ. పుం. ఇనుపసుత్తె; సమ్మెట

**అయోధ్య** సం. వి. ఆ. స్త్రీ. కోసలదేశమునకు రాజ ధాని. (ఇది సరయూతీరమందున్నది - దీనికి సాకేత మని నామాంతరము.)

**అయోనిజ** సం. వి. ఆ. స్త్రీ. సీత.

**అయోనిజుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) యోనినుండి పుట్టనివాఁడు. వి. అ. పుం. 1. శివుఁడు. 2. విష్ణువు.

**అయోమయము** సం. విశ. (అ. ఈ. అ.) ఇనుముతో చేయఁబడినది, అయోవికారము.

**అయోమలము** సం. వి. అ. న. ఇనుపత్రుప్పు.

**అయోముఖము** సం. విశ. (అ. ఆ, ఈ. అ-చూ. అభిముఖుఁడు.) 1. ఇనుపముఖము గలది. 2. ఇనుపముక్కు గలది. 3. ఇనుపమొన గలది. వి. అ. పుం. బాణము.

**అయోహృదయుఁడు** సం. విశ. (అ. ఆ. అ) ఇనుప గుండెగలవాఁడు, కఠినహృదయుఁడు.

**అయౌగికము** సం. విశ. (అ. ఈ. అ.) వ్యుత్పత్తి లేనిది, రూఢము. (పదము.)

**అయ్య** వి. (సం. ఆర్యః. ప్రా. అయ్యఓ. అజ్జ. పా. అయ్యో. త. ఐయన్.) 1. తండ్రి, జనకుఁడు.

క. మాయయ్యకుఁ బాయక పని, చేయుచు... భార. ఆది. 3. 137.

ఉ. అన్నయుఁ దమ్ములుం దమకు నయ్యసగం బిలవేఁడి కానకిట్లున్నను వారి మార్కొనుట కోర్చితి నేనొకబ్రాహ్మణుండనే. భార. ద్రో. 5. 32.

2. పూజ్యపురుషుఁడు.

శా. ఆమానాధికుతోడ నిట్లనియె నయ్యావృద్ధ నేనీవచః, ప్రామాణ్యంబులు విశ్వసింప... హర. 2. 57.

3. పురుషవాచకము-వాఁడు.

మ. ...నేనును బోయి మ్రోల నిలువంగనవ్వయ్య కాపట్య మెంచఁడె విన్నయ్యలు విశ్వసింపుదురె...ఉ. రా. 1. 185.

తరల. అలరువిల్తునిమేనమామగునయ్య కాకొద గల్గనే. యయా. 4. 40.

4. వాత్సల్యమును దెలుపును.

వ. ...ఆరాజర్షి ముఖ్యుండు పుత్త్రునిఁ జూచి యయ్యా యిట్లేల వనంబులో మసలితి... భార. అర. 7. 270.

ఉ. అయ్యలఁగంటి మంచుఁ బులకాంకురముల్ వెలయంగఁగుఱ్ఱలం, బయ్యెన దాసి యెత్తుకొని సంతస మందుచుఁ గౌఁగిలించి... భాగ. 10. పూ. 525.

5. పురుషనామాంతమందుఁ జేర్పఁబడును.

ఉదా: రామయ్య.

అవ్య. 1. పురుషు నుద్దేశించిన ప్రార్థనమందు క్రియలపైనను ప్రయుక్తమగును.

గీ. నెయ్యమొనరంగ నెఱిఁగింపుమయ్యమాకు. భార. ఆది. 3. 224.

ద్వి. పసిఁడిగేదఁగిరేకుపస మించుమేని, కుసుమ కోమల నిత్తుఁ గొనరయ్య మీరు. ద్వి.హరిశ్చ. ఉ. 392.

2. ప్రశ్నార్థమును దెలుపును.

ఆ. ...అఁ, కొని ముసిండి దినినఁ గ్రొవ్వులావుఁ, గలుగునయ్య ... భార. ఉద్యో. 3. 333. (ఇటకాక్వర్థకము.)

**అయ్యంగారు** ఏ. 1. అయ్యగారు, పూజ్యపురుషుఁడు

ఉదా: తిమ్మఁ నయ్యంగారు.

2. దక్షిణదేశమున కొందఱు వైష్ణవులనామంబులకు సముప్రయుక్తము.

ఉదా: భాష్యమయ్యంగారు.

**అయ్యగాండ్రు**- అయగాండ్రు.

ఆ. అఁడువారిఁ గన్న నర్థంబుఁ బొడగన్న, సారమైనరుచులఁ జవులుగన్న, నయ్యగాండ్రకైన నాకలు పుట్టవా, విశ్వదాభిరామ... వేమన. 1. 22.

**అయ్యగారు** - అయగారు.

**అయ్యజియ్యలుపెట్టు** అ. క్రి. అయ్య! జియ్య! యను. (ఇది వినయమును సూచించును.)

సీ. శరణాగతారాతి ధరణీరమణు లయ్య జియ్యలు వెట్టుచు సేవ సలుప. సారంగ. 1. 62.

**అయ్యది**—అయది.

**అయ్యయి**—అయ్యై. (చూ. ఆ².) భార. అను. 2. 394.

**అయ్యరే(రె)**—అయ్యారే. చంద్రికా. 2. 97.

**అయ్యవారు**—అయవారు, అయగారు. ఏ.

1. ఉపాధ్యాయుఁడు; ఆచార్యుఁడు.

గీ. నన్ను బిఁగీలు పెట్టించునాఁడె యయ్య, వారు నిద్రింపఁగాఁ జూచి చేరి యచటఁ, జింతబ్రేవేల్కొమ్మ వంచుక సిగను గట్టి, విడిచి యుటికిటి నయగారు మిడికి కూయ. హంస. 3. 144.

2. పూజ్యపురుషుఁడు.

ఉ. దండముపెట్టి నేమమెకదా యని మేషరి యయ్యవారి కెందుం డిపు డెందుఁబోయె దరో... ఉ. రా. 3. 239.

(అనిమేషరియయ్యవారు - కలహాశనముని, నారదముని)

**అయ్యా** - అయ్యై. (చూ. ఆ².)

**అయ్యాయి** - అయ్యై. (చూ. ఆ².)

**అయ్యారె** - అయ్యారే. కిరా. 2. 115.

**అయ్యారే** - అయ్యారె, అయ్యరే, అయారె, అయారే.

అవ్య. ఆశ్చర్యప్రశంసాదులను దెలుపును.

క. అయ్యారే చెలువెక్కుడ, నయ్యారే గెలవఁజాలు నంగజునారిన్, వెయ్యారులలో సరితే, రయ్యా రుచిరాంగరుచుల నయ్యంగనకున్. విజ. వి. 1. 38.

**అయ్యు(అయియు)**—ఐయు. అవ్య. క్రి. (√అగు)

1. అయినప్పటికి.

క. అనఘా యీయజ్ఞము విధి, సనాథ ఋత్విక్ప్రయోగ సంపూర్ణం బయ్యును గడచన నేఁడు నడు, మునయుడు నను భూసురోత్తమ నిమిత్తమునన్. భార. ఆది 2. 309.

క. ...మృతసంజీవని లేమిఁజేసి యమసాదనమున కరుగుదురు వీర్యదర్పితు లయ్యున్. భార. ఆది. 3. 104.

2. అయి. (ఈ యర్థమున సముచ్చయము నిరర్థకము.)

క. మనపక్షంబున నా గర్వదనుజుల చే నిహతు లయ్యుఁ దగ మృతసంజీవని లేమిఁజేసి యమసాదనమున కరుగుదురు ... భార. ఆది 3. 104.

సీ. చక్రధరుం డయ్యు జలరుహనాభుండు గాండీవధరుఁ డయ్యుఁ బాండవుండు, నుండి గవ్వనమున నుభయపార్శ్వంబుల... భార. అది. 8. 261.

**అయ్యె**—(ఆయె). క్రి. అగుధాతువు యొక్క భూతకాలిక ప్రథమపురుషైకవచనము.

**అయ్యె(డి)డు** క్రి. అగుధాతువుయొక్క తద్ధర్మార్థక ప్రథమపురుషైకవచనము.

విశే. ఎ(డి)డు ప్రత్యయముతోఁ గూడిన తద్ధర్మార్థక విశేషణరూపము.

**అయ్యై** న. (√ఆ².) ఆయా.

క. అయ్యైకర్మంబులదెస, నెయ్యం బలరారఁ... భార. అను 3. 306.

గీ. ...అయ్యైప్రయోజనములు, దావెకావించు ...దశా. 4, 166.

**అయ్యొ** - అయ్యో.

**అయ్యో-అయో, అయ్యొ.** (ఆమ్రే-అయ్యయ్యో.) **అవ్య.** సంతాపమును దెలుపును. మనుచ. 3.36,

**అర**—అ. (1. 2. అర్థములు.)
(సగము)
యయా. 3.84.
(కొంచెము.)
క. అర మోడ్పునకన్నులు సుస్థిరమగు నాన నము...పారి. ఉ. 5.213.
సీ ...అర మేసి...కు.సం. 4.469.
(పెట్టెలోనగువానిలోపలిగది.)
సీ....అరల పేటికవోలెఁ బరిమళ ములు, నెల వులై ...మనుచ. 6.8.
జ. అరకన్ను, అరిగొను, అరిగొను, అరచట్ట, అరచావు, అరపలము, అరమెయిజోటి వాఁడు, అరవిరి.

**అరంగమము** నం. విణ. (అ. అ. అ.) వేగముగాఁ బోవునది. (బాణము, మొ.)

**అరఁగు—అరుఁగు** వి. (క. అరగు. త. అరుగు. తు. అరు—అంచు.) తిన్నె, వేదిక.
ఉ. వింగడమైనయొక్క వనవీథిఁ గనుంగొనె నీడసున్నపున్, రంగుటరంగు పచ్చలయ రంగయిపోన్...ఆము. 5.4. ఉ.రా. 6.24.

**అరఁటి-** అంటి, అనఁటి. వి. అనఁటి, కదళి (వృ. వి.)
సీ. బడలి పై నొఱగు నాణి బాళి నాతికిఁ గప్పు రపుఁ దివ్వ లొప్పునట్లు చూపు. ఉ.రా. 6.55.
అరఁటాకు- అరఁటియాకు.
క....లేఁ, జిగురరఁటాకులు పెట్టిరి... భీమ. 2.128.

**అరక** వి. పరు, దున్నుటకై ఎడ్లను కట్టి సిద్ధము చేసిన నాఁగలి.
జ. అరకాఁడు.

**అరకన్ను—అఱకన్ను.** వి. (అర) సగము మూసిన కన్ను.

సీ. తనరూపునకుఁ దోడు దలముదప్పినగర్వమర కంటఁ జూడఁ దేనరిగినపుడు. కాశీ. 7.70.
(అర్ధదృష్టితోనైనఁ జూడలేదు. అనాదరణ సూచకము.)

**అరకాఁడు** వి. (అరక) సేద్యకాఁడు, కర్షకుఁడు.
సీ. అగ్రహారముల మాన్యక్షేత్రములఁ బండు గరిసెలకొలు చరకాండ్రు నింప. చంద్ర. 2. 115.

**అరగడము** విణ. ముసలి, వృద్ధు.
సీ. అరగడం బనఁగను నలరువృద్ధాభిధ... ఆం. భా. 2. 119.

**అరగలి** వి. జంకు, సందేహము,
చ. నరునకుఁ బూని సల్కృతి విన జవిమాలిన యట్టి సల్కృ తే,నరగలి లేక బెట్టడగినప్పుడు సూడుము నన్ను నాతనిఁ. భార. కర్ణ. 2. 28.

**అరగలిగొను** అ. క్రి. (√అరగలి) అరవాయిగొను, వెనుదీయు; జంకు, సందేహించు.
ద్వి. అగ్రుదైనవస్తువు గురుదెంచి వేఁడ, నరగలి గొన కిత్తు రట్ల భక్తులును. బస. పు 4. 613 పం, 2. 47పం. 7. 684 పం.

**అరగూఁడు** వి. (√అర) గోడయం దేర్పఱచిన గూఁడు. (బ్రౌ.)

**అరగొను** అ. క్రి. (√అర) వెనుదీయు, సందేహించు.
క. అరిగొనక శైలకన్యక, హరు మనమునఁ గోరి...కు. సం. 6. 806.
చ. కర మభిలాషులై బహుముఖంబులఁగూర్చిన బెద్ద గాదు దా,రరిగొన కిచ్చినం దఱుఁగదు ...కు. సం. 8. 167.

**అరగౌను** వి. (√అర) సన్ననినడుము.
గీ. అతివ దిరుగుఁ బ్రదక్షిణ బళువుగుడికిఁ, గుచ భరంబున నరగౌను గూనిగిలఁగ. శివరా. 2. 31.

**అరఘట్టఘటి** నం. వి. ఈ. స్త్రీ. గిలకమీఁద నీళ్లు తోఁడు చేఁద, బొక్కెన.

**అరఘట్టము** నం. వి. అ. పుం. 1. నూతినుండి నీళ్లుతోఁడెడు సాధనము. (గిలక, మొ.) 2. పెద్దనూయి.

**అరచేట్టు**–అఱచేట్ట. (√అఱ).

సీ. పొలుపుమించిముత్యాలయరచట్టపై గొప్ప పతకంపు హారముల్ పరిఢవిల్ల. విజ. వి. పీఠి. 36.

**అరచా(పా)వు** వి. (√అఱ)–సగముచచ్చుట–మూర్ఛ.

చ....అతండు నిమఱం,దికి నరసా వొనర్చె ఘనతీవ్రవసముజ్జ్వలమార్గణంబులన్. భార. ద్రో. 5. 178.

**అరడ**[1] వి. ఏఱు దాఁటు సాధనములలో నొకటి.

గీ. ఈఁదుకొయ్యలు తెప్పలు నీఁదుకాయ,లరడ లరికోళ్లు పడవలు తరులు. హంస. 4. 182.

**అరడ**[2] వి. (క. పాంఱు.) పూస, బొగడ.

గీ....పక్కెలు శంధులు గుల్ఫము లరడలు ప్రపదములు, కూర్చములు ... హంస. 4. 191.

**అరడా** వి. (క. హిం. డ. త. అరడా.) 1. కత్తియుములు మూతికట్టు.

సీ. కోశాంతకోశాదిగు ప్తిభూషలు కుప్పె యన నరడా యన నగుఁ గ్రమముగ. ఆం. భా. 2. 215.

2. మంచముయొక్క అలంకారవిశేషము.

సీ. అపరంజిబంగారుటరడాలు...భాను, 4.87.

3. పెండ్లిపల్లకీబొంగుకొనకు వేసెడిఅడ్డ.(బ్రా.)

**అరణము** వి. (సం. హరణమ్.) వివాహకాలమందు వధూవరులకు ఇచ్చుధనాదికము, యౌతకాదికము.

సీ....వాసుదేవుఁ, డనుజకు నరణమీ నర్థితోఁ జనుదెంచె...భార. ఆది. 8. 215.

ఆ. దర్పయుక్తులైనదశలక్షదాశార్హ, వరుల నరణ మిచ్చె వామనుండు. భార. ఆది. 8. 221.

క. ఇది నాకు నుంకు విచ్చుట, యిది మొదలుగ నన్ను నరణ మిచ్చితిఁ ద్రిజగ, ద్విదితముగ నీశ్వరున కని,ముద మొదవ శిలోచ్చయోత్తముఁడు నిశ్చితుఁడై. కు. సం. 7.972.

**అరణి** సం. వి. ఇ. పుం. ఇ. ఈ. స్త్రీ. త్రచ్చినిప్పుపుట్టి చెడుకొయ్య ఇ. పుం. అగ్నిమంథము, నెల్లి (న్యా.వి.)

**అర(ణి)ణీసుతుఁడు** సం. వి. అ. పుం. 1. శుకుఁడు. (వ్యాసుఁడు ఘృతాచి యనునప్సరసను జూచినపుడు స్ఖలితమైన రేతస్సు ఒకయరణిపైఁ బడఁగా దానినుండి శుకుఁడు పుట్టెనని పురాణప్రసిద్ధి.) 2. అగ్ని.

**అరణ్యకము** సం. వి. అ. న–అరణ్యము.

**అరణ్యచంద్రిక** సం. వి. ఆ. స్త్రీ. అడవిని కాసిన వెన్నెల (ఇది అడవియందు కాసినవెన్నెలవలె నిరుపయోగమైనదానిని దెలుపుటకుఁ గూడ నుపయుక్తము.)

**అరణ్యచరము** సం. విణ. (అ. ఆ. అ.) అడవిలోఁ దిరుగునది, వన్యము.

**అరణ్యజము** సం. విణ. (అ. ఆ. అ.) అడవిలోఁ బుట్టునది, వన్యము.

**అరణ్యజీవము** సం. విణ. (అ. ఆ. అ.) అరణ్యమందు జీవించునది.

**అరణ్యధర్మము** సం. వి. అ. పుం. 1. వానప్రస్థధర్మము. 2. అడవివాండ్రధర్మము.

**అరణ్యము** సం. వి. అ. న. పుం. వనము, అడవి. పుం. ఱేఁకుమ్రాను.

**అరణ్యరుదితము** సం. వి. అ. న. అడవిలోనియేడ్పు. దానివలె నిష్ఫలమైనది.

**అరణ్యరోదనము** సం–అరణ్యరుదితము.

**అరణ్యవాయసము** సం. వి. అ పుం. అడవికాకి, మాలకాకి.

**అరణ్యవాసము** సం. వి. అ. పుం. అరణ్యమందు ఉనికి.

**అరణ్యవాసి** సం. విణ. (న్. నీ న్.) అరణ్యమందు నివసించువాఁడు. వి. న్. పుం. 1. ఆటవికుఁడు. 2. వానప్రస్థుఁడు.

**అరణ్యవాసిని** సం. వి. ఈ. స్త్రీ. అత్యమ్లపర్ణిలత.

**అరణ్యవిలపితము** సం – అరణ్యరుదితము.

**అరణ్యవిలాపము** సం. వి. అ. పుం – అరణ్యరుదితము.

**అరణ్యశ్వానము** సం. వి. న్. పుం. తోఁడేలు, వృకము.

**అరణ్యషష్ఠి** సం. వి. ఈ. స్త్రీ. జ్యేష్ఠశుక్లపక్షషష్ఠి. (అరణ్యకగౌరీవ్రతము చేయుతిథి.)

**అరణ్యాని** సం. వి. ఈ. స్త్రీ. మహారణ్యము, పెద్ద యడవి.

**అరణ్యేచరము** సం- అరణ్యచరము.

**అరణ్యేతిలకము** సం. వి. అ. పుం. 1. అడవినువ్వు (వృ.వి.) 2. బ. అడవినువ్వులు (వీనియందు నూనె యుండదు. ఈపదము ఆశాభంగకర మగుదానికి ఉపమానముగాఁ గూడ నుపయుక్తము)

**అరతము** సం. విశే. (అ. ఆ. అ.) 1. అనురాగము లేనిది. 2. విరతము, విరమించినది. 3. అసంతుష్టము.

**అరతి** సం. విశే. (ఇ.) 1. అనురక్తి లేనివాఁడు, విరక్తుఁడు. 2. సంతోషము లేనివాఁడు. వి. ఇ. స్త్రీ. 1. విషయములయందు ఇష్టములేమి (ఇది మన్మథావస్థలలో నొకటి.) 2. రతిలేమి. 3. అనురక్తిలేమి, 4. మనస్సుకుదురులేమి, ఇష్టవస్తువును బొందమి వలన మనస్సునకుఁ గలుగువ్యాకులత్వము. 5. సంతోషములేమి. 6. బాధ. (సం. కిరా. 10. 49.) 7. అరుచిని గలిగించు పిత్తరోగము. పుం. క్రోధము.

**అరత్ని** సం. వి. ఇ. పుం. 1. మోఁచేయి మొదలు చిటికెనవ్రేలిచివరవఱకు నుండుకొలత. వ్రేలు చాఁచినమూర. 2. మోఁచేయి.

**అరదండలు** వి. బ. రెండుచేతులకుఁ దగిలించెడు సంకెలలు. (శ.ర.-అరదండాలు అనివాడుక)

**అరదము** వి. (సం. రథః. త. ఇరదము.) రథము, తేరు.

క. శరములు శరాసనము న, య్యరదముపై డిగ్గవిడిచి యతిరథసమునకా, ధరణికి లంఘించి...భార. విరా. 4. 72.

**అరదేశి** వి. (క. అరదేశి — యాత్రికుఁడు.)యాత్రికుఁడు. ('అరదేశిపరదేశి' అనువాడుకలోనే కలదు.)

**అరపలము** వి. (√అర) పలములో సగము. అం. భా. 2. 269.

**అరబి(బీ)** వి. ఒకానొకభాష, అరేబియా దేశీయుల భాష.

గీ. అరబి పారసి గుజరాతి...యయా. 1. 47.

మ. అరబీభాష తురుష్కభాష...భీమ. 1. 72.

**అరబ్బి** వి. అరేబియా దేశమందలి గుఱ్ఱము.

మ. బిరుదు ల్దిద్దినదిద్దమౌనొకయరబ్బి నెక్కి... రంగా. 2. 210.

**అరమర** — అఱమర.

(శంక, జంకు, సందేహము.)

చ. సురవరుపార నాప్రతిన చూడుఁడు నేఁడుడుగుండు సాధ్వసం, బరమర లేక ... రామా. 3. 71.

**అరమరము** — అఱమర.

(శంక, సందేహము.)

ఉ. తా మది నమ్మకున్నది విదర్భనరేంద్ర తనూజ నిన్ను సుత్రాముఁడ వంచు నీయరమరంబునఁబో మన సీదు నీకు ... నైష. 8. 75.

**అరమరిక** — అఱమర.

(భేదము)

ద్వి. వాలిసుగ్రీవుల వరుసతోఁ గాంచి, చాలంగ వారిచే సత్కృతుల్ వడసి, యరమరికయు లేక నందఱలోన, నిరవొంద సుగ్రీవు నిష్టుఁడై యుండె. రం. రా. ఉ. 97 పా. 28 పం.

**అరము** సం. విశే. (అ. ఆ. అ.) వడిగలది, త్వరితము. వి. అ. పుం. 1. బండికంటియాకు. 2. కోణము.

**అరమెయిజోటివాఁడు** వి. (√అర) అర్ధనారీశ్వరుఁడు, శివుఁడు.

సీ. కప్పుకుత్తుకవాఁడు గాలిమేఁతరియందెజోటివాఁ డరమెయిజోటివాఁడు. అచ్చ. రా. బాల. 13.

**అరయిక** వి. (√అరయు - క. అరయ్కె. త. ఆరాయ్గై.) అరయుట. నైష. 1. 50.

**అరయు**—అరయు. వ. క్రి. (క. అరయు. త. ఆరాయ్.) 1. వెదకు, అన్వేషించు.

ఆ. అరిగి యచట వాని నరసికానక రథమునఁ
గలయఁ దిరిగి శార్ఙ్గిఁ గాంచి. భార. శాం. 6. 488.

2. ఆలోచించు, పరిశీలించు, పరిశోధించు.

క. అరయంగా శబ్దంబును, బరంబు నన రెండు నూనె బ్రహ్మములు... భార. శాం. 5. 71.

క. తురిగంబులఁ జూచువిధం, బరయంగ నితఁ డశ్వవిద్యయందు నిపుణతా,స్ఫురణము గల వాఁడగు... భార. విరా. 1. 259.

3. కనుపెట్టు, జాగ్రత్తతో చూచు.

ఆ. అకట తండ్రి సచ్చినంతనుండియు మము, నరసి ప్రోచినట్టియనుఁగుఁదాతఁ, జంపమదిఁ దలంచు తెంపు నూచితె రాజ,ధర్మమింత క్రూరకర్మ మగునె. భార. భీష్మ. 3. 288.

గీ. అరసి రక్షింపనేరక యనుఁగుఁగొడుకు, భ్రష్టుఁ జేసితి నేమి చెప్పంగఁ గలదు.కాశీ. 4. 107.

6. చూచు, వీక్షించు.

వ. ఇవ్విధంబున సమ్మువ్వరంచేతను బ్రజాత యగు చుండం గురుపతి భారద్వాజునాజి యరసిపోవ వచ్చి... భార. ద్రో. 4. 110.

గీ. శిశిరశిఖరిస్థలంబు వీక్షించికొనుచుఁ, జంప కారణ్య మరయుచు... వసు. 2. 94.

5. కనిపట్టు, తెలిసికొను.

గీ. అచటివృత్తాంత మంతయు నరసిపోయి,వేలు వేలన సఖులు దేవేరులకును, విన్నవించిన వారును జిన్నవోయి. పారి. 3. 68.

వ. సింహగర్జితంబులంబోనియెలుంగుల శోణ పుర ప్రాసాదరంధ్రంబులం బరఁగించిన నమ్మహాధ్వని విని బాణుం డవ్విధం బర యించి సర్వసైన్యంబుల సన్నద్ధంబు గావించె నంత. హరి. ఉ. 8. 76.

6. రక్షించు, పోషించు, పాలించు.

ఆ. కొడుకుఁబోలె నరయ గురుఁబోలెఁ గొలు వంగ, నగ్నిఁబోలె నిష్ఠ నర్చితుఁడుగఁ, జేయవలయు విప్రు... భార. అను. 1.160.

శ్లో. పుత్త్రవచ్చైవ తే రక్ష్యా ఉపాస్యా గురు వచ్చతే, అగ్నివచ్చోపచార్యా వై బ్రాహ్మ ణాః కురుసత్తమ. అని మూలము.

ఆ. అధిప వినుము భూమి యరయు తెలుఁగు. భార. శాం. 2.384.

7. పరీక్షించు.

చ. మన మరయం దలంచి యొక మార్గము లన్నితో నవ్వుటంలకో...పారి 1.116.

ద్వి. విన్నమాటల మాకు విశ్వాస మొదవ దన్నరేంద్రుని సత్య మరసినఁ గాని. ద్వి. హరిశ్చ. పూ. 342.

8. ప్రతీక్షించు, నిరీక్షించు.

సీ....అర్కునియుత్తరాయణము వచ్చు. గీ. టరసికొనియుండి నాకడ కరుగుదెమ్ము. భార. అను. 5.442.

గీ. వైశ్వదేవాదివిధుల సర్వమును దీర్చి, యరయు చున్నాఁడు నాథ రా యతిథిరాక. కాశీ. 7.166.

చు. అరయిక.

**అరరము** సం. వి. అ. న. పుం. 1. కవాటము, తలుపు. 2. వంశకోశము, వెదురు మొలక చుట్టు నుండుపొర. 3. ఆచ్ఛాదనము, కప్పు పుం. ఆరె, చెప్పులు కుట్టుసూది.

**అరరి** సం. వి. ఇ. పుం. కవాటము, తలుపు.

**అరరె**—అరరే.

(ప్రశంసను దెలుపును.)

గీ. బొరి యేడకేంద్ర యరరె తగ...క్రీడా.232.

**అరరే**—అరరె. అవ్య. (సం. అరరే.)

1. ఆశ్చర్యమును దెలుపును. కువల. 3.13.

2. ప్రశంసను దెలుపును.

మ. అరరే శౌరి బలి ధ్రువుం డహహా భద్రా శ్వుండు...వరాహ. 8.93.

3. హీనసంబోధనమును దెలుపును.

ఉ....మాల్యవంతుఁ డీ, రీతి ముకుందునొంచి యరరే నిలుమంచు...ఉ.రా. 2.103.

**అరలు** అ. క్రి. (క. అరలు, అరులు.) వ్యాపించు, ప్రాఁకు.

చ. మటిమటి నుందటం బయినమల్లియతీవల నల్లిబిల్లియై, యరలి తమాలజాలమున నల్లిసపూఁబొదరిండ్ల ......గంధ. 1.65. (ప్రయోగాంతరము మృగ్యము.)

**అరవ–అఱవ**. వి. ద్రావిడుఁడు, అఱవ దేశము వాఁడు.

సీ. ఆరెలు గన్నడీ లఱవలు దెలుఁగులు దన బిరుదాదియం దగిలి కొలువ. ద్వా. 1.43.

**అరవత–అఱవత** వి. అఱవదేశపుస్త్రీ.

**అరవము–అఱవము** వి. (త. అఱవమ్.) అఱవ భాష.

**అరవరయుగు** అ. క్రి. (√అఱవఱలు) క్రోధాదులచే తుబ్బుఁడగు, కలఁత నొందు

క. పోరు గెల్చి పగలు దెచ్చిన, నఱవఱయై మాఱు సేయ కతిశాంతుండై, తిరిగినమాన వుఁ డుత్తముఁ, డఱయఁగా విష్ణుభక్తుఁ డతఁడే ధాత్రిన్. శేష. 4. 40.

**అరవరలు–అఱవఱలు**.

క. విఱవఁగ్ని వలన దేహము, లఱవఱలై... వి.పు. 7.365.

క. పరుసైనయెండమెండున, నఱవఱలై పోయి లేక యలజడి పడఁగా, సుఁగాలి యేఁచెఁ బ్రజలం, గఱవుకుఁ దోడావపంట గలిగిన కంటిన్. కువల. 1. 101.

(ఇట కొన్నిచోట్ల ఏకవచనాంతముగాఁ గూడ కన్పడుచున్నది. చూ. అరవరయగు)

**అరవాయి** వి. వెనుదీయుట, జంకు, శంక.

క. ఈయన నను(గని వారిఁ, నేయం డితఁ డగ్గ మైనఁ బిచ్చుఅపిడునై, పోయి పెయిఁబడుదు నీ వరవా యించుక లేక పఱపవలయుఁ దథం బున్. భార. విరా. 5. 14. (ప్రాఁతప్రతి)

గీ. ఇవ్విధంబున గురుసుతుఁ డేపు మిగిలి, చనఁగఁ గృపుఁడును గృతవర్మయును దలిర్చు, రివఁగ నతనితో నడచిరి గాని వారు, వలన నించుకయును నరవాయి లేదు. భార. సౌ. 1. 139.

జ. అరవాయిగొను.

**అరవాయిగొను** అ. క్రి. (√అరవాయి.) 1. వెనుదీయు, జంకు.

క. కురుసైన్యము నిస్సారం, బరయఁగ మన బలము లెల్ల నతిదృఢము నీ వరవాయి గొనక నడపుము, ధరణీశ్వర సేనమొగము దైవము నీకున్. భార. ఉద్యో. 4. 111.

సీ. ...సాత్యకి యలఁతులఁ బోయెడువాఁడె వృష్ణికుమారవరు లనేకు, లట్టియోధులు పోర నరవాయి గొందురే... భార. ఉద్యో. 1. 268. హరి ఉ. 9. 168. భా. రా.యు. 1949.

2 శంకనొందు, సందేహించు.

క. తరుణి యిది యన్నపూర్ణా, పరమేశ్వరిగాని యితరభామిని గాదం, చరవాయిగొనక మెసఁగిరి, పరమమునీశ్వరులు పంచభక్ష్యాన్నంబుల్. భీమ. 3. 140.

వ. చుట్టం బని యరవాయిగొనుట కర్జంబు గాదు కృతవర్మను సమయింపుము. భార. కర్ణ. 3. 122.

**అరవిందము** నం. వి. అ. న. పద్మము.

**అరవిందసదుఁడు** నం. వి. ద్వ. పుం కమలాసనుఁడు, బ్రహ్మ.

**అరవిందాక్షుఁడు** నం. విశ (అ. ఈ. అ.) తామరవంటి కన్నులుగలవాఁడు. వి. అ. పుం విష్ణువు.

**అరవిందిని** నం. వి. ఈ స్త్రీ. 1. తామరతీఁగ. 2. తామరగుంపు. 3. తామరలుగల చోటు, కొలను.

**అరవిరి** విశ. (√అర) సగము వికసించినది.

సీ. చదలు గేదఁగితూర్పుతుదకొమ్మ నరవిరియై కానిపించుపూరేకు లనఁగ. పారి. 2. 36.

సీ. అరవిరి విరిమొగ్గశరములకిరవగుచిగురులై గల తెల్ల చెఱకువిల్లు. ఘటికా. 2. 25.

వి. (క. అరెబిరి. త. అరై విరి.) సగము వికసించినపువ్వు.

సీ. అరవిరినెత్తావి నడరించు నున్నిద్రవిటపీటి సౌరభవితతి వొదల. భార. ఉద్యో. 2. 112.

**అరసము** నం. విశ. (అ. అ. అ.) – రసములేనిది – 1. రుచిలేనిది, చప్పనిది. 2. ద్రవము లేనిది. 3. ఇంపుకానిది. 4. దుర్బలము. 5. శృంగారాదిరసము లేనిది. (కావ్యాది.) 6. రసము గ్రహింపనిది.

ఉదా: అరసుఁడు–రసజ్ఞుఁడు కానివాఁడు.

(శ్లో. అరసపురుషానాద భర్తైః. సం. నైష. ౨. 152.) వి. అ. పుం. రసములేమి.

**అరసికుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) రసజ్ఞుఁడు కానివాఁడు, రసగ్రహణము లేనివాఁడు.

**అరసు-**అరుసు. వి. (సం. రాజా, క. అరస, అరసు. త. అరచర్.) రాజు, ప్రభువు. (తెలుఁగు నామాంతములయందే కనఁబడుచున్నది.)

ఉదా: **తిమ్మరసు**, అప్పరసు.

**అరళము** సం. వి. అ. న. (శ. ర.) అరళము. తలుపు.

వ.... అరళంబులు వివరంబులైన.. భాగ. 10. పూ. 143.

**అరళు(లు)వు** సం. వి. ఉ. పుం. దుండిగము (వ్యు. వి.)

**అరాజకము** సం. విశే. (అ. ఆ. అ.) రాజులేనిది (దేశము)

**అరాతి** సం. వి. ఇ. పుం. 1. శత్రువు. 2 (జ్యోతి) లగ్నమునకు ఆఱవస్థానము.

**అరాబా** హిం. వి. పిరంగిబండి.

క. ఆబొబ్బిలగడ పై తెలుఁ, గాబురుజులపై నెసంగు నాగ్నేయకళా, ఖీబది యోమయమైన య,రాబానొం పెన్న నెన్న రా దెవ్వరికిన్. రంగా. 2. 27.

**అరాబు** హిం. వి. పిరంగును పెట్టునట్టికోటబురుజు, ఉపసాలము.

సీ. వెలుపటిమంచుతిత్తులఁ గూరినయరాబు కొఱకమర్చినవచ్చి గోడగుంపు. కువల. 3. 18.

సీ. ఉపసాలాఖ్య యగు నరాబు... ఆం. భా. 2. 12. రా. వి. 5. 24.

**అరాళ(ల)ము** సం. విశే. (అ. ఆ. అ.) కుటిలము, వంకరైనది. వి. అ. పుం. 1. మదపుటేనుఁగు. 2. సర్జరసము, మద్దిజిగురు. 3. అభినయహస్త విశేషము. (బొటనవ్రేలిని వంచి చూపుడు వ్రేలిమొదటఁ గూర్చి చూపుడువ్రేలిని వంచి తక్కినవ్రేళ్లను జక్కఁగాఁ జాఁచి పట్టినది.)

**అరి**[1] వి. (క. త. అరి.) 1. కప్పము, పన్ను.

క. అతి యనివిర్పులచేతను, ధనికులు రూకయును మొదలుగాఁ గొన రెవ్వరును ... భార. ఆది. 6. 68.

క. నసుతు లయ్యైదికు లు, కరిగిమహీపతుల చేత నరి గొని ధనముల్, దెరలఁగఁ దెచ్చిన మార్గము. భా. సభా. 1. 228.

౨. మర్యాద, హద్దు.

ద్వి. పరమబాంధవుఁడైన పంచజోదరుని, నరమీఱి యేమను పనదనక దూఱితిమి. ద్వి. ప. మ. 3. 156 పొ. 10. పం.

జ. అరిగాఁపు.

**అరి**[2] వి. అల్లెత్రాడు, నారి, మౌర్వి.

సీ హారదాడి ఉపరిపాంగాలోకనము నూలు కొలుపుడు నమ్మరిఁ గొలిపె మరుఁడు. కు. సం. 5. 515.

గీ. అరిబలంబుపై నొక్క టిద్యాస్త్ర మేయఁ, దలఁచి యరిఁబోసి తిగిచి యుదగ్రవృత్తిఁ, గవిసి...భా. భీష్మ. 3. 386.

**అరిపోసి** వి. (అరి[2]+పోసి) మౌర్వీమధ్యతంతు బంధము, నారినడుమ బాణము సంధించుటకై దారములతో నేసిఅలచినభాగము.

గీ. అల్లెయరి నారి గొనయు మఱి చనఁగ వెలయు, మౌర్వి తన రాఁదుచుండుఁ దన్మధ్యతంతు, బంధ మరిపోసియనఁగఁ గుంపరి యనఁగ ఆం. భా. 2.211.

జ. అరివోయు.

**అరి**[3] ప్ర. మతుబర్థమున (కలది కలవాఁడు అను నర్థమున) వచ్చును.

ఉదా: పెరవరి, కల్లరి, నేర్పరి.

**అరి** సం. వి. ఇ. పుం. 1. శత్రువు. 2. ఆఱు అను సంఖ్య. 3. విట్ఖదిరము, తుమ్మ (వ్యు.వి.) 4. (జ్యోతి) లగ్నాది షష్ఠస్థానము. న్. న-అర ములు కలది-1. చక్రము. 2. చక్రాయుధము. పుం. చక్రవాకపక్షి.

**అరిందముఁడు** సం. విశే. (అ. ఆ. అ.) 1. శత్రువుల నణఁచువాఁడు. 2. కామాద్యరిషడ్వర్గ

మును గెలుచువాఁడు. వి. అ. పుం. 1. శివుఁడు. 2. ఒకానొకఋషి.

**అరికట్టు** స. క్రి. (తె. అరి–దారులమొగ.) 1. (దారులు) కట్టు, అడ్డగించు; నిరోధించు.

సీ. తెరువుల నరుగంగ నరికట్టి చంపె నాబాల వృద్ధంబుగా బహుజనముల. నిర్వ. 3. 78.

క. ఈనియమం బీడేఱుట, కై నిశ్శంకతను ద్రోవ లరికట్టి ప్రజం, బోనీక దోఁచియును ... పరమ. 4. 200.

గీ. కాని యెవ్వారికైన విజ్ఞానయోగ, గతిని దేహేంద్రియము లరికట్టి మనము, నాఁగి యంతర్ముఖముఁ జేసి యనవరతము, నిశ్చల సమాధి నిష్ఠచే నిలుప రాదు. సీతారా. 3. 135.

2. చుట్టుకొను, పరివేష్టించు.

సీ. ఆకుశద్వీపంబు నరికట్టుకొనియుండు నెని మిదిలతులఘనఘృతాబ్ధి. భాగ. 5. 2. 65.

క. ...మఱియుఁ గొందఱు పురుషుల్.

చ. వడి నరికట్టుకొన్న జనవల్లభుఁ డంబుదపంక్తి చేతిలోఁ, బడినహిమాంశుమండలముభంగిఁ దిరోహితుఁ డయ్యె...వరాహ. 9.12,13.

వి. 1. అడ్డు; నిరోధము, నిర్బంధము.

చ. అని దనుజేంద్రుఁ డేసెడిశరావళికిన్ హను మంతువాల మె, య్యన నరికట్టు చేసి ... సీతావి. 4. 128.

సీ. ఓదంబు లేనిచో నొగి మావటీనిచే గజరాజములు నరికట్టు వడునె. సీతారా. 1. 114.

2. దుప్పటి మెలిపెట్టి రెండుబుజములయందును జందెపువాటుగా వైచికట్టినకట్టు, వేఁటకట్టు. అం. భా. 3. 31.

**అరిగ**–అరిగె, హరిగ. వి. (తె. అరిగె, పరిగె, హరిగె.) 1. డాలు, ఖేటకము. పలక,

క. అందములు విడిచి రెక్కలను, లరిగలుఁ బట్టెములుఁ గొనుచు నాకసమునకున్, బోరిఁ బోరి నెగయుచుఁ గల్పాం, చిరి కాటుకప్రోవు వంటిచీఁకటి నంతన్. కాళ. 2. 58.

సీ. వింహాలపై దండు వెడలంగఁ దమకించు నసమాయుధుని కెంపుటరిగ యనఁగ...గీ. ఇందుఁడుదయించె లోచనానందుఁ డగుచు. విక్ర. 6. 67.

2. ఎండ మొదలగువాని కడ్డుగా పట్టుకేడెము వంటి సాధనవిశేషము.

క. గుడి వెడలి వైష్ణవులు గను, పడకుండఁగఁ జెలుల నరిగ పట్టు మటంచున్, బడఁతి తన యింటి కడకున్, వడిఁ జని... శుక. 3. 74.

వ. ...ఇరుగెలంకుల నకలంక ముకుందముఖులు పట్టుహొంబట్టుజిగిగచ్చుటరిగలనిగనిగలతో. ఉ. రా. 5. 248.

**అరిగాఁపు** వి. (√అరి¹) పన్నుచెల్లించు రైతు; కప్పము చెల్లించువాఁడు.

ఉ. క్ష్మాతలనాథు లెల్ల నరిగాఁపులమాడ్కిన తీరువెట్ట...ద. శా. 737.

సీ. పరువడి దక్షిణపశ్చిమోత్తరపూర్వ దేశస్థులయిన మహీశు లెల్ల. గీ. నీక యరిగాఁపులై రిప్పు...భాం. ఆ. 5. 345.

సీ. నావాడపతిశకంధరసింధురాధ్యక్షు లరిగాఁపు లెవ్వానికరతరానికి...మనుచ. 1.11.

**అరిగాపు** వి. (తె. అరి. చూ. అరికట్టు.) పైవారు రాకుండఁ బెట్టినకావలి.

ద్వి. వదలక బంగారువంటినాయిట్టి, నదటు దూలఁగ నేసి యరిగాపుతోఁట, మఱి గొచ్చిన యట్లు మత్తపోవనము, సురుఁగక చొచ్చి...ద్వి. హరిశ్చ. పూ. 1196.

**అరిగాళ్లు** వి. బ. ద్వారపుగుజ్జుపుపీఁటలకు వెనుకటి భాగమున ఉంచెడు కమ్ములు (శ. ర.)

**అరిగించే** స. క్రి. (√అరుగు) అరుగఁజేయు.

క. అస్మద్వంశజుల నాక మరిగింపు తగన్. భా. రా. బాల. 444.

**అరిగె**–అరిగ.

గీ. కడలపొఁజులరొద లిరుగడలఁ జెలఁగ, దొంలనందఱమన్ననల్ దొంలననిచి, వడి నిగుడఁ దేజిఁగొల్పుచావడిని డిగ్గి, యరిగె నత్తటి మహిభర్త యరిగె లెత్త. సారంగ. 2.190.

**అరిగొను**–అరిపడు. .అ క్రి. (తె. అరి – దారుల మొగ) అడ్డపడు, అడ్డముతగులు.

ద్వి. అలకు బెబ్బులి యరిగోన్నయట్లు. (వీరచరిత్రము. శ. ర.)

**అరిగోలు** వి. నదిని దాఁటించుసాధనములలో నొకటి.

గీ. ఈఁదుకొయ్యలు తెప్పలు నీఁదుకాయ, లరడ లరిగోళ్లు పడవలు తరులు పుట్లు. హంస. 4. 182.

ద్వి. అరిగోలు పట్టుక యాపగ దాఁటు, పురుషుని విధమున...ద్వి. ప్రభు. 80 పా. 6 పం.

సీ. అది చంద్రమండలంబా కాదు చదలేటఁ దేలు దంతపుటరిగోలు గాని. వేం. పంచ. 4. 288.

**అరిజె** వి. ఎత్తుడునీరు పోయుటకై తొలిచి కాలువ మొదట నుంచెడుకాటిమ్రాను మొదలగునది. (బ్రౌ—'అగిణ' అని శ. ర.)

**అరితి**—అర్తి. వి. ప్రేమ, కూరిమి.

సీ...అరితి. గీ. బాళి ప్రేముడి మచ్చిక మక్కువ యనఁ, బ్రేమ దోఁచును. ఆం. భా. 1. 136.

జ. అరితికాఁడు.

**అరితికాఁడు** విశే. (√అరితి) ప్రియుఁడు.

గీ. అరితికాఁడైనపూవిల్తు నట్టెకొట్టి, కల్ల వెల్లిగఁ జేసె నాకాఁపురంబు. పార్వ. 2 117.

**అరిత్రగాధము** సం. విశే. (అ. ఆ. అ.) తెడ్డునకు తగులునంత మెరక గలది; లోఁతు లేనిది. (జలము.)

**అరిత్రము** సం. వి. అ. న. 1. ఓడతెడ్డు. 2. చుక్కాని.

**అరిదళము**—హరిదళము. వి. (సం. హరితాళం.) పసుపుపచ్చనిధాతువిశేషము. ఆం. భా. 2. 280.

**అరిది** విశే. (క. అరిదు, అరుదు. త. అరిదు.)

1. అసాధారణము, అపూర్వము, అపురూపమయినది.

చ. అరిదితపోవిభూతి నమరారులబాధలు వొందకుండఁగా, నురగుల నెల్లఁ గాచిన... భార. ఆది. 1. 105.

క. అరిదివిలుకానియుజ్జ్వల, శరం మొక్కని నొంచుఁ దప్పి చనినం జను... భార. ఉద్యో. 2. 36.

సీ. ...అరిదికూఁతురు త్రిలోకైకసుందర ... హరి. ఉ. 7. 162.

2. ఆశ్చర్యకరము, వింతయైనది.

క. వినయజ్ఞుఁడు ధార్మికుఁ డితఁ, డన బరఁగిన నీవు నిట్టులగుట యరిది యిప్పనికి నిమిత్తం బేమో, యనఘా కలుగంగఁ జాలు నాత్మఁ దలంపన్. హరి. పూ. 1. 182.

3. అశక్యము; దుష్కరము; దుర్లభము; దుస్సహము.

(అశక్యము)

క. పరమార్థప్రతిభఁ దమో, హరు నచ్యుతు భీష్ముఁ డెఱిఁగిన ట్లెఱుఁగఁగఁ, నీ, కరిది శిశుపాల పెద్దల, చరితం బల్పులకు దెలియఁగ శక్యమె యెందున్. భార. సభా. 2. 19.

క. మును మమ్ముఁ బొగడి పదపడి, యనివారల దెలుప నరిది యని సొత్తుగఁ జెప్పినమాటలు నేనొడఁబడ... భార. ఉద్యో. 1. 322.

(దుష్కరము.)

ఆ. దానికంటె నరిది దలపోయ నజ్ఞాత, వాసముజ్జ్వలాంగభాసమాను, లైనమీకు ... భార. ఉద్యో. 1. 106. (చూ. 105 పద్యము.)

(దుర్లభము)

క. తోడు దొన లేని యప్పటి, క్రీడిఁ గొలఁది యట్టి దధిప కినియక విను మేఁ, దోడై రానెదురుట గడుఁ, గీడు వలవ దుడుగ వయ్య గెలుపరిది సుమీ. భార. ఉద్యో. 3. 340.

(దుస్సహము)

చ. అరిది నికృంతనాఖ్యనిరయం బది యందుఁ గులాలచక్రముల్, దిరుగుచునుండు వాని పయిఁ దెచ్చి యఘాత్ములఁ బెట్టి... మార్క. 2. 27. (శ. ర.—'అరుదు' అని ముద్రి)

**అరిపడు** అ. క్రి. (త. అర—దారులమొగ) అడ్డపడు, అడ్డమువచ్చు.

చ. ...తద్భుజనాంతరాయత, త్పరిమతి మాకు నిప్పుడరిపడ్డదు రాత్ముల నేఁడు గంటిరే. భాగ. 8. 523.

క. త్రోవకు నరిపడి దస్యులు, పోవకు మని ... పద్మ. 10. 300.

**అరిమర్దము** సం. వి. అ. పుం. 1. శత్రువులను పీడించుట. 2. కాసమర్దము, కసింద (వృ. వి.)

**అరిమి(ర్మి)**—అర్మలి. వి. (క. అరుమె.) ప్రేమ.

గీ. గాలికిని బూచుగేదఁగికరిణి నన్నుఁగాన్పులుడిగియు మాయమ్మ గర్భమయ్యె, నతిశయంబునఁ బుట్టిన దనుచుఁ గాదె, యరిమి పెరిమలఁ బెంచె నోయతివలారా. పార్వ. 4. 117.

సీ. యశురాజుఁదలంచి యశుగోత్రంబుల నత్రు పూరము నించు నర్మిమిగిలి. కాశీ. 2. 149.

**అరిమేదకము** సం. వి. అ. పుం. మలమందుఁ బెరుఁగునొక పురుగు.

**అరిమేదము** సం. వి. అ. పుం. విట్ఖదిరము, వెలితుమ్మ (వృ.వి.)

**అరివోయు** స. క్రి. (√అరి²) సజ్యముచేయు, ఎక్కుపెట్టు.

ఉ. ...ఇ క్కడఁదవిల్లరివోసినప్రోడ కేను మేలాఁగ నొసంగుదుగా....అచ్చ. రా. బాల. 172.

**అరిపము** సం. వి. అ. పుం. గుదస్థానమున నుండు మాంసమునఁ బుట్టునొకరోగము. న. అవిచ్ఛిన్నముగా వర్షించుట.

**అరిష్ట** సం. వి. ఆ. స్త్రీ. 1. కటుకరోహిణి (వృ.వి.) 2. కశ్యపునిపత్ని, దక్షునికూఁతురు.

**అరిష్టకము** సం. వి. అ. పుం. కుంకుడుచెట్టు.

**అరిష్టతాతి** సం. విశే. (అ.) సుఖకరుఁడు, క్షేమంకరుఁడు, మేలు చేయువాఁడు.

**అరిష్టము** సం. విశే. (అ. ఆ. అ.) 1. హింసింపఁబడనిది. 2. నిరుపద్రవము, క్షేమము గలది. వి. అ. పుం. 1. రాపులుఁగు, కంకము. 2. కాకి. 3. వెల్లుల్లి (వృ.వి.) 4. వేఁపచెట్టు. 5. కుంకుడు (వృ.వి.) 6. అనిష్టస్థానగత మగు సూర్యాది గ్రహము. న. 1. కీడు, అశుభము. 2. మరణచిహ్నము, 3. శుభము. 4. పురుటిల్లు. 5. మజ్జిగ. 6. మద్యము. 7. భూకంపము మొదలగుఅనిష్టసూచక మగునుత్పాతము. 8. రాగి, తామ్రలోహము.

**అరిసె** వి. (సం. అర్శః, అరిషః. క. అరసె.) అర్శోరోగము, మూలవ్యాధి.

2. నల్లేరుపసముతోడం, బెల్లం గల్కంబు పిండి చిట బెల్లంబుగా, బెల్లంచి యావునేతగా, దెల్లఁ బైనట్లు దినినఁ దీఱున్నరిసెల్. చికిత్స (చి.ని.)

**అరుంతుదము** సం. విశే. (అ. ఆ. అ.) మర్మస్థానమును పీడించునది, ఎక్కువదుఃఖమును గలిగించునది.

**అరుంధతి** సం. వి. ఈ. స్త్రీ 1. వసిష్ఠునిభార్య. 2. ఒకానొకనక్షత్రము. 3. దక్షునికూఁతురు.

**అరుఁగు**—అరఁగు.

చ. బిసబిసఁ బోక యెయ్యనడపిపుడరుంగు మెఱుంగు మెట్టికల్, మసలిక నెక్కుఁ డెచ్చరికమచ్చిక నిల్పుఁడు భద్రపీఠికగా. పాంచా. 4. 21.

**అరుకలి** వి. (క. అఱుగులి—వేఁటకాఁడు.) పందెగాఁడు.

క. తానఁట యరుకలి యనుచును, మానక పోరించు నధికమాత్సర్యమునన్. దశకు. 9. 32.

**అరుగు** అ. క్రి. 1. చను, పోవు.

వ. .. జననీసహితంబు దక్షిణపాంచాలంబున కరుగువారు... భార. ఆది. 7. 158.

2. కడచు, గతించు.

క. ధనదానములను బ్రియభో, జనదానములను విశిష్టసద్ద్విజతతులం, దనుపుచు నుండఁగ దత్పురమున షణ్మాసములు భరతముఖ్యుల కరిగెన్. భార. ఆది. 6. 158.

వ.... దినంబులు గడచె వారంబు లరిగెఁ బక్షంబులు సనియె...హరి. 7. 11.

3. నశించు.

మ. ...తీవ్రవాటోపవద్వాహినీ, శరవేగంబున నాత్మమూలబలము ల్జాఱగా దళాడంబరం, బరుగం గొమ్మలు వోవ...వసు. 1. 45.

జ: అరిగించు, అరుగుదెంచు, అరుదెంచు

**అరుగుదెంచు** — అరుదెంచు అ. క్రి. (√అరుగు) 1. వచ్చు.

గీ. ...జగత్త్రాణుఁ డొడలు, మనుపఁ జెఱుపంగ నొడయండు సనుట మగుడ,నరుగు

దెంచుట వి.తగా దశని కెందు. భార. ద్రో. 2. 176.

గీ. శంకరుండు గిరాతవేషంబు దాల్చి,యగజ చెంచెతయై తోడ నరుగుదేరఁ, బాడి నోం కార దివ్యచాపము ధరించి,వచ్చెవిప్వచ్చు వః తపోవనముకడకు. హం. 7. 41.

2. అరుగు, వెళ్లు. (ఇటస్వార్థమున 'తెంచు')

సీ. విను సామి నీతండ్రి పనుపున నీమామ యగు కుంభకునియింటి కరుగుదెంచి, యతని నేమం జెల్ల నాసి మీసేమ మెలమితో నతనికిఁ దెలియఁ జెప్పి.... వచ్చునెడను ... నీలా. 2. 12.

**అరుచి** నం. వి. ఇ. స్త్రీ. 1. ఇష్టములేమి, రోత. 2. నోటికి ఇతవు కాకుండుట. 3. కాంతిలేమి.

**అరుజు** వి. మత్స్యవిశేషము, శాలము.

సీ. ...అరుజు నిల్లెఘుఁజేప యాకు జెల్ల. హంస. 4.187.

**అరుణ** నం. వి. ఆ. స్త్రీ. 1. అతివస (వృ.వి.) 2. మంజిష్ఠ (వృ.వి.) 3. తెల్లతెగడ (వృ.వి.) 4. నల్లతెగడ (వృ.వి.) 5. పెద్దపాఁప. ఇంద్ర వారుణి (వృ.వి.) 6. శారిబ, మామెన (వృ.వి.) 7. గురివెంద (వృ.వి.) 8. ముండతిక్త (వృ.వి.)

**అరుణబభ్రువు** నం. విశే. (ఉ) ఎఱుపు పసుపు గలిసిన వర్ణము గలది.

**అరుణము** నం. విశే. (అ, ఆ. అ.) 1. ఇంచుక ఎఱ్ఱనిది; ఎఱ్ఱనిది. 2. కపిలవర్ణము గలది, నలుపు కలిసిన యెఱుపు గలది. వి. అ. పుం. 1. ఇంచుక ఎఱుపు; ఎఱుపు. 2. కపిలవర్ణము. నలుపు కలిసిన యెఱుపు. 3. సంధ్యారాగము 4. ఒకవిధ మగుకుష్ఠవ్యాధి. (ఇందెఱ్ఱనిపొడలు గలిగి చర్మమునకు స్పర్శశక్తి పోవును.) 5. పొన్న (వృ.వి.) 6. జిల్లేడు. (వృ.వి.) న. 1. బంగారము. 2. కుంకుమము. 3. సిందూరము. 4. రాగి. 5. రక్తము, నెత్తురు.

క. వీరుండు తక్షత్రియులందన,దారుణపరశువున జామదగ్న్యుఁడు రౌద్రా,కారుఁడు వధియించి తదీ,యారుణమున నేను మడుపు లాపాదించెఁ. భార. ఆ. 2.260.

**అరుణలోచనము** నం. విశే. (అ. ఆ. అ.) ఎఱ్ఱని కన్నులు గలది. వి. అ. పుం. పావురము.

**అరుణసారథి** నం. వి. క. పుం. - అరుణుఁడు సారథిగాఁ గలవాఁడు - సూర్యుఁడు.

**అరుణాత్మజ** నం. వి. ఆ. స్త్రీ. 1. యమున 2. తపతి.

**అరుణాత్మజుఁడు** నం. వి. అ. పుం. 1. జటాయువు. 2. శని. 3. సావర్ణి మనువు. 4. కర్ణుఁడు 5. సుగ్రీవుఁడు. 6. యముఁడు. 7. (ద్వి) అశ్వినీకుమారులు, దేవవైద్యులు.

**అరుణానుజుఁడు** నం. వి. అ. పుం. గరుడుఁడు.

**అరుణార్చి** నం. వి. స్. పుం. ఎఱ్ఱనికాంతి గలవాఁడు - సూర్యుఁడు.

**అరుణితము** నం. విశే. (అ. ఆ. అ.) 1. ఎఱ్ఱగాఁ జేయఁబడినది. 2. ఎఱుపు కలది.

**అరుణిమ(మము)** నం. వి. న్. పుం. ఎఱుపు.

**అరుణుఁడు** నం. వి. అ. పుం. 1. అనూరుఁడు, సూర్యసారథి. 2. సూర్యుఁడు.

**అరుణోదయము** నం. వి అ. పుం. సూర్యోదయమునకుఁ బూర్వము నాలుగుగడియలకాలము. (చతస్రో ఘటికాః ప్రాత రరుణోదయ ఉచ్యతే.)

**అరుణోదయసప్తమి** నం. వి. ఈ. స్త్రీ. మాఘశుక్ల సప్తమి, రథసప్తమి.

**అరుణోపలము** నం. వి. అ. పుం. పద్మరాగము, కెంపు.

**అరుదారు** అ. (క్రి. √అరుగు) అరుదగు, అపురూప మగు.

సీ. అరుదారు మేలుకట్లాయిత బై చూడ నొప్పారి తను పరుచవ్వరములు. భార. ఉద్యో. 1.92.

**అరుదు** వి. ఆశ్చర్యము.

ద్వి. అన విని దశరథుఁ డావాక్యములకు, మనమున నరుదంది మఱియు నిట్లనియె. రం. రా. ఉ. 102 పే. 18 పం.

వి. అధరణవిశేషము.

ద్వి. ...గంది, తొలిమాడ అరుదులు తోరంబు లాది,యగు సొమ్ములిడి ... ద్వి. భాగ. 1.8. పొ.

విశ — అరిది.

(ఆశ్చర్యకరము, వింత)

క. ...శాశ్వతుఁడగున,ప్పురుషుఁడు రవియంద వెలుఁగు, నరుదంతటికంటెఁ గలదె యగ్రిమ వర్ణా. భా. శాం. 6. 602.

చ. అరు దగునీతపమ్మునకు నమ్ముదువోయితి నేలుకొమ్ము...హరి. 4. 36.

ఉ. ...ఈయరుదులు వినఁబడియె( = ఈవింత మాటలు విన నయ్యెను.) భా. రా. యు.61.

క...అరుదుం జూపెద ( = అద్భుతకృత్యమును చూపెదను.) భా. రా. యు. 96.

(అపురూపము, అపూర్వము.)

రగడ. అరు దై నశంఖచక్రాదిపరికరములును. పం.మ. 1. 38.

(అశక్యము)

సీ. చిత్రగుప్తునకైనఁ జింతింప నరు దై నగణిత విద్యాప్రౌఢి ఘనతకెక్కె. విక్ర. 1. 50.

(దుష్కరము)

క.... వాయుతనయుఁడు లోకో,త్తరుఁ డాతఁ డుదక్కఁగ న, య్యరుదుంబని చేసి రాఁగ నన్యులవశమే. భా. రా. సుం. 545.

(దుస్సహము)

మ. అరుదుంగీలలు గ్రమ్మ నాశ్రమముపై నాగ్నేయబాణావళుల్, పరఁగింప... భా. రా. బాల. 563.

(దుర్లభము)

చ. ఒకగుణ మున్నచోట మఱియొక్కగుణం బరుదెన్ని చూడఁగా...దశా. 2. 256.

జ. అరుదారు, అరుదుపడు.

**అరుదుపడు** అ. క్రి. (√అరుదు) ఆశ్చర్యపడు.

గీ. బెదరు లేకిట్లు మిక్కిలి గదియవచ్చి, యున్న తనదిట్టతనమున కువిద లెల్ల, నరుదుపడఁ గృష్ణుఁ జూచి...ప్రభా. 2. 16.

**అరుదెంచు**—అరుగుదెంచు (√అరుగు.)

(వచ్చు)

క. సమయం బరుదెంచెఁ దొంటిచందము గలదే. భార. విరా. 4. 193.

(పోవు)

క. చంచలలోచన యెం దరు,దెంచెనొ నను గానలేక...రసిక.6.44. జై. భా. 4.122.

**అరులు(ర్లు)** వి. (క. అరులు, అర్లు. త. అరుళ్.) వాత్సల్యము, ప్రేమ.

ఉత్సా:...ఇక్కుమారుమీఁద నా, యుల్ల మున కరులు...మిగిలియున్నయది...దశకు. 12. 6.

సీ. అక్కులి యంచన నరులునా నర్ల న వాత్సల్య సంజ్ఞయై పరఁగుచుండు. ఆం. భా.1. 137.

అరులుమరులు,అర్లుమర్లు (క. అరుళుమరుళు, అరులుమరులు.)—ముదిమిచే మనసునకుఁ గలుగు తబ్బిబ్బు,అమితప్రేమ,వెఱ్ఱిప్రేమ.

**అరువరి** విశ. (√అరువు) అప్పు పుచ్చుకొనినవాఁడు, అధమర్ణుఁడు.

సీ. అప్పులవాఁ డన నగు నుత్తమర్ణాఖ్య యధ మర్ణుఁడు చెలంగు నరువరి యన. ఆం. భా. 2. 229.

**అరువు** స. క్రి. అచ్చు, (పన్ను దండుగ మొదలగు నవి) ఇచ్చు; విధిగావిచ్చు.

క. కావఁ గొనిపోయి యేమఱి,గోవుల దాఁ జెఱిచెనేని గొల్లఁడు పతికిన్, గోవుల వెల యరువందగు, భూవరునకుఁ గొంత దండు వును బెట్టఁదగున్. విజ్ఞా. ప్రా. 11.

క. ఇదియెల్లను నధికారికి,విదితంబుగఁదెలుపఁ దగునె వెసఁ దెలుపనిచోఁ, దుద నేంమి మనదెస నగు,నదిగా కిసొమ్ము నరువు మందు రటంచున్. విప్ర. 5. 7.

వ. ...శ్రీభీమేశ్వరమహాదేవరకు ఎక్కలి గణ పతిదేవనికొడుకు మురారిగణపయ దనకు ఆయుష్కామ్యార్థముగాం బెట్టినఅఖండ్డ వర్తికలోహద(ం)డ్డుదీపం ఒక్కంటికి మూం డవు అడపుకా మెటోయనిపూంట్టను నూం క్కబోలమారనివసమునం బెట్ట నపసులు 10దింటకిదినమొక్కంటికి త్రిభువనాంకుశ మానెండునెయి అరువం గలవాండు. ద.శా. 4. 1200. హరి. ఉ. 6. 99.

వి. వెల తర్వాత ఇచ్చెడుపద్ధతిని చేసెడు ధాన్యాది ఋణము.

(వ్యవ) అతఁడు నాల్గువీసెలబెల్లము అరువు తెచ్చెను. వాని కాయూరిలో అరువు పుట్టదు. ఇది అరువుబేరమా రొక్కపుబేరమా?

**అరుష్కము** సం. వి. అ. పుం. నల్లజీడి (వృ.వి.)

**అరుష్కరము** సం. విణ. (అ. ఈ. అ.) గాయ పఱుచునది. .వి. అ. పుం. నల్లజీడి (వృ.వి.)

**అరుష్కృతము** సం. విణ. (అ. ఆ. అ.) గాయ పఱుపఁబడినది, పుండుచేయఁబడినది.

**అరుసము** వి. (సం. హర్షః. ప్రా. హరిసో.) సంతోషము.

చ. అరుసముఁ జెంది పచ్చిరఁట యందఱు ముందటిలీల గుంపులై. ఉ. రా. 2 6.

**అరుసు**—అరిసు.

గీ. అనుచుఁ జెల్వపుఁజెంగల్వయరిదికిరుసు, దురుసుమాస్టిని బదరి యయ్యరుసుపట్టి, గురుసుమద్యోతనుని దూటి గరిసు మీటి, పేరె ములు వాటెడునురుత్కృమారు వనియె. కువల. 4. 31.

క. ఆవందలు సాల్వకోన మరుసున కెనయే. అప్ప. 3. 29.

**అరుస్సు** సం. వి. స్. పుం. ఎఱ్ఱచంద్ర (వృ.వి.) న. 1. మర్మము, ఆయువుపట్టు. 2. వ్రణము. 3. గాయము.

**అరుహ** సం. వి. ఆ. స్త్రీ. నేలయుసిరిక (వృ.వి.)

**అరూషుఁడు** సం. వి. అ. పుం. సూర్యుఁడు.

**అరోకము** సం. విణ. (అ. ఆ. అ) 1. ఛిద్రము లేనిది, కన్నములులేనిది. 2. దీప్తిలేనిది.

**అరోచకము** సం. విణ. (అ. వికా. అ.) 1. ప్రకాశింపనిది, వెలుఁగనిది. 2. అరుచి కలిగించునది, వెవకలిగించునది. వి. అ. పుం అన్నము ఇతవు కాకుండుట, ఒకరోగము;

**అరోచకి** సం. విణ. (న్. నీ. న్.) అరోచకము కలవాఁడు, అన్నాదులునయింపనివాఁడు.

**అర్కకాంత** సం. వి. ఆ. స్త్రీ. – సూర్యునిభార్య – 1. సంజ్ఞాదేవి. 2. ఛాయాదేవి. 3. పొద్దుతిరుగుడు (వృ.వి.)

**అర్కట**—అటకడ.

(స్కంధము, మూఁపు)

ద్వి. జనకుఁ దర్కటఁబెట్టుకొని యొకనాఁడు, చని సరోవరతీరమునజాలు నునిచి. బస.పు. 6. 114.

**అర్కతనయ** సం. వి. ఆ. స్త్రీ. 1. యమున. 2. తపతి.

**అర్కతనయుఁడు** సం. వి. అ. పుం. 1. కర్ణుఁడు. 2. యముఁడు. 3. వైవస్వతమనువు. 4. సావర్ణిమనువు. 5. శని. 6. సుగ్రీవుఁడు. (ద్వి) అశ్వినీకుమారులు. దేవవైద్యులు.

**అర్కపర్ణము** సం. వి. అ. పుం. జిల్లేడు (వృ.వి.)

**అర్కపుష్పిక** సం. వి. ఆ. స్త్రీ. కుటుంబిని, కొలపాల (వృ.వి.)

**అర్కప్రియ** సం. వి. ఆ. స్త్రీ. 1. సూర్యునిభార్య. (సంజ్ఞ, ఛాయ.) 2. జప, దాసనము (వృ వి.)

**అర్కబంధువు** సం. వి. ఉ. పుం. గౌతమముని, బుద్ధుఁడు.

**అర్కభక్త** సం. – అర్కకాంత.

**అర్కభము** సం. వి. అ. న. 1. సూర్యుఁడు ప్రవేశించునక్షత్రము. 2. సింహరాశి. 3. ఉత్తరఫల్గునీనక్షత్రము

**అర్కము** సం. వి. అ. పుం. 1. జిల్లేడు. (వృ.వి.) 2. స్ఫటికము. 3. రాగి. 4. పండ్రెండు అను సంఖ్య.

**అర్కమూల** సం. వి. ఆ. స్త్రీ. – అర్కమూలము (వృ.వి.)

**అర్కమూలము** సం. వి. అ. పుం. నాగదమని, ఈశ్వరి (వృ. వి.) (దీనివేరు పాములకు దుస్సహము.)

**అర్కవల్లభము** సం. వి. అ. పుం. బంధూకము, మంకెన (వృ.వి.)

**అర్కవాసరము** సం. వి. అ. పుం. ఆదివారము.

**అర్కవివాహము** సం. వి. అ. పుం. జిల్లేడుచెట్టును కన్యకగాఁ గొని పెండ్లియాడుట. (ఇది మూఁడవభార్యను బెండ్లియాడుటకు మునుపు విహితము. 'చతుర్థాదివివాహార్థం తృతీయేఽర్కం సముద్వహేత్, ఆదిత్యదివసే వాపి

హ స్తర్క్షే వా శనైశ్చరే, శుభే దినే వా పూర్వాహ్ణే కుర్యాదర్కవివాహకమ్.' కశ్య పస హిత. దీనిచేత మూఁడవభార్య నాలుగ వది యగును.)

**అర్క-వేధము** సం. వి. అ. పుం. తాళీసపత్రి (వృ.వి.)

**అర్క-వ్రతము** సం. వి. అ. పుం. 1. మాఘశుక్ల సప్తమి మొదలగు దినములందు సూర్య ప్రీత్యర్థమై చేయు ఒకానొక వ్రతము. 2. సూర్యుఁడు మెల్లమెల్లఁగా జలమును గ్రహిం చునట్లు రాజు ప్రజలకు నొప్పి గలుగకుండ పన్ను పుచ్చుకొను పలయును అనునియమము.

**అర్క-హిత** సం-అర్క కాంత.

**అర్కా-హ్వము** సం. వి. అ. పుం. జిల్లేడు (వృ.వి.)

**అర్కుఁడు** సం. వి. అ. పుం. 1. సూర్యుఁడు. 2. అన్న. 3. ఇంద్రుఁడు.

**అర్కేందుసంగమము** సం. వి. అ. పుం. అమా వాస్య.

**అర్కో-పలము** సం. వి. అ. పుం. సూర్యకాంతమణి.

**అర్గ(ల)ళ** సం. వి. ఆ. స్త్రీ-అర్గళము.

**అర్గ(ల)ళము** సం. వి. అ. న. 1. తలుపుగడియ. 2. ప్రతిరోధము. అర్గళి. పుం. న. కల్లోలము, పెద్దతరంగము.

**అర్గ(ళి)ళి** సం. వి. ఈ. స్త్రీ. చిన్నగడియ.

**అర్గ(లి)ళిక** సం. వి. ఆ. స్త్రీ-అర్గళి.

**అర్గ(ళి)ళితము** సం. విణ. (అ. ఆ. అ.) గడియవే యఁబడినది. (తలుపు, మొ.)

**అర్గ(ళీ)ళీయము** సం. విణ (అ. ఆ. అ.) గడియకు సంబంధించినది. (కఱ్ఱ, మొ.)

**అర్గ(ల్య)ళ్యము** సం-అర్గళీయము.

**అర్ఘము(ఘువు)** సం. వి. అ. పుం. 1. వెల.

చ. అవని యరాజకం బయినయప్పుడ భూప్రజ లందు నిర్వ్యథ, ద్విజులుఁ దొలఁగు దేహముని ముఖ్యులు వాయుదురోలి పృష్టితే,దవుమతి యర్ఘపుల్ దఱుఁగు నందురు... భార. శాం. 4. 248.

ఆ. అర్ఘులోలిఁ జెరిఁగె నవనిశు లెల్ల నీ, యనుజ వీర్యవిజితులయి ద్వదీయ, శాసనస్థులై రి... భార. సభా. 1. 271.

2. పూజావిధి.

**అర్ఘసంఖ్యానము** సం. వి. అ. న. వెలపట్టీ.

**అర్ఘసంస్థాపనము** సం. వి. అ. న. వెల నిర్ణయిం చుట.

**అర్ఘ్యము** సం. విణ. (అ. ఆ. అ.) 1. పూజనీయము, పూజకుఁ దగినది. 2. పూజకొఱకైనది. (జలా దులు.)

అష్టార్ఘ్యములు: పెరుఁగు, తేనె, నెయ్యి, అక్షత లు గఱిక నువ్వులు, దర్భ, పుష్పము. (ఉదకము, పాలు, కుశాగ్రములు, పెరుఁగు, నేయి, అక్షతలు, యవలు, తెల్లావలు అని కొందఱు.)

3. మిక్కిలి వెలగలది.

**అర్చ** సం. వి. ఆ. స్త్రీ. 1. పూజ. 2. పూజించుట కైనప్రతిమ.

**అర్చకుఁడు** సం. విణ. (అ. ర్చికా. అ.) పూజించు వాఁడు.

**అర్చన** సం. వి. ఆ. స్త్రీ-అర్చనము.

**అర్చనము** సం. వి. అ. న. పూజించుట, పూజ.

**అర్చనీయుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) పూజింపఁ దగినవాఁడు.

**అర్చి(ర్చిస్సు)** సం. వి. స్. న. స్త్రీ. 1. అగ్ని జ్వాల. 2. కిరణము. 3. కాంతి, దీప్తి.

**అర్చించే** సం. న. క్రి. పూజించు. మార్క. 6. 124.

**అర్చితుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) పూజింపఁ బడినవాఁడు.

**అర్చిష్మంతుఁడు** సం. విణ. (త్. ష్మతీ. త్.) కాంతి గలవాఁడు. వి. త్. పుం. 1. అగ్ని. 2. సూర్యుఁడు. 3. విష్ణువు.

**అర్చిష్మతి** సం. వి. ఈ. స్త్రీ. అగ్ని దేవునిపట్టనము.

**అర్చ్యుఁడు** సం-అర్చనీయుఁడు.

**అర్జకము** సం. వి. అ. పుం. 1. సితపర్ణాసము, తెల్ల గగ్గెర (వృ.వి.) 2. తులసి (వృ.వి.) ('భూతు లసి' అని రం. ని.)

**అర్జకుఁడు** నం. విశే. (అ. క్లీ. అ.) సంపాదించువాఁడు.

**అర్జనము** నం. వి. అ. న. సంపాదనము.

**అర్జుక** నం. వి. అ. స్త్రీ. (నాట్యపరిభాషయందు) వేశ్య.

**అర్జునము** నం. విశే. (అ. ఈ. అ.) తెల్లనిది. వి. అ. పుం. 1. తెలుపు. 2. నెమిలి. 3. ఒకవిధమైన చర్మవ్యాధి. 4. ఏఱుమద్ది, తెల్లమద్ది (వృ.వి.) 5. కరవీరము, గన్నేరు (వృ.వి.) న. 1. వెండి. 2. బంగారము. 3. కంటిరోగము. 4. గడ్డి (వృ.వి.)

**అర్జుని** నం. వి. ఈ. స్త్రీ. 1. ఆవు. 2. ఒకజాతి పాము. 3. ఉష, రాత్రి. (వై. ని.) 4. బాహుదా నది. 5. కుంటెనకత్తె, కుట్టిని.

**అర్జునుఁడు** నం. వి. అ. పుం. 1. పాండవులలో మూఁడవవాఁడు. 2. కార్తవీర్యార్జునుఁడు. 3. తల్లికొకఁడేకొడుకైనవాఁడు, తోఁబుట్టువులు లేనివాఁడు.

**అర్జునోపమము** నం. వి. అ. పుం. టేఁకుమ్రాను (వృ.వి.)

**అర్ణము** నం. వి. అ. పుం. వర్ణము, అక్షరము.
శ్లో. పంచార్ణో మనురీరితః. (తంత్ర.)

**అర్ణవము** నం. వి. అ. పుం—నీరుకలది—సముద్రము.

**అర్ణస్సు(ము)** నం. వి. స్. న. జలము, నీరు.

**అర్ణోదము** నం. విశే. (అ. ఆ. అ.) నీటి నిచ్చునది. వి. అ. పుం. 1. మేఘము. 2. తుంగ (వృ.వి.)

**అర్ణోరాశి** నం. వి. ఇ. పుం. జలరాశి, సముద్రము.

**అర్తనము** నం. వి. అ. న. 1. నింద. 2. రోఁత, జుగుప్స.

**అర్తి** నం. వి. ఇ. స్త్రీ. 1. ఆర్తి, బాధ. 2. వింటికొప్పు.

**అర్థకరము** నం. విశే. (అ. ఈ. అ.) 1. ధనమును కలిగించునది. 2. ఉపయోగకరము, లాభకరము.

**అర్థగౌరవము** నం. వి. అ. న. అర్థగాంభీర్యము, అర్థ మెక్కువగా నుండుట.

**అర్థదూషణము** నం. వి. అ. న. 1. ధనమునుపాడు చేయుట. (ఇదిసప్తవ్యసనములలో నొకటి.)
శ్లో. పానంస్త్రీమృగయా ద్యూతమర్థదూషణమేవచ, వాగ్దండయోశ్చ పారుష్యం వ్యసనాని మహీభుజామ్. హితో. విగ్ర. 115.
2. క్రోధజము లగుఅష్టవ్యసనములలో నొకటి,
(క) ధన మపహరించుట.
(చ) ఈయఁ దగిన సొమ్ము నీయకుండుట. మను. 7. 48.

**అర్థదోషము** నం. వి. అ. పుం. అర్థమందలిదోషము. (కావ్యదోషములలో నొకవిధమగుదోషము. అర్థదోషములు పదునెనిమిది.

**అర్థన** నం. వి. అ. స్త్రీ. ప్రార్థనము, యాచన.

**అర్థనము** నం. వి. అ. న—అర్థన.

**అర్థనీయము** నం. విశే. (అ. ఆ. అ.) ప్రార్థింపఁదగినది.

**అర్థపతి** నం. వి. ఇ. పుం. 1. రాజు. 2. కుబేరుఁడు.

**అర్థపరుఁడు** నం. విశే. (అ. ఆ. అ.) 1. ధనాశ గలవాఁడు. 2. పిసినిగొట్టు.

**అర్థప్రకృతి** నం. వి. ఇ. స్త్రీ. (నాటక) ప్రబంధ ప్రతిపాద్యమగుకథయొక్క ప్రయోజనసిద్ధికి హేతువు. (బీజము, బిందువు, పతాక, ప్రకరి, కార్యము అని అర్థప్రకృతు లైదు.)

**అర్థప్రయోగము** నం. వి. అ. పుం. 1. కుసీదము, వడ్డివ్యాపారము. 2. రాజకార్యమును నడపుట.

**అర్థము** నం. వి. అ. పుం. 1. శబ్దార్థము. (ఇది వాచ్యము లక్ష్యము వ్యంగ్యము అని మూఁడు విధములు.) 2. వస్తువు. 3. ఇంద్రియములచే గ్రహింపఁదగిన విషయము. (శబ్దము స్పర్శము రూపము రసము గంధము.) 4. నిమిత్తము, కారణము. 5. కార్యము, ప్రయోజనము. 6. ధనము. 7. నాలుగు పురుషార్థములలో ధన సంపాదనరూప మగు నొకపురుషార్థము. 8. నివృత్తి. (ఉదా: మశకార్థో ధూమః.) 9. యాచన 10. ప్రకారము. 11. న్యాయము. 12. రాజ్యపరిపాలనాతంత్రము. (స్వరాష్ట్ర చింతన పరరాష్ట్ర చింతన మొదలగునది.) 13. వ్యవహారము.

**అర్థవంతము** నం. విశే. (త్. వతీ. త్.) 1. ధనము గలది. 2. శబ్దార్థము గలది. 3. సార్థక మయినది, అన్వర్థమైనది. 4. సఫలమైనది.

**అర్థవాదము** సం. వి. అ. పుం. 1. వేదభాగ విశేషము. (విధినిషేధవాక్యములను బలపఱచి బోధించుటకై నిందారూపముగాఁ గాని స్తుతిరూపముగాఁ గాని చేసెడువివరణము- పురాకల్పము ఇతిహాసము మొదలగునవిగూడ అర్థవాదములే.)

2. స్తుతి గాని నింద గాని ప్రయోజనముగాఁ గల లౌకిక వాక్యము.

దుర్ముఖః-ఉపస్తువంతి దేవం పౌరజానపదా విస్మారితా వయం మహారాజ దశరథస్య రామభద్రేణేతి.

రామః-అర్థవాద ఏషః. (ఉ. చ. 1. 40 పొ.)

**అర్థవిదుఁడు** సం. విణ. (డు.) 1. కార్యజ్ఞుఁడు, కార్య మెఱిగినవాఁడు. 2. అర్థము తెలిసినవాఁడు.

**అర్థవిద్య** సం. వి. అ. స్త్రీ. లోకవ్యవహారజ్ఞానమును కలిగించువిద్య, నీతిశాస్త్రము.

**అర్థశాస్త్రము** సం. వి. అ. న. దండనీతి, రాజనీతిశాస్త్రము.

**అర్థశౌచము** సం. వి. అ. న. ధనవిషయ మగుపరిశుద్ధి. న్యాయముగా ధనమును సంపాదించుట.

**అర్థసంగ్రహము** సం. వి. అ. పుం. ధనము కూడఁబెట్టుట, ధనసంపాదనము.

**అర్థాంతరన్యాసము** సం. వి. అ. పుం. ఒకయర్థాలంకారము, (ఒకవిషయమును మొదట చెప్పి దానిని సమర్థించుటకు మఱియొకవిషయమును చెప్పుట.)

ఉదా: 1. గుణవంత మగువస్తువుయొక్క సంసర్గమున నీచవస్తువు కూడ గౌరవింపఁబడును. పువ్వులసంబంధమువలన నారయును శిరమున ధరింపఁబడుచున్నది గదా!

2. హనుమంతుఁడు సముద్రమును దాఁటెను. మహాత్ములకు దుష్కర మెద్దియు లేదుగదా!

**అర్థాపత్తి** సం. వి. ఇ. స్త్రీ — చెప్పఁబడనియర్థము సిద్ధింపఁజేయునది-1 (మీమాంస) ప్రమాణములలో నొకటి.

ఉదా: దేవదత్తుఁడు బలిసి యున్నాఁడు పగట భుజింపఁడు- అనుచో భోజనము లేనియెడల బలియుట సంభవింపదు గావున అతఁడురాత్రి భుజించుచున్నాఁడు అనునర్థము సిద్ధించుచున్నది.

2. (అలం) ఒకానొక అర్థాలంకారము.

ఉదా: ఓవనితా! నీముఖము చంద్రునే జయించి నప్పుడు పద్మములమాట వేఱె చెప్పవలెనా?

**అర్థాలంకారము** సం. వి. అ. పుం. అర్థము ననుసరించి వచ్చినయలంకారము. (వ్యతి. శబ్దాలంకారము.)

**అర్థి** సం. విణ. (న్. నీ. న్.) 1. యాచకుఁడు, కోరువాఁడు. 2. వాది. (వ్యతి. ప్రతివాది) 3. సేవకుఁడు.

(ఈక్రిందియర్థములు తెలుఁగుననే కలవు)

విణ. 1. ఇష్టము, ప్రియము.

ద్వి. పరాగి మానక లేఱున కర్థి,యారాగ వీణ తానలరి ధ్వనింప. బస. పు. 3. 920 పం. (ప్రాఁతప్రతి. 'పరాగమున' అని క్రొత్త ప్రతి.)

వి. 1. ప్రీతి, స్నేహము.

సీ....నరుఁడు, గవలుమ్రొక్కినఁ గర మర్థిఁ దిగిచి నీ వాలింగనంబు సేయంగ...భార. ఉద్యో. 3. 358.

సీ. తనమేనయత్తవందనుఁ దపుత్త్రికుఁ డైన యాకుంతిభోజున కర్థితోడఁ, గూఁతుఁగా నిచ్చినఁ గోమలి.. భార.ఆది. 5. 17.

2. కోరిక.

గీ. అర్థిఁ గణ్వమహామునియాశ్రమంబు, నందు గాంధర్వవిధివివాహమునఁ గరము, నెమ్మిఁ జేసితి దీనిఁ బాణిగ్రహణము. భార. ఆది. 4. 106.

క. విహరింప మానవాకృతి, సహితంబుగ మహికి నర్థిఁ జనుదెంచినపద్మహితుఁడొ హితకరుఁడో ... భార. విరా. 1. 215, 218.

అర్థిసేయు — కోరు.

సీ....తపము సేయ,నర్థిసేయకు మొం దేమియైనఁ జేయు. కు. సం. 7. 371.

3. ఆసక్తి.

సీ. సఖులయి వేదముల్ సదివి ధనుర్వేద మగ్ని వేళులతోడ నర్థిఁ గఱచి. భార. ఆది. 7. 5.

గీ. అనఘ ధర్మార్థకామంబులందు నొకట, నర్థిఁ దగిలినమానవుం డధముఁ డొకటి, మాని వర్తించు నాతఁడు మధ్యముండు, నడపు నన్నింటి నుత్తమనాయకుండు. భా౦. శాం. 3. 461.

4. భక్తి.

ద్వి...అక్కడ కేఁగి యత్యర్థి దొల్కాడ, వలసిన యంతగుగ్గిలము నాకిందు నిలిపెదఁ జక్కఁగా నిటలాతుననుడు. బస. పు. 4. 887 పం.

సీ. ...ఉగ్రశ్రవసుం డనుకథకవర్యు, నర్థిఁ బూజించి మహాభారతాఖ్యాన మఖిలంబు వరుసతో నతనివలన, విని ... హరి. పూ. 1. 48.

**అర్థించే** *నం. న. క్రి.* కోరు, అభిలషించు; వేఁడు.

గీ....కృతిప, తిత్వ మర్థించి వచ్చితిఁ దిక్కశర్మ. భార. విరా. 1. 18.

**అర్థికుఁడు** *నం. వి. అ. పుం.* రాజాదులను మేలుకొలుపుట భోజనాద్యవసరములను దెలుపుట. మొదలగువానియందు నియుక్తుఁ డగుస్తుతిపాఠకుఁడు.

**అర్థితము** *నం. విశ.* (అ. అ. అ.) యాచింపఁబడినది, వేఁడఁబడినది. *వి. అ. న.* కోరిక.

**అర్థిసాత్కృతము** *నం. విశ.* (అ. అ. అ.) యాచకాధీనము చేయఁబడినది.

**అర్థోపక్షేపకము** *నం. వి. అ. పుం.* ఒకానొక నాటకాంగము. (విష్కంభము ప్రవేశకము చూళిక అంకావతారము అంకముఖము అనియది అయిదువిధములు.)

**అర్థ్యము** *నం. విశ.* (అ. అ. అ.) 1. వేఁడఁదగినది. 2. అర్థమునుండి తొలఁగనిది.
(క) ప్రయోజనముతోఁ గూడినది.
(చ) సార్థకమైనది, అర్థయుక్తమైనది. (శబ్దాది)
(ట) ధనము గలది.
(త) న్యాయముతోఁ గూడినది.
(ప) పాండిత్యము గలది, జ్ఞానము గలది.
(అర్థ్యుఁడు—పండితుఁడు.)
*వి. అ. న.* సిలాజిత్తు.

**అర్దన** *నం. వి. ఆ. స్త్రీ.*—అర్దనము. *వి.*

**అర్దనము** *నం. విశ.* (అ. అ. అ.) నొప్పించునది, పీడించునది; వధించునది. *వి. అ. న.* 1. బాధించుట. 2. బాధ. 3. హింస, వధ. 4. పోవుట. 5. వేఁడుట, యాచన.

**అర్దితము** *నం. విశ.* (అ. అ. అ.) 1. పీడింపఁబడినది. 2. హింసింపఁబడినది. 3. యాచింపఁబడినది. *వి. అ. న.* ముఖముయొక్కయు కంఠముయొక్కయు ఒకపార్శ్వమునకుఁగలుగు వాతరోగవిశేషము.

**అర్ధగంగ** *నం. వి. ఆ. స్త్రీ.* కావేరినది. (ఇట్లే అర్ధజాహ్నవి, మొ.)

**అర్ధగుచ్ఛము** *నం. వి. అ. పుం.* ఇరువదినాలుగు పేటలుగలహారము. (పదియాఱు పేటలుగల హారము అని కొందఱు)

**అర్ధగోళము** *నం. వి. అ. పుం.* గోళములో సగము.

**అర్ధచంద్ర** *నం. వి. ఆ. స్త్రీ.* నల్లతెగడ (వృ.వి.).

**అర్ధచంద్రకము** *నం. వి. అ. పుం.* నెమిలిపురిలో అర్ధచంద్రాకారముగా నుండుచిహ్నము.

**అర్ధచంద్రము** *నం. వి. అ. పుం.*—అర్ధచంద్రాకారము గలది—1. క్షురప్రము, అర్ధచంద్రముఖముగల బాణము. 2. నఖక్షతము. 3. మెడపట్టి త్రోయుట కమర్చిన అర్ధచంద్రాకారపుచేయి, గళహస్తము. 4. అభినయహస్తవిశేషము. (చూపుడువ్రేలు మొదలయిన నాలుగువ్రేళ్లనొక ప్రక్కసరిగాఁ జేర్చి బొటనవ్రేలినెడముగాఁ జాఁచి పట్టినది)

**అర్ధచంద్రుఁడు** *నం. వి. అ. పుం.* అరచందురుఁడు.

**అర్ధచోలకము** *నం. వి. అ. న.* చిన్నరవిక.

**అర్ధజరతి** *నం. వి. ఈ. స్త్రీ.* సగము ముదుసలియు సగము పడుచుదియునగుస్త్రీ (శ్లథస్తనియు కృష్ణకేశియు నగుస్త్రీ యిట్టిదే.)

**అర్ధతిక్తము** *నం. వి. అ. పుం.* నేపాలనింబము (వృ.వి.) (ఒకజాతినేలవేము అని రం. ని.)

**అర్ధతూరము** *నం. వి. అ. పుం.* యుద్ధారంభమందు వాయించు వాద్యవిశేషము.

**అర్ధధారము** సం. వి. అ. పుం. ఒంటివాయిగలకత్తి. (ఇది సుశ్రుతమునఁ జెప్పఁబడిన యిరువదిశస్త్ర సాధనములలో నొకటి.)

**అర్ధనారాచము** సం. వి. అ. పుం. అర్ధచంద్ర బాణము.

**అర్ధనారీశ్వరుఁడు** సం. వి. అ. పుం. – సగము స్త్రీయును సగము పురుషుఁడును అయిన వాఁడు–శివుఁడు.

**అర్ధనావము** సం. వి. అ. న. సగముపడవ, పడవలో సగము.

**అర్ధపులాయితము** సం. వి. అ. న. ఒకవిధమైన యశ్వగతి.

**అర్ధభ్రమము(మకము)** సం. వి. అ. పుం. చిత్ర కవిత్వవిశేషము.

**అర్ధమాణవము(వకము)** సం. వి. అ. పుం. పండ్రెండు పేటలహారము.

**అర్ధము** సం. విణ. (అ. ఆ. అ.) అసంపూర్ణము, ఖండము. (ఉదా: అర్ధజరతి, అర్ధరథుఁడు.) వి. అ. పుం. భాగము, తునుక. న. అర, సగము.

**అర్ధరథుఁడు** సం. వి. అ. పుం. రథునికంటె (సమరథునకంటె) తక్కువయోధ, (అతిరథమహారథ రథులకంటె తక్కువవాఁడు.)

**అర్ధరాత్రము** సం. వి. అ. పుం నడిరేయి.

**అర్ధరాత్రార్ధదివసము** సం. వి. అ. పుం. రేయును పగలును సమానముగా నుండు కాలము, విషువము.

**అర్ధర్చము** సం. వి. అ. పుం. న. ఋక్కులో సగము.

**అర్ధవైనాశికుఁడు** సం. వి. అ. పుం. అసంపూర్ణ బౌద్ధుఁడు, బౌద్ధమతమున కొంతభాగ మంగీకరించినవాఁడు. (వైశేషికులు సర్వము క్షణికమనెడు వైనాశికునివలె పరిణామభేదముచేత దేహాదులు వినాశ మొందుటను స్వీకరించి ఆత్మను మాత్రము స్థాయిగా గ్రహించిరిగాన వీరు అర్ధవైనాశికు లని వేదాంతులుచెప్పెదరు. వేదాంతులు వైనాశికులవలె సర్వపదార్థములు చిద్రూపజ్ఞానమాత్రాత్మకములును నశ్వరములును అని స్వీకరించిరి. కాని చిత్తునకు స్థాయిత్వము నంగీకరించుటచే వైనాశికులకంటె విలక్షణులైరి కాన వీరు అర్ధవైనాశికులని వైశేషికులు చెప్పెదరు.)

**అర్ధవ్యాసము** సం. వి. అ. పుం. (క్షేత్రగ) – వ్యాసములో సగము – వలయమధ్యమునుండి పైవారమువఱకు సరళముగా గీసినగీఁత.

**అర్ధసీరి** సం. వి. న్. పుం. 1. పంటలో పాలుగల వాఁడు–పాలికాఁపు. 2. ఒకానొక సంకరజాతి వాఁడు.

**అర్ధహారము** సం. వి. అ. పుం. – దేవచ్ఛందములో సగము – ఏఁబదినాలుగు పేటలు గలహారము. (అఱువదినాల్గు పేటలు గలహారము అని కొందఱు)

**అర్ధాయము** సం. వి. అ. పుం. (చూ. ఆయము.)

**అర్ధాసనము** సం. వి. అ. న. సింహాసనములో సగము భాగము, పీఠమున సగముభాగము.

**అర్ధి** సం. విణ. (న్. నీ. న్.) సగపాలుగలవాఁడు.

**అర్ధికము** సం. విణ. (అ. ఈ. అ.) 1, అర్ధరూప్యము నకుఁ గొనఁబడినది. 2. (అ. ఆ. అ.)
(క) అర్ధరూప్యము వడ్డిగాఁ గలది (అప్పు)
(చ) అర్ధరూప్యము పన్నుగాఁ గలది (భూమి)
(ట) అర్ధరూప్యము సుంకముగాఁగలది(సరకు)
(త) అర్ధరూప్యము లంచముగాఁ గలది (కార్యము)

**అర్ధేందువు** సం. వి. ఉ. పుం. 1. అర్ధచంద్రుఁడు. 2. నఖక్షతము. 3, అర్ధచంద్రాకార ముఖము గల బాణము. 4. గళహస్తముద్ర, మెడపట్టి త్రోయుటకమర్చినచేయి. 5. గతిచేష్టావిశేషము.

**అర్ధోదయము** సం. వి. అ. పుం. 1. సూర్యునియొక్క కాని చంద్రునియొక్కకాని మండలము సగముదయించుట. 2. తిథి నక్షత్రాది యోగవిశేషము, ఒకానొకపర్వము. (పుష్యమాసమునఁ గానిమాఘమాసమునఁగానిఅమావాస్యతిథియు ఆదివారమును శ్రవణనక్షత్రమును వ్యతీపాత యోగమును కలసినయోగము. ఇట్టియోగము తటస్థించినకాలము మహాపుణ్య కాలముగా నెంచఁబడును)

**అర్ధోదయాసనము** సం. వి. అ. న. యోగమందలి ఒకానొక ఆసనము.

శ్లో. అర్ధోదయాసనం నాథసర్వాంగం ఖేనియో జయేత్, కేవలం హస్తయుగళం భువ్యవష్ట భ్యతిష్ఠతి. (రుద్రయామళము.)

**అర్పణము** నం. వి. అ. న. 1. పొందించుట. (పెట్టుట ఉంచుట, మొ.) 2. ఇచ్చుట, దానము, అర్పణచేయు-(అర్పణము+చేయు) ఇచ్చు. భీమ. 5. 30.

**అర్పణీయము** నం. విశ. (అ. ఆ. అ.) 1. ఉంపఁదగినది. 2. ఈయఁదగినది.

**అర్పించే** నం. న. క్రి. ఇచ్చు, అప్పనచేయు.

మ. ... అర్కోమలి కొప్పుఁ దేఁటితెగకున్ గుందంబు లర్పించుపోల్కి రఘుగ్రామణి గ్రొత్తముత్తియపుఁ బ్రాల్నించెన్ వివాహంబునన్. ఉ. రా. 1. 89.

**అర్పితము** నం. విశ. (అ. ఆ. అ.) 1. అర్పింపఁబడినది, ఈయఁబడినది. 2. ఉంపఁబడినది.

**అర్పిసము** నం. వి. అ. పుం. హృదయముదలి మాంసము, అగ్రమాంసము.

**అర్ప్యము** నం. — అర్పణీయము.

**అర్బుదము** నం. వి. అ. పుం. న. 1. కంతి, రోగవిశేషము. (మాంసార్బుదము రక్తార్బుదము మొదలగునవి దీనిభేదములు) 2. పదికోట్లు. (సంఖ్య) 3. పర్వతవిశేషము. విశ. అ. పుం. న. 1. పదికోట్ల సంఖ్యగలది, 2, కఠినము.

**అర్భకము** నం. వి. అ. పుం. 1. మృగాదుల పిల్ల, కూన. 2. గర్భమునందలి శిశువు,

**అర్భకుఁడు** నం.విశ. (అ. ఋకా. అ.) 1.మూర్ఖుఁడు, జడుఁడు. 2. కృశుఁడు, చిక్కినవాఁడు. వి. అ. పుం. పిన్నవాఁడు, శిశువు.

**అర్భుఁడు** నం. వి. అ. పుం. బాలకుఁడు.

**అర్మణము** నం. వి. అ. న. ద్రోణము,మానవిశేషము.

**అర్మము** నం. వి. అ. న్. న. 1. ఒకానొక నేత్ర రోగము. 2. రెప్పనడిమి వెండ్రుక.

**అర్మిలి** వి. - అరిమి.

1. ప్రేమము, ప్రీతి.

ఉ. ధర్మసుతుండు పెంచె ననుఁ దాన తురంగమ శాస్త్ర శిక్షకుం, గర్మఠుఁ జేసి యాత్మ తురగంబుల కెల్లను నన్న యుక్తుఁగా, నర్మిలి నిల్పి యూగియుఁ బ్రియంబును నాయెడ నాఁడు నాఁటికిం, బేర్మివహించుచుండ నడపెం దనతమ్ములలోని వానిఁగాన్. భార. విరా. 1. 267.

2. అపేక్ష, కోరిక.

చ. ...ఇ., పులుదులకింపుచుండు భుజమూలరుచుల్ జిలుఁగుంబయంటలోఁ, గులుకుమిటారి గబ్బిచనుగుబ్బలుఁ జూచుటఁ గాని క్రీడి కర్మిలి మఱిలేదు భోజనముమీఁది యపేక్ష యొకించుకేనియుఙా. విజ. వి. 2. 158. (శ. ర-'చూచుటకాని' ముద్రి)

3. మిత్రము, సహాయుఁడు.

వ. దిక్కుంజరంబుల దిక్కైకూర్మంబునకు నర్మిలియై క్రీడాక్రోడంబునకుఁ దోడై ... కాశీ. 1. 100. (ఇట నర్మిలి అనియు పదచ్ఛేదము చేయవచ్చును)

**అర్య** నం. వి. ఆ. స్త్రీ. 1. స్వామిని,ఒడయురాలు. 2. వైశ్యజాతిస్త్రీ, కోమటిది.

**అర్యమము** నం. వి. న్. పుం. 1. ఉత్తర ఫల్గునీ నక్షత్రము. 2. జిల్లేడు (వ్య.వి.)

**అర్యముఁడు** నం. వి. న్. పుం. 1. ద్వాదశాదిత్యులలోనొకఁడు;సూర్యుఁడు. 2. పితృదేవతలలో నొకఁడు.

**అర్యాణి** నం. వి. ఈ. స్త్రీ—అర్య.

**అర్యి** నం వి. ఈ. స్త్రీ. 1. అర్యునిపత్ని. 2. అర్యుని కూఁతురు.

**అర్యుఁడు** నం. వి. అ. పుం. 1. స్వామి, యజమానుఁడు. 2. వైశ్యుఁడు, కోమటి.

**అర్వణము** నం. వి. అ. న. (జ్యోతి) సేవింపఁ బోవు రాజమంత్రాదులవలనఁ గలుగులాభనష్టములను దెలుపుగణనక్రియావిశేషము. (ఉదా; గ్రామార్వణము, మొ.)

సీ. మ్రొక్కి నాకైహికాముష్మిక సౌఖ్యప్రదాయి మంత్రముఁ గృపచేయవలయు, నని పల్క దేశికుండును నర్వణము చూచి కార్తికశుక్లపక్షమున ద్వాదశీదినంబునను బ్రసిద్ధలగ్నంబున...వరాహ. 12. 46.

**అర్వతి** సం. వి. ఈ. స్త్రీ. 1. ఒండుగుఱ్ఱము. 2. కుంటెనకత్తె.

**అర్వది** – అఱువది. భా. కర్ణ. 2. 258.

**అర్వము** సం. విశ. (న్. శీ. న్.) 1. గమనశీలము, పోవునది. 2. అధమము, గర్హ్యము. వి. న్. పుం. 1. గుఱ్ఱము. 2. గోకర్ణప్రమాణము, చాఁపఁబడినబొటనవ్రేలియొక్కయు ఉంగరపువ్రేలియొక్కయు నడిమికొలత, జుత్త.

**అర్వాక్కు** సం. విశ. (చ్. ర్వాచీ. చ్.) 1. కాలమున తర్వాతిది, ఇటీవలిది, నవీనము. (ఉదా; అర్వాక్కాలము – ఈవలికాలము. వ్యతి : పూర్వము (ప్రాక్కు) 2. దేశమున ఈవలిది. (ఉదా : అర్వాక్కూలము – ఈవలియొడ్డు.) 3. క్రిందిది. (వ్యతి. ఊర్ధ్వము.)
ఉదా : అర్వాక్స్రోతసుఁడు–ఊర్ధ్వరేతస్కుఁడు కానివాఁడు, అధోరేతస్కుఁడు.

**అర్వాచీనము** సం. విశ. (అ. ఆ. అ.) 1. ఈవలది. (తీరము, మొ.) 2. ఇటీవలిది, నవీనము. (వ్యతి: ప్రాచీనము.) 1. క్రిందిది (వ్యతి : ఊర్ధ్వము.)

**అర్శము(స్సు)** సం. వి. స్. న. మూలవ్యాధి.
సీ. ...అర్శంబు మొలక యంచనఁగ వెలయు. అం. భా. 2. 128.

**అర్శసుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) మూలవ్యాధి గలవాఁడు.

**అర్శోఘ్నము** సం. వి. అ. పుం – మూలవ్యాధిని పోఁగొట్టునది– 1. సూరణము కంద (వృ.వి.) 2. నల్లజీడి (వృ.వి.) న. తక్రము, పాతిక పాలు నీళ్లుకలిపి చేసిన మజ్జిగ.

**అర్శోఘ్ని** సం. వి. ఈ. స్త్రీ. 1. నేలతాడు (వృ.వి.) 2. నల్లజీడి (వృ.వి.)

**అర్శోహితము** సం. వి. అ. పుం – మూలవ్యాధిని కుదుర్చునది – నల్లజీడి (వృ.వి.)

**అర్హ** సం. వి. అ. స్త్రీ. పూజ.

**అర్హంతుఁడు** సం. వి. అ. పుం. బుద్ధదేవుఁడు.

**అర్హణ** సం. వి. అ. స్త్రీ. పూజ.

**అర్హణము** సం. వి. అ. న. పూజించుట, పూజ.

**అర్హణీయుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) పూజింపఁదగినవాఁడు.

**అర్హత్** సం. శత్ర 1. పూజించుచున్న. 2 పూజ్యుఁడగు.

**అర్హత** సం. వి. అ. స్త్రీ. యోగ్యత.

**అర్హము** సం. విశ. (అ. ఆ. అ.) 1. పూజార్హము. 2. యోగ్యము, తగినది. వి. అ. పుం. వెల, విలువ.
శ్లో: మహార్హశయ్యాపరివర్తనచ్యుతైః. సం. కు. సం. 5. 12.

**అర్హితుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) పూజితుఁడు.

**అర్హ్యము** సం. విశ. (అ. ఆ. అ.) 1. యోగ్యము, తగినది. 2. పూజ్యము, పూజింపఁదగినది.

**అఱ** వి. (సం. అర్ధమ్. క. అఱ. త. అరై.) 1. సగము, అర్ధము; కొంచెము.
క. నిన్నయఱ నచ్చిపోయితి, వున్న యఱయు నేఁడు దీర్చి యుడిపెద నీ గర్వోన్నతి ... భార. ఉద్యో. 4. 341.
2. (త. అఱై.) గది, చిన్నది; పెట్టెగూఁడు మున్నగువానిలోనిగది.
గీ. అతివ బంగారునఱలోని కరిగి మిగులఁ, బెరుఁగుసిబ్బితిచే గడెఁ బెట్టుకొనియె. యయా. 5. 34.
చ. మిడుఁగుఱుఁబుర్వువెన్ను తగుమృత్తిక పాదున నంటఁజేసి యొ,క్కెడ నఱలోన నిడ్డ నదియిమ్ములఁ గ్రాలెడుదీపరేఖగా... కేయూర. 3. 270.
3. కొఱఁత, న్యూనత్వము.
సీ. అఱ లేనినెఱదీప్తి మెఱుఁగెక్కి సరిమింటఁ జరియించుసంపూర్ణచంద్రుకంబె. భా. రా. అర 1. 185.
ద్వి. వెఱవక సుగ్రీవ వేగపొమ్మనిన, నఱ లేని కడఁకతోనప్పు డుప్పొంగి. రం. రా. కిష్కిం. 208 పొ. 7 పం. భాగ. 10 ఉ. 685.
4. భేదము.
క....మీతండ్రికి నే, నఱ లేనిసఖుఁడ నెమ్మెయి, మఱతునె యారాజునుతుల మాన్యుల మిమ్ముఁగ. భా. రా. అర. 1. 105.

5. కపటము, వంచన.

చ....కోమలిజన్మఫలంబు మీకుఁ దోఁ, చినతెఱఁ గంతయుం దెలియఁజెప్పుఁడు వీరికి వీరు సమ్మతిం,చినయటులైన లెస్స యఱచేసిన దోషము వచ్చు నావుడుఁ.భోజరా, 4.58.

6. శంక, సందేహము.

ద్వి.పన్ను గానానేయుపనుల పై నిన్ను,మన్నించి నిలిపెద మది నఱ లేక. ద్వి. హరిశ్చ. ఉ. 1606.

7. కీడు, ద్రోహము.

ఆ. దుర్ణయమున శకునికర్ణదుశ్శాసనుల్, గఱపఁ బాండవులకు నఱయచేయఁ,గడఁగెఁ బాండవులును గడు ధార్మికులు గానఁ, బోరయరైరి వారదురితవిధుల. భార. ఆది. 8. 12.

క. ఒకఁడు సుశర్మాఖ్యుఁడు ఘూ,తుకుఁడు గలఁడు కల్లుద్రాగుఁ దునుము ధరామ, ర్త్యకులుల నఱదలఁచుం గురు,నకుఁ గన కము దొంగిలుం దినము నజపుత్రా.పాండు. 5. 78.

8. చినుఁగు.

ద్వి. అఱలదోవతి మొలనంటఁగా బిగిచి,కుఱు చగా శిఖ ముడిగొని యొడు గఱచి. రం. రా. అయో. 108పొ. 3 పం. (శ. ర- 'అఱచిదోవతి' అని ముద్రి)

విశ. సగము; కొంచెము.

సీ. అఱచందురుని...హరి. ఉ. 7, 74.

క్రి. విశ. కొంచెముగా.

గీ. వసుధ రాయుచు మోమఱ వాంచి వాంచి. కృ. శకుం. 3. 5.

జ: అఱకన్ను, అఱకాలు, అఱకూడు, అఱ క్రొన్నెలతూపు, అఱగొర, అఱగౌను, అరచట్ట, అఱచావు, అఱచూడ్కి, అఱ చేయి, అఱచేయు, అఱజాతి, అఱపది, అఱ పీనుఁగు, అఱపొఱడు, అఱమర,అఱమాట, అఱమీటుమొన, అఱమెయిజోటివాఁడు, అఱవిరి, అఱసంజ.

**అఱక** వి. మూఁపు,స్కంధము.

క. నీ వేల వచ్చితిచటికి,నేవాఁడవు మోపు టఱక నేపారెదునీ, లావరిపులుఁ గెక్కడి యది, యీవారిజనయన యెవ్వ రేర్పడఁ జెపుమా. హరి. ఉ. 4. 140.

**అఱకట** – అఱకడ.

(మూఁపు)

క. చఱినుండి తొలఁగ నుఱికెడు, నెఱిసింగపుఁ గొదమవోలె నిబ్బరముగఁ గ్రేఁళ్లుఱికెం దొలఁగం బగతుని, యఱకటనుండి భువిమీఁది కబ్బలియుండున్ హరి. పూ. 7. 105.

ద్వి. కొడుకుఁ దా నఱకట నిడుకొని వచ్చి. బస. పు. 6. 140 పం.

**అఱకటము** – అఱకడ.

(మూఁపు)

క. ఘనవిక్రముఁడు ప్రలంబుం, డనుదైత్యుఁడు గోపరూపమై బలభద్రుం, దనయఱకటమున నిడుకొని, చనియెన్ గగనమున గోప సంఘము బెదరన్. పద్మ. 9. 186.

**అఱకడ**–అఱకట,అఱకటము,అఱకడము,అఱ్కట.

వి. 1. స్కంధము, మూఁడు.

సీ. ఎఱిఁగి చెచ్చెరఁ దల్లి నఱకడ నిడి ధర్మసుత విజయులఁ దన వితతబాహు,యమళంబు నెక్కించి... భార. ఆది. 6. 160.

(శ్లో: స్కంధమారోప్య జననీం యమావంకేన వీర్యవాన్, పార్థౌ గృహీత్వా పాణిభ్యాం భ్రాతరౌ సుమహాబలః. సం. భార. ఆది. 160. 27.)

క. తఱి యగునంతకు రిపుఁ దన,యఱకడఁ బెట్టుకొని...భార. ఆది. 6. 114.

2. పొదిగిలి.

క. అఱిముఱి నప్పొట్లము దను,గిఱికొని కొలువంగ నరిగి కెరలెడుబత్తిన్, ముఱియుచు నడుగులకెఱఁగిన,నఱకడఁబెట్టుకొనిరాముఁ డాతని కనియెన్. అచ్చ. రా. కిష్కిం. 72.

**అఱకడము** – అఱకడ.

(మూఁపు)

గీ. అహితసేనలు రా నతం డడ్డగించి,యాహవము చేయుచుండ హయంబు నేన,గొఱియ

వలెఁ బెట్టుకొనివత్తు నఱకడమునఁ,దడవు చేయకధర్మనందమునికడకు.జై.భా.1.101. (పొదిగిలి)

ద్వి. అఱకడంబునఁ గాంత ననువుగా నునిచి, యొఱవాయఁ బెటికి మహోగ్రంబుగాఁగ, ద్వి, హరిశ్చ. పూ. 1858.

**అఱకన్ను** — అరకన్ను. వి. (√అఱ) సగము మూసినకన్ను; కొంచెము మూసినకన్ను.

అరకన్నిడు — అఱకన్నుపెట్టు. వేం. పంచ. 3. 310.

అఱకన్నుపెట్టు — (పారవశ్యాదులచే) సగము కన్నుమూయు.

వ. అన్నన నఱగన్నువెట్టి ...చంద్రా. 2. 84.

**అఱకము** వి. అజీర్ణవ్యాధి. ఆం. భా. 2. 128.

**అఱకాలు**—అరకాలు. వి. (√అఱ) పాదతలము, పాదముక్రిందిభాగము.

క. నాయంగంబుల నెల్లన్, బాయసమతిభక్తిఁ బూసి పాదతలమునన్,బూయవు గావునఁ గలుగు న,పాయం బఱకాల నీకు నవిలంఘ్యంబై. భార. అను. 5. 377.

క. ... మలయో,ద్ధూతరజం బఱకాళులఁ, జేతుల నొరయుదురు...కు. సం. 5. 688.

**అఱకూడు** వి. (√అఱ) 1. అర్ధాశనము, కడుపు నిండనిభోజనము.

గీ. అక్కవాడల నఱకూళ్లు మెక్కి ... ఆము. 6. 69.

2. పూఁటకూడు, (చి. ని.)

**అఱక్రొన్నెలతూపు** — అరక్రొన్నెల తూపు. వి. (√అఱ) అర్ధచంద్ర బాణము. అచ్చ. రా. యు. 544,

**అఱగొడ్డము** — అఱగొడ్డెము.

క. బిడ్డలు వెఱతురె నీ కఱ,గొడ్డంబులు నేయక ...భాగ. 8. 467.

**అఱగొడ్డెతనము** వి. (√అఱగొడ్డెము) ధార్ష్ట్యము, దుండగము.

ద్వి. అద్దిరా థక్తునియఱగొడ్డెతనము, విద్దెలాడె దుఁగాక విందుమే తొల్లి. బస.పు.5.105పం.

**అఱగొడ్డెము** — అఱగొడ్డము. వి. దుండగము, దౌష్ట్యము.

క. ఎఱిఁగి యెఱిఁగి నీముందర, నఱగొడ్డెము చేసిపోయి చదిగై కొన నీ,తెఱఁగయిన హంసడిభకులు, కొఱవిం దల బరికికొన్న కొఱదులు గారే. ఉ. హరి. 4. 106.

**అఱగొఱ** వి. √అఱ (త. అఱైకుఱై—న్యూనత.)

1. కపటము.

చ....సుఖంబునదశవాటికన్,దుఱఁగలిగొన్న సమ్మదముతో గమనింపుము భీమనాయకుం, డఱగొఱ లేనివేల్పు నిఖలాభ్యుదయంబులు నీకు నయ్యెడున్. భీమ. 2. 155.

2. భేదము.

క. ...తానుం బతియున్,మనమున నఱగొఱ తెలుఁగక,యనితరసులభైకసుఖము లందుదురు...పారి. 5. 62.

**అఱచెట్ట**- అరచెట్ట. వి. (√అఱ) చిన్నచొక్కా, మొలవఱకు వచ్చుచొక్కా.

సీ. అఱచట్ట దొడిగి మైనడ్డంబు దిగటంబు వలిప దుప్పటి పల్లెవాటువేసి. వై జ. 2. 47.

ద్వి. హరువైన పైఠిణీ యఱచట్ట తొడిగి. రఘునా. 7 పా. 9 పం.

**అఱచు**—అర్చు. అ. క్రి. (క. అఱచు, అఱుచు. త. అఱై. మ. అర్.)

1. (జంతువులు, మొ.) ధ్వనిచేయు: కేకవేయు, బొబ్బవెట్టు.

ఉ. ...ఆ వఱచినట్లు...భార. ఆది. 6. 168.

క. ...కప్పలు, గఱరవరట్కరరవరరగట్టని యఱచెన్. హర. 2. 17.

క. అఁకొని యఱచెడిఁ బ్రేవులు. భోజరా. 4. 212.

(వ్యవ) నేనుఎంతఅఱచినను తలుపులుతీసినావు కావు.

2, మొఱపెట్టు.

ఆ. జీవితార్థులై నజీవుల సుఖనుప్త,లై నవారిఁ జంపె నఱవ నఱవ. భార. అర. 2. 112.

వ ...రక్షింపుం డని యఱచువారును...దశా. 2. 440.

3. విలపించు, ఏడ్చు.

క. వెఱి దప్పం బడి పెల్లుగ, నొఱలెడి నరివాఱి కరులయులి వభిమన్యుం, డఱిముఱిఁబడుటకు వగ మదిఁ, బఱిగొన నిలపెలుచ నఱచుభంగిఁ జెలంగున్. భార. ద్రో. 2. 132.

న. క్రి. 1. బిగ్గరగాఁ బిలుచు; బిగ్గరగాఁ జదువు.

సీ. అర్థంబు తెలియక యఱచెద రవధాను లూరక వేదాలునోరికొలఁది. ప్రబోధ. 2.7.

2. ప్రేలు, వదరు, వాఁగు.

క. నను సుప్రసాదదృష్టిం, గనుగొను మేనిపుడు గొన్ని కాఱు లఱచితిన్, మనుజేంద్ర వానిఁ బెడచెవు, లను బెట్టుము వేఱుగాఁ దలంపక దయతోన్. భార. కర్ణ. 3. 93.

జ. అఱపు.

**అఱమోడ్కి** వి. (√అఱ) అర్ధవీక్షణము. ఆము. 5. 7.

**అఱచేయి** వి. (√అఱ) హస్తతలము, చేతిక్రింది భాగము,

అఱచేతఁ బ్రాణములు పెట్టికొనుట—ప్రాణములు విడువ సిద్ధముగా నుండుట.

క. పిలుఁదం గురుధరణీపతి, నఱచేతం బ్రాణములు ఘనారాతిబలం, బులని తెగువ ముందటఁ బె, న్గొఱలుట చిత్తమునఁ బెట్టికొని విహరించెన్. భార. స్త్రీ. 2.87.

అఱచేతిలోనికి వచ్చు—సులభమగు, వశమగు.

ఆ. అఖలతీర్థఫలము నఱచేతిలోనికి, వచ్చు సంశయింప వలదు నీకు. భోజరా. 6.375.

అఱచేతికిఁ దెచ్చుట—వశము చేయుట.

క. సకలభువనములు నఱచే, తికిఁ దేరం జాలునట్టి ధీమంతుఁడు దే, వకికొడుకు గలఁడు... భార. ఉద్యో. 2.182.

అఱచేత నుంచుకొను—అఱచేతఁ బెట్టుకొను, లాలనముసేయు. శుక. 3.187.

అఱచేతిది, అఱచేతిలోనిది—అఱచేతిలో నున్న దానివలె వశమైనది.

క. ఇనశశిపావక భూమిగ, గనజలపవనాదివస్తుగతు లెల్లను గా, లునియఱచేతి వనిన... భార. అను. 1.28.

అఱచేతఁ బండ్లువచ్చుట:- అసంభవమైనకార్యము నెఱుపును.

క. అఱపు లుడిగి పోపో నీ, యఱచేతం బండ్లు వచ్చినప్పుడు మమ్ముం, గఱచెదవుగాని... కళా. 3.218. నిరం. 3.32.

**అఱచే(సే)యు** స. క్రి. (√అఱ) వంచనచేయు, మోసపుచ్చు.

ఉ.... పాండవుల్, సేపడిరేని చంప నఱసేయక చెప్పెద సవ్యసాచిపైఁ, గోపముపెద్ద వాఁడు సమకూరిన బిట్టఱఁ జంపుదుం జుమీ. భార. ఉద్యో. 4.68.

('న వైత్వ య్యనృతం వదే' అని మూలము).

2. మఱుఁగుపఱుచు, దాఁచు.

గీ. నీవు మారాజుపైఁ గూర్మినిలుపు గలిగి, చిత్తమఱసేయ కున్నట్లు చెప్పి తిపుడు. నైష. 2.86.

**అఱజాతి** విశే. (√అఱ) హీనకులుఁడు; హీనుఁడు; దుష్టుఁడు.

ద్వి. కల్లరి పతితుఁడు ఖలుఁడు దుర్జనుఁడు, ప్రల్లదుఁ డఱజాతి భక్తిహీనుండు.... మందునకైన నూరిలో లేఁడు. బస. పు. 1.578 పం.

క. తఱుచంటి తన్ను నెదిరిని, నెఱుఁగడు దన కొలఁది పుడుక లేఱుఁడు మొండిఁ., డఱజాతి...ఎక్కడ నిట్టిప్రేలుగొండులుగలరే. కు. సం. 7.880.

క. అఱజాతిజంతు విచ్చట, నెఱపించుచు నుండ వలదు విపినంబునకున్, దఱుముఁడు... నా. పంచ. 2.189.

క. అఱజాతివి నిన్ను నేమి యననేర్తు సుతా. హరి. పూ 5.239.

**అఱప** వి. కొన్నచేలు మొదలగువానిని గాచునపుడు కూర్చుండుటకై యెత్తుగాఁ గట్టినమంచె.

ద్వి. మఱి యేల వేయును నెఱయఁ బండించి, యఱపడిగ్గినయట్ల యయ్యెనుర్వీశ. బస.పు. 7.310.

**అఱవది** స. (√అఱ) పదిట సగము, అయిదు. (యశోవర్ణనము)

సీ. వెన్నుని యన్నన్న వేల్పులదొరవాలు
నఱపది మోముల నలరుసామి. రామ. 2.13.

**అఱపినుఁగు** వి. (√అఱ) 1. ప్రాణావశిష్టమైన ప్రాణి.

వ....పదంపడి యఱపినుఁగు లొఱలుటయును దానవగణంబు కలకలంబును డిందువడియె... భార. సౌ. 1.201.

2. మూర్ఛితమైనప్రాణి.

ఉ ...విల్, ద్రుంచి తురంగవక్త్రములఁ దూపులు నించి యలంచి మేను నొ, ప్పించినఁ దేరితోడ నఱపినుఁగు నీడిచి కొంచుఁ బాఱె...భార. ద్రో. 2.74.

**అఱపు** వి. (√అఱచు) అఱచుట.

క. అఱపు లుడిగి పోపో నీ, యఱచేతం బడ్లు వచ్చినప్పుడు మమ్ముఁ, గఱచెదవుగాని... కళా. 3.218.

**అఱపేద** విశే. (త. అఱ-అత్యంతము) మిక్కిలి దరిద్రము.

ఉ. కన్నులు చేరలం గొలువఁగాఁదగుఁ గౌ నఱపేద...అహ. 1.83.

(ఇట 'మిక్కిలికృశము'అని తాత్పర్యము.)

**అఱపొఱడు** వి. (√అఱ) సగముగూను.

క. అఱపొఱడు కుఱుచచేతులు. భార. అర. 2.134.

సీ. కందుఁబండ్లు బరికెగడ్డంబులును నఱపొఱడులు నంటురూపులును...ఆ...గలుగు నెఱుకుముసిఁడిఁ గనిరి సతులు. కు. సం. 6.694.

**అఱమర**—అరమర, అరమరము, అరమరిక, వి. (త. అరెమరె-అరె-సందేహము. మరె-చాఁపటికము, గుట్టు.)

1. వ్యాజము, కాపట్యము.

ద్వి. తెఱఁగొప్ప నెవరికిఁదెలుపక భక్తి, నఱమర లేక మమ్మనవరతంబుఁ, గొలిచిన... నవ. 4.141 పొ.19 పం.

2. మర్మము, గుట్టు.

క. మఱియు నొకమాటయెవ్వరు, నెఱుఁగని యది దశరథునకు నే కాంతమునం, దఱ మర లేక దృఢంబుగ, నెఱుకపడఁగ జెప్పి వింటి నే నొకరుండఁ. నిర్వ. 9.57.

3. భేదము.

క. ఓయమ్మ యిట్టు లఱమర,సేయంగా నేల నీవుచెప్పిన చెయ్యవే, ద్రోయంగా నేర్తుమె యిఁక, నీయానతిఁ గడవఁబోము నీయాన సుమీ. అచ్చ. రా. అయో. 60.

4. సందేహము; శంక, జంకు.

చ. అఱమర మాని తద్విభుఁడు నాబలభద్రునిఁ బట్టఁ బంచినన్. దశకు. 10. 126.

గీ. అఱమరలు దీఱ లాలించి యామతించి, కలికి తొలికూటమి విభుండు తులకరించె. కృ. శకుం. 3. 50.

**అఱమాట** వి. (√అఱ) వక్రోక్తి, వంకరమాట.

సీ. దప్పి కిమ్మన మది దప్పినదా యనుఁ దెంబు దెమ్మనినఁ గుచంబె యనును.

గీ. అంచు నిట్టేపురేఁగి యమ్మించుఁబోఁడి, యతని మాటల కఱమాట లాడికొనుచు. హంస. 5. 70, 71.

**అఱమిటుమొన** వి. (√అఱ) మల్లవిద్యయందలి పదిరెండుమొనలలో నొకటి. హంస. 1. 206.

**అఱవ**[1] వి. (త. అఱవై - దుష్టత్వము). పెంకెయావు.

సీ. అరవలపై నను నలవున వెరవున ముట్టె యంటఁగఁబట్టి కట్టి విడువ. భార. విరా. 1. 101.

('అట్టులఅని' పాఠాంతరము). చూ. అఱవ[2].

**అఱవ**[2] వి. (త. అఱవ.) సన్యాసి, భిక్షుకుఁడు.

ఆ. పఱవఁబో మ్మటంట బరువకే నాకు నీ, యఱవఁదోఁక గోసి యఱవఁజేతు. వైజ. 3.97.

(ఇట 'పెంకెయావు'అని ధ్వని కలదు.)

**అఱవ**[3]—అరవ. వి. ద్రావిడుఁడు, అఱవదేశము వాఁడు. ఆం. భా. 2. 103. అప్ప. 2. 197.

**అఱవదు** వి. సన్యవిశేషము.

క. అఱవదు గంటె తవిందియ లఱువదిదినము లకుఁ బండు నని బ్రదుకాసన్, దఱచుగ

నేఱాలె త్తఁగఁ, బటపటయైయవియుమల్లెపడి చెడిపోయెన్. కాళ. 3. 152.

**అఱవత** వి. (అఱవ+త.) అఱవస్త్రీ.

గీ. బంగెక త్తెలు నుంత ప్రపంచ వేఁగ చియఱ వత లసమాస్త్రఖడ్గలతలు. కాశీ. 3. 109.

**అఱవము** వి. (క. అరవవు. త. అరువ, అరవ.) ద్రావిడభాష.

**అఱవఱలు** — అఱవఱలు. విశే. బ. (క. బఱవం — మిక్కిలి శుష్కమైనది.)

1. శుష్కించినది, శిథిలించినది. (చూ. అఱపఱలు.)

2. భగ్నమయినది; ధ్వస్తమైనది.

క. అఱవఱలై నరథంబులు, నెఱి దప్పఁగఁబడిన యశ్వనికరంబులుఁ బెఁ, దఱుచుగఁ గూలిన కరులు, న్గిఱికొనియెఁ సమరమేదినీతల మెల్లన్. భార. భీష్మ. 2. 136.

గీ. అకట బాలకుఁడిప్పు డేమయ్యెనొక్కొ, బండి యఱవఱలై యిట్లు పడ్డదేమి, మూఁడెనో యంచు... హరి. పూ. 5. 180.

సీ. ... కావించుదక్షయాగమున శివుని, మఱచిన నయ్యజ్ఞ మఱవఱలై పోదె... భార. అను. 5. 388.

వి. బ. ఖండములు, తునుకలు.

గీ. అఱవఱలు ఛిద్రపలన ఖండాహ్వయములు. ఆం. శే. 55. అప్ప. 2. 197.

**అఱవఱసేయు** స. క్రి. (√అఱవఱలు) భగ్నము చేయు; ధ్వంసముచేయు.

సీ. అరిగి దక్షాధ్వరం బఱవఱసేయ గ భద్ర తేజుని వీరభద్రుఁ బనిచె. హరి ఉ. 6. 14.

**అఱసంజె** వి. (√అఱ) అర్ధసంధ్య.

క. అఱసంజవేళఁ జుక్కలు, దటితటిఁ బొడ మూసె... పద్మ. 3. 23.

**అటిమి** వి. కుత్తుకలో పుట్టెడి యొకానొకరోగము.

ద్వి. అటిమియో శోషయో యంగిటముల్లో, యెఱుఁగను మందు మ్రూఁకేమియు ననుచు. బస. పు. 3. 365.

జ. అటిమికొను.

**అటిమించు** స. క్రి. (√ అఱుము) అఱుముఁ జేయు. (ఎగురొత్తఁజేయు, ప్రతిఘటింపఁజేయు)

క. అటిమించి చొచ్చినిల్లటు, చెటిచితి విఁకఁ బుట్టినిల్లు చెఱచెద ననియే, పఱతెంచితి... జై. భా. 4. 69.

**అటిమికొను** అ. క్రి. (√అటిమి) అటిమిరోగము కలది యగు.

సీ. చివురెల్లఁగనినొత్తి శోషరాకు గుత్తుక డెక్కొని కోయిలవెక్కుచుండు... తని పండ్ల రసమెల్లఁ ద్రావి ప్రసాధికమై చిల్కలెల్లఁ గట్టటిమికొనఁగ. కు. సం. 5. 641.

**అటిముటి** క్రి. విశే. ద్రు. 1. శీఘ్రముగా, వేగముగా; వెంటనే, తోడ్తో.

చ. ...యుధిష్ఠిరుఁ డటిముటిఁ బంపె సారథిఁ దదశ్వములన్ పరిబాణపాణియై. భార. విరా. 3. 215.

క. అఱజాతిజంతు విచ్చటు, వెఱపించుచు నుండ వలదు విపినంబునకున్, దఱుముఁ డని ముదల వెట్టిన, నటిముటి ననుచరులు వెడల నడచిరి నన్నున్. నా. పంచ. 2. 189.

చ. ...ముందఱ నిఁక నాకుభక్తుఁడని నందను బాధలఁబెట్టినప్పుడే, నటిముటి దైత్యవల్లభుని నంతకుఁ జేర్చెద... దశా. 4. 125.

2. అనాలోచితముగా.

చ. అటిముటిరుద్రు నెంత చెడనాడెదు సోమము ద్రాగియున్కిమై, యెఱుఁగక బిట్టిదో... కు. సం. 2. 171.

ద్వి. కఱపెడి దేమి యక్కమలాప్తకులుని, తెఱఁగెఱుంగక పూని దేవేంద్రుతోడ, నటిముటి వేమించ నాడంగనేమి. ద్వి. హరిశ్చ. పూ. 857.

3. తబ్బిబ్బుగా, తాఱుమాఱుగా, ఉచ్చావచముగా.

క. విఱిగి భవత్సుతనివహం, బటిముటిఁగనుకనిఁ జనఁగ ననిలసుతుం డే, త్తెఱ నెగచి వగచె వారం, దఱుఁ దనచే జచ్చుఁ టపుడు తప్పుటకుఁ గడున్. భార. భీష్మ. 2. 390.

ద్వి. విఱిగి ముందట నున్నవింటి తున్కలును, నటిముటిఁ బడియున్న యస్త్రశస్త్రములు. రం. రా. అర. 189 పొ. 21 పం.

4. అత్యంతము, మిక్కిలి.

క. దానికి నవ్వుచు వేగంబే నొకభల్లంబుదొడిగి
యేసితి సాంద్ర, జ్యానాదభరితరోదసి,యైన
తదీయోగ్రచాప మటిముటిఁ దునియన్.
భారం. ఉద్యో. 4. 317.

5. ఇంచుకేనియు, బొత్తిగా.

(ఈయర్థమున వ్యతిరేక క్రియలతోనే సంబంధించి యుండును.)

చ....తొయ్యలి యుయ్యెలలూఁగుమానసం,
బటిముటి నిల్పనోప కలిబాధల వేదనఁ
బొందె నయ్యెడన్. సురా. 90.

6. తఱచుగా, దట్టముగా.

చ. ఉఱుముచు నెల్లెడం బిడుగు లుగ్రగతిం బడ
ఘోరమూర్తియై, యటిముటిఁ గప్పుదెంచు
విలయాభ్రముచాడ్పున...భారం. ద్రో. 1.89.

చ. ...చక్రి చెమర్ప రాలె మై,నటిముటిఘర్మ
బిందువులు నమ్మణులున్...ఆము. 6. 132.

7. నిశ్చయముగా, నిజముగా.

క. నెఱవగుసంపద గలిగిన,నెటి దానం గడువఁ
గట్ట నేరనిమనుజుం,డటిముటిఁ జేనికిఁగట్టిన,
వెఱబొమ్మయె కాఁడె యెన్నివిధములఁ
జూడన్. విక్ర. 2. 179.

చ. అటిమి రమాకుమారుఁ డపు డగ్రతలంబున
వచ్చి నిల్చిన,ట్లటిముటిఁ దోఁచినన్ గువల
యాక్షి వడంకి...వసు. 3. 179.

విశ. అత్యంతము, మిక్కిలి.

చ. ...వసిష్ఠముఖ్యు లగుమిక్కిలికాంతులరీతిఁ
జూచితో, యటిముటి వజ్రకుంఠపుగదా
యవిదారణకారణాయుధా. దశా. 2. 30.

**అటిముటితనము** వి. క్షోభము, కలవరము.

ద్వి. నునుపుగాకున్న వాసనకుఁ దేకున్న, మటి
కదా శివునకు మాకు నంకంబు,నటిముటితన
మిప్పు డదియేల యనుచు. బస. పు. 4. 372.

(ఇది చందనము కొనుటకు ధనములేక తనశరీరమును మాటి గంధముగా వర్షింపఁ దలఁచిన భక్తుని వచనము.)

**అటిమెనకుండలు**—ఐరేనికుండలు. (గ్రా)

**అటిసె(సియ)** వి. (సం. అతిరసః) ఒకవిధమగు పిండివంట, భక్ష్యవిశేషము.

**అటు¹**—అటు. అ. క్రి. (క. త. అటు.) నశించు, క్షీణించు. భార. అది. 2. 18.

క. బలవంతులబలముఅఁగా...భార. ఆది. 7. 176.

చ. చిటునగ వొప్ప గాండివము సెచ్చెర సజ్యము
సేసి సేనలు,క్కఱ...భార. విరా. 5. 143.

క. కరువునఁ బూరితమై లో,హారసము లోఁ
గాలునట్టు లంగజలోకో,ద్ధురశిఖ రతితను
విమ్ముగఁ, గరఁగియుఁ బొడ వటక లోనఁ
గాలుచునుండెన్. కు. సం. 5.578. భా. రా.
అర. 2. 144, హర. 7. 88.

మ. పరకార్యంబు లొనర్పఁగాఁ దమపనుల్
పాటిల్లు నోర్వన్ ఖలో,త్తరులా మూర్ఖుల
పెంపటున్ బరుచరిత్రల్ మెచ్చనాత్మీయమా,
చరితం బెన్నిక కెక్కు...మల్ల. నీతి. 60.

ఉ. ...వా,రెట్ట టిపోవనిమ్మనుచు నించుకయేని
యుఁ దాల్మిలేకయే, నెట్టు భుజించువాఁడ
ధవలేక్షణ యొక్కఁడ నీగృహంబునన్.
కాశీ. 7. 180. సమీర. 3. 281.

**అటు²** (చూ. అట్టు.)

**అటుఁదెవులు** వి. (√అటుగు.) క్షయరోగము.

సీ. ...కుష్ఠము గలతనువునాతఁ, డటుఁదెవుల్
గొన్నాతఁ డఖిలవస్తువులును నమ్మెడునతఁడు
...పంక్తిదూషకులంద్రు పౌరవేంద్ర, భారం.
అను. 3. 175.

**అటుకువ** వి. (√అటుగు) అఱకము, అజీర్ణవ్యాధి.

సీ. ...అటుకు వటక మత్తె మన నజీర్ణియగు.
అం. భా. 2. 128.

విశ. పరిపక్వము కానిది: పరిణతము కానిది.

సీ. అటుకువయెటుకతో...ఉ. హరి. 4. 50.

**అటుక్రమ్ము** అ. క్రి. (√అటు²) చుట్టును క్రమ్ము; క్రమ్ము.

ద్వి. పటుచు నెత్తురుటేర్లు బహుమాంసములును,
నటుక్రమ్ము భూతంబులై రణం బొప్పె.
రం. రా. సుం. 265 పొ. 4 పం. కవిక.
4. 180.

**అటుగమి** వి. (√అటుగు) అటుగక పోవుట; అజీర్ణ వ్యాధి.

సీ. ఒకతఱి మునివర్యులొక్కటఁ బెక్కండ్రు
శ్రాద్ధముల్ సేయ భోజ్యములు పెక్కు,
లనుభవించుటఁ దమ కఱుగమి పుట్టుట...
భార. అను. 8.196.

సీ. అఱుగమి పుట్టి యింద్రాదిదేవతలకు
వెన్నఁడు వంటకం బింపుగాదు. వరాహ.
12.61.

**అఱుగు(వు)** అ.క్రి. (క. అరగు, అరుగు.త.అఱు.)
1. క్షీణించు, తఱుఁగు, కృశించు.

గీ. సమదుఁడగు భీమసేనుచేఁ జచ్చిచచ్చి, బల
ములఱుగ...భార. ద్రో. 4.220.

క. నెఱగొండలు గువ్వలచే, నఱుగునె యీ
మంటిదిబ్బ యటు నాచేతం, దఱుఁగునె...
భోజ రా. 3.79.

2. (తినినపదార్థము)జీర్ణమగు.

సీ....దరిద్రపుజనంబు, లాఁకటం దిని యాలు
నఱిగించుకొందురు...భార. శాం. 1.216.

ఉ. డక్కెను రాజ్యమంచు నకటా యిటు
దమ్మునిభాగ మీక నీ, వెక్కటి మ్రింగఁ
జూచె దది యెట్లఱుగుఁ...భార. ఉద్యో.
2.52.

జ: అఱుఁదెవులు, అఱుకువ, అఱుగమి,
అఱుగుఁ దెవులు, అఱుగుడు, అఱుగుపడు,
అఱువుఁ దెవులు, అఱువుడు.

**అఱుగుఁదెవులు—అఱువుఁదెవులు.** వి. (√అఱుగు)
అఱుఁదెవులు, క్షయరోగము.

**అఱుగుడు** అఱువుడు. విశే. (√అఱుగు) అఱిగి
పోయినది; జీర్ణమయినది.

సీ. కుడికరంబున నఱుగుడు వేణుదండంబు
గూని వీఁపునఁ జింపిగోడుగుఁదడక. శై.
భా. 9.167.

వి. అఱిగిపోవుట. సాంటో. 2.19.

వి. తునుకలు, ముక్కలు. (చూ. అఱువుసు.)

**అఱుగుపడు** అ. క్రి. (√అఱుగు) క్షీణించు. చెడు.

క. వఱువాత లేచి నీవగు, కొఱగాములు
చక్కఁద్రోచికొనఁబోయె దినం, బఱుగు
పడియె నీపను, లఱజాతివి నిమ్న నేమి
యన నేర్తు సుతా. హరి. పూ. 5.289.

**అఱుపు** వ. క్రి. (√అఱుగు). 1. అఱిగించు,
జీర్ణముచేయు.
ఉదా; తిన్నతిండి అఱుపుకొనలేకపోయినాఁడు.
2. ఇముడుచు, దక్కించు.
ఉదా : అఱుపరానికడి-ఇముడుచుకొనశక్యము
గానిముద్ద. మ్రింగరానిముద్ద.
(వ్యవ) దొఁకినసొమ్ము అఱుపుకొనలేక పోయి
నాఁడు.

అ.క్రి. 1. ఇముడు, లొంగు, అడఁగు.
ఉదా : నాచేతికి ఆ పెద్దరాయి అఱుపదు.
2. దక్కు.
(వ్యవ) ఆసొమ్ము నాకు అఱుపనిచ్చుటలేదు.

**అఱుము(ర్మ)** స క్రి. 1. ఎదుర్కొను.

ద్వి. తివిరి రాక్షసనేనఁ దెంఱించి పఱప, నఱిమి
కొందఱు చచ్చి రాహవక్షోణి. రం. రా.
ఉ. 77 పొ. 12 పం.

2. ఒత్తుడుచేయు, బాధించు.

సీ. కఱకును బేదల నఱుముటయును బెఱ
తెఱవల పైఁజూడ్కి పఱపుటయును. అచ్చ.
రా. బాల. 45.

3. ఆక్రమించుకొను, వశపఱచుకొను.

సీ. ఒజ్జకుఁగైతవ మొనరించు నతఁడు తదంగ
నాజనముల నఱిమినతఁడు, శునకంబు
గర్దభంబు నగుదురు...మార్క. 2.118.

అ క్రి. 1. ప్రతిఘటించు, మార్కొను.

చ. ... అమరాపగాతనయుతోడిరణంబునకున్
దిశాధినాథులు నఱుమఁగఁ జాలరు...
భార. భీష్మ. 2.9.

క....ఓడకుఁ దోడకుఁ, డనుచున్ గౌడవిభుఁ
డనికి నఱిమెనె యనుచున్ కళా. 8.50.

2. సాహసించు, తెగించు.

గీ. పిఱికికండ యొకింత లేకఱిమి వేడ్కఁ,
జిచ్చుఱుకఁ బోవువికచరాజీవనేత్ర,కు...
కాశీ. 2.86.

3. విజృంభించు, అతిశయించు.

చ. అఱిమి రమాకుమారుఁ డపు డగ్ర
తలంబున వచ్చి నిల్చిన, ట్లఱిముఱిఁ
దోఁచిరన్ గువలయాక్షి వడంకి కడంక
దూలి...వసు. 8.179.

సీ. గ్రామముల్ ధనధాన్య కటకంబులై యుండు నఱిమి ధేనువులు చన్నవిసి పిండు. కృ. శకుం. 1.18.

వి. ఎదుర్కొనుట, ప్రతిఘటనము.

క. ఉఱక నరుఁడట్లు మైమఱు, వఱువుళ్లుగఁ జేసిలీల నంగము తెల్లం, బఱియలుగఁ జేయ నాతం,డఱు మెడలక మఱియు నేసె నధికరయమునన్. భార. భీష్మ. 2.306.

ఉ. ఏటుల మ్రొగ్గువారిఁ గని యించుక కొంకక యర్మ్మె పెంపునన్, బోటులవాతఁ బోవు భటపుంగవులన్ మది మెచ్చుచున్.... భార. విరా. 3.163.

**అఱువంద్రు** స. (అఱువదికి మహాన్మహాత్వర్థక రూపము.) అఱువదిమంది.

**అఱువది** అర్వది స. ఔ. (ఆఱు + పగులు-క. అఱువత్తు. త. అఱుపదు.) ఆఱుపదులు. భార. శాం. 5. 46. కాశీ. 5.266.

**అఱువుఁదెవులు** — అఱుగుఁదెవులు.

ఉ. ఏను హితంబు సెప్పనిటు లేచి దురాచరణంబు లిమ్మెయిన్, మానవు రోగి చేఁడయిన మందఱువుందెవు లంటుఁదాఁకినన్, గాని యెఱుంగఁడు....నిర్వ. 4.65.

**అఱువుడు** - అఱుగుడు. విశ (√అఱుపు) అఱిగి పోయినది; జీర్ణమయినది.

క. అఱువుడుగావిముసుఁగును, విఱిగినదండంబుఁదునిసి వ్రేలెఁడుగోఁచిం, బఱియయిన కమండలువును...ఉ. హరి 4.79.

వి. అఱిగిపోవుట.

బ. ఖండములు, తునుకలు.

క. చిఱునగవుతోడ మైమఱు, వఱువుళ్లుగఁ జేసి యతని యంగము దోఁగం, బఱపె రుధిరంబు...భార. కర్ణ. 3.300.

క. ద్రోణుఁడు కోపించి తను, త్రాణం బఱువుళ్లు నేసి...భార. భీష్మ. 2.233.

క. ఏసి నిశాతశరంబులఁ, గౌసల్యాతనయు నొంచి కవచం బఱువుల్, నేసి...భార. రా. యు. 548.

**అఱువై** - అఱువది. (చూ. ఇరువై.)

మ. అఱచేయింబలె మేఘపుష్కర మహాహార్యాంతరాళంబునం, దఱువై యోజనముల్ వెడల్పును శతాయామంబునుం గల్గి...వరాహ. 10.137.

**అఱ్ఱ¹** - నఱ్ఱ. వి. ప్రయాసమునఁ బిడుకఁ దగిన యావు, కరట.

సీ. అఱ్ఱలనైనను నమువైన వెంపున ముట్టె యంటఁగఁబట్టి కట్టి విడువ. భార. విరా. 1.101. (చి. ని పా.)

ద్వి. ఉఱ్ఱడి కాళ్గట్టి యొనరంగఁ బిదికి, యఱ్ఱ పాలిచ్చె నేఁడని తెచ్చువారు. ద్వి. భార. 10. (చి. ని)

**అఱ్ఱ²** — అఱ,

(సగము) చూ. అఱ్ఱాఁకలి.
(గది)

ద్వి. వలిగప్పురంపు ధూపవాసనల్ గదురు, కొను కెంపుటఱ్ఱలోఁ గ్రొన్ననపాను, పుననుంచి యందు నేర్పున వ్రాసినట్టి. ద్వి. తి. సా. 1.15 పా.

ఆ. పరమయోగినొమ్ముపదిలమ్ముగా నపాయమ్ము జెందకుండునట్లు డాఁచి, మగుడనీయఁ గలిగె మాటదక్కెనటంచుఁ, దడయకేఁగి యఱ్ఱ తలుపుదీసి. హరి భక్త. 1. (చి. ని.)
(కీడు, హాని)

సీ. తపనసూనుఁడు తారఁ దా నాక్రమింపఁడె యన్నప్రాణములకు నఱ్ఱఁదలఁచి. ప్రబోధ. 1. 50.

జ: అఱ్ఱాకలి.

**అఱ్ఱము** వి. ముండ్లమోపు. (శ. ర.)

**అఱ్ఱాఁక** వి. (√అఱ్ఱాఁగు.) 1. ఒత్తుడు, బాధ.

ఉ. ...ప్రసూనబాణుఁ డఱ్ఱాఁకలఁబెట్టెఁ దానరవనామెత బాలికకై విటావళిన్. కళా. 1. 16.

క. ఆఁకలి గాదో భక్తిం, దేఁకువ గలవాఁడఁ గానొ తినవేల కృపన్, సాఁకఁగదే నన్నిపుడఱ్ఱాఁకలఁ జెట్టక పలాశనాసక్తుఁడవై. కాశ. 3. 89.

2. అంతరాయము, అడ్డు, ఆటంకము.

క. అఁకొనియఱచెడిఁ బ్రేవులు, నేఁకటవోవమల వలయు నీమాంసము న,ట్టాఁకయిడి యివ్విధంబునఁ, దేఁకువ చెడి వల్కెఁదగునె ధేనువ నాకోన్. భోజరా. 4. 212.

3. దాఁపటికము, మఱుఁగు.

శా. ఊఁకోఁ జెప్పఁగ నెంతయేని తడవానో విప్ర శార్దూల నీ,వాఁకొన్నాఁడవు భోజనో త్తరమునం దాస్థానమై యుండి య,ట్టాఁకం బెట్టక చెప్పెదన్ సకలవృత్తాంతంబునుం దేటగా, వీఁకన్ వేళ యతిక్రమించెఁగుడునన్ విచ్చేయుమా క్రమ్మఱన్. కాశీ. 7. 173.

**అట్టాఁకలి** వి. (అట్టు¹–అఱ+ఆఁకలి) – సగమాఁకలి—ఆఁకలి పూర్తిగా తీఱమి.

క. అవనీసురులకు నన్నం,బవనీశా పెట్టు పెవ్వఁడట్టాఁకలి గా,నవనిపయి నతఁడు పద్మో,ద్భవుఁడైనను బొలియుఁ జుమ్ము తత్క్షణమాత్రన్. భోజరా. 6. 173, 161, 163.

**అట్టాఁగు**—అట్టాఁచే. స. క్రి. (√అట్టు.)

1. కంఠము పట్టుకొను.

శా. హాహాహా యని వేగ లేచి శమనుం డట్టాఁగి తన్ ద్రోయఁగా...దశా. 5. 22.

2. బాధించు, పీడించు.

(యశము–కర్త)

మ. బలభిన్నాగము చెంపఁగొట్టి గిరిజాప్రాణేశు నట్టాఁగి...(చాటువు.)

(సీసపాదములందు పేర్కొనఁబడిన చంద్రుని ఈశానుని, ఐరావతమును, హిమవంతుని పరుసగా.)

గీ. అక్కుఁ బఱచియు నట్టాఁగి చెక్కిలడఁచి, కలఁచి నీరుగఁజేసి నల్లడలయందుఁ గడిమి నెఱయఁ జెలఁగుచుఁ గలయ మెలఁగి, యుబ్బుఁ జిన్న వేంకటపతి గబ్బియసము. రామ. 3 51.

(రెండర్థములకును ఇవి యుదాహరణము లగును.)

**అట్టాఁచే**—అట్టాఁగు.

(బాధించు.)

గీ. శబరకాంతాకుచాగ్రసంసక్తగైరి, కాంకసంబులు జనుల నట్టాఁచు నచట. చంద్ర. 5. 50.

**అట్టాడు** అ. క్రి. (√అట్టు) 1. సమీపమునఁ దిరుగు; ఇటు నటు తిరుగు, చుట్టుచుట్టు తిరుగు.

వ. ద్రౌపది యున్న యెడకుం జని యాసమీపంబున నట్టాడుచు నమ్మానవతితో నిట్లనియె. ...భాగ. విరా. 2. 42.

గీ. పెట్టుపోఁతలసాగ సానిపెట్టిసాని, యింటికడ నుండి యట్టాడుబంటువాఁడు. శుక. 2. 208.

వ. ఇళ్ళాలకులు మనవాలకపు సొమ్ములందు నేమే,నియు నపహరించుటకు నట్టాడుచున్న వారు. ప్రభా. 1. 107.

2. ఊఁగులాడు, ఆందోళన మొందు.

వ. కటాక్షాంచలం బతనిమూర్తిఁ దాయనుం డాయనుం జాలక యట్టాడ. నైష. 5. 183.

3. తమకించు, తహతహపడు.

సీ. మొలక చన్నులతోడ ముచ్చట కట్టాడు చెలువునఁ దడఁబాటు చెవులు వ్రేల. విప్ర. 1. 68.

ద్వి. అఁకటఁ జంటి కట్టాడుచు ముద్దుఁ, గూఁకటి తూఁగాడ గునియుచు నున్న, సుతు లోహితాస్యునిఁ జూచి...ద్వి. హరిశ్చ. ఉ. 705.

**అట్టు** వి. బొ. (దీనిక్రింది అకారమునకు బొపవిభక్తికములు పరమగునపుడు నిత్యముగాను ఇతరత్ర వికల్పముగాను లోపముపచ్చును, అచ్చుపరమగునపుడు మాత్రమురాదు. ఉదా: అటితిన్, అటితికిన్, అటునన్, అట్టులు, అటులు, అట్టెత్తి. మొ.)

2. కంఠము.

ఉ. అందని మ్రాని పండ్లకును నట్టులు సాఁచెద నేమి సేయుదున్...దశకు. 3. 131.

వ. ...అపగత ప్రాణంబై పడియున్న పామున్ దన వింటి కొప్పున నెత్తి యమ్మునియఱుతం దగుల వైచి...భాగ. ఆది. 2. 167.

సీ. ఇందుబింబముఁ జూచి చెందుప్పుఁగలుసావి యఱులెత్తినాకఁగ నాసపడిన. కాశీ. 3. 12.

ద్వి. అంతకుం డఱుద్రొక్కి యదిమినయట్టి, జంతువునైనను సత్కృపఁ గాచు. ద్వి. హరిశ్చ. పూ. 337.

ద్వి. ఆదట నీరీతి నట్టొత్తి చంపె...ద్వి.హరిశ్చ. ఉ. 2412.

2. ఉపకంఠము, చేరిక, సమీపము.

క. ...తెల్ల నిగట్ట ఉత...మనుచ. 4. 16.

గీ. ...ఇయ్యూరియటుత. శుక. 3. 586.

3. ముందుభాగము.

(రాముఁడు మాయలేడిని వెంబడించుట.)

క. పిటిఁదికిఁ టో నిచ్చినవి,ల్ల టితికినై యల్లఁ టాఁప నది గనుఁగొని పె,ల్లుటికి చను... భా. రా. అర. 2. 49.

జ: అటుక్రమ్ము,అట్టాఁక,అట్టాఁగు, అట్టాఁచు, అట్టాడు.

**అట్టెము** వి. అటుగకు, అజీర్ణరోగము.

సీ. ...అటుకు వటక మట్టె మన నజీర్ణ...ఆం. భా. 2. 128.

**అల¹** వి. (త. అలై. క. అలె—చలించు.) తరంగము.

సీ. అరల నుయ్యాలలూఁగు చలరెడి హంసలు. ఉ. రా. 7. 283.

**అల¹—అల్ల¹** నం. విణ. ప్రసిద్ధిని దెలుపును,

మ. అలవై కుంఠపురంబులో నగరిలో నామూల సౌధంబుదా,పల...భాగ. 8. 95.

2. నిర్దేశమును దెలుపును,

గీ. చోరుఁ డలచంద్రుఁ డద్దంబు సొచ్చినపుడు. నై ష. 2. 124.

**అల²—అలా.** అవ్య. సంబోధనాంత పదములకు అనుప్రయుక్తము.

ఉ. అక్కల కన్యకాత్వ మిటు లాఅడివోవ నకారణంబ నీ,కెక్కడి చూలువచ్చె, నిర్వ. 2. 24.

**అలంకరణము** నం. వి. అ. న. 1. అలంకరించుట. 2. భూషణము.

**అలంకరించె** నం. న. క్రి. కై సేయు, సింగారించు.

(క) అలంకారయుక్తము చేయు.

సీ. ఏరాజు నిజకీర్తి నెనిమిదిదిశల నుల్లాసంబు నొంద నలంకరించె. మార్క. పీఠి. 85.

(చ) (అలంకారముగా) పెట్టు.

సీ. తళుకైన వింతసొమ్ము లలంకరింపరే మించు మైదీఁగెడాల్మించునటుల. ఇందు. 6. 119.

అ. క్రి. అలంకారములుపెట్టు.

వ. అయ్యింబుజాక్షికిఁ దద్వయస్యలుకౌతుకాతి శయంబున నెప్పటికంటె మిగుల నలంక రించి...కళా. 4. 104.

**అలంకరిష్ణువు** నం. విణ. (ఉ.) అలంకరించు స్వభా వము కలవాఁడు.

**అలంకర్త** నం. విణ. (ఋ. స్త్రీ. ఋ.) అలంక రించువాఁడు.

**అలంకర్మీణుఁడు** నం. విణ. (అ. ఆ. అ.) పనియందు నేర్పరియైనవాఁడు, కర్మఠుఁడు.

**అలంకారకము** నం. విణ. (అ. రికా. అ.) అలంక రించునది.

**అలంకారము** నం. వి. అ. పుం. 1. అలంకరించుట. 2. (హారాది) భూషణము. 3. కావ్యాలంకా రము-శబ్దనిష్ఠ మగుఅనుప్రాసాదులు, అర్థనిష్ఠ మగుఉపమాదులు, ఉభయ (శబ్దార్థ) నిష్ఠమగు పునరుక్తవదాభాసాదులు-అని అలంకారములు త్రివిధములు.

**అలంకారించె** నం. న. క్రి—అలంకరించు.

(అలంకారయుక్తముచేయు.)

ఆ. దేవిరూపమునకు దృష్టి దాఁకెడు నంచు, మాటు సేయుభంగి మణిసువర్ణ, పుష్పవస్త్ర గంధముల నలంకారించి, రెలమితోడ గౌరి నిందుముఖులు. వీర. 3. 162.

**అలంకృతి** నం. వి. ఇ. స్త్రీ — అలంకారము.

**అలంకృతుఁడు** నం. విణ. (అ. ఆ. అ.) అలంకరిం పఁబడినవాఁడు.

**అలంక్రియ** నం. వి. ఆ. స్త్రీ — అలంకారము.

**అలంగము** వి. (త. అలంగం) కోటచుట్టును వేసిన మట్టిదిమ్మ, వప్రము.

సీ. కడుగడిపై నలంగముచుట్టు నెల్లెడ గస్తు గ్రుమ్మరునట్లు గట్టిపఱచి. రంగా. 2.198. రామా. 6. 246.

సీ. అలంగం బన నలవరి నా వప్ర మగును. ఆం. భా. 2. 12.

అలంగముదిరుగు—చుట్టును దిరుగు; చల్లిర్థముగా తిరుగు (వ్యవ)

**అలంఘనము** సం. వి. అ. న. 1. దాఁటకుండుట. 2. మేర తప్పకుండుట.

**అలంఘనీయము** సం. విణ. (అ. ఆ. అ) 1. దాఁటుటకు శక్యము గానిది. 2. దాఁటఁ గూడనిది. 3. అతిక్రమింప శక్యముకానిది. 4. అతిక్రమింపఁ గూడనిది.

**అలంఘ్యము** సం — అలంఘనీయము.

**అలంజరము** సం. వి. అ. పుం. 1. మృన్మయపాత్ర (కుండ, మొ.) 2. కాఁగు, మొ.

**అలంజుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) నిరర్థకజన్మము గలవాఁడు.

**అలంజురము** సం — అలంజరము.

**అలంతమము** సం. విణ. (అ. ఆ. అ.) 1. మిగుల చాలినది. 2. మిక్కిలి సమర్థము.

**అలంపురుషీణుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) ఇతరునితోఁ బోర సమర్థుఁడు (ప్రతిమల్లుఁడు, మొ.)

**అలంబుష** సం. వి. ఆ. స్త్రీ. లజ్జాలులత, అత్తపత్తి, సోఁకుడుముడుఁగు (వృ.వి.)

**అలంబుషము** సం. వి. అ. పుం. వాంతి, క్రక్కుట.

**అలంభూష్ణువు** సం. విణ. (ఉ.) సమర్థుఁడు.

**అలఁగు** అ. క్రి. (క. అలుంగు. త అలంగు.) 1. నలఁగు, అలయు, శ్రమపడు. (చూ. అలఁచు.) 2. దుఃఖించు; ఏడ్చు, ఆర్తధ్వనిచేయు.

ఉ. బాలుర చావుకర్ణములఁ బడ్డఁ గలంగి యలంగి
యోరువం, జాలక బాష్పతోయకణజాలము
సెక్కుల రాల నేడ్చి... భాగ. 1. 142.

చ. పలలము సాకువంబు గొనుభంగి సుచిత్రుఁడు
క్రీడిఁ దేరితో, నలమి వియత్తలంబు గదియన్
రథసంబున దాఁటి సంగరస్థలిఁ బదియంగ
నైవ నిజసైన్యము కవ్వడి చచ్చెఁ బచ్చె
నం, చలఁగ మురారి గ్రక్కునఁ గరాబ్జ
మునన్ బడకుండఁ బట్టినన్. జై. భా. 7.
177.

3. అలుకు, భయపడు.

సీ. ఆయుధప్రభఁ గాంచి యలఁగుభీరువుఁ బూను
వాఁడిముమ్మోముల వేఁడియలుఁగు. పాండు.
1. 101.

చ. పలికిన నేను నీతలఁపువద్దతి గాకిపు డేమి
మీఁటి వస్త్రిలితిఁ దోడింబడన్ నిను వధింపఁగ
వచ్చెదనో యటంచు న్యాకలఁగుచు రాక
మామ మని యానలువెట్టఁగ ... కళా.
6. 66.

(శ. ర. పాఠము—'అలుగుచు' అనిముద్రి.)

4. జంకు, సంకోచించు.

ద్వి. జలకేళి సలుపునిర్జరసతుల్ కుకుని, కలఁగ
కూరకయుండి యటుతరువాత. ద్వి. కో.
భాగ. 1. 688. పం.

జ. అలఁచు, అలకువ.

**అలఁచు** స. క్రి. √అలఁగు. (త. అలసుదల్,) అలఁగఁజేయు.

(బాధించు, శ్రమపెట్టు,)

గీ. అమ్ముకుందుఁడు గ్రొత్తయై యడలుదనదు.
డెంద మలఁపంగఁ జెలియలిమందిరమున,
కరిగి పుఁపురఁ బొక్కెడు నాసుభద్రఁ,
గాంచి... భార. ద్రో. 2. 321.

సీ. ఘనవృత్త కుచములఁ గని సింహములు
నొంచుఁ గరములు గని కురంగంబులలఁచు.
భా. రా. అర. 2. 303.

**అలఁత** వి. (√అలయు—త. అలందై.) 1. అలయిక, శ్రమము.

సీ. ఆఁకలి నీరువట్టలఁత జరారోగములు కాల
గుణములు మొదలుగాఁగ, దోషంబు లెవ్వి
యుఁ దోయజభవులోకమునఁ బ్రభవింపవు.
...హరి. పూ. 2. 17. కువల. 2. 110.

2. దుఃఖము; బాధ.

గీ. తనుజ శోకార్తయైన గాంధారిఁ జూచి,
యడలు తనదు చిత్తంబున నతిశయిల్ల,
నలఁతఁ దేర్పంగఁ దలఁచి తా నల్లఁ జేరి,
యమ్మహాదేవితోడ నిట్లనియెఁ గృపుఁడు.
భార. స్త్రీ. 1. 107, ద్రో. 2. 252.

ఆ. అదియ తప్పుచేసి యలరంపగము లేసి,
యలఁతఁ బెట్టఁ దొణఁగె నంగభవుఁడు.
విక్ర. 1. 147.

**అలఁతి** విణ. 1. సూక్ష్మము, చిన్నది, కొలఁదిపాటిది.

గీ. ...పెక్కండ్రు రథులదిశలఁ బోదివి యతని కరంబునఁ బోలుచుచక్ర; మలఁతితునియలు గానేసి రాగ్రహమున. భార. ద్రో. 2.116.

ఆ. అనిన సిగ్గుతోడియలఁతిన వ్వొలసిన, చెన్ను మొగము వింతచెలువు దాల్ప. భార. అను. 5. 277.

ఆ. వేదమయు సహస్రపాదు నలఁతు,లై నవారి కంటె నలఁతి పెద్దలకును, జాలఁబెద్ద యగు దయాళుఁ గొలుతు. భార. శాం. 2. 21.

2. పలుచనిది.

గీ. ...తన్నగరసతుల, నెఱికురులు ముద్దుమోములు నిడుదకన్ను, లలఁతిమోవులు బిగి గుబ్బ లరిదినాభులు. వసు. 1. 107.

సీ. అలఁతిపయ్యెదలోనిహారముల్ చిలుపవెన్నెలలోని తారకావళులుగాఁగ. దశా. 3. 28.

3. అల్పుఁడు, తక్కువవాఁడు.

మ. ... ఉదగ్రుల్ పండితగ్రామణుల్, మది నూహింప నలంతులే సురభిమల్లా...మల్ల. నీతి 11.

4. తరము, శక్యము.

చ. చిరముగ నొల్వు వడ్డనరసింహునికంటెను బెద్దవే...నీవువిశ్వసం, హరునుఱకెత్తిపోయి కలహంబున నోర్వఁగ నీయలంతియే. కు. సం. 4. 432.

(నీయలంతియే–నీకుశక్యమా.)

వి, 1. అల్పమైనయత్నము.

వ, ఇట్లు బ్రాహ్మణ్యం బలఁతులం బడయవచ్చునే, భార. అను. 1. 97.

మ. అలఁతింబోరు మహారథుల్ ద్రుపదమత్స్యాగ్రిశులు...భార. ఉద్యో. 4. 261.

2. (క. త. అళవు, అళతె.) పరిమితి; కొలఁది,

గీ. మేర కగ్గలమై పర్వు మెఱుఁగు లెల్ల, వరుస నలఁతికిఁ దెచ్చిరి వెరవు మెఱసి. కు. సం. 9. 209.

**అలఁదు** స క్రి. పూయు, రాచు.

సీ, కలపంబు లభినవగంధంబులుగఁ గూర్చి తనువున నలఁదుదు ననువు గాఁగ. భార, విరా. 1. 107.

**అలఁదురు** అ. క్రి. (త. అలంద్రై, అలందలై–శోభము.) 1. శోభమునొందు, కలఁతనొందు.

లయగ్రాహి...ప్రోషితుల డెందము లలందురఁగ మందమలయానిల మమందగతి వీచెన్.భార. ఆది. 5. 189.

క. అనిపనవి వనట వలఁదురి...భార,ద్రో.1.93,

2. దుఃఖించు; పడ్చు.

చ. ఇటు దగునయ్య శూరులకు నెల్ల ను బోకడ యిట్లు కాదె యే,మిటికి నలందురన్... భార. ద్రో. 2. 257.

క. ఒకనాఁ డొకవిప్రుని బా,లకుఁడు మృతుండైన నతఁ డలందురి కాకు,త్థ్సకులులకుఁ జెప్ప...పద్మ. 9. 25.

**అలక** వి౫, (హిం. అల్కా, హల్కా.) – దీనికి కర్మధారయమందు నిగాగమము వికల్పముగా వచ్చును – పలుచనిది.

చ. అలకనిజీబులోఁ గుసుమ మద్దినపావడ దోఁప. మనుచ. 6. 31.

జ. అలకన.

**అలక** సం. వి. ఆ. స్త్రీ. కుబేరుని పట్టనము.

**అలక(ము)** సం. వి. అ. పుం. న. (ఇది తఱుచుగా బహువచనమునందేకనఁబడుచున్నది.) 1.కుటిల కుంతలము, నెఱివెండ్రుక.

సీ. నిటలాలకము లంట నివుర జుంజుమ్మని ముఖ సరోజమునిండ ముసరుఁ దేంట్లు. భాగ. 8. 104.

2. కేశము, వెండ్రుక.

చ. అలకలు దువ్వరాదు సరసాన్నములన్ భుజియింపరాదు...సాధ్వియా,నలినదళాయతాక్షికిని నాథుఁడు చెంగట లేకయుండినన్. శకాం. 2. 124.

**అలకన** వి. (√అలక) పలుచఁదనము.

**అలకప్రియము** సం. వి. అ. పుం. పీతసాలవృక్షము.

**అలకి** వి. (సం. ఆలుకా.) భాండవిశేషము, ఒక విధమగుకుండ; కుండ.

సీ. అలకులుఁ గాఁగులు నాదిగాఁగల భాండములును...భార. అశ్వ. 3, 156.

ద. ...నాలుగే, నలకులదొంతి డించి యవి యన్నియు నుగ్గులి నీతనూఱుఁడో,ప్పులువడ మ్రింగె. హరి. పూ. 5. 221.

సీ. అలకిపుట్టువు. ప్రబంధ. 174.

(అలకిపుట్టువు—ఘటోద్భవుఁడు, అగస్త్యుఁడు.)

**అలకువ** వి. (√అలఁగు) కొఱఁత, న్యూనత.

చ. అలకువ లేనినిష్ఠలును యజ్ఞముకర్మము లాచరించి వేల్పులకు సుఖంబులం దగిన పూజ లొనర్చి... మై. 1. 63.

**అలక్తకము** సం. వి. అ. పుం. లత్తుక.

**అలక్తము** సం. — అలక్తకము.

**అలక్షణము** సం. విణ. (అ. ఆ. అ.) 1. నిర్వచనము లేనిది. 2. చిహ్నములు లేనిది. 3. మంచిచిహ్నములు లేనిది. వి. అ. న. 1. దుష్టచిహ్నము. 2. అప్రశస్తమైన నిర్వచనము.

**అలక్షితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. చూడఁబడనిది. 2. గ్రహింపఁబడనిది. 3. చిహ్నితము కానిది.

**అలక్ష్మి** సం. వి. ఈ. స్త్రీ. దౌర్భాగ్యదేవత, పెద్దమ్మ; దౌర్భాగ్యము.

**అలక్ష్యము** సం. విణ. (అ. ఆ. అ.) 1. చూడరానిది. 2. తెలిసికొనరానిది. 3. గుఱిలేనిది. 4. లక్ష్యార్థము లేనిది. వి. అ. న. 1. గుఱి కానిది. 2. లక్ష్యార్థము కానిది.

అలక్ష్యముచేయు — లెక్క సేయకుండు, గణింపకుండు.

**అలగర్ద** సం. వి. ఆ. స్త్రీ. విషముగలయొక పెద్దజలగ.

**అలగర్దము** సం. వి. అ. పుం. నీరుపాము.

**అలగర్ధము** సం. — అలగర్దము.

**అలజడి** వి. 1. ఆపద; బాధ.

ఆ. ఇదియకాని చేయ నెద్ది యే ననుచు ని,ర్బంధవృత్తిఁదలఁపు పట్టుకొనిన, నట్టివాని కెందు నలజడి వాటిల్లు... భార. ఉద్యో. 3. 305, అర. 7. 381.

క. ఖలుఁడు మునుల యాశ్రమములు, గల యన్నియుఁ జొచ్చి చెఱిచెఁ గ్రతువులు ధర్మస్థలనం బొనర్చె సాధుల, యలజడి కిది గుఱుతుగొలఁది యన తే దనఘా. హరి. ఉ. 4. 110.

2. క్లేశము, శ్రమము.

క. నీవలనను భక్తిస్నేహావేశముగలిగి కూరుఁదై యలజడికిం, దా విసువనిసత్కులజుం, గావింపుము సైన్యవిభునిఁగాఁ గురుముఖ్యా. భార. ఆశ్ర. 1. 65.

క. అలజళ్లు దీనివలనం, గలిగెడునో కాని తక్కఁగలుగ దరిష్టం,బు... భార. అశ్వ. 4. 155.

జ. అలజడిచేయు, అలజడిపడు, అలజడిపాటు, అలజడిపెట్టు.

**అలజడిచేయు** స. క్రి. (√అలజడి)—అలజడిపెట్టు.

గీ. నాయమూ మమ్ము నలజడిచేయ మీకు. HK. 2. 210. (బ్రా)

**అలజడిపడు** అ. క్రి. (√అలజడి) అలజడినొందు.

క. అలఁజడిపడుచెలులం గని, పలవించుచు ... వరాహ. 4. 84.

**అలజడిపాటు** వి. (√అలజడిపడు) అలజడిపడుట. భార. అను. 2. 64.

**అలజడిపెట్టు** స. క్రి. (√అలజడి) అలజడి నొందించు, మొ. రా. బాల. 49.

**అలజము** సం. వి. అ. పుం. కుక్కుటము, గంపపులుఁగు.

**అలజి** సం. వి. ఇ, ఈ. స్త్రీ. 1. కీళ్లయందుఁగలుగు నొకరోగము. 2. ఒకవిధమైన నేత్రరోగము.

**అలతి** సం. వి. ఇ. పుం. స్వరసాధనార్థముగా నారంభమున పాడెడి స రి గ మాది, గీతిమాతృక.

వ. ...రంభనాట్యారంభంబున.

చ. అలతులనిల్పహస్తములు హస్తవిలాసముతోఁ బెనంగ... కు. సం. 9. 236, 237.

**అలపద్మము** సం. వి. అ. పుం. అభినయహస్తవిశేషము. (అయిదువ్రేళ్లను కొనలు గూడకుండునట్లు విల్లువలె వంచి చిటికెనవ్రేలి వెంబడి వ్రేళ్లన్నియు నెడముగా చిమ్ముట.)

**అలపు**—అలయిక. వి. √అలయు (శ. అలైప్పు.) అలయుట, శ్రమము.

క. నిలయ వ్యాపారంబుల, యలపుల మేనులు చెమర్చి...హర 5. 86. శివరా. 3. 26.

**అలబలము** వి. కలకలము, సందడి,జనులు, పశులు మొదలగువానిధ్వని.

క. అల బలము లసంఖ్యములై, యలబలములు సేయుచుండ...విజ. వి. 3. 141.

గీ. కమలనాభుండు కక్ష్యాంతరములు గడచి, యలబలము లేనివగరెల్ల నరసి చూచి. పారి. 1. 105.

గీ. అలబలము సేయుశుకశారికల నదల్చి. విప్ర. 2. 56.

**అలక్ష్యము** సం. విశే. (అ. ఆ. అ.) పొందశక్యము గానిది.

**అలమ్** సం. అవ్య. (తెనుఁగున సమాసపూర్వ పదముగానే యుపయుక్తము.) 1. చాలినంతటిది, చాలినది, తగినది.

అలంధనుఁడు- చాలినంతధనము గలవాఁడు.

అలంజీవికము–జీవనాధారమునకు చాలినది.

అలంకుమారి–కుమారికకు సరిపడినది.

2. అధికము; అధికముగా.

అలంధూమము–అధికమగుపొగ.

అలంగామి–అధికముగా నడచువాడు.

3. భూషణము.

ఉదా: అలంకారము.

**అలమట** వి. (√అలమరు – త. అలమరల్.) 1. దురవస్థ; కష్టము, బాధ.

క. అనవరతసౌఖ్యసంపదఁ, బెనుపొందుచుముండు మీకు భీకరకాంతా,రనివాసాయాసంబుల, ననఘాయిబ్భంగినవయనలమట వొదమెన్. భార. అర. 1. 213, కర్ణ. 1. 34.

సీ. ఒజ్జ శిష్యులఁ దర్జనోక్తులవెజ్జు రోగార్తుల నానావిధౌషధముల, నలమటఁ బొందింతు రవ్విధంబులచేఁత లన్నియు సుకృతంబులై ఫలించు. భార. అను. 5. 144.

గీ. యతివరేణ్య, యలమట సహింపఁ జాలను బొలియ నొక్క, మందు గల్గిన దయ సేయుమా రయమున. సారంగ. 3. 189.

2. దుఃఖము.

క. అని వెక్కి వెక్కి యేడ్వఁగ, వనజాననఁజేరి సఖులు వలదుడుగవళా, నిను వెవ్వతెఁగాఁ దలఁచితి, వనదయునుంబోలె వేల యలమట గుడువన్. ఉ. హరి. 5. 68.

3. శ్రమము, అలసట.

క. ఫలజలదళకుసుమసమి,జ్జ్వలసంబులు మొదలుగాఁగ వలసినయవి ని,చ్చలుఁదెచ్చియిచ్చుచును మే,నలమట నొందంగనీక యనయముఁ గొలువన్. భా. శా. శాం. 481.

జ. అలమటపడు, అలమటించు.

**అలమటపడు** అ. క్రి. (√అలమట) అలమటను పొందు.

క. కలఁగున్ వెనుఁబడు మ్రాన్పడుఁ,బలవించును దైత్యుఁజూచి భయపడు మదిలోఁ,గలుషించి దిక్కులేమికి, నలమటపడుఁ బతిఁ దలంచు వాయని యేడ్చున్. పద్మ. 8. 162.

**అలమటించు** అ. క్రి. (√అలమట) 1. దుఃఖించు; ఏడ్చు.

ఆ. అన్న నిన్నువంటియన్న కుఁదోఁబుట్టి,యాడుబిడ్డపోఁడి మందలేక, సుతులఁ గన్నకడుపు చుట్టనఁ గాలఁగా, నలమటింపవలసె నకట నాకు. వి. పు. 7. 79.

సీ. నానయు నలుకయు లోనఁ బెనంగొన ఖరుఁడు దూషణుఁడు త్రిశిరుఁడు ననఁగఁ, బరఁగు రేద్రిమ్మరి దొరలపాలికిఁ బోయి యత్తెఱంగెఱిఁగించి యలమటింప. అచ్చ. రా. అర. 12.

2. విచారించు, అరయు, పరిశీలించు.

ద్వి. మహిపతిభటులు...ఇంతపని చేసె వెలఁది యటంచు, మనకుఁ దోఁపకపోయె మహిపాలుఁ డేమిఁ, దెలియక సెలవిచ్చెఁ దెగి దాఁపలేక,యలమటింపక తెగవాఁడ్లఁ బెట్టితిమి, యక్కటా యిదియెంత యన్యాయమనుచు. ద్వి. శ. సా. 2. 89 పా. 22 పం.

(ఈయర్థమునఁబ్రయోగాంతరమున్మృగ్యము.)

**అలమరు** అ. క్రి. (త. అలమరు.) 1. శ్రమపడు, బాధపడు.

ద్వి. నీవు నీసుతుఁడును నీవధూమణియు, నీవిధి నలమరి యేఁగుచుండఁగను. ద్వి. హరిశ్చ. వా. 1798.

క. ప్లవగం బట్లలమరి మే,నవశం బగుటయుఁ దర్శిఁ చె నసువుల నుచిత,వ్యవహార క్రియఁ దెలియని, యవివేకికిఁ జేటు వొందదా యెందైనన్. వేం. పంచ. 1. 130.

2. విలపించు. ఏడ్చు.

(శిశువు) శా. ... ఇ ట్లలమరంగాఁ బట్టఁగా వచ్చునే. వేం. పంచ. 4. 498.

జ. అలమట.

**అలము** అ. క్రి. (త. అలంబు.) వ్యాపించు, ప్రసరించు.

చ. సులభమె దుర్లభంబొ యని చూడనెఱుంగవు గన్నదానిపై, నలముదు కామమా... భార. శాం. 4. 51.

స. క్రి. 1. ఆక్రమించు. క్రమ్ము.

చ. ...మి,న్నలముతదీయ హోమవరధూమచల చంపక శాఖలందుఁ బ,తులు రొదసేయ. ఆము. 1. 74.

2. పరివేష్టించు, ఆవరించు, చుట్టుకొను.

మ. జలజాతాస్యలు సద్వయస్యలు సహస్రంబు న్నజస్రంబు ద,న్నలమన్ దాసి సుదాసి యయ్యెఁ బగ వాయన్. భాగ. 9. 537.

3. సందిటఁ బట్టు, కౌఁగిలించు.

చ. కనఁ బదమూనఁ బాడఁ బలుకన్నొగ మెత్తుకొన న్నదింపఁజే, య నలమఁ జల్లనూర్చ నగ నంటనుజాలవుగాక కాఁకచే,ఘనకుచ పువ్వులిచె తిలకంబు నశోకము ప్రేంకణంబు గోఁ,గును గనకంబు కేసరము గ్రోవియు వావిలి పొన్నమావియున్. వసు. 8. 146. హ. న. 8. 86.

4. కప్పు.

గీ. ...ఆమించు ముద్దుగుమ్మ, సిగ్గు కడ్డంబుగాఁ బతిచేల మలమి, కొనుచుఁ బలికెను జిన్నెలు కొనరుచూప. హంస. 2. 68.

5. అదుము, ఒత్తు.

సీ. నిండుచందురుచొప్పు నిరసించుచును నొప్పు తెలిమోము మోమున నలమి యలమి.
గీ. మహిత రాగరసాంబుధిమగ్నుఁ డగుచుఁ, బద్మలోచనఁ గూడె భూపాలవరుఁడు. వరమ, 2, 42. పాండు. 3. 156.

6. గ్రహించు, పట్టుకొను.

గీ. అంతటను నేని పైఁటకొంగలమి బలిమి. సెజ్జపైఁ దార్చి యలకలచిక్కుఁ దీర్చి, మొక్కుచు నదల్చి నునుపోఁకముడివదల్చి, కరఁగఁజేసిన యటుమీఁదఁ గౌఁగిలించి. కువల. 4. 194.

7. అలఁదు, పూయు.

చ. ఇలఁ గలవస్తుసంతతుల కెల్లను గచ్చిడు మాస్వభావ పా,టలరుచి యింక వేఱ యొకదాలిడవచ్చునె లక్కనీట మ,మ్మలమినదెంత ముగ్ధ యిది యంచుఁ బదాబ్జము లంగుళీముఖం,బుల నగునట్లు మించు నఖముల్ మెఱయన్ గొమరారు నింతికిన్. ఆము. 5. 34.

గీ. పూసెఁ బట్టించెఁ జమిరె నాఁ బొలుచు నలమె, ననుట. ఆం. భా. ౬. 125.

౮. నేలపై ప్రాఁకుతీఁగ.

చ. వనముల నాకలంబుఁదిని వంతలఁగుందుచు. భా. రా. సుం. 186,

క. అలములు దుంపలు నములుచుఁ, బొలములఁ బడి తిరుగు రాచపురువులపై. అచ్చ రా. సుం. 39.

ద్వి. ఆకులు కాయలు నలము భక్షించి. నల. 1. 140. హంస. 5. 48.

జ. అలముకొను.

**అలము** సం. వి. అ. న. 1. తేలుకొండి. 2. అరిదళము.

**అలముకొను** స. క్రి.—అలము.

(ఆక్రమించు)

క. ...సెజ్జపై మేనిడి య,స్త్రులు గ్రమ్మనున్న యవ్విభుఁ, డలమట గ్రొత్తయయి మనమునలమికొనంగన్. భార. మౌ. 106.

గీ. ప్రత్యహంబు నవత్వంబు వదయ నెద్ది. యట్టి చింతాజ్వరంబు న న్నలమికొనియె. కాశీ. 1. 111.

(కౌఁగిలించుకొను)

క. అడుగుల కెరఁగినఁ జెండిలి, కొడుకపుగ మ్మనుచు నలమికొని వక్రి ముదం, బడర

నొడలెల్లఁ గన్నులు, గడలుకొనం జూచి యవనికాంతుని బలికెన్. వసు. 5. 57.

(పొందు)

గీ. వెనుక ము దటి సమ్మర్దమునఁ గరంబు, దండనిలి మధ్యమున నున్నధరణి విభుఁడు, యంత్రి సిద్ధార్థభావంబు నలమికొనియుఁ, దను నసిద్ధార్థుఁగా నాత్మఁ దలంచుచుండు. నైష. 4. 126.

(ఆచ్ఛాదించు, కప్పు.)

సీ. ఉడికిన ట్లున్నపుప్పొడి మెట్టఁగాఁ బొక్కు నడుగుఁదమ్ములు కేల నలముకొనుచు. యయా. 5. 118.

(పైకొను)

రగడ. అలముకొని వెంటఁ జెంలాటములుఁ గూటములుఁ, జలిపె నహిపతిమృగధూట ములుఁ గీటములు. రాఘవ. 2. 6.

అ. క్రి.

(ప్రసరించు, వ్యాపించు.)

ఆ. నారచీరయేని చారుచీనాంబరం, బైనఁ గట్టికొనినయపుడు హృదయ, మొప్పదొప్పు ననక యుండు రూపాదుల, నలమికొనవు చతురాదికములు. భార. శాం. 4. 60.

(అభిముఖమగు)

ఆ. దోషజుష్ట మైనదుర్జనచిత్తం బ,నార్యమార్య సేవ కలమికొనక, పవనచలితపింఛలవము చందంబునఁ, జంచలించుచుండు సన్మునీంద్ర. వా. రా. 1. 98.

(ఏకీభవించు, మిశితమగు)

క. అలమికొని యొండొరులప్రోపుల త్రావుల చెలమికలిమిఁ బొంది బహుజ్ఞా,తులు నెమ్మిఁ గూడి తామర,కొలని క్రియన్ సిరికిఁ బట్ట గుదు రుజ్జ్వలులై. భార. ఉద్యో. 2. 87.

సీ. లలిత మాగధలోక కలకంఠగానంబుకలకంఠి గానంబు నలమికొనియెఁ, దతవాదకసమీర హతకిన్నరీరుతుల్ కిన్నరీరుతులు నేకీభవించె. వసు. 1. 149.

**అలమేల్మం(లుమం)గ**—అలరుమేలుమంగ.

క. అలమేల్మంగాభిధేందిరాలయవక్షా. అము. 1. 87.

గీ. మంగళాకారయలమేలుమంగ నాదు,తలఁపు లీడేర్చి మాయింటనిలుచుఁగాత. ప్రబంధ.2:

**అలయము** సం. విశే. (అ. ఆ. అ.) 1. ఒకచోట నిలుకడ లేనిది, త్రిమ్మరియైనది. 2. నాశము లేనిది. వి. అ. పుం. 1. నాశములేమి. 2. పుట్టుక.

శ్లో. శక్రాదిష్వపిలోకేషు భ్రూయమాణౌ లయా లయౌ. రామా. (వాచ.)

**అలయిక**—అలపు. వి. (√అలయు) ఆయాసము, శ్రమము.

క. తనయింటికి మధ్యాహ్నం,బున నలయికఁ జెంది దీనముఖుఁడై యేతెం,చినయర్థికిఁ గడపక భో,జన మిడినగృహస్థుఁ డుండు శక్రునివీటన్. జాహ్నవీ. 3. 61. కళా. 6. 224.

**అలయు** అ. క్రి. (త. అళై. క. అలె.) 1. శ్రమ పడు, డయ్యు, ఆయాసపడు.

సీ. పలుకదు సఖులతో లలితాంగి మిన్నక యలయుచు నుండుఁ దా ననుదినంబు, భార. అర. 2. 26.

క. వేఁట నలసి యీ చెంచెత,యోటమి వెట్టం గడంగి యున్నట్టియెడన్. హర. 7. 52.

సీ. తులకించుతొలుకారుబలుమించుఁబలుమాఱు నలయించుమేనికాంతులు రహింప. ఉ. రా. 1. 99.

(ఇట ఔపమ్యద్యోతకము. 'మించు'అని తాత్పర్యము.)

2. విసుగు, వేసారు.

చ. అలయకనాఁడునాఁటికి లతాంగి యపూర్వములైన భోజనం,బులు గడుభక్తిఁ బెట్టుచు, భార. ఆది. 8. 188.

మధ్యా. తిలలందుఁ దైలంబుకాష్ఠములయందు దిరముగా నగ్ని,గలుగు రీతిఁగి యుపాయ పూర్వమునఁ గడఁగి తత్సిద్ధి యలయక యుత్సాహవంతుఁడు వడయు. భార. అర 1. 284.

3. తడయు, విలంబముచేయు.

(శ్రీకృష్ణుఁడు కైలాసంబునకుఁ బోవుచుబలరాముని తోఁ జెప్పినమాట.)

ఆ. ...హారుని భువనగురుని.

క. కనుఁగొని నాతలఁచినపని, యనువుపఱిచి మఱచియైన నలయక వేగం, బునవత్తు వచ్చునంతకు, మనవీ డేమఱక కాచుమత ముచితమగున్. ఉ. హరి. 2. 90, 91.

4. చెంతిల్లు, వగచు.

క. వనజాక్షునిమందస్మిత, ఘనకుండలదీప్తిగండకలితాననమున్, వనితలుఁ బురుషులుఁ జూచుచు, ననిమిషభావంబులేమి కలయుదురధిపా, భాగ. 9. 730.

జ. అలఁత, అలవు, అలయిక, అలసట.

**అలరారు** అ. క్రి. (√అలరు) 1. పుష్పించు.

సీ. సౌరభోల్లాసముల్ జాతి క్రుంగఁగఁ జేరె నలరారుకొదమ క్రోవులను నెలను. ఆము. 5. 1?9.

2 వికాసము నొందు; సంతోషించు.

సీ. మానసం బలరార మత్స్యకూర్మవరాహనారసింహాద్యవతారకథలు, వినుము ... దశా. 1. 111.

3. ఒప్పు, శోభిల్లు.

ఉ. ఆహారణాళి యిడ్డయలరారెడు పువ్వులదండ... నైష. 6. 8.

4. కలుగు.

శా. ... తోడ్తో మోహం బలరారఁ గన్గొనిరి దైత్యుల్ దంభనారాయణిన్. దశా. 2. 299.

**అలరించే**—అలరుచే. స. క్రి. (√అలరు)

1. సంతోషపెట్టు.

చ. ...ప్రాంతవడ్డమాటలఁ దమనేర్పు చూపి యొకటన్ హృదయం బలరింపలేక. నిర్వ. 1. 6.

2, ఒనర్చు, చేయు; నిర్మించు.

సీ. మదిలోన నెవరి కెయ్యది యిష్ట మది యట్ల యలరించు నుచితజ్ఞుఁ డైనవాఁడు. సారంగ. 3. 83.

సీ. పూని పాఁవజగంబులొఱియ నొచ్చి వెడందతీనియ యలరించి దానియందు, నగ్గి రపులించి...అచ్చ. రా. యు. 488.

సీ. సుత్తెవాటుల వారులెత్తనిసొమ్ము నొం పలరించె నెవ్వాఁడు సింబునకును, రా. వి. 1. 9.

**అలరు** అ. క్రి. (త. క, అలర్.) 1. (పుష్పము) విరియు, విచ్చు.

క. ఇమ్మెయిని నధికపరితా, పమ్మునఁ బడుసూతుహృదయపద్మం బలరం, దమ్మికొలంకులు మొగుడ వ, నమ్ములు సోలంగ దివసనాథుఁడు గ్రుంకెన్. భార. విరా. 2. 816.

2. పూచు, పుష్పించు.

సీ. నెత్తుటఁ దోఁగియు నిగిడి పోరెడువీరు లలరిన నడమోదుగులవిధంబు. భార. శల్య. 1. 129.

చ. అలరెఁ బ్రియాళువోర్తు ప్రియమౌటవసంతము పొడ. ఆము. 5. 138, వాల్మీ. 3. 110.

3. వికాసమును పొందు, శోభాయుక్తమగు.

క. ...హలాయుధుండుసముదెంచిన నెమ్మనము దెలివొందె మూఁపులు, దనరె మొగం బలరె నీదు తనయునకధిపా. భార. శల్య. 2. 228.

4. సంతోషించు, ఆనందించు.

సీ. నలనామధేయ మైనతృణంబు వినఁబడ్డ నధిపతి పేర్విన్నయట్ల యలరు. నైష. 1. 74.

సీ. కన్యకాదానాభిగణ్య పుణ్యఫలంబు దనకుఁ జేకుఱెనంచు జనకుఁడలరు. ఉ. రా. 2. 119.

5. ఒప్పు.

సీ. త్రొక్కుతేంట్లకుఁ గాఁక లెక్కింపఁ జెరివిన గంధఫలీపంక్తిఁ గబరులలర. ఆము. 5. 143.

ఉ, ...తత్సుతుఁడై యలరె న్యయాతి. పారి, పీఠి. 7.

6. కలుగు, ఉదయించు.

క. అసమతయత త్తు లలరఁగఁ, గుసుమంబులు దోయిలించి కోమలి. హర. 3. 74.

ద్వి. గౌరి వివాహంబు గాకటమున్న, యావనజాండంబు లలరకమున్న. బస. పు. 2. 506 పం.

వి. (క. త. అలర్.)—వికసించునది–1. పుష్పము. (పుష్పాపచయవర్ణనము.)

రగడ. అనుచు నలరులు గోసి రతివ అల్ల నడాసి. మనుచ. 3. 84.

గీ. ...అలరు,లమ్ముదురు పుష్పలావిక లప్పు రమున. ఆము. 2. 19.

2. సంతోషము. (చూ. అలరొందు.)

3. ఒప్పు, శోభ, (చూ. అలరారు, అలరొందు.)

జ. అలరారు, అలరించు, అలరుఁబోఁడి, అలరుఁబోణి, అలరుచు, అలరుమూనె, అలరుబంతి, అలరువిలుకాఁడు, అలరువిల్తుఁడు, అలరువిల్దాల్పు, అలరొందు.

**అలరుఁబోఁడి** – అలరుఁబోణి. వి. (√అలరు. వి. బ. అలరుఁబోఁడులు, అలరుఁబోండ్లు.) పుష్పము వలె మనోజ్ఞురాలగుస్త్రీ: స్త్రీ.

మ. అలరుంబోడి...సీకాంతాస్యముం బోలఁగా, వలదా యీశశికిఁ. నైష. 8.195.

**అలరుఁబోణి** – అలరుఁబోఁడి. భీమ. 1.4.

**అలరుచే(ర్చు)** – అలరించే. √అలరు.(క్రి. అలర్చు, అలరిను)

(వికసింపఁజేయు)

చంద్రోపాలంభము.

గీ. మలినతరకీర్తిజాతంబు లిలనలర్చి,ప్రోదిగను నిన్నుఁదిలకింప...చంద్రి. 4.111.

('కలిగించు' అనిరెండవయర్థము.)

(ప్రకాశింపఁజేయు, ఒప్పునట్లు చేయు)

సీ....ఘనకిరీటము మస్తకము నలర్చ. ఉ. హరి. 1.55.

(సంతోషపెట్టు)

గీ. కలికి రాచిల్కపల్కుఁబల్కులనలర్చి... కలితవనలక్ష్మిఁ గూడి రాగము వహించె, మాధవుఁడు...వేం.పంచ. 3.148.

(చేయు)

క. ఆచక్కనిబాలుఁడు వాఙ్మాధుర్యముఁ గాంచు నని శుభగ్రహదృష్టుల్, చూచి యిలావంతుం డని, యాచతురుఁడు నామ కరణ మలరిచి యంతఁ. విజ.వి. 1.112.

**అలరుమూనె** వి. (√అలరు. వి.) – పువ్వులతోఁ జేసినమూనె – సుగంధము గలమూనె.

మ. అలరుమ్మూనె తలంటు...దశా. 5. 67.

**అలరుబంతి** వి. (√అలరు. వి.) పూబంతి. ఘటికా. 2. 188.

**అలరుమే(ర్మే)లుమంగ** వి. (క. అలరుమేలు మంగై – పుష్పముమీఁదనుండు స్త్రీ) (శ్రీ) వేంక టేశ్వరస్వామిభార్య, పద్మావతి.

సీ. మహిమ నలర్మేలు మంగ యిల్లాలుగా మును నోఁచు పుణ్యవాసననుగాక. ప్రబంధ. 881.

**అలరువిలుకా(ల్కా)ఁడు** వి. (√అలరు.వి.)–పుష్ప ధన్వుఁడు–మన్మథుఁడు. విక్ర. 1. 133.

**అలరువిల్తు(లుతు)ఁడు** వి. (√అలరు, వి.)–పుష్ప ధన్వుఁడు–మన్మథుఁడు.

సీ. అలరువిలుతుపువ్వుటమ్ముపోలె. భార.విరా. 1. 245. యయా. 4, 41.

**అలరువిల్(లు)దాల్పు(లుపు)** వి. (√అలరు. వి.) మన్మథుఁడు. అ. రా. బాల. 6.

**అలరొందు** – అలరు. (√అలరు, వి.)

(శోభిల్లు, ఒప్పు.)

సీ. అలరొందు నెచ్చోట నాజ్యనిర్ఝరులతో బహుసంఖ్య పాయసపర్వతములు. కాశీ. 2, 28, అచ్చ. రా. సుం. 10.

(సంతోషించు)

గీ. ... అత్తొడవు లిడిన, మిగుల నలరొంది. అచ్చ. రా. సుం. 76.

**అలర్కము** సం. వి. అ. పుం. మందుచే వెఱ్ఱియెత్తిన కుక్క; వెఱ్ఱికుక్క. 2. తెల్లజిల్లేడు (వ్య.వి.). 3. శరభమృగము. 4. ఉచ్చింత (వ్య. వి.). 5. ఒకజాతి కీటకము.

శ్లో. అష్టాపదం తీక్ష్ణదంష్ట్రం సూచీభిః పరినం వృతం, రోమభిస్సన్నిరుద్ధాంగ మలర్కం నామనామతః సం. భార.శాం. 3అ. 18శ్లో.

**అలవ** వి. కంచె; దడి; అవరణము.

(వృషభములు.) గీ. గోడలలవలు వెనఁదాఁటుఁ గ్రిడవోలె, రేలుఁబగళులుఁదిరుగుచుఁ జేలఁ బంట,లొకఁడు లేకుండ మేయు ... హరి, పూ. 6. 128.

సీ. గంధంపుఁగూచముల్ పొందించి కురువేళ్ల నలవగాఁ గట్టినయట్టిమహిమ,పన్ని చెట్టుల

చుట్టు బలువట్టివేళ్లచేఁ గంచెఁ గావించిన గారవంబు. రా. వి. 3. 81.

2. పశువులకు గడ్డి వేయుటకై పర్చబడిన తొట్టి. (వా)

**అలవడు** అ. క్రి. (అలవు+పడు) 1. అభ్యస్తమగు, అబ్బు.

చ. నృపనయవిద్యకుం దగిన నేర్పలవడ్డది గొంత గొంత...భార. విరా. 1. 197.

సీ. సత్యంబు దాంతియు శౌచంబు శాంతియు నలవడి యెవ్వనియందు వెలయు. భార. శాం. 2. 151.

2. పరిచితమగు, చనవు గలిగి యుండు.

(గోపికలు.)చ. అలరులుగోసికోసినవయస్యలఁ బల్మఱుఁ గౌఁగిలించి కో, యిలలయెలుంగు లోలిఁగొనియింపుగఁ జిల్కలతోడ నెమ్మిమై, నలవడి మాటలాడి...హరి. పూ. 8. 35.

3. కలుగు, లభించు.

వ. ...అందు మీరెవ్వ రెక్కడ నేరూపంబునం జరియింపం గోరిన నయ్యైరూపంబు లలవడి యెడు. భార. అర. 7. 464.

క. కలదొక యితిహాస మివుడు గైకొని నీకుం, దెలియఁగఁ జెప్పెద దానన, యలవడు నీవడుగు ప్రశ్నకగునుత్తరమున్. భాగ. 10. ఉ. 1236.

4. శక్యమగు, సాధ్యమగు.

చ. ...తారకా,వళి సికతా వ్రజంబు హిమవారి కణంబులు లెక్కవెట్టఁగా, నలవడుఁ గాని యేను వసుధామరకోటికి దానమిచ్చు గో,వులు గణుతింప ధాతయును నోపఁడు. భాగ. 10. ఉ. 462.

(చివరపాదములో యతితప్పినది.)

5. సిద్ధించు, నెఱవేఱు.

క. ...మనం,బుల జనియించు మనోరథ,మల వడుటయు...భార. కర్ణ. 2. 140.

క. బలజంభప్రముఖమహో,బలశాలుల చేతఁ గాని పని యిట నాచే,నలవడునె. దశా. 2. 164.

6. తగు, అర్హమగు.

క. విను నాకీర్తి జగంబులఁ, గొనుఁగుపడియె నీవు భువన పూజితవృత్తిం, బనుపడితి గావఁ దగు నీ,యనలపదవి నీకు నాకు నలవడ దింకన్. భార. అర. 5. 152.

క. నను నెఱుఁగఁడె నానామము,దన కలవడు నే తలంపఁ దగదే దీనిన్, వనితాహంతకుఁ బలువిశ,సనకారికి నిట్టిపేరు సదృశమె యరయన్. హరి. ఉ. 6. 141.

7. కూడు, చేరు, కలియు.

క. పురికొనుచుం దెరలుచు నో, హరిసాహరి నొక్కచోట నలవడు నొకచో, విరియు నొకచోటఁ దిరుగుం,దిరుగక యొకచోట రెండు దెఱఁగులు నొచ్చున్. భార. భీష్మ. 2.178.

8. ఒప్పు.

క. దడములు గొల్వఁగ ధర్మం. బడరఁగ దశరథుఁడు రాజ్యమలవడఁ జేసెన్. భా. రా. బాల. 755.

ద్వి. హరిచందనము మేన నలవడ నలఁది. ద్వి. హరిశ్చ. పూ. 166.

9. ఉండు.

సీ. త్రిజగంబు మార్పడఁ ద్రిప్పి మునుదటియట్ల యలవడఁజేయంగ నతఁడె చాలు. భా. రా. అర. 1. 248.

10. స్వాధీనమగు, వశమగు.

క. వరనాథుఁ గొలిచి యలవడఁ దిరిగితి నాకేమి యనుచు. భార. విరా. 1. 122.

చ. ...లక్ష్మి యొప్పుదమ్మలవడఁ జెంద వైశ్య జను లప్పురి నొప్పుదురు...నిర్వ. 1. 56.

ఇ. అలవరించు, అలవఱచు, అలవాటు.

**అలవరి** వి. అలంగము. వప్రము.

సీ. ...అలంగం బన నలవరి యన వప్రము. ఆం. భా. 2. 12.

**అలవ(ర్వ)రించు-అలవఱచు.** స. క్రి. (√అలవడు) అలవడఁజేయు.

(అభ్యసించు, నేర్చు.)

సీ. ...శాస్త్రముల నెల్లఁ దగినభంగి. అ. నలవరించి...భార. అను. 4. 124.

సీ. తపవర్తనము విన్న మునిజనంబులకైన నలవరించికొనంగ వలయువాఁడు. భార. విరా. 2. 208.

సీ. వ్రేళ్లలు గఱవంగ వెర వల్వరించిరో నోరఁ జేతులు గ్రుక్కినొల్లువాఁడ. నిర్వ. 1. 40.
(అభ్యసింపఁ జేయు, నేర్పు.)

సీ. వాద్యనైపుణ మనపద్యశిక్షావిధి నలవరించుచు బృహన్నల యనంగఁ, బరఁగునీతండు శిక్షత్సుండు... భార. విరా. 5. 333.
(వశపఱచు)

ఆ. ఇంత గలరె నేలయెమ్మెయినైనను,గొమ్మనలవరించి కూర్చుటరుదె. భార. విరా. 2. 80.
(సంపాదించు)

వ. వీరలు దిగ్విజయంబుఁ జేసి యలవరించికొన్న పదం బగుటయు. భార. ఉద్యో. 1. 12.
(శ్లో. యత్తు స్వయం పాండుసుతై ర్విజిత్య, సమాహృతం భూమిపతీన్ ప్రపీడ్య. సం. భార. ఉద్యో. 1. 17.)
(సృజించు, నిర్మించు.)

సీ. ...అద్దేవుఁ డుండునట్లు, గావఁ మర్థితోఁ గైకొని తనపేర మధురాపురంబును మధువనంబు. గి నన్నఁగ లోకప్రసిద్ధిగా నలవరించె. వి. పు. 2. 88. ఇందు. 2. 201.
(కావించు, చేయు.)

గీ. దేవతాతతి కెల్లను భావశుద్ధి, చెలఁగుచుండ నమోవాక మలవరించి. వాల్మీ. 2. 40.

సీ. ఖడ్గహాలాహలగరిమచే నహితుల నమృతాశనులు గాఁగ నలవరించు. విక్ర. 2. 73.
(సవరించు, చక్కఁబఱచు.)

సీ. ఒక్కింత సడలినయుత్తంసదామకం బభినవంబుగ మౌళి నలవరించి. హరి. పూ. 5. 9.

వ. అరవీడుకుచ్చెళ్ల నెత్తి చెక్కుచు నొక్కింత జాఱువయ్యంటఁ జక్కంజేర్చుచు నొక్కింత వదలువేనలి నలవరింపుచుఁ గొండొకచెదరు పాపటఁ గుదురుకొల్పుచు. విజ. వి. 2. 200.
(సిద్ధపఱచు, సమకూర్చు.)

సీ. స్రుక్స్రువహోలూఖలజుహూపువులు మొదలైన యజ్ఞసంభారంబు లలవరించి. జై. భా. 3. 177.

(పెట్టు, ఉంచు.)

వ. ... దేవకీయశోదాదులకుం దగినకట్టనంబులు పెట్టియల నలవరించి. జై. భా. 3. 87. చం. రా. 6. 9.
(ధరించు, తాల్చు.)

సీ. దక్షిణశ్రవణరంధ్రములఁ గోమలకృష్ణతులసీప్రవాళంబు లలవరించి. కాశీ. 3. 116.

సీ. బలుపాఁపతలచుట్ట లలవరించినవారు లేఁత చందురులఁదాలిచినవారు. పాండు. 1. 165.
(పూను, వహించు.)

సీ. జపహోమదానసంస్కారపూర్వకముగా నధ్వరప్రతదీక్ష యలవరించి. జై. భా. 3. 120.
(అలంకరించు, అలంకారయుక్తముగాఁ జేయు.)

గీ. హంసకంబుల నిజపదం బలవరించి. వేం. పంచ. 4. 233.

**అలవరులు** వి. బ. ధాన్యవిశేషము.

గీ. జిలితొగలరాజనమ్ములు నలవరులును,దెల్లనల్లచెన్నంగులు దీవసరులు,నాది యగుపేరు గలుగు వడ్లతనియింట, నుండు. హంస. 4. 128.

**అలవఱుచు**—అలవరించు.
(నేర్పు)

క. నలనాథాఖ్యతనూజుఁడ,నలఘుమతీ! బ్రహ్మమిత్రు నాయుర్వేదం, బలపఱుప వలయు నాకని,పలుమఱు నే నడిగి త్రోపువడి చలము మెయిన్. మార్క. 5. 41.
(కలిగించు)

చ. కలమవనాళికా కణిశ కంటక కోటులచేతఁ జూడ్కికిం, పలవఱిచె న్ధరిత్రి తుహినాగమవేళ...శివరా. 4. 20.
(కావించు, చేయు.)

క. కలవాణి యిట్లు పలికినఁ,గలఁ కంతయు వీలలేచి కల గన్నగతిన్, దలఁచి చమదెంచి దండం, బలపఱుచుచు విప్రవరుల కనియెన్ ప్రీతిన్. శేష. 1. 148.
(కూర్చు.)

క.అలవఱిచె నృపతికరముల,నలికుంతలయొకతె కంకణాభరణంబుల్. నైష. 6. 57.

(అలవఱిచెన్—ధరింపఁజేసెను.)

క. గళమునఁ గట్టెను హరి మం,గళసూత్రము పులకలతివగాత్రముఁబొదువ,న్నెలఁతయుఁ బఱియనుగరముల, నలవఱిచిరి కంకణంబు లన్యోన్యంబున్. ఆము. 6. 134.

(అలవఱిచిరి—కట్టిరి.)

(పూను, వహించు.)

క. ఉరిఁ ద్రెవ్వఁ గోఱికి యిప్పుడ, వెరవారఁగ నీకు నేను విడుగరఁ జేయం,దొరకొనుట నీదు భాగ్యం, బరిత్వము దొఱంగి మైత్రి యలవ ఱుపు మదిన్. భార. శాం. 3. 205.

**అలవాటు** విశే. (√అలవడు) 1. అభ్యాసపడినది.

చ. ...పూవిలుకాఁడ విట్టినీ, వెడపక నిష్ఠుర త్వమున కెట్లలవాటుగఁ జేసి తక్కటా, పడఁతులమీఁద నేయ రతిపయ్యెదకున్ నను పైన చేతులన్. మనుచ. 3. 48.

2. అభ్యస్తము.

గీ. అనఘ! జాత్యభిమానదేహాభిమాన,లేశములు దాసురాలికి లేవు మాధు,కరము నలవాటె మీవంటిఘనులు దిద్దు,పనులు సేయుటకంటె శుభంబుగలదె. వై జ. 2. 110.

3. సిద్ధము.

సీ. అవనిజ దేవోపహారఫలంబులు చెలువార నలవాటు సేయుచోట, నుపహతిఁ గావింప నొకకాక మేతెంచి, భా. రా. అయో. 164.

వి. అభ్యాసము.

క, అలవాటుకలిమి మారుతి, లలితామితలాఘవమున లంఘించెను...కంధిన్. భాగ.9.275.

**అలవాలము** సం. వి. అ. న. ఆలవాలము, చెట్టు మొదట నీళ్లునిలుచుటకు జేసినపల్లము. పాగు.

**అలవి** వి. (క. అళమి. త. అళవై.) 1, కొలఁది, పరిమితి.

క. వెలలి బలరిపుఁడు చలమునఁ, గలహము నకుఁ జొచ్చె వృత్రుఘనబాహుబలం,బలవికి మీఱెను దంద్రి వి,మలతపమునఁ జేసి సురల మనములు దలఁకన్. భార. ఉద్యో. 1.126.

సీ. నగరాజతనయ పన్నగ రాజధరుమ్రోల నిలుచుడు మదమఁ డేటలవి నిలిచె. కు. సం. 5. 515.

మ. హరిణం బొక్కటి కుక్కతండముఁ బుళిం దానీకమున్ ద్రోచియు,ర్వరఁ గా లూఁదక దాఁట నేటలవికిన్ వాహంబునడ్డంబునూ,కి రసావల్లభుఁ డేసెఖల్లమున...మనుచ. 4.44.

(ఏటలవి—ఏటునకు అందునంత దూరము.)

2. శక్తి, సామర్థ్యము.

చ, అలవి యెఱుంగనేరక మహాత్ముని లోకము తోడిపాటిగాఁ, దలఁచితి బేలనైతి...భార. భీష్మ. 2. 6.

4. విధము.

సీ. అబ్బురంబుగ నుబ్బుగబ్బి గుబ్బలగుబ్బతిలు హారములు ధారలలవినలర. అచలా. 1.27.

(గుబ్బపలు—ముద్రి.)

విశే. శక్యము, సాధ్యము.

క. బలహీనుఁడైనవానికి, నలవియె మోపెట్టి తివియ నక్కార్ముకముఁ, గులహీనున కక్రూరాస్త్రన, కలవియె యాలక్ష్యమేయ నక్రమశీలన్. భార. ఆది. 7. 282.

చ. అలఁచివి పత్త్రప్రయోగత మహాత్ములధైర్య మడంపఁ జూతు నీ,యలవియ...కు. సం. 7. 878.

గీ. అబ్జమాతికి నైన శక్యంబు గాదు, పలుకుఁ బూఁబోఁడికైనను నలవి కాదు. నైష. 2. 9.

**అలవు** వి. (క. త. అళవు.) 1. బలము, శక్తి, సామర్థ్యము.

చ. ...పోటరులైనశర్త లేవురు గల రంటి వారియలవుం బలముం గడకంటి...భార. విరా, 2. 257.

2. ఉపాయము, నేర్పు.

క. గెలుపున మెయి పొదలఁగ సొ,బల మూనుఁడు రథము పఱపి పాంచాలబలం, బలుగులపడఁ బలుదెఱఁగుల, యలవుల విహరించె నుద్భటాటోపమునన్. భార. కర్ణ. 1. 147.

3. విధము.

గీ....నీయందు బుద్ధివాక్కర్మములను.

క. అలవడఁ జేయుచు నందఱు, బలకొని యులఁ బెట్టఁ బడిన పదవిన్యాసం,బులు

పతనకారణముగా, నలవున సేవించుమను గృహార్థులు వగుచుఁ. భాగ. 10. ఉత్త. 1206, 1207.

**అలవోక** విశ. (√అలవి? అలవు? అల్ల+పోక. క.ర.) 1. మందము, అల్పము.

వ....సోమరిగాలియలవోకపోఁకులం గదలెం గదల వనం గదులు నుపవన...పూగావళీ కోమలపలాశద్రోణికల...మనుచ. 3.28.

2. సవిలాసము, ఒయ్యారము గలది.

సీ. అలవోకనడలు మాంద్యమయంబు లగు నైన నంతరంగములు బోధాస్పదములు. పాండు. 5.180.

3. ఆసక్తిశూన్యము, ఆస్థ లేనిది.

వ. అయ్యంబుజాక్షి యక్షుద్రుపవిధేపవిక్రమంబున ననాదరంబు దెల్పుచు నలవోకగా దిగీశసందేశం బాకర్ణించి. నైష. 4.9.

సీ....అలవోకగా గుబ్బ లంటుటయును. దశా. 7.70.

ఉ. పూని నిమేషమైన నలవోకగ నీవు ధరాతలేంద్ర!యా, స్థానమునందు నుండి తగఁ జల్పెడు రాజ్యరమాధిపత్య రే,ఖానయవర్తనంబు కలకాలముఁ జాటులఁ బడ్డనైన మా,చే నగునే సృగాలములచే నగు నయ్య మృగేంద్రకృత్యముల్. పరమ. 3. 83.

క్రి. విశ. ప్రదు. 1. యాదృచ్ఛికముగా; దైవికముగా.

గీ....నారదముని యలవోక నచటి, కరుగుదెంచిన వినతుఁడై. భార. శాం. 6.327.

2. అకస్మికముగా, హఠాత్తుగా.

సీ. అలవోకఁ గనుఁగొని యంతరంగములిట్టు బెదర మాఱుమొగంబుపెట్టువారు. భార. విరా. 3.86.

3. సవిలాసముగా, ఒయ్యారముతో.

సీ. అలవోక మువిద నన్నరగంటఁజూచిన నీరేడు జగముల నేలఁ జూతు. విక్ర. 3.48.

4. అవలీలగా, అనాయాసముగా.

ద్వి. ఓరి రావణ నీమదోద్ధతి యెల్ల, వారించి పుచ్చెద వడి నిల్వు మనుచుఁ, గల్పాంతనిర్ఘాతకల్పమై శాఁక, నల్పపీడితముష్టి నలవోకఁ బొడిచె. రం. రా. ఉ. 87. పొ. 10. పం.

చ....పంక్తికం,ధరు నలవోక సందిటను దాల్చియె తూరుపువార్ధిఁ జేరి యం, దురుజపనిష్ఠ లెల్లనియమోన్నతిఁ దీరిచి. ఉ. రా. 3.286.

5. అశ్రద్ధతో, అజాగ్రత్తతో.

చ....కంటి వనంతు నాద్యు వి,ష్ణుని నలవోకఁ దన్మహిమ సువ్రత నా కెఱిఁగింపు. భార. శాం. 5.406.

**అలవోకయునుబలె**
**అలవోకయునుబోలె**
**అలవోకవలె**
**అలవోకవోలె** — అలవోక. క్రి. విశ.

(అవలీలగా. అనాయాసముగా.)

సీ. నీకతంబునఁగాదె కాకోలవిషవహ్ని నలవోకయునుబోలె నార్పఁగలిగె. కాశీ. 6. 96.

క. నరుఁ డఖువదివేలేఁడు లి,తరదైవతదర్శనమునఁ దాఁగమఫలముం,బొరయునలవోకవలె శాం,కరియా క్షేత్రోత్తమంబుఁ గనుఁగొన్నంతన్. పాండు. 2, 83.

సీ. అలవోకవోలె వాలాగ్ర మొకించుక విదిలించినంత నవ్విహాగవిభుఁడు. సమీర. 6. 169.

(సవిలాసముగా)

క. అలవోకయుబలె జేజే, నెలవుపయిం దాడివెట్ట నీగతి బంట్లన్, బిలిపించి సొంపు పెంపునఁ, జెలఁగుచుఁ బయనంపుఁదముతుఁ జేయించుటయున్. యయా. 2. 65.

(యాదృచ్ఛికముగా, దైవికముగా.)

గీ. ...విప్రకులుఁడు, పుణ్యశివరాత్రి నలవోకవోలెనై న,మరగధరుచెంత జాగరం బుండెఁగాన. శివరా. 4. 48.

(అశ్రద్ధతో, అనాదరముగా.)

వ. ఇట్లు దుర్వాసుం డాశీర్వాదపూర్వకంబుగా నొసంగిన కుమారపారిజాతమాల్యంబు నహాల్యాజారుం డగుసునాశీరుండు దుర్వారగర్వాటోపంబునఁ గమ్నగావక...బరావణ

కరటికుంభపీఠంబువయి వలవోకయుంబోలె వైచె. హర. 6. 16.

**అలన** సం. వి. అ. స్త్రీ. హంసపదీలత, అల్లుడుతీఁగ.

**అలసందియ(దె)లు** వి. బ. (సం. అలసాంద్రః. ప్రా. అలసందో. వి. వి.) పెద్దబొబ్బరలు.
గీ. శ్రాద్ధకర్మంబునందు వర్జ్యములు వినుము, పెండలంబును దోసపలాండు పుల్లి, యానుగ మ్మింగు వలసందియలు...మార్క. 3.203. (అలచందలు అని వ్యవహారము.)

**అలసకము** సం. విశే. (అ. నిశా. అ.) సోమరి. వి. అ. పుం. అజీర్ణమువలన కలుగుకడుపుబ్బు.

**అలసట** వి. (√అలయు?) ఆయాసము, అలవు.

**అలసపడు** అ. క్రి. (అలసము+పడు) మందమగు.
సీ. కటకారవములకుఁ గాళ్ల వ్రేళ్లఁ జెనంగు నంచలచే నడ యలసపడఁగ. దశా. 2. 236.

**అలసము** సం. వి. అ. పుం. 1. పాదరోగవిశేషము. బురదలోఁ దిరుగుటచే కాలివ్రేళ్ల మధ్యమున పుండ్లుపడుట. 2. ఒకవిధమగు అజీర్ణరోగము. 3. వృక్షవిశేషము. 4. విషమూషికము. విశే. (చూ. అలసుఁడు.)

**అలసాంద్రము** సం. వి. అ. పుం. అలసందె, పెద్ద బొబ్బర (వ్య. వి.).

**అలసుఁడు** సం. విశే. (అ. అ. అ.) 1. పాటుపడని వాఁడు, సోమరి. 2. మందుఁడు, చురుకులేని వాఁడు.

**అలా** – అల[3]
(డిభకుఁడు వానియన్న యగుహంసుని గానక విలపించుట.)
క. ...పెలవుల,లాలలు దొరుఁగఁగ నన్నలా యని యొఱలున్. ఉ. హరి. 4. 302.

**అలాతము** సం. వి. అ. న. ఉల్ముకము, కొఱకచ్చు.

**అలాబువు** సం. వి. ఉ, ఊ. స్త్రీ. సొర, అనుగు (వ్య.వి.). ఉ. న. సొరకాయబుఱ్ఱ.

**అలాబూకటము** సం. వి. అ. న. అలాబూరజము.

**అలారము** సం. వి. అ. న. తలుపు.

**అలానము** సం. వి. అ. పుం. ?వాలుకమూలమునఁ బుట్టు నొకానొక రోగము.

**అలి** అవ. వ్యుత్తియందు 'అంను, ఇందు, ఎందు' అను వానిపై వచ్చుఆగమము.
ఉదా: నాయందలిదయ, ఇందలివారు. (చూ. అందుల.

**అలి(ళి)** సం. వి. స్. ఇ. పుం. 1. తుమ్మెద. 2. తేలు. 3. వృశ్చికరాశి. ఇ. 1. కోయిల. 2. మద్యము. 3. కాకి.

**అలింజరము** సం. – అలంజరము.

**అలి(ళి)ందము** సం. వి. అ. పుం. 1. బహిర్ద్వార ప్రకోష్ఠము, తలవాకిటి ప్రక్కనుండుగృహము. 2. వాకిటికి వెలుపల నున్న నలుచదరపుచోటు. 3. ఒకానొకదేశము.

**అలి(ళి)కము** సం. వి. అ. న. లలాటము, నొసలు.

**అలికిడి**–అలుకుడు.
సీ. అలికిడి మేల్కనుసతని ధృష్టద్యుమ్నుఁబట్టిన క్రియ. భార. సౌ. 1. 168.
సీ. అలికిడి లేకుండఁ దెలిసి యిల్ సొరఁజాలి వాకిటిగడియ నెవ్వడి సడల్చి, వేం. పంచ. 3. 200.

**అలి(ళి)గర్దము** సం. వి. అ. పుం. నీరుపాము.

**అలిజిహ్వ** సం. వి. ఆ. స్త్రీ. కొండనాలుక.

**అలిజిహ్వక** సం. – అలిజిహ్వ.

**అలిదూర్వ** సం. వి. ఆ. స్త్రీ. మాలాదూర్వ, చిప్ప కసవు (వ్య. వి.).

**అలి(ళి)ని** సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడుతుమ్మెద. 2. ఆఁడుతేలు. 3. తుమ్మెదల సముదాయము.

**అలిపకము** సం. వి. అ. పుం. 1. కోకిల. 2. తుమ్మెద. 3. కుక్క.

**అలిపత్త్రిక** సం. వి. ఆ. స్త్రీ. వృశ్చికపత్త్రలత, తేలుకొండితీఁగ.

**అలిపర్ణి** సం. వి. ఈ. స్త్రీ. – అలిపత్త్రిక.

**అలిపిరి** విశే. అల్పము, దుర్బలము.
ద్వి. చల్లనై మెల్లనై సౌరభశ్రీల,నల్లనల్లన వీచె నలిపిరి గాలి. ద్వి. భాగ. 2. 24.

**అలిప్రియ** సం. వి. ఆ. స్త్రీ. పాటల, కలిగొట్టు (వ్య. వి.).

**అలిప్రియము** సం. విశే. (అ. ఆ. అ.) తుమ్మెదకు ప్రియమైనది. వి. అ. పుం. ఎఱ్ఱగలువ.

**అలిమకము** సం. వి. అ. పుం. 1. కప్ప. 2. కోకిల. 3. తుమ్మెద. 4. ఇప్ప (వృ. వి.). 5. పద్మ కేసరము.

**అలిమోద** సం. వి. అ. స్త్రీ. గడికారి, నెల్లి (వృ.వి.).

**అలియు**—అలయు.

(వ్యవ) వాఁడు పనిచేసి అలిసిపోయినాఁడు.

మధ్యా. వెలయంగ నియ్యొట్టులన్నీ మలినులై విడిసిన స్త్రోల,గలతానపతులును రాజు పట్టంబు గట్టినపతియు, నలియం బయ్యార్వరల వెల్వఱించిన నశ్వమేధంబు, ఫలం బుపేక్షించిన లింగం బటినిసపాపంబు దమకు. శా. ప. మం. 2. 3.

(ఇన్మధ్యరూపమునకు ప్రయోగాంతరము లేదు.)

**అలివల్లభము** సం. విశ. (అ. ఆ. అ.) తుమ్మెదలకు ప్రియమైనది. వి. అ. పుం. కలిగొట్టు, పాటల (వృ. వి.).

**అలి(లీ)కము** సం. విశ. (అ. ఆ. అ.) 1. అప్రియమైనది. 2. అసత్యమైనది; కృత్రిమము. ('అలీకకోపకాంతేన' కాదంబరి.) వి. అ. న. 1. అసత్యము, 2. అప్రియము, అపకారము. 3. అలికము. నొసలు.

**అలీగర్ధము** సం.– అలిగర్ధము.

**అలుఁగు**[1]—అలువు. వి. పరీవాహము, చెఱువులోనగు వానిలో ఎక్కువగా నుండునీరు పోవుటకు ఏర్పఱచినదారి; ఆదారిని బోవునీరు.

క. కలిమికిని దగినకొలఁదిని, నెలవుగ వెలివిడువకున్న నిలు పెక్కడిదౌఁ,గలయఁగ నిండిన చెఱువున,కలుఁ గించుక లేకయున్న నాఁగని భంగిన్. ద్వా. 2. 156.

గీ. దుఃఖమనియెడుచెఱువునఁ దొరఁగునలుఁగు, లనఁగఁ గన్నీరు ధారలై యతిశయిల్ల. భా. రా. యు. 2332

వ. కనుఁగవ కొలంకుల నలుఁగులు వెడలిన చందంబున సంతసంబునం గన్నీరుమున్నీరై పఱవ. భాగ. 8 669.

జ. అలుఁగులువాఱు, అలుఁగులు వెడలు.

**అలుఁగు**[2] వి. (క,అలగు. అలుగు.)1. కాణాగ్రము, ములికి; పిడిగాక మిగిలిన ఆయుధాంశము.

క. తనువున విఱిగిన యలుఁగుల, ననువునఁ బుచ్చంగవచ్చు నతినిష్ఠురతన్, మనమున నాటినమాటలు, విను మెన్నియుపాయము లను వెడలునె యధిపా. భార. ఉద్యో. 2.62.

గీ. అలుఁగుటమ్ములు దాఁకిన నలిగి భద్ర,కుంభి రౌద్రంబు సొంపారఁ గొలిపె నతఁడు. భార. ద్రో. 1. 349.

మ. ప్రతతోర్ధ్వాధరభాగపీతయుగశీఖాస్వత్సరు స్తంభసంస్థితిఁ దీంద్రించెదుజాళువామొనలివా దీప్తార్చిగాఁగజ్జలా, న్వితధూమాసితరేఖ పై యలుఁగుగా విజ్ఞానదీపాంకురా, కృతినందం బగునందకం బఘులకాత్రేణిచ్ఛిదం జేయుతః. ఆము. 1. 6.

2. ఖడ్గము, కత్తి.

గీ. పలక పఱియలుగాఁ జేసి యలుఁగు దునిమి, యొడల వాలంపపొది నింప. భార. భీష్మ. 3.23.

3. ఆయుధము.

సీ. ఆయుధప్రతఁ గాంచి యలఁగుభీరువుఁ బూను వాఁడి ముమ్మోముల వేఁడియలుఁగు. పాండు. 1.101.

వ. వజ్రాయుధ చకచకః బకపక నవ్వువజ్రభేదియలుంగు వెలుంగ. మనుచ. 4.115

**అలుఁగురాజనములు** వి. బ. ధాన్యవిశేషము.

సీ. సాలఁక లలుఁగురాజనములు సంభావులు... గీ.ఆది యగు పేరు గల్గువడ్లు. హంస. 4.128.

**అలుఁగులువాఱు** అ. క్రి. (√అలుఁగు[1])—అలుఁగులనుండి ప్రవహించు నీరువలెఁ బ్రవహించు–ప్రవహించు.

ద్వి. ఆనందబాష్పంబు లలుఁగులువాఱ, మేను రోమాంచసంమిళితమై తనర. బస. పు. 1.542.

**అలుఁగులు వెడలు** అ. క్రి. (√అలుఁగు[1]) అధికమగు.

క....ఆలేమ విలాసలీల లలుఁగులు వెడలః. పద్మ. 2.183.

**అలుక'(ల్కు)** వి. (√అలుగు) 1. కోపము.
చ. అలుకఁ దుషారశైలసుత యవ్వలిమో మయి... హర. 4.34.
ఉ ... ఆబకవైరి గ్రక్కునఁ, వాని కైకడంగఁ బట్టి పడవైచి మహోగ్రత నాక్రమించెఁ బ౯, చానన మేణముం బోదువున ట్లతఁ డూర్జితశక్తినుద్భటుం, డై నెగసెఁ సమీ రనుతునల్క కుఁ బ్రాఁకిడినట్లు వీఁకతోఁ. భార. విరా. 2.340.
అలుకపాన్పు – పెండ్లిలోఁ బెండ్లికొడుకు విలాసముగాఁ గోపించి కూర్చుండుటకు వేయు పాన్పు.
2. వైరము, ద్వేషము.
క. చెలిమి శిలాక్షర మెప్పుడు, నలుక జలాక్షరము సుజను లగువారలకుం, జెలిమి జలాక్షర మెప్పుడు, నలుక శిలాక్షరము కుజను లగువారలకుఁ. కేయూర. 3.29.

**అలుక²** విశే. అల్పుఁడు, తేలిక యైనవాఁడు, గౌరవశూన్యుఁడు.
సీ....తగిన, పురుషున కెందును నిరతంబు మిక్కిలి తేజంబు కర్మంబు దీని కోప ఘూర్ణిత, రక్తనేత్రుఁడై పరాక్రమ మున. భార. సభా. 2.269.
క. అలుకఁదనంబున విప్రున, కలుగంగాఁ దగదు గురుఁడునై యున్నాఁడు. భార. ఉద్యో. 4. 312.
బ. అలుకన.

**అలుకన** విశే. (√అలుక²) తేలికయైనది, పలుచనిది.
సీ. అలుకనై మీఁజేత నంటిన యాక్రొత్త మువ్వన్నెము సారె ములుగుచుండ. క్రీడా. 226.

**అలుకు'(ల్కు)** – అళుకు. అ. క్రి. (క. అళుకు, అళకు. త. అళుక్కు) భయపడు; వెనుదీయు, జంకు.
గీ. ధార్తరాష్ట్రులు నడికి నధర్మమునకు, నలుక రెన్నఁడు విడువు దైన్యంబు. భార. ఉద్యో. 3.35.
క. వెలవెలఁ బాఱుచు వడఁకుచు, నలుకుచుఁ దనమోముఁ జూచునయ్యంగన న,ప్పలుఁగు కృపఁ జూచి. భార. అను. 1.173.
ఉ. నెయ్యము దప్పనొండొకటి నీచెవి నోఁకెవె నాదుపల్కులం, దెయ్యెడ నాజయా యనికి నిమ్మయి నల్కెదు నీవు...భార. ఉద్యో. 1.304.
వి. భయము; జ కు, శంక.
అ. చంపెఁ జంపె భీము సామజం బనియెడు, నులివు గలయఁ జెలఁగఁ గలఁగి రథిప.
వ. తదవసరంబున యుధిష్ఠిరుండు.
క. అలు కొందుమనముతోఁ దన,బలముం బురికొలివి పొదివి భగదత్తుని న,మ్ములఁ గప్పె. ...భార. ద్రో. 317, 318, 319.
జ. అలుకువ'.

**అలుకు²(ల్కు)** స. క్రి. 1. (పేఁడమున్నగువానితో నేల లోనగునవి) రాచు, లిప్తముచేయు.
క. అలుకుఁడు మృగ మదమున ముగ్గులు వెట్టుఁడు గప్పురమున ... భార. ఉద్యో. 3. 152.
చ. కలికి యొకర్తు చేఁ దుడువఁ గస్తురిచేనరుఁ గల్కె నొక్కపై,దశ...యయా. 4. 87.
2, చల్లు.
క. ఉమతపమున కెదమెచ్చి త,దమరులు ముత్యములనేన లలీనతంగిన్. కు. సం. 6. 765.
క. వలవైచి క్రింద ధాన్యం, బలికి నిగూఢ బుగాఁగ నవ్వలిపొదలోఁ, దలఁదూటిచి...నా. పంచ. 2. 6. భార. అను. 2. 108.
3. (పుష్పులు) చెరువు, గ్రుచ్చు.
తరువోజ...కల్హారంపు జేకు, లలకల నలికి. హరి. ఉ. 7. 75.
4. ఊఁదుచు, (మొక్కలు) నాటు.
చ. అలఘుజగద్దివ ఘటాంకుశ శాత నఖాంకురాగ్రలాం,గలముల ముస్న నీ వసురఘస్మరవైరి భుజాంతరాళ జాం, గలమహిఁ జాలువట్టపయిఁ గ్రమ్మొడునెత్తులు నీరువెట్టి యం, దలుకవె కీర్తిపూర్తికలమాంకుర మింద్రదరమాఘలార్థి వై. పాండు. 2. 59.

వి. అలకుట. విశేషణము.
(వ్యవ) ఇల్లుఅలుకుకుమ్ముగ్గును లేకుండనున్నది. అలుకులు అయినవి. ముగ్గులు తరువాయి.

**అలుకుఁజుట్టు**—అలుకుగుడ్డ.

**అలుకుగుడ్డ**—అలుకుఁజుట్టు. వి. (√అలుకు²) అలుకుట కుపయోగించు ప్రాఁతగుడ్డ లోనగునది.

**అలుకు(ల్కు)డు**—అలికిడి. వి. మనుష్య సంచారాదుల వలనఁ గలుగుధ్వని; చప్పుడు.

సీ. ఒంటిపాటునఁ గౌఁగి లోనఁగుఁ దత్తఱముతో వంతలోపల మల్లు నలుకుడై న.దశా. 8. 225.

చ. ...దర్పకుపంపు బలంబులోని యల్కుడు కరణిం జెలంగె శుకకోకిల భృంగతతుల్ వనంబులం, దెడనెడఁ బల్కుఁ గూయ సొగి యింపఁగ మ్రోయఁగఁ దద్విరావముల్. భార. ఉద్యో. 2. 111.

**అలుకువ¹**—అలుకు¹. వి.
(జంకు, సంకోచము.)

చ. పలికె నరేంద్రుతోఁ గుముదబంధుకులోత్తమహీమతంగి ని,ట్లలుకువ లేక వస్త్రరహితాకృతి నాకడ నిల్వఁ జాడియే. కవిరా. 5. 258.

**అలుకువ²** వి. (√అలుగు) కోపము, అలుక.

చ....కులశీలము గ్రుంగె ముడింగె గౌరవం, బలుకువ తగ్గె దైవ మకటా యెటు దెచ్చునో యేమి వచ్చునో. చంద్రా. 4.180. (శ. ర.)

**అలుక్సమాసము** సం. వి. అ. పుం. విభక్తిలోపము లేనిసమాసము
ఉదా. సరసిజము, నావలని నేరము.

**అలుగు(ల్గు)**—అలువు. అ. క్రి. 1. కోపపడు.

క. ...నీ వలిగిన వడ్డమె పురహరాజకేశవులైనఁ. భార. ఆది. 4.184.

క. ... నానుతునకు మ్రొక్కొవా యలుగం దగునే, నీకు సుఖం జేయు మీతనిం గృప తోడఁ. భార. శాం. 5.474.

మత్త. ఏమి కారణ మయ్య పాముల కేల యల్గితి వీవు. భార. ఆది. 1.158.

2. ద్వేషించు, పగగొను.

సీ. కవితోడ వలిగినఁ గాని పద్యము చెప్పఁ గడుముచ్చుఁ దడవిఁ గన్న పెట్టు. నీతి 21.

చ. కపటము లేక వైభవము గప్పక యొండొరు మీఁద రాజుపై, నపరిమిత ప్రియం బెసఁగ నల్గక యుండు మదంబుఁ బొంది యే, నృపువిషయంబునం బ్రజవినిర్మలవృత్తతఁ బుత్త్రభంగి నా, నృపువృపుఁ డంద్రుడు గా శితరునిం దగువా రెద నియ్యకొందురే. భార. శాం. 2.190.

3. హానిచేయు.

క. తనయునికం చెను నను నమ్మనుఁ జేంద్రుఁడు గరము నెమ్మి మన్నించు మనమ్మున నట్టి యగ్రజమ్మని, యనుపమ రాజ్యమున కలుగ నగునే నాకుఁ. మార్క. 8.23.

గీ. అకట దీని, ప్రాణముల కల్గఁ దలఁచితిఁ బాపబుద్ధి. మనుచ. 5.4.

జ. అలుక, అలుకువ².

**అలుగులపడు** అ. క్రి. (అలుగులము+పడు) వ్యాకులత నొందు, సంక్షోభము నొందు.

క. అలుగులపడి ఖాండవమునఁ, గలయాశీవిషమహోరగము లెల్ల విషాగ్నులు గ్రక్కుచు. భార. ఆది. 8. 267.

క. గెలుపున మెయి వొదలఁగ సొబలసూనుఁడు దథము వఱపి పాంచాలబలం, బలుగులపడఁ బలుదెఱఁగుల, యలవుల విహరించె నుద్భటాటోపమునఁ. భార. కర్ణ. 1. 147. విరా. 3. 50.

**అలుగులము** వి. (క. అలుగు. త. అలుక్కు-తల్లై-వికలమగు.) సంక్షోభము, వ్యాకులత, క్లేశము.

చ. అలుగుల మంది యందులమృగావళియుఁ విహగంబులుఁ భయాకులగతిఁ బొంది మూఁగలును గుంటులుఁ జీఁకులు నైన యట్టులై. భార. అర. 1.301.

జ. అలుగులపడు.

**అలుమే** విజ. అల్పుఁడు, నీచుఁడు.

క. అలుమై నను బగతుని దెసఁదలఁపు గలుగ వలయు. భార. విరా. 3.107.

**అలుచు** వి. తిరస్కారము.

సీ. అలు చన నెల్లిద మనఁ బొకయనఁ దిరస్కా-
రంబు రాజిలు... ఆం. భా. 1.184.

**అలుపము** విణ. (సం. అల్పమ్. క. అలుప.) అల్పము, కొంచెము.

సీ. ఈవెంద్రుకలు వట్టి యీడ్చిన యా చేయి
దొలుతగాఁ బోరిలో దుస్ససేను,తను వింత
లింతలు తునియలై చెదరి రూపఱి యున్నఁ
గని యుడు కాఱుఁగాక, యలుపాలఁ
బోనుపడునట్టిచిచ్చే యిది. భార. ఉద్యో.
3.117.

(అలుపాలఁ — అలుపములను, అల్పప్రతి
క్రియలచేత)

**అలుపుఁడు** విణ. (సం. అల్ప.) అల్పుఁడు.

ఆ. అనుడు నకులుఁ డిట్టు లను దేవ తమతమ,
నేర్పు పనులవెంట నెగడి బ్రదుక, వలయుఁ
గాక నగరఁ దలముదప్పిన మెలం,కువల
కలుపు లియ్య కొనుట దగునె. భార. విరా.
1.266.

**అలువు**[1]—అలుఁగు[1].

(జలనిర్గమనమార్గము)

గీ. అంతరంగంబు నిండి రెండలువులందు,
వెడలు సంతోష పూరంబు విధము దోఁపఁ,
గన్నుఁగవ సమ్మదాశ్రులు గడలుకొనుచు.
భార. విరా. 5.240, అశ్వ. 3.196.

**అలువు**[2]—అలుగు. అ. క్రి.

(కోపించు)

చ. వినుము నరేంద్ర విప్రుఁ డలిపెఱ జమదగ్ని
సుతుండు శాప మి,చ్చెను...భార. శాం.
1.85.

**అలోకము** సం. విణ. (అ. ఆ. అ.) 1. చూడఁబడ నిది, 2. నిర్జనము. 3. ఉత్తరలోకములులేనిది, గతులు లేనిది.

**అలౌకికము** సం. విణ. (అ. ఈ. అ.) 1. ఈలోక మునకు సంబంధింపనిది. 2. అపూర్వమైనది, అసాధారణమైనది. 3. లౌకికభాషలోలేనిది. వైదికము. (పదము, మొ.)

**అలౌకికసన్నికర్షము** సం. వి. అ. పుం. (తర్క.) లోకసిద్ధముకాని ప్రత్యక్షజ్ఞానమును గలిగించు సంబంధము—ఇది త్రివిధము.

1. ఘటాదిస్వరూపజ్ఞానము కలిగినపిదప ఆయా వస్తుజాతిని బట్టి సకలఘటాది జ్ఞానమును గలి గించునది సామాన్యలక్షణము.

2. చందనము పరిమళము గలదని ఘ్రాణేం ద్రియ మూలమున గ్రహించినపిదప చందనము కంటితోఁ జూచినపుడు వెనుకటి యనుభవ మునుబట్టి చందనము పరిమళముగలది యనెడి జ్ఞానము కలిగించునది జ్ఞానలక్షణము.

3. యోగశక్తివలన సర్వవస్తు జ్ఞానము కలి గించునది యోగజము.

**అల్గోజా** వి. (హిం. అల్గోజా.) పిల్లనఁగ్రోవి. (శ. ర.)

**అల్పంపచము** సం. విణ. (అ. ఆ. అ.) కొంచెము ఉడుకునది. (గిన్నె, మొ.)

**అల్పంపచుఁడు** సం. వి. అ. పుం. — కొంచెముగా వండుకొనువాఁడు-పిసినిగొట్టు, లోభి.

**అల్పకము** సం. విణ. (అ. ల్పికా. అ.) అల్పము. వి. అ. పుం. తిఁటకసింద (వృ. పి.).

**అల్పకేశి** సం. వి. ఈ. స్త్రీ.—చిన్న వెంద్రుకలవంటి ఆకులు గలది-భూతకేశి, జటామాంశి, కారు కొల్లి (వృ. వి.)

**అల్పదృష్టి** సం. విణ. (అ.) 1. దృష్టి తగ్గినవాఁడు. 2. ఉదారదృష్టి లేనివాఁడు. వి. ఇ. స్త్రీ. 1. తక్కువదృష్టి. 2. ఔదార్యములేమి.

**అల్పప్రాణము** సం. విణ. (అ. ఆ. అ.) 1. తక్కువ బలముగలది. 2. (వ్యాక) ఉచ్చరించుటయందు అల్పప్రాణవాయువ్యాపారముగలది.(వర్ణము) (అంతస్థములు అనునాసికములు క చ ట త ప గజడదబలును అల్పప్రాణములు.

(అలంకారశాస్త్రమున హ్రస్వాచ్చులు కూడ అల్పప్రాణము లే. కావ్యాద. 1.43. వ్యాఖ్య).

**అల్పము** సం. విణ. (అ. ఆ. అ.) 1. నీచము, క్షుద్రము. 2. కొంచెమైనది, తక్కువది. సూక్ష్మము.

**అల్పితము** నం. విశే. (అ. ఆ. అ.) తక్కువగాఁ జేయఁబడినది.

**అల్పిష్ఠము** నం. విశే. (అ. ఆ. అ.) మిక్కిలి తక్కువ యైనది.

**అల్పీయము** నం. విశే. (స్. యస్. స్.) అల్ప తరము.

**అల్ల¹**—అల².

(నిర్దేశమునకు)

సీ. నీలజీమూతంబు లీల నాక్షేపించు నల్లనై తోఁచెంచు నల్లగృహము. భార. ఆది. 6. 211.

అల్లచోట. భార. ఆది. 6. 211.

అల్లయతఁడు. ప్రభా. 2. 39.

అల్లప్పుడు. మనుచ. 3. 28.

అల్లదె. మనుచ. 4. 16.

అల్లంత. బస. పు. 5. 558 పం.

అల్లటు—అవ్వైపు. విప్ర. 4. 8.

(ప్రసిద్ధికి)

ఉ. అమ్మకచెల్ల యల్లచిగురాకుఁగటారి కడింది జోదు పూవమ్ములు...నీలా. 2. 110.

2. అల్లంతన్ కంటి కగపడునంతదూరమున.

ఆ. హరిగదావిహార మల్లంతఁ దోచిన...ఉ. హరి. 4. 146.

అల్లపట్టు గుహ్యావయవము.

గీ. అంగజవ్యాధిఁ గడుపుబ్బినట్టి విటుల, యాత్మ జలపూరముల తెట్లు వల్లపట్టు. వైజ. 2. 25.

**అల్ల²** విశే. (నం. అలస.) 1. మందము; కొంచెము. (కర్మధారయమందు దీనికి నిగాగమము వికల్పము.)

సీ. అల్లఁదనంబున యనువు మైకొనఁ జూచు నడపుకాంతికి వింతతోడవు గాఁగ. భార. విరా. 1. 245.

క. ...అల్లనవ్వునఁ, దనవదనము వింతచెన్ను దల కొనఁగా. హరి. ఉ. 6. 109.

మ. ...అల్లనినవ్వు. భార. శాం. 3. 391.

2. సౌమ్యము, శాంతము.

క. అల్లనిమాటలనంతయుఁ, దెల్లంబుగఁ జెప్పి కలపు దెలిపి. దశకు. 11. 66.

క్రి. విశే. ద్రు. మందముగా, మెల్లఁగా; క్రమ క్రమముగా.

ఉ. అమ్ముఖమంతుఁ డల్ల నగి యంబురుహాసన సూతి కిట్లనున్. నైష. 3. 28.

గీ. సర్వసంకల్ప వర్జనశాలి యగుచుఁ, బరమ శాంతి చిత్తంబునఁ బట్టుకొల్పు, నతఁడనింధ నానలమునట్లల్లఁ బొందు, వికృతివర్జిత మైన నిర్వృతిఁ గృతాత్మ. భార. అశ్వ. 1. 205.

జ. అల్లన, అల్లలనాడు, అల్లలాడు, అల్లల్ల, అల్లల్లాడు, అల్లాడు.

**అల్ల** నం. వి. అ. స్త్రీ. 1. తల్లి. 2. సర్వవ్యాపిని యగు పరదేవత.

**అల్లకల్లోలము**—హల్లకల్లోలము. విశే. (క. అల్ల కల్లోల — చలించుతరంగము) తాఱుమాఱు, వ్యత్యస్తము, కలఁతనొందినది, క్షోభమొందినది.

గీ. అనుచు దైతేయ సైన్యంబు లదరి చెదరి, యల్లకల్లోలమై పాఱె. మైరా. 3. 58.

**అల్లట** వి. కష్టము, పీడ.

గీ. చోద పల్లట మల్లట చోడుమ బడప యిడు మగచాటు బా మనఁ బరఁగుఁ గష్టము. అం. భా. 1. 150.

జ. అల్లటపెట్టు.

**అల్లటపెట్టు** స. క్రి. (√అల్లట) దుఃఖపెట్టు, పీడించు.

ద్వి. అల్లన మూఁడేఁడు లయ్యె నన్నెంత, యల్లట పెట్టెదోయన్న నే నెఱుఁగ. బస. పు. 1. 359 పం.

**అల్లన** వి. (√అల్ల²) మెల్లన, మాంద్యము. (శ.ర.) క్రి. విశే. ద్రు. మెల్లగా, మందముగా. (ప్రౌ.)

వ. ...అల్లనల్లనం జాగుతఱి...ఆము 4. 85.

చ. ...అనిలజుఁ డోరి రావణుఁడ యల్లన నేటికి బెట్టు చెప్పెదన్, విను...రామా. 6. 233.

క. చల్లనిదక్షిణమారుత, మల్లన వీతెంచె. భార. ఆది. 4. 40.

చ. అనవుడు బ్రాహ్మణప్రవరుఁ డల్లన నవ్వుచు నిన్నునారయన్, మనమున వేడ్కపుట్టి. భార. అశ్వ. 2. 95.

చ. అల్లనల్లన...విలాసగతిం జనుదెంచి.భార. ఆది. 4. 41.

**అల్లనేరెడు**–అల్ల నేరెడు, అల్లొనేరెడు; అల్లొ నేరేడు, అల్లోనేరెడు. అల్లోనేరేడు. వి. రాజ జంబువు (వృ. వి.)

గద. అల్లనేరెడువాఁగు జలములనైన యవి యపఁజిలప్పలు. శుక. 1. 183.

సీ. నేరేడు మఱి యల్లనేరేడు పాదిరి తడ గూబతడ ఱేఁకు. హంస. 4. 11.

**అల్లనేరేడు**–అల్ల నేరెడు.

**అల్లము** వి. (క. అల్ల. త. అల్లం.) ఆర్ద్రకము, కారము గల ఒకజాతి దుంప. కాశీ. 7. 185.

**అల్లరి** వి. (క. త. అల్లరి.) 1. సందడి; గొడవ.

ఉదా: పిల్లలు అల్లరి చేయుచున్నారు.

2. కలహము, జగడము.

3. దుండగము.

ఉదా. వానియల్లరి భరింప శక్యముకాకున్నది.

4. దూఱు, నింద.

ఉదా. వాఁ డీవిషయమునఁ జాల నల్లరిపడినాఁడు.

విశ. 1. దుష్టము, చెడ్డది.

ఉదా. అల్లరివాఁడు, అల్లరిపనులు.

2. తాఱుమాఱు, వ్యత్యస్తము.

ఉదా. ఆకాంగితము లన్నియు నల్లరిగా నున్నవి.

**అల్లలనాడు**–అల్లాడు.

(చలించు)

చ. అనియని యుగ్గడించు ధృతి యల్లలనాడినఁ దల్లడించు. భార. విరా. 2. 81.

ఉ. ...లేచి కుచంబులుం దుఱుము లేనడు మల్లలనాడ. మనుచ. 2. 29.

(సంక్షోభించు)

చ. జలజదళోదరోదకము చాడ్పున నల్లలనాడె లోకముల్. పారి. 5. 83.

(ఇదిపై రెండర్థములకునుగూడ నుదాహరణము)

**అల్లలాడు** – అల్లాడు.

**అల్లల్ల** క్రి. విశ. ద్రు. (√అల్ల²) మెల్ల మెల్లఁగా, క్రమక్రమముగా.

మ. ... అశాతరం, గములన్ విహ్వాల మైన చిత్తము సమాకర్షించి యల్లల్ల బ్రహ్మమునం జేర్చుట మేలగున్.మల్ల.వై రా.89.

**అల్లాటము** వి. (√అల్లాడు) అల్లాడుట, త్రిప్పుట. (శ. ర.)

**అల్లాడు** – అల్లలనాడు, అల్ల లాడు, అల్లల్లాడు.

అ. క్రి–(√అల్ల²-శ. త. అల్లాడు.) చలించు, వడఁకు.

మ. అవనీచక్రము పాదఘాతమున నల్లాడంగ... భార. ఆది. 6. 13.

మ. అనిశన్ గన్నులు జేవుఱింప నధరం బల్లాడ ...మనుచ. 5. 18.

2. భయాదులచే క్షోభపడు.

మ....కై,కొనియెన్ వేడుక జీడికోట యహితక్షోణీశు లల్లాడ. కాశీ. 1. 38.

3. తిరుగు. (చూ. అల్లార్చు.)

జ. అల్లాటము, అల్లార్చు, అల్లార్పు.

**అల్లల్లాడు** – అల్లాడు.

(చలించు)

క. శైలారణ్యాబ్ధిద్వీపాలంకృత యైన నేల యల్లల్లాడెన్. మార్క. 6. 217.

**అల్లారుబెల్లము** విశ. మిక్కిలి ప్రియము, మిక్కిలి మనోహరము.

ఆ. ఎల్ల బంధువులకు నల్లారుబెల్లమై, యరిది గారవంబు నతిశయిల్ల. కళా. 6. 197. రాజ. చ. 2. 5.

**అల్లారుముద్దు** విశ. మిక్కిలి ప్రియము, మిక్కిలి యింపైనది.

మ. అనుఁగుంగ్రీడల నెల్లవారలకు నిట్లల్లారుముద్దైన,కూఁతునకున్. వసు. 3. 32.

గీ. పడుచుఁదనము వేడుక పడుచు నాడు, ముద్దరాంద్రకు నల్లారుముద్దుగాను.దశా. 9.81.

**అల్లార్చు(రుచే)** స. క్రి. (√అల్లాడు) 1. కదలించు, చలింపఁజేయు, ఆడించు.

శా.... అల్లార్చు భ్రూవల్లరిశా. నై ష. 8. 125.

సీ.... శోక యల్లార్చుచు... మార్క. 5. 859.

సీ. మందాకినీవీచి మారుతం బల్లార్చె నప్సర స్త్రీల నీలాలకముల. హర. 7. 135.

2. త్రిప్పు.

సీ. అనువొంద నందందయల్లార్చు బలుగద శత్రు దేహంబులు చదిపిచదిపి. హరి. ఉ. 7. 17.

**అల్లార్పు(రుపు)** వి. (అల్లార్చు) అల్లార్చుట.

శా.... వాలంబునల్లార్పుల్ గాడ్పుల రేఁచ... రామా. 6. 206.

సీ. అనికివేలుపుతేజి నలరుకై జామోరలల్లార్పుచేఁ జీరు హయకులముల. చం.ద్రి. 6. 85.

**అల్లార్పుఁజూపు** వి. దశవిధావలోకనములలో నొకటి.

సీ. పలుచని చూపునఁ బరిపాటిగాఁ జూచు నల్లార్పుఁజూపున నదటు చూచు. కవిరా. 2. 18.

**అల్లి**[1] వి. (శ. అల్లి.) 1. కలువవంటి యొకానొక జలపుష్పము.

ఉదా. అల్లి పువ్వు. అల్లికాఁడ.

2. తెల్లకలువ.

ద్వి. ఒకతెల్లగలువలో నున్న పూఁబోఁడి, నుకుమారి యగువేల్పుచూలి నీక్షించి... అల్లిలో నుదయించె నని యెన్ని కుముద, వల్లి నామంబిడి వాంఛిప్రేమ. ద్వి. పరమ. 6. 452 పా. 2 పం. ఆం. భా. 1. 165.

**అల్లి**[2] వి. ఒకానొకచెట్టు.

**అల్లి**[3] వి. బాల క్రీడావిశేషము.

సీ. చిడుగు డువ్వలపోటి చెండుగట్టి నబోది యల్లి యుప్పనఁబట్టె లప్పళాలు. కాశీ. 3. 33.

**అల్లిక** వి. (√అల్లు) 1. అల్లుట. 2. (జడచాప మాటలు మున్నగువాని) కూర్పు.

సీ. జడలయల్లిక లూడ్చి సంపెంగనూనియ శిర సంటి సీకాయ జిడ్డు దిగిచి. పి. శకుం. 5. 141.

సీ. జల్లిమాటలు వపశబ్దములును జజ్జుటల్లికల్ ప్రావ లందదుకుఁబలుకు,లును.... ప్రబంధ. పీఠ. 16.

ఆ. అల్లసానివానియల్లిక జిగిబిగి. ముక్కుతిమ్మనార్యుముద్దుపలుకు. (చాటువు.)

3. నేఁత. ఆం. భా. 2. 296.

**అల్లికనాను** — అల్లిక గలనాను. శుక. 2. 411.

**అల్లికబిల్లిక** — అల్లిబిల్లి. వి. పెనఁకువ.

ఉ. మొల్లపుమొల్ల పూఁబొదల మొగ్గల వగ్గలమైన శీవలం, దల్లనఁ జల్లనై యొలయు నందపుఁగందపుఁగొండ గాడ్పుచే, నల్లికబిల్లికం దనరునామిడిమామిడిక్రింద భూమిభృ, త్తల్లజుఁ డల్ల జాలరివిధంబునఁ బొంచి హరించె డెందముల్. కృ. శకుం. 2. 220.

విశ. కలసి మెలసి యుండునది.

ఉ. అంగము లొక్కటై పొదువ నల్లికబిల్లికలై కరంబు ను,ప్పొంగుచుఁ జెక్కునాఁడు లోక పూఁటయె కాఁగ మెలంగుచుంటిమి. రసిక. 6. 107.

**అల్లితెమ్మెర** వి. మందమారుతము, చల్లగాలి. (ప్రా)

**అల్లిపట్టు** వి. (√అల్లు) క్రీడావిశేషమగు గంజికావడి పట్టునపుడు రెండు చేతుల వ్రేళ్ళను గొనిపి పట్టెడి పట్టు.

మ. శ్రవణశ్రీలు విశాలలోచనయుగ చ్ఛద్మాత్మ పాణిద్వయిన్, నివుడుంటొక్కపు టల్లిపట్ట మగ నెంతే గంజికాల్వట్ట ... చంద్రా. 4. 112.

**అల్లిబిల్లి** విశ. (శ. అల్లుపుల్లు.) 1. కలసి మెలసి యున్నది.

ద్వి. పెసలుఁ గుంకుము నల్లిబిల్లిగా మెదిచి, పసిమితేజెడు నూనెపస నలంగిడుచు. అ. మ. క. 1. 24 పా. 21 పం.

గీ.... తనకూర్మి చెలువతో నల్లిబిల్లి, యగుచు నెప్పటియట్ల నెయ్యమున నుండె. పరమ. 3. 274.

చ. ... అనుంగుఁజుట్టముక్రియల్ భువి వంతట నల్లిబిల్లియై, తిరుగుడు వంచు నిమ్ము వలితెమ్మెర. కవిరా. 3. 156.

2. సాంద్రము

క. పుల్లలవలి నవైలా, వల్లిమతల్లికలతోడ వాసంతికలు, దళ్లీల నల్లిబిల్లిగ, నల్లుకొనిన

యొక లతా గృహాంతరసీమఁ. మనుచ. 3. 113.

3. ప్రియమైనది.

గీ. బల్లిదపుఁజేటియిల్లాంద్ర యల్లిబిల్లి, మేర దప్పక నిలిచిన నీరువెల్లి, నిట్ట నేరేడుదిబ్బకుఁ జుట్టువాఱు. తీరు చెన్నారు మున్నీరు ... కవిరా. 4. 63.

వి. 1. పెనఁకువ. ఆం. భా. 8. 29.

2. బాలక్రీడా విశేషము.

జ. అల్లిబిల్లిగొను.

**అల్లిబిల్లిగొను** అ. క్రి. (√అల్లిబిల్లి) 1. కలసి మెలసి యుండు.

సీ. బెరుకెఱుంగనిగాఢపరిరంభమున నల్లిబిల్లి గొంచుఁ బెనంగుపెనఁకువలును. కళా. 3. 37.

2. పెనఁగొను.

శా. ...తీరంబున, న్మావుల్ క్రోవులు నల్లిబిల్లి గొనుకాంతారంబునందు. మనుచ. 2.22.

**అల్లిమత్తు** వి. ఒకవిధ మగుకత్తిసాము, పండ్రెండు గాయమానములలో నొకటి.

వ. అల్లిమత్తును నిస్సందు హస్తాభరణంబును పద ఖండనంబును నురిత్రాడును లోబిత్తరియు వెలిబిత్తరియు సర్పాంకుశంబును మొదలుగాఁగల పదిరెండు గాయమానంబులును. ప్రబంధ. 78.

**అల్లు** స. క్రి. (జడచాఁప మాటలు, ము) కూర్చు, రచించు.

క. గారవముననిజదేశాచారముమైనల్లియున్న జడ యగుకబరీ, భారంబు విచ్చి శిరముగ, సైరంధ్రీజాతివేష సముచితభంగిన్. భార. విరా. 1. 290.

ఆ. పెల్లుకల్లలల్లి బొల్లిమాటలఁ జల్లి, మెల్ల మెల్ల నిల్లు గుల్ల సేయు, తల్లి గలుగులంజె నుల్లోలమతిఁ జేరు, పల్లవులకు సౌఖ్యమిల్ల జగతి. చంద్ర. వి. 2. 29.

2. సేయు.

ఆ. పడుగు, జేయువేళఁ బటము లల్లెడువేళఁ, గూడు దినెడువేళఁ గూర్కువేళ, మగనిఁ గన్మొఱంగి మార్మగలను గూడు, నింటి పొరుగుసఖులయిండ్లలోన. హంస. 2, 24.

అ. క్రి. అల్లుకొను, పెనఁగొను.

చ. మఱిమఱి సుందరం బయినమల్లియతీవల నల్లిబిల్లియై, యఁలి తమాల జాలమున నల్లిన పూఁబొదరండ్ల. గంధ. 65.

జ. అల్లిక, అల్లుకొను, అల్లుడు, అల్లుబచ్చలి.

**అల్లుఁగుఱ్ఱ** వి. (√అల్లుఁడు)-అల్లుడగు బాలుఁడు- 1. అల్లుఁడు, జామాత.

చ. అంబుధియల్లుఁగుఱ్ఱ మన యచ్చరజాతికి బావ వేల్పు పీతాంబరుఁ డెట్టు లట్ల. కకు. 1. 171.

2. మేనల్లుఁడు, భాగినేయుఁడు.

క. గతి నీవె నాకు మత్సంతతికిని నీ యల్లుఁగుఱ్ఱ తనయుఁడు పుట్టెన్. భార. అశ్వ. 3. 169.

**అల్లుఁడు**[1] వి. (బ. అల్లురు, అల్లుండ్రు) కూఁతుమగఁడు, జామాత.

చ. మఱఁది యటంచు బావ యని మామయటంచును నల్లుఁ డంచు నందఱకును నన్నివావులిడి. దశా. 2. 366.

గీ. అల్లుతండంబుచే ధన మెల్లఁ గొనుచు. దశకు. 5. 17.

2. మేనల్లుఁడు.

చ. జలరుహవైరి నేఁ డిటులు సాటికి నల్లునిఁ గూడి వచ్చితే. ఇందు. 4. 38.

**అల్లుఁడు**[2] వి. (బ. అల్లురు, అల్లుండ్రు) కూఁతుమగఁడు, జామాత.

గీ. దను నల్లుండ్ర మెడల సూత్రములఁ గట్టి. కాశీ. 7. 88.

శా. ...నీయన్న యల్లుండ్రన్ బిల్చియు... వీర. 1. 130.

ఉ. ...నీ, యల్లురఁ బాండుపుత్రుల... భార. ఆది. 8. 53.

జ. అల్లుఁగుఱ్ఱ, అల్లుఁడుకొమాళ్లు, అల్లుఁదనము, అల్లువాఁడు, అల్లెము.

**అల్లుఁడుకొమాళ్లు** వి. బ. — అల్లునితోను కొమారుని తోను సమానులగువారు — ప్రభువునకు ప్రేమపాత్రులై అంగరక్షకులుగా నుండువారు. (బ్రౌ)

**అల్లుఁడనము** వి. (√అల్లుఁడు) అల్లుఁడగుట, జామాతృత్వము.

గీ. అసురపతి యొల్ల డాతని యల్లుఁడనము, పుర మితనియాజ్ఞ లే కెట్లుఁ జొరఁగ రాదు. ప్రభా. 4. 52.

**అల్లుకొను** అ. క్రి. (√అల్లు) 1. పెనఁగొను.

క. పుల్లలవలీ నవైలా, వల్లిమతల్లి కలతోడ వాసంతిక లు,ద్యల్లీల నల్లిబిల్లిగ, నల్లుకొనిన యొక లతా గృహాంతరసీమన్. మనుచ. 3. 113.

2. వ్యాపించు, ప్రసరించు.

మ. మొగ మెల్లన్ వళిపూర్ణమైనయపుడున్ మూర్ధంబునన్ జన్ను నా,రగతిం బాండిమ యల్లుకొన్నపుడు...మల్ల. వై రా. 8.

**అల్లుడు** వి. (√అల్లు) 1. అల్లిక. (శ. ర.)

2. ఉపఘ్నము, ప్రాఁకు. (చి. ని.)

**అల్లుబచ్చలి** వి. (√అల్లు) తీఁగబచ్చలి (వృ. వి.) ఆం. భా. 2. 72.

**అల్లువాఁడు**—అల్లుఁడు. (√అల్లుఁడు)

చ. వలిమలయల్లువాఁడు తలవాఁక ధరించిన పూవుగుత్తి. పారి. పీఠి. 6.

గీ. అల్లువారికి నెల్ల నీయవగుణంబు, వెన్నతోఁ బెట్టినది. కాశీ. 7. 50.

**అల్లె¹(ల్లియ)** వి. వింటినారి, మౌర్వి.

సీ. అర విరివిరి మొగ్గశరముల కిరవగుచిగురల్లె గల తెల్లచెఱకువిల్లు. ఘటికా. 2. 25.

**అల్లె²(ల్లియ)** వి. మత్స్యవిశేషము.

ఉ. ...పిత్తడికాసు ముల్లుమీ,వల్లె యు గండెరొయ్యపర శాదిగఁ జేఁపలఁబట్టి బెట్టుగన్. ప్రబంధ. 195.

**అల్లెదము** వి. మత్స్యవిశేషము.

గీ. అల్లెద మ్ముప్పుచేపయు గొల్లగొందు, పరిగెరొయ్యాదియగుమీలఁ బట్టు నతఁడు హంస. 4. 187.

**అల్లె(ల్లియ)ము** వి. (√అల్లుఁడు) 1. జామాతృత, అల్లుఁడగుట.

గీ. అల్లె మనఁగను జామాతృతాఖ్య. ఆం.భా. 2. 111.

2. మనుగుడుపు. (బ్రౌ)

**అల్లోనేరెడు**—అల్ల నేరెడు.

(జంబువు)

సీ. అల్లోనేరెడు దివియవనీభ్రమములలోననేకొండ కైశ్వర్య మెక్కుడయ్యె. శివరా. 2. 3.

(నమస్కారము)

గీ. నతియు జోహారు మ్రొక్కు దండంబు మొక్క, ణంబు చేమోడ్పు జోత ప్రణామ మల్లో, నేరె డంజలి గొబ్బిళ్లు నిరుపమాన, వందనంబును దేవిప్పు ప్రణతులిమరు. కార్తిక. ?.20.

**అల్లోనేరేడు**—అల్ల నేరెడు.

(నమస్కారము.)

గీ. అల్లోనేరేళ్లు నీకు మహానుభావ, మ్రొక్కులివె నీకు సూనసమ్యక్కృపాణ. ఇందు. 3.87.

(ఒకవిధమగుపాట)

పాంచా. 4. 24.

**అల్లోనేరెడు**—అల్ల నేరెడు

(ఒకవిధమగుపాట)

శా. అల్లోనేరెడు పాడుచుం జనఁగ రంభాద్యప్సరోభామినుల్. కకు. 4. 3.

**అల్లోనేరేడల్లో** వి. నమస్కారము. ప్రబంధ. 880.

**అల్లోనేరేడు**—అల్ల నేరెడు.

(జంబువు)

కవిక. 4. 123.

(నమస్కారము)

హంస. 4. 218.

(బాలక్రీడావిశేషము)

క. ఎల్ల సుఖంబులఁ జేకొనఁ, బెల్లుట యౌవనము నంద చిక్కిన మఱి పా,టిల్లునె వెన్నెలదినముల, నల్లోనేరేళ్లు గాక యౌవలఁగలవే. భా. రా. సుం. 180.

(ఒకానొకపాట)

క. పల్లవపాణులు కొందఱు, పల్లెరములఁ బూని రవలబంగరుగాజుల్, ఘల్లు రన నుంకుఁ జెరిగిరి, యల్లోనేరే డటంచు నయ్యెందిరకున్. ప్రబంధ. 571.

(అల్లోనేరేళ్లల్లో అనెడుపల్లవితో పాడుదురు గనుక దీనికీపేరు వచ్చినదని - బ్రౌ.)

**అళఁది¹-హాళఁది.** వి. (సం. హారిద్రా. ప్రా. హాలిద్దా. క. అళది, హాళది.) పసుపురంగు.

క. ఒకయెడఁ దెలుపొకయెడ నలు,పొకయెడ నళఁదివగ యొఱపు నొకయెడ నెఱుపున్, బ్రకటింపుచు సకలాశా,నికురుంబంబునకు మేదినీరజ మెగసెన్. రామా. 7. 278. ఆం. భా. 1, 108. ఆం. సం. స్థా. 16.

విశే. పసుపురంగు గలది.

జ. అళఁదికాయ.

**అళఁది²** వి. చెలఁదిపురుగు, పెద్దసాలీఁడు. (చి.ని.)

**అళఁదికాయ** వి. (√అళఁది¹) పట్టునూలిపురుగు గూఁడు, పసిఁడికాయ. (చి. ని.)

**అళకము** వి. (సం. అలర్కః) ఒకజాతి కీటకము.

గీ. అళక మనియెడునొక కీట మద్దినేంద్ర, తన యుత్క్రీఁదొడఁ దొలిచె సత్వరము గాఁగ. భార. శాం. 1. 21.

**అళది-హాళది.** వి. సరళవృక్షము. ఆం. భా. 2.50.

**అళుకరి** విశే. (√అళుకు) భయశీలుఁడు.

సీ. భయశీలుఁడౌ వెఱపరి యళుకరి...ఆం. భా. 3. 9.

**అళుకు** అ. క్రి. (క. అళుకు.)- అలుకు.

ఉ. రా. 7. 54.

వి.—అలుకు¹.

గీ. వ్రాలె నగ్రజుఁ డళు కొంద వసుధ నతఁడు. హరి. ఉ. 1. 124.

జ. అళుకరి.

**అళె(ళియ)** వి. (క. అళియ.) అల్లుఁడు, జామాత. మ...అళెరామరాజు...రామా. 1. 59.

**అవ** అవ. సంఖ్యావాచకములపై పూరణార్థమున వచ్చును. (దీనికి పూర్వరూపములు 'అగు,అవు' చూ. అగు.)

సీ. ఆయంబునందు నాల్గవభాగ మొండె మూఁడవభాగ మొండె నందర్ధ మొండె, భార. సభా. 1. 46. మనుచ. 4. 46.

**అవ** సం. అవ్య. ఇది సమాస పూర్వపదముగానే యుండి తఱచుగా ఈ క్రింది యర్థములు తెలుపును. దీని యాద్యక్షరము వైకల్పికముగా లోపించును.

ఉదా: అవతంసము, వతంసము.

1. అవనతము, వంగినది.

ఉదా: అవాగ్రము — వంగిన అగ్రముకలది.

2. విరుద్ధము, వ్యతిరిక్తము.

ఉదా: అవమానము, అవలక్షణము.

3. అనాదరమును దెలుపును.

ఉదా: అవకృష్టనము. (చూ)

4. కొన్నిచోట్ల నిరర్థకముగానే యుండును.

ఉదా: అవాప్తి = ఆప్తి, అవమర్దనము = మర్దనము, అవమోచనము = మోచనము.

**అవంతి** సం. వి. ఇ. ఈ. స్త్రీ. ఒకానొక పట్టణము, ఉజ్జయిని. (ఇది మోక్షదాయకములగు సప్త పురములలో నొకటి. 'అయోధ్యా మథురా మాయా కాశీ కాంచీ అవంతికా, పురీ ద్వారవతీ చైవ సప్తైతా మోక్షదాయికాః')

**అవంతి(తీ)సోమము** సం. వి. అ. న. ధాన్యామ్లము, పులియఁ బెట్టినకడుగు, కలి.

**అవంధ్యము** సం. విశే. (అ. ఆ. అ.) 1. గొడ్డు వోనిది. 2. సఫలము, అమోఘము.

**అవక** సం. వి. ఆ. స్త్రీ. నాఁచు.

**అవకట** సం. వి. ఆ. స్త్రీ. ఆకారగోపనము, అవహిత్థ. (వై. ని.)

**అవకటము** సం. విశే. (అ. ఆ. అ.) 1. వ్యత్యస్తమైనది; విరుద్ధమైనది. వి. అ. న. ప్రాతికూల్యము, విరోధము.

**అవకరము** సం. వి. అ. పుం. 1. చీఁపురు మొదలగు వానితో నూడ్చినచెత్త. 2. హీనకృత్యము, నీచకార్యము, చెడ్డపని.

(ఈయర్థము తెనుఁగునవే కలదు.)

గీ. అవకరము లెన్ని యన్నియు నాదరించెఁ, బావి యగువీని నరకకూపమునఁ ద్రోచి. శివరా. 4. 67.

**అవకర్ణనము** సం. వి. అ. న. 1. వినుట. 2. అనాదరముతో వినుట.

**అవకర్ణించు.** సం. వి. క్రి. 1. విను. 2. అనాదరముతో విను, పెడచెవిని బెట్టు.

వ. అనిన వానివచనం బవకర్ణించి రాజనియుక్తు లయి చ్యవనకులవిఖ్యాతుం డైనచండ భార్గవుండు హోతగాఁ బింగళుం డధ్వర్యుండుగా ...భార. ఆది. 2. 210.

**అవకర్తనము** సం. వి. అ. న. చించుట; త్రుంచుట.

**అవకర్తము** సం. వి. అ. పుం. (వస్త్రాదులనుండి ఛేదించిన) తునక, ముక్క.

**అవకర్తి** సం. విశే. (న్. సీ. న్.) చించువాఁడు; త్రుంచువాఁడు.

**అవకర్షణము** సం. వి. అ. న. 1. బలిమితో లాగుగుట, మఱియొకచోటికి బలవంతముగాఁ బట్టి యీడ్చుట. 2. వెడలించుట, తఱుముట.

**అవకర్షము** సం. వి. అ. పుం—అవకర్షణము.

**అవకలితము** సం. విశే. (అ. ఆ. అ.) 1. చూడఁబడినది. 2. తెలియఁబడినది. 3. గ్రహింపఁబడినది, చేకొనఁబడినది.

**అవకాశము** సం. వి. అ. పుం. (దేశకాలముల) ఎడము, తెఱపి.

**అవకీర్ణము** సం. విశే. (అ. ఆ. అ.) 1. చల్లఁబడినది, క్షిప్తము; వ్యాప్తము. 2. పొడిచేయఁబడినది, చూర్ణితము. 3. ధ్వస్తము, నాశమునొందినది. వి. అ. న. బ్రహ్మచర్య వ్రతభంగము.

**అవకీర్ణి** సం. వి. న్. పుం. స్త్రీసంగమాదులచే వ్రతభ్రష్టుడైన బ్రహ్మచారి.

**అవకుంచనము** సం. వి. అ. న. 1. ముడుఁగుట, ముకుళించుట. 2. వంగుట. 3. ఒకానొక రోగము.

**అవకుంఠనము** సం = అవగుంఠనము. (ముసుఁగు)

చ. ఒనర హిమాపకుంఠనము లూడ్చి తెమల్చిన పత్రభంగముల్, నన ననియాడుచుఁ... లతికాలతాంగులు...వసు. 1. 127.

**అవకుంఠము** సం. వి. అ. పుం—అవగుంఠనము. (మేలుముసుఁగు.)

ఉ. ...పరిలిశ్చిద్ధరా, కాంతపటావకుంఠవృత కామినిఁ గన్గొనరామి వక్త్రనఁ, క్రాంత విలాసలక్ష్మిఁ గనుకై వడి గడ్డము పట్టి యెత్తి...మంగళమాత్రముఁగట్టె నింతికిన్. వేం. పంచ. 4. 362.

**అవకుంఠితము** సం—అవగుంఠితము.

**అవకుటారము** సం—అవకటము.

**అవకుట్టితము** సం. విశే. (అ. ఆ. అ.) 1. ఖండింపఁబడినది. 2. (వృశ్చికాదులచే) కుట్టఁబడినది, పొడువఁబడినది.

**అవకృష్టము** సం. విశే. (అ. ఆ. అ.) 1. పట్టియీడ్వఁబడినది, లాగఁబడినది. 2. తొలఁగింపఁబడినది. 3. అధమము. (వ్యతి. ఉత్కృష్టము) 4. బహిష్కరింపఁ బడినది.

**అవకృష్టుడు** సం. విశే. (చూ. అవకృష్టము.) వి. అ. పుం. ఇల్లు తుడుచుట మొదలగుప్రాఁచి పనులు చేయుసేవకుఁడు.

**అవకేశి** సం. విశే. (న్. సీ. న్.) 1. ఫలింపనిది, గొడ్డువోయినది (చెట్టు). 2. కుఱుచవెండ్రుకలు గలవాఁడు; కొలఁది వెండ్రుకలు గలవాఁడు.

**అవక్రందనము** సం. వి. అ. న. 1. ఏడ్పు. 2. అఱపు.

**అవక్రందము** సం. విశే (అ. ఆ. అ.) 1. ఏడ్చునది. 2. అఱచునది. వి. అ. పుం. 1. ఏడ్పు. 2. అఱపు.

**అవక్రమము** సం. వి. అ. పుం. క్రిందికి దిగుట.

**అవక్రయము** సం. వి. అ. పుం. 1. వెల. 2. బాడిగ, అద్దె. 3. అద్దెకిచ్చుట. 4. రాజునకు చెల్లించు పన్ను. 5. కూలి; జీతము.

**అవక్రాంతి** సం. వి. ఇ. స్త్రీ. దిగుట.

**అవక్రియ** సం. వి. అ. స్త్రీ. విహితక్రియలను ఆచరింపకుండుట.

**అవక్రోశము** సం. వి. అ. పుం. 1. అపస్వరము. 2. నింద. 3. శాపము, తిట్టు.

**అవక్లిన్నపక్వము** సం. విణ. (అ. ఆ. అ.) మిగుల మాఁగి నీరుకారునది (పండు, మొ.)

**అవక్లిన్నము** సం. విణ. (అ. ఆ. అ.) (జలాదుల చేత) మిక్కిలి తడిసినది.

**అవక్లేదనము** సం. వి. అ. న.—అవక్లేదము.

**అవక్లేదము** సం. వి. అ. పుం. 1. రసికాఱుట. 2. పండు మిగుల మాఁగి నీరు కాఱుట.

**అవక్వణము** సం. వి. అ. పుం. అపస్వరము అపధ్వని.

**అవక్వాథము** సం. వి. అ. పుం. 1. బాగుగా కాఁగని కషాయము. 2. ఆహారము బాగుగా జీర్ణము కాకుండుట.

**అవక్షిప్తము** సం. విణ. (అ. ఆ. అ.) 1. క్రిందికి త్రోసివేయఁబడినది; త్రోసివేయఁబడినది. 2. దూఱఁబడినది. 3. ఎగతాళి చేయఁబడినది.

**అవక్షుతము** సం. విణ. (అ. ఆ. అ.) తుమ్ముపడినది, తుమ్ముచే కలుషిత మైనది (పదార్థము)

**అవక్షేపణము** సం. వి. అ. న. 1. క్రిందికి త్రోయుట; త్రోయుట. 2. నిరసించుట. 3. నిందించుట.

**అవక్షేపణి** సం. వి. ఈ. స్త్రీ. 1. వాగె, కళ్లెము. 2. బల, ముత్తవపులగము (వృ. వి.)

**అవక్షేపము** సం. వి. అ. పుం. 1. త్రోసివేయుట. 2. నిందించుట. 3. ఎగతాళిసేయుట.

**అవఖండనము** సం. వి. అ. న. 1. భాగించుట, ముక్కలుకొట్టుట. 2. నాశముసేయుట.

**అవఖాతము** సం. వి. అ. పుం. లోఁతయినగోయి.

**అవగండము** సం. వి. అ. పుం. మొగముమీఁది బొటిమ, మొటిమ.

**అవగడము** వి. (క. అవగడ. త. అవగడమ్.)

1. ప్రమాదము, ఏమఱిపాటు.

క. మణిధరనామకుఁ డగువొక, ఫణివరుఁ డవగడముకతనఁ బడి యన్నదిలో, గణనాతీత భయంబునఁ, దృణముంబలె ఝురముమెంటఁ దేలుచు వచ్చెన్. శుక. 3. 327.

2. అపాయము.

ఆ. అనుచుఁ జిలుక పలుక నాప్రభావతి యుట్టి, యవగడంబు మాన్పనది యెఱుంగు, నిపుడు నీ వెఱుఁగు దింతయేకాని యీ, తెంపువగలు మాకుఁ దెలియవనిన. శుక. 2. 298.

విణ. 1. అపాయకరము, హానికరము.

క. మోసము వచ్చుట యరుదే, యీసునఁ దద్గర్వభాష లిచటి సృగాలా, గ్రేసరులు సైఁతురే విను, మానమయము సుమ్ము దొరల కవగడ మరయన్. శుక. 3. 391.

2. అనన్యసాధ్యము, ఇతరుల కశక్యమయినది.

ద్వి. అవు నౌనె నీ వాడినట్టి యీ ప్రతిన,యవగడంబగుమాట లవి నీకె చెల్లు. ద్వి. పరమ. 4. 296 పా. 12 పం.

ద్వి. క్రచ్చఱ ద్వీపాంతరంబుననుండి, వచ్చిన యట్టికువాడ వద్రంగి, యవగడంబైన యీ యాలయం బిట్లు,నవరించె నని నవనవగాఁగ వింటి. ద్వి. పరమ. 7. 523 పా. 8 పం.

3. దుష్టము, చెడ్డది.

సీ. పైచేయఁ గలిగెనే ప్రహ్లాదుని హిరణ్యకశిపుచే నగువవగడపుఁబనులు. విప్ర. 4. 49.

**అవగణన** సం. వి. అ. స్త్రీ.—అవగణనము.

**అవగణనము** సం. వి. అ. న. 1. ఉపేక్ష, సరకుసేయమి. 2. నిందించుట. 3. అవమానించుట.

**అవగణము** సం. విణ. (అ. ఆ. అ.) తోడిగుంపు నుండి వీడినది, ఒంటరియైనది, ఏకాకి.

**అవగణించు** సం. స. క్రి. అలక్ష్యముసేయు.

వ. ఉత్తరంబునకు మాఱు పలుకక యవగణించి మరలుట కర్జంబు గాదని యూహించి యకాంంతాలలామంబు. కృ. శకుం. 2. 59.

**అవగణితుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) 1. సరకుసేయఁబడనివాఁడు. 2. నిరసింపఁబడినవాఁడు. 3. నిందింపఁబడినవాఁడు. 4. పరాభవింపఁబడినవాఁడు.

**అవగతము** సం. విణ. (అ. ఆ. అ.) తెలియఁబడినది, జ్ఞాతము.

**అవగతి** సం. వి. ఇ. స్త్రీ. జ్ఞానము, తెలివి.

**అవగఘుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) ప్రాతస్స్నానము చేసినవాఁడు.

**అవగదితము** సం. విణ. (అ. ఆ. అ.) నిందితము.

**అవగమనము** సం. వి. అ. న.—అవగమము.

**అవగమము** సం. వి. అ. పుం. జ్ఞానము, తెలివి

**అవగమించు** సం. వ క్రి. తెలిసికొను.

సీ. ...పర్యాయగతుల. గీ. నలరు నన్నింట నర్థంబు నవగమింపఁగదగు ననేకార్థయుత ములై తనరు శబ్ద, సంతతుల కర్థసంధాన చతురు లెల్ల. కావ్యా. 4. ఉల్లా. 67.

**అవగల్భుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) ప్రౌఢుఁడు.

**అవగాఢము** సం. విణ. (అ. ఆ. అ.) 1. మునిఁగినది; చొరఁబడినది. (మనుష్యాది) 2. నిమ్నము, లోఁతైనది.

శ్లో. అభ్యున్నతా పురస్తాదవగాఢా జఘనగౌరవాత్పశ్చాత్. శాకుం. 3. 8.

3. దేనియందు స్నానము చేయబడునో అది (జలాదికము.) 4. తెలిసికొనఁబడినది. (విషయము.) 5, గడ్డకట్టినది. (రక్తాదికము.) 6. దట్టమైనది, నిబిడము; అధికము.

**అవగాహనము** సం. వి. అ. న.—అవగాహము.

**అవగాహము** సం. వి. అ. పుం. 1. మునుఁగుట, స్నానము. 2. ప్రవేశము, లోపలఁ జొచ్చుట. 3. గ్రహించుట, తెలిసికొనుట. 4. స్నానము చేయుచోటు. (చెఱువు, మొ.)

**అవగాహించు** సం. అ. క్రి. మునుఁగు, స్నానము చేయు. స. క్రి. 1. తెలిసికొను.

వ. ధనుర్వేదం బవగాహించి యాయుర్వేదంబు విచారించి నాట్యవేదంబు గ్రహించి. కాశీ. 3. 79.

2. ప్రవేశించు, చొచ్చు.

వ. ఇవ్విధంబున లోహదండ మహాగహనం బవగాహించి. వరాహ. 2. 152.

**అవగాహ్యము** సం. విణ. (అ. ఆ. అ.) 1. స్నానము చేయఁదగినది. (చెఱువు, మొ.) 2. ప్రవేశింపఁదగినది. 3. తెలిసికొనఁదగినది.

**అవగీతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. వికృతముగా పాడఁబడినది. 2. నిందితము. 3. దుష్టము. 4. మాటిమాటికి చూడఁబడినది. 5. చెప్పఁబడినది. వి. అ. న. 1. వికృతముగా పాడుట. 2. నింద. 3. జనాపవాదము.

**అవగీర్ణము** సం. విణ. (అ. ఆ. అ.) ప్రణుతము. పొగడఁబడినది.

**అవగుంఠనము** సం. వి. అ. న. 1. మేలుముసుఁగు వేసికొనుట. 2. మేలుముసుఁగు. 3. ఆచ్ఛాదన వస్త్రము, కప్పుబట్ట. 4. కప్పు, ఆచ్ఛాదనము.

**అవగుంఠిక** సం. వి. ఆ. స్త్రీ. 1. ముసుఁగు వేసికొనుట; కప్పుకొనుట. 2. ముసుఁగు; కప్పు. 3. తెర.

**అవగుంఠితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ముసుఁగిడఁబడినది; కప్పఁబడినది. 2. పొడిచేయఁబడినది.

**అవగుంఫితము** సం. విణ. (అ. ఆ. అ.) కూర్పఁబడినది. అల్లఁబడినది.

**అవగుణము** సం. వి. అ. పుం. దోషము, తప్పు.

**అవగూహనము** సం. వి. అ. న. 1. దాఁచుట. మఱుఁగుచేయుట. 2. కౌఁగిలించుట, ఉపగూహనము.

శ్లో. యా మమోద్విజతే నిత్యం. సామామద్యావగూహతే. సం. పంచ. 3. 186.

**అవగ్రహణము** సం. వి. అ. న. 1. అడ్డపాటు. 2. అనాదరము.

**అవగ్రహము** సం. వి. అ. పుం. 1. వర్ష ప్రతిబంధము, అనావృష్టి, వఱపు. 2. ప్రతిబంధము, అడ్డపాటు. 3. ఏనుఁగులగుంపు. 4. ఏనుఁగునొసలు. 5. స్వభావము. 6. నిగ్రహము, దండనము.

శ్లో. స్వయం విధాతా సురదైత్యరక్షసాం,మనుగ్రహావగ్రహయో ర్యదృచ్ఛయా. శిశు. 1. 71.

7. శాపము. తిట్టు. 8. అంకుశము. 9. (వేద) పదము చెప్పునపుడు అవాంతరపదసంజ్ఞను సూచించుటకై కొంచెము సేపు పదము నాఁపుట.

(అది తఱచు సమాసపూర్వపదమునకే సంభవించును. ఆఁపినపదము కూడ అవగ్రహ మనఁబడును.)

**అవగ్రాహము** సం.—అవగ్రహము.

**అవఘట్టన** సం. వి. ఆ. స్త్రీ.—అవఘట్టనము.

**అవఘట్టనము** సం. వి. అ. న. 1. తుడిచివేయుట. 2. కదల్చుట, చాలనము.

**అవఘట్టము** సం. వి. అ. పుం. 1. నేలబొఱియ. 2. తిరుగలి, ఘరట్టము. 3. కదల్చుట.

**అవఘట్టితము** సం. విణ. (అ. ఆ. అ) 1. కదల్పఁబడినది. 2. తుడిచివేయఁబడినది.

**అవఘర్షణము** సం. వి. అ. న. 1. క్రిందఁ బెట్టి రాచుట. 2. పిండిగా విసరుట. 3. శుద్ధిచేయుట. మాలిన్యము తొలఁగించుట.

**అవఘళము** — అవుఘళము, ఔఘళము. వి. (మ. అవఘళం.) 1. అతిశయము, పెంపు. (చూ. ఔఘళము.) 2. సామర్థ్యము, శక్తి.

సీ. అపరిహాస్యంబుగా నన్యమతంబులయందు శంక ఘటించు నవఘళంబు. దశా. 1.43.

విణ. 1. హెచ్చైనది, అధికము.

ద్వి. అవఘళంబుగ దండ మల్లార్చి పేర్చి, కవిసి వ్రేసిన మహాకలకలం బెసఁగ. ద్వి. హరిశ్చ. ఉ. 944.

2. అసాధ్యము, శక్యము కానిది.

ద్వి. నిర్మలశివతత్త్వ నిశ్చలజ్ఞాన, మగ్గలిఁ దెలియనా కవఘళం బనిన, నున్న వారల కేడ నున్నది శక్తి. ద్వి. ప్రభు. 2. 16పా. 1 పం.

3. అకృత్యము, చేయరానిది.

ద్వి. వనజాక్షి నిను నాఁడు వనవహ్నిఁ గూల, ననుమతించిననాకు నవఘళం బెద్ది. ద్వి. హరిశ్చ. ఉ. 262.

జ. అవఘళించు, అవఘళుఁడు.

**అవఘళించు** అ. క్రి. (√అవఘళము — క. అవగడిను.) 1. సరియగు, తుల్యమగు.

సీ. గగనకల్లోలినీ కల్లోలమాలికాహాల్లీసకము లతో నవఘళించి. నైష. 1. 87.

సీ. వారాణసీసంభవం బైనమళకంబు నైరావణముతోడ నవఘళించు. కాశీ. 2. 47.

2. వ్యాపించు, ప్రసరించు.

సీ. కలయంగ నలఁదినకస్తూరి నెత్తావి యష్ట దిక్కులయందు నవఘళింప. కాశీ. 1. 45.

సీ. అలజలంబులు ధాత్రి నవఘళింపకమున్నె క్రేళ్లుబ్బు వారియక్ర్రిపంక, మావంకసంకటం బంకురింపకమున్నె పొడము ననల్పకీర్తి పుండరీక, మవుర...నరస. 5. 102.

స. క్రి. 1. మీఱు, అతిక్రమించు.

సీ. ఆరకూటచ్ఛాయ నవఘళింపఁగఁ జాలు బడుగు దేహంబున భస్మమలఁది. మనుచ. 1. 59.

సీ. తరళలోచనముల ధావళ్యంబులు హరిణుల సౌభాగ్య మవఘళింప. జై. భా. 8. 73.

(ఇటఁ జౌపమ్యవాచకము)

2. అడఁచు.

గీ. వివిధశస్త్రాస్త్రములు వైచి రవఘళించె, శుక్రశిష్యుల ద్రోణశిష్యుండు గెలిచె. హర. 7. 164.

**అవఘళుఁడు** విణ. (√అవఘళము) సమర్థుఁడు, శక్తిమంతుఁడు.

సీ. వేఁడి? పురందరు వేయిమాఱులు దాఁక నాజిలోఁ దఱిమినయవఘళుండు. మై. 3. 141.

**అవఘాతము** సం. వి. అ. పుం. 1. కొట్టుట, తాడనము. 2. దెబ్బ. 3. దంచుట. 4. చంపుట.

**అవఘాతి** సం. విణ. (న్. నీ. న్.) 1. కొట్టువాఁడు. 2. దంపువాఁడు. 3. చంపువాఁడు.

**అవఘుష్టము** సం. విణ. (అ. ఆ. అ.) చాటఁబడినది.

**అవఘూర్ణనము** సం. వి. అ. న. తిరుగుడు, భ్రమణము.

**అవఘూర్ణము** సం. వి. అ. పుం—అవఘూర్ణనము.

**అవఘోటితము** సం. విణ. (అ. ఆ. అ.) చుట్టును కప్పఁబడినది, మఱుఁగుపఱుపఁబడినది.

**అవఘోషణ** సం. వి. ఆ. స్త్రీ—అవఘోషము.

**అవఘోషణము** సం. వి. అ. న—అవఘోషము.

**అవఘోషము** సం. వి. అ. పుం. చాటుట, చాటించుట.

**అవఘ్రాణ(త)ము** సం. విణ. (అ. అ. అ.) ఆఘ్రాణింపఁబడినది, మూర్కొనఁబడినది. వి. అ. న. ఆఘ్రాణించుట, మూర్కొనుట.

**అవచక్షుఁడు** సం. విణ. (అ. అ. అ.) నిందితమగు దానిని చెప్పువాఁడు.

**అవచనము** సం. విణ. (అ. అ. అ.) పలుకకుండునది, మాటాడనిది. వి. అ. న. 1. పలుకకుండుట. 2. నింద.

**అవచనీయము** సం. విణ. (అ. అ. అ) 1. చెప్పఁదగనిది. (అశ్లీలాదికము) 2. నింద్యము కానిది.

**అవచయము** సం. వి. అ. పుం. (పుష్పఫలాదులను) కోయుట, అపచయము.

**అవచాటముగా** క్రి. విణ. క్రమ. అకస్మాత్తుగా.

క. ఖురుఁడగుకంసునిపంపున, నరిగి తృణావర్తుఁ డవని కవచాటముగా, సురకరువలియై బిసబిస, నరు దరు దన మునరి విసరి హరిఁ గొనిపోయెః. భాగ. 10. పూ. 264. (ప్రయోగాంతరములేదు.)

**అవచాయము** సం. వి. అ. పుం. (చేతి కందెడు పుష్పాదులను) కోయుట.

**అవచారణము** సం. వి. అ. న. (వైద్య) క్షారపాకవిధి, క్షారములు వండునొకానొకపద్ధతి.

**అవచితము** సం. విణ. (అ. అ. అ.) 1. కోయఁబడినది (పుష్పాది) 2. ప్రోగుచేయఁబడినది.

**అవచూద(ల)కము** సం. వి. అ. న. చామరము.

**అవచూద(ల)ము** సం. వి. అ. పుం. 1. టెక్కెము క్రిందఁగట్టఁబడినగుడ్డ 2. జెండానుండి అధోముఖముగా వ్రేలాడుకుచ్చు.

**అవచూర్ణనము** సం. వి. అ. న. 1. (గాయము, మొ. వానిపై) పొడి చల్లుట. 2. ఒకానొక రోగము. 3. నూఱుట, చూర్ణము చేయుట.

**అవచూర్ణితము** సం. విణ. (అ. అ. అ.) చూర్ణము చల్లబడినది (వ్రణాది)

**అవచ్ఛదము** సం. వి. అ. పుం. కప్పు, ముసుఁగు.

**అవచ్ఛాదము** సం—అవచ్ఛదము.

**అవచ్ఛిన్నము** సం. విణ. (అ. అ. అ.) 1. ఛేదింపఁబడినది, త్రుంపఁబడినది. 2. వేఱుపఱుపఁబడినది, విడదీయఁబడినది. 3. (తర్క) ఉపాధి, మున్నగువానిచేఁ దక్కినవానినుండి విశేషితమైనది; విశేషణాదులచే ప్రత్యేకింపఁబడినది. 4. మితియేర్పఱుపఁ బడినది, పరిమితముగాఁ జేయఁబడినది. (వ్రీహి ద్రోణావచ్ఛిన్నము = వ్రీహి ద్రోణముకొలతచే అవిచ్ఛిన్నమైనది, ద్రోణముచే కొలఁది యిడఁబడినది.)

**అవచ్ఛురితము** సం.విణ. (అ. అ. అ.) మిశ్రితము, కలిసినది. వి. అ. న. పెద్దనవ్వు, అట్టహాసము.

**అవచ్ఛేదకము** సం. విణ. (అ. దికా. అ.) 1. వేఱుపఱుచునది, ప్రత్యేకించునది. 2. కొలఁది యిడునది, మేర పెట్టునది. 3. అవధారకము, నిర్ణయించునది. 4. వ్యాపించునది. వి. అ. పుం. 1. విశేషణము, విశేషలక్షణము. 2. ఎల్ల, మేర.

**అవచ్ఛేదనము** సం. వి. అ. న. 1. వేఱుపఱుచుట, ప్రత్యేకించుట. 2. కొలఁది యిడుట. 3. నిర్ణయించుట. 4. ఖండించుట.

**అవచ్ఛేదము** సం. వి. అ. పుం. 1. ఛేదనము, త్రుంచుట. 2. మితి యేర్పఱుచుట. 3. హద్దు. 4. వేఱుపాటు. 5. (తర్క) ఉపాధిమొదలగు వానిచే విశేషపఱుచుట, విశేషకరణము. 5. అవధారణము, నిర్ణయించుట. 6, భాగము, అవయవము. 7. విశేషలక్షణము, విశేషణము. 8. వ్యాపించుట, వ్యాప్తి.

**అవచ్ఛేద్యము** సం. విణ. (అ. అ. అ.) 1. వేఱుపఱుపఁ దగినది, ప్రత్యేకింపఁ దగినది. 2. కొలఁది యిడఁదగినది, మేర పెట్టఁ దగినది. 3. నిర్ణయింపఁ దగినది.

**అవజయము** సం. వి. అ. పుం. జయము, గెలుపు.

శ్లో. యేనేంద్ర లోకావజయాయ దృప్తః (ప్రతస్థే). సం. రఘు. 6. 62.

**అవజితి** సం. వి. ఇ. స్త్రీ. విజయము, గెలుపు.

శ్లో...వః,,సుఖసంగినం ప్రతి సుఖావజితిః. సం. కిరా. 6. 48.

**అవజితుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) గెలువఁబడిన వాఁడు, పరాజితుఁడు.

**అవజ్ఞ** సం. వి. ఆ. స్త్రీ. అవమానము.

**అవజ్ఞాతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. అనాదరింపఁబడినది, తిరస్కరింపఁబడినది. 2. అవమానింపఁబడినది.

**అవజ్ఞానము** సం. వి. అ. న. 1. అనాదరము, తిరస్కారము. 2. అవమానము.

**అవజ్ఞేయము** సం. విణ. (అ. ఆ. అ.) 1. అనాదరింపఁదగినది, తిరస్కరింపఁ దగినది. 2. అవమాన పఱుపఁ దగినది.

**అవటకచ్ఛపము** సం. వి. అ. పుం. బొటియలో నున్న తాఁబేలు; (దానివలె) లోకానుభవము లేనివాఁడు.

**అవటము** సం. వి. అ. పుం. 1. రంధ్రము. 2. గొయ్యి. 3. నూయి. 4. (దేహమునందు) కంఠమూలము, చంక మొదలగు పల్లపు భాగము. 5. పక్షిపిల్ల.

**అవటి** సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. రంధ్రము. 2. నూయి.

**అవటీట** సం. వి. అ. స్త్రీ. చప్పిడిముక్కు.

**అవటీటము** సం. వి. అ. న. ముక్కు అణఁగి యుండుట, ముక్కు చప్పిడిగా నుండుట.

**అవటీటుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) చప్పిడి ముక్కు గలవాఁడు.

**అవటుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) ఇంద్రజాలికుఁడు; మాయచే జీవించువాఁడు.

**అవటుజము** సం. వి. అ. పుం. తలకు వెనుకటి భాగమందలి వెంట్రుక. శిశు. 10. 52.

**అవటువు** సం. వి. ఉ. పుం. ఉ. ఊ. స్త్రీ. 1. నేల లోని బొటియ. 2. నూయి. 3. ఒకానొక వృక్షము. 4. దేహమునందలి పల్లపుచోటు (కంఠమూలము, మొ.) 5. పెడతల, తల యొక్క వెనుకటిభాగము; ముచ్చిలిగుంట.

**అవదంశ(గ)ము** సం. వి. అ. పుం. అంగడివీథి, హట్టస్థానము.

**అవడీనము** సం. వి. అ. న. పక్షియొక్క అవరోహణగతి, పక్షి క్రిందికి దిగుట.

**అవడు**—అగడు. విణ.

(నీచము)

ఉ.పాయక యొమ్మునం దవడుఁగాముల మోపను వారికిం బనుల్, సేయను నేమి కారణము సెప్పుము నాకుఁ బయోరుహాననా. భార. ఆది. 2, 48.

**అవణు**—హవణు. వి. పొందు, ఒప్పిదము.

సీ. ముడిఁ బూలుసుట్టి కెంపులబొట్టు సవరించి చెవుల ముత్తెపుఁబువ్వు లవణుపఱచి. రా. వి. 5. 72. (అవణుపఱచు—పొందుపఱచు, అమర్చు.

**అవత్** సం. (శతృ.) రక్షించుచున్న.

**అవతంసము** సం. వి. అ. పుం. న. 1. కర్ణభూషణము, 2. శిరోభూషణము. (ఇది 'పండితావతంసుఁడు' మున్నగు చోట్ల శ్రేష్ఠవాచకముగా నుపయుక్తమగును.)

**అవతంసితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. అవతంసము కలది. 2. అవతంసముగాఁ జేయఁబడినది. (పుష్పాది)

**అవతక్షణము** సం. వి. అ. న. చెక్కుట.

**అవతతము** సం. విణ. (అ. ఆ. అ.) వ్యాప్తము.

**అవతతి** సం. వి. ఇ. స్త్రీ. వ్యాపించుట.

**అవతప్తము** సం. విణ. (అ. ఆ. అ.) 1. తపింపఁ జేయఁబడినది. 2. తపించినది.

**అవతమసము** సం. వి. అ. న. 1. తక్కువచీఁకటి, కనుచీఁకటి. 2. చీఁకటి.

శ్లో. అవతమసభిదాయై భాస్వతః పూర్వగత్వేన. శిశు. 11. 57. (అవతమసము—తిమిరము. మల్లి. వ్యా.)

**అవతరణము** సం. వి. అ. న. 1. (తీరాదులనుండి జలాదులందు) దిగుట. 2. అవతారము, దివ్యజన్మవిశేషము. 3. క్రిందికి దిగుట, వ్రాలుట. 4. దాఁటుట, 5. (నదిమొ. వానియందు దిగుటకై కట్టిన) మెట్టు. 6. రేవు. 7. అవతారిక. 8. భూతాదులు ఆవేశించుట. 9. వస్త్రాంచలము, చెఱఁగు.

**అవతరణి** నం. వి. ఈ. స్త్రీ. 1. పీఠిక, ఉపోద్ఘాతము. 2. పరిపాటి, అనుక్రమము.

**అవతరణిక** నం. వి. అ స్త్రీ.—అవతరణి.

**అవతరము** నం. వి. అ. పుం.—అవతరణము.

శ్లో. నిజశ్రితినేత్రావతరత్వబోధికాం.
నం. నైష. 1. 6. శిశు. 1. 43.

**అవతరించే** నం. అ. క్రి. 1. దేవతలు మనుష్యాద్యాకారములతో పుట్టు; పుట్టు.
మార్క. 2. 203.
2. దిగు.
వ. ...వాహనంబు నవతరించి కక్ష్యాంతరంబులు గడచి...ఉ. హరి. 1. 53.
(వాహనంబును—వాహనమునుండి)

**అవతరిలు(ల్లు)**—అవతరించే.
(పుట్టు)
తే. అతఁ డనూచానసంతతి నవతరిలియు.
పాండు. 9. 8.
వ ...వారలు సప్తర్షులై యవతరిల్లిరి.
మార్క. 5. 104.

**అవతల**—ఆతల. వి. వి. (అవలి+తల)
(అవతలికి, అవతలివారు, మొ.)
1. తదనంతర ప్రదేశము; ఆవలియొడ్డు.
సీ. ...తనరును శారి మద్దరి యవతల, యాతల యావల యవ్వల యవలన. ఆం భా. 1. 155.
2. తదనంతర కాలము.

**అవతాడనము** నం. వి. అ. న. కొట్టుట.

**అవతారణము** నం. వి. అ. న. 1. దింపుట. 2. భూతాదులను ఆవేశింపఁ జేయుట. 3. గ్రంథప్రస్తాపన, ఉపోద్ఘాతము.

**అవతారము** నం. వి. అ. పుం. 1. దిగుట 2. దేవతలు మనుష్యాద్యాకారములతో పుట్టుట. 3. దేవత లవతరించినపుడు తాల్చిన రూపము. 4. ప్రాదుర్భవించుట ('వసంతావతారసమయే' శాకుం, 1. 'యౌవనావతారే' కాదం.)
5. దిగుచోటు, రేవు. 6. కోనేలు, మొ. 7. గ్రంథాదులయవతారిక. 8. (నది, మొ.) దాఁటుట. 9. ప్రవేశము.

'పాషండపథావతారః' నం. దశకు.

**అవతారి** నం. విశ. (న్. ఈ. న్.) అవతరించువాఁడు.

**అవతారించే** నం. అ. క్రి.—అవతరించే.
దేవతలు మనుష్యాద్యాకారములతో పుట్టు.)
మ. వివిధాభిఖ్యల నొప్పు బ్రహ్మ మతఁ డుర్విన్ రంగధామాఖ్యమై, యవతారించె దదంఘ్రిమూలములు నీ కౌఁగాక యాధారముల్.
శ్రీరం. మా. 10. 103.

**అవతారిక** నం. వి. అ. స్త్రీ. గ్రంథాదిని రచింపఁబడు ప్రస్తావము, అవతరణిక,

**అవతారితము** నం. విశ. (అ. ఆ. అ.) దింపఁబడినది.

**అవతీర్ణము** నం. విశ. (అ. ఆ. అ.) 1. దిగినది. 2. ప్రవేశించినది. 3. అవతరించినది. (దేవతాదికము.) 4. దాఁటి వెళ్లినది. 5. దాఁటఁబడినది.

**అవతోక** నం. వి. అ. స్త్రీ. 1. గర్భస్రావము నొందిన స్త్రీ. 2. ఈచుకపోయినయావు.

**అవత్తము** నం. విశ, (అ. ఆ. అ.) 1. ఖండింపఁబడినది. 2. ఈయఁబడినది.

**అవత్రస్తము** నం. విశ. (అ. ఆ. అ.) భయపడినది.

**అవద** విశ (నం. అవద్యం.) నింద్యము; చెడ్డది, దుష్టము. (చూ. అవదగాకి.)

**అవదంశము** నం. వి. అ. పుం. ఊరుఁగాయ, నంజుకొనెడువస్తువు.

**అవదగాకి** విశ. (అవద + కాకి.) పలుగాకి, దుష్టుఁడు.
క. ...ఏమ,య్య నరేంద్ర కన్నులారం, గనుఁగొంటివె వీనియవదగాకితనంబుల్. కువల. 2. 77.
వ. అని రోషపరుషవచనంబులం గినియుచు గృహంబునకుం గొనిపోయి యయ్యవదగాకిఱంకుటాలిం గాలం గేలం. బొడిచి. వేం. పంచ. 1. 254
చ...అయ్యవదగాకి మునుం గెడలింప కూర్చిత, తుర మొకటిచ్చె గాజురొద సూక్ష్మతరార్తగవంబు గప్పఁగఁ. వేం. పంచ. 1. 269.

**అవదత్తము** నం. విశ. (అ. ఆ. అ.) ఈయఁబడినది.

**అవదరణము** నం. వి. అ. న. (కుఱువు, మొ) పగులుట.

**అవదాఘము** నం. వి. అ. పుం. 1. వేఁడిమి. 2 నిదాఘము, వేసవి.

**అవదాతము** నం. విశ. (అ. ఆ. అ.) 1. మనోజ్ఞము, ఇంపయినది. 2. తెల్లనిది. 3. పసుపుపచ్చనిది. 4. దోషరహితము. 5. ఖండింపఁబడినది. వి. అ. పుం. 1. తెల్లన. 2. పసుపుపచ్చన.

**అవదానము** నం. వి. అ. న. 1. అపదానము, ప్రశస్తమైన పూర్వకృత్యము. 2. శూరకృత్యము. 3. ఖండనము. 4. ఖండము, ముక్క. (హృదయాద్యవదానానాం-శారీరభాష్యము) 5. శుద్ధిచేయుట, 6. వట్టివేరు.

**అవదాయము** మి. వి. (జూదమందలి) తప్పుడాట. (చి ని.)

సీ. పలుకదు రోషించి పడనిపాసికలతో నవదాయమైనను నాడుఁగాని ఉ. హరి. 3. 124.

**అవదారణము** నం. వి. అ న. 1. చీల్చుట. 2. గడ్డపాఱ. 3. గుద్దలి.

**అవదారితము** నం. విశ. (అ. ఆ. అ.) చీల్పఁబడినది.

**అవదాహము** నం. వి. అ. న—తాపమును పోఁగొట్టునది-వట్టివేరు. ('అవదాహేష్టకాపథే' అని అమరము. ఇట—'అవదాహేష్టము + కాపథము' అనికొందఱు.) పుం. 1. వేఁడిమి 2. కాల్చివేయుట.

**అవదీర్ణము** నం. విశ. (అ. ఆ. అ.) 1. చీల్పఁబడినది, పగులఁగొట్టఁబడినది. 2. కరఁగింపఁబడినది. 3 కలఁత పెట్టఁబడినది. (భయావదీర్ణః. సం. భార.)

**అవదోహము** నం. వి. అ. పుం. 1, పాలుపితుకుట. 2. పాలు, క్షీరము.

**అవద్యము** నం. విశ. (అ. ఆ. అ.) 1. నిందింపఁదగినది. 2. అధమము.

**అవద్యోతనము** నం. వి. అ. న. 1. ప్రకాశించుట. 2. ప్రకాశింపఁజేయుట; స్పష్టపఱుచుట. 3. కాంతి.

**అవద్యోతి** నం. విశ. (న్. నీ. న్.) 1. ప్రకాశించువాఁడు. 2. ప్రకాశింపఁజేయువాఁడు; స్పష్టపఱుచువాఁడు.

**అవధరించు** నం. అ. క్రి. సావధానుఁడగు, శ్రద్ధవహించి యుండు.

క. సర్వేశ్వరు వినిపించెద. సర్వము విన నవధరింపు. దశా. 2. 81.

స. క్రి. 1 చిత్తగించు, దయతోవిను.

వ. ఏమన నెంతవారు మవధరింపుము. మార్క. 1. 87.

2. తలఁచు.

వ. కన్యకం బిత్రుపరాధీన నగుట దేవర చిత్తంబున నవధరింప వలయు. హర. 4. 87.

3. ధరించు, తాల్చు.

సీ. నవపింఛమయభూష లవధరించి నటించు... మనుచ. 3. 19.

4. ఒనర్చుకొను, చేసికొను.

గీ. అనుదినంబును దలఁగడు గవధరించు. శుక. 2. 434.

5. (గ్రంథాదులు) రచించు.

గీ. బాలసఖుఁడవు శైవప్రబంధ మొకటి, యవధరింపుము నాపేర నంకితముగ. హర. పీఠ. 12.

**అవధాతవ్యము** నం. విశ. (అ. ఆ. అ.) శ్రద్ధతో గ్రహింపఁదగినది.

**అవధానము** నం. వి. అ. న. మనస్సు ఇతరవిషయములనుండి మరలి యొక విషయముపై నిలిచి యుండుట, ఎచ్చరిక, ఏకాగ్రత. (ఉదా: సావధానము, శతావధానము, మొ.)

**అవధాని** నం. విశ (న్. నీ. న్.) అవధానము కలవాఁడు.

**అవధానీయము** నం—అవధాతవ్యము.

**అవధాయకుఁడు** నం. విశ. (అ. యికా. అ.) ఏక విషయమునందే మనస్సు నిలుపువాఁడు.

**అవధారకము** నం. విశ. (అ. రికా. అ.) నిర్ణయించునది.

**అవధారణ** నం. వి. ఆ. స్త్రీ—అవధారణము.

**అవధారణము** సం. వి. అ. న. నిర్ణయము, నిశ్చయించుట.

**అవధారణీయము** సం. విణ. (అ. ఆ. అ.) 1. అవధారణము చేయుటకు యోగ్యమయినది. 2. అవధారణము చేయుటకు శక్యమయినది.

**అవధారము** సం. వి. అ. పుం. నిశ్చయము.

**అవధారితము** సం. విణ. (అ. ఆ. అ.) నిర్ణయింపఁబడినది.

**అవధారు** అవ్య. (సం. అవధారయ. క. అవధారు.) అవధరింపుము, వినుము. (హెచ్చరించుటను దెలుపును.

సీ. అవధారు దేవ మధ్యాహ్నసంధ్యావేళ దిన యౌవనంబు దోఁతెంచె నిపుడు. నైష. 8. 91, 3. 120. ఉ. రా. 5. 282.

చ. ..మ్రొక్కులిడి స్వామి పరా కవధారు దేవ హెచ్చరిక యటంచు... దశా. 1. 233.

**అవధార్యము** సం.—అవధారణీయము.

**అవధి** సం. వి. ఇ. పుం. 1. అవధానము, చిత్తైకాగ్రత. 2. (దేశకాలములందు) మేర, హద్దు. (మఱియు పూర్వసీమయందును పరసీమయందును—అనగా 'మొదలుకొని, వఱకు' అను నర్థములందు—వర్తించును.)

శ్లో. గ్రాసావధి విమోక్షాంతం – గ్రాసకాలం సమారభ్య జపేన్మోక్షావధి ప్రియే.

3. కాలము. 4. బిలము. 5. శ్రమము, కష్టము. (ఈ యర్థము ఆంధ్ర ద్రావిడ కర్ణాటక భాషలయందే కలదు—(చూ. అవధిఁబెట్టు.)

**అవధిఁబెట్టు** స. క్రి. శ్రమపెట్టు, చిక్కుపెట్టు, ఆయాసపెట్టు.

మ. ...మందంచు మ్రానెల్లఁ దేనవధింబెట్టిన సత్యపీవు...ఆము. 5. 74.

**అవధిఁబోవు** అ. క్రి. 1. కష్టపడు, శ్రమపడు.

ఆ. తండ్రి నీవు నాకు దయతోడ నిచ్చిన వరము చిత్తగించి వలయు తెఱఁగు. సమయసముచితముగ సమకట్టుమయ్య యీ, రాకుమారు లవధిఁబోక యుండ. భార. విరా. 1. 181.

(భా.ల.వ్యా. పాఠము-అవిధి అనిముద్రితము)

2. నశించు, చచ్చు.

గీ. అకట ప్రద్యుమ్నుఁ డాకంగి నవధిఁబోయె, నదయుఁడై నవిధాతచే ననురచెయిది, నమపమాకారుఁ డవికారుఁ డట్టివట్టి, బ్రదికెనే నింతకును నింతబంటు గాఁడె. హరి. ఉ. 3. 203.

3. వ్యర్థమగు.

సీ. కలయంగ నడవిలోఁగాచిన వెన్నెలపై చారుహాసంబు లవధిఁబోవ,... గీ. సిగ్గువోయిరి యచ్చర చెలువ లెల్ల. నృసిం. 2. 90.

**అవధీరణి** సం. వి. ఇ. స్త్రీ.—అవధీరణము.

**అవధీరణము** సం. వి. అ. న. అనాదరము, తిరస్కారము.

**అవధీరి** సం. విణ. (న్. ఈ. న్.) పాటింపనిది, అనాదరము చూపునది.

**అవధీరితము** సం. విణ. (అ. ఆ. అ.) తిరస్కరింపఁబడినది, ఆదరింపఁబడనిది.

**అవధూకుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) భార్య లేనివాఁడు.

**అవధూతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. కదల్పఁబడినది. 2. ఎగురఁగొట్టఁబడినది. 3. నశింపఁజేయఁబడినది.

**అవధూతుఁడు** సం. వి. అ. పుం. కేవల బ్రహ్మనిష్ఠతో వర్ణాశ్రమాదులను విడిచినసన్యాసి. (అవధూత—అనివాడుక.)

**అవధూననము** సం. వి. అ. న. 1. కదల్చుట; ఊడించుట. 2. ఒకవిధమైన చికిత్స. (సుశ్రుతము.)

**అవధూపితము** సం. విణ. (అ. ఆ. అ.) ధూపద్రవ్యములచే పరిమళింపఁ జేయఁబడినది.

**అవధూల(ళ)నము** సం. వి. అ. న. కుఱుపుపై రసి యినుకుటకై పొడి చల్లుట.

**అవధృతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. నిశ్చయింపఁబడినది. 2. వినఁబడినది. 3 ధరింపఁబడినది.

**అవధేయము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఉంపఁదగినది, స్థాపింపఁదగినది. 2. శ్రద్ధయుంపఁదగినది. 3. తెలిసికొనఁ దగినది. వి. అ. న. అవధానము, శ్రద్ధ.

**అవధ్యము** సం. విణ. (అ. ఆ. అ.) వధింపరానిది.

**అవధ్వంసము** సం. వి. అ. పుం. (ద్రవణాదులపై) పొడి చల్లుట. 2. వదలిపెట్టుట. 3. నిందనము, దూఱుట. 4. నాశము.

**అవధ్వస్తము** సం. విణ. (అ. అ. అ.) 1. నశించినది. 2. పొడిచల్లఁబడినది (ద్రవణాది.), 3. విడువఁబడినది. 4. నిందింపఁబడినది.

**అవనతము** సం. విణ. (అ. అ. అ.) 1. అధోముఖమైనది, వంగినది. 2. అణఁగినది. 3. ప్రణతము, మ్రొక్కినది.

**అవనతి** సం. వి. ఇ. స్త్రీ. 1. వంగుట, (సూర్యచంద్రాదులు) వ్రాలుట. 2. అడఁకువ. 3. ప్రణామము, మ్రొక్కు.

**అవనద్ధము** సం. విణ. (అ. అ. అ.) 1. ఖచితము, చెక్కఁబడినది.

శ్లో. ...వలయావనద్ధ, తామ్రమాశ్మరశ్మిచ్ఛురితైర్నఖాగ్రైః. శిశు. 3. 7.

2. కూర్పఁబడినది, గ్రువ్వఁబడినది.

శ్లో. స్రగవనద్ధమనోరమపల్లవాః. శిశు. 6. 53.

3. వేష్టితము. చుట్టఁబడినది.

'తాంబూలీలతావనద్ధపూగఖండమండితైః.' కాదం.

6. కప్పఁబడినది.

శ్లో. చర్మావనద్ధం (శరీరము). మను. 6. 76.

వి. అ. న. (చర్మముతో మూసిన) మృదంగాది వాద్యము, ఆనద్ధము.

**అవనము** సం. విణ. (అ. అ. అ.) కాపాడునది, రక్షకము. వి. అ. న. 1. రక్షణము, కాపాడుట. 2. తృప్తిపఱచుట. 3. తృప్తి. 4. ఇచ్ఛ, కోరిక.

**అవనమ్రము** సం.—అవనతము.

**అవనయనము** సం. వి. అ. న. పడఁద్రోయుట.

**అవనయము** సం. వి. అ. పుం.—అవనయనము.

**అవనాట** సం. - అవటీట.

**అవనాటము** సం- - అవటీటము.

**అవనాటుఁడు** సం. - అవటీటుఁడు.

**అవనామకము** సం. విణ. (అ. మికా. అ.) వంచునది; అణఁచునది.

**అవనామము** సం. వి. అ. పుం. 1. అవనతి, వంగుట. 2. వంగి నమస్కరించుట. 3. వంచుట.

**అవనామి** సం. విణ. (న్. నీ. న్.) 1. వంగువాఁడు, 2. నమస్కరించువాఁడు.

**అవనాయకము** సం. విణ. (అ. యికా. అ.) క్రిందఁబడఁద్రోయునది.

**అవనాయము** మి. వి. అన్యాయము. (చి. ని.)

**అవనాయము** సం.—అవనయము.

**అవనాహము** సం. వి. అ. పుం. (చర్మాదులతో) కట్టుట, మూయుట.

**అవని** సం. వి. ఇ, ఈ. స్త్రీ. భూమి, నేల.

**అవనిక్తము** సం. విణ. (అ. అ. అ.) 1, క్షాళితము కడుగఁబడినది. 2. పరిశుద్ధి చేయఁబడినది.

**అవని(నీ)ధరము** సం. వి. అ. పుం. పర్వతము.

**అవని(నీ)ధ్రము** సం. వి. అ. పుం. పర్వతము.

**అవని(నీ)పతి** సం. వి. ఇ. పుం. రాజు.

**అవని(నీ)రుహము** సం. వి. హ్. అ. పుం. చెట్టు.

**అవనీయము** సం.విణ. (అ. అ. అ.) రక్షింపఁదగినది.

**అవనేజనము** సం. వి. అ. న. 1. కడుగుట, ప్రక్షాలనము. 2. శ్రాద్ధమందు పిండదానమునకై కుశలుపఱచి వానిని జలముతో తడుపుటయను సంస్కారము.

**అవపతనము** సం. వి. అ. న. 1. దిగుట. 2. క్రిందఁబడుట.

**అవపన్నము** సం. విణ. (అ. అ. అ.) 1. (కేశకీటాది) సంపర్కముచే దూషితము (అన్నాది). 2. పడినది. 3. దిగినది, వ్రాలినది.

**అవపాటిక** సం. వి. ఆ. స్త్రీ. లింగరోగవిశేషము. (ఇందు పురుషునిగుహ్యాగ్రము చివరపగులును.)

**అవపాడి** — అపపాడి.

క. అధికారిచయముఁ దత్త్వద్విధముల నవపాడి
చేసి వివిధధనంబుల్, వృథగతి వాకొక్క
వెరపున, నధిపతికిం జెప్ప కంతకంతకుఁ
జెఱిచెన్. దశకు. 11, 116.

**అవపాతనము** సం. వి. అ. న. క్రిందఁ బడఁద్రోయుట, నేలఁ గూల్చుట.

**అవపాతము** సం. వి. అ. పుం. 1. క్రిందఁ బడుట, అధఃపతనము. 2. పడఁద్రోయుట, పాతనము. 3. దిగుట. 4. పైఁబడుట. (ఉదా:-శస్త్రావపాతము) 5. పక్షితటాలున వ్రాలుట. 6. పల్లము, గోయి. 7. ఓదము, ఏనుఁగులోనగు వానిని బట్టునపు డవి పడుటకై త్రవ్వి మీఁద తేలికైన కఱ్ఱలను కంపలను పలుచగాకప్పియా పైని కొంచెము మట్టి పఱచి నేలమట్టముగాఁ జేసినపల్లము.

**అవపాత్రితుఁడు** సం.—అపపాత్రితుఁడు

**అవపాత్రుఁడు** సం. - అపపాత్రుఁడు.

**అవపాశితము** సం. విశే. (అ. ఆ. అ.) చుట్టును పాశము (త్రాడు) కలదిగాఁ జేయఁబడినది, త్రాటిచేఁ గట్టఁబడినది.

**అవపీడన** సం. వి. ఆ. స్త్రీ.—అవపీడనము.

**అవపీడనము** సం. వి. అ. న. 1. నలుపుట. 2. పిండుట. 3. బాధించుట. 4. (వైద్య) తుమ్మును పుట్టించుమందు- నస్యవిశేషము.

**అవపీడము** సం. వి. అ. పుం. 1. బాగుగానలుపుట. 1. నాసికాచికిత్సాభేదము. 3. తుమ్మును కలిగించుమందు.

**అవపూర్ణము** సం. విశే. (అ. ఆ. అ.) నిండినది.

**అవబంధము** సం. వి. అ. పుం. 1. కనుఱెప్పలకుఁ గలుగునొకదెపులు. 2 నలుగడల బంధించుట.

**అవబాధ** సం. వి. ఆ. స్త్రీ. 1. మిక్కిలిబాధ. 2. ప్రతిబంధము, అడ్డపాటు.

**అవబాహుకము** సం. వి. అ. పుం. మూఁపునందుఁ గలుగు నొక వాయురోగము.

**అవబుద్ధము** సం. విశే. (అ. ఆ. అ) 1. తెలియఁబడినది, జాతము. 2. ఎఱిఁగినది; తెలిసినది.

**అవబోధకుఁడు** సం. విశే. (అ. ధికా. అ.) 1. తెలుపునట్టివాఁడు, బోధించువాఁడు. 2. మేలుకొలుపువాఁడు. వి. అ. పుం. 1. సూర్యుఁడు. 2. రాజులను మేలుకొలుపు స్తుతి పాఠకుఁడు. 3. ఉపాధ్యాయుఁడు, గురువు.

**అవబోధనము** సం. వి. అ. న. —అవబోధము.

**అవబోధము** సం. వి. అ. పుం. 1. మేలుకొని యుండుట, జాగరణము. 2. తెలివి, వివేకము. 3. బోధించుట, తెలుపుట. 4. మేలుకొనుట.

**అవభంగము** సం. వి. అ. పుం. 1. విఱుచుట; చెఱుపుట.

శ్లో. మానావభంగనిపుణం త్వ మమోఘశస్త్రం. విక్రమో. 4. 14.

2. విఱుగుట; చెడుట.

**అవభంజనము** సం. వి. అ. న. 1. విఱుచుట, చీల్చుట. 2. చెఱుపుట.

**అవభాషణము** సం. వి. అ. న. 1. మాటాడుట. 2. చెప్పుట, కథనము.

**అవభాసకము** సం. విశే. (అ. సికా. అ.) 1. వెలిఁగించునది, ప్రకాశకము. 2. తోఁపించునది, స్ఫురింపఁ జేయునది. వి. అ. న. పరమాత్మ.

**అవభాసము** సం. వి. అ. పుం. 1 జ్ఞానము, తెలివి. 2. ప్రకాశము, వెలుఁగు. 3. సాక్షాత్కారము, ప్రత్యక్షమగుట. 4. మిథ్యాజ్ఞానము, ఒకటి మఱియొక రూపమునఁ దోఁచుట.

**అవభాసి** సం. విశే. (న్. సీ. న్.) ప్రకాశించువాఁడు.

**అవభాసితము** సం. విశే. (అ. ఆ. అ.) 1. ప్రకాశింపఁజేయఁబడినది. 2. స్పష్టపఱుపఁబడినది, తెలుపఁబడినది.

**అవభుగ్నము** సం. విశే. (అ. ఆ. అ.) 1. వంగినది, వంకరయైనది. 2. ముడిఁగినది.

**అవభృథము** సం. వి. అ. పుం. 1. యజ్ఞముకడపట న్యూనాతిరిక్తదోషపరిహారార్థము చేయు కర్మము. 2. యజ్ఞమున కంగమై దానికడపటఁ జేయఁబడుస్నానము. 3. యజ్ఞసమాప్తియందు యాజకుఁడును యజ్ఞపరికరములును స్నానముచేత నొందుశుద్ధి.

**అవభ్రటు** సం—అవటీట.

**అవభ్రటము** సం—అవటీటము.

**అవభ్రటుఁడు** సం—అవటీటుఁడు.

**అవమంత** సం. విశే. (ఋ. త్రీ. ఋ.) అవమాని.

**అవమంతవ్యుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) అవమానింపఁదగినవాఁడు.

**అవమంథము** సం. వి. అ. పుం. (వైద్య) లింగరోగభేదము

**అవమతము** సం. విణ. (అ. ఆ. అ.) అవమానింపఁబడినది, తిరస్కృతము.

**అవమతి** సం. వి. ఇ. స్త్రీ. అవమానము, తిరస్కారము, అనాదరము.

**అవమతించు** సం. స. క్రి. అవమానపఱుచు.
గీ.... అసురుల నవమతింప, సురల కమృతంబు నొప్పింప... హర. 6. 98.

**అవమము** సం. విణ. (అ. ఆ. అ.) 1. అధమము, తక్కువది. 2. మూఁడు తిథులు కలిసినది, తిథిత్రయస్పర్శము కలది (దినము).

**అవమర్దనము** సం. విణ. (అ. ఆ. అ.) 1. పిసికెడు నది. 2. నలఁగఁగొట్టునది. వి. అ. న 1. పిసుకుట, ఒత్తుట. (హస్తపాదావమర్దనం. సం. పంచ. 1.) 2. బాధ, పీడ.

**అవమర్దము** సం. వి. అ. పుం. 1. నలఁగఁగొట్టుట. 2. ఒత్తుడు గలిగించుట. 3. శత్రురాష్ట్రమునకుఁ గలిగించు రాయిడి; రాయిడి. 4. చంపుట. ఉ. చ. 5. 8.

**అవమర్యాద** సం—అమర్యాద.

**అవమర్శము** సం. వి. అ. పుం. 1. స్పర్శము. 2. విమర్శము, ఆలోచన. 3. నాటకమున పంచసంధులలో నొకటి.

**అవమానన** సం. వి. ఆ. స్త్రీ—అవమాననము.

**అవమాననము** సం. వి. అ. న. అవమానము చేయుట, తిరస్కరించుట.

**అవమాననీయుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) అవమానింపఁ దగినవాఁడు.

**అవమానపడు** అ. క్రి. (√అవమానము) అవమానము నొందు. (చూ. అవమానపాటు.)

**అవమానపాటు** వి. (అవమానపడు) అవమానపడుట, భార. ఉద్యో. 4. 257.

**అవమానపెట్టు** స. క్రి. (అవమానము) అవమానించు.
సీ.... సాధ్వి పాంచాలి నాట్యజనములు గనుఁగొన సభలోన నవమానపెట్టినతులువ ... భార. స్వ. 5.

**అవమానము** సం. వి. అ. పుం. అగౌరవము, అనాదరము.

**అవమాని** సం. విణ. (న్. నీ. న్.) అవమానించువాఁడు.

**అవమానించు** సం. స. క్రి. అవమానపఱుచు.
వ. అగ్రజు నవమానించువాఁడు క్రౌంచయోని జాతుం డగు... మార్క. 2. 115.

**అవమానితము** సం. విణ. (అ. ఆ. అ.) అవమానింపఁబడినది.

**అవమాన్యుఁడు** సం—అవమంతవ్యుఁడు.

**అవమార్జనము** సం. వి. అ. న. 1. ప్రక్షాళనము, కడుగుట. 2. కడుగుటకైన జలాదికము.

**అవమూర్ధుఁడు** సం. విణ. (న్. న్. ఆ. ర్ధ్నీ, న్.) -వంగినతల గలవాఁడు-తల వంచుకొనినవాఁడు.

**అవమోచనము** సం. వి. అ. న. విడుదల, విమోచనము.

**అవయము** విణ. అనువైనది, ఉచితము.
సీ. శృంగార రాజ్యలక్ష్మికి ...గీ.... పొలఁతులొండు, లవయవంబుల కన్నింటి కవయమైన, పసదన బులు నూల్కొల్పి భావమెలఁగఁ, జేసెి ... కు. స. 9. 212.
(ప్రయోగాంతరము మృగ్యము)

**అవయవము** సం. వి. అ. పుం. 1. అంగము (దేహము యొక్క కరచరణాది). 2. సముదాయము యొక్క ఏకదేశము, మొత్తములోని యొకభాగము. 3. (తర్క) అనుమితికి సాధనమైన పంచవాక్యములలో నొకటి. (అవయవములు-ప్రతిజ్ఞ, హేతువు, ఉదాహరణము, ఉపనయము, నిగమనము-అని అయిదు విధములు,) 4. సాధనము, ఉపకరణము. 5. ఒకానొక తర్కగ్రంథము.

**అవయవార్థము** సం. వి. అ. పుం. వ్యుత్పత్త్యర్థము.

**అవయవి** సం. విణ. (న్. నీ. న్.) అవయవములు గలది.

**అవర** సం. వి. ఆ. స్త్రీ. పశ్చిమదిక్కు.

**అవరజ** సం. వి. ఆ. స్త్రీ. 1. చెల్లెలు. 2. శూద్రస్త్రీ.

**అవరజుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) 1. పిన్నవాఁడు, వెనుకఁ బుట్టినవాఁడు. 2. తక్కువపుట్టుకవాఁడు, తక్కువవాఁడు. వి. అ. పుం. 1. తమ్ముఁడు, అనుజుఁడు. 2. శూద్రుఁడు.

**అవరతము** సం. విణ. (అ. ఆ. అ.) ఆఁగినది, ఉడిగినది.

**అవరతి** సం. వి. ఇ. స్త్రీ. 1. విరామము. 2. నివృత్తి.

**అవరము** సం. విణ. (అ. ఆ. అ) 1. చిన్నది. 2. (దేశమందును కాలమందును) పిమ్మటిది. 3. (సంఖ్యయందుఁగాని పరిమితియందుఁగాని) తక్కువైనది, న్యూనము. 4. అధమము, నీచము. (వ్యతి. ఉత్తమము.) 5. కడపటిది, చరమము. (వ్యతి. ప్రథమము.) 6. పడమటిది. 7. అత్యంత శ్రేష్ఠము, మిక్కిలి మంచిది. వి. అ. న. ఏనుఁగువెనుక పాదము, అపరము.

**అవరవర్ణుఁడు** సం. వి. అ. పుం. శూద్రుఁడు.

**అవరార్ధ్యము** సం. విణ. (అ. ఆ. అ.) న్యూనము, అల్పము.

**అవరీణము** సం. విణ. (అ. ఆ. అ.) తిరస్కరింపఁబడినది, ధిక్కరింపఁబడినది.

**అవరుగ్ణము** సం. విణ. (అ. ఆ. అ.) 1. విఱుపఁబడినది. 2. తెవులుగొంటు.

**అవరుద్ధము** సం. విణ. (అ. ఆ. అ.) 1. అడ్డగింపఁబడినది. 2. చెఱయందుంపఁబడినది. 3. ప్రచ్ఛన్నము, మాఱువేషము వేసికొనినది.

**అవరుద్ధి** సం వి. ఇ. స్త్రీ. 1. ముట్టడించుట. 2. అడ్డగింత.

**అవరూఢము** సం. విణ. (అ. ఆ. అ.) 1. దిగినది. 2. పెల్లగింపఁబడినది.

**అవరూపము** సం. విణ. (అ. ఆ. అ.) రూపు చెడినది.

**అవరోచకము** సం. వి. అ. పుం. జఠరాగ్ని దీపనములేమి, ఆఁకలిలేమి, అజీర్ణరోగము.

**అవరోధకము** సం. వి. అ. న. కంచె.

**అవరోధకుఁడు** సం. విణ. (అ. ధికా. అ.) 1. అడ్డుపెట్టువాఁడు 2. ముట్టడించువాఁడు. వి. అ. పుం. కావలివాఁడు.

**అవరోధనము** సం. వి. అ. న. 1. అడ్డపెట్టుట, నిరోధము. 2. ప్రతిబంధము, విఘ్నము. 3. ముట్టడించుట. 4. రహస్యస్థలము, అంతఃపురము. 5. అంతఃపురస్త్రీ, రాణి.

**అవరోధము** సం. వి. అ. పుం. 1. నిరోధము. అడ్డగింత. 2. అంతఃపురము, 3. అంతఃపురస్త్రీజనము. 4. ముట్టడి. 5. చెఱ, బందె.

**అవరోధాయనము** సం. వి. అ. న. అంతఃపురము.

**అవరోధి** సం. విణ. (న్. నీ. న్.) 1. అడ్డగించువాఁడు. 2. ముట్టడించువాఁడు.

**అవరోధించు** సం. స. క్రి. 1. నిరోధించు, అడ్డగించు
మ. అవరోధించెను వింధ్యభూధరము బ్రధ్నాధ్వంబు... కాశీ. 1. 118.
2. ముట్టడించు.
వ. ...ధార్తరాష్ట్రు లనేకనృపకుమార సహితులై పాంచాలుపురం బవరోధించిన... భార. అది. 6. 69.
మ. అవధారయ్య దశాననుండు సబలుండై నేఁడు నాపట్టణం, బవరోధించినవాఁడు తమ్ముఁడును దోడైనాఁడు ... ఉ. రా. 4. 282.

**అవరోధిక** సం. వి. అ. స్త్రీ. అంతఃపురస్త్రీ.

**అవరోధికుఁడు** సం. వి. అ. పుం. అంతఃపురపు కావలివాఁడు, కంచుకి.

**అవరోపణము** సం. వి. అ. న. 1. దింపుట. 2. తగ్గించుట. 3. పెల్లగించుట, ఉత్పాటనము.

**అవరోపితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. పెల్లగింపఁబడినది, ఉత్పాటితము. 2. తగ్గింపఁబడినది.
శ్లో. ఇతరేష్వాగమాద్ధర్మః పాదశస్త్వవరోపితః, చౌరికానృతమాయాభిర్ధర్మశ్చాపైతిపాదశః మను. 1, 82.
3. దింపబడినది.

**అవరోహణము** సం. వి. అ. న దిగుట, అవతరణము

**అవరోహము** సం. వి. అ. పుం. దిగుట, అవతరణము; స్వరాదికము దిగుట. 2. చెట్టును అల్లుకొని మొదటనుండి చివరకు ప్రాఁకుతీఁగ. (తిప్పతీఁగ. మొ.) 3. మఱ్ఱిలోనగువాని యూడ. 4. స్వర్గము. (పుణ్యపురుషులు దీని నుండి భోగావసానమున దిగుదురు.)

**అవరోహశాఖి** సం. వి. న్. పుం. మఱ్ఱి (వృ.వి.).

**అవరోహి** సం. విణ. (న్. నీ. న్.) దిగునది. వి. న్. పుం. మఱ్ఱి (వృ.వి.).

**అవరోహిక** సం. వి. ఆ. స్త్రీ. అశ్వగంధ, పెన్నేరు (వృ. వి.).

**అవరోహిణి** సం. వి. ఈ. స్త్రీ. (జ్యోతి) ఉచ్చ భాగమునుండి భ్రష్టమైన గ్రహముయొక్క దశ.

**అవర్ణము** సం. విశ. (అ. ఆ. అ.) వర్ణము లేనిది. వి. అ. పుం. 1. అపవాదము, నింద, 2. 'అ' యనెడి అక్షరము.

**అవర్తనము** సం. విశ. (అ. ఆ. అ.) జీవనాధారము లేనిది. వి. అ. న. 1. జీవనాధారము లేమి. 2. ఉనికిలేమి, అభావము.

**అవల**—అవల. వి.

(దేశమునందు అనంతరము)

గీ. అరిగి రవలకుఁ జతురంతయానధరులు. నైష. 5. 87.

వి. (కాలమునందు అనంతరము)

క. విని నవ్వుచు రాముఁ డవల వింశతిభుజుఁ డున్, ధనవిభుఁడును బోరినవిధ, మనఘా వినవలతు...ఉ. రా. 2. 382.

(వేఱుచోటు, ఇతరస్థలము)

క. నవలా నవలావణ్యాం, బవల నిఁకేచెలికిఁ గలదె యభినుతి సేయన్. ఇందు. 5. 111.

విశ. (అవతలిది, అన్యము, ఇతరము)

చ. ...భూమి కొంతవలికి నిచ్చుచుంట. ... ఆము. 4. 248. (అవలికి-ఆవలివానికి.)

సీ. ఒక్కయంగమె మున్ను చిక్కలో భావించి యది దృఢం బగుటయు నవలియంగ,కము ...ఆము. 3. 86.

అవలఁజను—దూరమగు; నశించు.

(గోపోషణమున తపోనిష్ఠ తగ్గినమునివర్ణనము) (గోవునకు) సీ. సడలంగ మెడరజ్జు గడు వడి నిడుతమి నతసూత్రావృత్తి యవలఁజనియె. పాండు 5. 288.

**అవలంబకుఁడు** సం. విశ. (అ. లికా. అ.) అవలంబించువాఁడు.

**అవలంబనము** సం. వి. అ. న. 1. చేపట్టుట. 2. ఊఁత, పట్టు (దండాది.) 3. ఆశ్రయము, ప్రాపు.

**అవలంబనీయము** సం. — అవలంబితవ్యము.

**అవలంబమానము** సం. విశ. (అ. ఆ. అ.) అవలంబించు చున్నది.

**అవలంబము** సం. వి. అ. పుం. 1. వ్రేలుట. 2. ఆశ్రయము, ప్రాపు. 3. పట్టు, ఊఁత (దండాది.). 4. ఆశ్రయణము సాహాయ్యము.

**అవలంబి** సం. విశ. (న్. నీ. న్.) 1. ఆశ్రయించునది. 2. ఊఁతగొనునది. 3. వ్రేలాడునది. 4. దిగినది. అవతీర్ణము.

**అవలంబించు** సం. స. క్రి. 1. గ్రహించు, చేపట్టు. (ఉదా: అమత మవలంబించిరి.)

2. పూను.

(కామక్రోధాదులు) క. ధైర్యం, బవలంబించిన నరుఁ జేఁవు...భార. శాం. 3. 428.

**అవలంబిత** సం. విశ. (ఋ. త్రీ. ఋ.) అవలంబించువాఁడు.

**అవలంబితము** సం. విశ. (అ. ఆ. అ.) ఆశ్రయింపఁబడినది. 2. గ్రహింపఁబడినది, చేపట్టఁబడినది. 3. వ్రేలాడునది. 4. దిగినది, అవతీర్ణము.

**అవలంబితవ్యము** సం. విశ. (అ. ఆ. అ.) అవలంబింపఁ దగినది.

**అవలంబిష్యమాణము** సం. విశ. (అ. ఆ. అ.) 1. అవలంబింపఁ బోవునది. 2. అవలంబింపఁబడఁ బోవునది.

**అవలంబ్యము** సం. — అవలంబితవ్యము.

**అవలక్షణము** సం. వి. అ. న. దుర్లక్షణము.

**అవలక్షము** సం. విశ. (అ. ఆ. అ.) వలక్షము. తెల్లనిది. వి. అ. పుం. తెలుపు.

**అవలగ్నము** సం. విశ. (అ ఆ. అ.) తగులుకొనినది. వి. అ. పుం. న. నడుము.

**అవలిప్తము** సం. విశ. (అ. ఆ. అ.) 1. పూయఁబడినది. 2. గర్వించినది.

**అవలీఢము** సం. విశ. (అ ఆ. అ.) 1. నాకఁబడినది. 2. తినఁబడినది. 3. వ్యాప్తము. (నవయౌవనావలీఢావయవా. సం. దశకు.)వి. అ. పుం. గుఱ్ఱమున కుండెడు ఒకవిధమగుసుడి.

**అవలీల** సం. వి. ఆ. స్త్రీ. చులుకన, అనాయాసము.

**అవలుంచనము** సం. వి. అ. న. 1. ఛేదనము. 2. పెకల్చుట, ఉత్పాటనము. 3. వెండ్రుకలు మొదలగువానిని ముడువకుండుట, విరియఁబోయుట. 4. తొలఁగించుట.

**అవలుంచితము** సం. విశే. (అ. ఆ. అ.) 1. పెకల్పఁబడినది, ఊడఁదీయఁబడినది. 2. బంధింపఁబడనిది, ముడువఁబడనిది (కేశాది). 3. తొలఁగింపఁబడినది.

**అవలుంఠనము** సం. వి. అ. న. 1. నేలపైఁబడి పొరలాడుట. 2. తస్కరించుట, దోఁచుకొనుట.

**అవలుంఠితము** సం. విశే. (అ. ఆ. అ.) 1. పొర్లాడినది. 2. అపహరింపఁబడినది.

**అవలుంపనము** సం. వి. అ. న. మీఁదికి దూఁకుట, తటాలున పైఁబడుట.

**అవలేపనము** సం. వి. అ. న. 1 పూయుట, రాచుట. 2 కలయిక, సంబంధము. 3. గర్వము, పొగరుఁబోతుఁదనము. 4. చందనాదిలేపనద్రవ్యము.

**అవలేపము** సం. వి. అ. పుం. 1. లేపనము, పూఁత. 2. గర్వము, పొగరుఁబోతుఁదనము. 3. కలయిక, సంబంధము. 4. క్షేపణము, చిమ్ముట. 5. దూషణము.

శ్లో: అవలేపస్తు గర్వే స్యాత్క్షేపణే దూషణేపిచ. (వి. ని.)

**అవలేహకుఁడు** సం. విశే. (అ. హకా. అ.) నాకువాఁడు.

**అవలేహనము** సం. వి. అ. న. నాకుట.

**అవలేహము** సం. వి. అ. పుం. 1. నాకుట. 2. లేహ్యము, నాకఁదగిన యౌషధాదికము.

**అవలేహిక** సం. వి. ఆ. స్త్రీ. లేహ్యము,

**అవలోకకము** సం. విశే. (అ. కా. అ.) చూచునది.

**అవలోకనము** సం. వి. అ. న. 1. చూచుట. 2. చూపు. 3. కన్ను. 4. అనుసంధానము; విచారణ.

**అవలోకము** సం. వి. అ. పుం. 1. చూచుట. 2. దృష్టి, చూపు.

**అవలోకయిత** సం. విశే. (ఋ. త్రి. ఋ.) 1. చూచువాఁడు. 2. ఆలోచించువాఁడు.

**అవలోకి** సం. విశే. (న్. వి. న్.) 1. చూచునది. 2. విచారించునది, పరిశీలించునది.

**అవలోకించు** సం. స. క్రి. చూచు.

వ. ...పరిజనుల నవలోకించి... మార్క. 3.22.

**అవలోకితము** సం. విశే. (అ. ఆ. అ.) 1. చూడఁబడినది, కనుఁగొనఁబడినది. 2. విచారింపఁబడినది, పరిశీలింపఁబడినది. వి. అ. న. దృష్టి, చూపు.

**అవలోడనము** సం. వి. అ. న. 1. కలియఁబెట్టుట, అడుగంటఁగదల్చుట. 2. విమర్శము, చక్కఁగా విచారించుట.

**అవలోపము** సం. వి. అ. పుం. 1. ఛేదనము, ఖండనము. 2. నాశనము. 3. (పెదవి మొదలగువానిని) కఱచుట, కొఱుకుట.

శ్లో: యదధయదధరావలోప నృత్యత్కరవల యస్వనితేన తద్వివవ్రే. శిశు. 7. 45.

**అవలోభనము** సం. వి. అ. న. భోగములయందిచ్ఛ, విషయవాంఛ.

**అవల్గుజము** సం. వి. అ. పుం. సోమరాజీలత, కారుగచ్చతీఁగ.

**అవవరకము** సం.—అపవరకము.

**అవశకునము** సం. వి. అ. న. దుశ్శకునము.

**అవశము** సం. విశే. (అ. ఆ. అ.) 1. ఒకరికి వశమందు లేనిది, ఇతరులకు లొంగనిది, స్వతంత్రము. 2. తనవశమందు లేనిది, పరాధీనము. 3. అనివార్యము, తప్పనిది.

శ్లో. కిమస్య భవతో యథా సుహృద ఏవ నాశోఽవశః. ముద్రా. 6. 16.

**అవశాతనము** సం. వి. అ. న. కుస్కింపఁ జేయుట, సన్నగిలఁజేయుట.

**అవశిష్టము** సం. విశే. (అ. ఆ అ.) మిగిలినది, పరిశిష్టము. వి. అ. న. మిగులు, శేషము.

**అవశీనము** సం. విశే. (అ. ఆ. అ.) చలి మొదలగువానిచే ముడుఁచుకొనిపోయినది. (శరీరము, మొ.)

**అవశీర్షకుఁడు** సం.విశే. (అ. ర్షికా. అ.)-అవశీర్షుఁడు.

**అవశీర్షుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) వంగినతల గలవాఁడు, తలవంచుకొన్నవాఁడు.

**అవశుష్కము** సం. విణ. (అ. అ. అ.) మిక్కిలి యెండినది.

**అవశేషము** సం. వి. అ. పుం. మిగులు, శేషము.

**అవశేషించు** సం. అ. క్రి. మిగులు. (శ. ర.)

**అవశేషితము** సం. విణ. (అ. ఆ. అ.) మిగుల్పఁబడినది.

**అవశోషము** సం. వి. అ. పుం. మిక్కిలి శుష్కించుట.

**అవశ్య** సం. వి. ఆ. స్త్రీ. కుజ్ఝటిక, పొగమంచు.

**అవశ్యంభావి** సం. విణ. (న్. నీ. న్.) తప్పక సంభవించునది.

**అవశ్యభావ్యము** సం. విణ. (అ. ఆ. అ.) అనివార్యముగా కాఁదగినది.

చ. ....ఈ, పొలియు టవశ్యభావ్యమని బుద్ధిఁ దలంచుట గావనయ్యెడున్. భార. మౌ. 112.

**అవశ్యము** సం. విణ (అ ఆ. అ.) 1. అడఁపరానిది, దుర్దాంతము. 2. లోఁబడనిది, అనధీనము. 3. అనివార్యము, తప్పనిది, మానఁగూడనిది.

చ. ....అధర్మువునందుఁ జిత్తముం, దగులదు నాకు నెన్నఁడును ధర్మ మవశ్యము నట్ల కావునన్. భార. ఆది. 7. 250.

క్రి. విణ. నిశ్చయముగా, తప్పకుండఁగా.

ఉ. వచ్చినవాఁడు ఫల్గునుఁ డవశ్యము గెల్తు మనంగరాదు. ...భార. విరా. 4. 234.

**అవశ్యానము** సం. - అవశీనము.

**అవశ్యాయము** సం. వి. అ. పుం. 1. మంచు. 2. గర్వము అభిమానము.

**అవశ్రయణము** సం. వి. అ. న. ప్రొయ్యిమండి దింపుట. (వ్యతి. అధిశ్రయణము-ప్రొయ్యి మీఁదఁ బెట్టుట)

**అవష్టంభనము** సం. వి. అ. న. 1. ఆలంబనము, ఊఁత. 2. ప్రాపు, ఆధారము. 3. మ్రానుపాటు గలిగించుట, నిశ్చేష్టత నొందించుట. 4. నిలుపుట, అడ్డుపెట్టుట. 5. ప్రారంభము, 6. అవలేపనము, పూఁత. (చూ. అవష్టంభము)

**అవష్టంభము** సం. వి. అ. పుం. 1. ఆలంబనము, ఊఁత. 2. సామీప్యము, అవిదూర్యము. 3. ఆశ్రయము, ప్రాపు 4. గర్వము. 5. ప్రారంభము. 6. నిశ్చేష్టత. 7. బంగారు. 8. అడ్డు. 9. పూఁత, లేపనము. (ఆలంబనావిదూరార్థములయందే షత్వసహితరూపమని వ్యాకరణము. కాని నిఘంటువులయం దితరార్థములు కూడ నీయఁబడినవి.)

**అవష్టబ్ధము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఆక్రమింపఁబడినది. 2. అవలంబితము, ఆశ్రయింపఁబడినది, పట్టుకొనఁబడినది. 3. ఆసన్నము, సమీపించినది. 4. అడ్డఁబడినది. 5 నిశ్చేష్టముగాఁ జేయఁబడినది. (చూ. అవష్టంభము)

**అవష్వాణము** సం. వి. అ. పుం. చప్పు డగునట్లు తినుట.

**అవసండీనము** సం. వి. అ. న. పక్షులు క్రిందికి వ్రాలు గతిభేదము.

**అవసక్తము** సం. విణ. (అ. ఆ. అ.) సంలగ్నము, తగులుకొన్నది. వి. అ. న. తగులు, సంసర్గము.

**అవసక్థిక** సం. వి. ఆ. స్త్రీ. 1. పర్యంకబంధము, రెడ్డిగము. 2. రెడ్డిగమున కుపయోగించుబట్ట.

**అవసడి** మి. వి. (తె. అవసడి.) దూఱు, నింద.

సీ. అవసడి యాడిక యాఱడి సడి ఱట్టు నగడు దూఱవ నింద కమరు. సాం.ని. మాన. 51.

**అవసన్నము** సం. విణ. (అ. ఆ. అ.) 1. నష్టము, పోయినది.

శ్లో. పిత్రోస్సకాశ మవసన్నదృశో ర్నినాయ. సం. రఘు. 9. 77.

2. సమర్థము కానిది, శక్తి లేనిది. 3. విషాదము నొందినది, విన్నవైనది. 4. సమాప్తము, కడ ముట్టినది.

**అవసరదార్లు** వి. బ. ధాన్యవిశేషము,

సీ. పొలంక లబుఁగు రాజనములు సంభావు లవసరదార్లు మోహనపుసరులు.. .. గీ. అది యగు పేరు గలుగువ డ్లతనియింట, నుండు ....హంస. 4. 128.

**అవసరము** సం. వి. అ. పుం. 1. తఱి, సమయము. 2. ప్రస్తావము, కార్యోచితసమయము. 3. (తర్క.) సంగతివిశేషము, సంగతు లాఱిటిలో నొకటి. 4. కురియుట, వర్షణము. 5. మంత్ర

భేదము. (రహస్యాలోచనము? అని విల్యమ్స్.)

6. ఆవశ్యక కార్యము, అక్కఱ.

గీ. హంసవరులార మా కొక్కయవసరంబు, గలిగి పిలిపించితిమి. ....ప్రభా. 1. 111.

క. ఒంటిఁబడి మృత్యుముఖమున, నంటిన నీకింటి కరుగునవసరమేమీ. శేష. 2. 25.

7. అవసరములందు అర్పించు నైవేద్యము; నైవేద్యము.

వ. తాడిపరతను ఆరామేశ్వరదేవునికి దధ్యన్నావసరానకు .... నాలుగుపుట్లు వెలిచేను ధారవోసి యిచ్చితిమి. ద. శా. 801.

ద్వి. అమ్మమ్మ మాలింగ మాఁకొన్నవాఁడు, క్రమ్మన వడ్డించు రమ్ము లెమ్మనుచు, సరసర లింగావసరము సెల్లించి. బస. పు. 5. 278.

(ఈ కడపటి రెండర్థములు తెలుఁగుభాషయందే కనఁబడుచున్నవి.)

**అవసరములవారు** వి. బ.—సమయము నెఱిఁగించువారు—రాజద్వారపాలకులు.

గీ. ....నృపసూనునగరి,కేఁగి యువరాజునకుఁ దమ్ము నెఱుకసేయుఁ,డనిన నవసరముల వారు నపుడె పిలువ. సారంగ. 2. 264.

**అవసర్గము** సం. వి. అ. పుం. 1. విడిచిపెట్టుట, విసర్జనము. 2. కామచారానుజ్ఞ, ఇచ్ఛచొప్పునఁ జేసికొన నిచ్చుట. 3. స్వాతంత్ర్యము.

**అవసర్జనము** సం. వి. అ. న. విసర్జనము, విడిచిపెట్టుట.

**అవసర్పణము** సం. వి. అ. న. క్రిందికిఁ బోవుట.

**అవసర్పి** సం. విశే. (న్. ఈ. న్.) క్రిందికిఁబోవునది.

**అవసాదకము** సం. విశే. (అ. దికా. అ.) 1. విషాదము కలిగించునది. 2. సత్తువ పోఁగొట్టునది. 3. ముగించునది. 4. నాశము చేయునది.

**అవసాదనము** సం. వి. అ. న. 1. ఆసక్తిని గలిగించుట. 2. విషాదమును గలిగించుట. 3. ముగించుట. 4. వినాశనము. 5. (వైద్య) ఒకవిధమైన వ్రణచికిత్స, కోశమందుచేత వ్రణాదుల దుర్మాంసమును పోఁగొట్టుట. 6. వ్రణాదులకు వేయు కోశమందు.

**అవసాదము** సం. వి. అ. పుం. 1. కృశించుట. 2. నాశము. 3. తుదముట్టుట, ముగియుట. 4. సత్తువలేమి. 5. విషాదము.

**అవసాది** సం. విశే. (న్. ఈ. న్.) అవసాదమును బొందినది.

**అవసానము** సం. వి. అ. న. 1. చివర. 2. సమాప్తి. 3. హద్దు. 4. చావు. 5. (వ్యాక) విరామము, వర్ణములు లేకపోవుట.

**అవసాయకుఁడు** సం. విశే. (అ. యికా. అ.) 1. నిశ్చయము చేయువాఁడు. 2. ముగించువాఁడు. 3. నశింపఁ జేయువాఁడు.

**అవసాయము** సం. వి. అ. పుం. 1. మిగులు, శేషము. 2. నిశ్చయము. 3. నాశము 4. సమాప్తి.

**అవసిక్తము** సం. విశే. (అ. అ. అ.) తడుపఁబడినది.

**అవసితము** సం. విశే. (అ. అ. అ.) 1. సమాప్తము. 2. నూర్చఁబడినది (ధాన్యము.) 3. తెలియఁబడినది. 4. పరిపక్వమైనది. 5. నిశ్చయింపఁబడినది. 6. కూర్పఁబడినది.

**అవసుప్తము** సం. విశే. (అ. అ. అ.) నిద్రించినది.

**అవసృష్టము** సం. విశే. (అ. అ. అ.) 1. దత్తము, ఇయ్యఁబడినది. 2. త్యక్తము, విడువఁబడినది.

**అవసేకము** సం. వి. అ. పుం. 1. (నీరు మొదలగునవి) చల్లుట. 2. తడుపుట. 3. (వైద్య) నేత్రరోగ భేదము.

**అవసేకిమము** సం. వి. అ. పుం. ఒకవిధమైన వడియము.

**అవసేచనము** సం. వి. అ. న. 1. (నీరు, మొదలగునవి) చల్లుట. 2. తడుపుట. 3. (వైద్య) నెత్తురుదీయుట.

**అవసేయము** సం. విశే. (అ. అ. అ.) 1. నిశ్చయింపఁ దగినది. 2. నశింపఁ జేయఁదగినది; ముగింపఁదగినది. 2. తెలిసికొనఁ దగినది.

**అవస్కందనము** సం. వి. అ. న.- అవస్కందము.

**అవస్కందము** సం. వి. అ. పుం. 1. ఆక్రమణము, పైఁబడుట. (నిద్రించునపుడు శత్రువులపైఁ బడుట అని వై. ని.) 2. విడియుచోటు, శిబిరము.

**అవస్కంది** సం. విశ. (స్. పి. న్.) 1. పైఁబడువాఁడు. 2. (స్త్రీని) చెఱచువాఁడు, భంగపఱచువాఁడు.
(గౌతమదారావస్కందినం.మహా.1.120పా.)

**అవస్కరకము** సం. విశ. (అ. లిశా. అ.) మలమందుఁ బుట్టునది (పురుగు, మొ.).

**అవస్కరము** సం. వి. అ. పుం. 1. విష్ఠ, మలము. 2. గుహ్యావయవము (మగగుఱి; ఆఁడుగుఱి).

**అవస్తరణము** సం. వి. అ. న (చాఁప, మొ) పఱచుట.

**అవస్తారము** సం. వి. అ. పుం. 1. తెర. 2. అస్తరణము (చాఁప, మొ.).

**అవస్తువు** సం. వి. ఉ. న. నీచపదార్థము.

**అవస్థ** సం. వి. అ. స్త్రీ. 1. స్థితి, ఉనికి. 2. దేహాదులకు కాలమునననుసరించి వచ్చినదశ (బాల్య కౌమారాది). 3. దురవస్థ, బాధ. (చూ. అవస్థపడు.)

అవస్థాద్వయము :- సుఖము, దుఃఖము.

అవస్థాత్రయము :- జాగ్రత్, స్వప్న, సుషుప్తులు

(సాంఖ్య) — కార్యములు కారణాత్మకములై సూక్ష్మరూపమున కారణమందుఁడుట వలన ఉత్పత్తికి మునుపు ప్రాగభావస్థానీయమగు- అనాగతావస్థ, (పిమ్మట కారకవ్యాపారముచేత వ్యక్తమగు) అభివ్యక్త్యవస్థ, (పిమ్మట ధ్వంసనీయమై కారణలయరూపమగు) తిరోభావావస్థ.

అవస్థాచతుష్టయము. (వేదాంత) జాగ్రత్తు, స్వప్నము, సుషుప్తి, మోక్షము.

(వైద్య.) బాలము, కౌమారము, యౌవనము, వార్ధకము. (పంచదశవర్ష్యంతం బాల్యమ్, ఆత్రింశద్వర్షం కౌమారమ్, ఆపంచాశద్వర్షమ్ యౌవనమ్, తత ఊర్ధ్వం వృద్ధత్వమ్.)

అవస్థాపంచకము. (యోగ) అవిద్య, అస్మిత, రాగము, ద్వేషము, అభినివేశము.

అవస్థాషట్కము :- పుట్టుట, ఉండుట, పెరుగుట, మాఱుట, క్షీణించుట, నశించుట.) (జాయతేఽస్తి వర్ధతే విపరిణమతేఽపక్షీయతే నశ్యతి. నిరుక్త.)

అవస్థాసప్తకము :- గర్భ, జన్మ, బాల్య, యౌవన, జరా, మరణ, నరకములు.

అవస్థాష్టకము :- కౌమారము, పౌగండము, కైశోరము, యౌవనము, బాల్యము, తారుణ్యము, వృద్ధత్వము, వర్షీయస్త్వము. (కౌమారం పంచమాబ్దాంతం పౌగండం దశమావధి, కైశోర మాపంచదశాత్ యౌవనం తు తతః పరమ్, ఆషోడశాద్భవే ద్బాలస్తరుణ స్తత ఉచ్యతే, వృద్ధస్తు సప్తతే రూర్ధ్వం వర్షీ యాన్ నవతేఃపరమ్-స్మృతి.)

అవస్థాదశకము. (అలం). దర్శనము, మనస్సంగము, సంకల్పము, జాగరము, కార్శ్యము, అరతి, అలజ్జ, ఉన్మాదము, మూర్ఛ, మరణము. (జ్వరము, సంతాపము, కలిపి కొందఱు ద్వాదశావస్థ లందురు.)

**అవస్థపడు** సం. అ. క్రి. (అవస్థ+పడు) దురవస్థనొందు, బాధపడు.

క. పిడుగడచినవానిఁ గొఱవి, వడిఁజూఁడిన గతి నవస్థపడి పోవన్‌లై, నడరి యొకకాల సర్పము ... నన్నుఁ గఱచెన్ ... దశకు. 2. 111.

**అవస్థపెట్టు** సం. వ. క్రి. (అవస్థ+పెట్టు) దురవస్థనొందించు, బాధించు.

ఉదా: కనిగాఁడు వాని నేఁడేండ్లనుండి అవస్థపెట్టుచున్నాఁడు.

**అవస్థానము** సం. వి. అ. న. 1. ఉండుట, నివసించుట. 2. అఁగుట, నిలిచిపోవుట. 3. స్థితి, అవస్థ.

**అవస్థాపనము** సం. వి. అ. న. నెలకొల్పుట, స్థాపనము.

**అవస్థాపితము** సం. విశ. (అ. అ. అ.) నెలకొల్పఁబడినది, స్థాపింపఁబడినది.

**అవస్థాప్యము** సం. విశ. (అ. అ. అ.) స్థాపింపఁదగినది.

**అవస్థాయి** సం. విశ. (న్. పి. న్.) నివసించువాఁడు, ఉండువాఁడు.

**అవస్థితము** సం. విశే. (అ. ఆ. అ.) 1. ఉన్నది. నిలుకడ గలది. (వ్యతి. అనవస్థితము.)

**అవస్థితి** సం. వి. ఇ. స్త్రీ. నివాసము, ఉండుట.

**అవస్యందనము** సం. వి. అ. న. స్రవించుట, కాఱుట.

**అవస్రంసనము** సం. వి. అ. న. 1. అధఃపతనము, క్రింద పడుట. 2. జాఱుట.

**అవస్రంసితము** సం. విశే. (అ. ఆ. అ.) 1. చీల్పఁబడినది. 2. పడఁద్రోయఁబడినది.

**అవహతము** సం. విశే. (అ. ఆ. అ.) 1. కొట్టఁబడినది. 2. దంపఁబడినది.

**అవహతి** సం. వి. ఇ. స్త్రీ. 1. కొట్టుట. 2. దంచుట.

**అవహననము** సం. వి. అ. న. 1. కొట్టుట. 2. దంచుట. 3. ఎడమయూపిరితిత్తి, పుప్పుసము.

**అవహము** సం. విశే. (అ. ఆ. అ.) 1. (నది మొదలగువాని) ప్రవాహము లేనిది (దేశము). 2. మోయనిది. వి. అ. పుం. తృతీయస్కంధమం దుండెడియొక వాయువు.

**అవహరణము** సం. వి. అ. న. 1. ఒకచోటనుండి మఱియొకచోటికి తీసుకొనిపోవుట. 2. సేనలను యుద్ధస్థానమునుండి శిబిరస్థానమునకుఁ గొనిపోవుట. 3. అపహరించుట.

**అవహస్తము** సం. వి. అ. పుం. అపహస్తము, హస్తపృష్ఠభాగము, చేతివెనుకభాగము.

చ....భీముఁడును...సారథిం జఱచెఁ దానవహస్తమునన్ వసుంధరా, తలమునఁ ద్రెళ్లె సారథియు...భార. ఆది. 5. 177.

**అవహారకుఁడు** సం. విశే. (అ. రికా. అ.) 1. మఱియొకచోటికిఁ గొనిపోవువాఁడు. 2. ఆఁపువాఁడు, నివారకుఁడు.

**అవహారము** సం. వి. అ. పుం. 1. గ్రాహము అను జలజంతువు. 2. శ్రాద్ధమునకై బ్రాహ్మణులను నిమంత్రించుటకుఁ గొనిపోఁదగిన ద్రవ్యము. 3. సేనలను యుద్ధభూమినుండి శిబిరమునకుఁ దీసికొనిపోవుట. 4. జూదము యుద్ధములోనగు వానినుండి విశ్రమించుట. 5. (తాకట్టు వస్తువులు మున్నగు వానిని) తిరుగ ఇచ్చుట.

**అవహారుఁడు** సం. వి. అ. పుం. దొంగ.

**అవహార్యుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) దండుగు విధింపఁదగినవాఁడు, ధనదండనమున కర్హుఁడు.

**అవహాలిక** సం. వి. ఆ. స్త్రీ. ప్రాచీనము, కంచె; ఆవరణము.

**అవహాసము** సం. వి. అ. పుం. 1. మందహాసము, చిఱునవ్వు. 2. అపహాసము, ఎగతాళి.

**అవహాస్యము** సం. విశే. (అ. ఆ. అ.) పరిహసింపఁదగినది, ఎగతాళిచేయఁ దగినది.

**అవహితము** సం. విశే. (అ. ఆ. అ.) 1. ఉంపఁబడినది. 2. సావధానముగా నున్నది.

**అవహిత్థ** సం. వి. ఆ. స్త్రీ. ఆకారగోపనము, మనస్సునందలి శోకాదివికారములు పైకిఁ గనఁబడకుండ దాఁచుట. (ఇది వ్యభిచారిభావములలో నొకటి.)

**అవహిత్థము** సం. వి. అ. న. – అవహిత్థ పుం. అభినయహస్తవిశేషము.

**అవహీనము** సం. విశే. (అ. ఆ. అ.) హీనము, త్యక్తము.

**అవహృతము** సం. విశే. (అ. ఆ. అ.) 1. తీసికొనిపోఁబడినది. 2. అపహరింపఁబడినది. 3. దండుగగాఁ బుచ్చుకొనఁబడినది.

**అవహేల** సం. వి. ఆ. స్త్రీ. అనాదరము.

**అవహేలనము** సం. వి. అ. న. అనాదరము.

**అవహేలితము** సం. విశే. (అ. ఆ. అ.) అవహేలనము చేయఁబడినది, అవమానింపఁబడినది. వి. అ. న. అనాదరము.

**అవహ్వరము** సం. విశే. (అ. ఆ. అ.) కుటిలము, వంకరైనది.

**అవాంచితము** సం. విశే. (అ. ఆ. అ.) వంపఁబడినది. శిశు. 18. 56.

**అవాంతరదిక్కు** సం. వి. ఉ. స్త్రీ. రెండుదిక్కుల నడిమిదిక్కు, మూల, విదిక్కు. (ఆగ్నేయ, నైరృతి, వాయవి, ఐశాని)

**అవాంతరము** సం. విశే. (అ. ఆ. అ.) నడిమిది, లోపలిది.

ఉదా: అవాంతరదిక్కు, అవాంతరకథ, అవాంతర ప్రసంగము, మొ.

**అవాక్కు** (అవ+అంచ్) సం. విశే. (న్.వి.న్.) 1. క్రిందుగా వ్రాలినది, వంగినది. 2. క్రిందిది. 3. దక్షిణపుది. (వై.ని.) 4. (అ+వాక్) న్. వాక్కులేనిది, మూఁగ.

**అవాక్పుష్పి** సం. వి. ఈ. స్త్రీ. సదాప (వృ వి.)

**అవాక్శ్రు(శ్రు)తి** సం. విశే. (ఇ.) పెడమూఁకుడు, చెవిటిమూఁగ.

**అవాగ్రము** సం. విశే. (అ. అ. అ.) వంగినది. ఆన తము.

**అవాఙ్మనసగోచరము** సం. విశే. (అ. అ. అ.) వాక్కునకును మనస్సునకును విషయముకానిది, చెప్పను దలంపను శక్యము కానిది.

**అవాచి** సం. వి. ఈ. స్త్రీ. దక్షిణదిక్కు. (రం.ని.)

**అవాచీనము** సం. విశే. (అ. అ. అ.) 1. తలక్రిందైనది, వ్యత్యస్తము. 2. క్రిందిది. 3. దక్షిణపుది. (వై. ని.)

**అవాచ్యము** సం. విశే. (అ. అ. అ.) 1. చెప్పశక్యము గానిది. 2. చెప్పుటకు అర్హము గానిది. 3. నిందింపఁ దగనిది. 4. అభిధావృత్తిచే బోధింప శక్యము గానిది. (లాక్షణికాద్యర్థము.) వి. అ. న. నిందావచనము.

**అవాపితము** సం. విశే. (అ. అ. అ.) 1. చల్లఁబడనిది, నాటఁబడినది (సస్యము). 2. ఛేదింపఁబడనిది (కేశాది). 3. పొందింపఁబడినది.

**అవాప్తము** సం. విశే. (అ. అ. అ.) పొందఁబడినది.

**అవాప్తవ్యము** సం. విశే. (అ. అ. అ.) పొందఁ దగినది.

**అవాప్తి** సం. వి. ఇ. స్త్రీ. ప్రాప్తి, పొందుట.

**అవాప్యము** సం. విశే. (అ. అ. అ.) 1. పొందఁ దగినది. 2. చల్లఁదగనిది, నాటఁదగినది (సస్యము.) 3. ఛేదింపఁ దగనిది (కేశాది).

**అవాయి** వి. (హిం. హవాయీ.) ఆకాశబాణము, ఒకవిధమగు బాణసంచు. (వా. అవాయిచువ్వ, అవాయిగొట్టము.)

**అవారణ** సం. వి. ఆ. స్త్రీ. అడ్డులేమి, అవారణము.
క. పవధిం బడు మేదినం డ్లవారణ లోలో, దిమచు...వేం. పంచ. 4. 29.

చ. ...పావలు రత్నపాత్రమున్, వఁముసఁ గాంచె మద్గురుఁ డవారణమైఁ బ్రబలాభిధానుఁడు...విక్ర. 2. 6. పరస. 2. 35.

**అవారణము** సం. విశే. (అ. అ. అ.) అడ్డు లేనిది. వి. అ. న. అడ్డులేమి.

**అవారణీయము** సం. విశే. (అ. అ. అ.) 1. వారింపఁ దగనిది. 2. వారింప శక్యము గానిది.

**అవారపారము** సం. వి. అ పుం. పారావారము, సముద్రము.

**అవారపారీణము** సం. విశే. (అ. అ. అ.) 1. సముద్రములో పుట్టినది. 2. సముద్రమందున్నది. 3. సముద్రమును బొందునది.

**అవారము** సం. వి. అ. న. పుం ఏఱు మొదలగు వాని యీవలిగట్టు.

**అవారయితవ్యము** సం. — అవారణీయము.

**అవారి**[1] — అవ్వారి[1].
(అడ్డము లేనిది, నిరంకుశము)
క. పనజాకరవారిలో నవారిగ సాడెా. వేం. పంచ. 3. 78.

**అవారి**[2] — అవ్వారి[2].
(అధికము, బహుళము)
చ....ఎవ్వారికి నేపదార్థము లవారిగ నిమ్మను నట్లు యిత్తురు...కావ్యా. 241.
సీ. తేటి మాధురిఁగడతేటి పేరివము నవారి నేయు మదీయవారిఁ దేల. వసు. 6. 61.
వేం. పంచ. 4. 667.

**అవారిక** సం. వి. ఆ. స్త్రీ. దనియము, కొత్తిమిరి (వృ. వి.)

**అవారితము** సం. విశే. (అ. అ. అ.) వారింపఁబడనిది, అడ్డగింపఁబడనిది.

**అవారీణుఁడు** సం. విశే. (అ. అ. అ.) నద్యాదుల యివ్వలిదరికి వచ్చువాఁడు; నద్యాదులను దాఁటి వచ్చువాఁడు.

**అవార్యము** సం. విశే. (అ. అ. అ.) 1. వారింప నలవి కానిది. 2. వారింపఁ దగనిది.

**అవావటుఁడు** సం. వి. అ. పుం స్త్రీకినవర్ణుఁడగు ద్వితీయపురుషునివలనఁ బుట్టినకొడుకు. మను. 10. స. వ్యాఖ్య.

**అవానుఁడు** సం. విశే. (న్.) దిసమొలవాఁడు, నగ్నుఁడు. వి. న్. పుం. జినదేవత.

**అవి** సం. వి. ఇ. పుం. 1. గొఱ్ఱె. 2. సూర్యుఁడు. 3. కొండ. 4. గాలి. 5. ప్రభువు. 6. ప్రాకారము. 7. గృహము. 8. కాంతి. 9. మూషిక కంబళము, ఒకవిధమగు కంబళి. స్త్రీ. 1. భూమి. 2. ముట్టుది.

**అవిందువు** సం. వి. ఉ. స్త్రీ. చనిపోవుచున్న సంతానము గలస్త్రీ. (రం. ని.)

**అవికటము** సం. విశే. (అ. అ. అ.) ఉగ్రముకానిది, సౌమ్యము. వి. అ. పుం. గొఱ్ఱెలమంద.

**అవికటోరణము** సం. వి. అ. పుం. రాజునకుఁ గప్పముగా గొఱ్ఱెలమందనుండి యీఁదగిన గొఱ్ఱె.

**అవికము** సం. వి. అ. పుం. గొఱ్ఱె. న. వజ్రమణి.

**అవిగంధ** సం. వి. అ. స్త్రీ. అజగంధ, వాయింట (వృ. ని.)

**అవిగంధిక** సం.—అవిగంధ.

**అవిగీతము** సం. విశే. (అ. అ. అ.) నిందితము కానిది.

**అవిగొ** — అవిగో.

**అవిగో** — అవిగొ. అవ్య. దూరముగా నున్నవానిని చూపునపు డుపయుక్తము. (చూ. అదిగో)

ఉ...పుత్త్రునియుత్తమాంగముఁ, గూరలు సేయవైతి వవిగో నిజపుత్త్రనిసర్గ మోహముల్. హర. 2. 126.

**అవిఘ్నము** సం. వి. అ. పుం. కరిమర్దకము, కలివె, ఓఁక (వృ. ని.)

**అవిఘ్నము** సం. విశే. (అ. అ. అ.) విఘ్నములేనిది, అటంకము లేనిది. వి. అ. పుం. విఘ్నములేమి, అటంకములేమి.

**అవిచారణీయము** సం. విశే. (అ. అ. అ.) 1. విచారింపఁ దగనిది. 2. విచారింప శక్యము గానిది.

**అవిచారము** సం. విశే. (అ. అ. అ.) మంచిచెడ్డలు ఆలోచింపనిది, వివేచనము లేనిది. వి. అ. పుం. వివేచనము లేమి, ఆలోచనలేమి.

**అవిచారి** సం. విశే. (న్. ఈ. న్.) ఆలోచింపని వాఁడు.

**అవిచారితము** సం. విశే. (అ. అ. అ.) చక్కఁగా ఆలోచింపఁబడనిది.

**అవిచారితరమణీయము** సం. విశే. (అ. అ. అ.) విచారింపనిచో రమణీయముగా నుండునది, విచారించినయెడల రమణీయముగా నుండనిది.

**అవిచ్ఛిన్నము** సం. విశే. (అ. అ. అ.) 1. తెంపు లేనిది, ఎడతెగనిది. 2. ఛేదింపఁబడనిది.

**అవిచ్ఛేదము** సం. విశే. (అ. అ. అ.) 1. తెంపులేనిది, ఎడతెగనిది, 2. ఛేదము నొందనిది. వి. అ. పుం. ఎడతెగకుండుట.

**అవిజ్ఞాత** సం. విశే. (ఋ. ఈ. ఋ.) తెలియని వాఁడు. వి. ఋ. పుం-విజ్ఞాతృ (= జీవ) విలక్షణుఁడు-పరమేశ్వరుఁడు.

**అవిజ్ఞాతము** సం. విశే. (అ. అ. అ.) చక్కఁగాఁ దెలియఁబడనిది, స్పష్టముగా బోధపడనిది.

**అవిజ్ఞుఁడు** సం. విశే. (అ. అ. అ.) 1. తెలివి లేని వాఁడు, మూఢుఁడు. 2. నేర్పు లేనివాఁడు.

**అవిజ్ఞేయము** సం. విశే. (అ. అ. అ.) తెలియ శక్యము గానిది.

**అవిటి** విశే. 1. వికలాంగుఁడు.

మ. అవిటైనన్ జడుఁడైనఁ గుంటయిననఁ జీకైనన్ మహారోగియై,న...మల్ల. శృం. 58. ఆం. భా. 2. 122.

2. వికలము.

ఉదా: అవిటికాలు, అవిటికుండ, అవిటిచేయి, అవిటిబ్రదుకు.

**అవిత** సం. విశే. (ఋ. ఈ. ఋ.) రక్షించువాఁడు.

**అవితథము** సం. విశే. (అ. అ. అ.) 1. అసత్యము కానిది, నిజమైనది. 2. వ్యర్థము కానిది, సఫలము. వి. అ. న. సత్యవచనము.

**అవితము** సం. విశే. (అ. అ. అ.) రక్షింపఁబడినది

**అవితవ్యము** సం. — అవనీయము.

**అవిత్యజము** సం. వి. అ. పుం. న. పాదరసము.

**అవిత్య** సం. వి. ఆ. స్త్రీ. యూథి, పెద్దగోరంట (వృ.ని.)

**అవిదూనము** సం. వి. అ. న. అవిదుగ్ధము, గొఱ్ఱె పాలు.

**అవిద్ధకర్ణి** సం. వి. ఈ. స్త్రీ. పాఠ,విసబొద్ది(వృ.వి.)

**అవిద్య** సం. వి. ఆ. స్త్రీ – విద్యకు విరోధి - అజ్ఞానము. ('మాయ' అని అద్వైతులు. ఈమాయ చేతనే నిర్విశేష చిన్మాత్రమును సత్యమును అగు బ్రహ్మమునందు మిథ్య యగు జగత్తు తోఁచుచున్నది - 'తత్త్వజ్ఞానములేమి.' అని విశిష్టాద్వైతులు. 'చిత్తు, అచిత్తు, ఈశ్వరుఁడు' అను మూఁడుతత్త్వములకుఁ గల పరస్పర సంబంధమును తెలియమి. దీని చేతనే ఆత్మలు బద్ధావస్థ నొందుచున్నవి - 'క్షణికములను స్థిరములఁగాఁ దలఁచుట' అని బౌద్ధులు – జ్ఞానములేమి, ఎఱుకలేమి, అని నైయాయికులు – జ్ఞానమింకను రాకున్న యవస్థ, జ్ఞాన ప్రాగభావము, అని సాంఖ్యాదులు.)

**అవిధి** సం. విశే. (ఇ.) 1. నియమము లేనిది, ఏర్పాటులేనిది. 2. నియమమునకు విరుద్ధము. వి. ఇ. పుం. 1. ఏర్పాటులేమి, నియమము లేమి.

2. కష్టము, శ్రమము. (బ్రౌ.)
ఈయర్థము ఆంధ్ర ద్రావిడ కర్ణాట భాషలందే కనఁబడుచున్నది.
(వ్యవ) అవిధిపడు – కష్టపడు.
అవిధిపెట్టు – కష్టపెట్టు.

**అవిధేయుఁడు** సం. విశే. (అ. అ. అ.) విధేయుఁడు కానివాఁడు.

**అవినయము** సం. విశే. (అ. అ. అ.) వినయము లేనిది, గర్వము గలది. వి. అ. పుం. 1. అడఁకువలేమి, గర్వము. 2. దుర్నయము, చెడు నడవడి.

**అవినాభావము** సం. వి. అ. పుం విడువకుండుట, ఎడతెగని సంబంధము.

**అవినాభావి** సం. విశే. (న్. వీ. న్.) వీడియుండనిది, ఎప్పుడు నెడతెగక కూడియుండునది.

**అవినాభూతము** సం. విశే. (అ. అ. అ.) ఎడతెగని సంబంధము గలది.

**అవినీత** సం. వి. ఆ. స్త్రీ. కులట, లంకుటాలు.

**అవినీతుఁడు** సం. విశే. (అ. అ. అ.) 1. చెడునడవడి గలవాఁడు. 2. గర్వము గలవాఁడు,అడఁకువ లేనివాఁడు. 3. శిక్షితుఁడు కానివాఁడు, (విద్యాదులందు) అభ్యాసము చేయింపఁబడని వాఁడు.

**అవినుఁడు** సం. వి. అ. పుం. అధ్వర్యుఁడు.

**అవిభక్తము** సం. విశే. (అ. అ. అ.) విభక్తము గానిది. (ద్రవ్యము. కుటుంబము, మొ.)

**అవిమరీసము** సం. వి. అ. న. గొఱ్ఱెపాలు,

**అవిముక్తము** సం. విశే. (అ. అ. అ.) విడువఁబడనిది. వి. అ. న. 1. కాశియందలి యొక క్షేత్రము. 2. కాశి. 3. గడ్డమునకును శిరస్సునకును నడిమి ప్రదేశము.

**అవిముక్తేశ్వరుఁడు** సం. వి. అ. పుం. కాశీ విశ్వేశ్వరుఁడు.

**అవియఁబడు** అ. క్రి. (√అవియు – స్వార్థమున 'పడు') బ్రద్దలగు.
సీ. వాలుఁజూపని యెడువేలుపు తేనికైదువ చాయగుట్టు గట్టవియఁబడునొ. కాశ. 2.10.

**అవియఁబాఱు** అ. క్రి. (√అవియు - స్వార్థమున 'పాఱు') పగులు.
సీ. ఒక యింత ఘనముగా నొడ లుబ్బఁజేసెనా హారిదంతరము లెల్ల నవియఁబాఱు. దశా. 3. 171.

**అవియు** అ. క్రి. (క. త. అవి,) 1. పగులు, భేదిల్లు, బ్రద్దలగు; తెగు.
వ. ఏనూఱేండ్లకుఁ గద్రూగర్భాండంబులు తరతరంబ యవిసిన నందు...వేవురు నాగముఖ్యులు పుట్టిన...భార. ఆది. 2. 4.
క. ...వినత పుత్త్రార్థిని యొకయండంబు విగత ధృతి నవియించెన్. భార. ఆది. 2. 5.
సీ. తగిలి నాజీవమునకు నాధారమైన, నీవు సనుఁబెట్టి పోఁ జన్నె భావజన్మ కట్ట యవి యుడు నీరులు కట్టువాసి, బయలువడ డించి పోయినభంగి వోలె. కు. సం. 5. 657.
2. విరియు, ఉబుకు, పొంగు.
క. గొడుగువను వింటికొమ్ములు, నిడమున వరదంబు వందు సెల లవిసి కడున్,వడి నిగిడి జుట్టుచాడ్పున సవ్వడముడిచెన చమ్ముల దరె వసుధాధీశా. భార. ద్రో. 4. 222.

క. అతతబలుఁ డగుభీష్మునిఁ, జేతిబలువు ద్రోణు
నంపసెల లవియుటయుం, జూతు రటు
రండు కృష్ణునిఁజేతన సకలంబుఁ జక్కఁ
జేసికొనుండి. శాం. ఉద్యో 4. 193.

3. చెదరు.

సీ. తొలుమొగుల్బుట్టుముల దూదియట్లవియించి ...నీలా. 1, 42.

4. భగ్నమగు.

గీ. ...విజయప్రతిజ్ఞచొ ప్పవియకుండ, నిలిపె ...రాఘవ. 4. 179.

క. మానస మఖిలంబునకుఁ బ్రధానంబు ప్రధా
నమే ప్రధానము మదికిన్, దాని విడిచి నను
గను మది, తానవముం బొందె యంతఁ దా
నవిసి చెడున్. సీతారా. 2. 135.

5. నొగులు, నొచ్చు, బాధపడు.

గీ. ప్రజ లవిసి చన్నఁ బిలువ కవ్వసులఁ గొలుచు,
నమ్మ యింట్లిం ధనంబున కాయె నవెడు,
కలని నక్కైన యధికారి గల నృపతికి, నేడు
దీవులుగొన్న సమృద్ధి లేదు. ఆము. 4, 287.

ఐ. అవియఁబడు, అవియఁజేయు.

**అవియోగవ్రతము** నం. వి. అ. న. వైధవ్యము కలుగకుండుటకై మార్గశీర్ష శుక్ల తృతీయ యందు స్త్రీలు గావింపఁ దగు నొక వ్రతము.

**అవిరతము** నం. విశ. (అ. అ. అ.) విరామము లేనిది, ఎడతెగనిది. క్రి. విశ. అ. న. ఎల్లప్పుడు, ఎడతెగకుండునట్లు.

**అవిరతి** నం. విశ. (అ.) విరామము లేనిది, ఎడతెగనిది. వి. అ. స్త్రీ. 1. నివృత్తిలేమి, విషయాదులందు అత్యాసక్తి. 2. విరామములేమి, ఎడతెగమి.

**అవిరల(ళ)ము** నం. విశ. (అ. అ. అ.) పలుచన కానిది, దట్టమైనది.

**అవిరలి(ళి)తము** నం. విశ. (అ. అ అ.) ఎడలేని దిగాఁ జేయఁబడినది, దగ్గఱగాఁ జేర్చఁబడినది. (అవిరళితకపోలం. ఉ. చ. 1. 27.)

**అవిరామము** నం. విశ. (అ. అ. అ.) ఎడతెగనిది, సంతతము. వి. అ. పుం. ఎడతెగమి, తెంపులేమి.

**అవిరి**¹ వి. వీరి (వృ. వి.). (శ. ర.)

**అవిరి**² —అయిర.

ఆ. పేరియున్న నేయి పెంకులపొడియును,
నవిరి పెరిఁగనేని నరఁటిపసరు, మూపు
కంటిలోన మసలకపెట్టిన, నేమిటిభుల కెల్ల
మాను(ఁ) బసికి. పశువైద్యశాస్త్రము. 106.

**అవిల** నం. వి. అ. స్త్రీ. ఆఁడుగొఱ్ఱె.

**అవిలంబితము** నం. విశ. (అ. అ. అ.) శీఘ్రము, త్వరితము. క్రి. విశ. అ. న. శీఘ్రముగా, త్వరితముగా.

**అవిలక్ష్యము** నం. విశ. (అ. అ. అ.) 1. వ్యాజము లేనిది, నెపము లేనిది. 2. ఉద్దేశము లేనిది. 3. గుఱి లేనిది. 4. ప్రతీకారము లేనిది.

**అవివక్షితము** నం. విశ. (అ. అ. అ.) చెప్పుట కిచ్ఛగింపఁ బడనిది, చెప్పుట కుద్దేశింపఁబడనిది.

**అవివిక్తము** నం. విశ. (అ. అ. అ.) 1. వివేచింపఁ బడనిది, చక్కఁగా నాలోచింపఁ బడనిది. 2. వేఱువేఱుగా లేనిది, కలిసియున్నది. 3. రహస్యము కానిది, నిర్జనము కానిది (ప్రదేశము) 4. పవిత్రము కానిది.

**అవివేకము** నం. విశ. (అ. అ. అ.) వివేకము లేనిది. వి. అ. పుం. వివేకములేమి.

**అవివేకి** నం. విశ. (న్. నీ. న్.) వివేకి కానివాఁడు, వివేకము లేనివాఁడు.

**అవివేచకుఁడు** నం. విశ. (అ. కా. అ.) కార్యాకార్యజ్ఞానము లేనివాడు.

**అవివేచన** నం. వి. అ. స్త్రీ. —అవివేచనము.

**అవివేచనము** నం. వి. అ. న. అవివేకము.

**అవిశేషము** నం. విశ. (అ. అ. అ.) భేదము లేనిది, తుల్యము. వి. అ. పుం. 1. భేదమును తెలుపు ధర్మములేమి. 2. అభేదము, ఐక్యము.

బ. (సాంఖ్య)-శాంతత్వ ఘోరత్వ మూఢత్వము లను విశేషములులేనివై స్థూలభూతములకు ముఖ్య కారణములై యున్న – సూక్ష్మ భూతములు.

**అవిశేషితము** నం. విశ. (అ. అ. అ.) మఱియొక దానినుండి గుణములచేత (వ్యావర్తింపఁబడనిది) వేఱుచేయఁబడనిది (పదార్థము.).

**అవిశ్వాన** సం. వి. ఆ. స్త్రీ. ఈఁతకును ఈఁతకును నడుమ మిక్కిలి వ్యవధానము గల ఆవు.

**అవిషము** సం. విశ. (అ. ఆ. అ.) నిర్విషము,విషము లేనిది. వి. అ. పుం. 1. సముద్రము. 2.స్వర్గము.

**అవిషహ్యము** సం. విశ. (అ. ఆ. అ.) 1. సహింప శక్యము కానిది. 2. నిశ్చయింప రానిది (హద్దు.)

శ్లో. సీమాయామవిషహ్యాయామ్. మను. 8. 265.

**అవిషి** సం. వి. ఈ. స్త్రీ. 1. రాత్రి. 2. స్వర్గము. 3. నది.

**అవిషుఁడు** సం. వి. అ. పుం. రాజు.

**అవిసియ(సె)**– అగిసియ. వి. అతసి, అగిసె (వృ.వి)

**అవిసోఢము** సం. వి. అ. న. అవిదుగ్ధము, గొడ్డు పాలు.

**అవిస్థలము** సం. వి. అ. న. పాండవులు కోరినయైదు గ్రామములలో నొకటి. (దీనికి 'కుశస్థల'మనియు 'ఇంద్రప్రస్థ' మనియుఁ గూడ పేళ్లు)

శ్లో.అవిస్థలం వృకస్థలం మాకన్దీం వారణావతం, అవసానంచ గోవింద కంచిదేకంచ పంచమం. సం. భార. ఉద్యో. 31. 19.

**అవీచి** సం. విశ. (ఇ.) తరంగములు లేనిది. వి. ఇ. పుం. నరకవిశేషము.

**అవీర** సం. వి. ఆ. స్త్రీ. మగఁడును కొడుకులును లేని స్త్రీ.

**అవుఁగు–ఔఁగు** వి. (క. అవుగు) పాలతోఁ జేసిన భక్ష్యవిశేషము. ద్వి. ప్రభు. 4. 150 పా. 26 పం.

**అవుకాఁపు**–ఔకాఁపు.

**అవుకు–ఔకు.** విశ. శిథిలమైనది; అస్థిరము; దుర్బలము.

ఉదా : వానిది అవుకుబ్రదుకు. అవుకునేల. ఆగోడ అవుకుగా నున్నది. ఆ వ్యవహారము అవుకుగా నున్నది

వి. లోపము; సంశయము.

ఉదా: నా కేమియు అవుకు లేదు.

నీ కేమైనను అవు కున్న యెడలఁ జెప్పుము.

అ. క్రి. జంకు, వెనుదీయు.

ఉదా: ఆయెద్దు అవికిపోయి బండి లాగకున్నది.

**అవుఘళము–అవఘళము.**

**అవుజు¹–ఔజు¹.** వి. (హిం. హావుజ.) జలయంత్ర దీర్ఘిక, కేళాకూళి. (చి. ని.)

**అవుజు²–ఔజు².** వి. బురద, పంకము. ఆం. భా. 1. 155.

**అవుటము** వి. గజాకరము, ఏనుఁగులు పుట్టుతావు. (చి. ని.)

**అవుడు–ఔడు.** వి. (క. అవుడు.)

(పెదవి, అధరము)

ఆ. ...అతండు గెంపారెడు, నాననంబుతోడ నవుడుగఱచి. భార. ద్రో. 1. 290.

(దంతము, పల్లు)

ద్వి. ...వాఁడు గోపించి, యవనిపైఁ దనచేతు లందంద చమరి, యవుడులు దీటుచు నధిక దర్పమున. రం. రా. ఉ. 145 పా. 28 పం.

**అవుదల – ఔదల.** వి. శిరము, తల.

క. అవమానంబులు సేసిన, యవినీతుల దుస్స సేనుఁ డాదిగఁ గలవారి వధించి యడుగు పగతుని, యవుదల నిడి శింతవార లవనింగిలరే. భార. శల్య. 2. 319.

**అవుదు – ఔదు.**

**అవుబలము–ఔబలము.**

**అవురు–ఔరు.** వి. ఔరుగడ్డి. వీరణము (వృ. వి.).

వ. ...మూపట్టినయవురుగంటవేళ్లల్లంగాలుండు మూషికవ్యాజంబునం దరతరంబ కొఱికిన ...భార. ఆది. 2. 143.

ఆ. అవురు దర్భయానె యబ్ధిలో ముంచిన. వేమన. 2. 78.

**అవురుసవురు – ఔరుసౌరు, అవురుసౌరు.** విశ. దస్సినది, క్షీణించినది; నశించినది.

వ. వాహినులు చికుటవడి చిందఱవందఱై మతి చెడి మల్లామడియై యేపుదెగి యవురుసవురై ...ఉ. హరి. 1.148. కాశీ. 7. 87.

**అవురుసవురుపడు** – ఔరుసౌరుపడు.

**అవురుసౌరు** – అవురుసవురు.

ఉ. చట్టులు దప్పిమై నవురుసౌరయి ... కాశీ. 7 180.

**అవుల** – అవల.

వి. (కాలమునందు అనంతరము.)

ఆ. నీమనోరథంబు నెఱవేర్తు నేనియు; నవుల నెట్లు సైఁతు రార్యజనులు. కృ. శకుం. 3. 43.

(దేశమునందు అనంతరము)

సీ....వారియవుల నున్నవారు మిత్రులగుదురు ...భార. ఆశ్ర. 1. 66.

విశే. (అవతలిది; అన్యము, ఇతరము)

ఆ. ఇవుల మూఁటి కవల నవుల యమ్మూఁటికి. నివలఁ దేజరిల్లు దివిజవగము. భార. భీష్మ. 1. 21.

ఆ. విభుని సకల ధర్మవృత్తి నత్తటి కృత, యుగముఁబోలు ధర్మయుక్తిమాత్ర,లరయ విభుల కెట్టులయ్యె నయ్యైతఋ, లవుల యుగము లట్లయగు నృపాల. భార. శాం. 2. 294.

క. ...బ్రాహ్మణ్య మవులజాతులుమూఁటఁగా, జనించినవానికి దొర,కొనునొకొ ... భార. అను. 1. 85.

అవులఁబెట్టు–పరిత్యజించు.

గీ. ...గర్భంబు దాల్చియున్న,యవుడువాచవు లెల్లను నవులఁబెట్టి, దానికెయ్యవి పథ్య ముల్ వానిఁగొందు. భార. అను. 4. 361.

అవులజరువు – అవలఁద్రోయు, విడుచు.

క. అసమయంబునఁ బుష్పశ,రాసనుచే నలసి తగవు నవులజరుపుచుం, దా నెజ్జడిగ్గి ధైర్య, వ్యాసంగం బెడలి నృపతి యతివఁ దటి యుచుఁగా. కేయూర. 4. 20.

**అవుసు** – ఔసు, హౌసు. వి. 1. సొగసు. 2. ఒయ్యారము. (శ. ర.)

**అవె** అవ్య. స్త్రీసంబోధనాంతపదముల కను ప్రయుక్తము.

రగడ. రాగరాగపరాగ విచ్చివ రంగురంగునఁ బొల్చె నెక్కడె, రాఁగ రాగతఁ బట్టుకొనఁ గలరవము రవములు తెరల దక్కడె. చంద్రి 4. 63.

**అవేక్ష** సం. వి. అ. స్త్రీ – అవేక్షణము.

**అవేక్షకుఁడు** సం. విశే. (అ. శా. అ.) 1. చూచువాఁడు; చక్కఁగా ఆలోచించువాఁడు.

2. (ఆయవ్యయాదులకు) అధ్యక్షుఁడు.

**అవేక్షణము** సం. వి. అ. న. 1. చూచుట. 2. జాగ్రత్తతోఁజూచుట, కాచుట. 3. చక్కఁగా ఆలోచించుట.

**అవేక్షణీయము** సం. విశే. (అ. అ. అ.) 2. చూడఁ దగినది. 2. ఆలోచింపఁ దగినది.

**అవేక్షమాణము** సం. విశే. (అ. అ. అ.) చూచుచున్నది.

**అవేక్షి** సం. విశే. (న్. శీ. న్.) 1. చూచువాఁడు. 2. ఆలోచించువాఁడు.

**అవేక్షించు** సం. స. క్రి. చూచు.

గీ. సురగురుం డాదిగాఁ గలకుభులచేత, వీఁడవేక్షింపఁబడియెడుఁ బోఁడిగాఁగ. మార్క. 8. 91.

**అవేక్షిత** సం. విశే. (ఋ. శ్రీ. ఋ.) – అవేక్షకుఁడు.

**అవేక్షితము** సం. విశే. (అ. అ. అ.) 1. చూడఁబడినది. 2. ఆలోచింపఁబడినది.

**అవేక్షితవ్యము** సం – అవేక్షణీయము.

**అవేక్ష్యమాణము** సం. విశే. (అ. అ. అ.) చూడఁబడుచున్నది.

**అవేక్ష్యము** సం. విశే. (అ. అ. అ.) 1. చూడఁదగినది. 2. చక్కఁగా ఆలోచింపఁ దగినది.

**అవేతము** సం. విశే. (అ. అ. అ.) 1. కడచినది. 2. పొందఁబడినది. 3. తెలియఁబడినది. 4. తెలిసినది.

**అవేద్యము** సం. విశే. (అ. అ. అ.) 1. తెలియరానిది. 2. అలభ్యము, పడయ రానిది. 3. వివాహము చేసికొనఁదగనిది. (మను. 10.24.) వి. అ. పుం. గోవత్సము, దూడ.

**అవేల(ళ)** సం. వి. అ. స్త్రీ. 1. అనుచితకాలము. అకాలము. 2. పూగచూర్ణము, వక్కపొడి.

**అవేలము** సం. విశే. (అ. అ. అ.) 1. హద్దు లేనిది, మితిలేనిది. 2. సమయము లేనిది. వి. అ. పుం. అపలాపము, ముఱుఁగుమాట.

**అవోక్షణము** సం. వి. అ. న. అఱచేతిని అడ్డముగా నుంచి జలాదికము చల్లుట. (అఱచేయి పైకెత్తి చల్లుట ప్రోక్షణము. వంచిచల్లుట అభ్యుక్షణము. చూ. అభ్యుక్షణము.)

**అవోషము** సం. వి. అ. పుం. తడియుట, ఆర్ద్రత.

**అవోషము** సం. వి. అ. పుం.. వేఁడియన్నము.

**అవ్యంగ** సం – అవ్యండ.

**అవ్యంజనము** సం. విణ. (అ. ఆ. అ.) 1. (స్త్రీపురుషాది) చిహ్నము లేర్పడనిది. 2. స్పష్టము కానిది. 3. మంచిలక్షణములు లేనిది. వి. అ. పుం. (వయసువచ్చియు) కొమ్ములురాని పశువు.

**అవ్యండ** సం. వి. ఆ. స్త్రీ. 1. దూలగొండి (వృ.వి.) 2. యవధాన్యపుగింజ.

**అవ్యక్తము** సం. విణ. (అ. ఆ. అ.) స్పష్టము కానిది. వి. అ. న. 1. (సాంఖ్య) – రూపాదులు లేకపోవుటచే చక్షురాదులకు గ్రాహ్యము కానిది– జగత్కారణమగు ప్రధానము, మూలప్రకృతి. 2. అజ్ఞానము. 3. సూక్ష్మశరీరము. 4 సుషుప్త్యవస్థ. 5. నిరాకార బ్రహ్మము, పరబ్రహ్మము. 6. (బీజగ) తెలియఁబడని సంఖ్య.

**అవ్యక్తరాగము** సం. విణ. (అ. ఆ. అ.) అరుణము, కొంచెము ఎఱ్ఱనిది. వి. అ. పుం. కొంచెము ఎఱుపురంగు.

**అవ్యక్తుఁడు** సం. వి. అ. పుం. 1. విష్ణువు. 2. శివుఁడు. 3. మన్మథుఁడు. 4. మూఢుఁడు. (వై. ని.)

**అవ్యథ** సం. వి. ఆ. స్త్రీ. 1. కరక (వృ. వి.) 2. సొంటి. 3. బాధలేమి.

**అవ్యథము** సం. విణ. (అ. ఆ. అ.) 1. బాధలేనిది. 2. బాధ కలిగింపనిది. వి. అ. పుం – కాళ్లతో నడవనిది, ప్రాకునది–పాము.

**అవ్యథి** సం. విణ. (న్. సీ. న్.) 1. బాధలేనిది. 2. భయము లేనిది.

**అవ్యథిషి** సం. వి. ఈ. స్త్రీ. 1. భూమి. 2. రాత్రి.

**అవ్యథిషుఁడు** సం. వి. అ. పుం 1. సూర్యుఁడు. 2. సముద్రుఁడు.

**అవ్యము** సం. విణ. (అ. ఆ. అ.) 1. గొఱ్ఱెకు సంబంధించినది. (బొచ్చు, మొ.) 2. రక్షింపఁదగినది.

ఉ. అవ్యుఁడు గాఁడు వీఁడు శిశుహంత దురాత్మకుఁడు...భాగ. 1. 170.

**అవ్యయము** సం. విణ. (అ. ఆ. అ.) 1. నాశరహితము, శాశ్వతము. 2. వికారశూన్యము. మార్పులేనిది. 3. వెచ్చము లేనిది, వ్యయము లేనిది. వి. అ. న. పరబ్రహ్మము. పుం. న. (వ్యాక) లింగవిభక్తివచన శూన్యమైనపదము.

**అవ్యయీభావము** సం. వి. అ. పుం. (వ్యాక) సమాసములలో నొకటి. (ఉదా : మధ్యేమార్గము, యథేచ్ఛము, యథాశక్తి.)

**అవ్యయుఁడు** సం. వి. అ. పుం. 1. విష్ణువు. 2. శివుఁడు.

**అవ్యవస్థ** సం. వి. ఆ. స్త్రీ. 1. నియమము లేమి. 2. హద్దులేమి.

**అవ్యవస్థము** సం. విణ. (అ. ఆ. అ.) 1. చంచలము నిలుకడ లేనిది. 2. హద్దులేనిది, మేర లేనిది. 3. నియమము లేనిది, ఏర్పాటు లేనిది.

**అవ్యవస్థితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. నియమము లేనిది. 2. అస్థిరము, చంచలము. (ఉదా: అవ్యవస్థితచిత్తుఁడు, మొ.)

**అవ్యవహితము** సం. విణ. (అ. ఆ. అ.) ఎడము లేనిది, దగ్గఱది.

**అవ్యాకృతము** సం. విణ. (అ. ఆ. అ.) నామరూపములచే స్పష్టపఱుపఁబడనిది. వి. అ. న. (వేదాంత) ప్రకటము గాకుండ బీజరూపమున జగత్కారణమైయున్న అజ్ఞానము. 2.(సాంఖ్య) జగత్కారణము, ప్రధానము.

**అవ్యాజము** సం. విణ. (అ. ఆ. అ.) నెపము లేనిది, కపటము లేనిది. వి. అ. పుం. 1. కపటము లేమి, మోసము లేమి. 2. అకృత్రిమత్వము, నిసర్గము, స్వభావము.

శ్లో ఇదం కిలావ్యాజమనోహరం వపుః, శాకుం. 1. 17.

**అవ్యాప్తి** సం. వి. ఇ. స్త్రీ. 1. వ్యాప్తి లేమి, లక్ష్యైకదేశమున లక్షణము ప్రవర్తింపమి, లక్ష్యమందుఁ గొంతభాగమున లక్షణము ప్రవర్తింపమి.

(శిఖాసూత్రములు గలవాఁడు బ్రాహ్మణుఁడు, అనులక్షణము బ్రాహ్మణుఁ డయ్యును శిఖా సూత్రములు లేని సన్న్యాసియందు వర్తింపదు.)

**అవ్యాప్యము** సం. విణ. (అ. ఆ. అ.) (తర్క) వ్యాప్తి లేనిది. (నిప్పుండుచోట పొగ యుండు నను నియమము లేదు. కాలినయినుపగుండు నందు నిప్పున్నను పొగ యుండదు. కనుక నిప్పు పొగకు అవ్యాప్యము.)

**అవ్యాప్యవృత్తి** సం. విణ. (అ.) 1. స్వాధికరణ మందు సర్వత్ర ఉండనిది. (ఘటాదికము స్వాధి కరణమగు గృహమందు అంతట వ్యాపించి యుండదు. కాన ఘటాదికము అవ్యాప్య వృత్తి) 2. స్వాధికరణమందు సర్వదా ఉండ నిది. (రాగద్వేషాదికము స్వాధికరణ మగు మనస్సునందు ఎల్లప్పుడు ఉండదు, కనుక రాగ ద్వేషాదికము అవ్యాప్యవృత్తి).

**అవ్యాహతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. అప్రతి రుద్ధము అడ్డగింపఁబడనిది. 2. వ్యాఘాతము లేనిది, నిర్విఘ్నము.

**అవ్యుత్పన్నము** సం. విణ. (అ. ఆ. అ.) వ్యుత్పత్తి లేనిది, అవయవార్థము లేనిది. (శబ్దము.)

**అవ్యుత్పన్నుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) పండితుఁడు కానివాఁడు, అవివేకి.

**అవ్వ** వి. (సం. అంబా. క. అవ్వ. త. అవ్వై.)

1. తల్లి, జనని.

క. అవ్వల నెఱుఁగక ముయ్వుర, కవ్వల వెలుఁ గొందుపరముఁ డర్భకుఁడై ... భాగ. 10. పూ. 294.

క. తల్లిఁగదిని చిట్టాడుచు నల్లనఁ జను బువ్వఁ బెట్టు మవ్వా యనుచున్ ... భాగ. 10. పూ. 303. ఆం. భా. 2. 112.

2. తండ్రితల్లి; తల్లితల్లి.

సీ. అవ్వయంచును బ్రేమ నివ్వటిల్లఁగఁ జేరి ముకిపెంపు మనుమఁడు ముద్దుగురియ. దశా. 3. 49.

(ఇది ప్రపితామహి మొ. వారినిగూఁడ దెలుపును.)

క. పువ్వారుఁబోఁడివై సరి, యెవ్వారనభీష్ముఁ గాంచి యుంపొందితి వీ, వవ్వాని యెఱుఁగుదువె మాయవ్వా పోషింపఁ బాడియగు నను నీకున్. విజ. వి. 1. 116. కృ. శకుం. 1. 26.

3. పూజ్యస్త్రీ.

ఆ. అవ్వ నీవు వేల్పవగుదని కొండలు, మొగిన కేలు మొగిచి మ్రొక్కునంత. భార. అర. 2. 102.

4. వృద్ధస్త్రీ.

ఉ... అవ్వవిధంబున వంగి లేచుచున్. వేం. మా 5. 4.

5. స్త్రీతో మాటాడునప్పుడు అమ్మ శబ్దమువలెఁ గ్రియలమీఁద వచ్చును.

ఆ. బలియు నిట్టిభీము బ్రాహ్మణార్థమ్ముగా, నసురవాతఁ ద్రోతురవ్వ యిట్లు. భార. ఆది. 6. 278.

సా: అవ్వయుఁ గావలెను బువ్వయుఁ గావలెను. అవ్వయు గుఱ్ఱము నొకటియే అయినవి.

**అవ్వల** — ఆవల.

వి. (కాలమునందు, అనంతరము.)

క. ఎవ్వరు నేటికి నామెయిఁ, గ్రొవ్విసమాంసంబు గలదు కొను మాఁకలియున్, నొవ్వియును దీఱునంతట, నవ్వల నారోగ్యమగు మృగాధిప నీకున్. నా. పంచ. 1. 399.

(ఆవైపు)

క. ఎవ్వనితో నెచ్చోటం, బివ్వకుఁ జేసాఁప వలదు చేసాఁచినచో, నివ్వల నవ్వల నెవ్వరు, నవ్వక యుండంగఁబగి సనన్ దీర్పఁదగున్. కాశీ. 1. 109. (చి. ని. పా.)

గీ. ఇవ్వ లవ్వల దైత్యులట్టిట్టు ద్రోయ. దశా. 101.

విణ. (అవతలిది)

ఉ. అవ్వలిదిక్కు మోమయి ... నైష. 6. 118.

(ఆవైపుది)

చ. అలుకఁ దుషారశైలసుత యవ్వలిమోమయి... హర. 4. 84.

(అవ్వలిమోమయి = పెడమొగము పెట్టుకొని.)

అవ్వలఁద్రోయు = తిరస్కరించు.

సీ. బెళుకు బేడిసల నవ్వలం ద్రోయుననవేఱ క్రేఁ గంటిచూపు లగ్గింప నేల. పె. శకుం. 1.88.

**అవ్వలించు** వ. క్రి. ఉద్యమించు, పూను.

ద్వి. అత్తిం త్రిణీతరువు, కోటరవసతిఁ గై కొన నవ్వలించి ద్వి. పరమ. ౨. 162 పా.

మత్తకోకిల. క్రొవ్వి ధూమిని మొండితోఁ దన కోర్కి తెల్పుడు సేయఁగా, నవ్వలించినఁ జూచి...దశకు. 10. 89.

**అవ్వారి**[1] — అవారి[1]. విశ. (సం. అవార్యః.) అడ్డు లేనిది, నిరంకుశము.

క్రి. విశ. క్రియ. 1. అనివారితముగా, అడ్డు లేకుండ. 2. నిశ్శంకముగా, జంకు లేకుండ.

క. పాతకులార యనర్ఘం,బై తగునపరంజిగిన్నె హారియించి కడుం,జాతురి మీరెఱుఁగనిగతి, నీతెఱఁగునఁ బోయె నందురే యవ్వారన్. విప్ర. ౫. 14.

**అవ్వారి**[2] — అవారి[2]. విశ. (సం. అపారమ్.) అధికము, బహుళము.

సీ. ఇది యధ్వరమునకు నిష్టాన్నపానాదు ల వ్వారిగా నిచ్చు నద్భుతముగ. విక్ర. 5. 118.

రగడ. వారిజాతకరో కింశుకము లవ్వారి యిచ్చట రావె యిల్లి వె. కిరా. 8. 20.

**అశకుంభి** సం. వి. ఈ. స్త్రీ. జలముమీఁదఁ బుట్టి స్వల్పకాలముననే జల మంతయు వ్యాపించు నట్టి తృణవిశేషము, కుంభిక (వృ. వి.)

**అశకునము** సం. వి. అ. పుం. న. అపశకునము. దుశ్శకునము. శశ. 9. 88.

**అశక్తము** సం. విశ. (అ. ఆ. అ.) సమర్థముకానిది, శక్తి లేనిది.

**అశక్తి** సం. వి. ఇ. స్త్రీ. సామర్థ్యములేమి, శక్తి లేమి.

**అశక్యము** సం. విశ. (అ. ఆ. అ.) సాధ్యముకానిది, తరముకానిది.

**అశనము** సం. వి. అ. న. 1. వ్యాప్తి. 2. భుజించుట. 3. అన్నము.

**అశనాయ** సం. వి. ఆ. స్త్రీ. ఆఁకలి, బుభుక్ష.

**అశనాయితుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) ఆఁకలి గొన్నవాఁడు.

**అశని** సం. వి. ఇ. పుం. స్త్రీ. 1. పిడుగు. 2. మెఱుపు, 3. వజ్రాయుధము. 4. (జ్యోతి) ఉల్కావిశేషము.

**అశనీయము** సం. విశ. (అ. ఆ. అ.) తినఁ దగినది.

**అశబ్దవాది** సం. వి. న్. పుం. సాంఖ్యుఁడు. (అశబ్దము—ప్రధానము—ప్రధానము జగత్కారణ మని సాంఖ్యులమతము.)

**అశాశ్వతము** సం. విశ. (అ. ఆ. అ.) శాశ్వతము కానిది.

**అశిత** సం. విశ. (ఋ. త్రి. ఋ.) తినువాఁడు.

**అశితము** సం. విశ. (అ. ఆ. అ., తినఁబడినది. వి. అ. న. అశనము.

**అశితవ్యము** సం. — అశనీయము.

**అశిరుఁడు** సం. వి. అ. పుం. 1. అగ్ని. 2. రాక్షసుఁడు. 3. వాయువు.

**అశిశ్వి** సం. వి. ఈ. స్త్రీ. శిశువులు లేని స్త్రీ, గొడ్రాలు.

**అశీతి** సం. వి. ఇ. స్త్రీ. ఎనుబది.

**అశీతికుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) ఎనుబది పరిమాణము గలవాఁడు. (ఎనుబదియేండ్లవాఁడు. మొ.)

**అశీతిభాగము** సం. వి. అ. పుం. ఎనుబదియవపాలు.

**అశుచి** సం. విశ. (ఇ.) 1. పరిశుద్ధిలేనిది, అపవిత్రమైనది. 2. తెల్లనిదికానిది; నల్లనిది వి. ఇ. పుం. నలుపు.

**అశుద్ధము** సం. విశ. (అ. ఆ. అ.) శుద్ధము కానిది.

**అశుభము** సం. విశ. (అ. ఆ. అ.) 1. శుభముకానిది, అమంగళము. 2. అశుభమును సూచించునది (శకునాది). 3. పవిత్రము కానిది, దుష్టము. వి. అ. న. 1. అమంగళము, కీడు. 2. పాపము.

**అశేషము** సం. విశ. (అ. ఆ. అ.) మిగులు లేనిది, సర్వము. వి. అ. పుం. శేషములేమి, మిగులు లేమి.

**అశోక** సం. వి. ఆ. స్త్రీ. 1. కటుకరోహిణి (వృ.వి.) 2. చైత్రశుద్ధ షష్ఠి.

**అశోకపూర్ణిమ** సం. వి. ఆ. స్త్రీ. ఫాల్గునపూర్ణిమ.

**అశోకము** సం. విశ. (అ. ఆ. అ.) దుఃఖములేనిది. వి. అ. పుం. 1. కంకేళి (వృ.వి). 2. పొగడ

3. శోకాభావము, శోకములేమి. న. 1. పాదరసము. 2. కంకేళిపువ్వు. (ఇది మన్మథుని పంచబాణములలో నొకటి.)

**అశోకరోహిణి** సం. వి. ఈ. స్త్రీ. కటుకరోహిణి (వృ. వి.).

**అశోకషష్ఠి** సం. వి. ఈ. స్త్రీ. చైత్రమాసమందలి షష్ఠి. (1. శుక్లషష్ఠి. 2. బహుళషష్ఠి.)

**అశోకారి** సం. వి. ఇ. పుం. కదంబము, కడిమి (వృ. వి.).

**అశోకాష్టమి** సం. వి. ఈ. స్త్రీ. చైత్రశుక్లాష్టమి.

**అశోకుఁడు** సం. వి. అ. పుం. 1. విష్ణువు. 2. దశరథుని మంత్రులలో నొకఁడు. 3. మౌర్యవంశ్యుఁడగు నొకరాజు, అశోకవర్ధనుఁడు.

**అశౌచము** సం. వి. అ. న. 1. శుచిత్వములేమి, మాలిన్యము. 2. జాతాశౌచము, పురుడు. 3. మృతాశౌచము, మైల.

**అశౌచసంకరము** సం. వి. అ. పుం. అశౌచమధ్యమున మఱియొక యాశౌచము వచ్చుట.

**అశ్నత్** సం. (శత.) తినుచున్న.

**అశ్మంతకము** సం. వి. అ. న. ప్రొయ్యి. పుం. 1. అమ్లోటకము (వృ.వి.). 2. కోవిదారకము (వృ. వి.). 3. ఒక జాతితృణము (వృ. వి.).

**అశ్మంతము** సం. వి. అ. న. (అస్వంతమని కొందఱు) 1. ప్రొయ్యి. 2. పొలము, క్షేత్రము. 3. చావు. 4. అశుభము. 5. అవధిలేమి, మేరలేమి.

**అశ్మకదలి(ళి)** సం. వి. ఈ. స్త్రీ. ఒకజాతి అరఁటి, కాష్ఠకదలి (వృ. వి.).

**అశ్మకుట్టకుఁడు** సం. విశే. (అ. స్త్రీ. అ.) ఱాతితో చూర్ణముచేసికొని యపక్వపదార్థములను తినువాఁడు. (వానప్రస్థుఁడు) వి. అ. పుం. ఱాలను మలచువాఁడు.

**అశ్మకుట్టుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) వి. - అశ్మకుట్టకుఁడు.

**అశ్మకేతువు** సం. వి. ఉ. పుం. పాషాణభేదివృక్షము, కొండపిండి (వృ. వి.).

**అశ్మగర్భజము** సం. వి. అ. పుం. న. మరకతమణి, పచ్చ.

**అశ్మగర్భము** సం. వి. అ. పుం. న. మరకతమణి, పచ్చ.

**అశ్మగుడ** సం. వి. ఆ. స్త్రీ. - అశ్మగుడము.

**అశ్మగుడము** సం. వి. అ. పుం. ఱాతితోఁ జేసిన అస్త్రవిశేషము.

**అశ్మఘ్నము** సం. వి. అ. పుం. పాషాణభేదివృక్షము, కొండపిండి (వృ. వి.).

**అశ్మజతువు** సం. వి. ఉ. న. సిలాజిత్తు.

**అశ్మజము** సం. విశే. (అ. ఆ. అ.) ఱాతినుండి పుట్టినది. వి. అ న. 1. సిలాజిత్తు. 2. ఇనుము.

**అశ్మదారణము** సం. వి. అ. పుం. ఱాలు చెక్కెడి యులి, టంకము

**అశ్మపుష్పము** సం. వి. అ. న. శైలేయము, ఒకానొక గంధద్రవ్యము, ఱాపువ్వు.

**అశ్మభాలము** సం. వి. అ. న. వస్తువులను చూర్ణము చేయు లోహపాత్రభేదము. (అమాందస్తా)

**అశ్మభిత్తు** సం. వి. ద్. పుం. పాషాణభేదకవృక్షము, కొండపిండి (వృ. వి.).

**అశ్మభేదకము** సం. - అశ్మభేదము.

**అశ్మభేదము** సం. వి. అ. పుం. — అశ్మభిత్తు.

**అశ్మము** సం. వి. న్. పుం. ఱాయి, శిల.

**అశ్మయోని** సం. వి. ఇ. పుం. - అశ్మగర్భజము.

**అశ్మరి** సం. వి. ఈ. స్త్రీ. మూత్రకృచ్ఛ్రరోగము, నీరుకట్టురోగము. (ఈరోగమువలన ఱాలు పుట్టి మూత్రమును బంధించును.)

**అశ్మరీఘ్నము** సం. వి. అ. పుం. వరుణము, ఉలిమిరి (వృ. వి.).

**అశ్మసారము** సం. వి. అ. పుం. న. 1. ఇనుము. 2. నీలమణి.

**అశ్మార్మము** సం. వి. అ. న. - అశ్మరి.

**అశ్మీరము** సం. వి. అ. పుం. న. — అశ్మరి.

**అశ్మోత్థము** సం. వి. అ. న. సిలాజిత్తు.

**అశ్యమానము** సం. విశే. (అ. ఆ. అ.) తినఁబడుచున్నది.

అశ్రద్ధ సం. వి. ఆ. స్త్రీ. 1. ఆసక్తిలేమి. 2. విశ్వాసము లేమి.

**అ్రశపుఁడు** నం. - అ్రసపుఁడు.

**అ్రశమము** నం. విశ. (అ. ఆ. అ.) శ్రమలేనిది. వి. అ. పుం. 1. శ్రమలేమి, అనాయాసము. 2. సోమరితనము, పాటుపడమి.

**అ్రశము** నం. వి. అ. న. 1. కన్నీరు. 2. నెత్తురు. పుం. కోణము. మూల (వై. ని.)

**అ్రశవణము** నం. విశ. (అ. ఆ. అ.) 1. చెవులు లేనిది. 2. చెవిటిది. వి. అ. పుం. పాము. న. వినకుండుట.

**అ్రశాంతము** నం. విశ. (అ. ఆ. అ.) 1. బడలనిది. అలయనిది. 2. ఎడతెగనిది, అవిరతము. క్రి. విశ. అ. న. ఎల్లప్పుడు.

**అ్రశి** నం. వి. ఇ. ఈ. స్త్రీ. (ఇది బహువ్రీహిలో 'చతుర్' శబ్దమునకు పరమైనపుడు అకారాంతముగా నుండును. ఉదా: చతురశ్రము.) 1. కోణము, మూల. 2. (ఖడ్గాదుల) అంచు, వాయి.

**అ్రశీకుఁడు** నం. విశ. (అ. ఆ. అ.)-శ్రీ లేనివాఁడు. 1. సంపద లేనివాఁడు, దరిద్రుఁడు. 2. కాంతి లేనివాఁడు, శోభ లేనివాఁడు.

**అ్రశీలుఁడు** నం. - అ్రశీకుఁడు.

**అశ్రునాళి** నం. వి. ఈ. స్త్రీ. కన్నీటినాళములో పుట్టు పుండు.

**అశ్రుపాతము** నం. వి. అ. న. 1. కన్నీరుకాఱుట. 2. గుఱ్ఱము మున్నగువానియొక్క మూతికిని చెక్కిలికిని నడిమిప్రదేశము. (రం. ని.)

**అశ్రువు** నం. వి. ఉ. న. కన్నీరు.

**అశ్లీకము** నం. విశ. (అ. ఆ. అ.) శ్రీని నశింపఁ జేయునది.

శ్లో. అశ్లీకమేతచ్ఛాన్ధూనాం. మను. 4. 206.

**అశ్లీలము** నం. వి. అ. న. 1. ఒకానొక అర్థదోషము. 2. ఒకానొక శబ్దదోషము. 3. అసభ్య వచనము, గ్రామ్యవచనము. (వ్రీడాజుగుప్సామంగళకరమగుమాట.)

**అశ్లేష** నం. వి. ఆ. స్త్రీ. ఆశ్లేషానక్షత్రము.

**అశ్లేషాజుఁడు** నం. వి. అ. పుం. కేతువు.

**అశ్వ** నం. వి. ఆ. స్త్రీ. ఆఁడుగుఱ్ఱము.

**అశ్వకంద** నం. వి. ఆ. స్త్రీ. అశ్వగంధ, పెన్నేరు (వృ.వి.)

**అశ్వకందిక** నం. - అశ్వకంద.

**అశ్వకము** నం. వి. అ. పుం. 1. చెడ్డగుఱ్ఱము. 2. ఎవరిదో తెలియనిగుఱ్ఱము. 3. గుఱ్ఱము. 4. గుఱ్ఱపుబొమ్మ.

**అశ్వకర్ణకము** నం. - అశ్వకర్ణము.

**అశ్వకర్ణము** నం. వి. అ. పుం. 1. గుఱ్ఱముయొక్క చెవి. 2. ఇనుమద్ది, నల్లమద్ది (వృ.వి.)

**అశ్వకిని** నం. వి. ఈ. స్త్రీ. - అశ్వముఖమువంటి ముఖము గలది - అశ్వినీనక్షత్రము.

**అశ్వకుటి** నం. వి. ఈ. స్త్రీ. లాయము, గుఱ్ఱపుసాల.

**అశ్వఖరజము** నం. వి. అ. పుం. - గుఱ్ఱమునకును గాడిదకును బుట్టినది - అశ్వతరము, కంచరగాడిద.

**అశ్వఖుర** నం. వి. ఆ. స్త్రీ. అపరాజిత (వృ. వి.)

**అశ్వఖురము** నం. వి. అ. పుం. 1. గుఱ్ఱపుడెక్క. 2. ఒకానొక గంధద్రవ్యము.

**అశ్వగంధ** నం. వి. ఆ. స్త్రీ. పెన్నేరు (వృ. వి.)

**అశ్వగోయుగము** నం. వి. అ. న. గుఱ్ఱముల జత, జోడుగుఱ్ఱములు.

**అశ్వగోష్ఠము** నం. వి. అ. న. గుఱ్ఱపుసాల.

**అశ్వఘ్నము** నం. వి. అ. పుం. కరవీరము, గన్నేరు (వృ. వి.) (ఇది తినుటవలన గుఱ్ఱములు చచ్చును.)

**అశ్వతరము** నం. వి. అ. పుం. 1. కంచరగాడిద. 2. పాతాళలోకమున నుండునొకసర్పశ్రేష్ఠము.

**అశ్వతరి** నం. వి. ఈ. స్త్రీ. ఆఁడుకంచరగాడిద.

**అశ్వతీర్థము** నం. వి. అ. న. గంగాతీరమున కన్యాకుబ్జముదగ్గఱ నున్న తీర్థవిశేషము.

**అశ్వత్థకము** నం. వి. అ. పుం. 1. అశ్వత్థము (వృ.వి.) 2. అశ్వత్థవృక్షములు ఫలించెడి కాలమునఁ దీర్పఁదగిన ఋణము.

**అశ్వత్థము** నం. వి. అ. పుం. 1. రావి (వృ. వి.) 2. అశ్వినీనక్షత్రము. 3. అశ్వినీనక్షత్ర యుక్త కాలము. 4. ఆశ్వయుజమాస పూర్ణిమ.

**అశ్వత్థామ** నం. వి. న్. పుం. భారతయుద్ధవీరులలో నొకఁడు, ద్రోణాచార్యునికొడుకు.

**అశ్వదంష్ట్ర** నం. వి. ఆ. స్త్రీ. పల్లేరు (వృ.వి.)

**అశ్వనాయుఁడు** సం. వి. అ. పుం. అశ్వపాలకుఁడు, గుఱ్ఱములను కాచువాఁడు.

**అశ్వపాలుఁడు** సం. వి. అ. పుం. గుఱ్ఱమును గాపాడుట మొదలగుపనులయందు నియుక్తుఁడైన భృత్యుఁడు, గుఱ్ఱపువాఁడు.

**అశ్వపుచ్ఛి** సం. వి. ఈ. స్త్రీ. మాషపర్ణి. కారుమినుము (వృ. వి.)

**అశ్వబంధుఁడు** సం. వి. అ. పుం. అశ్వమునుకట్టుట మొదలగుపనులు చేయుభృత్యుఁడు, గుఱ్ఱపువాఁడు.

**అశ్వబడబము** సం. వి. అ. న. ఆఁడుగుఱ్ఱముల యొక్కయు మగగుఱ్ఱముల యొక్కయు సముదాయము. ద్వి. ఒకమగగుఱ్ఱమును ఒక ఆఁడు గుఱ్ఱమును. బ. మగ గుఱ్ఱములును ఆఁడుగుఱ్ఱములును.

**అశ్వమహిషిక** సం. వి. అ. స్త్రీ. అశ్వమునకును మహిషమునకును గల స్వాభావికవైరము.

**అశ్వమారము** సం. వి. అ. పుం. కరవీరము, గన్నేరు (వృ. వి.)

**అశ్వము** సం. వి. అ. పుం. 1. గుఱ్ఱము. 2. ఏడు అనుసంఖ్య.

**అశ్వముఖ** సం. వి. అ. స్త్రీ – అశ్వముఖి.

**అశ్వముఖి** సం. వి. ఈ. స్త్రీ. కిన్నరస్త్రీ.

**అశ్వముఖుఁడు** సం. వి. అ. పుం–గుఱ్ఱపుముఖము గలవాఁడు-కిన్నరుఁడు.

**అశ్వమేధము** సం. వి. అ. పుం. అశ్వమును పశువుగా నేర్పఱిచి సార్వభౌముఁడు చేయుయాగ విశేషము.

**అశ్వమేధికము** సం. వి. అ. న. మహాభారతమందలి పదునాలుగవపర్వము.

శ్లో. తతో౽శ్వమేధికంనామపర్వ ప్రోక్తంచతుర్దశం. సం. భార. ఆది. 2. 389.

**అశ్వమేధీయము** సం. వి. అ పుం. అశ్వమేధమున కుపయోగించు గుఱ్ఱము, యాయావరము. (త్రి. ని.)

**అశ్వయుక్కు** సం. విశే. (జ్.) 1. గుఱ్ఱములను పూన్చువాఁడు. 2. గుఱ్ఱములను కట్టునది. (రథము) 3. అశ్వినీనక్షత్రమందుఁ బుట్టినవాఁడు. వి. జ్. పుం. ఆశ్వయుజమాసము. స్త్రీ. అశ్వినీనక్షత్రము.

**అశ్వరోధకము** సం. వి. అ. పుం. అశ్వమారము, గన్నేరు (వృ. వి.)

**అశ్వవారణము** సం. వి. అ. పుం. గవయమృగము, గురుపోతు.

**అశ్వవారుఁడు** సం. వి. అ. పుం. గుఱ్ఱపు రౌతు.

**అశ్వవాలము** సం. వి. అ. పుం. 1. గుఱ్ఱపుతోఁక. 2. ఱెల్లు, కాశము (వృ. వి.)

**అశ్వవాహుఁడు** సం. వి. అ. పుం. గుఱ్ఱపురౌతు.

**అశ్వవిదుఁడు** సం. విశే. (ద్.) అశ్వహృదయ మను విద్య నెఱిఁగినవాఁడు, అశ్వములను మచ్చిక చేయుటయందు నేర్పరి.

**అశ్వవృషము** సం. వి. అ. పుం. వృషణసహితాశ్వము. విత్తులు తీసివేయనిగుఱ్ఱము

**అశ్వశంకువు** సం. వి. ఉ. పుం. గుఱ్ఱమును గట్టు కొయ్య.

**అశ్వశకృత్తు** సం. వి. త్. న. గుఱ్ఱపులద్ది.

**అశ్వశాల** సం. వి. అ. స్త్రీ. మందుర, గుఱ్ఱపుసాల.

**అశ్వశాస్త్రము** సం. వి. అ. న. అశ్వలక్షణాదికమునుదెల్పుశాస్త్రము.

**అశ్వషడ్గవము** సం. వి. అ. పుం. ఆఱుగుఱ్ఱముల సముదాయము.

**అశ్వసాది** సం. వి. న్. పుం. గుఱ్ఱపురౌతు.

శ్లో. ప్రతిప్రహారాక్షమ మశ్వసాదీ. సం. రఘు. 7. 47.

**అశ్వసాదుఁడు** సం. వి. అ. పుం. గుఱ్ఱపురౌతు.

**అశ్వసృగాలిక** సం. వి. అ. స్త్రీ. గుఱ్ఱమునకును నక్కకును గలస్వాభావిక వైరము.

**అశ్వస్తనికుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) – అశ్వస్తనుఁడు. మను. 4. 7.

**అశ్వస్తనుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) ఱేపటికిఁ గావలసినపదార్థము జాగ్రత్తపెట్టుకొననివాఁడు. యాజ్ఞ. 1. 128.

**అశ్వహృదయము** సం. వి. అ. పుం. 1. గుఱ్ఱము యొక్క మనోగతభావము. 2. అశ్వముయొక్క మనోగతభావమును దెలుపువిద్యావిశేషము.

**అశ్వాశము** సం. వి. అ. పుం. దేవసర్షపము (వృ. వి.)

**అశ్వారి** సం. వి. ఇ. పుం. మహిషము, దున్నపోతు.

**అశ్వారోహ** సం. వి. ఆ. స్త్రీ. పెన్నేరు (వ్య. వి.)

**అశ్వారోహి** సం. విణ. (న్. ఈ. న్.) - అశ్వారోహుఁడు.

**అశ్వారోహుఁడు** సం. విణ. (అ. ఈ. అ.) గుఱ్ఱము నెక్కువాఁడు (రౌతు); గుఱ్ఱము నెక్కి యుద్ధము చేయువాఁడు (భటుఁడు).

**అశ్వి** సం. విణ. (న్. నీ. న్.) గుఱ్ఱములు గలవాఁడు. వి. న్. పుం. ద్వి. (అశ్వులు) అశ్వినీపుత్త్రులగు దేవవైద్యులు.

**అశ్వీకము** సం. విణ. (అ. ఈ. అ.)-గుఱ్ఱములచేఁ బోవునది-గుఱ్ఱములచే లాగఁబడునది(రథము).

**అశ్విని** సం. వి. ఈ. స్త్రీ. 1. నక్షత్రవిశేషము. 2. దేవవైద్యులతల్లి, బడబారూపమును దాల్చిన సూర్యపత్ని, సంజ్ఞాదేవి.

**అశ్వినీకుమారులు** సం. వి. అ. పుం. ద్వి. అశ్వినీసుతులు, దేవవైద్యులు.

**అశ్వీయము** సం. విణ. (అ. ఆ. అ.) గుఱ్ఱములకు హితమైనది.వి. అ. న. గుఱ్ఱముల సమూహము.

**అశ్వుఁడు** సం. వి. అ. పుం. అశ్వజాతిపురుషుఁడు.

**అశ్వులు** సం. వి. న్. పుం. ద్వి. అశ్వినీకుమారులు, దేవవైద్యులు.

**అశ్వోరసము** సం. వి. అ. న. మేటిగుఱ్ఱము,గుఱ్ఱములందు ముఖ్యమైనది.

**అషడక్షీణము** సం. విణ. (అ. ఆ. అ.) - ఆఱుకన్నులకు గోచరింపనిది — మూఁడవవానికిఁ దెలియనిది, ఇరువురకే తెలిసినది. (ఆలోచనము, మొ.)

**అషాఢ** సం. వి. ఆ. స్త్రీ. 1. పూర్వాషాఢా నక్షత్రము 2. ఉత్తరాషాఢానక్షత్రము.

**అష్ట** సం. విణ. (న్.) ఎనిమిది. (ఇది తెనుఁగున సమాసపూర్వపదముగనే యుండును. ఉదా:- అష్టపుత్త్రులు, అష్టాపదము, అష్టావింశతి, మొ.)

**అష్టక** సం. వి. ఆ. స్త్రీ. 1. శ్రాద్ధకాలవిశేషము. (హేమంతశిశిర ఋతువులలో బహుళాష్టమి తిథులు.); ఆ తిథులయందు చేయుశ్రాద్ధము. 2. అష్టమీతిథి. మను. 4. 114.

**అష్టకము** సం. విణ. (అ. ష్టికా. అ.) ఎనిమిది పరిమితి గలది. వి. అ. న. 1. ఋగ్వేదమందలి యొకభాగము.
(ఋగ్వేదమున ఎనిమిది అష్టకములు గలవు.) 2. ఎనిమిది. (అంకె.) 3. పాణిని రచించిన యష్టాధ్యాయి. 4. ఎనిమిదింటియొక్కసమూహము. (ఉదా:- గంగాష్టకము, కాలభైరవాష్టకము.)

**అష్టకర్ముఁడు** సం. వి. న్. పుం.—అష్టగతికుఁడు.

**అష్టకష్టములు** సం. వి. అ. న. బ. ఎనిమిదికష్టములు:— 1. దేశాంతరము. 2. భార్యావియోగము. 3. ఆపత్కాలమున బంధుదర్శనము. 4. ఉచ్ఛిష్ట భక్షణము. 5. శత్రుస్నేహము. 6. పరాన్న ప్రతీక్షణము. 7. భంగము. 8. దారిద్ర్యము.

**అష్టకాంగము** సం. వి. అ. పుం. న— ఎనిమిది గళ్లు గలది-నెత్తపలక. న. ఎనిమిది అంగములు గల రాజ్యము.
(స్వామ్యమాత్యసుహృత్కోశ రాష్ట్ర దుర్గబలానిచ । రాజ్యాంగాని ప్రకృతయః పౌరాణాం శ్రేణయోఽపిచ) — స్వామి, అమాత్యుఁడు, సుహృదుఁడు, కోశము, రాష్ట్రము, కోట, సైన్యము, పౌరశ్రేణి-ఇవి రాజ్యాంగములు.

**అష్టకి** సం. వి. న్. పుం. అష్టక యనుశ్రాద్ధ కర్మమును చేయుపురుషుఁడు.

**అష్టకుఁడు** సం. వి. అ. పుం. పాణినీయాష్టాధ్యాయి చదువువాఁడు.

**అష్టగతికుఁడు** సం. వి. అ. పుం— ఎనిమిదిగతివిశేషములు గలవాఁడు- రాజు.

శ్లో. ఆదానేచ విసర్గేచ తథా ప్రైషనిషేధయోః।
పంచమే చార్థవచనే వ్యవహారస్య చేక్షణే।
దండశుద్ధ్యోస్సదారక్తస్తే నాష్టగతికోనృపః।
(ఆ. ని.)

(1. పన్ను పుచ్చుకొనుట. 2. సేవకులకుజీతము మొదలయినవి యిచ్చుట. 3. ప్రత్యక్షకార్యములందుఁ గాని అప్రత్యక్షకార్యములందుఁగాని

మంత్రి మొదలగువారిని నియోగించుట. 4. దృష్టాదృష్టము లగు చెడుకార్యములనుండి మంత్రి మొదలగువారిని నిషేధించుట. 5. సందిగ్ధ కార్యములందు తనయాజ్ఞచేతనే ప్రవర్తింపఁజేయుట. 6. ప్రజల వ్యవహారములు తీర్చుట. 7. ఓడినవారినుండి శాస్త్రోక్తమైన ధనమును గ్రహించుట. 8. జనులు పాపము చేసినపుడు ప్రాయశ్చిత్తము నిర్ణయించుట - అనునెనిమిది పనులయందు ఆసక్తి గలవాఁడు.)

**అష్టగవము** సం. వి. అ. న. ఎనిమిది గోవులసమూహము.

**అష్టతయము** సం. విణ. (అ. ఈ. అ.) ఎనిమిది యవయవములు గలది. వి. అ. న. ఎనిమిదింటి సముదాయము.

**అష్టత్రికము** సం. వి. అ. న. ఇరువది నాలుగు.

**అష్టదిక్కులు** సం.వి.**ర**. స్త్రీ. బ. ఎనిమిదిదిక్కులు. (తూర్పు, అగ్నిమూల, దక్షిణము, నిరృతిమూల, పడమర, వాయువుమూల, ఉత్తరము, ఈశాన్యదిక్కు.)

**అష్టద్రవ్యములు** సం. వి. అ. పుం. న. బ. యజ్ఞమునకు వలయు నెనిమిది ద్రవ్యములు.

శ్లో. అశ్వత్థోదుంబరప్లక్షన్యగ్రోధసమిధస్తిలాః। సిద్ధార్థపాయసాజ్యాని ద్రవ్యాణ్యష్టౌ విదుర్బుధాః-(రావి, మేడి, జువ్వి, మఱ్ఱి—వీని సమిధలు—నువ్వులు, ఆవలు, పరమాన్నము, నేయి.)

**అష్టధాతువులు** సం. వి. అ. పుం. బ. బంగారు, వెండి, రాగి, తగరము, తుత్తినాగము,సీసము, ఇనుము, పాదరసము-అను నెనిమిదిధాతువులు. (స్వర్ణం రూప్యం చ తామ్రం చ రంగం యశదమేవచ,సీసం లోహం రసశ్చేతి ధాతవోఽష్టౌ ప్రకీర్తితాః.)

**అష్టపత్త్రిక** సం. వి. ఆ. స్త్రీ. నాగమల్లె (వృ. వి.)

**అష్టపదిక** సం. వి. ఆ. స్త్రీ. జయదేవకృతమైన గీతగోవిందములోని గీతవిశేషము.

(ఇందు తఱచు ఎనిమిదిపాదము లుండును.)

**అష్టపాత్తు** సం. విణ. (ద్. ద్, పదీ. ద్ — ఇది బుక్కునకు విశేషణ మగునప్పుడు స్త్రీలింగమున 'అష్టపదా' అగును.) ఎనిమిది పాదములు గలది. వి. ద్. పుం. 1. శరభమృగము. 2. సాలెపురుగు.

**అష్టభోగములు** సం. వి. అ. పుం. బ. 1. గృహము, శయ్య, వస్త్రం, ఆభరణము, స్త్రీ, పుష్పము, గంధము, తాంబూలము—అను నెనిమిది భోగములు.

2. భూసంబంధమైన యెనిమిదిభోగములు.

వ. నిధి, నిక్షేప, జల, పాషాణ, అక్షీణ(అక్షీణీ, అని కొందఱు) ఆగామి, సిద్ధ, సాధ్యంబు లనియెడి అష్టభోగ తేజస్స్వామ్యాలును అనుభవించుమని...ద. శా. 4. 800.

('నిధి, నిక్షేపము, అక్షీణము, ఆగామి, సంచితము, జలము, తరువు, పాషాణము' అని కిటెల్ కన్నడ నిఘంటువు)

**అష్టమంగళము** సం. వి. అ. పుం. మొగము, తోఁక, జూలు, ఱొమ్ము,గొరిజలు-ఈ యెనిమిదిమాత్రము తెల్లగానుండు గుఱ్ఱము. న. ఎనిమిదిమంగళవస్తువుల సముదాయము. 'సింహము, ఎద్దు, ఏనుఁగు, కలశము, వ్యజనము (వీవన), వైజయంతి(జెండా),భేరి, దీపము' (అనికొందఱు.) 'బ్రాహ్మణుఁడు, గోవు, అగ్ని, బంగారు,నేయి, ఆదిత్యుఁడు, జలము, రాజు, (అనికొందఱు.)

**అష్టమకము** సం. విణ. (అ. మికా. అ.) ఎనిమిదవది.

**అష్టమకాలికుఁడు** సం. విణ. (అ. ఈ. అ.) ఏడు పూఁటలు భోజనము మాని ఎనిమిదవపూఁట భోజనము చేయువాఁడు, మూఁడుదినముల పూఁట ఉపవసించి నాల్గవనాఁటిరాత్రి భుజించువాఁడు (ఒక విధమగు వానప్రస్థుఁడు.)

**అష్టమము** సం. విణ. (అ. ఈ. అ.) ఎనిమిదవది.

**అష్టమానము** సం. వి. అ. న – ఎనిమిది ముష్టుల కొలత-ఒకకుడవము, మానిక, కుంచములో నాల్గవవంతు.

**అష్టమి** సం. వి. ఈ. స్త్రీ. పక్షములో ఎనిమిదవతిథి.

**అష్టమిక** సం. వి. ఆ. స్త్రీ. నాలుగుతులముల యెత్తు.

**అష్టమూర్తి** సం. వి. అ. పుం. శివుఁడు. (అష్టమూర్తులు — పంచభూతములు, సూర్యచంద్రులు, యజ్ఞము చేసిన పురుషుఁడు.)

**అష్టరసములు** సం. వి. అ. పుం. బ. (అలం) ఎనిమిది రసములు. (శృంగారము, హాస్యము, కరుణము, రౌద్రము, వీరము, భయానకము, బీభత్సము, అద్భుతము. వీనితోఁగూడ శాంతము చేరి తొమ్మిది యని కొందఱు.)

**అష్టలోహకము** సం. వి. అ. న. ఎనిమిదిలోహముల సముదాయము. (సువర్ణం రజతం తామ్రం సీసకం కాంతికం తథా। వంగం లోహం తీక్ష్ణలోహం లౌహ్యానష్టావిమాని తు.)

**అష్టవర్గము** సం. వి. అ. పుం. (జ్యోతి) 1. పురుషుని శుభాశుభములను సూచించు గ్రహచక్రభేదము.
2. ఎనిమిదిఅక్షరవర్గముల సముదాయము.
(అ. క. చ. ట. త. ప. య. శ. వర్గములు.)

**అష్టశోభనములు** సం. వి. బ. (క. అష్టశోభ) ఎనిమిది విధములగు నగరాలంకారములు. (నీళ్ళు చల్లుట, ముగ్గులు పెట్టుట. పందిరులు వేయుట, తోరణములుకట్టుట, ధ్వజములెత్తుట, -కొందఱు ఇట నృత్తగీతవాద్యము లందురు- చిత్రములు వేయించుట, ధూపదీపములు పెట్టుట, పూర్ణకుంభము లుంచుట, అనునవి.)

వ. ...పాంచాలపతియును గరం బనురాగం బునఁ బురం బష్టశోభనంబు సేయించి... భార. ఆది. 7. 281.

**అష్టాంగధూపము** సం. వి. అ. పుం. జ్వరనాశకమగు నొక ధూపము.

'పలంకషా నింబపత్రం వచా కుష్ఠం హరీతకీ। సర్షపాః సయవాః సర్పిర్ధూపనం జ్వరనాశనమ్.' (గుగ్గిలము, వేఁపాకు, వస, చెంగల్వకోష్టు, కరకకాయ, ఆవలు, యవలు, నెయ్యి — ఈ యెనిమిది ధూపద్రవ్యములు.)

**అష్టాంగము** సం. విశే. (అ. అ. ఈ. అ.) ఎనిమిది యంగములు గలది. వి. అ. పుం. 1. ప్రణామవిశేషము.

'జానుభ్యాం చ తథా పద్భ్యాం పాణిభ్యాముర సా ధియా, శిరసా వచసా దృష్ట్యా ప్రణామోష్టాంగ ఈరితః.' (మోఁకాళ్లు, పాదములు, చేతులు, ఱొమ్ము, బుద్ధి, తల, మాట, చూపు- వీనిచేఁ జేయు నమస్కారము.)

2. యోగవిశేషము — దీని యంగములు :- 'యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధారణ, ధ్యానము, సమాధి.'

3. ఆయుర్వేదము-దీనియంగములు:-'శల్యము, శాలాక్యము, కాయచికిత్స, భూతవిద్య, కౌమారభృత్యము, అగదతంత్రము, రసాయనతంత్రము, వాజీకరణతంత్రము.'

4. సూర్యార్ఘ్యము-దీనియంగములు:- 'నీళ్లు, పాలు, తేనె, పెరుఁగు, కుశాగ్రములు, నెయ్యి, ఎఱ్ఱగన్నేరు, ఎఱ్ఱచందనము.'

5. పూజావిధి. (అర్ఘ్యము)-దీని యంగములు:— 'జలము, పాలు, కుశాగ్రములు, పెరుఁగు, నెయ్యి, బియ్యము, యవలు, తెల్లావలు.'

6. నెత్తపలక, పాచికలాడు పలక. (దీనికి ప్రతి పంక్తియందును ఎనిమిదేసి గళ్లుండును.)

7. న్యాయసభ-దీని యంగములు:— 'చట్టము (విధి), ప్రాడ్వివాకుఁడు (న్యాయ సభాధ్యక్షుఁడు), న్యాయసభ్యుఁడు, కరణము (లేఖకుఁడు), జోస్యుఁడు, బంగారు, నిప్పు, నీళ్లు.'

**అష్టాంగహృదయము** సం. వి. అ. న. ఒకవైద్యక గ్రంథము.

**అష్టాకపాలము** సం. విశే. (అ. ఆ. అ.) ఎనిమిది మట్టిపాత్రములలో సంస్కరింపఁ బడినది (పురోడాశాది)

**అష్టాగవము** సం. విశే. (అ. ఆ. అ.) ఎనిమిది యెడ్లచే లాగఁబడునది (శకటము.).

**అష్టాదశ** సం. విశే. (న్.) పదునెనిమిది. (ఇది తెలుఁగున సమాసపూర్వపదముగనే ప్రయుక్తమగును.)

1. అష్టాదశ పురాణములు :- బ్రాహ్మము, పాద్మము, వైష్ణవము, శైవము, భాగవతము, నారదీయము, మార్కండేయము, ఆగ్నేయము, భవిష్యత్తు, బ్రహ్మవైవర్తము, లైంగము, వారాహము, స్కాందము, వామనము, కౌర్మము, మాత్స్యము, గారుడము, బ్రహ్మాండము,

2, అష్టాదశోపపురాణములు :- సనత్కుమారము, నారసింహము, నారదీయము, కౌమా

రము, శివధర్మము, దౌర్వాసము, కాపిలము, మానవము, ఔశనసము, బ్రహ్మాండము, వారుణము, కాళికము, మాహేశ్వరము. శాంబము, సౌరము, ప్రవరము, శ్రీభాగవతము, దేవీ భాగవతము.

3. అష్టాదశధాన్యములు:-యవలు, గోధుమలు, వరి, నువ్వులు, కొఱ్ఱలు, ఉలవలు, మినుములు, పెసలు, చిఱుసెనగలు, అనుములు, చామలు, ఆవలు, గవేధుకములు, నివ్వరిధాన్యము, కందులు, సతీనకములు, సెనగలు. చీనిధాన్యము.

4. అష్టాదశ విద్యలు:- నాలుగు వేదములు, ఆఱు వేదాంగములు, మీమాంస, న్యాయశాస్త్రము, పురాణము, ధర్మశాస్త్రము, ఆయుర్వేదము, ధనుర్వేదము, నీతిశాస్త్రము, గాంధర్వము.

5. అష్టాదశవివాదస్థానములు:-ఋణము పుచ్చుకొని అనుకొన్నప్రకారముగా ఈయకపోవుట, ఒకనియొద్ద సొమ్ము దాఁచుకొనుట, హక్కులేకుండ అమ్ముట, కొందఱు కలిసి వ్యాపారము చేసికొనుట, దానము చేసినది మరల పుచ్చుకొనుట, కూలి మొదలగునవి యీయకుండుట, చేసికొన్న యేర్పాటును దాఁటుట, క్రయవిక్రయముల యెడల పశ్చాత్తాపముచే మాట తిరిగిపోవుట, యజమానునకును పశుపాలకునకును విరోధము, సరిహద్దులవిషయము, తిట్టుట, కొట్టుట, దొంగతనము, బందిపోటు, స్త్రీలను చెఱపట్టుట, స్త్రీపురుషుల పరస్పర ధర్మముల యేర్పాటు, దాయము పంచుకొనుట. ద్యూతము. (జూదము, కోడిపందెము, గుఱ్ఱపు పందెము మొదలైనవి)

6. అష్టాదశ వర్ణనలు:-పురము, సముద్రము, పర్వతము, ఋతువులు, సూర్యుఁడు, చంద్రుఁడు, జలక్రీడ, ఉద్యానవనము, మధుపానము, రతి. విరహము, వివాహము, పుత్త్రోదయము, నీతి, యాత్ర, యుద్ధము, ద్యూతము, రాజు–వీనివర్ణనలు.

7. అష్టాదశ జాతులు :– బ్రహ్మ, క్షత్త్రియ, వైశ్య, శూద్ర, వ్యావహారిక, గోరక్షక, శిల్పక, పంచాణ, కుంభకార, తంతువాయ, క్షౌరక, రజక, వస్త్రచ్ఛేదక, చర్మకార, జీవఘాతుక, లుబ్ధక, చండాల, మాతంగజాతులు.

8. అష్టాదశ స్మృతులు :– మనుస్మృతి, దక్షస్మృతి, యమస్మృతి, బృహస్పతి స్మృతి, శంఖలిఖితస్మృతి, పరాశరస్మృతి, యాజ్ఞవల్క్యస్మృతి, విష్ణుస్మృతి, అత్రిస్మృతి, అంగిరస్స్మృతి, సంవర్తస్మృతి, శాతాతపస్మృతి, ప్రాచేతసస్మృతి, హారితస్మృతి, ఆపస్తంబస్మృతి, గౌతమస్మృతి, ఉశనస్స్మృతి, ఆశ్వలాయనస్మృతి. (సంఖ్యార్థనామ ప్రకాశిక.)

**అష్టాదశము** సం. విశే. (అ. ఈ. అ.) పదునెనిమిదవది.

**అష్టాదిశాబ్దికులు** సం. వి. అ. పుం. బ. ఎనమండ్రు పూర్వవైయాకరణులు (ఇంద్రుఁడు, చంద్రుఁడు, కాశకృత్స్నుఁడు, ఆపిశలి, శాకటాయనుఁడు, పాణిని, అమరుఁడు, జైనేంద్రుఁడు)

**అష్టాధ్యాయి** సం. వి. ఈ. స్త్రీ. పాణిని రచించిన సంస్కృతవ్యాకరణము. (ఇందెనిమిది అధ్యాయములు గలవు.)

**అష్టాపదము** సం. వి. అ. పుం. 1. ఎనిమిది పాదములు గలది–శరభమృగము. 2. సాలెపురుగు. 3. కైలాసము. పుం. న.-ఎనిమిదిధాతువులందు ప్రతిష్ఠకలది – బంగారము. న. – ప్రతిపంక్తియందును ఎనిమిదేసి గదులుగలది–నెత్తపలక.

**అష్టాపది** సం. వి. ఈ. స్త్రీ. అడవిమల్లె (వృ.వి.)

**అష్టావక్రుఁడు** సం. వి. అ. పుం.-ఎనిమిదివంకరలు గల శరీరముతోఁ బుట్టినవాఁడు–ప్రసిద్ధుఁడగు నొకఋషి, ఉద్దాలకుని శిష్యుఁడగు ఏకపాదుని కొడుకు.

**అష్టావధానము** సం. వి. అ. న. (కవులు, మొ.) ఎనిమిది భిన్నవిషయములం దేకకాలమున హెచ్చరిక కలిగియుండును. (కావ్యపాఠము, కవిత్వము, సమస్యాపూరణము, పురాణము చెప్పుట, లోకవార్తలు ముచ్చటించుట, వ్యస్తాక్షరి, చదరంగమాడుట, పైఁబడినపువ్వులు లెక్కించుట ఇవి భిన్న విషయములు)

**అష్టావధానములు** వి. బ. ఆశ్వికులు నేర్వవలసిన పద్ధతులు.

గీ. వాజిగుణమును రాగెయు వాగె భూమి,
మానమును శరశస్త్రసంధానములును,
జోడుపర శస్త్రములరాక సూటివిధము,
ననెడు యష్టావధానము లాత్మ నెఱిఁగి
ప్రబంధ. 184.

**అష్టావింశతి** నం. వి. ఇ. స్త్రీ. ఇరువదియెనిమిది.

**అష్టావింశతితమము** నం. విశే. (అ. ఈ. అ.) ఇరువది యెనిమిదవది.

**అష్టావింశము** నం. విశే. (అ. ఈ. అ.) ఇరువది యెనిమిదవది.

**అష్టాశ్రము** నం వి. అ. న. (గణిత) ఎనిమిది మూలలు గల ఆకృతి.

**అష్ఠీల** నం. వి. ఆ. స్త్రీ. 1. వాయువువలన బొడ్డు క్రిందఁ గలిగెడువాఁపు. 2. ఒకవిధమైనమూత్ర రోగము. 3. గుండ్రనిఱాయి.

**అష్ఠీలిక** నం. వి. ఆ. స్త్రీ. 1. ఒకవిధమైన వ్రణము. 2. గులకఱాయి.

**అష్టైశ్వర్యములు** నం. వి. అ. న. బ. అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశత్వము, వశిత్వము.

**అష్ఠీవత్తు** నం. వి. త్. పుం. న. మోఁకాలు.

**అసంఖ్యము** నం. విశే. (అ. ఆ. అ.) సంఖ్య లేనిది, లెక్కింప రానిది.

**అసంఖ్యాతము** నం. విశే. (అ. ఆ. అ.) ఇన్ని యని లెక్కింప రానిది, బహుసంఖ్య గలది.

**అసంఖ్యేయము** నం. విశే. (అ. ఆ. అ.) లెక్కింప శక్యము కానిది.

**అసంగతము** నం. విశే. (అ. ఆ. అ.) 1. కూడనిది, సంబంధము లేనిది. 2. పొసఁగనిది, యుక్తి శూన్యము.

**అసంగతి** నం. విశే. (ఇ.) 1. కూడిక లేనిది, సంబంధము లేనిది. 2. యుక్తి లేనిది, పొసఁగనిది. వి. ఇ. స్త్రీ. 1. కూడికలేమి, సంబంధములేమి. 2. యుక్తిలేమి, పొసఁగకుండుట. 3. ఒక అర్థాలంకారము, కార్యకారణములకు భిన్న దేశస్థితివర్ణనము.
ఉదా: భూభారమును వహించు వాఁడీరాజు-వంగుచున్నవి సామంత రాజుల శిరములు.

**అసంగము** నం. విశే. (అ. ఆ. అ.) 1. సంబంధము లేనిది. 2. అడ్డు లేనిది.
శ్లో. అసగమద్రిష్వపి సారవత్తయా నమే త్వద న్యేన విసోఢమాయుధమ్, సం-రఘు. 3.63.
(అసంగమ్ = అప్రతిబంధమ్. మల్లి. వ్యా.) 3. కూడికలేనిది. వి. అ. పుం. అనుబంధము లేమి.

**అసంగి** నం. విశే. (న్. నీ. న్.) 1. సంబంధము లేనివాఁడు. 2. భోగాసక్తి లేనివాఁడు.

**అసందర్భము** నం. విశే. (అ. ఆ. అ.) సందర్భము లేనిది. వి. అ. పుం. సందర్భములేమి.

**అసంప్రజ్ఞాతము** నం. విశే. (అ. ఆ. అ.) 1. బాగుగాఁ దెలియఁబడనిది. 2. జ్ఞేయజ్ఞానజ్ఞాతృభేదములేనిది, నిర్వికల్పము (సమాధి).

**అసంబద్ధప్రలాపము** నం. వి. అ పుం. 1. అసంగతమైనదానిని (ఒకటి కొకటి పొసఁగనిదానిని) చెప్పుట. 2. అప్రస్తుతమైనదానిని (అప్పటికి ప్రస్తావింపఁ దగనిదానిని) చెప్పుట.

**అసంబద్ధము** నం. విశే. (అ. ఆ. అ.) 1. సంబంధము లేనిది, అసంగతమైనది. 2. పరస్పరాన్వయము లేనిది (వాక్యము).

**అసంభవము** నం. విశే. (అ. ఆ. అ.) సంభవింపనిది, కలుగనిది. వి. అ. పుం. సంభవములేమి, కలుగమి.

**అసంభావనీయము** నం — అసంభావ్యము.

**అసంభావ్యము** నం. విశే. (అ. ఆ. అ.) 1. గ్రహింప శక్యము గానిది. 2. ఊహింప రానిది.

**అసంశయము** నం. విశే. (అ. ఆ. అ.) సంశయము లేనిది, నిశ్చితము వి. అ. పుం. సంశయములేమి.

**అసంహతము** నం. విశే. (అ. ఆ. అ.) 1. కూడుకొననిది, కలిసి యుండనిది. 2. పేరుకొననిది, గడ్డకట్టనిది. వి.అ.న.బలములు వేఱువేఱుగాఁ దీర్చిన వ్యూహవిశేషము.

**అసంహతుఁడు** నం. వి. అ. పుం. (సాంఖ్య) పురుషుఁడు, జీవాత్మ.

**అసక్తము** నం. విశే. (అ. ఆ. అ.) 1. ఆసక్తిలేనిది, తగులు లేనిది. 2. ఫలాభిలాష లేనిది. 3. అడ్డు లేనిది, నిరంతరము.

శ్లో.... అస క్తమూధాంసి పయఃతరం త్యమూః ...సం. కిరా. 4. 31.

(అస క్తం—అప్రతిబంధం. మల్లి. వ్యా.)

**అసడ్డ** వి. (సం. అశ్రద్ధా. ప్రా. అసడ్ఢో. క. అసడ్డె. త. అసట్టై.) అశ్రద్ధ, ఉపేక్ష; తిరస్కారము, తృణీకారము.

(ఇంద్రబలిసంవాదము)

ఆ. సరకు సేయ వను చసడ్డమాటలు గొన్ని, యాడినంత నేమి యయ్యె నింద్ర, నీదు శక్తి వింతయే దైవవశమున, నెట్టిపాటి వారు నెట్లుఁ గారె. భార. శాం. 4. 426.

**అసతి** సం. వి. ఈ. స్త్రీ. కులట, అంకుటాలు.

**అసత్ఖ్యాతి** సం. వి. ఇ. స్త్రీ. 1. భ్రమ విషయమున శూన్యవాదితము (ఈ మతమున 'ఇదం రజతం' అను భ్రమస్థలమున శశ శృంగమువలె నత్యంతాసత్తగు రజతము ఇదం పదార్థమగు శక్తియందు విశేషణమై భాసించును.) 2. అపకీర్తి.

**అసత్తు** సం. విణ. (సే. తే. సే — శ్వతంత్రమైనను దీనికి తెలుఁగునఁగూడ వ్యస్తప్రయోగము కలదు.)

1. లేనిది, అయథార్థము.

సీ. సత్తుగా దాత్మవిజ్ఞానంబుచే నెం దభావమై బాధింపఁబడుటవలన, నెలమి నసత్తుగా దే నజ్ఞుఁడ నటంచు నజ్ఞానభూతమై యల రుచునికి. సీతారా. 2. 21.

2. దుష్టమైనది, చెడ్డది.

**అసత్యము** సం. విణ. (అ. ఆ. అ.) సత్యముకానిది (వ్యవహారాది). వి. అ. న. బొంకుమాట.

**అసదధ్యేతి** సం. వి. ఋ. పుం. శాఖారండుఁడు, స్వశాఖను పరిత్యజించి యన్యశాఖను అధ్యయనము చేయువాఁడు.

**అసదు** విణ. (క. అసిదు.) 1. అల్పము, తక్కువది; దుర్బలము.

గీ. విశిఖవనకంబు నాటించి వెగడుపఱిచి, పేర్చి యార్చిన సురకోటి పిచ్చలించె, మెచ్చి భీష్మాదు లెల్ల వివ్వచ్చుఁబోలు, నెక్కుడగుఁ గాని యసదు గాఁడితఁ డనిరి. భార. భీష్మ. 1. 272.

సీ. అసదుగాలియె వెట్ట యగునేని నింతకుఁ గమల వనం బెల్లఁ గ్రాఁగకున్నె. రాజ. చ. 3. 111.

(అసదుగాలి—మందమారుతము)

గీ. పాండవులు కౌరవులతోడిపగకు నొల్ల, రఖిల భూప్రజనాశన మగుటఁజేసి, వార లసదని తలఁపంగ వలవదు ... భార. ఉద్యో. 1. 234.

ఆ. పాదరోగు లకుచిపదముల దేవాల,యములు మెట్టుటయును నసదువారిఁ, దప్పులేక క్రొవ్వి తన్నుటయును దొలు, పుట్టునందుఁ గలిగినట్టివారు. భార. అను. 5. 102.

2. దీనుఁడు.

గీ. అసదుగాఁ జూడ కీమాట యఘము చెంద, దసదుగా నిన్ను వేఁడెద యతివరేణ్య, యలమట సహింపఁజాలను బొలియ నొక్క, మందు గల్గిన దయసేయుమా రయమున. సారంగ. 3. 189.

3. కృశము, సన్ననిది.

సీ. పాలిండ్లు దను వెడ వ్రాలింపఁ జెన్నొందు నసదుఁగౌఁదీఁగె యల్లాడుచుండ. భార. విరా. 4. 26.

చ. కరమసదైన యాసుదతి కౌను ... నైష. 3. 196.

**అసదృశము** సం. విణ. (అ. ఆ. అ.) 1. అసమానము, సాటిలేనిది. 2. తగనిది, అనర్హమైనది. 3. సాటికానిది.

**అసద్గ్రహము** సం. వి. అ. పుం. బాలాదుల పెంకెపట్టు. 2. దురభిప్రాయము.

**అసద్ధేతువు** సం. వి. ఉ. పుం. 1. (తర్క) వ్యభిచారాదిదోషయుక్త మగుహేతువు, హేత్వాభాసము. 2. దుష్టకారణము.

**అసద్భావము** సం. వి. అ. పుం. 1. ఉనికిలేమి. 2. చెడ్డయభిప్రాయము. 3. చెడ్డస్వభావము.

**అసనపర్ణి** సం. వి. ఈ. స్త్రీ. పోమిదము (వృ.వి.)

**అననము** సం. వి. అ. న. 1. త్రోయుట. 2. (బాణాదులను) వేయుట. 3. చిమ్ముట. పుం. పీతసాలము, వేఁగిస (వృ. వి.)

**అనని** సం. విశ. (ఇ.) 1. త్రోయువాఁడు 2. చిమ్మువాఁడు. 3.(బాణములు) వేయువాఁడు.

**అసభ్యము** సం. విశ. (అ. ఆ. అ.) సభకుఁ దగనిది, అశ్లీలము (ప్రసంగము, మొ.)
అసభ్యుఁడు – సభకుఁ దగనివాఁడు.

**అసమంజసము** సం. విశ. (అ. ఆ. అ.) సమంజసము కానిది.

**అసమక్షము** సం. విశ. (అ. ఆ. అ.) ప్రత్యక్ష విషయము కానిది, ఎదుట లేనిది, పరోక్షమున నున్నది.

**అసమగ్రము** సం. విశ. (అ. ఆ. అ.) సంపూర్ణము కానిది.

**అసమనయనుఁడు** సం. వి. అ. పుం. ముక్కంటి, శివుఁడు.

**అసమబాణుఁడు** సం. వి. అ. పుం. – బేసి (ఐదు) బాణములు గలవాఁడు – మన్మథుఁడు.

**అసమము** సం. విశ. (అ. ఆ. అ.) 1. తుల్యము కానిది, సాటి కానిది. 2. సరికానిది, బేసి (సంఖ్య.) 3. నిరుపమానము, సాటి లేనిది. 4. ఒడుదొడుకైనది, మిట్టపల్లములు గలది (నేల.)

**అసమయము** సం. వి. అ. పుం. 1. తగనివేళ. 2. దుష్టకాలము.

**అసమర్థము** సం. విశ. (అ. ఆ. అ.) 1. అశక్తము, దుర్బలము. 2. అసంగతార్థమైనది, ఉద్దిష్టార్థము దెలుప నశక్తమైనది. (శబ్దము.) వి. అ. న. (అలం) పదదోషములలో నొకటి.

**అసమర్థసమాసము** సం. వి. అ. పుం. అన్యోన్యము ఆకాంక్షలేని పదములసమాసము, పరస్పరాన్వయము లేని పదముల సమాసము.
ఉదా : 'అసూర్యంపశ్య' అను దానిలోని 'అసూర్య' అనునది అసమర్థసమాసము.

**అసమవాయికారణము** సం. వి. అ. న. (తర్క.) కారణవిశేషము, సమవాయి కారణమునకు సన్నిహితమగు కారణము.(తంతుసంయోగము పటమునకును తంతురూపము పటరూపమునకును అసమవాయికారణములు.)

**అసమవృత్తము** సం. వి. అ. న. (ఛంద) నాలుగు పాదములును సమముగా నుండనివృత్తము, విషమవృత్తము.

**అసమానము** సం. విశ. (అ. ఆ. అ.) 1. సమానము లేనిది, సాటిలేనిది. 2. సమానము కానిది.

**అసమీక్ష్యకారి** సం. విశ. (న్. ఈ. న్.) చక్కఁగా ఆలోచింపక పని చేయువాఁడు.

**అసము**[1] వి. (సం. యశః.) యశము, కీర్తి.
క. ఎదుఁ గుదురగువేడుకఁ బొగడుదుఁ బది యరదముల దొరకొడుకుకతకడునిం,పొదవఁ గదియించి యసమునఁ, బొదలినబల్లిదునిఁ బుట్టపుట్టువు తపసిఁ. అచ్చ. రా. బాల. 9.
ఆ. కనకరచితరుచిరకల్పావనీరుహా, కుసుమమిచ్చెఁ దనకు నసము వెరుగ శా.ప. మ.3.

**అసము**[2] వి. (క. అస – బలము.) అహంకారము, గర్వము, దర్పము.
చ. అసమున మీఁ దెఱుంగక మహోగ్రహవృత్తిఁ గడంగి చెచ్చెరం, బసులకుఁ గూయిగాఁ జని యెఁ బాపఁడు కౌరవసేన యెడయొం, టి సనుట యేడ...భార. విరా. 5. 234.
2 ఉత్సాహము.
క.వసురుచి పితుకఁగఁ బాత్రము,బిసరుహముగఁ జిత్రరథుఁడు పెయ్యగఁ గొని రిం,పెసఁగఁగ గానకళం, బసమున గంధర్వవరులు నమరాంగనలుఁ. హరి. పూ. 1. 127.

**అసము**[3] వి. (సం. వశః?) 1. చనవు.
చ....ఈకుసుమసుగంధి కేవలము గోల సుమీ యస మీఁ దలంచుమీ.
చ. అనుటయు దండనాథసుతుఁ డానృపకన్యక నాదరించెఁ ద, జ్జనకుఁడు సమ్మతించె ... శుక. 1. 335, 336.
2. అవకాశము, వీలు.
చ. తఱిమి వధింప శత్రునకుఁ దా నస మీక ... వేం. పంచ. 4. 18.

**అనమ్మతము** నం. విశే. (అ. అ. అ.) సమ్మతము కానిది, ఇష్టము కానిది.

**అనమ్మతి** నం. వి. ఇ. స్త్రీ. అనుమతింపమి, ఇష్టము లేమి.

**అనరు** వి. (√వసరు) వసరు.

సీ. ...విను మొక్కనాఁ డత్తపస్విప్రవే ల్పాటి దర్భ. ఆ. గంటిఁ గూర యనరు గాటిన వర్తించె, నతఁడు తపమునిద్ధి కాత్మఁబొంగి. భార. శల్య. 2. 160.

('తతేః కిలకరే రాజం స్తస్య శాకరసోఽ స్రవత్.'-మూలము. (శ. ర.)

విశే- వసరు గలది- లేతది; అల్పము.

సీ. దయచేసి తత్ప్రార్థితము లైన వరముల నొసఁగి యవ్వసిగా వుటనరుబుద్ధి. పాండు. 5. 157. ('అసర' అపముద్రి)

**అనలారు** — ఎసలారు. అ. క్రి. 1. అతిశయిల్లు, అధికమగు.

క. వసియించు నమ్ముదితఁ బ్రియ, మసలారఁగఁ గాంచి వచ్చునప్పుడ. భారం. అను. 2. 6.

ద్వి. అసలార భోగించి యాదట లేక. బస. పు. 5. 262.

2. ఒప్పు.

ద్వి....చేతులుం బొసఁగ, బిసములు జక్కవల్ బిగువుచన్నులును వసలారునాభియు నావర్త నంబు. నవ. 1. 18పొ. 24 పం.

**అనలు**[1] వి. బొ. పంకము, బురద.

సీ. దినవారిరాశి మానుమౌని గ్రోలంగ నడు గునఁ గనుపట్టునస లనంగ. పారి. 2. 84.

గీ. మేటిజమ్మేటియసటఁ గ్రొమ్మిoచుమించుఁ, బొదివి మదన ప్రతాపాగ్నిఁ బుటముపెట్టి. వసు. 2. 82.

**అనలు**[2] వి. నికరము, సారము (చి. ని. శ. ర.)

అసటఁబెట్టు - బురదలోఁబెట్టు; కీడ్పరుచు.

సీ. మోమోట నలరుతమ్ములతావు లగలింపఁ గనుసన్న మనురుషకముల నలఁపఁ, జూడ నాసవమైత్రిఁ జొక్కినయళి రేఁప నరకుత్తి కగు నంకులసటఁబెట్టఁ, గై వసంబగు బిసాగ్ర ముల నున్మూలింప...వేం. పంచ. 4. 180.

జ. అసలుకొను,అసలుకొల్పు, అసలుఁబుట్టువు.

**అనలుఁబుట్టువు** వి. (√అసలు) — బురదయంఁ పుట్టినది - పంకజము, పద్మము. అచ్చ. రా కాల. 4.

**అనలుకొను** అ. క్రి. (√అసలు) 1. బురదవ నగు.

సీ. అలఁతి లేఁజెమటచే వసలుకొన్న అలాఁ కుంకుమంబునఁ జిన్నికురులు మునుఁగ కాశీ. 1. 3.

క. ఒడల నసలుకొను నెత్తురు, గడిగి రఘూద్వ హుని సమ్ముఖము చేయుదు ని, వ్వడుగ నని తనరథముపై, నిడుకొని చనియెన్మ హాత్వ మేఁగెడు దెసకుఁ. జై.భా.6.128.

2. పంకిలమగు, బురద కలది యగు. (చూ. అసలుకొల్పు)

**అనలుకొల్పు** న. క్రి. (√అసలుకొను) పంకిలము చేయు, బురద కలదిగాఁ జేయు.

సీ. మసిబొట్టు బోనాన వసలుకొల్పినకన్ను కొడుపుచేఁ దాటించు నెడపఁదడవ. క్రీడా. 1. 186.

**అనలుమనలు** అ. క్రి. అసలారు, ఒప్పు.

గీ. భసలకలభకులాస్పృష్టకుసుమవిసర, మసృణ మకరందమయమైన మావిమొక, కిసల యచ్ఛవిపునరుక్తి నసలుమసలు, ఋషుల చెంగావివలువందు నిందువదన. పాండు. 1. 181.

**అనవన** వి. అలసత్వము, జాగు.

క. పమిట నెగ్గొనరించితిఁ, గాముఁడ నీ కేను నన్ను గాసించెద విం, దేమి ప్రయోజన మసవస, లేమిటి కొక మరియ తీర్ప వేలొకొ చెపుమా. దశకు. 7. 109.

**అనహత్వము** నం. వి. అ. న. ఓర్వలేమి.

ఉ....జగ, త్పావను ధర్మనందను సభాస్థితుఁ జూచి ముదంబు నెందిరిం, ద్రావరజాది మిత్రు లసహత్వముఁ బొందిరి ధార్త రాష్ట్రులుఁ. భార. సభా. 2. 78.

**అనహనము** నం. విశే (అ. అ. అ.) 1. ఓర్పులేనిది. తమ లేనిది. 2. అమాయగలది. వి. అ. న. 1. ఓర్వలేమి, సైఁపమి. 2. అమాయ.

**అనహనుఁడు** నం. వి. అ. పుం. శత్రువు.

**అసహమానుఁడు** నం. విణ. (అ. ఆ. అ) ఓర్వని వాఁడు.

**అసహము** నం. విణ. (అ. ఆ. అ) ఓర్వనిది, సహింప నిది.

**అసహాయుఁడు** నం. విణ. (అ. ఆ. అ.) తోడు లేని వాఁడు, సహాయులు లేనివాఁడు.

**అసహించు** నం. అ. క్రి. అసూయపడు.

ద్వి. తద్గురుకరుణానితాంతసంస్థితికిఁ, దనతోడి శిష్యు లెంతయు ననహింప. పండితా పురా. 109 పా.

**అసహిష్ణువు** నం. విణ. (ఉ.) ఓర్వనివాఁడు.

**అసహ్యపడు** మి. అ. క్రి. (√అసహ్యము.)

1. రోఁతపడు.

క. పరులధనమునకు...అసహ్యపడున న్నరుఁడు దెవులు లేని వేదనం బడు నధిపా. భార. ఉద్యో. 2. 58.

క. అందఱు నచ్చోట నిజ స్యందనములు డిగ్గి మ్రొక్క సంయమి మదిలో, నిందులకును హాతి యెక్కుడి, సందడి గొనివచ్చెనని యస హ్యపడంగన్ జై. భా. 8. 136.

2. అసూయపడు.

**అసహ్యము** నం. విణ. (అ. ఆ అ.) సహింప రానిది.

**అసహ్యించు** నం. అ. క్రి. అసహ్యపడు. (శ. ర. వా.)

**అసాక్షికము** నం. విణ. (అ. ఆ. అ.) సాక్షి లేనిది.

**అసాక్ష్యము** నం. విణ. (అ. ఆ. అ.) సాక్ష్యము లేనిది. వి. అ. న. సాక్ష్యములేమి.

**అసాధనీయము** నం విణ. (అ. ఆ. అ.) 1. సాధింప శక్యము గానిది, సాధ్యము గానిది (రోగాది.). 2. కారణములచే నిరూపింప రానిది, సమర్థింప రానిది. 3. నెఱవేర్ప రానిది.

**అసాధారణము** నం. విణ. (అ. ఆ, ఈ. అ.) సాధా రణము కానిది, సామాన్యము కానిది. వి. అ. పుం. (తర్క.) హేత్వాభాసములలో నొకటి. (సవ్యభిచార భేదము.)

**అసాధువు** నం. విణ. (ఉ. ఉ, ద్వి. ఉ.) 1. మంచి నడత లేనిది. 2. దుష్టము, చెడ్డది. 3. వ్యాకరణ విరుద్ధ మయినది (శబ్దము.)

**అసాధ్యము** నం-అసాధనీయము.

**అసాధ్వి** నం. వి. ఈ. స్త్రీ అసతి, కులట.

**అసామాన్యము** నం. విణ. (అ. ఆ. అ.) 1. అను పమము, సాటిలేనిది. 2. సామాన్యముకానిది, విశేషమైనది. వి. అ. న. సామాన్యధర్మములేమి, సాటిలేమి.

**అసారము** నం. విణ. (అ. ఆ. అ.) 1. చేవ లేనిది. 2. దుర్బలమైనది. 3. మంచిది కానిది. వి. అ. పుం న. ఆముదపుచెట్టు పుం. సారములేమి. న. అగురు చందనము (వృ. వి.)

**అసి** ఉప. (క. అసి.) అల్పార్థకము. (చూ. అసి కోఁత, మొ.)

జ: అసికోఁత, అసియాడు, అసియార్చు, అసి వాఱు, అసివోవు.

**అసి** నం. వి. ఇ. పుం. ఖడ్గము, కత్తి. ఇ. ఈ. స్త్రీ. కాశికి దక్షిణముందుండు నొకనది.

**అసికము** నం. వి. అ. న. గడ్డమునకును క్రింద పెదవి కిని నడిమిపట్టు.

**అసికోఁత** వి. (√అసి) చిన్నకోఁత.

ద్వి. వెట్టన మొలనున్న నెఱికత్తిఁ దిగిచి, కొన్నింటి ముక్కులు కొన్నింటి చెవులుఁ, గొన్నింటి చెక్కులుఁ గోఁతలువెట్టి, అసికోఁతలుగఁ గోయ. ద్వి. హరిశ్చ. పూ. 2040.

**అసిక్ని** నం. వి. ఈ. స్త్రీ. 1. పడుచుది యగునంతః పురపరిచారిక. 2. ఒకానొకనది.

**అసిగండము** నం. వి. అ. పుం చెక్కిలి యుంచు కొను చిన్నతలగడ.

**అసిత** నం. విణ. (ఋ. క్రి. ఋ.) సేపకుఁడు, చిమ్ముువాఁడు, వైచువాఁడు. వి. అ. స్త్రీ. 1. నీలిమొక్క. 2. వృద్ధురాలు కాని అంతః పుర పరిచారిక. 3. యమున.

**అసితఫలము** నం. వి. అ. పుం. తియ్యకొబ్బెర చెట్టు.

**అసితము** నం. విణ. (అ. ఆ. అ.)-తెల్లనిది కానిది-నల్లనిది. వి. అ. పుం. నలుపు; నీలవర్ణము.

**అసితాంగము** నం. వి. అ. పుం. - నల్లనిదేహము గలది - ఖడ్గము, కత్తి.

**అసితుఁడు** సం. వి. అ. పుం. 1. శని. 2. దేవలుఁ డనుముని.

**అసిదంష్ట్రము** సం. వి. అ. పుం - కత్తివంటికోఱలు గలది - మకరము, మొసలి.

**అసిద్ధము** సం. విశ. (అ. ఆ. అ.) 1. పక్వము కానిది. 2. అయితము గానిది. 3. నెఱవేఱనిది. 4. అనుమతిచేఁ బ్రాప్తము కానిది. వి. అ. పుం. (తర్క.) ఆశ్రయాసిద్ధత్వాది దోషములచే దుష్ట మగు హేతువు.

**అసిద్ధి** సం. వి. ఇ. స్త్రీ. 1. అనిష్పత్తి, సిద్ధింపమి. 2. పరిపక్వముకామి, పండమి. 3. (యోగ) సిద్ధిలేమి. 4. (తర్క.) ఆశ్రయాసిద్ధి మొద లగు హేతుదోషము.

**అసిధార** సం. వి. ఆ. స్త్రీ. కత్తివాయి, కత్తియంచు.

**అసిధారావ్రతము** సం. వి. అ. న. 1 - కత్తివాతి మీఁద శయనించుటవలె దుష్కర మగువ్రతము-ఎలజవ్వనితో యువకుఁడు కలసి మెలసి యుండియు దానితోడ రతిని సలుపకుండుట. 2-అసిధారతో చేసెడు వ్రతము-శయన మధ్య మున ఖడ్గము పెట్టుకొని దంపతులు బ్రహ్మ చర్యమును జరుపుట. 3.-అసిధారావ్రతము వంటిది-దుష్కరమగు కార్యము.

**అసిధావకుఁడు** సం-అసిధావుఁడు.

**అసిధావుఁడు** సం. వి. అ. పుం. కత్తి సానఁబట్టు వాఁడు.

**అసిధేనుక** సం. వి. ఆ. స్త్రీ. చురకత్తి, చిన్నకత్తి.

**అసిధేనువు** సం. వి. ఉ. స్త్రీ. అసిపుత్రి, చురకత్తి.

**అసిపత్త్రము** సం. విశ. (అ. ఆ అ.) కత్తివంటి ఆకులు గలది. వి. అ. పుం. చెఱకు (వృ. వి.) న. కత్తియొఱ.

**అసిపత్త్రవనము** సం. వి. అ. న. నరకవిశేషము. (ఇందలిచెట్ల యాకులు కత్తులవలె నుండును.)

**అసిపుచ్ఛము** సం. వి. అ. పుం. శింశుమారము, ఒకజాతి మొసలి.

**అసిపుత్రి** సం. వి. ఈ. స్త్రీ. చిన్నకత్తి.

**అసిపుత్రిక** సం. వి. ఆ. స్త్రీ. చిన్నకత్తి.

**అసిమి** వి. ఒకవిధమగు చిన్నగోనె; సంచి.

ఆ. అసిమిలోని దొకటి యమ్మెడి దొక్కఁ యనివచందమయ్యెనవనినాథ, ఖార్యదాఁ యింకఁ బడఁతులు లేరని, చాటఁ బసి తౌర జగతియందు. చెన్న. 4. 85.

సీ. అసిమిలోఁజలువ మాయకయుండ మడ పెట్టిన చల్లడముదుప్పటీరుమాలు. కు 3. 140.

సీ. నొసలిపైఁ జుక్కలమిసిమిసామపు రేఖలఁ వొంద భుజముపై ననిమిసంచి. హంస.2.2 అం. భా. 2. 266.

జ. అసిమిగొల్లెన.

**అసిమిగొల్లెన** వి. (√అసిమి) గోనెలతో వేసిన చిన్న గుడారము.

గీ. మునుపుగా నేఁగి యసిమిగొల్లెనలు వన్ని, త్రోవ నెక్కడెక్కడ నేమిగావలసిన, నట్టి భక్ష్య భోజ్యాదులయమ్మకమునఁ, దనియఁ జేసిరి వణిజులు తద్బలముల. కళా. 8. 42.

**అసిమేదము** సం. వి. అ. పుం. విట్ఖదిరము, తుమ్మ (వృ. వి.)

**అసియాడు** అ. క్రి. (√అసి) 1. కదలు, అల్లలాడు; వడఁకు.

సీ. ముక్కున నసియాడుముదురుతామరతూఁడు ముత్యాలకల్లెంబుమురువు నెఱప. దశా. 2. 66.

క....కటి, నతరస్థలి నడుగు లిడుచు నడు మసి యాడఁగ. భా. రా. అయో. 148.

2. చలించు, చెదరు.

ఉ. గుట్టసియాడ గబ్బిచనుగుట్టలపైఁ బుల కాంకురావళుల్, తెట్టువగట్టఁ గోరికలు దేటలు వెట్టఁగ. విజ. వి. 1. 61.

3. సంచరించు, తిరుగు.

క. పసిగొనుచు మేయవచ్చిన, పసిఁ గొనుచుం గోలుపులులు బలిసెన్ నృప నీ, యసి యాడు నేని యచ్చట, ననియాడం దఱచు నెఱచు నఱచుం బఱచున్. రామా. 2. 13.

**అసియార్చు(రుచే)** న. క్రి. (√అసియాడు) (అల్లలార్చు)

ఉ. ...వ్రేఁకనిచన్నులు పాలవంకలై, కా నసి యార్చ...కాశీ. 7. 159. హర. 6. 44.

**అసిలేరు** వి. (సం. ఆశ్లేషా. ప్రా. అసిలేసా.) ఆశ్లేషా నక్షత్రము. (శ్రీ.)

**అసివాలు** వి. (√అసి)–మందగమనము–విహారము, వయాళి.

సీ. ఎవ్వఁడు నలువతే రెక్కి యష్టాదశద్వీపాళి నసివాలు దిరిగె లీల. కాశీ. 4. 195.

సీ. అవంచగౌడధాత్రీపదం బెవ్వాని కసివాలుగా నేఁగునట్టిబయలు. మనుచ. 1. 11.

**అసిపోవు** అ. క్రి. (√అసి) 1. క్షీణించు, నశించు. (గోహత్య చేసిన గౌతమునితో బ్రాహ్మణు లనెడుమాట)

సీ. మాకుఁ జూడంగ సొమ్మసిలి పడ్డది గాని తెగటాఱఁ జచ్చుట తెలియరాదు, కావున నీపాతకం బసిపోవు జాహ్నవిఁదెచ్చుటకుఁ బ్రయత్నంబు నీవు, చేయుము...వరాహ. 10. 45.

క. అసదృశపాపఫలంబున, నసిపోవని బ్రహ్మహత్య లైదు దగిలె నెట్లు సహించువాఁడ ...వరాహ. 8. 25.

2. తప్పిపోవు.

సీ. అసిపోవు చెట్లు నాయసి పోవుమెకములఁ జించు నాయమ్ము నాచిలుకుటమ్ము. రామా. 2 24.

సీ. జిఱుజిఱుఁ ద్రిప్పివైచినకూల మసిపోవఁ దొలఁగువేడుక సునందుండు దొలఁగె. దశా. 4. 101. పాంచాలీ. 5. 31.

**అసిహేతి** సం. వి. ఇ. పుం. ఖడ్గయోధుఁడు, కత్తితో పోట్లాడుబంటు.

**అసుఖము** సం. విణ. (అ. ఆ. అ.) 1. సుఖము లేనిది. 2. కష్టమైనది.

శ్లో. శ్రేయాంసి లబ్ధు మసుఖాని వినాంతరాయైః. సం. కిరా. 5. 49.

వి. అ. న. దుఃఖము, బాధ.

**అసుఖి** సం. విణ. (న్. ని. న్.) సుఖములేనివాఁడు.

**అసుధారణము** సం. వి. అ. న. జీవనము, బ్రదుకు.

**అసుభృత్తు** సం. వి. త్. పుం. ప్రాణి, జంతువు.

**అసుమంతము** సం. విణ. (త్. మతీ. త్.) ప్రాణములు కలది.

**అసుర** సం. వి. అ. పుం. (ఈరూపము సంస్కృత సమాసాంతమున నుండదు. ఉదా: రావణాసురుఁడు.) అసురుఁడు.

ఆ. ...నన్ను, నెన్నఁడైన నొరుల కిచ్చుచో నసురకు, భోజనమున కిచ్చిపుచ్చుఁ డిపుడ. భార. ఆది. 6. 257.

గీ. ...మహాతపం బొనరించె నీయసుర పీన, కొసఁగెఁ బద్మజుఁ డధికమహోగ్రబలము. భార. శాం. 5. 425.

ఆ. స్త్రీ. 1. రాత్రి. 2. వేశ్య.

**అసురము** సం. వి. అ. పుం. ఏనుఁగు. (వై. ని.)

**అసురస** సం. వి. అ. స్త్రీ. ఒకజాతితులసి (వృ.వి.)

**అసురసంధ్య** సం. వి. ఆ. స్త్రీ. సాయంసంధ్య, మఱుసంజ.

**అసురాచార్యుఁడు** సం. వి. అ. పుం. – రాక్షస గురువు – శుక్రాచార్యుఁడు.

**అసురాహ్వము** సం. వి. అ. న. కంచు.

**అసురి** సం. వి. ఈ. స్త్రీ. 1. రాక్షసస్త్రీ. 2. వల్లావ (వృ.వి.)

**అసురుఁడు** సం. వి. అ. పుం. 1. దైత్యుఁడు, దానవుఁడు. 2. సూర్యుఁడు. 3. రాహువు.

**అసురుసురు** వి. (త. అసురుసురు.) బడలికయందు విడుచు ఊపిరిధ్వనియనుకరణము.

క. అసురుసు రని సొలయున్ రా,జసురేంద్రుఁడు మలయపవను చలి కసరునకున్. కవిరా. 5. 265.

క. ఒసఁగిన నది గైకొని వెక్కసమగుకన్నీరు దొరుఁగఁ గళవళమున లో, నసురుసు రనుచుం గడితపు, దెసలం బడి కొంతవడికిఁ దెలివిదలిర్పన్. అచ్చ. రా. కిష్కిం. 22.

అసురుసురగు–బడలు, శ్రమనొందు.

క. మునురుకొను జరభరంబున, నసురుసురై యున్న మమ్ము నదకించితివి...మనుచ. 4.84.

చ. అసురుసురై యలంతినడు మల్లలనాడఁగ ముందుముందుగా, నొసపరి తాగులాడియవు డొక్కతె వచ్చి నృపాలుతోడుతన్. సారంగ. 1. 38.

**అసుర్యము** సం. విశ. (అ. ఆ. అ.) అసురులకు హితమైనది.

**అసువులు** సం. వి. ఉ. పుం. బ. ప్రాణములు, ఉసులు.

**అసుసువు** సం. వి. ఈ. స్త్రీ. బాణము.

శ్లో. సపాసిః సాసుసూః సానో, యేయాయేయా యయాయయః. సం. కిరా. 15. 5.

**అసూయ** సం. వి. ఆ. స్త్రీ. 1. గుణములందు దోషము నారోపించుట. 2. కోపము.

శ్లో. 'వధూ రసూయాకుటిలం దదర్శ.' సం. రఘు. 6. 82. (అసూయయా- రోషేణ. మల్లి. వ్యా.)

**అసూయకుఁడు** సం. విశ. (అ. యిశా. అ.) అసూయ గలవాఁడు.

**అసూయనము** సం. వి. అ. న. - అసూయ.

**అసూయిత** సం. విశ. (బు. త్రి. బు.) అసూయ గలవాఁడు.

**అసూయువు** సం. విశ. (ఉ.) అసూయగలవాఁడు.

**అసూర్క్షణము** సం. వి. అ. న. అవహేలనము, అనాదరము.

**అసూర్యంపశ్యము** సం. విశ. (అ. ఆ. అ.)-సూర్యుని జూడనిది - ఎండకన్నెఱుఁగనిది, సూర్యరశ్మి యెఱుఁగనిది. (అంతఃపురస్త్రీజనము, మొ.)

**అసృక్కు** సం. వి. క్. న. 1. రక్తము, నెత్తురు. 2. అంగారకుఁడు. 3. కుంకుమపూవు.

**అసృగ్దరము** సం. వి. అ. పుం. స్త్రీలకుఁ గలుగు కుసుమరోగము.

**అసృగ్దర** సం. వి. ఆ. స్త్రీ. త్వక్కు, చర్మము.

**అసృగ్ధార** సం. వి. ఆ. స్త్రీ. 1. రక్తధార. 2. త్వక్కు, తోలు.

**అసృగ్వర** సం. వి. ఆ. స్త్రీ. త్వక్కు, తోలు.

**అసృగ్వహ** సం. వి. ఆ. స్త్రీ. రక్తనాళము, నాడి.

**అసేచనకము** సం. విశ. (అ. నికా. అ.)-అసేచనము.

**అసేచనము** సం. విశ. (అ. ఈ. అ.) దేనినిజూడఁగా మనస్సు తనివినొందదో యది, అతిసుందరము.

**అస్ఖలితుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) 1. చలింపని వాఁడు, స్థిరుఁడు. 2. అప్రమత్తుఁడు, జాగరూకుఁడు. 3. తడఁబడనివాఁడు.

**అస్తంగతుఁడు** సం. - అస్తగతుఁడు.

**అస్తంగమనము** సం. - అస్తగమనము.

**అస్తంగమము** సం. - అస్తగమము.

**అస్తగతుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) 1. అస్తమించిన వాఁడు. 2. నాశము నొందినవాఁడు.

**అస్తగమనము** సం. వి. అ. న. 1. (గ్రహములు) అస్తమించుట, కనఁబడకుండుట. 2. మరణించుట, నాశము పొందుట.

**అస్తగమము** సం. వి. అ. పుం. 1. అస్తమించుట. 2. నాశము నొందుట.

**అస్తమతి** సం. వి. ఈ. స్త్రీ. శాలపర్ణి, ముయ్యాకు పొన్న (వృ.వి.)

**అస్తమనము** సం. వి. అ. న. (సూర్యాదులు) అస్తమించుట.

శ్లో.... నైవాస్తమన మర్కస్య నోదయ స్సర్వదా సతః. (వాచ.)

**అస్తమయము** సం. వి. అ. పుం. 1. (సూర్యాదులు) అస్తమించుట, క్రుంకుట, కనఁబడకుండుట. 2. నాశము; క్షీణదశ. 3. (జ్యోతి) గ్రహములు సూర్యునితోఁ గలిసి యుండుట.

**అస్తమానము** సం. వి. అ. పుం. ప్రొద్దుక్రుంకుట.

సీ. అస్తమానము గా దటంచుఁ బాదచ్ఛాయ లొనరించి వ్రేళ్లెంచికొనుచు నుండు. హంస. 3. 155. కిరా. 2. 45.

**అస్తమించు** సం. అ. క్రి. క్రుంకు.

క. ఇనుఁ డస్తమించె...మార్క. 2.163.

**అస్తమితము** సం. విశ. (అ. ఆ. అ.) అస్తమించినది.

**అస్తము** సం. విశ. (అ. ఆ. అ.) 1. క్షిప్తము, త్రోయఁబడినది. 2. వశించినది. 3. కనఁబడనిది. వి. అ. పుం. 1. (సూర్యాదులు) అస్తమించు కొండ. 2. శుక్రాది గ్రహములకు సూర్యునితోడియోగము. (ఉదా:-శుక్రాస్తము, బుధాస్తము, మొ.) న. 1. లగ్నమునకు సప్తమ స్థానము. 2. నాశము. 3. కనఁబడకుండుట, క్రుంకుట.

**అస్తరు** వి. (హిం. అస్తరు.) 1. ఒకగుడ్డ కాశ్రయముగా లోప్రక్కను జేర్చుకుట్టెడుగుడ. (శ.ర.)

2. సంధానవసనఖండము, అతుకు. ఆం. భా. 2. 158.

**అస్తవ్యస్తము** నం. విశే. (అ. అ. అ.) చాలు మాలినది, వ్యత్యస్తము.

క. అస్తమయమునకు మును రిపు, మస్తకముం దునుమవలయు మన కిది సాలఁ, దుస్తరమును నగు నస్తవ్యస్తం బగునేని నాకు నగవు గదిరెడుఁ. భార. ద్రో. 2. 303.

**అస్తసంఖ్యము** నం. విశే. (అ. అ. అ.) అసంఖ్యము, లెక్కకు మీఱినది.

శ్లో. ఉజ్ఝిత్సు సంహారి ఇవాస్తసంఖ్య,మహ్నాయ తేజస్విషు జీవితాని. సం. కిరా. 16. 16.

**అస్తాచలము** నం. వి. అ. పుం. అస్తమయ పర్వతము. (ఇట్లే అస్తాద్రి, మొ.)

**అస్తికాయము** నం. వి. అ. పుం. (జైనమతము నందు) పదార్థము—ఈ అస్తికాయము లైదు:- జీవుఁడు, పుద్గలము (పరిమాణు సంఘాతము), ధర్మము, అధర్మము, ఆకాశము.

**అస్తిక్షీరము** నం. విశే. (అ. అ. అ.) పాలు గలది. (ఆవు, మొ.)

**అస్తిత్వము** నం. వి. అ. న. ఉనికి, ఉండుట.

**అస్తినాస్తిత** నం. వి. ఆ. స్త్రీ—అస్తినాస్తిత్వము.

**అస్తినాస్తిత్వము** నం. వి. అ. న — ఉండుట లేకుండుట — సందిగ్ధమైన యునికి.

**అస్తిమంతుఁడు** నం. విశే. (త్. మతీ. త్.) కల వాఁడు, ధనవంతుఁడు.

**అస్తీకుఁడు** నం. వి. అ. పుం. ఒకముని. (జరత్కారునికొడుకు)

**అస్తుంకారము** నం. విశే. (అ. ఈ. అ.) అస్తు (ఔఁగాక, కానిమ్ము) అని పలుకునది. వి. అ. పుం. అంగీకారము, ఇయ్యకొనుట.

**అస్తేయము** నం. వి. అ. న. దొంగిలింపమి.

**అస్తోకము** నం. విశే. (అ. ఆ. అ.) అల్పముకానిది, అధికము.

**అస్త్యానము** నం. విశే. (అ. ఆ. అ.) పేరుకొననిది, గడ్డకట్టనిది. వి. అ. న. 1. నింద 2. బెదిరించుట.

**అస్త్రకంటకము** నం. వి. అ. పుం — ముల్లువలె నుండు అస్త్రము — బాణము.

**అస్త్రజిత్తు** నం. వి. త్. పుం. వృక్షభేదము. (ఇది కత్తిదెబ్బలను మాన్పును.)

**అస్త్రజీవి** నం. విశే. (న్. నీ. న్.) అస్త్రములవలన జీవించువాఁడు.

**అస్త్రజీవుఁడు** నం. విశే. (అ. ఆ. అ.)- అస్త్రజీవి.

**అస్త్రమార్జకుఁడు** నం. విశే. (అ. ర్జికా. అ.)—అస్త్రమార్జుఁడు.

**అస్త్రమార్జుఁడు** నం. విశే. (అ. ఈ. అ.) ఆయుధములను సానఁబట్టువాఁడు.

**అస్త్రము** నం. వి. అ. న. 1. ఆయుధము. 2. విల్లు. (కే. ని.)

**అస్త్రవిదుఁడు** నం. విశే. (ద్.) అస్త్రశాస్త్ర మెఱిఁగినవాఁడు.

**అస్త్రవిద్య** నం. వి. ఆ. స్త్రీ. అస్త్రప్రయోగోపసంహారములను దెలుపు శాస్త్రము.

**అస్త్రాగారము** నం. వి. అ. న. ఆయుధశాల.

**అస్త్రి** నం. విశే. (న్. ణీ. న్.) 1. ఆయుధములు గలవాఁడు. 2. విలుకాఁడు.

**అస్త్రీకుఁడు** నం. విశే. (అ. ఆ. అ.) స్త్రీలేనివాఁడు; భార్య లేనివాఁడు

**అస్థానము** నం. విశే. (అ. ఆ. అ.) స్థానము లేనిది. వి. అ. న. తగనిచోటు; తగనిసందర్భము.

**అస్థాయి** నం. విశే. (న్. నీ. న్.) స్థిరము కానిది, చంచలము.

**అస్థి** నం. వి. ఇ. న. 1. ఎముక, కీకసము. 2. టెంక; గింజ.

**అస్థికృత్తు** నం. వి. త్. పుం. ఎముకలోని ద్రవ పదార్థము, మజ్జ, మూలుగ.

**అస్థిజము** నం. వి. అ. పుం. 1. మజ్జ, మూలగ. 2. వజ్రాయుధము.

**అస్థితుండము** నం. వి. అ. పుం. పక్షి. (దీనిముక్కు అస్థి వలె కఠినముగా నుండును.)

**అస్థితేజము** నం. వి. స్. పుం — అస్థికృత్తు.

**అస్థిధన్వుఁడు** నం. వి. న్. పుం. శివుఁడు.

**అస్థిపంజరము** నం. వి. అ. పుం- ఎముకలగూఁడు- మాంసాదులు లేక పట్టియెముకలు గలబొంది, కంకాళము.

**అస్థిభక్షము** నం. వి. అ. పుం. కుక్క.

**అస్థిమాలి** సం. వి. న్. పుం — ఎముకలమాలలు గలవాఁడు - శివుఁడు.

**అస్థియుక్కు** సం. వి. క్. పుం — విఱిగినయెముకలను గూర్చునది - నల్లేరు, వజ్రవల్లి (వృ.వి.)

**అస్థిరము** సం. విశ. (అ. అ. అ.) 1. నిలుకడలేనిది, చంచలము. 2. నిశ్చితము కానిది.

**అస్థివిగ్రహుఁడు** సం. విశ. (అ. అ. అ.) మిక్కిలి చిక్కినశరీరము గలవాఁడు. వి. అ. పుం. భృంగి, ఒకశివానుచరుఁడు.

**అస్థిశృంఖల** సం. వి. ఆ. స్త్రీ-విఱిగినయెముకలను మరలఁ గూర్చునది-నల్లేరు, వజ్రవల్లి (వృ.వి.)

**అస్థిశేషుఁడు** సం. విశ. (అ. అ. అ.) — ఎముకలు మాత్రము మిగిలినవాఁడు - మిక్కిలి చిక్కినవాఁడు.

**అస్థిసంచయము** సం. వి. అ. పుం. 1. శవదహనానంతరము ఎముక లేఱుట. 2 ఎముకలరాశి.

**అస్థిసంధి** సం. వి. ఇ. పుం. 1. ఎముకయు ఎముకయుఁ గలియుచోటు; కీలు. 2. విఱిగిన ఎముక అతుకుట.

**అస్థిసంహారకము** సం. వి. అ. పుం. 1. పెద్దజాతి కొంగ, బెగ్గురు. 2. నల్లేరు, వజ్రవల్లి (వృ.వి.)

**అస్థిసంహారిక** సం — అస్థిశృంఖల.

**అస్థిసారము** సం. వి. అ. పుం — అస్థికృత్తు.

**అస్థిస్నేహము** సం. వి. అ. పుం — అస్థికృత్తు.

**అస్పర్శనము** సం. వి. అ. న. తాఁకకుండుట.

**అస్పర్శము** సం. విశ. (అ. అ. అ.) తాఁకుటలేనిది, తాఁకనిది. వి. అ. పుం. తాఁకుడులేమి.

**అస్పృశ్యము** సం. విశ. (అ. అ. అ.) 1. స్పృశింపరానిది. 2. అపవిత్రమైనది, అశుచియైనది.

**అస్పృష్టి** సం. వి. ఇ. స్త్రీ. స్పృశింపమి, తాఁకమి.

**అస్ఫుటము** సం. విశ. (అ. అ. అ.) స్ఫుటము కానిది.

**అస్మత్** సం. న. (ఇది తెలుఁగున సమాసపూర్వపదముగానే యుపయుక్తము.) మా;మన.(ఉదా:- అస్మదాదులు, అస్మద్గోత్రము.)

**అస్మదీయము** సం. విశ. (అ. అ. అ.) మాది; మనది.

**అస్మద్విధుఁడు** సం. విశ. (అ. అ. అ.) మాబోఁటివాఁడు; మనబోఁటివాఁడు.

**అస్మాదృక్కు** సం. విశ. (క్) మావంటివాఁడు.

**అస్మాదృశుఁడు** సం. విశ. (అ. ఈ. అ.)-అస్మద్విధుఁడు.

**అస్మార్తము** సం. విశ. (అ. అ. అ.) మన్వాదిస్మృతిసమ్మతము కానిది.

**అస్మిత** సం. వి. ఆ. స్త్రీ. అహంత, అహంభావము. కాశీ. 4. 202.

**అస్మిత్వము** సం. వి. అ. న. - అస్మిత.

**అస్యుద్యతుఁడు** సం. విశ. (అ. అ. అ.) ఉద్యతాసి, కత్తిని పైకెత్తి పట్టుకొన్నవాఁడు.

**అస్రఖదిరము** సం. వి. అ. పుం. విట్ఖదిరము, తుమ్మ (వృ.వి.).

**అస్రజము** సం. వి. అ. న. మాంసము, కండ.

**అస్రప** సం. వి. ఆ. స్త్రీ. 1. జలగ. 2. పిశాచస్త్రీ.

**అస్రపత్త్రకము** సం. వి. అ. పుం. భిండావృక్షము, బెండ (వృ.వి.)

**అస్రపము** సం. వి. అ. పుం. మూలనక్షత్రము.

**అస్రపిత్తము** సం. వి. అ. న. ముక్కు నోరు మొదలగు వానినుండి నెత్తురు కాఱెడియొకరోగము.

**అస్రపుఁడు** సం. వి. అ. పుం. 1. నెత్తురు త్రాగువాఁడు- రాక్షసుఁడు. 2. కోణమును పాలించువాఁడు—నైరృతుఁడు.

**అస్రఫలి** సం. వి. ఈ. స్త్రీ. పల్లకి, అందుగు (వృ.వి.)

**అస్రబిందుచ్ఛద** సం. వి. ఆ. స్త్రీ. — రక్తబిందువులవంటి ఆకులు గలది—లక్ష్మణ, ఒకజాతి దుంపమొక్క.

**అస్రమాతృక** సం. వి. ఆ. స్త్రీ. దేహమందలి ప్రథమధాతువు, తిన్న యాహారముయొక్క రసరూపపరిణామము. (ఇదియే పిదప రక్తముగా మాఱును.)

**అస్రము** సం. వి. అ. పుం. 1. మూల, కోణము. 2. తలవెంట్రుక న. 1. కన్నీరు. 2. నెత్తురు.

**అస్రరోధిని** సం. వి. ఈ. స్త్రీ -నెత్తురును అఁపునది- లజ్జాలులత, సోఁకుడుముడుఁగు (వృ.వి.).

**అస్రార్జకము** సం. విశ. (అ. క్షీకా. అ.) నెత్తురు గలిగించునది వి. అ. పుం. తెల్లతులసి (వృ.వి.).

**అస్రి** సం.—అశ్రి (వాచ).

**అస్రువు** సం. వి. ఉ. న. కన్నీరు, అశ్రువు.

**అస్వకము** సం. విణ. (అ. స్వికా. అ.) సొంతము కానిది, అన్యులది.

**అస్వకీయము** సం. విణ. (అ. అ. అ.)—అస్వకము.

**అస్వత** సం. వి. అ. స్త్రీ.—అస్వత్వము.

**అస్వతంత్రము** సం. విణ. (అ. అ. అ.) పరతంత్ర మయినది, పరాధీనము.

**అస్వత్వము** సం. వి. అ. న. సొంతముకామి, స్వామ్యములేమి.

**అస్వప్నుఁడు** సం. విణ. (అ. అ. అ.) నిద్ర లేని వాఁడు. 2. కలలు రానివాఁడు. వి. అ. పుం. దేవత, వేలుపు.

**అస్వము** సం. విణ. (అ. అ. అ.) 1. సొంతము కానిది. 2. ధనము లేనిది.

**అస్వరము** సం. విణ. (అ. అ. అ.) 1. చెడ్డస్వరము గలది, చెవికింపుగానిస్వరముగలది. 2. మెల్లని స్వరము గలది. వి. అ. పుం. 1. మందస్వరము, మెల్లనిగొంతు. 2. స్వరముకానిది — ప్రాణి, హల్లు. 3. ఉదాత్తాదిస్వరములు లేని లౌకికో చ్చారణము.

**అస్వస్థత** సం. వి. అ. స్త్రీ. — అస్వాస్థ్యము.

**అస్వస్థము** సం. విణ. (అ. అ. అ.) 1. మనసుకుదురు లేనిది. 2. రోగాదులచే బాధపడునది.

**అస్వామికము** సం. విణ. (అ. అ. అ.) స్వామిలేనిది.

**అస్వామ్యము** సం. విణ. (అ. అ. అ.) స్వామ్యము లేనిది,అధికారములేనిది. వి. అ. న. స్వామ్యము లేమి.

**అస్వాస్థ్యము** సం. వి. అ. న. 1. మనసు కుదురులేమి. 2. వ్యాధిగ్రస్తత. రోగముతో నుండుట.

**అస్వుఁడు** సం. విణ. (అ. అ. అ.) నిర్ధనుఁడు, పేద.

**అహ—అహా.** అవ్య. (సం. అహ.) ఆశ్చర్యాది ద్యోతకము.

సీ. అని పల్కి నానృపుం డానందమగ్నుఁడై హరియేడ నే,నేడ యహా యిదేమి. వేం. మా. 5. 69.

**అహఃపతి** సం. — అహర్పతి.

**అహంకరించు** సం. అ. క్రి. అహంభావముతో నుండు, గర్వించు.

(శరము.) ఎ. కృపాణంబునం దిలప్రమాణంబుగా నఱికిన దశాంశోనం బయ్యు నహంకరించె ...వరాహ. 9. 22.

**అహంకారము** సం. వి. అ. పుం. 1. నేను అనెడి యభిమానము, గర్వము. 2. మహత్తత్త్వము వలనఁ బుట్టి పంచతన్మాత్రలకుఁ గారణమైన తత్త్వభేదము. (ఇది యభిమానమునకుఁ గారణము.) 3. క్రోధము.

మ. ...అరితు లుద్భటవృత్తిం దనచెంగటన్ నిలువ నాతం డత్యహంకారుఁడై ...విప్ర. 5. 23. (ఈయర్థము తెనుఁగుననే కలదు.)

**అహంకారి** సం. విణ. (న్. ఈ. న్.) అహంకారము గలవాఁడు.

**అహంకారించు** సం. అ. క్రి. అహంకారమునొందు, గర్వించు.

ద్వి. కావున మాభక్తగణములనడుమ,నీవహంకా రించి నిలువ నెవ్వఁడవు. బస. పు. 4. 844పం.

**అహంకృతి** సం. వి. ఇ. స్త్రీ.—అహంకారము.

**అహంకృతుఁడు** సం. విణ. (అ. అ. అ.) అహంకారి, గర్వముగలవాఁడు.

**అహంక్రియ** సం. వి. అ. స్త్రీ. – అహంకారము.

**అహంత** సం. వి. అ. స్త్రీ. – అహంభావము.

**అహంత్వము** సం. వి. అ. న. – అహంభావము.

**అహంపూర్వికి** సం. — అహమహమిక.

**అహంప్రథమిక** సం. – అహమహమిక.

**అహంబ్రహ్మీభవించు** సం. అ. క్రి. 'అహంబ్రహ్మ' అనుకొనువాఁడగు, నేనే బ్రహ్మ మని యనుకొను.

వ. అమ్మనంబు...నవద్వారంబు లగుపురంబులు రచియించి యప్పురంబుల నద్వితీయుం డగు నాత్మునిం ద్రుంచివైచిన నతండును దనకు లోనై మణి క్రింది వత్తివిధంబునఁ దన యందు నిజచేష్టితంబులు చూచుచుండ నీడ తోడంగూడిన దర్పణంబుజాడ నహం బ్రహ్మీభవించి తల్లికిం దగినబిడ్డయై కలిగె

నవ మెలంగుచుండు నట్టి మనంబు పెద్దకొడు కగునహంకారుండును. ప్రబోధ. 1. 76.

**అహంభావము** నం. వి. అ. పుం. 1. గర్వము. 2. (వేదాంత) అవిద్య, దేహాత్మభ్రాంతి.

**అహంమతి** నం. వి. ఇ. స్త్రీ. అవిద్య, అజ్ఞానము

**అహంయువు** నం. విశ. (ఉ.) 1. గర్వము గలవాఁడు. 2. అభిమానము గలవాఁడు.

**అహంవాది** నం. విశ. (న్. నీ. న్.) తన్నుఁదానే హెచ్చుగాఁ జెప్పుకొనువాఁడు, అహంకారి, గర్వి.

**అహతము** నం. విశ. (అ. ఆ. అ.) హానముగానిది. వి. అ. న. క్రొత్తబట్ట.

**అహమగ్రిక** నం. వి. ఆ. స్త్రీ. నేను ముందు అని ఆధిక్యమునకై కలహించుట.

**అహమహమిక** నం. వి. ఆ. స్త్రీ. 1. నేను ముందు నేను ముందు అని ఒకరితో నొకరు రోషమునఁ బలుకుట, 2. యుద్ధాదులందుఁ జూపు అహంకారము.

**అహమించు** నం. అ. క్రి. అహంభావము పూను, గర్వించు.

చ. ...లెక్కకున్, మిగిలినసేన నొక్కఁడహమించి వధించుట యెట్లు...జై. భా. 2. 43.

**అహమిక** నం. వి. ఆ. స్త్రీ. అహంకారము.

సీ. వికటారివీరుల ప్రకటాహమిక మాన్పుచిక టారి పొదలిక లెన్ను మిగుల కళాం. 2.16.

**అహము(న్సు)** నం. వి. న్. న. 1. దినము, రేయుంబవలు. 2. పగలు.

అహరహము — ప్రతిదినము, దినదినము.

క మహనీయమధురుచిరసం, గ్రహమునఁ గాలు వలువలపి గనిమలుగ రజం, బహరహము నెలపి మాకుణ, నహాకారముల యెయ్య నచట సహాకారంబుల్. వసు. 1. 188.

క. అత్త దయామతిఁ దనకడ, నత్తమిలక నిద్ర వోవ దహరహమందున్ రాజ. చ. 2.84.

**అహరాది** నం. వి. ఇ. పుం. ప్రభాతము, వేకువ.

**అహర్దివము** నం. అవ్య. అ. న. ప్రతిదినము.

**అహర్నాథుఁడు** నం. వి. అ. పుం. సూర్యుఁడు.

**అహర్నిశము** నం. వి. అ. న. పగలును రేయును; ఎల్లప్పుడు. నైష. 2. 115.

**అహర్పతి** నం. వి. ఇ. పుం. 1. సూర్యుఁడు. 2. శివుఁడు. 3. జిల్లేడు (వ్య. వి.)

**అహర్బాంధవుఁడు** నం. వి. అ. పుం. సూర్యుఁడు.

**అహర్మణి** నం. వి. ఇ. పుం. సూర్యుఁడు.

**అహర్ముఖము** నం. వి. అ. న. వేకువ.

**అహల్య** నం. వి. ఆ. స్త్రీ. గౌతముని భార్య.

**అహల్యము** నం. విశ. (అ. ఆ. అ.) దున్నుటకుఁ దగనిది. వి. అ. పుం. ఒకానొక దేశము.

**అహల్యాజారుఁడు** నం. వి అ. పుం ఇంద్రుఁడు.

**అహల్యానందనుఁడు** నం. వి. అ. పుం. శతానందుఁడు.

**అహస్కరుఁడు** నం. వి. అ. పుం. సూర్యుఁడు.

**అహహ** — అహహా, అహహో. అవ్య. (నం. అహహా.) ఆశ్చర్యాధిక్షేప ప్రశంసాదులను దెలుపును.

1. (ఆశ్చర్యమునకు) భీమ. 3. 128.

2. (అధిక్షేపమునకు)

గీ. అహహ సత్తంపుఁగూటికి నమరవరులె, కాని మేమర్త్యులము కా మెకా యటంచుఁ, బరిహసించుచు...దశా. 1. 245, 2. 333.

3. (ప్రశంసకు) నైష. 2. 10.

**అహహో** — అహహా. (నం. అహహో.)

(ఆక్షేపమునకు) ఉ. రా. 3. 70.

(ప్రశంసకు) నీలా. 1. 108.

**అహో** — అహ.

(ప్రశంసకు)

చ....క్రొమ్మొగులువన్నియఁ గేరును గొప్పు తీరహో...నీలా. 2. 19.

అహోయను—ఔనను, అంగీకరించు, సమ్మతించు.

క. మననేరవు పతిమతి రాఁ, గననేరవు మదతి తగవు గాదన్న నహో, యననేర వెంత సెప్పిన, విన నేఁవు చాలుఁజాలు విడు పోవలయుణ. సారంగ. 2. 121.

**అహార్యము** నం. విశ. (అ. ఆ. అ.) 1. హరింపఁ దగనిది. 2. హరింప శక్యము గానిది. వి. అ. పుం. కొండ.

**అహాహా** — అహహా.

(ప్రశంసకు)

శా. ...చారుతురంగసంఘము లహాహా యన్నె వారల్ ఖళీ...కృష్ణ. 3. 76.

**అహి** సం. వి. ఇ. పుం. 1. పాము. 2. రాహు గ్రహము. 3. (సర్పదేవతాకమగు) ఆశ్లేషా నక్షత్రము. 4. సీసము, నాగము. 5. వృత్రాసురుఁడు.

**అహింస** సం. వి. ఆ. స్త్రీ. హింసచేయమి, హింస లేమి.

**అహింసకుఁడు** సం. విణ. (అ. వికా. అ.) హింసింపనివాఁడు.

**అహింస్ర** సం. వి. ఆ. స్త్రీ. కులికయను ఓషధి.

**అహింస్రము** సం. విణ. (అ. ఆ. అ.) హింసింపనిది, క్రూరశీలము కానిది.

**అహిక** సం. వి. ఆ. స్త్రీ. శాల్మలి. బూరుగు(వృ.వి.)

**అహికము** సం. వి. అ. పుం. ధ్రువనక్షత్రము.

**అహికోశము** సం. వి. అ. పుం. పాముయొక్క కుబుసము.

**అహిచ్ఛత్త్ర** సం. వి. ఆ. స్త్రీ. 1. మేషశృంగి (వృ. వి.) 2. శర్కర, పంచదార.

**అహిచ్ఛత్త్రకము** సం. వి. అ. న. పుట్టకొక్కు. కుక్కగొడుగు (వృ. వి.)

**అహిచ్ఛత్త్రము** సం. వి. అ. పుం. 1. అర్జునుఁడు జయించి ద్రోణున కిచ్చిన యొక దేశము. 2. ఒకానొక చెట్టువలనఁ బుట్టెడువిషము.

**అహిజిహ్వ** సం. వి. ఆ. స్త్రీ. నాగజిహ్వలత.

**అహితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. అనిష్టము, ప్రతికూలము, విరుద్ధమైనది. 2. (వైద్య) పథ్యముకానిది. వి. అ. న. కెఱుపు, హాని.

**అహితుండికుఁడు** సం. వి. అ. పుం. పాములవాఁడు.

**అహితుఁడు** సం. వి. అ. పుం. శత్రువు.

**అహినకులము** సం. వి. అ. న. పాములయొక్కయు ముంగిసలయొక్కయు సముదాయము.

**అహినకులిక** సం. వి. ఆ. స్త్రీ. సర్పమునకును ముంగిసకును గలస్వాభావికవైరము.

**అహిపుత్రకము** సం. వి. అ. పుం. సర్పాకారమగు నొకరకపు పడవ.

**అహిఫేనము** సం. వి. అ. న. 1. గరళము. 2- పాముగరళమువలె తీక్ష్ణము - నల్లమందు.

**అహిభయద** సం. వి. ఆ. స్త్రీ. నేలయుసిరిక(వృ.వి.)

**అహిభయము** సం. వి. అ. న. 1. పామువలన భయము. 2. రాజునకుఁ బుత్త్రదాయాది స్వపక్షము వలని భయము, (స్వపక్షమువా రేడ్వురు :- మూలబలము, మిత్త్రబలము, సమాశ్రితుఁడు, సంబంధజుఁడు, కార్యసముద్భవుఁడు, భృత్యుఁడు. ఉపచార గృహీతుఁడు )

**అహిభుక్కు** సం. వి. క్. పుం. 1. గరుడుఁడు. 2. నెమిలి. 3. ముంగిస.

**అహిభృత్తు** సం. వి. త్. పుం. శివుఁడు.

**అహిమన్యువు** సం. విణ. (ఉ.) పామువగవంటిపగ గలవాఁడు. వి. ఉ. పుం. పాముపగ.

**అహిమము** సం. విణ. (అ. ఆ. అ.) 1. చల్లనిది కానిది. 2. వేఁడిది.

**అహిమర్దని** సం. వి. ఈ. స్త్రీ. గంధనాకులిలత, సర్పాక్షి (వృ.వి.)

**అహిమాంశువు** సం. వి. ఉ. పుం. వేఁడివెలుఁగు, సూర్యుఁడు.

**అహిమారకము** సం. వి. అ పుం. 1. వెలితుమ్మ (వృ. వి.) 2. నెమిలి. 3. ముంగిస.

**అహిమారకుఁడు** సం. వి. అ. పుం. 1. గరుడుఁడు. 2-వృత్రాసురుని చంపినవాఁడు-ఇంద్రుఁడు.

**అహిమేదకము** సం — అహిమారకము.

**అహిమేదకుఁడు** సం — అహిమారకుఁడు.

**అహిరిపువు** సం. వి. ఉ. పుం. 1. గరుత్మంతుఁడు. 2. ఇంద్రుఁడు. 3. కృష్ణుఁడు. 4. ముంగిస, 5. నెమిలి.

**అహిర్బుధ్న్యుఁడు** సం. వి. అ. పుం. 1. రుద్రులలో నొకఁడు. 2. శివుఁడు.

**అహిలత** సం. వి. ఆ. స్త్రీ. 1. నాగవల్లి, తములపాకుతీఁగ. 2. గంధనాకులిలత, సర్పాక్షి (వృ. వి.)

**అహీనము** సం. విణ. (అ. ఆ. అ.) 1. తక్కువ కానిది, నిండైనది. 2. నీచము కానిది,గొప్పది. 3. సర్పశ్రేష్ఠము. వి. అ. పుం. క్రతువిశేషము.

**అహిరణి** సం. వి. ఇ. పుం. రెండుతలలపాము.

**అహేతుకము** సం విణ. (అ. అ. అ.) హేతువు లేనిది, నిర్హేతుకము.

**అహేరువు** సం. వి. ఉ. పుం. శతమూలి, పిల్లపీఁచర (వృ. వి.)

**అహైతుకము** సం. విణ. (అ. ఈ. అ.) అకారణముగా వచ్చినది.

**అహో** సం. అవ్య. ఆశ్చర్యశోకసంబోధనాదులను దెలుపును.

(ఆశ్చర్యమునకు)

శా. ...అహోవచనకవ్యాహారము...., అద్ధిరా ౹గణిగెల్పుటుత్సవమునం దయ్యెన్ నభం బ త్తఱిఁ. ఆము. 4. 6.

(పరిహాసమునకు)

ఉ. ...పరసాగసగంధులఁ బొంద నంచు నా కొప్పనిబాస నిచ్చితి వహో యిటు లెంతకు నెత్తికొంటి విం, కెప్పటికైన నమ్మఁదగునే ననుఁ జంపఁగఁ జూతు వింతటఁ. శుక. 1. 451.

(సంబోధనమునకు)

చ....సుధా, కలశము పోయెఁ బోయె నని కాతరులై మొఱవెట్టఁగా నహో, వలదు భయం బటంచు హరి వంచనసేయఁ దలంచె దైత్యులఁ. దశా. 2. 293.

**అహోపురుషిక** సం. వి. అ. స్త్రీ. అహోపురుషిక, గర్వముచేఁ దన్ను గొప్పగాసంభావించుకొనుట, బడాయి.

**అహోరాత్రము** సం. వి. అ. పుం. పగలును రేయును; ఎప్పుడు.

**అహ్రీకుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) సిగ్గులేనివాఁడు.

**అహ్వల** సం. వి. అ. స్త్రీ. నల్లజీడి (వృ.వి.)

# ఆ

**ఆ** తెలి. ఒకానొకయక్షరము.

**ఆ¹** కొన్ని పదాంతములకు సంబోధనమందు విభాషను ఆదేశముగా వచ్చునది.

ఉదా: (రాముఁడ) రాముఁడా, (వనము) వనమా.

**ఆ²** వి. తచ్ఛబ్దార్థకము.

(దీనికి ఈరూపముతోఁ బ్రత్యేక ప్రయోగము లేదు.)

1. దూరముగా నుండి గోచరమగుచున్న దానిని దెలుపును. (ఉదా: ఆకొండ, ఆయిల్లు.)

2. పూర్వము నిర్దేశింపఁబడినదానిని దెలుపును.

క. ఏకథలయందుఁ బుణ్యశ్లోకుఁడు హరి సెప్పఁబడును సూరిజనముచే, నాకథలు పుణ్యకథలని, యాకర్ణింపుదురు ... భాగ. 8. 21.

3. ప్రసిద్ధిని దెలుపును.

ఉ. ఆవతులై నుతించుచతురాననముఖ్యుల కోర్కిఁ దీర్పఁ బం,చాసన దివ్యమూర్తికి షడాననుఁడై జనియించి యాసహస్రాసను సంస్తవంబులకు నందనిశక్తిధరుండు. విక్ర. 1. 3.

(దీనికి ఆమ్రేడితమున 'అయా, ఆయాయి, అయ్యొ' ఇత్యాదిరూపములు సిద్ధించును.)

4. విభక్తి వివక్షించునపుడు 'ఉన్న, కల, న' వర్ణకములపై మహత్తునకు రెండువచనము లందును మహతికి బహువచనమందునువచ్చును.

(ఉదా : వండుచున్నాఁడు, వండఁగలాఁడు, వండినాఁడు, వండుచున్నారు.)

జ. అతఁడు, అతగాఁడు, అది, ఆకె, అతఁడు, అతగాఁడు, ఆపె, ఆమె, ఆయక, ఆయన, ఆయప, ఆయమ, వాఁడు.

**ఆ³** ప్ర. కొన్నిబహువచనాంతశబ్దములపై పుంస్త్వమున మతుబర్థమందు వచ్చును.

(ఉదా: పగలాఁడు, చిన్నెలాఁడు.)

**ఆ⁴** అవ్య. 1. ప్రశ్నార్థకము.

క. కనువిడి నీవును బోటరి,వనియే దానవులఁ జెనసెదా గానీ పో, టును జాతము...కు. సం. 12. 301.

చ....కిరీటిచే నలుక కాంతిక నొందినసోమదత్త నం,దనుతలఁ ద్రుంపవే మఱచితా యనికో యుదిపోరిపాడియే. భార. మౌ. 44.

క. ధరణీరాజ్యము పాకును, నరవర సౌఖ్యంబు సేయునా. భార. ఆ(క. 1. 80. (ఇట కాక్వర్థకము)

2. క్రియాపదములమీఁద వచ్చి 'పని, ఎడల' అనువానియర్థ మిచ్చును.

ఉ. ఆనతి యిచ్చెనా యది శిలాక్షరం మెవ్వనినేని మెచ్చెనా, వానిఁ గృతార్థుఁజేయుఁ బగ వాఁడయినన్ శరణంబుఁజొచ్చెనా, యానరు నేర మెంచక తనంతటివాని నొనర్చు నిచ్చెనా, యేనుఁగుపాఁడి యీడు గలదే రఘునాథనృపాలమౌళికిన్. (ఇచ్చెనా — ఇచ్చిన యెడల) విజ. వి. పీఠి. 54.

వ. తమ్మొకవారు తప్పిరా వారిఁజొమ్మునను ఈశ్వరుని త్రిశూలము విఱుగును. ద. కా. 4. 659.

3. 'అన్నను' అనునర్థమును దెలుపును.

శా. ఓనర్వేశ్వర దృప్తుడై మహిషదైత్యుం డష్టదిక్పాలనే, నానందోహముఁ దోలి నిన్నుఁ జెనక న్నన్నద్ధుఁడై వచ్చె మా, కాసార్థ్యము లేదు వాని గెలువంగా నీవె దిక్కంచు నా, చే సర్వంబును విన్నవించి పనిచె న్జేజొమ్ము తత్ప్రార్థనల్. (మాకా— మాకు అంటివా) వరాహ. 11. 94.

4. 'అయినను' అనునర్థమును దెలుపును.

మ. రకవుంజెయ్యులఁ దా వినోదముగ సారథ్యంబు గావించుక, న్యకపై బెట్టినచూపె కాని యిటు సేనం జూచుటా లేదు సా, యకపంక్తుల్నడమన్ సహస్రములుగా నయ్యార్జె విచ్చుచే, శికిఁ గన్నుల్ గల వంచు నెంచి రవుడెంతే వీరయోధాగ్రణుల్. విజ. వి. 3. 153.

5. సంప్రార్థనమున మధ్యమపురుష 'ము' వర్ణక 'ఁడు' వర్ణకములకు అనుప్రయుక్తమగును. (ఇది అదాదులలోనిది.)

చ.···నాకుదు, క్ష్వధి యొలయంగ నింతయును వే చెడిపోవుట చీవ చూడుమా. హరి. పూ. 1. 128.

6. ప్రశంసార్థకము.

చ. మదగజవైరివంటినడుమా కమలంబులవంటి కన్నులా, యదనశశాంకువంటి మొగమా ముకురంబులవంటి చెక్కులా, మదనునివంటి చక్కఁదనమా మధురాధర! వానిరూపు నా, హృదయపటంబునందు లిఖియించిన కై వడిఁ గానవచ్చెడున్. అని. 2. 93.

7. (సం. ఆమ్, అ. ప్రా. అమ. త. అమ్.) అంగీకారమును దెలుపును.

(వ్యవ) వాఁడు వచ్చినాఁడా? ఆ! వచ్చినాఁడు.

8. పూర్వస్మృతి, ఆక్షేపము, ఆశ్చర్యము, మొదలగువానిని దెలుపును

(వ్యవ) ఆ! జ్ఞప్తికి వచ్చినది. ఆ! చేసినావులే! ఆ! ఎంతవాఁడయినాఁడు. ఆ! ఆ! ఆఁగు ఆఁగు.

9. ఆక్షేపగర్భిత ప్రశ్నమును దెలుపును.

ఉ. అంతట మూర్ఖుఁడేటి పులియా యెలుఁగా యెనుపోత సింగమా, కాంతుమ వీని గర్వము...కకు. 4. 106.

**ఆః** — హా (సం. ఆః) పరితాపమును దెలుపు అవ్యయము.

సీ. శ్రీరామశరమున శిథిఁ గూలి మారీచుఁ డా సీత హా లక్ష్మణా యటంచు దశా. 7.250.

**అ** సం. అవ్య. (దీనికి తెనుఁగున ప్రత్యేక ప్రయోగము లేదు.) ఇది తఱచుగా నీక్రిందియర్థములను దెలుపును.

1. మర్యాద; అభివిధి.

ఆఫలోదయము — ఫలసిద్ధి వఱకు. ఆజన్మశుద్ధులు — జన్మము మొదలుకొని శుద్ధులు. ఆచంద్ర తారకము — చంద్రతారకములుండు వఱకు. ఆబాలగోపాలము — బాలగోపాలుర వఱకు. ఇట్లు, ఆకంఠము, ఆచండాలము, మొ.

2. ఈషదర్థకము. (ఇంచుక.)

ఆపాండురము—ఇంచుక తెలుపు.

3. అంతట.

ఆప్రచ్ఛన్నము—అంతటఁ గప్పఁబడినది. (ఆపూర్ణము — అంతట నిండినది.)

4. మిక్కిలి.

ఆపీనము — మిక్కిలి బలిసినది. (ఆపీతము — మిక్కిలి త్రాగఁబడినది.

5. గమనాద్యర్థక ధాతువులకు ముందు వచ్చి ధాత్వర్థమునకు వ్యతిరేకార్థమును దెలుపును. ఆగమనము — వచ్చుట. (ఆనయనము—రప్పించుట. ఆదానము - పుచ్చుకొనుట. ఆముక్తము — ధరింపఁబడినది.

**అంకుశికుడు** సం. విణ. (అ. ఈ. అ.) అంకుశము ఆయుధముగాఁ గలవాఁడు, మావటీఁడు.

**అంకీ** సం వి. ఈ. స్త్రీ. చర్మవాద్యవిశేషము,

**అంగకుఁడు** సం. విణ. (అ. గికా. అ.) 1. అంగదేశమున నున్నవాఁడు. 2. అంగదేశమునఁ బుట్టినవాఁడు. 3. అంగదేశక్షత్రియులను సేవించువాఁడు. 4. అంగదేశమును సేవించువాఁడు.

**అంగము** సం విణ. (అ. ఈ. అ.) 1. దేహమునకుఁ గాని అవయవమునకుఁ గాని సంబంధించినది. 2. అంగదేశమందుఁ గలిగినది. వి. అ. న. రోమలాంగము.

**అంగవిద్యుఁడు** సం. విణ. (అ. ఈ. అ.) 1. అంగవిద్య నెఱిఁగినవాఁడు. 2. అంగవిద్య చదివినవాఁడు.

**అంగారము** సం. విణ. (అ. ఈ. అ.) అంగారసంబంధమైనది. వి. అ. న. అంగారముల సమూహము, బొగ్గులప్రోగు.

**అంగికము** సం. విణ. (అ. ఈ. అ.) అంగనిర్వృత్తము, అవయవములచే జరుపఁబడినది. వి. అ. పుం. 1. అభినయవిశేషము, భ్రూవిక్షేపాదికము. 2. స్త్రీలహావభావాదికము.

**అంగికుఁడు** సం. వి. అ. పుం. మద్దెల వాయించువాఁడు.

**అంగిరసుఁడు** సం. విణ. (అ. ఈ. అ.) అంగిరసునకు సంబంధించినవాఁడు. వి. అ. పుం. అంగిరుని కొడుకు, బృహస్పతి. (ఈయర్థమున. బ. అంగిరులు, అంగిరసులు.)

**అంగుఁడు** సం. వి. అ. పుం. అంగదేశపురాజు. (బ. అంగులు.)

**అంగుశి(లి)కము** సం. విణ (అ. ఈ. అ.) అంగుళియాకృతిగలది, అంగుళివంటిది.

**అంఛనము** సం. వి. అ. న. వంచియో లాగియో కాలు మొదలగువానిని జక్కఁజేయుట,

**అంజనము** సం. విణ. (అ. ఈ. అ.) అంజనమునకు సంబంధించినది. వి. అ. న. 1. కంటికాటుక. 2. సంపూర్ణమైన యభ్యంజనము.

**అంజనేయుఁడు** సం. వి. అ. పుం - అంజనాదేవి కొడుకు—హనుమంతుఁడు.

**అండము** సం. విణ. (అ. ఈ. అ.) అండమునుండి పుట్టినది. (పిట్ట, మొ.)

**అండారి** వి. (త. అండార్. క. అండారి – ఏలిక, ప్రభువు.) ఇది గౌరవసూచకముగాఁగొందఱు శివభక్తులనామముల చివరను బ్రయుక్తము. ఇర్వదాండారి. మొ. బస. పు. 4. 965. పం.

**అంతరజ్ఞుఁడు** సం. విణ. (అ. అ. అ.) లోపలిమర్మములను దెలిసినవాఁడు.

**అంతరతమ్యము** సం. వి. అ. న. (వ్యాక) అక్షరములకుఁ బరస్పరము బాహ్యప్రయత్నాదులచేఁ గల్గునంత్యంతసాదృశ్యము.

**అంతరము** సం. విణ. (అ. ఈ. అ.) 1. లోపలిది, అభ్యంతరము. 2. గూఢమైనది, పైకిఁగనఁబడనిది.

**అంతరాగారికము** సం. విణ. (అ. ఈ. అ.) అంతఃపురరక్షకునికి ధర్మమైనది. (అంతఃపురరక్షణాదికము.)

**అంతరాలుఁడు** సం. విణ. (అ. ఈ. అ.) జీవుఁడు అణురూపుఁడై శరీరములోనే యుండును అతఁడు విభుఁడు కాఁడు-అని తలఁచువాఁడు. (మాధ్వమతస్థుఁడు.)

**అంతరి(రీ)క్షము** సం. విణ. (అ. ఈ. అ.) 1.ఆకాశమందుఁ బుట్టినది. (ఉత్పాతము, జలము, మొ.) 2. అంతరిక్షసంబంధమైనది.

**అంతర్గణిక** సం. విణ. (అ. ఈ. అ.) గణమునకు నడుమ నున్నది.

**అంతర్గేహికము** సం. విణ. (అ. ఈ. అ.) గేహమునకు నడుమ నున్నది. (ఇట్లే. అంతర్వేశికము, అంతర్వేశ్మికము.

**అంతర్యము** సం. వి. అ. న. 1. (వ్యాక) స్థానాదులచే అక్షరములకుఁ గలవఁస్వరసాదృశ్యము. 2. అంతర్వర్తిత్వము, లోపలి మనికి.

**ఆంతిక** నం. వి. అ. స్త్రీ. (నాటక) అంతిక. జ్యేష్ఠ భగిని, అక్క.

**ఆంత్రటీక** వి. పదునాల్గు విసరులలో నొకటి.

వ. ...ఆంత్రటీక నాట్యము...మొదలైన పదునాల్గు విసరుల...హంస. 1·206.

వ. ...అంత్రటీక టీక...మొదలగు పదునాల్గు విసరులు...ప్రబంధ. 78.

**ఆంత్రము** నం విశ. (అ. ఈ. అ.) అంత్రములకు (ప్రేగులకు) సంబంధించినది. వి. అ న. అంత్రము, ప్రేగు.

**ఆంత్రికము** నం. విశ, (అ. ఈ. అ.) 1. ప్రేగులకు సంబంధించినది. 2. ప్రేగులలోనిది.

**ఆందోళకము** నం విశ. (అ. ఈకా. అ.) 1. ఊఁచునది. 2. వడఁకించునది.

**ఆందోళన** నం. వి. ఆ. స్త్రీ — ఆందోళనము.

**ఆందోళనము** నం. వి. అ. న. 1. ఊఁగుట, ఉఱియాట. 2. (వింజామర మొదలగువానిని) చలింపఁజేయుట, విసరుట. 3. ఉయ్యెల, డోల.

**ఆందోళము** నం. వి. అ. పుం. 1. ఊఁగుట, ఉఱియాట; మనసు ఊఁగులాడుట, సంశయము.

శా. ....చాలింపం దగునే ప్రతిజ్ఞ నగరే జ్యోపాలకుల్ వచ్చినాం,దోళం జేనిఁక నెట్టి చందమునఁ దీర్తుం ధర్మసందేహముల్. దశా. 7. 195.

2. ఉయ్యెల, డోల. 3. అందలము, పల్లకి.

**ఆందోళి** నం. వి. ఈ. స్త్రీ. (సంగీ) స్త్రీ రాగములలో నొకటి. హంస. 5. 123.

**ఆందోళించు** నం. అ. క్రి. 1. ఊఁగులాడు, ఉఱియాడు.

వ. యమునాతరంగిణీ వేణికలం గ్రేణిసేయు వేణులు పిఱుందుల నాందోళింప...వరాహ. 4. 155.

2. డోలాయమానమగు, తొట్రుపడు.

వ. అని యత్యంతసంతాపంబున నాందోళించుచు ...సారంగ. 2. 156.

క. వనితవతవాభితుంగ, స్తనములఁ గడచి చన లేవు జనపతిచూడ్కుల్, మనమున నుయ్యాలొండో, యని యాందోళించువారి కగునే తెగువల్. కవిక. ?. 38.

**ఆందోళిత** నం. వి. ఆ. స్త్రీ. ఆందోళము, అందలము.

**ఆందోళితము** నం. విశ. (అ. ఆ. అ.) 1. ఊఁపఁబడినది. 2. తొట్రుపడినది.

**ఆంధసము** నం. విశ. (అ. ఈ. అ.) అన్న సంబంధమైనది. (గంజి, మొ.)

**ఆంధసికుఁడు** నం. విశ. (అ. ఈ. అ.) వంటలవాఁడు, బానసీఁడు.

**ఆంధ్యము** నం. వి. అ న. అంధత్వము, గ్రుడ్డితనము.

**ఆంధ్రము** నం. విశ. (అ. ఈ. అ.) ఆంధ్రదేశమునకు సంబంధించినది. (భాషాదికము) వి. అ. పుం. ఆంధ్రదేశము, తెలుఁగుదేశము.

**ఆంధ్రుఁడు** నం. వి. అ. పుం. ఆంధ్రదేశపువాఁడు, తెనుఁగువాఁడు. 2. ఆంధ్రదేశపురాజు.

**ఆంబికేయుఁడు** నం. వి. అ. పుం-అంబికాపుత్రుఁడు- 1. ధృతరాష్ట్రుఁడు. 2. పార్వతీనందనుఁడు, కుమారస్వామి.

**ఆంబురము** వి. (నం. ఆమ్లం. క. అంబర.) ఆమ్లరసము, చేదు.

ఉ. ఆరికకూడు పుచ్చవరు గావుల వెన్నయు దోసగింజసం, బారపుటాంబురంబు తనిమజ్జిగ ...వేం. పంచ. 1. 687.

**ఆంభసము** నం. విశ. (అ. ఈ. అ.) జలసంబంధమైనది.

**ఆంభసికము** నం. విశ. (అ. ఈ. అ.) అంభస్సుచేత (నీటిబలముచేత) సంచరించునది. (చేఁప. మొ.)

**ఆఁక** వి. (√ఆఁగు) 1. నిరోధము, అడ్డు, అడ్డగింత.

గీ. ఆఁక లేక యెవ్వానిజలాశయమున, మండు వేసవియందును మనుజకోటి, యవభృథస్నానపానంబు లాచరించు. భార. అను. 2. 336.

ఉ. తాఁకినఁ జూచి వాఁడతనిఁ దారసిలంగ రథంబు దోలి నీ,యాఁకకు నిల్వ దీయరదమన్న...రామా. 8. 168.

ఉ. ఇంటికి నడ్డ మాఁక యొక యింతయు లేక చరించువాని...పాండు. 3. 61.

2. చెఱ.

ఆ. భ్రాతయింట నాఁకఁ బడియుండె దేవకి, కాంత...భాగ. 10. పూ. 77.

సీ. ఏ నాఁక నున్నప్పు డెవ్వారు చూపెద రింక వెఱఁగి యయ్యిందువదన...కాశీ. 6.224.

3. కట్టుపాటు, మర్యాద, నిబంధనము.

సీ. కకురించి రిచ్చిపుచ్చుకొనుచోటుల వార లాఁకకు లోనుగా కప్పులిక. మనుచ. 3. 129.

4. వేల, చెలియలికట్ట.

ఉ. ఆఁకకు మీఱువారిధి క్రియన్ రిపుసేనల నాక్రమించితిన్. దశకు. 12. 34.

**ఆఁకగొను** అ. క్రి. (√ఆఁక) నిరోధ మొందు, ఆఁగు.

గీ. గురునిదర్పంబుచే నాఁకగొనిన ధర్మ,మాను సైన్యంబు లెట్లయ్యె మాతతనయ. భార. ద్రో. 3. 235.

క. తాఁకినఁ బోగడం దగియెడు, వీఁకం బతి ద్రోణు బాణవృతుఁ జేయ నతం,డాఁక గొనక యతనిధనువు, వ్రేఁకనిశల్లమునఁ ద్రుంచి వెస దగ్గఱియెన్. భార. ద్రో. 1. 201.

**ఆఁకట్టు** స. క్రి. (ఆఁక+కట్టు) 1. అడ్డగించు, నిరోధించు.

గీ. విటుఁడు రో యిచ్చి వేశ్యనిల్పుటయె కాని, యొరులఁ గోరెడిగుణ మెట్లు మడుపలేఁడు, డొల్ల నీరంబు నాఁకట్టఁ జెల్లుఁగాక, డొల్ల గుణ మది మాన్పంగఁ జెల్లునెట్లు. కవిక. 4. 119.

2. ఆక్రమించు, క్రమ్ము.

దండ. ...గుజ్జురూ పూని మూఁడంజలన్ ముజ్జగంబుల్ కరం బబ్బురం బొప్ప నాఁకట్టి చాగంపుబల్ రక్కసుం గ్రిందికిం ద్రొక్కుచా. నీలా. 2. 41.

ఆఁకట్టుకొను—తన దనిపించుకొను.

(వ్యవ) ముందుగాఁ గొంత సొమ్మిచ్చి అతని యిల్లు తా నాఁకట్టుకొన్నాఁడు.

**ఆఁకతోఁట** వి. (√ఆఁగు) పరులు రాకుండ కట్టుపాటు చేసినతోఁట.

సీ. నీవును వాలియు నేఁడును నాఁడుఁ బ్రియంబునఁ బాటించునాఁకతోఁట,మధువనంబది. భార. అర. 7. 9. రం. రా. సుం. 274 పా. 25 పం.

**ఆఁకత్రాడు** వి. (√ఆఁక)—అడ్డగించుత్రాడు-కవ్వమును దగిలించుటకై రాటను గట్టెడుత్రాడు.

క. తరిగాంద్రలోన నొకఁ డఁట, తరిగడవకుఁ గుదురు నాఁకత్రాఁ డఁట చేరుల్, దరిగవ్వంబును దానఁట...భాగ.8.205. భీమ.4.59.

**ఆఁకపడు** అ. క్రి. (√ఆఁక) నిరుద్ధమగు, ఆటంకము నొందు.

క. ఇలఁ బాతాళమున నభస్థ్సలి నంబుధి నాఁక పడక చరియింపఁ శక్తులు గలవానర వీరులు. భా. రా. కిష్కిం. 401.

**ఆఁకపె(వె)ట్టు** స. క్రి. (√ఆఁక) ఆఁకిడు, అడ్డగించు.

క. ...మంత్రులు దా, రెద్దియును బల్కకుండిరి, పెద్దతడవు వింజ మాఁకపెట్టినభంగిన్. భా. రా. యు. 728.

సీ. అడుగైన నడనీక యాఁకపెట్టిననిగ్గుసంపూర్ణమదధారసరణిఁ బొదల ... తరళలోచన గంధసింధురము పగిదిఁ, గొంతసొంపునఁ దోఁతెంచెఁ గాంతుకడకు. కకు. 4. 10.

**ఆఁకయిల్లు** వి. (√ఆఁక) చెఱసాల.

సీ. ...ఆఁకయింటికావలివారు మేల్కని చూచి ...భాగ. 10. పూ. 148.

**ఆఁకరము** వి. (సం. అహంకారః. త. అంకారం.)

1. ఆగ్రహము, చలము.

క. వీఁకఁ బఱతెంచి నలుగడఁ, దాఁకినఁ గడు వఱిగి ఘోరతరశరహతి నమ్మూకలు విరియఁగ నర్జునుఁ,డాఁకరమున నేసె నుగ్రుఁడయి రణభూమిన్. భార. ఆది. 8, 200, భా. రా. యు. 584.

2. అహము, మదము. ఆం. భా. 1. 183.

**ఆఁకలి** వి. దే. అవా. ఉత్తు.

ఆ. అలిగి యొడుగుబఱచి యాఁకటిపెలుచన, నిలువలేక...భార. ఆది. 6. 291.

చ. ఫలము దళంబుమం బొడిమఁ బాయుట
రాలినవానిఁ గొంచు నాఁకలి కెరనేసి
గోరసము కార్యమువట్టుల నిర్వహించి...
భార. అను. 5. 55.

క. కంటికిఁ గూరుకు రా దాఁ, కంటికిఁ దుది
లేదు చిక్క కయె యెట్లుందున్. శుక. 3. 411.

జ. ఆఁకలిగొను, ఆఁకొను, ఆఁకొన్నతనము.

**ఆఁకలిగొను** అ. క్రి. (√ఆఁకలి) క్షుత్తునొందు, క్షుధితమగు.

గీ. అతిథి యాఁకలిగొని యింటి కరుగుదెంచి.
వి. పు. 4. 156.

**ఆఁకవిరితోఁట** వి. (√ఆఁక) పరులు రాకుండ కట్టుపాటు చేసినపూవులతోఁట.
పాండు. 5. 294.

**ఆఁకించు** స. క్రి. (√ఆఁక) నిరోధించు.

వ. ఇవ్విధంబున ఘోటకంబును నొక్కింతవడి
యిట్టట్టు ద్రొక్కించి యాఁకించి కించిదుదం
చిత రత్నకంకణ క్రేంకారంబులు గందళింపఁ
గంఠం బప్పళింపుచు నిలిపి యప్పుడు...
కళా. 5. 112.

**ఆఁకిడు** స. క్రి. (√ఆఁక) అడ్డుపెట్టు.

క. ఆకొలువువారు గర మచలాకృతి నొక
పలుకులేక యందఱు వింజం, బాఁకిడినకరణి
నవళ ము దాకారితచిత్తవృత్తులై యుం
డంగన్. భార. ఉద్యో. 3. 255.

గీ. అరణిసంగ్రహ మొనరించి యజునిపట్టి,
పెద్ద కొలువుండె ముత్యాలగద్దె యెక్కి,
చుట్టు బలసి కూర్చుండిరి సురలు మునులు,
వింధ్య మాఁకిడినట్లుండె విశ్వసభయు.
కాశీ. 7. 55.

**ఆఁకొను** అ. క్రి. (√ఆఁకలి) ఆఁకలిగొను, క్షుత్తునొందు.

ఆ. విను మనత్యలోకమున సిరి యగునె యాఁ,
కొని ముసిండి దినివఁ గ్రొవ్వులావుఁగలుగు
నయ్య. భార. ఉద్యో. 3. 383.

శా. అమ్మా మన్ను దినంగ నే శిశువనో యాఁ
కొంటినో వెఱ్ఱినో... భాగ. 10. పూ. 338.

**ఆఁకొన్నతనము** వి. (√ఆఁకొను.) ఆఁకొన్నవాని తనము, ఆఁకలి.

శా. పెల్లాఁకొన్నతనాన రే నొకఁడనే భిక్షానకు
న్వత్తునో, యెల్లన్ శిష్యులఁ గొంచువత్తునో
నిజం బేర్పాటుగాఁ జెప్పుమా. భీమ. 2. 120.

**ఆఁగాఁకర** వి. అడవికాఁకర (వ్య. వి.). (దీని కాయలు పనసపిందెలవలె నుండి కూరకుపయోగించును.)

సీ. నల్లేరు వావిలి మల్లె యాఁగాఁకర,
(చికి. చి. ని.)

**ఆఁగు** స. క్రి. 1. అడ్డగించు, నిరోధించు, ఆటంకపఱుచు, అరికట్టు.

క. దవ్వుల విఱిగినఁ బౌరులు, నవ్వుదురని
మేలుమేలునను నాఁగకు. భార. విరా. 4. 71.

సీ. వరు లొండుకడ కేఁగఁ బురుషభూమిఁ
బూని తెరువాఁగి భంగింపఁ దివురువారు.
వసు. 4. 65.

2. నిలుపు.

సీ. తండోపతండమై గండోపలము లుండు
పథమునందుఁ గొలారుబండ్ల నాఁగి. శుక.
1. 182.

3. (పట్టనాదుల) నిరోధించు, ముట్టడివేయు.

ఉ. అడ్డమువచ్చి వేల్పుపురి యాఁగెడుమమ్మిటు
లావరించి. ఉ. రా. 2, 221.

2. నిగ్రహించు, అణఁచు.

ఆ. వినుము తన్ను గెలుచుటన వేఱొకండె
పం, చేంద్రియములఁ దూలనీక కొలఁది,
నాఁగుటయ... భార. శాం. 2. 277.

క. కోపంబు నాఁగి మిక్కిలి, పాపమునకులోఁగి.
పాండు. 4. 209.

5. ఆవరించు, ఆక్రమించు.

గీ. అతనిఁ దమపొమ్ముఁ జేసి ము న్నాగియున్న,
మోహముఖులైన జ్ఞాతుల మూలఁ ద్రోచి,
సంహృతాసురులైన నిర్జరులకరణి, మది
వివేకాది వర్గ మభ్యుదిత మయ్యె. పాండు.
4. 208.

గీ. వాసిదయ్యము నీవె వెయ్యేసిహైన, తలలుఁ
జేతులుఁ గన్ను లజ్జలును గలిగి, యలర
లాడిశేఁడు మగవాఁడ వగుచునేల, యెల్ల
నాఁగుదు వని మిమ్ము లెన్నఁ గదవె. అచ్చ.
రా. యు. 159.

6. ఆపేధించు, రాజాజ్ఞచే నిరోధించు.

క. అఁగిన నిలువని యాతం, డాఁగఁ దగని వాని బలిమి నాఁగినయతఁడున్,...దండ్యుఁ డవనీశులకున్. విజ్ఞా. వ్యవ. 14.

7. నిషేధించు.

ఆ. వేదవిహితవిధుల నాదరించుట యూర్ధ్వ, గతికిఁ దెరువు విధులఁ గడచి యొందు; నాఁగఁ బడినవాని లోఁగక చేయుట, యధమగతికి మార్గ మనిరి మునులు. భార. ఆది. 3. 220.

8. నివారించు, పోఁగొట్టు.

ఉ. ప్రాణవిభూపలాలనము ప్రాఁకుడుగొయ్యగ నిల్చి మన్మనం, బాన మొదర్చుప్రోది జర దైన్యము నాఁగ...పాండు. 4. 268.

9. సహించు, భరించు.

సీ....వేలసంఖ్యలదైత్యవిభులు దన్ను, నాక్రమించిన భార మాఁగఁజాలక భూమి గోరూపయై బ్రహ్మఁ జేరఁబోయి. భాగ. 10. పూ. 14.

అ. క్రి. 1. నిలఁబడు, నిలిచిపోవు.

చ....ఇంచుక వాయివిడ్డన్, మరి మొఱపెట్టి పెట్టి పలుమాఱును వాకిలి దాఁటి యాఁగుచున్, మొరయ విపంచి మీటుగతి మ్రోసి యళుల్ వెడలెన్ గొలంకులన్. మనుచ. 3. 60.

సీ. అట్లు గావున నింద్రియమనంబుల నజస్ర మాత్మభావనచేత నాఁగఁబట్టి సీతారా. 8. 189.

2. సైచు, ఓర్చు.

(వ్యవ) వాఁడు దెబ్బల కాఁగలేఁడు. ఎంత బరువునకైనను లొట్టి పిట్ట యాఁగును.

3. ఉడుగు, విరమించు.

(వ్యవ) మఱి మాట లాడక నీ వింతటితో నాఁగుము.

జ. అఁక, అఁకట్టు, అఁకగొను, అఁకతోఁట, అఁకత్రాడు, అఁకపడు, అఁకపెట్టు, అఁకయిల్లు, అఁకవిరితోఁట, అఁకించు, అఁకిడు, అఁచు, అఁపు, అఁపుచేయు.

**అఁచికొను** స. క్రి — నాఁచికొను. (అపహరించు)

ఆ. చావు లేనిమందు చక్కఁగ మన కబ్బె, ననుచుఁ గడవ ననురు లాఁచికొనిన, వెఱచి సురలు...భాగ. 8. 297.

సీ. పురిలోనఁ జొచ్చి విస్ఫురిత గేహంబులయర్థ సంచయమును నాఁచికొనుఁడు. హరి. ఉ. 6. 156.

**అఁచే—అఁపు** స. క్రి. (√అఁగు) అఁగఁజేయు. (అణఁచు.)

సీ. ఆదిత్యుపవ యాఁచి హాలహాలంబును లోఁచి హుతవహుగర్వ ముఱ్ఱాఁతలూఁచి. కళా. పీ. 76. (ఇట ఔపమ్యవాచకము.)

**అఁటది** వి. (త. అట్టి.) స్త్రీ, అఁడుది.

క. పటికి నీరాచఱికం, బాఁటది మొఱపెట్టఁ బకువు లాతురపడ...భాగ. 9. 408.

ద్వి. అఁటదానికి వశమమ్మ యామేటి, కోటలు దాఁటి యాగోడలు దాఁటి, తాళంబు లెడలించి తలుపులు దెఱచి, యాదట నీరీతి నట్టాత్తి చంప...ద్వి. హరిశ్చ. ఉ. 2407.

**అఁటు** అ. క్రి. పర్యాప్తమగు, చాలు.

ఉ. కయ్యపువేడ్క రేఁచుకొని క్రమ్మెడుతమ్మెదిరించి యేమియున్, డయ్యక కొంతసేపు పెనుదాకను జేతుల కాఁటి నిల్చువాఁ, డెయ్యెడఁ బోటుబంటునకు నెంతయుఁ గౌతుకకారి గాఁడె ప్రభా. 2. 59.

ఉ. ...నాడెపుఁజాఱుల కీనియూళ్లు నీ, రాఁట నిగాటపుంజెఱువు లారయ నబ్బుర మెంచి చూడ న,మ్మేటియయాతి యేలుపుడమిన్. యయా. 1. 94.

ఉ. మూఁటిక వ్రావు నీతఁడు కమంగొనునంతటిలో మనుష్యులన్, మూఁటువురైనఁ గాని తివ నోటికి నాఁట దటంచుఁ గూర్చఁగా, మూరువురైరి నేఁటికి మనుష్యులు నీవును గూడ నింతటన్, మూఁటును నిండె నిందఱ కనుగ్రహ మీశ్వరుఁ డేమి సేయునో. కాశి. 3. 205.

(వ్యవ) వాని కెంతదశైనను అఁటదు. నీళ్లాఁటనిచేతికి నిధానము లాఁటవు

**ఆఁడంగులు** వి. బ. (క. ఆడంగి.) స్త్రీలు. (వృత్తియందు ఆఁడంగివాఁడు, ఆఁడంగిమాటలు, ఆఁడంగిపనులు. మొ.)

సీ. దేవ యిప్పుడు కుమారీ విసరంబుచే విఱిగె నీపోఁ బంచు విన్నవింప, నద్దిరా మదియించి రాఁడంగు లందఱుఁ బదియుఁ గొట్టెద నంచు గద ధరించి. వరాహ. 11. 103.

**ఆఁడది** – ఆఁడుది, ఆఁటది. వి. స్త్రీ. ఇంతి.

క. అదె తాటకి యనురక్కసి, గొదగొని యే తెంచె దీనిఁ గూల్పుము కడు బె,ట్టిద మగు తూపుల నిది యాఁ,డది యని చూడకుము మిగుల డాయగ వచ్చెన్. యయా. 3. 8.

వ. శివయోగులు పదుంద్రకు వధ్యుశంచెడు ఆడ్దది యొక్క త్తె. దా. శా. 1288.

**ఆఁడి** ప్ర. కొన్ని బహువచనాంతములకుస్త్రీత్వమున వచ్చు మత్వర్థక ప్రత్యయము. (ఉదా : వగలాఁడి, కులుకులాఁడి. మొ.)

**ఆఁడు** వి. (దీనికి వ్యస్తప్రయోగము లేదు.) 1. స్త్రీజాతి. (ఉదా : ఆఁడుది.)

2. స్త్రీ. (ఉదా: ఆఁడుఁగోల, ఆఁడుముత్తము, మొ.)

జ. ఆఁడుఁగట్టు, ఆఁడుఁగూఁతురు, ఆఁడుఁగూచి, ఆఁడుఁగోల, ఆఁడుఁదనము, ఆఁడుఁదోడు, ఆఁడుఁబడుచు, ఆఁడుఁబాప, ఆఁడుఁబుట్టువు, ఆఁడుగుఱి, ఆఁడుది, ఆఁడుదొంగ, ఆఁడుబిడ్డ, ఆఁడుబీఱ, ఆఁడుముత్తము, ఆఁడుమొఱ.

**ఆఁడుఁగట్టు** వి. (√ఆఁడు.) ఆఁడుదానికోకకట్టు.

సీ. కాళ్ల యొప్పిద మాఁడుఁగ ట్టనుజ్జ్వలము చేయంగ... భార. విరా. 1. 228.

**ఆఁడుఁగూఁతురు** వి (√ఆఁడు) స్త్రీ.

క. పెనిమిటి శివభక్తుఁడు గాఁ, డని యొల్లక రోసి నిన్ను నడిగినరాత్రిన్, జనఁ బడసెఁ గాదె శంకర, గొనకొనఁ బుంస్త్వమ్ము నాఁడుఁగూతురు నీచేన్. శివ. సా. 417.

**ఆఁడుఁగూచి** వి. (√ఆఁడు) వాఁడియైనయాఁడుది, గయ్యాళి.

గీ. పాఁకులకొఱ్ఱు నట్టువపాలియదురుఁ, గ్రోవి భంతంపుటయగారి గుండెదివులు, బట్టువాకట్టు బవనీలపాముకూన, యనఁగ విఖ్యాతిఁ గాంచు నాయాఁడుఁగూచి. శుక. 3. 20.

**ఆఁడుఁగోల** వి. (√ఆఁడు) స్త్రీహత్య; స్త్రీహత్యాపాతకము.

ద్వి. సురవరోరగులకుఁ జోక్కనిమాయ, కరమర్థి నిను దాను గావలెననుచుఁ, బరితాపమొందంగఁ బరిహరించినను, ధర నాఁడుఁగోల నీకుఁ దగులదా యనుచు. ద్వి. ప్రభు. 2. 31. పా. 26 పం.

**ఆఁడుఁదనము** వి. (√ఆఁడు) స్త్రీత్వము.

ఉ. ఆఁడుఁదనంబు నిక్కమున కారసి చూచిన లేదు... భార. విరా. 1. 258.

**ఆఁడుఁదోడు** వి. (√ఆఁడు) 1. తోడఁ బుట్టినది, సహోదరి; సోదరీమత్త్వము.

ఉ. తోయవె యాఁడుఁదోడునను బుట్టవె ... మనుచ. 4. 87.

2. స్త్రీసాహాయ్యము.

(వ్యవ) ఆయింటిలో తోత్తిగా ఆఁడుఁదోడు లేదు.

**ఆఁడుఁబడుచు** వి. (√ఆఁడు) 1. కూఁతురు.

సీ. కొడుకు మన్మథుఁ డాఁడుఁబడుచు భాగీరథి యిల్లాలు భూకాంత యిల్లుకొండ. రా. వి. 1. 28

2. మగనిసోదరి.

**ఆఁడుబాప** వి. (√ఆఁడు) ఆఁడుశిశువు.

**ఆఁడుఁబుట్టువు** వి. (√ఆఁడు) ఆఁడుది.

గీ. చనునె యిమ్మాట లాడ సజ్జనుల కాఁడుఁ, బుట్టువులతోడ నీవును బుట్టినాఁడ, వు... భార. విరా. 2. 50. (ఇట అక్కచెల్లెండ్రు-అని భావము)

2, స్త్రీజన్మము.

ద్వి. పుట్టినదే యాఁడుఁబుట్టువు గాని, చెట్టుగుట్టయి నేమ ఉతిఁ బుట్టనయితి. ద్వి. శ. సా. 2. 52 పా. 11 పం.

**ఆఁడుగుఱి** వి. (√ఆఁడు) యోని. స్త్రీల రహస్యావయవము.

**ఆఁడుది**–ఆఁడది. వి. (√ఆఁడు. తె. అట్టి.) ఇంతి. స్త్రీ. (బ. ఆఁడువారు, ఆఁడువారలు, ఆఁడువాండ్రు.) 'ఆణ్డువాణ్డ్రిద్దఱకు' దా.శా. 1015.

**ఆఁడుదొంగ** వి. (√ఆఁడు) దొంగయైన ఆఁడుది. హరిశ్చ. 5. 132.

**ఆఁడుబిడ్డ** వి. (√ఆఁడు) 1. ఆఁడుశిశువు. 2. కూఁతురు.

సీ. పాలిండ్లు గదలంగఁ బసుపుఁబయ్యెద వీచు వచలాధిపతి కూర్మి యాఁడుబిడ్డ. కాశీ. 2. 63.

3. మగనిసోదరి.

**ఆఁడుబీఱ** వి. (√ఆఁడు) ఆఁడుజాతిబీఱ (వృ.వి.).

సీ. చెనటాయి గాలిమిడి నీరుబచ్చలి ప్రబ్బవేరు గన్నే రాఁడుబీఱ...హంస. 4. 10.

**ఆఁడుమొత్తము** వి. (√ఆఁడు) స్త్రీసమూహము.

సీ. ...ధర్మతనయుండు ధృతరాష్ట్రు వినయ మొప్ప మున్నిడుకొని యాఁడుమొత్తంబుఁ దోడ్కొని...భార. స్త్రీ. 2. 173.

**ఆఁడుమొఱ** వి. (√ఆఁడు) ఆఁడుదాని మొఱ్ఱ.

క. కావరె యీపుణ్యమునన్, తోవరె యని పలుకు నాఁడుమొఱ వినఁబడియెన్. మనుచ. 4. 66.

**ఆఁదోఁక** వి. (√ఆవు) ఆవుతోఁక, గోపుచ్ఛము.

ఆఁదోఁకగా—ఆవుతోఁకవలె మొదట లావుగాను తరువాత అంతకంతకు సన్నముగాను ఉండు ఆకృతి గలిగి; కలిగియుండునట్లు.

(వ్యావ) ఈ బెత్తము ఆఁదోఁకగా నున్నది. ఆకఱ్ఱ ఆఁదోఁకగా చెక్కినారు.

**ఆఁదోఁకపాటు** వి (√ఆవు) ఆఁదోఁకగా నుండుట. ఆము. 5. 30.

**ఆఁపు**–అంచు. స. క్రి. (√ఆఁగు) ఆఁగఁజేయు. (నివారించు, అడ్డగించు.)

వ. ...అధర్మంబు నాఁపనినాఁడు. భార.సభా. 2. 243.

(వశమున నిల్పు. ఉంచుకొను.)

ద్వి. పట్టినవాఁడవో పడయ నంగళ్ల,నాఁపిన వాఁడవో యటుగొన్నిదినము, లేఁపిన వాఁడవో యే నిన్ను వలవ...పండితా. పురా. 115 పొ.

విశే. ప్రతిబంధకము.

సీ. అరికార్యలీలకు నాఁ పొదురాయిత్రాడను రీతిఁ దోరణం బలవరించి. ఇందు. 5. 19.

వి. 1. నిరోధము, అడ్డగింత.

2. నిలుపుట, ఏర్పాటుగా నుంచుట.

(చూ. ఆఁపువెట్టు, ఆఁపుసేయు, మొ.)

**ఆఁపువెట్టు** స. క్రి. (√ఆఁపు) ఒకరికని నిలిపిపెట్టు, ప్రత్యేకముగా ఏర్పఱిచి యుంచు.

చ. ...ఏడ నెవ్వ రెవ్వరు వసియించి యుండి రది వారిద కాననభూమిజాతకో,టరముల నాఁపువెట్టెనె యొడంబడి పక్షుల కుర్వి చెప్పుమా. వేం. పంచ. 3. 111.

**ఆఁపుసేయు** స. క్రి. (√ఆఁపు) 1. బంధించు.

గీ. పట్టుకొని యాఁపుసేయించె బాణుఁ డతని. అని. 3. 120.

2. నిలువచేయు.

(వ్యావ) ఆ చెట్టుకాయలు కోయకుండ ఆఁపుచేసినాఁడు.

3. ఆటంకపఱచు, నిరోధించు.

(వ్యావ) పన్ను చెల్లింపనందున కుప్పనూర్పు ఆఁపుచేసినారు.

4. నిలుపు.

(వ్యావ) నేను వచ్చువంతవఱకు ఊరిబైట బండి యాఁపుచేయుము.

**ఆఁబడ్డ** వి. (ఆవు.) పాలు విడిచిన ఆవుపెయ్య.

సీ. అడ్డంబునిడుపుటాఁబడ్డలగతి మనుబిల్లు డొంకలనుండి క్రేళ్లుదాఁట. మనుచ. 2. 7.

**ఆఁబసి** వి. (√ఆవు) ఆవు.

సీ. బలుదాదు లగుచు తెబ్బులులబిడ్డల నిచ్చ విసువక పెంచు నాఁబసులపదువు. యయా. 2. 49.

**ఆఁపెయ్య** వి. (√ఆవు) ఆవుపెయ్య.

సీ. ...ఒక్క, యాఁపెయ్య యుఱికి...భార. కర్ణ. 2. 90.

**ఆఁపెరుఁగు** వి. (√ఆవు) ఆవుపెరుఁగు. చెన్నబ. 3. 73.

**అఁజేయ**—అఁజెయ్య.

సీ. ...అందంపుటాఁజేయమందలోపలఁ జొచ్చి క్రీడించుకఁటివన్నెకోడె యనఁగ. బహు. 2. 19. (చి.ని.) అఁజెయ్య అని (ముద్రి.)

**అఁబోతు** వి. (√అవు) అచ్చుటెద్దు, యథేచ్ఛముగాఁ దిరుగుటకై అచ్చువేసి విడిచినయెద్దు; ఎద్దు.

మ. ...ఎద్దు క్రొవ్వి పెలుచ న్నాఁబోతుపై అంకెవై చిన చందంబున...భాగ. 10. ఉ. 519.

వ. ...అఁబోతు పంచితంబు మూర్కొనినను బై గాలి వీచినను గొడ్డునకై నం జూలు నిలుచు...భాఁ. విరా, 1. 286.

శా. .. అంకెవైచె నొకచో నాఁబోతు కాల్ద్రొవ్వుచున్. నా. పంచ. 1. 81.

('అంబోతు'అని శాసనములలును వాడుకయును- 1407. గు. శా. 669. 1135. చే. శా. 750.)

**ఆకంపించు** నం. అ. క్రి. మిక్కిలి కంపించు,వణఁకు.

క. ...ఆకంపించె జగత్త్రితయము. ...మార్క. 7. 116.

**ఆకతాయ** విణ. (నం. ఆతతాయీ.) దుష్టుఁడు, తుంటరి.

సీ. ఆకతాయలు మూఁకలై దేశ మంతయుఁ జెఱచి పుణ్యస్త్రీలఁ జెఱలుగొనిరి. వి. పు. 2. 124. హంస. 5. 113.

**ఆకరము** నం. వి. అ. పుం. 1. గని, ఖని, రత్నములు లోనగునవి పుట్టుచోటు. 2. సమూహము.

శ్లో. తతో మందానిలోద్ధూతకమలాకరశోభినా, గురుం నేత్రసహస్రేణ. సం. కు. సం. 2.29.

3. ఉత్పత్తిస్థానము. 4. స్థానము. 5. వ్యాకరణ మహాభాష్యము.

**ఆకరి** నం. విణ. (న్. తీ. న్.) గనియందుఁబుట్టినది, ఖనిజము.

శ్లో. దధతమాకరిభిః కరిభిః క్షతైః. సం. కిరా. 5. 7.

**ఆకరికుఁడు** నం. విణ. (అ. ఈ. అ.) గనులపని చేయించుటకు నియోగింపఁ బడినవాఁడు, గనులపై యధికారి.

**ఆకర్ణన** నం. వి. అ. స్త్రీ. — ఆకర్ణనము.



**ఆకర్ణనము** నం. వి. అ. న. శ్రవణము, వినికి.

**ఆకర్ణనీయము** నం. విణ. (అ. ఆ. అ.) వినఁదగినది.

**ఆకర్ణయత్** నం. (శతృ) వినుచున్న.

**ఆకర్ణయమానము** నం. విణ. (అ. ఆ. అ.) వినుచున్నది.

**ఆకర్ణయిత** నం. విణ. (ఋ. త్రీ. ఋ.) వినువాఁడు.

**ఆకర్ణయితవ్యము.** నం. — ఆకర్ణనీయము.

**ఆకర్ణించు** నం. న. క్రి. ఆకర్ణనముచేయు, విను. మార్క. 1. 81,

**ఆకర్ణితము** నం. విణ. (అ. ఆ. అ.) ఆకర్ణింపఁ బడినది.

**ఆకర్ణ్యమానము** నం. విణ. (అ. ఆ. అ.) వినఁబడుచున్నది.

**ఆకర్ణ్యము** నం — ఆకర్ణనీయము.

**ఆకర్షకము** నం. విణ. (అ. ఇకా. అ.) ఆకర్షించునది. వి. అ. పుం. అయస్కాంతము, సూదంటు రాయి.

**ఆకర్షణము** నం. విణ. (అ. ఈ. అ.) ఆకర్షించునది. వి. అ. న. 1. ఆకర్షించుట. 2. (తంత్ర) ఆకర్షణసాధన మైనకర్మవిశేషము.

**ఆకర్షణి** నం. వి. ఈ. స్త్రీ. 1. పువ్వులు పండ్లు మొదలగునవి కోయుటకై నదోఁటి, కొంకి. 2. ముద్రాభేదము.

**ఆకర్షము** నం. వి. అ. పుం. 1. ఆకర్షించుట, లాగుట. 2. పాచిక. 3. జూద మాడెడుపలక. 4. జూదము. 5. చక్షురాదింద్రియము. 6. ధనురభ్యాసముకై సాధనముగాఁ జేయఁబడిన వస్తువు. 7. నికషము, ఒరగల్లు.

**ఆకర్షి** నం. విణ. (న్. తీ. న్.) ఆకర్షించునది.

**ఆకర్షించు** నం. న. క్రి. 1. ఆకర్షణముచేయు, లాగు; వశపఱచు.

వ...హృదయంబు నాకర్షించుచాడ్పున. భీమ. 6. 79.

2. రప్పించు.

వ. ...నిజాశ్రమంబునకు వచ్చి యనేక శిల్ప కల్పనా చాతుర్యుంబైన విశ్వకర్మ నాకర్షించి యతనితో విట్లనియె. వి. పు.5. 155.

**అకర్షిణి** సం. — అకర్షణి.

**అకర్షితము** సం. విణ. (అ. అ. అ.) లాగింపఁ బడినది.

**అకలన** సం. వి. అ. స్త్రీ — అకలనము.

శా. ...శుభక్రమాకలనచేఁదద్రత్నముం గప్పు సీ,శాఖామాపతి...వసు. 1. 1. (అకలన—చేయించుట)

**అకలనము** సం. వి. అ. న. 1. గ్రహణము, పట్టుకొనుట. 2. అవగాహనము, తెలిసికొనుట. 3. బంధనము, కట్టుట.

శ్లో. సేవ్యోపి సానునయమాకలనాయ యంత్రా, నీతేన...గజేన...శిశు. 5. 42.

4. లెక్కించుట, గణనము. 5. కాంక్ష, కోరిక. 6. సమూహము. 7. కూర్పు. 8. చేయుట; చేయించుట.

**అకలితము** సం. విణ. (అ. అ. అ.) 1. అనుసరింపఁబడినది. 2. బంధింపఁబడినది. 3. గ్రహింపఁబడినది, తెలిసికొనఁబడినది. 4. గ్రథితము,కూర్పఁబడినది. 5. పొందఁబడినది.

**అకల్పము** సం. వి. అ. పుం. 1. వస్త్రాద్యల కరణము, వేషరచనము. 2. భూషణము. 3. కల్పనము, సన్నగడ. అవ్య. అ. న. కల్ప పర్యంతము.

**అకల్యము** సం. వి. అ. న. వ్యాధి, తెవులు.

**అకళించు** స. క్రి. (√సం. అకల) 1. అవగాహనము చేసికొను, తెలిసికొను.

ఉ. అంతము గాఁగ గౌతమకణాదమతంబులు భేదవాదిసి, ద్ధాంతము జైమినీయ మురగాధిప శాస్త్రముఁ గాపిలంబు న,త్యంతము నాకళించి....కళా. 4. 82.

సీ. గ్రహియించె సాంఖ్యయోగములమర్మము లెల్ల,నాకళించెను బురాణాదికముల.శకాం. 2. 58.

2. కలిగించు, చేయు.

సీ. ఏ దేవదేవునిపాదరాజీవకంబు లోకంబులకు సౌఖ్యమాకళించు. కృ. శకుం. పీఠి. 94.

జ. అకళింత, అకళింపు.

**అకళింత** వి. (√అకలించు) జ్ఞప్తి; అవగాహనము.

(వ్యవ) కొంత సేపటికి అవిషయము అకళించి తెచ్చుకొంటిని.

**అకళింపు** — అకళింత.

(వ్యవ) నాకావిషయము అకళింపునకు రాలే

**అకషకుఁడు** సం. విణ. (అ. షికా. అ.) ఒరగ మీఁద రాచి బంగారు మున్నగువానివన్నె ఊంచుటయందు కుశలుఁడు.

**అకషము** సం. వి. అ. పుం. ఒరగల్లు, బంగా మున్నగువానివన్నె పరీక్షించుఱాయి.

**అకషికుఁడు** సం. విణ. (అ. ఈ. అ.) — అకషః పట్టుకొని తిరుగువాఁడు—ఒరగంటిమీఁద రా బంగారు మున్నగువానివన్నె పరీక్షించువాఁడ

**అకసము** వి. (సం. అకాశః. ప్రా. అకాసో.) అకము. మిన్ను.

గీ. ఎనఁగుబెడిదంపుమాట లాకసము ముట్టి భార. భీష్మ. 1. 183.

**అకస్మికము** సం. విణ. (అ. అ. అ.) అకస్మాత్తుగా గలిగినది.

**అకాంక్ష** సం. వి. అ. స్త్రీ. 1. కోరిక. 2. అన్వయమునకై యొకపదము మఱియొక పదమును గోరుట—క్రియను బట్టి విశేషణములను దెలిసికొనుటకై చేసెడు ప్రశ్నము.

**అకాంక్షి** సం. విణ. (న్. నీ. న్.) 1. కోరువాఁడు 2. ప్రతీక్షించువాఁడు, ఎదురుచూచువాఁడు.

శ్లో. తంభావాయ ప్రసవసమయాకాంక్షిణీనాం ప్రజానాం. సం. రఘు. 19. 57.

**అకాంక్షించు** సం. స. క్రి. వాంఛించు, కోరు, అపేక్షించు.

క. నీకొడుకు లొందుసుఖములు, నేకొనరప్వీర సుఖము చిత్తములఁగోరం,బాకాంక్షింతురు. భార. ఉద్యో. 3. 205.

**అకాంక్షితము** సం. విణ. (అ. అ. అ.) కోరఁబడినది.

**అకాంక్ష్యము** సం. విణ. (అ. అ. అ) కోరఁదగినది.

**అకారకరభము** సం. వి. అ. పుం. ఓషధివిశేషము, అక్కలకర (వృ.వి.) (శాలిగ్రామ నిఘంటువు)

**అకారణ** సం. వి. అ. స్త్రీ. — అకారణము.

**అకారణము** సం. వి. అ. న. ఆహ్వానము, పిలుపు.

**అకారము** సం. వి. అ. పుం. 1. రూపము. 2. హృదయమునందలి భావములను వెలికి సూచించు చేష్ట. (బొమముడిపాటు. మొ.) 3. ఇంగితము, హృద్గతభావము. 4. 'అ' అనునక్షరము.

**అకారితము** సం. విశే. (అ. ఆ. అ.) 1. పిలువఁబడినది. 2. ఆకారము కలదిగాఁ జేయఁబడినది.

**అకాలికము** సం. విశే. (అ. ఆ. అ.) 1. పుట్టిన వెంటనే నశించునది, వేగనశించునది. (అ.ఈ.అ.) 2. అకాలమునందుఁ బుట్టినది.

**అకాశకక్ష** సం. వి. అ. స్త్రీ. దిక్చక్రము, ఆకాశము భూమియు అంటినట్లు చుట్టును కనఁబడు ప్రదేశము.

**అకాశగంగ** సం. వి. అ. స్త్రీ మందాకిని, మిన్నేఱు.

**అకాశచక్రము** వి. ఒకవిధమైన బాణసంచు.

వ... వెండియుఁ జక్రబాణంబులు నాకాశచక్రంబులు జంటబాణంబులు... మొదలైన బాణవైఖరులు... హంస. 3. 28.

**అకాశజనని** సం. వి. ఈ. స్త్రీ. ప్రగండి, దుర్గము నడుమ నున్నజనులు వెలుపలివస్తువులు చూచుటకువీలుగా గండ్లు పెట్టబడినగోడ,

**అకాశదీపము** సం. వి. అ. పుం. తులారాశియందు రవి యుండఁగా సాయంకాలమున ఎత్తైన చోటఁబెట్టు దీపము, కార్తికదీపము.

శ్లో. తులాయాం తిలతైలేన సాయంసంధ్యా సమాగమే, ఆకాశదీపం యో దద్యాన్మాస మేకం నిరన్తరమ్. (వాచ)

**అకాశబాణము** సం. వి. అ. పుం. ఒకానొక బాణసంచు. (దీనిని తారాచువ్వ యందురు.)

క. పంజులును బగలువత్తుల, పుంజము లాకాశబాణములు చేబిరుసుల్, వింజామరకోపుల చాలుం జెలువు వహించె లోకలోచనము లకుణ్. రా. వి. 5. 61.

**అకాశభాషితము** సం. వి. అ. న. 1. (నాటక) రంగమునందుఁ బాత్రాంతర మేదియు లేకున్నను ఉండి యేమో చెప్పఁగా విన్నట్లు నటించి దాని ననువదించుట. 2. ఆకాశమునందుండి అదృశ్యులగు దేవాదులవలనఁ బుట్టినమాట, ఆకాశవాణి.

**అకాశమాంసి** సం. వి. ఈ. స్త్రీ. క్షుద్రజటామాంసి (వృ. వి.)

**అకాశము** సం. వి. అ. పుం. న-సూర్యాది గ్రహములు ప్రకాశించు ప్రదేశము - 1. అకసము, మిన్ను. (వైశేషికులతొమ్మిది ద్రవ్యములలో నిది యొక్కటి. దీనిగుణము శబ్దము.) 2. అభ్రకము. 3. బ్రహ్మము. 4. (గణిత) సున్న, శూన్యము.

**అకాశమూలి** సం. వి. ఈ. స్త్రీ. కుంభిక, శిఁగపాఁచి (వృ. వి.)

**అకాశయానము** సం. వి. అ. న. 1. (ఆకాశగమనమునకు సాధనమగు) విమానము. 2. ఆకాశమునఁ బోవుట, ఆకాశగమనము.

**అకాశరక్షి** సం. వి న్. పుం. దుర్గము వెలుపలి యావరణపు గోడమీఁద నుండి కావలికాచు భటుఁడు.

**అకాశవల్లి** సం. వి. ఈ. స్త్రీ. ఒకానొక బదనిక. (వృ వి.)

**అకాశవాణి** సం. వి. ఈ. స్త్రీ. ఆకాశమునుండి పుట్టినట్లు వినఁబడునట్టి యదృశ్యదేవాదులవాక్కు. అశరీరవాక్కు.

**అకాశసలిలము** సం. వి. అ. న. ఆకాశమునుండి పడిననీరు. (మేఘధారలచేఁ బుట్టినది ధారమనియు, చంద్రకరములనుండి కలిగినది కారమనియు, తుషారకృతమైనది తౌషారమనియు, హిమఖండముల వలనఁ గలిగినది హైమమనియు-ఇది నాలుగువిధములు.)

**అకాశస్ఫటికము** సం. వి. అ. పుం. వడగల్లు, వర్షోపలము. కరక.

**అకాశీయము** సం. విశే. (అ. ఆ. అ.) ఆకాశమునకు సంబంధించినది.

**అకాశ్యము** సం — ఆకాశీయము.

**అకించన్యము** సం. వి. అ. న. దారిద్ర్యము, అకించనత్వము.

**అకిరాలు** వి. (క. ఆకె) భార్య ?

వ... కొందఱు బుడిబుడిఁ జని దూపను జాలిఁ బట్టి తెప్పిరిలి తమయాకిరాండ్రఁ జూడఁ గలిగిన జాలుఁ గంబము రాయా నీకుఁ

గలపణాగ్రములు సాగింతుము...ప్రబంధ. 788.

**అకీర్ణము** సం. విణ. (అ. అ. అ.) 1. వ్యాప్తము; నిండినది. 2. విక్షిప్తము, చిమ్మఁబడినది. 3. ఒకటితో నొకటి కలసినది, సంకీర్ణము.

**అకు** వి. (క. అకు. త. అక.) 1. పర్ణము, పత్త్రము. భార. అర. 2. 174.

2. తములపాకు.

క...క,ర్పూరంబుతోడితాగా, లీరాదో యాకు మడఁచియీరాదో చెలీ. కళా. 4. 69.

3. గ్రంథపత్త్రము.

క. ఇదియెంత పేర్చెదరు మీ, చదివినయాకునవె తానుఁ జదివినయది మా, సుదతియు ... ప్రభా. 5. 74.

4. అధికారపత్త్రము, అజ్ఞాపత్త్రము.

సీ. చావు లేకుండ నాజముచేత నాకుఁ దెచ్చిన వారు గలరె యీసృష్టియందు. భోజరా. 4. 45.

5. ఆయుష్పత్త్రము.

ఉ. కాముని మేను గాలె ... వసంతునియాకు రాలె...హంస. 5. 99. (ఇట 'ఆయువు' అనిభావము. 'పర్ణము' అని రెండవ అర్థము.)

6. జాబు.

సీ....చదువ నీక తా నొడిసి యాయాకుబలిమిఁ బుచ్చుకొనియె...ప్రభా. 4. 45.

7. ఋణాదులను ఇచ్చిపుచ్చుకొనుట మొదలగు వ్యవహారములను దెలుపుపత్త్రము.

క. అప్పిచ్చినతని యాకును, నప్పు మగుడఁ బెట్టునతనియాకును గలచో, నప్పిచ్చి నాకు బొంకగు, నప్పు మగుడఁబెట్టినతనియాకు నిజమగుఁగా...విజ్ఞా. వ్య. కాం. 28.

8. కర్ణపత్త్రము, చెవికమ్మ, చెవ్వాకు, కర్ణభూషావిశేషము.

చ. తిలకము తీర్చుచుఁగా గురులు దీటుచు వీనుల మానికంపుటాకులఁ బోరిఁ ద్రిప్పుచుఁగా. నృసిం. 2. 86.

9. త్రాఁతకుపయోగించుతాటాకు.

సీ. ఇందు నీవిపుడు వ్రాలిడు మని యాకు గంటము చేతి కిచ్చె...పరమ. 5. 358.

10. అరము, బండికంటియాకు.

(వ్యవ) ఇది పంద్రెండాకులచక్రము.

11. తలుపుల కమర్చెడియాకు.

(వ్యవ) కిటికీతలుపులయాకులు తెలచి యుంచినారు.

12. వరి మొదలగువాని నారు.

(వ్యవ) వరియాకు ఊడ్చినారు.

13. విస్తరాకు.

(సా) అయినవాండ్రకు ఆకులలోను కాని వాండ్రకు కంచములలోను.

జ. అకుఁగూర, అకుఁజిలుత, అకుఁజిలుక, అకుఁ జెప్పు, అకుఁదేలు, అకుఁబచ్చ, అకుఁబత్తి, అకుఁబాఁచి, అకుఁబీఁకె, అకుఁబురుగు, అకుజెముడు, అకుజెల్ల, అకుటిక్క, అకుటిల్లు, అకుపోయు, అకుప్పు, అకుమడి, అకుషదుపు, అకుమిడుత, అకురాలుకారు, అకుజాయి, అకుసంపెఁగ, అకుసన్నములు.

**అకుంచనము** సం. వి. అ. న. 1 ముడుఁగుట, సంకోచము; ముడుఁచుట. 2. వంగుట; వంచుట.

(ఇది తర్కమునందు ఉత్క్షేపణము, అవక్షేపణము, అకుంచనము, ప్రసారణము, గమనము- అను పంచకర్మములలో నొకటి.)

**అకుంచితము** సం. విణ. (అ. అ. అ.) 1. ముడుఁగఁ జేయఁబడినది, సంకోచితము. 2. అభుగ్నము, వంపఁబడినది.

**అకుఁగూర** వి. (√అకు) పత్త్రశాకము. (తోఁటకూర, బచ్చలికూర, మొ.)

**అకుఁజిలుత** వి. (√అకు) ఒకజాతిచిలుతపులి.

**అకుఁజిలుక** వి. (√అకు) తెల్ల బొట్లుగల పెద్ద రెక్కలతో నుండుఒకానొకపురుగు.

సీ. ధర రామచిలుకతో సరి యాకుఁజిలుకైనఁ బడఁతిపల్కులసరి పైక మగును. చంద్రా. 4. 105.

**అకుఁజెప్పు** వి. (√అకు) ఆకువలె పలుచనియట్టి గలచెప్పు.

**ఆకుఁదేలు** వి. (√ఆకు) ఆకులమీఁదనుండి తేలువలెఁ గుట్టు ఒకానొక పురుగు.

**ఆకుఁబచ్చ** వి. (√ఆకు) ఆకువలె పచ్చనైనరంగు, హరితవర్ణము. విశే. ఆకువలె పచ్చనైనరంగు కలది.

**ఆకుఁబత్రి** వి. (√ఆకు) ఒకానొకఓషధి (వృ. వి.)

**ఆకుఁబాఁచి** వి. (√ఆకు) ఒకజాతిపాఁచి, కుంభిక (వృ. వి.)

**ఆకుఁబీఁకె** వి. (√ఆకు) 1. ఊఁదుటకు బూరలకు ఆకులతోఁ జేసి పెట్టెడుపీఁకె. 2. బ. బాల క్రీడావిశేషము. (ఆకులతో బూరలకు పీఁకెలు పెట్టి యూఁది ఆడెడుఆట.)

సీ. ఆకుఁబీఁకెలు... గీ. తాటియాకులచిలుకలు త్రాళ్లపాము,లకట యగచాట్ల పోతనై యాడుకొనుచు. హంస. 3. 146.

**ఆకుఁబురుగు** వి. (√ఆకు) ఆకుమీఁద నుండు ఒక జాతి పచ్చపురుగు.

**ఆకుజెముడు** వి. (√ఆకు) పత్త్రస్నుహి, ఒకజాతి జెముడు (వృ. వి.)

**ఆకుజెల్ల** వి. (√ఆకు) మత్స్యవిశేషము. హంస. 4. 187.

**ఆకుటిక్క** వి. (√ఆకు) పర్ణశాల, ఆకుటిల్లు.

సీ. ఆకుటిక్కలు నాడెమైనమాడువు లయ్యె మంటిదుంపలు పిండివంట లయ్యె. అచ్చ. రా. అర. 102.

**ఆకుటిల్లు** వి. (√ఆకు) పర్ణశాల

సీ. ఆకుటిండ్లను గట్టి యందుండి ప్రీతిమైనమల మంత్రాదుల నధ్వరంబుఁ, జేయుచుండఁగఁ జూచి...వేం. మా. 1. 125.

**ఆకుపోయు** స. క్రి. (√ఆకు) నాఱుకై చల్లు. (వ్యవ) కుంచెఁడువడ్లు ఆకుపోసినారు.

**ఆకుప్పు** వి. (√ఆకు) ఒకదినుసు ఉప్పు.

**ఆకుమడి** వి. (√ఆకు) నాఱుపోసినమడి.

**ఆకుమడుపు** వి. (√ఆకు) వృత్తపర్ణము, తములపాకులచుట్ట.

సీ. హెచ్చుపావనవక్క లిచ్చి చుట్టిన యాకు మడుపు లీఁ దివిరెడు వడవచాని. ఉ. రా. 4. 428.

**ఆకుమిడుత** వి. (√ఆకు) ఆకుపచ్చ రెక్కలమిడుత.

**ఆకురాలుకారు** వి. (√ఆకు) చెట్లయాకులు రాలెడి కాలము.

**ఆకుఱాయి** వి. ౘా. (√ఆకు) కత్తి లోనగువానిని రాచెడి ఒకానొక పనిముట్టు, పత్త్రపరశువు.

సీ. ఆకుఱాతను రాచునందాన గడుసరి నార చీరను మేను చీరుకొనఁగ. పార్వ. 4. 21.

**ఆకులపడు** అ. క్రి. (√ఆకులము) ఆకులమగు, కలఁగు. (చూ. ఆకులపాటు.)

**ఆకులపాటు** అ. వి. (√ఆకులపడు) వ్యాకులత్వము, కలఁత.

ఉ. ...కా,రాకులపాటు దెందమున నాకులపాటొందవింపఁ జొచ్చె. దశకు. 3. 98. శశాం. 3. 82.

**ఆకులము** సం. విశే. (అ. ఆ. అ.) 1. చెదరినది; వ్యాకులము, కలఁగినది.

ఉ. ఆకుల మంది నిర్జరచయంబు భయంబునఁ దల్లడిల్ల ...కు. సం. 12. 842. (ఇట 'ఆకులత్వము' అను నర్థమునఁ బ్రయోగింపఁబడినది.)

2. వ్యాప్తమైనది, నిండినది.

ఉదా: మృగపక్షిగణాకులము వనము.

**ఆకులితము** సం. విశే. (అ. ఆ. అ.) 1. ఆకులపడినది. 2. ఆకులపఱుపఁబడినది.

**ఆకుల్యము** సం. వి. అ. న. 1. ఆకులత్వము, క్షోభము.

క. నీకఱపుల నిక్కురుకుల,మాకుల్యముఁ బొందు టేమియాశ్చర్యము... భార. ఆది. 8. 41.

2. నేలతంగేడు (వృ. వి.). (శ. ర.)

**ఆకుసంపెఁగ** వి. (√ఆకు) ఆకులవంటి పువ్వులు గల సంపెఁగ (వృ. వి.).

**ఆకుసన్నములు** వి. బ. (√ఆకు) వ్రీహివిశేషము, ఒకజాతివడ్లు.

**ఆకూణితము** సం. విశే. (అ. ఆ. అ.) ఇంచుక మూయఁబడినది.

**ఆకూతము** సం. వి. అ. న. ఆశయము,అభిప్రాయము (వై.ని.) 2. అభిప్రాయవ్యంజకచేష్ట. (రం.ని.)

**అకూతి** నం. వి. ఇ. స్త్రీ. - ఆకూతము.

**ఆకృతి** నం. వి. ఇ. స్త్రీ. 1. ఆకారము, రూపు. 2. జాతి, సామాన్యము. 3. దేహము. 4. హృదయమందలి భావమును దెలుపుచేష్ట. 5. ఒకానొక ఛందస్సు. 6. సాదృశ్యము, పోలిక, రీతి.

చ....ప్రాతవాయువులు దోఁచుఁ బురిం బరి చారికాకృతిగా. పాండు. 1. 119.

క. అడవుల బొబ్బలు వెట్టుచు,నడలెడు హరు లింతికానునాకృతిఁ గనునే. ఽసిక. 2. 97.

**ఆకృతిగణము** నం. వి. అ. పుం. (వ్యాక) గణ విశేషము. (ఇందు ఉదాహరింపఁబడిన పదము లతో పాటు కార్యసాదృశ్యమునుబట్టి మఱి కొన్ని పదములుగూడ గ్రహింపఁబడును.)

**ఆకృతిచ్ఛత్ర** నం. వి. ఆ. స్త్రీ. ఘోషాతకీలత, నేతి బీఱ (వృ. వి.)

**ఆకృష్టము** నం. విణ. (అ. ఆ. అ.) ఆకర్షింపఁబడి నది.

**ఆకృష్టి** నం. వి. ఇ. స్త్రీ. ఆకర్షణము.

**ఆకె** న. వి. (అ+అక్క - దీని తుదిఅకారమునకు ఎకార మాదేశమగును. ఇల్లే. ఆపె, ఆమె, మొ.) ఆమె.

క. నాకంటె నకట! యుత్తమ, యాకె యగుట చెప్పవలయునా...ప్రభా. 5. 181.

**ఆకేకరము** నం. విణ. (అ. ఆ. అ.) – ఇంచుక రక రము - కొంచెము ఓరగాఁ జూచునది. (కన్ను, దృష్టి.)

శ్లో. దృష్టిరాకేకరా కించిత్స్ఫుటాపాంగే ప్రసా రితా, మీలితార్ధపుటాలోకే తారావ్యా వర్తనోత్తరా. (వాచ)

**ఆకొత్తు** – అడకొత్తు.

గీ. కంటికాటుక పొడివక్క కావితొత్తి,బ్రేలియా కొత్తుఁ తెంది యవ్వేలవెలంది, తల్లి యేతెంచి ...బహు. 5.118.

**ఆక్రందనము** నం. వి. అ. న. 1. బిగ్గరగా నేడ్చుట, ఏడ్పు. 2. మొఱ్ఱ. 3. పిలుపు.

**ఆక్రందము** నం. వి. అ. పుం. 1. పెద్దరోదనము, ఏడ్పు. 2. మొఱ. 3. పిలుపు. 4. యుద్ధ మందలి పెద్ద యఱపు, బొబ్బరింత. 5. ధ్వని. 6. భయంకర మగుయుద్ధము. 7. ఏడ్చు చోటు.

**ఆక్రంది** నం. విణ. (న్. నీ. న్.) 1. మొఱ పెట్టు వాఁడు, బిగ్గరగా నేడ్చువాఁడు. 2. అఱచు వాఁడు. 3. పిలుచువాఁడు.

**ఆక్రందించు** నం. అ. క్రి. 1. ఏడ్చు. 2. మొఱ పెట్టు. మార్క. 1.158.

**ఆక్రందికుఁడు** నం. విణ. (అ. ఈ. అ.) – దుఃఖితు లగు వారియేడ్పు విని యాచోటికిఁ బనుగునఁ బోవువాఁడు-ఆర్తరక్షకుఁడు.

**ఆక్రందితము** నం. విణ. (అ. ఆ. అ.) పిలువఁబడి నది. వి. అ. న. 1. బిగ్గరగా నేడ్చుట. 2. అఱపు, అరుపు.

**ఆక్రందుఁడు** నం. వి. అ. పుం. 1. మిత్త్రుఁడు 2. రక్షకుఁడు. 3. పార్ష్ణిగ్రాహునకు (దండెత్తి పోవురాజు వెనుక దిక్కున నుండు శత్రువు నకు) వెనుక నుండురాజు.

**ఆక్రమణము** నం. వి. అ. న. – ఆక్రమము.

**ఆక్రమము** నం. వి. అ. పుం. 1 ఆక్రమించుట, క్రమ్ముట. 2. బలిమిచే వశపఱచుకొనుట.

**ఆక్రమించు** నం. స. క్రి. 1. అఱుము.

(క) బలాత్కారముగాఁ బట్టుకొను

ఆ. అనదనైతి నిచట నాలికు య్యాలింపుఁ, డకట మీరు గలుగ నాక్రమించి, నన్నుఁ గట్టి సూతనందను లిమ్మెయి, వెఱపు లేక భంగపఱచువారు. భార. విరా. 3.19.

(చ) బలత్కారముగా వశపఱుచుకొను; అన్యా యముగా వశపఱుచుకొను.

తే. అప్పురంబులు వడిఁదాన యాక్రమించి మార్క. 6.71.

సీ. తపనసూనుఁడు తారఁదా నాక్రమింపఁగె యన్న ప్రాణములకు నఱ్ఱు దలఁచి. ప్రబో 1.50.

2. ఓడించు, జయించు.

చ. ...ఇంక నెవ్వరికిని జన్నె వీని ననవద్య పరాక్రము నాక్రమింపఁగన, భార. అది 7.205.

3. అతిక్రమించు, ఉల్లంఘించు.

ఆ. దీన నేమి తప్పు కానకు నేఁగిన, యతఁడు
సమయవృత్తి నాక్రమించి, తండ్రిపాలు
మాకుఁ దగు నంచు నడియరి, తనము నేసి
రాక తప్పు గాక. భార. ఉద్యో. 1.250.

**ఆక్రాంతము** సం. విణ. (అ. ఆ. అ.) ఆక్రమింపఁబడినది.

**ఆక్రాంతి** సం. వి. ఇ. స్త్రీ. — ఆక్రమణము.

**ఆక్రామకుఁడు** సం. విణ. (అ. ఇకా. అ.) ఆక్రమించువాఁడు.

**ఆక్రీడనము** సం. వి. అ. న. క్రీడించుట, ఆడుకొనుట.

**ఆక్రీడము** సం. విణ. (అ. ఆ. అ.) క్రీడించునది, విహరించునది. వి. అ. పుం. ఉద్యానవనము.

**ఆక్రీడి** సం. విణ. (న్. నీ. న్.) క్రీడించువాఁడు.

**ఆక్రుశ్యమానుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) 1. (రక్షణమునకై) బిగ్గరగా పిలువఁబడుచున్నవాఁడు. 2. తిట్టఁబడుచున్నవాఁడు, శపింపఁబడుచున్నవాఁడు.

**ఆక్రుష్టము** సం. విణ. (అ. ఆ. అ.) 1. (రక్షణమునకై) బిగ్గరగాఁ బిలువఁబడినది. 2. నిందింపఁబడినది, తిట్టఁబడినది. వి. అ. న. 1. పరుషభాషణము. 2. పిలుపు, కేక, కూఁత.

**ఆక్రుష్టి** సం. వి. ఇ. స్త్రీ. 1. (రక్షణమునకు) బిగ్గరగాఁ బిలుచుట; అఱచుట. 2. తిట్టుట, శపించుట.

**ఆక్రోశకుఁడు** సం. విణ. (అ. ఇకా. అ.) ఆక్రోశించువాఁడు.

**ఆక్రోశత్** సం. (శతృ) ఆక్రోశించుచున్న.

**ఆక్రోశనము** సం. వి. అ. న. — ఆక్రోశము.

**ఆక్రోశము** సం. వి. అ. పుం. 1. తిట్టు, శాపము. 2. నింద, అపవాదము, నడి. 3. (రక్షణమునకు) బిగ్గరగా అరచుట.

**ఆక్రోశి** సం. విణ. (న్. నీ. న్.) ఆక్రోశించువాఁడు.

**ఆక్రోశించు** సం. స. క్రి. 1. తిట్టు, శపించు. 2. నిందించు. 3. (రక్షణమునకై) బిగ్గరగాఁ బిలుచు. 4. గట్టిగాఁ జెప్పు, చాటించు.

క. కాశీక్షేత్రము పంచ, క్రోశము గైవల్య లక్ష్మికులగృహ మని యా, క్రోశించు శ్రుతులు వినియును...కాశీ. 2. 118.

అ. క్రి. (భయాదులచే) అఱచు, వాపోవు.

శా. ...బెదరెం జమూరుగణ మాక్రోశించెఁ బంచాస్యముల్. హరి. 6. 46. భార. విరా. 4. 4.

**ఆక్రోష్ట** సం. విణ. (ఋ. ష్ట్రీ. ఋ.) ఆక్రోశించువాఁడు.

**ఆక్లేదము** సం. వి. అ. పుం. తడియుట.

**ఆక్షద్యూతికము** సం. విణ. (అ. ఈ. అ.) జూదముచేతఁ గలిగినది. (వైరము, మొ)

**ఆక్షపాటికుఁడు** సం. వి. అ. పుం. 1. అక్షక్రీడాధ్యక్షుఁడు, జూదము నడపువాఁడు. 2. వ్యవహారాధ్యక్షుఁడు, ప్రాడ్వివాకుఁడు.

**ఆక్షపాదము** సం. వి. అ. న. గౌతమతర్కము, న్యాయశాస్త్రము.

**ఆక్షపాదుఁడు** సం. వి. అ. పుం. నైయాయికుఁడు, గౌతమతర్కము చదివినవాఁడు.

**ఆక్షారణ** సం. వి. ఆ. స్త్రీ — ఆక్షారము.

**ఆక్షారణము** సం. వి. అ. న — ఆక్షారము.

**ఆక్షారము** సం. వి. అ. పుం. 1. అమ్మ ఆలి - అని తిట్టుట, బూతులు తిట్టుట. 2. అగమ్యాగమనము చేసితివని పురుషుని అగమ్యగమనము చేసితివని స్త్రీని దూషించుట.

**ఆక్షారితుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) అగమ్యాగమనాదిదోషము చేసినాఁ డని దూఱఁబడినవాఁడు.

**ఆక్షికుఁడు** సం. విణ. (అ. ఈ. అ.) 1. జూదమాడువాఁడు. 2. జూదమున గెలుచువాఁడు. 3. జూదమున ఓడింపఁబడినవాఁడు.

**ఆక్షిప్తము** సం. విణ. (అ. ఆ. అ.) 1. త్రోయఁబడినది. 2. కొనిపోఁబడినది, అపహరింపఁబడినది. (విక్రమో. 5. 5.) 3. ఈడ్వఁబడినది, ఆకర్షింపఁబడినది. 4. చెదిరినది, కలతఁపడినది. (ఆక్షిప్తమివమే చేతః. వేణీ. 2.) 5. నిందింపఁబడినది, దూషింపఁబడినది.

**ఆక్షీబము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఇంచుక మత్తుగలది. 2. మిక్కిలి మత్తెక్కినది. వి. అ. పుం. శోభాంజనవృక్షము, మునగ (వృ. వి.)

**ఆక్షేపకము** సం. వి. అ. పుం. ఒకవిధమైన వాతరోగము.

**ఆక్షేపకుఁడు** సం. విణ. (అ. విశా. అ.) ఆక్షేపించు వాఁడు. వి.అ.పుం. బోయవాఁడు,వ్యాధుఁడు.

**ఆక్షేపణము** సం. వి. అ. న – ఆక్షేపము (కడపటి 8. వ అర్థముతక్క.)

**ఆక్షేపము** సం. వి. అ. పుం. 1. త్రోసివేయుట, చిమ్మివైచుట. 2. లాగుట, ఆకర్షము. 3. భర్త్సనము, అదలుపు. 4. అపవాదము, నింద; తిరస్కారము. 5 అపహరించుట. 6. పూర్వ పక్షము, దోషములుఎంచుట. 7.వణఁకురోగము. 8. ఒకానొక అర్థాలంకారము.

**ఆక్షేపి** సం. విణ. (న్. తీ. న్.) ఆక్షేపించువాఁడు.

**ఆక్షేపించు** సం. స. క్రి. 1. తిరస్కరించు, దూఱు.

సీ. నీలజీమూతంబులీల నాక్షేపించి నల్లనై త్రోఁ తెంచు నల్లగృహము. భార. ఆది. 6. 211.

2. అదల్పు, బెదరించు.

శా. చేరన్ బోవఁ బ్రబాను లడ్డమయి యా క్షేపించి యి ట్లేఁగఁగా, మేరా నీ వెటఁ బోయె దెవ్వఁడవు...ఉ. రా. 3. 230.

3. అడ్డగించు, 4. పూర్వపక్షముచేయు 5. చిమ్ము. 6. ఆకర్షించు, లాగు.

శా. పూర్వాంభోధిజలంబు లన్నియు వడిం బొల్పేదఁగాఁ ద్రాగి త,ద్గీర్వాణోరునదీ జలౌఘముల నాక్షేపింప విస్వీథి క, య్యార్వోర్వ్యగ్రా గ్నిరయంబున న్నెగసె నా నత్యంత రాగద్యుతుల్, పర్వెం దూర్పునఁ దోఁచెఁ జంద్రుఁడెదలోఁ బాంథుల్ భయం బందఁగన్ కు.సం 8. 107. (ఇట 'పీల్చు లాగు' అని తాత్పర్యము. 'నదీజలౌ ఘముల నాక్షేపించి విస్వీథి, నయ్యార్వో ర్వ్యగ్ని రయంబున న్నెగసె' అనిముద్రిత పాఠము.)

**అక్షోటము** సం. వి. అ. పుం. – అక్షోటము, కొండ గోఁగు (వృ. వి.)

**ఆఖండలుఁడు** సం. వి. అ. పుం. – పర్వతములను భేదించినవాఁడు – ఇంద్రుడు.

**ఆఖనము** సం. – ఆఖము.

**ఆఖనిక బకము** సం – ఆఖనికము.

**ఆఖనికము** సం. వి. అ. పుం. 1. గుద్దలి. 2. గడ్డ పాఱ. 3. పంది. 4. ఎలుక.

**ఆఖనికుఁడు** సం. వి. అ. పుం. కన్నపుదొంగ.

**ఆఖము** సం. వి. అ. పుం. 1. గడ్డపాఱ. 2. గుద్దలి.

**ఆఖరము** సం. – ఆఖము,

**ఆఖానము** సం – ఆఖము.

**ఆఖుకర్ణి** సం. వి. ఈ. స్త్రీ. ఎలుకచెవి తీఁగ, ఎలుక జీడి (వృ. వి.)

**ఆఖుపర్ణి** సం – ఆఖుకర్ణి.

**ఆఖుపాషాణము** సం. వి. అ. పుం. (వైద్య) పాషాణ భేదము.

**ఆఖుభుక్కు** సం. వి. జ్. పుం. ఎలుకలను భుజిం చునది – మార్జాలము, పిల్లి.

**ఆఖువాహనుడు** సం. వి. అ. పుం. కొక్కురౌతు, గణేశుఁడు.

**ఆఖువిషహ** సం. వి. అ. స్త్రీ. – మూషికవిషమును హరించునది – దేవతాడవృక్షము, డావర డంగి (వృ. వి.)

**ఆఖుపు** సం. వి. ఉ. పుం. 1. ఎలుక 2. పందికొ క్కు 3. దొంగ. 4. పంది. 5. దేవతాడ వృక్షము.

**ఆఖేటకము** సం. వి. అ. న. వేఁట.

**ఆఖేటము** సం. వి. అ. పుం. వేఁట, మృగయ.

**ఆఖేటికము** సం. వి. అ. పుం. వేఁటకుక్క.

**ఆఖోటము** సం. వి. అ. పుం. అక్షోటము, కొండ గోఁగు (వృ. వి.)

**ఆఖ్య** సం. వి. అ. స్త్రీ. సంజ్ఞ, పేరు.

**ఆఖ్యాత** సం. విణ. (ఋ. త్రి. ఋ.) చెప్పువాఁడు.

**ఆఖ్యాతము** సం. విణ. (అ. ఆ. అ.) చెప్పఁబడినది. వి. అ. న. (వ్యాక) 1. తిఙ్ప్రత్యయము 2. తిఙన్త పదము.

**ఆఖ్యాతి** సం. వి. ఇ. స్త్రీ. కథనము, చెప్పుట.

**ఆఖ్యానకము** సం. వి. అ. న. చిన్నకథ.

**ఆఖ్యానము** సం. వి. అ. న. 1. చెప్పుట, కథనము. 2. పూర్వవృత్తకథనము. 3. ప్రతివచనము, ప్రత్యుత్తరము. 4. భారతము మొదలగు ఆర్ష మహాకావ్యములవడుమ వచ్చెడి కథా విశేషము. 5. కథ.

**అఖ్యాయకుఁడు** సం. విశే. (అ. యికా. అ.) చెప్పువాఁడు, కథకుఁడు. వి. అ. పుం - ఒకరు చెప్పినదానిని మఱొకరికిఁబోయి చెప్పువాఁడు - దూత.

**అఖ్యాయి** సం. విశే. (న్. సి. న్.) చెప్పువాఁడు, కథకుఁడు.

**అఖ్యాయిక** సం. వి. ఆ. స్త్రీ. యథార్థముగా జరిగినకథను జెప్పెడి గద్య గ్రంథ విశేషము. (హర్ష చరితాది-అఖ్యాయిక, కథ, అని రెండు తెగలుగా గద్యకావ్యములను విభజించి బాణుని హర్ష చరితను అఖ్యాయిక యనియు తదితరము లగు కాదంబర్యాదులను కథ యనియు ఆలంకారికులు చెప్పుదురు. దండి యీ రెంటికి భేదము పాటింపలేదు.)

**అఖ్యేయము** సం. విశే. (అ. ఆ. అ.) చెప్పఁదగినది, కథనీయము.

**అగంత** సం. విశే. (ఋ. త్రి. ఋ.) వచ్చువాఁడు. రానున్నవాఁడు

**అగంతుకము** సం. విశే. (అ. ఆ. అ.) 1. ఆకస్మికముగా వచ్చునది; ఆకస్మికముగా సంభవించునది. 2. కవిరచిత ప్రబంధాదులలో మరియొకరిచే నడుమఁ జొప్పింపఁబడినది, ప్రక్షిప్తము.

**అగంతుకుఁడు** సం. వి. అ. పుం. అతిథి.

**అగంతువు** సం. విశే. (ఉ.) అకస్మాత్తుగా వచ్చునది; అకస్మాత్తుగా సంభవించునది. వి. అ. పుం. అతిథి.

**అగడకాఁడు** విశే. √అగడము. (త. అగడియక్కారన్. క. అగడకాఱ.)—అగడీఁడు.

**అగడపలు** వి. బ. మేఘశకలములదొంతులు, మెట్లవలె నేర్పడిన మబ్బుతునుకల వరుసలు.

సీ. పడమర నిరుదెసఁ బ్రబలిమార్యములు దోఁచె నంబరంబునఁ బర్వె నాగడపలు. హరి.పూ. 7. 160.

గీ. గగనమార్గంబునందు నాగడప లెగసె,నంబుధరమాలికలు దక్షిణంబు నడచె. హర.2.16.

వ. ...అగడపలం గడవవైచి వీచిరేఖలం బోఁద్రోచి కుసుమవారాచు శేశాకూశిం గలజాళువాపోపవంబులఁ బ్రతిఘటించు త్రివళి విభాగంబులును. పాండు. 5. 179. ఆం. భా. 1. 73.

(వ్యవ) ఆకాశమున మేఘములు అగడపలు తీర్చినవి, నేఁడో రేపో వర్షము కురియును.

**అగడము** వి. (సం. అగస్. త. అగడ. క. అగడియం.) 1. అకార్యము, చెడ్డపని; కొంటెపని.

సీ. వేశ్యయొక్కత దొల్లి విద్యాంసు నొకరుని ప్రముచ్చని తలవరుల్ మోఁదఁ జూచి. గీ. యితఁడు మావాఁడు మీరిది యేటికాగడంబు చేసెద రని మోక్షణంబునేసి. భార. అను. 5. 313.

గీ. అవయవంబులు గదియంగ నదిమి యదిమి, యవల నేమేమొ చేసె నయ్యాగడంబు, లెట్లు చెప్పుదు సిగ్గు నోరెత్తనీదు. అని.2.91.

క. విడిచిన నెప్పటి చని యా, గడములు చేసెదవు నిన్నుఁ గాచుట మాకుం, గడు బ్రేఁగు ...హరి. పూ. 5. 240.

2. దుష్కార్యచిహ్నము, చెడ్డపనులు చేసినట్లు సూచించెడి గుర్తు.

చ. పడుచుఁదనాన వచ్చి నినుఁ బట్టి పెనంగె వటంచు లేనియా, గడములు గొన్ని యంగమునఁ గానఁబడఁ బవరించి యీసుచేఁ, దొడిఁబడఁబోయి ప్రాణవిభుతో నెఱిఁగించి తెగించి వానినో,పడఁతుక యాజ్ఞసేయుమని పంచితివి....సారంగ. 3. 48.

3. దౌష్ట్యము.

గీ. తలిరుఁబోఁడుల డెందము ల్దల్లడిల్లఁ,గూఁక లిడుకొంచు నెంతయుఁ గొఱఁత లేక, యాగడంబునఁ బరి విచ్చి యాడె దేమి. నీలా. 3. 27.

4. వంచన, మోసము.

సీ. ...ఈభామిని బభ్రునిభార్య ప్రజలఁ. గీ. గనుమె యిది యని యడిగినఁ గౌరవేంద్ర, యత్తపోధనవర్యు లయ్యాగడమున, కాత్మలందుఁ గ్రోధానల మగ్గలముగ,నెలయ నక్కుమారులతోఁదనిట్టు లనిరి.భార.మౌ.8.

(విప్రలంభ ప్రదర్శి కా. సం. భార. మౌ.2.7.)

5. అనాదరము, పరిభవము.

ఉ. సాఁగిలి మ్రొక్కి యిట్లనెఁ ద్రిశంకుఁడ నేను వసిష్ఠుఁజేరి సశ్రోన్ని గురువట్ల్య నాకమున కున్నతిఁ బంపవె మేనితోడ నా, నాగడమున్ ఘటింపఁ గని యయ్యెయొ కౌశికుఁ జెంద నింతకున్, వేగమ పంపఁడే దివికి వేఁడిన యట్టుల నంచుఁ బల్కితిన్. ఉ. హరిశ్చ. 4. 159.

6. అన్యాయము, దుర్నీతి.

క. వేగురు గన రాకుండిన, వేగ మరలివచ్చి తపసి వెన్నెలతోఁ డప్లాగడమున మెలఁగెడు మము, బాగుగఁ బొడగాంచియెదమ బాయని కినుకన్. అచ్చ. రా. బాల. 147.

7. ఉత్పాతము.

గీ. గగనమణి మాసెఁ బగలె ఘూకములు మ్రోసె, నన్న లక్ష్మణ యిది యేమి యాగ డంబొ. ఉ. రా. 6. 235.

విశే. 1. వంచకుఁడు.

క. నుడువులన బయలుపందిరి, యిది హ స్తము బలుసుముంటి కెనయైదనముల్, గడపుచుఁ బొమ్మను నయ్యా, గడవున్నపుం బాయుఁ జేవగల సైన్యంబుల్. వేం. పంచ. 1. 519.

2. అపరాధి, తప్పు చేసినవాఁడు; దండ్యుఁడు.

క. సాగర సుబుద్ధితోడను, మాగురుపుత్రకునిఁ దెమ్ము మాటాడిన నీ, వాగడ మవుదువు దుస్సహ, వేగరణాఖిల నిశిత విశిఖాగ్నుల కున్. భా. స. 10. పూ. 1416.

జ. ఆగడకాఁడు, ఆగడముచేయు, అగడించు, అగడీఁడు

**అగడముచేయు** స. క్రి. (√ఆగడము.) 1. రట్టు చేయు, అవ్వపెట్టు.

వ. ...చిక్కితిరి మాచేత నింక మమ్ము నాగ డంబు సేయక విడువమని పెదపెద మాట లాడు సమయంబున. చంద్రా. 5. 68.

2. ధిక్కరించు.

వ. ...అగణితముక్తాదామాభిరామంబై ప్రేమా స్పదంబగుచుం గందర్పకరకంబుబిబ్బోకంబు నాగడము సేయు కంధరాధౌరంధర్యంబును ...వార. ఉ. 5. 86.

(ఇట బౌపమ్యవాచకము.)

**అగడించు** స. క్రి. (√ఆగడము) ఆగడముచేయు. (ధిక్కరించు.)

ద్వి. అబ్జదాసయగారి నాగడించితివో. పండితా. మహిమ. 506.

**ఆగడీఁడు** విశే. (√ఆగడము.) కొంటెవాఁడు, దుండగీఁడు, దుష్టుఁడు. (ఆగడీలు, ఆగడీనికిన్,)

సీ. ఏమని వినియెద విన్నియునాయింటి సేగి సెప్పఁగఁజిట్ట లాగడీఁడు, నీకొడుకేతెంచి ... హరి. పూ. 5. 218.

గీ. ఆగడీలు మహాధూర్తు లగడుఁగాకు, లు ... హంస. 5. 10. దశకు. 11. 112.

**ఆగతము** సం. విశే. (అ. ఆ. అ.) 1. వచ్చినది, ఆయాతము. 2. జరిగినది, వృత్తము. 3. ప్రాప్తము, లభించినది. వి. అ. న 1. ఆగమనము, రాక. 2. ప్రాప్తి.

**ఆగతి** సం. వి. ఇ. స్త్రీ. 1. రాక, ఆగమనము. 2. ప్రాప్తి.

**ఆగమనము** సం. వి. అ. న. 1. రాక, వచ్చుట. 2. ప్రాప్తి.

**ఆగమము** సం. వి. అ. పుం. 1. రాక, వచ్చుట. 2. ప్రాప్తి. 3. ఆదాయము, వచ్చుబడి. 4. (భూమ్యాదుల) క్రయ ప్రతిగ్రహాదికము.

శ్లో. ఆగమోఽభ్యధికో భోగాద్వినా పూర్వ క్రమాగతాత్. యాజ్ఞ. 2. 27.

5. శాస్త్రము; శాస్త్రజ్ఞానము. 6. వేదము. 7. శబ్దజన్యబోధమునకు సాధనమగు శబ్దరూప ప్రమాణము. (ఇదియే ఆప్తవాక్యము అనఁబడును. ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, శాబ్దము—అను నాలుగు ప్రమాణములలో నిది కడపటిది.) 8. యామళోక్తమగు తంత్రశాస్త్రము, దేవపూజా విధానమును తత్సంబంధివిషయములను దెలుపు పాంచరాత్రాదికము. 9. (వ్యాక) అధికముగా వచ్చెడు వర్ణము. 10. జనప్రవాదము.

శ్లో. అసాక్షికహతే చిహ్నైర్యుక్తిభిశ్చాగమేన చ, ద్రష్టవ్యో వ్యవహారస్తు. యాజ్ఞ. 2.212.

**ఆగమాపాయి** సం. విశే. (న్. వి. న్.) — ఆగమమును అపాయమును గలది—వచ్చుచుఁ బోవుచు నుండునది, పుట్టుచుఁ జచ్చుచు నుండునది.

**అగమావర్త** నం. వి. ఈ. స్త్రీ. వృశ్చికాళి అను మొక్క.

**అగమి** నం - అగామి.

**అగమించే** నం. అ. క్రి. వచ్చు.

పీ. ...వసిష్ఠుఁ డాగమించి సమాచరించునపర్య లూరీకరించి. కకు. 1.158.

**అగమితము** నం. విణ. (అ. ఈ. అ.) అగమము వలనఁ బ్రాప్తించినది.

**అగరము** నం. వి. అ. పుం. అమావాస్య.

**అగళి(లి)తము** నం. విణ. (అ. అ. అ.) 1. జారి నది. 2. పోయినది.

**అగవీనుఁడు** నం. వి. అ. పుం. గోవులను తోలుకొని పోయి మరల సాయంకాలమున నప్పగించు వఱకు వానిని మేపి కాచుగొల్లవాఁడు.

**అగస్తి** నం. వి. ఈ. స్త్రీ. - అగస్త్యుఁ డుండునది- 2. దక్షిణదిక్కు. 2. అగస్త్యుని స్త్రీసంతతి. (కూఁతురు, మనుమరాలు, మొ.)

**అగస్త్యము** నం. విణ. (అ. స్త్రీ. అ.) 1. అగస్త్యునికి సంబంధించినది. 2. అగిసెచెట్టునకు సంబంధించినది.

**అగస్త్యుఁడు** నం. వి. అ. పుం. (బ. అగస్తులు) అగస్త్యసంతతివాఁడు. (కొడుకు, మనుమఁడు, మొ.)

**అగస్సు** నం. వి. స్. న. 1. అపరాధము, తప్పు. 2. పాపము.

**అగాడి** వి. లోపల నిండుగా బియ్యపుగింజ లేని తేలిక వరిధాన్యము.

(వ్యవ) ధాన్య మెగురఁబోయునపుడు అగాడి ధాన్యము ప్రక్కగాను నికరమైన ధాన్యము రాశి మీఁదను బడును.

**అగాధము** నం. విణ. (అ. అ. అ.) 1. అగాధము, మిక్కిలి లోఁతయినది. 2. దురధిగమము, పొందశక్యము కానిది.

**అగామకము** నం. విణ. (అ. మిశ్రా. అ.) రాఁబోవు దానిని దెలుపునది.

శ్లో. మతి రాగామికా జ్ఞేయా బుద్ధిస్తత్కాల దర్శినీ. (వాచ)

**అగామి** నం. విణ. (స్. నీ. స్.) 1. వచ్చునది, రానున్నది. 2. ప్రాప్తించునది, ప్రాప్తింప నున్నది.

**అగాముకము** నం. విణ. (అ. అ. అ.) అగమనశీలము, వచ్చునది.

**అగాయిత్యము** వి. కొంచెమును గొప్పగాఁ జేసి కావించెడి యలవు పద్ధు లోనగునది. (ఇది వాడుకలోనిది - అగాత్యము, అకాత్యము, అగాయిత్తు, అగాయిత్యము, అఘాత్యము, ఓగాత్యము - అని. బ్రౌ)

**అగారము** నం - అగారము.

**అగుబ్బు** వి. విజృంభణము, అతిశయము.

ఉ. అబ్బుర మైనబాల్యమున నద్దిర యంగజుఁ గన్న తండ్రి యా,గుబ్బున నామదిం గలుగు గుట్టుఁగలంచె నిఁకేమి సేయుదుఁశా. కృ. క. 1.65.

విణ. 1. అధికము, మిక్కుటము.

క. నిబ్బరపుదప్పి మంటలు, ప్రబ్బిన ధృతి లేక నేత్ర పదహస్తంబుల్, గొబ్బున వివృతము లుగ నా,గుబ్బగుచున్నట్టికూఁతఁ గూలెశా నేలన్. భాగ. 10.పూ. 226.

క. పొగయును మంటలు సదలున, కెగయఁగ మిడుఁగుఱులు సెదర నే డ్తెఱ నవు డా. దుగ మొగములవే ల్పాగు,బ్బుగ దరికొని కాల్పఁ దొడఁగెఁ బ్రోలెల్లెడలశా. అచ్చ. రా.యు. 279.

2. అసంఖ్యాకము.

ఉ. గొబ్బునరతిమ్మఁఘూవిభునిఘోరతరాసినిద్రెవ్వి వైరు లా,గుబ్బుగ నేఁగి వేల్పువెలగు బ్బెతలం గవగూడి పైఁబయిం, బుబ్బన చూఱలాడుటకుఁ జొత్తురు తన్మధురాధ రామృతంబు ... రామా. 1. 45.

జ. అగుబ్బుకొను, అగుబ్బులుకేఁగు.

**అగుబ్బుకొను** అ. క్రి. (√అగుబ్బు) అతిశయించు; వ్యాపించు.

క. కవకవనై పదనూపుర,రవరవ లాగుబ్బుకొన్నరతిపతిగతులం, జివచివనై విటు చెవులకు, రవళిశా రతిసల్పు రతుల రవరవ గనిమొశా. భాగ. 6. 100.

గీ. కుంభగతదీపశోభానిగుంభశీలఁ, గుంభకుచ
మేనఁ జూడ్కు లాగుబ్బుకొనఁగఁ, గాంచు
విభుఁడంగ నా ప్రసంగంబుకతన, మంత్రివరు
నెట్టకేలకు మరలి చూచి. వసు. 2. 77.

**అగుబ్బులురేఁగు** అ. క్రి. (√అగుబ్బు) మిక్కుట
మగు, అతిశయించు.

ఉ....పికాలికుకాలిఅంతు లాగుబ్బులురేఁగఁ
బుప్పొడులు గొబ్బున జబ్బున రాలుచుండఁ
గా. కకు. 8. 94.

**అగురవము** నం. విణ. (అ. ఈ. అ.) అగురువునకు
(అగలునకు) సంబంధించినది.

**అగువు** నం. వి. ఈ. స్త్రీ. అంగీకారము.

**అగ్నీధ్రము** నం. వి. అ. న. యజ్ఞవేదికలో ఉత్తర
భాగమందుండు స్థానవిశేషము (ఇది అగ్నీధ్రుఁ
డుండుచోటు.)

**అగ్నీధ్రుఁడు** నం. వి. అ. పుం. అగ్నీధ్రమునం
దుండు ఒకానొక ఋత్విజుఁడు.

**అగ్నేయపురాణము** నం. వి. అ. న. అగ్నిపురా
ణము.

**అగ్నేయము** నం. విణ. (అ. ఈ. అ.) 1. అగ్నికి
సంబంధించినది. 2. అగ్నిదేవతాకము వి.అ.పుం.
1. అగ్నిపర్వతము. 2. వివాహములో అరుంధతీ
దర్శనానంతరము యజుర్వేదులు చేయుకర్మ
విశేషము. 3. దర్శపూర్ణమాసేష్టిలోఁ గర్తవ్య
మగు యాగవిశేషము. న, 1. కృత్తికానక్ష
త్రము. 2. బంగారు. 3. నెత్తురు. 4. నెయ్యి
5. అస్త్రవిశేషము, ఆగ్నేయాస్త్రము. 6.
భస్మస్నానము. 7. ఉపాకర్మమునకుఁబిమ్మటను
సమావర్తనమునకుఁ బూర్వమును యజుర్వే
దులు చేయువ్రతవిశేషము.

**అగ్నేయుఁడు** నం. వి. అ. పుం. కుమారస్వామి.

**అగ్రభోజనికుఁడు** నం. వి. అ. పుం. నియతముగా
ముందు భోజనము పెట్టఁబడుబ్రాహ్మణుఁడు.

**అగ్రయణము** నం. వి. అ. న. నవసస్యేష్టి, క్రొత్త
సస్యములు దినుటకు ముందు చేయునట్టి
యాగము.

**అగ్రహము** నం. వి. అ. పుం. 1. అభినివేశము,
చలము, పట్టుదల. 2. ఆక్రమణము. 3. స్వీకా
రము, గ్రహించుట. 4. అనుగ్రహము, దయ
5. నిగ్రహము. 6. ఆసక్తి. 7. కోపము.
(ఈయర్థము తెనుఁగు గ్రంథములందునువాడుక
లోను గానిపించుచున్నది.

ఉ. అగ్రహ మాత్మలోఁ బొడముటట్లుగఁ దండ్రి
నకారణంబ య, త్యుగ్ర నిశాచర ప్రతతు
లుక్కణఁగించుట చెప్పి...వి. పు. 1. 18.

**అగ్రహాయణకము** నం. వి. అ. న. మార్గశీర్ష
పూర్ణిమనాఁడు చెల్లింపఁ దగిన ఋణము.

**అగ్రహాయణము** నం. వి. అ. పుం. మార్గశీర్ష
మాసము.

**అగ్రహాయణి** నం. వి. ఈ. స్త్రీ. మార్గశీర్ష పూర్ణిమ.

**అగ్రహాయణికము** నం. వి. అ. పుం. మార్గశీర్ష
మాసము. న. మార్గశీర్ష పూర్ణిమనాఁడు
చెల్లింపఁ దగినఋణము.

**అగ్రహారికుఁడు**నం. విణ. (అ. ఈ. అ.) అగ్రహార
మును (బ్రాహ్మణపోషణమునకై యీయఁ
బడిన గ్రామము) అనుభవించువాఁడు.

**అగ్రహించు** నం. అ. క్రి. 1. కోపించు.

చ....తపోధనసత్తముఁ డాగ్రహించి నగ్నముఁ
గొని నీవయస్యల వికారమునకా జనియింపు
వైశ్యవై, వనజదళాక్షి నీవని యవారణ
నమ్మునిశాప మిచ్చినకా. మార్క. 7. 245.

2. చలపట్టు.

చ. కనుఁగొని శల్యుఁ డిట్లనియెఁ గర్ణునితో
నిదియేల ధర్మనందనుపయి నాగ్రహించెదు.
భార. కర్ణ. 2. 889. (చూ. 2. 388.)

**అఘట్టకము** నం. విణ. (అ. ట్టికా అ.) కదల్చునది.
వి. అ. పుం. ఎఱ్ఱయుత్తరేను (వృ. వి.)

**అఘట్టన** నం. వి. ఆ. స్త్రీ. 1. కదల్చుట, అడించుట.
2. రాపు, ఒరయిక.

**అఘట్టనము** నం. వి. అ. న — అఘట్టన.

**అఘట్టితము** నం. విణ. (అ. అ. అ.) 1. కదల్పఁబడి
నది. 2. రాపిడిచేయఁబడినది.

**అఘర్షణము** నం. వి. అ. న — అఘర్షము.

**అఘర్షణి** నం. వి. ఈ. స్త్రీ. (నగలుమున్నగువానిని
రాచి శుభ్రము చేయుట కుపయోగించు)కుంచె.

**అఘర్షము** నం. వి. అ. పుం. ఒరయిక, రాపిడి.

**ఆఘాటము** సం. వి. అ. పుం. 1. ఉత్తరేను (వృ.వి.) 2. (సంగీత) తాళము, చిఱుత, మొ. 3. ఎల్ల, సీమ.

**ఆఘాతనము** సం. వి. అ. న. వధస్థానము.

**ఆఘాతము** సం. వి. అ. పుం. 1. కొట్టుట. 2. దెబ్బ. 3. చంపుట. 4. వధస్థానము, చంపుచోటు.

**ఆఘాతించు** సం. న. క్రి. వధించు. చంపు.

శా. ....చేపట్టి పల్లార్చుచుఁ, గారింపన్ వల దొక్కపూఁపునన యాఘాతించి నాకుఁ మహో, దారం బైనశుభం బొనర్పుఁడు. హరి. పూ. 9. 55.

**ఆఘారము** సం. వి. అ. పుం. 1. అగ్నిసంస్కారార్థము నేయి పోయుచు చేసెడిహోమ విశేషము. 2. నేయి, ఘృతము.

**ఆఘూర్ణనము** సం. వి. అ. న. 1. తిరుగుడు, భ్రమణము. 2. చలనము, కదలిక.

**ఆఘూర్ణితము** సం. విశే. (అ. ఆ. అ.) 1. తిరుగుడు పడినది, భ్రాంతము. 2. చలితము.

**ఆఘోషణ** సం. వి. ఆ. స్త్రీ — ఆఘోషణము.

**ఆఘోషణము** సం. వి. అ. న. చాటించుట.

**ఆఘోషము** సం. వి. అ. పుం. చాటుట.

**ఆఘోషించు** సం. అ. క్రి. 1. అఱచు.

శా. ఈపాదండము సీరితుండమునని హేరాళమై మూఁక లా,ఘోషింపంగ ... రోషోద్రేకము చూపుచుండె బలభద్రుం డుల్లసద్రౌద్రుఁడై. ఉ. హరి. 6. 67.

2. మ్రోయు.

శా. ఆఘోషించుతదుగ్రశంఖపటహోద్యద్ధ్వానముల్ దిక్తట, వ్యాఘూర్ణంబులుగా ... జై. భా. 6. 208.

**ఆఘ్రాణము** సం. విశే. (అ. ఆ. అ.) 1. వాసన చూడఁబడినది, మూర్కొనఁబడినది. 2. తృప్తి పొందినది. వి. అ. న. 1. వాసనచూచుట, మూర్కొనుట. 2. తనివి, తృప్తి.

**ఆఘ్రాణించు** సం. న. క్రి. మూర్కొను, మూచూచు.

క. స్వఘ్రాణానిలసౌరభ, మాఘ్రాణింపఁగ... పాండు. 3. 85.

**ఆఘ్రాణీయము** సం. విశే. (అ. ఆ. అ.) ఆఘ్రాణింపఁ దగినది.

**ఆఘ్రాతము** సం — ఆఘ్రాణము. విశే.

**ఆఘ్రాతవ్యము** సం — ఆఘ్రాణీయము.

**ఆఘ్రేయము** సం — ఆఘ్రాణీయము.

**ఆచక్షువు** సం. విశే. (స.) — ఆఖ్యాత.

**ఆచమనము** సం. వి. అ. న. 1. ఉపస్పర్శము, ఆచమించుట. 2. ఆచమించుటకైన జలము.

**ఆచమనీయము** సం. విశే. (అ. ఆ. అ.) ఆచమించుటకుఁ దగినది, ఆచమనార్హము.

**ఆచమించు** సం. న. క్రి. ఆచమనము చేయు.

వ. పూర్వాభిముఖుండయి శుద్ధోదకంబులం బ్రక్షాళిత పాణిపాదవదనుండయి యాచమించి శాస్త్రానుమతంబున నద్దేవి యొద్దకుం జనిన... భార. ఆది. 1. 97.

**ఆచయకుఁడు** సం. విశే. (అ. యికా. అ.) పువ్వులు మొదలగువానిని ప్రోగుచేయుటయందుఁ గుశలుఁడైనవాఁడు.

**ఆచరణము** సం. వి. అ. న. 1. చేయుట, అనుష్ఠానము. 2. నడవడి, ప్రవర్తనము.

**ఆచరణీయము** సం. విశే. (అ. ఆ. అ.) ఆచరింపఁ దగినది.

**ఆచరించు** సం. న. క్రి. చేయు, కావించు.

ఆ. పసులు పట్టువడిన పదపడి నరుఁ డెద్ది,యాచరించెఁ గౌరవాధినాథుఁ, డేమి సేసె ... భార. విరా. 4. 273.

శా. గర్వాంధ్యంబున మత్తపంబునకు విఘ్నం బాచరింపంగ... మార్క. 1. 28.

**ఆచరితము** సం. విశే. (అ. ఆ. అ.) ఆచరింపఁబడినది, అనుష్ఠింపఁబడినది. వి. అ. న. 1. ఆచారము, నడవడి. 2. ఋణమును రాఁబట్టుకొనుటకుఁ గల యుపాయములయిదింటిలో నొకటి, భార్య బిడ్డలు మున్నగువారిని గొట్టియు గుమ్మముమీఁదఁ గూరుచుండియు ఋణము రాఁబట్టుకొను ఉపాయము. (ధర్మము, వ్యవహారము, ఛలము, ఆచరితము, బలము-అని ఋణగ్రహణోపాయము లైదు.)

**ఆచరితవ్యము** సం — ఆచరణీయము.

**అచర్యము** సం — ఆచరణీయము.

**అచాంతము** సం. విశ. (అ. ఆ. అ.) ఆచమింపఁబడినది (జలాది).

**అచాంతి** సం. వి. ఇ. స్త్రీ. ఆచమనము.

**అచాంతుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) ఆచమనము చేసినవాఁడు.

**అచామకుఁడు** సం. విశ. (అ. మికా. అ.) ఆచమించువాఁడు.

**అచామము** సం. వి. అ. పుం. 1. ఆచమనము. 2. గంజి, మాసరము.

**అచామ్యము** సం — ఆచమనీయము.

**అచారదీపము** సం. వి. అ. పుం. రాజులకుఁ గాని అశ్వాదులకుఁ గాని మంగళార్థము నివాళి పట్టెడు దీపము.

**అచారము** సం. వి. అ. పుం. 1. అనుష్ఠానము, ఆచరణము. 2. సంప్రదాయము, గురువులు పెద్దలు మొదలగువారినుండి పరంపరగా వచ్చువాడుక. 3. నడత, ప్రవర్తనము.

**అచారలాజలు** సం. వి. అ. పుం. బ. రాజాదులు ఊరేఁగునప్పుడు మంగళార్థము కన్యకలు వారిపై చల్లెడులాజలు (ఇట్లు లాజలు చల్లుట ఆర్యుల ఆచారము.) సం. రఘు. 2.20. (చూ. లాజలు.)

**అచారవంతుఁడు** సం. విశ. (త్. వతీ. త్.) సదాచారసంపన్నుఁడు.

**అచారవేది** సం. విశ. (న్. నీ. న్.) ఆచారమును తెలిసినవాఁడు. వి. ఈ. ఈ. స్త్రీ-ఆచారమునకు వేదికవంటిది-పుణ్యభూమి, ఆర్యావర్తము.

**అచారి** సం. విశ. (న్. నీ. న్.) ఆచారము గలవాఁడు. వి. ఈ. స్త్రీ. హిలమోచిక, చిలుకతోఁటకూర (వ్. వి.)

**అచార్య** సం. వి. ఆ. స్త్రీ. ధర్మోపదేశకురాలు, ఉపాధ్యాయురాలు.

**అచార్యకము** సం. వి. అ. న. ఉపాధ్యాయత్వము, ఉపదేశము.

క....కృపా, చార్యుఁడు మత్పితృసఖుఁ డా, చార్యక మొనరించె మాకు శైశవము కతన. భార. విరా. 5. 9.

వ....నీకు నాతనికి నాచార్యకంబు సమప్రకారంబు. భార. ద్రో. 2. 296.

**అచార్యభోగీనము** సం. విశ. (అ. ఆ. అ.) ఆచార్యుఁ డనుభవించుటకుఁ దగినది (ద్రవ్యాదికము).

**అచార్యాని** సం. వి. ఈ. స్త్రీ. ఆచార్యునిస్త్రీ.

**అచార్యుఁడు** సం. వి. అ. పుం. 1. శిక్షకుఁడు, ఉపాధ్యాయుఁడు. 2. వేదము నధ్యయనము చేయించువాఁడు. 3. మతస్థాపకుఁడు (శంకరాచార్యాది).4. (యజ్ఞాదులందు కర్మోపదేశకుఁడగు) గురువు. 5. ద్రోణుఁడు.

**అచితము** సం. విశ. (అ. ఆ. అ.) 1. వ్యాప్తము. 2. కూర్పఁబడినది, గ్రథితము. 3. సంగ్రహింపఁబడినది, ప్రోగుసేయఁబడినది. 4. కప్పఁబడినది. వి. అ. పుం. బండెఁడుబరువు న. పదిబారువుల బరువు. (కే. ని.)

**అచోకి** వి. పోఁబడి, జాడ. (చి. ని. శ. ర.)

**అచూషణము** సం. వి. అ. న. 1. (పండ్లరసము, మొ.) నోటితోఁ బీల్చుట. 2. (వైద్య) యంత్ర విశేషముచే దేహమునం దుండు విషాదులను లాగుట; అట్లు లాగుటకుఉపయోగించు యంత్ర విశేషము.

**అచ్ఛన్నము** సం. విశ. (అ. ఆ. అ.) ఆవృతము, కప్పఁబడినది.

**అచ్ఛాదకము** సం. విశ. (అ. దికా. అ.) ఆచ్ఛాదించునది.

**అచ్ఛాదనము** సం. వి. అ. న. 1. కప్పుట. 2. దోషములను గప్పుట. 3. వస్త్రము.

**అచ్ఛాదము** సం. వి. అ. పుం. 1. కప్పుట. 2. వస్త్రము, బట్ట.

**అచ్ఛాది** సం. విశ. (న్. నీ. న్.) ఆచ్ఛాదించునది.

**అచ్ఛాదించు** సం. వ. క్రి. ఆచ్ఛాదనము చేయు. (మఱుఁగుపఱుచు)

వ. ...సాంద్రచంద్రికానికరంబు... సహేశ్వర సటాచ్ఛటాస్వచ్ఛతర విభాగుకుచ్ఛంబుల నాచ్ఛాదించి...ఉ. రా. 4. 168.

**అచ్ఛిన్నము** సం. విశ. (అ. ఆ. అ.) 1. పూర్తిగా ఛేదింపఁబడినది. 2. కొంచెముగా ఛేదింపఁ బడినది. 3. బలాత్కారముచేఁ గొనిపోఁబడినది.

**ఆచ్ఛురితకము** సం. వి. అ. న. 1. నఖక్షతవిశేషము. 2. ఆక్షేపణముతోఁ గూడినహాసము. వికృతపు నవ్వు. 3. (సంగీత) నఖవాద్యము.

**ఆచ్ఛురితము** సం — ఆచ్ఛురితకము.

**ఆచ్ఛేదనము** సం. వి. అ. న. 1. పూర్తిగా ఛేదించుట. 2. కొంచెము ఛేదించుట. 3. బలాత్కారముగఁ గొనిపోవుట.

**ఆచ్ఛేదము** సం. వి. అ. పుం -- ఆచ్ఛేదనము.

**ఆచ్ఛోటనము** సం. వి. అ. న. వెటికెలు విఱుచుట.

**ఆచ్ఛోదనము** సం. వి. అ. న. ఆఖేటము, వేఁట.

**ఆజకము** సం. వి. అ. న. అజసమూహము, మేఁకలమంద.

**ఆజగవము** సం — అజగవము.

**ఆజన్మము** సం. అవ్య. అ. న. 1. పుట్టుకనుండి. 2. పుట్టుకపర్యంతము.

**ఆజన్మసురభిపత్త్రము** సం. వి. అ. న — పుట్టినప్పటి నుండియుఁ బరిమళించు ఆకులు గలది — మరువకము, మరువము (వ్యు. వి)

**ఆజము** సం. విశే. (అ. ఈ. అ.) అజసంబంధమైనది. (మాంసాదికము) వి. అ పుం. 1. చిమ్ముట, విసరుట. 2. గమనము.

**ఆజవంజవము** సం. వి. అ. న. సంసారము.

సీ. ...ఆజవంజవభీతి కథయపాణి ... పరమ కల్యాణి యాపగాంభస్త్రివేణి. కాశీ. 3 90.

**ఆజవము** సం — ఆజవంజవము.

**ఆజానము** సం. వి. అ. న. 1. స్వభావము, ప్రకృతి. 2. దేవలోకము.

**ఆజానేయము** సం. వి. అ. పుం మేలుజాతి గుఱ్ఱము, ఉత్తమాశ్వము.

**ఆజి** సం. వి. ఇ. స్త్రీ. 1. యుద్ధము. 2. సమభూమి 3. క్షణకాలము.

**ఆజీవనము** సం. వి. అ. న — ఆజీవము.

**ఆజీవము** సం. వి. అ. పుం. 1. జీవనము, బ్రదుకు. 2. బ్రదుకుఁదెరువు, జీవనోపాయము, వృత్తి.

**ఆజీవిక** సం. వి. ఆ స్త్రీ. జీవిక, జీవనార్థమగు వ్యాపారము.

**ఆజీవ్యము** సం. విశే. (అ. ఆ. అ.) 1. జీవించుటకు సాధనమైనది, జీవనోపాయము. (వృత్తి, మొ.) 2. జీవికకొఱకు నవలంబింపఁ దగినది. (రాజాదికము) 3. జీవనమునకు ననువైనది(దేశము).

**ఆజువు** సం. వి. ఊ. స్త్రీ. కూలిలేనిపనిచేయుట, వెట్టిపని చేయుట.

**ఆజ్ఞ** సం. వి. ఆ. స్త్రీ. 1. ఉత్తరువు, ఆదేశము. 2. దండనము.

క. విజ్ఞాపనం బొనర్చిరి. విజ్ఞానేశ్వరము చూచి విద్వజ్జనుల, య్యజ్ఞునికరచరణాదుల, కాజ్ఞ నిశావేళఁ జేయ నర్హం బనుచుం. సారంగ. 3. 21.

శా. ...నీప్రాగల్భ్యగర్వం బడంగింతుం గన్నుల కాజ్ఞ చేసి యని పల్కెం బల్కినం దీవ్రతం. పరమ. 5, 363.

3. (జ్యోతి) లగ్నమునకుఁ బదియవ రాశి, కర్మస్థానము.

4. (యోగ) భ్రూమధ్యమం దుండెడిచక్రవిశేషము.

**ఆజ్ఞపడు** మి. అ. క్రి. (ఆజ్ఞ + పడు) ఆజ్ఞావశుఁడగు; చిక్కు., తగులువడు.

సీ. తరలాక్షిచూడ్కులఁ దా నాజ్ఞపడి యున్కి ధర నాజ్ఞ చెల్లించుతగవు మఱచె. కేయూర. 1. 70.

**ఆజ్ఞప్తి** సం. వి. ఇ. స్త్రీ. ఆజ్ఞ, ఆనతి.

**ఆజ్ఞప్తుఁడు** సం విశే. (అ. ఆ. అ.) ఆజ్ఞాపింపఁబడినవాఁడు

**ఆజ్ఞయిడు** మి. స. క్రి. (ఆజ్ఞ + ఇడు) దండించు.

చ అటువలెనింతి నాజ్ఞయిడి యామనుజేశుఁడు మంగలంబునం, బెటిలిన పేలగింజవలె మిక్కిలి పుత్త్రవియోగబాధ నట్టటుపడి... సారంగ. 3. 223.

**ఆజ్ఞవాఁడు** మి. విశే. (ఆజ్ఞ + వాఁడు) ఆజ్ఞావర్తి, ఆజ్ఞలో నున్నవాఁడు.

గీ. అఖిలదిక్పాలకులును నీయాజ్ఞవారు, నీదుని ర్వ్యాజపవనంబు నిగమరాశి. భీమ. 4. 72.

**ఆజ్ఞ(పె)వెట్టు** మి. స. క్రి. (ఆజ్ఞ + పెట్టు.) 1. ఆజ్ఞాపించు, శాసించు.

సీ. ...సప్తమహార్ణవంబులు విన్నంది పెనువెల్లి విరియకుండ. గీ. నాజ్ఞవెట్టించుఁ బ్రమథ

నాయకులచేత, విశ్వపతి యైనఖిమేశ్వరేశ్వ
రుండు. భీమ. 8. 87.

(వ్యవ) ఉండు మని కాని పొమ్మని కాని నన్ను ఆజ్ఞ పెట్టుటకు నీ వెవఁడవు ?

2. దండించు.

అ. పట్టినిట్టు లాజ్ఞ వెట్టఁ గట్టడ సేసి, నరగ
లోనికరిగి. సారంగ. ౬. 28. (చూ. 3.22.)

అ. మీరు లేనినాఁడు మేదినీజనులకు, బాధ చేసి
నట్టిపాదపముల,నింతయాజ్ఞ వెట్టుటింతయు
నర్హమె,యైన దీర్ఘకోప మనుచితంబు. వి.
పు. 2. 198.

**అజ్ఞాచక్రము** సం. వి. అ. న. (యోగ) కనుబొమల నడుమనుండు చక్రవిశేషము.

**అజ్ఞాతము** సం. విశే. (అ. ఆ. అ.) చక్కఁగాఁ దెలియఁబడినది.

**అజ్ఞాపకుఁడు** సం. విశే. (అ. వికా. అ.) ఆజ్ఞ సేయువాఁడు.

**అజ్ఞాపత్త్రము** సం. వి. అ. న. ఆజ్ఞను దెలిపెడి పత్త్రము.

**అజ్ఞాపనము** సం. వి. అ. న. ఆజ్ఞ చేయుట.

**అజ్ఞాపించు** సం. స. క్రి. ఆజ్ఞ వెట్టు, నియోగించు.

క. అపరమేశ్వరి తను నా,జ్ఞాపింపఁగ సామి
మలకు...చనియె. పాండు. 1. 124.

**అజ్ఞాపితుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) ఆజ్ఞాపింపఁబడినవాఁడు.

**అజ్యము** సం. వి. అ. న. నెయ్యి, ఘృతము.

**అట** వి. (√అడు) 1. క్రీడ.

క. ఆటలకుఁ దన్ను రమ్మని, పాటించి నిశాట
సుతులు భాషించినదో,పాటకులేంద్ర కుమా
రుఁడు, పాటవమున వారిఁ జీరె ప్రజ్ఞాన్వి
తుఁడై. భాగ. 7. 209.

2. నృత్యము.

క. నిన్నుఁ గొలువంగ వచ్చితిఁ, గన్నియలకు
నాటగఱపఁగా వోపుదు. భార.విరా.1.238.

3. విహారము. (చూ. ఆటతోఁట.)

4. మునుఁగుట, స్నానము చేయుట.

ఉ. నిన్నిటు పాలవైచి తగ నిద్దురవోయెడుఁ
బాపఁడంచు నే,మిన్నక నీళ్లనాట యను
మిత్త్రికి నేటికిఁ బోయితిగా. హరి. పూ. 5.
176.

5. మువ్వలు చెఱకు మున్నగువానిని గానుఁగలో వేసి త్రిప్పుట. (చెఱకులాట, మొ.)

చ. ...వరేతుపంక్తి నడుమంత్రపు సంపదచేతఁ
గ్రిందు మీఁ, దెఱుఁగక సాటివత్తు నని
హెచ్చిన నాటకుఁ బెట్టఁ గుందదే. భాను.
2. (శ. ర.)

6 పలుకుట.

క. అని తను నుల్లసమాటకుఁ,గినిసి యినతనూ
జుఁడు...భార. విరా. 5. 182.

అ. ...మీకుఁ గాననవాస, మెల్లభంగిఁ గలుగు
నేని యేనుఁ,దగిలి తోన వత్తుఁ దగుమాటగా
నాట, గాదు నాదుహృదయగతియు నిట్ల,
భార. ఆశ్ర. 1. 84.

7. నింద, దూఱు.

సీ ఆటలు పసిబిడ్డయాటలై పెంపఱి యొరుల
యాటలఁ బడ నోగితముగ...గీ. ...అసుర
చిత్తంబు గానఁగ నలవిగాక, సిగ్గువోయిరి
యచ్చర చెలువలెల్ల. నృసిం. 2. 90.
(1. 2. అర్థములకుఁ గూడ నిది యుదా
హరణ మగును.)

8. గేలి, పరిహాసము. అం. భా. 1. 189.

(ఇది కొన్ని శబ్దముల కనుప్రయుక్తమై ప్రాయికముగా క్లీబసమ మగును. ఉదా-కోలాటము, మంత్రాటము, పోరాటము, పోరాట, కొట్లాట, గ్రుద్దులాట, మొ.)

**అటంకము** వి. నిర్బంధము, అడ్డంకి. నిరోధము. (వి. ని. శ. ర. అను బట్టి తెనుఁగుపదముగా గ్రహింపఁబడినది—డా. కిటల్. తత్సమముగా గ్రహించుటచేతను 'నిరాటంకముగా' అని వాడుకలో నుండుటచేతను 'టకిబంధనే' అను ధాతువునుండి అటంకముఅను తత్సమరూప మేర్పఱుప వచ్చును. కాని యిది సంస్కృత నిఘంటువులలోను ప్రయోగములలోను గూడఁ గాన్పింపదు.

**అటకత్తె(త్తియ)** వి. √ఆట. (శ. ఆటగాత్తి. శ. అట్టక్కారి.) నటి, నర్తకి.

**అటకాఁడు** వి. √అట. (క. ఆటగాఱు. త. ఆట్టక్కారన్.) ఆటయాడువాఁడు, నటుఁడు, నర్తకుఁడు.

ఆ. ఓరి యాటకాఁడ యారీతి యఱపులా, పొగడుటనఁగ మెచ్చు పుట్టదిందు. ప్రభా. 1. 106.

**అటకొలను** వి. (√అట) క్రీడాసరస్సు. చం. రా. 2. 78. పె. శకుం. 1. 51.

**అటగీము** వి. (√అట) విహారగృహము.

గీ. తమ్మిపూఁజూలి నాలుగు నెమ్మొగంబు, లాటగీములు గాఁగఁ జెన్నలరునట్టి, పల్కునవఁబోఁడి...అచ్చ. రా. బాల. 6.

**అటగొట్టు** వి. (√అట) మూఁడుకట్టులు గలగొట్టు. (చి. ని. శ. ర.)

**అటచేడియ** వి. (√అట) నర్తకి; వేశ్య. నీలా. 1. 40.

**అటడిగ్గియ** వి. (√అట) క్రీడాదీర్ఘిక, క్రీడార్థమైన నడబావి.

సీ. దురవగాహాగభీరతరతరంగిణులు నీ కాటడిగ్గియ లయ్యోనా మృగాక్షి. రామా. 5.77.

**అటతిప్ప** వి. (√అట) క్రీడార్థ మేర్పఱచిన మెట్ట. కృతకాద్రి.

సీ. ఆటతిప్పలు వచ్చి పాటబండులు గూర్చి కట్టువ లన్నియుఁ గాడుచేసి. అచ్చ. రా. సుం. 96.

**అటతెఱవ**—అటచేడియ. పఁమ. 2. 81.

**అటతోఁట** వి. (√అట) విహారార్థమైన తోఁట, ఉద్యానము; ప్రమదావనము. రామా. 3. 99

**అటది** వి. (√అట) నర్తకి; వేశ్య.

ఉ. ఆటది యన్న మార్వశి యథార్థముఁ బల్కుదు మింతె కాని మో,మోటలుమాకు సైఁపవు...అహ. 1. 71.

**అటపట్టు** వి. (√అట) 1. క్రీడాస్థానము 2. నాట్యస్థానము.

సీ. సరసుల కారామసరణి శ్రీరంగగేహక్రోడవాసిని కాటపట్టు. వసు. 1. 94.

3. విహారస్థలము.

సీ. సత్యలోకముదాఁక సకలలోకంబులు నాటపట్టులు మాకు నబ్జవదన. నైష. 2. 49.

4. వాసస్థానము.

క. మఱి రామేశ్వరతీర్థము, కలికంఠున కాటపట్టు. భీమ. 3. 166.

గీ. గొనములకు నెల్ల నాటపట్టనఁగఁ జాలి. నీలా. 1. 85.

**అటరి** వి. (√అట) 1. నర్తకుఁడు. 2. నర్తకి. ఆం. భా. 1. 129.

**అటరూషము** సం. వి. అ. పుం. అటరూపము, వాసకవృక్షము, అడ్డసరము (వృ. వి.)

**అటవాఁడు**—అటకాఁడు. ప్రభా. 1. 108.

గీ. అలరి తొలకరిపేరిటియాటవాఁడు, మీటువాటిల్ల వలరాజు మెచ్చ వడసి, పథికజనమానధనము లపహరింపఁ, గొల్లలాడెను భువనంబు లుల్లసిల్ల. రామా. 6. 18.

**అటవికము** సం. వి. అ. న. సైన్యభేదము, అటవికుల సేన. (ఇది షడ్విధసేనలలో నొకటి)

శ్లో. మౌలం భృత్యస్సుహృచ్ఛ్రేణీ, ద్విషదాటవికం బలం. సం. రఘు. 4.26. మల్లి. వ్యా.

**అటవికుఁడు** సం. విశ. (అ. ఈ. అ.) 1. అడవిలో నుండువాఁడు. 2. అడవిలోఁ బుట్టినవాఁడు.

**అటవిడుపు** వి. (√అట) అనధ్యయనదినములందు ఆడుకొనుటకై బడిపిల్లలను వదలిపెట్టుట, విశ్రాంతికై సెలవిచ్చుట.

శా. ... ఆటవిడుపై నట్లుండెఁ గూర్మంబు సమ్యగ్గోర్దండమునన్ ధరాధరము రామక్ష్మావరుండూనినన్. ఉ. రా. 1. 187.

గీ. బొక్కసంబులు పెనుతీగములు భజింప, మడిగములవారలకు నాటవిడుపు గాఁగ, నోలమును మాని మేదినీయువతిజాని, యింతి భావించు నంతఃపురాంతరమున. కువల. 4. 101.

**అటవెలఁది** వి. (√అట) 1. నర్తకి; వేశ్య. 2. పద్యభేదము.

**అటి** సం. వి. అ, ఈ. స్త్రీ. 1. ఒకజాతిపక్షి,ఆడేలు, శరారి. 2. ఒకజాతిచేప.

**ఆటీముఖము** సం. వి. అ. పుం. న.—ఆటిపక్షిముక్కు వలె నుండుముఖము గలది–(వైద్య) నెత్తురు వెలికిఁ దీయుట కుపయోగించుశస్త్రవిశేషము.

**ఆటీకనము** సం. వి. అ. న. 1. గతి, గమనము. 2. లేఁగదూడలు దుముకునప్పటి గమనము.

**ఆటీకము** సం. విశే. (అ. ఆ. అ.) చరించునది.
శా. ... పంపాహేమకూటాశ్రయ, ఖ్యాత బ్రహ్మాము బ్రోచుఁగావుత విరూపాక్షాహ్వయం బాకుపీ.టీతిమ్మప్రభు వేంకటాద్రి హృదయాటీకంబు లోకంబులన్. రాఘవ. 1. 1.

**ఆటు¹** వి. (√అడుచు) అడుపు, దెబ్బ, వ్రేటు.
సీ. దాసత్వ మొంది యదలుపులఁ దిట్టుల నాటులఁబడుచుండునట్టి నీచులు. ...భార. అను. 5. 107.
ఉ. ఆటున మూర్ఛవోయినఁ బ్రహస్తుఁ గనుం గొని యింకఁ దాఁకినన్, గీటడగించు నర్జునుఁడు గేవలుఁడేయని భీతచిత్తులై, మేటి మగల్ సలంబెడలి మేమెయి మార్కొనలేక పాటినన్. నిర్వ. 7. 52.
ఆటుఁబోటు–బాధ.
ఆ. అట్లు తివిసిపోయి యాటుఁబోఁటువొడళ్ళఁ, గలయఁ గలిగి డప్పి గదిరి...భార. కర్ణ. 1. 218.

**ఆటు²** వి. (√పాటు) తగ్గుట.
ఆఁటుఁబోటునగు – (ఆటును పోటును గలది యగు) విజృంభించు, అతిశయించు.
పంచ. తటాతటాన గుండె పారెఁ దల్లడింపుచుండఁగాఁ, బోటాపోటాన నక్రులాటుఁ బోటునై దొరంగఁగాన్. ఉ. హరిశ్చ. 2. 128.
ఈక్రింద 'పోటును నాటు నగు' అని కలదు.
గీ. అబ్ధిలేదును జంద్రోదయాస్తకలిత, వేళలందును గ్రాఁగినపాలఁబోలె, మీటి వేయింటి మీఁద నేనూటుద్రేళ్ల, పొడవుపోటును నాటునై పొలుపు మిగులు. వి. పు. 3. 86.
(వ్యవ)ఒడలంతయు నాటుఁబోటుఁగామున్నది. (బాధగానున్నది.)

**ఆటోపము** సం. వి. అ. పుం. 1. వేగిరపాటు,సంభ్రమము. 2. సంరంభము, ఆడంబరము;గర్వము. 3. ఉబుకుట, వ్యాపించుట.
శ్లో. విషం భవతు మాభూద్వా స్ఫటాటోపో భయంకరః. సం. పంచ. 1. 225.
4. వాతమువలన కడుపునందుఁ గలుగుగబ్బు గుబ్బుమను ధ్వని.

**ఆటోపించు** సం. అ. క్రి. అతిశయించు, అగ్గలించు.
క....సరసీ, కోటులఁ జల్లనిచోటుల, నాటలఁ దనువడక విరహ మాటోపింపక. వరాహ. 11. 68.

**ఆట్రగడములు** (డాలు) వి. బ. ఒకజాతివడ్లు. (బ్రౌ)

**ఆట్లఁడు** విశే. ఖలుఁడు, ఉలిపికట్టె (బ్రౌ)
సీ...ఖలుం డొప్పు నాట్లఁ డనంగ నులిపికట్టె, యనఁగను బాట్లనీ యనఁ జెట్లకొలవి నా ...అం. భా. 3. 13.

**ఆడ** వి. (ఆ+కడ) అక్కడ.
ద్వి. ఆడ కే మొగముల నరుగుదెంచెదరు,వేడుక మరలు హవిర్భాగమునకు. రం. రా. బాల. 57 పా. 22 పం.
ఆడాడ - అక్కడక్కడ.
ద్వి...దశరథుం డంత, పాడువాటినయట్టిపట్టనవీథి, నాడాడ నిలుచుచు ... రం. రా. అయో. 116 పా. 10 పం.

**ఆడంబరము** సం. వి. అ. పుం. 1. హర్షము. 2. దర్పము, గరువము. 3. డంబము. 4. యుద్ధ వాద్య ధ్వని. 5. ఆరంభము. 6. సంరంభము, వేగిరపాటు. 7. ఉబుము. 8. ఏనుఁగుల ఘీంకారము. 9. కనుఱెప్పవెండ్రుక.

**ఆడంబరి** సం. విశే. (న్. శే. న్.) ఆడంబరము గలవాఁడు.

**ఆడి** సం — ఆటి.

(ఆడేలు)
క. ఆడిబక సాంపరాయము, వేడుకఁ జెప్పినవిని విఘ్నము లడఁగుఁగా. మార్క. 2.20.

**ఆడిక** వి. (√ఆడు-క. ఆడికె.) 1. బాస, ప్రతిజ్ఞ.
గీ. అనిన జండాలకవ్యక యాఁడువారి, మంచితనమును మగవారి మంచితనము, సరియ

కిడని మేలని చర్చ లేల,మనకు మనయాడి
కలు తప్పుకునికి చాలు. శివరా. 3. 77.

2. నింద, అపవాదము.

సీ. కువలయంబు దినంబుఁ గూల్చునాడిక బంధు
జీవ మాబోదిగాఁ జేయనిసడి.వసు.1.107.

**అడికపడు** అ. క్రి. (√అడిక) దూఱుపడు, నిందితుఁ
డగు.

సీ. ...వీరల నేఁడు బ్రదికింపకుండినఁ బ్రజలచే
నాడికపడుదు ననుచు. జై. భా. 8. 114.

**అడికోలు** వి. (√అడు) నింద.

క. కుల మెంచ రాడికోళ్లకుఁ, దలఁకరు సడి
వావి వరుస దలఁపరు నీతిఁ, దలకొనరు
సత్యమాడరు, కలకంఠులు వారి నమ్మఁగా
నెటు వచ్చుఁ. హంస. 5. 267.

**అడివోసికొను** స. క్రి. (√అడు) దూఱు, నిందించు.
(బ్రౌ)

**అడు** అ. క్రి. 1. చలించు, కదలు.

ఉ... మే. యాడక నిద్రవోయె శిశిరానిలముల్
పయి వీచుచుండఁగాఁ. భార. ఆది.5.170.

2. (అవయవాదులు స్వకార్యమందు) ప్రవ
ర్తించు.

క. పెలువారి నెల్లఁ దరమిడి,నఱకుదుఁ బాండు
తనూజ నందనులను రూపఱ నేయం జేయా
డదు. భార. ఉద్యో. 4. 150.

చ. ...మదిఁ దలఁపఁ విన దగనిమాటలు
నోరెటు లాడెఁ జెప్పఁగా. సారంగ.2.101.

ఉ. ...ఇంతకాల మే,నిక్కడ నిట్ల యుండఁగ
నిజేశుఁడు నీవును నన్నుఁ బాపి మీ, రక్కడ
నుండ నెట్లు మనసాడె విభుం డట నఁ దలం
చునా. (మనసాడె - మనసొప్పె.) భా. రా.
సుం. 292.

3. సంచరించు, తిరుగు; విహరించు.

గీ. అడరి కురుసేనపై గ్రద్దలాడఁ జొచ్చెఁ,
బడుచు నున్నవి యుల్కలు... భార. భీష్మ.
3. 355.

సీ. వావోర్వీశభూమి రేవంతనై షధులట్లు హాయ
రత్నముల నెక్కియాడ నేర్చు... గీ... సంగ
రార్జునుఁ డరియేటి లింగవిభుఁడు. భీమ.
1. 65. నీలా. 1. 2.

4. మునుఁగు, స్నానముచేయు.

ఆ... గంగ నాడవచ్చి నీవు, వలవ దనిన నుడుగు
వారము కాము. భార. ఆది. 7. 41.

గీ. యోగివరులార సందేహ మొకటి మిమ్ము,
నడుగ వచ్చెద నవఁగ మీయంత నేఁగు,దెంచి
నారాడఁబోయినతీర్థ మెదురు,గాఁగ వచ్చిన
కర(?)ణిభాగ్యంబుకతన. వరాహ. 1. 183.

సీ. ...లవణాబ్ధివెలడు మైచవుడువోఁదియ్యనీ
రాడఁగఁ జొచ్చినయమృతకరుఁడో. కు.సం.
10.421. (తియ్యనీరు - తియ్యనీటియందు)

మధ్యా... సర్వతీర్థము లాడుచు... భార. ఆది.
8. 118. వరాహ. 1. 2.

సీ. కర్దమం బాడెనో. కు. సం. 8. 97.

సీ. నెలయేటి తెలినీటఁ జిఱుబంతిపసు పాడి.
హర. 5. 37. (పసుపాడి = పసుపుతో -
పసుపురాచికొని-స్నానముచేసి.)

5. క్రీడించు.

ఆ. పడుచులీఁక లూడ్చి పట్టి యాడెడునట్టి,
పులుఁగు చందమయ్యెఁ దలఁప నాయ,వస్థ
...భార. కర్ణ. 1. 34.

6. నర్తించు.

చ.... తనకుంచెయుఁ గృష్ణమృగాజినంబునుం,
బలుమఱు వీచుచుం గలహబంధుఁడు నారదుఁ
డాడె వేడుకఁ. భార. సభా. 2. 31.

మ. అలపర్జన్యుఁడు కేకిపాత్రములగుం పాడించు
చో... ఆము. 4. 92.

7 కాఁడు, గ్రుచ్చుకొను.

రగడ. చులుకు మనె వేఱొక్కచోటఁ గంటక
మాడ. మనుచ. 3. 84.

స. క్రి. 1. పలుకు, వంచించు, చెప్పు.

క. విఱుగుట నొచ్చుట మనదెసఁ, దఱచుగ
నాడెదవు పాండుతనయుల బలమే, త్రైలఁ
దఱుఁగక పెనఁగుట పలు, మఱుఁ జెప్పెద
వకట యేమి మాయయొ తలఁపఁ. భార.
భీష్మ. 3. 81.

గీ. వారి వీక్షించి ఖచరులు పోరు లెందుఁ,జూడ
మే దీని కెవ యని యాడఁగలరె. భార.
కర్ణ. 1. 107. భార. భీష్మ. 1. 68.

సీ. ఈమాట లాడకు మిం దువంశవతంస యాడి
తప్పఁగవచ్చునయ్య నీకు. నైష. 3. 68.

2. దూఱు, నిందించు.

మత్త. తాన చుట్టుఁ దగిల్చి యగ్ని యుదగ్రతం
దరికొన్నఁ దా,పానుభూతికి నోర్వఁ జాలక
యప్రయోజన వాక్య సం,తాన శోషిత
వక్త్రుఁడై యతిదైన్య మొందెడు వాని
య,ట్లైన నీదు విలాప మన్యుల కాడఁ బట్టగు
భూవరా. భార. స్త్రీ. 1. 21.

క. అన విని రంభ విభ్రంభణ, మొనరంగాఁ
బలికె నలుక నూర్వశి యా నౌ,నినువంటి
మచ్చెకంటికి, వనువగునే యిట్టు లాడి
యాడించుకొనఁగ. వాల్మీ. 3. 57.

3. అను, పాడు.

సీ. సంపెంగ నాటకశాలలఁ గలహంస లతమ
తంత్రంబుల నాడుచుండ. విక్ర. 8. 62.

4. ఆచరించు, చేయు, నిర్వర్తించు, జరుపు.
భార. ఆది. 5. 170.

ఉ. ...జలక మాడఁగ లెమ్మని...పారి. 2. 6.

గీ. అతఁడఘమర్షణస్నాన మమ్మరుద్వృ,
ధాంబువులనాడి...ఆము. 6. 98.

5. నాటు, గ్రుచ్చుకొను.

క...మ,హాభల్ల మురస్థలమ్ము నాడఁగ నేసెఁ.
భార. ద్రో. 4. 229.

క. ...మరున్నందనుండు తొమ్మిదిశరముల్,
తను నాగ నేయ బలువిలు, గొని యన్నియ
కర్ణుఁ డేసెఁ గ్రూరాస్త్రములఁ. భార.ద్రో.
4. 189.

ఉ....ఏటికి నన్నుఁ జూడ వ,జ్ఞానవ నీ విలోక
నము లచ్చెరువారఁగ నెన్నఁడేని నా,మానస
మాడి యున్న యవి మన్మథమోహనసాయ
కంబులై. భా. రా. సుం. 117.

6. (యంత్రమున) నలుగునట్లుచేయు.

ఆ. అద్భుతంబుఁ జెంది యతఁడు చేజంత్రావఁ,
జెఱకుఁ గోల లాడి చేసె రసము. హర.
1. 22.

7. ఇది పెక్కుపదముల కనుప్రయుక్తమై విశే
షార్థములు కలిగియును లేకయును ఉండును.
వానియర్థములునుసకర్మకత్వాకర్మకత్వము
లును సందర్భానుసారముగ గ్రహించునది.

ఉదా: ముద్దులాడు, సివములాడు, విడనాడు,
వెన్నాడు, ఈఁదులాడు, పకపకలాడు,
పెండ్లాడు, జూదమాడు, కొనియాడు,
తునుమాడు, చెండాడు, తూఁగాడు, మొ.

జ. ఆట, ఆటకత్తె, ఆటకాఁడు, ఆటకొలను,
ఆటగీము, ఆటగొట్టు, ఆటచేడియ, ఆట
డిగ్గియ, ఆటతిప్ప, ఆటతెలివ, ఆటతోఁట,
ఆటది, ఆటపట్టు, ఆటరి, ఆటవాఁడు, ఆట
విడుపు, ఆటవెలఁది, ఆడిక, ఆడికపడు, ఆడి
కోలు, ఆడిపోసికొను, ఆడుకొను, ఆర్చు[2].

**అడుకొను** స. క్రి. (√అడు) 1. చెప్పు, పలుకు.

గీ. స్వామి మీ రెన్నటికి నయాచకుల రగుట,
యాచకులు గాకయుండుట నాత్మఁదెలియు,
నైనఁ గక్కుర్తిమాట దా నాడుకొనెద.
కుచేల. 148.

2. దూఱు, నిందించు.

సీ....బంధువుల్ గనినచోఁ బరఁగ నిందింతురు
తోడికోడలు చూడ నాడికొనును. హంస.
1. 125.

గీ. అకట నాయీడు రాచకన్యకల కెల్లఁ,
గడఁగినన్నాడుకొన నోరు గల్గె నేమ,నందు
...శుక. 1. 385.

క. అన విని రంభ విభ్రంభణ, మొనరంగాఁ
బలికె నలుక నూర్వశి యా నౌ, నినువంటి
మచ్చెకంటికి, వనువగునే యిట్టు లాడి
యాడించుకొనఁగ. వాల్మీ. 3. 57.

**అడువరి** వి — అఱువరి, అలంగము, వప్రము.

**అడుపు** సం. వి. అ. పుం. స్త్రీ. ఉడుపము, తెప్ప.

**అడె** వి. శాకినమండలి యొకభాగము. ఆం. భా.
2. 188.

**అడెబలు** వి. బ. - అగడపలు. ఆం. భా. 1. 73.

**అడెలు[1]** — అడేలు.

సీ. కైజా కక్కెర గువ్వకల్లెడు కీరజ మాడెలు
తొగగిజిగాఁడు కొరడు. సుద. 3. 194.

**అడెలు[2]** వి. బ — అగడపలు. ఆం. భా. 1. 73.

**ఆడేలు** వి. ప్రా. (సం. ఆడిః.) శరారి, జలపక్షి విశేషము.

క. బకమై యుండెడ వని కౌశికు నతఁడు శపించె విని వసిష్ఠునకుం గౌశికుఁడును నాడే లగుమని, ప్రకట క్రోధమున నిచ్చెఁ బ్రతిశాపంబుఁగా. మార్క. 2. 3.

ద్వి. గువ్వల వడిఁ బట్టి గువ్వలు నైవ,నవ్వలకుం దేళ్లనాడేళ్ల తేళ్ల, చాయక మును మింట జను సాళువములు. అ. మ. క. 5. 222 పా. 22 పం.

**ఆఢకము** సం. వి. అ. న. పరిమాణవిశేషము, తూము. (నాలుగుకుంచములకొలఁదిది)

**ఆఢకి** సం. వి. ఈ. స్త్రీ. 1. కంది (వృ. వి.) 2. సువాసన గలయొకవిధమైనమట్టి.

**ఆఢకికము** సం. విణ. (అ. ఈ. అ.) 1. ఆఢకము కొలఁదిసరకు పట్టునది. (గంప, మొ.) 2. ఆఢక పరిమాణము గలది. (రాశి) 3. ఆఢకముకొలఁది విత్తనములు విత్తఁదగినది (నేల) 4. ఆఢకము కొలఁది బియ్యము మున్నగునవి ఉడుకునది. (పాత్రము.) 5. కొంచెము తక్కువైనను ఆఢక మగునట్లు కొలుచునది. (ఉదా: ఆఢకికుఁడు, ఆఢకికి. మొ.)

**ఆఢకీనము** సం. విణ. (అ. అ. అ.) 1. ఆఢకము కొలఁది సరకుపట్టునది. (గంప, మొ.) ఆఢకము కొలఁదివిత్తనములు విత్తఁదగినది. (నేల) 3. ఆఢకముకొలఁది బియ్యము మున్నగునవి ఉడుకునది. (పాత్రము.) 4. కొంచెము తక్కువైనను ఆఢకమగునట్లు కొలుచునది. (ఉదా: ఆఢకీనుఁడు, ఆఢకీన. మొ.)

**ఆఢ్యంకరణము** సం. విణ. (అ. ఈ. అ.) ఆఢ్యుఁడు గానివానిని ఆఢ్యునిగాఁ జేయునది. (రాజసేవ. మొ.)

**ఆఢ్యంభవిష్ణువు** సం. విణ. (ఉ.) మొదట ఆఢ్యుఁడుగా నుండక పిదప ఆఢ్యుఁడగువాఁడు.

**ఆఢ్యంభావుకుఁడు** సం. విణ.(అ. అ. అ.)—ఆఢ్యంభవిష్ణువు.

**ఆఢ్యకులీనుఁడు** సం. విణ. (అ. అ. అ.) ఆఢ్యకులమునఁ బుట్టినవాఁడు.

**ఆఢ్యచరుఁడు** సం. విణ. (అ. ఈ. అ.) పూర్వము ఆఢ్యుఁడుగా నుండినవాఁడు.

**ఆఢ్యవాతము** సం. వి. అ. పుం. వాతరోగవిశేషము. (ఊరుస్తంభరోగము-అని కొందఱు.)

**ఆఢ్యుఁడు** సం. విణ. (అ. అ. అ.) 1. ధనవంతుఁడు. 2. సంపన్నుఁడు, సమృద్ధుఁడు. (ఉదా: ధనాఢ్యుఁడు; గుణాఢ్యుఁడు, మొ.)

**ఆణకము** సం. విణ. (అ. ఈ. అ.) అధమము, నికృష్టము. వి. అ. న. సురతభేదము.
'ఆణకం సురతం నామ దంపత్యోఃపార్శ్వసంస్థయోః' (వాచ.)

**ఆణము** వి. మాంసరసము. ఆం. భా. 2. 252.

**ఆణవము** సం. విణ. (అ. ఈ. అ.) అణుసంబంధమైనది. వి. అ. న. అణుత్వము.

**ఆణవీనము** సం. విణ. (అ. అ. అ.) ఆవలు మున్నగు అణుధాన్యములు పండునది. (పొలము.)

**ఆణి'** విణ. ప్రశస్తము, శ్రేష్ఠము.

సీ....కన్నాకు మేల్బంతి నికరము మేటి మేలు తరం మాణియంచనఁ దనరు శ్రేష్ఠము...... ఆం. భా. 3. 15.

గీ. ఎచటఁ జూచిన నాణిగా నేర్పఱించి, పెద్ద ముత్యాలముగ్గులు వెట్టువారు. యయా. 4. 31.

వి. (త. క. ఆణి.) 1. ఒకజాతిముత్యము, మౌక్తిక విశేషము.

సీ. గంబూరకుగకుగల్ గలఁగించుమనుఁబల్కు పల్కుదు రాణులపసను మించు. హంస. 3. 192, ఆం. భా. 2. 276.

సీ. ...ఆణిముత్తెములసోయగము.విక్ర. 1.50.

సీ. వేణుజాతము లైనయాణిపూసల వెందు రూడుగవండ్లకు నీడు గాఁగ. కాశ. 3. 4.

2. (ముత్యముల) వర్తులత్వము, గుండ్రఁదనము.

గీ...చందనమునఁ, బరిణయాగార మలుకంగఁ బాణియాణి, గలుగుముత్తియములముగ్గుగా నొనర్పఁ, జతుర పుణ్యాంగనాజనతతిఁ గొనర్చె. భార. విరా. 5. 386.

ఉ. ఇందునిభాస్య యోర్తు కదియించెఁ గుమారుని పేరురింబునం, గందక యాణి పాణియును కల్గినతోరిపుఁదాఁ వారముగా. నై ష.6.55.

**అణి** సం. వి. ఇ. పుం. స్త్రీ. 1. ఇరుసుతుదిచీల. 2. కోటి, అంచు. 3. సీమ, ఎల్ల. 4. మోఁకాలికి మీఁదనున్న మూఁడంగుళముల ప్రదేశము. (ఇది యొక మర్మస్థానము.)

**అణి**[2] వి. (సం. అణిః) ఇరుసుతుదిచీల

సీ. చీల జంజడ యాణి చిలుక యంచనఁగ సంధానితకీలాఖ్య తనరుచుండు ఆం. భా. 2. 204.

(ప్రాఁత ప్రతిపా)

**అణీ**

(దీని నొక కవి దీర్ఘాంతముగాఁ బ్రయోగించినాఁడు.

క ...వేణీమూలంబునందు వెలయఁగ బింఛం, బాణీముత్యము ముక్కున...కృష్ణ. శ. 16.

**అణె** వి. దద్రురోగము, దద్దురు. ఆం. భా. 2.131.

**అణెము** వి. దేశము.

సీ. అణె మంచనఁగ దేశాహ్వయంబు. ఆం. భా. 2. 7.

**అతంకము** సం. వి. అ. పుం. 1. రోగము. 2. సంతాపము. 3. సందేహము. 4. భయము. 5. మద్దెల మ్రోఁత.

**అతంకించు** సం. అ. క్రి. వెఱచు, భయపడు.

సీ.... వేలుపులకు నాతంకించి వలన వచ్చి. వరాహ. 3. 131.

**అతంచనము** సం. వి. అ న. 1. చేమిరి పెట్టుట, (పాలు) తోడుపెట్టుట; తోడుపెట్టుట కుపయోగించుఆమ్లద్రవ్యము. 2. తనుపుట, తృప్తి నొందించుట. 3. వడి, వేగము.

**అతఁడు** న. ఏ. (క. అతం) వాఁడు, అతఁడు.

ఇది 'అ' శబ్దమునకు మహదర్థమున వచ్చు ప్రథమై కవచన రూపము. (ఉదా: అతనిన్, అతని చేతన్, మొ.)

సీ. వాసవ ప్రతిముండు వసు వసునాతండు చేదిభూనాథుండు... భార. ఆది. 3.28.

**అతగాఁడు** — అతఁడు.

చ కుదురు మెఱుంగుగబ్బివలిగుబ్బల గ్రుచ్చియు నాతగానికిన్, ముద మొదవించి.... శుక. 2.190.

**అతతము** సం. విణ. (అ. అ. అ.) 1. విస్తృతము, విశాలము. 2. అంతటను వ్యాప్తమైనది. 3. ఆరోపితము, ఎక్కింపఁబడినది.

శ్లో. మౌర్వీధనుషిచాతతా. సం. రఘు. 1.19.

**అతతాయి** సం. విణ. (స్. సీ. స్.) చంప నుద్యుక్తుఁడైనవాఁడు. (అతతాయులు ఆఱుగురు:- ఇంటికినిప్పు పెట్టువాఁడు విషము పెట్టువాఁడు. కత్తిగొని నఱకువాఁడు. ధనము దోఁచుకొనువాఁడు. నేల నపహరించువాఁడు. పరస్త్రీని చెఱపట్టువాఁడు.)

**అతప్రత్త్రికము.** సం - అతపత్త్రము.

**అతపత్త్రము** సం. వి. అ. న. ఎండనుండి రక్షించునది-గొడుగు.

**అతపము** సం. వి. అ. పుం. 1. ఎండ 2. వెలుతురు, ప్రకాశము. (ఉదా: చంద్రాతపము.)

**అతపవారణము** సం. అతపత్త్రము.

**అతపోదకము** సం. వి. అ. న. ఎండమావులు, మృగతృష్ణ.

**అతరము** సం. వి. అ. పుం. తరపణ్యము, ఓడకేవు.

**అతర్పణము** సం. విణ. అ. న. 1 తనుపుట, ప్రీణనము. 2. పండుగులందు గోడలు మొదలగు వానికి వెల్లవేయుట, మంగళాలేపనము; అట్టి పూఁతకై యుపయోగించు ద్రవ్యము.

**అతల** - అవతల.

వి. ఆవలి ప్రదేశము; ఆవలికాలము.

చ. బలిమిఁ దదీయులప్పుడు సభామునిముఖ్యుల రెట్టఁబట్టి యాతలఁ బడవైచుచుం దమకుఁ దామె యవారణఁ దత్తదాసనంబులు గొని కూరుచుండిరి.... ప్రభా. 1.82.

క. దైతేయవటుచుళాముల, కేతెఱఁగున నోర్వఁజాల మిట నీయడుగుల్, ప్రీతిం గొలుచుచు నుండెద, మాతల నీ వెట్టులుంచె దటు నూడు దయన్. హరి. పూ. 4.80.

జ: అతలీతల చేయు.

**ఆతలితలసేయు** స. క్రి. (√ఆతల) అటిటుసేయు, తలక్రిందు సేయు.

క. చూపుల గగనము మ్రింగుచు, వేపున దివి భువియు నాతలితల సేయన్. భాగ. 8.444.

**ఆతాపి** సం. వి. ఇ. పుం. ఒకయసురు.

శ్లో. ఆతాపిర్భక్షితో యేన వాతాపిశ్చ మహాసురః, సముద్రశ్శోషితో యేన సమేఽగస్త్యః ప్రసీదతు. (వాచ)

న్. పుం. చీపరపిట్ట, చిందపిట్ట, పిన్నగ్రద్ద.

**ఆతాయి** సం. వి. న్. పుం. ఆతాపి, చీపరపిట్ట.

**ఆతారము** సం. ఆతరము.

**ఆతార్యము** సం. విణ. (అ. ఆ. అ.) తరింపఁ దగినది, దాఁటఁదగినది.

**ఆతి** సం. ఆటి.

**ఆతిథేయము** సం. విణ. (అ. ఈ. అ) అతిథికి యోగ్యమైనది (భోజనాది).

**ఆతిథేయుఁడు** సం. విణ. (అ. ఈ. అ.) అతిథి సత్కారము చేయువాఁడు.

**ఆతిథ్య** సం. వి. ఆ. స్త్రీ. ఇష్టివిశేషము.

**ఆతిథ్యము** సం. విణ. (అ. ఆ. అ.) అతిథికొఱకైనది (భోజనాది). వి.అ.న. అతిథిసత్కారము.

**ఆతియాత్రికుఁడు** సం – ఆతివాహికుఁడు.

**ఆతివాహికుఁడు** సం. వి. అ. పుం. మరణానంతరము అతివాహమునందు – ఇహలోకమునుండి పరలోకమునకుఁ గొనిపోవుటయందు–నియుక్తుఁడైనవేలుపు. (ఈదేవతలు అర్చిరాద్యభిమానులుగాను ధూమాద్యభిమానులుగాను నిరుదెగలుగా నుందురు. అర్చిరాద్యభిమానులు జ్ఞానులను ఉత్తరమార్గమునను ధూమాద్యభిమానులు కర్మపరులను దక్షిణమార్గమునను గొనిపోవుదురు.)

**ఆతుమ** వి. (సం. ఆత్మా. ప్రా. ఆతుమా.) ఆత్మ.

క. మాయాతుమ లానివయది, పాయక సంతోసము...కళా. 6. 161. (ఆతుమ-మనస్సు.)

**ఆతురపడు** మి. అ. క్రి. తొందరపడు, త్వరపడు.

క. కూఁతుర యాతురపడినీ, వాతనిఁ జేరంగఁ బోకుము... చంద్ర. వి. 2.6.

**ఆతురపాటు** మి. వి. (√ఆతురపడు) తొందరపాటు, వేగిరపాటు. కావ్యా. 2.81.

**ఆతురసన్న్యాసము** సం. వి. అ. పుం. ఆపత్సన్న్యాసము, రోగాదులవలన బ్రతుకునందాశ లేనివాఁడు కైకొను సన్న్యాసము.

**ఆతురుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) 1. వ్యాధిగ్రస్తుఁడు; పీడితుఁడు. 2. తమకించువాఁడు, ఉత్కంఠితుఁడు, వేగిరపడువాఁడు.

శ్లో. విద్యాతురాణాం న సుఖం న నిద్రా.

**ఆతువు** సం. వి. ఉ. పుం. ఉడుపము, తెప్ప.

**ఆతృప్యము** సం. వి. అ. పుం. సీతాఫలవృక్షము. న. సీతాఫలము.

**ఆతోద్యకము** సం – ఆతోద్యము.

**ఆతోద్యము** సం. వి. అ. న. వాదిత్రము, తతము ఆనద్ధము సుషిరము ఘనము అనెడివాద్య చతుష్టయము.

**ఆత్తగంధుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) అభిభూతుఁడు, గర్వభంగము చేయఁబడినవాఁడు.

శ్లో. పక్షచ్ఛిదాగోత్రభిదాత్తగంధాః.... మహీధ్రాః. సం. రఘు. 13.7.

**ఆత్తము** సం. విణ. (అ. ఆ. అ.) 1. గృహీతము, లబ్ధము. 2. హరింపఁబడినది. (ఉదా: ఆత్తగర్వుఁడు – అభిభూతుఁడు.)

**ఆత్మ(ము)** సం.వి.న్.పుం. 1. జీవుఁడు, జీవాత్మ. 2. పరమాత్మ, బ్రహ్మము. 3. స్వరూపము. 4. దేహము. 5. మనస్సు.

క. సరసిరుహోదరు మంగళ, చరితామృత మాత్మఁ గ్రోలుజనుఁ డితరకథా, గరళముఁ గ్రోలునె. ...భాగ. 3.191.

6. తాను. 7. బుద్ధి. 8. స్వభావము. 9. ధైర్యము 10. ప్రయత్నము. (1. 2. అర్థముల యందు 'ఆత్ముఁడు' అను రూపము గూడ నుండును – చూ. ఆత్ముఁడు.)

**ఆత్మంభరి** సం. విణ. (ఇ.) దేవతలు అతిథులు మొదలగువారికిఁ బెట్టక తాను మాత్రము భుజించువాఁడు, స్వోదరమాత్ర పూరకుఁడు, కుక్షింభరి.

**ఆత్మకము** నం. విశే. (అ. త్మకా. అ.) స్వరూపముగాఁ గలది. (అది సమాసాంతముననే యుండును.
ఉదా: దుఃఖాత్మకము, సంశయాత్మకము.) వి. అ. పుం. (మంత్ర) ఆకారము.

**ఆత్మఖ్యాతి** నం. వి. ఇ. స్త్రీ. భ్రమవిషయమున క్షణిక విజ్ఞానవాదులయొక్కయు సౌత్రాంతికుల యొక్కయు మతము (ఈ మతమున భ్రమస్థలమున ఇదం పదార్థమగు శాహ్యాశుక్తి యందు బుద్ధిరూపాత్మయొక్క ధర్మమనురజతము- అనగా రజతాకార మగుజ్ఞానము- విశేషణమై భాసించును. అనఁగా ఆంతరజ్ఞానరూపమగు రజతము అబహిస్థమైనను బహిస్థమువలె భాసించును.)

**ఆత్మగతము** నం. విశే. (అ. ఆ. అ.) మనస్సునందున్నది. వి.అ.న. (నాటక) స్వగతము, ఇతరపాత్రము వినకుండునట్లు తనలో తాను అనుకొనెడి మాట. (వ్యతి - ప్రకాశము.)

**ఆత్మగుప్త** నం. వి. ఆ. స్త్రీ — పరులనుండి తన్ను తాను గాపాడుకొనునది — దూలగొండి (వృ. వి.)

**ఆత్మగ్రాహి** నం. విశే. (న్. తీ. న్.) 1. ఉదరంభరి, తనపొట్టకు మాత్రమే చూచుకొనువాఁడు. 2. ఆత్మజ్ఞుఁడు.

**ఆత్మఘాతకుఁడు** నం. విశే. (అ. తికా. అ.) ఆత్మహత్య చేసికొనువాఁడు.

**ఆత్మఘాతము** నం. వి. అ. పుం. ఆత్మహత్య.

**ఆత్మఘాతి** నం. విశే. (న్. నీ. న్.) - ఆత్మఘాతకుఁడు.

**ఆత్మఘాతుకుఁడు** నం. విశే. (అ. ఆ. అ.) — ఆత్మఘాతకుఁడు,

**ఆత్మఘోషము** నం. వి. అ. పుం. 1. తనకూఁత చేత తననామమును దెలుపునది. 'కాకా' అని కాకమును 'కుకు' అని కుక్కుటమును గూయును — (క) కాకము, కాకి. (చ) కుక్కుటము, కోడి. 2. తన్నుఁదాను పొగడుకొనుట, ఆత్మస్తుతి.

**ఆత్మజ** నం. వి. ఆ. స్త్రీ. 1. తనూజ, కూఁతురు. 2. బుద్ధి.

**ఆత్మజన్ముఁడు** నం. వి. న్. పుం - ఆత్మజుఁడు.

**ఆత్మజుఁడు** నం. వి. అ. పుం. 1. పుత్త్రుఁడు, 2. మన్మథుఁడు. (ఇప్లే. ఆత్మజాతుఁడు, మొ.)

**ఆత్మజ్ఞానము** నం. వి. అ. న. తన్నుఁదాను తెలిసికొనుట.

**ఆత్మజ్ఞుఁడు** నం. విశే. (అ. ఆ. అ.) తన్నుఁదానెఱిఁగినవాఁడు.

**ఆత్మతత్త్వము** నం. వి. అ. న. 1. ఆత్మయొక్కయథార్థస్వరూపము. 2. ఆత్మరూప మగుపరమపదార్థము.

**ఆత్మదర్శనము** నం. వి. అ. న. 1. ఆత్మసాక్షాత్కారమునకు సాధన మగుశ్రవణమనననిధిధ్యాసనాదికము. 2. ఆత్మసాక్షాత్కారము. 3. సర్వభూతములు తానే యని యెఱుఁగుట.

**ఆత్మదర్శము** నం. వి. అ. పుం. - దేహము చూపునది - అద్దము, దర్పణము.

**ఆత్మదానము** నం. వి. అ. న. - తన్నుఁదానిచ్చుకొనుట - స్వార్థత్యాగము, ఆత్మసమర్పణము.

**ఆత్మద్రోహి** నం. విశే. (న్. నీ. న్.) - ఆత్మఘాతకుఁడు.

**ఆత్మనింద** నం. వి. ఆ. స్త్రీ. తన్నుఁదాను నిందించుకొనుట.

**ఆత్మనివేదనము** నం. వి. అ. న. తన్నుఁ దానర్పించుకొనుట.

**ఆత్మనిష్ఠుడు** నం. విశే. (అ. ఆ. అ.) ఆత్మజ్ఞానమాత్రమును అన్వేషించు బ్రహ్మనిష్ఠుఁడు, ముముక్షువు.

**ఆత్మనీనుఁడు** నం. విశే. (అ. ఆ. అ) తనకుహితుఁడైనవాఁడు. వి. అ. పుం. 1. కొడుకు. 2. భార్య సోదరుఁడు, 3. విదూషకుఁడు.

**ఆత్మనేపదము** నం. వి. అ. న. (నం. వ్యాక) లడాదులకు వచ్చెడిఆదేశవిశేషము, (తఙ్, శానచ్, కానచ్.) (తె. వ్యాక) క్రియాపదవిశేషము. ఇందు అనుప్రయుక్తమగు 'కొను' ధాతువు క్రియాఫలము కర్తృగామియని తెలుపును. (ఉదా: వండుకొను, మొ.)

**ఆత్మపురాణము** నం. వి. అ. న. ఉపనిషదర్థప్రకాశకమగు నొక పురాణము.

**ఆత్మప్రభము** సం. విణ. (అ. ఆ. అ.) స్వయం ప్రకాశమానము, తనంతటతాను ప్రకాశించునది. (బ్రహ్మము)

**ఆత్మప్రశంస** సం. వి. ఆ. స్త్రీ. తన్నుఁదానుపొగడుకొనుట.

**ఆత్మబంధువు** సం. వి. ఉ. పుం. 1. తనబంధువు. 2. (ధర్మ) సొంతచుట్టము (మేనమామకొడుకు, మేనత్తకొడుకు, తల్లియొక్క అప్పచెల్లెండ్రకొడుకులు.)

**ఆత్మబోధము** సం. వి. అ. పుం. — ఆత్మజ్ఞానము.

**ఆత్మభువు** సం. విణ. (ఈ. ఈ. ఉ.) 1. తనకుఁదానే పుట్టినవాఁడు. 2. మనస్సునుండి పుట్టినవాఁడు. 3. దేహమునుండి పుట్టినవాఁడు, వి. ఈ. పుం. 1. బ్రహ్మ. 2. ఈశ్వరుఁడు. 3. విష్ణువు. 4. మన్మథుఁడు. 5. కొడుకు. ఈ. స్త్రీ. 1. బుద్ధి. 2. కూఁతురు.

**ఆత్మభూత** సం. వి. ఆ. స్త్రీ. 1. కూఁతురు. 2. బుద్ధి.

**ఆత్మభూతుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) 1. స్వయంభువు, తనంతటఁదానే పుట్టినవాఁడు. 2.ఆత్మకు సాటియైనవాఁడు—అనుకూలుఁడు (సేవకాది), వి. అ. పుం. 1. దేహభవుఁడు — పుత్త్రుఁడు. 2. మనోభవుఁడు—మన్మథుఁడు.

**ఆత్మభూయము** సం. వి. అ. న. ఆత్మత్వము, బ్రహ్మభావము.

**ఆత్మమయము** సం. విణ.(అ. ఈ. అ.) ఆత్మస్వరూపమైనది. (ఉదా: సర్వమాత్మమయం జగత్.)

**ఆత్మమూలి** సం వి. ఈ. స్త్రీ. దురాలభ, తీఁటకసింద (వృ. వి.).

**ఆత్మయోని** సం. విణ. (ఇ.) వి. ఇ. — ఆత్మభువు.

**ఆత్మరక్ష** సం. వి. ఆ. స్త్రీ. 1. ఇంద్రవారుణి, పెద్దపాఁపర (వృ.వి.). 2. తనయొక్క రక్షణము.

**ఆత్మలాభము** సం. వి. అ. పుం. 1. దేహప్రాప్తి, పుట్టుక. 2. (ఆత్మయొక్క యథార్థస్వరూపమును దెలియుటవలనఁ గలుగు) ఆత్మస్వరూపప్రాప్తి. 3. స్వలాభము.

**ఆత్మవంతుఁడు** సం. విణ. (త్. వతీ. త్.) 1. వశ్యచిత్తుఁడు, చిత్తమును లోఁబఱుచుకొన్నవాఁడు. 2. నిర్వికారచిత్తుఁడు.

**ఆత్మవశము** సం. విణ. (అ. ఆ. అ.) ఆత్మాధీనము, తనకు వశమైనది. వి. అ. పుం. తనకు లోఁబడియుండుట.

**ఆత్మవశ్యుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) 1. తనమనస్సును వశము చేసికొన్నవాఁడు. 2. తనకు వశ్యుఁడైనవాఁడు.

**ఆత్మవిదుఁడు** సం. విణ. (ద్.)- ఆత్మజ్ఞుఁడు.

**ఆత్మవిద్య** సం. వి. ఆ. స్త్రీ. ఆత్మయొక్క యథాస్వరూపమును దెలుపువిద్య, ఆధ్యాత్మికవిద్య.

**ఆత్మవీరుడు** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి బలముగలవాఁడు. వి. అ. పుం. 1. పుత్త్రుఁడు. 2. శ్యాలకుఁడు, పెండ్లాము తోఁబుట్టువు. 3. (నాటక) విదూషకుఁడు.

**ఆత్మశల్య** సం. వి. ఆ. స్త్రీ. శతావరి, పిల్లపీఁచర (వృ. వి.).

**ఆత్మశ్లాఘ** సం. వి. ఆ. స్త్రీ. తన్నుఁదాను పొగడుకొనుట.

**ఆత్మసంతుష్టుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) తనయందుఁ దాను సంతుష్టుఁడై యున్నవాఁడు, ఆత్మతృప్తుఁడు.

**ఆత్మసందేహము** సం. వి. అ. పుం. 1. తనకుఁగలిగినసందేహము. 3. ప్రాణసంశయము, అపాయము.

**ఆత్మసంభవ** సం. వి. ఆ. స్త్రీ. 1 కూఁతురు. 2. బుద్ధి. (ఇప్లే. ఆత్మసముద్భవ, మొ.)

**ఆత్మసంభవుఁడు** సం. వి. అ. పుం. 1. దేహసంభవుఁడు—కొడుకు. 2. మనసునఁ బుట్టినవాఁడు—మన్మథుఁడు. 3. స్వయంభువు, తనంతటనే పుట్టినవాఁడు — (క) బ్రహ్మ. (చ) విష్ణువు. (ట) శివుఁడు. (త) పరమాత్మ. (ఇప్లే. ఆత్మసముద్భవుఁడు.)

**ఆత్మసంయమము** సం. వి. అ. పుం. మనస్సును అడఁచుట, మనోనిగ్రహము.

**ఆత్మసాక్షి** సం. వి. న్. పుం. — బుద్ధివృత్తి ప్రకాశకము—చైతన్యము.

**ఆత్మసాత్కరణము** సం. వి. అ. న. తనవశముచేసికొనుట.

**ఆత్మసాత్కృతము** సం. విశే. (అ. ఆ. అ.) తన వశముగాఁ జేసికొనఁబడినది.

**ఆత్మసిద్ధము** సం. విశే. (అ. ఆ. అ.) తనంతట సిద్ధించినది, ప్రయత్నము లేక సిద్ధించినది.

**ఆత్మసిద్ధి** సం. వి. ఇ. స్త్రీ. 1. ఆత్మస్వరూపమగుట, మోక్షము. 2. ప్రయత్నము లేకుండఁగ సిద్ధించుట.

**ఆత్మసుఖము** సం. వి. అ. న. 1. ఆత్మరూప మగు పరమానందము. 2. తనసుఖము.

**ఆత్మస్తుతి** సం. వి. ఇ. స్త్రీ. తన్నుఁ దాఁ బొగడుకొనుట.

**ఆత్మస్థుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) ఆత్మస్వరూప జ్ఞానమునకై యత్నించువాఁడు, ఆత్మనిష్ఠ కలవాఁడు.

**ఆత్మహత్య** సం. వి. ఆ. స్త్రీ. తన్నుఁ దాఁ జంపుకొనుట. (ఇట్లే-ఆత్మహననము, మొ.)

**ఆత్మాపహారకుఁడు** సం. విశే. (అ. రికా. అ.) తన యథార్థస్వరూపమును దాఁచువాఁడు, తన కలరూపును మఱుఁగు పుచ్చువాఁడు.

**ఆత్మాపహారము** సం. వి. అ. పుం.తనయథార్థస్థితిని గప్పిపుచ్చుట.

**ఆత్మారాముఁడు** సం. విశే. (అ. ఆ. అ.) ఆత్మయందే రమించుచు దానియందే తృప్తుఁడై యుండువాఁడు. (యోగి)

**ఆత్మాశి** సం. వి. న్. పుం-తమజాతివానిని భక్షించునది — మత్స్యము, చేఁప.

**ఆత్మాశ్రయము** సం. విశే. (అ. ఆ. అ.) తనకుఁదానే ఆశ్రయముగాఁ గలది, స్వతంత్రము. వి. అ. పుం. 1. తన ఆశ్రయము 2. (న్యాయ) ఒకానొకదోషము, స్వాపేక్షాపాదక ప్రసంగము.

**ఆత్మీభావము** సం. వి. అ. పుం.ఆత్మస్వరూపప్రాప్తి, ఆత్మసాయుజ్యము.

**ఆత్మీయము** సం. విశే. (అ. ఆ. అ.) తనది.

**ఆత్ముఁడు** సం. (చూ. ఆత్మ.)

క. ...ఆత్ముం, డకులతేజోరూపతఁ, బ్రకృతియు వికృతియును గాక ప్రస్ఫురితుఁ డగుఁ. భార. శాం. 5. 608.

క. విను మూత్ముఁడు క్షేత్రజ్ఞుం,డన ఘృతాత్ముఁ డనఁ బురుషుఁ డనఁ బరమేశుం,డన బుద్ధి సాక్షి యన నం, జనరహితుం డనఁగఁ బరఁగు శాంతిప్రవణా. భార. శాం.4.122.

**ఆత్మోద్భవ** సం. వి. ఆ. స్త్రీ 1. మాషపర్ణి, కారుమినుము (వృ.వి.) 2. కూఁతురు. 3. బుద్ధి.

**ఆత్మోపజీవి** సం. విశే. (న్. నీ. న్.) దేహకష్టము చేత బ్రదుకువాఁడు.

**ఆత్మోపముఁడు** సం. విశే. (అ. ఆ. అ.) 1. తన వంటివాఁడు వి. అ. పుం. పుత్త్రుఁడు.

**ఆత్మౌపమ్యము** సం. వి. అ. న. తనపోలిక, స్వసామ్యము.

**ఆత్యంతికదుఃఖనివృత్తి** సం. వి. ఇ. స్త్రీ. అపవర్గము, ముక్తి. (ఇందు దుఃఖనివృత్తి అత్యంతముగాను అవిచ్ఛిన్నముగాను ఉండును.)

**ఆత్యంతిక ప్రల(ళ)యము** సం. వి. అ. పుం. ప్రళయభేదము. (నిత్యము, ప్రాకృతము, నైమిత్తికము, ఆత్యంతికము అని ప్రళయము నాలుగువిధములు. అందుఁ గడపటి ప్రళయమే మోక్షము.)

**ఆత్యంతికము** సం. విశే. (అ. ఈ. అ.) 1. అత్యంతముగాఁ గలిగినది; సమృద్ధము, పూర్ణము. 2. ఎడతెగనిది, స్థిరమైనది, శాశ్వతమైనది.

**ఆత్యయికము** సం. విశే. (అ. ఈ. అ.) అత్యావశ్యకము.

**ఆత్రగాఁడు** విశే. (√ఆత్రము) త్వరపడువాఁడు. (శ. ర.)

**ఆత్రపడు** అ. క్రి. (√ఆత్రము) త్వరపడు; కళవళపడు.

గీ.....కొలువున్నయెడ వచ్చి కుశికపుత్త్రుఁ,డర్థి దీవించి తా వచ్చినట్టికార్య,మధిపునకుఁ జెప్ప మదిలోన నాత్ర పడుచు, వినయ మొప్పార నిట్లని విన్నవించె. మొ. రామా. బాల.45.

**ఆత్రము** — అత్తరము వి. (సం. ఆతురమ్. త. అత్తిరం.) 1. త్వర.

గీ. అకట కనుసన్న చేసినయంతమాత్ర, నాత్రమున వేఁగి సంజీవనౌషధంబు, దెచ్చి యిచ్చిన ....సమీర. 4. 149.

2. విపత్తు. ఆం. నం. మాన. 59.
జః అ[త్రగాఁడు, అ[త్రపడు.

**అ[త్రేయి** నం. వి. ఈ. స్త్రీ. 1. అ[త్రివంశమునఁ బుట్టినయాఁడుది. 2. అ[త్రిభార్య. 3. ఒకనది. 4. ఋతుమతి, ముట్టుది.

**అ[త్రేయుఁడు** నం. విణ. (అ. ఈ. అ.) అ[త్రివంశ మునఁ బుట్టినవాఁడు. వి. అ. పుం. 1. ఒకా నొక ముని. 2. చం[ద్రుఁడు.

**ఆథర్వణము** నం. విణ. (అ. ఈ. అ.) అథర్వ వేద సంబంధమైనది. వి. అ. న. 1. అథర్వసమూహము. 2. అథర్వవేదవిహిత మగుఅభిచారాది కర్మము.

**ఆథర్వణికుఁడు** నం. విణ. (అ. ఈ. అ.) అథర్వ [ప్రోక్తమగు [గంథము చదువుకొనినవాఁడు.

**అద** వి. మనస్సు.
ఆ. ఒప్పుహృదయసంజ్ఞ యుల్లంబు మదిడెంద, మెడద యెడ్డ యాద యెద మనసన. ఆం. భా. 1. 100.
జ. అదమఱచు, అదమఱపు,

**అదంశము** నం. వి. అ. పుం. 1. కాటు. 2. కాటు వలనఁ గలిగిన గాయము. 3. పల్లు, దంతము.

**అదట**[1] వి. 1. ఆసక్తి, ఆవేశ.
సీ. ...గుండె, కాయ లాదటమెయిఁ గబళించు చును [గొవ్వుదెమలిచి నమలుచు...భార. స్త్రీ. 2. 9.
క. ఆదివ్యధ్వనియింపున, కాదటఁ జెవు లొగ్గి గోవు లాదిగఁ గల లో, కోదితజంతువు లుల్లము, లేది యొడలు మఱచి నిగనె నెంతయు [భాంతిన్. హరి. పూ. 8. 8.
2. [పేమము, [పీతి; (స్త్రీ పురుషుల) అను రాగము.
క. అదట మును వాసినభి,న్నోదరులును సోదరులును నొక్కటియైనన్, సోదరులకు వచ్చును భి,న్నోదరులకు రాదు పుత్త్రునొడమి ధరి [తిన్. విజ్ఞా. వ్యవ 141.
చ.... కౌతుకం,బతిశయమై తదంగలత లాదటఁ గౌఁగిటఁ జేర్పఁగోరు ని.. భార. అర. 5. 197.
ఉ ఆగమణీలలామ హృదయంబున నాదట లంతకంతకున్. జేరఁగ...కేయూర. 4.5.
3. వాత్సల్యము; దయ.
ద్వి. ఆదినారాయణుం డవునీవు దక్క, నాదట మముఁ [బోవ నన్యు లోపుదురె. రం. రా. 78 పా. 5 పం.
4. భక్తి.
ద్వి. పాదము ల్గడిగి యప్పాదోదకమ్ము,లాదటఁ [బాశించి యంత లోపలికిఁ, దొడుకొని పోయి...పండితా. దీక్షా. 41 పా.
ఉ....అక్కమలాసనుం గొలుతు నాదటతోవని నిశ్చితాత్ముఁడై. మార్క. 7. 22.
5. తనివి, తృప్తి.
ఉ. ఆమని మేసి యాముకొని యాదటఁ జేర్చి చెలంగుగోధన, స్తోమముఁ గొంచు...హరి. పూ. 7. 91.
జ ఆదటవోవు.

**అదట**[2] అవ్య. [దు. అనంతరము, తరువాత.
క. ఆది జనించెన్ గురవయ,యాదటఁ బాపన్న రామనాఖ్యులు పొడమన్. సానందో. 1.
ఉ. అదటఁ గొన్ని నాళ్లకు దశాస్యుని పట్టపు దేవి యైనమం,డోదరి గాంచె నొక్కనుతు ఉ. రా. 2. 288.

**అదటవోవు** అ. [కి. (√అదట[1]) తనియు, తృప్తి నొందు.
చ. అనఘుఁడు దానిఁ జిత్తమున నాదటవోవక చూచెఁ [బీతితోన్. భార. ఆది. 4. 144.
ఉ. పరెన చూచినం బొదలి యుంపెసలారెడు నాత్మణోత్కరం, బాదటవోవఁగాఁ గదుపు లన్నియుఁ జెన్నుగ నుండి మేయ...హరి. పూ. 7. 78.

**అదత్తము** నం. విణ. (అ. అ. అ.) [గహింపఁబడినది, పుచ్చుకొనఁబడినది.

**అదమఱచే** అ. [కి. (√అద) 1. స్మృతితప్పు, వివశత్వము నొందు.
క. లేదింకం బగ యని ధమ,రాదులదెన వాహనములయందును సంతస్య, శ్రాదరులై పగతురు నేఁ, డాదమఱచి ని[దవోదు రది తఱి పొడువన్. భార. సౌ. 1. 51.

2. ఉన్మత్తుఁడగు.

క. అని యాదమఱచి పలుకఁగ, వెనుకదెసం జల్లగాలి వీతెంచిన గ్రక్కున నులికిపడి పదంపడి, హనుమంతునిదిక్కు చూచి యవ్విభుఁ డనియెన్. రామా. 7. 46. (చూ. 45.)

3. ప్రమత్తుఁడగు.

క. ...బహుభో, గోన్నతుఁడై యాదమఱచి యుండె నళంకన్. ఆము. 4. 186.

**అదమఱపు** వి. (√అదమఱచు) పరాకు, ఏమఱి పాటు.

(వ్యవ) నేను అదమఱపుగా నున్నప్పుడు వాఁడు వచ్చి నామీఁద పడినాఁడు. నే నెన్నిమార్లు పిలిచినను వాఁడు అదమఱపుగా నుండుట చేత పలుకలేదు.

**అదరణము** సం. వి. అ. న. మన్నించుట, సమ్మానించుట; పాటించుట, లక్ష్యముచేయుట.

**అదరణీయము** సం. విశే. (అ. అ. అ.) ఆదరింపఁదగినది.

**అదరబాదర** క్రి. విశే. మిక్కిలి తొందరగా, అతి త్వరితముగా. (బ్రౌ. చి. ని.)

(వ్యవ) కుఱ్ఱవాఁడు వచ్చి అదరబాదరగా నాలుగు మెతుకులు నోటవైచికొని వెళ్లినాఁడు.

**అదరము** సం. వి. అ. పుం. 1. సమ్మానము, గౌరవము. 2. పాటించుట. లక్ష్యము చేయుట. 3. అభిలాషము, వాంఛ.

శ్లో. ...భూయాన్ దారార్థమాదరః. సం. కు. సం. 6. 13.

4. ప్రయత్నము, పూనిక.

శ్లో. గృహయంత్రపతాకాశ్రీ రపౌరాదర నిర్మితా. సం. కు. 6. 41.

**అదరించు** సం. న. క్రి. 1. గౌరవించు, సమ్మానించు

ఉ. సారమతిం గవీంద్రులు ప్రసన్న కథాకలితార్థయుక్తిలో, నారసి మేలు నా నితరు లక్షరరమ్యత నాదరింప. భార. ఆది. 1. 26. ('ప్రశంసింప' అని భావము)

2. పాటించు, లెక్కసేయు.

ఆ. అనిన బాహ్లికాదులగుకురువృద్ధుల, నాత్మజనకుఁ గృష్ణు నాదరింప, కతఁడు రాజసమున నప్పుడు దిగ్గన, లేచిపోయె. భార. ఉద్యో. 3. 373.

3. (దీనులను) జాలిచేఁ బ్రోచు.

(వ్యవ) ఈప్రభువు దిక్కులేనివారి నెందఱనో ఆదరించుచున్నాఁడు.

**అదరింత** మి. వి. ఆదరణము. (ఇట తత్సమక్రియపై 'త' వర్ణకము వచ్చినది.

ఉ. వచ్చి లతాగృహంబుతలవాకిలి బోటులు చెప్పిచూపఁ గన్విచ్చి మనంబులో వెఱపు నెయ్యముఁ దియ్యము నాదరింతయున్, మచ్చికయున్ గుతూహలము మక్కువయుం దడఁబాటు నొందఁగా, నచ్చపలాక్షి చూచె లలితాననచంద్రుని మానవేంద్రునిన్. పి. శకుం. 3. 212.

**అదరువు** వి. (సం. ఆధారః. త. అదరవు.) ఆధారము, ప్రాపు.

గీ. జగతి కాదరు వైనతత్సద్గుణంబు, లెంచ వారలసమత నీకేల గలుగు. కృష్ణ. 4.84. సీతా. వి. 2. 126.

**అదర్తవ్యము** సం — అదరణీయము.

**అదర్పించు** సం. అ. క్రి. మిక్కిలిదర్పించు, త్రుళ్లు.

వ. మహిషకేతుండు రౌద్ర వృషభకేతుండునుం బోలె నాదర్పించి. కు. సం. 12. 881.

**అదర్శకము** సం. వి. అ. పుం. అద్దము.

**అదర్శమండలము** సం. వి. అ. పుం. సర్పవిశేషము. (దీనికి అద్దమువంటి గుండ్రనిమచ్చలుండును.) వ. గుండ్రని యద్దము.

**అదర్శము** సం. వి. అ. పుం. 1. అద్దము,దర్పణము. 2. టీక. 3. ఒకదానిని జూచి వ్రాసినప్రతి. నకలు. 4—చూచి నేర్చుకొనఁ దగినది—దృష్టాంతము, మేలుబంతి.

శ్లో. ఆదర్శ శ్శిక్షితానాం. మృచ్ఛ 1. 48. 'ఆదర్శోగుణానాం' కాదం.

**అదర్శితము** సం. విశే. (అ. అ. అ.) చూపఁబడినది.

**ఆదాత** సం. విశే. (ఋ. త్రి. ఋ.) గ్రహించు వాఁడు, పుచ్చుకొనువాఁడు.

**ఆదానము** సం. వి. అ. న. 1. గ్రహించుట, పుచ్చుకొనుట. 2. (వైద్య) రోగకారణము, స్కంధ త్రయములో నొకటి. (ఆదానము, నిదానము, చికిత్స :- ఇవి స్కంధత్రయము.) 3. గుఱ్ఱము యొక్క అలంకారము.

**ఆదాని** సం. వి. ఈ. స్త్రీ. హస్తిఘోష యను మొక్క.

**ఆదాపనము** సం. వి. అ. న. పుచ్చుకొనునట్లు చేయుట, స్వీకరింపఁ జేయుట.

**ఆదాయము** సం. వి. అ. పుం. 1. పుచ్చుకొనుట, గ్రహించుట. 2. లాభము; లబ్ధద్రవ్యము, రాబడి.

గీ. ఇవ్విధంబున నాదాయ మెల్లఁ జెల్లఁ,నిచ్చలును వెలయాండ్రకు నిచ్చియిచ్చి. శేష. 4. (శ. ర.)

క. కాయకము దలఁపఁ గొంచెము, పాయక నీసేయుచున్న భక్తార్చల కా,దాయము చాలదు దినగతి, యేయనువున జరుగు ననిన నింతి యతనితోఁ. చెన్నబ. 4. 104.

**ఆదాయి** సం. విశే. (న్. నీ. న్.) 1. పుచ్చుకొను వాఁడు, తీసికొనువాఁడు. 2. ఆదాయము కల వాఁడు.

**ఆది** వి. (సం. ఆదిః - సదృశము) నగలు మొదలగు నవి చేయుట కిచ్చినకొలత; కొలతను దెలిపెడి పదార్థము.

(వ్యవ) ఉంగరమునకు ఆది యిచ్చినాను. చౌక్కాకు ఆది యిచ్చినాను.

**ఆది** సం. విశే. (అ. పుం.) 1. ప్రథమము,మొదటిది. తరువోజ- ఏ నేడ నింద్రాదు లేడ. భార. అర. 2. 42.

క. ఆదియుగంబున నసురుల, కాది యగు హిరణ్య కశిపుఁడు...హరి. ఉ. 9. 193.

వ.తార్కికులు వాదిగాఁగలుగువిద్వజ్జనంబులు. భార. ఆది 1. 8.

వ. కుండోదరమహోదరు లాదిగాఁగల నాగ ముఖ్యులు పుట్టిన. భార. ఆది. 2. 4.

(కడపటి రెండు ప్రయోగములందును 'ఆది గాఁగల – మొదటివాఁగాఁ గల, మొదలయిన.)

2. మొదలుగాఁగల, మొదలయిన.

గీ. అమరనాథుఁ డాదిదిక్పతులు ...ఉ.హరిశ్చ. 2. 48.

గీ....సుత్రాముఁ డాదిసురలు. భా. రా. అర. 1. 118.

3. సదృశము.

ఉదా: భూవాదయో ధాతవః.

వి. అ. పుం. 1. మొదలు. భాగ. 8. 592.

2. మూలము, ప్రమాణము.

ద్వి. వేదార్థములు తెల్పి యాది చూపియును, గాదన్న దృష్టసంపాదనఁ జూపు. బస. పు. 4. 974.

**ఆదికవి** సం. వి. ఇ. పుం. 1. బ్రహ్మ. 2. వాల్మీకి.

**ఆదికారణము** సం. వి. అ. న. 1. మొదటికారణము, నిదానము. 2. (వేదాంత) పరమేశ్వరుఁడు. 3. (సాంఖ్య) ప్రధానము. 4. (తర్క) నిమిత్త కారణమగు ఈశ్వరుఁడు; సమవాయి కారణమగు పరమాణువులు.

**ఆదికావ్యము** సం. వి. అ. న. వాల్మీకిరచిత మగు శ్రీమద్రామాయణము.

**ఆదికొ(గొ)ను** అ. క్రి. (త. అది - సూటిగా పరుగెత్తుట.) క్రోధముతో సూటిగాఁ బరుగిడు; ఎదుర్కొను.

వ. వృషభంబున కాదికొను బెబ్బులియుం బోలె రాధేయుదెస నడచుకవ్విడిం గని. భార. విరా. 5.73. భార. ద్రో. 5. 308.

మ. పలకఁ బాణపరంపరల్ జడియుచుఁ బ్రద్యుమ్ను సూనుండు మొ,క్కలుఁడై యేమఁగుఁ ఆంప నాదిగొను సింగంబుఁ విడంబించి మం,డలవిభ్రాంతి వహార్పతిం జెనయుచుఁ డాసెఁ. ఉ. హరి. 5. 251. మార్క. 6. 106. హరి. ఉ. 10. 101.

సీ. కులగోత్రముల కాదికొన్న చిన్నతనంబు విసములో నుదయించుకసరుఁదనము. కృ. శకుం. పీఠి. 1, 56.

**అదిగ(గా)** అవ్య. క్రి. తొట్టి, మొదలుకొని.
చ. ...బాల్యమునాదిగ దుష్టభావనం, బెరిఁగితి నీనిమిత్తమునఁ బెద్దయు దుఃఖితులైరి పాండవుల్. భార. సభా. 2. 255.
మధ్యా. ...అది యాదిగాఁగ శతద్రునామమై యన్నది యొప్పెం. భార. ఆది. 7. 121.

**అదితాళ(ల)ము** నం. వి. అ. పుం. (సంగీ) తాళభేదము, ఏకోత్తర శతతాళములలో నొకటి.

**అదితేయుఁడు** నం. వి. అ. పుం. – అదితికొడుకు – వేల్పు.

**అదిత్యపురాణము** నం. వి. అ. న. ఒకానొక ఉపపురాణము.

**అదిత్యపుష్పిక** నం. వి. అ. స్త్రీ. – ఆదిత్యవర్ణము గలపూలుగలది–ఎఱ్ఱ పూవులజిల్లేడు (వృ.వి.).

**అదిత్యభక్త** నం. వి. అ. స్త్రీ. అర్కకాంత, ప్రొద్దుతిరుగుడు (వృ. వి.).

**అదిత్యము** నం. వి. అ. పుం. జిల్లేడు (వృ.వి.).

**అదిత్యవారము** నం. వి. అ. పుం.–సూర్యదేవతాకమగువారము – ఆదివారము, భానువారము. (రం. ని.)

**అదిత్యుఁడు** నం. వి. అ. పుం. 1. వేలుపు. 2. సూర్యుఁడు. 3. ఆదిత్యమండలాంతర్గతుఁడును హిరణ్యవర్ణుఁడు నగువిష్ణువు.

**అదిత్స** నం. వి. అ. స్త్రీ. గ్రహణేచ్ఛ. గ్రహింపవలయు ననెడికోరిక.

**అదిత్సువు** నం. విశ. (ఉ.) పుచ్చుకొన నిచ్ఛ గలవాఁడు.

**అదిపర్వము** నం. వి. న్. న. మహాభారతమందలి ప్రథమపర్వము.

**అదిమము** నం. విశ. (అ. ఆ. అ.) మొదటిది.

**అదివరాహము** నం. వి. అ. పుం. వరాహావతారమూర్తియగు విష్ణువు.

**అదివారము** నం. వి. అ. పుం. – ఏడువారములలో మొదటిది – భానువారము.

**అదివిద్వాంసుఁడు** నం. వి. స్.-పుం. – మొదటి విద్వాంసుఁడు – కపిలమహర్షి.

**అదివెలమలు** మి. వి. బ. వెలమలలో ఒకతెగవారు. (శ. ర.)

**అదిశక్తి** నం. వి. అ. స్త్రీ. 1. పరమేశ్వరునిమాయాశక్తి. 2. దుర్గ, దేవీమూర్తిభేదము.

**అదిష్టము** నం. విశ. (అ. ఆ. అ.) 1. ఆజ్ఞాపింపఁబడినది. 2. ఉపదేశింపఁబడినది. 3. (వ్యాక) ఆదేశముగా వచ్చినది. 4. తినఁగా మిగిలినది, ఎంగిలియైనది. 5. నిర్దిష్టము. చూపఁబడినది. వి. అ. న. 1. ఆజ్ఞ, అనతి. 2. ఉపదేశము. 3. ఎంగిలి, ఉచ్ఛిష్టము.

**అదీనవము** నం. వి. అ. పుం. 1. క్లేశము. 2, దోషము.

**అదీపకుఁడు** నం. విశ. (అ. విా. అ.) 1. ఇండ్లకు నిప్పుపెట్టువాఁడు, గృహదాహకుఁడు, 2. రేఁపువాఁడు, పురికొలుపువాఁడు, ఉద్దీపకుఁడు,

**అదీపనము** నం. వి. అ. న. 1. ప్రజ్వలింపఁజేయుట, మండించుట. 2. రేఁపుట, ఉద్దీపనము. పురికొల్పుట. 3. ముగ్గులు మొదలగువానిచే గృహాదుల నలంకరించుట.

**అదీపితము** నం. విశ. (అ. ఆ. అ.) 1. జ్వలింపఁజేయఁబడినది, కాల్పఁబడినది. 2. ముగ్గు మొదలగువానిచే నలంకరింపఁబడినది(గృహాది). 3. పురికొల్పఁబడినది, ఉద్దీపితము.

**అదీప్తము** నం. విశ. (అ. ఆ. అ.) 1. మండినది. 2 ప్రకాశించినది. 3. రేఁగినది, ఉద్దీప్తము.

**అదుఁడు** నం. విశ. (అ. ఆ. అ.) 1. పుచ్చుకొనువాఁడు, గ్రహించువాఁడు. (ఉదా: దాయాదుఁడు, మొ. 2. (అ. ఈ అ.) తినువాఁడు. (ఉదా: అన్నాదుఁడు, మొ. దీని కీయర్థమున వ్యస్తప్రయోగము లేదు.)

**అదుకొను** అ. క్రి. 1. క్రమ్ము.
ఉత్సాహ. అదుకొన్న కావరమున నకట మనుజమాత్రుఁ డీ, మేదినిపయి సింధురాజు మీఱి వచ్చి... రాఘవ. 4. 147.
2, ప్రాపగు, ఆధారమగు.
మ. మకరాంకానలతప్యమానకుచకుంభద్వంద్వ నుధ్యస్థల, ప్రకటస్వేదజలప్లుతాంబుజ దళవ్రాతంబు లొప్పారె ద,ర్పకళద్రుంబుల గాఁడిపాఱు నవలాభావంపుబల్ గాయ

మూఁడుక గాఁపంగఁ జెలు ల్లొటించుకలి పొత్తుల్ వోలె నవ్వెట్టునన్. చంద్రా. 4.176.

.(వ్యవ) తండ్రి చనిపోయినపిమ్మట మేనమామ ఆదుకొని పిల్లలను వృద్ధిలోనికిఁ దెచ్చినాఁడు.

స. క్రి. రక్షించు, ప్రోచు.

ద్వి. నిన్ను నమ్మితినయ్య నిఖిలలోకేశ, యన్య మెఱుంగ న న్నాదుకొమ్మనుచుఁ, బన్నగ శాయి శ్రీపాదపద్మములు, పన్నుగా మది లోన భావించుచున్న. ద్వి. శ. సా. 2. 56. 12 పం.

గీ. ...ఓపక్కిమిన్న, యక్కఱలు దీర్చియిపుడు న న్నాదుకొనుము. రసిక. 5. 10,

**ఆదృతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఆదరింపఁ బడినది. 2. మన్నింపఁబడినది,

**ఆదృతి** సం. వి. ఇ. స్త్రీ. —ఆదరము.

**ఆదృతుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఆదరింపఁ బడినవాఁడు. 2. ఆదరము గలవాఁడు, సాదరుఁడు. సం. రఘు. 13. 72. మను. 7.150.

**ఆదేయము** సం. విణ. (అ. ఆ. అ.) పుచ్చుకొనఁ దగినది, గ్రహింపఁ దగినది.

**ఆదేవకుఁడు** సం. విణ. (అ. వికా. అ.) జూద మాడువాఁడు.

**ఆదేవనము** సం. వి. అ. న. 1. జూదము. 2. (జూదమునకు సాధనమైన) పాచిక, మొ. 3, (జూదమున కాధారమైన) వెత్తపలక, ద్యూతఫలకము. 4. జూదమాడు చోటు.

**ఆదేశకుఁడు** సం. విణ. (అ. శికా. అ.) 1. ఆజ్ఞాపించువాఁడు. 2. ఉపదేశించువాఁడు. 3. (మార్గాదులు) చూపువాఁడు.

**ఆదేశనము** సం. వి. అ. న. 1. ఆజ్ఞాపించుట. 2. ఉపదేశించుట. 3. (మార్గాదులు) చూపుట.

**ఆదేశము** సం. వి. అ. పుం. 1. ఆజ్ఞ. 2. ఉపదేశము. (వ్యాక) ఒకదాని స్థానమున వచ్చిన మఱియొక వర్ణాదికము. 4. జ్యోతిర్వేత్తలు మొదలగువారు చెప్పెడి శుభాశుభఫలము.

**ఆదేశి** సం. విణ. (న్. నీ. న్.) 1. ఆజ్ఞాపించువాఁడు. 2. ఉపదేశించువాఁడు. 3. (మార్గాదులు) చూపువాఁడు. వి. న్. పుం-రాఁబోవు దానిని సూచించువాఁడు - దైవజ్ఞుఁడు, జోస్యుఁడు. మొ.

**ఆదేశించు** సం. స. క్రి. 1. ఆజ్ఞాపించు.

వ. కనకమయపట్టిక పుచ్చికొని చదువుకొమనది యని యాదేశించి యతని నుచితాశీర్వాదంబుల నభినందించె. మార్క. 8. 278.

2. ఉపదేశించు.

క. పాదమినసందేహంబుల,జడినినమందేహులం బ్రసన్నులఁజేయఁగా, మృడునకుఁ బడి గావున మన. మడిగినయర్థంబు నతఁడ యాదేశించుఁగా. పాండు. 1. 157.

**ఆదేశ్యము** సం. విణ. (అ. ఆ. అ.) ఆదేశింపఁ దగినది.

**ఆదేష్ట** సం. విణ. (ఋ. ష్ట్రీ. ఋ.) ఆదేశించువాఁడు. వి. ఋ. పుం — ఋత్విజుల నియమించువాఁడు- యజ్ఞము చేయువాఁడు, యజమానుఁడు.

**ఆదొండ** — ఆరుదొండ (వృ. వి.)

**ఆద్య** సం. వి. ఆ. స్త్రీ. దుర్గ.

**ఆద్యమాషకము** సం. వి. అ. పుం. అయిదు గురిగింజలయెత్తు.

**ఆద్యము** సం. విణ. (అ. ఆ. అ.) 1. మొదటిది 2. అవ్యవహితపూర్వమైనది. (ఏకాదశాద్యము—ఏకాదశమునకు సన్నిహితపూర్వము, దశమము.) 3. తినఁ దగినది, భక్ష్యము.

**ఆద్యూనుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) తిండిమీఁదనే దృష్టి గలవాఁడు, ఔదరికుఁడు, తిండిపోతు.

**ఆద్యోతము** సం. వి. అ. పుం. కాంతి, ప్రభ.

**ఆధమనము** సం. వి. అ. న. ఆధి, తాకట్టు.

**ఆధమర్ణ్యము** సం. వి. అ. న. అధమర్ణత్వము, అప్పుపడియుండుట.

**ఆధర్మికుఁడు** సం. విణ. (అ. ఈ. అ.) అధర్మము నాచరించువాఁడు.

**ఆధర్షణము** సం. వి. అ. న. 1. నేరము మోపుట. 2. తిరస్కరించుట; వాదమును ఖండించుట. 3. అన్యాయముగా పీడించుట.

**ఆధర్షము** సం. వి. అ. పుం. 1. తిరస్కారము. 2. అన్యాయముగా పీడించుట.

**అధర్షితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. అవమానింపఁబడినది, తిరస్కరింపఁబడినది. 2. అన్యాయముగా పీడింపఁబడినది. 3. ఖండింపఁబడినది (వాదాది). 4. నేరము మోపఁబడినది.

**అధవనము** సం. వి. అ. న. కదల్చుట, కంపింపఁజేయుట.

**అధాత** సం. విణ. (ఋ. త్రీ. ఋ.) అధానము చేయువాఁడు. (చూ. అధానము)

**అధానము** సం. వి. అ. న. 1. (సంస్కారపూర్వకముగా వహ్న్యాదులను) స్థాపించుట.

ఉదా: అగ్న్యాధానము.

2. ఉత్పాదనము, కలిగించుట.

శ్లో. ....కౌతుకాధానహేతోః, మేఘ. 1. 3.

శ్లో. గర్భాధానక్షణ పరిచయాన్నూనమాబద్ధ మాలాః. మేఘ. 1. 9.

3. ఉంచుట.

ఉదా: సమిదాధానము.

4. అధి, తాకట్టుపెట్టుట. యాజ్ఞ. 2. 247.

**అధాయకుఁడు** సం. విణ. (అ. యికా. అ.) – అధాత.

**అధారణము** సం. వి. అ. న. 1 ఆదరువుగా నుండుట, ప్రాపుగా నుండుట. 2. ధరించుట. 3. ధరించుట, తాల్చుట.

**అధారము** సం. వి. అ. పుం. 1. ఆదరువు, ఆశ్రయము, ప్రాపు. 2. ఆలవాలము, పాదు. 3. (నాటక) పాత్రము.

శ్లో: అప్రాకృతేషు పాత్రేషుయత్రవీరః స్థితో రసః, భేదైః సూక్ష్మైరభివ్యక్తైః ప్రత్యాధారం విభజ్యతే మహా. 1. 3.

4. కారకవిశేషము. (ఇది మూఁడు విధములు. చూ. అందు.)

5. (తంత్ర) షట్చక్రములలో మొదటిచక్రము. మూలాధారచక్రము. 6. జలముండెడిచోటు (హ్రదాది.)

**అధారశక్తి** సం. వి. ఇ. స్త్రీ. 1. సర్వాధారశక్తిరూప మయిన పరమేశ్వరశక్తి, మాయ, ప్రకృతి. 2. (తంత్ర) మూలాధారమందలి కుండలిని అను పరదేవత.

**అధారాధేయభావము** సం. వి. అ. పుం. అధారమునకును అధేయమునకును గలసంబంధము. (కుండ, జలము, మొ. వానికిఁగల పరస్పరసంబంధము.

**అధార్యము** సం. విణ. (అ. ఆ. అ.) ఉంపఁదగినది, అధేయము.

**అధి** సం. వి. ఇ. పుం. 1. మనోవ్యథ. 2. కుదువ, తాకట్టు. 3. అధిష్ఠానము, అధారము. 4. అత్యాశ.

**అధికరణికుఁడు** సం. వి. అ. పుం. – న్యాయవిచారణస్థానమందు నియుక్తుఁడైనవాఁడు-ప్రాడ్వివాకుఁడు, న్యాయాధికారి.

**అధికారికము** సం. విణ. (అ. ఈ. అ.) 1. అధికారిచే జరుపఁబడినది. 2. అధికారముచే జరుపఁబడినది.

**అధిక్యము** సం. వి. అ. న. 1. అతిశయము, హెచ్చు. 2. గొప్పతనము.

**అధిజ్ఞుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) మనోవ్యథననుభవించువాఁడు.

**అధిదైవికము** సం. విణ. (అ. ఈ. అ.) 1. వరుణాదిదేవతల గుఱించినది. (మంత్రము, మొ.) 2. అగ్ని వాయువు మొదలగు దేవతలవలనఁ గలుగునది (దుఃఖవిశేషము, ఇది తాపత్రయములో నొకటి. తాపత్రయమనగా అధ్యాత్మికము, అధిదైవికము, అధిభౌతికము.)

**అధిపత్యము** సం. వి. అ. న. అధిపతిత్వము, దొరతనము.

**అధిభౌతికము** సం. విణ. (అ. ఈ. అ.) వ్యాఘ్రసర్పాది భూతములవలనఁ గలిగినది. (ఇది తాపత్రయములో నొకటి-చూ. అధిదైవికము.)

**అధిరాజ్యము** సం. వి. అ. న. అధిరాజత్వము, అధిపత్యము, దొరతనము.

**అధివేదనికము** సం. విణ. (అ. ఈ. అ.) అధివేదనము నిమిత్త మిచ్చినది, రెండవపెండ్లి చేసికొనువాఁడు మొదటి పెండ్లామునకు ఇచ్చినది (ధనాదికము.)

**అధిస్తైనుఁడు** సం. వి. అ. పుం. తాకట్టుసొమ్ము తాకట్టు పెట్టినవానిసమ్మతి లేక యుపయోగించుకొనువాఁడు.

**ఆధికరణము** సం. వి. అ. న. కుదువపెట్టుట, తాకట్టుంచుట.

**ఆధికృతము** సం. విణ. (అ. అ. అ.) కుదువపెట్టఁబడినది.

**ఆధీన్యము** సం. వి. అ. న. అధీనత్వము, వశము.

**ఆధుతము** సం — ఆధూతము.

**ఆధునికము** సం. విణ. (అ. ఈ. అ.) ఇప్పటిది, అర్వాచీనము, నవీనము.

**ఆధూతము** సం. విణ. (అ. అ. అ.) కంపితము, కదల్పఁబడినది.

**ఆధృష్టి** సం. వి. ఇ. స్త్రీ — ఆధర్షణము.

**ఆధేయము** సం. విణ. (అ. అ. అ.) 1. ఉంపఁ దగినది (ద్రవ్యాది-ఘటము ఆధారము అందలి జలము ఆధేయము.) 2. పుట్టింపఁ దగినది, కలిగింపఁ దగినది. 3. కుదువపెట్టఁ దగినది.

**ఆధోరణుఁడు** సం. వి. అ. పుం. హస్తిపకుఁడు, మావటివాఁడు.

**ఆధ్మాతము** సం. విణ. (అ. అ. అ.) 1. ఊఁదఁబడినది. (నిప్పు, మొ.) 2. శబ్దితము. (శంఖము, మొ.) 3. పూరింపఁబడినది, నింపఁబడినది; హెచ్చింపఁబడినది.

శ్లో: అమృతాధ్మాతజీమూతస్నిగ్ధసంహననస్య తే. ఉ. చ. 6. 21.

శ్లో: జ్యానిర్ఘోషమమందదుందుభిరవై రాధ్మాతముజ్జృంభయన్. ఉ. చ. 5. 6.

4. కాల్పఁబడినది. 5. ఆధ్మానరోగము గలది.

**ఆధ్మానము** సం. వి. అ. న. 1. (అగ్ని, మొ.) ఊఁదుట, 2. (శంఖము, మొ.) శబ్దము. 3. పూరణము, నిండించుట. 4. దాహము, కాల్చుట. 5. వాతనిరోధమువలనఁ గలుగు రోగవిశేషము, కడుపుబ్బు.

**ఆధ్మాని** సం. వి. ఈ. స్త్రీ. నలిక అనుగంధద్రవ్యము. గువ్వగుత్తుక.

**ఆధ్మాపనము** సం. వి. అ. న. 1. ఊఁదించుట. 2. శబ్దము కలిగింపఁజేయుట. 3. ఆధ్మానమను రోగమును కలిగించుట. 4. (వైద్య) శల్యమును వెలికిఁదీయు చికిత్సాభేదము.

**ఆధ్యక్ష్యము** సం. వి. అ. న. అధ్యక్షత్వము.

**ఆధ్యాత్మికము** సం. విణ. (అ. ఈ. అ.) 1. మనశ్శరీరాదులవలనఁ గలిగినది. (శోకమోహజ్వరాది దుఃఖము. ఇది తాపత్రయములో నొకటి-చూ. ఆధిదైవికము.) 2. ఆత్మవిషయక మైనది. (ఉదా: ఆధ్యాత్మిక విద్య.)

**ఆధ్యానము** సం. వి. అ. న. ఉత్కంఠాపూర్వక స్మరణము; స్మరణము, చింత.

**ఆధ్యాసికము** సం. విణ. (అ. ఈ. అ.) ఆధ్యాసముచే (భ్రాంతిచేత) కల్పింపఁబడినది. (పదార్థము-శుక్తియందు రజతమును బ్రహ్మమందు జగత్తును ఆధ్యాసికములు.)

**ఆధ్వనికుఁడు** సం. విణ. (అ. ఈ. అ.) పథికుఁడు, బాటసారి.

**ఆధ్వరికము** సం. వి. అ. పుం. అధ్వరవిధానమును దెలిపెడువ్యాఖ్యాన గ్రంథము.

**ఆధ్వరికుఁడు** సం. విణ. (అ. ఈ. అ) అధ్వరమును (సోమయాగవిధానమును) తెలిసినవాఁడు.

**ఆధ్వర్యవము** సం. విణ. (అ. ఈ. అ.) 1. అధ్వర్యుపునకు (యజుర్వేదఋత్విజునకు) సంబంధించినది. 2. యజుర్వేదమునకు సంబంధించినది, యజుర్వేదవిహితము. వి. అ. న. అధ్వర్యుత్వము.

**ఆన** వి. (సం. ఆజ్ఞా. ప్రా. ఆణా. క. ఆణె.) 1. ఆజ్ఞ, ఉత్తరువు.

గీ.... ఆనయును ద్రోచివచ్చె నేని. కాశీ. 4. 87.

ఉ.... పోవనీ, కంగజుఁ డానవెట్టి కదియన్ గుఱి వ్రాసెను.... మనుచ. 2. 82.

2. ఆజ్ఞాముద్ర. (ఈయర్థమునఁ బ్రాయికముగా 'పొడుచు' అనుదానితోఁ గలిసి యుండును.)

క. వెడదెరువు లిచటఁ జెల్లవు, పుడమి నహహా దొంగ లానఁ బొడిచినఁ గోకల్, విడుతురె ...కళా, 3. 198. శా. ప. మ. 74పా. 6.

3. ఒట్టు, తోడు.

చ.... ఈ, యెడ నొకకీడు గల్గ దిఁక నేమనినన్ మఱి నీకు నానసూ, బదలిక దీఱ నిత్తమువుఁ గారణ సేయుము మైత్రి గల్గినన్. ఆము. 6. 52.

శా. నామీఁ దానసుమీ మఱేమి యనినన్... సారంగ. 3. 75.

ఆ. గురునియలవుఁ జలము వెరవును గలఁచి నీ, యాన గాండివంబునాన దివ్య, శరములాన యెల్లి సైంధవుతల యెల్ల, భంగిఁ దునిమి వైతుఁ బగలు దలఁక. భార. ద్రో. 2.311.

చ....అనిమిషరాజు పాదములయాన సుమీ... నైష. 3. 144.

సీ. నట తెత్తికొని యెత్తుకిటనైన మోటాన పడి యేయఁ బోడుతు నీపాదమాన.మనుచ. 4. 84.

4. ప్రమాణము.

ఆ. ఈతఁ డనెడుమాట లెల్ల బూటకములు, కూలి సేయుచుండి కుక్కఁ జెందె, నింతె కాని పూజలేమియు లేవటఁ, గానలేదు దమరెయాన యనిన. (తమరె యాన-మీరే నిర్ణయించెడివారు.) చెన్నబ. 3. 428.

జః అనపెట్టు, అనపొడుచు.

**అనంతర్యము** సం. వి. అ. న. అనంతరత్వము.

**అనంత్యము** సం. వి. అ. న. 1. అంతములేమి, తుదిలేమి. 2. నాశము లేమి. 3. మేరలేమి. 4. అమృతత్వము, మోక్షము.

**అనంద** సం. వి. అ. పుం. ప్రభవాదిసంవత్సరములలో నొకటి. అ. స్త్రీ. విజయ అనులత.

**అనందకము** సం. విణ. (అ. దిశా. అ.) ఆనందింపఁ జేయునది.

**అనందథువు** సం. వి. ఉ. పుం. ఆనందము.

**అనందనము** సం. విణ. (అ. ఈ. అ.) ఆనందింపఁ జేయునది, వి. అ. న. 1. సంతోషపెట్టుట. 2. (బంధు మిత్త్రాదులను) కుశలప్రశ్నములచే సంతోష పెట్టుట.

**అనందభుజుఁడు** సం. వి. న్. పుం. సుషుప్త్యవస్థలోనున్న జీవుఁడు. (వీనికి ప్రాజ్ఞుఁడని పేరు.)

**అనందభైరవి** సం. వి. ఈ. స్త్రీ. 1. పార్వతి. 2. (సంగీత) రాగభేదము. 3. ఒకానొక యౌషధము.

**అనందమయకోశము** సం. వి. అ. పుం. (వేదాంత) పంచకోశములందు అయిదవకోశము, అవిద్యాస్వరూపమగు కారణశరీరము. (అన్నమయము, ప్రాణమయము, మనోమయము, విజ్ఞానమయము, అనందమయము – అని కోశము లైదు.

**అనందమయము** సం. విణ. (అ. ఈ. అ.) అధికమగు ఆనందము కలది. 2. ఆనందవికారము.

**అనందము** సం. వి. అ. పుం. సంతోషము, సుఖము.

**అనందయిత** సం. విణ. (ఋ. త్రి. ఋ.) ఆనందింపఁ జేయువాఁడు.

**అనందయితవ్యము** సం. విణ. (అ. అ. అ.) ఆనందింపఁ జేయఁదగినది.

**అనందవనము** సం. వి. అ. న. కాశి.

ఉ....ఆనందవనానుభావకథనంబున... కాశీ. 1. 8. (ఇట్లే ఆనందకాననము, ఆనందవిపినము, మొ. కాశీ. 7. 151, 3. 101.)

**అనంది** సం. విణ. (న్. నీ. న్.) 1. ఆనందము కలవాఁడు. 2. ఆనందము కలిగించువాఁడు.

**అనందించే** సం. అ. క్రి. సంతోషించు.

ఉ. రా. 1. 74.

స. క్రి. 1. ఆనందింపఁ జేయు, సంతోషపెట్టు.

సీ. రోదసీకుహరంబు రుచిరాంశుతతిఁ జేసి యర్కుండు వెలిఁగించునట్టు లమృత, సందోహ నిష్యందచంద్రికఁ జేసి శీతాంశుఁ డానందించునట్లు...భార. సభా. 2. 6.

2. అభినందించు. కొనియాడు, స్తుతించు.

మ. హరియై పాదశిరంబు పాదిమెయి జాతశ్రీ శ్వోత్తమాంగంబుఁ గూడ రణోర్విన్ రఘునాథ శౌరి యనిఁ జెందన్ దివ్యమందార వృష్టి రహిం ప్రాణయుతంబులై గగనవాటిం బర్వ గంధర్వ కిన్నర రూపంబులు దాల్చి సారె కవి యానందించుఁ దచ్ఛౌర్యముల్. వసు. 1. 70.

**అనందితుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) 1. సంతోషము కలవాఁడు.2.సంతోషపెట్టఁబడినవాఁడు.

**అనకట్ట** వి. (క. అణెకట్టె. త. అణైక్కట్టు.) ఏటియడ్డకట్ట.

**అనకదుందుభి** సం. వి. ఇ. పుం. వసుదేవుఁడు, కృష్ణునితండ్రి. ఇ. ఈ. స్త్రీ. పెద్దభక్క.

**అనకము** సం. విణ. (అ. నిత్యా. అ.) 1. బ్రదికించునది, జీవింపఁ జేయునది. 2. ఉత్సాహపెట్టునది. వి. అ. పుం. 1. పటహము, తప్పెట. 2. మద్దెల. 3. భేరి. 4. ఉఱిమెడుమబ్బు.

**అనడుహము** సం. విణ. (అ. ఈ. అ.) ఎద్దునకు సంబంధించినది (పేఁడ, తోలు, మొ.)

**అనతి** వి. (సం. ఆజ్ఞప్తిః. ప్రా. అణత్తి. క. అణతి. త. ఆణై.) ఆజ్ఞ, సెలవు.

క. నావుడు భూసురుఁ డిట్లను, దేవా యానతియు నస్మదీయ నియమముఁ, భావించి యుభయసమ్మతి. గావించునుపాయ మొకటి గాంచితి వినుఁడీ. విక్ర. 1. 154.

జ. ఆనతిచ్చు.

**అనతి** సం. వి. ఇ. స్త్రీ. 1. వంగుట. 2. అడఁకువ నమ్రత. 3. మ్రొక్కు.

**అనతి(తియి)చ్చు** స. క్రి. (అనతి, సెలవిచ్చు, (గొప్పవారు తక్కువవారికి) చెప్పు.

సీ....పోతిలో వృత్రుఁ జంప నుపాయ మెయ్యది యొ మాకానతిమ్మన...భా. ఆ. 3. 2.

క. ఏది కరణీయ మీశ దయాదృష్టిని మమ్ముఁ జూచి యానతియీవే. భార. శాం. 6. 403.

సీ. క్రమమున నిది సమస్తము నీకుఁ దెలిపెదనని భగవద్గీత లానతిచ్చి. పరమ 5. 189.

(ఇట 'ఉపదేశించి' అని తాత్పర్యము.)

**అనతుఁడు** సం. విణ. (అ. అ. అ.) 1. వంగినవాఁడు. 2. వినయవంతుఁడు. 3. మ్రొక్కినవాఁడు.

**అనద్ధము** సం. విణ. (అ. ఆ. అ.) కట్టఁబడినది, బద్ధము (కేశభూషణాదికము.) వి. అ. న. చర్మము ముఖమునఁ గట్టఁబడినతప్పెట మద్దెల మొదలగు వాద్యము.

**అననము** సం. వి. అ. న. 1. మొగము. 2. నోరు.

**అనపత్యము** సం. వి. అ. న. అపత్యములేమి, గొడ్డుఁదనము.

**అనపెట్టు** స. క్రి. (√అన) ఆజ్ఞచేయు, ఆజ్ఞాపించు.

సీ. గగనస్థలి భ్రమద్గ్రహచంద్రసూర్యుల వాఁ పోకు మందు విట్టానపెట్టి. ప్రబోధ. 3. 38.

**అనపొడుచు** స. క్రి. (√అన) ఆజ్ఞపెట్టు, ఆజ్ఞాపించు.

క. నిలువ కటు పోవుచున్నా, రవికుంతల చెలుల నేల యానపొడిచె దేఁ, జెలికాఁడఁ గానె యని పైదలిచెవిలోఁ, జెక్కుచెక్కుఁ దార్కొనఁ బలికెన్. ప్రభా. 5. 39.

**అనమనము** సం. వి. అ. న. 1. అనతి, వంగుట. 2. చక్కఁగా మ్రొగ్గుట. 3. వంచుట.

**అనమనీయము** సం. - అనమ్యము.

**అనమితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. వంపఁబడినది. 2. నమ్రముగాఁ జేయఁబడినది.

**అనము** సం. వి. అ. పుం. ఉచ్ఛ్వాసము, లోపలి ప్రాణవాయువును నాసికమూలమున వెలిఁ బుచ్చుట,

**అనమ్యము** సం. విణ. (అ. ఆ. అ.) వంపఁదగినది.

**అనమ్రము** సం. విణ. (అ. ఆ. అ.) 1. కొంచెము వంగినది. 2. మిక్కిలివంగినది. 3. మ్రొక్కినది.

**అనయనము** సం. వి. అ. న. - అనయము.

**అనయము** సం. వి. అ. పుం. 1. తెచ్చుట. 2. ఉపనయన సంస్కారము.

**అనయించు** సం. స. క్రి. 1. తెచ్చు. 2. తెప్పించు.

ఉ. రాజులఁ బిల్వఁ బంపుము ధరాసురసంఘము నామతింపు వే, రోజ నుదాత్తయజ్ఞగృహయూపతతుల్ సమకట్టఁ బంపు వి,భ్రాజిత భక్ష్యభోజ్య విధిభవ్యపదార్థము లానయింపుము, వ్యాజవిభూతిమై నమరవల్లభుఁ డాడ్వునఁ జేయు జన్నముల్ భార. అర. 6. 70.

**అనర్తము** విణ. వి. అ. పుం. 1. నర్తనశాల; నాట్యరంగము. 2. యుద్ధము. 3. ఒకదేశము. (ఇదియే సౌరాష్ట్రము. దీని రాజధాని ద్వారక.)

**అనర్తుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) నర్తకుఁడు.

**అనర్థక్యము** సం. వి. అ. న. 1. నిష్ప్రయోజనత్వము, వ్యర్థత, ఉపయోగములేమి. 2. అర్థము లేకపోవుట.

**అనవాలు**[1] - అనాలు. వి. (అన+పాలు. ష. త.) ఇగురఁ గాఁచినపాలు.

సీ. అష్టావశిష్టంబు లానవా లొకకొన్ని చక్కెర పానకా లొక్కకొన్ని. నార. 3. 105.

సీ. అమృతరసోపమం బైనకమ్మనియానవాల పాయసము జంకాల మయ్యె. నైష. 6. 124. విక్ర. 4. 188.

**అనవాలు**² వి. (త. అడియాళం.) అడియాలము, గుఱుతు.

సీ. అద్దేవిఁ గని యతం డట్ల చెప్పిన మునివల్లభ నా కానవాలు దెమ్ము, నృపుపాల వనియె న న్నెలఁత. ..భార. అశ్వ. 3. 95.

జ. అనవాలుపట్టు.

**అనవాలుపట్టు** స. క్రి. (√అనవాలు²) గుర్తించు, చిహ్నములచే తెలిసికొను.

(వ్యవ) స్వరమునుబట్టి వానిని అనవాలు పట్టినాఁడు.

**అనాయము** సం. వి. అ. పుం. జాలము, చేఁపలవల.

**అనాయి** సం. విణ. (న్. సి. న్.) తెచ్చువాఁడు. వి. న్. పుం. ధీవరుఁడు, జాలరి.

**అనాయ్యము** సం. వి. అ. పుం. గార్హపత్యము నుండి తీసికొనిరాఁబడిన దక్షిణాగ్ని.

**అనాలు**—అనవాలు.

మ. కలమాన్నంబు ఘృతంబుఁ బాయసము శాకవ్రాతముల్ పిండివం, టలుఁ బాల్ తేనియ జున్ను వెన్న యిడి యానా లుక్కెరల్ చక్కెరల్, ఫలముల్ పానకముల్ రసాయనము లంబ ళ్లూరుఁబిం డ్లూరుఁగా, యలు బజ్జులద్ధిపిండఖండములు నం దావిర్భవించెన్ దగన్. రాజ. చ. 2. 127.

**అనాహము** సం. వి. అ. పుం. 1. బంధము, కట్టు. 2.రోగవిశేషము. (ఇందుమలమూత్రనిరోధము. గలుగును.) 3. (వస్త్రాదుల) నిడివి, దైర్ఘ్యము.

**అనాహికము** సం. విణ. (అ. ఈ. అ.) అనాహ రోగమును (మలమూత్రబంధమును) శమింపఁ జేయునది,

**అనికి** వి. (√అను—త. అనికె.) ఆధారము, ప్రాపు, ఊఁత.

చ. ...నుమగల్పిగుబ్బకవఁ బుట్టెడు రాయిడి కావలగ్నమున్, జడియఁగనీక యానిక యొసంగిన నీలశలాకపోలికన్, బడఁతుకరోమరాజి కనుపండువు నిచ్చు జనంబుచూడ్కికిన్. చం. రా. 3. 86.

**అనిలము** సం. విణ. (అ. ఈ. అ.) 1. వాయు సంబంధమైనది. 2. వాయుదేవతాకమైనది. (హవిరాది)

**అనిలి** సం. వి. అ. పుం. 1. హనుమంతుఁడు. 2. భీముఁడు. ఈ. స్త్రీ. స్వాతీనక్షత్రము.

**అనీతము** సం. విణ. (అ. అ. అ.) తేఁబడినది, తీసికొనిరాఁబడినది.

**అనీతి** సం. వి. ఇ. స్త్రీ.—అనయము.

**అను** స. క్రి. (క. అను. త. అణై.) 1. అంటు, తాఁకు.

సీ. వెడఁదకన్నెడఁకు లానెడివీనుఁగవ గ్రమ్మిము త్తెలచౌకట్లు మురువుమించ. ఇందు. 1. 20.

సీ. తెలిదమ్మికంటివాతెఱ యాన ముం దెంత పెనువంతఁ గుందెనో పిల్లఁగ్రోవి. నీలా. 3. 109.

2. గ్రహించు, పట్టుకొను.

క. ...కైకొనుఁ,డని ఫణము లొసంగి పుచ్చ మూనె సురలతోన్. దశా. 2. 192.

3. పొందు.

క. మానుఁ డని చాల నెంజిలి, యానెదుగా తల్లి దోన మన కిటు బలిమిన్, బోనీక పట్టి పెనఁగిన,వానిన్ మఱియేమి సేయవలయుం జెపుమా. సారంగ. 3. 59.

4. వహించు, మోయు.

గీ. ఇటులఁ బెకలించి కరములకెత్త మిగుల, సంభ్రమమున సురాసురుల్ శైలమాని, పట్టఁజాలక....దశా. 2. 172.

సీ. చలము వచ్చినఁ జొత్తు జలరాశిలోనైన నగము పైఁబడినను నానుకొందు. ఉ, హరిశ్చ. 2. 71.

5. ఆశ్రయముగాఁ జేసికొను, ఆశ్రయించు.

మ. వనజం బానెడితేఁటి యవ్యకునుమాపానం బపేక్షించునే. భాగ. 9. 529.

6. ఆక్రమించు, క్రమ్ము.

సీ. ప్రతిసాగరంబులై భద్రేభకర్ణప్రసవన్మదాంబువులు భువనము లాన. దశా. 2. 56. వసు. 2. 74.

7. అదుము.

క. నాన యిటు లేమిటికి నలి,నానన కెమ్మోవిపంట నానఁగ నిడి న, న్నాననవిల్తునిచెయువుల,నానందింపఁగ నొనర్చి యలరింపఁగదే. రసిక. 5. 169.

8 అణఁచు.

ఉ. అనగరాజభేదియును నానఁగ రానిమనోరథంబుతో, మానిని నాత్మ నిల్పి ధృతిమాని.... నలినాననయేఁగినజాడ నేఁగుచున్. వసు. 3. 79.

ఉ. ఆనఁగ రానికోపమున నప్పుడు శాంతుని ధిక్కరించుచో...నఁస. 2. 47.

9. అడ్డగించు, నిరోధించు.

(అర్జునుఁడు సుభద్రను దీసికొనిపోవుచు నెదిరించిన వీరులతో ననినమాట.)

క. అనుటయు నేమీ కనినం, గనకుండిన నానఁబూనఁగలరా మీరల్, మనవలసిన నీమాటలఁ,బనిలేదు చనుం డటంచుఁ బైఁబడి రాఁగన్. విజ. వి. 3. 149.

సీ. చిల్కపల్కులు గాఁడి జీవంబు వెడలుచో నంగుళంబుల వీను లాని యాని. కవిక. 3. 92.

(ఇట 'మూయు' అని భావము.)

10. సహించు, ఓర్చు.

ఉ. నూనశరాసనీశరము నొచ్చినధాతకు నీమహోత్తరం, బానక శౌవ్యభూధరగుహాగృహ మీఁగిన శూలికిం ద్వదీ,యానఘశౌర్యశక్తి హృదయంబునఁ బూమరమా విలాసికిన్, మానదుపో రజంబును దమంబును సాత్త్వికముం గ్రమంబునన్. వసు. 3. 175.

11. ఆస్వాదించు, అనుభవించు.

(క) మూర్కొను, ఆఘ్రాణించు.

చ. జలధి మథింపఁ జిక్కి మధుపౌరభ మానుటఁ జావు దక్కి...మనుచ. 5. 53.

(చ) చవిచూచు.

సీ. విరిబోఁడిచీనిచక్కెర మోవిరుచు లాన వలవదే నాలుక గలుగుఫలము. దశా. 2.307.

(ట) విను.

చ....అ,తురుకథ లానుకర్ణములు కర్ణములై విలసిల్లుఁబో భువిన్. భాగ. 10. ఉ. 963.

సీ. పరశివస్తుతి కథాభాషలు వినువీను లానునే కుంచెన లాడుపలుకు,లు. కాళ. 4. 89.

12. త్రాగు.

ఉ. అక్కట యేను వేడ్కపడి యానెడువానవమర్థిఁ దేరఁగా. భార. విరా. 2. 98.

ఉ. అంకముఁ జేరి శైలతనయాస్తనదుగ్ధము లాను వేళ...మనుచ. 1. 4.

13. తిను, భక్షించు.

క. కరికచ్ఛపముల పెన్నొ,త్తురుఁ గండలుఁ గ్రొవ్వు మెదడుఁ దుష్టిగఁ బక్షి,శ్వరుఁ డాని...భార. అను. 1. 247.

పంచచా. పలాసి డాసి రాజుఁ జూచి పల్కెనోరి నోరి కీ,ప్రాలానఁ బెన్పొలాన లేకపోవ నీవు దోఁచితా. మనుచ. 4. 98.

అ. క్రి. 1. మోచు, అంటు; నిలిచియుండు.

(వ్యవ) ఆబల్లకోళ్లు భూమిమీఁద సరిగా ఆనలేదు. వాని కొకచోటను గాలు ఆనదు.

2. గోచరమగు, కనఁబడు.

(వ్యవ) చిన్న అక్షరములు నాకు బాగుగా అనుటలేదు.

3. నచ్చు. ఇష్టమగు.

(వ్యవ) వానికంటి కీవస్తువు ఆనిపది.

బరువాను — భారమగు.

ఉ....ర, త్నాంకితహార ముంప బరువానునో బిడ్డకి వేలకర్కశా,లంకృతు లంచు... వసు. 3. 87.

(వ్యవ) అంతదూరము వానికి దృష్టి ఆనదు. వృద్ధులకు దృష్టి ఆనదు.

జ. ఆనిక, అనుకట్టు, అనుకొను, ఆనుడుబిల్ల, ఆనువు.

**అనుకంట్లము** వి. ఒక విధమగు సంచి.

చ. తణగము లానుకంట్లములు తండిగము ల్నల
కల్ దెడల్ కుతూ,గణములు చెక్కు గుంపు
లిడిగంబులు పంజులు...హంస. 5. 97.

**అనుక(గ)ట్టు** వి. (√అను) ఊఁతకట్టు. చెన్నబ. 2. 209.

**అనుకూలికము** సం. విశే. (అ. ఈ. అ.) అనుకూలముగా నుండునది.

**అనుకూల్యము** సం. వి. అ. న. అనుకూలముగా నుండుట, తగి యుండుట, ఒద్దిక.

**అనుకొను** స. క్రి. (√అను) 1. ఆధారము చేసికొను.

(వ్యవ) నన్ను ఆనుకొని కూర్చున్నావు. వాఁడు కట్టు అనుకొని నడచుచున్నాఁడు.

2. అంటియుండు, చేరియుండు.

(వ్యవ) అడవిని ఆనుకొన్న చేలు.

**అనుగతికము** సం. విశే. (అ. ఈ. అ.) అనుగతి వలనఁ గలుగునది, అనుసరణమువలనఁ గలుగునది.

**అనుగత్యము** సం. వి. అ. న.-అనుగతునిభావము-అనుగమనము చేయుట, అనుసరించుట, వెంబడించుట.

**అనుగము**-అనుగు వి. సొఱ, అలాబువు (వ్య.వి.)

గీ. శ్రాద్ధకర్మంబునందు వర్జ్యములు వినుము, పెండలంబును దోస పలాండు వుల్లి,యాను గమ్మింగు వలసందియలు విచార, సార ప్రత్యక్షలవణమమూరములును. మార్క. 8. 208. భార. అను. 8. 189.

**అనుగు** – అనుగము (వ్య. వి.) (చి. ని. శౌ. శ. ర.)

**అనుగుణ్యము** సం. వి. అ. న. అనుగుణముగా నుండుట, తగియుండుట, అనుకూల్యము.

**అనుదువిల్లు** వి. (√అను) ఒఱగుదిండు, గభోళి.

**అనునాసిక్యము** సం. వి. అ. న. అనునాసికధర్మము, ముక్కుతోఁ బలుకుట.

**అనుపదికుఁడు** సం. విశే. (అ. ఈ. అ.) వెంబడించువాఁడు.

**అనుపూర్వి** సం. వి. ఈ. స్త్రీ – అనుపూర్వ్యము.

**అనుపూర్వ్యము** సం. వి. అ. న. అనుక్రమము, మొదటినుండి వచ్చుక్రమము, పరిపాటి.

**అనుమానికము** సం. విశే. (అ. ఈ. అ.) ఊహచేఁ గలిగినది, అనుమానప్రమాణమువలన ప్రాప్తమైనది, అనుమితము.

**అనుయాత్రికుఁడు** సం. విశే. (అ. ఈ. అ.) అనుచరుఁడు, వెంటఁ బోవువాఁడు.

**అనులోమికము** సం. విశే. (అ. ఈ. అ.) 1. క్రమమును అనుసరించి ఉండునది. 2. అనుకూలమైనది.

**అనులోమ్యము** సం. వి. అ. న. 1. అనుక్రమము, యుక్తక్రమము, 2. అనుకూల్యము.

**అనువు** – ఆనిక. (√అను)

ఉ. ఇవ్విధంబునం గ్రొవ్వనె...జానువునాను వున్ నదిమియుం గదిమియు ... ఉ. హరి. 6. 108.

**అనువేశ్యుఁడు** సం. వి. అ. పుం. ప్రాతివేశ్యునికి (ప్రక్కయింటివానికి) ప్రక్కయింట వసించువాఁడు.

**అనుశాసనికము** సం. విశే. (అ. ఈ. అ.) అనుశాసించుటకుఁ దగినది (నీతివాక్యాది).

**అనుశ్రవికము** సం. విశే. (అ. ఈ. అ.) 1. వినికి వలన పరంపరగా వచ్చినది. 2. వేదమునందు విధింపఁబడినది (కర్మసముదాయము.).

**అనుశ్రావికము** సం – అనుశ్రవికము.

**అనుషంగికము** సం. విశే. (అ. ఈ. అ.) – అనుషంగమువలనఁ గలిగినది – ప్రసంగవశమున వచ్చినది. అప్రధానము.

**అనుష్టుభము** సం. విశే. (అ. ఈ. అ.) అనుష్టుప్ఛందస్సు గలది (మంత్రాది). వి. అ. న. అనుష్టుప్ఛందస్సు.

**అనూపము** సం. విశే. (అ. ఈ. అ.) 1. అనూపమువఁ బుట్టినది, చెమ్మనేలఁ బుట్టినది. 2. చెమ్మనేల నుండునది. (ఎనుబోతు, మొ.)

**అనృణ్యము** సం. వి. అ. న – అనృణుని భావము-ఋణములేమి, అప్పు లేకుండుట.

**అనృతుఁడు** నం. విణ. (అ. ఈ. అ.) అనృతము లాడువాఁడు, అసత్య మాడుస్వభావము గల వాఁడు, కల్లరీఁడు.

**అనృశంస్యము** నం. వి. అ. న. అక్రూరభావము, నిష్ఠురత్వములేమి.

**అనె(నియ)** వి. దద్రురోగము, దద్దురు. ఆం. భా. 2. 181.

**అనేత** నం. విణ. (ఋ. త్రి. ఋ.) తెచ్చువాఁడు.

**అనేతవ్యము** నం — అనేయము.

**అనేయము** నం. విణ. (అ. ఆ. అ.) తేఁదగినది.

**అనైశ్వర్యము** నం. వి. అ. న. ఐశ్వర్యము లేమి, అధిపత్యము లేమి.

**అన్నము** నం. విణ. (అ. ఆ. అ.) అన్నము పొందినది, అన్నమును సంపాదించుకొన్నది (అ. ఈ. అ.) అన్నమునకు సంబంధించినది.

**అన్వయికుఁడు** నం. విణ. (అ. ఈ. అ.) ప్రశస్త కులమందుఁ బుట్టినవాఁడు.

**అన్వాహితము** నం. విణ. (అ. ఈ. అ.) ప్రతి దినమును చేయఁదగినది (పాకాది).

**అన్వీక్షకి** నం — ఆన్వీక్షికి.

**అన్వీక్షికి** నం. వి. ఈ. స్త్రీ - పర్యాలోచనప్రయోజనముగాఁ గలది - న్యాయవైశేషిక రూపమైన తర్కవిద్య.

**అన్వీపితము** నం. విణ. (అ. ఈ. అ.) అనుకూలముగా నుండునది.

**అపకుఁడు** నం. విణ. (అ. ఈ. అ.) పొందువాఁడు, పడయువాఁడు.

**అపక్వము** నం విణ. (అ. ఆ. అ.) అర్ధపక్వము. (కొంచెము పండినది, కొంచెము ఉడికినది.) వి. అ. న. అభ్యూషము, గుగ్గిళ్లు.

**అపగ** నం. వి. ఆ. స్త్రీ. నది, ఏఱు.

**అపగేయుఁడు** నం. వి. అ. పుం. గాంగేయుఁడు, భీష్ముఁడు.

**అపణము** నం. వి. అ. పుం. 1. అంగడి, దుకాణము. 2. పట్టము, బజాఱు.

**అపణికము** నం. విణ. (అ. ఈ. అ.) 1. అంగడివలన వచ్చినది. 2. అపణమునకు విహితమైన ధర్మములు గలది. వి. అ. న. రాజగ్రాహ్యమగు అంగడిపన్ను.

**అపణికుఁడు** నం. వి. అ. పుం. వణిజుఁడు, బేహారి.

**అపతనము** నం. వి. అ. న. 1. అగమనము, రాక. 2. జ్ఞానము, ఎఱుక. 3. ప్రాప్తి, సంభవము.

**అపతికము** నం. విణ. (అ. ఆ. అ.) దైవాయత్తము దైవవశమున వచ్చినది. వి. అ. పుం. శ్యేనము, డేగ.

**అపతితము** నం. విణ. (అ. ఆ. అ.) హఠాత్తుగా వచ్చినది, దైవవశమున వచ్చినది.

**అపత్కాల్పము** నం. వి. అ. పుం. అపత్కాలమందు ననుష్ఠింపఁదగువిధి.

**అపత్తి** నం. వి. ఇ. స్త్రీ. 1. ఆపద, ఇడుమ. 2. (అర్థాదుల) సిద్ధి, కలుగుట. 3. (తర్క) అయథార్థ జ్ఞానవిశేషము, తర్కము.

**అపత్తు** నం. వి. ద్. స్త్రీ. విపత్తు, ఇడుమ.

**అపద** నం. వి. ద్. ఆ. స్త్రీ — అపత్తు. (వాచ. విలక్షమ్ము.)

క. అపదఁగడవం బెట్టఁగ... భార. ఉద్యో. 3. 6.

**అపద్ధర్మము** నం. వి. అ. పుం. అపదయందు అనుష్ఠింపఁ దగినధర్మము.

**అపనము** నం. వి. అ. న. 1. ప్రాప్తి, లభించుట. 2. మరిచము, మిరియము.

**అపనికము** నం. వి. అ. న. ఇంద్రనీలమణి.

**అపనికుఁడు** నం. వి. అ. పుం. కిరాతుఁడు.

**అపన్నము** నం. విణ. (అ. ఆ. అ.) 1. విపత్తునొందినది. 2. ప్రాప్తము, లభించినది. 3. కలిగినది, సంభవించినది.

**అపన్నసత్త్వ** నం. వి. ఆ. స్త్రీ - లోపల ప్రాణి గలది - గర్భిణి, చూలాలు.

**అపమిత్యకము** నం. విణ. (అ. ఇకా. అ.) ఒక వస్తువు నిచ్చి మాఱుగాఁ బుచ్చుకొనఁబడినది, కుదువ యిచ్చి తెచ్చినది. (వస్తువు - రం. ని.)

**అపము** నం. వి. అ. న. జలసమూహము.

**అపయిత** నం. విణ. (ఋ. త్రి. ఋ.) పొందించువాఁడు, సమకూర్చువాఁడు.

**అపరాహ్ణికము** నం. విణ. (అ. ఈ. అ.) అపరాహ్ణమందు అగునది.

**ఆపనోపాలు** వి. బ. జ్వరాదితాపకృతమగుబాధలు. (వ్యవ) జ్వరముచేవానికి ఆపనోపాలు ఎక్కువైనవి. అధికముగా తిని వాఁడాపనోపాలు పడుచున్నాఁడు.

**ఆపస్సు** సం. వి. స్. న. 1. నీరు. (బ్రువతేకత మేఽపినపుంసకమాపః. బాలమనోరమ.) 2. కర్మము.

**ఆపాంగ్యము** సం. విణ. (అ. ఆ. అ.) కడకన్నులకు పెట్టునది. (కాటుక)

**ఆపాకము** సం. వి. అ. పుం. 1. కుమ్మరి ఆవము. 2. కొంచెమగు పాకము. 4. చక్కని పాకము. 4. పుటపాకము, ఔషధములు పుటము పెట్టి వండుట.

**ఆపాతము** సం. వి. అ. పుం. 1. హఠాత్తుగాఁ బైఁబడుట. 2. క్రిందికి దిగుట, 3. ఆకస్మికమైన రాక, అతర్కితాగమనము. 4. సంభవించుట. 6. పడుట. 6. ఉపక్రమము, మొదలు. 7. అప్పుడు, తత్కాలము.

శ్లో: ఆపాతరమ్యావిషయాఃపర్యంతపరితాపినః. సం. కిరా. 11. 12.

**ఆపాతి** సం. విణ. (న్. నీ. న్.) 1. పడునది. 2. దిగునది. 3. సంభవించునది, కలుగునది. 4. పైఁబడునది, మార్కొనునది.

**ఆపాదకము** సం. విణ. (అ. దికా. అ.) కలిగించునది.

**ఆపాదనము** సం. వి. అ. న. 1. ఉత్పాదనము, కలిగించుట. 2. సంపాదనము.

**ఆపాదము** సం. వి. అ. పుం. 1. ప్రాప్తి, పొందుట. 2. ఆగతి, రాక. అవ్య. అ. న. 1. పాదము మొదలుకొని. 2. పాదములవఱకు.

**ఆపాదించు** సం. స. క్రి. 1. కలుగఁ జేయు, కలిగించు.

క. అందుండుట పరమసుఖము నాపాదించుణా. మార్క. 8. 250.

2. చేయు, ఒనరించు.

శా. ...భారతియు చేపుణ్యాత్ముసంకీర్తనం, బాపాదించి కృతార్థయయ్యె...వసు. 1. 28.

3 ఉపపాదించు, తెలుపు, ఎఱిఁగించు.

క. అలరెడుపద్యంగ్యం బశేష మాపాదింతున్ నరస. 3. 105.

క...భ్రాంతిమ, దలంకరణమయ్యె దీని నాపాదింతున్. నరస. 5. 56.

**ఆపాదితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. కలిగింపఁబడినది. 2. సంపాదింపఁబడినది.

**ఆపాదిల్లు** సం. అ. క్రి. కలుగు. (శ. ర.)

**ఆపానకము** సం — ఆపానము.

(అనేకులు గూడి కల్లు త్రాగుట.) 'ఆపానక ముత్సవః' కాదం. (వాచ)

**ఆపానము** సం. వి. అ. న. 1. అనేకులు గూడి కల్లుత్రాగుట. 2. కల్లుదుకాణము.

**ఆపాయి** సం విణ. (న్. నీ. న్) కల్లు త్రాగువాఁడు.

**ఆపాళి** సం. వి. ఇ. పుం. పేను, యూకము.

**ఆపింజరము** సం. విణ. (అ. ఆ. అ.) ఇంచుక యెఱుపును పసుపును గలిసినరంగు గలది. వి. అ. న. 1. బంగారు. 2. ఇంచుక యెఱుపును పసుపును గలసినరంగు.

**ఆపితము** సం. విణ. (అ. ఆ అ.) పొందింపఁ బడినది.

**ఆపీడ** సం. వి. ఆ. స్త్రీ. చక్కఁగా (కాళ్లమున్నగునవి) పిసుకుట.

**ఆపీడనము** సం. వి. అ. న. 1. నలుపుట, పిసుకుట. 2. బిగించుట. 3. బాధించుట.

**ఆపీడము** సం. విణ. (అ. ఆ. అ.) 1. నొప్పించునది. 2. నొక్కునది. వి. అ. పుం. 1. నలఁగుడు 2. సిగనిడిన పూలదండ. 3. శిరోభూషణము 4. గోడబయటికి వచ్చినగృహదారు విశేషము.

**ఆపీడితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. నలుపఁబడినది. 2. రుద్ధఁబడినది, శోమఁబడినది. 3. పీడింపఁబడినది, బాధింపఁబడినది. 4. పూలదండచే అలంకరింపఁబడినది (శిరస్సు.).

**ఆపీతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఇంచుకపసుపువన్నె గలది. 2. పసుపువన్నె గలది. 3. త్రాగఁ

బడినది. వి. అ. పుం. 1. ఇంచుక పసుపువన్నె. 2. పసుపువన్నె. న. మాక్షికధాతువు.

**ఆపీనము** నం. విశే. (అ. అ. అ.) మిక్కిలి బలిసినది. వి. అ. పుం కూపము, నూయి. న. పొదుఁగు.

**ఆపూపికము** నం. విశే. (అ. ఈ. అ.) అపూపముల కుపయోగించునది. (బెల్లము, మొ.) వి. అ. న. అపూపముల సమూహము.

**ఆపూపికుఁడు** నం. విశే. (అ. ఈ. అ.) 1. పిండి వంట చేయువాఁడు, భక్ష్యకారుఁడు. 2. పిండి వంటలు తినెడిస్వభావము గలవాఁడు; పిండి వంటలు తిన నిష్టపడువాఁడు. 2. పిండివంట లమ్మువాఁడు.

**ఆపూరణము** నం. విశే. (అ. ఈ. అ.) చక్కఁగా పూరించునది, అంతట నిండించునది. వి. అ. న. అంతటను నిండించుట, పూరించుట.

**ఆపూరము** నం. వి. అ. పుం. 1. జలాది ప్రవాహము, వెల్లువ. 2. అంతటను నిండించుట. 3. ఇంచుక నిండించుట.

**ఆపూరితము** నం. విశే. (అ. ఆ. అ.) నిండింపఁ బడినది.

**ఆపూర్ణము** నం. విశే. (అ. ఆ. అ.) నిండినది.

**ఆపూర్తి** నం. వి. ఇ. స్త్రీ. 1. నిండుట. 2. సమృద్ధి. 3. తనివి, తృప్తి.

**ఆపూర్యమాణము** నం. విశే. (అ. అ. అ.) చక్కఁగా నింపఁబడుచున్నది.

**ఆపూషము** నం. వి. అ. న. తగరము.

**ఆపృచ్ఛ** నం. వి. అ. స్త్రీ. 1. జిజ్ఞాస, తెలిసికొన నిచ్ఛ. 2. అభాషణము, మాటలాడుట. 3. బంధు మిత్త్రాదులు వచ్చినపుడు చేయుస్వాగతము, కుశల ప్రశ్నము. 4 వీడ్కోలువు నప్పుడు బంధుమిత్త్రాదులను ఆలింగనాదులచే ఆనందపఱచుట. 5. యాత్రాదులందు బంధువులు మొదలగువారి యనుజ్ఞ పడయుట, వీడ్కొనుట.

**ఆపె** — ఆయప న. వి. (ఆ+అప్ప) ఆమె.

**ఆపోక** వి. (√ఆపోవు) ఆపోవుట, తృప్తినొందుట.

**ఆపోక్లిమము** నం. వి. అ. న. (జ్యోతి) లగ్నము నకు తృతీయషష్ఠనవమద్వాదశస్థానములు.

శ్లో. తృతీయం షష్ఠనవమమంత్యం చాపోక్లిమం విదుః (వాచ)

**ఆపోమయము** నం. విశే. (అ. ఈ. అ.) 2. జల వికారము. 2. జలప్రచురము, ఎక్కువజలము కలది.

**ఆపోవు** "అ. క్రి. (ఆదట+పోవు — అని శ. ర.) తృప్తినొందు.

క. శ్రీపతి కడు నెయ్యంబున, నాపోవక పార్థునొద్ద నారాత్రి ప్రియాలాపములఁ దగిలి యుండెను....భార. ఆది. 8. 172, ఉద్యో. 2. 32.

మత్త...ఆ, పోవఁ గ్రోలె వధూకథామృత పూరముఁ జెవిదోయిటఁ. రామా. 7. 18.

ఉ....ఆపోయి...విప్ర. 2. 20.

జ. ఆపోక.

**ఆపోశనము** నం. వి. అ. న. భోజనాదియందును భోజనాంతమందును పుడిసిట జలము "పోసికొని మంత్రపూర్వకముగాఁ బుచ్చుకొనుట; అట్లు పుచ్చుకొనుజలము.

గీ. ఎత్త నేటి కాపోశనం బెంగిలికిని. రామలిం. 60.

క. అని యఱచేత నె యాపోశనముం బట్టుకొని యున్న చలమరిఁ గని ..భోజరా. 6. 198.

గీ. పోసిరా యెల్లవారి కాపోశనములు, నార గింపుఁడు రెండు మీ కమృతమస్తు. భీమ. 2. 137.

**ఆపోశనముగొను** మి. న. క్రి. (√ఆపోశనము)

1. ఆపోశనముగాఁ గొను, పుడిసిటితో త్రాగు.

సీ. మించి లోకము నావరించినవిషరాశి నాపోశనముగొన్న యద్భుతాత్మ. రాఘవ. 3. 54.

2. ఆక్రమించు, వశపఱచుకొను.

వ. పరదేశం బాపోశనంబుగొనం దమకించుతన బలంబుగలిమిజ యుడిపికొని. భార. విరా. 3. 131.

**ఆపోశనించు** నం. న. క్రి. ఆపోశనముగాఁ గొను, త్రాగు.

గీ. వార్ధు లాపోశనించె మార్వశితమూఁడు. శ్రీరం. మా. 2. 57.

క. మెలఁగుచు నాపోశనించె మిహికాజలధిశా. ఆము. 5. 102.

**ఆపోశానము** సం. వి. అ. న - ఆపోశనము.

**ఆపోసనము** వి. (సం. ఆపోశనమ్. ప్రా. ఆపోసన.) ఆపోశనము. భోజనకాలమందు సమంత్రక ముగా పుడిసిటితో నీరు త్రాగుట; త్రాగుట. జ. ఆపోసన మెత్తు.

**ఆపోసనమెత్తు** స. క్రి. (√ఆపోసనము) ఆపోసన ముగాఁ గొను. త్రాగు.

ఉ. ఈసున నేక హేలన మహీసురుఁ డొక్కరుఁ డొక్కవార్ధి యాపోసనమెత్తుచో దిగులు పుట్టి...నైష. 5. 68.

**ఆప్త** సం. విశే. (పు. స్త్రీ. పు.) పొందువాఁడు. వి. అ. స్త్రీ. జట, జడ.

**ఆప్తము** సం. విశే. (అ. అ. అ.) 1. ప్రాప్తము, పొందఁబడినది. 2. పొందినది. 3. విశ్వాస పాత్రము, నమ్మఁదగినది. 4. యథార్థజ్ఞానము గలది, కలరూపు నెఱిఁగినది. 5. సత్యమైనది. యథార్థము. 6. కుశలము, నేర్పుగలది. 7. సంపూర్ణము, నిండినది. 8. సంబద్ధము, చుట్ట ఱికము గలది. 9. యుక్తియుక్తమైనది. వి. అ. న. (గణిత) భాగహారము చేయఁగా నేర్పడినసంఖ్య, లబ్ధము.

**ఆప్తవాక్కు** సం. విశే. (చ.) యథార్థమైనమాట గలవాఁడు. (మహర్షి, మొ.) వి. చ. స్త్రీ. 1. ఆప్తునివచనము. 2. యథార్థమైనమాట. 3. వేదము. 4. స్మృతీతిహాసపురాణాది(శ్లే: ఆప్తవచనము, ఆప్తవాక్యము, ఆప్తోక్తి.)

**ఆప్తవ్యము** సం. విశే. (అ. అ. అ.) పొందఁదగినది.

**ఆప్తి** సం. వి. ఇ. స్త్రీ. 1. పొందుట. 2. సంయో గము; స్త్రీసంయోగము. 3. సంబంధము. 4. లాభము, సంప్రాప్తి. 5. ఆయతి, రాఁబోవు కాలము.

**ఆప్తుఁడు** సం. విశే. (చూ. ఆప్తము.) వి. అ. పుం. 1. బంధువు. 2. సుహృదుఁడు, హితుఁడు, స్నేహితుఁడు. 3. యథార్థవక్త యగు పురు షుఁడు, విశ్వసనీయ పురుషుఁడు.

**ఆప్యము** సం. విశే. (అ. అ. అ.) 1. జలమయము. 2. జలసంబంధమైనది. 3. పొందఁ దగినది, పడయఁదగినది.

**ఆప్యానము** సం. విశే. (అ. అ. అ.) 1. మిక్కిలి బలిసినది. 2. తనివి నొందినది. వి. అ. న. 1. ప్రీతి. 2. వృద్ధి, బలుపు.

**ఆప్యాయకుఁడు** సం. విశే. (అ. యుశా. అ.) 1. తృప్తిపడువాఁడు; సంతోషపడువాఁడు. 2. వృద్ధినొందువాఁడు. 3. తృప్తిపఱుచువాఁడు. సంతోషపెట్టువాఁడు. 4. పెంచువాఁడు, వృద్ధి నొందించువాఁడు.

**ఆప్యాయనము** సం. విశే. (అ. అ. అ.) 1. బలుపు కలిగించునది. 2. ప్రీతి కలిగించునది; తనివి కలి గించునది. వి. అ. న. 1. వర్ధనము, బలుపు కలిగించుట. 2. ప్రీణనము, సంతోష పెట్టుట; తనుపుట. 3. బలుపు, వృద్ధి. 4. ప్రీతి, తనివి.

**ఆప్యాయము** సం. వి. అ. పుం. 1. బలియుట, వృద్ధి. 2. తృప్తి, తనివి.

**ఆప్యాయి** సం. విశే. (న. సి. న.) - ఆప్యాయ కుఁడు.

**ఆప్యాయిత** సం. విశే. (పు. స్త్రీ. పు.)-ఆప్యాయ కుఁడు.

**ఆప్యాయితుఁడు** సం. విశే. (అ. అ. అ.) 1. తృప్తి నొందింపఁబడినవాఁడు; సంతోషపెట్టఁ బడిన వాఁడు. 2. పెంపఁబడినవాఁడు, బలియఁ జేయఁ బడినవాఁడు.

**ఆప్రపచ్ఛన్నము** సం. వి. అ. న. గమనాగమనముల యందు బంధుమిత్త్రాదులను కుశలప్రశ్నాదులచే ఆనందపఱుచుట.

**ఆప్రపదము** సం. అవ్య. అ. న. పాదాగ్రము వఱకు.

**ఆప్రపదీనము** సం. విశే. (అ. అ. అ.) పాదాగ్రము వఱకు వ్రేలాడునది. (అంగీ, ఆఁడుదాని పావడ, మొ.)

**అప్లవనము** సం. వి. అ. న - అప్లవము.

**అప్లవము** సం. వి. అ. పుం. 1. స్నానము, మునుక. 2. నీళ్లు అంతటను చల్లుట.

**ఆప్లవవ్రతి** సం. వి. న్. పుం. స్నాతకుఁడు, వేదముల నధ్యయనముచేసి దారపరిగ్రహము కొఱకు సమావర్తనస్నానము సలిపి దారలాభమునకుఁ బూర్వము వ్రతవిశేషము నాచరించు ద్విజుఁడు.

**ఆప్లావము** సం. వి. అ. పుం. 1. స్నానము, మునుఁక. 2. నీళ్లుచల్లుట, తడుపుట, 3. ముంచుట. 4. వెల్లువ, వఱద.

**ఆప్లావితము** సం. విణ. (అ. ఆ. అ.) జలాది ప్రవాహముచేత అంతటను వ్యాప్తమైనది.

**ఆప్లావ్యము** సం. విణ. (అ. ఆ. అ.) స్నానము చేయునది (మనుష్యాది). వి. అ. న. స్నానము.

**ఆప్లుతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. మునిఁగినది. 2. ఆర్ద్రీభూతము, తడిసినది. 3. అభివ్యాప్తము. వి. అ. న. 1. స్నానము. 2. దుముకుట.

**ఆప్లుతవ్రతి** సం. — ఆప్లవవ్రతి.

**ఆప్లుతుఁడు** సం. వి. అ. పుం. ఆప్లుతవ్రతి, స్నాతకుఁడు.

**ఆప్లుష్టము** సం. విణ. (అ. ఆ. అ.) 1. కొంచెము దగ్ధమైనది. 2. పూర్ణముగా దగ్ధమైనది.

**ఆఫీనము** సం. — ఆఫూకము.

**ఆఫూకము** సం. వి. అ. న. నల్లమందు, అహిఫేనము.

**ఆబ**[1] వి. కంటిపాప. అం. భా. 2. 143.

**ఆబ**[2] వి. అత్యాశ.

(వ్యవ) ఎంత తిన్నను వానికి ఆబ తీఱలేదు, వాఁడు ఆబతో అంతయు వడ్డింపు మనియెను.

**ఆబంధనము** సం. వి. అ. న.—ఆబంధము.

**ఆబంధము** సం. వి. అ. పుం. 1. గట్టికట్టు, 2. యోక్త్రము, పలుపు. 3. ప్రేమ. 4. భూషణము.

**ఆబద్ధము** సం. విణ. (అ. ఆ. అ.) 1. బద్ధము, కట్టఁబడినది; స్థిరముగా నిలుపఁబడినది.

శ్లో. స్యందనాబద్ధదృష్టిషు. సం. రఘు 1. 40.

2. ఏర్పఱుపఁబడినది, రచితము.

వ. ఆబద్ధమండలా తాపసపరిషత్. కాదం.

వి. అ. న. 1. దృఢబంధనము, గట్టికట్టు. 2. భూషణము. 3. యోక్త్రము, పలుపు. 4. ప్రేమ.

**ఆబర్హణము** సం. వి. అ. న.—ఆబర్హము.

**ఆబర్హము** సం. విణ. (అ. ఆ. అ.) పెకల్చునది, పెల్లగించునది. వి. అ. పుం. ఉత్పాటనము, పెకల్చుట. 2. హింసించుట.

**ఆబర్హితము** సం. విణ. (అ. ఆ. అ.) పెకలింపఁబడినది.

**ఆబాధ** సం. వి. ఆ. స్త్రీ.—ఆబాధము.

**ఆబాధము** సం. వి. అ. పుం. పీడ, దుఃఖము.

**ఆబిడ** స. (అ + బిడ్డ.) ఆమె.

చ. ...ఆబిడమొగ మట్టె కన్గొని కుబేరుని కూఁతమిపట్టి యిట్లనున్. ఉ. రా. 4. 226.

**ఆబూతి** వి. (సం. ఆభుక్తిః. ప్రా. ఆహుత్తి.) పెనుతిండి.

గీ. తనరు నాభుక్తి యాబూతి యనఁగ...అం. భా. . . 260.

**ఆబూతికాఁడు** విణ. తిండిపోతు, భక్షకుఁడు. (శ.ర.)

**ఆబ్దము** సం. విణ. (అ. ఈ. అ.) 1. అబ్దమందుఁ గలిగినది. 2. అబ్దమునకు సంబంధించినది.

**ఆబ్దికము** సం. విణ. (అ. ఈ. అ.) 1. ప్రతిసంవత్సరమును ఈయఁబడునది (పన్ను, మొ.) 2. సంవత్సర కాలమునకు ఈయఁబడునది (ఋణము, మొ.) 3. ప్రతి సంవత్సరమును చేయఁదగినది (ప్రత్యాబ్దికము, మొ.) 4. సంవత్సరమునకుఁ జేయఁదగినది (పేఁడుడి, మొ.) వి. అ. న. శ్రాద్ధవిశేషము.

(క.) ప్రథమాబ్దికము, పేఁడుడి, (చ.) ప్రత్యాబ్దికము, తద్దినము.

**ఆభ** సం. వి. ఆ. స్త్రీ. 1. దీప్తి, వెలుఁగు. 2. శోభ, కాంతి.

**ఆభము** సం. విణ. (అ. ఆ. అ.) ఇది సమాసోత్తర పదముగా నుండి 'సదృశము' అను వర్థము నిచ్చును.

శ్లో. ద్యూతం యో యమదూతాభం హాలాం హాలాహలోపమాం, పశ్యేద్దారాన్ వృథాకారాన్ సభవేద్రాజవల్లభః. సం. పంచ. 1. 57.

**ఆభరణము** సం. వి. అ. న. 1. చక్కఁగా పోషించుట. 2. భూషణము, తొడవు.

**ఆభరితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. నింపఁబడినది, పూరితము. 2. అలంకరింపఁబడినది.

**ఆభాణకము** సం. వి. అ. పుం. లోకోక్తి, జనప్రవాదము. (ఉదా: తథా చ లౌకికానామాభాణకః.)

**ఆభాతి** సం. వి. ఇ. స్త్రీ. ప్రతిబింబము.

**ఆభాషణము** సం. వి. అ. న. 1. సంబోధనము, పిలుపు. 2. ఒండొరులతో మాటాడుకొనుట, ఆలాపము. సం. రఘు. 2. 58.

**ఆభాష్యము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఆమంత్రణీయము, సంబోధింపఁ దగినది, పిలువఁదగినది. 2. ఆలాప్యము,మాటాడఁదగినది. 3. ప్రశ్నింపఁ దగినది, అడుగఁ దగినది, (హేమాదికము.)
శ్లో. (కుళలం) పూర్వాభాష్యం సులభవిపదాం ప్రాణినామేతదేవ. మేఘ. 2. 38.

**ఆభాసము** సం. వి. అ. పుం. 1. కాంతి, ప్రకాశము. 2. ప్రతిబింబము. 3. ఒకటిమఱియొకదానివలె- అవాస్తవముగా – కనఁబడుట యనుదోషము. (ఉదా: హేత్వాభాసము, రసాభాసము, మొ.)

**ఆభాసురుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) చక్కఁగాఁ ప్రకాశించువాఁడు.

**ఆభాస్వరుఁడు** సం. విణ. – ఆభాసురుఁడు.
వి. అ. పుం. ఒకానొకగణదేవత. (వీరు అఱువది నలుగురు.)

**ఆభిచరణికము** సం. విణ. (అ. ఈ. అ.) అభిచారమునకు–శత్రు మారణవశీకరణాదులకు–సాధనమైనది. (మంత్రాది.)

**ఆభిచారికము** సం. – ఆభిచరణికము.

**ఆభిజనము** సం. విణ. (అ. ఈ. అ.) 1. వంశమును బట్టి వచ్చినది, 2. వంశమునకు సంబంధించినది. 3. తనపూర్వులుండుదేశమునకు సంబంధించినది.

**ఆభిజాత్యము** సం. వి. అ. న. 1. కులీనత, గొప్ప వంశమునఁ బుట్టుట, 2. పాండిత్యము. 3. సౌందర్యము.

**ఆభిజితము** సం. విణ. (అ. ఈ. అ.) అభిజిన్నక్షత్రమునఁ బుట్టినది.

**ఆభిధానికము** సం. విణ. (అ. ఈ. అ.) 1. అభిధానమందలిది, నిఘంటువునందలిది. 2. నామమును బట్టి వచ్చినది.

**ఆభిధానికుఁడు** సం. వి. అ. పుం. అభిధానము చేసినవాఁడు, నైఘంటుకుఁడు.

**ఆభిమానికము** సం. విణ. (అ. ఈ. అ.) అభిమానమువలనఁ గలిగినది.

**ఆభిముఖ్యము** సం. వి. అ. న. 1. అభిముఖభావము, ఎదురుమొగమై యుండుట. 2. అనుకూల్యము.

**ఆభిరూపకము** సం. వి. అ. న.–అభిరూపభావము- సౌందర్యము, చక్కఁదనము.

**ఆభిరూప్యము** సం. – ఆభిరూపకము.

**ఆభిషేచనికము** సం. విణ. (అ. ఈ. అ.) పట్టాభిషేకమున కుపయోగించునది (పదార్థము.).

**ఆభిహారికము** సం. వి. అ. న. రాజాదులకు సమర్పింపఁ దగినకానుక.

**ఆభీక్ష్ణ్యము** సం. వి. అ. న. – అభీక్ష్ణభావము – 1. సాతత్యము, ఎడతెగకుండుట. 2. పౌనఃపున్యము, మరల మరల వచ్చుట.

**ఆభీరపల్లి** సం. వి. ఇ. ఈ. స్త్రీ. గొల్లపల్లె, వ్రేపల్లె.

**ఆభీరము** సం. వి. అ. పుం. ఒకదేశము.

**ఆభీరి** సం. వి. ఈ. స్త్రీ. 1. గొల్లవాని పెండ్లాము. 2. ఆభీరజాతిస్త్రీ, గొల్లది. 3. ఆభీరులభాష.

**ఆభీరుఁడు** సం. వి. అ. పుం. 1. మిక్కిలి పిఱికివాఁడు–గొల్లవాఁడు. 2. ఆభీరదేశవాసి. 3. ఆభీరదేశపురాజు.

**ఆభీలము** సం. విణ. (అ. ఆ. అ.) భయంకరము.
వి. అ. న. 1. శరీరబాధ. 2. దుఃఖము.

**ఆభుక్తి** సం. వి. ఇ. స్త్రీ. పెనుతిండి, అబాతి.

**ఆభుగ్నము** సం. విణ. (అ. ఆ. అ.) కొంచెము వంపఁబడినది; కొంచెము వంకరయైనది.

**ఆభేరి** సం. వి. ఈ. స్త్రీ. (సంగీత) రాగిణీభేదము.

**ఆభోగము** సం. వి. అ. పుం. 1. పరిపూర్ణత.
క. ఆభోగము తద్వస్తుచ,యాభోగము నెందుఁ గన్నయవి గావు మమీ. విజ. వి. 1. 128.
2. వైశాల్యము.
ఉదా : గగనాభోగము, గండాభోగము. మేఘ. 2. 29.
3. ప్రాంతప్రదేశము, చుట్టు నుండుచోటు.
వ. యథాయమాభోగస్తపోవనస్య. శాకుం. 1.

4. యత్నము. 5. చక్కని సుఖాద్యనుభవము. 6. పాటచివరచరణమున కవి స్వనామమును చెప్పుకొనుట. 7. విప్పినట్లు కాఁచువడగ. 8. వరుణునిగొడుగు.

**అభ్యంతరము** నం. విణ. (అ. ఈ. అ.) లోపలిది.

**అభ్యవహారికము** నం. విణ. (అ. ఈ. అ.) భోజన యోగ్యమైనది, తినఁదగినది (అన్నాది.).

**అభ్యాదాయికము** నం. వి. అ. న. పితృమాతృ కులాదులనుండి ప్రాప్తమైన స్త్రీధనవిశేషము.

**అభ్యాశికము** నం. విణ. (అ. ఈ. అ.) సమీప మందున్నది.

**అభ్యాసికము** నం. విణ. (అ. ఈ. అ.) అభ్యాసము వలన ప్రాప్తమైనది.

**అభ్యుదయికము** నం. విణ. (అ. ఈ. అ.) వృద్ధిని మిత్తమయినది, క్షేమంకరము.

**అభ్రితుఁడు** నం. విణ. (అ. ఈ. అ.) గుద్దలితో త్రవ్వువాఁడు.

**అభ్ర్యము** నం. విణ. (అ. అ. అ.) అభ్రమునుండి పుట్టినది.

**అమండము** నం. వి. అ. పుం. ఏరండము, ఆముద పుఁజెట్టు.

**అమంత్రణ** నం వి. ఆ. స్త్రీ — అమంత్రణము.

**అమంత్రణము** నం. వి. అ. న. 1. సంబోధనము. 2. ఆహ్వానము, పిలుపు. 3. అభినందనము, చుట్టములు లోనగువారిని ఆలింగనాదులచేత సంతోష పఱచుట. 4. ప్రయాణాదులందు బంధువులు లోనగువారి యనుజ్ఞ పడయుట, వీడుకొనుట. 5. కామచారానుజ్ఞ, అనుజ్ఞ. 6. సంభాషణము.

**అమంత్రణముసేయు** మి. వ. క్రి. వీడ్కొను.

వ. ధృతరాష్ట్రవిదురుల నామంత్రణంబు సేసి యద్దేవముని యంతర్ధానంబునొందె ... భార. ఉద్యో. 2. 106.

**అమంత్రము** నం. వి. అ. పుం. 1–ఆమము (అజీర్ణము) నుండి రక్షించునది—ఆముదపుఁజెట్టు. 2–అమంత్రణము.

**అమంత్రయిత** నం. విణ. (ఋ. క్రి. ఋ.) అమంత్రించువాఁడు, అమంత్రణము చేయువాఁడు.

**అమంత్రించు** నం. న. క్రి. 1. అమతించు, పిలుచు. (శ. ర.) 2. వీడ్కొను, పోయివచ్చెద నని చెప్పివిడుచు.

వ. వివాహతిథి నేఁటికి నాల్గవనాఁ డని ముహూర్త నిశ్చయంబు సేసి పారుంధ తీకులై హిమాలయంబు నామంత్రించి చని ...హర. 4. 71.

**అమంత్రితము** నం. విణ. (అ. ఆ. అ.) పిలువఁ బడినది. వి. అ. న. 1. సంబోధనము. 2.(వ్యాక) సంబోధన ప్రథమాంతము. 4. సంభాషణము.

**అమంత్ర్యము** నం. విణ. (అ. ఆ. అ.) అమంత్రింపఁ దగినది, అమంత్రణము చేయఁదగినది.

**అమంద్రము** నం. విణ. (అ. ఆ. అ.) ఇంచుక గంభీరమైనది (ధ్వని, మొ.).

**అమకము** నం. విణ. (అ. మికా. అ.) పక్వము కానిది, పచ్చిది.

**అమగంధి** నం. విణ. (ఇ.) పచ్చి వగుమాంసాదుల వలె కంపు గొట్టునది.

**అమజ్వరము** నం. వి. అ. పుం. జ్వరభేదము, ఆమ సహితమయిన జ్వరము.

**అమడ** వి. యోజనము, నాలుగుకోసులదూరము.

వ...అచటికి రెండామడ యగునరస్వతి పొంతం బయలికి బలంబులం గొని చని ... భార. శల్య. 1. 74.

గీ. అలరుఁబోఁడికి నొకయడు గామడయ్యె. ఉ. రా. 2. 187.

**అమతి** వి. సెలవు. (చూ. అమతికొల్పు.)

జ. అమతించు¹, అమతికొల్పు. అమతిలు.

**అమతించు¹**—అమతిలు. అ. క్రి. (√అమతి) పుట్టు, కలుగు.

గీ. వనిత నాకన్న నెనరైనవారు నీకుఁగలుగ నేర్తురె నీకొక్క తెలియఁజెప్పు. కున్న మీ యన్నతో డన్నఁ గన్నుఁగవను, నలరునును సిగ్గుతో నగ నామతింప. భాగ. 10. ఉ. 340.

క. నగ నామతించుచూపులు, నగధరు మొగము నను నిలిపి...భాగ. 10. ఉ.270.(నవ్వుతోఁ గూడిన చూపులు అని భావము.)

సీ. బుగులుకొంచును దాని దగ నామతించు
కస్తురిజీని వ్రాఁతలదుప్పటములు. యయా. 4. 120.

**అమతించు²** స. క్రి. (సం. ఆమంత్ర్.) 1. ఆమంత్రించు, ఆహ్వానించు, పిలుచు.

ఉ. రాజులఁ బిల్వఁ బంపుము ధరాసుర సంఘము నామతింపు... భార. అర. 6.70.

క. వినుము సపిండీకరణ,మ్మున నేకోద్దిష్టమునకు భోజనవిధి వ,ర్జన మొప్పు నామతింపక, చన దామెతఁ గుడువఁబోవ సజ్జనవినుతా. భార. అను. 4. 122.

చ. ...,సవతులయిండ్ల నెల్లఁ దొలునాఁడు క్రమంబున నేఁగి తద్ద్రవ్యతో,త్సవమునకామతించి యతిసంభ్రమలీలలఁ దోడితేఁ దగుః. పారి. 5. 57.

2. గౌరవించు, సమ్మానించు, సత్కరించు.

గీ. హర్షమగ్నాంతరంగుఁ డౌనాన్నృపాలుఁ,డతని కెదురేఁగి కౌఁగిట నామతించి,తోడుకొని వచ్చి యొక్క యస్తోకచిత్ర,కంబళావృతమైన కూటంబులోన. రంగా. 2.212.

గీ. ఓలిఁ దగుచోట్ల వారిఁ గూర్చుండఁబెట్టి, తమ్ములమ్ములు మంచిగందములు జింక, పొక్కిలియుఁ గప్పురము గందవొడి మొదలగు, మంచి సరకులచే నామతించి యంత. అచ్చ. రా. బాల. 167.

3. విందుపెట్టు, విందిడు.

మత్త.... అప్పుడు తండ్రి మ,హ్మామిషంబుగ నాభగంబున కామతింపఁ దలంచి...మార్క. 1. 72.

జ. ఆమతింపు.

**అమతింపు** వి. (√అమతించు².) విందు, చుట్టములు మొదలగు వారికిఁ బెట్టెడు భోజనము.

సీ. ఆరాధ వాతెఱయామతింపుల వంటెమొగయింపులహావడింపుల ... వలపువిలువూను వానికలవ నందింపఁజేసెఁగా యకట నీకు ...బళిరకటివేల్పు శతకము. 79. (చి.ని.)

**అమతికొల్పు** స. క్రి. (√అమతి) వెలకొల్పు, ఉంచు.

ద్వి. కోమలవల్లిచన్గొనలఁ బాదంబు, లామతికొల్పి హేమాబ్జినిచెంత. ద్వి. పరమ. 5. 389 పొ. 8 పం.

**అమతిలు(ల్లు)** – అమతించు¹. (√అమతి)

చ. అన విని యాలతాంగి నగ నామతిల న్ననుఁ జూచి భావవే,దినివి గదమ్మ నీకు నిఁకఁ దెల్పక యుండఁగ నేర్తునమ్మ. కువల. 3. 110.

ఉ. తామరతంపరై సిరులఁ దార్కొను కాసల నాటిసత్యచిం,తామణి పొట్లచెల్లను సతంబగు చుండ నమీనుభానుఁ డిం,పామతిలంగ నిల్వఁ బోడవై బెడఁగై నమసీదుఁ గాంచి యం, దేమను వెండికొండపయి కేఁగఁ దలంపక బేసికంటియుః. యయా. 1. 28.

**అమదము** – అముదము. వి. (సం. ఆమంత్రః, ఆమండః. త. అమణక్కు.) 1. అముదపుఁజెట్టు, ఏరండము (వ్య.వి.) 2. ఏరండతైలము.

సీ. మూనెండునూనె యాముదము నేయంతయు నందులోపలఁ గలయంగఁబోసి.గోచికిత్స. 1. (చి. ని.)

3. బ. ఏరండబీజములు.

(ఈక్రింది ప్రయోగములందు 'ఆమిదము, ఆమిదెము' అనురూపములుగూడఁ గన్పట్టుచున్నవి.)

సీ.వెలితుందునుకలై నసీరుల్లి యరపడిమిళితంబు నేసి యామిదము వెంచి.చికిత్స.2.(చి.ని.)

సీ. దివ్వెచమురు నామిదెము నాముదం బననేరండతైలాఖ్య లెసంగు...సాంబ. మూ. 47.

**అమసన్యము** సం. వి. అ. న. ప్రసవవేదన, బిడ్డకుట్టు. (–జన్మమువలనఁ గలిగినది–దుఃఖము అని కొందఱు.)

**అమని** వి. 1. వసంతఋతువు; వసంతుఁడు.

గీ. ...తేఁటికదుపు లామనిఁ దలఁపూపె. పారి. 3. 51.

సీ. తనచెలికాని కామని కనంగుఁ డొసంగిన కృపాణి యేమొ యీనవలినపాడి. చం. రా. 3. 33.

2. పంట యొల్చిపడిచేయించుట, పంట కోసి జాగ్రత్త పెట్టించుట. ఆం. భా. 3. 51.

విశే. 1. అధికము, మిక్కుటము.

వ....ఆరామ పేరామనియెదుట నెమ్మనంబునం బేరామనియై వర్తిల్లునార్తి సంబేరం బిచ్చి. హర. 3. 98.

3. తృప్తికరము.

వ. ...లోఁపుచూపులకుం బేరామనిగా నామని యొప్పెనంత. యయా. 4. 13.

క్రి. విశే. అధికముగా; తృప్తికరముగా.

ఉ. అమని మేసి యాముకొని యంతటఁ బేర్చి చెలంగు గోధనస్తోమము గొంచు నగ్రజుని తోడ యశోదతనూభవుండు...హరి. పూ. 7. 91.

(ఇట'అమనిగా మేసి'అని అన్వయింపఁదగును.)

క. నామాటకడుగు దాఁటకు, సేమముధర్మంబు నేయ సిద్ధించుఁ దగన్, భూమీసురులకు నన్నం,బామనిగా నిడుము మనకు నభివృద్ధి యగున్. శేష. 1. 92.

జ. అమనిచెలి.

**అమనిచెలి** వి. (అమని + చెలి) మన్మథుఁడు. సాంబ. దేవ. 8.

**అమము** సం. విశే. (అ. ఆ. అ.)—పక్వముగానిది — 1. వండనిది (తండులాది). 2. పండనిది పచ్చిది (కాయ.) 3. కాలనిది (కుండ). 4. పరిపాక దశకు రానిది (జ్వరము, వ్రణము, మొ.). 5. జీర్ణింపనిది, అఱుగనిది (ఆహారము.) వి. అ. పుం. 1. తెవులు, రోగము. 2. రోగవిశేషము, ఆమవ్యాధి.

**అమయము** సం. వి. అ. పుం. రోగము, తెవులు.

**అమయావి** సం. విశే. (న్. సీ. న్.) రోగి, తెవులుగొంటు.

**అమరక్తము** సం. వి. అ. న. రక్తగ్రహణిరోగము.

**అమరణాంతము** సం. అవ్య. అ. న. మరణావధి వఱకు, చచ్చువఱకు.

**అమరణాంతికము** సం. విశే. (అ. ఈ. అ.) మరణమును హద్దువఱకు నుండునది, చచ్చువఱకు నుండునది.

**అమరసము** సం. వి. అ. న. రక్తముగా మాఱుటకు పూర్వస్థితిలో నుండెడు అన్నరసము.

**అమర్దము** సం. వి. అ. పుం. 1. గట్టిగాఁ బట్టి పీడించుట. 3. పిండుట; పిసుకుట; నలుపుట.

**అమర్ది** సం. విశే. (న్. సీ. న్.) 1. పీడించునది. 2. పిడుచునది; పిండునది; నలఁచునది.

**అమర్శనము** సం. వి. అ. న. — అమర్శము.

**అమర్శము** సం. వి. అ. పుం. చక్కఁగా స్పృశించుట.

**అమర్షణము** సం. వి. అ. న. — అమర్షము.

**అమర్షము** సం. వి. అ. పుం. అమర్షము, కోపము.

**అమలకము** సం. వి. అ. పుం. న. 1. ఉసిరిక (వృ.వి.) 2. ఉసిరికకాయ.

**అమలకి** సం. వి. ఆ. స్త్రీ. ఉసిరిక (వృ.వి.).

**అమవడ** వి. (సం. అమ్లవటికా. క. అమవడె. త. అమవడై.) పొగచిన పుల్లపెరుఁగులో నానవేసిన వడ.

సీ. ...వడియంబు లతిరసంబులు వడ లామ వడలు,పరమాన్నములు...బ్రహ్మో. 8.380.

**అమవాతము** సం. వి. అ. పుం. అజీర్ణమువలన వాయువుచేత ప్రేగులు మాంద్యము నొందుట, మలబద్ధత.

**అమశూలము** సం. వి. అ. పుం. అజీర్ణమువలనఁ గలుగు శూలబాధ. కడుపునొప్పి.

**అమశ్రాద్ధము** సం. వి. అ. న. బియ్యము మొదలగు అపక్వపదార్థములతోఁ బెట్టెడు శ్రాద్ధము.

**అమాతిసారము** సం. వి. అ. పుం. గ్రహణి, అతిసార రోగవిశేషము.

**అమాన్నము** సం. వి. అ. న. పచ్చిబియ్యము. (ఉప్పుడుబియ్యము కానిది)

శ్లో. ఆమాన్నం తే ప్రయచ్ఛామి ఫలతాంబూల సంయుతం. (బృహన్నందికేశ్వర ప్రోక్త దుర్గోత్సవపద్ధతి)

**అమావాస్యము** సం. విశే. (అ. ఈ. అ.) 1. అమావాస్యయందు కలుగునది, అమావాస్యయందు జరుగునది. 2. అమావాస్యకు సంబంధించినది.

**అమాశయము** సం. వి. అ. న. కడుపులో బొడ్డునకు పైభాగము, అన్నకోశము. (ఇందుఅపక్వాన్న ముండును.)

**అమి**—అము. వి. మదము; గర్వము.

ఉ. ...చిచ్చుపై. నామి నెదిర్చి చచ్చుకలభావ శిరైవడి నొక్కపెట్టునన్. సీతావి. 4. 21.

**అమిక**—హామిక. వి. (సం. అహమహమికా.) గర్వము, మదము.

సీ. గర్వంబు మేనులుగన్నట్టు లుండెడు దొరల యామిక లెందుఁ దొలఁగిపోయె. విజ. వి. పీఠి. 42.

**అమిత్ర** సం. వి. అ. స్త్రీ. పాలవిఱుగుడు, కూకు.

**అమిషప్రియము** సం. విశే. (అ. ఆ. అ.) మాంసమం దిష్టము గలది. వి. అ. పుం. కంకము, రావు లుఁగు.

**అమిషము** సం. వి. అ. పుం. న. 1. మాంసము. 2. భోగ్యమగువస్తువు. 3. ఆశఁగొలుపువస్తువు, లోభనీయవస్తువు. 4. లోభము, ఆశ. 5. భోగము. 6. ఉత్కోచము, లంచము.

**అమిషి** సం. వి. ఈ. స్త్రీ. జటామాంసి (వృ.వి.).

**అమీలనము** సం. వి. అ. న. కన్నులు కొంచెము మూయుట.

**అము**—అమి. వి. (సం. అహమ్.) మదము;గర్వము.

సీ. అముచేనుఁగు మోముసామి ముద్దులపట్టి ఐక్కరవిరిలోఁడి సవతిమిన్న. రసిక. 1. 2.

ఉ. అమునఁ ద్రుళ్లుకొంచు దనుజాధమ నోరికి వచ్చినట్టు లే,మేమొ దురుక్తులాడెదు... రసిక. 6. 31.

వ. ...బిగువుపొట్టలం గనుపట్టునట్టివియును... కమ్మఁదనంబు లీని సుందరీప్రాయంబున నాముపలచునవియును...భీమ. 2. 55.

(అముపలచు—మదపువాసనవేయు.)

అవ్య. అధికముగా; దట్టముగా.

సీ. అమల్లియలదాఁటి శ్రీమల్లి కుచవాటి యామల్లి కొనియుండు నరుగఁ దగదె. రా. వి. 3. 84.

(చూ. అముకవియు. 2.)

బ: అముకవియు, అముకొను, అముచేనుఁగు, అమునీరు.

**అముకవియు** అ. క్రి. (√అము) 1. మదమెక్కు, క్రొవ్వు.

సీ. కాఱుపుల్ దిని యాముకవిసి మహోక్షులు కారుపోతులనైనఁ గదియఁ జూచు.సారంగ. 1. 68.

గీ. ...అన్నపాల,తిలకుఁ జేర్పంగ నెన్నఁడు గలుగునొక్కొ, యాము కవిసినకుచకుంభ సీమయందు. విజ. వి. 3. 23.

2. అధికముగా వ్యాపించు, మిక్కుటముగా పర్వు.

గీ. అంతఁ బడమట నెఱసంజ యాముకవిసె, నలిని కనుమూసెఁ దుమ్మెద కలువ కరిగె. రామా. 6. 107.

సీ. నిశ్వాసపవనంబు నెలకొన్నచో నెల్లఁ ద్రామిన్కు నెత్తావు లాముకవియ. పాండు. 2. 152.

**అముకొను** అ. క్రి. (√అము) 1. మత్తిల్లు,క్రొవ్వు.

ఉ. అమని మేసి యాముకొని యాదటఁ బేర్చి చెలంగుగోధన,స్తోమము గొంచు వ్రజమునితోడ యశోదతనూభవుండు... హరి. పూ. 7. 91.

2. గాఢమగు, అధికమగు.

గీ. అనుచుఁ బలికిన యశరీరియంచితోక్తి, కాత్మ నలరుచు సతిపతు లాముకొనిన, ప్రేమతో నేఁగి...సురా. 146.

3. అలముకొను, వ్యాపించు.

వ. నిండుపన్నీటి యేటి కాలువలతావులతావు లందాముకొన్న కన్నెవెన్నెలలు. ఘటికా. 2. 146.

4. కవియు, పైకొను.

శా. లేమా! లేమరు లేమరల్పక విరాళిం దూలి పోమాన్వయో,ద్దాముం గోమున నాముకొంటి వఁటవే తానై హితాలాప ముల్, ప్రేమం గోమలకోమలాక్షరముగాఁ జెక్కాడి పొక్కింపవ, క్కామిం గామిని కామినీమనసిజుం గై కొంటి నాతాఁగిటఁ. కృ. శకుం. 3. 92.

**అముక్తమాల్యద** సం. వి. అ. స్త్రీ. 1—(తనచేత) ధరింపఁబడిన మాల్యము (శ్రీరంగస్వామికి) నిచ్చినది—కూడికొడుత్తనాచ్చియారు, గోదాదేవి. 2. ఈమె నాయికగాఁ గలయొకకావ్య

ఆంధ్ర ప్రబంధము, శ్రీకృష్ణదేవరాయవిరచిత మగు విష్ణుచిత్తీయము.

**అము_క్తము** సం. విశ. (అ. అ. అ.) 1. విడిచి పెట్టఁబడినది. 2. ధరింపఁబడినది (వస్త్రాదికము). 3. ఏయఁబడినది (బాణము, మొ.).

**అము_క్తి** సం. వి. ఇ. స్త్రీ. 1. విడుదల. 2. పరిధానము, ధరించుట. 3. మోక్షము. అవ్య.ఇ. న. ముక్తి పర్యంతము.

**అముఖము** సం. వి. అ. న. 1. ప్రారంభము. 2. ప్రస్తావన. (ఇది నాటకముయొక్క అంగ భేదము.

**అముతేనుఁగు** వి. (√అము) మదపుటేనుఁగు. రసిక. 1. 2.

**అముత్రికము** సం. విశ. (అ. ఈ. అ.) పరలోకమందు కలుగునది.

**అముదము** — ఆముదము.
(ఏరండవృక్షము.)
కాశీ. 7. 234, ఆం. భా. 2. 48.
(ఏరండతైలము.)
ఆం. భా. 2. 268, సాంబ. మా. 47.

**అమునీరు** వి. (√అము) మదజలము.
గీ. అగుచు జిగి చెక్కుఁగవ జాలునామునీరు,
ప్రోలుటకుఁ జేరుజమిలిముక్కాలిబారు,
గొనబు పాటల కెదఁ గేరుకొనుచు సారు,
నెరపు నెఱవేల్పు నామది నిలుచుఁగాత.
అచ్చ. రా. బాల. 7.

**అముష్మికము** సం. విశ. (అ. ఈ. అ.) పరలోకమందుఁ గలుగునది.

**అముష్యకులిక** సం. వి. అ. స్త్రీ. వాసి గన్నవంశమునఁ బుట్టుట; ప్రశస్తమగు కులమునఁ బుట్టుట.

**అముష్యపుత్రిక** సం — అముష్యకులిక.

**అముష్యాయణుఁడు** సం. విశ. (అ. ఈ. అ.) ప్రఖ్యాతవంశోద్భవుఁడు, వాసి గన్నవంశమునఁ బుట్టినవాఁడు.

**అమూలము** సం. అవ్య. అ. న. మొదలంట,మొదటి నుండి.

**అమూలాగ్రము** సం. అవ్య. అ. న. మొదటినుండి చివరవఱకు, అంతయు.

**అమృష్టము** సం. విశ. (అ. అ. అ.) 1. తాఁకఁబడినది, సంస్పృష్టము. 2. బలాత్కారముగా ఆక్రమింపఁబడినది. (సం. కు. సం. 2. 31.) 3. శుద్ధిచేయఁబడినది, శోధితము; నిర్మలముగా సిద్ధము చేయఁబడినది (అన్నాది).

**ఆమె** — ఆయమ. న. ఏ. (ఆ+అమ్మ.) 1. ఆపూజ్యురాలు. 2. ఆస్త్రీ.
(వ్యవ) ఆవచ్చినయామె యెవరు? (ఇటవృత్తియందు తత్పూజ్యార్థకము పోయినది.)

**ఆమెత** వి. (సం. ఆమంత్రణం.) విందు.
గీ. ...నిఖిలనిలింపసభయు, నప్పటప్పటికిని
జిహ్వాత్రుప్పు దుల్ల, నామెత లెటింగె
నీతుషారాద్రి కతన. మను చ. 2. 11.
గీ. ఆమెతల నిచ్చలు నొనర్చు నలఘుమహిమ.
చంద్ర. 1. 5.
గీ. మేటితుమ్మెదగముల కామెతలు వెట్టు.
రసిక. 4. 154.

**ఆమోకము** సం. వి. అ. పుం. పరిధానము, ధరించుట.

**ఆమోచనము** సం. వి. అ. న — అముక్తి.

**ఆమోటనము** సం. వి. అ. న. నలఁగఁ గొట్టుట.

**ఆమోదకము** సం. విశ. (అ. దికా. అ.) 1. సంతోషపెట్టునది. 2. పరిమళింపఁ జేయునది.

**ఆమోదనము** సం. విశ. (అ. అ. అ.) 1. సంతోష పెట్టునది. 2. పరిమళింపఁ జేయునది. (అ. ఈ. అ.) 1. సంతోషపెట్టుటకు సాధనమయినది. 2. పరిమళింపఁ జేయ సాధనమైనది. వి. అ. న. 1. సంతోషపెట్టుట. 2. పరిమళము కలిగించుట.

**ఆమోదనీయము** సం — ఆమోద్యము.

**ఆమోదము** సం. వి. అ. పుం. 1. దూరముగా వ్యాపించెడు పరిమళము; పరిమళము. 2. సంతోషము.

**ఆమోదయిత** సం. విశ. (ఋ. ౘ్రీ. ఋ.) 1. సంతోషపెట్టునది. 2. పరిమళింపఁ జేయునది.

**ఆమోదయితవ్యము** సం — ఆమోద్యము.

**ఆమోది** సం. విణ. (న్. నీ. న్.) 1. సంతోషము కలది. 2. సుగంధము గలది.

**ఆమోదించు** సం. అ. క్రి. 1. సంతోషించు. 2. సమ్మతించు. 2. పరిమళించు.

**ఆమోదితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. సంతోష పెట్టఁబడినది. 2. పరిమళింపఁజేయఁ బడినది.

**ఆమోద్యము** సం. విణ. (అ. ఆ. అ.) ఆమోదింపఁ జేయఁ దగినది.

**ఆమోషము** సం. విణ. (అ. ఆ. అ.) దొంగిలించునది, ముచ్చిలించునది. వి. అ. పుం. దొంగతనము.

**ఆమోషి** సం. వి. న్. పుం. దొంగ.

**ఆమ్నాతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. చక్కఁగా అభ్యసింపఁబడినది, ధారణకై మరల మరల వల్లింపఁబడినది. 2. చెప్పఁబడినది. వి. అ. న. చక్కని అభ్యాసము; చక్కఁగా జదువుట.

**ఆమ్నాతి** సం. విణ. (న్. నీ. న్.) 1. వేదాదులను అభ్యసించినవాఁడు. 2. వేదములను వల్లెవేసిన వాఁడు.

**ఆమ్నానము** సం. వి. అ. న. 1. (వేదాలను) పఠించుట; వల్లె వేయుట. 2. చెప్పుట.

**ఆమ్నాయము** సం. వి. అ. పుం. 1. చక్కఁగా అభ్యసించుట, చక్కఁగా పఠించుట. 2. వేదము. 3. శాస్త్రము. 4. సంప్రదాయము, శిష్టాచారము. (సంప్రదాయమువలనఁ గాని వంశక్రమమునఁ గాని యేర్పడినయాచారవ్యవహారాదికము.) 5. వంశము. (శే. ని.)

క. ...పాపమతివై భరతా,మ్నాయులగుపాండవేయుల, శ్రీయిమ్మెయిఁ గొనివనిన్నుఁ, జీయనరె యెరుల్. భార. సభా. 2. 185.

6. సముదాయము.

ఉ. ఆయతకీర్తితో వివిధయాగములఁ సురధారణీ సురా,మ్నాయము నాహితాహుతి సమంచితదక్షిణ లిచ్చి తన్పుచుఁ. భార. ఆది. 1. 89.

**ఆమ్రకూటము** సం. వి. అ. పుం. ఒకానొక పర్వతము.

**ఆమ్రగంధకము** సం. వి. అ. న. సమష్ఠిలావృక్షము, నదామ్రమము (వృ. వి.).

**ఆమ్రపేశి** సం. వి. ఈ. స్త్రీ. ఎండఁబెట్టిన మామిడి పండుముక్క, మామిడిచిన్ని.

**ఆమ్రము** సం. వి. అ. పుం. చూతము, మామిడి (వృ. వి.) న. మామిడిపండు.

**ఆమ్రవణము** సం. వి. అ. న. చూతవనము, మామిడితోఁపు.

**ఆమ్రాతకము** సం. వి. అ. పుం. 1. అంబాళము (వృ.వి.). 2. ఎండఁబెట్టఁగా గట్టిపడినమామిడి పండ్ల రసము, మామిడితాండ్ర. న. అంబాళపు పండు.

**ఆమ్రాతము** సం. వి. అ. పుం. అంబాళము (వృ.వి.) న. అంబాళపు పండు. (దీనిరసము మామిడి పండు రసమువలె నుండును.)

**ఆమ్రావర్తము** సం. — ఆమ్రాతకము.

**ఆమ్రిమ(ము)** సం. వి. న్. పుం. పులుసు, పుల్లఁదనము.

**ఆమ్రేడనము** సం. వి. అ. న. పదములనుగాని వర్ణములనుగాని రెండు మూడు మారులు చెప్పుట.

**ఆమ్రేడించు** సం. స. క్రి. రెండు మూఁడు సారులు వచించు; పెక్కుసారులు పలుకు.

వ. కొన్ని (విధిశిరంబులు) యజురామ్నాయంబా మ్రేడించునవియును భీమ. 5. 8.

అ. క్రి. ఆమ్రేడితమగు, రెండు మూఁడు సారులు పలుకఁబడు.

వ. సంయమీశ్వరతిలకంబుల వికస్వరస్వరంబుల నామ్రేడించువేదమంత్ర పఠనంబులవలన... ఆ సమయంబు ... ఘూర్ణమానార్ణవంబు గ్రేణి సేయుచుండె. పారి. 5. 76.

**ఆమ్రేడితము** సం. విణ. (అ. ఆ. అ.) రెండుమూఁడు మాఱులు చెప్పఁబడినది (పదము); అధికముగాఁ జేయఁబడినది, ఎక్కువగా, జేయఁబడినది.

క. ప్రోడతనంబులు మీఱఁగఁ, జేడియ లదుగులు మొగములుఁ జేతులు మెఱయన్, వేడుక నీఁదఁగ నవు డా,మ్రేడితజలజాత [illegible] పారి. 4. 82.

ఉ. ఆడితె నీదువంతె మని హస్తనఖప్రసరచ్ఛ
విచ్ఛటామ్రేడిత పాండురద్యుతిసమృద్ధి
గరం బమరంగఁ గాచికల్, వేడుకతోడఁ
బుచ్చికొని...కళా. 6. 119.

వి. అ. న. 1. రెండు మూఁడు సారులు చెప్పుట.
2. (వ్యాక) ద్విరుక్తముయొక్క పరరూపము, రెండుమాఱులు చెప్పఁబడినదానిలో రెండవది. (బుధవర్ణనము)

సీ. వీప్సయో కాని పూవిలుకానిసఖునకు
నామ్రేడితమొ కాని యర్థిజనకు. కాశీ. 4.
191. (ఇట ప్రతిబింబము, సాటి — అని భావము.

**ఆమ్ల** నం. వి. అ. స్త్రీ. చింతచెట్టు.

**ఆమ్లము** నం. విశే. (అ. ఆ. అ.) పుల్లనిది. వి. అ. పుం. షడ్రసములలో నొకటి, పులుసు.

**ఆమ్లలోణిక** నం. వి. అ. స్త్రీ. పులిచింత, పులిచెంచలి (వృ. వి.)

**ఆమ్లవేతసము** నం. వి. అ. పుం. పుల్లప్రబ్బలి (వృ. వి.)

**ఆమ్లి** నం. వి ఈ. స్త్రీ. చింతచెట్టు.

**ఆమ్లిక** నం. వి. అ. స్త్రీ. 1. చింతచెట్టు. 2. ఆమ్లోద్గారము, పులిత్రేనుపు.

**ఆమ్లీక** నం — ఆమ్లిక.

**ఆయక** స. ఏ. (ఆ+అక) ఆకె, అపూజ్యస్త్రీ.
బంధురవృత్తము ... గెలుపుల సిరి నెలఁతగా
దక్కం గైకొని యాయకతో. యయా. 4.
165. కళా. 1. 68.

**ఆయకట్టు** మి. వి. (ఆయము+కట్టు - క. అయకట్టు. త. ఆయక్కట్టు.) 1. రాబడియొక్క నిర్ణయము.

గీ. సరవి గుడికట్టుగాఁ జెంగ వెరసు వ్రాసి, యంత
కము వేసి కులవర్గు లాయకట్లు, దీర్చిదిన
వహి వపరగతి ప్రతీర, నౌరవణి నిర్ణయింప
శేషాహి యతఁడు. హంస 4 29.

2. చెఱువు మొదలగువాని క్రింద సేద్యమగు భూమియొక్క పరిమితి.

**ఆయకము** — అవాకము. వి. తాకట్టు, కుదువ, ఆధి.

**ఆయకాఁడు** మి. వి. (ఆయము+కాఁడు. క. ఆయగార. త. ఆయక్కారన్.) పన్ను పుచ్చుకొను కరణము మున్నగు గ్రామాధికారి. (శ. ర.)

**ఆయగము** వి. గజాదులపై వేసెడిచిత్రకంబళము.

సీ. పసిఁడి యాయగములు పన్ని యాయిత
ముగా గజవాజితతిఁ బక్కరలు పెరయఁ,
బెట్టి. కు. సం. 12. 784.

వ. మణికనకనేత్ర పట్టికామయం బగు నాయ
గంబునం బన్నియున్ననంది నిందుశేఖరుం
డెక్కుడు...కు. సం. 8. 25.

**ఆయతచ్ఛద** నం. వి. అ. స్త్రీ. కదళి, అరఁటి (వృ. వి.)

**ఆయతనము** నం. వి. అ. న. 1. ఇల్లు, ఉనికిపట్టు. 2. స్థానము, ఆశ్రయము. 3. యజ్ఞస్థానము. 4. గుడి, దేవాలయము. 5. బౌద్ధాలయము.

**ఆయతము** నం. విశే. (అ. ఆ. అ.) 1. దీర్ఘము, నిడుపైనది. 2. విస్తృతము, విరివియయినది. 3. ఆకర్షింపఁబడినది, లాగఁబడినది.

శ్లో....ఆయతవల్గ మగ్రే తురంగిభి ర్యత్ననిరు
ద్ధవాహైః. శిశు. 3. 80.

4. నిరోధింపఁబడినది.
'త్రిర్జ వేదాయతప్రాణః' (యోగియా-వాచ.)
వి. అ. పుం. (క్షేత్రగ) దీర్ఘచతురస్రము. (దీనికి పొడు గెక్కువగను వెడల్పు తక్కువగను ఉండును.)

**ఆయతి**[1] వి. ఆయము, రాబడి.
జ. ఆయతికాఁడు.

**ఆయతి**[2] వి. జ్యేష్ఠాదిమాసచతుష్టయము, జ్యేష్ఠము మొదలుకొని నాలుగేసిమాసములకాలము, కందాయము, కారు.

సీ. ఆయతి కారు కందాయ మనంగ జ్యేష్ఠాది
మాస చతుష్టయంబు దనరు. అం. భా.
1. 86.

**ఆయతి**[3] నం. వి. ఇ. స్త్రీ. 1. ఆయామము, నిడుపు. 2. ప్రభావము, కోశదండములవలన రాజునకుఁ గలుగుశక్తి. 3. ఉత్తరకాలము, భవిష్యత్కాలము. 4. ఫలదానకాలము, ఫలము గలుగుతఱి.

శ్లో. ఇయం శివాయా నియతేరివాయతిః. సం. కిరా. 4. 21.

5. ప్రాపణము. 6. సంగమము, కూడిక. 7. పని, కర్మము. 8. సంయమము, నిగ్రహము.

**ఆయతికాఁడు** (√ఆయతి') రాజాదాయమును రక్షించువాఁడు.

క. ఆయతికాఁడు వలయునర, నాయకునకు... భార. శాం. 2. 363.

(శ్లో. రాజకోశస్య గోప్తారం. సం. భార.శాం. 82. 4.)

ఉ. ఆయతికాని కీకు మమరాలయముఖ్యము లాతఁ డర్థతృష్ణాయుతుఁడై నిజోర్వివగు నష్టికిఁ దర్దనముం దొరల్చి రాజాయత నంబుఁ జేర్చు మఱి యట్టిదపథ్యము ... ఆము. 4. 218.

**ఆయత్తపడు** మి. అ. క్రి. (ఆయత్తము+పడు.) సిద్ధపడు.

ద్వి. ...మీకులం బెల్లఁ,గాయకరోషాగ్ని భస్మీ కరింతు, నాయత్తపడియుండు మనిన నీ విపుడు, పోయెదవో నినుఁ బోనీను గాని, పుడమి శత్రుఘ్నుండు పుట్టనినాఁడు, కడిఁది వీరుఁడ వైతి గాక నేఁ డగుదె. రం. రా. ఉ. 145 పొ. 23 పం.

ద్వి. కాయంబు కడఁజేసి కన్నులు మూసి, యాయత్తపడియుండె నారాజసుతుఁడు. ద్వి. శ. సా. 2. 82 పొ. 6 పం.

**ఆయత్తము** సం. విశ. (అ. అ. అ.) 1. అధీనము, వశమైనది. 2. సిద్ధము. 3. ప్రయత్నించునది. జాగరూకము. (విల్యమ్సు)

**ఆయత్తి** సం. వి. ఇ. స్త్రీ. 1. లోఁకువ,అధీనత్వము. 2. స్నేహము, చెలిమి. 3. సామర్థ్యము, శక్తి, బలము. 4. సీమ, ఎల్ల. 5. శయనము, పరుండుట. 6. దినము.

**ఆయథాతథ్యము** సం. వి. అ. న. 1.అనౌచిత్యము, తగినట్లు లేకుండుట. 2. అవాస్తవత్వము.

**ఆయది** – అయ్యది వ. (అ+అది) అది.

**ఆయన** వ. వి. (అ+అన) అతఁడు.

క....అతని, గాయన సెప్పినవిధంబు నభివర్ణిం

**ఆయప** – ఆపె. వ. వి. (అ+అప) ఆమె.

**ఆయపఱచు** వ. క్రి. సాగుబడిచేయు. (బ్రౌ.)

**ఆయమ** వ. వి. (అ+అమ) ఆమె. భార. శాం. 1. 7.

**ఆయమనము** సం. వి. అ. న. 1. నిడివి. 2. సంయమము, నియమించుట, కట్టుపాటులోనుంచుట. 3. (విల్లు, మొ.) లాగి సాగఁదీయుట.

**ఆయము** వి. (సం. ఆయుః. త. ఆయం. క.ఆయ.)

1. మర్మస్థానము, ఆయువుపట్టు.

క. ఆయమ్ము లమ్మహీసురు, నాయమ్ములు దాఁకవయ్యె నాయుర్మహిమన్. పాండు. 3. 53.

2. మర్మము, రహస్యము.

గీ. మిగుల రొదగాఁ గిశాకిక నగుచు రతుల, యాయములు సోఁక నెద్దియే నాడుకొనుచు ...కళా. 1. 40.

**ఆయము** సం. వి. అ. పుం. 1. రాక. 2. ప్రాప్తి. లాభము. 3. రాబడి. (అంతరాయము, అభినవాయము, సిద్ధాయము, సనుస్తాయము అని ఆయములు నాలుగు విధములు - వ్యతి: వ్యయము.) 4. పన్ను. 5. (జ్యోతి.) లగ్నమునకు ఏకాదశస్థానము.

**ఆయయి** – ఆయా.

**ఆయలె(లే)** అవ్య. (√అగు–ఆయెగా+లే – అయినదిలే. ఇది క్రమముగా భ్రష్టమై "ఆయలే, ఆయలె" అని యైయుండును. ఆ+ఆ+లెమ్ము–అని శ. ర.) అనాదరమును దెలుపును.

చ. అలరెఁ బ్రియాళు వోర్తు ప్రియమౌట వసంతముఁ గాడ నప్పు డవ్వెలఁదిసవత్ని భక్తికిని వేల్పులు మెత్తురు గావ రాగమా, ఛలమునఁ దన్నుఁ గాడఁగ వసంతుఁడు దా దయచేసెఁ గాక యాయలె నిజశక్తినా యమచు నాపనకుం గొదవెట్టె నీనునా. ఆము. 5. 133.

ఉ. నీచెలువంబు నీసొగసు నీనరపోక్తులు నీవిలాసముల్, నీచతురత్వ మింతయిన నిర్జర భర్తకు నేది యాయలే, చూచితి మెందు

**అయల్లకము** సం. వి. అ. పుం. ఉత్కంఠ, తహతహ; విరహోత్కంఠ, విరహమువలనఁ గలుగు తహతహ.

ఉ. చల్లనివాఁడు మానెలవుచందురుమాము యటన్నఁ దద్ద్విప, ద్వల్లభమౌగ్ధ్యవైభవము వ్యంగ్యము తద్ధ్వనిచేత నాయకా, యల్లకమగ్న యానసుటవ్యంగ్యము ... నరస. 2. 122.

**అయవనము** సం. వి. అ. పుం. న. మేఁతపట్టు, పచ్చికబయలు.

**అయవారము** వి. (సం. యాయావరం. ప్రా.యాయవార.) 1. ఇంటింటికి తిరుగుచు ధాన్యమును గాని బియ్యమును గాని యాచించుట; అట్లు యాచించుటవలన వచ్చిన బియ్యము, మొ.

సీ. అయవారముకంటె నధికకల్యాణంబు పతిగ యెన్నులధాన్యభక్షణంబు. భాగ. 7. 410.

సీ. అంశభాగమునందు నాయవారపుసంచి దోర్మూలమున నిట్టితోలుసజ్జ. శై. భా. 7. 197. అం. భా. 2. 17.

ద్వి. అయవారము లెత్తి యతిదైన్యవృత్తి, నడిగిన ధాన్యంబు లవి వేలువేలు, ముడిచిన మూటలు మూఁపుపై వ్రేల్వ. ద్వి. హరిశ్చ. ఉ. 494 పం.

(వ్యవ) వానికి అయవారము పెట్టి పంపుము.

**అయశ్శూలికుఁడు** సం. విశే. (అ. ఈ. అ.) మృదూపాయములచేత సాధ్యమైనపనులఁ గూడ తీక్ష్ణములైన యుపాయములచేత నెఱవేర్చుకొనువాఁడు, సాహసికుఁడు.

**అయసము** సం. విశే. (అ. ఈ. అ.) లోహమయము, ఇనుపది. వి. అ. న. 1. ఇనుము. 2. ఆయుధము.

**అయస్తము** సం. విశే. (అ. ఆ. అ.) 1. ఆయాసపడినది, శ్రమపడినది. 2. కుపితము, త్రోయఁబడినది. 3. దుఃఖపెట్టఁబడినది. క్లేశితము. 4. తీక్ష్ణీకృతము, వాఁడిచేయఁబడినది. 5. కుపితము, కోపించునది. 6. ఉత్సుకము, ప్రయత్నించునది.

శ్లో. అయస్తః సురసరిదోఘరుద్ధవర్త్మా సంప్రాప్తుం నవగజదానగంధి రోధః పం. కిరా, 7. 32 ("సంప్రాప్తుం గంతుం అయస్తః ఉత్సుకః" వ్యాఖ్య)

**అయస్థానము** సం. వి. అ. న. 1. పన్నులు పుచ్చుకొనెడుచోటు. 2. (జ్యోతి) ఏకాదశస్థానము.

**అయా** వ. ('అ' యొక్క ఆమ్రేడితరూపము ఇట్లే అయయి, అయాయి, అయ్యో, మొ.)

శా. అయావేళల నాసరోజముఖ నాయాలీలలద్దేల్చి. పారి. 1. 40.

**అయాతము** సం. విశే. (అ. అ. అ.) అగతము, వచ్చినది (ఉదా: యాతాయాతములు.) వి. అ. న. రాక.

**అయాతి** సం. వి. ఇ. స్త్రీ. అగతి, రాక.

**అయానము** సం. వి. అ. న. 1. ఆగమనము, రాక. 2. స్వభావము, ప్రకృతి.

**అయాపనము** సం. వి. అ. న. రప్పించుట, రావించుట.

**అయామము** సం. వి. అ. పుం. 1. దైర్ఘ్యము, నిడుపు. 2. నిరోధము.

**అయామి** సం. విశే. (న్. నీ. న్.) 1. నిరోధించువాఁడు. 2. (దేశకాలములందు) నిడుపైనది.

**అయాయి** – అయా.

గీ. అఖిలభువననివాసు లాయాయి తెఱఁగు, లేర్పడ భజించి రాకంసదర్పహారుని, సర్పహారుని గ్రూరప్రచార ముడిగి, రాజబింబాభిరాములై తేజరిల్ల. నార 1. 210.

**అయాసకము** సం విశే. (అ. సికా. అ.) అయాసపెట్టునది, శ్రమపెట్టునది.

**అయాసపడు** మి. అ. క్రి. (అయాసము+పడు.) శ్రమపడు.

**అయాసపెట్టు** మి. స. క్రి. (అయాసము+పెట్టు.) శ్రమపెట్టు.

**అయాసము** సం. వి. అ. పుం. 1. శ్రమము, బడలిక. 2. ఉత్సాహము, పూనిక.

**అయాసి** సం. విశే. (న్. నీ. న్.) 1. అలసట నొందినవాఁడు, శ్రమ మొందినవాఁడు. 2. పాటుపడువాఁడు, పూనిక గలవాఁడు.

**అయి** వి. (స. త. అయి.) ఇది అమ్మశబ్దమువలె పేర్ల చివర నుపయోగింపఁబడును.

ఉదా: మంగాయి, గంగాయి.

కం. అంద గ్రజుండు నరహరి, కుందేందుసమాన కీర్తి గుణవతి లక్ష్మాయిం దగ నుద్వాహం బయి, నందితసుజనుల ముగురు తనయులం గనియెన్ చిత్రభా. పీఠి. 24.

**ఆయిటిదూది** వి. బూరుగుదూది. (గ్రా.)

ఆ. ఊఁతనీరు చెలఁది నేఁతమూటాయిటి, దూది యొండపసుపు తొట్టియక్క, రంబు మేను దీనిరహిఁబుణ్యమమ్ముటఁ, గప్పురంబు వెట్టి యుప్పుగొనుట. ఆము 6. 62.

(గాలి కెగిరిపోవుదూది - అని వ్రాఁత ప్రతి వ్యాఖ్య)

**ఆయితపడు** — ఆయిత్తపడు. అ. క్రి. (√ఆయితము) సిద్ధపడు, సిద్ధమగు.

క. ...నీహారగిరీంద్రా వివిధామరసహితుఁడ, నై వచ్చెదఁ బెండ్లిఁ జూడ నాయితపడుమా. వరాహ. 6. 35,

**ఆయితపాటు** — ఆయిత్తపాటు. వి. (√ఆయితము) ఆయితపడుట, సిద్ధమగుట. (శ. ర.)

**ఆయితపెట్టు** స. క్రి. (√ ఆయితము) సిద్ధము చేయు.

ఉ. ...సర్వమునాయితపెట్టి. విజ. వి. 2. 89.

**ఆయితము** — ఆయిత్తము. విశే. (క. ఆయిత, ఆయత. త. అయత్తం.) సిద్ధమైనది.

క. సమరమునకుఁ దగునుద్యోగమునఁ బ్రవర్తిల్లి కెలమిఁ గౌంతేయులు మత్స్యమహీనాథుఁడు సన్నాహము సేసెఁ ద్రుపదవిభుఁడు నాయిత మయ్యెన్. భార. ఉద్యో. 1. 49.

వి. సన్నాహము, సిద్ధమగుట.

గీ. హర్ష మిగురొత్తఁ గయ్యపుటాయితమునఁ, బురము వెలువడె బలిపుత్త్రుఁ డురుజవమున. ...భాగ. 10. ఉ. 434.

జ. ఆయితపడు, ఆయితపాటు, ఆయితపెట్టు.

**ఆయితు(త్తు)** విశే. 1. ఉచితము, తగినది.

ఉ. ...నీ, వన్నసదుక్తి కిట్టులన నాయితు గాదన వాతఁ డిట్లనున్. చెన్నబ. 4. 334.

2. శక్యము, సాధ్యము.

ఉదా: నేనురానాయిత్తుగాదు. (గ్రా. వ్యవ)

**ఆయిత్తపడు**—ఆయితపడు. అ. క్రి. (√ఆయిత్తము) సిద్ధపడు, సిద్ధమగు.

క. ...మీ రాయిత్తపడి వెసన్ రం డనుచున్. సాంగ. 1. 77.

**ఆయిత్తపాటు**—ఆయితపాటు. వి. (√ఆయిత్తము.)

గీ. ...సేవకులకు, విష్ణుసారూప్యసౌభాగ్యవిలసనంబు, లెప్పుడపుడె సృజింప నాయిత్తపాటు, వెలయ నున్నది. పర. 2. (శ. ర.)

**ఆయిత్తము**—ఆయితము. విశే. (సం. ఆయత్తమ్.) సిద్ధము.

జ. ఆయిత్తపడు, ఆయిత్తపాటు.

**ఆయుఁడు** సం. వి. అ. పుం. కంచుకి, అంతఃపురము కాచువాఁడు.

**ఆయుక్తము** సం. విశే. (అ. అ. అ.) 1. నియోగింపఁబడినది. 2. కూడినది, కలిసినది,

**ఆయుగము** వి. (క. ఆయుగ.) కత్తిపిడి,

వ. మఱియుఁ బసిఁడియాయుగంబునసురియ నురంగంబుగాఁ దొంగలిపట్టియంగట్టి చెన్ను మిగులఁ గై సేసిన. కు. సం. 9. 224.

(ఆయుగంబున సురియ—పిడియందు బిగింపఁబడిన కత్తి—ఆయగము, అపముద్రి.)

**ఆయుధజీవి** సం. వి. న్. పుం. — ఆయుధముచేత బ్రదుకువాఁడు—శస్త్రాజీవుఁడు, యోధుఁడు.

**ఆయుధధర్మిణి** సం. వి. ఈ. స్త్రీ. జయంతీవృక్షము, తక్కిలిచెట్టు (రోగమును నశింపఁజేయుటలో నిది యాయుధమువంటిది.)

**ఆయుధము** సం. వి. అ. పుం. న. శస్త్రము, ఖడ్గాది యుద్ధసాధనము.

**ఆయుధాగారము** సం. వి. అ. న. ఆయుధశాల.

**ఆయుధి** సం. విశే. (న్. వి. న్.) ఆయుధములు కలవాఁడు, ఆయుధములనుపయోగించువాఁడు. (యోధుఁడు.)

**ఆయుధికుఁడు** సం. వి. అ. పుం. — ఆయుధముచేత బ్రదుకువాఁడు—యోధుఁడు.

**ఆయుధీయుఁడు** సం.—ఆయుధికుఁడు,

**అయుర్దాయము** సం. వి. అ. పుం. (జ్యోతి) జాతకు నకు జన్మకాలమందలి గ్రహరాశి స్థితివలనను లగ్నవిశేషమువలనను లబ్ధమైన ఆయువు; ఆయువు.

**అయుర్ద్రివ్యము** సం. వి. అ. న. 1. ఔషధము. 2. ఘృతము, నేయి.

**అయుర్యోగము** సం. వి. అ. పుం. (జ్యోతి) ఆయు వును దెలుపు ఒకానొక గ్రహయోగము.

**అయుర్వేదము** సం. వి. అ. పుం. చికిత్సాశాస్త్రము, వైద్యశాస్త్రము.

**అయుర్వేది** సం. వి. న్. పుం. ఆయుర్వేదమును దెలిసినవాఁడు, వైద్యుఁడు. (ఇట్లే ఆయుర్వేద దృక్కు, ఆయుర్వేదికుఁడు.)

**అయువు** సం. వి. స్. న. ఉ. పుం. జీవితకాలము. (సాన్తమైనప్పుడు రూ. ఆయుస్సు.)

**అయుషము** సం. వి. అ. న. ఆయువు. (ఈక్రింది మూఁడుసమాసములలోనే ఆయుశ్శబ్దము ఈ రూపమును బొందును. ఉదా: పురుషాయు షము, ద్వ్యాయుషము, త్ర్యాయుషము. దీనికి వ్యస్తప్రయోగము లేదు.)

**అయుష్కరము** సం. విశే. (అ. ఈ. అ.) ఆయు స్సును బెంచునది.

**అయుష్కర్మము** సం. వి. న్. న. 1. ఆయుర్వృద్ధి కరమగుపని. 2. క్షౌరము. (శ. ర. వ్యవ.)

**అయుష్కాముఁడు** సం. విశే. (అ. ఆ. అ.) దీర్ఘా యువును గోరువాఁడు.

**అయుష్టోమము** సం. వి. అ. పుం. ఒకానొక యాగము.

**అయుష్మంతము** సం. విశే. (చూ. ఆయుష్మంతుఁడు.) వి. త్. పుం. (జ్యోతి) 1. ఇరువదియేడు యోగములలోనొకటి, 2. కృత్తికానక్షత్రము.

**అయుష్మంతుఁడు** సం. విశే. (త్. ప్రకృతి. త్.) చిర కాలము బ్రదుకువాఁడు,

**అయుష్యము** సం. విశే. (అ. ఆ. అ.) ఆయుస్సాధ నము, ఆయుర్వృద్ధికరము. (రసరసాయన ద్రవ్యకర్మాది) సం. అ. న. దీర్ఘజీవనము, దీర్ఘాయువు.

సీ. హస్తరేఖలుచూచి యాయుష్యమును భవి ష్యము తేటతెలివిగా నానతిచ్చు. కాశీ. 6. 60. (ఇట ఆయుష్యము – ఆయుష్ప్రమాణము. కాని ఈయర్థము సం. ని. లలో లేదు.)

**అయె**–అయ్యె.

శా. ...మన్మథవిహారక్లేశవిశ్రాంతిచేఁ, బాయం బాయెను బట్టకట్టెఁ దల. ... కాళ. ళ. 14.

**అయ్యై**–అయ్యై.

**అయోగము** సం. వి. అ. పుం. 1. వ్యాపారము. 2. గంధమాల్యాదుల కానుక: గంధమాల్యా దులు కానుకగా నర్పించుట. 3. చక్కనికూడిక. 4. శీలము, ఒడ్డు. 5. బోధము, తెలివి. 6. కాఁడికిఁ గట్టిన పశువులజత.

**అయోగవి** సం. వి. ఈ. స్త్రీ. 1. వడ్రంగిజాతిస్త్రీ, వడ్లది. 2. వడ్రంగి పెండ్లము.

**అయోగవుఁడు** సం. వి. అ. పుం. (శూద్రునకు వైశ్యస్త్రీయందుఁ బుట్టినవాఁడు. వీనివృత్తి వడ్రము) వడ్రంగి.

**అయోజనము** సం. వి. అ. న. 1. కూర్చుట. 2. ప్రోగుచేయుట. 3. ఉద్యోగము. పూనిక.

**అయోజించు** సం. న. క్రి. కూర్చు. చేర్చు.

మ. ...అయ్యారుభూషామణిఁ దక్కాగ్ర మున నాయోజించి. ధర్మ. 1. 2,

**అయోధనము** సం. వి. అ. న. 1. యుద్ధము. 2. యుద్ధభూమి. 3. వధము,

**అర**–ఆరా, అవ. సంబోధనమునందు బహువచన మున వచ్చు ఆగమము.

గీ. ...మగువలార కనుఁగొంటిరే యమునాశి వాక్య, మొకటి విననైన నిదె వేళ యొదవె ననుచు. వసు. 2. 81.

**అర** సం. వి. అ. స్త్రీ. 1. మాదిగవాఁడు చెప్పులు కుట్టుసూది, ఆరె. 2. (వైద్య) శస్త్రవిశేషము. 3. కళ, గుఱ్ఱములనుదోలుకొరడా. శిశు. 18.7.

**అరంగపువక్క** వి. (త. అరంగిప్పాక్కు.) మేలగు నొకవిధమైన పోఁకచెక్క. (బ్రౌ)

**అరంథోతి** వి. (సం. అరుంధతి.) వసిష్ఠునిభార్య; ఆ పేరుగల నక్షత్రము.

క. చీరచెఱంగులు ముడియిడి, కూరిమిఁ జిటికె
నలు వట్టికొనఁ గూరిచి తా,రారంభకోటిని
గడు నిం,పారఁగ ద్రొక్కించి రప్పు డాలి
న్నగనిన్. నీలా. 3. 85

**అరంభకుఁడు** నం. విశ. (అ. కా. అ.) 1. ఉపక్ర
మించువాఁడు. 2. యత్నించువాఁడు.

**అరంభణము** నం. వి. అ. న. — అరంభము.

**అరంభణీయము** నం. — అరభ్యము.

**అరంభము** నం. వి. అ. పుం. 1. ఉపక్రమము.
2. ప్రస్తావన, ఉపోద్ఘాతము. 3. ఉద్యమము,
ప్రయత్నము. 4. కార్యము, పని. 5. త్వర,
వడి. 6. గర్వము. 7. వధము. 8. సస్యము,
పైరు. (ఈయర్థము తెనుఁగుననే కలదు.)
తపతీ. 1. 59.

గీ. వఱపుదోసంబు వాయంగ వాన గురియుఁ,
గొంద్రలం బందు నారంభకోటు లెల్ల. భీమ.
3. 142. (అరబకోటులు. అని అపముద్రి.)

(వ్యవ) ఈయేఁడు అరంభాలు బాగుగా అంటి
నవి.

**అరంభవాదము** నం. వి. అ. పుం. పరమాణువుల
వలన నుండియే జగదుత్పత్తి యగు ననువైశేషి
కాదులవాదము.

**అరంభి** నం. విశ. (న్. కి. న్.) — అరంభములు
గలవాఁడు — క్రొత్తపన్నుగడలు పన్నువాఁడు.

**అరంభించే** నం. అ. క్రి. స. క్రి. మొదలుపెట్టు.

శా. మారీచక్షణదాచరుం డపుడు రామస్వామి
తోఁ బోరికై, యారంభించి... చం. రా.
2. 91.

శా. అరంభింపరు నీచమానవులు విఘ్నాయాస
సంత్రస్తులై, యారంభించి పరిత్యజింతు
రురువిఘ్నాయత్తులై మధ్యముల్, ధీరుల్
విఘ్ననిహన్యమాను లగుచుఁ ధృత్యున్న
తోత్సాహులై, ప్రారబ్ధార్థము లుజ్జగింపరు
సుమీ ప్రజ్ఞానిధుల్గావునన్. భర్తృ. నీతి.78.

**అరకాటి** వి. (త. అఱుకాట్టి) ఓడనడుపువాఁడు,
నావికుఁడు, కర్ణధారుఁడు.

**అరకూటము** నం. వి. అ. పుం. న. పిత్తలము,
ఇత్తడి.

**అరక్ష** నం. వి. అ. స్త్రీ. రక్షణము.

**అరక్షకుఁడు** నం. వి. అ. పుం. 1. తలారివాఁడు,
ఆరెకుఁడు. 2. గ్రామదండనాధికారి.

**అరక్షము** నం. విశ. (అ. అ. అ.) రక్షించునది. వి.
అ. పుం. 1. రక్షణము. 2. ఏనుఁగుకుంభముల
క్రిందిచోటు. 3. గజకుంభముల సంధి. 4.
సైన్యము.

**అరక్షుఁడు** నం — అరక్షకుఁడు.

**అరగించే** స. క్రి. (త. అరోగిను.) 1. ఆహారించు,
తిను.

గీ. సరసరంజక మహనీయసంప్రయోగ, మగు
చతుర్విధహృద్యాన్న మారగించె. భార.
ఉద్యో. 3. 229.

ఆ. ఏమి సేయఁ దలఁచి తేని నీ వక్కట,యార
గించి చేయు మయ్య యనుడు. భార.ఆశ్ర.
1. 54.

2. త్రాగు.

చ. మునుజననీస్తనంబులకు మోపఁగ వ్రేఁగయి
యున్నయట్టియ, వ్వినుతపయస్సు లన్ని
యును వేడుకతోఁ గడుపార నారగిం,చినఁ
బ్రియ మంది...హరి. పూ. 5. 237.

జ. అరగింత, అరగింపు, అరోగిణము.

**అరగింత** — అరగింపు.

గీ... మెసవుట యారగింత, యారగింపు కుడుపు
నాఁగ సలరు భుక్తి. ఆం. భా. 2. 260.

**అరగింపు** — అరగింత. వి. (√అరగించే.) 1. భోజ
నము, భుక్తి. ఆం. భా. 2. 260.

2. (దేవతాదులకుఁ జేయు) నివేదనము.

(వ్యవ) స్వామికి అరగిం పయినది.

3. విందు.

గీ. వైష్ణవసహస్రమునకు సద్భక్తి నార, గింపు
సేయించి కాని భుజింప నొల్లఁ, డాత్మసతి
యును దాను నేమని నుతింప. పర. 4.199.

ద్వి. చారువైష్ణవసహస్రమున కన్వహము, నార
గిం పొనరింతు నని యొడఁబడిన. ద్వి. పర.
6. 455 పా. 10 పం.

**అరగ్వధము** నం. వి. అ. పుం. ఱేల (వృ. వి.) న.
ఱేలపండు.

**అరఘట్టము** సం. వి. అ. పుం. నూతినుండి నీళ్లు వెలుపలికిఁ దెచ్చుట కేర్పఱచినయంత్ర విశేషము, ఏతము.

**అరచించు** సం. స. క్రి. రచించు, ఏర్పఱుచు.

గీ. తవిలి భూలోకసారమై తనరు నగ్ర, హార మొకటిని దనపేర నారచించి. శ్రీరం. 4. 949.

**అరచితము** సం. విశే. (అ. ఆ. అ.) బాగుగా రచింపఁబడినది.

**అరజము**¹ వి. (ప్రా. అరజ్జఅం. చి. ని.) వాద్యవిశేషము.

ఉ. సంచితభూరిబాహుబలసంపద పెంపున నారజంబు వాయించి యనేకభంగుల నుమేశుఁ ద్రిలోకశరణ్యు నాత్మ మెచ్చించి ...... భాగ. 10. ఉ. 314.

చ...డమరుగోముఖడిండిమమడ్డుశంఖకాహళీ మురళీ మృదంగ పణవానక దుందుభిఢక్కాకాంస్యమర్దళమురజారజాది వివిధధ్వను లేపున భూనభోంతరంబులఁ జెలఁగెన్. భాగ. 10. ఉ. 1100. (ఇట సంస్కృత సమాసమధ్యమున నున్నది. కాని యిది తత్సమ మనుటకుఁ బ్రమాణాంతరము లేదు.

**అరజము**²—అరజము¹. వి. 1. పక్షులు మొదలగువాని) కలధ్వని, అవ్యక్తమధురధ్వని.

గీ. పావురము లారజంబులు పలుకుచోట. మనుచ. 3. 111.

వ. ...కివకివఁ గూయుకోయిలల యారజంబు లకుమ. కువల. 1. 17.

2. లీల, విలాసము.

ఉ. ...అరజ ముట్టిపడన్ మెలంగుదున్. శుక. 2. 110.

గీ. ప్రథమసంగమకేళి నప్పటికి నంత, ముగ్ధ యనిపించి పిదప నమ్మోహనాంగి, జాతివారాంబు లేచబల్ సైత మింత, నేర రనిపించెఁ గలయిక యారజముల. శుక. 4. 26.

3. దుర్విలాసము.

గీ. పుణ్యచిహ్నంబు లపఘనంబున ఘటింప, సిగ్గుపడుఁ గాని కరనఖశిఖరలిఖిత, జాతమాత్న శశాంకముల్ సమ్మతించు, నారజము మీఱి యాదుర్విహారహారి. పాండు. 3. 12.

ఉ. అరజ మెల్ల నొక్కపొడ వయ్యె ననంగమ ప్రాఁతి గానిసింగారము తీరుమాలిన వికారము...జెరయన్. విప్ర. 5. 25.

విశే. మనోజ్ఞమైనది, సొగసైనది, ఇంపైనది.

సీ. తైక సడల్చి యారజపుఁబైఁట ఘటించి యదిమేలొ యిదిమేలొ యనుచు నడుగు. శశాం. 2. 81.

గీ. అత్తెఱంగున నదిరిపా టారజంపు, వన్నెఁ బొడకట్టి తాఁ బాడు సన్నరవళి, పాట లళిఝుంకృతిశ్రుతిఁ బాడుకొనఁగఁ, బాడ కయ చూచు చూపుతో నుడియుటయును. మనుచ. 6. 32.

సీ. జారకర్ణగ్లాని చేర నారజముగాఁ బలుకు నొక్కొకసారి పచ్చిపలుకు. వేం. పంచ. 3. 251.

**ఆరట(ము)** — ఆరాటము. వి. (క. అఱట, అఱాట. త. అఱాట్టం.) పరితాపము, సంతాపము; బాధ.

ఉ. అమ్మ యిదేమి పద్మయివు డారటఁ బొర్లుచుఁ బవ్వళించి. వేం. మా. 5. 39. దశకు. 5. 61.

గీ. ఎగ్గతంబునఁ దానుఁ గారగ్గిఁ గాలె, నచె యనాథయై దీనికి నంతరంగ, మలఁదురక తల్లడిల్లక యారటమున, నుడుక కలమటఁ బడక యెట్లుండుఁ జెపుమ. భార. ఆశ్ర. 2. 163.

ఆ. అన్నదాత గానియతఁడు క్షుద్బాధన, గార దాహకారి యారటమున, నన్పత మాడు సాక్షియును వేదదూషక, జనుఁడు మోహపరతఁ జత్తు రపుడు. మార్క. 2. 87.

క. అటుగానఁ బాపకర్ముని, గుటిలుని మఱి నార్తు ధూర్తుఁ గ్రూరుని నేమా, రటమునఁ గొని యేఁగెద మంతట దండమువలన నితఁడు ధన్యత నొందున్. భాగ. 6. 109.

(అరటమునఁ గొను - బాధపెట్టుచుఁ దీసికొని పోవు.)

జ. అరటపడు, అరటపఱుచు, అరటపాటు, అరటపెట్టు, అరటించు.

**అరటపడు** అ. క్రి. (√అరట) సంతాపపడు; బాధపడు.

గీ. భర్తృసేవావిధికి నిన్నుఁ బనుపనేని, నడికిలో నౌదుఁ బనిచిన జాలి దూలి,చిత్త మారటపడు నేమి సేయువాఁడ. పె. శకుం. 3.166.

**అరటపఱుచు** స. క్రి - అరటపెట్టు.

క. పెనురాలు నీటఁ గ్రుంకిన, యనువునదుర్వ్యథలు నన్ను నారటపఱుపఁగ, ఘనశోక మొదవి బంధులు విని వగచెద రనుచు నేద్వ వెఱతు మునీంద్రా. వా. రా. 1. 81.

**అరటపాటు** వి. (√అరట) సంతాపము; బాధ, దుఃఖము.

ఉ. అవ్వచనంబు చిత్తమున కారటపాటొదవిం పనెంతయు,న్నివ్వెఱఁ గంది...వి. పు. 78.

**అరటపెట్టు** స. క్రి. (√అరట) తపింపఁ జేయు; బాధపెట్టు.

చ....విషమెత్తి క్రోలి యది యంఁగము నారట పెట్ట నన్నులం, గినిసినయట్లు మీఁదు పరికింపక యమ్మొయి నీవు పాండునం,దనులకుఁ బెట్టవై హృదయతాపము వచ్చినఁ బల్కె దొండులఁగా. భార. ద్రో. 4.209.

**అరటి** నం. వి. ఈ. స్త్రీ. నటి.

**అరటించు** అ. క్రి. (√అరట) అరటపడు, పరితపించు.

వ. అవద్రావినవానిగతి నారటించుచు...రాకుమారుండు. సారంగ. 3. 29.

**అరటుఁడు** నం. వి. అ. పుం. నటుఁడు.

**అరట్టజము** నం. వి. అ. పుం. అరటదేశమందుఁ బుట్టిన గుఱ్ఱము. వసు. 2.152.

**అరట్టము** నం. వి. అ. పుం. 1. హిందూదేశము యొక్క పశ్చిమోత్తరమున నుండు దేశవిశేషము పంచనదము (పంజాబు) అని కొందఱు. 2. అరట్టదేశమందుఁ బుట్టిన గుఱ్ఱము.

**అరఠము** వి. పూనిక, ఉత్సాహము.

క. వెలినాఱును గాలురులును, వలలుఁదెరలు దీమములును వడిఁ దీరినకు,క్కలు నారె గోలలును నుం,డలక్రోవులు వేఁట కారఠంబుఁ బెనుపఁగఁగా. ఉ. హరి. 4. 22.

**అరణి** నం. వి. ఇ. పుం. ఆవర్తము, నీటిసుడి.

**అరణేయుఁడు** నం. వి. అ. పుం. - అరణియందుఁ బుట్టినవాఁడు - శుకయోగి.

**అరణ్యకము** నం. విశే. (అ. త్య్రా. అ.) 1. అడవికి సంబంధించినది. 2. అడవియందుఁ బుట్టినది. 3. అడవియందుండునది.

(అధ్యాయన్యాయ విహారమనుష్యహస్తిపథిశబ్దములకు విశేషణ మగునపుడు ఈ రూపము సిద్ధించును. గోమయశబ్దమునకు విశేషణమగునపుడు ఆరణ్యకము, ఆరణ్యము, అని రెండు రూపము లుండును. ఇతర పదములకు విశేషణ మగునపుడు ఆరణ్యమనియే యుండును.)

వి. అ. న. 1. అరణ్యమందుఁ బఠింపఁ దగిన వేద భాగము. 2. పిడుక.

**అరణ్యకుఁడు** నం. వి. అ. పుం. ఆటవికుఁడు, అడవిమనుష్యుఁడు.

**అరణ్యకుక్కుటము** నం. వి. అ. పుం. అడవికోడి.

**అరణ్యము** నం. విశే. (అ. అ. అ.)-చూ. అరణ్యకము.

1. అడవికి సంబంధించినది. 2. అడవియందుఁ బుట్టినది (ధాన్యాది). వి. అ. పుం. న. అకృష్టపచ్యధాన్యభేదము, సేద్యము చేయకయే పండుధాన్యవిశేషము.

**అరణ్యముద్గ** నం. వి. ఆ. స్త్రీ. ముద్గపర్ణి, కాకిపెసర, పిల్లపెసర (వృ.వి.)

**అరణ్యముద్గము** నం. వి. అ. పుం. అడవి పెసర (వృ. వి.)

**అరతము** నం. విశే. (అ. అ. అ.) 1. ఉపరతము, ఉడిగినది. 2. ప్రశాంతము, మెల్లదిగా నుండునది.

**అరతి - హారతి** వి. (సం. ఆరాత్రిక. ప్రా. ఆరత్తి త. అలత్తి.) నీరాజనము, నివాళి.

చ....యువతికోటులతోఁ దపనీయపాత్రికా, సదమలరత్నదీపికల శౌరికి నారతు లెత్తి వేడుకన్. ఉ. రా. 3. 303.

ఉ....శోభవపుటారతు లెత్తె. వసు. 1.153.

**అరతి** సం. వి. ఇ. స్త్రీ. 1. విరామము, ఉడుకువ, నివృత్తి. 2. ప్రశాంతి.

**అరనాళకము** సం. - అరనాళము.

**అరనాళము** సం. వి. అ. న. పులియఁబెట్టినకడుగు నీళ్లు, కలి, కాంజికము.

**అరబము** వి.(సం.ఆరంభః.) 1. ప్రారంభము,ఉపక్రమము. (మా. అరబము సేయు.) 2. (క. అరంబు, అరంబ.) తొలకరిపైరు, మొదటి సస్యము; పైరు.

శా. వేమం డీగతిఁ బాపకర్మములు గావింపంగ నాకీడునన్, వానల్ గల్గక మానె నారబము లెండన్ జొచ్చెఁ బెక్కాపదల్, గానన్ వచ్చె...వి.పు. 2. 106.

క. ఏనుఁగులతలలు కొమ్ముల,తో నారబములకు దృష్టిదోషము వాయం,గా నెత్తుదు రెలుకులు దమ, చేనికి...కాశ. 3.8.

జ. అరబముసేయు.

**అరబముసేయు** అ. క్రి. స. క్రి. (√అరబము.) ఆరంభించు, మొదలుపెట్టు.

గీ. భ్రాతృభ్రాతృవ్యబాంధవప్రతతు లెల్ల, క్షేత్రకర్మంబు లొనరింపఁ జేనిపనికిఁ, దాను వొక్కొకవేళ ముందరనె పోయి, యారబము సేయు మిథ్యాప్రయత్నమునను. వి. పు. 3. 279.

**అరబ్ధ** సం. విశే. (బు. శ్లి?. బు.) ఆరంభించువాఁడు.

**అరబ్ధము** సం. విశే. (అ. అ. అ.) ఆరంభింపఁబడినది, మొదలు పెట్టబడినది. వి. అ. న. ఉపక్రమము, మొదలు పెట్టుట.

**అరబ్ధవ్యము** సం - ఆరభ్యము.

**అరబ్ధి** సం. వి. ఇ. స్త్రీ - ఆరంభము.

**అరభటి** సం. వి. ఈ. స్త్రీ. 1. (నాట్య)వృత్తులు నాలుగిటిలో నొకటి. (ఇది రౌద్ర బీభత్సరసములలో నుపయోగపడును.)

శ్లో. అత్యుద్ధతార్థసందర్భా వృత్తిరారభటీ స్మృతా. 2. కూరత్వము, బంటుతనము. 3. ప్రౌఢి; అతిశయము.

శా. ఆటోపారభటి న్మునీశ్వరుఁడు దన్నందంద వర్ణింపఁ ద,చ్చాటుప్రౌఢికిఁ జేసె ధూర్జటి మహాశ్లాఘాశిరఃకంపమున్. కాశీ. 4.253.

**అరభటుఁడు** సం. వి. అ. పుం. కూరుఁడు.

**అరభమాణుఁడు** సం. విశే. (అ. అ. అ.) ఆరంభించుచున్నవాఁడు.

**అరభి** సం. వి. ఇ. స్త్రీ. ఒకానొక రాగము.

**అరభ్యమాణము** సం. విశే. (అ. అ. అ.) ఆరంభింపఁబడుచున్నది.

**అరభ్యము** సం. విశే. (అ. ఈ. అ.) ఆరంభింపఁదగినది.

**అరము**[1] సం. వి. అ. పుం. న 1. పిత్తలము, ఇత్తడి. 2. ముండలోహము, ముండాయసము. 3. కోణము, మూల. 4. తియ్యమామిడి (వృ.వి.) పుం. 1. శనిగ్రహము. 2. అంగారక గ్రహము.

**అరము**[2] వి. (సం. ఆరామః) ఆరామము.

చ. మలయసమీరణాభిహతి మ్రాఁకుల నాకులుడుల్లి డుల్లి క్రొ,మ్మొలకలు సాగిసాగి విరిమోసులఁ గెందలి రొత్తి యొత్తి కు,ట్మలములు గ్రమ్మి క్రమ్మి కుసుమంబులు వాసన కెక్కి యెక్కి గు,త్తులు గొని పండిపండి వినుతుల్ దగ నారము లొప్పె నామనిన్ కు. సం. 4. 443.

సీ. ఏపుఁజెల రేగి యేయుమనోజున్మ చెఱకువిల్ రెండుగా విఱిచి వైతుఁ, బలువలై పలుకుచిల్కలనాలుకల ముల్లు విఱిచి యారములలో వెడల నడుతు, మదమున మ్రోయు తుమ్మెదలఁ జంపకలతాంతములలో మునుఁగంగఁ దఱిమివైతుఁ, దగులమై వీతెంచుదక్షిణాశా గంధవహు మహేంద్రునివాతఁ ద్రోతు,గీ. వేట కులికెదు నాయట్టిబోటి కలుగ, వెలఁది నీమది లోపల వెఱవకుండు, మమ్మ ధైర్యంబు వదలకు మమ్మ యెందు, గత్తలముగల్గి మేనికిఁ గలదె బాధ (విక్రమసేనము 3 ఆ. కు. సం. 4. 443. వ్యాఖ్య.)

**అరయు** - అరయు స. క్రి. (క. అరయు. త. ఆరాయ్.) 1. వెదకు.

వ. ఒక్కవటమహీజాత శీతల శిలాతలంబున మనిచి దానియగ్రవిటపం బెక్కి నీ రార యచున్నంత. భార. ఆది. 6. 171.

ఉ. అంబురుహంబులం గలయ నారసి చొచ్చి యొకండు నాళసూత్రంబున నున్న యింద్రుఁగని...భార. ఉద్యో. 1.188.

2. ఆలోచించు, విచారించు, పరిశీలించు.

ఉ....భూవర రెండు దెఱంగులందు నీ కారయఁ బథ్యమేది యగు నవ్విధ మేర్పడ నిశ్చ యింపుమా. భార. ఉద్యో. 3.284.

క. వారెల్లను భవదీయస్ఫారబలము గారణ ముగ సౌఖ్యంబున ను, న్నారమని పలుకుదురు నిజ, మారయఁగా నట్లకాదె యది జననాథా. భార. ఉద్యో. 2. 6.

ఉ. ...కవీంద్రులు ప్రసన్న కథాకలితార్థ యుక్తి లో, నారసి మేలు నా నితరు లక్షర రమ్యత నాదరింప...భార. ఆది. 1.25.

గీ....ఇంట వార్త, రవము వీతెంచె దీని నారసి యెఱుంగ, వలయు...భార. ఆది. 6.289.

చ. అరులను మిత్త్రులం దెలియ నారయు టెంతయు సూక్ష్మకృత్యము, వైరవతిదుర్లభంబు...భార. శాం. 3. 227.

3. కాపాడు, కను పెట్టి చూచు, (యోగక్షేమములు) కనుఁగొను.

క. ...భీష్ముం, డయనయశాలి సమర్థుం, డయి చేకొని రాజ్యభార మారయుచుండున్. భార. ఆది. 4. 250.

క. ద్వారవతి నుండియునునిట, యారసియుండు నది దానవాంతక...భార. సభా. 2. 82.

4. చూచు, వీక్షించు.

క. ఆఋషియాగమునం బవు, డారసి చని చెప్పి రంబుజాతునకు బహిః, ద్వారిణు లగు పరిచారిక, లు...కళా. 2. 14.

5. కనుఁగొను, తెలిసికొను.

ఉ. ఆరవ మాలకించి సభ నందఱు బిమ్మెరపోవు నంతటన్, భూరమణుం డదేమి యటఁ బోయి కనుంగొనుఁ డన్న నేత్రకుం, డారసి వచ్చినిల్చి వినయంబున నిట్లని విన్నవించె ...చెన్న. 2. 211.

క. ...అబ్బల్లిదుఁ, డనుపఁగ మీసేమ మెల్ల నారయుకొఱకున్. నీలా. 1. 64.

6. పరీక్షించు, శోధించు.

ఉ. అఁడుఁదనంబు నిక్కమున నారసి చూచిన లేదు. భార. విరా. 1. 288.

చ. అనవుడు బ్రాహ్మణ ప్రవరుఁ డల్లననవ్వుచు నిన్ను నారయ, న్మనమున వేడ్క పుట్టి నర నాయక వచ్చితి నేను ధర్ముఁడన్, బనుపడు నిర్వివేక పరిపాకము గాఢనిరూఢ భావ మొంది నిలుచుఁగాత నీదగుమదిన్. భార. అశ్వ. 2. 95.

**అరరే** అవ్య. ఆశ్చర్యప్రశంసాదులను దెలుపును.

సీ. అరరే యొప్పారుసూరులభాగంబుచాఁగురే బాహుల చక్కఁదనము. శ్రీరం. 4. 962.

**అరళ్లు** వి. బ. ధాన్యవిశేషము.

సీ. పొన్న శ్రీరాజనా ల్పునుఁగు రాజనములు ముద్దుప్రాలారళ్లు ముత్తెసరులు. హంస. 4. 128.

**అరవము** సం. వి. అ. పుం. 1. ధ్వని, మ్రోఁత. 2. అర్పు, అఱవు.

**అరసత్వము** సం. వి. అ. న. అరసత్వము, రసములేమి.

**అరా**—అర. అవ.

క. ...గౌతముచే, వంపించుకొనక పోవఁ ద, లం పుట భావ్యంబె పెద్దలారా మీకున్. వరాహ. 10. 35.

**అరాటము**—అరటము.

క. నీరాటవనాటములకుఁ, బోరాటం బెట్లు గలిగెఁ బురుషోత్తముచే, నారాట మెట్లు మానెను, ఘోరాటవిలోన భద్రకుంజరము నకున్. భాగ. 8. 19.

క. ఈరీతి శిశిరవిధుల ని, వారింపఁగ రానివిరహవహ్నిశిఖలచే, నారాటంబునఁ బొరలం, గా రమణులఁ జూచి కదలిశారత్నవకుల్. వరాహ. 4. 36.

జ. ఆరాటించే.

**అరాటించు**—అరటించు, అ. క్రి. (√అరాటము.) ఆరటపడు, తపించు; వడ్చు.

మ. ...పరితప్తప్రాంతుఁడై శాష్పపూరము లొక్కుమ్మడిఁ గన్నులం దొరుఁగ నారాటించుచున్. వి. పు. 1. 147.

**ఆరాతి** సం. వి. అ. పుం. అరాతి, పగతుఁడు.

**ఆరాతీయము** సం. విణ. (అ. ఆ. అ.) 1. దగ్గఱది. 2. దూరపుది.

**ఆరాత్రికము** సం. వి. అ. న.—పగటియందుఁగూడ వెలిఁగింపఁబడునది–నీరాజనము, ఆరతి, నివ్వాళి.

**ఆరాధకుఁడు** సం. విణ. (అ. ధికా. అ.) ఆరాధించువాఁడు.

**ఆరాధన** సం. వి. ఆ. స్త్రీ. 1. సేవ, కొలువు, పరిచర్య. 2. సంతోషపెట్టుట.

**ఆరాధనము** సం. విణ. (అ. ఆ. అ.) ఆరాధించునది. వి. అ. న. 1. సంతోషపెట్టుట. 2. గౌరవించుట. 3. (దేవతాదులను) కొలుచుట, సేవనము. 4. (సంతోషపెట్టుట, పూజించుట, మొదలగు వానికి) సాధనము.

శ్లో. ఇదం తు తే భక్తినమ్రం, సతామారాధనం వపుః. సం. కు. సం. 6. 73.

5. వంట, పాకము. 6. అవాప్తి, పొందుట. 7. సంసిద్ధి, ఒనగూడుట.

**ఆరాధనీయము** సం. విణ. (అ. ఆ. అ.) ఆరాధింపఁదగినది.

**ఆరాధయిత** సం. విణ. (ఋ. త్రీ. ఋ.)—ఆరాధించువాఁడు - 1. పూజకుఁడు. 2. సేవకుఁడు, పరిచారకుఁడు. 3. సంతోషపెట్టువాఁడు.

**ఆరాధించు** సం. స. క్రి. 1. సంతోషపఱచు. 2. గౌరవించు, పూజించు. 3. సేవించు, కొలుచు.

వ. నీ వరిగి యమ్మహాదేవు దేవునింబోలె నారాధింపు మని పలికిన. మార్క. 1. 262.

**ఆరాధితము** సం. విణ. (అ. ఆ. అ.) ఆరాధింపఁబడినది.

**ఆరాధ్యమానుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) ఆరాధింపఁ బడుచున్నవాఁడు.

**ఆరాధ్యుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) ఆరాధింపఁదగినవాఁడు. వి. అ. పుం. శైవులగురువు.

గీ. హరమహాదేవ పార్వతీశ్వర యటంచు, వెంట శైవద్విజుల్ గొంద ఱంటి రాఁగ, నధ్యయన ధుర్యులైన యారాధ్యవరులు, వరగ నరుదెంచిరి నృపాలు సముఖమునకు. కృష్ణ. 2. 6.

**ఆరామము** సం. వి. అ. పుం. 1. ఉపవనము, తోఁట. 2. క్రీడనము, విహరణము.

శ్లో. అఘాయురింద్రియారామః. గీత. 3. 16.

**ఆరామశీతల** సం. వి. ఆ. స్త్రీ. ఆనందివృక్షము, గోడసాల (వృ.వి.). (దీనియాకులు పరిమళము గలిగియుండును–అని గం. ని.)

**ఆరామికుఁడు** సం. విణ. (అ. ఈ. అ.) ఉద్యానవనమును పాలించువాఁడు, తోఁటకాపరి.

**ఆరాలి(ళి)కుఁడు** సం. వి. అ. పుం. – కుటిలవర్తనుఁడు–వంటవాఁడు, పానసీఁడు.

**ఆరావము** సం.—ఆరవము.

**ఆరావళి(లి)** సం. వి. ఇ. స్త్రీ. వింధ్యపర్వతశ్రేణికి ఉత్తరముగా నున్న ఒకానొక పర్వతపువరుస.

**ఆరావి** సం. విణ. (న్. ణీ. న్.) 1. మ్రోయునది, ధ్వనించునది. 2. అఱచునది, ఆర్చునది.

**ఆరిక**—ఆరికె, ఆరుగ (క), ఆరువు (గు). (త్రా). వి. సస్యవిశేషము (వృ.వి.). బ. (ఆరికలు, ఆరికెలు, ఆరుకలు, ఆరుగలు, ఆరుగులు, ఆరువులు, ఆళ్లు) ధాన్యవిశేషము, కోద్రవము.

ఉ. ఆరికకూడు పుచ్చవరు గావుల వెన్నయు... వేం.పంచ. 1.687. (దీనిభేదము 'కుట్టారిక')

**ఆరికె**—ఆరిక. వి. సస్యవిశేషము.

సీ. జడకొఱ్ఱ కొఱ్ఱలు చామలు వెలిచామ కుట్టారికారికె. హంస. 4. 127.

**ఆరితి** (సం. ఆర్తిః) వి. పీడ.

గీ. ఆరితి ఘటిల్లఁ గొందఱు చారవరులు, వచ్చి నతిసల్పి కువలయాశ్వక్షితీంద్రు, చేతనైనట్టి పాతాళకేతుపాటు, లోఁపఁ దెల్పఁ దాళకేతుండు కనలి. కువల. 4. 74.

**అరితేఱు** అ. క్రి. సమర్థుఁడగు, నిపుణుఁడగు, దిటవగు.

గీ. వాఁడు నానాఁటి కభివృద్ధి వఱలఁ బెరిఁగి, కాఁకలను దేఱి గడిమీఱి గట్టిపాఱి, రాలుగాయతనాన బేరజపుదారి, నారితేఱియుఁ బలుగుంటమారి యయ్యె. హంస. 5. 110. విజ. వి. 3. 25.

**అరిత్రితము** సం. విశే. (అ. ఈ అ.)-అరిత్రమునకు సంబంధించినది — ఓడ గడపు తెడ్డు చుక్కాను మున్నగువానికి సంబంధించినది.

**అరిప్స** సం. వి. ఈ. స్త్రీ. ఆరంభింప నిచ్ఛ.

**అరిప్సితము** సం. విశే. (అ. అ. అ.) ఆరంభింప నిచ్ఛగింపఁబడినది.

**అరిప్సువు** సం. విశే. ఆరంభింప నిచ్ఛగించువాఁడు.

**అరిరాధయిష** సం. వి. అ. స్త్రీ. ఆరాధించునిచ్ఛ.

**అరిరాధయిషువు** సం. విశే. (ఉ.) ఆరాధించు నిచ్ఛగలవాఁడు.

**అరివేరము** - అర్వేరము వి. 1. వైరము; కలహము.

గీ. గగనముననుండి వచ్చె నాకస్మికముగ, నారివేరంపుఁదపసి దైత్యారికడకు. పారి. 1.44.

(అరివేరపుఁదపసి — కలహప్రియతపస్వి, నారదుఁడు)

2. (తె. ఆరవారం.) చింత. మనఃక్షోభము.

సీ. కుడుము రూకలకెల్లఁ గొనవైతిఁగా యంచు జేరి తీఱనియారివేర మొందఁ. శుక. 2.563.

గీ. ఇట్లు కోలాహలంబుగాఁ బెట్లఁ బెట్టి, వీఁక నందఱు నచట నొయ్యారఁ జేసి, ముమ్మరమ్మైన యారివేరమ్ము మదికిఁ, బుట్టి యతఁ డేఁగెఁ దలవరికొట్టమునకు. వైజ. 4.99.

**అరు¹** అ. క్రి. 1. కలుగు, జనించు.

ఉ. కౌరవకోటి నేఁ బొదివి క్రందుగఁగయ్యము సేయఁ గర్ణుఁ డా, ఘోరమణుఁగ వడింగదిసి ఘోరశరంబులు మేన నింప నొ,వ్వారుటయుం దొలంగె నతఁ డాహవరంగము నందులేఁడు.... భార.కర్ణ. 3.21.

క. కౌరవులు నేయునవమతి, కారణముగఁ గోప మెత్తుఁ గర్ణునివదనాం, భోరుహముం గమఁగొన తమ, మారుగ నావశముగాక యంతన బుద్ధిగ. భార. శాం. 1.18.

మ. ...మార్తాండమూ,ర్తి విడంబింపఁగఁ జక్ర గాండివధరుల్ దేజోమయాకారవై,భవ మారం దనపై వెలుంగ నతిదీప్తంబైన తే రొప్పె భార. ద్రో. 1.124.

చ. పరమవినీతిమై వెలుఁగి బాంధవమారఁగ నల్ల నిట్లనుఁ, గరుడుఁడు... భార. అను. 1.209.

3. అతిశయిల్లు.

క. ద్రుపదనృపాలునిధవళా,తపత్ర మన్త్రంబు లె చోటు దాఁకక జిగియా,రి పొలిచె శారద చంద్రుం,డుపమా పాత్రంబుగాఁగ మర్వియనుదివిఁ... భార. స్త్రీ. 2.147.

సీ. తలపోసి చూడంగ ధర్మమయ్యె నధర్మ మయ్యె నేఁ బ్రాణభయంబుకతన, నట్లు నేసితిఁ గృపయార సైరింపుము... భార. స్త్రీ. 1.157.

4. నిండు, పూర్ణమగు.

సీ. ఉదధిలో నున్న యత్యుగ్రనిపాదుల నారంగ మ్రింగినఘోరవీరుఁడు.... భార. ఆది. 2. 83. (ఆరంగఁ — నిశ్శేషముగా.)

క. వినుము తెలియంగ శ్లేష్మం, బనుదోషం బారఁ బెరఁగి యవయవములు జా,డ్యనిరూఢంబులుగాఁ జే,యును.... భార. అశ్వ. 1. 171.

(ఈయర్థమున సందర్భానుసారముగా దీని తుమున్నంతము 'నిండుగా, బాగుగా, తనియునట్లు' మున్నగునర్థముల నిచ్చును.)

ఉదా. ఆరఁ ద్రాఁగినపాలు :- ఆరఁగ — పూర్తిగా, బాగుగా. హరి. పూ. 5.204.

ఆరఁబండినపండ్లు :- ఆరన్ — పూర్తిగా, బాగుగా, భార. శాం. 1.160.

వీనులార వినియు :- ఆరన్ - తనియునట్లు. భార. ద్రో. 2. 254.

కడుపార వెవ్వానిఁగన్న తల్లి :- ఆరఁగ - తనియునట్లు. మనుచ. 1.18.

మనసారంగను కౌఁగిలించి :- ఆరన్ - తృప్తి నొందునట్లు. పారం. 2.40.

అరంగ సుభద్రఁ బెండ్లియై :- అరంగన్ -

(వ్యవ) కమలారఁ జూచిన దానిని లేదనెదవేమి? (కమలారఁజూచు - పూర్తిగాఁజూచు, స్పష్టముగాఁ జూచు.)

5. ఇది కొన్ని పట్ల నర్థవిశేషము లేకయును గొన్ని పట్ల నర్థవిశేషము కలిగియును గొన్ని పదములతోఁ గలసి శబ్దపల్లవమగును.

ఉదా: అడఁగారు – అడఁగు. నిండారు – నిండు. చల్లారు – చల్లఁబడు. ఎసలారు – అతిశయము కలిగియుండు. ఇట్లే పెంపారు, ఏపారు, మొ.

**అరు²** వి. ఓషధివిశేషము, అరుకము (వృ.వి.) (ఇది హిమాలయమునఁ గలదు.)

**అరు³** వి. రోమావళి, నూఁగారు.

సీ. నెడనెడ నూఁగారి వింతయై యేర్పడు దేరని వళులలో నారు నిగుడ. భార. విరా. 1.245.

గీ. బాల్యతారుణ్యసీమావిభాగమునకు, నజుఁడు వ్రాసిన రేఖ తన్వంగియారు. నైష. 2.15.

**అరు⁴** వి. అవ్వ, నింద.

ఉ. వారక యత్తగారిఁ గనుఁబ్రామి నిజేశ్వరు మోసపుచ్చి యే, యారును దూఱునైనఁ బడి యందఱు కన్ని ఘటించి యాత్మఁ దాఁ,గోరిన నాథునిం గలసి కొల్లలుగా సుఖ మొందకున్నయా, సారసపత్త్రనేత్ర యెలజవ్వన మేటికి జన్మ మేటికిన్. అహ. 3.33.

(వ్యవ) అరును బోరును లేకుండఁ జక్కఁగా సంసారము సాగించుకొనుచున్నాఁడు.

అరును బోరును లేనిసంసారము. (గ్రా)

జ. అరుదూఱు.

**అరుకము** నం. వి. అ. పుం. చలువ నిచ్చుగుణములు గలయొక యోషధి (వృ.వి.) (ఇది హిమాలయమందుఁ బెరుఁగును.)

**అరుగ(క)** – అరిక.

క. ఉలవగునారుగపంటలు, గొటియలపాఁడియును దఱచగుం బురుషులకుం, బెలవల చుట్టము లయ్యెద, రెలచియ భుజియింతు రర్థి నెల్లజనంబుల్. భార. అర. 4.295.

సామె: అరుగ కోసినవదనున కంది కోసినట్లు. అయిన నారుగ కాకున్న కంది.

**అరుమే** - అర్చు².

(అడించు)

క. ఏలినవానిధనంబులు, కాలురు బంధువులుఁ దారు బ్రదికినదినముల్, బ్రేలాడిచి తింద్రాతని, యోలము గని విడవ క్షితి నొరుఁగుదు రాజన్. భార. విరా. 4.217.

**అరుణము** నం. విశే. (అ. ఈ. అ.) అరుణునకు సంబంధించినది. వి.అ.న. అరణ్యకము. వేదమునందలి యొక భాగము.

మ. తుల లే కుండు స్వరూపరూపగుణభూతుల్ దోఁచె నేత్రచ్యుతి,స్థలమై లో వెలిఁ దానె యున్కిఁ దెలిపె న్నారాయణం బారుణం, బులసామాన్యవిశేషరీతి నిఖిలంబు న్బద్ధజాలంబు ని,ర్మలనారాయణశబ్దమందు నెతుదం బర్యాప్త మయ్యెన్స్మృతిన్ ఆము. 3.11.

గీ. త్రిపుర కాస్వాదకళ మదోద్రేకలహరి, ధరణి దేవుఁ డాయోజ మత్తా వహించి, యారుణాలు పఠింపంగ నాలకించి, శంబరారాతి రతి చేయు చలచి నవ్వు. శివరా 3.14

(అరణాలు అపముద్రి)

**అరుణి** నం. వి. ఇ. పుం.-అరుణుని సంతతి-1.ఉద్దాలకుఁ డనుఋషి. 2. యముఁడు.

**అరుదూఱు** వి. (√అరు⁴) అవ్వ, నింద.

సీ. మగని నటుంచి మార్గమగని వెంబడిఁ జన్న కార కేయిల్లాలితనము తగ్గె. గీ. వారి కెవ్వారికిని లేని యారుదూఱు, నీతలనె వ్రానెనే ధాత నికృతిచేత...అహ. 3 49.

అం. భా. 1.115.

(బొరుదూఱు - అపముద్రి.)

**అరుదొండ** - ఆదొండ. వి. తుజాలకము, అడవి దొండ (వృ.వి.)

**అరుద్ర** వి. (నం. ఆర్ద్ర.) ఆర్ద్రానక్షత్రము.(వా)

**అరుద్రపురుగు** వి. అరుద్ర కార్తెలోఁ గనుపట్టెడి పట్టువంటిదేహము గల యొకానొకయెఱ్ఱని పురుగు, ఇంద్రగోపము.

**అరుదుష** నం. వి. అ. స్త్రీ. ఎక్కుటకు నిచ్చె, ఉచ్చదశము బొందునిచ్చె.

**అరురుక్షువు** సం. విణ. (ఉ.) ఎక్క నిచ్ఛగలవాఁడు; ఉచ్ఛదశను బొంద నిచ్ఛగలవాఁడు.

**అరువు(గు)** - ఆరిక.

వ. కొట్టుఆరువు వరువు పుట్టి 1 ట్టికి చి. 6. ద. శా. 4. సం. 1884.

**అరువు** సం. వి. ఉ. పుం. 1. పంది. 2. ఎంగ్రి, పిత. 3. వృక్షవిశేషము.

**అరుష్కరము** సం. వి. అ. న. భల్లాతకఫలము, నల్ల జీడిపండు.

**అరుహము** సం. విణ. (అ. ఆ. అ.) ఎక్కునది.

**అరూఢము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఎక్కినది; ఉచ్ఛదశ నొందినది. 2. ఎక్కఁబడినది. (చెట్టు, మేడ, మొ.) 3. ఉత్పన్నము, కలిగినది.

శ్లో. ...తదాగమారూఢగురు ప్రహర్షః సం. రఘు. 5. 61.

4. పొందినది. 5. పొందఁబడినది,

వ. ఆరూఢవినయం....కాదం.

వి. అ. న. 1. ఆరోహణము.

క. ఘోరాస్త్రశస్త్రవిద్యల, నారూఢములందు నిపుణులై రి కుమారుల్. భార. అది. 6. 3.

2. పెంపు, వృద్ధి. (చూ. అత్యారూఢము.)

**ఆరూఢి** సం. వి. ఇ. స్త్రీ. 1. ఎక్కుట. 2. ఔన్నత్యము.

**ఆరె**[1] వి. ధాతకి, ఏఱుజాతి (వ్య. వి.)

ద్వి. బలుసు ముల్ మోదుగు పచ్చారె యారె, వలిచంద్ర ములుచంద్ర వాడగన్నేరు... ద్వి. శ. సా. 2. 661 పం.

**ఆరె**[2] వి. (సం. ఆరా. శ. ఆరె.) 1.చెప్పులు కుట్టెడు మూది.

సీ. దొంకునామము కుడివంక వంకరసిగ కత్తి యారెయుఁ దోలుఁ గరమునందు. ఉ. హరిశ్చ. 4. 156.

2. ఆయుధ విశేషము.

వ....పేరెలమిం దలపడినవీరుల నారెలం జీరి నాటులు వోసినట్లు చేసియు. ఉ. హరి. 6. 66.

3. కొట్టె, కోడికాలివెనుక ప్రక్కనుండువాఁడి

క. చరణములు నేత్రములుఁ గడు,వరుణము లారెలును ముక్కు నాయతములు. దశకు. 9. 30.

ఉ. పట్టెపుజుట్టు నిక్కుమెడ బాగునఁ జివ్విన యారెపొంకముల్. కువల. 4. 207.

జ. ఆరెవడ్లు.

**ఆరె**[3] వి. (శ. ఆరె.) మరాటివాఁడు.

సీ. ఆరెలు గన్నడి లరవలుం దెలుఁగులుఁ దన బిరు దందియఁ దగిలి కొలువ...ద్వా.1.42.

సీ. ఆరె మరాటివాఁ డన మహారాష్ట్రుఁ డొ. ఆం. భా. 2. 108.

జ. ఆరెము[2].

**ఆరెకుఁడు** వి. (సం. ఆరక్షః. ఆరక్షికః. ప్రా. ఆరక్ఖో. పా. ఆరక్ఖకో.) గ్రామరక్షకుఁడు, తలారి.

వ. అయ్యాశ్రమంబులో డాఁగినవారి వెను దగిలి వచ్చినయారెకు లమ్మునిం గని రాజ ధనాపహారులై నచోరులు నీయొద్దన పాఱిరి. భార. ఆది. 4. 261.

ఆ. ముచ్చుగాఁ దలంచి చెచ్చెర నారెకుల్, పట్టి తెచ్చి కొఱుతఁ బెట్టినట్టి. మార్క. 2. 167.

**ఆరెగోల** వి. ఏనుఁగు ప్రక్కలు పొడిచి బెదిరించుటకై అర్ధచంద్రాకారముగా ఉక్కుతోఁజేసిన యలుఁగు గలవేణుదండము, బరిగోల.

సీ...తోత్రంబు బరి యనఁగ నారెగోల యనంగ నలరుచుండు. ఆం. భా. 2. 195.

క. వెలివాఱును గాలురులును, వల లుఁ దెరలు దీమములును వడిఁ దీరినకుక్కలు నారె గోలలును నుం,దల క్రోపులు వేఁట కార దంబుఁ బెనుపఁగన్. ఉ హరి. 4. 22.

**ఆరెము**[1] వి. (సం. ఆరామః.) ఆరామము.

ఉ. ఆరెముఁ జొచ్చి కందువకు వగ్గెడువంతకు మున్న...షోడ. 4. (శ. ర.)

**ఆరెము**[2] వి. (√ఆరె[3].) మహారాష్ట్ర భాష.

గీ. అరబి పారసి గుజరాతి యారె మచ్చ, తెనుఁగు కన్నడి మొదలుగాఁ దెలిసినాయ.

**ఆరెవడ్లు** వి. బ. (√ఆరె²) మూదులవంటి తోఁకలు గల ఒకదినుసువడ్లు. (శ. ర.)

**ఆరెవెలఁగ** వి. ఒకానొక మంచిజాతివెలఁగ (వ్య.వి.)

**ఆరేకము** సం. వి. అ. పుం. 1. శూన్యత. 2. అకుంచనము, ముడుఁగుట. 3. అతిరేకము, ఆధిక్యము.

**ఆరేచితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఇంచుక ముడుఁగఁ జేయఁబడినది, ఆకుంచితము.

శ్లో. ఆరేచిత భ్రూచతురైః కటాక్షైః. సం. కు. సం. 3. 5.

2. రిక్తముగాఁ జేయఁబడినది, ఉత్తదిగాఁ జేయఁబడినది.

**ఆరేవతము** సం. వి. అ. పుం. ఆరగ్వధము, ఱేల (వ్య.వి.) వ. ఱేలపండు.

**ఆరోగ(గి)ణము** వి. (√ఆరగించే-శ. ఆరోగణ.) భోజనము.

ద్వి. చేతిపులగము చెచ్చెరఁ బుచ్చుకొనుచు, నారోగణము చేసి యందఱు చూడ, బస. పు. 6. 623 పం. (ఆరోగణముచేయు—తిను)

ద్వి. అంత నారోగణ మైనమీఁదటను...ద్వి. పరమ. 3.198 పా.

క....నవ్వుచు నారోగిణంబొనర్చిరి తమితోన్. చెన్న. 4.360. (ఆరోగిణ మొనర్చిరి-తినిరి, భుజించిరి.) ఆం. సం. మాన. 28. సాం. ని. మాన. 22.

**ఆరోగ్యము** సం. వి. అ. న. స్వాస్థ్యము, రోగము లేమి.

**ఆరోగ్యశాల** సం. వి. ఆ. స్త్రీ. చికిత్సాస్థానము, వైద్యశాల.

**ఆరోచనము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ప్రకాశించునది. 2. ప్రకాశింపఁజేయునది. వి.అ.న. 1. ప్రకాశించుట. 2. ప్రకాశింపఁజేయుట.

**ఆరోఢ** సం. విణ. (ఋ. ఱీ. ఋ.) ఎక్కెడివాఁడు.

**ఆరోఢవ్యము** సం. విణ. (అ. ఆ. అ.) ఎక్కఁదగినది.

**ఆరోపకము** సం. విణ. (అ. వికా. అ.) 1. ఆరోపించునది, లేనిది మోపునది. 2. నాటునది. (ఉదా:- వృక్షారోపకుఁడు.) 3. ఎక్కించునది.

**ఆరోపణము** సం. వి. అ. న. 1. ఆరోపించుట, లేనిది మోపుట. 2. పైని ఉంచుట, పైని పెట్టుట.

శ్లో....అర్ద్రాక్షతారోపణ మన్వభూతామ్. సం. రఘు. 7.27.

3. (అశ్వాదులను) ఎక్కించుట. 4. ఎత్తుట. (ఉదా:ధ్వజారోపణము.) 5. (వృక్షాదులను) నాటుట. 6. విల్లు ఎక్కు పెట్టుట.

**ఆరోపణీయము** సం - ఆరోప్యము.

**ఆరోపము** సం. వి. అ. పుం. 1. ఒక దాని ధర్మములు అవి లేని మఱియొక దానియందు ఉన్నట్లు చెప్పుట. (క) తర్క - మిథ్యాజ్ఞానము.

(చ) అలం - అభేదజ్ఞానము :- ఉపమానోపమేయములను ప్రత్యేకముగాఁ దెల్పి వాని కభేదమునునిరూపించుట. (ఉదా: ఆ మెకన్నులు పద్మములు.)

ఉద్దిష్టోపమేయమును ప్రత్యేకముగాఁ దెల్పక యుపమానోపమేయములకు అభేదమును నిరూపించుట అధ్యవసాయము. (ఉదా :- స్త్రీ కన్నులనుజూపి - అవిగో పద్మములు.)

2. (నింద మొదలగు వానిని) మోపుట. 3. పైని ఉంచుట.

**ఆరోపయిత** సం. విణ. (ఋ. ఱీ. ఋ.) 1. ఆరోపణము చేయువాఁడు. 2. ఎక్కించువాఁడు.

**ఆరోపించే** సం. స. క్రి. ఆరోపణము చేయు.

(క) లేనిది మోపు.

క. ఆరోపింతువు నాపై, నేరము విపరీతముగను నీపై రారా, యూరకె యుఁకైన రాజకు, మూరక నామాట వినుట మంచిది సుమ్మీ. సారంగ. 2.136.

(చ) లేనిది కల్పించు.

వ. అశతపత్రనేత్రయందు మైత్రి నారోపించి. మార్క. 5.201.

**ఆరోపితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఆరోపింపఁబడినది. 2. ఎక్కింపఁబడినది, 3. ఎక్కు పెట్టఁబడినది (విల్లు). 4. పైఁ బెట్టఁబడినది.

**ఆరోపితవ్యము** సం — ఆరోప్యము,

**ఆరోప్యము** సం. విణ. (అ. ఆ. అ.) ఆరోపింపఁ దగినది.

**ఆరోహకము** సం. విణ. (అ. హికా. అ.) 1. ఎక్కునది. 2. ఎక్కించునది. 3. మొలచునది,బయలు దేలునది. వి. అ. పుం. వృక్షము.

**ఆరోహకుఁడు** సం. వి. అ. పుం–ఎక్కెడివాఁడు – 1. మావటీఁడు. 2. గుఱ్ఱపురౌతు.

**ఆరోహణము** సం. వి. అ. న. 1. ఎక్కుట. 2. అశ్వాదుల నెక్కుట. 3. సోపానమార్గము. 4. అంకురించుట, మొలకెత్తుట. 5. నర్తనమునకై యెత్తుగాఁ గట్టినరంగము. 6. ఆరోపణము, ఎత్తుట.

(ఉదా : ధ్వజారోహణము.)

**ఆరోహత్** సం. శ(త. ఎక్కుచున్న.

**ఆరోహము** సం. వి. అ. పుం. 1. ఎక్కుట. 2. అశ్వాదుల నెక్కుట. 3. ఉన్నతి, ఎత్తు. 4. నిడుపు, దీర్ఘత్వము. 5. నితంబము, స్త్రీల పిఱుఁదు.

'శ్రోణ్యాం చారోహః' (వై. ని.)

సీ...ఆరోహభరమున నడుగులు తడఁబడ. భాగ. 8.893.

6. అంకురాది ప్రాదుర్భావము, మొలకెత్తుట. 7. శిఫ, ఊడ.

**ఆరోహి** సం. విణ. (న్. ణీ. న్.) ఆరోహించువాఁడు.

**ఆరోహించు** సం. స. క్రి. ఎక్కు.

వ. ...రెండవయుచ్చైశ్శ్రవంబునుం బోలిన యాసవాహ్యంబు నారోహించి. నైష. 1. 35.

వ. పరితఃపతితమృతవీరులఁ దనుత్రాణశిరస్త్రాణ భూషణవస్త్ర విశేషంబుల యథాతథంబుగాఁ బూన్చి మాతంగతురంగశవంబు లారోహింపించి .... వినోదించు పిశాచలోకంబు. కవిక. 2. 197. (ఆరోహింపించు–ఎక్కించు.)

**ఆరోహుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) ఎక్కువాఁడు. (ఉదా : అశ్వారోహుఁడు, గజారోహుఁడు, రథారోహుఁడు. మొ.) వి. అ. పుం. 1. మావటివాఁడు. 2. గుఱ్ఱపురౌతు, రౌతు. (శ్లో. సారోహాణాంచ వాజినాం. సం.రామా.)

**ఆర్కి** సం. వి. ఇ. పుం – అర్కునికొడుకు – 1. యముఁడు. 2. శని. 3. కర్ణుఁడు. 4. సుగ్రీవుఁడు. 5. వైవస్వతమనువు.

**ఆర్క్షము** సం. విణ. (అ. ఈ. అ.) నక్షత్రసంబంధి.

**ఆర్గళము** సం. వి. అ. పుం. అర్గళము, తలుపు గడియ.

**ఆర్గళి** సం. వి. ఈ. స్త్రీ – అర్గళము.

**ఆర్గురు** – ఆఱుగురు.

క. కట్టా యార్గురుకొడుకులఁ, బట్టి వధించితివి. భాగ. 10. పూ. 151.

**ఆర్గ్వధము** సం – ఆరగ్వధము.

**ఆర్ఘ** సం వి. అ. స్త్రీ. మధుమక్షికాభేదము,పసుపు రంగుగల ఒకవిధమైన తేనెటీఁగ.

**ఆర్ఘ్యము** సం. విణ. (అ. ఆ. అ.) ఆర్ఘలు అను తేనెటీఁగలచేఁ గూడఁబెట్టబడినది. (ఒకరకపు తేనె)

**ఆర్చము** సం. విణ. (అ. ఆ. అ.) అర్చాయుక్తము, పూజించునది. 2. (అ. ఈ. అ.) ఋక్కునకుఁ గాని ఋగ్వేదమునకుఁ గాని సంబంధించినది.

**ఆర్చికము** సం. విణ. (అ. ఈ. అ.) 1. ఋగ్వేదమందున్నది. 2. ఋగ్వేద వ్యాఖ్యానరూపమైనది. (గ్రంథాది) వి. అ. న.సామవేదము.

**ఆర్చు**[1] – ఆఱుచు[1] అ. క్రి. అఱచు, బొబ్బరించు; ఘోషించు.

క. కలయ ననిముసలదండం, బులు గొని కాంపిల్య నగరమునజను లెల్లఁ, నలి రేఁగి యార్చి కౌరవ, బలసుభటులఁ బొడిచి రాజి బడలువడంగన్. భార. ఆది. 6. 71.

సీ. అపుడు బ్రాహ్మణు లెల్ల నన్యాయ మన్యాయ మనుచుఁ బెరెలుఁగున నార్చువారు. వరాహ. 10. 41.

గీ. మధువుఁ గాంతలపుక్కిటి మధువుఁ బేళ్ల, యూర్పులఁ బస మూపఁ బొగడపై నెలయ దాన, విరిసెఁ దొల్లిటిదళములు విరులు జడిసె, దీవనగ్గెల్పువకు మల్లి తేఁటులార్చె. ఆము. 5. 130.

గీ. వవధి బహుఘోషమున నార్చె వాన పేర్చె. ఉ. రా. 103.

ఙ. అరుపు.

**అర్పు**² – అరుచే. న. క్రి. (√అడు) అడఁజేయు.

1. చలింపఁజేయు, కదలుచు; విసరు.

గీ. ఏచి సావిత్రుఁ డొకశక్తి వైచుటయును, దనుజుఁ డెడఁ ద్రుంచె నతఁడు రథంబు డిగ్గి, ఖడ్గహస్తుఁడై కవిసినఁ గాలుసేయి, యార్పరాకుండ నేసి యయ్యసియుఁ దునిమె. హరి. ఉ. 10. 50.

సీ. పిట్టలనార్ప నాపుట్ట పట్టున మంచెఁ గావించి. ద్వా. 1. 161. (అర్పగ – తోలుటకు)

ఉ....విటు లార్చునుశీరపుఁదాళ వృంతముల్. ఆము. 2. 63.

2. వర్తింపఁజేయు, ఆడించు.

క. నేర్పరి పెక్కువిధంబుల, నార్పఁగ బొమ్మలు గడంగి యాడెడుచందం, బేర్పడఁ గాన్పును. భార. శాం. 1. 283.

3. (స్నానాదులు) చేయించు, నిర్వర్తింపఁ జేయు.

సీ. నీహారసలిలంబు నించి కాంచనకలశముల మజ్జనమార్పఁ జనవు లేదు. వరాహ. 7. 47.

మ. జలకం బార్చె లతాంగి యొత్తు యదువంశ స్వామికిన్ వేడుకన్. పారి. 2. 11.

4. పలికించు, చెప్పించు.

సీ. కెంగేలు గేలితోఁ గీలించి నెయ్యంపు మాటలఁ దగుముఖమాట లార్తు. భార. విరా. 2. 310.

5. (యంత్రాదులఁబెట్టి) త్రిప్పించు.

క. ఆవెపమున ద్రోహమునకు, వానినకా దరసి యతని వంశంబెల్లన్, గానువునఁ బెట్టి యార్చిన, నేనియుఁ జాల దిది పెద్దయే దతునకున్. కు. సం. 2. 229.

7. (ద్యూతాదులను) ఆడఁజేయు, ఆడించు.

చ. మది మది నుండ నీసుతుఁడు మంత్రులు సౌబలు జూదమార్చి సంపద గొని. భార. ఉద్యో. 3. 230.

**అర్పు**³ – ఆఱుచే². న. క్రి. (√ఆఱు¹) ఆఱఁ జేయు. 1. నిర్ద్రవముగాఁజేయు, తడిలేనిదిగాఁ జేయు.

సీ. కొనగోళ్ల వెఱలచిక్కులు వాపి మెలపున శిరసార్చె నొక్కతెఁజిగురుఁబోఁడి. పారి. 2. 12.

2. మలుగఁజేయు, (దీపాదులను) పోఁజేయు.

సీ. ఏకదీప మార్చిన నున్నదీపంబులు నప్పుడ తమకుఁ దా మాఱుటయును. నైష. 7. 169.

3. ఉపశమిల్లఁజేయు.

ఉ. ఆర్చెదొ తీర్చెదో తెలుప నయ్యెడి దేమని యంతఁ దేటిపాటయోర్చు టెఱుంగ కంటి. సారంగ. ౨. 185.

పటికనార్చినపసిఁడి – పటిక పట్టించి యది యాఱునట్లు కాల్చి శుద్ధి చేసినబంగారము.

గీ. ...పటికనార్చినపదివన్నె పసిఁడిగట్టు, కీలి జిగిఁ బూను కృసి తనిమేను. దశా. 4. 89.

**అర్జకుఁడు** నం. విశ. (అ. ర్జికా. అ.) అర్జకుఁడు, సంపాదించువాఁడు, గడించువాఁడు.

**అర్జనము** నం. వి. అ. న. అర్జనము, సంపాదనము, గడన.

**అర్జము** – అరజేము².

(విలాసము)

ఉ. చక్కెర మోవిశాటు దమసానులచీరలవల్లె వాటు లేఁ, జెక్కులగోటినీటు మెయిఁ జెల్వగుకీల్జడవాటు నార్జవుం, దెక్కు ఘటింప. చం. రా. 3. 67.

**అర్జవము** నం. వి. అ. వ. 1. సంశయము, వక్రము కామి. 2. పగులను మోసపుచ్చకుండుట, కప టములేమి, చక్కనినడవడిక.

**అర్జించే** నం. అ. క్రి. సంపాదించు, గడించు.

వ. సుకృతంబు లార్జించి. వరాహ. 1. 58.

**అర్జితము** నం. విశ. (అ. అ. అ.) అర్జితము, సంపా దింపఁబడినది, గడింప బడినది.

**అర్జుని** నం. వి. ఇ. పుం – అర్జునునికొడుకు – అభి మన్యుఁడు.

**ఆర్తగళ** సం. వి. ఆ. స్త్రీ. నల్లగోరంట (వృ. వి.) (రం. ని. రాజని.)

**ఆర్తగళము** సం. వి. అ. పుం. 1. నీలఝింటి, నల్ల గోరంట (వృ. వి.) 2. అరుదొండ (వృ. వి.) (రం. ని.)

**ఆర్తము** సం. విణ. (అ. ఆ. అ.) 1. పీడితము, నొప్పింపఁబడినది. 2. దుఃఖము నొందినది, కష్ట దశయందున్నది. 3. అస్వస్థత, రోగముగలది.

**ఆర్తవము** సం. విణ. (అ. ఈ. అ.) 1. (వసంతాది) ఋతుసంబంధమైనది. 2. స్త్రీఋతు సంబంధ మైనది. వి. అ. న. 1. స్త్రీఋతువు, రజస్సు. 2. పుష్పము. 3. ఋతుస్నానమైనపిదప గర్భో త్పత్తికి అనుకూలమైనకాలము.

**ఆర్తవి** సం. వి. ఈ. స్త్రీ. గోడిగ, అఁడుగుఱ్ఱము.

**ఆర్తి** సం. వి. ఇ. స్త్రీ. 1. పీడ, నొవ్వు. 2. మనో వ్యథ, దుఃఖము. 3. తెవులు, రోగము. 4. కీడు, ఆపద. 5. వింటికొప్పు.

**ఆర్త్విజీనుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) ఋత్వి క్కుగా నుండఁ దగినవాఁడు.

**ఆర్త్విజ్యము** సం. వి. అ. న. ఋత్విజునిభావము, ఋత్విజునిపని.

**ఆర్థపత్యము** సం. వి. అ. న. అర్థపతిత్వము.

**ఆర్థము** సం. విణ. (అ. ఆ. అ.) అర్థమునకు సంబం ధించినది. (చూ. అర్థము.)

**ఆర్థి** సం. వి. ఈ. స్త్రీ. 1. (అలం) అర్థమువలనఁబుట్టు వ్యంజన. (వ్యతి. శాబ్ది) 2. సదృశాదిశబ్దములు గల యుపమాభేదము. (వ్యతి. శ్రౌతి)

**ఆర్థికము** సం. విణ. (అ. ఈ. అ.) 1. అర్థము, ప్రయోజనముగాఁ గలది. 2. అర్థమువలన వచ్చినది 3. అర్థమును గ్రహించునది. (చూ. అర్థము)

**ఆర్థికుఁడు** సం. విణ. (చూ. ఆర్థికము) వి. అ. పుం. కవిభేదము. (వివేకి, వాచకుఁడు, రౌచికుఁడు, ఆర్థికుఁడు, శిల్పకుఁడు, భూషణార్థి, మార్ద వానుగతుఁడు-అని కవులు ఏడువిధములు.)

**ఆర్దుము** వి. (ఆఱు+తూములు) ఆఱుతూములు. (తూము — నాలుగుకుంచములు.) ఆం. భా. 2. 271.

**ఆర్ద్రి** సం. వి. ఆ. స్త్రీ. ఒకానొక నక్షత్రము.

**ఆర్ద్రికము** సం. వి. అ. న. అల్లము, శృంగబేరము (వృ.వి.)

**ఆర్ద్రిజాతకము** సం. వి. అ. న. పొంటి. (రం. ని.)

**ఆర్ద్రిమాష** సం. వి. ఆ. స్త్రీ. మాషపర్ణి, కారు మినుము (వృ.వి.)

**ఆర్ద్రము** సం. విణ. (అ. ఆ. అ.) 1. తడిసినది, క్లిన్నము; తేమగలది. (దయార్ద్రము మొదలగు చోట్ల దయారసముచేత తడిసినదని భావము.) 2. పచ్చిది, శుష్కముకానిది: నూతనము. (ఉదా: ఆర్ద్రమూనసము, ఆర్ద్రాపరాధము.) వి. అ. పుం. న. ఆర్ద్రికము, అల్లము (వృ.వి.) (వై. ని.)

**ఆర్ద్రశాకము** సం. వి. అ. న. అల్లము (వృ.వి.)

**ఆర్ద్రాలుబ్ధకుఁడు** సం. వి. అ. పుం. కేతుగ్రహము.

**ఆర్ధికుఁడు** సం. విణ. (అ. ఈ. అ.) పంటమొదలైన వానిలో సగముగ్రహించువాఁడు. (పాలికాఁపు, మొ.) వి. అ. పుం. బ్రాహ్మణునకు వైశ్యస్త్రీ యందుఁబుట్టి బ్రాహ్మణునిచేత సంస్కరింపఁ బడినవాఁడు, అంబష్ఠకులమువాఁడు.

**ఆర్పు**—అఱుపు. వి. (√అర్చు') 1. అఱపు, కేక.

మ. ...బొబ్బలు నార్పుల్ పటుసింహనాద ములు నుత్పాదిల్ల ధాత్రీస్థలిఁ, భీమ. 4. 191.

చ. హరి పొడగానరాఁ దలహాలాయుధుఁ డెక్కడవోయె సాత్యకిన్,బొరిగొనుఁడంచు నార్పులును బొబ్బలు నింగిఁ జెలంగ...ఉ. హరి. 3. 25.

2. సింహనాదము.

సీ. ఆర్పు బొబ్బ యనంగ నగు సింహనాదంబు ...ఆం. భా. 2. 223.

**ఆర్పటము** సం. వి. అ. పుం. (ఇది తెనుఁగుగ్రంథము లందే కాన్పించుచున్నది.) ఆర్పు మున్నగు వానితోఁ గూడిన విజృంభణము.

సీ. ...పాపమతుల,పై దాడివెడలి యార్భటము సేయఁగ వారు దైత్యాంశజులుగాన ధైర్య మెసఁగ. వేం. మా. 3. 8.

**ఆర్పటి** నం. వి. ఈ. స్త్రీ. (ఇది ఆంధ్రగ్రంథములందే కాన్పించుచున్నది.) 1. మ్రోఁత, ధ్వని.(శ.ర.) 2. విజృంభణము, అతిశయము.

ఉ. ...నభో, వాటి నెసఁగె నంత సురవార వధూమురజారవార్పటుల్ వసు. 2. 156.

శా. ...నమస్కరించి పలికెన్ గంభీరవాచార్పటిన్. ఉ. రా. 2. 187.

**ఆర్పటించు** నం. వ. క్రి. 1. ధ్వనించు, కూయు.

ఉ. ఆమని వచ్చె వాకు వని యందఱలోఁ గడు విఱ్ఱవీఁగుచున్, గాముఁడు మెచ్చ నెత్తులగు కత్తులు త్రిమ్మంగెద వార్పటించుచున్ ... కోకిలా. ఇందు. రా. 3. 128.

2. విజృంభించు.

గీ. ...వసుధ నీటి,బరువు కోపంగలేక లోపలికిఁ గ్రుంకు,నపుడు హైరణ్యలోచనుఁ డార్పటించి. వ. ధరణీతలంబును రసాతలంబునకుఁ గొనిపోయి యందు బహుకాలంబు క్రీడించుచుండె. వేం. మా. 1. 46, 47.

**ఆర్పాటము** నం. వి. అ. పుం. (ఇది తెనుఁగుగ్రంథములందే కాన్పించుచున్నది.) విజృంభణము, అతిశయము, చెలరేఁగుట.

ద్వి. అందఱు నేకమై యార్పాటమునను,గ్రింద రాకుండఁగఁ గేకలువేయ. ద్వి. శ. సా. 1. 215 పం.

**ఆర్య** నం. వి. ఆ. స్త్రీ. 1. పూజ్యురాలు. 2.పార్వతి. 3. అత్త. 4. (ఛంద) మాత్రావృత్త భేదము. 5. (నాటక) నటుఁడు భార్యను బిలుచునపు డుపయోగించు నామము.

**ఆర్యకము** నం. వి. అ. న. గయలోఁ బితృదేవతల నుద్దేశించి చేయు శ్రాద్ధవిశేషము.

**ఆర్యకుఁడు** నం. విశే.(అ. ఆ,ర్యకా. అ.)పూజ్యుఁడు, శ్రేష్ఠుఁడు. వి. అ. పుం. పితామహుఁడు.

**ఆర్యగృహ్యుఁడు** నం. విశే. (అ. ఆ. అ.) ఆర్యుల పక్షపువాఁడు.

**ఆర్యపుత్రుఁడు** నం. వి. అ. పుం. 1. మాన్యుఁడగు వానిపుత్త్రుఁడు. 2. (నాటక) భార్య భర్తను బిలుచునప్పు డుపయోగించు పూజ్యనామము. (కొన్నిపట్ల కావ్యభాషయందుఁగూడఁ గనఁబడుచున్నది.)

శ్లో. ఆర్యపుత్త్ర! పితా మాతా భ్రాతా పుత్త్ర స్తథా స్నుషా,స్వాని పుణ్యాని భుంజానాః స్వంస్వం భాగ్యముపాసతే. రామా. (కల్ప)

**ఆర్యభటుఁడు** నం. వి. అ. పుం. జ్యౌతిషగ్రంథ విశేషమును రచించిన యొక విద్వాంసుఁడు.

**ఆర్యమిశ్రుఁడు** నం. విశే. (అ. ఆ. అ.) గౌరవాన్వితుఁడు, పూజ్యుఁడు.

**ఆర్యావర్తము** నం. వి. అ. పుం పూర్వపశ్చిమ సముద్రములకును వింధ్యహిమాలయపర్వతములకును నడిమిభూమి.

**ఆర్యుఁడు** నం. విశే (అ. ఆ. అ.) 1. పూజ్యుఁడు. 2. మంచివాఁడు, సాధువు. 3. వినీతుఁడు. 4. కులీనుఁడు. 5. కర్తవ్యము నాచరించుచు, అకర్తవ్యము విసర్జించుచుఁ బ్రకృతాచారమున వర్తించువాఁడు. వి. అ. పుం. 1. ఆర్యావర్తదేశపువాఁడు, (వ్యతి. అనార్యుఁడు, (బ్రాహ్మణ క్షత్త్రియవైశ్యులలో నొకఁడు

**ఆర్వురు**—అఱుగురు.

ఉ. అర్వురు చక్రవర్తులు పదార్వురురాజులు ... విక్ర. 2. 34.

**ఆర్వేరము**—అరివేరము.

(కలహము.)

గీ. విభునితమకంబుతో నిట్లు వెలఁదిసిగ్గు,పోరు చెల్లను వట్టియార్వేరమయ్యె.అని.1.118.

(ద్వేషము)

గీ. వట్టియార్వేరమున బలవంతుతోడి. సాటికిఁ బెనంగు చెల్లనిష్ఫలము గాదె. అని. 1. 89.

(అల్లరి)

ఉ. కారణమేమి లేకయె వికావిక నవ్వును నిర్నిమిత్త మె,వ్వారల నైనను బిలిచి వాదుకుఁ బోవునిరర్థకంపుహుం,కారముతోఁ బెలంగు నరికన్ను బొమల్ ముడివెట్టు వట్టియా,ర్వేరము సేయు సీధురసవిభ్రమ యైనమృగాక్షి యత్తఱిన్ కవిరా. 5. 186.

**ఆర్వేలవారు** వి. బ. ఆఱువేల దేశమువారు,నియోగులలో నొకశాఖవారు.

సీ. అఖిలరాజాధి రాజాస్థానజనహృద్యవిద్యావిహారు లార్వేలవారు. ఉ. రా. 1. 27.

**అర్షభము** సం. విణ. (అ. ఈ. అ.) వృషభసంబంధమైనది.

**అర్షభ్యము** సం. వి. అ. పుం. కాలక్రమమున ఆఁబోతు కాఁదగినకోడె. స్పష్టతారుణ్యము గలకోడెదూడ.

**అర్షము** సం. విణ. (అ. ఈ. అ.) 1. ఋషిసంబంధమైనది. 2. ఋషిప్రోక్తమైనది (పురాణాది). 3. వైదికము, వేదమందుపయుక్తము (పదాది -వ్యతి. లౌకికము.) వి. అ. పుం. అష్టవిధవివాహములలో నొకటి. (ధర్మార్థము వరునివలన ఒకటి గాని రెండు గాని గోమిథునములు పుచ్చుకొని కన్యక నిచ్చి యథాశాస్త్రముగాఁ జేయు వివాహము) స-ఋషి సేవితమైనది-వేదము.

**అర్షేయుఁడు** సం. విణ. (అ. ఈ. అ.) ఋషులగోత్రమునఁబుట్టినవాఁడు, ఋషిసంతతివాఁడు.

**అర్హంతి** సం. వి. ఈ. స్త్రీ. యోగ్యత, అర్హత.

**అర్హంత్యము** సం. వి. అ. స-అర్హంతి.

**అర్హతము** సం. విణ. (అ. ఈ. అ.) జైనునికి సంబంధించినది. వి. అ. స. జైనమతము. అర్హతుడు సం. వి. అ. పుం. జైనుఁడు, జైనమతావలంబి.

**ఆఅడి.** వి. 1. కష్టము, దుఃఖము, బాధ.

ఉ. వారణసీపురంబున నవారణ మేను దొఱంగ నేల కే,దారజలంబు లర్థి మెయిఁ ద్రావి శరీరము కోరవోవఁగా, నాఅడి వొంద నేల ...విక్ర. 1. 200. (ఈయర్థమున నిందును కవిరా. 5. 210. లోను దీనికి సాధురేఫముతోఁ బ్రాసము కన్పట్టుచున్నది.)

మ. అవికీశాంశుల కావిధుంతుదునిచే నాఅళ్లుగన్నఁ ...దైవంబె బాల వరిష్ఠంబని తోఁచెడిఁ సురభిమల్లా నీతివాచస్పతీ. మల్ల. నీతి. 85.

2. హాని; భంగము.

ఉ. ఇంకిట మాట లేమిటికి నింతకు నాతనయాల లామ మే,ణాంకనిభాస్య యెందుఁ బడి యాఅడిఁ బొందెనొ యెంత గుందెనో. రాజ. చ. 2. 86.

గీ. నిత్యనైమిత్తికము లైనవనిఖిలకర్మ, ములకు

నింటికిఁ జను నుపాయంబు వేఁడి,కొవఁగ నిచ్చుట వొకతపోధనుఁడు లేఁడె. మార్క. 4. 228.

3. నింద, అట్టు, అపవాదము; అపకీర్తి.

క. పరు లెఱిఁగిన నాఅడికిం,గరి యగు నను తలఁపు లేక. దశకు. 4. 69.

గీ. అయినయాఅళ్లు నాడికోళ్లయిన వమ్మ, కాఁగలట్టిది యేమైనఁ గాని కలదు, ఇంక నీకనుదాఁ పురం బేల పొమ్ము, అంబుజాకాంతీ పక్వబింబాధరోష్ఠి. గంధ. 1. 67.

క. ... అత్తయు నొనరించు పనుల కాఅడి గలదే. కుచేల. 1. 90.

చ. సురలకు నోడి పాఱకుఁడు సొంపఱి రాహుని లాం పాటినన్, మరణము దప్పునే యచట మానుగ ధాత యొనర్చినట్టిపెం, దెరువు మొఱంగ నెవ్వరికిఁ దీరునె యాఅడి యేల కార్యము, న్నిరతంకీర్తియు నైడఁగఁ జేయక కయ్యము సేయుఁ డుక్కునన్. మార్క. 1. 58.

విణ. 1. వ్యర్థము, ప్రయోజనము మాలినది.

మ. ...శూరశ్రేష్ఠులన్యుల్ జగం,బుల లేరెవ్వరుఁ గయ్యపుంగఅవు నన్ బొందెం ద్రిలోకేశ బా,హులు వే యాఅడి మోపులై యెటులు పోనోపుం దలం కయ్యోడిన్. హరి. ఉ. 7. 16.

సీ. గతిమాలి విగియాఱు కాఁగిలి లేని యాఅడి కూర్మికే నేల అట్టుపడితి. ఉ. హరి. 5. 117.

2. దుష్టము, చెడ్డది.

ఉ. అక్కచు నెట్టుగా మఱతు నాఅడిదయ్యము యింత చేసితే. యయా. 3. 125.

3. నింద్యము, నీచము.

సీ. నహుషుని విరహంపుఁదహతహల్ చూచెనే సాంద్రసద్గుణచర్య యింద్రు భార్య, మఱి సింహబలుని పెన్మాయలఁ జిక్కెనే యాఅడి పనిఁబూని యాజ్ఞసేని. హంస. 1. 127.

వ. ఎంతవానిఁ లేపట్టిన పెట్టియిల్లు మెట్టిన

కంటికిఁ దత్ఫలం బనుభవింపక పోవచ్చునే. ఉ. రా. 8. 81.

ఉ. ఆఱడిబుద్ధిఁ గన్యఁ గవయన్ యమదూతలుమట్టి యాతనిన్, గోఱలఁ జీరి చక్కసులగుంపు దినన్ దొరఁగ నుంచి కత్తెరన్, దూఱిచి మేఢ్రముష్కములు ద్రుంచి యదల్చినశృంఖలాంఘ్రికా, నూఱుయుగంబులుం బగఁ గనుంగొనుఁడిమ్మట నంత్యజన్మతన్. సిద్ధి. శేషధర్మ. (చి. ని.)

క్రి. విశ. 1. నిష్కారణముగా.

ఉ. అక్కట లోక మెల్ల నగ నాఱడి కప్పులఁ జంప దీన నీ, కెక్కుడి పెంపు గల్గుఁ బృథివీశ్వర కోపము డింపు.... భార. అర. 4. 33.

ఉ. యతుఁ డెఱింగి వచ్చి యిటు లాఱడి చావగ నేల చెప్పు మ,జ్ఞాతి ... భార. ఉద్యో. 4. 385.

2. వ్యర్థముగా, నిష్ప్రయోజనముగా.

చ. అనుటయు నాతఁడిట్లనియె నాఱడి విప్రుల కేల యశ్వముల్. భార. అశ్వ. 4. 349.

ఉ. చచ్చినపిమ్మటం గడిఁదిశత్రుల నోర్వఁగ వచ్చునే శుభం, బిచ్చునె చావు లెందును నరేశ్వర యాఱడి చత్తు నంట దా, మెచ్చ గునయ్య భార. అర. 6. 58.

3. దీనముగా.

గీ. కాశిరాజ కన్యలకుఁ గాఁగఁ బుడమి, నరపతుల నెల్ల గెలిచినబిరుదు గలన, నాఱడియపడు టూహింప నడలు గదురు. భార. శాం. 1. 196.

చ. ...నిమం బగఱు సంపఁగఁ గావఁగ లేని మీబలాధిపతుల దూఱు సాత్యకి యతిశ్రమ మొందినచోటఁ దాఁకి కప్పటిచి చంపెదీ వతఁడు సచ్చునె యాఱడి యేనుగల్గఁగాన్. భార. ద్రో. 4. 270.

జ. ఆఱడిచేయు, ఆఱడిపడు, ఆఱడిపుచ్చు, ఆఱడిపోక, ఆఱడిపెట్టు, ఆఱడివోవు.

**ఆఱడిచేయు** అ. క్రి. (√ఆఱడి) వ్యర్థముచేయు, నిష్ఫలముచేయు.

ఉ. అక్కట వాఁడు నాతగుల మాఱడిచేసి ... మనుచ. 3. 5.

**ఆఱడిపడు** అ. క్రి (√ఆఱడి) ఆఱడి నొందు.
(వ్యర్థమగు, కృతకృత్యము గాక యుండు)

ద్వి. ...మాతాత లుదగ్రులై వచ్చి, యాతత కపిల కోపాగ్నిచేఁ గ్రాఁగి, దుఃఖు వేలేండ్లు సన్నుతగతి లేక, నాఱడిపడి భస్మమై యున్న వారు రం. రా. బాల. 42 పా. 19 పం.

(హాని చెందు, నాశము నొందు)

ద్వి. నినుఁ జంప వచ్చిన నీపాలిమృత్యు, వనక రామునిచేత నాఱడిపడితి ... రం. రా. కిష్కిం. 215 పా. 13 పం.

**ఆఱడిపుచ్చు** స. క్రి. (√ఆఱడి) 1. వ్యర్థము చేయు.

ఉ. ఆలము సేసి నాతగుల మాఱడిపుచ్చఁగ నేల బేల న, న్నేలి యనంతభోగముల నిచ్చమె యిన్ విహరింపు...భాం. విరా. 2. 253.

2. దుఃఖపెట్టు.

గీ. ...నిన్నిట్లు గానపాలు, సేసి యాఱడిపుచ్చి తి రెప్పుఁ డిట్టులయ్యె నామను వే మవ నంబుజాక్షి. నిర్వ. 9. 88.

3. భంగపఱుచు, చెడఁగొట్టు.

ఉ. అక్కట భర్తకాఁపురము నాఱడిపుచ్చి నృపాలమౌళితోఁ, జొక్కి రమించునందు లకుఁ జొచ్చినఁ దావకబంధువర్గముల్, దక్కువ సేతు రమ్మ...హంస. 1. 124.

**ఆఱడిపోక** వి. (√ఆఱడిపోవు) ఆఱడిపోవుట.
(దూఱుపడుట, నిందపడుట)

ఉ...ప్రచ్చట రచ్చ కెక్కుటకు నాఱడిపోకకు నోర్తు మైథిలి. నిర్వ. 9. 89.

(వ్యర్థమగుట, నిష్ఫలమగుట.)

ఉ. ఆఱడిపోకయున్ ఫలము నందుటయుం గని పల్కె నేరమిన్. భార. ఉద్యో. 3. 107.

**ఆఱడిపె(పె)ట్టు** స. క్రి. (√ఆఱడి) 1. వ్యర్థము చేయు.

ఉ. మొల్లసుగంధి నామనసుమోహము నాఱడి పెట్టి నీవు న, న్నొల్లక వీడనాడెద వయో తగవా...వి. పు. 2. 233.

2. బాధపెట్టు.

సీ. వోరూరఁ జేయుచు నాఱడివెట్టినమోవి
క్రొవ్వాఁడి పల్మొనల నొక్కి. కవిరా. 3. 210.

3. నిందపెట్టు, అవ్వసేయు.

క. ఆఱడివెట్టెద నని మది,నాఱనిచల మూని కఱకు లాడెద వకటా, నూటిడుములు వొదవిన నిఁకఁ, గాఱడవుల కమపఁ జాలఁ గద యిక్ష్వాకుడుకున్. అచ్చ. రా. అయో. 25.

**ఆఱడివో(పో)వు** అ. క్రి. (√ఆఱడి) 1. వ్యర్థమగు, నిష్ఫలమగు.

చ. అనవుడుఁగృష్ణుఁ డిట్టు లను నాఱడివోయెఁ బ్రయత్నమెల్ల ...భార. అశ్వ. 3. 59.

ఉ....నైషధుఁడునుం గడుఁ జింత వహించె విన్ననై, యక్కట దైవకార్యమిటు లాఱడి వోవునె యంచు నాత్మలో. నైష. 4. 104.

2. చెడు, భగ్నమగు.

ఉ. అక్కల కన్యకాత్వ మిటు లాఱడివోవఁగ ...నిర్వ. 2. 24.

క. అనుమానింప కతనిఁ జేరు, మనరుగదా మీయుపాయ మాఱడివోవన్. భార. ద్రో. 2. 234.

3. చచ్చు.

ఆ. అవ్విధమునఁ గర్ణుఁ డాఱడివోయిన, నాదు మానసంబు వోదు నూఱు, పఱియలై .... ఆశ్ర. 1. 154.

ఆ. అడరి పెలుచ నేడ్చె నాఱడి వోయిన, ప్రజలఁ బేరు గ్రుచ్చి పనవి పనవి. భార. మౌ. 107.

**ఆఱు** అ. క్రి. 1. నిర్జలమగు, శుష్కమగు,ఎండు.

గీ. క్షేత్రపాలున కుడికినచీర లాఱు,చాకిరేవుల గములయ్యె సకలదిశలు. ఆము. 2. 46.

సీ. పొలసు లేకాటి ప్రేగులు మాఁడియున్న ప్రేతవ్రాతములబీదతనము వాసె. ఉ. రా. 8. 178.

2. (స్వేదాదులు) పోవు.

చ. చెలువ కుమారుని న్వడుగు చేసిన చేతడి యాఱకుండఁగా. హర. 2. 108.

సీ. చెక్కుల దిగజాఱు చెమట యాఱఁగ నొక్క విరిబోఁడి కపురంపునురఁటి విసర. చంద్రా. 2. 118.

3. తీఱు, ఉపశమిల్లు, నశించు.

క...మృగముల,నూఱడకం దిగిచి డస్సి యున్న తనిశ్రమం,బాఱఁగ నెడఁ బరితాపము, దీఱఁగఁ బై వీచె నన్న దీపవనంబుల్. భార. ఆది. 4. 19.

క. కౌరవపాండవులకు నీ, వైరము నీవలనఁ గాదె వచ్చెను నిను మ, ద్ఘోరశరనిహతిఁ బడఁ గ, న్నారఁ గనుంగొనక కోప మాఱునె యొంటన్. భార. కర్ణ. 1. 124.

ద్వి. వేఱొక్కచోఁ దనవిపులప్రతాప,మాఱించి వచ్చినయవ్వీరుతోడ. రం. రా. ఉ. 47 పొ. 27 పం.

సీ. ఒండు చూడండు మూర్ఖుండు మండు నటంచుఁ దొండమై గండాఱియుండె ధనదుఁ,డు...ఉ. రా. 8. 141.

('గండాఱు' ఇత్యాదిరూపములు శబ్దపల్లవములుగా గ్రహించునది.)

4. (దీపాదులు) పోవు, మలుగు; చల్లారు.

సీ. ఒకదీపమార్చిన నున్నదీపంబులు నప్పుడ తమ కుఁదా మాఱుటయును. నైష. 7. 169.

ఆ. ఇంద్రియముల నెల్ల నివురంగఁ జేయుచు, నడరుశోకవహ్ని యాఱ నేర, దింద్ర పదవి నేరె నేనియు. భార. భీష్మ. 1. 193.

5. క్షీణించు, తగ్గు.

ఉ. ఆరతి పోటికిఁ విభున కప్డు మనంబుల విప్రలంభ శృంగార మొకళ్లొకళ్ల యిఱి గొఁగిటఁ బుట్టిన నిండువేడ్కచే, బోరన నాఱి యాఱి మదిఁ బొంగె ఘృతం బతి మాత్రఁ బోసినఁ, గూరికి కూర్కి యాఱ ఱమ గొబ్బున మండిన దీపమో యనన్. నైష. 8. 116.

ఉ. ఆఱనితేజు గల్గి యలరారెదు నయ్యోక మీఁడు. అచ్చ. రా. బాల. 196.

**ఆఱిచను, ఆఱిపోవు — ఆఱు, నశించు, పోవు.**

సీ. శాల నీకాపాలుమ్మ్రాలము శ్చేరప్రక యత
మతాపవికారి మాఱి చనదు. రసిక. 6. 89.

చ. ...జపముల నాఱిపోని కలుషంబులు. నృసిం. 1. 67.

జ. అర్చు². అఱుచు².

**అఱు**² న. సం. (త. అఱు. క. అఱు.) ఐదునొకటి.

క. తురగముల నాలుగిట ను, త్తరు నాఱిట ... భార. విరా. 5. 108.

అఱు**మూఁడగు** – చెడిపోవు, భగ్నమగు.

గీ. అఱుమూఁడయ్యె గచ్చు విచ్చయ్యెనఁగ... అఖ్యలగుఁ గార్యవైకల్య మయ్యెననుట; కు. అం. శే. 9.

అఱు **మూఁడుచేయు**–భగ్నముచేయు.

గీ....మమతల నానాఁడె యాఱుమూఁడు, నేసి మఱచెను నే నేమి నేతునమ్మ. కలు. శ. 29.

జ. అఱుగురు, అర్గురు, అఱువురు, అర్వురు, అఱుపలము, అఱు మోముల వేల్పు, అఱు వేలదేశము, అఱుప.

**అఱుగురు** న. (√అఱు²) — అఱువురు, అర్గురు. అర్వురు. (అఱునకు మహన్మహాత్యర్థక రూపము.) అఱుమంది.

**అఱుచే**¹ — అర్చు¹. చిత్రభా. 7. 91.

**అఱుచే**² — అర్చు².

**అఱుపలము** వి. (√అఱు².) అఱుపలముల యెత్తు గలమానవిశేషము. అం. భా. 2. 269

**అఱుపు** వి – అర్పు (√అఱుచే¹) అఱపు.

క....పొడిచిరి కడుఁ జెంచు లాఱుపులఁ జద లదరన్. యయా. 2. 19.

**అఱుమోములవేలుపు** వి. (√అఱు².) షణ్ముఖుఁడు, కుమారస్వామి.

**అఱువురు** — అఱుగురు.

**అఱువేలదేశము** వి. (√ అఱు²) కృష్ణానదికి దక్షిణముగా నుండి పూర్వము ధరణికోట రాజధానిగాఁ గల యొకానొక దేశము.

**అఱుప** వి. (అఱు²) అఱుకుంచములకొలత గల మానవిశేషము. అం. భా. 2. 271.

**అలంకి**¹ వి. శాలక్రీడావిశేషము

సీ. దాఁగిలిమూఁతలు తనుబిల్ల యాలంకి కుబ్బటు గురిగింజ కొండకోఁతి. హంస. 3. 146.

సీ. తూఁనతుంకాలు గింనగింజలు పిల్లదీ వాలంకి బిల్లగోడు. కాశీ. 3. 33.

సీ. సాలముల్ రిపుఁ జుట్టి సాధింతు ననుచీల నాలంకిగుడి డింభకాళిఁ దిగుచు. రా. వి. 2. 23.

**అలంకి**² వి. కురిచీవంటిపిల్లకి. (గ్రా.)

**అలంబనము** సం. వి. అ. న. 1. వ్రేలాడుట. 2. ఆశ్రయించుట, ఆధారముగాఁ గొనుట. 3. అవలంబము, ఊఁత, ప్రాపు, ఆధారము. 4. (అలం) రసమునకు ఆశ్రయమైననాయకాది. (రసకారణమైనవిభావము అలంబనము ఉద్దీపనము అని ద్వివిధము. అందు నాయికానాయకాదికము అలంబనము. వేష భూషణాదికము ఉద్దీపనము.)

**అలంబము** సం. విశే. (అ. ఆ. అ.) వ్రేలునది, వ్రేలాడునది. వి. అ. పుం. 1. అవలంబము, ఊఁత. 2. ఆశ్రయము, ఆధారము. 3. ప్రాపు, రక్షణము. 4. వ్రేలాడుట.

**అలంబి** సం. విశే. (న్. నీ. న్.) 1. వ్రేలునది. వ్రేలాడునది. 2. ఊఁత గొనునది, ఆశ్రయించునది. 3. ఊఁతయైనది, ఆధారమైనది. 4. ధరించునది, తాల్చునది.

శ్లో. గజాజినాలంబి దుకూలధారి వా. సం. కు. సం. 5. 78.

**అలంబించే** సం. న. క్రి. గ్రహించు, పట్టుకొను.

శా. అలంబించె మరుండు హస్తమున దాక్షారామలీలావతీ, భ్రూలేఖానిభవిభ్రమాఖ్యదయమున్ బుంద్రేకు కోదండమున్. శివరా. 3. 98.

(అలంబితవ్యము మున్నగు కృదంతరూపములు అవలంబితవ్యము మున్నగురూపములఁ బట్టి గ్రహించునది)

**అలంబితము** సం. విశే. (అ. ఆ. అ.) 1. వ్రేలఁగట్టఁబడినది. 2. వ్రేలాడునది. 3. గృహీతము, పట్టుకొనఁబడినది. 4. ధరింపఁబడినది (వస్త్రాది).

**అలంభకుఁడు** సం. విశే. (అ. లీకా. అ.) 1. చంపువాఁడు. 2. స్పృశించువాఁడు.

**అలంభనము** సం. వి. అ. న. — అలంభము

**అలంభనీయము** సం. — అలంభ్యము.

**అలంభము** సం. వి. అ. పుం. 1. సంస్పర్శము. 2. హింసనము, చంపుట.

**అలంభి** సం. విణ. (న్. నీ. న్.) 1. తాఁకువాఁడు 2. చంపువాఁడు.

**అలంభించు** సం. స. క్రి. వధించు, చంపు.

మ. ...సోమకుఁ డన్మహాపశువు నాలంభించి వేదాప్తియన్,ఫలమున్ జెందిన సోమయాజి నిను నేఁ బ్రార్థింతు మత్సాన్యకృతీ. భోజ సుతా పరిణయము. 1. 158.

**అలంభ్యము** సం. విణ. (అ. ఆ. అ.) 1. హింస్యము, చంపఁదగినది 2. స్పృశ్యము, తాఁకఁదగినది.

**అలకాపరి** వి. (√అవు) 1. పసులఁ గాచువాఁడు, గోపాలుఁడు. నా. పంచ. 2. 801.

2. కృష్ణుఁడు. నీలా. 1. 109.

**అలకించు** స. క్రి. (సం. అలక్ష్. క. ఆలిసు, ఆలయిసు.) విను.

ఆ. సకియ లత్తెఱంగు సకలంబు నూహించి, కార్యగతిఁ దలంచి కడుఁ జలించి, యుందు వదన యున్నకందువ కేతెంచి, పొంచి నిలిచి యాలకించునపుడు. విక్ర. 1. 128.

అలకించివిను—ఆదరంచివిను, శ్రద్ధతోవిను.

ఆ. ...అంచలారి యాలకించి వినుఁడు.చంద్రా. 4. 59.

**అలక్షి** సం. విణ. (న్. నీ. న్.) 1. కనుఁగొనునది. 2. తెలిసికొనునది.

**అలక్షించు** సం. స. క్రి. కనుఁగొను,చూచు. (శ.ర.)

**అలక్షితము** సం. విణ. (అ. ఆ. అ.) చక్కఁగాఁ జూడఁబడినది; చక్కఁగాఁ దెలిసికొనఁబడినది.

**అలక్ష్యము** సం. విణ. (అ. ఆ. అ.) 1. బాగుగాఁ దెలిసికొనఁదగినది. 2. దృశ్యము. 3. ఈషద్దృశ్యము, కొంచెము కనఁబడునది.

శ్లో. ఆలక్ష్యరంతముకుళాన్. శాకుం. 7. 17.

**అలగర్దము** సం. వి. అ. పుం. అలగర్దము, నీరు పాము.

**అలగర్ధము** సం — అలగర్దము.

**అలగోడు బాలగోడు** వి. పెడబొబ్బలు (శ. ర.). (అలగోలుబాలగోలు—అందఱును గలిసి చేసెడు రోదనము - బ్రౌ.)

**అలతి**—ఆఁతి. వి. (సం. ఆలప్తిః. ప్రా. ఆలత్తి. క. ఆఁతి.) రాగాలాపము.

క. సోలుచు సమ్మదరసమునఁ, గ్రాలుచు వన పాల బాలికలు నవలతికాం,దోలముల వేడ్కసలుపుచు, నాలతు లొగిఁ జేసి పాడి రభినవలీలన్. కు. సం. 4. 438.

సీ. తీఁగెలు గప్పూర మూఁగి యాలతి సేయు, భృంగమాలికలకు బెదరి బెదరి. దశకు. 9. 38.

**అలన** వి. (√అలించు—ఇది అప్పాదులలోనిది.) వినుట; మొఱ్ఱ వినుట.

(వ్యవ) నేను చేసిన విన్నపమునకు అలన లేదు పాలనలేదు. అలనపాలన లేని రాజ్యములో నుండుటకంటె అడవిలోనుండుట మేలు.

**అలపత్** సం. శ క్రి. 1. మాటలాడుచున్న. 2. రాగాలాపము చేయుచున్న.

**అలపనము** సం. వి. అ. న — అలాపము.

**అలపనీయము** సం — అలాప్యము.

**అలపించు** సం — అలాపించు.

(రాగాలాపము చేయు)

ఉ. ...ఉ,దగ్రన్నఖర ప్రమాణములఁ దంత్రులు మీటుచు నాలపించు నా, తిన్ననియెల్లు నాచెవులఁ దేనియ లొల్కుచవు ల్దలంచెదన్. పాండు. 3. 94.

**అలపిత** సం. విణ. (ఋ. త్రీ. ఋ.) 1. మాటలాడువాఁడు. 2. (రాగము) అలాపించువాఁడు.

**అలపితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. పలుకఁబడినది. 2. అలాపింపఁబడినది (రాగము) వి. అ. న. వచనము, మాట.

**అలపితవ్యము** సం — అలాప్యము.

**అలపుచ్చు** స. క్రి. (√అలము²) ఉపేక్ష చేయు, అనాదరము చేయు, తిరస్కరించు.

ద్వి. నాచిదేవయగారి నవ్వుచేసితివో,యాచెన్న బసవన్న నాలపుచ్చితివో. పండితా.మహిమ. 306.

**అలపోతు** వి. (√అవు) వృషభము.

సీ. అత్రిఁకషం బైనయాలపోతు నితండు త్రుంచి నాఁ డితఁడు పెంచినాఁడు. ఉ. హరి. 2. 180.

**అలప్తి** సం. వి. ఇ. స్త్రీ. ఆలతి, రాగాలాపము.

**అలబ్ధము** సం. విణ. (అ. ఆ. అ.) 1. స్పృష్టము, తాకఁబడినది. 1. హింసితము, చంపఁబడినది.

**అలబ్ధి** సం. వి. ఇ. స్త్రీ. 1. స్పర్శము, తాఁకుట. 2. హింస, చంపుట.

**అలము¹** వి. (సం. హారః – యుద్ధము) యుద్ధము.

క. వాలమ్ములు దాఁకి ధరన్, వ్రాలుభటులఁ జూచి యెడలు వడఁకఁగ మేనుల్, దూలఁగఁ దముఁ దాఁకకయును, నాలము సాలించి కొంద అవలఁజనంగన్. భార. విరా. 5. 62.

మ. ...గురుముఖ్యు యుంక నిట నీ వాలంబు సాలింపవే. భార. భీష్మ. 3. 170.

**అలము²** విణ. 1. అలక్ష్యము, ఉపేక్షితము, అనాదృతము.

క. మే లర్థింపను గిడును, జాలింబడి తొలఁగఁ ద్రోవ సరి తూష్ణింభా, వాలంబి మనస్కుఁడనై, యాలంబుగఁ జేసి నడతు నయ్యెరు తెలుఁగున్. భార. శాం. 4. 58.

ఉ. ఆలము సేసి నాతగుల మాఱడిపుచ్చఁగ నేల జేల న, న్నేలి యనంతభోగముల నిచ్చ మెయిన్ విహరింపు. భార. విరా. 2. 253.

క. ఇది ధర్మం బిది యాలువ, యిది వ్రత మిది సద్వివేక మిది యాచారం, బిది దేవపూజ యధిపతి, యుదితం బాలంబు సేయకుండుట సతికిన్. కాశీ. 2. 77.

వ. అని పలికి వానియాలాపంబు నాలంబు సేసి యభిమన్యుండు పెలుచం దఱిమిన వాఁడనుమానించుచు మన సైన్యంబునకు సమ్ముఖంబుగాఁ దేరు నడపుటయు. భార. ద్రో. 2. 16.

సీ. ఆలంబులో నింద్రు నాలంబుగావించి వహ్నికిఁ దనకోపవహ్ని చూపి. వీర. 2. 5.

2. అసత్యము.

(మునిడిచౌడయ్యగారు శతాయుష్య మని దీవించిపస్త్రీ మరణింపఁగా నామెను ఆయన మరల బ్రదికించినకథ)

ద్వి. ఎవయ దీవించువా రేండ్లెల యిత్తు, రను పలుకప్పుడ యాలంబు గాఁగ, నిశితఖడ్గం బాల్చి నిఖిలంబు సెఱుఁగ, శిశువ తెమ్మని పేరిఁ జీరఁగఁ దడప, కట్టులు పటుకవఁగాఁ దెగి నిద్ర, చెట్టులిక్క తెప్పిఱినట్టునుబోలె, నతిసంభ్రమాక్రాంతమతిఁ దేఱిచూచి, యతివ చౌడయ్యకు సాష్టాంగ మెఱఁగె. బస. పు. 5. 524.

వి, ఉపేక్ష.

సీ. ...యదుకుమారు, లాలంపుటాలంబుననువున నయ్యింద్రనందనుం గని పూజనం బొనర్చి. భారి. అశ్వ. 4. 114.

జ. అలవుచ్చు.

**అలము** సం. విణ (అ. ఆ. అ.) 1. పర్యాప్తము, చాలినది.

వ. ...చదువ దొంగొనినవనునకుఁ గాలంబు నాలంబు విఘ్నంబు లఖిలోద్యమఘ్నంబులు. ఆము. 1. 78.

2. అనల్పము, అధికము.

సీ. ......నుదువు లాలముల్లైన నోరు నొక్కు. కావ్యా. 3. 122.

3. శ్రేష్ఠమైనది. వి. అ. పుం. న. 1. హారి భూశము, అరిదము. 2. తేలుకొండి.

**అలయము** సం. వి. అ పుం. 1. ఇల్లు. 2. ఆధారము, స్థానము. 3. లీనమగుట, కలిసిపోవుట. క్రి. విణ. అ. న. లయమగువఱకు.

**అలరి** విణ. దుస్స్వభావుఁడు, దుష్టుఁడు.

ఉ. చాలుఁ బురే సరోజభవ సత్ప్రథవృత్తిఁ దొఱఁగి కూఁతు నిట్లాలరి వైరమింప హృదయంబునఁ గోరుట ధర్మరీతియే. భాగ. 3. 380.

ఉ. మాలెతవిందు...నిర్ఝరాపగా, కూలమునన్ భుజించి ఘనగోపురవేదిక నిద్రవోయెన, య్యాలరి బ్రాహ్మణుండు తుహినాచల కన్యకా యాశ్రమంబునన్. శివరా. 3. 105.

2. అవివేకి, మూర్ఖుఁడు.

మ...ఆత్మహిత మన్వేషింప కజ్ఞుండు మందిర దాహం బగు నప్డు కాంతివిధి కెంతేఁ గూప ముంద్రవ్వు న్నాలరియట్లె నగుబా టగుఁజుఁ సురభిమల్లా. మల్ల. వై. 75.

(అఁడెలుకకోరిక తీర్చుటకై ఎండురివటమీఁద నున్నఎండుతోలును దెచ్చుటకు వెళ్లి నిప్పులోఁ బడినమగయెలుకను గుఱించినపద్యము.)

ఉ. కాలిక నన్నుఁ బిల్చి పనిపంపెఁ గృతార్థుఁడ నైతి నంచు న,య్యాలరియెల్క గంతుగొని నంతనె తుత్తుము రయ్యెఁ గాష్ఠ మా,తో లును దానుఁగూడ మును దూరపథాగతు లైన మానవుల్, లోలత వండికొన్న ప్రొయిలోఁ బడి రూపఱఁగాలె వ్రేల్మిడిఁ. భోజరా. 4. 25.

**అలర్కము** సం. విణ. (అ. అ. అ.) అలర్కసంబంధ మైనది.

**అలఱేఁడు** వి. (√అవు) అఁబోతు.

ద్వి. వెండి కోఁతియుఁ బోలె వికృతి సేయుచును, నాలఱేఁడును బోలె నట నిటఁ జనుచు ... పండితా. పర్వ. 372.

**అలవట్టము** వి. (సం. ఆలావర్తమ్. ప్రా. ఆలావట్టం. త. ఆలవట్టం.) 1. వస్త్రముతోఁ జేయఁబడిన గుండ్రని విసనకఱ్ఱ (ఇది రాజాద్యుపచారమునకై ఉపయోగపడును.)

గీ. కమలదళము మృణాళకాండమునఁ జేర్చి, యాలవట్టంబు గావించి లీల మెఱయ, విసరు నల్లన రామభూవిభుఁడు జనక, రాజనందనమన మనురాగ మొంద. నిర్వ. 8. 62.

గీ. కనకబహురత్నమయ పీఠమున మృగాతు, లాలవట్టంబు లిడఁ జెలు వమరునట్టి, శౌర వేంద్రుండు పెను నేలఁ గంకపత్ర,పవన హతుఁడయ్యెఁ జూచితె పద్మనాభ. భార. స్త్రీ. 2. 88.

(సూర్యోదయవర్ణము.)

సీ. వృత్రభేదికి వీవ నెత్తినసూరెపుటం పుటం పాలవట్టం బనంగ. రా. వి. 3. 29.

2. గుండ్రని విసనకఱ్ఱవలె నుండి రాజాదులకు ఎండ తగలకుండఁ బట్టెడునొక సాధనము.

సీ. ...వ్యజనము, విసనకఱ్ఱ సురఁటి వీవన యంచన నవి యెండముఱుఁగిడ నాలవట్ట, మన విరాజిలును...ఆం. భా. 2. 168.

సీ. అచ్చరవిరి బోఁడు లాలవట్టము లూన విను కొంకి చెలులు వీవనలు వైవ. అచ్చ. రా. సుం. 35.

ఉ. అంగజరాజు పాంథనిచయంబులపై విజయం బొనర్ప నేఁగంగఁ దలంచునంత మును గల్గఁగ దాసులు వట్టుజాళువా, బంగరుఁగాల వట్టముల భంగిఁ గనంబడెఁ బూర్వపశ్చిమో, త్తుంగ మహీధ రాగ్రములఁ దోయజశాత్ర వమిత్ర బింబముల్. విజ. వి. 1. 143.

(1061.) నా. శా. 672.

**అలవణ్యము** సం. వి. అ. న. చప్పన,చప్పఁదనము.

**అలవాలము** సం. వి. అ. న. ఆవాలము, పాదు.

**అలసించు** అ. క్రి. (సం. ఆలస్యము. ప్రా.అలస్స.) ఆలస్యముచేయు, జాగుచేయు.

సీ. ...ఓదేవ నే నున్న వనములోనికిఁ దీర్థవాని యొక్కఁ, డిటఁ గొన్నినాళ్ల క్రిందట వచ్చి యచ్చోటఁ దపము సేయఁగఁ బూనె దాని కొలఁది, యెఱుఁగునంతకు నేను నిన్నినా ళ్లాలసించితి నది నానాఁటి కతులమైనఁ, జెప్పవచ్చితి...కళా. 2. 164.

సీ. అతివ మిక్కిలి దూలె నాలసింపఁగ నేల చల్లఁగాఁ బన్నీరు చల్లరమ్మ. యయా. 5. 115.

**అలస్యము** సం. వి. అ. న. 1. మాంద్యము, సోమరితనము. 2. అజాగ్రత్త, ఏమఱిపాటు.

వ. నీ వేల యేమఱి తనిన నయ్యబల యతని తోడ.

గీ. కడుపు నిండఁగఁ జన్నిచ్చి కొడుకు నిద్ర, వోవ దీవియ మండఁగఁ బ్రొద్దువోవు,నంత దాఁక మేల్కని యుండి యలసి కన్మొ,కింత మూసితి నాలస్య మేది యిందు. హరి. పూ. 5. 155, 156.

3. జాగు, విలంబము.

క. అరయఁగ నయ్యెడు తెఱఁగుల, నరయుట కార్యంబు వారి నాలస్యములే, కరయునది ...భార. విరా. 3. 105.

**అలాతము** సం. వి. అ. న. ఇంధనము, వంటచెఱకు.

**అలాతము** సం. వి. అ. న. కొఱవి.

**అలానము** సం. వి. అ. పుం. న. 1. ఏనుఁగునుకట్టు కంబము. 2. ఏనుఁగును కట్టుత్రాడు; త్రాడు. 3. బంధనము, కట్టు.

**అలానికము** సం. విణ. (అ. ఈ. అ.) – అలానార్థమైనది–ఏనుఁగును కట్టుట కుపయోగించునది (స్తంభాది). వి. అ. న. అలానము.

**అలాపకుఁడు** సం. విణ. (అ. వికా. అ.) 1. మాటలాడువాఁడు. 2. (రాగము)ఆలాపించువాఁడు.

**అలాపనీయము** సం. – ఆలాప్యము.

**అలాపము** సం. వి. అ. పుం. 1. మాటలాడుట, సంభాషణము. 2. మాట.

శా. ఆలాపంబులు మాని...భాగ. 1. 216.

(శ్లో. తదోపసంవ్యాత్య గిరః. సం. భాగ. 1. 9. 30.)

3. చెప్పుట, కథనము. 4. (సంగీత) స్వరసన్నివేశ విశేషము, రాగాలాపము. 5. స్వరసాధనాక్షరము లగు స రి గ మాది.

**అలాపయిత** సం. విణ. (ఋ. త్రీ. ఋ.) 1. మాటలాడించువాఁడు. 2. (రాగము) ఆలాపింపఁజేయువాఁడు.

**అలాపి** సం. విణ. (న్. నీ. న్.) 1. మాటలాడువాఁడు. 2. (రాగము) ఆలాపించువాఁడు, పాడువాఁడు.

**అలాపించు** సం. అ. క్రి. రాగాలాపముచేయు.

సీ. శ్రవణసుఖంబుగా సాధుస్వనంబున మ్రోల నాలాపించుమొకరితేఁటి. పి. శకుం. 3.218.

వ. క్రి. (రాగమును) పెంచిపాడు.

(వ్యవ) వాఁడు భైరవి ఆలాపించుచున్నాఁడు.

**అలాపిని** సం. వి. ఆ. స్త్రీ. సొరకాయ గలవీణ,

**అలాప్యము** సం. విణ. (అ. ఆ. అ.) 1. పలుకఁదగినది. 2. ఆలాపింపఁ దగినది (రాగాది).

**అలాబువు** సం. వి. ఉ. ఈ. స్త్రీ. అలాబువు, సొరకాయ, అనుగుకాయ.

**అలాయము** విణ. 1. పాత్రము. (శ.ర.) 2. సిద్ధము, ఉద్యుక్త.

ఉదా: అన్యాయమున కాలాయమై. (ప్రౌ)

వి. సిద్ధముగా నుండుట. (ప్రౌ)

**అలావర్తము** సం. వి. అ. న. గుడ్డతోఁ జేయఁబడిన విసన. అలవట్టము.

**అలాస్యము** సం. వి. అ. పుం.–పెద్దమొగముగలది–మొసలి.

**అలి**–నాలి. విణ. హీనము.

(రావణునిచెఱంబడిన స్త్రీలు విలపించుట)

మ. మగఁడా నీవు జగంబుచొప్పు మిగులన్ మానంబు వాటించువా, లిగ సెగ్గంబగుమాట వాటిలెనె తల్లి నీకు లోకంబుపా, టిగ నిట్లొందెనె నిందతోడివగ...నిర్వ. 5. 103.

వి. పరిహాసము, గేలి.

ఉ. యజ్ఞరసప్రమత్తుఁడగునాత్మజుపై నడి పెట్టలేదు నా, యజ్ఞత నప్పు డేఁ జని సమాధినిమగ్నమనఃప్రవృత్తిఁ గా, లజ్ఞుఁడఁ గాక వారిధిజలంబులలోన మునింగి యుండి య, ప్రాజ్ఞులచేత నాలిఁ బడుపాటికి వచ్చితి నేమి సెప్పుదున్, నిర్వ. 6. 9. (చూ. అలిగొను, అలిసేయు.)

జ. అలిగొను, అలితనము¹, అలిసేయు.

**అలి(ళి)** సం. విణ. (ఇ.) శుద్ధాంతఃకరణము గలది, విశదాశయము గలది. వి. ఇ. న్. పుం. తేలు. ఇ. పుం. తుమ్మెద. ఇ. ఈ. స్త్రీ. 1. సఖి, చెలికత్తె. 2. పంక్తి, వరుస, శ్రేణి; సమూహము. 3. సేతువు, ఆనకట్ట.

**అలింగకుఁడు** సం. విణ. (అ. గికా. అ.) కౌఁగిలించుకొనువాఁడు.

**అలింగత్** సం. శత్ర. కౌఁగిలించుచున్న.

**అలింగనము** సం. వి. అ. న. ఉపగూహనము, కౌఁగిలింత.

**అలింగనీయము** సం. – ఆలింగ్యము.

**అలింగము** సం. వి. అ. పుం. ఒకవిధమగు మద్దెల.

**అలింగి** సం.విణ.(న్. నీ. న్.) కౌఁగిలించువాఁడు. వి. న్. పుం. యవధాన్యపుగింజవంటి యాకారము గలదై కౌఁగిలించుకొని వాయింప నను వగునొక మృదంగము.

**అలింగిత** సం. విణ. (ఋ. త్రీ. ఋ.) కౌఁగిలించుకొనువాఁడు.

**అలింగితము** సం. విణ. (అ. ఆ. అ.) ఆశ్లిష్టము, కౌగిలింపఁబడినది. వి. అ. న. ఆలింగనము, కవుఁగిలి.

**అలింగితవ్యము** సం. — ఆలింగ్యము.

**అలింగ్యమానుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) కౌఁగిలించుకొనఁబడుచున్నవాఁడు.

**అలింగ్యము** సం. విణ. (అ. ఆ. అ.) కవుఁగిలింపఁదగినది. వి. అ. పుం. ఆలింగి, గోపుచ్ఛమువంటి యాకారము గల మృదంగము.

**అలించు** స. క్రి. — ఆలకించు.

(విను)

క. ఆలింపుము నావిన్నప, మేలింపు మనోజ రాజ్యమెంతయు నింతిన్. విక్ర. 1. 142.

ఆ. ఇంకనైన నన్ను నేల యాలింపవు, నాకు శరణ మగుము నాథ యనుచు. (నన్ను నేల యాలింపవు—నామొఱ నేల వినవు) భార. ఆర. 2. 87.

ఆలించివిను—శ్రద్ధతోవిను; బాగుగా విను.

గీ. ...వజ్రఘోరనాదంబు నీ కోర్వఁ గొలఁది యగునొ. కాదొ నీవ యెఱుంగుదు మేదినీశ, యనుటయును నృపుఁ డాలించివిని భయమున. భార. అశ్వ. 1. 90. జై. భా. 4. 126.

జ. ఆలన

**అలింజరము** సం. వి. అ. పుం. ఆలింజరము, మట్టితోఁ జేసిన పెద్దకుండ.

**అలిం(లిం)దకము** సం. — ఆలిందము.

**అలిం(లిం)దము** సం. వి. అ. పుం. 1. బహిర్ద్వార ప్రకోష్ఠము, తలవాకిటిగది 2. వసవగది. 3. శయ్యావేదిక, ఇంటిలోపలఁ బరుండుటకై కట్టిన యరుఁగు.

**అలింపనము** సం. వి. అ. న. ఆదీపనము, పండుగు దినములందు గోడలకు సున్నమువేసి నేలను ముగ్గులుపెట్టి యింటి నలంకరించుట.

**అలిఖత్** సం. శత్ర. 1. వ్రాయుచున్న. 2. చిత్తరువు వ్రాయుచున్న. 3. గోఁకుచున్న.

**అలిఖించు** సం. స. క్రి. లిఖించు; (చిత్తరువులు) వ్రాయు.

గీ. అలిఖించిరి గేహకుడ్యములయందు, సర్వతోభద్రమకరికాస్వస్తికములు. శివరా. 2. 58.

**అలిగొను** స. క్రి. (√అలి) పరిహసించు; తక్కువ పఱుచు, కీడ్పఱుచు.

గీ. అకట సైరంధ్రి నన్ను ని ట్లాలిగొనఁగ, నేల చక్కఁగఁ గనువిచ్చి యేను జేడిఁ, జూడ రోయుదు రణమున మాతకృత్య, భంగము దాల్చుట కెమ్మెయిఁ బనుచువాఁడ. భార. విరా. 4. 18. నిర్వ. 5. 184.

గీ. ఇట్లు వికృతాంగిఁ గావించి యిట్టులని యె, నో నిశాటి యీయొప్పుతో నున్ననిన్నుఁ, గన్న నార్తిని దూలరే కాముచేత, జేల నీ కింత వలవనిజాలి యేల.

క. ఈలీల సుమిత్రాసుతుఁ, డాలిగొనఁగ... భా. రా. అం. 2. 382, 388.

లయగ్రాహి. స్థూలతను కాళిమ విశాలలయ కాల ఘననీల రుచిజాలముల నాలిగొన. మార్క. 6. 184.

**అలిచిప్ప** వి. (తె. ఆళి.) శంబూక, ము త్తెపుఁజిప్ప వంటి యొకవిధమైన గుల్ల.

**అలితనము** వి. (√అలి) హీనత్వము; దైన్యము.

ఉ. ఏ లనుమాన మేను సమయించెద వైరము నేఁటితోడఁ బాఁ, చాలుఁ నెల్లఁదీవ్ర శర జాలములం బొలియించి కాని భూపాలక పుచ్ఛఁ గత్తెము పాటిగఁ బట్టుము నాదు మాట లి, య్యాలితనంబు వాపెదఁ బ్రియం బొనరించెద నీకుఁ దండ్రికిన్. భార. శల్య. 2. 35.

**అలితనము**² వి. (అలు+తనము) భార్యాత్వము. రాఘ. 2. 88. (భార్యార్థమున.)

**అలిపుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) పూయువాఁడు, రాచువాఁడు.

**అలిసేయు** స. క్రి. (√అలి) 1. కీడింపఁ జేయు, చెఱచు, పాడుచేయు.

గీ. కూలి సేకొన్నతపమెల్ల నాలిసేసి, యతని దేహంబునందు సామాలిఁ జేసి, కామకింకరుఁ జేసి నాకడిమి నెఱపఁ, గంటి నీప్రపన్నమ దీర్పఁగంటి నెలమి. కు. సం. 4. 409.

2. అనాదరముచేయు, తిరస్కరించు, దూషించు, నిందించు.

(హరభక్తుఁడై వచ్చిన జానిసకొడుకునకు ఈశ్వరభావముతోఁ గాళ్లు కడుగ భర్త సిద్ధపడఁగా భార్య పాద్యమీయ నిరాకరింప భర్త యనినమాటలు.)

ద్వి. పొలఁతి జలంబులు పోయకున్నంత, నాలి నేసితి గదా హరిమూర్తి ననుచు, నాలి చేతులు రెండు నప్పుడ నఱకి. బస. పు. 4. 955 పం.

ద్వి. ననిచినతనప్రాణనాథుఁ దోడ్తేర, వనజాక్షి యొక్కతె మలసుఁ బంపుగును,బని మనోహరునితోడను రమియింపఁ,దను గిలుజాడెఁ గదా మనం బనుచు,నెనయ నపుంసకంబిల మన శ్శబ్ద, మనినపాణినిసూత్ర మాలి నేయుచును, వనితగోపించుడు వచ్చె నమ్మ. నను. పండితా. దీక్షా. 77 పొ.

3. ఎగతాళిచేయు; తక్కువపఱుచు.

ద్వి. ఆలినేయుచుఁ బల్కు నది తథ్యగాఁగ, నాలింగవంతుఁడ ట్లాత్మఁ దలంచి. బస. పు. 3. 573.

పి. క్రాలు గన్నుల నెమ్మొగంబున గళమున నబ్జవిజృంభణ మాలినేయు. జఘనస్థలంబునఁ జనుఁగవ నతనాభిఁ జక్రవైభవము నతిక్రమించు. ద్వా. 4. 210. (ఇట ఔపమ్యమును దెలుపును.)

**ఆలీఢకము** సం. వి. అ. న. దూడలు దుముకులాడుచు క్రీడించుట, దూడలు క్రేళ్లుఱుకుట.

**ఆలీఢము** సం. విణ. (అ. ఆ. అ.) 1. నాకఁబడినది. 2. ఆస్వాదితము. 3. క్షతము, గాయపడినది.

శ్లో. సేనాన్యమాలీఢమివాసురాస్త్రైః. సం. రఘు. 2. 37.

వి. అ. న. బాణములు వేయునప్పుడు విలుకాఁడు కుడికాలు ముందటికి చాఁచి నిలుచుట.

**ఆలీనకము** సం. వి. అ. న. 1. తగరము. 2. సీసము. 3. సంశ్లేషము, కలిసికొనుట.

**ఆలీనము** సం. విణ. (అ. ఆ. అ.) సంశ్లిష్టము, అంటియున్నది. వి. అ. న. 1. తగరము. 2. సీసము. 3. సంశ్లేషము, కలిసికొనుట.

**ఆలు** వి. ఔ. 1. స్త్రీ, ఆఁడుది. (బ. ఆండ్రు, ఆండురు, ఆండ్రురు.)

క. ఆలవు బాలవు గడుఁ గోమ, రాలవు...కు. సం. 6. 672.

చ. కలుచుట దోసమే మగలఁ గల్వక యాఁడురు దొల్లి యాఁడురున్, గలుతురె ... కు. సం. 8. 151. (ఈ యర్థమందు వ్యస్త ప్రయోగము ఈగ్రంథముననే కనఁబడుచున్నది. ఇచటఁదక్క మిగిలినచోట్ల వృత్తియందుత్తరపదముగా నుండును – ఉదా: మగనాలు, ఇల్లాలు, చూలాలు, బాలెంతరాలు, ధీరురాలు, మొ.)

2. భార్య.

ఉ. ఆలునుదాసియన్ సుతుఁడు నన్నవి వాయని ధర్మముల్ మహిన్. భాం. ఆది. 3. 174.

సీ. అండ్రను బిడ్డలన్...భా. ఉద్యో. 2. 127.

గీ. ... ఆండ్రురఁ బెక్కండ్రఁ జేసికొనుట, పురుషులకుఁ దప్పె...భా. ఆశ్వ. 4. 69.

గీ. ...ఆలి నొల్లనివాఁడు దా నీలకూర, కుప్పు చాలలేదన్నట్లు తప్పులేని, తప్పు గొట్టించుమమ్మ సంతతము నేమి, చెప్పుకొంగుము నీతోడ సిగ్గుపడక. వరాహ. 7. 47.

జ. ఆలితనము, ఆలుమగలయాట.

**ఆలుంచనము** సం. వి. అ. న. 1. ఉత్పాటనము, పెల్లగిలచుట. 2. చీల్చుట.

శ్లో మార్జారః క్రమతే మృగః ప్రసరతే శ్యేనో గ్రహాలుంచనే. మృచ్ఛ. 3. 21.

3. జుట్టు విరియఁ బోసికొనుట.

**ఆలుంచితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఉత్పాటితము, పెకల్పఁబడినది. 2. విరియఁబోసికొనఁబడినది (జుట్టు).

**ఆలుంటనము** సం. వి. అ. న. కొల్లగొనుట, దోఁచుట.

**ఆలుక** సం. వి. ఆ. స్త్రీ. ధారాపాత్ర. (చూ. గలంతిక.)

**ఆలుకము** సం. వి. అ. పుం. 1. శేషసర్పము. 2. ఒకదినుసుదుంప, (దీనిభేదములు:– కాష్ఠాలుకము,శాఖాలుకము,హస్త్యాలుకము పిండాలుకము, మధ్వాలుకము, రక్తాలుకము.)

**అలుగడ్డ** వి. (సం. ఆలుః) ఉరలగడ్డ, బంగాళా దుంప.

**అలుడి** వి. మంచినడత, శీలము.

శీ. ఆలుడి యనఁగను శీలంబు విలసిల్లు. అం. శా. 1. 186.

**అలుమగలయాట** వి. (√ఆలు) బాలికా క్రీడా విశేషము.

సీ. ...అత్తకోడలియాట యాలుమగలయాట తాటిచెట్టాట కోలాటములును. దశా. 9,81.

**అలువరి** — అలువరి. వి. అలంగము, వప్రము.

గీ. అనినఁ డిట్టిభుఁడౌ నంచు ననుచరింప,నాలు వరిక్రిందిత్రోవగా నరిగి యరిగి, విప్రుఁ డీఱించెఁ బలనాటివీరపురుష, పరమదైవత శివలింగభవనదాటి. క్రీడా. 115.

**అలువు** నం. వి. ఉ. పుం. ఘూకము, గుడ్లగూబ. స్త్రీ. ధారాపాత్రము. (చూ. గలంతిక.) న. 1. ఖేలకము తెప్ప. 2. ఒకదినుసుదుంప. (చూ. ఆలుకము.)

**అలూనము** నం. విశే. (అ. ఆ. అ.) 1. కొంచెము త్రుంపఁబడినది. 2. పూర్తిగా త్రుంపఁబడినది.

**అలెగాఁడు** వి. క్రిందికొలువుగాఁడు. (శ. ర.)

**అలెప్రొయ్యి** వి. ఒకసారిగా నాలుగైదు పాత్రములు వేఱువేఱుగాఁ బెట్టి వండుటకేర్పఱచిన ప్రొయ్యి. (గ్రా)

**ఆలేఖకుఁడు** నం. విశే. (అ. థికా. అ.) 1. చిత్తరువు వ్రాయువాఁడు. 2. వ్రాయువాఁడు.

**ఆలేఖనము** నం. విశే. (అ. ఆ. అ.) 1. వ్రాయునది. 2. చిత్తరువు వ్రాయునది. 3. ఒరయునది, స్పృశించునది. వి. అ. న. 1. వ్రాయుట. 2. చిత్తరువు వ్రాయుట. 3. ఒరయుట.

**ఆలేఖని** నం. వి. ఈ. స్త్రీ. 1. చిత్తరువు వ్రాయు తూలిక. 2. వ్రాయుసాధనము (కలము, మొ.).

**ఆలేఖనీయము** నం. విశే. (అ. ఆ అ.)—ఆలేఖ్యము.

**ఆలేఖము** నం. వి. అ. పుం. లిఖితపత్త్రం. (కమ్మ, క్రయపత్త్రము, మొ.)

**ఆలేఖిత** నం. విశే. (ఋ. త్రీ ఋ.)—ఆలేఖకుఁడు.

**ఆలేఖితము** నం. విశే. (అ. అ. అ.) 1. వ్రాయింపఁబడినది. 2. చిత్తరువుగా వ్రాయింపఁబడినది.

**ఆలేఖితవ్యము** నం. — ఆలేఖ్యము.

**ఆలేఖ్యము** నం. విశే. (అ. ఆ. అ.) 1. వ్రాయఁదగినది. 2. చిత్రింపఁదగినది. వి. అ. న. చిత్తరువు.

**ఆలేఖ్యశేషుఁడు** నం. విశే. (అ. ఆ. అ.)—చిత్తరువు మాత్రమే మిగిలినవాఁడు-మృతుఁడు, చచ్చినవాఁడు.

శ్లో. బాష్పాయమాణో బలిమన్నికేత,మాలేఖ్యశేషస్య పితుర్వివేశ. సం. రఘు. 14. 15.

**ఆలేపనము** నం. వి. అ. న. — ఆలేపము.

(ఆలేపకుఁడు, ఆలేప్యము మొదలగు కృదంత రూపములు లేపకుఁడు, లేప్యము మున్నగు వానివలె గ్రహించునది.)

**ఆలేపము** నం. వి. అ. పుం. 1. పూయుట, రాచుట. 2. అలుకుట. 3. అలింపనము, ముగ్గులు పెట్టుట మొదలగు గృహోద్యలంకరణము. 4. (వైద్య) రాచుట కుపయోగించు ద్రవ్యము (కర్పూరతైలాదికము).

**ఆలోకకుఁడు** నం. విశే. (అ. కికా. అ.)—ఆలోకి.

**ఆలోకనము** నం. వి. అ. న.—ఆలోకనము.

**ఆలోకనీయము** నం, — ఆలోక్యము.

**ఆలోకమానము** నం. విశే. (అ. ఆ. అ.) చూచుచున్నది.

**ఆలోకము** నం. వి. అ. పుం. చూచుట, దర్శనము. 2. చూపు, దృష్టి. 3. సూర్యాదిప్రకాశము, కాంతి. 4. వందిభాషణము,బట్టువారుస్తోత్రము చేయునపుడు ఉపయోగించు జయజయాది శబ్దము.

శ్లో. యయావుదీరితాలోకః,స్స ధర్మాసనమాంస థాం. సం. రఘు. 17. 27.

**ఆలోకయత్** నం. శత్ర. ఆలోకించుచున్న.

**ఆలోకయమానము** నం. — ఆలోకమానము.

**ఆలోకయిత** నం. విశే. (ఋ. త్రీ. ఋ.) ఆలోకించువాఁడు.

**ఆలోకి** నం. విశే. (న్. నీ. న్.) చూచువాఁడు.

**ఆలోకించే** నం. న. త్రి. వీక్షించు, చూచు; ఆలోచించు, విమర్శించు.

వ. ...అప్పులుఁగుఁతేనియానన౦ బాలోకించి. ...మార్క. 1. 79.

క. ఏకాంతిజనంబులు మ,శ్లోకుం డగుహరిమనం బులో నుండుదు రా,లోకింప వారి కతనికి, నేకత్వము గలదు తెల్లమిది వేదములన్... భార. శాం. 6. 509.

వ. తర్కంబు లాలోడించి మీమాంసాద్వయం బాలోకించి... కాశీ. 3. 79.

**ఆలోకిత** సం. విణ. (ఋ. త్రి. ఋ.) ఆలోకించు వాఁడు.

**ఆలోకితము** సం. విణ. (అ. ఆ. అ.) చూడఁబడినది. వి. అ. న. చూపు. దృష్టి.

**ఆలోకితవ్యము** సం. - ఆలోక్యము.

**ఆలోక్యమానము** సం. విణ. (అ. ఆ. అ) చూడఁ బడుచున్నది.

**ఆలోక్యము** సం. విణ. (అ. ఆ. అ.) 1. చూడఁ దగినది. 2. చూడ శక్యమైనది.

**ఆలోచకుఁడు** సం. విణ. (అ. విశా. అ.) 1. చూచువాఁడు. 2. ఆలోచించువాఁడు.

**ఆలోచన** సం. వి. ఆ. స్త్రీ. - ఆలోచనము.

**ఆలోచనము** సం. వి. అ. న. 1. చూచుట, దర్శనము. 2. ఆలోచించుట.

**ఆలోచనీయము** సం - ఆలోచ్యము.

**ఆలోచమానుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) ఆలోచించుచున్నవాఁడు.

**ఆలోచయత్** సం. శత్ర. ఆలోచించుచున్న.

**ఆలోచయమానుఁడు** సం - ఆలోచమానుఁడు.

**ఆలోచయిత** సం. విణ. (ఋ. త్రి. ఋ.) ఆలోచించువాఁడు.

**ఆలోచయితవ్యము** సం - ఆలోచ్యము.

**ఆలోచి** సం. విణ. (న్. నీ. న్.) ఆలోచించు వాఁడు.

**ఆలోచించు** సం. న. క్రి. విమర్శించు. వివేచించు.

వ. నీకు సంక్షేపరూపంబునం జెప్పెద మనస్కరించి విని యాలోచించి యెట్లు మేలట్లు ప్రవర్తింపుము. మార్క. 3. 388.

**ఆలోచిత** సం. విణ. (ఋ. త్రి. ఋ.) ఆలోచించు వాఁడు.

**ఆలోచితము** సం. విణ. (అ. ఆ. అ.) ఆలోచింపఁ బడినది.

**ఆలోచితవ్యము** సం - ఆలోచ్యము

**ఆలోచ్యమానము** సం. విణ. (అ. ఆ. అ.) ఆలోచింపఁబడుచున్నది.

**ఆలోచ్యము** సం. విణ. (అ. ఆ. అ.) ఆలోచింపఁ దగినది.

**ఆలోడనము** సం. వి. అ. న. 1. కలఁచుట, కలఁగఁ జేయుట. 2. మర్దనము, నూఱుట. 3. మంథనము, చిలుకుట. 4. (గ్రంథాదులు) విమర్శించుట, పరిశీలించుట. 5. మేళనము. కలుపుట.

**ఆలోడించు** సం. న. క్రి. 1. కలఁచు. 2. తరుచు, మథించు. 3. చక్కఁగా విమర్శించు, చర్చించు.

వ తర్కంబు లాలోడించి మీమాంసాద్వయం బాలోకించి... కాశీ 3. 79.

ఆ. సర్వశాస్త్రవాక్యసమితి నాలోడించి. భార. అను. 4.398.

(ఆలోడకుఁడు, ఆలోడ్యము, మొదలగునవి లోడకుఁడు, లోడ్యము మున్నగువానివలెనే గ్రహించునది.)

**ఆలోడితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. కలియఁ బెట్టఁబడినది. 2. చిలుకఁబడినది, మథితము. 3. మర్దితము, నూఱఁబడినది. 4. మిళితము, మిశ్రితము.

శ్లో. ఆలోడితాః కాంచన భూపరాగాః. శిశు. 3. 27.

5. విమర్శింపఁబడినది, పరిశీలింపఁబడినది (గ్రంథాది.). 6. కలఁపఁబడినది. (ద్రవద్రవ్యము)

**ఆలోలము** సం. విణ. (అ. ఆ. అ.) 1. కదలునది, చంచలము. 2. ఆసక్తము.

**ఆలోలితము** సం. విణ. (అ. ఆ. అ.) కదల్పఁబడినది, చంచలీకృతము.

**ఆళతి** – ఆలతి. వి. రాగాలాపము.

క. నాళీకముఖులు గొందఱు, సాళగసంకీర్ణశుద్ధసరణి మెఱయఁగా, నాళతులు నేసి పాడిరి, తాళగతులు మంద్ర మధ్యతార శ్రుతులన్. వరాహ. 4. 190.

**ఆళుగ** – ఆళువ. (గ్రా. శ. ర.)

**ఆళుతనము** వి. (త. ఆళుతన, ఆళ్తన.) ప్రభుత్వము, అధికారము.

క. ...ఖగేంద్రుఁడు, హతుఁడయ్యెను నాకుఁ బూని యకట మహాజిన్.

క. ఆళుతనంబునఁ బెక్కుల్, వేలేఁడులు బ్రదికి యధికవిక్రమయుతుఁడై, యాలమునఁ బొలిసె నితఁడున్, గాలము నెవ్వండు గడిమిఁ గడవఁగనోపున్ భా. రా. అర. 2. 370, 371 (అలితనము అపముద్రి.)

**ఆళులు** – ఆళ్ళు. సేవకులు, భటులు.

క. ఈవలయునర్థ మిచ్చియు, సేవకు మన్నింపవలయు జితమతి విభుఁ డా,యీవికి మన్ననకుం దగఁ, జావలయు భటుండు పతికి జయముగఁ బోరన్.

ఆ. పొడవు చూడ మగలపొల్లలు నాళుల, పొల్లలును నిజంబపోలె నుండు. కు. సం. 11. 616.

**ఆళువ** వి. శల్యకము, ఉడుమువంటి యొకానొక జంతువు (దీనిశరీర మంతయు ముత్తెపు చిప్పలవంటి గఱుకు చిప్పల చేతఁ గప్పఁబడి యుండును.)

ద్వి. కుందేలు నుడుమును గూర్మంబు సేదుఁ, బందియాళువయును భక్ష్యముల్గాని, పంచనఖంబని ప్లవగంబుఁ దినరు. రం.రా. కిష్కిం. 212పా. 28పం.

శ్లో. శల్యకశ్శ్వావిధో గోధా శశః కూర్మశ్చ పంచమః. రామా. కిష్కిం. 17. 37

**ఆళువరి** – ఆడువరి, ఆలువరి. వి. (త. ఆళ్వారి, ఆళువేరి.) వప్రము, అలంగము.

సీ. కోట సింగారించి కొత్తళంబుల నెల్ల నట్టళ్లు పన్నించి యాళువరికిఁ, బందిళ్లు వెట్టించి. ఉ. హరి 2. 92.

**ఆళువారు** – ఆళ్వారు.

ఆ. అనిన మాఱు వలుక నలికి యయ్యాళువా,రి య్యకొనియె. ఆము. 2. 94.

ద్వి. జ్ఞానమతద్రావిడాగమసార్వభౌము, లైన మావారల నాళువారులను ద్వి. పర. 3పా.

**ఆళ్లకోన** వి. ఒకజాతికాకి (శ. ర.)

**ఆళ్లు** వి. బ. (చూ. ఆరిక)

సీ. చేటఁ గైకొని యాళ్లు చెరిగెదనని పోవు శుక. 2. 208.

**ఆళ్వారు** వి. (త. ఆళ్వార్. క. అళ్వర్.) ద్రావిడప్రబంధకర్త యగు విష్ణుభక్తుఁడు (వీరు పదిమంది అని కొందఱు పండ్రెండుమంది అని కొందఱు.)

శా. అంచత్ప్రేమవశంవదుం డగుచు నాయాళ్వారిఁ జేరంగ రమ్మంచుం బిల్చి మురారి సాదరవిశేషాలింగితుం జేసి లాలించెన్. పర. 4. 218.

**ఆవ** వి. 1. సర్షపము (వ్య. వి.) 2. సర్షపముల పిండి; ఆవాలపిండి కలిపి చేసిన ద్రవ ద్రవ్యము

క. సేవించి రొకటి దొలఁగం, ద్రోవక జంబీరరసముతో నూనియతో, నావం బెట్టిన కిటము, ద్రావలయము లమృతమధుర రసఖండంబుల్. నై. ష. 6. 127.

ఉత్సాహ...ఆవ ద్రాగినట్టికంటకంబునన్. వి. పు. 2. 58.

బ. సర్షపబీజములు. (ఆవాలు. అని వాడుక)

క. తిలలు యవలు గోధూమం, బులు గొఱ్ఱలు కోవిదారములు ముద్గము లాలవలు కందులు మినుములు...మార్క. 3. 202.

ఆవంత – ఆవగింజంత, మిక్కిలి కొంచెము.

ఉ. ...మనంబులోన నా,వంతయు శంక లేక... భార. కర్ణ. 3. 288.

జ. ఆవకాయ.

**ఆవ²** వి. (త. ఆవల్ - చెఱువు.) బాడవ, పల్లపునేల.

**ఆవంత్యుఁడు** సం. వి. అ. పుం. 1. అవంతి దేశపు రాజు. 2. అవంతి రాజు కొడుకు. (పై రెండర్థము లందును. బ. అవంతులు.) 3. సంకీర్ణజాతి విశేషము. వ్రాత్య బ్రాహ్మణునికి బ్రాహ్మణస్త్రీ యందుఁ బుట్టినవాఁడు

**ఆవకము** సం. విణ. (అ. వికా. అ.) కాపాడునది.

**ఆవకాయ** వి. (√ఆవ¹) ఆవగుండ మున్నగు పదార్థములలో ఊఁగఁబెట్టిన మామిడికాయ మొదలగునది.

**వజకాఁడు** వి. (√అవజము) అవజము వాయించువాఁడు (అవజకానికి. చే. శా. 1139.)

**వజము** వి. ఆరజము, వాద్య విశేషము.

చ. ...అ, య్యనుమతి గాంచి దండియ లుపాంగము మద్దెల తాళ మావజం, బునుఁ గొని మేళమై మునితపోవనికిం జని నిల్చి రొక్కెడన్. రామా. 2. 89. అము. 4. 35.

జ. అవజకాఁడు, అవజీఁడు.

**వజీఁడు** — అవజకాఁడు. (1055.నా. శా. 677.)

**వటము** వి. పొందిక. (శ. ర.)

విణ. అనుకూలము, వీలైనది.

క. అవటము క్రిందఁ దలిరుల, నావటముగ శయ్య దీర్చి యందు సమస్త, శ్యావనిమణి కోటీర, స్థావర నిజశాసనుండు శయితుండయ్యెన్. ద్వా. 5. 54.

గీ. ...వలయుసంపద లంద నానటము వటము. భాగ. 4. 136.

వ. ఈకృపీటయోని యతని వివాహంబునం గూటసాక్షియై కైలాటంబు నేసి యప్పాటం దనకుఁ బెండ్లి ఘటింపంజేయ నావటంబై యుండునట్లు నేయక హుతం బెట్లు పరిగ్రహించె. నైష. 7. 108.

క. అటుముందట పటుశైత్యో, ద్భటమయి దిటమయి నిగాఢదళ సంతతివి, స్ఫుటమయి రుటమయి కడునా, వటమయి బటు వయిన దొక్కవటముం గనియెన్. ప్రబంధ. 207.

జ. అవటముచేయు, అవటించు, అవటిలు.

**వటముచేయు** స. క్రి. (√అవటము) 1. అవటించు, పొందుపఱుచు.

సీ. మోఁచేతివంపుగా ముడిఁచిపట్టినకేల వరదాభయంబు లావటముచేసి. పాండు. 2. 239.

2. సిద్ధముచేయు.

వ. అని యొడంబఱిచి మిలమిలనిమంచుతోడం బురుడించుధళధళమను మెఱుంగులుదుఱంగలిగొనుపటంబు నావటంబునేసి భాగ. 10 ఉ. 346.

**వటించు** స. క్రి. (√అవటము). 1. సంగ్రహించు, సేకరించు.

సీ ప్రళయానలార్కులవస యంతయును నావటించి ప్రోవిడఁగ దీపించెనొక్క. హరి. పూ. 9. 102.

గీ. కడఁగి బయ లావటించి సెన్నడుము, జేసి, కలువ ఱేకులు గన్నులుగా నమర్చి. పద్మ. 2. 9.

గీ. ఓగిరంబులు మంచి మేలోగిరములుఁ నావటించెదఁ బదఁడు మీ రారగింప, బ్రతిదినంబును జంగమార్చనము లేక, తనివు వడ నొల్ల విజితకందర్ప యనుడు. శాళ. 1. 85.

2. పొందుపఱుచు, సవరించు.

మ. ఒకకేలం దుఱు మావటించు చెలువం బుల్లంబు గొల్లాడదే. పి. శకుం. 2. 161.

3. కలిగించు, కావించు

మ. ...కామాంకము లావటించి రతితంత్రవ్యాప్తి మోదించితిన్, దశకు. 7. 113.

('అవహించి' అని క్రొత్త ప్రతిపాఠము.)

4. భక్షించు, తిను.

సీ. గా లావటించు నేవేళను జూచిన బుసకొట్టుచుం బంటు విసముఁ బెట్టు. రామ. 480.

వ. మందపవనంబులన్ దార్కొని యావటించు సానుచరద్భుజంగ సంఘంబుల. ఉ. రా. 8. 191.

5. వహించు, పూను.

ద్వి. ఘనరాజ్యభార మొక్కట నావటించి. ద్వి. పరమ. 6. 459 పా. 9. పం.

**అవటిలు(ల్లు)** అ. క్రి. (√అవటము). 1. పొందుపడు.

గీ. అతఁడు గొఱ ప్రాణమున నుండి హరువు దెరువు, లావటిలఁ దెల్పఁ జని వాయుదేవసుతుఁడు, క్షీరవారాకరోత్తరతీర భూమి, నుండుదివ్యౌషధంబుల గొండఁ దెచ్చె. రామా. 8. 175.

2. కలుగు. ఆం. భా. 3. 94.

**అవర** వి. అడవిబీఱ, చేఁతిబీఱ (వృ.వి.) ఆం. భా. 2. 60

**అవడి** — అవలి, హావడి, హావళి. వి. (శ.హావళి.) ఉపద్రవము, బాధ.

క. మానుగ జగములయావడి, మానుపఁగాఁ గోరి పుడమిమడఁతుకకై వి, న్నానికపువం గడంబున. రానెలయై పొడమినట్టి రాముని బంటఁ. అచ్చ. రా. సుం. 138. ఆం. 2. 223.

**ఆవనేయుఁడు** నం. వి. అ. పుం. భూపుత్రుఁడు - అంగారకుడు.

**ఆవపనము** నం. వి. అ. న. 1. విత్తనములు చల్లుట, విత్తుట. 2. విత్తనము, బీజము. 3. ధాన్యము పోసి పెట్టెడు పాత్రము. (గోనె, గంప, మొ.) 4. ముండనము, గొఱుగుట.

**ఆవపాఱు** అ. క్రి. 1. జ్ఞప్తికి వచ్చు. 2. తోఁచు. (శ. ర.)

**ఆవము** వి. (క. ఆవి, ఆమ.) కాల్చుటకై పేర్చిన కుండలు ఇటికలు మొదలగు వాని దొంతర.

సీ. ...కడవకు...గీ. ఎత్తి యొక్కచోట డించిన నెడలుటయును నెండి యవియుటయును నావ మిడినఁ బగిలి, పోపుటయు వాడు జను లచేఁ బొలియుటయును, గలుగుగతి మేని కెట్టునను గలుగుఁజేటు. భార. స్త్రీ. 1.34.

గీ. చక్రి పొడమంగఁ బార్థివ స్థానమయ్యె, నోరి మీ వంశ మండఁదాఁ గోర్వజాలు, వారిఁ జూపుము కుమ్మరావమున రాగి, ముంత తేఱంగఁ గలెనె నీ కింత యేల. ఉ. హరి. 3. 48.

**ఆవరకము** నం విణ. (అ. రికా అ.) 1. కప్పునది. 2. మఱుఁగు పఱుచునది.

**ఆవరణము** నం. విణ. (అ. ఆ. .అ) 1. కప్పునది. 2. మఱుఁగుపఱుచునది. 3. చుట్టుకొనునది. 4. అడ్డుపెట్టునది.

శ్లో. ...అశ్రు నేత్రావరణం ప్రమృజ్య. సీతా. నం. రఘు. 14. 71.

వి. అ. న. 1. కప్పుట 2. మఱుఁగుపఱుచుట. 3. చుట్టుకొనుట. 4. ప్రాకారము, ప్రహరి, 5. ఆచ్ఛాదనము, కప్పు. 6. గుణసాధనము.

శ్లో. శీలమావరణం స్త్రియాః. సం. రామా.

7. అడ్డు, ప్రతిబంధము. 8. ఖేటకము, డాలు.

**ఆవరణశక్తి** నం. వి. ఇ. స్త్రీ. (వేదాంత) చైతన్యమును కప్పిపుచ్చుమాయాశక్తి (ఆవరణశక్తి, విక్షేపశక్తి అని మాయాశక్తులు రెండు. లేనిది ఉన్నట్లు కనఁబడఁ జేయునది విక్షేపశక్తి.)

**ఆవరణీయము** నం. విణ. (అ. ఆ. అ.) ఆవరింపఁ దగినది.

**ఆవరనమకము** నం. వి. అ. న. రాఁగలసంవత్సరమునఁ జెల్లింపవలసినఋణము.

**ఆవరించు** నం. న. క్రి. 1. చుట్టుకొను. 2. కప్పు, క్రమ్ము.

వ. నిబిడంబుగా నావరించిన సాత్త్విక గుణంబు రీతిశరీరంబున భసితంబు గన్పట్ట. వరాహ. 4. 100.

3. ఆక్రమించు.

సీ. ఉడుటుఁడుమ్మొదలఁ బస్తునుతుమా యని ముద్దు కొమరాండ్రు విరితేనె కొల్లగొనిరి, మదటగాలివయాళి మాస్తమా యని కుమారికలు పుప్పొడు లావరించుకొనిరి. వేం. పంచ. 4. 129.

**ఆవరిత** నం విణ. (ఋ. త్రీ. ఋ.) ఆవరించువాఁడు.

**ఆవరివ్యము** నం - ఆవరణీయము.

**ఆవరీత** నం - ఆవరిత.

**ఆవరీతవ్యము** నం - ఆవరితవ్యము

**ఆవర్జనము** నం. వి. అ. న. 1. ఆనమనము, వంచుట. 2. వశీకరణము, వశము చేసికొనుట. 3. దానము, ఈవి. 4. విడుచుట.

('ఆవర్జకుఁడు, ఆవర్జ్యము' మున్నగుకృదంత రూపములు. 'వర్జకుఁడు, వర్జ్యము మున్నగు వానివలె గ్రహించునది)

**ఆవర్జితము** నం. విణ. (అ. ఆ. అ.) 1. వంపఁబడినది. 2. వశము చేసికొనఁబడినది. 3. దత్తము, ఇయ్యఁబడినది. 4. విడుపఁబడినది.

**ఆవర్తకము** నం. వి. అ. పుం. 1. మేఘములకు కూటస్థ మగు మేఘవిశేషము. 2. నీటిసుడి. 3. వెండ్రుకలసుడి. 4. ఒకానొకవిషకీటకము.

**ఆవర్తకి** నం. వి. ఈ స్త్రీ. 1. కొంకణముదు ప్రసిద్ధ మగు నొకలత. 2. భద్రదంతిక అను తీఁగ.

**ఆవర్తనము** నం. వి. అ. న. 1, చుట్టు తిరుగుట; గిరగిర తిరుగుట. 2. మథించుట, చిలుకుట.

3. ద్రావణము, లోహాదులను కరఁగించుట. 4. మరలుట 5. మధ్యాహ్న కాలము. 6. పాఠమును వల్లించుట. 7. త్రిప్పుట.

**ఆవర్తని** సం. వి. ఈ. స్త్రీ. 1. కలియఁబెట్టుటకు సాధన మగునది - దర్వి గరిఁటె, త్రెడ్డు. 2 (లోహాదులను గరఁగించుటకు ఆధారమైన) మూస.

**ఆవర్తనీయము** సం. విశే. (అ. ఆ. అ.) 1 మరల్పఁదగినది. 2. కరఁగింపఁ దగినది. 3. మథి పఁదగినది, చిలుకఁ దగినది (పెరుఁగు, మొ.) 4. వల్లింపఁదగినది, మరలమరల చదివఁ దగినది (పాఠాది.).

**ఆవర్తమణి** సం. వి. అ. పుం. ఒకానొకమణి, రాజావర్తము.

**ఆవర్తము** సం. వి. అ. పుం. 1. చుట్టు తిరుగుట. 2. నీటసుడి. 3. వెండ్రుకలసుడి 4. రాజావర్తమనెడిమణి. 5.మరలుట 6. మేఘములకుఁ గూటస్థ మగు మేఘవిశేషము, ఒకానొక ప్రళయకాల మేఘము. 7. లోహాదులను కరఁగించుట. 8. చింతనము, పర్యాలోచనము. 9. పాఠముయొక్క వల్లె. 10. సంశయము. న. మాక్షికధాతువు.

**ఆవర్తి** సం. విశే. (న్. నీ. న్.) 1. చుట్టు తిరుగునది. 2. మరలివచ్చునది. 3. మరల మరల వచ్చునది. 4. కరఁగించునది. 5. చిలుకునది, మథించునది. వి. న్. పుం. మంచిసుడులు గల గుఱ్ఱము.

**ఆవర్తించు** సం. స. క్రి. 1. వల్లించు, వల్లెవేయు.

సీ. ననవిల్తుశాస్త్రంపుమినుకు లావర్తించుపని వెన్నతోడఁ బెట్టినది మాకు. మనుచ. 2. 43.

2. జరుపు, చేయు.

క. దేవాధికారులనుభా,ర్యావర్జితులను సురాలయంబున సురతం, బావర్తించినహీనులఁ, బావకకుండముల లేదు పడఁద్రోయంగన్. రుక్మాం. 2.8.

3. త్రిప్పు, మరల్చు.

వ. కుండినావనిపురందర ప్రియనందనయును దూష్ణింభావంబుల నవ్విశ్వంభరాభర్త మీఁదఁ గటాక్షవీక్షణం బావర్తింపదయ్యె. నైష. 5. 86.

(ప్రసరింపఁజేయు - అని భావము.

4. ఆక్రమించు, క్రమ్ము.

వ ప్లవంగపుంగవులు తమతమ సైన్యంబులతోడ శైలవనసాగరసహిత యైనసర్వంసహా నావర్తించి గునియుచు నుప్పరం బెగసి దాఁటుచు. భా. రా. కిష్కిం. 548.

**ఆవర్తితము** సం. విశే. (అ. ఆ. అ.) 1. మథితము, చిలుకఁబడినది (పెరుఁగు, మొ.). 2. కరఁగింపఁబడినది (లోహాది). 3. వల్లింపఁబడినది, ఆవృత్తి చేయఁబడినది. 4. సుడి గలది. 5. మరల్పఁబడినది. 6. గుండ్రముగాఁ ద్రిప్పఁబడినది.

**ఆవర్తిని** సం. వి. ఈ. స్త్రీ. 1. నీటసుడి 2. అజశృంగి, జుట్టుపుతిఁగ.

**ఆవర్హితము** సం. విశే. (అ. ఆ. అ.) ఉత్పాటితము, పెఱుకఁబడినది.

**ఆవల** - ఆవ్వల, అవల అవుల, దేశ. వి. దే. అవ్య. (ఆ + వలను) 1. (దేశ కాలములందు) అనంతరము, అవతల.

(దేశమునకు)

సీ. రౌరవం బనఁగ ధరాస్థలిక్రిందమహారౌరవం బన నవుల దాని, కావల విను కంటకావనం బన నుండు... భార. అను. 5.170.

చ. అచిరము లైన యన్యరుచు లన్నియు నావలఁ బోవఁ ద్రోచి...విక్ర. 1.9. (ఆవల – దూరముగా.)

(కాలమునకు)

చ. అకట నితాంతలోభమున నావలఁ బాటిలు కీడు గానఁడా, లక ధృతరాష్ట్రసూనులు ... భార. భీష్మ. 1. 186.

2 ఆవైపు.

సీ. అవల నిషధరాజకులలోకేశ్వరుం డీవలఁ బరమేష్ఠిహితుఁడ నేను. నైష. 2. 66.

విశే. ఆవలిది; అన్యము, ఇతరము.

క. విను నూతికప్పవిధమున, నిను నీవ యెఱుంగు దెఱుఁగ నేరవు గర్వం, బున నావలికొలఁది ...భార. ఉద్యో. 4. 196.

జ. అవలిమొన్న, అవలియెల్లుండి.

**అవలి** – అవడి

మ. పులుఁ గొక్కం డెదుటన్ జటాధరనిరం భోవార్ధియై వజ్రియా, వలిఁదన్ జేరెడుగట్టురా కొమరుశేవం దోఁచి... చం. రా. 5. 19. వసు. 6.126.

**అవలించు** – అవులించు. (చూ. అవలింత.)

(జృంభించు)

సీ....సింహనాదంబులు చెలఁగి చేయుట మాని మానిముంచుతంద్రల నావలించువారు. గీ. నైమవేంద్రాదిసురులు దైత్యాధినాథ, మాయజోకొట్టె వన నిద్రవోయి కలవ, రింతురు...వరాహ. 11.129.

(బ్రద్దలగు, పగులు)

సీ. కాఁక యించుక మేనఁ గలిగెనా యప్పుడె హవ్యవాహనుగుండె యావలించు. పార్వ. 2. 101.

సీ. ఫణిరాజభూషణుపత్ని నెమ్మది నిల్పు యతిఁ జూచి గుండియ లావలింప, హరుని పట్టపుదేవి నాత్మలో నునిచిన జటిఁ జూచి యొడ లెల్ల జల్లు రనఁగ. చంద్రా. 3.85.

జ. అవలింత.

**అవలింత** – అవులింత. వి. (√అవలించు) జృంభ ణము, అవలించుట.

సీ. అవలింత యనంగ నావులింత యనంగ జృంభణ సంజ్ఞయై చెలఁగుచుండు. ఆం. భా. 1. 141. ద్వి. శ. సా. 1. 34 పా. 14 పం.

**అవలితము** నం. విశ. (అ. ఆ. అ.) 1. ఇంచుక కదల్పఁబడినది. 2. చక్కఁగాఁ గదల్పఁబడినది. 3. ఇంచుక త్రిప్పఁబడినది. 4. సంవృతము,కప్పఁ బడినది. 5. వేష్టితము, చుట్టుకొనఁబడినది.

**అవలిమొన్న** వి. క్రి. (√అవల) నేఁటికి పూర్వము మూఁడవదినము. ఆం. భా. 192.

**అవలియెల్లుండి** వి. క్రి. అవ్య. (√అవల). నేఁటికి తరువాత మూఁడవదినము. ఆం. భా. 1. 91.

**అవల్గితము** నం. విశ. (అ. ఆ. అ.) కదలునది, చలించునది. నం. కిరా. 4. 17.

**అవళి**–అవడి.

చ. ... అ,త్యలఘుతరంగ సంపదల కావళు లావళు లుత్పలచ్ఛదో,జ్జ్వలతకు గోళ్లు గోళ్లు. చమ. 1. 25.

క. పోవక కుమారుఁ డప్పుడు, లావును జేవ యును నగ్గలంబుగ శ్రీరం,గావరణరణ కావళి, యావళి కావలయు మాను నని హాళహాళికన్. శ్రీరం. మా. 4. 88.

**అవళి(లి)** నం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. శ్రేణి, వరుస; పరంపర – ఇది 'ముక్తా' శబ్దమువకుఁ బర మైనపుడు హారవాచక మగును. (ఉదా: ముక్తావళి.) 2. సమూహము.

క. పుడమియు రాజ్యము బంధుల, విడిచి మృగా వలులఁగలిసి విపినంబులలో... భార. అర. 2. 3.

**అవశ్యకత** నం. వి. అ. స్త్రీ. ఆవశ్యకత్వము, అక్కఱ.

**అవశ్యకత్వము** నం. వి. అ. న. – అవశ్యకత.

**అవశ్యకము** నం. విశ. (అ. ఆ. అ.) ముఖ్యమైనది, తప్పనిది.

'ఏతేష్వావశ్యక స్త్వసౌ' కారికావళి. 22.

శ్లో. ఉత్థాయావశ్యకం కృత్వాకృతశౌచస్సమా హితః, పూర్వాం సంధ్యాం జపం స్తిష్ఠే త్స్వకాలే చాపరాం చిరమ్. మను 4. 93.

వి. అవశ్యకత్వము.

**అవసతి** నం. వి. ఇ. స్త్రీ. 1. రాత్రి. 2. అర్ధరా త్రము, నడురేయి.

**అవసథము** నం. వి. అ. పుం. 1. వాసస్థానము, ఉనికిపట్టు, ఇల్లు. 2. విశ్రామస్థానము. 3. గ్రామము. 4. విద్యార్థులు సన్యాసులు మొద లగువారు బసచేయు మఠాదికము.

**అవసథికము** నం. విశ. (అ. ఈ. అ.) గృహమునం దుండునది, గృహస్థము.

**అవసథ్యము** నం. విశ. (అ. ఆ. అ.) అవసథమునం దుండునది. వి. అ. పుం. 1. గృహసంబంధి యగు లౌకికాగ్ని. 2. అగ్న్యాధి భావ

కర్మమునకు అంగమైనఅగ్ని. 3. యజ్ఞాంగములైనపంచాగ్నులలో నొకటి.(ఆవసథ్యము, దక్షిణాగ్ని, ఆహవనీయము, అన్వాహార్యము, గార్హపత్యము-అని పంచాగ్నులు.) వి. అ. న – ఆవసథము. పుం. న. సన్న్యాసులకును విద్యార్థులకును ఉనికిపట్టు. న. 1. అగ్నిహోత్రమును గృహమునందు స్థాపించుట 2. ఇల్లు, గృహము.

**అవసానికము** సం. విణ. (అ. ఈ. అ.) అవసానకాలమందైనది, అవసానమందు కలుగునది.

**అవసానుఁడు** సం. విణ. (అ. ఈ. అ.) గ్రామము యొక్క చివరను వసించువాఁడు. (చండాలుఁడు, మొ.)

**అవసితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. సుక్షేత్రాది గుణసంపన్నమైనది (ధాన్యము). 2. ముగింపఁబడినది. 3. నిర్ణయింపఁబడినది, ఏర్పాటు చేయఁబడినది. 4. అవధారితము, నిశ్చయింపఁబడినది. 5. నూర్చి ప్రోవుగా పోయఁబడినది (ధాన్యము, మొ.). 6. పక్వమైనది, పండినది. వి. అ. న. 1. పండిన ధాన్యము. 2. నూర్చి ప్రోగు పోసిన ధాన్యము.

**అవస్థికము** సం. విణ. (అ. ఈ. అ.) అవస్థయందుఁగలిగినది.

**అవహత్** సం. శత్రు. అవహిల్లుచున్న, కలుగుచున్న.

**అవహనము** సం. వి. అ. న. కలిగించుట

**అవహము** సం. విణ. (అ. ఆ. అ.) కలిగించునది. (ఉదా: దుఃఖావహము, భయావహము, మొ.) వి. అ. పుం. సప్తవాయువులలో నొకటి 2. అగ్ని యొక్క సప్తజిహ్వలలో నొకటి.

**అవహించు** సం. న. క్రి. 1. కలిగించు, అవహిల్లఁజేయు.

క. వినుమచిరవృత్తిఁ జేసిన, పని కర్తకు నావహించుఁ బశ్చాత్తాపం, బనఘా ... భార. శాం. 5. 292.

సీ. శావించి సతతయాగంబుల దేవభూదేవ పితృ ప్రీతి నావహించి, యధికధార్మికులగుట... హరి. పూ. 5. 6.

2. రప్పించు.

క. కని యిది కన్యకాదోషం, బని తలఁపక బాల్యసఖ్యకృతాజ్ఞానము వేడ్క నొనర్పనావహించితి. ముని మంత్రబలమున సూర్యుని నాథవరా. భార. ఆది. 2. 98.

3. ఆవాహనముచేయు, మంత్రాదులచే ప్రవేశపెట్టు.

గీ. వారిఁ జతుర్వ్యూహు నవ్యయు నభవుఁ బరము, నెలమిఁదమచిత్తముల నావహించి ...మార్క. 1. 107.

సీ. మణికర్ణికావారి మజ్జనం బొనరించి యవిముక్తమునయందు శివుని నిలిపి, యాశివలింగంబు ననిశంబు సేవించి యందు విశ్వేశ్వరు నావహించి. కాశీ. 4. 286.

4. ధరించు, పూను.

వ. వరాహరూపం బావహించి రసాతలంబున సలిలమగ్న యగుపృథిని నుద్ధరించిన. శివరా. 1. 62.

5. (పిశాచాదులు) సోఁకు, అవేశించు. (వ్యవ)వానిని పిశాచ మావహించినది.

**అవహిలు(ల్లు)** సం. వి. అ. క్రి. కలుగు; ఉండు.

ఉ. ...శుభం, బావహిలుః జగంబులకు...ఉ. రా. 2. 200.

గీ. ...అధ్వరమయాత్ముఁడైనవిష్ణుండు దండమై యావహిల్లు. భార. శాం. 3. 110.

గీ. అఖిలసిద్ధులు నటఁచేత నావహిల్లు. భార. శాం. 3. 415.

**అవాపకము** సం. వి. అ. పుం. కంకణము (చేతిగాజు, మురుగు, మొ.)

**అవాపకుఁడు** సం. విణ. (అ. వికా. అ.) 1. విత్తనములు చల్లువాఁడు. 2. క్షౌరము చేయువాఁడు.

**అవాపము** సం. విణ. (అ. ఆ. అ.) 1. (పాచికలు, మొ) త్రోయునది, వేయునది. 2. (విత్తనములు) చల్లునది. వి. అ. పుం. 1. విత్తులు నాటుట; చల్లుట. 2. ధాన్యాదు లుంచెడు పాత్రము (గోనె, గంప, మొ.). 3. పరరాష్ట్రచింతన. (స్వరాష్ట్రచింతన తంత్ర మని చెప్పఁబడును.) 4. ఆలవాలము, పాదు. 5. ఒడుదొడుకునేల, మిట్టపల్లములుగల భూమి. 6.

ఆవాపకము, వలయము (చేతిగాజు, మురుగు, మొ.). 7. ప్రధానహోమము. 8. (సంగీత) తాళాంగమగు నిశ్శబ్దక్రియా విశేషము, హస్తమును వెలికిఁ బెట్టి లయానుగుణముగా వ్రేళ్లు మడఁచుట.

**ఆవాపికము** సం. విణ. (అ. ఈ. అ.) ఆవాపము నకుఁదగినది.

**ఆవారకము** సం. విణ. (అ. రికా. అ.) ఆవరకము, ఆవరించునది.

**ఆవారణీయము** సం. – ఆవరణీయము.

**ఆవారయత్** సం. – ఆవృణ్వత్.

**ఆవారయిత** సం. – ఆవరిత.

**ఆవారయితవ్యము** సం – ఆవరణీయము.

**ఆవారి** సం. వి. ఇ. పుం. దుకాణము, అంగడి.

**ఆవారితము** సం. – ఆవృతము.

**ఆవార్యము** సం. – ఆవరణీయము.

**ఆవాలము** సం. వి. అ. న. ఆలవాలము, పాదు.

**ఆవాసము** సం. వి. అ. పుం. 1. ఇల్లు, ఉనికిపట్టు. 2. ఉండుట.

**ఆవాంసించు** సం. అ. క్రి. ఉండు, వర్తించు.

శా. వన్యాహారములన్ జితేంద్రియత నావాసించు నాకణ్వుఁ డీకన్యారత్నము నేగతిన్ గనియెడిన్... భాగ. 9. 610.

**ఆవాహకుఁడు** సం. విణ. (అ. హికా. అ.) ఆవాహనము చేయువాఁడు.

**ఆవాహనము** సం. వి. అ. న. 1. ఆహ్వానము. పిలుపు. 2. (దేవతలను) మంత్రములచేఁ బిలుచుట, విగ్రహాదుల యందు ప్రవేశ పెట్టుట. (వ్యతి–విసర్జనము. ఉద్వాసనము.)

**ఆవాహనీయము** సం – ఆవాహ్యము.

**ఆవాహయత్** సం. శత్ర. ఆవాహనము చేయుచున్న.

**ఆవాహయమానుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) ఆవాహనము చేయుచున్నవాఁడు.

**ఆవాహి** సం. విణ. (న్. నీ. న్.) ఆవాహనము చేయువాఁడు; పిలుచువాఁడు.

**ఆవాహించు** సం. స. క్రి. (దేవతలను) మంత్రముల చేత నాహ్వానించి పూజాస్థానమును బొందించు.

వ. సేతుమూలంబున కరిగి పాషాణంబు వైచి సముద్రు నావాహించి మ్రొక్కి యర్ఘ్యం బిచ్చి ప్రార్థించి... సేతు. 6. 194 పొ.

శా. దేవేశుండు పరిగ్రహించుట నుమాదేవిన్ సఖుల్ డగ్గఱం, బోవం జూడఁగ వోడిరోటు దగదే పొల్పొందఁగా బుత్త్రికన్, దేవార్థంబుగఁ జేసియున్నఁ గని బుద్ధిం దేకయావేల్పునం, దావాహించినమీఁద నెవ్వరికి డాయన్ ముట్టఁగా వచ్చునే. కు. సం. 9. 223.

**ఆవాహిత** సం. విణ. (ఋ. త్రీ. ఋ.) ఆవాహనము చేయువాఁడు.

**ఆవాహితము** సం. విణ. (అ. ఆ. అ.) ఆవాహింపఁబడినది.

**ఆవాహితవ్యము** సం – ఆవాహ్యము.

**ఆవాహ్యమానుఁడు** సం. విణ. (అ ఆ. అ.) ఆవాహింపఁబడుచున్నవాఁడు.

**ఆవాహ్యము** సం. విణ. (అ. ఆ. అ.) ఆవాహింపఁదగినది.

**ఆవి** వి. (క. త. అవి.) 1. ఉష్ణము, ఆవిరి.

సీ. ఉంముగంధంబు చిట్టుడుకు వట్టినఁ బొంగి యందు దుమారమై యావు లెగసె. పి. శకుం. 3. 176.

మ. ...కట్టావికుట్టారుగో, గిరిముల్ మెక్కి... ఆము. 4. 134.

2. తాపము.

మ. విహరించున్ మలయానిలం బచటఁ దావిం జిక్కి నెమ్మేనియా, వి హరించున్...విజ. వి. 2. 58.

3. శ్వాసము, ఊపిరి.

గీ. ఆసుయోధనుముక్కున నావి గలుగఁ, బుగమి నీకిఁడు...భాం. ఉద్యో. 3. 41.

4. సస్యరోగము, చీడ.

గీ. ఆవి యనఁ జీడ యనఁగను వలరు సస్య, రోగము. ఆం. భా. 2. 124.

జ: ఆవించు, ఆవిగొను, ఆవిరి, ఆవిరిల్లు, ఆవిలి.

**ఆవి** సం. వి. ఈ. స్త్రీ. 1. ప్రసవవేదన. 2. రజస్వల, ముట్టుది. 3. గర్భిణి, చూలాలు.

**అవించు** న. క్రి. (√అవి) అవిరితో పక్వముచేయు.
వ. కీచకతండులంబులం బిండికొట్టి కొట్రంబోసి యుప్పి గొప్పలుగాఁజేసి యావించినకుడుములబానలు. కాశీ. 3. 56.

**అవికము** సం. విణ. (అ. ఈ. అ.) గొఱ్ఱెసంబంధమైనది (పాలు, మొ.). వి. అ. న. ఉన్ని (గొఱ్ఱెబొచ్చు)తోఁ జేసినకంబళము.

**అవికసౌత్రికము** సం. విణ. (అ. ఈ. అ.) ఉన్నిపోఁగులతోఁ జేయఁబడినది (యజ్ఞోపవీతాది). మను. 2. 44.

**అవిగొను** అ. క్రి. (√అవి) వేఁడిగొను, వేఁడియెక్కు.
సీ. కోకపాట్లం బావిగొన నూఁది యెత్తుచుఁ గపణోష్ణకరభభాగమునఁ గాంచి. కాశీ. 3. 110.

**అవిగ్నము** సం. విణ (అ. ఆ. అ.) క్షోభపడనది, కలఁగినది. వి అ. పుం అవిగ్నము, కలివె, ఓఁక (వృ. వి.)

**అవిదూర్యము** సం. వి. అ. న. సామీప్యము, దాపు.

**అవిధము** సం. వి. అ. పుం. 1. చెప్పులు మున్నగునవి కుట్టుసూది, ఆరె. 2. కఱ్ఱ మున్నగునవి తొలిచెడు సాధనము పిడిసాన, బంమా.

**అవిద్ధకర్ణి** సం. వి. ఈ. స్త్రీ. పాతాలత, చిలుబొద్ది, అగురుసొంటి (వృ. వి.)

**అవిద్ధకర్ణిక** సం. వి. ఆ. స్త్రీ — అవిద్ధకర్ణి.

**అవిద్ధము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఛిద్రితము, తొలుపఁబడినది, బెజ్జము వేయఁబడినది. 2. క్షిప్తము, విసరవైవఁబడినది 3. తాడితము, కొట్టఁబడినది. 4. వంకరయినది.

**అవిరి** వి (√అవి-క. ఆవిరి.) 1. ఊష్మము, ఆవి.
గీ. ఎసఁగుకట్టావిక్రియ నావి రెగయఁ బగటి. యెండయుడు కాఱకుండ భూమండలమునఁ, బొలిచె మావటిపండు వెన్నెల చకోర, పోత వితతికిఁ జాఁపట్టు వోసినట్టు. ఆము. 2. 60.
2. ఒకవిధమగురోగము.
ద్వి. వెలఁతకు మే నిచ్చె వెలమి సోమేశుఁ, డలర వావిరి దిగె నల్లవిప్రులకు. పండితా. దీక్షా. 51 పు.

**అవిరిల్లు** అ క్రి (√అవి) చెమర్చు. (శ. ర.)

**అవిర్భవత్** సం. శత. పుట్టుచున్న.

**అవిర్భవించు** సం. అ. క్రి. ప్రభవించు, పుట్టు.
సీ...దారుణాతిపోవహ్నిదాహంబున వింధ్యాద్రి దరుల నావిర్భవించి, యత్యుచ్ఛమయి ధూమమాకాశ మెల్లను గప్పిన...భాగ. ఆది. 8. 96. మార్క. 1. 28.

**అవిర్భవిత** సం. విణ. (ఋ. త్రీ. ఋ.) — ఆవిర్భావకుఁడు.

**అవిర్భవిలు(ల్లు)** సం. అ. క్రి. ఉద్భవించు, పుట్టు.
క. వంశపతియై జగత్పతి, యంశంబున వీని కొంకరుఁ డావిర్భవిలున్, సంశయ మేమిటికి ...కకు. 3. 66.

**అవిర్భావరుఁడు** సం. విణ. (అ. విశా. అ.) ఆవిర్భవించువాఁడు

**అవిర్భావము** సం. వి. అ. పుం. 1. ప్రకాశము బయలుపడుట. 2. ఉత్పత్తి, పుట్టుక.

**అవిర్భూతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. అభివ్యక్తము, బయలుపడినది. 2 పుట్టినది.

**అవిర్భూతి** సం. వి. ఇ. స్త్రీ — అవిర్భావము.

**అవిలము** సం. విణ. (అ. ఆ. అ.) 1. కలఁగఁబాఱినది (జలాదికము). 2. నల్లనిది.
'అవిలప్రయోధరాగ్ర' విక్ర మో. 5. 29.
3. కలుషము (చిత్రాదికము). సం. కు. సం. 5. 37.

**అవిలి** వి. (√అవి) 1. బట్టి. (ప్రా.) 2. మాంత్రికుఁ డుపయోగించెడు కావపాత్రవిశేషము. (శ. ర.)

**అవిశత్** సం. శత. ఆవేశించుచున్న.

**అవిశ్యమానము** సం. విణ. (అ. ఆ. అ.) ఆవేశింపఁబడుచున్నది.

**అవిష్కరణము** సం. వి. అ. న. ప్రకాశనము, ప్రకటనము, వెల్లడిసేయుట.

**అవిష్కరణీయము** సం. విణ. (అ. ఆ. అ.) ప్రకటింపఁ దగినది.

**అవిష్కరించు** సం. న. క్రి. 1. ప్రకటించు. 2. ప్రసరింపఁజేయు.

గీ. వీథికలయందు దృష్టి యావిష్కరించి. కాశీ. 2. 41.

**అవిష్కర్త** నం. విణ. (ఋ. త్రి. ఋ.) ప్రకాశకుఁడు, వెల్లడించువాఁడు.

**అవిష్కర్తవ్యము** నం. విణ. (అ. ఆ. అ.) ప్రకటింపఁ దగినది.

**అవిష్కారకుఁడు** నం. విణ. (అ. రికా. అ.) అవిష్కరించువాఁడు.

**అవిష్కారము** నం. వి. అ. పుం. ఆవిష్కరణము, ప్రకటించుట, వెల్లడిసేయుట.

**అవిష్కార్యము** నం — ఆవిష్కరణీయము.

**అవిష్కుర్వత్** నం. శత్రు. ప్రకటించుచున్న.

**అవిష్కుర్వాణుఁడు** నం. విణ. (అ. ఆ. అ.) ప్రకటించుచున్నవాఁడు.

**అవిష్కృతము** నం. విణ. (అ. ఆ. అ.) ప్రకాశితము, ప్రకటింపఁబడినది.

**అవిష్కృతి** నం. వి. ఇ. స్త్రీ. ఆవిష్కరణము, వెల్లడి సేయుట.

**అవిష్క్రియ** నం. వి. ఆ. స్త్రీ. ఆవిష్కరణము, ప్రకటించుట.

**అవిష్క్రియమాణము** నం. విణ. (అ. ఆ. అ.) ప్రకటింపఁబడుచున్నది.

**అవిష్టము** నం. విణ. (అ. ఆ. అ.) 1. చొచ్చినది, నివిష్టము. 2. భూతాదులచే గ్రస్తమైనది. ఉదా: పిశాచావిష్టము, భయావిష్టము, మొ.

**అవీతము** నం. విణ. (అ. ఆ. అ.) 1. అంతటను కుట్టఁబడినది, చక్కఁగా కుట్టఁబడినది. 2. ఎత్తి ధరింపఁబడినది. (ఉత్తరీయము, జందెము, మొ.) వి. అ. న. 1. చక్కఁగా కుట్టుట. 2. (యజ్ఞోపవీతాదులను) ధరించుట. (వాచ)

**అవీరచూర్ణము** నం. వి. అ. పుం. ఫల్గువృక్షము, కుక్కమేడి (వృ.వి.).

**అవు** వి. గోవు, మొదవు. (ఐ. అవులు, అలు—వృత్తియం దంత్యవర్ణలోపము వికల్పముగ నగును. ఉదా: అవుపెయ్య, ఆఁపెయ్య, మొ.)

గీ. ఆలనేయి ముఖ్యము మహిషాదిమేష, జనిత ఘృతములుఁ దైలంబు మనుజనాథ, మధ్యమములగు... భార. అను. 4. 22.

జ. ఆఁదోఁక, ఆఁదోఁకపాటు, ఆఁబడ్డ, ఆఁబని, ఆఁపెయ్య, ఆఁపెరుఁగు, ఆఁపేయ, ఆఁబోతు, ఆలకాపరి, ఆలతేఁడు.

**అవుకుఁడు** నం. వి. అ. పుం. (నాటక) తండ్రితండ్రి.

**అవుత్తుఁడు** నం. వి. అ. పుం. (నాటక) బావ, సోదరీభర్త.

**అవుర** వి. నోరుతెరచుట కనుకరణము.

గీ. నొసలు ప్రుక్కించు నావుర నోరు తెరచు క్రీడా. 226.

**అవురు** వి. ఏడ్పునందలిధ్వని కనుకరణము.

సీ. అంత బాలిక యావురని యేడ్పుచిఱుచప్పుడాలించి... భాగ. 10 పూ. 148.

ఉ. ...ఈ పోక యింతి యావురని యేడ్వఁగదన్న కుమారరత్నమా. పరమ. 2. 176.

(వ్యవ) వాఁడు అన్నమునకు అవురావు రనుచు వచ్చినాఁడు.

**అవులించు** — అవలించు. అ. క్రి. (త. అవలి.) 1. జృంభించు. 2. నోరు తెఱచికొని యుండు; వివృతమగు, విచ్చు, విడు,

ఆ. అవులించుతలయు నడరెడునట్టయుఁ, జూచి ప్రీతుఁడగుచు సురవిరోధి. నిర్వ. 4. 40.

సీ. మొన లావులించి వాసన సల్ల బసిగొని తేఁదేఁటిగము వెంగిలింపకుండ కు.సం. 3.351.

3. బద్దలగు, పగులు.

జ. అవులింత.

**అవులింత** — అవలింత. (√అవులించు.)

ఆ. అవులింత తుమ్ము హాసంబు నిష్ఠీవనంబు గుప్తవర్తనములు గాఁగఁ, జలుపవలయు... భార. విరా. 1. 187.

ఆ. మేలు దెలిసికొంటి వాశిశిరోమణి, వింత లేని యావులింత గలదె. కృ. శకుం. 2. 87.

సా: అవులింతకు అన్నదమ్ము లున్నారు గాని తుమ్మునకు తమ్ముఁడైన లేఁడు.

**అవృణానము** నం. విణ. (అ. ఆ. అ.) ఆవరించుచున్నది.

**అవృణ్వత్** నం. శత్రు. ఆవరించుచున్న.

**అవృణ్వానము** నం. విణ. (అ. ఆ. అ.) ఆవరించుచున్నది.

**అవృతము** నం. విణ. (అ. ఆ. అ.)-ఆవరింపఁబడినది- 1. **మూయఁబడినది,** కప్పఁబడినది (ఉదా: మేఘావృతము,మొ.). 2. (ప్రాకారాదులచే) చుట్టుకొనఁబడినది. 3. గుప్తము, సురక్షితము.

(అభిమన్యుఁడు) మత్త. ఆదిఁగోలెను గృష్ణుచే దయ నావృతుండయి ధౌమ్యుతో, వేద మంగయుతమ్ముగాఁ జదివెన్...భార. ఆది. 8. 227.

**అవృతి** నం. వి. ఇ. స్త్రీ. – ఆవరణము.

**అవృతుఁడు** నం. విణ. (చూ. అవృతము) వి. అ. పుం. బ్రాహ్మణునకు ఉగ్రకన్యయందు (క్షత్రియునకును శూద్రస్త్రీకిని పుట్టినదానియందు) పుట్టినవాఁడు.

**అవృత్తము** నం. విణ. (అ. ఆ. అ.) 1. గుండ్రముగాఁ ద్రిప్పఁబడినది. 2. తిరుగుడుపడినది, మాఱు పడినది. 3. వల్లింపఁబడినది. 4. మరలినది, ప్రతినివృత్తము. 5. పరావృత్తము, వెనుదీసినది.

**అవృత్తి** నం. వి. ఇ. స్త్రీ. 1. వల్లెవేయుట. 2. మరలి వచ్చుట. 3. వెనుదీయుట, పాఱిపోవుట. 4. తిరుగుడు, గుండ్రముగా తిరుగుట. 5. తడవ, మాఱు, తేప.

**అవృత్తు** నం. వి. త్. స్త్రీ. 1. త్రిప్పుట. 2 మరల మరల చేయుట. 3. పరిపాటి, అనుక్రమము, వరుస. 4. రీతి, విధము.

శ్లో: అనయైవావృతా కార్యం పిండనిర్వపణం సుతైః. మను. 3. 248.

5. జాతకర్మాదిసంస్కారము.

శ్లో: అమంత్రికా తు కార్యేయం స్త్రీణామావృదశేషతః, సంస్కారార్థం శరీరస్య. మను. 2. 66.

**అవృష్టి** నం. వి. ఇ. స్త్రీ. వాన.

**ఆవేగము** నం. వి. అ. పుం. ఇష్టముగాని అనిష్టముగాని ప్రాప్తించినపుడు గలుగు తొట్రుపాటు, మనస్సునకుఁ గలుగుతొందర, చిత్తసంభ్రమము.

**ఆవేగి** నం. విణ. (న్. నీ. న్.) ఆవేగముగలవాఁడు. వి. ఈ. స్త్రీ. బృహద్దారకము, బొద్దికూర (వృ.వి.).

**ఆవేక్ష్యము** నం. విణ. (అ. ఆ. అ.) తొలువఁదగినది, బెజ్జమువేయఁదగినది (ముత్తెము, మొ.).

**ఆవేదకుఁడు** నం. విణ. (అ. కా. అ.) విన్నవించువాఁడు, తెలుపువాఁడు. వి. అ. పుం. వ్యాజ్యెమును దెచ్చువాఁడు, వాది.

**ఆవేదనము** నం. వి. అ. న. 1. విన్నవించుట, తెలుపుట. 2. వ్యాజ్యెముతెచ్చుట. 3. వ్యాజ్యెము.

**ఆవేదనీయము** నం. – ఆవేద్యము.

**ఆవేదనీయుఁడు** నం. – ఆవేద్యుఁడు.

**ఆవేదయత్** నం. క్రి. ఆవేదించుచున్న.

**ఆవేది** నం. విణ. (న్. నీ. న్.) 1. విజ్ఞాపకుఁడు. విన్నవించువాఁడు. 2. వ్యాజ్యెమునందు వాది.

**ఆవేదించు** నం. స. క్రి. తెలుపు.

వ. సత్యవతీనందనుం డాగామిశుభంబు లావేదించి చనిన...భార. ఆది. 7. 164

**ఆవేదిత** నం. విణ. (ఋ. త్రీ. ఋ.) – ఆవేదకుఁడు.

**ఆవేదితము** నం. విణ. (అ. ఆ. అ.) 1. విన్నవింపఁబడినది, తెలుపఁబడినది. 2. వ్యాజ్యెములో వాది ప్రతివాదులు చెప్పుకొనినది.

**ఆవేదితవ్యము** నం. – ఆవేద్యము.

**ఆవేదితుఁడు** నం. విణ. (అ. ఆ. అ.)-ఆవేదితము (తెలుపుడు సేయుట) కలవాఁడు – విన్నవింపఁబడినవాఁడు, విజ్ఞాపితుఁడు. (ఎవనికిఁ దెలుపఁబడెనో వాఁడు—రాజు, న్యాయాధికారి, మొ.)

**ఆవేద్యమానము** నం. విణ. (అ. ఆ. అ.) ఆవేదింపఁబడుచున్నది.

**ఆవేద్యము** నం. విణ. (అ. ఆ. అ.) 1. విన్నవింపఁదగినది, తెలుపఁదగినది. 2. వ్యాజ్యెమువేయుటకుఁ దగినది. (విషయము, వాదకారణము – అప్పుతీర్పకుండుట, మొ.)

**ఆవేద్యుఁడు** నం. విణ. (అ. ఆ. అ.) విన్నవించుకొనఁ దగినవాఁడు, ఎవనితో విన్నవించుకొనఁ దగునో వాఁడు (న్యాయాధికారి, మొ.).

**ఆవేశకుఁడు** నం. విణ. (అ. కా. అ.) ఆవేశించువాఁడు.

**ఆవేశనము** నం. వి. అ. న. 1. ప్రవేశించుట, చొచ్చుట. 2. ప్రవేశపెట్టుట, చొనుపుట. 3. భూతాదు లావేశించుట. 4. శిల్పశాల.

క. పుట్టినకోలెఁ ఖరత్రి, లెట్టివో యెన్నఁడును జూచి యెఱుఁగనిమాకీ, పట్టున నించుకవడి యీ,పట్టనమున మెలఁగి చూడఁబట్టదె యనఘా. హరి. పూ. 8. 208. (ఇంచుకవడి – ఇంచుకసేపు, స్వల్పమైన కాలము.)

జ. ఇంచు³, ఇంచుమించు, ఇంచుమించులాడు.

**ఇంచేటలుక** వి. (√ఇంచే¹) ప్రణయకోపము, వాలయలుక.

ఆ. తప్పు గల్గెనేని తార తీర్చి రసజ్ఞు,లస్మదీయ కవిత ననుమతింతు, రించుటలుక గలిగెనేఁ దీర్చి ప్రేయసి, నుల్లమున వరింప కోర్తు రెట్లు. కవిక. పీఠి. 1. 21.

**ఇంచేమించే** వి. (√ ఇంచేక – చూ. ఇంచుమించులాడు.)

ఇంచుమించేగా – ఎక్కువతక్కువగా; రమారమి.

ఉదా: ఆపని యించుమించుగా పదిదినములు పట్టును. (వ్రా.)

**ఇంచేమించేలాడు** స. క్రి. (√ ఇంచేమించే.) ఎక్కువతక్కువలాడు; తిరస్కరించు.

ఆ. నలినలీలసంచు నలినలిగావించు, నించుమించులాడు నించుమించు, లేమనగవుఁ జూవు లేమన నగు జావు, జగ మెఱుంగు దాని జగమెఱుంగు. విజ. వి. 1. 86.

**ఇంచేవింటిచెంచే** వి. (√ ఇంచే¹) ఇక్షుధన్వుఁడు, మన్మథుఁడు.

**ఇంచేవిలు(ల్లు)** వి. (√ఇంచే¹) ఇక్షుధనుస్సు.

ఉ. చక్కెరతిండితత్తడి వెసఁ దుమికించుచుఁ బంత్తికంఠుఁడా, చిక్కితి వంచు నించువిలు చేకొని యెక్కిడి కల్వతూపుచా, లెక్కుడు కిన్కతోఁ దొడిగి యేసి మనోభవుఁ డార్చె. ఉ. రా. 4. 171.

**ఇంచేవిలుకాఁడు** వి. (ఇఁచువిలు+కాఁడు) ఇక్షుధన్వుఁడు, మన్మథుఁడు.

గీ. మొదల మార్దైర్యధనమును ముచ్చిలింప, యించువిలుకాఁడు దొంగ మీయింతి కిచ్చె. పి. శకుం. 3. 81.

**ఇంచువిలుతు(ల్తు)ఁడు** వి. (√ ఇంచేవిలు) ఇంచువిలుకాఁడు, మన్మథుఁడు.

**ఇంజేటి** వి. ఒకజాతి కంద.

తే...గొట్టె. చెట్లు నింజేట్లుఁ దుంగముస్తియలు నీఁత, గుంజు మొదలుగఁ దిన దొరఁకొనియె జనము. కాశ. 3. 151.

**ఇంటాతఁడు** వి. (√ఇల్లు¹)-ఇంటియతఁడు (శ.ర.).

**ఇంటికాఁపు** వి. (√ఇల్లు¹) గృహస్థుఁడు.

**ఇంటిపట్టు**–ఇలుపట్టు (√ఇల్లు¹).

(వ్యవ) పట్టుమని పదిదినములు ఇంటిపట్టున నుండలేదు.

సీ. పసుపునిగ్గులు దేఱుపాఁపజన్నిద మొప్పఁ బ్రమథాధిపతి యింటిపట్టైటెంగె, ... గీ. ...ఈ తుషారాద్రికతన. మనుచ. 2. 11. (ఇంటిపట్టైటెంగె–గృహస్థుఁడయ్యెను.)

**ఇంటిపాప** వి. (√ఇల్లు¹) వెలకుఁ గొన్నదాసి (శ. ర.).

**ఇంటిపేరు** వి. (ఇల్లు¹) వంశనామము.

**ఇంటిమగఁడు** వి. (√ఇల్లు¹) పుస్తె కట్టినమగఁడు, యథావిధిగా వివాహము చేసికొన్నవాఁడు. (వ్యతి–అంకుమగఁడు.) వేం. పంచ. 1. 598.

**ఇంటియ(యా)తఁడు** వి. (√ఇల్లు¹) భర్త,మగఁడు.

గీ. అట్లు మెలఁగుట యేమిటి కంటిరేని, నింక యెక్కుడిసిగ్గు మాయింటియతని, కానఁ బుట్టింప మెలఁగుదు. ... శుక. 2. 111.

సీ. కాంతకు మానరతుకుఁ డింటియాతండు సతికి నాఱడి లేనిహితుఁడు వరుఁడు. పి. శకుం. 4. 82.

**ఇంటిల్లిపాది** వి. (√ఇల్లు¹) ఇంటిలో నున్నవారందఱు (శ. ర.).

**ఇంటివాఁడు** వి. (√ఇల్లు¹) గృహస్థు. సాంబ. మా. 7.

**ఇంటివేలుపు** – ఇలువేలుపు. వి. (√ఇల్లు¹) గృహదేవత, కులదైవము. ద్వా. 11. 15.

**ఇంత్రుపడు** అ. క్రి. (√ఇంత్రుము) సంకటపడు, ఇఱుకుపడు, కదలమెదల నవకాశము లేకయుండు.

గీ. కడఁగి కల్పాదిఁ బ్రగమ్మఁ గలుగఁజేయఁ, దవక పని గాన నట్లు నొచ్చివఁగముల,నొలిఁ

గండోదరుండు నిజోదరమున,నింట్ర పడ కుండఁగా నిల్పె నెడము లిచ్చి. హరి. ఉ. 9. 144.

**ఇంట్రము** వి. సమ్మర్దము, ఇఱుకు.

గీ. ఎదురుగా నేఁగుదెంచుచో నింట్రమయ్యెఁ, బెండ్లి యిరువంక చుట్టంపుఁ బెద్దలకును. నైష. 6. 84.

జ. ఇంట్రపడు.

**ఇండె** వి. (త. ఇణై. క. ఇండె.) పువ్వులదండ; దండ.

ద్వి. ఇండె గట్టెడిది మాయిండె రేకవ్వ. బస. పు. 2. 470 పం.

ద్వి. హాసనాలిగెయ శివయోగి దేవుండు, ఎప్పుడు ప్రేవుల నిండెలు గట్టి,తప్పక మూఁడు సంధ్యల శివుఁ బూన్ప...పండితా. దీక్షా. 80 పొ.

**ఇండె²** వి. ఎముకకీలు (శ. ర.) (వేశ్యామాత వర్ణనము.)

వ. ...పాడిల్లునుంబోలె వెన్నొరగి ముదిరిన మొగలిచెట్టునుంబోలె నేల మోపం జన్ను లుడిగి యొంటనికాఁపుప్రజయుం బోలె నిండెలు దొలంగి. కవిక. 4. 118.

**ఇండె³** వి. చీలిక. (గ్రా.)

జ. ఇండెవాఱు.

**ఇండెవాఱు** అ. క్రి. (√ఇండె³) చీలు, పగులు, బీఁటవోవు. (గ్రా.)

**ఇంత** న. వి. అవ్య. (సం. ఇయత్. ప్రా. ఇత్తిఅం. క. ఇనితు, ఇనిత్తు. త. ఇవై —చూ. అంత.)

1. ఈకొలఁదిది, ఈపరిమాణము గలది.

(దీనికి బహువచనరూపముకూడఁ గలదు—ఇది సందర్భానుసారముగా ఆధిక్యమును అల్పత్వమును గూడ సూచించును.)

క...మేనకకున్ సత్పుత్రినయి బొంకు వలుకఁగ, ధాత్రీతలనాథ యింతధర్మేతరంబే. భాగ. ఆది. 4. 97.

ఉ. ఇంతుల నేఁచుపాతక మదింతట నంతటఁ బోదు...వసు. 4. 28.

ఉ. ఇంతలు కన్నులుండఁ దెరు వెవ్వరి వేఁడెదు భూసురేంద్ర...మనుచ. 2. 41.

ఉ. పాండవకౌరవుల్ గలసి పాలును నీరును బోలె నెమ్మిమై,నుండఁగ దుష్టచేష్టల సుయోధనుఁ డింతలు సేసె నాతఁ డొ, క్కండ కులక్షయంబునకుఁ గారణమండ్రు... భార. ఉద్యో. 3. 47.

చ. ఇది దగ దంచు నడ్డపడునింతకు నేరక సభ్యు లందఱుఁగా, మది మది నున్నయట్టి యెడ... భార. ఉద్యో. 1. 348. (శ. ర. చి. ని. పాఠము-'మఱగొన్న' ముద్రి. అడ్డుపడునింతకుఁగా—అడ్డుపడుటమాత్రముననైనను.)

క. దైవికమునఁ దొక నేరమి, గావించిన నిట్లు విడువఁగాఁదగ వగునే, సేవకుని నమ్ము మునులా, రా వలదా యింతకనికరంబైన మదిఁగా. వరాహ. 10. 43.

క. అని దనుజు లూరకున్నం,గనుఁగొని నవ్వుచును శౌరి ఘను లిట మీరిం, తన యల్ల నేల గైకొనుఁ,డని ఫణము లొసంగి పుచ్చ మానె సురలతోన్. దశా. 2. 192.

2. ఈసమయము, ఇప్పుడు.

చ. ...ఉమ్మలికమ్మువ గొంతి యింతకుఁగా, బడుగయి పాలలోఁ బడిన బల్లి విధంబున నుండ కుఁదునే. భార. ఉద్యో. 3. 135. (ఇంతకున్ — ఈపాటికి.)

గీ. అనుపమాకారుఁ డవికారుఁ డట్టిపట్టి బ్రదికె నే నింతకును నింతబంటు గంఁడె. హరి. ఉ. 8. 202. (ఇంతకును — ఈపాటికి,ఇప్పటికి.)

క. ఏ నెఱిఁగివ బ్రదుకేగద, యీనడవడి యెట్లు గలిగె నింతటిలో...శుక. 3. 265. (ఇంతటిలోఁ — ఈస్వల్పకాలములో.)

గీ. ఇత్తెఱంగున మనసెట్టి యింటిమీఁది, శౌరి నైనను నిముఁ జూచుకాశినైన, నింతలో వచ్చె నేని నీ వింట లేమి, కేమనుచు బొంకఁ గలవు పూర్ణేందువదన. శుక. 1. 148. (ఇంతలో — ఈమధ్యమున, ఈనడుమను.)

క. కానఁ దటిచ్చల మగు రా,జ్యానందము మఱగి యింద్రియారాముఁడనై,పో నింత నుండి పరలో,కానందంబునకె యత్న మాపాదింతుఁగా, అము. 2. 81. (ఇంత నుండి — ఇప్పటినుండి, ఇది మొదలుకొని.)

3. ఇదమర్థకము, ఇది అనునర్థము నిచ్చును.

గీ. నృప కృతార్థుండ నైతి నా కింతకంటె, నర్థనీయంబు మఱియెద్ది యనుచు...ఆము. 3. 88. (ఇంతకంటె — దీనికంటె.)

4. ఈసర్వము, ఇది యంతయు.

తరువోజ...ఇంతకు నింతయు నెఱుఁగరె జనులు ...భార. ఆది. 5. 28.

క. ఇంతకు మూలము తృష్ణా, తంతులతయ వత్స వినుము దానికి నడరం, గాంతా జనంబు తొలుఁ బ్రాఁకింత యెఱిఁగి తృష్ణఁ దొఱఁగు టచ్చు విముక్తిఁ. భార. శాం. 4. 293.

అవ్య. 1. అధికముగా, ఎక్కువగా.

గీ. ...ఆకోడియలను బట్టి, గట్టిచేసెద నిఁక నింత కసర వలవదు...నీలా. 2. 62.

2. ఇంచుక, కొంచెము.

రగడ...నెఱసులు పల్క నింతయున్ ... వసు. 3. 149.

సీ. ...అకురాలువుగండ్ల నానెడునాస నిం తడు గూఁది బంకంటి యంగలార్చి.ఆము. 5. 117.

క్రి. (రూ. ఇంతటన్.) 1. ఇచ్చట, ఇక్కడ. (ఈయర్థమున అంతశబ్దముతోఁ గలిసియే వచ్చును. ఇంతటనంతటన్, ఇంతటంతటన్, ఇంతంతటన్, ఇంతనునంతన్, ఇంతనంతన్, ఇంతంతన్ — అనతిదూరమున, సమీపమున, సులభముగా, సులువుగా.)

చ. ఎఱుఁగవె నీవు ప్రాంతమున నింతటనంతట నున్కి. నైష. 1. 104.

క. తలవరులు వచ్చి ధరణీ, తలవరులు ప్రధానులును హితజనులుఁ దగువా, రలు నింత టంతటం బం, కలఁ జేతు లిడికొని యుండఁగా నృపుఁ బ్రోలన్. సారంగ. 3. 200.

మ. ...అంతరిక్షగతులై యింతంతటం గాన రాక నిగూఢాకృతి నున్న దేవతలు....నైష. 4. 117.

క. నెఱసి తమ మెల్ల యెడఁ గ్రిక్కిఱిసిన మఱి పాసి నిలిచి రింతనునంతన్. భార. విరా. 3. 195.

వ. వృకోదరుం డతనికి నింతనంత నుండి.భార. ఆశ్ర. 1. 18.

సీ. అమ్మహాత్ములు దమ్ము నాత్మల నాదరిం పంగఁ దా నత్యంతభక్తిఁ బ్రణతుఁ, డై పరమైకాంతు లగువారి కింతంత నిలిచి దుష్కరతపోనిష్ఠఁ బూని. భార. శాం. 6. 377.

ఇంతట నంతటన్—న.బ: అవ్య. సులభముగా, సులువుగా,

ఉ. ఇంతుల నేఁచుపాతక మ దింతట నంతటఁ బోదు...వసు. 4. 28.

2. ఇంక, ఈమీఁదట.

వ. ...నాఁడునాఁటికి నగుచున్నట్లు కిటకిటనగు చున్న దింత నియ్యింతియొరవు మాన్చి యింగితం బెఱుకపఱచుకొని చింతావనోదంబు చేయకున్నం బ్రమాదంబు. ఆము. 5. 55.

వ.అమ్మణిస్తంభుని నేకాంతంబునకుం దోడ్కొని పోయి యతనిచేతఁ దొల్లి టితతోఁకపకార ణంబును నటమునుపటిహాస్యవాక్యంబు లను జెప్పించుకొని వచ్చి సుముఖానత్తిం బూచి యింత నీవేమని చెప్పెదో చెప్పుమను టయు. కళా. 4. 156.

ఇంతంతగానితమి — అపరిమితమైనతమి. సారంగ. 2. 39.

ఇంతంతగాదు — మిక్కిలియెక్కువ, వేమన. 2. 176.

ఇంతనాఁడు — చిన్ననాఁడు.

క. ఏ నింతనాఁటనుండియు, మానవతులలోన మిగుల మానవతినినై, యీనాఁటికిఁ గడచితిని...శుక. 1. 50.

ఇంతింతలు — 1. అత్యల్పములు, మిక్కిలి తక్కువవి.

క. పలకయు వాలును నింతిం, తలు దునియలు సేసె బాణతతిఁ బాండవుఁడు. భార. విరా. 5. 158.

శా....నాతపము పెంపుల్ చూడ నింతింతలే. ప్రబోధ. 2. 22.

2. అల్పఖండములు, తుత్తునియలు.

ఉ. అంతటఁ బోక విప్రుఁడు లయాంతకుఁడై వడి
నగ్గి చాపమిం,తింతలు చేసి. రుక్మాం. 5.26.

ఉ. ...లోహతురంగమంబు నిం,తింతలు చేసి
వైచి...రాజ. చ. 2. 83.

ఇంతలింతలు — అత్యల్పములు,మిక్కిలిచిన్నవి.

సీ. ...దుస్ససేను, తను వింతలింతలు తునియలై
చెదరి రూపఱియున్నఁ గని యుడు కాఱుఁ
గాక. భార. ఉద్యో. 3. 117.

జ. ఇంతదనుక, ఇంతదాఁక,ఇంతపట్టు,ఇంతియ,
ఇందనుక, ఇందఱు, ఇందాఁక.

**ఇంతదనుక** — ఇందనుక, ఇందాఁక. అవ్య. ద్రు. (√ఇంత.) ఇంతవఱకు, ఇంతపర్యంతము.

**ఇంతదాఁక** — ఇంతదనుక.

**ఇంతపట్టు** వి. (√ఇంత) 1. ఈమాత్రము.

చ. అతులితవిష్ణుశక్తి సముపాహితమూర్తివి
గమ్ము లెమ్ము సం,తతభుజశక్తి నిట్టియవ
ధాన మొనర్పఁగ నీవకాని యీ,ఖిలి
నితరుండు లేఁ డధిపకీర్తియుఁ బుణ్యముఁ
జేరు నిన్ను నూ,ర్జితగుణ యింతపట్టు తగఁ
జేయుము గావుము లోకమంతయున్.
భార. ఆర. 4. 387.

2. ఇదియంతయు, సర్వము.

గీ. ఇప్పుడీసభఁ బుట్టినయింతపట్టు, మీకుఁ
దెల్లంబు గాదె యీ మేదినీవి,భుండు దా
నేమిటికిని ముఖ్యుండగాను, దప్పుతనదెస
లేదని చెప్పివిడిచె...భార. ఉద్యో. 4. 7.

3. ఇంతకాలము.

గీ. ఇట్టి నీవు నుట్టమ వయి యింతపట్టు,వారిలో
నున్నవాఁడవు వారిజాక్ష. హరి. పూ. 7.
233.

**ఇంతి** వి. (సం. స్త్రీ. ప్రా. ఇత్థిఆ, ఇత్థీ.) 1. ఆఁడుది, స్త్రీ.

ఉ. ఇంతుల నేఁచుపాతక మ దింతట నంతటఁ
బోదు...వసు. 4. 28.

2. భార్య, ఇల్లాలు.

సీ. కా నింతియై యుండఁగా నొరు వర్థించి
హరి వేఁడె లక్ష్మీమాహాత్మ్య మెంత కు.
సం. 7. 958.

**ఇంతియ(తె)** వి. (√ఇంత) ఇంతయె, ఇంతమాత్రము.

మ. ...పెక్కంద్ర కిం,తియ కాలం బగునట్టి
నీమనము శాంతిం బొందఁగా నేర్చునే.భార.
ఉద్యో. 4. 47.

ఉ. నిన్నటికాల వింతె తరుణీమణి యెన్నఁడు
నేర్చినావె యీ,చిన్నెలు వన్నెలాఁడి ...
ఇందు. 3. 5.

ఉ. ...కూలఁగాఁ, గారణ ముంటఁ జేసి చెడు
కార్యముఁ జేసితి వింతె యెమ్మెయిన్.
దశా. 1. 295.

**ఇంద(ము)** అవ్య. (త. ఇంద.) 'ఇదిగో పుచ్చుకొమ్ము' అని భావమును దెలుపును.

ఆ. అట్లు నేదదేటి యరవిందనాభుండు, సత్య
భామఁ జూని చంద్రవదన,శార్ఙ్గ మింద నీవు
సమరంబె కోరుదు, వవసరంబు వచ్చె
ననుచు నిచ్చె. ఉ. హరి. 1. 155.

గీ. బొమ్మపొత్తిక లడిగితికొమ్మ యింద,మనుచు
నిచ్చెఁదాఁ దెచ్చినయంబరములు. భార.
విరా. 5. 304.

**ఇందనుక** — ఇంతదనుక.

చ....మౌనికులావతంస యిం,పడరఁగ మార్గ
వంబు నెల వయ్యెడునీచరణంబు లొత్తెదన్,
బడలినవార లిందనుకఁ బాదులు ద్రవ్వియుఁ
గారె మెత్తియున్. విప్ర. 3. 84.

**ఇందఱు** వి. బ. (ఇంతశబ్దమునకు మహన్మహత్యర్థక బహువచనరూపము.) 1. ఇంతమంది.

(వ్యవ) సభకు ఇందఱు ఎప్పుడును రాలేదు.

ఉ. ఇందఱుఁ జూడఁగా...భార. విరా.2.142.

2. వీరందఱు. (ఈయర్థమునఁ బ్రాయికము
గా సముచ్చయముతోఁ గూడి యుండును.)

క....నీ,కొడుకని యీతని నెంతయు, నెడ
మడుగుగఁ జూపఁ దెత్తె యిందఱు వగఁ
గాన్. భార. ఆది. 4. 100

క. ఇమ్మద్దియ వర్జునునకు,ని మ్మ్రాపని బంధు
జనుల కిందఱకుఁ గడున్, సమ్మతము ...
భార. విరా. 5. 359.

**ఇందలి** వి*శే.* (√ఇందు²) ఇందున్న. (చూ. అందలి)
ఉదా: ఇందలివారు మొ.

**ఇందాఁక** — ఇంతదనుక.

క. ఇందాఁక విశ్రమించితి, మిందు నినుం దడవి కంటి మిప్పు డిచట... భార. శల్య. 2. 66.

గీ. ప్రియము మీఱంగ విటకంటకియును దేవ, దేవియును మిమ్ముఁ దోడ్కొని తెమ్మటంచు, నన్నుఁ బంపిరి తాము నిందాఁక వెఱచి, వచ్చి నా రింక సరగఁ బోవలయు మీరు. విప్ర. 4. 81.

**ఇంది** *నం. వి. ఇ. ఈ.* స్త్రీ. లక్ష్మి.

**ఇందిందిరము** *నం. వి. అ. పుం.* తుమ్మెద.

**ఇందిర** *నం. వి. అ.* స్త్రీ. లక్ష్మి.

**ఇందిరామందిరము** *నం. వి. అ. న.* 1. పద్మము.
2. లక్ష్మికి మందిరమువంటివాఁడు—విష్ణువు.

**ఇందివరము** *నం* — ఇందీవరము.

**ఇందీవరము** *నం. వి. అ. న.* నల్లకలువ.

**ఇందీవరి** *నం. వి. ఈ.* స్త్రీ. పిల్లపీఁచం (వృ.వి.)

**ఇందీవరిణి** *నం. వి. ఈ.* స్త్రీ. 1. నల్లకలువలగుంపు
2. నల్లకలువతీఁగ.

**ఇందు¹** *అ. క్రి.* 1. భక్షితద్రవ్యములు లోపల ఇముడు; అణఁగియుండు.

చ. ...కుక్కుకునాళ్య మిందునే. వేం. పంచ. 1. 247.

ఉ. ఇందలియామునేఁ బోదలునేనుఁగు నెక్కిమదిం జెలంగుచున్. యయా. 4 155.

(ఇందనియాము — పైకులికినమదము.)

2. రుచించు, ఇష్టమగు.

ఉ. కంటికి నిద్ర వచ్చునె సుఖం బగునే రతికేళి జిహ్వకున్, వంటక మిందునే యితర వైభవముల్ పదివేలు మానసం, బంటునె మానమంబు గలయట్టి మనుష్యున కెన్నఁ డేనియున్, గంటకుఁ డైనశాత్రవుఁ డొకండు లినంతటివాఁడు గల్గినన్. కాశీ. 1. 108.

**ఇందు²** (చూ. అందు¹) *అవ్య. ప్ర.* (త. ఇదిల్.)
1. దీనియందు; వీనియందు; ఈమెయందు; వీరియందు.

సీ. ఇక్కన్య యతిబాల యిం దుద్భవం బగు దౌహిత్రలాభంబు దలుఁగ నెట్లు. భార. ఆది. 6. 248.

క.... ఇందు వాను లెఱియఁగ వలయున్. ఆము. 3. 48.

2. ఇక్కడ.

ఆ. ఏల యెఱుక లేనియితరులయట్ల నీ, వెఱుఁగ ననుచుఁ బలికె దెఱిఁగియెఱిఁగి, యేన కాని దీని నెఱుఁగ రిం దొరు లని, తప్పఁ బలుక నగునె ధార్మికులకు. భార. ఆది. 4. 78.

క. ఇందుఁ గలఁ డందు లేఁ డని, సందేహము వలదు చక్రి సర్వోపగతుం, డు... భాగ. 7. 275.

3. ఈలోకమున.

తరువోజ... ప నిందు ధృతిఁబతియిష్టంబు దీర్పన కాన, నరిగెదఁ బతితోడ నన్యలోకంబునం దైనఁ బ్రీతి సేయఁగఁ గాంతు ననియు. భార. ఆది. 5. 145.

మ.... ఈకృష్ణకథాసుధారసము సంప్రీతాత్ములై భక్తిఁ గ్రో, లినపుణ్యాత్ములు గాంతు రిందు సుఖముల్ నిర్ధూతసర్వాఘులై, యనయంబున్ దుదిఁగాంతు రచ్యుతపదం బైనట్టికైవల్యమున్. భాగ. 10. ఉ. 1386.

5. ఇది, ఇవి అను యర్థముల నిచ్చును.
(ఈయర్థమందు విభక్తిప్రత్యయము పర మగునపుడు ద్రుతము లోపించును. ద్వితీయాది విభక్తులందే ప్రయోగములు కనఁబడుచున్నవి.)

క. కావున మన మెదురుకొనం, గావలయు సమస్తసైనిక వ్రాతముతో, నీ విందుకుఁ దగు యత్నము, గావింపుము వెనఁ బ్రభాతకాలంబునకున్. జై. భా. 5. 164.

చ... ఇందుకై కవలకు. ఆము. 6. 28.

చ. వివిధములైన యశ్వములు వేలతరంబులు నీరుద్రావుచు, న్నవియునుఁ బోవుచున్నవియు నైనవి యారయ నిందులోపలన్ పవనహయంబు వచ్చుట కనంబడదు... జై. భా. 2. 16.

జ. ఇందలి, ఇందుల.

**ఇందు³** — ఇందుగు.

(చిల్లగింజ)

సీ. ఇందు గిసినరీతి నించుకించుక చేరి గిలు
కాడుఁ దల్లిపైఁ గలపసిండి. పాండు. 3.16.

**ఇందుఁడు** సం. వి. ఉ. పుం. చంద్రుఁడు.

**ఇందుకము** సం. వి. అ. పుం. అశ్మంతకము (వృ.వి.)

**ఇందుకలి(ళి)క** సం. వి. అ. స్త్రీ. 1. చంద్రకళ. 2. కేతకి, మొగలి (వృ. వి.)

**ఇందుకాంత** సం. వి. అ. స్త్రీ. 1. రాత్రి. 2. మొగలి (వృ. వి.)

**ఇందుకాంతము** సం. వి. అ. పుం. చంద్రకాంతమణి.

**ఇందుక్షయము** సం. వి. అ. పుం. 1. చంద్రునిక్షీణదశ. 2. అమావాస్య.

**ఇందుగ** — ఇందుగు.

సీ... ఇందుగ యనఁ జిల్ల, యనఁ గతకం బగు.
ఆం. భా. 2. 63.

**ఇందుగు** - ఇందుగ, ఇందువు, ఇందు³. వి. 1. కతకము, చిల్ల (వృ.వి.)

గీ. అందుగులు గేదఁగులు మఱ్ఱు లిందుగులును,
మోదుగులు దాసనంబులు మొదలు గలుగు,
మ్రాఁకులకు... అచ్చ. రా. సుం. 25.

2. చిల్లగింజ. (చూ. ఇందువు.)

**ఇందుపుష్పిక** సం. వి. ఇ. అ. స్త్రీ. 1. కలికారి మొక్క. 2. జాంగలి, దూలగొండి (వృ.వి.)

**ఇందుప్పు** వి. (ఇందు — సం. సింధుః? + ఉప్పు) సైంధవలవణము.

సీ.... ఇందు ప్పనంగ, నడరు సైంధవలవణము.
ఆం. భా. 2.249.

**ఇందుభము** సం. వి. అ. న. 1. కర్కటరాశి. 2. మృగశీర్షనక్షత్రము.

**ఇందుమణి** సం. వి. ఇ. పుం. 1. చంద్రకాంతమణి. 2. ముత్తెము.

**ఇందుమతి** సం. వి. ఈ. స్త్రీ. 1. పున్నమ. 2. అజమహారాజు భార్య.

**ఇందుమౌళి(లి)** సం. వి. ఇ. పుం. నెలతాల్పు, శివుఁడు.

**ఇందురేఖ** సం — ఇందులేఖ.

**ఇందుల** - ఇందు² 1. ఇందలి, దీనియందున్న. (చూ. అందుల.)

సీ. ...బకుండనురక్కసుం డుండువాఁ డక్కజ
ముగ, నిందులకాఁపుల నందఱఁ దొల్లి
యుల్వరుస మ్రింగుచునున్న... భార. ఆది.
6.264.

క. ఇందులతాత్పర్యము నీ, డెందము వొందించి.
... భార. శాం. 5.17.

2. ఇచ్చోటు, ఇక్కడ.

క. వీనికి మార్కొనఁ జాలెడు, దానికిఁదగువాని
ధర్మతనయునిపురిలో, నానానియుద్ధలం
పటు, నే నొక్కనిఁ గంటి నిప్పు డిందుల
నతఁడున్. క. మనబానసీఁడు... భార.
విరా. 2.9,10.

క. ఎందుండి వచ్చితిందుల, కెందుల కేఁగెదు
మహామునీశ్వర... భార. ఆది. 4.231.

ఉ. ఎయ్యది జన్మభూమి కుల మెయ్యది
యెయ్యది యున్నచోటు పే, రెయ్యది
మీర లిందులకు నిప్పుడు వచ్చినదానికిం
గతం, బెయ్యది... భార. విరా. 1.190.

3. ఇదంశబ్దార్థకము. (దీనికిఁ బ్రథమావిభక్తి
యందుఁ బ్రయోగము కనఁబడదు.)

చ. ఎనయఁగ నీకు నెద్ది ప్రియ మిందులలో
ననినన్ బురోధసుం, డు... జై. భా. 5. 133.

(ఇందులలోన్ - వీనిలో.)

వ. ఇందులకుఁ బొందుపడు ప్రత్యుత్తరంబుల
వీనిఁగెలఁకిన... ఆము. 6.36. (ఇందు
లకున్ - వీనికి.)

**ఇందులేఖ** సం. వి. అ. స్త్రీ. 1. చంద్రకళ. 2. సోమలత.

**ఇందులోహకము** సం - ఇందులోహము.

**ఇందు(లొ)హము** సం. వి. అ. న. వెండి.

**ఇందువదన** సం. వి. అ. స్త్రీ. - చంద్రముఖ - స్త్రీ.

**ఇందువల్లి** సం. వి. ఇ. ఈ. స్త్రీ. సోమలత.

**ఇందువారము** సం. వి. అ. పుం. సోమవారము.

**ఇందువు** - ఇందుగు. వి. 1. చిల్లచెట్టు.

ఉ. ఇందువుగింజచే నుదక మెంతయు శీఘ్రము
గం బ్రసన్నతన్, బెందువిధంబువన్...
శివయో. ఉ. 2. (శ.ర.)

2. చిల్లగింజ.

సీ.....నీళ్లకలఁక నిందువు రాచి తెలుచుభంగి. వా. రా. 3.32.

**ఇందువు** నం. వి. ఉ. పుం. 1. ఇందుఁడు. చంద్రుఁడు. 2. మృగశీర్ష నక్షత్రము. 3. (గణిత) ఒకటి అనుసంఖ్య. 4. హారతి కర్పూరము.

**ఇందువ్రతము** నం. వి. అ. న. చాంద్రాయణ వ్రతము, చంద్రకళలయొక్క క్షయవృద్ధుల ననుసరించి దినమున కొక్కొక్కకబళము చొప్పున తగ్గించియు హెచ్చించియు భుజించుచు చేయునొకానొక వ్రతము.

**ఇందూరము** న. వి. అ. పుం. ఎలుక.

**ఇంద్రకము** నం. వి. అ. న. సభాగృహము.

**ఇంద్రకీలము** నం. వి. అ. పుం. అర్జునుఁడు తపస్సు చేసినయొకానొక పర్వతము.

**ఇంద్రకూటము** నం. వి. అ. పుం. ఒకానొక పర్వతము.

**ఇంద్రకృష్టము** నం. విశే. (అ. ఆ. అ.) మనుష్య ప్రయత్నము లేకయే వర్ష జలము సమృద్ధముగా నుండుటచేఁ బండునది. (ధాన్యము)

**ఇంద్రకోశము** నం. వి. అ. పుం. 1. మంచె. 2. నాగదంతము, గోడకుఁ గొట్టుపాగాకొయ్య. 3. ఇంటిముంజూరు.

**ఇంద్రగోపము** నం. వి. అ. పుం. ఆరుద్ర పురుగు. (ఇట్లే ఇంద్రగోపకము.)

**ఇంద్రచాపము** నం. వి. అ. పుం. ఇంద్రధనుస్సు, మేఘమునఁ జిత్రవర్ణములతో ధనురాకారముగాఁ గనఁబడుసూర్యకిరణసముదాయము.

**ఇంద్రచ్ఛందస్సు** నం. వి. స్. న. వేయిపేటలు గల హారము.

**ఇంద్రజాలము** నం. వి. అ. న. 1. కనుకట్టువిద్య; మంత్రౌషధాదులచేత నొకవిధ మగు పదార్థమును మఱియొక విధముగాఁ జూపెడివిద్య; మాయ. 2. కనుఁ(బ్రా)మయుట, మోసపుచ్చుట.

**ఇంద్రజాలి** నం. విశే. (న్. నీ. న్.) ఇంద్రజాలికుఁడు.

**ఇంద్రజాలికుఁడు** నం. విశే. (అ. ఆ. అ.) కనుకట్టువాఁడు, ఇంద్రజాలము చేయువాఁడు.

**ఇంద్రజి** నం — ఇంద్రజిత్తు. భార. అర. 7.120.

**ఇంద్రజితుఁడు** నం — ఇంద్రజిత్తు. భా. రా. సుం. 419.

**ఇంద్రజిత్తు(త్తుఁడు)** నం. వి. త్. పుం-ఇంద్రుని జయించినవాఁడు - మేఘనాదుఁడు. మొ.రా. యు. 2.8.

**ఇంద్రతూలకము** నం. వి. అ. న. గాలికి ఆకాశమున నెగురుచున్న దూదికణము (త్రి. ని.)

**ఇంద్రదారువు** నం. వి. ఉ. పుం. దేవదారువృక్షము.

**ఇంద్రద్రుమ** నం. వి. ఉ. పుం. 1. అర్జునము, ఏఱుమద్ది (వృ.వి.) 2. కుటజము, కొండమల్లె (వృ.వి.) (ఇట్లేఇంద్రద్రుమము, ఇంద్రవృక్షము.)

**ఇంద్రధనుస్సు(వు)** నం. వి. స్. న - ఇంద్రచాపము.

**ఇంద్రధ్వజము** నం. వి. అ. పుం. భాద్రపదశుక్ల ద్వాదశియందు రాజు తన రాజ్యమందు సస్యవృద్ధికరం మగువాన కురియుటకై ఇంద్రప్రీతిగా నెత్తునట్టిధ్వజవిశేషము.

**ఇంద్రనక్షత్రము** నం. వి. అ. న. జ్యేష్ఠ.

**ఇంద్రనీలము** నం. వి. అ. పుం. నీలమణి.

నం. వి. 2 వజ్రవిశేషము.

ద్వి. ఇంద్రనీలంబు మహేంద్ర భూషణము... మానితవజ్రవితానముల్...బస పు 3. 57 పం.

**ఇంద్రపుష్పి** నం. వి. ఈ. స్త్రీ. దూలగొండి. (వృ.వి.).

**ఇంద్రప్రస్థము** నం. వి. అ. న. యమునాతీరమున నున్న యొకానొకపట్టనము.

**ఇంద్రభేషజము** నం. వి. అ. న. సొంటి.

**ఇంద్రము** నం. వి. అ. పుం. 1. కుటజము, కొండమల్లె (వృ.వి.) భారతవర్షమునందలియొకానొక ఉపద్వీపము. 3. అధిపతి; శ్రేష్ఠము. (చూ. ఇంద్రుఁడు. 4.)

**ఇంద్రయవము** నం. వి. అ. పుం. న. కొండమల్లె విత్తు, కొడిసెవిత్తు.

**ఇంద్రలుప్తకము** సం – ఇంద్రలుప్తము.

**ఇంద్రలుప్తము** సం. వి. అ. న. ఒకానొకరోగము, బట్టతల. (దీనిచే తలవెంద్రుకలూడిపోవును.)

**ఇంద్రలోకము** సం. వి. అ. పుం. స్వర్గము.

**ఇంద్రవంశ** సం. వి. ఆ. స్త్రీ. ఒకానొకవృత్తము. (ఇందు ప్రతిపాదమునకుఁ బండ్రెండు డక్షరము లుండును.)

**ఇంద్రవజ్ర** సం. వి. ఆ. స్త్రీ. ఒకానొకవృత్తము. (ఇందు ప్రతిపాదములోను పదునొకం డక్షరము లుండును.)

**ఇంద్రవల్లి** సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. ఇంద్రవారుణి లత, పెద్దపాఁపర (వృ.వి.) 2. పారిజాతలత, పారిభద్రము (వృ.వి.)

**ఇంద్రవస్తి** సం. వి. ఇ. పుం. కాలిపిక్క.

**ఇంద్రవారుణి** సం. వి. ఈ. స్త్రీ. పెద్దపాఁపర (వృ.వి.)

**ఇంద్రశత్రువు** సం. వి. ఉ. పుం. 1. వృత్రాసురుఁడు 2. ఇంద్రునిశత్రువు

**ఇంద్రశలభము** సం. వి. అ. పుం. ఆరుద్ర పురుగు.

**ఇంద్రసురస** సం. వి. ఆ. స్త్రీ. పెద్దపాఁపర (వృ.వి)

**ఇంద్రసురసము** సం. వి. అ. పుం. వావిలి. (వృ.వి.)

**ఇంద్రాగ్ని** సం. వి. ఇ. పుం – మేఘములవలనఁ గలుగునిప్పు – విద్యుదగ్ని, మెఱుపు.

**ఇంద్రాణి** సం. వి. ఈ. స్త్రీ. 1 – ఇంద్రునిపత్ని – శచీదేవి. 2. దుర్గాభేదము, సప్తమాతలలో నొకతె. 3. పెద్దయేలకి (వృ.వి.) నల్లవావిలి (వృ.వి.)

**ఇంద్రాయుధ** సం. వి. ఆ. స్త్రీ. ఒకజాతిజలగ. (దీనిశరీరముపై ఇంద్రధనుస్సురంగులవంటి రంగు లుండును.)

**ఇంద్రాయుధము** సం. వి. అ. న. 1. వజ్రాయుధము. 2. ఇంద్రధనుస్సు, రతనపువిల్లు.

**ఇంద్రారి** సం. ఇ. వి. పుం. వేల్పుదాయ, అసురుఁడు.

**ఇంద్రావరజుఁడు** సం. వి. అ. పుం. ఉపేంద్రుఁడు, విష్ణువు. (ఇతఁడువామనావతారమున నింద్రుని తమ్ముఁడయ్యెను.)

**ఇంద్రాశనము** సం. వి. అ. పుం. 1. భంగ, గంజాయి (వృ.వి.) 2. గుంజాలత, గురివెంద (వృ వి.)

**ఇంద్రియగోచరము** సం. వి. అ. పుం – ఇంద్రియములకు గోచరించునది – శబ్దస్పర్శరూపాదికము.

**ఇంద్రియగ్రామము** సం. వి. అ. పుం. ఇంద్రియ సముదాయము.

**ఇంద్రియజ్ఞానము** సం. వి. అ. న. ప్రత్యక్షజ్ఞానము.

**ఇంద్రియనిగ్రహము** సం. వి. అ. పుం. ఇంద్రియములను విచ్చలవిడిగా విషయములందు ప్రవర్తింపనీయక వశపఱుచుకొనుట.

**ఇంద్రియబోధనము** సం. విశే. (అ. ఆ. అ.) ఇంద్రియముల కుద్రేకము కలిగించునది, ఇంద్రియములను రేఁపుట.

**ఇంద్రియము** సం. వి. అ. న. 1. త్వగాది. (ఇవి పది – త్వక్కు, చక్షువు, శ్రోత్రము, జిహ్వ, ఘ్రాణము – ఇవిజ్ఞానేంద్రియములు. వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థము-ఇవి కర్మేంద్రియములు. మనస్సుతోఁ గూడ ఏకాదశేంద్రియము లగును.) 2. రేతస్సు. 3. అయిదు అనుసంఖ్య.

**ఇంద్రియసన్నికర్షము** సం. వి. అ. పుం – ఇంద్రియములకు తమతమ విషయములతోడి సంబంధము, ప్రత్యక్షజనక మగువ్యాపారము.

**ఇంద్రియారాముఁడు** సం. విశే. (అ. ఆ. అ.) ఇంద్రియార్థముల ననుభవించుటయందు ఆసక్తి కలవాఁడు, విషయలోలుఁడు.

**ఇంద్రియార్థము** సం. వి. అ. పుం. శబ్దాదివిషయము. (ఇవి ఐదు-శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము.)

**ఇంద్రుఁడు** సం. వి. అ. పుం – ఐశ్వర్యము గలవాఁడు–1. సురపతి, వాసవుఁడు. 2 ద్వాదశాదిత్యులలో నొకఁడు. 3. పరమేశ్వరుఁడు. 4. సమాసమునం దుత్తరపద మైనపుడు మహాదమహాధ్యావముల ననుసరించి 'ఇంద్రుఁడు, ఇంద్రము' అనురూపములలో నుండి 'అధిపతి, శ్రేష్ఠుఁడు, శ్రేష్ఠము' అనునర్థముల నిచ్చును. (ఉదా: నరేంద్రుఁడు, మృగేంద్రము, యోగీంద్రుఁడు, కపీంద్రము, మొ.)

**ఇంద్రోత్సవము** సం. వి. అ. పుం. ఇంద్రునిగూర్చి రాజులు మొదలగువారు ఏఁటేఁటఁ జేయు నుత్సవ విశేషము.

**ఇంధకుఁడు** సం. విణ. (అ.ధికా.అ.) కాల్చువాఁడు.

**ఇంధనము** సం. విణ. (అ. ఈ. అ.) రగుల్చునది, వెలిఁగించునది. వి.అ.న. 1. రగుల్చుట, వెలిఁగించుట. 2. వంటకట్టియ.

**ఇంధనీయము** సం – ఇంధ్యము.

**ఇంధము** సం. విణ. (అ. అ. అ.) 1. రగుల్చునది, వెలిఁగించునది. 2. రగులునది, వెలుఁగునది. వి. అ. పుం. వంటకట్టియ.

**ఇంధయిత** సం. విణ.(ఋ. త్రి. ఋ.) కాల్చువాఁడు.

**ఇంధయితవ్యము** సం. విణ. (అ. అ. అ.) కాల్పఁదగినది.

**ఇంధానము** సం. విణ. (అ. అ. అ.) కాలుచున్నది; ప్రకాశించుచున్నది.

**ఇంధిత** సం విణ. (ఋ. త్రి. ఋ.) కాలునది (కట్టియ).

**ఇంధ్యము** సం. విణ. (అ. అ. అ.) కాల్పఁదగినది.

**ఇంపితము** విణ. (ఇంపు+ఇతము.) ఇంపైనది. (ఇది పోరితమువంటిది – శ. ర.)

**ఇంపు** – ఇంబు, ఇమ్ము వి. (√ఇంచు¹-క. ఇంపు. త. ఇన్పు,ఇనిప్పు.) 1. తీపి, మాధుర్యము.

సీ. అమృతంబునింపు కర్ణములకు నొసఁగెడు మాట లాకర్ణింపు మనుజనాథ. భార.సౌ. 1.228.

2. సంతోషము, ఆనందము.

శా....సీ. వేణీబంధము నవ్విభుండు తనచే వీడ్వంగ నత్యంతక, ల్యాణస్ఫూర్తి వెలుంగు నిమ్నుఁ గని తెల్లం బేమ నింపొందెదన్. భా. రా.యు. 401.

శా. ఆయింపే పరబ్రహ్మము...మనుచ.2. 62.

3. మనోజ్ఞత, విలాసము, అందము, శోభ.

క. జడనిధి యను తెరమఱుఁ గటు,వెడలి నిలిచినట్టి యాటవెలఁదియపోలెన్. గడు నింపులు గులుకుచుఁదన,రెడునీపురలక్ష్మి యవధరించితె యధిపా. ప్రభా. 1.57.

సీ. సత్యభామాభోగసక్తి నాఁడును నేఁడు నాకల్ప మవని నింపార నిలిపె. పారి. పీఠి. 19.

(ఇఁపారన్ – చక్కఁగా)

గీ. ఇంపు దళుకొత్త వీణ వాయించుచుండి. మనుచ. 2. 27.

4. వినోదకృత్యము.

ఉ. పెంపునఁ జందమామ ప్రతిబింబముఖంబునఁ జుంబనంబు గా,వింపను రాయఁ దత్కర నవీనరుచుల్ వలితభ్రమంబు పుట్టింపఁగ రోసిపద్మిని ముడించెను మోమునఁ దమ్మి మోడ్పునా,యిం పటు మూచి నవ్వెనన నెంతయును న్వికసించెఁ గల్వయున్. విప్ర. 3. 86.

5. ఇచ్ఛ, ఆసక్తి; వలపు.

మ. ...వేసటలముంపున్ మాటపైఁ గంటగిం, పును వర్ణ్యక్షితిపాలపాళిపయి నింపు న్నింప మిం దెల్పినన్. చంద్రా. 5. 152.

సీ. చారువేణికి వింత చవుల నింపులు మీఱఁ గను పట్టె విశదమై గండరేఖ. వసు. 3. 20.

చ. నలుఁ గిడి చల్వ చాల్చి పయనంపుటలంతల నిద్రఁజెందురో, వెలఁదుల లేవఁ గొంకి పతి వింతగుడారపుఁ జారి వారిగం,టల రొద కుల్కి లేవఁ జిఱునవ్వులతోఁ దమవారిఁ గూడి యిం,పులతమి దీటినన్ నిదురవోయిరి నన్నులొజుంగు లత్తటిన్. కువల. 2. 110.

విణ. ప్రియము, ఇష్టము.

గీ. తల్లి వన్నులపా లేనుద్రావ నెట్టు,లాననే పలుతెఱఁగుల తేనియలును, ఖండశర్కర తోడి దుగ్ధంబు లనుభ,వింపఁబడవే యవియు నింత యింపు గావు. భార. కర్ణ. 3. 216.

గీ. నలుని వరియింపఁ గోరెదు నాకు నివ్వు, డింద్రుపలుకు లయుక్తంబు లింపుగావు. నైష. 3. 131.

క. ... అ,నిందిత చరితములె నుమ్మ నీవతి కింపుల్. కళా. 7. 92.

**ఇంపెసలారు** అ. క్రి. (ఇంపు+ఎసలు+ఆరు) శోభాతిశయమునొందు, శోభిల్లు. నైష. 3.55.

**ఇంపొందు** అ. క్రి. (ఇంపు+ఒందు) ఒప్పు.

శా...మా, కింతే చాలు వటంచు సంతసముతో
నింపొందుదునాభారతీ, కాంతుండు ... దశా.
1. 3.

**ఇంబు** – ఇంపు.

**విశే.** (ప్రియము, ఇష్టము.)

**ఉ.** ఇంబుగ సర్వలోకజను లెవ్వనియేనిముఖా
మృతాంశుబింబంబున నుద్భవం బయిన
భారతవాగమృతంబు కర్ణరంధ్రం బను
నంజలిందవిలి త్రావుదురు ... భార. ఆది.
1. 76.

**వి.** (ఆనందము.)

గీ...అతఁడు గదాదండమును సమిద్ధజయ
నాదికంబు వరమునిచ్చెను హరి కిం బడ
రంగఁ, బలుదెఱంగుల నార్యులు ప్రస్తుతింప.
రాఘ. 2. 111.

ఉ. ఇం బడరంగ నియ్యకొనియెన్ రజనీచరుఁ
డేమి భాగ్యమో,యంబుజనాభ ... ప్రభా.
1. 91.

(శోభ, విలాసము.)

శా. ఇంబుల్ గుల్కెడుచాన...మల్ల. వైరాగ్య.
41.

**ఇఁక** – ఇఁగ అవ్య. ద్రు. (క. ఇన్ను. త. ఇని.)

1. ఇతఃపరము, ఈపైని, ఇందుమీఁద.

ఆ. ఇంకనైన మమ్ము నెఱుఁగంగ నగునొక్కొ.
భార. ఆది. 6. 90.

వ. ఒక్కయెడ వరదంబు లరిగినచొప్పుగాంచి
దానివెంబడిం జనిచని.

క. కేవలమాతులతోడన,పోవుట గని వారిఁ జేరఁ
బోవక యది యిం, కేవంకఁ బోవునొకొ
యను,భావనఁ బోయితిమి దానివజ్జన
యేమున్. భార. విరా. 3.83, 84.

గీ. చాలు సందేహవక్ర భాషణము లింక.నైష.
2. 71.

క. అప్పటి కట్లరుదెంచుట, తప్పనరా దంత
మనము దండ మనికిఁ దా,నప్పుడుచుఁదనము
మానక, యిప్పడఁతుక యంత వెట్టియే
యిఁకఁ జేయన్. ప్రభా. 5. 21.

2. ఏతదనన్యము, ఇంతకంటె వేఱు.

ఉ...తండ్రి తా,నిట్టగునన్ను నింకొకని కియ్యక
తొల్తన. ఆము. 5. 80.

3. ఇంతకంటె నధికముగా.

క....నా కింకను బలువుర,దనయులఁ బడ
యంగ వలయు ధర్మువు వేర్మిన్. భార.ఆది.
5. 119.

మ. మొదలం దేవర యానతిచ్చితిర యేముం
జిత్తమం దెంతు మ,య్యది నాకుం గొడు
కింకనుం గలఁడె. హరి. 2. 181.

4. ఇది సందర్భానుసారముగా ఇప్పటికిని,
ఇంతకంటె, మఱియు, మున్నగునర్థముల
నిచ్చును.

(వ్యవ) వాఁడింకను రాలేదు. ఏఁబది రూప్య
ములు మాత్రమే నాయొద్దనున్నవి. ఇంక
నెక్కువ సొమ్ము లేదు.

రామాయణము భారతము ఇంకఁగొన్ని పుస్త
కములును నాయొద్ద నున్నవి.

ఇఁకమీఁదన్, ఇఁకమీఁదటన్ = ఇఁక.

గీ. తలఁపఁ దైత్యలోకలక్ష్మి యాధన్యుఁ జేరు,
నీకు నెయ్యది యిఁకమీఁద నిర్జరేంద్ర.
దశా. 2. 32.

క. నీచిత్త మింకమీఁదట, నాచేతం గా దటన్న.
...దశా. 4. 84.

**ఇఁగ** – ఇఁక.

ద్వి. సంసారి నేటికి సరిచేసికొంటి, విఁగ మెడ
దుని మెడ విది యేమి పుట్టె, జగములలో
రిత్తపడి వచ్చె నీకు. బస. పు. 5. 90 పం.

**ఇఁడి** ప్ర. (త. క. ఇతి.) లేనిది, లేనివాఁడు – అను
వర్థముల నిచ్చును. (ఉదా: ముక్కిఁడి,వాలిఁడి,
సిగ్గిఁడి, మొ.)

**ఇకటము** సం. వి. అ. పుం. కరీరము,వెదురుమొలక.

**ఇక్క** – ఇక్కువ. వి. (క. ఇర్కె, ఇక్కె. త.
ఇరుక్కై.) 1. స్థావము; సంకేతస్థలము.

శా....నేరా నిశాచారిం గీకకులాశి నంచు
వెసఁ గేశాకేశి వర్తింపఁ దెం, పారంబోయి
రెలుంగునిక్కలకు నయ్యాశ్చర్యపుం జీఁక
టిన్. భా. రా. యు. 587.

చ...ప్రమదంబునఁ బట్టినచోటు లెల్లనుం,గళ లకు నిక్కలై మెఱయఁగా రతి సల్పిరి వేడ్క దంపతుల్. విక్ర. 4. 224.

ఉ. అక్కమలాక్షి పొందు దగ నాడి తుదిన్ నిజ మేదినేఁటిరే,యిక్కకురాక తక్కినసహించు నె నన్ మరుఁడు. భార. విరా. 2. 296.

2. ఇల్లు; నివాసస్థానము; ఆశ్రయము.

ఉ. చయ్యన నేఁగి యంబుజవిశాలవిలోచనఁ గాంచి ప్రీతిమై, నయ్యెడ నేకతంబ హృద యం బలరం దగఁ బల్కి యొక్క మై, నియ్యకొనంగఁ జేసి యెలయించెద నిక్కకుఁ దార్చి నేర్పునన్, కయ్యకుఁ దెచ్చెదం గుసుమసాయకు పూనికి నేఁడ తీర్చెదన్. భార. విరా. 2. 245.

ఉ. చుక్కలు తోడుతోడఁ దలచూపఁదొడంగె మనోభవుండు వి,ల్లెక్కిడి చక్రవాకముల యిక్కలు రోయఁగఁ జొచ్చె...భార.విరా. 2. 319.

సీ. ఎలమి నమ్మేలఁత నన్నేలయింపఁ దివిరిన నెడద యానందంబునిక్క గాదె. భార. విరా, 2. 86.

సీ. సౌశీల్యమున కీప్రశాంతిశాలి విడారు పర హిత క్రియ కీప్రపన్నుఁ డిక్క. ఉ.రా. 5.140.

3. ఉనికి. (చూ. ఇక్కపట్టు.)

జ. ఇక్కపట్టు.

**ఇక్కటము** సం. వి. అ. పుం. చాఁప లల్లుట కుప యోగించుతృణ విశేషము.

**ఇక్కట్టు** వి. (ఇరు+కట్టు-క. ఇక్కట్టు, ఇర్కట్టు. త. ఇక్కట్టు.) ఆపద, ఇబ్బంది, ఒత్తుడు.

ఆ. ఎందుఁ జనఁగ రానియిక్కట్టు ప్రాప్తించెఁ, గృష్ణ రాఁదొడంగెఁ గృష్ణరాయ, లివలఁ దఱుమఁ జొచ్చె నెంతయు వెఱపింపఁ, బోయి వెఱచుకొన్న చాయయయ్యె. కృష్ణ 3.48.

విశే. ఇఱుకైనది, సంకుచితము.

సీ. ఇక్కట్టు త్రోవల నెదురైన నెదురుగా నొయ్యారిమేను మే నొరయ నేఁగు. దశా. 8.214.

**ఇక్కడ** వి. వి. (ఈ+కడ) ఈచోటు. (చూ. అక్కడ.)

**ఇక్కన్ను** వి. బొ. (ఇరు+కన్నులు) రెండు కన్నులు.

ద్వి. ముక్కంటి వాని సమ్ముఖమున నుండి, యిక్కంటితో నొక్కయింతి యేతెంచి. బస. పు. 6. 131 పం.

ద్వి. ముక్కంటివాఁ డేల మును వెట్టినేయు, నిక్కంటివానికి నేఁ జేయ ననుడు. పండితా. మహిమ. 276పా.

**ఇక్కపట్టు** వి. (√ఇక్క) ఉనికిపట్టు.

సీ. క్రొక్కారు మెఱుఁగులయిక్క ప ట్టిది యని తారముక్తాహారతరలరుచులు... మెచ్చి చూచుచు... కు.సం. 3.261.

**ఇక్కు**[1] వి. (త. ఇక్కు - ఇఱుకు) ఇఱుకు, సంక టము. (చూ. ఇక్కుపాటు.)

జ. ఇక్కుపాటు.

**ఇక్కు**[2] వి. (త. ఇక్కు - నడుము) మధ్యము, నడుము.

ఆ. ఇక్కుముట్టి చక్కి నెక్కంగ మఱచి సం, భ్రమముఁ బొంది పిఱుఁదఁ బ్రమథగణము, లార్వఁ బోతుమీఁద నడ్డంబుపడి యుప్పు, పెటికవోలె వెఱచి పఱచె జముఁడు. కు. సం. 2.206. (ఇంకను విచార్యము.)

**ఇక్కుపాటు** వి. (√ఇక్కు[1]) - ఇఱుకునఁ బడుట- ఇక్కట్టు, ఆపద.

ద్వి. అక్కటా నీతిజ్ఞుఁ డైన నీ కిట్టి, యిక్కు పాటును గల్గెనే తండ్రియనుచు. రం. రా. సుం. 270 పా. 10 పం.

**ఇక్కువ** - ఇక్క. వి. 1. ఉనికి, ఉండుట.

ఉ. ఎచ్చటఁ గంటిరో విజయునిక్కువ నిక్కువ మానె రాఁడుగా, యిచ్చటికి ... విజ. వి. 2.167.

2. స్థానము; నివాసస్థానము; ఆశ్రయము.

ఉ. ఎక్కడఁ బోయితో యెఱుఁగ కేనును వెంటనె వచ్చి యప్పు డే,దిక్కువ నిన్నుఁ గానకమదిన్ వెఱఁగందుచు దేవుఁడాన నీ, విక్కర మెత్తునయ్యఱవపిల్లలవాడల నింత

నేవు నీ,యిక్కువ లన్నియున్ వెదకి యే
నిట వచ్చితి లేచి రావయా. వై జ. 4.38.

క. దిక్కులనెల్లఁ బొగడ్తకు, నెక్కినయక్కజపుఁగడిమి నేపారెడుమీ, రిక్కడ నుండియ మీమీ. యిక్కువలకుఁ జనుఁడు వానరేశ్వరులారా. భా.రా.యు. 2468.

ఉ. ఎక్కడివాఁడొ యీచెలువుఁ డింద్రుని పట్టియొ రంభచుట్టమో, చుక్కల ఱేఁడొ శంబరునినూడొ వసంతుఁడొ కాక భూమిలో, నెక్కడ యిట్టిరాజు జనియించుట లెక్కడ నిక్క మెన్న నే, యిక్కువ నేర్చి నొక్కొ సృజియింపఁగ నీతని ధాత గ్రొత్తగన్. ఉ. హరిశ్చ. 3.49. (ఏయిక్కువన్ — ఎక్కడ)

ఉ. ...ఒక్కనయంబ యొండె భయ మొండె నొనర్చక తద్ద్వయంబుఁ దా, నిక్కు వెలింగి చూపు మనుజేంద్రునకున్ వశు లౌదు రందఱున్. హ. వరాహ. 1.9 పొ.
(ఇక్కువ—యుక్తస్థానము, పాత్రము.)

సీ. మొగమోట కుడుగనిపగ రాజసంబుల యిక్కువ గురుసేవ కెదురుచుక్క. రాజ. చ. 2.21.

ఉ. ఈవికి నిమ్ము భోగమున కిక్కువ చక్కఁదనంపుఁదేటకున్, దావు... రా.వి. 2.31.
(చి.ని.పా-ఇంకువ. ముద్రి.)

3. సంకేతస్థలము.

మ. అకటా యిక్కువ చెప్పి రాకునికి యే మంచున్ దదీయాలయో,ర్వికి డాయున్ దలవాకిట న్నిలక పొరెన్ జేయు సంచారము, ల్పకిలించున్ బ్రకటించుఁ బాటఁబరుఁ బిల్వం జూచు జారుండు బం,ధకి సంధింపమి కంధకారసమయాంతః ప్రాప్తి సంతప్తుఁడై. బహు. 3.49.

4. కళాస్థానము.

గీ. సొగసుకాఁడెదఁ గదియించి జంటిమోవి, గంటి యొనరించి యిక్కువ లంటి తుంట, వింటి బలుదంటపనులు గావించునపుడు. నీలా. 3.94.

5. సూచన, జాడ.

గీ. త్వష్టకు సుదాహరకుఁ జతుర్దశి యనంగ, నొక్క కూఁతురు గలిగినయిక్కు వెలిఁగి, గంధగజరూపమునను వక్కన్యఁ దెచ్చి, కదిసి నరకాసురుండు సౌఖ్యములఁ దేలి. ఉ హరి. 1.82.

సీ. సుముఖుఁ డోటకు నవ్వుచూపులే యిక్కువ యింపొందిమెచ్చుట కిరి గుఱుతు. నీతి. 25.

**ఇక్షుకము** సం. వి. అ. పుం — ఇక్షువు.

**ఇక్షుకాండము** సం. వి. అ. పుం. న. 1. ఱెల్లు, కాశము (వృ.వి.) 2. ముంజిగడ్డి. 3. చెఱకు గడ.

**ఇక్షుకీయ** సం. వి. ఆ. స్త్రీ. చెఱకు విశేషముగాఁ గలభూమి.

**ఇక్షుకుట్టకుఁడు** సం. వి. అ. పుం. చెఱకు నఱికి బెల్లము చేయువాఁడు.

**ఇక్షుగంధ** సం. వి. ఆ. స్త్రీ. 1. ఱెల్లు (వృ.వి.) 2. గొలిమిడ (వృ.వి.) 3. శుక్లవిదారి, తెల్లనేలగుమ్ముడు. (వృ.వి.) 4. పల్లేరు (వృ.వి.)

**ఇక్షుగంధము** సం. వి. అ. పుం. క్షుద్రగోక్షురము, చిన్నపల్లేరు (వృ.వి.)

**ఇక్షుచ్ఛాయము** సం. వి. అ. న. చెఱకులనీడ.

శ్లో. ఇక్షుచ్ఛాయనిషాదిన్య, స్తస్య గోప్తుర్గుణోదయం. సం. రఘు. 4.20.

**ఇక్షుదండము** సం. వి. అ. పుం. చెఱకుగడ.

**ఇక్షుదర్భ** సం. వి. ఆ. స్త్రీ. తృణపత్త్రిక, ఒకవిధ మగుగడ్డి.

**ఇక్షుధన్వుఁడు** సం. వి. న్. పుం. ఇంచువిలుకాఁడు, మన్మథుఁడు.

**ఇక్షునాళిక** సం. వి. ఆ. స్త్రీ. నల్లచెఱకు (వృ.వి.)

**ఇక్షునేత్రము** సం. వి. అ. న. 1. చెఱకుగనుపు. 2. ఒక జాతి చెఱకు (వృ.వి)

**ఇక్షుపత్త్రము** సం. వి. అ. పుం. ధాన్యభేదము.

**ఇక్షుపాకము** సం. వి. అ. పుం. పాకము పట్టిన చెఱకు రసము.

**ఇక్షుప్రము** సం. వి. అ. పుం. శరము, ఱెల్లు (వృ.వి.)

ఇక్షుబాలిక సం. వి. అ. స్త్రీ. శరము, ఱెల్లు (వృ.వి.)

ఇక్షుమేహము సం. వి. అ. పుం. మధుమేహ మను రోగము.

ఇక్షుయంత్రము సం. వి. అ. న. చెఱకురసము తీయుయంత్రము, చెఱకుగానుఁగ.

ఇక్షుయోని సం. వి. ఇ. పుం. పుండ్రేక్షువు, నలుపు గలసినయెఱ్ఱ చెఱకు.

ఇక్షురకము సం. వి. అ. పుం. కాశతృణము, ఱెల్లు గడ్డి.

ఇక్షురము సం. వి. అ. పుం. 1. గోక్షురము, పల్లేరు (వృ.వి.) 2. ములుగోలిమిడి (వృ.వి.) 3. చెఱకు (వృ.వి.) 4. కాశము, ఱెల్లు (వృ.వి.)

ఇక్షురసము సం. వి. అ. పుం. 1. చెఱకురసము. 2. ఒకవిధమగు ఱెల్లు (వృ.వి.)

ఇక్షువణము సం. వి. అ. న. చెఱకుతోఁట.

ఇక్షువల్లరి సం - ఇక్షువల్లి.

ఇక్షువల్లి సం. వి ఈ. స్త్రీ. క్షీరవిదారి, నల్లనేల గుమ్మడు (వృ.వి.)

ఇక్షువాటి సం. వి. ఈ. స్త్రీ. 1. చెఱకుతోఁట 2. పుండ్రకమను చెఱకు (వృ.వి.)

ఇక్షువాటిక సం. వి. అ. స్త్రీ - ఇక్షువాటి.

ఇక్షువాలిక సం. వి. అ. స్త్రీ. కాశము, ఱెల్లు (వృ.వి.)

ఇక్షువు సం. వి. ఉ. పుం. 1. ఇంచు, చెఱకు (వృ వి.) (దీని భేదములు-పుండ్రము, కాంతారము, శతపర్వము, బంగాళము, నేపాళము, మొ.)

ఇక్షుశరము సం. వి. అ. పుం. కాశభేదము, ఒక జాతి ఱెల్లు (వృ.వి.)

ఇక్షుశాకటము సం. విశే. (అ. ఆ. అ.) చెఱకు పంచెడుది (పొలము.)

ఇక్షుశాకినము సం. - ఇక్షుశాకటము.

ఇక్షూదము సం. వి. అ. పుం. చెఱకుసముద్రము.

ఇక్ష్వాకు(వు) సం. వి. ఉ. పుం. సూర్యవంశపు రాజులలో నొకడు ఉ. స్త్రీ. చేఁదుసొఱ (వృ.వి.)
సీ. మనువు నిక్ష్వాకు వేఁడిన...వైజ. 1. 78.

ఇగము-ఇవము.

తే. చల్లన యివం బిగం బీము చలిమిరి చలి, జలుబు సీ తివశాళింపు చలువ యివకఁ యనఁగ శీతంబు గుఱిగుణాఖ్యలఁ దగు హర. అం. ఛా. 1. 80.

ఇగిడించు-నిగిడించు.

(ప్రయోగించు)

సీ. అసురు లుద్ధతి శూలహలభిందిపాలంబు లడరించి రడఁగించె నర్జునుండు, దైత్యు లుద్దండించి దండశంకులశక్తు లిగిడించి రుడిగించె నింద్రసుతుఁడు. హర. 7. 164.

ఇగిరించు[1] అ. క్రి. (√ఇరుగు[1]) 1. మొలకలెత్తు, అంకురించు.

వ. ...భవదరుణచరణనిహతిఁ జెకలిన కఱకు చెఱకలు మగుడ నిగిరించిన తెఱంగునఁ బరఁగు కార్మ్ముకుల తెగలను గని. వసు. 2. 11.

2. పల్లవించు, చిగుళ్లుపెట్టు.

శా. ఏదే నొక్క పురంధ్రి గానసుధచే హేలాకరాంభోజపీ, ఠాదండం బిగిరించెనా నఖరుచుల్ నర్తింప...రాజ. చ. 1. 4. రా. వి. 4. 128.

3. చిగురువలె నగు-ఎఱ్ఱనగు.

క. పట్టుకొని కట్టి రావణు, కట్టెదుటను బెట్టి తోఁకఁ గ్రందుగఁ గోగల్ చుట్టించి యింగలంబున, ముట్టించిన ననుమఁ దలిగి మొగ మిగిరింపఁగా. యయా. 3. 25,

ఇగిరించు[2] స. క్రి. (√ఇగురు[2]) ఇగురఁజేయు; పోఁగొట్టు, నశింపఁజేయు.

చ.... రాక్షసు భయంపడఁ జేసి పయోధినాథు జీవన మిగిరించి గంధవహు వంచి....పద్మ 7. 39.

ద్వి. ఈదహనజ్వర మిగిరింపు తండ్రి.ద్వి. భాగ. (ప్రా).

ఇగిరిక(కె) వి. (√ఇగురు[2]) హవిష్యము, అత్రైసరన్నము. అం. ఛా. 2. 172.

ఇగిలించు - ఇగులుచు. అ. క్రి. పండ్లు కనఁబడునట్లు నోరు తెఱచు.

క. ఎనుపోతు నీసమాన మె, యినకిరణమునోఁ కె
నేని యిగిలించుచుఁ దాఁ, జనలేక నిలుచు
నీవే, ఘనుఁడవు పద గోవృషంబ కాలా
గ్రభవా. శేష. 3. 201.

క. తగిలించుకొన్న మీఁదట, నిగిలించుటె కాని
కార్యమే మున్నది. శుక. 2. 291.

స. క్రి. (పండ్లు) వెలిపుచ్చు, బయలుపఱుచు; (నోరు) తెఱచు.

సీ. సొంపుతో నద్దంబుఁ జూచి పండ్లిగిలించు... శుక. 3. 78.

ద్వి. తగిలి గద్దించుఁ దలఁకుచు మూతి, యిగి
లించుకొని మొగం బెత్తి చూచుచును. బస. పు. 5. 477 పం.

జ. ఇగిలింత.

**ఇగిలింత** వి. (√ఇగిలించే) ఇగిలించుట. (శ. ర.)

**ఇగురాకుఁబోణి** వి. (ఇగురు' + ఆకు + పోణి) ఇగురుఁబోఁడి.

ఉ. ఆ యిగురాకుఁబోణి వినయంబున డగ్గఱి
తండ్రి కిట్లనున్. పర. 4. 68.

**ఇగురు'** – ఇవురు', చిగురు', చివురు'. వి. (క. ఇగరు, చిగురు.) 1. చిగురు, పల్లవము.

చ. ఇగురులవంటి నీయడుగు లిక్కడికర్కశ
భూమి సోఁకినన్, నొగిలెనో యంచు నా
మనసు నొప్పి వహించినది ... ఉ. రా. 7. 469.

2. పండ్లచుట్టును చిగురువలె నెఱ్ఱగాను మృదువుగాను నుండెడికండ.

ఆ. ...చేతులతీఁట వోఁ, బొడువఁ జాలునేని
మృడుఁడు గాక, నిరత మిగురు గుట్టి
నెత్తురు గ్రాగిన, భంగి గాక నాకు జాలుఁ
జెదురె. కు. సం. 10. 511.

అ. క్రి. (క. ఇగుర్, ఇగురు, చిగురు.) పల్లవించు; అలరు, సంతసించు.

సీ ...ఈఁదిరు నెంత సువర్ణ మెంత యిచ్చినఁ
జిత్తమిగురు నంత, కాశీ. 7. 244.

జ. ఇగిరించు', ఇగురాకుఁబోణి, ఇగురుఁ
గైదువుజోదు, ఇగురుఁబోఁడి, ఇగురుకొను, ఇగురుచు, ఇగురువెట్టు, ఇగురొత్తు, ఇగ్రుచు.

**ఇగురు²** – ఇవురు². అ. క్రి. (క. ఇగరు.) ఇంకు, శోషించు.

క. ఈతటిని నిగురఁజేసెద, శాతోగ్రాస్త్రముల
ననుచు... భా. రా. అర. 2. 315.

వి. పులుసు పెట్టకుండ వండినకూర.
(వ్యవ) నేఁడు మాయింట వంకాయయిగురు చేసినారు.

విశే. పులుసు పెట్టకుండ జేసినది. (పచ్చడి, మొ.)
(వ్యవ) వంకాయలతో ఇగురుపచ్చడియు పులుసుపచ్చడియుఁ గూడఁ జేసికొందురు.

జ. ఇగురుచు, ఇగిరించు², ఇగిరిక.

**ఇగురుఁగైదువుజోదు** (√ఇగురు') మన్మథుఁడు.

సీ. ఏమంత్రి సౌభాగ్య మిగురుఁగైదువుజోదు
లాలిత్యలీలకు మేలుబంతి. భీమ. 1. 19.

**ఇగురుఁబోఁడి(ణి)** వి. (√ఇగురు') చిగురువలె మనోజ్ఞురాలగు ఆఁడుది; ఆఁడుది.

సీ. ఏపదార్థంబు నాయెదుటఁ బెట్టకమున్న
యెవ్వారి కొసఁగ దోయిగురుఁబోఁడి.
పారి. 1. 94.

**ఇగురుకొ(ర్కొ)ను** – ఇగురుచే.

(చిగిరించు.)

ఉ. మారునిమేల్కటారి యెలమావి నిగుర్కొను
కొమ్మ మేలి బంగారుమెఱుంగుతీవ ...
చెన్న. 1. 242.

**ఇగురుచే'(ర్చు)** – ఇగిరించే.'

(చిగిరించు, పల్లవించు)

ఉ. గట్టున కేఁగుదెంచి తొలుకారు మెఱుం
గులఁ బోలునంగనల్, గట్టిరి చంద్రకాపు
లెసఁగన్ దనువల్లు లిగిర్చెనో యనన్. రాజ.
చ. 2. 164.

ఉ. అడపొడ గానరాక తెగటాఱియుఁ గాలివ
యట్టిమోడుకై, వడి రతిలోచనాంబువుల
వాన నిగిర్చితె. మనుచ. 3. 46.

(అంకురించు, పుట్టు)

వ. ...పగడంపుఁ జిగురుటధరములతుదల నిగు
రుచు చిఱుతపగవులు విగియ వగివం దెగి
పడియెడు వనువడువున వడుగడుగునకు

వడవడ వడంకుచుం బిడికిట నడంగునడు
ముల కెడంగును...భీమ. 1. 117.

సీ. మది నిగిర్చినమాట మగువ నీపెంపునఁ గుదిసి
నానాలుకతుదికి రాదు. భార. విరా. 2 47.

**ఇగురుచే¹(ర్చు)** – ఇగ్గిరించే².
(ఇంకఁజేయు, ఇగురఁజేయు)

క....తడియొత్తుమఱుం, గున నొయ్యన మేని
తడి యిగుర్చఁగ నొత్తన్. నై ష. 6. 42.

**ఇగురువెట్టు** – ఇగురొత్తు.
(అనురక్తమగు)

సీ. పవువ్వఁబోఁడుల యిసిరింత చూపుల
ఋషుల గట్టిమనంబు లిగురువెట్టు. కాశీ.
3. 169.

**ఇగురొత్తు** అ. క్రి. (√ఇగురు¹) 1. పల్లవించు,
చిగిరించు. 2. అనురక్తమగు.
(ప్రభాతవర్ణనము)

సీ. ...మలయపవను, నింపారుచోఁకున నిగు
రొత్తు చిత్తంబు లెలసి యొండొరులపైఁ
బొలయు చూడ్కులు...భార. విరా. 2.
238.

3. నికసించు, ఉత్సాహాయుక్తమగు.

క. ఎన మీఱినవేడ్క నుల్ల మిగురొత్తంగన్.
అచ్చ. రా. అయో. 3.

గీ. చిత్త మిగురొత్త అన్నయసిద్ధ మంత్రి,
కొలువు గూర్చుండి నను వేడ్కఁ బిలువఁ
బంచి. విక్ర. 1. 19.

4. ఉదయించు, ప్రాదుర్భవించు, కలుగు.

సీ. ఒకదీవి తవజిల్లు నొకఁబుతు ప్రారంభ మొక
దీవి నగురొత్తు నొండు ఋతువు. కాశీ. 1.
129.

క. కోరిక లిగురొత్తఁగఁ ద, త్కారంభ
మొనర్చె సత్యధవుని యనుజ్ఞన్. పారి.
5. 63.

వ. వేడ్కలిగురొత్తు చిత్తంబున నద్దేవోత్త
ముండు. ప్రభా. 1. 67.

**ఇగులుచే(ల్చు)** – ఇగిలించే.
(వ. క్రి. ఇగిలించు.)

సీ. కికురించుచును బం డ్లిగిల్చి చూపుచు వెసఁ
గొమ్మకొమ్మకు నుఱుకుచు నదల్చు. భాగ.
10. ఉ. 544.

గీ...పండ్లిగుల్చుచు. నై ష. 7. 52.

క. నగచరుఁ డది విని వెఱఁ బం, డ్లిగిలిచి
వడవడ వడంకి యెదపడి చెడితిన్,...మోస
పోయితి ననియెన్. వేం. పంచ. 4. 76.

**ఇగో** – ఇదిగో. (రూ. ఇగో, ఇకో, ఇక్కో.)

ఉ...వీఁడిగో. గుబ్బ పుదొంగ వచ్చె...శై. భా.
3.114. (వ్య.ర. పా–వీఁడుగో–ముద్రి.పా.)

**ఇగ్గు** అ. క్రి. 1. వెనుకకొఱగు; ఒఱగు.

ఉ. ఇగ్గెడు వెన్కకుం బయికి నీడ్చినఁ బైఁట
దొలంగఁజేయఁ గే,లొగ్గెడు రెమ్మ పోఁక
ముడి యూడ్చినఁ గ్రుంగిలి రెండుకొంగులున్,
బిగ్గ నడంచుచున్ విడిచి పెట్టదు కాల ననం
బనేమి యా.సిగ్గుకు సిగ్గు లేదిటులు నేసిన
పిమ్మట నుండ వచ్చునే. విజ. వి. 2. 30.

స. క్రి. లాగు.

సీ. సాహిణి రా నిగ్గ సాధించునావలరాజు
క్రొత్త చిలుకతేజి యనఁగ. చంద్రి. 6.
122.

ఉ...అ, ద్దానిచెఱంగువట్టిన నుదాత్తత నిగ్గుక
కోప మయ్యెడన్, మానక యున్నదాని...
బిల్హ. 3. 109.

జ. ఇగ్గులాట, ఇగ్గులాడు, ఇల్లిగ్గులు.

**ఇగ్గులాట** వి. (√ఇగ్గు) ఇగ్గులాడుట.

**ఇగ్గులాడు** అ. క్రి. (√ఇగ్గు) పెనఁగులాడు.

వ. కంకణఝుణఝుణత్కారంబు లుల్లసిల్ల
నగ్గలం బగు సిగ్గుతమకంబు లిగ్గులాడ నంచ
లంచల నించించుక తిరిగితిరిగి చూచుచు.
ఉ. హరిశ్చ. 3. 87.

గీ. వనమృగంబులపాలకువ గమటఁ దెలిపె,
వేఁటకాండ్రకుఁ గుర్కురవితతి యపుడు,
పట్టఁ బట్టంగ నిలువక బలిమి నిగ్గు, లాడి
యెగురుచుఁ దమకించుజాడవలన. కవిరా.
2. 98.

స. క్రి. వెనకకులాగు.

చ. చిరగతి నిగ్గులాడకువె సిగ్గ మనం బచలత్వ
మొందకే, నెరపకుమీ నిమేషమును నేత్రమ
...చూచెద శ్రీధరుఁడైన కృష్ణునిన్.
రస. 3 గు. 5 కు. 58 వ.

**ఇ|్రగుచే** - ఇగురుచే[1]. (ఇందలి ఇకారములఘువు.) (అంకురించు, పుట్టు)

గీ.... లతాంగి, యెట్టి క్లేశంబులకు నైన నీడఁ బోదు, తనమనంబున నిగ్రుచు సంతాన కాంక్ష. శివరా. 2. 89.

గీ. ఇ|్రగుచు కోర్కులఁ దనడెంద మివతళింప. కవిక. 3. 222.

**ఇచేటు** — ఇచ్చోటు. భార. స్వ. 48, 51. దశా. 2. 143. (ఇచటన్ — ఈవిషయమున)

**ఇచికిలము** సం. వి. అ. పుం. బురద. (వాలా. ని.)

**ఇచేటు** — ఇచ్చోటు. భార. స్వ. 7.

**ఇచ్చే** వి. (సం. ఇచ్ఛా.) 1. కోరిక.

సీ... నీకు నావిభవంబు కానంగ రాదు, గుప్త మై యున్నది గుహాయందు నా కిచ్చ వుట్టిన నప్పుడు పొలిచి తోఁచు. భాగ. శాం. 4. 392.

గీ. ఇచ్చ యెఱిఁగినరతికేళి మెచ్చి పొగడు. మనుచ. 3. 123.

ఇచ్చఁజను, ఇచ్చఁబోవు — ఇష్టప్రకారము పోవు.

క. ఎచ్చోట నున్నవాఁ డతఁ, డిచ్చోటికి నేల రాఁడొ యిప్పు డనుడుఁ దా, నచ్చట నంతర్హితుఁడై, యిచ్చఁజనియెఁ దోఁచు నేఁటియెల్లి టిలోవన్. భార. విరా. 5. 301.

గీ. ...అచ్చెలువచెలువుఁ, దగిలి తనయిచ్చఁ బోవుచిత్తంబుపజ్జ, నరిగి యిట్లను నక్కీచ కాధముండు భార. విరా. 2. 85.

2. చిత్తము, మనస్సు.

ఆ.... భూతకోటి మంచు, వోలెఁ దోఁచు విరియు బుద్ధిమంతులు దాని, కిచ్చ వగవ రింత యెఱుఁగ వెట్లు. భార. శాం. 4. 392.

ఆ. ఇదియ సుమ్ము మాకు నిచ్చలోఁ గలకోర్కి, పొసఁగ నీదువలనఁ బొందుపడియె. భాగ. 6. 223.

ఇచ్చకువచ్చినట్లు, ఇచ్చివచ్చిట్లు — మనసునకు వచ్చినట్లు, యథేష్టముగా.

ఉ... కడు వట్టి ప్రజ్ఞ చే, నిచ్చకువచ్చినట్లు చరి యించును దుష్కవి తచ్చరిత్ర మే,యచ్చున నెన్ని చూచినను వాఁ వగుఁబాటు గదా గణిం పఁగన్. విప్ర. 1. 14.

విశ. ఇష్టమైనది, ప్రియమైనది.

క. సన్నిధిఁ బన్నగహారుఁడు, పెన్నిధిఁగని పొంగుచున్న పేదలక్రియ న, య్యన్నం దమ్ముని గని మీ, కెన్నఁగ నేవరము లిచ్చ యిచ్చెద వానిన్. ఉ. హరి. 4. 15.

జ. ఇచ్చకదారి, ఇచ్చకము, ఇచ్చకాలమారి, ఇచ్చకుఁడు, ఇచ్చగించు, ఇచ్చగింత, ఇచ్చగొండి, ఇచ్చమానికము.

**ఇచ్చేకదారి** విశ. (√ఇచ్చేకము) ముఖప్రీతికరము లగుకృత్యములు చేయువాఁడు;

గీ. చూచి వలదన్న మానక సురఁటి విసరు, నేమి మాటాడినను నుతియించు మిగులఁ, జిటిక లిడు జృంభణంబునఁ జేరి దివిజ,వైరి కగదారి యిచ్చకదారి యగుచు. దశా. 2. 129.

(ఇది యీయొక చోటనే కన్పట్టుచున్నది.)

**ఇచ్చేకము** వి. (√ఇచ్చే) 1. ముఖప్రీతి.

చ. అతులమహానుభావ మని యవ్విరిఁ దా నొక పెద్ద చేసి య,చ్యుతునకు నిచ్చకం బొదవ నూడిద యిచ్చిన నిచ్చఁగాక. పారి. 1. 84.

చ. అని మొనఁ బత్తికంతుఁ డునుమాడినమేలు దలంచి యిచ్చకం, బునకు ధరాజ మంచి దని బొంకిరి వేల్పులు సీతభావ మేఁ, గని యును మూఢులిట్టు లనఁగాఁ గల రంచుఁ దలంచి కాదె య, య్యనలము మండఁజేసి చొరు మంటిని దానిని దల్పరైరిగా. ఉ. రా. 6. 215.

2. ముఖస్తుతి.

గీ. అతివ నీకనుబోమలకప్రతి యటంచు, నెట్టి ధర్మంబునైనా నాన యిడఁగ వచ్చు, నిచ్చకము గాదు సుమ్ము నేఁ డిది నిజమ్ము. సారంగ. 2. 204.

2. ముఖప్రీతికై పలుకుమాట: ప్రియవచనము.

చ...మనుజేంద్ర నీవు గనునట్లు నయస్థితి నేను గాన నేర్తునె యయినన్ మనంబునకుం దోఁచినలాగున విన్నవింతు నీ, యనుమతిఁ జేసి నిర్భయత నాప్తుల కిచ్చక మాడ వచ్చునే. కళా. 7. 250.

సీ...ఇష్టోక్తి భాసిల్లు నిచ్చక మన ...ఆం. భా. 1. 117.

గీ. ఏఱు నిలుపఁ గే లొగ్గుట యిచ్చకంబు,మత్త కరిఁ గెరలించుట మాయచేఁత, కొండ నెది రించి తగరు డీకొనుట కడిమి, కాన సధికుని యెడ మేలు దాన మంద్రు. సనిక. 2. 37. (ఇట సామోపాయ మని భావము.)

4. మోహము, వలపు.

సీ. ఇచ్చకం బిగురొత్తఁ బచ్చిదేరఁగఁ బల్కు ముద్దిడరా యని యొద్ది కరుగు. హంస. 2. 104.

గీ. అరమరలు లేనికూటమి నధిపుఁడపుడు, కుల వధూటుల నెంతయుఁ గుస్తరించి, పచ్చివగ దేరురతులతో నిచ్చనిచ్చ, లిచ్చకము పుట్టఁ జేయుచు నెనసి యుండె. హంస. 5. 385.

విశ. ముఖప్రీతికరము; ప్రీతికరము, ప్రియము.

ఆ. ...వారవనితపలుకు, లిచ్చకంబు లనక యెవ్వరు నమ్మెదరు... కళా. 4. 24.

గీ. తగవు ధర్మంబు విడిచి సత్యంబు వదలి, యితఁడు పిలువని పేరంట మేఁగుదెంచి, పాడిఁ జెప్పెద ననుచు దబ్బఱలు వలికెఁ, గాలకౌశికునకు నిచ్చకంబు గాఁగ. హరిశ్చ. 4. 138.

సీ. మెచ్చినచోఁ గొంచె మిచ్చు వెన్నఁడు లేదు మొగమిచ్చకపు మెచ్చు మొదలె లేదు. విఖ. వి. 1. 21.

సీ. ఇనకుమారునిమది కిచ్చకంబుగఁ బొంచి వాలిని జంపు టేవీలు నీకు. సిం. నార. 24.

**ఇచ్చకాలమారి** విశ. (√ఇచ్చకము) ఇచ్చకము లాడుస్వభావము కలవాఁడు.

తే. ఎసఁగుచుండును ప్రియవాది యిచ్చకాల, మారి యన...ఆం. భా. 3. 8.

**ఇచ్చకుఁడు** విశ. (√ఇచ్చకము—శ. ఇచ్ఛక.) ముఖ ప్రీతికరుఁడు; కపటవర్తనుఁడు.

గీ. అప్పు డిచ్చకు లగుచు బ్రాహ్మణులు గొంద, ఱాత్మజనిభూమి విడువరే కలికభూతి, గడ్డముల నాన రుదురాక లిడ్డనంది. మాత సంహిత లిఖికించి చొరఁ దొడఁగిరి. ఆము. 4. 46. (ఇదిపెక్కు ప్రతులపాఠము. 'ఇచ్చకు లగు బ్రాహ్మణౌఘ మెల్ల, నాత్మ' అని వావిళ్లప్రతి.)

**ఇచ్ఛగించు** స. క్రి. (√ఇచ్ఛ) 1. వాంఛించు, కోరు.

క. తమపిన్ననాఁటియాటల, క్రమ మంతయుఁ దలఁచి వేడ్క గడలుకొలఁగఁ జి.త్తము నందు గోకులాలో, కమహోత్సవ మిచ్ఛ గించి కరమిష్టమునన్. హరి. ఉ. 2. 70.

చ. ...వేఱొక టిచ్ఛగింప కే,మని వనిఁ జూడఁ గోరితి. ఉ. రా. 6. 238.

2. మెచ్చు:

సీ. భాసవామిల్లిక ప్రతిభాసముస్మేష హేలా విశేషంబు నిచ్ఛగించి. నైష. 1. 7.

గీ. కాలకంధర హర కాలకాల యనుచు, వచ్చె నింటికి జనకోటి యిచ్ఛగింప. హర. 2. 87.

3. అంగీకరించు.

గీ. హరహరహిరణ్యగర్భాదు లగుమహాత్మ, లెల్ల నెప్పుడు సంసార మిచ్ఛగించి, పుత్ర పౌత్ర పరంపరాభ్యుదయవంతు,లగుటెఱుం గనె యేకవీరాగ్రగణ్య. శుక. 1. 278.

ఉ. నాతలఁ పిచ్ఛగింపు మనినం బ్రభుఁ డించుక యియ్యకొలునన్. హరి. ఉ. 7. 232.

అ క్రి. 1. ఇష్టపడు, ఒప్పుకొను.

గీ. ధార్తరాష్ట్రు లున్మత్తులు దగినపలుకు, లేల విని సంధి సేయుట కిచ్ఛగింతు, రెదిరిఁదమ్మును నెఱిఁగిరయేని వార, లంతలంతలు సేయుదు రయ్య నాఁడు. భార. ఉద్యో. 4. 73.

సీ. ఆచార్య ప్రియభామ యని కొన్నిదినంబు లిచ్ఛగింపఁడు తప్ప లెత్తిచూడ. కాశీ. 4. 198.

2. సంతసించు.

గీ. చంపకారణ్య మరయుచు జగతి నద్భుతం
బయిన పుండరీక కేదార సేతు, వైఖరికి నిచ్చ
గించుచు వచ్చివచ్చి. వసు. 2. 94.

**ఇచ్చేగింత** వి. (√ఇచ్చేగించు) ఇయ్యకోలు, అంగీకారము (శ. ర.).

**ఇచ్చేగొండి** విణ. (√ఇచ్చకము) ఇచ్చకము లాడువాఁడు.

సీ. ఇచ్చగొండుల కిచ్చి యుచ్చమల్లుల కిచ్చి
వారక యుబ్బించువారి కిచ్చి. విక్ర. 7.124.

**ఇచ్చేటు** – ఇచ్చోటు.

భార. స్త్రీ. 22. భార. శాం. 3. 502.

**ఇచ్చేమానికము** (ఇచ్చే) – కోరిక లిచ్చుమణి – చింతామణి.

తే. ఇచ్చమానిక మేయూరి రచ్చబాయి, పెట్టె
బుఁగు బ్రమ్మఁకు లేయూరి పెరటిచెట్టు,లు
...చంద్ర. 2. 66.

**ఇచ్చిపుచ్చుకోలు** వి. (√ఇచ్చు) ఇచ్చిపుచ్చుకొనుట (శ. ర.)

**ఇచ్చు** – స.క్రి. (త. క. ఈ, తు. ఇసీ–ఇందు, ఈఁడు, ఈవుత, మొ. విశేషరూపములు సిద్ధించును.) (ఒకనిది మఱియొకని) అధీనముచేయు.

1. ఇడు, ఒసఁగు.

గీ. మమత మొనవంటఁ దెలనాకుమడుపుఁ
గొఱికి, చెలువునకు నియ్యఁగోరు నచ్చి
గురుఁబోఁడి. దశా. 3. 17.

2. దానాదిరూపముగా నొసఁగు.

సీ. ఇట్టి క్రూరులయింటి కిచ్చినమనవారి నందుఁ
గాక ...భార. ఉద్యో. 3. 195.

క. ఒండని పిలువఁ బనిచి పా, లిం డని కొడుకు
లకుఁ జెప్పి యింద్రప్రస్థం బొండెను వేఱొక
పట్టన, మొండెను మా కిచ్చి యనుచు టుచి
తము గాదే. భార. ఉద్యో. 1. 327.

చ. ...దీనిఁ గన్గొన నధికారి వీ వగుటకుం
గొను మిచ్చెద మూలమంత్రముగా. కవిక.
పీఠి. 1. 33.

ఇచ్చిపుచ్చుకొను–(క) కన్య నిచ్చిపుచ్చుకొను, వియ్యమందు.

గీ. చుట్టఱికమున నిచ్చిపుచ్చుకొను బంధు, జాల
మెంతయు గౌరవసరణిఁజూడ. దశా. 3.49.

(చ) అప్పిచ్చిపుచ్చుకొను, వ్యవహారసంబంధము కలిగి యుండు.

సీ. కికురించి రిచ్చిపుచ్చుకొనుచోటులవార లాఁ
కకు లోనుగా కప్పులిక. మనుచ. 3. 129.

3. వశపఱచు, అధీనముచేయు.

సీ. మనసుఁ గామక్రోధమదలోభముల కిచ్చి సడ
లింతు రన్యాయాచారసరణి. భీమ. 5. 173.

సీ. ...ఎవ్వఁ. గీ. దేని సప్తాంగములు నీకు నిచ్చి
చెట్లు, వట్టి పెన్నాలతిప్పలు వట్టి తిరుగు.
ఆము. 3. 24.

4. (ధ్వని, పూజ, ప్రతిజ్ఞ, మొ.) చేయు, కావించు.

అ. ...ఎలుఁగు లిచ్చుచున్న వాఁడు. భార. ఆది.
6. 290.

అ. ఇట్లు సింహనాద మిచ్చినభీముని ... భార.
ద్రో. 4. 157.

సీ. కొక్కొరోకో యని కొమరసామి రథంబు
కంబంబు సాఁచి క్రేంకారమిచ్చె. భీమ. 2.28.

గీ. అతిథి యైయున్న శంభున కర్చలిచ్చి. హర.
3. 34,

చ. తడయక సామభేదముల దానములన్ దయ
తోడ నమ్మఁగా,నొడివియు సత్యమిచ్చియుఁ
జనున్ జననాథ కృతాపకారులన్, గడఁగి
వధింపఁగా... భార. ఆది. 6. 118.

అ. ...నా, యిచ్చుబాస కాఁ వేంద్ర వినుము.
భార. ద్రో. 5. 338,

ఉపదేశమిచ్చు–ఉపదేశముచేయు, ఉపదేశించు.

శా. ...నాకుం దప,శ్చర్యాసిద్ధికి నొక్కమంత్ర
ముపదేశంబిచ్చి రక్షింపవే. వరాహ. 7. 77.

5. (మనసు, మర్మము, మొ.) వెలిపుచ్చు, ప్రకటించు.

చ. అడిగిన దిచ్చు నర్థులకు నాప్తుల కిచ్చు
మనంబు... కాశ. 3. 147.

గీ. నిన్నుఁ జూచు నహల్యకు నెనరులేదె,
హృదయమియ్యదు పతిభీతి నింతె కాక.
దశా, 7. 1. 108.

క. ...మఱి నమ్మక మర్మమీక మనవలె మనుతీ.
ను. శ. 29.

ఉదా: అర్థ మిచ్చు. తాత్పర్య మిచ్చు.

6. (బలి, కృతి, మొ) అర్పించు.

క. ఈమెఱుఁగుగండకత్తెర, చే మిడిదల యిచ్చు సాహసికుఁడు శిరం బుల్లే మగుడఁగ నదుకు కొనం,గా మని చంపుఁ దనుఁ జంపఁ గడఁ గినవానిన్. కళా. 6. 48.

సీ. కన్నె నిచ్చినవానిఁ గబ్బ మిచ్చినవాని సొం పుగా నింపుగాఁ జూడవలయు. వేణు. 29.

క...చంపుకావ్య మ్మగునీ, శ్రీవిష్ణుపురాణము నా, కీవలయు...వి. పు. 1. 25.

7. కలిగించు.

గీ. ఇన్ని భాగ్యంబులును గూడి యిచ్చె మనకుఁ, గాశికాక్షేత్ర రాజవీథీసుఖంబు. కాశీ. 2. 84.

గీ. పుణ్యవాసన లూరక పోవు సూవె, యెట్లుఁ దమతమఫలముల నిచ్చుఁ గాని. కళా. 5. 184.

సీ. ఇంచు కేమఱుటఁ దోఁపించి ప్రేటున కాస యిచ్చిన వేయ వాఁ డెత్తినట్టి ... కళా. 8. 68.

ఉ. వేడుక లిచ్చు మెచ్చుగల వెన్నెలడాల్ నెల రాలజాడలుణ. ఇందు. 4. 9.

గీ. శోకభయకారణంబులు లోకమున న, నేక ములు దానఁ దలమూపుశోకములకు, భయములకు బుద్ధినెడ యీఁడు పండి తుండు, మూఢుఁడవి ప్రోవ నేరండు మునుఁగు వగల. భార. శాం. 1. 188.

8. త్యజించు, విడుచు, వదలు.

ఉ...సత్యల మొందునంతకున్, బట్టినకార్య మీశ్వరుఁడు పట్టిన నీనిదృఢప్రతిజ్ఞలు... పాండు. 1. 110.

ఆ. ఎట్టి రాజులును మహీసురోత్తము లెదు, రరుగుదెంచు నప్పు డధికభక్తి, నెరఁగి ప్రియము పలికి తెరు విత్తు రిట్టిద, ధర్మ మీవు దీనిఁ దలఁపవెట్టు. భార, ఆది. 7.111.

9. తుమున్నర్థకములకు అనుప్రయుక్తమగు నపుడు.

(క) చేయు, అడ్డు పెట్టకుండు, సమ్మతించు, అంగీకరించు, మొ. అర్థము లిచ్చును. భార. ఉద్యో. 2. 86.

(చననిచ్చు — చనఁజేయు.)

క. నిఱుపేదయింటి కేటికిఁ, బఱతెంచు నిధాన మట్లు పఱతెంచినవయే, నిఱుపేద యథా గ్యతఁ దలు, పిలియఁగ నిడుఁగాక చొరఁగ నిచ్చునె దానిన్. నైష. 4. 78.

సీ. మునివృత్తి నడవికిఁ జనియెద నందునే జన కుఁడు నన్నేల చనఁగ నిచ్చు. మార్క. 8. 48.

(చ) ఉపేక్షను-అనాదరమును-తెలుపును.

ఉ. చిత్తజుఁ డల్గి తూపుమొన చేసినఁ జేయఁగ నిమ్ము పైద్యజం, బెత్తిన నెత్తనిమ్ము వచి యించెదఁ గల్గినమాట గట్టిగా. విజ. వి. 3. 15.

10. ప్రేరణార్థకము. (చూ. ఇంచు².)

శాపమిచ్చు — శాపము పెట్టు.

సీ....నీ విట్లు ననుదేక తక్కిన శాపమిత్తు. భార. భీష్మ. 1. 157.

చెవియిచ్చివిను — చెవియొగ్గి విను, శ్రద్ధతోవిను.

హారతియిచ్చు — నివాళిపట్టు.

ముద్దిచ్చు — ముద్దు పెట్టుకొన నిచ్చు.

వెన్నిచ్చు - వెనుదీయు.

(ఇట్లే ఇతరములు గ్రహించునది.)

జ. ఇప్పించు, ఈగి, ఈగికాఁడు, ఈగిచేయి, ఈగిమ్రాను, ఈగులకెంపు, ఈవరి, ఈవి, ఈవికాఁడు, ఈవిమ్రాను, ఈవులకెంపు, ఈవులమొదవు, ఈవులమ్రాను, ఈవుల రతనము.

ఇచ్చోటు — ఇచ్చోటు.

ఇచ్చో క్రియా. (√ఇచ్చోటు) 1. ఈస్థలమునందు. భార. స్వ. 86. భాగ. 10. పూ. 504.

2. ఈసమయమందు, ఇప్పుడు.

ఇచ్చోటు వి. ఔ. ఈచోటు, ఈస్థలము. (చూ.అ చ్చోటు.)

భార. విరా. 5. 301. భాగ. 10. పూ. 975.

జ. ఇచటు,ఇచోటు, ఇచ్చటు,ఇచ్చోటు,ఇచ్చో.

ఇచ్ఛ నం. వి. అ. స్త్రీ. అభిలాష, కోరిక.

ఇచ్ఛకము నం. విశ. (అ. ప్రకా. అ.) ఇచ్ఛ గలది, ఇచ్ఛించునది. వి. అ. పుం. మాతులుంగము, మాదీఫలము (వృ. వి.) (వాచ.).

**ఇచ్ఛత్** వం. శ. క్రి. కోరుచున్న.

**ఇచ్ఛయించే** వం. వ. క్రి. కోరు.

ఉ. ...న,న్ని విపు డిచ్ఛయించినవి యిచ్చితి... ఉ. రా. 5. 308.

అ. క్రి. ఇష్టపడు, సమ్మతించు.

మ త్త. స్వచ్ఛమైన ఫణంబు మీరలు సక్కఁ బట్టి మథింపఁగాఁ, బుచ్ఛ మేటికి మాకుఁ బట్టఁ గఁ బూరుషత్వము గల్గి మే, మచ్ఛ మైన తపోబలాధ్యయనాన్వయంబుల వార మై, యిచ్ఛయింతుమె తుచ్ఛవృత్తికి నిందు మాకు ఫణాగ్రముల్. భాగ. 8. 195.

(ఇచ్ఛక్రిందనిచ్చిన. చి. ని. అనంద పాఠ ములు- ఇచ్ఛయింతుమె. ముద్రి. పాఠము 'ఇచ్ఛయించు' అనురూపము యొక్క సాధు త్వము విచార్యము.)

**ఇచ్ఛాకృత** వం. వి. అ. స్త్రీ. - ఇచ్ఛవచ్చినట్లు వేసి నది - అధర్మపువడ్డి.

శ్లో. వృద్ధేర్వృద్ధిశ్చక్రవృద్ధిః, ప్రతిమాసం తు కాలికీ, ఇచ్ఛాకృతా కామకృతా, కాయికా కాయకర్మణా. (వాచ)

**ఇచ్ఛాకృతము** వం. విశే. (అ. అ. అ.) ఇచ్ఛవచ్చి నట్లు చేయఁబడినది, కామకృతము.

**ఇచ్ఛావతి** వం. వి. ఈ. స్త్రీ. కాముక ధనాదివిషయ ములందు ఇచ్ఛగలస్త్రీ.

**ఇచ్ఛావసువు** వం. వి. ఉ. పుం. కుబేరుఁడు.

**ఇచ్ఛించే** వం. అ. క్రి. ఇచ్ఛగించు, ఇష్టపడు.

వ. అద్దేవుని దివ్యాకారంబుఁ జూడ నిచ్ఛిం చుచు. భాగ. 1. 124.

సీ. ఎవ్వనిఁ గరుణింప నిచ్ఛించితిని వానియఖిల విత్తంబు నే నపహరింతు. భాగ. 8. 661.

స క్రి. కోరు. (చూ. ఇచ్ఛయించు.)

**ఇచ్ఛితము** వం. విశే. (అ. అ. అ.) కోరిక గలది.

**ఇచ్ఛుకము** వం. విశే. (అ. అ. అ.) కోరునది.

**ఇచ్ఛువు** వం. విశే. (ఉ.) కోరువాఁడు.

**ఇజాతు** వి. 1. శ్రమము. 2. సంకటము. (శ. ర.) (ఇజుగు - గ్రా.)

**ఇజ్జలము** వం. వి. అ. పుం. హిజ్జలము,ఎఱ్ఱ గన్నేరు (వృ. వి.)

**ఇజ్య** వం. వి. ఆ. స్త్రీ. 1. యజ్ఞము. 2. దానము. 3. సంగము, కూడిక. 4. ప్రతిమ. 5. పూజ. 6. కుంటెనకత్తె, కార్యకత్తె. 7. ఆవు.

**ఇజ్యము** వం. వి. అ. పుం. - బృహస్పతి దేవతాకము - పుష్య నక్షత్రము.

**ఇజ్యుఁడు** వం. విశే. (అ. అ. అ.) పూజ్యుఁడు. వి. అ. పుం. 1. బృహస్పతి. 2. గురువు 3. పరమేశ్వ రుఁడు. 4. విష్ణువు.

**ఇట** వి. ఏ. 1. ఈచోటు, ఇక్కడ.

ఆ....వార లిట దలంతు రొక్కొ. భార. అర. 1. 96.

ఉ. ...వాఁ డిట వచ్చువాఁడొ యే, నందుల కేగుదాననొ. భార. అర. 2. 202. (ఇట— ఇటకు).

మ. ...ఇటఁ గై కోవయ్య విస్తారమొ, కడ నిల్పంగదవయ్య. దశా. 1. 145. (ఇటన్— ఇక్కడనుండి)

సీ....రా వలసె నిటకు. ఆము. 2. 21.

క. ఉక్కఱి సురపతి కైనను, మ్రొక్కము నృప ధర్మ మూఁది మొనతలఁ బడినఁ, మిక్కిలి పేరును నిట దివి, నక్కజముగఁ బెంపుఁ బడయ నగుట సుపేంద్రా. భార. ఉద్యో. 3. 360. (ఇటన్—ఈలోకమున)

2 ఇదంశబ్దార్థకము, ఇది అనువర్తమిచ్చును.

క. ఇటువంటివి యిట కెక్కుడు, విటదిగుడువి యొంద నెన్నియే నిదియును నొక్కటి యొకనాఁటిద కా దొక, త్రుటిగీతఫలంబు నొసఁగుదునె యిమ్మెయికిన్. ఆము. 6.60. (ఇటదిగుడివి — దీనికిఁ దక్కువవి)

ఇటమీఁదన్ — ఇటుపై ని.

క. ...తమ, కాజికి నిటమీఁద నెవ్వ రాధా రంబో. భార. భీష్మ. 1. 68.

ఉ....ఇటమీఁద నెప్పుడే, చొప్పన నుండునో. నైష. 2. 67.

ఇటక్రితము—ఇంతకుమున్న, ఇంతఃపూర్వము.

చ. ఇటక్రిత మెన్నితోయముల నిందుముఖీముఖ శేషమద్యముల్, గుటుకునఁ గ్రోలము... ప్రబోధ. 3. 56.

అవ్య. ద్రు. ఈవల. (చూ. అట.)
జ. ఇటఁబట్టి.

**ఇటఁబట్టి** అవ్య. (√ఇట) ఇది మొదలుకొని, ఇంతటి నుండి.

చ. ...ఇటఁబట్టి నీకు మీ, యనిమిష రాజు పాదములయాన సుమీ మఱి యేమి పల్కి-నన్. నై ష. 3. 144.

ఆ. దివము కాని యింక భువనంబునం దిటఁ, బట్టి రాత్రి లేనియట్టు గాఁగఁ, జేసె నాళ్కావిధి. భార. విరా. 2. 313. (ఇది శ. ర. పాఠము. ఇటవట్టి. ముద్రి)

**ఇటిక** — ఇట్టిక.

సీ... అష్ట ద్వారసవనమండపమునట్ల, కనకంపు టిటికలఁ గట్టించి వివిధరత్నవితానతోరణ ధ్వజము లెత్తి. జై. భా. 8. 177. ఆం. భా. 2. 29.

**ఇటు** అవ్య. (చూ. అచ్చోటు) 1. ఈవైపు.

సీ. ఇటు చూడు మిందఱు నిం తొప్పి యున్న వా ఠిఖలభూషణ భూషితాంగు లగుచు. కాశీ. 7. 70.

మత్త. ...ఇంద్రునియల్కనై, రింతు నంచును సాహసం బొనరించి యే నిటు వచ్చితిన్. కళా. 3. 258.

2. ఈప్రకారము.

చ. తగునె యదుప్రవీర యిటు ధౌర్త్యము నీ వొనరించి యీామరు,న్నగము హరించి వంచనఁ జనన్ ...పారి. 4. 56.

గీ. నిం గిటు త్రిశంకుకతన మాతంగవాటి, యయ్యె....ఆము. 2. 82.

వి. ఇదంశబ్దార్థకము. (చూ. ఇటువంటి, ఇటువలె.)

ఇటీవలఁ — కొలఁది కాలము క్రిందట.

(వ్యవ) ఈగ్రంథ మిటీవలనే అచ్చుపడినది.

ఇటీవలివారు — ఆధునికులు, నవీనులు.

జ. ఇటులు, ఇటువంటి, ఇటువలె, ఇట్లు.

**ఇటుక** — ఇట్టిక. ఆం. భా. 2. 29.

**ఇటులు** — ఇటు.

(ఈప్రకారము)

రగడ. మృగవిలోచన మేను చుఱు కన మేల మేలత నిటులు వ్రేయఁగ. పారి. 4. 16.

**ఇటువంటి** విశ. (√ఇటు) ఇట్టి.

క. ఇటువంటిమిమ్ముఁ దెలిసిన, పటుబుద్ధికి భవపయోధిపకుఖుఁజనిశా, వటమాత్రం బఁట...కాశ. 1. 81.

క. ఇటువంటివి యిట కెక్కుడు, విటదిగుడు వియొంద వెన్నియేని...ఆము. 6. 60.

ద్వి. ఇటువంటిదూత నాకిపు డబ్బెనేని రం. రా. కిష్కిం. 200 పా. 2 పం

**ఇటువలె** ద్రు. (√ఇటు) ఈప్రకారము.

క. ఇటువలె వెదకియు. రామా. 6. 65.

చ. ఇటువలె జవ్వనంపుమద మెచ్చఁగ నెచ్చెలు లిచ్చ మెచ్చఁగా, నటు నిటుఁ జెంతవారు చెంలాడఁగ...ఉ. రా. 1. 172.

**ఇట్చరము** నం. వి. అ. పుం--కామములోఁ దిరుగు నది — ఆఁబోతు.

**ఇట్టకలు** వి. బ. బాలక్రీడావిశేషము.

వ. గుజ్జెనగూళ్లు తుంపెనలు డాఁగిలిమూఁత లిట్టకలు సింగనావత్తి గుజగుజరేకులు. భోజసుతా పరిణయము. 2. 9.

**ఇట్టలము** విశ. అధికము.

చ. తలపడి పోర వారియరిదంబు లనేకము లొక్కపెట్ట యిట్టలపురయంబునం బొదివి డాసె...భార. విరా. 3. 199.

గీ. వినుము నృపసత్త్వమును రజస్సును దమస్సు, ననఁగ గుణములు ముప్పిరిగొనుచు నాత్మఁ, జుట్టుకొను నొండు మెయిఁ దెగ విట్టలముగ, నొలయువైరాగ్య మనుకొడవలిన కాని. భార. శాం. 4. 192.

వి. (క. ఇట్టణ, ఇట్టళ.) అతిశయము, ఆధిక్యము.

(వెన్నెల) వ. దట్టపువీచీఘట్టంబులం జుట్టుగట్టు గిట్ట తొట్టు పాలమున్నీటి యిట్టలంబున ఘూనభక్ర్యక్రంబు లాక్రమించి. వరాహ. 4. 155.

**ఇట్టి**[1] వి. (నం. యష్టిః. క. త. ఇట్టి.) ఆయుధ విశేషము.

సీ. కవదొవల్ విండ్లును గత్తలంబులు గుంతములు గరవాలముల్ పలక లిట్టు, లడ్డనంబులు...కు. సం. 12. 784. (వ్రాఁత ప్రతి)

జ. ఇట్టికాఁడు.

**ఇట్టి²** విశే. (ఇట్టు+ఇ) ఈదృశమైన, ఇటువంటి.

క....లేడికడుపునఁ బులిపుట్టునె యిట్టిదివ్య తేజం, బనవాఁ డధమాన్వయమునఁ బుట్టునె చెపుమా. భార. ఆది. 6. 58.

వ....తుర్వసువంశంబునం బుట్టినట్టినీ కిట్టిశోభనంబు లేమద్భుతంబులు...ఆము. 1. 18.

గీ. ఇందు నెవ్వని చేతఁగా దిట్టిపనికి ... దశా. 2. 158.

ఇట్టిపాటి — ఈపరిమాణముగల.

ఉ. కా దన కిట్టిపాటియపకారముఁ దమకుఁ జేక విప్రసం, బోధనఁజేసి చేసె ... భార. ఆది. 1. 124.

**ఇట్టిఁడు** విశే. (ఇటి²+వాఁడు) ఈదృశుఁడు, ఇటువంటివాఁడు.

(వి. ఇట్టిరు - బహువచనమున మహతీవాచకము గూడ నగును.)

గీ....అర్జునుఁ డొంటిభార్గవుఁడు వింట, నిట్టిఁడే యని పొగడంగ నెల్లజనులు. భార. ఆది. 5. 280.

చ....చూచియే, నెఱుఁగ సురేంద్ర కన్యకలు నిట్టిరె రూపవిలాససంపదన్. భార. ఆది. 7. 73.

క. భావిభవత్సుతు లిట్టిరె. భార. ఆది.4.188.

**ఇట్టిక** — ఇటిక, ఇటుక, ఇట్టుక, వి. (సం.ఇష్టకా. ప్రా. ఇట్ఠకా. క. ఇట్టగె. త. ఇట్టిగై.) మట్టిఱాయి, ఇటిక. (ఇది గోడ మున్నగునవి కట్టుటకుపయోగించును.)

గీ. ఇటుక యిట్టుక యిట్టిక యిటిక యనఁగ, నిష్టకంబొప్పు...ఆం. భా. 2. 29.

క. సురుచిరమై యష్టాదశ, కరమితమై పసిఁడి యిట్టికల నిర్మితమై. విక్ర. 5. 127.

ఇట్టికసూఁడినవాఁడు — ఇటికావమునకునిప్పంటించినవాఁడు.

క. ఇట్టికసూఁడిన వాఁడో, యొట్టడుకొన్నాఁడొ యనుచు నుల్లస మాడం, బట్టగుచు మగిడి చూడక, పట్టనమున కేఁగె లజ్జ బండతనమునన్. ఉ. హరి.1.36.

**ఇట్టికాఁడు** విశే. (√ఇట్టి¹) ఇట్టి పట్టుకొని యుద్ధము చేయువాఁడు.

సీ. కొని మిట్టిపడవైచు కొంతంపుగాని బి ట్టెడలుచ్చిపోవైచు నిట్టికాని. కు. సం. 11. 610. (వ్రాఁతప్రతిపాఠము.)

**ఇట్టు** అవ్య. 1. ఈవైపు.

ఉ. కట్టెదురన్ నృపాలుఁ గని క్రమ్మఱ నాకెఱిఁగింప వచ్చునో, యిట్టును నట్టునుం దిరిగి యెందును గానక తానె వచ్చునో. విక్ర. 6. 122.

సీ...అట్టిట్టు గన్గొని. మనుచ. 3. 16.

గీ....చోటీయ నందుఁ గూర్చుంటి నొదిఁగి, యివ్వలవ్వల దైత్యులట్టిట్టు ద్రోయ. దశా. 2. 101.

2. ఈప్రకారము.

క. ఇట్టగు తెఱుఁగక వచ్చితి, మెట్టోకో మన భంగి... భార. విరా. 4. 54.

సీ. హరివంశకథ లెల్ల నానుపూర్విగ నిట్టు విని కృతార్థుఁడనైతి మునివరేణ్య. హరి.1.56.

ద్వి. ఇట్టుండ వలవదా పుట్టినఫలము, ఇట్టుండ వలవదా ముట్టినచలము. పండితా. పురా. 90 పు.

ఇట్టట్టగు — తాఱుమాఱగు.

సీ. కలఁగి యిట్టట్టయ్యె జలరాశివర్గంబు ఘూర్ణిల్లెఁ బాతాళకుహర మెల్ల. గీ. భూరి భేరీనినాదంబు బోరుకలఁగ. ఇందు. 1.187.

ఇట్టట్ట(ట)ను — (క్ర) మాఱాడు; వ్యతిరేకించు.

ఉ. ఇట్టిది క్రూరకర్మమని యించుక కొంకక లక్కయింటఁ జి, చ్చొట్టితి మాయజూదమున నుత్తము ధర్మజుఁ దూలఁబుచ్చి తా, చుట్టలుఁ బెద్దలుం దెలులుఁ జూడఁగ ద్రోవది భంగపెట్టితి, ట్టట్టన కింకఁ దత్ఫలము లన్నిటి నొందుము చేరి తగ్గమై. భార. శల్య. 2. 184.

చ. బలిమిని బట్టఁగాఁ దివురుఁ బట్టిన నొప్పక యిట్లు టన్నచోఁ, బలువు రెఱుఁగరేని నగుఁ బాటని కొంకు...విజ. వి. 2. 145.

ఉ. చుట్టపుమేరు వుగ్రగుణశోభితుఁ డిద్దుపదుండు నిన్ను నిఁట్టట్టన వచ్చునే సురల్కైనను నొల్లవుగాక చివ్వకున్. భార. ఉద్యో. 1. 297.

సీ. చిత్తంబుతనయాజ్ఞఁ జేసి వర్తించెనే నిట్టట్టనఁ గఁజాల నింద్రియములు. భీమ. 5. 160.

(ఇట్లే అట్టిట్టను)

(చ) నిందించు.

క. నీతి పథంబున నడుచుమ, హితలనాయకున కొక్కయె గ్గొదవినఁ దా, రాతని నిట్టట్ట నరు వి,ధాతం దిట్టుదురు గాని ధరణిన్ లోకుల్. కళా. 7. 253.

ఇట్టట్టుపడు — తత్తఱపడు.

గీ. అతనివిధ మెఱిఁగింప నిట్టట్టుపడుచు.

...భూపల్లభుఁ డిట్టట్టూ తా వాదముఁ జేసి శివమతంబు జయింపం,గా వచ్చెనొ చూత ముగం, రావింపు మటన్న వాఁటిరాత్రి చనఁగన్. ఆము. 4. 54,55.

ఇట్టట్టొనరించు — కలఁతపెట్టు. క్షోభపఱచు.

మ...వరాహసంఘములరూపుల్మాపి సింగంపు గుంపుల నెల్లం దెగటార్చి యేనుఁగులతోఁ బోరాడి భల్లూకమం, డలి నిట్టట్టొనరించి యుండుబెడ దండ న్విస్మయం బొప్పఁగన్. శుక. 1. 176.

జ. ఇట్టులు, ఇట్టె.

**ఇట్టుక** — ఇట్టిక.

ద్వి. తట్టుచేతులుమ గ్రొత్తడములతోడ,నిట్టుక కోకయు నిరవొందుజాతి, కోటయు ... రం. రా. యు. 281 పా. 3 పం. (చి. ని. పాఠము. ఇట్టిక. ముద్రి.) ఆం. భా. 2. 29.

**ఇట్టులు** — ఇట్టు.

(ఈప్రకారము.)

వసంతతిలక...ఎట్లీబాలు మూర్ఖునిభు నిట్టులు డించి పోవం,గా బుద్ధి పుట్టు నని కన్య మనంబులోనన్. భార. ఆది. 5. 29.

ఆ. ...ఇట్టులనియె భూసురేశ్వరుండు. విక్ర. 1. 108.

**ఇట్టె(ట్టై)** అవ్య. (√ ఇట్టు) వెంటనే, అతిశీఘ్రముగా.

గీ. పదియును జూడ కిజగద్ధితచరిత్రుఁ, డిట్టె చని బాలభానునిఁ బట్టె నపుడు. ఉ. రా. 5. 100.

**ఇట్లు** — ఇటులు.

1. ఈప్రకారము.

గీ....మీజన్మములు నిట్లు కావె వినఁగ. భార. ఆది. 6. 59.

ఇట్లుగా — ఇటులు.

ఆ....మహాతపంబు చేటు, లేనికృత్య మిట్లుగా నెఱుంగుట...భార. శాం. 5. 525.

2. దీనికి అర్థవిశేషము లేకయే 'పోలె' మున్నగునవి యనుప్రయుక్తము లగును. (చూ. అటులు)

చ. నమఁ గని యొందుసత్త్వము మనంబున బెగ్గిలి పాఱునప్పుడి,మ్మునివరుఁ డిట్లపోలెఁ గృప మొక్కలమై శరభంబుఁ గాఁగఁ జేయునో...భార. శాం. 3. 95. (ఇట్టు పోలె—శ. ర. పా.)

**ఇడ** నం. వి. ఆ. స్త్రీ. 1. ఇల, నేల. 2. గోవు. 3. వాక్కు. 4. నాడీభేదము. 5. హవిరన్నము. 6. దేవీభేదము. (మనువుకూఁతురు - బుధుని భార్య — పురూరవునితల్లి - ఈమెకు మైత్రావరుణి అని నామాంతరము.) 7. దుర్గాదేవి.

**ఇడాచిక** నం. వి. అ. స్త్రీ. వరట, కందురీఁగ.

**ఇడి** వి. (తె. ఇడి.) భక్ష్యవిశేషము.

వ. పుడుకులు నడుకులు నిడియుఁ జలిమిడియును. కాశీ. 7. 185.

మ ... పిండివంటలుఁ బాల్ తేనియ జున్ను వెన్న యిడి యానా లుక్కెరల్ చక్కెరల్. రాజ. చ. 2. 127.

**ఇడిక** నం. వి. అ. స్త్రీ. భూమి.

**ఇడికుడక** వి. భక్ష్యవిశేషము.

వ. పలకిలాయలు వెన్న మెఱుంగులు నిడికుడకలు పడికుడకలు ... ఆదిగాఁ గలభక్ష్యంబులు. హంస. 1. 105.

**ఇడిక్కము** సం. వి. అ. పుం. అడవిమేఁకపోతు.

**ఇడియు** అ. క్రి. (క. ఇడి, ఇడ.) బ్రద్దలగు,పగులు; నలఁగు.

సీ. మారుతాహతి రాలు నారికేళఫలాళి నిడిసి జల్లించుపుండ్రేతురసము. పాండు. 1.118.

సీ. ఇది చిల్కపోటుల నిడియుదాడిమఫలమ్ముల జాఱురసముజాల్ పొరలువాఁగ. చంద్రా. 4. 192.

చ... కఠోరఘనబృందము లడ్డమువడ్డ వాని మేఁ,యిడియ జవోష్మఁ గాఱెడురవిందుల దట్టపు బిండికండ్ల చప్పుడుగతి ... ఆము. 4. 85.

**ఇడు** స. క్రి. (క. త. ఇడు.) 1. ఉంచు.

(క) పెట్టు.

చ...దీని కిం దొడం, బడమని దుర్జనత్వమునఁ బల్కెడు వీరుల మస్తకంబుపై, నిడియెద నంచుఁ దాఁ బరిణ మెత్తె సభన్ సహదేవుఁ డట్టిచో. భార. సభా. 2 30.

వ. నీవు భూభువనంబు భరియింపనినాఁడు భుజంగమ శేఖరుండు మృణాలపేశలం బగు ఫణా మండలంబున నిడి భరింప సమర్థుం డగునే. హర. 4. 62.

(చ) మూయు.

క...తలుపిఱియఁగ నిడుఁగాక...నైష.4.78.

(ఇట్లే ఱెప్పలిడు, మొ.)

(ట) తాల్చు, ధరించు.

సీ. చేర్చుక్కగా నిడ్డచిన్ని జాబిల్లి చే...మనుచ. 1. 5.

గీ. రథముమీఁదికిఁ జనుదెంచ పృథులసైన్య, హర్ష భాషణధ్వనులుఁ దూర్యస్వనములు, నెగసి దివి ముట్ట మైమఱు విడి తలిర్చు, నెలమిఁగోదండ తూణీరములు ధరించె. భార. భీష్మ. 1. 169.

(త) వైచు, వేయు.

క....సాత్రాజి, తనయ ముసుం గిడి...పారి. 1. 107.

(వ) దాఁపఁబెట్టు. తిరిగి పుచ్చుకొనుటకై ధనాదిక మితరులయొద్దఁ బెట్టు, న్యాసము చేయు.

చ. జలరుహమిత్రుఁ డాత్మరుచిసంపదఁ జీఁకటి బందెకానికిన్, గలఁగుచు వీనిలోన నిడ కైకొనె నమ్మికకాఁపు లంచుఁ జక్కల దొర యొండదాడి విని గ్రక్కునఁ దామను గాంచి వీనిలో,పల నెలకొల్పె నాఁ బలుకఁ గాఱె నిశాంత నిశాంతదీపికల్. పారి.2.59.

(గ) అలఁదు, పట్టించు, రాచు.

సీ. అటకలి యిడె లెస్స యట కలికి యొకర్తు జలజగంధి యొకర్తు జలక మార్చె. సారంగ. 2. 193.

(జ) విత్తు, చల్లు; ఊడ్చు, నాటు, పాఁతు.

క...ఆత్మవిద్యావినయ,ద్విషు లగువారల బ్రతుకులు, విషమంబులు చవుట నిడినవిత్తులు దలఁపగా. వా. రా. 1. 91.

మ. అలుకన్ ఘోటకధట్టికాఖురపుటీహాల్యం గురాసానిపు,చ్చలు వోదున్ని చలచ్చమూ గజమదాసారంపుల్లతిం గీర్తిపు,ష్కలసస్యం బిడి...ఆము. 1. 42.

ఉ. పొందుగఁ బశ్చిమాబ్ధితటభూస్థలి నంకు మదంకుమత్ఫలా,కందము వాసరాంత హాలిక ప్రవరుం డిడ...పారి 2. 41.

(డ) ఉపయోగించు, వాడు.

సీ. మలయజం బేవిటఁ దొలుచెక్కడులిచి మేడల కిడ్డమిగులె భూములకు డిగ్గు. ఆము. 2. 8.

శి. వీనులకు సుధారసముల,సోనలు వర్షించు మృదుల సుస్వరఫణితిం, దా నిట్టటు గ్రుక్కక పని, లేనిపునఃపదము లిడక లీల దలిర్పన్. ప్రభా. 4. 60.

(ద) నిలుపు, నెలకొల్పు.

క. పరమేశ్వరు మనమున నిడి...భార. సౌ.1. 123.

(బ) అటుపెట్టు, విడుచు.

సీ. చక్రస్తన ప్రకాశమునకు ఫేనంపుఁగొం గిడి ...గీ....స్రవంతు లుబ్బి పెనఁచె. ఆము. 4. 188.

ఉ. దావన గుండె గుబ్బు మనఁ దానెరియఁగా విడిచెం ద్వదంగసం,గానుభవేచ్ఛ యిట్లిడిన యట్టిది యాదిగ నాదు చిత్తమో, మానిత శీల...కళా. 4. 20.

ఉ. ఎక్కడ కేఁగుదెంచితి వహీనవిహార చికిత్స నీకు నేఁ, జక్క నొనర్చెదన్ దెలుపఁ జంపితి దొంగిలి ము న్నదీయులన్, రక్క సులన్ నిమం బొదివి ప్రాణము గొందుఁ గడంగి సాదవై, త్రుళ్ళిక్కడియున్నఁ బోవిడువఁ దొల్లిటి త్రుళ్ళిఁకఁ జెల్ల దిచ్చటన్. పాండు. 5. 107.

2. ఒసఁగు.

(క) ఇచ్చు, పెట్టు.

క. పేరు వలలుండు గూడుం, జీరయు నిడి సాక తంబు సేసినఁ జాలున్. భార. విరా. 1. 219.

సీ. కాంతాజనంబులు కమియార నిడుదురే పురములోఁ దత్కాలపుణ్యభిక్ష. భీమ. 3.7.

(చ) వ్రాసియిచ్చు.

సీ. ఇంద్రికి నిడ్డపత్త్రములు దొంగిలిపోయి పోయినంతకు నిచ్చి పొరయు విత్తము.... పాండు. 3. 16.

(ట) అర్పించు, సమర్పించు.

గీ. ...ఈయమ్మ చెప్పినట్ల, శక్తి కిడియెదు ననుట నిస్సంశయంబు. కళా. 8. 91.

వ. కటిఘటితార్ద్రవసన ఖండంబులతోఁ బోర్లు దండంబు లిడువారలకు. శుక. 2. 10.

3. ఆరోపించు, మోపు.

చ. ...తమ చేయుతప్పు లెల్లను మగవారిపై నిడి చలంబున బొం కొనరింతు రెందు జవ్వనుల మనోగతుల్ దెలియువారల నెంతటి వారు గావలెన్. సారంగ. 2. 243.

4. నిర్మించు.

క. తనరె బలిభుక్తతులు...కొనుకసవులఁ జైత్య తరుల గూండ్లిడు భ్రమలన్. ఆము. 4.182.

గీ. పుట్ట లినుమంత లిడ నిడఁ బొదలు చెట్టఁగి. విక్ర. 2. 170.

5. ఏర్పఱచు, నిర్ణయించు.

సీ. ఇడ్డవడ్డికి నోర్చి...పాండు. 3. 16.

గీ...కొలఁది యిడరాని. పారి. 1. 78.

గీ....భ్రమరక మని, తేఁటి బిడ్డవే రిడుట... ప్రభా. 2. 65.

6. (గ్రుద్దు) పెట్టు.

గీ. అధరసుధఁ గ్రాఁడి జతగ్రాఁడి యగుచు మౌక్తిక. కాండమాలిక నిడెను నాసాగ్ర మౌక్తికంబ యనఁజాలునన లిచ్చె గత జరత్సు, మంపునావిలి మొగమూర్పు నింప నోర్తు. ఆము. 5. 134.

క. తలచూపె నప్పు డళులాళుల దట్టపుటిరులు చిలువజవరాలు నభస్స్థలమండపకోపరిసీ, మలనిడినసితాండ పటలిమాడ్కిన్ జుక్కల్. మనుచ. 5. 84.

అడుగులకుమడుఁగులిడు — అడుగులకుమడుఁగు లొగ్గు (పఱచు) దశా. 1. 144.

ఆనయిడు — ఒట్టుపెట్టు. సారంగ. 2. 204.

కన్నమిడు — కన్నమువేయు. విక్ర. 8. 9.

కయ్యములిడు — కయ్యములు కల్పించు, కలహములు పెట్టు. కళా. 2. 6.

గ్రుంకిడు — మునుఁగు. స్నానముచేయు. మనుచ. 1. 68.

గంతులిడు — గంతులువేయు. మనుచ. 4. 87.

చామరములిడు — చామరములతో విసరు. మనుచ. 1. 12.

త్రవ్వటమిడు — త్రవ్వటము పెట్టు, త్రవ్వు. విప్ర. 2. 69.

పన్నిదమిడు — పందెమువేయు. విజ. వి. 2.164.

బొబ్బిడు — బొబ్బవెట్టు. భార. ఆది. 6.209.

సద్దిడు — సద్దుచేయు. ఉ. హరిశ్చ. 2. 8.

ఇట్లే యితరములు గ్రహించునది.

జ. ఇడుమ్రాను.

ఇడుగడ వి. (క. ఇడుగు. త. ఇడుక్కు.) 1. కష్టము, బాధ.

క. కడలేని విరహవేదన, నిడుగడ వడుచుండు కంజె నీథర మెల్లన్, మృదు వెయిదఁ దపోవర్తన, నొడలేర్పద నరిగి దారుణో గ్రాటవులన్. కు. సం. 6. 662.

2. అమాయ.

చ. తడయక గ్రమ్ముకొయున్న వినతానుతు నప్పుడు సూచి యాత్మలో, నిడుగడ సేయుచున్ గడు సహింపక కద్రువ ... భార. ఆది. 2. 42.

3. అవమానము.

చ. వెడలఁగనీక గొంది నిడి వేయువిధంబుల భంగపెట్టుచుం, బడకలు గట్ట నిచ్చి నిజ సంపదకుం జొరనీక నిచ్చలుం, గడనిడి కూడు పెట్టుచును గాని యొనర్చుచు నేల తెంకిపై, నిడుగడ సేయఁగా వలయు నిలువుమాలిన యంకుటాండ్రకున్. విజ్ఞా. ఆచా. 111. (చి. ని. పాఠము. కడియేఁడు ...నేలతెంకిపై -ముద్రి.)

**ఇడుపు** వి. 1. కుడ్యము, గోడ.

మ...మా,యల వంచించి నరేంద్రనందనుల నుడ్డాడించి సప్తాంగముల్, బలుసొమ్ముల్ గొని సంయమీ యిడుపులుం బంగారుగాఁ జేసినఁ. విప్ర. 3. 14.

సీ. ఇడిసినయిడుపులయొడలఁ బ్రొచే మత్తరేను గసింద కోరింద పొదలు. ఆము. 6. 13.

సీ. నేలయు నింగియుఁ దాకము ల్వాయింప... ఇడుపు లేక చిత్రముప్రాయ.కు.సం.8.185.

గీ. ఒరగి రతిదేవిపాలిండ్ల నొత్తగిలిన, యించు విలుకాని వ్రాసినా రిడుపునందు. నైష. 7. 150.

సీ. పొడుపుగుబ్బలి వెలపురుటింటి యిడుపునఁ జఱచినగందంపుఁజట్ట లనఁగ. పారి. 2. 88.

2. ద్వారప్రాంతకుడ్యము. అం. భా. 2.13.

**ఇడుము** వి. (త. ఇడుంబై.) క్లేశము, కష్టము.

క. ఇడుములు గుడువఁగఁ బుట్టిన,యొడ లిది యిటులోపుఁ గాక యొడ్డులు నాచేఁ,బడిరి తొలుభవమునం దిప్పుడు తత్ఫల మంద కున్నఁ బోవునె నాకుఁ. నిర్వ. 9. 23.

గీ. మగువఁ గోల్పోయి కడు నిడుములఁ గలంగు. అచ్చ. రా. సుం. 154.

జ. ఇడుమపడు, ఇడుమపాటు.

**ఇడుమపడు** అ. క్రి. (√ఇడుము) క్లేశమునొందు, కష్టపడు.

క. నరనుతుఁడు దొల్లి నలుఁ డను,ధరణీశుఁడు జూద మాడి తనవిభవము పు,ష్కరుచేతనో టువడి యొ,క్కరుఁడు గరం బిడుమపడఁడె కావనభూమిఁ. భార. అర. 2.6. (ఇడుమఁబడు - ముద్రి)

**ఇడుమపాటు** వి. (√ఇడుమపడు) కష్టపడుట.

చ. ... ఆ,బడలిక చూడలే కిడుమపాట్లకుఁ జొచ్చి నలంగి తంచు నె,క్కుడుతమకంబుతో డఁ దల్గ్రుచ్చి కవుంగిటఁ గూర్చెన త్తఱిఁ. కళా. 4. 99.

వ. ...ఇడుమపాట్లకోర్చి...కళా. 4. 98.

**ఇడుమ్రాను** వి. (√ఇడు) కల్పవృక్షము.

(విష్ణువర్ణనము) సీ. నీటుగాఁగరము మానిక పుమాటున మాటుమచ్చవాఁ డిడుమ్రాని రచ్చవాఁడు. చంద్రా. 1. 70.

**ఇడ్డెన** వి. (క. ఇడ్డళి. త. ఇడ్డలి.) వాసెనకుడుము.

సీ. పరమాన్నములు దేనె ఫలరసప్రకరంబు లిడ్డెనల్ పులగంబు లడ్డువములు. బ్రహ్మో. 3. 330.

**ఇత్వరము** సం. వి. అ. పుం. షండము, ఆఁబోతు.

**ఇతః** సం. అవ్య. (దీనికి తెనుఁగున వ్యస్తప్రయోగము లేదు.) ఇంతకంటె, దీనికంటె.

ఇతఃపూర్వము — ఇంతకుమునుపు.

(వ్యవ) వాని నితఃపూర్వము నే నెఱుఁగను.

ఇతోధికము - ఇంతకంటె ఎక్కువది.

(వ్యవ) వాని కితోధికైశ్వర్యము గలుగుఁగాక.

ఇతఃపరము — 1. ఇంతకంటె నన్యమైనది.

శా. నీవే తప్ప నితఃపరం బెఱుఁగ...భాగ.8. 90.

2. ఇఁకమీఁద, ఇఁకముందు.

(వ్యవ) ఇతఃపరము నేను నిన్ను చూడఁ దలఁచు కొన లేదు.

**ఇతఁడు** — ఈతఁడు.

చ. ...నీ వితనితోడ రణం బొనరించెదేని.భార. ఆది. 6. 44.

**ఇతము** వి. (సం. హితమ్.) అభీష్టము, కోరిక.

గీ. పలుపలుకు లేల యింక నాచెలులు గిలులు, నేఁగుదెంచి విఘ్న మొనర్తు రిత మెఱుఁగక. కళా. 3. 61.

**ఇతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. గతము, పోయినది. 2. పొందినది. 3. ప్రాప్తము, పొందఁబడినది. వి. అ. న. 1. గతి. 2. జ్ఞానము.

**ఇతరము** సం. విణ. (అ. అ. అ.) 1. అన్యము, వేఱైనది. 2. నీచము. అధమము.

**ఇతరేతరము** సం. విణ. (అ. అ. అ.) అన్యోన్యము, ఒండొకటి.

**ఇతరేతరయోగము** సం. వి. అ. పుం. 1. (వ్యాక) సమాసములోని పదములన్నియుఁ బరస్పరము కలిసి మఱియొక పదముతో నన్వయించుట. (ఇది ద్వంద్వసమాసార్థములలో నొకటి.) 2. పరస్పర సంబంధము.

**ఇతరేతరాశ్రయము** సం. వి. అ. పుం — అన్యోన్యాశ్రయము.

**ఇతవరి** — హితవరి. విన. (√ఇతవు) హితము కోరువాఁడు, మేలు కోరువాఁడు.

**ఇతవు** — హితవు. విణ. హితమైనది.

క. ఏకాంత యెవరి కితవో, యాకాంతను వారు పొగడు టది యుక్తంబే. అహ. 1. 111. (ఇతవు — హితురాలు)

క. పితృపూజన మని యెవ్వరి,కితవుగఁ జేయుదురు దీని నెఱిఁగింపు శివా. భార. అను.5. 206.

చ. ...ఇట్టి వా,రితవులు తండ్రికిన్ సుతుల కేమన నేర్తుము పెద్దరాజులన్. భార.ఉద్యో. 4. 240. (ఇతవులు — హితులు)

వి. హితము, ప్రీతి.

క. ఆరామ కపుడు శుభవా,గ్ధారాగతిఁ దెలిపె నొక్కతరుణి పరికరా,వాఁ నిశాంత మితవు నలు,వార నిశాంతమితిరహితహాసవిభవమున్. చంద్రి. 4. 128.

(వ్యవ) వానికి అన్నముమీఁద ఇతవు తప్పిపోయినది.

**ఇతికర్తవ్యత** సం. వి. అ. స్త్రీ. ఇట్లు చేయవలయును అనుసంగతి.

**ఇతికర్తవ్యతామూఢుఁడు** సం. విణ. (అ. అ. అ.) ఏమి చేయుటకును తోఁచనివాఁడు.

**ఇతివృత్తము** సం. వి. అ. న. చరితము, కథ.

**ఇతిహాసము** సం. వి. అ. పుం. పూర్వచరిత్ర ప్రతిపాదక గ్రంథము (భారతాది).

**ఇత్కిల** సం. వి. అ. స్త్రీ. రోచన యనుగంధ ద్రవ్యము, గోరోజనము.

**ఇత్తడి(రి)** వి. (సం. పిత్తళమ్.) ఒకానొక లోహము, ఆరకూటము.

క....ఇత్తడి బంగారు మొనె యిలలో సుమతీ. సు. శ. 14.

సీ. చముత్రైనతోల్కుబుసంబు చెక్కియును నిత్తళిశంఖచక్రకుండలము లమరి. ఆము. 6. 6. (వ్రాఁతప్రతి).

**ఇత్తిగ** న. (ఇరు+తిగ) 1. పాచికలమీఁదిమూఁడు బొట్లజత, దుందుభి. (సొగటాలాటపరిభాష). మ....దచ్చొక చౌపంచ యిత్తిగ తూరా దుగ యంచుఁ జిల్కరొద లుద్దీపింప దౌదవ్వులా. కళా. 3. 131.

2. ఆఱు.

(విష్ణువర్ణనము)

సీ. ఇత్తిగనలయెన్ను నీనుచూలాలు వావిరిఁ బూచుతటి తెప్ప విప్పువాఁడ. ప్రబం.217.

మ....ఆతెల్లునం,బొడమెఱ దైవత మొక్కఁడిత్తిగలమోముల్ కృత్తికల్ మెచ్చఁగన్. చం. రా. 3. 6. (ఇందు బహువచనము విశేషము).

సీ. ఇత్తిగ చక్కన నెసఁగును షట్కంబు.ఆం. భా. 2. 306.

**ఇత్థంభూతము** సం. విణ. (అ. అ. అ.) ఇట్టిది, ఈ ప్రకారము గలది.

ఇత్థంభూతాఖ్యానము — ఇట్టిది అని చెప్పుట.

**ఇత్థంవిధము** సం. విణ. (అ. అ. అ.) ఇట్టివిధము కలది, ఇట్టిది.

**ఇత్యము** సం. విణ. (అ. అ. అ.) ప్రాప్యము,పొందఁదగినది.

**ఇత్యాది** సం. విణ. (అ.) ఇది మొదలుగాఁ గలది.

**ఇత్వరము** సం. వి. అ. పుం. ఇట్టురిము, ఆఁబోతు.

**ఇత్వరి** సం. వి. ఈ. స్త్రీ. అసతి, అంకుటాలు.

**ఇత్వరుఁడు** సం. విణ. (అ. ఈ. అ.) 1. పోవువాఁడు, పథికుఁడు. 2. క్రూరుఁడు. 3.నీచుఁడు, నిందితుఁడు. 4. దరిద్రుఁడు.

**ఇదమ్** సం. న. (మ్.) ఈ. (దీనికిఁ దెనుఁగున వ్యస్త ప్రయోగము లేదు).

క. ఇంపున నేఁ డిట నిలిచి యి,దంపురభూవరకు మారదర్పనము గా, వింపుదు వని యచ్చట

విహా,రింపుచుఁ బరికింప నొక్క క్రేవన్ తేవన్. చంద్రా. 5. 8.

(ఇట్లే 'ఇదంప్రకారము, ఇదంప్రథముఁడు, ఇదం యుగము' మొ.)

**ఇదంకార్య** సం. వి. అ. స్త్రీ. దురాలభ, తీఁటకసింద (వృ. వి.)

**ఇందతనుఁడు** సం. విశే. (అ. ఈ. అ.) ఇదానీంతనుఁడు, ఇప్పటివాఁడు.

శ్లో. అనేకధాకృతాః పుత్రా ఋషిభిశ్చ పురాతనైః, న శక్యాస్తేఽధునా కర్తుం శక్తిహీనైరిదంతనైః. మను. 9. 68 వ్యాఖ్య.

**ఇదానీంతనము** సం. విశే. (అ. ఈ. అ.) ఇప్పటిది.

**ఇద్ది** – ఇద్ది–చూ. అది. (ఈ+ది – ఈది, ఇద్ది, ఇది–అనిరూపావతారము. 'ఈది' ప్రస్తుతము భాషలో లేదు–క. త. ఇదు.)

'ఈ' అనుదానికి మహత్యర్థమునందును (స్త్రీవాచక మగునపుడును) అమహదర్థమందును (తిర్యగ్జడములను దెలుపునపుడును) ప్రథమైకవచనమున వచ్చురూపము, ప్రథమాబహువచనమున స్త్రీవాచక మగునపుడు 'వీరు' అనియు, తిర్యగ్జడవాచకమగు నపుడు 'ఇవి' అనియు, రూపము లుండును.ద్వితీయాదివిభక్తులలో ఏకవచనమున రెండిటికిని 'దీని' అను రూపముండును. ద్వితీయాది బహువచనములందు స్త్రీవాచకమునకు 'వీరి' అనియు, తిర్యగ్జడవాచకములకు 'వీని' అనియు రూపము లుండును.

1. దగ్గఱగా నున్నదానిని తెలుపును.

చ. ఇది గడు ముద్దరాలు పని లేమియుఁ జేయఁగ నేరదు. భార. విరా. 1. 108.

సీ. ఇది యాదిగా సతు లెన్నండుఁ బరపురుషార్థినుల్ గాఁ జనదు... భార. ఆది. 5. 85. (ఇది – ఈకాలము)

2. పాదపూరణముగా నుపయోగింపఁబడును.

ఉ. ఇమ్మహి నీవుఁ బాండవులు నెప్పటియట్ల పరస్పరానురా,గమ్మున నేలుచున్కి యిది కార్యము. భార. సభా. 2. 186.

3. కొన్ని పట్ల మహద్వాచకముగాఁ గూడఁ గనఁబట్టుచున్నది.

గీ. ఎవ్వఁ డిది యని పల్కిన నవ్వధూటి, నోరు నొక్కుచుఁ గొఁగిటఁ జేరఁ దిగిచి, మగువ చెవిలోన నలుకుడు మాను మేను,వాసవుఁడ నిమ్ముఁ గని కూర్మివచ్చినాఁడ. జాహ్నవీ. 4 87. (ఎవ్వఁడిది – వీఁడెవ్వఁడు).

ఇదియదియనక – అనవసరపుమాట లాడక.

క. ఎదిరికి హితమును బ్రియమును, మదికింపును గాఁగఁ బలుకుమాటలు పెక్కై, యొదవినను లెస్సయటుగా,కిదియదియన కూరకునికి యెంతయు నొప్పుఁ. భార. ఉద్యో. 2. 59.

ఐ. ఇదిగాక, ఇదిగొ, ఇదిగో, ఇదియో, ఇదె, ఇద్ది.

**ఇదిగాక** అవ్య. (√ఇది) మఱియు. దశా. 2. 140. (ఇట్లే ఇదియుఁగాక, మొ–చూ. అదిగాక.)

**ఇదిగొ** – ఇదిగో (√ఇది)

(సమీపవస్తువును జూపుటకును ఎదుటివానిని అభిముఖునిగాఁ జేయుటకును నుపయుక్తమగును.)

గీ. మంచిమేలైన దిదిగొఁ గొమ్మంచుఁ గప్పు, రంబు నగపాలు నించి వీడెం బొసంగి. సారంగ. 2. 84.

(ఇప్పుడే)

సీ. నిలలేక స్వయముగాఁ బిలువఁ బోయినఁ గాని బెదరించు నిదిగొ వచ్చెద నటంచు. కువల. 4. 194.

**ఇదిగో**–ఇదిగొ. అవ్య చూ. అదిగో. (క. ఇదుగో, ఇగో, ఇకో. త. ఇదో) ఇది కళగాను ద్రుతప్రకృతికముగాను గూడఁ గనఁబడుచున్నది.

1. సమీపవస్తువును జూపుటకును ఎదుటివానిని అభిముఖునిగాఁ జేయుటకును ఉపయుక్తమగును.

క. అది గని మధురానగరం, బిదిగోఁ దడవు లకుఁ గంటిమి. వాల్మీ. 2. 17.

(వ్యాప) ఇదిగో నామాట వినుము.

క పూఁబోఁడి యొఱసికొని చనఁగాఁ బయ్యెద యొడిసిపట్టెఁ గనుఁగొంకు చెలీ, లేఁబొన్న నుబళిరా యిది,గోఁ బురుషావ్యాయము నిలుపుకొను సమయంబుఁ. కళా. 1. 85.

2. ఇప్పుడే. (చూ. ఇదిగో.)

ఇదిగోఅదిగో—1. దేశసామీప్యమును దెలుపును. (వ్యవ) ఇదిగోఅదిగో అని నాలుగుక్రోసుల దూరము వచ్చినాము. (ఇదిగోఅదిగోఅని — గమ్యస్థానమును సమీపించుచున్నా మను బుద్ధితో).

2. కాలసామీప్యమును దెలుపును.

(వ్యవ) నా కీయవలసినసొమ్ము ఇదిగోఅదిగో అని యాయక జరుపుచున్నాఁడు. (శీఘ్ర కాలములో నే యిచ్చెదనని జరుపుచున్నాఁడు.) ('ఇవిగో' అని. హర. 2. 126 లోనున్నది. కాని అది నిర్ధారక ప్రయోగము కాదు.)

ఇదియో (ఇది+ఓ) — ఇదిగో.

మ. ప్రమదాపాది పయఃప్రపూర్ణ మిదియో పద్మాకరం బంచు...భార. ఆది. 6. 172. (ఇదిగో. పాఠాంతరము.)

ఇదె అవ్య. (ఇది+ఎ) ఇదిగో.

మ. ఇదె గోవర్గము నేఁ డ పచ్చితిమి పోనీం కేల సైన్యంబులుం, గదియన్ వేచనుదెంచె. భార. విరా. 4. 263.

క. ఇదె పోయెదఁ గౌరవ్యులఁ, బదనిశి రాఁ బలికి సంధి వాటించెద. భార. ఉద్యో. 3. 69. (ఇదె — శీఘ్రముగా).

ఇద్దరి వి. (ఈ+దరి) ఈవలిగట్టు, అవారము. ఆం. భా. 2. 155. (చూ. ఇవతల)

ఇద్దఱు న. (రెండుశబ్దమునకు మహన్మహత్వర్థక బహువచనరూపము) ఇరువురు.

చ....క్రి,క్కిఱిసిన పోటులఁ మిగులఁ గిడ్పడ నెత్తురు గ్రమ్మఁజేసి యి,ద్దఱు నవలీలఁ బోరి రతిదర్పితులై సమరోత్సవంబుతోన్. భా. రా. యు. 1975.

ఉ. ఇద్దఱుముష్టి ఘాతములు. భార. ఆది. 6. 297. భిష్మ. 1. 288.

ఇద్ది — ఇది.

గీ. కీడు సేరు నను చుఁ గీనువగొట్టుట, యిద్ది వెలపుగాక యొఱుక యగునె. కేయూర. 3. 41.

ఇద్దుగ వి. (ఇరు+దుగ) పాచికమీఁది రెండుబొట్ల ఆట.

క. అత్తీవంచ తిగ దుగయు,సత్తా దచ్చౌక వంచ చౌవం చీరై, దిత్తిగ యిద్దుగ బద్రలు, చిత్తంబునఁ దలఁచినట్లు చేతికిఁ దెచ్చున్. ఉ. హరి. 3. 121.

ఇద్దుము వి. (ఇరు+తూములు) రెండుతూములు. ఆం. భా. 2. 271.

ఇద్ధము సం. విణ. (అ. ఆ. అ.) 1. దీప్తము, కాంతిమంతము.

శ్లో. తన్వంత మిద్ధమభితో గురుమంశుజాలం లక్ష్మీ ముపాహ సకలస్య శశాంకమూర్తేః. సం. కిరా. 2. 59. భట్టి. 1. 5. (ఇద్ధబోధైః — పటుబుద్ధిభిః. అని. వ్యా.)

2. ఉగ్రము.

శ్లో. తమిద్ధమారాధయితుం సకర్ణకైః కులైర్న భేజే ఫణినాం భుజంగతా. శిశు. 1 63.

3. దగ్ధము, కాల్పఁబడినది.

శ్లో. సమిద్ధశరణా దీప్తా. భట్టి. 10. 7.

4. అప్రతిహతము, అడ్డు లేనిది.

శ్లో. స యావరాజ్యే నవయావనోద్ధతం, నిధాయ దుశ్శాసనమిద్ధశాసనః. సం. కిరా. 1. 22.

వి. అ. న. 1. ఆతపము, ఎండ. 2. దీప్తి. 3. ఆశ్చర్యము.

ఇధ్మజిహ్వుఁడు సం. వి. అ. పుం. అగ్ని.

ఇధ్మప్రవ్రశ్చనము సం. వి. అ. పుం.—ఇధ్మములను నఱుకునది—గొడ్డలి.

ఇధ్మము సం. వి. అ. న. 1. చిదుగు. 2. వంటకట్టియ.

ఇధ్యి సం. వి. ఆ. స్త్రీ. వెలిఁగించుట, రగుల్చుట.

ఇధ్యమానము సం. విణ. (అ. ఆ. అ.) కాల్పఁబడుచున్నది.

ఇనము సం. వి. అ. పుం. — సూర్యదేవతాకమగు నక్షత్రము — హస్తనక్షత్రము.

ఇనసభము సం. వి. అ. న. రాజసభ.

ఇని — ఇన్ని (శ. ర.).

ఇను—ఇరు. వ. (వృత్తియందే దీనికిఁ బ్రయోగము. 1. రెండు.

క. తనయొప్పటిరూపముఁ జేకొని దీనికి నిను
మడుంగగుఁ బ్రతిబలముం,గనినప్పుడు నా
రూపం, బనుపమముగ ననిన హనుమ కని
లజుఁ డనియెన్. భార. అర. 3. 345.

2. రెట్టి, ద్విగుణితము; అధికము.

క. భూపాల మెఱుఁగుఁబోఁడుల, చూపులకుం
దాయు నీదుసొబ గట్లగుటన్, మాపిన్నది
యినుమడింతల, చూపుల నఱగంట వెఱచుచు
న్నినుఁ జూచున్. నైష. 8. 61.

చూ. ఇనుమడి, ఇనుమడించు, ఇనుమనుమఁడు, ఇనుమాఱు, ఇనుమిక్కిలి, ఇన్మాఱు, ఇబ్బడి, ఇబ్బడించు, ఇమ్మడి, ఇమ్మడించు.

**ఇనుఁడు** సం. వి. అ. పుం. 1. ప్రభువు, పోషకుఁడు. 2. రాజు. 3. మగఁడు. 4. సూర్యుఁడు.

**ఇనుక** వి. తుషయుక్తమైన స్వల్పధాన్యము, ఊఁకతోఁ గూడిన చిన్నధాన్యము.

గీ. ...తుషయుక్తములగు స్వల్పధాన్యములు
చింక యినుక నఁ దగు మహేశ. ఆం. భా.
2. 238. ప్రా. (ఇనుకు. శ. ర. – ఇంకను విచార్యము.)

**ఇనుకు**–ఇంకు.

అ. క్రి. (కోపిల్లు)

మ....వార్ధు లినికెన్ నక్షత్రముల్ రాలె...
మై. 3. 91. (ప్రయోగాంతరము లేదు.)

**ఇనుప(న్ప)యెడ్లు**–ఈన్పయెడ్లు. వి. బ.
(త. ఈన్–ఈను. ఆడు–మేఁక; గొఱ్ఱె–వ్యు. ఈనునట్టి మేఁక; గొఱ్ఱె–అనఁగా ఆఁడుమేఁక; ఆఁడుగొఱ్ఱె.) మేఁకలు? గొఱ్ఱెలు?
(ఈన్పయెడ్లు అనునదే ప్రథమరూప మనితోఁచుచున్నది. ఇది ప్రాచీనశాసనములందు మాత్రమే కాన్పించుచున్నది.)

స్వస్తిసమస్తప్రశస్తిసహితం శ్రీమన్మహామండలేశ్వరకోటకేతరాజులు శకవర్షములు 1104 గునేంటిమాఘశుద్ధ 10 గురువారమునం దమకు ధర్మార్థముగా శ్రీమద్బుద్ధదేవరకు నఖండవర్తి దీపములు రెంటికినై ఇచ్చినఇన్పఎడ్లు 110 వీనిలోన దామక అమరేటోయుండు ఎంథదేనుగొఱియలం జేకొని ఆచంద్రార్కముగాం దనపుత్రులును పౌత్రికమునవనిత్య మావెందునేసి నేయిం బోయంగలవాండు. అమరావతి. శా. Ep. Ind. 6. 160.

**ఇనుమ(న్మ)డి** – ఇమ్మడి, ఇబ్బడి. విశే. (ఇను+మడుఁగులు) రెట్టి, ద్విగుణితము.

క. అనినఁ గృపాచార్యుం డీయినుమడిదివస
ములఁ దీర్ప నేనోపుదు. భార. ఉద్యో.
4. 414.

**ఇనుమ(న్మ)డించు** అ. క్రి. (√ఇనుమడి) రెట్టియగు, ద్విగుణితమగు.

తే. చేటువకుఁ జావునకు వగఁజెందుజనుల, కిను
మడింపదె మానసమున వలంత. భార. స్త్రీ.
2. 166.

సీ. కాఁబోలు నివి బాలకమనీయపదలీల లిచటఁ
బల్లవజాల మినుమడించె. వసు. 3. 80.

స. క్రి. ద్విగుణీకరించు, ద్విగుణముచేయు. (చిన్నయసూరి ధాతుమాల).

**ఇనుమద్ది** వి. (ఇనుము+మద్ది) నల్లమద్ది (వృ. వి.)

**ఇనుమనుమఁడు** వి. (√ఇను) మునిమనుమని కొడుకు, ప్రపౌత్రుని కొడుకు.

**ఇనుమా(న్మా)ఱు** వి. (ఇను+మాఱులు) రెండు మాఱులు.

క. ననుబోఁటిబోదునుం గా, దని పలుకఁగ
నేర్పు నీకు నంత గలదె య,ట్లును గాక
వినుము కర్ణుం,డినుమాఱొకశరము దొడు
గునే పరులు నగన్. భార. కర్ణ. 3. 317.

సీ. అట్లుగ నిశ్శబ్దమై యుండ ముమ్మాఱు
ద్రావి యిన్మాఱు తిర్యగ్విధమున, నాస్యంబుఁ
దొడసి...భార. అను. 3. 284.

**ఇనుమిక్కిలి** విశే. (√ఇను) అత్యధికము.

ఉ. ...ఎయ్యెడన్, మీరలు రాజుకంటె నిను
మిక్కిలి మాకనురక్తి మైమముఁ, గొంవ
లీలఁ బ్రోతురు...సారంగ. 2. 267.

చ. ...మందగామిని యను చెల్లి నప్పడిను
మిక్కిలిగాఁ దనయందె నిల్పఁగన్. విజ.వి.
3. 207.

**ఇనుము** – ఇన్ము. వి. (త. ఇరుంబు—వృత్తియందు మువర్ణమునకు పవర్ణం బగు) కాలాయసము, ఒకానొక లోహము.

గీ. ఎట్టిగా నగ్నిఁ గాఁగినయినుపయిసుక ... కాశీ. 3. 152.

చ. ఇనుమునఁ జేసినం బొలుచునెన్మిదిగండ్లగు తేరు వేయి పెం, పెనసిన గర్దభంబులు వహింపఁగ...హరి. పూ. 4. 88.

గీ. అనఁటిపం డొల్వ నేటికి నినుపగోరు. పి. శకుం. 4. 47.

సా: ఇవి యినుపగుగ్గిళ్లు గాని అనుపగుగ్గిళ్లుకావు. (ఒకానొకచో ముపర్ణము లోపించును - చూ. ఇనుమద్ది.)

జ. ఇనుమద్ది.

**ఇన్నాళ్లు** వి. బ. (ఇన్ని + నాళ్లు) ఇన్నిదినములు. ('ఇన్నాళ్' అనియుఁ గలదు.)

గీ. తెలవ! యిన్నాళ్లు నడుగఁ బుత్తేఁడునిన్ను, నరయ నిది తప్పు గాదె. నైష. 3. 128.

శా....ఏలా పుట్టె నీదూఱు నీ,కిన్నాళ్ లేనిది చెల్లఁబో జనని గాదే యల్ల చిత్రాంగి. సారం. 3. 88.

శా....ఇన్నాళ్లోప్పదియెనఁటఁ గేళివనిలో నిం బొందునమ్మాధవీ, పున్నాగంబుల పెండ్లి సేయవలెఁ బూఁబోండ్లారరారే...విజ. వి. 3. 77.

**ఇన్ని** న. బ. వా. (త. ఇత్తనై) ఇంతశబ్దము యొక్క అమహదర్థక బహువచనరూపము

1. కొన్నిచోట్ల సందర్భానుసారముగా అధిక సంఖ్య గలవానిని గాని అల్పసంఖ్యగల వానిని గాని తెలుపును.

(అధికసంఖ్యకు)

ఉ. మున్ను విధాత మీకు వరముల్ కరుణించుటఁ జేసి త్రోయరా, కిన్నిదినంబు లేను క్షమియించితి...ఉ. రా. 2. 97.

(అల్పసంఖ్యకు)

గీ....మునీంద్ర, యిన్నినీళ్లైన వంటకం బించుకైనఁ, దొల్లి దానంబు చేయనిదుష్కృతమున, నిర్భరక్షుత్పిపాసలు నిలువ వనిన. వరాహ. 12. 66.

2. ఇవి యన్ని

క. ఇదె దేహం బిదె యర్థం,బిదె నాపరిజన సమూహ మిన్నిటిలో నె,య్యది మీకిష్టము దానిన, ముద మొదవఁగ నిత్తు ... భార. ఆది. 5. 242.

జ. ఇన్నాళ్లు.

**ఇన్నూఱు** – ఇరునూఱు. న. వా. (√ఇను) రెండు వందలు.

సీ. ఇన్నూఱు మున్నూఱు నేనూఱు కన్నులు గల వేలు పెవ్వానిఁ గన్నతండ్రి. నైష. 6. 72.

**ఇన్ము** – ఇనుము.

చ....అనేక రాక్షసు, ల్వాదిగొని కావ నిన్ము వలలో నమృతంబు సుర క్షితస్థితిన్.

క. ఉండునన విని ... భార. అను. 1. 216, 217.

**ఇన్వళలు** నం – ఇల్వలలు.

**ఇపుడు** – ఇప్పుడు. నైష. 2. 77.

**ఇప్డు** – ఇప్పుడు, ఇపుడు. భార.అర. 5. 432.

**ఇప్ప** వి. (త. ఇలుప్పై. క. ఇప్పె. మ. ఇర్ప.) మధూకము, ఒకజాతిచెట్టు.

మత్త. ఏచె మావులు గ్రోవులున్ దగునిప్పలున్ గురువిందలున్. యయా 4. 7.

గీ. అతిమనోజ్ఞంబు ధమ్మిల్ల మలరుఁబోఁడి, యిప్పపూదండఁ గైసేసె నెలమి నోర్తు. హర. 4. 80.

చ. కదళిగభీరపుష్పపుటికాచ్చుటఁ జేతుల నిప్ప పిండిపైఁ, గుదురుగ నిల్పి...అము 1.83.

జ. ఇప్పపూరాజనములు.

**ఇప్పపూరాజనములు** వి. బ. (√ఇప్ప) ధాన్య విశేషము. హంస. 4. 128.

**ఇప్పించు** న. క్రి. (√ఇచ్చు) ఈయఁజేయు.

వ. అయ్యా మదీయధర్మపత్ని యక్కుండలంబులు దొడుగ నవసరంబై యున్నయది మద్వచనంబున వాని నిప్పించుకొమ్ము. భార. ఆది. 1. 95.

క. ఇయ్యఁగ నిప్పింపం గల,యయ్యలకే కాని మీస మందఱకేలా. కవిచౌడప్పశతకము. 18.

**ఇప్పుడు** – ఇపుడు, ఇప్డు వి. వా. వి.

(దీనిరూపాంతరములగు 'ఇపుడు, ఇప్డు' అనునవి ద్వితీయాదివిభక్తులతోఁ గూడియుండవు— తె. ఇప్పాళుదు.)

ఈసమయము.

చ....జరకై వయస్సునను బూని పరంబున కిప్పుడుద్యమం, బనువుగఁ జేయఁగా వలయు ...ఆము. 2. 76. (ఇప్పుడు — ఈజీవిత కాలమున).

**ఇబ్బంది**¹ వి. (ఇరు+బందులు) ఇక్కట్టు, అనివార్యమైనబాధ.

**ఇబ్బంది**² విశ. (తె. ఇబ్బంది) మూర్ఖుఁడు.

ద్వి. పొంగి చిచ్చులుకంగఁ బోవుచుఁ జీర,కొంగోసరించు పెన్వెంగలియట్ల, చెల్లుఁ బొమ్మని సన్న్యసింపఁ బోవుచును,నిల్లప్పగించునయ్యిబ్బందియట్ల, పదపడి నూతిలోఁ బడఁ బోయి తాప, వెదకుచు మెట్టెడివీటఁడి యట్ల. బస. పు. 3. 1140 పం.

ద్వి. ఇబ్బందిజనమును తీయబ్బలూర, మెట్టి మాతోఁ బ్రతిఘటించి యాడ. బస. పు. 6. 559. పం.

**ఇబ్బంది**³ వి. (తె. ఇబ్బంది — సంకరజాతిది.) సంకర జాతిమృగము. (ఇరు+పంది — అడవిపందికిని ఊరఁబందికిని పుట్టినపంది. శ. ర. పెద్దపులికిని చిఱుతపులికిని పుట్టినపులి. చి. ని.).

జ. ఇబ్బందిగాఁడు, ఇబ్బందిగుఱ్ఱము.

**ఇబ్బందిగాఁడు** వి. (√ ఇబ్బంది³) సంకరజాతి మృగము. (బెబ్బులికిని చిఱుతపులికిని పుట్టిన పులి—శ. ర. బ్రౌ.).

**ఇబ్బందిగుఱ్ఱము** వి. (√ ఇబ్బంది³.) సంకరజాతి గుఱ్ఱము. (బ్రౌ.)

**ఇబ్బడి** — ఇమ్మడి, ఇనుమడి (√ఇను).

ఆ. ద్విగుణమున కభిఖ్యలగు నిబ్బడిమ్మడి,జంట దంట దఁగయు జమిలి రెట్టి, యినుమడి యన...ఆం. సం. మాన. 42.

**ఇబ్బడించే** — ఇనుమడించే. అ. క్రి. స. క్రి. (√ఇబ్బడి.)
(అ. క్రి. రెట్టియగు.)
అప్ప. 4. 220 పా. 1 పం.

**ఇబ్బెద** వి. వృక్షవిశేషము.

సీ. మఱ్ఱివిరిగి తొండ్లి మఱ్ఱితూ కిబ్బెద పెద్ద విరిగి. హంస. 4. 11.

**ఇభకణ** సం. వి. ఆ. స్త్రీ. గజపిప్పలి (వృ. వి.)

**ఇభకేసరము** సం. వి. అ. పుం. నాగకేసరము (వృ. వి.).

**ఇభనిమీలిక** సం. వి. ఆ. స్త్రీ. 1. భంగ, గంజాయి. (దీనిని తినినయెడల ఏనుఁగునకైనను నిద్ర వచ్చును.) 2. వైదగ్ధ్యము, నేర్పు.

**ఇభపోట** సం. వి. ఆ. స్త్రీ. మగయేనుఁగులక్షణములు కూడఁగల ఆఁడేనుఁగు.

**ఇభభరము** సం. వి. అ. పుం. యూథము, గజ సమూహము.

**ఇభము** సం. వి. అ. పుం. 1. ఏనుఁగు. 2. (గణిత) ఎనిమిది.

**ఇభయ** సం. వి. ఆ. స్త్రీ స్వర్ణక్షీరి. రెడ్డివారినానఁ బ్రాలు (వృ. వి.)

**ఇభాఖ్యము** సం. వి. అ. పుం. నాగకేసరము (వృ. వి.).

**ఇభి** సం. వి. ఈ. స్త్రీ. ఆఁడేనుఁగు.

**ఇభోషణ** సం. వి. ఆ. స్త్రీ. గజపిప్పలి (వృ.వి.)

**ఇభ్య** సం. వి. ఆ. స్త్రీ. 1. ఆఁడేనుఁగు. 2. అందుగు (వృ. వి.)

**ఇభ్యకుఁడు** సం. విశ. (అ. భ్యికా, భ్యకా. అ.) వి—ఇభ్యుఁడు.

**ఇభ్యుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) 1. ధనవంతుఁడు. 2. ప్రభువు. వి. అ. పుం. 1. రాజు. 2.మావటివాఁడు.

**ఇమడిక** వి. (√ఇముడు) ఇమిడియుండుట.

**ఇముడు** అ. క్రి. అడఁగు, అంతర్భూతమగు.

గీ. జగము తీరేడు గర్భవాసమున నిముడు. రా. వి. 1. 38.

సా: ఒక యొఱలో రెండు కత్తు లిముడవు.

స. క్రి. అణఁచు, కనఁబడకుండఁ జేయు.

(హిరణ్యాకశిపుఁడు వైకుంఠముపై దాడి వెడలినప్పుడు సారూప్యముక్తులయవస్థ యొక్క వర్ణన)

సీ. ధవళాబ్జలోచనద్వయి మూయువారును
దమగుడాకేశంబు లిముడువారు. దశా. 4. 109.

జ. ఇమిడిక, ఇముడుకొను, ఇముడుచు.

**ఇముడుకొను** స. క్రి. (√ఇముడు) ఇముడు.

వ. చెన్నగుచవికెల నిముడుకొన్న కన్నెసుర పొన్నగున్నలు...కువల. 4. 92.

స. క్రి. 1. కనఁబడకుండఁ బెట్టుకొను.

క ఆవృద్ధనారియును గరు,డావిలమతి యగుచు నాథయార్త మృగాక్షిం,దా వెనుక నిముడు కొనుచుం, గావుము కావు మని వానికర ములు పట్టెక. కళా. 3. 118.

2. దగ్గఱనుంచుకొను.

సీ. అది నిన్నుఁ బూజించి యమ్మ నీ కెయ్యది కోర్కి చెప్పు మటన్నఁ గొన్నివాళ్లు. గీ. న న్నిముడుకొమ్ము కరుణ ననాధ ననిన. ప్రబోధ. 5. 80.

**ఇముడుచే(ర్చు)** స. క్రి. (√ ఇముడు) ఇముడ జేయు. నైష. 2. 6.

**ఇమురుకొను** అ. క్రి. (క. ఇమురు, ఇమరు-స్వార్థ మున 'కొను') చమురు మొదలగునవి అయి పోవు, సమాప్తమగు.

ద్వి. ఇమురుక యాఱిపోయిన దీపమునకుఁ, బమురు వోసినయట్టు చచ్చినయట్టి, వారికిఁ బరలోక వైదికకర్మ, మూరక జనులు సేయుటయు వ్యర్థంబు. రం. రా. అయో. 141 పా. 20 పం.

**ఇమ్మడి** – ఇనుమడి. విశే. (√ఇను)1. ద్విగుణితము, రెట్టి యగునది.

సీ.... అగ్గోవిందు సందర్శనంబున నుత్సవోన్మత్త భావ, మిమ్మడియై ప్రమోదమ్మునం దేలెర ...భార. అశ్వ. 3. 119.

చ. ఇనుమున కద్దిలోఁ బసిఁడి యిమ్మడి గల్గుట నాలు గోడలం,గనకము దాను దెచ్చి చెలి కానిభటప్రకరంబుఁ గ్రూరతఁ, వననిధిఁ ద్రోచి చంపుట సువర్ణము పాఁతినచోటు సర్వముఁ, గొనములబ్రోక యైనధన గుప్తుఁడు సెప్పిన రాజు నవ్వుచున్. కేయూర. 3. 208.

2. రెండవవాఁడు.

ఉదా: ఇమ్మడినరసింగరాయలు. ఇమ్మడి దేవ రాయలు (ఇట ఏకనామము గలవారిలో రెండవ వాఁడు).

వ. దానధర్మపరాయణుండును నిమ్మడిగరుడ నారాయణుండును. హరి. పీఠి. 7.

(ఇమ్మడిగరుడనారాయణుఁడు :- గరుడ నారాయణుని వంటివాఁడు అనిభావము.)

**ఇమ్మడించే** – ఇనుమడించే (√ఇను)

(అ. క్రి. రెట్టియగు)

(దిశ్వాలురు) గీ. అలఘుశతకోటి కాంతులు నతను దండ, భృతులు నంజనతృప్త లలకేహి తములు, నిమ్మడింపఁగ ననిమిషదృష్టు లై రి, యంబుజభవోపలాల్య నహల్యఁ జూచి. అహ. 2. 28. (ప్రాఁతప్రతి).

**ఇమ్ము**[1] వి – ఇంబు. (క. ఇంబు. త. ఇంపు,ఇంపం.)

1. సుఖము; ప్రీతి, సంతోషము.

(ఈయర్థమున నిది ద్వితీయాబహువచనాంతము గానే కనఁబడుచున్నది.)

క. కులపాంసనులై యహితం,బులు సేయుచు నుండుచుట్టములఁ బొందక యి,మ్ముల నుండువాఁడ పుణ్యుఁడు, వెలయఁగ గ్రామ స్థితైక వృక్షము పోలెక. భారం. ఆది. 6. 181.

శ్లో. జ్ఞాతయో యస్య నైవ స్యు,ర్విషమాఃకుల పాంసనాః,స జీవేత సుఖం లోకే,గ్రామ ద్రుమ ఇవైకజః. సం. భారం. ఆది. 164. 140.

ఉ. ఇమ్ముల నున్నవాఁడె హరి యిక్కడ కెన్నఁడు వచ్చు వచ్చి మా,యుమ్ములికంబు వాపునె...భాగ. 10. పూ. 1474.

ఉ. తమ్ములు ధౌమ్యుఁడుఁ సతియుఁ దానర దంబులతోడఁ గ్రోశమా,త్రమ్మొకచోటి కల్లఁ జని ధర్మతనూభవుఁ డందు నాఁటిరే, యిమ్ములఁ జల్పివేగుటయు నీప్సితకార్యము సేయఁగా విచా,రమ్మున నున్నచో నమర రాజతనూభవుఁ జూచి యిట్లనున్. భార. విరా. 1. 58.

సీ. ఇమ్మహాభారతం బిమ్ములఁ జాయక విహి
తావధానులై వినుచునుండు, వారికి ...
భార. ఆది. 1. 71.

క. ఇమ్ముద్దియదెసయక్కటి, కమ్మనుభవదీయ
సఖ్యకౌతూహలమున్, నెమ్మదిఁ బిరిగొను
టయు నా,యిమ్ములఁ జనుటుడిగి రాక
యిది మిత్త్రనిధీ. దశకు. 5. 104. (నాయి
మ్ములఁ – నాయిష్టము చొప్పున.).

2. అనుకూల్యము, వీలు.

క. తన కిమ్మగునంతకు దు,ర్జనుఁ డిష్టుఁడ పోలె
నుండి సర్పమపోలెం, దన కిమ్మగుడును గఱ
చును, ఘనదారుణ కర్మగరఁ ఘనదంష్ట్రో
లచేన్. భార. ఆది. 6. 112.

ఉ. లోకవిరుద్ధవృత్తి చపలుం డతఁడి మ్మెఱుఁ
గండ యేమియున్. భార. శల్య. 2. 370.

3. అవకాశము.

ఉ. తన్నినవాఁడు తచ్చరణ తామరసంబుల
వ్రాలి నన్ను నే,మన్నది లేదు నావలన
నన్నియు నేరము లోర్చుకొమ్ము నా,పిన్న
తనం బొకళ్ళ చెవిఁ బెట్టకు పెట్టిన సిగ్గు
వోవు నా, వన్నియ సన్నమౌ నగరివారికి
దండుగఁ బెట్ట నిమ్మగున్. వేం. పంచ. 4.
511.

శా. ...ఈ ప్రోలొకఁ డెంత సాధనము నా
యైశ్వర్యమున్ బ్రోవఁ దా,నే యిష్టం
డగు లేమి మీరెఱుఁగరే యి మ్మేది భేదో
క్తికిన్. ఉ. రా. 2. 239.

4. ఉపాయము.

క. నెమ్మిగలవారి నొల్లరు, త మ్మొల్లనివారి
వెనుకఁ దగులుదు రధిక,త్వ మ్మెఱిఁగి
యెఱిఁగి తొడరు దు, రి మ్మెఱుఁగనియట్టి
వారి లిథపురనాథః. భార. ఉద్యో. 2.34.

విణ. 1. అనుకూలము, వీలయినది.

ఆ. ఎత్తికొని చనంగ నిమ్మగునట్లుగా, మెదలు
చున్న వ్రయ్యలదిమి రెంటిఁ,గూడఁ బట్టె
నవియుఁ గూడి యొండొంటితోఁ, జక్క
నంటి రెండు నొక్కఁడయ్యె. భార. సభా.
1. 147.

వ. ...వార లేమటి నమ్మి కొండొకకాలం
బుండ ని వ్వారు లెఱుంగకుండ నిమ్మయిన
యవసరంబువం దద్గృహద్వారంబునందు
దహనంబు దరికొలిపి పగఱపంచత్వం
బెఱింగి రమ్మ. భార. ఆది. 6. 139. దశా.
3. 173.

2. మనోహరము.

క. ఇది నా నుద్యోగపర్వ మి మ్మగు సభలన్.
భార. ఆది. 1. 43.

ఇమ్మగ – బాగుగా. (ఇది సందర్భమును బట్టి
'స్పష్టముగా' మున్నగు నర్థములఁ గూడ
నిచ్చును.)

ఉ. ఇమ్మగ నాత్మరక్ష విధియించువిధంబున
మంత్రరక్ష య,త్నమ్మునఁ జేయఁగావలయు
...భార. ఆది. 6. 110.

గీ. వృక్షశాఖాగ్రమున నున్న పక్షిశిరము, దెల్ల
ముగఁ జూచితే మహీవల్లభుండ, యనిన
నిమ్మగఁ జూచితి. భార. ఆది. 5. 249.

వ. ...సూపకారుండు వధ్యస్థానంబునకుం జని
మనుష్యమాంసంబు దెచ్చి యిమ్మగా వండి
పెట్టిన. భార. ఆది. 7. 114. (ఇమ్మగా–
రుచ్యముగా.)

ఇమ్ము² వి. (క. ఇంబు.) 1. స్థానము, చోటు.

గీ. ...పనులకెల్ల,నిపుడు దగినయి మ్మెయ్యది
యిచట ననకుఁ,డు...హరి. పూ. 7. 182.

మ. ...కార్తవీర్యభుజపంక్తిం జక్కు గావించి
తం,బునిధిం గ్రొత్తగ నాశ్రమంబునకు
నిమ్ముంగొంటి వీ వమ్మునన్. పారి. 3. 34.

2 వైశాల్యము, విరివి.

ఇమ్ముచాలు–వైశాల్యమున సరిపడు.

ఆ. ... దశ,దిశలనడుమ నెఱయ దీటుగట్టి,
జగములెల్ల నిమ్ము సాలక మల్లడి,గొనియె
గుహాబలంబు కొలఁది మిగిలి. కు. సం.
11. 582.

చ. విను మిటు లున్న యీజనులవిప్పు గనుం
గొన వచ్చినం బురం,బున కిచ టిమ్ము చాల
దనుబుద్ధిజనించె గణించి చూడుమా. హరి.
ఉ. 2. 158.

3. ఆశ్రయము.

ఉ. ఇ మ్మనవద్యహృద్యసముదీర్ణగుణాళికి... ఓబళమంత్రిభార్యయౌ, నమ్మమ... పాండు. 1. 60.

గీ. అతులధైర్యంబునకు నీమహాత్ముఁ డిమ్ము. ఉ. రా. 5. 140.

4. ఇల్లు.

సీ. అనయమ్ము వెలయిమ్ములను ద్రిమ్మరుచు నుండు చలివెలుంగు ననుంగుచెలియ లెవరొ. నీలా. 1. 52.

గీ. తలుకు కపురంపుబరణి గందంపుఁగుడుక, చిన్నియడపంబు గతనంపుఁజిలుక పంజరమ్ములును గల యొక మిద్దెటిమ్మునందు. రసిక. 4. 4.

జ. ఇమ్ముకొను.

**ఇమ్ముకొను** అ. క్రి. (√ఇమ్ము²-క. ఇంబుగొళ్.) 1. కలుగు. 2. నివసించు, ఉండు.

సీ. కావున నవ్వీర్యకలితుఁ డాశత్రులయమ్మ నాకులవృత్తి నిమ్ముకొనఁగఁ. గీ. జేసె. రాఘవ. 2. 2.

(రామాయణార్థమున 'కలుగు' అనియు, భారతార్థమున 'ఉండు' అనియు అర్థములు.)

**ఇయ** (ప్రాచీనశాసనములందు నామాంతములవచ్చు 'అయ్య'శబ్దమునకుబదులుగా కన్పించుచున్నది.)
ఉదా: వెంటియ, దొడ్డియ, కాటియ, తిమియ. మొ. ద. శా. 977, 990, 995.

**ఇయత్** సం. విశ. (త్. ఈ. త్.) – తెనుఁగునఁ దఱచు సమాసపూర్వపదముగానే యుపయోగింపఁబడును–ఇంత పరిమితి గలది, ఇంత.
ఉదా: ఇయద్భాగ్యము–ఇంత భాగ్యము.

**ఇయత్త** సం. వి. ఆ. స్త్రీ. ఇంత (ఇన్ని) యను పరిమాణము, కొలఁది.

**ఇయత్త్వము** సం. వి. అ. న. – ఇయత్త.

**ఇయ్య¹** – ఈయ¹.
ఉదా: ఇయ్యఁగలఁడు, ఇయ్యఁడు, ఇయ్యక, ఇయ్యన్, మొ.

ఉ.... పనుఁగు నిచ్చి యంతటం, బియ్యక కయ్యమాడఁ దగునే నను నీగతి వేఁచఁబాడియే. శశిబిందుచరిత్రము.

క. ఇయ్యఁగ నిప్పింపం గల, యయ్యలకే కాక మీన మందల కేలా. కవిచౌ. 4. 18.

**ఇయ్య²** అవ్య. (త. ఇయ్యె.) అంగీకారమును దెలుపును.

మధ్యా. ఒనరం నామతునకు భార్యవగు మన్ననొడఁబడి యయ్య యనియె. భార. ఆది. 4. 141.

క. చక్కనగు మనిన రక్కసుఁ, డక్కజముగఁ బెరిఁగి యియ్య యగు నిప్పుడు నీ, యుక్కును వీరముఁ జూచెద. భార. ఆది. 6. 208.

జ. ఇయ్యకొను, ఇయ్యకొలుపు, ఇయ్యకోలు.

**ఇయ్యకొను – ఈయకొను.** స. క్రి. (√ఇయ్య²) అంగీకరించు, సమ్మతించు.

ఉ. ముందటియట్ల యింకఁ బదుమూఁడు దినంబుల మాత్రకుఁ భవన్మందిరవాస మియ్యకొనినం గడతేఱు మదీయవాంఛ.... భార. విరా. 3. 62.

క. అక్కడిబంధులఁ బంపుచు, నిక్కడిబాంధవుల సచ్చు టియ్యకొనుచు నిం, దెక్కడి పెంపొందెదను. భార. భీష్మ. 1. 184.

అ. క్రి. అంగీకరించు, సమ్మతించు

ఉ. ఈతనితోడికయ్యమున కియ్యకొనం దగదేమ.... భార. విరా. 5. 7.

ఆ. పొదుతు నెట్లుఁ బాండుపుత్రులతోఁగయ్య, మేను నీవు దీని కియ్యకొనుము. భార. శల్య. 1. 69.

చ. సమబలుతోడఁ జేయఁదగు సంధి బలాఢ్యునితోడ సంధియుఁ, సమరముగాదు హీనునెడ సంధికి నియ్యకొనంగఁ జెల్లదు. ఉ. రా. 3 877.

**ఇయ్యకొలుపు** స. క్రి. (√ఇయ్యకొను) అంగీకరింపఁజేయు, ఒప్పించు.

గీ. ....సముచిత మగుమాటలఁ జిక్కఁబడక, తక్కెనే మక్కువం దగుధార్తరాష్ట్రుఁ గ్రూరశరముల నే నియ్యకొలుపువాఁడ, నవని కౌంతేయులకు నిచ్చునట్లు గాఁగ. భార. ఉద్యో. 1. 27.

**ఇయ్యకోలు** వి. (√ఇయ్యకొను) ఇయ్యకొనుట, అంగీకారము; అనుమతి.

చ. పెనఁకువ నాక యేల మనపెద్దల కెవ్వరి కియ్యకోలు గాదు. భార. ఉద్యో. 2. 246.

ఉ. నాతలఁ పిచ్చగింపు మనినం బ్రభుఁ డించుక యియ్యకోలువడ. హరి. ఉ. 7. 282.

గీ. ఏమి సేయుదు నాధైర్యుని యియ్యకోలు, లేక పీ డెవ్వరికిఁ బొరరాక యునికి, యరసి వేఁగుచున్నాఁడ....ప్రభా. 4. 87.

**ఇయ్యకొది**—ఈయది.

**ఇయ్యన** — ఈయన.

క. అయ్యై కర్మంబులదెస,నెయ్యం బెసలారఁ గలిగి నియమనిరూఢుం,డియ్యన యన సుకృతంబుల,నయ్యేడు సౌఖ్యంబు నిహమునందుఁ బరమునడ. గీ. అనుభవించుచు .... భార. అను. 3. 306, 307.

**ఇర** సం. వి. ఆ. స్త్రీ. 1. భూమి. 2. వాక్కు. 3. మద్యము, కల్లు. 4. జలము.

**ఇరణము** సం. వి. అ. న. ఊషరభూమి, చౌటినేల.

**ఇరమ్మదము** సం. వి అ. పుం. వజ్రాగ్ని, మేఘము నందలి జ్యోతి.

**ఇరవగు** అ. క్రి. (√ఇరవు) నెలకొను, ఉండు.

మ. హరిణీలోచన కంటివే యెదుట నాయ్యారంబుగా సౌరభో,త్కరగుంజాతరుసీమఁ దెమ్మెరలరాక స్వీకనల్లాడు క్రొం,వ్విరి తీఁగం గని యొక్క రాచిలుక కివిడి బోటు లీడింప నం,దిరవై యుయ్యెల లూఁగుచున్న యది తాయిం దుమ్మెదల్ పాడఁగడ. విప్ర. 2. 62. నైష. 1. 52.

**ఇరవారు** అ. క్రి. (ఇరవు+ఆరు) స్థిరమగు, నిశ్చలమగు.

క. నరపతికి నాకుఁ బరిణయ, మిరవారఁగ నాఁడు చేసి తిప్పుడు దేశాం,తరమునఁ జిక్కిన నన్నును, వరునిం గూర్పంగ నీవ వచ్చితి కరుణడ. భా. రా. సుం. 294.

గీ. అప్పు డవలీల గోవర్ధనాద్రిఁ బెకికి,పూని యొకకేల నెత్తుడు దానిక్రింద, గోపగోపీ సహస్రంబు గోగణంబు, నుండి రిరవార మేడలోనున్నయట్లు. పద్మ. 9. 283. (ఇరవారఁ — నిర్భయముగా అనిభావము).

**ఇరవు** — ఇరువు[1]. వి. (ప్రా. ఇరిఅ = కుటి. క. ఇరవు. త. ఇరుప్పు.).

1. స్థానము; యుక్తస్థానము.

క. శిరమును నాభియు హృదయము,నురమును గర్ణములుఁ బార్శ్వయుగళము నాశ్మా, దరణీయస్థానము ల,యిర్యరవులఁ గను యోగి యాత్మ నిభపుగనాథా. భార.శాం. 5. 589.

క. ...ధా,త్రిదైవత సమ్మానము, నేదేశము నందుఁ గలుగు నిర వది నిలువన్. భార. శాం. 5. 455.

క. ఇర వటి ప్రాణంబులు వే, తిరుగుడువడఁ జొచ్చె నాదుదేహంబు గడుం, బగవళ మయ్యెడు...భా. రా. అర. 2. 367.

2. ఇల్లు; బస.

చ. ఇరవును తల్లిదండ్రులను నెత్తినపెంచిన వారిఁ బాసితిన్, దురమునఁ దండ్రి సైన్యపతిఁ ద్రోలితి సేనలతోడఁ గూడ... విక్ర. 6. 110.

క. అనవుడు మండూకేశుఁడు, విన మెన్నఁడు నంచ లేమివిధమునఁ గాకం,బునకు నిం విచ్చె నెవ్విధ,మున వానిం బిదపఁ గీడు పొందెం జెపుమా. కేయూర. 3. 38.

గీ. తెరువు నడచెడువారికి నిరవు చేసి, ధాన్యములు నెయ్యి నూనె వస్త్రములు లవణ, మాదిగాఁగల యాత్రాపదార్థ సమితిఁ, బాయ కెవ్వండు పెట్టు నాథక్తుఁడతఁడు. భీమ. 6. 52.

విశే. 1. స్థిరము.

సీ. ఎనమద్ల వీరన్న కిరవుగాఁ బ్రాకారమును భోగరాగంబు లనువుపఱచె,... మల్లనరనాథు చినబొమ్మమనుజవిభుఁడు. దా. శా. 4. 933.

2. అనుకూలము.

చ. ఇరువురు వాసుదేవులు మహిం గలరే యది మాన్పఁ గోరునా, కిర వగుకాల మిప్పగిది నింపెనలారఁగ నేఁగుదెంచె మ, ద్ధుర మగు మద్భుజావిభవధుర్యత లోకము మెచ్చఁ జేసెదన్. హరి. ఉ. 8. 108.

జ. ఇరవగు, ఇరవారు, ఇరవుకొను, ఇరవు కొలుపు, ఇరవుపడు, ఇరవొందు.

**ఇరవుకొను** అ. క్రి. (√ ఇరవు) 1. నివసించు, ఉండు.

క. పురిరాకొమరులకీర్త్యం, బరవాహిని భుజగపురికి బలువిడిఁ జని యం, దిరవుకొన నెడము చాలమి, మరలిన తెలిబుగ్గ లన నమరు సౌధంబుల్. పాండు. 1. 107.

క. పరమాణుతఁ గృశతం దగు, వరవర్ణినియుదర మవుడు వటపత్త్రశయుం, డిరవుకొనం దొలుతటిగతి, హరిపదబహుపాద్దళాభమై తగె నంతన్. చం. రా. 2. 47.

2. స్థిరపడు.

గీ. కలఁచి కబళించి కడువడి బలిమి మించి, గెలిచి యార్వీటి వేంకటశివుతిరుమ, లేంద్రు వంశమూఁపునను నిల్చి యిరవుకొనియె, రాజనుతు లొప్ప ధరణివరాహమూర్తి. రామ. 387.

3. కలుగు, పుట్టు

సీ మృగనేత్ర నేత్రలక్ష్మిని గణించినయంత నెడలోనఁ జాంచల్య మిరవుకొనియె. శశాం. 4, 52.

వ. అనుచు శుచిముఖ మెచ్చు నచ్చెరువు నిరవుకొన నతనిం జూచి యిట్లనియె. ప్రభా. 2. 57.

**ఇరవుకొలుపు** స. క్రి. (√ఇరవుకొను) ఇరవుకొనఁ జేయు.

క. కలికీ పలుకుంజిలుకల, కొలికీ నీకరుణ యిరవుకొలుపుము నాపై. రసిక. 6. 156.

సీ. తెరువులఁ గుక్కల నిరవుకొల్పవఁ జాలు నెఱలె యోదంబులై నిలుపఁగలవు. చంద్ర. 2. 13.

**ఇరవుపడు** — ఇరవుకొను. (చూ. ఇరవుపఱుచు.).

**ఇరవుపఱుచు** స. క్రి. (√ ఇరవుపడు) నిలుపు, స్థాపించు,

సీ. తనుఁ జూచి శిథిలబంధశిరోజ యగుట నయ్యతివకు ముక్తకేశాహ్వయంబు, దయచేసి తత్త్రాప్తి తము లైనవరముల నొసఁగి యప్పని గావుటసరబుద్ధి, చిఱుగుబ్బ లాని తత్క్షేత్రరాజమునకు నీశానుదిక్కున నింపు వఱిచె, వెన్నుఁడు... పాండు. 5. 157.

**ఇరవొందు** అ. క్రి. (ఇరవు + ఒందు) 1. కలుగు.

మ... యుష్మద్విక్రమప్రక్రమం, బనపాయంబు నపేతవిఘ్నమునునై యాఢ్యం బగుం గాత మెం, దును ధన్యం బగుఁగాత ధర్మ మిర వొందుంగాతఁ గల్యాణముల్. హరి. ఉ. 4. 99.

2. ఒప్పు.

గీ. హరిహరవిరించిముఖ దేవతానుభావ, ఘనతర స్వర్ణకారు లొక్కటియ కాఁగఁ, గరఁగి కూర్చిన యపరంజికడ్డి యనఁగ, సూర్యుఁ డిరవొందుఁ దేజోనివార్యుఁ డగుచు. నృసి. 1. 39. వసు. 1. 124.

(ఇట్లే 'ఇరవందు')

శా.... రండో బాలకులార చల్ది గుడువన్ రమ్యస్థలం బిక్కడి, దండన్ లేఁగలు నీరుద్రావి యిరవందం బచ్చికల్ మేయుచుం, దండంబై విహరించుచుండఁగ సమంద ప్రీతి భక్షింతమే. భాగ. 10. పూ. 493.

**ఇరాంబరము** సం. వి. అ. న. వడగల్లు.

**ఇరాచరము** సం. విశే. (అ. ఈ. అ.) 1. భూచరము. 2. జలచరము. వి. అ. న. వడగల్లు, కరక.

**ఇరాలు** — ఈరాలు (√ఇరు).

(అచ్చు పరం బగునపుడు ఈయొక్కచోటనే 'ఇరు' అను నాదేశము కనఁబడుచున్నది.)

ఉ. అనగనంబుత్రోవను దినాధిపుఁ డేఁగుచు దారి కడ్డమై, పూనిక నున్నకోటఁ గని పోవఁగ లేక యిరాలు మేనులం, దా వటు దిద్దు దూలి చనెఁ దథ్యము గాదని యంటిరేని యా, భానుని ద్వాదశాత్ముఁ డని పల్కఁగఁ గారణ మేమి నిచ్చలున్. రుక్మి. 1. 43.

**ఇరావంతుఁడు** సం. వి. ఈ. పుం. 1. రాజు. 2. అర్జునునకు ఉలూచియందుఁ బుట్టినకొడుకు.

**ఇరావతి** సం. వి. ఈ. స్త్రీ. 1. పంజాబునందలి యొక నది (రావి). 2. వటపత్త్రీవృక్షము.

**ఇరిణము** సం. విణ. (అ. అ. అ.) శూన్యము. వి. అ. న. ఊషరము, చౌటినేల.

**ఇరిమేదము** సం. వి. అ. పుం. అరిమేదము, వెలితుమ్మ (వృ. వి.)

**ఇరివిలి** వి. పోఁగరతోఁ జేయఁబడినరంధ్రము. (శ్రా)

**ఇరివిల్ల** సం. వి. ఆ. స్త్రీ. తలయందుఁ గలుగు వ్రణభేదము.

**ఇరివిల్లిక** సం — ఇరివిల్ల.

**ఇరు** వ — ఇను. (చూ. రెండు).

(హల్లు పర మగునపుడు 'రెండు' అనుదానికి వృత్తియందు వికల్పముగా వచ్చు ఆదేశము. 'ఇరుగురు'లోఁ దక్క విడిగా దీనికిఁ బ్రయోగము లేదు.)

జ. ఇక్కట్టు, ఇక్కన్ను, ఇద్దుగ, ఇద్దుము, మొ.

ఇరుకారు — రెండుకారులు.

(కారు—నాలుగేసిమాసముల కాలము)

భీమ. 1. 109.

ఇరుగాలు — రెండుకాళ్లు, పాదద్వయము.

వ. ఉరంబును మెడయు నిరుగాలం ద్రొక్కినఁ ద్రోచియు.... భార. సౌ. 1. 152.

ఇరుగెడ — రెండుప్రక్కలు. ఆము. 6. 125. వేం. మా. 1. 287.

ఇరుదెగలు—ఉభయపక్షములు. ఉ. రా. 2. 61.

ఇరుదెఱఁగు — రెండు విధములు. కవిజనా. సంజ్ఞా. 11.

ఇరుపక్కియలు — ఉభయపార్శ్వములు. భార. అర. 1. 306.

ఇరుపీనుఁగు — రెండు పీనుఁగులు. భార. భీష్మ. 2. 209.

ఇరుపుట్టి — రెండుపుట్లు. ద. కా. 4. 978.

ఇరుప్రొద్దు — రెండుపూఁటలు.

సీ. ఇరుప్రొద్దు గుడుచుచు వెడవెడఁ గుడువక యుండునాతండు సదోపవాసి. భార. శాం. 4. 368.

ఇరుబరులు — రెండుపార్శ్వములు, రెండు ప్రక్కలు.

(కిరాతార్జునులకథ)క. ఇరువురు నేసినబాణము, లిరుబరులును దాఁకి తిరిగె నిరుదెసలకు న,క్కిరి యిరుమొదములవట్టువ, తిరుపు గొనెదు క్రమముతో నతిత్వరితగతిన్. కా. 4. 181.

ఇరుమేయి, ఇరుమేలు — రెండుపార్శ్వములు. కు. సం. 10. 486. అప్ప. 4. 151.

ఇరుమేను — రెండు దేహములు.

క. హరుఁడు వినోదార్థముగా, నిరుమే నయి రణ మొనర్చె నింతియ కా కి,వ్వరుమున నక్కజమగుసం,గర మొనరింపంగ నొరులఁ గంటిమె యెందుఁ. భార. ద్రో. 5. 295.

ఇరువంక — 1. రెండుపక్షములు.

గీ. ఎదురుగా నేఁగుదెంచుచో నింట్రమయ్యెఁ, బెండ్లియిరువంక చుట్టంపుఁ బెద్దలకును. నై ష. 6. 84.

2. రెండుప్రక్కలు.

సీ. ఉరుచిత్ర కాగ్నిశిఖోన్మేష మిరువంక నిరువంకఁ గుండలిస్ఫురితకర్ణ.ము. వసు. 1.6.

ఇరువ(ప)ఱియ — రెండు పఱియలు. భార. కర్ణ. 1. 93, సౌ. 1. 191.

ఇరువాఁగు(లు) — 1. ఉభయపక్షములు. హ. 6. 110.

2. ఉభయసైన్యములు. భార. విరా. 3.198.

ఇరువాయ — రెండుపాయలు.

ఉ...ఇరువాయగా ముడికిఁ దార్చినవెంట్రుకల న్మిషంబునఁ. నై ష. 1. 51.

ఇరువైపు — ఇరువంక. వరాహ. 11. 106.

ఇర్మేలు — ఉభయపార్శ్వములు.

శా.... తెలిదీవిం బోల్చు పెన్బ్రోలు ని,ర్మేలం బాయనివేల్పుచాలుఁ గలసామిన్ వెన్నునిం గొల్చెదన్. చంద్ర. 5 58.

ఇరుగన్ను వి. బొ. రెండు నేత్రములు.

చ.... ఇరుగంట నిప్పుకల్, చిటచిట రాల... రా. వి. 5. 17.

**ఇరుఁబుట్టువు** వి. (√ఇరు) — రెండు పుట్టువులు కలది—1. పక్షి. 2. బ్రాహ్మణుఁడు.

సీ. తేజునఁ బడగ లెత్తియు నిరుఁబుట్టువు గోరలఁ గన్గొని మూలఁ దూఱుకొనుచు. అచ్చ. రా. బాల. 106. (రెండర్థములకు నిదే యుదాహరణము).

**ఇరుగడ(లు)** వి. (√ఇరు) రెండుప్రక్కలు. భార. విరా. 5. 204. యయా. 2. 8.

**ఇరుగాలిపసి** వి. (ఇరు+కాలు+పసి) ద్విపాత్పశువు, రెండు కాళ్లు గల పశువు.
ద్వి. మిమ్మిరుగాలిపసుల...బస. పు. 6. 575. (ఇరుగాలిపసులఁ – పశుప్రాయులను)

**ఇరుగు** – ఇరువు¹. విశే. ప్రక్కనున్నది. (చూ. ఇరువు¹) వి. ప్రక్క, సామీప్యము.
ద్వి. ఇరుగింటిలోఁ బని యెఱుఁగ వేమియును, బొరుగింటిపనిఁ దీర్పఁబోయెదు కంస. అ. మ. క. 2 118 పా. 11 పం.

**ఇరుగుడు** – ఇరువుడు. వి. (క. ఇరుగండి.) శింశుప (వృ. వి.) ఆం. భా. 2. 49. అచ్చ. రా. సుం. 31.

**ఇరుగురు** – ఇరువురు.

**ఇరుగేలు** వి. బ. (ఇరు+కేలు) రెండుచేతులు.
సీ. తనయిచ్చఁ బగవానిదర్పమంతయుఁ బుచ్చి యిరుగేలితోఁ ప్రాణ మిచ్చి కాచె. పాం. ఉ. 8. 280.

**ఇరుచే(సే)యి** వి. బ. (√ఇరు) రెండుచేతులు.
సీ. ఇరుచేయి నెత్తి...భార. మౌ. 151.
(ఇరుచేయిఁ – ఇరుచేయియును.)
గీ. శిరముగోఁకంగఁదగ దిరుసేత...భార. అను. 4. 102.

**ఇరుచేఁబడు** అ. క్రి. కుదియఁబడు.
ఉ...తల యల్లనఁ గాళ్ళకు వందియందిలోఁ చక్కికి నొక్కి నొక్కి యిరుచంబడ గుమ్మడి మూటగట్టి పీ, పెక్కి దువాళిచేసి చలి యిక్కడ నక్కడఁ బెట్టు వేకువన్. క్రీడా. 45.

**ఇరుచౌవంచె** వ. (√ఇరు) – రెండు అయిదులు – పది. అచ్చ. రా. యు. 17.

**ఇరుదలప్రగుడ్డుకానుపు** వి. (√ఇరు)– రెండు తలలు గలపక్షి–గండభేరుండము. అచ్చ. రా. అర. 4. (ఇట్లే. ఇరుదలపులుఁగు.)

**ఇరుదలపాము** వి – రెండు తలలు గలపాము – డుండుభము. (శ. ర.).

**ఇరునూఱు** వ. (√ఇరు - క. ఇన్నూఱు. త. ఇరునూఱు.) రెండువందలు.
ఉ. నూఱు మదావళంబు లిరునూఱు హయల్...ఉ. రా 7. 46.

**ఇరుపర్వునేల** వి. (√ఇరు) రెండుకోసుల దూరము. ఆం. భా 2. 9.

**ఇరుమూఁడు** వి. బ. (√ఇరు) ఆఱు.
క. ఇరుమూఁడు రుచుల...మనుచ. 5. 16.

**ఇరుల(లు)గొంగ** వి. (√ఇరులు) – చీఁకటికి విరోధి – 1. సూర్యుఁడు.
సీ. ఇరులగొంగ తమ్మివిరిబోఁడివగకాఁడు ... నీలా. 3. 45.
2. చంద్రుఁడు. 3. అగ్ని.

**ఇరుల(లు)దాయ** – ఇరులగొంగ. నైష. 8. 201.

**ఇరులు** – ఇర్లు. వి. ఏ. (క. త. ఇరుళ్.) 1. అంధకారము, చీఁకటి.
సీ. ఇరులున నొంటిఁ బోఁ బరసతి నెట్టుట యది తన్ను నంటుట కానపడుట ...విజ్ఞా. ప్రా. 105.
గీ. ఇరులు గెలిచిన యంతఃపురెండుముఖుల, కురులు మరుఁ డనువేఁటకాఁ డురులు సేసి. నైష. 3. 90,
క. విరితేనె మేపరులకుఁ, పారినీలపుసిరుల కిరుల కజ్జాళికురుల్, గురులై ...చం. రా. 3. 74.
వ. పృథువనంబులలోఁ దరలనియిరులకిం వగు తోరంపుటిరంపుగుంపుల. ఉ. రా. 3.191.
2. నలుపు.
గీ. మృగమదము మించుతములంపుటిరుల మోవి, దళముగా...ఆము. 4. 185.
(పై మూఁడు ప్రయోగములఁ బట్టి నిత్యబహువచనాంతముగాఁ గూడఁ గన్పట్టుచున్నది.)
ఇ. ఇరులగొంగ, ఇరులదాయ, ఇరులుకొను, ఇర్లగొంగ, ఇర్లు.

**ఇరులుకొను** అ. క్రి. (ఇరులు+కొను) చీఁకటులు గ్రమ్ము.
సీ. పార్శ్వభూమి నభీరుభటకదంబకరాళహేతిచ్ఛటాచ్ఛాయ లిరులుకొనఁగ, సామంత

మండనోద్దామమాణిక్యాంశుమండలంబోలసి
యీరెండ గాయ. మనుచ. 1. 12.

సీ. శైత్యపాండిమలు తుషారాంతమునఁ జేరె
నిరులుకొనఁ ద్రాక్షపందిరులవిరుల. ఆము.
5. 189.

(ఇరులుకొను అనఁగా 'సాంద్రముగా నల్లుకొను' అని భావము.)

**ఇరువది** — ఇరువయి, ఇరువై, ఇర్వది. స. (ఇరు+వది) రెండుపదులు.

క. ఇరువదిచేతుల శంభుని, పరిపూజనసేయుచుండి...ఉ. రా. 8. 208.

**ఇరువయి** స. (√ఇరు) ఇరువది.

ఉదా: ఇరువయిపుట్ల వెలిసేను. ద. శా. 4. 661.

**ఇరువాఁడికైదువు** వి. (ఇరు) రెండువైపులను వాఁడి గలఆయుధము. చంద్రి. 4. 107.

**ఇరువాయికట్టు** వి (√ఇరు) మలమూత్ర బంధరోగము. (చి. ని.).

**ఇరువు**[1] — ఇరుగు. విశే. ప్రక్కనున్నవాఁడు.

మ. సరిసామంతుఁడు శ్రీకుమారవనికాచాళుక్య
భీమేశ్వరేశ్వరదేవుం డుపకంఠబాంధవుఁడు
శ్రీసంవేద్యరామైకవిభుం డిరువుం బొ
ర్వను బల్వలేశుఁడు మృకండేశుండుగా
నేలె ని,ద్ధరణీమండలి భీమనాథుఁడు ....
భీమ. 5. 89.

వి. ప్రక్క.

క. అని నియతి చేయుటయు న,మ్ముని పలుకులు
కన్యకాసమూహం బెల్లఁ,విని య ట్లిరు
వులఁ జేరక, చన నం దొక్కర్తు విధివశం
బున వినమిఁ. నిర్వ. 2. 20. (శ. ర. పా-
ఆయిరువునఁ జేరక-ముద్రి).

**ఇరవు**[2] — ఇరంవు. వి. స్థానము.

రగడ. మావులు దగుమరుమావుల కిరువులు,
కావులకును గడుకావులవిరువులు. యయా.
4. 26.

సీ.... నెఱనీటు కిరువు పన్నీటిచెలువు. శశాం.
4. 50.

**ఇరువుడు** — ఇరుగుడు. వి. శింశుప (వృ. వి.)

**ఇరువు(ర్వు)రు** — ఇరుగురు స. బ. (రెండు అనుదానికి మహన్మహత్యర్థక బహువచనరూపము. ఇద్దఱు. భార. ఆది. 2. 10. ఉ. రా. 2. 160

**ఇరువుస** — ఇరుస. దా. శా. 1015.

**ఇరువై** — ఇరువది.

మ. ఇరువై నాలుగుమూళ్ల (?) నేం ... కాశీ
1. 58.

క. ఈయెనిమిది భేదంబులఁ, బ్రేయసులు
పదార్వురుం బ్రభిన్నాత్మికలై, యాయ
తగతి నిల నూటిరు, వై యెనిమిది భేదము
లను వఱలుదు రెలమిన్. నంస. 2. 50.

**ఇరుస** వి. (√ఇరు) రెండుకుంచముల పరిమితిగల మానవిశేషము, అందూము.

సీ. ఇరుసవడ్లను బోసి యెడ నెంపి. దశకు.
10. 105.

ద్వి. ఎట్టకేలకు బియ్య మిరుస గల్గినను బస.
పు. 4. 900 పం.

గీ. ప్రస్థయుగ్మాఖ్య యిరుస నాఁ బలుకఁ
బడును, జనును ముక్కుస నాఁగఁ బ్రస్థత్ర
యంబు. ఆం. భా. [illegible]70.

**ఇరుసత** స. (ఇరు+సత) పదునాలుగు.

గీ. ఎపుడు నిరుసతజగముల నెదురు లేక, మిక్కు
టంబైన తేజున మెఱయుచున్న. అచ్చ.
రా. సుం. 57.

**ఇరుసు** వి. (క. ఇరసు. త. ఇరుసు) బండియొక్క అక్షము. కు. సం. 4. 489.

**ఇరుసె(చె)వి** వి. (√ఇరు) రెండవచెవి; రెండవ మనుష్యుఁడు.

క. ఇరుసెవి యెఱుఁగక యుండం, దరుణీ సుఖ
మనుభవింపఁ దలఁచినఁ బదివే,వుఁ గన్ను
లెదుటఁ బడితిని, సరిపా రెల్లిదముచేయ
జాణెత నయితిన్. ఉ. హరి. 5. 197.

గీ. ఒంటి నేతెంచి మంతనం బుండి నిలిచి, చక్ర
ధరుతోడ హితకార్యచర్చ చేసి, యేఁగె
దేవేంద్రుఁ డిరుచెవి యెఱుఁగకుండ, సిద్ధ
సంకల్పుఁడై యాత్మశిబిరమునకు. భీమ.
4. 50.

**ఇర్గళ(ల)** సం. వి. అ. స్త్రీ - ఇర్గళము.

**ఇర్గళము** సం. వి. అ. న. అర్గళము, తలుపుగడియ.

**ఇర్వలము, ఇరువలము** వి. (ఇరు+పలము) రెండు పలములు. ఆం. భా. 2. 269. దా. శా. 4. 1291.

**ఇర్ల(ర్లు)గొంగ** — ఇరులగొంగ. అచ్చ. రా. యు. 19. (ఇళ్లే. ఇర్ల వేఁటకాఁడు. మొ. అచ్చ. రా. అయో. 42.)

**ఇర్లు** — ఇరులు.

(చీఁకటి).

వసు. 6. 4.

ఇర్లుగొను — చీఁకట్లుగ్రమ్ము. కు. సం.3.261.

**ఇర్వది** — ఇరువది.

గీ. ...ఇర్వదేనేండ్లనిన్నుఁ దలఁచి. కాశీ. 4. 91.

**ఇర్వారువు** సం. వి. ఉ. పుం. స్త్రీ. ఉర్వారుకము, దోస (వృ. వి.) (వై. ని.).

**ఇర్వురు** — ఇరువురు. దశా. 2. 430.

**ఇఱి**[1] *విశే.* (√ఇఱియు)-ఇది వృత్తియందే కనఁబడుచున్నది-1. ఇఱుకైనది, సందులేనిది.

ఉ. ఆరథికోత్తముం డధికహర్షముఁ బొందుచు నమ్మహీశ్వరుఁ, గాఁవ మొప్ప గ్రుచ్చి యిఱి కౌఁగిట జేర్చి ... భార. శల్య. 2. 416.

గీ కన్నియలమిన్న యిఱిగుబ్బచన్నుఁగవకు. రసిక. 3. 65.

2. సన్నమైనది.

సీ. హరిణాక్షియిఱిగౌను హరికైనఁ బల్లవాధర యూరులు సరసతరులకైనఁ. గీ. బట్టి వర్ణింప నలవిగాదు.. అచలా. 2. 58.

**ఇఱి**[2] — ఇఱ్ఱి. (ఐ. ఇర్లు—చూ. ఇఱ్ఱి.)

ఆ. ఆత్మజవము వచ్చి హరిణంబు డిగి భీతిఁ, బాఱఁ గాళ్లు రాక పవనుఁ డమర, లెగిచి కూడముట్ట రెకిరింత యిఱిపోరి, గఱికఁ దిగిచి నోరఁ గఱచుకొనియె. కవిక.2.120.

**ఇఱించు** స. క్రి. (√ఇఱియు) — ఇఱియించు.

చ. అనవుడుఁ గృష్ణుఁ జూచి యనిలాత్మజుఁ డబ్బలుఁ బట్టి త్రిప్పి గ్రక్కున ధర వైచి త్రొక్కి కడకాలొకకేల నిఱించి యెత్తి వేచె నకఁగ నీక మున్ను జరిచే నదుకైన శరీర మంతయుఁ, బనుపడ రెండుగ్రవయ్యలుగఁ బాపి రవుం బరిమార్చి యార్చుచున్. పద్మ. ఉ. 10. 221.

చ. తొలఁగక శౌరి యగ్రజముతుండము కేల నిఱించి పట్టినఁ. పద్మ. ఉ. 9. 311. (చి. ని. పా. మలంచిపట్టినన్. అని. ముద్రి).

**ఇఱికి** వి. బాలక్రీడావిశేషము. (శ. ర.).

**ఇఱికించు** స. క్రి. (√ఇఱుకు) ఇఱుకఁజేయు.

గీ. కఱకుటంగ్రముల నిఱికించి గజ్జెగదల. మనుచ. 4. 58. ఆము. 4. 46.

(వ్యవ) ఆమాటనడుమ నిఱికించి వ్రాసినాఁడు.

**ఇఱియించు** — ఇఱించు. స. క్రి. (√ ఇఱియు) ఇఱియఁజేయు.

(క) బిగియించు.

గీ. హస్త మిఱియించి పట్టినయపుడు కదిసి, యంగుళులు రంధ్రహీనంబు లయ్యె నేని, యతనిఁ గల్యాణ లక్షణాన్వితునిఁగాఁగఁ, జెప్పు సాముద్రికజ్ఞానసిద్ధబుద్ధి. కాశీ.4 32.

(చ) బిగించిపట్టు.

సీ. అద్దంబుపిడి ముట్ట వలయుపాణితలంబు లస్త్రకం బిఱియించు లావుకలిమి. ఉ. హరి. 1. 161.

వ. ఇఱియించినయోష్ఠాధరంబులు ముమ్మాఱు న్నాశియించి. కాశీ. 5. 201.

(ట) బిగించికట్టు.

క. అని కరుణ పుట్ట వేఁడిన విని యొకబలు తీవ బగ్గవిడిచిన నావృద్ధును నద్దెస మొల నిఱియించిన వెంవును లావు మెఱయఁ జేఁదిరి వెడలఁ. దశకు. 11. 77.

**ఇఱియు** అ. క్రి. 1. బిగియు.

సీ.... అబ్జాక్షిని వగచుచు నాతని నెత్తి కౌఁగిట నిఱియఁ జేర్చి. భాగ. అశ్వ.2.84.

సీ. దాకతీవను బూవుదండ చేరిచి మెడ యిఱి యంగ నురి బిగియించుదాన. రసిక. 4. 86.

క. నిఱుపేదయింటి కేటికిఁ, బఱతెంచు నిధాన మట్లు పఱతెంచెనయే, నిఱుపేదయభాగ్యతఁ

దలు,పిఱియఁగ నిడుఁ గాక చొరఁగ
నిచ్చునె దానిన్. నై. ష. 4. 73.

2. దట్టమగు.

ద్వి. మెఱుఁగుఁ గైదువుల క్రొమ్మెఱుఁగులు
దిశల, నిఱిసినచీకట్ల నెడలంగ జడియ.
ద్వి. హరిశ్చ. ఉ. 2317.

ద్వి. ఆకులతఱుచున నంటి పెల్లిఱియు,చీఁకటి
మేన నిల్పినవల్పు గాఁగ. ద్వి. హరిశ్చ.
పూ. 1997.

స. క్రి. ఇఱియునట్లుచేయు, అంటసిల్లఁజేయు.

చ...కిరణంపుఁగొన ల్గొని మోము మోముతో,
నిఱియుచుఁ జేర్చి ప్రేయసుల కిచ్చుచు
నాడె దివిం జకోరముల్. పి. శకుం. 3.
159.

జ: ఇఱి¹, ఇఱించు, ఇఱియించు.

**ఇఱుకటము** – ఇఱుకు వి. (√ఇఱుకు) 1. సంబా
ధము, ఇఱుకుచోటు.

క. తఱ చగు పెనుసందడిలో, నిఱుకటమునఁ
బడ్డ నృపతి...నై. ష. 40. 124

వ ఇవ్విధంబున వరదంబులయిఱుకటంబు గడచి
యెడ గలుక నిలిచి. భార. విరా. 5.213.
(ఇఱకటము అని ముద్రితము).

శ్లో. తస్థౌ విముక్తో రథబృందమధ్యాత్. సం.
భార. విరా. 67. 27.

వ. ఈరథబృందంబుల యిఱుకటంబు వెడలి
నిలుతమని కదలిన...భార. విరా. 5. 211.
(చి.ని. పా–ఇఱకటము. ముద్రి.

2. ఇక్కట్టు, చిక్కు, బాధ.

ద్వి. క్రూరాత్మ మద్ఘనఘోరశాపాగ్ని, నీ
రాష్ట్రమును నిన్ను నీఱు గావింతుఁ,
గాదేని యీ యిఱుకటములు మాని,
లేదు బొంకితి నని లెమ్ము...ద్వి. హరిశ్చ.
పూ. 1414. (ఇఱకటము. ముద్రి.)

విశే. ఇఱుకైనది.

గీ. ఎత్తినప్పుడు విడియుచో నిఱుకటంపుఁ,
దెరువునందు నడపు సెడి తిరుగఁబడిన, యట్టి
యెడ నిద్రవోయెడునవసరమున, శాత్ర
వుల బెట్టు పైఁబడి చంపవలయు. భార.
శాం. 1. 25.

(ఇఱకటము. ముద్రి.)

**ఇఱుకాటము** – ఇఱుకటము (√ఇఱుకు)–శ.ర.

**ఇఱుకు** స.క్రి. (క. ఇఱకు, ఇఱకు. త. ఇఱుక్కు.)

1. ఇముడ్చు.

క. చఱచి యొక చేతఁ గూర్మముఁ, బెఱచేత
గజంబుఁ బట్టి పెనఁచి ఖగేంద్రుం, డిఱికి
కొని గగనవీథిన్, బఱచె వియచ్చర
విమానపంక్తులు దూలన్. భార. ఆది.
2. 69.

2. రెంటిసందున నొక్కి పట్టు, బిగియఁబట్టు.

ఆ. గరుడినడుము మెడయుఁ గాలును గేలును,
నిఱికికొనుచుఁ జక్రి వెఱచి పఱచె. కు. సం.
2. 204.

క. నెరవునఁ ద త్తనువుం దన, చరణంబులనిఱికి
యెత్తి చా వుడిపి... భార. కర్ణ. 2. 80.

చ. ఇరువురఁ జంకలం దిఱికి యే పెసలాఁగ
బాహుపీడన,స్ఫురణ నొగిల్చి పెల్చఁ దెగఁ
జూచి జలంబులలోన వైచినన్...హరి,పూ.
5.26.

అ. క్రి. 1. ఇముడు, అణఁగు.

గీ. ప్రాఁకి యమ్మోటి యిరుగుడు మ్రాఁకు
చివురు, జొంపములలోన నిఱికి యజ్ఞోటి
సారె, సారెకును రామ రామ యన్వేరు
నుడువ, నొనర నాలించి సీతయంచును
దలంచి. అచ్చ. రా. సుం. 31.

సీ. అంగుష్ఠమున నిల్చినా కిరీటము తాఁకి పట
పట బ్రహ్మాండభాండ మదరు, నట్టె చేతులు
చాఁచెనా పూర్వపశ్చిమచంద్రదినేంద్రులుం
జంక నిఱుకు. దశా. 3. 171. (ఇట మహా
ద్బహువచనాంతకర్తకు ఏకవచన క్రియ
యుపయోగింపఁబడెను.)

2. రెంటినందునఁ జిక్కి అదుముడువడు.

గీ. తలలు దఱిగి పూజించినదర్పలీల, వెసఁగు
వీరుఁడు నీశైల మెత్తఁబోయి, బాహు
లిఱుకంగఁదాల్మిని బాసి కూసె. హరి. ఉ.
6. 9.

క. బిగు వెడలి సీల యూడిన, వగచరుబీజంబు
లిఱుక నా వొప్పిఁ గడున్, వెగ డొంది

మొఱలు వెట్టుచుఁ, దెగియెన్ మర్కటము దానిత్రిమ్మరిట వింటే. నా. పంచ. 1. 92.

వి. సంకుచితస్థలము, ఇఱుకుచోటు.

సీ... పాతాళభవనకోటి, కెల్లను గ్రిందైన యిఱుకున నున్న మీతండ్రి విరోచన తనయుఁ డెలమి... హరి. ఉ. 7. 30.

విశే. సంకుచితము, విశాలము గానిది.

(వ్యవ) ఆయిల్లు మిక్కిలి యిఱుకుగా నున్నది.

జ: ఇఱికించు, ఇఱుకటము, ఇఱుకాటము, ఇఱుకుడు, ఇఱుకుమెడ, ఇఱుకుమ్రాను.

**ఇఱుకుడు** విశే. (√ఇఱుకు) బాధకము.

మ. కుపితానంగశరాగ్ని దాహమున నాక్షోణీవిభుం డెంతయున్, దపియింపన్ వెసనుగ్రభానురుచు లుద్గారించుచున్ జంద్రికా, తపమున్ ముంచినఁ గ్రిందుమీఁ దిఱుకుడై దాపంబు రెట్టింప నే, యుపచారంబున మానదొక్క యిది యం చూహించి చిత్తంబునన్. పి శకుం. 3. 162.

**ఇఱుకుమెడ** వి. (√ఇఱుకు) మిక్కిలి కుఱుచ మెడ. (చి.ని.)

**ఇఱుకుమ్రాను** వి. (√ఇఱుకు) ఆవరణములోపలికి మనుష్యుఁడు మాత్రము వెళ్లుటకు వీలుగాను పశువులు పోకుండునట్లుగాను పాఁతినపంగల కొయ్య. (బ్రౌ.)

**ఇఱుము** వి. (శ. ఇఱుంబు.) మూల, మఱుఁగుచోటు.

క. తనకడుపున నొకయిఱుమునఁ, గొనకొని జగములను నిముడుకొను పెనుముదుకండు.... భాగ. 8. 496. (చి.ని.పా- ఇరువున. అనిముద్రి.)

వ.... ఎడ లిఱుములు సందులు రంధ్రంబులు లేకుండ నిండి. భాగ. 8. 824, 10 పూ. 1627.

జ. ఇఱుముకొను.

**ఇఱుముకొను** అ. క్రి. (√ఇఱుము) మఱుఁగుపడు.

చ. ఇఱుముకొనం దొడంగె దెస లేచినచీఁకటి వంచుఁ జేతులం, గొఱవులు పట్టిక్రుమ్మరుచు.... భా. రా. యు. 1080.

**ఇఱ్ఱి** వి. (బ. ఇఱ్ఱులు, ఇర్లు) మగజింక, హరిణము.

క. మనసిజరాగంబునఁ బెనఁగినయిఱ్ఱిని లేడిఁ జూచి కృతహాస్తుఁడు పెల్చన యేవమ్ముల నాఱెంటిని ద్రెళ్లఁగ నేసెఁ గడుఁ గఠిన హృదయుండై. భార. ఆది. 5. 49.

చ.... ఋక్షసంఘముల తేజము దూలిచెఁ బుండరీకమం, డలిఁ దెగటార్చె నిర్లదటడంచె నహో కరిచాతురీగతుల్, విలసిల రాజు నైజగుణవిక్రమచాతురి.... సారంగ. 1. 101. (చంద్రపక్షమున 'చీఁకటు' లని అర్థము.)

జ. ఇఱ్ఱిగోఱజము. ఇఱ్ఱిపోతు.

**ఇఱ్ఱింకుఁజూపు** వి. (√ఇఱ్ఱింకులు) అఁగంటిచూపు. క్రేఁగంటి చూపు. కవిక. 3. 226.

**ఇఱ్ఱింకులింకు** అ. క్రి. (√ఇఱ్ఱింకులు. శ. ఇఱుంకు.)

1. మిక్కిలికుషిక్కుచు; కుంగిచు.

సీ. ఇఱ్ఱింకులింకి బీడెండఁ బెన్ బీఁటికల్ గాతంబులై తటాకములు బలసె. శ్రీరం. మా. 4. 62.

సీ.... భామవారంపు వీఁథద్ర పల్లెఁ మిడుగృహ దైవతంబు లిఱ్ఱింకులింక ఆము. 4. 43. (ఇఱ్ఱింకులింక. ఆము. 4. 43. (ఇఱ్ఱింకులింకు - పస్తుచేఁ గృశించు.)

2. క్రుంగఁబడు.

సీ. ఎవ్వాఁడు వింధ్యాద్రి నిఱ్ఱింకులింకించె గంభీరహుంకారగర్జనమున. భీమ. 2. 77

**ఇఱ్ఱింకులు** వి. బ. (ఇంకులు + ఇంకులు) మిక్కిలి యింకుటలు. (చూ. ఇఱ్ఱింకులింకు, మొ.)

జ. ఇఱ్ఱింకుఁజూపు, ఇఱ్ఱింకులింకు, ఇఱ్ఱింకులు చేయు.

**ఇఱ్ఱింకులుచేయు** స. క్రి. (√ఇఱ్ఱింకులు) అడఁచు.

ఉ. మంకెనపువ్వుమీఁదియళిమాడ్కి వృపాధర పల్లవోదరా, లంకృతి యైనదంతపదలాంఛనముం గని కన్నుఁగోనలం, దంకురితంబులైన దరహాసలవంబులు పద్మనేత్రయిఱ్ఱింకులు చేసెఁ బత్మములయీఱమిఁ గాటుకచిమ్మచీఁకటిన్. నైష. 7. 198.

**ఇఱ్ఱిగోఱజము** వి. (ఇఱ్ఱి) మృగమదము, కస్తూరి.

గీ. ఒక్కయొఱుకుజేఁడు నక్కకొమ్ముగను నిఱ్ఱి, గోఱజంబు జున్నుఁ జాఱపప్పుఁ, బిలి

గఱుల యంపకోలలు సెలవిండ్లుఁ, గాను కిచ్చి కరయుగంబు మొగిచి. మనుచ. 4. 14.

**ఇఱ్ఱిపోతు** — ఇఱ్ఱి. మనుచ. 4.22.

**ఇఱ్ఱియ** వి. పార్శ్వము, ప్రక్క. (చి.వి.)

**ఇల** వి. (సం. ఇలా) భూమి. సాం. ని. 62.

ఇలతాల్పు - భూధరము, పర్వతము. సాం.ని. 53.

ఇలవేల్పు - భూసురుఁడు, బ్రాహ్మణుఁడు. నిరం. 4. 31.

**ఇల** నం - ఇడ.

**ఇలకఱచు** - ఈలకఱచు. అ.క్రి. మీఁదిపండ్లు. క్రింది పండ్లతోఁ గదియ బిగించు.

గీ. కడిఁదివిలు చేఁది గుఱి కిలకఱచి నిలువు, మరునికువలయశరముకంపములఁ బోలు... నలజ్జ దృగ్విభ్రమములు. అము. 5. 13. (శ. ర. పా.).

స. క్రి. బిగఁబిట్టు.

ఆ. అట్టు దూల నేయ నాతండు మన సిల,కఱచి ధైర్య మూఁత గాఁగ నిలిచి. భా. రా. యు. 702.

**ఇలకోడి** వి. (త. ఇల్కోళి, నిలకోళి.) ఝిల్లిక, ఈలపురుగు, చిమ్మట.

**ఇలటము** — ఇల్లటము.

ద్వి... వెల్మఁ దొక్కఁ,దధముఁడై చిరకాల మతివ నర్థించి, యిలట ముండఁగఁ గూఁతు లేద్వర మొఱఁగి, పిలిపించి యొరులకుఁ దెండిండ్లు నేయ...పండితా. పురా. 98పా.

**ఇలబిల** నం. వి. అ. స్త్రీ. విశ్రవసుని భార్య,కుబేరుని తల్లి.

**ఇలాయి(యీ)** వి. చుట్టవత్తులు వేసెడు దివ్వటి.

మ. తగ సూర్యప్రభ లాయిలాయులును జంద్ర జ్యోతులుఁ...హంస. 3. 28.

మ. ఇట్టటై కరదీపికాతతు లిలాయీలుఁ... రంగా. 3. 145.

**ఇలారము** — ఇలువారము. (శ. ర.).

**ఇలి** వి. ఎంగిలి మెతుకు.

గీ. పాముసకు బలి వెట్టని ప్రతినవారు, ఈఁగ కెన్నఁడునే నిలి యిడనివారు. నైష. 7.55.

(వ్యవ) వానియింటిలో ఇలభిక్షము బలిభిక్షము పుట్టదు.

**ఇలి** నం. వి. ఈ. స్త్రీ. కరవాలము, కటారం.

**ఇలింద** — ఇలివెంద. వి. ఇంద్రవల్లి (వ్య. వి.). (ప్రా.)

**ఇలిక** నం. వి. అ. స్త్రీ. భూమి.

**ఇలివెంద** — ఇలింద.

**ఇలు** — ఇల్లు¹. (చూ.)

(గృహము)

క. ఇలు వెలువరించి...భార. ఆది. 6. 180.

క. లక్కయిలు గాలినది మొద,లక్కట మాతల్లి ....భార. ఉద్యో. 3. 186.

సీ....లక్కయి ల్గాలిచి....భార.ఉద్యో. 3.366.

(గృహకృత్యము)

ఉ....సఖులై తలిదండ్రులు గూడి దేవియుం, దేవరవోలె నుండి యిలు దీర్పఁగఁ గాఁపురం మొప్పవానికిఁ. మనుచ. 1. 53.

**ఇలుకరించు** స. క్రి. ఇగిలించు, తెఱచు.

క. భూకాంత నీరువట్టుకుఁ, గాక వదన మిలు కరింపఁ గాన్పించినపం,క్తో కాకన వెలి పుచ్చలు, లోకములోఁ గాచె నిట్లు లోఁబడె జనముల్. వరాహ. 10. 30. (ప్రయోగాంతరము కనఁబడ లేదు.

**ఇలుకు(ల్కు)** అ. క్రి. బెణఁకు.

సీ. గోరక్షణమునకై గోవర్ధనమహీధ్ర మెత్తిన నాఁ డెంత యిల్కెనొక్కొ.... గీ... అని తొంటినొప్పి దీఱ, నట్టివలచేయి గట్టిగాఁ బట్టి పట్టి. బహు. 3. 29.

వి. (క. ఇలుకు.) బెణఁకు తొలఁగుడు.

ఉదా: ఇలుకునొప్పి — బెణఁకువలనినొప్పి.

(వ్యవ) వాచేయి యిలుకు పట్టినది.

**ఇలుగు** — నిలుగు.

(చచ్చు)

క. బలవిక్రమఘను లగుదొఁ, లిలిగిన మననేన మేదినీశ్వర విను క,న్నులు సెడినట్లున్నది.... భార. శల్య. 1. 51.

చ. అలఘుఁడు వాలి రామవసుధాధిపుఘోర శిలీముఖంబుచే, నిలిగిన వేఁడిమూట విని యెంతయు నుల్లము జల్లనంగఁ గొంచల వడి తార.... భా. రా. కిష్కిం. 266.

**ఇలుపట్టు** – ఇంటిపట్టు. (√ఇల్లు¹) వి. నివేశన స్థలము ఇల్లు కట్టుకొనుట కుపయోగించునట్టి ప్రదేశము.

క. అమ్మామెయిన నధిశరఁగలు, గ్రమ్మన నెడ గలుగఁ ద్రోచి కాదే యిలుపట్టిమ్ముగఁ బడసితి వీన,హ్యామ్మునఁ బశ్చిమధరిత్రి యపరాంతమునన్. హరి. ఉ. 1. 86.దా. భా. 4. 1080, 1082, 1148.

**ఇలుఱేఁడు** వి. (√ఇల్లు¹-త. ఇల్లఱన్.) ఇంటియజమాన్నుఁడు, గృహి.

వ. అంతఁ దెల్ల వాఱుటయు నయ్యిలుఱేఁ డెల్ల కొమరులఁ బిలిపించి....నీలా. 3. 56.

(ఇల్లే ఇలుదొర మొ. ఆం. భా. 2. 176.)

**ఇలువ(ల్వ)డి** వి. (√ఇల్లు¹–త. ఇల్వళి.)

1. కులీనత, సత్కులమునఁ బుట్టుట.

క. ఇలువడియుఁ జెలువుఁ గలిమియుఁ, గల వానికిఁ గన్నె నొసఁగఁగాఁ గోరుదు రిట్లిలువడియుఁ జెలువుఁ గలిమియుఁ, గల వానికిఁ గన్నెనొసఁగఁ గాంచితి మింతి. యయా. 4. 126.

క ఇలువడి గలనాకూఁతురు, కొలఁది యెఱిఁగి జీవఘాతికూఁతురి యనుచుం, బలుకఁగ నోయి మునీ నీ, కులకామిని యెవిశిష్టు కూఁతురు చెపుమా. వరాహ. 2. 148.

2. మంచినడత.

క. కులమును రూపును బ్రాయము, నిలువడి యుం గలుగువరున కిఁ గంటి నిమున్. రాజచ. 3. 195.

సీ....ఇలువడి ఘటశుద్ధి గలిగినకాంతలందు. గీ. నిల్తు వల్లభప్రతికూల నిష్ఠురాత్మ, నన్య మందిర గామిని నధికనిద్ర, యైనమానినిఁ దొలఁగుదు....భార. అను. 1. 285.

చ. ఇలువడి నున్న చేసి హృదయేశుల సిగ్గులు వుచ్చి యత్తమామల నెరియించి....భాగ. 10. వూ. 977.

చ. ఇలువడి వీటఁబుచ్చి హృదయేశ్వరునిం గనుఁద్రామి బోటులం, దలఁపక కన్న తండ్రికినిఁ దల్లికి నాడిక తెచ్చి....విక్ర. 7. 152.

3. మానము, అభిమానము.

ఉ. రాముఁడు పెద్దకాల మటు రావణునింట వసించి యున్నయా, కోమలి సీతఁ దెచ్చుకొని కూరమి నొందు దలంచుకున్న వాఁ, డేమిటిమర్లొ రానుతుల కెక్కడి యిల్వడి యంచు దుర్జనస్తోమము నింద సేయ.... పద్మ. 9. 6. (చి. ని. శ. పా– 'ఇల్వరుస' అని ముద్రి.).

**ఇలువరము** – ఇలువాసము. వి. 1. మాటు మొదలగువానిమీఁది గొల్లెన, (గుడారమువలె నుండు) గుడసె.

సీ. ఆలగుంపులు గొఱియలందొడ్లు లేఁబూరి యెనుములమునిమంద లెడ్లకదుపు, లిలువరంబులు వాఱుబోలము వాకిటఁ బది కట్టుబండ్లు.... వేం. పంచ. 4. 416. చి. ని. (ఉలుగరంబులు. ముద్రి.).

2. ఆనేయమగు కుటీరము.

ఆం. భా. 2. 14.

**ఇలువ(ల్వ)రుస** వి. (√ఇల్లు¹) 1. ఇంటివంతు.

సీ ఇందులకాఁపుల సంతసఁ దొల్లి యిల్వరుస ద్రింగుచునున్న.... భాగ. ఆది. 6. 264.

క. ఇలువరుసగాఁగ నీక్రియఁ, గలవాగల నెల్లఁ బుచ్చెఁ గాలునిపురికిన్. విక్ర. 5. 206.

2 (త. ఇల్వరిసై.) కులమర్యాద.

క. ఇలువరుస చెడఁగ బంధులు, దలవంపఁగ మగఁడు రోయఁ దల్లి కట్టా, వెలి నేల నన్నుఁ గంటివి, గలిగించిన వాఁడు శిత కరుఁడో గురుఁడో. భాగ. 9. 382.

క. కులసతుల విడిచి పురుషులు, కులహీనుల యిండ్లఁ బోయి కూటికొఱకుఁ గ, న్నెలఁ బెండ్లియాడి యుందురు, నిలువరుసలుఁ బౌరుషములు నెడలి మునీంద్రా. వి. పు. 8. 299.

**ఇలువారము** — ఇలువరము. వి. 1. ఆనేయ మగు కుటీరము, ఒకచోటనుండి మఱియొక చోటికిఁ గొనిపోఁదగు గుడిసె.

గీ. అలకుటీరంబె యానేయమైన నిలువ,రమన నిలువారి మనఁగాను రహికి నెక్కు. అం. భా. 2. 14.

2. గాదెపై వేసినకప్పు.

గీ. భూమి వస్త్రశుతస్మృతదృష్ట పూర్వమైన, బహుళ సంపత్పరంపర పాదుకొనిన, గరిసె యన గోట మించఁగ గణనకెక్కె, నందు పయి నుంచు నిలువారి మన దివంబు. చంద్రా. 1. 5.

**ఇలువిందు** వి. (ఇలు + విందు) అతిథి. బస. పు. 5. 188 పం.

**ఇలువే(ల్వే)లుపు** — ఇంటివేలుపు.

చ. ప్రమదవిలాసన ర్తన విభాసురగోపకిశోర మూర్తితోఁ, దమ కిలువేలుపై వెలయు తాండవకృష్ణు పదాబ్జసేవ...కళా. 1. 2.

ఇలువేల్పు. హరి. ఉ. 9. 47.

**ఇల్ల** అవ్య. (క. ఇల్ల. త. ఇల్లె.) నాస్తివాచకము.

ఉ. మందత నాస్తి శేదవెడుమాట పలుకక్కు- మదంబు మిథ్య చు,ల్కందన మిల్ల కుత్సితము కల్ల యసత్యము సున్న...పె. శకుం. 1. 50.

ఆ. తల్లి గలుగులంబె నుల్లోలమతిఁ జేరు, పల్లవులకు సౌఖ్య మిల్ల జగతి. చంద్ర. వి. 2. 29.

**ఇల్లంత్రము** — ఇల్లటము (ఇల్లటపుమగనితోఁ దన పుట్టినింటఁ జేయుకాఁపురము.

సీ. గా రాబమునఁ బాలకడలి ముద్దులు సేయ నలరునిల్లంట్రంపుటాఁడుబిడ్డ. ప్రబంధ. 2.

**ఇల్లటము** — ఇల్లంట్రము, ఇలటము. వి. (√ఇల్లు[1]) అల్లుఁడు తనభార్యతో అత్తవారి యింటనే చేయుకాఁపురము.

గీ. అర్యపైఁ జేర్మి యెట్టిదో యద్రియింట, నిల్లటంబుండెఁ ద్రిభువనాధీశ్వరుండు. హర. 5. 4. నిరం. 1. 6.

సీ....ఇల్లంట్ర మనఁగను నిల్లట మన... గీ. శ్వశురగేహాధివాసంబు చనును....అం. భా. 2. 111.

ఇల్లటపల్లుఁడు — ఇల్లటిక మున్న యల్లుఁడు. నీలా. 1. 14. (ఇల్లే. ఇల్లటపుటల్లుఁడు. విక్ర. 7. 161.).

**ఇల్లడ** వి. (ఇల్లు + అడకము — త. ఇల్లడై) న్యాసము, అడిగినప్పుడు తిరుగ నిచ్చుపద్ధతిని ఒకరియొద్ద దాఁచినధనాదికము.

క. ఇల్లడ లోగి యాఁచికొనిన, బల్లిదు లదె యిఱియఁ గట్టఁబడి కీటకముల్, పెల్లుగ దేళ్లుంగాకులు, తల్లడపెట్టంగ నొఱలెదరు నొరెండఁగ. మార్క. 2. 102. (ఇల్లడ గొని. ముద్రి).

ఇల్లడధనము - ఇల్లడముగాఁ బెట్టిన ధనము. మార్క. 2. 113.

ఇల్లడమానిసి — ఇల్లడగా నుంచినమానిసి. వి. పు. 5. 151.

ఇల్లడయిడు — ఇల్లడగా నిడు.

చ....బృహద్రథాత్మజుం, గడిఁదిరిపుం జయింతుము జగన్నుత నన్నెద నమ్మ దేని యి,ల్లడయిడు భీము నర్జును నలంఘ్యబలాఢ్యుల నావశంబునన్. భార. సభా. 1. 163.

శ్లో. భీమసేనార్జునౌ శీఘ్రం న్యాసభూతౌ ప్రయచ్ఛ మే సం. భార. సభా. 20. 7.

సీ....ఏమిట నేమఱ కెపుడు మీర, లీతనిఁ బోదివి సంప్రీతిగ వర్తింపుఁడయ్య యిల్లడ యిమ్మహానుభావు, నిడితి మీకడ....భార. ఆశ్ర. 1. 93. (ఇల్లడపెట్టిన వస్తువు వంటి వానిఁగా—అని తాత్పర్యము).

ఇల్లడవెట్టు — జాగ్రత్తగాఁ గాపాడి మరల నడిగినపుడు ఒప్పగింపు మని దాఁపనిచ్చు.

ఉ. ఏనును మీరుఁ గాననకు నేఁగునెడన్ నముఁ జేరి యెంతయున్, దీనత దోఁపఁ గుంతి సహదేవుని నిల్లడవెట్టి నాకు న,మ్మా నిను నమ్మి చాల విషమం బగునివ్వనవాస మీతఁడుం, బూనఁగ నియ్యకొంటనని బోరన నశ్రులు గ్రమ్ముచుండఁగన్. భార. విరా. 2. 211.

ఇల్లడము వి. (√ఇల్లు¹) అవకాశము, నివాసస్థానము, చోటు.

చ. పొడువను జంపనుం జనుట పోల నెఱిం గియుఁ దాను వారితో, నెడనెడ మాట లాడినను నిల్ల డమిచ్చినఁ గూడు వెట్టినం, బొడువఁగఁ గైదు విచ్చినను బుద్ధులు చెప్పిన ద్రోహి గానఁ ద,ప్పడుగకవానిపైఁ దగులు నుత్తమ సాహసదండ మెమ్మెయిన్. విజ్ఞా. ప్రా. 97.

శ్లో. భక్తావకాశాగ్న్యుదక మన్త్రోపకరణ వ్యయాన్, దత్వా చౌరస్య వా హన్తుర్జానతో దమ ఉత్తమః. యాజ్ఞ. వ్యవ. స్తేయ ప్రకరణము. 276.

ఇల్లరి వి. (ఇల్లు¹+అరి) ఇంటిపన్ను.

సీ....గృహభాగధేయ మౌ నిల్లరి యన....ఆం. భా. 2. 192.

ఇల్లటికము – ఇల్లటము.

ఇల్లవ వి. మత్స్యవిశేషము. (శ. ర. బ్రౌ.).

ఇల్లాపె వి. (ఇల్లు¹+ఆపె) గృహిణి.

శా. వాపోచున్ క్షుధఁ గుంది చాల సుతులవ్వా బువ్వ బువ్వంచు ని,ల్లాపెన్ జీర్ణపటావకర్షముల నుడ్డాడింపఁగాఁ జూచి....మల్ల. వై. 31.

ఇల్లామల్లి విశ. (క. కల్లామల్లి) కొండెగాఁడు, పిసునుఁడు. (శ. ర. బ్రౌ.).

ఇల్లాలు వి. (ఇల్లు¹+ఆలు–త. ఇల్లాళ్.)

1. భార్య, గృహిణి.

(అర్జునుఁడు ఊర్వశితో నన్న మాట.) శా.మత్తారాతివిదారణుండు జనసమ్మాన్యుండు శీతాంశువం,శోత్తంసుండు పురూరవుండు ప్రచలద్యోగుండు మాతాతగా, రత్నోయాకర మేఖలానతికి నిల్లా లైతిగా గావునన్,ముత్తో వీవు....హరి. 7. 125.

2. స్త్రీ.

సీ. మలయాచలంబుపైఁ జిలువయిల్లాండ్రదుర ఫణ రత్నములయందుఁ బ్రతిఫలించి. కాశీ. 1. 130.

సీ. గొల్ల యిల్లాండ్రతోఁ గోడిగించుటఁ జేసి పర కామినీసహోదరతఁ బాప. పారి. పీఠి.17.

ఇల్లి వి. ఉపవాసము.

సీ. పస్తిల్లి నుంకు నిప్పస్తు నిట్రనఁగను నుపవాససంజ్ఞలై యొప్పుచుండు. ఆం. భా. 2. 175.

ఇల్లింద – ఇలింద. (శ. ర.).

ఇల్లిగ్గులు వి. బ. (√ఇగ్గు) – మిక్కిలి వెనుదీయుటలు–మరలఁబాటు; తగ్గుదల.

క. వెల్లియగుగవలద్రొక్కున, నిల్లిగ్గులు గాన వచ్చు హృదయములోనన్, మల్లామడియగుమదనుఁడు, మెల్లన కూర్పుండెఁ దాల్మి మినుమిను కనఁగన్. ఉ. హరి. 5. 116. (లొల్లియగు–శ. ర. పా.).

ఇల్లిముక్కు వి. (త. ఇల్లిమూక్కు.) పగిలి నెత్తురు గారెడుముక్కు. (బ్రౌ.).

ఇల్లు¹ – ఇలు. వి. బౌ. (క. త. ఇల్. తు. ఇల్లు.) ఇది హల్లు పరమగునపుడు వైకల్పికముగా 'ఇలు, ఇల్' అనురూపముల నొందును.

1. గృహము, ఉనికిపట్టు.

చ. ఎఱిఁగిరి యేని యిట్లు తమయిండ్లలనుండిన యట్లు మెచ్చ కేమఱి శయనింతురే కడుఁ బ్రమాదము సేసిరి.... భార. ఆది. 6. 194.

చ....వింట లేదె యిం,ట గెలిచి రచ్చ గెల్వ మనునానుడి నానుడి నానుఁడీ చెవిన్. సారంగ. 2. 259.

సీ. ఏకొండ యిల్లు గా నీశానుఁ డెప్రొద్దుఁ బార్వతీసహితుఁడై పాయకుండు. విక్ర. 1. 197.

2. (మంచము చదరంగము మొదలగు వాని) గడి.

3. (జ్యోతి) స్థానము, రాశి.

గీ. అనపరాధ వనవద్య నీయబల నింత,యేఁ చెదవు చంద్ర యీయును జెలపోవు, నష్ట కళ మిత్త్రునింట హైన్యమున నుండ, నీకు సంప్రాప్త మగుఁగాక నెలకు నెలకు.కవి రా. 3. 133.

4. గృహకృత్యము.

క. గొల్లఁడు వ్యాధుఁడు రజకుఁడు, కల్లమ్మెడు వాఁడు లోనుగాఁ గొందఱు దా,రిల్లాలవ్వ

రుపం దగు,నిల్లు నడపుచనవు దాని కిచ్చిన కతనన్. విజ్ఞా. వ్యవ. 80.

5. వంశము, కుటుంబము.

మ. భవదీయాత్మజు నాత్మజుండు కురుభూభా రోద్వహుం డయ్యె యా,దవవంశోత్తరుం డై నవజ్రునకు నింద్రప్రస్థరాజ్యంబు గా,రవ దీప్తంబుగ నిచ్చినాఁడ సుచరిత్రాంగనణి యంబులై,నవి యాయిండులు రెండు నీవు దృఢభక్తిం బొప్ప రక్షింపుమీ. భాగ. మహా. 11.

ఆ. వలదు సీత నిచ్చి నలినాప్తకులనాథు, కొలువు వట్టి యిల్లు నిలుపుకొనుము. రామా. 7. 74.

గీ. పాకనాటింటి వాఁడవు బాంధవుఁడవు ... శ్రీనాథకవివరేణ్య. భీమ. 1. 23.

ఇల్లునుబొల్లును–ఇల్లు మొదలుగా సర్వమును.

శా. లోలత్వంబున మత్తకాశినుల కిల్లుంబొల్లు నుం జెల్లఁగా, నేలా వెచ్చముసేయ ... పాండు. 3. 42.

ఇల్లుగుల్లసేయు – ఇంట నుండున వెల్ల నాశనము చేయు.

ఆ. పెల్లుకల్ల లల్లి బొల్లిమాటలఁ ఒల్లి, మెల్ల మెల్ల నిల్లు గుల్లసేయు, తల్లి గలుగులంజె నుల్లోలమతిఁ జేరు, పల్లవులకు సౌఖ్యమిల్ల జగతి. చంద్ర వి. 2. 29.

సా: ఇంటిదీప మని ముద్దుపెట్టుకొన్నచో నోరు కాలును.

ఆ. ఇంటిదీప మనుచు నిగిలించుకొని ముద్దు,పెట్టుకొన్న నోరు బిట్టుగాలు. కుచేల 2. 38.

సా: ఇంటికన్న గుడిపదిలము.

గీ. ఇండిని గూడి యుంటి వీ వింటికన్న, గుడి పదిల మంచు యవనులఁ గొట్టవయ్య, వైరిహరింహ...సిం. నారసిం. 2.

జ: ఇంటాతఁడు, ఇంటికాఁపు, ఇంటిపట్టు,మొ.

ఇల్లు²(లు) అవ. కొన్నిధాతువులమీఁది ఇంచుగా గమనమునకు ఆదేశముగా వచ్చునది.

ఉదా: రంబిలు, రంబిల్లు, రాగిలు, రాగిల్లు, మొ.

ఇల్లుటాలు – ఇల్లాలు.

ఆ. నందునింటఁ జేరె నందునియిల్లుటా, లగు యశోద పాపఁ డనుచుఁ బెనుప. నీలా. 1. 71.

ఇల్లెము వి. మత్స్యవిశేషము.

సీ....మలుఁగుమీ నరుజు నిల్లెపుఁజేప యాకు జెల్ల. హంస. 4. 187.

ఇల్వలము సం. వి. అ. పుం. మత్స్యభేదము.

ఇల్వలలు సం. వి. అ. స్త్రీ. బ. మృగశీర్ష నక్షత్రము యొక్క శిరోదేశమున నున్న అయిదు చిన్న నక్షత్రములు.

ఇల్వలుఁడు సం. వి. అ. పుం. ఒకానొక రాక్షసుఁడు, వాతాపియన్న. (ఇతఁడు అగస్త్యునిచేఁ జంపఁ బడెను).

ఇళ సం – ఇడ.

ఇవక వి. (సం. మిహికా.) శైత్యము. విణ. శీతలము.

గీ. జలుబు నీ తివతాళింపు చలువ యివక, యనఁగ శీతంబు గుణిగుణాఖ్యలఁదగు ... ఆం. భా. 1. 80.

ఇవతల – ఇవల. వి. క్రి. (ఇవలి+తల – చూ. అవతల.

1. ఈవలిప్రదేశము; ఈవలియొడ్డు.

సీ. ... మీఱుచుముందును బాసంజ్ఞ, యిద్దరి యావల యివ్వల యివల యాతల యివతల యన...ఆం. భా 1 155.

2. ఈవలికాలము

ఇవతళించు – ఇవతాళించు.

గీ. ఇగ్రుచుకోర్కులఁ దనరెంద మివతళింప. కవిక. 3. 222.

ఇవతాళించు – ఇవతళించు. అ. క్రి. (ఇవము+తాళించు) చల్లనగు. శీతమగు.

మ. నవనీహారగవయోమిళన్మలయజస్నానార్ద్రి పర్యంతమై, యివతాళించు విదర్భరాజ తనయాహృదయ్యస్తనద్వంద్వముల్. నైష. 8. 34.

క. జవరా లగురుకాపాలిని, కవుఁగిటఁ దవమేను గజరుగజరులు వోఁగా, వవిరళ సుఖమున

హృదయం, బివతాళింపంగ బొద్దు( డి ట్లని తలంచెజా. ప్రబోధ. 3. 46.

**ఇవతాళింపు** వి. (√ఇవతాళించే) శైత్యము, చలువ. విణ. శీతలము. ఆం. భా. 1. 80.

**ఇవము** – ఇగము. వి. (సం. హిమమ్.) 1. మంచు.

సీ. వేఁడవేలు పివమువేఁటాడుపోటరి...నీలా. 4. 45.

2. శైత్యము, చల్లఁదనము.

ద్వి. పన్నీటియివము క్రమముమీఁదిచలువ, వెన్నెలలోసీతు...ద్వి. పరమ. 2. 57 టీ.

విణ. చల్లనిది. ఆం. భా. 1. 70. (చూ. ఈము[1]).

జ. ఇవతళించు, ఇవతాళించు, ఇవతాళింపు, ఇవముకొను, ఇవముమేపరి, ఇవముసూడు.

**ఇవముకొ(గొ)ను** అ. క్రి. (√ ఇవము) 1. వడియు.

చ. అవిరళపుష్పరేణుయుతమై పొలుపొందు మరందవృష్టిచే, నివముగొనంగఁ దద్వన సమృద్ధిఁ గనుంగొని యవ్వసుంధరా, దివిజకుల ప్రసూతుఁడు మదిం బరితోషము నొంది యత్తఱిజా. కళా. 4. 60.

2. చలినొందు, శీతబాధ నొందు.

గీ. చంద్రబింబాస్య కుచశైలజవన్మథూమి, గానరారూపువోలె నక్కడిఁదిచలికి; నించుకింతయుఁ గంపింప దివముకొనుచు ... పాండు. 4. 5.

గీ. ఎండ నెండతి మంచున నివముకొంటి; వానఁ దడిసితి సీతున వడఁకుచుంటి, గాలిఁ దూలితి నళనంబు గానసై తి. కాశీ. 6. 44.

**ఇవముమేపరి** వి. (√ఇవము) సూర్యుఁడు. అచ్చ. రా. యు. 311.

**ఇవముసూడు** వి. (√ఇవము) సూర్యుఁడు. అచ్చ. రా. కిష్కిం. 39.

**ఇవల** – ఇవ్వల, ఈవల వి. బొ అవ్య. (ఈ + వలను–చి. ని శ. ర లు ఇట్లు అన్యార్థముగా గ్రహించినవి. కాని అచ్చుప్రతులలో ఈక్రింది ప్రయోగములందు ఉన్యార్థముగా కాన్పించు చున్నది.)

1. ఇవతలిభాగము.

క. కనక మసంఖ్యము మోపులు, గొని వచ్చె నతండు మంచుకొండయివఁ కున్. భా. అశ్వ. 1. 63.

2. ఇవతలికాలము.

గీ. ఇవల నేడుదరంబుల నవల నేడు, దరములకు బిత్రృవర్గంబు నరుఁడు గంగ, నాడి శుచిఁ జేయు. భార. అను. 2. 110.

**ఇవిరించు** అ. క్రి. 1. (√ఇవురు[1]) చిగిరించు. 2. ఎట్టినగు. శ. ర. (చూ. ఇగురు, ఇగిరించు.).

**ఇవురు**[1] – ఇగురు[1].

(పల్లవము, చిగురు)

గీ. పెద్ద లివురాకుఁబట్టైన పెట్టువడిరి. ఆము. 5. 111.

జ. ఇవిరించు, ఇవురుఁబోణి, ఇవురుచు, ఇవు రొత్తు.

**ఇవురు**[2] – ఇగురు[2]. అ. క్రి. 1. వట్టు, ఎండు, శుష్కించు.

సీ. కల్పాంతవాయుసఖ స్ఫుగణంబున నివిరి పోయినమహార్ణవముకరణి. భార. శల్య. 2. 399.

ఆ. ఇంద్రియముల నెల్ల నివురంగఁ జేయుచు, నదరుశోకవహ్ని యాఱనేర, దింద్రదపదవి నేరె నేనియు...భార. భీష్మ. 1. 193.

2. లీనమగు.

గీ. ఇంద్రియంబులు మనమునం దివురఁ జేసి, మనను దిగిచి...భార. శాం. 6. 117.

ఇవురఁబాఱు – ఇంకు.

సీ. గగనంబుతో రాయు కరడులు గల జలం బివురఁబాఱినమహార్ణవము కరణి. భార. ద్రో. 2. 126.

జ. ఇవురువంటకము.

**ఇవురుఁబోణి** – ఇగురుఁబోడి. (√ఇవురు[1]).

గీ. శీతలజలావగాహమన్నే హాతువర, కందమూల పలాశాదికదశనంబు, సేయుటకు నెట్లు దవరెశచీవిలాస, మెన్న దొఁరకొన్ననిచిన్నె యివురుఁబోణి. కృ. శకుం. 2. 70.

**ఇవురుచే(ర్చు)** – ఇగురుచే. (√ఇవురు¹) (స. ర. |శౌ.)

**ఇవు(గు)రువం(ర్వం)టకము** వి. (√ఇవురు²) ఇగిరిన అన్నము, అత్తెసరు.

సీ. రాగిలోహండి గన్నాళ్ళియి, లేకుండంగ వండి దించిన యివుర్వంటకంబు. కాశీ. 3. 121.

**ఇవురొత్తు** – ఇగురొత్తు. (√ఇవురు¹) అ. క్రి. అంకురించు, కలుగు.

ఆ. కురులు గూడె మేను మెఱుఁగెక్కెఁ బాలిండ్లు, బయలు మెఱసెఁ బిఱుఁదు బలిసె నడలు, మురిసె మెఱిఁగె సిగ్గు మోమున నివురొత్తెఁ, దోయజాస్య కలరుఁ బ్రాయమైన. వేం. పంచ. 3. 301.

**ఇవులుచే(ల్చు)** – ఇగులుచే.

**ఇవ్వల** – ఇవల. వి. 1. ఈవైపు.

గీ. ఇవ్వలవ్వలదైత్యు లట్టిట్టు ద్రోయ. దశా. 2. 101.

2. ఈపతము.

క. ఎవ్వనితో నెచ్చోటం, బివ్వకుఁ జేసాఁగ వలదు చేసాఁచినచో, నివ్వల నవ్వల నెవ్వరు, నవ్వకయుండంగఁ బగ సనం దీర్పఁదగున్. కాశీ. 1. 109. (చి. ని. పా. 'పగఁబసనఁ గింపఁ దగుఁగా' ముద్రి).

**ఇషము** నం. వి. అ. పుం. ఆశ్వయుజమాసము న. ఇనుము. (కే. ని.).

**ఇషిక** నం – ఇషీక.

**ఇషీక(ము)** నం. వి. అ. స్త్రీ. 1. కాశము, ఱెల్లు (వృ. వి.) 2. వీరణతృణము, అవురుగడ్డి. 3. ఏనుఁగు కనుగ్రుడ్డు. 4. చిత్రరువు వ్రాసెడి కుంచె. 5. ముంజదర్భమొక్కలోని మొవ్వు

క. కాకుత్స్థాన్వయనాథుఁ డిషీకము మంత్రించి వైచెఁ జెన్నఁటి కాకిపై. భా. రా. సుం. 318.

6. ఒకజాతిచెఱకు (వృ. వి.)

**ఇషుధి** నం. వి. ఇ. పుం. స్త్రీ. తుంణీరము, అమ్ములపొది.

**ఇషుపుంఖ** నం. వి. ఆ. స్త్రీ. – బాణపుంఖమువంటి పువ్వులు గలది – శరపుంఖావృక్షము, వెంపలి (వృ. వి.).

**ఇషువు** నం. వి. ఉ. పుం. స్త్రీ. 1. బాణము. 2. (గణిత) అయిదు 3. (క్షేత్రగ)వృత్తక్షేత్రము లోపల జీవమధ్యావధి పరిధిపర్యంతము గీచిన సరళరేఖ. (లీలావతి).

**ఇష్ట** నం. వి. ఆ. స్త్రీ. శమి, జమ్మి (వృ. వి.)

**ఇష్టక** నం. వి. ఆ. స్త్రీ. ఇటిక.

**ఇష్టకాపథము** నం. వి. అ న. అవురుగడ్డివేరు. పుం. ఇటికలతోఁ గట్టినమార్గము.

**ఇష్టగంధము** నం. విణ. (అ. ఆ. అ.) మంచివాసన గలది. వి. అ. పుం. సుగంధిద్రవ్యము. న. ఇసుక.

**ఇష్టదేవత** నం. వి. ఆ. స్త్రీ. ప్రియదేవత. (ఇట్లే. ఇష్టదైవతము, ఇష్టదైవము, ఇష్టదేవుఁడు).

**ఇష్టము** నం. విణ. (అ. ఆ. అ.) 1. కోరఁబడినది. 2. ప్రియమైనది. 3. పూజితము. 4. యజింపఁబడినది, యజ్ఞముచేత సంతోష పెట్టఁబడినది. (దేవతాదికము) వి. అ. న. 1. కోరిక. 2. (యజ్ఞాది) కర్మము. 3 ఉపనయనాది సంస్కారము. 4. అతిథ్యాదివిహితకృత్యము. 5. ఇష్టక, ఇటిక.

**ఇష్టాపత్తి** నం. వి. ఇ. స్త్రీ 1. కోరిక నెఱవేఱుట. 2. (తర్క) ఇష్టమైనయాపత్తి, ప్రతివాది కనుకూలమైన యాక్షేపము.

**ఇష్టాపూర్తము** నం. వి అ. న. ఇష్టమును పూర్తమును. (ఇష్ట మనఁగా అగ్నిహోత్రాదికర్మము. పూర్తమనఁగా వాపీకూపతటాకారామ దేవాలయ నిర్మాణమును అన్నదానమును.).

**ఇష్టి** నం. వి. ఇ. స్త్రీ. 1. ఇచ్ఛ, కోరిక. 2. యాగము. 3. యాగభేదము (దర్శేష్టి, మొ.) 4. (వ్యాక) భాష్యకారుల యుద్దేశమును దెలుపువాక్యము. 4. సంగ్రహశ్లోకము. న్. పుం. యాగము చేసినవాఁడు, యజ్వ

**ఇష్టిపచుఁడు** నం. వి. అ. పుం – దేవతార్థము కాక స్వతృప్తికొఱకు మాత్రమే వండుకొనువాఁడు– 1. కృపణుఁడు, పిసినిగొట్టు. 2. దైత్యుఁడు.

**ఇష్టుఁడు** సం. వి. అ. పుం. 1. ప్రియుఁడు, మగఁడు.
2. చెలికాఁడు, మిత్త్రుఁడు; ఆప్తుఁడు.
క. ...అవ్విదురువచనంబ నిలుపుదు, హృదయంబున నతఁడు పెద్దయిష్టుఁడు మీకున్. భార. ఆది. 8. 19.
3. విష్ణువు.

**ఇష్మము** సం. వి. అ. పుం. వసంతఋతువు.

**ఇష్మఁడు** సం. వి. అ. పుం. మన్మథుఁడు.

**ఇష్యమాణము** సం. విణ. (అ. ఆ. అ.) కోరఁబడుచున్నది.

**ఇష్యము** సం. వి. అ. పుం. వసంతఋతువు.

**ఇష్వసనము** సం. వి. అ. పుం. - బాణము చిమ్మునది - ధనువు, విల్లు.

**ఇష్వాసనము** సం. వి. అ. పుం. — ఇషువులు ఏయునది — విల్లు, ధనుస్సు.

**ఇష్వాసుఁడు** సం. వి. అ. పుం విలుకాఁడు.

**ఇష్వుఁడు** సం. వి. అ. పుం —ఉపదేశము కొఱకు చేరఁ దగినవాఁడు - ఆచార్యుఁడు.

**ఇసిరో** — ఇస్సిరో. అవ్య. నిందను రోఁతను సూచించును.
చ. ...కిరీటి చే నలుక శాంతత నొందినసోమదత్తనం, దమతల ద్రుంపవే మఱచితా యిసిరో యిది పోరిపాడియే. భార. మౌ. 44.

**ఇసిఱింత** వి. చలనము.
సీ. ఏపువ్వుఁబోఁడుల యిసిఱింత చూపులు ఋషుల గట్టిమనంబు లిగురువెట్టు. కాశీ. 3. 169.
చ. మనతరళాక్షి సిగ్గు తెరమాటున నుండక దాఁటిదూఁటి పాఱినఁ గదియంగఁ బట్టి యిసిఱింతల చూపులఁ దన్నుఁ జూడఁగా, మనుజవిభుండు ప్రేమగరిమంబునఁ జూచె లతాంగి నయ్యెడన్, జనుమొన నాటె నానృపతిచంద్రుని చూపులఁ గంతుతూపులున్. పి. శకుం. 3. 52.
జ. ఇసిఱింతలువాఱు.

**ఇసిఱింతలువాఱు** అ. క్రి. (ఇసిఱింతలు+పాఱు) చలించు.



వ. ...కులాంగనాజనంబు నపాంగదృక్తరంగంబులం జిఱునగవు లిసిఱింతలువాఱఁ గనుంగొనుచు. హర. 5. 51.
క. అంతట నిద్దఱమనసులు, కంతుని పసఁ గలసె నింతకసమన లోలయన్, మంతనములఁ బెదవులు నిసి, ఱింతలువాఱంగ నగవు తెప్పలు గొరన్. విక్ర. 3. 87. (ఇను, ఱింతలువాఱంగ నగవు తెప్పల జాఱెన్. చి. ని. పా.).

**ఇసీ** — ఇస్సీ. అవ్య. (శ. ఇస్సి.) నిందను రోఁతను తెలుపును.
క. ...అఖిలజనులు నిన్, గదుఁ బేదమనను వాఁ డని; సెడవాడుదు రనిన మము నిసీ యనుటరుదే. భార. శాం. 1. 117. మార్క. 3. 588.
ఉ. ...దు, శ్శీలములం గనుంగొని యిసీ యని రోసె మనంబులోపలన్. ఉ. రా. 3. 324.

**ఇసుక**—ఇసుము. వి. ఏ. సికత, వాలుక. కు. సం. 5. 516.
ఇసుకఁజల్లిన రాలకుండుట — మిగుల దట్టముగా నుండుట. ద్వి. హరిశ్చ. పూ. 587, 588.
ఇసుకపోసిన రాలనియంతసందడి — ఇసుక చల్లినఁ గ్రిందికి పడని యంత సమూహము, మిక్కిలి దట్టమగు గుంపు. కుచేల. 2. 11.
జ. ఇసుకతిన్నియ, ఇసుకదాసరి, ఇసుకదొందు, ఇసుకపులకండము, ఇసుకబేలు, ఇసుకమ్రాను, ఇసుకరాజనములు.

**ఇసుకతిన్నియ(న్నె)** వి. (ఇసుక+తిన్నె) సైకతము. (శ. ర. ప్రౌ.).

**ఇసుకదాసరి** వి. (√ఇసుక) ఒకవిధమైన కూర, సైకతశాకము (వృ. వి.) (శ. ర.)

**ఇసుకదొందు** వి. (√ఇసుక) మత్స్యవిశేషము. ప్రబంధ. 195.

**ఇసుకపులకండము** వి. (√ఇసుక) మత్స్యాండిక, కండచక్కెర (శ. ర.).

**ఇసుకబేలు** వి. (√ఇసుక) ఒకానొక తీఁగ (శ.ర.).

**ఇసుకమ్రాను** వి. (√ఇసుక) ఉలిమిరి, వరుణము (వృ. వి.) (శ. ర.).

**ఇసుకరాజనములు** వి. బ. (√ఇసుక) ధాన్యవిశే షము.

సీ. వడుకట్లు లవంకె లిసుకరాజనములు పులి గోళ్ల వంకెలు. హంస. 4. 128.

**ఇసుము**-ఇసుక.

(సికత)

సీ....ఇసుము చల్లుచు నమరేంద్ర పుత్రుఁడు వోయె.... భార. సభా. 2. 301.

(సూక్ష్మాంశము.)

గీ. ఇసుముచేయదె గద గోపుఁ డెత్తుగదను. ఉ. హరి. 3. 7.

గీ. ఇసుపజోళ్లను బడవైచి యిసుముగాఁగఁ, గ్రుమ్ముచుందురు.... శేష. 3. 37.

ఇసుమంత – కొంచెము, అల్పము.

సీ. వెస అంపమున నిడ్డవసిగఁ గొన్నిటి నిసు మంతలుగా నుఱుమాడి యాడి. భార. విరా. 5. 35.

గీ. సంగతియె యోయి యిసుమంత లింగలావు, తత్త్వనిర్ణయవాదంబు తరమె నీకు. ఆము. 4. 60.

ఇసుమంతలగు – క్షీణించు.

గీ. తోఁట చేను కొటారంబు దొడ్డి యనెడి, యాస లన్నియు నిసుమంతలయ్యె సామి. వసు. 2. 149.

**ఇసుల్లు**–ఉసుల్లు. వి. బ. ఱెక్కచెదలు.

ముదిరి ఱెక్కలు కలిగి రూపాంతర మొందిన చెదలు.

వ...నేల యీనినటుల మున్నీరు వెల్లివిరిసిన వైఖరిఁ బుట్టయిసుళ్లకరణిఁ గాకులకోకఁ గొండ్రముచ్చుల బాగున...ప్రబంధ. 788.

**ఇస్తువు** వి. సొత్తు, ఆస్తి. (గ్రా.)

**ఇస్మ** – ఇసుము.

సీ. ఇంద్రుఁ డంబుధిఁ బైఁడియిస్మ గొల్మని పెట్టి కరఁగించు కరుపుముఖం బనంగ మల్హణ. 3. 140.

**ఇస్సిరో** – ఇసిరో. భార. కల్యా. 2. 58.మార్క. 1. 182.

**ఇస్సిస్సి** – ఇసిరో.

గీ. కోప ముదయింపఁగాఁ బండ్లు కొఱుకు కొనుచు, దంభుఁ డిస్సిస్సి పైగాలి తగిలి నీడు, చెమటబిందులు మామీఁదఁ జిలుక కుండ, నోయి విప్రుండ యెడగల్గ నుండు మనిన. ప్రబోధ. 2. 14.

ఇస్సిస్సియగు – అసహ్యమగు, రోఁతయగు.

వ. ...గళన్మలపంకపిచ్ఛిల బీభత్సదేహంబున దొనదొన మునురునీఁగలం జేత వెమిలిపురి కుంచెం గొని చోపుకొనుచుం గేళోల్లుం ఛనంబునం బురబుర మనుబోడితల నిమురు కొనుచు దిన మొలయుం దానును జూడ నిస్సిస్సియై వచ్చువీఁడు పిశాచంబు గాని రక్క సుండు గాఁడు. ప్రబోధ. 3. 12.

**ఇస్సిస్సిరో** – ఇసిరో.

శా....నం, పన్న త్వంబున నున్న దాన వని చెప్ప న్వీందు మిస్సిస్సిరో ... దొంగసొమ్ములకు నై యిక్లేల ప్రాల్మాలితే. విప్ర. 5. 85.

**ఇస్సీ** – ఇస్సీ.

క. అందఱు రథికులు పఱవఁగ, నిందేటికి మున్ను వచ్చి రిస్సీ యని సంక్రందనసుతు మారొ్కనియెఁ దగం దెగి సంగ్రామజిత్తు గర్వోద్ధతుఁడై. భార. విరా. 5. 79. భా. రా. అర. 2. 140.

**ఇహత్యకము** సం. విణ. (అ. త్యకా. అ.) ఇహ త్యము.

**ఇహత్యము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఇక్కడిది, ఈలోకమున నున్నది. 2. ఇప్పటిది, ఈకాల మందున్నది.

**ఇహము** సం. అవ్య. ఈలోకము.

ఆ. ఇహపరముల నెనక మెనఁగ సౌఖ్యము తులా,ధారుఁడును సమున్నతత్వ మొందె. భార. శాం. 5. 257.

గీ. ఏల చింతింప నిహామువం దెల్లసుఖము, లనుభవించితి మధురా మహాపురమునఁ, బరమునందు విముక్తి సంపదయుఁ గలిగె, నేడుపురములఁ దీర్థంబులాడఁ గనుట. కాశీ. 3. 126.

2. ఐహికసుఖము.

గీ. ...భూవిభుఁడు ప్రజకు, రక్షణము సేయ నిహముఁ బరంబుఁ గల్గు. భార. శాం. 5. 297.

**ఇహలోకము** సం. వి. అ. పుం. ఈలోకము.

**ఇహాగతుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) ఇక్కడకు వచ్చినవాఁడు.

**ఇహాముత్రఫలము** సం. వి. అ. న. ఐహికాముష్మిక ఫలము, ఇహపరములందలి కర్మఫలము.

**ఇహిహీ** అవ్య. నిందను తెలుపును.

క. తగవా మగవారికి నిటు, మగువయెడం దెగువఁ జూప మాదృశవీరుల్, జగతిం గలవా దొరవా, మగఁటిమి గలరాచ చందమా యిది యిహిహీ. రామా. 5.148.

వి. పరిహసించుటయం దగుధ్వన్యనుకరణము.

చ...ఇహిహీ యని నవ్వె...రుక్మి. 3. 94.

**ఇహీ** వి. పరిహసించుటయం దగుధ్వన్యనుకరణము.

ఉ...న, న్నెట్టుల మెచ్చు శంకరుఁ డిహీ యని భక్తులు నవ్వకుందురే. చెన్నబ. 4. 216.

# ఈ

**ఈ** ఉత. ఒకానొకయక్షరము.

**ఈ**[1] స. దగ్గఱ నున్నదానిని నిర్దేశించును. (దీనికి వృత్తియందే ప్రయోగము కలదు.) భార. విరా. 2. 78.

**ఈ**[2] ఇచ్చుధాతువునకు భవిష్యదర్థక వ్యతిరేకార్థక ప్రార్థనాద్యర్థక తుమున్నర్థక ప్రత్యయములు పరమగునపుడు ఆదేశముగా వచ్చునది. (ఉదా: ఈఁగలఁడు, ఈఁడు, ఈమి, ఈ, ఈన. మొ.).

**ఈ**[3] అవ్య. 1. సంప్రార్థనంబున మధ్యమపురుష 'ము, ఁడు' వర్ణకంబులకు విభాషను అనుప్రయుక్తమగునది. (ఇది అదాదులలోనిది)

క. ఓ విప్రులార వినుఁడీ. దశా. 1, 289.

2. ప్రశ్నించునపుడు (కిమర్థమగు) 'ఏ' అను శబ్దమున కనుప్రయుక్తమై అర్థవిశేషమును తెలుపును. అము. 6. 65.

ఉదా. ఏఁడీ. (= ఎక్కడనున్నాఁడు) ఏదీ, వేఁడీ, వేరీ, మొ.—ఇట్లే. ఏఁడి, ఏరి, మొ.

ఒకప్పుడుకాకువర్థమునందుఁ గూడ ప్రయోగింపఁబడును.

శా. కారే రాజులు రాజ్యము ల్గలుగవే గర్వోన్నతిం బొందరే, వా రేరీ సిరి మూటగట్టుకొని పోవం జాలిరే... భాగ. 8. 590.

**ఈ**[4] ఇకారాంతపదములకు సంబుద్ధియందు విభాషను ఆదేశముగా వచ్చునది.

ఉదా:— హరీ, మతీ, మొ.

**ఈ**[5] ప్ర. 1. కొన్నిశబ్దములకు పుంస్త్వమున మతుబర్థమందు వచ్చునది.

ఉదా: అటమటీఁడు, కమ్మతీఁడు, మొ.

2. కొన్నిశబ్దములకు స్వార్థమునందు వచ్చును.

ఉదా: కల్లరీఁడు, మొక్కలీఁడు, మొ.

**ఈ** సం. వి. ఈ. స్త్రీ. లక్ష్మి.

**ఈండ్ర** వి. (క. ఈడిగ. త. ఈట్టువర్ — ఈడిగవాఁడు.) తాటిచెట్టు లోనగువాని గీచుకొని జీవించుజాతి, ఈడిగ.

గీ. కటకటా పద్మగర్భుఁ డెక్కడిరసజ్ఞుఁ, డీండ్ర సరకని కటువంటి తీండ్రవయసు, టోర చూపులనెఱపోంతకారిఁ దెచ్చి, యాలుగాఁ గూర్చె పాపాత్ముఁ డాయె నహహ. సురా. 59.

ఉదా:- ఈండ్రవాఁడు, ఈండ్రది.

**ఈండ్రము** వి. (త. సీండఱము) పీడించుట.

క. ము న్నెన్నఁడు వదాన్యుల, నెన్నెడుచో నిన్నుఁ ద్రిభువనేశుం డనుచున్, ఇన్నిదివంబులనుండియు, నెన్నఁడు నిమఁ బెట్టు మనుచు నీండ్రము సేయన్. భాగ. 8. 565. (ఈండ్రము సేయన్ - పీడింపను).

జ. ఈండ్రించు.

**ఈండ్రించు** స. క్రి. (√ఈండ్రము - త. సీణ్డు.) పీడించు, నలుఁగుడువెట్టు.

శా. ఈరీతిం గుమతోక్తులన్ జవని త మ్మీండ్రింప నారాటమున్, బోరాటంబు ఘనంబు లైన ...కాశ. 4. 50.

**ఈఁక - ఈఁకె.** వి. 1. పక్షిఱెక్క, పక్షము.

సీ. గలి యీఁక చట్టువ యొఱక డాకన నొప్పుఁ బక్షంబు...అం. భా. 2. 99.

2. పడి చెక్కలోని భాగము.

ఉ. తమ్ముఁడ నీవు నాకొలఁది తథ్య మెఱుం గక నాకు నీచభా, వమ్ము గుథంగిఁ జేసితివి వాసవ యి య్యదితి ప్రమాతవం,శమ్ముఖ అమ్ముఁ దాల్తు నొకసన్నపుటీఁకవ...భార. ఉద్యో. 3. 298.

చ. ...తోరమైనయాఁ,కలుఁ జెనుఁగండలుం దొరఁగఁగా ఖగదానవవీరులిట్లు మూ,ర్ఛలఁ బడి సోలుచుఞ్. భా. రా. అర. 2. 188.

**ఈఁకు** — ఇంకు. (బ్రౌ. శ. ర.).

**ఈఁకె(కియ)** — ఈఁక.

సీ. గఱులు చుఱుక్కన నెఱసంజకాఁక సోఁకిన వెఱఁగంది యీఁకియలు ముడుఁచు. ప్రబంధ. 59.

**ఈఁగ** వి. (తె. ఈ.) 1. మక్షిక.

ద్వి. లోఁగక తేనియలోఁ బడినట్టి, యీఁగల చందాన నెడఁబాయఁ గలరె. ద్వి. పరమ. 4. 272 పొ. 5 పం.

సా: ఈఁగకుఁ గా టీక పామునకు బలిపెట్టక.

వ. అదనంబుగా ధనంబు గూడఁబెట్టి యీఁగ కుం గాటీక పామునకుం బలి పెట్టక రట్ట వకుం దిట్టునకు నొడికట్టుకొని కట్టఁడులై పొట్టలు పోసికొందురు. వరాహ. 9. 123.

సా: ఈఁగకు ఇలి పామునకు బలిపెట్టఁడు.

2. తుపాకికిఁ జివర గుఱి చూచుకొనుట కేర్ప ఱచిన యినుపపూస.

సీ. గుఱి తప్పనీనియబ్బురపుఁజూడ్కులు వాఁడి యుక్కుటీఁగలమీఁద మూలుకొలిపి. రంగా. 3. 34.

జ: ఈఁగపులి.

**ఈఁగపులి** వి. (√ఈఁగ — తె. ఈప్పులి.) — ఈఁగ లకు పులివంటిది — 1. ఒకజాతి సాలెపురుగు.

సీ. పాదో ట్టవఁగ లూత పరఁగుఁ దద్భేదంబు దోఁచు నీఁగపులి విందుపురు వనఁగ. ఆం. భా. 2. 87.

2. సాలెపురుగు. (చి. ని.).

**ఈఁగు**[1] — నీఁగు. స. క్రి. (క. నీగు త. నీంగు.)

1. తొలఁగించు, పోఁగొట్టు.

సీ. గ్రాహనిగ్రహ మీఁగి కరిఁ గాచె నెవ్వఁడా త్రిభువనాధీశుండు దిక్కు నాకు. పాండు. 5. 189.

గీ. ఎల్ల భంగుల మాభంగ మీఁగు మభవ. భాగ. 6. 341.

2. (ఋణము, పగ, మొ.) తీర్చు.

ఉ. ఎందును నెవ్వరుం బడని యొంతయుఁ గష్టము పాటు వచ్చినఞ్,గొందల మంది పాండువిభు కోడలు దవ్వుల మన్నవన్ను గో,విందుఁడ కావు మంచుఁ బలవించుట యీఁగఁగ రాని యప్పువో,లెం దలపోయ వ్రేఁగయి చలిం పక యున్నది యెప్పుడుఞ్ మదిన్. భార. ఉద్యో. 2. 129.

ఉ. ఎచ్చరికం గళింగధరణీశుఁడు రుక్మి మొగంబు సూచి నీ,యొచ్చెము దీర్చుకో నిదియ యొప్పగువేళ బలుండు జూదమం, దిచ్చ గలండు గాని పొలు పెక్కువ నేర్పరి గాఁడు గాన నీ,కిచ్చు నవశ్యమున్ జయము నీఁగుము తొల్లిటఁ బడ్డ బన్నమున్. భాగ. 10 ఉ. 290.

**ఈఁగు**[2] అ. క్రి. 1. చొచ్చు, ప్రవేశించు.

క. ఈగంగాదికతీర్థము, లీఁగం గానీవు తమ సమిద్ధాంబువులన్, దోఁగెడువారల గనగనఁ గ్రాఁగెడు నంగారసింధు కల్లోలములన్. పాండు. 1. 150.

2. దాఁగు.

ఆ. పొదలఁ దూఱువారుఁ బుట్టలమాటున, నీఁగువారుఁ బరువులెత్తువారు. అచ్చ. రా. యు. 141.

**ఈఁచే** వి. కణిశవృంతము, ఊఁచ.

గీ...ఈఁచ యనఁగఁ, గణిశవృంతము చెలఁగును...ఆం. భా. 2. 286.

**ఈఁటె(టియ)** వి. (క. త. ఈటి.) కుంతము అనెడి యాయుధవిశేషము.

సీ...నేజ బరిచి యీఁటె యనంగఁ బరఁగుఁ గుంత,ము...ఆం. భా. 2. 217.

సీ. వంకుల జముదాళ్ల వాల్బల్లెములఁ గ్రుమ్మ వయికొని పెద్దయీఁటియలఁ బొడిచి. అచ్చ. రా. యు. 180.

సీ...దివము కాణోత్కరములఁ, గప్పుఁ డీఁటెల
నెలకట్టయలను బ్రేయుఁ దొడిసెల
కాండ్రము నొడ్డుఁ డెందు. హరి.ఉ. 1.83.

**ఈఁటెకాఁడు** విశే. (√ఈఁటె) ఈఁటె పట్టుకొని యుద్ధము చేయువాఁడు.

సీ...విచ్చుకత్తులవా రీఁటెకాండ్రట్ల వర్తిల్ల నిట్టి యేనుఁగులును జుట్టు మూఁడు, వేల యేనూఱును...నడవంగ. రామ. 208.

**ఈఁత¹** వి. (√ఈఁదు¹ - త. ఈఱు, ఈను.) ఈఁదుట.

సీ. శచి కీఁత గఱపుచుఁ జదలేట సురరాజు... మనుచ. 2. 11.

సా: ఈఁతకు మిక్కిలి లోఁతు లేదు.

సీ. వెలిచవు ల్గొమకాంత వెఱవదు నిందకు నీఁతకు మిక్కిలి లోఁతు లేదు. రామలిం. 47.

**ఈఁత²** వి. (త. ఈన్దు.) ఖర్జూరిక (వృ. వి.)

గీ. కొమ్మవం డ్లీఁతపండ్లును. కాశ. 8. 69.

సీ....ఈఁదాడు ఖర్జూర మీఁత నేల,తాడి ... హంస. 4. 11.

ఉ...ఈఁ దన నీఁత నాఁగ ఖర్జూరిక ... ఆం. భా. 2. 79.

సీ. ఈఁత చెట్టును లోఁతు నీఁత యనఁ దెలంగు ...సాంబ. 87.

జ. ఈఁతకాయ².

**ఈఁత³** వి. (√ఈను-త. ఈన్దల్.) ఈనుట. రా. వి. 8. 45.

**ఈఁతకాఁడు** విశే. (√ఈఁత¹) ఈఁదుడువాఁడు.

ద్వి. వఱదపోవు నెలుఁగు గొఱపడం బనుచు, నెఱుఁగక యీఁతకాఁ దేఁగి పట్టుడును. బస. పు. 8, 1137 పం.

**ఈఁతకాయ¹** – ఈఁదుఁగాయ.

ఉ. కోపనశాపవవ్యతిక గోల్మసఁగం గనుగంది ప్రమంది తత్తాపము వాఁపలేక తిమిధామ జలభ్రమిఁ గూలి తూలుజం, భాపహరాజ్య లక్ష్మి వెరవారఁగఁ దేల్పవె యీఁతకాయ రూపై పృథుకర్పరం బమర నాశ్రితరక్షణ దక్షదేవతా. పాండు. 2. 57.

**ఈఁతకాయ²** వి. (√ ఈఁత²). ఈఁత చెట్టుకాయ.

**ఈఁతకొట్టు** అ. క్రి. (√ ఈఁత¹) ఈఁదు.

**ఈఁద¹** – ఈఁదర. వి. 1. చలిగాలి.

గీ. నన్ను వదవద వణఁకించి నలఁపవలసి, వర్ష మిదె యీఁదయును దాను వచ్చె ననుచు. విప్ర. 3. 56.

గీ. ఈఁద యన నీఁదర యనంగ నెనఁగు శీత, వాయువు. ఆం. భా. 1. 60.

2. గాలి, వాయువు.

సీ. బలితంపుఁ జేడ్పాటు తొలుకరి యదను క్రొక్కార్ల కొన్నిరు దాలుపుగముల యీఁద అచ్చ. రా. బాల. 68.

జ. ఈఁదకొమరుఁడు, ఈఁదతూపు, ఈఁదర.

**ఈఁద²** వి. ఆయుధవిశేషము.

చ. పరశులు గొంతముల్ గదలు ... త్రిశూలము లీఁదలు మండలాగ్రముల్ ...కు.సం. 12. 786. (ఇది సబిందుకమనుటకుఁ గాని నిర్బిందుక మనుటకుఁ గాని తగిన ప్రమాణము లేదు).

**ఈఁదకొమరుఁడు** వి. (√ఈఁద¹)-వాయుపుత్త్రుఁడు-

1. హనుమంతుఁడు. అచ్చ. రా. సుం. 99.
2. భీముఁడు.

(ఇక్లో. ఈఁదచూలి, ఈఁదపట్టి. మొ.)

**ఈఁదతూపు** వి. (√ఈఁద¹) వాయవ్యాస్త్రము.

గీ. ...సోఁకుతోఁదు గుదియ, తాల్చుతూ పేసె నేసిన దాని నపుడె, రాకొమరుఁ డీఁదతూపేసి క్రమ్మఱించె. అచ్చ. రా. యు. 265.

**ఈఁదర** – ఈఁద¹.

**ఈఁదాడు** వి. బ. (ఈఁదు²+తాడు ? – సం. హింతాళః.) గిఱక తాటిచెట్టు.

సా: ఈఁదాడన్నను గోఁదాడను –ఒకఁ డొకటి యన రెండవవాఁడు తద్వ్యతిరిక్తముగానను; ప్రతికూలముగా ప్రవర్తించు.

క. మీఁదన్ వియోగసాగర, మీఁదం గలవా లతాంగి యే మెఱుఁగ వయో, యీఁదా డన్నను మదనుఁడు, కోఁదాడనువాఁడు బిగువు కొన సాగునొకో. విజ. వి. 2. 192.

**ఈఁదు¹** అ. క్రి. (క. ఈజు, ఈసు. త. నీన్దు.) ఈఁత కొట్టు, ఈఁదులాడు.

ఆ. జలముమీఁద నీఁదుసర్వంసహాకాంత,కెలమి మూఁపుదెప్ప యిచ్చినట్లు విక్ర. 6. 53.

ప. అగడ్తలో నీఁదుచిలువచెలువ. నీలా. 1.35.

వ. క్రి. (కాలుసేతుల సాహాయ్యముచే నద్యాదులను) తరించు, దాఁటు.

గీ. ఏచి మున్నీరు సేయీఁత నీఁద.భార.విరా. 4. 213.

వ. జననీ ముదిసి ముప్పుకాలంబున సుతశోక సాగరం బెట్లంగి నీఁదఁ గలదానవు. నైష. 1. 108.

గీ. ప్రళయకాలసముద్రముభంగిఁ బొంగి, కడు భయంకరుఁ డగుభీముఁ గడవ నీఁద,వశమె నాపుత్రులకు...భార. ఉద్యో. 2. 190.

గీ. ఎవ్విధంబున నీవల పీఁద నేర్తు. చిత్రభా. 3. 85,

వి. ఈఁదుట. (చూ. ఈఁదుఁగొయ్య, ఈఁదులాడు.).

జ. ఈఁత¹, ఈఁతకాఁడు, ఈఁతకాయ¹, ఈఁతకొట్టు, ఈఁదుఁగాయ, ఈఁదుఁగొయ్య, ఈఁదులాట, ఈఁదులాడు.

**ఈఁదు²** వి. ఈఁతచెట్టు.

వ. ...వేము పులుగుడు గురివెంద యీఁదు గేదంగి మోదు గారు కోరింద కనుము కానుగు మొదలగుపొదలన్ బొదువగు నానావిపినపాదపకలాపంబులును...మనుచ. 4. 37.

జ: ఈఁదాడు.

**ఈఁదు³** వి. చల్లఁదనము, తడి.

శా. తారాప్రోష్ఠులఁ గాలమూతుఁడు వియద్వారాశి వేఁటాడి ప్రాష్ణోరంభం బనుబుట్టఁ బెట్టి మలివాయం గుంచి యీఁ దాటఁ బెన్నారగా వైచిన జాలమో యనఁగ శోభాశించనత్వంబునన్, దారానాయకమండలం బమరె నస్త్రగ్రావకూటంబునన్. కాశ. 4. 96. (ఈఁద+ఆటన్ - అనియు విడఁదీయ వచ్చును.)

**ఈఁదుఁగాయ** వి. (√ఈఁదు¹) ఈఁదుటకు సహాయమగు సొరకాయ. (చూ. ఈఁదుఁగొయ్య.)

**ఈఁదుఁగొయ్య** వి. (√ఈఁదు) ఈఁదుటకు సహాయమగుమ్రాను.

గీ. ఈఁదుఁగొయ్యలు తెప్పలు నీఁదుఁగాయ, లరద లరిగోళ్లు పడవలు తరులు పుట్లు, చేపడవ లోడ లాదిగాఁ దెలఁగునట్టి,యంబుతరణంబులకు నెల్ల నధిపుఁ డతఁడు. హంస. 4. 182.

**ఈఁదులాట** వి. (√ ఈఁదులాడు) 1. ఈఁదుట. ప్రబంధ. 268.

**ఈఁదులాడు** అ. క్రి.(ఈఁదులు+ఆడు.) 1.ఈఁదు.

క. అది చాలక బ్రహ్మాండం,బుదితము గావించి బాహ్యమున నుదితం బౌ,నుదకమున నీఁదులాడఁగ, మదిఁ దలఁచుచు నుండె దితికుమారుం డధిపా. దశా. 3. 176.

2. ప్రేలాడు.

గీ. ఈఁటెపోటులఁ బడి ప్రేవు లీఁదులాడ. మనుచ. 4. 42.

**ఈకువ** వి. తడి, తేమ, ఆర్ద్రత. (చి. ని. శ. ర.).

**ఈకె** స. ఏ. (ఈ+అక) ఈమె. (చూ. ఆకె.).

**ఈకొను** స. క్రి. అ. క్రి – ఈయకొను.

**ఈకోలు** – ఈయకోలు.

సీ. ఇయ్యకో లొప్పికో లీకోలు మైకోలు ... నమ్మతిపేరు. ఆం. భా. 1. 104.

**ఈక్ష** సం. వి. అ. స్త్రీ. 1. చూచుట; చూపు. 2. పర్యాలోచనము.

**ఈక్షకుఁడు** సం. విశే. (అ. శా. అ.) చూచువాఁడు.

**ఈక్షణము** సం. వి. అ. న. 1. చూచుట; చూపు. 2. కన్ను.

**ఈక్షణిక** సం. వి. అ. స్త్రీ. దైవజ్ఞ, సోదెచెప్పునది.

**ఈక్షణికుఁడు** సం. విశే. (అ. అ. అ) హస్తరేఖలను జూచి శుభాశుభఫలములు చెప్పువాఁడు, సాముద్రికుఁడు.

**ఈక్షించె** సం. స. క్రి. చూచు. కళా. 8. 2.

(ఈక్షితవ్యము. ఈక్ష్యమాణము మొదలగునవి అవేక్షితవ్యము, అవేక్ష్యమాణము మొదలగువానివలె గ్రహించునది.)

**ఈక్షిక** సం. వి. ఆ. స్త్రీ. 1. కన్ను. 2. చూపు.

**ఈక్షిత** సం. విశ. (ఋ. త్రి. ఋ.) 1. చూచు వాఁడు. 2. ఆలోచించువాఁడు.

**ఈక్షితము** సం. విశ. (అ. ఆ. అ.) 1. చూడఁబడి నది. 2. ఆలోచింపఁబడినది. వి. అ. న. చూపు, దృష్టి.

**ఈగర** వి. జాడ.

క. కడు మేటి రైయినదొంచేఁ, బడినది మీసొమ్ము వెచ్చపడ నోపిననీ,గడ కొంత దివ్యవచ్చుఁగా, బెడిదపురొదచే ఘటింప నేర దొకటియుఁగా పరమ. 5. 57, 58.

గీ. ఇచట శుచిముఖ యనుహంసి యీగడ యొక, కొంత దొరకునో యంచు నక్కు-జమునందు, నొయ్యనిలిచితి...ప్రభా. 4.8.

**ఈగి** – ఈవి. వి. (√ఇచ్చు-త. ఈగై, ఈవు.) ఇచ్చుట; దానము, త్యాగము.

గీ క్రతువు నేఁత నేయించుట శ్రుతులు గాథ, నియతిఁ జదువుట చదివించుటయును ధనము, లీగి కొనుట షట్కర్మంబులు... భార. శాం. 5. 81.

సీ....దీనుఁడు విపద్బాధితుండు. గీ. నీగికర్తలు ...భార. శాం. 1.329. నైష. 4. 5.

**ఈగికాఁడు** – ఈవికాఁడు, విశ. (√ఈగి) ఇచ్చు వాఁడు, దాత.

**ఈగిచేయి** వి. (√ఈగి) – దాన మిచ్చెడిచేయి – కుడిచేయి.

సీ. అలరారుసిరిఁ దనయడుగునఁ గూర్చి గట్టిగ నీగిచేయి మాటకొనఁడేని. వసు. 1.34.

**ఈగిద్రుమము** వి. బొ. √ఈగి. (కోరికలు) ఇచ్చు చెట్టు, కల్పవృక్షము.

సీ. ఈగిద్రుమాన్వలె ఫలం బిడి జిగి దప్పక సురభి కైవడిఁ గొలు వరసి యీక. వరస. 5.19.

సీ. ఉలుపకై యీగిద్రుమాఁకుల చెంతకుమ దానె చని యిప్పు డాదుకొం డనఁగ వలసె.కువల. 1. 46.

**ఈగులకెంపు** వి. √ఈగి. (కోరికలు) ఇచ్చుకెంపు, చింతామణి.

సీ. నిగిడి యీగులకెంపు సెలకట్టు గలచోటఁ గల్పకావిరి కాయు క్రమ్ముచోట. పాండు. 3. 158.

**ఈచే** విశ. (క. ఈన్చు. త. ఇంచు.) 1. కుప్పింంచి నది, ఎండినది, సన్నగిల్లినది. 2. నిష్ఫలము, వ్యర్థము. (చూ. ఈచవోవు) వి. 1. కుష్క-పదము, వ్యర్థపదము. (ఇది కావ్యదోషము లలో నొకటి).

సీ. ...అతుకుఁబలుకు, లును పునరుక్తములును వట్టివూదెలుఁ గాకుదెనుంగులుఁ గటువు లీచ,లును...ప్రబంధ. 16.

2. వంకర.

ద్వి. కాలకౌశికుఁ డనఁగాఁ బేరువడసి, కా లీచఁ జనుచు...ద్వి. హరిశ్చ. ఉ. 490.

జ. ఈచవడు, ఈచవోవు.

**ఈచేవడు–ఈచేవోవు** (నిస్సత్త్వమగు).

క. కా లీచవడఁ జరింపుదు, నీలోకమునందు... పాండు. 2, 204.

సీ. కా లీచవడ నిండ్లకడ కేఁగి వవరుచుండెడు వాఁడు వైరాగ్యనిష్ఠుఁ డయ్యె. పాండు. 4. 210.

**ఈచేవోవు** అ. క్రి. (√ఈచే) 1. కుప్పింంచు, ఎండి పోవు, నిస్సత్త్వమగు.

సీ. బారకాళులు నీచవోయిన చేతులుఁ గోల మూఁపులు గుదిగొన్నతొడలు. ఉ. హరి. 2. 122.

సీ. పొఱటవీఁపు నీచవోయినచేతులు గుదియఁ బడ్డ మెడయుఁ గుందు కాళ్లు, గుజ్జు పొడవు నైన కోమలినొక్కతె గంధపాత్ర హస్తఁ గాంచె నెదుర. పద్మ. 9. 298.

2. నిష్ఫలమగు.

సీ. తతితోడ విత్తినఁ దఱచుగాఁ బండుఁ జే నెపుడైన విత్తిన నీచవోవు. నీతిసీ. 88.

**ఈమేకొనిపోవు** అ. క్రి. (పశువు) నెలలు నిండక మునుపు చెడిపోయినగర్భము కలది యగు.

**ఈటార్చు** స. క్రి. (√ఈటాఱు) తడిపోఁజేయు, ఆఱఁబెట్టు.

సీ. కసటు వోఁ దెలినీటఁ గడిగి యీటార్చిన పలలకపాయవల్కలముగట్టి. హర. 7.111.

గీ. వేణి యీటార్చి నుఱపొన్న విరులు ముడిచి. హం. 2. 107.

**ఈటాలు** అ. క్రి. నిర్ద్రవమగు, ఎండు.

సీ. జలము లూటలు గ్రమ్మ శశికాంత పాషాణ నికరమ్ము లీటాలి నీరు దివియ. పి. శకుం. 3. 202.

జ. ఈటార్చు.

**ఈటు** విశే. 1. వ్యర్థము. 2. శూన్యము (శ.ర.). జ. ఈటువోవు.

**ఈటువోవు** అ. క్రి. (ఈటు+పోవు) 1. శూన్యమగు. 2. వ్యర్థమగు. (శ. ర.)

**ఈట్టు(టు)** నం. వి. ౯. పుం. అధిపతి, ఏలిక.

**ఈడ¹** వి. (ఈ+కడ) ఇక్కడ, ఈచోటు.

మత్త. తోడఁబుట్టుగుకన్న నీవొగిఁ దోడునీడయి ప్రోవఁగా, నీడ నేకాద లేక యుండితి నింక మాతలిదండ్రులకా, జూడఁ బోయెద ... యయా. 3. 151.

మ. ... చోద్యంబుగా నీడకుం, జనుదెంచుం దరియించుఁ బల్కితి...దశా. 1. 176.

ఈడాడ—ఇక్కడక్కడ.

ద్వి. సీత యాకాశంబుఁ జెచ్చెరఁ బోవ, నేతెఱంగునఁ బోవ కీడాడఁ జూచి. రం. రా. అయో. 121 పొ. 12 పం.

**ఈడ²**—ఈడె. వి. పారావతము, ఎఱ్ఱకిత్తలి (వృ.వి.).

సీ. ఇంపుగాఁ బండిన యీడలనీడలఁ జెలువైన నుంపొన్న చెట్లవట్ల. శ్రీరం. 2. 268.

**ఈడ** నం. వి. అ. స్త్రీ. పొగడిక, స్తుతి.

**ఈడఁబడు** అ. క్రి. (√ఈడు³). వెనుకఁబడు, ప్రాఁతపడు.

గీ. ఏలయెన్నో తరంబుల నీడఁబడ్డ, పెద్దవావులు శోధించి గుద్దలింప, వారకాంతాజనములకు వావి కలదె. హర. 7. 128.

**ఈడఁబోవు** అ. క్రి. (√ఈడు⁴) వెనుదీయు, వెనుకకుఁబోవు.

శా. ఈడంబోవక వీఁకమైఁ బొడువఁగా నేపారు ఘోరాజి...భార. ఆది. 1. 69.

చ. ..కవ్వడి ద్రౌణియు నీడఁబోక య, త్తఱిఁ దఱుమంగ వస్త్రములు దందడి మార్కొని మండుమంటె ... భార. విరా. 5. 148. శాం. 5. 548. శివరా. 2. 39.

**ఈడకుఁడు** నం. విశే. (అ. తిక. అ.) స్తుతించువాఁడు.

**ఈడన** నం. వి. అ. స్త్రీ.—ఈడనము.

**ఈడనము** నం. వి. అ. న. పొగడుట.

**ఈడనీయము** నం. — ఈడ్యము.

**ఈడ(డా)ము**—ఈళము. వి. (త. ఈజము.) సింహళద్వీపము. (ఈద్వీపములో మంచినీలములు దొరకునని ప్రసిద్ధి)

గీ. ఈడము వళంద బందర యింగిలీషు,కళము మొదలైన పేఁటలగారు లెల్ల,సారభద్రవ్యముల తెరసార మాడఁ,బిలువ నంపిరి తమ తమ పేఁటలకును. హంస. 1.112. (ఈడము పేఁట—సింహళదేశమువా రుండుపేఁట.)

సీ. ఇందిరామందిరాతి కీడాపునీలంపు మేడచుట్టు ప్రహరిగోడ యనఁగ ... గీ. వేంకటాధీశు నురముపై వినుతి గనిన, వైజయంతిక మా కిచ్చు వైభవములు. రా. వి. 1. 4.

**ఈడయత్** నం. శత్ర. స్తుతించుచున్న.

**ఈడయమానుఁడు** నం. — ఈడానుఁడు.

**ఈడయిత** నం. విశే. (బు. త్రి. బు.) 1. స్తుతించువాఁడు. 2. స్తుతింపఁ జేయువాఁడు.

**ఈడవిడుచు** స. క్రి. (√ఈడు³) దిగవిడుచు; విడుచు.

సీ....కూర్చువా రొవ్వరుండు,వా రని తనకు నెవ్వరును గల్గక శివగ్గేచ్ఛ యెవ్వనిచేత నీడవిడువఁబడు... భార. అశ్వ. 1. 208.

గీ. ఈడవిడిచిన మేఁదిఁగ యింతవయము,గలిగి యున్నది వాడుక గలిగెనేని, యెంత నవకమై యుండునో యింతికనుచు, శివుఁడు గిరిరాజసుత విశేషించె నర్థి. కు. సం. 7. 888. (ఈడవిడిచినా—ఉపేక్షించినను)

**ఈడాడు** స. క్రి. (√ఈడు¹) ఎదిరించు,మార్కొను.

ద్వి. ఓడకోడకు దేవి యుగ్రరాక్షసుని, నీడాడి నీచెఱ నే విడిపింతు. రం. రా. అర. 181పొ. 5 పం.

**ఈడానుఁడు** నం. విశే. (అ. అ. అ.) స్తుతించుచున్నవాఁడు.

**ఈడిక** వి. (√ఈడు³) 1. గడ్డి మొదలగు వానిని దెచ్చెడి బండి పరమువంటి సాధనవిశేషము, సరవడి.

సీ. అలరుఁ దృణాద్యానయనసాధనవిశేషసంజ్ఞ యీడిక యన సరవడి యన. ఆం. భా. 2. 201.

2. విత్తనములు చల్లినతరువాత చేను చదును చేయుటకై ఈడ్చెడుకంప, కంపతోడుగు.

సీ.... తోడుగట్టు యీడిక నుడుము కంప,యనఁద వర్పును గంటకాదిభారము. ఆం. భా, 2.38.

**ఈడిగ** – ఈంద్ర. వి. (క. ఈడిగ, త. ఈఘ్రిఱ, ఈఘ్రువఱ.) ఈంద్రజాతి.

ఆ. పాలు నీడిగింటఁ గ్రోలుచు నుండెనా,మనుజు లెల్లఁగూడి మద్యమండ్రు. వేమన. 2. 168.

గీ. చిఱుతవగలాఁడి నీడిగ చిగురుఁ బోఁడిఁ, గాంచె నమ్మోని కన్నులకఱవుదీఱ. సురా. 44.

**ఈడిగి(గ్గి)లఁబడు** అ. క్రి. – ఈడిగిలు.

వ... జనకతనయ... హా రామ హా రామయనుచు నొక్కవృక్షం బిరుగేలం బట్టికొని యీడిగిలంబడి యున్న బెట్టదల్చి తరువు విడిపించి యెత్తుకొని వియత్తలంబున కెగసి పఱవం దొడంగిన... భా. రా. అర. 2. 147.

సీ. తిగిచిన రాక యీడిగిలంబడుచును లజ్జాలసత్వమున మల్లాడి యాడి. ప్రభా. 5. 28.

గీ. అఁకటను బోవఁ జాలవే వంగడింట, గంట తాకట్టుగా నుంచి కడుపునిండఁ, గుడువు మిచ్చుట నీడ్గిలఁబడి తెలాఱు,దాఁక నొఱలిన గలుగదు తథ్యమనిన. చెన్న. 2. 42.

**ఈడిగి(గ్గి)లు(ల్లు)** అ. క్రి. (√ఈడు³ – త. ఇఱుక్కుణ్.) ముందునకు రానని కూలఁబడు, చదికిలఁబడు.

గీ. మాటుకొనియును వెనుదిక్కు మరలి చని యుఁ, గూడి కేల్వట్టి తిగిచిన నీడిగిలియు, నలిగి బొమముడి చూపియు నాన లిడియుఁ, జాలఁ దరలతఁ గనియు రాఁ జాల కున్న. సీమంతి. 3. 176.

క. నిమ విడిచివఁ గొంపోయినఁ, బనితొదవలు లేమి పరిపొమపత్త్రిక చేఁ జిక్కినయది నీ వీఁక నీడిగిలిన నొచ్చుట మీఁదుమిక్కిలి వివేకింపఁగ. ప్రభా. 3. 145.

**ఈడిత** సం. విశే. (ఋ. క్రి. ఋ.) – ఈడఁబడు.

**ఈడితము** సం. విశే. (అ. అ. అ.) పొగడఁబడినది.

**ఈడితవ్యము** సం – ఈడ్యము.

**ఈఁడు¹** వి. (క. త. ఈడు.) 1. సామ్యము, ఉద్దీ.

క. చూచెదరు గాని సఖులు, నీచిన్ని కుమారకులకు నీమల్లుంకుగ, ఓచెల్ల యీడు గాదని, సూచింపరు పతికిఁ దమకు శోకము గాదే. భాగ. 10 పూ. 1351.

2. తాకట్టు, ఆధి.

సీ. ...ఈ దనంగను నాధి చెలంగుచుండు. ఆం. భా. 2. 229.

విశే. సమానము, సాటి.

ఆ. భూతములకు దుఃఖములు వాపికొనుటకు, నే విధములు గంగ కీడు గావు. భార.అను. 2. 106.

2. అనుగుణము, తగినది.

ఉ... ఎవ్వరున్, ధర్మజుపాటి గారవఁగ ధాత్రిఁ బ్రసిద్ధుఁడ నైనయట్టినీ, పేర్మికి నీడె దుర్దశల పెల్లునఁగుఁ దురపిల్లు టారయన్. భార. విరా. 1. 51, ఉద్యో. 1. 154.

3. శక్యము, తరము.

క. ఓడక నిమఁ బొగడఁగ నా, యీ దగుఁ గాదని తలంప కేవేదుఅనై, చూడవె పొగడెద వనియెద, వేడుక కారణము గాఁగ వెఱవక రుద్రా. శివ. సా. 9.

జ: ఈడాడు, ఈడుకోడు, ఈడువచ్చు, ఈడువాఁడు, ఈడునేయు, ఈడ్వడు.

**ఈడు²** వ. క్రి. (క. ఈడు – లాగు. త. ఈఱ్ఱు.) పిదుకు.

వ. గోవులకుఁ గ్రేవుల విడువకయు విడిచివిడిచి యీడకయు నీడియీడి యీడినపాలు కాఁపకయు... భాగ. 10పూ. 966. (శ.ర.పా.).

ద్వి. దూడ వచ్చిన నొండు దూడఁ గైకొలిపి యీడుదుఁ గ్రొత్తగా నీనినయావు. నవ. 1. 40 పా. 6 వం.

జ: ఈడుముంత.

**ఈడు**[3] అ. క్రి. 1. లాగు, ముందునకుఁ బోవు.
(ఈడిక, ఈడుచు శబ్దముల కిది ప్రకృతియై యుండును.).
2. వెనుకఁబడు.
(ఈడఁబడు, ఈడఁబోవు, ఈడవిడుచు, ఈడిగిలు, ఈడిగిలఁబడు శబ్దముల కిది ప్రకృతియై యుండును. దీనికి స్వతంత్ర ప్రయోగము కనఁబడలేదు.)

**ఈడు**[4] వి. 1. వయస్సు.
సీ. పలు తేఁడులకు నూడు బలియించి పొలియించి లలిఁ గేరుపంటవలంతి సరియె. గీ. యిద్వెలందుక కని తనయీడుచేడె, లందలును దెందముల నుబ్బి యాడుకొనఁగ. నీలా. 1. 52. విక్ర. 1. 116.
2. యౌవనము.
గీ. ...అలరు నీడు,పాయ మన జవ్వన మన యౌవనము శర్వ. ఆం. భా. 2. 117.
విశ. అనురూప మైన వయస్సు గలది.
(వ్యవ) ఆపిల్ల ఆతనికి ఈడు కాదు.
జః ఈడుమీఱు, ఈడేర్చు, ఈడేఱు.

**ఈడుచు(డ్చు)** స. క్రి. (√ఈడు[3] - త. ఇఴు.(ప్ర) లాగు, తిగుచు
సీ. శరభసింహామదేభసమితి నీడిచి తెచ్చి గట్టిగా దామెనఁ గట్టవైచు. ఉ. రా. 2. 147.
ఉ. ఏవురుఁ జూడఁగా సభకు నీడ్చెఁ గులాంగన నిట్లొనర్తురే. భార. ఉద్యో. 3. 110.

**ఈడుజోడు** విశ. (√ఈడు[1]) సమానము, సాటి.
గీ. కలిమి బలిమిని నీకు లోకములయందు, నీడుజోడును లేదుగా యింద్ర. దశా.2.80.
క. అవెంగళ మంత్రీశ్వరు, దేవికి శ్రీయాబ కాఖ్య తిలకవతికి రా,ధావిభుదేవేరియు నల,కావేరియు నీడుజోడు గౌరవకళలన్. పాండు. 1. 46.
ఈడుజోడాడు-ప్రతిఘటించు, మార్కొను.
(చూ. వీడుజోడాడు, ఈడాడు)
ద్వి. ... కిన్న, రేంద్రు మందిరముతో నీడుజోడాడి. రం. రా. అయో. 96 పా. ఘటికా. 2. 82. (ఈ రెండింటను ఔపమ్య ద్యోతకము).

**ఈడువు** వి. (√ఈడు[3] - త. ఇఴుప్పు.)
1. లాగుట, ఈడ్చుట.
సీ. శిబికావతంసరాజితపదాబ్జములకా యీడువు తొట్రుపాటెల్లిదములు. సారంగ. 3. 87.
2. విలంబనము (శ. ర.).
3. బ. కర్ణాభరణవిశేషము, బొగడలగొలుసు (శ. ర.)

**ఈడుమీఱు–ఈడేఱు.** అ. క్రి. (√ఈడు[4].) వయసు వచ్చియుండు, యౌవనము వచ్చియుండు.
సీ. ఈడుమీఱె ననంగ నీడేఱె ననఁగను వయసు వచ్చె ననుట వఱలు రెండు. ఆం.భా. 3.94.

**ఈడుముంత** వి. (√ఈడు[3]) పాలు పిదుకుపాత్రము (శ. ర.).

**ఈడుపచ్చు** అ. క్రి. (√ఈడు[1]) సమానమగు, సాటియగు.
గీ. ఇందుమతి యే మనఁగ వచ్చు నెంచిచూడ, నెందు మతిమంతు లతనితో నీడురారు. 4. 16,
మ. ...దాడిమీ, ఫలబీజాదులు సద్విజావయవ సౌభాగ్యంబుతో నీడురాఁ,గలవో లేవో యటంచుఁ జూచుగతి నాగ్రావంబునఁ ద్రిమ్మరుఁ. కాశ. 1. 100.

**ఈడువాఁడు** విశ. (√ఈడు[1]). సమానుఁడు.
గీ. పరమపావని విశ్వప్రపంచ జనని,వై ననిను వంటి కూఁతును గానలేరు,గాన నానాను పర్వులలో నవతస్య,వంతు లెవ్వారు నాయీడు వారు గారు. వరాహ. 6. 33.

**ఈడుసేయు** స. క్రి. (ఈడు[1]) పోల్చు సాటిచేయు.
ఉ దోసము గాదె యయ్యతివతోఁ జెలితో య్యలి నీడుసేసినఁ. కవిక. 3. 28.

**ఈడె–ఈడ**[2]. వి. ఎట్టికత్తలి (వ్య. వి.)
సీ. మీవండ్ల చెలు వూనుమేటిగుబ్బలుగల చేడియఁ గావరే యీడెలార. అచ్చ. రా. అర. 88.
గీ. ఈ డెలుంగనివిభుఁ జూపుఁ డీడెలార. భాగ. 10 పూ. 1015.

**ఈడేర్చు(ఱుచు)** స. క్రి. (√ఈడేఱు) ఈడేఱఁ జేయు.
(సిద్ధింపఁ జేయు.)

గీ. ఈనృపతికోర్కి లీడేర్పు మెట్టులైన. కళా. 5. 211.

(చరితార్థునిఁ జేయు, ధన్యునిఁ జేయు.)

ఉ. ...నీ వెవరయ్య నన్ను నీడేర్పఁ దలంచి మానవునితేవను వచ్చిన శంకరుండవో. పారంగ. 3. 185.

ఉ....ఇ,చ్చో రయమార మమ్ము నొక చొప్పున దుస్థితి నొందకుండ నీడేలువు మయ్య నేమము ఘటింపఁ గదయ్య ప్రసన్న మూర్తివై. వేం. పంచ. 1. 304. (ఈగ్రంథ మందు తఱచుగా ఉభయ రేఫములకు ప్రాసము కవ్పట్టుచున్నది.)

ద్వి. పృథివిజంతువుల నీడేలుచుకొలుకుఁ,బృథుల వేదార్థగర్భితములుగాఁగ. ద్వి. పరమ. 3. 175 పు. 11 పం. (చి. ని. పా.)

**ఈడేలు** అ. క్రి. (ఈడు[4]+ఏలు) 1. యౌవనము వచ్చియుండు.

క. ఏడన్నికొలమింటఁ, జూడము ముంగురులు గూడుచుఁ గొనబున ని,ట్లీడేఱి కట్టుదప్పిన, చేడియ కిఁకనైనఁ బెండ్లి సేయం దగదే. యయా. 3. 100.

2. వర్థిల్లు, పెరుఁగు.

సీ. గతిలక్షణము చూచి ఘనుఁడౌ ననిరి గాని యీడేఱఁ దని నాఁడె యెంచరైరి,యను పమాకృతిఁ జూచి ఘనుఁ డౌ ననిరి గాని కడతేఱఁ దని నాఁడె మడువరైరి. సారంగ. 3. 102.

మ. ... నా, తనయుం డెంతయుఁ బూఁట పూఁటకు సముద్యత్కాంతి నీడేఱఁగా. మైరా 2. 142.

3. సాంతమగు, పూర్తియగు.

ద్వి. ఏక్రియలందుమ నెడపడకుండ, నీక్రియ హాయమేధ మీడేఱుటయును. రం రా. బాల. 16 పు. 8 పం.

మ. ...సజ్జనుల్,పని యీడేఱకపోదురే సురభి మల్లా...మల్లభూ. నీతి. 71.

4. సిద్ధించు.

శా. ఈరీతిం గడు వేగ వాంఛితఫలం బీడేఱ ధన్యుండ...వరాహ. 7. 105.

సీ. తనకోర్కి లీడేఱ వను చొక్క పరువుతోఁ గలహాభోజి ముకుందుకడకుఁ జనువ. ఉ. రా. 2. 28.

5. సఫలమగు.

శా. ఏనుఁగ వేగమయేఁగి నాపడిపపా ట్లీడేఱ... కళా. 2. 64.

6. నెగ్గు, నిర్వహిల్లు.

క. అనుమాటలు చెవి నాటిన, ననుమానము మాని సొమ్ముఁ దలరుచు నవు డ,య్యను మానమధ్యఁ జేకొని,యెను మానసభవుని పంత మీడేఱంగఁ. ఉ. రా. 7. 471.

గీ. ఇతనితోడుత వైర మీడేఱ దనుచు, సకల ధరణికు లెవుడు నిచ్చక మొనర్చు. కువల. 1. 59.

గీ. ...కవాట,బంధన మొనర్చి తా నుండెఁ జాన్పుమీఁదఁ, బంత మీడేఱె ననుచున్న యంతలోన. శుక. 2. 125.

2. ధన్యుఁడగు, కృతార్థుఁడగు.

ద్వి. ఇలలోనిజను లెల్ల నీడేలుకొలుకు, సలలిత వేదార్థసార సంతతులు. ద్వి. పరమ. 3. 175 పు. 11 పం.

**ఈడ్యమానుఁడు** సం. విశే. (అ. అ. అ.) స్తుతింపఁ బడుచున్నవాఁడు.

**ఈడ్యము** సం. విశే. (అ. అ. అ.) పొగడఁ దగినది.

**ఈడ్వ(డువ)డు** అ. క్రి. (√ఈడు[1]) సమానమగు, సరిపడు.

చ. ... పనసలం బోలుచుం గలుగుండ్లతోడ నీడ్వడు పెనుఁబండ్లు...ఆము. 1, 68.

**ఈతఁడు—ఈతగాఁడు, ఇతఁడు.** స. పే. (క. ఈతం, ఈత. త. ఇవర్.) ఈపురుషుఁడు; ఈయన.

గీ. నిర్మలస్వాదు సలిలాంబునిధివిహార, మతివ యీతండు నీవును నాచరింపు. వైష. 5. 34.

**ఈతగాఁడు**—ఈతఁడు (శ. ర.).

**ఈతల**—వి.శే. (ఈ+తల — క. ఇత్తల్, ఇత్త.)— ఇవతల.

(ఈవలికాలము, పిమ్మట.)

కాశ. 2. 92.

**ఈతలాతలగు** (ఈతల+అతల+అగు)—తాఱు మాఱగు.

క. బలభేదిభిదురధారకుఁ, దలఁకని తనమాన
సంబు దర్పకబాణంబుల నీతలాతలైనం,
దలకొను తాపమున మహిషదానవుఁ
డాత్మన్. వరాహ. 11. 55.

**ఈతి** సం. వి. ఈ. స్త్రీ. 1. కొల్ల మొదలగు దేశోప
ద్రవము. 2. అతివృష్ట్యాది.

శ్లో. అతివృష్టి రనావృష్టి ర్మూషకా శ్శలభా
శ్శుకాః, అత్యాసన్నాశ్చ రాజానష్ష డేతా
ఈతయ స్స్మృతాః.

3. మారి మొదలగు రోగము, అంటుతెవులు.

4. ప్రవాసము, ఊరు విడిచిపోవుట.

**ఈదు** హిం. వి. పండుగ.

సీ. తురకలయీదునందు ముదంబుగల్గెనో భక్త
నితోద్యత్సవపరత మాని. సిం. నార. 8.

**ఈదృక్కు** సం. విశ. శ. ఇట్టిది. (రూ. ఈదృశము.)

**ఈదృక్షము** సం. విశ. (అ. ఆ. అ.) ఇట్టిది.

**ఈదృశము** సం. విశ. (అ. ఈ. అ.) ఇట్టిది.

**ఈన**—ఈనె.

సీ. ఈనగాగ్రంబున నీన గాఁడినయంత శిలనైన
మిన్నేలు పెలవకున్నె. ఉ. హరి. 2, 161.

**ఈనాము** హిం. వి. బహుమతిగా నిచ్చుద్రవ్యము.

సీ. కరిమయూరమరాళికలకు నొయ్యారమీనా
మిచ్చి పడవు సన్నంపు పడవు. వరాహ.
4. 159.

**ఈనిక** వి. √ఈను. (తిర్యగ్జడములు) ఈనుట, ఈఁత.

**ఈను** అ. క్రి. స. క్రి. (క. ఈన్, త. ఈను.)
(తిర్యగ్జడములు) ప్రసవించు.

సీ. మానుషీక్షీరంబు నీనినపదివాళ్లలోని ధేను
వుల పాలును వపేయ,ములు... భార. శాం.
1. 322.

క. ఎవ్వఁడు సచరాచరగురుఁ, డెవ్వని నాభి
సరోజ మీనె విధాతను. భార. శాం. 4. 218.

గీ. వేల యీనినతెలుఁగున వోలి వెపుడు, కడిమి
నెడ యీక తిరుగు మెకంబు లడవి.
యయా. 1. 106.

(వ్యవ) చేలు బాగుగా ఈనినవి.

స. క్రి. 1. కలిగించు.

సీ. రథసమాగమవనం రావంబు మేరు గహ్వర
ములఁ బ్రతిరవోత్కరము నీన. భార.
మహా. 48.

సీ. అవతంసకుసుమంబునం దున్న తుమ్మెదేఁటిరుతి
కించిదంచితశ్రుతుల నీన. మనుచ. 1. 5.

2. అమితముగా వెలువడఁజేయు, వెలువరించు.

చ... అనుమాలిపై, బడి గొన నమ్ము లీమహాఠి
కార్గ్ధ ధమర్గత... ఆము. 1, 8.

చ. చనుఁగవ యొప్పువెన్నడుముసన్నఁదనంబు
మెఱుంగు లీను మోము,మనఁ గలతేట... శుక.
2. 551.

సా: ఈనఁ గాఁచి నక్కలపాలు చేసినట్లు.

జ: ఈఁత, ఈనిక.

**ఈనుపెద్దు**—ఇనుపయెద్దు.

వ. ...నూఱు ఈనుపెద్దు. దా. శా. 1315.

**ఈనె(నియ)**—ఈన. వి. 1. సిర, ఆకులనరము.

చ. పరమవినీతి నాతి వెలిపావడచేఁ దడి యొత్తి
యొత్తిపై, పొరవడిమీనెయుం దిగిచి పొంక
ముగాఁ గొనగోరఁ ద్రుంచి... ఆకుమడు
పిచ్చిన... సారంగ. 3. 139.

వ. కదళీపలాశంబునడిమి యీనియ వుచ్చి.
హర. 2. 125.

2. చీలినయల్పభాగము.

చ. గొనికొని రాజు లేయుశరకోటి పరస్పర
ఘట్టనంబులన్, తునుకలు వ్రక్క లీనెలు
చిదుర్పలు తుత్తుమురై పడంగ... భోజరా.
5. 22.

**ఈనెకట్టు** అ. క్రి. (√ఈనె) ఈనెవలె పర్వడు.

ఉ. అత్తయొసంగ నొక్కకబళాన్నముగై కొని
వీటికారుచుల్, క్రొత్తమెఱుంగు లీమరద
కోరకముల్ గబళించి తెనివ, ల్లొత్తులు బట్ట
బైటనిడపోవుచు బాలెఱ నీనెకట్టఁగా,
సత్తరభాక్షి చూపులునిజాంఘ్రుల నిల్పుచు
వీథి నేఁగఁగన్. శుక. 1. 425.

**ఈనెగాజులు** వి. బ. కాలికాక్రీడావిశేషము. (బ్రౌ.)

**ఈన్పుయెద్దు**—ఇనుపయెద్దు.

వ. కొమ్మువివనమునం బెట్టిన ఈన్పుయెద్దు 50 టికి
నిత్యపడి (పతిచ్చు)... ద. శా. 1118.

**ఈపి** వి. వుంటిమీఁద ఈఁగ పెట్టినగ్రుడ్లు. (చి. ని.) ఈఁగమలము. (బ్రౌ.) ఈరు (శ. ర.)

ద్వి. ...మతిశ మీపిఁ బెట్టి వయ్యెడలఁదొడి తొడిఁ బురుగులు దొలువంగఁ జొచ్చె. వవ. 5. 244 పొ. 12 వం.

**ఈపె** వ. వి. (ఈ¹+అప్ప.-త. ఇవళ్.) ఈమె. (చూ. ఆపె.)

చ...ఇక్కవ లన్నదియవు,త్రులగుదు రిపెసాధ్వి యగు రూఢిగ...ఉ. రా. 8. 88.

**ఈప్స** నం. వి. అ. స్త్రీ. ఇచ్ఛ, కోరిక.

**ఈప్సితము** నం. విశ. (అ. అ. అ.) 1. కోరఁబడినది. 2. పొందుట కిష్టమైనది. వి. అ. న. కోరిక.

**ఈప్సువు** నం. విశ. (ఉ.) కోరువాఁడు.

**ఈబరి** విశ. అప్రయోజకుఁడు. (బ్రౌ.)

**ఈబరిగొట్టు**–ఈబరి. (బ్రౌ.)

**ఈబిడ** న. వి. (ఈ+బిడ్డ – త. ఇవళ్.) ఈమె.

గీ. ...ఈబిడారు మృగిమద శ్రీబిడారు. విజ. వి. 1. 130.

**ఈమిరి** వి. (క. త. ఈఱమ్.) కడి, ఆర్ద్రత్వము. (బ్రౌ.)

**ఈము¹**- ఇవము.

గీ. ....ఇవం బిగం బీము చలిమిరి చలి,జలుబు సీ తివతాళింపు చలువ యువక,యనఁగ శీతంబు గుడిగుటాఖ్యలఁ దగు హర. అం. భా. 1. 80.

**ఈము²** (ఇచ్చుధాతువుయొక్క వ్యతిరేకార్థకోత్తమ పురుష బహువచనరూపము.) భార. ఉద్యో. 4. 198.

**ఈమె** వ. వి. (ఈ¹+అమ్మ – త. ఇవ్వమ్మై.) ఈ పూజ్యస్త్రీ. ఈబిడ, ఈపె, (చూ. ఆకె.)

గీ. ఈమె యూ వని చుట్టంబు లెల్లఁ బొగడ. ఉరా. 1. 80.

**ఈయు¹**–ఈ². (ప్రార్థనాద్యర్థమందు మాత్రము 'ఈయ' అను నాదేశము రాదు.)

ఉదా: ఈయఁగలఁడు, ఈయఁడు, ఈయని, ఈయక, ఈయజా, మొ.

సీ. బలిమి నీయని భూమివలయపతుల ...భార. ఆది. 1. 7.

క. ఈయక...శుక. 2. 532.

మ. ఈయఁగ...ఇందు. 8. 14.

**ఈయ²**– ఇయ్య². చూ.

జ. ఈయకొను, ఈయకోలు.

**ఈయక(ఈక)** అవ్య. ఇచ్చుధాతువునకు వ్యతిరే కక్త్వార్థకరూపము.

**ఈయకొను**–ఇయ్యకొను, ఈకొను. చూ. (√ఈయ²)

**ఈయకోలు**–ఇయ్యకోలు, ఈకోలు. చూ. (√ఈయకొను.)

**ఈయది**–ఇయ్యది, ఇద్ది, ఇది. న. (ఈ¹+అది)ఇది.

క...యశః,పూర్ణులు మీరలె యీయది,నిర్ణయ మని పలుకఁ దగునె నిండిన సభలోన్. విక్ర. 1. 151.

**ఈయన** న. వి. (ఈ¹+అన) ఈతఁడు.

క. ఈయనతో రణ మిప్పుడు,సేయఁగ మది గొల్పదు...భార. భీష్మ. 2. 252.

**ఈయమ** న. వి. (ఈ¹+అమ)–ఈమె.

క. ఈయమ నీకోడలు...హరి. ఉ. 8. 206.

**ఈరకుఁడు** నం. విశ. (అ. రికా. అ.) 1. చెప్పు వాఁడు. 2. ప్రేరించువాఁడు.

**ఈరణ** నం. వి. అ. స్త్రీ. 1. ఈరణము, పురికొల్పుట. 2. గతి, పోక.

**ఈరణము** నం. విశ. (అ. అ. అ.) ప్రేరకము, పురి కొలుపునది. వి. అ. పుం. గాలి. న. 1. ప్రేర ణము, పురికొల్పుట. 2. గతి, పోక 3. ఇర ణము, చౌటనేల.

**ఈరణీయము** నం. – ఈర్యము.

**ఈర(ఱ)మి** వి. కొంపము, తీఁగలు ఆకులు మొద లగు వానిగుంపు.

వ పొదరిండ్ల యీరమిమయుంగున వారిసల్లా వంబు లాలకించుచుం జని...కళా. 1. 62.

వ. ఇక్కడ నొక్కచిగురుంబొదరుటీఱమి నిడి వదాన...ప్రభా. 1. 137.

2. సాంద్రత, తఱచు.

ఉ....కన్నుగోవలం,దంకురితంబులై వదరవాప లవంబులు పద్మనేత్ర యుత్సింకులు సేసెఁ

బత్మ్మములయీఅమిఁ గాటుకచిమ్మచీఁకటిన్.
  నై ష. 7. 193.

వి॰. సాంద్రము, దట్టమైనది.

చ. అరుదుగఁ దమ్మభూవిభునియన్నని దాడికి
  వోడి శాత్రవుల్, దిరుగనిడొంకలుం బడని
  తెక్కలిలెంకులుఁ బాదచారులై, యెటుఁ
  గని కానలుం జొరనియీఅమికోనలు భీత
  చిత్తులై, సురుఁగని క్రోవలు న్నిలువఁ
  జూడని క్రేవలు లేవు భూస్థలిన్. వి.పు. 1.44.

**ఈర(అ)ము** వి. (క. ఈర. త. ఈరమ్. మ. ఈరమ్.)
  పొద, కుంజము.

  ద్వి. వీరముల్ మెచ్చుచు భేదింప రాని, యీర
    ముల్ చొచ్చుచు....రం. రా. అర. 150పొ.
    80 పం.

  క. ఈఅము లాఅట నొందక, తూఅుచు ... వేం.
    పంచ. 4. 271.

  వి॰. సాంద్రము, దట్టము.

  గీ. తఅచు వెన్నెలగుంపులఁ దారితారి, యీఅ
    మగు వెన్నెలలలోనఁ దూఅితూఅి, పలుచ
    నగు వెన్నెలలలోనఁ బాఅిపాఅి, మెలఁగెఁ
    జెక్కు చకోరంపుఁబులుఁగుగములు. విక్ర.
    6. 71.

  ఉ. ఈరపుమోకమావిగమియిక్కువ గొజ్జెఁగ
    లందు జాఅుప, న్నీరులయేట .... కవిక.
    3. 115.

**ఈరయత్** సం. విక్రి. 1. చెప్పుచున్న. 2. ప్రేరించు
  చున్న.

**ఈరయమాణము** సం. వి॰. (అ. ఆ. అ.) 1. చెప్పు
  చున్నది. 2. ప్రేరించుచున్నది.

**ఈరయిత** సం. — ఈరిత.

**ఈరయితవ్యము** సం. — ఈర్యము.

**ఈరస**—ఈరసము.

(కోపము)

  మ....వ్రేయున్ వడిం జీరు నీఁరసతో నొంచుఁ
    బరాభవించుఁ గలఁచున్ రౌద్రంబుతోఁ
    దాఁకు...భా. రా. యు. 1974.

**ఈరసపడు** అ. క్రి. (√ఈరస) ఈరసము నొందు.
  (అసహనపడు)

  క. నారూపమునకు మదిలో, నీరసపడుచున్న
    వాఁడు హృదయేశ్వర...కాశీ. 4. 152.

**ఈరసమాడు** స. క్రి. (√ఈరసము) నిరసించు,
  తిరస్కరించు.

  క. కుందనపుఁ గాహళంబులు, పొందెలుఁగక
    యెన్ని బిరుదములు పలికినఁ ద, మ్మంద
    దుకు లనుచు నాలిక, నిందీవరనయనజంఘ
    లీరసమాడున్. వరాహ. 11. 44. (ఇట
    నౌపమ్యమును దెలుపును.)

**ఈరసము**—ఈరస. వి. (సం. ఈర్ష్యా.)

  1. ఓర్వ లేకపోవుట, అసహనము.

  గీ. బుద్ధిమంతులవలన దుర్బుద్ధు లధికు, వలన
    హీనులు రూపసివలనఁ గొనటి, వా రమా
    యలు సేయుదు రీరసమున, నింత యెఱు
    గంగ వలవదే యీవు కొడుక. భార. శాం.
    3. 70.

  2. ద్వేషము, పగ.

  క. పెక్కంద్రతోడ నీరస, మొక్కతఱిన కొనక
    తఱిఁగియున్న పగతుతో, సుక్కాఁడి బంధు
    భావముఁ, దక్కటిపగఅయెడ వలయుఁ
    దా నెఅపంగన్. భార. శాం. 3. 25.

  ఆ. కొడుకు తండ్రిమాటఁ గొనక యీరసమున,
    నడచునేని వాఁడు కడిఁదిదాయ, గావఁ
    బగతుఁ జంపఁగాఁ దగుఁ బగవాని, పక్షమైన
    వారు పగఅ కారె. నృసింహ. 4. 26.

  3. కోపము.

  ఉ. ...సారథి...హితం బెఱిఁగించుట నీతి గాన
    నీ, వీఁ స మె త్తినోఁ బలికి తేనియుఁ దెప్పుదు
    సూతనందనా. భార. కర్ణ. 2. 52.

  మ. సుకవిత్వంబె ప్రభుత్వ మీరసమె ద్వేషుల్
    కొండెకాఁడే మహా, హి కరం బొర్మ్మియె
    జోడువిద్యయె ధనంబు....మల్ల భూ.నీతి.17.

  (మూలము: కిమరిభిః క్రోధో స్తి చేద్దేహినామ్.)

  4. చలము, పట్టుదల, మాత్సర్యము.

  సీ. ధరణిఁకుఁ దనరాదు తనకు నోడితి పన్న
    దాఁక నీరసమున వీఁకఁ జూపుఁ.గీ. కాయపు
    నెలంత యనరాదు పాపమునకు, భయపడక
    యెట్టులైనను బట్టి కలయు. ఉ.రా.3.101.

**ఈరసించు** అ. క్రి. (√ఈరస) ఈరసమునొందు. (కోపించు)

ఉ. ...అహా విభుఁ డీరసించెను గదయ్య నిమి త్తము లేమి నీవయిన్ వేం. పంచ. 1.488.

**ఈరాఱు** స. (√ఈరు³) పండ్రెండు.

గీ. వరఁగు నీరాఱు పండ్రెండు వార యనఁగ. ఆం. సం. మాన. 43.

**ఈరిక**¹ వి. అంకురము, మొలక.

సీ. మొలక మొలవ మొక్క మోక మోసిరిక మొటిక నా నంకురం బొప్పుచుండు. ఆం. భా. 2. 85.

జ: ఈరికలెత్తు.

**ఈరిక**² – చీరిక. వి. (త. ఈరి.) గుడ్డపేలిక.

సా: ఈరికలవంటి గుడ్డలు ముత్యాలవంటిబిడ్డలు గలది. (మొక్క జొన్న పొత్తి).

**ఈరికలెత్తు** అ. క్రి. (√ ఈరిక¹.) అంకురించు, మొలచు.

సీ. ఎలమితోఁ గోరిక లీరికలెత్తిన సరణి మేఁ బులకలు జాదుకొనఁగ. విక్ర. 1. 122.

ఉ. ఎచ్చటఁ గంటిరో విజయునిక్కువ నిక్కువ మౌనె రాఁడుగా, యిచ్చటి కంచుఁ గోరికలు నీరికలెత్త రవోక్తిఁ బల్కఁగా...విజ. వి. 2 167.

**ఈరిణము** సం – ఇరిణము.

**ఈరిత** సం. విశే. (పు. స్త్రీ. పు.) – ఈరకుఁడు.

**ఈరితము** సం. విశే. (అ. అ. అ.) 1. ప్రేరింపఁబడినది. 2. వేయఁబడినది, త్రోయఁబడినది (బాణాది). 3. చెప్పఁబడినది.

**ఈరితవ్యము** సం – ఈర్యము.

**ఈరు**¹ వి. (క. ఈరు, ఈర్. త. ఈర్–బ. ఈరులు, ఈకులు, ఈళ్లు) పేనుగ్రుడ్డు, లిక్ష.

గీ. ఎలయు సీత్కారములతోడ నీళ్లు గ్రుక్కి, యంటుసంటులు పరికించి యంట్లఁ బొడిచె, గోరుముక్కుల దిగదువ్వి తూరుపెత్తి, వెఱులఁ గలిగిన పేల నన్నింటిఁ నిగిచె. పాండు. 3. 30.

ఈరు దువ్వఁగఁ బేనువచ్చును – కొంచెము కదలిచిన నంతయు బయలుపడును. (తీఁగఁ దీసిన డొంక కదలును – అనుదానివంటిది).

ఆ. మీర లూరకుండ రీరు దువ్వఁగఁ బేను, వచ్చుననుట వినరె వనితలార, యూనపెట్టి యడుగ మాన రాదిఁకఁ జెప్పవలసె మీర హాస్యవర్తనములు. ప్రభా. 5. 78.

జ: ఈరుచు, ఈరుపెన.

**ఈరు**² విశే. అల్పము, హీనము. (చూ. ఈరెండ, ఈరెలుఁగు.).

**ఈరు**³ స. 'రెండు' శబ్దమునకు వృత్తిలో అజాది సంఖ్యావాచకము పరంబగునపుడు ఆదేశముగా వచ్చునది. (చూ. ఈరేడు, మొ.).

జ: ఈరేడు, ఈరేను, ఈరైదు. మొ.

**ఈరు**⁴ స. 'ఈవు' నకు బహువచనరూపము. భార. అశ్వ. 3. 78.

**ఈరుచు(ర్చు)** స. క్రి. √ఈరు¹. (ఈర్పెనతో ఈళ్లను) ఈడ్చు, దువ్వివైచు.

**ఈరుపె(ర్పె)న** వి. (√ఈరు¹) ఈళ్ల నీర్చెడిదువ్వెన.

గీ. వెలయు లిక్షావికర్షి యీర్పెన యనంగ. ఆం. భా. 2. 168.

**ఈరువు** వి. ఎఱచి, మాంసము.

క. ...పొల యీరు వెఱచి నంజుడు, పొలసన నివివరఁగు మాంసమునకు మహేశా. ఆం. సం. 3. 18.

**ఈరె** వి. వంచెను చుట్టి తీసిననూలు.

**ఈరెండ** – నీరెండ. వి. (√ఈరు²).

లేఁతయెండ, కొంచెపాటియెండ.

శా. ఓరుంగంటి పురంపుసౌధములపై నొప్పారెడిన్ జూచితే, యీరెండల్ మణిహేమ కుంభములతో నేకాంతముల్ సేయుచున్. క్రీడా. 65.

సీ. కెంపులో పవడంపుగుంపులో యీరెండ సొంపులో యీమేటిజోగిజడలు. పాండు. 4. 287.

**ఈరెలుఁగు** వి. (√ఈరు²) హీనస్వరము.

చ. ...వండఁ గుంది యీరెలుంగువఁ దమ వానిఁ బిల్చుచు శకుంతము లయ్యెడ నిల్చె మ్రాఁకులన్. పారి. 4. 21.

ఈరెలుఁగుపడు – హీనస్వరము కలవాఁడగు.

గీ./ ఏరసి వ్రాలినలోము లెత్తి పరమవృద్ధు,తల
వడంకఁగ నొయ్యొ నీరెలుఁగువడుచు ....
శివుని కారుణ్య మనుచు నాశీర్వదించె.హర.
2. 48.

**ఈరేడు** న. (√ఈరు²) పదునాల్గు.

గీ. ఏను విల్లందుకొనిన నీరేడుభువన,ములును
వడవడ వడఁకు...భార. విరా. 4. 219.

క. కారలకు నగ్రగణ్యుం,డై రవి సంవర్త
సమయ హవ్యవహశిఖా, దారుణకరముల
భువనము, లీరేడును వేఁచిపోఁత నెఱిఁగి
నథయుతై. వరాహ. 6. 103.

**ఈరేను** న. (√ఈరు) పది.

ఉ. ఓవరనాథ యిద్ధగతి నొక్కనిశాచరుఁ డాన
నంబు లీ,రేను ధరించినాఁడు నను నెక్కటిఁ
దోకొని పోవుచున్నవాఁడు...భా. రా.అర.
2. 108.

**ఈరైదు** న. (√ఈరు³) పది.

మ. ...ధర్మసుతుఁ డీరైదమ్ము లమ్మద్రనా,
యకుపై నన్నియుఁ బిన్నతమ్ముఁడును
దోరై నాట నాటెం గడుఁ. భార. శల్య.
1. 226.

**ఈర్మము** సం. వి. అ. పుం. న. వ్రణము, పుండు.

**ఈర్య** సం. వి. ఆ. స్త్రీ. 1. ధాన్యమౌనాది రూపమగు భిక్షుకచర్య. 2. ఈర్ష్య. (వాచ).

**ఈర్యమాణము** సం. విణ. (అ. ఆ. అ.) 1. చెప్పఁబడుచున్నది. 2. ప్రేరింపఁబడుచున్నది.

**ఈర్యము** సం. విణ. (అ. ఆ. అ.) పురికొల్పఁ దగినది, ప్రేరింపఁ దగినది.

**ఈర్వారువు** సం. వి. ఉ. పుం. స్త్రీ. ఉర్వారుకము, దోస (వృ. వి.).

**ఈర్ష్య** సం. వి. ఆ. స్త్రీ. అసూయ, ఓర్వలేమి.

**ఈర్ష్యకుఁడు** సం. విణ. (అ. ర్షికా. అ.) 1. ఈర్ష్య గలవాఁడు. 2. పరులసంగమముఁ జూచినఁగాని సంభోగేచ్ఛ గలుగని యొకవిధమైన నపుంసకత్వము గలవాఁడు.

**ఈర్ష్యత్** సం. శత్ర. అసూయపడుచున్న.

**ఈర్ష్యాలు(కు)వు** సం. వి. (ఉ.) ఈర్ష్యపడువాఁడు.

**ఈర్ష్యితము** సం. విణ. (అ. ఆ. అ.) అసూయ పడినది.

**ఈర్ష్యుఁడు** సం. విణ. (అ. ఆ. అ) ఈర్ష్యగలవాఁడు, అసూయపడువాఁడు.

**ఈర్ష్యువు** సం. విణ. (ఉ.) — ఈర్ష్యుఁడు.

**ఈఱకాఱు** వి. (ఇది బహువచనముగాఁ గూడఁ బ్రయుక్తమై యున్నది). డోలావచ్ఛలనము, ఉయ్యాలవలె నూఁగులాడుట.

క. పెనుగాలిఁ దూలు మేఘం,బును బోలెను
బలివిభుని భూరిబలమువం,దన కెట్లు నరుగ
రా క,ద్దనుజు రథము దిరిగె నీఱకాఱల
నడలన్. భా. రా. అర. 2.124. (చి.ని.).

విణ. 1. కాఱుమాఱైనది; వక్రము.

గీ. వంక యైనతలం పెల్ల వసుమతీశ,యరయ
మృత్యుపదం బగు నార్జవాన్వి,తంబు
బ్రహ్మపదం బింత తథ్య మేల,యీఱకాఱు
తలంపులు బీఱువాఱు. భార. అశ్వ.1.108.

గీ. బహువిధంబులఁ బలుకుచాపలుకు లెల్ల,
చెవిటి కైవడిఁ దనపెడచెవులఁ బెట్టి,యీఱ
కాఱులు మఱుమాట లిచ్చి యపహ,సించె
దుర్యోధనుఁడు వేయుఁ జెప్పనేల. భార.
ఉద్యో. 4. 76. (చి. ని. పా.).

గీ. ఈఱకాఱు లనంగను దాఱుమాఱు,లు.
అం. భా. 3. 29.

2. పరుషము, కఠినము.

గీ. మరలె దుర్మర్షణుఁడు తోన తెరలె సేన,
యపుడు సమ్మోటకోలల వంకుశములఁ,
జేలుకోలల వ్రేటుల నీఱకాఱు, యదలు
పుల వాహనంబులు సెదరి పఱచె. భార.
ద్రో. 3. 48.

ఆ. బాల ముద్దరాలు పసిగాపు గసుగందు,కూన
ముద్దుగుమ్మ గోల యబల, యీఱకాఱు
లాడ నెట్లు నోరాడెనో, రామరామ నిరప
రాధనుమ్మ. కృ. శకుం. 3. 24. (ఇట
పరుషవచనములు)

**ఈల** వి. (త. ఈచల్.) 1. (వేఁటకాండ్రు దొంగలు మున్నగువారు) సంకేతముగా నోటితోఁ జేయు ధ్వని.

గీ. ...ఈల, యవఁగఁ దన్కర సంకేతనినద మెసఁగు. ఆం. భా. 1. 122.

ఉ. ...ముకుందవేణుకలనాదపు టీలకు లేటి మొత్తమై, త్రెళ్ళ్కెనుకాఁకచే నడికిరే లరుదెంచిన గోపికావళిఁ. ఆము. 5. 68.

ఈలవెట్టు – సంకేతముగా నోటితో ధ్వనిచేయు.

గీ. ...వాఁ డిందు రండని త్రోవ యడవిఁ, బెట్టె యొకవాఁగు డిగ నీలవెట్టుటయును. ఆము. 6. 78.

ఆ. పీఁకె వెట్టి యీలవెట్టుచు బడిబడిఁ, బాలు తెంచి చుట్టువాలుకొనిరి. సారంగ. 3. 28. (ఇల్లే ఈలవేయు.)

2. చిమ్మటకూఁత. (శ. ర.)

3. ఈలపెట్టుట కుపయోగించు సాధనము.

శా. ఈల ల్వీఁకెలు దిక్కులం జెలఁగ. కాశీ. 3. 58.

జః ఈలకూఁతలు, ఈలగ్రద్ద, ఈలపురుగు.

**ఈలక(ల్క)ఱచు** – ఇలకఱచు.

(అ. క్రి. ప్రాణములు బిగఁబట్టు.)

క. పొదవునకు వెగసి యొప్పటి, పడమటి దెస నిగిడి పెలుచఁ బఱచినఁ గూడం,గడు రయమునఁ జని యంచం, గడవం గా కీలకఱచి కాకము పాఱుఁ. భార. కర్ణ. 2. 68.

వ. ఇట్లు సన్నిహితవిశేషవేదనాజాతభేదంబున నారాటంబు పుట్టి యడియాసపసనుసులు పరిత్యజింపఁ జాలక యీలకఱచుకొని యొడతెగక నిగుడునమందోష్ణ నిశ్వాసమాతరిశ్వంబున. వేం. పంచ. 3. 187.

చ. పడి వడి యాన మీల్కఱచి పట్టుచు వాఁడుమ నెట్టకేలకుఁ,వడిగొని... భా. రా. యు. 996.

**ఈలకూఁతలు** వి. బ. (√ ఈల) బాలక్రీడా విశేషము.

గీ. ఏలపాటలు సరిబేసు లీలకూఁత, లాదిగా శైశవక్రీడ లాడిరచట. వి. పు. 7. 208.

**ఈలకూర** వి. ఒకజాతి ఉప్పనికూరాకు. (వృ. వి.)

సా: అలి నొల్లనివానికి ఈలకూరలో ఉప్పు చాలదు. – దోషమున కవకాశము లేకున్నను దోష మారోపించుటను తెలుపును.

**ఈలగ్రద్ద** వి. (√ఈల.) ఈలవేసెడు గ్రద్ద, ఒకజాతి గ్రద్ద.

ఆ. పిట్ట గాదు కోడిపిల్ల గాదు, కొట్టె బట్టు పట్టుకొనిపోవఁ బసిబిడ్డ, లేడ నీలగ్రద్ద లేడఁ జెపుమ. వేం. పంచ. 1. 782.

విశే. లోభి.

ఆ. ఏము నలువురందు నెవ్వాఁడు గాఁజాలు, నిచ్చిపుచ్చుకొన్న యీలగ్రద్ద, మాకు నింపు గావు మాను మీసుద్దులు, కలహముల మొగంబ కలియుగంబ. నైష. 7. 107.

**ఈలపురుగు** వి. (√ఈల) – ఈలవలె ధ్వని చేయు పురుగు – ఝిల్లి, ఇలకోడి, చిమ్మట.

**ఈలి** సం. వి. ఇ, ఈ. స్త్రీ. 1. కరవాలిక, చిన్న కటారి. 2. చిన్నగదవంటిచేతికఱ్ఱ, దుడ్డుకఱ్ఱ.

**ఈలిక** సం. వి. అ. స్త్రీ – ఈలి.

**ఈలుగు(ల్గు)** అ. క్రి – నీలుగు.

(మరణించు, చచ్చు.)

ఉ. ...వాలి మదంబున వచ్చి యోట లే,కివగ మెప్పు డెక్కు నపు డీలుగుఁ బొమ్మని శాప మిచ్చె... భా. రా. కిష్కిం. 165.

గీ. ఇత్తెఱంగున నిజపుత్రుఁ డీల్గుటయును. భార. భీష్మ. 2. 196.

వి. గాత్రవినామము, ఒడలువిఱుచుకొనుట.

సీ. ...గాత్రవినామంబు గనుపట్టు నీల్గన. ఆం. భా. 1. 141. (ఇట 'నీల్గు' అనియు ఛేదింప వచ్చును.).

**ఈలువు** వి. (క. ఈలు. త. ఇయల్పు – మంచి నడత.)

1. కులాచారము.

గీ. ఇవ్విధంబున సుకుమారుఁ డీలు వుడిగి, మాల చిగురాకుఁ బోఁడితో మనువు మనఁగ, వచ్చె నొయ్యన మధుమాసవాసరములు. శివ. రా. 3, 117.

2. సత్ప్రవర్తనము, మంచినడవడి.

ఉ. ఈలువువంగడంబు గల దీజవరా లని యోలిరొక్కరో,క్కలిడి యొట్టి బంకు తడకఁ బరియించితి. వేం. పంచ. 4. 507.

3. మానము, చిత్తసమున్నతి.

ఉ. కొమ్మపదారవిందములకుం బ్రణమిల్లె విభుండు మేనఁ గం,పమ్ము దలిర్ప నప్పడఁతి

పాపము గట్టకు పార్థివేంద్ర నీ, విమ్మోయి నివు వేగవడి యీాలువుపెం పెడలించి పోవఁగాఁ, విమ్మటిమాట కోర్వ వనుఁ బెండిలిగ మ్మటులైన మేలగుణా. భో.జరా. 7. 118.

చ...లలనానలినా స్త్రుఁడ వీవు నిమ్నుఁ గ,న్గాని నలతాంగి యీాలువు మనోభవుఁ ది.తకుఁ గొల్లలాడఁడే. వసు 3. 87.

4. పాతివ్రత్యము.

చ. మరుఁ బరిమార్చి...యా,తరుణులయీాలువుల్ చెఱిచి తాపసులణా బెడఁబాచి...కు. సం. 10. 529.

క. గక్కసిమగువుల యీాలువు; మొక్కపఱిచె దీవ...పారి. 1. 50.

గీ. పాలనుమేఁతరిక్రొన్నవఁబోఁడి తెగల, యీాలువులు మొక్కపఱిచియు మేలికత్త. లానిపై నెక్కి మొనసి పాలసుల నెల్లఁ, జీదుమఁగల బల్లిదుఁడ వీవె గదవె తండ్రి. అచ్చ. రా. బాల. 159.

జ: ఈలువుటాలు.

**ఈలువుటాలు** వి. బ. (ఈలువు+ఆలు). పతివ్రత, సాధ్వి.

సీ...అమరుల యీాలువుటాండ్రను జెఱవట్టితి. భార. అర. 7. 61.

క. పతి యున్నను బతి చచ్చిన,నితరులఁ దాఁ బొందకున్న యీాలువుటాలి,కీర్తిఁగీర్తియుఁ బిమ్మటఁ బా,ర్వతితోడ సతీత్వమును ధ్రువం బుగఁ బడయుణా. విజ్ఞా. ఆచా. 115.

చ. ఇలు గలనైన వెల్వడని యీాలువుటాండ్రకుఁ దాపికత్తెవై ...ఆము. 5. 70.

**ఈశ(శా)ము** — ఈడము.

సీ. ఈశంపునీలంపు మేలికంబంబులు కులశైల జాలంబుకొమరు దాల్చ. అహ. 1. 80.

రగడ. తళుకుఁడుమ్మెదతాళికగు నని తలఁపు మీ యీాశాపునీలము. శుక. 1. 138.

**ఈవ** — ఈఁగ.

గీ. ఈవ యీాఁగ యవఁగ, మశకకు నొప్పు. సాంబ. 88.

**ఈవరి** విశే. (ఈవి+అరి) ఇచ్చువాఁడు, దాత.

క. సిరిరాచవేల్పు కడు నీ,వరితనమున నీటి దాల్పు వలమురిసుడివాల్, దొరవంటి యొప్పు గలదే, వర జాణ యమీనుఖాన వలపుల తేఁడా. యయా. 5. 1.

**ఈవల** — ఇవల.

(ఇవతలియొడ్డు.)

చ. అలయక సప్తవారిధుల నావలి కీవలి కొక్క రితిగాఁ, గలయఁగ నీఁదవచ్చును నగంబుల నచ్చనగండ్లుగాఁ గరం,బులఁ గొని యాడ పచ్చు. సీతారా. 3. 89.

(ఇక్కడ)

ఉ. దేవర నేఁడు కొల్వున మదింగడు నెంతయు సంతసించి సం,భావన మీఱ నాకు నొక ప్రత్యుపకారము సేయఁ బూను టే, నావల నీవల న్విని యథార్థ మెఱుంగుటకై యొన ర్చితిన్. విక్ర. 5. 154.

ఈవలవలఁజేయు — ఇట్టటు చేయు, తలక్రిందు చేయు.

సీ. పశ్చిమోత్తర పూర్వపాథోధిపర్యంత మఖల దిక్కుల నీవలావలఁజేసి. భా.రా. యు.263.

ఈవలావలగు — వ్యత్యస్తమగు.

చ.అదలుపులం బ్రచండ మగునార్పుల లంకయు నీవలావలై, కదలినభంగి...భా. రా. యు. 1319.

**ఈవి** — ఈగి. వి. (√ఇచ్చు) 1. ఇచ్చుట,దానము.

గీ. అడుగకయ మున్న యీావి భాగ్యంబు గాదె. నైష. 3. 53.

ఆ. ఈవిమాన మెక్కి యెల్ల వేల్పులలోన, నీవి మాన కలరు మింక ననుచు. ఉ. రా.1.209.

2- ఈయఁబడినది — వరము.

గీ. వెలయునజుని వరముల గర్వింప వలవ,దట్టి బ్రహ్మను బుట్టించునతఁడె యితఁడు, అట్లు గావున నాదేవుఁ డలిగెనేని, పద్మజునియీావు లెందుకుఁ బనికిరావు. సీతావి. 2. 169.

3. బహుమానద్రవ్యము.

గీ. ఆత్మ మెచ్చితి నిచ్చెద మడుగు మనిన,నింద్రునకు వేల్పుబూఁబోఁడి యిట్టు లనియె.

ఉ. మెచ్చుల కెంత కార్యమిది మేకొని యీవిపు డీవు లందఁగా, నిచ్చటియచ్చరల్ నగరె

యిట్టిదియే సమయంబు వేఁడ...చంద్రా. 3. 45, 46.

**ఈవికాఁడు** — ఈగికాఁడు.

**ఈవిమ్రాను** — ఈగిమ్రాను.

సీ. పచ్చ్రాతలకుఁ జప్పరి కోళ్ల సకినల మంచంబు పై నీవిమ్రానికమ్మ, విరిశయ్య ...దశా. 4. 103.

గీ. కూటిచవి వేలుపు లెఱింగికొనుట యెల్ల, నమర మన మావి మ్రాఁకుల నమరు చెల్ల, హారుఁడు శ్రీకంఠుఁ డనుపేరి నలరు చెల్లఁ, దలఁప నీతీరువారాశివలనఁ గాదె. ఉ.రా. 5. 208.

**ఈవు** స — నీవు.

('నీవు'లో ఆద్యక్షరము లోపించినరూపము. ఈ లోపము 'మీరు, మీరలు' అనుచోట్లను గలదు. 'నీకు, మీకు' అనువానిలోఁగూడ ఒక్కొక్క చోట నీలోపము కానిపించుచున్నది.)

చ....పా, మెనసినతోలు వాయుక్రియ నీవు దొఱంగుదు పాపపుంజముగా. భార. శాం. 5. 183.

ఈకు — 1. నీకు.

గీ. కలిత సౌభాగ్యగరిమంబు గాంచి మించి, యీకుమారిక పరితోష మీకు నొసఁగ, మనుమలను గూడి జననాథ మను మటంచు. చంద్రా. 3.18.

2. మీకు.

గీ. ఎంతచెప్పిన వినరేమి యీకు మాకు, హరుని యాజ్ఞయ బలవంత మల్ప మెట్లు. శివరా. 4. 63.

ఈరు — మీరు.

క...విపన్నుల,యెడఁ గృప సేయుటయ లెస్స యీరలుగకుఁడీ. భార. విరా. 5. 123.

ఈరలు — మీరలు,

క....మ, మ్మెవ్వరు నెఱుంగకుండఁగ, నివ్విధ మున నున్న నెట్టు లెఱిఁగితి రీరల్. భార. ఆది. 7. 217

**ఈవుత** ద్రు. ఇచ్చుధాతువుయొక్క ఆశీరర్థక రూపము. 'ఇచ్చుతకా' అనుదానికి రూపాంతరము.

చ. ... సరస్వతీశ్వరుఁ డుదారత మాకుఁ జిరాయు వీవుతన్. ఉ. రా. 1. 5.

**ఈవులకెంపు** — ఈగులకెంపు.

**ఈవులమొదవు** వి. (√ఈవి) కామధేనువు (శ.ర.).

**ఈవులమ్రాను** — ఈవిమ్రాను. వి. (√ఈవి) కల్పవృక్షము. అం. భా. 1. 57.

**ఈవులరతనము** — ఈవులకెంపు. వి. (√ ఈవి.) చింతామణి (శ. ర.).

**ఈశ** సం. వి. అ. స్త్రీ. 1. ఐశ్వర్యము. 2. ఐశ్వర్యము గలస్త్రీ, ధనవంతురాలు. 3. దుర్గాదేవి. 4. ఈష.

**ఈశనము** సం. వి. అ. న. ఐశ్వర్యము.

**ఈశానము** సం. వి. అ. పుం. 1. పదునొకండు అను సంఖ్య. 2. ఆర్ద్రానక్షత్రము. న. 1. కాంతి, 2. ఈశ్వరుని అయిదుముఖములలో నొకటి.

**ఈశాని** సం. వి. ఈ. స్త్రీ. 1. దుర్గ. 2. బూరుగు (వృ. వి.).

**ఈశానుఁడు** సం. వి. అ. పుం. 1. అధిపతి, రాజు. 2. శివుఁడు. 3. ఒకదిక్పాలకుఁడు.

**ఈశి** సం. వి. ఈ. స్త్రీ. ఈశపత్ని, పార్వతి.

**ఈశిత** సం. విశే. (ఋ. త్రి. ఋ.) ప్రభువు

**ఈశుఁడు** సం. వి. అ. పుం. 1. ప్రభువు. 2. యజమానుఁడు. 3. మగఁడు. 4. మహాదేవుఁడు, శివుఁడు, 5. ఈశానుఁడు, ఒకానొకదిక్పతి.

**ఈశ్వర** సం. వి. అ. పుం. ఒక సంవత్సరము పేరు. (ఇది ప్రభవాదులలో పదునొకండవది.)

అ. స్త్రీ. 1. దుర్గ. 2. లక్ష్మి.

**ఈశ్వరప్రియములు** సం. వి. అ. పుం. బ. ఒకజాతి వడ్లు.

సీ. పలికరాజనాశీశ్వరప్రియములు రావిపూ రాజనాల్ రత్నసరులు. హంస. 4. 128. ప్రబంధ. 112.

**ఈశ్వరవిభూతి** సం. వి. ఇ. స్త్రీ. లోకమున స్థావరవిశేషములందుఁ గల ఈశ్వరాంశము.

శ్లో: ఆదిత్యానామహం విష్ణుర్జ్యోతిషాంరవిరంశుమాన్, మరీచిర్మరుతామస్మి నక్షత్రాణామహం శశీ, వేదానాం సామవేదోఽస్మి

దేవానామస్మి వాసవః. (ఇత్యాదిరీతిని అది త్యాది గణమందు విష్ణురూపాదిగా నుండు వది ఈశ్వరవిభూతి. చూ. గీత. 10అధ్యా.)

**ఈశ్వరసభము** సం. వి. అ. న. రాజసభ.

**ఈశ్వరసాక్షి** సం. వి. ఇ. పుం. (వేదాంత) మాయోపహితచైతన్యము.

**ఈశ్వరి** సం. వి. ఈ. స్త్రీ. 1. దుర్గ. 2. లక్ష్మి. 3. లింగినీలత. 4. వంధ్యాకర్కోటీలత. 5. క్షుద్రజటాలత. 6. నాకులి. సర్పాక్షి (వృ.వి.).

**ఈశ్వరుఁడు** సం. విణ. (అ. అ. అ-కే. ని.) 1. ప్రభువు, నియమించువాఁడు. 2. ఆఢ్యుఁడు, ధనవంతుఁడు. 3. శక్తుఁడు, సమర్థుఁడు. వి. అ. పుం. 1. యజమానుఁడు. 2. రాజు. 3. మగఁడు, భర్త. 4. పరమేశ్వరుఁడు. 5. శివుఁడు. 6. మన్మథుఁడు. 7. పరమాత్మ.

**ఈష** సం. వి. ఆ. స్త్రీ. 1. లాంగలదండము, ఏఁడికోల; బండినొగ. 2. నూటయెనుబదియెనిమిది అంగుళముల ప్రమాణము (కే. ని.).

**ఈషణము** సం. విణ. (అ. ఆ. అ.) 1. త్వరపడునది. 2. త్వరపెట్టునది. వి. అ. న. త్వర.

**ఈషత్** సం. అవ్య. ఇంచుక, కొంచెము.

(ఇది తెనుఁగున సమాసపూర్వపదముగానే యుండును. ఉదా: ఈషత్ స్పృష్టము, ఈషదుష్ణము, మొ.)

**ఈషత్కరము** సం. విణ. (అ. ఆ. అ.) సులభముగాఁ జేయఁ దగినది. 2. (అ. ఈ. అ.) కొంచెముగా చేయునది.

**ఈషాదంతము** సం.విణ. (అ. ఆ. అ.)-నాఁగటికోలవంటి దంతములు గలది - మహాదంతము, పెద్దదంతములు గలది. వి. అ. పుం. నిడుపైన దంతములు గలయేనుఁగు.

**ఈషిక** సం. వి. ఆ. స్త్రీ. 1. ఏనుఁగుకనుగ్రుడ్డు. 2. చిత్తరువు వ్రాసెడికుంచె. 3. అస్త్రవిశేషము.

**ఈసడము** వి. నింద, దూఱు.

సీ...అడిక యేవ మీసడ మీసడింపు తెగడు తెగడిక...నా నపవాదసంజ్ఞలై యలరుచుండు, ఆం. భా. 1. 115.

ఉ. ఈసడించు.

**ఈసడించు** అ. క్రి. (√ఈసడము) విరోధించు, పగఁబూను.

సీ. ఇది తమ్మికంటిపై నీసడించిన నిశాధవుఁ ద్రోలు లోకబాంధవునిపోడుపు. వసు.4.56.

స. క్రి. 1. నిరసించు.

సీ. చండాలుఁ డని సారెసారెకు వస్తు నీ వీసడించుట పాటియే తలంప. హరిశ్చ.4.221.

సీ. చతురభాషామనీషావిశేషావాప్తి నేభోగి యాభోగి నీసడించు. వరస. 1. 11. (ఇట నౌపమ్య ద్యోతకము).

2. అసహ్యించుకొను, రోయు.

గీ. అంత నొకనాఁడు నిర్మలస్వాంత మౌని, మౌళి భుజియింపఁ బాత్రలో వ్రేలు దునిసి, పడిన మది నీసడింపక కడకుఁ దిగిచి,చైచి భుజియించె నప్పతివ్రతలతల్లి. పాంచాలీ. 3. 47.

(ఇట 'వ్రేలిఁ'అను కర్మపద మధ్యాహార్యము.)

**ఈసపిట్ట** వి. శరీరముపైని ముండ్లు గలిగి గుండ్రముగా నుండు నొకజాతిచేఁప. (బ్రౌ).

**ఈసు** వి. (సం. ఈర్ష్యా.)1. ఓర్వలేమి. అసహనము.

ఉ. ఈసునఁ బుట్టి డెందమున హెచ్చినశోకదవానలంబుచే, గాలిసి యేడ్చెఁ బ్రాణవిభుకట్టెదుటం లలితాంగి...పారి. 1. 133.

ఉ. అందఱు లీలఁ జూడ నొకయంగన తాను వచ్చి రాజనందనునందమంతయు నెగాదిగఁ గన్గొని చొక్కి యట్టియా,నంద మెయింద యొందెదరు నావలెనే యని యీసుఁ జెందె...ఉ. రా. 6. 152.

2. కోపము.

వ. అంతఁ బంక్తివదనుండు నిబిడజ్వాలం బగు శూలంబు రాఘవుమీఁదం బ్రయోగించిన నతండును దానిఁ దునియలు సేసిన నీసునం జెరిఁగి సురవైరి మఱియునుం దరతరంబ...తోమరంబులు శరంబులుం బఱఁగించి...భార. అర. 7. 149.

శ్లో. తతః క్రుద్ధస్ససర్జాశు దశగ్రీవశ్శితాఞ్ శరాన్. సం. భార. అర. 291. 28.

ఉ. ఈసున నొక్క పేలన మహీసురుఁ డొక్కరుఁ డొక్క వార్ధి యా,పోసన మెత్తుచో ...నై ష. 5. 68.

3. ద్వేషము, పగ.

ఉ. ...అమ్మహో,క్రూరుఁడు కంసుభార్య తన కూఁతురు గావున దాని సంతత, ప్రేరణ నాకుపద్రవము పెక్కువిధంబులఁ జేసె నీసునన్. భార. సభా. 1. 118.

4. మాత్సర్యము, చలము.

ద్వి. ...ఇబ్భంగి మర్కాఁడు, ఆసేతు విరువది యాఁబుయోజనము, లీసున బంధింప నిమ్డ నుమించె. రం.రా.యు. 314పొ. 20 పం.

ఆ. కప్పువెట్టి వెన్నుకందమ్ము సమముగాఁ, బొదలి జోళ్లు గట్టి పోరుచుండి, మలయుఁ గాని పోవు మానిసిఁ బొడగన్న, నేమి చెప్ప వానియీసు లధిప. మనుచ. 4. 38.

5. నింద.

గీ. ప్రథమమున నీవు చేసినబాస నమ్మి, మోసపోయితిఁ గులమునం దీసు వడితి. శివరా. 3. 129. (ఈసువడు – నిందనొందు).

**ఈసుళ్లు** – ఇసుళ్లు. (క. త. ఈచల్.)–వా.

**ఈహ** నం. వి. అ. స్త్రీ. 1. కోరిక, వాంఛ.2.చేష్ట, కాయిక వ్యాపారము. మను. 9. 205.

**ఈహకుఁడు** నం. విశే. (అ. హిశా. అ.) 1. కోరువాఁడు. 2. చేయువాఁడు.

**ఈహనము** నం. వి. అ. న. 1. కోరిక. 2. చేష్ట,పని.

**ఈహనీయము** నం – ఈహితవ్యము.

**ఈహమానము** నం. విశే. (అ. అ. అ.) 1. కోరుచున్నది. 2. చేయుచున్నది.

**ఈహామృగము** నం. వి. అ. పుం. 1. తోఁడేలు. 2. కృత్రిమపులేడి. 3. రూపభేదము. (కథానాయకుఁడు లేడివలె వలభ్యయగుస్త్రీని పొందఁ గోరినట్లు వర్ణింపఁబడినకథ గలనాలుగంకముల రూపకము).

**ఈహిత** నం. విశే. (ఋ. త్రి. ఋ.) – ఈహకుఁడు.

**ఈహితము** నం. విశే. (అ. అ. అ.) కోరఁబడినది. వి. అ. న. 1. కోరిక. 2. పని, చేష్టితము.

**ఈహితవ్యము** నం. విశే. (అ. అ. అ.) 1. కోరఁదగినది. 2. చేయఁదగినది.

**ఈహి** – ఇహి.

శా....తక్కినబలాధికాఖ్యకీటంబు లిం, దెవ్వం డెవ్వఁడొ మీఁదిచే టెఱుఁగ రీహి...కవిక. 2. 112.

**ఈహ్యమానము** నం. విశే. (అ. అ. అ.) 1. కోరఁబడుచున్నది. 2. చేయఁబడుచున్నది.

**ఈహ్యము** నం – ఈహితవ్యము.

# ఉ

**ఉ** *తెలి.* ఒకానొక యక్షరము.

**ఉ**[1] 1. హలంతసంస్కృత శబ్దములు తత్సమము లగు

ఉదా : వాక్+ఉ = వాకు, వాక్కు. దిక్+ఉ = దిక్కు.

2. మహద్వాచకము లగుబల్లి దాదులయొక్కయు పెక్కుపుంలింగ మహద్వాచక తత్సమశబ్దముల యొక్కయు తుది అకారమున కాదేశముగావచ్చునది.

ఉదా: బల్లిదుఁడు, రాముఁడు, మొ. (రంగడు లింగడు మొదలగువానియందు రాదు.

3. అలుశబ్ద ముత్తరపదమగునపుడు బల్లి దారుల యొక్కయు తత్సమశబ్దములయొక్కయు తుది అకారమున కాదేశముగా వచ్చునది.

ఉదా: బల్లిదురాలు,ధీరురాలు,గుణవంతురాలు.

4. నామములతుది ఇకారమునకు బహువచనము పర మగునపు డాదేశముగా వచ్చునది.

ఉదా : హరులు, సిరులు, మొ.

5. ఇకారాంతములగు తెలుఁగుశబ్దముల యుపోత్తమేత్వమునకు బహువచనమున ఆదేశముగా వచ్చునది. (చూ. ఉపోత్తమము).

ఉదా: కలికి-కలుకులు. (పందిరులు, వాకిలులు, మామిడులు, తొమ్మిదులు, మొదలగు కొన్నిటి యందు రాదు.)

6. ప్రేరణార్థమున వచ్చు 'మ, పు' వర్ణములు పరమగునపుడు ధాతువులలోని ఇకారమున కాదేశముగా వచ్చునది.

ఉదా: వడియు - వడుచు, తెలియు - తెలుపు, బిగియు-బిగుచు, మొ.

7. కృత్ప్రత్యయములు పరమగునపుడు కొన్ని యువర్ణాంత ధాతువుల తుది ఇకారమున కా దేశముగా వచ్చునది.

ఉదా: కినియు-కినుక, కినిపు, బలియు-బలుపు, ముదియు-ముదుక, మొ.

**ఉ² అవ్య.** ద్రు. (క. ఉం. త. ఉమ్ - ఉదంతేతరము లకు పర మగునపుడు దీనికి నిత్యముగా యడాగ మము వచ్చును. ఒకానొకచో నిందలిద్రుతము మాత్రము మిగిలి ఉకారము లోపించును - 'మ' సముచ్చయాద్యర్థక మనియు, ఉకారే తరముల మీఁద యువర్ణ పూర్వకముగావచ్చు ననియు పూర్వలాక్షణికమతము.)

1. అపిశబ్దార్థమును దెలుపును.

(క) సముచ్చయార్థమును దెలుపును.

మ. ఇవి యేనున్ సతతంబు నాయెడఁ గరం బిష్టంబులై యుండుఁ బా,యవు భూదేవ కులాభితర్పణమహీయః ప్రీతియున్ భారత, శ్రవణాసక్తియుఁ బార్వతీపతిపదాబ్జధ్యాన పూజామహో,త్సవమున్ సంతత దానశీల తయు శశ్వత్సాధుసాంగత్యమున్. భార. ఆది. 1. 12.

మ... భూ,వర ము న్నిట్టివి చూడరున్ వినరు నెవ్వారుం ద్రిలోకంబులన్. భార. ద్రో. 3. 162.

మ....విక్ర,మాఢ్యులలో నేనును వాసుదేవుఁడ నతండున్ వాసుదేవుండతే. ఉ. హరి. 3.12.

(చ) విరోధమును దెలుపును(కూడ,సయితము, అయినప్పటికి, మున్నగువాని యర్థముల ని చ్చును.

క. ఎట్టివిశిష్టకులంబునఁ,బుట్టియు సదసద్వివేక ములు గల్గియు మున్,గట్టినకర్మఫలంబులు, నెట్టన భోగింపకుండ నేర్తురె మనుజుల్. భార. ఆది. 5. 58.

సీ....వారలిగినఁ జెడుదు రయ్యమరులైన,నట్టి వీరులబారి కగపడి యుండియు నేమియుఁ గారైతి రీవుఁ బాండు. గీ. తనయు లందఱు నీకూర్మితమ్ముఁడును...(అగపడియుండియు- అగ్గమైయుండికూడా) భార. స్త్రీ. 2. 155.

గీ. పైత్యదోషోదయంబునఁ బరుసనైన,జిహ్వ కకుఁ బంచదారయుఁ జేఁదు గాదె. (పంచ దారయు-పంచదారనైతము) నైష. 2.82.

శ్లో. పిత్తేన దూనే రసనే సితాపి,తిక్తాయతే హంసకులావతంస. సం. నైష. 3. 94. విజ. వి. 2. 10.

2. కిమర్థక మగు ఏ, ఎవఁడు ఎప్పుడు మున్నగు పదములకును ఒకఁడు మున్నగు మఱికొన్ని పదములకును అన్వయయుక్తమై సర్వార్థము నిచ్చును. (అప్పుడు వ్యతిరేకార్థక క్రియలతో డనే సంబంధించి యుండును)

ఉ. ...చిచ్చొచ్చెడిం, గట్టినయట్లు...వీనికి నాఁటు లెన్నఁడుఁ, బుట్టదు ... భార. ఉద్యో. 3. 118.

వ. యుష్మద్ఘటితంబులైన సంబంధములకెన్నం డును వికారంబు పుట్ట నేరదు. హర. 4. 49.

క. పాండవులవలనికి డొ,క్కండును లే దధిప నీదుకొడుకులు ధరణీ,మండల మంతయు మ్రింగిరి,పాండునృపతి భాగమునకుఁబాపిరి వారిన్. భార. స్త్రీ. 1. 88.

3. అనంతర్యమును దెలుపును.

చ. అనుటయుఁ బిన్ననవ్వునగి యంబుజనాభుఁ డు వల్కె,నెన్నఁడుఁ,విననివి భీముపాలఁ గడు వింతలు వింటిమి మాటలు ... భార. ఉద్యో. 3. 52.

క. మఱెవ్వ రనుటయును శృంగారిణి మే మురగ కన్యకల మింతకు మును,ధారణి కేతెంచితి మన...ఆము. 5. 78.

4. వాక్యాలంకారముగానుపయోగింపఁబడును.

సీ. విషయోపభోగాభిలషణ మింకను నాకు వదలక పెరుఁగుచున్నదియుఁ గాన. భార. ఆది. 3. 95. కాశీ. 2. 83.

(ఉత్వలోపమున కుదాహరణములు.)

శా. వాలిం గీలియు వాయుపుత్రుసరియే... నిర్వ. 7. 99.

శా. తల్లిం దండ్రియు నన్నుఁ గావనిమనస్తాపం బునం బొక్కఁగా, నిల్లా లార్తిఁ గృశిం పఁగా...మనుచ. 3. 98. (ఇట్లే. ఏమిన్, మఱిన్, మొ.)

**ఉ²** ప్ర. కొన్ని ధాతువులపై వచ్చుకృత్ప్రత్యయము. ఉదా : ఒప్పు + ఉ = ఒప్పు. పలుకు + ఉ = పలుకు. అంటు + ఉ = అంటు.

**ఉ** సం. వి. ఉ. పుం. (దీనికిఁ దెనుఁగున వ్యస్తప్రయోగము లేదు) 1. శివుఁడు. 2. బ్రహ్మ.

**ఉంకించు** అ. క్రి. యత్నించు, పూను.

మ.... పైచెఱం, గొడియం జేవిరదమ్మి ద్రేయుటకునై యుంకించి జంకించినన్. పాండు. 1. 119.

ఉ. చంచలనేత్రఁ గాంచి నృపచంద్రుఁడు మోహము నిల్పలేక చే, లాఁచల మంటి శయ్యకపు డల్లనఁ దార్చి కవుంగిలింప నుంకించుఁ బయంట నంట గమకించుఁ జలించు నిఁకెప్పు డెప్పుడం, చించుకసేపు లోన మెఱయించు ననేకమనోవికారముల్. విజ. వి. 2. 37.

(ద్రౌపది) సీ. లలి నుల్ల సిల్లుచు లలితలోచన దీప్తు లడరి నుంకించిన నాఁగి యాఁగి. భార. విరా. 3. 55.

**ఉంకుచెండు** వి. బాఁగుగా నెగురుస్వభావము గల యొక విధమైనబంతి.

గీ. నీర ముంచినపొఱకాయ నెగసినట్లు, పేరు కొని పైచు తెల్లఁటచీరవోలె, నుంకుచెండు విధంబున మత్తరించు, తములపాకు నిక్కెడు భంగిదాఁటె నిట్టి. ఉ. హరి. 4. 28. చి. ని. (దీని కీయొక్క ప్రయోగమే కలదు)

**ఉంకుణము** సం. వి. అ. పుం. 1. మత్కుణము, నల్లి. 2. పేను.

**ఉంకువ¹** వి. 1. కన్యార్థము మామకుఁ గాని కన్యకకుఁ గాని యిచ్చుద్రవ్యము, కన్యాశుల్కము, ఓలి.

గీ. ఇంతుఁ బుట్టినసుతుఁడు మాకిందువంశ్య, వంశవిస్తారకుండు గావలయు నిదియ, యీల తాంగికి నుంకు విట్లిఁగ నోవు, దేని పెండిలి యగుమ యీయింతిఁ బ్రీతి. భార. ఆది. 8. 144.

క. ఇది నాకు నుంకు విచ్చుట, యిది మొదలుగ నన్ను నరణ మిచ్చితి. కు. సం. 7. 972.

సీ. హయమేధ రాజసూయము లనఁ జేప్పెడ్డ సవన తంత్రంబు లుంకువలు మాకు. మనుచ. 2. 43.

ఉ... నామననుపాఁ తగలించి వెలార్చినట్టియా, మాటలుమూఁడు నుంకువగ మానవనాయక నీకు దక్కితిన్. విక్ర. 8. 104.

క. తివిర యొకరుండు మున్నుం, కువ పెట్టిన దాని నడుగఁ గూడునె. దశకు. 6. 51.

2. కానుక, బహుమతి. (ఈయర్థమున నిది మువర్ణకాంతముగాఁ గన్పడుచున్నది).

మ. వినుతానోకహకుంజమంజులలతల్ విస్ఫూర్తిఁ బొందంగ న, త్యను రాగంబున భృంగకేకి కలకంఠారావముల్ మ్రోయఁ గ్రొన్ననవిల్కానికి నుంకువం బగుచు నానా గంధముల్ నిండ మన్ననతో వచ్చె వసంత కాలము జనానందంబు గావించుచున్. ధనాభి. 2. 4.

('ఉంకివము' అని ప్రాఁతప్రతి. ప్రయోగాంతరము లేదు. ఇంకను విచార్యము.)

**ఉంకువ²** వి. వాసస్థానము.

క. వెండియుఁ బసిఁడియుఁ దడఁబడు, చుండఁగ నాయిల్లు లచ్చి కుంకువ యయ్యెన్. పద్మ. 3. 217. (చి. ని. పా. - 'ఉఱవును' అని. ముద్రి.)

చ. వలవదు రోయఁ బాండవుల వారికయుం కువ లేని త్రిమ్మటన్, బలమతి వన్యసత్త్వముల పాల్పడి చచ్చినచోటఁ బూరియున్, మొలవ దెయింతకున్. భార. విరా. 3. 95. (చి. ని, భా. ల. వ్యా. పాఠములు-'ఊఱట' అని ముద్రి).

ఇట స్థైర్యము, నిలుకడ-అని భావము.

**ఉంగ** వి. శిశువుల యవ్యక్తధ్వని కనుకరణము. దీని యామ్రేడితరూపము-ఉంగుంగ.

సీ. కనుఱెప్ప వేయక కనుఁగొంచుఁ దనలోన నుంగుంగ యని పారె మగ్గడింప. సారంగ. 1. 49.

**ఉంగరపువ్రేలు** వి. దే. (√ఉంగరము) ఉంగరము పెట్టుకొనెడువ్రేలు, అనామిక, చిటికెనవ్రేలిప్రక్క వ్రేలు. శుక. 2. 412.

**ఉంగరము** – ఉంగ్రము. వి. (సం. అంగుళీయమ్. ప్రా. అంగురీయమ్. క. ఉంగుర, ఉంగర,

ఉం[గ. తు.ఉంగిల.) 1. చేరి[వేలికిఁ బెట్టుకొనెడి నగ, ఊర్మిక.

సీ. ఁవయుంగరంబులరి త్నాలదీప్తులు వాలారు గోళ్లపై జీలువాఱ. హరి. 5. 44.

2. ఉఁగరమువలె గుం[డముగా నుండువస్తువు. (రింగు).

సీ. మక్కళించినశావు మంజిళ్ల పెండెర లుంగ రంబులఁ బట్టి యొత్తువారు. నైష.6.108.

ఉంగరపుఁగురులు, ఉంగరపువెం[డుకలు – ఉంగరమువలెఁ జుట్టుకొన్నతలవెం[డుకలు.

క....మరునికా,లాయసచ[క్రవరంపర, లోయవ నుంగరపుఁగురులు యువతికి నమరున్. ఆము. 5. 9.

చ. తొకతొకమాటలు న్నొసలఁ దుంపెన లా లెదు నుంగరంపువెం,[డుకలును. కవిరా. 2. 47.

జ. ఉంగరపు[వేలు.

**ఉంగిడి** వి. నాము ఆముదపాకు మొదలగునవితినుట వలనఁ గలుగుపశురోగము.

వ. ఉంగిడి యదురుఁ[దిక్క యనువానికినావేరు సెప్పివం జాలు. భార. విరా. 1. 286.

సీ....పశువ్యాధిభేదాభిధ యొప్పుచు నుండును మంగిడి యన. ఆం. భా. 2. 125.

జ. ఉంగిడిగొను.

**ఉంగిడిగొను** అ. [క్రి. (√ఉంగిడి) ఉంగిడిరోగము గలది యగు.

ఆ. జొన్ననాము మేసి పొలసి యుంగిడిగొని, తొట్టతట్టుపసికిఁ దోరముగను, దద్విషంబుఁ దెలుపఁ దడయక నల్లేరు, కొవలు దవుడ లందుఁ జొనుప వలయు. గోచికిత్స.(చి.ని.)

వ. ఉంగిడిగొన్నభంగి. కాశీ. 2. 188.

**ఉంగుటము** వి. (సం. అంగుష్ఠః. [పా. అంగుట్ఠో. క. ఉంగుట, ఉంగుట్ట.) బొటన[వేలు.

ఆ. [మొక్కి నిలిచి యతనిముందట మేదిని, నుంగుటమున నొఱయుచున్నఁ జూచి, యొచటనుండి రాక యొవ్వనిసుత వేమి, పనికి నిందువచ్చి తనిన నదియు.నిర్వ.8.49.

క. చెటచెటఁ జేలుచు నలుగడఁ,బటుతరశిఖ శిఖలు వెగయఁ బదిలముగా నుం,గుటము ధరమూఁది మస్థితిఁ, గుటిలాలక పదన మెత్తుకొని రవిఁ జూచున్. కు. సం. 6.800.

ఉ....వికసించిన తెల్లదమ్మిలో, భానుసమాను నుంగుటముపాటి [ప్రమాణమువాని నొక్క నిన్. వరాహ. 9. 74.

**ఉంగే** వి. శిశువులు ఏడ్చునప్పటియవ్యక్తధ్వని కను కరణము.

క. ...ఉంగేఉంగే యటఁచు...పరమ. 1.125.

ఉం[గము – ఉంగరము.

**ఉంచు,ఉనుచు(న్చు)** స. [క్రి. (√ఉండు) – ఉండు నట్లు చేయు–1. కూర్చుండఁబెట్టు.

ఉ....రత్నపీఠమున నుంచి. వి[క. 1. 107.

2. నివసింపఁ జేయు.

గీ. ఆలమందలో నునిచి. హరి. ఉ. 2. 112.

3. నెలకొల్పు.

చ. అమృతు ననంతు నచ్యుతుని నాత్మఁ దిరం బుగ నున్చి నిత్యబో,ధమునఁ గరంగున ప్పరమ ధార్మికుఁడు నృసిం. 4. 88.

4. స్థాపించు.

ఉ. ఉంచినయ[గహారములమున్నతవైఖరి విద్య లెల్లఁ ర, ప్పించినవి[పవక్త్రములఁ బెంచిన నవ్యవనోత్కరంబులన్, నించినబల్తటాక ముల నెమ్మిఁ గనం దగు వెంగళాంబయ, భ్యంచితకీర్తిసౌధ విశదాకురమూనమురాశ రాజమై. వసు. 1. 64.

గీ. సకలచతురంగసేనతో సంతసిలుచుఁ, గృష్ణ రాయమహీం[దుండు కీర్తిచెలయు, సంగ నచ్చట నొకజయస్తంభ మునిచె. కృష్ణ. 3. 112.

5. అమరుచు.

చ. విమలమణీగణోజ్జ్వలనవీనవిచి[త గవాక్ష సీమలన్,రమణులముద్దుమోములు విరాజిలెఁ దన్మధుగంధలుబ్ధనం, [భమవిచరన్మధాళిని కరంబు లనంగఁ గనీనికాతతుల్, మెఱ యఁగ శిల్పు లబ్జములు మేడలజాడల నుంచిరో యనన్. ఇందు. 6.4. (ఇటనాల్గవ పాదమున [పాసభంగము.)

6. ధరింపఁజేయు, పెట్టు.

ఉ. పంకజపాణిశంఖపరిభావక కంధరఁ దల్లి యే
లకో, సంకులు గట్టి నంచుఁ గులశైలను
శాగ్రగణి పాయఁ ద్రోచి రత్నాంకితహార
ముంప బరు వానువొ బిడ్డకివేల కర్కశాలం
కృతులంచు హల్లకకలాపము లుంచు నదీల
లామయున్. వసు. 8. 81.

7. (భోగార్థమై వేశ్యను) వశమునఁ బెట్టుకొను.

క. చేరినదాని నతఁడు గని, కూరిమితోఁ
గౌఁగిలించుకొని మక్కువ నాహారాదికంబు
లిడి సుకుమార క్రీడలఁ దేలంగి మన్నన
మునిచెన్. చంద్ర. వి. 1. 49.

8. ఆఁపు, నిలుపు; నిరోధించు.

చ. ...భీష్ముఁ డెఱింగి వారి కిట్లను సురలార
కాలగతి నాత్మఁ దలంచియ కాదె మేనిలో,
మనిచినవాఁడఁ బ్రాణముల నుమ్మలికింపకుఁ
డించుకేనియున్. భార. భీష్మ. 3. 415.

సీ. తముకు వేసినవెన్కఁ దాఁ బరించినఁ బట్టి
యునుపకుండఁ దలార్ల కొసఁగి యొసఁగి.
శుక. 4. 111.

9. దిగవిడుచు.

సీ. దుర్దమసమ్మర్దకర్దమ స్థలములఁ బవ రాక
మదసామజముల డించి,చటులనికుంజపుంజ
ములఁగా లాడనిక తనఁ గంఖాణసంఘము
లనునిచి. శుక. 1. 182.

10. నియమించు, ఏర్పఱచు.

క. ...జనకునకుఁ గావలిగా, మనిచినవాఁడయి
నెమ్మదిఁ, జనినహరికిఁ జావ్వసెప్పఁ జని
యొద వకటా. భార. మౌ. 156.

మ. ... రాజకులగ్రామణి యుంచె నవ్వసు
పదుగా నైన్యాధిపత్యంబునన్. వసు. 6.89.

11. న్యాసముచేయు, (తాకట్టుగా) పెట్టు.

చ. ... అభ్రగతరుచంతతిం బ్రథమభార్యఁ
బురిఁగా గిరవుంచె వార్ధి నాన్. ఆము. 1. 64.

**ఉంఛనము** సం. వి. అ. న — ఉంఛము.

**ఉంఛము** సం. వి. అ. పుం. క్షేత్రాది స్థానములందు
రాలినగింజలను జీవనార్థమై ఏఱుకొనుట.

**ఉంఛవృత్తి** సం. విణ. (అ.) ఉంఛముచే బ్రదుకు
వాఁడు. వి. ఇ. స్త్రీ. రాలినగింజల నేఱుకొని
బ్రదుకుట, శిలబ్రదుకు (చూ. ఉంఛము).

**ఉంట**[1] వి. (√ఉండు) ఉండుట.

ఉ. బంటుతనంబుమాటలకుఁ జాలకు పాండు
నృపాలుపాలు గై, కొంటయ చాలు నన్న
నృపకుంజరు పల్కుల కడ్డ మాట రాకుంట
యొఱుంగవే మును. భార. ఉద్యో. 3. 59.

సీ. దుగ్ధాబ్ధికన్యక తోడికోడలు గాఁగ, నొరిమ
మై నుంట నీ కొప్పుఁగాదె. నైష. 3. 126.

**ఉంట**[2] — ఉండ.

సీ. కలఁచి వారిధి బయ ల్వెలసి కొమ్మునఁ
గొట్ట నంటి వచ్చిన నాఁచుటుంట పుడమి.
చంద్రా. 1. 75.

ఉ....చంద్రునిఁ బెళాలునఁ బెన్నిగివింటి యుం
టచే, వేసి మధంగొవన్ ... పార్వ. 1. 54.

జ. ఉంటగాలము.

**ఉంటగాలము** వి. (ఉంట[2] + గాలము) సీసపుగుండు
కట్టినయొకవిధమైనగాలము. (శ ర.).

గీ. ఉంటగాలంబు తెండిము లుసురుగాలము...
హంస. 4. 188.

**ఉండ** వి. (క. ఉండె. త. ఉండై, ఉరుండై.) గుళిక,
గుండ్రముగాఁ జేయఁబడినవస్తువు. నిర్వ. 6.88.

చ....వలపుదేవర పచ్చలమేడ యెక్కియ, చ్చె
రువుగఁ దుంటవింట వడిఁ జిమ్మెడుకస్తురి
యుండలో యనన్. యయా. 5. 56.

గీ. పటికంపుటుండలు. పారి. 2. 86.

గీ. విబుధామృతంపుటుండ. రా. వి. 1. 31.

(ఇల్లీ మిఠాయియుండ, నులకయుండ, మొ॰)

జ. ఉండ క్రోవి, ఉండగట్టు, ఉండవిల్లు, ఉండ
సురియ.

**ఉండ(ం)క్రోవి** వి. (√ ఉండ) ఘుటికాక్షేపణ
నాళము, ఒకవిధమైన వేఁటసాధనము.

క. వెలివాఱును గాలురులును, వలలుఁ దెరలు
దీమములును వడిఁ దిరినకుక్కలు నారె
గోలలును ముండల క్రోవులు వేఁట కార
దంబుఁ దెమవఁగఁగా. ఉ. హరి. 4. 22.
(వీరేశ. పాఠమును 'అరడము' క్రిందనిచ్చిన
శ. ర, చి. వి. పాఠములును.)

**ఉండగట్టు** అ. క్రి. (√ఉండ) ఉండగా చేర్పడు.
(వ్యవ) పిండి ఉండగట్టినది.

**ఉండవిల్లు** వి. ఔ. చూ - ఇల్లు¹. (√ఉండ) ఉండలు వేయువిల్లు

గీ. తరుణి నతనాభిమండలోదంచనాభి, రామ రోమావళీజ్యావిరాజమాన, నీదుతను వుండ విలు నేసి నెఱఁకు లేయు, రతివరుఁడు హార గుళికల రాజహంసు. నైష. 2. 97.

**ఉండసురియ** వి. (√ఉండ) ఒకవిధమైన కత్తి.

వ. వేదండంబులఁ గోదండంబులఁ గొండగొాటి యల నుండసురియల...చెండాడుచు...రా. వి. 3. 65.

**ఉండి** అవ్య. (√ ఉండు) 1. ఉండు ధాతువునకు క్త్వార్థకరూపము.

ఉదా: అక్కడ రెండుదినము లుండి వచ్చెదను.

2. అపాదానార్థమందు (ఎడఁబాటును దెలుపునప్పుడు) వచ్చిన 'వలన' కును, దానికి వికల్పముగా నాదేశ మగుద్వితీయాసప్తము లకును అనుప్రయుక్తమగును.

ఆ. విష్ణువలనఁ ద్రిపురవిజయిమౌళివలన, నుండి హిమనగమున నొలసె గంగ. భార. అను. 2. 118.

క. ...వనజాయతనేత్రకడకు వచ్చెను గగనం, బుననుండి కమలమిత్త్రుఁడు, తనతీవ్రకరత్వ ముడిగి తరుణద్యుతితోన్. భాగ. ఆది. 5. 20.

3. హేత్వర్థకము.

క. నిన్నుండి వీనిరూపముఁ, గన్నులఁ జూడం గఁ గలిగెఁగా నేఁటికి. అని. 2. 137. (నిన్నుండి – నీవు కారణముగా, నీవు హేతువుగా.)

4. ప్రభృతి (మొదలుకొని) అనునర్థమును దెలుపును.

ఉ ...సుధారసము చిందివయిట దిగువాఱు నంతనుండి వెన్నెల సన్నగిల్లు. విజ. వి. 1. 7.

(అంతనుండిన–అంతనుండియును, అదిమొదలు కొని.)

**ఉండిగ** వి. (క. ఉండిగె – ముద్ర.) ముడుపులు వేయుటకై దేవాలయమున ముద్రవేసియుంచిన పాత్ర.

సీ. ఉండిగ ల్నిండఁ బొన్నూళ్ల కేఁగెడు జేరు లకలంకభక్తిఁ గానుకలు వైవ. శుక. 3. 442.

**ఉండు** అ. క్రి. (క. ఉళ్, ఉంటు – ఉన్నది. త. ఉంటా. √ఉళ్) ఉందురు, ఉంద్రు, ఉండ్రు, ఉంటివి, ఉన్నను, ఉన్నది, ఉన్నె, ఉన్నే, మొ. రూపములు సిద్ధించును. (ఇది సంస్కృతము నందలి భూధాతువువంటిది.)

1. సత్తను (స్థితిని) తెలుపును.

వ. పరమ బ్రహ్మణ్యులైన పాండవులును బ్రాహ్మణసమూహములో నుండి పాంచాల రాజు సమృద్ధినిం జూచి సంతసిల్లిరి. భార. ఆది. 7. 166.

మధ్యా. పరమధర్మాత్ముఁడయినపాండు భూపతి దొట్టి సకల, ధరణీశు లెల్ల యము సభ నుండంగఁ దా నేమి పుణ్య, చరితఁ బ్రవర్తిల్లె నయ్య దేవేంద్రసభ హరిశ్చంద్రుఁ, డురుతరమహిమతో దేవపూజ్యుఁడై యుం డంగఁ గనియె భార. సభా. 1. 81.

2. ప్రవర్తిల్లు.

తరల... కామభోగ, గరిత నుండితి మిష్టచారి మృగవ్రజంబుల పొత్తులన్. భాగ. ఆది. 5. 51. భార. సభా. 1. 81.

3. నివసించు.

వ. మద్భార్య్య నీకుం గోడలు నీపాదచర్య సేయుచు నీయాశ్రమంబున నుండం గల యది. హర. 1. 8.

క. ఎయ్యది నీ వుండెడునెల, వు...విక్ర. 2. 244.

4. జీవించు.

క. నిరతంబు బ్రహ్మ మొదలగు, వరుసన యొడ తెగక యిట్లు వచ్చిన వంశం, బురుభుజ నీవుండఁగ నీ, తఱిమున విచ్ఛిన్న మగుట ధర్మమె యనినన్. భార. ఆది. 4. 221.

చ....పండితుల్, వగతురె యున్నవారికి నవశ్యవిధేయతఁ జన్నవారికిన్, దెగు వగ లెల్లఁ జిత్తము ప్రదీప్తవివేకమయత్వ మొందినన్. భార. భీష్మ. 1. 195. సుమతి. 18.

5. అఁగు, నిలుచు.

మ. అదటున నిల్లు చొచ్చి యమ్మృతాశనుఁ డొక్కఁడు దల్పుమూలయం, దొదిఁగినతమ్ము నీవ్వఁ బద మూరకె వచ్చెదవంచు నాలుగే,

నృపదములు వెంటఁబోయి కలపం బిడె
తెచ్చెదనుండు మంచుఁ దా,నదనముఁ జేరి
తల్పుగదెసాఁచె నొకానొక కాంత నేర్పు
నన్. దశా. 4. 46.

గీ. వచ్చి యరదంబు డిగ్గి తద్ద్వారసీమ, దారు
కుని నుండ నియమించి తాన యొకఁడు,
కమలనాభుండు కక్ష్యాంతరములు గడచి.
పారి. 1. 105.

6. ఊరకుండు.

సీ. ...వీఁడు విజయుఁ. ఆ. డొక్కొ యనుచు
సంశయోపేతచిత్తయై, యుండి యుండ
నోప కొక్కనాఁడు, భోజనావసానమున
నున్న యమ్మునిని, కిందువదన ప్రీతి నిట్టు
లనియె. భార. ఆది. 8. 185.

క. నోరిసని నుండ కే నో, రోరి యకట మాస
మీప పూరనె మనియుం, దూరము వోయితి
వే నొ,మ్మె రితిని నీకు దక్కునే కానీరా.
ఆము. 6. 82.

7. శేషించు, మిగులు.

చ. వరవర పొల్పునోపువతి నానదియై జనపావ
నాకృతిం, బరమతపంబులోని సిగపాలను
నియ్యమ యున్నసామున, స్వైరవునఁ దొంటి
మై నిలిచి నీకుఁ దగం బరిచర్య నేయు
ని,చ్చరితము మీకు నిర్మలయశంబు నొన
ర్చుట కేనొవర్చితిఁ భార. అను. 1. 82.

ఉ. ఒక్కటి మున్ను వచ్చుటయు నున్నవి
రామికి బెగ్గడిల్లుదున్. మార్క. 8. 66.

గీ. అదియుఁ గాక మరుత్తుండు యజ్ఞవేళ,నుచిత
దక్షిణ లర్పించి యున్నధనముఁ, గొల్ల విడి
చిన....తై. భా. 1. 78.

8. కొన్ని ధాతుజన్యము లగు అవ్యయముల
కనుప్రయుక్తమగును.

వ. రాజు లెల్లం బ్రతిసంవత్సరంబు నింద్రోత్స
వంబు సేయుచుండుదురు. భార.ఆది. 3.24.

చ. ఇది గొనిపోయి భర్తృవారికిచ్చెద నిచ్చిన
నాతఁ డాయురభ్యుదయముఁ బొంది
యుండు. విక్ర. 3. 11.

గీ. ఉరగసంఘంబులకుఁ గప్పలోడు చెల్ల,నీవు
పుట్టకమును గాని నీప్రభావ, మెఱిఁగి రిఁక
మిమ్ము దొరయ రా వెఱవకుండ్రె, దారు
తం మూర్తి మండుఁక చక్రవర్తి. కేయూర.
3. 23.

9. కొన్నిపట్ల తుమున్నంతముల కనుప్రయుక్త
మై భవిష్యదర్థమును సూచించును.

శా. నిన్నుం జంపి మహోపహారముగ వండింపంగ
నున్నాఁడు. హరి. 2. 74.

ఉ. ఎందఱు రాజు లీయవని నేలినవారిఁక నేల
నున్నవా,రెందఱు లెక్క సేయఁ దరమే పర
మేష్ఠికి నైన. కవిరా. 1. 181.

10. కొన్నిపట్ల తుమున్నంతముల కనుప్రయు
క్తమై సిద్ధమగు, అభిముఖముగా నుండు, అను
నర్థమిచ్చును.

తరువోజ. ఇది యిట్టిదారుణ మిమ్మొయిఁ
జేయఁగా నున్నవిధి యేల కడవంగ నిచ్చు.
భార. ఆది. 6. 247.

ఆ. స్వజనములును దాను భుజియింప నుండి
యా,సత్తువతిథికిచ్చెఁ జనదె పొగడ. భార.
అశ్వ. 4. 259.

ఉపవాసముండు — ఉపవాసముతోనుండు, ఉప
వాసముచేయు, పస్తుండు.

క. నృప శ్రావణకృష్ణాష్టమి, నుపవాసంబుండి
వారిజోదరుఁ బూజించి పిదపఁ దిల
హోమము చేసి పారణ హవిష్యమునన
చేయఁగ వలయున్. వరాహ. 9. 88.

కొలువుండు — (రాజాదులు)సభతీర్చియుండు.

క. కవితామధురిమ డెందముఁ,దవులం గొలు
వుండి సదయతఁ దన్నుఁ బల్కెన్. మనుచ.
1. 13.

సుఖముండు — సుఖముతో నుండు.

క...హరి నిజపురమున సుఖముండె వతివిభూతి
దలిర్పఁగ. భాగ. 10. ఉ. 525.

ఉన్నది — 1. ఉన్నయట్టిది. భార. ఆది.7.72.

2. ఉండునది, ఉండవలయును.

సీ. ...దుర్జనయోధవరుల,కడ నుండకున్నది
కరుణ యార్జవ మక్షయము సత్యంబును
శమము శౌచ,మనునవి యెద నిల్పునది.
భార. ఆది. 3. 206.

క. వరునకు నాకుం దక్కఁగ,వారలకు మీరూపు చూపకున్నది విషవి,స్ఫురిత భుజభంగి భయం,కర మూర్తులు దాల్చి యుండఁగా వలయుఁ జుడీ. భార. విరా. 1. 176.

**ఉన్నరూపు** — కలరూపు, యథార్థస్థితి.

ఆ. ఉన్నరూప పలుకుచున్నరు లెక్కడఁ,గలరు ...భార. విరా. 1. 191.

**ఉన్నట్టులు** — యథార్థముగా.

క. న న్నడుగ నేల నీవును, నన్నిచుఁడు నేమి మాట లాడితి రది నా,కున్నట్టు తెలుఁగఁ జెప్పుము, ని న్నే మెచ్చించువాఁడ నీరజ వదనా. భార. విరా. 2. 278.

**ఉన్నట్లేయుండి వాఁడు వెళ్లిపోయినాఁడు** — ఆకస్మికముగా వెళ్లిపోయినాఁడు.

**ఉన్నవాఁడు** — 1. ఉన్నయట్టియతఁడు. 2. ధనికుఁడు, ధనము కలవాఁడు. 3. అన్యుఁడు.

మ. ...వీఁ, డతఁడే కాఁదగు నున్నవారలకు నాయాత్మకు సారూప్యసం,గతి సిద్ధింపదు. భాగ. 10. ఉ. 34.

**ఉన్నే** — ఉండునే.

క. పురుషార్థంబునకు హాని పుట్టక యున్నే. భార. విరా. 1. 122.

క. డెందమున కింద్రియములకు, నొందఁగ రాకున్న లేకయున్నే తత్త్వం,బు. భార. శాం. 4. 180.

**ఉన్నేని** — ఉన్నయెడల. (ఉండెడు+ఏని-ఉండెనేనియొక్క సంగ్రహరూపము.)

సీ. నిటలంబుకను దెఱచుటకుఁ గారణ మేమి సర్వేశ యిది రహస్యంబు గాక, యున్నేనిఁ జెప్పవే యన్న నద్దేవుండు ...భార. అను. 4. 422.

జ. ఉంచు, ఉంట¹. ఉండి, ఉంపుడుకత్తె. ఉనికి, ఉనుకువ.

**ఉండేరకము** నం. వి. అ. పుం. ఉండ్రము.

**ఉండ్ర** — ఉండ్ర. వ. వి. వెలిచండ్ర, కదరము (వృ. వి.)

సీ. ఒండొండ తిండ్రించు నుండ్రలఁ జండ్రలఁ బొరిగొన్న పేకీఁతపొదల. వాల్మీ. 2. 82.

సీ....కదంబమౌ నుండ్రస యనఁగను నుండ్ర యనఁగ. ఆం. భా. 2. 48.

**ఉండ్రకము** — ఉండ్రము.

గీ....సంపూర్ణభక్తి, ననుదినము లుండ్రకము లుపహార మొసఁగి. ధర్మ. 7. 115.

**ఉండ్రము** — ఉండ్రకము. వి. (నం. ఉండేరకః) మోదకము, ఉడికించిన వరిపిండిని ఉండలుగాఁ జేసి ఆవిరిమీఁద వండినభక్ష్యము.

(వ్యవ) ఉండ్రముముక్క.

సీ. ఉండ్రాలు నూఁబిండి పుండ్రేక్షులుం దేనె యనఁటిపండ్లుం బూరియలు ఘృతంబు.గీ. నాదిగా భక్ష్యచోష్యలేహ్యాదు లయిన,బహు పదార్థంబు లర్పించి ప్రణతు లయిరి, వేలుపులు రాక్షసులును నావిఘ్నపతికి. హర. 6. 55.

**ఉండ్రస** — ఉండ్ర. ఆం. భా. 2. 48.

**ఉందనము** నం. వి. అ. న. తడుపుట.

**ఉందరువు** నం — ఉందురువు.

**ఉందురకర్ణి** నం. వి. ఈ. స్త్రీ. మూషికపర్ణి, ఎలుకజీడి (వృ. వి.)

**ఉందురకర్ణిక** నం. వి. అ. స్త్రీ — ఉందురకర్ణి.

**ఉందురము** నం. వి. అ. పుం. — ఉందురువు.

**ఉందురుకర్ణి** నం — ఉందురకర్ణి.

**ఉందురువు** నం. వి. ఉ. పుం. 1. ఎలుక. 2. పందికొక్కు.

**ఉంపుడుకత్తె(త్తియ)** విశే. (√ఉంచు) భోగార్థము ఉంచుకొన్న స్త్రీ.

**ఉంబ** వి. గోవుల యంభారవము, గోవులయఱపు నందలిధ్వని కనుకరణము (గ్రా).

**ఉంబరము** నం. వి. అ. పుం. నాస, ద్వారముమీఁది కమ్మి.

**ఉంబళి** — ఉంబళిక. (క. ఉంబళి. త. ఉంబళమ్.) (పన్ను లేకుండ ననుభవించుట.)

గీ. సత్యలోకంబుఁ బాలించు శంభులోక, మేలు శ్రీవిష్ణులోకంబు లాలనంబు, సేయుఁ బాతాళ సురపదక్షితితలముల, నుంబళిక నిచ్చుఁ దనుఁగొల్చి యున్న ప్రజకు. హర. ఉ. 3. 48.

**ఉంబళిక** వి. (క. ఉంబళికె. త. ఉమ్మళికై్క.) 1. పన్నియ వక్కఱ లేకుండ ననుభవించుభూమి గ్రామము, మొ. (మొఖాసా).

సీ. అలసహ్యాజాతటి నగ్రహారంబులు బహు రేఖ మించునుంబళిక యూళ్లు. రాజగో. 1. 38.

సీ. అఖిలసీమామూల మైనదుర్గమ్ము లుంబళికలు గల కమ్మ వెలమదొరలు, చేరి కై దేసివేల్ శివరాయలవరాల వెలకట్టడలపటాణీల్ గరిబులు. రా. వి. 5. 13. (ఉమ్మలికలు — ముద్రి).

2. (భూమి గ్రామము, మొ.) పన్ను లేకుండ ననుభవించుట.

సీ. ఇగురుకై జీతంపు చెక్కటీలకు గుజ్జుపంపు మామిడిఁ గట్టుబడిగఁ జేసి, చలువపూఁదేనె గానపునల్ల ప్రజలకు వలరుటీఁ ముమ్మ లుంబళిక కొసఁగి. చంద్రా. 4. 84.

**ఉంబి** నం. వి. ఈ. స్త్రీ. గడ్డినిప్పున సగము పక్వ మగునట్లు కాల్చినయవగోధూమమంజిరి(యవల యొక్కగాని గోధుమలయొక్కగాని వెన్ను).

**ఉంబురము** నం. — ఉంబరము.

**ఉంభకుఁడు** నం. విశ. (అ. భీశా. అ.) — ఉంభిత.

**ఉంభత్** నం. శత్. నిండించుచున్న.

**ఉంభనము** నం. వి. అ. న. పూరించుట, నించుట. ఆము. 2. 55.

**ఉంభనీయము** నం — ఉంభితవ్యము.

**ఉంభిత** నం. విశ. (ఋ. త్రి. ఋ.)పూరించువాఁడు, నిండించువాఁడు.

**ఉంభితము** నం. విశ. (అ. ఆ. అ.) పూరితము, నింపఁబడినది.

క. అంభోధికన్యకాకుచ, కుంభోంభితఘుసృణ మసృణగురువతునకుఁ. ఆము. 1. 46. (ఇచట అంతటను పూయఁబడినది అని తాత్పర్యము).

**ఉంభితవ్యము** నం. విశ. (అ. ఆ. అ.) నిండింపఁ దగినది.

**ఉంభ్యమానము** నం. విశ. (అ. ఆ. అ.) నిండింపఁ బడుచున్నది.

**ఉంభ్యము** నం — ఉంభితవ్యము.

**ఉక** ప్ర. చిఱుత మొదలగువానికిస్వార్థమునవచ్చు తద్ధిత ప్రత్యయము.

ఉదా: చిఱుత + ఉక = చిఱుతుక, పొలఁతి + ఉక = పొలఁతుక, ఎమ్మ + ఉక = ఎమ్మక.

**ఉకానహము** నం. వి. అ. పుం. 1. పీతరక్తవర్ణ మగుగుఱ్ఱము. 2. కృష్ణరక్తవర్ణమగుగుఱ్ఱము.

**ఉక్క** వి. (√ఉక్కు[1]? నం. ఉల్కా. ప్రా. ఉక్కా. త. ఉక్కమ్ — నిప్పు) ఉమ్మము, ఉబ్బ,ఉమ్మ.

సీ. మిక్కుటంబుగ మేనియుక్కచేఁ గమలినవిరి పూవుసజ్జ లకఁటి చూచి. రాజ. చ.3.146.

వ. మఱియు నొక్కయెడ నెడ మీనిమానిని యుక్కలఁ జిక్కి .... ఊర్పుగాడ్పుల కవ కాశంబు లేకునికి. ప్రబంధ. 78.

**ఉక్కట** వి. (నం. ఉత్కటః) మదము.

ఉ. చక్కెరబొమ్మపైఁ గరము సాఁచుటకొట్టిన పిండి నీకు నీ,వక్కట యుక్కటం గలుష మన్నఁ గలంగవుకారఁ గొంద్రె కాల్, ద్రొక్కినలీల కూలితలఁ ద్రొక్కఁ దలంతురె యొల్లు చెడ్డవాఁ,డెక్కటిదేవిమిండఁ డను టెల్ల యథార్థము పాండురాంగకా. రా. వి. 4. 55.

**ఉక్కడ(ఱ)ఁగు** అ. క్రి. (√ఉక్కు[2]) దుర్బల మగు, నిస్సత్త్వమగు.

చ. అవనితలంబు ప్రవస్సెనొ హిమాచలశృంగము ప్రయ్యలయ్యెనో,శ్రవణవిదారణం బయిన శబ్దము దా నిది యేమియొక్కొ భైరవ మయి విన్చె నంచును బురంబునవారు భయంబు నొంది రం, దువిదలగర్భముల్ గలఁగె ముక్కడఁగెఁ మగధేశుసైన్యముల్. భార. సభా. 1. 212.

**ఉక్కడ(ఱ)ఁచు** స. క్రి. (√ఉక్కడఁగు.) ఉక్కడఁగఁ జేయు.

1. బలహీనముచేయు.

సీ. పొలపంబు మెఱసి దిక్కులఁగాంతిపూరించు క్రొక్కారుమెఱుఁగుల నుక్కడంచి. భార. విరా. 2. 83. (ఇట ఔపమ్యద్యోతకము)

2. చంపు.

సీ. ఉగ్రశరముల నుదగ్రవీర్యుని ద్రుంచెనుగ్రామ్యనాకకోలమక్కడంచె. మార్క. 6.108.

క. రక్కసు నాయోధనమున, నుక్కణఁచి మదీయపుత్త్రి నొగిఁ గాచి మమున్, గ్రక్కున రక్షించినమీ. చక్కని కారుణ్యరసము చను వర్ణింపన్. రుక్మా. 5. 75.

(ఇట్లే ఉక్కడఁగించు, ఉక్కణఁగించు.)

సీ. అదిమి కప్పంబుల ముదముతోఁ గొనుచును బలిమి నీయనిభూమివలయపతుల, నుక్కడఁగించుచు ...భార. ఆది. 1. 7.

క. ఉడుపుం గ్రోధుఁ డహింసను,సడలింపుదు నేను బ్రహ్మచర్యాదుల నుక్కడఁగించు లోభుఁడుద్ధతి, నడవొడ లేకుండ సూనృతాస్తేయములన్. ప్రబోధ. 1. 56.

ఉ. ఆగ్రహ మాత్మలోఁ బొడమునట్లుగఁదండ్రి నకారణంబ యత్యుగ్రనిశాచరవ్రతతు లుక్కణఁగించుట చెప్పి...వి. పు. 1. 18.

వ. పదితలలరక్కసు నుక్కణఁగింపనోపక సీతావియోగుండనై యకారణంబున వాలిం ద్రుంచి కోఁతులమఱువు చొచ్చి యనేక ప్రయాసంబుల వైరంబు చక్కంబెట్టి లోకంబు లుద్ధరించితి నది యట్లుండె. సీతావి. 1. 65.

**ఉక్కడము¹** విశే. (సం. ఉత్కటః) గొప్ప.

ఉ. ఉక్కడమైన మంచిమను వొప్పెడునాహాయరత్న మెక్కినన్, గక్కస మేమి లేక... సారంగ.1.82. (శ.ర—ఉక్కళము,ముద్రి.)

**ఉక్కడము²**—ఉక్కళము¹.

(సేనలకై ఉంపఁబడిన కావలి)

వ. కొక్కెరలు కెరలి యిరుచక్కియల నుక్కడంబు నడువన్...హర. 2. 20.

జ. ఉక్కడీఁడు

**ఉక్కడీఁడు** విశే (ఉక్కడము² + ఈఁడు) ఉక్కడముగా వచ్చినబంటు, సేవకు ముందుగాఁబంపఁబడినబంటు.

గీ. ఉక్కడీఁడయి యేతెంచె నుక్కు మిగిలి,కలిగారాబుచెలికాఁడు కలికిమరుఁడు. నైష. 7. 41.

శ్లో. అద్రాతురాజివాహనం తే స్మరమగ్రేసరం సురాః,అజానినయశిక్షార్థం కలినేవ పురస్కృతం. సం. నైష. 17. 14. (పురస్కృతం—పురఃప్రేషితం, అనివ్యాఖ్య)

**ఉక్కఱు** అ. క్రి. (√ఉక్కు²) ఉక్కుచెడు.

ఉ. ఉక్కఱి యిట్లు మధ్యము మహోగ్రశరంబులు దాఁకనోర్వ కా,రక్కసులెల్ల నాహవపరాఙ్ముఖులైన...భార. అర. 4. 13.

క. ఉక్కఱి సురపతి కైనను,మ్రొక్కము... భార. ఉద్యో. 3. 360

**ఉక్కలుఁడు** విశే. (సం. ఉత్కలః. ప్రా. ఉక్కల, ఉక్కలో.) ధురంధరుఁడు.

మ. విలసచ్చక్రచతుష్కమై ఘనతరద్వీపిత్వగావేష్టనో,జ్జ్వలమై కిష్కుచతుశ్శతత్రితయవిస్తారాఢ్యమై రెండువే,లెలుఁగు ల్వానిన కాంచనోన్నతరథం బేపెక్కఁగా నెక్కియు,క్కలుఁడై యేఁగె మయుండు సైన్యమున కేకస్వామి యాతం డవన్. హరి. పూ. 4. 82. (వ్రాఁతప్రతులలో 'ఉత్కలుఁడు' అని యున్నది.)

**ఉక్కళము¹**—ఉక్కడము² వి. (త. ఉక్కడ. త. ఉక్కళమ్.) సేనలకై యుంపఁబడినకావలి; శత్రువులరాకను గనిపట్టుటకై యుంచినకావలి, కోవురము.

చ. పయనము చాటఁ బంచి సుముఖంబుగఁ బూరియు నీరు వంటక,ట్టియలును గల్గుచోట్లను గడిందిమగల్ దగునుక్కళంబుగా, భయమను పేరులేక నిరపాయముగా విడియించుచున్ మనఃప్రియ మగుభంగి సేననడిపించె విశృంఖలవైభవంబునన్. నిర్వ. 7. 96. ('ఉక్కణము' అని శ. ర. చి. ని. పాఠములు.)

ఉ. చుక్కలఱేఁడు తూర్పుదెసఁబోదు తనుం గురుసంగరార్థమై. యుక్కునఁ దారసిల్లునని యుక్కళ మంపినరీతి వేగురుం,జుక్క సురేంద్రుదిక్కునను శోభిలె...శశాం. 4. 126.

**ఉక్కళము²** వి. (సం. ఉపనిష్కరః) పట్టణమునకుఁ బోవు రాజమార్గము.

సీ. ఉపనిష్కరం బన నుక్కళం బమరును. ఆం. భా. 2. 9.

**ఉక్కన–ఉక్కిన.**

(శ్వాసబాధ)

చ. కుసుమసుగంధి యొర్తు నృపకుంజరుఁగన్గొని మోహితాత్మయై, యనురుసు రన్న దాని నికటాంగన యాఁగసి నీకు నేటి కి,ట్లుసు రన నన్న నిఁటికడనుం డిటకుం బరువెత్తి వచ్చు ను,క్కన నుసు రంటిఁ బొమ్మనుచు గ్రక్కునఁ బోలఁగ బొంకెనయ్యెడన్. వేం.పంచ. 4. 348. (దీనికిఁ బ్రయోగాంతరము కనఁబడలేదు.)

**ఉక్కాడు** అ. క్రి. (√ఉక్కు²) బలముచూపు.

క. పెక్కండ్రతోడనిరిన, మొక్కతలినకొనక తలఁగియున్న పగతుతో,నుక్కాడి బంధు భావముఁ,దక్కటి పగలయెడ వలయుఁ దానెఱపంగన్. భార. శాం. 3. 25.

**ఉక్కిరిబిక్కిరి** వి. ఊపిరియాడకుండుట.

(వ్యవ) నాకు ఉక్కిరిబిక్కిరి యగుచున్నది. మెడ వదలుము

విశే. ఊపిరియాడనిది.

వ. క్రిక్కిఱిసి యుక్కిరిబిక్కిరియై ధరణిం గా ళ్లందక పక్కిజక్కి నెక్కుసామిపాదంబులకు మ్రొక్కి. మృ. వి. 3. 43.

(వ్యవ) పాలు త్రాగలేక పిల్లవాఁడు ఉక్కిరి బిక్కిరియైనాఁడు.

**ఉక్కివము** వి. (క. ఉక్కివ. త. ఉక్కుమమ్.) కప టము, మోసము; కపటకృత్యము.

ఆ. ఇట్టికార్యమునకు నే నవశ్యంబును, వొడఁ బడంగ నోప నుక్కివమున, సుతులతోడ నేల సుతులకు భేదంబు,నేయఁ గడఁగి తిదియుఁ జెట్ట యనక. భార. సభా. 2. 180.

క. ఎక్కువతక్కువమాటలు, నుక్కివములు నెం దుఁ గీడు లొందించుటలుం,బెక్కుతనయన్న దమ్ముల,దిక్కులనన్నియును సైఁపఁ దేజము నేయున్. భార. శాం. 2. 350.

జ. ఉక్కివుఁడు.

**ఉక్కివుఁడు** విశే. (√ఉక్కివము) 1. కపటముగల వాఁడు, మోసగాఁడు.

సీ. కడుఁగ్రొవ్వి తొల్లి యెప్పుడు నాకు నేఁటేఁ టఁ జేయుపూజలు నేఁడు నేయనొల్ల,కుక్కి వుఁడై నదామోదరుకఱపులు విని యొక్క చిడిపిగట్టునకుఁ జేసి,రి. హరి. పూ. 8. 157.

ఉ. టక్కరు లుక్కివుల్ బలుకుటారులు క్రూరు లు వేషధారులున్, దక్కను లోట .... సమీర. 4. 22.

2. ఉక్కిఁడు, మూర్ఖుఁడు, బుద్ధిహీనుఁడు.

ఉ. అక్కట వాసుదేవువను పాదరిణంబునఁ జేయరైరి వీ, రెక్కడిబుద్ధిమంతు లని నిందును నందును లోక మెల్లఁ జే,రుక్కన మ్రగ్గుటన్ దలఁప నొల్ల కపాయము నేసి రట్టె యీ,యుక్కివు లెందునుం గలరె యొప్పరువో ధృతరాష్ట్రనందనుల్. భార. ఉద్యో. 4. 20.

3. ఖలుఁడు, దుష్టుఁడు.

వ ....భవత్ప్రతాపంబున నహుషునకుఁ బరా భవం బొనరించి నన్ను రక్షింపక తక్కిన నుక్కివుం డగు నతని పాపనిశ్చయంబున నాపద వచ్చు. భార. ఉద్యో. 1. 174.

**ఉక్కిన** వి – ఉక్కస. 1. దగ్గు.

క. ...వళీ,పలితంబు లయ్యె వగరును, దల యేరును నుక్కసయును దలకొను దెంచెన్. భార. ఆది. 3. 191.

చ....వగరంపుటూర్పులున్, నిలుపఁగ రాని యుక్కసయు నెమ్మెయి నెక్కొనుదప్పి పెంపుఁ జే,వెలుఁగునఁ జూచుచూపుఁ గల వృద్ధమహీసురుఁ డమ్మహీశ్వరున్. విక్ర. 2. 155. అం. భా. 2. 126. ('ఉక్కస యన' వ్రా. పాఠము 'ఉక్కసమన'ముద్రి).

2. శ్వాసబాధ, ఊపిరి పీల్చుకొనునపుడు విడు చునపుడును గలుగుశ్రమము.

ఆ. ఉక్కసయును దగ్గుఁబిక్కటిల్లె. భాగ.6.61.

**ఉక్కిఁడు** - ఉక్కివుఁడు

(మూర్ఖుఁడు.)

ఉ....ఉ,క్కిలయి నేర్పు లేక తమకించి పయిం బడి నొచ్చువారు...నిగ్ర. 3. 11.

ఉ. బాలురు మీఁద లిద్దరణిభాగము క్రిందును మీఁదుదిక్కులున్, మూలలు నెంత యక్కొ లఁది ముందర నిక్క మెఱింగి కాక

యు,క్కిలయి యిట్లు సృష్టిపనికిం దమకిం
పఁగ జన్నె. హరి. పూ. 1. 72.

**ఉక్కు¹** అ. క్రి. (క. ఉక్కు.) 1. ఉడుకు; గాలి లేక తపించు.

(వ్యవ) శరీరము గాలిలేక ఉక్కిపోవుచున్నది.

2. ఊపిరి యాడకుండు.

ఉ. పాడి యొఱుంగవోటు వేఁ,బట్టిన నుక్కి చచ్చు ... అతఁడు కూర్చుతపంబనవెంత. చంద్రా. 3. 60.

3. (క. ఉక్కు.) నశించు, చచ్చు.

ద్వి. ఘోరాహవంబునఁ గుంభకర్ణాది, వీరులు పెక్కండ్రు విషమవిక్రములు, ఉక్కిరందఱు విభుఁ డొక్కఁడె చిక్కె, నెక్కటిరఘు రాము నితఁ డేమి గెలుచు. రం. రా. యు. 514 పా. 5 పం.

ఉక్కఁబట్టు — ఉక్కునట్లు పట్టు, ఊపిరి యాడ కుండఁ బట్టు.

సీ.... ఈలైరి కంకణం బెగయఁ బోఁ బొడవున పెక్కించి డించి తా నుక్కఁబట్టు. చంద్రా. 2. 77.

సీ. ఒకవేళ వానల నుపహతి నొందించు నొకవేళ రంధ్రంబు లుక్కఁబట్టు. భాగ. 7. 199.

**ఉక్కు²** వి. (సం. ఊర్క్—బలము. త. ఉరుక్కు. క. ఉర్కు.) 1. ప్రతాపము; బలము.

చ. చక్కనగు మనిన రక్కసుఁ, డక్కజముగఁ బెరిఁగి వచ్చి యయ్యనిలజు నీ,యుక్కును వీరముఁ జూచెదఁ, జిక్కన నిలు మనుచుఁ గడు విజృంభించి వడిగా. భార. ఆది. 6 208.

గీ....ఉక్కు లావును నంతంత పెక్కు డయ్యె. భార. విరా. 5. 184.

2. వేగము, వడి.

ఉ.... పే, రుక్కున నేలు నిక్కిచన నొక్కఁడు వంకలు నొక్క శక్తుఁడే. పాండు. 5.218.

3. మదము, గర్వము, పొగరు.

గీ. పాండుపుత్రులమాత్రకు భయము నాకు, నెక్కడిది ప్రేల్కెడిన వారియుక్కు మడఁతు. భార. ఉద్యో. 4. 216.

క. పెంక్కండ్రము గల మని యు,ట్లుక్కునఁ బోరఁబడుట నీతియునుపాయముఁగా,దక్కజమగురై వబలం,బెక్కుడు బాలురన వచ్చునే యాదవులకా. హరి. ఉ. 1. 86.

4. అయస్సారము, కాఁచి శుభ్రము చేసిన యినుము.

క. ఉక్కుగద మురారిదెసకు నుక్కునవై చెన్. హరి. ఉ. 6. 211.

ఉక్కుతునియ—ఉక్కుముక్కవంటివాఁడు, శూరుఁడు.

గీ. ద్రౌపదేయులు నామభద్రానుతుండు,నుక్కుతునియలు గారె మిమ్మక్కుమార,వరులఁ గొని యొర్చువాఁడయి వచ్చు ధర్మ,పుత్త్రుఁ డిది నీకుఁజూడంగఁ బోల దెల్లు. భార. ఉద్యో. 2. 176.

(ఇట్లే ఉక్కుతునుక)

ఉ. గాళకు లాపురీభటశిఖామణు లెక్కటియుక్కుతునుక లా,భీలతరాళనుల్ చిదిమి పెట్టిన బంటులు...విజ. వి. 1. 10.

విశ. క్రూరము, ఘోరము.

చ. తరుణులఁ గాంథులకా వెడఁగుఁదాపసులకా ప్రబనవాళుగంబులం, బోరిగొమనట్లు గాదు ననుఁ బోర జయించుట యన్న నవ్వినా, శరములు పువ్వుతోట సహజంబులు వారికి నిమ్ము నొంచుచో, గరళముకంటె నుక్కు లని గ్రక్కున నైదు శరంబు లేసినన్. శై. భా. 3. 102.

జ. ఉక్కడఁగు, ఉక్కడఁచు, ఉక్కఱు, ఉక్కాడు, ఉక్కుమడఁగు, ఉక్కుమడఁచు, ఉక్కుమిగులు, ఉక్కెక్కు.

**ఉక్కుమడఁగు** — ఉక్కడఁగు. (చూ. ఉక్కుమడఁచు.)

**ఉక్కుమడఁచు** స. క్రి. (√ఉక్కుమడఁగు) ఉక్కడఁగఁజేయు; చంపు.

ఆ. అని నివాతకవచు లనుదానవుల నాతఁ, డొక్కరుండ కాఁడె యుక్కుమడఁచె. భార. విరా. 4. 210.

**ఉక్కుమిగులు** అ. క్రి. (√ఉక్కు²) ప్రబలు, అతిశయిల్లు.

క. రెండుబలంబులవారలు,నొండొరువులకంటెఁ జాల నుక్కుమిగిలి యొం,డొండ కడంగుచు

నుజ్జ్వల, చండస్థితి నొప్పిరపుడుజగతీనాథా. భార. భీష్మ. 1. 138.

(ఇట్లే ఉక్కుమీఱు, ఉక్కుమెఱయు.)

సీ...కల్పాంతభైరవాకారులై శూరులై బిరుదు లందినభటుల్ పెక్కువేలు. గీ. మిక్కుటపు వీఁక దిక్కులఁ బిక్కటిల్ల, నొక్క మొగిఁ దన్నుఁ గొల్వఁగా నుక్కుమీఱి, కదనమున కాయితంబయి కదలిపోయె, రావణునిమీఁద మనయనరణ్యనృపతి. ఉ. రా. 3. 159.

ఆ. అనుచు నతని నుడిపి ధనువు మ్రోయించుచు, నంపగములు వఱప నవ్విభుండు, వానినెల్ల వింట వడిఁ బాఱఁ జదుపుచు, లెక్కసేయ కుండె నుక్కుమెఱసి. భా. రా. అర. 1.228.

**ఉక్కెక్కు** అ. క్రి. (√ఉక్కు[2]) సత్త్వవంతమగు, దృఢమగు.

ఉ. గ్రక్కున లేచి వాలమున గాఢతరంబుగఁ జుట్టి పిక్కలు, క్కెక్కఁగఁ ద్రొక్కి నిల్చి తను వించుక వంచి. కాశ. 4. 74.

**ఉక్కెఱ** వి. (సం. ఉత్కరికా? ఉపకారికా? శ. ఉక్కారి—ఇది శకటరేఫ మని లాక్షణికులు. శ. ర. చి. ని. నిర్ధారకప్రయోగము లేదు. ప్రయోగములం దుభయరేఫములు కనఁబడు చున్నవి.) బెల్లమును పిండియుఁ గలిపి చేసిన భక్ష్యవిశేషము.

వ....ఉక్కెరలుఁ జక్కెరలును నేతులుఁ దేనె తొలలును. కాశీ. 7. 185.

క. చక్కెరలో నిండువెన్నెల, యుక్కెరలో యమృతధారలో యివి యనఁగాఁ, జొక్కించు నెంచఁ దరమా, యక్కొమరునితొక్కుఁ బలుకు లతిమధురంబుల్. సుద. 2. 125.

సీ. ... ఉక్కెఱయుఁ బక్కెఱయును గుఱు మాపు ... ఇవి యాదిగాఁగఁ, గొన్ని తెనుంగుఁ బలుకుల హ్రస్వములమీఁదఁ, దప్పక బండిఱా లొప్పుచుండు. అప్ప. 2. 167.

**ఉక్త** నం. వి. అ. స్త్రీ. ఒకానొకఛందస్సు.

**ఉక్తము** నం. విశే. (అ. అ. అ.) 1. అడుగఁబడినది (మిత్రాది).

శ్లో. అనుక్తేనాపి వక్తవ్యం, సుహృదా హిత మిచ్ఛతా. (నీతి).

2. చెప్పఁబడినది (వాక్యాది). వి. అ. న. 1. మాట. 2. వాక్యము.

**ఉక్తి** నం. వి. ఇ. స్త్రీ. 1. చెప్పుట, కథనము. 2. మాట, పదము. 3. శబ్దశక్తి.

శ్లో. ఏకయోక్త్యా పుష్పవంతౌ దివాకరనిశాకరౌ. అమరము. (చూ. శక్తివాదము. 83 పా.)

4. సరస్వతి.

**ఉక్థము** నం. వి. అ. న. 1. సామవేదము; సామవిశేషము (స్తోత్రము). 2. ప్రాణము.

శ్లో. ఉక్థేన రహితో హ్యేష, మృతకః ప్రోచ్య తే యథా. భాగ. 1. 15. 5.

**ఉక్షణము** నం. వి. అ. న. (నీరు, మొ) చల్లుట, సేచనము.

**ఉక్షతరము** నం. వి. అ. పుం. మహోక్షము, పెద్ద యెద్దు.

శ్లో. గోఽణిం జనేన స్మ నిధాతుముద్ధృతామనుక్షణం నోక్షతరః ప్రతీచ్ఛతి. శిశు. 12. 10.

**ఉక్షము** నం. వి. న్. పుం. 1. వృషభము, ఎద్దు. 2. వృషభమను ఓషధి.

**ఉక్షితము** నం. విశే. (అ. అ. అ.) 1. చల్లఁబడినది, చిలుకరింపఁబడినది. 2. తడుపఁబడినది.

**ఉఖ** నం. వి. అ. స్త్రీ వంటకుండ.

**ఉఖర్వలము** నం. వి. అ. పుం. భూరి పత్త్రమను తృణవిశేషము.

**ఉఖలము** నం — ఉఖర్వలము.

**ఉఖ్యము** నం. విశే. (అ. అ. అ) ఉఖయందు వండఁ బడినది (మాంసాది).

**ఉగము** వి. (నం. యుగం — జన్మము?) ఆయువు.

క. ఏనుం గనికర మరయక, పూనితిఁగా కిట్టియెడలఁ బొనఁగునె యేయం, గావమె కాలనియమగతి, తో నావేఁట మునియుగము ద్రుంగించెఁ దుదకు. రాఘవ. 1. 25. (రామాయణార్థమున ఉగ మనియు భారతార్థమున యుగమనియుఁ బదచ్ఛేదము. ప్రయోగాంతరము లేదు.)

2. (క. ఉగరిసు) అయాసము బాధ మున్నగు వానిచే విడుచు నిట్టూర్పు.

చ. ఉగమున నంబ యంచు జను లుల్లములం గడుఁ దల్లడంబులం, బొగులఁగఁ గొన్ని దిక్కులఁ గపోతకపోత సమూహధూమ్రమై, పొగయుచుఁ గొన్నిదిక్కులఁ బ్రభూతశిఖాచయ మంట మింటిపై, నెగయుచు నన్ని లోకములు నేర్చెఁ దదీయతపోగ్ని మిక్కిలిన్. వాల్మీ. 3.4.

**ఉగాది** వి. (సం. యుగాదిః. క. ఉగాది.) చాంద్రమానసంవత్సరాది, చైత్రమాసము నందలి మొదటి దినము.

**ఉగ్గఁగట్టు** స. క్రి. బిగియఁగట్టు.

క. అని దామపాశమున నా,తని నెన్నడు ముగ్గఁగట్టి తక్కినకొనఁ, దా,డొనరఁగ నులూఖలముతో, జనని వెస న్మ్రుడిచి నిలిపె సదనము నందున్. వి. పు. 7. 185.

**ఉగ్గఁబట్టు** స. క్రి. 1. బిగఁబట్టు.

చ. బలితపుఁదావిమానెఁ దలపై నిడి వెంద్రుక లుగ్గఁబట్టి తొ,య్యలి రతనం బొకర్తు తలయంచు ధరాతలవజ్రపాణికిన్. రా. వి. 5. 52. ('ఉగ్గఁబెట్టు.' ముద్రి).

2. నిరోధించు.

క. నీ కిష్టం బిది గానీ, నాకా పాపాత్ముఁ జెప్పినం బదిలతల్, లేకున్న విడుతుఁ బ్రాణము, నీకై కూ డుగ్గఁబట్టి నీలగ్రీవా. కాశ. 3. 101. (చి. ని. ముద్రి—ఉక్కబట్టు. శ. ర. పాఠము. కూడుగ్గఁబట్టు—అభోజనముండు)

**ఉగ్గడన** వి. (√ ఉగ్గడించు — సం. ఉద్ఘాటనా.) ప్రకటనము, పైకిఁ జెప్పుట.

తరల. కొడుకుసద్గుణకోటులెల్లను గోటిభంగుల వోలి ను,గ్గడనసేయుచు సత్యవంతునిఁ గానరే మునులార. భార. అర. 7. 269.

**ఉగ్గడి** వి. మేర, మర్యాద.

గీ. గడు వవఁగ మేర యవఁగ ముగ్గడి యనంగ, వడరు మర్యాద...ఆం. భా. 2. 191.

**ఉగ్గడించు** స. క్రి. (సం. ఉద్ఘాట్. ప్రా. ఉగ్గాడ, ఉగ్ఘాడ. క. ఉగ్గడిసు, ఉగ్గడిసు,) 1. ప్రకటించు, తెలుపు; చెప్పు.

ఆ. అక్కుమారి చతుర యగుట శిఖండివ,ర్తనము నెడఁ బ్రమాదమున నెఱింగి, యుగ్గడింప నొల్ల కూరక యెఱుఁగని,యదియ పోలె నుండె నాత్మనొచ్చి. భార. ఉద్యో. 4. 374.

క. వగకులలోపలిమాటలు, దగునే వెలి నుగ్గడింపఁ దన కేర్పడ నొం,డుగడం బుట్టినఁ బలి విన,నగునని చెప్పెడిది గాక యాతని తోడన్. భార. విరా. 1. 30.

సీ. హాళి పుట్టించునుద్యత్సుధారసధార లుప్పతిల్లఁ గవిత్వ ముగ్గడించి, రక్తిఁ గల్పించు...శుక. 1. 89.

2. (మంత్రాదులను) ఉచ్చరించు, పఠించు.

చ. అలవర పాలమౌళి విమలాంబుజరాగవివాహపీఠికా,స్థలి వసియించి లాజసముదాయము నన్ శిఖి హోమ మూన్చెను,తక్కలిక చెలంగ ధూమరవితానము మంత్రము లుగ్గడింపఁగన్. చంద్రి. 6. 73.

ఉ. ...వందిజనంబు ముందటం, జాటువు లుగ్గడింప...నైష. 4. 126.

3. స్తుతించు, ప్రశంసించు.

గీ. సముచితంబుగఁ గూరలచంద ముగ్గ,డించి కుడుపుతెఱంగు పుట్టించి పలుకు, నాసుయోధనుతో...భార. ఉద్యో. 3. 212.

ఉ. మానిని భోజనావసరమధ్యమునం గొని యాడ గోస్తనిం, దేనియ సంస్తుతింప వినుతింపను మిఁగడ ఖండశర్కరా, పానక ముగ్గడింపఁ బ్రతిపత్తిచటూక్తినిసర్గరోషర,క్తాన మైననీ యధర మల్గునొ యంచు మదిం దలంకుచున్. నైష. 8. 85.

4. (నాట్యమునందు లయను సూచించు శబ్దములను) పలుకు.

గీ. తొలుత సుతి కోయిల యొసంగఁ దోడ గోరు, వంక తాళము లుగ్గడింపంగ నెమిలి, సకియ నటియింప మరునాట్యశాలలీలఁ, బంతువగఁ బొల్పు కేళిగృహాంతరమున. ప్రబంధ. 706. శశాం 3. 21.

అ. క్రి. ధ్వనించు, మ్రోయు.

చ....తగువిన్నపంబులం,బలుమఱుఁ జేయుచం దమున బంగరుటందియ లుగ్గడింపఁగన్. పాండు. 2. 32.

ఞ. ఉగ్గడన.

**ఉగ్గడువు** వి.ణ. (సం. ఉత్కటమ్. క. ఉగ్గడ.) అధికము, ఎక్కువ.

క. నడురేయి తీవ్రభానుఁడు, పుడమి వెలసె ననుతలంపు పుట్టించుచు నుగ్గడు వగు తేజంబున వెలిఁగెడుఁ గర్ణుఁడు బాణరుచులు గిఱికొన దెసలన్. భారం. ద్రో. 5. 195.

క. మడువులనీ రింకించుచు, నెడపడఁ జేయుచుఁ బ్రవాహ మెట్టిదియైనన్, వడ యెయ్యనఁ బెనుచుచు నుగ్గడు వయ్యె నిదాఘబలము క్రమయోగమునన్. హరి. పూ. 6. 52.

చ...ఉగ్గడు వగుమేని కాంతి...విక్ర. 6. 45.

**ఉగ్గము** వి. (సం. ఉద్గ్రాహః) చేతఁ బట్టుకొని పోవుటకు ననుకూలమగునట్లు కుండ మొదలగువాని మూతికిఁ గట్టెడు త్రాడు.

గీ. హాలికుఁ డొకండు తన్నగరాశ్రయుండు, చేత నుగ్గంపుఁ గుండతోఁ జెర్లకోలతోడ... పరమ. 5. 28.

ద్వి. అకలంకుఁ డగుబాలు నాత్మగేహమున, నొకచోటఁ బెనుఱోల నురిత్రాటఁ బెనఁచి, కట్టఁబూనిన నింత గడమైన నింట,గట్టిగాఁ గలుగు పగ్గముల నుగ్గముల, ముడుపలేమి దయాసముద్రుండు కట్టు,వడియె నేమిటఁ బట్టువడని బ్రహ్మంబు. అ. మ.క. 1.40పా. 28 పం.

2. తఱిమెన పట్టుటకై తా దమర్చెడుచక్రము.

చ....అతని పటుదీప్తిమండలి ముదంబున నుగ్గమునం దమర్చి వే, తునియఁగఁ ద్రచ్చె ... హరి. పూ. 1. 188.

**ఉగ్గళించు** స. క్రి. అధికముచేయు, గొప్పచేయు.

మ. ఎలదోఁటజ జవరాలి నొక్కతెను నీ విపూపులం గోయుమా,లలనా యంచు భ్రమంబుఁ బూన్చి పతి లీలాచంచలల్లోచనాం, చలమై యున్ననవోఢ నొక్కతెను జంచత్పంచబాణావృతా, నిలముల్ వీవఁగ నుగ్గళించెఁ గుహనాని స్తంద్ర చేతస్కుఁడై. గంధ. 59. ('ఉగ్గిలించె' ముద్రి).

సీ...లఘువుల క్రింది వెల్లను గూడ వెండియు నొక్కటి గలువుక యుగ్గళింప. అ. నైన సంఖ్య వృత్తమది గురులఘువుల, సంఖ్య ఛందమునకు సంఖ్య యిట్లు, దెలిసి చెప్ప వలయు దీనివృత్తోద్దిష్ట, మంత్రు ప్రత్యయజ్ఞు లంబుజాక్ష. అప్ప. 4. 149. (ఉగ్గళించు — పెద్దదిగాఁ జేయు).

**ఉగ్గించు** స. క్రి. దట్టముగా నేయు, తఱచుగా నేయు. (బ్రౌ).

**ఉగ్గు**[1] వి. చనుఁబాలతో రంగరించి బిడ్డలకుఁ బెట్టెడు ఆముదము మొదలగు చమురు.

గీ. పల్మాఱును దేఁటి చిన్ని పాపలకుఁ గుళికి, పువ్వుఁదేనియ నుగ్గులు పోసి పోసి.యయా. 4. 25.

ఉ. పాలడలోనఁ బోసి చమఁబాలు నెయింగిల కొట్టి కాళ్లపై, బాలకు నుంచి వ్రేల్ సెలవిపై నెరగా నిడి యుగ్గువెట్టి యా,కేలటు బొజ్జపై నిమిరి కెంజిగిచేతుల నెత్తి గట్టురా,చూలి యనుంగు సామికిని జోతలు జోత లటంచుఁ బల్కుచున్.సారంగ.1.44.

**ఉగ్గు**[2] వి. నొక్కు, ముడుత, వంపు.

సీ.మేనియుగ్గులు మాన్చి మెదలక చిత్రరూపము భంగిఁ బర్వతభాతి నుండె. వా.రా.4.242.

**ఉగ్గువడు** — నొక్కవడు, మణఁగు, కుంఠితమగు.

క. సిగ్గువడి నిడుదబుడువుల, బొగ్గువలెం బడిన వజ్రముం గని సురరా, జగ్గణములతోఁ దన ధృతి, యుగ్గువటజ వే పితామహునికడ కరిగెన్. కకు. 1. 209.

**ఉగ్గులువాఱు**—(మూలిపోఁగు) మెలిపడు(శ ర.)

**ఉగ్గు**[3] వి. (క. ఉగ్గు) అవ్యక్తవచనము.

ఉ. ఉల్లముఁ జూపుచూపు లన నొల్లనియుగ్గులు విచ్చు సిగ్గులున్...కావ్యా. 2. 63.

**ఉగ్మలి** వి. ఆఁడుది, స్త్రీ. నిర్వ. 8. 75.

గీ. తిరిగె నింటింట భిక్షాం ప్రదేహి యనుచు, బాదరాయణుఁ డీకాసుపట్టనమున, నొట్టు పెట్టిన భంగి నేయుగ్మలియును, బిలిచి

యొక పట్టెఁడన్నంబు పెట్టదయ్యె. కాశీ. 7. 185.

**ఉగ్ర** సం. వి. అ. స్త్రీ. 1. వచ, వస (వృ. వి.) 2. యవాని, ఓమము. 3. ధన్యాకము, దనియాలు. 4. ఉగ్రజాతిస్త్రీ. (చూ. ఉగ్రుఁడు).

**ఉగ్రంపశ్యము** సం. విణ. (అ. ఆ. అ.) క్రూరముగాఁ జూచునది, క్రూరదృష్టి గలది: భయంకర మైనది (వ్యాఘ్రాది).

**ఉగ్రకాండము** సం. వి. అ. పుం. కాఁకర (వృ.వి.).

**ఉగ్రగంధ** సం. వి. ఆ. స్త్రీ. 1. వస (వృ. వి.) 2. 2. ఓమము. 3. అజమోద (ఒకదినుసుఓమము).

**ఉగ్రగంధము** సం. విణ. (అ. ఆ. అ.) గాటయిన వాసన గలది. వి. అ. పుం. 1. సంపెంగ (వృ. వి ) 2. కట్ఫలము, పినగుమ్ముడు (వృ. వి.) 3. తెల్లగగ్గెర (వృ. వి.) 4. వెల్లుల్లి (వృ.వి.) న. ఇంగువ.

**ఉగ్రధన్వుఁడు** సం. విణ. (న్.) భయంకర మైన విల్లు గలవాఁడు. వి. న్. పుం. 1. శివుఁడు. 2. ఇంద్రుఁడు.

**ఉగ్రము** సం. విణ. (అ. ఆ అ.) 1. క్రూరమైనది, భయంకర మైనది. (ఉగ్రదృష్టి.)
2. ఉత్కటమైనది, మిక్కుటమైనది. (ఉదా: ఉగ్రాతపము, ఉగ్రశోకము.)
తీక్ష్ణమైనశక్తి గలది. (ఉదా: ఉగ్రవిషము).
4. కోపించునది, మండిపడునది. 5. దీర్ఘము, నిడుదయైనది. (ఉదా: ఉగ్రనాసికుఁడు).
వి. అ. పుం. 1. శోభాంజనవృక్షము, మునగ చెట్టు. 2. కేరళదేశము, మలయాళము. 3. రౌద్రరసము. న. 1. వత్సనాభవిషము, వస వాళి. 2. (జ్యోతి) క్రూరమగు నక్షత్ర పంచకము. (పూర్వఫల్గుని, పూర్వాషాఢ, పూర్వ భాద్రపద, మఘ, భరణి).

**ఉగ్రశ్రవసుఁడు(వుఁడు)** సం. వి. స్. పుం.సూతుని కొడుకు, రోమహర్షణుఁడు.

**ఉగ్రసేన** సం. వి. ఆ. స్త్రీ. అక్రూరునిభార్య.

**ఉగ్రసేనుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) భయంకర మైన సేనలు గలవాఁడు. వి. అ. పుం. 1. ధృతరాష్ట్రుని పుత్రులలో నొకఁడు. 2. మథుర రాజు, కంసునితండ్రి.

**ఉగ్రాక్షుఁడు** సం. విణ. (అ. ఈ. అ.) ఉగ్ర మైన కన్నులు గలవాఁడు. వి. అ. పుం. శివుఁడు.

**ఉగ్రాణగాఁడు** విణ. (ఉగ్రాణము+కాఁడు.)కొట్టు మీఁద పెత్తనము గలవాఁడు. వేణు. 46.

**ఉగ్రాణము** వి. (క. ఉగ్రాణవు. త. ఉక్కిరాణం.) సామగ్రులుంచెడిగది, కొట్టు.
సీ. నిపుణత రంగమండపములో నారసి యెల మినుగ్రాణంపుటిండ్లు చూచి. విప్ర. 5. 6.
జ: ఉగ్రాణగాఁడు.

**ఉగ్రుఁడు** సం. వి. అ. పుం. 1. శివుఁడు 2. క్షత్రి యునకు శూద్రజాతి భార్యయందుఁ బుట్టిన సంకీర్ణ జాతివాఁడు.

**ఉచిఁత** — ఉచ్చిఁత. (శ. ర.) పరమ. 5. 185.

**ఉచితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. తగినది,యుక్త ము. 2. అలవాటువడినది, పరిచితము.
శ్లో. ...భీమానురశోణితోచితః, పపావనాస్వా దితపూర్వమాశుగః కుతూహలేనేవ మనుష్య శోణితం. సం. రఘు. 3. 54.
3. తెలియఁ బడినది. 4. మితము, కొలఁది యిడఁబడినది. 5. ఉంపఁబడినది, న్యస్తము.

**ఉమేకరించె** అ. క్రి. (√ఉచుక్కు) ఉచుక్కుమను (చూ. ఉచుకరింపు).

**ఉమేకరింపు** వి. (√ఉమేకరించె) ఉచుక్కు మనుట.
మ. అనుచుం బ్రాణవయస్య తెల్పి తనకా యజ్ఞాఙ్క్రేఁగంటి కెంపును జంపుం దలవంపు లోనుచుకరింపుం దొట్టునిట్టూర్పు గుంపును ....వర్ణ్యక్షితిపాలపాళి పయినింపుల్ నింప మిన్ దెల్పినన్. చంద్రా. 5. 152.

**ఉమేకు** వి. (అనాదరమును విషాదమునుసూచిం చు) ధ్వన్యనుకరణము.
సీ. తనవిలాసముఁ గనుంగొని నీటు వెట్టెడుమూ నాస్త్రు రతియు నుచుక్కురనఁగ.దశా.1 57.
ఉ....వాఁడాపుపుఁబోఁడిఁ జూచి విరహాతురుఁ డై తన సర్వశక్తులుం, జూపియు దాని గర్వము నుచుక్కులు గాంచి రిరంస మించఁ గన్. శుక. 3. 166. రా. వి. 1. 76.
జ. ఉచుకరించు, ఉచుకరింపు.

**ఉచ్చే** వి. (క. ఉచ్చె.) మూత్రము.
ఉచ్చపోయు — మూత్రవిసర్జనము చేయు.
జ. ఉచ్చగిత్త, ఉచ్చబుడ్డ, ఉచ్చమల్లి.

**ఉచ్చండము** నం. విణ. (అ. ఆ. అ.) 1. మిక్కిలి యుగ్రమైనది. 2. ఆగ్రహము కలది, అతి కోపము గలది. 3. వడి గలది. 4. మిక్కిలి వేఁడిది.

**ఉచ్చంద్రము** నం. వి. అ. పుం. రాత్రియొక్క చివరభాగము, అపరరాత్రము.

**ఉచ్చక్షువు** నం. విణ. (స.) 1. పైకెత్తినకన్నులు గలది — పైకిఁ జూచునది. 2. పెఱుకఁబడిన కన్నులు గలది; గ్రుడ్డిది.

**ఉచ్చెగిత్త** వి. (√ఉచ్చే) ఆవులమూత్రమును ఆఘ్రాణించును వానిని వెంబడించుగిత్త; స్త్రీలోలుఁడు.

**ఉచ్చట** నం. వి. ఆ. స్త్రీ. 1. దంభము. 2. చంక్రి. 3. ఒకదినునువెల్లుల్లి (వృ. వి.) 4. గురివెంద (వృ. వి.) 5. చూడాల, వట్రువముస్తె (వృ. వి.) 6. భూమ్యామలకి, నేలయుసిరిక (వృ. వి.) 7. నాగరముస్త; భద్రముస్త (వృ. వి.).

**ఉచ్చతరువు** నం. వి. ఉ. పుం. 1. పొడుగైనచెట్టు. 2. కొబ్బరిచెట్టు, నారికేళము (వృ. వి.).

**ఉచ్చతాళము** నం. వి. అ. పుం. 1. గట్టిగాఁగొట్టు చప్పటలు. 2. పానగోష్ఠి, కల్లుపాక. 3. పొడుగైనతాటిచెట్టు.

**ఉచ్చనీచము** నం. విణ. (అ. ఆ. అ.) 1. నిమ్నోన్నతము, మెరకపల్లములుగా నున్నది. 2. గొప్పవి కొలఁదివి కలిసియున్నది.

**ఉచ్చెబుడ్డ** వి. (√ఉచ్చే) 1. మూత్రకోశము. 2. ప్రసవకాలమునందు శిశువుతో వచ్చునీరుతిత్తి. (చి. ని.)

**ఉచ్చెమల్లి** వి. (ఉచ్చే+మల్లి — క. ఉచ్చెమల్లి) ఎబ్బెరాసియాఁడుది, రోఁత పుట్టించుస్త్రీ; నగ్నిక.
గీ. బేరజపుగట్టిజంత పాడూరిసంత, చలము సాధించుదిట్ట రోసాలపుట్ట, లోకముల కెల్ల మూచి యల్లుంద్రజూచి, యెంచఁ గల యుచ్చమల్లి యయ్యింతితల్లి. శుక. 3.18.
సీ. ఇచ్చగొండుల కిచ్చి యుచ్చమల్లుల కిచ్చి వారక యుబ్బించువారి కిచ్చి. విక్ర. 7.124.
వ. హృషీకేశుండు సమయింపం దలంచి వెంటం దగులునవసరంబునం గోటవి యనునొకయుచ్చమల్లి వచ్చి యడ్డపడిన నానగ్నికం జూచి నారాయణుండు మాఱుమొగంబు వెట్టె. ఉ. హరి. 6. 182.
ద్వి. బద్దపిక్కలు నంటబలిసినతొడలు, మొద్దుఁ బాదంబులు ముడిగినవ్రేళ్లు, గఱుకు నల్లని యేను గలిగి దయ్యంబు, మఱపింపఁ దగు నుచ్చమల్లిచందమునఁ, గనుఁగొన రోఁతైన కాలకౌశికుని, వనిత...ద్వి. హరిశ్చ. ఉత్త. 1092.

**ఉచ్చము** నం. విణ. (అ. ఆ. అ.) 1. ఉన్నతము, ఎత్తైనది. (ఉదా: ఉచ్చతటి) 2. ఉత్కృష్టము, గొప్పది. (ఉదా: ఉచ్చకులము) 3. మిక్కుటము, పెద్దది. (ఉదా: ఉచ్చభాషణము, ఉచ్చస్వరము, మొ.) వి. అ. పుం. 1. (జ్యోతి) గ్రహములగతికిఁ గారణమై గ్రహకక్షాశిఖరమున నుండుజీవభేదము. 2. (జ్యోతి) రాశిచక్రమందు ఆయాగ్రహమున కేర్పడినస్థానవిశేషము. (వ్యతి—నీచము).

**ఉచ్చయము** నం. వి. అ. పుం. 1. సమూహము. 2. పువ్వులు మొదలగువానిని కోయుట. 3. నీవిబంధము, పోఁకముడి. 4. ఏఱికూర్చిననివ్వరిధాన్యము. 5. అతిశయము, పెంపు. (ఉచ్చయాపచయా. హితో. 3. 133).

**ఉచ్చరణము** నం. వి. అ. న. 1. మీఁదికిఁ బోవుట, ఊర్ధ్వగమనము. 2. వెలికిఁబోవుట, బహిర్గమనము. 3. ఉచ్చరించుట, నోటఁ బలుకుట.

**ఉచ్చరించు** నం. న. క్రి. వాక్రుచ్చు, పలుకు, చెప్పు.
సీ. ఉచ్చరించితివి విద్వచ్చయంబు నుతింపఁ జాటు ప్రబంధముల్ శతకములును. చంద్ర. వి. 1. 14

**ఉచ్చరితము** నం. విణ. (అ. ఆ. అ.) 1. మీఁది కెగసినది, పుటమెగసినది. 2. వెలుపలికి పోయినది, బహిర్గతము. 3. ఉచ్చరింపఁబడినది. వి. అ. న. పురీషము, మలము.

**ఉచ్చరియించు** సం — ఉచ్చరించు.

క. అచ్చట మూన్నాళ్లెవ్వరు,వచ్చి కృతస్నాను లగుచు వనమాలిజపం, బుచ్చరియింతురు వారు వి,యచ్చరు లరుదందఁ గనుదు రచ్యుతు నందున్. శ్రీ౦. మా. 2. 10.

**ఉచ్చలత్** సం. (క్రి) మీఁది కెగయుచున్న, పైకి వెడలుచున్న.

**ఉచ్చలనము** సం. వి. అ. న. 1. కదలుట. 2. వెడలుట, పయనమగుట.

**ఉచ్చలము** సం. విశ. (అ. ఆ. అ.) చలస్వభావము కలది. వి. అ. న. మనస్సు.

**ఉచ్చలితము** సం. విశ. (అ. ఆ. అ.) 1. బయలు దేఱినది. 2. పై కెగసినది. 3. చెరుగఁబడినది. (ధాన్యము).

**ఉచ్చాటనము** సం. వి. అ. న. 1. ఉత్పాటనము, పెల్లగించుట. 2. స్వస్థానమును డి లేవఁగొట్టుట. 3. పిశాచాదులను విడిపించుట.

**ఉచ్చాటము** సం. వి. అ. పుం — ఉచ్చాటనము.

**ఉచ్చారకుఁడు** సం. విశ. (అ. ఇకా. అ.) ఉచ్చరించు వాఁడు.

**ఉచ్చారణము** సం. వి. అ. న. ఉచ్చరించుట, పలుకుట.

**ఉచ్చారణీయము** సం — ఉచ్చార్యము.

**ఉచ్చారము** సం. వి. అ. పుం. 1. ఉచ్చరించుట, పలుకుట. 2. పురీషము, మలము.మను. 4.50.

**ఉచ్చారితము** సం. విశ. (అ. ఆ. అ.)1. ఉచ్చరింపఁ బడినది. 2. పురీషము విడిచినది (జంతువు).

**ఉచ్చార్యము** సం. విశ. (అ. ఆ. అ.) ఉచ్చరింపఁ దగినది.

**ఉచ్చావచము** సం. విశ. (అ. ఆ. అ.) — ఉచ్చనీచము.

**ఉచ్చి** వి. (సం. ఉచ్చైః. క. త. ఉచ్చ.) బ్రహ్మరంధ్రము, నడితల, సోడు.

సీ. బ్రహ్మరంధ్రాభిధ పరఁగు నుచ్చన...అం. భా. 2. 145.

**ఉచ్చింగటుఁడు** సం. వి. అ. పుం. కోపస్వభావము గల మనుష్యుఁడు.

**ఉచ్చింత** — ఉచింత. వి. అలంకృము, ఉక్తై(వ్యవి.)

సీ చెవుల కితెల్లయుచ్చింతకాయ లెంతేసి పారుటాకులది కుప్పస మిదప్ప. యయా.1.120.

వ. ఉచ్చింతపువ్వులలో నికేసరంబుల క్రియ భాసురం బగుపలువరుసయు. భోజరా. 4.19.

**ఉచ్చిత్రము** సం. విశ. (అ. ఆ. అ.) పైని చిత్తరువులు కలది (వస్త్రాది).

శ్లో. ...ఉచ్చిత్రచీనాంశుక, ప్రస్తారస్థగితాః. మాలతీ, 6. 5.

**ఉచ్చు**¹ వి. వాగురా, పక్షి లోనగువానిని బట్టుటకుఁ బెట్టు ఉరి.

సీ....ఉచ్చు నా నురి యన నొప్పుచుండుఁ, బక్షి బంధనసంజ్ఞ...అం. భా. 2. 293.

గీ. పెంపుడిఱ్ఱులఁ గినుకను బెనఁచిపోయి,కొమ్ము నుచ్చులఁ దగిలించుకొన్న నరిగి, రాజు చూడంగఁ జెప్పంగ రానికడిమి, నీఁటియలఁ గ్రుమ్మినొంచిరి లేటిమగల. యయా.2.17.

**ఉచ్చు**² (దీనికిఁ దఱచు 'పోవు మున్నగుగమనార్థక ధాతువు లనుప్రయుక్తము లగును.) అ. క్రి. (క. ఉచ్చు, ఉర్చు.) 1. ఉద్గతమగు, పైకివచ్చు; అంకురించు.

గీ.....కుంభజుండు కోపించి దొడ్డ,నారసంబేయ నమ్మత స్యనాథుతనయు, నురము వడిఁగాఁడి వీఁపున నుచ్చిపోయె. భార. భీష్మ. 3. 19.

మ. ...వారి శ్రీపాదతలంబు దూఱఁ గొని యయ్యస్త్రంబు మీఁగాల నిష్ఠుర వేగంబున నుచ్చిపోయె వెస వాఁడుం జేరెఁ గైకొంటకున్. భార. మౌ. 83.

సీ. అన్నంబు కడుపులో నఱుగకుండినయప్పుడుడివోక పుల్లతేన్పు లుచ్చునపుడు. శివధ. 6 26.

శా. ఆ సర్వేశ్వరు విశ్వరూపమున కత్యాశ్చర్యుఁడై హర్ష బాష్పాసారఁబుల మేనిసైఁ బులకసస్యం బుచ్చి వర్తింపుచుఁ, గాసారప్రథవాసవాత్మజుఁడు....వరాహ. 9. 109.

2. ఛేదిల్లు, చీలు.

మ....మాయల్ వన్ను నేర్పెంకఁ జెల్లదు సూనీకని యానుయోధనునియుల్లం బుచ్చిపోనాడుమీ. భార. ఉద్యో. 3. 97.

స. క్రి. ఛేదించు, చీల్చు.

గీ. గొరక మే నుచ్చి ధరఁ గాఁడ శిరము విసరె. లే దస్పృశ్యాన మనుమఁ దెల్పెదుననంగ. మనుచ. 4. 47.

వ. అప్పీరం వరునారాచాదినానావిధవిశిఖ వ్రాతంబులు హేతిసంఘట్టనంబున మండుచుఁ గరుల నుచ్చిపోవుచుఁ దేరుల విఱుచుచు ... భార. ద్రో. 2. 18.

చ. ఎలనగ వంకురింప మొగ మెత్తి కనుంగొన రాదొ మేనఁ గ్రొం,బులక లెసంగఁ జై నొంగి పొంకపుఁజన్మొన లుచ్చిపాఱఁ గౌఁ, గిలి దయసేయరాదొ. సమీర. 2.25.(ఇట 'ఉంమును'అధ్యాహార్యము)ఉ. రా. 4.315.

**ఉమ్ప్రెచ్చిరే** వి. కుక్కను బిలుచుట యందలి శబ్దమునకు అనుకరణము.

ద్వి. ఉచ్చుచ్చిరే శంకరోచ్ఛిష్టభోగి,యనియిటు లెలుఁగించునమ్మాత్ర లోన.బస.పు.212పొ. 110 పం.

ద్వి. ఉచ్చుచ్చిరే యని యొగిఁ బిట్టి మిడిచి. బస. పు. 243 పొ. 946 పం.

**ఉచ్చూర(ల)ము** నం. వి. అ. పుం. 1. ధ్వజపటము, జెండాగుడ్డ. 2. జెండాకు ఊర్ధ్వముఖముగాఁ గట్టినకుచ్చు.

**ఉచ్చైర్ఘుష్టము** నం. వి. అ. న. 1. పెద్దకలకలము, కోలాహలము. 2. బిగ్గరగా చాటుట.

**ఉచ్చైశ్శ్రవము** నం. విశే. (స్.) 1. నిక్కినచెవులు గలది. 2-గట్టిగామాటాడినఁ గాని వినలేనిది—చెవిటిది. వి. స్. పుం. ఇంద్రునిగుఱ్ఱము.

**ఉచ్చైస్తమము** నం. విశే (అ. ఆ. అ.) 1.మిక్కిలి యెత్తైనది. 2. మిక్కిలి గొప్పది.

**ఉచ్చైస్తరము** నం. విశే. (అ. ఆ. అ.) 1. ఎక్కువ యెత్తైనది. 2. ఎక్కువ గొప్పది.

**ఉచ్చైస్స్వరము** నం. విశే. (అ. ఆ. అ.) పెద్దకంఠధ్వని గలది. వి. అ. పుం. పెద్దకంఠధ్వని.

**ఉచ్ఛన్నము** నం. విశే. (అ. ఆ. అ.) ఆచ్ఛన్నము, మఱుఁగుపడినది.

**ఉచ్ఛలనము** నం. వి. అ. వ – ఉచ్చలనము.

**ఉచ్ఛలము** నం. విశే. (అ. ఆ. అ.) 1. పైకిఎగయునది. 2. మట్టుమీఱి పైని వ్యాపించునది. 3. తేలియాడునది.

**ఉచ్ఛలితము** నం. విశే. (అ. ఆ. అ.) – ఉచ్చలితము.

**ఉచ్ఛాదనము** నం. వి. అ. న. 1. ఆచ్ఛాదనము, కప్పుట. 2. గంధద్రవ్యములు దేహమునకు అలఁదుట. (శ్లో. స్నాపనోచ్ఛాదనేన. రామా).

**ఉచ్ఛాసనుఁడు** నం విశే. (అ. ఆ. అ.) శాసనము నతిక్రమించినవాఁడు, అవిధేయుఁడు.

**ఉచ్ఛాస్త్రము** నం. విశే. (అ. ఆ. అ.) శాస్త్రము నతిక్రమించినది; శాస్త్రవిరుద్ధమైనది.

**ఉచ్ఛింఘనము** నం. వి. అ. న. చీఁదుట.

**ఉచ్ఛిఖము** నం. విశే. (అ. ఆ. అ.) 1. ఎత్తైనశిఖ కలది. 2. ఎత్తైనశిఖరము గలది. 3. పైకి ఎగయు జ్వాలలు కలది, జ్వలించునది (అగ్ని).

**ఉచ్ఛిత్తి** నం. వి. ఇ. స్త్రీ. 1. త్రుంచుట. 2. వ్రేళ్లతోఁ బెకలించుట; నిర్మూలము సేయుట. 3. నశింపఁ జేయుట.

**ఉచ్ఛిన్నము** నం. విశే. (అ. ఆ. అ.) 1.విదళితము, చీల్పఁబడినది. 2. త్రుంపఁబడినది. 3. సమూలముగా నాశనము చేయఁబడినది. నిర్మూలింపఁబడినది.

**ఉచ్ఛిరస్కుఁడు** నం. విశే. (అ. ఆ. అ.) – ఉచ్ఛిరుఁడు.

**ఉచ్ఛిరుఁడు(రసుఁడు)** నం. విశే. (స్.) 1. పైకెత్తుకొనిన శిరస్సు గలవాఁడు. 2. పొడుగైనవాఁడు. 3. మహిమగలవాఁడు, గొప్పవాఁడు.

**ఉచ్ఛిష్టచాండాలిని** నం. వి. ఈ. స్త్రీ. (తంత్ర) మాతంగీదేవియొక్క మూర్తిభేదము.

**ఉచ్ఛిష్టము** నం. విశే. (అ. ఆ. అ.) భుజింపఁగా మిగిలినది, ఎంగిలిది. 2. పూర్వ ముపయోగించినది, ప్రాఁతపడ్డది. (ఉదా: ఉచ్ఛిష్టకల్పన) వి. అ. న. తేనె, మధువు.

**ఉచ్ఛిష్టమోదనము** నం. వి. అ. న. సిక్థకము, మైనము.

**ఉచ్ఛిష్టుఁడు** నం. విశే. (అ. ఆ. అ.) అన్నముభుజించినపిదప ప్రక్షాళనాది శుద్ధి చేసికొనని వాఁడు. శ్లో న చోచ్ఛిష్టః క్వచిద్వ్రజేత్. మను, 2. 56.

**ఉచ్ఛీర్షకము** నం. విశే. (అ. శీర్ష. అ.) తలపైకెత్తుకొన్నది. వి. అ. న. 1. తలగడ. 2. శిరఃప్రదేశము. మను. 3. 89.

**ఉచ్ఛుష్కము** సం. విశే. (అ. ఆ. అ.) ఎండినది; ఇంకినది.

**ఉచ్ఛూనము** సం. విశే. (అ. ఆ. అ.) 1. ఉబ్బినది, వాఁచినది. 2. బలిసినది. 3. ఎత్తైనది. వి. అ. న. 1. బలుపు. 2. పొంగుట; వాఁచుట. 3. ఉన్నతి. ఎత్తు.

**ఉచ్ఛృంఖలము** సం. విశే. (అ. ఆ. అ.) 1. బంధన రహితము, కట్టు లేనిది. 2. నిరంకుశము, స్వేచ్ఛగా వర్తించునది; పద్ధతి గాని క్రమము గాని లేనిది.

**ఉచ్ఛేత్త** సం. విశే. (పు. స్త్రీ. పు.) 1. తుంచువాఁడు. 2. చీల్చువాఁడు. 3 సమూలముగా నాశనము చేయువాఁడు.

**ఉచ్ఛేదనము** సం. వి. అ. న. — ఉచ్ఛేదము.

**ఉచ్ఛేదనీయము** సం — ఉచ్ఛేద్యము.

**ఉచ్ఛేదము** సం. వి. అ. పుం. 1. ఛేదించుట, త్రుంచుట. 2. సమూలముగా నాశనముచేయుట. 3. మొదలంట పెల్లగించుట.

**ఉచ్ఛేది** సం. విశే. (న్. నీ. న్.) 1. త్రుంచువాఁడు. 2. సమూలముగా నాశము సేయువాఁడు.

**ఉచ్ఛేదించు** సం. స. క్రి. 1. త్రుంచు. 2. పోఁగొట్టు, నశింపఁజేయు.

మ. చిగురాకుల్ దమకంటి దోషముల నుచ్ఛేదింపఁగాఁ జాల మెం,డుగతిన్ ప్రాలి...చిత్రభా. 2. 100.

(ఉచ్ఛేదకుఁడు మొదలగునవి ఛేదకుఁడు మొదలగు వానివలె గ్రహించునది.

**ఉచ్ఛేద్యము** సం. విశే. (అ. ఆ. అ.) 1. త్రుంపఁదగినది. 2. నశింపఁజేయఁ దగినది.

**ఉచ్ఛేషణము** సం వి. అ. న. ఉచ్ఛిష్టపదార్థము, ఎంగిలి.

**ఉచ్ఛోషణము** సం. విశే. (అ. ఆ. అ.) 1. ఎండించునది; ఇంకించునది. 2. తపింపఁజేయునది. వి. అ. న. 1. ఎండుట; ఇంకుట. 2. తపించుట. 3. ఎండించుట; ఇంకించుట. 4. తపింపఁజేయుట.

**ఉచ్ఛ్రయణము** సం. వి. అ. న. 1. ఎత్తు. 2. గొప్పతనము.

**ఉచ్ఛ్రయము** సం. వి. అ. పుం. 1. ఎత్తు. 2. గొప్పతనము. 4. (గ్రహాదులు) ఉదయించుట. 4. అతిశయము, పెంపు.

**ఉచ్ఛ్రయి** సం — ఉచ్ఛ్రాయి.

**ఉచ్ఛ్రాయము** సం — ఉచ్ఛ్రయము.

**ఉచ్ఛ్రాయి** సం. విశే. (న్. నీ. న్.) 1. పొడుగైనది. 2. గొప్పది.

**ఉచ్ఛ్రావణము** సం. వి. అ. న. గట్టిగా వినిపించుట, గట్టిగాఁ జెప్పుట.

**ఉచ్ఛ్రితము** సం. విశే. (అ. ఆ. అ.) 1. పయికెత్తఁబడినది. 2. ఉన్నతము, మీఁదికిఁ బోయినది. 3. గొప్పది. 4. పుట్టినది. 5. పెరిఁగినది.

**ఉచ్ఛ్రితి** సం. వి. ఇ. స్త్రీ. — ఉచ్ఛ్రయము.

**ఉచ్ఛ్వసనము** సం. వి. అ. న. 1. ఊర్చుట, ఊపిరి విడుచుట. 2. ఊపిరి లోనికిఁ గొనుట. 3. సడలుట, వదులగుట. (నీవీబంధోచ్ఛ్వసనమ్' మాలతీ. 2. 5.)

(ఉచ్ఛ్వసిత, మొ. రూపములు శ్వసిత, మొ. వానివలె గ్రహించునది.

**ఉచ్ఛ్వసితము** సం. విశే. (అ. ఆ. అ.) 1. ఊపిరి లోనికిఁ గొనినది. 2 ఊర్చినది, ఊపిరి విడిచినది. 3. వికసించినది, విరిసినది. 4. సంతోషించినది. 5. ఆశాయుక్తము.

శ్లో॥ ధర్మేణాపి పదం శర్వే కారితే పార్వతీం ప్రతి. పూర్వాపరాధభీతస్య కామస్యోచ్ఛ్వసితం మనః. సం. కు. సం 6. 14.

6. ఊఱటనొందినది, ఓదార్పఁబడినది. 7. చెదరినది.

శ్లో. ఇదముచ్ఛ్వసితాలకం ముఖం. సం. రఘు. 8. 55.

వి. అ. న. 1. ఊపిరి. 2. ఊపిరి విడుచుట. 3. నిట్టూర్పు విడుచుట. 4. ప్రాణము. 5. వదులగుట. 6. వికసించుట.

**ఉచ్ఛ్వాసము** సం. వి. అ. పుం. 1. అంతర్ముఖశ్వాసము, ఊర్పు లోపలికిఁ గొనుట; లోపలికిఁ బీల్చుగాలి. 2. బహిర్ముఖశ్వాసము, ఊర్పు వెలికిఁ బుచ్చుట; పైకి విడిచినయూపిరి. 'ముఖోచ్ఛ్వాసగంధం' విక్ర మో. 4. 22.

శ్లో. ఉష్ణోచ్ఛ్వాసం సమధికతరోచ్ఛ్వాసినా దూరవర్తి. మేఘ. 2. 39.

3. నిట్టూర్పు. 4. ప్రాణము, జీవనము. 5. ఊఱట. 6. పరిచ్ఛేదము, గ్రంథభాగము.

**ఉచ్ఛ్వసి** సం. విణ. (న్. సీ. న్.) 1. ఊపిరి లోపలికిఁ గొనువాఁడు. 2. ఊపిరిపైకి విడుచువాఁడు. ఊర్ధ్వశ్వాసము గలవాఁడు, చావునకు సిద్ధముగా నున్నవాఁడు. 4. నిట్టూర్పు విడుచువాఁడు. 5. వెలికిఁబోయినది.సం.కు.సం.7.82

**ఉజ్జగించు** స. క్రి. (√ఉజ్జనము) ఉజ్జగిల్లఁజేయు. 1. విడుచు, విసర్జించు, త్యజించు.

గీ. లజ్జ పాటించి మదివెఱ యుజ్జగించి,రయము మెఱయ నప్పాంచాలరాజసుతుఁడు. భార. శల్య. 1. 320.

ఉ. అమహనీయచాపమున నర్జునదర్ప మడంచి నేఁడు సంగ్రామము నుజ్జగించెర నకంటకసుస్థితి గల్గ మేటివై. భార. కర్ణ. 1. 234. (సమాప్తి నొందును గనుక విడుతు నని భావము.)

2. పోఁగొట్టు.

సీ. వేరు వెల్లఁకి కాయ గూర పండనికోరి కుదరాగ్ని గాడ్పుచే నుజ్జగించు. పాండు. 2.29,

3. త్రోసివేయు, నిరసించు.

క. కమలముల నుజ్జగించుం,గుముదంబుల బుజ్జగించుఁ గోమచూపులు పున్నమచందమామ వెలుఁగుల, కొమ రంతయుఁ బుణికిపుచ్చుకొనఁబోలుఁ జమీ. విజ. వి. 1. 133. (ఇట ఔపమ్యద్యోతకము.)

**ఉజ్జగింపు** వి. (√ఉజ్జగించు.) విసర్జనము, విడుపు.

సీ. ఉజ్జన మనఁగను నుజ్జగిం పనఁగను విడి యన విడుపన విడుదల యన. ఆం. భా. 2. 178.

**ఉజ్జగిల్లు(లు)** అ. క్రి. (√ఉజ్జనము.) తొలఁగు, పోవు.

సీ. గంజాయి దినఁగ నుత్క్రాంతచేసినవాఁడలజ్జాభిమానంబు లుజ్జగిల్లె. శివరా. 3. 62.

ఉ... ద్వాపర ముజ్జగిల్లుతఱి...పాండు.3.186.

ఉ...చం, చజ్జరశాహికంచుకముచాయమడుంగుల నొత్తెఁ జెమ్మనీ,రుజ్జగిలఁగ. నమచ. 5. 57.

**ఉజ్జనచే(సే)యు** స. క్రి. (ఉజ్జనము+చేయు.) విడుచు.

సీ. సంధ్యాభివందనశ్రద్ధ యుజ్జనసేయు గీతవాద్యవినోదకేళిం దగులు. కాశీ. 4. 81.

**ఉజ్జనము** వి. (సం. ఉజ్ఝనమ్.) త్యజించుట, విడుచుట.

సీ. ఉజ్జన మనఁగను నుజ్జగిం పనఁగను విడియన విడుపన విడుదల యన. ఆం. భా. 2. 178.

గీ. అనిన నానకారంబు నుజ్జనమొనర్చి, యక్కుమారుఁడు 'నేమిరా'యనుచు నుండె. విక్ర. 3. 112. (ఉజ్జనమొనర్చి—ఉజ్జగించి)

జ: ఉజ్జగించు, ఉజ్జగింపు, ఉజ్జగిల్లు, ఉజ్జనచేయు.

**ఉజ్జని—ఉజ్జేని.** వి. (సం. ఉజ్జయినీ. ప్రా. ఉజ్జనీ.) ఉజ్జయిని.

గీ....వీఁ దేలుముజ్జనివీటియందు. నైష. 5. 83.

మ....కా నేఁగె నుజ్జనికిఁ సమ్మతిఁ బాదుకంబు వలనన్ సంతోషితస్వాంతుఁడై. విక్ర. 2. 48.

**ఉజ్జయిని** సం. వి. ఈ. స్త్రీ. ఒకనగరము, అవంతి. (ఇది మాళవదేశమందలిది. విక్రమాదిత్యుని రాజధాని. మోక్షదాయక సప్తనగరములలో నొకటి. వాచస్పత్యాదినిఘంటువులలో 'ఉజ్జయిని' అను రూపముగూడఁగలదు.)

**ఉజ్జాయించు** స. క్రి. (ఊహించు. (శ. ర. చి. ని.)

జ: ఉజ్జాయింపు.

**ఉజ్జాయిలపు** వి. (√ఉజ్జాయించు) ఊహ. (గ్రా.)

**ఉజ్జాసనము** సం. వి. అ. న. వధము, చంపుట.

**ఉజ్జి—ఉద్ది.** (గ్రా. చి. ని.-'ఉజ్జీ'అనివాడుక.)

**ఉజ్జిఘ్రము** సం. విణ. (అ. ఆ. అ.) వాసనచూచునది.

**ఉజ్జీవకుఁడు** సం. విణ. (అ. విశా. అ.) 1. జీవింపఁజేయువాఁడు. 2. జీవించువాఁడు.

**ఉజ్జీవనము** సం. వి. అ. న. 1. బ్రతుకుట. 2. బ్రతికించుట.

**ఉజ్జీవి** సం. విణ. (న్. సీ. న్.)—ఉజ్జీవకుఁడు.

**ఉజ్జీవించు** సం. అ. క్రి. బ్రతుకు.

వ. గుజ్జులేమావులపజ్జల నుజ్జీవించు గొజ్జంగయారంబుల నంటుగోరంటలతో...ఉ.రా. 6. 24.

('ఉజ్జీవత్' మొదలగురూపములు 'జీవత్' మొదలగు వానివలె గ్రహించునది.)

**ఉజ్జీవకల్లు** వి. (క. ఉజ్జుకల్లు.) గోడలు మొదలగు వానిని నునుపుచేయుటకు రాచురాయి—బ్రౌ. (ఇది అగ్నిపర్వతములనుండి వెడలఁగ్రక్కఁబడును)

**ఉజ్జృంభ** సం. వి. అ. స్త్రీ. 1. ఆవులించుట; ఆవులింత. 2. వికసించుట. 3. అతిశయము.

**ఉజ్జృంభణము** సం. వి. అ. న.—ఉజ్జృంభ.

**ఉజ్జృంభము** సం. విశే. (అ. ఆ. అ.) 1. వికసించినది. 2. ఆవులించినది. 3. విజృంభించినది. వి.అ.పుం. 1. వికాసము, విరియుట. 2. కీఁటలువాఱుట, బ్రద్దలువాఱుట. 3. ఆవులింత. 4. విజృంభణము

**ఉజ్జృంభించు** సం. అ. క్రి. విజృంభించు, చెలరేఁగు. శా. ...నీజావాశ్రపతాపంబు నిస్సీమంబై నొక కొంతనే పిచట నుజ్జృంభింపరాఁజేయుమా. హరి. 7. 63.

('ఉజ్జృంభకుఁడు' మొదలగునవి 'జృంభకుఁడు' మొదలగువానివలె గ్రహించునది.)

**ఉజ్జృంభితము** సం. విశే. (అ. ఆ. అ) 1. వికసించినది, విరిసినది. 2. విజృంభించినది. వి. అ. న. 1. ఆవులింత. 2. చేష్ట.

**ఉజ్జైని**—ఉజ్జెని.

ఉ. ... ఉజ్జైనికిఁ జేరఁ బోవుటయుఁజెప్పి ... దశకు. 3. 59.

**ఉజ్జ్వలనము** సం. వి. అ. న. 1. ప్రకాశించుట. 2. జ్వలించుట, మండుట.

**ఉజ్జ్వలము** సం. విశే. (అ. ఆ. అ.) 1. జ్వలించునది; ప్రకాశించునది. 2. వికాసి, విరియునది. 3. ఉచ్ఛృంఖలము, అడ్డులేనిది. (శ్లో: స్వాతంత్ర్యముజ్జ్వలమవాప కరేణురాజః. శకు. 5. 48.) 4. సహితము, కూడినది. (శ్లో: హింగూజ్జ్వలా జీరకభద్రముస్తా వచాయాగ్రంథిన్నగుడా చ శుంఠీ. మృచ్ఛ. 8. 13. ప్రాకృతచ్ఛాయ.) వి. అ. పుం. శృంగారరసము, న. బంగారు. ('ఉజ్జ్వలత్, ఉజ్జ్వాలకుఁడు' మొదలగునవి 'జ్వలత్, జ్వాలకుఁడు' మొదలగువానివలె గ్రహించునది.)

**ఉజ్జ్వలితము** సం. విశే. (అ. ఆ. అ.) 1. జ్వలించినది. 2. ప్రకాశించినది. 3. జ్వలింపఁజేయఁబడినది. 4. ప్రకాశింపఁజేయఁబడినది.

**ఉజ్ఝకుఁడు** సం.విశే. (అ. ఝికా. అ.)విడుచువాఁడు.

**ఉజ్ఝత్** సం. శత్ర. విడుచుచున్న.

**ఉజ్ఝనము** సం. వి. అ. న. విడుపు.

**ఉజ్ఝనీయము** సం — ఉజ్ఝితవ్యము.

**ఉజ్ఝము** సం. విశే. (అ. ఈ. అ.) విడుచునది,త్యజించునది. (సమాసాంతమునందే యుండును ఉదా: కర్మోజ్ఝుఁడు — కర్మమును విడిచినవాఁడు.)

**ఉజ్ఝి** సం. విశే. (న్. నీ న్.) — ఉజ్ఝకుఁడు. (సమాసాంతమందే యుండును, ఉదా:కర్మోజ్ఝి, సముజ్ఝి.)

**ఉజ్ఝిత** సం. విశే. (ఋ. త్రీ. ఋ.) విడుచువాఁడు.

**ఉజ్ఝితము** సం. విశే. (అ. ఆ. అ.) విడువఁబడినది.

**ఉజ్ఝితవ్యము** సం. విశే. (అ. ఆ. అ.) విడువఁదగినది.

**ఉజ్ఝ్యమానము** సం. విశే. (అ. ఆ. అ) విడువఁబడుచున్నది.

**ఉజ్ఝ్యము** సం — ఉజ్ఝితవ్యము.

**ఉటంకము** వి. సంగ్రహము (బ్రౌ).

జ. ఉటంకించు.

**ఉటంకి** — ఉటంకు. విశే. నీచుఁడు, హీనుఁడు. ('పౌరవ గలవాఁడు' అని. శ. ర.

ఉ. ఓరియుంటకి యీవికసితోత్పలగంధిని మారు నింటిసింగారపుఁబూజవారువముఁ గారు మెఱుంగులలోని తేట నా, కూరిమిపట్టి నిట్టి నసగూఁటితనంబున బేలువెట్టి తా,రార గణింప నన్ను వినవా మఱి యిప్పురిలోని తక్కరిన్. విప్ర. 4. 25.

**ఉటంకించు** స. క్రి. (√ఉటంకము) సంగ్రహముగా చెప్పు; చెప్పు. (బ్రౌ. చిన్నయసూరిధాతుమాల).

**ఉటంకు** — ఉటంకి.

సీ. పేరుకోఁ దగినట్టి యూర లేని యుటంకు పరుల బుద్ధులకుఁ జొప్పడనిమంకు. గీ ... ఎంచఁ గల యుచ్చమల్లి యయ్యింతితల్లి. శుక. 3, 18.

ఉ. నింగిఁ బొరల్కవేరఁజ మునింగి సిరంగని సేవ చేసి యా,పొంగలిముద్ద మ్రింగి విధుపుష్కరిణీజల మాని మానితో,త్తుంగతరోత్తమోప వనిఁదూఱి సిరంగములోన నున్నవాఁ, డుం గమనా యుటంఁకు టకటొంకుపురంబుల కాఁపురంబులఁ. పాంచాలీ. 1. 21.

**ఉటజము** సం. వి. అ. పుం. న (పూరితోఁ గాని ఆకులతోఁ గాని కట్టినది.) ఆకుటిల్లు, పర్ణశాల.

**ఉటము** సం. వి. అ. న. 1. ఆకు. 2. గడ్డి.

**ఉట్టంకించు** సం. న. క్రి. స్తుతించు పొగడు.

క. పంకజగర్భుండైనను, శంకామతి నుండుఁ బొగడఁజాలక నే ను,ట్టంకింపఁ గలనె సకలా,లంకారము తత్ప్రతాపలంక మహీశా. సీతావి. 1. 127.

**ఉట్టాడు** — ఊటాడు.

(త్వరపడు)

మ.బొమ లెక్కించిన విల్లు వంచు నునుఁజూపుల్ చంచలాచంచల, క్రమరేఖఁ నిగిడింప శాత విశిఖౌఘంబుల్ మెయి న్నించు నె,య్యము నం బల్కఁగ నల్క మీఱి చటులజ్యాఘోష ముం జేయు న,య్యుమప్రాపొంది రతీశ్వ రుండు హారు బిట్టోడింప నుట్టాడుచున్. పాండు, 1. 189.

**ఉట్టి** వి. (క. ఉట్టి.) కుండలు మొదలగునవి వ్రేలాడఁ గట్టుట కల్లినచిక్కము, శిక్యము.

మత్త....శా,నుట్టి యందక ఱోళ్లుఁ బీఁటలు నొక్క ద్రోవిడి యెక్కి చే,పెట్టఁ జాలక కుండక్రిందొక పెద్దతూఁటొనరించి మీ,పట్టి మీఁగడ పాలుఁ జేరలఁ బట్టి త్రావెఁ దలో దరీ. భాగ. 10 పూ. 310.

సా: కలిఁ బోయ నుట్లవంకఁ జూచుట — అన్నములో కలి పోసినను పెరుఁగుపోయు నను ఆశచే నుట్లవంక చూచుట.

గీ. ఇంగితవిచార మాత్మలో నించు కయిన, నూహసేయక కలిఁబోయ నుట్లవంకఁ,జూచు చుండెద రజ్ఞ శిరోమణియందు.యమలిం.85.

సీ. భీష్మాదులెంతచెప్పిన నిచ్చగించెనే బాలిశుఁ డగు శిశుపాలకుండు. గీ. కొట్టుకుండఁగ ధూర్తుల పట్టి శాంతి, కాలి మేటికిఁ దుంకలు తటిమిరాఁగ, నొదిఁగి చూచెదు కలిఁబోయ నుట్లదిక్కు. సిం. నారసిం. 39.

ఉట్టికట్టుకొని వ్రేలాడెదవా — చావు లేక స్థిరముగా నుందువా.

ద్వి. వినుము హరిశ్చంద్రవిభుఁడు ..., నెట్టన సత్యంబు నెఱపెద ననుచు, నుట్టిగట్టుక వ్రేలుచున్నాఁడు ద్వి. హరిశ్చ. ఉ. 1760. (ఇట'దృఢప్రతిజ్ఞుఁడై యున్నాఁ'డనిభావము)

జ. ఉట్టి చీల.

**ఉట్టిచీల** వి. (√ఉట్టి) సందులో చొప్పించి యవతలిమొదను వెడల్పుగాఁ గొట్టనచీల.(బ్రౌ).

**ఉట్టిపడు** అ. క్రి. (√ఉట్టు') 1. కాఱు, స్రవించు; పైకివచ్చు.

సీ. అత్యంతగాఢదంతాగ్రపీడనమునఁ దొట్ట వాతెఱ నెత్తు రుట్టిపడఁగ. నైష. 7. 46.

చ....జీవకళ యుట్టిపడఁ శివ వ్రాసినట్టియా, చెలువున కాభిముఖ్యము భజింపఁ దలంకెను దాను బోటియున్. ప్రభా. 1. 138.

సీ. బ్రహ్మతేజం బుట్టిపడు నెమ్మొగముశివి రాకాశశాంక గౌరవముఁ దెల్ప. పె. శకుం. 2. 58.

2. తలఁపనితలంపుగాఁ గలుగు,హఠాత్తుగాఁ గలుగు; కలుగు.

(రాజునకు కిరాతలక్షణము కలుగుట,)

సీ. మాణిక్యమకుటంబు మాటి మస్తమునందు బట్టి యీఁకలనెట్టె ముట్టిపడియె. ఘటికా. 1. 153.

క. పెట్టి వెనువెనుక కటు చని,యట్టిటు భయచపలచేష్టులై యరుగుచుఁ గ,న్పట్టెడి యాకాలురఁ గృప, యుట్టిపడఁగఁ జూచి నృపతి యొయ్యన నగుచున్. కళా. 6. 159.

3. శీఘ్రముగా వచ్చు. వెంటనేవచ్చు.

గీ. చట్టుపలఁ బుట్టులే గాడ్పుకొట్టువకును..... కొట్టుకొట్టునఁదారక బ్బిట్టు దుల్లఁ, బిట్ట దొర కొరికట్టడ యుట్టిపడియె. బహు. 3.8.

ఆ. అని ప్రయాణ మిటకు నపుడె యంతయు సమ,కూర్చి యతని వీడుకొంటి నమ్మ,కొని

ఫలించె నీదు కోరిక లని పొంగి, బాల యిటకు నుట్టిపడితి నమ్మ. చమ. 3. 63.

ఉట్టిపడ్డట్టు — ఊడిపడ్డట్టు, హఠాత్తుగా.

గీ. ఉట్టిపడ్డట్టు యోగిని యొర్తు వచ్చి, లీల నా రాజశేఖరుప్రోల నిలిచి. రాజ. చ. 2.94.

**ఉట్టు¹** అ. క్రి. (క. వఋట్టు, పుట్టు.) 1. పుట్టు, కలుగు.

చ. అలమిననిద్రఁ గొక్కుచెడి యంతన మేల్కని కాళికుఁడు పే, రెలుఁగున పారెకుం బిలువ నించువెఱం బరకియ గావునం, బలుకక యుండె నందులకు భావమునం గన లుట్టి మేలువాల్, కెళవులఁ బూని ముక్కు దటి గెన్ రుధిరంబు బోరునన్. వేం. పంచ. 1. 276.

ఉ....మర్దలప్రముఖ తూర్యరవంబులు నిండ నేర్పునన్, సుందరు లాటపాటల వినోదము సూపిరి తీపు లుట్టఁగన్. ద్వా. 7. 28.

2. కాఱు, స్రవించు.

ఆ. ఆర్పి నెత్తురుట్ట నమ్మస్తకము వట్టి, కొని యతం డుదాత్తఘోరభంగి. భార. ద్రో. 5. 205.

గీ. మొదలఁ దేనియ లుట్టునంభోరుహాళి, ముద్దు పలుకులు శ్రుతిపుటంబుల భుజించి, పిదప భుజియింపఁ దొడఁగిరి త్రిదశవరులు, దైత్యులును దత్సుమిథ్యాసుధారసములు. హర. 6. 121.

జ. ఉట్టిపడు.

**ఉట్టు²** వి. ఉప్పు పండఁ దగిననేల (బ్రౌ).

**ఉట్రవడియము** వి. ఒకవిధమగు వడియము.

క. గుడిమ్రింగెడువానికి లో, వడ రెడువే ల్పుట్రవడియ మగుఁ గద తలఁపఁగ. అచ్చ. రా. సుం. 155.

ద్వి. పతెంచితే నేమి యిప్పుడే జముని, వాలికి నిమ నుట్రవడియం బొనర్తు. రం. రా. కిష్కిం. 211 పా 8 పం.

**ఉట్లబొద్ది** వి. ఒకానొకచెట్టు (శ. ర.).

**ఉఠాణి** విశే. గొప్పది, ఎత్తైనది. (శ. ర.) వి. పొడుగు. (చి. ని.)

**ఉడాయించు** హిం. అ. క్రి. పాఱిపోవు.

జ: ఉడాయింపు.

**ఉడాయింపు** వి. (√ఉడాయించు) 1. పాఱిపోవుట.

2. మల్లబంధవిశేషము.

వ....చోరవనేర్పులును నుడాయింపువితంబును ...మల్లపు. 3. 69.

**ఉడికించు** స. క్రి. (√ఉడుకు) ఉడుకునట్లుచేయు.

**ఉడికిల్లు(లు)** అ. క్రి. (√ఉడుకు.) ఉడుకు,తపించు. (చి. ని. శ. ర. బ్రౌ.)

**ఉడిగపుఁగత్తె** వి. (ఉడిగము + కత్తె - క. ఉఱిగత్తె.) సేవకురాలు, దాసి.

గీ. అన్నగేంద్రునికిని గిరిటార్పణకరి, యైన యుడిగంపుఁగత్తె మధ్యాహ్నలక్ష్మి. కళా. 5. 179.

**ఉడిగము** — ఊడిగము.

(సేవ, పరిచర్య.)

చ. పుడమి సమస్తవర్ణములపొత్తుల నిలుపు దప్పి లంజెలై, పడిచి గడింతు రర్థములు బ్రాహ్మణ భూవరవైశ్యజాతిచే, నుడిగము గొంచు గర్వమున నుందురు శూద్రులు సత్యశౌచముల్, పొడవడఁగుం గలిం బరిసిపోవు మహత్త్వము దేవకోటికిన్. వరాహ. 9. 126.

సీ. పతి పిల్వఁబంచిన పని యేమి యని వచ్చి చెప్పినయుడిగంబు సేయ వలయు. కాశీ. 2. 75.

ద్వి. ఓరి నాపంచినయుడిగ మేమైనఁ, గోరి సేయుచు నొఱగొడ్డెంబు లేక, కొలిచెదవేని యీగోఁచిశాఁపనికి, వలసినధన మంతవట్టును నిచ్చి, బంటుగా నేలుదు .... ద్వి. హరిశ్చ. ఉ. 1403.

(నమ్రత, అడఁకువ)

ఉ. కాలికిఁ గేలు సాఁచి యుడిగంబున మ్రొక్కుము రాచమిన్న యిల్లాలికి ... అచ్చ. రా. యు. 469.

విశే. పరిచారకుఁడు, సేవకుడు.

సీ. ఉడిగము చాకిరి యూడిగం బనఁగను దాస దాస్యములుగాఁ దనరుచుండు. ఆం. భా. 2. 288.

జ: ఉడిగపుఁగత్తె.

**ఉడిగి(వి)ంచే** — ఉడుచే, ఉడుపు¹. స. క్రి. (√ఉడుగు)— ఉడుగఁజేయు-
(మానిపించు, అఁపు.)
క. ఉడిగింతును సర్పయాగ మోదకుఁ డింకన్. భార. ఆది. 2. 221.
ఉ...మహో,గ్రవిషత సర్పయాగ ముడివింపుము కావుము సర్పసంహతిన్. భార. ఆది. 2. 230.
(అణఁచు.)
ఉ.... వాని నెల్లఁ గ్రగ్రింపెద నీమథాంధ్య ముడిగించెద నిప్పుడ కాలుబ్రోలి కేఁగించెద ...భార. ఆది. 6. 294.
సీ. దైత్యుఁ లుద్దండించి దండశంకులకుఁ డిగి డించి రుడిగించె నింద్రసుతుఁడు. హరి. 7. 164.
ఉ. వింతయె కాముశక్తి యుడివింపఁగ శక్యమె యెట్టివారికిన్. భార. ఆది. 7. 58.

**ఉడివుచ్చు** స. క్రి. (√ ఉడివోవు.) ఉడివోవఁ జేయు.
(భంగపఱచు, పోఁగొట్టు.)
గీ. మునుపటి పతివ్రతలు మహామూర్ఖచిత్తు, లైనదుర్జను లతిఘోరమానసాయ,కాస్త్ర జర్ఘరితాత్ములై యానపడిన, మాన ముడి వుచ్చుకొనిరిఁచే మచ్చెకంటి. హంస. 1. 127.

**ఉడివోవు** అ. క్రి. (ఉడిగి+పోవు) ఉడిగిపోవు, విచ్ఛిన్నమగు; నశించు.
సీ. లేవయ్యె స్వాహాస్వధావషట్కారంబు లుడి వోయెఁ బ్రదేశాగ్నిహోత్రవిధులు. కాశీ. 1. 137.
సీ. అన్నంబు కడుపులో నఱుగకుండినయప్పు డుడివోక పులితేన్పు లుచ్చునపుడు శివధ. 6. 26.
సీ. ఉడివోనిమిన్కు లీనెడుపేరు లిరుదెస నిరు దెసఁ గమలబంధురకరంబు. వసు. 1. 6.

**ఉడుంబరము** సం — ఉదుంబరము.

**ఉడుఁగోఁత** వి. (ఉడుగు+కోఁత)-పాదులు మొద లగువవి కాపు ఉడిగెడితటిని కోసెడుకోఁత — చివరకోఁత.
ఉదా: మిరపచేను ఉడుఁగోఁతకు వచ్చినది.
(వ్యవ) ఉడుఁగోఁతపించె — చివరకాపుపించె, నిస్సారపుపించె. ('ఉడుఁబోతుపించె' అని. శ. ర.)

**ఉడుక** — ఉడుక్క.
చ. తొలకరిచూపు లింపొసఁగుధూమములై పయిఁ బర్వఁగంధరో,జ్జ్వల కల నిస్వనం బుడుకచాల్ రొదయై విన వేడ్కఁ దాల్పఁ బూ,విలు గలవేల్పురాసిపము వేగమె మౌనికి రేఁచి మత్కుచా,చలయుగరంగవీథి ఘన సంభ్రమతన్ నటియింప నూన్పెదన్. చంద్రికా. 2. 47.

**ఉడుకు(డుక్క)** అ. క్రి—తపించు—1. కాఁగు, తప్తమగు.
సీ. కళపెళ నుడుకుచక్కనినూనియలు మీఁదఁ జిల్కఁ జెల్లునె మీకుఁ జెలియలార. నీలా. 3. 34.
క. అలజడిపడు చెలులం గని, పలవించుచుఁ గాఁగిలించుపగిది ముఖములం, జిలజిల రసములు చిప్పిల, నలినాతులకాహువుల మృణాళము లుడుకున్. వరాహ. 4. 34.
సీ. ఉడికిన ట్లున్న పుప్పొడి మెట్టఁగాఁ బొక్కు నడుగుఁదమ్ములు కేల నలము కొనుచు. యయా. 5. 119.
వ. చిగురువాతెఱ తుకతుక నుడుక ... ఉ. రా. 6. 276.
2. పక్వమగు.
వ. చిచ్చు లాత్రంపులం దవిలించి చిముడ నుడికిన వెలువరించి యుప్పువెప్పునన్ గల యప్పితఖండంబులు...మనుచ. 4. 60.
3. (భయదుఃఖాదులచే) తాపము నొందు.
సీ....పకువుఁ జేయ,విప్రులు వట్టరా వెఱ పొచ్చి యొదిఁగెడుగవయంబు లాడ్పునఁ గర్ణభీతి, మల్లల నుడుకుచు నుండుదు. ... భార కర్ణ. 3. 33.
గీ. హంసతూలికాతల్పములందుఁ బొందు, భోగిజనములమృదుగాత్రములు ముకుంద, కంటి పరుసని ధరణి భాగమునఁ గూలి, యున్నయవి చూచువారలయుల్ల ముడుక. భార. స్త్రీ. 2. 14.

4. కోపించు.

క. విడువక తలపయిఁ గొన్నాళ్లిడి చూచి
కళంకి వగుట యెఱిఁగి మహేశుం, డుడు
కుచు దఘార్ధ్వగమున, నడుగువఁ బడవై చె
దాన నడఁగవు చంద్రా. మనుచ. 3. 48.

(వ్యవ) వారు వేళాకోళముగా నన్న మాటలకు వాఁ డుడికినాఁడు.

వి. 1. వేఁడి, ఉష్ణత్వము.

గీ...పగటి, యెండయుడు కాఱకుండ ధూమం
డలమున. ఆము. 2, 60.

గీ. అకట గుడమిశ్ర మగుపాయసాన్న మేని,
నుడుకువాఱిన రుచ్య మైయుండుఁజెట్లు.
కృ. శకుం. 2. 76.

2. బాధ, పీడ.

క. కడుఁ గ్రొవ్వి వాఁడు లోకము, నుడుకులఁ
బెట్టఁగ వినివి యుగ్రతపమునం, గొడుకుఁ
బడసి...భార. అను. 4. 407.

సీ. ఏతెరు వై తినో యే నని పురపురఁ బొక్కు
చుండరె బంధు లక్కటకట, యొరులకుఁ
దొలుమేన నుడుకులఁ బెట్టినదాని కిప్పా
టేల మాను రాక. మార్క. 5. 178.

3. అంతస్తాపము, విచారము.

ఆ. ఓడి వచ్చినాఁడ నుద్ధతి నా కేల,యుడుకు
మాని నీవ యుర్వి యేలు, గుట్టములును
నేనుఁగులు లేని బయలు నీ,తలనె కట్టు
కొనుము ధర్మతనయ. భార. శల్య.
2. 72.

శ్లో. ఏషా తే పృథివీ రాజన్ భుఙ్క్ష్వైనాం
విగతజ్వరః. సం.భార. శల్య. 31. 50.

విశే. ఉష్ణము.

చ. పడమట వెట్ట నయ్యుడుకుఁ బ్రాఁకిన మొ
ల్లక కూటి పేదలై ...ఆము. 2. 49.

చ. కఁ మున నున్న పున్కయును గాముని
దూతియు నుడ్కు ఫాలమున్, కరివం
చర్మమున్ దొఱఁగి గ్రక్కున లేమికి
బొమ్మగట్టఁడే, హరుఁడు కుబేరుచె ల్మెడలి
యాదట మానఖుఁడై న వంచు న,ప్పుం మున
వైకుక్కులాడుదురు... విక్ర. 1. 73.

సీ. దానిచేరువ నుద్కు మూనెకొప్పెరపొంత
విపుల మౌక వకమండపము క్రింద. ద్వా.
6. 118.

జ. ఉడికించు, ఉడికిల్లు, ఉడుకుఁబోతు, ఉడుకు
జుట్టు, ఉడుకెత్తు.

**ఉడుకుఁబోతు** విశే. (ఉడుకు+పోతు) ఉడుకు నట్టిస్వభావము గలవాఁడు.

**ఉడుకుజొట్టు** అ. క్రి. (ఉడుకు+జొట్టు) – ఉడుకు పదార్థము జుట్టు-పొందరపడు.

ఉ. వేడుక కేఁగుదెంచితిరో వెట్టులో మీరవు
గాము లేమియుం, జూడక యేలయిట్లుడుకు
జొట్టెద రించును లాభ మెద్ది ... సత్వరవా
క్యము చెల్ల దేరికిన్. పరమ. 5. 56.

**ఉడుకువ** వి. (√ఉడుగు) విశ్రాంతి, ఊఱట, తెఱపి, విరామము.

చ. ఉడుకువ లేనిక య్యమున కోర్వఁగ వచ్చు
నె నాకు డప్పి పుట్టెడు నొకమాటు
నాగ్రహాము డింపవు ... భార. విరా.
5. 186.

**ఉడుకె(వె)త్తు** అ. క్రి. (ఉడుకు+ఎత్తు) ఉడుకొందు.

క. వెడవిలుతుకిరిజాలము, వడువునఁ జంద్రాత
పంబు వాలుటయును ము,న్నుడుకెత్తిన
డెందముతో, వడఁ కాడెదుధైర్య మెడల
పగలఁ బొగులుచున్. భా రా.యు. 38.

గీ. వెంటనె తపోగ్ని ఘోరమై వెడలుటయును,
శరధు లుడుకెత్తె... దశా. 4. 73.

గీ. ఉడుకు లెత్తెడియడుసులఁ గడు ననహ్యా,
మైన జలదారిమడుపు లందందుఁ గలవు.
సానందో. 2. 11.

**ఉడుక్క** – ఉడుక వి. (సం. హుడుక్కః. తే.) హుడుక్కె.) చర్మవాద్యవిశేషము. (శ.ర.)

**ఉడుగర** వి. 1. కానుక; బహుమానము.

క. తొడవులు మానికములు విడి, ముడియు
న్నాడెంపుఁబుట్టములుఁ బ్రోవులు గా,ను
డుగరలు దెచ్చి యిడి య,య్యొడయని
యడుగుల కెఱఁగి యొప్పుగఁ బలికెన్.
అచ్చ. రా. కిష్కిం. 48.

క. కలిమి మెఱయంగ మఱియున్. గల
కాంధవు లొసఁగి రపుడు కాంచన మణిభూ,
షలుఁ జీరలు నరపతికిన్, బొలఁతికి నుడు
గరలు ముదము పొదలఁగ నంతన్. మనుచ.
5. 97.

సీ. తనధాటి పదములందమున విన్పించు
గంధర్వుల కుడుగరల్ దయ నొసఁగుచు.
దశా. 2. 103.

2. ఉడుగరగా నీయఁ దగుసన్ననిబట్ట.

సీ. విఁక వస్త్రము పేరు వెలయు నుడుగరనా....
ఆం. భా. 2.152.

సీ. తనరంభ వారి కీయ నటంచు వాదించుకా
జేరి కుడుగఁ గప్పవలసె. కువల. 1. 46.

ఉడుగు (వు) న. క్రి. (క. ఉడుగు. త. ఒడుంగు.)
మాను, విడుచు, త్యజించు.

సీ. ధర్మార్థి గావున ధారణీసురుఁడై యడు
గుద మీక్రతు వుడుగు మనియు. భార.
ఆది. 2. 130.

క. సమరంబున భటులు గడున్, శ్రమ
మొందిరి తమము నవిసినం గాని సము,
ద్యమసంరంభముడుగ రిది, సమయం బని
తొలఁగినట్లు సవిత్రుఁడు గ్రుంకెన్. భార.
విరా. 3. 193.

ఆ. అధిక మైనయజ్ఞ మల్పుఁడు తాఁ జేసి,
శాస్త్ర ముడివి మురువు దక్కు, వేమన.
2. 97.

అ. క్రి. 1. విరమించు, అఁగు.

క. ఉడు గుడుగు మోహనాస్త్రము, విడువకు
మనునెలుఁగుతోడ ... భార. ఉద్యో.
4. 348.

క. ద్యుమణికరాళి మొగుల్లై, యమవసతిఁ
గలయఁ గూర్చి హదనౌటయు న,య్యమృ
తపుబిందులె క్రమ్మఱ, నుమిసెడు ననఁ
గలయఁ గరక లుడుగక రాలెన్. ఆము.
4. 99. (ఇట 'అవిచ్ఛిన్నముగా' అని
భావము)

క. ఎడ లేదు దివెల నడుమ నె,గడచున్
మీపురముఁ జేరఁగా లేమీ యేఁ,డుడుగుము
వచ్చెడు పండువ, కెడపక యట కేఁగుదెంతు
మిందఱ మనిసన్. చెన్న బ. 3. 164.

క. కదియుచుఁ గాయుచుఁ బట్టుచు, నుదలు
చుచుం బడుచు తేచు చుడుగుచు వడిగొం,
చొదవెడు కినుకం గడు బెట్టిదముగఁ బెనఁ
గిరి చలంబు డింపక కడిమిన్. భార.
విరా. 2. 348.

(వ్యవ) ఆమెకు కాను పుడిగినది.

2. తీఱు, పోవు, నశించు; తగ్గు.

గీ. చిత్రతరతరంగి నంగుష్ఠమాత్రు డగుచు, దాని
జఠరాంతరము సొచ్చి తాన మరలి, వదన
మార్గంబు వెలువడి వచ్చి నగుచు, నోనికాటి
నీయాఁకలి యుడిగె నోటు. భా. రా.సుం.
49.

సీ. రోగాపమృత్యువార్తాగంధ మెడలెను జార
చోరాదులపేరు నుడిగె. రాఘవ. 4. 289.

క. అడలుచుఁ బెదవులు దడుపుచు, గుడికొను
కన్నీరు గ్రుక్కుకొనుచున్ మడిలో, నుడు
వని నెంజిలి నేమియు, నుడువనియమ్మాన
ధనుఁ గనుంగొని వేగన్. సారంగ 3. 164.

3. కోసిల్లు, ఇంకు.

క. వనరాసు లేదు నుప్పరి, పెనమున నీరులును
బోలెఁ బెల్లున నుడిగెన్. కు. సం. 6. 812.

ఉడిగిపోవు - ఉడుగు.

వ. మఱియు నుడిగిపోయిన మ్రాఁకునుం బోలెఁ
బండ్లు డుల్లి. కవిక. 4. 113.

(ఉడిగిపోయిన – కాపు అఁగిపోయిన.)

ఉడిగినుడు(డ)ఁగు - ఉడుగు.

(అణఁగు)

గీ. ఉపవసింతుము గాక నేఁ డుడిగిమడిఁగి,
యస్తమించుమనున్నవాఁ డహిమభానుఁ,
డెల్లి పాఁ ణకైన లే దెట్టు మనకు, మాధుక
రభిక్ష బ్రాహ్మణమందిరముల. కాశీ.
7. 153.

ఆ. అనిన ధౌమ్యుఁ డిట్టులనియె నీవప్పు,
మొకఁడు నెట్టులయిన నుడిగిమడిఁగి సంకట
ముల కోర్చి చరియించి యాపద, నిస్తరించి
పిదప నెగడ వలయు. భార. విరా. 1.143.

(కృశించు, నశించు.)

గీ. మనసు చేతివ యింద్రియమహిమ తెల్ల, నుపరతంబై నమనసుతో నుడిగిమడఁగు. భార. శాం. 6. 86.

ఉడుదేనెలు – ఉడిగిన తేనె కలవి, తేనె లేనివి.
ద్వి.కడివోవ నళు లానఁగా రేకు లెడలి, యుడు దేనెలైన పర్యుషితపుష్పములు. పండితా. పురా. 69 పా.

కామపుడుగు – (బిడ్డలను) కనుటను మాను.
సీ. బహువారములయందు బహువస్తువులు గాంచి కలశపాథోరాశి కామపుడిగె. హర. 6. 129.

జ: ఉడిగించు, ఉడివచ్చు, ఉడివోవు, ఉడుకువ; ఉడుచు, ఉడుపు.

**ఉడుచే** – ఉడిగించు.

(నివర్తించు, మరలించు.)

క. ధరణీదిశాప్రసారిత, గురుకరనికరంబు లుడిచికొని దీర్ఘనిరంతరగతి భన్నుఁడపోలెను, హరిదశ్వుఁడు విశ్రమించె నస్తాద్రిదరిన్. భార. ఆది 6. 174.

(నివారించు, అఁపు.)

వ...వారాశియుం బోలె బోరన మ్రోయుచున్న వాదిత్రశబ్దంబు లుడిచి... భార. ఆది. 6. 15.

(లయింపఁజేయు)

సీ. గాఢతమోగుణాకలన నీకుండ నా నొక్కట నిఖిలంబు నుడిచి యడఁచు. నృసిం. 1. 65.

**ఉడుత–ఉడుత.** వి. చిత్రోడము, వీఁపున మూఁడు చాఱలు గలజంతువిశేషము.

సీ. ఉఱుత నా నుడుత నాఁ దరుమూషికం బగు ...అం. భా. 2. 87.

జ. ఉడుతచాఱలు.

**ఉడుతచాఱలు** వి. బ. (√ఉడుత) – ఉడుతచాఱల వంటి చాఱలుగలది.

గీ.పవ్వలి బవంతి కరయంచు పట్టెమార్పు,మాద కంబులు దళ్లు బొమ్మంచు లుడుత,చాఱ తెనుఁగడుగు లన మీఱు నిట్లు, చిత్రవస్త్రవిశేషము ల్చిత్రస్వరూప. అం. భా. 3. 154.

**ఉడుపకుక్క** వి. (ఉడుము+కుక్క) ఉడుము లోనగువానిని వేఁటాడెడుకుక్కము.

గీ. మున్ను జాగిలములఁ గూడి చన్నయట్ల, యుడుపకుక్కలు కుందేళ్ల నుందురువుల, నుడుముల గ్రహింప...మనుచ. 4. 51.

**ఉడుపతి** సం. వి. అ. పుం. 1. చంద్రుఁడు. 2. వరుణుఁడు.

**ఉడుపథము** సం. వి. అ. పుం. నక్షత్రమార్గము.

**ఉడుపము** సం. వి. అ. పుం. న – నీటినుండి రక్షించునది–1. తెప్ప. 2. పుట్టి, గంపవలె నుండియేఱు దాఁటుటకుపయోగించు సాధనవిశేషము.

**ఉడుపు(డ్పు)**[1] – ఉడిగించే.

(అణఁగించు)

క. నిన్న యఱ వచ్చిపోయితి, వున్న యఱయు నేఁడు దీర్చి యుడిపెద నీగ, ర్వోన్నతి ... భార. ఉద్యో. 4. 341.

(నిరోధించు)

క. మురనరకాసురు లిరువురు, సుర లరిగెడు త్రోవ లుడిపి...ఉ. హరి. 1, 89.

(–ఎక్కును – డించు)

క. సగరుఁడు మీకులవిభుఁ డ,జగతీపతిపేర నేను సాగర మనఁగా, వెగడుదుఁ గావున నిట్టులు, తెగఁ దగునె నరేంద్రచంద్ర తెగ యుడుపఁ గదే. భా. రా. యు. 225. భీమ. 4. 139.

(వదలు, విడుచు)

క. అని చూపఱ కద్భుతముగ, దనుజుఁడు యుద్ధంబు చేసి తచ్ఛక్తిఁ దుదన్, దనువుతగు లుడుపుకొనియెం,దనవారలు గలఁగఁ బగఱ దళములు నెలఁగన్. రాఘవ. 4. 205.

(పోఁగొట్టు, తీర్చు, మాన్చు)

ద్వి....వదిపుల్లెలాకులును, వేలిమిసమిధలు వెల యుదర్భలును, జాలుంబో రుడ్పఁబండ్లు దోసెఁడును. ద్వి. హరిశ్చ. ఉ. 1718.

గీ. తేము లుడిపెడు తేఁజాపుతేమతోడ. ఆము 1. 12.

(అఁపు)

క. ఏయెడఁ బతిఁ బొడగానక,హా యని యెలుఁగెత్తి దిక్కుల ద్రువఁగ నఱుచున్,గూ యిడ మొఱ యిడుఁ బలుమఱు,వా యుడుపక చీరు నేడ్చువడి వాపోవున్. కు. సం.5.547

**ఉడుపు(డుప్పు)**[2] వి. (క. ఉడుపు. త. ఉడుప్పు.) దుస్తు.

**ఉడుము** వి. (క. ఉడు. త. ఉడుంబు.) గోధ, బల్లి యాకారము గలిగి అంతకంటె పెద్దదిగా నుండు నొకానొకజంతువు.

గీ. ఉడుము నడఁకిన నడుఁకునే బడియపెట్టు. కాశీ. 2. 144.

జ. ఉడుపకుక్క.

**ఉడుపు** సం. వి. ఉ. స్త్రీ. న. నక్షత్రము. న. నీరు.

**ఉడుసర** వి. వాయసి, కాఁచి (వృ. వి.) (బ్రౌ).

**ఉడ్డ** న. (క. ఉడ్డి.) 1. నాలుగు.

సీ. ...చౌ యుడ్డ తీవంచ చౌకము నలు, నాలు గనఁగఁ జతుర్నామముల్ ...సాం. ని. 29. (చూ. ఉడ్డకేలుగలాఁడు.)

2. నాలుగువస్తువులప్రోగు; ప్రోగు, రాశి.

వ. ఉపరి యందలి మొక్కచిదుమై వెంటనే గుంపు లుడ్డలు తుటుములు మూఁకలు గా డాక మీఱి నాలుగు కోపులతో నీనినపులుల కాశిని. ప్రబంధ. 788.

జ. ఉడ్డకేలుగలాఁడు. ఉడ్డమోమువేల్పు.

**ఉడ్డకేలుగలాఁడు** వి. (√ఉడ్డ) – చతుర్భుజుఁడు – విష్ణువు. సాం. ని. 4.

**ఉడ్డబిరగలు** వి. బ. (√ఉడ్డ?) ఆభరణవిశేషము.

సీ. మెఱుఁగంచుకమ్మలు మెణ్ణాలు గెఱలము క్కఱ యుడ్డ బిరగలు కట్లసరులు. హంస. 4. 138.

**ఉడ్డమోమువేల్పు** వి. (√ ఉడ్డ.) చతుర్ముఖుఁడు, బ్రహ్మ (శ. ర.).

**ఉడ్డయనము** సం. వి. అ. న. పైకెగురుట.

**ఉడ్డా** – ఉడ్డ (శ. ర. బ్రౌ.).

**ఉడ్డాడించు** స. క్రి. (√ఉడ్డాడు) 1. కలఁగించు, ఇటు నటు కదలించు.

మ. ఇభలోకేంద్రుఁడు హస్తరంధ్రముల నీ రెక్కించి పూరించి చండభమార్గంబున కెత్తి నిక్కి వడి నుడ్డాడించి పింజింప న్పాంథటన్ నీరములోనఁ బెల్లెగసి నక్రగ్రాహపాఠీనముల్, నభమందా డెడుమీనకర్కటములన్ బట్టె న్సురల్ భ్రమానపడఁగా. భాగ. 8. 47.

2. బాధించు, పీడించు.

శా. వాపోచున్ క్షుధఁ గుంది చాల సుతు లవ్వా బువ్వ బువ్వంచు ని,ల్లాపెళ్ళ జీర్ణపటావకర్షముల నుడ్డాడింపఁగాఁ జూచి .... మల్ల భూ. వై. 21.

క. పోయెదఁ బోయెద నంచి, ట్లోయంచలతల్లి యేల యుడ్డాడింపఁగ, మాయేకాంతపుఁబని కిని, నీయునికి విరోధి గాదు నిర్వాహకముగ. ప్రభా. 3. 70.

మ. అన దౌశౌను బెడంగు సింగములు నుడ్డాడించు .... ముకుంద. 2. 210 (ఇట ఔపమ్య వాచకము).

**ఉడ్డాడు** అ. క్రి. (√ఉడ్డు+ఆడు) కలఁగు, చీకాకు పడు.

ద్వి. వేగ నందుని నల్లె వెఱచి యుడ్డాడ, నల యక వర్షింపుఁ డని పల్కి. యనుప. ద్వి. భాగ. 10 (శ. ర.).

**ఉడ్డామరము** సం. విణ. (అ. ఆ. అ.) 1. భయంకరము.

శ్లో. విషజ్యోతిరుజ్జృంభణోడ్డామరవ్యస్తవిస్తా 8. మాలతీ. 5. 23.

2. శ్రేష్ఠము.

**ఉడ్డీనము** సం. విణ. (అ. ఆ. అ.) పయి కెగిరినది. వి. అ. న. పైకెగురుట.

**ఉడ్డు** వి. (చూ. ఉడ్డాడించు, మొ.)

జ: ఉడ్డాడు, ఉడ్డాడించు, ఉడ్డుకుడుచు.

**ఉడ్డుకు(గు)డుచు** అ. క్రి. (√ఉడ్డు) ఊపిరి తిరుగక బాధపడు, ఉక్కిరిబిక్కిరి యగు.

సీ. బేతాళములు నీళ్ల ద్రోసి త్రొక్కఁగఁ గాశి యుదు చెల్లఁ బెడఁబాసి యుడ్డుగుడిచె. దశా. 2. 898.

క. మినుకుచమగుబ్బగుబ్బలి, కొననుండియు గాఢ నాభికూపంబున గ్రక్కున దుమికి వెలవు మఱిఁ గనుఁగొనమి న్నృపుచూపు లుడ్డుకుడుచుచు వెడలెన్. కువల. 4. 150.

వ. ఉదవాసక్లేశంబున నుడ్డుగుడిచి.... పాండు. 3. 150.

**ఉడ్రము** సం. వి. అ. పుం. ఓడ్రదేశము.

**ఉడ్లపల్లంచి** వి. బాలికాక్రీడావిశేషము (శ. ర.).

**ఉతక** – ఉదుక. వి. తలుపుకుసి తిరుగుటకై తలుపు నకు క్రింద నమర్చినకొయ్యచిప్ప. కవాటమూ లాలవాలము (శ. ర. వా.).

**ఉతథ్యుఁడు** సం. వి. అ. పుం. అంగిరునికొడుకు, బృహస్పతియన్న.

**ఉతము** సం. విణ. (అ. ఆ. అ) నేయఁబడినది.

**ఉతుకు** – ఉదుకు.

క. తిరుపుట్టము లుతికి వేగ దెచ్చెద దినముల్. వై జ. 2, 115.

**ఉత్కంఠ** సం. వి. ఆ. స్త్రీ. 1. ఇష్టవస్తుప్రాప్తికైన వేగిరపాటు, తహతహ. 2. చింత, విరహాదుల వలనివిచారము.

**ఉత్కంఠము** సం. విణ. (అ. ఆ. అ.) 1. కంఠము పయికెత్తినది. వి. అ.పుం. ఒకానొకరతిబంధము.

**ఉత్కంఠిత** సం. వి ఆ. స్త్రీ. (అలం) విరహోత్కం ఠిత, ప్రియుఁడు వేఁకు రాకుండుట కోర్వక దుఃఖించునాయిక.

**ఉత్కంఠితము** సం. విణ. (అ. ఆ. అ.) ఉత్కంఠ గలది.

**ఉత్కంపనము** సం. విణ. (అ. ఆ. అ.) 1 వడఁకు నది. 2. వడఁకించునది. వి. అ. న. వడఁకుట.

**ఉత్కంపము** సం. విణ. (అ. ఆ. అ.) వడఁకునది. వి. అ. పుం. వడఁకు.

**ఉత్కంపి** సం. విణ. (న్. నీ. న్.) 1. వడఁకునది. 2 వడఁకించునది.

**ఉత్కంపించు** సం. అ. క్రి. కంపించు, వడఁకు.

మ....ఉదగ్రులై నడిచి రుత్కంపింపఁ దైత్యలోకవ్య ముల్. హరి. ఉ. 9. 168.

(ఉత్కంపకుఁడు మొదలగునవి కంపకుఁడు మొదలగువానివలె గ్రహించునది)

**ఉత్కట** సం. వి. ఆ. స్త్రీ. సైంహిలత.

**ఉత్కటము** సం. విణ. (అ. ఆ. అ.) 1. పెద్దది, అధికమైనది. 2 తీవ్రము, ఉగ్రము. 3. మదించి నది. 4. బలముగలది. వి. అ. పుం. 1. మదపు టేనుఁగు. 2. ఎఱ్ఱచెఱకు (వృ.వి.). 3. శరము, తెల్లు (వృ.వి.). 4. త్వక్పత్త్రము, ఆకుపత్రి (వృ.వి.). న. లవంగపుపట్ట, దాల్చినిచెక్క.

**ఉత్కట** సం. వి. ఆ. స్త్రీ. 1. ఉత్కంఠ. 2. గజ పిప్పలి (వృ. వి.).

**ఉత్కము** సం. విణ. (అ. ఆ. అ.) కుతూహలము గలది, ఉవ్విళ్లూరునది.

శ్లో. అద్రిసుతాసమాగమోత్కః. సం. కు సం. 6. 95.

**ఉత్కరము** సం. వి. అ. పుం. 1. సమూహము, గుంపు. 2. రాశి, ప్రోగు 3. కసవూడ్చుట. 4. తుడువఁబడిన ధూళి, పెంట.

**ఉత్కరిక** సం. వి. ఆ. స్త్రీ. పాలు నెయ్యి బెల్లపు పాకమును జేర్చి చేసెడునొక తియ్యని భక్ష్యము.

**ఉత్కరీయము** సం. విణ. (అ. ఆ. అ.) ఉత్కరము నకు (ప్రోగునకు) సంబంధించినది.

**ఉత్కర్ణము** సం విణ. (అ. ఆ, ఈ. అ.) నిక్కిన చెవులు గలది.

**ఉత్కర్తనము** సం. వి. అ. న. త్రుంచుట, ఛేదనము.

**ఉత్కర్షకము** సం. విణ. (అ. ర్షికా. అ.) ఊడఁ బెఱుకునది. 2. మీఁదికి లాగునది. 3 అతిశ యింపఁజేయునది, గొప్పతనమునుగలిగి చునది.

**ఉత్కర్షము** సం. వి. అ. పుం. 1. పైకిలాగుట. 2. ప్రాశస్త్యము, శ్రేష్ఠత్వము. 3. అతిశయము, గొప్పతనము.

**ఉత్కర్షి** సం విణ. (న్. ణీ. న్) 1. ఊడఁబెఱుకు నది. 2. మీఁదికిలాగునది. 3. ఉత్కర్షముగలది.

**ఉత్కర్షించు** సం. స. క్రి. గొప్పచేయు, స్తుతించు, పొగడు.

క. సరసప్రజ్ఞోత్సాహా, స్ఫురితుఁడ వీ వెచట నున్నఁ బూజ్యుఁడవు గుణాకర మూషక కులశేఖర, యురగేంద్రుఁడఁ గాను నిన్ను నుత్కర్షింపన్. వేం. పంచ. 2. 165.

వ. అని లఘుపతనకుం డనేక ప్రకారంబుల మందరకు నుత్కర్షింపుచుండె నాసమయం బున. వేం. పంచ. 2 175.

అ. క్రి. అధికమగు.

క. తప ముల్లముకల్మషముల, నపగతములఁ జేయు విద్య కాస్పద మగు నాతపసిమహిత దానంబున, నుపచిత మగు విద్య దపము నుత్కర్షించున్.

క, కానఁ దపంబును విద్యయు దానౌదార్య
ప్రవర్ధితంబులు... భార.అను. 4.351,552.
(ఉత్కర్షకుఁడు మొదలగునవి కర్షకుఁడు మొదలగువానివలె గ్రహించునది.

**ఉత్కలము** నం. వి. అ. పుం. ఓఢ్రదేశము.

**ఉత్కలిక** నం. వి. ఆ. స్త్రీ. 1. ఉత్కంఠ, తహతహ. 2. కామాదులవలనఁ గలుగు స్మరణము. 3. తరంగము. 4. కలిక, మొగ్గ. 5. హేల, విలాసము.

**ఉత్కలికాప్రాయము** నం. వి. అ. న. సమాసములతోను కటువైన యక్షరములతోను గూడినగద్యభేదము.

**ఉత్కలుఁడు** నం. విణ. (అ. ఆ. అ.) భారవాహకుఁడు. వి. అ. పుం. 1. ఓఢ్రదేశస్థుఁడు. 2. వ్యాధుఁడు, బోయవాఁడు.

**ఉత్కషణము** నం. వి. అ. న. దున్నుట.

**ఉత్కారి** నం. వి. ఆ. స్త్రీ. పచ్చేంట ఈనెడిఆవు.

**ఉత్కారము** నం. వి. అ. పుం. 1. తూర్పెత్తుట, ధాన్యాదులను ఎగఁబోయుట. 2. ధాన్యమును రాశిచేయుట.

**ఉత్కారిక** నం. వి. ఆ. స్త్రీ. పాఁపు, మొదలగునవి కగుడుకు గట్టెడిపిండి మొదలగునది.

**ఉత్కారుఁడు** నం. వి. అ. పుం. ధాన్యమును చల్లువాఁడు.

**ఉత్కాశనము** నం. వి. అ. న. ఉత్తరువుచేయుట, ఆజ్ఞాపించుట.

**ఉత్కాసనము** నం. వి. అ. న. 1. లోనిశ్లేష్మమును వెడలఁగ్రక్కుట. 2. శ్లేష్మము పడిపోవుదగ్గు.

**ఉత్కిరము** నం. విణ. (అ. ఆ. అ.) చిమ్మునది, వ్యాపింపఁజేయునది.

శ్లో. పుష్పరేణూత్కిరైర్వాతై ... రఘు. 1.38.

**ఉత్కీర్ణము** నం. విణ. (అ. ఆ. అ.) 1. పైకిఁజిమ్మఁబడినది, ఎగుడైవఁబడినది. 2. ఉల్లిఖితము, చెక్కఁబడినది (రూపము అక్షరము, మొ.)

శ్లో. లీనేవ ప్రతిబింబితేవ లిఖితేవోత్కీర్ణరూపేవ చ. మాలతీ. 5. 10.

3. విద్ధము, తొలివేయఁబడినది (రత్నాది).

**ఉత్కీర్తనము** నం. వి. అ. న. 1. (దేవనామాదులను) బిగ్గరగాఁ బలుకుట. 2. చాటుట. 3. పొగడుట.

**ఉత్కీర్తితము** నం. విణ. (అ. ఆ. అ.) 1. గట్టిగా నుచ్చరింపఁబడినది. 2. చాటఁబడినది. 3. పొగడఁబడినది.

**ఉత్కీలితము** నం. విణ. (అ. ఆ. అ.) 1. మేకులుతీసి తెఱవఁబడినది. 2. మేకులుకొట్టి బిగింపఁబడినది.

**ఉత్కుణము** నం. వి. అ. పుం. 1. మత్కుణము, నల్లి. 2. పేను.

**ఉత్కులుఁడు** నం. విణ. (అ. ఆ. అ.) కులభ్రష్టుఁడు, కులమర్యాదలు దాఁటినవాఁడు.

**ఉత్కూజము** నం. వి. అ. పుం. (కోయిల మొదలగువాని) కూఁత.

**ఉత్కూటము** నం. వి. అ. పుం. గొడుగు.

**ఉత్కూర్దనము** నం. వి. అ. న. దుముకుట, పైకి దూఁకుట.

**ఉత్కూలము** నం. విణ. (అ. ఆ. అ.) 1. గట్టుదాఁటి ప్రవహించునది. (నది, మొ.) 2. కూలమును (గట్టును) పొందినది.

**ఉత్కూలితము** నం. విణ. (అ. ఆ. అ.) గట్టునకుఁ జేర్పఁబడినది.

శ్లో. ప్రతిక్షణోత్కూలితశైవలాః భా. శిశు. 3.70.

**ఉత్కృతి** నం. వి. ఇ. స్త్రీ. 1. గొప్పపని. 2. ఉద్గ్రంథము. 3. ఛందోవిశేషము. (దీని ప్రతిపాదమునకు 26 అక్షరము లుండును.)

**ఉత్కృష్టము** నం. విణ. (అ. ఆ. అ.) 1. పైకిలాగఁబడినది. 2. శ్రేష్ఠము, ప్రశస్తము. 3. మిక్కుటమైనది, అధికము. 4. దున్నఁబడినది.

**ఉత్కోచకుఁడు** నం. విణ. (అ. వికా. అ.) లంచము పుచ్చుకొనువాఁడు. మను. 9. 258.

**ఉత్కోచము** నం. వి. అ. పుం. లంచము.

**ఉత్క్రమణము** నం. వి. అ. న. 1. మీఁదికిఁ గాని వెలికిఁ గాని పోవుట. 2. అతిక్రమించుట, మీఱుట.

**ఉత్క్రమణీయము** నం. విణ. (అ. ఆ. అ.) అతిక్రమింపఁ దగినది, మీఱఁదగినది.

**ఉత్క్రమము** నం. వి. అ. పుం. 1. వెలుపలికిఁ బోవుట. 2. మీఁదికిఁ బోవుట. 3. క్రమముతప్పుట. 4. అతిక్రమించుట.

**ఉత్క్రమించు** నం. అ. క్రి. వెడలిపోవు.

(నరుఁడు) గీ. దుస్సహక్లేశమున మహాతురత యొదవ నొఱలుచును దేహ మొకఠంగి నుత్క్రమించు. కవిక. 5. 111. (దేహ ముత్క్రమించు — దేహమునుండి వెడలి పోవు.)

(ఉత్క్రామకుఁడు మొదలగునవి క్రామకుఁడు మొదలగువానివలె గ్రహించునది.)

**ఉత్క్రాంతము** నం. విశే. (అ. అ. అ.) 1. వెలువడినది, వెడలిపోయినది. 2. మరణించినది.

శ్లో. ఉత్క్రాన్తానామామిషాయోపవిష్టా, దధ్యాకాశం బభ్రమః పత్త్రవాహాః, మూర్తాః ప్రాణా మాన మద్యాప్యవేక్షా, మాసుః కాయం త్యాజితా దారుణాస్త్రైః. శిశు. 18. 73.

(ఉత్క్రాంతానాం — మృతానాం—వ్యా) 3. చెడిపోయినది. (రంగు, మొ.) 4. అతిక్రమింపఁ బడినది. 5. అతిక్రమించినది.

**ఉత్క్రాంతి** నం. వి. ఇ. స్త్రీ — ఉత్క్రమణము.

**ఉత్క్రామము** నం. వి. అ. పుం — ఉత్క్రమము.

**ఉత్క్రుష్టము** నం. విశే. (అ. అ. అ.) 1. బిగ్గరగా పిలువఁబడినది. 2. గోలున నేడ్చినది. వి. అ. న. 1. బిగ్గరగాపిలుచుట. 2. గోలుననేడ్చుట.

**ఉత్క్రోషము** నం. వి. అ. పుం. 1. మొఱపెట్టుట. 2. చాటుట. 3. కురరము, ఒకజాతిపక్షి. (లకుముకిపిట్ట అనికొందఱు. పెన్నడవులుఁగు అనికొందఱు.)

**ఉత్క్లేదము** నం. వి. అ. పుం. తడియుట.

(ఉత్క్లిన్నము మొదలగునవి క్లిన్నము మొదలగు వానివలె గ్రహించునది.)

**ఉత్క్లేది** నం. విశే. (న్. నీ. న్.) 1. తడియునది. 2. తడుపునది.

**ఉత్క్లేశకము** నం. విశే. (అ. ఇకా. అ.) 1. క్లేశమును గలిగించునది. 2. ఉత్క్లేశరోగమును గలిగించునది. వి. అ. పుం. అగ్నిప్రకృతి గలకీటభేదము.

**ఉత్క్లేశనము** నం. విశే. (అ. అ. అ.) — వ్యాధిని— రేఁపునది. (కఫోత్క్లేశనము — కఫమునురేఁపునది.)

**ఉత్క్లేశము** నం. వి. అ. పుం. 1. మనస్సునందలి కలఁత, వ్యథ. 2. (వైద్య) ఊర్ధ్వగత మగు వాయువుచేఁ గలుగురోగభేదము.

**ఉత్క్లేశి** నం. విశే. (న్. నీ. న్.) — ఉత్క్లేశనము.

**ఉత్క్షిప్తము** నం. విశే. (అ. అ. అ.) 1. ఎగఁజిమ్మఁబడినది, ఎగురవైవఁబడినది. 2. పైకెత్తఁబడినది.

శ్లో. తత్ర నాగఫణోత్క్షిప్త సింహాసననిషేదుషీ, వసుంధరా...రఘు. 15. 83.

3. తొలఁగింపఁబడినది, నిరసింపఁబడినది. 4. ఆక్రమింపఁబడినది, ఆవరింపఁబడినది. (ఉదా: విస్మయోత్క్షిప్తము, అనురాగోత్క్షిప్తము.) వి. అ. పుం. ఉమ్మెత్త (వృ. వి.).

**ఉత్క్షిప్తిక** నం. వి. ఆ. స్త్రీ. ఉమ్మెత్త పువ్వువంటి యొకానొకకర్ణభూషణము.

**ఉత్క్షేపకుఁడు** నం. విశే. (అ. ఇకా. అ.) ఎగఁజిమ్మువాఁడు. వి. అ. పుం. వస్త్రాదుల నపహరించు దొంగ. యాజ్ఞ. వ్యవ. 2. 274.

**ఉత్క్షేపణము** నం. వి. అ. న. 1. ఎగఁజిమ్ముట:పయికెత్తుట. 2. డోఁకుట. 3. పంపుట. 4 ధాన్యమును రాలఁగొట్టుబడిత, మొ. 5. ధాన్యమును ఎగురఁబోయుగంప, మొ. 6. పదియాఱుపణముల మానము. 7. వీవన, వ్యజనము.

**ఉత్క్షేపము** నం. విశే. (అ. అ. అ.) ఎగఁజిమ్మునది, ఎగురవైచునది. వి. అ. పుం. 1. ఎగఁజిమ్ముట, ఎగురవైచుట. 2. ఎగఁజిమ్మఁబడినపదార్థము.

శ్లో. బిందూత్క్షేపాన్ పిపాసుః పరిపతతి శిఖీ భ్రాంతిమద్వారియంత్రం, మాళవి. 2. 13.

3. పంపుట. 4. త్రోసిపుచ్చుట, పాఱవైచుట. 5. డోఁకు. 6. (ద్వి.) కణఁతలమీఁది ప్రదేశములు (విల్సన్).

**ఉత్క్షేపించు** నం. స. క్రి. ఎగఁజిమ్ము, పైకి విసరు.

మ. గిరిరుద్ధాంఘ్రులు మింటితో నొఱయ నుత్క్షేపించులాంగూలముల్,దరుణాదిత్యవిధూమపావకసముద్దామాననంబుల్ గరుల్, ఖరుడారంగ...భా. రా. కిష్కిం. 808.

(ఉత్క్షిపత్ మొదలగునవి క్షిపత్ మొదలగువానివలె గ్రహించునది.)

**ఉత్ఖచితము** సం. విణ. (అ. అ. అ.) 1. ఖచితము, తాపఁబడినది. 2. గ్రథితము, గ్రువ్వఁబడినది. సం. రఘు. 13. 54.

**ఉత్ఖల** సం. వి. ఆ. స్త్రీ. మురి యనెడిగంధద్రవ్యము (వై వి.).

**ఉత్ఖాతకేళి** సం. వి. ఇ. స్త్రీ. వప్రక్రీడ, ఏనుఁగులు మొదలగునవి దంతములు మొదలగువానితో కోరాడుట.

**ఉత్ఖాతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. త్రవ్వఁబడినది. 2. పెల్లగింపఁబడినది. 3. తుదముట్ట నాశము నేయఁబడినది, ఉన్మూలితము. వి. అ. న. త్రవ్వుట. (ఉత్ఖననీయము మొదలగునవి ఖననీయము మొదలగువానివలె గ్రహించునది)

**ఉత్త** విణ. (వా) 1. రిక్తము, వట్టిది.
ఉదా: ఉత్తకుండ, ఉత్తగంప.
2. కేవలము.
గీ. ఓయి ధృతరాష్ట్ర నీకొడు కుత్తగోల, కొండ వలె నుండు ఘన మూల ముండ దిఁకను, ఖండనంబున గెల్తురు పాండుతనయు, లుదరమునఁ బూలదండరే కొత్తకుండ (చాటువు).
(వ్యవ) వాఁడు ఉత్త అమాయికుఁడు.
3. అసత్యము (ఉదా: ఉత్తమాట).
4. నిర్వ్యాపారము, పనిలేనిది.
ఉదా : అట వ్రాయువారును ఉత్తవారును గూడ నున్నారు. వాఁడు భోజనకాలమున మాటాడఁడుగాని ఉత్తప్పుడు మాటాడును.

**ఉత్తండము** వి. అఁడువారి కంఠభూషావిశేషము.
సీ. సరవిశేషంబు లుత్తరిగె యుత్తండంబు బన్నసరంబు నాఁబరఁగుచుండు. ఆం. భా. 2. 149.
(ముత్తండము – అపముద్రి.చూ.శ్రా.శర.)
సీ. సరిగె ముక్కర బన్నసరము నుత్తండాలు కంకణంబులు తట్లు కడియములును.హంస. 2. 190.

**ఉత్తంభకుఁడు** సం. విణ. (అ. శా. అ.) నిలుపువాఁడు, ఆఁపువాఁడు.

**ఉత్తంభత్** సం. శత్ర. ఉత్తంభించుచున్న.

**ఉత్తంభనము** సం. వి. అ. వ – ఉత్తంభము.

**ఉత్తంభనీయము** సం. విణ. (అ. ఆ. అ.) ఉత్తంభింపఁ దగినది.

**ఉత్తంభమానము** సం విణ. (అ. ఆ. అ.) ఉత్తంభించుచున్నది.

**ఉత్తంభము** సం. వి. అ. పుం. 1. ఆధారము, ప్రాపు, ఊఁత. 2. ఆఁపుట. 3. వృద్ధిచేయుట.

**ఉత్తంభి** సం. విణ. (న్. నీ. న్.) – ఉత్తంభకుఁడు.

**ఉత్తంభించు** సం. న. క్రి. 1. నిలుపు, ఆఁపు. 2. బొడిగించు (శ. ర.).

**ఉత్తంభిత** సం. విణ. (ఋ. త్రీ. ఋ.) – ఉత్తంభకుఁడు.

**ఉత్తంభితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. వహింపఁబడినది.
శ్లో:...స్కంధోత్తంభితతీర్థవారికలశా రాజ్యాభిషేకాయ తే. వేణీ. 6. 44.
2. వృద్ధిపఱుపఁబడినది. 3. ఆఁపఁబడినది.

**ఉత్తంభితవ్యము** సం – ఉత్తంభనీయము.

**ఉత్తంభ్యమానము** సం. విణ. (అ. ఆ. అ.) ఉత్తంభింపఁబడుచున్నది.

**ఉత్తంభ్యము** సం – ఉత్తంభనీయము.

**ఉత్తంసము** సం. వి. అ. పుం. 1. సిగబంతి, తలమానికము, శిరోభూషణము. 2. కర్ణాభరణము, చెవిపోఁగు.
(ఈపదము శ్రేష్ఠవాచకముగాఁ గూడ నుపయుక్తము. ఉదా: నృపోత్తంసము, మొ.)

**ఉత్తంసితము** సం. విణ. (అ. ఆ. అ.) ఉత్తంసముగాఁ జేయఁబడినది. 2. ఉత్తంసము కలది.

**ఉత్తటము** సం – ఉత్కూలము.

**ఉత్తప్తము** సం. విణ. (అ. ఆ. అ.) 1. కాఁగినది; కాలినది. 2. సంతాపము నొందినది, ఆరటపడినది. వి. అ. న. 1. ఉత్తాపము, మిక్కిలి వేఁడిమి. 2. సంతాపము, ఆరట. 3. ఎండినమాంసము.

**ఉత్తబ్ధము** సం – ఉత్తంభితము.

**ఉత్తమ** సం. వి. ఆ. స్త్రీ. 1. ఉత్తమస్త్రీ. 2. ఊరావి, చిఱుపాల (వై. వి.) 3. ఒకవిధమైనపొక్కు.

**ఉత్తమపురుషము** సం. వి. అ. పుం. (వ్యాక) ప్రథమమధ్యమోత్తమపురుషములలో కడపటిది.

నేను, మేము, మనము కర్తగాఁ గల క్రియా రూపము.

**ఉత్తమఫలిని** నం. వి. ఈ. స్త్రీ. దుగ్ధిక, చిఱుపాల మొక్క.

**ఉత్తమము** నం. విశే. (అ. ఆ. అ.) 1 శ్రేష్ఠమైనది. గొప్పది. (వ్యతి. అధమము) 2. ముఖ్యము, ప్రధానము. (ఉదా: ఉత్తమాంగము.) 3. రెంటికెక్కువైన దానిలో కడపటిది (అక్షరము, మొ—'కలికి' ఇట 'కి' ఉత్తమము).

**ఉత్తమర్ణి** నం. విశే. (స్. సీ. స్.)—ఉత్తమర్ణుఁడు.

**ఉత్తమర్ణికుఁడు** నం — ఉత్తమర్ణుఁడు.

**ఉత్తమర్ణుఁడు** నం. విశే. (అ. ఆ. అ.) అప్పిచ్చువాఁడు. (వ్యతి. అధమర్ణుఁడు)

**ఉత్తమసాహసము** నం. వి. అ. పుం. న. 1. అపరాధమునకు విధించుచుండుగు (జుల్మానా)లలో పెద్దది. (1000 పణములని కొందఱు 80000 పణములని కొందఱు.) 2. శిరశ్ఛేదము మొదలగు పెద్దదండనము.

**ఉత్తమాంగము** నం. వి. అ. న. శిరస్సు, తల

**ఉత్తమారణి** నం. వి. ఈ. స్త్రీ. ఇందీవరి, పిల్లపీఁచర (వృ. వి.).

**ఉత్తమీయము** నం. విశే. (అ. ఆ. అ.) ఉత్తమమైన దానికి సంబంధించినది.

**ఉత్తము** నం. విశే. (అ. ఆ. అ.) ఉన్నము, తడిసినది.

**ఉత్తర** నం. వి. ఆ. స్త్రీ. 1. ఉత్తరపుదిక్కు. 2. ఉత్తరఫల్గునీ నక్షత్రము.

సీ....మఘ పుబ్బ యుత్తర మఱియు హస్త. హంస. 4. 65.

3. విరాటరాజుకూఁతురు. (అభిమన్యునిభార్య, పరీక్షిత్తుతల్లి).

**ఉత్తరంగము** నం. విశే. (అ. ఆ. అ.) 1. లేచినట్టి తరంగములు గలది. 2. (అలవలె) తటాలున నెగిరిపడునది; చపలము.

శ్లో. కశా ప్రహారభయేన జాతకంపో త్తరంగాః. ...తురంగాః. ముద్రా. 6. 3. (ప్రాకృత చ్ఛాయ).

వి. అ. న. ద్వారముమీఁదికమ్మి.

**ఉత్తరకాండము** నం. వి. అ. పుం. రామాయణము నందలి యేడవకాండము.

**ఉత్తరకాయము** నం. వి. అ. పుం. దేహముయొక్క ఊర్ధ్వభాగము.

**ఉత్తరక్రియ** నం. వి. ఆ. స్త్రీ. 1. పిదపఁ జేయఁదగుకార్యము 2. మృతుల నుద్దేశించి చేయఁబడుకర్మము, అపరకర్మము

**ఉత్తరగోగ్రహణములు** నం. వి. అ. న. బ. ఒక దినుసువస్త్రములు.

సీ. ముత్తెలపందిళ్లు నుత్తరగోగ్రహణంబులుకొని కంచు నాఁచువన్నె, నిండువన్నెలు ....
గీ. మొదలుగా వల్వలు ధరించి ముదిత లపుడు. ప్రబంధ. 372.

**ఉత్తరచ్ఛదము** నం — ఉత్తరపటము.

**ఉత్తరజందెము** — ఉత్తరజన్నిదము.

ద్వి. క్రొత్తముత్యంబులుగూర్చినయట్టి,యుత్తర జందెంబు లురమునవ్రేల. ప్రభు 143 పే. 15 పం.

**ఉత్తరజన్నిదము** మి. వి. యజ్ఞోపవీతమువలె ధరించుముత్యాలహారము సువర్ణసూత్రము, మొ.

సీ. ఇభకుంభమణు లెడనెడఁ గూర్చుగురివెందజ మలియుత్తరజన్నిదములు దనరి. రా. వి. 3. 34.

**ఉత్తరడొక్కరము** వి. (నం. ఉత్తరదోఃకరము.) మల్లబంధవిశేషము.

వ. డొక్కరము నుత్తరడొక్కరము కత్తెకొక్కెన కుమ్మరింపు బోడింపు సమసీసము సందుసీసము. మల్లుపు. 3. 69.

**ఉత్తరణము** నం. విశే. (అ. ఆ. అ.) దాఁటునది,కడచునది. వి. అ. న. దాఁటుట: అవ్వలిగట్టు చేరుట.

**ఉత్తరదాయకుఁడు** నం. విశే. (అ. యికా. అ.) 1. ఉత్తరము (జవాబు) చెప్పువాఁడు. 2.మాఱాడువాఁడు, ఎదురాడువాఁడు.

శ్లో. దుష్టాభార్యా శఠంమిత్రం భృత్యాశ్చో త్తరదాయకాః, ససర్పేచ గృహే వాసో మృత్యురేవ నసంశయః. హితో. 2. 121.

**ఉత్తరదోఃకరము** నం. వి. అ. న. ఉత్తరడొక్కము, మల్లబంధవిశేషము.

శ్లో. గ్రీవాయాశ్చ భుజాయాశ్చ పాదేనాక్రమణే సతి, అన్యజాన్వవబంధేన కుర్యాదుత్తరదోశ్శరమ్. శివతత్త్వరత్నాకరము. (శ. ర.)

**ఉత్తరపక్షము** సం. వి. అ. పుం. 1. కృష్ణపక్షము. 2. వాదమందు సిద్ధాంతపక్షము. (వ్యతి-పూర్వపక్షము.)

**ఉత్తరపటము** సం. వి. అ. పుం. 1. ఉత్తరీయము. 2. శయ్యపయిని పఱచువస్త్రము.

**ఉత్తరపదము** సం. వి. అ. న. 1. తర్వాతిమాట. 2. సమాసమందుకడపటియవయవమగుపదము.

**ఉత్తరపశ్చిమ** సం. వి. ఆ. స్త్రీ. వాయవ్యదిక్కు.

**ఉత్తరపశ్చిమము** సం. విణ. (అ. ఆ. అ.) ఉత్తరపశ్చిమపుది. వాయవ్యదిక్కున నున్నది.

**ఉత్తరపాదము** సం. వి. అ. పుం. ప్రతివాది యుత్తరము, ప్రతివాదిసమాధానము.

శ్లో. పూర్వపక్షస్స్మృతః పాదో ద్వితీయశ్చోత్తరస్స్మృతః, క్రియాపాదస్తృతీయస్స్యాచ్చతుర్థో నిర్ణయస్స్మృతః, బృహస్పతిః. (వాచ.)

1. పూర్వపక్షము-వ్యాజ్యెము తెచ్చుట. 2. ఉత్తరము-ప్రతివాదియొక్క సమాధానము. 3. క్రియ-సాక్ష్యము మొదలగునవి వినుట. 4. నిర్ణయము-తీర్పు-అని వ్యవహారమునకు నాలుగు పాదములు)

**ఉత్తరపూర్వ** సం. వి. ఆ. స్త్రీ. ఈశానదిశ.

**ఉత్తరపూర్వము** సం. విణ. (అ. ఆ. అ.) ఈశానదిక్కునందలిది.

**ఉత్తరప్రత్యుత్తరము** సం. వి. అ. న. 1. ఉత్తరోత్తరము. 2. బ. లేఖప్రతిలేఖములు (జాబుజవాబులు.)

**ఉత్తరఫల్గుని** సం. వి. ఈ. స్త్రీ. అశ్విని మొదలగువానిలో పండ్రెండవనక్షత్రము.

**ఉత్తరఫాల్గుని** సం.-ఉత్తరఫల్గుని.

**ఉత్తరభద్రపద** సం. వి. ఆ. స్త్రీ. అశ్విని మొదలగువానిలో ఇరువదియాఱవనక్షత్రము.

**ఉత్తరభాద్రపద** సం.-ఉత్తరభద్రపద.

**ఉత్తరమీమాంస** సం. వి. ఆ. స్త్రీ. శారీరక సూత్రగ్రంథము. (ఇది వేదవ్యాసరచితము. దీనికి వేదాంతశాస్త్రమనియు నామము కలదు. ఇది వేదమందలి జ్ఞానకాండమునకు సంబంధించినది. కర్మకాండమునకు సంబంధించినది 'పూర్వమీమాంస' యనియు 'మీమాంస'యనియుఁ జెప్పఁబడును. దీనినిబట్టియే ఇది 'ఉత్తరమీమాంస' అనఁబడును.)

**ఉత్తరము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఉత్తరపుదిక్కుది. 2. మీఁదిది, పయిది. (వ్యతి. అధరము.)

శ్లో. అవసతోత్తరకాయమ్. సం. రఘు. 9. 6.

3. దేశమునందును కాలమునందును పిదపటిది, అనంతరము. (వ్యతి. పూర్వము) 4. ఎడమది, డాపటిది. (వ్యతి. దక్షిణము) 5. ప్రధానము, ముఖ్యము.

వ. ప్రవర్త్యుత్తరంబుగాఁ బ్రజాపాలనంబు సేయుచు. భా. ఆది. 5 స. 112. 7.

6. అధికము, ఎక్కువ. (ఉదా. అష్టోత్తరశతము-ఎనిమిదిచే ఎక్కువైననూఱు, నూటయెనిమిది.) 7. అతిక్రమించునది, దాఁటునది. 8. శ్రేష్ఠము. వి. అ. పుం. 1. భవిష్యత్కాలము, రాఁగలకాలము. 2. అనంతర ప్రదేశము, తర్వాతిచోటు. న. 1. ప్రతివచనము, సమాధానము. 2. రాజునొద్ద వాది తెచ్చినవ్యాజ్యెమును రద్దుపఱుచుటకుచేయు ప్రతివాదము. (ఇది వ్యవహారమున కొకయంగము.) 3. (మీమాంస) సిద్ధాంతమునకనుకూలముగా తర్కము నుపన్యసించుట, (వ్యతి. పూర్వపక్షము:- 'విషయము, సంశయము, పూర్వపక్షము, ఉత్తరము, నిర్ణయము.' అని అధికరణముయొక్క అవయవము లయిదు. ఉత్తరమునందు పూర్వపక్షమును ఖండించి సిద్ధాంతమునకు అనుకూలముగా తర్కము ఉపన్యసింపఁబడును.) 4. నిగమనము, సిద్ధాంతము. 5. ఊర్ధ్వభాగము. మీఁదు. 6. వామభాగము, దాపలిప్రక్క. 7. ఉత్తరణము, ఉల్లంఘనము, దాఁటుట. 8. (గణిత) రెండుసంఖ్యలకుఁ గలభేదము. 9. లేఖ, జాబు. (ఈయర్థము సంస్కృతమున లేదు. 'ఉత్తరప్రత్యుత్తరములు' అని సమాసఘటితముగా వాడుకొనుచుండుటచే ఇది తత్సమముగానే గ్రహింపవగును.)

నేను, మేము, మనము కర్తగాఁ గల క్రియా రూపము.

**ఉత్తమఫలిని** సం. వి. ఈ. స్త్రీ. దుగ్ధిక, చిఱుపాల మొక్క.

**ఉత్తమము** సం. విణ. (అ. ఆ. అ.) 1 శ్రేష్ఠమైనది. గొప్పది. (వ్యతి. అధమము) 2. ముఖ్యము, ప్రధానము. (ఉదా: ఉత్తమాంగము.) 3. రెంటికెక్కువైన దానిలో కడపటిది(అక్షరము, మొ—'కలికి' ఇట 'కి' ఉత్తమము).

**ఉత్తమర్ణి** సం. విణ. (న్. నీ. న్.)—ఉత్తమర్ణుఁడు.

**ఉత్తమర్ణికుఁడు** సం — ఉత్తమర్ణుఁడు.

**ఉత్తమర్ణుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) అప్పిచ్చువాఁడు. (వ్యతి అధమర్ణుఁడు)

**ఉత్తమసాహసము** సం. వి. అ. పుం. న. 1. అపరాధమునకు విధించుదండుగు (జుల్మానా)లలో పెద్దది. (1000 పణములని కొందఱు 80000 పణములని కొందఱు.) 2. శిరశ్ఛేదము మొదలగు పెద్దదండనము.

**ఉత్తమాంగము** సం. వి. అ. న. శిరస్సు, తల.

**ఉత్తమారణి** సం. వి. ఈ. స్త్రీ. ఇందీవరి, పిల్లపీఁచర (వృ. వి.).

**ఉత్తమీయము** సం. విణ. (అ. ఆ. అ.) ఉత్తమమైన దానికి సంబంధించినది.

**ఉత్తము** సం. విణ. (అ. ఆ. అ.) ఉన్నము, తడిసినది.

**ఉత్తర** సం. వి. ఆ. స్త్రీ. 1. ఉత్తరపుదిక్కు. 2. ఉత్తరఫల్గునీ నక్షత్రము.

సీ....మఘ పుబ్బ యుత్తర మఱియు హస్త. హంస. 4. 65.

3. విరాటరాజుకూఁతురు. (అభిమన్యునిభార్య, పరీక్షిత్తుతల్లి).

**ఉత్తరంగము** సం. విణ. (అ. ఆ. అ.) 1. లేచినట్టి తరంగములు గలది. 2. (అలవలె) తటాలున నెగిరిపడునది; చపలము.

శ్లో. కశా ప్రహారథయేన జాతకంపోత్తరంగాః. ...తురంగాః. ముద్రా. 6. 3. (ప్రాకృతచ్ఛాయ).

వి. అ. న. ద్వారగముమీఁదికమ్మి.

**ఉత్తరకాండము** సం. వి. అ. పుం. రామాయణము నందలి యేడవకాండము.

**ఉత్తరకాయము** సం. వి. అ. పుం. దేహముయొక్క ఊర్ధ్వభాగము.

**ఉత్తరక్రియ** సం. వి. ఆ. స్త్రీ. 1. పిదపఁ జేయఁదగుకార్యము 2. మృతుల నుద్దేశించి చేయఁబడుకర్మము, అపరకర్మము

**ఉత్తరగోగ్రహణములు** సం. వి. అ. న. బ. ఒకదినుసువస్త్రములు.

సీ. ముత్తెలపంటిల్లు నుత్తరగోగ్రహణంబులుకరకంచు నాఁచువన్నె, నిండువన్నెలు .... గీ. మొదలుగా వల్వలు ధరించి ముదితలప్డు. ప్రబంధ. 272.

**ఉత్తరచ్ఛదము** సం — ఉత్తరపటము.

**ఉత్తరజందెము** — ఉత్తరజన్నిదము.

ద్వి. క్రొత్తముత్యంబులుగూర్చినయట్టి,యుత్తరజందెంబు లురమున వ్రేల. ప్రభు 142 పం. 15 పం.

**ఉత్తరజన్నిదము** మి. వి. యజ్ఞోపవీతమువలె ధరించు ముత్యాలహారము సువర్ణసూత్రము, మొ.

సీ. ఇభకుంభమణు లెడనెడఁ గూర్చుగురివెందజ మలియుత్తరజన్నిదములు దనర. రా. వి. 3. 34.

**ఉత్తరడొక్కరము** వి. (సం. ఉత్తరదోఃకరము)మల్లబంధవిశేషము.

వ. డొక్కరము నుత్తరడొక్కరము కత్తెరకొక్కెన కుమ్మరింపు బోడింపు సమసీసము సందుసీసము. మల్లుపు. 3. 69.

**ఉత్తరణము** సం. విణ. (అ. ఆ. అ.) దాఁటునది,కడచునది. వి. అ. న. దాఁటుట: అవ్వలిగట్టు చేరుట.

**ఉత్తరదాయకుఁడు** సం. విణ. (అ. యకా. అ.) 1. ఉత్తరము (జవాబు) చెప్పువాఁడు. 2.మాఱాడువాఁడు, ఎదురాడువాఁడు.

శ్లో. దుష్టాభార్యా శఠంమిత్రం భృత్యాశ్చోత్తరదాయకాః, ససర్పేచ గృహే వాసో మృత్యురేవ ససంశయః. హితో. 2. 121.

**ఉత్తరదోఃకరము** సం. వి. ఇ. న. ఉత్తరడొక్కము, మల్లబంధవిశేషము.

శ్లో. గ్రీవాయాశ్చ భుజాయాశ్చ పాదేనాక్ర మణే సతి, అన్యజాన్వవబంధేన కుర్యాదు త్తరదోఃకరమ్. శివతత్త్వరత్నాకరము. (క. ౧.)

**ఉత్తరపక్షము** సం. వి. అ. పుం. 1. కృష్ణపక్షము. 2. వాదమందు సిద్ధాంతపక్షము. (వ్యతి-పూర్వపక్షము.)

**ఉత్తరపటము** సం. వి. అ. పుం. 1. ఉత్తరీయము. 2. శయ్యపయిని పఱచువస్త్రము.

**ఉత్తరపదము** సం. వి. అ. న. 1. తర్వాతిమాట. 2. సమాసమందుకడపటియవయవముగుపదము.

**ఉత్తరపశ్చిమ** సం. వి. ఆ. స్త్రీ. వాయవ్యదిక్కు.

**ఉత్తరపశ్చిమము** సం. విణ. (అ. ఆ. అ.) ఉత్తరపశ్చిమపుది. వాయవ్యదిక్కున నున్నది.

**ఉత్తరపాదము** సం. వి. అ. పుం. ప్రతివాది యుత్తరము, ప్రతివాదిసమాధానము.

శ్లో. పూర్వపక్షస్స్మృతఃపాదోద్వితీయశ్చోత్తరం స్మృతః, క్రియాపాదస్తృతీయస్స్యా చ్చతుర్థోనిర్ణయస్స్మృతః,బృహస్పతిః.(వాచ.)

1. పూర్వపక్షము-వ్యాజ్యము తెచ్చుట. 2. ఉత్తరము-ప్రతివాదియొక్క సమాధానము. 3. క్రియ-సాక్ష్యము మొదలగునవి వినుట. 4. నిర్ణయము-తీర్పు-అని వ్యవహారమునకు నాలుగు పాదములు)

**ఉత్తరపూర్వ** సం. వి. ఆ. స్త్రీ. ఈశానదిశ.

**ఉత్తరపూర్వము** సం. విణ. (అ. ఆ. అ.) ఈశాన దిక్కునందలిది.

**ఉత్తరప్రత్యుత్తరము** సం. వి. అ. న. 1. ఉత్తరోత్తరము. 2. బ. లేఖప్రతిలేఖములు (జాబు జవాబులు.)

**ఉత్తరఫల్గుని** సం. వి. ఈ. స్త్రీ. అశ్విని మొదలగు వానిలో పండ్రెండవనక్షత్రము.

**ఉత్తరఫాల్గుని** సం.-ఉత్తరఫల్గుని.

**ఉత్తరభద్రపద** సం. వి. ఆ. స్త్రీ. అశ్వని మొదలగు వానిలో ఇరువదియాఱవనక్షత్రము.

**ఉత్తరభాద్రపద** సం.-ఉత్తరభద్రపద.

**ఉత్తరమీమాంస** సం. వి. ఆ. స్త్రీ. శారీరక సూత్ర గ్రంథము. (ఇది వేదవ్యాసరచితము. దీనికి వేదాంతశాస్త్రమనియు నామము కలదు. ఇది వేదమందలి జ్ఞానకాండమునకు సంబంధించినది. కర్మకాండమునకు సంబంధించినది 'పూర్వమీమాంస' యనియు 'మీమాంస'యనియుఁ జెప్పబడును. దీనినిబట్టియే ఇది 'ఉత్తరమీమాంస' అనఁబడును.)

**ఉత్తరము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఉత్తరంపుది క్కుది. 2. మీఁదిది, పయిది. (వ్యతి.అధరము.) శ్లో. అవనతోత్తరకాయమ్. సం. రఘు. 9. 6. 3. దేశమునందును కాలమునందును పిదపటిది, అనంతరము. (వ్యతి.పూర్వము) 4. ఎడమది, దాపటిది. (వ్యతి. దక్షిణము ) 5. ప్రధానము, ముఖ్యము.

వ. బ్రహ్మోక్తోత్తరంబుగాఁ బ్రజాపాలనంబు సేయుచు. భార. ఆది. 5 ఆ. 2. 7.

6. అధికము, ఎక్కువ. (ఉదా. అష్టోత్తరశతము - ఎనిమిదిచే ఎక్కువైననూఱు, నూటయెనిమిది.) 7. అతిక్రమించునది, దాఁటునది. 8. శ్రేష్ఠము. వి. అ. పుం. 1. భవిష్యత్కాలము, రాఁగలకాలము. 2. అనంతర ప్రదేశము, తర్వాతిచోటు. న. 1. ప్రతివచనము, సమాధానము. 2. రాజునొద్ద వాది తెచ్చినవ్యాజ్యమును రద్దుపఱుచుటకుచేయు ప్రతివాదము. (ఇది వ్యవహారమున కొకయంగము.) 3. (మీమాంస) సిద్ధాంతమున కనుకూలముగా తర్కము నుపన్యసించుట, (వ్యతి. పూర్వపక్షము:- 'విషయము, సంశయము, పూర్వపక్షము, ఉత్తరము, నిర్ణయము.' అని అధికరణముయొక్క అవయవము లయిదు. ఉత్తరమునందు పూర్వపక్షమును ఖండించి సిద్ధాంతమునకు అనుకూలముగా తర్కము ఉపన్యసింపఁబడును.) 4. నిగమనము, సిద్ధాంతము. 5. ఊర్ధ్వభాగము. మీఁదు. 6. వామభాగము, దాపలిప్రక్క. 7. ఉత్తరణము, ఉల్లంఘనము, దాఁటుట. 8. (గణిత) రెండుసంఖ్యలకుఁ గలభేదము. 9.లేఖ, జాబు. (ఈయర్థము సంస్కృతమున లేదు. 'ఉత్తరప్రత్యుత్తరములు' అని సమాసఘటితముగా వాడుకొనుచుండుటచే ఇది తత్సమము గానే గ్రహింపవగును.)

గీ. అచటి కరుగుచు నుండి సురాధినేత, మిమ్ము
రమ్మని యిదె యుత్తరమ్ము పనిచె. కువల. 4. 203.

**ఉత్తరరామచరితము** సం. వి. అ. న. భవభూతియను కవి రచించిన యొకసంస్కృతనాటకము (ఇది ఉత్తరరామాయణకథను దెలుపును.)

**ఉత్తరవయస్కుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) వృద్ధుఁడు, ముసలివాఁడు.

**ఉత్తరవయస్సు** సం. వి. స్. న. వార్ధకము,ముదిమి.

**ఉత్తరవస్తి** సం. వి. ఇ. పుం. (వైద్య) ఒకవిధమైన చిన్న చిమ్మనగ్రోవి. మూత్రపురీషద్వారముల నుండి నీరు మున్నగువాని నెక్కించుట కుపయోగించుసాధనము.

**ఉత్తరవస్త్రము** సం. వి. అ. న. ఉత్తరీయము, పయిబట్ట.

**ఉత్తరవాది** సం. విశ. (న్. నీ. న్.) సమాధానము చెప్పువాఁడు, ప్రతివాది.

**ఉత్తరవాసము** సం. వి. స్. న. అ. పుం. ఉత్తరీయము, పయిబట్ట.

సీ. చంద్రాతపముతోడ సరియైనవెలిపట్టుపుట్ట
ముత్తరవాసముగ ధరించి. నైష. 8.103.

**ఉత్తరవాసస్సు** సం. వి. స్. న.—ఉత్తరవాసము.

**ఉత్తరవేది** సం. వి. ఇ, ఈ. స్త్రీ. 1. యజ్ఞమం దగ్నిస్థాపనార్థమై ఉత్తరదిక్కున వేసినవేది. 2. కురుక్షేత్రమందలి యొకానొకతీర్థము.

**ఉత్తరసక్థము** సం. వి. అ. న. (ఉత్తర + సక్థి.) ఎడమతొడ.

**ఉత్తరసాక్షి** సం. వి. న్. పుం. 1. సాక్షులు చెప్పిన విషయమును తాను విన్నదానిఁబట్టి ధ్రువపఱచు సాక్షి. 2. మోపిననేరమును పరిహరించుకొనుటకు ముద్దాయి తెచ్చుకొను సాక్షి.

**ఉత్తరస్ఫుటితము** సం. వి. అ. న. యోనియందు చేయుచుంబనము.

సీ. చిత్తజుగృహమున ముత్తరస్ఫుటితంబు పొ
క్కిట సంపుటంబును శిరోధి, నసువదం బూ
రుల నన్వితం బన నొప్పు దశచుంబనములు
దత్తత్ స్థలములఁ. హంస. 5. 148.

**ఉత్తరాత్రయము** సం. వి. అ. న. ఉత్తరఫల్గుని ఉత్తరాషాఢఉత్తరభాద్రపద-అనునక్షత్రత్రయము.

**ఉత్తరాధరము** సం. విశ. (అ. ఆ. అ.) 1. మీఁదిది క్రిందిదియును, ఎక్కువది తక్కువదియును. 2. ఉచ్చావచము, ఎక్కువతక్కువలుగలది. వి. అ. పుం. మీఁదిపెదవి.

**ఉత్తరాధికారము** సం. వి. అ. పుం. అనంతరదాయాదత్వము, తర్వాతివార సగుట.

**ఉత్తరాధికారి** సం. విశ. (న్. నీ. న్.) వారసు, యజమానుఁడు మరణించినపిదప నతనిసొత్తునకు స్వామ్యము గలవాఁడు, దాయాదుఁడు.

**ఉత్తరాపథము** సం. వి. అ. పుం. ఉత్తరదేశము.

**ఉత్తరాపర** సం. వి. ఆ. స్త్రీ. వాయవ్యదిక్కు.

**ఉత్తరాభాసము** సం. వి. అ. పుం. (ఉత్తరమువలె తోఁచునది.) సరి కానియుత్తరము.

**ఉత్తరాయణము** సం. వి. అ. న. సూర్యుఁ డుత్తరపు వైపుగాఁ బోవు ఆఱునెలలకాలము, మకరసంక్రాంతి మొదలు కర్కటసంక్రాంతివఱకుఁగల కాలము.

**ఉత్తరార్ధము** సం. వి. అ. న. 1. దేహముయొక్క మీఁదిభాగము. 2. (గ్రంథాదులయొక్క) రెండవ సగము. (వ్యతి. పూర్వార్ధము – మొదటి సగము.) 3. ఉత్తరపువైపునఁ గలభాగము.

**ఉత్తరాషాఢ** సం. వి. ఆ. స్త్రీ. అశ్విని మొదలగువానిలో ఇరువదియొకటవనక్షత్రము.

**ఉత్తరాసంగము** సం. వి. అ. పుం.—ఉత్తరీయము.

**ఉత్తరాసులు** వి. బ. తలుపునకు క్రిందను మీఁదను అమర్చినకుసులు.

**ఉత్తరించు** స. క్రి. ఖండించు.

గీ. ...ఉత్తరించు,తములపాకు నిక్కెడు క్రియ
దాఁకె నిట్టి. ఉ. హరి. 4. 28.

చ. ...అమ్మగలమగండు వీఁక దళమం బగు
మస్తక ముత్తరించి వేల్వఁ గడఁగి హోమ
వహ్నిచటులంబుగఁ బ్రజ్వరిలంగఁ జేసినన్.
ఉ. రా. 2. 178.

ద్వి. తల లుత్తరించి దెందమ్ములు వ్రచ్చి. అ. మ. క. 3. 171 పా. 19 పం.

గీ. అతఁ డవరోధగమన మెట్లనుచు వెఱచి, యొడఁబడకయున్న నాప్రాణ ముత్తరింతుఁ, దనకుఁగానని యే నంటిననుచు ధైర్యమిచ్చి తోడ్కొని చిమ్మిపు డేఁగు మనిన. శుక. 2 50.
(ఇట 'పోఁగొట్టుకొందును' అని భావము.)

**ఉత్తరించు(రియించు)** సం. స. క్రి. దాఁటు; కడపు.
గీ. ...జీవుండు భవాబ్ధి యుత్తరింపలేఁ డిది నిజము గరిష్ఠచరిత. భాగ. శాం. 5. 535.
సీ. చదలేఱు ప్రవహించుచాయ యుత్తరియించి ధ్రువమండలంబు పెంద్రోవ నడచి. నైష. 7. 37.
గీ. అనుచుఁ గృతకాద్రిమణికందరాంతరముల, రత్నసౌధాగ్రములఁగృహారామములను, గమల కాసారపులినభాగములదినము,లుత్తరించును మనుజనాథోత్తముండు. భాను. 4.23.
(ఉత్తరత్ మొదలగునవి తరత్ మొదలగువాని వలె గ్రహించునది.)

**ఉత్తరిగె** వి. ఒకవిధమైనహారము.
సీ. సరివిశేషంబు లుత్తరిగె యుత్తుండంబు బన్న సరంబు నాఁ బరఁగు చుండు ఆం. భా. 2. 149.
వ. కంఠమాలికలు కంఠసరు లుత్తరిగెలు చౌకట్టు లొంటులు మురువులు తురాలు కిరీటంబు లనం బరఁగునాభరణంబులును ... ప్రబంధ. 605.

**ఉత్తరీయము** సం. వి. అ. న. పైబట్ట.

**ఉత్తరుఁడు** సం. వి. అ. పుం. 1. విష్ణువు. 2 శివుఁడు. 3. విరాటునికొడుకు.

**ఉత్తరువు** వి. (సం. ఉత్తరమ్. క. త. ఉత్తిరువు.) అనుజ్ఞ, ఆజ్ఞ, సెలవు.
వ. దొంగ యగునని నిశ్చయించి యభిమానధనుని కెత్తిఁగించి మూఁడుత్తరువులు గైకొని ....అతని వధియించి...శుక. 3. 587.
సీ. ఊళ్లాయములమీఁద హారవుత్తరువు గన్నరాయకై జీతంబురాయవారు.రా.వి.5.18.

**ఉత్తరేను** వి. (క. ఉత్తరేణి.) అపామార్గము, మయూరకము (వృ. వి.) (దీనివేరు దంతధావనమున కుపయోగింతురు.)

సీ. ఇడిపినయిడుపులయొడలఁ బ్రోచేనుత్తరేను గసిం ద కోరింద పొదలం. ఆము. 6. 18.
గీ. ఒప్పుచుండు నపామార్గముత్తరే న,నంగ. ఆం. భా. 2. 54.
(ఉత్తరేణి. వాడుక.)

**ఉత్తరోత్తరము** సం.విశ. (అ.అ.అ.) 1.తరువాతిదానికంటె తరువాతిది. 2. క్రమముగా హెచ్చునది.
వ. ఉత్తరోత్తరస్నేహేన దృష్టః. సం. పంచ. 1.
వి. అ. న. 1. ఉత్తరమున కిచ్చిన ప్రత్యుత్తరము. 2. ఉత్తరమును ప్రత్యుత్తరమును గల వాదము, మొ. క్రి. విశ. 1. పైపై. 2. మఱిమఱి. 3. ఎడతెగక, పరంపరగా.
గీ. ఉత్తరోత్తర మభివృద్ధి నొందుచుండు.కాశీ. 3. 51.

**ఉత్తర్జనము** సం. వి. అ. న. తీవ్రముగా అదల్చుట, గట్టిగా బెదరించుట.

**ఉత్తలపడు** అ. క్రి. (ఉత్తలము+పడు.) 1. క్షుభితమగు, కలఁగు.
క. ఇత్తఱి మనుష్యభువనం, బుత్తలపడు చున్నయది మహోగ్రాసుఁ డు,ర్వృత్తముల నీవు కరుణా,యత్తమతిం బుట్టవయ్య యదువంశమునన్. భార. భీష్మ. 2. 267.
2. త్వరపడు.
మ.... వీచీభుజావళియాలిం గన కేళి కుత్తలపడన్. హరి. పూ. 7. 112.
ద్వి. చిత్తంబుదినిపైఁ జేరిచిమీర,లుత్తలపడివట్టు నూహింప వలదు. రం. రా. అర. 174 పొ. 9 పం.
3. వ్యత్యస్తమగు, తాఱుమాఱగు.
సీ. పొలుపొందఁగ విభూతిలొట్టు జెన్నొసలిపైఁ దళుకొత్తుచెమట కుత్తలపడంగ. వీథి. 25.
చ. కలఁగెఁ బయోనిధు ల్గిరులు గంపమునొందెఁ జలించెఁ భూమి ది,క్కులు వడఁకెన్,వియత్తలము గుబ్బటిలెన్ గ్రహతారకంబు లు,త్తలపడఁజొచ్చె నచ్యుతపితామహశంభులిచౌబలాత్మ,కాంతల నువగూహనక్రియకుఁదార్చితి బెగ్గిలకుంద నాధ్వనిన్. భోజరా. 4.77.

**ఉత్తలపాటు** వి. (√ఉత్తలపడు) ఉత్తలపడుట. (క్షోభము, కలఁత.)

క. అత్తఱి సీతనయుండెలుఁగెత్తి రథికవరుల
తోడ నిట్లను నీదు వ్యర్థత్తునిఁ బోదువుఁడు
భీముని, యుత్తలపాటుడుపు కడఁక నుడు
వుఁడు గడిమిఁ. భార. భీష్మ. 2. 372.

క. క్రొత్తగవచ్చినరంభయు, నత్తఱిఁ గంత
యును గని కరాంగుళి నాసఁ, హత్తించి త
లఁ గదల్చుచు, నుత్తలపాటేర్పడంగ నుస్సు
రు మనియెన్. కళా. 3. 178.

సీ. తళుకొత్తె మదిఁ దిలోత్తమకు నుత్తలపాటు
ప్రమ్లోచ ప్రమ్లానభావ మొందె. నైష. 3. 36.

**ఉత్తలపెట్టు** స. క్రి. (√ ఉత్తలము) ఉత్తలపడఁ
జేయు.

(పరితపింపఁజేయు)

క. మత్తుఁ బ్రమత్తుని విషయా, యత్తుని దుష్ప్ర
లునిఁ జూచి యట్టిపగతుపై, నెత్తునది శిఖ
విషాదుల, నుత్తలపెట్టునది యతని యుర్వ
కడంకఁ. భార. శాం. 2. 381.

ఉ.... అ, త్యుత్తమతేజు భూరిగుణు నొప్పెడు
మెత్తనిమేనివాని నెట్లుత్తలపెట్టిరో పలువు
రుగ్రమనస్కులు గూడి యక్కటా. భార.
ద్రో. 2. 3.

**ఉత్తలము** వి. 1. కలఁక, కాలుష్యము.

ఉ....నీరధి యెంతయు ఘూర్ణమానమై, యుత్త
ల మొందె.... నిర్వ. 2. 98.

2 సంక్షోభము.

క. అప్పయుఁ బరిజనములుఁ దనుఁ, దప్పక
కనుఁగొనుచు నుండఁ దగ వేదికరం, బొప్పని
తమకము చిత్తముఁ, గప్పికొనుట నుత్తలం
బు గదురంగ నచ్చోఁ. భార. విరా. 2. 36.

3. పరితాపము.

క. చిత్తంబునఁ బైకొనియెడు, నుత్తల మడఁచు
చును ముఖపయోరుహమునఁ ద, శ్యాకృత్తెడు
వెడ నవ్వునఁ బ్రియు, చిత్తం బిగురొత్తఁ జని
యెఁ జెలువ యడవికిఁ. భార. అర. 7. 210.

శ్లో. సహాభర్త్రా హసంతీవ హృదయేన విదూయ
తా. సం. భార. వన. 297. 30.

గీ. అబ్జముఖులార యేఁ బోయి యచలకన్య,
యుత్తలము దెల్పి వసురాజుచిత్త మరసి,
వత్తు...వసు. 4. 26.

4. సంభ్రమము, తత్తర.

సీ ...సంభ్రమసంజ్ఞ యుత్తలంబు. అం. భా.
1. 140.

లయగ్రాహి....కొత్తిలెడి మాంసం, బుత్తలము
తో మెసఁగి నృత్తములు సేయుమదమత్త
ఘన డాకినులు.... భాగ. 6. 373.

5. భీతి, బెదరు.

సీ.... వెఱ యుత్తలము బీతు బెదరు....అన న
ధృతి యగు. అం. భా. 1. 183.

జ: ఉత్తలపడు, ఉత్తలపాటు, ఉత్తలపెట్టు.

**ఉత్తలితము** సం. విణ. (అ. ఆ. అ.) ఎగఁజిమ్మఁబ
డినది, ఉత్క్షిప్తము.

**ఉత్తాడించు** సం. స. క్రి. కొట్టు, తాడనముచేయు.

వ. సాధ్యులం జెఱిచి రుద్రులం బఱపి మరుత్తుల
నుత్తాడించి విశ్వుల వైచి విద్యాధరుల వెఱచి
గంధర్వులఁ గారించి...కాశీ. 7. 95.

**ఉత్తానకము** సం. వి. అ. పుం. ఉచ్చట, వట్రువము
స్తై (వృ. వి.).

**ఉత్తానపత్త్రకము** సం. వి. అ. పుం. ఎఱ్ఱ యాముద
పుఁజెట్టు.

**ఉత్తానపాదుఁడు** సం. వి. అ. పుం. ఒకానొక రాజు
(ధ్రువునితండ్రి).

**ఉత్తానము** సం. విణ. (అ. ఆ. అ.) 1. విస్తృతము.
2. వెలికిలఁ బరుండునది. 3. ఊర్ధ్వముఖము,
మీఁదిమొగమైనది (పాత్రాది). 4. లోఁతు లేని
ది, నిష్కపటము.

వ....స్వభావోత్తానహృదయమిమం జనం ...
శాకుం. 5. 20 శ్లో. క్రింద.

**ఉత్తానశయుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) వెలికిలఁ
బరుండువాఁడు (బోరగిల లేనిబిడ్డఁడు, మిక్కిలి
చిన్నబిడ్డ).

**ఉత్తానితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. విస్తృతము
చేయఁబడినది. 2. ఊర్ధ్వముఖముగాఁ జేయఁబ
డినది.

**ఉత్తాపము** సం. వి. అ. పుం. 1. ఉష్ణత్వము, మిక్కిలి
వేఁడిమి. 2. సంతాపము. 3. సంరంభము, వేగి
రపాటు.

శ్లో. ప్రత్యూహాన్సర్వాసిద్ధీనాముత్తాపః ప్రథమః కిల. హితో. 3. 45.

(ఉత్తప్తము మొదలగునవి తప్తము మొదలగు వానివలె గ్రహించునది).

**ఉత్తాపితము** నం. విణ. (అ. ఆ. అ.) 1. కాల్పఁబడినది (కట్టె, మొ). 2. సంతాపితము (మనస్సు, మొ).

**ఉత్తారకుఁడు** నం. విణ. (అ. రికా. అ.) దాఁటించువాఁడు, గట్టెక్కించువాఁడు; (ఆపదను) కడవఁ బెట్టువాఁడు, రక్షకుఁడు.

**ఉత్తారణము** నం. విణ. (అ. ఆ. అ.) 1. దాఁటించునది, అవ్వలిగట్టును జేర్చునది. 2. రక్షించునది, (ఆపదనుండి) కాపాడునది. (అ. ఈ. అ.) దాఁటుటకు సాధకమైనది. వి. అ. న. 1. దాఁటించుట, అవ్వలిగట్టును జేర్చుట; రక్షించుట.

**ఉత్తారము** నం. విణ. (అ. ఆ. అ.) 1. పయికెత్తిప్పఁబడినగ్రుడ్లు కలది (కన్ను) 2. మిక్కుటమైన ధ్వని గలది. వి. అ. పుం. 1. ఉల్లంఘనము, దాఁటుట. 2. పారంగయనము, అవ్వలిగట్టునకుఁ గొనిపోవుట; (కష్టమునుండి) గట్టెక్కించుట, (విపత్తునుండి) దాఁటించుట. 3. ఉద్వమనము, వాంతి.

**ఉత్తారి** నం. విణ. (న్. ఈ. న్.) 1. దాఁటించువాఁడు, 2. రక్షించువాఁడు, (ఆపదను) కడవఁ బెట్టువాఁడు. 3. చపలుఁడు.

**ఉత్తార్యము** నం. విణ. (అ. ఆ. అ.) 1. దాఁటఁదగినది. 2. అవ్వలిగట్టును జేర్పఁదగినది 3. రక్షింపఁ దగినది, కష్టము నుండి దాఁటింపఁ దగనది. 4. క్రక్కఁ దగినది (విషాది).

**ఉత్తాలము** నం. విణ. (అ. ఆ. అ.) 1. గొప్పది, బలీయమైనది. 2. బెట్టిదమైనది, భయంకరము, 3. మిక్కిలి ఉరువైనది, చాల విరివి గలది, 4. మేలైనది, శ్రేష్ఠము. 5. పొడువైనది. వి అ. పుం. కోఁతి.

**ఉత్తిష్ఠత్** నం. శత్ర. లేచుచున్న, నిలఁబడుచున్న.

**ఉత్తిష్ఠమానము** నం. విణ. (అ. ఆ. అ.) అభివృద్ధి నొందు చున్నది.

శ్లో. ఉత్తిష్ఠమానస్తుపరైర్నోపేక్ష్యః పథ్యమిచ్ఛతా. శిశు. 2. 10.

**ఉత్తీర్ణము** నం. విణ. (అ. ఆ. అ.) 1. దాఁటఁబడినది, కడవఁబడినది. 2. పారంగతము, దాఁటినది, గట్టును బొందినది; పరీక్షాదులందుఁ దేఱినది, పరీక్షాదులఁ గృతార్థమైనది. 3. (ఆపదను) కడచినది, (ఆపదను) దాఁటినది.

**ఉత్తుంగము** నం. విణ. (అ. ఆ. అ) ఎత్తయినది.

**ఉత్తుండి** నం. వి. ఈ. స్త్రీ. గురుజ, ఒకదినుసుకూరాకుచెట్టు.

**ఉత్తుఁడు** విణ. (నం. యుక్తః. పా. యుత్తో. ప్రా. జుత్తో.) అర్హుఁడు, తగినవాఁడు. పాత్రుఁడు.

ఉ. చిత్తజు రాజ్యసంపద యశేషము గైకొని సౌఖ్య మందఁగాఁ మత్తులు దాం నాఁ బుర పరోపవనంబులు సొచ్చి యిచ్చఁ బూ, గుత్తులఁద్రావి తేనియలు కుత్తుకబంటిగఁ గ్రోలి లీలమై, నొత్తిలి మ్రోయు చింపు నళులొత్తు చునుండు మదాలిదంపతుల్. విక్ర. 1. 94.

చ. ఎత్తిన లేచి కందర్పయ, మెత్తి లలాటమున మోపి యిందుముఖి య, త్యుత్తమధర్మపథమునకు, నుత్తునిఁ గావించి కార్యయుక్తిఁ దెలుపవే. భోజరా. 4. 834.

**ఉత్తుషము** నం. వి. అ. పుం. – వేఁచుటచేత పొట్టు పోయినది - లాజలు, పేలాలు.

**ఉత్తేజకము** నం. విణ. (అ. ఙకా. అ.) 1. ప్రేరించునది, ఉద్దీపకము. 2. వాఁడి సేయునది.

**ఉత్తేజన** నం. వి. ఆ. స్త్రీ. – ఉత్తేజనము.

**ఉత్తేజనము** నం. వి. అ. న. 1. ప్రేరణము, ఉద్దీపనము. 2. సానఁబట్టుట, వాఁడిసేయుట. 3. మెఱుఁగుపెట్టుట.

**ఉత్తేజితము** నం. విణ (అ. ఆ. అ.) 1. ప్రేరితము, ఉద్దీపితము. 2 సానఁబట్టఁబడినది, వాఁడిసేయఁబడినది. 3. మెఱుఁగుపెట్టఁబడినది. వి. అ. న. 1. ఉత్తేజనము. 2. మధ్యవేగము గలఅశ్వగతి.

**ఉత్తేరితము** నం. వి. అ. న. అశ్వధారలలో నొకటి, ఆస్కందితము. పుం. అట్టిగతితోఁ గూడిన గుఱ్ఱము.

శ్లో. ఉత్తేరితముపకంఠమాస్కందితక మిత్యపి. ఉత్ప్లుత్యోత్ప్లుత్య గమనం కోపాదేవాశ్వశైః పదైః (చూ. ఆస్కందితము. అమరసుధ)

**ఉత్తోలనము** సం. వి. అ. న. 1. పైకెత్తుట. 2 తూఁచుట.

**ఉత్తోలితము** సం. విశ. (అ. ఆ. అ.) 1. పైకెత్తఁబడినది. 2. తూనిక వేయఁబడినది.

**ఉత్త్యక్తము** సం. విశ. (అ. ఆ. అ.) 1. ఎగఁజిమ్మఁబడినది. 2. త్యక్తము, విడువఁబడినది. 3. వైరాగ్యము కలది.

**ఉత్త్యాగము** సం. వి. అ. పుం. 1. విడుపు, విడుచుట. 2. ఎగఁజిమ్ముట, పైకిపోయుట. 3. వైరాగ్యము.

**ఉత్త్రాసము** సం. విశ. (అ. ఆ. అ.) 1. మిక్కిలి భయము గలది. 2. భయము నతిక్రమించినది, భయము లేనిది. వి. అ. పుం. మిక్కిలిభయము.

**ఉత్త్రిపదము** సం. వి. అ. న. ఎత్తయినముక్కాలిపీఁట.

**ఉత్థము** సం. విశ. (అ. ఆ. అ.) 1. ఉద్భూతము, పుట్టినది. 2. ఉద్గతము, వెలువడినది.

సీ. ఛిద్రోత్థవంశవలక్వణ్రాజ మనఁ జుట్టుతో విప్పుతో దరిఁ దొండమాడ. ఆము. 4.158.

3. ప్రబుద్ధము, మేల్కొన్నది.

సీ. ...సుప్తోత్థశార్దూలముల్. మనుచ. 3. 11.

**ఉత్థాత** సం. విశ. (ఋ. స్త్రీ. ఋ.)–ఉత్థాయి.

**ఉత్థానము** సం. వి. అ. న. 1. లేచుట, పైకి లేచుట. 2. నిలుచుట, నిలఁబడుట. 3. ఊర్ధ్వపతనము, పైకెగయుట. 4. ప్రబోధము, నిద్రనుండి లేచుట, మేలుకొనుట. 5. పురుషప్రమాణము, నిలువు. 6. ఉద్భవము, పుట్టుక; చంద్రాదుల ఉదయము.

శ్లో. ఇందుం నవోత్థానమివేందుమత్యై. సం. రఘు. 6. 31.

7. ఉద్యమము, పూనిక; పౌరుషము, పురుషప్రయత్నము. 8. సంతోషము. 9. తంత్రము, స్వరాజ్యచింత. 10. ప్రాంగణము, ముంగిలి. 11. చైత్యము, (వదుగురుచేరెడి యజ్ఞశాల దేవాలయము, మొ.) 12. సైన్యము. 13. యుద్ధము. 14. మలస్రావరోగము. 15. సమాప్తి. 16. హర్షము. 17. ఇల్లు. 18. ఇచ్చ.

**ఉత్థానైకాదశి** సం. వి. ఈ. స్త్రీ. విష్ణువు నిద్రనుండి లేచెడియేకాదశి, కార్తికశుక్లపక్షమందలి యేకాదశి.

**ఉత్థాపకము** సం. విశ. (అ. పికా. అ.) 1. లేవఁదీయునది. 2. మేలుకొలుపునది. 3. ప్రేరించునది, ఉద్దీపము. 4. నిలఁబెట్టునది.

**ఉత్థాపనీయము** సం –ఉత్థాప్యము.

**ఉత్థాపయత్** సం. శత్రు. 1. లేవఁదీయుచున్న. 2. నిలఁబెట్టుచున్న. 3. ఉదయింపఁజేయుచున్న; బయలుదేఱఁదీయుచున్న.

**ఉత్థాపి** సం. విశ. (న్. నీ. న్.) – ఉత్థాపకము.

**ఉత్థాపించు** సం. స. క్రి. నిక్కించు, నిగుడఁజేయు,

క. మెండుగ నుత్థాపించిన,దండము గమనమున కెగ్గు దలఁపఁగ వినుల్,బెండువడ నొంద్రపెట్టుచు, దుండగపుఖరంబు దన కెదుర్పులు తేరన్. వేం. పంచ. 3. 54.

**ఉత్థాపితము** సం. విశ. (అ. ఆ. అ.) 1. లేపఁబడినది. 2. పురికొల్పఁబడినది. 3. పుట్టింపఁబడినది.

**ఉత్థాపితవ్యము** సం.– ఉత్థాప్యము.

**ఉత్థాప్యమానము** సం. విశ. (అ. ఆ. అ.) 1. లేవఁదీయఁబడుచున్నది. 2. నిలఁబెట్టఁబడుచున్నది. 3. లేపఁబడుచున్నది. 4. వృద్ధినొందింపఁబడుచున్నది.

**ఉత్థాప్యము** సం. విశ. (అ. ఆ. అ.) 1. లేపఁ దగినది. 2. పైకెత్తఁదగినది. 3. పురికొల్పఁదగినది. 4. లేవఁగొట్టఁ దగినది.

**ఉత్థాయకము** సం. విశ. (అ. యికా. అ.)–ఉత్థాయి.

**ఉత్థాయి** సం. విశ. (న్. నీ. న్.) 1. లేచునది. 2. వెలువడునది. 3. పొడచూపునది, ఉదయించునది.

**ఉత్థితము** సం. విశ. (అ. ఆ. అ.) 1. లేచినది. 2. నిలఁబడినది, నిలిచియున్నది. 3. పైకెగసినది, మీఁదికిఁ బోయినది. 4. పెరిఁగినది,వృద్ధి నొందినది. 5. పుట్టినది; ఉదయించినది (చంద్రాది). 6. పూనినది, ఉద్యుక్తము. 7. ఎత్తయినది.

**ఉత్థితాంగుళి** సం. వి. ఇ. పుం ప్రేళ్లు చాఁచినఅఱచేయి, చపేటము.

**ఉత్థితి** సం. వి. ఇ. స్త్రీ – ఉత్థానము.

**ఉత్పచిష్ణువు** సం. విశ. (ఉ.) 1. పచనము సేయునది, వండునది. 2. పైనుండి వండెడిస్వభావము గలది (తృణాది).

**ఉత్పతనము** నం. వి. అ. న. 1. ఎగురుట; పైకి దుముకుట. 2. (గర్భాదులనుండి) వెలువడుట, పుట్టుక. 3. మీఁదికిఁ బోవుట, (చెట్టు మొదలగునవి) ఎక్కుట.

(ఉత్పతత్ మొదలగునవి పతత్ మొదలగువాని వలె గ్రహించునది.)

**ఉత్పతము** నం. వి. అ. పుం. - పైకెగురునది — పిట్ట, పక్షి (త్రి. ని.).

**ఉత్పతిత** నం. విశే. (ఋ. త్రీ. ఋ.) ఎగిరెడువాఁడు.

**ఉత్పతితము** నం. విశే. (అ. ఆ. అ.) పైకిఁబోయినది, ఊర్ధ్వగతము.

**ఉత్పతిష్ణువు** నం. విశే. (ఉ.) మీఁదికిఁ బోవు స్వభావము గలది, ఊర్ధ్వగమనశీలము.

**ఉత్పత్తి** నం. వి. ఇ. స్త్రీ. 1. పుట్టుక, జననము. 2. ఊర్ధ్వగమనము, పైకిఁ బోవుట. 3. ఉత్పత్తిస్థానము (ఉదా : 'ఉత్పత్తిః కలానాం' కాదం. 10 పా. 2 పం.)

**ఉత్పథము** నం. విశే. (అ. ఆ. అ.) 1. మార్గమునతిక్రమించినది. 2. న్యాయమును మీఱినది. వి. అ. పుం. 1. కానిత్రోవ, తప్పుదారి. 2. న్యాయరీతి నతిక్రమించినది — తప్పు.

**ఉత్పన్నభక్షి** నం. విశే. (న్. నీ. న్.) ఎప్పుడు దొరికినది అప్పుడు తినువాఁడు; నిలువఁ జేయుట కేమియు లేనివాఁడు; కష్టజీవనుఁడు.

**ఉత్పన్నము** నం. విశే. (అ. ఆ. అ.) 1. ఉద్భూతము, పుట్టినది 2. సిద్ధించినది, ఒనగూడినది.

**ఉత్పల** నం. వి. ఆ. స్త్రీ. ఉత్పలశారిబ, నల్లసుగంధిపాల (వృ. వి.).

**ఉత్పలగంధికము** నం. వి. అ. న. గోశీర్ష మనెడి చందనము, హరిచందనము, పచ్చనిగంధము.

**ఉత్పలపత్రకము** నం. వి. అ. న. (వైద్య) కలువరేకువలె నుండునొక శస్త్రము.

**ఉత్పలపత్రము** నం. వి. అ. న. 1. కలువరేకు. 2 ఐ. పిఱుఁదులమీఁది నఖక్షతములు.

సీ. పురుషుఁ డుత్పలపత్రములు పిఱుందను నుంప నవని లాంగలరేఖ నమరె వనియు. కవిరా. 4. 80.

వ. అతివిపులపులినజఘనారోహంబుల నుత్పలపత్రంబుల నెంపుచు. వసు. 2. 140.

3. ఒకవిధమైన బొట్టు, తిలకభేదము.

**ఉత్పలమాల** నం. వి. ఆ. స్త్రీ. 1. కలువలదండ. 2. (ఛంద) ఒకానొక వృత్తము.

**ఉత్పలము** నం. విశే. (అ. ఆ. అ.) కండలేనిది, కృశించినది. వి. అ. న. 1. కలువ 2. చెంగల్వకోష్టు (వ్య. వి.).

3. పద్మము, కమలము (అమరసుధ).

శ్లో. ఇదమాస్థ్యాస్మితజ్యోత్స్నం స్నిగ్ధనేత్రోత్పలం ముఖం, ఇతి జ్యోత్స్నోత్పలాయోగాదయుక్తం నామరూపకమ్ [illegible] వ్యాద. [illegible].7).

(ఈ యర్థమున ప్రచుర ప్రయోగము లేదు.)

**ఉత్పలశారిబ** నం. వి. ఆ. స్త్రీ. నల్లసుగంధిపాల (వృ. వి.).

**ఉత్పలాక్షి** నం. వి. ఈ. స్త్రీ. కలువకంటి; స్త్రీ.

**ఉత్పలి** నం. విశే. (న్. నీ. న్.) ఉత్పలములు మిక్కిలి కలది (సంస్కృ. మొ.).

**ఉత్పలిని** నం. వి. ఈ. స్త్రీ. 1. ఉత్పలముల సమూహము. 2. కలువతీఁగ.

**ఉత్పవనము** నం. వి. అ. న. 1. ద్రవద్రవ్యములకు దర్భలతోఁ జేయునొకానొక సంస్కారము. 2. శుద్ధిచేయుట.

**ఉత్పవిత** నం. విశే. (ఋ. త్రీ. ఋ.) 1. దర్భలతో పవిత్రము చేయువాఁడు. 2. శుద్ధి చేయువాఁడు.

**ఉత్పశ్యుఁడు** నం. విశే. (అ. ఆ. అ.) మీఁదుగా చూచువాఁడు.

**ఉత్పాటకము** నం. విశే. (అ. టికా. అ.) పెకల్చునది, పెల్లగించునది. వి. అ. పుం చెవితమ్మెయందలి రోగవిశేషము.

**ఉత్పాటనము** నం. వి. అ. న. 1 పెఱుకుట, పెకలించుట. 2. కుఱుపువలనఁ గలుగునొకానొక బాధ.

**ఉత్పాటనీయము** నం — ఉత్పాటితవ్యము.

**ఉత్పాటము** నం. వి. అ. పుం. 1. పెకల్చుట, నిర్మూలము సేయుట. 2. చెవితమ్మెయందుఁ గలిగెడియొకానొక రోగము.

**ఉత్పాటయత్** సం. *శ[త.* పెకలించుచున్న.

**ఉత్పాటయమానము** సం. *విశ.* (అ. ఆ. అ.) పెక లించుచున్నది.

**ఉత్పాటి** సం. *విశ.* (న్. నీ. న్.) పెకల్చునది.

**ఉత్పాటించు** సం. న. *[క్రి.* పెఱుకు, పెకల్చు.

వ. ...కపాలంబుల నాస్ఫోటించుచుఁ గపోలం బుల నుత్పాటించు నరంబుల వదలించుచు ....ఉ. రా. 2. 61.

**ఉత్పాటిక** సం. వి. అ. *స్త్రీ.* చెట్టుయొక్క పైపట్ట, బెరడు.

**ఉత్పాటిత** సం. *విశ.* (ఋ. [తీ. ఋ.) ఉత్పాటించు వాఁడు.

**ఉత్పాటితము** సం. *విశ.* (అ. ఆ. అ.) ఉత్పాటింపఁ బడినది.

**ఉత్పాటితవ్యము** సం. *విశ.* (అ. ఆ. అ.) పెకలిం పఁ దగినది.

**ఉత్పాట్యమానము** సం. *విశ.* (అ. ఆ. అ.) పెకలిం పఁ బడుచున్నది.

**ఉత్పాట్యము** సం — ఉత్పాటితవ్యము.

**ఉత్పాతకము** సం. *విశ.* (అ. తికా. అ.) 1. పైకెగ యునది, పయికిఁ బోవునది. 2 ఉపద్రవమును గలిగించునది.

**ఉత్పాతము** సం. వి. అ. పుం. 1. పైకిఁ బోవుట. 2. దుముకుట, ఎగురుట. 3. శుభాశుభసూచకమ గుమహాభూతవికారము. (ఇది దివ్యాదిభేదము లచే త్రివిధము: దివ్యము—సూర్యగ్రహణము చంద్రగ్రహణము,మొ. అంతరిక్షము — ఉల్కా పాతము,మొ. భౌమము — భూకంపాదికము). 4. ఉపద్రవము.

శ్లో. ఉపలి గం త్వపష్టం స్యాదజన్యం డింబవిప్ల వౌ,డమరోపప్లవౌ త్పాతా ఉపసర్గ ఉపద్ర వః. (వై. ని.).

**ఉత్పాదకము** సం. *విశ.* (అ. దికా. అ.) పుట్టించు నది, కలిగించునది. వి. అ. పుం. శరభము (ఇది ఎనిమిది కాళ్ళమృగము—దీనికి ఇతరమృగము లకు వలె నాలుగుకాళ్లును అదనముగా వీఁపు మీఁద నాలుగు కాళ్లును ఉండును).

**ఉత్పాదనము** సం. *విశ.* (అ. ఆ. అ.) పుట్టించునది, కలిగించునది. వి.అ.న. పుట్టించుట, కలిగించుట.

**ఉత్పాదనీయము** సం — ఉత్పాద్యము.

**ఉత్పాదము** సం. *విశ* (అ. ఆ. అ.) పైకెత్తినపాద ములు కలది. వి. అ. పుం. పుట్టుక; సంభవము, కలుగుట.

**ఉత్పాదయత్** సం. *శ[త.* పుట్టించుచున్న, కలిగించు చున్న.

**ఉత్పాదయమానము** సం. *విశ.* (అ. ఆ. అ.) పుట్టిం చుచున్నది, కలిగించుచున్నది.

**ఉత్పాదయితవ్యము** సం — ఉత్పాద్యము.

**ఉత్పాదశయము** సం. వి. అ. పుం — కాళ్లు పైకిఁబె ట్టుకొని పరుండునది-టిట్టిభపక్షి, తీతువుపిట్ట.

**ఉత్పాదశయము** సం. *విశ.* (అ. ఆ అ.) కాలు పయికెత్తుకొని పరుండువాఁడు. వి. అ. పుం. శిశువు.

**ఉత్పాది** సం. *విశ.* (న్. నీ. న్.) 1. పుట్టుకగలది, పుట్టినది. 2. పుట్టించునది; కలిగించునది.

**ఉత్పాదించు** సం. న. *[క్రి* — ఉత్పాదిల్లఁజేయు—1. పుట్టించు, కను.

క. భూదేవుఁడు శూద్రస్త్రీ,నాదఁ మునఁ బెండ్లి యాడి యానతియందు,త్పాదించినపుత్త్రుండు ని,పాదుండనఁబరఁగుచుండు సమ్మదశీలన్. విజ్ఞా. ఆచా. 195.

2. సృజించు.

వ. నలువ... సప్తమునుల నుత్పాదించి కౌమా రంబున షష్ఠసర్గంబు నిర్మించె. మార్క. 4. 25.

**ఉత్పాదిక** సం. వి. ఆ. *స్త్రీ.* 1. హిలమోచిక,చిలుక కూర (వృ.వి.) 2. పూతిక, కొమ్మనగొట్టెపిం డిచెట్టు. 3. దేహిక యనుకీటము.

**ఉత్పాదిత** సం. *విశ.* (ఋ. [తీ. ఋ.) — ఉత్పాద కము.

**ఉత్పాదితము** సం. *విశ.* (అ. ఆ. అ.) పుట్టింపఁబడి నది; కలిగింపఁబడినది.

**ఉత్పాదిల్లు** సం. అ. *[క్రి.* 1. పుట్టు.

క....విష్ణుదేవుని వంశంబున ను,త్పాదిల్లెఁ గృష్ణుఁ డపగతభేదుఁడు వసుదేవదేవకీదేవులకున్. భార. ఆది. 8. 74.

2. కలుగు.

క....యుష్మద్భేదమునఁజేసి యెగ్గు,త్పాదిల్లు ధరిత్రిఁ బ్రజకు భయజననంబై. భాం.సభా. 2. 185.

**ఉత్పాద్యమానము** నం. విశే. (అ. ఆ. అ.) పుట్టింపఁబడుచున్నది; కలిగింపఁబడుచున్నది.

**ఉత్పాద్యము** నం. విశే. (అ. ఆ. అ.) పుట్టింపఁ దగినది; కలిగింపఁ దగినది.

**ఉత్పాలి** నం. వి. ఈ. స్త్రీ. ఆరోగ్యము, స్వస్థత.

**ఉత్పావము** నం. వి. అ. పుం — ఉత్పవనము.

**ఉత్పింజర(ల)ము** నం. విశే. (అ. ఆ. అ.) మిక్కిలి వ్యాకులమైనది.

**ఉత్పిబుఁడు** నం. విశే. (అ. ఆ. అ.)-పాత్రాదులను -ఎత్తి త్రాగువాఁడు.

**ఉత్పీడన** నం. వి. ఆ. స్త్రీ — ఉత్పీడము.

**ఉత్పీడనము** నం. వి. అ న — ఉత్పీడము.

**ఉత్పీడము** నం. వి. అ. పుం. 1. ఉన్మథనము, కలఁచుట. 2. రాయిడి, రారాపు. 3. పిడుచుట. 4. అతిశయము.

శ్లో. పూరోత్పీడే తటాకస్య పరీవాహః ప్రతిక్రియా. ఉ. చ. 3. 29.

**ఉత్పుచ్ఛము** నం. విశే. (అ. ఆ. ఈ. అ.) తోఁక పై కెత్తుకొన్నది.

**ఉత్పుటకము** నం. వి. అ. పుం. (వైద్య) చెవితమ్మె యందుఁ గలుగురోగవిశేషము.

**ఉత్పుటము** నం. విశే. (అ. ఆ. అ.) వికసించినది.

**ఉత్పులకము** నం. విశే. (అ. ఆ. అ.) 1. గగుర్పాటు గలది. 2. సంతోషించినది.

**ఉత్ప్రబంధము** నం. విశే. (అ. ఆ. అ.) ఎడతెగనిది. వి. అ. పుం. ఉద్గ్రంథము, గొప్పగ్రంథము.

**ఉత్ప్రభము** నం. విశే. (అ. ఆ. అ.) పయికి వచ్చిన కాంతులు గలది; మిక్కిలి కాంతిగలది.

**ఉత్ప్రసవము** నం. వి. అ. పుం. గర్భస్రావము.

**ఉత్ప్రాసనము** నం. వి. అ. న — ఉత్ప్రాసము.

**ఉత్ప్రాసము** నం. వి. అ. పుం. ఉపహాసము, ఎత్తిపొడుపుమాట.

**ఉత్ప్రేక్ష** నం. వి. ఆ. స్త్రీ. 1. ఊహించుట; ఊహ. 2. (అలం) ఒకఅర్థాలంకారము 3. అనవధానత, పెచ్చరికలేమి.

**ఉత్ప్రేక్షణము** నం. వి. అ. న. 1. పైకి చూచుట. 2. ఊహించుట, ఇది యీపదార్థముగా నుండ వచ్చునని తలంచుట; ఉత్ప్రేక్షించి చెప్పుట.

**ఉత్ప్రేక్షించు** నం. స. క్రి. 1. ఊహించు.

శా...ఆ, భీమ బిమ్మను వద్దురాత్మునెల పుత్ప్రేక్షింప నేర్తుంగులన్. హరి. పూ. 7. 7.

2. ఉత్ప్రేక్ష గలుగునట్లు చెప్పు;ఉత్ప్రేక్షాలంకారయుక్తముగా వర్ణించు.

(ఉత్ప్రేక్ష్యము మొదలగునవి అపేక్ష్యము మొదలగువానివలె గ్రహించునది.)

**ఉత్ప్లవ** నం. వి. ఆ. స్త్రీ. పడవ.

**ఉత్ప్లవనము** నం వి. అ న. 1. దాఁటుట. 2. పైకి దూఁకుట. 3. పైని తేలుట.

**ఉత్ప్లవము** నం. వి. అ. పుం. దాఁటు, గంతు.

**ఉత్ఫుల్లము** నం. విశే. (అ. ఆ. అ.) 1 వికసించినది (పువ్వు). 2 విడినది; తెఱచియున్నది (కన్ను). 3. ఉబ్బినది, బలిసినది. 4. ఉత్తానము, వెలికిలఁబడియుండునది వి. అ. న. 1. ఆఁడుగుఱి. 2. సురతబంధవిశేషము.

**ఉత్సంగము** నం. వి. అ. పుం. 1. ఒడి. 2. తొడ. 3. తుంటి, నితంబము. 4. మధ్యభాగము. (కర్ణోత్సంగము, మొ.) 5 పై భాగము 6. శిఖరము 7. అధికమైనకూడిక. 8. పైనికలియుట. 9. అధీనయమానవిశేషము 10. ఆలింగనము.

**ఉత్సంగితము** నం. విశే. (అ. ఆ. అ.) 1. సంసర్గము కలదిగాఁ జేయఁబడినది. 2. ఒడియందు పెట్టుకొనఁబడినది.

**ఉత్సంగిని** నం. వి. ఈ. స్త్రీ కనుఱెప్పల లోపలి యందున లేచుమొటిమ.

**ఉత్సంగుఁడు** నం. వి. అ. పుం-సంగము వీడినవాఁడు - సన్న్యాసి.

**ఉత్సన్నము** నం. విశే. (అ. ఆ. అ.) 1. నష్టము, నశించినది. 2. క్షీణించినది. 3. వాడుకలో లేనిది, ప్రచారములో లేనిది (గ్రంథము, మొ.) 4. ఉద్గతమైనది, ఉబికినది.

**ఉత్సము** సం. వి. అ. పుం. ఊటగలచోటు; ఊట.

**ఉత్సరణీయము** సం. విణ (అ. ఆ. అ.) తొలఁగింపఁ దగినది.

(ఉత్సృతము మొదలగునవి సృతము మొదలగు వానివలె గ్రహించునది.)

**ఉత్సర్గము** సం. వి. అ. పుం. 1. విడుచుట. 2. విచ్చలవిడిగాఁ దిరుగ విడుచుట, జన్నియవిడుచుట (వృషోత్సర్గము, మొ.) 3. ఈవి. 4. (వేదాధ్యయనవ్రతాదుల) ముగియుట, సమాప్తి. 5. సామాన్య విధి. (వ్యతి అపవాదము-విశేషవిధి.) 6. గుదస్థానము, పాయువు.

**ఉత్సర్గి** సం. విణ. (న్. ఈ. న్.) 1. విడుచువాఁడు. 2. ఇచ్చువాఁడు.

**ఉత్సర్జనము** సం. వి. అ. న. 1. విడుచుట. 2. దానము. 3. అధ్యయనాదులు సమాప్తిచేయుట.

**ఉత్సర్జించు** సం. అ. క్రి. విసర్జించు, విడుచు.

సీ. మాట లాడుచు మలమూత్రము లుత్సర్జించు ...కాశీ. 6. 46.

(ఉత్సృజన్ మొదలగునవి సృజన్ మొదలగు వానివలె గ్రహించునది.)

**ఉత్సర్జితము** సం. విణ. (అ. ఆ. అ.) విడిపింపఁబడినది.

**ఉత్సర్పణము** సం. వి. అ. న – ఉత్సర్పము.

**ఉత్సర్పము** సం. వి. అ. పుం. 1. పైకిఁ బోవుట, ఎగఁబ్రాఁకుట. 2. ఉల్లంఘనము, దాఁటుట. 3. పయి కుబుకుట.

**ఉత్సర్పి** సం. విణ. (న్. ఈ. న్.) 1. పైకెగురునది, మీఁదికిఁ బ్రాఁకునది. 2. గొప్పవిషయములగురించి పోవునది, ఉదాత్తము.

వ. ఉత్సర్పిణీ ఖలు మహతాం ప్రార్థనా. సం. శాకుం. 7.

**ఉత్సర్పిణి** సం. వి. ఈ. స్త్రీ. పొర్లుటకుఁ దగినస్థితిలోనున్నయావు. ఎదపదను గలయావు.

**ఉత్సవము** సం. వి. అ. పుం 1. ఆనందమును పుట్టించుకార్యము (పండుగు వివాహము, మొ.) 2. సంతోషము. 3. కోపము. 4. గర్వము. 5. కోరికలు పుట్టుట.

**ఉత్సవసంకేతులు** సం. వి. అ. పుం. బ. వివాహము సంబంధములు లేక విచ్చలవిడిగా స్త్రీలును బురుషులును వర్తించునొక పర్వతీయజాతిభేదము.

**ఉత్సహించు** సం. అ. క్రి. 1. యత్నించు, కడఁగు.

గీ. అనఘులార సంసిద్ధుల రైతి రింకఁ, దడయ నేటికి నిర్మలోదాత్తగతికి, నుత్సహింతురుగా కన్న మత్సరాది, బంధకంబులఁ బోఁద్రోచి బ్రాహ్మణుండు. భార. శాం. 4. 168.

2. ఉత్సాహపడు, ఉబ్బు.

ఉ. వాయువుచేఁ బ్రభూత మగువానవలెన్ నిజ శార్ఙ్గముక్త మౌ, సాయకజాత మద్దనుజసైన్యమునుంచిన నుత్సహించి నా, రాయణుఁడొత్తెనప్పుడు యుగాంతపయోధరఘర్షణోదిత, స్ఫాయదభంగురాశనినిభధ్వనిధుర్యము శంఖవర్యముఁ. ఉ. రా. 2. 58.

న. క్రి. పూను.

సీ. పయాయుధంబున నెమ్మెయిఁ బోరంగనిష్ట మయ్యెది యుత్సహింపుఁ డనిన. భార. సభా 1. 197. (ఈయర్థమునఁ బ్రయోగాంతరము గనఁబడలేదు.)

**ఉత్సాదకము** సం. విణ. (అ. దికా. అ.) నాశము సేయునది.

**ఉత్సాదన** సం. వి. ఆ. స్త్రీ. – ఉత్సాదనము.

**ఉత్సాదనము** సం. వి. అ. న. 1. తొలఁగించుట. 2. జిడ్డు పోవునట్లు తోముట; నలుఁగు పెట్టుట. 3. నశింపఁజేయుట, పోఁగొట్టుట. 4. పైకెత్తుట. 5. పెల్లగించుట. 6. దున్నుట. 7. ఔషధమురాచి వ్రణమును శుద్ధిచేయుట.

**ఉత్సాదనీయము** సం. విణ. (అ. ఆ. అ.) ఉత్సాదనముచేయఁ దగినది. వి. అ. న. పుండు మాన్పు మందు.

**ఉత్సాదము** సం. వి. అ. పుం. నాశము.

**ఉత్సాదించు** సం. స. క్రి. 1. పైకెత్తు. 2. పెల్లగించు. 3 నశింపఁజేయు.

వ. దైవానుకూల్యంబు లేక మానుషం బెంతయయ్యు నేమి సేయుఁ బాండవు లేమిదైవసంపన్నులై రో యని వగచి యీయవసరంబున ద్రుపదు భేదించి పాండవుల నుత్సాదింపవలయు నెట్లనిన. భార. ఆది. 8. 12.

**ఉత్సాదితము** సం. విశే. (అ. ఆ. అ.) 1. పెల్లగింపఁబడినది. 2. నశింపఁజేయఁబడినది. 3. నలుఁగుపెట్టఁబడినది (శరీరాది.) 4. పైకెత్తఁబడినది.

**ఉత్సారకుఁడు** సం. విశే. (అ. రికా. అ.) తొలఁగించువాఁడు. వి. అ. పుం. 1. ద్వారపాలకుఁడు. 2. కావలివాఁడు. 3. మార్గమందుండు జనులను తొలఁగించి దారిచేయుభటుఁడు.

**ఉత్సారణ** సం. వి. ఆ. స్త్రీ. — ఉత్సారణము.

**ఉత్సారణము** సం. వి. అ. న. 1. తొలఁగించుట, 2. కదలించుట. 3. జనులను తప్పించి దారిచేయుట.

**ఉత్సారణీయము** సం. విశే. (అ. ఆ. అ.) తొలఁగింపఁ దగినది.

**ఉత్సారించు** సం. స. క్రి. 1. తొలఁగించు. 2. కదలించు.

**ఉత్సారితము** సం. విశే. (అ. ఆ. అ.) 1. తొలఁగింపఁబడినది. 2. కదల్పఁబడినది.

**ఉత్సార్యము** సం. — ఉత్సారణీయము.

**ఉత్సాహకము** సం. విశే. (అ. హికా. అ.) ఉత్సహించునది.

**ఉత్సాహన** సం. వి. ఆ. స్త్రీ. — ఉత్సాహనము.

**ఉత్సాహనము** సం. వి. అ. న. ఉత్సాహము కలిగించుట.

**ఉత్సాహము** సం. వి. అ. పుం. 1. ప్రయత్నము, పూనిక. 2. ఆస్థ, అభిలాష. (మమోత్సాహభంగం మాకృథాః. హితో. 3.) 3. (రాజునకు వలయు) ప్రభుమంత్రోత్సాహశక్తులలో నొకటి. 4. (అలం) స్థాయిభావములలో నొకటి. (ఇది వీరరసమునకు స్థాయి) 5. శుభము. 6. సూత్రము, దారము. 7. (ఛంద) ఒకానొక వృత్తము.

**ఉత్సాహవర్ధనము** సం. వి. అ. పుం. వీరరసము.

**ఉత్సాహి** సం. విశే. (న్. నీ. న్.) ఉత్సాహము గలది.

**ఉత్సాహించు** సం. అ. క్రి. 1. విజృంభించు.
శా.... ఝుంఝూమరుద్వైశ్వత్రింశబొల్చుచుకా
కులీలఁ గుశుఁ డుత్సాహించె సోదర్యుతోన్.
వై. భా. 6. 148.

2. ఉత్సాహపడు, కుతూహలపడు.
శా. ఓరత్నాకర నీకుమారిక వకుంఠోదారికిన్
శౌరికిన్, సారోదారికి దారగా నొసఁగ
నుత్సాహించునీవాంఛ యీ, దేఱున్...ల.
వి. 5. 15.

3. యత్నించు, కడఁగు.
సీ. వెడవింటిదొర దాడి వెడల నుత్సాహించు
చిలుకపైకములు విందులకుఁ దిరుగు. గీ....
చెలిపలుక...చంద్రా. 4. 141.

**ఉత్సిక్తము** సం. విశే. (అ. ఆ. అ.) 1. (జలాదులచే) ప్రోక్షింపఁబడినది, చల్లఁబడినది. 2. అతిశయించినది. 3. గర్వించినది. 4. పొంగినది (నది, మొ.) 5. (క్రోధాదులచే) ఉద్రేకము నొందినది.

**ఉత్సుకము** సం. వి. అ. పుం.—తహతహ, తమకము.
శ్లో. ప్రకుర్వతే కస్య మనో న సోత్సుకం. ఋతుసంహారము. 1. 6.

**ఉత్సుకుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) 1. ఇష్టవస్తుప్రాప్తికై త్వరపడువాఁడు, తహతహపడువాఁడు, ఉవ్విళ్లూరువాఁడు. 2. ఇష్టార్థమునకై యత్నించువాఁడు.

**ఉత్సూత్రము** సం. విశే. (అ. ఆ. అ.) 1. సూత్రము (దారము)నుండి వీడినది, పెరిగిపోయినదారము గలది.
శ్లో. ...హారాణాం మణిభిరుపాశ్రితా సమన్తాదుత్సూత్రైః. శిశు. 8. 53.
2. సూత్రమును (శాస్త్రనిబంధన వాక్యమును) మీఱినది.
శ్లో. అనుత్సూత్రపదన్యాసా. శిశు. 2. 112.

**ఉత్సూరము** సం. వి. అ. పుం. సాయంకాలము, దినావసానము.

**ఉత్సృజించు** సం. స. క్రి. విడుచు, విసర్జించు.
ఉ. తుమ్మను నింద్రియంబు నిజతోయమలంబు
లు నొందె నొందె మూత్రమ్ము మలమ్ముఁ
దుమ్ము బలదార్ఢ్యము పొలక యెవ్వఁడేని
నొక్కమ్మడి నుత్సృజించు నతఁడుండఁడు
ప్రాణముతోడఁ గూడి యేకమ్మగువత్సర
మ్ము గడిగాంచినపిమ్మట వాసరార్ధమున్.

కాశీ. 5. 258. (శాలవ్యాకరణానుసార ముగ 'ఉత్సర్జించు' అనియుండనగు.

**ఉత్సృష్టము** సం. విణ. (అ. ఆ. అ.) 1. విడువఁబడినది. 2. ఈయఁబడినది.)

**ఉత్సృష్టి** సం. వి. ఇ. స్త్రీ. 1. విడుచుట. 2. ఇచ్చుట.

**ఉత్సేకము** సం. వి. అ. పుం. 1. ప్రోక్షణము, చల్లుట. 2. ఉద్రేకము, అతిశయము, హెచ్చుట. 3. గర్వము. కావరము. 4. (నది, మొ) పొంగుట; ఉప్పొంగుట.

**ఉత్సేకి** సం. విణ. (న్. నీ. న్.) 1. అతిశయించినది. 2. పొంగినది; ఉప్పొంగినది. (నది, మొ.) 3. గర్వము గలది.

**ఉత్సేకించు** సం. స. క్రి. 1. అతిశయించు. 2. గర్వించు. 3. పొంగు; ఉప్పొంగు.

సీ. ...ఉత్సేకించి యుల్లాసించినాఁడో కలంగినాఁడో. గీ. యుత్సవమొ వైభవమొ లేమియో కలిమియొ, పగలొ రాత్రియొ యెఱుఁగఁ డాబ్రాహ్మణుఁడు. నవమధూక ప్రసూనసంభవపు మధువు,దలము దప్పంగఁ ద్రావి మత్తా వహించి. శివరా. 3. 15.

స. క్రి. ప్రోక్షించు, చల్లు.

**ఉత్సేచనము** సం. వి. అ. న. పైకి చల్లుట.

**ఉత్సేధము** సం. విణ. (అ. ఆ. అ.) పొడువైనది. వి. అ. పుం. 1. పొడవు. 2. బలువు. 3. దేహము. 4. గొప్పతనము.

**ఉత్స్మయము** సం. విణ. (అ. ఆ. అ.) వికసించినది (పుష్పాది). వి. అ. పుం. చిఱునవ్వు.

**ఉత్స్మితము** సం. వి. అ. న. చిఱునవ్వు.

**ఉత్స్వనము** సం. విణ. (అ. ఆ. అ.) పెద్దధ్వనిగలది. వి. అ. పుం. పెద్దధ్వని

**ఉత్స్వప్నుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) స్వప్నమున కలవరించువాఁడు.

**ఉద్** సం. అవ్య. ఇది సమాసపూర్వపదముగా నుండి తఱచుగా నీక్రిందియర్థములఁ దెలుపును.

1. ఊర్ధ్వము.

ఉదా: ఉద్గమనము—ఊర్ధ్వగమనము.

2. ఉద్ధృతము, ఎత్తఁబడినది.

ఉదా: ఉద్బాహువు—ఎత్తఁబడినబాహువులుగలవాఁడు.

3. ఉత్కృష్టము, అధికము.

ఉదా: ఉద్బలుఁడు— అధికబలము గలవాఁడు.

4. ఉన్నతము, ఎత్తైనది.

ఉదా: ఉత్తోరణము — ఎత్తయినబహిర్ద్వారము గలది.

5. ఉత్క్రాంతము, మీఱినది.

ఉదా: ఉత్కులుఁడు—కులమర్యాదలు దాఁటినవాఁడు.

6. ఉద్గతము. (క) పోయినది.

ఉదా: ఉన్నిద్రుఁడు—నిద్రలేనివాఁడు.

(చ) పైకివచ్చినది.

ఉదా: ఉత్పటము — చెట్టుపట్టనుండి వెలుపలికి వచ్చినది. (జిగురు, మొ.)

**ఉదంకము** సం. వి. అ. పుం. (నూనె నెయ్యి మొదలగునవి పోసెడి) తోలుతిత్తి, సిద్దె.

**ఉదంచనము** సం. విణ. (అ. ఈ. అ.) ఎగఁజిమ్ముటకు సాధనమయినది, పైకిఁ ద్రోయుటకు సాధనమైనది. వి. అ. న. 1. మూయుట కుపయోగించు పాత్రము, మూఁకుడు. 2. నూతినుండి నీళ్లు చేదుపాత్ర; చేద. 3. ఎగఁజిమ్ముట, పైకివైచుట.

**ఉదంచితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. పూజింపఁబడినది. 2. విజృంభించినది. 3. పైకి విసరఁబడినది.

**ఉదంతపాలము** సం. వి. అ. పుం. 1. ఒకజాతిచేఁప 2. సర్పభేదము.

**ఉదంతకము** సం. — ఉదంతము.

**ఉదంతము** సం. వి. అ. పుం. వృత్తాంతము, వార్త.

**ఉదంతిక** సం. వి. ఆ. స్త్రీ. తృప్తి.

**ఉదంతుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) 1. వడ్డివర్తకముచేయువాఁడు, వార్ధుషికుఁడు. 2. మంచివాఁడు, సజ్జనుఁడు.

**ఉదకక్రియ** సం. వి. ఆ. స్త్రీ. పితృదేవతాదులకుఁ జేయుజలాదితర్పణము. (ఇట్లే ఉదకకర్మము, ఉదకకార్యము, మొ.),

**ఉదకదానము** సం. వి. అ. న — ఉదకక్రియ.

**ఉదకదుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) 1. నీరిచ్చు వాఁడు. 2. పితృదేవతలకు జలతర్పణము చేయువాఁడు, సన్నిహితజ్ఞాతి.

**ఉదకపరీక్ష** సం. వి. ఆ. స్త్రీ. వివాహాదులందు లౌకిక ప్రమాణములు దొరకనిచోఁ జేయఁదగు దివ్య ప్రమాణభేదము.

**ఉదకమాడు** సం. అ. క్రి. (ఉదకము+ఆడు) స్నానముచేయు.

గీ. ఒక్కప్రొద్దుండి సెలయేట నుదకమాడి, నాథనాథుండు. ..కాశీ. 3. 37.

ఉదకములాడు – నీళ్లాడు, ప్రసవించు. (గ్రా.) ఉదకాలాడు (వ్యవ).

**ఉదకము** సం. వి. అ. న. జలము, నీరు.

**ఉదకమేహము** సం. వి. అ. పుం. నీరుడిరోగము, మూత్రమధికముగాఁ అగువ్యాధి.

**ఉదకమేహి** సం. విశ. (న్. నీ. న్.) ఉదకమేహరోగము గలవాఁడు.

**ఉదక(కి)లము** సం. విశ. (అ. ఆ. అ.) జలముగలది.

**ఉదకశాకము** సం. వి. అ. పుం. న. నీళ్లయందే మొలచుకూర (తూఁటికూర, మొ.)

**ఉదకీర్ణము** సం. వి. అ. పుం. కానుగు (వృ.వి.)

**ఉదకీర్యము** సం – ఉదకీర్ణము.

**ఉదకుంభము** సం. వి. అ. పుం. ఉదకకుంభము, నీటిపాత్ర.

**ఉదకేవిశీర్ణము** సం. విశ. (అ. ఆ. అ.) – నీటియందు ఎండఁబెట్టఁబడినది–ఇది నిష్ఫల మనునర్థము ను దెలుపును.

**ఉదక్కు** సం. విశ. (చ్. చీ. చ్.) 1. ఊర్ధ్వగతము, పయికిఁ బోవునది. 2. ఎత్తయినది. (చూ. ఉదగ్భూమము.) 3. (దేశకాలములందు) అనంతరము, పిమ్మటిది, అవ్వలిది. 4. ఉత్తరపుది; ఉత్తరపు వంకకుఁదిరిగినది. (ఉదా : ఉదఙ్ముఖుఁడు).

**ఉదక్తము** సం. విశ. (అ. ఆ. అ.) – నూయి మొదలగువానినుండి – పైకెత్తఁబడినది (జలాది). ఉదా: ఉదక్తముదకం కూపాత్ (కౌముది).

**ఉదక్ప్రవణము** సం. విశ. (అ. ఆ. అ.) 1. ఉత్తరపు వైపునకు ఏటవాలుగా నుండునది. 2. ఉత్తరమార్గగతికి హేతువయినది (యజ్ఞము, మొ.).

**ఉదక్య** సం. వి. ఆ. స్త్రీ. రజస్వల, ముట్టుత.

**ఉదక్యము** సం విశ. (అ. ఆ. అ.) 1. జలము నపేక్షించునది (వరి, మొ.) 2–జలస్నానముచేయవలసినది–అశుచియైనది.

**ఉదగద్రి** సం. వి. ఇ. పుం. – ఉత్తరదిక్కునందలి పర్వతము – హిమాలయము.

**ఉదగయనము** సం. వి. అ. న. ఉత్తరాయణము.

**ఉదగాహము** సం. వి. అ. పుం – నీటియందుఁ జొచ్చుట – ఉదకగాహము, స్నానము.

**ఉదగ్భూమము** సం. విశ. (అ. ఆ. అ – ఉదక్+భూమి) ఉన్నతమైనభూమి గలది (దేశము, మొ.).

**ఉదగ్రము** సం. విశ. (అ. ఆ. అ.) 1. ఉన్నతము, ఎత్తయినది. 2. దీర్ఘము, పొడువైనది. 3. గొప్పది, పెద్దది. 4. వృద్ధము, మిక్కిలి పెరిఁగినది. 5. భయంకరము. 6. ఉద్ధతము, గర్వించినది.

శ్లో. మదోదగ్రాఃకకుద్మన్తః.సం.రఘు. 4. 22.

**ఉదజము** సం. వి. అ. పుం. (పశువులను) త్రోలుట.

**ఉదధి** సం. వి. ఇ. పుం. 1. సముద్రము. 2. (గణిత) నాలుగు.

సం. విశ. ఇ. పుం. నీరు పోసికొనుట కుపయోగించునది (కుండ, మొ.).

**ఉదధిమలము** సం. వి. అ. పుం. సముద్రపునురుఁగు.

**ఉదధిమేఖల** సం. వి. ఆ. స్త్రీ – సముద్రము మొలనూలుగాఁగలది – భూమి.

**ఉదన్య** సం. వి. ఆ. స్త్రీ. పిపాస, నీళ్లుత్రాగనిచ్ఛ.

**ఉదన్వంతము** సం. వి. త్. పుం. సముద్రము.

**ఉదపాత్రము** సం. వి. అ. న. ఉదపాత్రము, నీటిపాత్ర.

**ఉదపాత్రి** సం. వి. ఈ. స్త్రీ. ఉదకపాత్రి, నీటిపాత్ర.

**ఉదపానమండూకము** సం. వి. అ. పుం. నూతిలోని కప్ప (ఇది తనయిరుగుపొరుగులుతప్ప ఇతరము లేదమకొనువాఁడు అనునర్థమున నుపయుక్తము.).

**ఉదపానము** సం. వి. అ. పుం. న. నూయి.

**ఉదబిందువు** సం. వి. ఉ. పుం. ఉదకబిందువు, నీటిబొట్టు

**ఉదమానము** సం. వి. అ. పుం. న. అధకమానమం దు వేఁబదియపపాలు.

**ఉదమేఘము** సం. వి. అ. పుం. నీళ్లుగలమబ్బు.

**ఉదయనీయ** సం. వి. ఆ. స్త్రీ. యజ్ఞాంతమందుఁ జేసెడి యిష్టి.

**ఉదయనుఁడు** సం. వి. అ. పుం. 1. అగస్త్యుఁడు.2. వత్సరాజు. 3. ఉదయనాచార్యుఁడు.

**ఉదయపురము** సం. వి. అ. న. మార్వారిదేశపు రాజధాని.

**ఉదయభాస్కరము** సం. వి. అ. పుం. సుంగధి ద్రవ్య విశేషము.

ద్వి. కడు నొప్పునుదయభాస్కరమున మెదిచి, చక్కఁగా మేళవించినచందనంబు, మిక్కిలి తనువుగా మెయినిండ నలఁది. నవనాధ.1. 63 పా. 16 పం.

**ఉదయము** సం. వి. అ. పుం. 1. ఉదయించుట, (సూర్యాదులు) పైకివచ్చుట. 2. (జ్యోతి) రాశియొక్క ఉదయరూప మగులగ్నము. 3. ఉద్గమము, వెడలుట. 4. ఉద్భవము, పుట్టుక. 5. వృద్ధి. 6. సృష్టి. (వ్యతి: ప్రలయము.)7. తూర్పుకొండ, పొడుపుకొండ. 8. ఫలసిద్ధి.

శ్లో. అగమైస్సదృశారంభః ప్రారంభసదృశోదయః. సం. రఘు. 1. 15.

9. వడ్డి.

శ్లో.ఆజీవతా స్వేచ్ఛయా దండ్యో దాప్యస్తంచాపి నోదయమ్. యాజ్ఞ. 2. 67.

**ఉదయరాగపట్టులు** ఏ. వి. బ. ఒకరకమువస్త్రములు.

వ. వెలిపట్టులును హొంబట్టులును బులుగోరు పట్టులును నుదయరాగపట్టులును నేత్రపట్టులును వజ్రపట్టులును...ద్వా. 3. 206.

**ఉదయరాగము** సం. వి. అ. పుం. 1. ఉదయకాలమందలి యెఱుపు. 2. ఒకరకమువస్త్రము.

సీ....బొమ్మంచు ముయ్యంచుఁ బొప్పళిహొంబట్టు నుదయరాగము....గీ. మొదలుగా వల్వలు ధరించి ముదిత లపుడు. ప్రబంధ. 272.

**ఉదయాచలము** సం. వి.-అ. పుం. తూర్పుకొండ, పొడుపుకొండ.

**ఉదయి** సం. విశే. (న్. ఈ. న్.) 1. ఉదయించునది. 2. పైకివెడలునది. 3. వర్ధిల్లునది.

**ఉదయించు** సం. అ. క్రి. 1. పుట్టు, కలుగు.

వ....అరిషడ్వర్గం బేమిట నుదయించు నెట్లు నయము నెఱింగింపవే. భార. శాం. 3. 420. మార్క. పీఠి. 30.

2. (సూర్యచంద్రాదులు)ఉదయమగు,పొడుచు.

**ఉదరంభరి** సం — ఆత్మంభరి.

**ఉదరగ్రంథి** సం. వి. ఇ. పుం. గుల్మరోగము.

**ఉదరత్రాణము** సం. వి. అ న.. 1. కడుపుబొమ్మమొదలగుచోట ధరించెడియినుపకవచము. 2. మొలనూలు; నడికట్టు.

**ఉదరపిశాచుఁడు** సం. విశే. (అ. ఈ. అ.) సర్వాన్నభక్షుఁడు, తిండిపోతు.

**ఉదరపోషణము** సం. వి. అ. న. పొట్టపోసికొనుట, జీవనము చేయుట.

**ఉదరము** సం. వి. అ. న. 1. కడుపు. 2. మధ్యభాగము. 3. జలోదరాదిరోగము. 4. యుద్ధము. 5. నడుము, శరీరమధ్యభాగము.

శ్లో.ఉదరం పరిమాతి ముష్టినా కుతుకీ కోపిదమస్వసుః కిము. సం. నైష. 2. 35.

**ఉదరశయము** సం. విశే. (అ. ఆ. అ) బోరగిలి పరుండునది. వి. అ. పుం. గర్భమందలిశిశువు.

**ఉదరసర్వస్వుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) తిండిపోతు.

**ఉదరావర్తము** సం. వి. అ. పుం. బొడ్డు, నాభి.

**ఉదరావేష్టము** సం. వి. అ. పుం. 1. నడికట్టు. 2. ఏటికపాము.

**ఉదరి** సం.విశే.(న్.ఈ.న్.) పెద్దకడుపు గలవాఁడు.

**ఉదరికుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) పెద్దబొజ్జ గలవాఁడు.

**ఉదరిణి** సం. వి. ఈ. స్త్రీ. గర్భిణి, చూలాలు.

**ఉదరిపడు** — ఉదరు. అ. క్రి. (ఉదరి+పడు)-హఠాత్సంభవము లైన భయక్రోధాదులచే-త్రుళ్లిపడు, చలించు, అదరిపడు, ఉలికిపడు.

వ. అమ్మహాధ్వని విని యుదరిపడి ధృతరాష్ట్రుం డిదియేమి రభసం బని విదురు నడిగిన ... భార. ఆది. 6. 21.

క. ఇది పూర్వపుఁగథ యంచును,మది నరయఁగ నీనిభ క్తిమహిమావేశం, బుదిఁ ముగ నప్పు డట బిట్టొదవిన యర్థంబురీతి నుదరిపడి వెసఁన్. పరమ. 3. 108

**ఉదరిపాటు** వి. (√ఉదరిపడు) 1. అదరిపాటు, ఆక స్మికత్వము.

ద్వి. ఉదరిపాటునఁ దదంకోపరినుండి. విష్ణుమా యావిలాసము. పూ. 1. (శ. ర.).

2. ఉలికిపాటు.

గీ. అతనియాకారమును జూచి యదరి బెదరి, చెదరి పదములు తడఁబడ నుదరిపాటు,గదు ర...ఉ. రా. 3. 347.

**ఉదరిలుఁడు** నం - ఉదరికుఁడు.

**ఉదరు** — ఉదురు. అ. క్రి. (క. ఒదఱు త.ఉదఱు.)

1. (భయక్రోధాదులచే) కంపించు.

ద్వి. అటు మూర్ఛ నొందినయంగదుఁ డపుడు, దెలిసి మోమునఁ గ్రమ్ముదెంచురక్తములఁ, బలుమఱుఁ గరములఁ బాయఁ ద్రోయుచును, నుదిరుచు నప్పు డయోమయంబైన, గద యెత్తికొని మహాకాయుని రథము,పయికి లంఘించి...రం. రా. యు. 377పా. 18పం.

2. కదలు, చలించు.

చ. ఉదరెడుమోవి ముత్పులక లొత్తెడుమూరు లుఁ గేలుఁ జన్నులున్. కు. సం. 5. 630.

3. భయపడు, బెదరు.

ద్వి. ఉదరి తాపసు లెల్ల నొండొరుఁ గడవఁ,బద పదం డిదె మహా ప్రళయంబు వచ్చె.ద్వి.పా రిశ్చ. పూ. 416 పం.

4. కోపించు.

ఆ. అనుచు నుదరి పలుక విని హిడింబయుఁగడు, వెఱచి...భార. ఆది. 6. 201.

సీ. తోడికోడండ్రు వంతులకుఁ బట్టినచోట నుద రక తాలిమి నుండు మమ్మ.వరాహ,2.124. రం. రా. బాల. 58 పా. 18 పం.

వి. వా. అవా. (చూ.ఉదురు.) ఉద్ధతి, ఉదుటు.

చ. ఉదట రణోత్సవంబొదవ నూఱట వార్వఁగ నొక్కనోరు పాలదు. కు. సం. 12. 783.

జ. ఉదరిపడు, ఉదరిపాటు.

**ఉదర్కము** నం. వి. అ. పుం. 1. రాఁగలఫలము, భావిఫలము. 2. ఉత్తరకాలము,రాఁగలకాలము. 3. మదనకంటకము (వృ. వి.).

**ఉదర్చి** నం. వి. (స్.) పైకి ఎగయుజ్వాలలు గలది. వి. స్. పుం. 1. అగ్ని. 2. మన్మథుఁడు. 3. శి వుఁడు.

**ఉదర్దము** నం. వి. అ. పుం. ఒకవిధ మైనదద్దురురో గము, కుష్ఠభేదము.

**ఉదర్యము** నం. విశే. (అ. ఆ. అ.) ఉదరమం దున్న ది; ఉదరమునకు సంబంధించినది.

**ఉదలావణికము** నం. విశే. (అ. ఈ. అ.) 1. ఉప్పు లో ఊరవేసినది. 2. ఉప్పునీట పక్వముచేయఁ బడినది.

**ఉదలు** న. క్రి. విడుచు, వదలు. (చూ. ఉదలుచు). జ. ఉదలుచు.

**ఉదలుచు(ల్చు)** న. క్రి. (√ ఉదలు — క. ఉదర్చు)

1. (స్వార్థమున 'చు') వదలు, విడుచు.

క. కదియుచుఁ బాయుచుఁ బట్టుచు, నుదలుచు చుం బడుచు లేచు చుడుగుచు వడి గొం,చొ దవెడుకినుకం గడు బిట్టిదముగఁ బెనఁగిరి చలంబు డింపక కడిమిన్. భార. విరా. 2. 348.

2. విదిలించు, విడిపించు.

ఉ. పాపవినిశ్చయుండు సతిపయ్యెద కొంగు క డంగి పట్టినన్, గోపముతో నుదల్చికొని కో మలియున్ వెస వావి వ్రేయుడున్. భార. అర. 6. 190.

**ఉదవసితము** నం. వి. అ. న. ఇల్లు.

**ఉదవాపుఁడు** నం. వి. అ. పుం. పితృదేవతలకు ఉద కతర్పణము చేయుజ్ఞాతి.

**ఉదవాసము** నం. వి. అ. పుం. 1. జలమందు నివసిం చుట. 2. (తపస్సునకై) జలమందు నిలిచియుం డుట.

**ఉదవాసి** నం. విశే. (న్. నీ. న్.) 1. (తపస్సున కై) నీటియందు నిలిచి యుండువాఁడు. 2. నీ టియందు నివసించువది.

**ఉదవాహము** నం. వి. అ. పుం - నీటని మోయున ది - మబ్బు.

**ఉదవీవధము** సం. వి. అ. పుం. ఉదకవీవధము, నీళ్ల కావడి.

**ఉదశరావము** సం. వి. అ. పుం. నీటితో నిండియున్న మూఁకుడు.

**ఉదశ్రువు** సం. విణ. (ఉ.)-వెలికి వచ్చినకన్నీళ్లు గలవాఁడు - ఏడ్చువాఁడు. వి. ఉ. న. వెలికివచ్చిన కన్నీరు.

**ఉదశ్విత్** సం. వి. త్. న. పెరుఁగును నీళ్లను సమ భాగములుగాఁ గలిపి చేసినమజ్జిగ.

**ఉదసక్తువు** సం. వి. ఉ. పుం. ఉదకసక్తువు, నీటఁబాఁ వఁబెట్టిన బియ్యము యవలు మొదలగువాని పిండి.

**ఉదస్తము** సం. విణ. (అ. ఆ. అ.) 1. పైకి వైవఁబడినది, ఎగఁజిమ్మఁబడినది. 2. నిరసింపఁబడినది, తొలఁగింపఁబడినది; తఱుమఁబడినది. 3. కీడ్పఱుపఁ బడినది, అవమానపఱుపఁబడినది.

**ఉదహారుఁడు** సం. విణ. (అ. ఈ అ.) నీళ్లు మోయువాఁడు.

**ఉదాజము** సం. వి. అ. పుం. పశుభిన్నములను (సేనాదికమును) నడుపుట.

**ఉదాత్తము** సం. వి. అ. పుం. 1. స్వరభేదము.(వ్యతి. అనుదాత్తము.) 2. దానము. 3. పెద్దమద్దెల. 4. అర్థాలంకారభేదము.

**ఉదాత్తుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) 1. గొప్పవాఁడు, అధికుఁడు. 2. ఇచ్చువాఁడు. 3. మనోజ్ఞుఁడు, ఒప్పిదము గలవాఁడు. వి. అ. పుం. (అలం) ధీరోదాత్తనాయకుఁడు.

**ఉదానము** సం. వి. అ. పుం. 1. కంఠమునం దుండు వాయువు,ప్రాణాదిపంచవాయువులలో నొకటి, 2. బొడ్డు. 3. సర్పవిశేషము.

**ఉదాయుధుఁడు** సం. విణ. (అ. అ. అ.) ఎత్తఁబడిన ఆయుధము గలవాఁడు, కత్తిదూసి నిలువుఁబట్టుకొన్నవాఁడు.

**ఉదారము** సం. వి. అ. పుం. ధాన్యవిశేషము, ఉదరలు.

శ్లో ప్రియంగవోహ్యుదారాశ్చకోరదూషాస్స తీనకాః. విష్ణుపురాణము. ప్రథమాంశము. 6. అధ్యాయము.

**ఉదారుఁడు** సం. విణ (అ. ఆ. అ.) 1. దాత. 2. ఘనుఁడు, గొప్పవాఁడు. 3. సరళుఁడు, ఋజుభావము గలవాఁడు. 4. గంభీరుఁడు, మనస్సునందలి వికారములు వెలికిఁ దెలుపనివాఁడు. 5. నేర్పరి.

**ఉదావర్త** సం. వి. అ. స్త్రీ. నురుఁగుతోను నొప్పితోను ముట్టురక్తమును వెలువఱుచుయోనిరోగము

**ఉదావర్తము** సం. వి. అ. పుం. మలమూత్రాదుల నిరోధమువలనఁ గలిగెడియొకానొకరోగము.

**ఉదానము** సం. విణ. (అ ఆ. అ.) 1. ఎగఁజిమ్మునది. 2. ఉపేక్షించునది, 3. నిరసించునది. వి. అ. పుం. 1, ఎగఁజిమ్ముట. 2. నిరసించుట. 3. ఉపేక్ష, తటస్థముగా నుండుట.

**ఉదాసి** సం. విణ. (న్. నీ. న్.) 1. ఉపేక్షించువాఁడు, ఉదాసీనుఁడు. 2. నిస్సంగుఁడు, దేనియందు నాసక్తిలేనివాఁడు. (సన్న్యాసి)

**ఉదాసించు** సం. స. క్రి. ఉపేక్షించు.

సీ....కైకకన్నఁ, బ్రాయంబుచేఁ బెద్దపత్ని నుదాసింపఁ బాడి గాదంచును బంకపాలు,మాత్రం బొసంగి సుమిత్రకుఁ గైకకుఁ బాతిక పాలిచ్చి...దశా. 7. 13.

**ఉదాసిత** సం. విణ.(ఋ. తీ. ఋ.)-ఉదాసి. వి. అ. స్త్రీ. ఉదాసీనత.

**ఉదాసీనుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) 1. తటస్థుఁడు, ఉపేక్షించువాఁడు. 2. వ్యవహారమునందు రెండుపక్షములలో నొపక్షమును అవలంబింపనివాఁడు. వి. అ. పుం. (సాంఖ్య) కూటస్థుఁడు,సృష్టి మొదలగు కార్యములందుఁ దగులులేకుండెడి పురుషుఁడు. 2. శత్రువును మిత్త్రుఁడును గాని రాజు.

**ఉదాస్థితుఁడు** సం. వి. అ. పుం. 1. అధ్యక్షుఁడు. 2. ద్వారపాలుఁడు. 3 స్వకర్మమును విడిచి వేగులవాఁడుగా పని చేయుసన్న్యాసి.

**ఉదాహరణము** సం. వి. అ. న. 1. కథనము, చెప్పుట. 2. వృత్తాంతము.

శ్లో. తుల్యానురాగపిశునం లలితార్థబంధం, పత్త్రే నివేశితముదాహరణం ప్రియాయాః. విక్రమో. 2 33.

3 ఒకవిషయమును ధ్రువపఱుచుటకు ప్రామాణికవాక్యము లుపన్యసించుట 4. దృష్టాంతము, తార్కాణ, చెప్పెడివిషయమునకు సరిపడునట్లు చూపెడివిషయాంతరము, తెలివిడి. 5. ప్రకృతవిషయము సిద్ధించుకొఱకు చెప్పినవిదగ్ధ్నవరూప మైనయుపోద్ఘాతము. 6. చెప్పవలసినవానిలో మచ్చునకై కొన్నింటిని మాత్రము చెప్పుట. (వ్యతి. పరిగణనము.) 7. (తర్క) ప్రతిజ్ఞాదిపంచావయవములలో మూఁడవది. 8. ఒక విధమైన ప్రబంధము.

శ్లో. యేన కేనాపి తాలేన గద్యపద్యసమన్వితం, జయత్యుపక్రమం మాలిన్యాదిప్రాసవిచిత్రితమ్, తదుదాహరణం నామ విభక్త్యష్టకసంయుతమ్. ప్రతాపరుద్రీయము. కావ్య. 74.

9. (అలం) అర్థాలంకారభేదము.

**ఉదాహరము** సం. – ఉదాహారము.

**ఉదాహరించు** సం. స. క్రి. ఉదాహరణముగాఁ జెప్పు.

క. తనమహిమ నాశ్రయశక్తి, యునరుచుఁ జనఁ జూచి సుగ్రహులకుఁ లీసత యం,చు నుదాహరింతు రెఱుఁగుఁడి, యనుజుఁడు సుమ్మాతఁ డిమ్ముదాశయుపతికిన్. కళా. 7. 43.

**ఉదాహారము** సం. వి. అ. పుం.–ఉదాహరణము.

**ఉదాహితుఁడు** సం. విశ. (అ. అ. అ.) పైకెత్తఁబడినవాఁడు, ఉన్నతికిఁ దేఁబడినవాఁడు.

**ఉదాహృతము** సం. విశ. (అ. అ. అ.) 1. కథితము, చెప్పఁబడినది. 2. ఉదాహరింపఁబడినది, ఉదాహరణముగా తేఁబడినది.

**ఉదాహృతి** సం. వి. ఇ. స్త్రీ. – ఉదాహరణము.

**ఉదితము** సం. విశ. (అ. అ. అ.) 1. పయికి లేచినది; ఉదయించినది. 2. పుట్టినది, కలిగినది. 3. చెప్పఁబడినది. వి. అ. న. 1. కురువేరు (వృ.వి.) 2. చెప్పుట. 3. వాక్యము. 4. (జ్యోతి) లగ్నము. 5. (జ్యోతి) ఉదయము నొందినరాశి.

**ఉదితి** సం. వి. ఇ. స్త్రీ. ఉదయము.

**ఉదియ**–ఉద్దియ.

మ.... తొలఁగున్ డాయున్ దెగన్ ద్రేయు పీ, ద్వడనొత్తున్ దివి కెత్తుఁ గిట్టి యుదియన్ బట్టున్... భా. రా. అర. 2. 138. (శ. ర పా–'కటయంబట్టున్' అని ముద్రి.)

జ: ఉదియకొను.

**ఉదియకొ(గొ)ను** అ. క్రి. (√ఉదియ) యత్నించు.

సీ. ఒండొరు నొప్పింప నుడుగక పెనఁగ గనొదవునదల్పుల నుదియగొనుచు. భా. రా. అర. 2. 137. (శ. ర. పా–'ఒదవినదప్పుల నుదిలకొనుచు' ముద్రి.)

**ఉదిరి** వి. మేలిమి, శ్రేష్ఠమైనబంగారము; బంగారము.

సీ. ఉదిరిబంగరువ్రాతవహొంబట్టువలెవాటు సడలించి పెనఁగటిస్థలిని జుట్టి. పాండు. 1, 198.

(వి. ధ్యము) క. ఉదిరిమలతోడ నొరయఁగ, నెదిరినదొర... రా. వి. 2. 79. (ఉదిరిమల–మేరుపర్వతము.) ఆం. భా. 2. 279. సాం. వి. 67.

**ఉదిరిపడు**–ఉదరిపడు (√ఉదురు)

**ఉదిల** వి. (√ఉదిలు) 1. అధృతి, చలనము.

సీ. తల్లడింపు తలఁకు... అంబిక యుదిల యటన నధృతి యగు. ఆం. భా. 1. 183.

2. పరితాపము. (చూ. ఉదిలకొను)

**ఉదిలకొ(గొ)ను** అ. క్రి. (ఉదిల + కొను.) 1. (భయాదులచే) చలించు, వణఁకు.

ఆ.... బెదరి వజ్రాయుధు,హృదయ ముదిలకొనఁగఁ ద్రిదశగణము, భాగ. ఆది. 2. 21.

క. పనరుఁడు మానసము ధృతి,నూన నుచితవృత్తిసుండు నుదిలగొనక యెం,దైనను నెయ్యది యేనియు,వానికి దుర్లభము లేదు వసుధాధీశా. భార. శాం. 3. 161.

2. సంభ్రమముపొందు, త్వరపడు.

సీ. సత్యభామ మదీయజనకునిపడపిన యర్థంబు వనుఁ జేరువని తలంచె, నగ్రజుఁ ప్రియురాలి నాత్మఁ జూడక కృష్ణుఁ డొక్కింతవడి కోర్కి నుదిలకొనియె. హరి. పూ. 3. 252.

గీ. ఇందుబింబాస్య నారాక కెదురుచూచు, నయనములు వేయు విరియించి నాకభర్త, యుదిలకొను చున్నవా రాత్రి నున్న ముగురు, కాలయాపన సేయఁగాఁ గాదు నీకు. నైష. 4. 64.

3. కులుకు, మురియు.

గీ. తవవిలోచనములు పాదుమనను వా(చి,కొ న(గ నయ్యింతి ననుఁ గను(గొనియె పాత్మ, గై కొనియె రాగరసమునఁ గడలుకొనియె, మదనవికృతి బయల్పడ మదిలకొనియె. భా ర. విరా. 2. 88.

4. ప్రసరించు, వ్యాపించు; అతిశయించు.

వ. వారివాహవ్యూహంబులు కడలవియఁ జదల నుదిలకొనియె. హర. 6. 58.

గీ. అనుచు వరనాథపుత్రిక మనములోన,మదన వికృతు లంతంతకు నుదిలకొన(గ, వేడుకలు మెచ్చులును జోడుగూడి పొదల,ధరణినా యకు చెలువంబుఁ దగిలిపొగడె. కేయూర. 4. 7.

5. పరితపించు.

వ. ఇట్లు మదనాగ్ని నుదిలగొని యగ్ని దేవుం డ క్కాంతతో నేకాంతంబున నిట్లనియె.భాగ. అను. 1. 49. ఉ. హరి. 5. 102.

ఉదిలు అ. క్రి. చలించు, కదలు.

గీ. పెటిలె బ్రహ్మాండఖాండంబు చిటిలె దిక్కు, లురగెఁ బాతాళభువనంబు లుదిలె నభము, మేటిధాటీజనిత కాలకూటవిషము, చిచ్చు విడివడి యంతంతఁ జెచ్చుపెరు(గ. భీమ. 4. 61.

జ. ఉదిల, ఉదిలకొను.

ఉదీక్షణము సం. వి. అ. న. 1. మీఁదికిఁ జూచుట. 2. బాగుగా ఆలోచించుట.

ఉదీచి సం. వి. ఈ. స్త్రీ. ఉత్తరపుదిక్కు.

ఉదీచీనము సం. విణ. (అ. ఆ. అ.) 1. ఉత్తరపుది క్కున నున్నది. 2. ఉత్తరకాలమున (తర్వాతి కాలమున) నున్నది.

ఉదీచ్యము సం. విణ. (అ. ఆ. అ.) 1. ఉత్తరపుది క్కున నున్నది. 2. ఉత్తరకాలమున (తర్వాతి కాలమున) నున్నది. వి. అ. పుం. 1. శరావతీ నదికి పశ్చిమోత్తరములమధ్యమున (వాయవ్య దిక్కున) నుండుదేశము. 2. ఉత్తరదేశము.న. కురువేరు (వృ. వి.).

ఉదీపము సం. విణ. (అ. ఆ. అ) – ఉత్+అప – వె ల్లువపాఱినది(దేశము) వి.అ.పుం. ప్రవాహము.

ఉదీరణ సం. వి. ఆ. స్త్రీ – ఉదీరణము.

ఉదీరణము సం. వి. అ. న. 1. ఉచ్చారణము, పలు కుట; చెప్పుట. 2. విసరివైచుట (బాణాదులను) వేయుట.

ఉదీరితము సం. విణ. (అ. ఆ. అ.) 1.చెప్ప(బడినది. 2. ఉద్రిక్తము, చెలరేఁగినది. 3. ప్రేరితము, పురికొల్ప(బడినది. వి. అ. న. చెప్పుట.

ఉదీర్ణము సం. విణ. (అ. ఆ. అ.) 1. గొప్పది. 2. ఉత్పన్నము, పుట్టినది.

శ్లో:...తారోదీర్ణగ్రైవనాదం ప్రజంతః. శిశు. 18. 37.

3. ఉద్రేకము నొందినది. 4. గర్వించినది. 5. ఉచ్చరింప(బడినది, పలుక(బడినది.

శ్లో....అనుదీర్ణవర్ణనిభృతార్థమాహ్వయత్. శిశు. 13. 42.

ఉదుంబరదళ సం. వి. ఆ. స్త్రీ. దంతి (వృ. వి.).

ఉదుంబరపర్ణి సం. వి. ఈ. స్త్రీ. దంతి (వృ. వి.).

ఉదుంబరము సం. వి. అ. పుం. 1. మేడి (వృ. వి.) 2. గడప, దేహళి. 3. రక్తమునం దుండి కుష్ఠ మును బుట్టించుక్రిమిభేదము. పుం. న. ఎఱ్ఱని పొడలుగలకుష్ఠభేదము. న. 1. మేడిపండు. 2. రాగి. 3. కర్షము అనెడిమానవిశేషము.

ఉదుంబరుఁడు సం. వి. అ. పుం. నపుంసకుఁడు.

ఉదుక – ఉతక.

సీ. బోలుమ్రా నుదుక నాఁ బోలుఁ గవాటమూ లాలవాలాభిధ...అం భా. 2. 22.

ఉదుకు – ఉతుకు. స. క్రి. 1. మురికిపోవుటకై బ ట్టలు రాతిమీఁద వేసి కొట్టు.

చ...క్రాటము,నుదికినశాటి ప్రేల...ఆము. 1. 88. మనుచ. 1. 54.

2. బట్ట ఉదికినట్లు కొట్టు; కొట్టు.

గీ....అన్నిశాచరుని నొడిసి, కాలు పట్టి మీఁదికి నెత్తి నేలతోడ, నొడలు గుల్లలత్తిగా ను దికి చంపె. భా. రా. యు. 680.

3. నశింప(జేయు, పోఁగొట్టు.

గీ. ఘనత శివగంగయును రుద్రగంగ యనఁగఁ, గూపములు రెండు దక్షవాటిపురమున,మొ

దలియది పాపముల నెల్ల నుదుకఁ జాలు, భీమ. 6. 17.

**ఉదుటు** — ఉదురు. వి. 1. ఉద్ధతి, గర్వము.

వ. అట్టియెడ రెండుసేనలయందును నుదుటు గలపోటరు లామనికాలంబున మేపుక్రొవ్విన మందలయందుఁ గడంగి నలి రేఁగి పోడరు వృషభంబులుం బోలె దర్పించి...హరి. ఉ. 10. 90.

చ. ఉదుటున నట్లు తన్మహిపుఁ డొడ్డినయొద్దు జయించి...రాఘవ. 2. 56. ప్రబంధ. 17.

2. నీటు, విలాసము.

సీ. నుదుటఁ గస్తూరిచే నుదుటు మీఱఁగ వధూతిలక మొక్క-తె వింతతిలక మునిచె. ఇందు. 5. 79.

సీ. ఉదుటుతో నారాక కెదురుచూచుచు ముద్దు దాఱఁగా నది నిల్చుకడపఁ జూచి. శుక. 3. 555.

సీ. ఒరగంటి మెఱుఁ గెక్క నొంటియంగఁ గఱ జెక్కువన్నెలుంచుపక్కెర యుదుటు నూప. దశా. 2. 66.

విశే. 1. ఉదుటుగలది, గర్వించినది; నిక్కినది.

సీ. మిన్నేటిదరులందు మేఁతలాడుచు నున్నయుదుటురాయంచ రేఁగొదమ యనఁగ. సారంగ. 1. 122.

గీ. ఉదుటుగుబ్బలు గలతల్పుటురము నూచి. అము. 2. 10.

సీ. ఉదుటుఁజన్నులనై యుఱుకునగ్గలికల మన సొగ్గ నీయనిమౌగ్ధ్యములను. విప్ర. 3. 87.

2. నీటుగలది, సుందరము.

చ. ఉదుటగువానిఁ బ్రాయమున నుండెడువాని మనోజ్ఞలీలసం,పద గడిదేఱువాని...హంస. 5. 157.

జ: ఉదుటెక్కు.

**ఉదుటెక్కు** అ. క్రి. (ఉదుటు+ఎక్కు) ఉదుటు పొందు, విజృంభించు.

సీ. దినిచూపుదు టెక్కఁగానె సిరిపట్టికని బోరబిరుదుఁజెక్కంబు గలిగె. అము. 6. 105.

**ఉదురు** — ఉదరు. అ. క్రి.

(భయపడు, బెదరు.)

ద్వి. పొదల గ్రక్కదలఁ జోఁపుడుకోలఁ జోఁప, నుదిరి బెట్టుగసినయుదిరికై దులును. అ.ము. క. 5, 222 పా. 22 పం.

(కంపించు, వణఁకు)

సీ. కొసరుమాటలును బై కొన్నచిన్నె గడింపఁ గినుకతో నుదిరి జంకించువగలు. ఉ. రా. 6. 169.

వి. ౙ. అనా - ఉదిరు, ఉదుటు.

చ. ఉదుటఁ దెమల్చి మ్రింగు సరసోదకబిందుల మౌక్తికంబు లం,గదఁ గబళించు...ఉప్పరం బెగయుఁ జాతకపోతకముల్ సెలర్చుచుఁ. కు. సం. 6. 756.

చ. ...మహోదరుం,డుదురున నొక్కఘోరగద యూని కృతాంతునిలీల నుగ్రుఁడై ... ఉ. రా. 3. 14.

ఉదురఁదోలు — పాఱఁదోలు, పోఁగొట్టు.

ఆ. అదియుఁ గాక యాధరాధిపుఁ డింతకుమున్ను మనసమీపమునకుఁ రావడు, డేగఁబిలిచి కొనుచు శివితో రాఁడె యా, యొప్పు మిగులఁ దాల్మి నుదురఁదోలె. కళా. 7. 265.

జ. ఉదిరిపడు, ఉదురుమిడుకు.

**ఉదురుమిడుకు** వి. (√ ఉదురు) ఉద్ధతుఁడు; దుష్టుఁడు.

గీ. ఉద్ధతులు గొంట్లు పలుగాకు లుదురుమిడుకు, లాతతాయులు శఠులు గయ్యాళు లగుచు. హంస. 5. 10.

సీ. ఒకకాలఁ జిరకాల మోహో తపోవృత్త మొనరె నాఁ జేసె నీయుదురుమిడుకు. కకు. 5 87.

**ఉమూఖలము** సం. వి. అ. న. 1. ఉలూఖలము, ఱోలు. 2. గుగ్గిలపుచెట్టు.

**ఉదూఢము** సం. విశే. (అ. ఆ. అ.) 1. ఊఢము, పెండ్లియైనది. 2. స్థూలము, బలిసినది. 3. వహింపఁబడినది.

**ఉదేజయము** సం. విశే. (అ. ఆ. అ.) వడఁకించునది, గజగజలాడించునది.

**ఉదేష్యత్** సం. శ. త్ర. ఉదయింపనున్న.

ఉదా: ఉదేష్యత్సూర్యుఁడు — ఉదయింపనున్న సూర్యుఁడు.

**ఉదొదనము** సం. వి. అ. న. (ఉదకౌదనము) 1. నీటిలో వేసినఅన్నము. 2. జలాహారము.

**ఉద్గంధి** సం. విణ. (ఇ.) ఎక్కువవాసన గలది.

**ఉద్గతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. భేదించుకొని వెలికి వచ్చినది. 2. పైకిఁ బోయినది. 3. పుట్టినది; ఉదయించినది. 4. క్రక్కఁబడినది.

**ఉద్గతి** సం. వి. ఇ. స్త్రీ. 1. పైకిఁ బోవుట. 2. పుట్టుక; ఉదయము.

సీ. జగదుద్గతికిని బీజము ప్రధానమని...ఆము. 3. 8.

3. వాంతి.

**ఉద్గమనము** సం. వి. అ. న — ఉద్గమము.

**ఉద్గమనీయము** సం. వి. అ. న. 1. ధౌతవస్త్రయుగము. 2. ధౌతవస్త్రము, ఉదికినవస్త్రము.

గీ. తంత్రియుద్గమనీయంబు తానె యుదుకు. పాండు. 3. 46 (ఇట వస్త్రసామాన్యమున వాడఁబడినది.).

**ఉద్గమము** సం. వి. అ. పుం. 1. పైకిఁ బోవుట. 2. పుట్టుక, ఉదయము. 3. ఉన్నతి, ఎత్తు. 4. నిక్కుట, నిట్టకనిలుచుట. (ఉదా: స్తనోద్గమము, రోమోద్గమము.) 5. వెలువడుట. (ఉదా: ప్రాణోద్గమము.) 6. మొలక. 7. క్రక్కుట.

**ఉద్గమించు** సం. అ. క్రి. ఎగురు, ఎగయు.

ఉ...వాలి మింటికిఁ, గ్రక్కున నుద్గమించె... ఆ. రా. 3. 282.

**ఉద్గరణము** సం. వి. అ. న. 1. క్రక్కు. 2. త్రేఁపు.

**ఉద్గరణీయము** సం. విణ. (అ. ఆ. అ.) ఉద్గారింపఁదగినది.

**ఉద్గరిత** సం. విణ. (ఋ. క్రీ. ఋ.) ఉద్గారించునది.

**ఉద్గరితవ్యము** సం. విణ. (అ. ఆ. అ.) ఉద్గారింపఁదగినది.

**ఉద్గాఢము** సం. విణ. (అ. ఆ. అ.) అధికము, మిక్కుటమైనది. వి. అ. న. అతియము, ఎక్కువ.

**ఉద్గాత** సం. వి. ఋ. పుం. యజ్ఞమునందు సామవేదతంత్రము నడపువాఁడు.

**ఉద్గారకుఁడు** సం. విణ. (అ. ఇకా. అ.) ఉద్గారించువాఁడు.

**ఉద్గారము** సం. వి. అ. పుం. 1. క్రక్కుట. 2. కాఱుట. 3. త్రేఁచుట.

**ఉద్గారి** సం. విణ. (న్. నీ. న్.) 1. క్రక్కునది. 2. త్రేఁచునది. 3. వెడలించునది.

**ఉద్గారించు** సం. అ. క్రి. త్రేఁచు స. క్రి. క్రక్కు: వెలువరించు.

మ....తదీయసౌరభము లుద్గారించుచుఁ గాంత తస్మరసంజీవనమై చరించుఁ గలయఁగా మందానిలుం డప్పురిఁగా. పి. శకుం. 1. 84.

**ఉద్గార్యము** సం. విణ. (అ. ఆ. అ.)-ఉద్గరణీయము.

**ఉద్గిరత్** సం. శత్ర. ఉద్గారించుచున్న.

**ఉద్గీతి** సం. వి. ఇ. స్త్రీ. 1. గట్టిగా పాడుట. 2. సామగానము చేయుట. 3. (ఛంద) ఒకానొకమాత్రావృత్తము.

**ఉద్గీథము** సం. వి. అ. పుం. 1. ఉద్గాత గానము చేయు సామవేదభేదము. 2. ప్రణవము

**ఉద్గీర్ణము** సం. విణ. (అ. ఆ. అ.) 1. క్రక్కఁబడినది. 2. వెడలింపఁబడినది.

**ఉద్గీర్యమాణము** సం. విణ. (అ. ఆ. అ.) ఉద్గారింపఁబడుచున్నది.

**ఉద్గూర్ణము** సం. విణ. (అ. ఆ. అ.) పైకెత్తఁబడినది

**ఉద్గ్రంథము** సం. విణ. (అ. ఆ. అ.) కట్టునుండి విడిపింపఁబడినది. వి. అ. పుం. 1. గొప్పగ్రంథము. 2. విడిచిపెట్టుట.

**ఉద్గ్రంథి** సం. విణ. (ఇ.) 1. బంధవము లేనిది. 2. విషయబంధమునుండి విడివడినవాఁడు.

**ఉద్గ్రహణము** సం. వి. అ. న. పైకెత్తి పట్టుకొనుట.

**ఉద్గ్రాహము** సం. వి. అ. పుం — ఉద్గ్రహణము.

**ఉద్గ్రాహిణి** సం. వి. ఈ. స్త్రీ. పాశము, కట్టుత్రాడు.

**ఉద్గ్రాహితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఉపన్యస్తము. 2. బద్ధము. 3. గ్రహింపఁజేయఁబడినది.

**ఉద్గ్రీవుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) 1. మెడపైకెత్తినవాఁడు. 2. గర్వము గలవాఁడు (వై ని.).

**ఉద్ఘటితము** సం. విణ. (అ. ఆ. అ.) కూర్పఁబడినది.

**ఉద్ఘట్టము** సం. వి. అ. స్త్రీ — ఉద్ఘట్టనము.

**ఉద్ఘట్టనము** సం. వి. అ. న. ఒరపిడి.

**ఉద్ఘట్టితము** సం. విశే. (అ. అ. అ.) తెలుపఁబడినది. శిశు. 11. 42.

**ఉద్ఘనము** సం. వి. అ. పుం. చెక్కెడు మ్రానికి ఊఁతగా క్రిందనుంచుకొనెడిదుక్క మున్నగునది.

**ఉద్ఘము** సం. వి. అ. పుం. ప్రశస్తము, శ్రేష్ఠము. (ప్రశస్తవాచక మగునీపదము జాతివాచకముతో సమసించి ఉత్తరపదముగానే యుండును. ఇది నియతలింగము. ఇతరవిశేషణములకువలె విశేష్యానుసారముగ దీనిలింగము మాఱదు. ఇట్లే మతల్లికాదులు ఉదా: గవోద్ఘము మొ.) వి. అ. పుం. 1. హస్తపుటము, దొప్పవలెపట్టిన చేయి. 2. అగ్ని. 3. దేహమునందలివాయువు.

**ఉద్ఘర్షణము** సం. వి. అ. న. రాచుట, రుద్దుట.

**ఉద్ఘసము** సం. వి. అ. న. మాంసము.

**ఉద్ఘాటము** సం. విశే. (అ. టీకా. అ.) ఉద్ఘాటించునది, వి. అ. పుం. న. నీళ్లు తోడెడిపతము గిలక చేఁద, మొ. పుం. కుంచిక, తాళపుఁజెవి.

**ఉద్ఘాటనము** సం. విశే. (అ. ఆ. అ.) ఉద్ఘాటించు సాధనము. వి.అ.న. 1. పైకిలాగుట. 2. నీళ్లు తోఁడెడిపతము గిలక చేఁద, మొ. 3. ఉగ్గడించుట, వెలికి చెప్పుట. 4. అడ్డు లేకుండఁగఁ జేయుట. 5. తెఱచుటకు సాధన మగుకుంచిక; తాళపుఁజెవి.

**ఉద్ఘాటము** సం. వి. అ. పుం. సరకులపై సుంకము పుచ్చుకొనుచోటు, ఘాటి.

**ఉద్ఘాటించు** సం. స. క్రి. 1. పగులఁగొట్టు.

వ. భేరీమృదంగవేణువీణానినాదంబులు రోదసీకటాహంబు నుద్ఘాటింప.... నైష. 6. 80.

2. చంపు.

మ. మును లంకాపురిలోన రావణుబలంబుల్ రాము సైన్యంబుతోఁ, బనిఁ గావించువెడఁ గనిశాచరుల నుద్ఘాటించి రామావనీశుని మెప్పించితి... వి. పు. 6 269.

3. పెఱుకు, పైకిలాగు.

వ. యూపస్తంభంబు లుద్ఘాటించిరి... కాశీ. 7. 83.

అ. క్రి. వ్యాపించు, ప్రసరించు.

స్రగ్ధర. ఉద్ఘాటించుఁగా..... వరసనరేశప్రతాపాతపంబుల్. వరాహ. 1. 40.

**ఉద్ఘాటితజ్ఞుఁడు** సం. వి. అ. పుం. బుద్ధిమంతుఁడు.

**ఉద్ఘాటితము** సం. విశే. (అ. అ. అ.) 1. ఉగ్గడింపఁబడినది, చెప్పఁబడినది. 2. భేదింపఁబడినది, తెఱవఁబడినది. 3. బయలుపఱుపఁబడినది. 4. పైకిలాగఁబడినది.

**ఉద్ఘాతము** సం. వి. అ. పుం. 1. ప్రతిఘాతము, దెబ్బ. 2. కొట్టుట. 3. ప్రాణవాయువుచేతఅపానవాయువునకుఁ గలుగునొత్తుడు. (అపానవాయువు ప్రాణవాయువుచేతఁ బీడితమై నాభిమూలమునుండి కదలి మీఁదికిఁబోయి శిరస్సుమోఁదుట.) 4. ఆరంభము. (ఉదా: కథోద్ఘాతము.) 5. ముద్గరము, ఇనుపగుదియ. 6. స్ఖలనము, (కాలుబండి మొదలగువాని) తొట్రుపాటు.

**ఉద్ఘాతి** సం. విశే. (న్. నీ. న్.) 1. తొట్రుపాటుగలది (రథాది.) 2. తొట్రుపాటు కలిగించునది (భూమి, మొ.).

**ఉద్ఘుషితము** సం. విశే. (అ. అ. అ.) శబ్దముచేతఁ దెలుపఁబడినయభిప్రాయము గలది (వాక్యము).

**ఉద్ఘుష్టము** సం. విశే. (అ. అ. అ.) 1. ధ్వనిచేసినది, మ్రోఁగినది. 2. పేనఁబడినది (త్రాడు). వి. అ. న. ధ్వని.

**ఉద్ఘోషము** సం. వి. అ. పుం. 1. గట్టిగా మాట లాడుట. 2. చాటుట. 3. కింవదంతి, జనప్రవాదము. 4. మొఱ్ఱ.

**ఉద్ఘోషించు** సం. అ. క్రి. పెద్దధ్వనిచేయు.

మ. ...దృప్యద్దిగ్గ్రమనిర్వాపణోద్ధురవర్షాగమ రాజభద్రకరు లుద్ఘోషించె నూత్నాభ్రముల్. కవిక. 6. 12.

స. క్రి. చాటు. (ఉదా: అహింస పరమధర్మమని వేదము లుద్ఘోషించుచున్నవి.)

**ఉద్దండము** సం. విశే. (అ. అ. అ.) 1. ఎత్తఁబడిన కఱ్ఱగలది. 2. పైకిలేచినకాఁడ గలది. 3. ప్రచండమైనది, భయంకర మైనది. 4. ఉత్కటము, ఎక్కువైనది. 5. పొడువైనది. వి. అ. పుం. ఉన్నత మగుదండము.

**ఉద్దండించు** సం. అ. క్రి. 1. అతిశయించు, విజృంభించు.

మ...ఉద్ధరణీనాథునికీర్తి చాటుఁ గడు నుద్దండించి బ్రహ్మాండముగా. కాశీ. 1. 52.

2. తెగించు, సాహసించు.

మ. తరుణుల్ గొందఱు మూలగేహమున నుద్దడించిరారాకత,ద్విరహాగ్నిం బరితాపమొందుచు మనోవీథిన్ విభున్ మాధవున్, పరిరంభంబులు నేసి జారుఁ డనుచున్ భావించియుం జొక్కి పొం,దిరి ముక్తిన్ గుణదేహమున్ విడిచి ప్రీతిన్ బంధనిర్ముక్తలై. భాగ. 10 పూ. 967 (మూలగేహములన్ – మూలగేహములనుండి).

**ఉద్దంతురము** సం. విశ. (అ. ఆ. అ.) 1. మిట్టపండ్లు గలది. 2. పొడువైనది. 3. భయంకరమైనది. 4. మిక్కిలి నిమ్నోన్నతము.

**ఉద్దంశము** సం. వి. అ. పుం. 1. నల్లి. 2. పేను. 3. దోమ. 4. జోరీఁగ.

**ఉద్దడ** వి. ఆయుధపువిసరులలో నొకటి.

వ. దధ థారు థాణు అంత్రటీక టీక ఉద్దడనాట్యదారుథాణు... మొదలగువిసరులును... మల్లుపు. 3. 69.

వ. దారు థాణు దధ యుద్దడ అంత్రటీకటీక ...మొదలగుపదునాలుగు విసరులు. ప్రబంధ. 78 (ఉద్భడ అపముద్రి.).

**ఉద్దము** వి. 1. చెప్పు, పాదరక్ష. సాం. ని. 44.

సీ. నిద్ద మౌళుచ్చులయుద్దాలు గిట్టని మ్రోయఁగా మల్లానమునఁ జెలంగి. చ్వా. 10. 84.

2. పాదరక్షావిశేషము, ఒకవిధమగు చెప్పు.

సీ. పాదరక్షాభిధ పరఁగును జెప్పన మలకడమ్మ నఁగ సమ్మాళి యనఁగఁ, దద్విశేషమ్ములు తగుఁబాయబోసు పావో మూడు వుద్దము. ఆం. భా. 2. 298.

**ఉద్దర** – ఉద్దరువు. వి. అధి, కాకట్టు.

సీ. కాకట్టు కుదువ యుద్దర వారకంబి దవనగను నాధి చెలంగుచుండు. ఆం.భా.2.229.

(వృద్ధి చెలంగుచుండు – అపముద్రి).

**ఉద్దరి** వి. 1. నిట్టముగా నుండుఒడ్డు, కత్తెరఒడ్డు. (గ్రా.) 2. (నదియొక్క) రెండుగట్లకు వడిమి ...కము (వా).

**ఉద్దరువు** – ఉద్దర.

ఉ. వెచ్చము వెట్టు మన్నఁబదివేలకు నుద్దరు నొల్లరు...పి. శకుం. 1. 78.

**ఉద్దవడి** – ఉద్దవిడి.

(అత్యంతము, మిక్కిలి.)

సీ.పరమేశుమన ముద్దవడి ముట్టి సాధింప నెత్తిన గతిఁ దలయెత్తఁ దొడఁగె. కు.సం.8.275.

(అతివేగమున, వడిగా.)

గీ. పారువంబులఁ బట్టెడువారిఁ జీరి,యుద్దవడి రమ్మనిన భృత్యులొకనిఁ బట్టి,వదుగురత్తఱి బడిబడిఁ బాఱుదెంచి. సారంగ. 1. 115.

ఉ. ఓమనుజేంద్ర నీవెనుక నుద్దవడిం బఱతెంచు చాన నీ,వామహనీయ వేగమున కంకిలి సేయక తూఁగనోపినం, గామితసిద్ధి పొందు... భోజరా. 7. 17.

చ. అలిగి ప్రహస్తుఁ డుద్దవడి హైహయుపై ముసలంబు వైచినఁ. ఉ. రా. 3. 248.

**ఉద్దవిడి** – ఉద్దవడి. అవ్య. ద్రు. 1. శీఘ్రముగా, వడిగా, వెంటనే.

ఆ. ఉద్దవిడిన వసుల నూఁచముట్టుగఁ దెత్తు, న తఁడు వెనుకవచ్చి యడ్డుపడిన, చోటఁబాం డు రాజసూనుల నరయుదు. భార. విరా. 8. 120. భార. ఉద్యో. 8.837. జై. భా.4. 14. ఆం. భా. 1. 65.

2. మిక్కిలి, అత్యంతము.

ఉ.దుందుభివాద్యనిస్వనముతోఁదులఁదూఁగెడు పక్షనాద మం,దంద యతర్కితోపనతమై వినఁబడ్డ విహారశీలలం, జెంది పరాకునన్ మెలఁగుచిత్తము లుద్దవిడిం గలంగఁగా, నిం దునిభాస్య లప్పుడు సమీక్షణచేసిరి రాజహంసముల. నైష. 2. 45. ఆం. శే. 57.

**ఉద్దాంతము** సం. విశ. (అ. ఆ. అ.) మిక్కిలి అడఁ పఁబడినది.

**ఉద్దానము** సం. వి. అ. న. బంధించుట.

**ఉద్దామము** సం. వి. అ. పుం. (ఛంద) ఒకానొక దండకము.

**ఉద్దాముఁడు** సం. విశ. (అ. ఆ. అ.) 1. కట్టు లేనివాఁడు, బంధరహితుఁడు. 2. స్వతంత్రుఁడు.

3. భయంకరుఁడు. 4. గంభీరుఁడు. 5. గర్వితుఁడు.

శ్లో: పౌలస్త్య విజయోద్దామ కార్తవీర్యార్జున ద్విషమ్. మహా. 3. 45.

6. అధికుఁడు. వి. అ. పుం. వరుణుఁడు.

**ఉద్దారుఁడు** హిం. వి. ఒకానొక పెద్దయధికారి.

గీ. వడుమ నీ లున్నతోలుడాల్వెడఁగు సూవ,న భయముగ వెంట నరుదెంచె సభరువాఁడు, నమరుముస్తైదు తేజితో నరుగుదెంచె,దారుణాకారుఁడైన యుదారుఁ డొకఁడు. శుక. 2. 426.

**ఉద్దాలకపుష్పభంజిక** సం. వి. ఆ. స్త్రీ. ఉద్దాల పుష్పములను (విరిగిపువ్వులను) భంగము కావించెడియొకయాట.

**ఉద్దాలకము** సం — ఉద్దాలము.

**ఉద్దాలకుఁడు** సం. వి. అ. పుం. ఒకానొకఋషి.

**ఉద్దాలము** సం. వి. అ. పుం. 1 బహువారకము, విరిగి (వృ.వి.). 2. అడవియాళ్లు,వనకోద్రవము.

**ఉద్ది**[1] — ఉజ్జి. విశే. 1. ప్రతిస్పర్థి, ఎదిరి, పోటివాఁడు; సమానము, సాటి.

శా. రాజేంద్రుండు విదర్భరాజతనయారత్నంబు బెన్నుద్దులై ,రాజీవాతుల నుద్దు లుంచుకొని నీరం జల్లుఁబో రాడుచో, రాజీవాకరం బు మెప్పె...విక్ర. 5. 57.

సీ....తక్కినవారికిఁ దగినవారి. గీ. నుద్దులేర్పాటు చేయుచు నున్నచోఁ, బ్రలంబదైత్యుండు గోపవేషంబుతోడ, వచ్చి వంచనచే సీరి వధ మొనర్తు, ననుచు సంకర్షణున కుద్దియయ్యె నపుడు. దశా 8. 10.

క. ఉద్దు లవుపెనఁకువలయం, దిద్దఱు సరియై న చోట నెవ్వఁడు పైపై, గద్దించి యరుగునాతఁడ, పెద్దయు దండ్యుండు చలముపెక్కువ కలిమిఁ. విజ్ఞా. ప్రా. 119.

సీ. అనవద్యహృద్యవిద్యాబుద్ధి సంసిద్ధి విసరుహాసనునుద్ది పెద్దవిభుఁడు. నైష. 1. 26.

సీ. శాగొప్ప హారహారిహా గారినాగారిహారిహారు లుద్దని యాడవచ్చు. ప్రబంధ. 32.

2. యమళము, జంటగా నున్నది.

దండ...నిక్కపుంబట్టివే యంచు నివ్వట్టి చట్రోలితోఁ గట్టిన ద్దిట్టవై కిట్టి పెన్నుద్దిమద్దులోవడం ద్రోచియుఁ. పారి. 3. 33.

వి. (శ. ఉత్తి.) 1. జత.

వ. ....ఉద్దులుద్దులుగా గ్రుద్దులాడుశాలుబంట్లు ను...శకాం. 5. 21.

2. సమాను లగువారిసముదాయము, జట్టు.

సీ. వేడ్కతోఁ బాడుచు విరిబంతు లాడుచు నుద్దులు గూడుచు నుబ్బియుబ్బి, మెఱుఁగుఁ బోండ్లు...పరమ.4. 100. దశా. 8. 10.

3. సాంగత్యము, చెలిమి.

సీ. పామండభండదుర్భాష లావర్తించు దుర్వ్రాతకారులతోడియుద్ది వడయు. కాశీ. 4. 81.

సీ. వెలిదామరలఁ బోలువెడఁద్రకాల్గన్నులు మద్దికాయలతోడ నుద్ది వడయ కాశీ. 3. 240. (ఇటఔపమ్యము).

4. (జ.) బాలక్రీడావిశేషము.

ద్వి. బంతు లాలంకి యప్పలములు పాటి, గంతులుద్దులు గ్రచ్చకాయలాటలును. అ. మ.క. 1. 50 పొ. 26 పం.

జ: ఉద్దించు,ఉద్ది కాఁడు, ఉద్దిగొను, ఉద్దిచేయు.

**ఉద్ది**[2] వి. కారెము గూడ మున్నగువానితో తోఁడినసీరు పొర్లిపోకుండ బోదెమొదట ఎత్తుగా కట్టినకట్ట. మల్లము (బ్రౌ.).

**ఉద్దించు** అ. క్రి. (√ఉద్ది[1]) పోటిచేయు, ప్రతిఘటించు, ప్రతిస్పర్ధించు.

సీ. ఉదయాద్రితటముతో నుద్దించునుంమునఁ గౌస్తుభం బను దివాకరుఁడు దోఁప. ఉ. హరి. 2. 146 (ఇట ఔపమ్యద్యోతకము).

అ. క్రి. న. క్రి. ఉద్దులువేయు.

గీ.చెంచుకొమరులతోడ నుద్దించు కాడుఁ,దిన్నఁ డభినవశాల్యసంపన్నుఁ డగుచు,కాళ.3.33.

వ. తానును బలభద్రుండును బెన్నుద్దులైయితర వల్లవులెల్ల నుద్దించుకొని చిఱ్ఱుద్దులై వచ్చిన సమయంబున విభజించుకొని ... భాగ. 10 పూ. 730.

ద్వి. నెఱయుసొంపులతాపసీనదిఁజేరి,యుద్దించి గద్దించి యొడఁబడి పడుచు,లుద్దులై రాఁగఁ

తెన్నుద్దులై తాము. అ. మ. క. 2. 69 పా. 4 వం.

ద్వి. నలి రేఁగి గోపాలకులు నటింపుచును గము లేర్చి యుద్దించి కాల్గన్నవారిఁ, దమలోనఁ గేలివాదంబు పుట్టుటయు. బస పు.5.454.

**ఉద్దికాఁడు** వి॰. (√ఉద్ది¹) 1. జతకాఁడు.

ఉ....ఖా,స్వంతునియుద్దికాఁడు...భల్లా. 5 ఆ. (శ. ర.).

2. చెలికాఁడు, మిత్త్రుఁడు.

సీ. ఎద్దుత త్తడికోడునుద్దికాఁడిడినహొంబట్టు నా దెవుజిట్టుఁబుట్టములును. అచ్చ. రా. అర. 57.

**ఉద్దిగొను** అ. క్రి. (ఉద్ది¹ + కొను.) జతగూడు.

వ. ఇద్దఱు ముద్దియ లుద్దిగొని వీణలందుకొని వీణలం బ్రవీణలై ...వాయించుచు ... భాగ. 10 పూ. 1092.

**ఉద్దిచేయు** స. క్రి. (√ఉద్ది¹) జతచేయు, కూర్చు.

గీ.దతునల్లుంద్ర మెడలసూత్రములుగట్టి,యూ పముఁలు సూత్రములతోడ నుద్దిచేసి, దామె నలు గూర్చి నడిపించెఁ దరతరంబ, వీరభ ద్రుండు పశువుల వేల్చునట్లు. కాశీ. 7.88.

**ఉద్దితము** సం. విశ. (అ. అ. అ.) కట్టఁబడినది.

**ఉద్దియ** వి. (సం. ఉద్యమః. ప్రా.ఉద్దముఁ, ఉజ్జమం.) యత్నము.

ఉద్దియచేయు — యత్నించు.

ఉ. నిద్దుర మేలుకొమ్ము రజనీకరవంశవతంస కుంకుమం, బద్దినభంగి మింట నదె యామిని చెల్లెలు కాల్యసంధ్య రా,నుద్దియ నేయుచు న్నయది యుష్ణమయూఖసుత ప్రసూతికిం, బ్రొద్దులు సొచ్చియున్నయవి పూర్వదిశాసర సీరుహాక్షికిఁ. నైష. 8. 17. (శ. ర.- ప్ర యోగాంతఁ ము లేదు. శ్లో:'త్వయతికథం సంధ్యేయం త్వాం న నామనిశానుజా, సం. నైష. 19. 32' అనుమూలమునుబట్టి 'తా నుద్దియచేయుచున్నయది' అనుపాఠము. నొ కానొకరు గ్రహించి'త్వర పెట్టుచున్నది'అను నర్థమును చెప్పియున్నారు.)

**ఉద్దిశత్** సం. శ క్రి. ఉద్దేశించుచున్న.

**ఉద్దిశ్యమానము** సం. విశ. (అ. అ. అ.) ఉద్దేశింపఁ బడుచున్నది.

**ఉద్దిష్టము** సం. విశ. (అ. అ. అ.) 1. ఉద్దేశింపఁబడి నది. 2. కోరఁబడినది, బోధింపఁబడినది.

**ఉద్దీఁడు** — ఉద్దికాఁడు.

(జతకాఁడు.)

సీ. పిల్ల దీపొడుచుఁ దెనఁగునుద్దీలచే గ్రుద్దులఁబడి కంది కుంది కుంది. శేష. 3. ఆ (శ. ర.).

**ఉద్దీపకము** సం. విశ. (అ. విశా. అ.)- వెలిఁగించున ది–1, రగుల్చునది, జ్వలింపఁజేయునది. 2,ప్ర కాశింపఁజేయునది. 3. పురికొలుపునది.

**ఉద్దీపనము** సం. విశ. (అ. అ. అ.) 1. ఉద్దీపింపఁజే యునది. వి. అ. న. 1. జ్వలించుట. 2. ప్రకా శించుట. 3. జ్వలింపఁజేయుట. 4. ప్రకాశింపఁ జేయుట. 5. పురికొలుపుట. 6. (అలం)విభావ భేదము.(ఆలంబనగుణాదికము.) 7. మెఱుఁగు పెట్టుట.

**ఉద్దీపించు** సం. అ. క్రి. 1. ప్రకాశించు.

మ. త్రిజగన్మోహనశీలకాంతిఁ దను వుద్దీపింప... భాగ. 1. 218.

2. విజృంభించు, చెలరేఁగు.

మ....కన్నె కయ్యంబున,ర్థి భవత్పుత్రులమీఁది కోపమున నుద్దీపింప నేతెంచి ర,య్యభి మన్యుండును ద్రౌపదేయులును మాద్రేయద్వం తియూథాకృతిఁ. భా. భీష్మ. 1, 110.

స. క్రి. వెలిగించు, జ్వలింపఁజేయు.

మ పరమస్నేహము హృత్సరోరుహమునం బా త్రంబుగా నించి సుస్థిరతం బుణ్యదశం ద పోగ్ని మది నుద్దీపించి బ్రహ్మాండక,ర్పరఖం డంబున మంత్రకజ్జల మొగిఁ ఫాలాక్షుఁ గూర్పింపన,గ్గిరిరాజాత్మజ వత్తైనా నమరి నింగింబర్వె నీలాభ్రముల్. కు. సం. 6.758.

**ఉద్దీపితము** సం. విశ. (అ. అ. అ.) 1. ప్రకాశింపఁ జేయఁబడినది. 2. జ్వలింపఁజేయఁబడినది. 3. రేఁపఁబడినది, హెచ్చింపఁబడినది (కోపాది).

**ఉద్దీప్తము** సం. విశ. (అ. అ. అ.) 1. వెలిఁగినది, ప్ర కాశించినది. 2. రేఁగినది, హెచ్చినది (కోపా దికము).

**ఉద్దీప్రము** నం. *విశే.* (అ. ఆ. అ.) 1. ప్రకాశించునది. 2. మండునది. *వి. అ. పుం. న.* గుగ్గిలము.

**ఉద్దు** *వి.* (*క.* ఉద్దు.) మినుము (వ్య.వి.) (*బ.*)మినుములు. ఉద్దుపొడి — మినుపపొడి.

క. ఉడికినపిమ్మట మిరియము, పొడి బెల్లము చల్లి యుద్దుపొడి రాలిచి నేయిడి యెట్లగ వేఁచినవేఁపుడుఁగంద మిళిందవేణి పొందుగ నిడియెన్. పాంచాలీ. 4. 47.

ఉద్దుపప్పు — మినుపపప్పు (వ్యవ).

**ఉద్దేశకము** నం. *వి. అ. పుం.* ఉదాహరణవాక్యము.

**ఉద్దేశకుఁడు** నం. *విశే.* (అ. శా. అ.) 1. ఉద్దేశించువాఁడు. 2. ఉపదేశించువాఁడు. 3. అడుగువాఁడు, ప్రశ్నించువాఁడు.

**ఉద్దేశనీయము** నం — ఉద్దేశ్యము.

**ఉద్దేశము** నం. *వి. ఉ. పుం.* 1. లక్ష్యము, గుఱి; అనుసంధానము, గుఱిగాఁ జేయుట. 2 ఉపదేశము. 3. అభిప్రాయము. 4. ఉదాహరణములతో వివరించుట. 5. అభిలాష. 6 ఎత్తయిన ప్రదేశము. 7. శ్రేష్ఠమైనప్రదేశము; ప్రదేశము. 8. ఏకదేశము, ఒకభాగము.

శ్లో: ఏష తూద్దేశతః ప్రోక్తః. గీత. 10. 40.

**ఉద్దేశి** నం. *విశే.* (న్. నీ. న్.) ఉద్దేశించువాఁడు; ఉద్దేశము గలవాఁడు.

**ఉద్దేశించే** నం *స. క్రి.* 1. గుఱించు.

వ. భార్గవుండు వారల నుద్దేశించి చెప్పినవాక్యంబులు వినుండు. మార్క. 1. 52.

2. భావించు, అనుకొను, తలఁచు.

ఉదా: వాఁడు వెళ్ళవలె నని ఉద్దేశించుకొన్నాఁడు.

**ఉద్దేశ్యము** నం. *విశే.* (అ. ఆ. అ.) 1. గుఱిగాఁ జేయఁ దగినది. 2. ఉదాహరణములతో వివరింపఁ దగినది. 3. ఉపదేశింపఁ దగినది. 4. కోరఁ దగినది 5. ఉద్దేశింపఁ దగినది, తలఁపఁ దగినది. *వి. అ. న.* అభిలాషకుఁ గాని అభిప్రాయమునకుఁ గాని విషయ మైనవస్తువు.

**ఉద్దేష్ట** నం. *విశే.* (ఋ. ష్ట్రీ. ఋ.) ఉద్దేశించువాఁడు.

**ఉద్దేష్టవ్యము** నం. — ఉద్దేశ్యము.

**ఉద్దేహిక** నం. *వి అ. స్త్రీ.* చెదపురుగు.

**ఉద్ద్యోతము** నం. *విశే.* (అ. ఆ. అ.) ప్రకాశింపఁ జేయునది. *వి. ఉ. పుం.* 1. కిరణము. 2. కాంతి. 3. వ్యాకరణమునందొకానొకగ్రంథము. 4. అలంకారశాస్త్రమునందొకానొకగ్రంథము.

**ఉద్ద్యోతించే** నం. *అ. క్రి.* శోభిల్లు, ప్రకాశించు.

వ. ఆతపత్రంబు రేఖి నుద్ద్యోతించుగగనమండలంబునకు... కళా. 2. 9.

(ఉద్ద్యోతకుఁడు మొదలగునవి ద్యోతకుఁడు మొదలగువానివలె గ్రహించునది.)

**ఉద్ద్యోతితము** నం. *విశే.* (అ. ఆ. అ.) ప్రకాశితము.

**ఉద్ద్రావము** నం. *విశే.* (అ. ఆ. అ.) 1. ఉత్కృష్టమైనగమనము గలది, పరుగిడునది. 2. వెనుదీయునది. *వి. అ. పుం.* పలాయనము, వెనుదీసి పాఱిపోవుట.

**ఉద్ద్రుతము** నం. *విశే.* (అ. ఆ. అ.) 1. వెన్నిచ్చి పాఱిపోయినది. 2. వడిగా పరుగెత్తినది.

**ఉద్ధతము** నం. *విశే.* (అ. ఆ. అ.) 1. అవినీతము, అడఁకువ లేనిది: గర్వించినది. 2. ఉద్గతము, పైకెగిరినది (ధూళి, మొ.) 3. నిష్ఠురము, కఠినమైనది.

శ్లో: వచస్యైరసతాం మహీయసో న ఖలు వ్యేతి గురుత్వముద్ధతైః. శిశు 16. 27

4. ఆహతము, కొట్టఁబడినది.

**ఉద్ధతి** నం. *వి. ఇ. స్త్రీ.* 1. పై కెగరుట. 2. గర్వము, అడఁకువలేమి. 3. (ఱాయి మొదలగువానిచేఁ గొట్టిన) పెద్దదెబ్బ.

**ఉద్ధతుఁడు** నం. *విశే.* (చూ. ఉద్ధతము.) *వి. అ. పుం.* రాజునొద్ద నుండుమల్లుఁడు.

**ఉద్ధమము** నం. *విశే.* (అ. ఆ. అ.) — పిల్లనగ్రోవి మొదలగువానిని—ఊఁదునది, పూరించునది.

**ఉద్ధరణము** నం. *వి. అ. న.* 1 (ముల్లు మొదలగువానిని) ఊడఁదీయుట, వెలికిఁదీయుట. 2. (వస్త్రాదులను) లాగుట, విప్పుట. 3. ఆపదనుండి తొలఁగించుట, రక్షించుట 4. పెకలించుట, నిర్మూలముచేయుట. 5. పదవినుండి దీసివైచుట, స్థానభ్రంశము కలిగించుట. 6. మీఁది కెత్తుట. 7. క్రక్కుట, వాంతి. 8. క్రక్కినపదార్థము. 9. మోక్షము. 10. ఋణవిమోచనము.

**ఉద్ధరణి** నం. వి. ఈ. స్త్రీ. (ఆచమనాదిసమయము లందు) నీళ్లెత్తి చేతఁ బోసికొనెడు సాధనము.

**ఉద్ధరించు** నం. న. క్రి. 1. పెల్లగించు. 2. మీఁది కెత్తు, లేవనెత్తు.

గీ. మౌనినాథ కుటుంబజంబాలపటల,మగ్నమా దృశగృహమేధిమండలంబు, నుద్ధరింపఁగ నౌషధ మొండు గలదె, యుష్మదంఘ్రిసరోజ రేణు మొకటిదక్క. మనుచ. 1. 64.

3. రక్షించు, ఆపదనుండి తొలఁగించు.

వ. ప్రభాకరవర్తనంబు వెల్ల ననుగ్రహించి లోకంబు లుద్ధరింపు మనిన...మార్క. 2.185.

(ఉద్ధరణీయము మొదలగునవి హారణీయము మొదలగువానివలె గ్రహించునది.)

**ఉద్ధర్త** నం. విశే. (ఋ. త్రి. ఋ.) 1. మీఁది కెత్తువాఁడు. 2. ఆపదనుండి విడిపించువాఁడు, రక్షకుఁడు. 3. నిర్మూలించువాఁడు, నాశము సేయువాఁడు.

**ఉద్ధర్షము** నం. విశే. (అ. ఈ. అ.) 1. సంతోషము కలిగించునది. 2. ప్రోత్సాహపెట్టునది. వి. అ. న. 1. సంతోషము కలిగించుట. 2. ప్రోత్సాహపెట్టుట. 3. రోమాంచము, గగ్గురుపాటు. (ఉద్ధర్షకుఁడు మొదలగునవి హర్షకుఁడు మొదలగు వానివలె గ్రహించునది.)

**ఉద్ధర్షము** నం. విశే. (అ. అ. అ.) సంతోషించునది; ఎక్కువసంతోషము గలది. వి. అ. పుం. 1. మిక్కుట మైనహర్షము, ఎక్కువసంతోషము. 2. ఉత్సవము.

**ఉద్ధర్షి** నం. విశే. (న్. ఈ. న్.) 1. ప్రోత్సాహపెట్టునది, సంతోషకరము. 2. ఎక్కువసంతోషము గలవాఁడు.

**ఉద్ధవము** నం. వి. అ. పుం. 1. యజ్ఞాగ్ని. 2. ఉత్సవము.

**ఉద్ధవుఁడు** నం. వి. అ. పుం. కృష్ణునికి మంత్రియైన ఒకానొకయాదవుఁడు.

**ఉద్ధానము** నం. విశే. (అ. అ. అ.) 1. క్రక్కఁబడినది. 2. ఉద్గతము,లేచినది. వి. అ. న. 1. పొయ్యి. 2. క్రక్కుట, వాంతి.

**ఉద్ధార** నం. వి. ఆ. స్త్రీ. తిప్పతీఁగ.

**ఉద్ధారకుఁడు** నం. విశే. (అ. రికా. అ.)-ఉద్ధర్త.

**ఉద్ధారణము** నం. వి. అ. న. 1. ఉత్థాపనము,పైకెత్తుట. 2. నీళ్లు మొదలగునవి చేఁదుట. 3. ఆపదనుండి విడిపించుట,రక్షించుట. 4. వంచుకొనుట.

**ఉద్ధారము** ౦. వి. అ. పుం. 1. ఊడఁదీయుట, వెలికిఁదీయుట. 2. ఆపదనుండి విడిపించుట, రక్షించుట. 3. పైకెత్తుట, లేవనెత్తుట. 4. (నీళ్లు మొదలగునవి) చేఁదుట. 5. భాగమును ప్రత్యేకముగా విడఁదీసి యుంచుట. 6. ప్రత్యేకముగా విడఁదీసియుంచినభాగము. 7.(వ్యవహారమున) దాయపు సొత్తునుండి జ్యేష్ఠునకుఁగాను ప్రత్యేకముగా ఈఁదగినపాలు, తక్కినతోడఁబుట్టువుల పాళ్లకంటె జ్యేష్ఠునిపాలికి వెక్కువగా నియ్యఁదగినధనము. 8. యుద్ధమువందు కొల్ల మొదలగువానివలన వచ్చినధనములో రాజునకు చేరవలసిన యాఱవపాలు. 9. అప్పు. (అమరము) 10. వడ్డి లేనియప్పు. (వై. ని.) 11. ముక్తి. 12. ఋణశుద్ధి.

**ఉద్ధురము** నం. విశే. (అ. ఆ. అ.) 1. దింపినబరువు గలది, భారశూన్యము. (ఎద్దు, మొ.) 2. దృఢము. 3. ఉచ్చము (ధ్వని, మొ.). 4. దట్టమైనది. 5. నిండినది. 6. సమర్థము.

**ఉద్ధూతము** నం. విశే. (అ. ఆ. అ.)—ఉత్+ధూతము—1. వడఁకింపఁబడినది. 2 మీఁదికిఁగదలింపఁబడినది. 3. ఎగురఁగొట్టఁబడినది; చెదరఁగొట్టఁబడినది. 4—ఉత్+హూతము—గట్టిగాపిలువఁబడినది.

**ఉద్ధూననము** నం. విశే. (అ. ఆ. అ.) ఎగురఁగొట్టునది. వి. అ. న. 1. ఎగఁజిమ్ముట. 2. ఉత్కంపనము. వడఁకించుట. 3. ఎగురఁగొట్టుట; చెదరఁగొట్టుట.

**ఉద్ధూపనము** నం. వి. అ. న. 1. ఊఁదరపెట్టుట. 2. పొగవేయుట. 3. పొగవేయుట కుపయోగించుపదార్థము.

**ఉద్ధూయమానము** నం. విశే. (అ. ఆ. అ.) 1.(ఉత్+ధూయమానము) ఎగురఁగొట్టఁబడుచున్నది. 2. (ఉత్+హూయమానము) బిగ్గరగాఁ బిలువఁబడుచున్నది.

**ఉద్ధూలనము** సం. వి. అ. న. 1. పొడిచేయుట. 2. పొడిచల్లుట. 3. (భస్మాదులు) అలఁదుట. 4. వేశవారము, సంబారపుపొడి.

**ఉద్ధూషణము** సం. వి. అ. న. రోమాంచము, గగుర్పాటు.

**ఉద్ధృతము** సం. విశే. (అ. అ. అ.)-ఉద్ధరింపఁబడినది- 1. పై కెత్తఁబడినది. 2. చేఁదఁబడినది (నీరు.) 3. ఆపదనుండి విడిపింపఁబడినది. 4. పెకలింపఁబడినది, నిర్మూలము సేయఁబడినది. 5. ఎగఁజిమ్మఁ బడినది. 6. పంపకము చేయఁబడినది, విభక్తము. 7. చెల్లచెదరు సేయఁబడినది. 8. భుక్తోజ్ఝితము, అనుభవించి విడువఁబడినది. 9. తీసివేయఁ బడినది.

ఉదా : ఉద్ధృతస్నేహము — తీసివేయఁబడిన చమురు గలది (తెలికపిండి, మొ).

**ఉద్ధృతి** సం. వి. ఇ. స్త్రీ. 1. ఉత్క్షేపణము, ఎగఁజిమ్మట. 2. పై కెత్తుట. 3. (నీళ్లు మొదలగునవి) చేఁదుట. 4. ఊడఁదీయుట, వెలికిఁదీయుట, 5. ఆపదనుండి తప్పించుట, రక్షించుట. 6. విమోచనము, విముక్తి. 7. గర్వము.

**ఉద్ధ్వంసము** సం. వి. అ. పుం. గొంతు బొంగురుపోవుట.

**ఉద్ధ్మానము** సం. వి. అ. న. పొయ్యి.

**ఉద్బంధకుఁడు** సం. విశే. (అ. భికా. అ.) ప్రేలాడఁ చేయువాఁడు, ఉరిదీయువాఁడు. వి. అ. పుం. చాకలపని చేయునొకసంకీర్ణ వర్ణమువాఁడు.

శ్లో: సూనికస్య నృపాయాం తు జాతా ఉద్బన్ధకాః స్మృతాః, నిర్ణేజయేయు ర్వస్త్రాణి అస్పృశ్యాశ్చ భవన్త్యతః. (వాచ.)

(ఉద్బద్ధము మొదలగునవి బద్ధము మొదలగువానివలె గ్రహించునది.)

**ఉద్బంధనము** సం. వి. అ. న.—ఉద్బంధము.

**ఉద్బంధము** సం. విశే. (అ. అ. అ.) 1. కట్టువీడినది. 2. చెఱనుండి తొలఁగినది. వి. ఇ. పుం. 1. పైకెత్తికట్టుట, ప్రేలాడఁగట్టుట. 2. ఉరితీయుట.

**ఉద్బలుఁడు** సం. విశే. (అ. అ. అ.) మిక్కిలి బలము గలవాఁడు.

**ఉద్బాష్పము** సం. విశే. (అ. అ. అ.) పయికి వచ్చు కన్నీరు గలది, కన్నీరు కార్చునది.

**ఉద్బాహువు** సం. విశే. (ఉ) పయి కెత్తినచేతులు గలవాఁడు, చేతు లెత్తినవాఁడు.

**ఉద్బిలము** సం విశే. (అ. అ. అ.) కన్నమునుండి పైకి వచ్చినది (ఎలుక, మొ.)

**ఉద్బుద్ధము** సం. విశే. (అ. అ. అ.) 1. (నిదుర నుండి) మేలుకొన్నది. 2. ఉద్రేకించినది. అతిశయించినది. 3. వికసించినది. 4. (తర్క) ఉద్బోధము గలది (సంస్కారము.)

**ఉద్బృంహణము** సం. వి. అ. న. చక్కఁగా పెరుఁగుట.

**ఉద్బృహితము** సం. విశే. (అ. అ. అ.) ఉన్మూలింపఁబడినది, పెల్లగింపఁబడినది. (వై. ని.)

**ఉద్బోధకము** సం. విశే. (అ. భికా. అ.) 1. (తర్క) ఉద్బోధమును కలిగించునది. 2. మేలుకొలుపునది.

**ఉద్బోధనము** సం. వి. అ. న. 1. (తర్క) సంస్కారోద్దీపనము. 2. వికాసము. 3. మేలుకొనుట

**ఉద్బోధము** సం. వి. అ. పుం. — ఉద్బోధనము.

**ఉద్బోధించు** సం. న. క్రి. 1. లేపు, మేలుకొలుపు. 2. రేఁపు, ప్రేరించు.

మ. ఎదుటన్ సత్కృపతోడ దుర్జయధరాధీశాన సేవావనంబు దహింపం గలచక్రదావశిఖ నుద్బోధింప నేతెంచె...వరాహ. 5. 39.

(ఇట 'రగుల్చు' అని భావము.)

(ఉద్బోధనీయము మొదలగునవి బోధనీయము మొదలగువానివలె గ్రహించునది.)

**ఉద్భటము** సం. వి. అ. పుం. 1. చేట. 2. తాఁబేలు,

**ఉద్భటుఁడు** సం. విశే. (అ. అ. అ.) 1. మహాశయుఁడు, శ్రేష్ఠమైనభావము గలవాఁడు. 2. శౌర్యము గలవాఁడు. 3. శ్రేష్ఠుఁడు. వి. అ. పుం. సూర్యుఁడు.

**ఉద్భవము** సం. విశే. (అ. అ. అ.) పుట్టినది.

ఉదా: ఆకరోద్భవము, సోమోద్భవ.

వి. అ. పుం. 1. ఉత్పత్తి, పుట్టుక.

ఉదా: పుత్రోద్భవము, హర్షోద్భవము.

2. దేనినుండి పుట్టినదో యది—జన్మకారణము.

శ్లో: అహమంతశ్చ భూతానాముద్భవశ్చ భవిష్యతామ్. గీత.

**ఉద్భవించు** సం. వి. క్రి. జనించు, పుట్టు.

ఉ. ఆభరతాన్వయంబున రథాధ్వరయూపభు జుల్ మహోధరి,క్షితిభుజు లుద్భవించిరి యుధి ష్ఠిరముఖ్యులు...వసు. 1. 24.

(ఉద్భవత్ మొదలగునవి భవత్ మొదలగువాని వలె గ్రహించునది.)

**ఉద్భవిల్లు** సం.-ఉద్భవించు. మార్క. 3. 52.

**ఉద్భావనము** సం. వి. అ. న. 1. కల్పనము,పన్నిక. 2. పుట్టించుట. 3. చింతనము. 4. ఉత్ప్రేక్ష ణము, ఊహించుట.

**ఉద్భావము** సం. వి. అ. పుం. 1. ఉద్భవము, పు ట్టుక. 2. మహాశయము, గొప్పభావము.

**ఉద్భావయిత** సం. విణ. (ఋ. త్రి. ఋ.) ఉద్భావ నము చేయువాఁడు.

**ఉద్భాసము** సం. వి. అ. పుం. ప్రకాశము, కాంతి.

**ఉద్భాసి** సం. విణ. (న్. నీ న్.) ప్రకాశించునది, మెఱయునది.

**ఉద్భాసితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. మిక్కిలి ప్రకాశించినది. 2. మిక్కిలి ప్రకాశింపఁజేయఁ బడినది.

**ఉద్భాసిల్లు** సం. అ. క్రి. మిక్కిలి ప్రకాశించు.

క. అనంతతి వైభవజిత,వాసవుఁ డగుతాతపిన్న వసుధాధిపుఁ డుద్భాసిల్లె ...వసు. 1. 25.

(ఉద్భాసకము మొదలగునవి భాసకము మొద లగువానివలె గ్రహించునది.)

**ఉద్భాసురము** సం. విణ. (అ. ఆ. అ)-ఉద్భాసి.

**ఉద్భిజ్జము** సం. విణ. (అ. ఆ. అ.) భూమిని భేదించు కొని పుట్టునది (తరుగుల్మాది.)

**ఉద్భిదము** సం. విణ (అ. ఆ. అ-ద్-) భూమిని భేదించుకొని పుట్టునది (తరుగుల్మాది). వి. అ. న. ఒకవిధ మయినఉప్పు. ద్. పుం. ఒకానొక యాగము.

**ఉద్భిన్నము** సం. విణ. (అ. ఆ. అ.) 1. పుట్టినది. 2. మొలచినది, 3. వికసించినది. 4. దళితము, చీల్పఁబడినది. 5. (ఒకరిచేత) మోసమున పట్టి యియ్యఁబడినది; (నఖాద్యులచే) వెలిపుచ్చఁ బడినమర్మము గలది.

'ఉద్భిన్నాన్మి సహవాసిన్యా విస్రంభేణ.' మా లతీ. 7.

**ఉద్భూతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. పుట్టినది. 2. (తర్క.) ప్రత్యక్షయోగ్య మైనది. (రూప ము, మొ.)

**ఉద్భూతి** సం. విణ. (ఇ) గొప్పఐశ్వర్యము గలవాఁ డు. వి. ఇ. స్త్రీ. 1. పుట్టుక, ఉత్పత్తి, 2. గొప్ప ఐశ్వర్యము. 3. ఔన్నత్యము.

**ఉద్భేదనము** సం. వి. అ. న. 1. ఉద్భేదము. 2. ప్రకాశనము, బయలుపఱుచుట.

**ఉద్భేదము** సం. వి. అ. పుం. 1. చీల్చుట. 2, భేదిం చుకొని వెలికి వచ్చుట. 3. ప్రకాశము, బయలు పడుట, (ఉదా: స్తనోద్భేదము, యౌవనోద్భే దము.) 4. ఊట. (విద్యాము.)

(ఉద్భేదనీయము మొదలగునవి భేదనీయము మొదలగువానివలె గ్రహించునది.)

**ఉద్భ్రమణము** సం. వి. అ. న. – ఉద్భ్రమము.

**ఉద్భ్రమము** సం. వి. అ. పుం, 1. చుట్టుతిరుగుట. 2. పయిని తిరుగుట. 3. ఉద్వేగము, మనస్సు యొక్క వ్యాకులపాటు.

**ఉద్భ్రాంతకము** సం. విణ. (అ. తికా. అ.) వి. – ఉద్భ్రాంతము.

**ఉద్భ్రాంతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. చుట్టు తిరిగినది. 2. పైని తిరిగినది. 3. భ్రాంతినిపొంది నది (మనస్సు, మొ.) 4. గిరగిరఁద్రిప్పఁ బడి నది (కత్తి, మొ.) వి. అ. న. 1. ఉద్భ్రమణ ము, చుట్టుతిరుగుట. 2. పయినితిరుగుట. 3. గిరగిరఁదిరుగుట. 4, కత్తినిద్రిప్పుట.

**ఉద్యత్** సం. శత్రు. 1. పైకిఁ బోవుచున్న, లేచు చున్న. 2. ఉదయించుచున్న; పుట్టుచున్న. 3. బయలుదేఱుచున్న.

**ఉద్యంత** సం. విణ. (ఋ. త్రి. ఋ.) 1. పై కెత్తు వాఁడు. 2. ఉద్యమించువాఁడు.

**ఉద్యతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. పూనినది, యత్నించినది. 2. పై కెత్తఁబడినది. 3. సిద్ధము. (ఉదా: జయోద్యతుఁడు, వధోద్యతుఁడు.) వి. అ. న. ఉద్యమము, పూనిక.

**ఉద్యతి** నం. వి. ఇ. స్త్రీ. 1. పైకెత్తుట. 2. యత్నము, పూనిక.

**ఉద్యమనము** నం. వి. అ. న. పైకెత్తుట. 2. పైకిఁ జిమ్ముట, ఎగఁజిమ్ముట.

**ఉద్యమము** నం. వి. అ. పుం. 1. పైకెత్తుట. 2. ప్రయాసము. 3. పూనిక. 4. సిద్ధమగుట.

**ఉద్యమి** నం. విశ. (న్. వీ. న్.) ప్రయత్నించువాఁడు; ప్రయాసపడువాఁడు; గట్టిపూనికగలవాఁడు.

**ఉద్యమించు** నం. న. క్రి. ప్రారంభించు.

చ. ...శుభవేళ వాస్తుపూ,జనబలిహోమతంత్రములు సద్విధిఁ జెల్లఁగ సూత్రహస్తులై, మునుకొని కోవిదస్థపతిముఖ్యులు శిల్పము లుద్యమింప. ...హరి. ఉ. 2. 150.

అ. క్రి. ప్రయత్నించు, కడఁగు. (శ. ర.)

**ఉద్యమితము** నం. విశ. (అ. ఆ. అ.) 1. పైకెత్తఁబడినది. 2. ప్రయత్నించుటకు పురికొల్పఁబడినది.

**ఉద్యానకము** నం. — ఉద్యానము.

**ఉద్యానము** నం. వి. అ. పుం. న. 1. విహారార్థము వెడలుట, వయాళి వెడలుట. 2. విహారార్థమగుతోఁట. 3. ప్రయోజనము,

**ఉద్యాపనచేయు** మి. న. క్రి. విడిచిపెట్టు, వదలివేయు.

ఉ. ...చం, చూపుటమౌనముద్రఁదలఁ జూచి వినిద్రవివేకశాలియు, ద్యాపనచేసెఁ గన్నుఁగొనలందుఁ దొలంకఁగ మందహాసముల్. నైష. 2. 85.

**ఉద్యాపనము** నం. వి. అ. న. 1. (వ్రతాదులను) ముగించుట. 2. వెడలించుట.

(ఉద్యాపకుఁడు ఉద్యాప్యము మొదలగునవి యాపకుఁడు యాప్యము మొదలగువానివలె గ్రహించునది.)

**ఉద్యాపితము** నం. విశ. (అ. ఆ. అ.) 1. ముగింపఁబడినది. 2. వెడలింపఁ బడినది.

**ఉద్యావము** నం. వి. అ. పుం. మిశ్రణము, కలుపుట.

**ఉద్యాసము** నం. వి. అ. పుం. యత్నము, పూనిక.

**ఉద్యుక్తము** నం. విశ. (అ. ఆ. అ.) 1. ఉద్యోగించినది. పూనినది. 2. సిద్ధమైనది.

**ఉద్యోగపర్వము** నం. వి. న్. న. భారతమున ఐదవ పర్వము.

**ఉద్యోగము** నం. వి. అ. పుం. 1. యత్నము, పూనిక. 2. పని. (శ్లో: తులోద్యోగ స్తవ దినకృతశ్చాధికారో మతోనః–విక్రమో. 2. 1.) 3. ప్రయాసము, పాటుపడుట.

**ఉద్యోగి** నం. విశ. (న్. వీ. న్.) 1. వ్యాపారము గలవాఁడు. 2. పూనిక గలవాఁడు; పాటుపడువాఁడు.

**ఉద్యోగించు** నం. అ. క్రి. 1. ప్రయత్నించు, కడఁగు.

మ. ఉదయంబొందఁగఁ జేసి నీవు ప్రియ కుద్యోగించు చెల్లి శుభప్రదమై.. హరి. పూ. 7. 204.

2. ఆయితపడు, సిద్ధమగు.

వ. ...అతండు పయనంబునకు నుద్యోగించిన.

ఆ. అతని ననుప నేఁగి యధికసంప్రీతి నే, తెంచు నప్పు డయ్యుధిష్ఠిరుండు. భార. ఉద్యో. 1. 214, 215.

**ఉద్రథము** నం. వి. అ. పుం. 1. రథకీలకము, బండి యిరుసుకడచీల. 2. కోడి.

**ఉద్రము** నం. వి. అ. పుం. జలమార్జాలము, నీరుపిల్లి.

**ఉద్రిక్తము** నం. విశ. (అ. ఆ. అ.) 1. అతిశయించినది. 2. విజృంభించినది. 3. స్పష్టమైనది, తెల్లమైనది.

**ఉద్రేక** నం. వి. ఆ. స్త్రీ. మహానింబము, పెనువేము (వ్య. వి.).

**ఉద్రేకము** నం. వి. అ. పుం. 1. విజృంభణము. 2. అతిశయము. (ఉదా: మోహోద్రేకము, ధనోద్రేకము, మదోద్రేకము.)

**ఉద్రేకి** నం. విశ. (న్. వీ. న్.) ఉద్రేకము గలవాఁడు.

**ఉద్రేకించు** నం. అ. క్రి. 1. అతిశయించు

వ. ఉదరశూలంబు పుట్టి జగజెట్టి వైద్యులచేత భేద్యంబు గాక మిగుల నుద్రేకించిన. వరాహ. 2. 65.

2. విజృంభించు (శ. ర.)

**ఉద్వమనము** నం. వి. అ. న. క్రక్కుట, డోకు.

**ఉద్వయస్కుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) వయస్సు గడచినవాఁడు, ముదుసలి.

**ఉద్వర్తకము** సం. విశే. (అ. త్రీ. అ.) 1. అతిశయింపఁజేయునది, హెచ్చించునది. 2. నలుఁగు పెట్టునది.

**ఉద్వర్తనము** సం. విశే. (అ. అ. అ.) నీతి మీఱిన నడత గలది, చెడునడవడి గలది. వి. అ. న. 1. పైకిఁ బోవుట. 2. ఎగిరిపడుట, అదరిపడుట.

శ్లో: మోఘీకర్తుం చటులశఫరోద్వర్తనప్రేక్షితాని. మేఘ. 1. 40.

3. వృద్ధి. 4. నలుఁగుపెట్టుట. 5. నలుఁగుపిండి. 6. విలేపనము, పూఁత. 7. ఒరిపిడి, రాయిడి. 8. చెడునడవడి, నీతి మీఱి నడచుట.

**ఉద్వర్తము** సం. విశే. (అ. ఆ. అ.) అతిశయించినది, ఎక్కువ. వి. అ. పుం. 1. ఎక్కువ వ్యయగు పదార్థము, పై పెచ్చు. 2. మీఱుట, అతిశయము. 3. నలుఁగుపెట్టుట.

**ఉద్వర్తితము** సం. విశే. (అ. ఆ. అ.) నలుఁగుపెట్టఁబడినది.

**ఉద్వసించు** సం. స. క్రి. ఉద్వాసనముచేయు, (విగ్రహాదులయం దావాహనముచేసినదేవతను) పూజాంతమున స్వస్థానమునకుఁ బంపు.

ఉ. ...లింగమున్, నిక్కపుభక్తిఁ బీఠమున నిల్పి భజించుచు నుద్వసింపఁబో, నక్కడ దేవుఁ డుండ... కాశ. 4. 72.

**ఉద్వహ** సం. వి. ఆ. స్త్రీ. కూఁతురు.

**ఉద్వహనము** సం. వి. అ. న. 1. పై కెత్తుట. 2. మోచుట. 3. పెండ్లియాడుట.

**ఉద్వహము** సం. వి. అ. పుం. 1. వివాహము, పెండ్లి 2. సప్తవాయువులలో నొకటి.

**ఉద్వహించు** సం. స. క్రి. 1. గ్రహించు, పట్టుకొను.

సీ. అనుయాయిపృథుక హస్తాంతరన్యస్తోపదోచితార్థము తానె యుద్వహించు. పాండు. 1. 198.

2. మోచు.

సీ. కంబళకటబృసీకాషాయకరకంబు లొక్కయంతేవాసి యుద్వహింప. పాండు. 5. 190.

3. ధరించు, తాల్చు.

చ. ...క్రమతా, వనతరుపుష్పమాలిక దవర్చుచు రస్థ్వలి నుద్వహించి... పారి. పూ. 6. 179.

4. పెండ్లియాడు.

క. అలతిమ్మనారాయణుఁ, డోలిని యతిరాజు రాఘవోత్తముసుత యా, శ్రీలపతి సుబ్బమాంబను, బాలామణి నుద్వహించె భాగ్యము లొలయఁగ. బ్రహ్మో. 1. 48;

5. ఎగఁబట్టు, పై కెత్తు.

(ఉద్వహనీయము మొదలగునవి వహనీయము మొదలగువానివలె గ్రహించునది.)

**ఉద్వహుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) 1. మోచువాఁడు; పై కెత్తువాఁడు. 2. పైకిఁ గాని అవ్వలికిఁగాని కొనిపోవువాఁడు. 3. (వంశాదికమును) కొనసాగించువాఁడు, క్షయము నొందకుండ నుద్ధరించువాఁడు. (ఉదా: కులోద్వహుఁడు, రఘూద్వహుఁడు.) 4. ముఖ్యుఁడు, శ్రేష్ఠుఁడు. వి. అ. పుం 1. పితృదేవతలను నరకమునుండి యుద్ధరించువాఁడు—పుత్రుఁడు.

**ఉద్వాంతము** సం. విశే. (అ. ఆ అ.) ఉద్గీర్ణము, క్రక్కఁబడినది. వి. అ. పుం. మదముపోయిన యేనుఁగు.

**ఉద్వాంతి** సం. వి. ఇ. స్త్రీ. — ఉద్వమనము.

**ఉద్వానము** సం. విశే. (అ. ఆ. అ.) క్రక్కఁబడినది; వెలికిత్రోయఁబడినది. వి. అ. పుం. క్రక్కుట. వెలికిత్రోయుట.

**ఉద్వాపము** సం. వి. అ. పుం. 1. పాఱవైచుట, తీసివేయుట. 2. గొఱుగుట. 3. ఉద్ధరణము, పై కెత్తుట. 4. వేళ్లతోఁ బెకల్చుట.

**ఉద్వాసకుఁడు** సం. విశే. (అ. సికా. అ.) ఉద్వాసనముచేయువాఁడు.

**ఉద్వాసనము** సం. వి. అ. న. ఇంటినుండిగాని పురమునుండిగాని వెడలఁగొట్టుట. 2. త్యజించుట, విడనాడుట. 3. చంపుట.

**ఉద్వాసనీయము** సం. — ఉద్వాస్యము.

**ఉద్వాసము** సం. విశే. (అ. ఆ. అ.) ఇంటినుండిగాని పురమునుండిగాని తొలఁగినది, ప్రవాసమునకుఁ బోయినది. వి. అ. పుం. 1. తొలఁగించుట, ఇంటినుండిగాని పురమునుండిగాని వెడలఁగొ

ట్టుట. 2. విడుచుట. 3. చంపుట, నశింపఁజేయుట.

**ఉద్వాసయత్** సం. శత్రి. ఉద్వాసనముచేయుచున్న.

**ఉద్వాసయిత** సం. విణ. (ఋ. త్రీ. ఋ.) ఉద్వాసనముచేయువాఁడు.

**ఉద్వాసయితవ్యము** సం. — ఉద్వాస్యము.

**ఉద్వాసి** సం. విణ. (న్. నీ. న్.) ఉద్వాసనము చేయువాఁడు.

**ఉద్వాసించు** సం. స. క్రి. తొలఁగించు, పోఁజేయు.

సీ. అంతర్విలోకనవ్యాప్తియుద్వాసించిబాహ్యంబునకు దృష్టి పాఱవిడిచి. కాశీ. 2. 64.

శా....నిర్వాహ్యపాంథత్వముఁబోవఁద్రోచి వగలుద్వాసించి...నిర్వ. 9. 78.

2. విడుచు.

సీ. మూసి కండూతి ముమ్మారు మైనఁ గట్టదుద్వాసించి వేఱొక్కవల్కలంబు. పి. శకుం. 4. 121,

**ఉద్వాసితము** సం. విణ. (అ. ఆ. అ.) ఉద్వాసనము చేయఁబడుచున్నది.

**ఉద్వాస్యము** సం. విణ. (అ. ఆ. అ.) ఉద్వాసము చేయఁదగినది.

**ఉద్వాహనము** సం. విణ. (అ. ఈ. అ.) 1. పైకెత్తునది. 2. చేఁదునది.

శ్లో: ఉద్ఘాటనం ఘటీయన్త్రం సలిలోద్వాహనం ప్రహేః. అమరము.

వి. అ. న. 1. పైకెత్తుట. 2. చేఁదుట. 3. (పుత్రాదులకు) పెండ్లి చేయుట. 4. పెండ్లాడుట. 5. మఱియొకచోటికిఁ గొనిపోవుట. 6. ఇను మాఱు దున్నినపొలము.

**ఉద్వాహని** సం. వి. ఈ. స్త్రీ. గవ్వ.

**ఉద్వాహమగు** మి. స. క్రి. (√ఉద్వాహము) పెండ్లాడు, వివాహమగు.

గీ. తల్లమాంబికాదేవి నుద్వాహమయ్యె. నై. ష. 1. 32.

**ఉద్వాహము** సం. వి. అ. పుం. 1. వివాహము, పెండ్లి. 2. పైకెత్తుట. 3. మోచుట.

**ఉద్వాహి** సం. విణ. (న్. నీ. న్.) 1. పైకెత్తునది. 2. చేఁదునది. 3. మోచునది. 4. పెండ్లాడునది.

**ఉద్వాహితము** సం. విణ. (అ. ఆ. అ.) పెండ్లియైనది.

**ఉద్వాహిని** సం. వి. ఈ. స్త్రీ. త్రాడు.

**ఉద్విగ్నము** సం. విణ. (అ. ఆ. అ.) — ఉద్వేగము గలది — 1. (దుఃఖమును బరిహరింప నోపమిచే) మనస్సుకుదురులేనిది, వ్యాకులచిత్తము. 2. వెఱపునొందినది.

**ఉద్విజమానము** సం. విణ. (అ. ఆ. అ.) భయపడుచున్నది.

**ఉద్విజిత** సం. విణ. (ఋ. త్రీ. ఋ.) భయపడువాఁడు.

**ఉద్వీక్షణము** సం. వి. అ. న. 1. మీఁదికి చూచుట. 2. చూపు; చూచుట. 3. కన్ను.

**ఉద్వీక్షించు** సం. స. క్రి. చూచు.

రగడ. ఉడురాజకళాభరణు నుల్లమున నుద్వీక్షించును శ్రీమణికర్ణిక. కాశీ. 6. 125.

(ఉద్వీక్షకుఁడు మొదలగునవి వీక్షకుఁడు మొదలగువానివలె గ్రహించునది.)

**ఉద్వృత్తము** సం. విణ. (అ. ఆ. అ.) 1. నీతినిఅతిక్రమించి నడచునది, చెడునడత గలది. 2. పైకెత్తఁబడినది. 3. అనుభవించి విడువఁబడినది, ఉచ్ఛిష్టము. 4. అధికము, పయిపెచ్చు. 5. వెలికుబ్బినది, పయికి పొంగినది. 6. త్రొక్కఁబడినది. 7. గర్వించినది. 8. కలతనొందినది, క్షోభపడినది.

**ఉద్వృత్తి** సం. వి. ఇ. స్త్రీ. 1. చెడునడత. 2. గర్వము. 3. ఆధిక్యము. 4. వాంతి. 5. కలఁత. 6. పైకెత్తుట. 7. ఎగిరిపడుట.

**ఉద్వేగము** సం. విణ. (అ. ఆ. అ.) 1. శీఘ్రగామి, వేగముగాఁ బోవునది. 2. నిశ్చలము, స్తిమితము. 3. మందగామి, మెల్లఁగాఁ బోవునది. వి. అ. పుం. 1. వ్యాకులచిత్తత, మనస్సుకుదురులేమి. 2. ఊర్ధ్వభాగమును గదలించుట. 3. చమత్కారము. 4. విరహమువలనఁ బుట్టుదుఃఖము. 5. భయము. 6. వడఁకు. న. 1. పోఁకపండు. 2. పూగఖండము, పోఁకచెక్క. (కే.ని.)

**ఉద్వేగి** సం. విణ. (న్. నీ. న్.) 1. ఉద్వేజకము. 2. ఉద్వేగము గలవాఁడు.

**ఉద్వేగించు** సం. అ. క్రి. వ్యాకులపడు; వెఱచు, భీతిల్లు.

వ. ఇట్లఖిలభువనభవనాధీశ్వరుం డగుపరమేశ్వరుం డనవరతః తనిరతుండై జగద్వ్యాపారంబారయమికి నింద్రాదిదేవత లుద్వేగించి విరించి పాలికిం జని...కు. సం. 9, 355.

**ఉద్వేగిల్లు** నం. అ. క్రి. – ఉద్వేగించు.

శా.... కేశినా,మక్రూరాసురుఁడు...చరియించె గోపకుల ముద్వేగిల్ల వేగోద్ధతిన్. హరి.పూ. 8. 99.

**ఉద్వేజకము** నం. విశ. (అ. శ్రీ. అ.) 1. మనస్సును వ్యాకులపెట్టునది, కలఁచునది. 2. దుఃఖపెట్టునది. 3. కలఁగినది, వ్యాకులపడినది. 4. కుందునది, దుఃఖించునది. 5. భయపెట్టునది.

**ఉద్వేజనము** నం. విశ. (అ. అ. అ.) 1. భయపెట్టునది. 2. (మనస్సును) కలఁచునది. వి. అ. న. 1. వ్యాకులచిత్తత, కలఁత. 2. వ్యాకులపెట్టుట. 3. విరహామువలనిదుఃఖము. 4. వెఱపు, భయము.

**ఉద్వేజనీయము** నం. విశ. (అ. అ. అ.) 1. భయపెట్టఁ దగినది. 2 (మనస్సును) కలఁతపెట్టఁ దగినది.

**ఉద్వేజయిత** నం. విశ. (పు. స్త్రీ. పు.) 1. భయపెట్టువాఁడు. 2. (మనస్సును)కలఁతపెట్టువాఁడు.

**ఉద్వేజితము** నం. విశ. (అ. అ. అ.) 1. కలఁతపెట్టఁబడినది, వ్యాకులితము. 2. వెఱపింపఁబడినది, భయపెట్టఁబడినది.

**ఉద్వేజ్యము** నం. విశ. (అ. అ. అ) భయపెట్టఁదగినది. 2. కలఁతపెట్టఁదగినది.

**ఉద్వేలము** నం. విశ. (అ. అ. అ.) 1. వేలను అతిక్రమించినది, గట్టును మీఱినది (నది, మొ.) 2. మర్యాద నతిక్రమించినది, మేఱ మీఱినది. 3. మిక్కుటమైనది, ఉత్కటము.

**ఉద్వేల్లితము** నం. విశ. (అ. అ. అ.) 1. కదలింపఁబడినది. 2. మీఁదికిఁ జిమ్మఁబడినది. వి. అ. న. కదలిక, చలనము.

**ఉద్వేష్టనము** నం. విశ. (అ. అ. అ.) 1. ప్రిదిలినది, సడలినది, విడిపోయినది; కట్టువీడినది. వి. అ. న. 1. చుట్టుకొనుట. 2. (గుండె వెన్ను మున్నగువానియందుఁ గలుగు) నొప్పి. (ఉదా: హృదయోద్వేష్టనము.)

**ఉద్వేష్టము** నం. విశ. (అ. అ. అ.) చుట్టుకొనునది. వి. అ. పుం. చుట్టుకొనుట.

**ఉద్వేష్టితము** నం. విశ. (అ. అ. అ.) చుట్టుకొనఁబడినది.

**ఉద్వోఢ** నం. వి. ఋ. పుం. – పెండ్లాడినవాఁడు – మగఁడు.

**ఉనికి**(న్కి)–ఉనుకువ. వి (√ఉండు) 1. ఉండుట.

చ. ధరణికిఁ గోట చక్రగిరి దాని కగడ్తలు వారిరాసు లా,పరఖలు కోటలో నునికిభావ్యముగాదని యబ్జమూతి భా,సురముగఁ జక్రభూధరము చుట్టును వార్ధులు నిల్పె...విక్ర. 1. 64.

చ. ఎఱుఁగనె నీవు ప్రాంతమున నింతట నంతట నున్కి...నైష. 1. 104.

2. అవస్థ, దశ.

ఆ. సాధుమేయపశుజాలంబుఁ జెంచిన,వాఁడు కరుణ లేనివాఁడు విప్ర,వరుఁ డధోముఖాఖ్య నరకంబులోపల, నుండు ఘోరమైన యునికితోడ. వి. పు. 3. 121.

సీ. నాయున్కిఁ గనుఁగొన్న నాసాటివారిలో నిదిలాఘవంబనియెంచుకొంటి. అని. 2. 137.

3. జీవనము, బ్రదుకు.

క. నీ వస్త్రశస్త్రవిద్యా,కోవిదుఁడవు రణమునందుఁ గ్రూరుఁడ వరివి,ద్రావణ సాహసికుండవు, గావున నీయున్కినమ్మఁగా నోపనెడన్. భార. ఆది. 4, 182.

సీ. తనయుని కిపాటు నెనయఁ జేసితి వయోతనయుని కిఁక నేల యనుచుఁ బొగులు. సారంగ. 3. 231.

4. స్థానము.

మ. ఉనికిన్ నిల్వక ప్రాణముల్ తొలఁగిపో నూహింప వారిర్వురున్. చంద్రా. 6. 107.

5. సంధి మొదలగుసద్గుణములలో నొకటి,ఆసనము. ఆం. భా. 2. 187.

సుఖమున్కి–సుఖముతో నుండుట.

సీ. ...కుమార, వర్గఁబు నెల్లను వనితాజనంబుల నుచితంపుమై సుఖమున్కి యడుగు. భార. ఉద్యో. 1. 366.

ఉన్నయున్కి నయుండు — ఉన్నట్లే యుండు. నైష. 4. 2.

ఉనికి(న్కి)పట్టు—నివాసస్థానము; ఆశ్రయము.

క. మునిగరుడోరగవిద్యాధరాది భూతములు సూతతనయుని నేఁ డేఁ; బొరివచ్చిన నముఁ బొగడుచు, నరుగుంగా కునికిపట్లు కంబుజ నాభా. భార. కర్ణ. 3. 139.

సీ. వైరాగ్యమహిమ కీవడుగు నివాసంబు విన యంబునకు నీతఁ డునికిపట్టు.ఉ.రా. 5.140.

ఉనుకువ—ఉంకువ², ఉనికి. (√ఉండు.)

ఉనుకువగొను — నెలకొను.

వ. శశాంకశిలా సౌధవిటంకంబుల నునుకువ గొన్నతఱి శరన్నీరదవశంవదం బగునునా నీర శిలా శకలంబన మెలంగుచు... పాండు. 4. 237.

ఉనుచే (చూ. ఉంచు.)

ఉనుపు స. క్రి. (క. ఉని.) — బట్టలను — రంజించు, రంగు గలవానినిగాఁ జేయు.

వి. ఉనుపుట.

ఉనుపులవాఁడు — (బట్టలకు) రంగులు వేయు వాఁడు.

ఉన్నతము సం. విశ. (అ. ఆ. అ.) 1 ఎత్తయినది. 2, గొప్పది. 3. ఎత్తఁబడినది. వి. అ. న. ఉన్నతి.

ఉన్నతానతము సం. విశ. (అ. ఆ. అ.) మెంకపల్లముగా నుండునది, విషమము.

ఉన్నతి సం. వి. ఇ. స్త్రీ. 1. ఎత్తు. 2. ఉచ్చస్థితి.వృద్ధి. 3. గరుడునిభార్య. 4. నాట్యవిలాసవిశేషము.

క. లయకోపు దృష్టియును నభినయ ముదుటు దుఁమ్ము మోడి నయ మున్నతి రేకయును బ్రమాణము హారువుగా, మెయిసిరియవఘళము మురుపు మెలఁకువ యమరుగా. ప్రబంధ. 108.

ఉన్నతిల్లు సం. అ. క్రి. అతిశయించు.

గీ. పాదపీఠోరువజ్ర ప్రభాతికంబు, మున్న పద నఖ సంకాశ మున్నతిల్లె. కు. సం. 6. 869.

ఉన్నద్ధము సం. విశ. (అ. ఆ. అ.) 1. కట్టఁబడినది. 2. పై కెత్తికట్టఁబడినది. 3. ఉబ్బినది; పెరిఁగినది.

ఉన్నమనము సం. వి. అ. న. పై కెత్తుట.

ఉన్నమితము సం. విశ. (అ. ఆ. అ.) 1. పై కెత్తఁబడినది. 2. పొడిగింపఁబడినది; హెచ్చింపఁబడినది.

ఉన్నము సం. విశ. (అ. ఆ. అ.)ఉత్తము,తడిసినది.

ఉన్నమ్రము సం. విశ. (అ. ఆ. అ.) 1. ఉన్నతము. 2. నిట్టనిలువుగా నుండునది.

ఉన్నయత్ సం. శక్రి. 1. పైకి ఎత్తుచున్న. 2. పైకిఁ దీసికొనిపోవుచున్న. 3. ఊహించుచున్న

ఉన్నయనము సం. విశ. (అ. ఆ. అ.) కన్ను లెత్తినది. వి. అ. న. 1—ఉన్నయము. 2. (పాపట మొదలగునవి) దిద్దుట, సవరించుట. 3. ఎత్తిన కన్ను.

ఉన్నయనీయము సం — ఉన్నేయము.

ఉన్నయము సం. వి. అ. పుం. 1. పై కెత్తుట. 2. పైకిఁ దీసికొనిపోవుట. 3. (బావి మొదలగు వానినుండి జలము మొదలగువానిని) పయికిఁ దీయుట. 4. ఊడఁబెఱుకుట. 5. ఉన్నతి, ఎత్తు 6. అనుమతి, ఊహించుట.

ఉన్ననము సం. విశ. (అ. ఆ. అ.) పొడుగైన ముక్కు గలది.

ఉన్నామము సం. వి. అ. పుం. 1. పయి కెత్తుట. 2. ఉత్కృష్టమైన నామము.

ఉన్నాయకము సం. విశ. (అ. యికా. అ.) 1. పై కెత్తునది. 2. పైకిఁ దీసికొనిపోవునది. 3. అనుమాపకము, ఊహింపఁజేయునది.

ఉన్నాయము సం — ఉన్నయము.

ఉన్నాయి సం. విశ. (న్.నీ.న్.)—ఉన్నాయకము.

ఉన్నాహము సం. వి. అ. పుం. 1. కట్టుట; పయి కెత్తికట్టుట. 2. ముందఱికి నిక్కుట. (ఉదా, స్తనోన్నాహము) అ. కాంజికము, పుల్లనీళ్లు.

ఉన్ని వి. (సం. ఊర్ణా. ప్రా. ఉన్నా.) గొఱ్ఱె మొదలగువాని బొచ్చు.

ఉన్నిగాఁడు వి. పక్షివిశేషము.

సీ.పొలఁకుల యుల్లంగి పూరేడు లావుక పొన్నంగి దాబయు మున్నిగాఁడు. సుద. 3. 194.

ఉన్నిద్రము సం. విశ. (అ. ఆ. అ.)1. నిదుర లేనిది. 2. ఎచ్చరిక గలది. 3. వికసించినది.

**ఉన్నీతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. పైకెత్తబడినది; పైకిఁ దీసికొనిపోఁబడినది. 2. ఊహింపఁబడినది.

**ఉన్నేత** సం. విణ. (ఋ. త్రీ. ఋ.) 1. పైకెత్తువాఁడు. 2. పైకిఁ గొనిపోవువాఁడు. 3. ఊహించువాఁడు.

**ఉన్నేతవ్యము** సం — ఉన్నేయము.

**ఉన్నేత్రము** సం. విణ. (అ. ఆ. అ.) ఎత్తిన కన్నులు గలది. వి. అ. న. ఎత్తినకన్ను.

**ఉన్నేయము** సం. విణ. (అ. ఆ. అ.) 1. పైకెత్తఁదగినది. 2. పైకిఁ దీసికొనిపోఁదగినది. 3. ఊహింపఁ దగినది.

**ఉన్మంథకము** సం విణ. (అ. ఇకా. అ.) — ఉన్మథనము. వి. అ. పుం. చెవివెలుపలిభాగమునఁ గలుగు నొకరోగము.

**ఉన్మంథనము** సం — ఉన్మథనము.

**ఉన్మంథము** సం. వి. అ. పుం. 1—ఉన్మథనము. 2. 2. చెవివెలుపలిభాగమునఁగలుగునొకరోగము.

**ఉన్మంథితము** సం — ఉన్మథితము.

**ఉన్మజ్జకుఁడు** సం. విణ. (అ. ఇకా. అ.) నీళ్లుమొదలగువానిపై తేలువాఁడు. వి.అ.పుం.గొంతులోఁతున నీటిలో నుండి తపస్సు చేయుఋషి.

శ్లో. కంఠదఘ్నే జలేస్థిత్వా తపః కుర్వన్ ప్రవర్తతే, ఉన్మజ్జకస్సవిజ్ఞేయస్తాపసో లోకపూజితః (వాచ).

**ఉన్మజ్జనము** సం. వి. అ. న. నీరు మొదలగువానిపైఁ దేలుట.

**ఉన్మత్తగంగము** సం. అవ్య. అ. న. (ఇచట గంగ ఉన్మత్తవలెఁ బ్రవహించును) దేశవిశేషము.

**ఉన్మత్తము** సం. విణ. (అ. ఆ. అ.)1. ఉన్మాదము గలది, వెఱ్ఱియెత్తినది. 2. మత్తుగలది, కైపెక్కినది. 3. ఉద్ధతము, గర్వించినది. 4. పిశాచాద్యావేశము గలది. వి. అ. పుం. 1. ఉమ్మెత్తచెట్టు. 2. ముచుకుందవృక్షము.

**ఉన్మథనము** సం. విణ. (అ. ఆ. అ.) 1. తరుచునది, కలఁచునది; కదలించునది. 2. పీడించునది. 3. చంపునది. 4. మర్దించునది, రాచునది. వి. అ. న. 1. తరుచుట, కలఁచుట, కదలించుట. 2. మర్దనము, రాపిడి. 3. పీడించుట. 4. చంపుట.

**ఉన్మథితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. మథింపఁబడినది, చిలుకఁబడినది. 2. పీడింపఁబడినది. 3. వధింపఁబడినది, 4. మర్దింపఁబడినది.

**ఉన్మదనము** సం. విణ. (అ. ఆ. అ.) కామోద్రేకము గలది.

**ఉన్మదము** సం. విణ. (అ. ఆ. అ.) 1. మదమెక్కినది, 2. వెఱ్ఱియెత్తినది. 3. మత్తుగలిగించునది. వి. అ. పుం. 1. వెఱ్ఱి, 2. మత్తు.

**ఉన్మదితుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) ఉన్మాదము పట్టినవాఁడు.

**ఉన్మదిష్ణువు** సం. విణ. (ఉ.) 1. ఉన్మాదశీలము, వెఱ్ఱిపట్టు స్వభావముగలది. 2. మత్తుగొనినది. 3. మదముపట్టునది (ఏనుఁగు, మొ.).

**ఉన్మనసుఁడు** సం — ఉన్మనుఁడు.

**ఉన్మనస్కుఁడు** సం. విణ. (అ.ఆ.అ.)—ఉన్మనుఁడు.

**ఉన్మని** సం. వి. ఈ. స్త్రీ. యోగుల అవస్థలలో నొకటి.

(ఇందు మనస్సుసంకల్పరహితముగానుండును.)

శ్లో. ఉన్మన్యవస్థాధిగమాయ విద్వన్నుపాయమేకం నిర్దిశామి, పశ్యన్నుదాసీనదృశా ప్రపంచం సంకల్పమున్మూలయసావధానః (వాచ).

**ఉన్మనుఁడు** సం. విణ. (న్.) 1. తహతహపడువాఁడు, ఉత్కంఠగలవాఁడు. 2. మనస్సు కలఁగినవాఁడు. 3. మనస్సుమఱియొకచోటఁగలవాఁడు, అన్యమనస్కుఁడు.

**ఉన్మయూఖము** సం. విణ. (అ. ఆ. అ.) 1. మయూఖములు (కాంతులు) నిగిడించునది, మిక్కిలి మెఱయునది. 2. మీఁదుగాఁ బ్రసరించు కాంతులు గలది. వి. అ. పుం. మీఁదుగాఁ బ్రసరించు కిరణము.

**ఉన్మర్దనము** సం. వి. అ. న. 1. రాచుట, రుద్దుట. 2. పిసుకుట. 3. (వైద్య) ఒడలునొక్కి పిసుకుట రుద్దుట మొదలగువ్యాపారము. 4. ఒడలిఁ రాచుకొనుట కుపయోగించుసుగంధిద్రవ్యము.

**ఉన్మాథము** సం. విణ. — ఉన్మథనము వి. అ. పుం. 1 — ఉన్మథనము. 2. జంతువులను బంధించుసాధనము (గాలము బోను ఉరి, మొ.).

**ఉన్మాథి** *నం. విశ.* (*న్. సీ. న్.*) – ఉన్మథనము.

**ఉన్మాదకము** *నం. విశ.* (*అ. దిశా. అ.*) ఉన్మాదము కలిగించునది. *వి. అ. పుం.* ఉన్మాదము కలిగించుద్రవ్యము (ఉమ్మెత్త, మొ.).

**ఉన్మాదనము** *నం. విశ.* (*అ. ఆ. అ.*) 1. వెఱ్ఱికొలుపునది. 2. మత్తు గలిగించునది. *వి. అ. పుం.* మన్మథుని యొక్క బాణవిశేషము (త్రి. ని.).

**ఉన్మాదము** *నం. వి. అ. పుం.* 1. వెఱ్ఱి. 2 (అలం.) సంచారిభావములలో నొకటి.

**ఉన్మాదయిత** *నం. విశ.* (*ఋ. త్రీ. ఋ.*) ఉన్మాదమును గలిగించునది.

**ఉన్మాదయితృకము** *నం. విశ.* (*అ. ఆ. అ.*) – ఉన్మాదయిత. శాకుం. 1.

**ఉన్మాది** *నం. విశ.* (*న్. సీ. న్.*) ఉన్మాదము గలవాఁడు.

**ఉన్మానము** *నం. వి. అ. న.* 1. త్రాసు మొదలగువానిచేఁ బైకెత్తి తూఁచుట. 2. తూఁచుటకు సాధనమైన త్రాసు, మొ. *పుం.* ద్రోణపరిమాణము, తూము.

**ఉన్మార్గము** *నం. విశ.* (*అ. ఆ. అ.*) దారితప్పినది. *వి. అ. పుం.* తప్పుత్రోవ, చెడ్డనడత,

**ఉన్మార్జనము** *నం. వి. అ. న.* 1. తుడిచివైచుట. 2. తొలఁగించుట.

**ఉన్మార్జించు** *నం. న. క్రి.* తుడుచు.

> మ... సమరిస్వేదోజ్జ్వలం బైనయు, గ్మవిఫాలంబుఁ గపోలయుగ్మకము నున్మార్జించుచుఁ దేవి యగ్గలికం బెద్ద పెనంగి డస్సి తిటులింకంజాలు నిల్మొంచు...పారి. ఉ. 4. 159.

(ఇట మార్జించు అనియు పదచ్ఛేదము చేయవచ్చును.)

**ఉన్మితము** *నం. విశ.* (*అ. ఆ. అ.*) తూనిక వేయఁబడినది.

**ఉన్మితి** *నం. వి. ఇ. స్త్రీ* – ఉన్మానము.

**ఉన్మిశ్రము** *నం. విశ.* (*అ. ఆ. అ.*) సంకీర్ణము, కలిసినది.

**ఉన్మిషము** *నం. విశ.* (*అ. ఆ. అ.*) వికసించినది. *వి. అ. పుం.* వికసించుట.

**ఉన్మిషితము** *నం. విశ.* (*అ. ఆ. అ.*) 1. వికసించినది (పుష్పము.) 2. తెఱవఁబడినది (కన్ను, మొ.) *వి. అ. న.* 1. చూపు, దృష్టి. 2. తెఱచుకొనుట. 3. వికసించుట.

**ఉన్మీలనము** *నం. వి. అ. న.* 1. (కన్ను) తెఱచుట. 2. వికాసము. 3. బయలుపడుట. 4. బయలుపఱచుట. 5. రంగుచేఁ బ్రకాశింపఁజేయుట, రంగువేయుట.

ఉదా: ఆలేఖ్యోన్మీలనం. కాదం. 267 (ఆ.ని.).

**ఉన్మీలితము** *నం. విశ.* (*అ. ఆ. అ.*) 1. తెఱవఁబడినది, విప్పఁబడినది. 2. వికసించినది. 3. బయలుపెట్టఁబడినది. 4. రంగుచేఁ బ్రకాశింపఁజేయఁబడినది, రంగువేయఁబడినది. (శ్లో: ఉన్మీలితం తూలికయేవ చిత్రం. నం కు. 1. 32.) *వి. అ. న.* 1. ఉన్మీలనము. 2. ఒకానొక అర్థాలంకారము (చంద్రాలోకము.).

**ఉన్ముక్తము** *నం. విశ.* (*అ. ఆ. అ.*) విడువఁబడినది; బంధనరహితము.

**ఉన్ముఖము** *నం. విశ.* (*అ. ఆ, ఈ. అ.*) 1. మొగము పైకెత్తినది, మీఁదికి చూచునది. 2. ఎదురుచూచునది. 3. సిద్ధమైనది, ఉద్యుక్తము. 4. పలుకునది.

> శ్లో: చూతయష్టిరివాభ్యాశే మధౌ పరభృతోన్ముఖీ. నం. కు. సం. 6. 2.

**ఉన్ముఖరము** *నం. విశ.* (*అ. ఆ. అ.*) బిట్టుగా మ్రోఁగునది.

**ఉన్ముద్రము** *నం. విశ.* (*అ. ఆ. అ.*) 1. ముద్రవీడినది, తెఱచుకొన్నది. 2. వికసించినది.

**ఉన్ముద్రించు** *నం. న. క్రి.* బయలు పఱచు, వెలిపుచ్చు.

> మ. మునుపుం ముచ్చటయుం రహస్యమును నున్ముద్రించి నానాదివౌకసు లాస్థానముఁ గూడి యాడుదురు శ్రీకాశీప్రదేశంబునం, గనవై పుట్టెడుభాగ్యమైన మనకుం గల్పింప దాదైవమీ, కసునూలం బగునాక మేలయని యుత్కంఠాతిరేకంబునం. కాశీ. 7. 206.

**ఉన్మూలనము** *నం. వి. అ. న.* 1. వేళ్లతోఁ బెల్లగించుట. 2. అడుగంటఁ దెఱచుట.

**ఉన్మూలము** సం. విశే. (అ. అ. అ.) 1. పైకివచ్చిన వేరు గలది. 2. పెల్లగింపఁబడినవేరు గలది. 3. అడుగంటఁ జెడినది.

**ఉన్మూలించు** సం. స. క్రి. పెల్లగించు.

సీ. కేల నున్మూలించి గిరిశృంగములుపూచి కాచిన తరులపై వైచివైచి. చం. రా. 2.83.

2. నాశముచేయు, మొదలంటఁ బోఁగొట్టు,

శా. ...రాజకాంతావిలా, పాలాపంబులు భూమి నెల్లెడల మెండై నిండెఁదద్దైన్యము,న్మూలించెన్ మది నెంచి కశ్యపుఁడు రాముంజేరి దీవించుచున్. దశా. 8. 146.

**ఉన్మూలితము** సం. విశే. (అ. అ. అ.) ఉత్పాటితము, పెల్లగింపఁబడినది.

**ఉన్మృష్టము** సం. విశే. (అ. అ. అ.) 1. తుడిచివైవఁబడినది. 2. కడుగఁబడినది, శుద్ధిచేయఁబడినది. 3. తొలఁగింపఁబడినది.

**ఉన్మేయము** సం. విశే. (అ. అ. అ.) తూఁచుటకుఁ దగినది.

**ఉన్మేష** సం. వి. అ. పుం — ఉన్మేషము. ('ము'వర్ణ లోపమువలన చరిత్రాదులలో గ్రాహ్యము.) (అభివ్యక్తి, స్ఫురణము.)

సీ. క్రముకఖండము తియ్యఁగాఁ బోయి సంగ్రహోన్మేష లేమిని శయ్యమీఁద మునిచి. శుక. 3. 487.

**ఉన్మేషణము** సం. వి. అ. న — ఉన్మేషము.

**ఉన్మేషము** సం. వి. అ. పుం. 1. (కన్ను, మొ.) తెఱచుట. 2. మెలకువ. 3. (పువ్వు, మొ.) వికసించుట. 4. కాంతి. 5. అభివ్యక్తి, స్ఫురణము.

**ఉన్మేషి** సం. విశే. (న్. నీ. న్.) 1. పైకివచ్చునది, బయలుపడునది. 2. ప్రకాశించునది, తళతళలాడునది. 3. వికసించునది. 4. తెఱచికొనియుండునది (కన్ను, మొ.).

**ఉన్మోచనము** సం. వి. అ. న. 1. విడుచుట. 2. విడిపించుట. 3. విప్పుట.

**ఉప** సం. అవ్య. (ఇది సమాసపూర్వపదముగానుండి తఱచుగా నీక్రిందియర్థములను దెలుపును.)

1. ఆసన్నము, సమీపముగ నున్నది.

ఉదా: ఉపవిష్యము, ఉపదశము.

2. అల్పము, చిన్నది.

ఉదా: ఉపపాతకము.

3. అధికము.

ఉదా: ఉపతప్త.

4. సదృశము.

ఉదా: ఉపమాత. చూ. 2. అర్థము.

5. కొన్నిపట్ల నిరర్థకముగాఁ గూడఁ గనఁబడుచున్నది.

ఉదా: ఉపహసించు. చూ. 1. అర్థము.

**ఉపకంఠము** సం. విశే. (అ. ఆ. అ.) దాపైనది, దగ్గఱ నున్నది. అవ్య. అ. న. 1. కంఠసమీపమందు. 2. కంఠమున. వి. అ. న. 1. పొలిమేర. 2. ఆస్కందితము, అశ్వగతులలో నొకటి. 3. సమీపదేశము. 4. సమీపకాలము.

**ఉపకథ** సం. వి. ఆ. స్త్రీ. ఒకకథలో అప్రధానముగా వచ్చుకథ.

**ఉపకనిష్ఠిక** సం. వి. ఆ. స్త్రీ — చిటికెన వ్రేలిదగ్గఱ నున్నది — అనామిక. ఉంగరపువ్రేలు.

**ఉపకన్య** సం. వి. ఆ. స్త్రీ. కన్యకకు చెలికత్తె, కన్యకయొక్క సహవాసిని.

**ఉపకరణము** సం. వి. అ. న. 1. ఉపకరించుట, ఉపయుక్తమగుట. 2. సాధనము, పనిముట్టు. 3. రాజాదులఛత్రచామరాదిచిహ్నము.

**ఉపకరణీయము** సం — ఉపకార్యము.

**ఉపకరించు** సం. అ. క్రి. ఉపయోగించు, ఉపకారకమగు.

ఆ. పరుల కుపకరించి పంము నమ్మిక నుండి, యొనరుచుండు రాజయోగి వేమ. వేమన. 3.35.

**ఉపకర్ణము** సం. అవ్య. అ. న. కర్ణసమీపమున.

**ఉపకర్త** సం. విశే. (ఋ. త్రీ. ఋ.) ఉపకరించువాఁడు, మేలు చేయువాఁడు.

**ఉపకర్తవ్యము** సం — ఉపకార్యము.

**ఉపకల్పన** సం. వి. ఆ. స్త్రీ — ఉపకల్పనము.

**ఉపకల్పనము** సం. వి. అ. న. 1. సిద్ధపఱుచుట. 2. కల్పించుట, పన్నుట.

**ఉపకల్పితము** సం. విశే. (అ. ఆ. అ.) 1. సిద్ధపఱుపఁబడినది. 2. పన్నఁబడినది.

**ఉపకారకము** సం. విశే. (అ. రికా. అ.) 1. ఉపయోగించునది, అనుకూల మగునది; ఉపకారము చేయునది.

**ఉపకారము** సం. వి. అ. పుం. ఉపకృతి మేలు.

క. నా కభిమతంబు నిట్టిద, మీకును నుపకార మగు సమీహితబుద్ధిం, జేకొని చేసెద మీఁరు, శోకస్థితి నుండుఁ డనుచు సుగనదికరుణా. భార. ఆది. 4. 128.

**ఉపకారి** సం. విశే. (న్. తీ. న్.) ఉపకారము చేయువాఁడు.

**ఉపకారిక** సం. వి. అ. స్త్రీ. 1. రాజగృహము, నగరు; ఉప్పరిగ, మేడ. 2. గుడారము. 3. ఉక్కెఱ, చక్కెర చేర్చి పిండితోఁ జేసినభక్ష్యము.

**ఉపకార్య** సం. వి. ఆ. స్త్రీ. 1. రాజగృహము, నగరు; ఉప్పరిగ, మేడ. 2. పటగృహము, గుడారము.

**ఉపకార్యము** సం. విశే. (అ. ఆ. అ.) 1. ఉపకారముచేయఁ దగినది. 2. ఉపకారమును పొందుటకుఁదగినది.

**ఉపకిరణము** సం. వి. అ. న. 1. వ్యాపించుట. 2. పయిని చల్లుట. 3. అంతటను చిమ్ముట. అవ్య. అ. న. కిరణముల సమీపమున.

**ఉపకీచకుఁడు** సం. వి. అ. పుం. కీచకునితమ్ముఁడు. (ఉపకీచకులు నూటైదుగురు)

**ఉపకుంచి** సం. వి. ఇ. స్త్రీ. నల్ల జీలకఱ్ఱ.

**ఉపకుంచిక** సం. వి. అ. స్త్రీ. 1. చిన్న యేలకిత్తిఁగ. 2. నల్ల జీలకఱ్ఱ.

**ఉపకుర్వత్** సం. క్రి. ఉపకారము చేయుచున్న.

**ఉపకుర్వాణుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) ఉపకారము చేయువాఁడు. వి. అ. పుం-దక్షిణయిచ్చుటచే గురువున కుపకరించువాఁడు-స్వాధ్యాయగ్రహణమువఱకు బ్రహ్మచర్యమును జరపి తర్వాత గురుదక్షిణ యిచ్చి స్నాతకవ్రత మాచరించి గృహస్థాశ్రమమునఁ బ్రవేశింపఁ బోవు బ్రహ్మచారి. (వ్యతి. నైష్ఠికుఁడు.)

**ఉపకుల్య** సం. వి. ఆ. స్త్రీ. 1. చిన్నకాలువ. 2. పిప్పలి (వృ. వి.).

**ఉపకుశము** సం. వి. అ. పుం. పండ్ల యిగుళ్ల వాఁపు. అవ్య. అ. న. కుశ సమీపమున.

**ఉపకూజితము** సం. విశే. (అ. ఆ. అ.) ప్రతిధ్వనించునట్లు చేయఁబడినది. వి. అ. న. 1. కూఁతనమరించి కూసినకూఁత. 2. ప్రతిధ్వని.

**ఉపకూపజలాశయము** సం. వి. అ. పుం. నిపానము, నూతియొద్దపసులు నీరుత్రాగుటకై కట్టినతొట్టి

**ఉపకూపము** సం. అవ్య. అ. న. నూతిదగ్గఱ.

**ఉపకృతము** సం. విశే. (అ. ఆ. అ.) ఉపకారము చేయఁబడినది. వి. అ. న. ఉపకారము.

**ఉపకృతి** సం. వి. ఇ. స్త్రీ. 1. ఉపకారము. 2. మూఁడువిధము లైన తత్సమధాతువులలో నొకటి. (తత్సమధాతువులు 'ఉపకృతి, పరిణతి, సంస్కృతి' భేదముచేత మూఁడు విధములు.)

1. ఉపకృతి: పుష్, ను మొదలగునవి. ఈధాతువులు కృత్ప్రత్యయముతోఁ గలసియే ప్రకృతియగును.

ఉదా: పుష్-పోష-పోషించు. ను-నుతి-నుతించు.

2. పరిణతి: భూ, జి, మొదలగునవి. ఈధాతువులు 'అయ్, అవ్, అర్' వీనితోఁ గలసియే ప్రకృతి యగును.

ఉదా: అనుభూ—అనుభవ్—అనుభవించు.
జి — జయ్—జయించు.

3. సంస్కృతి: రంజ్, వస్, మొదలగువి. ఈధాతువులు స్వస్వరూపముతోనే ప్రకృతులగును.

ఉదా: రంజ్—రంజించు. వస్—వసించు.

**ఉపక్లృప్తము** సం. విశే. (అ. ఆ. అ.) 1. సజ్జీకృతము, సిద్ధపఱుపఁబడినది. 2. ఉంపఁబడినది. 3. అర్థమైనది. 4. నియతము.

(ఉపకల్పనీయము మొదలగునవి కల్పనీయము మొదలగువానివలె గ్రహించునది)

**ఉపక్రంత** సం. విశే. (ఋ. త్రీ. ఋ.) ఉపక్రమించువాఁడు.

**ఉపక్రమకుఁడు** సం. విశే. (అ. మికా. అ.) ఉపక్రమించువాఁడు.

**ఉపక్రమణము** సం. వి. అ. న. 1. సమీపించుట. 2. ఉద్యోగించుట, పూనిక. 3. ప్రారంభించుట. 4. (వైద్య) చికిత్స

**ఉపక్రమణి** సం. వి. ఈ. స్త్రీ.—ఉపక్రమణిక.

**ఉపక్రమణిక** సం. వి. అ. స్త్రీ పీఠిక, అవతారిక, భూమిక.

**ఉపక్రమణీయము** సం. విశే. (అ. ఆ. అ.) సమీపింపఁ దగినది. 2. ఆరంభింపఁదగినది. 3. చికిత్స చేయఁ దగినది

**ఉపక్రమమాణుఁడు** సం. *విణ.* (అ. ఆ. అ.) ఉపక్రమించుచున్నవాఁడు.

**ఉపక్రమము** సం. *విణ.* (అ. ఆ. అ.) ఉపక్రమింపఁబడినది, ప్రారంభింపఁ బడినది. (ఉపక్రమశబ్దము ఉత్తరపదముగాఁ గలతత్పురుషము 'ఈ విషయమును మొదట ఉపక్రమించినవాఁడు వీఁడు' అని చెప్పఁదలఁచినపుడు నిత్యనపుంసకమగును.

ఉదా: రామస్య ఉపక్రమా – రామోపక్రమమ్–ఈ స్తిరస్కృతిః.)

*వి. అ. పుం.* 1. ఉపాయము నెఱిఁగి ప్రారంభించుట; ప్రథమారంభము; అరంభము, మొదలు పెట్టుట. 2. సమీపించుట. 3. విక్రమము. 4. సామాద్యుపాయము. 5. ఉపధ, మంత్రులు లోనగువారిని బరీక్షించుట. 6. చికిత్స. 7. (వేదాంత) తాత్పర్యము నిర్ణయించునట్టి హేతు విశేషము. (ఉపక్రమోపసంహారౌ హేతుస్తాత్పర్యనిర్ణయే. వాచ.) 8. భూమిక, ఉపోద్ఘాతము.

**ఉపక్రమించు** సం. అ. క్రి. స. క్రి. ప్రారంభించు, మొదలుపెట్టు.

చ. ...పో, దమ చమదెమ్ము నావుడు నతండరు గంగ నుపక్రమించినన్. మార్క. 2. 122.

చ. అని యట దీక్ష పూని ముని యధ్వరకర్మ ముపక్రమించె...రామా. 4. 44.

**ఉపక్రమితవ్యము** సం. – ఉపక్రమణీయము.

**ఉపక్రమ్యమాణము** సం. *విణ.* (అ. ఆ. అ.) ఉపక్రమింపఁబడుచున్నది.

**ఉపక్రమ్యము** సం. – ఉపక్రమణీయము.

**ఉపక్రాంతము** సం. *విణ.* (అ. ఆ. అ.) 1. ఆరంభింపఁబడినది. 2. విస్తృతము, విరివియైనది.

**ఉపక్రామత్** సం. శక్రి. ఉపక్రమించుచున్న.

**ఉపక్రామ్యత్** సం. – ఉపక్రామత్.

**ఉపక్రియ** సం. వి. ఇ. స్త్రీ. – ఉపకారము.

**ఉపక్రోశనము** సం. వి. అ. న. నింద.

**ఉపక్రోశము** సం. వి. అ. పుం. నింద.

**ఉపక్రోష్ట** సం. *విణ.* (ఋ. ష్ట్రీ. ఋ.) నిందించునది. వి. ఋ. పుం. – ఓండ్రపెట్టునది – గాడిద.

**ఉపక్వణము** సం. వి. అ. పుం. వీణానాదము.

**ఉపక్వాణము** సం. – ఉపక్వణము.

**ఉపక్షయము** సం. *విణ.* (అ. ఆ. అ.) క్షీణించినది, తఱిఁగినది. వి. అ. పుం. 1. తఱుఁగుట, క్షీణించుట. 2. వ్యయము. అవ్య. అ. న. ఇంటి సమీపమున.

**ఉపక్షీణము** సం. *విణ.* (అ. ఆ. అ.) 1. క్షీణించినది, తఱిఁగినది. 2. కార్యాదులకు అసమర్థమైనది, ఓపనిది.

**ఉపక్షేపణము** సం. వి. అ. న. 1. త్రోసివేయుట; విసరుట. 2. ఆక్షేపించుట, దోషారోపణము చేయుట. 3. సమర్పణము, ఇచ్చుట. 4. శూద్రుని సొత్తయినబియ్యము మొదలగుపదార్థములను బ్రాహ్మణుని గృహమునందు వంటకమునకై సమర్పించుట.

**ఉపక్షేపము** సం. వి. అ. పుం. 1, త్రోసివేయుట: విసరివైచుట. 2, సూచించుట. 3. ఆక్షేపము, దోషారోపము. 4. ప్రారంభము. 5. సమీపమున నుంచుట.

**ఉపగంత** సం. *విణ.* (ఋ. త్రీ. ఋ.) 1. సమీపించువాఁడు. 2. పొందువాఁడు. 3. తెలియువాఁడు 4. స్వీకరించువాఁడు. 5. అంగీకరించువాఁడు. (ఉపగంతవ్యము మొదలగునవి గంతవ్యము మొదలగువానివలె గ్రహించునది.)

**ఉపగణము** సం. *విణ.* (అ. ఆ. అ.) గణమును–సముదాయమును–పొందినది, గణమును చేరినది.

వి. అ. పుం. 1. చిన్నగణము, అముఖ్యమగు గణము. 2. గణ మనెడిసేనాసముదాయము కంటె తక్కువసేన.

**ఉపగతము** సం. *విణ.* (అ. ఆ. అ.) 1. ప్రాప్తము, పొందఁబడినది. 2. సమీపించినది. 3. పుచ్చుకొనఁబడినది. 4. తెలియఁబడినది. 5. పోయినది. 6. పొందినది. 7. అంగీకరింపఁబడినది. వి. అ. న. 1. ప్రాప్తి. పొందుట. 2 స్వీకారము. 3. సమీపించుట. 4. జ్ఞానము. 5. ప్రాప్తిసూచకపత్త్రము (రసీదు.) 6. అంగీకారము.

**ఉపగతి** సం. వి. ఇ. స్త్రీ. 1. సమీపించుట. 2. జ్ఞానము. 3. అంగీకారము. 4. ప్రాప్తి, పొందుట. 5. పుచ్చుకొనుట.

**ఉపగమనము** సం. వి. అ. న. — ఉపగమము.

**ఉపగమము** సం. వి. అ. పుం. 1. సమీపించుట. 2. స్వీకారము. 3. అంగీకారము. 4. జ్ఞానము, ఎఱుక. 5. ప్రాప్తి, పొందుట. 6. కలియుట.

**ఉపగము** సం. విశే. (అ. ఆ. అ.) 1. సమీపించునది. 2. పొందునది.

శ్లో. ...బహుపుష్పఫలోపగాః. మను. 1. 46.

శ్లో. ...తచ్చరణోపగం శిరః. శిశు. 16. 69.

**ఉపగాత** సం. విశే. (ఋ. త్రీ ఋ.) తోడుగాఁ బాడువాఁడు. వి. ఋ. పుం. యజ్ఞమున ఉద్గాత దగ్గఱ గానముచేయునొకానొక ఋత్విజుఁడు.

**ఉపగామి** సం. విశే. (న్. నీ. న్.) — ఉపగంత.

**ఉపగిరము** సం. అవ్య. అ. న. కొండదగ్గఱ.

**ఉపగిరి** సం. అవ్య. ఇ. న. — ఉపగిరము.

**ఉపగీతము** సం. విశే. (అ. ఆ. అ.) 1. పాడఁబడినది. 2. స్తుతింపఁబడినది. 3. సమీపమున పాడుటకు ప్రారంభించినది. శిశు. 4. 57.
(ఉపగేయము మొదలగునవి గేయము మొదలగువానివలె గ్రహించునది )

**ఉపగీతి** సం. వి. ఇ. స్త్రీ. 1. గానము. 2. స్తుతి. 3. ఆర్యావృత్తభేదము.

**ఉపగుప్తము** సం. విశే. (అ. ఆ. అ.) దాఁపఁబడినది.

**ఉపగురువు** సం. వి. ఉ. పుం. 1. సహోపాధ్యాయుఁడు. 2. (తంత్ర) గురువువలె ఉపదేశాదులు చేయువాఁడు, గురువువంటివాఁడు.

**ఉపగువు** సం. విశే. (ఉ) గోవులను పొందినవాఁడు.

**ఉపగుహ్యము** సం. విశే. (అ. ఆ. అ.) 1 కౌఁగిలింపఁ దగినది. 2. పట్టుకొనఁ దగినది. వి. అ. న. కౌఁగిలి.

**ఉపగూఢము** సం. విశే. (అ. ఆ. అ.) 1, దాఁపఁబడినది. 2. కౌఁగిలింపఁబడినది. 3. పట్టుకొనఁబడినది.

శ్లో: కశ్చిత్కరాభ్యాముపగూఢనాళమ్. రఘు. 6. 13.

వి. అ. న. కౌగిలి.

**ఉపగూహనము** సం. వి. అ. న. 1. దాఁచుట. 2. కౌఁగిలింత.

**ఉపగోహ్యము** సం. — ఉపగుహ్యము.

**ఉపగ్రంథము** సం. వి అ. పుం. ఒకపెద్దగ్రంథమునకు అనుబంధముగాఁ గాని దాని ననుసరించి గాని రచించిన చిన్నగ్రంథము.

**ఉపగ్రహణము** సం. వి. అ. న. 1. పట్టుకొనుట. 2. బందిగాఁ బట్టుకొనుట, చెఱఁబెట్టుట. 3. తోడ్పడుట. 4. అనుకూలించుట. 5. స్వీకరించుట.

**ఉపగ్రహము** సం. వి. అ. పుం. 1. చెఱఁ బెట్టుట. 2. చెఱఁబడ్డది—బంది. 3. చెఱ. 4. నిరోధము,అడ్డు.

శ్లో: అథచ విహితే మత్కృత్యానాం నికామముపగ్రహే. ముద్రా. 4. 2.

5. ఉపయోగము. 6, అనుకూలించుట. 7. రాహువు కేతువు, మొ. 8. సంధి.

శ్లో: క్రియతే ప్రాణరక్షార్థం సర్వదానాదుపగ్రహః. హితో. 4. 121.

9. (జ్యోతి)విద్యున్ముఖాదినక్షత్రము.(సూర్యుఁడుండునక్షత్రమునకు ఐదవనక్షత్రము విద్యున్ముఖము. ఎనిమిదవది శూన్యము. పదునాల్గవది సన్నిపాతము. పదునెనిమిదవది కేతువు. ఇరువదియొకటవది ఉల్క. ఇరువది రెండవది కంపము. ఇరువదిమూఁడవది వజ్రము. ఇరువదినాల్గవది నిర్ఘాతము.)

**ఉపగ్రాహము** సం. వి. అ. పుం. 1. కానుక. 2. కానుక యిచ్చుట.

**ఉపగ్రాహ్యము** సం. విశే. (అ. ఆ. అ.) 1. దరిఁ జేర్పఁ దగినది, దగ్గఱ పెట్టుకొనఁ దగినది. 2. కానుకగా నీయఁ దగినది. వి. అ. న. కానుక.

**ఉపఘాతకము** సం. విశే. (అ. తికా. అ.) 1. నాశము సేయునది. 2. పీడించునది.

**ఉపఘాతము** సం. వి. అ. పుం. 1. దెబ్బ. 2. కొట్టుట. 3. బాధ. 4. నాశము. 5. అపకారము. 6. రోగము.

**ఉపఘాతి** సం. విశే. (న్. నీ. న్.) - ఉపఘాతకము.

**ఉపఘుష్టము** సం. విశే. (అ. ఆ. అ.) 1. ప్రతిధ్వనించునది,మాఱుమ్రోఁగునది. 2. శబ్దించునది.

**ఉపఘోషణము** సం. వి. అ. న. 1. ధ్వని చేయుట. 2. ప్రతిధ్వనించుట. 3. చాటుట.

**ఉపఘ్నము** సం. వి. అ. పుం. ప్రాఁకు, దగ్గఱ నుండెడియాశ్రయము; ఆధారము, ప్రాపు.

**ఉపచక్రము** సం. వి. అ. పుం. చక్రవాక పక్షివలె నుండునొకపక్షి.

**ఉపచక్షుస్సు(వు)** సం. వి. స్. న. ఉపనేత్రము, సులోచనము.

**ఉపచయము** సం. వి. అ. పుం. 1. వృద్ధి 2. ప్రోగు. 3. ఎత్తు, ఔన్నత్యము. 4. (జ్యోతి) లగ్నమునకు, 3,6,10,11వ స్థానము.

**ఉపచరణము** సం. వి. అ. న. 1. ఉపచారము చేయుట. 2. సమీపించుట. 3. చికిత్సచేయుట.

**ఉపచరించు** సం. స. క్రి. 1. సమ్మానించు. 2. సేవించు.

క. అచటికి వీణామౌనిన,హాచరుం డగు పర్వ తాఖ్యుఁ డరుదెంచిన రా,త్రిచరేంద్రుఁ డుపచరించి స,ముచితస్థితి మాటాలాడు చుండెడు వేళ౯, ఉ.రా. 4.47.

ద్వి. ముక్తులై యరుదెంచువారి...ఫలముల చేతఁ బుష్పములచేత, నుపచరించుచు నుండు నుచితవైఖరుల. ద్వి. పరమ. 10పా 12 పం.

3. బోధించు, ఉపన్యసించు.

సీ. పాణినీయపు ఫక్కి వాదించు నొకవేళ నొక వేళ వేదాంత ముపచరించు. నిరం. 4. 74.

**ఉపచరితము** సం. విశే. (అ. ఆ. అ.) 1. సేవింపఁ బడినది. 2. సమ్మానింపఁబడినది 3 (లక్షణచే) అర్థమును బోధించుటకు ప్రయుక్తము (శబ్దము)

**ఉపచరితవ్యము** సం - ఉపచర్యము.

**ఉపచర్మము** సం.విశే. (న్.న్.అ.న్.) చర్మమును పొందినది. అవ్య. న్, అ. న. చర్మముదగ్గఱ.

**ఉపచర్య** సం. వి. ఆ. స్త్రీ. 1. సేవ, కొలువు. 2. చికిత్స (హలా. ని.)

**ఉపచాయి** సం. విశే. (న్. నీ. న్.) 1. పెరుఁగునది, వర్ధిల్లునది. 2. పెంపునొందించునది.

**ఉపచాయ్యము** సం. వి. అ. పుం. యజ్ఞమునందు అగ్నిధారణముకొఱకు ఇష్టకాదులచేత నిర్మింపఁబడినస్థలవిశేషము.

**ఉపచారము** సం. వి. అ. పుం. 1. సేవ, కొలువు. 2. సమ్మాననము, గౌరవించుట. 3. చికిత్స 4. లంచము. 5. వ్యవహారము, వాడుక, 6. నడవడి, ప్రవర్తన. 7. అలంకారము; అలంకారసాధనము. 8. పూజాసాధనము (పంచోపచారములు:- స్నానము,పూజ, నైవేద్యము, ప్రదక్షిణము, నమస్కారము. షోడశోపచారములు :- ఆవాహనము, ఆసనము, పాద్యము అర్ఘ్యము, ఆచమనీయము, అభిషేకము, వస్త్రము, యజ్ఞోపవీతము, గంధము, పుష్పము, ధూపము, దీపము, నైవేద్యము, తాంబూలము, ప్రదక్షిణము, నమస్కారము.) 9. విధ్యుక్తమగుసంస్కారము.

శ్లో. ... ప్రయుక్తపాణిగ్రహణోపచారౌ... సం. కు. సం. 7.86.

10. లక్షణావృత్తి. 11. ప్రార్థనము, వేఁడుకొనుట. 12. సమీపించుట. 13. ఇతరుని సంతోషింపఁజేయుటకై కావించెడి అసత్య భాషణము.

శ్లో : ఉపచారపదం న చేదిదం. సం. కు. సం. 4.9.

**ఉపచారి** సం. విశే. (న్. ణీ. న్.) ఉపచారము చేయువాఁడు.

**ఉపచార్యము** సం - ఉపచర్యము.

**ఉపచికీర్ష** సం. వి. ఆ. స్త్రీ. ఉపకారము చేయనిచ్ఛ.

**ఉపచికీర్షువు** సం. విశే. (ఉ.) ఉపకారముచేయనిచ్ఛగలవాఁడు.

**ఉపచితము** సం. విశే. (అ. ఆ. అ.) 1. సంచితము, కూడఁబెట్టినది. 2. పెరిఁగినది; బలిమి నొందినది. 3. కుదురుపడినది. 4. సమృద్ధము, నిండినది. 5. పూయఁబడినది.

**ఉపచితి** సం. వి. ఇ. స్త్రీ. 1. ప్రోగగుట. 2. వృద్ధి 3. ఎత్తు.

**ఉపచిత్ర** సం. వి. ఆ. స్త్రీ. 1. ఎలుక జీడిచెట్టు. 2. చిత్తానక్షత్రమునకు సమీపముగా నున్న నక్షత్రము. (హస్త, స్వాతి.) 3. దంతీవృక్షము 4. ఒకానొక మాత్రావృత్తము.

**ఉపచేయము** సం. విశే. (అ. ఆ. అ ) ప్రోగుసేయఁదగినది.

**ఉపచ్ఛందనము** సం. వి. అ. న. 1. సాంత్వనము, బతిమాలుట. 2. పిలుచుట.

**ఉపజనము** సం. వి. అ. న. 1. ఉత్పత్తి, పుట్టుక. 2. శరీరము. అవ్య. అ. న. జనసమీపమున.

**ఉపజప్యుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) వేఱుపఱుపఁదగినవాఁడు, భేదము కలిగింపఁ దగినవాఁడు.

**ఉపజల్పనము** సం. వి. అ. న. సంభాషణము, మాటాడుట.

**ఉపజల్పి** సం. విశే. (న్. నీ. న్.) సంభాషించువాఁడు.

**ఉపజల్పితము** సం. విశే. (అ. ఆ. అ.) చెప్పఁబడినది. వి. అ. న. సంభాషణము.

**ఉపజాతము** సం. విశే. (అ. ఆ. అ.) 1. పుట్టినది, కలిగినది. 2. జరిగినది, సంభవించినది.

**ఉపజాతి** సం. వి. ఇ. స్త్రీ. (ఛంద) 1. వృత్తభేదము. 2. ఆంధ్ర పద్యభేదము (సప్తవిధసీసములును నవవిధగీతములును ఉపజాతు లనఁబడును.)

**ఉపజాపకుఁడు** సం. విశే. (అ. వికా. అ.) భేదము పుట్టించువాఁడు.

**ఉపజాపము** సం. వి. అ. పుం. 1. భేదోపాయము. 2. ఉపాంశువు, మెల్లఁగా చేయుజపము.

**ఉపజిహ్వ** సం. వి. ఆ. స్త్రీ. 1. కొండనాలుక. 2. నాలుక క్రింది ప్రక్కను కండ పెరుఁగు రోగము. 3. కీటభేదము.

**ఉపజిహ్వక** సం. - ఉపజిహ్వ.

**ఉపజీవకుఁడు** సం. విశే. (అ. వికా. అ.) 1. ఒకరి ననుసరించి జీవించువాఁడు. 2. ఆశ్రయించువాఁడు, అండ గొనువాఁడు (భృత్యుఁడు.)

**ఉపజీవనము** సం. వి. అ. న. - ఉపజీవిక.

**ఉపజీవి** సం. విశే. (న్. నీ. న్.) - ఉపజీవకుఁడు.

**ఉపజీవించు** సం. స. క్రి. ఆశ్రయించి జీవించు.

గీ.... అమరు లింద్రుఁ, ననిశమును నుపజీవించు వట్లు బంధుజనులు నిన్నుపజీవింప మనుము పేర్మి. భార. సభా. 2.79.

వ. సకల భూతంబులుం ద న్నుపజీవింపం బెంపారువాని. భార. అను. 1.315.

**ఉపజీవిక** సం. వి. ఆ. స్త్రీ. 1. జీవనము, బ్రతుకు. 2. జీవనాధారము.

**ఉపజీవ్యము** సం. విశే. (అ. ఆ. అ.) 1. జీవనోపాయము గలిగించునది. 2. అవలంబింపఁ దగినది. 3. విషయాదులు సంగ్రహించుటకు ఆధారమైనది (గ్రంథాది.) వి. అ. న. జీవనోపాయము.

**ఉపజుష్టము** సం. విశే. (అ. ఆ. అ.) 1. సేవింపఁబడినది; అనుభవింపఁబడినది. 2. ఇష్టమైనది.

**ఉపజ్ఞ** సం. వి. ఆ. స్త్రీ. ఆద్యజ్ఞానవిషయ మగునది, మొట్టమొదట కనిపట్టఁబడునట్టిది, మొట్టమొదట తెలిసికొనఁబడునట్టిది. (ఇది ఉత్తరపదము గాఁ గల తత్పురుషమున 'ఈవిషయమును మొదటఁ దెలిసికొనినయతఁ డితఁడు' అని చెప్పఁదలఁచినపుడు నిత్యనపుంసకమగును.-ఉదా: పాణిన్యుపజ్ఞము వ్యాకరణము, ప్రాచేతసోపజ్ఞము రామాయణము, బ్రహ్మోపజ్ఞము వేదము' ఇత్యాది. కాని పాణినిచే ఉపజ్ఞ యైనవ్యాకరణమునన్నగుచోట్ల ఆకారాంతస్త్రీ లింగముగానే యుండును.)

వి. ఆ. స్త్రీ. ఆద్యజ్ఞానము, పరులయుపదేశము లేకయే మొట్టమొదట కలుగుజ్ఞానము.

**ఉపజ్ఞాతము** సం. విశే. (అ. ఆ. అ.) ఉపదేశాదికము లేకయే తెలియఁబడినది; అపూర్వముగాఁ గనిపట్టఁబడినది.

**ఉపజ్వలితము** సం. విశే. (అ. ఆ. అ.) 1. జ్వలింపఁజేయఁబడినది. 2. జ్వలించినది.

**ఉపఝుంపె** వి (వాద్యములయొక్క) ఒకవిధమగు వాయింపు ప్రబంధ 100.

**ఉపఢౌకనము** సం. వి. అ. న. 1. కానుక, ఉడుగర. 2. కానుక యిచ్చుట.

**ఉపతటము** సం. అవ్య. అ. న. తటసమీపమున.

**ఉపతపనము** సం. విశే. (అ. ఆ. ఈ. అ.) తపింపఁజేయునది; బాధించునది. వి. అ. న. తపింపఁజేయుట.

**ఉపతపించు** సం. అ. క్రి. సంతాపము నొందు, దుఃఖపడు.

సీ. ఒరులసంపదకునై యుపతపింపఁడు లోన నిందింపఁ డెంతటినీచు నైన. పాండు. 2.6.

**ఉపతప్త** సం. విశే. (ఋ. త్రీ. ఋ.) మిక్కిలితపింపఁజేయునది. వి. ఋ. పుం. 1. రోగము. 2. వేఁడి.

**ఉపతప్తము** నం. విణ. (అ. అ. అ.) 1. వేఁడఁబడినది; కాఁగునట్లు చేయఁబడినది. 2. బాధింపఁబడినది.

**ఉపతాపకము** నం. విణ. (అ. వికా. అ.) ఉపతాపము కలిగించునది.

**ఉపతాపనము** నం. వి. అ. న. 1. వేఁడి కలిగించుట. 2. పీడించుట.

**ఉపతాపము** నం. వి. అ. పుం. 1. సంతాపము, వేఁడిమి. 2. రోగము. 3. అశుభము, కీడు. 4. తొందర.

**ఉపతాపి** నం. విణ. (న్. నీ. న్.) 1. వేఁడి కలిగించువాఁడు. 2. పీడించువాఁడు. 3. ఉపతాపము కలవాఁడు.

**ఉపతాయి** వి. మల్ల బంధవిశేషము.

('మల్లవిజ్ఞానము' అని. శ. ర. ఇంకను విచార్యము)

సీ. ఉపతాయిలోఁ దన కొదవిన తోరహ త్తము చూపి....భార. విరా. 2. 15.

క. నిపుణతఁ బెనఁగంగఁ దొడఁగి, రుపతాయి న్వేషభాష లుపలాస్యముగా. హరి. 7. 82.

వ. ....సింగంబులు పెనంగుభంగి నుపతాయిలో ననువార లిరువురుం జదిసియుఁ గుదిసియు... ఉ. హరి. 3. 70. (వీరేశ. పా.).

**ఉపతిష్యము** నం. వి. అ. న. – పుష్యనక్షత్రసమీపమున నున్నది–1. పునర్వసు. 2. ఆశ్లేష.

**ఉపతిక్త** నం. వి. ఆ. స్త్రీ. కొండచేరువ నేల. (వ్యతి. అధిత్యక.)

**ఉపద** నం. వి. ఆ. స్త్రీ. 1. కానుక. 2. లంచము.

**ఉపదంశము** నం. వి. అ. పుం. 1. ఊరుఁగాయ. 2. (భక్ష్యద్రవ్యమునకు ఉపకరణమయిన) కూర మొదలగునది. 3. సందంశనము, కొఱుకుట; (తెలు. మొ.)కుట్టుట. 4. కొఱుకురోగము. 5. మునగ (వృ. వి.) ఏలువంగ (వృ. వి.).

**ఉపదంశి** నం. విణ. (న్. నీ. న్.) ఉపదంశరోగముగలవాఁడు.

**ఉపదర్శకుఁడు** నం. విణ. (అ. ఋకా. అ.) 1. (కార్యమును లోపములు లేకుండఁగ) కనుపెట్టి చూచువాఁడు. 2. చూపువాఁడు. 3. చూచువాఁడు, సాక్షి. వి. అ. పుం. ద్వారపాలకుఁడు.

**ఉపదశము** నం. విణ. (అ. ఆ. అ.)–పదికి దగ్గఱగా నున్నది–1. తొమ్మిది. 2. పదునొకటి.

**ఉపదానము** నం. వి. అ. న. 1. అరణము. 2. కానుక. 3. లంచము.

**ఉపది** నం. వి. ఈ. స్త్రీ. 1. బదరిక (వృ. వి.) 2. చెదపురుగు.

**ఉపది(దీ)క** నం. వి. ఆ. స్త్రీ – ఉపది.

**ఉపదిక్కు** నం. వి. క్. స్త్రీ. విదిక్కు, మూలదిక్కు. (ఐశాని ఆగ్నేయి నైరృతి వాయవి అని నాలుగు ఉపదిక్కులు.)

**ఉపదిగ్ధము** నం. విణ. (అ. ఆ. అ.) పూయఁబడినది, లేపనముచేయఁబడినది.

**ఉపదిశ** నం. వి. ఆ. స్త్రీ. – ఉపదిక్కు.

**ఉపదిష్టము** నం. విణ. (అ. ఆ. అ.) 1. 'ఇది ఇట్టిది' అని తెలుపఁబడినది.

శ్లో: పృథూపదిష్టాం దుదుహుర్ధరిత్రీం. సం. కు. సం, 1. 2.

2. ఉపదేశింపఁబడినది (విషయము.) 3. ఉపదేశమునొందినది (శిష్యాది.) వి. అ. న. ఉపదేశము.

**ఉపదేవత** నం. వి. ఆ. స్త్రీ. దేవయోని (విద్యాధరాది.)

**ఉపదేశకుఁడు** నం. విణ. (అ. శికా. అ.) ఉపదేశము సేయువాఁడు.

**ఉపదేశనము** నం. వి. అ. న. ఉపదేశించుట.

**ఉపదేశము** నం. వి. అ. పుం. 1. బోధనము; హితబోధనము. 2. దీక్షాపూర్వకముగ మంత్రాదుల నుపదేశించుట. 3. విధివాక్యము. 4. (వ్యాక) ధాత్వాదికము.

శ్లో: ధాతుసూత్రగణోణాదివాక్యలింగానుశాసనం, ఆగమప్రత్యయాదేశా ఉపదేశాః ప్రకీర్తితాః.

**ఉపదేశి** నం. విణ. (న్. నీ. న్.)–ఉపదేశకుఁడు.

**ఉపదేశించు** నం. న. క్రి. ఉపదేశముచేయు, బోధించు.

క. ...నీకు ననఘ పండితజను లైనను నేండు, హితముపదేశింప నేర్తురే యెలనాఁగల్. మార్క. 2. 823.

వ. ...నీకు నొక్కటి యుపదేశించెద ... భా. రా. యు. 2071.

మ. ...శచీప్రాణేశుకెం గేలికిన్, జీవురుం గైదువుణోదు వైద్య ముపదేశించెన్ రహస్యంబునన్...విదర్భరాజతనయాహృద్యస్తనద్వంద్వమున్. నై. ష. 3. 34.

**ఉపదేష్ట** నం. విణ. (ఋ. ష్టి. ఋ.)–ఉపదేశకుఁడు.

**ఉపదేహిక** నం. వి. ఆ. స్త్రీ. చెదపురుగు.

**ఉపదోహము** నం. వి. అ. పుం. పాలు పితికెడు పాత్రము.

**ఉపద్రవము** నం. వి. అ. పుం. 1. విపత్తు, ఆపద. 2. బాధ. 3. రోగోద్రేకమును సూచించువికారము.

**ఉపద్రష్ట** నం. విణ. (ఋ. ష్టి. ఋ.) దగ్గఱ నుండి చూచువాఁడు. వి. ఋ. పుం. – యజ్ఞాదికర్మములయందలి గుణదోషములను కనుపెట్టిచూచువాఁడు–ఒకానొకఋత్విక్కు.

**ఉపద్రుతము** నం. విణ. (అ. ఆ. అ.) ఉపద్రవము నొందినది.

**ఉపద్వీపము** నం. వి. అ. పుం. చిన్నద్వీపము.

**ఉపధ** నం. వి. ఆ. స్త్రీ. 1. స్థాపనము, ఉంచుట. 2. మంత్రి మొదలగువారిగుణములను పరీక్షించుట. 3. ఉపాయము. 4. కపటము, మోసము, కూటకల్పన. 5. (వ్యాక) కడపటియక్షరమునకు పూర్వాక్షరము.

**ఉపధర్మము** నం. వి. అ. పుం. 1. అప్రధాన మగు ధర్మము. 2. అవైదికధర్మము.

**ఉపధాతువు** నం. వి. ఉ. పుం. 1. తక్కువరకపు ధాతువు. (ఇట్టిధాతువు లేడు–స్వర్ణమాక్షికము తారమాక్షికము తుత్థము కాంస్యము రీతి సిందూరము శిలాజతువు.) 2. శరీరమందలి రసాది సప్తధాతువులవలనఁ బుట్టినచనుఁబాలు మొదలగునవి ( స్తన్యము రజస్సు వస స్వేదము దంతములు కేశములు ఔజస్యము.)

**ఉపధానము** నం. వి. అ. న. స్థాపనము, ఉంచుట. 2. తలగడ. 3. విశేషము, ప్రత్యేకగుణము, ప్రత్యేకలక్షణము. 4. స్నేహము. 5. విషము.

**ఉపధానీయము** నం. విణ. (అ. ఆ. అ.) దగ్గఱనుంపఁదగినది. వి. అ. న తలగడ.

**ఉపధాయి** నం. విణ. (న్. నీ. న్.)–భుజాదులను–తలగడగా నుపయోగించువాఁడు.

**ఉపధారణ** నం. వి. ఆ. స్త్రీ. – ఉపధారణము.

**ఉపధారణము** నం. వి. అ. న. 1. మీఁద నుండు వస్తువును దోంకెనమొదలగువానితో క్రిందికి లాగుట. 2. ఏకవిషయముననే చిత్తమునిలుపుట.

**ఉపధావనము** నం. వి. అ. న. 1. వెంబడించుట, వెంటఁ బరుగిడుట. 2. మననము చేయుట.

**ఉపధావనుఁడు** నం. విణ. (అ. ఆ. అ.) వెంబడించువాఁడు; వెంటఁ బరుగెత్తువాఁడు.

**ఉపధి** నం. వి. ఇ. పుం. 1. కపటము, మోసము. 2. (వ్యవహారమున) సత్యమును గప్పిపుచ్చుట, అసత్యవిషయము సత్యముగాఁ దోఁచునట్లు చేయుట. 3. భయము. 4. రథచక్రము.

**ఉపధూపితము** నం. విణ. (అ. ఆ అ.) 1. పొగవేయఁబడినది. 2. చావుసమీపించినది. 3. సంతాపము గలది; మిక్కుటమైనబాధ గలది. వి. అ. పుం. మృత్యువు.

**ఉపధూమితము** నం. విణ. (అ. ఆ. అ.) పొగసినది. పొగ గలది.

**ఉపధృతి** నం. వి. ఇ. స్త్రీ. 1. సంధారణము, పైకి ఎత్తి పట్టుకొనుట. 2. కిరణము.

**ఉపధ్మ** నం. వి. ఆ. స్త్రీ. ఊఁదుట, ముఖమార్గమున గాలివిడుచుట.

**ఉపధ్మానము** నం. వి. అ. పుం. 1. ఓష్ఠము, పెదవి. 2. ఊఁదుట, ముఖమార్గమున గాలి విడుచుట.

**ఉపధ్మాని** నం. విణ. (న్. నీ. న్.) ఊఁదువాఁడు, ముఖమార్గమున గాలి విడుచువాఁడు.

**ఉపధ్మానీయము** నం. వి. అ. పుం.–ఉపధ్మానము (ఓష్ఠము) నందుఁ బుట్టినది–'పఫ'లకు పూర్వము అర్ధవిసర్గమువలె నుండువర్ణభేదము.(ఉదా: తపఃఫలము, శిరఃపాతము, మొ.)

**ఉపధ్వస్తము** నం. విణ. (అ. ఆ. అ.) నశించినది.

**ఉపనక్షత్రము** నం. వి. అ. న. అప్రధాననక్షత్రము. (అశ్విన్యాదు లగునిరువదియేడు నక్షత్రములందొక్కొక్కటికిని వేలువేలు యిరువదియేడేసి

చిన్నవక్షత్రములు అనుగతము లయి రాశిచక్రమునం దుండును.)

**ఉపనఖము** సం. వి. అ. న. చిప్పము, గోళ్లయందలి మాంసమునఁ బుట్టురోగము.

**ఉపనగరము** సం. వి. అ. పుం. శాఖానగరము, పేట.

**ఉపనతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. సమీపించినది. 2. పొందఁబడినది. 3. సంభవించినది. 4. వంగినది; లోనయినది.

**ఉపనతి** సం. వి. ఇ. స్త్రీ. 1. సమీపించుట. 2. పొందుట. 3. వంగుట.

**ఉపనయనము** సం. వి. అ. న. 1. దగ్గఱకుఁ దెచ్చుట. 2. ఇచ్చుట, అర్పించుట.

శ్లో: ధారావాహోపనయనపరా నైగమాస్సానుమంతః. విక్రమో. 4. 4.

3. వేదపఠనార్థము బాలుని గురుసమీపమునకు పంపుటకైనసంస్కారము, వడుగు.

**ఉపనయనీయుఁడు** సం. — ఉపనేతవ్యుఁడు.

**ఉపనయము** సం. వి. అ. పుం. 1. దగ్గఱకుఁదెచ్చుట. 2 పొందుట. 3. ఉపయోగించుట. 4. వేదపఠనార్థము బాలుని గురుసమీపమునకు పంపుటకైనసంస్కారము, ఉపనయన సంస్కారము. 5. (తర్క) పంచావయవవాక్యములలో నాలుగవది. (ఏదేది ధూమము గలదియో అది అది వహ్నిగలది, ఇదియు నట్లే యిత్యాదిరూపము. వ్యాప్తి విశిష్ట మగుహేతువునకు పక్షధర్మతను ప్రతిపాదించువచనము ఉపనయము అని లక్షణము.) 6. (తర్క) జ్ఞానలక్షణారూపమై అలౌకిక ప్రత్యక్షసాధనమగు సన్నికర్ష భేదము. (చందనమును జూడఁగా 'చందనము సురభి' అను ప్రత్యక్షము కలుగుచున్నది. అందు చందనము చక్షువునకుగ్రాహ్యమై లౌకికప్రత్యక్షము కలిగించు చున్నది. సౌరభము అట్లు గ్రాహ్యము కాకున్నను పూర్వజ్ఞానముచేత లక్షితమై అలౌకిక ప్రత్యక్షమును కలిగించు చున్నది. ఇట పూర్వజ్ఞానలక్షణారూప మగు సన్నికర్షమే ఉపనయము.)

**ఉపనహనము** సం. వి. అ. న. 1. కట్టుట; ముడివైచుట. 2. కట్టుటకు సాధన మగువస్త్రాదికము.

**ఉపనామము** సం. వి. న్. న. కులనామము, ఇంటిపేరు.

**ఉపనాయకుఁడు** సం. విణ. (అ. యికా. అ.) దగ్గఱకుఁ దెచ్చువాఁడు. వి. అ. పుం. 1. ఉపపతి, విటకాఁడు. 2. (నాటకాదులందు) నాయకునకుఁ గొంచెము తక్కువయై సహాయుఁడుగా నుండు నాయకుఁడు. (నాయకునిగుణోత్కర్షమును జెప్పువాఁడు ఉపనాయకుఁ డని కొందఱు. రామాయణమునందు లక్ష్మణుఁడు ఉపనాయకుఁడు.)

**ఉపనాయనము** సం వి. అ. న. ఉపనయనము.

**ఉపనాయము** సం. వి. అ. పుం. ఉపనయనము, వడుగు.

**ఉపనాయిక** సం. వి. ఆ. స్త్రీ. నాటకాదులందు ముఖ్యనాయికకుఁ గొంచెము తక్కువ యగు నాయిక.

**ఉపనాహనము** సం. వి. అ. న. 1. విలేపనము. పూయుట. 2. పుంటిపై మందు పూయుట.

**ఉపనాహము** సం. వి. అ. పుం. 1. మూట; కట్ట. 2. పుండు మానుటకై పూసెడుమందు. 3. వీణాదులతంతి చుట్టెడుబిరడ, వీణాదులతీఁగలు బిగించు కొయ్యచీల, 4. ఒకానొకరోగము.

**ఉపనిక్షేపము** సం. వి. అ. పుం. 1. ఇల్లడపెట్టుట, న్యాసము, వస్తురూపసంఖ్యాదులను చెప్పి ఏదేని యొకవస్తువును ఒకనియొద్ద దాఁచుట. 2. రూపమును సంఖ్యను జెప్పి చూపి పదిలపఱచుటకై యొకని కప్పగించినవస్తువు.

**ఉపనిధాత** సం. విణ. (ఋ. త్రీ. ఋ.) 1. ఇల్లడపెట్టువాఁడు, ఏదేనియొకవస్తువును ఒకనియొద్ద ఉపనిధిగా దాఁచువాఁడు.

**ఉపనిధానము** సం. వి. అ. న. — ఉపనిధి.

**ఉపనిధాయకుఁడు** సం. విణ. (అ. యికా. అ.) — ఉపనిధాత.

**ఉపనిధి** సం. వి. ఇ. పుం. 1. (వ్యవహార) రూపమును సంఖ్యను జెప్పక చూపక తనధనమును పదిలపఱచుటకై మఱొకనియొద్ద నుంచుట. 2. అట్లుచెప్పక చూపక యుంచినయిల్లడ, వాడిక.

**ఉపనిపాతము** నం. వి. అ. పుం. 1. దగ్గఱకువచ్చుట. 2. ఆకస్మికముగా సంభవించుట. 3. ఆకస్మికముగా పైఁబడుట.

**ఉపనిపాతి** నం. విశే. (న్. నీ. న్.) ఆకస్మికముగా వచ్చువాఁడు.

**ఉపనిబంధనము** నం. వి. అ. న. 1. ఒడఁగూర్చెడు సాధనము. 2. కూర్చుట, కట్టుట.

**ఉపనివేశితము** నం. విశే. (అ. ఆ. అ.) 1. కాఁపురముగా నుంపఁబడినది (మనుష్యాది) 2. ఉంపఁబడినది.

**ఉపనిషత్తు** నం. వి. ద్. స్త్రీ. 1. బ్రహ్మజ్ఞానము. 2. (బ్రహ్మవిద్యాప్రతిపాదకమును వేదశిరోభాగము నగు) వేదాంతము.

(శ్లో. ఈశ కేన కఠ ప్రశ్నముండ మాండూక్య తిత్తిరి, ఐతరేయం చ ఛాందోగ్యం బృహదారణ్యకం తథా ఇవి పది ఉపనిషత్తులు-బ్రహ్మకైవల్యాదులు కలిపినచో నూట యెనిమిది ఉపనిషత్తులు.) 3. సమీపగృహము. 4. ధర్మము. 5. ఏకాంతము, నిర్జన స్థానము.

**ఉపనిషాది** నం. విశే. (న్. నీ. న్.) దగ్గఱకూర్చుండువాఁడు; (గురువు మొదలగువారి) దగ్గఱ నుండువాఁడు.

**ఉపనిష్కరము** నం. వి. అ. న. పురమార్గము. (రాజమార్గము అని హేమచంద్రుఁడు.)

**ఉపనిహితము** నం. విశే. (అ. ఆ. అ.) 1. ఉపనిధిగా నుంపఁబడినది. 2. దగ్గఱ నుంపఁబడినది.

**ఉపనీతుఁడు** నం. విశే. (అ. ఆ. అ.) 1. దగ్గఱనుంపఁబడినవాఁడు, దగ్గఱకుఁ దేఁబడినవాఁడు. 2. ఉపనయనసంస్కారము నొందినవాఁడు. 3. పొందఁబడినవాఁడు.

**ఉపనేత** నం. విశే. (ఋ. త్రీ. ఋ.) దగ్గఱకుఁదెచ్చువాఁడు. వి. ఋ. పుం. (ఉపనయనసంస్కారము చేయువాఁడు) ఆచార్యుఁడు.

**ఉపనేతవ్యుఁడు** నం. విశే. (అ ఆ. అ.) 1 దగ్గఱకు తేఁదగినవాఁడు. 2. ఉపనయనార్హుఁడు.

**ఉపనేయుఁడు** నం. - ఉపనేతవ్యుఁడు.

**ఉపన్యసనీయము** నం. - ఉపన్యసితవ్యము.

**ఉపన్యసించు** నం. స. క్రి. ఉపన్యాసముచేయు, విస్తరించి చెప్పు; చెప్పు.

వ. ...అప్పరమపతివ్రత వేయాఁడుతెఱంగుల నత్యర్థనీయంబు లగువస్తువు లుపన్యసించిన నతం డవి యెవ్వియు నొల్ల ననుటయు... భాగ. అను. 1. 71.

వ. అమ్మహాత్ముని లీలావతారాద్భుతకర్మంబులు లెక్కపెట్ట నెవ్వరికి నశక్యంబై యుండు నీకు సంక్షేపరూపంబున నుపన్యసించితి సవిస్తరంబుగా నెఱింగింప నాకుఁ దరంబు గాదు. భాగ. 2. 199.

చ. ధనపతిమిత్రుఁ డట్లు ప్రమదాప్రమదార్థముగా నుపన్యసించినవచనామృతంబు ... పా డు. 2. 171.

**ఉపన్యసిత** నం విశే (ఋ. త్రీ. ఋ.) – ఉపన్యాసకుఁడు.

**ఉపన్యసితవ్యము** నం విశే (అ. ఆ. అ.) ఉపన్యసింపఁ దగినది.

**ఉపన్యస్తము** నం. విశే. (అ. ఆ. అ.) 1. దగ్గఱఁ బెట్టఁబడినది. 2. ఇల్లడపెట్టఁబడినది. 3. ఉపన్యసింపఁ బడినది.

**ఉపన్యస్యత్** నం శత్రు. ఉపన్యసించుచున్న.

**ఉపన్యస్యమానము** నం. విశే. (అ. ఆ. అ.) ఉపన్యసింపఁబడుచున్నది.

**ఉపన్యస్యము** నం.– ఉపన్యసితవ్యము.

**ఉపన్యాసకుఁడు** నం. విశే. (అ. సికా. అ.) ఉపన్యసించువాఁడు.

**ఉపన్యాసము** నం. వి. అ. పుం. 1. దగ్గఱనుంచుట. 2. ఇల్లడపెట్టుట. 3. ఒకవిషయమును విస్తరించి చెప్పుట; చెప్పుట. 4. స్వకార్యము వెలపెట్టుటకై చేసికొనుసంధి.

**ఉపన్యాసి** నం. విశే. (న్. నీ. న్.) ఉపన్యసించువాఁడు.

**ఉపపతి** నం. వి. ఇ. పుం. మాఱుమగఁడు,జారుఁడు

**ఉపపత్తి** నం. వి. ఇ. స్త్రీ. 1. పుట్టుక, కలుగుట. (ఉదా: ఇష్టానిష్టోపపత్తులు.) 2. ప్రాప్తి, పొందుట. (ఉదా: సంతానోపపత్తి.) 3. సిద్ధి. ఒనగూడుట. (ఉదా: స్వర్గోపపత్తి, మనోరథోప

పత్తి.) 4. యుక్తి. (ఉదా: ఉపపత్తిగల వచనము.) 5. సంగతి, పొందిక. 6. హేతువు. 7. అర్హత. 8. అంతము, సమాప్తి. 9. ఉపాయము. 10. సాహాయ్యము. 11. వృత్తాంతము. 12. సమాధి, చిత్తవృత్తినిరోధము. 13. ప్రతిపాదనము, చెప్పుట. 14. కలిమి.

**ఉపపదము** సం. వి. అ. న. 1. ఒకపదమునకు అవ్యవహితపూర్వముగా నున్నపదము. (ఉదా: ధనురుపపదం వేదం — ధనుర్వేదము. సం. కిరా. 18. 44.)

2. ఒకనామమునకు వెనువెంట నుచ్చరింపఁబడు బిరుదాదిసూచక మగుశబ్దము. (ఆర్య శర్మ వర్మాది.)

**ఉపపదసమాసము** సం. వి. అ. పుం. ఉపపదము (పూర్వపదము) గానున్న నామవాచకము కృదంతరూపముతో సమసించినసమాసము. (ఉదా: కుంభకారుఁడు, జలజము, మొ.)

**ఉపపన్నము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఉత్పన్నము, పుట్టినది. 2. ప్రాప్తము, పొందఁబడినది. 3. పొందినది. 4. కూడినది 5. సంపన్నము, కలిమి కలది. 6 అర్హమయినది. (వ. ఉపపన్నమేతదస్మిన్ రాజని. శాకుం. 2.) 7. యుక్తియుక్తమైనది. (ఉదా; నీతర్కము ఉపపన్నము.)

**ఉపపర్శుక** సం. వి. ఆ. స్త్రీ. ప్రక్కయెముకకు బదులుగా కూర్చినయెముక.

**ఉపపాతకము** సం. వి. అ. న. పాతకమువంటిదై దానికంటెఁ గొంచెము తక్కువఫలము గలపాపభేదము, చిన్నపాపము.

**ఉపపాతకి** సం. విణ. (న్. నీ. న్.) ఉపపాతకము గలవాఁడు.

**ఉపపాతము** సం. వి. అ. పుం. 1. అకస్మికముగా వచ్చుట. 2. ఫలించుటకు సిద్ధముగా నుండుట, 3. నాశము.

**ఉపపాదకము** సం. విణ. (అ. దికా. అ.) 1. ఉత్పాదకము, కలిగించునది. 2. యుక్తియుక్తముగాఁ జెప్పునది. 2. ఉపపత్తి కలదిగాఁ జేయునది.

**ఉపపాదనము** సం. వి. అ. న. 1. ఉత్పాదనము, కలిగించుట. 2. ఇచ్చుట. 3. యుక్తిచేత సమర్థించుట. 4. చక్కఁగా ప్రతిపాదించుట, (ఏదేని విషయమును) వివరించి చెప్పుట.

**ఉపపాదము** సం. విణ. (అ. ఆ. అ.) పాదమును పొందినది; పాదముదగ్గఱకు వచ్చినది. వి. అ. పుం. – ఉపపత్తి.

**ఉపపాదించు** సం. అ. క్రి. తెలియఁజేయు, తెలుపు.

వ. బలాంగచతుష్టయప్రవర్ధనోపాయంబు లుపపాదించి బలాధ్యక్షుల నిర్ణయించి...హరి. ఉ. 2. 177.

**ఉపపాదితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. కలిగింపఁబడినది. 2. యుక్తిచేత సమర్థింపఁబడినది. 3. చక్కఁగా ప్రతిపాదింపఁబడినది.

**ఉపపాద్యము** సం. విణ. (అ. ఆ. అ.) 1. కలిగింపఁదగినది. 2. యుక్తిచే సమర్థింపఁదగినది. 3. చెప్పఁదగినది, ప్రతిపాదింపఁ దగినది.

**ఉపపాపము** సం. — ఉపపాతకము.

**ఉపపురము** సం. వి. అ. న. శాఖానగరము, పేఁట.

**ఉపపురాణము** సం. వి. అ. న. వ్యాసప్రోక్తములగు అష్టాదశపురాణములవంటివై నానామునిప్రణీతములగు నారసింహాదిపురాణములలో నొకటి.

శ్లో: ఆద్యం సనత్కుమారోక్తం నారసింహంతతః పరం, తృతీయం వాయవీయం చ కుమారేణ చ భాషితం, చతుర్థం శివధర్మాఖ్యం సాక్షాన్నందీశభాషితం, దుర్వాససోక్త మాశ్చర్యం నారదీయమతఃపరం, నందికేశ్వరయుగ్మం చ తథైవోశనసేరితం, కాపిలం వారుణం సాంబం కాలికాహ్వాయమేవ చ, మాహేశ్వరం తథా కల్కి దైవం సర్వార్థసిద్ధిదం, పరాశరోక్తమపరం మారీచం భాస్కరాహ్వాయం. అని కూర్మపురాణము.

**ఉపపుష్పిక** సం. వి. ఆ. స్త్రీ.-దీనిచే పువ్వువలె నోరు వికసించును—జృంభ, ఆవులింత.

**ఉపప్రదానము** సం. వి. అ. న. 1. అప్పగించుట, 2. లంచము. 3. సంధికొఱకు భూమ్యాదుల నిచ్చుట; కప్పము.

**ఉపప్రలోభనము** సం. వి. అ. న. 1. ఆసకొలుపుట. 2. ఆకర్షణము, వశీకరణము. 3. లంచము.

**ఉపప్రాణము** సం. వి. అ. పుం. గౌణ మగు ప్రాణ వాయువు. (నాగకూర్మకృకరదేవదత్త ధనంజయములలో నేదియేని యొకటి.)

**ఉపప్లవనీయము** సం. విణ. (అ. అ. అ.) – ఉపప్లవ్యము.

**ఉపప్లవము** సం. వి. అ. పుం. 1. (ఆకాశమునుండి ఉల్కలు రాలుట మొదలగు) ఉత్పాతము. 2. ఉపద్రవము, విపత్తు. 3. భయము. 4. విఘ్నము. 5. మారి మసూరిక మొదలగువ్యాధుల వలని పీడ. 6. ఉపరోధము, అరికట్టుట. 7. సూర్యచంద్రుల గ్రహణము. 8. రాహుగ్రహము. 9. (నీటిపై) తేలుట. 10. సమీపగతి.

**ఉపప్లవి** సం. విణ. (న్. సి. న్.) ఉపప్లవము నొందినవాఁడు.

**ఉపప్లవ్యము** సం. విణ. (అ. ఆ. అ.) పీడింపఁ దగినది. వి. అ. పుం. – ఉపప్లావ్యము. (వాచ)

**ఉపప్లావ్యము** సం. విణ. (అ. ఆ. అ.) అవశ్యము పీడింపఁ దగినది. వి. అ. పుం. మత్స్యదేశము నందలి యొకానొకపురము.

క. నడచి యుపప్లావ్యపురంబు డగ్గఱి వన ప్రదేశముల బలచయముల్, విడియించి తనప్రతాపము, కడు నభలదిగంచలములఁ గ్రమ్మకొనంగన్. రాఘవ. 4.80. (విణ. వి. ల కిదే యుదాహరణము.) సం. భార, ఉద్యో. 23. 1.

**ఉపప్లుత** సం. వి. ఆ. స్త్రీ. స్త్రీలకు గర్భాశయమునఁ గలిగెడియొకానొకరోగము.

**ఉపప్లుతము** సం. విణ. (అ. ఆ. అ.) ఉపప్లవయుక్తము, ఉపప్లవము నొందినది.

**ఉపబంధము** సం. వి. అ. పుం. 1. దృఢముగా నుండుటకై రెండవమాఱు బంధించుట. 2. పద్మాసన బంధమువంటియొకయాసనభేదము. 3. రతిబంధ విశేషము.

**ఉపబర్హణము** సం. వి. అ. న. – ఉపబర్హము.

**ఉపబర్హము** సం. వి. అ. పుం. 1. ఉపధానము,తలగడ. 2. పీడించుట.

**ఉపబృంహణము** సం. వి. అ. న. చక్కఁగా పెరుఁగుట.

**ఉపబృంహి** సం. విణ. (న్. సీ. న్.) చక్కఁగా పెరుఁగునది.

**ఉపబృంహితము** సం. విణ. (అ. ఆ. అ.) చక్కఁగా పెరిఁగినది.

**ఉపభుక్తము** సం. విణ. (అ. ఆ. అ.) 1. అనుభవింపఁబడినది 2. ఆస్వాదింపఁబడినది. 3. ఉపయోగింపఁబడినది.

**ఉపభుక్తి** సం. వి. ఇ. స్త్రీ. – ఉపభోగము.

**ఉపభూషణము** సం. వి. అ. న – భూషణమువంటిది – ఉత్తరీయాదికము.

శ్లో: ప్రావారంపానపాత్రంచ గేందుకో గృహమేవ చ, పర్యంకాది యదన్యచ్చ సర్వం తదుపభూషణం, ఘంటాచామరకుంభాది పాత్రోపకరణాదికం, తద్భూషణాంతరే దద్యాద్యస్మాత్తదుపభూషణం.

**ఉపభృత్తు** సం. వి. త్. స్త్రీ. యజ్ఞాంగపాత్ర విశేషము, రావికఱ్ఱతోఁ జేసినస్రుక్కు.

**ఉపభోక్త** సం. విణ. (ఋ. త్రీ. ఋ.) 1. అనుభవించువాఁడు. 2. త్రాగువాఁడు. 3. తినువాఁడు. 4. ఉపయోగించువాఁడు.

**ఉపభోక్తవ్యము** సం – ఉపభోగ్యము.

**ఉపభోగము** సం. వి. అ. పుం. 1. అనుభవము. 2. ఆస్వాదించుట, తినుట 3. వినియోగించుట. 4. సంభోగము. 5. విషయసుఖము.

**ఉపభోగి** సం. విణ. (న్. సీ. న్.) ఉపభోగము కలవాఁడు.

**ఉపభోగించు** సం. స. క్రి. అనుభవించు.

మ....దుశ్చేష్ట ని,ట్లుపభోగింపఁగ నయ్యెనిట్టి వెత...రంగా. 3. 259.

**ఉపభోగ్యము** సం. విణ. (అ. ఆ. అ.) ఉపభోగమునకుఁ దగినది.

**ఉపభోజనీయము** సం – ఉపభోగ్యము.

**ఉపభోజి** సం. విణ. (న్. సీ. న్.) – ఉపభోక్త.

**ఉపభోజ్యము** సం. విణ. (అ. ఆ. అ.) భక్ష్యము, తిన దగినది.

**ఉపమ** వి. ఉపాయము.

ఉ. అవ్వచనంబు చిత్తమున నారటపాటొదవింప నెంతయున్, నివ్వెఱఁ గంది యొం

పత్తి.) 4. యుక్తి. (ఉదా: ఉపపత్తిగల వచనము.) 5. సంగతి, పొందిక. 6. హేతువు. 7. అర్హత. 8. అంతము, సమాప్తి. 9. ఉపాయము. 10. సాహాయ్యము. 11. వృత్తాంతము. 12. సమాధి, చిత్తవృత్తినిరోధము. 13. ప్రతిపాదనము, చెప్పుట. 14. కలిమి.

**ఉపపదము** సం. వి. అ. న. 1. ఒకపదమునకు అవ్యవహితపూర్వముగా నున్నపదము. (ఉదా: ధనురుపపదం వేదం — ధనుర్వేదము. సం. కిరా. 18. 44.)

2. ఒకనామమునకు వెనువెంట నుచ్చరింపఁబడు బిరుదాదిసూచక మగుశబ్దము. (అర్య శర్మ వర్మాది.)

**ఉపపదసమాసము** సం. వి. అ. పుం. ఉపపదము (పూర్వపదము) గానున్న నామవాచకము కృదంతరూపముతో సమసించినసమాసము. (ఉదా: కుంభకారుఁడు, జలజము, మొ.)

**ఉపపన్నము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఉత్పన్నము, పుట్టినది. 2. ప్రాప్తము, పొందఁబడినది. 3. పొందినది. 4. కూడినది 5. సంపన్నము, కలిమి కలది. 6 అర్హమయినది. (వ. ఉపపన్నమేతదస్మిన్ రాజని. శాకుం. 2.) 7. యుక్తియుక్తమైనది. (ఉదా; నీతర్కము ఉపపన్నము.)

**ఉపపర్శుక** సం. వి. ఆ. స్త్రీ. ప్రక్కయెముకకు బదులుగా కూర్చినయెముక.

**ఉపపాతకము** సం. వి. అ. న. పాతకమువంటిదై దానికంటెఁ గొంచెము తక్కువఫలము గలపాపభేదము, చిన్నపాపము.

**ఉపపాతకి** సం. విణ. (న్. నీ. న్.) ఉపపాతకము గలవాఁడు.

**ఉపపాతము** సం. వి. అ. పుం. 1. అకస్మికముగా వచ్చుట. 2. ఫలించుటకు సిద్ధముగా నుండుట. 3. నాశము.

**ఉపపాదకము** సం. విణ. (అ. దికా. అ.) 1. ఉత్పాదకము, కలిగించునది. 2. యుక్తియుక్తముగాఁ జెప్పునది. 2. ఉపపత్తి కలదిగాఁ జేయునది.

**ఉపపాదనము** సం. వి. అ. న. 1. ఉత్పాదనము, కలిగించుట. 2. ఇచ్చుట. 3. యుక్తిచేత సమర్థించుట. 4. చక్కఁగా ప్రతిపాదించుట, (ఏదేని విషయమును) వివరించి చెప్పుట.

**ఉపపాదము** సం. విణ. (అ. ఆ. అ.) పాదమును పొందినది; పాదముదగ్గఱకు వచ్చినది. వి. అ పుం. — ఉపపత్తి.

**ఉపపాదించు** సం. అ. క్రి. తెలియఁజేయు, తెలుపు.

వ. బలాంగచతుష్టయప్రవర్ధనోపాయంబు లుపపాదించి బలాధ్యక్షుల నిర్ణయించి...హరి. ఉ. 2. 177.

**ఉపపాదితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. కలిగింపఁబడినది. 2. యుక్తిచేత సమర్థింపఁబడినది. 3. చక్కఁగా ప్రతిపాదింపఁబడినది.

**ఉపపాద్యము** సం. విణ. (అ. ఆ. అ.) 1. కలిగింపఁదగినది. 2. యుక్తిచే సమర్థింపఁదగినది. 3. చెప్పఁదగినది, ప్రతిపాదింపఁ దగినది.

**ఉపపాపము** సం. — ఉపపాతకము.

**ఉపపురము** సం. వి. అ. న. శాఖానగరము, పేట.

**ఉపపురాణము** సం. వి. అ. న. వ్యాసప్రోక్తములగు అష్టాదశపురాణములవంటివై నానామునిప్రణీతములగు నారసింహాదిపురాణములలో నొకటి.

శ్లో: ఆద్యం సనత్కుమారోక్తం నారసింహం తతః పరం, తృతీయం వాయవీయం చ కుమారేణ చ భాషితం, చతుర్థం శివధర్మాఖ్యం సాక్షాన్నందీశభాషితం, దుర్వాససోక్త మాశ్చర్యం నారదీయమతః పరం, నందికేశ్వరయుగ్మం చ తథై వోశనసేరితం, కాపిలం వారుణం సాంబం కాళికాహ్వయమేవ చ, మాహేశ్వరం తథా కల్కి దైవం సర్వార్థసిద్ధిదం, పరాశరోక్తమపరం మారీచం భాస్కరాహ్వయం. అని కూర్మపురాణము.

**ఉపపుష్పిక** సం. వి. ఆ. స్త్రీ.-దీనిచే పువ్వువలె నోరు వికసించును—జృంభ, ఆవులింత.

**ఉపప్రదానము** సం. వి. అ. న. 1. అప్పగించుట. 2. లంచము. 3. సంధికొఱకు భూమ్యాదుల నిచ్చుట; కప్పము.

**ఉపప్రలోభనము** సం. వి. అ న. 1. ఆసకొలుపుట. 2. ఆకర్షణము, వశీకరణము. 3. లంచము.

**ఉపప్రాణము** సం. వి. అ. పుం. గౌణ మగు ప్రాణ వాయువు. (నాగకూర్మకృకరదేవదత్త ధనంజయములలో నేదియేని యొకటి.)

**ఉపప్లవనీయము** సం. విణ. (అ. ఆ. అ.) – ఉపప్లవ్యము.

**ఉపప్లవము** సం. వి. అ. పుం. 1. (ఆకాశమునుండి ఉల్కలు రాలుట మొదలగు) ఉత్పాతము. 2. ఉపద్రవము, విపత్తు. 3. భయము. 4. విఘ్నము. 5. మారి మసూరిక మొదలగువ్యాధుల వలని పీడ. 6. ఉపరోధము, అరికట్టుట. 7. సూర్యచంద్రుల గ్రహణము. 8. రాహుగ్రహము. 9. (నీటిపై) తేలుట. 10. సమీపగతి.

**ఉపప్లవి** సం. విణ. (న్. నీ. న్.) ఉపప్లవము నొందినవాఁడు.

**ఉపప్లవ్యము** సం. విణ. (అ. ఆ. అ.) పీడింపఁ దగినది. వి. అ. పుం. – ఉపప్లావ్యము. (వాచ)

**ఉపప్లావ్యము** సం. విణ. (అ. ఆ. అ.) అవశ్యము పీడింపఁ దగినది. వి. అ. పుం. మత్స్యదేశము నందలి యొకానొకపురము.

క. నడచి యుపప్లావ్యపురం,బు డగ్గఱి వన ప్రదేశముల బలచయముల్, విడియించి తనప్రతాపము, కడు నభిలదిగంచలములఁ గ్రమ్మికొనంగన్. రాఘవ. 4.80. (విణ. వి. ల కిదే యుదాహరణము.) సం. భార, ఉద్యో. 23. 1.

**ఉపప్లుత** సం. వి. ఆ. స్త్రీ. స్త్రీలకు గర్భాశయమునఁ గలిగెడి యొకానొకరోగము.

**ఉపప్లుతము** సం. విణ. (అ. ఆ. అ.) ఉపప్లవయుక్తము, ఉపప్లవము నొందినది.

**ఉపబంధము** సం. వి. అ. పుం. 1. దృఢముగా నుండుటకై రెండవమాఱు బంధించుట. 2. పద్మాసన బంధమువంటి యొకయాసనభేదము. 3. రతిబంధ విశేషము.

**ఉపబర్హణము** సం. వి. అ. న. – ఉపబర్హము.

**ఉపబర్హము** సం. వి. అ. పుం. 1. ఉపధానము,తలగడ. 2. పీడించుట.

**ఉపబృంహణము** సం. వి. అ. న. చక్కఁగా పెరుఁగుట.

**ఉపబృంహి** సం. విణ. (న్. నీ. న్.) చక్కఁగాపెరుఁగునది.

**ఉపబృంహితము** సం. విణ. (అ. ఆ. అ.) చక్కఁగా పెరిఁగినది.

**ఉపభుక్తము** సం. విణ. (అ. ఆ. అ.) 1. అనుభవింపఁబడినది 2. ఆస్వాదింపఁబడినది. 3. ఉపయోగింపఁబడినది.

**ఉపభుక్తి** సం. వి. ఇ. స్త్రీ. – ఉపభోగము.

**ఉపభూషణము** సం. వి. అ. న – భూషణమువంటిది – ఉత్తరీయాదికము.

శ్లో: ప్రావారఃపానపాత్రంచ గేండుకో గృహమేవ చ, పర్యంకాది యదన్యచ్చ సర్వం తదుపభూషణం, ఘంటాచామరకుంభాది పాత్రోపకరణాదికం, తద్భూషణాంతరే దద్యాద్యస్మాత్తదుపభూషణం.

**ఉపభృత్తు** సం. వి. త్. స్త్రీ. యజ్ఞాంగపాత్ర విశేషము, రావికఱ్ఱతోఁ జేసినస్రుక్కు.

**ఉపభోక్త** సం. విణ. (ఋ. త్రీ. ఋ.) 1. అనుభవించువాఁడు. 2. త్రాగువాఁడు. 3. తినువాఁడు. 4. ఉపయోగించువాఁడు.

**ఉపభోక్తవ్యము** సం – ఉపభోగ్యము.

**ఉపభోగము** సం. వి. అ. పుం. 1. అనుభవము. 2. ఆస్వాదించుట, తినుట 3. వినియోగించుట. 4. సంభోగము. 5. విషయసుఖము.

**ఉపభోగి** సం. విణ. (న్. నీ. న్.) ఉపభోగము కలవాఁడు.

**ఉపభోగించు** సం. స. క్రి. అనుభవించు.

మ....దుశ్చేష్ట ని,ట్లుపభోగింపఁగ నయ్యెనిట్టి వెత...రంగా. 3. 259.

**ఉపభోగ్యము** సం. విణ. (అ. ఆ. అ.) ఉపభోగమునకుఁ దగినది.

**ఉపభోజనీయము** సం – ఉపభోగ్యము.

**ఉపభోజి** సం. విణ. (న్. నీ. న్.) – ఉపభోక్త.

**ఉపభోజ్యము** సం. విణ. (అ. ఆ. అ.) భక్ష్యము, తిన దగినది.

**ఉపమ** వి. ఉపాయము.

ఉ. అవ్వచనంబు చిత్తమున నారటపాటొదవింప నెంతయున్, నివ్వెఱఁ గంది యొం

డుపమ నేరక యూరక యుండి యింతలో,
నువ్వునఁ జేవ గైకొని సహోదరిపాడి
దొలంగి చెల్లెలిన్, మవ్వపుముద్దరాలి నభి
మానవతిన్ వధియించు తెంపుతోన్. వి. పు.
7. 8.

క. భల్లూకేశ్వర వానరు, లెల్ల నృపవరులతోడ
నిలమీఁదను మూర్ఛిల్లియుఁ జచ్చియు
నున్నా, రొల్లంబోవుచును దీని కుపమ
యెటన్నన్. మొ. రా. యు. 1. 61.

క. ఉపమ యెఱుంగనివారల, కపరిమితావస్థ
లొందు నది యెట్లన న, య్యుపమ
యెఱుంగక కాదే, చపలత మున్నొక్క నక్క
సమసెం జెలు చన్. హంస. 1. 145.

జ. ఉపమరి.

**ఉపమ** సం. విశే. అ. స్త్రీ. సదృశము.
(చూ. తుల్యార్థైరతులోపమాభ్యాం. కౌముది.)
వి. అ. స్త్రీ. 1. (తర్క.) ప్రత్యక్షాదిప్రమాణములలో నొకటి. 2 (తర్క.) ఉపమానజన్యమైన శబ్దశక్తిజ్ఞానరూపానుభవవిశేషము. 3. (అలం) అర్థాలంకారవిశేషము. (భిన్నము లగు రెండుపదార్థములకు సమానధర్మమును బట్టి కంఠోక్తముగా ప్రతిపాదింపఁబడు సాదృశ్యము.) 4. సాదృశ్యము.

**ఉపమంత్రణము** సం. వి. అ. న. 1. అమంత్రణము, పిలుపు. 2. ఉపచ్ఛందనము, బుజ్జగించుట.

**ఉపమంత్రి** సం. విశే. (న్. తి. న్.)—ఉపమంత్రణము చేయువాఁడు - 1. పిలుచువాఁడు. 2. బుజ్జగించువాఁడు వి న్. పుం. చిన్నమంత్రి.

**ఉపమము** సం. విశే. (అ. ఆ. అ.) సదృశము. (ఇది సమాసోత్తరపదముగానే యుండును.)

**ఉపమరి** విశే. (ఉపమ+అరి) ఉపాయశాలి.

సీ. సమబుద్ధి గలవానిచరితంబు సమ్మతి యుప
మరి యగువానియునికి కాగు. నీతి. 45.

గీ. ఉభయభాషల నేర్పరు లుపమరులు న,మర్థ
లీకృతిరాజనిర్మాణమునకు. ప్రబోధ. 1. 24.

**ఉపమర్దకుఁడు** సం. విశే. (అ. ద్విశా. అ.) 1. నలఁగఁ జేయువాఁడు 2. హింసించువాఁడు. 3. అవమాన పఱుచువాఁడు.

**ఉపమర్దము** సం. వి. అ. పుం. 1. నిష్పీడనము, ఒత్తిడి. 2. హింసనము, బాధించుట. 3. అవమాన పఱుచుట.

వ. తస్య గేహం ప్రవిశ్య పరిజన స్యేదృశ
ఉపమర్దః క్రియతే. మృచ్ఛ. 1.

4. (ధాన్యాదులు) దంపుట. 5. ఆలోడనము, కలియఁబెట్టుట. 6. మోపినతప్పును ఖండించుట.

**ఉపమాత** సం. విశే. (ఋ. త్రి. ఋ.) ఉపమించువాఁడు, పోల్చువాఁడు. వి. ఋ. స్త్రీ. 1. దాది. 2. మాతృతుల్యురాలు (పినతల్లి, మొ.)

శ్లో. మాతృష్వసా మాతులానీ పితృవ్యస్త్రీ
పితృష్వసా, శ్వశ్రూః పూర్వజపత్నీ చ
మాతృతుల్యాః ప్రకీర్తితాః.

**ఉపమాదకము** సం. విశే. (అ. దిశా. అ.) హర్షము కలిగించునది.

**ఉపమాదనము** సం. వి. అ. న. హర్షముకలిగించుట

**ఉపమాదము** సం. విశే. (అ. ఆ. అ.) ఉపమాదకము, హర్షము కలిగించునది. వి. అ. పుం. హర్షము.

**ఉపమాద్రవ్యము** సం. వి. అ. న. ఉపమానముగా గ్రహింపఁ దగినవస్తువు (చంద్రాది).

**ఉపమానము** సం. వి. అ. న. 1. పోలిక, సాదృశ్యము. 2. దేనితోఁ బోల్పఁ దగునో యది (చంద్రాది-వ్యతి. ఉపమేయము.) 3. (తర్క.) ఒక ప్రమాణము (ఉపమితి ప్రమాకరణము. ఇది సాదృశ్యజ్ఞానాత్మకముగా నుండును.)

**ఉపమానోపమేయభావము** సం. వి. అ. పుం. ఉపమానోపమేయములకుఁ గలసంబంధము.

**ఉపమించు** సం. న. క్రి. 1. పోల్చు.

ఉ. భావిపురాతనాద్యతనపార్థివలక్ష్ములుపాండ
వేయుల, లక్ష్మివిభవంబుతోడ నుపమింప సమం
బులు గావు... భార. సభా. 2.114.

2. పోలు.

గీ. మించుత్రొమ్మ్రించు నుపమించు మెలఁతయగు
చు, నిలుచునవ్వనదేవత నృపతిమాచి. మనుచ.
6. 96.

ద్వి. మునుకొని తూణీరమున వెలువడుచుఁ,
దనరారుసాయంపతండంబుఁ జూడు, కుప

సంబు లూడ్చిన క్రూరసర్పములం, నుప మింప ననువులై యొడియు రాఘవుని. రం. రా. యు. 384 పొ. 9 పం.

3. పోల్చిచూచు.

ఉ. వీరలు దైవశక్తిం బ్రభవించినవారగు టేమి సందియం, బీరమణీయకాంతి నుపమింపంగ వేల్పుల కాక యిట్టియా, కారవిశేషసంప దం బ్రకాశిత తేజము పేర్మిం జూడ సా, ధారణమర్త్యులే యని ముదంబునం బౌరులు దమ్ముం జూడంగన్. భార. ఆది. 5.151.

**ఉపమితము** సం. *విణ.* (అ. అ. అ.) ఉపమింపంబడి నది.

**ఉపమితి** సం. *వి. ఇ.* స్త్రీ — ఉపమ.

**ఉపమేయము** సం. *విణ.* (అ. అ. అ.) పోల్పందగి నది. వర్ణనీయము (ముఖాది.)

**ఉపమేయోపమ** సం. *వి. ఆ.* స్త్రీ. ఒక అర్థాలంకా రము. (ఇందు మొదట ఉపమేయోపమానము లుగాం జెప్పినవానినే రెండవమాఱు ఉప మానోపమేయములుగాం జెప్పుట. ఉదా: ఓ రాజా నీయందు ధర్మ మర్థమువలెను అర్థము ధర్మమువలెను భాసిల్లు చున్నవి.)

**ఉపయంత** సం. *విణ.* (ఋ. త్రి. ఋ.) ఆజ్ఞాపించు వాండు. *వి. ఋ.* పుం. వరుండు, మగండు.

**ఉపయంత్రము** సం. *వి. అ.* న. (వైద్య) శల్యము ను దీయుటకు సాధన మైనయంత్ర భేదము.

**ఉపయమనము** సం. *వి. అ.* న. 1. వివాహము. 2. సంయమనము, కట్టుపాటులో నుంచుట. 3. బంధించుటకు సాధన మైనకుశాది.

**ఉపయమము** సం. *వి. అ.* పుం. 1. వివాహము. 2. ఆజ్ఞ; కట్టుపాటు.

**ఉపయాచకుండు** సం. *విణ.* (అ. విశా. అ.) దగ్గ అకు వచ్చి యాచించువాండు.

**ఉపయాచనము** సం. *వి. అ.* న. సమీపమునకు వచ్చి అభీష్టములను ప్రార్థించుట, దగ్గఱకు వచ్చి యాచించుట.

**ఉపయాచితము** సం. *విణ.* (అ. అ అ.) 1. దగ్గఱ కు వచ్చి యాచింపంబడినది (ధనాది) 2. అభీష్ట సిద్ధికై దేవతల కీంబడినది (పశ్వాది) *వి. అ.* న. యాచన, ప్రార్థన.

**ఉపయాతము** సం. *విణ.* (అ. అ. అ.) 1. దగ్గఱకు వచ్చినది. 2. మరలి వచ్చినది. 3. వచ్చినది. *వి. అ.* న. 1. రాక. 2. మరలి వచ్చుట. 3. దగ్గ ఱకు వచ్చుట.

**ఉపయానము** సం. *వి. అ.* న. ఉపసర్పణము, దగ్గ ఱకు వచ్చుట.

**ఉపయామము** సం. *వి. అ.* పుం. వివాహము.

**ఉపయాయి** సం. *విణ.* (న్. నీ. న్.) దగ్గఱకు వచ్చువాండు.

**ఉపయుక్తము** సం. *విణ.* (అ. అ. అ.) 1. (బండి మొదలగువానికి) కూర్పంబడినది. 2 ఉపయోగ పడినది. 3. న్యాయ్య మైనది; అర్హ మైనది. 4. తినంబడినది, భుక్తము. (వాచ)

**ఉపయోగము** సం. *వి. అ.* పుం. 1. అనుకూల్యము 2. వాడుక; ఆచరణము. 3. అనుభవించుట. 4. ప్రయోజనము, ఫలము.

**ఉపయోగి** సం. *విణ.* (న్. నీ. న్.) 1. ఉపయోగ పడునది. 2. ఉపయోగపఱుచునది.

**ఉపయోగించు** సం. *అ. క్రి.* ఉపయోగపడు. ఉదా: కలము వ్రాయుట కుపయోగించును.

స. క్రి. ఉపయోగపఱుచు, అనుభవించు.

క. అపహృతసర్వస్వులమై, సపత్నుల నికార మునం బ్రచండాటవిలో, విపులఫలశాకమూ లము, లుపయోగించుచును నిష్ఠ నుండెదు మాకోన్. భార. అర. 1. 18.

సీ... ఈభిక్ష యొప్పుగొను మని నాకుం జెప్పిన ను నేవురు నుపయోగింపుం డంటి నాయుక్తి దొల్లి, యనృత మెన్నండుం గాదు... భార. ఆది. 7. 209.

వ. నాకును బాంధవులకును హితంబు సేసినన్నుం గురురాజ్యంబు నుపయోగింపు మనిన నట్ల చేయుదు నని కర్ణుం డొడంబడి.... భార. ఆది. 684.

**ఉపయోజనము** సం. *వి. అ.* న. 1. గుఱ్ఱము మున్నగువానిని బండికి పూన్చుట; కాండికిం గట్టుట. 2. ఉపయోగించుట.

**ఉపరంజకము** సం. *విణ.* (అ. *కా.* అ.) ఉపరాగ ము కలిగించునది.

**ఉపరంజనము** సం. వి. అ. న. ఉపరాగము కలిగించుట.

**ఉపరంజనీయము** సం — ఉపరంజ్యము.

**ఉపరంజ్యము** సం. విశే. (అ. ఆ. అ.) ఉపరాగము కలిగింపఁదగినది.

**ఉపరంధ్రము** సం. వి. అ. న. తొలకు, మృగముల వెనుక కాలిమూలమునకును ప్రక్కకును నడిమి చోటు.

శ్లో: ద్వావుపరిస్యా శిరస్యాద్వాద్వావ్యోరంధ్రో పరంధ్రయోః, పకః ఫాలేహ్యాపానేచరశా పర్తాధ్రువాస్సశ్శృతాః శిశు. 5. 4. మల్లి. వ్యాఖ్య.

**ఉపరక్తము** సం. విశే. (అ. ఆ. అ.) 1. ద్యూతాది వ్యసనములందు తగులువడినది. 2. (దుఃఖాదులచే) పీడితము, బాధనొందినది. 3. రంగు వేయఁబడినది. 4. రాహుకేతు గ్రస్తమైనది (సూర్యచంద్రాది) 5. దాసనపుఁబువ్వుయొక్క సన్నిధియందుండుటచే దానియెఱుపు గుణము గలదియై తోఁచుపటికపుజాయివలె ఉపాధి సాన్నిధ్యమువలన ఆయుపాధిగుణము గలదిగా తోఁచునది (జీవాత్మ).

**ఉపరక్షణము** సం. వి. అ. న. 1 రక్షార్థముసైన్యాదులను స్థాపించుట, కావలి. 2. శిబిరరక్షణము కొఱకు చుట్టును వేసినకంచె మున్నగు ఆవరణము.

**ఉపరక్షుఁడు** సం. వి. అ. పుం. అంగరక్షకుఁడగు భటుఁడు, ఇతరులవలన నపాయము లేకుండఁగ రాజునొద్ద కావలి యుండుభటుఁడు.

**ఉపరతకర్ముఁడు** సం. విశే. (న్. న్. అ.న్) - క ర్మము లుడిగినవాఁడు - పనులు చాలించుకొన్న వాఁడు; లోకవ్యవహారములయెడ విరక్తి చెందిన వాఁడు.

**ఉపరతము** సం. విశే. (అ. ఆ. అ.) 1. విరమించినది. 2. మరలినది, 3. చచ్చినది. 4. విరక్తి నొందినది. వి. అ. న — ఉపరతి.

**ఉపరతి** సం. వి. ఇ. స్త్రీ. 1. విరమించుట. 2. (లభ్యమైన విషయమునఁ గూడ) ఉదాసీనత, ఉపేక్ష. 3. ఇంద్రియములను విషయములనుండి మరల్చుట. 4 శాస్త్రవిహితకర్మములను విధ్యుక్తముగా త్యజించుట, సన్న్యాసము 5. బుద్ధి. 6. పురుషాయితము. 7. మరణము.

**ఉపరత్నము** సం. వి. అ. న. తక్కువరకపు రత్నము (గాజు, మొ.)

**ఉపరథ్య** సం. వి. ఆ. స్త్రీ. 1. పసులు లోనగువాని రాకపోకలచేత నేర్పడిన (యూరిముందటి) దారి, పుంత. 2. చిన్నదారి.

**ఉపరమణము** సం. వి. అ. న — ఉపరతి.

**ఉపరమము** సం. వి. అ. పుం. 1. విరమించుట. 2. విషయవైరాగ్యము. 3. మరలుట. 4. చావు.

**ఉపరసము** సం. వి. అ. పుం. 1-పాదరసముతో సాటియైనది-గంధకము ఇంగిలీకము. మొ. 2. (అలం) ప్రధానరసమునకు అంగమైన రసము.

**ఉపరాగము** సం. వి. అ. పుం. 1. సూర్యచంద్రుల గ్రహణము. 2. ఎఱుపు, ఎఱ్ఱరంగు. 3. రంగు. 4. దుఃఖము; ఆపద. 5. నింద. 6. దుర్నయము, చెడునడవడి. 7. దాసనపుఁబువ్వు పటికపుజాతియందుఁ బోలె దగ్గఱనుండుటంబట్టి తనయందలిగుణము మఱియొక దానియందుఁ గలిగించుట; సత్పదార్థమునకు గుణాంతరమును గలిగించుట యను వాసనారూపసంస్కారము.

**ఉపరామము** సం. — ఉపరమము.

**ఉపరి** సం. అవ్య. 1. పైని. మీఁద. మీఁదిది.

ఉ. ...పూర్వశైలశిఖరోపరిఁ దోఁచెఁ బయోజబంధుఁడున్. భోజరా. 5. 208.

మ. కృకవాకుల్ మొరసెన్ గృహోపరిఁ ద్రిభంగిన్ ఘుగ్ఘకంఠధ్వనిన్ మనుచ. 3. 55.

సీ. అటమీఁదఁ దారలకన్నిటి కుపరియై రెండు లక్షలకుఁబ్రుఁ డుండి...భాగ. 5. 2. 88.

క. మునిసప్తకమున కెగువం,దనరుచు...శింశుమారచక్రం,బనఁగా నిన్నిటికి నుపరి యగుచుండు నృపా. భాగ, 5. 2. 72.

2. అనంతరము, తర్వాత. 3. పైఁగా, అదనముగా.

**ఉపరిజము** సం. విశే. (అ. ఆ. అ.) మీఁద పుట్టినది.

**ఉపరితనము** సం. విశ. (అ. ఈ. అ.) మీఁదిది. పయిది.

**ఉపరిస్థము** సం. విశ. (అ. ఆ. అ.) మీఁద నున్నది.

**ఉపరీతకము** సం. వి. అ. పుం. ఒకానొకరతిబంధము. (దీనికి 'విపరీతకము' అనియుపేరు)

**ఉపరుద్ధము** సం. విశ. (అ. ఆ. అ.) 1. అడ్డగింపఁబడినది. 2. చెఱఁబెట్టఁబడినది. 3. కప్పఁబడినది. 4. ముట్టడింపఁబడినది. 5. పీడపెట్టఁబడినది.

**ఉపరూపకము** సం. వి. అ. న. దృశ్యప్రబంధభేదము. (ఇది అష్టాదశవిధము:- 'నాటికాత్రోటకం గోష్ఠీ సట్టకం నాట్యరాసకమ్. ప్రస్థానోల్లాప్య కావ్యాని ప్రేఙ్ఖణం రాసకం తథా, సంలాపకం శ్రీగదితం శిల్పకఞ్చవిలాసికా, దుర్మల్లికా ప్రకరణీ హల్లీ శోభాణికా' సా. ద.)

**ఉపరోధకము** సం. విశ. (అ. దికా. అ.) 1. ప్రతిబంధకము, అడ్డగించునది. 2. ముట్టడించునది. 3. ఆవరించునది. 4. బంధించునది. వి. అ. న. వాసగృహము, పడుకటిల్లు.

**ఉపరోధనము** సం. వి. అ. న. — ఉపరోధము.

**ఉపరోధము** సం. వి. అ. పుం. 1. అడ్డగింత. 2. ముట్టడించుట. 3. ఆవరించుట. 4. కట్టుట.

**ఉపరోధి** సం. విశ. (న్. నీ. న్.) ఉపరోధము చేయునది.

**ఉపరోధించు** సం. స. క్రి. అడ్డగించు.

మ. ... ఈ,విపినం బుజ్జ్వలపుష్పపల్లవఫలావిర్భూతినానాలతా,గపరీతం బన విందుఁ జూడఁగ మదిం గౌతూహలం బయ్యె న, న్నుపరోధింపకు మింతపట్టు చన వీ యుక్తుండ వెబ్భంగులన్. భార. అర. 7. 208.

**ఉపర్యాసనము** సం. వి. అ. న. ఎత్తుగాఁ గూర్చుండుట.

**ఉపల** సం. వి. ఆ. స్త్రీ. 1. తిరుగటియొక్క పై ఱాయి. 2. పాత్రము. 3. శర్కర, గులకఱాయి.

**ఉపలంభకము** సం. విశ. (అ. భికా. అ.) 1. తెలుపునది, ఎఱిఁగించునది. 2. పొందించునది.

**ఉపలంభనము** సం. వి. అ. న. — ఉపలంభము.

**ఉపలంభము** సం. వి. అ. పుం. 1. పొందుట. 2. ప్రత్యక్షాదిజ్ఞానము, అనుభవము.

**ఉపలంభ్యము** సం. విశ. (అ. ఆ. అ.) పొందఁదగినది (ప్రశంసనీయమగువిద్యాది).

**ఉపలక్షకము** సం. విశ. (అ. క్షికా. అ.) 1. చూచునది, కనుఁగొనునది. 2. ఊహించునది.(ఉదా: పంచిత్రోపలక్షకుఁడు.) 3. స్వార్థమును విడువక అస్వార్థమును లక్షణచేఁ దెలుపునట్టిది. (శబ్దము—చూ. ఉపలక్షణము. 4 అర్థము )

**ఉపలక్షణము** సం. వి. అ. న. 1. చూచుట. కనుఁగొనుట. 2. గుఱుతు,చిహ్నము. 3.సూచించుట. 4. వాచ్యార్థమునే కాక దానికంటె వే ఱగు నర్థమునుగూడ లక్షణచేఁ దెలుపుట. (కాకులనుండి పెరుఁగును గాపాడుము' అనుచో కాకశబ్దము కాకినే కాక దానికంటె వేఱై కాకివలెఁ బెరుఁగును త్రాగివేయు కుక్క మొదలగువానిని గూడఁ దెలుపుచున్నది. ఇట్లు తెలుపుట ఉపలక్షణ మనఁబడును.)

**ఉపలక్షయితవ్యము** సం.—ఉపలక్ష్యము.

**ఉపలక్షించు** సం. స. క్రి. చూచు, కనుఁగొను.

ప. ధర్మజుఁడు విదురునిం దమ్ముల నుపలక్షించి ధర్మార్థకామంబులయం దుత్తమమధ్యమాధమత్వనిరూపణంబు సేయుఁడు చూత మని పల్కిన. భార. శాం. 3. 452.

**ఉపలక్షితము** సం. విశ. (అ. ఆ. అ.) 1. కనుఁగొనఁబడినది, చూడఁబడినది. 2. ఊహింపఁబడినది, ఉపలక్షణముచే తెలియఁబడినది. 3. సహితము, కూడుకొన్నది.

**ఉపలక్ష్యము** సం. విశ. (అ. ఆ. అ.) 1.కనుఁగొనఁదగినది, చూడఁ దగినది. 2. ఊహింపఁ దగినది. 3. గుఱుతిడఁ దగినది. 4. సూచింపఁ దగినది. 5. ఉపలక్షణముచే గ్రహింపఁ దగినది. వి. అ. పుం. ఆశ్రయము, అవలంబనము.

**ఉపలధిప్రియము** సం. వి. అ. పుం. (వాలధిః + ప్రియః—ప్రియ మైనవాలము కలది.) చమరమృగము.

**ఉపలబ్ధ** సం. విశ. (ఋ. క్రీ. ఋ.) 1. పొందునది. 2. తెలియునది.

**ఉపలబ్ధము** సం. విశ. (అ. ఆ. అ.) 1. ప్రాప్తము, పొందఁబడినది. 2. తెలిసికొనఁబడినది.

**ఉపలబ్ధి** సం. వి. ఇ. స్త్రీ. 1 పొందుట. 2. జ్ఞానము, తెలివి.

**ఉపలభేది** సం. వి. న్. పుం. పాషాణభేది, కొండ పిండిచెట్టు.

**ఉపలభ్యము** సం. విణ. (అ. ఆ. అ.) 1. పొందఁదగినది. (చూ. ఉపలంభ్యము.) 2. తెలియఁదగినది.

**ఉపలము** సం. వి. అ. పుం. 1. ఱాయి. 2. రత్నము. 3. మేఘము.

**ఉపలాలనము** సం. వి. అ. న. బుజ్జగింపు.

**ఉపలాలించు** సం. న. క్రి. బుజ్జగించు, లాలించు.

క. ఉపకారము కోరక యే, నపరిమితప్రీతితోడ ననుదినమును ని, న్నుపలాలించుచుఁ బెంచుట, విపరీతపుఁగొడుక వైరి వేయును నేలా. మార్క. 5. 302.

(ఉపలాలనీయము మొదలగునవి లాలనీయము మొదలగువానివలె గ్రహించునది.)

**ఉపలాలితము** సం. విణ. (అ. ఆ. అ.) బుజ్జగింపఁబడినది.

**ఉపలింగము** సం. వి. అ. న. అరిష్టసూచక మగు భూకంపము, మొ.

**ఉపలిప్తము** సం. విణ. (అ. ఆ. అ.) 1. అలుకఁబడినది. 2. పూయఁబడినది.

(ఉపలేపనీయము మొదలగునవి లేపనీయము మొదలగువానివలె గ్రహించునది.)

**ఉపలిప్స** సం. వి. ఆ. స్త్రీ. పొందుటకు నిచ్ఛ.

**ఉపలిప్సువు** సం. విణ. (ఉ.) పొంద నిచ్ఛగించువాఁడు.

**ఉపలేపనము** సం. వి. అ. న. — ఉపలేపము.

**ఉపలేపము** సం. వి. అ. పుం. 1. (గోమయాదులచే) అలుకుట. 2. (సున్నము మొదలగునవి) పూయుట. 3. (తైలాదికము) రాచుట. 4. అలుకుటకు పూయుటకు రాచుటకు నుపయోగించు ద్రవ్యము.

**ఉపలేపి** సం. విణ. (న్. నీ. న్.) ఉపలేపముచేయునది.

**ఉపవక్త** సం. విణ. (ఋ. త్రీ. ఋ.) 1. వక్తకు సాహాయ్యము చేయువక్త. 2. ఒకానొకఋత్విక్కు, బ్రహ్మ.

**ఉపవటము** సం. వి. అ. పుం. ప్రియాలము (వృ.వి.)

**ఉపవడమగు** అ. క్రి. (√ఉపవడము. క. ఉపవడ-మేల్కొలుపుపాట.) మేలుకొను.

(నిద్రించియున్న) క. ...నృపుఁ డుపవడమై, జవ్వాడు లతిక యో యన, నవ్వేలఁది వడంకఁ జూచి యతఁ డిట్లనియెన్. శుక. 1. 224.

**ఉపవడము** — ఉప్పవడము. వి. మేల్కొనుట, అవబోధము.

సీ. ... మేలుకొంట యనఁగ మేలుకంట యనఁగ. గీ. మేలుకాంచుట యనఁగను మెలఁకువయన, నుపవడ మనంగ నవబోధ మొప్పు ...ఆం. భా. 1. 142.

జః ఉపవడమగు.

**ఉపవనము** సం. వి. అ. న. ఆరామము, పెంచిన తోఁట. అవ్య. అ. న. వనముదగ్గఱ.

**ఉపవర్ణనము** సం. వి. అ. న. వర్ణించుట.

**ఉపవర్ణము** సం. వి. అ. పుం. — ఉపవర్ణనము.

**ఉపవర్తనము** సం. వి. అ. న. 1. వ్యాయామస్థానము, సాదనచోటు. 2. ప్రదేశము. 3. మండలము (జిల్లా.) 4. దేశము.

**ఉపవర్షుఁడు** సం. వి. అ. పుం. ఒకానొకఋషి, పాణినియొక్క గురువు.

**ఉపవల్లిక** సం. వి. ఆ. స్త్రీ. అమృతస్రవ యనులత.

**ఉపవసథము** సం. వి. అ. పుం. 1. గ్రామము. 2. యాగమునకు పూర్వదివసము.

**ఉపవసించు** సం. అ. క్రి. భుజింపకుండు, పస్తుండు.

ఆ. నియతి నుపవసించి నిధులకు నధిపతి, యైన ధనదుముంద అధికభక్తిఁ, బూజచేసి నిధులఁ బూజించి లక్ష్మికిఁ, బొలుపు మిగుల నగ్రపూజ సేసి. మార్క. 8. 147.

**ఉపవస్త** సం. విణ. (ఋ. త్రీ. ఋ.) ఉపవసించువాఁడు.

**ఉపవస్తము** సం. వి. అ. న. ఉపవాసము.

**ఉపవాసకుఁడు** సం. విణ. (అ. నికా. అ.) ఉపవసించువాఁడు.

**ఉపవాసము** సం. వి. అ. పుం. పస్తు, భోజనములేమి.

**ఉపవాసి** సం. విణ. (న్. నీ. న్.)—ఉపవాసకుఁడు.

**ఉపవాహనము** సం. వి. అ. న. 1. కొనిపోవుట. 2. దగ్గఱకుఁ గొనిపోవుట.

**ఉపవాహ్యము** సం. విణ. (అ. ఆ. అ.) రాజాదు లెక్కఁ దగినది (గజాశ్వాది). వి. అ. పుం. రాజాదు లెక్కెడిపనుఁగు.

**ఉపవిభక్తి** సం. వి. ఇ. స్త్రీ.—ఔపవిభక్తికము.

**ఉపవిశత్** సం. శత్రు. కూర్చుండుచున్న.

**ఉపవిష** సం. వి. అ. స్త్రీ. అతివస (వ్య. వి.).

**ఉపవిషము** సం. వి. అ. న. కృత్రిమవిషము. పుం. జిల్లేడుపాలు, మొ.

శ్లో. అర్కక్షీరం స్నుహీక్షీరం తథైవ కలిహారికా, ధుత్తూరః కరవీరశ్చ పఞ్చ చోపవిషాః స్మృతాః.

**ఉపవిష్టుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) కూర్చున్న వాఁడు.

**ఉపవీతము** సం. వి. అ. న. ఎడమబుజముమీఁదనుండి కుడిచేతిక్రిందుగా వ్రేలాడునట్లు ధరింపఁబడు జందెము.

2. మల్లవిద్యయందలి క్రియాభేదము.

వ. ...పైసర శృంగిపటలము ఝంపు లెక్కు కరలాఘవంబులాది యామోడశోపవీతంబుల రీతులనేర్చి....హంస. 1. 206. ప్రబంధ. 78. (దీనికి యర్థమున తెనుఁగు భాషయందే ప్రయోగము కన్పడుచున్నది.)

**ఉపవీతి** సం. విణ. (న్. నీ. న్.) ఉపవీతము గల వాఁడు.

**ఉపవృత్తి** సం. వి. ఇ. స్త్రీ. దగ్గఱకుఁ బోవుట, కదియుట.

**ఉపవేదము** సం. వి. అ. పుం. వేదసదృశ మగు ఆయుర్వేదాదికము (ఋగ్వేదమునకు ఆయుర్వేదమును, యజుర్వేదమునకు ధనుర్వేదమును, సామవేదమునకు గాంధర్వవేదమును, అథర్వవేదమునకు స్థాపత్య—శస్త్ర—వేదమును ఉపవేదములు.)

**ఉపవేశనము** సం. వి. అ. న. — ఉపవేశము.

**ఉపవేశనీయము** సం. విణ. (అ. ఆ. అ.) కూర్చుండఁ బెట్టఁ దగినది.

**ఉపవేశము** సం. వి. అ. పుం. కూర్చుండుట.

**ఉపవేశి** సం. విణ. (న్. నీ. న్.) కూర్చున్నవాఁడు.

**ఉపవేశ్యము** సం. — ఉపవేశనీయము.

**ఉపవేష్ట** సం. విణ. (ఋ. ష్ట్రీ. ఋ.) కూర్చుండు వాఁడు.

**ఉపవేష్టవ్యము** సం. — ఉపవేశనీయము.

**ఉపవ్యాఖ్యానము** సం. వి. అ. న. వ్యాఖ్యానము చాలనిపట్టులకు వ్రాయువ్యాఖ్యానము.

**ఉపవ్యాఘ్రము** సం. వి. అ. పుం. సివంగి.

**ఉపశమకము** సం. విణ. (అ. మికా. అ.) ఉపశమము కలిగించునది.

**ఉపశమనము** సం. వి. అ. న. — ఉపశమము.

**ఉపశమము** సం. వి. అ. పుం. 1. (రోగాదులు) మానుట, నిమ్మళించుట. 2. తగ్గుట, క్షీణమగుట. 3. ఓర్పు.

**ఉపశమించు—ఉపశమిల్లు.** సం. అ. క్రి. 1. శాంతించు.

వ. అని మఱియు నశ్యంతాపరాధులైనయీ దుష్టాంగమ్ములకు నే నుపశమించు మదీయ ధర్మంబు నిడిచి నీపంపును నే నొనరింప ననిన...మార్క. 8. 258.

2. తగ్గు, క్షీణించు; అడఁగు.

(వ్యవ) ఆమందుచేత కుఱుపుబాధ ఉపశమించినది.

స. క్రి. ఉపశమిల్లఁజేయు, అణఁచు.

గీ. ఇంతకాలంబు నాతోడ వెరవులేక, కూడియుండితి వటుగావఁ గోపమెల్ల, నుపశమించితి నీ వింక నుండవలదు, పొమ్ము పోకుండితేని యిప్పుడె. శపింతు. వి. పు. 2. 244.

**ఉపశమితము** సం. విణ. (అ. ఆ. అ.) శాంతి నొందింపఁబడినది, ఉపశమింపఁజేయఁబడినది.

**ఉపశమిల్లు** - ఉపశమించు సం. అ. క్రి.

(అడఁగు, నశించు.)

వ. శారీరదుఃఖంబు లాకుక్రియాదిప్రతియోగంబుల నుపశమిల్లు.మఱి స్నేహంబులైన మానస దుఃఖంబులు జలంబుల నగ్ని యుపశమిల్లునట్లు విమలజ్ఞానంబునం జేసి యుపశమంబునం బొందు...భార. అర. 1. 22.

**ఉపశయము** సం. విణ. (అ. ఆ. అ.) ప్రక్కc బరుcడునది. వి. అ. పుం. 1. దగ్గఱc బరుండుట. 2. (వైద్య.) అన్నౌషధాదులచేత వ్యాధిని కనిపట్టుట (ఇది నిదానాంగములలో నొకటి.). 3. పథ్యాదులచేత రోగమునకు ఉపశమము కలిగించుట. 4. వలయొడ్డి యాచెంత దాcగి యుండుటకై త్రవ్విన గొయ్యి. అవ్య. అ. న. హస్తసమీపమున.

**ఉపశల్యము** సం. వి. అ. న. 1. గ్రామాంతము, ఊరిపొలిమేర. 2. ప్రాంతభాగము,

శ్లో. శైలోపశల్యనిపతద్రథనేమిధారాః. శిశు, 5. 8.

**ఉపశాంతము** సం. విణ. (అ. ఆ. అ.) ఉపశమము నొందినది.

**ఉపశాంతి** సం. వి. ఇ. స్త్రీ.—ఉపశమము.

**ఉపశాఖ** సం. వి. ఆ. స్త్రీ. శాఖనుండి పుట్టినశాఖ.

**ఉపశాయము** సం. వి. అ. పుం. కావలివారు వంతుల ప్రకారము పరుండుట.

**ఉపశాయి** సం. విణ. (న్. నీ. న్.) 1. దగ్గఱc బరుండువాcడు. 2. పరుండువాcడు. 3. (వైద్య) నిద్రను గలిగించునది (ముందు, మొ.)

**ఉపశాస్త్రము** సం. వి. అ. న. ఒకశాస్త్రమున కంగమయినశాస్త్రము, అప్రధానశాస్త్రము.

**ఉపశింఘనము** సం. వి. అ న. 1. మూర్కొనుట, ఆఘ్రాణించుట. 2. ఆఘ్రాపణము, మూర్కొనcజేయుట.

**ఉపశిక్ష** సం. వి. ఆ. స్త్రీ. 1. బాగుగా విద్య నేర్పుట. 2. బాగుగా విద్య నేర్చుకొనుట.

**ఉపశిక్షణము** సం. వి. అ. న. 1. విద్య నేర్చుకొనుట. 2. విద్య నేర్పుట.

**ఉపశిష్యుcడు** సం. వి. అ. పుం. శిష్యునకు శిష్యుcడు, ప్రశిష్యుcడు.

**ఉపశోభ** సం. వి. ఆ. స్త్రీ. 1. ప్రకాశము, శోభ. 2. అలంకరణము. శిశు. 13. 36.

**ఉపశోభనము** సం. వి. అ. న. 1. ప్రకాశించుట. 3. శోభింపcజేయుట.

**ఉపశోభితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ప్రకాశించినది. 2. ప్రకాశింపcజేయcబడినది.

**ఉపశోషణము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఎండునది. 2. ఎండించునది. వి. అ. న. 1. ఎండుట. 2. ఎండించుట.

**ఉపశ్రుతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. వినcబడినది. 2. అంగీకరింపcబడినది.

**ఉపశ్రుతి** సం. వి. ఇ. స్త్రీ. వినికి, వినుట. 2. ఒకదేవతను శుభాశుభములనుగూర్చి ప్రశ్న సేయcగా తద్దేవతావేశము గల బాలాదులద్వారమునc జెప్పcబడు నుత్తరవాక్యము; ప్రసంగసమయమున దైవికముగా వినcబడుశుభాశుభసూచకమగు వాక్యము.

గీ.... నృప యుపశ్రుతి వింటివే... వసు. 2. 59.

3. అంగీకారము. అవ్య. అ. న. చెవిదగ్గఱ.

**ఉపశ్రోత** సం. విణ. (ఋ. త్రీ. ఋ.) వినువాcడు.

**ఉపశ్లిష్టము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఆలింగనము చేసికొనినది. 2. కలసి యున్నది. 3. కాcగిలింపc బడినది.

**ఉపశ్లేషణము** సం. వి. అ. న. — ఉపశ్లేషము.

**ఉపశ్లేషము** సం. వి. అ. పుం. 1. (గృహఘటములకుం బోలె) ఆధారాధేయములకుcగల ఏకదేశ సంబంధము 2. కాcగిలి.

**ఉపశ్లోకించు** సం. స. క్రి. కీర్తించు, స్తుతించు.

క. ...అభూకాంతునిగుణము లుపశ్లోకించుచు నృపుcడు మగిడి లోనికిc జనియెన్. ద్వా. 11. 108. వరాహ. 8. 98.

**ఉపసంక్రమణము** సం. వి అ. న. ఉన్నయాధారమును విడిచి సమీపమున నుండుమఱియొకయాధారమునుజేరుట.

**ఉపసంఖ్యానము** సం. వి. అ. న. 1. (వ్యాక.) సూత్రములోc జెప్పినదానికంటె అదనముగాc జెప్పుట. 2. లెక్కించుట.

**ఉపసంగ్రహణము** సం. వి. అ. న. — ఉపసంగ్రహము.

**ఉపసంగ్రహము** సం, వి. అ. పుం. 1. పట్టుకొనుట. (ఉదా: పాదోపసంగ్రహము — నమస్కరించుటకై పాదములను బట్టుకొనుట.) 2. ఉపకరణము, సాధనము, పరికరము. 3. లెస్సగా సంగ్రహించుట, చక్కcగాc గూర్చుట. 4. స్వీకా

రము. (ఉదా: దారోపసంగ్రహము.) 5.సంతో షపెట్టుట.

వ. చంద్రగుప్తశరీరమభిద్రోగ్ధు మస్మత్ప్రయుక్తానాం తీక్ష్ణరసదాయినాముపసంగ్రహార్థం పరకృత్యోపజాపార్థంచ మహాతా కోశసంచయేన స్థాపితశ్శకటదాసః, ముద్రా. 2.

**ఉపసంగ్రాహ్యుఁడు** సం. విశే. (అ. అ. అ.) నమస్కారముకై పాదములు పట్టుకొనఁ దగినవాఁడు.

**ఉపసంధానము** సం. వి. అ. న. కూర్చుట, చేర్చుట.

**ఉపసంపత్తి** సం. వి. ఇ. స్త్రీ. 1. సమీపించుట. 2. ప్రాప్తి.

**ఉపసంపన్నము** సం. విశే. (అ. అ. అ.) 1. పొందఁబడినది. 2. సమీపమున నున్నది. 3. సహితము, కూడుకొన్నది. 4. సమృద్ధము, చాలినది. 5. సిద్ధమైనది. 6. మృతము, చచ్చినది. 7. యజ్ఞమునందు విశసనముచేయఁ బడినది (పశువు, మొ.) 8. పాకముచేత సంస్కరింపఁ బడినది (వ్యంజనాది.)

**ఉపసంభాష** సం. వి. ఆ. స్త్రీ. 1. సంభాషణము, మాటాడుట. 2. బతిమాలుట.

**ఉపసంయమనము** సం. వి. అ. న. చక్కఁగా బంధించుట.

**ఉపసంయమము** సం. వి. అ. పుం. 1. చక్కఁగా నియమించుట. 2. బంధనము. 3. ఉపసంహారము.

**ఉపసంవాదము** సం. వి. అ. పుం. ఒడంబడిక.

**ఉపసంవ్యానము** సం. వి. అ. న. పరిధానము, దోవతి.

**ఉపసంహరణము** సం. వి. అ. న.—ఉపసంహారము.

**ఉపసంహరించు** సం. స. క్రి. 1. సంహరించు, నశింపఁజేయు.

సీ. వితత తమోగుణావృతి రుద్రుఁడై పుట్టి జగములన్నియు నుపసంహరించు. మార్క. 4. 15. భార. శాం. 4. 206.

2. ముగియఁజేయు (చూ. ఉపసంహారము.) 3. మరలించు, నివారించు.

వ. ఇ ట్లస్త్రద్వయంబు నుపసంహరించి ధనంజయుండు ద్రోణనందనుం గూడ వరిగి పట్టుకొని... భాగ. 1. 158.

4 అణఁచు.

వ. స్వామీ కోపం బుపసంహరింపుము. భార. శాం. 5. 441.

**ఉపసంహారము** సం. వి. అ. పుం. 1. మరలించుట. 2. ముడుఁచుట, సంకుచితముచేయుట. 3. సమాప్తి, ముగియుట (వ్యతి. ఉపక్రమము.) 4. సంగ్రహము, సంక్షేపము. 5. నాశనము. 6. (తర్క.) ఖండనము.

**ఉపసంహారి** సం. విశే. (న్. నీ. న్.) ఉపసంహారము చేయువాఁడు.

**ఉపసంహితము** సం. విశే. (అ. అ. అ.) సహితము, కూడుకొన్నది.

శ్లో. శ్రుతవృత్తోపసంహితః. సం. భార. (ఆ.ని.)

**ఉపసంహృతి** సం. వి. ఇ. స్త్రీ — ఉపసంహారము.

**ఉపసత్త** సం. విశే. (ఋ. త్రీ. ఋ.) 1. ఆసన్నుఁడు, దగ్గఱ నుండువాఁడు. 2. అనుసరించువాఁడు. 3. సేవకుఁడు.

**ఉపసత్తి** సం. వి. ఇ. స్త్రీ. 1. సంబంధము; సమీప సంబంధము. 2. అనుసరించుట. 3. సేవ.

**ఉపసదనము** సం. వి. అ. న. 1. సమీపించుట. 2. గురుపాదములకడఁ గూర్చుండుట; శిష్యుఁడగుట. 3. సేవ, కొలువు. 4. పొందుట. అవ్య. అ. న. గృహసమీపమున.

**ఉపసదము** సం. విశే. (అ. అ. అ.) 1. దగ్గఱ నుండునది. 2. కొలుచునది, సేవించునది. వి. అ. పుం. 1. సమీపించుట. 2. సేవించుట.

**ఉపసన్నము** సం. విశే. (అ. అ. అ.) 1. దగ్గఱ నున్నది. 2. సేవకై సన్నిధి నున్నది. 3. సేవింపఁబడినది. 4. పొందఁబడినది.

**ఉపసమాధానము** సం. వి. అ. న. ప్రోగుచేయుట, రాశీకరణము.

**ఉపసరణము** సం. వి. అ. న. సమీపించుట.

**ఉపసరము** సం. విశే. (అ. అ. అ.) సమీపించునది. వి. అ. పుం. 1. ఎదపదనున నున్న స్త్రీ పశువునకు పురుషపశువులు చేరుట. 2. పశువుల ప్రథమగర్భగ్రహణము. 3. నిరంతరగమనము. (శ్లో. వీనాముపసరం దృష్ట్వా. భట్టి. 9. 60.)

**ఉపసర్గము** సం. వి. అ. పుం. 1. రోగవికారము. 2. ఆపద. 3. ఉత్పాతము. 4. సంస్కృతధాతువులకు మొదటఁ జేర్పఁబడు 'ప్ర, పరా' మొ. (ఇవి 'ప్ర, పరా, అప, సమ్, అను, అవ, నిస్, నిర్, దుస్, దుర్, వి, ఆఙ్, ని, అధి, అపి, అతి, సు, ఉద్, అభి, ప్రతి, పరి, ఉప' అని 22. వీనిఁ జేర్చుటవలన ధాతువుల యర్థము తఱచుగ మాఱును.)

**ఉపసర్జనము** సం. విణ. అ. న. అప్రధానము (అమరము) వి. అ. న. 1. ఉపద్రవము. 2. త్యాగము.

**ఉపసర్పణము** సం. వి. అ. న. – ఉపసర్పము.

**ఉపసర్పము** సం. వి. అ. పుం. సమీపించుట.

**ఉపసర్పి** సం. విణ. (న్. నీ. న్.) ఉపసర్పముచేయువాఁడు.

**ఉపసర్పించు** సం. స. క్రి. సమీపించు. (ఆశ్రయించు—శ. ర.)

**ఉపసర్య** సం. వి. ఆ. స్త్రీ. ఎదపదనున నున్న స్త్రీ పశువు.

**ఉపసాంత్వన** సం. వి. ఆ. స్త్రీ. – ఉపసాంత్వనము.

**ఉపసాంత్వనము** సం. వి. అ. న. ఓదార్చుట.

**ఉపసుందుఁడు** సం. వి. అ. పుం. సుందునితమ్ముఁడును నికుంభునికొడుకును అగు నొక రాక్షసుఁడు.

**ఉపసూర్యకము** సం. వి. అ. న. (సూర్యచంద్రుల) పరివేషము, గుడి.

**ఉపసృష్టము** సం. విణ. (అ. ఆ. అ.) 1. (వ్యాక) ప్రాద్యుపసర్గయుక్తము (ధాతువు). 2. కూడినది. 3. విడువఁబడినది. 4. గ్రస్తము, ఉపరాగయుక్తము 5. కాముకము.

వ. రాజానః...ఉపసృష్టా ఇవతుద్రాధిష్ఠితభవనాః. కాదం. 176 పు. (వాచ.)

6. ఉపద్రవయుక్తము. వి. అ న. మైథునము.

**ఉపసేకము** సం. వి అ. పుం. తడుపుట.

**ఉపసేక్త** సం. విణ. (ఋ. క్త్రీ. ఋ.) జలాదులచే తడుపువాఁడు.

**ఉపసేచనము** సం. విణ. (అ. ఆ. అ.) తడుపునది. (అ. ఈ. అ.) తడుపుటకు సాధనమైనది. వి. అ. న. తడుపుట.

(ఉపసేచకుఁడు మొదలగునవి సేచకుఁడు మొదలగువానివలె గ్రహించునది.)

**ఉపసేవ** సం. వి. ఆ. స్త్రీ. – ఉపసేవనము.

**ఉపసేవకుఁడు** సం. విణ. (అ. వికా. అ.) 1. సేవించువాఁడు. 2. అనుభవించువాఁడు.

**ఉపసేవనము** సం. వి. అ. న. 1. సేవించుట, 2. అనుభవించుట.

**ఉపసేవి** సం. విణ. (న్. నీ. న్.)—ఉపసేవకుఁడు.

**ఉపస్కరణము** సం. వి. అ. న. 1. ఉపస్కరము. 2. మఱొకదానికి గుణము కలిగించుట. 3. అలంకరించుట 4. రుచి కలిగించుట.

**ఉపస్కరము** సం. వి. అ. పుం. 1. గుణాధాయకద్రవ్యము, మఱొకదానికి గుణము కలిగించు ద్రవ్యము. 2. మఱొక దాని నలంకరించు వస్తువు (కటకకుండలాది). 3. మఱొకదానికి రుచి కలిగించు ద్రవ్యము, సంబారము. 4. (కుండ చీఁపురుమొదలగు) గృహోపకరణము. 5. వాక్యమందలి యధ్యాహారము. 6. నిందము, వికృతి, 7. సముదాయము. 8. హింస.

**ఉపస్కారము** సం. వి. అ. పుం.—ఉపస్కరణము.

**ఉపస్కీర్ణము** సం. విణ. (అ. ఆ. అ.) హింసింపఁబడినది.

**ఉపస్కీర్తి** సం. వి. ఇ. స్త్రీ. హింస.

**ఉపస్కృతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. నవీనగుణము కలుగునట్లు చేయఁబడినది. 2. అలంకరింపఁబడినది. 3. రుచి కలుగునట్లు చేయఁబడినది. 4. వికారము కలదిగాఁ జేయఁబడినది. 5. కూర్పఁబడినది. 6. అధ్యాహృతము, తెచ్చిపెట్టికొన్నది (పదాది.)

**ఉపస్కృతి** సం. వి. ఇ. స్త్రీ. – ఉపస్కరణము.

**ఉపస్తం(ష్టం)భకము** సం. విణ. (అ. ఇకా. అ.) 1. ఆధారముగా నుండునది, ఊఁతయైనది. 2. తోడ్పడునది.

**ఉపస్తం(ష్టం)భనము** సం. వి. అ. న.—ఉపస్తంభము.

**ఉపస్తం(ష్టం)భము** సం. వి. అ. పుం. 1 అవలంబనము, ఊఁత. 2. స్థితి, ఉనికి. 3. తోడ్పాటు.

**ఉపస్తరణము** సం. వి. అ. న. 1. ఆస్తరణము, పఱచుట. 2. అన్నాదులు పెట్టుటకు అడుగున ఆధారముగా వేసిన ఆకుపాత్ర, మొ.

**ఉపస్తరించు** సం. వ. క్రి. అభిఘరించు, (నేయి,మొ) కొంచెముగా వేయు.

గీ. పాత్రసంశుద్ధి కాజ్యం బుపస్తరించి యూర కుండిరి...భీమ. 2. 185.

**ఉపస్తుతి** సం. వి. ఇ. స్త్రీ. స్తుతి.

**ఉపస్త్రీ** సం. వి. ఈ. స్త్రీ ఉంచుకొన్నస్త్రీ.

**ఉపస్థపత్త్రము** సం. వి. అ. పుం. అశ్వత్థవృక్షము, రావిచెట్టు.

**ఉపస్థము** సం. విశ. (అ. ఆ. అ.) దగ్గఱ నున్నది, దాపైనది. వి. అ. పుం. 1. ఒడి. 2. మధ్యము, నడిమిచోటు. పుం. న. 1. (స్త్రీపురుషుల) గుహ్యావయవము. 2. గుదము. 3. స్థితి.

**ఉపస్థాత** సం. విశ. (ఋ. క్రీ. ఋ.) 1. సేవించు వాఁడు. 2. నమ్రుఁడు. 3. పరిచారకుఁడు. 4. చెప్పినకాలమునకు సరిగా వచ్చువాఁడు.

**ఉపస్థాతవ్యుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) 1. ఉపాసింపఁ దగినవాఁడు (సూర్యాది). 2. సేవింపఁ దగినవాఁడు (రాజాది.)

**ఉపస్థానము** సం. వి. అ. న. 1. దగ్గఱుట, దరిఁజేరుట. 2. (దేవతాదులను) ఉపాసించుట. 3. సేవ. 4. అనుసంధానము, స్మరణము. 5. వాసస్థానము. 6. ఉపాసనగృహము, దేవపూజా గృహము. 7. పొందుట.

**ఉపస్థానీయుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) 1. ఉపాసకుఁడు. 2. సేవించువాఁడు. 3. ఉపాసింపఁదగిన వాఁడు (దేవతాది) 4. సేవింపఁ దగినవాఁడు (రాజాది) 5. దగ్గఱనుండఁ దగినవాఁడు (పోషకాది).

**ఉపస్థాపకుఁడు** సం. విశ. (అ. వికా. అ.) 1. దగ్గఱకుఁ దెచ్చువాఁడు; దగ్గఱ నుంచువాఁడు. 2. తలఁపించువాఁడు, స్మరింపఁజేయువాఁడు.

**ఉపస్థాపనము** సం. వి. అ. న. 1. దగ్గఱ నుంచుట. 2. సిద్ధముచేయుట, 3. తలఁపించుట, స్మరింపఁ జేయుట

**ఉపస్థాపనీయము** సం. విశ. (అ. ఆ. అ.) 1. దగ్గఱ నుంపఁదగినది. 2. తలఁపింపఁ దగినది. 3.సిద్ధము చేయఁదగినది.

**ఉపస్థాయకుఁడు** సం. విశ. (అ. యికా. అ.) – ఉపస్థాయి.

**ఉపస్థాయి** సం. విశ. (న్. నీ. న్.) 1. దగ్గఱనిలుచు వాఁడు. 2. ఉపాసించువాఁడు. 3. సేవించు వాఁడు.

**ఉపస్థితము** సం. విశ. (అ. ఆ. అ.) 1. దగ్గఱనున్నది. 2. దగ్గరకు వచ్చినది. 3. పొందఁ బడినది. 4. జ్ఞప్తికి వచ్చినది. 5. సేవింపఁబడినది. 6. ఉపాసింపఁబడినది (దేవతాది) 7. సంభవించినది, జరిగినది. వి. అ. న. 1. సమీపించుట. 2. సేవ. 3. తోఁచుట, తలఁపునకువచ్చుట.

**ఉపస్థితి** సం. వి. ఇ. స్త్రీ. 1. సమీపించుట. 2. దగ్గఱ నుండుట. 3. పొందుట. 4. జ్ఞప్తి. 5. సేవ. 6. (దేవతాదుల) ఉపాసన.

**ఉపస్పర్శనము** సం. వి. అ. న. ఉపస్పర్శము.

**ఉపస్పర్శము** సం. వి. అ. పుం. 1. స్పర్శము, తాఁకుట. 2. ఆచమనము. 3. స్నానము.

**ఉపస్పర్శి** సం. విశ. (న్. నీ. న్.) 1. స్పృశించు వాఁడు, తాఁకువాఁడు. 2. ఆచమించువాఁడు 3. స్నానము చేయువాఁడు.

**ఉపస్మృతి** సం. వి. ఇ. స్త్రీ. జాబాలిమున్నగు ఋషులచే రచింపఁబడిన ధర్మశాస్త్ర విశేషము.

**ఉపస్రవణము** సం. వి. అ. న. 1. క్షరణము, కాఱుట. 2. క్షరణనివృత్తి, రక్తాది స్రావము ఆఁగుట.

**ఉపస్వేదము** సం. వి. అ. పుం. అగ్ని మొదలగువాని దాపున నుండుటవలనఁ గలిగినయూష్మము, ఉక్క; చెమట.

**ఉపహంత** సం. విశ. (ఋ. క్రీ. ఋ.) 1. అడ్డు పెట్టువాఁడు. 3. చంపువాఁడు.

**ఉపహతము** సం. విశ. (అ. ఆ. అ.) 1. కొట్టఁబడినది. 2. పిడుగు మొదలగునుత్పాతములచే ఉపద్రవము నొందినది. 3. నాశము నేయఁబడినది. 4. దూషితమైనది, చెడినది. 5. నిందింపఁ బడినది.

**ఉపహతి** సం. వి. ఇ. స్త్రీ. 1. దెబ్బ. 2. ఉపద్రవము. 3. నాశము. 4. అస్తగింత.

**ఉపహరణము** సం. వి. అ. న. దగ్గఱకుఁ దెచ్చుట. 2. పట్టుకొనుట. 3. కానుకలు ఇచ్చుట. 4. బలియిచ్చుట. 5. వడ్డించుట.

**ఉపహవము** సం. వి. అ. పుం. పిలుచుట, ఆహ్వానము.

**ఉపహసించు** సం. అ. క్రి. నవ్వు.

వ. నీ వెంతవాఁడ వఖలభువనభవనాధీశ్వరుండ యినవఁగమేశ్వరు దూషింప ననుచున్న గిరిజ పలుకులు విని కృతకమువికుమారుం డుపహ సించుచు. కు. సం. 6. 863.

సం. క్రి. పరిహసించు.

**ఉపహసితము** సం. విశ. (అ. ఆ. అ.) పరిహసిం పఁబడినది. ఎగతాళిచేయఁబడినది. వి. అ. న. ఎగతాళితోఁ గూడిననవ్వు.

**ఉపహస్తిక** సం. వి. ఆ. స్త్రీ. అడపము, తాంబూల ద్రవ్యము లుంచెడిసంచి.

**ఉపహారము** సం. వి. అ. పుం. 1. కానుకగాని చ్చుద్రవ్యము (దేవతలకును రాజాదులకును ఇచ్చుబలి, ధనము, మొ.) 2. సత్కారము, పూజ.

**ఉపహారి** సం. విశ. (న్. నీ. న్.) 1. ఉపహార మిచ్చువాఁడు. 2. తెచ్చువాఁడు.

శ్లో. అహో పరిభవోపహారిణో వినిపాతాః. మాళవి. 5. 145 పొ.

**ఉపహాసకుఁడు** సం. విశ. (అ. నికా. అ.) 1. పరి హసించువాఁడు. 2. హాస్యము చెప్పువాఁడు.

**ఉపహాసము** సం. వి. అ. పుం. నిందాసూచక మగు హాస్యము; పరియాచకము.

**ఉపహాస్యము** సం. విశ. (అ. ఆ. అ) నవ్వఁదగినది, పరిహసింపఁ దగినది.

**ఉపహితము** సం. విశ. (అ. ఆ. అ.) 1. ఉంపఁబ డినది. 2. కూడుకొన్నది.

**ఉపహూతము** సం. విశ. (అ. ఆ. అ.) పిలువఁబడినది

**ఉపహూతి** సం. వి. ఇ. స్త్రీ. పిలుపు, ఆహ్వానము.

**ఉపహృతము** సం. విశ. (అ. ఆ. అ.) 1. ఇయ్యఁ బడినది: కానుక యిడఁబడినది. 2. యజ్ఞపశు వుగా నీయఁబడినది. 3. వడ్డింపఁబడినది.

**ఉపహ్వరము** సం. వి. అ. న. ఏకాంతము, నిర్జన ప్రదేశము. 2. సమీపము.

**ఉపహ్వానము** సం. వి. అ. న. 1. పిలుపు, ఆహ్వా నము. 2. మంత్రము నుచ్చరించి (దేవతాదు లను) పిలుచుట.

**ఉపాంగము** సం. వి. అ. న. 1. నుదిటి వేసెడిబొ ట్టు. 2. అంగమునకు అంగముగా నుపయోగించు నంతర్భాగము.

శ్లో. ... సాంగోపాంగైరిహోదితాః. అమ రము. 2. 1.

3. (వేదాంగసదృశమైన) మీమాంసాది. (అవి- మీమాంస, న్యాయశాస్త్రము, పురాణము, ధర్మశాస్త్రము అని నాలుగు.) తిలకము, బొట్టు. (వాచ.)

**ఉపాంజనము** సం. వి. అ. న. అలుకుట; సున్నము మొదలగువానిని పూయుట.

**ఉపాంతము** సం. విశ. (అ. ఆ. అ.) 1. అంతమున కు సమీపమం దున్నది. 2. సమీపమం దున్నది. వి. అ. పుం. 1. ప్రాంతము, సమీపము. 2. కొన. (ఉదా: నయనోపాంతము.)

**ఉపాంతికము** సం. విశ. (అ. ఆ. అ.) అత్యంతస మీపమున నున్నది. వి. అ. న. అతిసమీపము.

**ఉపాంతిమము** సం. విశ. (అ. ఆ. అ.) కడపటి దానికిఁ బూర్వపుది.

**ఉపాంత్యము** సం. విశ. (అ. ఆ. అ.) 1. కడపటి దానికి మునుపటిది. 2. ప్రాంతమందున్నది.

**ఉపాంశుక్రీడితుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) రాజు నకు రహస్యక్రీడలయందుసంగడికాఁడు.

**ఉపాంశువు** సం. అవ్య. ఏకాంతము, విజనప్రదే శము.

క. శిలముఁ బట్టియు గంజాహోల లుపాంశున భుజించునధముల బైటం,జాలఁడు బైవన్ విప్ర,స్ఖాలిత్యము బైట వేసి కనుగిలుపు నథన్. ఆము. 4. 47. (ఉపాంశునన్ :- రహస్యముగా అనిభావము.) వి. ఉ. పుం. పైకి వినఁబడకుండఁగాజపించు జపము. (జపము 'మానసికము, ఉపాంశువు, వాచికము' అని ఉత్తమమధ్యమాధమ భేద ములచేత త్రివిధము.)

**ఉపాకరణము** సం. వి. అ. న. 1. = ఉపాకర్మము. 2. యజ్ఞపశువును విధ్యుక్తముగాఁ జంపుట.

**ఉపాకర్మము** సం. వి. న్. న. సంస్కారపూర్వక మగునధ్యయనారంభము, ఉపాకరణము.

**ఉపాకృతము** సం. విణ. (అ. ఆ. అ.) ఉపద్రుతము, ఉపద్రవమునొందినది. వి. అ. పుం. 1. యజ్ఞమందు చంపుటకై సంస్కారము చేయఁబడిన పశువు. 2. ఉపద్రవము. న. 1. యజ్ఞపశుసంస్కారము. 2. ఉపాకర్మము.

**ఉపాకృతి** సం. విణ. (న్. నీ. న్.) ఉపాకర్మము చేసికొన్నవాఁడు. వి. ఇ. స్త్రీ. ఉపాకర్మము.

**ఉపాఖ్య** సం. వి. ఆ. స్త్రీ. 1. నిర్వచించుట, వర్ణించుట. 2. ఉపనామము.

**ఉపాఖ్యము** సం. విణ. (అ. ఆ. అ.) ప్రత్యక్షమగునది (సూ. ద్వితీయేచానుపాఖ్యే. కౌముది).

**ఉపాఖ్యానకము** సం. — ఉపాఖ్యానము.

**ఉపాఖ్యానము** సం. వి. అ. న. 1. ప్రధానకథలో వచ్చెడి యవాంతరకథ. (ఉదా: నలోపాఖ్యానము.) 2. పూర్వవృత్తాంతమును జెప్పుట. 3. చెప్పుట.

**ఉపాగతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. సమీపించినది. 2. జరిగినది, సంభవించినది. 3. ఒప్పుకొనఁబడినది, అభ్యుపగతము.

**ఉపాగమము** సం. వి. అ. పుం. 1. దగ్గఱకు వచ్చుట. 2. జరుగుట, సంభవించుట. 3. అంగీకారము.

**ఉపాగ్రము** సం. వి. అ. న. చిట్టచివరకు దగ్గఱగానుండుభాగము.

**ఉపాగ్రహణము** సం. వి. అ. న. సంస్కారపూర్వకముగా వేదమును గ్రహించుట.

**ఉపాత్తము** సం. విణ. (అ. ఆ. అ.) 1. పొందఁబడినది. 2. సంపాదితము. 3. గ్రహింపఁబడినది. 4. అంగీకరింపఁబడినది. (ఉదా: ఉపాత్తయజ్ఞః) వి. అ. పుం. మదముడిగిన యేనుఁగు (ఉపాత్తో మదవర్జితః. హలా. ని.)

**ఉపాత్యయము** సం. వి. అ. పుం. 1. శాస్త్రలోకాచారములు నతిక్రమించుట. 2 నాశము.

**ఉపాదానకారణము** సం. వి. అ. న. సమవాయికారణము. (కుండకు మన్ను ఉపాదానకారణము.)

**ఉపాదానము** సం. వి. అ. న. 1. గ్రహించుట, స్వీకరించుట. 2. పొందుట. 3. ప్రతిగ్రహించుట, పుచ్చుకొనుట. 4. ప్రత్యాహారము, ఇంద్రియములను విషయములనుండి మరల్చుట. 5. కారణవిశేషము (ఘటమునకు మృత్తు ఉపాదానము) 6. భిక్షము, ఆయహారము.

సీ. తలమీఁద మంత్రాక్షతము లుంచి కలశాఁపుటిండ్ల నుపాదాన మెత్తి తెచ్చి. హంస, 2. 15?.

**ఉపాదానలక్షణ** సం. వి. ఆ. స్త్రీ.—అజహాత్స్వార్థ.

**ఉపాదేయము** సం. విణ. (అ. ఆ. అ.) 1. గ్రహింపఁదగినది. 2. పొందఁదగినది. 3. సంపాదింపఁదగినది. 4. ఉపాదానకారణజన్యమగుకార్యము (మట్టి ఉపాదానము, కుండ ఉపాదేయము.) 5. ఉత్తమము.

**ఉపాధానము** సం. వి. అ. న. 1. ఉంచుట. 2. ధరించుట. 3. ఆరోపించుట. 4. కప్పుట.

**ఉపాధి** సం. విణ. ఇ. పుం. కుటుంబవ్యాపృతుఁడు, కుటుంబమున మిక్కిలి ఆసక్తిగలవాఁడు. వి. ఇ. పుం. 1. కపటము, మోసము. 2. స్ఫటికము నెఱ్ఱఁగాఁ జేయుజపాకుసుమమువలె తనసామీప్యాదులవలన మఱియొకదానియందు తనధర్మమును ఆరోపించుటకు సాధన మగుపదార్థము. 3. (ఉపలక్షణరూపమగు) విశేషణము. (ఇది — జాతి, గుణము, క్రియ, సంజ్ఞ —అని నాలుగు విధములు.) 4. ఉపనామము (భట్టాచార్యమిశ్ర పండితాది.) 5. ధర్మచింత, ధర్మవిషయమైన యాలోచన. 6. (తర్క.) వ్యభిచారమును స్ఫురింపఁజేయు పదార్థభేదము. (సాధ్యవ్యాపకమును సాధనావ్యాపకమును అయినది ఉపాధి. ('వహ్నిగలది గనుక పర్వతము ధూమవంతము' అనుచో వహ్నిమత్త్వమనెడు హేతువునకు ఆర్ద్రేంధనము ఉపాధియగును.) 7. జాడ, గుఱుతు

**ఉపాధికము** సం. విణ. (అ. ఆ. అ — ఉప + అధికము.) పై పెచ్చయినది, మీఁదుమిక్కిలియైనది.

**ఉపాధ్యాయ** సం. వి. ఆ. స్త్రీ. ఉపాధ్యాయురాలు, చదువుచెప్పు ఆఁడుది.

**ఉపాధ్యాయాని** సం. వి. ఈ. స్త్రీ. ఉపాధ్యాయుని పెండ్లాము.

**ఉపాధ్యాయి** సం. వి. ఈ. స్త్రీ 1. ఉపాధ్యాయురాలు, చదువుచెప్పు ఆఁడుది. 2. ఉపాధ్యాయుని పెండ్లాము.

**ఉపాధ్యాయుఁడు** సం. వి. అ. పుం. చదువు చెప్పు వాఁడు, గురువు. 2. వేదమం దొగభాగమునో వేదాంగమునో వేతనము పుచ్చుకొని చెప్పు వాఁడు (ఇతఁడు ఆచార్యునికంటె తక్కువ వాఁడు.)

**ఉపానసము** సం. వి. అ. న. మన్ను మున్నగువాని తో చేసిన బండి (వాచ).

**ఉపానహము** సం. వి. హ్. పుం. చర్మపాదుక, చెప్పు.

**ఉపాయనము** సం. వి. అ. న. 1. ప్రాప్తి, పొందుట. 2. (గుర్వాదుల) సమీపమునకుఁ బోవుట. 3. కానుక.

**ఉపాయము** సం. వి. అ. పుం 1. సాధనము (స్వర్గమునకు యాగము ఘటమునకు దండమును ఉపాయములు.). 2. వెరపు; పన్నుగడ. 3. (రాజు శత్రువుల జయించుటకై ప్రయోగించు) సామాది (ఇవి నాలుగు 'సామము, దానము, భేదము, దండము' వీనితో 'ఉపేక్ష' చేర్చి 'అయిదు ఉపాయములు' అని శుక్రుఁడు. 'మాయ, ఉపేక్ష, ఇంద్రజాలము' అను మూఁటి చేర్చ సప్తోపాయము లని కొందఱు)

**ఉపాయయోగము** సం. వి. అ. పుం. ఉపాయమును ప్రయోగించుట.

**ఉపాయాతము** సం. విశే. (అ. ఆ. అ.) సమీపించినది. వి. అ. న. రాక.

**ఉపాయి** సం. విశే. (న్. నీ. న్.) 1. సమీపించు వాఁడు. 2. ఉపాయము గలవాఁడు.

**ఉపారంభము** సం. వి. అ. పుం. ప్రారంభము.

**ఉపారతము** సం. విశే. (అ. ఆ. అ.) 1. మరలినది. 2. విరమించినది.

**ఉపారతి** సం. వి. ఇ. స్త్రీ. 1. మానుట, చాలించుట. 2. మరలుట.

**ఉపారము**[1] వి. (సం. ఉపహారః.) కానుక.

సీ. కానుక కానిక కప్పము మూడిద యులుపా యుపారంబు లులుప యనఁగఁ, జను నుపాయన సంజ్ఞ...ఆం. భా. 2. 198.

**ఉపారము**[2] వి. మల్లబంధవిశేషము.

వ. పణంబును కరాతును ఉపారంబును చొంగ ణయు...మల్లుపు. 3. 69.

**ఉపారూఢము** సం. విశే. (అ. ఆ. అ.) 1. పెరిఁగినది. 2. బయలుదేఱినది, ప్రాదుర్భూతము (ఉదా: ఉపారూఢయౌవనుఁడు.)

**ఉపార్జకుఁడు** సం. విశే. (అ. ర్జికా. అ.) గడించు వాఁడు, ఆర్జించువాఁడు.

**ఉపార్జన** సం. వి. ఆ. స్త్రీ. — ఉపార్జనము.

**ఉపార్జనము** సం. వి. అ. న. గడన, సంపాదనము.

**ఉపార్జనీయము** సం. విశే. (అ. ఆ. అ.) సంపాదింపఁదగినది.

**ఉపార్జించు** సం. స. క్రి. సంపాదించు.

సీ. తపమున నగణితద్రవ్యముపార్జించి భూరి ధనంబు విప్రులకుఁ బెట్టి. మార్క. 8. 52.

**ఉపార్జితము** సం. విశే. (అ. ఆ. అ.) గడింపఁబడినది.

**ఉపార్జితవ్యము** సం. — ఉపార్జనీయము.

**ఉపార్జ్యము** సం. — ఉపార్జనీయము.

**ఉపాలంభనము** సం. వి. అ. న. - ఉపాలంభము.

**ఉపాలంభము** సం. వి. అ. పుం. 1. దెప్పుట. 2. నిందించుట.

**ఉపాలంభించు** సం. స. క్రి. నిందించు.

వ. అని యుపాలంభించి యాగంభోరువు కరాంభోరుహంబులు మొగిడ్చి మహాపరాధంబుఁ జేసితి నని యతండు మన్మనోనాథువంశనాథుండు వంద్యుండు గాని నింద్యుండు కాఁడని...పి. శకుం. 3. 185.

వ. అని యీలాగునఁ బౌరవిలాసవతీజనంబులు తన్ను నుపాలంభింప నక్కుంభినీసురుండు కోపించి. హరిశ్చ. 4. 191 ('ఉపలంభింప' అని అపముద్రితము.)

**ఉపాలబ్ధము** సం. విశే. (అ. ఆ. అ.) 1. దెప్పఁబడినది. 2. నిందింపఁబడినది.

**ఉపాలభ్యము** సం. విశే. (అ. ఆ. అ.) 1. దెప్పఁదగినది. 2. నిందింపఁదగినది.

**ఉపావర్తన** సం. వి. ఆ. స్త్రీ. — ఉపావర్తనము.

**ఉపావర్తనము** సం. వి. అ. న. 1. మరలివచ్చుట. 2. నేలపైని బొరలాడుట. 3. సమీపించుట.

**ఉపావృత్తము** సం. విశే. (అ. ఆ. అ.) 1. మరలి వచ్చినది. 2. ఉడిగినది. 3. శ్రమము వాయుటకై పలుమాఱు నేలఁబొర్లాడినది (గుఱ్ఱము.)

**ఉపాశ్రయము** సం. వి. అ. పుం. 1. ప్రాపు, ఆశ్రయము 2. ఊత. 3. ఆస్పదము, స్థానము.

**ఉపాశ్రయించు** సం. వ. క్రి. ఆశ్రయించు, సేవించు.

ఉ. ... గిరిప్రభుకన్య నుపాశ్రయించెదన్. సమీర. 1. 4.

**ఉపాశ్రయుఁడు** సం. విశే. (అ. అ. అ.) 1. ఆశ్రయించువాఁడు. 2. ఆశ్రయ మగువాఁడు.

**ఉపాశ్రితుఁడు** సం. విశే. (అ. అ. అ.) 1. ఆశ్రయింపఁబడినవాఁడు. 2. ఆశ్రయించువాఁడు.

**ఉపాస** సం. – ఉపాసన.

**ఉపాసంగము** సం. వి. అ. పుం. అమ్ములపొది.

**ఉపాసకుఁడు** సం. విశే. (అ. ఇకా. అ.) 1, సేవించువాఁడు. 2. దేవతోపాసన చేయువాఁడు. వి. అ. పుం. సేవకుఁడు.

**ఉపాసన** సం. వి. ఆ. స్త్రీ. 1. సేవ. 2. పూజనము. 3. చింతన. మననము.

**ఉపాసనము** సం. వి. అ. న. 1. ఉపాసన. 2. శరాభ్యాసము. 3. చిన్నపీఁట.

**ఉపాసనీయము** సం. – ఉపాస్యము.

**ఉపాసము** వి. (సం. ఉపవాసః.) ఉపవాసము, పస్తు.

క. దిన మొక్కొక్కటి యొక్కఁగ, వనజాతుం డుపవసించి వత్సర మెల్లం, జనఁగా నొక్కొకయేఁ డొక్క నుపాసం బుడిగి యశనకర్మము నడుపున్. ఉ. హరి. 2. 163.

('ఒక్కొకయది యొక్క నుపాసం బుండి' అని శ. ర. పా.)

**ఉపాసాదితము** సం. విశే. (అ. అ. అ.) పొందఁబడినది. వి. అ. న. పొందుట.

**ఉపాసించు** సం. వ. క్రి. సేవించు, కొలుచు.

క. హరిదత్తాత్రేయుం డన, ధరణి నవతరించి యోగతత్పరుఁడును నిర్జరముని సేవితుఁడును నై, పరఁగుచు మన్నాఁ డతని నుపాసింపు నృపా. మార్క. 2. 215.

**ఉపాసిత** సం. విశే. (ఋ. క్రి. ఋ.) ఉపాసించువాఁడు.

**ఉపాసితము** సం. విశే. (అ. అ. అ.) 1, పూజింపఁబడినది. 2. సేవింపఁబడినది. 3. మననముచేయఁబడినది.

**ఉపాసితవ్యము** సం. – ఉపాస్యము.

**ఉపాసీనుఁడు** సం. విశే. (అ. అ. అ.) సమీపమందుఁ గూర్చున్నవాఁడు.

**ఉపాస్తి** సం. వి. ఇ. స్త్రీ. – ఉపాసన.

**ఉపాస్త్రము** సం. వి. అ. న. అప్రధానాస్త్రము, చిన్నయస్త్రము,

**ఉపాస్యము** సం. విశే. (అ. అ. అ.) – ఉపాసింపఁదగినది–1. సేవింపఁ దగినది. 2. పూజింపఁదగినది. 3. మననముచేయఁ దగినది.

**ఉపాహారము** సం. వి. అ. పుం. చిఱుతిండి (పండ్లు, పిండివంట, మొ.)

**ఉపాహితము** సం. విశే. (అ. అ. అ.) 1. ఉంపఁబడినది. 2. ధరింపఁ బడినది. 3. జనితము, కలిగింపఁ బడినది.

శ్లో: కపోలకాషైః కరిణాం మదారుణై, రుపాహితశ్యామరుచశ్చ చందనాః. సం. కిరా. 8. 12.

4. ఆరోపింపఁ బడినది, మోపఁబడినది (నింద, మొ.) 5. సంయోజితము, కూర్పఁబడినది. వి. అ. పుం. ఉల్కాపాతము మొదలుగాఁగల అగ్న్యుత్పాతము.

**ఉపాహృతము** సం. విశే. (అ. అ. అ.) 1. గ్రహింపఁబడినది, పట్టుకొనఁబడినది. 2. తేఁబడినది. 3. ఇయ్యఁబడినది.

**ఉపేంద్రవజ్ర** సం. వి. ఆ. స్త్రీ. ప్రతిపాదమునకు పదునొకండక్షరములు గలవృత్తభేదము.

**ఉపేంద్రుఁడు** సం వి. అ. పుం.–ఇంద్రునితమ్ముఁడు– 1. విష్ణువు (ఇతఁడు కశ్యపునకు అదితియందు వామనుఁడై పుట్టెను.) 2. కృష్ణుఁడు.

**ఉపేక్ష** సం. వి. ఆ. స్త్రీ. 1. అశ్రద్ధ. 2. ఉదాసీనత్వము, తగులు లేకుండుట. 3. (యోగ) భావనాభేదము (ఇది చిత్తప్రసాదనమునకు అగుభావనాచతుష్టయములో నొకటి–'మైత్రి, కరుణ, ముదిత, ఉపేక్ష'అని భావనలు నాలుగు;) 4. రాజుల సప్తవిధోపాయములలో నొకటి.

**ఉపేక్షకుఁడు** సం. విశే. (అ. ఈకా. అ.) అశ్రద్ధ చేయువాఁడు. 2. ఉదాసీనుఁడు.

**ఉపేక్షణము** సం. వి. అ. న.–ఉపేక్ష.

**ఉపేక్షణీయము** సం. విశ. (అ. ఆ. అ.) ఉపేక్షింపఁదగినది.

**ఉపేక్షించు** సం. స. క్రి. 1. అశ్రద్ధచేయు, ఉపేక్షించు.

సీ. తమతమధర్మము ల్దప్పి దుర్మార్గులై దురితంబు లొనరించునరుల ధార, నీకుండు దండింప కెడ నుపేక్షించినఁ బోలియు నిష్టాపూర్తపుణ్యఫలము, లతనికి ... మార్క. 8. 150.

2. విడుచు.

క. వాయుసుతుఁ బనిచి నేఁ డటు, నేయుంపక తక్కి తేనిఁ జెప్పెద విను మేఁ, బ్రాయోపవేశమున నీ, కాయ ముపేక్షింతుఁ జుమ్ము కౌరవనాథా. భార, సౌ. 2. 33.

**ఉపేక్షితవ్యము** సం. — ఉపేక్షణీయము.

**ఉపేక్షితుఁడు** సం. విశ. (అ ఆ. అ.) ఉపేక్షింపఁబడినవాఁడు.

**ఉపేత** సం. విశ. (ఋ. త్రీ. ఋ.) 1. ఉపాయములు పన్నువాఁడు 2. సమీపించువాఁడు.

**ఉపేతము** సం. విశ. (అ. ఆ. అ) 1. పొందఁబడినది. 2. పొందినది. 3. సమీపగతము. 4. కూడుకొన్నది.

**ఉపేతి** సం. వి. ఇ. స్త్రీ. 1. రాక. 2. దగ్గఱకు వచ్చుట.

**ఉపేయము** సం. విశ. (అ. ఆ. అ.) 1. ఉపాయముచే సాధ్యమైనది 2. పొందఁ దగినది. 3. సమీపింపఁ దగినది.

**ఉపోఢము** సం. విశ. (అ. ఆ అ.) 1. వహింపఁబడినది. 2. ప్రోగుసేయఁబడినది. 3. దగ్గఱకుఁ దేఁబడినది. 4. పన్నఁబడినది (సేన.) 5. వివాహితము, పెండ్లియైనది. వి. అ. న. వ్యూహము, పన్నఁబడినసేన.

**ఉపోతి** సం. వి. ఈ. స్త్రీ. ఉపోదక, దుంపబచ్చలి, మట్టుబచ్చలి (వృ.వి.).

**ఉపోత్తమము** సం. విశ. (అ. ఆ. అ.) రెంటికెక్కువైనవానిలో కడపటిదానికి పూర్వపుది (అక్షరము. మొ. ఉదా: కలికి. ఇందు 'లి' ఉపోత్తమము. చూ. ఉత్తమము.)

**ఉపోదక** సం. వి. ఆ. స్త్రీ. దుంపబచ్చలి, మట్టుబచ్చలి (వృ. వి.).

**ఉపోదకి** సం. వి. ఈ. స్త్రీ. — ఉపోదక (వాచ).

**ఉపోదిక** సం. — ఉపోదక (వాచ).

**ఉపోదీక** సం. — ఉపోదక (వాచ).

**ఉపోద్ఘాతము** సం. వి. అ. పుం.— చెప్పఁబోవు విషయము నెఱుఁగఁజేయునది— 1. పీఠిక, అవతారిక. 2. (తర్క) ఒకానొక సంగతి.

శ్లో. చింతాం ప్రకృతసిద్ధ్యర్థాముపోద్ఘాతం విదుర్బుధాః. (సంగతులు ఆఱు:— శ్లో. సప్రసంగ ఉపోద్ఘాతః హేతుతా వసరస్తథా, నిర్వాహకైక్యకార్యైక్యే షోఢా సంగతిరిష్యతే)

3. ప్రారంభము.

**ఉపోద్బలకము** సం. విశ. (అ. లికా. అ.) బలపఱుచునది, ధ్రువపఱుచునది.

**ఉపోద్బలనము** సం. వి. అ. న. బలపఱుచుట, ధ్రువపఱుచుట.

**ఉపోషణము** సం. వి. అ. న. ఉపవాసము, పస్తు.

**ఉపోషితము** సం. వి. అ. న. ఉపవాసము, పస్తు.

**ఉపోషితుఁడు** సం. విశ. (అ. ఆ. అ.) ఉపవసించినవాఁడు, పస్తున్నవాఁడు.

**ఉపోష్యము** సం. విశ. (అ. ఆ. అ) పస్తుండఁ దగినది (తిథ్యాది.)

శ్లో. త్రిసంధ్య వ్యాపినీ యా తు సైవోపోష్యా సదాతిథిః (కాలమాధవము).

**ఉప్తకృష్టము** సం. విశ. (అ. ఆ. అ.) విత్తినపిదప దున్నఁబడినది

**ఉప్తము** సం. విశ. (అ. ఆ. అ.) 1. విత్తఁబడినది (ధాన్యాది) 2. ధాన్యములు విత్తఁబడినది (నేల) 3. గొఱిగింపఁబడినది.

**ఉప్తి** సం వి. ఇ. స్త్రీ. విత్తుట, వెద.

**ఉప్త్రిమము** సం. విశ. (అ. ఆ. అ.) విత్తుటవలనఁ బుట్టినది, చల్లుటవలన బయలుదేఱినది.

**ఉప్ప** విశ. √ఉప్పు[2] (కర్మధారయమున దీనికి 'ని' గాగమము వికల్పము. ఉదా: ఉప్పనీరు, ఉప్పనినీరు.) లవణరసము గలది, ఉప్పనిది (బ్రౌ. చి. ని.) ఉదా: నీళ్లు మిక్కిలి ఉప్పగా నున్నవి.

**ఉప్పఁబడు** అ. క్రి. (√ఉప్పు²) ఉప్పనగు.
ఉదా: నీరు ఉప్పఁబడినది.

**ఉప్పత** వి. ఓర్వలేనితనముచే పరులసంపత్తు మున్నగు వానినిగూర్చి యెక్కువగా చెప్పుట (అట్లు స్తుతింపఁబడినవానికి కీడు మూఁడునని ప్రసిద్ధి.) 'అవ్వ, ఁట్టు' అని ఆం. భా. 1. 115.
జ: ఉప్పతించు.

**ఉప్పతించే** స. క్రి. (√ఉప్పత)- ఓర్వలేనితనముచే పరులగుణములను-శ్లాఘించు.

**ఉప్పతిల్లు(లు)** అ. క్రి. (సం. ఉత్పత్. ప్రా. ఉప్పత.)
1. కలుగు, పుట్టు; సంభవించు, తటస్థించు.
చ. గుణమున లస్తకంబునను గోటియుగంబునఁ గేలఁ దాఁకి పణముగ నుప్పతిల్లి రభసంబుగ రేఁగినమార్గిఁ దీవ్రమార్గణనికరంబు లొక్కటం నరాతిబలంబులఁ గప్ప... భా. విరా. 5. 20.
క. ఎప్పుడు గర్భగతుండగు నప్పుడ యాదేహినాశ మందుట సిద్ధం, బొప్పఁగ విధివశగతి నగు,నుప్పతిలుట చచ్చుటయు మహోత్పల గంధీ. బ్రహ్మో. 4. 49.
గీ. ఓడి గంధర్వు లూడనిఁబాడి రెచ్చఁ, లకుఁ జెలు లుప్పతిలె...ఉ. రా. 1. 285.
2. అతిశయించు, ఉప్పొంగు
చ. వరనవరత్ననిర్మిత సువర్ణ మనోజ్ఞవిమాన పంక్తులఁ, హారిహారపద్మసంభవసురాధిప ముఖ్యులు సన్మునీంద్రులుఁ, వరుసగ నంబరస్థలమున వ్యసియించిరి తత్స్వయంవరస్ఫురణము గన్గొనంగ మదిఁ బుట్టినవేడుక లుప్పతిల్లఁగాఁ. ఇందు. 5. 67.
సీ. ...పొంగె నుప్పతిలె నుప్పొంగె ననఁగ, నుబ్బెవనుటకు నర్థమై యొప్పుచుండు. ఆం. భా. 3. 94.
3. నిండు.
ఉ. అర్వుల వట్టహాసముల నబ్జభవాండము లుప్పతిల్ల ...దశా. 9. 158.

**ఉప్పన** వి. (√ఉప్ప) షడ్రసములలో నొకటి.
సీ. లవణ ముప్పుప్పన యనఁ దెలంగు...ఆం. భా. 1. 104.

**ఉప్పనఁబట్టెలు**-ఉప్పఁబట్టెలు వి. బ. (√ఉప్పన) బాలక్రీడావిశేషము.
ఉ. కప్పము పేర నేఁడు నొడికాఁరితనంబున మోసపుచ్చఁగా,నుప్పులు దెత్తురే సమరయోగ్యతలంబున వైరికోటితో, నుప్పనఁబట్టెలాడు నెడ నుప్పులు దెత్తురు గాక యాదవుల్. ఉ. వారి. 4. 155.
సీ. చిడుగు డువ్వలపోటి చెండు గట్టనబోది యల్లి యుప్పనఁబట్టెలప్పళాలు. గీ.... ఆడుఁ, దిన్నఁడభినవబాల్యసంపన్నుఁ డనుచు. కాళ. 3. 38.

**ఉప్పయనము** వి. (క. ఉప్పయణ.) ప్రయాణ మాఁపుట,బస చేయుట.
క. అప్పాలఁతికురులు శివుమన,సొప్పరిఁదనుఁ దగులఁబెట్టునురు లన నెఱులై,కప్పారి కొ దమ తుమ్మెద, లుప్పయనము నేసినట్టి యొఱపున నొప్పుఁ. కు. సం. 3. 318. (ఇంకను విచార్యము. ప్రయోగాంతరము లేదు.)

**ఉప్పర** వి. చెఱువులు మొదలైనవి త్రవ్వియు గోడలు మున్నగునవి పెట్టియు జీవించెడుజాతి.
ఉదా: ఉప్పరవాఁడు, ఉప్పరది.
జ: ఉప్పరి'.

**ఉప్పరగుడి** వి. (క. ఉప్పరిగుడి-ఉప్పర + కుడి = ఎత్తైనపతాక.) ఎత్తయినపతాక. పండితా. మహి. 295 పా. (చూ. ఉప్పరవట్టము.)

**ఉప్పరము** వి. (సం. ఉపరి. క. ఉప్పర.) 1. మీఁదు, ఊర్ధ్వభాగము.
వ. పాలమ్ములు బొమ్ముకెలంకులం గాఁడఁ గాంద్రుకాంద్రు మని రొప్పి నొప్పి కుప్పరంబుగా వియత్తలంబునకు విల్లెత్తుపొడు వెగసి. మనుచ. 4. 37.
2. ఆకాశము.
మ. ...రంజక మైయుప్పర మంటుచప్పరమున న్నొవర్ణడోలావిలో,లకుఁడై నిల్చిన... శుక. 3. 605. ఆం. భా, 1. 69
విశే. ఉన్నతము, ఎత్తయినది.
వ. గృహారామావనికి రామామణిం దోడ్కొని చని చలువచప్పరంబున నప్పురంధ్రు లుప్ప

రంబై నకప్పురంపుఁదిప్ప నప్పు డొప్పులకుప్ప సుంచి. రా. వి. 4. 26.

సీ. గమకించు చమరివాలము లోనఁ గిలించి యుప్పరంబుగ నొంగొప్పు దిద్ది. వై జ. 4. 30.

చూ: ఉప్పరిగుడి, ఉప్పరముదాఁటు, ఉప్పర మెగయు, ఉప్పర మెత్తు, ఉప్పరవట్టము. ఉప్పరవీది, ఉప్పరించు.

**ఉప్పరముదాఁటు** అ. క్రి. (√ఉప్పరము) మీఁదికి దాఁటు; దాఁటు.

సీ. అంటినఁ గందునో యనుమేనినునుఁగాంతి యిరుగెలంకులకు నుప్పరముదాఁటు. విక్ర. 8. 101. (ఇట 'వ్యాపించు' అని భావము.)

**ఉప్పరమెగయు, ఉప్పరములునెగయు, ఉప్పరములెగయు** అ. క్రి (√ఉప్పరము) పై కెగయు; ఎగయు; అతిశయించు.

గీ. ...కంపితధరాధరాధిత్యకా ఝరీత,రంగ ఘటలెల్లెడల నుప్పరంబులెగసి, పడితడిపి... రామా. 6. 88.

వ. దచ్చికాళ్ల మెకంబుల నిటికించి కఱచుక యుప్పరంబున కుప్పరంబెగసి మలల సెలయేట్ల పులివతలంబుల నజ్జుగానజ్జుగాఁ జెండు గండభేరుండ కాండంబులును .... ప్రబంధ. 186.

క. మగపిండు మగువపిండుం,దెగ తేర్పడి చల్లులాడ దివి కుప్పరముల్, నెగసిపడువారిధారల, నగుదెంచె నమేఘవృష్టి యంచలు చెదరన్. కకు. 3. 86.

క. అప్పలుకుల కలుకలు మది,నుప్పర మెగయంగ వెనఁగె ఉ. హరి. 5. 220.

**ఉప్పరమెత్తు** స. క్రి (√ఉప్పరము) మీఁదికెత్తు.

ఉ. ...దోమతెర లుప్పర మెత్తిరి. ...ఆము. 5. 104.

**ఉప్పరవట్టము** వి. (√ఉప్పరము) పురాలంకార విశేషము.

ద్వి. మకుటతోరణములు మార్గపార్శ్వముల, నుప్పరవట్టంబు లొగిఁ గల్వడమ్ము,లుప్పరగుళ్లు మహోత్సవపతాక,ములు...ఆతపత్రములు నలంకారించి. పండితా మహి. 295 పా.

**ఉప్పరవీది** వి. (ఉప్పరము+వీది) ఆకాశవీథి.

మ. ...కని తే రుప్పరవీదిఁ దోలుకొని...భార. భీష్మ. 2. 90. విరా. 3. 176, 5. 98.

వ. ఉప్పరవీదికి దెప్పరంబుగా నెగసి సతురంగులై నరాహుతులు సమయఁ గుప్పించి యులుకుచు... భా. రా. యు. 1949.

**ఉప్పరి**[1] వి. (√ఉప్పర) ఉప్పరవాఁడు.

గీ....పరఁగుఁ గుద్యాదికారి యుప్పరియనంగ ఆం. భా. 2. 285. ప్రభు 3. 82పా. 1 పం.

**ఉప్పరి**[2] విశే. (ఉప్పు1+అరి.) కాలినది, తప్తము.

క. వనరాను లేడు నుప్పరి,పెనమునవీరులుమ లోలెఁ బెల్లున నుడిగెన్. కు. సం. 6. 312.

సీ. కలయంగ ధారణీతల మగ్నితప్తమై యుప్పరి పెనమట్టు లుచ్చియుండఁ, గులపర్వతంబులు కొలిమిలోఁ గ్రాఁగినయినుపముద్దల క్రియ నెసఁగియుండ. విజయసేనము. కు. సం, వ్యాఖ్య. అనుబంధము. 11 పా. (ఇంకను విచార్యము.)

**ఉప్పరించు** స. క్రి.—ఉప్పరించు[2]. (√ఉప్పరము — క. ఉప్పరిసు.) పై కి ఎత్తు. (మల్లయుద్ధక్రియా విశేషము.)

వ. మడమల మెడ మలంచియు నలంచియుఁ బిక్కల మొక్కలంబునఁ బప్పరించియు నుప్పరించియు...ఉ. హరి. 6, 108.

**ఉప్పరిగ** వి. (సం. ఉపకారికా. ప్రా. ఉవఆరిఆ. క. ఉప్పరిగె. త. ఉప్పరిక్కై.) సౌధము, మేడ.

ఉ. అప్పరిగొప్పయుప్పరిగలందు వసించెడిముగ్ధకాంతలు...దశా. 1.84. ఆం. సం. స్థా. 31.

**ఉప్పళము—ఉప్పళము.** వి. (√ఉప్పు[1].) ఉప్పుపండు పొలము.

వ. బెరసినయుప్పళములఉప్పుయమ్మినవహిండి వలన ఆషాఢ బ 13 గురువారము మొదలుగా మాడ రెండు వీసాలు హవిబలియచ్ఛకనలకుం...ఇచ్చితిమి...దశా. 8 సం. 635.

గీ. ...లవణాకరంబు, వెలయు నుప్పళ మనఁగను వేదవేద్య. ఆం. భా. 2. 9.

**ఉప్పలవాయి** వి. రొ? అంగుష్ఠమునకును తర్జనికిని మధ్యభాగము బొటనవ్రేలికిని చూపుడువ్రేలికిని నడుమ నుండుచోటు.

గీ. అంగుళాగ్రముల్ సిటికెనలందు మొదలు, లనఘ దేవర్షి తీర్థము లనఁగఁ బఱఁగు, వరుస వలకేలియుప్పలవాయిపైతృకంపుఁ దీర్థంబు తర్పణకార్యమునకు. భారం. అను. 4. 113.

ఉ. చెప్పిన వెట్టి బోయ వలచే యటు సొన్పుడు నందుఁ గన్నులన్, నిప్పులు రాలుచున్న మహనీయగదోజ్జ్వలభీషణోరగం, బుప్పలవాయి దిన్న విష ముగ్రత నెక్కుడు దృష్టి చీఁకటుల్, గప్పఁగ నోరఁ బెన్నురువు గ్రమ్మ మృతుండయి కూలె మేదినిన్. కేయూర. 4. 75. పండితా. పురా. 148 పొ.

**ఉప్పలి** వి. కీడు ఆపద. (శ. ర.)

**ఉప్పళము–ఉప్పలము**. వి. (తె. ఉప్పళమ్) ఉప్పుగని; ఉప్పుపొలము, ఉప్పు పండుభూమి. (ఉప్పురాసు లుండెడుచోటు అని కొందఱు అని శ. ర.)

**ఉప్పళించు**[1] స. క్రి. (బట్టలు) గుంజు, ఉదుకు. ఉదా: బట్ట ఉప్పళించి తెమ్ము.

**ఉప్పళించు**[2]–ఉప్పరించు.

గీ. ...సీసానఁ బట్టియు నుప్పళించు ... భారం. విరా. 2, 15.

**ఉప్పవడమగు** అ. క్రి. (√ఉప్పవడము) మేలుకొను.

క. ఉప్పవడంబై వేలుపుఁ, గప్పురగంధులును వేడ్కఁ గైసేయుచు నేఁ, డప్పరమమౌని యుండెడు,చొ ప్పరయుదమనుచు నడుచుచును దమలోనన్. వాల్మీ. 3. 107. ద్వి. పరమ. 3. 189 పొ. 16 పం.

ద్వి. జననాథుఁ డంత మజ్జనభోజనాదు, లొనరించి నగరిలో నొకకొంతదడవు,పవళించి యుండి యుప్పవడమై...ద్వి. పరమ. 3, 207 పొ. 18 పం.

**ఉప్పవడము**–ఉపవడము.

జ: ఉప్పవడమగు.

**ఉప్పి** వి. కుండలి (వ్యా. వి.).

సీ. తెల్లకాంచనము తుందిల మెట్టకాంచన ముప్పి తెల్లుప్పి నీరుప్పి యుప్పు. హంస. 4. 11.

**ఉప్పిఁడి** విణ. (ఉప్పు[2]+ఇఁడి–తె. ఉప్పిలి.) అలవణము, ఉప్పు లేనిది. ఆం. భా. 1. 105.

వి. ఉపవాసము, పస్తు.

గీ. వలవ దెన్నఁడు నీళ్ల లోపల మునుంగఁ,బలుతెఱంగుల నుప్పిఁడుల్ సలుపవలదు, పున్నియపు నేలలకు నిచ్చఁ బోవవలవ, దెవుడు పెనిమిటిపై బత్తి యొనఁగుచెలికి. అచ్చ. రా. అయో. 54.

**ఉప్పిఁడియుపవాసము** వి. (√ఉప్పిఁడి) కుపోషపవాసము.

సీ. ఓర్పుమై నుప్పిండియుపవాస ముండనీ మగనాలి సరిపోల్పఁ దగదు విధవ. కాశీ. 2. 83.

ద్వి. ...ఒక్కపాము, గదిసి పతిని జూచి కనలుచుఁ బలికె, నుప్పిఁడియుపవాస మున్ననాయాస, తప్పించుకొని పోవ ధర్మంబుగాదు. ద్వి. సారంగ. 2. 66 పొ. 7 పం.

**ఉప్పిడి** వి. బ. (√ఉప్పు[1]) ఉడుకఁబెట్టిన వడ్లబియ్యము.

సీ. పక్వచరవ్రీహిథపతండులసమాఖ్య యుప్పిళ్లనంగను నొప్పుచుండు, ఆం భా. 2. 254.

ఉప్పిడిబియ్యము–ఉప్పుడుబియ్యము.

క. ఉప్పిడిబియ్యమ యోముఖఁ, గప్పొవరఁగఁ గొట్టి పిట్టు గావించి మఱిన్, ఒప్పగుగుడాజ్యములతో, ముప్పొద్దులు గొనిన రక్తమూలము లడఁగున్, చికిత్స. (చి. ని.)

**ఉప్పిరింత** వి. (తె. ఉప్పిరి.) జ్యోతిష్మతి, మానేరు (వ్య. వి.).

**ఉప్పు**[1] స. క్రి. ఉడికించు, ఉడుకబెట్టు.

వ. కీచకతండులంబులం బిండిగొట్టి కొట్రఁ బోసి యుప్పి గొప్పలుగాఁ జేసి యావించినకుడుములకానలు... కాశ. 3. 86.

వి. ఉడుకఁబెట్టుట; కాల్పు. తాపము. (చూ. ఉప్పరి[2].)

జ. ఉప్పరి[2], ఉప్పిడు.

**ఉప్పు**[2] వి. (క, త. ఉప్పు.) లవణము; షడ్రసము లలో నొకటి.

ఉప్పుతిను—సొమ్ము అనుభవించు.

క. తొంటిజని వానియుప్పటు, తింటిఁ జామీ యింతపాటుఁ దెచ్చుకొనుటకై ...శుక. 3. 411.

ఉప్పుతోఁడొమ్మిది—ఉప్పుతోఁగూడ వంటకు కావలసిన అన్నిపదార్థములు.

సీ. ఉప్పుతోఁ దొమ్మిదియును బెట్టి కృపణంతు ణము గావించు నేగుణసముద్రుఁ,డు. రామా. 1. 107.

ఉప్పుతోఁ దొమ్మిది—జీవితమునకు అవశ్యకము లగు తొమ్మిది వస్తువులు.

శ్లో. ఘటః పటం జలం కాష్ఠం తండులస్తైల మేవ చ, శాకమగ్ని సమాయుక్తం లవణం నవసంయుతం (అభియుక్తోక్తి.)

ఉప్పుచఱచు—ఉప్పఁబడు, ఉప్పనగు.

ద్వి. మడుఁగులు పసులకాల్మడి నుప్పుచఱచె.

2. ఊషరక్షేత్రము, చౌటినేల.

సీ. చౌడు కారపుమన్ను చవుడన నూషరమృ త్స్నంజ్ఞ దోఁచుఁ దత్పృథివి పేరు,లు ప్పనఁ జౌడన నూసర యన నొప్పు ... ఆం. భా. 2. 63.

జః ఉప్ప, ఉప్పఁబడు, ఉప్పనఁబట్టెలు, ఉప్పలము, ఉప్పిఁడి, ఉప్పిఁడియుపవాసము, ఉప్పుఁగండ, ఉప్పుఁగడలి, ఉప్పుఁగల్లు, ఉప్పుఁగాయ, ఉప్పుఁగుందము, ఉప్పుఁగొటారు, ఉప్పుఁజేఁప, ఉప్పుఁబట్టెలు, ఉప్పుఁబత్తు, ఉప్పుఁబిండి, ఉప్పుఁబొలము, ఉప్పుటుండలు, ఉప్పురాయి, ఉప్పురియు, ఉప్పుసంద్రము.

**ఉప్పు**[3] వి. ఊఁదుటయందగుధ్వని కనుకరణము.

సీ. పొలయరా దని పూని మలయమారుతమును నుప్పున నెగనూఁదు నొక్కనాఁడు. సీతావి. 1. 27.

**ఉప్పుఁగండ** వి. (ఉప్పు[2] + కండ.) ఉప్పులో ఊర వేసినమాంసపుముక్క.

గీ. శరవిఖండితయోధమాంసములు నిండ, యెప్పెఁ బందిరిపైఁ బచ్చియుప్పుఁగండ, లెండఁ బెట్టినవిధమువఖండవమువ.కు.సం.11.741.

సీ. దుప్పులఁ బడనేసి యుప్పుఁగండలు చేసి చప్పరింపుచు నుండుచవులు మఱచి. వాల్మీ. 2. 129.

**ఉప్పుఁగడలి** వి. (ఉప్పు[2] + కడలి.) లవణసముద్రము.

సీ. అని హనుమంతుఁ గన్గొని మేల్పరుద నీవు గ్రస్సన నీయుప్పుఁగడలి దాఁటి. అచ్చ. రా. యు. 402.

**ఉప్పుఁగల్లు(లు)** వి. (ఉప్పు[2] + కల్లు.) ఉప్పురాయి, లవణకణము.

క. తప్పదు చంపెణ వదనము, చెప్పక చెప్పెడును గ్రక్కసి క్తంబయి నా,కుప్పుఁగలు వోలెఁ గలిగిన, యిప్పాపని దీని కేన యిచ్చితి మెసవన్. వేం. పంచ. 5. 25,

**ఉప్పుఁగాయ** వి. ఉప్పు[2] + కాయ—క. ఉప్పుగాయ, ఉప్పినగాయి. త. ఉప్పుక్కాయ్.) ఊరుఁగాయ, ఉపదంశము.

మ. ...తేనె కప్పుపుందోయము మీఁగడల్ పెరుఁగు లుప్పుంగాయలున్ మున్నుగాఁ, బరిపూర్ణంబుగ నారగించి రమవొప్పం బెండ్లివా రందఱున్. అని. 1. 105.

**ఉప్పుఁగుందము** వి. (√ఉప్పు[2] + కుందము) బాలక్రీడావిశేషము (శ. ర.).

**ఉప్పుఁగొటారు** వి. (√ఉప్పు[2]) ఉప్పు నిలువచేసెడి స్థలము.

**ఉప్పుఁజేఁప** వి. (√ఉప్పు[2]) 1. ఉప్పులో ఊర వేసిన చేఁప. 2. మత్స్యవిశేషము.

గీ. అల్లెద మ్ముప్పుఁజేఁపయు గొల్లదొందు, పరిగె రొయ్యాదియగుమీలఁ బట్టు నతఁడు. హంస. 4. 187.

**ఉప్పుఁబట్టెలు**—ఉప్పనఁబట్టెలు. (ఉప్పు[2] + పట్టెలు—'ఉప్పట్లు' వ్యవ.) వి. బ. బాలక్రీడావిశేషము, ఒకజట్టువారు ఉప్పుదొంగిలించుచుండ రెండవజట్టువారు పట్టుకొనినట్లు అభినయించు ఆట.

**ఉప్పుఁబత్తు** వి. (ఉప్పు[2] + పత్తు.) చవుటినేల.

**ఉప్పుఁబిండి** వి. (ఉప్పు[2] + పిండి) ఉప్పు వేసివండిన పిండి.

**ఉప్పుఁబొలము** — ఉప్పలము (ఉప్పు¹ + పొలము.) 1051. దా. శా. 1176.

**ఉప్పుటుండలు** వి. బ. (ఉప్పు² + ఉండలు.) భక్ష్య విశేషము.

సీ. బొబ్బట్లు తైలంబు లుబ్బుగుడుము గీ. సాగు వలు నుప్పుటుండలమేరువులును. (శ్రీరం. మా. 6. 110.

**ఉప్పుడు** విశ. (√ఉప్పు¹) ఉడుకఁబెట్టినది.

ఉప్పుడుబియ్యము — ఉడుకఁబెట్టినవడ్లబియ్యము. (ఇట్లే ఉప్పుడుచిట్టు, ఉప్పుడుతవుడు.)

**ఉప్పురాయి** — ఉప్పుఁగల్లు.

వాఁడు ఉప్పురాతికి మాఱఁడు — వాఁడు కొంచె మైనను విలువ లేనివాఁడు.

**ఉప్పురియు** అ. క్రి. (ఉప్పు² + ఉరియు.) ఉప్పు పట్టు.

ఉదా: వానియొడలు ఉప్పురిసినది.

**ఉప్పుసంద్రము** — ఉప్పుఁగడలి. నీలా. 2. 41.

**ఉప్పెన** వి. (సం. ఉల్బణమ్.) సముద్రముయొక్క పొంగు.

సీ. క్రమ్మఱవచ్చినకల్పసాల ముప్పెనఁ బోయె వచ్చినభాగ్యదేవత దొలంగె. కాశీ. 4. 111.

**ఉప్పొంగు** అ. క్రి. (ఉబ్బి + పొంగు.) 1. పొంగు, మీఁదిగి ఉబుకు.

సీ. కాఁగినయెసరులకరణిఁ బొరింబొరి శరనిధు లుప్పొంగి పొరలఁబడియె. భార. ఉద్యో. 4. 116.

2. అతిశయించు.

మ. బొమ లల్లాన్ ముడివడ్డరౌద్రరస ముప్పొంగం దనర్పన్ భుజాగ్రములిం దెవ్వఁడు వాకుమా అనుచు శౌర్యస్ఫూర్తిశోభిల్ల ... భార. ఉద్యో. 2. 188.

గీ. అమదివము తీర్థసందర్శనాభిలాష, మాత్మ నుప్పొంగ నత్తరుణాగ్నిహోత్రి, మనుచ. 1. 57.

3. మిక్కిలి యానందించు, మిగుల సంతోషించు.

మ. ...పసిండి యందెరవళిన్ రాయంచ అంతంత రాఁ, జెలులుం దాముసు సత్యభామ సను దెంచెన్నాథుఁ డుప్పొంగఁగన్. పారి. 2. 14.

**ఉప్వము** సం. విశ. (అ. అ. అ.) విత్తఁ దగినది (వడ్లు, మొ.)

**ఉబలాటము** వి. ఉత్కంఠ, కుతూహలము, వేడుక. (శ. ర. వా.)

**ఉబుకు** అ. క్రి. (క. ఉబకు, ఉబికు. త. ఉపుక్కు.)

1. పైకిలేచు.

సీ. చెందు గోరిచినచెలువున లివమీఱ నొయ్యా రముసఁ గొంత యుబికి యుబికి. శశాం. 3. 111.

2. ఉప్పొంగు, ఉబ్బు.

గీ. ...ఓయబల నృపుకు, శేంద్రుఁ గలసెద నని వచ్చుచే నెఱుఁగుదు, నుబికి చనఁ దగ దితి వాస మొకటి వినుము. శుక. 1. 86.

వి. పొంగుట (శ. ర.).

జ: ఉబుకువాఁడు.

**ఉబుకువాఁడు** విశ. వర్ధిష్ణువు, వృద్ధిలోనికి రాఁగల వాఁడు.

గీ. ఉబుకువాఁడన వర్ధిష్ణుఁ డొప్పుచుండు. ఆం. భా. 3. 9.

**ఉబుసు** — ఊసు. వి. 1. పనిలేనికాలము. (ఈయర్థ మున 'పోవు, పుచ్చు' అనువానితోఁ గలసియే యుండును.) 2. వృత్తాంతము, సమాచారము.

సీ. నే కూకకిటంబ నేఁ బుండరీకంబ నే ఖంజరీటంబ నేను డోమ. గీ నేను మానిసి ము న్నంచు నేకతమున, నొండొరులతోడుతను జెప్పుకొందు రుబుసుఁ, దారక బ్రహ్మమణి పేటి దతవాటి, సంభవించిన ప్రత్యగ్ర చంద్రధరులు. భీమ. 4. 38.

ఉ. ఇంచుక ప్రొద్దుపోకడకు నెవ్వరితో నుబు సేమి చెప్పుదున్. విక్ర. 6. 38.

ఉబుసుపుచ్చు — ఉబుసుపోవఁజేయు, కాలక్షేప ము గునట్లు చేయు.

గీ. అమరపతిఁ గొల్వఁ బనువార లతివ యెపు డు, నుబుసుపుత్తురు వివిధోపయోగ్యకళల. పారి. 2. 92.

శా. ...నీ కుబుసుపుచ్చన్ నెచ్చెలిం బోలి యీ, రా చిల్కన్ గయికొమ్ము... రాజ. చ. 2. 102.

ఉబుసుపోక — కాలక్షేపము.

సీ. ఒక్కనాఁడు భవాని యుబుసుపోకకుఁ
బై(డిజలపోసనముకసీసంపుఁబట్టు బంతి...
ఆడు చుఁడ. కాశీ. 6. 161.

క. అలమానసారుఁ డాత్మజ, లలనామణి నుబు
సుపోకలకుఁ బిన్నపుడే, కలభాషిణి యెవ్వ
నిఁ బెం.డిలియాడెద వన్న మగధనృపు వని
పలికెన్. రా. వి. 5. 44.

ఉబుసుపో(వో)వు—కాలక్షేపమగు.

గీ. శమనలోకాభివర్ణన (శ్రవణపరత, మబుసు
పోవంగ శివశర్మ యెయ్యెఁ జేరె, నప్పరో
లోకము...కాశీ. 3. 165.

వ. ఓచిలుకచెలువ యుబుసువోదు కథ యొక్క
టి చెప్పవుగా. కళా. 5. 17.

క. కట్టియఁ జేకొని దేగం,బట్టి యుబుసుపోక
పొలము మట్టినఁ జాలున్. దొట్టినక్రొవ్వులు
గల యవి,చె ట్టడిచినఁ జేచ్చెఁ డేమి చెప్పన్
బులుఁగుల్. మనుచ. 4 24

ఉబ్బు—ఉమ్మ. వి. వేఁడి,తాపము.

సీ. రసధూమ మఖలగాత్రచ్ఛిద్రములఁ (గ్రాఁక
నుబ్బులఁ బడి మాల్గుచుండువారు. వేం.పంచ.
1. 688.

గీ. ఉడుకు సెగ వెట్ట వేఁడిమి యుబ్బ యావి.
యుక్క యన నొప్పు నామంబు లుష్ణము
నకు. అం. తే. 57.

జ. ఉబ్బనీరు.

ఉబ్బుళము ని. (√ఉబ్బు-క. ఉబ్బడిగ.) ఉబ్బుట.
(గ్రా.)

ఉబ్బతిల్లు(లు) అ. క్రి. (√ఉబ్బు) ఉబుకు.

మ. ఒకపాదంబున భూమి గప్పి దివి వేఱొంట
న్నిరోధించి యొం,డొకటన్ మింట జగంబు
లెల్లఁ దొడి యొండొంటన్ విలంఘించి
ప,ట్టక బ్రహ్మాండకటాహ ముబ్బతిలి తీం
(డంబై పగుల్ గావరా, నొకఁడై వాగ్భృగ
లభ్యుఁడై హరి విభుం డొప్పారె విశ్వాకృ
తిన్. భాగ. 8.625 (చి. ని. పా.)

ఉబ్బనీరు- ఉమ్మనీరు. (√ఉబ్బు.) (శ. ర. గ్రా.)

ఉబ్బరపో(వో)వు అ. క్రి. (ఉబ్బరము²+పోవు)
1. నివ్వెఱపడు, ఆశ్చర్యపడు.

చ ...తద్భుజదండముఁ దాఁకి బిట్టురవడిఁ
జెండు (గమ్మఱిన నుబ్బరపోయిరి భామినీ
జనుల్. నై ష. 3. 95.

చ. ...రిక్కమొ త్తమును జక్కఁగఁ జూచి మె
లుంగుఁబోఁడు బి.చ్చపు బిడికిళ్ల బట్టి యవి
జూటి చనం దమగోళ్లు చుక్క లం,చును
నెడ నిల్చి చే వదలి చూచుచు నుబ్బరపోదు
రందురున్. నీలా. 1. 29.

2. పీడనొందు, బాధపడు.

ఉ. ఒయ్యన వెల్పు మాపి జడి నుబ్బరవోయెదు
(ప్రాణికోటికిన్, దయ్యము నె త్తికోలు తుది
దాఁకఁగఁ దూరుపు తెల్లవాఱితె,ల్పయెయ్యె
ను...హర. 2. 24.

ఉబ్బరము¹ వి. (√ఉబ్బు-క. ఉబ్బరి.) ఉబ్బుట.
(అతిశయము.)

వ. ప్రత్తిసంప త్తియు బొబ్బరియుబ్బరంబును
...భీమ. 3. 57.

(—కడుపు—ఉబ్బుట.)

(వ్యవ) వానికి కడుపుబ్బరము కొంచెము తగ్గి
నది. వానికి కడుపుబ్బరముగా నున్నది.

ఉబ్బరము² వి. (సం. ఉద్భ్రమః) 1. నివ్వెఱపాటు.
2. బాధ, పీడ (చూ. ఉబ్బరపోవు.)

జ. ఉబ్బరిపోవు.

ఉబ్బరించు—ఉబ్బు. అ. క్రి. (ఉబ్బరము¹+ఇంచు—
క. ఉబ్బరిసు.)

(పొంగు.)

(మున్నీరు.) సీ. రేఖేనిసిరి కుబ్బరించు (మ్రోఁ
తల (ప్రోవు తపసిరోసపుమంట దాఁచు
తావు. కవిరా. 4. 63.

(—కడుపు,మొ—పొంగు,ఉబ్బు.)

ఉదా: వానికి అజీర్ణ వ్యాధిచే కడుపుబ్బరించినది.
(విజృంభించు)

ద్వి. ఉబ్బుమారులతోడ నొకకొంత సేపు. ఉబ్బ
రింపక పట్టి యూరకుండుమను, నిమ్మోయిఁ
బోరుచో...రం. రా. యు. 389 పొ. 25
పం. (ప్రయోగాంతరము లేదు.)

ఉబ్బులి—ఉమ్మలి. వి. బురద.

క. ధరలో విప్పురుషులు స,త్పురుషాపద్ధరణ
హేతుభూతులు గారే, కరు లుబ్బులిలోఁ

చిక్కి-వఁ, గరుతెత్తఁగఁ జాలి యుండుఁ గాదె
పుడమిన్. వేం. పంచ. 2. 171.

సీ. ...అసలు. గీ. తొంచ్చు వం డడు నుబ్బలి
రొంపి బురద, యమ్మలి యవుజు జవుకు నా
నొప్పుఁ బంక,ము...ఆం. భా. 1. 156.

**ఉబ్బసము** వి. (సం. ఉచ్ఛ్వాసః. క. ఉబ్బస. తు. ఉబ్బస.) శ్వాసరోగము, వగరుపురోగము.

ఆ. ఒడలు పెంచులంజె యుబ్బసంబునవైన, వేగ
విటునిమీఁద విఱిగెనేనిఁ, బందికొక్కుమీఁద
బండికల్ పడ్డట్లు. వేమన. 2. 101.

గీ. ...కాసంబు పేరు దనర్చుచుండు, నుబ్బస
మనంగ దగ్గ నుక్కిస యన. ఆం. భా. 2. 126.

**ఉబ్బించు** స. క్రి. (√ఉబ్బు) ఉబ్బఁజేయు.
(పొంగునట్లు చేయు)

శా. అయ్యంభోనిధివారిగర్భమునయం దైరా
వణం బుద్భవం, బయ్యెన్ గండతలంబునన్
దొరఁగుదానాంభః ప్రవాహంబులు...తజ్జ
లధినీ రుబ్బింప...హరి. ౮. 67.

(స్థూలముచేయు, పెద్దదిచేయు)

సీ. ఉత్సాహ మొదవమై నుబ్బించెనేనియుఁ బ
చ్చిగోడలజాడ విచ్చు దిశలు. ఉ. రా. 2. 196.

(-ముఖస్తుత్యాదులచే-సంతోషపఱుచు.)

సీ. ...వారకయుబ్బించువారికిచ్చి. విక్ర. 7. 124.

వ. చండికయే యి ట్లానతిచ్చెనో కాక యావి
ప్రుండె నెపంబున న న్నుబ్బించి ధనంబు వడ
యం జూచెనో. ద్వా. 3. 217.

**ఉబ్బు** అ. క్రి. 1. పొంగు.

క. కడు నధికవృష్టి గురియఁగ, వడితో నదులెల్ల
నుబ్బి వఱదలువాఱెన్. వి. పు. 7. 156.

2. ఉబుకు, పైకి వచ్చు.

సీ. చక్రవాకములలోచన యుగ్మకముల నెట్లు
బ్బెనో విరహాబాష్పోదకములు. నైష. 8. 168.

సీ. నీటలో మునిఁగిన నేలచేడియఁ గొమ్ముకొన
నుబ్బ నెత్తినఘోణిపీవ. పారి. 1. 49.

3. బయలుపడు, ప్రకటమగు.

గీ. కావవచ్చిన యుబ్బులింగంబులకును, గావ
రాని నిగూఢలింగంబులకును, బుణ్యవాస
రముల మహాపూజ సేసి. కాశీ. 3. 226.

గీ. ...ఏమయ్యెనలకళాపూర్ణునుద్ది కడమచెప్పు
మన్న రంభ యప్పుడ తెలుపనె. నీకు మఱి
చెప్పరాకుంట నీకథయును. నీకు నాతోడు
ను మ్ముబ్బనీకు మనియె. కళా. 1. 86.
('నాతోడు నుము నుబ్బనీకు మనియె' అని
ప్రాఁతప్రొ. పా.)

4. అతిశయించు, మిక్కుటమగు.

సీ. ఒకదీవి నిండుచంద్రికలు మిన్నులు ప్రాఁకు
నొకదీవిఁ జేరెండ యుబ్బి కాయు. కాశీ.
1. 129.

5. స్థూలమగు, పెద్దదియగు.

మ. జెరసెన్మైన నిగిర్చినట్లు పళు లుబ్బెం దుర్బ
లాంగంబు లం, కురములూన్పె రదంబు
లంఘ్రుల వడఁకు ల్డీఱె ... వృద్ధాళికిన్,
మరలన్ బ్రాయము వచ్చెఁ దత్తరుచల
న్మందానిలాసంగతిన్. పారి. 5. 46

మ. అవు కావా యమృతంబు ముందు మన
దైత్యశ్రేణికిం బంతునో, బవిజుల్ గుయ్యిడ
కుండముం దొసఁగి యుండేఁ గొంతతర్వాత
దా, నవదైత్యాసుర రాక్షసావళులకున్
వడ్డింతునో యానతీ, యవలెన్ మీ రవ మం
చిదే యనియె దైత్యస్వామి మే నుబ్బఁ
గాన్. దశా. 2. 354.

(వ్యవ) వాతముచే వానికి శరీరము ఉబ్బినది.
నానినగింజలు ఉబ్బును. అజీర్ణపదార్థములు
తినినఁ గడుపు ఉబ్బును.

6. గర్వించు.

క. తను లోకము గొనియాడఁగ, విని యుబ్బఁ
డు సజ్జనుండు...భార. ఉద్యో. 2. 48.

క. మున్నన కుబ్బక యవమతి, ద న్నొందిన
నుక్కఁబడక ధరణీశుకడన్, ము న్నున్న
యట్ల మెలఁగిన, యన్నరునకు శుభము లొ
దవు నాపద లడఁగున్. భార. విరా. 1. 188.

7. ఉత్సాహపడు, వేడుకపడు.

చ. ...కులవిశిష్టుని సుప్రతు వృద్ధు నాద్యు శ్రీ,
ష్మని జెనకొల్పి సేనలకు ముఖ్యుఁడ వీ వని
యుబ్బఁజేసి యీ, నువఁ దలపెట్టి చంపికొనఁ
జూచెఁ సుయోధనుఁ డింత సేమగున్. భార.
ఉద్యో. 4. 207.

(శుకవిశినిచోరునకును అభేదాధ్యవసాయము)సీ. తనవచోరచన లెంతయు నెఱింగింపఁడు తమి నిరంధ్రాన్వేషణమున కుబ్బు. రా.వి. 1.13.
గీ. ఉపనిషత్తులు వారిచే మబ్బి వినును. ఆము. 4. 48.
3. సంతోషించు.
ఉ. మాలిశిరంబు ద్రుంచె క్షణమాత్రములో దివి వేల్పు లుబ్బఁగన్. ఉ. రా. 2. 79.
సీ. కావేరిఁ గట్టించెఁ గార్పాసరాసుల నుబ్బి చోడఁడు మెచ్చ నొక్క-శాత. హరి. 1.10.
వి. 1. ఉబ్బుట.
చ. సుదతిముఖేందుమండలముసొంపున రాగరసాంబురాశి యభ్యుదయముఁ బొందియెంత యును నుబ్బున వేల నతిక్రమించుచున్. నైష. 3. 143. (ఉబ్బునన్—పొంగుటచేత)
2. ఉబ్బు కలిగించుపదార్థము.
వం ... చిత్తసంభవుదళవాయి దేవతలపాంబ మంబుధియుబ్బు లోచనోత్సవము ... భా. రా. సుం. 170.
3. ఆధిక్యము.
వ. అప్పాండవ కౌరవసైన్యంబులతో నెయ్యది యుబ్బు గలిగియుండె నని యడిగిన సంజ యుం డతని కిట్లనియె. భార. భీష్మ. 1.137.
4. ఉత్సాహము.
చ. ...వెమ్మనములన్ గుణకౌతుక మావహిల్లు నాననములు దోఁప దర్పవచనంబుల నేనకు నుబ్బొనర్చుచున్. భార. శల్య. 1. 73.
5. విజృంభణము.
ఉ. పాండునృపాలనందనులు పావని మున్నుగ నేచి యప్పు భీష్ముండు గడంకమై నడచు చోటికిఁ బక్కటిగాఁగఁ ద్రోచి యొండొండ కడంగి నేవ తమయుబ్బున నుబ్బఁగ నన్య సైన్యవేదండముభాంగముల్ ద్రుణవిశాలముగాఁ గొని నిర్విశారులై. భార. భీష్మ. 1. 284.
చ. ...ద్వారపాలురన్, నెఱి చెడ మట్టికొంచుఁ జోర నిర్భరగర్వము నుబ్బు బింకమున్, మెఱయఁగ వచ్చి యాయసుర మించె మద ద్రగమహోనవస్థితిన్. ప్రభా. 1. 81.
6. గర్వము.
అ. నుప్పుఁబువ్వు నప్పు జవ్వనినాసిక, చివురు నవురు జవురు నువిదమోవి, మబ్బునుబ్బు గెబ్బు బిబ్బోకవతివేణి, మెఱపునొఱపుఁ బఱపుఁ దెఱవమేను. విజ. వి 1. 84.
7. సంతోషము.
సీ. మనమున నుబ్బుమై మాట నాలుకకు రాఁ గడఁగిన నాదక కడపి కడపి. భార. విరా. 3. 55.
(ప్రాణనాథునకు) ఉ. ...ఊరువు లొత్తి చిత్తమున కుబ్బొనరించుట ధర్మ మింతికిన్. కాశీ. 2. 81.
8. వ్యాధివిశేషము (ఇందు దేహము పొంగును.)
విశే. ఎత్తైనది.
సీ. కలిమిగుబ్బెతమిన్న గబ్బినిబ్బరపుబ్బుగుబ్బలా జక్కవగిబ్బజోడు. దశా. 1. 164.
ఉ. ముంగల నుబ్బుచప్పుము ముత్తెపు ద్రుమ్ముగులుఁ బూలమేలుకట్లుం గొద లేనిచిత్తరు పులున్. కువల. 5. 102.
కడుపుబ్బ—అసహనము, చూపోపమి.
(వ్యవ) వానిబాగు చూచిన నీకంత కడుపుబ్బు ఏల?
జ : ఉప్పొంగు, ఉబ్బకము, ఉబ్బతిల్లు, ఉబ్బరము', ఉబ్బరించు, ఉబ్బించు, ఉబ్బుఁగుడుము, ఉబ్బెత్తు.

**ఉబ్బుఁగుడుము** వి. (√ఉబ్బు) ఉబ్బునట్టికుడుము, భక్ష్యవిశేషము.
సీ. ...బొబ్బట్లతైలంబు లుబ్బుఁగుడుము, సారువలు...శ్రీరం. మా. 6. 110.

**ఉబ్బెత్తు** అ. త్రి. (ఉబ్బు+ఎత్తు) ఉబుకు, ఉబ్బు, పైకిలేచు.
ద్వి. పసిఁడిజే కుబ్బెత్తుపగిది వీడెమునఁ బొసఁగి నిగ్గులుదేఱు పుక్కిటితోడ. అ. మ. క. 1. 26 పా 18 పం.
విశే. ఎత్తుగా నున్నది, ఉబికినది. (ఉదా: మురుగులు వడమిభాగమున ఉబ్బెత్తుగానున్నవి.)

**ఉభయచరము** వం. విశే. (అ. ఈ. అ.) — రెంటఁ దిరుగునది — నీటియందును భూమియందును

గాని, నీటియందును ఆకాశమందును గాని, భూమియందును ఆకాశమందును గాని తిరుగునది (శాఁబేలు, పక్షి, మొ.).

**ఉభయతోదంతము** సం. విశే. (అ. అ. ఈ. అ.) రెండువరుసలపండ్లు గలది, పయివరుసను క్రింది వరుసను పండ్లు గలది.

**ఉభయతోముఖము** సం. విశే. (అ. అ. అ. మా - అభిముఖము.) రెండుప్రక్కల ముఖద్వారములు కలది (ఇల్లు, మొ.)

**ఉభయతోముఖి** సం. వి. ఈ. స్త్రీ - (ఈనుచున్నపుడు) ఒకప్రక్క దూడముఖమును ఒకప్రక్క తన ముఖమును గలది - ఈనుచున్న యావు

**ఉభయము** సం. న. (అ. ఈ. అ.) 1. రెండవయవములు గలది. 2. రెండు. వి. అ. న. అనేకులు గలిసిచేసెడు ధర్మకార్యములలో వంతులప్రకారము ఒక్కొక్కరిచ్చెడుధనము.

(వ్యావ) ఈయుత్సవమునకు నేఁటియుభయ మెవరిది (ఈయర్థము ఆంధ్రద్రావిడములందే వాడుకలో నున్నది.),

**ఉభయవేతనుఁడు** సం. వి. అ. పుం.- రెండుపక్షములనుండియు జీతము పుచ్చుకొనువాఁడు - పైకి శత్రురాజుకొలువులో నున్న ట్లగపడు చారుఁడు.

**ఉభయవ్యంజనము** సం. వి. అ. న. పోట, స్త్రీపురుషలక్షణములు గలవ్యక్తి.

**ఉభయాత్మకము** సం. విశే. (అ. త్మకా. అ.) రెంటిస్వరూపము కలది.

**ఉమ** సం. వి. అ. స్త్రీ 1. పార్వతి, [illegible] 3. కాంతి. 4. పసుపు 5. నల్లయగిసె (వృ.వి.) 6. శాంతి.

**ఉమాకటము** సం. వి. అ. పుం. 1. నల్లయగిసెయొక్కరిజము, 2. పసుపుపొడి.

**ఉమాచతుర్థి** సం. వి. ఈ. స్త్రీ - పార్వతి పుట్టినచవుతి - జ్యేష్ఠశుక్ల చతుర్థి.

**ఉమాతము** - ఉమ్మాదము. (శ. ర. బ్రౌ. చి. ని.)

**ఉమాపతి** సం. వి. ఇ. పుం. శివుఁడు (ఇశ్లే - ఉమేశుఁడు, ఉమావల్లభుఁడు ఉమాసహాయుఁడు, మొ.)

**ఉమావనము** సం. వి. అ. న. కోటితపురము, దేవికోట. (ఇది బాణుని పట్టనము)

**ఉమాసుతుఁడు** సం. వి. అ. పుం. 1. వినాయకుఁడు. 2. కుమారస్వామి.

**ఉమి** - ఉమ్మి (√ఉమియు. త - ఉమిళ్వు.) ఉమిసినద్రవము; ఉమియుట.

క. క్రమ మెఱి కూర్రుఁడు విప్రోత్తముపై ని దప్పులేక శాగర్వితుఁడై, యుమిసినఁ బెదవులు గోయుట, యుమి కొలఁదిని పిఁచు టునిన ముర్వీశులకున్. విజ్ఞా. ప్రా. 46.

సీ. నాసాపుటంబులు మూసి యుమ లేక మాని... శివధ. 7. 5.

**ఉమియు** అ. క్రి. (త. ఉమిళ్.) నిష్ఠీవనముచేయు, ఉమ్మివేయు.

ఆ. నీవు సూచుచుండ నియిష్టుఁ డిమ్మతి, మఱుఁ డిపుడు దనదుమదము పేర్మి, నన్ను నుఱక యుమిసె నామీఁద నిట్టియి, ద్దినుజుఁ డీలు నొక్కమనుజు చేత. భాగ. ఆర. 4. 31.

సీ. కలికి ప్రేంకణము చెంగటఁ బాడి పొగడపైనుమిసితి విది యెదురుకు లాడె. ఉ. రా. 6. 89.

స. క్రి. (నోటనున్న వస్తువు) వెలువరించు; వెలువరించు.

సీ. కొని బాలురైనను దిని పిప్పి యుమిసెదు చెఱకు పిల్లని నమ్ము చేతఁబట్టి. కు. [illegible] 4. 4[illegible]

క. ఎఱమంట లుమియుచూడ్కులఁ జూఱచుఱఁ జూచుటయు... హరి. పూ. 2 66.

జ: ఉమి, ఉమ్మి.

**ఉముక** - ఊఁక. వి. (క. ఉమ్మి,ఉయ్.త.ఉమి.) తుషము, ధాన్యత్వక్కు. వడ్లపైపొట్టు. భాగ. శాం. 4. 391. ప్రబోధ. 2 40.

**ఉమెత** - ఉమ్మెత్త.

క. ముది మది దప్పెనొ పైత్యము, గదిరెనొ యటుగాక యుమెతకాయ నమలితో,

మదనారిభ క్తవర్యుల, సదనములకుఁ గాక
యిటకుఁ జనుదే నగునే. చెన్నబ. 2.35.

**ఉమ్మ - ఉబ్బ** వి. (సం. ఊష్మ. ప్రా. ఉమ్హా.) ఉక్క, ఉబ్బ.

సీ....సమీరణుండు, పుట్టి తీవ్రత నేల బెట్టు
గాఁ జలుచుచు విసరె బిహాండతో నెసఁగె
నుమ్మ, యీఁగ మిక్కుటమయ్యె...హరి.
పూ. 7. 160.

జ. ఉమ్మగించు, ఉమ్మగిల్లు, ఉమ్మనీరు.

**ఉమ్మగించు** అ. క్రి. (√ఉమ్మ) ఉక్క పెట్టు, ఉక్కగా నుండు.

సీ. ఎండలు ప్రబలుట....మంచు గాలియు
నుమ్మగించుటయును, సన్నపు వానయుఁ
జలియును నివిపది వివరింప వర్ష ధాతువులు
మఱియు. రెట్టమత శాస్త్రము. 2. 15.

**ఉమ్మగిల్లు** (లు.) అ. క్రి. √ఉమ్మ. (వార్చి పెట్టిన అన్నము మొదలగునవి) లోపలి ఆవిరిచే సరిగా నుడుకు.

వ. లోన నుమ్మగిలి గబ్బువలవక కమ్మతావులు
గల నావురాకులు వలచి...మనుచ.
4. 60.

**ఉమ్మడి** విశే. పలువురకు స్వామ్యము గలిగి అవిభక్తముగా నున్నది; ఏకము.

ఉ. ఉమ్మడిసొమ్ము గావఁ దనయోపినయంత
యు నన్నివంకలన్, సెమ్మదిఁ జాఱఁ
జల్లుమను నీగ్లెడుఁ దాన ప్రచాత
నంచు... ఛోజరా. 6. 137.

గీ. మంపు దులకించుచుత్తిగ మానిక ముల,
మొలక నిద్రాకడానిసొమ్ముల మెఱుంగు,
లుమ్మడిగఁ గ్రమ్మి నెమ్మేన నొఱపు
చూప, రాజవరుఁ గాంచి లేచి యారాజ
వదన. రసిక. 3.47.

(వ్యవ) ఉమ్మడిగొడ్డు పుచ్చి చచ్చినది. నేఁటి వఱకు సోదరు లందఱు ఉమ్మడిగానే యున్నారు.

వి – ఉంబళిక.

సీ. శ్రీరంగవిభుఁ బ్రతిష్ఠించి యర్చదివేలు
మాడలద్దేవునుమ్మడికి నొసఁగె. శై. ఖా.
1. 32.

ద్వి ...వారితోఁ జోళ కాంతుఁ డిట్లనియె,
నేమోయి పరకాలుఁ డేలుచు నున్న,సీమ
దానెంత నేఁ జేసినయట్టి, యుమ్మడియును
తానె యుత్తరు వమర, మిమ్మొయిడింప
మా కియ్యేటి వఱకుఁ,జెల్లినధన మెంత
చేసేత నతఁడు, చెల్లింపఁగా వలసినధన
మెంత. ద్వి. పరమ. 6. 458పొ.

అవ్య. క్రియ. ఒక్కమాటుగా ఏక కాలమున. (ఇది తఱచు 'ఒక్క' శబ్దపూర్వకముగా కన్పించుచున్నది.)

క. కృతవర్మయుఁ గృపుఁడు గురుఁడు, సతని
సుతుఁడుఁ గర్ణుఁడును బృహద్బలుఁడును
ఖా,సితశరములు గురియుచు న,చ్యుతు
నల్లునిఁ బొదివి రొక్కయుమ్మడిఁ బెలుచన్.
భాం. ద్రో. 2. 92.

ఉ. ...ఒ,క్కుమ్మడిమ్రోసె దివ్యముంజోద్గత
నాదము లెల్లదిక్కులన్. హరి పూ.1.113.

మ. ...అ,బలియు దేయ మెఱుంగుటమ్ము లస
మొప్పన్ ద్రుంచువాఁ డుమ్మడిన్. అచ్చ.
రా. యు. 346.

**ఉమ్మదము** వి. ఉమ్మ, ఉక్క.

గీ. ఉమ్మలిక యుమ్మలిం పుబ్బు నుమ్మయుక్క,
యుమ్మదం బావి యావిరి యుమ్మలిక య,
నంగ నూష్మాఖ్యలౌ...ఆం. భా. 1. 87.

చ. పటుతరవిక్రమస్ఫురణఁ జాకుపతంబులు
రెండుఁ బోరఁగాఁ, జిటిలివవిస్ఫులింగములఁ
జిల్లులవోయె వక్షస్థలంబు...గర్భగోళసం,
పుటములు వ్రొక్కె నుమ్మదము పుట్టెఁ జెమ
ర్చెఁ బురాణకూర్మమున్. శివరా. 1. 90.

**ఉమ్మనీరు** వి. (√ఉమ్మ) గర్భకోశములో శిశువు నావరించి యుండి ప్రసవకాలమున వెలువడు నీరు, ప్రసవజలము.

గీ. ఉగ్విఁ గాదంబినులఁ గలయుమ్మనీరు, తొ
రుఁగఁ గేకులు కేకలుతోన నేసె. ఆము. 4.
77. (ప్రాఁతప్రతి.) చంద్రా. 3. 101.

**ఉమ్మలము-ఉమ్మలిక.** వి. సంతాపము, దుఃఖము.

ఆ. ఇంత తలర నేలయొమ్మొయినైనము, గొమ్మ
నలవరించి కూర్చు టరుదె, యుమ్మలంబు

లంబు దక్కియూఁటతోడ నీ, వేఁగు మసల పలవ దింక నిచట. భార. విరా. 2. 80.

క. కనకమయయూప మొప్పఁగ, ననూనవిభవమున నీవు యాగం బొనరించిన యొప్పును నిప్పటి నీ, యునికియునుం జూచి నాకు నుమ్మల మయ్యెన్. భార. శాం. 4. 590.

జ. ఉమ్మలించు, ఉమ్మలింపు, ఉమ్మలిక, ఉమ్మలికించు.

**ఉమ్మలి**—ఉబ్బలి.

వ. నొసల వసలుకొనుకమ్మకస్తూరియుమ్మలింబడి కదలమెదలలేని నీలాలకజాలంబుల... కళా. 6. 224

గీ. ...అసలు, ఒొచ్చు వండడు నుబ్బలి రొంపి బురద, యుమ్మలి యవుజు ఉవుకు నానొప్పుఁ బంక, ము...ఆం. భా. 1. 165.

ద్వి. అనయంబుఁ గోపించి యాజ్ఞఁ గావించు, వడువున సౌగతవరమూర్తి రొంపి, మడియుండ నందు నుమ్మలిలోనఁ ద్రొక్కి. ద్వి. పరమ. 7. 530 పా.

**ఉమ్మలించు**—ఉమ్మలికించు. అ. క్రి. (ఉమ్మలము + ఇంచు) 1. తపించు, దుఃఖించు, శోకించు.

ఉ. అక్కట యేను వేడ్కపడి యానెడునాసవ మర్థిఁ దేరఁగా, నొక్కనికృష్టఁ బంచుటకు నోపక చెప్పినదీని నీవు గో, సెక్కఁగఁ జేసి నిన్ను నతిహీనవిధాననియుక్తఁ జేఁతగా, నిక్కమ యుమ్మలించి తిది నెయ్యమితియ్యము కల్మియే సఖి. భార. విరా. 2. 98.

గీ. తనకులంబునఁ బుట్టినధార్తరాష్ట్రు, లన్నదమ్ములతో విగ్రహంబు గొనుట, కుమ్మలించి వివర్ణత నొందినట్లు, గంది యెంతయుఁ జెలువేదెఁ బందురుండు. భార. ఉద్యో. 2 107.

గీ. ...ద్రోణుపాటు వినియు, వేయిపఱియలై పోవదు ఱాయి, గాఁగ, నోపు నాగుండె యేమని యుమ్మలింతు. భార. ద్రో. 1. 80.

2. ఉక్కనొందు, తాపమునొందు

సీ. ఒడ లుమ్మలించిన నొకపూఁట వెలుపట నుండుమీ చనుదెంచి యూరుఁబోక. భోజరా. 5. 210.

**ఉమ్మలింపు** వి. (√ఉమ్మలించు) ఊష్మము, ఉక్క. ఆం. భా. 1. 87.

**ఉమ్మలిక(ము)**—ఉమ్మలము. వి. 1. సంతాపము, దుఃఖము, శోకము.

క. ఇమ్మహియెల్లను నీమది, యుమ్మలికకుఁ జాలనొచ్చె నుర్వీవర... భార. ఉద్యో. 1. 197.

ఉ. పాములచేతఁ జచ్చి భువిఁ బడ్డమునీంద్రులఁ గాంచి పార్థివ, గ్రామణి యుల్ల ముమ్మలికఁ గాలఁగఁ బల్కెఁ దమ్ముఁ దిట్టుకొంచు... మార్క. 8. 288.

క. మునుముట్ట నెఱిఁగ శ్రాద్ధంబునకుం గై కొనుట మేలు భూసురునిం గై, కొని యరసి కాఁ డనిన నా, తనియుమ్మలికంబు నెఱచు ధార్మికునైనన్. భార. అను. 3. 182.

వ. ఇవ్విధంబున గాండివమ్మువాలు వమ్మయినం గ్రమ్మునుమ్మలికంబున విన్ననైన వన్నుఁ జూచి యవ్విప్రుండు. ఉ. హరి. 2. 29.

2. కష్టము, ఇడుము, బాధ

సీ. నలునిపిఱుందఁ గానల కేఁగి దమయంతి మనుజులు వడనియుమ్మలిక వడదె. భార. విరా. 2. 284.

వ. ఇవ్విధంబునఁ గృష్ణునితోడఁ దనయుమ్మలికంబు లన్నియుఁ ద్రవ్వికొని శోకంబు వెల్లిగొన. భార. ఉద్యో 3. 191.

**ఉమ్మలికించు**- ఉమ్మలించు. (ఉమ్మలిక + ఇంచు.) (దుఃఖించు, శోకించు.)

ఉ. ఇమ్ముల భూమి యంతయును నేలుచు నాత్మవధూటితోడి సౌ, ఖ్యమ్ములు గోరియున్న మదయంతియుఁ దొల్లిటి విప్రకాంతశా, పమ్మెఱిఁగించి నీకు నిది ప్రాణభయం బగునన్న నాత్మలో, నుమ్మలికించుచున్ బతుల నొల్లక యుండెను షండుకైవడిన్. వి. పు. 5. 300.

చ. ...భీష్ముఁ డెఱింగి వారి కి, ట్లను సురలార కాలగతి నాత్మఁ దలంచియ కాదె మేనిలో, మనిచినవాఁడ ప్రాణముల నుమ్మలికింపకుఁ డించు కేనియున్. భార. భీష్మ. 3. 415.

**ఉమ్మాదము** — ఉమాదము. వి. (సం. ఉన్మాదః. ప్రా. ఉమ్మాదో. క. ఉమ్మాదపు.) ఉన్మాదము, చిత్తవిభ్రమము, పిచ్చి.

సీ. వెట్టి యవంగను విచ్చి యనంగ నుమ్మాద
మవంగ నున్మాదసంజ్ఞ. ఆం. భా. 1. 186.

**ఉమ్మాయము త్తెము** వి కృత్రిమమౌక్తికము, చేత
ముత్యము (చి. ని. శ్రౌ. శ, ం.)

**ఉమ్మి**—ఉమి.

(వ్యవ) ఇచట ఉమ్మివేయకుము.

**ఉమ్మెత**—ఉమ్మెత్త.

సీ. పరుపంపుఁ గ్రొమ్మావిపందు లేపున మెక్కు
చిలుక గంటపుటుమ్మెతలకుఁ జనునె. నీలా.
2. 76.

**ఉమ్మెత్త**—ఉమెత, ఉమ్మెత. వి. (సం. ఉన్మత్తః.
ప్రా. ఉమ్మత్తో.) దుత్తూరము (వృ.వి.). (దీని
గింజలు తిన్నచో మత్తెక్కును.)

గీ. కంతుమాయల నుమ్మెత్తకాయ దిన్న, పొ
లుపు సారెకుఁ దెల్పు నప్పుడమివేల్పు. శుక.
2, 458.

ఉమ్మెత్తపువ్వుగిన్నె — ఆకారములో ఉమెత్త
పువ్వువలె నుండుగిన్నె (బ్రౌ.)

**ఉమ్యము** సం. విశే. (అ. అ. అ.) నల్లయగిసెచెట్లు
బయలుదేఱునది (పొలము)

**ఉయాల**—ఊయేల.

సీ. నిలుపుటద్దములు గంటలయుయాలలు హంస
తూలికపాన్పులు దోమతెరలు. షోడశ. 3 ఆ.
(శ. ర.)

**ఉయేల**—ఊయేల (శ. ర. చి. ని).

**ఉయ్యల**—ఊయేల.

గీ. అనుపమం బగుపసిఁడియుయ్యలఁ గుమారు,
నునిచి...పరి. 10. 59.

క. ...ఉయ్యల నూఁపుచుఁ బెనుపఁ దొడఁగె
పంపఁ శిశువున్ కళా. 6. 19.

జః ఉయ్యలచేరుపిట్ట, ఉయ్యలవులుఁగు.

**ఉయ్యలచేరుపిట్ట** వి. (ఉయ్యల + చేరు + పిట్ట)
సాహసపక్షి, బెగ్గురు.

సీ. ...బెగ్గు రుయ్యలచేరుపిట్ట యుయ్యలపు
లుఁగు నాఁగ సాహసమగు...ఆ. భా. 2. 94.
(ఇక్లే ఉయ్యాలచేరుపులుఁగు, మొ.)

**ఉయ్యలపులుఁగు** వి. (√ఉయ్యల) సాహసపక్షి,
బెగ్గురు. ఆం. భా. 2. 94.

**ఉయ్యాల**—ఊయేల.

సీ. తొదలఁ బదలేటిలేఁదరఁగలు బాలుఁ డగు
చందమామ నుయ్యాలలూఁప. హరి. పూ.
6. 84.

సీ. అచ్చరచెలువ లుయ్యాలచేరులు నేలవ్రైచితి
రని తోడివారిఁ బదర. కువల. 8. 10.

ఉయ్యాలోజంపాలో — ఉయ్యాల ఊఁగుచుఁ
బాడెడియొకానొక పాట.

క. లోల యగులోలలోచన, వాలుంజనుదోయిఁ
గేల వడిఁ బట్టుక యుయ్యాలో జంపాలో
యని, వ్రేలుఁ గృష్ణుండు సఖులు వికవిక
నవ్వన్, దశా. 8. 195.

**ఉయ్యాలతొట్టి** వి. (√ఉయ్యాల) త్రాళ్లయాధార
మున ఊఁగుతొట్టి.

సీ. ఉయ్యాలతొట్టిలో నునిచి చేతులు వట్టి
యూఁచి యాడెడుపాట నుబ్బ నేర్చె. వి
ష్ణు. 7. 12.

**ఉయ్యాలమంచము** వి. (√ఉయ్యాల) గొలుసుల
యాధారమున నూఁగుమంచము, డోలా మం
చము.

గీ. మించువంతపుటుయ్యాలమంచముననుఁ, బొ
లుపు మీఱుచుఁ దనరు విపులమునతుల,
యూడిగంబులు గైకొంచు నున్నశౌరి.
కళా. 2. 15 (శ. ర. పా. 'ఉయ్యేల' ముద్రి )

**ఉయ్యెల**—ఊయేల.

చ. ...గతాగతకారియైన యుయ్యెలయును
బోలె నూఅడక యెంతయుఁ బ్రొద్దు విని
ర్జితాత్ముఁడై . భార. అను. 5. 78.

జః ఉయ్యెలజిట్ట.

**ఉయ్యెలజిట్ట** వి. (√ఉయ్యెల) సారసము, బెగ్గురు
పక్షి.

**ఉయ్యేల**—ఊయేల (శ. ర. చి. ని.).

**ఉరక**—ఉఱక, ఊరక. అవ్య; (త. ఉరై. క. ఒరె-
మాటాడు. 'ఉరక, ఉఱక, ఊరక' అనునవి
వ్యతిరేకక్త్వార్థకరూపములుగాఁ గనఁబడు చు
న్నవి. వీనిమూలధాతువులకు ఇతరరూపములు
లేవు).

1. మాటాడక, పలుకక.

చ. అని యురకున్న రంగరిమకా సహియింపు
ము తప్పు చేసితిగా, మనమున నింత హెచ్చు
రిక మానిన మత్తుఁడ నంచు...(శ్రీరం.మా.
5. 87.

2. వ్యర్థముగా, ప్రయోజనము లేకుండ.

గీ. ఉఱికి యం దెవ్వరినిఁ గాన కురక నీటఁ, బడి
తి నని వజ్రఘటితసోపానపంక్తిఁ, శేదనంత
సరోవరశ్రీ స్వరూప,మిచ్చె నన నొక్క
క్కనియుంతి యయ్యె. ఉ. రా. 5. 158.

గీ. పెక్కునోళ్ల నురక పెక్కుదెగుంగుల,నఱచె
దిట్టివట్టికఱకు లేల,మగతనంబు నెఱపి జగ
డం బొనర్పుము, సోఁకుఁజేఁడ యెందు ప్రసు
క్కి చనక. అచ్చ. రా యు 459. (శ. ర.
పా. 'ఉఱక' ముద్రి.)

**ఉరగము** నం. వి. అ. పుం. 1- ఱొమ్ముతోఁ బ్రాఁ
కునది-సర్పము 2. సీసము. 3 -సర్పదేవతా
కము-అశ్లేషానక్షత్రము

**ఉరగరాజు** నం. వి. అ. పుం. 1. వాసుకి. 2. శే
షుఁడు.

**ఉరగారి** నం. వి. ఇ. పుం - సర్పశత్రువు - 1.గరు
డుఁడు. 2. నెమిలి. 3. ముంగి.

**ఉరగాస్యము** నం. విశే. (అ. ఆ. అ.) పాముముఖ
మువంటి ముఖముగలది. వి. అ. న తొల్లిక,
మొ.

**ఉరగి** నం. వి. ఈ. స్త్రీ. ఆఁడుపాము.

**ఉరడించు** — ఉరవడించు (చి. ని. శ. ర.).

**ఉరణము** నం. వి. అ. పుం. 1. గొఱ్ఱెపోతు. 2. తగి
రిస, తంగెడుచెట్టు.

**ఉరణాక్షకము** నం — ఉరణాక్షము.

**ఉరణాక్షము** నం. వి. అ. పుం. తంగెడుచెట్టు, తగిరిస
(వృ.వి.).

**ఉరణాఖ్యము** నం — ఉరణాక్షము.

**ఉరణి** నం. వి. ఈ. స్త్రీ. ఆఁడుగొఱ్ఱె.

**ఉరణించు** — ఉరడించు.

(విజృంభించు)

క. జ్వరవగ యే మండఁగ నీ,కొరుఁ దొడరఁగఁ
దగునె రమ్మ యురణింపుము నీ,పరు వెల్లఁ
జూపు నంచేఁ, బోరివో యెడు తెఱఁగు నొ
య్యఁ బొందెదు పిదపఁ. హరి. ఉ.8.118.

**ఉరభ్రము** నం. వి. అ. పుం. 1. పొట్టేలు. 2. తగిరిస
(వృ. వి.).

**ఉరము(స్సు)** నం. వి. స్. న. ఱొమ్ము.

**ఉరరీకరించు** నం. న. క్రి. అంగీకరించు, ఒప్పు
కొను.

గీ. దరముచెలువంబుఁ దఱుముకంధరమువాని,
నరరి నురరీకరించు పేరురముగవాని, రాము
సౌమిత్రి మైత్ర్యర్థిరాముఁ జూచి.చం.రా.
3. 99.

(ఇట ఔపమ్యద్యోతకము.)

**ఉరరీకారము** నం. వి. అ. పుం. 1. అంగీకారము.
2. విస్తృతము చేయుట.

**ఉరరీకృతము** నం. విశే. (అ. ఆ. అ) 1. అంగీకరిం
పఁబడినది. 2. విస్తృతము చేయఁబడినది.

**ఉరరీకృతి** నం. వి. ఇ. స్త్రీ. 1. అంగీకారము. 2.వి
స్తృతముచేయుట.

**ఉర(రు)లుఁద్రోచు** న. క్రి. (√ఉరులు¹) 1. దొ
ర్లించు.

క. తరువం బెట్టినబానల, పెరువులు మును గిలక
రించి పేర్చినవెన్నల్,నురువు తెరఁగఁ గ్రోలి
పిదప, నురలంద్రోచుచును బోవు నుక్కువపు
గరిగా. హరి. పూ. 5. 203.

2. త్రోసివైచు, పోఁగొట్టు.

క.గురుఁ డనఁగఁ దంద్రికం బెను,వరిని యొకనిఁ
జదివి చెప్పుమా శ్రుతిధర్మం,బురులఁగా ద్రోవ
గ నగునే, గురుశాసన ముజ్జగించి కుటిలపుఁ
దెలివిన్. నృసిం. 4. 94.

**ఉర(రు)లఁబడు** — ఉరలు¹. (స్వార్థమున 'పడు')
(కూలు, పడిపోవు.)

గీ. ఒలువుఁబప్పులతిరంబు లురలఁబడఁగఁ,బూ
రియలు లడ్డువంబులు పొరలిపాఱ....అజ్య
ధారా ప్రవాహసాహస్రములకు. నైష.
6. 124.

**ఉర(రు)లఁబాఱు** — ఉరలు¹.
(విఱిగిపోవు, చెదరు.)

మ....దిగ్దంతావళ శ్రేణికం, ధరముల్ మ్రొగ్గఁ
బడన్ దిశావలయ ముక్కంపంబుగా నీఱ

లం, బురులంబాఱఁగ భీష్ముపైఁ గవిసె... హరి...భార. భీష్మ. 3. 263.

**ఉరలు¹(రులు)** — ఉర్లు. అ. క్రి. 1. పడు.

(క) పడు, రాలు.

క. అప్పుడు ధృష్టద్యుమ్నుఁడు, నిప్పు లురులు చూపులదరి నిశితాస్త్రములం,గప్పెగురుని. భార. ద్రో. 1. 156.

చ. చిరముగ నొల్లువడ్డవరసింహునికం చెనుబెద్ద వే శిరం, బురలఁగ నాటువడ్డజలజోద్భవు కంచెను బెద్దవే...కు. సం. 4. 432.

శా. వాలోద్ధిప్తగిరుల్ సురారిపురిపై వ్రాలఁగా విశీర్ణంబులై, రాలెఁ గోపురముల్ గ్రహంబు లురలెఁగా. దశా. 2. 286.

(చ)—వలలో—పడు, చిక్కు.

క. ఒగ్గములు ద్రవ్వి పడుమని, యొగ్గెడు పెనుఁ దెరల వలల నురలుమృగములఁగా,డగ్గఱి చంపెడు వేడుక, పెగ్గలమై చిత్తమందు వెంటాడింపఁగా. భాగ. 1. 454

(ట) విఱిగిపడు, కూలు.

సీ. పూఁదేనెదొన దాఁటఁ బొరలి యొడ్డుంలిన నివ్వలి కింత లాఁగె తెనెకతె. బహు. 2. 28.

(త) క్షీణించు, నశించు. (చూ. ఉరలుకొను).

(వ) దొర్లు, జాఱిపడు.

ఆ. పొదివి పలువు రేయఁ బొడువ వ్రేయఁగ భగ, దత్తుదంతిరక్తధార లొప్పెఁ,జెలువు రెట్టిగాఁగ జేవులు సెలయేఱు, లున్నతాచలమున నురులువట్లు. భార. భీష్మ. 3. 146.

క. చెందము గలంగఁ గన్నీ, రుందరద మొగంబు మీఁద నగ్గల మురులన్. భార. మౌ. 196.

2. విడిపోవు, విరియు.

క. నటనోద్భటుఁ డైనమహా, నటునిజటాజూట మురిలినఁగా దొరఁగు మరు,త్కటకనది యది యనుచుఁ జని, యటఁ గనియెఁగా దుంగభద్ర నఘముఖముద్రఁగా. పాండు. 1. 188.

3. పగులు (చూ. గుబ్బు).

వ... పెనుబొబ్బలం బ్రహ్మాండకటాహంబు నిర్భరంబై గుబ్బు గుబ్బని యురల...భాగ 8. 208.

జ. ఉరలుకొను, ఉరలఁద్రోయు, ఉరులఁబడు, ఉరులఁబాఱు, ఉర్లఁబడు, ఉర్లిపెంటెర, ఉర్లు.

**ఉరలు²** అ. క్రి. (క. ఉరి — దగ్ధమగు) దగ్ధమగు, మండు.

గీ. పెటిలె బ్రహ్మాండభాండంబు చిటిలె దిక్కులు రిలెఁ బాతాళభువనంబు లుదిలె వధము, మేటి ధాటీజనితకాలకూటవిషము, చిచ్చు విడివడియంతంతఁ జెచ్చు పెరుఁగ. భీమ. 4. 61.

('సప్తాధోభువనాన్యాసన్నిర్దగ్ధాని సమంతతః' మూలము.

**ఉర(రు)లుకొను** — ఉరలు¹. (స్వార్థమున 'కొను'.) (క్షీణించు, నశించు)

సీ. అఖిలజీవులు నిజవ్యాపారశూన్యులై యున్నత తేజంబు లురలుకొనఁగ. గీ. జగుస యవ్యవస్థా విశేషంబు లెల్ల, విదితముగునట్లు పలుకుట యది నిరోధ, మన నిది యవాంతర ప్రళయం బనంగఁ,బరఁగు...భాగ. 2. 266.

**ఉరళించు** అ. క్రి. వెలుఁగు, ప్రకాశించు. (బ్రౌ. చి. ని. శ. ర.)

**ఉరవడి** — ఉరువడి, ఉర్వడి. వి. (ఉరువు¹ + వడి. క. ఉరువణి, ఉగవణి.) 1. మిక్కిలివేగము.

సీ. ఉరవడి సేనలు దెరలఁ జైఁ దోఁతెంచుధూళి పెల్లడరినఁ దూలపోక. భారా. విరా. 4. 62.

సీ. కుప్పించునురవడిఁ గుంభిని వడఁ గ్రుంగి సర్వాధిపతితలల్ నదియ నదుమ. భా. రా. యు. 628.

చ. ఉరవడి నేఁగుచోట నొకయుగ్మలియొల్లె చెఱంగు మేదినీశ్వరునిభుజావిభూషణము వ్రజములం దవులంగఁ బాలివన్. నైష. 8. 94.

2. శౌర్యము, పరాక్రమము.

క. తరువు వెసఁ జెఱికొని నీ,వురవడిమై గవిసితేని యుభయబలము న,చ్చెరు వందుచుఁ జూచి వృకో,దరుఁడ వగుట యెఱుఁగకున్నె తద్విధ మేలా. భార. విరా. 3. 226.

క. కురుబలముఁ దొడరి గెలువఁగ, సురగణములకైన నరిది శూరోత్తమ నీ, వురవడి గెలి

చిఱి భాగ్యం, స్ఫురణంబును బాహుబలముఁ
బొగడం దగదే. భా. ద్రో. 5. 7.

3. విజృంభణము.

వ. భయంకరంబగు నతిసంకులంబైన సామజ
వాజి రథంబులయురవడికి నోసరింపనిబాలు
బలంబులు... భార. భీష్మ. 1, 267.

చ. పొరిఁబొరి నార్చుచుం గవిసి భూరితరంబుగ
గద్దదభ్రముల్, ఖరకరుఁ గప్పినట్లు రణ
కర్కశులు నారఘువీరుఁ గప్ప నా,యురవడి
నూచి యప్పుడు నృపోత్తముఁ డొక్కఁడు
వీఁడ్రు పల్వురిద్దుం మెటులౌనో యంచు
మదిదూలఁగ నుండిరి నిరి నిర్జరుల్. భా. రా. అర. 1. 198.

జ: ఉరవడించు. ఉరవణించు.

**ఉరవడించే** — ఉరవణించే, ఉరువడించే, ఉరువణించే. అ. క్రి. (√ఉరవడి) 1. వేగిరపడు. (చూ. ఉరువడించు.)

2. విజృంభించు, రేఁగు.

సీ. కసిమసంగినమారి గడఁగి జీవులమీఁద ను
గ్రతఁ గవియున ట్లురవడించి. భార. ఉద్యో. 2. 189.

వ. ఇవ్వురునున నిజపార్శ్వచరు లైనచతుస్స
హస్ర యతప్రవరులం బరిమార్చి పేర్చిన
ప్రహస్తాదులం గనుంగొని నిర్నిద్రరౌద్రం
బున మాణిభద్రుండు వానిపై నురవడించిన. ఉ. రా. 3. 37.

3. పరాక్రమించు.

**ఉరవణించే** — ఉరవడించే.

(విజృంభించు, రేఁగు)

చ. యజనము దానకర్మమును...సంగరంబు
నన్, విజితవిభీతిమై నురవణించుటయున్
నృపధర్మముల్ గురుప్రజతిలకాయమాన
సమరంబునుధర్మువు వీనిలోపలన్. భార. శాం. 2. 224.

**ఉరవు**[1] — ఉఱవు. విశే. (√ఉరు) 1. ఉచితము, అర్హము, తగినది, అనుకూలము.

క. దురమునకు నృధురియుఁ బుష్కరముఁ
బ్రయాగంబుఁ దగినకలఁకులు మీ కే,దుర
వగు నది గొనుమనె హరి...ఉ.హరి.4.208.

2. అతిశయము, గొప్పది.

ద్వి. ఉరవుకెంజడ లెల్ల నొగిఁ జుట్టఁగట్టి. నల. 1. 14 పం.

సీ. లలితసంపచ్ఛాలిలక్ష్మీవిలాసమై యురవైన
వైకుంఠపురము వోలె. మొ. రా. బాల. 8.

3. ఔచిత్యము.

వ. ఉరవున నూకియు వెరవునఁ దాఁకియు...
ఉ. హరి. 6. 304 (వ. ర.).

**ఉరవు**[2] వి. (సం. ఉరః—ఱొమ్ము) వక్షస్థలము. అం. భా. 2. 187.

**ఉరశ్ఛదము** సం. వి. అ. పుం. కవచము.

**ఉరసము** సం. విశే. అ. న. శ్రేష్ఠము (ఇది సమాసోత్తరపదముగానే యుండును.).
ఉదా: అశ్వోరసము, నరోరసము. వనితోరసము.

**ఉరసిజము** సం.—ఉరోజము.

**ఉరసిలుఁడు** సం. విశే. (అ. అ. అ.) విశాల మైన ఱొమ్ముగలవాఁడు; శౌర్యవంతుఁడు.

**ఉరసుఁడు** సం. విశే. (అ. అ. అ.)—ఉరసిలుఁడు.

**ఉరస్త్రాణము** సం. వి. అ. న.—ఉరశ్ఛదము.

**ఉరస్యము** సం. విశే. (అ. అ. అ.) ఱొమ్మునం దుండునది, ఱొమ్మునఁ బుట్టునది.

**ఉరస్యుఁడు** సం. వి. అ. పుం. ధర్మపత్నియందుఁ బుట్టినవాఁడు, ఔరసపుత్రుఁడు.

**ఉరస్వంతుఁడు** సం. విశే. (క. స్వతీ. క.) ఉరసిలుఁడు.

**ఉరస్సూత్రిక** సం. వి. ఆ. స్త్రీ. ఱొమ్మున వ్రేలాడు ముత్యాలహారము.

**ఉరి** వి. (క. ఉరుల్, ఉరుల్. త. ఉర్లు.) 1. వాగుర, ఉచ్చు, మృగములను పశులను పట్టుకొను త్రాడు విశేషము.

గీ. ద్రౌపదీరూప మనునురిఁ దగిలి తనదు, హృ
దయమనుమృగ మత్తఱి నుదిలకొనుచు.
భా. విరా. 2. 24, శాం. 5. 578.

గీ. ఇరులు గెలిచిన యంతఃపురేందుముఖుల,
కురులు మరుఁ డను వేఁటకాఁ డురులు
సేసి, మరులు గొలుపంగ లేఁడయ్యె మనుజ

విభుని, సరులు లేనిదృక్షంజనశాబకముల. నైష. 3. 90. అం. భా. 2, 298.

2. కంఠపాశము.

గీ వానిఁ దెగఁ జూడవై తేని వాయుపుత్ర, నీవు గనుఁగొన నురినైన నీరనైన, నగ్ని నైన విషంబునవైన నేను, మేను దొఱఁ గుదు...భార. విరా. 2. 229.

ఉరిపోయు — ఉరిదగుల్చు.

ఉరివేఁటకాఁడు — ఉరి యొగ్గి వేఁటాడెడు వాఁడు. పి. శకుం. 3. 73.

3. చోరసాధనవిశేషము.

చ. ...కొ,య్యయు నురిత్రొంకి నాఁ సము... దశకు. 5. 72.

జ: ఉరిగోల, ఉరిత్రాడు, ఉరిదీయు, ఉరులు గొలుపు.

**ఉరిగోల** వి. (ఉరి+కోల) పిట్టలు మున్నగువానిని బట్టుటకై చివర నురి పెట్టి కట్టినకోల.

క. కట్టలుకఁ దడుకుచాటునఁ, బిట్టల నురిగోలఁ దిగిచి బిఱుసున తెక్కల్, పట్టి విఱిచి... భాగ. 7. 59.

**ఉరిడె** వి. కుమ్మరపురుగు, యమకీటము.

గీ. ఉరిడెపురు గెల్ల వేళల బురదలోనె, పొరలు చుండియుఁ బంకంబుఁ బొందనట్లు, జ్ఞాని యగువాఁడు సంసారసంగుఁ డగుచు,నెందు నేనియుఁ బంకంబుఁ జెందఁ డభవ. రుక్మి. 4. 36.

**ఉరిత్రాడు** వి. జా. (√ఉరి) 1. ఉరిపోయుట కుప యోగపడుత్రాడు, కంఠపాశము. మనుచ. 3. 31.

2. ఒకవిధ మైనగాయమానము, శస్త్రవిద్యా విశేషము.

వ. తొలకరిమెఱపును ... హస్తారణంబును... ఉరిత్రాడును...పదఖండనంబును,లోబిత్తరి ...అనియెడిగాయమానమ్ములును. మల్లుపు. 3. 69.

**ఉరిదీయు** స. క్రి. (√ఉరి) ఉరిపోసి చంపు.

(వ్యవ) నరహత్య చేసినవాని నురిదీసినారు.

**ఉరియాట** వి. (√ఉరియాడు) ఉరియాడుట, సందేహము.

గీ. ...ఇట్లు...మీరు సెప్పంగ నురియాటమేల. భార. శాం. 1. 275. (శ్లో. న తే భిశంకే వచనం యద్బ్రవీషి తపోధన. సం. భార. శాం. 31. 10.)

**ఉరియాడు** అ. క్రి. డోలాయమాన మగు, సందేహించు: కళవళపడు.

క. అందంద పొడముతమకము, ముందటికిం దిగువ సిగ్గు మునుకొని నిలుపం,డెంద ముఱి యాడ నిలిచిన, మందగమనఁ జూచి హరి కుమారసుతుండుఁ. చిత్రభా. 5. 143.

వ. అని వితర్కించుచుం గిరీటి యురియాడు చిత్తంబును త్తలం బుడిపికొని... భార. విరా. 1. 161.

క. సతి దనపతివచనంబులు, మతిఁ జొనుపుం దెంపు మాను మాన వెఱచు న, య్యతిథి పనుపు నేయక త్రో,చుతలం పలవఱుచుఁ జేయఁ జూచుం దలరున్.

గీ. ఇటు లురియాడుచు తంబు నెట్టకేని, సాధు ర్యాంచె అ. క్రి. వెమినకుఁ జొరంగ, నూలుకొల్పి నల కృపన శ. ర.) ఎనఁ గిలుకొన్న, లజ్జవ్రేఁగునఁ యహారుసాలగ మోము. భార. అను. 1. 7౽, ౯/8.

2. చెదరు, చలించు.

మ. కచభారం బురియాడి వెన్నొరయ. చిత్ర భా. 8. 60.

ఆ. అన్న రేంద్రుపాణి యల్లనఁ దనకరా,బ్జ మునఁ గీలుకొల్పి బహుళ బాష్ప,కలిత వదనుఁ డగుచు గళమున నెలుఁ గురి,యాడ వగచి యమ్మురాంతకుండు. భార. శల్య. 2. 361.

జ: ఉరియాట.

**ఉరియు**[1] అ. క్రి. (క. ఉరి. త ఎరి.) 1. ఎరియు. కాలు. దగ్ధమగు: పరితపించు.

సీ. దశూర్ధ్వరానలత్రయశిఖ మొక్కటి యో గాగ్ని నెందేని నురిసె గౌర. భీమ. 3. 66.

ఆ. ఇదియ,తల్లులార కరము తప్పయిచోఁచుట, మల్లమలఁత పేర్మి నురియుచుండు. భార. మౌ. 201.

2. ఉడుకు, పక్వమగు.

వ. పాకంబునకు రాక యుండ వెండియుఁ దన సవరించిన కాష్ఠంబులు క్రమంబున నిడి య వల బుఁ బ్రబలంబు సేయం గాష్ఠంబులు సమసెఁగాని యారేఁగుఁబం డ్లురియవయ్యె. భార. శల్య. 2. 192. ('న చ స్మ తాన్యప చ్యంత' మూలము.)

3. (వెండ్రుకలు) తెల్లనగు, నరయు.

చ. ఉరిసినవల్ల వెండ్రుకలు నూడినదంతము లంబకంబులన్, గురిసెడుబాష్పజాలములు గూనువడంకెడు మస్తకంబు...హంస. 2. 84.

**ఉరియు**[2] అ. క్రి. (త. ఉత్తై.) ఒరపిడినొందు, రేఁగు.

గీ. అరులు మనమీఁద నురవడి నరుగుదేర, నేము సిడిముడిపడుచుండ నిట్టు లనుట, యొప్ప దురిసినపుండుల నుప్పు వెట్టె, దరయ దీనికి నిన్ను నేమందుఁ బార్థ. భార. ద్రో. 5. 358.

క. చాలఁగ నురిసినపుండులు, కోలలఁ గెలఁ కుటఁ. పి. శకు. 3 170.

ద్వి. ఉరిసినపుండ్లపై నుప్పును జల్లి, కెలఁకులఁ జేసె దవు నేఁ గినిసితి నేని, చక్కఁజెట్టఁగ లేరు ...ద్వి. హరిశ్చ. ఉ. 1257.

**ఉరియు**[3] అ. క్రి. ఉలియు, చలించు.

గీ. తాను లురియంగఁ బిలుఁదులుఁ గదలి మేఖ, లావళులు గదలింప నేత్రాంతు లలరఁ, బె రువు ద్రచ్చుచు వేకువఁ బ్రేమ మిగులఁ, బాడి రబ్జాతు గోపాలభామ లెలమి. హరి. పూ. 8. 168.

**ఉరీకారము** నం. వి. అ. పుం.—ఉరరీకారము.

**ఉరీకృతము** నం. — ఉరరీకృతము.

**ఉరు** — ఉఱు[1].

(మేలగు, శ్రేష్ఠమగు, అధికమగు.)

క. ఈలోకము యురుఁ గొందఱ, కాలోకము కొందఱకు నిహంబును బరమున్, మేలగుఁ గొందఱ కధిపా. భార. అర. 4. 174. (ఉరున్ :- మేలని తోఁచును అని తాత్ప ర్యము.)

(తగు)

క. ...క్రియ, న్వినువక పరిశుద్ధి జీవునికిఁ జేయు టురున్. భార. శాం. 5. 417.

జ: ఉరువు[1], ఉరవడి.

**ఉరుకాలము** నం. వి. అ. పుం. 1. మహాకాలలత. 2. దీర్ఘకాలము.

**ఉరుక్రముఁడు** నం. విశే. (అ. అ. అ.) 1. పెద్ద యడుగు లిడువాఁడు వి. అ. పుం. విష్ణువు, వామనమూర్తి.

**ఉరుజు** వి. మత్స్యవిశేషము.

సీ. మినిక ల్లురుజు లేలుమేను తొల్లిక జాతి గొరక మావురమును గుంటముక్కు. గీ... పరిగె రొయ్యాది యగుమీలఁ బట్టునతఁడు. హంస. 4. 187. ('ఉరుజ' శ. ర.)

**ఉరుటు** వి. (త. ఉరుటు — 1. కంపితస్వరము. 2. ఉంగరము) 1. (సంగీత) కంపితస్వరము. 2. ఉంగరము.

సీ. అంగహారముఁ జూపి యంగాధిపుమనోహ రాంగహారముఁ గొన్న యబ్జవదన, యురు టింత గనిపించి పూటాఢ్యు కెంగేలియురు టుఁ గైకొన్న నీలోత్పలాక్షి. బహు. 5. 68.

(పై రెండర్థములకు ఇదియే యుదాహరణము)

**ఉరుదోడ** వి. మల్లవిద్యాసంబంధమగు పదునాలుగు విసరులలో నొకటి.

వ అప్పీరుండు ... ఉరుదోడ ... ఝూటు నివి మొదలైన పదునాలుగువిసరుల మర్మంబు లుం జూచి...హంస. 1. 206.

**ఉరుబూకము** నం. — ఉరువుకము (వ్య.వి.).

**ఉరుమ** వి. (త. ఉఱుమి.) తప్పెటవలె గుండ్రముగా నుండెడిదియు చుట్టు వంపఁబడిన పట్టెకు నందు లేర్పఱచి యానందులలో కంచుబిళ్లలు రెండు మూఁడు గూర్చినదియు నైన చర్మ వాద్యవిశేషము (ఖంజరి).

వ. మృదంగం బుపాంగం బావజంబు దండె తా శంబురుమ ... లోనగు నసంఖ్యాతవాదిత్ర త్రితయపరంపరలు...ఆము. 4. 85.

వ. ఉరుమ గిసివగలిన్ దేఁటి మ్రోసిన క్రియ వా దాలిక. మనుచ. 4. 115.

**ఉరుమం(ముం)జి**—హురుమంజి. వి. (హిం ఆర్మజ్.) పారసీకదేశమునందలి యొకమండలము; అచ్చ

ట ను౦డుసముద్రము (ఇవి మంచిగుఱ్ఱములకును, మంచిముత్యములకును ప్రసిద్ధికెక్కినవి.)

సీ. సింహళంబున గంధసింధురమ్ములు దెచ్చి యురుమంజిబలు తేజివారులు తెచ్చి. హం. పీఠి. 25. ('హురుమంజి' ముద్రి.)

ఉ. నాయపురంజిమేడ యొకనాఁడును జూడవుగా యగోచరం, బాయురుమంజిముత్తియ పుటమ్మువసోరణగండ్లయందము... సారంగ. 2. 62. (శ. ర. పా. చూ. బ్రౌ. హురుమంజి.)

**ఉరుముడు** వి. వృక్షవిశేషము (బ్రౌ.).

**ఉరులుగొ(కొ)లుపు** స. క్రి. (√ఉరి) — వలలో వైచు-వశపఱచు.

సీ. హరిఁ దెత్తుమే నీకు నమ్ముడుపడియుండ... ఉరగేంద్రుఁ దెత్తుమే యురులుగొలిపి. కు సం. 6. 674, 8. 257.

**ఉరువడి**—ఉరవడి.

(మిక్కిలివేగము.)

సీ. ఉరువడిఁ బలితెంచి యురువక్కియలు దాఁకి గంధసింధురకోటిఁ గనుపుకొట్టి. రాజ. చ. 2. 75.

జః ఉరువడించు, ఉరువడించు, ఉర్వడి.

**ఉరువడించు**—ఉరవడించు (√ఉరువడి.)

(వేగపడు, తొందరపడు.)

ద్వి. అని గర్వదుర్వారులై పల్కుచున్న, దనుజులనందఱఁ దప్పక చూచి, యురువడింపకుఁడి యోహో మానుమానుఁ, డంచి కార్యము చూతుమని విభీషణుఁడు. రం. రా. యు. 238 పా. 26 పం. (ఉరవడింపకుఁడు. శ. ర. పా.)

**ఉరువడు** అ. క్రి. నెఱవేఱు, నెగ్గు.

క. నీసట్టురువడ నొక్కతెఁ, జాపి యొకతెగర్వమడఁచుచున్ వలయుగలిన్, బ్రాపింపవచ్చు భోగము, నీపుణ్యం బినుమడించి నేఁడు ఫలించెన్. కళా. 8. 211.

**ఉరువణించు**—ఉరువడించు, ఉరవడించు.

(పరాక్రమించు.)

వ. క్షీవణం బగుసేనయుఁ దానును నతని వెనుకొని చని యతిరయంబునం బురంబు చొరనురువణి చినన్. కళా. 8. 73.

**ఉరువు**[1] వి. (త. ఉరుపు, ఉరువు) 1. స్వరూపము-వస్తువు.

ఉదా; ఇత్తడిసరకులు మొత్త మెన్నియురువులో లెక్కచూడుము (పశ్చిమాంధ్రము.).

వ. హరుని గుఱించి వత్సరసహస్రము ఘోరతపంబు చేసి త,త్కరుణ దుకూలకంథయును దండముఁ బావలు రత్నపాత్రమున్, వరమునఁ గాంచె మద్గురుఁ డవారణమైఁ బ్రబలాభిధానుఁ డీ,యురువులచేత నయ్యెడు ప్రయోజన మెల్లను జిత్తగింపుమా. విక్ర. 2. 6. చి. ని. పాఠము ('ఉరువిడి'అను శ. ర. ముద్రిత పాఠములు చింత్యములు.)

2. విధము, ప్రకారము.

వ. ఏనదులుం దనకు సరిరావని నవ్వునురువున నురువులు చూపుచు...వరాహ. 10. 62.

గీ. తెలవయధరంబు పవడంపుఁదీవెయురువు. విక్ర. 6. 26

**ఉరువు**[2] స. క్రి. 1. మాను, విడుచు, త్యజించు.

ఆ. తరిమి వతురంబుఁ గానంగఁ బోలు వే, దార్థ చింతనమున నమ్మిథునము, నందుఁ బార్వ మురివి యపరంబు నేపట్టి, నిలువ వలయు నధిక నిష్ఠ గలిగి. భార. శాం. 6. 144.

ఉ. చేరికరాసనం బురివి శీఘ్రము సర్వవిపక్షజీవితా, ఘారిని దైనయుగ్రగదఁ గైకొని వైచినఁ దన్నిపాతనగా, మూతతురంగకేతువులు చూర్ణములై యెడలెగా... హరి. ఉ. 10. 71.

గీ. ఊడ్చి బొందువు వచ్చి ప్రేపురివి వంఱు, డంతయును బుచ్చి పొదుకగా నమరఁగట్టి. భార. శాం. 3. 499.

2. వెడలించు.

ఆ. నురువు లురువువెడఁదనోళ్ల తోడుత మోర, లెత్తితోమము వేఁడుజొత్తినట్టు, లుబ్బు రేఁగి యున్న యుష్ట్రములును. భా రా. యు. 518.

**ఉరువు** సం. విణ. (ఉ. ఉ, స్త్రీ. ఉ.) 1. వెడలుపైనది, విశాలము. 2. పెద్దది. 3. మిక్కిలియైనది, అధికము. 4 శ్రేష్ఠము. (వరీయము – ఉరుతరము. వరిష్ఠము – ఉరుతమము.)

**ఉరువుకము** సం. వి. అ. పుం. 1. ఆముదపుచెట్టు. 2. ఎఱ్ఱాముదపుచెట్టు.

**ఉరువువు** సం. వి. ఉ. పుం. ఎఱ్ఱాముదపుచెట్టు.

**ఉరుపూ(బూ)కము** సం. వి. అ. పుం. ఆముదపుచెట్టు.

**ఉరోగ్రహము** సం. వి. అ. పుం. ఱొమ్మునంగలుగు నొకతెవులు.

**ఉరోఘాతము** సం – ఉరోగ్రహము.

**ఉరోజము** సం. వి. అ. పుం–వక్షమునఁ బుట్టినది–కుచము.(ఇట్లేఉరోజాతము,ఉరోభవము,మొ )

**ఉరోభువు** సం. వి. ఊ. పుం. ఉరోభవము,కుచము.

**ఉరోహస్తము** సం. వి. అ న. మల్లయుద్ధభేదము. (ఇందు హస్తముతో ఱొమ్ము కొట్టుకొని బాహుయుద్ధము చేయుదురు.)

**ఉర్లఁబడు** – ఉఱలఁబడు. అ. క్రి (√ఉర్లు)

(కూలు, పడిపోవు)

మ...పరిఖాంభోనిధిలక్ష్యమాణపురసౌభాగ్యంబు మించుచు...వియద్గంగాతరంగాహతిన్, దరు లుర్లంబడి పెల్లగిల్లిపడు నానాశంబు చందంబునన్. చంద్రా. 1 11.

**ఉర్లు** – ఉఱలు' అ. క్రి.

(రాలు)

ఉ. యక్షవరాజ్ఞ మౌళి నిడి యక్షులు వక్షుల నిప్పు లుర్ల ...ఉ. రా. 8. 8.

(దొర్లు.)

దండ. పుష్కలావర్తకాబ్దంబులన్ బంపఁగా వంపఱాలంబులుగాఁ గొండ లుర్లంగ వర్షించినన్. పారి. 5. 38.

**ఉర్లుపెంజెర** వి. (√ఉర్లు) ఒకజాతిపెంజెర, సర్పవిశేషము.

సీ. వ్రల్లదంబునఁ గ్రుదుళ్లవల్లవాగులు వాగపెంజెరలును కొట్టపెంజెరలును, శంఖపాలకులును జాతినాగులు నుర్లుపెంజెరలును వెట్టపెంజెరలును. హ్యా. 8. 100.

(ప్రాంత ప్రతి పా. చుట్టు పెంజెర చి. ని. పా. తుచ్చుపెంజెర బ్రౌ. పా. తుప్పపెంజెర శ. ర. పా. ఉర్లుఁజెంజెర ముద్రి. పా.)

**ఉర్వటము** సం. వి. అ. పుం. (ఉరు+అటము )సంవత్సరము.

**ఉర్వడి** – ఉరువడి.

(మిక్కిలివేగము.)

చ. ఒడిసెలరాతిచందమున నుర్వడి సింగిడికోలవాలుకై ,వడి...సారంగ. 1. 93, 96.

**ఉర్వర** సం. వి. అ. స్త్రీ. 1. ఎల్లపైరులు పండెడు నేల, సర్వసస్యాఢ్య మగుభూమి. 2. భూమి.

**ఉర్వశి** సం. వి. ఈ. స్త్రీ – గొప్పవారిని వశపఱచు కొనునది–ఊర్వశి. ఒకానొకస్వర్గవేశ్య.

**ఉర్వారుకము** సం. వి. అ. న – ఉర్వారువు.

**ఉర్వారువు** సం. వి. అ. పుం. దోస (వ్యా. వి ).

**ఉర్వి** సం. వి. ఈ. స్త్రీ–విరివియైనది–భూమి, నేల.

**ఉర్వీధరము** సం. వి. అ. పుం. - భూమిని ధరించునది – పర్వతము.

**ఉర్వీభృత్తు** సం. వి. త. పుం. 1. కొండ. 2. రాజు.

**ఉర్వీరుహము** సం. వి. అ, హ. పుం–భూమియందు మొలచునది – చెట్టు.

**ఉఱక** – ఉరక (చూ.).

(పలుకక, మాటాడక.)

క. వెఱచఱవ నింతకంటెం, దఱచుగ బాణంబు లేసి తడయక పగఱం, జెఱుతునని యిసుము చల్లుచు, నుఱక ధనంజయుఁడు రణజయోన్నతుఁ డరిగెన్. భార.సభా. 2. 306.

(వ్యర్థముగ, ప్రయోజనము లేకుండ; నిష్కారణముగా.)

చ. ఎఱిఁగియెఱింగి...దుర్నయుఁ డైనవినితో, నుఱక పెనంగ మాకుఁ జలమో ఫలమో... భా. రా. యు. 916.

సీ. ఉఱక దివోదాసు నుచ్చాటనముచేసి...కాశీ. 6. 189.

**ఉఱవడి** – ఉరవడి. (ఉఱవు+వడి )

(విజృంభణము.)

క. విఱిగి పఱచుసైన్యంబుల,వెఱ పెల్లను దీర్చి చటులవిక్రమగరిమల్, మెఱయంగ నుగ్రుఁ

దాఁకిరి, యుఱవడి నార్పులును బొబ్బలుఱు ములఁ దెగడఁగ. కాశి. 2. 45. ('ఉరవడి' ముద్రి. 'ఉఱుములు నార్పులును బొబ్బ లుఁగవడి నెగడఁగ అని 'ఉఱుము' క్రింది శ. ర. పాఠము.)

**ఉఱవు** – ఉ ఱ్ వు. (√ఉఱు) విశే. 1. ఉచితము, యుక్తము.

ఆ. అంతతోడ నెల్ల యాపదలును దీఱు, వ శ మధిక గౌరవంబు నొందుఁ, గూడి మనుట గలుగుఁ గురుపాండవులకు ని, త్తెఱఁగు మూడ మీకు నుఱవగాదె. భార. ఉద్యో. 3. 380.

క. ఎఱిగించి మీకు మనికికి, నొఱపు సకలదైత్య కోటియును మీరలు నే, డ్తెఱఁ జని యం దుండుఁడు గడు, నుఱ వని నెయ్యంపుసముచి తోక్తులఁ దెలుపఁగ. నిర్వ. 2. 80

2. అధికము; విశాలము.

క. ఉఱ వగునారుగపంటలు, గొఱియలపాఁడి యును దఱ చగు బురుషులకును, దెఱవల చుట్టము లయ్యెద, రెఱచియ భుజియింతు రర్థి నెల్ల జనంబుల్. భార. అర. 4. 295.

చ. ...ని, న్ను ఱపుగ నేను వేఁడుకొన యుక్తుఁ డఁ గాక మొఱంగి నన్ను న, క్కఱపడి నీవు వేఁడుటది కర్జమె నిర్జితదైత్య చెప్పుమా ...భార. అను. 7. 366.

క. కఱకంఠునిభక్తులకు, జిఱుతొండఁడు మిగుల భక్తి నేయుచును గడుఁ, దఱ చగుపెను వానలలో, నుఱ వగుకూటముల మడుఁగు లో రెము లిడుచుఁ. పం. 2. 82.

వి. ఔచిత్యము.

ద్వి. నెఱిచకోరములకు నెలనెలవంట, యుఱ వేది విరహుల నుడికించుమంట. రం. రా. యు. 313 పు. 12. పం. (శ. ర. పా. 'ఉరవేది' ముద్రి.)

ఱ; ఉఱవడి.

**ఉఱిది** వి. (క. ఉఱుబు. త. ఉఱుది.) 1. వేగము. వడి.

గీ. మరుని వాశికసాయకోత్కరము కరము, ధర ముఁదరమిడి మెఱము చేయరది నొరిది, నుఱిదినవి మెట్లు తెగఁగోయునురునదిర్ము, రం బుల జనింపవో శకాగములు గావొ. వసు. 2. 115.

క. కవలని నీటికి మీనము, లెదు రెక్కు నె యుఱి దిఁ బాయునేటికిఁ బోలెం, బరవి నిరుద్యోగు లఁ బొం, దదు సోద్యోగులన కాని ధార్మిక ముఖ్యా. వేం. పంచ. 2. 160.

2. శక్తి, బలము.

గీ. తిరుగఁబడి కురులతగరుల్ దీకొనుగతి, నుఱి దిఁ దలఁదఁరఁ దాఁకిఁతు రొకరి కొకరు. ప్రబంధ. 86.

విశే. తీవ్రము.

క. ఉఱిదివిషము వెంపున నిడి, చెఱ నున్న ప్రవాహి వర్మఁ జెచ్చెరఁ జంపం, దెఱఁగు విచారించి తి మతఁ, డఱుగమిఁ జచ్చె ననువార్త మై లలి తాంగి. దశకు. 7. 149.

**ఉఱియ** విశే. (త. ఉఱవియన్ – బలవంతుఁడు, ధీరుఁడు.) 1. ధీరుఁడు, దిట్టతనము గలవాఁడు.

గీ. అనుచుఁ జెక్కు దెఱఁగుల నడలుచున్న, యన్నఁ గన్గొని లక్ష్మణుం డనియె నహహ, తెఱవ కై యిట్టు చెల్లఁబో దిటము దప్పి, యొఱలఁ దగునయ్య నీవంటియుఱియ దొరకు. అచ్చ. రా. అర. 103.

2. క్రూరము; దుష్టము, చెడ్డది.

క. అని మరుబాములఁ బడ లే, నని క్రైదుపు దుస్సి దాఁటునాయిశములబలెఁ, బెనఁగునల యుఱియచేసురి, య నులిమి బలిమి విడిపించి యను ననురక్తిఁ. సారంగ. 2. 295. (ఉఱియ – క్రూరురాలి.)

వ. అట్లు బుద్ధికౌశలంబున నేను నియ్యుఱియ యెలుకచోట నిక్షేపంబు గలదని నిశ్చయించితి... వేం. పంచ. 2. 117.

**ఉఱియు** అ. క్రి. ఇల్లు లోనగునవి వానిపై కప్పు చెడి యాద్వారమున కురియు; కురియు.

సీ. ...నా కొక్క మందిరము నిర్మింపుమీ యుదక ధారలచేత నుఱియకుండ. కాశీ. 7. 40.

గీ. పల్లె మామూల వలిపిరి చల్లు నిచట, నుఱియు నీడాయ నిద్రమై నుండు నచట, మహిత రామానుజోదీర్యమాణ భాష్య,

ముఖబహు గ్రంథసామీప్యమునకుఁ జనకు. విప్ర, 3. 72.

గీ. బోరుబోరున వర్షాంబుధారలుఱిసె. శుక. 1. 187.

జ : ఉఱుపు.

**ఉఱు¹** – ఉరు. అ. క్రి. (క. త. ఉఱు.) 1. కలుగు.

సీ. అరదంబు లడరిన నళనివేగోద్ధతు లుఱు మీఁద నుఱుముగా నుఱుకువారు. భా రా. యు. 976.

2. బహిర్గతమగు, పైకివచ్చు

ద్వి. మెఱుఁగుఁగోఱ లుఱ వల్మీకముల్ వెడలి. ద్వి. హరిశ్చ. పూ. 1961.

3. తగు, ఒప్పు, ఉచితమగు.

క. ...జగంబును, గులమును రక్షించు టుఱదె కువలయనాథా. భార. ఆది. 5. 111.

చ...నీ, యుఱుకడ కేఁగి తోడుపడు మొడ్లకు నెవ్వరి కేని...భార. ఉద్యో. 4. 179.

ఉ...ఇది పథ్యము సు మ్మొకనక్క నిచ్చి సిం, హమ్ముల విల్చికో లుఱదె యన్యులె వారలు కౌరవేశ్వరా. భార. సభా. 2. 181.

4. ఇష్టమగు.

క. తెలిపి గొని నీవు సొచ్చినఁ బిఱుఁదనె చొచ్చెదము రిపులు పెల్లగిలఁగ నందఱ మును మా కిది యెంతయు, నుఱునట్టి వరంబు దీని నొసఁగుము పుత్రా. భార. ద్రో. 2. 7.

జ : ఉఱవు.

**ఉఱు²** (క త. ఉఱు. దీనికి వ్యతిరేకమునందే ప్రయోగములు కనఁబడుచున్నవి.) స. క్రి. లక్ష్యపెట్టు, గణించు, సరకుగొను.

చ. ఉఱఁడు సురేంద్రుడైన బలియుండు హిడింబుఁడు...భార. ఆది. 6. 194, 7. 271.

క. ధనదుధనసంఖ్య వవనిధు,లవ విని యర్థేశ నామమతనికి నీ మే, మొనర వసంఖ్యార్థేశుల, మని ధనపతి నుఱరు పేర్మి నవ్వరి వైశ్యుల్. కు. సం. 7. 953, 8. 259.

క. పిఱుఁదం గురుధరణిపతి, నలచేతం బ్రాణములు ఘనారాతిబలం, బుఱని తెగువ ముందటఁ బెనగొనుటలు చిత్తమునఁ బెట్టుకొని విహరించెన్. భార. స్త్రీ. 2. 87.

అ. క్రి. మాను, విరమించు.

వ. పక్షి న్యప్రసాదంబున మహాదృష్టి కొడుకుల వయిం గురియించి యయ్యురగుల విగత పరితాపులం జేసి కద్రువ గర్వంబున నుఱక గరుడుని వినతనుం బనులుగొను చున్నంత. భార. ఆది. 2 47.

సీ. ఈక్కటాఁకున స్రుక్క నిక్క ప్రక్కలు నొక్కనుఱక కల్లేటి నొక్కొరణంబు. మనుచ. 4. 58.

2. జంకు, వెనుదీయు.

క. ఉఱఁడు సుసీ ఖండాం గొని,నఱక నయోమయము లగు ఘనస్తంభములన్...కకు. 4.45.

క. ఉఱక యెదురేఁగి మూఁకకు, నుఱికి మెఱుఁగు కొనుచు మిగుల నుగ్రాకృతియై, కఱవం బైకొనఁ బెల్కుఱి,పఱచిరి తద్భటులు రాజపట్టుకుఁ బెలుచన్. భోజరా. 6. 258.

**ఉఱు³** – ఉఱ్ఱు² (మా.)

జ: ఉఱుఁద్రాడు.

**ఉఱు⁴** – ఉఱ్ఱు¹ (మా. 2. వ అర్థము)

వి. పాము ఉఱుకునప్పుడు పుట్టెడిధ్వని.

ద్వి. మెఱుఁగుఁ గోఱ లురల వల్మీకముల్ వెడలి యుఱు పుట్టఁ గోమలనుఱికి... ద్వి. హరిశ్చ. పూ. 1962 పం.

జ: ఉఱుకొట్టు, ఉఱువు.

**ఉఱుఁద్రాడు** – ఉఱ్ఱుఁద్రాడు. వి. దే. (ఉఱు³ + త్రాడు) ఆవులను పాలుపిదుకునప్పుడు వెనుక కాళ్లకు కట్టుబందపుత్రాడు.

వ. ఉఱుఁద్రాళ్లుం దలుగులు తలమొలలం బుట్టి యుట్టు నట్టుమం గలయం బాటి త్రేపుల నేర్పరించువారును. హరి. పూ. 5. 142.

గీ. ఊరకల్లరంబు నుఱుఁ ద్రాళ్లుఁ జేతఁ బట్టి, యమరుగోపాలకృష్ణు వల్లంతఁ గాంచె. వి. పు. 7. 338.

**ఉఱుకు** (ఉర్కు) అ. క్రి. (త. ఉఱుక్కు.) 1. దుముకు.

క. మఱియు నొకవిల్లు గొనున, త్తెఱపిన విరథుఁడుగఁ జేయ ధృతిఁ గంపాలం, బుఱక కొని విభుఁడు నేలకు, నుఱికి యతనిమీఁద నడరె నుగ్రాకృతియై. భార. భీష్మ. 3. 27.

క. ఎఱిఁగి పిఱుసనిన వెసఁ బై, కుఱుకుదు సాళువము గాకి నొడిసినభంగిన్. భార. విరా. 2. 282.

సీ. ధనము లుత్కృష్టంబు లమధనంజయుమాట పాటిగాఁ గొనుము సోపానభంగి, నున్నది మార్గంబు యోగసమారోహణమునకు దానన నడచి కాక, వడి నుర్కపడ నీకు వచ్చునే ధనసంగ్రహంబు భోగార్థకృతంబు దుష్ట, మగుటయుఁ గలదు యజ్ఞార్థకృతంబైన నదియు నిచ్చెన బ్రహ్మపదము నంద. భార. శాం. 1. 144.

2. పరుగెత్తు, పాఱు.

చ....ఘర్మధేను వా, కెళవుల నాడువాలభుజగింగని గోండ్రని యంగలార్చుచుం, గళగతఘంటమ్రోయ నుఱుకం బిడుగుంబలెఁ దాఁకి యుద్ధతిన్. ఆము. 8. 19.

గీ. ఆరెకులు చూచిరేని మహాప్రమాద, మీవిలాసిని విడిచి నీ వెచటి కయిన. వేగ నుఱుకుము కాదేని విశ్వసించి, పూని నాయుపదేశించుబుద్ధి వినుము. హరిశ్చ. 4.107. ఆం. భా. 3. 86.

3. వెలికివచ్చు, ఉద్గతమగు.

సీ. కోర కెవ్వఁడు పదాంగుష్ఠ భాగంబున నుదురాజు పొట్ట గుజ్జుఱుక నూఁదె. కాశీ. 8. 82.

లయగ్రా. పిఱుసనక యతఁ డదరి మెఱుఁగుగమి దశదిశల మెఱసి గిఱికొనుపరశువుఱక గొని కోపం,బుఱుక నృపవరుని పయి నుఱికి కసిమసఁగి...పద్మ. 7. 278. (ఉఱుకన్ - బయలుపడఁగా)

వ. మెడ యొడిసి పట్టి గ్రుడ్లు వెలి కుఱుక నొక్కుచు...కళా. 8. 236. (వెలికుఱుకు–పైకివచ్చు).

జ: ఉఱుకుడుఁగప్ప, ఉఱుకుబొద్దు.

**ఉఱుకుడుఁగప్ప** వి. (√ఉఱుకు) ఒకజాతికప్ప. (బ్రౌ. చి. ని.)

**ఉఱుకుబొద్దు** వి. (√ఉఱుకు) పైకిఉబికిన బొద్దు.

ద్వి. బరుసుమీసము చెక్కుపైఁ బులిపిరియు, నుఱుకుబొద్దును మేన నొదవినదద్దుఁ, బిల్లికన్నులు బల్ల పెరిఁగినకడుపు. నవనాథ. 8. 107 పా. 20 పం.

**ఉఱుకొట్టు** అ. క్రి. (√ఉఱు[4]) కోఁతి ఉఱ్ఱుమని ధ్వనిచేయు (శ. ర.).

**ఉఱుత–ఉడుత.** వి. (క. ఉడుతె. త. ఉఱుత్తై.) చిత్రోడము, వీఁపున మూఁడు నిడుపుచాఱలు గల యొకానొక జంతువు.

(భద్రవటవర్ణనము) సీ. ఉఱుతలు మొగడలు గఱవంగ దీనిపా ల్దొరిఁగియో తెలుపయ్యె హరునిశైల,మనఁగ...వరాహ. 12. 52.

సీ. ఉఱుత నా నుడుత నాఁ దరుమూషికం బగు ...ఆం. భా. 2. 87, అప్ప. 2. 197.

**ఉఱుతవన్నె** వి. ఉడుత వీపునం దుండు చాఱల వంటి చాఱలును, దాని వర్ణమువంటి వర్ణమును గల బట్ట.

సీ. బొమ్మంచు ముయ్యంచు పొప్పళి హొంబట్టు నుదయరాగము కందు లుఱుత వన్నె. ప్రబంధ. 2. 72.

**ఉఱుపు** వి. (√ఉఱియు) ఉఱియుట. (బ్రౌ. చి. ని. శ. ర.)

**ఉఱుము**[1] అ. క్రి. (త. ఉఱుము.) గర్జించు.

క. ఉఱుముచు మెఱుముచుఁ బిడుగులు,వఱలఁగ నలుగడలఁ బడ నవారితవృష్టుల్. ఆది. 8. 270.

ఉ. విల్లుఱుమంగఁజేసి యొకవేఁడికరం బరివోసి యేసి య,బ్బల్లిదుప్రక్క నొంచిన నపాయపుటూపిరికుట్టు పట్టి మూ,ర్ఛిల్లి యొకింతలోఁ దెలిసి...కకు. 2. 146.

వి. 1. మేఘధ్వని, గర్జనము.

క. ఉఱు ముఱిమి మూలగాడ్పులు, చఱచి విసరఁ జొచ్చె...హర. 2. 17.

2. వీరహుంకారము.

క. మాటికి మనపై నుఱుములు,చాటుచు వేగో
టులద్రిచరులుగోలువ...భా. రా. యు. 348.

**ఉఱుము²** — ఉడుము.

వ. తొఱుద్రొక్కనం గుక్కలచేఁ బఱివఱియైన
యుఱుములును...ఉ. హరి. 4. 29.

ఉఱుముతిండి — ఉడుపకుక్క.

ఉత్సాహా...ఎలుకవేఁట కుఱుముతిండ యేం.
...కు. సం. 2. 194.

**ఉఱువు** వి. (√ఉఱు⁴) కోఁతులు ఉఱ్ఱుమని చేయు
ధ్వని.

సీ. ఒండొరుఁ గడచుచు నుఱువులు మాపుచుఁ
జాతరిలాడుచుఁ బరువు గొనుచు.... గీ. ...
అక్కోఁతిమూఁక యెలమి నడచి. అచ్చ.
రా. యు. 90.

**ఉఱ్ఱటలూఁగు(ట్లూఁగు)** అ. క్రి. (ఉఱ్ఱటలు +
ఊఁగు) మిక్కిలియూఁగు, మిగులచలించు.

మ. అనుచుం జెందము గందళింప ధృతి బవ్వా
డంగ మోహంబుపై, కొన సిగ్గుఱ్ఱటలూఁగఁ
గ్రొవ్వలపుఁజూడ్కుల్ మీఱ వాంఛాలతల్,
ననలెత్తన్ వంవాధదర్శననవావందం బమం
దాకృతిన్,గని యమ్ముద్దులగుమ్మ మన్మథ
బలాక్రాంతులన్మూర్తియై. కృ. శకుం. 2. 57.

క. తక్కఁగలదనుజవీరులు, తక్కటిగీర్వాణ
వరులు దలపడివైరం, బెక్కఁగ నెక్కటి
పోరిరి, యుక్కన బ్రహ్మాండభాండ ముఱ్ఱ
ట్లూఁగఁగా. శశాం. 5. 86

సీ. బలిమిఁ గానవపరంపరల నుఱ్ఱటలూఁచి శివ
పందిళ్లలోఁ దిరిగి తిరిగి ... చనుదెంచె ...
సాయంసమీరణంబు. వేం. పంచ. 4. 281.

**ఉఱ్ఱాడు** అ. క్రి. (ఉఱ్ఱు¹ + ఆడు—ఉఱ్ఱుమని కదలు)
మిక్కిలి చలించు.

గీ. గమనజవమున నుఱ్ఱాడుకావ డదరి, కిఱ్ఱుకి
ఱ్ఱని భుజమునఁ గేళిసల్ప, గౌడరుద్రాక్ష
మాలికల్ కంఠసీమఁ, దవర వచ్చెను వేడ్క
వర్తిత్రిఘుండు. హంస. 1. 172.

**ఉఱ్ఱు¹** వి. 1. చలించుటయందు ఊఁగుటయందును
అగుధ్వని కనుకరణము.

2. కోఁతి, మొ. ఉఱ్ఱుమని చేయుధ్వని.

జః ఉఱ్ఱటలూఁగు, ఉఱ్ఱాడు, ఉఱ్ఱూఁతలూఁగు.

**ఉఱ్ఱు²** — ఉఱు³. వి. బంధము, పాలు పిదుకునప్పుడు
ఆవుకాళ్లకుఁ గట్టుత్రాడు.

(హోమధేనువర్ణనము) సీ. కలహంబునకుఁ
బోదు కల్గివంతన తుష్టినొందు నందడి కోర్చు
నుఱ్ఱువేయ, వలవదు పిదుకుచో వరవృష్టి
ధారల చెలువునఁ జన్నులు చేఁపికురియు.
భోజరా. 4. 129.

ఉఱ్ఱుకట్టు — పాలు పితుకునప్పుడు ఆవుకాళ్లకు
బంధమువేయు.

జః ఉఱ్ఱుఁద్రాడు.

**ఉఱ్ఱుఁద్రాడు** — ఉఱుఁద్రాడు. వి. దే. (ఉఱ్ఱు² +
త్రాడు) పాలు పిదుకునప్పుడు ఆవుకాళ్లకు
గట్టుత్రాడు, బంధము.

సీ. కుఱ్ఱులఁ బట్టఁగ నుఱ్ఱుఁద్రాళ్లు వలదు కుండ
యొడ్డినఁ బాలు నిండఁ గురియు. మైరా
1. 57.

**ఉఱ్ఱూఁతలూఁగు** అ. క్రి. (ఉఱు¹ + ఊఁతలు +
ఊఁగు) 1. మిక్కిలి ఊఁగు, చలించు.

సీ. ఉర్వీధరశ్రేణు లుఱ్ఱూఁతలూఁగంగ నేడు
గాడ్పులు వీచు నెన్నఁడేని. కాశీ. 2. 51.

సీ. ముత్తియంబులపేరు చిత్తజన్మునితూఁగుటు
య్యాలవగిది నుఱ్ఱూఁతలూఁగ, రతినైపు
ణము చూచి నుతియించువిధమున మణిమ
యకాంచి కింకిణులు మొరయ. వరాహ.
4. 162.

సీ. యుగవిరామమున నుఱ్ఱూఁతలూఁపఁగఁ
జాలుగాలి కొండ దమింపఁ జాల దెట్లు. కాశీ.
2. 105.

గీ. ధరణియుఱ్ఱూఁతలూఁచె నాదైత్యవిభుఁడు,
కల్పవిసరంబువేళ దిగ్గజమువోలె. శేష.
4. 95.

(ప్రతాపము.) సీ. ఆదిత్యువన యూఁచి హాల
హాలంబును లోఁచి హుతవహుగర్వ ము
ఱ్ఱూఁత లూఁచి. కళా. 1. 76.

2. కుతూహలపడు, ఉత్సహించు.

మహాస్రగ్ధర ...తనివి నవక యత్నవ్విఁ గీర్తింపఁ
జొచ్చుగా, దల యూఁచున్ దైవ్య మొందున్
దడ వగు నమచుగా డాయ నుఱ్ఱూఁతలూఁ
గున్. సురా. 47.

**ఉలంకలము** సం. వి. అ. పుం. పెద్దనల్లచీమ, గండ్రచీమ.

**ఉలక** — చులుక. విశే. (దీనికి కర్మధారయమునందు నిగాగమము వికల్పముగా వచ్చును.) చులుకన, లఘువు (బ్రౌ. చి. ని. శ. ర. ఉలుక — అని సాం. ని. 24. చులుకశబ్దసాదృశ్యమును బట్టి చూడఁగా ఉన్మధ్యరూపమే సాధువేమో.)

జ: ఉలకన.

**ఉలకన** వి. (√ఉలక) లాఘవము. విశే.- లఘువు. (బ్రౌ. చి. ని. శ. ర. చూ. ఉలక.)

**ఉలగరము** — ఉలవరము,

**ఉలపము** సం. వి. అ. పుం. న. రెమ్మలు ఆకులు జొంపముగాఁ గలతీఁగ,ఒకటితో నొకటి పెనఁగొన్న ద్రాక్ష లోనగునది. పుం. బల్బజము, మొదవగడ్డి.

**ఉలవ** వి. 1. సస్యవిశేషము, కుళుత్థము (వృ.వి.).

సీ. ఒప్పుఁ గుళుత్థాఖ్య యులవ యం చవఁగను ...అం. భా. 2, 236.

2. బ. వ. ధాన్యవిశేషము, కుళుత్థములు.

**ఉలవరము**--ఉలగరము. వి. (త. ఉళవీరమ్-ఉళవు-దున్నుట. ఈరమ్-పదను) దుక్కిపదను. ('తడిచేత నేల ఉబుకుట' శ. ర.)

జ: ఉలవరించు.

**ఉలవరించు** (√ఉలవరము) అ. క్రి. (నేల) దుక్కిపదను కలది యగు ('తడిచేత నేల ఉబుకు' శ. ర.)

**ఉలన**[1] వి. తృణవిశేషము.

**ఉలన**[2] — ఉలుచే.

సీ. కొరద దాసరికొయ్య కొట్టమీ నులన ముచ్చంగి వేడిన జెల్ల దాఱమీను. హంస. 4. 187.

**ఉలనకమ్మలు** వి. బ. కర్ణాటదేశమందలిస్మార్తబ్రాహ్మణులలో ఒక తెగవారు.

**ఉలి**[1] వి. (త. త. ఉళి.) 1. వడ్రంగికఱ్ఱ తెగఁగొట్టుట కుపయోగించు ఒకానొకపనిముట్టు.

సీ.....ఒవరు దారుచ్ఛేది యులి యనంగ. అం. భా. 2. 300,

2. ఱాతిని తెగఁగొట్టెడు ఒకానొకపనిముట్టు.

ఉ....మోములు రాహువుదంష్ట్రికాగ్రముల్, ముట్టనిచంద్రు లింతు లులి ముట్టనిలింగము లౌట చిత్రమే. కాశ. 4. 47.

సీ. గుద్దండ్లనుం జెద్దగునపంబులను గొట యొండొండ త్రవ్వుట యుక్కుటులుల, రాకట్టనపు చెడల్ గైకొని నఱకుట···గీ. ఓలిఁ గర్జంబుగా నెల్లయోధులకును, జెప్పి ... హరి. ఉ. 2. 15.

జ: ఉలియాడు.

**ఉలి**[2] — నులి. విశే. అల్పము. (ఇది వృత్తియందే కనఁబడు చున్నది.

క. గురుఁ డమజలనిధిఁ గడచితి, నొరులు దలంపంగ నాకు నులి గాలువ వీ,నరపతుల సరకు గొననీ, వందము సననిమ్ము నేఁటియని కలయకుమీ. భాం. ద్రో. 4. 68.

జ: ఉలిపచ్చి, ఉలివాడు[1].

**ఉలింద** వి. వృక్షవిశేషము (బ్రౌ. శ.ర.).

**ఉలికిపడు** అ. క్రి. (√ఉలుకు.) (అకస్మికముగాఁ గలిగినభయాదులచే) కంపించు, అదరిపడు, త్రుళ్లిపడు.

వ.... నే నపహాస్యార్థంబు తృణమయసర్పంబమ్ము నిపై వైచిన నతం డులికిపడి నా కలిగి నీవు నిర్వీర్యుం డైనయురగంబ వగు మని శాపం బిచ్చె...భార. ఆది. 1. 156.

**ఉలికిపాటు** వి. (√ఉలికిపడు) ఉలికిపడుట, త్రుళ్లిపడుట.

సీ. ధానుష్క శింజినీధ్వానముల్ చెవిఁజాఱ నులికిపాటున నిద్ర లుడుగువనియు. ఉ. రా. 7, 410.

సీ. ఎడనెడ మిట్టించి పడుమీలనెకుకుల కులికిపాటొదవంగ నొసరిలుచు. కళా. 6. 228.

**ఉలిపచ్చి** — నులిపచ్చి. విశే. (√ఉలి[2]) కొంచెము పచ్చిగామున్నది.

(నేల) ద్వి. ఉలిపచ్చియై యుండ నొకయింత యూరి,పలుకెక్కి గుగ్గిలపదను గానిచ్చి.ద్వి. పరమ. 4. 265 పా. 3 పం.

**ఉలిపి** వి. ఒకానొకచెట్టు. (దీనికఱ్ఱ కాల్పనయెడల చిటచిటలాడును.) విశే. 1—ఉలిపివంటివాఁడు-తులువ, దుర్మార్గుఁడు.

సీ. పరులకు బుద్ధిసెప్పఁగనేర్చు పెద్దల కుండక
పోదొక్కయులిపిగుణము.సావందో. 4. ఆ.
2. ముంగోపి. 3. పొగరుఁబోతు. (గ్రా.)
జ: ఉలిపికట్టె, ఉలిపిగొట్టు.

**ఉలిపికట్టె** వి. (√ఉలిపి)
(పొగరుఁబోతు)
సీ. పలువిత్తు వలుగాకి ప్రాడ్వాకుఁ దుచ్ఛిష్ట
మొందుసుద్దులమారి యులిపికట్టె. హంస.
5. 113.
(చెడ్డవాఁడు.)
సా: ఊరందఱది యొకదారి ఉలిపికట్టె దొక
దారి.

**ఉలిపిగొట్టు** — ఉలిపికట్టె.

**ఉలిమిరి** వి. (క. ఉలిమిరి) వరుణము (వృ.వి.)
వ. ఇప్ప కప్పురమద్ది గద్దగోరు గోరంట వెలమ
యులిమిరి మూఁగవేఁగిస మొదలుగఁ బెక్కు
తెఱంగుల మ్రాఁకులు. పి.శకుం. 2. 14.
సీ. వరుణనామము లులిమిరి యన...ఆం. భా.
2. 43. (రూ. ఉలిమిడి. శ. ర.)

**ఉలిమ్రాను** వి. చంద్ర. ఖదిరము(వృ.వి.) (శ.ర.).

**ఉలియాడు** స. క్రి. (ఉలి¹+ఆడు) 1. గంట్లు గల
దిగాఁ జేయు
(వ్యవ) తిరుగలి ఉలియాడినారు.
2. (ఊడ్చినమొక్కలు పోయినచోట్ల) మరల
నూడ్చు. (వా.)

**ఉలియు** అ. క్రి. (క. ఉలి. త. ఉలై.) 1. మ్రోయు,
శబ్దించు; అఱచు; రుతముచేయు, కూయు.
సీ. తమతమనియమితస్థానంబులం దోలి నుండిరి
బోరన నులిసె భేరులు... భార.ఆది.6. 7.
చ. అలుగుల మంది యందులమృగావలియుఁ
విహగంబులున్ భయాతురగతిఁ బొంది
మూఁగలును గుంటులుఁ జీకులు నైనయట్టు
లై, యులియక యున్నచో వడఁగియుండ
...భార. ఆది. 1. 301.
2. తొలఁగు, పోవు.
గీ. చెయ్వు లులియంగ మూర్ఛలఁ జెంది చెంది,
...ఉభయయోధులు పోరాడి రొక్కమొ
గిని. ఉ. రా. 8. 175.
జ: ఉలివు, ఉలివాడు², ఉలుచు, ఉలుపు¹.

**ఉలివాడు¹** — నులివాడు వి. వి. (ఉలి²+వాడు)
కొంచెము వాడుట.
క. కలహమున సురలు దాఁకు, ప్రళయానల
రూప మదరిపడి యొక్కొకమా, ర్దలఁచిన
మీసలు గడ్డము. నులివాడులువాడుచుండు
నొందిన భీతిన్. కు. సం. 10. 466

**ఉలివాడు²** అ. క్రి. (ఉలివు+ఆడు) చలించు,
కదలు.
సీ. కడు నల్లికలు కొనుకలికిలి త్తరపుఁజూపుల
క్రొమ్మెఱుంగులు వలలు గాఁగఁ, గొమ
రొందు వవవిలాసములకన్నామ లులివాడు
చోపుడుఁగోల లగుచుఁ దనర ఆ. కిరవాటి
యతనిఁ గ్రీడామృగంబుగాఁ,జేయవలయుఁ
గుసుమసాయకునకు. కళా. 2. 172.

**ఉలివు(ల్వు)** వి. (√ఉలియు) 1. శబ్దము, మ్రోఁత.
వ. అట్టియవసరంబున బోరన మ్రోయుజనుల
యులివును వాదిత్రనాదంబును వారించి...
భార. ఆది. 7. 168.
ఆ వారు సంభ్రమించి వడిఁ గోలదివియలు,గొ
నుచు నులివు మిగులఁ గూడఁ, బాఱి,వృత్త
శాలఁ జొచ్చి' త్తటి నాకలకల మెఱింగి
కీచకవ్రజంబు. భార. విరా. 3. 4.
ద్వి ...అంత, నందంద శాహస్తనయనసంజ్ఞ
లను, మందియుల్వణఁచి సమాధానపఱచి.
పండితా. మహిమ. 252. (మొదటిపాద
మున అఖండయతి).
2. చలనము. (చూ. ఉలివాఁడు².).

**ఉలుకు(ల్కు)** అ. క్రి.(క. ఉలుకు. త. ఉలుక్కు.)
1. భయపడు, బెదరు.
క అలయుచుఁ బులుఁగులయెలుఁగుల,కులుకు
చు నుగ్రాతపమున కోపక వృక్షం,బులనీడల
నిలుచుచు నెలుఁగులఁ బులులం జూచి
భయముగొని వగ వగచున్. భార. అర.
2. 84.
సీ. అధ్వర స్రుక్కుకాయంబు లాలోకించి యుర
గంబులో యని యులికి యులికి. నైష. 7.
124.
గీ. అలరువిలుకానిములుకుల కాత్మ నులికి.
విక్ర. 1. 138.

ద్వి. చాల నీతని కుల్కి-సత్యంబుకొలకు, నూలి పోఁగునఁ జిక్కి- మసల కున్నాఁడ ద్వి.పారి శ్చ. ఉ. 1525.

2. ఉడుకు, అసూయపడు.

క. జనులకు నొడఁబా టగువిధ,మున నడచుచు లోక నింద్యముల నుడుగుచు మీఁ,దని యొక నిక్కలిమి కులుకక,మనుజులలోఁ బొందిపొసఁ గి మను టొప్పు నృపా.భార. ఉద్యో.2.21.

గీ. వెట్టిశై వంబు ముదిరి మద్వినుతి వినఁడు, నతి యొనర్పఁడు మామక ప్రతిమలకును, హరుఁడె పరత త్త్వ మను మదీయాలయ ముల, నుత్సవంబుల కులుకు నెయ్యురును నట్ల. ఆము. 4. 42.

వి. 1. భయము.

క ఉలుకును వెక్కసపాటును,దలకొనునెమ్మన ముతోడ ధాత్రీరమణుం, డలఘుభుజవిపుల వక్ష,స్థల రేఖాకాంతిఁ బసి వర్ణ్యముఁ బొం దెన్. భా. విరా. 1. 218.

చ. ఇలు గల నైన వెల్వడనియాలువుటాండ్ర కుఁ దాపిక త్తైవై, యులు కెడలించి శౌరి తనుయోగపువాచవిఁ జూపి...ఆము. 5. 70.

2. ఉడుకు, సంతాపము.

సీ. ఒవరి వేఁపఁగ నెందు సెనగ లె త్తఁగఁ బోవు నూరికిఁ బొమ్మన్న నులుకుఁ జెందు. శుక. 2. 208.

జ : ఉలికిపాటు.

**ఉలుచే** – ఉలస[2] వి. (సం. ఉలూపీ. త. ఉళుశై.) మిక్కిలి చాపల్యము గలచేప.

సీ. ఉలుచలఁ జిలుతగుల్లల నమలుచు...తనరు బక పంక్తులకు...ఆము. 2.58.

సీ ...ఉలుచ నాఁ దిరిక నా మలుఁగనంగ,బొ మ్మడాయ యనంగఁ బొలుపారుచుండును మత్స్యభేదంబులు...అం. భా. 1 160.

**ఉలుచే** (లు) – ఉలుపు[1] న క్రి. (√ఉలియు) ఊడఁదీయు.

గీ. సత్కవులత్రుప్పు దుల్పువసంతవేళ...నృ సింహ, సార్వభౌమునిబిరు దైనసాళువంబు. జై.భా. 1. 45. (ఒక యర్థమందు 'త్రుప్పు డు+ఉల్పు' అనియు రెండవ యర్థమున 'త్రుప్పు+దుల్పు' అనియు పదవి భాగము.)

**ఉలుప[1]** – ఉలుపా.

గీ. సురఁటు లొక రెండు గోవకస్తురి జవాది,గా జుగిన్నియ చందురుకావిఅవిక, కొప్పుసవ రంబు పోఁక లాకులు దుకూల.ములుపగాఁ బట్టి సెట్టి కూర్చున్న తటిని. బహు. 5. 114.

ఉ...సం,బారము లుప్పు నె య్యొలువుఁబప్పు మొదల్గాని తెచ్చి యన్నియున్, వేఱుగ ని టిలో నులుప నించినకై వడి నుంచె... శు. 3.189.

గీ. అట్టియజుపట్టి కెదురుగా నరిశ పురికిఁ, దొడుకొని తెచ్చి రతనపుదొడ్డనగ రొ,కటి విడిదిచేసి నలంప శక్యంబు గాని,యులుప పట్టి ని నిమిషంతతికిఁ దంత.

మ. ...అయోధ్యాధివే,తని కేతంబున కేఁగి... చం. రా. 3. 105, 106.

ఉలుపపట్టు – కానుకగా పట్టు; (కానుకవలె)అ ర్పించు; అర్పించు, ఒసఁగు.

సీ. ఉలుపాంకురము లేర్చి యులుపవట్టెడుపూ న్కిఁ గుళ పల్లవావ్రాతి గుంటువడియె. పాండు. 5. 238.

**ఉలుప[2]** – పులువ. వి. పలుచని పుల్లయూరుఁబిండి.

గీ. పులుప యులు పన విరశామ్లకలితపిష్ట, మమరు... అం. భా. 2 251.

**ఉలుపఁడు** (ల్పఁడు) వి (√ఉలుపు[2]) శోఫరోగ ము గలవాఁడు. అం భా. 2. 122.

**ఉలుపము** సం – ఉలపము.

**ఉలుపా** – ఉలుప[1] వి. (హిం. ఉల్పా. క. ఉలిపె. ఉలుఫె. త. ఉలుపై్ప.) ఉపాయనము, (రాజా దుల కిచ్చు) కానుక.

మ. అలరాఁ జ నెలజాలఁ గట్టినమహీజా వాలము ల్గొన్ని స,త్ఫలపాండ్రంబులు గొన్ని పల్లవరుచి ప్రాగ్భారపట్టంబరో, జ్జ్వలము ల్గొన్ని సమగ్ర శారదరజో

జాలంబులై మాధవుం, డులుపా నించిన రౌప్యపాత్రికలు నా నొప్పెన్ నృపాగ్రంబు నన్. వసు. 1. 154.

సీ. తన కులుపా సాల దని మిట్టిపడఁగ నవా మధేయవు దైత్యునకు నడంగి. ప్రభా. 1. 78.

**ఉలుపావట్టు** – కానుకలుగాఇచ్చు.

(రాముఁడు పుష్పకము కిష్కింధకడ నిలిపెను.)

క. నిలిపిన ఫలాదివస్త్యము, లులుపావట్టెఁచె నినజుఁ డొదయని కవ్వించుఁదుల వెనుకఁ గపుల నకుటుం,బులఁగా నెక్కించుకొని యెఁ బుష్పక మతఁడుఁ. రామా. 8 237.

**ఉలుపాలుపట్టు** – కానుకల నిచ్చు.

మ. ఉలుపాల్పట్టి నయింద్ల మజ్జనన్నపాన్త్రోదాన ఘుక్తిక్రియో,జ్జ్వలులై .. ఆము 4 86.

**ఉలుపాచేయు** – కానుకగా నిచ్చు. యయా. 4. 75.

**ఉలుపి** విశే.(√ఉలుపు²) శోఫరోగము గలవాఁడు.

గీ. వాఁపి యన నులుపి యన నుబ్బఁ డన శోఫి,శోథిలు...ఆం. భా. 2 122.

**ఉలుపి** సం. వి. స్. పుం. ఉలూపి, శిశుకము, ఉలుచమీను.

**ఉలుపు¹** – ఉలుచే. (√ఉలియు)

గీ.... మెకములమీఁద గొలుసు, లులిపి జాగిలుముల నునికొలిపి రిపుడు. సారంగ. 1.62. (శ. ర-'ఉడిపి' ముద్రి.)

**ఉలుపు²** వి. శోఫరోగము. (శ. ర.)

జ : ఉలుపఁడు, ఉలుపి.

**ఉలుమఁడు** వి. (√ఉలుము¹) కుష్ఠరోగముగలవాఁడు.

సీ. ఉలుమఁడొక్కఁడు నూనెతలతోడ నేతెంచె మైలచీరలబాకి మ్రోలనెదిరె. ద్వా. 1.213.

**ఉలుము¹** – పులుము. వి. కుష్ఠరోగము.

ఆ. ఉలుము గొన్నవాఁడు దొలుమేన నాఘాత, బంధవముల నొరుల ప్రవ్నఁదనము, నెఱచినాఁడు... భార. అను. 5. 100.

సీ....కుష్ఠ,ములు మనఁ గు ష్టనఁ బులు మన విలసిల్లు...ఆం. భా. 2.128.

జ : ఉలుమఁడు.

**ఉలుము²** – నులుము. స. క్రి. నలుపు.

గీ. నిదురఁ దెప్పిలి మేల్కాంచి నీల్గి మలఁగి, యొడలు విఱుచుచుఁగనుఁగవ లులుము కొనుచు, ధాత గూర్చుండె సృష్టిసంధాత యగుచు. భాగ. 8.734. (చి. ని. పా. 'ఉసుముకొనుచు' ముద్రి.)

**ఉలూతము** సం. వి. అ. పుం. గ్రుడ్లగూబ. న. బల్బజము, మొదవగడ్డి.

**ఉలూకుఁడు** సం. వి. అ. పుం. 1. ఇంద్రుఁడు.(మే. ని.) 2. భారత యోధుఁడు, శకునిపుత్రుఁడు. 3. విశ్వామిత్రునికొడుకు.

**ఉలూఖలకము** సం. వి. అ. పుం. 1. ఱోలు. 2. గుగ్గిలపుచెట్టు.

**ఉలూఖలము** సం. వి. అ. పుం. మేడికఱ్ఱ. న. 1. ఱోలు. 2. గుగ్గిలపుచెట్టు.

**ఉలూతము** సం. వి. అ. పుం. కొండచిలువ.(నిఘంటువు లన్నియు త్రికాండశేషప్రమాణముతోనే అజాదిగా గ్రహించినవి. కాని త్రికాండశేషములో 'వలూతః' అని ముద్రితము కాన్పించుచున్నది.)

**ఉలూపి** సం. వి. స్. పుం. ఉలుచమీను. వి. ఈ. స్త్రీ. ఒక నాగకన్య, ఉలూచి. (ఈమె అర్జునుని భార్య. ఇరావంతునితల్లి.)

**ఉల్క(ము)** సం. వి. అ. స్త్రీ. 1. దివ్వటి, కాఁగడా. 2. దీపావళినాఁడు లక్ష్మీపూజానంతరమున వెలిఁగించుదీపవిశేషము 3. ఆకాశమునుండి రేఖాకారముగాఁ బడుతేజఃపుంజము. (ఇది అగ్న్యుత్పాతములలో నొకటి.) 4. మంటలేనినిప్పు కట్టె, కొఱకచ్చు. 5. అగ్నికణము. మిణుఁగుఱు.

శ్లో. బాధేతోల్కాక్షపితచమరీవాలభారో దవాగ్నిః. మేఘ. 1. 53.

సం – ఉల్క (ఇదికంధరాదులలోనిది)

ఉ...మహోల్కముల్, మొత్తము గట్టి రాలె బలముల్ వెలఁగందగఁ జేటు దెల్పుచున్. నిర్వ 2. 98.

**ఉల్కాధారి** సం. విశే. (స్. శ. స్.) దివ్వటివాఁడు, కాఁగడా వేయువాఁడు.

**ఉల్కాపాతము** సం. వి. అ. పుం. ఆకాశమునుండి రేఖాకార మగు కాంతి పుంజము పడుట.

**ఉల్కాముఖము** సం. వి. అ. పుం. కొఱవిదయ్యము.

**ఉల్కాముఖి** సం. వి. ఈ. స్త్రీ. ఆఁడునక్క.

**ఉల్పా** – ఉలుపా.

క. అల్లునికి విడిదియుల్పా, తెల్లమ ఘటియించి పంపి...ఉ. హరిశ్చ. 2. 79.

**ఉల్బణము** సం. విణ. (అ. అ. అ.) 1. అధికము,మిక్కుట మైనది. 2. తెలుపయైనది. (శ్లో. తస్యాసీ దుల్బణో మార్గః.సం.రఘు. 4.33..) 3.డాబు కలది. (అనుల్బణవేషము–డాబులేనివేషము.)

**ఉల్బము** సం. వి. అ. న. 1. మావి, జరాయువు.2. గర్భపిండము.

**ఉల్ముకము** సం. వి. అ. పుం. అలాతము, మండుచున్న కొఱవి.

**ఉల్ల** న. (క. ఉల్లి – నాతిదూరము నాతిసమీపమును కానిస్థలమునందు) నాతిదూరము నాతిసమీపము కానిదానిని తెలుపును (ద్రావిడభాష లన్నిటియందుమ దూరమునందున్న దానిని తెలుపుటకు 'అ' అనునదియు,సమీపమందున్నదానిని తెలుపుటకు 'ఇ' అనునదియు అతిసమీపస్థము అతిదూరస్థము కాక నడుమ నున్నదానిని తెలుపుటకు 'ఉ' అనునదియు సర్వనామములు తొలుత వాడుకలో నున్నట్లు తోఁచుచున్నది. 'అ, ఇ'లు ఇప్పటికిని అన్ని భాషలలోను కలవు.'ఉ' కన్నడమునను, తమిళమునను ప్రాయికముగా కలదు. తెలుఁగునందు ఈ క్రింది ప్రయోగములందే కనఁబడుచున్నది.)

గీ. ఉల్లపద్మాకరముపొంత నుండి నిన్ను, మెచ్చి కనుఁగొనుచున్న యున్మీలితాక్షుఁ, డుత్పలాక్షి యిక్ష్వాకువంశోద్భవుండు, సుబలభూపతి పుత్రుండు సుభగుఁ డతఁడు. భార. అర. 6. 154. (ఒనరపద్మాకరము...అని బరూరివారిప్రతి).

గీ. ఉల్లకాంచనరథముపై నున్నవాఁడు. భార. అర. 6. 158 ('అల్లకాంచనరథముపై నమరువాఁడు' అని బరూరివారిప్రతి).

సీ. మేలుగా కేమి టంకాలజాలెము లెవ్వి యుల్ల పెట్టె యనిండియున్నయవియ. కాశీ 7.244.

**ఉల్లంకి** – ఉల్లంగి.

సీ. పొటిపిట్ట యుల్లంకి పొన్నంగి తీతువు గున్నంగి యేట్రింత కొక్కరాయి. ప్రబంధ. 234

**ఉల్లంగి**–ఉల్లంకి. వి. (క. ఉల్లంగి) ఒకానొకపక్షి.

సీ. ...బైరిజావళము సాళ్వము డేగ గూడబాతుల్లంగి...అ. అదియైనపక్షు లతఁడు దీర్చు. హంస. 3. 18.

**ఉల్లంఘనము** సం. వి. అ. న. 1. దాఁటుట, కడచుట. 2. అతిక్రమించుట, మీఱుట.

**ఉల్లంఘనీయము** సం. విణ. (అ. అ. అ.) ఉల్లంఘింపఁ దగినది.

**ఉల్లంఘించు** సం. స. క్రి. 1. దాఁటు, కడచు.

సీ. పక్షులు చరియించుపదవి నుల్లంఘించి ఘనములు దిరుగుమార్గంబు గడచి. నైష.7.37.

2. నిరసించు, అనాదరముచేయు,

వ. నాపలు కుల్లంఘింపక ...హరిశ్చ. 2. 175.

వ. శ్రీవిష్ణుప్రసాదంబుఁ బ్రాకృతాన్నంబునుం బోలె నుల్లంఘింపఁ దగునే. వైజ. 1. 62.

అ. క్రి. దుముకు, ఎగురు,

శా. జంఘాలత్వముతో నగోపరిచలత్సారంగ హింసేచ్ఛ నుల్లంఘింపఁగ గమకించునింహముక్రియఁగ. భాగ. 10. పూ. 1872.

**ఉల్లంఘితము** సం. విణ. (అ. అ. అ.) 1. దాఁటఁబడినది. 2. అతిక్రమింపఁబడినది, మీఱఁబడినది.

**ఉల్లంఘితవ్యము** సం. – ఉల్లంఘనీయము.

**ఉల్లంఘ్యము** సం – ఉల్లంఘనీయము.

**ఉల్లంబితము** సం. విణ. (అ. అ. అ.) 1. పయిని వ్రేలాడినది. 2. పయికెత్తఁబడినది, పయిని వ్రేలాడఁ గట్టఁబడినది.

**ఉల్లడ** – ఉల్లెడ. వి. (క. ఉల్లడె.) వితానము, మేలుకట్టు.

గీ. ...చిత్రాకృతిఁదవర్చువంబరంబు,తనకు దిక్పద్మనయన లెత్తినమెఱుంగు, లడరుమంజిడి వన్నెయుల్లడ యనంగఁ, దనరె నొయ్యఁ గుండినమునకుఁ జనియె. చంద్ర. 5. 20

గీ....వితాన మగు మేలుకట్టు లుల్ల,బమ్ము లుల్లడలనఁ జందువలన...ఆం. భా. 2. 158.

**ఉల్లడము** వి. వితానము, మేలుకట్టు. ఆం. భా. 2. 158.

**ఉల్లము** వి. (సం. ఉల్లమ్.) 1. హృదయము.
క. ...ఉర్వీధరసార్వభౌమ యుల్లము నీకున్, సర్వోన్నతంబు గాదె య,ఖర్వము లగు నీ మహోత్సాహములభంగిన్. హరి. 4. 61.
2. ఇచ్ఛ, కోరిక.
ఆ. ఉసులు గాచికొనఁగ నుల్లంబు గలిగిన,నిపుడ బాల విడిచి యేఁగు మట్లు,కాక నిలిచితేని గ్రక్కున నిదె తలఁ,గొను మదీయతీవ్రఘోర శరము. హరి. ఉ. 8. 130. కళా. 6. 261.

**ఉల్లరపుబిరుదు** విశే. (√ఉల్లఱము) దుస్సహ పరాక్రముఁడు.
సీ. మొగదోరు కృతవస్త్ర మూఁడపవాఁడు నాలవవాఁడు నిశరుఁ డుల్లఱపుబిరుదు. ఉ. హరి. 4. 200.
(భయంకర మైనబిరుదులు గలవాఁడు – అని ఆం. భా.)
గీ. ...కర్కశం బగుబిరుదులు గలుగునాతఁ డుల్లఱపుబిరుదు ...ఆం. భా. 8. 26.

**ఉల్లఱము** విశే. సహింప రానిది, దుస్సహము. (ఉల్లము+అఱు – శ. ర.)
వ. ...దిక్కులు పిక్కటిల్ల నుల్లఱపుబిరుదధ్వజపటపటల పటపటాత్కారంబులు రాహుత్తులఝాత్కారములు ...ప్రబంధ 788.
(ఉల్లరపు – ముద్రి.)
జ: ఉల్లఱపుబిరుదు.

**ఉల్లల** వి. ఉడుకుట (పరితపించుట) యందలి ధ్వని కనుకరణము.
సీ. విప్రులు పట్ట రా వెఱ నొచ్చి యొదిఁగెడు గవయంబుచాడ్పునఁ గర్ణభీతి, నుల్లల నుడుకుచు నుండుదు...భార. కర్ణ. 3. 33. శాం. 4. 44.

**ఉల్లలత్** సం. శత్రు. 1. చలించుచున్న. 2. ఎగురుచున్న. 3. విలవిలఁ గొట్టుకొనుచున్న.

**ఉల్లలన** సం. వి. ఆ. స్త్రీ – ఉల్లలనము.

**ఉల్లలనము** సం. వి. అ. న. 1. కదలుట,చలించుట. 2. ఉత్పతనము, ఎగురుట. (శ్లో. తావత్తరఙ్గప్రఖరముల్లలయాంచకార. శిశు. 5. 7.)

**ఉల్లలము** సం. విశే. (అ. ఆ. అ.) 1. కదలునది.2. పెక్కు తెగుళ్లు గలది. వి. అ. పుం. చలనము, కదలిక.

**ఉల్లలితము** సం. విశే. (అ. ఆ. అ.) 1. కదలినది. 2. పైకెగిరినది. 3. అల్లలాడినది. 4. ఊఁపఁబడినది.

**ఉల్లసత్** సం. శత్రు. ఉల్లసించుచున్న.

**ఉల్లసనము** సం. వి. అ. న. 1. సంతోషము. 2. ప్రకాశము. 3. వికాసము, స్ఫుటత. 4. బయలుదేఱుట. 5. గగురుపు, రోమాంచము.

**ఉల్లసమాట** వి. (√ ఉల్లసమాడు) ఉల్లసమాడుట.
క. అని తను నుల్లసమాటకుఁ, గినిసి యినత నూఱుఁ దేను గ్రిడి నిచట మాఁ,ర్కొనుపిఁకఁ గన్నులారంగ,గనుఁగొనుమీ... భార. విరా. 5. 182.

**ఉల్లసమాడు(ములాడు)** స. క్రి. (ఉల్లసము+ఆడు) ఎత్తిపొడుచు, మర్మము దూఱనాడు.
సీ. ఈ యొద్దు భేదింప నే మెవ్వరము నేర మర్జునుండును నీవు నచ్యుతుండుఁ, బ్రద్యుమ్నుఁడును దక్కఁ బార్థుండు మనల నుల్లసమాడకుండ నీలావు మెఱసి, భేదించి మా కెల్లఁ బ్రియ మొనర్పుకుమార... భార. ద్రో. 2. 5.
గీ. ...బంధోరుల గరువంబుగ నుల్లసంబు,లాడుచును శేరి నడతేరం. భార. భీష్మ. 1. 112.
(చిఁకట్లు) సీ. ఋభుగణ ప్రభుమణిఘృణుల నుల్లసమాడి హాళికటీపటలీల నగడు సేసి. పె. శకుం. 2. 182. (ఇటఔపమ్యద్యోతకము.)
2. పరిహాసముచేయు, గేలిగొను. భార. శల్య. 2. 215 (సం. భార. శల్య. 54. 8.)
అ. క్రి. ఎత్తిపొడుపుమాటలాడు.
క. ...అమరవల్లభుహాగితో, నుల్లసమాడంజాలెడు,తెల్లనిదొకకత్తలాని తేజీహాయముఁగా. నైష. 6. 96. (ఇటఔపమ్యద్యోతకము.)

**ఉల్లసము** వి. ఉపహాసము, ఎత్తిపొడుపు; సోల్లుంఠవాక్యము ఎత్తిపొడుపుమాట.
గీ. లావునను గూడి పాణిపల్లవయుగమున,నొత్తిపట్టిన సంకుగా నుల్లసమున, హారకాంతిచ్ఛలంబున నల్లనవ్వు, తరుణిచన్నులు రాజచిత్తము హరించె. నైష. 7. 179.

క. కల్లలు నిజములు నర్థము,మొల్లంబును బ్రియము మోహమును నలుకయు నా,యుల్లసము నయము సరిగాఁ,దెల్లను వెలయాంధ్రయందు క్షితితలమందున్. ద్వా. 11. 42.

గీ. ఒల్లఁ బొమ్మన్నఁ బోదె తా నుల్లసముల, నేఁపనది రక్కసియ యాటయొగ్గె...ఆము. 5. 51, ఆం. భా. 1. 118.

జ: ఉల్లసమాట, ఉల్లసమాడు.

**ఉల్లసము** సం. విణ. (అ. అ. అ.) 1. ప్రకాశించునది. 2. సంతోషించునది. 3. వెలువడునది, బయలుదేఱునది. 4. వికసించునది; స్ఫుటమగునది. వి. అ. పుం. 1. సంతోషము. 2. ప్రకాశము. 3. వికాసము, స్ఫుటత.

**ఉల్లసించు** సం.—ఉల్లసిల్లు.

(స్ఫుటమగు, వ్యక్తమగు.)

మ. ...కుతుల్కునడల్ గొంచెఁ గృశించె మేనరుచి యాలో మించె నా రుల్లసిం,చె నుగుర్శాంతిజనించె గర్భము రహించెన్ ... ఉ. రా. 1. 181,

**ఉల్లసితము** సం. విణ. (అ. అ. అ.) 1. ప్రకాశించినది. 2. సంతోషించినది. 3. గర్వించినది. 4. అదరినది, చలించినది. 5. పయికిలాగఁబడినది. (కత్తి, మొ.)

శ్లో. దదృశురుల్లసితాసిలతాసితాః.శిశు.6.51.

**ఉల్లసిల్లు(లు)** — ఉల్లసించే. సం. అ. క్రి. సంతోషించు.

వ ... ప్రసవనారాచశరాసనాతివిభ్రమభ్రూవిలాసం బగు నీముఖశ్రీసముల్లాసంబునకు నుల్లసిల్ల ...నైష. 4. 40

ఉ. సంతసమంది యందఱును సమ్మత మౌ నిదియంచుఁ బల్కినన్, జింతఁ దొఱంగి యా నృపతి చెల్వయుఁ దా మది నుల్లసిల్లుచున్. ద్వా. 6. 75.

2. ఒప్పు, ప్రకాశించు.

గీ. ఒనర బహువిశేషంబుల నుల్లసిల్లు,నట్టి భారతాఖ్యానంబునందు...మార్క. 1. 8.

3. స్ఫుటమగు, వ్యక్తమగు (చూ. ఉల్లసించు)

4. బయలుదేఱు, పుట్టు.

చ. ...ఈ,చలిమలవల్ల నుల్లసిలుచల్లదనంబును మానకుండినన్. మనుచ. 2. 10.

క. మగువా నీపెంచినలత, చిగురున ముకుళంబు లుల్లసిల్లెనె చెపుమా, పగడపుఁ గెమ్మోవి నయిన్, నగ వుదయించినవిధంబునఁ బ్రస్ఫుటమై. హర. 4. 19.

**ఉల్లాకు** వి. ధాన్యాదులపరిమితి స్వామ్యము మొదలగువానిని తెలుపుటకై వ్రాసి వానియందుంచిన పత్త్రము (ఉలి + ఆకు - చీటి, ఖండపత్త్రిక అని శ. ర.)

**ఉల్లాకుఁజేఁప** వి. మత్స్యవిశేషము (బ్రౌ. శ. ర )

**ఉల్లాఘము** సం. విణ. (అ. అ. అ ) 1. రోగనిర్ముక్తము, వ్యాధికుదిరినది. 2. దక్షము,సమర్థము. 3. శుచి యయినది. 4. సంతోషయుక్తము. వి. అ. పుం. మిరియము.

**ఉల్లాపనము** సం. వి. అ. న. వ్యాఖ్యానము, వివరణము.

**ఉల్లాపము** సం. వి. అ. పుం. 1. మాట. 2. శోకభీత్యాదులచేఁ గలిగినధ్వనివికారముతో చెప్పుమాట. 3. దూషణవాక్యము. 4 సూచనము. 5. బిగ్గరగాఁ బిలుచుట.

**ఉల్లాపి** సం. విణ. (న్. ఈ న్.) 1. బిగ్గరగాఁ బిలుచునది. 2. సూచించునది. 3. శోకభీత్యాదులచే వికృతస్వరముతోఁ బలుకునది. 4. చెడ్డమాటలాడునది.

**ఉల్లాపించు** సం. స. క్రి. దూషించు.

వ. అని విధి నుల్లాపించుచు నక్కనుమశోమల నల్లనల్లన తడవికొనివచ్చి...కు.సం.5.628.

**ఉల్లాప్యము** సం. విణ. (అ. అ. అ.) 1. బిగ్గరగాఁ బిలువఁ దగినది. 2. నిందింపఁ దగినది. 3 వివరింపఁ దగినది. వి. అ. న. ఉపరూపకభేదము.

**ఉల్లాము** వి. పక్షివిశేషము (దీనిముక్కు పొడుగుగా నుండును. ఇది చెమ్మనేలలయందు సంచరించును. బ్రౌ.)

**ఉల్లారు** వి. (శ. ఉల్లార) 1. గుజ్జుపుటీనిమీఁదిపఱపు.

వ. ...అవిరళదళకిసలయవిలసితలతావితానంబులు మరకతకురువిందనిచయఖచితంబులగునగతులపగిదిఁ జూపట్ట సమకట్టుబల్లుల

మొల్లమి నుల్లసిల్లుచు నిరుగడల గ్రేవలనిడు పోగపూవు గెలలు పొలుపొంద నగ్రభాగ పల్లవంబు లింద్రగోపంపుటుల్లారుల యోజ రాజిల్లఁ దేజిలపోలిక భాసిల్లువానంతి కాకు డుంగంబులును...కళా. 6. 224.

ద్వి. ...ఇంద్రగోపంపుటుల్లారు... ద్వి. పరమ. 3. 228 పా.

2. జాలరు.

వ. ...మూరెడు కొక్కెండును జేన కొక్కెండును గాఁ గుట్టినడోల్లుటుల్లారు లుల్లసిల్లఁ బఱిచిన పల్లంబులపై ...ఆము. 4. 35.

**ఉల్లాననము** సం. విశే. (అ. ఆ. అ.) ఉల్లసింపఁ జేయునది. వి. అ. న. 1. ప్రకాశము, కాంతి. 2. సంతోషము. 3. వికాసము

**ఉల్లాసము** సం. వి. అ. పుం. 1. ప్రకాశము. 2. ఆహ్లాదము, సంతోషము. 3. ఒకానొక యర్థాలంకారము (ఇందు ఒకరిగుణదోషములు మఱియొకరి గుణదోషము లెత్తిచెప్పుటచే సూచింపఁబడును). 4. గ్రంథమందలి ప్రకరణము. 5. ప్రారంభము. 6. వికాసము, స్ఫుటత.

**ఉల్లాసి** సం. విశే. (న్. సీ. న్.) 1. ఉల్లాసముకలది, ఉల్లసించునది. 2. ఉల్లసింపఁజేయునది.

**ఉల్లాసించు** సం. అ. క్రి. 1. ప్రకాశించు.

సీ. అభినవబర్హిబర్హాపీడలక్ష్మి నుల్లాసించు కేశకలాప మమర. హరి. పూ. 8. 7.

2. సంతోషించు, ప్రసన్నుఁడగు.

సీ. ఆడుచునున్నాఁడొ...గర్వించి యున్నాఁడొ శోకించి యున్నాఁడొ ... యుల్లాసించినాఁడొ కలంగినాఁడొ. గీ. పగలొ రాత్రియొ యెఱుఁగఁ డాబ్రాహ్మణుండు, తలము దప్పంగఁ ద్రావి మత్తావహించి. శివరా. 3.15.

**ఉల్లాసితము** సం. విశే. (అ. ఆ. అ.) ఉల్లసింపఁజేయఁబడినది.

**ఉల్లి** వి. (త. క. ఉళ్ళి.) 1. లశునము (వృ. వి.) (నీరుల్లి, వెల్లుల్లి అని యిది రెండువిధములు)

ఆ. మునగ యుల్లి యడవిమునగ దుర్మాంసము, లానుగమ్మ మలినమైనయుప్పు, కఱియ జీలకఱ్ఱ కఱివేము గురుజ యుం,గువ ప్రవర్జనీయకోటియగుట. భార. అను. 3. 189.

(వ్యవ) ఉల్లిగడ్డ. ఉల్లిపాయ.

2. వెల్లుల్లి.

గీ. శ్రాద్ధకర్మంబునందు వర్జ్యములు వినుము, పెండలంబును దోస పలాండు వుల్లి ... మార్క. 3. 203.

సా: ఉల్లి చేసినమేలు తల్లియును చేయలేదు.

జ: ఉల్లికుట్టు.

**ఉల్లింగితము** సం. విశే. (అ. ఆ. అ.) గుర్తులవలన తెలిసికొనఁబడినది.

**ఉల్లికుచ్చెరము** వి. మత్స్యవిశేషము (శ. ర.)

**ఉల్లికుట్టు** వి. (√ఉల్లి) ఎత్తిపొడుపు: ఎత్తిపొడుపుమాట, సోల్లుంఠనవాక్యము.

క. సమరమునకుఁ బిరికొల్పుచు,మము దలఁచిన నుల్లికుట్టుమాటలఁ దచ్చి,త్తము లుడికించుచుఁ బాండవ,సమితిం గడఁగించువాఁ డచటనెవ్వరొకో. భార. ఉద్యో. 2. 242.

చ విను మరిఁ జంపనుం జెఱుప వేచుట లెస్స ప్రతాపభాషణం, బున వెడమ (యు?)ల్లికుట్టులను బొంకుల వానిఁ గలంగఁజేసి రేఁచినఁ దనపూఁపు దప్పు...భార. శాం. 3.20.

(ఉల్లకుట్టు-ఉల్లము+కుట్టు-అని శ. ర.)

**ఉల్లిఖితము** సం విశే. (అ. ఆ. అ.) 1. గోఁకఁబడినది. 2. రాచి సన్నముగాఁ జేయఁబడినది, సానఁబట్టఁబడినది. 3. వ్రాయఁబడినది.

**ఉల్లిపాషాణము** మి వి. (వైద్య) సౌవీరము, ఒకానొకవిషపదార్థము.

**ఉల్లీఢము** సం. విశే. (అ. ఆ. అ.) సానఁబట్టఁబడినది, మెఱుఁగుపెట్టఁ బడినది. (శ్లో. మణిశ్శాణోల్లీఢః. సం. భర్తృ. నీతి. 44.)

**ఉల్లుంచనము** సం. వి. అ న. 1. ఛేదించుట; కత్తిరించుట. 2. ఉన్మూలనము, పెకల్చుట.

**ఉల్లుంచితము** సం. విశే. (అ. ఆ. అ.) 1. పెకల్పఁబడినది. 2. ఛేదింపఁబడినది; కత్తిరింపఁబడినది.

**ఉల్లుంఠ** సం. వి. ఆ. స్త్రీ. – ఉల్లుంఠనము.

శ్లో. ధీరాధీరాతు సోల్లుంఠభాషితైః స్వంతుదేదముం. సాహిత్యదర్పణము.

**ఉల్లుంఠనము** సం. వి. అ. న. 1. వ్యాజస్తుతి, మనమున కోప ముంచుకొని పయికి స్తుతించుచున్నట్లు పలుకుట. 2. ఉపాలంభము, దెప్పుట.

**ఉల్లుంఠితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. చెప్పఁబడినది. 2. వ్యాజస్తుతిచేయఁబడినది.

**ఉల్లూనము** సం. విణ. (అ. ఆ. అ.) ఛేదింపఁబడినది, త్రుంపఁబడినది,

**ఉల్లెడ** – ఉల్లడ.

వ. ...విస్ఫురితపరాగపూగంబు చదల నెల్లెడ నుల్లెడగట్టిన ట్టమర. మనుచ. 5. 71.

సీ. శరదభ్రములచాలు దొరయనుల్లెడ యెత్తి. ముకుంద. 3. 281. ఆము. 6. 180.

**ఉల్లేఖనము** సం. వి. అ. న. 1. గోఁకుట. 2. రాచుట. 3. త్రవ్వుట. 4. క్రక్కుట. 5. ఉచ్చారణము. 6. వ్రాయుట.

**ఉల్లేఖము** సం. వి. అ. పుం. 1. గోఁకుట. 2. రాచుట. 3. చెప్పుట. 4. ఉచ్చరించుట. 5. ఒకానొక యర్థాలంకారము (బహుధర్మములు గల యొకపదార్థమును బహువిధముగా గ్రహించుట. ఉదా: ఓరాజా! నీవు స్త్రీలచే మన్మథుఁడుగాను, శత్రువులచే యముఁడుగాను గ్రహింపఁబడుచున్నావు...

**ఉల్లేఖి** సం. విణ. (న్. నీ. న్.) 1. రాపిడి చేయునట్టిది. 2. గీచునట్టిది. 3. గోకునట్టిది.

**ఉల్లేఖించు** సం. స. క్రి. 1. ఒరయు. రాచు.

సీ. ఆటమండపముపైనభ్ర ముల్లేఖించుజాంబూనదత్రిశూలంబుఁ జూచి. శివరా. 3. 107.

2. చెప్పు.

శా. ...క్రీడావిహారక్రియా, లీలాహాస్యకళాప్రసంగముల నుల్లేఖించి వర్తింతు రె,క్కాలంబుల ఘటజన్మ కాశినడుమల గర్వించి యద్దేవతల్. కాశీ. 6. 210.

**ఉల్లోచము** సం. వి. అ. పుం. మేలుకట్టు, వితానము.

**ఉల్లోలము** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి చలించునది. వి. అ. పుం. మహాతరంగము, పెద్దఅల.

**ఉళిక్కి** – హుళిక్కి. విణ. 1. శూన్యము, లేనిది (చూ. హుళిక్కి.) 2. అసత్యము.

గీ. జడలు రుదురిక్కవేరులుఁ జాలఁ బూని, బూది మెయిఁ బూసి పులితోలుమీఁదఁ గూరు,చుండి ముక్కున గన్నులు మూసి,కొని యుళిక్కిగ వేమేమొ గొణఁగుచుండె. అచ్చ. రా. యు. 409.

**ఉళిగము** – ఊడిగము.

(సేవ)

ద్వి. తవిలి యీయుళిగంబు తప్పింపరాదు.బస. పు. 6. 610 పం.

**ఉవిద** వి. (స్త్రీవాచ్యాద్యవతిః) 1. స్త్రీ, ఆఁడుది.

మహానిని తెలుపుటప్పుంగవ మొగిచి తెలవకపత్త్రము (ఉలి + ఆకు–శాఁగ. ఆది. 4. 258. 2. భార్య.)

ద్వి. అవనీశ దమయంతి యనుపాటిపడుకాంత, నువిదఁ జేసెద నీకు నొగి నన్ను విడువు. ద్వి. నల. 1, 374.

**ఉవ్వ** వి. వృక్షవిశేషము (శ. ర. ఈచెట్టుయొక్క పువ్వు పెద్దదిగను మిగుల సువాసనగలదిగను ఉండును. బ్రౌ.)

ఉవ్వకాయ–ఉవ్వచెట్టుయొక్క కాయ.

**ఉవ్వపిట్ట** వి. ఒకజాతిపక్షి, గోలత్తిక. (శ. ర. బ్రౌ.)

**ఉవ్వలపోటి** వి. బాలక్రీడావిశేషము.

సీ. చిడుగు డువ్వలపోటి చెండు గట్టనబోదియల్లి యుప్పనఁబట్టె లప్పళాలు. కాశ. 3. 88.

**ఉవ్వాయి** వి. (త. ఉవగై.) సంతోషము, ఉత్సాహము.

క. ఇవ్విధమున రుక్మిణిమదిఁ,బువ్వు బరిమళముఁ బోలెఁ బొలుపుగ నెత్తం, బువ్వాయి గలిగె కౌరికి, మవ్వము దిగఁద్రొడఁగె గెలుపు మట్టంబయ్యెన్. ఉ హరి. 3. 125.

విణ. సోల్లాసము.

ద్వి. జవ్వాది మెఱుఁగుహస్తముల డాలించి, యువ్వాయిగా నూర్పు లోనరింపుచును, భూమీశ్వరున కింపు పుట్ట నేర్పునను, మైమర్దనంబు వేమఱు నొనర్చుటయు. ద్వి పరమ. 3. 204 పా. (చి. ని. పా.)

**ఉవ్విళులూ(ఝ్లూ)రు** అ. క్రి. (ఉవ్విళులు + ఊరు. త. ఉళ్వాయియూరు.) త్వరపడు; తమకించు, తహతహపడు.

క. నవ్వెడువారల నెఱుఁగవు, క్రొవ్వున నిటు పలికె దేల గోవిందుని నీ, వెవ్వనిఁగాఁ దలఁ

చితి వతఁ, దువ్విళ్లూరెదు భవన్మదోద్ధతి
యడఁపఁగ. హరి. ఉ. 6. 116.

ఉ. వీనులఁ దియ్యమెక్క మును విన్కిఁ బరిస్ఫుర
రాగవృత్తి లో,నూనినఁ జూచువేడుకల
నువ్విళులూరెదు నెమ్మనంబులు ... భార.
విరా. 5. 393.

సీ. మీమొగంబులు నాల్గు నీమాడ్కి నువ్విళు
లూరిన నేకాస్య నొకతె నేను, జాలుదునె
...కళా. 5. 15.

మ. అనినం గేకయరాజనందన ప్రభూతాశ్చర్య
యై యిట్లనుఁ,విను నీరూపము మాచి మా
నృపతి యువ్విళ్లూరు నే నెమ్మెయిఁ,బని
గొందుఁ... భాస. విరా. 1. 321.

**ఉవ్విళ్లు(ళులు)** – ఊవిళ్లు. వి. బ. త్వర,

మ. హనుమంతుం డపు డుగ్రుఁడై దనుజలోకా
ధీశ్వరున్ డాసి క్రొ,వ్వన నవ్వట్టఁగఁ
బూని తిన్పుడు మదంబువ్విళ్లు నీ కేల యం,
చును...సీతావి. 3. 70.

జ: ఉవ్విళులూరు, ఉవ్విళ్లుగొను, ఉవ్విళ్లుగొలుపు,
ఉవ్విళ్లూర్చు.

**ఉవ్విళ్లుగొను** – ఉవ్విళులూరు (√ఉవ్విళ్లు.)

ఉ. వీళ్ల విరెండఁ బన్నుడు దివిం గలహోకనమౌని
చూడ్కు లు,వ్విళ్లుగొనంగఁ జొచ్చె నలవే
ల్పు వడంతుల నెమ్మనంబు పిం,పి ల్లోగిఁ
గూయఁ జొచ్చెఁ దమిపెక్కువ మృత్యువు
మ్రింగఁ జొచ్చె గ్రుక్కి ళ్లవియంగఁ జొచ్చె
రవికిఁ హృదయం బఖిలంబు నయ్యెడన్.
కవిక. 2. 150.

**ఉవ్విళ్లుగొలుపు** స. క్రి. (√ఉవ్విళ్లుగొను) ఉవ్విళ్లు
గొనఁజేయు, త్వరపఱచు; తహతహపెట్టు.

సీ. మాధుర్యధుర్యకోమలవచనామృతం బమిత
వింపఁగఁ గౌతుకాంతరంబు. గీ. గలుగఁజే
యుచు నువ్విళ్లుగొలుపునీదు, సంగతి యొకింత
గని యెట్లు జాఱవిడుతు. ప్రభా. 3. 66.

**ఉవ్విళ్లూర్చు** స. క్రి. (√ఉవ్విళ్లూరు.) ఉవ్విళ్లూరఁ
జేయు, సంభ్రమింపఁజేయు: తహతహపెట్టు.

సీ. ఏగంధగజయాన హృదయ మువ్విళ్లూర్చి
భవునిమైఁ జక్క పొఁజాలు గొనియె. కాశీ.
4. 150.

**ఉవ్వ** వి. శీఘ్రత్వాదులను దెలుపునుకరణము.
(చూ. ఉవ్వన, ఉవ్వెత్తు.)

జ: ఉవ్వన, ఉవ్వెత్తు, ఉవ్వెత్తుగొను.

**ఉవ్వన** అవ్య. ప్ర. 1. తటాలున, శీఘ్రముగా.

ఉ. ...నన్నునుపుఁడంచు, బసిండివిమాన మెక్కి
తా, నువ్వన నచ్చరల్ గొలువ నుర్వికి
వచ్చి ముహూర్తమాత్రలో...వి.పు. 5.310.
రుక్మా. 3. 133.

2. అకస్మాత్తుగా.

ఉ. త్రెవ్వెడుగంటులం గుటువు దేఱెడు నెత్తురు
రాకమున్న యే,నొవ్వియు నేవికారము
మనోగతిఁ జెందకమున్న నాయకం,బవ్వలఁ
బోకమున్న మకుటాగ్రవిఘట్టన రాణ మొ
ప్పఁగా, నువ్వననువ్వతిల్ల నసురోద్వహ
మూర్ధచయంబు గ్రక్కునన్. భా. రా.
యు. 2145.

ఉ. అవ్వచనంబు చిత్తమున నాఁటపా టొద
వింప నెంతయున్, నివ్వెఱఁ గంది యొం
డుపమనేరక యూరక యుండి యింతలో,
నువ్వనఁ జేవగై కొని...వి పు. 7. 8.

**ఉవ్వెత్తు** క్రి. విశే. (ఉవ్వ + ఎత్తు) 1. నిశ్శేషము
గా, పూర్తిగా. (చూ. ఉవ్వెత్తుగొను)

వ. పిశితఖండంబు లొండొండ యువ్వెత్తుగా
నాకుఁ బొత్తంలం గట్టియు ... మనుచ.
4. 60.

ఉ. అత్తఱిఁ దద్బలం బరిబలౌఘములన్ నుఱు
మాడివైచె ను,వ్వెత్తుగఁ జుట్టు ముట్టుకొని
యూఁచెల ... కాలు గే,ల్గత్తుక దొక్క
ప్రక్కచెవి గొమ్మని యేర్పడకుండునట్లుగన్.
కళా. 8. 57.

2. అవలీలగా, అనాయాసముగా.

మ. నను నువ్వెత్తుగఁ గాఱు మీటితివి నానా
ధైర్యసామగ్రి ను,జ్జనకు మ్మన్నె తృణీకరిం
చితి...వసు. 2. 10.

3. ఎక్కువగా.

ఉ. అత్తఱి నిప్పుద్రొక్కినటు లౌదలఁ దే ల్గొని
నట్టు లావ యు, వ్వెత్తుగఁ ద్రావినట్లు విబు
ధేశుఁడు మాణవకోగ్రనిష్ఠురున్, జిత్తమునం
దపించి...పాండు. క. 189. చంద్రా. 6. 83.

ఉవ్వెత్తుగాఁగ – ఉవ్వెత్తుగా.

ద్వి. బలువిడి వాయవ్యబాణ మేయుటయు, నురువడి మారీచునువ్వెత్తుగాఁగ. సరభసవృత్తిమై శతయోజనములు, గొనిపోయి యఱిముఱిఁ గ్రూరరాక్షసుని, వనధిలోపలఁ బాఱవైచె నాశరము. రం. రా. బాల. 81పా. 22పం.

**ఉవ్వెత్తుగొను** స. క్రి. (ఉవ్వెత్తు+కొను) నిశ్శేషముగా చంపు; నశింపఁజేయు.

క. అఱువదికోటులు గపివరు, లుఱక జగత్త్రయము నొకట నువ్వెత్తుగొనం, దఱిగొన్నయట్లు నడవఁగ, నెఱసి కుముదుఁ డరుగుదెంచి నృపవరుఁ గనియెన్. భార. అర. 7. 36.

ఆ. కవలవారుఁ గొడుకుగమియుఁ బాంచాలవర్గంబు వృష్ణివరులుఁ గడఁగిరేని, యొక్కమాత్రలోన నువ్వెత్తుగొనరె దుర్యోధనాదిశతము నుద్ధవిడిన. భార. ఉద్యో. 1. 20.

**ఉశనసుఁడు** సం.–ఉశనుఁడు.

**ఉశనుఁడు** సం. వి. స్. పుం. శుక్రుఁడు.

**ఉశి** సం. వి. ఈ. స్త్రీ. ఇచ్ఛ.

**ఉశీనరము** సం. వి. అ. పుం. ప్రకృతగాంధార దేశము.

**ఉశీరకము** సం.–ఉశీరము.

**ఉశీరము** సం. వి. అ. పుం. న. వట్టివేరు (వృ. వి.).

**ఉశీరికుఁడు** సం. విణ. (అ. ఈ. అ.) వట్టివేరు అమ్మువాఁడు.

**ఉష** సం. వి. అ. స్త్రీ. 1. రాత్రిశేషము, ఉషస్సు. 2. రాత్రి (శ్లో. అధికరుచిరశేషామప్యుషాం జాగరిత్వా. శిశు. 11. 22,) 3. అవు. 4. స్థాలి. 5. బాణునికూఁతురు (అనిరుద్ధునిభార్య.)

**ఉషణ** సం. వి. అ. స్త్రీ. 1. పిప్పలి (వృ. వి.). 2. చవ్య మనుమందుదినుసు. 3. సొంటి.

**ఉషణము** సం. వి. అ. న. 1. మిరియము. 2. సొంటి. 3. పిప్పలివేరు.

**ఉషపము** సం. వి. అ. పుం. 1. అగ్ని. 2. చిత్రమూలము (వృ. వి.).

**ఉషపుఁడు** సం. వి. అ. పుం. అహర్పతి, సూర్యుఁడు.

**ఉషము** సం. విణ. (అ. అ. అ.) కాల్చునది. వి. అ. పుం. 1. గుగ్గిలపుచెట్టు. 2. రాత్రిశేషము, వేకువ. 3. దినము, పగలు. 4. చౌటిమన్ను, క్షారమృత్తిక.

**ఉషర్బుధము** సం. వి. అ. పుం. చిత్రమూలము (వృ. వి.).

**ఉషర్బుధుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) వేగుజామున మేలుకొనువాఁడు. వి. అ. పుం. 1, అగ్ని. 2. బిడ్డఁడు.

**ఉషసి** సం. వి. ఈ. స్త్రీ. మఱుసంజ, సాయంసంధ్య.

**ఉషస్యము** సం. విణ. (అ. ఆ. అ.) ఉషఃకాలమున నున్నది.

**ఉషస్సు** సం. వి. స్. న. ప్రత్యూషము, తెల్లవాఱుటకు ముందు నాలుగుగడియలకాలము (ఐదుగడియలకాలము–అని కొందఱు.)

**ఉషాకలము** సం. వి. అ. పుం. – ఉషఃకాలమున కూయునది – కోడి.

**ఉషాపతి** సం. వి. ఇ. పుం. అనిరుద్ధుఁడు.

**ఉషితము** సం. విణ. (అ. ఆ. అ.) 1. కాల్పఁబడినది. 2. ఉన్నది. 3. పర్యుషితము, బహుకాలముంపఁబడినది, పాసిపోయినది. వి. అ. న. నివాసము.

**ఉష్ట్రగ్రీవము** సం. వి. అ. పుం. భగందరరోగభేదము.

**ఉష్ట్రము** సం. వి. అ. పుం, ఒంటె, లొట్టియ.

**ఉష్ట్రి** సం. వి. ఈ. స్త్రీ. ఆఁడులొట్టియ.

**ఉష్ట్రిక** సం. వి. అ. స్త్రీ. 1. ఆఁడులొట్టియ. 2. ఒంటెవలె నుండు ఒకరకముకుండ, లొట్టి.

**ఉష్ణంకరణము** సం. వి. అ. న. వేఁడి సేయుట, విణ. (అ. ఈ. అ.–అ. న. అనికొందఱు.) వేఁడికి సాధనము (చిత్రమూలము, కంబళి, మొ.)

**ఉష్ణకము** సం. విణ. (అ. ష్ణికా. అ.) 1. చుఱుకుగలది. 2. జ్వరము కలది. 3. వేఁడిసేయునది, కాఁక గలిగించునది. వి. అ. పుం. 1. జ్వరము. 2. వేసఁగి.

**ఉష్ణగుఁడు** సం. వి. ఉ. పుం. (ఉష్ణ+గో) వేఁడివెలుఁగు, సూర్యుఁడు.

**ఉష్ణనది** సం. వి. ఈ. స్త్రీ. వైతరణి (నరకమందలి యొకనది.)

**ఉష్ణము** సం. విణ. (అ. ఆ. అ.) 1. వేఁడియైనది. 2. చుఱుకైనది. 3. వేర్పుగలది. 4. కారము

గలది, గాటయినది (రసము). 5. కోపోద్రేకము గలది, ముంగోపి. వి. అ. పుం. 1. వేఁడిమి. 2. వేసఁగికాలము. 3. ఎండ. 4. తాపము. 5. పలాండువు, నీరుల్లి. 6. నరకభేదము.

**ఉష్ణరశ్మి** సం. వి. ఇ. పుం. వేఁడివెలుఁగు, సూర్యుఁడు.

**ఉష్ణవారణము** సం. వి. అ. న. ఆతపత్రము, గొడుగు.

**ఉష్ణాంశువు** సం. వి. ఉ. పుం. వేఁడివెలుఁగు, సూర్యుఁడు (ఇశ్లే: ఉష్ణకరుఁడు, ఉష్ణభానువు, ఉష్ణదీధితి, ఉష్ణరుచి, మొ.)

**ఉష్ణాగమము** సం. వి. అ. పుం. 1. వేసఁగి. 2. వేసఁగియొక్క రాక.

**ఉష్ణాభిగమము** సం. – ఉష్ణాగమము.

**ఉష్ణాళువు** సం. విశే. (ఉ.) ఉష్ణమున కోర్వనివాఁడు.

**ఉష్ణాసహము** సం. విశే. (అ. అ. అ. – ఉష్ణ + అసహము) వేఁడిసహింపలేనిది. వి. అ. పుం. (ఉష్ణ + ఆ + సహము – వేఁడిని బాగుగా సహించు కాలము) హేమంతఋతువు.

**ఉష్ణించు** సం. అ. క్రి. కాఁకనొందు, వేఁడియెక్కు.
సీ. సారెకు నుష్ణించి నీరు గ్రమ్మెడునేత్రముల మీఁద నంసినబొమలు ప్రాల. వరాహ. 6. 17.

**ఉష్ణిక** సం. వి. అ. స్త్రీ. యవాగువు, కాఁచుదుగంజి.

**ఉష్ణిక్కు** సం. వి. హ్. స్త్రీ. సప్తాక్షరపాదక మగు నొకకావ్యచ్ఛందస్సు. అప్ప. 4. 137.

**ఉష్ణిమ(ము)** సం. వి. న్. పుం. వేఁడిమి, ఔష్ణ్యము.

**ఉష్ణీషము** సం. వి. అ. పుం. న.–వేఁడిని తగులకుండఁ జేయునది – 1. తలపాగ, శిరోవేష్టనము. 2. కిరీటము.

**ఉష్ణీషి** సం. విశే. (న్. ఈ. న్) ఉష్ణీషము కలవాఁడు. వి. న్. పుం. శివుఁడు.

**ఉష్ణోపగమము** సం. – ఉష్ణాగమము.

**ఉష్మము** సం. వి. అ. న్. పుం. 1. వేఁడి, ఉష్ణత. 2. ఉక్క. 3. ఆవిరి. 4. ఎండ. 5. వేసఁగి, గ్రీష్మము.

**ఉష్మాగమము** సం. వి. అ. పుం. ఊష్మాగమము, గ్రీష్మఋతువు.

**ఉష్మోపగమము** సం. – ఉష్మాగమము.

**ఉసి**[1] (కుక్క మొదలగువానికిఁ జేయు) ప్రేరణము; ప్రేరణము.
(వ్యవ) ఇరుగుపొరుగువారు ఉసి యిచ్చుటచేత దొంగలు దోఁచుకొని పోయినారు.
జ: ఉసికొను, ఉసికొలుపు.

**ఉసి**[2] – నుసి. వి. పొడి.
ద్వి. పఁగినకరితి పత్త్రాలనంచి, యొగిన గొడుగున నుసి రాలుకోల. ద్వి. పారిశ్ర. ఉ. 504.
జ: ఉసిపోవు.

**ఉసి**[3] వి. (సంగీత) తాళము వేయునపుడు దెబ్బకు దెబ్బకు నడుమఁ గాపించెడు నొకవిధమగువం స్త విక్షేపము.

**ఉసికొను** అ. క్రి. (√ఉసి[1]) ప్రోత్సాహ మొందు. (చూ. ఉసికొలుపు)

**ఉసికొలుపు(ల్పు)** స. క్రి. (√ఉసికొను)–కుక్కలు మొదలగువానిని–ప్రేరించు; ప్రేరించు.
గీ. ....గొలుసు, లులిపి జాగిలముల నుసికొలిపి రపుడు. సారం. 1. 98.
సీ. గౌరివాహనము దిగ్గజముల కుసికొల్పి... కు. సం. 4. 377.
క. అనుఖమతి తరుణవయస్సునంగతి నలరు విటులఁ జేరి రతులకున్, వేసారక యుసి కొల్పఁగ... హంస. 4. 38.

**ఉసిమొన** వి మల్లయుద్ధపుమొనలలో నొకటి.
వ. లోమొన వెలిమొన యుసిమొన... సరితాళంపుమొన లాదిగాఁగల పదిరెండు మొనలు. ప్రబంధ. 78.

**ఉసిరి** – ఉసిరిక.
గీ. ...ఉసిరి యుసిరిక యన ధాత్రి యొప్పు. సాం. ని. 57.
జ: ఉసిరిక, ఉసిరికాయ.

**ఉసిరిక** – ఉసిరి. వి. ఆమలకీవృక్షము.
క. కాచె నుసిరికలు తఱుచుగఁ, ఖాచెన్ జేమంతివిరులు... ఉ. రా. 5. 288.
చ. ...కాటుకకన్నులనీరు సోవళ్లై, యుసిరిక కాయలంతలు పయోధరముల్ దిగువాఱున ట్లుగన్. కాశీ. 5. 167.

**ఉసిరికాయ** వి. (√ఉసిరి) ఉసిరికకాయ. దశా. 6.15.

**ఉసివోవు** అ. క్రి. (ఉసి² + పోవు) వ్యర్థమగు.

ఉ. కానకు నంపద న్పెఱుఁగుగల్గి మెకంబులు నేం ... పసినయే టుసివోయె ... కళ. 4. 57.

**ఉసుక** వి. (క. ఉసుక.) ఇసుక.

ద్వి. ఉసుక వంటకముగా నుడికింప వచ్చు. ద్వి. హరిశ్చ. ఉ 1819. (శ. ర. 'ఇసుక వంటకముగా నివిరింప వచ్చు' ముద్రి)

**ఉసుగు** అ. క్రి. (శ. ఉసిగు.) ఒరపిడి నొందు, నలఁగు.

ద్వి. ఒప్పెడుకన్నప్ప చెప్పురాయిడిని, తొప్పార నుసిగినచోట్ల...పండితా. పురా. 104పా.

**ఉసుము** స. క్రి. 1. ఉడుకు, నిర్ణేజనముచేయు. (వ్యవ) వాఁడు బట్టలు ఉసిమినాఁడు.

2. తుడుచు.

క. విసరుహారజమునఁ జైకం, డుసిమిన దగదగ వెలుంగు మదురాజు క్రియన్, విసరుహపాణి ముఖాంబుజ, మసమాయుధ సౌధ కుంభ మై జృంభించున్. పాండు. 3. 196.

3. పులుము.

ఉ. సంపదచేతఁ గాని కొనసాగవు సువ్వె గృహస్థధర్మముల్, సంపద పూర్వజన్మవికసత్సుకృతంబునఁ గాని చేర దా,సంపద చేరియుఁ స్వాంవశంవదుఁ జేయు మహాత్ము నేనియున్, జంపకు నన్నుఁగ న్నుసిమి చంపుడుముంపుడు బోధ గాథలఁ. పాండు 5. 224.

(కన్నుసిమి :- కన్ను గప్పి, మోసపుచ్చి అని భావము.)

**ఉసురసురు** వి. (ఉసురు¹ + అసురు) తాపమువం దగునిశ్వాసధ్వనికి అనుకరణము.

చ. ముసుఁ గిడి పంతుకొ మ్మనుచు మోహముతోడ వితర్దిఁ జూపి తా,నుసురసు రంచు భిన్నయయి యొయ్యన నేఁగి....హంస. 4. 118.

**ఉసురు¹** - ఉస్సురు. వి. తాపమువందగు నిశ్వాస ధ్వనికి అనుకరణము.

గీ. అని ప్రమోదించు నుసు రను నలంతఁ గుందు. సారంగ. 2. 147.

జ: ఉసురసురు, ఉసురుసురు.

**ఉసురు²** వి. ('ఉసుఱు' అని చి. ని. శ. ర. కాని ప్రయోగములందు ఉభయరేఫములును గన్పట్టుచున్నవి. నిర్ధారకములు లేవు—క. ఉసురు.)

1. ప్రాణము; ప్రాణి; ఆయువు.

ఆ. ఉసురు గాచికొనఁగ నుల్లంబు గలిగిన, నిపుడ వాల విడిచి యేఁగు మట్లు, కాక నిలిచి తేని గ్రక్కున నిదె తల,గొను మదీయతీవ్రఘోరశరము. హరి. ఉ. 3. 139. (1870. సం. ప్రతి.)

గీ. ఉత్త్రిధర్మంబు విడిచినఁ గలదె యిహముఁ, బరముఁ బేరోలగంబునఁ బలుకుపలుకు. లెల్ల మఱచితె విను మవి పొల్లులైనఁ, గష్టపాటుగా కుసు రేల గాన వచ్చు. భార, శల్య. 2. 56. (కరాలవారి ప్రతి.)

గీ. ఉసుఱు నాఁగను బ్రాణాఖ్య యొప్పుచుండు, నదియె యొకచోట జీవాఖ్యయై చెలంగు, నాయుర భిధానముగ నదె యలరుచుండు. అం. భా. 1. 61.

క. గోలలనావల్లభుఁ డిది, గోలలనలయుసురు వోసికొందు వని వనీ, బాలానిల నిను మెసవం,గాలాహికి నేండ్లు వేయుఁ గావించె వెసన్. వసు. 4. 47.(ఉసురువోసికొందువు ప్రాణములు తీయుదువు.)

2. ప్రాణశోకమువలనిదుష్ఫలము.

గీ. పాన్పు కెక్కించి తన ప్రక్కఁబవ్వళింపఁ, గోరి నేఁ జూడ రేలు తాఁ గుడిచి కట్టి, యూరకే యిల్లు వెడలు నాయుసుఱు తాఁకి, దీపములు సైత మల్లాడుఁ దెఱవ లార. శుక. 2.114.

ఆ. భూపతికృప నమ్మి భూమిఁ జెఱుచువాఁడు, ప్రజలయుసురు దాఁకి పడును విదప. వేమన. 1. 46.

ద్వి. చూడు మే మందు నీచుఁడ నుంతలోన, నాఁడుదానిది యుసురంటక పోదు. ద్వి. సారంగ. 1. 31 పా. 9. పం.

జ : ఉసురుకొను.

**ఉసురుకొను** అ. క్రి. (√ఉసురు²) - ప్రాయయుక్తమగు—పెరుఁగు, వర్ధిల్లు.
వ....పెస రుసురుకొనియె దవనిక వొదలె... కాశీ. 3. 28.

**ఉసురుగాలము** వి. మత్స్యగ్రహణసాధనము
గీ. ఉంటగాలంబు తెరదీము లుసురుగాల, మొసుకు గొంక పుణుకు సొక్కు లెసఁగు చుండు. హంస 4. 158.

**ఉసురుసురు** వి. (ఉసురు¹+ఉసురు¹) తాపమందగునిశ్వాసధ్వనికి అనుకరణము.
గీ. అచట శయనించి తన మోసు మాత్మ నెంచి, యుసురుసు రటంచుఁ బొరలాడు చుండె నంత. శుక. 3. 200.

**ఉసులు** వి. వీలు, అనుకూల్యము.
వ....ఉసులు లేక మానంబు మన బునకు ధనంబుగా వనంబునం గాల్చిచ్చునం గమరిన యట్లు రూపుసెడి పీనుఁగుపెంట లగు చోట్ల ...ఉ. హరి. 3. 80.
(వ్యవ) ఆపని చేయుటకు ఉసులుగా లేదు.

**ఉసుళ్లు** - ఇసుళ్లు. (శ. ర.)

**ఉసూరు** - ఉస్సురు.
చ. పదరుచుఁ బ్రాణనాయకుఁడు పైనముపో యెదనంచుఁ బల్కినన్, సుదతియు విన్నవై కడు నుసూరని మోమువాంచి యుండ... రస. 2. 92.

**ఉస్తె** – ఉచ్చిఁత (వ్య. వి.)
సీ. జిల్లేడు వెంపలి పైఁడి తంగేడు తంగేడి తగిడి యుస్తె. హంస. 4. 10.
ఉదా : ఉస్తెకాయ, ఉస్తెవరుగు, మొ.

**ఉస్ర** సం. వి. అ. స్త్రీ. 1. ఆవు. 2. భూమి. 3. ఎలుకజీడి (వ్య. వి.)

**ఉస్రము** సం. వి. అ. పుం. 1. కిరణము. 2. ఎద్దు.

**ఉస్రిక** సం. వి. అ. స్త్రీ. 1. ఆవు. 2. పాలు తక్కువగా నిచ్చెడియావు.

**ఉస్సు** – ఉస్సురు. వి. (శ. ఉస్.) తాపమందగు నిశ్వాసధ్వనికి అనుకరణము.
ఉ. ఓరువరానివంతఁ దలయూఁచుచు ను స్సని వెచ్చ నూర్చు... విక్ర. 7. 154.

**ఉస్సురస్సురు** వి. (√ఉస్సురు+అస్సురు) తాపమందగు నిశ్వాసధ్వనికి అనుకరణము.
ఉ. అంత నంతకంత కెంతయు సంతాప, మతిశయిల్ల నుస్సుఁసుస్స రనుచు. పరమ. 3. 48. (శ.ర.పా.)

**ఉస్సురు** – ఉసురు¹, ఉసూరు, ఉస్సు. వి. తాపమందగునిశ్వాసధ్వనికి అనుకరణము.
సీ. అలసి నివ్వెఱఁ గందు నంత యుస్సురు మను నని కెలంకులచప్పు డరయు....విప్ర. 3. 58.
మ. తరుణుల్ వానివిలాససంపదకు నాంతర్యంబునం జొక్కి తత్పరిరంభానుభవంబుఁ గోరుచు విధాతా వీని మజ్జీవితేశ్వరుఁగా నేటికిఁ జేయ వైతి వనుచున్ సంతాపముం జెందు నుస్సురుగాడ్పుల్ విధి కంగదాహ మొదవించున్ ముందు వేసంగియై. అని. 1. 83.
జ : ఉస్సుఁసుస్సురు.

**ఉహుహూ** వి. (ఉహూ+ఉహూ–శ.ర.) చలిచే వడఁకునప్పుడు చేయుధ్వనికి అనుకరణము.
క. బహుశీతో పేతం బయి, యుహుహుహూ యని వడంకె లోక మురీనాథా. భాగ. 10. పూ. 900.

**ఉహ్యమానము** సం. విశే. (అ. అ. అ.) వహింపఁబడుచున్నది.

**ఉహ్హు** వి. (నిప్పు. మొ. వానిని) ఊఁదుటయందగు ధ్వని కనుకరణము.
మ....ఉ. హ్హని వక్త్రంబు బిగించి యూఁదుటయు... కాశీ. 6. 228.
సీ. ఉహ్హున...పాండు. 3. 12.

**ఊ.** ఉచ్చ. ఒకారాక్షరము.

**ఊ.** ఉకారాంతతత్సమపదములమీఁది సంబుద్ధిడుబ్బకు వికల్పముగా ఆదేశమై వచ్చునది. (ఇది ప్లుతముగా ముచ్చరింపఁబడును.)

ఉదా: శంభూ 3, విష్ణూ 3.

**ఊ.** సం. విశే. (అ. అ. అ.) రక్షకుఁడు. వి. అ. పుం. 1. శివుఁడు. 2. చంద్రుఁడు. (దీనికిఁ దెనుఁగున వ్యస్తప్రయోగము లేదు.)

**ఊఁ** అవ్య. (సం. హుమ్) 1. కథాదులు వినునప్పుడు శ్రోత వానిని వినుచున్నట్లు సూచించుటకు ఉపయోగింపఁబడును. 2. సమ్మతిని దెలుపును.

ఉదా: నేను వెళ్లుదునా? ఊఁ! వెళ్లు.

3. క్రోధాదులను దెలుపును.

ఉదా: ఊఁ! వాఁ డిట్లు చెప్పె నేమి?

జ: ఊఁకొట్టు, ఊఁకొను.

**ఊఁక[1]** — ఉముక.

సీ.... ఊఁక పొ ట్టుముక నానొప్పుఁ దుషము. ఆం. భా. 2. 289.

ఊఁకదంపు — వ్యర్థప్రయాసము.

జ: — ఊఁకబంతి.

**ఊఁక[2]** వి. (√ఊఁగు) ఊఁగులాట.

చ. మొకరిపిసాళితుమ్మెదలమూఁకకు గందపుగాలిరాకకున్, మకరిపతాకుడాకకును మామిడి మోకకుఁ జంద్రుకాఁకకున్, పికముల వీఁకకున్ సిరులఁ జేర్చినయామని యూఁచునూఁకకున్, జకితమృగాక్షి యోర్వ నిఁకఁ జాలఁ గృపామతి నాదరింపుమా. రుక్మా. 3. 154.

**ఊఁకబంతి** వి. (√ఊఁక[1]) ఒక జాతిబంతిచెట్టు. (దీని పువ్వువందలి తేకులు ఊఁకపాయలవలె సన్నముగా నుండును.)

**ఊఁకర** వి. (సం. హుంకారః) సంతోషాదులు గలుగునప్పుడు చేయుహుంకారము.

ఊఁకరలిచ్చు-(సంతోషాదిసూచకముగా)హుం హుం అను.

(శిశువర్ణనము సీ. ఊఁకరలిచ్చు నా యుయ్యాల చేరిన వడు మెత్తివైచు ముందలయు నెత్తు. ద్వా. 3. 45.

సీ.... వెడయేడ్పు వంతన యడుగు న గ్గడుగు నూఁకరలిచ్చు నాలకించు. భోజరా. 7. 176.

ఊఁకరలుగొట్టు — ఊఁకరలిచ్చు.

(అంభోతులు) ద్వి. పలుగాండ్లు తెఱపింప నలరుచుఁ బసులు, వలివేగమున వచ్చివచ్చి యొండొండ, యూఁకరల్ గొట్టుచు నుత్తలపడుచు. బస. పు. 7. 828 పం.

ఊఁకరలువెట్టు — ఊఁకరలిచ్చు.

(అంభోతు) ద్వి. ఊఁకరల్ వెట్టుచు నురవడింపుచును. బస. పు. 5. 481.

**ఊఁకించు** అ. క్రి. (√ఊఁకు. త. ఊక్కు.) ఉంకించు, ఉత్సహించు, పూను.

శా. నీ తోడ్పాటున నేఁ త్రివిష్టపములన్ గెల్వంగ నూఁకింతు... భార. కర్ణ. 3. 130.

పీ. మంచుపై నెగయ నూఁకించుజక్కవ లనఁ జన్నులు జిలుఁగుకంచులుల నఱుమ. భాగ. 10. ఉ. 808.

గీ. వెన్కకుమ జాఁగి యూఁకించి వ్రేసి వ్రేటు, తోన చంగున లంఘించి దానిఁ దిగిచి, హస్తమునఁ బూని పక్షిసంహారమునకు, వేఁటకాండ్రను దోడ్కొని విపినభూమి. ప్రబంధ. 238.

**ఊఁకు** అ. క్రి. (త. ఊక్కు) ఉంకించు, పూను.

చ. ఉరవడి నుప్పరం బెగయ నూఁకు మదీయపదోగ్రఘట్టనస్ఫురణము సైఁప లేక పడి భూమి దిగంబడు. భా. రా. సుం. 3.

వి. పూనిక, యత్నము.

ఉ. ప్రాఁకుడుమా త్రికూటశిఖరంబులమీఁదికి నెల్ల వారు నొక్కూఁకున వంచు నున్న... భా. రా. యు. 280. భాగ. 10. ఉ. 436. (ఒక్కూఁకున:— ఒక్కమాఱుగా అని భావము.)

జ: ఊఁకించు, ఊఁకువ[1].

**ఊఁకువ[1]** వి. (√ఊఁకు. త. ఊక్కం.) ఊఁకు, పూనిక, యత్నము.

వ. అప్పులుఁగు లొక్కయూఁకునఁ దెప్పరంబుగా నుప్పరంబున కెగసిన నమ్మాలితకిలం బైజాలంబు వెంటరాఁ గొని. వేం. పంచ. 2. 13. (ఒక్కయూఁకువన్ — ఒక్క మాఱుగా.)

(దశరథుఁడు) వ. రథంబుఁ గూడ పరిగొదంగాక యనుచు నొక్కూఁకువం గదల నని

ష్ణుండు వారింప నిల్చి మఱియు వద్దెసం గమంగొనుచుండె. రామా. 5.7. (ఒక్కూఁ తునన్ :— తటాలున అని భావము.

**ఊఁతువ²** వి. ఆశ్రయము, ఆధారము.

చ. ...ఇదె పావని పోవుచున్న వాఁ, డుడుగణ వీథి లంకవల నొక్కఁడు నొక్క నిమేష మాత్రమం,బుడుగ హిరణ్యనాథ తగ నూఁతువ గమ్మని నెమ్మిఁ బల్కనన్.

క. పారావారముపంపున, మారుతి కొక్కింత తడవు మైనాకం బా,ధారం బగుతలఁపున... భా. రా. సుం. 26, 27.

ఊఁతువలుగొను — నెలకొను.

వ. కంక కాకగృధ్రంబు లుపరితలంబునం దిరుగ నులూకంబులు సిడంబుల నూఁతువలు గొన...భా. రా. యు. 686.

**ఊఁకొట్టు** అ. క్రి. (√ఊఁ) ఊఁ అను.

మ. పొలయన్ జూచు నగున్ బయల్ పలుకరింపన్ బల్కు నూఁకొట్టు బి,ట్టలుగున్ మొక్కుఁ బ్రియంబుఁ జెప్పు వధరిం బల్లార్చి కోకొమ్మనన్. చంద్రా. 3. 4.

స. క్రి. ఊఁ అనుచు విను.

ఉదా: వాఁడు కథ ఊఁకొట్టుచున్నాఁడు.

వి. (కోపాదిసూచకముగా) ఊఁ అనుట.

సీ. పెదవికాటునఁ బుట్టుబెడిదంపుటూఁకొట్టు గుబ్బజీరలఁ దొట్టుగొడఁగుతిట్టు...గీ.ధవున కెంతయు వలరాచసివము రేప...చంద్రా. 6. 151.

**ఊఁకొను** అ. క్రి. (√ఊఁ) ఊఁ అను.

గీ. తనువు మఱచితి వేమొ యూఁకొన వదేమి, యవలికతఁ దెల్పు మని యెదో యైనఁగాని. పార్వ. 6. 2.

స. క్రి. 1. (కథాదులు) ఊఁ అనుచు విను;విను, ఆలకించు.

శా. ఊఁకోఁ జెప్పఁగ నెంతయేని తడవౌ నోవి ప్రవాకార్ధూల నీ,వాఁకొన్నాఁడవు భోజనోత్తరమునం బాస్థానమై యుండి య,ట్లాఁకం బెట్టక చెప్పెదన్ సకలవృత్తాంతంబునుం దేటగా...కాశీ. 7. 173.

ఉ. ఒక్కె సమాట లాడెదరు రాజును దమ్ములు వానిలోన నీ,వొక్కటి యైనఁ గా దనక యూఁకొనుచుండుట యంతకంటె మేలు ...భార. ఉద్యో. 3. 94.

2. అంగీకరించు, కైకొను.

చ. ...చుట్టలుఁ దగువారుఁ దండ్రియు నీడం బడఁ జేయుము కార్య మల్పబుద్ధుల వెడ మాట లూఁకొనకు దోసము సేగియు వచ్చు నెమ్మెయిన్. భార. ఉద్యో. 3. 391.

**ఊఁగాడు** అ. క్రి. (ఊఁగు+ఆడు. చూ. ఊఁగులాడు-ఊఁగి+ఆడు అని శ. ర)—ఊఁగు.

శా. కంఠారావ మొనర్చె నత్తఱి మహోగ్ర స్ఫూర్తిదిక్నాగముల్, గుంభీభూతముదంబులై వడఁకఁగా గోత్రంబు లూఁగాడఁగా. చిత్రభా. 3. 86.

**ఊఁగు** అ. క్రి. (క. త. తూగు.) తూఁగు, వెనుకకుముందునకు చలించు; చలించు, కదలు.

సీ. ఒకచోఁ బునర్భను వూఁగె వృతముకొమ్ము నుడివడ్డము త్యాలపోఁగు పోలె. కాశీ. 1. 138.

క. ఊఁగెడువల్లును విసమునఁ,దోఁగినవంటక ముఁ గుత్సితుం డగుమంత్రిన్, లోఁగక యున్మూలించిన, చోఁ గలుగు నఖండమైన సుఖ మెవ్వరికిన్. వేం. పం. 1. 376.

జ: ఊక², ఊఁగాడు, ఊఁగులాట,ఊఁదులాడు, ఊఁచు, ఊఁపాడు, ఊఁపు, ఊవు.

**ఊఁగులాట** వి. (√ ఊఁగులాడు) ఊఁగులాడుట, ఆందోళనము.

**ఊఁగులాడు** అ. క్రి. (ఊఁగులు+ఆడు) — ఊఁగాడు.

గీ. ఓరచూపుల విటచిత్త మూఁగులాడ.వీథి.50.

**ఊఁచే** వి. (క. ఊచె — తృణవిశేషము.) 1.తృణవిశేషము, ఇషీక (వృ. వి.).

గీ. విసరి యొకయూఁచఁ గొని వేయ వెంట వెంట,నదియ యొక్కమహాస్త్రమై కదియఁ గాకి, లావు సెడి వచ్చి నను గావు కావు మనుచుఁ,బాదముల వ్రాలఁ బరమకృపాళుఁ డగుచు. రామా. 5. 68.

2. కొన్నకాఁడ. 3. ఇనుము మున్నగువానిచే చేసినకడ్డి. (ఉదా: కిటికీఊఁచ.) 4. బాణముగా నుపయోగించుటకై చెక్కినవెదురు మున్నగువాని కోల. (ఉదా. కోయలు ఊఁచ లేసి మృగములఁ జంపుదురు.) 5. అరఁటిదూఁట. (చూ. ఊఁచపడు.).

జ: ఊఁచకండె, ఊఁచపడు; ఊఁచపోవు, ఊఁచ బియ్యము. ఊఁచముట్టు, ఊఁచముట్టుగొను.

**ఊఁచేకండె** వి. (√ఊఁచే) నూలు చుట్టినకొన్న కాఁడ.

గీ. ఎన్నికలు పట్టి పుంజంబు తేర్పరించి, పంట కట్టులు మటి తోఁడుపడుగు లూఁచ, కండె లొనరించి చాలించి కాఁపుటింతు, లున్నయ వ్వేళ నద్భుతం బుట్టిపడఁగ. శుక. 2.423.

**ఊఁచేపడు** అ. క్రి. (√ఊఁచే. శ. ఊచు – నిస్సారమగు.) 1. ఊఁచవలె సన్ననగు, కృశించు, నిస్సారమగు. 2. ఊఁచ (దూఁట) కలదియగు.

చ. సరసిజగంధి పెందొడలసాటికి రా నెదిరించి పోరునీ, కరభము తెల్లఁ బేపడఁగఁ గన్గొని యుండియుఁ దజ్జయార్థి మై, పొరలఁ బెనంగి యూఁచపడిపోవుట లింతియ కాక భ్రాంతి పై, నరఁటులు పిల్లపిల్లతరమైనను సామ్యముఁ బొంద నేర్చునే. భాను. 2. 13. (పై రెండర్థములకు నిదియే యుదాహరణము.)

**ఊఁచేపోవు** అ. క్రి. (√ఊఁచే) కృశించు. శుష్కించు.

సీ... ఊఁచపోయినపిఱుఁదుదుటుఁబొట్ట. భల్లా. 4. (శ. ర.).

**ఊఁచేబియ్యము** వి. (√ఊఁచే) గుడ్డలోఁ బెట్టి కొన్నకట్టతోఁ గొట్టగా రాలినలేఁతకొన్నలు.

సీ. కంకుల వొజ్జలే కాలంబు గడపంగ నూఁచ బియ్యంబు శిష్యులకుఁ గలవె. రామలిం. 85.

**ఊఁచేముట్టు** క్రి. విశే. (√ఊఁచే)-అరఁటిపాదులను దూఁట తగులునంతకు నొలిచినట్లు- మూలముట్టుగ, నిశ్శేషముగా (చూ. ఊఁచముట్టుగొను.)

ఆ. ఉద్దవిడిన పసుల నూఁచముట్టుగఁ దెత్తు. భార. విరా. 3. 120.

గీ. మునుపు చదివినశాస్త్రసమూహ మెల్ల, నూఁచముట్టుగ వొజ్జల కొప్పగించి, యుద్వహనకేళి చింతించుచునికిఁ జేసి. శుక. 2.261.

**ఊఁచేముట్టుగొను** స. క్రి. (ఊఁచముట్టు+కొను) నిశ్శేషముగాఁ జంపు: చంపు.

గీ. కొడుకఁ తమ్ములు దోడ్పడఁ గడఁగి శత్రువరుల గెల్చెద నంటి వొక్కరుఁడు దక్క, కుండ నీ తమ్ముఁగుఱ్ఱల నూఁచముట్టుగొని యునే విధియెగతిఁ జనుదుఁ జెపుమ. భార. శల్య. 1. 28.

**ఊఁచే** – ఊఁపు. స. క్రి. (√ఊఁగు) ఊఁగఁజేయు. (ముందునకు వెనుకకుఁ జలింపఁజేయు)

చ. దళితనవీనకందళకదంబకదంబక కేతకీరజో, మిళితసుగంధబంధుర సమీరణుఁ డాసఖుఁ డూఁచుచుండఁ గా, నులియుచు మొల్లగుత్తులనుయ్యేల లొప్పఁగ నెక్కి యూఁగె న, ల్లలదళినీకులంబు మృదులధ్వనిగీతము విస్తరించుచుకా. భార. అర. 4. 138.

(ఆడించు, కదలించు)

ద్వి.... విప్రు, నొడిసి గడ్డము పట్టియూఁచె నవ్వెలఁట ద్వి. హరిశ్చ. ఉ. 1180.

తలయూఁచు – తలయాడించు. (ఇది సందర్భమును బట్టి క్రోధవిషాదాది భావములను సూచించును.)

(క) క్రోధమునకు.

చ. ప్రజ్వలత్తుక్కుధా, రుణవయవంబులన్ మిడుఁగుఱుల్ సెదరగా దలయూఁచి యిట్లనున్. ఉ. రా. 2. 92. వరాహ. 11. 126.

(చ) విషాదమునకు

చ.... గద్గదికన్ దలయూఁచి యక్కటా, వనిత తనంతఁ దా వలచి వచ్చినఁ జుల్కన గాదె యెఱికిరా, మనుచ. 2. 66.

(ట) మెప్పునకు.

ఉ. ...సవ్యసాచి నింద్రోపలరోచిఁ జూచి తలయూఁచి యులూచి రహోచితంబుగన్. విజ. వి. 1. 63. చిత్రభా. 3. 84.

(త) అంగీకారమునకు.

(వ్యవ) మేము చెప్పినదాని కతఁడుతలయూఁచి నాఁడు.

**ఊఁటు**–ఊఁడు. స. క్రి. పొడుచు.

సీ. పులిపులి గాఁగ బెబ్బులిపిండు వోకనాఁడు చెదరఁగా మూఁకొని నాచేతియాఁకె.రామా. 2. 24.

సీ. కోటకొమ్మలు డాయఁ గుఱుచయాఁకెల మూఁటి వదఁడ్రోయఁ బదికిలపాటుగాంచి. గీ. పొరలుచుండియుఁ గ్రమ్మఱ నురువడించి. లగ్గలకుఁ దూఁగిరి పరాను లగ్గలికల. రంగా. 8. 119.

వి. పొడుపు, పోటు,

క. దాఁటి తమఁ బూఁచి త్రేయఁగ, నూఁటా డెడు వతనిఁ గృష్ణుఁ డొకయమ్మున నొ,క్కూటున నడిదముఁ బలుకయుఁ, దూఁటులు గా నేయ వాఁడు దొలఁగక కడిమిఁ.పద్మ. 10. 32.

**ఊఁడు**—ఊఁటు, ఊను². అ. క్రి. (త. ఊన్ఱు. క. ఊఱు. మ. ఊన్ను) నాటు, గ్రుచ్చు. (మూలరూపమగు 'త. ఊన్ఱు' లో రేఫమునకు డకారోచ్చారణ ముండును గాన 'ఊఁడు'అను రూపమును రేఫములోపింపఁగా 'ఊను' అను రూపమును 'ఊఁడు' నకు 'ఊఁటు' అనురూప మును సిద్ధించినవి.)

**ఊఁడుకొను**—ఊఁడు. (స్వార్థమున'కొను')

గీ. పొదలి మాయ నదృశ్యులై చదలనుండి, కొండలంతలు రాలుముకుందుమీఁద,నూఁడు కొనవైవఁ దొడఁగి రొండొండ దెసలు, మూసెఁ బాషాణరోధసముత్థతమము.హరి. ఉ. 9. 212.

గీ. చాల నుడివడి దనుజుఁ డాభీలరౌద్ర,భంగిఁ బదివిండ్లు నెత్తి యప్పటివిథని, నూఁడుకొన నేసి తిరిగి వేఱొక్క దిక్కు, తెరువుగానూడఁ జూచిన నరుగ నీక. భా. రా. అర. 2. 125.

క. ఊఁడుకొనఁ బడుమధూళిక, యోడికలకుఁ గ్రిందఁ గ్రమ్మి యుండెడుతేంట్లన్, నీడలు దిరిగియుఁ దిరుగని, జాడఁ దరు ల్వొలిచె నవ్వసంతపువేళన్. ఆము. 5. 137. నృ సింహ. 4. 178.

ఋ: ఊఁడుచు, ఊఁడుపు, ఊఁడుపు.

**ఊఁడుచు(డ్చు)** స. క్రి. (√ఊఁడు.) ఒకచోట నున్న మొక్కలను తీసి మఱొక్కచోట నాటు, ప్రతిరోపించు.

ఉదా: వరియాకు ఊఁడిచినారు.

మ. ... వియద్గంగాప్రవాహాంబులో, పటిష్ఠా మాంబుజనాళముల్ పెఱికి యూఁడ్చం జేయు దేవాళిచే. నిటు దైతేయుఁడు గేళి దీర్ఘికలలో నిచ్చావినోదంబుగన్.హరి.3.7.

**ఊఁడుపు(డ్పు)** — ఊఁడుపు. వి. (√ఊఁడు.) వరి మొదలగువానిని దమ్ము చేసినపొలమున నాటు ట, ప్రతిరోపణము.

**ఊఁడుపు(డ్వు)** — ఊఁడుపు. (√ఊఁడు – 'చు' వర్ణాంతధాతువులకు 'పు' వర్ణకమువలెనే 'వు' వర్ణకము కొన్ని ప్రాచీన గ్రంథములయందుఁ గాన్పించుచున్నది - ఒల్వు – ఒలుపు, గెల్వు – గెల్పు. తాల్వు – తాల్పు. చూ. బస. పు. పీఠి. 101 పా.)

వ. శకవర్షంబులు 1048 గ్రాహి... పెద్దదాకరే మిత్రిశ్రీమేశ్వరమవాదేవరకు పోలునాట్ట అరి యవట్టనమున సత్తిరాజు తనవృత్తియైన అరియవట్టనమున విడ్చినఊడ్వునేల పడు పుట్లకుం బుసునీమములు...దశా. 4.1364.

**ఊఁత** వి (√ఊఁడు²) 1. ఆధారము,ఆశ్రయము; ప్రాపు.

గీ....చిత్తమునకుఁ, గన్నుఁగవ కూఁతగా నహి కటకురూపు.చిత్ర మిడి చూచె దిదియేమి చి త్ర మబల. కు. సం. 5. 602.

గీ. అధిప మెలయాశ్రమస్థుల కందఱకును,విను గృహస్థాశ్రమమువాఁడె వెలయ నూఁత. భోజరా. 2. 72.

క. చనుటయు ద్రౌపది యతనిం, గనియుంగాఎ నివిధంబు గైకొని చిత్తం,బున బెదరక తన ముందటి. పనివెంపున నూఁదె భీమువలుకుల యూఁతఁ, భా. విరా. 2. 248.

2. అడుగున లావుగను పైని సన్నముగను నుండునట్లు రెండువైపుల మూఁతలేకుండఁగ వెదురుపేళ్లతో అల్లిన మత్స్యగ్రహణసాధ నము.

గీ. ఊఁతయలబళ్లఁ జెలువుల నుండ రాక, కా ర్లొనసల్లు వెగళ్లను గవులు విడిచి, తంబి చెంతల మాఱిగుంతల వసించె. వేం. పంచ. 1. 294.

గీ. ...కైవర్తు లిచటికి నరుగుదెంచి, వలలు నూఁతలు మొదలుగా వలయునట్టి, సాధనం బులు గొని జలజంతుకోటిఁ, బొరిగొనఁగ వత్తు మనఁగను బొనఁగ వింటి. నా. పంచ. 1. 221. ఆం. భా 1. 159.

**ఊఁతకోల** వి. (త. ఊన్టుకోల్ — ఊఁత + కోల.) అవలంబముగా పట్టుకొనెడికఱ్ఱ; అవలంబము.

ఆ. ఏము కాఁపువారి మెద్దుల మే మెఱుఁగు దుము తండ్రి యల్లకొండచెంత, వడుచు కాఁపనయ్య నా కెదురయ్యెఁ దా, నూఁత కోల చేతనూఁదికొనుచు. భోజరా. 4. 68.

గీ. అంధునకు నూఁతకోల గా నకట యొకని, నైన నిలుపక నూర్వుర నదయవృత్తి, గ్రిం గితి... భారం. స్త్రీ. 1. 170.

**ఊఁతగొను** స. క్రి. (త. ఊన్టికొళ్ — ఊఁత + కొను) అవలంబముగాఁ బట్టుకొను; అవలంబముగాఁ జేసికొను.

గీ. కదిసి బలునారసంబు వక్షమున నాట, నొల్లఁ బోవుచు సిడ మతఁ డూఁతగొనియె. భార. భీష్మ. 2. 242.

ఉ. కాననివాని నూఁతగొని కాననివాఁడు విశిష్ట వస్తువుల్, గాననిభంగి... భాగ. 7. 182.

**ఊఁతము** విశే. (√ఊఁదు²) బరువైనది.

(వ్యావ) ఈకఱ్ఱ ఊఁతముగా నున్నది.

వి. 1. బరువు, భారము.

(వ్యావ) దీనిఊఁత మెక్కువగా నున్నది.

2. ప్రాపు, ఆధారము.

(వ్యావ) వీఁడువానిఊఁతము చూచుకొని విఱ్ఱ వీఁగుచున్నాఁడు.

**ఊఁతయిచ్చు** స. క్రి. ఊఁతగా ఇచ్చు, అవలంబముగాఁ జేయు.

ఉ. నావుడు మూర్ఛవచ్చినమనంబునకున్ ధృతి యూఁతయిచ్చి... నిర్వ. 8. 108.

**ఊఁద** వి. (√ఊఁదు¹. క. ఊదు త. ఊదల్.) 1. ఉబ్బు, ఉబుకుట (చూ. ఊఁదబొడ్డు—వాఁపు. శ. ర.) 2. కడుపుబ్బు—ఈర్ష్య.

గీ. ఈసు నా నూఁద నాఁ దగు నీర్ష్య... ఆం. భా. 1. 184.

**ఊఁదబొడ్డు** వి. (ఊఁద + బొడ్డు) ఉబికినబొడ్డు.

సీ. బొక్కబొమ్మును నూఁదబొడ్డును మిడిపండ్లు తెఱ్ఱనోరును జాఁచిదేఱు మొగము. భల్లా. 4. ఆ. (శ. ర.)

**ఊఁదర** వి. (√ఊఁదు¹. త. ఊత్తం.)

(కాయలు పండుటకును ఎలుకలు మొదలగు వానిని ఈవలకురప్పించుటకును చంపుటకును ఒకరంధ్రమునుండిపొగ లోపలికిపోవునట్లు) ఊఁదుట. (చూ. ఊఁదరలిడు, ఊఁదరవెట్టు.)

**ఊఁదరలిడు** — ఊఁదరవెట్టు (ఊఁదరలు + ఇడు).

ద్వి. ఉరుధూమతతుల బెట్టూఁదరలిడిన, పరుసునఁ దొఱటలఁ బాములు మడియ. ద్వి. హరిశ్చ. పూ. 2288.

**ఊఁదరవెట్టు** స. క్రి. (ఊఁదర + పెట్టు.)

(పొగవేసి జంతువులను) తపింపఁజేయు.

గీ. పొదలుతనపూత్కృతుల నెల్ల బొగలుగవిసి యబ్జజాండ మూఁదరవెట్టినట్లు గాఁగఁ, గాల కర్కశకాయుండు గాళియుండు, గ విసె గోపాలబాలుపైఁ గసిమసంగి. హరి. పూ. 7. 21.

**ఊఁదు¹** అ. క్రి. 1. ఆధ్మానము చేయు. అగ్నిప్రజ్వలనము మున్నగు వానికొఱకు నోటితో గాలిని విడుచు.

మ. ...ఉష్ణాని వక్త్రంబు బిగించి యూఁదుటయు నుల్కాగ్నిచ్ఛటల్ గ్రమ్మ... కాశీ. 6. 228.

సీ. పుప్పొడిపెర పొయ్యఁ బోవ నూఁదెద నని నయనచుంబనకేళి వడపి వడపి. విక్ర. 5. 26.

2. పై కుబుకు, ఉబ్బు.

ద్వి. అది యేల కడు పూఁదదయ్యెడుఁ జెపుమ. బస. పు. 8. 883 పం.

స. క్రి. (క. త. ఊదు) 1. ధమనము సేయు, నోటి గాలితో (నిప్పు) రేఁగఁజేయు.

చ. అవలము వోఁ మూఁదఁ దగ దగ్గియు నీరు ము వొక్కమాటు తేఁజనదు...మార్క. 8.247.

2. కరఁగించు.

చ. నిధి యమళంక భూతలము నిచ్చలు ద్రవ్యితి వావచే మహో,దధిఁ దరియించితిన్ శిఖరిధాతువు లూఁదితి రాజుఁ గొల్చితిఁ. శర్మ. 8. 8.

గీ. తామ్రమాదిగఁ గలయట్టిధాతుచయముఁ, గొలిమి నిడి యూఁదఁ గీ డెల్లఁ బోలియు వట్లు. మార్క. 8.315.

8. (శంఖము లోనగువానిని) పూరించు.

ఉ. ఊఁదుకపోవు శంఖము నవాం గఁ రేఖ శరాసనంబుల, న్వాదుకుఁ బట్టి కనొబ్బమల వైఖరి వంకలు దీరుచుం గటా. విజ. వి. 1. 69.

(ఇది 5. అర్థమునకుఁగూడ నుదాహరణము. ఊఁదుకపోవున్ - ఎగుఁగొట్టు - ఔపమ్య ద్యోతకము)

4. నోటిగాలిచే వెలువడఁ జేయు.

ఉ. ఘట్టతరూర్ధతిం గరిముఖంబునఁ బీలిచి గౌతమీనదిం, బుట్టిన సత్త్వవాహబలపూరముఁ ద్రున్నన నూఁదుచున్...భీమ. 5. 116.

సీ. కన్నీరు పన్నీటఁ గడిగి కర్పూరంపుఁబలుకులు నెవులలోఁ బాఱ నూఁది. భాగ. 10. ఉ. 241.

సీ. కవ జక్కవలు వాయఁ గరనాళముల జందురుం డూఁదుపటికంపుటుండ లనఁగ. పారి. 2. 36.

5. ఎగురఁగొట్టు.

గీ. పగఱ నిబ్బంగి శతకోటిఁ బాఱనూఁది. కాశీ. 6. 229.

ఆ. పాయకములు పఱపి చంపుచుఁ గపిసేన, బాణ మారుతమునఁ బాఱనూఁదె. భా. రా. యు. 690.

వి. వాఁపు. (శ. ర.)

ఔ. ఊఁద, ఊఁదబొడ్డు, ఊఁదర, ఊఁదరలిడు, ఊఁదరవెట్టు, ఊఁదుఁగ్రోవి, ఊఁదుఘుటికలు, ఊఁదువత్తి, ఊఁదువెండి.

ఊఁదు[2] స. క్రి. 1. గ్రహించు.

(క.) పట్టుకొను.

క. ఉరగపతితల లవల నురు,తరజవమున నను గు లూఁది తత్పుచ్ఛము ని,ర్జరవరు లూఁది మహామ,త్సరమున వడిఁ ద్రచ్చిత్రచ్చి జవ మఱియున్నన్ భార. ఆది. 2. 16.

ఆ. వినఁగ నిష్ట మేని విను మని ద్రుపదుచే, యూఁది యింటిలోని కొనర వరిగి, తాను నతఁడు నేకతము యుండి...భార. ఆది. 7. 254.

చ. ...మత్స్యరాజు ముగ్గడు నగుచంద మేమి యను గానవు కాలునికోఱ యూఁదఁగాఁ, దొడఁగుట కాదె నాకు భుజదుర్మతి మూపఁ గడంగు చెమ్మెయిన్. హరి. ఉ. 2. 126.

(చ) అవలంబముగాఁ గొను.

క....ధాత్రీ,వరుఁడు ధంతుచే యూఁదుచు, నురుచిరగతి నంద మెక్కెఁ జూపఱు లలరన్. భా. రా. యు. 2599.

ఉ. మానినిహస్తమూఁది యొకమంజులభాషిణి వచ్చె వీథికిన్. కాశీ. 7. 159.

2. అవలంబించు

(క) ఆశ్రయముగాఁ జేసికొను; ప్రాపుగాఁ జేసికొను.

వ. ...గజకచ్ఛపంబులఁ గరంబుల నిఱికికొని గరుడుండుగగనంబునం బఱచి తనకునూఁద నిమ్మగు ప్రదేశం బెందునుం గానక గంధమాదనంబునకుం జని...భార. ఆది. 2. 68.

గీ....ఉలూక మొక్కటి వచ్చె భూలోకనాథ.

వ. వచ్చి యవ్విటపివిటపంబు నూఁది యశాఖంబుల నాలోకించి...భార. సౌ. 1. 16, 17.

సీ.....వెనువెంట గ్రుడ్డవ్వకో లూఁదికొని రాఁగ. హరి. 2. 87.

సీ. పాండుసూనులతోడిపగ కోర్చె నెవ్వనియు త్సాహ మూఁది సుయోధనుండు. భార. కర్ణ. 1. 21.

చ. తనభుజశక్తి లేక యొరుదర్పము యూఁది పరాక్రమింప వచ్చిన వది నెల్లునే... భార. ఉద్యో. 4. 207.

(చ) ప్రమాణముగాఁ గొను.

ఆ. ఒడమి లేనివాఁడ నడపీనుఁ గను నహు, షోక్తి వినమె దాని నూఁద వలదె. భార. శాం. 1. 49.

చ....నీవు సెప్పినపలు కూఁది యాక్రతువు ప్రీతి వొనర్చెద నెల్లభంగులన్.... భార. అశ్వ. 1.13.

3. ఆను, నిలుపు, మోపు.

గీ. ఇంతపాపంబు సేయంగ నెత్తికొందు,మయ్య రాజ్యలోభంబున నఖిలబంధు, జనుల వధియింపఁ దొడఁగితి మని రథంబు మీఁదఁ గూర్చుండఁబడియెఁ జే యూఁదుకొనుచు. భార. భీష్మ. 1. 188.

సీ. బలభేదికరి...మత మటి...నేలఁ గొమ్మూఁది ప్రమొగ్గె. కు, సం. 10. 481.

గీ. అకట దిక్కులకెల్ల దిక్కైనమాకు, నొక్క దిక్కును లేదు కా లూఁద నైన,దిక్కు గానయ్యె నేఁడు మాదిక్కుఁ జూచి. భాగ. 6. 339.

4. నొక్కు.

(క.) అదుము.

(గిరిని) ఆ. ఉంగుటమున నల్ల నూఁదుటయును. నిర్వ. 4. 92.

సీ. కోరి కెవ్వఁడు పదాంగుష్ఠభాగంబున నుదురాజుపొట్ట గుజ్జులుక నూఁదె. కాశీ. 3. 82.

(చ) దృఢపఱుచు, బలపఱుచు.

వ. అని యూఁది చెప్పి యొకనాఁడు, భార, అను. 1, 69.

(ట) పలుకునపుడు ఒత్తు.

క. గురువులు నిడుదలు జడ్డక్కరములబొట్టుల పిఱిందికడ నూఁదినయక్కరములుఁ బెఱయవి లఘువులు, గురులఘువులు మూఁడుఁ గూడికొనగణములగున్. కవిజనా. సంజ్ఞా. 13.

(త) గ్రుచ్చు. నాటు.

శా. చేతోజాతవిరోధి కాశినగరీక్షేత్రోపకంఠంబునన్, శాతాగ్రం బగుశూల మూఁద ధరణీచక్రంబు భేదించుచున్. పాతాళంబులు గ్రొచ్చుచు న్నిగిడె నాథవ్యాయుధంబు...

గీ. దృఢముగా నూఁది శూలంబు దివిచె హరుఁడు, దివిచినప్పుడ తన్మహావివరసరణి, నేడు పాతాళములు దాఁటి యిలయు దూఁటి, యంబరముఁ దాఁకె నావరణాంబుధార. కాశీ. 5. 137, 138.

5. వహించు, పూను.

చ. బలుసెగ నించువి ల్లడుగుపట్టినదే యిపు డాకుబూదిగెం,పులఁ ద్రిరుచిత్వమూఁది... ఆము. 4. 96.

చ. ఇటు దగునయ్య శూరులకు నెల్లను బోకడ యిట్లుకాదె యే,మిటికి వలందురణ మొనలు మేకొని యాయుధజీవనంబు నూఁదుటయు నెఱుంగవే రిపులఁద్రుంచి యశం బిల నించి పుత్రుఁ డెక్కటి దివి చూఱకోల్ ప్రియమకా కిది యప్రియమే తలంపఁగన్. భార. ద్రో. 2. 257.

క. ఉక్కటి నురపతి కైవను.ప్రొక్కము వృషధర్మమూఁది మొనతలఁ బడినన్, మిక్కిలి పేరును నిట దివి, నక్కజముగఁ బెంపు, బడయనగుట నరేంద్రా. భార. ఉద్యో: 3. 360.

6. (చేఁపలను) ఊఁతతోఁ బట్టు (చూ. ఊఁత.).

వి. చేఁపలను బట్టెడియూఁత.

క. వెరవున నూఁదుల నెత్తెలఁ, గరముల మత్స్యములఁబట్టి... భార. శాం 3. 193. (కరాల వారిప్రతి.)

జ: ఊఁత, ఊఁతకోల, ఊఁతగొను, ఊఁతము, ఊఁతయిచ్చు.

ఊఁదుఁగ్రోవి వి. (ఊఁదు¹ + క్రోవి — త. ఊదుకళ్.) 1. ఊఁదెదుగొట్టము.

(శ) నిప్పు మొదలగువానిని ఊఁదెదుగొట్టము.

మ. ప్రతిసూర్యుం డనుకమ్మటంబు మఘవద్బాణాసన మ్మట్టాయి రో,హిత మన్వేరిటియూఁదుఁగ్రోవి చపలోపేతాంతరాంభోదసం,తతి యన్మమ్ములసంచి కావి రమునిద్దాటీకము న్గనుడన్, జనదీనాన్నారిబెడంగువ ర్దనరెవర్షావేశవిన్నాణడిన్. చంద్రా. 4. 17.

(చ) పిల్లనఁగ్రోవి.

2. (అ. వ.) బాలక్రీడావిశేషము.

సీ. కోలాటములు పిల్లఁగ్రోవులు గుమ్మడిగ్రోవి కూఁతలు మూఁదుఁగ్రోవులు ... హంస 3. 146.

**ఊఁదుఘుటికలు** మి. వి. బ. (√ఊఁదు[1]) ఒక జాతి వరిధాన్యము.

వ. ...పునుఁగుఁదావులు తేనెతొలలు మోహనాలు గుజ్జుపుఁదోఁకలు తేటచలములు ఊఁదుఘుటికలు గాజుకడియములు జాజికుసుమలు... అనునూటనాలుగువగల పైరులు...ప్రబంధ. 112.

**ఊఁదువత్తి** వి. (√ఊఁదు[1]) గంధధూపవర్తిక, శాఖిపోగకయి కర్పూరాదిపిష్టముచే వర్తిరూపముగాఁ గావించినది. చి. ని. (సాధారణముగా గొప్పవారు ముఖసువాసనార్థమయి దీనిపొగ త్రాగెడివారు చూ. శాదఁబగిసి. పొ. పత్ర పీతధూపవర్తి.)

**ఊఁదువెండి** వి. (√ఊఁదు[1]-త. ఊదువెళ్లి.) శుద్ధమైనవెండి. (శ. ర.)

**ఊఁపర** – తూఁపర. వి – నోటితుంపరవంటిది–వ్యర్థభాషణము.

ఉ. నేరక కల్చి భిక్షుకుని నీ వొకపెద్దగఁ జేసెదింత...అధనదుండె భూరివి, తోరుసమృద్ధి నీచెనఁటియూఁపర లేటికి నాడెదెన్నియుఁ. కు. సం. 2. 865.

జ. ఊఁపరలాడు.

**ఊఁపరలాఁడు** విజ. (√ఊఁపర) వ్యర్థభాషణములవాఁడు.

సీ. ఊఁపరలాఁడు గాఁ డుపకారి నవ్వుమేలము గాని తనవారు లాఁతివార. గీ. వఁడు... ఉ. హరి. 5. 278.

**ఊఁపాడు** అ. క్రి. (ఊఁపు+ఆడు) ఊఁగాడు.

సీ. చూపుఁదేఁటులపిల్లలూఁపాడఁ జొచ్చెఁబో యాడక యవి యేల యడఁగి యుండు. రాజ. చ. 1. 84.

**ఊఁపు** – ఊఁచు.

శా. భూమీచక్రము పూని యెట్లు దలలూఁపుం బన్నగస్వామి...నైష. 5. 187.

వి. ఊఁపుట.

(వ్యవ)వాఁడొకయూఁపుఊఁపి చూచినాఁడు.

జ. ఊఁపాడు.

**ఊఁపురము** వి. మూఁపురము, కకుదము.

సీ. మూఁపురమంచన నూఁపురమంచనఁ గకు దభిధానమై బరలుచుండు ఆం. భా. 2. 263.

**ఊకసబొద్దు** వి. ఒకానొకమందాకుచెట్టు (శ. ర. ఇది జ్వరమున కుపయోగించునని బ్రౌ.)

**ఊచు** అ. క్రి. (వ్యాధిచేత తలవెండ్రుకలు) రాలు. (బ్రౌ. శ. ర.)

**ఊట** వి. (√ఊరు[2]. క. ఊతె త. ఊట్టు) 1. ఊరిన ద్రవము.

చ. అనిశము ... గోవులపాలవాలిక మహితలం, బనయముఁ గ్రుంగి మట్టవిసి యప్పురి చుట్టున నూట రేఁగి బోరన నట జాలువాలి నదులై చను నంబుధిఁ గూడఁ జెల్లునన్. కు. స. 7. 955.

సీ. ...పణ్యంబు ఖైతమున...దుర్గంధబుద్బుద దూష్యతఁ బొందయనియూటనీరును శుచులు...మార్క. 3. 256.

ఉదా: ఆవకాయయూట, మొ.

2. సారము.

సీ. ...ఎముకయూట, చవిగని యానుచు... భార. స్త్రీ. 2. 9 (ఎముకయూట = మూలగ, ఎముకలలోని క్రొవ్వు.)

3. చేవ, బలము.

గీ. ఉదకసంభూతి బలమగు నూట యనఁగ... ఆం. భా. 3. 50.

జ. ఊటమెకము, ఊటాడించు, ఊటాడు, ఊటించు.

**ఊటమెకము** వి. (√ఊట.) దంష్ట్రి, పంది. సాం. ని. 75.

**ఊటాడించు** స. క్రి. ( √ ఊటాడు ) ఊటాడఁజేయు.

(వడఁకించు.)

క. ...వియచ్చరావ్యోనోద్గా, త్రుచ్చరితసామ మంత్రము,ఖోచ్చధ్వను లంతరిక్ష మూటాడింపన్. జై. భా. 7. 203.

శా. ....జక్కవకవల్ చక్కట్లుదిద్దు న్గచా,హం
కారంబు మదాళిమాలికల నూటాడించు
వేణీగుచుల్. విజ. వి. 2. 16. (ఇటపౌప
మ్యమును దెలుపును.)

**ఊంటాడు** – ఊటాడు. అ. క్రి. (తె. ఊటాడు
ఊట+ఆడు-పదచ్ఛేదమునకు చూ. 5. అర్థ
ము. క్రింది. ఉదా:)

1. ఊఁగు, ఊఁగాడు.

మ. కలఁగెం దోయధిన ప్రకంబు గిరివర్గం బెల్ల
నూటాడె నం, చలతం బొందె వసుంధరా
వలయము...భాం. విరా. 4. 172.

క. సొమ్మసిలి కొంత తడిసివఁ, గ్రమ్మఱఁ దెలి
వొంది లేచి కళ దెలిచి సమీ,పమ్మున నెవ్వ
రుఁ గావక, నుమ్మలిక లెసంగ నసువు లూ
టాడఁగఁ. సారంగ. 2. 116.

2. వడఁకు, కంపమొందు.

క. కాటుపడి భీతిఁ గాయం, బూటాడం బఱచి
జనకు నూరుద్వితయా,స్ఫోటితమస్తకుఁడై
శిశు, వేటుపడినకు వాలె నేడుచును
డఁ. వేం. పంచ. 2. 351.

3. సంభ్రమించు, త్వరపడు.

సీ. ఒక్కఁడాఁకొని కోయు చున్నట్టికాయలు
మిన్నక యూటాడి మ్రింగు నొకఁడు. మొ.
రా. సుం. 238.

4. సంచరించు.

వ. ఒంటిపాటున వేఁటపైఁ గలతివుట నూటా
డుచు నమీపాటవీమధ్యంబు సొచ్చి పాండు.
8. 89.

5. అతిశయించు.

శా. ఆరాజుం గనువేడ్క చిత్తముల నూటా
డఁ విధం బెవిధం,బో రామా ననవింటి
వేలుపునకుం బుష్పాంజలుల్ నేయ మం,
చైరావత్యలికుంతలఁ మొఱఁగి జోడై
చంపకశ్మాజముఁ, జేరం గ్రమ్మఱ నేఁగు
దెంచిరి సుకేశీమిత్రకేశీ సతుల్. వరాహ.
3. 127.

6. తొలఁగు.

క. కావున మన మిటకు మృగాం,కావలిఁ గొని
వచ్చి చూపి యధిపుమనంబుఁ, దేవివలన
నూటాడం,గా వేగమ చేయవలయు గాఢ
వివేకా. కేయూర. 2. 88.

జ. ఊటాడించు.

**ఊంటి** వి. ఒకజాతి మొక్క. చిఱుచెట్టులలో నొ
జాతిది.

సీ. శ్రీతులసియు నంబరేను నేలుసిరి కీళ్వరి
నేలవే మూటి చల్లగడ్డ. హంస. 4. 10

**ఊంటించు** స. క్రి. (√ఊట) బెల్లించు, ముఖస్తుతి
చేయు.

సీ. వెఁయును దేలి చె బెల్లి. చె మూటి చెననఁగ
నెక్కించె నం చనెడిమాట. ఆ. భా. 1.
174.

**ఊంటు** వి. వానవినుకులచేత కలిగిన చెమ్మ. (శ.ర.)

**ఊండ** వి. (క. ఊడె.) మఱ్ఱి మొదలగు చెట్లకొమ్మ
లనుండి క్రిందికి దిగువేరు, శిఘ కు. సం. 1.
946.

**ఊండనిఁబోడు** అ. క్రి. 1 పంఱిపోవు.

చ. గరుడుని నెక్కి కేశవుఁడు గ్రక్కున బాణ
పుంబు చేఁగొని నరిగినఁ ఒఱు రాజుఁ గని
యచ్యుత పౌత్రునిఁ బట్టికొన్నయ. య్యూర
గములెల్ల నద్దెసల నూడనిఁబాడినఁ జూచి
...ఉ. హరి. 6. 289. పా డు 2. 19.
ఉ. రా 1. 265.

2. తొలఁగిపోవు.

సీ. ప్రతి యెచ్చటను లేక ప్రబలిన శౌర్యంబు
బాపురే యూడనిఁబాఱఁజేసె. చంద్రా.
4. 96.

(నృసింహావతారం ఘట్టము) దండ... స్తంభముఁ
...ముష్టిచే వ్రేయఁ ... ఒక్క రావంబు
పుట్టెఁ....దిగ్భిత్తికల్ పట్టువీడెఁ.... వెలుం
గూడనింబాడెఁ జీఁకట్లు వేయాడె...దశా.
4. 282

క. అక్కా తామణినెచ్చెలు, లొక్కకపనిపేరు
చెప్పియూడనిఁబాడఁ. కవిజ. 5. 98.

**ఊండాడు** – ఊటాడు.

సీ. బెడిదంపుమదకీలి పికరావముల కుల్కి పెల్లు
గా మదిఁదల్లడిల్లుదాని. గీ. మసురు లూడా
డ విసవిస విసరి ముసరి. దొసఁగు లెసఁగిం
చు సురగాడ్పుతుటుముదాడి, కడలి తద్దయు
గడగడ వడఁకుదాని...వసిక. 4 17.

**ఊఁడి** వి. ఒక దినుసు కూరాకు. (గ్రా.)

**ఊఁడిగము**—ఊడెము, ఉడిగము, ఊళిగము, ఉళిగము. వి. (క. ఊటిగ. త. ఉఱియమ్) సేవ, పరిచర్య.

ఆ. కత్తులున్న సంచి కడువేగఁ గొనిరమ్ము, పోయి యూడిగమ్ము సేయవలయు, రాజు పిలువఁబంపె సమణిరో తెమ్మన్న, నదియుఁ గత్తియొకటి యతని కొసఁగ. నా. పం. 1 198.

సీ. విద్యాధరులు రుద్రవీణలు వాయింప నగరు డోంగము లూడిగముల మెలఁగ. వరాహ. 11. 33.

విశే. సేవకుఁడు, పరిచారకుఁడు.

గీ. ... నృపు వెంబడిన యూడిగములగములు. ఉ. రా. 7. 409.

చ. బడలిన మోము గువ్వగుమిపట్టులఁ జాఱెడు చూపు మించఁగాఁ, దొడఁదొడి నూడిగంపుఁ దెగతోఁ జనియెన్ మముఁ జూడఁ డేమియున్. కుమా. 8. 75.

ఊడిగపుఁజేడియ = సేవకురాలు.

గీ. ఊడిగపుఁజేడియలు గొందఱొదిఁగి చేరి. సీమం. 4. 11.

జ. ఊడిగీఁడు.

**ఊఁడిగీఁడు** వి. (ఊడిగము + ఈఁడు) పరిచారకుఁడు.

గీ. దొరలు ప్రెగడలు మన్నీలు బిరుదు లొజ్జ లూడిగీలును బోగపుఁజేడియలును... కొలువఁ గొలువుండి పెద్దలఁగూర్చి పలికె. అచ్చ. రా. అయో. 5.

**ఊఁడిగెము** - ఊడిగము.

సీ. కన్న రాగన లూడిగెములు సేయ. చిత్ర భా 4. 59

**ఊఁడిత** వి. (సాలెవాఁడు పడుగు చేయునపుడు అది పడిపోకుండ క్రింద నూఁతగా నిలువున నిలిపెడు.) కఱ్ఱలజంట, కత్తెరకాలు.

సీ. పరిపరి యచ్చులు చరకుండ యూడిత, చీడు దబ్బలు దండె నాడె క్రోవి హంస. 2. 11.

**ఊఁడు** అ. క్రి. 1. క్రిందఁబడు, రాలు.

చ. ...ఉగ్రకేతనములు నూడిన్...కకు. 2. 160.

చ. .... వీనిఁ గపటాత్ముని నిచ్చట నుండనీక పండ్లూడఁగ వేసి ద్రొబ్బుఁడని యుగ్రతఁ బల్కినఁ గాంత లందఱున్. వీర. 2. 284.

2. వీడు, వదలు, సడలు; జాఱు.

ఉ. .... కీ, లూడినయందెలోడ విరియూడిన తాలిమితోడ వచ్చె. సుద. 3. 4.

గీ. ....తొడిమ లూడి తొటతొటఁ దఱచుగా నుర్వి రాలి,పడఁగ....వరాహ. 10. 125.

గీ. అంసికొనియుండ నొక్కనాఁ డవ్వరాహ, లలన యీనుచో నిటలస్థలమునఁ బొల్చు. తెల్ల మచ్చతో నొకపోతుపిల్ల యూడి, పడఁగ నదియొవిం ప్రసి దాని నడుపఁ దలఁచి. భోజరా, . 181.

క. పెరుఁగిన త్రివిక్రమేశ్వరు, చరణతులాకోటి యతఁడు సంహృతదేహా, స్ఫురణుం డగునపు డూడిన,కరణిం బురకోట రొప్పుఁ గనకమయంబై. పాండు. 1. 105.

3. తెగు, ఖండితమగు. (చూ. ఊడుచు. వసు. 8. 107.

4. చెడిపోవు.

ఉ. ...సరివారలు నవ్విన నేమి కాఁపురం,బూడిన నేమి నాదగు ప్రియుం డిలుపాసి చనంగ నేనుమం,దోడనెపోవనైతి నదిఁ దోఁపక పోయెనిఁకేమి సేయుదున్. శశాం. 4 87.

5. నశించు; చచ్చు.

క. నారీమణికిఁ బురాకృతి, ఘోరాఘము లూడె మిగులఁ గూడెన్ శుభముల్. ఘటికా. 2. 54.

(వ్యవ) వాఁడు ఉన్నవాఁడును గాఁడు ఊడినవాఁడును గాఁడు.

6. పాఱిపోవు.

గీ. దనుజుఁడు ... తిరిగి వేఱొక్కదిక్కు, తెరుపుగా నూడఁ జూచిన నరుగనీక. భా. రా. అర. 5. 125.

7. ఊడఁదన్నుకొను, తొలగించుకొను, త్రోసివైచికొను.

క. అమరత్వమునకుఁ బోవుచుఁ, దమభవబంధంబు లూడఁదన్నుకొను గతిన్. వరాహ. 5. 32.

జ. ఊడుచు, ఊర్చు[2], ఊడుఁదెగులు, ఊడుబొట్టు, ఊడుపు.

**ఊడుఁదెగులు** వి. (√ఊడు) - పశ్వాదులకు - రోమము లూడిపోవువ్యాధి.

**ఊడుగు** వి. అంకోలము (వ్య. వి.)

సీ. వేణుజాతములైన యాణిపూసల నెంతు రూడుగుపండ్లకు నీడుగాఁగ కాశ. 8. 4.

**ఊడుచు (ర్చు) – ఊర్చు[2].** స. క్రి. (√ఊడు) ఊడఁజేయు.

(తొలగించు, తీసివేయు; సడలించు.)

సీ. కస్తూరికాపుష్పగంధబంధుర మణిబంధ మూడిచి జటాభారం మూని. భా. రా. అయో. 65.

గీ. ఘటితనిర్మల భూరిముక్తాఫల ప్రకాండసౌభాగ్యనిర్జితగగనసింధు, కంకణంబైన నిజహస్తకంకణంబు, కడఁకనూడిచి ఁతుగా బడసి వైచె. హరిశ్చ. 2. 80.

శా. ప్రాకోక్షణాంబరవీథిరిథిఁ గులటా పాళిము భాజ్ఞంబు తెల్పెక్కం బాంధుఁడు దట్టిగట్టఁ దనవిల్లె క్కూడ్చి నాల్గింటిపై, లెక్కమ్ముల్దొనవైవ.... బహుళా. 3. 94.

(విప్పు.)

క. సాయక గురు మీరు నూడఁ జంపినకష్టో, పాయుని ధృష్టద్యుమ్నుని, మాయించియ కాని తొడినములు వే నూడ్చుఁ. భార. కర్ణ. 2. 130. భార. భీష్మ. 1. 152.

సీ. సాలావలులు దాఁటి యేలాలతావారబా లాతతిపరాగపటము లూడ్చె. వసు. 1. 184.

వ. అయ్యువరాజు శాసనంబున యుగ్యంబుల పగ్గంబు లూడ్చి కేతనాతపత్రంబులు తొలంగించిన. వరాహ. 4. 120.

(త్యజించు, విడుచు)

ఉ. దేవుని వామభాగమున దేహము నూడ్చిన పార్వతీయముఁడౌ ... కావున మానవుండెపుడు గాఁపుర మంయెడఁ జేయఁగాఁదగుఁ. పాండు. 2. 286.

గీ. కుబుస మూడ్చెడి మేటినాగువును బోలె. భీమ. 5. 70.

(ఉన్మూలించు, పెఱుకు)

అ. పడుచు శిరఁక లూడ్చి పట్టి యాడెడునట్టి, పులుఁగుచందమయ్యెఁ దలఁప నాయ, వక్ష ...భార. కర్ణ. 1. 84.

సీ. అమరునేజాజల్లు లగు నని జేసితాపసులకూర్చము లూడ్చఁ బఱచువారు. నరస. 5 90

(జాఱిపోవఁజేయు)

మ. ... రాజాంగనా, జనగర్భంబుల నూడ్చెపం కృతిధనుర్జ్యాట కృతిఁ. దశా. 6. 144.

(ఖండించు, నఱకు)

ఉ. కొంచక యంబుధం బడినకొండలసుత్రము లూడ్చదయ్యె నూ, అంచులక త్తి... వసు 3. 107.

(చిమ్మివేయు)

చ. ఘనతరశైలముల్ వెఱికి గ్రక్కననూడ్చెదఁ గాలమ త్యువుఁ, దునిమెద మేరువుఁ విఱుగఁద్రోచెద.. భా. రా. కిష్కిం. 819.

(తుడుచు)

సీ. ఘల్లుఘల్లని రత్నకంకణంబులు మ్రోయ గంధవాహునియాలు కసవు నూడ్చు. భీమ. 3. 62,

**ఊడ్చుకొను–ఒలుచుకొను, అపహరించు.**

శా. ...ఒక్కయెడ నిక్కట్టైనచో దానినా, నారత్నోజ్జ్వలభూష లూడ్చుకొని యానందం బుతోడం బురిం, జేరెఁ...శుక. 3. 504.

**ఊడుపు** వి. (√ఊడుచే) 1. పాదరజావిశేషము.

సీ. పాదరజాభిధ పరఁగును తెప్పన మలకడమ్మనఁగ సమ్మాళి యనఁగఁ, దద్విశేషమ్ములు తగుఁ జాయపోసు పాపో నూడు పుద్దము ముచ్చ మెట్టు...అం. భా. 2. 293.

2. ఖండిత మగుట. విడిపోవుట.

వ. వెదురుపొదలకనుపూడుపునం జిటులు మౌక్తిక పటలంబులు దటాలువం దాఁక. అచలా. 2. 71.

**ఊడుబొట్టు** వి. (√ఊడు) పశురోగవిశేషము.

ద్వి. పుప్పి పంపఁ యూడుబొట్టు బొల్లాత ....ఆదిగానెన్నఁ, గలపనరాలరోగములకు నెల్ల, మందులు పెట్టను....నేర్తు. నవనాథ. 1. 41. పొ. 3 పం

**ఊఁడె(డియ)ము—ఊడిగము**

ఊఁడెపుఁగత్తె-పరిచారక.

ఉ. ....శృంగారరసంపుగిండి గలశాముని యూడెపుఁగత్తెయో యనఁగ. కళా. 8. 142.

**ఊఢ** నం. వి. అ. స్త్రీ 1. పెండ్లాడినస్త్రీ, వివాహిత. 2. భార్య.

**ఊఢము** నం. విశ. (అ. అ అ)-వహింపఁబడినది- 1. మోయఁబడినది. 2. తీసికొనిపోఁబడినది. 3. పెండ్లిచేసికొనఁబడినది.

**ఊఢి** నం. వి. ఇ. స్త్రీ. 1. మోయుట. 2. పెండ్లి.

**ఊఢుఁడు** నం. వి. అ. పుం. పెండ్లాడినపురుషుఁడు.

**ఊతము** నం విశ. (అ. అ. అ.) 1. రక్షింపఁబడినది. 2. నేయఁబడినది. 3. కుట్టఁబడినది. (వస్త్రాది.)

**ఊతి** నం. వి. ఇ. స్త్రీ. 1. రక్షణము. 2. కుట్టుట. 3. నేయుట. 4 లీల, క్రీడ.

**ఊదర** వి. (నం. ఉదారః క. ఊదరె.) తృణవిశేషము. ప్రబంధ. 200

(బ. ఊదర్లు, ఊదరలు) ధాన్యవిశేషము

గీ. గునుకు లూదర్లు బరిపటల్ గోళ్లగొండు, ఎల్లి బియ్యంబు వెదురుబియ్యంబు.... కాశ. 3. 151.

**ఊదలు** వి. బ (గంటులవంటి) వన్యధాన్యవిశేషము.

వ. ఒడిసెప్రాలు దూసరబియ్యంబు నివ్వరివడ్లు గునుకు లూద లాదిగాఁగలుగు వన్యధాన్యంబులు ముడియలం గావళ్లం బెట్టించి పట్టించికొని....పి శకుం. 3. 12.

**ఊదా** హిం. వి. ఒకవిధమగురంగు, ఎఱుపు నలుపు కలిసినరంగు.

**ఊదువత్తి** వి. (హిం. ఊద్‌బత్తి-సాంబ్రాణివత్తి, త. ఊదువత్తి క. ఊదుబత్తి) సాంబ్రాణివత్తి; అగరువత్తి.

**ఊధము** నం. వి. న్. న. (అవు మొదలగువాని) పొదుఁగు. ఇది బహువ్రీహియందు ఉత్తరపదమైనపుడు స్త్రీలింగమున 'ఊధ్నీ' అగును. ఉదా: కుండోధ్నీ, ద్వ్యూధ్నీ, అత్యూధ్నీ. మొ.)

**ఊధస్యము** నం. వి. అ. న.-పొదుఁగునఁబుట్టినది-పాలు.

**ఊనము** నం. విశ. (అ. అ. అ.) 1. హీనము. తక్కువైనది. 2. కొఱవడినది, అసంపూర్ణము. (ఉదా: ఏకోనవింశతి = ఒకటి కొఱవడి యున్న ఇరువది-పందొమ్మిది)

**ఊనిక** వి. (√ఊను[1]) ఆనిక. (శ. ర.)

**ఊనితము** నం. విశ. (అ. అ అ.)ఊనము నేయఁబడినది.

**ఊను**[1] = పూను. న. క్రి. 1. పట్టుకొను.

ఉ. శ్రీహరి యెంతయు క్రమము చేసితి వాసుకిభోగిభోగసం, దోహము మీఁ లూని కడుఁ దుచ్ఛపుఁ బుచ్ఛము మా కొసంగ మే, మూహ యొనర్చ లేక యిది యూనిన నధ్వయన శ్రుతంబులు, న్సాహసముం బరాక్రమము సత్కులజత్వము వీటఁబోవదే. దశా. 2. 91. వసు. 6. 73.

2. అవలంబించు.

గీ. అదియునుం గాక జనియించు టాది గాఁగఁ, బసులలోనన పెరిఁగినపాలసుఁడు, వావిమాలిన పశుమార్గవర్తనంబు, నూను టరిదియె యిదియేల యుగ్గడింప. హరి. ఉ. 8. 108.

గీ. గార్గ్యసిద్ధాంతమత ముషఃకాలకలన, శకున మూనుట యది బృహస్పతిమతంబు. భీమ. 3. 41. (శకునము-శకునముచూచుపద్ధతి.)

3. పొందు.

ఆ. ...ఏమిసంభవించె,నేని దానఁ దృప్తినూనుట దప్పిన, పనికి పగవకునికి భవ్యగుణము, భార. శాం. 5. 28.

మ. ...నను నీయంకతలంబున న్నిదుర నూనం జేయవే వేఁడెదఁ. విక్ర. 3. 94.

4. ధరించు, తాల్చు.

సీ. కస్తూరికా పుష్పగంధబంధుర మణిబంధ మూడిచి జటాభారమూని. భా. రా. అయో. 65.

గీ. నాయెదుట మీకు భూమిభృన్నామమూనఁ,
జెల్లునే... రామా. 2. 55.
గీ. మీకులములేటిఁ జేపట్టి మీవిరోధి యైన
పులిఁజెండి మైచంద్ర మూనెఁ గాదె. సారం. గ.
?. 285.
సీ. పైరుపచ్చలతాళి మీఱ మొల్కలగుఱ్ఱా
టుఁ గంచుక మూనె రత్నగర్భ. ఉ రా.
1. 186.
5. ఆశ్రయముగాఁ గొను, అధిష్ఠించు.
శా. ...భాషాదేవి మన్త్రప్రౌఢజిహ్వాసింహాసన
మూనుఁగాతఁ గృతియుక్తాలంక్రియాహం
క్రియలన్. కవిక. పీఠి. 5.
6. ఊఁదు, మోపు.
సీ. గాలమేఁతరిఁజేనిఁగా లూనఁగా నీక. నీలా.
1. 42.
7. అను.
గీ. ఉక్కుగద యూనుకొని నిలుచున్నవాని.
ఉ. రా. 4. 10.
8. (యజ్ఞము) చేయు. (చూ. ఊనుచు)
చ. వేదశాస్త్రముల్, సదివితి మీవు లిచ్చితిమి
జన్నము లూనితి మైహికంబునన్. ఉ. రా.
2. 24.
అ. క్రి. కలుగు.
ఉ. వీనులఁదియ్య మెక్కమును విన్కిఁ బరిస్ఫు
రరాగవృత్తి లో,నూనివఁ జూచువేడుకల
నువ్విళు లూరెడు నెమ్మనంబులు... భాగ.
విరా. 5. 393.
క. జ్ఞానంబున వైరాగ్యము, మూనుగ వైరా
గ్యమున సమగ్రజ్ఞానం,బూను మది నోర్మజా
ర్థం, బైనది శాజ్ఞానమన్య మజ్ఞానమగున్.
మార్క. 8. 312.
ద్వి. దీనితో భాషింప దీనిఁ గన్గొనిన, మూనుఁ
శాతకమని యుల్లంబులోన, వంతంత వదరు
శోకావేశమునను ద్వి. హరిశ్చ. ఉత్త.
2864.
ఊనఁగట్టు – తోలు బాగుచేయుటకై నీటితో
నింపి వ్రేలాడఁగట్టు.
(వ్యవ) మాదిగవాఁడు తో లూనఁగట్టినాఁడు.
మడుఁగులూను-మడుఁగులుగా నేర్పడు.

ఉ. తోఁడనె లేచి దండము ప్రతోదముగా నెను
పోతుతో జముం, దూడినచక్కటిన్ మడుఁ
గులూసినవెత్తుట భగ్నశృంగముల్, ప్రౌఢ
తనంబునన్ చిగినబూఁటకొమ్ములు గాఁగఁ
జల్లుపో,రాడిరి నిన్న రావణాఁ కావని భూత
పిశాచశాలికల్. కవిం. 2. 117.
పన్నిదమూను-పందెము వేయు
సీ. తనపై భవముఁ జూచి తనవారి లింద్రుఁడు
చోరులతోఁ బన్నిదమూనికొనఁగ. దశా. 1.
57.
రు: ఊనుచు, ఊనిక.
ఊను²- ఊఁదు. అ. క్రి. నాటుకొను
ఉత్సా. భానువిందుఁ దుర్ధతిన్ విపక్షపక్షసైన్య
దు,ర్మానకాననానలోపమాన చండకాండ
సం,తాన మూన నేసి చూర్ణితంబు చేసె.
భాగ. 10. ఉత్త. 860.
ఊనుచే(న్చు) స. క్రి (√ఊను¹) 1. (యజ్ఞము)
చేయించు (చూ. ఊను¹, 8. అర్థము.)
సీ ఈతండ నిఖిలావనీశలేఖుల నొప్ప రాజసూ
యము ధర్మరాజు నూన్చు. భా. ఆది. 5.
124. ('ఉనుచు' అని ముద్రితము)
క. ...కప్పముగొని చెచ్చెరఁ దెచ్చి యిచ్చె వ
న్నును, భరతకులశ్రేష్ఠుఁ డూన్చె బహుయ
జ్ఞంబుల్. భా. ఆది 6. 125 ('ఉనిచె'
అని ముద్రితము)
2. తగులుచు.
చ. ...తొలితొలిధాఁకే వెఱచి తోనె ఘనౌ
ఘము వానకాళ్ల కున్,బలరిపుఁ డాలయాశ్ర
ములఁ దగిలె సంకెల లూన్చెనో యనన్.
ఆము. 4. 84.
3. ఉంచు, మోపు.
క. ఒలసి మనోవాక్కాయం,బుల ద్రోహభావ
మఖిలభూతములయెడం, గలిమి విను శీల
మది మే, లొలయించును దాన నుల్ల మూ
న్పుము పుత్రా. భార. శాం. 3. 147.
చ. తలఁగక ధైర్యమన్మనక త్రాఁచుశిరంబునఁ
బాద మూన్చి పెం, పలరెడుసిగ్గు పేరిటి
గుహానది దాఁటి కురంగనేత్ర దా,వలచిన

ప్రాణనాథు నలుపై పుంగనక చిమ్మచీకటుల్, వొలయంగ నాఁటి చు (శుతిభూరి)గా ఘనాఘనాఫ్రటిఁ. గం.ఫ. 1. 117.

4. కలిగించు.

మ. మగువాలాగుశి బులందొం గు కమ్మం దేనెతోఁగూడి యు, య్యాఁ విందాటి బటి పుంగవ గవిపైయంగవిన బు నిస్ఫూర్తి ... బు నొనర్చెమున్న రుచిసౌ భ్యంబునం బిమ్మటఁ, ముఠియం ద్రోయుచు నూన్పె నెమ్మనమునఁ మూర్చ్ఛానముచ్చాయ ముఁ. నై. ష. 2 99.

**ఊపిరి** వి. ఊర్పు, శ్వాసము.

గీ. ...ఊపిరి యూర్పు నా శ్వాస మలరు... ఆం. భా. 1 60.

**ఊపిరికుట్టు**- ఊపిరి విడుచునప్పుడు పుట్టునొప్పి.

ఉ. విల్లులుమాంగఁ జేసి యొకవేడిశరంబు గవోసి యేసి య బ్బల్లిదు ప్రక్క నొంచిన సపాయ పుటూపిరికుట్టు పట్టి మూర్ఛల్లి యొకింత లోఁ దెలిసి. కకు. 2 146.

**ఊబ** విశ. గుల్లగా పెరిగినది, దుర్బలము. (శరీరము) వి 1. ఒకవిధమగుపాంతర.

సీ. ముంగిట రెండు చ్చ్రమ్మాఁకు,లినుగోడిగ లేగురి టిబిడ్డలు మాళ్ల తార్పులు నూబపాఁ తరలఁగొలుచు... కలిగి కాపురము సేయు. వే. పంచ. 4. 416.

గీ. పరఁగు ధాతువిశేషము లావ్రతరి యన,మూ బయనఁగను జంద్రమశ్నాబకధర. ఆం. భా. 2. 340.

2. పేడి, నపుంసకుఁడు. (శ. ర.)

**ఊబి** వి. బురద, పంకము.

సీ. ఉదక మల్పం బైన నూబిలోఁబడు చేఁప చెఱువు నిండినవెన్క జిక్కు చెట్లు. రామ లిం. 81.

**ఊయల**—ఊయేల.

**ఊయాల**—ఊయేల.

**ఊయెల**—ఊయేల

గీ. ...ముంచి, నేయుటకుఁ బంచునపరంజియూ యెలలును. అచ్చ. రా. అర. 59. చంద్ర. 4 ఆ.

**ఊయేల** - ఉయాల, ఉయేల, ఉయ్యాల, ఉయ్యాల, ఉయ్యేల, ఉయ్యేల, ఊయల, ఊయాల, ఊయెల. (క. ఉయల్, ఉయ్యాలు, ఉయ్యాలె, ఉయ్యాలు, ఉయ్యాలె, ఉవాలె, ఉవ్వాలె. త. ఊచల్, ఉంచల్. తు. ఉజ్జాలు-'ఊఁచు+ఏల' అని ప్రాచీనులవ్యుత్పత్తి.) వి. డోల.

**ఊరఁగంద** వి. (√ఊరు¹)-ఊరియందు పైరు చేసెడు కంద-ఒక జాతికంద. (వ్య. వి)

**ఊరఁబంది** వి (√ఊరు¹) ఊరియందు తిరుగుపంది—ఒక జాతిపంది. మార్క. 8. 207.

**ఊరఁబిచ్చుక** వి. (√ఊరు¹)-ఊరియందు తిరిగెడు పిచ్చుక-ఒక జాతిపిచ్చుక.

సీ. వైనతేయఖగంబుతో నూరఁబిచ్చుక రాజరత్నంబుతో గాజుపూస. చెన్నబ. 5. 71.

**ఊరఁబిల్లి** వి. (√ఊరు¹) - ఊరియందు తిరిగెడు పిల్లి - ఒకజాతిపిల్లి.

**ఊరఁబోవు** అ. (క్రి. (ఊరక+పోవు? త. ఊఱ్) ఊఱు చు.

సీ. తంపోఁక తంకు వెగ్గల మయ్యు భావంబు నూఱటఁ బొరిఁబొరి నూరఁబోవ. హరి. ఉ. 7. 178. భోజరా. 5. 210.

**ఊరక** -ఉరక. అవ్య. (యత్నము కారణము ఫలము మున్నగువాని అభావమును తెలుపును.)

1. యత్నము లేక.

గీ. తన్నుఁగేవలమాత్మగాఁదలఁచి యిష్ట, మతిశయము ఫృథముగఁ జూచునపుడు గాని, జన్మ దుఃఖజరావ్యాధి శాంతికరము. బ్రహ్మవిజ్ఞాన మూరక పట్టువడదు. భీమ. 5 165.

2. తగినకారణము లే; కారణము లేక

ఉ. సత్యవతీతనూభవ వృకంపిత భీష్మునిఁ గుంభజన్మునా,దిత్యకుమారు నూరక వధించితి రాజ్యరమావిభూతి కా,ద్దత్యముతోడుతఁ సమంధర్మము వీసరపుచ్చి ...భై. భా. 1. 56.

గీ. ఇన్ని ముఖముల వభివృద్ధి యొసఁగదేని,యొదిఁగి పవలించియట్లన యుండుఁ గాక, యూరకేల విజృంభించు నుదధు లేడు, ను

త్పలేశణ యాళశాంకోదయమున. నైష. 3. 168.

3. ఫలము లేక, వ్యర్థముగా.

మ. అకటా భాగ్యము లేమిఁజేసి...నై,నికస న్నాహము నస్త్రశస్త్రవిభవోన్మేషంబు నీ భంగి నూరక పోయెఁ. భా. రా. యు. 1392.

గీ. పుణ్యవాసన లూరక పోవు మూవె, యెట్లుఁ దమతమఫలముల నిచ్చుఁ గాని కళా. 5. 184.

4. మానక.

సీ. తోఁక నూరక మేను సోఁకఁగ నులివెట్ట వెడ వెడ వాలుక వెడలఁబెట్టు. భాగ. 10. ఉ. 544.

క. ఓరిదురాత్మక కౌమా,రారామంతోడ నీ వలుచుపల్లవపుల్, సైరించితి మిఁక నూర క. నోరె త్తితివేని మిగుల నొత్తువు సుమ్మీ. వరాహ. 11. 91.

5. ప్రతీకారము పొందక,

వ మహాపరాధులై నవా రూరక పోవరు. భాగ. 11. 118.

6. అయాచితముగా, అడుగకుండ.

గీ. ఊరకిచ్చుట గాదది యునికి యెఱిఁగి,యడుగుటయు భక్తి నిచ్చెద నవుడ యేను, నేఁడడుగు వెల్లియడుగు నన్నీరజాతుఁ, దనుచుఁ గోరుదు భవదీప్సితార్థకృతియ. హరి. పూ. 3. 249.

7. వివరణముచేయక.

చ. మగదలపద్మనాభునిసమస్తగుణవ్రజముంగణింపఁగా,నగణిత మౌట నూరకె గుణాకరుడంటిని...దశా. 1. 45,

8. ఉపేక్షించి, ఉపేక్షాభావముతో.

క. విను విధికృత్యము లూరక,కనుఁగొనుచును సిద్ధ్యసిద్ధికల్పితసుఖదుః,ఖనిరూఢిఁ బొందకుండఁగ, మనమును దొలగించువెరవు మహనీయమగుఁ. భార. శాం. 4. 379.

9. పలుకక, మాటాడక.

క. ఊరకయుండక పలువుర,తో రవ మెసగంగఁ బలుకఁ దొడరుపక మదిం,తేరువ గలనాగరికులుఁ,దారుఁ గలసి పలుక వలయు ధరణికుకడఁ. భార. విరా. 1. 127. భీమ 1. 14. దశా. 1. 240.

10. కొన్నిపట్ల ఇది వాక్యాలంకారముగా నుప యోగింపఁ బడును.

క. నారాయణాభిదానులు, వారలు గయ్యంబు నేయువా రొక్కెడ నే,నూరక నిరాయుధవ్యా.పారతమైను డువాఁడఁ బమాపుఁ డనై భార. ఉద్యో. 1. 24.

(ఇట్లే సందర్భమును బట్టి ఇతరార్థములు గ్రహించునది.)

**ఊరగోఁగు** వి. (√ఊరు¹) తీక్ష్ణవృక్షము.

**ఊరగోగి** వి. (ఊరు¹)ఊరియందు తిరుగుసన్న్యాసి.

ద్వి. ఉరగకంకణుతోడ నూరగోగులను, సరిచేసి యెన్నినచందాన నీవు ద్వి. హరిశ్చ. పూ. 2, 39.

**ఊరబీఱ** వి. (√ఊరు¹)-ఊరియందు పైరుచేయఁ బడుబీఱ-ఒకజాతిబీఱ (వ్య. వి)

**ఊరరీకృతము** సం.—ఉరరీకృతము.

**ఊరవ్య** సం. వి. ఆ. స్త్రీ వైశ్యజాతిస్త్రీ, కోమటిది

**ఊరవ్యుఁడు** సం. - ఊరుజుఁడు.

**ఊరార్చు(రుచే)** స. క్రి. (ఊరువు¹+అరుచు = ఊరుపు అడఁచేయు) 1. ఊఱడించు, ఓదార్చు.

గీ. బాలుఁ డొక్కఁడు కొండొకకోలనేతఁ, బట్టుకొని యేను రెక్కనుఁ గిట్టి చంపి, చులుకఁగా వత్తు మీరేవ్వవలవదనుచుఁ, గలయ నూరార్చెఁ దనతొక్కుఁబలుకులొప్ప. భార. ఆది. 6. 260.

క. ఊరార్చి యుంక నుచితా,చారంబులునడవుటయ యుచటఁగృత్యము ... భార. మౌ. 203. భార. అర. 3. 160.

ద్వి. అలుగంగఁదగునయ్య యతివమాటలకు, ననుచు సౌమిత్రి నూరార్చి యెంతయును. రం. రా. అర. 184. పొ. 91 పం.

2. బతిమాలు.

(ప్రగల్భాధీర) క. కూరిమిపతి తనకోపము, వారించినఁ ద్రోచి పిదప వచ్చియతనిఁ దా,నూ

రార్చునది ప్రగల్భా ధీర యనఁ బరఁగు రసికదృష్టికి నరయఁగ. కావ్యా. 3. 53.

**ఊరించు** స. క్రి. (√ఊరు²) ఊరఁజేయు.

1. కలిగించు.

గీ. ఎడతెగనిమోహ మూరించి యేపురేఁగి, వేశ్మమున నొంటిపాటైన వేళలందు. మదన కదనంబునకుఁ జాలమరులుకొనఁగఁ, జేసె శుభవాటి ధూర్తునిచిత్తమఁట. హంస. 2. 200. 169.

2. ఆసగొనఁజేయు, ఆసక్తిగలదిగాఁజేయు

సీ మాటిమాటికి ప్రేలు మడిఁచి యూరించుచు నూరుఁగాయలఁ దినుచుండు నొక్కఁ, డు... భాగ. 10. పూ. 493.

వ. అవేలమోహామయ విభావరిసమాగ మోదితయై శీతాంశురేఖ యన లోచనచకోరకల నూరించు నంచిత గుణాభిజాత యగు సీత. చం. రా 6. 9.

క. ...న, న్నూరింపవచ్చెఁ గా కీ, కిం బని చింతయుడిగి కీలించె ధృతిఁగ. తపతీ. 2. 63.

**ఊరీకరించు.** సం. స. క్రి. అంగీకరించు; గ్రహించు.

ద్వి ...నిర్వాణతత్త్వంబు, నూరీకరించి వేఱొక ప్రదేశమున, పాంనిష్ఠఁ దపంబు సల్పుచుండెదను. విష్ణు. పూ. 8. (శ. ర.)

సీ. ...సముపవిష్టుఁ, డై యుండఁగ వసిష్ఠుఁ డాగమించి సమాచరించు సపర్య లూరీకరించి. కకు. 1. 158.

**ఊరీకృతము.** సం. — ఉరరీకృతము.

**ఊరు¹.** వి. బౌ. (సం. పూర్. ప్రా. ఊరో. త. క. ఊరు. బ. వ. ఊళులు, ఊళ్లు, ఊరులు, ఊర్లు) గ్రామము (సందర్భవశమున 'గ్రామమునందలి జనము, గ్రామాంతరము' అను అర్థము లిచ్చును.

ఉ. ...ధారుణీపాలకురత్న మున్నడని భార్యను పుత్రుల నర్థయుక్తితో, బోలిన మేలుగాఁ బడసి యూళ్లను మున్నది. భార. అది. 6. 267.

క. ఇక్కన్యకు మగఁడే యితఁ, డక్కట యీ మగని కేటియా విది యనుచుం, జొక్కట్టు వలదు చెలులకుఁ, బెక్కేటికినూరు మెచ్చఁ బెండిలి గలిగెఁగ. ఉ హరి. 5. 152.

ఉ. ఊరికిఁ బంపి వచ్చితివె యొజ్జల... శశాం. 8. 7.

ఉ. ఏవురకుండ నొక్కొకటి యిమ్మని యూళులు వేఁడి కానరై. రేవలనైన... భార. శల్య. 2. 366.

ఉ కూరుఁడ వంద్రుడు నిఁగ మడువు సొచ్చుట శౌర్యము చొప్పె మాన మే, యూరికిఁ బోయె నాజి నృపు లోడుదురే... భార. శల్య 2. 65.

ఊరును పేరును లేనివాఁడు = అప్రసిద్ధుఁడు.

ఈయూరికి ఆయూరెంతో ఆయూరికి ఈయూరును నంతే:- రెంటికిని సమాన ప్రతిపత్తిని తెలుపును.

ఊరిపిడుగు పీరిసెట్టిని కొట్టుకొని పోయినది.

ఊరిమీఁద ఊరు పడినను కరణముమీఁద కాసు పడదు.

ఊరివానికి కాటిభయము పొరుగూరివానికి నీటి భయము.

ఊరులేనిది పేరఁ బిలుచుట:- లేనిదానికి పేరు పెట్టుట—అని భావము.

ద్వి. జనపతు లేయూరు సత్య మేయూరు. ద్వి. హరిశ్చ. పూ. 256. (రెంటికి సంబంధము లేదని భావము.

ఏయూరి కేది త్రోవ :- రెండును అసంబద్ధము లను భావమును తెలుపును.

గీ మోసపోయితి నిన్నాళ్లు నాసఁ దగిలి, యాలు బిడ్డలు దామఁ జుట్టా లనంగ, నెవ్వ రెవ్వారి లేయూరి కేది త్రోవ, వీరి కేఁ గాటఁపడుకొల్ల వృథయ యనుచు. వాల్మీకి. 2. 111. గోలరా. 4. 337.

జ. ఊరఁగండ, ఊరఁబంది, ఊరఁబిచ్చుక, ఊరఁబిల్లి, ఊరఁబోవు, ఊరగోఁగు, ఊరకోగి, ఊరబిజు, ఊరేఁగించు, ఊరేఁగింపు, ఊరేఁగు.

**ఊరు².** అ. క్రి. (దీనిని అప్పకవి శకట రేఫముతో గ్రహించెను. అప్ప. 2. 197. శ శ.

ఊఱు. తు. ఊఱు.) 1. లోపలనుండి (ద్రవము) పైకి వచ్చు.

సీ. శశికాంత పంక్తుల జలము లూరె. మనుచ. 3. 23.

గీ. చేరి రేయి మహీకాంతుచెంత కరుగు, దాని తోఁ బూని తోయజోద్యన్మందిర, ధార లూరఁగఁ గిరి మోతరుడి యొక్క, కథ విను మటంచు వెస నరకట్టి పలికె. శుక. 2. 543.

2. నాను.

(వ్యవ) నిమ్మపండ్ల రసములో అల్లము ఊరి వేసిరి.

3. తడిగలది యగు, ద్రవించు.

సీ. ఊరిక చూచి నోరూరు టెఱియ కాని యం దని మ్రానిపం డ్లందు పళమె. దశా. 7. 1. 101.

4. ఆసక్తి గలది యగు, ఆసగొను (చూ. ఊరి చు. 2.)

5. పుట్టు, కలుగు

ఉ. ఊఱటచెయ్యిలం దివుట లూరఁగ దర్పము లొండొకంటికిఁ, మాఱుకొనంగ... ప్రౌఢ దంపతులతీరునఁ బెంపెసలారి యద్దఱుఁ. హరి. ఉ. 7. 132.

ఉ. ...జగదేకమోహినిఁ, నావలవంత దీఱఁగ మనంబునఁ గోరిక లూరఁ జూచెదఁ వి. వం. 2. 94

6 పెరుఁగు, పెద్దది యగు

సీ కలిగెఁబో పొదలుచుఁ గలయఁ దీఁగెలు వాటి ముదురు నూరంగఁ గదముగాము లకు. వరాహ. 4. 88.

(వ్యవ) పెండలపుదుంప బాగుగా ఊరినది.

జ: ఊట, ఊరించు, ఊరుఁగాయ, ఊరుఁబండు, ఊరుఁబిండి, ఊర్గాయ.

**ఊరుఁగాయ.** వి. (√ఊరు². త ఊఱుగాయ్)— ఉప్పులోను కారములోను ఊరెడుకాయ—ఉప దంశము.

సీ. మాటిమాటికి వ్రేలు మడిచి యూరించుచు నూరుఁగాయలు దినుచుండు నొక్కఁ, డు. భాగ. 10. పూ. 496.

మ. ...అవంజిగు రొక్కను పచ్చళ్లును బాయసా న్నములు నూరుంగాయలుఁ. అము 1. 87.

**ఊరుఁబండు.** వి. (√ఊరు² + పండు) ఊరవేసిన నిమ్మ లోనగువానిపండు.

గీ పాలు ఫలములు నెడనీళ్లు పానకములు, నూరుఁబం డ్లూరుఁగాయలు తైరు సొంటి. ఘటికా. 2 16.

**ఊరుఁబిండి.** వి. (√ఊరు²) ఊరఁబెట్టినపిండి వ్యంజన విశేషము.

మ ఫలముల్ పానకముల్ రసాయనము లంబ ళ్లూరుఁబిం డ్లూరుఁగా, యలు బజ్జుల్ దధి పిండ ఖండములు నం దావిర్భవించెన్ దగన్. రాజ. చ. 2. 127.

**ఊరుకొను**-మూరుకొను స క్రి. ఆఘ్రాణించు.

క. ఈరీతిఁ బొదల మెదలుచు, నారీ తిలకంబు మేని నచ్చిక యిచ్చం, గోరిక నవసహకారిక, కోరిక మూరుకొని వడి నిగుడ గమ నించెన్. వసు. 3. 119. (ప్రయోగాంతరము లేదు.)

**ఊరుగ్రాహము.** సం — ఊరుస్తంభము

**ఊరుజుఁడు** సం. విఱ. (అ ఱ. అ.) తొడనుండి పుట్టినవాఁడు. (వి ఱ. పుం.) వైశ్యుఁడు, కోమటి (ఇట్లే – ఊరుసంభవుఁడు. ఊరు జన్ముఁడు.)

**ఊరుదఘ్నము** సం. విఱ. (అ ఈ అ) తొడలోఁతు గలది, తొడవఱకు వచ్చునది. (నీరు మొ.)

**ఊరుద్వయసము.** సం. — ఊరుదఘ్నము.

**ఊరుపర్వము** సం వి. న్. పుం స మోఁకాలు.

**ఊరుపు¹** (ర్పు) వి. (√ఊర్పు¹) శ్వాసము, ఊపిరి.

గీ నారికేళాంవపుదీపుటూరు పొలయ. అము. 2. 61.

ద్వి. తనయుని ముక్కునఁ దనవ్రేలు మోపి, యుడుగక మెల్లనె యూరుపు లరసి. ద్వి. హరిశ్చ. ఉ. 2023.

ఉ ...ఇట్టిమీ, ముక్కున నూర్పు గల్గ మన మోహార మీదురవస్థఁ బొందునే. భార. భీష్మ. 2 119 భార. శల్య. 1. 357.

**ఊరుపు²**(డ్పు). వి. వ్యంజనవిశేషము, ఒకవిధముగా పండినకూర.

సీ. మేలింపుచవి గుల్కు తాలి పు వంకాయ యూర్పులు గొనియాడ నేర్పుగలదె. రా. వి. 2. 105.

గీ. ఒఱపు దనరారఁ జేపులయూర్పుగుంగ, యుడిన... శుక. 3. ...

సీ. ఒకకొన్ని కరగల్పు లొకకొన్ని బజ్జులు నొకకొన్ని రీతుల యూర్పువగలు. పాండు. 4. 184

**ఊరుపో²(ర్పో)క.** వి. (ఊరుపు¹+పోక) ఉబుసుపోక, కాలక్షేపము.

మ ...అం(గ్రతమా, స్థలికిం బోదమె యూరుపోకకు వినోదంబుల్ సరిజ పంగన్. భీమ. 5. 14.

(వేశ్యావర్ణనము) సీ. ఘనునొద్ద నుండియుఁ దనకానపడియె నేఁ బోలఁతుక ...యె యూర్పోకకూర్మి కవిక. 4. 121.

**ఊరుభిన్నుఁడు** నం. విశ. (అ. ఆ అ.) — భిన్నోరుఁడు — విఱిగినతొడలు గలవాఁడు.

**ఊరుమాత్రము.** నం — ఊరుదఘ్నము.

**ఊరువు** నం. వి. ఉ. పుం. తొడ.

**ఊరుస్తంభ** నం. వి. ఆ స్త్రీ. అరఁటి (వృ. వి.)

**ఊరుస్తంభము** నం. వి. అ. పుం. తొడలయందుఁ గలుగు వాతరోగము (దీనిచేత తొడలు శక్తి తప్పి స్వాధీనము కాకయుండును.)

**ఊరూణింపు** వి. మల్లబంధ విశేషము.

వ. ఉపాంగంబును జొంగణయుఁ బెట్లాఁగు నూరూణింపును నరిబిత్తరంబును లాఁగును.... మల్లుపు. 3. 66.

**ఊరేఁగించు** నం. క్రి. (√ఊరు¹) ఊరేఁగునట్లు చేయు.

**ఊరేఁగింపు** వి. (√ ఊరేఁగించు) ఊరేఁగించుట.

**ఊరేఁగు** అ. క్రి. (√ఊరు¹) ఉత్సవముతో ఊరిలో విహరించు.

(వ్యవ) పెండ్లివా రూరేఁగి వచ్చినారు.

**ఊర్గాయ** — ఊరుఁగాయ.

శా. ...తియ్యబోండ్లు మేలూరుఁబిం, డ్రూర్గాయల్ వనపర్ణ భాజనములం దొప్పారనప్పు పంగన్. బహు 4. 19.

**ఊర్చు¹**(రుచు) అ. క్రి. ఊపిరి విడుచు, నిశ్వసించు.

ఉ. విమనుడై పడియుండె హా యని వెచ్చనూర్చుచు విన్నవై. భా. సభా. 2. 810.

చ. ...నేఁడై, నొఱగెడు రూపులున్ నెలఁగనూర్చెడు రూపులు. . కు. సం. 11. 700. అము. . . 28.

జ. ఊరార్చు, ఊరుపు¹, ఊరుపోక, ఊర్పోవు.

**ఊర్చు²** — ఊడుచు నం. క్రి. (పాత్రము సాన ముస్నగువాని నంటియున్న దానిని) చేతితో నొక్కితీయు.

(గోదావివాహము)

వ. ...కతాన్యంతరంబులం జంచలాతులు కడుగు వడుగుల జల బులకున్ బయిపయిం బడి గీర్వాణసిద్ధసంఘంబు లహంపూర్వికనుర్వి నిర్వాతిగా నూర్చికొని ప్రాశింప... అము. 6. 130

సీ. పక్వశాకం బెల్లఁ బతికంచమున నుంచి యొడికంబుగాఁ బట్టి యూర్చువైచు. శుక. 3. 349.

**ఊర్జము** నం. విశ. (అ. ఆ. అ.) బలము గలది. వి. అ. పుం. 1. కార్తిక మాసము. 2. ఉత్సాహము. 3. బలము. 4. ప్రాణనము, జీవనము. న. జలము.

**ఊర్జస్వంతము** నం విశ. (త్. న్వత్. త్.) 1. మిక్కిలి బలముగలది. 2. మిక్కిలి యుత్సాహము గలది.

**ఊర్జస్వలుఁడు** నం. విశ. (అ. ఆ. అ.) 1. మిక్కిలి బలముగలవాఁడు. 2 మిక్కిలి యుత్సాహము గలవాఁడు 3 గొప్పవాఁడు, శ్రేష్ఠుఁడు

**ఊర్జస్వి** నం విశ. (న్. నీ న్)— ఊర్జస్వలుఁడు. వి. న్. న. ఒక అర్థాలంకారము.

**ఊర్జస్సు** నం. వి. స్. న. 1. అన్నము. 2. ఉత్సాహము. 3. బలము.

**ఊర్జి** నం. విశ. (న్. నీ. న్.) — ఊర్జస్వంతము.

**ఊర్జితము** నం. విణ. (అ. ఆ. అ.) 1. దృఢము, బలము గలది. 2. వృద్ధి గలది. 3. వృద్ధిచేయఁబడినది. 4. గొప్పది, ఉదారము. 5. గంభీరము. వి. అ న. 1. బలము. 2. ఉత్సాహము.

**ఊర్ణ** నం. వి. ఆ స్త్రీ. 1. ఉన్ని, గొఱ్ఱెలోనగు వాని బొచ్చు. 2. కదళ్యాదుల తంతువు, అరఁటి మున్నగువాని నార. 3. కనుబొమలనడుము నుండు పలుచని వెండ్రుకల సుడి. (ఇది మహాపురుష లక్షణము.)

**ఊర్ణనాభము** నం. వి. అ పుం. 1. బొడ్డున ఊర్ణవంటి దారము గలది - సాలెపురుగు. 2. అభినయహస్తవిశేషము. (అయిదు వ్రేళ్లను గొంచెము వంచి కొనలు కూడకుండఁ బట్టినది.)

**ఊర్ణనాభి** నం. వి. ఇ. పుం. సాలెపురుగు.

**ఊర్ణపటము** నం. వి. అ. పుం. సాలెపురుగు.

**ఊర్ణము** నం. వి. అ. న. ఉన్ని గుడ్డ.

**ఊర్ణాపిండము** నం. వి. అ పుం. ఉన్నియుండ.

**ఊర్ణాయువు** నం. విణ. (ఉ) ఉన్నిగలది. వి. ఉ. పుం. 1. పొట్టేలు. 2. బొచ్చుకంబళి. 3 సాలెపురుగు.

**ఊర్ణావలము** నం. విణ. (అ. ఆ. అ.) ఉన్ని గలది.

**ఊర్ధ్వకంఠి** నం. వి. ఈ స్త్రీ. మహాశతావరి, పెద్ద పిచంరు (వృ. వి.)

**ఊర్ధ్వకము** నం. వి. అ. పుం. యవమధ్యమువంటి మధ్యముగల మృదంగము. (దండాకారముగా నుండు మృదంగము అని కొందఱు.)

**ఊర్ధ్వకాయము** నం. వి. అ. పుం. ఒడలి పై భాగము. (నాభి మొదలు తల చివరవఱకు నుండు భాగము.)

**ఊర్ధ్వగతి** నం. విణ. (ఇ) పైకిఁ బోవునది. వి. ఇ. స్త్రీ. పైకిఁ బోవుట. 2. ఊర్ధ్వలోకములగు స్వర్గాదులకుఁ బోవుట. 3. ప్రాణోత్క్రమణము, మరణము

**ఊర్ధ్వగుఁడు** నం. విణ. (అ. ఆ. అ.) పైకిఁబోవువాఁడు. 2. పై నున్నవాఁడు. 3. పైకి లేచువాఁడు. 4. ఊర్ధ్వలోకమును పొందువాఁడు.

**ఊర్ధ్వచరణము** నం. వి. అ. పుం. అష్టపాదము. శరభమృగము.

**ఊర్ధ్వచరణుఁడు** నం. విణ. (అ. ఆ. అ.) కాళ్లు పైకెత్తినవాఁడు. వి. అ. పుం. కాళ్లు పైకెత్తి తపస్సు చేయుఋషి.

**ఊర్ధ్వజానుపు** నం. విణ. (ఉ.) ఎత్తయిన మోఁకాళ్లుగలవాఁడు.

**ఊర్ధ్వజ్ఞుపు** నం. – ఊర్ధ్వజానువు.

**ఊర్ధ్వదృష్టి** నం. విణ. (ఇ) 1. మీఁదిచూపు గలవాఁడు. 2. ఉన్నత స్థితియందు దృష్టి కలవాఁడు. వి. ఇ. స్త్రీ. 1. మీఁదిచూపు. 2. ఉన్నతస్థితిపైని దృష్టి. 3. (యోగ) కనుబొమలనడుమ నెలకొలుపు దృష్టి. (ఇది ఉపాసనాంగము.)

**ఊర్ధ్వదేహము** నం. వి అ. పుం మరణమునకుఁ బిదపఁ గలుగు దేహము.

**ఊర్ధ్వపుండ్రము** నం వి. అ. పుం. నిలువుబొట్టు

**ఊర్ధ్వమంథి** నం. విణ (న్. నీ. న్.) నైష్ఠిక బ్రహ్మచారి, యావజ్జీవ బ్రహ్మచారి.

**ఊర్ధ్వమానము** నం. వి. అ న. 1. తూఁచుకొనుట కుపయోగించుత్రాయి, తూనికత్రాయి. 2. ఎత్తును కొలుచు సాధనము.

**ఊర్ధ్వము** నం. విణ. (అ. ఆ. అ.) 1. ఉచ్చము, ఎత్తయినది 2. ఉపరితలము, మీఁదిది. 3. ఉన్నమితము, మీఁది కెత్తఁబడినది. 4. నిట్టనిలువుగా నున్నది. 5. ఉత్క్షిప్తము, ఎగఁజిమ్మఁబడినది. పుం. న. 1. తరువాతి కాలము. 2. తరువాతి దేశము.

**ఊర్ధ్వముఖము** నం విణ (అ. ఆ అ.) మీఁదుగా నున్న మొనకలది (అ. ఆ. ఈ అ. చూ. అభిముఖుఁడు.) మొగము పైకెత్తినది.

**ఊర్ధ్వమూలము** నం. వి. అ. పుం. దర్భ (వృ. వి.)

**ఊర్ధ్వమౌహూర్తికము** నం. విణ. (అ. ఈ. అ.) తర్వాతి ముహూర్తమున జరుగునది.

**ఊర్ధ్వరేతనుఁడు(రేతుఁడు** నం. విణ. (న్) అధఃపతనము లేని రేతస్సు గలవాఁడు వి న్. పుం. మునివిశేషము (సనకాది). 2. భీష్ముఁడు 3. మహాదేవుఁడు, ఈశ్వరుఁడు.

**ఊర్ధ్వరోమము** నం. వి. న్. పుం. కుశద్వీపమందలి సీమాపర్వతములలో నొకటి. (చక్రకబిత్థపు.

చతుశ్శృంగము. కపిలము. చిత్రకూటము. దేవానీకము. ఊర్ధ్వరోమము. ద్రవిణము — ఇవి పడును కుశద్వీపస్థ సీమాపర్వతములు)

**ఊర్ధ్వలోకము** నం. వి. అ. పుం. స్వర్గము (వై. ని.)

**ఊర్ధ్వవర్త్మము** నం. వి. న్. న. ఆకాశము, వాయుమార్గము.

**ఊర్ధ్వశాయి** నం. విశే. (న్. నీ. న్.) మీఁది వంకగా మొగము త్రిప్పి పరుండువాఁడు, వెల్లికిలఁ బరుండువాఁడు (బాలుఁడు) వి. న్. పుం. శివుఁడు.

**ఊర్ధ్వశ్వాసము** నం. వి. అ. పుం. 1 శ్వాసరోగ భేదము, ఉబ్బసము 2 ఎగరొప్పుట.

**ఊర్ధ్వస్రోతసుఁడు (స్రోతుఁడు)** నం. – ఊర్ధ్వరేతసుఁడు.

**ఊర్ధ్వస్రోతస్సు** నం. వి. అ పుం. – జలాదులను వేళ్ళమూలమున పైకి తీసికొనునది – వృక్షలతాది.

**ఊర్ధ్వానితము** నం. విశే. (అ ఆ అ.) ఊర్ధ్వముగాఁ గూర్పఁబడునది. వి. అ పుం. కాఁకరు (వ్య. వి.)

**ఊరొప్పు** అ. క్రి. (ఊర్పు¹ + పోవు) ఊపిరివెడలు, శ్వాసమాడు.

శా.... శత్రుప్రాతముల్ సాంద్రమై, యూరొప్పకుండఁగ నించినన్ మురవైరుండుద్దామ కోపాగ్నియై. నిర్వ. 8. 17.

ఊర్పుచ్చు-ఊపిరవిడుచు; నిట్టూర్పు విడుచు.

శా. కంపంబొందె సురేంద్రుఁ డగ్ని వెఱచెన్ గాలుండు శంకించెఁ జింతింప బూనె నిశాచర ప్రభుఁడు వార్ధిస్వామి యూర్పుచ్చె... తద్దివ్య త్తపోవృత్తిన్. శేష. 5. ఆ. (శ. ర.)

**ఊర్మి** నం వి. అ. పుం. స్త్రీ. 1 తరంగము. 2. తరంగమువలెఁ గన్పడునట్లు పంక్తిగా నుండి వేగముగా పరుగెత్తు అశ్వములగతి విశేషము. 3. వేగము. 4. బట్టముడుత. 5. ప్రకాశము. 6 పీడ. 7. బుభుక్షాది. (షడూర్మ్యులు:- బుభుక్ష, తృష్ణ, శోకము, మోహము, జర, మరణము.) 8. అలుసంఖ్య. 9. ఉత్కంఠ, తహతహ. 10. వంకర.

**ఊర్మిక** నం వి. ఆ స్త్రీ. 1–ఊర్మి. 2. ఉంగరము. 3. భృంగనాదము, తుమ్మెదచలరవళి.

**ఊర్మిమాలి** నం. వి. న్. పుం. సముద్రము.

**ఊర్మిళ** నం. వి. ఆ స్త్రీ. 1. లక్ష్మణుని భార్య, జనక మహారాజు కూఁతురు. 2. తల్లకత్తె ర్త్రిక. మగనిని విడిచిపెట్టిన స్త్రీ. (శ్లో. ఊర్మిళా తల్లకత్తె ర్త్రికా – వై. ని.)

**ఊర్వంగము** నం. వి. అ. న. పుట్టగొడుగు (వ్య. వి.)

**ఊర్వశి** నం – ఉర్వశి.

**ఊర్వష్ఠీవము** నం. వి. అ. న. తొడల యొక్కయు మోఁకాళ్ళ యొక్కయు సముదాయము.

**ఊర్వి** నం. వి. ఈ. స్త్రీ తొడనడిమిచోటు.

**ఊర్షి** నం. వి. ఆ స్త్రీ. దేవతాడము (వ్య. వి.)

**ఊఱట.** వి. (√ ఊఱడు¹) 1. విరామము.

సీ కోలుమసంగెడు కోర్కులు వెనువెంటఁ బాయుచు ననికియు నూఱటయును. భార. విరా. 2. 215.

చ. ...ఊఱటలేని యూర్పులన్... ఉ. రా. 6. 509.

2. విశ్రాంతి

ఉ. చెందిన సేదలం దృణముసేయుచు సేతువు గట్టికట్టి మత్కర్యందినవేళ నూఱటల కాసలు చేయుచు... భా. రా. యు. 271.

క. అరాచవేల్పురాయఁడు, వేరపుఁబె రెందునైన వినఁబడకుండన్, దోఁచుముగఁ జిల్వ ఱేనికి, నూఱటఁగాఁ బుడమిదాల్చి యొకనాఁడంతన్. యయా. 1. 24.

3 స్వాస్థ్యము; స్వస్థచిత్తత.

ఆ. ఉమ్మలంబుదక్కి యూఱటతోడ నీవేఁగు మనలవలవదింక నిచట భార. విరా. 2. 80.

ఉ. ...భోజనృపాలకన్య నతుల్యత్తమ రాజుఁ గూర్చి నుం లూఱటఁ బొందిరి...నైష. 7. 86.

విశే. విశ్రాంతి నిచ్చునది; సహాయము

సీ. కుంభినీభృత్కుంభికుంభీనసేంద్రుల కూఱట యెవ్వనియురుభుజంబు వి. పు. 1. 46.

గీ. మాటిమాటికిఁ బొంకించి మందడీల, కెల్ల నూఱట యగుచు వర్తిల్ల నేర్తు. భా. విరా. 1. 95.

క. ఆ ధనము నీకు నచ్చిన, సాధనముగ నర్థ్య ముఖు సాగించి బుధారాధనము చేయు ని త్తా, యోధనచణులైన తమ్ము లూఱట గాఁగన్. జై. భా. 1 67. భా. రా. యు. 935.

**ఊఱడించు** స. క్రి. (√ ఊఱడు¹) ఊఱడఁజేయు. (ఓదార్చు)

క. అనవుడు మోమలరఁగ నజ్జనపతి లక్ష్మణునిఁజూచి చయ్యనఁ జని విప్రుని నూఱడింపు తత్పుతు, తనువు తగన్ సంగ్రహింపు తైలద్రోణిన్. నిర్వ 10 64.

సీ. సప్తపాతాళ విష్కంభమూల స్తంభ మూఱడించుచె నన్ను నుపేతాత్మ. భీమ. 3. 10.

సీ. గంలితయామున సైకతస్థలములనుండ మమ్మేమని యూఱడించె. భాగ. 10. ఉ. 492.

**ఊఱడిల్లు(లు)** — ఊఱడు¹.

(ఉపశాంతి నొందు)

ఉ. వీఁడె నలుండు విశ్వపృథివీవలయైకవిభుండు వచ్చుచున్నాఁడని భీమభూమిపతినందన యూఱడిలంగఁ బల్కు పూఁబోఁడుల మాట నేర్చికొని... నైష 3. 104.

క. అని వాఁడు మఱువు సొచ్చినఁ, గనికర మొదవంగ భద్రకాళీశ్వరి యోరి నిశాట యోడకోడకు మని యూఱడిలంగఁ బలుకు నత్తఱిలోనన్. రాజ. చ. 2. 84.

(స్వస్థమగు; స్వస్థచిత్తమగు)

ఆ. పగయ కలిగె నేని పాము న్నయింటిలో, నున్న యట్లుకాక యూఱడిల్లి, యుండు నెట్లు చిత్తము... భా. ఉద్యో. 3. 20.

ఆ. పను నిల్పినట్ల కా నూఱడిల్లు నీవున్న వన్న రేశ్వరోత్తముఁడు, నిర్భయుండ వగుము నీవు నా దెస నాకు, హరి గలఁడు. భార. ద్రో. 3. 22.

ఉ. ...అక్కారుణికుండు చెచె వనితాతుక మూఱడిలెన్ వధూటియున్. ఉ. రా. 6. 319.

(విశ్రాంతినొందు. విశ్రమించు.)

ఆ. పుట్టినింటి కేను బోయి యొక్కించుక, యూఱడిల్లి వత్తు నువిద నీవు, వింతతనము లేక విభునకుఁ బ్రియము నా, మాఱుగాఁ నొనర్చి మనుము నెమ్మి. పారి. పూ. 1 170.

**ఊఱడు**¹ — ఊఱడిల్లు. అ. క్రి. 1. విరమించు, ఊరుకుండు.

క. కాఱడవిఁ బఱచుమృగముల, నూఱడవధించి. భాం. ఆది. 4. 19.

(శ. ర. పాఠము-'ఊఱడకన్ దిగిచి' అనిముద్రిత)

వ. కృతవర్మ యాతనిం దాఁకి.

క. ఆఱమ్ములతనిమేన, దూఱంగా నేసి నాల్గు తురగంగములన్, గీటణంచినఁ గని ద్రోణుం, డూఱడి ధర్మజుని దెసకు నుమ్మఖుఁడయ్యెన్. భాం. ద్రో. 4. 12, 13.

2. ఉపశాంతి నొందు.

ఉ. ఈపగిది న్మురారి హృదయేశ్వరి నూఱడఁ బల్కి...పారి. 4. 15.

క. కనుఁగొని వెఱవకు వెఱవకుమని యూఱడఁబలికె సతీ నభయప్రదుఁడై ... విక్ర. 2. 65. ఉ. రా. 7. 217.

3. స్వస్థమగు; స్వస్థచిత్తమగు.

క. ...ఈవున్నను సుతు లందఱు నిండున్నట్టుల నాకుఁ జిత్త మూఱడి యుండున్. భాం. సభా. 2. 358.

క. ఉత్సాహంబున శత్రు కులోత్సాదనవిధి యొనర్చ యున్నత సామ్రాజ్యోత్సవము నొందు పుత్రుల, నుత్సుకతం జూతు గాక యూఱడుమింకన్. భాం. ఉద్యో. 3 206. భాం. శాం. 4 18.

జ. ఊఱట, ఊఱడించు, ఊఱడిల్లు.

**ఊఱడు**² స. క్రి. (క. ఊఱు = ఉంచు) అప్పగించు.

క. నిను నిట్లూఱడి పోయెను, మనుజేంద్రుఁడు నాకుఁ దగునె మానిని యిచ్చో, నిను డించి పోవ...భా. రా. అ. 2. 69.

(శ్లో. న్యాసభూతాసి వైదేహీ న్యస్తా మయి మహాత్మనా - సం రా. అ. 45. 16.)

**ఊఱు** స. క్రి ప్రోలు.

ఉ. వేలోకవంకం గొండగుహా వేశ్మము గాంగ
నులూకభర్త తన్నూతనవయంతలేసి బలి
యుర్ గలవాం డుపమర్దనాము డు...నా.
పంచ. 8. 9. (క. ఎ. పాఠము 'తనిక్తిరీన
యట్టి మంత్రులగమిన్' అని ముద్రి.)

**ఊల** వి. (చూ. ఊ. 2.) ఆర్తధ్వని, మొఱ్ఱ.

సీ. కాయసంధులు నవహో గ్రగంధు లొదవిన
బెట్టిదంబుగ నూలం బెట్టువారు. వేం. పంచ.
1. 688.

శా. పలల్ తందనతాన లేమయిన లేవే యంచు
బాధించునే, నూలం బెట్టంగం జాల మూఢ
న్నృపుం డోవలో నామహాసాహితి. కూలం
బుల్ నెవులాడ సౌమ్మసిలు నొచ్చుం జచ్చుం
దతక్కల్మషం, బేలా యుం బలిచేసి మ్రొక్కెదం
బదార్థేచ్ఛా నిశాచాంకన్. వేం. పంచ. 2.
138. ('ఊలల్ వెట్టంగ' చి. ని. పాఠము)

జ. ఊలమాలగుడుచు.

**ఊలమాలగుడుచు** అ. క్రి. (ఊల+మాల+కుడుచు) ఆర్తినొందు.

ద్వి. చిక్కిముడిం బొడుచు సిగ నిట్టి మిట్టి,
పడంగం బల్కులు తొట్రుపడ నూలమాల,
గుడుచుచు...నవ. 3. 80. పా ('గ్రుక్కిళ్లు
మ్రింగు' అని ప్రా — 'తహతహపడు' అని
క. ఎ.)

**ఊలుకొ(ల్కొ)లుపు** — నూలుకొలుపు న. క్రి.
(√ఊలుకొను)

(నెం కొలుపు, నిలుపు)

సీ. గుఱ్ఱి దప్పనీనియబ్బు పుంజూడ్కులు వాని
యుక్కుటీంగలమీంద నూలుకొలిపి. గీ.
గండికోట తుపాకిందండిబారు. బారుగా
నిల్చె...గంగా. 2. 4.

**ఊలుపి** నం. వి. న్. పుం. 1. జలజంతుభేదము. 2.
ఉలుచమీను, ఉలూపి.

**ఊలూకము** నం. — ఉలూకము.

**ఊల్కొ(లుకొ)ను** — నూల్కొను. అ. క్రి.
(ఒప్పు, తగు)

చ. ఘనపురుషార్థభూత మవంగాం దగునాత్మకు
నేసిమిత్తమై, యొనం నవర్థహేతు వన
నూల్కొను సంస్సృతి నంభవించు...భాగ.
4. 865.

జ. ఊలుకొలుపు.

**ఊళ** వి. (క. ఊళ్. త. ఊళై) 1. నక్కకూత.

మత్త. ...అయ్యెడ నిల్చి యదల్చె నప్డు
శివాళి యూళల...మనుచ. 4. 61.

గీ ...ఊళ యన ఐంబుకధ్వని... ఆం. భా.
1. 129.

2. ఆర్తధ్వని, మొఱ్ఱ.

క. ఊళలు వెట్టంగా డాకాలం న్వడిం దన్నుట
యు ఘుగాలున నోరం, బాలు వెడల నాసరి
మయు, జాలిగుడిచి మంచుకొండ చక్కికిం
బోవన్. వరాహ. 5. 68.

**ఊళిగము** — ఊడిగము.

ద్వి. కాళంగి నుంటియుం గరిములం బట్టి,
యూళిగంబులు నేయునుత్పలాతులును.
ప్రభు. 1. 68. పా. 5. పం.

**ఊవిళ్ళు(కులు, ఉవ్విళ్ళు** — (చూ. ఊవిళ్ళూరు)

**ఊవిళ్లూరు** — ఉవ్విళులూరు.

శా. ...పాలిండ్లపైం, బ్రోవు లోన్వసినభంగి
ముత్యాలకముల్ పుంఖాను పుంఖంబుగా,
నూవిళ్లూరుచుం జూచె భూవిభువి డా నొ
య్యారం పుం జూపులన్. పి. శకుం. 3. 51.

**ఊషకము** నం. వి. అ. న. ప్రభాతము, వేకువ.

**ఊషణ** నం. వి. ఆ. స్త్రీ. 1. పిప్పలి (వ్య. వి.) 2.
నవ్యము.

**ఊషణము** నం. వి. అ. పుం. చిత్రమూలము
(వ్య. వి.) న. 1. పిప్పలివేరు 2. సొంటి. 3.
మిరియము.

**ఊషము** నం. వి. అ. పుం. 1. చవుటిమన్ను 2.
రంధ్రము. 3. కర్ణరంధ్రము. 4. మలయపర్వ
తము. 5. వేకువ.

**ఊషరజము** నం. వి. అ. న. చవుటియుప్పు.

**ఊషరము** నం. విణ. (అ. ఆ. అ.) చవుటిది. (నేల)

**ఊష్మ(ము)** సం. వి. అ. న్. పుం. 1. వేఁడిమి.

చ. ఘనతరశంపఁ గంచ మిడి కాటుకఁ దీర్చి పునుంగినోష్మఁ దట్టినది యలాది...ఆము. 2. 16.

మ. ఇనరశ్మిల్ తృష వార్ధిఁ జేరి జల మొక్కింతాన నాత్మోష్మఁ జుయ్యని వెంటం బోగ ముంచికో...ఆము. 4. 69.

2. ఉమ్మ, ఉక్క. 3. వేసఁగి. 4 ఆవిరి. వి. న్. పుం. (వ్యాక) 'శ ష స హ'లలో నొకటి.

**ఊష్మకము** సం. వి. అ. పుం. వేసఁగి.

**ఊష్మలము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఉమ్మ గలది. 2. ఆవిరి గలది. 3. వేండ్రమైనది.

**ఊష్మాగమము** సం. వి. అ. పుం. 1. గ్రీష్మము, వేసఁగి. 2 వేసఁగియొక్క రాక.

**ఊష్మోపగమము** సం — ఊష్మాగమము.

**ఊసర** వి. (సం. ఊషరః) ఊషరక్షేత్రము, చౌటి నేల. ఆం. భా. 2. 5.

**ఊసరము**[1] విణ. కృశించినది. (శ. ర.)

జ. ఊసరిల్లు.

**ఊసరము**[2] విణ. (సం. ఊషరః. క. ఊసరవు) చవుటిది. (నేల)

**ఊసరవెల్లి** వి. (క. ఊసరవల్లి) బింబము, మూఁడు రంగులుగల తొండ.

గీ. వేగ నేతెంచి యూసరవెల్లితొండ, పాదము లనుండి తలదాఁకఁ బ్రాఁకెనేని యతఁడు వస్త్రానములఁ జూచు యముని మొగము. కాశీ. 5.261. (ద్రుతమారుహ్య సరటస్త్రివర్ణో యస్య మస్తకమ్, ప్రయాతి యాతి తస్యాయుః షణ్మాసే పరిసంఖ్యయమ్ - మూలము)

ఉ. ఊసరవెల్లిచందమున నొక్కట బిఱనరాలు దేరఁగా...మనుచ. 4. 79.

ముదిరినతొండ. (వాడుక, గ్రా.)

సా. తొండ ముదిరి యూసరవెల్లి యైనట్లు. 'తొండ' అని ఆం. భా. 2. 87.

**ఊసరిల్లు** అ. క్రి (√ఊసరము[1]) చిక్కు, కృశించు. (శ. ర.)

**ఊసిల్లు** — ఉసుళ్ళు.

సీ. ...వల్మీకమతిక యూసిళ్ళు నాఁగను బహుతచే నలరియుండు. ఆం. భా. 2. 65.

**ఊసివానము** వి. (సం. ఉచ్ఛ్వాసః) ఊర్ధ్వశ్వా.(శ.ర.)

**ఊసు** - ఉబుసు.

ఊసుపోవు-ఉబుసుపోవు, కాలక్షేపమగు.

క. జనపతికి నింక నే నేమనిచెప్పిన నేమియగును నది గడచనె నై,నను నూసుపోక వెడియు. ననియెద నొకమాట రఘువరానుజనితో౯. నిర్వ. 9. 26.

**ఊహ** సం. వి. ఆ. స్త్రీ. — ఊహము (కే. ని.)

**ఊహనము** సం. వి. అ. న. ఊహించుట.

**ఊహనీయము** సం. — ఊహ్యము.

**ఊహము** సం. వి. అ. పుం. 1. వితర్కము, అపూర్వార్థము నుత్ప్రేక్షించుట, ఊహించుట. 2 పరీక్షణము, ఏదేని విమర్శించి నిర్ణయించుట. 3. (మీమాంస) అనన్వితార్థకము లగువిభక్తి లింగములను త్యజించి అన్వయయోగ్యములగు విభక్త్యాదులను కల్పించుకొనుట 4. (పదార్థరిముచేత ఆకాంక్షను పూరించుటకైన) అధ్యాహారము, లేనిమాటలను గొన్నిటిని దెచ్చుకొనుట. 5. ఆరోపము.

**ఊహి** సం. విణ. (న్. నీ. న్.) ఊహము కలవాఁడు, ఊహించువాఁడు.

**ఊహించు** సం. స. క్రి. వితర్కించు, ఆలోచించు.

మ. ...విద్యలా,తతతీవ్రార్థయ బున ద్దలఁకి యత్యంతంబు వాపోయెడి౯, ధృతి నీ రాజు ను నోడకుం డనుచు నేతెంచెం గతం బేమియో

వ. అని యూహించి. మార్క. 1. 148. 149.

**ఊహితము** సం. విణ. (అ. ఆ. అ.) ఊహింపఁబడినది.

**ఊహితవ్యము** సం — ఊహ్యము.

**ఊహ్యము** సం. విణ. (అ. ఆ. అ) 1. తర్క్యము, విచారము నేయఁదగినది. 2. అధ్యాహార్యము, ఆకాంక్షను పూరించుటకై తెచ్చుకొనఁదగినది.

# ఋ

**ఋ** సం. ఒకానొక వర్ణము.

**ఋక్కు** సం. వి. చ్. స్త్రీ. – దేనిచే దేవతలు స్తుతింపఁబడుదురో అది – 1. ఛందోబద్ధమగు వేద మంత్రము. 2. ఋగ్వేదము.

**ఋక్థము** సం. వి. అ. న. 1. ధనము, రిక్థము. 2. పితృధనము, దాయము. 3. బంగారు.

**ఋక్షగంధ** సం. వి. ఆ. స్త్రీ. 1. వృద్ధదారకము, బొద్దికూర (వృ. వి.) 2. క్షీరవిదారి, పాలగుమ్ముడు. (వృ. వి.).

**ఋక్షగంధిక** సం. – ఋక్షగంధ.

**ఋక్షము** సం. వి. అ. పుం. 1. ఎలుఁగుగొడ్డు. 2. రైవతకపర్వతము. 3. భల్లకమనువృక్షము. 4. శ్యోనాకవృక్షము, దుండిగము (వృ. వి.) న. 1. నక్షత్రము. 2. మేషాదిరాశి.

**ఋక్షరము** సం. వి. అ. న. వానధార. వి. అ. పుం. కంటకము, ముల్లు.

**ఋక్షరాజు** సం. వి. అ. పుం. చంద్రుఁడు. 2. జాంబవంతుఁడు.

**ఋక్షరుఁడు** సం. వి. అ. పుం. ఋత్విజుఁడు.

**ఋక్షి** సం. వి. ఈ. స్త్రీ. ఆఁడు ఎలుఁగుబంటి.

**ఋక్సంహిత** సం. వి. ఆ. స్త్రీ. ఋగ్వేదమున మంత్రాత్మకమగు భాగము.

**ఋగ్యజుషము** సం. వి. అ. న. ఋగ్వేదయజుర్వేదముల సముదాయము.

**ఋగ్వేదము** సం. వి. అ. పుం. ఒకానొక వేదము.

**ఋచీకుఁడు** సం. వి. అ. పుం. జమదగ్ని తండ్రి, గుష్యంత పౌత్రుఁడు, భృమన్యు పుత్రుఁడు.

**ఋచీషము** సం. వి. అ. న. 1. నరకభేదము. 2. పిండివంట చేసెడు పాత్రము.

**ఋజిమ** సం. – ఋజిమము.

**ఋజిమము** సం. వి. న్. పుం. ఋజువగుట, ఋజుత్వము.

**ఋజిష్ఠము** సం. విశే. (అ. ఆ. అ.) మిక్కిలి ఋజువైనది. ఋజుతమము.

**ఋజీయము** సం. విశే. (స్. సీ. స్.) ఋజుతరము, ఎక్కువ సరళమైనది.

**ఋజీషము** సం. వి. అ. న. 1. పిండివంట చేసెడు పాత్రము. బూరెల మూఁకుడు. 2. నరకభేదము. 3. సారము తీసివేసిన సోమలతయొక్క చూర్ణము.

**ఋజుతము** సం. విశే. (అ. ఆ. అ.) – ఋజువు

**ఋజుకాయుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) ఋజువైన శరీరము కలవాఁడు. వి. అ. పుం. కశ్యపముని.

**ఋజుగము** సం. విశే. (అ. ఆ. అ.) 1. తిన్నగాఁ బోవునది. 2. నిష్కపటముగా వ్యవహరించునది. వి. అ. పుం. బాణము.

**ఋజువు** సం. విశే. (ఉ. ఉ, ఈ. ఉ.) 1. సరళము, వంకర లేనిది 2. నిష్కపటము. 3. ఉత్పత్తిరహితము, పుట్టుకలేనిది. (వై. ని.)

**ఋజూకరణము** సం. వి. అ. న. ఋజువైనదానినిగాఁ జేయుట.

**ఋజూకృతము** సం. విశే. (అ. ఆ. అ.) ఋజువుగాఁ జేయఁబడినది.

**ఋణకర్త** సం. విశే. (ఋ. త్రీ. ఋ.) అప్పు చేసినవాఁడు.

**ఋణగ్రస్తుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) అప్పుపడ్డవాఁడు.

**ఋణగ్రహుఁడు** సం. విశే. (అ. ఆ. అ.) అప్పు పుచ్చుకొనువాఁడు.

**ఋణగ్రాహి** సం. విశే. (న్. నీ. న్.) – ఋణగ్రహుఁడు.

**ఋణదాత** సం. విశే. (ఋ. త్రీ. ఋ.) అప్పిచ్చువాఁడు.

**ఋణదాయి** సం. విశే. (న్. నీ. న్.) ఋణదాత.

**ఋణదాసుఁడు** సం. వి. అ. పుం. తనయప్పు తీర్చినవానికి దాసుఁడైనవాఁడు.

**ఋణమత్కుణుఁడు** సం. వి. అ. పుం. ప్రతిభువు, జామీనుదారుఁడు.

**ఋణమార్గణుఁడు** సం. – ఋణమత్కుణుఁడు.

**ఋణము** సం. వి. అ. న. 1. అప్పు; దేవాది ఋణము. (ఇది దేవఋణము పితృఋణము ఋషిఋణము – అని మూఁడు తెఱఁగులు 'దేవా

నాంచ పితౄణాంచ ఋషీణాంచ తథానఘ, ఋణవాన్ జాయతే'. కల్ప. 'మనుష్య ఋణముతో నాల్గు తెఱఁగులు' అని సం. భా. ఆది. 126. 16.) 2. దుర్గభూమి. 3. జలము. 4. (బీజగ) తీసివేయు సంఖ్య; తీసివేఁతగుర్తు.

**ఋణముక్తుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) ఋణము నుండి విముక్తుఁడైనవాఁడు, అప్పుతీర్చుకొనిన వాఁడు.

**ఋణలేఖ్యము** సం. వి. అ. న. అప్పు పత్త్రము.

**ఋణవంతుఁడు** సం. విణ (క. వతీ. క.) అప్పు పడ్డవాఁడు, ఋణము గలవాఁడు.

**ఋణాంతకుఁడు** సం. వి. అ పుం. అంగారకుఁడు. (అంగారక గ్రహోపాసనముచే ఋణవిముక్తి యగును.)

**ఋణాపనయనము** సం. వి. అ. న. ఋణముతీర్చుట. (ఇట్లే ఋణాపనోదనము, ఋణాపాకరణము, ఋణశోధనము, ఋణముక్తి, ఋణమోక్షము, మొ.)

**ఋణార్ణము** సం. వి. అ. న. (ఋణ+ఋణ) అప్పు తీర్చుటకై చేసిన మఱియొక యప్పు.

**ఋణి** సం. విణ. (న్. నీ. న్.) అప్పుపడినవాఁడు, ఋణగ్రస్తుఁడు.

**ఋణికుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) – ఋణి.

**ఋణిధనిచక్రము** సం. వి. అ. న. (జ్యోతి) అర్వణము చూచెడు ఒకానొక చక్రము.

**ఋతంభరుఁడు** సం. వి. అ. పుం. – సత్యపాలకుఁడు – పరమేశ్వరుఁడు.

**ఋతధాముఁడు** సం. వి. న్. పుం. విష్ణువు.

**ఋతధ్వజుఁడు** సం. వి. అ. పుం. 1. శివుఁడు. 2. ఒక బ్రహ్మర్షి.

**ఋతము** సం. విణ. (అ. ఆ. అ.) 1. సత్యమైనది. 2. పూజింపఁబడినది 3. దీప్తము, ప్రకాశ మొందినది. 4. ప్రాప్తము, పొందఁబడినది. వి. అ. న. 1. ఉంఛశిలవృత్తులు. 2. జలము. 3. మోక్షము. 4. సత్యము. 5. పరబ్రహ్మము. 6. ప్రాప్తి. 7. యజ్ఞము.

**ఋతవ్యము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఋతుభవము, ఋతువువంటిది. 2. ఋతుదేవతాకమైనది.

**ఋతి** సం. వి. ఇ. పుం. శత్రువు. స్త్రీ. 1. గతి, పోక. 2. స్పర్ధ, పోటి. 3. జుగుప్స, రోఁత. 4. త్రోవ. 5. మంగళము.

**ఋతింకరుఁడు** సం. విణ. (అ. ఈ. అ.) ఋతిని చేయువాఁడు.

**ఋతీయ** సం. వి. ఆ. స్త్రీ. 1. జుగుప్స, రోఁత. 2. కృప.

**ఋతుఁడు** సం వి. అ. పుం. సూర్యుఁడు.

**ఋతుకాలము** సం. వి. అ. పుం. 1. వసంతాది ఋతుకాలము. 2. గర్భధారణకు యోగ్యమగు కాలము. (ఋతువైన దినము మొదలు పది యాఱు రాత్రులు ఋతుకాల మనఁబడును.)

**ఋతుగామి** సం. విణ. (న్. నీ. న్.) ఋతుకాలమందే భార్యను పొందువాఁడు.

**ఋతుపతి** సం. వి. ఇ పుం. వసంతర్తువు

**ఋతుపర్ణుఁడు** సం. వి. అ పుం. అయోధ్యాపుర రాజులలో నొకఁడు. (నలునకు అక్షహృదయ ముపదేశించి అశ్వహృదయ మతనివలనఁ బడసిన వాఁడు.)

**ఋతుప్రాప్తము** సం. విణ. (అ. ఆ. అ.) ఫలేగ్రహి, అవంధ్యము, గొడ్డుదికానిది. (వృక్షము.)

**ఋతుమతి** సం. వి. ఈ. స్త్రీ. పుష్పవతి, ముట్టుత.

**ఋతువు** సం. వి. ఉ. పుం. 1. రెండు మాసముల కాలము. (ఋతువులు ఆఱు:- వసంతఋతువు, గ్రీష్మఋతువు, వర్షఋతువు, శరదృతువు, హేమంతఋతువు, శిశిరఋతువు.) 2. ఆఱు అనుసంఖ్య. 3. స్త్రీరజస్సు. 4. దీప్తి, వెలుఁగు. 5. గర్భధారణ యోగ్యమగు కాలము. 6. మాసము.

**ఋతువృత్తి** సం. వి. ఇ. పుం. సంవత్సరము.

**ఋతుసాత్మ్యము** సం. వి. అ. న. ఋతువునకు దగిన పథ్యాదికము.

**ఋతుస్నాత** సం. వి. ఆ. స్త్రీ ఋతుస్నాతము చేసిన స్త్రీ.

**ఋతుస్నానము** సం. వి. అ. న. ఋతుమతి నాల్గవ

దినమున శుద్ధికొఱకు చేయు స్నానము.

**ఋత్విక్కు-** నం — ఋత్విజుఁడు.

**ఋత్విజుఁడు** నం. వి. క్. పుం. యాజకుఁడు, (యజ్ఞకర్త చేత దక్షిణ పుచ్చుకొని) యజ్ఞము చేయించు బ్రాహ్మణుఁడు (హోత, ఉద్గాత, అధ్వర్యువు, బ్రహ్మ-అని వీరు నలువురు వీరిలో ఒక్కొక్కనికి ముగ్గురుచొప్పున, బ్రాహ్మణాచ్ఛంసి, ప్రస్తోత, మైత్రావరుణుఁడు, ప్రతిప్రస్థాత, పోత, ప్రతిహర్త, అచ్ఛావాకుఁడు, నేష్ట, ఆగ్నీధ్రుఁడు, సుబ్రహ్మణ్యుఁడు, గ్రావస్తుతుఁడు ఉన్నేత-అని పదునాఱుగురు సహాయ ఋత్విజులు.)

**ఋద్ధము** నం విశే. (అ. ఆ. అ.) 1. సమృద్ధము. 2. పెరిగినది. 3. మూర్చి తూర్పెత్తుటకు సిద్ధముగా నుంచినది (ధాన్యము). వి. అ. న. 1. వృద్ధి, పెనుపు. 2. సమృద్ధి. 3 సిద్ధాంతము.

**ఋద్ధి** నం. వి. ఇ. స్త్రీ. 1. వృద్ధి, పెంపు. 2. సమృద్ధి. 3 సిద్ధి 4. పార్వతి. 5. లక్ష్మి. 6. గంధద్రవ్యవిశేషము. 7. కుబేరుని భార్య.

**ఋభుక్షము** నం. వి. అ. పుం. 1. దేవతలు వసించునది – స్వర్గము. 2. వజ్రము

**ఋభుక్షుఁడు** నం. వి. అ. న్. పుం. (నకారాంతమైనప్పుడు మూలరూపము 'ఋభుక్షిన్.' సమాసమున దు ఋభుక్షిపురము, ఋభుక్షిసభ, మొ. రూపములగును.) – వజ్రస్వర్గములు గలవాఁడు – ఇంద్రుఁడు.

**ఋభువు** నం. వి. ఉ. పుం. 1. వేల్పు, దేవత 2. దేవతలకుఁగూడ యజింపఁదగిన దేవుఁడు. 3. చాక్షుష మన్వంతరపు దేవగణ భేదము. 4. రథకారుఁడు.

**ఋశ్య** నం. వి. అ స్త్రీ. మనుఁబెంటి, ఒకజాతిమృగి.

**ఋశ్య(ష్య)కేతనుఁడు** నం. వి. అ. పుం – ఋశ్యకేతువు.

**ఋశ్య(ష్య)కేతువు** నం. వి. ఉ. పుం. అనిరుద్ధుఁడు. (వై. ని – మన్మథుఁడని కొందఱు.)

**ఋశ్యదము** నం వి. అ. పుం. మనుఁబోతులను బట్టుటకై త్రవ్వినగోయి, ఓదము.

**ఋశ్యప్రోక్త** నం. వి. ఆ. స్త్రీ. 1. దూలగొండి (వృ. వి.). 2. పిల్లపీఁచర (వృ. వి.). 3. అతిబల, ముత్తవపులగము (వృ. వి.) 4. ఋద్ధియను గంధద్రవ్యము (వృ. వి.)

**ఋశ్యము** నం. వి. అ. పుం. ఋష్యము, మనుఁబోతు, ఒక జాతిమృగము

**ఋషభకము** నం. వి. అ. పుం. ఓషధి విశేషము.

**ఋషభతరము** నం. వి. అ. పుం. బరువు మోయుటకు తగిన ప్రాయము రానియెద్దు, చిన్నగిత్త.

**ఋషభద్వీపము** నం. వి అ. పుం, న. శ్వేతద్వీపము.

**ఋషభధ్వజుఁడు** నం వి. అ. పుం. శివుడు. (ఇట్లే ఋషభకేతనుఁడు, మొ.)

**ఋషభము** నం. వి. అ. పుం. 1 వృషభము, ఎద్దు. 2. మదించిన ఏనుఁగు. 3. సప్తస్వరములలో నొకటి. 'రి' 4. కర్ణరంధ్రము. 5. పందితోఁక. 6. మొసలితోఁక. 7. శృంగి యనుగంధద్రవ్యము (వృ. వి.) 8. ఒకానొక యజ్ఞము. 10. ఒకానొకసామము

**ఋషభి** నం వి. ఈ. స్త్రీ. 1. మీసములు మొదలగు పురుషలక్షణములుగల స్త్రీ. 2. విధవ. 3. దూలగొండి (వృ. వి.).

**ఋషభుఁడు** నం. వి. అ. పుం. 1. ఒకముని. 2. విష్ణుని యవతారభేదము. విశే. అ. పుం. శ్రేష్ఠుఁడు. (ఉదా: పురుషర్షభుఁడు, వానరర్షభము, మొ.)

శ్లో. ...స మే ఋషీణామృషభః ప్రసీదతామ్. సం. భాగ. 2. 4 22.

**ఋషి** నం. వి. ఇ. పుం – జ్ఞానముచే సంసార పారము నొందినవాఁడు – వసిష్ఠాది. 1. (సప్తర్షులు-మరీచి, అత్రి, అంగిరుఁడు, పులస్త్యుఁడు, పులహుఁడు, క్రతువు, వసిష్ఠుఁడు. మఱియొక మన్వంతరమున - కశ్యపుఁడు, అత్రి, భరద్వాజుఁడు, విశ్వామిత్రుఁడు, గౌతముఁడు, జమదగ్ని, వసిష్ఠుఁడు. వీరు దేవర్షులు, రాజర్షులు-బ్రహ్మర్షులు - అని మూఁడు తెగలు. మఱియొక క్రమమున-మహర్షి, పరమర్షి, శ్రుతర్షి, కాండర్షి అని నాలుగు తెగలు) 2. శాస్త్రకారుఁడగు ఆచార్యుఁడు. 3. మంత్రద్రష్ట,

మంత్రములు కనిపట్టినవాఁడు. 4. వేదము. 5. కిరణము. 6. చక్షురాది జ్ఞానేంద్రియము (శే. ని.)

**ఋషిజాంగలము** నం. వి. అ. పుం. ఋషగంధ, బొద్దికూర (వృ. ని.)

**ఋషిజాంగలికి** నం. వి. ఈ. స్త్రీ.— ఋషిజాంగలము.

**ఋషితర్పణము** నం. వి. అ. న. ఋషులను గూర్చి చేయు జలతర్పణము.

**ఋషిపంచమి** నం. వి. ఈ. స్త్రీ. భాద్రపద శుక్ల పంచమి. (ఇందు సప్తర్షుల నుద్దేశించి వ్రత మాచరింతురు.)

**ఋషిప్రోక్త** నం. వి. అ. స్త్రీ. మాషపర్ణి, కారు మినుము (వృ. ని.)

**ఋషియజ్ఞము** నం. వి. అ. పుం. వేదాధ్యయన రూప మగు బ్రహ్మయజ్ఞము.

**ఋష్టి** నం. వి. ఇ. పుం. స్త్రీ. 1 రెండు ప్రక్కల వాదరగల కత్తి; కత్తి. 2. ఆయుధము

**ఋష్య** నం — ఋశ్య.

**ఋష్యకము** నం — ఋష్యము.

**ఋష్యగంధ** నం. వి. అ. స్త్రీ — ఋషగంధ.

**ఋష్యగత** నం — ఋష్యప్రోక్త.

**ఋష్యజిహ్వము** నం. వి. అ. న. మహా కుష్ఠరోగ భేదము.

**ఋష్యప్రోక్త** నం. వి. అ స్త్రీ. 1. శతావరి, పిల్లి పీచర (వృ. ని.). 2. అతిబల, ముత్తవ పులగము (వృ. ని ). 3. శూకశి బి, దూలగొండి (వృ.ని.). 4. మాషపర్ణి, కారు మినుము (వృ.ని.).

**ఋష్యము** నం — ఋష్యము.

**ఋష్యమూకము** నం. వి. అ. పుం. పంపాసరస్సు నకు దగ్గఱనున్న పర్వతము.

**ఋష్యశృంగుఁడు** నం. వి. అ. పుం — ఋష్యమృ గము కొమ్మువంటి కొమ్ము గలవాఁడు — ఒక ముని. (విభాండకునికి ఋష్యమృగియందు బుట్టిన కొడుకు. ఇతనికి నెత్తియందొక కొమ్ము గలదు. ఇతని భార్య శాంత. ఇతఁడు దశరథుని చేత పుత్రకామేష్టి చేయించినవాఁడు.)

# ౠ

**ౠ** నం. ఒక అక్షరము.

# ఌ

**ఌ** నం. ఒక అక్షరము.

# ౡ

**ౡ** నం. ఒక అక్షరము. (కొందఱమతమున.)

# ఎ

**ఎ**[1] ఒకానొక యక్షరము.

**ఎ**[2] — ఏ[1] అవ్య. 1. అవధారణార్థకము.

గీ. వెంటనె తపోగ్ని ఘోరమై వెడలుటయును. దశా. 4. 78.

సీ. అఘటనప్రఘటనోద్యముఁడవౌటకు జాలు నీటిపైఁ దేలించు నేర్పె సాక్షి. ఉ. రా. 1. 151.

2. నిర్దేశమును (చూపుటను) బలపఱుచును.

చ. హరుఁ డదె చిక్కె నింక ననురాధిపుచేఁ దెగు నంచుఁ బొంగి భీకరముగ దైత్యు లార్వఁగ... భార. అర. 5. 260.

చ. ఇదెయొక పిన్నవాఁ డడరి యెక్కుడు మూఁకల క్రందు ద్రోలెడుఁ. భార. ద్రో. 2. 11.

సీ. అల్లదె శింశుమారాకారహరిమూర్తి వీఁడె భాస్వంతుఁడు వాఁడె ధ్రువుఁడు వీరె సప్త ర్షులు వారె యశ్విన్యాదు లిరువాడ దేవేరు లిందుభార్య. కీ ల్లవాఁడె సుధాకరుండవె గ్రహంబు, లివ్వలాఖ్యంబు లగుచుక్క లివె కెలఁకుల, ననుచు మాతలి చూపంగ... హరి 7. 119

3. అల్పత్వమును (తక్కువను) తెలుపును.

ఉ. పూని ముకుందునాజ్ఞఁ గనుబొమ్మనె కాం చి.... ఆము. 1. 4.

4. అధిక్యమును (ఎక్కువను) తెల్పును.

ఉదా: అతనిని శేషుఁడె వర్ణింపలేనపుడు ఇత రులు చాలరని చెప్పనేల ?

5. తనంతటఁదాను (అన్యప్రేరణములేక) అను

గీ. పాతకుఁడ కాన యెంగిలిచేతఁ గాకి, వేయఁ జాలవు....వరాహ. 2. 146.

ఎంగిలిమంగలము — ఎంగిలియైన మంగలము వంటిది, అపవిత్రము

మ. కులదైవం బని యల్కఁ బూసి గుడి ముగ్గు ల్పెట్టి కైసేయ లో, వలికి కెంగిలిమంగ లంబులగు దొప్పల్ రాఁ గతం బేమి... కాశ. 3. 96.

జ: ఎంగిలించు.

**ఎంగిలించు** స. క్రి. (√ఎంగిలి) ఎంగిలిచేయు, ఉచ్ఛిష్టము కావించు.

సీ. మొన లావులించి వాసన సల్ల బసిగొని తేఁ దేఁటిగము లెంగిలింపకుండ. గీ. మున్ను గొనివచ్చి గణికాసమూహితోడ, గిరిజ పూజించెఁ బసిఁడితామరల వరదు. కు. సం. 3. 351. ('ఎంగులించు' వ్రాఁతప్రతి. 'పఁగులించు' ముద్రి.)

**ఎంగెన** వి. ఒకజాతి అడవిచెట్టు.

**ఎంచు** — ఎన్ను. స. క్రి. 1. గణించు, లెక్కించు.

ఉదా: ఆకాయ లెన్ని యున్నవో ఎంచి చెప్పుము.

2. ఉన్న దున్నట్లు నిరూపించు

ఉ. ఎంచి నుతింప శక్యమె యహీశ్వరునంతటి వానికైన...శితశైలముల్. హర. 5. 21.

3. సరకుసేయు, పాటించు.

ఉ. ...నిజకార్యము లెంతురె మిత్త్రతత్పరుల్. వసు. 4. 8.

4. ప్రశంసించు, మెచ్చు, పొగడు.

క. దాంతుఁడయి రఘువీరుఁడు, దాంతకుతూహలముతోడఁ దండ్రి వనుప బ్బాం, దాంతకు లెంచఁగ మునిబృం, దాంతకు క్రతురక్ష కరిగెఁ దమ్ముఁడు గొలువన్. ఉ. రా. 1. 81.

5. ఆక్షేపించు, నిరసించు.

సీ. ముద్దునెమ్మొగము తమ్ముల నెంచు చేచోద్య మిందుబింబముచంద మెనసియుండ. దశా. 2. 239.

క. పరసతికూటమిఁ గోరకు, పరధనములు కాస పడకు పరు నెంచకుమీ. సు. శ. 72.

6. భావించు.

సీ. ఒకవేళఁ దనయందు సకల ప్రపంచంబు కల్పితంబని యెంచి కాంచి నవ్వు. సీతారా. 3. 179.

7. సంకల్పించు.

సీ. పెల్లు నల్లిండ్లు నిల్పెదనన్న వదలించుఁ గొలువు గావింప నెంచినను గసరు విప్ర. 3. 15.

క. అని పలికి మౌని యరుగఁగ, ధనలాభము లేమి దెలిసి తహతహతోడన్, జన నెంచ నతని వ్యాకులతయు, బనుపమమతి నెఱిఁగి యమ్మహారాజనియెన్. ఇందు. 1. 180.

8. స్మరించు.

మ. త్త అ. గఁ తునిప త మెంతయు న ... కనంతవి.క్రాంతిఁ బ గ నో కెట్టటు కాని యి నియఁ సై,రి తు న ను సాహసం బొ నరించి.యే నిటు వచ్చితిఁ, గొంత వెండయు నింద్రు నెంచుచుఁ గొంచితిన్ నిను డగ్గఱన్. కళా. 5. 258.

చ. అని గురుఁ డానతిచ్చినఁ దదాం ణోక్తికిఁ బొంగి వేగ వందన మొనరించి మాట జవ దాఁటుట శిష్యలక్షణంబు గాదని మును సన్మునిప్రవరు లాడినవాక్యము లెంచి యంతయున్, వినయ మొలర్ప మ్రొక్కితిని వేమఱు నగ్గురు భక్తివైఖరిన్. ఇందు. 1. 171.

9. పరిశీలించు, విమర్శించు.

చ. నిను నెదిరింపఁ గోరుటలు నిక్కము సింహకిశోరకంబుతో, వని ఘటియింప నక్కహృదయంబున గోరుట లెంచి చూచినన్. చంద్రా. 6. 103.

10. ఊహించు

ఉ. ....ఎట్లయిన శ్రీతరుణీమణి వచ్చునట్లుగా, నొక్కయుపాయ మెంచవలె నూహ యొనర్చితి లక్ష్మిరాకకున్. దశా. 2. 84.

11. ఆరోపించు.

శా. ...తల్లీ నిన్ను శోధింప కే, నేరం బెంచితి వంతఁ జెందకుము...ఉ. రా. 1. 193.

12. ఏఱు, ఎన్ను.

ఉ. అల్లద్విజుండు రాండు నడవాయెం గదా నాథనందనుం, డుల్ల మెలం ప నవ్విని యెనో విని యుద్వహనేచ్ఛ యాత్మలో, నుల్లసిలంగ నెంచెనొ మఱొక్కతె నెవ్వతె నైన నెంచెనో, పల్లవపాణులారం యల భావజుకారిం బడంగ శక్యమే ఇందు. ౪. 12. 13. అనుకొను, భ్రాంతిచే తలంచు.

సీ. ఎండమావులు గాంచి మోడునీ రని యెంచి క్రేళ్లుదాంటుచుం జాలుతేళ్ళ సౌరు ఇందు. ౫. 94.

**ఎండ** వి. (√ఎండు) సూర్యప్రకాశము, ఆతపము.

ఎండకన్ను వానకన్నును నెఱుంగని—రాణి వాసమునుండి బయటికి రాని.

ఆ. వచ్చి రెండకన్ను వానకన్నును నెఱుంగని పురంధ్రు లెల్ల...అక్కురువృద్ధుం జూడ. భార. ఆశ్ర. 1.143.

ఇట్లే: ఎండకన్ను నీడకన్ను నెఱుంగని

గీ. క్రీడమై నెండకన్నును నీడకన్ను నెఱుంగ కన్నలం ఉమ్మలు హితులం సుతులం. గూడి సుఖమున్న వారము కోర్కు లొదవ, సత్క సల్లాప యోవారిశ్చంద్ర భూప. హరిశ్చ. 1. 212.

ఎండగొట్టు — ఎండదెబ్బ.

సీ. త్రావ నీ ప్పడనివి స్తం దు స్తం పుంద్రోన నెత్తు పైనముగాంటి యెండగొట్టు, మదహస్తిం గని గత్తజెదం చిల్లంగొనెం బడవై చికదలు నప్పుంటిగోడు. రా. వి. 2. 69.

**ఎండదొర** వి. (ఎండ+దొర.) ఎండఱేడు, సూర్యుడు.

గీ. విపులఖండరక్షితి నవ్విపినసీమ, యండగొని యెండదొరం బోరకరయం బిలుచు, వీక ఘూకమహోత్కటుల్ వెలయుం జీమ. లైనం దూఱంగరాని యశ్మాన నధిప. శేష. 2. ఆ. (శ. ర.)

**ఎండ పనుపు** వి. నీరెండచే వస్తువులందు తాత్కాలికముగ నేర్పడు పసిమి.

ఆ. ఊంత నీరు చెలంది నేతమూ టయిటి, దూది యెండపనుపు దొట్టియక్క రంబు ... ఆము. 6. 62.

**ఎండమావులు** వి. బ. (క. బిసిలుకుదురె — ఎండ గుఱ్ఱము. — ఎండ+మావులు- ఎండలో గుఱ్ఱము వలె చలించుచుం గనంబడుఛాయలు) మట్ట మధ్యాహ్నమున బయళ్లయందు నీటివలెం దోంచెడు ఛాయలు, మృగతృష్ణ.

సీ. ఎండమావులు గాంచి మోడునీ రని యెంచి క్రేళ్లుదాటుచుం జాలుతేళ్ళ సౌరు. ఇందు. ౫. 94.

సీ. నేలయు నింగియుం దాలముల్ వాయింప నెండమావులం బట్ట బండతలయు, మోంకాలు ముడివెట్ట....కు సం 8. 185.

గీ. తెలుపులుగం దోంచె నెండమావులబయిళ్లు. ఆము. 2. 46.

**ఎండఱేడు** వి (ఎండ+ఱేడు) సూర్యుడు.

ఆ. ఎండఱేడు గ్రుంకుకొండ నడంగె ద్వా. 1. 253.

**ఎండు** అ. (క్రి. నిర్ద్రవమగు; నీరసమగు, నిస్సారమగు.

ఉ. ఎండెం గొలంకు లెల్లను....కాశ. 1. 128.

గీ. అలంతం గుత్తుక యెండంగా నవ్విభుండు, గరణం బత్యతమై నన్నుం గావండయ్యె. జై. భా. 7. 210.

ఉదా: బట్ట యెండినది. ఆపిల్ల తిండి లేక యెండి పోయినది.

ఎండంగట్టు—ఆఱంగట్టు.

ఉదా: చేను ఎండంగట్టెను. తిండి పెట్టక పిల్లను ఎండంగట్టెను.

ఎండంజాఱు—ఎండిపోవుటకు సిద్ధమగు.

సీ. పైవరామశిక చొప్పడమిం బక్వము దప్పి పండంజాఱినపొల మెండంజాఱె. మనుచ. 8 129.

ఎండంబెట్టు—ఎండుటకై యెండలో నుంచు.

ఉదా: వరుగులు ఎండంబెట్టుము.

ఎండంబోయు—ఎండుటకై పోయు

ఉదా: ధాన్య మెండంబోసినారు.

జ: ఎండ, ఎండదొర, ఎండమావులు, ఎండఱేడు, ఎండుగులు, ఎండుతెవులు, ఎండుపుంటట.

**ఎండుగు (పు) లు** వి. బ. (√ ఎండు) ఎండంబోసిన ధాన్యము.

చ. కలనుపుతెండుగుల్ ద్రవిడ కన్యలు ముంగిటఁ గాచియుండి...ఆము. 1. 75.

క. ముంగిళ్ల నెండువులు గా,వంగఁబడవు గలుగు పట్టునం గాపు ఘనం, బెంగిలిమెతుకులు చల్లుట, యుం గలుగదు మున్ను వోలె నుర్విఁ దలుచుగఁ. కేయూర. 3. 84.

**ఎండుతెవులు** వి. (√ ఎండు) దేహము శుష్కించెడు వ్యాధి విశేషము. (శ. ర.)

**ఎండుపుఁదట్టు** (√ఎండు) వి. ఏదేని యెండఁబెట్టుటకు వెదురు బద్దలు లోనగువానితో అల్లినతట్ట. దాఁగర. (బ్రౌ. చి. ని.)

**ఎండ్ర** వి. గ్రుడ్డికామ చి. ఛత్త్ర, తృణ విశేషము వృక్షవిశేషము.

చ. వెనుతురు ప్రోల్లబూదియును వీడలి పిచ్చుకలియ్య మెండ్రయున్.

గీ. ... అంగ్రటింత సాలువయుప్పుగడ్డి, ... ముల్లాచి మొదయము బైటితుగ, మొదలుగాఁ బూరిందతింప. ప్రబంధ. 200,201.

సీ. ...కామంచి కావంచి యనఁ దగుఁ గత్త్రిణంబు, నెండ్ర యంచన ఛత్త్రి నెగడును ....ఆం. భా. 2. 76.

**ఎండ్రకాయ** – ఎండ్రి (శ. ఎండ్రకాయ.) కర్కటకము, పీత.

సీ. ...గోఁదురుకప్ప కప్ప కత్తరి యెండ్రకాయ జలగ. హంస. 4. 186.

**ఎండ్రి** – ఎండ్రకాయ, ఎండ్రిక వి. (శ. ఏడి) (కర్కటకము, ఎండ్రకాయ, పీత).

సీ. ఎండ్రికా లిటికిన నెగసి యెక్కించుక తొలఁగి శిత్రతోటి దూఁటి తినుసు. గీ. తనరు బక పంక్తులకు...ఆము. 3. 58.
(కర్కటకరాశి)

గీ. వనతతి వరాహవాహారివాయుభుగ్వి.రోధి వారణవర్షాభు లాధిఁ దొలఁగె, నెండ్రి రవి చేర...ఆము 4. 77.

**ఎండ్రిక** – ఎండ్రి.

గీ. ఎండ్రి యన నెండ్రిక యనంగ నెండ్రకాయ, యనఁగఁ గర్కటకాభిధ యలరుచుండు. ఆం. భా. 1. 160.

**ఎండ్రు** వి. కాయధాన్యము.

వ. ...పెసలు మినుము అనుము లోనైన ఎణ్బు... కు పుట్టి 1. ట్టిక ... ద. శా. 4. 1581. (ప్రయోగాంతరము లేదు).

**ఎంత** న. (సం. యావత్. కియత్. ప్రా. జెత్తుల, కెత్తులు. క. ఎనితు, ఎనిత్తు. త. ఎత్తనై – చూ అంత.) వి. అవ్య. 1. ఏపాటిది, ఏకొలఁదిది (ఈ యర్థమున 'లు' వర్ణాంత రూపమును ... మేడిత రూపమును గూడఁ గావు.)

సీ. వెలఁది యానీదఁ వెలయెంత ... ఆము 2. 19.

ఉ. ...ఎంతటి విస్మయము ... పాం. 1. 10.

చ. ...మునిచోదితవ్రతంబుల మహానీయదానములఁ బుణ్యచరిత్రములన్ మహాత్మ్యులెం, తలు రమణీయ విశ్రుత పదంబుల కేఁగుదు రంతకంటె నుజ్జ్వల మగుసద్గతిం బడయు ...భార. ద్రో. 2. 338.

గీ. సర్వపార్థివులును జరాసంధుఁగూడి, యెతలెంతలు నేసిరి యెఱుఁగరెల్ల. హా. ఉ. 2.97. (ఎంతలెంతలు – ఎంతెంతపనులు)
(ఇది సందర్భమునుబట్టి అల్పత్వమును అధికత్వమును సూచించును.)

సీ. ఏనుఁగులావెంత యీగ మూవటీ డెంగ తిమిరంబుబల మెంత దీప మెంత. గీ. ఎవ్వరికి దొడ్డుకొంచెంబు లెంచరాదు నీతి. సీ. 56.

గీ. తప్పకుండ మీ యుద్దఱ తారతమ్య, మెంత వారును దెలియంగ నెంతవారు. కాశీ. 1 104.

2. ఎంతకాలము.

క. ఎంతకుఁగృతకార్యుండగు, నంతకుఁడీ రంతకును భయంబందక ని,శ్చింతమున నుండుఁడు...భార. ఆది. 7. 266.

మ. త్రిదివం బెంతటిదాఁక నేలు నెలమిన్ దేవేంద్రుఁడంతదాఁక స,మ్మదమొప్పారఁ దదీయ మిత్త్రిపదవిన్ ధర్ముండవై యుండు... హరి. ఉ. 5. 248.

మ. ...సం,తత భేదంబునఁ గూర్కు పట్టక మదిన్ ధ్యానించు వేదయ్య కా,యతమై

యెంతట వేగదొ సు భిమల్లా...మల్లభూ. శృం. 101.

ఉ. ...వట్టిగొడ్డు తా,కట్టినఁ డెంతయున్న ... కళా. 4. 74.

8. సందర్భమునుబట్టి ప్రదేశాగులమదెలుపును.

ఉదా: ఆ చెట్టు మన కెంతలో నున్నది. (ఎంత లో — ఎంత దూరములో)

అయిల్లెంతకు వచ్చును. (ఎంతకు — ఎంత వెలకు)

సా: ఈయూరికి ఆయూరెంతో ఆయూరికీ యూరును అంతే. (ఎంతో - ఎంత దూరమో)

ఎంతకుఁ దెచ్చెను-ఎట్టి స్థితికిఁ దీసికొని వచ్చెను.

ఉ. ఎంతకుఁదెచ్చెనే సుదతి చేష్టల చయ్యములు... ఆము. 5. 77.

ఎంతకులేఁడు — ఎంతకుకాఁడు, అన్నిటికి తగిన వాఁడు

ఉ. ఎంతకులేఁడు వానిఁ దమునీ ప్రియుఁడు కౌరవి నగ రుక్మిణీ,కాంత వినంగ నేను వినఁగాఁ బలికెం బతి కూర్చుదాన నా,య వటివారు లేరని యహంకృతి నెప్పుడు విఱ్ఱవీఁగుచున్, వంతుకువచ్చుసత్యగనుడం బిఁకఁ జెల్ల దటంచు మానినీ. పారి. 1. 80.

ఎంతకులేదు — ఎంతకైనను గలదు, అన్నిటికిని జాలును.

ఉ. కోరుచళుకన్యనాథుకడకుఁ జనుని ంతిని రత్న కాంచనం,కాంము లై వభూషణనికాయము లందడవంగనేల యా,నూరెలఁ గ్రాలునం గముల నోయగ మెంతకులేదు చూడుఁడా, మారుని పూవుఁదూపులకు మాఱటరూపము వంగ నొప్పెదున్. కావ్యా.2. 27

ఎంతకెంత-పోల్చిచూచిన నెంతతారతమ్యము న్నది.

సీ. పదుతేవఁ మేన నెనయునే నెక్కడ నీదృగ్వి ధాండంబు లేరకైన. గీ. సంఖ్య నేయంగ రానివి సంతతంబు, వోలిఁ బరమాణువుల భంగి నొదలి రోమ, వివరముల యందు వర్తించు విపులభాతి, నెనయు చున్న నీ వెక్కడ నెంతకెంత. భాగ. 10. పూ. 557.

ఱు: ఎంతదనము, ఎంతదాఁక,ఎంతయు, ఎంతేని, ఎంతో, ఎందనుక ఎందలు, ఎందాఁక.

**ఎంతదనుక** — ఎంతదాఁక, ఎందను, ఎందాఁక. అవ్య. (దు (√ఎంత) ఎంతవఱకు, ఎంత పర్యంతము.

**ఎంతదాఁక** — ఎంతదను (√ఎంత.)

గీ. ఇలయు గిరులును శరధులు నింతదాఁకఁ, గలుగు నంతకాలంబును వెలయుచుడు. శుకునికీర్తియు... భార. శాం 6. 341.

**ఎంతయు** విశ. (దు. (√ఎంత) అధికము, మిక్కిలి.

గీ. సుతులవిద్యాప్రవీణతఁ జూచు వేడ్క, నెంత యును సంతసంబునఁ గుంతిదేవి, రాజసన్నిధి గాంధారరాజపుత్రి, కెలన మండె...భార. ఆది 6. 6.

, ఎలమియు నచ్చెరువును సరి, నెలసి పొదలు మానసమున నెంతయుఁ బ్రొద్దేఁ,గలలోనఁ, గన్న చందము, దలఁచుచు నుండితిని భక్తి తాత్పర్యమునన్. భార విరా. 1. 25.

క్రి. విశ. (దు. మిగుల, అత్యంతముగా.

సీ. ...తత్తమున, కెంతయు వెఱచి...భార. ఆది 4. 36.

క. ...మాతృవియోగం, బెప్పుడువాటిల్లెనపుడ యెంతయుఁదూలున్. భార శాం. 5.277, 6. 203.

**ఎంతేని** విశ. (ఎంత+ఏని చూ. ఏని.) అధికము, మిక్కిలి.

ఉ. ...ఎంతే రుమఁద్రొబ్బ నంతలునునింతలునై పడు...ఆము.4. 107.

గీ. అన్ని యున్నియు నన రాక చెన్నుమిగిలి, తెగలుగాఁ గొల్వవచ్చి యెంతేని వేడ్క, మానితములయ్యె నారాచ జేని కెదుట, నంతకంతకుఁ గనుదోయి కబ్బురముగ. రంగా. 1. 156.

క్రి. విశ. అత్యంతము, అధికముగా.

శా. ఆసిస్థానిధి గేహసీమ నడురే యాలించినన్ మ్రోయు నెం,తే నాగేంద్ర శయానుపుణ్య కథలున్ దివ్యప్రబంధానుసం,ధానధ్యానము. ఆము. 1. 84.

**ఎంతో** విశే. (ఎంత+ఓ) ఎంతేని, అధికము, మిక్కిలి.

ఉ. అతఁడు ముఖ్యజాతిఁ గనినంతన పాయుచు నెండ గాలి నెంతో తడపున్ బ్రసాదవిని యోగము వార్చి...ఆము. 6. 9.

ఉ. ...మునీంద్రుఁడెంతో ముదమొప్పఁబల్కె. దయతోఁ దననిస్పృహాభావ మేర్పడన్. ఇందు. 1. 176.

క్రి. విశే. అధికముగా.

ఉదా: నీమాటకు వాఁ డెంతో నొచ్చుకొన్నాఁడు.

**ఎందనుక** — ఎంతదనుక. (√ఎంత)

**ఎందఱు** స. బ (√ఎంత. ఎంత శబ్దమునకు మహన్మహత్వార్థకరూపము.) ఎంతమంది.

ఉ. ఎందఱపొందుగూడి...చంద్రరే. ౬. 53.

ఎందఱేని (ఎందఱు+ఏని) — పెక్కురు, అనేకులు.

గీ. ఎత్తె మున్నన్నగుజ్జల నెందఱేని; పాండు. 4. 167.

చ. ..వత్తురెందఱే, వదలకయాతనింట శనివారిమునం బరదేశవైష్ణవుల్. ఆము 1 88.

ఎందఱో — పెక్కండ్రు, అనేకులు.

ఉదా: ఎందఱో మహానుభావులున్నారు.

**ఎందలి** విశే. (√ఎందు-చూ. ఎందుల, అందలి) ఎక్కడనున్న.

**ఎందాఁక** — ఎంతదనుక. (√ఎంత.)

గీ. ధరణిఁ బొగడిత యెందాఁకఁ బరఁగు నత, కాలమును బుణ్యలోకంబు గల్గు నండ్రు. భార. ఉద్యో. 2. 66.

గీ. ధరణి యెందాఁక నుండు సుస్థిరత నీదు, కీర్తి యందాఁక నక్షయస్ఫూర్తిఁ దాల్చి, నడవఁగలయది...భార. శాం. 2 148.

**ఎందు** అవ్య. ద్రు. (చూ. అందు.) ఇది సందర్భమునుబట్టి దేశము విషయము మొదలగు వానిని దెలుపును.

1. దేనియందు.

ఉ. ఎందును నిట్టిరూపు నరు లెవ్వరుఁ గాంచిరె నాక కాదు సంక్రందన నూతిలిం దగిలి కన్గొంజాలదె...భా. విరా. 2.29. (ఎందు—ఏచోటనైనను.)

ఆ. ఎల్లదాని నేన యెఱుఁగుదు నెందు వాఁడు ఘల్గిదాన యోగ్యుఁ డయ్యెఁ జెవుమ భా. సభా. 2. 41. (ఎందు-ఏవిషయమందు)

2. దీనికి కొన్ని విభక్తులు చేరుటయుఁ గలదు.

ఎందుండి—ఎచటినుండి.

క. ఎందుండి వచ్చితిందుల, కెం దుండఁగ నీకు నిష్ట మెఱిఁగింపుము...భార. ఆది. 5. 213.

ఎందుకు—దేనికి.

ఉ ది బఫలోష్షికన్యలను బేడనమీ లిరుదిక్కులన్ సమానంబుగఁ బర్వుచున్న శ్రుతినామ సరోయగళోథ లిట్లు నట్టుం దిరువీఁకు నేయఁగఁ గదుఁ దమి నెందుకుఁ గాక రెంటిమ, ధ్యంబునఁ బాఱెడిం ఒరువు లారయఁ జాపల మట్ట దేకదా. ప్రభా. 2. 71.

ఎందల్లోసిరి. ద్రా. 8.

గీ. సర్వపార్థిపశ్రేష్ఠమ సహస్రాశ్వమేధములు తత్తెంచలె విప్రులకు నన్న జలదాన మొసఁగుటయెందులోనిది యింక హేమశాంస్య, రత్నభూపాంబర గ్రామగజాశ్వాదు లొసఁగుదు...వరాహా. 12. 59.

ఎందును — 1. అన్నిటియందు.

ఆ. ...అమర, భావమున సుఖంబు జీవింతు రెదీని నేలఁగనినవాఁడ యెందుఁ బెద్ద. భార. ఆది. 4. 158.

2. సర్వత్ర, అంతట.

ఉ. ఇమ్మహి తేలివోసమున నెందును నబ్బఁ శాస్త్రయప్రసంగమ్మునఁ బూర్వభూపతులకర్మవిశేషములున్ గుణప్రకాశమ్ములు దేవదైత్యమునిరాక్షసయక్షఖగాది పుణ్యవృత్తమ్ములు ధర్మనిశ్చయవిధమ్ములు పెక్కెఱిఁగించి తీపుగఁ. హరి. పూ. 1. 45

ఎందునేని—ఎచ్చటికైనను.

చ ధరణిపుఁ డెందునేఁ దగదుశాఁ జన నూఱట కొక్కనిం దగుం, దొర నొనరించి పంప... ఆము. 4. 255.

ఎందేనినుండి—ఎక్కడనుండియో.

వ. శకుంతల జ్ఞాపనతవదన యయి యిట్లను నెందే నినుండి యొక్క మహాముని నిఖిలవేదవేదాంగపారగుండు వచ్చి ఋతుమతినై యున్న నన్నుం జూచి నాకుఁ బుత్త్రోత్పత్తిఁ బ్రసాదించి... భారం. ఆది. 8. 181.

ఎందేనియు–ఎక్కడకో.

వ. ...మీకు మే లయ్యెడుఁ బోయి వచ్చెదనని నాఁ డెందేనియుం జనియె... కాశీ. 1 106

జ: ఎందలి, ఎందుల.

**ఎందుల** – ఎందు. ప్రదు. అవ్య. 1. దేనియందు; దేని వలనను

సీ. విను బ్రహ్మానందము తలిసినవాఁ డెందులను భయముఁ జెందఁ డనంగా, వినవే శ్రుతివాక్యంబుఁ, సపఘూ తత్రీప్రతిఁ జంద సర్వము కాదే. దశా. 1. 221.

2. (– ఎందలి) ఎక్కడనున్న.

ఉ. ఎందులదాన వేకతమయియ్యమునానది నోడ నల్పుచున్, సుందరి నీకునున్ని యిటసూడఁగఁ దా నుచితంబె నావుడుఁ. భార. ఆది. 4. 172.

సీ. ఎందులపరిఖ భోగీంద్రబృందమునకు భాసురకేళినివాసమయ్యె. దశకు. 2. 8.

ఎందులకున్ – 1. ఏ చోటికి.

క. ఎందుండి వచ్చి తిందుల, కెందుల కేఁగెదు మహామునీశ్వర... భారం. ఆది. 4. 231.

క. ...నన్నుఁ బొడగని దివిఁ దా, నెందుల కేఁగుచునో గిరినందన దరి వచ్చి కరుణ నాకిట్లనియెన్. మనుచ. 6. 55.

2. దేనికి.

మ. ...ఇందు నెందులకే మోదుమటంచు పాదులలయన్. ఆము. 2. 29.

**ఎంపలి** – వెంపలి (క. ఎమ్బలి)

ఉ. ఏనుఁగు చిక్కనేని మఱి యెంపలి చెట్టునఁ గట్టవచ్చునే. ద్వా. 11. 27.

**ఎంబెరు** వి. ('ఎంబెరుమానారు' యొక్క సంక్షిప్త రూపము.) రామానుజుఁడు.

ఎంబెరుమతము – రామానుజమతము.

ఆ. ఎంబెరుమతవాండ్రు వెసఁగ మాంసము దిని, మాలువేగు పెట్టి మధువు ద్రావి. వేమన 3. 184.

**ఎఁడు** ప్ర. పరిమాణమును దెలుపును. ('ఎఁడు' ప్రత్యయాంతపదములు అసమాసమందు ఔపవిభక్తికములు.)

గీ. అతండు పుడిసెఁడు నీరన యప్పు డతనిఁ, దెలచి... భారం. అశ్వ. 1 84.

చ. పిడికెఁడు కానుఁగొప్పుఁ గని... ఆము. 1. 8.

మ. పొదరైు నాథులఁ దారుఁ గాఁపురములింపు ల్మీఱఁగాఁ జేయుచుఁ, గదిపెంచేసి కొమాళ్లఁ గూఁతులఁ దగన్ గన్నట్టి యిల్లాండ్రకున్, మది లజ్జాదులు లేవె నీకు బళె... కళా. 7. 119.

ద్వి. జేనెంటనొక్క శివమూర్తి గలదు... మూరెంట నొక్క మునిపల్లె గలదు ... బారెంట నొక్క పర్వతం బలరు....పండితా. పర్వ. 384 పొ.

చ. కరిలక ద్రమ్మరిలింప నడుగెంటనె నిల్చు నొకంత నూకిడన్. పాండు. 1. 114.

సీ. ఇవి గాలి కనిన మూక వరాహదనుజేంద్రునైన జుట్లెంటిలో నాఁగజాలు మనుచ. 4. 81.

జేనెంటజేనెంటఁ – జేనెఁడు జేనెఁడు దూరమందు. కాశీ. 3. 108.

**ఎక** న. (సం. ఏకః. క. ఎక్క, యక్క. హిం ఏక్.) ఏకార్థకము. (వృత్తియందే దీనికి ప్రయోగము. చూ. ఎకకంటి రథము, మొ.)

జ: ఎకకంటి రథము, ఎకతాళము, ఎకతాళి, ఎకరంగి, ఎకవాలుచెప్పులు

**ఎకఁదొట్టు** – ఎగఁదొట్టు.
(అతిశయించు)
మహాప్రసద్ధర...నిట్టూ, ర్పెకఁదొట్టఁ డస్సి ... ఆము. 5. 3.

**ఎకకంటిరథము** వి. వి. (ఎక+కన్ను+రథము) ఏకచక్రరథము, సూర్యునిరథము.

కవిరాజ...ఎకకంటి రథంబు వెసన్ బఱచెన్. కకు. 2. 62.

**ఎకతాళము** వి. వి. (√ఎక–సం. ఏకతాళః, క. ఎక్కతాళ) (సంగీ) ఒకానొకతాళము.

మ ఎకతాళంబున వీణమద్దెలలు వంశేకంబుగా..
(శ్రీ)రం. మా. 4. 161.

**ఎకతాళి** వి. – ఎకతాళము

క పదలక ధ్రువమును మఠమును విదితంబగు జంపెగఁబుడ వినుమెకతాళిన్. బొందలెడిచంచత్పుటమును, మొదలగు నూటొక్క తాళములు విలసిల్లున్. ధనాభి. 2. 4౦.

**ఎకరంగి** వి. — ఏకరంగి (√ఎక.)

సీ. ఇంత పైపై కెక్కి వయెకరంగి పఱుపఱుపై కుంకుమ పుటంబుపటుపుదోయి రా.వి. 5. 86.

**ఎకరా** వి. ఏనుఁగును గట్టు మొగసాల; మొగసాల. మహా స్రగ్ధర. ఎకరాలన్ మందువాసాహిణములఁ గలభ ద్రేభసందోహంవాహ ప్రకరంబుల్ గొంచు...మనుచ. 1. 40.

**ఎకవాఱుచెప్పులు** వి. బ (√ఎక) ఒంటివాఱు గల చెప్పులు.
(దొంగవానివర్ణనము) ద్వి. చేయమ్ము నెకవాఱు చెప్పులు రాఁగి. చాయలుదేఱునచ్చపు నీలి దట్టి. ద్వి పరమ. 485 పు. 18 పం.

**ఎకసకియము** – ఎకసక్కెము. (శ. ర.)

**ఎకసకెము** – ఎకసక్కెము.
(విషమము, ఎచ్చుతగ్గులు గలది)

సీ. జడలల్లి చొళ్లియ విడి యొకసకెముగా బాలేందు శకలంబు పదిలపఱచు కాశీ. 2. 146.

**ఎకసక్కియము** – ఎకసక్కెము.

గీ. అట్టిజగదండకే కాని యనఁగిపెనఁగి, యుడుడుపు నీవు మాబోంట్ల యొద్దఁ జేసి, వనుచు నెకసక్కియములాడు వనజముఖులఁ, గాంచి నవ్వుచు గోపికాకాంతుఁ డనియె. దశా. 8. 317.

**ఎకసక్కెము** – ఎకసకియము, ఎకసకెము, ఎకసక్కియము, ఎకసెకియము, ఎకసెకెము, ఎకసెక్కియము, ఎకసెక్కెము, ఎక్కసకియము, ఎక్కసకెము, ఎక్కసక్కియము, ఎక్కసక్కెము, ఎక్కసెకియము, ఎక్కసెకెము, ఎక్కసెక్కియము, ఎక్కసెక్కెము విశే. (క. ఎక్కసక్క, ఎక్కసక్కి, ఎక్కసెక్క. త ఎక్కచ్చక్కమ్) 1. విషమము, ఎచ్చుతగ్గులు గలది. (చూ. ఎకసకెము.) 2. వికటము, అననుగుణము, పొసఁగనిది.

ఉ. చక్కనివారిలో మిగులఁ జక్కనివాఁడవు గాన నీకెనా, చక్కనివారిఁ జంద్రుని వసంతునిఁ గూర్చికొంటి వందమౌఁ, జక్కెంచి, టీరాజయెకసక్కెమ దేమని కూర్చుకొంటి వమ్మక్క యరూపకం బయినయాయెల దెమ్మెగ నాలిబూతమున్. విజ. వి. 3. 45.

వి. 1. పరిహాసము; పరిహాసపుమాట.

ఉ. జంకులు తేఱిచూపు లెకసక్కెములున్ నెపంకబొమ్మలున్. భాగ. 10. ఉ. 265.

గీ. అర్ధచంద్రుని నెకసక్కె మాడునట్టి. యలికఫలకంబిలకము లలరఁ దీర్చి. భాగ. 10. ఉ 674 (ఎకసక్కెమాడు–ఇటఔపమ్యద్యోతకము.)

2. అవమానము.

చ. నీ వెఱ వచ్చుట పారిజాతహా సినఁ బ్రకటించి నాకు నెకసక్కెము నేయుస కాదెచెప్పుమా.

క. మానరహిత మయినబ్రదుకు మానిని కేలా. పారి 1. 1. 8. 130.

3. వంచన, మోసము.

ద్వి. అకట చేతికిఁ జిక్కినటుల మాటాడి, యొసక్కె మెయొనర్చి యిచట నిల్వక యె, యిప్పు డొగఁ జనియె నయ్యిందీవరాక్షి. విష్ణు. ఉ. 4 అ. (శ. ర.)

**ఎకసర** వి. మల్లవిద్యాసంబంధమగు షోడశోపవీతములలో నొకటి.

ప అవ్వీరుండు...ఎకసరమైన ...కరలాఘవంబులాదియా షోడశోపవీతంబులరీతుల నేర్చి. హంస. 1. 206.

**ఎకసెకియము** – ఎకసక్కెము. (శ. ర.)

**ఎకసెకెము** – ఎకసక్కెము. (శ. ర.)

**ఎకసెక్కియము** – ఎకసక్కెము. (శ. ర.)

**ఎకసెక్కెము** – ఎకసక్కెము.
(పరిహాసము, పరిహాసవచనము)

చ. బొమ లెగమైచి కన్గొనుచుఁ బొందుగఁ గన్గొని వేరు గ్రుచ్చి కొంచెముగ హాసించి యొక్కయెకసెక్కెమటాడి యయారె నీకు గంధము కడునందమౌ నని ముదంబునఁ జెక్కిలి

గీ. టి యిట్లు నెయ్య మెసఁగఁ బల్కుచు నలినాక్షుల నందఱ నన్నిభంగులన్. చమ. 1. 62.

**ఎకాయెకి** క్రి. విశే. (దు. (హిం. యకాయక్.) ఒక్కసారిగా.

చ. కదనమహా మై పఱచెఁ గత్తులుఁ గత్తులు నీఁకు లీఁటియల్, గదయ నెకాయెకి బడి చెకా చెకలై తునియంగ.. ర గా. 1. 198.

**ఎకిమీఁడు** వి. రాజు, ప్రభువు, శ్రేష్ఠుఁడు.

సీ. సుమునిదొంతరము కేళిభవన బుకడలుం యెకిమీఁడు కన్నతండ్రి జాహ్నవి. 1. 6.

సీ. జేజేలయెకిమీఁ డెక్కిన గజపెండ్లాలు పదమునఁ గండుమీఁ. దశా. 2. 188.

దీ. విటులకెకిమీని వీనిఁ గావి పనేని, యుగ్మలీ నీకు దాసినై యుండుదాన. వి.ప్ర. 2. 84.

**ఎకిరింత-ఎక్కిరింత**[1].

(వాహనము.)

సీ. రేవెలుఁగులకాల్పుదేవేరి యగుదుర్గ కెకి రింత యైమించు మేకముదక్కు. రామా. 2. 58.

గీ. సంయమిక్రతుహుతపాశనము మఱఁగి, యగ్నిభట్టారకుఁడు నిచ్చలచట నుండ, నగని యెకిరింత యేడిక యనుదినంబు, గొండ గొటియల బెదరించుచుండు బలసి. హ. 1. 158.

**ఎక్కటి** న. వి. (ఇది మహాదమహాప్కమును దును మహత్వర్థము నందుఁగూడ నుపయోగింపఁ బడును. (సం ఏకః ప్రా. ఎక్కమ్, ఎక్కో. త. ఎక్కటి.) 1. ఒక్కఁడు; అసహాయుఁడు, పరాపేక్ష లేనివాఁడు.

క. ...ఉర్వీరాజ్యం, బెక్కటి నేలొని తేజము, దిక్కుల వెలిఁగింపు... భా. ఆది. 4. 20.

ఉ. దక్కెను రాజ్యమంచు నకటా యిటు నమ్మి ని భాగమీక నీ, వెక్కటి మ్రింగఁ జూచెదది యెట్లుగున్. భా.. ఉద్యో. 2. 5.

సీ. ...పాండుబు, వెడఁగల్లఁగొనిపోయి యెక్కటి సంపిన దండితక్రతుఁడీతండ కాఁడె. భార. ఆది. 6. 278.

ఉ. ఒక్కరుఁడై నఁ గేశవుహితోక్తికి మేకొనఁ డయ్యె నర్జును, డెక్కటి దాన చాలుఁ దమునిందఱఁ దీవ్రశరాగ్నిఁ గాల్పు... భా. ఉద్యో. 4. 54.

2. కేవలుఁడు, అద్వితీయుఁడు.

సీ. పరాక్రమములు లేక యెనయునెక్కటికిని జాత కర్మంబులు సంభవించె. భాగ. 10. పూ. 194.

3. కటికచీఁకటి వెలుఁగునెక్కటి వెలుంగు. ఉ. రా. 1. 80.

3. సహాయము లేనిది, దిక్కులేనిది.

ఉ. ఓనరనాథ యుద్ధగతి నొక్కనిశాచరుఁ డాన నంబు లీ, రేను ధరించినాఁడు నను నెక్కటిఁ దోలొని పోవుచున్న వాఁడు... భా. రా. అర. 2. 108.

క. మించినపనులకు నేరము, తెంచం బని లేదు సీత నెక్కటినటులన్, గొంచు న్వెడలంబడి యే, తెంచితిగా చాల సుస్థితిన్ నిలు మింకన్. రామా. 7. 62.

ఉ. అక్కడ లక్ష్మణుండు నటులాతురుఁడై చను చుండి త్రోవలో, స్రుక్కుచు సద్వినీతుఁ డ సుసూతుని జూచి సుమంత చూచితే, యక్కట నిన్నిమిత్తము ధరాత్మజ కెంత యుపాధి వచ్చెఁ దా నెక్కటి నైతినంచు వెతనెక్కుడఁ బ్రాణము వీడనోకదే. ఉ. రా. 6. 221.

4. ప్రత్యేకమయినది, రెండవదానితోఁ గలియనిది.

క. ఎక్కటియిట్టిది దోసము, లొక్కొక్కమరి రెండు మూఁడునొదవి జెరయుఁ దా, నక్కడు నన్నిపాతకంబు... భార. అశ్వ. 1. 174.

సీ. పితభాషలకు విపంచికలమ్రోఁతకు భావము అలేక తోడ్పడి మెఱనెనేని. గీ. బాణనందన యాననప్రభకుఁ జన్ను, దోయికాంతి కపాంగ దీప్తులనఁ దకి. వాక్యభంగికి నెనయనవచ్చుఁ గాక, యెక్క టిగఁ బోల్ప నుపమాన మెందుఁ గలదు. హరి. ఉ. 7. 164.

5. సాటిలేనిది.

ఉ. గాళకు లావురీభటశిఖామణు లెక్కటియు క్కుతున్క లా, భీలతరాశమల్ చిదిమి పెట్టిన బంటులు...విజ. వి. 1. 10.

6. శూరుఁడు.

సీ. గడుసరి దిట్టయెక్కటి వాఁడి గలవాఁడు వడికాఁడు పోటరి బంటు మేటి, మనసరి తెంపరి మొనకాఁడు మిడిమూసి వడివాఁ డసంగ శూరుఁడు సెలంగు సాం. ని. మాన. 31.

సీ. ఇటు గిల్ప తేజి యెక్కటి రౌతు చేపట్టు గరితఁ గాంచినగట్టు గాంచినాఁడ. ప్రబంధ. 149.

సీ. బొక్కలాయపుజక్కి యెక్కటితో డెక్కునత్తడిపురి సికఁదాల్పు వేల్పు. ప్రబంధ. 153.

7. అధికము.

చ. ...మన్మథకేళిమీఁద నెక్కటివడి జాఱి సంగమసుఖంబునకే తమకింతు గిద్దఱున్. శుక. 2. 334.

8. ఏకాకిత్వము, ఒంటరితనము.

ఉ. ఇంకొకఁ డెవ్వఁడేని నను నెక్కటి నుండఁగఁ జూచి పట్టునో. కాశీ. 5. 168.

ఉ ఈసకలాపనీతలము నెక్కటిఁ దాన పరిభ్రమించి... నై ష. 5. 118.

9. (ఛంద) ఒకానొక యతి, ఎక్కటివడి. కవిజనా. సంజ్ఞా. 62.

ఎక్కటిపాటన్-ఒంటిపాటున.

చ. ఎనసినచెల్మి నుండుటయు నెక్కటిపాటఁ దదర్థభాండముం, గనుటయు నాకుఁ జెప్పుటయుఁ గప్పుటయుం గలదు... వేం. పంచ. 1. 724.

ఎక్కటిబవరము - ఒకనితో ఒక్కఁడే చేయు యుద్ధము, ద్వంద్వయుద్ధము.

సీ. బహుదివ్య శరములు వడయఁడే యెక్కటి బవరాన మెప్పించి శివునిచేత. భార. భీష్మ. 3. 177.

ఇట్లే-ఎక్కటికయ్యము విక్ర. 4. 98.

ఎక్కటిపోరు చం. రా. 2 64.

ఎక్కటివీరుఁడు-అసహాయశూరుఁడు కు. సం. 11. 610.

ఎక్కసెక్కటి-ఒక్కనితో ఒక్కఁడు.

ఆ. ఏను నర్జునుండు నెక్కసెక్కటి దల, పడక యున్న నగరె పుడమిజనులు భార. ఉద్యో. 4. 41. (శ్లో. యదిహ్యాద్వైరథం గచ్ఛేయం ద్వైరథం సవ్యసాచినా, అకీర్తిస్స్యాత్పరాశేకశ మమ పార్థస్య చోభయోః. సం. భా. ఉద్యో. 141. 18.)

గీ. ఎక్కసెక్కటి పెనఁగిన యింతవట్టు, పెనఁకువలు నిట్టు లేచునే పృథివి నింక, జనము లీకురుపాండవసంగరంబు, సెప్పికొం్రడు మనంబులచ్చెరువునొంద. భా. ద్రో. 1. 178.

గీ. అంతలో నేకలవ్యుండు హలధరుండు, సాహసోత్సాహసన్నాహ మతిశయిల్ల, నెక్కసెక్కటి దలపడ్డ నేకలవ్యుఁ, డెసె బలభద్రు నమ్ములు నిరువదింట. ఉ. హరి. 3. 76.

జః ఎక్కటీఁడు.

ఎక్కటికము - అక్కటికము. వి. దయ. (ఈరూపము ప్రాచీనకవులగ్రంథములందుకనఁబడదు)

ఉ. భూమిపతుల్ మృగవ్యాళిఁ బూనుట యుక్తమటంచు ధార్మిక, స్వామివి నీవె యానతియొసంగుట నా చెవి సోఁకి యుండ శా, భామృగిఁ దావకీనశరఘాతనిపాతితఁ జేయకుండువా, యే మృగిమీఁద నేమృగయుఁడెక్కటికం బిడు రాఘవేశ్వరా. చం రా. 6. 42. (కోనామ రామ మృగయుర్దయతే మృగీణాం. మూ౦ము.)

ఎక్కటీఁడు విణ (ఎక్కటి + ఈఁడు-స్వార్థమున) 'ఈఁడు'-ఎక్కటీలు, ఎక్కటీనికి, మొ.) అసహాయశూరుఁడు.

సీ. ఇగురుఁగ్రొ జీతంపు టెక్కటీలకు గుజ్జుపటువు మామిడి గట్టుబడిగఁ జేసి. చంద్రా. 4. 84

ఉ అక్కటదిక్కటాహాశయదార్ఢ్యటిఁ బర్వెడు సోఁకుసెక్కటీ, లెక్కడ కాకపక్షధరుఁ డీసను నెక్కడ వారితోడ వీఁ, డెక్కటిపోరికిం దొడరు సెక్కడ యెక్కడి సంగతంబు లీ, మొక్కలపుంబ్రసంగములు మోసముఁ దెచ్చు దురూహలేకదా. చం రా. 2. 64.

ఎక్కడ వి వి (ఏ + కడ - వృత్తియందు ఔపవిభక్తికము ఉదా: ఎక్కడివారు)

1. ఏచోటు.

క. ...ఎక్కడియది... భార. ఆది 4. 34

2. అత్యంత తారతమ్యము, అసంగతత్వము (-పొసఁగమి), అనాదరము, లోక వైపరీ

త్యము, మొదలగువానిని తెలుపును.

(అత్యంతతారతమ్యము.)

సీ. అఖిలలోకాధీశుఁ డమరేంద్రుఁ డెక్కడ నే నెక్కడ వరాటి నెన్ని చూడ. నైష. 4. 68.

(అసంగతత్వము, పొసంగమి)

ఉ. అక్కట యిట్లు వేఁడికొననైనను బోయెదు వో సుయోధనుం, డెక్కడ భూమిలోన సగ మిచ్చుట యెక్కడ దానవాంతకా. భార. ఉద్యో. 3. 94.

సా: నక్క యెక్కడ నాకలోక మెక్కడ?

(అనాదరము)

మ. యమసూనుం డనుఁ గృష్ణుఁ జూచి బకదాల్భ్యవ్యాసకణ్వాదులం, యములుండన్ దెగు డెంపు నేయకిటు లేలా వారిఁ బొమ్మంటి వ, న్న ముకుందుం డను నీసమతమున నానా సౌఖ్యగోష్ఠిన్ వినోదములన్ ప్రొద్దులు పుచ్చ నెక్కడవివాదంబంచు నట్లంపితిఁ. జై. భా. 8. 210.

ఉ. ఎక్కడిరాజ్యవైభవము లెక్కడిభోగము లేటిసంభ్రమం, బక్కట బుద్బుదప్రతిమ మైన శరీరము నమ్మి...అము. 2. 78.

(లోక వైపరీత్యము)

ఉ. అక్కట వాసుదేవుపద పాదరణంబునఁ జే యరైరి వీ,రెక్కడిబుద్ధిమంతులు...భార. ఉద్యో. 4. 20.

ఉ. ఎక్కడిమాట గొల్లతన మింతుక యేలయు లేదు నేదెసఁ.భార. విరా. 1. 281.

(ఇతరముల కుదాహరణములు)

గీ. ...ఇట్టిచౌకపనికి, మీరు వేంచేయ వలయు నే మీగృహమున,కరుగుదెంచితి రందులకను టగాదు, పదము లెక్కడబడలెనో యద ము నీంద్ర. కువల. 2. 45

(వ్యవ)వాఁడు ఎక్కడవచ్చునోయని పాటిపోయితిని. పెండ్లాము ఎక్కడ అలసిపోవునో యని వంటలక్కను నియమించినాఁడు

**ఎక్కము¹** వి. పొలమునకు పొలమునకు నడుమ నేర్పఱచినగట్టు. గ్రా. (మడికి చుట్టు నేర్పఱచిన చిన్నకట్ట, గనిమ. అని శ. ర.)

**ఎక్కము²** న. (సం. ఏకమ్. ప్రా. ఎక్కమ్.) 1. వి. ఒక్కటి 2. గుణకారపథకము.

ఉదా: మూఁడవయెక్కము వచ్చినది నాలుగవ యెక్క మింకను రాలేదు.

**ఎక్కలమ్మ** వి. (√ఎక్కలి¹) ఒకానొక గ్రామ దేవత. శుక. 2. 49.

**ఎక్కలి¹** వి. (క. ఎక్కలి.) ఒకానొక గ్రామ దేవత. గీ. .. ఎక్కలోఁజోగటంచు. శుక. 2. 424.

జ: ఎక్కలమ్మ, ఎక్కలిదేవి.

**ఎక్కలి²** వి. (త. ఎక్కర్.) ప్రవాహముచే కొట్టుకొని వచ్చి క్రమ్ముకొనిన యిసుక. (శ. ర.)

**ఎక్కలిదేవి** — ఎక్కలమ్మ. (ఎక్కలి¹) శుక. 2. 444.

**ఎక్కసకియము** — ఎకసక్కెము. (శ. ర.)

**ఎక్కసకెము** — ఎకసక్కెము. (శ. ర.)

**ఎక్కసక్కియము** — ఎకసక్కెము. (శ. ర.)

**ఎక్కసక్కెము** — ఎకసక్కెము.

(పరిహాసము; పరిహాసవచనము.)

ద్వి. ఎక్కసక్కెమో నిక్కమే పల్కినదియొ, యక్కట హరుఁ బెండ్లియాడెద ననుచు, నే లాగు దోఁచె నీ కిటువంటిబుద్ధి, బాలరో నీ బుద్ధి బంగారు గాను. మృ. వి. 2. 67.

సీ. నిక్క వీనులతోడ నెక్కసక్కము లాడుకర ణి నున్నవి వీనిఘనఘనములు. మనుచ. 2 36.

**ఎక్కసెకియము** — ఎకసక్కెము (శ. ర.)

**ఎక్కసెకెము** — ఎకసక్కెము. (శ. ర.)

**ఎక్కసెక్కియము** — ఎకసక్కెము. (శ. ర.)

**ఎక్కసెక్కెము** — ఎకసక్కెము. (శ. ర.)

**ఎక్కించు** స. క్రి. (√ఎక్కు) ఎక్కునట్లుచేయు.

1. అధిష్ఠింపఁజేయు

క. ....పృథివీపతి నీ,తలన తనకార్యఖడ్గంబుల మోపెక్కించె త్రవోపునె నీకుఁ. భార. విరా. 5. 28.

సీ. గరుడుండు మోమోటఁగాదె వాహనమయి వనజాతునెక్కించుకొనియె వీఁపు కాశీ. 2. 107.

2. నిక్కించు, ఎత్తు

మ. భీమ లెక్కించిన విల్లు వంచు నునుఁజూపు ల్చంచలాచంచల, క్రమరేఖన్ నిగిడింప శా తవిశిఖౌఘ బుల్ మెయిన్ నించు...ఉమ ప్రాపొంది ఢళీశ్వరుండు వారు బిట్టోడింప నుట్టాడుచున్. పాండు. 1. 189.

3. కలిగించు

క. ...ధర్మనందనుని(దగం,గను మతఁడు రాజ నని తన,మనమున నెక్కించుకొనఁడు మదగ ర్వ బుల్. భాగ. శల్య. 1. 59

మ. ...నమ్రమై, యెస సంక్రందనశాఖ డెంద ముగ యం దెక్కించు మందాకమున్.నైష. 5. 156.

4. ప్రసరింపఁజేయు.

గీ. నిశలఁ గుంకుమ మగలు మై నిండ నలఁది, గేహమున ధూపధూమ మెక్కించి కుధగి, ధరుని పేముంతముగఁ గొల్వ దొరకు ముకి. పాండు. 2. 112.

5. అధికముచేయు. అతిశయింపఁజేయు.

సీ. అంగుళంబుల నల్ల నలకలు గబళించి కెమ్మోవి యాని యెక్కించుఁ గాయ్వు. భార. విరా. 2. 310

6. సజ్యముచేయు. ఎక్కుపెట్టు

క. తిగిచి శరాసన మెక్కించి గుణధ్వని చేసి యంపశరము లొనలన్,బిగియించి...పారి. 5. 5

7. బెల్లించు

సీ. వెలయును దేలించె బెల్లించె నూటించె ననఁగ నెక్కించె నంచనెడిమాట. ఆం. భా. 8.124

8. (నారిని) సంధించు. కూర్చు

శా. ...ధా త్రీశోత్తంసమువిల్లువంచి గొనయుఁ బెక్కించి...చంద్ర 3. 58

ఎక్కిడు ఎక్కుద్రోచే. ఎక్కువెట్టు. వ. క్రి. (√ ఎక్కు) 1. సజ్యము చేయు. జ్యాసంధాన ము కలదిగాఁ జేయు.

ఉ. చుక్కలు తోడుతోడఁ దలచూపఁ దొడంగె మనోభవుండు వి,ల్లెక్కిడి చక్రవాకముల యిక్కలు రోయఁగఁ జొచ్చె ... భార. విరా. 3. 319

2. (నారిని) సంధించు. కూర్చు.

మ. ...భృగురాముకార్ముక మనాయాసంబుగా వంచి యా గొనయ మెక్కిడి టంకృతుల్ స లిపి తక్కుందూపు సంధించి యి,ట్లని ప ల్కెన్ రఘురాముఁడయ్యెడ... రామా. 4. 186.

మ. ...భార్గవరోషపోషణపటువ్యాహారముల్మి అంద,ద్ధనువుం దేజముతోడఁ గైకొని సము ద్యద్బాహుఁడై బునన్, గొనయం బెక్కిడి యమ్ముగూర్చి యిఁకనీకున్ శాస్తిగావింపకే, జన నా బాణ మమోఘమంచు ధరణీజాభర్త యుత్యుగ్రుఁడై. దశా. 7. 308.

ఎక్కిరింత[1] – ఎకిరింత. వి. (√ఎక్కు) 1. వాహన ము.

సీ. వేదాదివిద్యలు విహరణస్థలములు చక్కని రాయంచ యెక్కిరింత. నైష. 1. 5.

2. గుఱ్ఱము.

సీ. . వాపురము పిటాణి వాగువంబు. గీ. ఇక్కి మావు గుఱ్ఱము తేజి యెక్కిరింత,తత్తడి గవాలు నడగఁడు కత్తలాని. తురగ బాబా యనఁగనొప్పుఁ దురగమునకు. సాం. ని. 71.

సీ. తత్తడియనఁ దగుఁ గత్తలాని పిటాని ఇక్కి బాబా మావు నెక్కిరింత. గీ. యన హయము పేళ్లు...వేంక. 61.

ఎక్కిరింత[2] – వెక్కిరింత. వి. ఆక్షేపణము.

సీ. వెలిద్వజు లెక్కిరింతలు సెప్పఁ దగునట్టిజలజ సంభవునియాచార మెంత. అచలా. 1. 17. (ఇట వాహనమని అర్థాంతరము.)

ఎక్కిలి – వెక్కిలి. (సం. హిక్కా. త. ఏక్కల్) వి. ఔ. దప్పిమొదలగు వానిచేఁగలుగు రోగ విశేషము, హిక్క.

గీ. గొంతు తడిలేయు నెక్కిటఁ గొంతతడవు, దాహమున కుదకము లేక తడసెనేని. దశా. 2. 186.

ఎక్కు – అ. క్రి. 1. అధిష్ఠించు.

ఉ. ...అస్తోక నిజప్రభావములు నూపెడుగద్దె యమీఁద నెక్కి...పారి. 1. 79.

ఉ. ...చొక్కపుఁ గొక్కు ఇక్కిపై, నెక్కెడు బల్వజీరునకు...నీలా. 1. 7

2. పైకిపోవు; (పైకి) వ్యాపించు.

క. గోనయంబు నెక్కఁ ద్రోచిన, గనయంబున
నెక్కకున్నఁ గ్రమ్మిన తమకంబున విల్లు
విడిచి వేళాకయనిమిషభటుఁ డనికి వెడలె
నడిదము గొనుచున్. పారి. 4. 71.

సీ. ...ఇడఁ బింగళను గాలి యెక్కు డిగ్గు. కాశీ. 2. 121.

సీ. కమలించెఁ గాక యంగజవిరోధిశిరోధిఁ దల
కెక్కఁ జాలెనే హాలహాలంబు. వసు. 4. 79.

ఉదా: తేలు విషము గజ్జలలోని కెక్కినది.

3. పాఱు, ప్రసరించు.

క. ....పెఱమడి కెత్తిననీరును దెగి యల రా,
జనపు మడికి నెక్కినట్లు చను ముద మందన్.
ఆము. 4. 82.

4. సంతోషకరమగు, ఇష్టమగు; నచ్చు.

వ. పాండవులం బరిమార్చుపని నేఁడ చేయక
మఱిచేసిన రారాజు నిగ్రహపాలుండైన నా
కెలసం బెవ్వరి కెక్కెడు. .... భార. సౌ. 1. 24.

గీ. ఇతఁడు పుట్టినకోలెను నెసక మెసఁగు,దర్ప
మునన వర్తిల్లు నుదగ్ర హృదయుఁ డకట
యెుఱిచిత్తమున కెక్కునట్లుగాఁగ, మెలఁగి
యేమి విధంబునఁ గొలుచువాఁడు. భార. విరా. 1. 74.

5. అధికమగు, అతిశయించు, హెచ్చు.

క. తమకు బలం బెక్కినతఱి, సముచిత మగువిగ్ర
హంబు .... భార. శల్య 1. 56.

గీ. అధికధార్మికులగుట పరాశ్రమంబు, లాత్మ
ధర్మముల్ దప్పక యాచరింప, నెల్ల వారును
గడు నాయువెక్కి తెవులుఁ, జావు లేకుండ
నున్నారు దేవదేవ హరి. పూ. 6. 6.

ద్వి. .. నిత్య మెక్కవుఁ దఱుఁగవు నేను మా
నికలు. బస. పు. 4. 300. పం.

6. సంభవించు, కలుగు.

శా. ...బరువడిఁ హర్షోదయం బెక్కఁగా, జా
యం దమ్మునిరూఢదృష్టిఁ గన భ్రూసంజ్ఞఁ
నియోగించుచున్. రాఘవ. 3. 50.

ద్వి. చెక్కుల సన్నంపుఁ జెమ రెక్క...ద్వి. హరి
శ్చ. ఉ. 909.

7. నెఱవేఱు, సిద్ధించు.

ఉ. ఏమటుపోక వారి మది నేర్పడ మున్ గని
డాఁగురించెనో, యేమిటి కెందుఁ బోయిరో
నరేంద్ర యెఱుంగము ధర్మదూష్యసం,
గ్రామ విధంబులం జయము గల్గియు వారికి
దక్కదయ్యె వా,రేమయిరేమి మాకెలన
మెక్కె నెఱుంగుము మమ్ము మువ్వురన్.
భార. సౌ. 1. 250.

చ. జననివి నీవు వేఁడుదవు సత్యము తండ్రికి నె
క్కు నట్టె నాయనుజుఁడు నేల యేలునట
...భా. రా. అయో. 39.

8. మార్కొను ఎదుర్కొను

సీ ఒక్కఁడు పెక్కండ్ర కెక్కిన విచ్చియుఁ
బోటవి చెఱోకపోటు వోడుచు నెడలు
భార. విరా. 3. 164.

సీ. చేర యెక్కినచోటఁ బూరి మెక్కినచోట భ
యద్రోణి దయశక్తిఁ బరఁగఁ జూపె, బోరు
ముట్టినచాయఁ బేరువెట్టినచాయఁ గరపోతి
వరభూతిగడలుకొల్పె. రా. వి. స. 12 కరు.
4. 98.

9. స్పష్టపడు

క నినుఁ గీడు వాయకుఁ డఁగ, జనులకు నా
నిక్కమెక్క జననాయక నే,ననలంబుఁ జొచ్చి
వెడలెదఁ,గనుఁగొను మిచ్చనవునాకుఁ గరు
ణింపు దగన్. భార. అర. 7. 160.

10. ఆవేశించు.

ఉ. మ్రొక్కినఁ గౌఁగిలించి మది ముట్టిన మోహ
ము ద్రెంపలేక లోఁ బొక్కుచు వేఁడియూ
ర్పుఁ దగఁ బుచ్చి తొడంబడఁ గొంత సేపు వే,
ల్పెక్కినభంగి నుండి ధృతి నెట్టకు నేనియుఁ
బూని కుత్తుకం,బి క్కడలించి పుత్రుఁ గని
చిత్తములోనఁ దలంపుగూడినన్. భా. రా.
అయో. 89.

న. క్రి. 1. (చెట్టుమున్నగువానిని) ఆరోహించు.

గీ ఎరకుఁ దెరువరిఁ గన శాఖ లెక్కజాలు, ప్రేవు
జందెంబు కసరి పైఁ బెట్టువాని. అము. 6. 19

2. అధిష్ఠించు, ఆశ్రయముగాఁ గొను.

క వర్లైయని రాజనందను, లెల్లను సమకట్టి
రథము లెక్కి దిశల్ ఫే, దిల్లఁగ ... భార.
ఆది. 6. 64.

సీ. పట్టసూత్రమయంబు పసిండియొడ్డాణ మే
యిగురుఁబోఁడి కటీర మెక్కె నొక్కొ. కాశీ. 4. 108.

వి. 1. జ్యాసంధానము. (చి. ని.)

గీ. కనియుఁ దమ్ముఁడుఁ దానును గాఢ్మకంబు, లెక్కు లటు డించి విసతులై యేఁగి మ్రొక్క. భా. రా. అర. 1. 11.

క. చతుష్పష్టి యనంజను, నఖీణవిలాసగుణస మగ్రుని ద్రిభీతిన్, వీక్షించుకుతుక మది మరు,ని శుధనుర్దండమునకు నెక్కెక్కుచున్. కావ్యా. 2. 62.

('వింటినారి' అని ప్రౌ. శ. ర-కాని ఆం. భా. మున్నగుపద్యనిఘంటువులలో వింటినారికిచ్చిన పర్యాయ పదములలో 'ఎక్కు' అనునది లేదు.)

2 దుష్ప్రోత్సాహము.

ఉ. ఎగ్గులు చూపి చంపు మని యెక్కులు పెట్టిన వారిపల్కులే,లగ్గగ నాత్మలోపలఁ దలంచి వివేకము లేక యిట్టి నీ, కగ్గల మైనదండ మన యంబునఁ జేసితి మోసపోయి ... దశకు. 8. 46.

ఎండయెక్కు – ఎండతీక్ష్ణమగు. భార. అర.

ఎక్కఁబాఱు (ఎక్కన్ + పాఱు – స్వార్థమున పాఱు)–ఎగప్రాఁకు.

(తూపులు) ఉ. ...పెద్దలు పిల్చినపిన్నపాపల,ట్లక్కునముండఁ దూఱుచుఁ దదంసతటంబుల కెక్కఁ బాఱుచుం, జెక్కులు చీరుచున్ నడుమఁ జివ్వకుఁ జీరుచుమండె నచ్చుగన్. కకు. 3. 187.

ఎక్కుకొను – ఎక్కు, ఆరోహించు.

ఉ. పట్టపుదంతి నెక్కుకొని భట్టి నృపాలుని సేన కంతకుం, బెట్టని కోటయై నడచె ... విక్ర 4. 58.

ఉ. ...రత్నఘంటికా, క్రాంతవిమాన మెక్కుకొని కన్నులపండువుగా ధనేశ్వరుం, డెంతయు వేడ్క వచ్చెలువు...ఉ.రా. 2. 125.

కీర్తికెక్కు–కీర్తికివచ్చు, కీర్తిమంతుఁ డగు. భా. రా. యు. 2087.

(ఇట్లే కీర్తనకెక్కు, గణనకెక్కు, నుతికెక్కు, మొ.)

కీర్తనకెక్కు, దశకు. 1. 75.

గణనకెక్కు, వరాహ. 10. 82.

నుతికెక్కు. పారి. పీఠి. 18.

జామెక్కు – జాముప్రొద్దుకడచు. విక్ర. 5. 217.

పల్లెరు(ర్లు) దుడిచిపాడెక్కు – (మొదటపల్లెరు మొక్కలు మున్నగువానితో నిండియున్నప్రదేశమును బాగుచేసి పల్లె కట్టుకొనియుండు) గ్రామనిర్మాణము చేసికొని ప్రథమనివాసులగు; ప్రథమ నివాసులగు.

గీ. పదియునెనిమిది వేలును బంచశతియు,నేఁబదియు నైదు సంఖ్యలయిండ్లవారి, మాత్రితులు కాశికాపురి కస్మదీయు,లీశ పల్లెరుదుడిచి పాడెక్కినారు. కాశీ. 6 155.

వ. ...భువనప్రపంచపంచజనహృదయభవనంబులం బద్మాపద్మాతులు పల్లెర్లు దుడిచి పాడెక్క భక్తిబోధించి భూతలంబుఁ బావనంబు సేయం గలవాఁడు...ఆము. 6. 66.

పసరెక్కు – పసరుకలది యగు.

(వ్యవ) నీరు పసరెక్కినది.

మదమెక్కు, కాశీ. 1. 189.

ఆమాట లన్నియు పుస్తకములోని కెక్కినవి – పుస్తకములో చేరినవి.

సూదిలో దార మెక్కినది – సూదిరంధ్రములో దారము దూఱినది.

వారు వివాదపడి రచ్చకెక్కినారు–1. రాజసభకు వెళ్లిరి. 2. వీథికెక్కిరి.

ఆపనికి ఎవరును ఎక్కలేదు–సిద్ధపడలేదు.

చక్కఁదన మెల్ల నొకరాశికెక్కు – చక్కదనమంతయు నొకరాశిగా ఏర్పడు. వరాహ. 9. 101.

జ: ఎకిరింత,ఎక్కించు, ఎక్కిడు, ఎక్కిరింత', ఎక్కుడించు, ఎక్కుడు, ఎక్కుడుఁదీఁగ, ఎక్కుగాఁడు, ఎక్కుడుమోకము, ఎక్కుదీయు, ఎక్కుద్రోచు, ఎక్కుబావి, ఎక్కువ, ఎక్కువెట్టు.

**ఎక్కుడించు** స. క్రి. (ఎక్కు+డించు)1 – ఎక్కు

దీయు. అవసజ్యముచేయు, జ్యాసంధానరహితముగాఁజేయు.

మ. కని బాణాసన మెక్కుడించి ధరణీకాంతుండు కాంతారమం,డనకల్పం బగునాశ్రమాంతతరువాటం బవ్వ నొత్తేరఁగా... భా. రా. అర. 1 8.

ఉ. అంత లతాంతచాపలత యగళ్లవుం డవు డె క్కుడించె... శుక. 1. 128.

3. (ఎక్కుడు+ఇంచు) హెచ్చించు.

గీ. వర్ణములు నాశ్రమంబులు వసుమతీశ, కలియుగంబున గతఁ గలసిపోవుఁ, గాన ధర్మంబు రూపయి కావరాదొ, కింత గలిగిన నది ఫలం బెక్కుడించు. హరి. ఉ. 9. 52.

**ఎక్కుడు** వి. (√ఎక్కు)1. ఆరోహణము, ఎక్కుట.

ద్వి. ... మెలఁతకునెక్కు, డల్లన నేర్పుచు... రం. రా. 150 పొ.29 పం.

ద్వి. అలయక యలసినయట్ల నాథులకు,విలవిలసొలుపులవిగువు సూపుచును, కోమరుదలిర్ప నెక్కుళ్ళ గుగ్గిళ్ళ, తమతమ పతుల హస్తము లూఁదికొనుచు. పండితా. పర్వ 343 పొ

2. వాహనము.

క. తొడవులు చివికినయెమ్ములు, గుడిముట్టు కపాల మిల్లు గుడి ముడియె ద్దెక్కుడు... కు. సం. 7. 870.

ఉ. ఎక్కుడివారొకో గరుడుఁ డెక్కుడుగాఁ గలవారు వీరొకో. యెక్కుడువారు...ఉ హరి. 6. 87.

8 ఆధిక్యము, పెంపు

సీ. పరసేన సచ్చియుం బాటియు బయలైన యనిలోన జయము నేకొనెడుచోట.

ఆ నొక్కరూపకాని యెక్కుడు డిగ్గను, గాన రాదు. ముఖవికాసమునకు. నిర్వ. 1. 44

విశ.— ఎక్కువ.

(హెచ్చైనది.)

చ చిడిముడిపాటు లేక యతిశీఘ్రమునన్ ఘనశక్తి నాతఁడె,క్కుడుముద మొప్ప నాన్నృపతిఁ గూలఁగనైచె సురల్ నుతింపఁగాన్. భార. ద్రో. 3. 250.

(ఉత్కృష్టము, శ్రేష్ఠము.)

ఉ ఎక్కుడివారొకో గరుడుఁ డెక్కుడు గాఁగలవారు వీరొకో, యెక్కుడువారు లోకులకు ...ఉ హరి. 6.87.

(అధికముగా నాదరింపఁదగినది.)

చ. ...నినురాజరాజ యిమ్మడుపున కీర్తి తెచ్చె విధి మానము ప్రాణముకంటెఁ జాల నెక్కుడగుట నెప్పఁగా వినవొకో కడు నీచతఁ బొందితక్కటా భా. శల్య. 2. 67.

(హెచ్చుగా నున్నది.)

చ. ఇరువదిరెండు నూఁటులకు నెక్కుడు నిర్వది యోజనంబులు . పిల్ల. 1. 7.

(స్థితికి మీఱినది.)

సీ. సంజయుతో మీరు శ కలేకాడినయెక్కుడు మాటలు నెక్కుడుకలవు భా. ఉద్యో. 4. 191.

(సామాన్యముగా నుడపలసిన దానికంటె ఎక్కువ )

ఉ. ఎవ్వఁడొకో లయా తకుని నే నని మార్కొని కోల మీఱెవాఁ,డెవ్వఁడొకో పురా తకుని యెక్కుడుక న్నలకాలఁ చన్నె... భా. రా. అర. 1. 158.

(అతీతము.)

క. పను గృతాంజలినై పది,యేనుఁ బదియుఁ దత్త్వములకు నెక్కుడగుచు వే, గోనల్లకైదువుచే న,య్యేనుఁగు రక్షించినతని నిట్లంటి మునీ. వరాహ. 10. 87.

క్రి. విశ. అధికముగా, మిగుల.

వ. అప్పటప్పటికెక్కు డొదవుమదంబున ప్రదిగ ర్తాదు లగు నమ్మార్తురు పై పయిం గ్రమ్మి ...భార. కర్ణ. 2. 317.

క. కడు నమ్మియునికియును నె,క్కుడు నమ్మమియును సుశీల కుశలతగా దె,య్యెడ నైనను... భార. శాం. 2. 187.

**ఎక్కుడుఁదీఁగ** వి. (√ఎక్కు) జ్యోతిష్మతి, మానేరు తీఁగ. (శ. ర.)

**ఎక్కుడుగాఁడు** వి. (ఎక్కుడు+కాఁడు) రౌతు

చ. ఎలుకలరాచ తేజి నెఱ యెక్కుడుగాఁ డపరంజిపైఁడని,గ్గులు గలమేని పెద్దడుగు బ్రొన్నెలబాలుపు ముద్దుపట్టె ... రాజ.చ.1.5.

**ఎక్కుడుమెకము** వి. (ఎక్కుడు + మెకము) మహా మృగము, ఏనుఁగు.

సీ. ఎక్కుడు మెకవునూ శ్లీ రుదల గ్రుడ్డుకానుపు లుఁబిల్లులు నడిదవు మెకములు. అచ్చ. రా. అర. 4.

**ఎక్కుడీయు** – ఎక్కుడించు. 1. (ఎక్కు + ఈయు.)

చ. ...మరుండు తుంటవిల్, బలువడి నెక్కుడీ సెఁ దొగపై దలియుం గనుమూసె నెంత యుఁజా. నీలా. 3. 44.

**ఎక్కుద్రోచు** – ఎక్కిడు. (ఎక్కు + త్రోచు.) (సజ్యముగాఁ జేయు)

చ. ...గాండిన్న,బలవడ నెక్కుద్రోచి బిగియం గదియించి నిమఁగయుగ్మమున్. భాగ. 10. ఉ. 1292.

గీ. ...పూవింటి నెక్కుద్రోచి, శరము సంధించి యేయుచో శంకరుండు, కలఁగు నంగజ మమ్మేలు కావవయ్య. పీఠ. 3.68.

**ఎక్కుబావి** వి. (ఎక్కు + బావి – ఎక్కుటకు మెట్లు గల బావి నడబావి

గీ. ఇఱుకుమ్రాను పెరంటిలో నెక్కుబావి...తన ర నిరతంబు వెలయు నాతనిగృహంబు.శుక. 2. 408.

**ఎక్కువ** వి. (√ఎక్కు) ఆధిక్యము.

ఆ. ఇరువురందు నప్పు డెక్కువ తక్కువ, యింత లేక కూర్మి యెఱుకపడియె. విక్ర.4. 183.

విణ. అధికము.

చ. భువనములం బ్రసిద్ధిగని పొల్చినసద్విజకోటి కన్న నెక్కువ యగుహంసచక్రములుగోరి భజింపఁగ...చిత్రభా. 1. 100.

**ఎక్కువె(పె)ట్టు** – ఎక్కిడు. (ఎక్కు + పెట్టు) (సజ్యముచేయు.)

గీ. ఇట్టియేఁ దేరుగడపంగ నెందు నుతికి,నెక్కు గాండీవ మేత్తెఱ నెక్కువెట్టి, రెండు దొనలను బూని కిరీటి యనికి,వచ్చు నేఁడెల్లి యెందుఁ బోవచ్చు మీకు. భార. ఉద్యో. 2. 190.

సీ. పల్వలంబులఁ గిరిప్రకరంబు లనుశంక నెఱుకు రాజులు విండు లెక్కువెట్ట గీ....అంధకారంబు ప్రబలె. భీమ. 2. 85.

(–నారిని–సంధించు, కూర్చు)

క. ధనలగుణ మెక్కువెట్టఁగఁ, గుసుమశరాసనుని విల్లు కుసులకు విఱిగెఁ. కళ. 1. 179.

**ఎగఁగట్టు** స. క్రి. (√ఎగు) పైకిఁగట్టు.

క. తలవెంట్రుక లెగఁగట్టెడు, కొలఁదిని .... నైష. 1. 62.

**ఎగఁగొట్టు** స. క్రి. (√ఎగు) 1. ఎగురఁగొట్టు.

సీ. పీచి త న్నెగఁగొట్టువెక్కసం బగుసుడిగాలి దక్కనుమీఁద లాలియూఁగి. చమ. 1. 83.

2. (ఋణాదుల)అపహరించు, ఎగవేయు.

(వ్యవ) వాఁడు ఋణము ఎగఁగొట్టినాఁడు.

**ఎగగొలుపు(ల్పు)** స. క్రి. (√ఎగు) పురికొల్పు.

వ. నీమది నెఱుఁగునురు గాదె యమనెడ నీ వనమాలిక కనుగొలిపి యెగఁగొల్పినఁ గల వాడి మఱియు నిట్ల నియె. మృ. వి. 2. 18.

**ఎగఁద్రోలు** స. క్రి. (√ఎగు) - నోటితో నీరు మొదలగునవి - పీల్చు.

క. బలుమీనొక్కటి నోరఁ,సలిలం బెగఁద్రో లుచుండఁ జని రాచెలువల్, వలుపురు తద్వ దనములో,పలి కానలిలంబువెంటఁ బార్థివ తిలకా. కళా. 6. 109.

**ఎగఁజల్లు** స. క్రి. (√ఎగు) పైకిఁ జల్లు.

చ. నెలఁతలు బంగిగట్టుకొని నీ రెగఁజల్లఁద దీయ మ జులాం,జలికలితోదకం బెగయు జాడ నుతింపఁగనయ్యె...వసు. 3 157.

**ఎగఁజేపు** అ. క్రి. (√ఎగు) ఆవు మొదలగునవి పాలు పైకిలాగి బిగఁబట్టు.

ఉదా : ఆవు ఎగఁజేపినది.

స. క్రి. ఆవు మొదలగునవి (పాలు)పైకి లాగి బిగఁబట్టు.

ఉదా : ఆవు పాలు ఎగఁజేపినది.

**ఎగఁజోపు** స.క్రి. (√ఎగు) 1. పైకిఁద్రోలు.

సీ. ఒకవేళ దేగవేఁటకుఁ జని యెగఁజోపి నానాండజములప్రాణములు గడపి. కాళ. 3. 47.

2. విడుచు, త్యజించు.

రగడ. మగువ లెగఁజోపి రభిమానముల మానముల. రాఘవ. 2. 6.

**ఎగఁదట్టు** అ. క్రి. (√ఎగు) ఎగఁదాఁకు, పైకి వచ్చి తగులు; హెచ్చగు.
ఉదా : శ్లేష్మము కంఠమునకు ఎగఁదట్టినది.
చ. దశముగ వేఁడియూర్పు లెగఁదట్టఁగ జెమ్మట లూని.... చెన్న. 4.30.

**ఎగఁదన్ను** అ. క్రి. (√ఎగు) 1. ఆవు మొదలగునవి పాలీయకుండు.
ఉదా : పాఁడియావు ఎగఁదన్నినది.
2. ఎదురు తిరిగి ప్రవహించు.
(వ్యవ) అడ్డుగట్టుపోయుటచే ఏఱు ఎగదన్నినది.
స. క్రి. ఎగఁజిమ్ము. మీఁటు
(వ్యవ) ఆవిరి మూఁతను ఎగఁదన్నుచున్నది.

**ఎగఁదీయు** స. క్రి. (√ఎగు) పై కెత్తు.
గీ. తిరిగి చూచుచు దల్లెగఁదీసికొనుచు, దగలు దొట్టి యథాయథలగుచు విఱిగి, యొకఁడు వోయినత్రోవ వేఱొకఁడు వోక, చెట్టొకఁడు గాఁగఁ బఱచిరి చెంచు లపుడు. మనుచ. 4. 103.
(వ్యవ) బట్ట ఎగఁదీసికొని వచ్చినాఁడు
సా : ఎగఁదీసిన బ్రహ్మహత్య దిగఁదీసిన గోహత్య.

**ఎగఁదొట్టు** - ఎకఁదొట్టు. అ. క్రి. (√ఎగు) ఎగువకు వ్యాపించు.
గీ. ఎదుటఁ బడకున్న మునికోటి వెదకి వెదకి, పట్టి భక్షించుఁ గ్రొవ్వెగఁదొట్టి గుఱక, విడిచి నిదురించు లేచు వల్లడలఁ దిరుగుఁ, గుంభకర్ణుండు నడయాడుకొండకరణి. ఉ. రా. 2. 148.

**ఎగఁద్రోచు** స. క్రి. (√ఎగు) పైకిత్రోయు.
వ. విమలమణిస్థలంబు జలాశయంబుగా వగచి పరిధానం బెగఁద్రోచికొని... భార. సభా. 2. 86.

**ఎగఁద్రోయు** స. క్రి. (√ఎగు) మీఁదికిఁ ద్రోయు: త్రోయు.
గీ. గాజు లెగఁద్రోసి చప్పుడు గాక యుండ, వచ్చెమార్వశి యర్జునావాసమునకు. హర. 7. 119.
సీ. సడలి ముంజే బ్రాలుజాలువాఁపైఁడిగాజులు పైకి నెగఁద్రోయుచో విలాసము...దశా. 2. 360.

**ఎగఁబట్టు** స. క్రి. (√ఎగు) ఎత్తిపట్టు
చ. కంఠముల నెత్తరాక యధికంబుగ వ్రేఁగయి యున్న దేవుఁ గ్రమ్మఱఁ జెనుఁగౌఁగటం జెనఁచి మాటికిమాటికిఁ బట్టి యెత్తనా, బరువయి తోఁచెన ట్టె నెగఁబట్టఁ సమర్థుఁడుగాక యిద్ధుని, స్ఫుటతిగతిన్ విభీషణుఁడు బుద్ధిగలంగి దుఃఖచింతతోన్. శేష. 5. ఆ. (శ. ర.)

**ఎగఁబడు** అ. క్రి. (√ఎగు) పాఱు, పరుగెత్తు.
గీ. స్తనితముల కెగఁబడి వచ్చుశిఖములను, బట్టి యెయ్యన ధాత్రిపైఁ బెట్టికొంచు, గండభేరుండపక్షులు గలిగి యజుని, యాశ్రమము శాంతరసరూపమయ్యె నపుడు. కాశి. 3. 70.

**ఎగఁబాఱు** స. క్రి (√ఎగు) ఎగువకుపాఱు. (శ. ర.)

**ఎగఁబిల్చు** స. క్రి. (√ఎగు) పైకి పిల్చు.
(వ్యవ) పొడుము ఎగఁబీల్చినాఁడు

**ఎగఁబెట్టు** స. క్రి. (√ఎగు) - ఋణాదులను - అపహరించు, ఎగఁగొట్టు.
(వ్యవ) వాఁడు ఋణము ఎగఁబెట్టినాఁడు.

**ఎగఁబోఁత** వి. (√ఎగఁబోయు) ఎగఁబోయుట

**ఎగఁబోయు** స. క్రి. (ఎగన్ + పోయు) 1. అధికముగా ప్రాఁగు.
(వ్యవ) గాడుపు ఎక్కువగా నుండుటచే పిల్లవాఁడు నీళ్లు ఎగఁబోయుచున్నాఁడు.
2. పురికొల్పు,
మ. అజహన్మత్సరవృత్తి చిత్త మెగఁబోయం జేట బల్గోటిజం, త జనస్థానమురీతి లంక నజనస్థానంబుఁ గావింప... చం. రా. 5. 49.
3. విజృంభింపఁజేయు, అతిశయింపఁజేయు.
సీ. మధునదం బెగఁబోసె మాకందమాలికాక్రీడామషంగిభృంగిరవంబు. మనుచ. 6. 29.
అ. క్రి. దురోద్ధముచేయు.
సీ. కామాంధురాలయి కలయఁ గోరినసీవు జనని వే సుతుఁడ దోసం బటంచుఁ, దలఁగి వచ్చి నఁ దనతప్పు నాపయిఁజూపి భూపాలునకు నెగఁబోసి యీర్ష్య. అ. నాజ్ఞ వెట్టఁజేసె

నలకన్నతండ్రియు, వెరవు మాలి యిటుల
వేగురించె. సారంగ. 3. 186.

చ. దయ వృషపర్వపుత్రియెడఁ దద్దయునుంచి
యయాతి భార్గవ, ప్రియసుత నాదరింపక
చరింప యదుం డది చూచి తల్లి కెం,తయు
నెగఁ బోసి రోస మెదఁదార్కొనఁజేసిన...
ఉ. రా. 6. 397.

**ఎగఁబ్రాఁకు** అ. క్రి. స. క్రి. (√ఎగు) మీఁదికిఁ బ్రాఁకు, ప్రాఁకుచు నెక్కు.

సీ. కర్ణడోలామౌక్తికచ్ఛాయ లెగఁబ్రాఁకు
నురువారరుచులఁ బ్రదస్తరికిఁ దన్న. అము
2. 75.

సీ. తెలుఁగంటిదొరయింటి తెలిమ్రాఁకు లెగఁ
బ్రాఁకి. నీలా. 1. 45.

**ఎగఁచు** - ఎగయించు - ఇది పొగచు వంటిది. కాని నిర్ధారక ప్రయోగములులేవు.(1.ఎగయఁ జేయు. 2. తలుము — అని సోదాహరణముగా శ. ర. కాని 1. వ. అర్థము క్రింద నిచ్చిన భాగ. అర. 2. 13. లోని 'ఎగచియెగచి' అనునది చి. ని. లోను, ప్రాంతభాంతప్రతులలోను 'ఎగిచియెగిచి' అని యున్నది. మఱియు 2. వ యర్థము క్రిందనిచ్చిన 'విహంగగమనుం డెగవన్' అను నిర్వ. 3 83. ఉదాహరణము. శ. ర. యే 'ఎగుచు' అను ఉన్మధ్యరూపము క్రిందఁ గూడ నిచ్చెను. 'ఎగయు' యొక్క ప్రేరణమగు 'ఎగచు' నకు 'ఎగవన్' అనురూపము సిద్ధించుటయుఁ జింత్యము. చూ. ఎగుచు.)

**ఎగతాళి** వి. (క.ఎక్కతాళి. ఎగతాళి) పరిహాసము గేలి. (చి. ని. శ.ర. బ్రౌ.)
(వ్యవ) పెద్దలను ఎగతాళి చేయరాదు.

**ఎగదిగ** క్రి. విశే. ద్రు. (ఎగన్+దిగన్) పైకిని క్రిందికిని; వెనుకకు ముందునకు.

గీ. ...తనకూఁతుసింగార మెల్లఁ జెక్కు, మాఱు
లెగదిగఁ గ్రేఁగంటఁ జూడఁజూచి, యింతకం
కెను గయిసేయ నెవ్వరింక, నేర్తురు...కళా.
7. 67.

ఉ. శాకునిక ప్రసంగ మిది సాహసికాదరణీయ
మౌనె చీ,కాకయి యూరకే యెగదిగం దల
పోయుచునున్న వారికిన్, గాక సదా మనోజ
యముగల్గి నధిరులకున్ భయంబులే,దు ...
రామా. 7.69. (ఎగదిగన్ — సంశయాత్మకో.)

**ఎగదువ్వు** స. క్రి. (ఎగన్+దువ్వు.) మీఁదికి దువ్వు.

సీ. డిగజాఱుముంగురు లెగదువ్వుకై తవంబున
నెమ్మొగంబుపై మోముఁజేర్చి. కవిజ. 3.
124.

**ఎగనూఁదు** స. క్రి. (ఎగన్+ఊఁదు)ఎగుర నూఁదు, ఎగసిపోవ నూఁదు.

సీ. వాంశికవంశికావైభవం బెగనూఁదెఁ జాళి
కాధరకరశాఖగరిమ. వసు. 5. 69. (ఇట
'తిరస్కరించు'అని తాత్పర్యము.)

**ఎగనెత్తు** స. క్రి. (ఎగన్+ఎత్తు) ఎగయ నెత్తుఁ మీఁదికెత్తు.

చ. ...తేఁటికో,యిలగొరవంకపొఁడు లెగనెత్తి
పొంకపుమీనుడాలు పెం, పలర ... కవిరా.
3. 69.

సీ. అభిమతదేచ్ఛ నభ్రమానసం బెగనెత్తికొన
గోళ్లఁ బలుమఱుఁ గురులు దువ్వి. ప్రభా.
5. 44.

**ఎగపు** వి. (ఇది 'అలపు,సొలపు'లవంటిది. √ఎగయు)
1. ఉడ్డీనము, ఎగురుట.

సీ. ...ఎగపునాఁగను విహంగగతి దనరు. ఆం.
భా. 2.99.

2. మండిపడుట.

ద్వి. బాగు మీఱిననాగబంధపుమొగపు, తీఁగదా
నిక్కఁగల్గఁదీఱుదేయెగపు. ద్వి. భాగ. 10
స్కం. (శ. ర.)

**ఎగమీటు** స. క్రి. (ఎగన్+మీటు) పైకిఁ బోవం జిమ్ము.

మ. జనవాథాగ్రణి ... కోలాహలా,ఖ్యనగాధీ
శుఁడు ప్రాలి శుక్తిమతి నాఁగన్ వేగ లేగ
వ్వ మీ,టినమాటన్ బొటబ్రేలిగోట నెగమీ
టున్... వసు. 1. 119.

**ఎగయించు** - ఎగచు. స. క్రి. (√ఎగయు) ఎగయఁజేయు.

సీ. ...అతఁడు. తెప్పల నెగయించి యప్పాండ వోత్తముఁ దవ్వఁ జూచి... భాఁ. ఆ[శ. 2. 60.

క. ...ఇంచుకవడి మౌనమ్ము దగం దాల్చి యుండి న తవదను డై.

వ పదంపడి నిట్టూర్పు నిగిడించి మొగం బెగయించి భూపాలు నాలోకించి...భాఁ భీష్మ 3. 173, 174.

(లేచునట్లుచేయు)

చ. మగలమనోనివాసముల మానిని దృఙ్మద నాస్త్రపావకున్, దగులుకొనన్ రగిల్చి చిఱు నవ్వనుగందవుఁగొండగాడ్పుచేఁ, బొగ లెగయించి... కాళ. 4. 34.

ఎగయు - నెగయు. అ. క్రి. (క. నెగె) 1. పైకి పోవు, ఎగురు.

సీ. ...ప్రమథులు గాని సేయుచును రక్తములు సల్లి, యారాఁగ మృగరూపమై గగనంబున కెగసె నధ్వరము భాం. శాం. 5. 489.

క. పిడుగువలె వచ్చి వన్నొక, పిడికిట మఱి ధర్మునొక్కపిడికటఁ గొని తా,నుడువీథి కెగసి మానసము. నొడిసి వడిన్నెగయు గృధ్రియుం బలె నన్నున్. ప్రబోధ. 3. 77.

2. రేచు, ఉత్తితమగు.

సీ. మంకినాఁ బరఁగుబ్రాహ్మణుఁడు ధనేచ్ఛమై వర్తించు శిఖంపవలయునట్టి, గుజ్జుదోయిని బట్టి గొని ప్రీతి లంకించి యుండ లంకియ తోన గండుమీటి, పాఱి నక్లోడియల్ పడి యన్నగనపలొట్టెనుంగుపై నదియెగసి పటు వ, నుభయపార్శ్వంబుల నురిపోసిన ట్లవి వ్రేలి చచ్చినఁ జూచి విప్రుఁ డడలి. భాం. శాం. 4. 40.

గీ. వగతమూజాతపెండ్లై వనాఁటినుండి,చేఁటిదాక వగస్త్మయుండు నిలువఁడేని, నిమ్మహాసేన బరువున నెగయకున్నె, దక్షిణం బన నరిగె నుత్తరమునకును. వరాహ. 3. 30.

3. ఎత్తగు.

గీ. అతఁడు నాఁగట నెత్తినయంతనుండి,యేటి దిక్కున కంతయు నెగసి యుండు. హస్తినా పురి...ఉ. హరి. 1. 10.

వ. ...వాఁణపురంబు నేఁడును దక్షిణం బెగసి యున్నది భాగం బొకించుక గంగకై క్రుంగి బలభద్రుని మాహాత్మ్యంబుఁ దెలుపు చున్నది...భాగ. 10. ఉ. 597.

4. ఉద్భవించు, కలుగు పుట్టు.

ఉ. .. ఊర్పులందుఁ గాఱుచ్చెగయంగఁ బాతి కఱచెన్ విహగేంద్రునహీంద్రుఁ డుగ్రతన్. భాగ. 10. పూ. 704

సీ. చెలిపాన్పుకడ నున్న చిగురుఁ గోయిలనోటి కిడిన నాలుక బొబ్బ లెగయు మంత. రా. వి. 4. 38.

5. చిట్లు లేచు.

ఉ. ...అక్రపామతిఁగొంకక చేతికోలఁ బై, తో లెగయంగ వ్రేసి వెస దోర్డ్లాని...మార్క. 1. 280.

6. వెడలు, ఉద్గతవగు.

గీ. ...ఖండితతర్జనిగుండ నెత్తు, రముక మొదలుగ లేచయ్యె నించుకైన, భూతియె వెడలె నౌర తపోవిభూతి.

ఉ. సత్యతపునివ్రేలు సమిధలతోఁ గూడఁ,దెగిన విధము భస్మ మెగయువిధము, ధరణిఁ బడ్డతునుక తనుఁదానె కీల్కొన్న. విధముఁ దెలియ విన్నవించుటయును. వరాహ. 12. 26. 29.

జ: ఎగచు, ఎగవు, ఎగయించు, ఎగసిపడు, ఎగసిపాటు.

ఎగరొప్పు అ. క్రి. (ఎగన్ + రొప్పు) వగర్చు. (మల్లయుద్ధమువర్ణనము) వ. చక్రమ్ములనీటున జిఱజిఱఁ దిరిగి దగల నెగరొప్పుచు... ప్రబంధ. 788.

వి. వగర్చు. (బ్రౌ. శ. ర.)

ఎగరోఁజు అ. క్రి. (ఎగన్+రోఁజు) వగర్చు.

వ పికిలిపిట్టలు... కఱచిన కాటులు విడక కాళ్లుపట్టుక పడి యెగరోఁజు నవతునను విచ్చుకలు కాట్లాడి పట్లు పట్టెడిచోదున.... ప్రబంధ. 788.

వి వగర్చు (బ్రౌ. శ. ర.)

ఎగవిడుచే స. క్రి. ( ఎగన్ + విడుచే ) విడిచి వేయు.

క. పలువలు చలువలు నేసెదు, నెలవునఁ బగ తెల్ల నిలిపి నిసి యగుటయ న,ప్పులుగాకి చాక పెనుఁగో,ల్పులిచర్మముఁగప్పి సస్య ముం కెగవిడుచున్. వేం. పంచ. 2.49.

క. మగఁడాపట్టునఁ దలఁ, దెగఁగొట్టినఁ గొట్టుఁగాక తెగతేంగ నీ, కెగవిడిచి పోయె దనె ప్రా,వగ నాకాణాచి యైనవలపుల పంటన్. కళా. 8. 191

**ఎగవేయు** స. క్రి. (ఎగన్ + వేయు) 1. (ఋణాదులను) అపహరించు. ఎగఁబెట్టు.

(వ్యవ) వాఁడు ఋణము ఎగవేసినాఁడు.

2. (చేసినతప్పు చేయలేదని) తప్పించుకొను.

ద్వి. ఎంత నేరమిచేసి యెగవేయఁ గలదు, అంత కురాలిది యనియెదువారు. ద్వి. సారంగ. 3. 107. పా.

**ఎగవైచు** స. క్రి. (ఎగన్ + వైచు) ఎగురవైచు.

ఉ. శైలములెత్తి కందుకముచందముగా నెగవైచి నేలకున్, వ్రాలఁగ నీక పట్టు... రామా. 5. 291.

**ఎగసన** విశే. (√ఎగు) ఎక్కువ.

సీ. యౌవనంబున నృశంసావతంసక కంస విధ్వంసనకిరంస వెలసినావు గీ. భూసురులఁ బ్రోవవేమి మహానురాగి, యిప్పు డేటికిఁ బ్రుంపవేళ్లైగసనైన, బుద్ధి దిగసనవచ్చెనో పో మహేమి. సిం. నార. 19.

క్రి. విశే. ప్రయో. పైకిపోవునట్లు. (చి. ని. శ. ర.)

(వ్యవ) పొయ్యిలో నిప్పుడుక లెగసనఁద్రోయుము.

సీ. అన్నపాత్రావలోకార్థమై దీపంబు శంభుస న్నిధి కెగసనఁగఁ ద్రోసె. సానందో. 5. ఆ.

చ. మగలమనోనివాసముల మానిని దృష్టిమదనాస్త్రపావకున్, దగులుకొనఁగ రగిల్చి చిఱునవ్వ నుగంధవుఁగొండగాడ్పుచేఁ, బొగలెగయుంచి పల్కునెయివోయుచు మందఁగ మాయ కట్టైచే, నెగసనఁద్రోచి యార్పఁ దగు నించుక యించుక కూర్మి తుంపరల్. కాశ. 4. 84.

(ప్రయోగములిట్లున్న నుద్రుతాంతమే యనుటకు నిర్ధారకములు కావు)

**ఎగసిపడు** అ. క్రి. (√ఎగయు) 1. ఎగిరిపడు. 2. గర్వపడు.

క. తానెంత యెగసిపడినం, గానీ దీని కుచములకుఁ గందుకమెనయే, నానాఁటఁ బ్రక్రముతెగ,ల్లైన స్మృతి వన్నెవాసియగు జోడునకున్. రా. వి. 2. 101. (రెండర్థములకు నిదియే యుదాహరణము.)

3. కోపపడు.

(వ్యవ) ఈమాట చెప్పఁగానే నామీఁద వాఁడు ఎగసిపడినాఁడు.

**ఎగసిపాటు** వి. (√ ఎగసిపడు) 1. ఎగిరిపడుట. 2. గర్వపడుట.

క. పసినిసువగు మా మగువన్, విసిగింపకు మనుచు నెంత వేఁడినఁ బైపై, ముసరుచు మఱిమఱి మోఁసెదు, భసలమ నీకింత యెగసిపాటేమిటికిన్. రసిక. 4. 171. (రెండర్థములకు నిదియే యుదాహరణము.)

**ఎగాదిగ** — ఎగదిగ.

చ. ...మోము గుబ్బలున్, గడకొనుకటుదీధితు లెగాదిగఁ గన్గొనుచిట్టకంపుఁ బ్రాఁగుడుఁగని ....ఆము. 2. 57.

ఉ. ప్రాయపుగాయకు ల్వేలనెపాన నెగాదిగఁ జూడ నేర్పులౌ, రా యివి దండమీఁదఁ గొనరందొందఁ గొంటిరి మంచిసాములే, పో ... విజ. వి. 1. 14.

ఉ. ...ఒకయంగన తానును వచ్చి రాజసం, బ్రందమునంద మంతయు నెగాదిగఁ గన్గొని చొక్కి...ఉ. రా. 6. 152.

**ఎగు** అ. క్రి. (క. ఎగు. త. ఎఱు.) దీనికి సమాపక క్రియారూపమున ప్రయోగము లేదు. కాని 'ఎగించు' అనిమాత్రము వాడుకలో నిప్పటికిని గలదు.

(వ్యవ) ఈయేఁడు వాన తెగించినవి.

మఱియు పెక్కుజన్యములకు ప్రకృతిగాఁగూడ నున్నది.

1 క్రిందినుండి మీఁదికిఁబోవు.

ద్వి. సంగడికాండ్రను జప్పరించుచును, వంగ మెగంగదిగంగఁ జూచుచును. బస. పు. 4.725.

(ఇది ప్రాఁతప్రతి పాఠము. క్రొత్త ప్రతిలో 'ఎక్కంగదిగంగ' అని సవరింపఁబడినది.)

చ. కొలుచును జేన వెట్టి కుచకుంభయుగం బెగ
డిగ్గఁ గన్నుఁద్రేగే,వలఁ బరికించు ... క్రీడా.
106.

2. ఎత్తగు, ఉన్నతమగు
సీ. ఎగుబుజంబులవాఁడు ... విజ. వి. 2. 164.
సీ. ఎగుపిక్కలు...కళాశాస్త్రము. 1. 11.

3. ఎగురు. (చూ. ఎగుబోద.)

జ: ఎగఁగట్టు,ఎగఁగొట్టు,ఎగఁగొలుపు,ఎగఁగ్రోలు,ఎగఁజల్లు,ఎగఁజేఁపు,ఎగఁజోపు, ఎగఁదట్టు,ఎగఁదన్ను,ఎగఁదీయు,ఎగఁదొట్టు,ఎగఁద్రోచు,ఎగఁద్రోయు, ఎగఁబట్టు, ఎగఁబడు, ఎగఁబాఱు,ఎగఁబీల్చు,ఎగఁబెట్టు, ఎగఁబోఁత,ఎగఁబోయు,ఎగఁప్రాఁకు,ఎగదిగ,ఎగదువ్వు,ఎగమూఁడు,ఎగనెత్తు, ఎగమీటు, ఎగరొప్పు,ఎగరోఁజు,ఎగవిడుచు,ఎగవేయు,ఎగవైచు,ఎగసన ఎగాదిగ,ఎగుడు, ఎగుడుదిగుడు, ఎగుదల,ఎగుబోద,ఎగుమతి,ఎగువ.

**ఎగు(వు)చే** స. క్రి. (చూ.ఎగచు.) 1. వెంబడించు; తఱుము.

ఆ. వీరినేనసుతుఁడు వీరుండు హంసల, నడబెడం
గుఁ జూచి నగుచు వాని,నెగిచి యెగిచి యందు
నెగయకుండఁగ నొక్క, హంసఁ బట్టుకొని
యె నతిశయమున. భార. అర. 2. 12.

క. బాలహరిణములఁ బట్టెడు,శీలను విషమాటవీ
చరత కేసరిశా,ర్దూలేభ శరభములఁ దన,బాల
త్వమునందె యెగిచి పట్టుచు మఱియున్.
భార. ఆది. 4. 6.

క. అమ్మోయిని నోడి శానుం, దమ్ముఁడు హత
శేషమైనదానవ బలముం, గ్రమ్మఱి తమ
వచ్చిన మా,ర్గమ్మునఁ బాఱెను విహంగగమ
ముం డెగువన్. నిర్వ. 8. 83. (చి. ని. పా)

క. దివిజులుతొలుశాఁకునఁ ద, మ్మెవిచినదను
జులను మనకుతేశ్వర శరముల్, పావయని
మంటలు మింటికి,నెవయంబడి కెడవ మొనని
నిలిచిరి బారున్. కకు. 5. 37.

ఉ. ... నిన్,నమ్మినముగ్ధలన్ రహితవాధల
వక్కట నేఁడు రెండుమూఁ,డమ్ములయేటు
లాఁ డెగువ నడ్డము రాఁదగదే కృపానిధీ.
భాగ. 10. పూ. 1056. (చి.ని.పా-ఇట
'బాధించు' అని భావము.)

2. త్రోలు.

చ. అనపుడు మూతుఁ డెంతయు రయంబునఁ
దేరు వృకోదరాంతి కం,బున కెగువంగ
శంఖరవముల్ గుణనిస్వనమున్ నిగిడ్చి ...
భారా. కర్ణ. 1. 159.

ఆ. వలుఁదనాఁసంబు వతఁబుఁ దూఱంగ, నే
యుటయును బాండవేయుఁ డార్తుఁ,గూరి
నిలువలేక కూర్చుండఁబడి మూతు నందమె
గువు తోలఁగ ననియె నధిప. భార. కర్ణ.
2. 381.

3. త్రోయు, పడఁద్రోయు.

మ. ...విజయుఁజ్యాధీశ్వరుం గానిగా, నెవిచెన్
జోళనమన్మసిద్ధి యని ప్రాయెటం బ్రగాఢోద్ధ
తిణ. నిర్వ. 1. 39.

4. చోపు, తేవఁగొట్టు.

సీ. ఎగుచుకూఁతలు ముట్టె యెత్తి బిట్టాలించి గ
మికిఁ గన్నాకయి గాలి యరయు. మనుచ.
4. 42.

5. (బాణాదులతో) కొట్టు.

క. కనిమసఁగి యసుఁవిసరము, లనిలశిఖల
సుఁల నెగువ నసువులు వెడల, బసచెడిరి
పడిరి కెడసిరి...భాగ. 8. 145. చి. ని పా.
(కత్తులతో చావఁగొట్టఁగా, అని భావము)

శ్లో. యదా యుద్ధేఽసురై ర్దేవా వధ్యమానాశ్శ
స్తాయుధైః, గతాసవో నిపతితా నోత్తిష్ఠేర
న్ పునశ్చ తే సం భాగ. 8. 5. 15.

**ఎగుడు** విశే. (√ఎగు) ఉన్నతము. (చూ. ఎగుడు దిగుడు.)

**ఎగుడుదిగుడు** విశే. (ఎగుడు+దిగుడు) 1. సమము కానిది, విషమము.
ఉదా: ఎగుడుదిగుడు నేల.
2. అసంగతము.
ఉదా: ఎగుడుదిగుడుమాటలు.

**ఎగుదల** వి. (√ఎగు) 1. పై భాగము. 2. అభివృద్ధి (శ. ర.)

**ఎగుడు** (ఇది శైవకవియగు సోమనాథుని కవిత్వము వంటే కాన్పించుచున్నది) అ. క్రి. 1. పరుగిడు; పరుగిడివచ్చు.

ద్వి. మహి నెదురే చూచు మత్తిభూతములు,
ఎగిది యొక్కటి చాల కేమ్నాలు నచటి,

పొగ దాఁకి కైలాసమున కప్డు పోవ. బస. పు. 7. 198. పం.

ద్వి. మగనిఁ బాయుదు వాఁడు తెగ నున్న యెడ ను, నెగిది శివాలయం బింతి సొచ్చుడును. బస. పు. 6. 548. పం.

ద్వి. చక్కన గుడి వెన్కటక్కున కరిగి, యెగుదు దురోయని వగపడి వెనుక, మగిడి యాలించు చు బెగడుచుఁ జనుచు. బస. పు. 4. 777. పం.

2. దొంకు, లభించు

ద్వి. ఆవేళమున భక్తులగ్గలం బనుచు, నెగుదునొకో వత్తు లివ్వాఁట కనుచు, నెగుదికున్నను లింగ మెఱుఁగుఁగాకనుచు, బడి యోగిరము లలవ దునొకో యనుచు. పండితా. పర్వ. ...

**ఎగుబోద** వి. (√ఎగు) ఱెక్కలు మొలచి యెగిరెడు వయసువచ్చిన పక్షిపిల్ల.

సీ. ఎగుబోదలయి గూఁడు దిగనాడి పెఱ మ్రాఁకు లెక్క నాఁచి యుత్సహింప లేదు. వే. పంచ. 1. 287.

**ఎగుమతి** వి. (√ఎగు-త. ఏట్రుమద) ఓడ మొద లగువానిమీఁద సరకు లెక్కించుట.

ఎగుమతిచేయు-(సరకు)ఓడ మొదలగువానిలో నెక్కించు.

**ఎగురఁగొట్టు** స. క్రి. (ఎగురగ + కొట్టు) ఎగిరి పోవునట్లు చేయు.

గీ. దాఁగురే దావచఁదోయి చక్రవాక, ముల నె గురఁగొట్టు... ఇందు. 2. 188. (ఇట లౌప మ్యద్యోతకము.)

**ఎగురు** అ. క్రి. (క. ఎగురు. త. ఎక్కు, ఎహ్కు.)

1. ఉడ్డీనముచేయు, ఎగయు.

ఆ. మువ్వగదల నత్తెములమండి యెగురుచుఁ, బ దనుమీఱ నెరలు వెదకుదేగ, పదువు వట్టి దండ పాణులై నడిచిరి, విభునిగెడల దేగ వేఁటకాండ్రు. మనుచ. 4. 85.

2. పైకిలేచు, ఉత్పతనముసేయు.

వ. దారుహారంబు లెగుర, వసు. 4. 28.

సీ. భ్రూసంజ్ఞసంకేతములు దెల్పునముచికి నింపు గాఁ గమలొామలెగురవైచె, దశా. 2. 303.

వి. 1. ఎగురుట. 2. గర్వము, పొగరు.

ఉదా: వాని ఎగురు అణఁగినది.

జ. ఎగురఁగొట్టు, ఎగురులాడు.

**ఎగురులాడు** అ. క్రి. (ఎగురులు + ఆడు) దుముకు లాడు. (శ. ర. బ్రౌ.)

**ఎగువ** వి. (√ఎగు) మీఁదు; ఆవలిభాగము.

ఆ. అపుడు దేవదేవి యాచల్ల గాడ్పుల, వింతవా సనలకు వెఱఁగుపడుచు, నెగువ నొక్కతోఁట యెద్ది యో గలదుగాఁ, బోలు దానిఁ జూచిపోద మనుచు. పరమ. 8. 198.

విశ. మీఁద నున్నది; ఆవలిభాగమున నున్నది.

వ. గాలి వగికించి దిగువదెస దొడ్డి వల వన్ని యెగువ పొలిమేర బారాదియగుదూరం బేఁగ... మనుచ. 4. 87.

**ఎగ్గడి-హెగ్గడి.** వి. 1. అంతఃపురపు కావలివాఁడు.

సీ. . . మఁడుఁ డొప్పు, నెగ్గడి యనంగ... ఆం. భా. 2 188.

2. అంతఃపురపు కావలికత్తె (చూ. ఎగ్గడికత్తె).

జ: ఎగ్గడికత్తె, ఎగ్గడివాడు, ఎగ్గడీడు.

**ఎగ్గడికత్తె-హెగ్గడికత్తె.** వి. (√ఎగ్గడి - స్వార్థమున 'కత్తె') అంతఃపురపు కావలికత్తె.

గీ. ఒడలిబడలికఁ గైటభద్విడలికచలు, కదలు దురె నాఁటి కెగ్గడికత్తె కేలి, చికిలిబెత్తంబు త ఱులింత చేసెఁగాక. బహు. 2. 65.

**ఎగ్గడికాఁడు - హెగ్గడికాఁడు.** (√ ఎగ్గడి)

**ఎగ్గడీఁడు - హెగ్గడీఁడు.** (√ ఎగ్గడి.)

**ఎగ్గతము** విశ. (సం. ఏకాంతః ?) ఏకాంతమైనది, నిర్జనమైనది.

(గాంధారికృష్ణునిశపించుట) గీ. ...అయ్యవ్వ యతఁ డెగ్గతంపుఁజోట, వరయ దిక్కెవ్వరు ను లేనియట్టితెగుట, నొందఁగలవాఁడుగాఁ బల్క నొద్దమండి, వింటి... భార. మౌ. 157.

వి. ఏకాంతస్థలము, ఒంటరిగానుండుచోటు.

గీ. ఎగ్గతంబునఁ దానుఁ గారగ్గిఁ గాలె, నశు య నాథయై దీనికి నంతరంగ, మలఁదురక... యెట్లుండుఁ జెపుమ. భార. అశ్వ. 2. 168.

**ఎగ్గించు** స. క్రి. (√ ఎగ్గు) 1. అనాదరముసేయు, నిరసించు.

మ. తవరాజీవశరం బెఱుంగదు నిశాతత్వంబు లేఁగల్వతూ, పువకుం జాలదు వేగలిల యని యాపూములుక్కలెగ్గించి క్రొన్ననవిల్తాఁడు

వవాంబుజోత్పలవితానం బీ సుమీ నా ఉ లో,చవము ల్వింట ఘటింపఁ బొల్చె వవి ని స్తంద్రాంబక ఖ్యాతులన్. వసు. 2. 48.

2. ఆక్షేపించు, దూషించు.

స. ... మనంబున వగచి యిట్టి ... వద్దురా త్మునిచే నఖిల కపివర రాక్షసప్రళయంబు సమకూరుచున్న యది యని యింద్రాదు లెగ్గింప విన్నవై యుంటె. సీతావి. 8. 185.

8. ఎగ్గుగాఁదలఁచు,త ప్పనితలఁచు.

శా. ...అయోధ్యాకళాదుండు చే,తోవీథిన్ సహా జాధనాపహరణోద్యోగంబు నెగ్గించునే ... వసు. 4. 84.

ఎగ్గు వి. 1. కీడు, అశుభము.

ఆ. ...నిమిత్తములు నయంబునఁ జూచితి, నెగ్గు లేదు వారికెల్ల లగ్గు. భార. ఆది. 7. 28.

క. వలచి హితంబునఁ బథ్యముఁ, బలికినఁ జేకొ వని ధర్మబాహ్యుల నవివేకుల నిగ్రహింతు మీకె,గ్గులు మత్సాన్నిధ్యమున నగునె యెయ్యెడలన్. భార. అర. 1. 149.

2. అశుభచిహ్నము, దుర్నిమిత్తము.

క. ఖలుఁ డీదుర్యోధనుఁ డె,గ్గులతోడన యుద్భవిల్లె గోమాయురుతం, బులు వించె దుర్నిమిత్తం,బులు పెక్కులు పుట్టె వీని పుట్టిన వేళన్. భార. సభా. 2. 178.

8. అపరాధము.

గీ. ...అమ్మ మిమ్ము,నెఱుఁగ కొనరించినట్టి నాయెగ్గు లెవ్వి.గల్గినఁ గృతార్థ(కృపార్ద్ర?) చిత్తవై కావు మనుచు. కళా. 5. 180.

శా. ఏలా యింత వృథాభిమానము క్రియాహీనుండవై నావిధం,బాలోకింపక యెగ్గుచేసి తిట నీ యాచారము న్నీదువా,గ్జాలంబు న్మతి నీ తపోమహిమయుం జర్చింప నీపాటి యే, నీలాగంతయుఁగంటి నంత్యజుఁడవై నీవుండు మిద్ధాత్రిలోన్. భోజరా. 8. 114.

4. తప్పు; నిషిద్ధమైనపని.

క. ప్రతికూలమైనకార్యం, బతి విడిచిన నెగ్గు లేమి ప్రకటంబ శ్రుతి,స్మృతులందుఁ జెప్పఁబడుట...వరమ. 5. 278.

క. ఏ మనిన నని యగణ,గామినియలు కార్యఁ బంబు గామిని నృపతి, గ్రామణి సాఁగిలి మ్రొక్కెను, గాముకులకు నెగ్గుసిగ్గుఁ గలవే యెందున్. సారం. 2. 218.

గీ. సబము నెంగిళ్లు దినిభోజనము క్రూర,మిట్టి యెగ్గులు వేయును నేల చెప్ప, ఖగములందుఁ బండాలుఁడు కాక మనుట,గడుఁ బ్రసిద్ధంబు గాదె యానొడువు వినవె. కేయూర. 8. 38.

5. భంగము, ఓటమి.

శా. ఆపంచాయుధు పెంపు సాహిమక రాహంకారి మాకోకిలా,టోపంబుం దరియింప లేక సతి నిండుంగూర్మితో ధైర్యసీ,మాపర్యాప్తికి నెగ్గుగా మడిఁగిఁదన్మంజీరపుంజీకృత, ఖ్యాపత్రాతకిరీటు మ్రొక్కి నిలిచెం జారుకర్య విశ్వేశ్వరున్. కావ్యా. 8. 54.

చ. నిను హరియించునట్టి మహనీయ బలాఢ్యుని గాని యెవరిం,ప ననుచుఁ బల్కితిం గలదె పల్కున కెగ్గనియెన్ వధూటియున్. కళా. 6. 50.

6. నింద.

ఉ. ...ధర్మకీర్తులన్, బొగ్గులు సేసిజారు శశిఁ బొందిన టూకడు పేల తెచ్చుకొం, టెగ్గు దలంపఁగా వలదె. భాగ. 9. 878.

7. అమంగళ వాక్యము, కీడుమాట; దూషణ వాక్యము.

సీ. ...ఎగ్గు నా గుళతిపై రెసఁగు చుండు. అం. భా. 1.117.

గీ. కలికిజవ్వన ముడివోయి కడుఁగురూప,యై మదీయభామిని యుండు నదిప యట్టిదైన నయ్యింతి నొక్క యెగ్గాడ దాని,కింపు మిగులంగ వర్తింతునిది నిజంబు. మార్క. 5. 142.

8. అవమానము. (చూ. ఎగ్గుసేయు.)

విశే. కీడైనది, హానికరము.

క. అంతిపురముచుట్టటికిఁ, బెంతయుఁ గీడంత కంటె నెగ్గు తదీయో,పాంతచర కుబ్జవామన, కాంతాదులతో డిపొందు కలిమి ధటునకున్. భార. విరా. 1. 181.

ఎగ్గాడు – నిందించు.

శా. తోడంబుట్టినవానిభంగమునకున్ దుఃఖించి మాకృష్ణు నె, గ్గాడం జూడకు మమ్ము ... భాగ. 10. పూ. 1778.

ఎగ్గులాడు — నిందించు.

ఉ. ధీయుత యంచు ధర్మజనదీసుతకృష్ణుల నెగ్గులాడుచుం, బోయె సదంబు వెళ్వడి సపుత్ర బలుండయి చైద్యుఁ డల్కతోన్. భార. సభా. 2. 15.

సీ. భూభారభరణలీలాభిముఖ్యంబున నేమేటి తామేటి నెగ్గులాడు. నరస. 1. 11. (ఇట ఔపమ్యవాచకము)

ఎగ్గులుపల్కు — నిందించు.

చ. ఇతనికి నిట్లు వన్నుటక యెగ్గులు పల్కఁగఁ బోలెఁ గాక యుద్ధతమతి నన్ను శీతనివిధంబునఁ బల్కి మదీయచాపనిర్గతచటులోగ్ర మార్గణనికాయపయోధిమును గ్రక్కున దాఁ తులయి పోవ నేర్తు రె... భార. సభా. 2. 61.

ఎగ్గువల్కు — ఎగ్గాడు.

గీ. అట్టి సర్వేశుఁ బాపసంహారు ధీరు, శాశ్వతైశ్వర్యు నాత్మసంసారు నీశు, నెగ్గువల్కిన పాపాత్ముఁ డెల్లభంగి, దండనార్హుఁడు గాకేటు దలఁగఁ గలఁడు. భాగ. 6. 496.

సీ. వలుఁదచిందముసెగ్గువలుకుకుత్తుకవాఁడు.. నీలా. 1. 88. (ఇట ఔపమ్యవాచకము)

జ. ఎగ్గించు, ఎగ్గుగొను, ఎగ్గుచేయు.

**ఎగ్గుగొను** స. క్రి. (√ఎగ్గు) ఎగ్గుగా భావించు.

క. కావునఁ బ్రభుత్వసంపద, నీవిభుఁ డాడినది యెల్ల నెగ్గుగొనక నా, చే వినుము నీదు ప్రతినకు, నేవిధి నేయ నగు దాని నేర్పడ ననఘా. భార. కర్ణ. 8. 83.

**ఎగ్గుచే(సే)యు** స. క్రి. (ఎగ్గు+చేయు) అవమానపఱచు, పరాభవించు.

ఆ. పోతుటేఁగ కైవఁ బోలయంగ రాదు నా, యావఁ జేసి మందయాన నిన్ను. నెవ్వ రెగ్గు సేసి రెఱిఁగింపవే మది, నలుక వలదు నీకు నలుక వలదు. సారంగ. 2. 201.

**ఎచేటు** — ఎచ్చోటు.

గీ. ..ఏకలవ్యుఁ గచట, నెచట నున్నాఁడు సాత్యకి యొందుఁ బోయె, హాలధరుం డని యదలించి యంతఁబోక. ఉ. హరి. 3. 29.

**ఎచేరించు** — ఎచ్చెరించు.

(ప్రేరేచు, ప్రోత్సాహపఱుచు, పురికొల్పు)

గీ. వట్టికూడును వేన్నీళ్లు పెట్టి యొట్ట, గలుగువిద్యంబు లిప్పించి వలఁతియైన, వెజ్జు నెచరించి యరయించె విప్రసుతుని, గంటవత్తిడుకొని సైరికప్రభుండు. పాండు 3. 56. (ఎచరించి:- ఏర్పఱిచి అని భావము.)

ద్వి. చలపట్టి లేనిదోషంబు నామీఁదఁ బచరించి మాయలు పన్ని భూపాలు, నెచరించి గోయింప నెట్లాడె మనసు. నవ. 2. 94. పా. 11. పం.

**ఎచోటు** - ఎచ్చోటు.

**ఎచ్చేటు** - ఎచ్చోటు.

సీ. రంభాప్రధానాప్సరః ప్రభూరోజకుంభంబు లెచ్చటఁగన్నఁబట్టిపట్టి. ఆము 1 41.

**ఎచ్చెరము** వి. (√ఎచ్చు) ఎచ్చరిక.

వ. మఱియు నయ్యుచ్చర లెచ్చరంబుల కచ్చు వదలి... కవిక. 6. 94 (శ.ర పా.–మచ్చరంబులకచ్చువదలి. ముద్రి.)

వి. ఎచ్చరము, హెచ్చరిక

సీ. ఎచరంబు నేర్పని యెన్నుఁగాని; ఉ. హరి 8. 124. (అరచంబు నేర్పని యరయుఁగాని. వీరేశ పా)

**ఎచ్చెరించు** - ఎచేరించు, ఎచ్చెరికించు, హెచ్చరించు, హెచ్చెరికించు. స. క్రి. (√ఎచ్చె. క. ఎచ్చఱిసు. త. ఎచ్చరి.) 1. ప్రోత్సాహపఱుచు, పురికొలువు.

గీ. ముచ్చటలు దెల్పు రతికేళి కెచ్చరించు. శుక. 1. 301.

ఉ. ... టంక్రియా, రావమునన్ ధనుర్గుణము రక్షసినొంచుట కెచ్చరింప ర, ణోవినరాంగ శోణితముఁ గ్రోలి యెఱుంగనికోల యేయుడున్. చం. రా. 2 77.

2. జాగరూకుని చేయు.

చ. అతినికటంబు లగ్న మని యాంగిరసుం డవుడెచ్చరింప... వసు. 6. 8.

గీ. మఱియు నచ్చోట విహరించుతఱిని మంద, మందగంధవహాప్తిమై మఱచియుండు, వంత నవు

నెచ్చరింపక యరిగె బంధు,తతి మన బున నిల్లాం[డ్రఁ దలఁచికొనుచు. శుక 1. 304.

3. జ్ఞప్తికిఁదెచ్చు.

ఉ. ఎంతకుఁ దెచ్చె నే సరసిజేక్షణచెయ్యము లందు మీఁద జ,న్మాంతరవర్తనంబు హృదయంబు న కిత్తఱి నెచ్చరించి గో,రంతలు గొండలంత లగునట్లుగఁజేసితి మంచుఁ జేటికా, వాంత సతాళవృంతమృదువాతహిమాంబుకణాళిఁ దేర్చెనఁ. ఆము. 5. 77.

4. తెలుపు.

ఉ. రామవిభుండు నిస్తులశరంబుల రావణు హస్తమస్తక,స్తోమము [దుంచినన్ మొల చుఁ దోడనెతోడనె [తుంచు రాముఁడున్, వేమఱు నట్లు ద్రుంచి యటువెన్క విభీషణుఁ డెచ్చరింప గ,ర్భామృతమున్ హరించె నన లాస్త్రమునన్ శిరం మొండు దక్కఁగన్. దశా. 7. 156.

**ఎచ్చేరింత** వి. (√ఎచ్చేరించే) ఎచ్చరించుట.

ఉ. వింతకవుంగిలింతల నవీనగళధ్వని యెచ్చరింతలన్.. కంతుకేళిక,ల్గినల గొల్పునాఁటి తగులే మనసయ్యెడు నేమి సేయుదున్. పాంచా. 3. 60.

**ఎచ్చేరింపు** వి. (√ఎచ్చేరించే క. ఎచ్చఱ. త. ఎచ్చరిప్పు) ఎచ్చరించుట.

సీ. పెనఁగొన నేరని[ప్రేమానుబంధంబుపై కొన నెఱుఁగని పదుకసొంపు, ఎచ్చరంపెఱుఁగని యెడఁదబల్ తమకంబు [ప్రతికారమెఱుఁగని భావచేష్ట. చంద్రా. 6. 143.

**ఎచ్చేరిక**-పెచ్చేరిక. వి. (√ ఎచ్చే క ఎచ్చఱికె. త. ఎచ్చరిక్కై). 1. [ప్రోత్సాహము.

వ. ...రథంబు వఱపించి యొఱపుసఱపున నడ్డగించువగఱ యెద్దుగడ్డుటికి చించుకొని తన తోన చొచ్చునిచ్చలంపుటెచ్చరిక చాలక యక్కడక్కడం దలపడి వెలివెలిన పోరునిజ యోధవీరులకు దూరదృశ్యమాన కేతవద్యోతనంబువం [బీతి యొసంగుచు... రాఘవ. 4 152.

2. జాగ్రత్త, అవధానము.

వ. తనమేళగాండ్రద నాలోకించి యిబ్బాలకులు మనవాలకపుసొమ్ములంటు నే మేనియు నప హరించుటకు సన్నాడుచున్నవారు మీర లీ [ముచ్చుల నెచ్చరికం గనుపెట్టుకొని యుండుఁ డనుటయు. [ప్రభా. 1. 107. పాండు. 2. 97.

3. [ప్రభువులయవధానమునకై వే[త్రధరు లుప యోగించుమాట. (ఇది'పరాకు'వంటిది)

క. ఎచ్చరిక సామి యనురవ, మెచ్చుఁగఁ గంచుకులు వెంటనేతేఁగఁగన్. ఉ. రా. 7. 398.

సీ. ఎచ్చరిక యయ్య మాహిష్మతి యేలువాఁ డని చినాఁ డిచిన్నయలరుఁకొండ్ల,ను ...... యయా. 1. 100.

**ఎచ్చేరికించే**-పెచ్చేరికించే, ఎచ్చేరించే. (√ ఎచ్చేరిక) స. క్రి. ఎచ్చరించు.

(జ్ఞప్తికిఁదెచ్చు)

సీ. మఱవక నే నన్నమాట యెచ్చరికించి యడిగితి గాన నీ కనువచింతు. శ్రీరం. మా. 4. 4.

([ప్రోత్సాహపఱచు, పురికొల్పు)

ఉ. వచ్చి పురంబువాకిట రువారపుఁగోడెతనంబుతోడఁగ,న్నిచ్చకు వచ్చు చేడియల నెచ్చరికించుచు... నెలవిపాఱఁగ నవ్వుచుఁ గేకరించుచున్. వి[క. 8. 9.

**ఎచ్చిరిలు**(రిల్లు,ర్లు) - పొచ్చిరిల్లు అ. క్రి. (√ ఎచ్చే) 1. వృద్ధినొందు.

గీ. ఏయుపాయంబు చేనైన నెచ్చిరలఁగ,నీక రాక్షసకులము రమేశ్వరుఁడు, దునుము ... కళా. 6. 82.

చ. అనిమిషమండలీరుచిరమై కవిరాజవిరాజితోక్తులన్,దనర మరున్ని కేతన మనం గనుపట్టినదాని నొక్కచోఁగనియె సరోవరంబు ఝుషకంబులఁ బట్టుకొనంగ శక్తిఁ జేక నిలిచి [కౌంచ మెచ్చిరిలుకాఱియఁ దత్తటి నూరకుండఁగన్. వేం. పంచ. 1. 297.

2. విజృంభించు.

గీ. వృపులకపుల సమరనిష్ఠురత్వంబుల, వొచ్చి చరమదశకు వచ్చి దనుజు,లెపుడు [ప్రొద్దు

క్రుంకు నెపుడు మా కెచ్చిర్లఁగలుగు నను చుఁ బోరు సలుపుచుండ. రామా. 8. 6.

3. జాగరూకుఁ డగు.

గీ. బీజమాత్రంబు చిక్కక బెలపోవు,నెల్ల ధరణి యు నింతట నెచ్చిరిల్లి,కాన నిది వేళ తగిన మార్గంబుఁ జూడు,మనిన నెంతయు భీతిల్లి యబ్జభవుఁడు. శ్రీరం. మా. 8. 14.

ఎచ్చిలు అ క్రి. (√ ఎచ్చె. క ఎచ్చలు) 1. వృద్ధి నొందు.

చ. మఱునటినాఁటి వేకువ నమాత్యుఁడు మే ల్కొని వంశ మంతయుం, జెఱచిరి కూఁతు రుం గొడుకుఁ జెల్లరె మీఁదటఁ జంద్రవం సుఁ డెచ్చిలినఁ బ్రమాదమౌ ననుచుఁ జిత్త మునం దలపోసి వీని నే,తెఱఁగున నైనఁ జంపెద యతిప్రవరోక్తులు బొంకుచేసెదన్. హై. ఖా. 8. 98.

2. తేలు, ప్రబోధము చెందు.

వ. అని హితోపదేశంబు చేసినం గైకొని రతి నిః శీలయథ క్తింబని మేశ్వరారాధనంబు సే యుచుండె నట గిరిజ శిశిఁ గిరివరకరంస్పర్శం బు శిశిరోపచారంబుగఁ నెచ్చిలి...కు. సం. 5. 583.

ఎచ్చిలులల్లు, — హెచ్చిల్లు. అ. క్రి. (√ ఎచ్చె) హెచ్చు,అతిశయించు.

ద్వి. గవఁకులు దెలిపించి ఘనవాద్యతతులం పము లెచ్చిలఁగ ధీరతఁ గోటవెడలి. ద్వి. పం. ము. 6. 484 పొ. 4 పం.

ఎచ్చె— హెచ్చె అ. క్రి. (క. త. ఎచ్చు) 1. అధిక మగు

క. ఎచ్చరిక సామి యనుఁ న,మెచ్చఁగఁ గంచు కులు వెంట నే తేరంగన్. ఉ. రా. 7. 398

గీ కుసుమకొనకొమ్మ డిగి క్రిందికొమ్మమీఁది, నిలుపు గైకొనుపులుఁగుల యెలుఁగు లెచ్చె. విక్ర. 4 27.

2. చెలరేఁగు, రెచ్చు.

ఉ. దుర్మతు లెచ్చి సాధులకు ద్రోహము సేయు నెడన్ జగంబునన్,ధర్మము తప్పునప్పుడవ తారము లెత్తి విశిష్టరక్షణల్,గూర్మివొనర్చి దుష్టజనకోటి హరింతువు...ఉ. రా. 2. 110.

వి. 1. అధికము, హెచ్చైనది.

క. వచ్చినవారికి నాపద,వచ్చిన నదివరిహరించు వానిప్రభుత్వం, బెచ్చైను గాని ... దశా. 2. 217.

2. గొప్ప, గౌరవకరము.

సీ. నీవిశ్వరూపంబు సేవించుటకు వేయిచకువు ల్ గల్గువాసవుఁడఁ గాను. గీ ఇట్టివారలఁ గృపఁజూచు టెచ్చు గాదు, దేవ నావంటి దీనుని బ్రోవవలయు. వేణు. 2.

వి. ఆధిక్యము, గొప్పతనము.

గీ. నిచ్చలంబునఁ గడలఁ దా నెచ్చుఁ గాంచి. నీలా. 1. 42.

జ. ఎచరించు, ఎచ్చరము, ఎచ్చరించు, ఎచ్చ రింత, ఎచ్చరింపు, ఎచ్చరిక, ఎచ్చరికించు, ఎచ్చరలు, ఎచ్చిలు, ఎచ్చిలు.

ఎచ్చోటు—ఎచ్చోటు.

తోటకము.చోర నెచ్చోటు లేమి.... భార. స్త్రీ. 1. 45.

మ. ...రక్షోవీరు వీక్షించి యెచ్చోట లేదిట్టిక డానిచోఁ బయిది కొంచుం బోయి చేకాన్క గా,ఘటియింపం దగు దైత్యకోటికి .... దశా. 1. 278.

ఎచ్చో క్రియా. (చూ. ఎచ్చోటు.)

(ఏప్రదేశమందు)

క. చెచ్చెరఁ బలియును దోడన,చొచ్చి రసాతల ముదాఁక నూకరమార్గం, బెచ్చో వదలక వెనుచన, నచ్చెరువుగ మాయమయ్యె నది యచ్చోటన్. విక్ర. 2 137.

(ఏ కాలమున, ఎప్పుడు.)

క ఎచ్చో గజఘోటక్రయ.తచ్చర్వణసుభటజీవి తద్విజనురవూ. జోచ్చనిజభోగముల కగు. వెచ్చము వెచ్చంబు గాదు విత్తంబునకున్. ఆము. 4. 262. (ఎచ్చోన్—ఏకాలమునను, ఎన్నఁటికిని).

ఎచ్చోటు—ఎచ్చోటు, ఎచ్చేటు, ఎచేటు, ఎచోటు.

వి. ఏ. (ఏ.+ చోటు—చూ అచ్చోటు) ఏస్థాన ము, ఏచోటు.

సీ. ....చికుల మెచ్చోటఁ జేరువారి,ము. భా. రా. అయో. 205.

**ఎట** వి. వి. ఎచ్చోటు. ఎక్కడ.

వ. అని శాపం బిచ్చినదీర్ఘతమునకు నలిగి ప్రద్వేషిణి యిమ్ముదుకని నెటయేనియుం గొనిపోండని తనకొడుకులం బంచిన ... భార. ఆది. 4. 230.

క. ....ప్రణయపుటలుకం,బూని యెట నిల్చెనో యని, యే నుండితి... దశా. 2. 83.

స్రగ్ధర ... ఎటకుఁ బోఁ గూడు మీ కంచు న వ్వున్. ఉ. రా. 4. 92.

క. ఏ నెట నీ వెట సుతుఁ డెట ....భార. ఆది. 4. 99. (ఇట సంబంధములేమిని దెలుపును.)

**ఎటవారె** వి. కుందురికి, అందుగు వృక్ష విశేషము (శ. ర)

**ఎటు–ఎట్టు.** అవ్య. (చూ. అచ్చోటు) 1. ఏవైపు.

సీ. ఏమికార్యము గోరి యెటు పోవుచున్నాఁడవు. నైష. 3. 46.

వ. అవ్వాలుఁగంటి యెటు వోయెనో యని యొంటిగా నవ్వలం జని చని. ఉ. రా. 1. 179.

2. ఏప్రకారము.

గీ. ....కామాంధచిత్తుఁ, డెవ్వరి వధింపఁ డెటు సేయఁ డేమి గాఁడు. మనుచ. 6. 50.

ఉ. భూనుతలీల రుక్మిణికిఁ బుట్టి మనోభవ మత్ప్రియత్వమున్, బూనినవాఁడ వీవయఁట పూర్వపునీయతనుత్వధర్మమున్, మానక యేఁచుచున్న నది మామకభాగ్యము నిన్నెటాడఁ బోఁ,గా నెటు వచ్చునో తడవఁగా వెఱతున్గరంముల్ మొగిడ్చెదన్. ప్రభా. 5. 8.

క. కుటిలత్వము కూడు గాఁగఁ గుడుతురు మగవా,రిటువంటివారి మదిలో, నెటుగా నమ్ముదురు సతులు హితు లని పతులన్. విక్ర. 7. 131.

జ. ఎటులు, ఎటువంటి, ఎటువలె, ఎట్లు.

**ఎటు(ట్టు)లు** అవ్య. (√ ఎటు) ఏ ప్రకారముగా.

ఉ. ఓయి దయావిహీనమతి యూరక యీపసి బిడ్డఁ గొట్టఁగాఁ, జేయెటు లాడె నీకు ... మనుచ. 4. 88.

గీ. నీల యనువేఁ దేజున నివ్వటిల్లు, నింతి వెండిలి కతలెఱఁ గెట్టు లనిన. నీలా. 1. 23.

**ఎటువంటి** విశే. (√ ఎటు) ఎట్టి.

చ. తన కెటువంటివేడుక యొ.... కా. 1. 99.

క. భూసురులకు నవమానము,సేసిన నెటువంటి వాని శ్రీయు వెలయునే. దశా. 2. 83.

**ఎటువలె** అవ్య. ద్రు. (√ ఎటు) ఎట్లు, ఏరీతిగా.

చ. కటకట మమ్ము నొక్కత్రుటికాలముఁ బాయనిదాన వొంటిమై, నెటువలె వచ్చి తమ్మ చెలి ... వసు. 3. 121.

**ఎట్టకునేని** – ఎట్టకేని.

ఉ. ...కొంతసేపు వే ల్పెక్కినభంగి నుండి ధృతి నెట్టకునేనియుఁ బూని కుత్తుకం, జి క్కెడలించి పుత్రుఁ గని చిత్తములోనఁ దలంపు గూడినన్. భా. రా. అయో. 89.

**ఎట్టకేని** – ఎట్టకునేని. అవ్య. (ఎట్టకున్ + ఏని) చాలసేపటికి; చిట్టచివరకు; అతిప్రయాసమున.

వ. ...ఇకార్యంబున దోషంబు లేదు వినిద్రకరణం బయిన నాహృదయశల్యంబు నుద్ధరింపు మని ధృతరాష్ట్రు నెట్టకేనియు నొడంబఱిచి దుర్యోధను డు. భార. ఆది. 6.180.

గీ ఇట్లు ప్రార్థించి పాంచాలి యెట్టకేని, సింహబలుమందిరం బల్లఁ జేరఁగి, యొల్లఁ బోవుచు బెబ్బులి యున్నపొదరు, సొచ్చు లేడిచందంబునఁ జొచ్చుటయును. భా. విరా. 2. 11?.

**ఎట్టకేలకు** అవ్య. ద్రు. (ఎట్టకున్+ఏలకు.) ఎట్టకేని.

చ. ఒకరుఁడ తాను భీతి వెగ డొందెడురెండవ నన్ను నెట్టకే,లకుఁ దగఁ దేర్చునప్పుడు బలంబులతోఁ గురురాజు నూడ ... భార. విరా. 5. 226.

క. తదనంతరంబ చెదరిన, హృదయము దన లోన నెట్టకేలకు నిలువన్. ద్వా. 4. 17.

క. పెన్నిధిఁ గని సోపంగ లే,కున్నకృపణుమాడ్కిఁ జిత్తమూటాడఁగ నా,కన్నెపరాధీనత నటి, ఖిన్న యగుచు నింటి కెట్టకేలకుఁ జని యెన్. జై. భా. 8. 78.

**ఎట్టట** అవ్య. (ఎట్టు+అటు+అ.) ఎట్లైనను.

మత్త. అంతఁ గుంతునిపంత మెుంతయు నంత కంత కనంత వి,క్రాంతిఁ బగ్వఁగ నోర్వ కెట్టటకాని యింద్రునియల్క సై,రింతు నంచును సాహసం బొనరించి యే నిటు వచ్చితిఁ. కళా. 3. 258. ('ఎట్టటు' అని ముద్రితము.)

క. పడఁతి యెట్టట ప్రాణము,పిడికిటఁ బెట్టు కొని నేఁడు ప్రియుతో నీ వె,ప్పుడుబలెఁ బలుకక యుంచుక,తడ వుండుము మాకుఁ గాను దాలిమితోడన్. కళా. 7. 205. (శ. ర. పా. 'పడఁతి యెటులయిన' అని ముద్రితము.)

క. ముద మొదవఁగ సుతుఁ డెట్టట,బ్రతికినఁ జాలు నని చనియె...పర. 2. 192.

**ఎట్టయెదురు** వి. వి. (ఎదురు + ఎదురు) మిక్కిలి యెదురు.

గీ. భాగవతులార భాగ్యసంపన్నులార, యింత యొుప్పునె యదులోక మెట్టయెదుర. కాశీ. 4. 186.

**ఎట్టి** విశే. (ఎట్టు + ఇ) ఎటువంటి. భార. ఆది. 5. 58. మనుచ. 3. 46.

ఎట్టిపాటివారు – ఎంతటివారు. భార. శాం. 4. 426.

**ఎట్టిఁడు** విశే. (ఎట్టి + వాఁడు - బ. ఎట్టిరు.) ఎటువంటివాఁడు.

చ. పతియెడ రెండు లేక కులభామలు తారతఁ దెట్టిఁడైన స,న్మతిఁ జరియించు టొప్పు...భారా. అయో. 297.

క. ...విప్ర,ద్రోహంబున నెట్టిఁడైన దురితముఁ బొందున్. మార్క. 1. 119.

**ఎట్టు** – ఎటు.

1 ఏవైపు.

ఉదా: నీ వెట్టు పోయెదవు.

2. ఏప్రకారము.

క. అ ట్టవ నేల మహోబలు,పట్టికి సురఖచరద నుజపన్నగులును మా,ర్పెట్ట రనివఁ గర్ణాదుల,కెట్టునిలువ వచ్చు వానియెదురం దిరమై. భార. ద్రో. 4. 205.

ఎట్టెట్టగునో – ఏరీతిగాఁ బరిణమించునో.

ఉ. ఇట్టివరంబు లయ్యసుర కిచ్చినవాఁ డజుఁ డిజ్జగంబు లె,ట్టెట్టగునో యటం చపుడ యుంతటి తేరు సృజించి యిచ్చి మా,పట్టియ నిర్వహించు నని పంచె....కకు. 2 125.

జ. ఎట్టట, ఎట్టి, ఎట్టిఁడు, ఎట్టువోలె, ఎట్టూ.

**ఎట్టువోలె** – ఎటువలె. (శ. ర.)

**ఎట్టూ.** అవ్య. (√ ఎట్టు) ఏప్రకారము.

(ఆశ్చర్యము, ఆక్షేపణము, మున్నగువానితోఁ గూడిన ప్రశ్నమును దెలుపును.)

శా. ఎట్టూ యి ట్టగునయ్య పల్క .... ఆము. 6. 54. (వ్రాఁతప్రతి పాఠము.)

ఆమ్రేడితమందు ఎట్టెట్టూ, ఎట్టెటూ.

శా. ఎట్టెట్టూ విన మైతి మింక నొకమా ఱేర్పాటుగాఁ జెప్పుమా. కాశీ. 7. 107.

చ. అన విని వారు లందఱును నత్యధికం బగు విస్మయంబునన్, మునుఁగుచు నెట్టెటూ చెపుమ ముద్దియ....కళా. 4. 3, 7. 32.

**ఎట్లు** – ఎటులు.

1. ఏప్రకారము.

క అమరవరులందుఁ బురుషో,త్తముఁ డెట్లు విశేషుఁ డట్లు ధరణిం గలతీ,ర్థములందుఁ బుష్కరంత్రిత,యము గుణము విశేష మఖిమతార్థప్రదమై. భార. అర. 2. 247.

చ. ....పూవిలుకాఁడ విట్టి నీ, వెడపక నిష్ఠురత్వమున కెట్లలవాటుగఁ జేసి తక్కటా, పడఁతులమీఁద నేయ రతిపయ్యెదకున్నను వైనచేతులన్. మనుచ. 3. 48.

గీ. వేలుపుల నెల్లఁ బరిపాటి పిదుకొలిపి, సముచితంబైన తాంతమ్మమున శివుఁడు, మఱచె దక్షప్రజాపతి మామ ననువ,నెట్టివారికి మఱపులేదె ట్లోకపుడు. కాశీ. 7. 44.

(ఎట్లు లేదు–ఏల యుండదు–ఉండు నని భావము.)

2. పొసఁగమిని దెలుపును.

గీ. తగవు ధర్మంబు పాడి పంతంబు లెట్లు,భామ లెట్లు వృథానులాపంబు లేల శివరా. 3. 76.

ఎట్లోకదా (దే)—ఎలాగో కదా. (భయాదుల వలనిసంతాపమును దెలుపును.)

మ. ...ఆహా యింక నెట్లోకదా.వనధుల్ ముం పఁగఁ జాగె ముజ్జగములు .... దశా. 1. 176.

శా. ...ఉండ లే, కీ నీరాస ని చేల వచ్చితిభయం బెట్లోకదే యీశ్వరా. భాగ. 8. 72.

ఎడ¹ వి. (క. ఎడ. త. ఇడం.) 1. స్థానము, చోటు.

ఆ. ...పార్థు,నరిగినెడక మనము నరిగి యతని, యున్నచోన ప్రీతి నుండుద మిం దుండ, నేల యనుచుఁ బౌరు లెల్లఁ దెరలి. భార. ఆది. 6. 142.

క. సరిగా నారెందెడలకు,నరులు సనుటఁగోరి మనమునన్. ...భార. అను. 5. 160.

చ. అతఁడు ప్రియంబు గల్గనెడ కర్పణసేసినఁ జేసెఁ గాక యా,మతకరివేలుపుందపసి మ మ్మ్మఁ దలంపఁగ నేల యచ్చటన్. పారి. 1. 84.

2. నెత్తపలకపై కాయ లుంచెడుగది.

సీ. ... ఎక్కుడాయంబుల యెడలు గడపి. దశకు. 5. 64.

గీ. లంచములు గొని యెడ పొరలంగఁ బలికి. దశకు, 5. 65.

3. అంతరము, ఎడము.

గీ. ప్రేలెఁ డెడ లేనియట్లుగ వివిధభంగి, నిష్ఠురాస్త్రశస్త్రంబుల నిలిచి రధిప. భార. భీష్మ. 3. 411.

సీ. వెడఁదముత్యములతో నెడ వెట్టి గ్రుచ్చిన మంచి రుద్రాక్షదామములు దాల్చి. హర. 7. 111. కాశీ. 7. 5.

చ. పొడగన వేళ యబ్బె నని పొంగి కళింగ శశాంగముఖ్యు ల,య్యెడ నెడ యీక. వసు. 1. 147.

4. మధ్యము. (నడిమి ప్రదేశము — నడిమి కాలము)

సీ. ఎడ సొచ్చి దైత్యుచేఁ బడినజటాయువు వలన నంగన చన్నవల నెఱింగి. నిర్వ. 1. 79. (ఎడసొచ్చు - అడ్డపడు, అడ్డము వచ్చు.)

క. అని మామఁ బలుకు పలుకులు, విని యశ్వత్థామ క్రోధవివశుం డయి గ్రక్కున వాలు వెఱికికొని కర్ణునిదెసకుం గవియ భూవరుం డెడసొచ్చెన్. భార. ద్రో. 5. 106.

క. కదిసి శరాసనగురుఁ డిరు,వదియేనుశరంబు లేయఁ బార్థుఁడు వానిం,గుదియించి విశాలాస్య, ప్రదరము లడరింపఁ గుంభభవుఁ డెడఁ ద్రుంచెన్. భార. ద్రో. 3. 75.

శా. నీ సామ్మై పెనుపొందురాజ్యము దగ న్నీకీక నీచాత్ముఁడై, నీసూనుం డెడ నాక్రమించికొనియె న్నిర్వ్యాజభంగిన్ దుదిన్, దోసం బేమియు లేక యంతయును నిన్నుం జేరెఁ గై కొమ్ము... హరి. పూ. 9. 179.

5. దూరము.

సీ. అవనిక్షేత్రమున కనతిదూరంబున గవ్యూతి యెడ నుదక్ప్రశ్చిమమున. శివరా. 4. 81.

చ. తడ వగుదెంచె జమ్మికిఁ బ్రదక్షిణవృత్తిగఁ దేరు వోవని,మ్మెడ గలుగంగఁ బోయెఁ బసు లిప్పుడ కూడుద మన్న.... భార. విరా. 4. 171. (ఎడగలుగంగ - దూరముగా)

సీ. అడవిలో నిద్రావశాత్ములమై యున్న మన నిద్రఁ జెఱుపఁ గాదని హిడింబు, నెడ గల్గఁ గొనిపోయి యొక్కటి సంపిన దండితశత్రుఁ డితండ కాఁడె. భార. ఆది. 6. 278.

వ. అల్లెల్ల వారునుం జాల నెడగలిగి చూచు చుండ.... హరి. ఉ. 2. 59. (ఎడగలిగి - దూరముగా నుండి.)

వ. .... పవమానసూనుం డవమానపూర్వకం బుగ నీ వెందులదాన వింత ప్రొద్దేల వచ్చితెటవోయె దెడగలిగి పొమ్మనిన విని హిడింబ యిట్లనియె. భార. ఆది. 6. 191. (ఎడగలిగి - దూరముగా.)

6. వ్యవధానము, అవకాశము.

గీ. జలధి యొక్కింత యెడ యిచ్చి చనియె నేని, సర్వలోకాతిశాయిగా సంఘటింప, వచ్చుఁ బట్టన మన విని వాసుదేవుఁడట్ల కాక నియా ప్రొద్ద యధిక నియతి. హరి. ఉ. 2. 159.

గీ. శోక భయకారణంబులు లోకమున న,నే కములు దానఁ దలమూపుశోకములకు, భయములకు బుద్ధి నెడ యీఁడు సంది తుండు, మూఢుఁ డవి త్రోవ నేరండు మునుఁగు వగల. భార. శాం. 1. 188.

7. విచ్ఛిత్తి, విరామము

ఉ. ...పెల్లై యతిరేకమై పొదుఁగులం దెడ లేక స్రవించుచున్న పాలాయెడ ... భాగ. 10. పూ. 519.

క. ఎడ లేక కవుంవాసన,లడరెడి బాగాలు కొన్ని యాకుమడుపులున్. ఉ. రా. 4. 177.

చ ....తనివి దీరని ముచ్చట లోసగింత లే,కల రెడి కౌఁగిలింత లెడ లన్నది విన్నది లేని కూర్ములున్. గలఁకలు గాని కూటములు గల్గి రమించిరి మించి రిర్వురున్. ఉ. రా. 6. 165.

8. తెఱపి, తీఱిక.

ఆ. వేగజాము గలుగ నెడనిద్రఁ బొందుదుఁ, గాని రాజ్యభార కార్యయుక్తి, నబ్జనయన నాకు నాహారనిద్రల, కెడయు లేదు నువ్వె యెల్ల ప్రొద్దు. భార. అర. 5. 308.

గీ. మమ్ము నున్నారె యనుమాటమాత్రమైన, నెడగలదె నీకు మాకొలు విపుదు గాక. కళా. 7. 20.

2. గడువు, వ్యవధి.

ఉ. అల్లన యింతి యిట్లనియె నారసి వాసవు కల్మి లేమియుం, దెల్లముగా నెఱింగికొని తేఁకువలేకిట వచ్చుటొప్పు నా, యుల్లము శంకితం బగుచు నుండఁగ వేగిరపాటు మేలె నీ, వెల్ల నెఱుంగు దిప్పు డెడ యిచ్చుట యుక్తము నాకుఁ జూడఁగన్. భార. ఉద్యో. 1. 165.

వ. అని యొడం బఱచి కొండొక కాలం బెడ వలికొని యింద్రాణియు మగుడం జను దెంచె. భార. ఉద్యో. 1. 166. (గడుపుగా మాటాడుకొని అని తాత్పర్యము.)

క. ఎడ యిమ్ము నా కొకించుక, తడవెద నా బుద్ధి యంద త్రైలోక్యమువన్, బొడవైనవి యెల్లను గని, తడయక నీ ప్రియుని నెవ్విధంబునఁ దెత్తున్. హరి. ఉ. 7. 111.

సీ. ....ధనమున, కెన్ని నా ళ్లెడ గొనియెదు చెప్పు మంతలో సవరింపకుండిన శాప మిత్తు. మార్క. 1. 170.

10. సమయము.

క. గెలుపునెడ సేయునెడ వడిఁ, బలుచునెడం బెనఁగునెడ నపార బలంబుల్, మెఱయు నెడ భీమునకు నం,దొలుఁ గీడ్పడఁ దొడఁగి రుద్ధతులు రాజసుతుల్. భార. ఆది. 5. 164.

సీ. ఇతని విక్రమ మాశ్రయించియ కాదె య య్యెడ లక్కయిల్లు వెల్వడఁగఁ గంటి, మి. భార. ఆది. 6. 278.

గీ. ....పై మగతనముల,నొక్కెడలఁ గూడుచు స్రవంతు లుబ్బు పెనిచె ఆము 4. 183. (ఎడల – ఎడ)

11. వీలు, అనుకూల్యము.

క. ఇవి మీ కన్నియుఁ జేయఁగ, నవు నని తలఁపకుఁడు భూసురాహుతిమంత్రో,ద్భవ దారుణ దహనశిఖల్, గవిసిన నెద్దియును జేయఁగా నెడ గలదే. భార. ఆది. 2. 182.

12. ఆలస్యము, విలంబము.

క. ధరణీసురవరులకుఁ గడు, నెరగై నెడ నెఱిఁగి యెడయుఁ జేయుదురె మహా, పురుషు లని నరుఁడు విలుగొని.... భార ఆది. 8. 119.

క. నా కెంతయుఁ బ్రియశిష్యుం, డీ కపివరుఁ డితని పనికి నెడ గాకుండం,బోక యుచిత మను కరణి వి,భాకరుఁ డపు డపరశిఖరిపై కరుగుటయున్. భా. రా. సుం. 74.

13. ఎడఁబాటు, వియోగము.

సీ. ఈ రూపుతో మన కెడ సేయ నేతెంచి నదియొ తొల్లియు నొక్క యసురజంత, జనకనందనకు రామునకుమ నెడ సేయఁ గడఁగి వచ్చుట వినఁబడుచు నుండు. కళా. 8. 177.

14. అడ్డు. (చూ. ఎడపెట్టు)

15. భేదము.
మ. ...మహర్షుల్ విష్ణునంశాంశజుల్, హరి
కృష్ణుండు బలానుజన్ముఁ డెడ లే దావిష్ణుఁ
డౌ నేర్పడన్. భాగ. 1. 64.
క. ఎడ యెఱిఁగియుఁ దమలోపల, నెడ
యెఱుఁగక ధర్మపథసమేతస్థితికిన్, నడి
మింటివార లై రా, నడిమింటరవిన్ హసించు
నవ్యప్రథలన్. రామా 3. 155.
16. దౌత్యము, రాయబారము.
(శారావిలాసము.) ద్వి. నీకోరినట్లయ్యె నీ
పగదీరెఁ, గై కొని భోగింపు కపిరాజ్యపదవి,
నెడమాట లాడ నాయినవంశుతోడఁ, గడఁ
కను హనుమండు గలిగెనే నీకు. రం. రా.
కిష్కిం. 215. పా. 30. సం
ద్వి. వెడపను ల్వంపఁగ వేశ్యయింటికిని,
నెడయును బుచ్చంగ నిల్లెఱింగియును.
బస. పు. 4. 884.
విశే. 1. దూరస్థము, దవ్వైనది.
క. కడు నెడ గావున నది యిక్కడ వినఁబడ
దేమొ.... కళా. 4. 58.
మ. అయోధ్య కెడై వచ్చియు. చం. రా.
5. 67.
2. అన్యుఁడు, ఇతరుఁడు.
ద్వి. పడఁతి యాశవముఁ గంబంబునఁ జేర్చి,
యెడ వారి నెవ్వరి నెఱుఁగంగ నీక.
పండితా. పురా. 153. పా.
సీ. పెఱవారు కడవారు వింతవా రెడవారు,
లాఁతి వా రన నన్యులకుఁ దెలుంగు. సాం.
ని. మాన. 10.
గీ. ....తక్కటి యెడ కడ కడమ తక్కు, వేఱు
పెఱ యన నిత రాఖ్య మారవై రి. ఆం.
భా. 3. 24.
3. అధికము. (చూ. ఎడదవ్వు.)
అవ్య. ప్ర. అందు; విషయమున
చ. మన మరయం దలంచి యొక మార్గము
వన్నితొ నవ్వుటాలకున్, నను వెఱపించెదో
యకట నాయెడ నిక్కము తప్పు గల్గెనో.
పారి. 1. 116. (నాయెడన్-నాయందు)

క. మాతండ్రియెడం జేసిన, పాతకముకతంబు
గాఁగఁ బాంచాల నికృష్టాతుని మెద
నిసు... భార. కర్ణ. 2 327. (తండ్రి
యెడన్-తండ్రివిషయమున)
క. ....సజ్జన సేవ్య యన్నదానము, మును
లధికం బండ్రు పాపములఁ బాపునెడన్.
భార అను. 4. 270.
4. ఎల, లేఁతది (చూ. ఎడనీరు)
వ. ... గుత్తుల యెడ చిగుళ్లు.... కేయూర.
4. 50.

ఎడతప్పఁద్రోచు - హారమును గ్రుచ్చునపుడు
తరువాతిపూసకు చోటిచ్చుటకై పూర్వపు
దానిని దూరముగాఁ ద్రోచు.
చ. సమయవిలాసి శోణమణిసంగతమౌక్తిక
చారుహారముం, గ్రమమునఁ గ్రుచ్చుచో
నరుణరత్నము దా మును సాంధ్యరశ్మియా,
త్రమునఁ బొసంగఁ గ్రుచ్చి యెడతప్పఁ
ద్రోచి పిఱుందఁ జేర్చుముత్తెము గ్రియఁ
దోఁచె నయ్యమృతదీధితి లాంఛనరంధ్ర
సంగతిన్. పారి. 2. 42

ఎడయొనర్చుకొను — తప్పించుకొను.
క. ఆఁటది కాదిది మృగముల వేఁటాడన్వచ్చు
మృత్యువే తప్పదు పో, రాట మిది యేల
యిచ్చట, నేఁటి కెడయొనర్చుకొనుట నీతి
యొ కాదొ. శుక. 2. 279.

(వ్యవ) వారిద్దఱు ఎడమొగము పెడమొగ
ముగా నున్నారు. వానిస్థితియంతయు ఎడదారి
పెడదారిగా నున్నది.

జ. ఎడఁగాటు, ఎడఁబాపు, ఎడఁబాయు, ఎడ
కట్టు, ఎడకత్తె, ఎడకాఁడు, ఎడకారు, ఎడ
గడ్డ, ఎడగిల్లు, ఎడగొను, ఎడతాఁకు, ఎడ
తీయు, ఎడతెగు, ఎడతెఱపి, ఎడత్రెవ్వు,
ఎడదవ్వు, ఎడదూడ, ఎడనీరు, ఎడనెడ,
ఎడపక, ఎడపడు, ఎడపరి, ఎడపు, ఎడ
పెట్టు, ఎడప్రొద్దు, ఎడబిడ్డ, ఎడయగు,
ఎడయాడు, ఎడయిక, ఎడయు, ఎడల, ఎడ
లించు, ఎడలు, ఎడలుచు, ఎడలుపాపు,
ఎడలు సేయు, ఎడవల, ఎడవిడివడు, ఎడ

వోవు, ఎడసంది, ఎడసను, ఎడసాల, ఎడ నేయు, ఎడాటము.

**ఎద²** – ఎడఁద, ఎడ్డ, ఎడ్ద, ఎద. వి. (సం. హృద్. ప్రా. హడక్క) హృదయము.

క. కొడుకుం ద్రిలోకవిజయుం, బడయుదు నని ఘోర మగుతపం బొనరింపం,దొడఁగె సుర రాజు నెదలో. నిడికొని యేకాగ్రబుద్ధి నేకాంతమునన్. భార. ఆది. 5. 116.

చ. ఎడఁ బొలివోని వేడుకలయేద్రె బొంపున .... నిర్వ. 8. 78. (శ. ర.)

**ఎద³** – ఎల². విశే. (చూ. ఎడమ) ఎడమ, వామ భాగమున నున్న.

క. కుడిచేత మాంసఖండము, లెడకేలను మద్య రససహిత మగు కంచుం, గుడుకయు ధరించి... శివరా. 4. 38.

సీ. పెరిఁగినవింధ్యాద్రి పెం పెంత కలశజుఁ డెడగాల మెట్టిన నడఁగె నట్టె. కు. సం. 8. 243.

ద్వి. మడమయ మోపుచు మఱి కొంతదవ్వు, ఎడకాల నేఁగుచు నించుక దవ్వు, పండితా. పురా. 182. పా. ఉ. హరి. 3. 65.

**ఎద⁴** వి. తృణవిశేషము. వృక్షవిశేషము ప్రబంధ. 200.

**ఎద⁵** – నెద. విశే. 1. వ్యర్థము,

గీ. ఇందులో నిష్ట మెద్ది మీ యిందుముఖకి, నడుగుఁ డెడమాటలకుఁ బ్రొద్దునిడివి లేదు. పి. శకుం, 3. 83.

2. స్వల్పము.

ఆ. కర్ష కునకు నేల కాల మెఱుంగుట, జిట్టి కాని కేది సంభవించె, నందు విలువ మొదల నగులాభమును నెడ,వ్యయము గల్గుటయు శివప్రదములు. భార. అను. 5. 75.

**ఎద⁶** వి. వ్యవహారము; లోకవ్యవహారము,

క. ఎనిమిది యేఁడులు శిశు వగు, నెనిమిది యేఁడులట బాలుఁ డెడ యెఱుఁగఁడు గా,పున బాలుఁ డెన్నిభంగుల, జనకుని ఋణ మరువఁ జనదు చను వటమీఁదన్. విజ్ఞా. వ్యవ. 38.

శ్లో. గర్భస్థైస్సదృశో జ్ఞేయ అష్టమాద్వత్స రాచ్ఛిశుః, బాల అషోడశాద్వర్షాత్పౌగండ శ్చేతి శబ్ద్యతే. పరతో వ్యవహారజ్ఞస్స్వ తంత్రః పితరావృతే. యాజ్ఞ. వ్యవ. 8. 50. వ్యాఖ్య.

గీ. అబలఁ గడు నెడ యెఱుఁగనియాఁటదాన, మెలఁత వతిభీత నన్ను నమ్మించి తెచ్చి, కాన నంబు లోఁ గన్నులుగట్టి కాదు, పఱచి నీ కిట్లు పోఁజన్నె భావజన్మ. కు. సం. 5. 544.

**ఎడఁద** – ఎడ్డ, ఎడ్ద, ఎడ², ఎద¹, వి. (సం. హృద్, పా. హదయమ్. క. ఎదె. త. ఇద యమ్.) 1. మనస్సు.

చ. ....భీష్ముఁ డర్ధరథుఁ జేసి యెడందఁ గలంచె.... భార. శాం. 1. 85. (శ. ర. కరాల. ప్రతిపాఠములు.)

సీ. ఎలమి నమ్మెలఁత నన్నెలయింపఁ దివిరిన యెడఁద యానందంబునిక్క గాదె. భార. విరా. 2. 86.

2. గుండె.

క. గడగడ వడఁకుచు నుడువులు, దడఁబడ సిగ్గడర యెడఁద దడదడ మనఁగా, జడువుం జెమ్మట నొడలుం,దడియ దశాస్యుఁ గని రంభ తడయక పలికెన్. ఉ. రా. 4. 203.

3. వక్షము, ఱొమ్ము.

సీ. బెడఁ ద వా దెఱచి యేర్పడ దవానలు మ్రింగు నెడఁదవాటంపుఁ జేరెడఁదవాని. చంద్రా. 1. 84.

ఎడఁదవచ్చు – మనసువచ్చు, బుద్ధిపుట్టు. ఇష్ట మగు.

సీ. పొరుగింటి కేలాగు పోయితిరా యంచు జడకొద్దిఁ గొట్ట నా కెడఁద రాదు. కలు. శ. 85.

**ఎడఁబాటు** వి. (√ఎడఁబడు – చూ. ఎడపడు.) ఎడఁబాయుట, వియోగము.

సీ. సాదరంబుగ రఘుస్వామివెంటనె లక్ష్మ ణుం డెడఁబాటు లేకుండు...అధ్యా. బాల. 12. పా.

**ఎడఁబాపు** స. క్రి. (√ ఎడఁబాయు) 1. తొలఁగించు; తీర్చు

గీ. ....అవధారు దైతేయపట్టభద్ర, భద్రగజ చర్మధారిపై భక్తి యుంచి, యంచితోక్తుల నతని నుతించితేని, నీ నిరోధంబు నెడఁ బాపు నీక్షణమున. ఉ. రా. 8. 88.

ఉ. ....ఎన్ని జన్మమ్ములకైన నీతని ఋణం బెడఁ బాపుకొనంగ నేర్తునే ఉ. రా. 5. 80.

2. వేఱుచేయు.

(వ్యవ) భార్యాభర్తలను ఎడఁబాపినారు.

**ఎడఁబాయు** – పెడఁబాయు. స. క్రి. (√ ఎడ¹) వదలు, విడుచు.

క. ఆయమ్మ యాగ్రహం బెడఁ బాయక నా మీఁద విన్నపము చేసిన భూనాయకుఁ డిది యాఁ గాదన, కీయెడ నామీఁద నాగ్రహింపం దగునే సారంగ. 2. 272.

అ. క్రి. దూరమగు, వీడిపోవు.

ఉ. అవ్యయనవ్యవాసన లోకక్పుడు వీడక వాడకుండునీ, దివ్యసరోజదామక ము ధీధితి మాత్ర దినేశమిత్రభా, భవ్యము దీనిఁగన్న నెడఁబాయుఁ బ్రదోషము లన్నచోఁ బ్రదోషవ్యసనంబు పైకొనంగఁజాలునె దీని జగత్త్రయంబునన్. వసు. 5. 98.

**ఎడకట్టు** అ. క్రి. (√ ఎడ¹) ఆఱినపుండు మరల చీముపట్టు. (శ. ర. బ్రౌ.)

**ఎడకత్తె(త్తియ)** వి. (√ ఎడ¹) దూతిక, కార్పు స్త్రీ.

సీ. హితయును జాతుర్యవతియును నైనసృగాలిక తా నెడకత్తె గాఁగ. దశకు. 6. 180.

సీ. ....కుట్టనీ నామధేయంబు కాసికత్తియ యన నెడ, కత్తియ యనఁ బొంతకత్తియ యనఁగఁ గుంటెనకత్తియ యనంగఁ దనరు.... ఆం. భా. 2. 110.

**ఎడకాఁడు** వి. (ఎడ¹+కాఁడు) కార్పుకాఁడు. కుంటెనకాఁడు.

మ. అతివృష్టి న్మను వార్ధిఁ గూర్చు నెడకాఁ డౌటం దముం గూర్చున, న్మతి లంచంబుగ హేమటంకములు మింటం బొల్చువర్షద్రవ్య దే, వత కిచ్చెత్తి న కేలునాఁ బొలిచె. ఉన్నాళ నాళికముల్. ఆము. 2. 52. పె. శకుం. 3. 44.

**ఎడకారు** వి. (√ ఎడ¹) అకాలపు పంట, మాఘమాసము మొదలు జ్యేష్ఠమాసములోపల పండెడు పంట. (బ్రౌ. శ. ర.)

**ఎడగడ్డ** వి. (√ ఎడ¹) ఒడ్డు, తీరము.

సీ. జలరాను లేదును గలగుండుకొని యెడగడ్డలపై దొంగడలు దొడర, దిక్కూలములు గూల.... హరి. ఉ. 9. 220.

**ఎడగిల్లు** అ. క్రి. (√ఎడ¹) తొలఁగు, అపసరిల్లు.

క. తిరువాముడి పఠియించుచు, హరిభక్తులఁ గన్న భక్తి నడియఁడ ననుచున్, శిర మటు వంచుచుఁ బ్రాకృత, పురుషుల నెడగిల్లి దూరమునకుం జనుచున్. విప్ర. 2. 80.

**ఎడగొను** అ. క్రి. (√ఎడ¹) అవకాశముచేసికొను.

సీ. అంతఁ గామిని కన్ను లరవిచ్చి సురతసంభృత వేషము పతి చూడకుండఁ, దనదు చెక్కిలి మొగంబున కడ్డముగఁ జేర్చి పొరిఁ బొరి నదిదానఁ బులకితముగఁ, గెంగేల నతని కౌఁగిలి యాఁగి యెడగొంచుఁ జేలాంచలము పెఱచేతఁ దడవి, తెచ్చి పాలిండ్లమీఁదికిఁ బొనుపుచు.... ప్రభా. 5. 53.

**ఎడకాఁకు** అ. క్రి. (√ ఎడ¹) 1. వచ్చుచుఁ బోవుచు నుండు.

సీ. తనభూమి వదలక ధనవంతు లగువారి యిండ్లకు నెడకాఁకు చెల్లప్రొద్దుఁ, జేరి మిథ్యానమస్కారముల్ చేయుచుఁ బ్రియములు నయములుఁ బెక్కు చూపి, విశ్వాస మొదవించి....హరిశ్చ. 4. 121.

క. భావపరీక్షార్థం బతఁ, డివిధిఁ బదియేడు మాఱు లెడ కాఁకించెన్, దా విసువకుండె మాటకిఁ, బోవుచు వచ్చుచును యోగిపుంగవుఁ డంతన్. పరమ. 5. 804.

సీ. విడిచియు విడఁజాల కెడకాఁకుసిగ్గుమోమోరసింపులయింపు దారసింప. అని. 3. 95. పరమ. 5. 47.

2. తాఁకు, మార్కొను.

సీ. ఒక నరుం డెడతాఁక నోర్చుటీరము లేక గిరిజాధినాథుండు క్రిందుపడియె. కృ. శకుం. పీఠి. 83.

**ఎడతీయు** అ. క్రి. (√ ఎడ¹) ఎడతెగు. (శ. ర)

**ఎడతెగు** అ. క్రి. (√ఎడ¹) 1. ఎడపడు, విచ్ఛిన్నమగు.

క. జనవినుత యగ్నిహోత్రం,బును సంతానమును వేదములు నెడతెగఁగాఁ, జనదు.... భార. ఆది. 4, 181.

క. ద్రోణుఁడు రయమున నేసిన, బాణము లెడతెగక యొక్క బాణమపోలెన్, శ్రేణి యయి పోవఁ బార్థుఁడు, రేణువు గావించుఁ గంటిరే చిత్రగతిన్. భార. విరా. 5. 129.

2. వేఱుపడు.

క. ఎక్కడఁ జూచిన లెక్కకు, నెక్కువయై యడవి నడచు నిభయూథములో, నొక్క కరినాథుఁ డెడతెగి, చిక్కె .... భాగ. 8. 37.

**ఎడతెఱపి(ర్పి)** వి. √ఎడ¹. (దేశకాలములందు) వ్యవధానము.

చ. ....ఇద్దిన వచ్చెనేని యఁ,త్తెఱఁగయిపోమె యంచు నెడ తెర్పిగఁ గొందఱు పాయ వాఱఁగన్. భార. విరా. 5. 61. శ. ర. పా - 'ఎడ తెంపిగ' ముద్రి.

**ఎడత్రెవ్వు** అ. క్రి. (√ ఎడ¹) ఎడతెగు, విచ్ఛిన్నమగు.

క. మడు వింకఁగఁబాఱెదు నీ, రెడత్రెవ్విన నొండుచోటి కేఁగఁగ రా దె,ప్పుడు నింకని నీళ్లులు గల,మడువునకుం బోవ వలదె మన కిట్టియెడన్. భార. శాం. 3. 166.

క. పెనఁకువ యెడత్రెవ్వక పదు,నెనిమిది దివసములు సెల్లె... భార. శల్య 1. 349.

**ఎడదవ్వు** వి. (√ ఎడ¹) అతిదూరము.

గీ. కాశి, కాపురి కెడదవ్వు గలుగునడవి. కాశీ. 7. 197.

గీ. చారుగుణరత్నములకు విదూరభూమి. శమదమాదికములకును సంశ్రయంబు, దైన్యరసమున కెడదవ్వు హైన్యమునకు, నప్రదేశంబు వైరాగ్య మరసి చూడ. విప్ర. 1. 84. (ఇట కడుదూరముగా నుండునది అని భావము)

**ఎడదూడ** వి. (√ ఎడ¹) పాలు విడిచిన దూడ, తఱపిదూడ. (బ్రౌ)

**ఎడనీరు** - ఎలనీరు. వి. (√ ఎడ¹) లేఁతకొబ్బెరకాయలోని నీరు.

చ. తెలినులివెచ్చ యోగిరముఁ దియ్యని చేరులుఁ దిమ్మనంబులున్, బలుచని యంబళుల్చలుకుపా లెడనీళ్లు రసావళుల్.... ఆము. 1. 81.

**ఎడనెడ** అవ్య. క్రియా. (√ఎడ¹) మధ్యమధ్యమున.

(క) అక్కడక్కడ.

క. ఎడనెడఁ బటపై యొప్పెడి, యడవులు.... భార. భీష్మ. 1, 39.

(చ) అప్పుడప్పుడు.

సీ. ....చక్కనిపిన్నబాలకుం డొక్కఁడు...ఎడనెడ నవ్వుచు నేడ్చుచుండు. జై. భా 8. 143.

(ట) మధ్యకాలములందు

సీ. ఇరుప్రొద్దు గుడుచుచు నెడనెడఁ గుడువక యుండు నాతండు సదోపవాసి. భార. శాం. 4. 368.

**ఎడపఁదడప** అవ్య. క్రియా. అప్పుడప్పుడు.

చ. పలికినమాట నిల్వఁ డెడపందడపం బెడనాడు వచ్చు మె,చ్చుల దిగ ద్రిమ్మంగుఁ దొల్దొలుతఁ జూచిన చూపులఁ జూడఁడు.... శ్రీ, వల నృప సంశ్రయంబు పగవారలకున్ వల దివ్యసుందరన్. వేం. పంచ. 1. 434.

గీ. ఎడపఁదడపఁ దనూభవుం డెచట నుండుఁ, గావ రాఁడని గృహభర్త కాంత నడుగ, నింత తడవును నాయొద్ద నిచట నుండి, యరిగెఁ జదువంగ నని భర్త కలిక మొఱఁగు. కాశీ. 4. 85.

**ఎడపక** అవ్య. (ఎడపుధాతువుయొక్క వ్యతిరేకక్త్వార్థకము) 1. తప్పక, అవశ్యము.

క. ఎడ లేదు దివెల నడుమనె గడచు న్నీ పుర
ముఁజేరఁగా లే మీయేఁ, డుడుగుము వచ్చెడు
పండువ, కెడపక యట కేఁగుదెంతు మిందఱ
మనినన్. చెన్న. 3. 164.

2. అవిచ్ఛిన్నముగా, సంతతము.

చ. ఎడపక రేయియుం బగలు నెమ్మెల నమ్మల
తాల్పుఁ గూడి పూ, వడిదపుఁజోదునిబ్బరపు
టాజమునందమి హెచ్చ నొచ్చె మె, య్యె
డలను లేని బల్జోయలు నిమ్ముగఁ గోరుచుఁ
జాలఁ బ్రోడలై, యడరెడుగొల్ల కన్నె లహ
హా తొలుబాము ల నేమినోఁచిరో. నీలా.
1. 108

3. వారు వీరు అని భేదము లేకుండ.

క. అడవులు నేఱులు నవి నీ పడసినయవి
యట్టె పుణ్యభాగీరథి యి, ప్పుడమిఁ గల
జనుల కెల్లను, నెడపక సేవ్యంబ కాక
యిది నీయదియే. భార. ఆది. 7. 40.

4. ఎడయక, దూరము గాక.

క. పుడమి నచలేంద్రుడు లెచ్చుట, జడవాహిను
లెచట నెచటినఖ్యము వినఁ జొ, ప్పడదు
పొడ వడరు మీయెడ, నెడపక మారంనము
లెచటి కెక్కు మహాత్మా. వసు. 3. 133.

5. విలంబము చేయక.

క. కడుఁ బెల్లగు నాఁకలి నా, యొడ లెరియుం
పంగఁ దొడఁగె నొక్కెడ జగముల్, పొడి
పొడిగా దరికొనియెడ, నెడపక యుంచుక
యనుజ్ఞ యిమ్ము మహాత్మా. హరి. పూ.
4. 115.

**ఎడపడు** (పడుఁబడు) అ. క్రి. (√ ఎడ[1])

1. విచ్ఛిన్నమగు.

క..... ఎడపడకయ, కురిసె మహావృష్టి... కు. సం.
6. 763.

వ. .. ఎడపడక పొగడు పొగడికల కలకల
మ్ములును, మనుచ. 5. 71.

క. ఎడఁబడక యహోరాత్రము, వడగొని
చదివింప నిట్లు వలయునె... భార. అర.
3. 388.

2. విడిపడు, వీడు

వ. మొదవులనోరినురువులుం, బెయ్యలరేణంబు
లుం జాలకుండలమనలునుం దమయొడలు
లకు నెడపడని తొడవులుగాఁ బిడికి. హరి.
పూ 5. 149.

3. లోపము నొందు.

ద్వి. ఏ క్రియలందును నెడపడకుండ, నీ క్రియ
హాయ మేధ మీడేఱుటయును. రం. రా.
బాల. 16. పొ. 8. పం.

4. అవరోధము నొందు, విఘ్నమునొందు.

ద్వి. కడపట బ్రహ్మర్షిఁగా నేఁగెనైతి, నెడపడి
చెడి పోయి యాయుగ్రతపము. రం. రా.
55. పొ. 60. పం.

5. ఒకదాని తరువాత నొకటి యగు.

ఆ బ్రదుకు చేటు పొగడువడుట దూఱొం
డుట, యీగివేఁడుకొనుట యిట్లు మఱి
యుఁ, గలుగు సౌఖ్యదుఃఖములు వచ్చు
నెడపడి, వాని కింత యేల వగవ నధిప.
భార. ఉద్యో. 2. 79.

(శ్లో. పర్యాయశస్సర్వమేతే స్పృశన్తి. సం.
భార. ఉద్యో. 36. 47.)

6. దూరమగు. (చూ. ఎడ[1])

సీ. ....ముక్తకామస్థితి నమ్మోఁడు మార్గము
లను నడచి పరంబున కెడపడ కుండుదు.
భార. శాం. 6. 174.

7. అడ్డుపడు - జామీనుగా నుండు, పూఁట
పడు.

క. కుడిచినతఁ డరువకుండిన, నెడపడిన యతం
డ యచ్చు వెటిఁగి నృపతి యా, కుడిచి
నతనిఁగని నప్పుడ, యెడపడినాతనికి రెట్టి
యిప్పింపఁదగున్. విజ్ఞా. వ్యవ. 88.

**ఎడపరి** వి. (ఎడపు+అరి) ఎడఁబాపునది.

ద్వి..... అఁగనలు... ఎడపరుల్ మదపతు లే
వంపుఁ బుట్ట, లొడుపరులు... పండితా.
పురా. 116. పొ.

**ఎడపు** స. క్రి. (√ఎడయు) 1. తొలఁగించు.

గీ. పొదువు పోసిక పట్టుము భూమిదేవ, వర్గ
యనుకొంచు వచ్చి కవాటముగడె, యొకపి
నంతనె తదర్థ యింతితోడ, నెవ్వఁ డీతం

దు గజిబిజి యేమి యనుచు. హంస. 5. 242.

2. తప్పించు, మానుపు.

గీ. అతని కొలయును నెడపలేవైతి గానఁ, బుత్రహీనపు నిన్నంటఁ బోల దనిన. జై. భా. 4. 78.

3. విడుచు.

సీ. తొడఁగి పని చలం బెడపక యతిదుష్కరం బైనఁ గడతేర్పు ప్రభువులార. భార. విరా. 3. 21.

4. విఘాతము నొందఁ జేయు, విఘ్నము నొందించు.

క. క్రతు వంత రాయమైనను, క్రతుకర్త వినాశ మొందు ఘనపాపముచేఁ, గ్రతు వెడప కుండఁ జయ్యనఁ, గ్రతుపశువుం దేరవల యుఁ గ్రతు పుణ్యనిధీ. భా. రా. బాల. 621.

ద్వి. నొడివిన మా వ్రతం బెడపకుమమ్మ, గుడి కేఁగి నిత్యంబు కుంచెఁడుపాలు,వడి మృడుఁ డారగింపఁగఁ బెట్టవమ్మ. బస. పు. 3. 409. పం. (ప్రాఁత ప్రతి)

5. క్షీణింపఁ జేయు, నశింపఁ జేయు. (చూ. ఎడయు) వి. 1 అభావము, లేమి.

క. ఇమ్మెడపున నిజసర్వస్వమ్ము గళత్రంబు నైనఁ జను నీఁగ .... కు. సం. 10. 557. (ఇమ్మెడపున – ఇమ్ము యొక్క అభావమున, ఇమ్ముకానప్పుడు )

2. ఎడఁబాపుట. (చూ. ఎడపరి)

ఎడపె(వె)ట్టు స. క్రి. (√ ఎడపడు) 1. విడుచు, విడిచిపెట్టు.

గీ. దినము లెడపెట్టి కుడుచుచు.... భార. అను. 4. 148.

క. గెలుపును నోటమియును ననిఁ, గలుగవె యొడ పెట్టి యెట్టి ఘనులకు నిమ్మెఁ, బలుకుదురే తగువారిం, దులువా నీకులము గుణముఁ దోఁచెం బ్రజకున్. భార. ద్రో. 4. 289. (ఎడపెట్టి – ఒకదాని విడిచి యొకటి, ఒకటి తరువాత నొకటి – ఎడపడి అని భావము.)

2. అడ్డుగాఁ బెట్టు, మితిగాఁ బెట్టు.

వ. అనిన విని కుటిలం బగు నతని యభిప్రాయంబునకు రోసి యస్త్రగురుం డవ్వరంబునకు నేమేనియు నెడవెట్టి యిచ్చువాఁడుగా నూహించి. భార. ద్రో. 1. 112.

(శ్లో. తస్యజిహ్మమభిప్రాయం, జ్ఞాత్వాద్రోణో ఽర్థతత్త్వవిత్, తం వరం సాంతరం తస్మై, దదౌ సంచింత్య బుద్ధిమాన్. సం. భార. ద్రో. 12. 23.)

ఆ. గురుని ప్రతిన వింటె వెరవున లావునఁ, జేసి దీని బొంకు సేయ వలయు, నెఱుఁగు మతఁడు నిన్ను నెడవెట్టి పలికిన, వాఁడు గానఁ జెప్ప వలసె నీకు. భార. ద్రో. 1. 116.

ఎడప్రొద్దు వి. (√ ఎడ[1]) సంధ్యాసమయము, సంజవేళ.

ద్వి. ఈపథిశ్రాంతి నేఁ డింతయుఁ దీఱఁ, బల్లె పట్టయినను బసులమందయిన, నుల్ల మారఁగఁ జేర నున్నదే ప్రొద్దు, ఈ ముని పుత్రున కీ విధి మూఁడె, నీ మహాటవిలోన నీయెడప్రొద్దు,.... ఎలమిమై నిచ్చట నీ రాత్రి మనము నిలుచుట కార్యంబు నిక్క మూహింప. ద్వి. హరిశ్చ. పూ. 1729.

ఎడబిడ్డ వి. (√ ఎడ[1]) పాలు విడిచినబిడ్డ, చంటి బిడ్డకు పూర్వపు బిడ్డ. (ఇట్లే ఎడపిల్ల, మొ.) (వా.)

ఎడబెట్టు వి. దీనారభేదము, నాణెములలో నొకటి.

సీ. ఎడ బెట్టనంగను నెరుస నా బారిముద్రయన దీనార భేదములు చెలఁగు. అం. భా. 2. 274.

ఎడమ – ఎడ్మ. వి. (త. ఎడ. క. ఇడమ్.) వామభాగము.

క. ....ఎడమన్, అర్ధాంగలక్ష్మి గౌరియు.... భీమ. 5. 180.

గీ. ....ఎడమకొక్కింత యొఱగ, నిడినధమ్మిల్లవలయంబు నడుగునందు. ఆము 5. 38.

గీ. తొడరి బడిబడి వెడవింటఁ గుడియెడమల, నడరివడి నేయుకఱివేల్పుకొడుకు... నీలా. 3. 15.

విశే. సవ్యము, డాపలిది. (దీనికి వృత్తియందు వికల్పముగా అంత్యవర్ణము లోపించును.)

ఉదా: ఎడమకాలు, ఎడకాలు. (చూ. ఎడ[3])

ఎడమపెనపెట్టు – ఎడమవైపునకు పెనవేయు; వ్యతిరేకము చేయు. (సామాన్యముగా బ్రాహ్మలు కుడివైపునకు పెనవెట్టిన పేటలతో వేయుదురు. అందొక పేట ఎడమపెనవెట్టినది యైనచో మిగిలినవానితోఁ గలియదు.)

క. అనుమానపడక వల్లభ, వినుమా నామాట వారి వీటం బలె నన్, గనుఁగొనకుము కులకాంతలు, పెనిమిటిధర్మమున కెడమ పెనపెట్టుదురే. ప్రబోధ. 1. 81.

ఎడమపెనవాఁడు – ఇతరులతోఁ గలియనివాఁడు (వా.)

జ: ఎడమడుగు, ఎడమడుగుపరువడి, ఎడమయోరభృంగి.

**ఎడమడుగు(వు)** విశే. (ఎడమ + అడుగు)

1. వ్యత్యస్తము, తాఱుమాఱు అయినది.

క. నడిపింపఁగఁ బొడిపింపఁగ, నెడమడువైకలఁగినప్పు డేర్పఱుపఁగ నేఁ, గడు నేర్తుఁ బేర్చు నాదగు, కడిమియ నీసైన్యమునకు గొనెన గాదే. భార. ఉద్యో. 4. 214.

2. విపరీతము, విరుద్ధము.

క. పొడుపునఁ బ్రాయంబునఁ గడుఁ, గడిఁది బలంబునను జూడఁగా నసదృశు నీ, కొడుకని యాతని నెంతయు, నెడమడుగుగఁ జూపఁ దెత్తె యుందఱు నగఁగాన్.

వ. ఇట్టిలోకవిరుద్ధంబుల కే మోడుదు మయుక్తంబు లయినపలుకులు వలుకక ... భార. ఆది. 4. 100. 101.

క. నడుమ నొకబోయపల్లెం, గడువేడుకఁ గోడిపోరు గనుఁగొని యెడునం, దడిఁ దఱియఁ జొచ్చి కోళుల, నెడమడువుగ విడుచుచున్న యెడ ని ట్లంటిన్. దశకు. 9. 29.

గీ. దబ్బ్రవేలి యుంగరము మేదావిబొట్టు, మడుఁగుపేలిక పిరిచుట్టు బెడఁగు గాఁగ, వడుగుచందంబు దన కెడమడుగు గాక, కొమరుగా నేఁగె నెలకట్టిగుజ్జువేల్పు. హరి. ఉ. 10. 283. (శ. ర. పా-'ఎడమడుగుగాఁగ' ముద్రి.)

3. కుటిలము.

క. ...అతండును దత్సేవనకార్యంబు తగ నెపం బిడి యేప్రొద్దును నెడమడు గగు మదితో, ననువర్తింపంగఁ గించిదవశిష్టము గాన్. హరి. పూ. 1. 61.

వి. 1. వైషమ్యము, భేదము, అంతరం.

క. అనవుడు రోమశుఁ డిట్లను, మనలో నెడమడుగు గలదె మంటికి నీవ, ట్లన నేల మమ్ము మఱవక, యుని కిది సంతసము గాక యొండొక టగునే. పద్మ. 4. 180.

క. పొడగంటి నిన్ను బ్రతికితిఁ, గడచితి నాపదల నింకఁ గార్యంబుల నే, యెడమడుగు లేని నెచ్చెలిఁ, బొడగాంచుట చచ్చి మరలఁ బుట్టుటగాదే. భాగ. 10. పూ. 202.

క. అడలడఁచి నెమ్మనంబున, వెడతెలి వొడఁగూర్చి మాట వేర్పడకుండం, జిడిముడిపడక నయంబున, నెడమడు వొక్కింత లేక యిట్లను సతితోన్. నిర్వ. 8. 131.

2. ఆలస్యము, జాగు

ద్వి. ...ఈపాలు ద్రావు, మెడమడు గేమిటి కీపాలలోని, కడుకులు దెచ్చెద నశైనఁ జెవుమ. బస. పు. 3. 484. పం. (సందేహమనియు నర్థము చెప్పవచ్చును.)

చ. అడవులనుండి వచ్చిరఁట యద్భుతశౌర్యులు రామకృష్ణు లిక్కడకు నరేశ్వరుండు గడుఁ గౌతుకియై పిలిపించెఁ దోడితెం, డెడమడువేల యింక నఖలేచ్చలుఁ జేకుఱె నంచుఁ గంచుకుల్, బడిబడిఁ బాఱుతెంచి తమభావ మెలర్పఁగఁ బల్కి పిల్వఁగన్. హరి. పూ. 9. 87.

**ఎడమడుగుపరువడి** వి. (√ ఎడమ) పదిరెండు పరవడులలో నొకటి (పదునాల్గు విసరులలో నొకటి అని హంస. 1. 206.)

వ. ఎడమడుగుపరువడి కుడియడుగుపరువడి కదలుపరువడి... మొదలుగాఁగల పదిరెండు

పరువడులును...ప్రబంధ. 78. ఎడమడుగు పరువడి కుడియడుగు పరువడి కదలు పరువడి...ఇవి మొదలైన పదునాలుగు విసరుల మర్మంబులఁజూచి. హంస. 1. 206.

**ఎడమయోరభృంగి** వి. వి. (√ ఎడమ) మల్లబంధ విశేషము, ఒకానొక కెట్టిపట్టు. ప్రబంధ. 79.

**ఎడము** వి. నడిమిభాగము, మధ్యప్రదేశము; అవకాశము.

సీ. కవట లొండొంటితోఁ గదియుచు నెడములు ప్రమింగి ప్రబ్బఁగ సొంపు మిగులుదాని. భార. విరా. 1. 162.

క. ...రెండువీళ్ళయెడమున విడిసెన్. హర. 6. 101.

వ. ...నిషాదయోధులు....

క. మిడుతవరి వోలె దిక్కుల యెడములు దమ మయముగాఁగ నేకాకృతితోఁ, గడిఁదిగఁ బొదివిరి రాముని. హరి. ఉ. 6. 164, 165.

గీ. ఇట్లు కడ లేనియాసాన బీనుచుండ, జనులు ప్రబహ్మాండకోటులఁ దనివి నొంద, ఠనిన శాంతిఁ గా లూఁదనైనఁ గలదె, యెడము మదిఁ దృష్ణ నీ వింత వెడలితేని. ప్రబోధ. 2. 64.

2. దూరము.

సీ. తనమదిలోఁ దాను దలఁచె నిమ్మెయి సిరి నెడఁబాసి నరుఁడనై యున్నియేండ్లు, గడపుచునుంటి నింక నెడంబునం దుంచి యుండుట పాడిగా దుదధిసుతను. వేం. మా. 6. 12.

3. కాలవ్యవధానము, ఆలపి.

ఆ. అబ్జనయన నాకు నాహారనిద్రల, కెడము లేదు...భార. అర. 5. 308. (వ. ర. పా. 'ఎడయులేదు' ముద్రి.)

క. వివరింప నెడము లేదిఁక, నువిదకు సోబనపు జలక మొనరింపంగా, జవరాండ్రఁ బనుపు మనవుడుఁ, బువుఁబోఁడియు నలరి తగిన పొలఁతులఁ బనిచెన్. యయా. 4. 86.

4. గడువు.

చ. ఇది నిజ మిందు కాలునెల లి మ్మెడము ...వేం. పంచ. 1. 84.

5. విచ్ఛిత్తి, ఆలపు.

ఆ. మిన్న జన్నిగట్టుఁ గ్రొన్నెల వెన్నుని చెన్నుమీఱ నప్పు డెన్న మున్న, విన్నకతన నెపుడుఁ గన్నులఁ గట్టినట్లున్న దెడము లేక యన్నులార. నీలా. 2. 98.

ఎడముకొను - 1 అవకాశము కలిగించుకొను; ఆలపి చేసికొను.

(మల్లయుద్ధము.) వ. ..పట్టిన నిట్టట్టు పెనఁగి పట్టు వదలించి కరంబులు నురంబుల నడిమికి ముడించి యెడముకొని బడిబడిం బొడుచుచు ... కళా 3. 266

2. ఆక్రమించుకొను.

గీ. ... వై జయంతీవితాన, మెడములకు నెడమీక మీఁ దెడముకొనఁగఁ బరఁగి నడతెంచెఁ గాంద్ర భూపాలుసేన. ఉ హరి. 3. 24.

**ఎడయగు** అ. క్రి. (√ ఎడ[1]) దూరమగు.

(క) విలంబమగు.

సీ. ....అపత్యం బెడయైనఁ దతోదరి గౌరి వివాహమై గౌఁవమున, సుతుఁ గాంచె ... దశకు. 2. 110.

(చ) బాహ్యమగు.

గీ. ... బంధుల కెడయగుఁ గులము వాయు, బైసి వోకార్చుకొనుఁ బాపపంకనిహతిఁ, గూలుఁ గా ల్జారి నారకకూపమునను, సంతత స్త్రీరతుండు దుష్యంతతనయ. పి. శకుం. 4. 163.

చ. తుద నవి యేమి చెప్ప నతిదుఃఖకరంబుగ నిట్లు పుత్రసంపద కెడయైతి. రాఘవ. 1. 44.

**ఎడయాడు** అ. క్రి. (ఎడ[1] + ఆడు) 1. అల్లాడు, సమీపమున తిరుగాడు.

ఉ. ..వేడ్కతో నిషధభూపతికై యెడయాడు దృష్టిల, జ్జావతి యెట్టకేల కొక చందమున న్మగిడించి చేర్చె వా, గ్దేవిముఖేందుబింబమున....నైష. 5. 184. (చూ. 183.)

2. ప్రవర్తించు.

చ. ....భవత్ప్రయత్నము ప్రకారము బుద్ధి నెఱింగి దాని కే, ననుగుణ మైనభంగి నెడ యాడఁగఁజొచ్చెద నీవు చెప్పుమా దశకు. 7. 52.

**ఎడయిక** వి. (√ ఎడయు) ఎడఁబాటు, వియోగము. (శ. ర.)

**ఎడయు** అ. క్రి. (√ ఎడ[1]) 1. సంబంధము లేకపోవు, దూరమగు; తొలఁగు.

గీ. పరులు తెలియంగ రాని యీ పరమ గోప్య, మైన కార్యంబు నీవు నన్నడిగితేని, స్వపతి జారుల కెడసిన చపల యనెడి, కాంతతో జంట యగుదు వా గాథ వినుము. శుక. 3. 479.

వ. చూచి యెందును ఫలంబు గానక యా సుగాత్రి యాయన నిం కేమి ప్రపంచంబుఁ జేసిన నెఱయ నెడసిపోవుట దక్కఁ బ్రయోజనంబు లేదు. కళా. 4. 78.

సీ. ఎడసిన జిలుఁగుఁ బయ్యెదతోడ ముడి వీడి నేల జీరాడు పెన్నెఱులతోడ. అచ్చ. రా. సుం. 16.

2. విముఖమగు, (మనసు) విఱుగు.

గీ. నేఁటి రాత్రి తెఱంగు నా నేమమున జనించె నది యొక్క మాటకే నెమ్మనమున, వలిగి తేఱన యే నెన్ని ప్రార్థనముల, దానిచే నెంత యెడసెనో ధవునిమనము. ప్రభా. 5. 166.

క. రామాజ్ఞ లేక యే వను, దీమసమున నిందుఁ దోడి తెచ్చితొ నాపై, స్వామిమతి యెడసి యున్నదొ, యేమిటి కడలెదవు తండ్రి యెఱిఁగింపఁగదే. ఉ. రా. 6. 262.

3. చెడు, భగ్నమగు.

గీ. ...అడుగ వచ్చిన వారలు... జార యను పేరు విన్నంత జాఱుటయును, బీఁటమీఁదటి పెండిండ్లు పెక్కు లెడసె. శుక. 2. 158.

4. క్షీణించు, నశించు.

సీ. సంరక్ష సేయనిస్వర్ణ మప్పుడె చెడు వృద్ధిఁ బొందింపని విత్త మెడయు. నా. పంచ. 1. 70.

సీ. విటులఁగూడినను వివేక మెడయు. నీతి. 52.

స. క్రి. విడుచు, త్యజించు.

క. మామీఁద నీమనంబునఁ, బ్రేమము లేకుండుఁ గాక ప్రియబాంధవమిత్త్రామాత్యులు లేరే వా, రేమి గొఱఁత చేసి రెడసి యేఁగితి దివికిన్. హరి. పూ. 9. 147.

(పుడమిచెలి) సీ. వంకనిశ్శంకుఁడై పాండారిక వృత్తి వదలక వ ల్లొత్తువాని నెడసి. వసు. 1. 76.

**ఎడరు** అ. క్రి. విఱుగు, భగ్నమగు.

చ. తడయక ఘోరదగ్ధన సుదగ్ధన పావకుచే దహింపఁగాఁ, బడి పరమేశ్వరోగ్ర శర పావక దగ్ధపుర త్రయాభమై, యెడరి ధరిత్రి మీఁదఁ బడియెం జెడి సౌంభక మంత సాల్వుఁడుం, బడియె మదీయచక్ర పటు పాతరయంబున రెండు వ్రయ్యలై. భార. అర. 1. 198. ('ఎడలి' భా. అ. వ్యా. పాఠము – ప్రయోగాంతరము లేదు.)

వి. (క. ఎదరు. త. ఇదర్, ఇడరు.) 1. కష్టము, ఆపద.

ఆ. ఎడరుచోట నృపతి కి నాల్గు వృత్తులుఁ, దగుఁ బ్రతిగ్రహంబు దగదు తలఁప, నాపదవసరముల వధముఁ జెక్కువ జాతి, వృత్తినున్న దోషవిధము గాదు. భాగ. 7. 410.

శా. ...విశ్వామిత్త్రుం డెడ రైనచో శునక మాంసంబున్ భుజింపండె. ... శివరా. 3. 87.

2. కీడు, అశుభము.

గీ. ఇట్టియప్పుడు సదివిన నెల్లభంగి, నెడరు పుట్టుఁ గావునఁ జదు వుడుగ వలసె. భార. శాం. 6. 309.

3 యుక్తసమయము, సందు.

ఆ ఎడరు వేచి సంధ్య నిన్నుఁడు వృద్ధత నున్న, నెడలె వనఁగ గుహాలు వెడలెఁ గరులు. భాగ. 8. 27.

ఆ. ఎడరు వేచి చెఱచు సేవకాఁ డగువాని, కంటె మేలు మూపె కాలయముఁడు. భా. రా. యు. 2258.

గీ. ...జారుఁ దప్పులుఁ దనతి, నెత్తికొని పోవ నిం దందు నెడరు వేమ పాండు. 8. 72.

4. భంగము, అవమానము.

చ. ఇది తగ దంచు వడ్డపడు నింతకు నేరక సభ్యు లందఱున్, మదిమది నున్న యట్టి యెడ మానినికిం దనుఁ దాన కాచికో, లోదవిన దానఁజేసి సభ నొచ్చెము దక్కినఁ బాండునందనుల్, బ్రదికిరి గాక యయ్యె డరు రాచకొమారుల కోర్చునట్టిదే భార. ఉద్యో 1. 848. (వి. ని. శ. ర. పాఠ ములు.)

**ఎడల** అవ్య. ద్రు — ఎడ [1] అవ్య.

(విషయమున)

వ. పద్మాసనుని శిల్పప్రయాసంబు లక్ష్మీ నారాయణుల యెడలను గౌరీవృషభాం కులపట్టుననుంబోలె మీ యెడలఁ బరస్పర యోగ్య సమాగమనంబునకుఁ జాల్పడుఁ గాక. నైష. 2 67.

(పక్షమున)

క. చెలియా కాంతామోదము, కలుగనియెడ లన్ మదాళి కలియునె... దశా. 3. 18.

**ఎడలించు** స. క్రి. (√ ఎడలు) ఎడలఁ జేయు

1. తొలఁగించు.

వ. ...నవ్వుటాలకు వెనుకపాటునఁ గదిసి ము నుంగు లెడలింప... మనుచ. 8. 28.

2. వెలికిపోఁజేయు.

చ. బలసిన హల్లకచ్ఛటలపైఁ దమ జుంజుఱు ముండ్లు రాయఁగాఁ, గలమము లుండుఁ బండి యొఱగంబడి నీ రెడలింపఁ దృష్ణ లోఁ, దలకొన వంగి మున్ జలముఁ ద్రావెడు క్రిందటి వేళ్లు మీఁదటన్, నిలిపి మరంద మానుకరణి న్నికటోపవనానిలా హతిన్. ఆము. 1. 67.

3. భగ్నముచేయు.

శా. ...శౌర్య సంవత్సరున్ వృషకేతుఁ గూడుకొని యా భద్రావతీ సైనిక ప్రోత్సాహం బెడలించి యధ్వరహయంబున్ దెచ్చు పర్యంతమున్. జై. భా. 1. 98.

4. విడుచు, త్యజించు; విసర్జించు.

ఉ. సైనికు లెల్ల నంత రణసన్నహనం బెడలించి పాఱిన,స్నానయు నచ్చలంబు మది నాటు కొనంగఁ గపోలమండలీ, దానమిళద్ద్విరేఫ నివదంబులఘుంకృతి సందడింప వె,ల్లేనుఁగు మీఁద డీకొలిపి యింద్రుఁ డుపేంద్రునిఁ దాఁకె నుద్ధతిన్. పారి. 5. 18.

క. వెడబుద్ధు లుడిగి నా చెప్పెడు మతమున మీరు గోత్రభిత్పూజ తెఱంగెడలించి గోత్ర పూజకుఁ గడఁగుఁడు పసువుఁ డిది పల్లెఁ గ్రమ్మఱఁ జాటన్. హరి. పూ. 7. 136.

5. వదల్చు.

ఉ. వేవిన మేడపై వలభి వేణికఁ జంట వహిం చి విప్పఁగా, బూవులు గోట మీటుతఱిఁ బోయెడు తేఁటుల మ్రోఁత కామిశం, కావహమౌఁ గృతాభ్యసన తాటను దంతపు మెట్ల వెంబడిం, జేవడి వీణె మీటుటలుఁ జిక్కెడలించుటలు న్సరింబడన్. ఆము. 1. 62

6. పోఁగొట్టు, నశింపఁజేయు.

సీ. చల్లలమ్మఁగఁ బోవు గొల్లకొమ్మల నడ్డు కొని సిగ్గు లెడలించి యెనసి కేరు. నీలా, 1. 76.

క. ఇతఁడు కిరాతుం డే దుర్మతి మ మ్మడి గియు మహేశు మన్నించి ప్రసన్నతఁ బాపితి రి తెఱఁగున, హితలీల భవప్రయాస మెడ లింపఁ గదే. కాశ. 3 125.

7 వెలిపుచ్చు, బయలుపఱుచు, ప్రకటించు.

(జగన్మోహిని) సీ. వదినె మఱుందలి వావులు కల్పించి మర్మంబు లెడలించి మఱుఁగుసేసి. భాగ. 8. 318.

8. తీయు, తెఱచు.

గీ. ఇదియె తన మున్న గృహ మని యెంచి యచట, నిర్గమద్వార మెడలించి నెమ్మి వెడలి, దైవవశమున మదన సేనావధూటి, పడుక యి ల్లాట నిలిచి విశ్రాంతుఁ డగుచు. శుక. 3. 333.

**ఎడలు** అ. క్రి. (√ ఎడ¹) 1. తొలఁగు, అపసరిల్లు; పోవు.

మ. జిలుఁగుంబయ్యెద జీరువాటి యెడఁ న్... / నై. ష. 6. 67.

ద్వి. మెఱుఁగుఁ గైదువుల క్రొమ్మెఱుఁగులు దిశల, నిఱిసినచీఁకట్ల నెడలంగ జడియ. ద్వి. హరిశ్చ. ఉత్త. 2317.

వ. ...ఈఁటియలు నాటుకొల్పి యసులు లెడల మీటుచు. అచ్చ. రా. యు. 364.

2. సడలు, వదలు.

వ. పయిం బడినవీరులం గీలెడలిన జంత్రంబులుం బోలె నేలం గూల నేయుచు. భార. భీష్మ. 2. 137.

ఉ. భూవరుమూతి కీలెడలు బొమ్మ విధంబున వ్రాలె భూస్థలిన్. సారంగ. 3. 115.

3. రాలు, క్రిందఁబడు.

సీ. ...పల్లాకు లెడలెఁ దరుల. కు. సం. 4. 445.

వ. ...కుంభముల మౌక్తికంబు లెడల వ్రేయు నెడల... దశా. 1. 261.

4. విచ్ఛిన్న మగు.

సీ. ...ఆ శిశువు సంజీవితుఁ జేయకున్న. అ. బ్రదుక రన్వయమున కుదకపిండప్రదా, నంబు లెడలు... భార. అశ్వ. 3. 170.

(భీష్ముఁడు) క. కురువంశ మెడల వచ్చినఁ, బరమోపాయమున మగుడఁ బడసెన్. భార. స్త్రీ. 2. 111.

5. వికలమగు.

చ. తనువు ఘనాస్త్రశస్త్రములు తాఁకిన నొప్పిని డప్పి పుట్టెనా, మనము వశంబుగా కెడలె మాటల చందము సూడ మీరు డ, స్సినయటు లున్నవాఁలు... భార. శల్య. 2. 33.

6. పగులు, భిన్నమగు.

సీ. ...న్నవ విను కడవకు సారెపై నమర మృత్తిక యిడునపుడు విరియుటయు వెర వారఁ లట్టఁగ రాక చెడుటయు వాని యొత్తెడు నెడ ప్రవయ్యుటయును. గీ. నెత్తి యొకచోట డించిన నెడలుటయును, నెండ యవియుటయును నావమిడినఁ బగిలిపోవు టయు వాడుజనులచేఁ బొలియుటయును, గలుగుగతి మేని కెట్లును గలుగుఁ జేటు భార. స్త్రీ. 1. 34.

7. చెడు.

క. అంబయు నట సాళ్వునికడ, కుం బోయిన నతఁడు భీష్ముకొనిపోయినదా,నిం బడుచుం గైకొన ధర్మం బె కన్యాత్వ మెడలె మగువా నీకున్. భార. ఉద్యో. 4. 278. (ప్రాఁత ప్రతి).

క. పడఁతికిఁ గన్యాధర్మం, బెడలినఁ గొలయగునె వెండి యెవ్వరికైనం, గడిపోయిన పువ్వులు మఱి, ముడుచునె రసికుఁ డగు వాఁ డమోఘవివేకా. భోజరా. 4. 224.

8. తగ్గు, క్షీణించు; నశించు.

సీ. కాళ్లయొప్పిద మూఁడుకట్టు నుజ్జ్వలముగనే, యంగ సంకుల బాహు లంద మెడల. భార. విరా. 1. 228.

క. గురునలుక నాకు నస్త్ర, స్ఫురణ మెడలె నంద్రడు జనులు బొంకరది... భార. ఉద్యో. 2. 266.

9. చచ్చు.

ఆ. గొడ్డుబడుగుఁ దెవులుగొంటుఁ గ్రాగి పెడలిన, దాని... భార. అను. 2. 402.

క. కడుఁ గూర్తుఁ గవ్వడికి నయ్యెడలు గలుగ నేను బ్రదికి యుండుదుఁ గాకె,క్కడి బ్రదుకు నాకు నాతం, డెడలిన నపార్థుఁ గాతు నెల్లవిధములన్. భార. ద్రో. 2. 349.

10. లేకపోవు.

గీ. దర్పపోటులఁ దిని లేనితఱుల మైత్రి, నంటి పిత్తశేషము భుజించి యదియు నెడల, నక్కవాడల నఱకూళ్లు మెక్కి... ఆము. 6. 69.

11. దూరమగు.

క. నీ రథమునకుం జౌరమ, నోరథమునకున్ భవత్తనుజు లెడలిరి మి, న్నే యవ్వలిదరి వని దొ,వారికులై శావిదేహవరసుత కధిపా. చం. రా. 4. 74.

స. క్రి. విడుచు.

శా. ఉదగ్రద్విక్రము లైన యీ ద్రుపద మత్స్యోర్వీపతుల్ నిన్ను సం,పద్యోగోజ్జ్వలుఁ జేయఁ బూని కడఁకం బ్రాణంబు లీ నున్నని, ట్లుద్యోగం బెడలంగ నేమిటికి నీ కుర్వీశ... భార. భీష్మ. 2. 18.

ఎదలుచు(ల్చు) – ఎడలించు. స. క్రి. (√ ఎడలు)

1. ఊడ్చు, ఊడదీయు; తొలఁగించు.

క. ఒడలఁ గల తొడవులన్నియు, నెడలిచి కామినులచేతి కిచ్చి ప్రియం బేర్పడ... చిత్ర. భా. 4. 3.

క. తుఱుమునఁ దుఱిమిన మొల్లల, సరు లెడలిచి గగనలక్ష్మి సంపెంగ విరుల్,దుఱిమెను నా రిక్కలపరి, తఱుఁగన్ రవిరుచులు గొన్ని తఱిఁ దింద్రించెన్. ఘటికా. 2. 158.

గీ. చెలియ తెచ్చిన వీణఁ గెంగేల నంది,కొని మెఱుఁగు గవియఁగ గవుసెన యెడల్చి, తీఁగెలు బిగించి సారెలు దిద్ది శ్రుతులు, గూర్చి యుత్తర తుంబిక కుచముఁ జేర్చి. చిత్ర భా. 3. 83.

చ. తొలఁకెడు తావి గందవొడి తూరుపు వాలుఁగఁ బట్టి మల్లెపూ,వలపులు కొల్లలాడి హిమవారిఁ గలంచి మెఱుంగుఁబోండ్ల గుబ్బలపయి చంద్రకావిజిగి పయ్యెద కొంగు లెడల్చి యెందుమై, తెలియక తూలుకొంచు వలిదెమ్మెరలాహిరికాఁడు త్రిమ్మరున్. కువల. 1.88.

2. తీయు.

చ. దొనపయిఁ జాయకెప్పుడును దూపు లెడల్చుచు నున్న రీతిఁ దాఁ,బనుమఱచేర్పువం దెపుడు జాఱక య మ్మరిఁబోసియున్న దా, ద్దున శ్రవణాంతసీమ నెపుడున్ వలయీకృతచాపమైనశిం,జినిగతిఁ దోఁచెఁ దత్కరము చిత్రరయంబునఁ బెక్కు రూపులై. కళా. 8. 122.

3. వదల్చు.

గీ. తఱుకుఁగొనగోర మీసలనులి యెడల్చి. కళా. 5. 118.

ఎదలువాపు – యెడఁబాపు. (√ ఎడ¹.)

ఆ. హా మహానుభావ హా భాజనందన,హా యశోనిధాన హా కులీన, యెడలువాపె మనల నీశ్వరుండు. బ్రహ్మో. 8. 51.

ఎదలుసేయు – యెడసేయు (√ఎడ¹.) (ఎడఁబాపు.)

గీ. అని యనుజ్ఞ సేయ నవనికి నేతెంచి,యుర్వశియు నృపాలుఁ దున్నయట్టి, చెలిమి గాంచి యెడలు సేయుటకై వేళ,గాచి యుండి రప్రకాశ వృత్తి. కవిరా. 5. 241.

ఎదవల వి. (√ఎడ¹) జాలవిశేషము, ఒకవిధమగు వల.

క. మెడవల సన్నపువల త్రో,వుడువల డొంకవల మింటముక్కిడివల దాఁ,టుడువల సింగితమనుకువ, లెడవల కుందెవల లాదు లెనఁగెడి వలలున్. హంస. 4. 185.

ఎదవిడివడు అ. క్రి. (√ఎడ¹) – అడ్డు(బంధము) నుండి తప్పించుకొను – విశృంఖలమగు.

ద్వి. ఎడవిడివడ్డమత్తేభంబు వోలె. పండితా. 176. పా. 4. పం.

ఎదవు వి. నిర్జలప్రదేశము, మరుదేశము, యెడారి.

వ. ...యెడవునఁ జలిపంది రిడియెద మనియు ...అము. 4. 53. ('ఎడరు' శ. ర. పా.)

వివ. దవ్వు, దూరము.

గీ. ...తెరువు, నెడ వనుచు జాలి గొని సంశయించువేళ. అము. 6. 18. (శ. ర – వి. ఎడారి. ప్రాఁతప్రతివ్యాఖ్య)

ఎదవోవు అ. క్రి. (ఎడ¹+పోవు) రాయబారము పోవు, దౌత్యమునకై పోవు.

ద్వి. ఎడవోవు లంజియ యుంటికిఁ దాన బస. పు. 4. 739.

క. కడుఁ జోద్యము భక్తులకును, గడుఁ గూర్చుట నీదు భక్తిగౌరవమునకుం, గడు మెచ్చి యొడయ నంబికి, నెడవోయితి గాదె లంజెయింటికి రుద్రా. శివ. సా. 407.

**ఎడనంది** వి. (√ ఎడ[1]) నడిమినందు, మధ్య భాగము.

క. దయ్య మెఱుంగున్ వారల, నెయ్యంబులు మక్కువలును నిజమరితనముల్, వియ్యములును నెడనందిని. బయ్యెదకొం గడ్డమైనఁ బ్రాణము వెడలున్. భాగ. 9. 401.

**ఎడనను** అ. క్రి. (√ ఎడ[1]) ఎడముగా చను, తొలఁగిపోవు.

క. ... పతివ్రతాంత్నము న,న్నెవ్వు డెడనవక కంటికి, ఱిప్పవలెం గాచి తిరుగు రేలుం బవలున్. శుక. 1. 299.

**ఎడిసాల** వి. (√ ఎడ[1]) ప్రత్యేకమైన యిల్లు. (బ్రౌ. శ. ర.)

**ఎడసేయు** స. క్రి. (√ ఎడ[1]) 1. దూరముచేయు, ఎడఁబాపు.

ఆ. పల వృద్ధరాజు లెడసేసిరో పార్థ, వరిగి నెడక మనము వరిగి యతని, యున్నచోవ ప్రీతినుండుదము... భార. ఆది. 6. 142.

2. భేదము కలదానినిగాఁ జేయు.

మ. అమరంగాఁ దనమీఁది నేర మిపు డావానా పయిం జూపెఁ దం,డ్రిమనం బి ట్లెడ సేసెనే...సారంగ. 3. 12. (మనం బెడ నేసెన్: మనను విఱిచెను అని భావము.)

**ఎడాటము** వి. (ఎడ[1]+ఆట+ము) 1. భేదము, మార్పు.

ఉ. ...మాటలలోటికి నవ్విరించికిన్, బొంది కలం దెడాటములు పుట్టినమాన్తను వారు మెచ్చఁగన్. అహ. 3. 7.

2. విషయము. (ఈ యుద్ధమున 'ఎడాటమునన్, ఎడాటములందు, ఎడాటములన్' అని సప్తమీవిభక్తిలోనే ప్రయోగములు కన్పట్టుచున్నవి.)

సీ నెప మేమియును లేక నీ యెడాటమ్మునఁ బాటిఁ దప్పఁడు గదా భైరవుండు. భీమ. 2. 88.

ఉ. అన్నలపట్లఁ దమ్ముల యెడాటమునన్ సముఁడంచు నెన్నఁగా...విజ వి. 1. 27. వరాహ. 2. 129.

ఉ. ...జవరాంధ్రయెడాటములందు శక్యమే. యొంతటివానికైనఁ జలియింపక బిగ్గ మనంబు నిల్పఁగన్. సారంగ. 2. 11.

ఉ. ...కెట్టిపో,రాటము లాయె నాయన కొయారి యెడాటములన్ హుటాహుటిన్. పాంచా. 5. 20.

**ఎడారి** వి. చెట్టుచేమలు లేని విశాలపునిర్జలభూమి, బయలు.

సీ. ...నలుచోటు లొకత్రోవఁ గలిసియుండు, నట్టి యెడారిఁ బెన్గొట్టంబుఁ గట్టించి కూళ్లు గంజియు వేఁడినీళ్లు....సిద్ధి శేషధర్మములు. 2. ఆ. (వి. ని.)

**ఎడారె** వి. (ఎడ[3]+అరె.) చెప్పులు కుట్టెడు చిన్న మూది. (శ. ర.)

**ఎడి** — ఎడు.

(భవిష్యత్కాలమునకు)

క. పలికెడిది భాగవత మఁట, పలికించువిభుండు రామభద్రుం డఁట నేఁ, బలికిన భవహరమగు నఁట, పలికెద వేఱొండుగాథ పలుకఁగ నేలా. భాగ. 1. 18.

**ఎడు** అవ. తద్ధర్మార్థకార్థములందు ప్రథమ పురుషైకవచన 'ము' వర్ణకము పర మగునపుడు ఆగమముగను, తృవర్ణకార్థము దు ప్రత్యయముగను వచ్చునది.

(వర్తమానకాలమునకు)

క. ఒగ్గజములు మిన్నకయును, మ్రొగ్గెడు నుత్తమ తురగములు బాష్పజలం, బగ్గలము విడుచుచున్నవి, తగ్గెడుఁ గారణము లేక తడఁబడి పడగన్. భార. విరా. 4. 87.

(తాచ్ఛీల్యమునకు)

క. కడు నను రక్తియు నేర్పును, గడఁకయుఁ గలవారి మఱక కడవఁగ నెగ్గుల్, నొడివెడు వివేకశూన్యుల,కడ నుండెడు నంతకంటెఁ గష్టము గలదే. భార. ఆది. 8. 149.

(భవిష్యత్కాలమునకు)

వ. ...నాగముఖ్యుల నెల్ల వానుకి చెలియలైన జరత్కారువునకు జరత్కారుం డను

మహామునికిం బుట్టెడువాఁ డధిక తేజస్వి యాస్తీకుం డను మహాముని జనమేజయ సమారబ్ధ సర్పకులప్రళయంబువలన రక్షిం చును. భార. ఆది. 2. 137.

(భూతకాలమునకు)

క. తడఁబడఁబడియెడు రవమును,బడి కాలెడు రవముఁ గాలి వలు దెలఁగుల ప్రవ,స్నెడు రవమును దిగ్వలయము, గడుకొని ప్రమో యించె నురగశాయోత్థితమై. భార. ఆది. 2. 215.

సీ. కరులఁ ద్రుంచెడువేళ గిరులఁ దున్మాడు సంక్రందను కైవడి గావవచ్చు. భార. శల్య. 1. 282.

ద్రు. ఆశీశ్వానసంప్రార్థనములందు క్రియాప్రత్యయములకు వచ్చు ఆదేశము. దీనికి అచ్చు పరమైనచో 'మ' వచ్చును.

(ఆశీస్సునకు)

వ. ...యయాతికి నీకును నయిన యీ వివాహంబునం దపక్రమదోషంబు లేకుండెడు మని వరంబిచ్చి...భార. ఆది. 3. 169.

(శాపమునకు)

క. పతిహీన లైనభామిను, లతిధనవతు లయ్యుఁ గులజలయ్యును ననలం,కృత లయ్యెడు మాంగల్యర,హిత లయ్యెడుఁ గృపణవృత్తి నిదియు మొదలు గాన్. భార. ఆది. 4. 229.

ఎడ్డ - ఎడఁద.

ఆ. వీనివలనఁ గులము వెలుఁగు నంచును నెడ్డ, జాహ్నవీసుతుండు సంతసిల్లి. భార. ఆది. 5. 15.

క. వికచముఖుఁ డగుచు శాత్రవు,లకు హితు లగునట్టివారలం గని భూపా,లకుఁ డెడ్డ కత్తెరయు నా,లుక బెల్లమునై మనంబులుం గన వలయున్. భార. శాం. 3. 268.

ఎడ్డముల్లు - హృదయశల్యము.

గీ. మూఁడు లోకంబులకు నెడ్డముల్లు వోలె, మన్న దశకంఠురక్షచే నొవ్పు మిగిలి. భా. రా. యు. 483.

ఎడ్డమి వి. ఎడరు, ఆపద.

ఉ. ఎడ్డమి యైనయప్పటికి నెవ్వరుఁ జేరరు లోకులేమియున్, నడ్డలు సేయ నొల్ల రవసానపు వేళల దండధారుచే,జడ్డలె కాని మేలు కొనసాగ దయో తలపోసి చూచినన్, బిడ్డలు లేనివారి కడవిన్ మృగజన్మము రోఁత పుట్టదే. వి. పు. 5. 102.

ఎడ్డము వి. అడ్డము, నిరోధము; ఇబ్బంది.

క. బిడ్డలు వెఱతురె నీ కఱ,గొడ్డంబులు సేయ కెల్లకోడంద్రును మా,తొడ్డారిఁచక నడతురె, యెడ్డముగా కున్నదే మృగేక్షణ యుంటన్. భాగ. 8. 467.

ఉ. ఏడుదినంబు లన్నమున కెడ్డము పుట్టినయంతమాత్రలో, నేడుచు చున్నవాఁడవు మునీశ్వర ...భీమ. 2. 116.

ఎడ్డె(డ్డియ) విణ. 1. మూర్ఖుఁడు, విరసుఁడు, మోటువాఁడు.

మ. ధనికుం జేయును లోభివాని నెఱదాతన్ బేదగాఁ జేయు ర,త్యనభిజ్ఞుం డగు నెడ్డెకున్ మదనతంత్రప్రౌఢ యాదాని భా,ర్యనుగాఁ జేయు...అహ. 3. 14. ఉ. హరిశ్చ. 4. 12.

2. మోటుది, ముదుకది.

ఉ. చాలనిదట్టిబట్టయన్, మాసినయెడ్డెదుప్పటి దనర్పఁగ... శుక. 2. 362.

3. అసహ్యమైనది, రోఁత పుట్టించునది.

(వ్యవ) ఎడ్డెవాఁడు, ఎడ్డెపనులు. మొ.

జ. ఎడ్డెఁడు.

ఎడ్డెఁడు. విణ. (√ ఎడ్డె) మూర్ఖుఁడు.

('ఎడ్డె'కు మహద్వాచకమగు రూపాంతరము)

ఉ. బిడ్డయొ పాపయో చిదిమి పెట్టినకైవడి మన్న నిన్నుఁ దా,నడ్డ యొనర్ప కవ్వలఁ బిశాచము వంటి గరాముఁ గూడె నీ, యెడ్డెఁడు. శుక. 1. 438.

ఎడ్డెన వి. భోజనపాత్రము లుంచుకొనెడి యెత్తు పీఁట.

సీ. వెండియెడ్డెనలపై వెలచి తెచ్చిన పైఁడి పళ్లెంబు లాయత్తపఱచువారు. నైష. 6. 108.

గీ. పసిఁడియెడ్డెవలను మించు పద్మరాగ,ఖాజ
నంబుల వడ్డించు బహువదార్థ, వితతు లమ
రెను...జై. భా. 8. 202.

**ఎడ్డ** – ఎడఁద.

ఉ. ఏ వొక పాపభావమును నెడ్డఁ దలంపక
యుండు నట్లుగా, నానతవై రి నీ యడుగు
లంటఁగ నోపుదు... భార. అర. 2. 214.

**ఎడ్మ** – ఎడమ.

(ఎడమది.)

మ. ...మురారియెడ్మలరి వ్రేయఁగా. పాండు.
2 103.

**ఎతఁడు** – ఏతఁడు.

**ఎతుబరికాఁడు** – ఎత్తుబరికాఁడు. (బ్రౌ)

**ఎత్తనగోల** వి. (√ ఎత్తు) 1. గోనె నెత్తి యెడ్ల
మీఁద వేయుటకు సాధన మైన కఱ్ఱ. (శ. ర.)
(ఇరువురు మనుష్యులు గోనె మున్నగు బరు
వులను త్రాళ్లుకట్టి మోచికొని పోవుటకై
యుప యోగించు కఱ్ఱ (బ్రౌ)

సీ. తనరు గోణ్యుద్ధారిదండాఖ్య యెత్తన
గోల నా బట్టనగోల యనఁగ. ఆం. భా.
2. 167.

2. ఊఁతగా ఆనించిన కోల. (శ. ర.)

**ఎత్తనగోలు** వి. మొదలు, ప్రారంభము. (శ. ర.)

**ఎత్తరము** – ఎత్తరవు విశే. (√ఎత్తు–క ఎత్తర.)
ఉన్నతము, ఎత్తైనది.

సీ. ఇలఁ జుట్టువడు తొండములు మించు
పూర్వాంగ మెత్తరంబై పిఱుందత్తమిల్ల.
మనుచ. 5. 98.

వి. ఉన్నతి, ఎత్తు.

సీ. ఒక్కింత బటు వైన యుదుటు దెల్పెడి
శ్రోణితటి పటంబునకు నెత్తరము నెఱప.
దశా. 8. 210.

**ఎత్తరవు** – ఎత్తరము. విశే. (√ఎత్తు) ఉన్నతము,
ఎత్తైనది.

ఉదా: ఇది చాల ఎత్తర వైన యెద్దు.
(అరుఁగు, మేడ. మొ.)

వి ఎత్తు. (బ్రౌ)

**ఎత్తళి** వి. కొలుముట్టు సాధనము. (శ ర)

**ఎత్తి(త్తు)కొను** అ. క్రి. (√ఎత్తు) యత్నించు,
పూను; సిద్ధపడు.

ఆ. ఎట్టి కష్టుఁ డైన నిట్టిపాపము సేయ,
నెత్తికొనునె ధరణి నీవు దక్క. భార.
అర. 6. 252.

గీ. ...ఎక్కడనైన జనని ప్రజల, కింతకీడొన
రింపఁగ నెత్తికొనునె. మార్క. 5 346.

సీ. దయ యింత లేక యెంతకు నెత్తుకొంటి
రక్కట... శుక. 4. 42.

స. క్రి. 1. గ్రహించు, పట్టుకొను.

(విరాటుఁడు) ఆ. అనుశస్త్రతేరియం దున్న
ఘనగదా,దండ మెత్తికొని యుదగ్రవృత్తి,
జాత దేహుఁడయ్యుఁ దరుణవయస్కునట్ల
వని కుఱికి పోయి యతని వ్రేసె. భార.
విరా. 3 217.

2. తీసికొను, తోడ్కొను.

వ. ఏము పోయి యాముద్దియకు బుద్ధి చెప్పి
యెత్తుకొని వచ్చెదము. ప్రభా 5 19.

3. వహించు, మోయు.

గీ. వాయువేగంబులైన తద్వాహనములు,
భీష్ముతే రెత్తికొనిపాఱెఁ బృథివి యద్రువ
భార భీష్మ. 2. 82.

గీ. ఏ నొకఁడఁ బోయి యొకవంక నెత్తి,
కొంటి, నాతఁ డొకవంక నెత్తె మో పద్రి
తనయ. హర. 2. 11.

4. అపహరించు, దొంగిలించు.

క. ఆయసుర నన్ను సూకరమై యప్పుడ
యెత్తికొని రయంబునఁ జనుచోఁ. భార.
ఆది. 1. 133.

మ. ....గిన్నె యెత్తుకొని బొంకుల్ పల్కు
చు న్నేమముగా, దనినం బోవునె.... విప్ర.
5. 15.

5 ఆపదనుండి యుద్ధరించు, రక్షించు.

గీ. భ్రమసి మతిదప్పి పడితి నీ ప్రాంతనూత,
నింతలో వచ్చి మీరెల్ల నెదురుకొంటి, రెత్తు
కొంటిరి నా ప్రాణ మేమి చెప్ప. విక్ర.
7. 105.

6. అవలంబించు, పూను.

గీ. అభవుదేహార్ధ మురవడి నాక్రమించి, కొనఁగఁ జువ్వె యీ తప మెత్తికొనియె నగజ. కు. సం. 7. 882.

7. చంకఁ బెట్టుకొను.

(వ్యవ) ఆమె పిల్లను యెత్తుకొని వచ్చుచున్నది.

**ఎత్తి(త్తు)కోలు** వి. (√ ఎత్తికొను) 1. సంకల్పము, ఇచ్ఛ.

గీ. ధాతమదియెత్తికోల్ తుది దాఁకకున్నె. నైష. 1. 80.

ఉ. తొయ్యలి రాజనందనునితోడన కూర్పఁ దలంచుచున్న యాదయ్యము నెత్తికోలు తుది దాఁకుట గానఁగ నయ్యె నయ్యెడన్. నైష. 1. 81.

శ్లో. విధే ర్వంధ్యేచ్ఛతయా వ్యలాసి తత్. సం. నైష. 1. 46.

భాం. ఉద్యో. 3. 67.

2. ప్రయత్నము, పూనిక.

వ. ఇట్లు పితామహు నెత్తికోలునకుం జిత్తంబు విరిసిల్ల ననుజనసహితంబుగా నతనిం బరివేష్టించి. భాం. భీష్మ 1. 103.

క. తరతరమ ప్రజలఁ దునిమెడు నరునప్పటి యెత్తికోలునకు సుర విద్యాధర ఖేచరులును భీతిం, బోఁసిరి తమదెసకు నేమి పుట్టునొ యనుచున్. భార. విరా. 5. 64. (ఇట 'విజృంభణము' అని భావము)

**ఎత్తిపొడుచు** స. క్రి. (√ఎత్తు) దోషములు బైటబెట్టి మనస్సు నొవ్వనాడు.

సీ. తలిదండ్రు లెఱిఁగినఁ దలలెత్త కుండుదురే రాలెఱింగిన నెత్తిపొడుచు. భాగ. 10. పూ. 978.

**ఎత్తిపోవు** అ. క్రి. (√ఎత్తు) 1. చెడిపోవు.

ఉ. ...శా. నే నను అవ్వచేసినఁ దృణీకృత మింతె శరీర మొక్కము, టైన ననూనదుఃఖ మెనయన్ దనకాఁపుర మెత్తిపోవదే శుక. 2. 188.

ది. శిలఁ జిగురుఁబోఁడియై యుల్లసిల నొనర్చె, యెత్తిపోయిన గౌతము నిల్లు నిలిపె, నడుగుఁ గెందమ్మి కమ్మపుప్పొడిన యిక, నే మని నుతింపవచ్చు శ్రీరామమహిమ. రామ. 4 57. (ఎత్తువోవు. శ. ర. పా)

సీ. బలవంతు లధముల బాధింపఁ దొడఁగిరి యిల్లాండ్రయీలువు లెత్తిపోయె పరాశ. 7. 81.

2. నిశ్శేషమగు, పూర్తిగఁబోవు.

ఉదా : వాని పద్దెత్తిపోయినది :- వానిబాకీ పూర్తిగా తీఱిపోయిన దని భావము.

**ఎత్తిలి** అవ్య. (ఇది 'ఒత్తిలి' వంటిది) గట్టిగా, బిగ్గరగా.

గీ. ...విషపుఁ జన్ను మొదలు తదననాబ్జమున నదిమె, నదముటయుఁ బాపఁ డార్పుఁ డైనట్లపోలె.

ఉ. ఎత్తిలి కావు కావు మని యేడ్చి తదీయ పయోధరాగ్రముల్, కుత్తుక దాఁకఁ దీర్చికొని... హరి. పూ. 5. 149, 150.

గీ. వేడ్క నృత్యంబులాడిరి వీథులందు, బాడిరెత్తిలి పిక కుహూ పంచమమునఁ, బంజరంబున ధవళ ప్రబంధగీత, కముల నవ్వేఁగ గర్జాంత కమలముఖులు. శివరా. 2 54.

**ఎత్తివేయు** స. క్రి (√ ఎత్తు). 1. పైకెత్తి క్రిందఁ బడవేయు.

ఉదా: సిరాబుడ్డి ఎత్తివేసినందున పగిలిపోయినది.

2 లాఘవపఱచు, అలక్ష్యముచేయు.

ఉదా: ఎంతవానినైనను వాఁడు ఇట్టె ఎత్తివేసి మాటలాడును.

3. తీసివేయు.

ఉదా: పాఠశాలల ఎత్తివేసినారు.

**ఎత్తు** అ క్రి. (క. ఎత్తు. త. ఎడుత్తల్) 1 కలుగు

మ. అతులైశ్వర్యవిభూతి నొప్పు భవదీయంబైన రూపంబు నూఁచుతలం బెత్తెడుఁ బోలు నేని దయఁ జతుర్ప్రీతిఁ గావింపవే. భార. భీష్మ. 1. 236

క. అడుకులు దిన్నట్లగునే, కడుపునఁ గుట్టెత్తి నపుడు...భార ద్రో. 4 89.

క. శాంతులు నేయు ననమతి, శాంతముగఁ గోప మెత్తుఁ గర్ణుని నదనాం, భోరుహముం

గనుఁగొన శమ,మారున్ నావశము గాక యంతన బుద్ధిన్. భార. శాం. 1. 13. భా. రా. యు. 519. హంస. 1. 220.

2. (పోరుటకు) పూను, కడఁగు.

క. నీ యనుజులు దివిజులకు న,జేయులు ధృత రాష్ట్రసుతులఁ జెఱచుట ప్రేఁగే, తోయజ నాశము గజలీ,లాయత్తముగాదె యెత్తు మాహవమునకుఁ. భార. ఉద్యో. 4. 112.

3. దండెత్తు, పోరుటకై బయలుదేఱు.

క. బలవంతుఁడు పై నెత్తిన, బలహీనుఁడు ధనము గోలుపడిన యతఁడు ప్రము,చ్చిల వేచువాఁడుఁ గామా,కులచిత్తుఁడు నిద్ర లేక యుండుదు రధిపా. భార. ఉద్యో. 2. 21.

గీ. ...ఎవ్వరిఁ గొని యతండు, కౌరవుల మీఁద నెత్తి రాఁ గలుగువాఁడు. భార. ఉద్యో. 2. 169.

4. అతిశయించు.

ఉ. ఎత్తినవేడ్కఁ గంధరము లెత్తి మొగంబులు సాఁచి...చిత్తజుకేళిఁ దేలె విలసిల్లుచు జక్కవదోయి వేకువన్. భార. ఉద్యో. 2. 109.

ద్వి. ఎత్తిన కడఁకతో నే తెంచి చాప, మెత్తఁ జాలక పోదు రెందఱేనియును రం. రా. బాల. 68 పే. 16. పం.

స. క్రి. 1. లేవఁ దీయు, పైకిఁ దీయు; ఉన్నమితము చేయు, ఊర్ధ్వముగా నుండునట్లు చేయు.

ఉ. అంబుధిఁ ద్రొచ్చినన్ గడు భయంపడి వార్ధిల సత్తరంగహ,స్తంబుల నెత్తి పెట్టెఁ దన సైకతతీరముఁ జేర నమ్మునిన్. భార. ఆది. 7. 119.

క. పెనురొంపిలోపలను బ్రుం,గినధేనువు నెత్తు పోలికని శల్యుం డ,మ్మొనఁ దన భుజబలమునఁ గలఁ,గనియట్లుగ నిలిపె శౌర్య గర్వము మెఱయఁ. భార. శల్య. 1. 158.

గీ. నరసి ప్రాలినబొమ లెత్తి పరమవృద్ధు. హరి. 2. 48.

2. (అర్ఘ్యాదులు) ఇచ్చు, సమర్పించు.

గీ. అర్ఘ్యమెత్తిన యా సమయంబునందు. కాశీ. 3. 179.

ఉ. ఆరతు లెత్తువేళ జవరాలి ముఖాబ్జము తేటఁ జూచు.... ఉ. రా. 8. 309.

3. పైని బెట్టు, మీఁద నుంచు

గీ. ... నేను ముడిమోపు వటునకెత్తి...అము. 6. 73.

4. స్థాపించు, నిలుపు, పన్నఱచు, అమర్చు.

సీ. కంబాలఁ జీనిచీనాంబరములు చుట్టి గోపురంబులఁ బైడికుండ లెత్తి. విప్ర. 4. 136.

సీ. తరుణాంగుళాతరు స్తంభంబు లెత్తిగ కట్టి రెల్లెడఁ బట్టుకలువడములు. శివరా. 2. 5.

సీ. పవడపుఁ జివురుంగవఁకు లుత్పాదించి తమ్మిరేకుల బోరుతలుపు లెత్తి. భీమ. 5. 100.

5. ఊడఁదీయు; పెల్లగించు.

గీ. ...మహీవరుండు శిబి మెత్తఁ బడాళ్లకుఁ జెప్పఁ బనిచె. నైష. 7. 8.

సీ. బలువాహినుల మించు మలకల ఘనసామకంబులు దూల మూలంబు లెత్తు. గీ. సాహసోదగ్ర బిరుద వరాహమూర్తి. వసు. 1. 68.

6. చావు ఆపద మొదలగువానినుండి ఉద్ధరించు, కాపాడు, రక్షించు.

క. ...విగతాసులఁ దన,మృదువచన ప్రశ్నమను నమృతమున నెత్తెన్. భార. ఆది. 6. 232.

శా. ...భూతకోటులకు నట్లాధారమై యున్కి మీ. తద్రిం బంకజసంభవాదులు జగత్ప్రాణుండు నా రే మముం,దండ్రీ యెత్తుదు గాక...భా. రా. యు. 1068

గీ. నన్ను బ్రతికించుటయు నీదు నైపుణముల, కెల్లఁ దలకట్టు చెలిప్రాణ మెత్తు టనదె. హరి. ఉ. 7. 144. భా. రా. యు. 1086.

7. తోడు, చేదు; (చేను మొదలగువానికి నీరు) పెట్టు

ఉ. ఆ యవఘుండు దారుజలయంత్రముచేతఁ గవేరకన్యకా, తోయము లెత్తియెత్తి... విప్ర. 2. 50.

క..... పెఱమడి కెత్తిన నీరును ... అము. 4. 282.

8. ఎత్తుకొను, చంకఁ బెట్టుకొను.

ద్వి. ఏరాలిసుతు నెప్పు డెత్తి ముద్దాడు. పండి తా. మహి. 288.

సీ. ఏరాలిపట్టి నెత్తెత్తి చెక్కిలి నొవ్వఁ గఱచి వాఁ డేడ్చినఁ గౌఁగిలించు. పాండు. 3. 62.

9. చేతఁ బట్టుకొను. కైకొను.

సీ. నంశయించి కరాంబుజములఁ గొమ్మించు టద్దము లెత్తి చూతురు తమ్ముఁ దారు. నైష 1. 68.

గీ. అలివ యతఁ డొండు కోదండ మందికొన్న. నఱకె వేఱ విల్లెత్తిన విఱుగ నేసె ఉ. హరి. 1. 165.

10. తాలుచు, ధరించు

చ. ...జీవుఁడు పదంపడి యట్టి శరీర మెత్తి తా, నసుగత మైనకర్మఫల మందక.... భాగ. 8. 1011.

క. ప్రొద్దుల నెల దొచ్చిన న,మ్ముద్దియకు జనించి రపుడు మోహనమూర్తుల్, ముద్దు మొగంబుల కన్యక, లిద్దఱు శివభక్తి తనువు లెత్తిన పగిదిన్. కాశి. 4. 8.

11. వహించు, పూను.

ఆ. పుణ్యపరులు తోడఁబుట్టువు లార్యులు, వైర మెత్తఁ దగునె వారితోడ. భార. ఉద్యో. 3. 227.

క. రాముని కే నపరాధం, బేమియుఁ జేయ మ దురుక్తు లేమియు నాడన్. సౌమిత్రి యూరకేలకొ, నామీఁదం గోప మెత్తినాఁ డుగ్రముగన్. భా. రా కిష్కిం. 452.

12. సంకల్పించు, తలఁచు.

సీ. ఉన్నఁ దద్వీపుల గుణోన్నతి సైఁపక దుర్యోధనుండు దుష్కార్య మెత్తె భార. ఆది. 8. 12.

13. ప్రస్తావించు.

క. ఓ సామి యుంక వెత్తకుఁ, డీసుద్దులు... పార్వ. 5. 197.

(వ్యవ) వానిమాట యెత్తవలదు.

14. ఉద్ఘాటించు, బయలుపెట్టు.

చ. మఱియు బహుప్రకారముల మర్మము లెత్తుచు నత్త దిట్ట.... వరాహ. 2. 136.

ఉ. లేనగ వొప్ప మానము చలింపఁగ మర్మము లెత్తి యాడుచున్. చిత్ర భా. 2. 70

15. పొందు, పడయు.

గీ. అఖిల కల్యాణగుణశీల యా సుశీల, పెట్టెఁ జే మీఁదుగా నెల్ల చుట్టములకు, భర్తతోఁ గూడ ముత్తైదువగా దినియె, నెత్తె మున్మున్మగుఱ్ఱల నెందఱేని. పాండు. 4. 267.

ద్వి. ఇదిగదా సంతోష మిదిగదా తేజ, మిది గదా పుత్రుల నెత్తిన ఫలము ద్వి. భార. విరా. 4. 84. పౌ.

16. (పన్ను) రాఁబట్టు.

చ. విరహాపు శీతల క్రియల వెచ్చము సర్వము నాయమున గొనం,ద్వారపడులాగొ యట్లు యినఁ దద్దన మెత్తుద మూళ్ల మీఁదటన్, విరహాపుఁబన్ను వేసెడి...కళా. 7. 23.

17. అపహరించు.

గీ. కామసమున నతితృష్ణుఁడై మనుష్యుఁ, డప్తితృప్తాప రితాంతరంగుఁడైన, గొఱియ నడవిలో నెత్తెడు తోలుపులియుఁ బోలె మృత్యు వాతనిఁ గొనిపోవు దేవి. భార. అను 5. 235.

గీ. నేరములు వెట్టి దండువు నిశ్చయించి, ధరణిఁ గలచోట నర్థ మెత్తంగఁ దలఁచి. నైష. 7. 78.

18. (కంఠస్వరము) హెచ్చు చేయు. (ఈ యర్థమున 'ఎలుఁగు, గొంతు' మున్నగు శబ్దములతోనే కూడియుండును.)

క. అత్తఱి నీతనయుం డెలుఁగెత్తి రథికవరులం
తోడ నిట్లను... భారం. భీష్మ. 1. 372.
వసు. 4. 53.

19. లోపలికి పుచ్చుకొను

గీ. ఎత్త నేటి కాంపోశనం బెంగిలికిని. రామ
లిం. 60.

గీ. ఏను మున్ను ప్రాణాపానులు లెత్తఁ జూచి.
చేయుఁ బ్రాణాగ్నిహోత్రంబు శిష్యకోటి.
కాశీ. 7. 178.

20. (గ్రంథాదులనుండి) గ్రహించు, సంగ్రహించు.

ఉదా: ఆ పద్యములు భాగవతాదులనుండి ఎత్తి వ్రాసితిని.

వి. 1. తూనిక, బరువు.

క. చిత్తజమహాగ్ని కాంకలం, నెత్తు దిటిఁగి వన్నె యెక్కెనంతయు నెమ్మేనెత్తురుణికి జను లందఱుఁ బుత్తడిబొమ్మ యనుమాట బొంకేల యగున్. ప్రభా. 4. 78.

ఉదా: ఈ బిందె యెత్తు మణుఁగు

2. రెండు వీసెలకొలఁది.

ఉదా: ఒక ఎత్తు చింతపండు.

3. ఒక వస్తువు నణఁచి పెట్టుటకుఁ బైని పెట్టెడు బరువు.

ఉదా: ఎగిరిపోకుండా ఆ కాగితముల మీఁద ఎత్తు పెట్టుము.

4. క్రిందుగా నున్నదాని నెత్తుగాఁ జేయుటకు అడుగునఁ బెట్టువస్తువు.

ఉదా: మంచపుకోళ్ల క్రింద ఎత్తులు పెట్టినారు.

5. సామ్యము.

గీ. ఎసఁగి వేపురు దైత్యులయెత్తు నెనయ, వచ్చె నెవ్వఁడు దొరకొండు సుప్రజముఁ గలఁచు,నట్టి యానిసుందుఁడు హతుఁ డైనఁ గలఁగె,ననుర సైన్యంబు నరకుని యాన మాలె. హరి. ఉ. 4. 180.

6. ఊర్ధ్వప్రమాణము, ఉన్నతి.

వ. వియత్తలంబునకు విల్లెత్తుపాడు వెగని. మనుచ 4. 37.

ఉదా: ఆ గోడయెత్తు వాల్గు గజములు.

7 గౌరవము, గొప్పతనము.

క. తొత్తుంరఁ దగిలినవారికి, నెత్తు చెడున్ శ్రీలు చెందవేకాలంబున్. మల్హణ. 2. 124.

8. రీతి, విధము.

వ. మృత్యుదేవత యెత్తునం గాలుపోలిక శమనుని గమనిక నెదిరి... భాగ. 10. పూ. 1318.

వ. పూవుచెత్తులయెత్తున సోగతీఁగలబాగున. పాండు. 3. 179

9 ఉపాయము, యుక్తి.

గీ. ఇంతపట్టును నాపాల నిచటఁ గూడె, నేమి సేయుదుఁ బనికిఁ బై యెత్తు దోఁప,దనుచుఁ జింతాపరంపరాంత్య తరంతు, రాంతరంగంబుతో నుండె నవ్విభుండు. రామా. 7. 48

చ. ...మీఁదిలెు, ఎత్తులుఁగవు ... సారంగ. 2. 14.

సీ. ...ఎత్తు జిత్తనఁగ నిరూపనఁగు యుక్తి. ఆం. భా. 1. 112.

10. పన్నుగడ, పన్నిక.

ఉదా: నీయెత్తు లిక్కడ సాగవు.
వాడు పెద్దయెత్తుమీఁదనే వచ్చినాఁడు.
వాఁ డెత్తినయెత్తు పనికి వచ్చినది కాదు.

11. మాఱు, తడవ, పర్యాయము. (ఈ యర్థమున 'ఒక్క' శబ్దపూర్వకముగానే యుండును)

శా. జ్ఞానాజ్ఞానకృతంబు లైన యఘముల్ సర్వంబు నొక్కెత్తునన్, మాను న్మానవకోటి శుద్ధింగతిన్ ...భీమ 4. 28,

క ...కర్ణుఁడు బాణరుచులు గిటికొన దెస లణ.

ఆ ఇట్లు దఱిమె నేని యిప్పుడ యాతఁడిద్దిక్కువారి నెల్ల నొక్కయెత్తుగాఁగఁ బిలుకు మార్చుఁ గాపున నెమ్మేయి, నైనఁ బ్రతివిధానమాచరింపు. భార. ద్రో. 5. 195, 196.

12. చదరంగములో కాయ నొకగడియలో నుండి మఱియొక గడిలోనికి నడపుట.

ఉదా: ఇంక నై దెత్తులలో వాని యాట కట్టును.

13. ఒక విధమగు పూలదండ.

సీ. పువ్వులు బహువిధంబులఁ గట్టి ముడికొక్క తంగిగా నెత్తులు వట్టి యిత్తు. ఖాం. విరా. 1. 107.

క. ...పువ్వుల్గోసి నృపాత్మజుఁడు దండలును నెత్తులుఁగా, వేసరక కట్టి... భోజరా. 5. 207.

గీ. బోడిగట్టిన చెంగల్వ పూపు టెత్తుఁ, దరు పఱణతోరు కదఁ మంజరియుఁ గొనుచు. ఆము. 6. 91.

14. వలపుకత్తె విటున కిచ్చు ధనము. (ఈ యర్థమున ఐ అని శం.)

సీ. పద్మాస్యపుర నసుభవితకు నీవ యెత్తులు వెట్టుదనఁగ రా వలసె నిటకు. ఆము. 2. 21.

విశ. 1. ఉన్నతము; గొప్పది, అధికము.

ఉదా: ఇది మిక్కిలి యెత్తైన గోడ.

ఉ. ...వసుధమా, వాసవ చాల నెత్తయిన వారికి నెందును జేరు దప్పునే ఏసు. 6. 108.

2. తూనిక కలిగినది, ఎత్తు గలిగినది.

సీ. తొలునాఁడు శోఖ్యని దులదూఁచి యాతని యెత్తైన యిట్టిక లెల్ల దాఁచి. విజ్ఞా. వ్యవ. 117.

ఆపోసనమెత్తు — ఆపోశనముగా త్రాగు.

ఉ. ఈనున నేక పేలన మహీసురుఁ డొక్క రుఁ డొక్కవార్ధి యాపోసన మెత్తుచో దిగులు పుట్టి .... నైష. 5. 68. ఖా. రా. యు. 120.

ఉడుకెత్తు — ఉడుకు కలదియగు, ఉడుకు. పారి. 2. 87.

ఎత్తుకెత్తు — సరిసరిగా, సమముగా.

రగడ. ఎత్తుకెత్తు మెఱుంగుఁగుందన మిచ్చి తెచ్చితి మీసిరాజులు. శుక. 1. 188.

ఒక్కయెత్తు — సమానము.

క. ఈయున్న రాజులందఱు, వాయుసుతున కొక్క యెత్తు వాఁ డలిగిన కూ,లాయుదుఁడు వడఁకు .... ఖార. ఉద్యో. 3. 387.

(ఇది రెండుమాఱు లుపయోగింపఁబడి పరస్వరసామ్యమును దెలుపును.)

గీ. ...ఎసఁగవలయు, సాంగరాజ్య మొకెత్తుగ స్వాంగ రాజ్య, మొకయెత్తుగ నృపతి యాయుష్య పరత. ఆము. 4. 270.

సా. అగస్త్యుఁడొకయెత్తు కమండలు వొక యెత్తు.

చర్మమెత్తు — తోలూడ్చు, ఒలిచిన చర్మము కలదానినిగాఁ జేయు.

సీ. చర్మ మెత్తుదుము రోసమున మీసములు దీండ్రించు ధీర చమూరు రిపుల నైన. హ. న. 2. 19.

దండెత్తు — యుద్ధార్థము సేనతో నడచు, దాడివెడలు.

నోరెత్తు — మాటాడు.

ఉదా: వాఁడు తిట్టినను నేను నోరెత్తలేదు.

పరుగెత్తు — పరుగిడు, పాఱు.

పరువులెత్తు — పరుగెత్తు. వసు. 1. 66.

పేటెత్తు — పగులు కలదియగు, పగులు. దశా. 2. 186.

పొంగెత్తు — లేచిన పొంగు కలదియగు. కు. సం. 8. 287.

భిక్షమెత్తు — భిక్షాటనము చేయు. మనుచ. 5. 18.

(ఇట్లే తిరిపమెత్తు, ముష్టియెత్తు, బిచ్చమెత్తు.)

మొలకెత్తు — మొలక కలదియగు, మొలచు. నీలా. 1. 18.

ఓగిరములెత్తు — అన్నము భిక్షించు.

సీ. కడపోని దెంనాటకవుటూరు జంగాలు కేళి కల్ గూడ కోగిరములెత్త వేం. పంచ. 4. 240.

జ. ఎత్తనగోల, ఎత్తరము, ఎత్తరవు, ఎత్తికొను, ఎత్తికోలు, ఎత్తిపొడుచు, ఎత్తిపోవు, ఎత్తివేయు, ఎత్తుగడ, ఎత్తుగడ్డలు, ఎత్తుగల్లు, ఎత్తుగీతము, ఎత్తుగున్న, ఎత్తుదెంచు, ఎత్తుబరికాఁడు, ఎత్తులిడు, ఎత్తువచ్చు, ఎత్తువడు, ఎత్తువెట్టు, ఎత్తువేయు, ఎత్తుహోవు.

**ఎత్తుగడ** వి. (√ ఎత్తు – క. ఎత్తుగడె.) 1 యత్నము. 2. ఉపాయము; కుటిలోపాయము.

**ఎత్తుగడ్డలు** వి. బ. (√ ఎత్తు) ఎత్తుడు ప్రాయ్యగడ్డలు. (శ. ర.)

**ఎత్తుగల్లు** వి. (ఎత్తు + గల్లు) ఎక్కుటకై ఎత్తుగాఁ బెట్టుకొన్న ఱాయి.

ఉత్సాహ. బలిమిఁ బట్టఁ గలిగి పంటపనము దొడుగ నేటికి,గ్గలి ముంజికాయ కెత్తుగల్లు గొనఁగ నేల. కు. స. 2. 194.

**ఎత్తుగీతము** వి. (√ ఎత్తు) సీసపద్యమునకు అనుబంధముగా వచ్చు గీతపద్యము.

**ఎత్తుగీతి** మి. వి. (√ ఎత్తు) – ఛందః – పద్యభేదము.

ఎ. గీ. సుదనాధమీఁద సూరు, లిరపుసు రెంట విరతి, ధరణిఁ బ్రాసంబు దనర, హరి యెత్తుగీతియంగు. అప్ప. 4. 155.

ఎ. గీ. యతులుఁ బ్రాసములు నమ, పతి యొకనిపయి పద్మ, హితు లిద్దఱుగను నిడిన, గృతిఁ దగు నెత్తి గీతి. లక్షణ 2. 96. (రూ. ఎత్తుగీతము)

**ఎత్తుగున్న** వి. (√ ఎత్తు) లేఁత యేనుఁగుపిల్ల.

గీ. అచటి మదపుటేనుంగుల కమరి కంటి, యెత్తుగున్న యచట నున్న యుత్తమాశ్వ, ములకు నేరాది లేఖ్యఘనితుంగ, మనఁగ సురపురి తత్పురంబునకు సరియె. చంద్రా. 1. 43.

గీ. అచటి యొకపాటిదొర మదహస్తులకును, నెత్తుగున్నలు దిక్కులమత్తకరులు. పాంచా. 1. 39.

**ఎత్తుదెంచు** అ. క్రి. (√ ఎత్తు) దండెత్తివచ్చు.

ఆ. కాలయవనుఁ డనఁగఁ గాలకల్పుఁడు శత్రుఁ,డేచి మథురమీఁద నెత్తుదేంచ,గదలె ననిశి వపుడ యొదవి జరాసంధుఁ,డును గడంగె ననియు వినియె నొకట. హరి. ఉ. 2. 108.

వ. ద్రుపదుపయి నెత్తుదెంచిన ద్రుపదుండును క్షితుండై బ్రాహ్మణుల మఱువు సొచ్చె. భార. ఆది. 7. 191.

**ఎత్తుబరికాఁడు** వి. (√ ఎత్తు) దొంగ, చోరుఁడు.

సీ. దొంగ తెక్కలికాఁడు దొంగకోలుసన్నాసిము చ్చెత్తుబరికాఁడు ముడియవిడుపు. ఆం. నం. మాన. 11.

**ఎత్తులిడు** స. క్రి. (ఎత్తులు + ఇడు) ప్రోత్సాహము చేయు. ప్రేరించు.

మ. తను లేలెమ్మని కొమ్మ యెత్తులిడ మోదంబొప్ప నాథుండుపై,కొని యానందపయోధి నీఁదుచును. రసా. 2. 66.

సీ. ఇరువంకఁ జెలు లెత్తులిడుచు నుబ్బింపంగఁ జెలువప్పలో, గొంత సిగ్గు వదలి. కళా. 7. 76.

**ఎత్తువచ్చు** అ. క్రి. (√ ఎత్తు) సరితూఁగు; సమమగు, సాటియగు.

వ. వారెల్లఁ దేశోద్ధేశ్యపరాక్రమోపాయ విచారవివేకంబుల నా కెత్తువత్తురే. భార. ఉద్యో. 2. 265.

గీ. వాజి మేథముల్ వే యొక్కవలనఁ బెట్టి, యలఘుసత్యంబు దక్కటివలనియందు,నిల్పి తులఁదూఁపఁగా సత్యనిష్ఠలోని, యర్థమున కెత్తువచ్చె నయ్యధ్వరములు. భార. అను 2. 43.

వ. భూపకుమారులతోఁ బనులకాపరు లెత్తువత్తురే. భాగ. 10. ఉ. 300.

**ఎత్తువ(ప)డు** అ. క్రి. (ఎత్తు + పడు) 1. బలహీనమై పడిపోవు.

క. ...కొన్ని యతిసాంద్రదుస్తరబాధం,బడి ప్రేవులు నిండె దునిసి, పడకుండునె యనఁగ నెత్తువడె నెల్లెడలన్. హరి. పూ. 6. 44.

2. చెడు.

శా. సంపన్నుం డొరుఁ గాన లేఁడు తనువున్ సంసారమున్ నమ్మి హింసింపం జూచు దరిద్రుఁ డెత్తువడి శుష్కీభూతుఁ డై చిక్కి హింసింపండు ... భాగ. 10. పూ. 394.

3. భగ్నమగు.

మ. ....ధర్ముడు శ్రద్ధయుం గలిసినన్ వేగంబె యబ్బున్ వివేకునకున్ వాంఛితసిద్ధి

యెత్తుపడుఁ గోర్కుల్ మోహాభూభర్తృ కుణ. ప్రబోధ. 3. 68.

4. —ఎత్తుటనుపొందు—ఎత్తబడు. (ఇది 'కొట్టువడు' వంటిది.)

సీ. తారాచలము వ్రేఁకఁదన మెంత వింతలిలా హానిచే నెత్తువడియె నట్టె. కు. సం. 3. 248.

**ఎత్తు(లు)వెట్టు** అ. క్రి. (√ ఎత్తు) కపటోపాయము పన్ను.

ఉ. చిత్తజవైరిఫాలశిఖిచే జగమెల్లను వెచ్చఁ జూచెనో, యిత్తెఱఁగంటిపట్టమున కే నిటు లుండకయుండ నెవ్వఁడే, నెత్తులువెట్టెనో మఱియు నేకతమో వివరింపుమయ్య నా, కిత్తెఱఁ గంతయుం గృతరమేశ్వరవందన బ్రహ్మనందనా. వాల్మీ. 8. 7.

న. క్రి. ప్రోత్సాహపఱుచు, పురికొల్పు.

చ. విలసితమోహదాహపరివేదన పొమ్మని యెత్తువెట్టఁగా, వలపులవింటివాఁడు నెఱవాదితనంబునఁ బ్రోవఁ జూపఁగా, నలమిన భీతి లజ్జ వలదంచరికట్టఁగ నింతి నింతలో, జలజహితుండు గ్రుంకె నలచానవెత ల్గనలేని కైవడిన్. హంస. 1. 114.

చ. మునుకొని మేరమీఱువలపుం దనముంగల త్రోవ చూపఁగా, వెనుక రతీశ్వరుండు పదవే యని యెత్తులువెట్ట నెమ్మదిం, బెనఁగొనులజ్జయుం బొడముభీతియుఁ దన్నరకట్ట నంతలో, నినుఁ డపరాంబుధి న్మునిఁగె...శుక. 1. 61.

**ఎత్తువేయు** స. క్రి. (√ ఎత్తు) తూఁచు.

ఉదా: నాను ఎత్తువేయఁగా నాలుగుతులముల తూనిక వచ్చినది.

**ఎత్తువోవు** అ. క్రి. (ఎత్తు + పోవు) తగ్గు, తీసిపోవు

క. అవియును నొక టొకటికి నెత్తువోవక పెనఁగినఁ గని మధుత్రిపురహరుల్, సవరణతో మగుడంగాఁ, దివిచిరి ఖేచరగణంబు దివిరి నుతింపఁగ. ఉ. హరి. 6. 160.

**ఎత్తెల** వి. చేఁపలను బట్టుకొనెడి యొకానొక సాధనము.

క. వెంపున నూఁతల నెత్తెలఁ, గరిముం మత్స్యములఁ బట్టి కడుసంతసముం, బొరయుచుఁ ద్రాళ్లం గ్రువ్వఁగ., గర మూహించి మదిఁ బ్రాప్తకాలజ్ఞుఁడుగ. భాగ. శాం. 3. 193.

గీ. చాఁప యెత్తెల గూడయు .... హంస. 4. 184.

ఎత్తెలగొను—ఎత్తెలతోఁ జేఁపలను బైకి లాగునట్లు అవలీలగా లాగు, అవలీలగా స్వాధీనముచేసికొను, సులభముగా జయించు.

ఉ. ఎత్తెలగొందు దిక్పతుల నిందఱ ముందఱెఱుంగనట్ల ...నిర్వ. 6. 147.

క. ఇత్తెఱఁగు పరిజనములకుఁ, జిత్తక్షోభంబు సేయుఁ జేసిన నాకున్, మెత్తనిమెయితో రాజ్యం, బెత్తెలగొన రాదు నన్ను నెఱుఁగరు వారల్ దశకు. 7. 30.

ఉ. ఎత్తెలగొందుఁ గొంపుల నెల్లను మూర్ఖొని రేని గోపులం, దెత్తు ముహూర్తమాత్రమున. ... భార. విరా. 4. 9. (ప్రాంత ప్రతి.)

**ఎద¹**—ఎడఁద. వి. 1. హృదయము, మనస్సు.

ఉ. ...ఎదఁ భయకంపము లుప్పతిల్లఁగా. హరి. 8. 66.

గీ. అనినఁ దద్భక్తికెద మెచ్చి ... ఆము. 2. 92.

2. గుండె.

గీ. ఎఱఁగపై నెత్తి రా నెన్నియెదలు గలవు. కు. సం. 9. 241.

3. వక్షస్థలము, ఱొమ్ము.

శా. శ్రీవక్షోజకురంగనాభ మెదపైఁ జెన్నొంద ...మనుచ. 1. 1.

4. భయము.

సీ. ఎద డింది మద మొంది గద నంది రొదఁ జెంది పొదనంది పెదపంది మెదువు నొక్కఁ, డు. చంద్రా. 2. 88.

గీ. ... ఎద యన భయమును హృదయ మెసఁగు ఆం. భా. 8. 61.

ఎదముల్లు — హృదయశల్యము.

ద్వి. ఇంద్రాదిదివిజుల యెదమ్రల్లు రామచం
ద్రుండ పెఱికితి జగ మెల్ల నెఱుఁగ. రం.
రా. ఉ. 157. పా. 8. పం.

జ. ఎదవడు.

**ఎద²**-వెద. వి. పశుబుతువు.

వ. ఎదపదనునఁ బొదలుపెట్టలకుం జుట్టంబులై ...చిఱుగున్నలకు వెన్నాడులోఁడేళ్ల సివంగులం దిరిగి తిరిగి మొత్తి పోనొత్తి చరియించు నేకచరంబుల. మనుచ. 4. 87.

ఎదపోవు-(పశువు) బుతుసమయమునకువచ్చు.
ఉదా: ఆవు ఎదపోయినది.
ఎదావు-ఎదపోయినఆవు, పొర్లుటకుసిద్ధముగా నున్నఆవు (బ్రౌ. శ. ర.)

**ఎదవ(ప)డు** అ. క్రి. (ఎద¹+పడు) భయపడు అధైర్యపడు.

క. అవ్వేళ దివ్యబాణము లెవ్వియుఁ బనిసేయ
కున్న నెదవడి మదిలోఁ, గవ్వడి దూలఁగఁ
గని యొంనవ్వుచుఁ జిత్రాంగదాతనయుఁ
డిట్లనియెఁ. జై. భా. 7. 42.

క. ఎదపడి పెదవులు దడుపుచు, నదవద నెద
తాల్మి వదలన గము గదలన్, దుదమొదలు
లేనిదీనత, గదురఁగ జనకసుత యతనిఁ
గనుఁగొని యనియెఁ. ఉ. రా. 6. 257.
వేం. పంచ. 4. 763.

**ఎది** — ఏది.

**ఎదిరి** విశ. (√ ఎదురు) అన్యుఁడు, ఇతరుఁడు.

క. ఎదిరికి హితమును బ్రియమును, మదికింపు
సుగాఁగఁ బలుకుమాటలు పెక్కై, యొద
వినములెన్న యటుగా,కిది యది యన కూర
కునికి యెంతయు నొప్పుఁ. భార. ఉద్యో.
2. 59.

గీ. తావఁ దనయట్ల యెదిరిని గాన్పు తాన్పు,
జీవులకుఁ దాంతమ్యంబు సెప్పఁదగదు,
సర్వభూతములందును సమత మేలు,కరుణ
చేపట్టవలయుఁ గాఁగాదు హింస. కాశీ.
6. 78.

వి. ప్రతిపక్షుఁడు, విరోధి.

క. మ మ్మెఱుఁగు దెదిరి నెఱుఁగుదు,నెమ్మి
యెఱుఁగు దర్థసిద్ధి నెఱి యెఱుఁగుదు
వాక్యమ్ములపద్ధతి నెఱుఁగుదు. పొ మ్మె
వ్వఁడ నేను నీకు బుద్ధులుసెప్పన్. భార.
ఉద్యో. 3. 34.

క. ...ఎదిరికిఁ దమగు ట్టిచ్చుట శుభప్రదము
గాదు....ప్రబోధ. 4. 68.

**ఎదిరించు**-ఎదురుచు, ఎద్రుచు. అ. క్రి. స. క్రి. (√ ఎదురు) ప్రతిఘటించు, మార్కొను.

క. ....భగదత్తమహోకుండాలమునకుఁ దా
నెదిరించెన్. రాఘవ. 4. 188.

క. ఎవ్వరు చూచినఁ జూపులఁ,జివ్వకుఁ బద
నడఁగి వశముసిగ్గున నొంటపై,అవ్వకు మొద
లగుపాపము,జవ్వన మెదిరించె జిగి యొసఁగ
నామేనన్. మనుచ. 6. 42. (ఇట 'ప్రతి
కూలముగా సంభవించు, దాపరించు' అని
భావము.)

చ. ఇరువురు నీలసిందనిభేకణ లించినవేడ్క
తోఁ బరిస్ఫురి మెదిరించి కాంచనపుఁబంతు
లఁ దచ్చనవాటు లాడఁగాఁ. నైష.
8. 95.

గీ. కొంచ కెవ్వాఁడు ని న్నెదిరించువాఁడు.
ఉ. రా. 1. 325.

**ఎదుగు** అ. క్రి. పొచ్చగు, పెరుఁగు.

గీ. ధీరంము లగు విధములు పెక్కు సేయు,
గర్వమెదుగంగ నాదశకంధరుండు. నిర్వ.
4. 22. భాగ. 10. పూ. 75.

గీ. పేశలాకారయై మించి పెండ్లి కెదుగ.
శుక. 2. 152.

('అది ఎదుగుఁబొదుఁగు లేక యున్నది' అని వ్యవహారమున విశేష్యముగాఁ గూడ నుపయోగింపఁబడుచున్నది.)

**ఎదురాడు** అ. క్రి. (ఎదురు+ఆడు) వ్యతిరేకముగాఁ జెప్పు.

ఉ. దేవసమానునిన్ ధరణిదేవుని సుశ్రుతునాశ్ర
యింపు త,ద్భావము పల్లవింప వని పార్థి
వుఁ డాడినఁ గన్య యంత లజ్జావనతాస్య
యాచు నెదురాడఁగ లేక వరించె విప్రు
నిన్. ద్వా. 6. 139. శుక. 2. 209.

**ఎదురు** అ. క్రి. (క. ఎదురు. త. ఎదిర్.) 1. ఎదురుపడు, అభిముఖమగు.

సీ. చరణంపునరిపడిమొరపంబు విన్న దంతుల
కట్ల యెదురునింతులకుఁ దొలఁగి. ఆము. 6. 94. వసు 2. 110.

2. మార్కొను. ప్రతిఘటించు.

క. ...మీరలందఱు. నేవలఁజూచిన శిఖండి
కెదురుం డెపుడున్. భార. భీష్మ. 1. 31.

చ. ...విస్తరముగ నీదువంశమును దల్లిని
దండ్రిని జెప్పు చెప్పినఁ, దొరయగుదేని నీ
కెదిరి దోర్బలశక్తినితండు మాపెడుఁ.
భార. ఆది. 6. 44. భీష్మ. 1. 48.

స. క్రి. ఎదిరించు. మార్కొను.

ఉ. చివ్వకు వచ్చి నిన్నెదురఁ జెల్లెనె దైత్య
కులాధినాథ ము,న్నెవ్వరికైన ...రామా. 7. 55.

చ. తలఁపఁగ వాక్యవైఖరిఁ గథ మ్మన శక్తుఁ
డు గాఁడు శేషకుం,డలిపతియైన మి
మ్మెదిరి...వరాహ. 7. 86. విక్ర. 4. 112.

వి. వె. 1. పురోభాగము, ముందు; సమక్షము.

ఆ. ...ఇందఱ,యెదుర నీవు గోరి తవ్విధంబు.
భార. శాం. 4 160.

గీ. ఎంత చేసిన నాసింహ మెదుట కడుగు,
వెట్టదయ్యెను...కళా. 3. 79.

గీ. ... దైవికము నెదుట, యుక్తులు ఫలింప
వనుచు విట్టూర్పు నవ్వు. ఆము. 6. 147.
(దైవిక విషయమున అని భావము.)

2. వలపుకాఁడు వలపుకత్తెకిచ్చుటకు మాఱుగా వలపుకత్తె యే వలపుకాని కిచ్చు ధనము.

గీ. ఇటుల నజ్జారశేఖరుఁ డేలఁబట్టి, యింటి
లోనున్న వస్తువు లెదురువెట్టి. హంస. 2. 112.

గీ. ఇవ్విధంబునఁ జలి దీఱి యింటిపనులు,
నూఱునటువెట్టి వల్లభునోరు గొట్టి,యెల్ల
సొమ్ములు జారుల కెదురువెట్ట సాగె ....
శుక. 3. 858.

విశ. 1. ముందఱనున్నది.

సీ ఇరుగింటిదయ్యంబు పొరుగింటికిని గూబ
యెమరింటివారల కెదురుచుక్క. శుక. 3. 20.

(వ్యవ)వారియింటికి ఎదురుగా నున్నదే నా
యిల్లు.

2. అన్యుఁడు, ఇతరుఁడు.

గీ. మాలకరి పుష్పములు గోయుమాడ్కిఁ
దేటి, పువ్వుఁ దేనియఁ గొనియెడుపోల్కి
నెదురు గందకుండఁగఁ గొనునది కార్య
ఫలము. భార. ఉద్యో. 2 57.

క. ఎదురనఁ దా రనఁగ నేమి యెఱుఁగుదు
రింకఁ. కు. సం. 9. 338.

3. అభిముఖుఁడు.

గీ. అమ్మహామోహముఁ డెదురుగా నరుగుదేర
నైష. 7. 59

సీ. ఎదురైనచోఁ దనమదకరింద్రము నిల్పి
కేలూఁత యొసఁగి యెక్కించుకొనియె.
(పెద్దన చాటువు.)

సీ. శీఘ్రసంవాసు లేతెంచినా రని విన్న నెదురు
గా నేఁగుద వ్వెంతయైన మనుచ. 1. 57.

4. ఎదుర్కొన సమర్థమైనది, ప్రతిఘటింపఁ జాలినది; సాటి, సమానము.

క. అస్త్రశాస్త్రంబుల బాలుఁడఁ గా,ర్ముకవిద్యా
ప్రౌఢిమై నిరూఢు లయినయా,శకునిజయ
ద్రథదుర్ముఖ,వికర్ణ కర్ణాది యోధవీరుల కె
దురే భార. విరా. 4. 53.

క. దారుణదంభోళివాతికిఁ దరు వ్రాక యెదు
రా. సుద. 3. 117

గీ. ముందు వెలనాడు దివ్యమౌ నందులోన,
నుదురుపాటికులంబున కెదురు గాన,ను ...
పాండు. 1. 15.

సీ. చింతింప సోమకాశికభద్ర భద్రకాశిక సో
ము లెదురని చెప్పవచ్చు. ప్రబంధ. 32.

5. మాఱు, బదులు.

క. ఈమాటకు నెదురుత్తర,మే మైనను నియ్య
వలయు నే నని తలఁపం, గా మహిషదూ
తఁ జూచి జ,యామానిని రోషకంపితాధర
యగుచున్. వరాహ. 11. 90.

క్రి. విశ. 1. ఎదురుగా, అభిముఖముగా.

క. జననాథున కెదురు వచ్చి నరసాష్టాంగం, బొ
నరించి యతని గద్దియ,నునిచికొనెఁ ...
విక్ర. 2. 85.

సీ. ఇట్లు దూరంబున నీక్షించి యెదు రేఁగి సాష్టాంగ మెఱఁగి నిజాశ్రమంబునకుఁ దెచ్చి .. వరాహ. 5. 50.

చ. కలిగినవాఁడుగా మరునికన్నను వన్నియగల్గువాఁడుగాం, గులమున మేటిగా సవతిగోరముగాన మట చు నెంచి వేడ్కల నెదు రేఁగుదురు. శుక. 2. 112. (ఎదు రేఁగుదుర-ప్రత్యాశతో నెళ్లుదురు.)

గీ. ఇత్తఱిఁగున నూ రాత్రి యింతిఁ దఱిమి, యల్లనల్లనఁ దోకొని యాశ్రమమున, కరుగుదేరఁగ నమ్మునీశ్వరునకర్థి, నెదురువోయి తపస్వినుతెరఁగుటయును. నిర్వ. 9. 47.

2. సమానముగా.

వ. సుయోధనుఁడు...భీష్ముకడకుం జని శోకగద్గదకంఠుండగుచు నతనితో నిట్లనియె...

వ. అనిన విని నదీసూనుండు దాను నెదురు శోకించి యతని కిట్లనియె. భార. భీష్మ. 3. 76, 78.

ఎదురీఁదు-ప్రవాహమున కెదురుగానీఁదు.

క. పటికి నెదురీఁదుమాడ్కి నింటికిఁ బోయెన్. దశకు. 3. 120. సు శ. 78.

ఎదురుండు-ఎదురుగానుండు కాశీ. 2. 147.

ఎదురుకెదురు-ఇది ఎదుటివాఁడు చేయవలయు పనిని తానే చేయునప్పు డుపయోగింపఁబడును.

గీ. కూడు పెట్టక యేన్నాళ్లు కుతిలపఱచి, గాసినేయుట యిది తప్పుగాదె తనకు, నెదురు కెదు రేల కోపించె నిందుధరుఁడు, అకట గ్రుడ్డెట్టి బాదరాయణునిమీఁద. భీమ. 4. 12.

ఎదురుమేనటికము-మేనమామకూఁతును పెండ్లియాడుటకు మాఱు మేనత్తకూఁతును పెండ్లియాడుట.

ఎదురుమ్రోయు-ప్రతిధ్వనించు.

సీ. ఘురఘురధ్వనులు నిర్భరముగఁ బర్విన వెలసి బ్రహ్మాండంబు నెదురుమ్రోయు. హరి. పూ. 4. 16.

ఎదురువడ్డి-అప్పుపుచ్చుకొన్నవాఁడు అప్పుడప్పుడు చెల్లించినసొమ్ముమీఁద కట్టెడువడ్డి.

ఎదురుసన్నాహము-ఎదురుకోలు 2. (చూ.)

ఎదురెత్తు-ప్రతిఘటనముచేయు, ఎదిరించు.

చ. ...మూఁ వేంద్రుని కెదురెత్త రా దతఁడు రోషమునన్ బయి నెత్తి వచ్చినన్. దశకు. 2. 29.

ఎదురెదురగు - ఎదుటఁబడు, అన్యోన్యాభిముఖులగు.

చ. ఎదురెదురై పెనంగుటకు నేమియు నోర్వక మాయ పన్ని యీశ్రితకవిరోధి చేసిన యుదీర్ణవిశాల మవశ్యభావియై. కదిరె... హరి. ఉ. 7. 236.

(వ్యవ) వాఁడు నన్ను కొట్టి ఎదు రేడ్చుచున్నాఁడు-నే నేడ్చుటకుమాఱు వాఁడే ఏడ్చుచున్నాడు

జ: ఎదరి. ఎదిరించు. ఎదురాడు. ఎదురుకట్టు, ఎదురుకుత్తుక, ఎదురుకొను, ఎదురుకొలుపు, ఎదురుకోలు, ఎదురుగడ, ఎదురుచు ఎదురుచుక్క, ఎదురుచూచు, ఎదురుతాఁకగు, ఎదురుపడు, ఎదురుపాటు, ఎదురురొమ్ము, ఎదురునెలఁగు, ఎదురెక్కు, ఎదురొడ్డు, ఎదురొత్తు, ఎదురొమ్ము, ఎద్రుచు.

**ఎదురుక(ర్క)ట్టు** వి. (ఎదురు + కట్టు - తఱుచుగా బహువచనాంతముగానేకన్పట్టుచున్నది.)-దేశకాలముల-ఎదురు, ముందఱ.

క. ...కౌండిన్యుఁ.

క అల్లంత నెదురుకట్టుల,నుల్ల మలరఁ గాంచి భక్తియుక్తులగుచు నుత్ఫుల్లముఖాంబుజములు శో.భిల్ల నమస్కృతులొనర్చి పేర్చిన వేడ్కన్. భోజరా. 5. 215, 216.

ఉ. ఎట్టు నుతింతు నల్పమతి నిర్మలమర్దనయేను గాశికా,పట్టనశంభుమూర్తులకృపాగుణ మొక్కలతాంగి జేపెదు,ర్కట్టున ముంగిటం గనవు గాంద్రయుఁ బుచ్చుచుఁ జేరిచీఁపురుం,గట్టయుఁ దానుఁ గొల్చెఁ గఱకంఠుని నోంకృతినాదదేవునిన్. కాశీ. 6. 262. (చి. ని. పా—జేపెదుర్కట్టున-ప్రాతఃకాలపూర్వమున.)

గీ. గొల్లపడుచులు చని గుంపుగూడి చూడ, జోలుదామెనత్రాడును లీలతోడ, నీడ్చ

కొనివచ్చి తమయింటియెదురుకట్లఁ, దవరు ధవళార్జునంబులఁ దగులఁ బెట్టి. వి. పు 7. 137.

చ. మలఁచినఁ జాలుఁ గాక మకమానిసిరూపులు ఊలపైనఁ జెక్కులు పులకింపఁ జేసి యదిగో వలపింతు మనన్ వివం గనం గల మగరూపు మాయెదురుకట్లకు వచ్చిన నెంత గాదు ప్రేమల వలరాచమోమెఱుక మానిసిఁ జేసిటఁ దెత్తు మమ్మునిన్. రామా. 2. 88.

**ఎదురుకుత్తుక** వి. (√ ఎదురు) అంకిళ్లుపట్టుకొను వ్యాధివిశేషము. (శ. ర.)

**ఎదురుకొ(ర్కొ)ను** స. క్రి. (√ ఎదురు) 1. ప్రత్యుద్గమించు

గీ. కమలసంభవసములైన కవులతోడ, మహిమమై వచ్చి సత్యధర్మక్షితీంద్రుఁ, డింపు రెట్టింప నల్లుని నెదురుకొనియె. విక్ర. 7. 74.

2. మార్కొను.

చ. ...శాత్రవు నెదుర్కొనఁ జేసి... ఉ రా. 2. 78.

అ. క్రి. అభిముఖమగు; తారసిల్లు.

వ. ... మదాధికపదాతిపదాఘాతధూతధరాతల పరాగపటలంబుతోఁ గలిసి మలసి ప్రతికూలమారుతంబు లెదురుకొన సరకుగొనక పశ్చిమోన్ముఖుండై పంక్తిముఖుండు తత్తటినీతటంబునఁ జని చని .... ఉ. రా. 8. 228.

గీ. ఉదరభాగప్రపూరణోద్యోగవిముఖ, వమధువిరహోన్నమత్కరవ్యక్తవిటప, కించిదాతపవ్యాప్తవనీసంచరిష్ణు, మదగజేంద్రంబు వేసవి యెదురుకొనియె. విప్ర. 2. 49. (ఆసన్నమైనదని భావము.)

**ఎదురుకొలుపు** స. క్రి. (√ ఎదురుకొను) ఎదురుకొనఁజేయు.

(ఎదురుగా నుండునట్లుచేయు, గోచరింపఁజేయు.)

గీ. నహుషఋషివిద్విషన్మేరుమహీధర ప్రవిలీపవశరాజదుర్మదాటోపహరణ, పటుతరఘటీతమాభవప్రాక్చరిత్ర, మెదురుకొలిపెదు మదికినిం దిగురుఁబోఁడి. చం. రా. 5. 13.

(ఎదురుకొలిపెదున్ – స్ఫురింపఁజేయుదు, స్మృతికిఁదెచ్చుదు.)

**ఎదురుకో(ర్కొ)లు** వి. (√ ఎదురుకొను) 1. ఎదురుగాఁ బోవుట, ప్రత్యుద్గమనము

సీ. తనచక్రమునకు నాతనిదివ్య తేజంబు గురుభావమున నెదుర్కోలు సేయ. కళా. 2. 182.

క. పురలక్ష్మి సరసతరనిజసరసీతామరసరసలసన్మృదులీలా, సురభిపరిభోగపవనాంకురమిషమున హరికి నెదురుకోలు వహించెన్. అని. 5. 59.

2. ఆఁడుపెండ్లివారు మగపెండ్లివారి నెదుర్కొనుట, ఎదురుసన్నాహము.

సీ. ప్రేమ నెదుర్కోలు పెండ్లివారల కిచ్చి తెవులైనవారి కర్దాలకు నొసఁగి హంస. 5. 40.

**ఎదురుగడ** వి. (√ ఎదురు) మాఱువ్రాసిన ఒడంబడికలోనగునది.

ఉదా : ఎదురుగడ యొడంబడిక, ఎదురుగడ లెక్క, మొ. (శ. ర.)

**ఎదురుచే(ర్చు)** అ. క్రి. స. క్రి. (√ ఎదురు) ప్రతిఘటించు, మార్కొను.

క. పొదలెడువప్పుడు శౌర్యోన్మదుఁడగు నయ్యనిలతనయుమార్గణములు బెట్టిదముగఁ గవియుడు నోటమి, యెదురుపలేరైరి కురుకులేంద్రుఁడు వారున్. భార. కర్ణ. 2. 164.

ఆ. అనఘ నీకెదిర్చి యని సేయువాఁడనై, మున్ననుజ్ఞఁ గొనఁగ నిమ్నుఁ గాన, నెమ్మి వచ్చినాఁడ...భార. భీష్మ. 1. 156

చ. నెలకొని కృష్ణరాయధరణీవిభుఁ డుత్కలభూమిపాలుతోఁ, గలన నెదిర్చి ... పారి. పీఠి. 22.

చ. అనిలజవంబునం బఱచునమ్మదవాగ మెదిర్చి క్రమ్మఱిం,చినపరిశాఁడపోలె ... భార. ఆది. 4. 206.

చ. ...ఆగ్రహమున నేను దుంతిగణరాజు నెదిర్చితి మమ్ము నింద్రునిన్. కాశీ. 7. 30.

**ఎదురుమే(ర్చు)క్క** - చుక్క యెదురు. విశే. (√ ఎదురు) ప్రతికూలము, హానికరము. (చుక్క-శుక్రునకు — ఎదురుగా ప్రయాణముచేయుట కార్యభంజకమును అనిష్టకరమును అని జ్యోతిశ్శాస్త్ర సంప్రదాయము.)

సీ. వెలయ భాగవతోత్తములకుఁ జేరువవంట మదమత్సరాదుల కెదురుచుక్క. పరమ. 1. 21.

గీ. పదులకు మిత్తి తేళ్లకు నెదురుచుక్క. శుక. 2. 283.

ద్వి. కామరోషములు దగ్గఱ నోదు నతని,వ్యామోహమదముల కతఁ డెదుర్చుక్క, మత్సరం బాతని మాటన్న వెఱచుఁ, గుత్సితవృత్తులకును పెన్నుగుదియ. ప్రభు 3. 102 పా. 17. పం.

**ఎదురు(రులు,ళ్లు)చూచు** అ. క్రి. (√ ఎదురు) ప్రతీక్షించు, వేచియుండు.

గీ. ఇందుబింబాస్య నారాక కెదురుచూచు, నయనములు వేయు విరియించి నాకభర్త. నైష. 4. 64. భాగ. శాం. 6. 594.

చ. ...ఎన్నఁడొకో పదునాలుగేఁడులుం,దుదిగను నెల్ల నేమములతోఁ గొడుకెప్డొకొవచ్చు నంచు నీ,కెదురులుసూచుచుఁ. భా. రా. యు. 5. 86.

క. ...మా,రాకకు నెదుళ్లుసూచుచుఁ, బ్రాకటగతి నుండువారు పౌరులు ప్రీతిన్. భా. రా. యు. 2455.

క. అమరు లమృతపానంబున, నమరినవారయ్యు నేనికాటునిపంచ,త్వమునకు నెదుళ్లు సూతురు,తము నమ్మక యట్టియఘుండు దుర్లోద్ధతుఁడై. భాగ. 10. పూ. 464.

**ఎదురుకాఁగు** అ. క్రి (√ ఎదురు) ఎదురుపడు, తారసిల్లు.

క. దైవికముగ రెండు నెదురుకాఁగి నిలువన్. జై. భా. 7. 144.

గీ. నీకుఁ బరదానవుఁడనైతి వేత్రతతిచ, కోరవ న్నిచ్చలో నేల కోరనైతి, వందు రాత్మ ప్రపంచకులైన వారు, లెదురు కాఁగైన నవ్వాదవదినెఁ గూర్చి. వేం. పంచ. 3. 252.

2. సమానమగు, సాటియగు.

ద్వి. ...అచ్చటిమేడలందుఁ జరించు, నేణలోచనలముఖేందుబింబంబు, లేణాంకబింబంబు నెదురుకాఁగైనఁ,దమపతి యితఁ డంచుఁ దలఁపంగలేక, భ్రమసి తారాళి యేన్పాటున రాకుండు. ద్వి. పరమ. 5. 348. పా. 4. పం.

**ఎదురుప(ర్వ)డు** అ. క్రి. (√ ఎదురు) 1. ఎదురుగావచ్చు.

క. ...జారశేఖరుఁ, డావెలఁదికి నెదురుపడియె నంతట వేడ్కన్. హంస. 2. 117.

సీ ... దక్షిణాంబుదపూర్ణకుంభంబు లెదురుపడియె. పి. శకుం. 1. 182.

2. ఎదిరించు, ప్రతిఘటించు.

క. కురుపతికిఁ జిత్రసేనుఁడుఁ, బురుమిత్రుఁడు వేల్పుసేవపుత్రుఁడుఁ బ్రాపై. యురవడిఁ దఱిమినవారికి,నందనుఁ డెదురుపడె గుణధ్వని సెలఁగన్. భా. భీష్మ. 2. 318.

చ. దివిజులకోర్కెఁ దీర్ప వసుదేవునియింట జనించి కంసదా,నవుఁడు వధించు నన్నయమునం జని నందునియింట నుండుకున్, యవన జరాసుతాదులకు నాజి నెదుర్పడలేక సజ్జన, స్తవమధురాపురిన్ విడిచి దాఁగుటకున్ మదిఁ జింత నొందుదున్. భాగ 3. 92.

వ. ...వినుకెంపునునుఁగెంపుసొంపులతో నెదురుపడఁగల విడికెంపుల వడగలఁ జెలువగు చిలువరాచకొడుకులచేత...ఉ. రా. 8. 94. (ఇట ఔపమ్యవాచకము)

**ఎదురుపొ(ర్పా)టు** వి (√ ఎదురుపడు) ఎదురుపడుట. (శ. ర.)

**ఎదురురొ(ఱొ)మ్ము**-ఎదురొమ్ము. వి. (√ ఎదురు) ఱొమ్మునడిమిభాగము. (శ. ర.)

**ఎదురుసెలఁగు** అ. క్రి. (√ ఎదురు) ప్రతిధ్వనిచేయు, మాఱుమ్రోయు.

సీ. కులపర్వతావళి కుళిశభయంబున లెదరి

వాపోవునల్లెదురుసెలఁగె. భార. ఉద్యో. 4. 116.

**ఎదురెక్కు**-(ఎదురులెక్కు-) అ. క్రి. (√ ఎదురు)
1. ఎదురుగాఁబోవు, అభిముఖముగాఁజను.
ఆ. జడిసి జడిసి జన్ము సంభవాంభోవేణి, కెదురులెక్కు మీలకొదమ లనఁగ. మనుచ. 5. 63.
మ. హరి పూరింపఁ దదాస్యమారుతసుగంధాకృష్టమై నాభిపం,కరుహ క్రోడమిళిందబృందమెదురెక్కఁగా...ఆము. 1. 5. నీలా. 3. 13.
2. మీఁదికివచ్చు.
గీ. వజ్ర మెదురెక్క కుండంగ వరము వడసె, వచ్చు యమదండ మనకుండ వరము వడసె, వరుణపాశాదు లుడివోవ వరము వడసె. కకు 4. 145.

**ఎదురొడ్డు** అ. క్రి. (√ ఎదురు) – ఎదురుగాఒడ్డు–ఎదురుగా వ్యూహము పన్ను; ప్రతిఘటించు.
గీ. విడిసెఁ బతిసేన కెదురొడ్డి విమతసేన. కవిక. 2. 147.
(రజనీచరుఁడు) క. దొడ్డచలంబున నీ కెదు, రొడ్డి విజృంభించె నవలియొడ్డున నధిపా ఉ రా. 3. 237. కళా. 3. 266.
స. క్రి. 1. ప్రతిప్రయోగము చేయు, ఎదురువేయు
గీ. అతఁ డెదురొడ్డినట్టి శూలాయుధమును, హాఁయురము గాఁడి యారౌతుశిరము పైకి, వెడలె...కళా. 8. 97.
2 (జూదమున) పందెమునకు మాఱుగా పందెముపెట్టు (చూ. ఒడ్డు[1]. స. క్రి. 1. అర్థము)

**ఎదురొత్తు** స. క్రి. (√ ఎదురు) మాఱొత్తు.
చ. ....ఉరఃస్థలంబుఁ జన్నుల నెదురొత్తి మక్కువ సనుం బిగికౌఁగిటఁ దేర్చ వేటికే. పారి 1. 117.
వి. బ మాఱొత్తులు, ప్రతిఘట్టనములు.
సీ. సామి పై కొని రతి సల్పినయపు డీవు నించుక యెదురొత్తులియ్యవమ్మ. రాధికా. 1. 64.
సీ. చాన యింతకు మున్నె శౌరి పై కొన నెడతీయక యెదురొత్తులియకున్నె. రాధికా. 1. 78.

**ఎదురొ(ఱొ)మ్ము**–ఎదురురొమ్ము. వి. (√ ఎదురు)
చ. ....నీదుపెద్దతమ్ముని యెదురొమ్ము నెత్తురు సముద్ధతిఁ గ్రోల...రాఘవ. 4. 111.
ఎదురొమ్ముమీఁదికుంపటి–మిగులబాధాకరమైనది.

**ఎద్దడి** వి. 1. పేదఱికము, దారిద్ర్యము.
గీ. ...పేదఱికంబు నిప్పచ్చరమ్ము, నెవ్వ యెద్దడి లేమి నా నివ్వటిల్లు, రిక్తతకు నామధేయము ల్వ్యక్తవరద. అం. భా. 2. 210.
సీ. తొలుకడరాజాపసలు గెబ్బునర్తిఁ జేఁ దెద్దడి గుబురుకాటిగ్గ ప్రొద్దు. అచ్చ. రా. బాల. 8.
2. అభావము, లేకపోవుట.
ఉదా: ఆగ్రామములో నీటియెద్దడిచేఁ బ్రజలు బాధపడుచున్నారు.
విశే. 1. దరిద్రము. (శ. ర.)
2. శూన్యము, లేనిది.
క. పసులకు మే పెద్దడియై .... హరి. పూ. 7. 69.
(వ్యవ) ఆయూరిలో నీటికి ఎద్దడిగా నున్నది.
(ఎద్దడిగానున్నది–కష్టముగానున్నది.)
(వ్యవ) ఎద్దడినీళ్లు తెచ్చుకొనుట కష్టము.
(ఎద్దడినీళ్లు–చాలియుఁజాలని నీళ్లు.)

**ఎద్దడినేల** వి. నిర్జలభూమి, మరుభూమి.
గీ. పరఁగు నెద్దడినే లవ మరుధరిత్రి. అం. భా. ?. 5.

**ఎద్దము** వి. పట్టెతీరిన అంచు.
ఉదా: ఎద్దపుచీర. (శ. ర.)

**ఎద్దీ**–పది భార. శాం. 6. 547.

**ఎద్దు** వి. (బ ఎద్దులు, ఎడ్డులు, ఎడ్లు–శ ఎత్తు. త. ఎదురు.) 1. వృషభము.
ఉ. ...ఎద్దీ నెనటన్నఁ గొట్టమున నేర్పడఁ గట్టుమటన్నచందమే, కానఁగవయ్యె .... సారంగ. 2. 276.
క. వడిగలయెద్దులఁ గట్టుక, మడి దున్నక బ్రదుకవచ్చు మహిలో సుమతీ. సు. శ. 8.

గీ. వలయుమున్కెల్లఁ దెమ్మె కంటలవు కెడ్ల, నాయితము నేయు ... హరి. పూ. 6. 21.

2. (జ) పశుస్త్రీ, ఆఁడుపశువు. (ఈయర్థము పూర్వశాసనములలోనే యున్నది )

వ. శక. 1014 ... (నేతికై) నెగియమువనమునం బెట్టినఎడ్లు 50. ... ... ద. శా. 4. 1009.

(చూ. ఇనుపయెడ్లు, ఈన్పయెడ్లు.)

జీ: ఎద్దుతత్తడిజోదు, ఎద్దునాలిక, ఎద్దుపట్టు, ఎద్దుముట్టె, ఎద్దుమొద్దు, ఎద్దురాసి.

**ఎద్దుతత్తడిజోదు** వి. (√ ఎద్దు) వృషభవాహనుఁడు, శివుడు. అచ్చ. రా. అర. 59

**ఎద్దునాలి(లు)క** వి. (√ ఎద్దు) గోజిహ్వ. బెండ (వృ. వి )

సీ. ఎద్దునాలిక యయి యిం పొందు గోజిహ్వ .... అం. భా. 2 61.

**ఎద్దుపట్టు** స. క్రి. (√ ఎద్దు) ముష్కహీనము చేయు, (ఎద్దును) బీజములు లేనిదానినిగాఁ జేయు.

వ. వానిం బట్టి కట్టింపు మొండె నెద్దుపట్టింపుము గంకున్న నదణ్యంబు సొం వెలువరింపుము ... హరి. పూ. 6. 127.

**ఎద్దుముట్టె** వి. (√ ఎద్దు) ఒక జాతిదుంప. (శ. ర. )

**ఎద్దుమొద్దు** విశ. (√ ఎద్దు) మూఢుఁడు, అవివేకుఁడు.

చ. ... మోహనాంగిఁ దా. నిటువలె నెద్దుమొద్దునకు నేమిటికిం దగులంబుచేసె నక్కటకట నిర్దయాపరుఁడు గాక సరోజభవుండు సత్యుఁడే. సురాభాం. 60.

**ఎద్దురాసి** వి. (√ ఎద్దు) వృషభరాశి.

**ఎద్దువేఁట** వి. (√ ఎద్దు) ఒకవిధమగువేఁట. (ఇందు ఎద్దును మాటుగాఁజేసికొని మృగములను వేఁటాడుదురు )

గీ. హెచ్చరికమించి తెరవేఁట యెద్దువేఁట, గంటవేఁటయు మొదలుగాఁ గలుగువేఁట, లెన్నిగల వన్నియు ఘటించి యన్నరేంద్రుఁ, డుగ్ర మృగభంజన క్రియోద్యుక్తుఁ డయ్యె. రామా. 2. 29. (బ్రౌ. ముద్రి. పా. పసువేఁట అని చి. ని. శ. ర. పా.)

**ఎద్రుచే**- ఎదురుచే – (√ ఎదురు—ఇందలి ఎకారము లఘువు.) అ. క్రి.

(ప్రతికూలమగు)

చ. ఎద్రిచినకాలపాకమున నీగతి నీమదిఁ గ్రోధవల్లికఁ, బద్రిచినవారు మన్నిశితబాణపరంపరలై మిడుంగుఱుల్, విద్రుపఁగఁ దత్ఫలంబులచవిం జరితార్థులుగా శరీరపుం, జిద్రుపలుచేరుఁ దత్సుతులచేతులఁ గాకకులంబువాతులఁ. ఉ. హరి. 4. 109. (చి. ని. వీరేశ. పా.)

**ఎన** విశ. (క. ఎణె. త. ఇణై.) సాటి, సమానము.

క. అతిరథుఁడు బాహ్లికుఁడు విను, మతులితబలుఁ డితనియట్ల యాత్మజుఁడును విక్రుతశక్తి సోమదత్తుం, డితనికి నీతనికి సమం బెన పెండిలికిఁ. భార. ఉద్యో. 4. 230.

క. ధనదుసభ యింద్రసభతో, నెన యగుచు మహావిభూతి నెంతయునొప్పుఁ. భార. సభా. 1. 73.

వి. 1. సామ్యము.

చ. ...మించునదెరవలిం గలహంసలు రాసపైన్యమై, తగుమరుమించుఁబోఁడి కెన దాలుతు రచ్చటిశాలిపాలికల్. చం. రా. 3 69.

సీ. చిఱునవ్వు దవ్వైనచెంగావిజిగిమోవి నన లేనిచిగురాకు నెనకుఁ దీయ. చం. రా. 6. 40.

2. జత జోడు (చూ ఎనవాయు.)

జ. ఎనవచ్చు, ఎనవాయు, ఎనపోవు, ఎన నేయు.

**ఎనపు** – ఎనయించే.

(పొందించు)

రగడ. పొదలుపొదలును దలిసి నెలఁతలుఁ బొగడఁ బొగడలమీఁద మాటికి మదిర మది రహిమించ నుమిసిన మధురమధురసమెనపుఁబోటికి. చంద్రికా. 4 63.

**ఎనమండ్రు(డ్రురు)** వ శ. (√ ఎనిమిది–త. ఎణ్మర్) ఎనిమిదిమంది. (ఎనిమిదికి మహన్మహాత్యర్థకరూపము.)

క. ...వసువుల, నెనమం[డం గాంచి గంగ యెంతయుఁ [బీతిన్. భార. ఆది. 4. 125.

క. వారలఁ బోదువ నడరు బలు, తేరులమొత్తముల మిగిలి దీప్తపటురథో,దారు లగుచు నెనమం[డురు,వీరులు దఱిమిరి నితాంత వేగోజ్జ్వలులై. భార. [దో. 3. 216.

**ఎనమందుము** వి. (ఎనిమిది+తూము.) ఎనిమిది తూములపరిమాణము. ద. శా. 4. 781.

సీ. ....అష్టాధకీసంజ్ఞ యలరుచుండు, నెనమందుమనఁగను....ఆం. భా. 2. 271.

**ఎనమనూఱు(న్నూఱు)** స. వి. (ఎనిమిది + నూఱు.) ఎనిమిదివందలు.

గీ. .. శివమంత్రపఠన మెనమ,నూఱుమాఱులు కావించి మీఱి యతఁడు,[బహ్మహత్యాది కంబులుపాయు....శివధ. 7. 65.

ఆ. తొలుత నెనమనూటతొమ్మిది పైఁడిట్టి, కల సుపర్ణరూపు గా నమర్చి. జై. భా. 8. 176.

వ. ...అర్జునుండు భీష్ముని వధియించుటయు ననువృత్తాంతంబుల నొప్పి యైదువేలు నెన మన్నూటయెనుబదినాలుగు శ్లోకంబులు గలిగి....భార. ఆది. 1. 44.

**ఎనయించు** స. [కి. (√ ఎనయు) ఎనయఁజేయు.

1. కలుపు, అతుకు.

క. అనలమునఁ గాఁచి లోహము, నెనయించిన కరణి....వేం. పంచ. 2. 63.

2. చేయు, కావించు.

సీ గిరిగిరిత లోకకొన్ని కలయంగ నెనయించి మోవినొక్కు మటంచు మొనసి నిలుచు ....

గీ. ... వెతల నేఁకారుమది నిట్లు విటులఁ జూచి. చిత్తజోన్మత్తయై గొల్లచిన్నెలాఁడి. హంస. 2. 104.

3. కలిగించు.

సీ ఏను నీ వనుమాట లెనయించె నెవ్వాఁడు కోమలపదలీలఁ గూర్చె నెవ్వఁ,డు. వసు. 1 9. (అనిపించు అనిభావము.)

**ఎనయిక** వి. (√ ఎనయు) ఎనయుట.

1. పొందిక.

క. అనఘ యనులోమమునఁ దోఁ,పును [బతిలోమమున లయముపొందుటయును గ,ల్గును సర్వత త్త్వముల కవి, యెనయిక [బహ్మమును గలయు నేకత్వముగుఁ, భార. అను. 4. 184.

క. వినుఁ డీఁదగుసంబంధవు, లెనయికఁ గని మోచి తెచ్చి యిచ్చె ననరె చు.ల్కానినరులు ... ఆము. 6. 119.

2. సామ్యము, పోలిక. (శ. ర.)

**ఎనయు** స. [కి. 1. పోలు.

చ. ఎనయుదె నీవు పౌరుషవిహీనుఁడ వద్ది వికేం[ద నందనున్. భార. కర్ణ. 2 28.

గీ. ఎఱుఁగునే పూర్ణచం[దుని నెనయునట్టి, నీదు నెమ్మోము ముద్దియ... హరి. పూ. 8. 153. భార. శా. 5. 75.

2. పొందు.

శా. ఆ వాక్యంబులలో సుధామయ శుభై కాయత్త చిత్తేశసం,జ్ఞావర్ణంబు లొకింత వీను లెనయన్ సంజాత చైతన్యయై. వసు. 3. 183.

3. (రతియందు) కూడు, కలియు.

సీ. అగ్నిసాక్షిగను బెండ్లాడిన తనయింతి నేలక పరకాంత నెనయువాని వేమ 39.

క. ఇంత యుపాయము గలిగిన, నింతి చన వచ్చు జారు నెనయఁగ... హంస. 2. 66. ఇందు. 5. 157.

4 తాఁకు, స్పృశించు, అంటు.

క. అని వనితలు జవ్వని క,వ్వనివిభవముఁ దెల్పి కమ్మవలపులు గొనుగా, న్వెనయ మిసి ఘనులఁ బెనఁచిన,యనుపున జడ లడరఁ గుసుమహరిణోత్సుకలై వసు. 3. 148.

చ. గనగన నెల్ల[ప్రొద్దుఁ గొని[కాలెడువేఁడిమిఁ దేర్చుభర్త మే,నెనయను దగ్గఱన్ నయిఁః కెంతయుభీతి నొదుంగుచున్ లస,ద్వనరుహ పత్రలోచన యవంధ్యచరిత్రమునన్ఁ దాత్మ కిం.పు నెఱయఁజేయుచుం గనియె

బుత్రుల నిద్దఱ నొక్క కన్నియఁ. హరి. పూ. 1. 167.

5. గ్రహించు, పుచ్చుకొను.

సీ. గాదెలధాన్య మెల్కల కయ్యె గుత్తకై యెనసిన గ్రామంబు లెల్ల నెంచె. శుక. 2. 360.

అ. క్రి. (తె. ఇదై) సరియగు, సమానమగు.

క. ఈనలువుర భుజశక్తుల,తో నెనయఁగఁ జాలునట్టి దోర్బల మెందుం, గానము... భార. విరా. 3. 114.

క. నెల్లుఁడు యమతనయునితో, నెల్లగుణం బులను జాల నెనయుదు నని కాం,నుల్ల మున నిశ్చయించుఁ. భాగ. స్త్రీ. 2. 104. హరి. ఉ. 5. 186.

2. కలుగు, సంభవించు. అగు.

సీ. ...ఇట్లైనసినపోరాటఁ బదునెనిమిదిమాఱు లెదిరి రిపుఁడు. గీ. భగ్నుఁడై పోయె.... హరి. ఉ. 2. 68.

క. అని తెల్పు నెడఁ బ్రభాతం, బెనయుట గవి రథ తురంగ హేషారవమో,యనఁ బఱిర వము నెలఁగె...శుక. 1. 219.

3. వ్యాపించు, ప్రసరించు.

చ. ఎనసిననిండువెన్నెలలు నింపగురాత్రుల .. హరి. పూ. ౬. 39.

4. ఏకమగు, కూడుకొను.

ఆ. అతఁడు కాలకళిత మైన కర్మమున సం, సారవర్తనం బు సలుపుచుండు, స్వప్నసం ప్రవృత్తి సలిపెడు నగుమాడ్కి, నింద్రియ ములతోడ నెనయ బొసి. భాగ. శాం. 4. 295.

5. సంగమించు, రమించు,

సీ. మేనత్తయను మేర మీఱి రాధికతోడ నెన యఁడే నిన్న నీయముఁగు బావ. శశాం. ౫. 81.

6. చేకూరు, లభించు.

క. జనవర తపమువకుం జొ,చ్చినఁ గన్నులు మూసికొంచు నెల వింతియకా,క నిది ధ్యానకు బ్రహ్మం,బెనయుసె పరిభవపు కల్మి మెదతో మెఱమన్. ఆము. 3. 40.

7. ఒప్పు.

సీ. రత్న సానువుకేవఁ బ్రాశేయనగ మొప్ప సొరాగగరి కిరణై ల మెనయ. ఇందు. 1. 106.

8. మూఁగు

సీ. ఎంగిలిపుల్లపై నెనయుకాకులరీతి గోష్ఠాం గములు మూఁగు కొణుజులట్ల. గీ. దుష్ట ప్రభు ననుసరింతురు దుర్జనములు రామ. ౪. 88.

ఱ. ఎనపు, ఎనయించు, ఎనయిక.

ఎనవచ్చు అ. క్రి. (√ ఎన) సాటివచ్చు, సమాన మగు.

సీ. ఎనవచ్చు నసవచ్చు ననసూయ కై తయుఁ బఁమపాతివ్రత్యభవ్యగరిమ. జాహ్నవి. 1, 72.

ఎనవాయు అ. క్రి. (√ ఎన) జతవీడు, జోడు వాయు.

క. అనుచరి యగుమత్ప్రియతో, నెనవాసిన నాదు జన్మ మేటికి నాకుం, దను వేటికి మను వేటికి, ధను వేటికి దివ్యబాణతతు లేమి టికిఁ. భా. రా. సుం. 308.

ఎనవోలు అ. క్రి. (√ఎన) సాటియగు, సరిపోలు.

ఉ. ఇంతిమ్మృదూక్తి మాధురికి నిక్షునసం బెన వోలఁ జాల కాం,ద్యంతము నోడి.... వసు. 2. 49.

ఎనసేయు స. క్రి (√ ఎన) సమానము చేయు, సాటిగాఁదెచ్చు.

చ. కలువలు గండుమీలు తొలుకారు మెఱుం గులు నీడురామిగం, తెలుపుగ నేపదార్థ మెనసేయుదునో నతికన్నుదోయికిఁ. విక్ర. 8. 46.

ఎని — ఎన్ని. (ఇది 'అని'' వంటిది. దీనికి హల్లు పరమగుచో వికల్పముగా ఇత్వము లోపించును.)

ఉదా: వాని కెన్నలల్ గలవు. (శ. ర)

ఎనిక' — ఎన్నిక'. వి. (√ఎన్ను) గణనము, లెక్క.

క. తనకంటె నధికుఁ బరిసతి, నెనిక మిగులఁ దిట్టె నేని నేఁబదిపణముల్, తనకంటె

హీనుఁ దిట్టినఁ, దనరఁగఁ బం(డెండు నరయు దండువు గలుగుఁ. విజ్ఞా. (పా. 45.

క. తనమనములోన నెంతట, ననుమానము తీఱశుద్ధియగు నందాఁక, మనుశౌచము చేయుట తగు, నెనికయుఁ గొలఁదియును వెదక రెన్నఁడుఁ బెద్దల్. విజ్ఞా. ఆచా. 40.

**ఎనిక²** – ఎన్నిక². నాలుగు పోఁగుల నూలు దారము. (శ. ర.) – తంతువాయ పరిభాష యందు – నాలుగు పోఁగులు, కొంత దేశ మందు ఐదుపోఁగులు. (చి. ని.)

**ఎనిమి(న్మి)ది** వి. శా. (క ఎంటు. త. మ. ఎట్టు. తు. ఎణ్మ.) ఎనిమిదిటిఁ, ఎనిమిదింటిఁ, ఎనిమిదిటఁ, ఎనిమిదింటఁ. మొ- బ. ఎనిమిదులు. 1. ఏడునొకటి.

క. ఎనిమిదియగుపర్వం బిది,యనఁ బరఁగుం గర్ణపర్వము. భార. ఆది. 1. 49. (ఎనిమిదియగు – ఎనిమిదవ.)

క. ...ఉత్తరు నాటిట నెనిమిదిట రథము... నాటఁగ నేసెఁ. భార. విరా. 5. 103.

క. ...అం,దెనిమిదిటిఁ గూర్చె బాణము, లెనిమిది యెనిమిదులఁ దమ్ముఁ దేర్చె ఱనధిపా. భార. కర్ణ. 2. 345.

క... మేరు నగేం(ద మమ్మహాశైలము నెన్మిది దిక్కుల వసియింతురు, (తిదశేం(దుండొట్టి యష్ట దిక్పాలవరుల్. భార. ఆది. 4. 37.

జ. ఎనమం(డు, ఎనమండుము, ఎనమనూఱు, ఎనిమిదికాళ్ల చుక్క, ఎనిమిదికాళ్లరిక్క, నెల, ఎనుబం(డు, ఎనుబది.

**ఎనిమిదికాళ్లచుక్క** వి. (ఎనిమిది) భా(దపదానక్ష(త్రము. (ఇది పూర్వభా(దపద ఉత్తరభా(దపద అని రెండువిధములు. ఈ రెండింటికి మొత్తము ఎనిమిదిపాదములు)

**ఎనిమిదికాళ్లరిక్కనెల** వి. (✓ ఎనిమిది) భా(దపద మాసము.

**ఎనియు** అ. (కి. కలసికొను (శ. ర.)
ఉదా : పప్పు ఎనియలేదు.
జ. ఎనుచు, ఎనువు, ఎనువుడు.

**ఎను** అవ. (దు. భూతార్థక (ప్రథమపురుషైకవచన (ప్రత్యయము. (తిర్యగ్జడములు వాచ్యము లగునపుడు బహువచనమునకు కూడ ఇది వచ్చును. ఉదా : చిలుకలు పలికెను. గంటలు (మోఁగెను.)

క. ...భూతవర్గం బెల్లన్,బరమోత్సవ మొందెను. భార. ఆది. 5. 95.

ఉ. ...సం, వాదమునేసె దేవమునివందు్యఁడు భార. శాం. 5. 570.

**ఎనుచు** (శ. ర. చి. ని.) స. (కి. (✓ ఎనియు) ఎనియఁజేయు, కలియఁజేయు.
ఉదా : వాఁడు పప్పు బాగుగా ఎనిచెను.

**ఎనుపతేలు** వి. (ఎనుము + తేలు) నల్లతేలు
సీ. ఎనుపతేలనఁ గృష్ణవృశ్చికం బగు... ఆం. భా. 2. 88.

**ఎనుపమోఁకాలు** వి. ఒకానొకచెట్టు. (శ. ర.)

**ఎనుపళువు** – ఎనుపసరము. మి. వి. గేదె, బఱ్ఱె. (బాలుమూల. శా. 1565. నె శా. 3. 1121.)

**ఎనుపసరము** వి. (ఎనుము + పసరము) గేదె, మహిషి.
సీ. ఎనుపసరం బన నెను మన నెను పెంటి యన బఱ్ఱె నాఁగను దనరు మహిషి. ఆం. భా. 2. 264.

**ఎనువు** – ఎనుచు.
(వ్యవ) వాఁడు పప్పు బాగుగా ఎనిపినాఁడు.

**ఎనువుడు** వి. (✓ ఎనియు) ఎనువుట. (శ.ర.(శా.)

**ఎనుపెంటి** వి. (ఎనుము + పెంటి) మహిషి, గేదె వరాహ. 11. 76.

**ఎనుపోతు** వి. (ఎనుము) దున్నపోతు, మహిషము.
చ. ...కోలుపులివైనను గారెనుపోతునైన... పట్టుదు... భార. విరా. 1. 83.

**ఎనుబం(డు** వ. బ. (✓ఎనిమిది–ఎనుబదికి మహన్మహత్వర్థక రూపము – ఎనుబం(డన్, ఎనుబం(డకు, మొ.) ఎనుబదిమంది.

**ఎనుబ(న్బ)ది** న. **వి.** (√ఎనిమిది–క. ఎంబత్తు, త. ఎన్బొదు–'ఎనిమిది, ఎనుబది' ఈ శబ్దముల రౌక్యయు వీనిసమానార్థక మైన ద్రావిడాది పదములయొక్కయు రూపము లను బట్టి యూహింపఁగా 'ఎనిమిది' యను నర్థముగల 'ఎన్' అను మూలరూప మొకటి యున్నట్లు స్ఫురించుచున్నది ) అశీతి, ఎనిమిది పదులు.

క ఎనుబదియెనిమిది వేవురు, దనుజుల కాధ్యుండు వక్ర దనుజుఁడు తోడై చను దేర వాంపసడిభకులు చెనకిన వెసఁ దునిమె శౌరి చెప్పెద నదియుఁగా. ఉ. హరి. 4. 6.

**ఎనుము(న్ము)** వి. (√ఇనుము – నల్లనిది ? – క. ఎమ్మె. త. ఎరుమై తు. ఎర్మె–వృత్తియ దు దీని మువర్ణమునకు లోపముగాని ప వర్ణము గాని వచ్చును.) మహిషి, బఱ్ఱె, గేదె.

గీ. ...పరఁగు నెను పెట్లు గేదెలు బఱ్ఱె లెనుము, లనఁగ మహిషీసమాఖ్యలు ... అం. సం. తిర్య. 10.

క. ఎనుమునకుబందె పాతిక, గొన నగు మొద వునకుఁ బదిక గొఱియకు వీసం,బొన నొరుచేను మేసిన, నినుమడి గొనవలయు నొడయఁడెఱిఁగి విడిచినన్. విజ్ఞా. ప్రా. 4.

గీ. ... కొడుకుఁగాంచి, యెనుప మేను దొఱంగె... వరాహ. 11 84.

ఎనుపకడుపు – బఱ్ఱెలమంద.

గీ. అతిథిసంఘంబునకు నీనిన్టియెనుప, కడు పులేఁగలగమికి వాకట్టు లెసఁగె ఆము. 4. 128.

జ. ఎనుపతేలు. ఎనుపకువు ఎనుపసోము, ఎనుపెటి, ఎనుపోతు

**ఎన్నఁడు** – ఏనాఁడు వి. **వి.** 1. ఏదినము; ఏకాలము.

చ. ...వసుంధరాసురుత్కులమణులార శాప మునకుం గడ యెన్నఁడు నాకుఁ జెప్పుఁడా వరాహ. 7 87.

క. అని యతనిజత్రుదేశం బున నొకవాలమ్ముగ వతమునఁ జెక్కును గ్రుచ్చినఁ ద్రెల్లె యెన్నఁడో చచ్చినయట్లు రథంబుమీఁదఁ జేడ్పడి యుండెన్. భా. ద్రో. 2. 50.

(ఎన్నఁడో చచ్చినయట్లు – చిరకాలము క్రిందట చచ్చినట్లు.)

2. ఎప్పుడును, ఎల్లప్పుడు. (ఈయర్థమునఁ దఱుచు ద్రుతాంతముగా ను డుని.)

గీ. ఒకఁడు భజియించు నెన్నఁడు నొప్పు... హం. 2. 19

మ ... ప్రకృతి నచ్చుగ డైన సన్మార్గి యెన్నటికిన్ గూఢ మవంక వచ్చువికృతిన్ మగ్నుండు గానేర్చునే మనుచ. 3 24 కాశీ. 3. 45.

ఎన్నఁటివలె – ఎప్పటిరీతిగా, యథాపూర్వముగా.

సీ. ఎన్నఁటివలె సప్తఋషులు వేగన వచ్చి విజయోస్తటంచు దీవించిరి. ఉశా. 2. 51.

**ఎన్నాళ్లు** వి. **బ.** (ఎన్ని + నాళ్లు) ఎన్నిదినములు.

శా ఎట్టూ యిట్టగునయ్య పక్కదయ లే కిన్నాళ్లు నీకూడె యీ పొట్టం బెట్టి మహా ఘులద్ధి దనువుం బోషించి యెన్నాళ్లకే, నెట్టే నొక్క తపస్వియొక్క ప్రతి రాఁడే చూడఁడే తత్కృపం, బుట్టు న్నీఁగెద... ఆము. 6. 54.

(ఎన్నాళ్లకేన్ – ఎప్పటికైనను)

క. అకపృడియతివేషముఁ,దాలొని యున్నాఁడు నీకుఁ జెంతనె యెన్నాళ్లో కలదు వచ్చి. విజ. వి. 2. 174.

**ఎన్ని** న **వి.** (క. ఎనితు, ఎనితు. త. ఎత్తనై – ఎంతశబ్దమునకు అమహదర్థక బహువచనము సంఖ్యావాచకము. ఉదా: ఎన్ని నెలలు. ఎన్ని టికి, మొ. చూ. అన్ని.) 1. ఎంత సంఖ్యగా వి. (ప్రశ్నార్థకము)

ఉదా : నీవెన్ని గ్రంథములు చదివితివి ?

2. యావదర్థకము (ఇదితావదర్థకము నపేక్షించును.)

ఉదా ; వానికెన్నిమాయ లున్నవో అన్నియు నుపయోగపఱచినాఁడు.

ఎన్నియేని, ఎన్నేని, ఎన్నైనను – పెక్కులు, అనేకములు.

గీ. ఏను గయ్యపుళకునంబు లెన్నియేని, కంటి ...భారం. ఉద్యో. 3. 41.

శా. ...కళాయంబు లి దెన్నే నున్నవి... పాండు. 4. 176.

శా. ఆనందమ్మునఁ జాం వందనుఁడు సాష్టాంగ ప్రణామంబు లెన్నైనం జేసి... కాశ. 4 176.

జ. ఎన్నాళ్లు.

**ఎన్నిక**[1] – ఎనిక[1]. వి. (√ఎన్ను[1] – త ఎణ్ణికై)

1. లెక్క, గణనము.

గీ ఎన్నికకు రోమకూపంబు లెన్ని గలవు, దివ్యవర్షంబు లన్ని మోదించు సాధ్వి. నాకభువనంబునం దాత్మనాథుఁగూడి. వెల పొలింతయు లేక చిన్నటికెనేని. కాశీ. 2. 91.

2. ప్రసిద్ధి, ఖ్యాతి.

క. ఈరేడు జగములం దిఁక, నేరి నీరితిగోతు లెన్నికగనునో, య్యారి తిరగుకులుకుమి, టారి వలజేని మేల్కటారి నారి. రసిక 3. 81

సీ. నీ పినతండ్రు లెన్నికలు గాంచిరి... నీలా. 1. 15.

3. అపఖ్యాతి, నింద.

గీ. అది దిగుల్పడి నీ వెట్టులరుగుదెంతు, వెన్నికా వటుమీఁద నీ కేమికాక, ముక్కుఅయుఁ గమ్మలును దాల్చి మురియువన్నుఁ, జూడఁ జాలక యిమ్మాట లాడెదేమొ. శుక. 2. 299.

4. ఊహ, తలఁపు.

గీ. కానికల గంటి తటు మొన్న గన్నయపుడె. యుగము గ్రుంగినయట్లైన నొల్లఁబోయి, నిలువఁగూడక యెన్ని యెన్నికలొ పొడమె శుక. 3. 149.

ఉ. ఇత ప్రయోజనంబు తను నేలినయేలిక చోళధారణి, కాంతునకున్ సవిస్తరముగా వినిపింపక నే వహంక్రియావంతుఁడనై గణించి తగునై వుడఁ దీర్చ నతండు విన్న నాకింతయు మాటవచ్చు నను నెన్నిక నయ్యధికారి గ్రక్కునన్. విప్ర. 5. 43.

5. (త. ఎణ్ణె.) సంకల్పము.

గీ. రాక్షసశ్రేణులకు సమారాధనంబు, సేయ నెంచిన దయ్యంబుఁ జెలుల యెన్నికలును ఫలియించె నమ్మహాకదనమువను. ఉ. రా. 8. 178.

ఉ. నిన్న గడమ్మ గాలవమునిప్రభు వెంబడి నేఁగి రక్కసు, న్వన్నియ మార్చి రాచిలుక వంటి మదాలసఁ దెచ్చి యుద్వహోత్సుకున్నతి గోరి నేఁటికి మువూర్తమటంచును నిశ్చయించె నీ, యెన్నిక చిన్నపోవఁగ ఋషీశ్వరుఁడెక్కడ వచ్చెనక్కటా. కువల. 4. 90.

6. ఎన్నుకొనుట.

ఉదా : సభ్యుల ఎన్నిక లయినవి.

విశే. 1. కోర దగినది; తగినది.

క. అంతట డగ్గఱి యా వేదాంతసరస్వతి మనంబు నదలింపుచుఁ బ్రాణాంత వ్యవసాయం బిది. యింతులకుం గాక నీకు నెన్నిక యగునే. ప్రబోధ. 5. 18.

ఉ. ...పో, రెన్నిక యానె పోరిన జయింప నశక్యము... ఆము. 3. 57.

2. గణనీయము, శ్రేష్ఠము.

ఉదా: వాఁడు ఎన్నికైనమనుష్యుఁడు. ఎన్నిక మాటలు.

ఎన్నిక కెక్కు – ప్రసిద్ధినొందు, గణనకెక్కు.

క. ...వరరుచి. యేకముఖ బ్రహ్మ యనఁగ నెన్నిక కెక్కెన్. విక్ర. 1. 187,

**ఎన్నిక**[2] – ఎనిక[2]. వి. నాలుగు పోఁగుల నూలి దారము. (చూ. ఎనిక[2].)

గీ. ఎన్నికలు పట్టి పుంజంబు లేర్పరించి, పంచెకట్టులు మఱి తోఁడు పడుగు లూఁచ, కండె లొనరించి చాలించి కాఁపుటింతులు ...శుక. 2 423.

సీ తంతుచతుష్కంబు దవరు వెన్నిక యన... ఆం. భా. 2. 295.

**ఎన్ను**[1]. స. క్రి. (క త. ఎణ్ణు) గణించు.

1. లెక్కించు లెక్కపెట్టు

చ. అమలిన శారదాసముదయంబుల నెన్నను సర్వ వేద శాస్త్రముల యశేషపారము

ముదంబునఁ బొందను.... విధాత్రునకై
వను నేరఁబోలునే. భార. ఆది. 1. 19.

ఆ. తారకములు వృష్టిధారలు లెక్కింప, వచ్చుఁ గాని యతనియిచ్చుగోవు,లెన్నఁ గొలఁది గావు ... భార. ద్రో. 2. 200. (ప్రాంతప్రతి పాఠము.)

2. లక్ష్యపెట్టు, సరకుసేయు

గీ. అబ్జపటముఖ్యులయ మెన్న రాలయాంగ, దారులయ మెన్నరు... అజ్జడిని ... అము. 4. 127.

3. స్తుతించు, కొనియాడు.

దండ. అప్పాఁవ జేఁ దట్టిరాయంచవార్వంబు తోడ్తోన వోరాఁ నగ్గింప లేఁన్నచోఁ బిన్న లెల్లెన్నఁగాజాలువారు... నీలా 2. 41.

4 ఆక్షేపించు, దూఱు.

గీ. ఇంకఁ జుట్టలు వ న్నేమి యెన్నువారొ, కులమునకుఁ బాయవడి యేను గులటనైతి, నీవు నల్పాయుషుండవై నీచ పోదు, వంశమునకుఁ బరస్త్రీవినాశి వగుట. హరి. పూ. 9. 74.

సీ. చంద్రచంద్రాతపచందన శారదాశారదాంభోదకేసరుల వెన్ని. గీ. మీఱి తనకీర్తి జగములు మెఱయ నలరె. రసిక. 1. 24. (ఇట ఔపమ్యవాచకము.)

5. ప్రసంగించు, చెప్పు.

సీ. వినుము ధర్మము లెల్ల విమతకృత్యంబుల, తపమెన్ని యెన్నఁగా ధర్మ మొందుఁ, గలదు... భార. అను. 4. 82.

ఆ. అలతాంగి చూపు లల్లార్చి చూచిన, నతను మహిమచేత యతులకైనఁ, దెములి యినుప కచ్చడము లూడిపడు నన్న, నున్న వారి నింక వెన్న నేల. విక్ర. 8. 73. భార. ఉద్యో. 1. 338.

6. భావించు, ఊహించు, ఆలోచించు.

చ. విపదపహార్తయైన రఘువీరునకుం దురవస్థ రాదు నీ,విపుడు దలంకి యొం డొకటి యెన్నక మిన్నక యుండుమమ్మ. రామా. 5. 220.

7. పన్ను.

క. నన్నిచట నుంచి చనియెం, గన్నియ మఱి రాక తడసెఁ గపటోపాయం, బెన్నెనొకొ యెవ్వఁ డెఱుఁగుఁ బ్ర,పన్నాంబుజముఖుల యింద్రజాలము లెల్లన్. శుక. 2. 191.

8. తెలిసికొను, గ్రహించు.

మ ...అట్టి శుక్తిమతియున్ ప్రాలేయశైలేంద్ర నందనుఁడుం గాంచినకన్నెఁగా నధిప యీ తన్వంగి నెన్నం దగుఁ. వసు. 3. 57.

9. జపించు.

ద్వి. మదిలోని మంత్ర మేమఱక యెన్నుచును ద్వి. పరమ. 50. పొ.

ఇ: ఎనిక', ఎన్నిక', ఎన్నుకొను, ఎన్నువ.

ఎన్ను² – వెన్ను. వి. సస్యాదిమంజరి, కణిశము, కంకి.

గీ. ఎన్నవఁగఁ గణిశ మలరు నీఁచ యనఁగఁ, గణిశ వృంతంబు చెలఁగును. ఆం. భా. 2. 236.

మ. ...పండి నోఁయగమై యెన్నుల వ్రేఁగునన్ ధరణి మ్రోయన్ ప్రాలి సస్యావళుల్ ఉ. రా. 1. 74.

సీ: వక్షస్థలమునఁ బద్మాక్షమాలిక కర్ణబిలమున మలివాడు తొలసియెన్ను. జై. భా. 7. 197.

ఎన్నుకొను స. క్రి. (√ ఎన్ను¹) వరించు, కోరుకొను, ఏఱుకొను.

(వ్యవ.) ఆమె వానిని భర్తగా ఎన్నుకొనినది. ప్రజలు వానిని సభ్యునిగా ఎన్నికొనిరి.

ఎన్నువ వి. (√ఎన్ను¹) అఁడువా లేద్పునపుడు అనుభవము నెంచి యెంచి పాటగా పాడెడు చచ్చినవారి చారిత్రము. (శ. ర.)

ఎన్నెమ్మ(మ) వి. పురుటిలో పిల్లలను పీడించెడి భూతవిశేషము.

ఇ. ఎన్నెమ్మ పురుగు.

ఎన్నెమ్మపురుగు వి. (√ ఎన్నెమ్మ) పురుగురూపముగా వచ్చిన యెన్నెమ్మ, ఒకానొక పురుగు

ఎపుడు(డ్డు) – ఎప్పుడు.

(ఎల్లప్పుడు)

గీ. ఏ కొఱంతయు లేక యస్తోకభక్తి, చే నిజేశుని పరిచర్య సేయు నెపుడు...నరసమాంబావధూటి. ఉ. రా. 1. 84.

శా. .. తేజోగణ్యుం డయి యొప్పు శ్రీ వాంఛాపారేశుం డెప్డు రక్షించు ... సిద్ధామాత్యచూడామణిన్. విక్ర. 1. 1.

**ఎప్పటి** అవ్య. (√ఎప్పుడు) ఎప్పటివలె, యథాపూర్వముగా. (మరల, తిరిగి అని తాత్పర్యము.)

క. విడిచిన నెప్పటి చని యాగడములు చేసెదవు నిన్నుఁ గాంచుట మాకుం, గడుగ్రేఁగు ...హరి. పూ. 5. 240. భాగ. 8. 729. ప్రభా. 5. 52.

**ఎప్పుడు** — ఎపుడు (ప్డు) వి. వి. బా. (క. ఏపొత్తు. త. ఎప్పొழுదు-ఎప్పటితో. ఎప్పటికి, ఎప్పటన్, మొ. దీని రూపాంతరములగు 'ఎపుడు, ఎప్డు' అనునవి ద్వితీయాది విభక్తులతోఁ గూడి యుండవు.)

1. ఏసమయము (ప్రశ్నార్థకము.)

ఉదా: ఎప్పుడు వచ్చెదవు

2. యదార్థకము. (ఇది 'అప్పుడు' అనుదాని నపేక్షించును.)

క. ఎప్పుడు హరిఁ గని రమరులు... అప్పుడు తత్కరములతో, విప్పినగొడుగులును మింట వేగమ మొగిడెన్. ఆము. 4. 12.

3. ఏ కాలమును, ఎల్లప్పుడును. (ఈ యర్థమునఁ దఱచు సముచ్చయసహితముగా నుండును.)

క. ...యాజ్ఞికుఁడు ప్రయోగనిపుణుఁ డై యేమఱకుండునె నిజకృత్యముల నెప్పుడును నమబుద్ధిన్. భార. సభా. 1. 29.

గీ. ఎప్పటికి నిత్తునో లేక యూరకిర, మిప్పటికిఁ జాలునో నిక్క మెఱుఁగ జెపుము. శివరా. 3. 71.

తే. ...రేయుఁ బగలు నిద్రయు నెప్పు డెఱుఁగక...భార. అర. 2. 26. (ప్రాఁత ప్రతి పాఠము.)

4. పూర్వము, మునుపు.

సీ. వంటపూఁటింటి కెప్పటికంటెను బాలు పెరుఁగు నే గూర లంపెడు తెగువలు. ఆము. 6. 71. (ఎప్పటికంటె — మునుపటి కంటె అధికముగ.)

ద్వి. శ్రీరంగపతి సమంచిత వైభవముల, నెప్పటికంటెఁ దా నిమ్మడి గాఁగఁ, దప్పక నడుచు చందంబు సేయించి. ద్వి. పరమ. 8. 616. పా. 3. పం.

క. మందర శైలము నెప్పటి,కందువ నిడి... వి. పు 1. 198. (ఎప్పటికందువ—ఎప్పుడు నుండు చోటు, పూర్వస్థానము.)

ది. ...ఎప్పటికరణి. దశా. 1. 98.

క. ...నీ వెప్పుడువలెఁ బలుకక యుంచుక,తడ వుండుము... కళా. 7. 205 (ఎప్పుడు వలె—యథాపూర్వముగా.)

చ. లలనలు బాహులన్ బదములన్... లతలఁ బల్లవగుచ్ఛ మిళింద కీర కోకిలముల నెప్పటట్ల కలిగించ వనేందిర మించె... ఉ. రా. 6. 64.

(ఎప్పటట్ల —ఎప్పటిరీతిని, యథాపూర్వము.)

ఎప్పటియాటయాడు — పూర్వపురీతిని సంచరించు.

ఉదా: నే నెన్ని చెప్పినను వాఁ డెప్పటియాట యాడుచున్నాఁడు

ఎప్పటికప్పుడు — 1. వెంటవెంటనే.

సీ చనవరియై వడిజాఱెడు రత్నభూషణము లెప్పటికప్పు చక్కఁబెట్టు. దశా. 2. 129.

2. ఎప్పు డావశ్యక మగునో అప్పుడు, ఆవశ్యకమైనప్పుడు.

ఉదా: పదార్థము లన్నియు నెప్పటికప్పుడే కొనవచ్చును.

3. ఎప్పుడును.

ఉదా: నీ వెప్పటికప్పుడు ఏవో మాయమాటలాడి తప్పించుకొనుచున్నావు.

ఎప్పుడెప్పుడను — ఎప్పుడు లభించును ఎప్పుడు లభించును అని అనుకొను, తహతహపడు.

చ. అట జగదేక సుందరికి నై యతివేషముఁ బూని వచ్చినాఁ,డట తన చేయు భాగ్యమున నప్పువుఁబోణియె యెంత సేవ సేయుట కని

వచ్చి యుండువఁట యొక్కొకపట్టున
నొంటిపాటు నొందఁట యతఁ డెప్పుడెప్పు
డను టబ్బురమే మదిఁ దత్తఱించుచున్.
విజ. వి. 2. 146.

ఇ: ఎప్పటి.

**ఎబ్బె** అవ్య. రోఁత పడుటయందుపయోగింపఁబడు మాట.

ఉదా: ఎబ్బె! ఏమిపని చేసినావురా.

జ: ఎబ్బెట్టు, ఎబ్బెతనము, ఎబ్బెరాసి, ఎబ్బెటికము.

**ఎబ్బెట్టు** విశ. (√ఎబ్బె.) వికటము, విరసము.

ఉదా: వాఁడు ఎబ్బెట్టుగా మాటాడుచున్నాఁడు.

గీ. కుమ్మరికిఁ జూడ నొకయేఁడు గుదియ కొక్క, పె ట్టటన్నట్టు దీని యెబ్బెట్టుతనము, తెల్లనిదె తీఱు నొకసారి యిటకు రారి, వచ్చి నిన్నేలు నిందుకు వగవనేల. రాధికా. 3. 24.

**ఎబ్బెతనము** — ఎబ్బెటికము. (గ్రా)

**ఎబ్బెరాసి** విశ. (√ఎబ్బె - క. ఎగ్రాసి.) రోఁత పుట్టించువాఁడు; రోఁత పుట్టించునది.

ద్వి. ఈ క్రూరకర్మున కీయెబ్బెరాసి, కీకష్టచరితున కీబహుభాషికి. ద్వి. హరిశ్చ. ఉ. 829. వం.

సీ. ...ఎబ్బెరాసిగాతలఁకొటారు. గీ. మగని కంటి వెరను. చెన్న. 2. 24.

**ఎబ్బెటికము** వి. (√ఎబ్బె) రోఁత.

సీ. తొడమీఁద నిడుకొని దోషాచరాగ్రణి యెత్తుక చని లంక నేఁడుకాల, ముంచిన యిల్లాలి నించుక కొంచక మరలఁ దాఁ గొనివచ్చి మరులు హెచ్చి, యెబ్బెటికము లేక యేలుచునున్నాఁడు చెలువిల్కానికిఁ జిక్కువాఁడు. ఉ. రా. 6. 200.

**ఎమిడిక** — ఏటిక. వి. 1. కడుపులోఁబుట్టి పాము వలె నుండు పురుగు, క్రిమి. 2. మట్టిలోనుండు నొకవిధమైనపాము, ఎల్లి.

**ఎముక** — ఎమ్ము, ఎమ్ముక. వి. అస్థి. అం. భా. 2. 188.

ఎముకబలియు — బలసిన యెముకలు కలది యగు.

సీ. అల బలీంద్రునిచేత నడుగువెట్టఁగ నేర్చి ధారాధరముచేత నీరువోసి, కానీనుచేఁ గంచుకముఁ బూనఁగా నేర్చి యెలమి దధీచిచే నెముకబలిసి.... గీ. ధరణిఁ బ్రోది వహించిన దానకన్య ... నీకరగ్రహణావాప్తి నెలసె నౌర, సరసగుణహార యోబయనరసధీర. నరస. 1. 116.

(వ్యవ) వానిచేతి కెముక లేదు: వాఁడు మహాదాత అని భావము.

జ: ఎముకయూట, ఎముకలపోగు, ఎముకలవట్టు, ఎముకలేఱు

**ఎముకయూట** వి. (√ఎముక) మూలుగ, మజ్జ, నెనడు.

సీ. ...గుండె,కాయ లాదట మెయిఁ గబళించుచును గ్రొవ్వు దెమలిచి నములుచు నెముకయూట, చవిగొని యానుచు.... గీ. కాటులాడుచు నున్న సృగాలములును, గాకములు...భార. స్త్రీ 2. 9.

**ఎముకలపోగు** వి. (√ఎముక) 1. అస్థిరాశి. 2. మిక్కిలి చిక్కినవాఁడు; మిక్కిలి చిక్కినది.

**ఎముకలవట్టు** విశ. (√ఎముక) వ్యాధిచేబక్కటిల్లినవాఁడు: బక్కటిల్లినది (శ. ర.)

**ఎముకలేఱు** స. క్రి. (√ఎముక) ఎముకలు లేనివానిఁగాఁ జేయు; బాధించు.

సీ. దివనాథవందముఁ దిత్తొల్చి విడిచిరి కరుణలేకెముక లేటిరి దధీచిఁ,కాకాకబిలమున బలిఁ గట్టవైచిరి... గీ. అయ్య లెంతకు నేరగర్థార్థి జనులు. నైష. 7. 81.

**ఎమ్ము** — ఎమ్ముక, ఎముక. వి (త. ఎమ్బు.) అస్థి.

సీ. మొగిని దధీచియెమ్ముకఁ బుట్టదయ్యోనే వాసవాయుధమైన వజ్రమదియు, భార. ఆది. 6. 59.

ఎంపనుగ్గు — ఎముకలపొడి.

ఉ. ...ఎంపనుగ్గు లొంట,డొండ ధరిత్రి పైఁ దొరఁగ... భార. ద్రో. 2. 122

ఎంపనుర్చుడు — ఎముకలమ నలఁగఁగొట్టుట.

సీ. ...ఎంపనుర్పుడు సేయుసేనికకాని... కు. సం. 11. 610.

జ: ఎమ్ముక, ఎమ్మూట.

**ఎమ్ముక** - ఎమ్ము. వి. అస్థి.

గీ. ఎమ్ముకలు చల్లినట్టిచో నెఱుఁగఁడయ్యె. దైవవశమున వాఖిల్ల తస్కరుఁడు. కాశీ. 5. 78.

**ఎమ్మూట** వి. (ఎమ్ము+ఊట.) మూలగ, నెనడు, మజ్జ.

సీ. ... నెఱవైనయెమ్మూట నెయ్యిగాఁగ. కవిక. 2. 196. (శ. ర. పా- 'అయ్యూట' అపముద్రి )

**ఎమ్మె** వి 1. చక్కఁదనము, మనోహరత్వము.

ఉ. ...నీ,యెమ్మెకు రాముఁ డానపడు నింతియ కాక నిరాకరింపఁబో..డు... చం. రా. 5. 88.

2. విలాసము, శృంగారచేష్ట.

ఉ గుమ్మలుపోవ నొక్క చెలి గ్రోలిన తేనియ కావి మోవితో, నెమ్మెలు మీఱఁ జంద్రుఁ డొక యింతికరం బవలంబనంబుగన్.

గీ. ...కొలువుకూటమునకు, లీల నరుదెంచి... శశాం. 4. 169, 170.

గీ. ఇట్లు చరియించునయ్యింతియెమ్మె లెఱిఁగి, పొరుగునసె యుండెడు నియోగిపుత్రుఁ డొకఁడు, శారశేఖరుఁ డను బ్రహ్మచారి మీఱి,యొంటిపా శైనఁ దెరువులో నొడిసి పట్టె. హంస. 2. 106.

3. (శ. ఎమ్మె.) ఉద్ధతి, గర్వము.

క. తెమ్మెర నీకెం తెమ్మెర, గమ్మని విలుకాని దొరవు గమ్మని నెలఁతై ,రమ్మని యళిపిక శుకనిక,ర మ్మనిగా నిలిపి ముందరగ వచ్చి తివా. విజ. వి. 8. 48.

4. ప్రీతి.

క. విను నీకు కావ యగువం,దుని తెంగటనుండి యెమ్మెతో నీకడకుం, జనుదెంచితి వల్బల్లి దుఁ, దనువఁగ మీ సేమ మెల్ల నారయు కొఱకున్. నీలా. 1. 64.

సీ. కడఁకతో నెలియాకుమడువు లెమ్మెను తేలి కొనఁగెడితొయ్యలిఁ గనరె దేమి. నీలా. 3. 96.

(ఱ.) అధిక ప్రసంగములు, పనితమాలిన మాటలు.

ఉ. ఎమ్మెలు సెప్ప నేల జగ మెన్నఁగఁ బన్న గరాజశాయికిన్, సొమ్ముగ వాక్యసంపదలు నూఱులుసేసినవాని భక్తిలో, నమ్మినవాని భాగవత నైష్ఠికుఁడై తగువానిఁ బేర్మితో, బమ్మెరపోతరాజుఁ గవిపట్టపురాజుఁ దలంచి మ్రొక్కెదన్. భాగ. 6. 12.

క. ఎమ్మెలు నాముందఱనా, యమ్మక్కరొ చెల్లవగ్రహారములోనఁ, దమ్ముళితో సఖ్యము లన్న వి,ధమ్మిది నీవలన నాకుఁ దథ్యం బయ్యెన్. రుక్మా. 5. 88.

విణ. మనోజ్ఞము, చక్కనిది.

చ. ...లవలీనవవల్లిక లెమ్మెసొమ్ములై ... మనుచ. ౯. 26.

జ: ఎమ్మెకాఁడు, ఎమ్మెలాఁడి.

**ఎమ్మెకాఁడు** విణ. (√ఎమ్మె) 1. విలాసవంతుఁడు, వన్నెకాఁడు; అందగాఁడు

సీ. అనుపమచ్ఛాయా విహార మందఁగఁ గల్గెఁ జిమ్మ చీఁకటి మ్రింగు నెమ్మెకాని,కి... నరస. 2 92.

సీ. పయెమ్మెకాని కీయింతి వాతెఱతేనె లిచ్చి పైకొని రమియించునొక్కొ. ఉ. రా. 4 194.

2. ప్రియుఁడు.

ఆ. ఎమ్మెకాఁడ యగ్గి యెల గాఁగఁ బెండిలి, యైన చెలిని డించి యకట యొంటి,నేఁగఁ దగునె. అచ్చ. రా. అయో. 70.

**ఎమ్మెలాఁడి** వి. (ఎమ్మెలు+ఆఁడి) విలాసముగల యాఁడుది; విలాసిని.

సీ. ఘుమఘుమమార్భటితోడ ఘోషించువదు లైన నీఁడి పోవని నేటియెమ్మెలాఁడి. హంస. 1. 102. శుక. 1. 55.

**ఎయిదించు** స. క్రి. (√ఎయిదు) ఎయిదఁజేయు. (తెలుపు, యెఱిఁగించు,)

క. చని యక్కుమారుఁ జేమ,య్యెనొ యత్తఱిఁగెఱిఁగి మనకు నెయిదించుట పుట్టిన

కార్యమునకుఁ దగియెడు, పని... భార. విరా. 5. 237. (ఈయర్థమునఁ బ్రయోగాంతరము లేదు.)

**ఎయిదు** – ఎయ్దు. స. క్రి. (క. అయ్దు. త. ఎయ్దు.) 1 చేరు. అందుకొను.

1. చేరు, అందుకొను.

ఆ. ఇట్లు పలుచుటయును నెంతయు రయమున, నమ్మృగంబు వెనుక నరిగి యరిగి, యెయిద లేక భారణీశుండు సారథిఁ బదరి తేరు వేగ పఱుపుమనియె. భార. అర. 4. 337.

గీ. రతియెలుం గగు నది వలరాజు పేరు, సెప్ప పనవెడు నది యేమిచిత్ర ముగ్రు, నెయిదఁ దడ వెద్ది మరుఁడు దండెత్తి పోవఁ, బోవ నడుమను బిందంబు పుట్టెనొక్క. కు. సం. 5. 567.

2. వెంబడించు, వెంటాడు.

వ. .. అందఱం గడచి తన తేరు దోలుకొని పోయి గోవిందు నెయిది యెలుంగెత్తి... హరి. ఉ. 3. 137.

3. పొందు.

క. ఎఱిఁగి పిలుసనిన వెసఁ బై, కుఱుకుదు సాళు వము గాలి నొడిసినభంగిన్, వెఱచఱవం బోదువుదుఁ బఱిపఱి సేయుదు నీదుపూన్కి పారం బెయిదఁగ. భార. విరా. 2. 282.

సీ. ఎలయించి ప్రాణేశ యెందుఁ బోయితి వని తోరంపుటలుకతో దూఱె నొకతె, జలజాక్ష ననుఁ గాసి చనఁగ నీ పాదంబు లెట్లాడెవని వగ నెయిదె నొకతె. భాగ. 10. పూ. 1068.

అ. క్రి. 1. సాగు

క. ఇలఁబుట్టదు పుట్టియుఁ దా, నిలువదు నిలిచియును నొక్క నిజమునఁ దిరమై, కలదాఁక నెయిద నేరదు, వెలయాండురకలుపు... కు. సం. 8. 165.

సీ. ...తుంద గీ. రున్న యునికివె వెలువడ నుత్సహింపఁ, దలఁచి తేనియు నిది తుది దాఁక నెట్లు, నెయిద నేరదు...కు. సం. 6. 670.

2. సరిపడు, సమానమగు

ద్వి. ...నానా వ్రత ప్రకర సంజనిత, ఫలకోటు లొక్క పుష్పం బీకుఁ బూన్చు, ఫలములో వెయిపాళ్ల పాలికి నెయిద, వసుపురాణము బ్రాహ్మణాదులు వినరె. పండితా. దీక్షా. 17 పొ.

3. అనుకూలమగు.

సీ. ...వెంద్రుకలు కొప్పునకు నెయిద. హరి. పూ 6. 177. (చాలఁగా, అందఁగా అని భావము.)

4. పోవు. చను.

ఆ. అనిన నట్లు కాక యని కౌర యరిదంబుఁ, ద్రిప్పి యాత్మ సేనదిక్కు వోవ, నిచ్చట యును వెనుక నెయిది సంశప్తకులార్పి పేర్చి కురిసి రస్త్ర సమితి. భార. ద్రో. 1. 388.

సీ. గమనించుతఱి మందగమనల్పఁ గా రాప్తి నంటు వాయక వెంట వెంట నెయిదు. శుక. 1. 301.

క. జ్ఞాని యగువాఁడు భక్తి విహీనుం డగునేని ముక్తి కెయిదఁడు. శివ. సా. 248.

జ: ఎయిదించు.

**ఎయ్దు** – ఎయిదు.

(వెళ్లు.)

చ. ...ఇప్పుడ వెసన్ మన మెయ్దక తక్కినం బకు. ప్రచయము దప్పిపోవుఁ దుది భంగము సేగియు వచ్చు... భార. విరా. 8. 140.

(ఎగురు)

చ. హరిగరుడుండు బ్రహ్మకలహంసము నాఖచ రేంద్రులుం గర, బురవడి నద్రిపై కెగుర నోపక తత్పృథుపాగపంక్తిపై, నిరవుగ నిల్చి నిల్చి తుది కెయ్దిరి ...కు. సం. 7. 977.

**ఎయ్యది** – ఏయది, ఏది, ఎది, ఎద్ది. స. (ఏ + అది – త. ఎవ్దు, ఎదు.) 1. (శ) ప్రశ్నార్థకము.

ఉ. ఎయ్యది జన్మభూమి కుల మెయ్యది యెయ్యది యున్నచోటు పే, రెయ్యది మీర లిందులకు నిప్పుడు వచ్చినదానికిం గతం, బెయ్యది నాకు నంతయును జేర్పడఁగా నెఱిఁగింపుఁడు... భార. విరా. 1. 190.

(చ.) కాకువ్యర్థకము (లేదు అను తాత్పర్య మిచ్చును.)

గీ. స్వాస్థ్య మెయ్యది జలజాతుకకీర్తి మెఱసి, నాఁడె స్వర్గంబు గైకొనినాఁడు బలియె... దశా. 2. 78.

2. యచ్ఛబ్దార్థకము. (అది తచ్ఛబ్దార్థకము నపేక్షించును.)

ఉ. ఎయ్యది కారణంబుగ మహీపతియంచిత ధైర్యకంచుకంబయ్యతనుండు సించె నల రమ్ములచే నది కారణంబుగాఁ, దొయ్యలి రాజనందనునితోడన కూర్పఁ దలంచుచున్న యా, దయ్యమునెత్తికోలు తుదిఁ దాఁకుట గానఁగనయ్యె నయ్యెడన్. నైష. 1. 81.

**ఎర** వి. (క. ఎరె. త. ఇరై.) 1. పశ్వాదుల యాహారము, ఆహారము.

సీ. అగ్నిమండలి కర్థ మడ్డమైనంతనె యెంమాని మోము బిట్టెత్తి చూచి. కేకు లుండె. ఆము. 4. 181.

సీ. అర్ధరాత్రపువేళ నాఁకొని డస్సి నే నెర కునై యిట్టట్టు దిరుగుచుండ. నా. పంచ. 3. 322.

గీ. కుంభకునిముందఁ బుట్టినగోవృషంబు, లేదు నీ భూమి సస్యంబు లెల్లఁ దెలిచెఁ, గావ నలవిగా దెరికి దేవ యెరకుఁ, దెడితి మర యంగవలయు మాచేటు నీవు. హరి. పూ. 6. 125.

2. (భూతాదులకువేయు) బలి, ఆహుతి.

క. నరపతుల నెల్ల భీష్మున, కెరగా నొప్పింపఁ జాలనే నడవులకున్, మరలం బోయెద... భార. భీష్మ. 2. 8.

3. వ్యసనము.

చ. తిరుగుచుఁ బుట్టలం బొదలఁ ద్రిమ్మరు పాముల రోసి రోసి నిష్ఠురతర దీర్ఘదండమున డొల్లఁగ వ్రేయుచు వచ్చి వచ్చి యయ్యెర నొకడుండుభంబను నహింగని వ్రేయఁగ దండ మెత్తుడున్, హరిహరి యంచు డుండుభమహాహి భయంపడి పల్కు భార్గవున్. భార. ఆది. 1. 152.

(వ్యవ) వాఁడు దానియెరను బడి పోవుచున్నాఁడు.

4. ఆఁకలి.

సీ. ఆహార మాఁకలి యవనిపన్నగములు పరఁగుచు నుండును నెర యనంగ. అం. భా. 3. 64.

(అవనిపన్నగార్థమున 'ఎఱ')

జ: ఎరగొను, ఎరవేయు.

**ఎరఁగు** - ఎఱఁగు.

(ఉఱుకు, దూఁకు.)

ఆ. జంతదేవుఁడయ్యుఁ దరుణవయస్కునట్ల వని కెరఁగి పోయి యతని వ్రేసె. భార. విరా. 3. 217. (కరపా 'అవనికుఱికి పోయి' అని ముద్రి.)

సీ. ...మృగంబుపై కెరఁగుసింగముపోలెఁ గిట్టి సత్యేషుని గిటదంచి. భార. శల్య. 1. 379.

(నమస్కరించు)

ఆ. ఎట్టిరాజులును మహీసురోత్తము లెదు, రరుగుదెంచునప్పు డధిక భక్తి, నెరఁగి ప్రియము పలికి తెరువిత్తురు... భార. ఆది 7. 111. హర. 1. 6.

జ: ఎరఁగుడు.

**ఎర(ఱ)ఁగుడు** వి. (√ఎర-అ-ఁగు.) నమస్కారము.

సీ. మ్రొక్కు దండము కేలుమోడ్పెరఁగుడు నాఁగఁ దెవ్వొందును నతి... అం. భా. 2 175.

**ఎరగ(వ)లి** వి. దావాగ్ని, కార్చిచ్చు; అగ్ని.

చ. ఎరగలిచిచ్చు కాఱడవి యెల్లను బెల్లుగ నొక్కపాయగా, దరికొని రూపడంచిన విధంబున... భార. భీష్మ. 2. 5.

క. ఎరగలి యెండినయడవుల, దరికొను చందంబు మిగుల... భా. రా. యు. 1822. యయా. 5. 8.

ద్వి. కఱకంఠునెరగలికనుచూపు మగుడ, నఱ కాఱ నయనసహస్రములూపి. ద్వి. పరమ. 137. పా. 11. పం.

ఎరవ(గ)లులువోవు-దవాగ్నులచే మండు.

గీ. కనక భూషణజాలంబు కతన గజము లెరవళ లువోవు కొండల నెనసి యొప్పె. భార. భీష్మ. 1. 88.

**ఎరగొను** స. క్రి. (ఎర+కొను.) ఎఱఁగఁగొను, మ్రింగు.

క. ఉరగము నెరగొనుగరుడుని, వెరవున నరు నణఁతు నని దివిజ వెస దాఁకెన్. ఉ. హరి. 5. 261.

సీ. సురపొన్న నెరగొన్న సొబగు పొక్కిలివాని ... కృ. శకుం. 2. 45. (ఇటపొపమ్య మును దెలుపును)

అ. క్రి. 1.—ఎరనపేక్షించు — ఆఁకలిగొను.

ద్వి. నీలకయును నిన్ను నీలంధుజములఁ, గాలుచు నోరి రాఘవుకోపవహ్ని, యెటిఁ గియు విషమిట్టు లేల క్రోలెదవు, ఎరగొన్న పెనుఁబాము నేల త్రొక్కెదవు రం. రా. అర. 181 పొ. 18 పం.

ద్వి. కోపంబు చలమును గోలలుగాఁగ, నేపటి యుండుచే యెరగొంట గాఁగ. రం. రా. యు. 293. పొ. 14. పం.

(ఎలగొను - కోపగించు. అని శ. ర. కాని రెండవ ప్రయోగమునుబట్టి ఆయర్థము సరి పడ దని తోఁచుచున్నది. మొదటి ప్రయోగములో రేఫశకటరేఫములకుఁ బ్రాస మను కొనవలెను.)

2. మత్తెక్కు.

వ. ...మృణాళంబు లాహారంబులుగ మెసంగి యెరగొని సుఖించు రాజహంసంబులుం గల పులినస్థలంబులవలనను... మైరా 2. 74. (ప్రయోగాంతరము లేదు.)

**ఎరబిల్లపురుగు** వి. క్షుద్రజలజంతువిశేషము.

సీ. మలిగుల్ల యెరబిల్లపురుగు గోఁదురుగప్ప కప్ప కత్తిరి యెండ్రకాయ జలగ. హంస. 4. 186.

**ఎరవు** వి. (క. ఎరవు. త. ఇరవల్.) కొంతకాలము వాడుకొని తిరుగ నిచ్చుటకు అడిగి తెచ్చికొను సొమ్ము.

క. ఇమ్ము వరేశ్వర మాతుర, గమ్ములు నీకార్య మయ్యెఁగాదే కడులో, భమ్మున నొండ్లవి సొమ్ములు, సొమ్మనినన్ వచ్చునే యెరవు నత మగునే. భార. అర. 4. 147.

గీ. అరయవచ్చినఁ దన మేను నెరవ తనకు, నొండు రూపులు దక్కఁగ యునికి యగుదె. భార. స్త్రీ. 1. 33. (ఇట 'ఎరవువంటిది, అనిత్యము' అని భావము.)

2. భేదము, అంతరిక.

క. గురుభీష్మాదులమనములు, దురమునకుం బొరక యుండ దుర్యోధనుఁ డాతురుఁడై యొడఁబఱుపఁగ నిప్పరుసున నెరవైన అచ్చపడు బలమెల్లన్. భార ఉద్యో. 1. 58. (శ. ర. పా.)

గీ. ఇంత కాలంబు నాతోడ నెరవు లేక, కూడి యుంటి వటుగాన గోప మెల్ల నుపశ మించితి నీ వింక నుండవలదు, పొమ్ము పో కుండితేని యిప్పుడ శపింతు. వి పు. 2. 244.

విశే. 1. ఎరవయినది.

చ. హరి గలుగంగ నేటికి భయంబున వచ్చితి నీదు గాండివం, బెరవుగ నిచ్చి నీవు నొగ లెక్కి హరిన్ రథిఁ జేయఁగన్న నిష్ఠుర భుజ విక్రమోగ్రుఁ డగుసూతతనూభవుఁ దత్ప్రహాయులం, బొరిగొనఁడే సుయోధనుని పోఁడిమి దూలఁగ నొక్కమాత్రలోన్. భార. కర్ణ. 3. 65.

ఉదా: ఎఱవునగ, ఎఱవులిందె, మొ.

సా: ఎరవుసొమ్ము బరువుచేటు.

2. అన్యము, లాఁతి, అపరిచితము.

వ. మమ్మెరవుగాఁ దలంచి యియ్యోజ నిట్టట్ట నవలవదు. భార. విరా 3. 184.

3. విలక్షణము, వికృతము, విపరీతము; అస్వ స్థము.

క. కని యల్లల్లన యచటికిఁ, జనుచు నిరూపించి యతని చందము దనవెఱ్ఱనమున నెర వయి తోఁచిన, మనుజేంద్రుఁడు చేర వచ్చి మధురోక్తిమెయిన్. నిర్వ. 10. 72.

క. మఱగినకాలమృగంబులు, దిరుగుడువడు తెలుగుఁ జూచి ధృతి గలఁగఁగ నన్నరపతి బహువిధముల వచ, నెరవయి మునికూర్మ్య

మగుట నింపక యున్నన్. భా. రా. అయో. 279.

మ. ...మురారి సుఖయై పేమంబుతో నుం డునా, యెం త్రై యున్నది చిత్తమీశ్వర కృతం బెట్లోకదే మారుతీ. భాగ. 1. 328.

4. అసక్తుండు, తగులు చెందనివాండు.

క. నరనాయక నీయేలెడు, పురమున భూమిని మమత్వబుద్ధి గలుగక శీ, ఘ్రెర వై యుండుట కుం గతం, బరయంగ వెద్ది... భార. అశ్వ. 2. 91.

ఎరవిచ్చు — ఎరవుగానిచ్చు.

చ. ఇనుండు ప్రభావిలాస మెరవిచ్చెనొకో యన మేనంబొల్చు నూ.తనమణిభూషణద్యుతివి తానము గ్రమ్మంగ... పి. శకుం. 4. 142.

ఎరవుదెచ్చు — ఎరవుగాందెచ్చు.

సీ. చిక్కంచెు యెరవుదెచ్చెద నంచుం జని యిచ్చుం గమనాతురున కింపుకొంగిలింపు. శుక. 2. 268.

ఁజ: ఎరవుపడు, ఎరవుసేయు.

ఎరవుపడు అ. క్రి. (√ఎరవు) భేదపడు; కల హించు

వ. అట్టియెడ సహదేవుం డా త్రై నేయు మద్దే శించి... మీలో మీ రెరవుపడం దగునే యలుక దక్కు మమనెడ.... భార. ద్రో. 5 371.

ఎరవుసేయు స. క్రి. (√ఎరవు) అన్యముగా భా వించు, వేఱుసేయు; ఉపేక్షించు.

సీ. .... నెటిలేక నీతోడునీడయై గెడగూడి పంగిన వన్నింత యెరవుసేసి. కు. సం. 5. 602.

గీ. పను మీచెలి నిం తేల యెరవుసేయ, వింత వారై వ మొఱ యాలకింతు రకట, ప్రాణ సఖులరు కావరె ప్రాణ మిచ్చి, మమత విడు వక మాన్పరే మధుపబాధ. పి. శకుం. 2. 75.

ఎర(చే)సేయు స. క్రి. (√ఎర.) ఎరగాంజేయు, బలియిచ్చు.

చ. అతని శిఖండిబాణముల క ఘ్లెర సేసితి ... భార. కర్ణ. 3. 120.

సీ. లోనగ ఘ్లె ల్లం బెల్లుగ నగ్గి కెరచేసి...అచ్చ. రా. సుం. 172.

ఎరియు అ. క్రి. (త. ఎరి.) 1. దగ్ధమగు, మండు, కాలు.

సీ. కమలజుపాశంబు గాలావుం ద్రాడుగాం గాలోగ్ర దండంబు గడయుంగాంగ...అది మత్స్య కూర్మములం దిగిచి. గీ. హరులలా టాగ్నిలోపల నెరియంబెట్టి, నమలు నిజభుజ భూరివిక్రమము మెఱయ. కు. సం. 10. 585.

క. గురుకర్ణులయ స్త్రాగ్నుల, నెరిసినయది మున్ను దీని నిటుగాకుండన్, భరపడి రక్షించితి నం,గరము దెగినం దొలంగి యుపుడు గాల విడిచితిన్. భార. శల్య. 2. 387.

శ్లో. ద్రోణకర్ణాస్త్రనిర్దగ్ధః పూర్వమేవాయ మర్జున. మదాస్థితత్వాత్సమరే న విశీర్ణః పరంతప. ఇదానీం తు విశీర్ణోయం దగ్ధో బ్రహ్మాస్త్రతేజసా. భార. శల్య. 68. 18, 19.

2. పరితపించు, బాధపడు.

క. పరులధనమునకు విద్యా,పరిణతికిం దేజము నకు బలమునకు మనం,బెరియంగ వసహ్యా పడు న,న్నరుండు దెవులులేని వేదనం బడు నధిపా. భార. ఉద్యో. 2. 58.

గీ. క్రోధమోహనామకు లైన ఘోరశత్రు, లిరువు రెరియించుచుండుదు రెపుడు నంత, రంగ మయ్యుభయంబు నడంగకున్నం, గలదె యూరక బ్రాహ్మణ్యగౌరవంబు. భార. అర. 5. 23.

క. శర వేదన సర్వాంగము, నెరియంగ నా కిపుడు పెదవులెండెడుం దృష్ణా,భర ముడు పంగదగ నీరులు. వెరవునం దే నేర్తువేవ వే తెమ్మనఘా. భార. భీష్మ. 3. 429.

3. నశించు, చచ్చు.

క. కౌరవులు దమదురితమునం,దా రెరిసిరి కల్మషంబు దావం గలదె భూ,భారము వహింపు బహుయ,జ్ఞారంభణ మాచరింపు మఖిలహితముగా. భార. శాం. 1. 105.

తోదకవృత్తము. తమతమ తప్పులం దా రెరి యంగా, విమలమతీ యిటు వీరికి నై శోక

మున దహింపఁగఁగాదు మనంబుగా. భాం. స్త్రీ. 1. 81.

జ: ఎరివు.

**ఎరివు** వి. (√ఎరియు - త. ఎరివు.) తాపము, బాధ.

ద్వి. అరయంగ నీయిచ్చువరములు సాలు, నెరివు మాన్పఁగవే యేమియు నొల్ల. బస. పు. 1. 861. (ప్రయోగాంతరము లేదు.)

**ఎరువంటి** వి. వంజెచెట్టు (శ. ర.)

**ఎరువాటు** వి. (√ఎరువు) ఎరువు.

సీ. సిరివుఁగప్రపుదుమ్ము మగువంపుఁబాదుల కెరువాటు వైచిన యింపుసొంపు. రా వి. 3. 81.

**ఎరువు** వి. (క. ఎరుబు - పేఁడ. త. ఎరు.) భూమి బలపఱుచుటకు వేయు పేఁడ మున్నగు దోహద పదార్థము; అటువంటి పదార్థము.

సీ. ఎలమిఁ గస్తురిబూదియెరువునఁ బెరిఁగిన సంపెంగ యున్నదే చంద్రవదన. విక్ర. 5 19.

సీ. ...సికాయయెరువున జిడ్డువిడిచి. హర. 2. 107. (ఇట 'అటకలి' అని భావము.)

జ: ఎరువాటు.

**ఎరుస** వి. దీనారభేదము, ఒక విధమగు నాణెము.

సీ. ఎడబెట్టవంగను నెరుస నా టారిముద్ర యన దీనారభేదములు చెలఁగు. ఆం. భా. 2. 274.

**ఎరుసు** వి. (సం. ఈర్ష్య) ఈసు, అసూయ.

ఆ. వారిలోన నగ్రవనజాక్షి చల్లాంబ, మఱియుఁ జిన్న పొలఁతి మల్లికాంబ, సవతు లెరుసు లేక సతతంబు మెలఁగుచు, సవతులేక యుంద్రు సమ్మదమున. రాజశేఖరవిలాసము. 1. 64.

**ఎర్కు** - ఎఱుకు. వి కిరాతుఁడు, వ్యాధుఁడు.

మ జననం బాదిగ నాలలోఁ బెరిఁగి సంస్కారంబు నాచారమున్, ఘనవిద్యాగ్రహణంబు లేక యడవిం గాఁ బెర్కుచందంబ నన్...హరి. పూ. 9. 1'5. కు. సం. 6. 692.

**ఎర్గు** - ఎఱుఁగు.

గీ. తద్జ్ఞనం దెర్గవగుఁ గవితావిశేష, మజ్ఞనం దేమి యెఱుఁగంగనగు సమస్త, కనకవర్ణోత్కరం బొరగంట నొరసి, చూచితా కెర్గ వచ్చునే సుద్దరాత. కు. సం. 1. 32 (వ్రాత ప్రతి.)

ద్వి. వలఁతులై మనుజు లెవ్వరు నెర్గకుండ. రం. రా. ఉ. 117. పొ. 20. పం.

**ఎఱ** - ఎఱ్ఱ. వి. 1. వానపాము, మహీలత, గండూపదము.

గీ. ఎఱల పెనుపట్టె నేలపైఁ గొఱలఁ జొచ్చె. విక్ర. 4. 27.

2. అరుణిమ, ఎఱుపు, రక్తిమ.

సీ. ఈఁగ మిక్కుట మయ్యె నెఱ నింగిఁ గడు మించె నిడుదలై తిలకించె నీరుకాళ్లు. హరి. పూ. 7. 160. ప్రబంధ. 78.

విశే. ఎఱ్ఱనిది, అరుణము.

క. ఎఱమంట లుమియు చూడ్కులఁ, జూఱ చుఱఁ జూచుటయు...హరి. పూ. 2. 66.

ఉ. నెత్తుటఁ దోఁగి నేల యెఱనింగి తెఱంగున నుండె నక్కుమారోత్తముఁ డందుఁ జంద్రుక్రియ నొప్పె ... భాం. ద్రో. 2 127.

జ: ఎఱగందు, ఎఱగన్ను, ఎఱమట్టి, ఎఱసంజ.

**ఎఱుఁగు** - ఎరఁగు అ. క్రి. (క. ఎఱగు - దిగు. త. ఇఱంగు - దిగు.)

1. (మీఁదికి) ఉఱుకు, దూఁకు.

క. వితిగినయలువులతునియలు, మెఱచుచు దివి కెగయఁ దొడఁగె మింటికి వడిఁ బోం, గెఱఁగెడు వీరుల వెనుచని, యొఱకలుగొని క్రమ్మఱింప నెగయువిధమునన్. కు. సం. 11. 739. (ఇట 'ఎగయు' అని భావము.)

2 వ్రాలు, దిగు.

ఆ. దానిమీఁదనుండి వాని రెంటిని భుజింపంగ మదిఁ దలంచి పంచయోజనములు నిడుపు గల్గు రమణీయశాఖపైఁ, గరుడుఁ డెలమి నెఱఁగెఁ గురువరేణ్య.

క. ఎఱఁగినయప్పెమ్ప్రేఁగున, విఱుగుటయును ....భార. అను. 1. 236, 237.

గీ. కరులదానంబులకు మధుకరము లెఱఁగి, కుంజరమ్ములు నీటిలోఁ గ్రుంకియున్న,మీఁద సుడియుచు నుండెఁ దుమ్మెదలు వాయ, కుదధి కెఱఁగిననీలనీరదము లనఁగ. కు. సం. 1. 96.

3. అభిముఖమగు, ప్రవణమగు.

గీ. నెఱయ రసవంత మగుకృతి కెఱఁగ నేర, రల్ప రసకృతి కెఱఁగుదు రల్పు లెల్లఁ, జెఱకు విడిచినరసమున కెఱఁగి రాక, పిప్పి కఱిగెదు నీఁగల పెల్లువోలె. కు. సం. 1 50.

4. నమస్కరించు.

సీ. ...తండ్రికి రేపు మ్రొక్కి యాచార్య విప్రులకు వరుస; మఱి మ్రొక్కునది వీరి కెఱఁగుట తక్క దేవార్చనంబునకు మున్న నుర్వీకదకుఁ,జనఁ గాదు.... భార. అను. 4, 105.

సీ. అతనియున్నెడ కప్రకాశతఁ జన్న నెఱిఁగి యమ్మహిశాత్ముఁ డెఱఁగిభక్తిఁ, బూజించి ...భార. అను. 4. 348.

**ఎఱక** వి. (√ఎఱఁగు ? క. ఎఱకె. త. ఇఱగు,ఇరక్కై) 1. పక్షిఱెక్క.

క. ఎఱకలు విచ్చుచుఁ దుండము, తెఱచుచు వ్రేఁగడరి నొగసి త్రెళ్లి వివశుఁడై : యఱచిన నోడకు మని హరి,నెఱి నక్కఁగఁ దోచి యెత్తె నెగయ గఁగృపన్. భార. ఉద్యో. 3. 301, కర్ణ. 2. 72.

2. భుజము.

ద్వి. చంద్రహాసం బెత్తి జానకి వ్రేయ నింద్రారి గమకింప నెఱకలు వట్టి. రం. రా. సుం. 252. పా. 7. పం. (శ. ర.)
('జానకి నేయ,నింద్రారి గమకించునెడఁ గేలు వట్టి' ముద్రి.)

**ఎఱగండు** వి. (√ఎఱ) నెత్తురుకందు, శేతబిడ్డ.

చ. ... కరుణయొకింత లేక యెఱగందుల దేవకి గన్నయార్వురన్ ...చంపెఁగంసుఁడు ...హరి. పూ. 5. 106.

**ఎఱగన్ను** వి. (√ఎఱ) 1. ఎఱ్ఱనికన్ను, మద్యపానాదులచే ఎఱ్ఱఁబడినకన్ను. మనుచ. 6, 44.

2. శివుని యొక్క యగ్ని నేత్రము. శివుని మూఁడవకన్ను.

చ. హరునెఱగంట భ్రమ దిన లతాంతశరుఁగా... వరాహ. 11. 37.

క. వెలిపట్టును బలితోలును, మలయజమును భూతిపూఁత మణులుఁ ఫణులున్, దిలకము నెఱగన్నుఁగ గల, వెలఁదియు మగవాఁడు నైన వేలుపుఁ గొలుతున్. ద్వా. 7. 107.

**ఎఱగొయ్యి** వి. క్షుద్రతృణవిశేషము. హంస. 5. 45.

**ఎఱచి** వి. మాంసము.

క. ఉఱ వగు నారుగపంటలు, గొఱియలపాఁడియును దఱ చగుం బురుషులకుం,దెఱవల చుట్టము లయ్యెద, రెఱచియ భుజియింతు రర్థి వెల్లజనంబుల్. భార. అర. 4. 295.

ద్వి. మఱి యట్లుగాక నీమవసువచ్చినను, నెఱచులుఁ గఱకుట్టు లెన్నేనిఁ గలవు. బస. పు. 3. 662.

జ. ఎఱచిదిండి, ఎఱచిమేపరి.

**ఎఱచిదిండి** వి. (√ఎఱచి) క్రవ్యాదుఁడు, రాక్షసుఁడు; రాక్షసి. అచ్చ. రా. అర. 121.

**ఎఱచిపిడుక** వి. చోరపుష్పి (వృ. వి.)

**ఎఱచిమేపరి** – ఎఱచిదిండి. అచ్చ. రా. కిష్కిం. 66.

**ఎఱబఱము** వి. ఎఱబఱికము, రోఁత.

సీ. ఈరీతిఁ బుట్టినయింటికిఁ జొచ్చినయింటికి నెప్పుడు నెఱబఱంబు. గీ. నేయకాయంబుతో నుంట సిగ్గుగాదె. వరాహ. 6. 3.

వి.అ. అసహ్యము, రోఁతకలిగించువది.

క. నిపుణుల చెవి కెఱబఱమగు, నుపమలు వొక కొన్ని గలవ యొక్కొకచోటన్, ఉపవోలె జముఁడు కృష్ణుఁడు, విపినంబువలెఁ వనధి విపులం బనఁగా. కావ్యా. 5. ఉల్లా. 18.

జ: ఎఱబఱికము

**ఎఱబఱికము** వి. (√ఎఱబఱము) 1. రోఁత. అసహ్యత.

క. కాంతామణియును జంద్రుఁడు, మంతన మునఁ దెలఁగి మెలఁగుమార్గముఁ జూడన్, వింతగఁ దోఁచిన మది నొ,క్కింతయునున్ సంశయించి యెఱబఱికమునన్. శశాం. 4. 10.

2. భేదము, అరమరిక.

చ. అఱమర యేల నే నిలుచునాశ్రమదేశము నీదె కాదె నీ,కెఱబఱికంబు లేక యుఁక నిచ్చట నున్న తపస్వికాంత లం,దఱు నుచితోపచారము లొనర్పఁగలారు వివేకశాలి నుల్. ఉ. రా. 6. 312.

**ఎఱమట్టి** వి. (√ఎఱ) అలంకారముగా గోడలకుఁ బూయు నొకవిధ మగు ఎఱ్ఱ మన్ను, జేగుఱు మట్టి.

సీ ఎఱమట్టిపూఁతచే మెఱుఁగారు గోడల ... వైజ. 4. 80. హంస. 1. 161.

**ఎఱసంజ** వి. (√ఎఱ) సంధ్య (సాయంసంధ్య, ప్రాతస్సంధ్య)

క. అఱిముఱిని గ్రుంకుమలపై, నెఱసంజను గ్రమ్మినట్టి యెంవలిసెగ బి,ట్టఱిమినఁ జని వడిఁ గ్రుంకెన్, బఱపున వనఁ బ్రొద్దు గుంకెఁ బడమటికడలిన్. యయా. 5. 8.

సీ ఎఱసంజకెంజాయ కెదురు మొగ్గనముళై కమపట్టు వల్కలాగ్రములు దూల రామా. 5. 114.

**ఎఱిఁగించు** స క్రి. (√ఎఱుఁగు) ఎఱుఁగఁజేయు. (ప్రకటించు)

సీ. ...ప్రాసశక్తి,కుంతతోమరగదా కుశలత్వ మెఱిఁగించువారునుగా నిట్లు వసుధలోన

ఆ. రాజసుతులతోడ రమణఁ బాండవధృత, రాష్ట్రసుతులు వృద్ధరాజులొద్దఁ, దద్దయును ముదమునఁ దమతమవిద్యలు, మెఱసి రెల్ల జనులు మెచ్చి పొగడ భార. ఆది. 6. 11.

గీ. చిత్రజుని శౌర్య మెఱిఁగించెఁ జిత్రశాల. క్రీడా. 191.

(తెలియఁజేయు.)

క. అన విని తగుమాటల నా,తనికొందలపాటు పాండుతనయుండు గ్రమం,బున డిందు పఱిచి యందము, సనఁగా నెఱిఁగించి పట్టి శంఖము మఱియున్. భార. విరా 4. 178.

క. ...అ,ప్పావకుఁడు నీలకేతున, కేవిధమున నల్లుఁడయ్యె నెఱిఁగింపు మనన్. జై. భా. 4. 34.

(నేర్పు, అభ్యాసపఱుచు)

వ. క్రేపులం గొవని యావులం దొలఁగం గట్టి పిల్లు వెట్టియు మందులు సల్లియుం జాల దుఃఖపఱిచి చేఁ బెఱిఁగించువారును ... హరి. పూ. 5. 142.

**ఎఱుఁగు** – ఎర్గు. స. క్రి. (క. త. మ. అఱి.) 1. తెలియు.

క. ...ధర్మం, బెఱుఁగుచు నెఱిఁగినదానిని, మఱవ కనుష్ఠించునది సమంజసబుద్ధిన్. భార. 3. 203. కు. సం. 6. 701.

2. నేర్చు, అభ్యసించు.

క వేదములు తదంగంబులు, వేదాంగప్రముఖ నిఖలవిద్యలును ధను,ర్వేదము నెఱిఁగిరి.. వాసిష్ఠ. 1. 68.

క. నీతి విచారించినచో, జాతుఁడయి దెల్ల విప్రజాతికిఁ బతి లే, దేతఱి జాపఁడ వయ్యును, నీ తెఱఁగున దొంగిలింప నెక్కెఱిఁగితిరా. వి ప్ర. 5. 86.

3. అనుభవముచే గ్రహించు; అనుభవించు.

క. హరికులిశహతి యెఱుఁగని, గురుతర పక్షములతోడికులగిరివోలెఁ, గరుడుండు గగనగతి నుగ్ర, తరజవమున నరుగుదెంచి తల్లికి మ్రొక్కెన్. భార. ఆది 2. 41.

సీ. సంతోషహృదయులై సాంద్వకాలంబును దుఃఖ మెఱుఁగను....వి. పు. 3. 61

వినియెఱుఁగఁడు – వినలేదు.

చూచియెఱుఁగఁడు – చూడలేదు.

క. ...ఇట్టిసభన్. మానవలోకేశ్వరులం, దెన్నఁడుఁ జూచి వినియు నెఱుఁగ ధరిత్రిన్ భార. సభా. 1 58.

చొచ్చి యెఱుఁగఁడు – చొచ్చుట యెఱుఁగఁడు, ప్రవేశించినవాఁడు కాఁడు. భార ద్రో. 2. 141.

తన్నుఁ దా నెఱుఁగక – స్మృతి తప్పి; అవి వేకి యయి.

వ. దేవా యీవేళ కావ్యజనాథుండు ప్రాభవాభిమానంబునఁ గన్నుఁ గానమిఁ దన్నుఁ దా నెఱుంగకున్నవాఁడు. ప్రభా. 1. 117

(వ్యవ) వాఁడు ఒడలెఱుఁగక తిరుగుచున్నాఁడు.

ఎఱిఁగి యెఱిఁగి (ఎఱిఁగి + ఎఱిఁగి - కృ ళార్థమునం దామ్రేడితము.) – బాగుగా తెలిసి. భార. అర 3. 321.

జ: ఎఱిఁగించు, ఎఱుక, ఎఱుకచేయు, ఎఱుకత, ఎఱుకపడు, ఎఱుకపఱుచు, ఎఱుకసాని, ఎఱుకువ.

**ఎఱుక** వి (√ఎఱుఁగు-క అఱికె. త. అఱికై క.)

1. తెలివి, జ్ఞానము.

క. ఎఱుక గలవారి చరితలు, గఱచుచు సజ్జనుల గోష్ఠిఁగదలక... భార. ఆది. 3. 208.

2. స్మృతి.

ఆ. ఎల్ల వారు నెఱుక లెడలి చొక్కి నిద్రాతిశయము గూరినట్లుగై రి... భార. విరా. 5. 208.

3. ఆనవాలు, చిహ్నము. గుఱుతు.

క. పురహార్మ్యవిహారిణు లగు, తరుణుల వదనములతోడఁ దడఁబడు నని పంకరుహాభవుఁ డెఱుక యిడెఁగాఁ గరయం గం దేల యిందునందు ఘటించున్. కేయూర. 1. 58.

సీ. కూడియుండుట కోర్చుకొనుటయ సూచనమన్నించుటకు మంచిమాట యెఱుక. నీతి. 25.

4. పరిచయము.

గీ. పూర్వసఖుఁడైన యాదవపుంగవుండు, మిమ్ముఁ బొడగన్న సిరు లెల్ల మిన్న కొసఁగు, నెఱుక పిడికెఁడుధన మన్న గుఱుతుమాట, తథ్యమే కాదె యెందైనఁ దాప సేంద్ర. కుచేల 1. 40.

5. సోదె.

క. ఇఱుకువలిగుబ్బచన్నుల, యెఱుకుంజవరాలొకర్తు యెఱుకో యవ్వా, యెఱుకో యని తన చందం, బెఱుకపడంగా హాజార మెల మిం గదిసెన్. శుక. 1. 11.

6. జోస్యము.

గీ. రాజునకుఁ గీడుపుట్టెడు రాజ్యమడఁగు, ననుచు నెఱుక చెప్పెడు జ్యోతిషాధములను, గుడుపు కొలకు విప్రాకృతి గొన్న శూద్రుఁ బణసహస్ర దండము గొనఁ జాడి గలదు. విజ్ఞా. ప్రా. 187.

**ఎఱుకచేయు** స. క్రి. (√ఎఱుక) 1. తెలియఁజేయు, తెలుపు.

ఆ. ద్వారపాలు రచట వారింప శాంతిమై, నూరకున్నఁ జూచి వారు వెఱచి, లోని కెఱుక చేసి లోఁగుచువారు దన్నను పనరిగె నృపగృహంబు సేర. భార. శాం. 6. 263.

ఎఱుక చేసికొను – సరకుచేసికొను, లక్ష్యము చేసికొను.

క. మొదలె సివవెట్టి యటుపయి, ముది మదివెసఁ దప్పి కోపమున నాడిన నీవది యెఱుకచేసికొని యలుగుదువా నేఁ గాక యామె గుఱుతా నీకున్. వైజ. 4. 59. (ఈ యర్థమునఁ బ్రయోగాంతరము లేదు.)

**ఎఱుకత** వి. (√ఎఱుక) సోదెచెప్పు స్త్రీ

క. ఎఱుకత యిట్లని యెను నా, యెఱుకయ జీవనము జనుల కెల్ల ...వేం. మా 5. 9.

**ఎఱుకపడు** అ. క్రి. (√ఎఱుక. త. అఱియప్పడు.)

1. తెలియు, విదితమగు; స్పష్టమగు, ప్రకటితమగు.

క. ...పెన్నిధిగును గాడ్పును జనులకుఁ, బడుటయు వీచుటయు నెఱుకపడియెడు భంగిన్. భార. ఆది. 6 113.

ఆ ...ప్రథమపుత్రస్నేహ, మెఱుకపడకయుండ నింతియుండె. భాం. ఆది. 6. 61.

క. అలయుపమేయము ఛన్నత, నలరఁగ వారోప్యమాణ మగునుపమానం, బిల నెఱుక పడఁగ భ్రాంతిమ, దలంకరణ మయ్యె దీని నాపాదింతున్. వరప. 5. 56 నిర్వ. 7. 121.

2. అనుభవించుచున్నట్లు తెలియఁబడు

గీ. అధిక దుఃఖ రోగార్తున కౌషధంబు, సురుచిరంబుగ భార్యయ చూవె యెందు, నౌవర భార్యా సమేతుఁడై యున్నవాని. కెంతలయ్యను నాపద లెఱుకపడవు. భార. అర. 2. 73.

**ఎఱుకపఱుచు** స. క్రి. (√ఎఱుకపడు.) 1. తెలియఁజేయు, బోధపఱుచు

గీ. ఇంక నీపయిఁ గరుణచే నెఱుకపఱుతు,సాంఖ్యయోగంబు విను మాప్రసంగ మనఘ. సీతారా. 2. 4.

2. ప్రకటించు.

వ. ...ఇంగితం బెఱుకపఱుచుకొని... ఆము. 5. 55.

**ఎఱుక(ల)సాని** (√ఎఱుక) – ఎఱుకత.

ఉ ఈముఖపంకజంబురుచులు ... సామజయాన యీయెఱుకసాని కిదేలయొ యింత యొప్పునే. వీర. 3. 176.

గీ. పల్కి రిట్లని తల్లి యాపట్టనమున, కొనర నెఱుకలసాని వచ్చినది దాని, నిటకు రప్పించి సుతకష్ట మేవిధమునఁ, దీఱునో తద్రవాస్యంబుఁ దెలియ నడుగు. వే. మా. 5. 11.

**ఎఱుకు-ఎరుక్క** వి. (త. ఎరుక్కు – చంపు.) కిరాతుఁడు, వ్యాధుఁడు.

క. ఎఱుకని యెఱుఁగక మిమ్మున్, మఱఁకువ మాఱొక్కన్న తప్పు వఱుపుఁడు...భార. అర. 1. 327.

మ బలుఁడుం గృష్ణుఁడు నాఁగఁ జెప్పఁబడు గోపాలార్భకుల్గాసిన స్థలిలోఁ గారెఱుకుం దనంబునన యింద్రాఁకం బ్రవర్తిల్లినారు... హరి. పూ. 9. 54.

'కిరాతభేదము' అని ఆం. భా. 2. 289.

జ: ఎఱుకెత.

**ఎఱుకువ** వి. (√ఎఱుఁగు – త. అఱి.) 1. తెలివి, జ్ఞానము. 2. అనురాగము.

వ. ...ఏను...సుతపుం డనువాఁడ నీ మృగి యందు బద్ధానురాగుండనై మృగరూపంబు ధరియించి దీనివెనుక వచ్చితి. నావలన నిదియు నెఱుకువ గలిగియున్న తఱి నీవిట్లు చేసితి... మార్క. 5. 241.

**ఎఱుకెత** వి (√ఎఱుకు.) కిరాతస్త్రీ.

గీ. ...ఎఱుకెత యనఁ గిరాతి గా నెనఁగుచుండు. ఆం. భా. 2. 108. (ఎఱుకత – అపముద్రి.)

**ఎఱుపు** వి. (√ఎఱ్ఱ) ఎఱ్ఱన, రక్తవర్ణము.

**ఎఱ్ఱ** – ఎఱ. వి. 1. వానపాము.

ఆ. అలయఁజేసి మలిచి యడిగండ్లు మలిగండ్లు, తిరిపెమిడెదుకటిక తేజరిల్ల, నెలమి మన్ను దినెడు నెఱ్ఱయై పుట్టును, విశ్వదాభిరామ.. వేమన. 8. 84.

2. ఎఱుపు, ఆరుణ్యము.

ద్వి. మిక్కిలియైన నీమీఁదికోపమున, నక్కన్నులం దెఱ్ఱ యమరినవాఁడు... వాఁడె పో రాముండు వనజాప్తకులుఁడు. రం. రా. యు. 332. పా. 16. పం.

రగడ. కన్నె చంటిముంటిగిఱఁ గన్నఁ గన్న తల్లి దిట్టు. నన్ను సకియ నిట్టు లేటి కంటి కంటి కెఱ్ఱ పుట్టు, వరాహ. 8. 92. (కంటి కెఱ్ఱ పుట్టు – కోపముగలుగు.)

(వ్యవ) నన్నుఁజూచిన వానికిఁ గన్నెఱ్ఱ. (కన్నెఱ్ఱ – అసూయ.)

3. నెత్తురు.

సీ. రక్తాభిధాన మెఱ్ఱ యనంగ నెత్రు నా నెత్తుర నంగను నెగడుచుండు. ఆం. భా. 2. 182.

సీ. పిను గీక పెనఁగినఁ బెద్దనొంపక యెఱ్ఱఁ బాఱించి....ఆము. 6. 78.

విశే. ఎఱ్ఱనైనది.

మ. ధర కెంధూళులు కృష్ణరాయలచమూ ధాటీగతిన్ వింధ్యగ,హ్వరముల్ దూఱఁగఁ జూచి తా రచటఁ గాఁపై యుండుటన్ జాలన,చ్చెరువై యెఱ్ఱనివింత చీఁకటులు వచ్చెన్ జూడరే యంచు వే,సొరిదిఁ జూతురు వీరరుద్రగజరాట్ శుద్ధాంతముగ్ధాంగనల్. మనుచ. 1. 88.

సీ. కన్పెఱ్ఱనెరలదీర్ఘవిలోచనంబులకడల తళ్కి స్ఫులింగంబు లురల. నైష. 7. 46.

క్రుడ్డెఱ్ఱ సేయు - కన్నులెఱ్ఱ సేయు. కోపగించు.

గీ. మున్ను కొన్నాళ్లు పలుగాకిమూఁకలోనఁ, గలసి మెలఁగిన తెఱఁగెల్లఁ గానిపింపఁ, జేడియలమీఁద క్రుడ్డెఱ్ఱ సేయ రాకు, కోయిలా యింక నీ యిల్లు గూలిపోను. నీలా. 3. 65.

జ: ఎఱుపు, ఎఱ్ఱకాంచనము, ఎఱ్ఱగంధము, ఎఱ్ఱగడ్డ, ఎఱ్ఱగన్నేరు మొ.

**ఎఱ్ఱకాంచనము** వి. (√ఎఱ్ఱ) వృక్షవిశేషము.

సీ. తెల్లకాంచనము తుందిల మెఱ్ఱకాంచనముప్పి తెల్లుప్పి నీరుప్పి యుప్పు. హంస. 4. 11.

**ఎఱ్ఱగంధము** వి. (√ఎఱ్ఱ) కుచందనము (శ. ర.)

**ఎఱ్ఱగడ్డ** వి. (√ఎఱ్ఱ) నీరుల్లి. (వృ. వి.) (శ. ర.)

**ఎఱ్ఱగన్నేరు** వి. (√ఎఱ్ఱ) చండకము. (వృ. వి.) (శ. ర.)

**ఎఱ్ఱగలిజేరు** వి. (√ఎఱ్ఱ) వర్షకేతువు (వృ. వి.) (శ. ర.)

**ఎఱ్ఱగిసె** వి. (√ఎఱ్ఱ) లాలసి. (వృ. వి.) (శ. ర.)

**ఎఱ్ఱగురిజ** వి. (√ఎఱ్ఱ) కృష్ణల. (వృ. వి.) (శ. ర.)

**ఎఱ్ఱగొల్ల** వి. (√ఎఱ్ఱ) ఒకానొక గొల్లజాతి (బ.) ఆజాతివారు. (శ. ర.)

**ఎఱ్ఱగోరఁట** వి. (√ఎఱ్ఱ) కురవకము. (వృ. వి.) (శ. ర.)

**ఎఱ్ఱచిత్రమూలము** వి. (ఎఱ్ఱ) ఓషధివిశేషము.

సీ. ...తిప్పతీఁగె విష్ణుక్రాంత తిం క్రెఱ్ఱచిత్రమూలము దొండతీఁగె ముల్లంగి...హంస. 4. 10.

**ఎఱ్ఱచీమ** వి. (√ఎఱ్ఱ) రక్తపిపీలిక. ఆము. 2. 70.

**ఎఱ్ఱచేమంతి** వి. (√ఎఱ్ఱ) రక్తసేవంతిక. (వృ. వి.) (శ. ర.)

**ఎఱ్ఱతుమ్మ** వి. (√ఎఱ్ఱ) రక్తారిమేదము. (వృ. వి.) హంస. 4. 9.

**ఎఱ్ఱతుమ్మి** వి. (√ఎఱ్ఱ) ఒకజాతికూరాకు. హంస. 4. 10

**ఎఱ్ఱతుమ్మెద** వి. (√ఎఱ్ఱ) గండోలి. (శ. ర.)

**ఎఱ్ఱతెగడ** వి. (√ఎఱ్ఱ) కాకనాసిక. (వృ. వి) (శ. ర.)

**ఎఱ్ఱదాసానము** వి. (√ఎఱ్ఱ) వృక్షవిశేషము. హంస. 4 11.

**ఎఱ్ఱన** విశే. (√ఎఱ్ఱ) ఎఱ్ఱనిది.

క. ఆకులు మిక్కిలి తెల్లన, ప్రాకటముగ వాని పండ్లు పచ్చన పుష్పానీకంబు లరయ నెఱ్ఱన. భా. రా. యు. 1600.

వి. ఎఱుపు, అరుణిమ.

**ఎఱ్ఱ(ని)వేలుపు** వి. (√ఎఱ్ఱ) 1. జ్వలనుఁడు, అగ్ని (శ. ర.) 2. అరుణుఁడు, సూర్యుఁడు. (చి. ని.)

**ఎఱ్ఱపులుము** వి. (√ఎఱ్ఱ) కుష్ఠభేదము (శ. ర.)

**ఎఱ్ఱపోతమ్మ** వి. (√ఎఱ్ఱ+పోతు+అమ్మ.) ఒకానొక గ్రామదేవత. ద్వా. 3. 21.

**ఎఱ్ఱపొలికి** వి. (√ఎఱ్ఱ) వృక్షవిశేషము. హంస. 4. 11.

**ఎఱ్ఱప్రత్తి** వి. (√ఎఱ్ఱ) రక్తకార్పాసము.

**ఎఱ్ఱమన్ను** వి. బొ. (√ఎఱ్ఱ) శోణమృత్తిక. (చూ. ఎఱ్ఱమట్టి)

**ఎఱ్ఱమల్లె** వి. (√ఎఱ్ఱ) ముచుంద. (వృ. వి.) (శ. ర.)

**ఎఱ్ఱమీను** వి. (√ఎఱ్ఱ) రోహితము (శ. ర.)

**ఎఱ్ఱమునగ** వి. (√ఎఱ్ఱ) మధుశిగ్రువు. (వృ. వి.) (శ. ర.)

**ఎఱ్ఱలొద్దుగు** వి. (√ఎఱ్ఱ) పట్టిక. (వృ. వి.) హంస. 4. 11.

**ఎఱ్ఱపాఱు** అ. క్రి. (ఎఱ్ఱ+పాఱు) 1. ఎఱ్ఱనగు. 2. కోపగించు.

సీ. ప్రతిఘటించు చిగుళ్లపై నెఱ్ఱపాఱినవిరితి నున్నవి వీని మృదుపదములు. మనుచ. 2. 36.

సీ. ... పాణిపాదము లె(దం జె?)ఱ్ఱపాఱఁ దొడఁగె.

గీ. అనుచు జాతినగరంబి బాల్యంబు జాతె. అము. 5. 7. (రెండర్థములకు నుదాహరణములు)

**ఎఱ్ఱాముదపుఁజెట్టు** వి. (√ ఎఱ్ఱ) హస్తిపర్ణి. (వృ. వి.) (శ. ర.)

**ఎల¹** విశే. (క. ఎళె త. ఇళై.) (దీనివృత్తిలోనే ప్రయోగములు కనఁబడుచున్నవి.) 1. లేతది, కోమలము.

సీ. ఎలదీఁగ...భార. విరా. 2. 158.

2. అభినవము.

సీ. ఎలజవ్వనము.... భార. ఆది. 8. 27.

3. స్వల్పము.

చ. ఎలనవ్వు. భార. శల్య. 1. 186. – మందస్మితము, చిఱునవ్వు.)

క్రి. విశే. స్వల్పముగా, కొంచెముగా.

క. ...అతం డెల నగుచున్. జై. భా. 5. 132

గీ. అతఁ బరకాలుఁ డెల చూచునాత్మభృత్యు, లీలఁ బెట్టియుఁ జెబుల్లు లిడియు మిగులఁ, దన్ను నెచ్చరింపఁగ నార్పి కాఁకె వారిఁ, గడు నడవిఁ జేర్చు నొక వాఁకకనుమలోన. పరమ. 4. 205.

జ: ఎలగోలు, ఎలదోఁట, ఎలనాఁగ, ఎలనీరు, ఎలపొఁప, ఎలప్రాయము, ఎలమావి.

**ఎల²-ఎడ³** విశే. ఎడమ, కుడికానిది.

గీ. ....యోధు,లెలమి నెలవంక వలవంక బలసి కొలువ. దశా. 1. 127.

వ. విలసిల్లు రామభద్ర విజయరాఘవేంద్రులు ఎలవంక వలవంక నెనసి కొల్వఁగను. రఘునా. 16. పొ.

**ఎల³** విశే. సాటి.

ఆ. ఎమ్మెకాఁడ యగ్గి యెల గాఁగఁ జెంచిలి, హైన చెలిని డించి యకట యొంటి, నేఁగఁ దగునె మీర తెలుఁగని నడవడు, లింకఁ ...ఋడమిఁ గలవె యేర్పరింప. అచ్చ. రా. అయో. 70. (ప్రయోగాంతరము కనఁబడ లేదు.)

**ఎలగోలు** వి. (√ఎల¹) 1. ప్రథమకృత్యము, మొదటిపని...

గీ. మనుజనాథ కుమారుండు మాయ యవ్వు, డర్పణము నేయు మధుపర్క మాదరించె, నానుదతీణకెమ్మోవియమృతరసము, క్రోలు సన్నాహమున కెలగోలుగాఁగ. సుద. 5 154.

2. ప్రథమయుద్ధము, తొలిపోరు.

మ. కలయంబర్విన చూపుతూపు లెలగోల్గావించి వేమించి య,య్యలినీలాలకయున్ విభుండు తమి బాహాబాహిఁ బోరాడఁగా, వలరాయండు ప్రసూనవర్షములతేవల్ చూపి నట్లయ్యె న,య్యలరుంబోఁడికిఁ గొప్పు వీడి వడి క్రందై క్రొవ్విరుల్ చిందఁగన్. రాజగో. 8. 25.

సీ ...గీర్వాణచమూసమూహములతో సేనాని యెలగోలు చేసి రాత్రించరసైన్యముల బారిసమరె నాదైత్యులు సురల మార్కొని యేపు చూపుచోట. వరాహ. 6. 114. ద్వి. పరమ. 4. 293. పొ. 18. వం.

3. ప్రథమ ప్రసారము.

గీ. దవుల జల్లనితూఱ నంతకు మునుపటి, జల్లు నీరూనివచ్చు నాజల్లు మొదలి,గాలి యెలగోలుచేఁ గొమ్మ కదలి జల్లు, తల పడకమున్నె వంగుల్లఁ దడిపెఁ దరులు. అము. 4. 130.

4 ముందటిసేన; కాల్బలము.

చ. కులగిరి రాజనందనుఁడు కూరమి నాథువ నాభినందితం, దలఁపఁ దలంపులోపలనె దర్పకకేతనవల్లనంబు లం,చల యెలగోలు నంబుజవిశాలశిలీముఖకాండవంబు లు,త్పలదళమండలాగ్రములు పైకొను నెట్టినొ తత్ప్రభావముల్. వసు 2. 114. (ఇది 'కలకలము'నకుఁగూడ నుదాహరణము.)

గీ. క్షాత్రవభయంకరోద్దండచండపటిమ, మెండు కొమచుండ నెలగోలు గండుమెఱసి. రంగా. 8. 34.

సీ. జింకతత్తడులతోఁ దెంకి నిల్వనికల్ల మేని త్రిమ్మరితేర్లు మెండుకొనఁగ ... పూఁదేనె తేట్లు పొగరుపోటులు... తెక్కునీలి... దాల్దాఁ దెలగోలు నడువ. గీ. నిట్టు...

ము లుద్ఘటము గాఁగ... ఉ. హరిశ్చ. 8. 12.

5. కోలాహలము. కలకలము, అలజలము; సంకుల సమరము, దొమ్మిజగడము.

ఉ. అల్లది కంటివే నృపకులాగ్రణి మంథమహీధరంబు రా,గిల్లెఁ బ్రఫుల్ల కింశుకవికీర్ణరుచిచ్ఛవి వికటిల్ల నీ, యుల్లసిత ప్రతాపదహనోగ్రశిఖావలి తాను మున్న య,బ్బల్లిదుఁడై వరక్కసునిపై నెలగోలున వచ్చెనో యనన్. రాజ. చ. 2. 44.

ద్వి. పదిలమై చోళభూపతివరూథినికి, నెదురుగాఁ జనుదెంచి యెలగోలుసేయ. ద్వి. పరమ. 6. 467. పా. 2. పం.

ఉ. .... అమరాసురసైన్యము లంత నెంతయున్, గోపము లగ్గలింప నెలగోల్ జగడంబునఁ జేరి చేరి... శశాం. 5. 19.

విశే. ప్రథమము, ముందటిది; సేనాముఖమునందుఁడునది.

సీ. ఎలగోలుజల్లు ము న్వెళపెళ నేటవాల్పడి గాలి నట్టిండ్లఁ దడిపి చనఁగ,నట్టి తో వడగండ్ల కట్టావులు కుమార మావులు రేఁచి రెండవదియుఁ జన. అము. 4. 91.

వ. ...ఎలగోలుచూపుల నితరేతరద్వైరథ్యంబులు గంటివడ... పారి. 2. 52.

ఉ. ...క్రొన్ననవింటివాని యెలగోలుదురంబొనరించి డస్సిన, ట్లున్నది మేను... శుక. 3. 175.

ద్వి. ...ప దెనిమిదివేలయెలగోలు ప్రజల... ఁఘునా 12 పా.

వ. ...ఎలగోలుమూఁకల గగ్గోలు కేకలకు... ఉ. హరిశ్చ. 3. 110.

క్రి. విశే. జోరున, పెద్దరొదతో.

సీ. పుష్కలావర్త కాంభోధర ప్రాతంబు లెలగోలు వర్షించు నెన్నఁడేని. కాశీ. 2. 51.

**ఎలదాయరక్కసుఁడు** వి. బిరుదవిశేషము. (శత్రు భయంకరుఁ డని భావము. ఇది పూర్వము కొందఱు సామంత రాజులు పెట్టుకొనుచుండెడి బిరుదము.)

వ. సప్తసహస్రావనీవల్లభ మల్లికావల్లభ ఎలదాయరక్కసవరబలకక్రకళ ... శ్రీమన్మహామండలేశ్వర పరిచ్ఛేదఅల్లాడనాథ దేవండు.... ద. శా. 4. 986.

**ఎలదాయసింహుఁడు** మి. వి. బిరుదవిశేషము.(శత్రువు లనుగజములకు సింహము అయినవాఁ డని తాత్పర్యము.)

వ. ఎలదాయసింహ విక్రమసింహ... నామాది ప్రశస్తిసహితంబున శ్రీమన్మహామండలేశ్వర కొండ పడ్మటిబుద్ధరాజు శకవర్షంబులు 1070 అగు నేంటి ... ద. శా. 4. 678, 663, 692.

**ఎలదోఁట** వి. (√ఎల¹) ఉద్యానము, ఉపవనము.

మ. ఎలదోఁటల్ వనముల్ వధూకుచములద్రీంద్రంబు లాఁకంటికిన్, ఫలముల్ వాతెఱలు....సంభోగంబు కై వల్య మం,దుల లీలారతి నుండు మానవులకు .... కాశ. 1. 21.

**ఎలనాఁగ** వి. (√ఎల¹) యువతి; స్త్రీ.

సీ నాదులావణ్యంబునకు నిచ్చ మెచ్చిన యెలనాఁగ పైఁబడ కేల నిలుచు. భార. విరా. 2. 335.

గీ. ...అయ్యెలనాఁగయు సంభ్రమం,బు, దెచ్చికొని తా నెఱుంగని తెఱఁగు దాల్చి. కార్యమున నున్మలించి పాంచాలి తోడ, నెలుఁగు వేఱొకభంగిగా నిట్టులనియె భార. విరా 2. 155. ఆం. భా. 2. 104.

**ఎల(ళ)నీరు** – ఎడనీరు. వి. (√ఎల¹ – త. ఇళనీర్.) లేఁత టెంకాయలోని నీరు.

సీ. ఎలనీటి బొండలంబులువోలె మెద దెల్ల జుట్టివైచిన డొల్లుపుట్టిగములు. అము. 6. 17.

సీ, ...ఎళనీరటం చనఁ జనుఁ దచ్చలాటు జలము...ఆం. భా. 2. 78

**ఎలపొర** వి. (√ఎల¹) పల్లవము, చిగురు.

చ. ఎలపొరవోనిమేని నవయించియు... భోగవృద్ధిని,ష్ఫలముగఁ జేసియుం దుదిఁ దపం

బున నయ్యెడి దేమి చెప్పుమా. కు. సం. 7. 872. (చూ. తేఁకొర)

**ఎలప్రాయము** వి. (√ఎల¹) జవ్వనము.

క. ఎలప్రాయ మిచ్చితిని నీ,కలఘుమతి యిచ్చె దను మదాత్మజ నుల్లం,బలరఁగఁ జెండిలి గమ్మని, పలికి మఱియు నాతపస్విపతి యిట్లనియెన్. భాం. అశ్వ 3. 76. (చూ. 79)

**ఎలమావి** వి. (ఎల¹+మావి) సహకారము, తియ్యమామిడి. (వ్యు. వి.) ఆం భా. 2. 45.

**ఎలమి** వి. (√ఎలము) 1. సంతోషము.

ఉ. కాననదేశవాసములఁ గాఱియ కోర్చి యడంగి యుండి మీ,పూనిక దీర్చి మీ రెలమిఁ బొందుట యెల్లను బుణ్యదేవతా, మానదయాసమృద్ధి నను నొందుటగాదె సురేంద్రనందనా. భాగ. విరా. 5. 346.

గీ. ఇవ్విధంబున నభిషేక మెలమిఁ జేసి. భాగ. ఉద్యో. 4. 159.

2. అనుగ్రహము, దయ.

గీ. సురనదియును గాలి దియు జెరసినట్టు, శాంతిపూరంబు శోభిల్ల శాంతమూర్తి, నామనంబు నానందమగ్నముగఁ జేయ, నెలమి సన్నిధి సేసె సర్వేశ్వరుండు. భార. విరా. 1. 12.

3. ప్రేమ, అనురాగము.

సీ. ఎలమి నమ్మెలఁత నన్నెలయింపఁ దివిరిన నెడఁద యానందంబునికి గాదె. భార. విరా. 2. 89

4. వికాసము.

క. అని పలికి గాఢనిశ్చయ,మున వదనం బెలమిఁ బొంద మును కలఁగిన నీ,మొన లెల్ల నొక్క మొగముగ,నొనరిచి తలకొలిపె భూమురోత్తముఁ డనికిన్. భార. ద్రో. 5. 42.

గీ. దానవుని వీటిలోన మార్తాండుఁ డెండ, యంతమాత్రంబ కాని కాయంగ వెఱచు, నెంతమాత్రము కానిన నెలమిఁ బొందుఁ, గేళిదీర్ఘికలందుఁ బంకేరుహములు. హర. 3. 6.

5. మనోవికాసము, వివేకము,

గీ. ఔర సకలంక మైనట్టి యబ్జమండ,లమున శృంగాబ్జమండల భ్రమ గడంగి, జలధిజల కరి తుండంబు సాఁచి తివియు, నే మనఁగ వచ్చు మత్తుల కెలమి గలదె. దశా. 1. 188.

6. పెంపు, అతిశయము, వృద్ధి.

క. అలుచైనను బగతుని దెసఁ,దలఁపు గలుగ వలయు ననిన దర్పోజ్జ్వలదో,ర్బలు లగు కౌంతేయుల మన, మెలమి కలిమి నచ్చి యిట్టు లేమఱ నగునే. భార. విరా. 3. 107.

క. హీనస్థానమున విభవ, హీనత నిట్లుండి రిపుల యెలమిఁ గనియు నీ,మానసమున శోకింపమి, దానవకులనాథ యెవ్విధంబునఁ గలిగెన్. భార. శాం. 5. 428.

7. ఉత్సాహము.

(అర్జునసాత్యకులకు సహాయునిగా భీముని పంపుట)

గీ. పెక్కుచోటుల నెఱిఁగిన యుక్కు లావుఁ, గలుగు నీతనిఁ బనుచుట కలుక నేల,యితఁడు గలయ నయ్యిరువుర కెలమి వచ్చుఁ,బనుతు నే నటు శోకంబు వాయవలయు. భార. ద్రో. 4. 181.

8. ధైర్యము.

గీ. శంఖభేరీరవంబులు సామజముల, బృంహితంబులు వింతలే వృథులసైన్య,పరిచయోదాత్తులగు నరపాలసుతుల, కెలమిఁ బొందుము దీనికి నింత యేల. భార. విరా. 4. 175.

**ఎలమికాఁడు** విశే. (√ఎలమి) ఎలమి కలవాఁడు. (శ. ర.)

**ఎలము** అ. క్రి. 1. వికాసమునొందు.

సీ. వంది కందిన నింతవఱలెడు ముఖరోచు లెలమిన నెంత సల్లలిత మగునొ. కు. సం. 7. 838.

2. ప్రకాశితమగు, చూపట్టు.

చ. జలజల దుల్లు పర్ణములఁ దప్పుడు లక్కడఁ జూడఁజూడఁ దై, నెలమెదు పల్ది మోములను నేర్పడు కెందలిరాకుజొంపముల్ ...

అదియెట్టివసంతవేగమో. కు. సం. 6. 787.

జ: ఎలమి, ఎలమికాఁడు.

**ఎలయించు** స. క్రి. ఎలయఁజేయు. (తీసికొనిపోవు.)

చ. ... దివ్యసౌఁధలతాగృహసీమల మేము డాఁగఁగా, మఱువులనుండి నీడలకు మమ్మెలయించి కలంచి దేహముల్, మఱచినఁ దేర్చి నూల్కొలిపి మన్మథలీలలఁ దేల్చుచందముల్. భాగ. 10. పూ. 1475.

చ. అనుటయుఁ గోపదీప్తహృదయంబున నానృపుఁ డమ్మురాంతకున్, వెనుకొని పాఱుచు డ యదువీరవరుం డెలయించుకొంచుఁ జయ్యన నొక శైలగహ్వరమునందుఁ బ్రవేశము చేసె... వి. పు. 8 19.

**ఎలయు** అ. క్రి. 1. ప్రవణమగు. ఉన్ముఖమగు.

గీ. రాజభావంబు తొడుసునఁ గ్రచ్చుకొన్న, మనసుతో నుండ కెన్నఁడో మఱి యింద్రి, యముల నిర్జించి సత్త్వాదు లవులఁ ద్రోచి, యేను శాంతిసుఖంబున కెలయు టవఘ. భార. శాం. 5. 395.

సీ. ...వేఁటకు నెలయు టఘము గాదు ... భార. అను. 5. 66.

2. లోనగు. వశమగు.

సీ. ఇంద్రియార్థంబుల కెలసినపురుషుండు గాఢరాగంబునఁ గరఁగుచుండు. భార. అర 5. 81.

సీ. హరిఁదెత్తుమే నీకు నమ్ముడు పడియుండ....

గీ. మదన సంహారుఁ డొక్కఁడు మాకు నెలసి, వచ్చు రాఁ డవుఁగా కెట్టినారినైన, నొరుల నొక బ్రేలిమిడిఁ దిరుల్ మరులుగొలిపి, శివయమే దేవి నీయట్టి దిము గలుగ.... కు. సం. 6 674.

3. ఒలయు, వ్యాపించు.

క. తనకొలఁది యెఱుఁగక యీ, దనుజుఁడు వనితావినోదతత్పరు నన్నున్, తెనసె నని యుగ్గడించుచు, వనిమిషరిపుమీఁదఁ బోరిఁ గటాక్షం బెలయన్. నిర్వ. 7. 60.

గీ. మధువుఁ గాంతలపుక్కిటిమధువుఁ బేర్మి, యార్ద్రతఁ బసమూపఁ బొగడపై నెలయ దాన, విరిసెఁ దొల్లిటిదళములు విరులు జడిసె, దీన సగ్గెల్పునకు నుబ్బి తేఁటు లార్చె అము. 5. 180.

4. ప్రవేశించు.

సీ. విను తొల్లి ధర్మవర్తనము లసహ్యంబులైన దానవులు మహాగ్రహమున, నరులయందెలసిన నరవర వారలు దర్పరోషముల నధర్మవృత్తిఁ, దగిలినఁ గలఁగె వేదములును గ్రతువులు.... భార. శాం. 5. 496.

వ. ఇట్లానష్టపూర్వద్విజుండు కష్టమార్గంబున నెలసి నెలఁతయుం దానును బ్రాలుమాలి ....పాండు. 3. 89.

5. కలుగు, పుట్టు.

గీ. అమరనిమ్నగానిత్యసేకముల నెలయు. జడల లేఁగెంపు విమలతఁ గడు మెఱయఁగ, మెకము తోలు విభూతి సమిద్ధతనుపు. నొండొకటి కందమై యొప్ప నొప్పువాని. రాఘవ. 3. 54.

అ. పగ యడంగె నంచు మిగుల డెందములోన, నలరి వేల్పు రాచ గెలుపుకాఁడు, దివి కేఁగి గెలుపు తెఱఁ గెల్లఁ దండ్రికిఁ, దెలియఁ జెప్పి యెలమి నెలయఁజేసె. అచ్చ. రా. యు. 152.

6. ఉండు.

సీ. మృతిఁ బొంది వేగ జన్మించినఁ బూర్వపైహికములన్నియు బుద్ధి నెలయువాఁడు, జాతిస్మరుం డనఁ జను నయ్యెఱుక పెద్దవాఁడు గాఁగాఁ జెడు వనిత వినుము. భార. అను. 5. 150.

సీ. అతివల వేర్వేఱ యడగి చచ్చినపొంత నెల నిడు వారల నెల్ల నరసి. విజ్ఞా. ప్రా. 108. భార. ద్రో. 5. 118. అచ్చ. రా. బాల. 25.

7. చేరు.

సీ. ఏనుఁగుమదమున కెలయు తేఁటులమొత్తముల నీలిగొడుగులు చెలువుమిగుల భార. భీష్మ. 1. 104. (శ. ర. పా.)

జః ఎలయించు.

**ఎలరారు** అ. క్రి. (ఎలరు+ఆరు.) 1. అతిశయించు, అధికమగు.

క. ఇవ్విధమున నాయితమై, క్రొవ్వెల రారంగ నిలిచి కురుపాండవులం, దెవ్వరు మును గడఁగిరి... భార. భీష్మ. 1. 282.

2. ప్రకాశించు, ఒప్పు.

సీ. మలయుచుఁ బొలుపారు మకర కేతనముతో నెలరారు కెందలిరెల్లి గాఁ)ల. కు. సం. 9. 245.

3. వికాసమునొందు.

సీ. ఎలరారుక్రొవ్విరు లెత్తులుగట్టి యొయ్యారంపుఁ గ్రొమ్ముడి నలవరంచి. హరి. ఉ. 4. 250.

4. పుష్పించు.

ఆ. ఎల్ల ఋతువులందు నెలరార పరువమై, యిందు విరులతోఁటకేపు దెచ్చి,కోరి వమ్మ వారి కోర్కుల నీనెదు, వేల్పుమ్రాను పాలవెల్లిఁబుట్టె. భాగ. 8. 261.

**ఎలరు** వి (చూ. ఎలరారు) 1. అతిశయము. 2. వికాసము.

జః ఎలరారు, ఎలరుచు, ఎలరుపు.

**ఎలరుచు(ర్చు)** అ. క్రి. (√ఎలరు-క. ఎలర్చు. త. అలర్.) 1. అతిశయించు.

గీ. అనినఁ దలఁకకు మిం తేల యకట యేను, గలుగ ననుచు నవ్విభుఁడన్నఁ గౌఁగిలించెఁ, గృష్ణసంస్పర్శమునఁ బాసెఁ గిల్బిషంబు, బలువ కెప్పటికంటెను బల మెలర్చె. హరి. ఉ. 8. 112. భార. ద్రో. 1. 42.

2. సంతోషించు.

క. కురుజాతి యెలర్పఁగ న,న్నరపతి భీష్మాభిషేచనం బొనరించెన్. భార. ఉద్యో. 4. 158.

ఉ. ...మనఃప్రియముం దగ నిత్తువన్నఁ గౌం, తేయు లెలర్చి రవ్వసుమతీపతి మోదము నొందె నెంతయున్. భార. ఆశ్ర. 2. 82.

3. ఒప్పు, ప్రకాశించు, శోభించు.

ఉ. పూర్జితధర్మవృత్తిఁ గ్రతువుల్ పదివే లొనరించి మించి యా,నిర్జరకోటిఁ దన్పి కమనీయగతిన్ నిజబాహువిక్రమో,పార్జితమైన యర్థము వ్యయం బొనరించి యెలర్చెఁ గార్తవీ,ర్యార్జునచక్రవర్తి.... వి. పు. 6. 198.

ఉ. భావ మలంక్రియాగుణవిభావితమై వికసద్రసోదయ, శ్రీవినివారితేతరవిశేషనివేదనమై యెలర్చ....నరస. 3. 155.

**ఎలరుపు(ర్పు)** వి. (√ఎలరుచు) ఎలర్చుట. (అతిశయము)

ఉ. ....సంభ్రమంబు గరువంపు టెలర్పును నుల్లసిల్ల....భార. శాం. 6. 574.

**ఎలిఁగించు** అ. క్రి. (√ఎలుఁగు') కూయు.

చ. ఎలమిఁ బికాళితోడ నెలిఁగించుచు... నళివనకేళిసల్పి రెలనాఁగలు దీఁగలతోఁ బెనంగుచుఁ. కు. సం. 9. 309.

క. కాకంబు లెల్ల మడిసెం,గా కిచ్చట నొకటి యైనఁగలిగెనె యనుచున్, గూకారు లరుగునంతట, నాకాకము కావుకావు రని యెలిఁగింపన్. నా. పంచ. 3. 169.

('ఎలుఁగించు'అని ఉన్నదర్థముకూడ పెక్కు ప్రయోగములలో కన్పట్టుచున్నది.)

సీ. చంచులఁ జికురాకుఁ జించి యాడుచు నలి నెలుఁగించుగండుఁగోయిలలపొంపు. భార. అను. 1. 181.

**ఎలిసె** – వెలిసె. వి. గోడకును ఇంటికప్పునకును నడుమనుండు తెఱప ప్రదేశము.

గీ. ...ఎలిసె నా నలరు భిత్తి,కాచ్ఛదిస్సంధి సంజ్ఞయై యచ్ఛదేహ. అం. భా. 2. 20.

**ఎలుఁగు'(గ్లు)** – ఎలువు'.

1. కంఠస్వరము.

ఆ. భీముఁ జేర నరిగి బీభత్సు నీతమ్ము,వని యెలుంగు గళమునందుఁ దగుల, వక్రు లొలుక మాట యట చెప్పలేఁడు.... భార. ద్రో. 4. 188.

గీ. ...పులుఁగుల యెలుఁగు లెచ్చె .... విక్ర. 4. 27.

2. ధ్వని, మ్రోఁత. (చూ. ఎలుఁగులిచ్చు 2. అర్థము.)

3. పిలుపు.

క. అని యతఁడు వెదకఁ దొడఁగినఁ, గని కుంతియు నింత నంతఁ గాల్వడ్చుచుఁ బిల్చి నఁ బదియెలుఁగుల కోకమఱి,ముసుకుచు... భోజరా. 5. 66.

ఈరెలుఁగు — హీనస్వరము,

చ. కనుఁగవ మ్రాన్పడంగ నెఱక ల్విరియం బడ బోర మోవ వెం,డినవదనంబులం దెఱచి నిక్కిన యఱ్ఱులు దల్లడించుటల్, గనఁబడ నూరుపు ల్దశముగా నిగుడ న్వడఁ గుంది యీరెలుం,గునఁ దమవానిఁ బిల్చుచు శకుంతము లయ్యెడ నిల్చె మ్రాఁకులన్. పారి, 4. 21. వి. పు. 2. 134.

ఎలుఁగుచేయు — కూయు.

ఆ. ఎలుఁగుచేసెఁ బెద్దపులుఁగు పా మటఁ దోఁ చె, డబ్బు బొబ్బలిడియె నుబ్బు లడర. ద్వా. 1. 218.

ఎలుఁగుసూపు — 1. పలుకు, మాటాడు.

ఆ. ...అతిథి దాని నల్ల, నూరకుండు మనియె నువిదయు భూసుర, శాపభీతి నెలుఁగు సూపకుండె. భార. అను. 1. 75.

2. గట్టిగా అఱచు, పెద్దకేక వేయు.

గీ. ఏచి దుర్యోధనుండు చే వీచి యెలుఁగు, సూపి పురికొల్ప నెంతయు నేపుమిగిలి. భార. భీష్మ. 2. 28.

ఎలుఁగె(గ్గె)త్తి — ఉచ్చైస్స్వరముతో, బిగ్గరగా.

చ. కమఁగొని సైన్యముల్ విఱిగి క్రందు కొనన్ వెసఁ బాఱ నాపగా,తనయుఁడు సేన నాఁగి యివి దైత్యులమాయలు గాని కొంకు కొం,కని యెలుఁగెత్తి చెప్పఁగ భయంబున నమ్మకపోయె.... భార. భీష్మ. 3. 135.

సీ. ఇందుబింబానన యెలుఁగెత్తి పాడిన దాన వేంద్రులకు గద్గదికపొడమె. దశా. 2. 301.

శా. ...మోమునఁ బటాగ్రం బొత్తి యెగ్గెత్తి యా, రాజీవానన యేడ్చె ... వసు. 4. 52.

పేరెలుఁగు — పెద్దకంఠధ్వని, ఉచ్చైస్స్వరము

ఉ. అందఱివార లెల్లను జయంబునఁ బొంగు చుఁ బేరెలుంగు లం,దంద చెలంగఁగా... భార, సౌ. 1. 5.

మాఱెలుఁగు - ఒకదానిననుకరించి చేయుకంఠ ధ్వని. కు. సం. 3. 260.

జ: ఎలిఁగించు, ఎలుఁగులిచ్చు.

**ఎలుఁగు²(ల్గు)** — ఎలువు². వి. (త. ఎలుక, ఎల్లి.) భల్లూకము.

చ. ఎలుఁగులు వేయు పూనిన సితేతరలోహ రథంబు. హరి. ఉ. 10. 21.

చ. అని తన యంకపీఠిపయి నాతనిఁ జేరిచి నిద్రవుచ్చె నం,త నది యెఱింగి బెబ్బులి ముదం బెసలారఁగ నెల్గు తోడ ని,ట్లను... విక్ర. 3. 89. మనుచ. 4. 37.

గీ. కలహభూమిలో... చాముండిదేవి... రాక్ష సుల నెల్ల,మ్రింగె వడి నెల్గు చీమల మ్రింగి నట్లు కు. సం. 12. 892.

జ; ఎలుఁగుగొడ్డు, ఎలుఁగుబంటి

**ఎలుఁగు(ల్గు)గొడ్డు** వి. (√ ఎలుఁగు²) ఎలుఁగు, భల్లూకము.

సీ. పుట్టజున్నంగళ్లఁ బెట్టించువాడుకకోమట్లు మా కెల్గుగొడ్లుసుమ్ము. సారంగ. 1. 78.

**ఎలుఁగుబంటి** వి. (√ఎలుఁగు²) ఎలుఁగు, భల్లూకము. (శ ర. వా.)

**ఎలుఁగులిచ్చు (ఎలుఁగిచ్చు)** స. క్రి. (√ఎలుఁగు¹) పిలుచు.

గీ. నీదునిష్ఠురబాణంబు నెఱఁకు దూఱఁ, గాఁడి పరవశుఁడై వ్రాలుకడఁక నపుడు, తండ్రి నేమని యెలుఁగిచ్చెఁ దల్లడంబుఁ, జెంది తల్లి నే మని పిల్చెఁ జెప్పుమయ్య. భా. రా. అయో. 205.

ఆ. తెచ్చి యిచ్చుబలియుఁ దెచ్చి యీఁగ, వొల్ల కెలుఁగు లిచ్చుచున్న వాఁడు. భార. ఆది. 6. 290.

అ. క్రి. 1. ధ్వనిచేయు, మ్రోఁగు.

వ. ... విలాసినీమంజుమంజీరంబు లెలుఁగు లియ్య.... అము. 4 35.

2. పలుకు, మాటాడు; ప్రతిగాఁబలుకు.

క. ...అ,య్యా యని పిలిచిన నంబికి,వో యని యెలుఁగిచె తొల్లియురగాభరణా. శివ. సా. 112.

చ .... తన్మృదుపంచమషడ్జశయ్యకా,య్యవ నెలుఁగిచ్చె వింతె ప్రమదాకులకోకిల కేకి లోకముల్. వసు. 2. 17.

ఎలుఁగులుచూపు.

చ. అలుగకు తప్పు సైచు నుకుమాయుధుఁ గావుము దేవ యంచు నా, తొలఁదిన దేవతల్ చదలఁగూడి యెలుంగులు నూపి వేఁడ.... హరి. ఉ. 6. 65.

**ఎలుక(ల్క)** వి. (క. ఎలి. త. ఇలి.) మూషికము. (దీనిభేదములు - కల్లెలుక, చిట్టెలుక, చుంచెలుక.)

గీ. బిలము సొచ్చితి మేని నం దెలుక సంపు. భార. ఆది. 8. 307.

వ. అనుటయు నెల్క యిట్టులను ... భార. శాం. 3. 218.

జః ఎలుకచెవి, ఎలుకజీడి. ఎలుకమొక్క, ఎలుకరౌతు.

**ఎలుకచెవి** వి. (√ఎలుక) ఎలుకజీడి, మూషికపర్ణ, చిత్ర. (వృ. వి.)

**ఎలుకజీడి** — ఎలుకచెవి.

**ఎలుకమొక్క** వి. (√ఎలుక) ఒకానొక చెట్టు. (శ. ర.)

**ఎలుకరౌతు** వి. (√ఎలుక) మూషకవాహనుఁడు, విఘ్నేశ్వరుఁడు.

**ఎలువు¹** — ఎలుఁగు¹.

**ఎలువు²** — ఎలుఁగు².

ఆ శతసహస్రకోటిసంఖ్యలయెలువులు,గొలువ జలదనీలఘోరమూర్తి, జాంబవంతుఁ డతుల సత్త్వుఁడై చనుదెంచె, భూపవరుని కార్యమునకుఁ బూని. భార. అర. 7. 89.

**ఎల్ల¹.** వి. (క. త. ఎల్లె.) సీమ, పొలిమేర; అవధి.

క. పొలి మేరన గడి యనఁగాఁ, బొలిమెర యన నెల్ల యనఁగఁ బోలును సీమా,స్థల నామధేయములు....ఆం. భా. 2. 24.

ఉదా. గ్రామమునకు ఉత్తరపుటెల్ల, పడమటి యెల్ల, ఎల్లబాయి మొ.

ఉ. .... భా,గ్యమ్ముల కెల్ల నెల్ల యయి గాంచెఁ బ్రసిద్ధి... నైష. 1. 81.

జః ఎల్లమ్మ, ఎల్లాఁపి, ఎల్లాఁపికత్తె.

**ఎల్ల²** అవ్య. ద్రు. (క. ఎల్ల. త. ఎల్లామ్. మ. గుల్లె.) సర్వశబ్దార్థకము. (దీనికి వృత్తిలో ద్రుతలోపము. మఱియు 'ఎల్లరు, ఎల్లందు, ఎల్లయందు' అని సవిభక్తికముగా ప్రయోగములును. అసమాసంబున విశేష్యమునకు ముందు ప్రయోగాభావమును చూపట్టుచున్నవి. కాని 'ఎల్లన్ శిష్యులఁ గొంచువత్తునొ' భీమ. 2. 120. అనువిశేష ప్రయోగము కలదు.)

మ. ....జనులెల్లం గడు సంభ్రమింపఁగ... భా. ర. ఆది. 6. 28.

చ. ...మాకు నెల్లను బలి వాఁడ .... భార. ఆది. 4. 186.

గీ. ...దివిజ, నేఁగుఁడని పల్కె భార్గవుం డెల్ల వినఁగ. భార. అను. 2. 283.

ఆ. ....కృపుఁడు రాజసుతుఁ దన తేరిపై, నిడి తొలంగఁదెచ్చె నెల్లఁ జూడ. భార. భీష్మ. 2. 222.

గీ. ....ఎల్ల పురుషుఁడు. కవిక. 5. 148.

ఎల్లందున్, ఎల్లయందున్—సర్వత్ర, అంతట, అన్నిచోట్లను.

ద్వి. కృతయుగంబున దశగ్రీవుండు జగము, లతి భీతిఁ జెంద నెల్లందుఁ గ్రుమ్మరుచు. రం. రా. ఉ. 101. పొ. 27. పం.

క. కోరికలకుఁ గొరక యనం,గారూఢత గలిగి యెల్లయందును సమతం,గూరిన చిత్తంబులు గల,సాత్ముకు లీ పథమునఁ జనుటకు శక్తుల్. భార. అశ్వ. 2. 215. హరి. పూ. 5. 160.

ఎల్లనాఁడు — ఎల్లప్పుడు.

గీ. శౌరితో నెల్లనాఁడు మచ్చరముసేయు, చుండు .... హరి. ఉ. 8. 5. వి. పు. 6. 256.

ఎల్లప్రొద్దు—ఎల్లప్పుడు. సీతారా. 1. 97.

జః ఎల్లకమ్మరి, ఎల్లది, ఎల్లప్పుడు, ఎల్లబోటి, ఎల్లరు, ఎల్లవాఁడు, ఎల్లెడ.

**ఎల్లకమ్మరి** వి. (ఎల్లన్ + కమ్మరి.) విశ్వకర్మ, దేవశాశిల్పి.

ద్వి. బొమ్మరవోయి వేల్పులమూఁక లెల్ల, కమ్మరిఁ బిలిచి యక్కజము చూచితివె. ద్వి. పఁమ. 27. పొ. 6. పం. (చి. ని. పా— 'వేల్పుఁగమ్మరి' ముద్రి.)

**ఎల్లది** వ. (ఎల్లన్ + అది.) సమస్తము.

క. కావునఁ గృష్ణునిదెస భయ, మేవిధమునఁ బొందకుండ నీవలయుఁ గృపన్, నీవరవు డుషాకన్యకు,దేవా యుల్లైన నెల్లదియు సిద్ధించున్. హరి. ఉ. 7. 158.

సీ. అనవుడు నాతఁ డమ్మనుజవల్లభుతోడ వినుము తీర్థము లెల్లవియును మేల. భార. అను. 4. 241.

**ఎల్లప్పుడు(పుడు, ప్డు)** వి. బొ. (ఎల్లన్ + అప్పుడు) సర్వకాలము. ఉ. రా. 1. 60. దశా. 2. 6.

**ఎల్లఁబోటి** విశ. (ఎల్ల + బోఁటి) అందఱవంటి, సామాన్యమైన. (దీనికి వృత్తియందే ప్రయోగము.)

క. వీఁ డెల్లబోఁటిబాలుఁడు,గాఁ డాకంమున కుఁ గీడు గావించుటకై, పోఁడిమి యొసఁగ జనించిన,వాఁడ యగును .... హరి. పూ. 5. 149.

**ఎల్లమ్మ** వి. (ఎల్ల¹ + అమ్మ—త. ఎల్లమై) ఎల్లయందుండునది-ఒకానొక గామదేవత. (శ. ర.)

**ఎల్లరు** వ. బ. (√ఎల్ల²) అందఱు.

ఉ. ఎల్లరు నంత మేలుకొని యిందుముఖుల్ ముఖమజ్జనాదికం, బల్ల నఁదీర్చి.... రామా. 2. 107.

గీ. సులభమై యెల్లరకుఁ దేటి చూడవచ్చు, ననఁగ.... రామా. 2. 106.

**ఎల్లవాఁడు** వ. (√ఎల్ల² — బ. ఎల్లవారు ము.) ఎల్లమనుజుఁడు, ప్రతివాఁడు.

సీ. వెర విట్టిదెఱిఁ గని వెంగలితనమని యెల్లవాఁడును దనయెఱిఁగినట్టి . తెఱఁగున నిజకార్య దృష్టిఁ గనుఁగొనుచు. భార. సౌ. 1. 45.

ఉ. ...భూసురు లాదిగ వచ్చి చూచి ర,వ్వాఁడిమగంటిమిన్ వెలయువాని వృకోదరు నెల్లవారలున్. భార. ఆది. 6. 306.

**ఎల్లాఁపి** వి. (ఎల్ల¹ + అఁపి) ఎల్లయందుండి దోఁచుకొను దొంగ; దొంగ. (బ్రౌ.)

**ఎల్లాఁపితత్త్వ(త్తియ)** వి. (√ఎల్ల¹.) దొంగతనము చేయు స్త్రీ. (బ్రౌ.)

**ఎల్లి¹** వి. ఛత్రము, గొడుగు.

ఉ. అల్లదె కంటె పాఁడుతనయాగ్రణితేరు సితాశ్వయుక్తమై, తెల్లనియెల్లి నొప్పినది .... భార. శల్య. 1. 133.

క. ...మణిమయంపుటెల్లులు మెఱయం, గానివె తెంతువు .... భార. శాం. 4. 389

**ఎల్లి²** వి. ఏ. బొ. అనాగ్ వడి నెల్లు చీమ!. నేఁటికి మఱునటి దినము,¹· శ్వః.

వ. ... దమయంతీస్వయంవరం బెల్లి యో యెల్లుండియో యయ్యెడు నని చెప్పిన.... భార. అర. 2. 163.

క. అచ్చట నంతర్హితుఁడై , యిచ్చఁ జనియెఁ దోఁచు నేటియెల్లిటిలోనన్. భార. విరా. 5. 301.

క. ...పౌండ్రా,వనివిభుని నీవు చూడఁగఁ, దునుముదు నేఁ డెల్లిలోనఁ దుత్తునియలుగాన్. ఉ. హరి. 3. 22.

2. ముందుకాలము, భావికాలము.

(శ్వేతుఁడు కామాతురుండై రంభతో నన్న మాటలు.)

ద్వి. ఎల్లింటివరకంబు నే లెక్కసేయ. పండితా. పురా. 120. పొ.

జః ఎల్లుండి.

**ఎల్లిదము** — పలిదము. విశ. (క. పళిద. త. ఎళిదు. తు. ఎల్లి.) 1. లఘువు, తేలికయైనది; సమర్థత లేనిది: గౌరవము లేనిది.

(వసంతఋతువర్ణనము.) ఉ...మావుల నెల్లిదంపుఁగా, రాకులపాటు డెందమున నాకులపాటొదవింపఁ జొచ్చె.... దశకు. 3. 93.

చ. త్రిదశులు పిల్చి పంపు డొక తేజముగాఁ
గొని దేవదేవు నెల్లిదముగఁ జెప్పి యింత
గొని లేవడి లేచెదు.... కు. సం. 4. 421.

ఉ. ...నీకింతభయంబు లే కడుగ నెల్లిదమై
తిమి మాటలేటికిన్. మనుచ. 2. 41.

2. అగౌరవపఱుచునది. అవమానకరము.

గీ. వేడ్కఁ దొడి పూసి కట్టి యవ్విరటుఁ
డుత్తరుండు దోఁ జనుదేరఁ గొల్వుండు
బుద్ధినచటి కేతెంచి కని విస్మయంబునొంది
యెల్లిదంబుగఁ దలఁచుచు నిట్టు లనియె.
భార. విరా. 5. 317.

వి. అవమానము, అగౌరవము, తిరస్కారము

సీ. మృగమద శ్రీగంధమిళిత దేహమునకా
గాటంపుఁ గెందూళికప్పడములు, శిఖికా
వతంసరాజిత పదాబ్జములకా యీడుపు
తొట్రుపాటెల్లిదములు. సారం.గ. 3. 87.

క. ఇరువెవి యెఱుగక యుండం, దరుణీష ఖ
మస్త్రభవింపఁ దలఁచినఁ బదివేవురకున్
లెదుటఁ బడితిని. సరివా రెల్లిదము చేయ
జాణెత నయితిన్. ఉ హరి. ౬. 197. ఆం.
భా. 1. 184.

జ: ఎల్లిదుఁడు.

**ఎల్లిదుఁడు** విశ (√ఎల్లిదము - త ఎల్లియన్.) అసమర్థుఁడు. అల్పుఁడు.

చ. ... దుష్ట దుర్మద ఖరదండమండన పరా
యణులై చనువట్టివారి కిట్టిది దగుఁ గాక
పూని యొకటిం గడతేర్చఁ గడంగలేక
యెల్లిదు లగువారి కేటికి సలిలవిహారము
వేడ్క సేయఁగన్. నిర్వ. 3. 7.

చ. ఎడపక పంచె నాతఁ డొక యేలినవాఁడని
పూనికాఁడవై, పొడువఁగఁ బోయె దీవు
నొక పోటరిమూటవ నీకు నక్కడ, నృపు
డుఁ డొకొ యెల్లిదుం డకట... కు. సం.
4. 418.

**ఎల్లుండి** వి. కా. అవ్య. (ఎల్లి² + ఉండి—త. ఎల్లంటి.) తేపటితావలిదినము.

వ. .... దమయంతీస్వయంవరం బెల్లియో
యెల్లుండియో యయ్యెడు. భార. అర.
2. 163.

ద్వి. అనఘ నీవాక్యంబు లఖిలసంయములు,
వినఁ గోరి యున్నారు విమలచిత్తముల,
నిమ్ముగఁ గథ యెల్ల నెల్లుండినుండి, సమ్మ
దంబున మీరు చదివింపవలయు. రం. రా.
ఉ. 170. పా. 9. పం.

వ. అమూర్ధాభిషిక్తునకు శుద్ధాంతకాంతాజన
చింతాభరంబో శకుంతలాచింతాభరంబో
నేఁట తేపట నెల్లి యెల్లుంటి మెల్ల మెల్లనఁ
దెలిసికొనియెద.... పి. శకుం. 3. 70.

**ఎల్లెడ(ఎల్ల యెడ)** వి. (√ఎల్ల².) 1. సర్వదేశము, అన్నిచోటులు.

చ. ....కెంపులూ,జిగితలుపుల్ కడుస్మెఱయుఁ
జెన్ను దలిర్పఁగఁ బ్రోల నెల్లెడన్. నీలా.
1. 30.

ఉ. ...తా, నింతయి యంతయై వెనుక నేనిక
యంతయి కొండయంతయై, యెంతయుఁ
బెద్దయై కదలి నెల్లెడ నిండె .... దశా.
1. 281.

2. సర్వవిషయములు.

గీ. ...ప్రజలకు నెల్లయెడలఁ, దల్లిదండ్రియు
నేలి నాతఁడు గాఁడె. విప్ర. 6. 40.

**ఎళ్లము** వి. (ఏడు + పలము) ఏడుపలముల మానము.

గీ. ఉల్లసిలు సప్తపలినామ మెళ్ల మనఁగ. ఆం.
భా 2. 269. (శ. ర. పా.)

**ఎళ్లు** వి. బ. 'ఎడ్లు'యొక్క మాఱురూపము.

సీ బండ్ల మెట్టింపుపై బరువు లెక్కింపు మీఁ
దెళ్లను బూన్పు కావళ్లు నునుపు. హరి.
పూ. 6. 20. (శ. ర. ప్రాంత ప్రతి పాఠములు.)

**ఎవఁడు** – ఏవాఁడు, ఎవ్వాఁడు, ఎవ్వఁడు, ఏఁడు, వేఁడు. వి. (త. ఎవన్ — బ. ఎవరు, ఎవండ్రు — ఇది బహువచనమున మహతీ వాచకము గూడ నగును.) 1. యచ్ఛబ్దార్థకము. (ఈ యర్థమున తచ్ఛబ్దార్థకము నపేక్షించును.)

ఉదా: ఎవఁడు పుట్టించినవాఁడో వాఁడే
ప్రోచును.

2. కిమర్థకము (ప్రశ్నమును దెలుపును.)
ఉదా: మీయింటికి వచ్చినవాఁ డెవఁడు?
ఎవరు — అందఱు.
గీ. దొడ్డిపట్టుల నిల్వక త్రోవ నెవరి, నెదిరి కొమ్ములఁ గ్రుమ్మంచు... నీలా. 2. 43.
నన్ను మందలింప వాఁ డెవఁడు:- వానికి నాకును సంబంధములేదు అని భావము.
ఎవఁడైనను ఆకాశమున కెగురలేఁడు. (ఎవఁడైనను - ఎంతటివాఁడైనను)
ఆయూర నెవఁడును లేఁడు. (ఎవఁడును— ఒక్కఁడును.)

**ఎవత** - ఎవ్వతె.
**ఎవతి** - ఎవ్వతె.
**ఎవతుక** (ఎవత+ఉక.) - ఎవ్వతె.
**ఎవతె** - ఎవ్వతె.
**ఎవయు** - ఎగయు.
క. దివిజులు తొలుతాఁకునఁ ద, మ్మెవిచిన దనుజులను మనుకులేశ్వరశరముల్, పొన యని మంటలు మింటికి, నెవయంబడి కెడవ మొనసి నిలిచిరి తారున్. కఠు. 5. 37. (స్వార్థమున 'పడు')
**ఎవరిత** (ఎవరి+త. అని శ. ర.) — ఎవ్వతె.
**ఎవరితి** (ఎవరి+తి. అని. శ. ర.) — ఎవ్వతె.
**ఎవరితె** (ఎవరి+తె. అని. శ. ర.) — ఎవ్వతె.
**ఎవర్త** - ఎవ్వతె.
**ఎవర్తి** - ఎవ్వతె.
**ఎవర్తుక** (ఎవర్త+ఉక.) - ఎవ్వతె.
**ఎవర్తె** — ఎవ్వతె.
**ఎవ్వఁడు** — ఎవఁడు. (ఏ+వాఁడు — బ. ఎవ్వరు, ఎవ్వండ్రు - శ. ఎవన్. ఇది బహువచనమున మహతీవాచకము గూడ నగును )
1. యచ్ఛబ్దార్థకము.
వ. ఎవ్వనియేనివీర్యంబున నిక్కన్య యుద్భవిల్లె నట్టియుపరిచరుం డను రాజర్షి ... భార. ఆది. 4. 188.
చ. సుచరిత రామసంస్తవన మూర్తి సుధారస మాను వెవ్వఁ డా, ప్రమరకవిత్వతత్త్వనిధి భక్తి భజించెద....విక్ర. 1. 9.
2. కిమర్థకము, (ప్రశ్నమును దెలుపును.)
క. ....కురుపాండవులం, దెవ్వరు మును గడఁగిరి రణ, మెవ్విధి నూలుకొని చెల్లె నెఱిఁగింపు తగన్. భార. భీష్మ. 1. 282.
వ. ...పౌలోమి నీ వెవ్వర వని యడిగిన నది యుమ భవత్ప్రాతివ్రత్యశౌచంబులకుఁ బ్రియంబంది వచ్చితి నుపశ్రుతివని చెప్పి.... భార. ఉద్యో. 1. 171.
3. ఎంతవాఁడు, ఏపాటివాఁడు, ఎట్టివాఁడు.
మ. జననీ నీవు మహాపతివ్రతవు నీ సౌశీల్య మిల్లాంధ్ర కెల్లను మేల్పంతి రఘూద్వహాంఘ్రియుగళీలగ్నాత్మవై యుండుమీ, యని నే నెవ్వఁడ విన్నవింపఁ బతిఁ బాయన్ జేసి ని న్నొంటిడించిన పాపాత్ముఁడ నూరికేఁగు మనుచున్ సె ల్విచ్చెదే నావుడున్.... ఉ. రా. 6. 274.
గీ. ....అసరణి నీవు, దమ్ముఁడును జరించిన యద్భుతంపుఁజరిత, మెన్నఁ గొనియాడ నెవ్వర మిప్పుడేము. హరి. ఉ. 2. 77.
4. ఎల్లవాఁడు. (ఈ యర్థమున బహువచనమునకే ప్రయుక్తము. అపుడు తఱచు సముచ్చయార్థకసహితమై యుండును. ఎవ్వరు — అందఱు.)
క. ఇమ్మణిమతీపురంబునఁదమ్ముండును దాను నతి ముదంబున నుండున్, నెమ్మిని నిల్వలుఁడను వాఁ, డిమ్మహి ధనవంతుఁ డతఁడ యెవ్వరికంటెన్. భార. అర. 2. 338.
క. వివరే యెవ్వరుఁ బాపం, బనఁ బుణ్యంబన నిషేధమన విధియనఁ గీడన మేలనఁ బరలోకం, బనఁ దలఁపఁగ లేరుగాక యాత్మహితంబున్. కళా. 2. 100.
ఉ. ఎవ్వరు నట్లపో తెరను లెన్నకమానరు ప్రాణభర్తలన్. ఆము. 5. 56.
5. ఎట్టి (అధికారాది) సంబంధముగలవాఁడు.
గీ. ఇంట నెవ్వా రయిన భిక్ష మిడిన ముష్టి, పెట్టిన....ఎగిరిపడి యిందులకు మీర లెవ్వరముచుఁ, బెద్దపులివోలె రొప్పు నాబిసరు హాతి. శుక. 3. 349.
6. ఒకానొకఁడును.

(సముచ్చయార్థకముగా నుండును)

క. ఎవ్వఁడు దుశ్చరితుఁడు లేఁ, డెవ్వఁడు దుర్గతుఁడు లేఁడు హీనాత్ముఁడు లేఁ, డెవ్వఁడు బలి రాజ్యంబున, నెవ్వఁలవ గృహార్థమతుల యిలఁ గల మనుజుల్. హరి. ఉ. 10. 284.

**ఎవ్వత** - ఎవ్వతె. భార. శాం. 3. 144. అను. 3. 222.

**ఎవ్వతి** - ఎవ్వతె

**ఎవ్వతుక** (ఎవ్వత + ఉక) — ఎవ్వతె.

**ఎవ్వతె** - ఎవత, ఎవతి ఎవతుక, ఎవతె, ఎవరిత, ఎవరితి, ఎవరితె, ఎవర్త, ఎవర్తి, ఎవర్తుక, ఎవర్తె, ఎవ్వత, ఎవ్వతి, ఎవ్వతుక, ఎవ్వరిత, ఎవ్వరితి, ఎవ్వరితె, ఎవ్వర్త, ఎవ్వర్తి, ఎవ్వర్తుక, ఎవ్వర్తె. — స. ప్ర. ('త. ఎవళ్.) ఏ స్త్రీ మనుచ. 2. 89.

**ఎవ్వరిత** (ఎవ్వరి + త. అని. శ. ర.) - ఎవ్వతె.

**ఎవ్వరితి** (ఎవ్వరి + తి. అని. శ. ర.) - ఎవ్వతె.

**ఎవ్వరితె** (ఎవ్వరి + తె. అని. శ. ర.) - ఎవ్వతె.

**ఎవ్వర్త** - ఎవ్వతె.

**ఎవ్వర్తి** - ఎవ్వతె.

**ఎవ్వర్తుక** (ఎవ్వర్త + ఉక) - ఎవ్వతె.

**ఎవ్వర్తె** - ఎవ్వతె.

**ఎవ్వల** - ఏవల.

(ఏవైపు)

ఉ. ఎవ్వరు గన్న నెత్తికొని యెంతయు వేడుక ముద్దులాడఁగా, నెవ్వలఁ జాటిపాటి తర తేఁటఁ దీధితు లొప్ప నొప్పుమై, మువ్వలు గంటలున్మొరయ ముందటి కూఁకటిరావి రేకతో, నవ్వనజాతుఁ డాడు చెలు వర్మిలిఁ జెంచు జనంబు చూడ్కికిన్. హరి. పూ. 5. 191. (ఎవ్వలన్ — ఏదో యొకవైపు నకు.)

**ఎవ్వాఁడు** — ఎవ్వఁడు. (బ. ఎవ్వారు, ఎవ్వాండ్రు, ఎవ్వారలు.)

(యచ్ఛబ్దార్థకము)

మనుచ. 1. 18.

(కిమర్థకము.)

భార. భీష్మ. 1. 179.

(ఎంతటివాఁడు, ఏపాటివాఁడు, ఎట్టి వాఁడు.)

శా. ....ఎవ్వాఁడున్ మాపురిఁ జేరి నీకరణి గర్వస్ఫూర్తి నిట్లాడఁగా, లేఁడు....ఉ. రా. 3. 187.

**ఎస** వి. 1. విధము.

క. అత్తాలుగొల మలరులసర, మెత్తినక్రియఁ జాలు పొంగునెన వికసిత మౌ, నెత్తమ్మికొల ని చెలువునఁ, దత్తత్సౌభాగ్యముల నుదాత్తంబయ్యెన్. పాండు. 4. 266.

2. ప్రేరణము. (చూ. ఎసకొలుపు, ఎసవెట్టు.)

క్రి. విశ. (ఇది 'వెస' సామ్యమునుబట్టి ద్రుతాంతమని తోఁచుచున్నది. కాని నిర్ధారక ప్రయోగము కాన్పించలేదు.) 1. అత్యంతము, మిక్కిలి.

మ. ....నమ్రమై, యెస సంక్రందనశాఖ డెందమునయం దెక్కించు మందాతమున్. నైష. 5. 156.

2. చక్కఁగా, బాగుగా.

సీ. జనకుండునిర్మలస్వాంతుఁడై శాంతుఁడై యెస మిధిలాపురి నేలుచుండి. వేం. మా. 4. 11.

జ: ఎసకొలుపు, ఎసరేఁగు, ఎసలారు, ఎసవెట్టు.

**ఎసఁగించు** స. క్రి. (√ఎసఁగు) ఎసఁగఁజేయు. (కలిగించు)

సీ. ఇనకరసంప్రాప్తి వెసఁగించె నెవ్వాఁడు రహినించె నర్థగౌరవము నెవ్వఁడు. వసు. 1. 9.

**ఎసఁగు** అ. క్రి. 1. అతిశయించు; ఒప్పు.

క. వసునిభుఁడు పైతృకం బగు, వసుధారాజ్యంబు భీష్మవచనమున గత, వ్యసనుఁడయి కాల్చెఁ దేజం, బెసఁగంగ విచిత్ర వీర్యుఁ డిద్ధయశుండై. భార. ఆది. 4. 196.

క. భూతాత్మక మైన యఖిల, ధాతుచయము వెలిగ లేదు తను వా మొత్తం, బాతతజీవ వ్యాప్తిస, మేతము కాకున్నఁ జేష్ట వెసఁగదు వత్సా. భార. శాం. 6. 388.

ఉ. ....సోమశర్మ పేరిట నెసఁగు ... శుక. 2. 144. మనుచ. 3. 80.

2. కలుగు.

సీ. ధర్మాభిసంరక్షితం బైనభూ ప్రజ కెంతయు నభివృద్ధి యెసఁగుచుండె. భార. ఆది. 5. 3.

పెంపెసఁగు – ఎసఁగు

చ. ప్రముహితకీర్తిఁ బెం పెసఁగె భాస్కర మంత్రిప్రతాపధాముఁడై. విక్ర. 1. 41.

ఱ: ఎసఁగించు.

**ఎసకము** వి. (క. ఎసక. త. ఇయక్కం.) 1. విజృంభణము.

క. అపన్నిద్దలు సైన్యాటోపసమేతముగఁ గవియుడును బాంచాల,ఱాపాలసుతుఁడు భీముఁడు, నేపారిర నీడుసేన యెసకం బడఁగన్. భార. భీష్మ 2. 378.

2. అతిశయము, పెంపు.

గీ. ...ఎంతయు వంతఁ బొందుఁ,జింత యెసకంబు వడిగొని చిక్కు పఱుప. భార. విరా. 2. 292.

3. విధము.

ఉ అంధకవైరి నాయెడ దయాగుణసంపద గల్గెనేని నీ,స్కంధమునందు నాయొడలి చర్మము పాయక యుఁడుఁగాక.... వెండి కొండపైఁ, గంధగంధ మున్నయెసకం బున నీవరమే వరించెదన్. కాశీ. 6. 155.

విశే. 1. అధికము, హెచ్చైనది.

క. స్వాతిగతుం డగుశుక్రుం.దే తెఱఁగున బరఁగఁజేయు నెసకపు వర్షం, బా తెఱఁగున సాయక వర్షాతిశయం బావహించె నతఁడు నరేంద్రా. భార. కర్ణ. 3. 43.

2. మనోహరము; ప్రియము

తరువోజ. ...కేల, నెలదమ్మి కేళికై యిచ్చి శేఁ దేఁటి యెసకపుటులివున నింపులు వలికి, చెలితనంబున గంగచెల్వ పార్వతికిఁ జేసె సత్కృతులెల్ల....హరి. ఉ. 7. 75.

సీ. ఎందులబోధంబు లిందిరాదేవికి నెసకంపుఁ బుట్టినయిండు లయ్యె. దశకు. 2. 8.

ఱ: ఎసక మెసఁగు.

**ఎసకమెసఁగు** – ఎసఁగు. అ. క్రి. (ఎసకము+ఎసఁగు) 1. అతిశయించు, పెంపొందు.

గీ. ఇతఁడు పుట్టినకోలెను నెసక మెసఁగు, దర్పమునన వర్తిల్లు ... భార. విరా. 1. 74.

2. ఒప్పు, శోభిల్లు.

గీ. పసుపుఁబోడి తోలువల్వంబు నెసక మెసఁగ, పచ్చు సేవింప నురియాళు వైష్ణవుండు. ఆము. 6. 6.

3. కలుగు.

గీ. తాను దొచ్చినకతన మత్స్యశుభీశు,నింట నిమ్మెయిఁ గ్రొత్తయొ ప్పెసక మెసఁగ, నమ్మహాదేవి యున్నెడ కల్లనల్లఁ,బాండు రాజతనూభవ పత్ని యరిగె. భార. విరా. 1. 303.

గీ. విప్రుఁ డేమిట దేవత్వవిభవ మొందు, నేమి కతమున సాధుత్వ మెసక మెసఁగు, నతని కెద్ది యసాధుత్వ మావహించు, మానుషుం డగు నెద్దాన మహితమూర్తి. భార. శాం. 5. 566.

**ఎసకరి** వి కిరాతభేదము.

గీ. ....వట్ర యెఱుకు వేఁకరి యెసకరి యనఁ దద్భేదములుగఁ,బొల్పును వినంగ శ్రీమాతృభూతలింగ. ఆం. భా. 2. 289.

**ఎసకొలుపు(ల్పు)** స. క్రి. (√ఎస) 1. పురికొల్పు, ప్రేరేచు.

సీ. పాండుపుత్రులతోడిపగకు ని న్నెసకొల్పుఁ గొలువున రజ్జులు పలుకు నట్టి, రాధాసుతుండు... భార. ఉద్యో. 4. 234.

గీ. ... మావంతుఁడెసకొల్ప మలయుమత్త, వారణేంద్రంబు ద్వారంబుఁ జేరి... రావి 5. 50.

2. కలిగించు, అపాదించు.

వ ..పుండరీకములపసకు మసమసక లెస కొల్పు మిసిమిగల భోగిభోగభాగంబులకుఁ బారదస్ఫటిక పటీరపాండురుచిం బర భాగంబు మిగుల,...ఆము. 6. 98.

**ఎసటిపోఁతలు** వి. అ. (ఎసరు¹ + పోఁతలు) ఎస

టఁబోయఁదగిన బియ్యము. దంపి బాగుచేసిన బియ్యము.

సీ. ఎసటిపోఁతలుగాఁగ నేర్చి నించినచిరంతనపు శాలితేమతండులములు. ఆము. 2. 97.

సీ. ఆహతతండులాంహ్వాయము లెసటిపోఁత లన నడింపు లనంగ నలరుచుండు. ఆం. భా. 2. 264.

**ఎసరు**[1] – ఏసరు. అ. క్రి. విజృంభించు, మీఱు, అతిశయించు.

క. ఈసున నాసుంపతి జం,భాసురున నెసరి రావణాసురు శీఘ్రం, బేసియు వేసియుఁ బొడిచియు, వేసరి దిశ్పాలకోటి విన ని ట్లనియెన్ నిర్వ. 6. 187.

క. ఇనుమంత గాని లేఁడీ,పసిబాలుఁడు కూడు గూటిప్రాయమువాఁడీ, నెసరి బహుభక్ష్య రాసులు, మెసఁగెడి విసువఁడు ప్రతుష్టి మేకొనఁడుగదే. పాండు 4. 180. ('కుడు వఁ గూటి' అని శ. ర. పా.)

**ఎసరు**[2] వి. బొ. (శ. ఎసరు) వంటకై కాఁగఁబెట్టిన నీరు, పచనయోగ్యజలము.

సీ. కాఁగినయెసరులకంటెఁ బొరిఁబొరి శర నిధు లుప్పొంగి పొంగఁబడియె. భార. ఉద్యో. 4. 116.

సీ. రతిరూపువన మూపుగతిచూపు గల కాఁపు గుబ్బెత లెసటికై కుండ లరయ. హంస. 1 187. ఆం. భా. 1. 153.

జ: ఎసటిపోఁతలు, ఎసరువెట్టు.

**ఎసరు వె(పె)ట్టు** అ. క్రి. (√ఎసరు[2]) 1. వంటకై నీటినొకపాత్రలో మఱుఁగఁబెట్టు.

చ. అడరుగళాస్రధారలు మహాముఖవాంత సుధాంబుధారలు,న్బొడ వగు వహ్నికీల ములుఁ బొంగును గాఁ బెఱదైత్యకోటికి, న్వెడిదవుఁ గిన్కతో నెసరువెట్టినపెద్ద పనంటిఁబోలె నెక్కుడువెన రాహుమస్తకముఁ గొన్న సుదర్శనదేవుఁ గొల్చెదన్. ఆము. 1 9.

2. హానికలిగించు.

సీ అసురప్రాణంబున కెసరువెట్టినకుఱి గలుగు పిడిబిగబా కలశజున్న, మనఁదనరు...

చం. రా. 5. 16.

వ. ...లాయంబుల కషాయంబు దెచ్చి గుల్లు గూలిచి... చప్పరంబుల కెసరుపెట్టి. రామా. 6. 249.

పెద్దకుండల కెసరుపెట్టుట–శక్తికి మీఱినపనికిఁ బూనుట.

**ఎసరేఁగు** – ఏసరేఁగు అ. క్రి. (√ఎస) విజృంభించు; అతిశయించు.

గీ. ఎడప కెసరేఁగి నుతియించె దిచట నతని. హరివ. 1. 142. (శ. ర. పా.)

**ఎసలారు** అ. క్రి. (ఎసలు + అరు – త. ఇసైయార్.) ఒప్పు; అతిశయించు.
(ఇది ఉభయయతులలోనిది.) చూ. శ వ్యా. 7. 69.

క. అయ్యైకర్మంబులదెస, నెయ్యం బెసలారఁ గలిగి.... భార. అను. 3. 306.

క. కరములు రెం డాఫణిపై,నిరవుగ నూను కొని లక్ష్మియెదపై వెలుఁగన్, ధరణియు నీ యు భక్తిని,నిరుగెడ వసియించి వేడ్క నెసలారంగన్. వేం. మా. 1. 287.

ఇం పెసలారు – ఎసలారు.

శా. శర్వాణీస్తనచక్రవాకములు వతుస్ఫారశాసారమున్, గర్వం బింపెసలారఁగాఁ దలిసి వేడ్కల్సల్పరో మాంచమున్, సర్వాంగీణముగా ధరించుకొని యిచ్చున్ బేర్చు శంభుండు సర్వోర్వీరక్షణదక్షు వేమనృపు వర్యూర్జస్వలుం జేయుతన్. హరి. పూ. 1. 2.

ఒప్పెసలారు – ఎసలారు. వి. పు. 1. 188.

చెన్నెసలారు – ఎసలారు. కళా. 6. 199.

పొల్పెసలారు – ఎసలారు హర. 3. 58.

సొంపెసలారు – ఎసలారు.

క. చుట్టంబులుఁ జెలులుం దన,చుట్టుఁ దిరిగి యుండ ముదము సొంపెసలారన్. చెట్టపడి చచ్చి క్రమ్మఱఁ,బుట్టినచందమున హంసము దటాకములోన్. నైష. 2. 4.

(ఇట్లే ఇతరములు గ్రహింపనగు.)

ఎవలిక వి. తిటిక. అవకాశము. (శ. ర.)

ఎసవెట్టు – ఎసకొలుపు. స. క్రి. (ఎస + పెట్టు.) పురికొల్పు, ప్రేరించు.

బలయుగ్రాహి....క, య్యాల కెసవెట్టుచును హాళిఁ జలపట్టుచు సుమాళములఁ గిట్టుచును బాలికలు వేడ్కన్. కళా. 6. 281

# ఏ

ఏ ఉత్త. ఒకానొక యక్షరము.

ఏ¹ – ఎ², ఆ³. అవ్య. (సం. ఏవ. ప్రా. ఎవ్వ. క. త. ఏ.)

1. అవధారణార్థకము.

మ. ...ఏ, తెరు వైనం దనయుచ్చతోఁ బడియె నింతే కాక యేఁ బూఁటయే. భార. ఉద్యో. 3. 358.

గీ. అన్న నీయట్టియన్న నన్నుదినంబు, గార వింపఁగ నుండనేఁకరుదు నన్న, నింకఁ జాల నెవ్వగలచే నిచట నిలువ,నాకు నేల నీతోడిదే లోకమన్న. ఉ. హరి. 4. 300.

(ఈయర్థమున 'ను' అనుప్రయుక్తమై 'ఏను' అను రూపమును దానిపైఁ బ్రశ్నార్థక మగు 'ఆ' చేరి 'ఏనా' అనురూపమును ఏర్పడినవి. ఇవి ప్రాచీన ప్రయోగములలో కనఁబడవు. ఈ క్రిందియుదాహరణములలోఁగలవు. వ్యవహారమునను ప్రసిద్ధములు.)

చ. అళిరుచి కొప్పు కొప్పు శశియందు రమం దిర మోము మోము చం, చలసమ మేను మేను లకుచమ్ములలీల కుచమ్ములింపు ... ముకుంద. 1. 46. పా. 4 పం.

ఉ. నీమదిలోన సంశయము నివ్వటిలెన్ బదు వాల్గుకోటులే,నా మఱియున్ ఘనంబుగ ధనం బొనగూర్చెద మూర్ఖవంశజుల్, లేమిడిఁ జెంది యుండియును లే దను వాక్యముఁ బల్కరెన్నఁడున్. ఇందు. 1. 181.

క. అతులితవిలాసరేఖా,కృతులన్ వలపించి యిటులఁ ద్రిభువనలీలా,వతుల నలయించుచే నా,వ్రత మనఁగా నీకు రూపవంచితమదనా. విజ. వి. 1. 91.

శా. ...ని,ర్భీతిన్ బాలికఁ గొంచుఁ బోవ మచి తంతే కండగర్వంబు దుశ్శీలుల్ యాదవ వీరసింహములతోనేనా ... విజ. వి. 3. 162.

క. ధవళుఁడ వీవేనా యని, గవుఁగిటఁ గది యించి వెనరుగల బంధుఁడ వౌ,దువు ... శుక. 2. 516.

2. తనంతట తాను – అన్యప్రేరణము లేక – అను భావమును దెలుపును.

ఉదా : నేను పిలువకుండ వాఁడే వచ్చెను.

3. నిర్దేశమును – చూపుటను – బలపఱుచును.

మ. ఇతఁడే రామనరేంద్రుఁ డీయబల కాయిం ద్రారి ఖండించె న,ల్లతఁడే లక్ష్మణుఁడు... అటంచున్ జేతులన్ జూపుచున్, సతులెల్లన్ బరికించి చూచిరి... భాగ. 9. 325.

4. ఆధిక్యమును – ఎక్కువను – తెలుపును,

సీ. కంతుల నొజ్జలే కాలంబు గడపంగ నూఁచ బియ్యంబు శిష్యులకుఁ గలవె. రామలిం. 85.

ఏ² అవ్య. 1. ప్రశ్నార్థకము. (ఇది సందర్భాను సారముగా ఆశ్చర్యప్రశంసాదులను గూడఁ దెలుపును.)

గీ. స్నానమాడెనె వార్చెనే సంధ్య యగ్ని, హోత్ర మొనరించెనే యిఁకే పుత్రుఁ డనిన, స్నానమాడెను వార్చెను సంధ్య యగ్ని, హోత్ర మొనరించె నమచును నువిద మొఱఁగు. కాశీ. 4. 86.

క. చూచితిరే శ్రీహరి మా,యాచాతురి... దశా. 1. 201. (ఇట ఆశ్చర్యమును దెలుపును.)

వ. ...నాయాడినమాటలకు నయ్యుధిష్ఠిరుండు పలికిన వచనంబు లింత యొప్పునే యని యగ్గించిన... భార. ఉద్యో. 2. 117. (ఇట ప్రశంసను దెలుపును.)

గీ. తారు కందమూలంబు లాహారములుగఁ బొదలఁ బట్టులఁ బఱియుండి పులుఁగ

మెకముఁలఁబవ మేల్కొనుచుండిరే యక్కట కట. భార. ఉద్యో. 3. 183. (ఇట దుఃఖమును దెలుపును.)

ఉ. తోంటినృపాలజాలములతోఁ దులఁదూఁగెడు మాగధేంద్రుచే, నంటినవింటిమంటకు భయద్రుతుఁడై పరివారు నవ్వఁగా, గొంటుతనంబునం దుదిని గోటమెుఁబుంగున దాఁగియుండెనే, బంటిఁక మానసారఁ దని పల్కులు మాగధయోధు లాడిరన్. రా. వి. 5. 23. (ఇట పరిహాసమును దెల్పును)

మ. ...మామిడన్న సుతుఁ డేతన్మాత్రుఁడే చెప్పఁగాన్. నైష. 1. 27. (ఇటకాక్వర్థమును దెలుపును.)

2. స్త్రీతో మాటాడునపుడు ప్రయోగింపఁబడును.

చ. ...ముదిమి దాఁపసమైన మ ఈ టెసుద్దులే, గతజలసేతుబంధములు గావె ధనార్జనపుం బ్రసంగముల్. విప్ర. 4. 22.

సీ. వీఁడఁటే రక్కసి విగతజీవగఁ జన్నుఁబాలు ద్రావినమేటిబాలకుండు. భాగ. 10. పూ. 1. 249.

3. ప్రార్థనార్థకములగు మధ్యమ 'ము,(డు' ల కనుప్రయుక్తమగును.

శా. రావే యీశ్వర కావవే వరద సంరక్షింపు భద్రాత్మకా. భాగ. 8. 90. (చూ. ఎ³. 2. అర్థము.)

ఏ³ – ఎ⁴. వ. (సం. యద్. ప్రా. ఏ. క. త. ఏ) 1. యచ్ఛబ్దార్థకము. (ఇది తచ్ఛబ్దార్థకము నపేక్షించును.)

క. ఏకథలయందుఁ బుణ్యశ్లోకుఁడు హరి సెప్పఁబడును మూరిజనముచే, నాకథలు పుణ్యకథలని, యాకర్ణింపుదురు పెద్ద లతిహర్షమునన్. భాగ. 8. 21.

2. కిమర్థకము. (ప్రశ్నార్థకము.)

శా. ఏయే దేశములన్ వసించితిరి మీ రేయే గిరుల్ చూచినారు...మనుచ. 1. 68.

జః ఏకె, ఏడ, ఏది, ఏదీ, ఏపె, ఏలిడ, ఏమె, ఏయది, ఏవల, ఏవాఁడు.

ఏ⁴ – ఏమి. వ. అవ్య. ఏమియొక్కలుప్తశేషము. (చూ. ఏమి. వ. 8. అవ్య – చ. ట.)

ఏఁకట వి. (√ఏఁకరు.) 1. మిక్కిలి అపేక్ష; అపేక్ష.

క. ఆఁకొంటి రివ్విదినములు, పోఁకంతయు భిక్ష వీటఁ బుట్టకయునికిన్, ఆఁకటిదూఁకట వలిఁగిరి, ఏఁకట వాయంగ భిక్ష లిడియెదరండి. భీమ. 2. 124.

చ. కని కనాంఘ్రిభిక్షకటకంబులు మ్రోయక యుండ నల్లనల్లనఁ జని యక్కుమారునివిలాసము లేఁకటవాయఁజూచి మ్రోల నడవ సంభ్రమాటఁ బదిలం బగుపత్త్రిక వీడ్వ తండ్రి వ్రాసినసపటంపుఁబద్ధతిఁ జిత్తమునం బరితాప మ దుచున్. హై. భా. 8. 78.

ఉ. ...తియ్యనీ. రేఁకవోవఁ గ్రోలి ... నిమ్మగు చెట్టుల నీడనుండఁగా... కేయూ. 8. 87.

ఉ. ...ప్రాణనాయకు, డెక్కడు వర్ణ్యతన్ రతుల నేఁకటదీర్చ...మనుచ. 3. 7.

సీ. ఇచ్చకాయువు కోర్కియేఁకట కోరిక యాప యంచనఁగఁ జెన్నలరుఁ గాంక్ష. ఆం. భా. 1. 187.

2. బాధ.

ఉ. అన్న మెునంగఁ బాడియగు నాఁకట నేఁకటఁ జెందువానికిం, జెన్న గ శితభిక్షనకుఁ జేల మొనంగఁ దగున్...ధర్మ. 4. 127.

ఏఁకటపడు – ఏఁకరు, వాఁచిపోవు. మిక్కిలి అపేక్షపడు.

వ. ...అన్నదానవిరహితంబుగా విప్రులకు సకల దానంబు లొసంగి శరీరావసానంబున నాకలోక భోగంబు లనుభవించుచుండియు నాఁకట నన్నంబున కేఁకటపడి సకలలోకంబులం బరిభ్రమించుచు...వరాహ. 12. 68.

ఏఁకరి వి. కిరాతభేదము

గీ. బోయనాఁగఁ గిరాతుఁడౌఁ గోయ చెంచు పరికియేనాది యేఁకరి పట్ట యెరుకు, వేఁకరి యెసకరి యనఁ దద్భేదములుగఁ, బొల్చును ... ఆం. భా. 2. 289. (శ. ర. పా.)

**ఏఁకరు** - ఏఁకారు. అ. క్రి. (త. ఏక్కఁఱు, ఏక్కఁరి.)

1\. మిక్కిలికాంక్షకలిగియుండు, ఉవ్విళ్లూరు.

ఉ. లావున వైరిదర్పము వెలాగ్నక యేఁకరి యున్న చేతులన్, భావభవారిపాదములు పట్టి పరాక్రమకేళిఁ గోరినన్. ఉ. హరి 5. 19.

మ. తొలుతం జేరెఁడువడ్ల కేఁకరు దరిద్రుం డంత సంపన్నుఁడై, యిల సర్వంబు తృణీకరించు ...మల్ల. నీతి. 36.

(మూలము పరిక్షీణః కశ్చిత్ స్పృహయతి యవానాం ప్రసృతయే, స పశ్చాత్సంపూర్ణః కలయతి ధరిత్రీం తృణసమాం.)

2\. భయపడు.

చ. .... పదురాత్రులు మహోద్ధతి వానలు గుర్యఁ జూచి య.య్యోడరువ కించుకేని మది నేఁకరికుండఁగఁ జేసె వెన్నుఁడున్. పద్మ. 9. 231.

జ: ఏఁకట.

**ఏఁకారు** - ఏఁకరు.

(మిక్కిలి కాంక్ష కలిగియుండు.

సీ. ఎడ లేక కవగూడి యే ప్రొద్దు రతి సల్పు వారివై ఖరుల కేఁకారఁ దొడఁగు. హంస. 8. 205

సీ. కవగూడి యెడఁబాయఁగా లేని మిథునంబు కాంక్ష వీక్షించి యేఁ కారఁ దొడఁగు. శుక. 3. 488.

(బాధపడు)

గీ. ఉపరతికి నెంచుఁ బరిహాసకోక్తులాడుఁ, జేష్ట లెనయించుఁ బొలయల్కచేతఁ గుందు, వెతల నేఁకారు మది నిట్లు విటులఁ జూచి, చిత్తజోన్మత్తయై గొల్ల చిన్నెలాడి. హంస. 2. 104.

**ఏఁగించు** స. క్రి. ( √ఏఁగు. ) 1. ఏఁగఁజేయు, వెళ్లఁజేయు, పంపు.

ఉ. ...ఇప్పుడ కాలు ద్రొలి కేఁగించెదఁ బక్కనై నిలుము గిట్టెదనంబున రాజసాధమా. భార. ఆది. 6. 294.

2\. (ఉత్సవముతో) త్రిప్పు. (చూ. ఏఁగు. 5. అర్థము.)

మ. పురియేఁగించి తదీయమైన నగరంబున్ జేర్చుఁడంచు న్వడిన్. ఆము 4. 9. (పురి - పురియందు.)

క. నిచుళేశుఁడు... తాను బల్లకి మోచుచు నేఁగించెఁ విభూతితోఁ బిల్లఁబురిన్. పండి. 3. 303

గీ. పట్టపేనుఁగుమీఁదటఁ బెట్టి యతనిఁ, బురము గలయ నేఁగింపఁగ ... పండి. 4. 15. (పురము - పురమునందు.)

**ఏఁగు** అ. క్రి. (శ. ఏఁగు-శ ర. నిర్బంధుకముగా గ్రహించెను. కాని ఈ క్రింది సాధక ప్రయోగములఁ బట్టి సబిందుకముగా గ్రహించితిమి.)

1\. పోవు. వెళ్లు.

క. విని యతనిం దనపై సిడుకొని యేఁగని యమికిఁ దగనిఘోరార్తియొనర్చనవాఁడ మీకు దండ్యుఁడ,నని తనుఁదెలుపుచును వారి కప్పన నేసెన్ రాఘవ. 1. 28 (ఇట భాగవతార్థమున 'ఏన్ + కినియమికి' అనియు, రామాయణార్థమున 'ఏఁగి + నియమికి' అనియు భేదము.)

క. కాఁగానిమాట లాడెదు, రాఁగూడదు నేదపశ్చరణమై మాడంగాఁ గోమలి యిటు నిల్వక, యేఁగుము మగనాలి కేల యీ దుర్గుణముల్. భోజరా. 4. 148.

ఉ. లోఁగక వారు లవ్వనములో విహరించి రొకళ్లొకళ్లకై, యేఁగుచుఁ గమ్మపూఁ బొదరు లీఁగుచుఁ దేనియసోనవానలం, దోఁగుచుఁ దూగుటుయ్యాలలఁ దూఁగుచు నొక్కతె కోయు గుత్తికిన్, మూఁగుచుఁ గంతుపిడె లన మ్రోఁగుచు నొండొరుచేతు లాగుచున్. కళా. 3. 15. ఉ రా. 3. 269.

ఉ. ...అట్లుగాని నాఁ,డేల గృహస్థవృత్తి సుఖ

మేఁగి వనంబున నున్కి కష్టమే. భార. ఆది. 6. 267.

2. నడచు.

ఉ. ఇప్పటిభంగి నొక్కడుగు నేఁగెడువానికి నోర్వ నెమ్మెయిన్. భార. విరా. 1. 148.

3. కడచు.

సీ. ...తద్భూరిగర్భమూర్తి యైయుండి బహు వత్సరాత్మకంబగుకాల మేఁగిన నది యవి యించుకొనుచుఁ. గీ. బుట్టెనటుఁడు...హరి. పూ. 1. 58.

4. గతించు, చనిపోవు, చచ్చు.

సీ. శచిమాఱుమనువు రచ్చలఁ బెట్టి యెందఱే నింద్రుల మనువారు శేఁగి రహహ. గీ. చూడ నవి యెల్ల యుగచర్యనుద్దులయ్యె హంస. 1. 190.

సీ. శార్దూలకబళుండు సచ్చె దుర్జయుఁ డేఁగె శతమాయుఁ డొరఁగెను సమసె వక్ర. నానుండు... మొ. రా. సుం. 159.

5. (ఉత్సవముతో) తిరుగు.
(ఈయర్థమున వ్యవహితముగనో అవ్యవహిత ముగనో ఊరు, పురము. మొ. పదములతోఁ గలిసియే యుండును—చూ. ఊరేఁగు, ఏగించు 2. అర్థము.)

సీ. మనుచరిత్రంబందుకొనువేళఁ బుర మేఁగఁ బల్లకి తన కేలఁబట్టియెత్తె. (పెద్దనచాటువు)

జ: ఏఁగించు, ఏఁగుడు, ఏఁగుదెంచు, ఏఁగుపెండ్లి, ఏతెంచు.

**ఏఁగుడు** వి. (√ఏఁగు) ఏఁగుట

గీ. చనుట యేఁగుట యేఁగుదం చనఁగ యాత్ర. ఆం. భా. 2. 219.

**ఏఁగుదెంచు** అ. క్రి. (√ఏఁగు) 1. వచ్చు. (ఇట 'తెంచు' ధాత్వర్థమునకు వ్యతిరేకార్థమును దెలుపును.)

ఉ. ....పరాశరనందనుఁ డేఁగుదెంచె... భార. ఆది, 6. 225.

ఆ. ....ఎయ్యది నీనామ, మెచటినుండి యిచటి కేటి కివ్వ, డేఁగుదెంచినాఁడ వెఱిఁగింపు మనుటయు. విక్ర. 1. 108.

2. వెడలు. పోవు. (ఇటస్వార్థమున 'తెంచు' వచ్చినది. ఇది ప్రాయికము గాదు)

చ. ...భీమసేనుఁ డా. గ్రహమునఁ జూచి కన్నులెదురన్ వృషకేతునిపాటు గాంచి యా, యహితుల నెల్ల డించి నవనాశ్వముతోఁ బురి కేఁగుదెంచి యమ్మహిపతిఁ గాంచి యాతని క్రమంబపుడే మని విన్న వించెదర. జై. భా. 2. 78.

**ఏఁగుపెండ్లి** వి. (√ఏఁగు) పెండ్లికడపట వధూవరులను ఊరేఁగించునుత్సవము.

సీ ...వివాహనామంబు పెడ్లి ... పెండిలి యనఁగఁ బెం పెక్కు నేఁగు పెండ్లనఁ దదంతవీథికావిహృతి యగుభవ అం. భా. 3. 178.

చ. జలనిధిసాంద్రభోగమున నుజాదనుజాదుల యేఁగుపెడ్లినాఁ, డలఘుఁడు విశ్వకర్త యధవాబ్జభవాదులు మెచ్చఁ జేసెఁ గౌశలమున దీని... వసు. 3. 10.

**ఏఁచు** – ఏఁపు స. క్రి (త. ఏఙ్గు – బాధపడు. కష్టపడు.) బాధించు.

ఉ. ఏఁచు నుపేంద్రునిం బదక మిమ్ముని యక్కడి మున్ను దేవుడుం, బూఁచిన పూవు దప్పుటకుఁ బోకలఁ బోవుచునుండు....ఉ. హరి. 1. 168.

చ. ....అంగనాజనములు నన్నుఁ జూచి మరుసాయకముల్ దమచిత్తవృత్తు లేఁచినఁ వచ్చి యిత్తురు విశిష్టధనంబులు నాకు లంచముల్. భార. విరా. 2. 334.

**ఏఁచెల్ల** అవ్య. (ఏను+చెల్ల) సంతాపార్థకము.

ద్వి. ఎన్నఁడు నెండక న్నెఱుఁగని శిశువు, గన్నుల ముత్యాలు గాఱ నేడ్చెడిని, నేఁ చెల్ల యోయమ్మ యీచక్కనన్న. ద్వి. పారిశ్చ. ఉ. 927.

**ఏఁట** – వేఁట. వి. మేషము, గొఱ్ఱె.

ద్వి. కాటకోటండు నాఁ గలఁ డొక్క గొల్ల, యేఁట పెంట్రిక తన కీశ్వరుఁడనుచు. బస. పు. 2. 417.

ద్వి. పాటిపేరుఁడు కాటకోటయ్యగారి, కేఁట పెంట్రికయుఁ దా నిల లింగ మయ్యె. పండితా. దీక్షా. 58. పా.

(పై రెండు ప్రయోగములందు 'ఏట' అని ముద్రితము. కాని యీ గ్రంథములలో సరిఁదు నిర్బంధుక ప్రాసములు గలవు)

**ఏఁడాది** వి. (ఏఁడు¹ + ఆది – శ. ర.) ఒక యేఁడు పరిమితిగల కాలము.

క. అలరాజతనయుఁ దలరుచు,నిలరాజ య
యైన మంచి దేఁడా దిచటన్, నిలువుము
నీకు శుభంబులు, గలిగెడినని తెలుప నతఁడు
గై కొని నిలిచెన్. ఉ. రా. 7. 487.

ఆ. ఎద్దుఁ దెలుపవచ్చు నేఁడాదికైనను, మౌనిఁ
దెలుపవచ్చు మాసమందు, మొప్పెఁ దెలుప
రాదు ముప్పదేండ్లకునైన. విశ్వదాభిరామ
వినుర వేమ. వేమన 2. 68.

ఉ. ...ఏఁ, డాది భజించెనేని గురుఁ డాతని
కీఁదగు మంత్ర మిమ్మునలఁ. పద్మ.
5. 100.

**ఏఁడి** – ఏఁడి, వేఁడి, వేఁడీ. స. (ఏఁడు² + ఇ.) ఎక్కడనున్నాఁడు.

గీ. ఏఁడి జ్యోతిర్ముఖుఁడు నీలుఁ డేఁడి యేఁడి,
కుముదుఁ డాగవయుఁడు నేఁడి.... సీకావి.
2. 55.

**ఏఁడికోల** వి. (√మేఁడి ?) ఈష, నాఁగటికొయ్య.

సీ. కోళ్ల గూండ్లను గొట్టి కుఱుగాఁడి యేఁడి
కోలలు కాఁడి పలుపులు గలుగునటుక.
శుక. 2. 408.

సీ. ఏఁడికోలనఁగను నెనఁగు నీష. ఆం. భా.
2. 282.

**ఏఁడీ** – ఏఁడి. (ఏఁడు² + ఈ.)

క. ఓడితిమె మేము రణమునఁ, గ్రీడికిఁ గ్రే
డించి రాక గెలుపే యతఁ డేఁడీ డాఁగి
పోయెనొకో...భాగ. ద్రో. 1. 374.

**ఏఁడు¹** వి. బొ. (బ. ఏఁడులు, ఏండ్లు – క. ఏడు-కాలము. త ఆండు) 1. సంవత్సరము.

మధ్యా. వనమునఁ బదియురెండేఁడు లజ్ఞాత
వాస మొక్కేఁడు, జనపదంబువమండి తగఁగ
నయ్యేండ్లు సలిపి...భార. ఆది 8. 19.

వ. ....ఏఁటేఁట నింద్రోత్సవం బనుమత్సవంబు
సేయుచు. భార ఆది. 8 24.

2. ఆయువు.

క. అధరణీపాలుఁడు తమ,సాధుని యతికోమరు
నేఁడు సమసెనె యిట్లా,హా ధాత వ్రాఁత
యని శర,బాధం గలఁగఁగను వారిపజ్జకుఁ
జనియెన్. రాఘవ. 1. 28. (రామాయ
ణార్థమున ప్రయోగాంతరము లేదు.)

జ: ఏఁడాది, ఏఁడుడి.

**ఏఁడు²** – వేఁడు. స. (బ ఏరు.) ఎవఁడు.
(ఏపురుషుఁడు)

గీ. ....ఏనాజ్ఞనింద్రియ ప్రతతి నడుచు, నట్టి
శ్రీమేశ్వరుఁడు మాకు నభయ మొసఁగు.
భీమ. 4. 88.

క. కనలుచు శివశివ యి దేమి కారణ మెటు
లం, గనువాఁడ నేఁటఁ నే, మనువాఁడ....
శుక. 1. 116.
(ఎల్లవాఁడు)

మ. ...అత్తరుణీశీలతనుత్ర మేరికి నసాధ్యం
బౌటఁగా కేశవా. అము. 4. 80.

జ: ఏఁడి, ఏఁడీ

**ఏఁడుడి** వి. (ఏఁడు¹ + ఉడి.) ఆబ్దికము. (శ. ర.)

**ఏఁదర** వి. కుటుంబమునకు సంబంధింపని స్వతంత్ర పురొత్తు. స్వార్జితధనము
ఉదా: వానికి కొంత ఏఁదర ఉన్నది.
విశే. కుటుంబమునకు సంబంధింపక స్వతంత్ర మైనది. స్వార్జితము.
ఉదా: నా కాయూరిలో ఏఁదరకమతము కలదు. (శ. ర.)

**ఏఁదుము** వి. (ఏను + తూము) అయిదుతూములు.

సీ. ...పంచాధికియు నేఁదు మంచుఁ దోఁచు.
ఆం భా. 2. 270.

**ఏఁపరించు** స. క్రి. (√ఏఁపు) దుఃఖపెట్టు,

ద్వి. ఏఁపరించుచుఁ బతి కెదురు భాషించు,పాపా
త్ముర లూరఁబందియై పుట్టు ద్వి. హరిశ్చ.
ఉ. 1180 పం.

ద్వి. మనమున మోహంబు మల్లడిగొనఁగ,
జమదేవు నీ వేల చన్నులు సేఁపె, నేఁప
రింపుదురె న న్నిట్లు మాయయ్య, నాపుత్ర
రత్నంబ నానిధానంబ,యని పెక్కు భంగుల
నడలు...ద్వి. హరిశ్చ. ఉ. 1887 పం.

**ఏఁపు** – ఏఁచే. స. క్రి. ('ఏఁచు'నుబట్టి సబిందుకముగా గ్రహింపబడినది కాని నవనాథ, వి. పు. ప్రయోగములు నిర్బిందుక మనుటకు సాధకములుగా నున్నవి. ఇంకను విచార్యము.) బాధించు.

ద్వి. పాపాత్ముఁ డనఁ దల్లిఁ బట్టి యీరీతి, నేఁపినదుష్టు లేయెడ నైనఁ గలరె. నవనాథ 2. 81 పొ. గి. పం.

గీ. .. కోమటిమ్మరులు నెలఁగి యిటు లేఁపుచున్నఁ దలఁక వకట. అచ్చ రా. యు. 451.

వి. సంతాపము, బాధ

క. శ్రీపతిభావ్యలఁ గోల్పడి. యా పార్థుఁడు చిన్నవోయి యప్పుడు చనియెన్, ఏఁపున గోవులఁ గోల్పడి, గోపాలకుఁ డరిగినట్లు ఘోరాటవిలోన్. వి. పు. 8. 279.

ఉ. మిన్నక వచ్చి యాజఅఖి మేడ్పడి చిత్రపటంబు చూపి తా, నెన్నివిధంబులం బఱచి యిక్కకు నాఅడి యిట్లు దెచ్చునే, నన్నుఁ దలంచి యిట్టి నృపనందనుఁ డిందులఁ గేలవచ్చు నిం కెన్నఁడు నీఁగలేని మగునేఁపుల పాల్పడుదానవై తినే దశకు. 7. 108.

జ: ఏఁపరించు

**ఏఁబండ్రు** స. బ (√ఏను² – 'ఏఁబది'కి మహన్మహత్వర్థకరూపము.) ఏఁబదిమంది.

సీ. దక్షుఁడు దర్శిన్యాదిసుత జగములఁ బ్రకటింపఁ దలఁచి యేఁబండ్ర సుతులఁ బడసి.... కు. పం. 1. 74

**ఏఁబది** స. వి. అసౌ. (ఏను² + పది - త. ఐంబదు) అయిదుపదులు

చ. ....వయస్సు డెబ్బదిటికి లోను నేఁబదికి బాహ్యమునై ...ఆము. 4 211.

ఉదా: ఏఁబదికి, ఏఁబదిటన్, మొ.

**ఏఁబలము** వి. (ఏను² + పలము) అయిదుపలములు.

సీ. పంచపలీసంజ్ఞ వరఁగునేఁబలమన... అం. భా. 2. 269. (ఇప్పటి వాడుకలో పది పలములు.)

**ఏకకుండలుఁడు** సం. వి. అ. పుం. 1. కుబేరుఁడు. 2. బలరాముఁడు. 3. శేషుఁడు.

**ఏకకుఁడు** సం. విశే. (అ. కా అ.) అసహాయుఁడు. ఎక్కటి. ఒంటరి.

**ఏకగురువు** సం. వి. ఉ. పుం. సమానగురువుకలవాఁడు, సతీర్థ్యుఁడు.

**ఏకచక్ర** సం. వి. ఆ. స్త్రీ భారతప్రసిద్ధమగు నొకానొక పుటము

సీ. ..ంకించె నేఁకచక్రాపుటంబు. భార. విరా. 1. 74.

శ్లో. ... ఏకచక్రా గతాస్తేతు సం. భార. ఆది. 171. 1.

కాని నన్నయ దీనిని అకారాంతముగా ప్రయోగించినాడు.)

సీ. కడుఁ గ్రొవ్వి రేకచక్రంబున వారల కేనింత యెల్లిద మేల యైతి. భార. ఆది. 6. 292.

వ. ... ఏకచక్రపురంబున కేగి భార. ఆది 6. 228.

**ఏకచక్రము** సం. వి. అ. పుం- ఒకచక్రము కలది–సూర్యరథము

**ఏకచత్వారింశత్తమము** సం. విశే. (అ. ఈ అ.) నలువదియొకటవది.

**ఏకచత్వారింశత్తు** సం. వి. త్. స్త్రీ. నలువదియొకటి.

**ఏకచత్వారింశము** సం. విశే. (అ. ఈ. అ.) నలువదియొకటవది

**ఏకచరము** సం. విశే. (అ. ఈ. అ.) 1. ఏకాకి. అసహాయము సం. భాగ. 5. 5. 30. సం. కిరా. 8 58. 2. ఒక్కచారుఁడు గలది వి. అ పుం–ఒంటరిగాతిరుగునది–1. ఖడ్గమృగము 2. ఒంటిగాఁడు, అడవిపంది సం. కిరా. 13. 8. మనుచ 4 37.

**ఏకజన్ముఁడు** సం. వి. న్. పుం. 1. ముఖ్యమైన జన్మము గలవాఁడు - రాజు. 2. ఉపనయన రూప జన్మము లేనివాఁడు - శూద్రుఁడు. (వ్యతి ద్విజన్ముఁడు.)

**ఏకజాతి** సం. వి. ఇ. పుం. 1. శూద్రుఁడు. 2. కీటభేదము, స్త్రీ. ఒక్కజాతి.

**ఏకజాతీయము** సం. విణ. (అ. అ. అ.) ఒక్కజాతి లోనిది.

**ఏకతమము** సం. విణ. (అ. అ. అ.) పెక్కింటిలో నొక్కటి.

**ఏకతము** - ఎగ్గతము. విణ. (సం. ఏకాంతమ్. ప్రా. ఎక్కంత.) ఒంటరిగానున్నది; రహస్యముగా నున్నది.

సీ. ...ఏకతంపు, గుడిమ్రానిపొంతను... భాగ. శాం. 5. 98.

క. స్త్రీయును బురుషుఁడు నేకత,మై యున్నెడఁ జూచి ఘొట్టి యధముండైనఁ, డాయఁగవచ్చునె...మార్క. 1. 68.

వి. ఏకాంతప్రదేశము, నిర్జనస్థలము.

సీ. ఏకతంబున వసియించి యెవ్వనిఁ గంద్రు యోగీశ్వరేశ్వరుల్ యోగదృష్టి. హర. 4. 63.

క్రి. విణ. ఒంటరిగా, తోడులేకుండఁగా.

క. .. వయ త్నము త,ద్వనలోదధితీంబు నఁ గొమరుగ నేకతమ యిచ్చఁ గ్రుమ్మరుచున్నన్. భార. ఆది. 2 :6.

సీ. ఇప్పాండుపుత్రుల నేలొకో ధృతరాష్ట్రుఁ డేకత మనుపంగ నిచ్చగించె. భార. ఆది. 6. 142.

ఆ. తాను నతఁడు నేకతమ యుండి హాని కం, తయును జెప్పఁదొడంగె ధర్మవిదుఁడు. భార. ఆది 7. 254.

ఏకతమాడు - రహస్యముగా మాటలాడు

ఉ. కూరిమిమంత్రితోడ నలకూబరుఁ డేకత మాడి... మనుచ. 5. 96.

**ఏకతరము** సం. విణ. (అ. అ. అ.) రెంటిలో నొక్కటి.

**ఏకతానుఁడు** సం. విణ. (అ. అ. అ.) ఏకవిషయాసక్తచిత్తుఁడు, ఏకాగ్రచిత్తుఁడు. (ఇప్లే - ఏకతానకుఁడు)

**ఏకతాళము** సం. వి. అ. పుం. 1. గీతవాద్యాలయ సామ్యము. 2. తాళభేదము.

**ఏకత్రింశత్తమము** సం. విణ. (అ. ఈ. అ.) - ఏకత్రింశము.

**ఏకత్రింశత్తు** సం. వి. త్. స్త్రీ. ముప్పదియొకటి.

**ఏకత్రింశము** సం. విణ. (అ. ఈ. అ.) ముప్పదియొకటవది.

**ఏకదండి** సం. వి. న్. పుం. శిఖాయజ్ఞోపవీతాది శూన్యుఁడయి యేకదండమును దాల్చు సన్న్యాసి. హంసుఁడు. (సన్న్యాసులు – కుటీచకుఁడు, బహూదకుఁడు, హంసుఁడు, పరమహంసుఁడు–అని నాలుగువిధముల నుందురు. కుటీచకబహూదకులు త్రిదండమును, హంసుఁడు ఏకదండమును ధరింతురు. పరమహంసునకు దండధారణము లేదు.)

**ఏకదంతుఁడు** సం. విణ. (అ. అ. అ.) ఒకదంతము గలవాఁడు. వి. అ పుం. ఒంటికొమ్మువేలుపు, వినాయకుఁడు.

**ఏకదంష్ట్రుఁడు** సం. - ఏకదంతుఁడు.

**ఏకదృక్కు** సం. విణ. (క్) 1. సర్వమును ఒకటి (బ్రహ్మమును) గాఁ జూచువాఁడు, బ్రహ్మజ్ఞాని. 2. ఒకకన్నుగలవాఁడు, కాణుఁడు. వి. క్. పుం. 1. కాకి. 2. శుక్రాచార్యుఁడు. 3. శివుఁడు.

**ఏకదృష్టి** సం. విణ. (ఇ) వి. ఇ. పుం - ఏకదృక్కు.

**ఏకదేవుఁడు** సం. వి. అ. పుం. పరమేశ్వరుఁడు.

**ఏకదేశము** సం. వి. అ. పుం. 1. ఒకచోటు. 2. అంశము. భాగము, అవయవము.

**ఏకదేశి** సం. విణ. (న్. నీ. న్.) 1. అవయవి, అంశములు కలది. 2. ఏకదేశస్థుఁడు.

**ఏకదేశీయుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) సమానదేశమువాఁడు, ఏకదేశస్థుఁడు.

**ఏకధని** సం. విణ. (న్. నీ. న్.) - ఏకధనుఁడు.

**ఏకధనుఁడు** సం. విణ. (అ. అ. అ.) అవిభక్తుఁడు, పంచుకొననివాఁడు. (సోదరాది)

**ఏకధర్మి** సం. విణ. (న్. ణీ. న్.)– ఏకధర్ముఁడు.

**ఏకధర్ముఁడు** సం. విణ. (న్. అ, న్. న్.) 1. సమానధర్మముగలవాఁడు. 2. సమానమతము గలవాఁడు.

**ఏకధుర** సం. వి. అ. స్త్రీ. ఒక్కబరువు,

**ఏకధురము** సం. విణ. (అ. అ. అ.) ఒక్కబరువు

మోయునది. నాఁగటనైనను బండినైనను ఒక్కటిని మాత్రము లాగెడిది. (ఎద్దులో నగునది.)

**ఏకధురావహము** సం. - ఏకధురము.

**ఏకధురీణము** సం - ఏకధురము.

**ఏకన** వి. అంచు (ఉదా: బద్ద కంచము ఏకన ముంచుము. శ. ర.

**ఏకనవతము** సం. విజ. (అ. ఈ. అ.) తొంబదియొకటవది

**ఏకనవతి** సం. వి. ఇ. స్త్రీ తొంబదియొకటి.

**ఏకనవతితమము** సం. - ఏకనవతము

**ఏకపంచాశత్తమము** సం - ఏకపంచాశము

**ఏకపంచాశత్తు** సం. వి. త్. స్త్రీ. ఏఁబదియొకటి

**ఏకపంచాశము** సం. విజ (అ. ఈ. అ.) ఏఁబదియొకటవది

**ఏకపత్త్రిక** సం వి అ స్త్రీ గంధపత్త్రావృక్షము.

**ఏకపత్ని** సం వి ఈ. స్త్రీ. 1. ఒకఁడేభర్తగాఁ గలది- పతివ్రత. 2-తనభర్తకు తానొకతియే భార్య యైనది - సవతులులేనిది 3 సవతి, తోడి పెండ్లాము.

**ఏకపత్నీకుఁడు** సం. వి. అ. పుం ఒకతియే భార్యగాఁ గలవాఁడు.

**ఏకపత్నీవ్రతము** సం. వి. అ. న. 1. ఒక్క-భార్యతోనే యుండుట అనెడు వ్రతము 2. ఒక భర్తతోనే యుండుట యనెడు వ్రతము.

శ్లో కామేక పత్నీవ్రతదుఃఖశీలాం సం కు. సం. 3 7.

**ఏకపదము** సం. వి. అ. న. తత్క్షణము పుం. ఒకానొక రతిబంధము (వై. ని)

**ఏకపది** సం. వి. ఈ. స్త్రీ - ఒకఁడు నడువఁదగిన త్రోవ - త్రోవ మార్గము.

**ఏకపాత్తు** సం. విజ. (త్) ఒక్క-పాదముగలది. వి. త్. పుం. 1. శివుఁడు. 2. విష్ణువు.

**ఏకపాదిక** సం. వి. అ. స్త్రీ. పక్షులొక్క-కాలిమీఁద నిలిచియుండుట.

**ఏకపింగళుఁడు** సం - ఏకపింగుఁడు.

**ఏకపింగుఁడు** సం. వి. అ. పుం. కుబేరుఁడు. (ఇతని యెడమకన్ను పార్వతిశాపమున పింగళవర్ణమయినది.)

**ఏకపిండుఁడు** సం విజ (అ. ఆ అ.) - సమానమగు పిండముగాని శ్రాద్ధమునందియఁదగిన పిండముగాని గలవాఁడు - సపిండుఁడు.

**ఏకపుష్కల(ర)ము** సం. వి. అ పుం. కాహళవాద్యము.

**ఏకపుష్ప** సం. వి. అ. స్త్రీ. ఒకానొక చెట్టు.

**ఏకఫలి** సం. వి. ఈ. స్త్రీ ఓషధిభేదము.

**ఏకభక్తము** సం. వి. అ. న. పగలు రెండుజాములు దాఁటిన తరువాత ఒక్కపూఁటమాత్రమే తినుట.

శ్లో. దినార్ధసమయేఽతీతే భుజ్యతే నియమేన యత్, ఏకభక్తమితి ప్రోక్తమతస్తత్స్యాదహర్నిశి వై హవి. (కాలమాధవీయము)

**ఏకభోగము** సం వి. అ. పుం. (ఫలానుభవము ఒకనికే ఉండునది) కుటక. భృత్యాదిసహితుఁడైన ఒక్కఁడే అధిపతి యుండు గ్రామము (కల్పద్రుకోశము 2. ప్రకాండము. 11. 12. పం.)

2. ఒకపంటకేజలానుభవము గల భూమి. (వ్యతి-ఇరుభోగము రెండు పంటలకును జలానుభవము గల భూమి.)

ఉ. ...సురనాథుఁడు దక్షిణకాశి భీమలింగంబున కేకభోగముగఁ గట్టడఁ జేసె వసుంధరాస్థలిన్. భీమ. 5. 76.

గీ. ఏకభోగంబు గాఁగ నేలేలుగరుసు, గడలిసీమయు గౌతమీ గంగమేం, కప్పురపుఁ గ్రోలి. కాశ్మీరఖండ మవధి, యేలె విశ్వకుటుంబి భీమేశ్వరుండు. భీమ 5. 88.

**ఏకము** సం. విజ. (అ. అ. అ.) 1. ఒకటి. (ఈ యర్థమున నిత్యైకవచనము.) 2. ముఖ్యము, ప్రథమము.

సీ. ఏకుండు వాగ్ద్వైతియీకఫణావదధ్యక్షుఁ డాకృతిఁ ద్రుతీయాశ్వినేయుఁడు ... రా. వి. 2. 81, (ఇందలి 'ద్వైతియీక' అను రూపము చింత్యము 'ద్వైతియీక' అనునది సాధువు.) 3. అన్యము 4. కేవలము. 5. సమానము, అభిన్నము (ఉదా: ఏకోదరులు, ఏకకాలము, మొ.) 6. పత్యము.

7. అల్పము 8. అసమానము, సాటిలేనిది.

**ఏకముఖము** నం. విశే. (పు. ఆ. ఈ. అ. చూ. అభి ముఖుఁడు) 1. ఒక్కవైపునకేయున్న ముఖము గలది. 2. ఒకముఖమేగలది. 3. ఒకద్వారముగలది. (మండపము, మొ.) 4. ఒకటే యుద్దేశముగలది. వి. అ. న. ఒక ముఖము గల రుద్రాక్షము.)

**ఏకమూలి** సం. వి. ఈ. స్త్రీ. 1. అతసి, నూనె యగిసె (వృ. వి.) 2. సాలపర్ణి, ముయ్యాకు పొన్న. (వృ. వి.) ('ఏకమూల' అని కొందఱు.)

**ఏకయష్టి** నం. వి. ఇ. స్త్రీ. ఏకావళి, ఒక్కపేట గల హారము.

**ఏకయష్టిక** నం. వి. ఆ. స్త్రీ — ఏకయష్టి.

**ఏకరంగి** (గ్రా. మిశ్రని) మి. వి. (హిం. ఏక్‌రంగి.) ఒక్కరంగుగల మొకమాలు.

సీ కనకంబు గెలుచున గంబు తేజములీల నేక రంగికవాయి యుంపుగులుక. దశా. 1. 42. హంస. 5. 356.

**ఏకరజము** నం. వి. అ. పుం. భృంగరాజము, గుంట గలగర (వృ. వి.)

**ఏకరాత్రము** నం. వి. అ. పుం. ఒక్కరాత్రి యంతయు చేయఁదగు కర్మము. వి. అ న. 1. ఒకరాత్రి. 2. ఒక్క అహోరాత్రము.

**ఏకరాత్రికము** నం. విశే. (అ. ఆ. అ.) 1. ఒక్క రాత్రిభోజనమునకుఁ జాలినది. 2. ఒక్కదినపు భోజనమునకుఁ జాలినది. 3. ఒక్కరాత్రి చేయునది. (వ్రతాది.)

**ఏకరువు** (ఏక + రువ్వు ?) మి. వి. ఒక్కవల్లె.

ఏకరువిడు — (వచ్చినవేదాదులను మఱచిపోకుండుటకై) పఠించు, చదువు.

గీ. తెలఁగి తొలునాఁడు తరువాయి చెప్పునట్టి, యొల్లపన్నంబు లేకరువిడి పదంబుఁ, గ్రమము గుణియించు నైష్ఠికబ్రహ్మచారి, నికరములు...రా. వి. 2. 85

(ఇట్లే. ఏకరువుపెట్టు, ఏకరువువేయు.)

**ఏకరూపము** నం. విశే. (అ. ఆ. అ.) 1. అతిస్థిరమైనది. (వై. వి.) 2 సమానరూపముగలది.

శ్లో. వనం వికంతోర్వ్యా వనజాయతేక్షణాః, కణ ద్యుతీనాం దధురేకరూపతామ్. సం. కిరా. 8. 2.

**ఏకరూప్యము** నం. విశే. (అ. ఆ. అ.) ఒకదాని నుండియే వచ్చినది.

**ఏకలము-ఏకలీఁడు.** వి. (క. ఎక్కల.) అడవిపంది

గీ. పంది సలు గేకల మ్మనఁ బరఁగు ఘృష్టి. ఆం. భా. 2. 82.

సీ ...పంది...ఏకలము గుర్గురిం తన నెసఁగు దంష్ట్రి. సాం. ని. తిర్య. 76. పారి. 3. 30.

(ఇది యాంధ్రింద్రప్రయోగములో మాత్రము సంస్కృతపదముగాఁ గనుపట్టుచున్నది.)

ఉ. చేకొని యాకువీటవిభు శ్రీపెదవేంకటుఁ కుఁడు డెంబు యాత్మలో, నేకలసద్గుణంబు మహి యెన్న దనేకలసద్గుణాప్తిచేఁ, గైకొని నేవ భోగములకల్మిఁ దలంప దశేషభోగలీలా కలపంబు చేతఁ గరులన్ గిరులన్ మఱి చెప్ప నేటికిన్. రాఘవ. పీఠి. 39.

జ. ఏకలీఁడు.

**ఏకలము** నం. విశే. (అ. ఆ. అ.) అసహాయము, ఒంటరిగానుఁడునది

**ఏకలీఁడు** — ఏకలము వి. (ఏకలము + ఈఁడు — బ. ఏకలీలు. అడవిపంది, ఏకలము.

మ. సహసోత్కీర్ణ ఘనాంకురంబు లగునంచ న్మత్తసారంగ రాట్సహకారంబుల నేకలీల సమయించ న్మాగె సచ్చో మహీ.మహిళా భర్త ధృతిన్...హ. వ. 2. 24.

(హరిశ్చంద్ర- 'సారంగరాట్సహకారంబులకా + ఏకలీలకా' అని పదచ్ఛేదము.)

**ఏకవచనము** నం. వి అ. న. 1. (వ్యాక.) ఏకత్వ మును దెలుపు ప్రత్యయము. (వ్యతి - బహు వచనము.) 2. ఒకమాట.

**ఏకవర్షిక** నం. వి. ఆ. స్త్రీ. ఒక్కయేఁడు వయసు గల యావు పెయ్య.

**ఏకవాదము** నం. వి. అ. పుం. 1 - ఒకచేతితో వాయింపఁబడునది — డిండిమవాద్యము. 2. బ్రహ్మముక టొ లేయగామిచే సర్వమును

ఒక్కఁడే (బ్రహ్మమే)అని ప్రతిపాదించు వేదాంతుల వాదము, అద్వైతవాదము.

**ఏకవారము** సం. వి. అ. న. ఒకపర్యాయము, ఒకమాఱు.

**ఏకవింశతి** సం. వి. ఇ. స్త్రీ. ఇరువదియొకటి.

**ఏకవింశతితమము** సం — ఏకవింశము

**ఏకవింశము** సం. విశ. (అ. ఈ. అ.) ఇరువది యొకటవది.

**ఏకవిలోచనము** సం. వి. అ. పుం 1. కాకము. 2. ఒకకన్ను. 3. ఒకానొక దేశము.

**ఏకవిషయి** సం. విశ. (న్. ఈ. న్.) ఒకటే విషయముగలవాఁడు; ప్రతిస్పర్ధి, పోటిగాఁడు

**ఏకవృందము** సం. వి. అ. పుం. కంఠరోగభేదము.

**ఏకవృక్షము** సం. వి. అ. పుం. నాలుగు కోసుల లోపల ఒక్కచెట్టుతక్క రెండవచెట్టులేనిచోటు.

**ఏకశతతమము** సం. విశ. (అ. ఈ. అ.) నూట యొకటవది.

**ఏకశతము** సం. విశ. (అ. ఈ. అ.) నూటయొకటవది. వి. అ న. నూటయొకటి.

**ఏకశఫము** సం. విశ. (అ. అ. అ.) రెండుపాయలుగా లేని డెక్కలుగలది. (గాడిద, గుఱ్ఱము, మొ.)

శ్లో. ఖరోశ్వోశ్వతరో గౌరశ్శ్వమరీశరభస్తథా, ఏతే చైకశఫాః...సం. భాగ. 3. 10. 22.

**ఏకశాఖీయము** సం. విశ. (అ. అ. అ.) 1. ఒక్కటే శాఖయందుఁబుట్టినది. 2. ఒకశాఖకు సంబంధించినది.

**ఏకశృంగము** సం. విశ. (అ. అ, ఈ. అ.) ఒంటి కొమ్ముగలది. (అ. అ. అ.) ఒకశిఖరముగలది. వి. అ. పుం. ఖడ్గమృగము.

**ఏకశేషము** సం. విశ. (అ. అ. అ.) ఒకటి మిగులుగాఁగలది. వి. అ. పుం. 1. ఒకటేమిగులుట. 2. (వ్యాక) వృత్తిభేదము (ఇందు విగ్రహవాక్యమువనుండు అనేకపదములకుమాఱు ఒక పదమే నిలుచును—ఉదా: పితరులు—మాతాపితరులు.) 3 ఏకాంతము, రహస్యప్రదేశము.

**ఏకషష్ఠము** సం. విశ. (అ. ఈ. అ.) అఱువదియొకటవది.

**ఏకషష్టి** సం. వి. ఇ. స్త్రీ. అఱువదియొకటి.

**ఏకషష్టితమము** సం. విశ (అ. ఈ. అ.) అఱువదియొకటవది.

**ఏకసప్తతము** సం. విశ. (అ. ఈ అ.) డెబ్బదియొకటవది.

**ఏకసప్తతి** సం వి. ఇ స్త్రీ. డెబ్బదియొక్కటి.

**ఏకసప్తతితమము** సం - ఏకసప్తతము.

**ఏకసర(ము)** - ఏకసరి వి మల్లబంధవిశేషము

వ. దేహావుపాగువ నయనవుపాదువ శివరాకడ యేకసరి పైసర ఝుంప పిక్కు కంలాఘవంబు మొదలగు వితమ్ము లెఱింగి ... ప్రబంధ. 78.

వ. ... రాకడ ఏకసరము పైసరము ఝుంప పిక్కు ... వితంబులును ... మల్లుపు. 3. 69.

**ఏకసర్గము** సం. విశ. (అ. అ. అ.) ఏకతానము. ఏకాగ్రచిత్తముగలది. వి. అ పుం 1. ఏకాగ్రచిత్తము 2. ఏకసృష్టి.

**ఏకసహస్రతమము** సం. విశ. (అ. ఈ అ.) వేయునొకటవది.

**ఏకసహస్రము** సం. వి. అ. న. 1. ఒకవేయి. 2. వేయునొకటి.

**ఏకసూత్రము** సం. వి. అ. న. - ఒకత్రాడుగలది- డమరువాద్యము.

**ఏకస్థము** సం. విశ. (అ. అ. అ.) 1. ఒకచోటనుండువది 2. ఒంటిగానుండునది.

**ఏకహాయనము** సం విశ. (అ. ఈ. అ)-ఒకయేఁడు వయసు గలది - శిశువు (అ అ. అ.) ఒకయేఁడువయసుగలది. (శాలాది.) వి. అ. పుం. న. ఒకయేఁడు.

**ఏకహాయని** సం. వి. ఈ స్త్రీ. ఒకయేఁడు ఈడుగల యావుపెయ్య.

**ఏకాంగము** సం. వి. అ. పుం. నిరుపమానమైన అవయవములు గలది- 1. బుధగ్రహము. 2. అంగారకగ్రహము. న 1. ఒకయవయవము. 2. చందనము 3. ఉత్తమాంగము, శిరస్సు

**ఏకాంగి** సం. వి. న్. పుం. - ఒంటరి — సన్న్యాసి- భగవద్భక్తుఁడు

క. క్రేవల నేకాంగులు రా. అము. 2. 96.

ద్వి. ఎన్నంగఁ దగినట్టియేకాంగిముఖులు. ద్వి. పరమ 8. 642. పా (ఈయర్థము సంస్కృత గ్రంథములోఁ గానరాదు.)

**ఏకాంగిక** సం. వి. అ. స్త్రీ చందనముతోఁ జేయఁబడిన ద్రవ్యవిశేషము.

**ఏకాంగుఁడు** సం. వి. అ. పుం. 1. విష్ణువు 2. అంగరక్షకుఁడు ద్వి. – వివాహముచే ఏకశరీరము గలవారు – దంపతులు.

**ఏకాండము** విణ (సం. అఖండం. త. ఏకాండమ్) అఖండము, అతుకులులేక యొక్కటిగానే యున్నది.

ద్వి. ఆలోన నేకాండ మౌబలుపచ్చ. మేలిపెండ్లియరుంగు మృగనాభి నలికి. రం రా. బాల. 78. పా. 13 పం.

గీ. మలిచి యేకాండముగ నొక్క మానికమున. వేడ్క నెద్దాని నిర్మించె విశ్వకర్మ. నైష. 6 98.

రగడ కాళ జులు మసకపుఁ బటిములు మేల్. కట్టులు నేకాండవుఁదెరచీరలు. కవిక. 3. 195.

**ఏకాంతము** సం. విణ. (అ. అ. అ.) 1. రహస్యమైనది, ఇద్దఱకంటె నెక్కుడుజనము లేనిది. (చోటు) 2. ఒక్కవిషయమునే గుఱిగాఁ జేసికొనినది, ఏకాగ్రము. (ఉదా : ఏకాంతభక్తి) 3, మిక్కిలి, అధికము. 4 మాఱుపాటులేనిది ఏకరూపముగానున్నది వి. అ.పుం 1. రహస్యప్రదేశము 2. రహస్యవిషయము. 3. అతిశయము. 4. అవయవము. క్రి. విణ. 1. అవశ్యము, తప్పక.

శ్లో. ఏకాంతవిధ్వంసిషు మాదృశానాం పిండేష్వనాస్థా ఖలు భౌతికేషు. సం. రఘు. 2. 57.

2. అత్యంతము, మిక్కిలి.

శ్లో. కూరేభ్యోత్యధికం బిభేత్యుపహసత్యేకాంతధీరా నహో, శ్రీ... ముద్రా. 3. 5.

3. రహస్యముగా. 4. ఒంటరిగా. (ఉదా. ఏకాంతవిహారి)

ఏకాంతమిచ్చు – రహస్యముగా మాటాడుటకు అవకాశమిచ్చు.

క. నానాదేశమ్ములకును, దా నటు పనుపంగఁ జనిన తనచారులలో, ధీనిధి మతిమంతుఁడనంగా నొక్కఁడు వచ్చి సమయకర్తవ్యంబుల్.

వ. నడపి యుండ నేకాంతంబిచ్చిన వాఁడునుం దనయరయంబోయిన లాటదేశమందలి విశేషంబు లెఱింగించి. కేయూర. 1. 72, 7...

**ఏకాంతరము** సం. విణ. (అ. అ. అ.) ఒక్కటియెడగాఁగలిగినది; ఒక్కప్రేలువిడిచినది. (మేనఱికము, మొ.)

**ఏకాంతి** సం. వి. న్. పుం. – ఏకాగ్రచిత్తుఁడు – విష్ణుభక్తుఁడు.

**ఏకాకి** సం. విణ. (న్. సి. న్.) ఏకకుఁడు, ఒంటరి.

**ఏకాక్షము** సం. విణ. (అ. అ. అ.) ఒక అక్షము (ఇరుసు) కలది. (అ. ఈ. అ.) ఒక కన్ను గలది. వి. అ. పుం. కాకి.

**ఏకాగ్రము** సం. విణ. (అ. అ అ.) 1. ఒకవిషయమందే చిత్తము నెలకొల్పినది. (మనుష్యాదికము.) 2. ఒక విషయమందే లగ్నమైనది. (చిత్తము.)

**ఏకాతపత్రము** సం. విణ. (అ. అ. అ.) – ఒక్కటే ఆతపత్రము కలది – ఏకచ్ఛత్రాధిపత్యము గలది.

**ఏకాదశ** సం. విణ. (న్.) పదునొకండు.

(ఇది తెనుఁగున సమాసపూర్వపదముగానే యుండును. ఉదా: ఏకాదశరుద్రులు.)

**ఏకాదశకము** సం. విణ (అ. శా. అ.) పదునొకండుభాగములుకలది.

**ఏకాదశద్వారము** సం. విణ. (అ. అ. అ.) పదునొకండుద్వారములుగలది. వి. అ న. శరీరము. (తలయందు ఏడు. బొడ్డుతోఁగూడి క్రిందివి మూఁడు, శిరస్సునందలి బ్రహ్మరంధ్రము ఒకటి – వెరసి పదునొకండు ద్వారములు గలది.)

**ఏకాదశము** సం. విణ. (అ. ఈ. అ.) పదునొకండవది.

**ఏకాదశి** సం. వి. ఈ. స్త్రీ. 1. పక్షమున పదునొకండవతిథి. 2. పదునొకండుతంత్రులు గల వీణ.

**ఏకాన్న(ద్న)వింశతి** సం. వి. ఇ. స్త్రీ. ఒకటితక్కువ ఇరువది, పందొమ్మిది.

**ఏకాన్నుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) ఏకభాండాశనుఁడు, అవిభక్తుఁడు (భ్రాత్రాది)

**ఏకాబ్ద** సం. వి. ఆ. స్త్రీ. – ఏకహాయని

**ఏకాయనము** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఒక్కఁడు మాత్రము నడువఁదగినది. (కాలిత్రోవ.) 2. ఒకవిషయమునందే మనస్సు నిలిపినది, ఏకాగ్రము.

**ఏకావళి** సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. ఒకయర్థాలంకారము. 2. ఒంటిపేటహారము.

**ఏకాశీతము** సం. ఏకాశీతితమము.

**ఏకాశీతి** సం. వి. ఇ. స్త్రీ. ఎనుబదియొకటి.

**ఏకాశీతితమము** సం. విణ. (అ. ఈ. అ.) ఎనుబదియొకటవది.

**ఏకాష్ఠీల** సం. వి. ఆ. స్త్రీ. పాఠ, అగలుపొంటి, చిఱుబొద్ది. (వృ. వి.)

**ఏకాష్ఠీలము** సం. వి. అ. పుం. బక పుష్పము. (వృ. వి.)

**ఏకాహగమము** సం. విణ. (అ. ఆ. అ.) ఒకనాఁటి పయనముచే చేరఁదగినది. (గ్రామాది)

**ఏకాహము** సం. వి. అ. పుం. ఒకదినము.

**ఏకీకృతము** సం. విణ. (అ. ఆ. అ.) ఒక్కటిగాఁ జేయఁబడినది.

**ఏకీభవించు** సం. అ. క్రి. ఒక్కటియగు.

సీ. తతవాదక సమీరహతకిన్నరిరుతుల్ కిన్నరిరుతులు నేకీభవించె. వసు. 1. 149. ఉ. రా. 8. 94.

**ఏకీభావము** సం. వి. అ. పుం. ఒక్కటియగుట, ఐక్యము.

**ఏకీభూతము** సం. విణ. (అ. ఆ. అ.) ఒక్కటిగా అయినది.

**ఏకు** స. క్రి. (క. తు. ఎక్కు.) 1. దూదిమొదలగు వానిని విడివోవునట్లు యంత్ర విశేషముతో కొట్టు; దూదేకినట్లు విడఁగొట్టు

ఉదా: దూది ఎండవేసి ఏకి పఱుపు కుట్టినాఁడు.

క ...తాద్భుతమహిమోద్దండత ముందుమహోరథు, కండలు తనవింట నేకి కాకులకిచ్చెన్. కకు. 5. 76.

2. (దోషమును) ప్రకటించు; దూఱు.

ఉదా: వానిలోపములు అంతటను ఏకివేసి వచ్చినాఁడు. నలుగురులోను వానిని ఏకివేసినాడు.

వి. ఏకినదూదిచుట్ట, తూలకణిక.

ఆ. ముక్కునచ్చలాఱ కెక్కి చకోరపు, నినువు మెఱుపుకం ము నిశిత మునుచు. నేకు వాఁడి చేసి యిపు డేల పలికెదు. చం. రా. 5 86.

సీ .. అగుఁ దూలకణిక యేకని పదింప ఆం. భా. 2. 294.

సా: ఏకయి వచ్చి మేకయి విఱిగినాఁడు.

జ: ఏకుడు.

**ఏకుడు** వి. (√ఏకు) దూది ఏకుట.

సీ తూలమృదూకృతి దోఁచు నేకు డనగ... ఆం. భా. 3 294

**ఏకుదోఁక** వి. (√ఏకు ?) ఒకానొకపిట్ట.

సీ. ఏకుదోఁక చెమరుఁగాకి గోకిల చీఁద గొరువంక నెమిలి కార్కోడి యనెడి, గీ. పక్షులు ...పాం౯. 6. 77.

**ఏకులనారిగాఁడు** వి. (√ఏకు ?) పక్షివిశేషము.

సీ. ...కోడి కాకికో దేకులనారిగాఁడు ... ఆదియైన పక్షు లతఁడు దీర్చు. హంస. 8. 1?.

**ఏకు** వ. వి. (ఏ + అక.) ఏమె (చూ. అకె.)

**ఏకైకము** సం. విణ. (అ. ఆ. అ.) ఒక్కొక్కటి, ఒకటొకటి. (శ్లో. ఏకైకమక్షరం ప్రోక్తం మహాపాతకనాశనమ్.)

**ఏకోత్తరము** సం. విణ. (అ. ఆ. అ.) ఒకటి ఎక్కువగాఁగలది. (ఏకోత్తరశతము-నూటయొకటి.)

**ఏకోదకుఁడు** సం. వి. అ. పుం. – సమానజలము కలవాఁడు – ఏడవతరమునుండి పదునాలుగవ

తరమునఅకుఁగల గోత్రజుఁడు. సమానోదరుఁడు

**ఏకోదరుఁడు** సం. విశే. (అ. అ. ఈ. అ.) ఒకతల్లి కడుపునఁబుట్టినవాఁడు, సోదరుఁడు. (వ్యతి. భిన్నోదరుఁడు.)

**ఏకోద్దిష్టము** సం. వి. అ న. - ఒకఁడు ఉద్దేశింపఁబడినవాఁడుగాఁ గలది - ప్రేతము నుద్దేశించి చేయు శ్రాద్ధము

**ఏకోనము** సం. విశే (అ. ఆ. అ.) ఒకటితక్కువ యైనది

ఉదా: ఏకోనవింశతి – ఒకటితక్కువ ఇరువది, పందొమ్మిది. (ఇట్లే ఏకావరము, ఏకావమము, ఏకన్యూనము)

**ఏకోనవింశతి** సం. - ఏకాన్నవింశతి.

**ఏకోను** వి. (క. ఏకూను, ఏకోను - మొత్తము.) సమష్టి. (శ. ర.) యావత్తు. (చి. ని)

**ఏగాని** వి. కానిలో సగమువిలువగల రాగినాణెము 2 రెండు దమ్మిడులు. (వా)

**ఏగుడు** విశే. (క. ఏగులు.) రోఁతయైనది.

ఆ. ఏగుడైనపెగవి తేగుడమ్మృత మంచుఁ, గవులు వొగడఁ బేరు కలిగెఁ గాక, తత్త్వ మెఱిఁగి యిట్లుదలపోసి చూచిన నింతి రోఁతకెల్ల నిల్లుగాదె ద్వా. 1. 96. (ప్రయోగాంతరము కనఁబడలేదు.)

**ఏగురు** –ఏవురు వ. (ఏను² + గురు - ఏనుశబ్దమునకు మహన్మహత్త్వార్థక రూపము - త. ఐవర్.) అయిదుగురు.

క. గురువచనస్థితి మన కే, గురకును నిది పత్నిగాఁ దగుం గావున... భార. ఆది, 7. 218.

**ఏగున** వి. (√ఏని².) అయిదుకుంచములమానము.

సీ. ప్రస్థపంచకసంజ్ఞ పరఁగు నేఁగున యన... ఆం. భా. 2. 271.

**ఏచే** - ఏచు². విశే. 1. వికృతస్వరముగలది (మాట)

గీ. ఏచమాటలు జడగొన్న పీఁచుఁగురులు, గలుగు నెఱుకులు దగఁ బొడగనఁగ వచ్చి. యయా. 1. 102.

2. వక్రము (చూ. ఏచకంకటిచుక్క.)

ఉ: ఏచకంకటిచుక్క.

**ఏచేకంకటిచుక్క** వి. (√ఏచే) – వంకరమంచము వలెనుండుచుక్క - ఉత్తరాషాఢానక్షత్రము. (శ. ర.) ఆషాఢానక్షత్రము?

**ఏచు** అ. క్రి. 1. అధికమగు పెద్దదియగు అతిశయించు.

మ. ...పౌత్రుని భూరిశ్రవసుం గనుంగొనుచు నింద్రుం డ్రేగిసేయంగ నేఁచిన పెంపొప్పఁగ బాహ్లికుం డరిగె నిశ్చింతంబునం బోరికిన్. భార. భీష్మ. 1. 94.

క. ఏచిన తన నిడువాలువి, లోచనముల చెలువమునకు లొంగి జలజముల్, కై చెఱ యిచ్చె ననంగే, శీచాలితనలిన మాకలిశి ధరియించున్. వరాహ. 11, 59.

క ఏచినబలములతో రజనీచరులం జలము గలిగి నిష్ఠురతరనారాచములు మునుఁగ నేసిరి, చూచునురల్ దల్లడిల్ల ప్రుక్కక హరులన్. భా రా. యు 1438.

2 పెరుఁగు. బలియు.

మానిని. ఏచి తనర్చి తలిర్చిన క్రోవుల నిమ్మగు తావులజొంపములన్ భార. ఆది. 4. 20.

సీ. నెగసినకొన లేచి నింగి యంతంతకు నవులఁ ద్రోవఁగ దనరారుదాని ... శమితరుచక్రవర్తి. భార. విరా. 1. 162.

చ. విబుధతపోధనేంద్ర విను వేయువిధంబుల నాతఁడేద నేఁచి బలవిభేదినై చికి విశృంఖలమై.... పాండు. 5. 289.

3. విజృంభించు, చెలరేఁగు.

ఆ. అధికదర్పయుక్తమై బలివర్గంబు, నగముదరి విదారణంబు సేయఁ, గాలుద్రవ్వువట్లు గడు బలాఢ్యులతోడ, నేచి వీఁడు విగ్రహింపఁ దొడఁగె. భార. సభా 2. 183.

క. ...మీ రేఁచి జగంబులు నొవ్వ రణము సేయఁగ నేలా. భార. ఉద్యో. 1. 158.

4. కలుగు.

ఉ. నీచెలిఁ బాసిపోయి రజనీచర చక్రి భజింప ముక్తి పొం, దేచెర యేచెఱగా దవులనేనిఁక ...ఆము. 6. 45.

క. ఆ చెలికి గర్భచిహ్నము, లేచినఁ బరితోష మాత్మ నేపారఁగ మ్రొక్కుచుండు నిజతలో

దరిఁజూచి యకర్మమున కాళ్ళ ద్రుక్కు-
చుఁ బలికెన్. భాగ. 8. 476.

జ: ఏపడఁచు, ఏపారు, ఏపు, ఏపుమాపు, ఏపు
రేఁగు

**ఏజకము** సం. విశ. (అ. తికా. అ.) 1. చలించునది.
2. చలింపఁజేయునది, వడఁకించునది. 3. ప్రకా
శించినది. 4. ప్రకాశింపఁజేయునది

**ఏజనము** సం. వి. అ. న. 1. చలించుట, వడఁకుట,
2. చలింపఁజేయుట. 3. ప్రకాశించుట. 4.
ప్రకాశింపఁజేయుట.

**ఏజితము** సం. విశ. (అ. అ. అ.) 1. చలింపఁ
జేయఁబడినది; 2. చలించినది. 3. ప్రకాశింపఁ
జేయఁబడినది. 4. ప్రకాశించినది.

**ఏటము** విశ. ప్రధానము; అధికము, గొప్పది.

క. మాటలు నేరక పలికిన, నోటమిగాఁ గొనక
కార్యమున్న నిజముఁ దాఁ, జాటించి నృపతి
ధర్మం, బేటముగాఁ జూడ నిర్ణయింపఁగ
వలయున్. విజ్ఞా. వ్యవ. 27.

ద్వి. కోకమ్మి పడసినకొలుచు గాదియల, తే
కేమి కొని రావుగాక యేమియును, నేటపు
సంపద లెం దేఁగెనింక. బస. పు. 4. 351.

వి. ప్రక్క. (చి. ని.)

**ఏటలవి** వి. ఏటునకు అందునంత దూరము.

సీ. నగరాజతనయ పర్ణగరాజధరుప్రోల
నిలుచుడు మదనుఁ డేటలవి నిలిచె. కు. సం.
5. 515.

మ. ...ఏటలవికిఁ బాహాంబు నడ్డఁబుమూఁకి
రిపావల్ల భుఁ డేసె భల్లమున ... మనుచ.
4. 44.

**ఏటవాలు** విశ. (√ఏటము+వాలు-ప్రక్కకు వం
గినది.) ఓరగానున్నది, ఒఱగినది.

రగడ. ఏటవాలైనయది యూయరఁటిబాలెంత.
మనుచ. 8. 84.

సీ. ఇట్లు గవ్వట్టుచు నేతెంచి యంచలు వసుధ
చేరువ నేటవాలుగాఁగ, నతినిశ్చలప్రసారిత
పత్రంబులై దిగుచు... ప్రభా. 2 42.

సీ. పనిలేనిపని కనుంగొను నేటవాలుగ వాలుఁ
గన్నుల గరువమ్ము వొదల. ఘటికా.
2. 34.

క్రి. విశ. వంపుగా.

సీ. ఎలగోలుజల్లు ముఁగ పెళపెళ నేటవా
ల్పడి గాలి నట్టిండ్లఁ దడిసి చనఁగ. ఆము.
4. 91.

**ఏటిక** – ఎమిడిక వి. 1. ఎల్లి, వానపాము.

సీ. ఉటజాజిరంబుల నూతి పాఱఁగ గ్రొచ్చి
యేటికల్ దినినైచు నేకలంబు. కకు.
1. 152.

2. ఎమిడిక, కడుపులో బుట్టు పామువంటిదు
పురుగు. (శ. ర. ప్రౌ.)

**ఏటికోళ్లు** వి. బ. నమస్కారములు.

క. ....నరునకు, వర మిండీ వేల్పులార వారని
కరుణన్.

వ. అని ప్రార్థించుచు దైవంబుల కేటికోళ్లు
నిరూపించుచు మఱియు బహుప్రకారంబు
లం బలుకుచుండిరి...భార. ద్రో. 2. 346,
347.

వ. దండపాణికి దండప్రణామంబును, గుక్కుట
చతుష్టయంబునకు మ్రొక్కును, సకల
దేవతా కోటికి నేటికోళ్లును జేసి. భీమ.
2 50.

**ఏటిరింత** – వ్రేటింత.

సీ. కాకియును గొరువంకయును ఱెక్కలపోతు
నేటిరింతయు దాఁటె నెడమదెసకు. ద్వా.
1. 231.

**ఏటిఱేఁడు** వి. (ఏఱు[2]+ఱేఁడు) సరిత్పతి, సము
ద్రుఁడు.

ఉ. ...ఏటిఱేఁ, డమ్మోయిఁ ద్రోవయీమి
మది నల్గుచుఁ దా విలు కేలఁ బూనుచున్.
యయా. 8. 27.

**ఏటు** వి. (√ఏయు) బాణప్రయోగము; బాణపు
దెబ్బ.

గీ. వారి రేటును వ్రేటును బోటు నొక్క,
యలవిఁ దెలఁగంగ మఖయనై న్యముల
వారు. భార. భీష్మ. 8. 225.

**ఏటుకాఁడు** విశ. (ఏటు+కాఁడు) – బాణములు

ప్రయోగించువాఁడు. – విలుకాఁడు. ధాను ష్కుఁడు.

ఉ. ... నిన్నమ్మినముగ్ధలఁ రహితనాథల నక్కట నేఁడు రెండుమూఁడమ్ములయేటు కాఁ జెగువ నడ్డము రాఁదగదే కృపానిధీ. భాగ. 10. పూ. 1056.

**ఏటులా(ట్లా)డు** అ క్రి. (ఏటులు + ఆడు) బాణ ములతోఁ బోరు; పోరు.

క. అతిముఖ నడరవ రథికుల, తలచునకు సుభద్రదబోడుకు దలఁకక బాణం,బుల కన్ని రూపులై యేడ్తెఱ నవ్వుచు నేటులాడె ధీరత మెఱయన్. భార. భీష్మ. 2. 88.

సీ. మీఱుచు నేట్లాడు కాఱుపోతులకొమ్ము చప్పుళ్ల ఁబులుఁగులు కుప్పగూల. యయా. 1. 116.

**ఏట్రింత** – ఏటిరింత. వి. వ్యాఘ్రమాటపక్షి. భార ద్వాజపక్షి.

సీ. ఒలితపువెలిచె పావళము చేతువ చిందక కృగి యేట్రింత కారకోడి. యయా. 2. 24. ఆం. భా. 2. 91.

**ఏడ** వి. వి. (ఏ + కడ.) ఎక్కడ.

తరువోజ. ఏ నేడ నింద్రాదు లేడ వారలకు నెప్పుడు మ్రొక్కుదు ... భార. ఆది. 2. 47.

చ. వెఱవకు మోక్షమూల పదివేలవిధంబుల నైన నిన్ను నేఁ,మఱవ మహేడకుం జనుట మాని సుఖంబుగ దక్షవాటికిఁ, దుఱఁగలి గొన్న సమ్మదముతో గమనింపుము ... భీమ 2 155.

**ఏడ(ర)క** సం. వి. ఆ. స్త్రీ. ఆఁడుగొఱ్ఱె.

**ఏడ(ర)కము** సం. వి. అ. పుం. 1. మేషము. గొఱ్ఱె 2. అడవిమేఁక.

**ఏడగజము** సం. వి. అ. పుం. చక్రమర్దము, తగిరిస, తంటెపుచెట్టు.

**ఏడ(ర)ము** సం. వి. అ. పుం. గొఱ్ఱె.

**ఏడమూకుఁడు** సం – అనేడమూకుఁడు.

**ఏడాకుమొలకలు** వి. బ. (√ఏడు) ధాన్యవిశేషము. ప్రబంధ. 112.

**ఏడాకు(ల)పొన్న** వి. (√ఏడు) ఒకానొక చెట్టు. హరి పూ. 7. 117. కాశీ. 3. 23.

**ఏడాకులరఁటి** వి. (√ఏడు) సప్తవర్ణము. ఒకజాతి అరఁటి. (వృ వి.) మనుచ. 3. 84.

**ఏడాగోడము** విశే. విరుద్ధము.

ఉదా: ఏడాగోడపుమాట. మొ. (శ. ర.)

**ఏడాటలాడించు** స క్రి. (ఏడు + ఆటలు + ఆ డించు.) మిక్కిలి శ్రమపఱచు.

ఉదా: వాఁడునన్ను ఏడాటలాడించినాఁడు. ఏడాటలాడించుట–సప్తవ్యసనములను గలుగఁ జేయుట. అనఁగా సప్తవ్యసనములు గలిగి నప్పుడు ఎంతశ్రమము గలుగునో అంతశ్రమ మును గలిగించుట అని యర్థమై ఉండవచ్చును–అని (శ. ర.)

**ఏడి** – ఏడిక. వి. (సం. ఏడః. క. ఎళగ. త. ఆడు. మ. ఓడా.) మేషము. గొఱ్ఱె.

గీ. సింగములు పులిపిల్లలు జింక లేదు,గములు మానిసికోఁతులు కారుపోతు, లేడికదుపులు పులిజున్ను పాఁడిపసులు ప్రబంధ. 185.

**ఏడి(కి)** సం. వి. ఈ. స్త్రీ. ఆఁడుగొఱ్ఱె.

**ఏడిక** – ఏడి.

సీ. శరభసింహవ్యాఘ్రసత్త్వచయంబుల నేడిక లెల్లెట్ల యెక్కియాడి భార. ద్రో 2 210.

గీ. కొదమకెబ్బులి నేడిక లెదురఁ గలవె. అచ్చ. రా. సుం. 44.

గీ. సంయమిక్రతుహుతరసాశనము మరగి, యగ్నిభట్టారకుఁడు నిచ్చ లచట నుండ, నతని యెకిరింత యేడిక యనుదినంబు, గొఁడగొఱియల బెదరించుచుండు బలిసి. కకు. 1. 158.

**ఏడు** స. (క. ఏఱు. త. ఏళు.) ఆఱునొకటి.

క విన నే డగుపర్వము మేఁ,లనఁగా ద్రోణాభి షేక మాదిగఁ గలయ,య్యెనిమిదిపర్వము లను.... భార. ఆది. 1. 47.

శా. ఏ డక్షౌహిణు లెన్నఁ బాండవబలం బేకా దశాక్షౌహిణుల్, రూఢిం గౌరవసైన్యము ... భార. ఆది. 1. 69.

జ: ఏడాకుమొలకలు, ఏడాకులపొన్న, ఏడాకుల రఁటి, ఏడుకొండలరాయఁడు, ఏడుకొండలు, ఏడుగురు, ఏడుగుఱ్ఱాలజోదు, ఏడునూఱు ఏడువురు, ఏడ్దుము, ఏన్నాళ్లు. ఏన్నూఱు-డెబ్బది.

**ఏడుఁడు** సం. విశే. (అ. అ. అ.) చెవిటివాఁడు.

**ఏడు(డూ)కము** సం. వి. అ. పుం. న. లోపల ఎముకలు పెట్టికట్టినగోడ (అమరము.) ఎముకలును వానివంటి కఠినపదార్థములును లోపల నుంచి కట్టిన కట్టడము, బౌద్ధాలయము. (విల్యమ్సు.)

**ఏడుకొండలరాయఁడు** వి. (√ఏడుకొండలు) తిరుపతివేంకటేశ్వరుఁడు.

**ఏడుకొండలు** వి. బ. 1. సప్తకులపర్వతములు. యయా. ౪. ౫4.

2. తిరుపతియందలి సప్తపర్వతములు.

**ఏడుగ(డ్గ)డ** విశే. నియంత, రక్షకుఁడు.

గీ. ...ఏడుగడ నా నియంతసంజ్ఞ. అం. భా. ౫. 22.

క. మనమునఁ దెలియఁగ నీదళ, యనివార్యం బగుచున్నయది యాతని చొప్పును దెలుఁ గంబడ దెట్లును, గన మన కేడుగడ కమలక మనుఁడ యనుచుం. పరమ. 1. 91.

ఆ. అనిన వట్ల కాక యఖిలధర్మజ్ఞాన, ఘనుఁడు మనకు నేడుగడయుఁ దాన, శౌరి నిశ్చ యింప సంశయం బేటికి, సంమటింపుఁ దుగ్ర సమరపథము. భార. ఉద్యో. 4. 98.

సీ. దహనుఁ డేడ్గడయు నుత్తమవర్ణభవులకుఁ బావకుం డిశుండు బ్రాహ్మణులకు. కాశీ. 3. 205.

**ఏడుగ(డ్గ)డయు** క్రియా. అవ్య. (√ఏడుగడ) సమస్తము, ఎల్ల.

ఆ. ఎట్టిసాధ్వులకును బుట్టినయిండ్లను, బెద్దకాలమునికి తద్ద తగదు, పతులకడన యునికి సతులకు ధర్మువు, సతుల కేడుగడయుఁ బతులచూవె. భార. ఆది. 4. 65.

శా. వాలుఁగంటికి నింటియాతఁడు మనోవాంఛా ప్రదానక్రియా, హేలాలోలుఁడు నీలవేణికి బ్రియుం డెప్రొద్దు నొప్పారు ర, త్నాలంకారము కాంతకుఁ మగఁడు నిత్యానందసంపాదియుం, కేలిం వేయును జెప్ప నేడ్గడయుఁ బ్రాణేశుండ తన్వంగికిన్. హరిశ్చ. 3 164.

గీ. ఎనయు సర్వపదార్థమై యేడుగడయు, నాఁగ ... అం. భా. ౫. 79.

**ఏడుగు(గ్గు)రు** – ఏడువురు. న. ('ఏడు'నకు మహత్త్వార్థకరూపము. త. ఎళువర్. ఏడుమంది.

క. సుందరి యనునిజసుందరి, యుందుఁ గనియె మాల్యవంతుఁ డాత్మజనోకతతిఁ నందనుఁ నేడుగుర విను, మందఱనామములు దశకాత్మజతిలకా. ఉ. రా. 1. 197.

గీ. ఆపతివ్రత పెనిమిటిననుసరించి, సులభముగ నిర్వదేడ్గుర సుతులఁ గనియె కుచేల. 1. 31.

**ఏడుగుఱ్ఱాలజోదు** వి (√ఏడు) సప్తాశ్వుఁడు, సూర్యుఁడు సమీర. 2. 219.

**ఏడుచు(డ్చు)** అ క్రి. రోదనముచేయు.

గీ. కటకటా నందనుండ వోక్క ఁడవు నీవు, గురుల నేడ్పించుచున్నావు ఘోరముగను. శివరా. 2. 109.

సీ. .. ఒక్కరుఁ బలువు గట్లు, సంపితి రది మీకు సంతోషకాలమే యేడ్తురు గా కార్య నేల చెప్పుఁడ. భార ద్రో. 2 284.

**ఏడుచుకొను** అ. క్రి (ఏడుచు+కొను-స్వార్థము) రోదనముచేయు, విలపించు

ద్వి. ...ఆకోమలాంగి, తననాథుఁ జేరొక్కని కానేడ్చుకొనుచు. ద్వి. నల. 4. ౫94. పం

జ: ఏడుపు.

**ఏడునూఱు** – ఏన్నూఱు. న. (√ఏడు)

ద్వి. పొందుగా నిజపార్శ్వముల నేడునూఱు. మ ది యెంతయు నసమానులై యంత. ద్వి. పరమ. 8. 642. పా. 12. పం.

**ఏడుపు(డ్పు)** వి. (√ఏడుచు) రోదనము. భార. ఉద్యో. 1. 347, ఉ రా 6. 276.

**ఏడువు(డ్వు)రు** – ఏడుగురు. (√ఏడు)

గీ. గగనమును లేడువుర వారి కట్టెదురన పతిపదంబులపై దృష్టి భక్తి నిడిన, దివ్యచరిత నరుంధతీదేవిఁ జూచి, సమ్మదము వొందెఁ గందర్పశాసనుఁడు. హర. 4. 41.

వ...ఏడ్వురుకొడుకులం బడసె. భార. ఆది. ౬. 84.

**ఏడ్తెఱ** వి. (క. పఱు. త. పఱ్ఱు-వృద్ధిపొందు.) 1. అతిశయము.

ఉ. ఇమ్మహనీయరూపమున యేడ్తెఱఁ గన్గొని వేడ్క నీకు యోగ్యమ్మగుభంగిఁ జెప్పితిమి గాని నరోత్తమ కొండు గాదు ... భార. విరా. 1. 226.

ఉ. రోహిణియొండె నొండెను నరుంధతి గాక మనుష్యజాతియే, యీ మహిణాతిచెల్వము నయేడ్తెఱ చూడ్కులనాఁ చిలోల కాదు... భార. విరా. 1. 295.

2. పపు. చేవ; విజృంభణము.

చ. మఱియు నొకండు వింటె పవమానతనూజుని చెయ్విఁ జెన్నొడల్, విఱిగి ధరిత్రిఁ బడ్డ యెడ వేగమె వచ్చి శిరంబుఁ దన్నె నేడ్తెఱ గలయప్డు శత్రు నవధీరతుఁ జేయుట యొప్పుఁగాకయే పఱినఁ బరాభవించిన జనావళి నవ్వదె నొవ్వదే మదిఁ. భార. శల్య. 2. 187.

సీ. అక్కుమారుఁడు దఁ హాసాభిరాముఁడై ఛల్లమొక్కటి దొడ్గి విల్లుదునిమి, యేడ్తెఱ నిరువదియేను దూపులు వడి నడరింప... భా. భీష్మ. 1. 254.

3. పూనిక.

క. ...ఇనునిదెసఁ జూచుచు నేడ్తెఱ నూర్ధ్వబాహుఁడై మతిఁ, దఱుమక శ్రుతి నొడివి కొనుచుఁ దప మొనరించెన్. ఉ. రా. 2. 164.

4. వడి. వేగము.

క. ఎఱిఁగించి మీకు మునికికి, నొంబు సకల దైత్యకోటియును మీరలు నేడ్తెఱఁ జని యందుండుఁడు గడు, నుఱ వని నెయ్యంపు సముచితోక్తులఁ దెలుపన్. నిర్వ. 2. 80.

5. శక్తి. సామర్థ్యము; పరాక్రమము.

చ. అని నడిసన్న యేడ్తెఱ బృహన్నలకుం గల దంబుజాననా. భార. విరా. 4. 15.

ఉ. ...అర్జునుం,డొక్కటి దాన చాలుఁ దమునిండఁ దీవ్ర శరాగ్నిఁ గాల్పఁ జెం, పెక్కివ పాండువందనులయేడ్తెఱఁ దొల్లి యుఁ దా తెలుంగరే. భార. ఉద్యో. 4. 54.

అ. ఇట్లు దొరలు నొవ్వ నేడ్తెఱఁ దన చేతి, కొలఁది చూపి క్రీడి సెలఁగి దేవదత్త మొత్తుటయును ...భార. విరా. 5. 67.

6. తేజస్సు, కాంతి.

ఉ. ... నేల కెంపెక్కుచు వచ్చె దీవియల యేడ్తెఱ పోయగ మందె... భార. విరా. 2. 319.

సీ. తోరంపుచేనికతోలియేడ్తెఱ కప్పుకుత్తుక తోఁ బ్రీతిఁ బొత్తుసేయ. హరి. ఉ. 6. 84.

**ఏడ్దుము** వి. (ఏడు+తూములు.) ఏడుతూముల మానవిశేషము

సీ ...సప్తాధకీసంజ్ఞ జరుగుచుండు, నేడ్దు మంచనఁగను... ఆం. భా 2. 271.

**ఏణకము** నం. ఏణము.

**ఏణతిలకుఁడు** నం. వి. అ. పుం. చంద్రుఁడు.

**ఏణము** నం. వి. అ. పుం. పెద్దకన్నులుగలవల్లియిఱ్ఱి.

**ఏణి** నం. వి. ఈ. స్త్రీ. 1. పెద్దకన్నులుగలనల్లయాఁడులేడి. 2 విప్రక్రిమిభేదము.

**ఏత** వి. ఈడిగ, కల్లుగీయుజాతి, ఇంద్రజాతి. (ఉదా: ఏతవాఁడు, మొ.)

**ఏతఁడు** — ఎతఁడు స. వి. ఏవాఁడు.

**ఏతద్** నం. న. (ద్.) ఈ. (ఇది సమాసపూర్వ పదముగా నే తెనుఁగున నుపయుక్తము. ఉదా: ఏతదనంతరము—దీనికితర్వాతిది, ఏతత్కాలము—ఈ కాలము.)

**ఏతదీయము** నం. విశే. (అ. అ. అ.) 1. వీనిది. 2. దీనిది 3. వీరిది.

**ఏతనము** నం. వి. అ. పుం. 1. నిశ్వాసము. 2. ఒక జాతిచేప.

**ఏతము** — ఏతాము. వి. (నం. యంత్రమ్) నీళ్లెత్తెడి యంత్రవిశేషము. ఘటీయంత్రము.

గీ. ఏత మనఁగ ఘటీయంత్ర మెసఁగుచుండు. ఆం. భా. 2. 298.

**ఏతము** నం. విశే. (అ. ఆ. అ. — స్త్రీలింగమందు 'ఏనీ' అనురూపముగలదు) కర్బురవర్ణము కలది, చిత్రవర్ణముకలది. (అ. ఆ. అ.) వచ్చి

నది. వి. అ. పుం. 1. ఇట్టి. 2. ఇట్టిదోలు. 3. చిత్రవర్ణము.

**ఏతరి** విశే. (√ఏతు.) 1. దుర్నయుఁడు.

ఉ. ఏతరిదైత్యుఁ డాతటి మహీతనయాకృత భూషణావళీ,పాతము సైఁజతేజముని పాత మెఱుంగక లంక దుర్గతా,జ్ఞానవిరోధిజాత భయశబ్దకలంకకు నేఁగి శోకసం,ప్యాతను సీత నప్పురి నశోకని కేత నొనర్చె వింతగన్. చం. రా. 5. 75. (మూ: అనయాభిజ్ఞో దశ గ్రీవః)

క. మీతఁ మువార లేతటి, నేతరితనమునఁ దపస్వి గృహాకన్యకలన్, పీతభయవృత్తి వేఁడిరొ,కోతముఁ దర్కింప కొం గ్రొవ్వ లటంచున్. మనుచ. 6. 46.

ఉ. ఇందుకులావతంస మతఁ డేతటి నేతరిగాఁ డరిం బ్రబల,ల్కందఁ గొనందు ... ఆము. 2. 40.

గీ. కఱటి యడిగొట్టు పలువ యేతరి గరాసు, చెనఁటి చెన్నఁటి కూళ కుచ్చితుఁడు మొండి, కట్టె నాఁగను గుజనాఖ్యగాఁ దెలంగు. ఆం. భా. 3. 7.

2. ఉద్ధతుఁడు.

ఉ. ఆతటి భూరిబాహుబలులై నవిరోధి వరేశ్వ రుల్ మృగ,వ్రాతము లొక్క పెట్ట మృగ రాజకిశోరముపై నెదిర్చిన,ట్లేతరులై చతు ర్విధసమిద్ధబలంబులతోడఁ గూడి ని,ర్ధూత కళంకుఁడైన వనతోయజనేత్రునిఁ జుట్టు ముట్టినన్. భాగ. 10. ఉ. 1109.

3. నిరంకుశుఁడు, స్వేచ్ఛావిహారి.

క. ఏతెంచి చూచి చెలఁగుచు, నేతులఁ దెరుఁ గులను బాల నీళ్లను వెన్నం,బ్రీతివసంతము లాడిరి,యేతరులై సరసభాష లెసఁగన్ గొల్లల్. భాగ. 10. పూ. 182.

4. లోభి, దురాశగలవాఁడు.

ఉ. ఏతరినక్క వెక్కసపుటేడికకయ్యముచేతఁ దొల్లి చే,నేతఁ బరిగ్రహించి యతి శిష్యు నిచే నొకనేఁతకానిచే,దూతిక నొచ్చె నాత్మ కృతదోషమువన్గద ... వేం. పంచ. 1. 214.



చూ. 1. 284. (చి. ని. పాఠము 'ఈతటి' అని అపముద్రితము.)

**ఏతాదృక్కు** నం. విశే. (సం.) ఇట్టిది.

**ఏతాదృశము** నం. విశే. (అ. అ. అ.)–ఏతాదృక్కు.

**ఏతాదృశము** నం. విశే. (అ. ఈ. అ.) – ఏతాదృక్కు.

**ఏతాము** – ఏతము.

ద్వి. కోఁతికట్టికలు సాఁగు బళాయనంగ, నేతా మువలెఁ దారుఁ దేతెంచి మ్రొక్కె. రం. రా. కిష్కిం. (చి. ని.)

**ఏతావత్** నం. విశే. (సం.) ఇంతమాత్రమైన, ఇంత పరిమితిగల ఇది తెనుఁగున సమాసపూర్వ పదముగానే యుపయుక్తము – ఉదా: ఏతా వత్కాలము.

**ఏతు** వి. (త. ఏతు లోపము) 1. లోపము. దోషము.

గీ. తన కనిష్ఠులు లగు కలిద్వాపరములు, కేతు నూపియుఁ బోలె ధాత్రీశ్వరుఁడు, నిత్య సత్త్రత బుత్విక్ప్రణీతయైన, త్రేత సేవించె విజితమిత్ర్యతరుండు నైష. 8. 7.

2. గర్వోక్తి, బడాయిమాట. (ఈ యర్థమున బహువచనాంతముగానే ప్రయోగములు కనఁబడుచున్నవి.)

ఉ. చేతులు ద్రిప్పుచుఁ బ్రభులచెంతల నూఁక దుర్వినీతులై, యేతులఁ బోవుచున్ దిరుగు నిప్పటి మంత్రులు... పాండు. 1. 78 (ఏతు లఁబోవుచున్–డంబములుకొట్టుచు.)

గీ. సైన్యములు దన్నె నవరాష్ట్రసమయ మయ్యె, నిందు నొకపూఁట నిలిచిన నేమి దప్పెఁ,బూత మీఁతాపమని వట్టి యేతు లంచు, నృపతి విందారగింపంగ నియ్యకొనిన. వరాహ. 4. 102.

జ: ఏతరి.

**ఏతుల**[1] వి. సామాన్యస్త్రీ.

గీ. ఏతుల యవంగఁ దగుపాటియింతి వెలయు. ఆం. భా. 2. 116.

క. వాతెఱకు నమృతమే తుల, మేతులకింపుల పిపాశిమినిమికిఁ గ్రొమ్మిం,చే తుల చేతుల కజము,లే తుల లేతుల వెలందు లిచేలేతులయే. విజ. వి. 1. 181.

**ఏతుల²** వి. చాఁవల ల్లెడుజాతివిశేషము.

వ. ...వేడుకకుం జూడ వచ్చినయప్వీటి మేటి సాలె యగసాలె పటుసాలె వాని వైజాతి సాఁతు లేతులలోములు ... ఆము. 4. 85.
(శ. ర. వేదము. పాఠములు.)

**ఏతెంచు** – ఏఁగుదెంచు.

1. వచ్చు.

సీ. ప్రీతితోఁదానివ్వు దేతెంచె మేలయ్యె నిమ్మ హాత్ములకు దైనమ్ముఁ బురుష,కారంబుఁ గలుగఁగ...భార. ఆది. 8. 68.

క. ఆతురత నీవు నాకడ, కేతెంచినదానఁ జేసి యెలసినధర్మ,ద్యోతనకౌతూహలమున ... భార. శాం. 3. 357.

సీ. ఇదె యెల్లి కల్యాణ మేతెంచుచున్నది... వై ష. 4. 82.

2. సంభవించు.

క. నావుడు నందమహీపతి,కేవెరవున బ్రహ్మ హత్య యేతెంచె...వి క్ర. 3. 84.

3. జరుగు, ప్రవర్తిల్లు.

క. తమమేనయత్త గొంతికిఁ, బ్రమదంబుగఁ దత్తమాజవంచకమును గ,య్యముల బ్రతికింతు వనియెన్, గమలాక్షుఁడు పలికినట్ల కథయేతెంచెన్. హరి. ఉ. 6. 239.

4. పోవు.

మ. అరదం బెక్కి ప్రమోద మేర్పడఁగ నయ్యక్రూరుఁ డేతెంచుచున్, బరమాహ్లాదము భక్తియుక్తియను దాత్పర్యంబుఁ జిత్తంబులో,బెరయఁగ గృష్ణునిఁ బుండరీకనయనున్ బీతాంబరున్ భారిణీ,ధరునిన్ జూడఁగ నేఁడు గల్గెను గృతార్థంబయ్యె నాజన్మముఁ. వి. పు. 7. 330. (చూ. 332. వ. అరిగి యరిగి నందగోకులమునకు వచ్చె.)

**ఏద¹** వి. అవధానము ఏకాగ్రత.

గీ. ఎచ్చరిక యొచ్చరిం పేవ యేద పదిల,ము హవణిక పోణిమి యన నొప్పు నవధానము. ఆం. భా. 1. 188.

**ఏద²** వి. ఒకానొకచెట్టు. (బ్రౌ.)

**ఏదడి** వి. ఒకజాతి ఎలుఁగుగొడ్డు. (చి. ని, శ. ర.)

**ఏది** – ఎది. వ. (√ఏక్–ఏశబ్దమువకు అమహన్మహద్వర్థకప్రథమైకవచనము.) 1. ప్రశ్నార్థకము

ఉదా: వీనిలో నీ పుస్తకమేది?

గీ. కాకవుల కేది లోక విఖ్యాతకీర్తి. దశా. 1. 11.

(ఏది – ఎక్కడనున్నది – లేదనిభావము.)

ఉ. ఏయెడ నెన్నఁడుఁ గననియింపులు గుల్కెడు తద్గుణస్వనం, బాయత మైనకౌతుకము నద్భుతమున్ మొలపింప నేది యే.దీ యిది చాలఁ గ్రొత్త బళి యింతొక మాటఁక నొక్క మాటటం, చాయలినీలవేణి నల కాధిపమూనుఁడు వేఁడె వేఁడివన్. కళా. 1. 92. (ఇట'ఏది' అనునది కౌతుకాద్భుతాదులను సూచించును.)

2 యచ్ఛబ్దార్థకము – 'అది'అనుదానితో అన్వయము నపేక్షించును.

ఉదా: నీకేది యిష్టమో అది తినుము.

**ఏదీ** వ. (ఏది+ఈ) ప్రశ్నార్థకము,

(క.) ఎక్కడనున్నది – లేదనిభావము.

శా. మాదివ్యత్వము నీకునిత్తు మని సంభావింప సిగ్గయ్యెడిన్, వైదర్భీ భవదీయరూపవిభవైశ్వర్యంబు మాభూమియం,దేదీ...వైష. 4. 48.

(వ.) కౌతుకాద్భుతాదులను సూచించును.

(చూ. ఏది.) కళా. 1. 92.

శా. ఈరాజమ్మునిమీఁద నేఁ గవిత సాహిత్యస్ఫురన్మాధురీ,చారుప్రౌఢిమఁ జెప్పి పంప విని మాత్సర్యంబు వాటించి వ,క్కీరుం డూఁకె తప్పువట్టెనఁట యేదీ లక్షణంబో యలం,కారంబో పదబంధమో రసమొ చక్కం జెప్పుఁడా తప్పనన్. చాటు. 3. 167.(ఇట వెగిరపాటును సూచించును.)

**ఏదు¹** అ. క్రి. 1. నశించు, చెడు, ఉడుగు.

ఉ. ...నాని న,శ్యున్నతుఁ దాఁకి రాక్షస వధోచిత నీబలగర్వ మేదఁగా,నిమ్ము వధించి... భార. ఆది. 6. 302.

శా. పెం పేదం దమ కిట్టితక్కువలు రూపింపంగ నేలా.... భార. ఉద్యో. 3. 108.

2. లేనిదగు; పోయినదగు.

శా. శృంగారంబు వలంగ దేమియును బ్రస్వే

దాంకురచ్రేణి తే. దంగంబుల్ మెఱుఁ గేద వించుకయు మాహారాష్ట్రసామంతు సారం గుం దోలి తురంగముం గొనివనంగ్రామం బునం దృప్తప్రాగ్స్ప్రా ...కుండు పన్న విభుపం పై చన్న సైన్యంబునన్. నిర్వ. 1. 48.

క. ముట్టఁబడి దీర్ఘసూత్రుం... డిట్టట్టరుగఁగ నుపాయ మేది యొకనిచేఁ,బట్టువడె నదు డెందము,పట్టువదలి చకితవికలభావేంద్రి యుఁడై భార. శాం. 8. 198.

8. పెరుఁగు.

వ. ...ముత్తెపుఁ దేటనీటి చొక్కాటంపుసెల యేటిదరుల వఱలుచలువలకోమున నేదిన పంటవలంతినెమ్మేన శృంగారింపం బుప్పొంగినతెలుంగునఁ జెంగలించిన నిచ్చలపుఁబచ్చికల మచ్చికల విచ్చలవిడి మెసవి...ప్రబంధ. 186.

స. క్రి. 1. రక్షించు, ప్రోచు; పోషించు, పెంచు.

గీ. కాన శరణాగతులఁ బ్రోచుకంటెఁ బుణ్య మేది మేదినిలోన నెన్నది యింక,నాది రాజన్యకీర్తులఁ బ్రోదిసేయు,ధర్మగుణ సాంద్ర సత్యవ్రతక్షితీంద్ర. దశా. 1. 188.

సీ. అఁగిన సరకుసేయనివానిధనము భూతల నాథునకుఁజెప్పి బలిమిఁ గొనుచు,ధనమెల్ల నిచ్చి పేదఱిక మొందినవానికిగిగా ధన మిచ్చి యేదికొనుచు. దశకు. 5. 17.

క. కడుపునకుఁ బెట్టి యెడయక, యెడసెడఁ బన్నిచ్చి పాడి యేదుపడిపి యొడల్,గడిగి తెలిమడుఁగుఁ,బాన్పున,నిడి యాగతి రఘు కుమారునేదిరి దాదుల్. రామా. 3. 135.

2. పొందు.

తరువోజ. కాలవు నీకు నిప్పటఁగోలె నీతపం బిది గైకొని పార మేది పఁ,బోలదు వల దని బుద్ధులు చెప్పఁ బోయిన ... కు. సం. 6. 678.

మ. తరుణీ యెంతయు ధన్య వీవు దయితుం డచ్చోదితున్ శోకమం,దరు విశ్వాధికుఁ బొంది తెల్లుఁ దుది యేదం గాంచు నీకోరి కల్. పారి. ఉ. 7. 112.

ఏదు² వి. (క. ఏదు.) శల్యము, ముండ్లపంది.

వ. ఇట్లు విరథుండును విశిఖక్షతదేహుండును నై యతఁ డేదు వెరిఁగినట్లు నిగుడుఱంది యగు వృషకునందంబు మీఁది కరిగె. భార. భీష్మ. 3. 30.

చ. కనుఁగొని నెమ్మనం బలరఁగాఁ బులిజున్ను ను నేదుకన్నుఁ దెమ్మనినను దెచ్చువాఁడ ...విక్ర. 1. 169.

గీ. పాండుబహుళక్షపాపరంపరలు వెడల,కిటి లోనేదుము ల్లయ్యె నిందుముఖకి అము. 5. 84.

ఏదుకఱ్ఱలు వి. బ. ధాన్యవిశేషము హంస. 4. 128.

ఏధ సం. వి. అ స్త్రీ. 1. వృద్ధి. 2. ధనాదిసమృద్ధి

ఏధనము సం. వి. అ. న. 1. వృద్ధి, పెరుఁగుట 2 సమృద్ధి

చ. . .ధవదేధనై ధనై ,ధితజవశక్తి ... అము 4. 19.

ఏధమానము సం. విణ. (అ. అ అ) వర్ధిల్లు చున్నది.

ఏధము సం. వి. అ. పుం స్. న. 1. సమిధ, చిదుగు. 2. వంటచెఱకు

ఏధస్సు సం వి. స్. న. – ఏధము.

ఏధితము సం. విణ. (అ. అ. అ.) 1. వృద్ధిపొంది నది. పెరిఁగినది. 2. పెంపఁబడినది. 3. నిండింపఁ బడినది. (శ్లో : బందీభిరేధితాశాలారాః. మహా. 7. 6.) వి. అ. న. అడవి. పుం. కొండకాలువ.

ఏనస్యము సం. విణ. (అ. అ. అ.) 1. అపరాధము వలనఁగలిగినది. 2. పాపమువలనఁగలిగినది.

ఏనస్వంతుఁడు సం. విణ. (త్. వ్యాత్. త్.) 1. పాపముకలవాఁడు 2. అపరాధముకలవాఁడు.

ఏనస్వి సం. విణ. (న్ ఇ. న్.) – ఏనస్వంతుఁడు

ఏనస్సు సం. వి. స్. న 1. అపరాధము. 2. పాపము.

ఏనాఁడు – ఎన్నఁడు.

ఏనాదము వి. సముద్రతీరము. (చి. ని. శ ర.)

ఏనాది వి. (క. ఏనాది.) కిరాతభేదము.

సీ. ఏనాదిరాయ నీ వీకోనలో రమ్ము ముత
రాచ నీ వల్లపొదను నిలువు. ప్రబంధ. 198, రా. వి. 3. 56.

**ఏనాళ్లు** వి. బ. (ఏను² + నాళ్లు.) 1. అయిదుదినములు. 2. వివాహానంతరము వియ్యంకులొకరి కొకరు పంపెడు సారె.

**ఏని** - దే. అవ్య. ('ఏన్' అనునది 'ఏనియున్' అనుదాని సంక్షిప్తరూపము.) 1. చేదర్థకము.

(క.) పక్షాంతరమును తెలుపును.

ఆ. సభకు వచ్చి ధర్మసందేహ మడిగిన, నెఱిఁగి చెప్పకుండిరేని సభ్యు, లనృతదోషఫలము నం దర్ధ మొందుదు,రు ... భార. సభా. 2. 287.

(చెప్పకుండిరేని — చెప్పనిపక్షమున.)

మ. ... అది కాదేఁ దెగి బంటవై యఱుము ... భార. ఉద్యో. 3. 97. (అదికాదేన్ — అది కానిపక్షమున.)

(చ) వికల్పమును తెలుపును.

క మానవనాయక యగ్రజుఁడైనను నను జన్ముఁడేని యన్యాయంబుం, బూని సహోదరులకుఁ గీడైన నతఁడు దండ్యుఁ డండు రవనీపతికిన్, భార. అను. 4. 186.

(ట) సందేహములేమిని తెలుపును.

గీ. పాండుపుత్రుల కేను దప్పనిమనంబు,గలుగుచాననయేని యీలోకమలమిత్రి,కీచకుని దెస నన్నొక కీడుతెరువు,వొరయకుండఁగ రక్షింపు కరుణతోడ. భార. విరా 2. 108.

2 అవ్యర్థకము.

(క) ఉత్కర్షమును దెలుపును.

ఆ. అదరుశోకవహ్ని యాఱనేర,దింద్రపదవి నేరె నేనియుఁ గావున,ఖండనంబు నేయకుండువాఁడ. భార. భీష్మ. 1. 198.

(చ) అపకర్షమును తెలుపును.

చ. ... ప్రతిపుఁ డిట్లనియె నంబురుహానన యగ్నిసాక్షికం,బునఁ బరిణీత యైననతిఁ బొల్పుగ నొక్కతఁ గాని యన్యులన్, మనమున నేనియుం దలఁప మానిని ... భార. ఆది. 4. 187,

శా. ఎచ్చోనైనను నిల్చు వాఁకటికి నేమేనిం గొనున్ రాత్రియై,నచ్చో నెమ్మి శయించు నగ్నిపరిచర్యం బాసి వర్తించు ... భార. శాం. 2, 288.

3. నిర్ధారణములేమిని సూచించును.

చ ... మీజనకుండు పంచి యిప్పుడ యెటనేనిఁ బోయె పాంతభుక్ర్యక్షయంబు దలంప కక్కటా. భార. ఆది. 8. 305. (ఎటనేని— ఎటకో.)

4. వాక్యాలంకారము.

సీ. ఎందేని సర్వభూతేశుండు సృజియించె సచరాచరము లైనజగములెల్ల ... అట్టిబిందుసరము ... భార. సభా. 1, 9.

ఉ ఇంబుగ సర్వలోకజను లెవ్వనియేని ముఖామృతాంశుబింబంబున నుద్భవం బయిన భారతవాగమృతంబు కర్ణరంధ్రం బను నంజలిం దవిలి త్రావుదు రట్టిమునీంద్రలోక వంద్యుం బరము బరాశరసుతు బ్రణమిల్లి కరంబు భక్తితోడ. భార. ఆది. 1. 76...,

వైశ్వర్యాండమ కందళించు రహిచే నేకా 4. 43న్...అయింపే పరబ్రహ్మము ... శ. మనుచ. 2. 62.

**ఏనిక** వి. (సం. అనేకపః, త. ఆనై.) ఏనుఁగు.

క. నీనమ్మిన భూరిశ్రవుఁ,డేనికలావు... భార, శల్య. 1. 26. (ఏనికలావు - ఏనుఁగుబలము కలవాఁడు.)

**ఏనికదిండి** వి. (ఏనిక + తిండి) సింహము.

గీ. వఱలు నేనికదిండివార్వమ్ము దొలుతఁ, గాఁగఁ దా నెక్కి నన్నుఁ దాఁకకయ దీని, కటివిభాగంబు నెక్కి రాఁగలవె యబల, వెనుక మఱగొమ్ము మాఁతగాఁ గొనుచు ననియె. కళా. 3. 62.

**ఏనికదోమ** వి. తొండపుదోమ, ఘోటిక.

**ఏను**¹ - నేను. (బ. ఏము.)

గీ. ఏను నీయింతియును గాని యెఱుఁగ రమ్యులు...భార. ఆది. 4. 106.

ఉ. ...వంకమాట తే, నేర... భార. ఉద్యో. 3. 96,

క. ...మీ రిట,కరుదేరఁగ నిప్పు డేఁ గృతార్థుఁ
డ నయితిన్. పారి. 1. 47.

సీ. ఏను సంపితి మని యించుకేనియు నహం
కారంబు వారికిఁ గలుగదు.... భార. అను. 5. 58.

జ: ఏఁకెల్ల.

**ఏను²** వ. వి. అయిదు.

క. పర్వంబు స్త్రీపర్వాదిక. పర్వంబుల నేనిటం
గృపాయితమై స్త్రీ,పర్వము...భార. ఆది. 1. 55.

ఉ. ...తదీయ దేహముల్, ధీరుఁడు సూచెఁ
దారసమదీర్ఘతఁ గొల్చినవాని నేనిటన్.
భార. ఆది. 7. 276.

చ. ...నాలు గేనొ్వగపినకూరలు వడియము
ల్వరుగు లెవ్వఁగు షడ్రతప్పులిన్ ... ఆము. 1. 80. (ఇట ఉకారలోపము.)

గీ. ...శివునికరుణ, నివ్వటిలు నిర్వదేనేండ్లు
నిన్నుఁ దలఁచి... కాశీ 4. 91.

జ: ఏఁదుము, ఏఁబండ్రు, ఏఁబది, ఏఁబాము, ఏగురు, ఏగుస, ఏనాళ్లు, ఏనూఱు, ఏవురు.

**ఏనుఁగడుగుగారెలు** వి. బ. (√ ఏనుఁగు) భక్ష్యవిశేషము, పెద్దగారెలు.

వ. డాకినులవెంబడిం బడిన యేనుఁగడుగు లేనుఁగడుగుగారెలు నప్పలంబు లప్పలంబులుఁ గెరయువలుదవడలు వలుఁదవడలుగా మెసవు బ్రహ్మరాక్షసులు ... చంద్రా. 6. 93.

**ఏనుఁగడుగులు** వి. బ. (ఏనుఁగు + అడుగులు.) చిత్రవర్ణవస్త్రవిశేషము.

గీ. పప్పుతిబవంతి కరకంచు పట్టుమార్పు, మాద
శంబులు దళ్లు బొమ్మంచు లుదుత, చాలు
లేనుఁగడుగు లన మీలు నిట్లు, చిత్రవస్త్ర
విశేషములు....ఆం. భా. 2. 154.

**ఏనుఁగు(న్గు) - ఏనిక.** వి. (సం. అనేకపః. త. ఆనై. క. ఆనె) గజము, దంతి.

క. కనుఁగొని సాత్యకి యేనుంగునకు సిడులు
మాపినట్లు కోపంబున భీ,మ్మునిమీఁదఁ గవిసి
యుజ్జ్వల,మునిశితభల్లంబు లేసె మరల
మతింపఁగా. భార. భీష్మ. 2. 297.

ద్వి. రంజితమదనిర్ఝరంబులు గలిగి.యంజనం
బను నేన్గు నచ్చోటఁ గాంచి. రం. రా. బాల. 40. పొ. 27. పం.

సీ. ...ఏనుగు హత్తి గా రేమఁ గేన్గు,నాఁగ
దంతావళనామ మౌ...ఆం. భా. 2. 194.

సా: ఏనుఁగు చచ్చినను వేయిరూపాయలు బ్రతికియున్నను వేయిరూపాయలు.

విశ. పెద్దది.

ఉదా: ఏనుఁగుకలబంద, ఏనుఁగుకాలు, ఏనుఁగు జలగ, ఏనుఁగుతుమ్మి, ఏనుఁగుపల్లేరు, ఏనుఁగుబీఱ, మొ.

(వ్యవ) ఏనుఁగుదాహము — అధికాశ.

ఏనుఁగుపాఁడి — అమితమైన యీవి.

ఉ. ... ఇచ్చెనా, యేనుఁగుపాఁడి యీడు
గలదేఁ రఘునాథనృపాలమౌళికిఁ. విజ. వి. పీఠి. 54.

ఏనుఁగుమీఁదినున్నము-ఏనుఁగుమీఁది సున్నము వంటిది. (దుర్లభమనిభావము)

సీ. అతనికాలబూలగంధాస్యాప్తి యేనుఁగు
మీఁదినున్నం బని మేన యొంచె. కవిరా. 2. 48.

ఏనుఁగుదిన్న వెలఁగపండు (కాయ)—1. తల్లి బిడ్డకు ఉగ్గుపెట్టి జీర్ణముగుటకొఱకు దీవించునపుడు దృష్టాంతముగా చెప్పుమాట (ఏనుఁగు తిన్న వెలఁగపంటి గుంజులేక డొలుకయై దాని పురీషమునందు పడుట ప్రసిద్ధి.)

గీ. ముదమునను గడుపునకుఁ బెట్టి మూతిబిడ్డ,
మోమునను మేనఁ జమిరి యమ్ముదిత
యక్క, గలయ నిమిరి యేనుఁగు దిన్న
వెలఁగపండు, నాఁగ నొప్పు కృష్ణుఁడు
సాత్త్వికనయనుఁ దగుచు. హరి. పూ. 5. 195.

2. అంతస్సారము లేని డాంభికునిగూర్చిన ఆక్షేపవచనము.

మ. జగదాశ్చర్యకర ప్రభావమగు నీ సర్వజ్ఞ
విఖ్యాతి యేనుఁగు దిన్నట్టి వెలంగకాయ
గతి నొందున్ లోన లోతై బయల్, పొగ
సై యుండెడిదో వికుద్ధతరమో చూడంగ

నాతోడుతఁ. సొగటూ లాడెదవే నవేం ద౦ కుసుమస్తోతవ్యజూటాంతికా. నిరం. 3. 8.

మానెఁడుజలములో నేనుఁగు మెయి దాఁచుట-గొప్పవస్తువును చిన్నవస్తువులో నిముడ్ప యత్నించుట,

క. మానఘనుఁ డాత్మధృతి చెడి, హీనుం డగువాని నాశ్రయించుట యెల్లన్, మానెఁడు జలములలోపల, నేనుఁగు మెయి దాచినట్టు లెఱుఁగుము సుమతీ సు. శ. 91.

ఊ: ఏనుఁగడుగులు ఏనుఁగడుగుగారెలు, ఏనుఁగు కలబంద, ఏనుఁగుకొమ్ములు, ఏనుఁగుకోల, ఏనుఁగుగొంగ, ఏనుఁగుతోలుదాల్పు, ఏనుఁగు దాయ, ఏనుఁగుపల్లేరు, ఏనుఁగుమొగ మయ్య, ఏనుఁగుమొగసాల, ఏనుఁగుమోము సామి, ఏనుఁగురాకాసిగొంగ, ఏనుఁగుల మూడు, ఏనుఁగుసొరము.

**ఏనుఁగుకలబంద** వి. (√ఏనుఁగు) ఏనుఁగువలె పెద్దది యగు కలబంద. నారి కుపయోగించెడి పెద్దకలబంద. (వ్య. వి.)

**ఏనుఁగుకొమ్ములు** వి బ. (√ఏనుఁగు) ధాన్యవిశేషము.

సీ. ఇప్పపూరాజనా లేనుఁగుకొమ్ములు మల్లె శ్రీగంధులు మదనగంధులు... హంస. 4. 123.

**ఏనుఁగుకోల** వి. (√ఏనుఁగు) అస్త్రవిశేషము.

సీ. ఖగములగొంగ యేనుఁగుకోలఁ బఱప రాయండు సింగపుఁగత్తిఁ జెండిచె. అచ్చ. రా. యు. 521.

**ఏనుఁగు(ల)గొంగ** వి. (√ఏనుఁగు) సింహము శ. ర. అ. సం. తిర్య. 1.

**ఏనుఁగుతోలుదాల్పు** వి. ( √ఏనుఁగు ) గజచర్మ ధారి, శివుఁడు.

వ. దోవతు లుతి తిచ్చెద నంటివా యీవే శ్వేనుంగుతోలుదాల్పు. మ్కా. వి 1. 22.

**ఏనుఁగుదాయ** వి. (√ఏనుఁగు) సింహము. కకు. 4. 67.

**ఏనుఁగుపల్లేరు** వి. ( √ఏనుఁగు ) పెద్దపల్లేరు. (వ్య. వి.)

**ఏనుఁగుమొగమయ్య** వి. (√ఏనుఁగు) గజాననుఁడు, గణపతి.

క. టోవములు నడపఁగా నీ యేనుఁగుమొగ మయ్య వెలసె నిచ్చట ననినఁ. శుక. 3. 462.

**ఏనుఁగుమొగముసామి** వి (√ఏనుఁగు) గజాననుఁడు, విఘ్నేశ్వరుఁడు. ఆం. భా. 1. 48.

**ఏనుఁగుమొగసాల** వి. (√ఏనుఁగు) యామకుంజరములుండెడు ముఖశాల, మొదటి మొగసాల.

వ. ఇవ్విధంబున నేనుంగుమొగసాల గడచి కక్ష్యాంతరంబులు గడచి... నైష. 8. 85. చూ. నైష. 6 82.)

**ఏనుఁగురాకాసిగొంగ** వి. (√ఏనుఁగు) గజాసురారి, శివుఁడు. (శ. ర )

**ఏనుఁగులమూడు** వి. (√ఏనుఁగు) సింహము.

(కీర్తి) సీ. చల మూని యలయేను గులమూడు దిగనాడి...నీలా. 1. 46.

**ఏనుఁగుసొరము** వి. (√ఏనుఁగు) సప్తస్వరములలో నొకటి, నిషాదము. (శ. ర )

(శ్లో: నిషాదం బృంహతే గజః)

**ఏనూఱు** వ. (ఏను² + నూఱులు.) అయిదువందలు

సీ. ఇన్నూఱు మున్నూఱు నేనూఱు గన్నులు గలవేలు పెవ్వానిఁ గన్నతండ్రి. నైష. 6. 72.

**ఏన్నాళ్లు** వి. బ. (ఏడు + నాళ్లు ) ఏడుదినములు.

గీ. కూడు పెట్టక యేన్నాళ్లు కుతిలపఱచి. గాని సేయుట యిది తప్పుగాదె తనకు, నెదురుకెదు రేల కోపించె నిందుధరుఁడు. భీమ. 4. 12. (చూ. 2. 107.)

**ఏన్నూఱు** వి. (√ఏడు + నూఱులు.) ఏడువందలు.

ద్వి. ...మట్టి భూతములు, ఎగిది యొక్కటి సాల కేన్నూఱు వచటి,పొగదాఁకి కైలాన మున కప్డు వోవ. బస. పు. 298. పం.

**ఏపడఁచు** వ. క్రి. (√ఏపు.) -గర్వమడఁచు-అణఁచు.

మ. ...ఏపడంపుము రిపు నస్సంరంభివై .... భార. కర్ణ. 2. 307.

**ఏపారు** అ. క్రి. (√ఏపు + అరు.) 1. అతిశయించు, అధికమగు.

శా. ఈడంబోవక వీఁకమైఁ బొడువఁగా నే
పారు ఘోరాజి... భార. ఆది. 1. 69.

క. ఏపారి తొల్లి త్రేతా, ద్వాపరములసంధి
నొక్కవఱపు ధాత్రీ.తాపంబుఁ జేసె జన
ముల, పాపంబున వత్సరములు పండ్రెం
డధిపా. భార. శాం. 3. 279.

2. విజృంభించు.

క. అవనిన్నిద్దఱు సైన్యాటోపసమేతముగఁ
గవియుదురు పాంచాల.క్ష్మాపాలసుతుఁడు
భీముఁడు, నేపారి నీదు సేనయొనకం బడఁ
గన్. భార. భీష్మ. 2. 378.

3. అధికముగాఁగలుగు

క. ...జగద్దీపక నీదగ్గనమున, నేపారె భక్త
జనుల కిపాపనుజముల్. భాగ. 10. ఉ. 662.

శా. దేవా దేవరయాజ్ఞ మోముకొని ధాత్రిం
బొల్చుభూపాళిన్. దైవానీకము నేచి
త్రిమ్మంగుడు నసాధ్యం బెద్దియున్ లేదు నా.
కివిప్రోత్తముఁ జూడ దగ్గఱ భయం బేపారె
నాకాళజుం. దేవెంటన్ మఱి నాకు లోఁ
బడఁడు వీడెవ్వాఁ డెఱింగింపవే వాసిష్ఠ.
2. 14.

4. ఒప్పు, శోభిల్లు.

శా. క్రూరాసిత్రుటితారివారణఘటాకుంభస్థ
కూటస్థలీ; రారాజన్నవమౌక్తికోత్కరకిరా
ణంఛ క్రమోజ్జృంభియై. యీ రాజన్య
కరంబు పోరులఁ గరం బేపారు సత్కీర్తి శ్రీ,
జారోపంబొనరించుభంగి హాయరింఛాగ్రత
తక్షోణులన్. నైష. 5. 148.

ఏపిరి వి. ఎల్ల, హద్దు.

చ. వలపల వేగ నిచ్చలును వాఁజులు దీర్చి
యతండు నాతఁడున్, వెలువడి వచ్చి
యిఱుమతివేణిక యేపిరి గాఁగ వీఁగుచున్,
దలపడుచుం బెనంగఁగఁ గృతధ్వజనందను
సైనికావళీ,హాళహాళికిం జెడ న్విఱిగె
వార్త్త మితధ్వజనందనుం డనిన్. అము.
3. 16. (ప్రయోగాంతరములేదు)

ఏపు వి. (√వచే.) 1. అధిక్యము, అతిశయము.

సీ. పకారణంబున నేమయ్యెనో వానయేపునఁ
దెగియెఁగానోపు నకట. భార. శాం.
3. 310.

2. అభ్యుదయము, అభివృద్ధి.

ఉ. క్రూరత లేనిచూపు కెలకొన్న వికారము
లేని రూపహం,కారము లేనియేపు కల
కాలము వేసట లేనిప్రాపు .... వరన.
5. 106.

3. ఉత్సాహము.

గీ. ఏచి దుర్యోధనుండు దేవిచి యెలుఁగు,
చూపి పురికొల్ప నెంతయు నేపు మిగిలి.
మనబలంబులు పాండుకుమారసైన్య,సమితి
తోఁ దాఁకె నత్యంతసంకులముగ. భార.
భీష్మ. 2. 28.

గీ. ....చింత నేపు దక్కి, సుక్కి యుండియు
రాజుల నుక్కుమడఁతు. భార. ఉద్యో.
4. 361.

4. విజృంభణము.

ఉ. ... రణంబునందు నీ,యేపున కోర్వ దేవ
తల కేనియు దైత్యులకేని రాదు.... భార.
శాం. 2. 487.

5. ఔద్ధత్యము, గర్వము.

శా. ఈకౌరవ్యుల నెల్లఁ గాచికొనవే యేపొప్ప
దెందుం దుదిఁజ. లోకం బొందక వేగమే
కదలి కృష్ణుం గూడఁబోవే నృపా. భార.
ఉద్యో. 4. 24.

గీ. పోతరం బేపు నా గర్వ మొప్పుచుండు అం.
భా. 1. 133.

6. విలాసము.

గీ. జవటికి నేఁటప్రాయంపుటేపు గలదె.
హంస. 1. 100.

సీ. హొరఁగు చెన్నే పొఱ పొయ్యారము
బులుపు హొయ లవఁగ విలాస మొప్పు
చుండు. అం. భా. 1. 189.

7. విధము.

గీ. ఇల్లు పూచినయేపున మల్లెవిరుల,వీఁక
వెలిదమ్మి తేకులతోఁక నిండఁ, బండువెన్నెల
వెల్లి యఖండరుమలఁ, గంజజాండ
ఖండంబు గలయఁ బర్వె. ఘటికా.
2. 145.

క. ...అతఁడు ని,తేపముఁగనిన దరిద్రుని, యేపున ముదమంది... హంస. 2. 46.

విశ. అధికము, గొప్పది.

క. తాపసవరు లందఱు నా,భూపతి వీక్షించి యకట బుద్ధివిహీన,వ్యాపారదోషమున నీ, వేపుగ గర్భంబు దాల్తు వింతియుఁబోలెన్. వి. పు. 5. 113.

ఉ. ఎందఱు జంగమ ప్రముఖు లెత్తటి నేమి పదార్థ మెంత యే కందువ వేఁడినం దిర ముగా నతఁ డందఱ కాపదార్థ మా,కందువ నేపుప్రాణ మెడగా నిడియైన ఘటించి పెట్టు....హం 2. 5. (ఏపు:- ప్రియ మైనది అని భావము.)

**ఏపుమాపు** న క్రి. (ఏపు + మాపు.) 1 ఓడించు.

ఆ. వెల్లదమ్మితొగల వీని కందోయితో, రేపు మాపు బాపు రేపుమాపు. సారంగ. 2. 41. (ఇట ఔపమ్యవాచకము)

2. చంపు.

చ. కముఁగవఁ గెంపుసొం పడరఁగా నతఁ డానరనాథుచాపముం,దునిమి హయంబు లం జదిపి తోడనె సారథి నేపుమాపి కే, తనము ధరిత్రిఁ గూల్చిన రథంబును దిగ్గన డిగ్గి యాతఁడుం, గినుక దలిర్ప సైనికుల గిటుఁగించెఁగృపాణపాణియై. విక్ర. 4. 102.

**ఏపురేఁగు** అ. క్రి. (ఏపు+రేఁగు.) చెలరేఁగు.

గీ ఎడతెగని మోహమూరించి యేపురేఁగి, వేశ్మమున నొందిపాన్పైనవేళలందు,మదన కదనంబునకుఁ జాల మురులుకొనఁగఁ,జేసె శుభవాటిధూర్తు నిచిత్త మలరి. హంస. 2. 200, 195.

సీ. ఏపురేఁగిన యంకు లెలదీఁగబోఁడులు వింత కౌఁగిలి లేక వెతలఁబొంద. వేం. పంచ. 4. 240.

**ఏపె¹** వి. నల్లమద్ది, ఇనుమద్ది. (వ్య. వి.)

చ. ...తదీయపశ్చిమం,బునఁ గలకోట యొక్క సురపొన్నలు నేపెలు మన్నతోఁటలో... ద్వా. 11. 20. శా. వి. 8. 40.

**ఏపె²** వి. వి. (ఏ³+అవ.) ఏ స్త్రీ.

**ఏబిడ** వి. వి. (ఏ³ + బిడ్డ) ఏ స్త్రీ.

**ఏబ్రము** వి. ఎబ్బెటికము, రోఁత.

గీ. దేవపూజావిధానంబుఁ దీర్పు మన్న, నేబ్ర ముదయించు నా బ్రాహ్మణ బ్రువునకు. నిరం. 2. 25.

జ: ఏబ్రాసి.

**ఏబ్రాసి** విశ (ఏబ్రము + రాసి-శ. ఏబ్రాసి.) ఎబ్బె రాసి. రోఁతపుట్టించువాఁడు. (బ్రౌ.)

**ఏమఱించు** - ఏమఱుచు. న క్రి. (√ఏమఱు.) ఏమఱఁజేయు.

సీ. .... ఉత్తమద్రవ్యమైయున్న దీని. గీ. వెన్ని భంగులనైన నిన్నేమఱించి,కొనఁగఁ దలఁతురనేకులు క్రూరకర్ములు. దశకు. 6. 17.

చ. ...లవణాసురుమాతులుఁ డేమఱించి శీఘ్ర తఁ గొనిపోయె నాలవకరస్థశరాసన మభ్ర వీథికిన్. జై. భా. 6. 168

**ఏమఱిక** వి. (√ఏమఱు.) పరాకు, ప్రమాదము.

సీ. ఏమఱిపాటన నేమఱిక యన మోసమునఁ బరాకనఁ జను బ్రమాద,ము. ఆం. భా. 1. 188.

**ఏమఱిపాట** క్రి. విశ. క్రి. (√ఏమఱు.) అకస్మాత్తుగా.

ద్వి ఇప్పు డేమఱిపాట నిటకు నేతెంచి, ముప్పిరి గొనుకోపమునఁ గౌశికుండు. ద్వి. హరిశ్చ. ఉ. 128. పా. 155. పం.

ఉ. ...ఇగురుఁబోఁడుల నేమఱిపాటఁ జంపినం, బేరుమ బెంపునుం గలదె పృథ్వి నెఱుంగవె వీరధర్మముల్. భోజరా. 5. 108.

చ. అలుక జనింపఁ గౌశికమహామునిఁ యేమఱి పాట భీమభం,గులఁ జనుదెంచి మాధవను గొబ్బునఁ దెమ్మని యానఁ బెట్టినం, గలఁ గుచు నేయుపాయమును గానక నిన్నును నీతనూజుఁ గొం, దలమున విక్రయించు వసుధావరుఁ డెవ్వరికైనఁ జెప్పరశా. హరిశ్చ. 3. 158.

**ఏమఱిపాటు** వి. (√ఏమఱు.) పరాకు, ప్రమాదము. (ఇది 'కునికిపాటు, ఎగసిపాటు' వంటిది. ఇట్లే చి ని. బ్రౌ. లు ఇన్నర్థమ్యరూపమిచ్చి నవి.)

సీ. ఏమఱిపాటన నేమఱిక యన మోస మనఁ బరాకనఁ బనుఁ బ్రమాదము. అం. భా. 1. 188.

క్రి. విశే. అకస్మాత్తుగా

గీ. అంతనొకనాఁడు పువుఁదోఁట కాత్మగురుని, వెంటఁ జని యందు నట్లు కావించి నూతి, నీటిలో నీడఁ జూడంగ నెలఁతఁ జూచె, విష్ణుచిత్తుఁ డేమఱిపాటు వెనుకఁగదిసి. పరమ. 4. 61.

సీ. గ్రుచ్చి శ్రీహరి యెత్తుకొనఁగ నేమఱి పాటు బెదరుచే బెదగుండె యదరుచుండ.... గీ.....స్వయంవరమున ధవునిచేతఁ,దవిలి చెలువొందునట్టి మాతల్లి కమల, రుక్మిణీదేవి మము వేడ్కఁ బ్రోచుఁగాత. ఉ. హరిశ్చ. 1. 2.

**ఏమఱిలు(ల్లు)** – ఏమఱు. అ. క్రి. ప్రమాదపడు.

సీ. పదబంధశిథిలతఁ బాటిల్లఁగానీక యేచంద ములయందు నేమఱిలక. కళా. 1. 8.

స. క్రి. మఱచు

సీ. కత్తి యేమఱిలునె కన్నగాఁడు. రామలిం. 101.

**ఏమఱు** స. క్రి. (త. ఏమర్.)

1. ఉపేక్షించు, ఆలస్యముచేయు.

క. మఱచునొకో మఱవకుండియు, నెఱుఁగక యుండునొకో యనలుఁ డెఱిఁగియు నెడ నేమఱునొకో పుత్రులఁ గావఁగ ... భార. ఆది. 8. 314.

గీ. తీర్థములు మాసములు ముక్తిప్రదములు, తరుణి యివి మేలు బాహ్యతీర్థములకంటె, మానవుం డివి యేమఱి మధురవాణి, బాహ్యతీర్థంబు లాడ నిష్ఫలమునూనె. కాశీ. 3. 71.

సీ. ....చేరువవృపులకు వైరబంధ. ఆ. మెట్లు గలుగు దాని నేమఱ కుండుము,వారి యవులమన్న వారు మిత్రు,లగుదు రెల్ల భంగి వధిపయుదాసీను,లట సమీపవర్తులైన విభులు. భార. అశ్వ. 1. 66.

2. మఱచు.

చ. ...తోడియుంతులమానము దక్కి భజింపఁ బెంపుగై,కొనియెదు మమ్ము నేమఱకు కూరిమినంచు మునీంద్రుఁ డంపినన్. పరమ. 2. 34.

అ. క్రి. ప్రమాదపడు. ప్రమత్తుఁడగు. జాగ్రత్త లేకుండు.

క. మనవంశంబును వృత్తంబును బెంపును గావఁజాలుపుణ్యసతివి దుర్జనులగుతులువల తలఁపులు,గనుఁగొని యేమఱక మెలఁగఁ గావలయుఁ జుమీ. భార. విరా. 1. 110.

వ. ...ఏమఱి శయనింతురే కడుఁ బ్రమాదము సేసిరి బుద్ధిహీనులై. భార. ఆది. 6. 194.

జ: ఏమఱించు, ఏమఱిక, ఏమఱిపాట, ఏమఱిపాటు, ఏమఱిలు, ఏమఱుచు, ఏమఱుపు.

**ఏమఱుచు** – ఏమఱించు. (శ. ర.)

**ఏమఱుపు** వి. (√ఏమఱుచు) 1. ప్రమాదము, పొరపాటు, తప్పు. 2. ఒకానొక కావ్యదోషము.

సీ. ...ఈచలును బ్రాలుమాలికలును సందియము లేమఱుపులు మఱుఁగులు వ్యర్థపదములు రవణమీఱు పదునైదు వాక్యదోషములు గనక... ప్రబంధ. 16.

**ఏమాఱు** – ఏమఱు. స. క్రి.

(ఉపేక్షించు అలక్ష్యముచేయు.)

క. ఓమంత్రిశిఖామణి యిదె నాముద్దులకూర్మి తనయ నయ మలరంగాఁ,గోమలగతి లయ పద్ధతులేమాఱక సరసగాన మిం పుగ నేర్చెన్. బిల్హ. 1. 63.

**ఏమి** (ఇది వాక్యమునకు చివరమున్నపుడును దీనికి హల్లు పరమైనపుడును వైకల్పికముగా 'మి' లోపము.) స. ఏ. బ. అవా. 1. యత్కిమర్థకము. ఏది; ఏ.

సీ. ...కాను బరుల. గీ. దిక్కు పలుకక దివి యొల్లఁ బిక్కటిలఁగఁ, దాన యున్నట్లు గనుచు నేమేని గుడిచి. భార. శాం. 5. 148.

క. ఏమికులంబునవాఁడొకో,నామం బెద్దియగు నొక్కొ. భార. విరా. 1. 216.

మ. సుదతీ యెవ్వరిదాన వేమికొఱకిచ్చోటం బ్రవర్తించెదు... భాగ. 10 ఉ. 117.

ఆ. తవది యనక యేవిధమునఁ బ్రియమందు, దెద్ది కుడువకుండ నెసఁగుఁ దృప్తి. భార. శాం. 5. 198.

క. ఏమిట రూపగుఁ బురుషుం, డేమెయి రూపు సెడు. భార. శాం. 5 8.

క. మనకడకు నేమిటికి వ,చ్చెనొకో. భార. విరా. 187. (ఏమిటికిన్ :— ఎందులకు అని భావము.)

ఉ. ఏమిఁ కర్ణభీము నటు లేటికిఁ దిట్టితి... భార. ద్రో. 4. 288. (ఏటికిన్ :— ఎందులకు అని భావము.)

ఉ. నారదమౌని యేమి సురనాథ విశేషము లేమి వింటిరో. దశా. 1. 67.

సీ. అర్థముల్ దుఃఖదోషాకరంబులు విను మేమిట పై నాశలేమిఁ జేసి, పొరఁ లేవు నను దుఃఖములు మునినాయక మి౹41. గాలఁగ నేమియును నాకుఁ, గాలని ట్లుండె.... భార. శాం. 5. 375.

2. ఉచ్చరింపరాని యశ్లీలపదములకు మాఱుగా నుపయుక్తము (ఇట్టిచోట 'ఒ, ఓ' అను వానితోఁ గలసియుండును.

సీ. కడపటఁ జుట్టాలగరితలపైఁటలోఁ జెయి వేసి యేమేమొ చేసె ననుచు. గీ. ప్రాని కొన్నారు. కుక. 2. 547.

క. కలకాలము సాధించిన,యలఘుతపం బేమి యయ్యె నయ్యో న్యూరొ్ౣ.ములు నేమిటనో పోవుట,దలపోయఁగ నేఁడు నాకుఁ దథ్యంబయ్యెన్. పరమ. 1. 117. (ఇట 'అంకు' అమటకుమాఱుగా నుపయుక్తము)

శా. ... ప కాంతనిద్రాంతిక, మోదింపం గలలోఁ గుమారుఁడొకఁడు దేమో చేసినం దాల్మి పెం, పేదన్ దిగ్గన మేలు కాంచి... ఉ. హరి. 5. 84

3. ఎట్టిది, ఎంతటిది.

క. ఏమితపం బొనరించితి,భూమీశ్వర.... భార. ఆది. 8. 208. (ఏమితపంబు—ఎట్టియుత్కృష్టమగుతపము.)

క. పదివేవురురాజులు దన,కెదిరి పొలిసి రా శిఖండి యేమిటివాఁడై ,తుదిఁ బోయి తన్ను నాజింగదియుచుఁ బొలియించె నియతిఁ గడవఁగ వశమే. భార. భీష్మ. 1. 48.

క. యదుఁ డగ్రగతమూఁడు నా,హ్వాదయనము ద్రుపుఁడు వాఁ డయిన మద్వచనం, బిది యేటిది యని కడుదు,ర్మదుఁడై చేయక కృతావమానుం డయ్యెన్. భార. ఆది. 8. 198.

మ. కలకాలంబును నన్నదాన మొసఁగం గాంక్షించి యామంబులో,పలనే సస్యము విత్తఁ బండనితపఃప్రాధాన్య మేధావ్య మి,ట్టల వోకం బదలేటినీరు మృతమాయాధేనుపైఁ దేని వా,రలదే జీవన మంచుఁ దమ్ము ఫణితి ప్రోధిం ప్రశంసింపఁగన్. వరాహ. 10. 64.

4. సందర్భానుసారముగా దీనితర్వాతనుండఁ ప్రశ్నాశేవ్యము అధ్యాహార్యమగును.

ఏమఱిక వి. (√ఏమఱు) గొలిచి యలపడఁ, దిరిగితి నా

సీ. ఏమఱి...యుచుఁ దేఁకువలేమిన్, మరియాద దప్ప మెలఁగినఁ, బురుషార్థంబునకు హాని పుట్టకయున్నె. భార. విరా. 1. 122. (ఏమి - ఏమిభయము.)

గీ. కలశవారాశిఁ బుట్టుట కప్పెనయుట, శైలచాపశిరోధివాసంబుఁ గనుట, యెన్వరికి నంటరాకుంట యెఱిఁగి కాల,కూట మన నేమి నినుఁ జంద్ర నేఁటనుండి. విజ. వి. 8. 52. (ఏమి - ఏమితప్పు.)

అవ్య. ప్రశ్నార్థకము.

(క) లేదు

వ. ...అంతవత్త్వంబునకుఁ దారతమ్యం బేమి ...ఆము. 6. 31.

(చ) కాదు.

శా. ఏలో యిందును నందుఁ గాకెదవు నీ కేప్రాఁతి యేవెన్నలుం,బాలుం బాలక... హరి. పూ. 5. 284. (ఏప్రాఁతి - ఏమి ప్రాఁతి.)

(ట) జుగుప్సను దెలుపును

క. ఏటికి నీరాచఱికం, బాఁటది మొబవెట్టఁ బిలువు లాతురపడనో,యాఁటదని లేచి దొంగల, గీఁటవు వెడలంగ శవము బ్రతియ నుండె

దిదే. భాగ. 6. 408. (ఇదే – ఇదేమి.)

(త) వ్యతిరేకార్థముతోఁగూడి అనిషేధమును నివర్తించును.

ఉ. ఔర యి దేటియోజన మృగాయతలో చవ నమ్మఁ గోరునో, కోండా కోఁ కేమి నలకూబరు ముఖ్యులు నాదుబంట్లు... దశా. 2. 318. (కోర కేమి – కోరును.)

(వ) క్రోధాద్భుతాదులను సూచించును.

సీ. ఏమేమి తాఁ గాక యుఁక నెవ్వరున్నారు యాగభాగంబుల కనెడువారు. దశా. 1. 240.

చేయుఁగా కేమి – చేయుఁగాక దానికేమి– అనాదరమును దెల్పును.

క. ఆమైశ్వర్యము గ్రమ్మఱ, మాయుటకుం గారణంబు మాన్యచరిత తే, దే యొక దుష్కృత మది యిటు, నేయుంగా కేమి యేల చింతిం పంగ. భార. శాం. 5. 404.

(ఇట్లే ఎఱుఁగుదుఁగా కేమి.)

ద్వి. పొలఁతుక నీతోడితోఁగేచ్చ నాకు, వల యుటఁదలపోసి వచ్చితి ననిన, నెఱిఁగి యహల్య నీ వింద్రుండ వగుట, యెఱుఁగు దుఁగా కేమి యిందురమ్మనుచు. రం. రా. బాల 50 పా. 14. పం.

ఏమగు – (క) ఎట్టిదుస్థితికివచ్చు.

మ. ఇలఁ బాదద్వయి రాయ నక్కొనఁగు నెం దేఁ బాఱుచో నంకెవ, న్నెలు రెండై లఘిమం దకీర్తియిడు మున్నె యెక్కుచో నిందు నెం, దుల కేమౌదు మటంచు సాదు లలయన్ రూపొచ్చము ల్వాజు లం, దలరుగ....ఆము. 2. 29.

(చ) ఎట్టిదుష్టుఁడగు.

గీ. ...పుడమిఁ గామాంధచిత్తుఁ. డెవ్వరి వధిం పఁ డెటు సేయఁ డేమిగాఁడు. మనుచ. 6. 50.

(ట) ఎట్టిబంధుత్వము కలిగియుండు.

ఉదా: నీ కతఁ డే మగును.

ఏమియున్, ఏమిన్ – ఎంత మాత్రమైనను, కొంచెమైనను.

శా. ... కీర్తనీయమనుగుణస్తోమంబులం దేమియున్, రామస్ఫూర్తి కిఁ బోచ్చగాక సరియై రాజిల్లె...హరి. పూ. 1. 80.

చ. ...సారమే, యకములఁ జెల్గి కొట్టి నుఱు మాడుచు నొక్క వరాహ మేఁగెఁ జే, వ కలిమి నప్పు డాయెఱుకువాండ్రదలి పుల కేమి సడ్డ సే, యక తనయిచ్చగా. సాంగ. 1. 94.

ఏమని, ఏమనుచున్ – ఏమికారణముచెప్పి, ఏకారణమున,

క. ఎవ్వరు నెఱుగక యుండఁగ, నివ్వనమునఁ దపము సేఁత యిది నిర్ణయ మే, నెవ్వారి కడకు నే మని, యెవ్విధిఁ బోనేర్తుదాన నేటికి బంధుల్, భాం. ఉద్యో. 4. 287. (ఇట లజ్జను సూచించును.)

ద్వి. నాపుత్రరత్నంబు నకట కానలకు, బాపాలుఁ డేమని పో మ్మన నేర్చె. రం. రా. అయో. 97. పా. (ఇట అధర్మమును సూచించును.)

సీ. అమ్మునీశ్వరుశాప మరయి సామాన్యమే యనుభవింపక పోదు హరునకైనఁ. గీ. గాన నమరావతికి నిట్టిమేనితోడ, నేమనుచుఁ బోదు... జాహ్నవి. 4. 96.

ఏమిగా – ఎట్లుగా, ఎట్లు.

సీ. ఎట్లుగా మురిసితి వేఁమిగాఁ బెద్దవైతో కాని...హరి. పూ. 870.

ఏమిర – ఓరి,

ఉ. ఏమిర కర్ణ భీము నటు లేటికిఁ దిట్టితి ... భాం. ద్రో. 4. 288.

జ: ఏమీ, ఏమొ, ఏమో, ఏర, ఏరా.

ఏమీ – ఏమి. స. (ఏమి + ఈ.) ఏది, కిమర్థకము. (ప్రశ్నమును దెలుపును.)

క. కాముస నేత్ర నీపే, రేమీ యెవ్వరితనూజ విశ్లేల మహో, వ్యామోహితవై తనవుడుఁ, గోమలి సురరాజపుత్రకున కిట్లనియెన్. భార. ఆది, 8. 129.

క. చెలిసఖములు కలికారా, వలిసఖములు గాకయున్న కానింబలెనే, యిలఁ బుష్కర పద సంగతి, కలనగ సకాంతి నొందఁ గారణమేమీ. ముకుంద. 2. 107.

క. తెలిసె నీకుఁ గొన్నినా ళ్లి,యిలఁ గల
చెలువములు చూడ నిచటనె నిలువం, దలఁ
చినకై వడి నున్నది, చెలువా యది లెస్స
యట్లు చేయుదమేమీ. కువల. 3. 105.
(చేయుదమేమీ – చేయుదమా.)
(కౌతుకమును సూచించును.)

శా. ఏమేమీ యని విన్నమాటయె వినున్ ...
నైష. 2. 102.
(క్రోధమును సూచించును.)

శా ఏమే జాహ్నవి యేమి రాఘవ యిదేమే
వైరి నెన్నేవు నీ, నేమీ వాసవతిం గడిం
చెద వనేమీ నీవు కాళిందివా, యేమే నేఁటి
కిఁ దెల్ల నాయె జలధీంద్రా తిమ్మమంత్రీశ్వర.
శ్రీమత్కీర్తులు గ్రమ్మఁగా ననిన నాళ్లే
మించు హర్షంబునన్. దశా. 1. 26.
(అనాదరమును సూచించును.)

శా. పోపొం డమ్మరో పోవుటెట్లు బెదరింపు
ల్మానుఁ డిచోట మీ,మీవల్పోక డమాట
నేరుపుల కేమీ చాలుఁ జాలింపుఁడీ. చంద్రా.
2. 148.
(ఆశ్చర్యమును సూచించును.)

క. ఏమీ యిది దేవరకనుఁ, దామరలకు నింత
వెలుఁగు దలకొలిపెడునే,యే మనఁగ
నహహ నాక,స్వామికి నల్ల మగుప్రోలు
వసుమతిఁగలిగెన్. ప్రభా. 1. 56.

ఏమె న. వి. (ఏ³ + అమ – త. ఎవ్వమ్మె.) ఎవతె,
ఏస్త్రీ.
అవ్య. స్త్రీ సంబోధనమం దువయుక్తము.
గీ. ఓమె యేమె యిదేమేమె లేమయేమె, మేఘ
పుష్పంబుఁ దే వంచు మేలమాడ, మేమె
మేమెలు దఱచయ్యె మేలుమేలు, మేఁక
మేఁకన నభవారు మిగుల నగిరి. నైష.
౯. 114.

ఏమే – ఏమె. అవ్య.
శా. ఏమే జాహ్నవి యేమి రాఘవ యి దేమే
వైరి నెన్నేవు నీ,నేమీ వాసవతిం గడించెద
వదేమీ నీవు కాళిందివా. దశా. 1. 26.
శా. ఏమే హేమలతా యటంచుఁ బని యేమే
మాధవీ యంచు. వసు. 4 76.

ఏమొ – ఏమో. అవ్య. (√ఏమి.) 1. ఊహను
దెలుపును.
ఉ. ...ఆటులార్తులఁ గాచుటకేమొ గాక యే,
కాంతముగాఁగ నేఁగుదురె ... విజ. వి.
1. 115.
2. ఎందుచేతనో, ఏకారణముననో.
చ. తడఁబడు మాట గద్గదిక దార్కొను
నిల్చిన చోట నిల్వరా, దడుగులఁ దొట్రుపాటు
గదియంబడుఁ గంపము చెందు
నిద్ర రా, దెడపని కోర్కి హెచ్చు మది
నేమొ వికావిత జాలి జాలి యా, నడిగినఁ
జెప్పఁ గూడఁ దకటా మరు లెత్తిన
యాఁటదానికిన్. కువల. 3. 100.

ఏమో – ఏమొ.
(ఊహను దెలుపును)
క. ఏలికయై తను రా జొక్కఁ, దేలఁగ మని
యునికి మెచ్చ కేమో యల కా,రాశి
యుగ మఖలరాజశి,ఖాలంకృతియయ్యె
మదధిపాంఘ్రినఖములై. కళా. 7. 111.
(ఎందుచేతనో)
శా. ఏమో నాహృదయంబు నిమ్నఁగని యుల్లే
చావమం దాసమై,కామాసన్నిధి నుబ్బు
చున్న యది నీకాహాప్రతాపంబు ని,స్సీమం
బెనోక కొంతనే పిచట నుజ్జృంభింప రాఁ
జేయుమా. హం. 7. 63.

ఏయది – ఏది (ఏ³ + అది)

ఏయు స. క్రి. (క. ఏయ్, ఏసు. త. ఏయ్.)
1. (బాణాదులను) ప్రయోగించు.
క. ...దేవ,ప్రతుమీఁదను పాల్పుఁ దేనె వాఁడి
శరంబుల్ భార. ఆది. 4. 208.
సీ. ఏనును గులిశాస్త్ర మేసి పాషాణముల్
మఱుముగావించితి...భార. అర. 4. 68.
మ. తతిరుంగై దువుజోదు నానతి వధూదైర్ఘ్యం
పుఁ బెన్గోట గం,దశికాహార్ముఖయంత్ర
కాదుఁ దలుక ప్రానాఁటికిం ద్రెల్లఁ గో,
మల మార్తాండ మరీచిదీపకశికోష్మం జూఁడి
యేయుందశ,ద్దళపాథోరుహాలోహవాళభుహా
రోదశ్చంచరీకాశ్మముల్. ఆము. ౬. 85.
2. (బాణముతో) కొట్టు; కొట్టు.

తరువో॥జ. ఈవిల్లు మోపెట్టి యేనుబాణముల నీయంత్రమత్స్యంబు నేసినవాఁడ... భాగ. అది. 7. 169.

మ. ఘనరోషంబున మీనమూర్తి నిజశృంగం బెత్తి తీరస్థుఁడై, మనుజాళిప్రభు నేయఁగా ...దశా. 1. 301.

3. వేయు, వైచు, ఉంచు.

ఉ. ఏటికి వేఁటపోయితి మునీంద్రుఁడు గాఢ సమాధి నుండఁగా, నేటికిఁ దద్భుజాగ్రమున నేసితి సర్పశవంబుఁ దెచ్చి ... భాగ. 1. 489.

క. ....హనుమంతుని, యెదురు వెసన్ గుప్పి గంతు లేయుట సుమ్మీ. ద్వా. 2. 49.

జ: ఏటు, ఏటుకాఁడు, ఏటులాడు.

**ఏర** — ఏరా. శివధ. 1. 103.

**ఏరం(లం)గము** సం. వి. అ. పుం. ఒకజాతి చేఁప.

**ఏరండ** సం. వి అ స్త్రీ. పిప్పలి. (వ్య. వి.)

**ఏరండకము** సం. వి అ. పుం. - ఏరండము.

**ఏరండపత్త్రిక** సం. వి. అ. స్త్రీ. దంతీవృక్షము.

**ఏరండము** సం. వి. అ. పుం. ఆముదపుచెట్టు.

**ఏరక** సం. విశే. అ. స్త్రీ. కనుపులేని తృణభేదము.

**ఏరవకడ** వి. డావరడంగి, దేవతాళము (వ్య. వి.)

సీ. డావరడంగి నా దేవతా డన నేరవకడ యంచనఁగను వఱలు దేవ. గీ. తాళ నామంబు...ఆం. భా. 2. 51.

**ఏరా** - ఏర. అవ్య. (ఏమి+రా.) మైత్త్రికోపాదులతో చేయుసంబోధనమం దుపయుక్తము.

శా. ప్రారంభించిన వేదపాఠమునకున్ బ్రత్యూహమౌ నంచునో, యేరా తమ్ముఁడ నన్నుఁ జూడఁ జనుదే వెన్నాళ్లపోయుండి ... పాండు. 3. 83.

**ఏరాది** వి. గుఱ్ఱపుపిల్ల.

గీ. ...అచట నున్న యుత్తమాశ్వములకు నేరాది శేఖర్షభనితురంగ, మనఁగ ... చంద్రా. 1. 43.

(ఇట 'నేరాది' యనియు హాలాదిగా పదచ్ఛేదము చేయవచ్చును. రూపమును అర్థమును గూడ చింత్యము విచార్యము.)

**ఏరాలు** వి. దే. 1. యాత, తోడికోడలు.

సీ. ఏరాలిపట్టి వి క్రైత్తి చెక్కిలి నొవ్వఁగఁఅచి వాఁ దేడ్వఁ గౌఁగిలించు. పాండు. 3. 62.

సీ. ఈఁగవై మేన మీఱక సపత్నులఁగూడి చెలువుని కన్నుసన్నల మెలంగి, మన్నించి యత్తమామల భావముఁదుల నేరాండ్ర కనుకూలవృత్తిఁ దిరిగి, పె శకుం. 3. 190.

ద్వి. మగువ యేరాలికి మసలె గర్భంబు. పండితా. మహి. 287. పొ. 9. పం. ఆం. భా. 2. 113.

2. సవతి. (వ్యవ)

**ఏరాళము** — హేరాళము. విశే. (త. ఏరాళ.) అధికము, పెద్దది.

మత్త. ...ఏరాళమైనపిఱుందుఁ బల్లవరాగ పాదకరంబులుం, జాలదొడ్డగు కొప్పు నొప్పఁగ సర్వ మోహనమూర్తితోన్. భాగ. 10. పూ. 213.

క్రి. విశే. అధికముగా, అసంఖ్యాకముగా.

గీ. ఇరులు గవియుచు నేరాళ మెట్టయెదుర, నల్లనల్లన నేతెంచె నల్లమంద. నైష. 7. 39.

సీ. అంతరాయము లసంఖ్యములు గన్పట్టెడు సందేహములు పెక్కు దాయవాటె, నంకురితములయ్యె శంక లేరాళంబు వికృతు లెన్నేని యావిష్కరించె. శివరా. 3. 71.

**ఏరి** - ఏరి, (ఏరు+ఇ.)

గీ ...అఱఁడు గూఁతుఁ, గలయఁ దేశి గురు కాంతఁ గలసికొనఁడె, యింక శుద్ధాత్ము లని వేల్పులేరి వ్రేలు మడఁచి యెఱిఁగింపుఁ దెఱిఁగిన మౌనివర్య. దశా. 1. 258.

**ఏరీ** — ఏరి. ప. (ఏరు+ఈ) ఎక్కడనున్నారు.

శా. కారే రాజులు...వారేరీ సిరిమూటగట్టుకొని పోవంజాలిరే... భాగ. 8. 590.

**ఏరు¹** వి. దే. (క. ఏరు. త. ఏర్.) ఎద్దులను గట్టి దున్నుటకు సిద్ధపఱచిన నాఁగలి.

క. ఏరికి పెద్దులు లే కూ, రూరికి మోముకొని తిరుగు పొక మునలియుఁ దా, నేరు గలిగి

యొక యెద్దువ, బోరుదిగంబరుఁడునరియె పురికాఁపులకున్. రా. వి 1. 56.

మత్త. ఓరి యెవ్వరిచేను దున్నెదవు... నేఁ, డేరు మోపిన నీకుఁ జోళనరేంద్రుఁ డాన సుమీ యిఁకన్. పం మ. 5. 30. ఆం. భా. 2. 232.

ఎద్దులనుకట్టి దున్నుటకు సిద్ధపఱచిన నాఁగలి

సీ వృషమహిషంబుల నేరుగా నవరించి కృషి యాచరింప లోనిచ్చుఁజేసి సిద్ధశేషధర్మము 4. (చి. వి.)

జ: ఏరునేల, ఏరువాక, ఏరుసాగు.

**ఏరు²** వి. (స. ఏర్.) నొప్పి

గీ. .. తలయేరు మొదలుగాఁగఁ, గలుగు తెవులులవేదన సడలుకొలుపు. మార్క. 3. 87

ఈ: ఏర్చు¹, ఏర్పు.

**ఏరుకలప** వి. (√ఏరు¹.) బరగట్టు, హాలోపకరణము.

సీ. కలప యనఁగను హాల మొప్పు నైరగట్టేరు కలప నాఁగ మీఱుఁ దదువ,కరణము ... ఆం. భా. 2. 221.

**ఏరుగు** అ. క్రి. విష్ఠించు, మలమువిడుచు.

వి. మలము.

సీ. ...ఏరుగనఁగ విష్ఠ యొసఁగుచుండు. ఆం. భా. 2. 184.

**ఏరునేల** వి. (√ఏరు¹) ఒకనాఁగటితో దున్నఁదగిన నేల

ఆ. ఏరు నేలకొలఁది నెడనెడ విడియుచుఁ, బోవవలనియుండె భూరిభార, వహులడప్పి యెఱుఁగువాఁ డగు సాధర్మ్య,నందనునకు ధరణినాథవర్గ. భార. అశ్వ. 3. 158.

శ్లో. గోరుతే గోరుతేచై వవ్యవసత్పురుషర్ష భః, సాపురాభిముఖారాజన్నువాహా మహతీచ మూః, కద్రాద్ధ్రివిణభారాశ్తాహర్షయంతీ కురూద్వహాన్. నం భార. అశ్వ. 65. 21, 22.

(మూలమునుబట్టి తెండుకోసుల దూరమని అర్థమగుచున్నది.)

**ఏరుప(ర్ప)డు** అ. క్రి. 1. వేఱుపడు, వేఱుగాఁ గనఁబడు.

గీ. ఏరుపడి నాల్గు పొఁజులై యెప్పు దెప్పు, దుర దురం బనుచున్న వావరులఁ జూచి. రామా. 8. 90.

చ. నడుములు జంఘ లంఘ్రులు లలాటము లంసము లాననంబులే,రపడక పడం బ్లవంగ భటపంక్తులఁగూల్చి తెరల్పఁ జొచ్చినన్. భా. రా. యు. 645.

2. తేటపడు, స్పష్టపడు,

క. జననుత కృష్ణద్వైపా,యనమునివృషభాభిహిత మహాభారతబం,ధనిరూపితార్థ మేర్పడఁ, దెనుఁగున రచియింపు మధిక ధీయుక్తి మెయిన్. భార. ఆది. 1. 16.

3. గోచరమగు.

(క) నేత్రగోచరమగు, కనఁబడు.

గీ. ఊరుమూల మేర్పడఁగ నయ్యువిదవలువ, దొలఁగె ననిలంబుచేత విధూత మగుచు. భార. ఆది. 4 122.

(చ) బుద్ధిగోచరమగు. తెలియు.

సీ. అవలిత పైన్ని కన్న విదేశ్యుఁ జెఱచుట ప్రతి ప్రవర్తకుఁ కేర్పడఁగఁ జేత గీ. ... వలదు పలికె. ఆము. 4. 252.

(ట) ఘ్రాణగోచరమగు.

వ. ...దానిశరీరసౌగంధ్యంబు యోజనంబునం గోలె జనులకు నేర్పడునట్లుగాఁ బ్రసాదించిన నది గంధవతి యనియు యోజనగంధి యనియుఁ బరఁగి ... భార. ఆది. 3. 41.

(త) బయల్పడు.

వ. ...తనవంచన యేర్పడకుండఁ గృతప్రణాముండై తదాగమన ప్రయోజనం బడిగిన.... భార. అర. 2. 848

4. స్థిరపడు

వ. దినంబేసి యోకొమ్మ యిమ్మహాత్ముని వాక్యపద్ధతి యంతయు సత్యంబయగుట యేర్పడియె....కళా. 2. 176,

5. వర్తిల్లు, ఉండు.

శా. ఏపై చీఁకటి మూది మోవ నెడయా

కేర్పడ్డ వేళన్ ధ్వనుల్, చూపట్టఁ జిటి పొట్టిచిన్కులఘనాళుల్ మింట వర్తిల్ల... మల్ల. శృం. 94.

(వ్యవ) దానికి అవయవము లేర్పడ్డవి. వాఁడు రాజుగా ఏర్పడెను. వాని కిల్లును వాకిలియును ఏర్పడినవి.

జ: ఏరుపఱుపు, ఏరుపాటు, ఏర్పడు దెంచు, ఏర్పరిఁచు, ఏఁప్రఱుచు.

**ఏరుపఱుపు** వి. (√ఏరుపడు) కడుగుడు, వడియఁ గట్టుట, శోధనము. ఆం. భా. 2. 252.

**ఏరుపా(ర్పా)టు** వి. (√ఏరుపడు) ఏర్పడుట.
(విభాగము; భేదము.)

సీ. ఉనికి నిచ్చుచెకాని వనజాత బాంధవుం డేరుపా టొనరింప నేఁడయ్యె... వేదములకు... చంద్రా. 1. 19.

వ. ...కాలు చేయి తల దొక్క యని యేరుపాటు లేక వండం దఱిగినయ ట్లున్న యొడలును... భార. భీష్మ 3. 249.
(నియమము, కట్టుపాటు.)

శా. ...ఆ,హా వేదంబులు యాగభాగముల మర్త్యశ్రేణికే కాని మా, కేవంకం బనిలేక యుండునటుగా నేర్పాటు గావించెఁ గా, నీ వేగంబ హరించి తచ్ఛ్రుతులు భగ్నీభూతము లేసెదన్. దశా. 1. 248.

విశ. 1. నిర్ణీతము.

క. ఈనీతి సమాకర్ష స్థానము లేర్పాటు గాఁగ దైవాసురసం, తానంబు లైకమత్యము, గా నమృతాబ్ధి మ్మథింపఁ గడఁగిరి కడిమిన్. దశా. 2. 198.

2. స్పష్టము; ప్రకటితము.

గీ. నీవు చదివినచదువులో నికరం మైన, పద్య మొక్కటి చదివి యేర్పాటుగాఁగ, వర్థ మెఱిఁగింపు మనినఁ బ్రహ్లాదుఁ డనియెఁ, దండ్రి వినిపింతు వినుము చిత్తంబు నిలిపి. దశా. 4. 154.

శా. ఎట్టెట్టూ వినమైతి మింక నొకమా టేర్పాటుగాఁ జెప్పుమా, భట్టారా.. కాశీ. 7. 107.
(గట్టిగా అని భావము.)

మ. నిలువం జాలుదురే రణాంగణములో... దర్పమేర్పాటుగా, బలభద్రుం డతి రౌద్రుఁ డై కదిసినం బ్రత్యర్థిభూపాలకుల్. ఉ. హరి. 4. 125.

**ఏరువాక** వి. (√ఏరు¹) ఏఁకేఁటను చేయు దుక్కి యొక్క ప్రారంభము.
ఉదా: ఏరువాక సాగించుట, ఏరువాక ముహూర్తము. మొ.

**ఏరుసాగు** అ. క్రి. (√ఏరు¹) దుక్కిదున్ను, ఏరువాకచేయు (ఏరువాక సాగు అని వాడుక.)

ఉ. హాలికు లెన్నఁడుం దెగనియారులచేలును జౌకుమళ్లును, గా లలి నేరుసాగిరి... ఆము. 4. 124.

**ఏర్చు**¹ అ. క్రి. (√ఏరు²) నొచ్చు, బాధనొందు.

గీ. ....తపము గావించువారిఁ, గనివఁ దల యేర్చుగాదె యాఖండలునకు. పాండు. 5. 231.

సీ. కస్తూరితిలకంబు గాలి వాటిన నేర్చునొసలెట్లు వనిచెనో భసితమునకు. పాండు. 4. 8.

స. క్రి. 1. మండఁజేయు; బాధించు.

మ. ...ముకుమం దై యేర్చునావ ల్గిఁగుఁరొక్కను వచ్చుళ్లను... ఆము. 1. 92. 4. 218.

ఆ. అయసాగ్ని కంటె వనిధారకంటెను, పిడుగు కంటెఁ జాల జెడిద మగుచుఁ, దృష్ణ పేర్చి మిగులఁ దీవ్రమై సతతంబు, హృదయముల వసించి యేర్చు ననఘ. వాసిష్ఠ. 1. 106.

2. దహించు, కాల్చు.

క. రయమున మ్రింగుడు గాలము, క్రియ నెవ్వఁడు కంఠబిలము క్రిందికిఁ జనక, గ్నియ పోలె నేర్చుచుండును, భయరహితా వాని నెఱుఁగు బ్రాహ్మణుకులుఁగాఁ. భార. ఆది. 2. 60.

క. కార్చిచ్చే గవిసి మృగతతి, నేర్చుకరణి... భార. భీష్మ. 3. 278.

చ. ...దశాస్య మ, ద్విపులఖిలీముఖజ్వాలనదీర్ఘ శరార్చుల నేర్చు నిన్ను ... భా. రా. యు. 502.

3. ధ్వంసము చేయు, పాడుచేయు.

మహాస్ర. ... జిఱజిఱఁ ద్రిప్పివై చెఁ గదన్

వై . చిన( దేజిన్ రాజు గెంటించె( దొలంగ వద యచ్చెంతకాంతార మేర్చెన్. మనుచ. 4. 99.

**ఏర్చు²** స. క్రి. (√ఏఱు¹.) 1. (కావలసినదానిని) ఏఱు, ఎన్ను.

సీ. గోడిగజాతిలోఁ గొదమ పెంటుల నేర్చి మావుల హత్తించుమార్గవంబు. భార. విరా. 1. 95.

ఉ. సౌవరమాధురీస్పృహాపసం బికమో శుకమో తదీయజిహ్వావిలసత్స్వరస్వతి నుపాసన చేయుచు నగ్రభూమి నింపావహిలంగ నేర్చ యుపహారముగా నిడినట్టిపల్లవంబో విమలంపు బింబ ఫలమో యన వాతెఱ యొప్పు నింతికిన్. ప్రభా. 2. 74. అచ్చ. రా. సుం. 132. మనుచ. 4. 88.

2. విభజించు, కలిసిపోకుండఁజేయు.

మ వికసిల్లం బ్రజ చక్రపాలనము గావించెఁగఁ వ్యాపృతిన్, గకుబంతంబుల నాక్రమించెఁ బొసఁగంగా నేర్చు వర్ణాళి.... మనుచ 5. 82.

3. సంధించు, కూర్చు.

గీ. అచమూరువు యూథంబుఁ ద్రోచి పఱచె, వింట నమ్మేర్చి బోయ వెన్వెంటఁ దఱుమ. పాండు. 5. 15.

4. నిర్మించు; ఏర్పఱుచు.

గీ. మంటినైనను లింగంబు మలిచి కొలుఁడు, ఇసుకనైనను లింగంబు నేర్చికొలుఁడు భీమ. 3. 102.

సీ గహనాకారనక్షత్రగతు లెఱుపఱిచిత నరణు లేర్చితి వత్సరాంతమునకు శివరా. 1. 75.

5. (వ్యూహముగా) పన్ను.

ఉ అందఱు నింతకుఁ వెనుకయై మొనలేర్చి చనంగ... భార. విరా. 4 184.

చ. ....భూవర భవదీయ సైన్యబలవర్గము నొద్దవమేర్చ వీఁకమైఁ, బిరికొలుపంగ నిర్భయతఁ బోరెడునట్లుగఁ దాను ముందరై, తిరముగఁ జేయఁజాలు నొక ధీరు నొవర్పుము సైన్యనాథుఁగఁ. భార. శల్య. 1, 76. భీష్మ. 3 11.

6. శోధించు.

సీ. శ్రుతిపురాణోపసంహిత లేర్చి కూర్చితి సకల కథాసారసంగ్రహంబు. ఆము. 1. 13.

7. ఏఱిపాఱవేయు, తొలఁగించు.

సీ. చందురునుఁ గాంతికం దేర్చి కూర్చి బాగు నకుఁ దెచ్చినయట్లు కొమరుమిగిలి. భారం. విరా. 2. 52.

**ఏర్పడుదెంచు** – ఏరుపడు. అ. క్రి. (ఏర్పడు + తెంచు స్వార్థమున 'తెంచు')

(కలుగు)

వ. ....వసంతసమయంబు సకలజీవలోకానంద జననంబై యేర్పడుదెంచిన.... భార. ఆది. 5. 187,

(స్పష్టపడు)

సీ వెడవెడ మాఁ గారి వింతయై యేర్పడు దేరనివకులలో నారు నిగుడ భార. విరా. 1. 245, భాం. 1. 243.

**ఏర్పరించు** – ఏర్పఱుచు. స. క్రి. (√ఏర్పడు.) ఏర్పడఁజేయు.

(నిరూపించు, నిర్ణయించు.)

క. మనలోన నెవ్వఁ డెమ్మెయి, పనివెంటను విరటుమనము వడయుద మది యెల్లను నేర్పరించి యందఱుఁ, దనతనమది నున్న తెఱఁగు తథ్యము చెపుఁడా. భార. విరా. 1. 65.

(విభజించు.)

శా నీళ్లున్ బాలును నేర్పరింపఁగలపాండిత్యంబు మాన్పంగలేఁ, డబ్లోకేశ్వరుఁ డేమెయిఁ సుకవిమల్లా...మల్ల. నీతి. 14.

ద్వి. .... ఇరువురయందు, నితఁడు సుగ్రీవుఁ డితఁడు వాలి యని యేర్పరింపంగ వలవి గాకున్న. రం. రా. కిష్కిం. 208. పా. 25. పం.

(వివరించి చెప్పు.)

క. అవరపతిచరితం బెంతైనఁ గలదు దానిఁ బిదప వంతయుఁ దెలియంగా నీకు నేర్పరించెదఁ, గాని యిపుడు చెప్పుచున్న కథ వినుతెలియఁగా. వి. పు. 3. 16.

**ఏఱువాఁవిలి** వి. (√ఏఱు²) సప్త(వ్యు. వి.) (శ. ర.)

**ఏల¹(లా)** అవ్య. ఎందులకు,

1. ఏ కారణముచేత.

సీ. ...నేఁడు మొదలుగా నేఁడుదినంబుల కివ్వ యోధి,భువనము త్రిభువనంబులను లోఁ గొను నేల యన్న నానాఁటికి నబ్జభవుని,కే ళ్తెన నతఁడు నిద్రించు...దశా. 1. 168.

క. బాలున్ హరిపదచింతా.శీలున్ సుగుణాల వాలు శ్రీమన్మేధా,జాలున్ సంతోషింపక, యేలా శిక్షించె రాక్షసేంద్రుం డనఘా. భాగ. 7. 27.

2. వలదు, కూడదు, అనావశ్యకము, మున్నగు తాత్పర్యములు తెలుపును.

క. నాకంటె నధికుఁ డెవ్వఁడు,లోకత్రయమున మనంబులో విశ్వాస,స్వీకార మేల వదలెద, నాకాంక్షింపంగరాదె యభిమతవరముల్. కాశీ. 4. 47.

సా: అడుసు త్రొక్కనేల ? కాలు కడుగనేల ?

క. ఏలా చాఁచెద రర్థము.లు...నిలువదు సిరి పెను,గాలికిఁ గంపించు దీపకళికయుఁ బోలెన్. విక్ర. 2. 184.

ఉ. వాఁరణసీపురంబున నవారణ మేను దొఱంగ నేల కే,దారజలంబు లర్థి మెయిఁ ద్రావి శరీరము కోరవోవఁగా, నాఱడి వోంద నేల యొకయప్పుడు జన్మము లేక యుంటకై, యారయ శ్రీనగంబుశిఖరాగ్రము చూచినఁ జాలు నెమ్మదిన్. విక్ర. 1. 200.

క. జపము లమ స్మృతిఁ జదువఁగ, విని మ్రొక్కిన యంత్యజునకు విశ్రుతగతి గల్గు వనివ సద్భక్తి జపించిన యుత్తమజాతిజునకుఁ జెప్పఁగ నేలా. భార. శాం. 4. 258.

3. ఏమి ప్రయోజనము; ఏమి.

గీ. అన్న నీయట్టియన్న న న్నునుదినంబు, గార వింపఁగ నుండ నేఁకరుదు నన్ను,నింకఁ జాల నెవ్వగలచే నిచట నిలువ,నాకు నేల నీ తోడిదే లోక మన్న. ఉ. హరి. 4. 300.

క. ఏలా యీమాటలఁ బని, పౌలోమీవరుఁడ నీ ప్రభావము కంటే,కాలుని ప్రభావమును నీ, త్రైలోక్యం బెఱుఁగు వలదు తగవరి పలుకుల్. కాశీ. 4. 49.

4. ఎట్లు; ఎట్లుకలుగును.

క. బాలుఁడు సుకుమారుఁడు పెక్కాలము లం జొచ్చి యెఱుఁగఁ డనక మొన సొరం. జాలుడు చొరు మని పనిచితి, నేలా వన్నా న దోసమెఱుఁగఁగ నిచ్చున్. భార ద్రో. 2. 141.

వ. ...హింస పరలోకంబునం గదా బాధకంబు. పరలోకంబు ప్రాణాంతంబున గదా, చిర స్థిరప్రాణుల మగు మా కేల హింసాభయం బన వలదు... ఆము. 6. 81.

జ: ఏలకో.

**ఏల²** వి. (సం. హేలా;) ఒక విధమైన పాట.

గీ. పాట యనఁగను గానాఖ్య పరఁగుచుండు, నాలతి యనంగ నాలప్తి యలరుచుండు, దద్విశేషాభిధానముల్ దవరు నేల, జోల సువ్వాల యనఁగను....ఆం. భా. 1. 128.

సీ. కో యని యార్చుచుఁ గుప్పించి దాఁటుచు నేలలు పాడుచు నీల లిడుచు. అచ్చ రా. యు. 90.

సీ. వీథి నేఁగెడు ప్రౌఢవిటుఁడు పాడెడు వి త యేల పదా లట్టె యాలించు. శుక. 2. 182.

జ: ఏలపాట.

**ఏల** నం. వి. అ. స్త్రీ. 1. పెద్దయేలకి (వ్యు. వి.) 2. విలాసము. 3. పంచదశాక్షరపాదక మగునొకా నొక వృత్తము. 4. పితికాపురప్రాంతము నం దలి ఒకనది.

శ్లో: ఏలాయాహారిపూరేణ ... సం. భీమ. 3. 21.

శ్లో. ఏలానదీతటగ్రామాః....సం. భీమ. 3. 28.

(వై. వి. సం. "హేలా" అని. శ. ర.)

సీ. ఏ పట్టనముత్రోల నేలేఱు ప్రవహించు ...భీమ. 2. 52. (ఏలేఱు-ఏలానది.)

**ఏలకి** వి. (సం. ఏలా.) 1. ఒకానొకలత.

సీ. ...ఏలకితీవపొదల, పె. శకుం. 2. 23.

2. (జ.) ఏలకిగింజలు.

సీ. ...ఏలకులు పొంటియును. ప్రబంధ. 67.

జ: ఏలకికాయ, ఏలకిరాజనములు.

**ఏలకికాయ** వి. (√ఏలకి) ఏలాఫలము.
(వి.)–ఏలకికాయవలె నుండునది – భక్ష్యవిశేషము.
వ. ...ఇడ్డెనలుఁ దేనెతొలలు బొరుగులు నేల కికాయలు... ఆదిగాఁగలభక్ష్యంబులు ... హంస. 1. 105. ప్రబంధ. 112.

**ఏలకిరాజనములు** వి. బ. (√ఏలకి) ఒకవిధమైన ధాన్యము.
వ. ... ఏలకిరాజనాలు.. అను నూటనాలుగు వగల పైరులు...ప్రబంధ. 112.

**ఏలకొ(కో)** అవ్య. (√ఏల¹.)ఎందులకో.
ఉ. ఒకనాఁడొంటిగఁ గేళికాగృహములో నుండంగ శ్రీకృష్ణుఁ డేటికొ నేఁ బోయితిఁ బోయినం దెఱఁగు బట్టం బట్టినం గొంగు దీయకురా వచ్చెద రెవ్వరైన నని మల్లాడంగ నా వేళ నేలకొ యేతెంచి యశోద చూచి చనె నుల్లాసంబు సంధిల్లఁగఁ. దశా. 8. 266. ద్వి. పంమ. 4. 289. పా.

**ఏలపాట** వి. (√ఏల².) ఒకవిధమైనపాట, ఏల.
(బ.) బాలక్రీడావిశేషము.
గీ. గుజ్జు దాఁగిలిమ్రుచ్చులు గోడివట్టె, లేల పాటలు సరిబేసు లేకకూఁత,లాదిగా శైశవ క్రీడ లాడి రచట, రామకృష్ణులు గోపదారకులఁగూడి. వి. పు. 7. 202.

**ఏలము¹** – వేలము². వి. (హిం. ఏలామ్.) అమ్ముటలో నొకవిధము, వేలము. (శ. ర. వా.)

**ఏల(లా)ము²** వి. కల్లుగీచువాఁడు తోఁటలో వేసి కొనెడు గుడిసె. (శ. ర.)

**ఏలవాలుకము** నం. వి. అ. న. – ఏలవాలువు.

**ఏలవాలువు** నం. వి. ఉ. న. 1, నూఁగుదోస, కూఁతురుబుడమ. (వ్య. వి.) 2. వెలఁగపట్ట, వెలఁగచెట్టు యొక్కబెరడు.

**ఏలాటము** వి. పరిహాసము.
సీ. ఏమఁగుతో వల దేలాట మాడంగ వెవయని బాంధవం బెపుడు వలదు. నీతి. 85. (ప్రయోగాంతరము లేదు ఇంకను విచార్యము.)

**ఏలాపర్ణి** నం. వి. ఈ. స్త్రీ. కారేలకి, రాస్న. (వ్య. వి.)

**ఏలావాలుకము** నం. వి. అ. న. – ఏలవాలువు.

**ఏలావాలువు** నం. – ఏలవాలువు.

**ఏలి** విశే. 1. కృత్రిమము, చేఁతది.
(రాజాలంకారవర్ణనము.) సీ. మూలజా చొక్కపు కేలిసింగపుటాకుపని మేలికడియముల్ గొనబుమీఱ. చంద్రా. 2. 36. (శ. ర. పా. 'మేలిసింగపుటాకు' అనిముద్రితము.)
2. కపటయుక్తము, మోసముతోఁగూడినది.
సీ. పాలు పంపని యాక యేలిమాటలన మ్మ్మలుక దీర్చెదరు కారు... భార. ఉద్యో. 3. 9.

**ఏలిక** వి. (√ఏలు) 1. ప్రభువు, రాజు; యజమానుఁడు. ఆం. భా. 2. 182.
గీ. ... గవనికావరులచేత, నేలికకుఁ దమరాకడ యెఱుఁగఁ జెప్పి. నీలా. 2. 47.
2. భర్త.
క. సిరి యేలిక యగునంకే,సరి ...భీమ. 1. 76.

**ఏలికరాజనాలు** వి. బ. (√ఏలిక) ధాన్యవిశేషము, ఒకజాతి వడ్లు.
సీ. ఏలికరాజనా లీశ్వర ప్రియములు రావిపూ రాజనాల్ రత్నసరులు. హంస. 4. 128.

**ఏలికసాని** వి. (ఏలిక + సాని) రాజ్ఞి, దొరసాని; యజమానురాలు.
సీ. ఏ మన్న ననియెఁగా కేమి మీ యేలికసాని వచ్చితి వీవ చాలు మాకు. కాశీ. 6. 221.
ద్వి. ఇనుఁ డుదయాద్రికి నేతేకమున్న, చన కున్న నేలికసానిచేఁజావు. ద్వి. పారిజా. ఉ. 2252.

**ఏలిదము** – ఎల్లిదము.
వి. లాఘవము, చులుకఁదనము; ఉపేక్ష.
క. కాలుఁడని నమ్మి రిపుతో, నేలిదమునఁ గలసి యునికి యిది కార్యమె...భార. ఆది. 6. 116.
శ్లో. ... బాలశ్శత్రురుపేక్షితః,గహనేగ్నిరివోత్సృష్టః క్షిప్రం సంజాయతే మహాన్. నం. భార. ఆది. 154. 108.
విశే. (లఘువు, చులుకన.)
ఉ. బాలకుఁబట్టియే మనలు బల్విడి నావయి

ఆ ఎమ్మెకాఁడ యగ్గియెలగాఁగఁ బెండిలి, యైన చెలిని డించి యకట యొంటి, నేఁగఁ దగునె మీర తెలుఁగని నడువడు, లింకఁ బడమిఁ గలవె యేర్పరింప. అచ్చ రా. అయో. 70.

(నిర్మించు.)

గీ. మిఱ్ఱుపల్లంబు లెల్లను మెలపుతోడ, సరసి నాలుగుమూలలఁ జదునుగాఁగ, నేర్పుతో నాలవాలంబు లేర్పరించి, తమిని నానాఁటికిని వానితతి యొసంగి. విప్ర. 2. 21.

(—వ్యూహము-పన్ను)

గీ. దైవసైన్యంబు లీరీతిఁ దరతరంబ, వెడలి మొన లేర్పరించి యుద్వేలవృత్తి. పారి. 5. 2.

ఏర్ప(రుప)ఱు(ఱ)చు — ఏర్పరించు. స. క్రి. విభజించు.

ద్వి. పాలును నీరు వేర్పఱుపంగ నేర్చు, పాలిన పక్షిరాజవు గావె నీవు. ద్వి. నల. 1. 411, 412. పం.

క. ...అజుఁడు నోపని, వేదము లేర్పఱిచె నంద్రు వేదవ్యాసున్. కు. సం. 1. 18.

గీ. అర్జునుం డను పర్జన్యశస్త్రవృష్టిఁ, బల్లమును మిఱ్ఱు నని యేరుపఱుపరాక, యుండ నెత్తురు వెల్లి లొండొండ పెరిఁగె. భార. ద్రో. 3. 103.

2. అమర్చు, కూర్చు.

గీ. వారి వేర్వేఱ బంతిగా నేరుపఱిచి. దశా. 2. 357.

3. స్థిరపఱుచు, నిర్ణయించు.

మ. ...మహేశ్వరుఁ డంచుం బరమాత్ముఁ డంచు శ్రుతిశాస్త్ర జ్ఞానపారీణు లేర్పఱుపన్ జాలక పెక్కు భేదముల నేకవ్యాత్ము నూహింతు రా, పరమేశున్ నిన్నుఁ గొల్తు మేము శుభముల్ ప్రాపింప నశ్రాంతమున్. ఉ. రా. 1. 280.

4. కనఁబఱుచు, చూపు; తెలియఁబఱుచు.

ఉ. ...అజ్ఞానవనఁ బట్టి తెచ్చి హృదయం బలరంగ వనంగతంత్ర విద్యానిపుణత్వ మేర్పఱిచెదం బ్రమదాంబుధి నోలలార్చెదన్.



భార. విరా 2. 208.

సీ. లలితంపురతికేళి వలరింపనేగాని బంధచాతుర్య మేర్పఱుపరాదు. దశా. 2. 311.

క. అంగన నిలిచిన బాహువు, లుం గౌనును నేరుపఱుచు లోకమునకు ర, త్నాంగదకాంచీభేదము, లుం గొకవుల నడిమియునుకులు న్నాఁగారున్. ఆము. 5. 26.

5. చక్కఁబఱుచు.

క. నడిపింపఁగఁ బోడిపింపఁగ, నెడమడువై కలఁగి నవ్వు దేర్పఱుపఁగ నేఁ, గడు నేర్తుఁ బేర్చు నాదగు, కడిమియ నీసైన్యమునకు గాసెనగాదే. భార. ఉద్యో. 4. 214.

ఏర్చు వి. (√ఏర్చు¹) 1. మంట (శ. ర.) (మండుట, పేఁడిమి. అని బ్రౌ.)

2. బాధ.

ద్వి. ...చేఁపి యేర్పులు దట్టు తనదు, చన్నుల పాలెల చవిగొన నిపుడు. ద్వి. పరమ. 3. 152. పా.

ఏర్వారుకము సం. వి. అ. పుం. — ఏర్వారువు

ఏర్వారువు సం. వి. ఉ. పుం. చిర్భటి, కర్కటీభేదము, నక్కదోస. (వృ. వి.)

ఏఱు¹ స. క్రి. 1. (క్రిందినుండి గింజలు మున్నగు చిన్న చిన్న వస్తువులను) ఒకటొకటిగా ఎత్తు.

గీ. వారు నలువురుఁ జని తృణధాన్యమల్ప, మేఱికొనివత్తు రాఁకలి డీలకుండు. భార. అశ్వ. 4. 220.

క. ఏనాటనుండి వచ్చియు, మానవు తేరొక్కం ద్రు దివుట మైత్రావరుణీ, యానందకానవంబున, నానాసైవల్యశోభనము లను ఫలముల్. కాశీ. 6, 51. మనుచ. 4. 87.

2. (కావలసినవానిని) ఎన్ను; ఎంచు; గణించు.

గీ. ఏఱికొను మీవు వోకని మాయెవ్వరందు, వాఁడు నీతోడఁ దగఁ బోరువాఁడు వానిఁ, బంపి మహియేలు...భార. శల్య. 2. 108.

వ. ...అ కొండవబ్రాహ్మణునిం బ్రార్థించిన నతండును జలంబు డింపక పదివే లేఱికోటిన పాఁడిమొదవుల నిచ్చిన నైవను దీనిన కాని యొల్లనని నిలువక చనియె. భాగ. 10. ఉ. 474.

గీ. ...కుమ్మరావమున రాగిఁముంత లేఱంగఁ
గలదె ... ఉ. హరి. 3. 48.

సీ. అకార్తులము మాయహంకృతిస్ఫురణకు
నెరసు లేఱకుమయ్య వరుణదేవ. నైష.
7. 90.

3. ఎంచిఖండించు; ఖండించు, నఱకు.
(ఈయర్థమున 'తలలు' అను పదముతోఁ గల
సియే ప్రయోగములఁ గన్పట్టుచున్నది.)

సీ. ....మనమోపి సర్వపాండవులను జంపితి
మేనిఁ బ్రచండచక్రధారఁ గౌరవకోటితల
లేఱి రాజ్యంబు గోవిందుఁ డీకున్న గొంతి
కయిన. భార. ద్రో. 1. 111.

మ. హనుమంతుం డను నేటిమాట పతికార్యం
బట్లు పోకార్చి యీ,వని నెట్లుం డెడువార
మాదొంగకు దవ్వా యివ్వనం బెందుఁ దూ,
ఱినఁ బోనీయక వంపువెట్టి తల లేఱించుం
గపిస్వామి యొ,వ్వనియాలోచన మాని
మే వ్వడలుఁడీ ప్రాయోపవేశంబునన్.
చం. రా. 6. 80.

జ: ఏర్చు², ఏరుసుగ్గు, ఏఱుపిడుక.

ఏఱు² వి. దే. (త. మ. ఆఱు.) నది.

సీ. కూరుల జన్మంబు సురలజన్మంబును నేఱుల
జన్మంబు నెఱుఁగ వగునె. భార. ఆది.
6. 59.

సీ. ఏ మేటియడుగుఁ గెందామర బల్గాఁపురవు
ఛేర్లఱేని కబ్రంపుఁదెప్ప అచ్చ. రా. బాల.
11.

గీ. అరయ మవహారి వాటిల్లినట్టిచోట, వాజి
తైలాభ్యుపేత ఖాండావలులకు, నేళ్ళ
నీళుల నొండె వేనీళ్ళనొండెఁగడువఖాతఁ
దోమిన నొండెఁ గలుగుశుద్ధి. మార్క.
8. 154.

ఏటఁగలుపు — ధ్వంసము చేయు.

ఏటఁబఱవు—ధ్వంసముచేయు. చంద్ర. 1. 112.

ఏటావలిగిలిగింతలు— 1. దుర్లభములు. కవిరా.
3. 48.

2. దుష్కరములు, చేయ శక్యము గాని
పనులు.

క. కలువలు కిలకిల నవ్వెన్, తొలిమల నెల
యేటి యవలి తుహినాంశుకరం,బులు గని
యవు డేటావలి,గిలిగింత లటంట వానికిన్
నరిదాఁకెన్. సారంగ. 2. 182.

ఏటికెదురీఁదు :—

చ. ...మానసం, బెరియఁగఁజొచ్చె నేటి కెదు
రీఁదినచాడ్పున నేమి చెప్పుదున్. భార.
మౌ. 98.

ఏటిపాలగు — వ్యర్థమగు.

ఏర్ల ఱేఁడు — సముద్రుఁడు. అచ్చ. రా. బాల.
11.

ఏఱుదొర — సముద్రుఁడు. ముకుంద. 2. 25.

జ: ఏటిఱేఁడు, ఏఱుజాజి, ఏఱుపుచ్చ, ఏఱు
మద్ది, ఏఱుమల్లె, ఏఱువంగ, ఏఱువావిలి.

ఏఱుజాజి వి. (√ఏఱు²) ధాతకి. (వ్య. వి, శ. ర.)

ఏఱుసుగ్గు - ఏఱుపిడుక. (చూ. సుగ్గు.)

ఏఱుపి(ర్పి)డుక వి. (√ఏఱు¹) నేలఁబడియెండి
యేఱఁబడెడు పేఁడకడి, కరిషము.

వ. ఉపరిప్రదేశంబులఁ గారెనుపపెంటపట్ల నీ
రాఱు నేఱుపిడుకల దాల్లిడి... మనుచ.
4. 60. ఆం. భా. 2. 258.

ఏఱుపుచ్చ వి. (√ఱు²) కళింగపత్త్రము. (వ్య. వి.)
(శ. ర.)

ఏఱుమద్ది వి. (√ఏఱు²) నదీసర్జము, ఒకజాతిమద్ది.
(వ్య. వి.)

ద్వి. ఏనును జిరకాల మీయేఱుమద్ది,మ్రాని
పెందలనుండి ... నవనాథ. 4. 117. పా.
18. పం.

ఏఱుమల్లె(ల్లియ) వి.(√ఏఱు²)వాసంతిక.(వ్య. వి.)
(శ. ర.)

బి. ధాన్యవిశేషము.

వ. ...మధురములు చామరాలు పెందెముడు
వులు రాచవన్నెలు తులసీవనమాలికలు
సింధుకర్పూరాలు రాయమెచ్చు లేఱు
మల్లెలు ముని మనోహరాలు...అనుమాట
నాల్గువగల వైరులు...ప్రబంధ. 112.

ఏఱువ వి. విలాతి, దేశము. (శ. ర.)

ఏఱువంగ వి. (√ఏఱు² — త. ఏరువంగ.) ఒకజాతి
వంగ. (వ్య. వి.) (శ. ర.)

(ఇది సమాసపూర్వపదముగానే తెనుఁగున నుపయుక్తము)

క. ఏవంవిధగుణవంతునకు...మనుచ. 1. 48.

**ఏవల** – ఎవ్వల వి. వి. అవ్య. (ఏ³ + వలను-చూ. అవల) ఏప్రక్క, ఏవైపు.

క. ...మీఱ లందఱు, నేవలఁజూచిన శిఖండి కెదురుండెవ్వఁడున్. భార. భీష్మ. 1. 81.

గీ. భీతి యేవల నరిగె...దశకు. ౯. 7.

**ఏవాఁడు** – ఎవ్వఁడు. ఆము. 4. 67.

**ఏవురు** – ఏగురు. వ. అయిదుమంది.

క. పరమాన్న తైలభక్ష్యసూప పరిపూర్ణతరంబులైన పాత్రము లయ్యేవురు నిత్యంబు నివేదింతురు దల్లికి...భార. ఆది. 6. 287.

**ఏష** సం. వి. ఆ. స్త్రీ. 1. కోరిక. ఇచ్ఛ 2. గమనము.

**ఏషణ** సం. వి. అ. స్త్రీ. 1. (దారపుత్రధనములందలి) కోరిక. (దారైషణ, పుత్రైషణ, ధనైషణ.) 2. కొత్తిమిరి. (వ్య. వి.) 3. యాచన.

**ఏషణము** సం. వి. అ. పుం. ఇనుపయమ్ము, లోహబాణము. న. 1. – ఏషణ. 2. వ్రణవిదారణ వ్యాపార విశేషము.

**ఏషణి** సం. వి. ఈ. స్త్రీ. 1. నారాచి, త్రాసు. 2. వ్రణములోని చీము మొదలగువానిని వెలికి తీయుసాధనము, వ్రణరంధ్రమునఁ జొప్పించెడు శలాక.

**ఏషణిక** సం. వి. ఆ. స్త్రీ. – ఏషణి.

**ఏషణీయము** సం. విశే. (అ. ఆ. అ.) 1. అభిలషింపఁదగినది. 2. కోరఁదగినది. 3. శలాక చొప్పింపఁదగినది, ఏషణకర్మసాధ్యము. (వ్రణాది.) 4. రాఁదగినది.

**ఏషవ్యము** సం. విశే. (అ. ఆ. అ.) 1. పొందఁదగినది. 2. కోరఁదగినది. 3. శలాక చొప్పింపఁదగినది, ఏషణకర్మసాధ్యము. (వ్రణాది.) 4. రాఁదగినది.

**ఏస¹** – ఎస

(అత్యంతము.) చూ. ఏసరేఁగు.

ఉ: ఏసరేఁగు.

**ఏస²** విశే. – ఏచే.

(వికృతస్వరముగలది - మాట–)

గీ. ఒదుగుఁదండాలు నల్లెస కొదుఁగుచూపు. లేసమాటలు సందిట నిడిన కేలుఁ,గవయుఁ గల చెంచుచేరువకాఁ డొకండు,వచ్చి నృపతికిఁ గానుక లిచ్చి నిలిచి. చంద్రా. 3. 89.

(వ్యవ) తూర్పువారిమాటలు పడమటవారికి ఏసగా నుండును.

(వక్రము, వంపుగలది.)

వ. ... ఏసగాఁ దివిసి తడవిండ్ల నేసి కెవ్వునం గూసి డాసి...వసు. 2. 11.

(అల్పము)

ఉ. ఏసవిరి న్విరించి వాక యేటుగ్గఁ దామరపాన్పుపైఁ బడం,ద్రోసినజోదు మన్మథుఁడు దుర్వహ నూత్న వియోగవేదనా,యాసిత మైనరాజు హృదయాబ్జము గాఁడగ నేసె వింతయుం,గావిలి తేఁటి తెక్కగటిగట్టిన పుష్పశిలీముఖంబులన్. వైష. 1. 82.

**ఏసరించు** – ఏసరు.

ద్వి. చిట్టుదాఁటుచు జిగిబిగి నేసరించు. హరి.

గీ. ఇప్పు డమితాగ్రహంబున నేసరేఁగి, యిప్పు డమివేల్పుఁగొలమువా రిందిరేశ, వెలి గిలి యటంచు నున్నారు .... పరమ. 2. 186. ('వెలియు గిలియంచు' అని శ. ర. పా.)

సీ. ఆసక్తి నాలేమయావనవనములో నెన్నండు విహరింతు నేసరేఁగి. వరాహ. 11. 56.

క. దశయుగమున హంతంబులు,పొలుపొందఁ జిదంశ మగుచు భూరిమణివిభా,వలిఁ దగు నాజ్ఞా పురమునఁ, గలవాసన లేసరేఁగి కడలు కొనంగన్. పాండు. 4. 78.

ఏసి - చేసి. అవ్య. 1. వంతున.

ఆ. కృష్ణుఁ డిచ్చు నాలు గేసి చీరలు కూర్మి, నింతులకును నాలుగేసి మణులు, శివితోడ దోసెఁ జేసి మాడలు కడు,నింపెసఁగ గం పెఁడేసి సొమ్ము. కావ్యచింతామణి. అని అప్ప, 3. 220.

క. ఆసమయంబునను దివో,దాసుఁడుఁ గాశీశ్వ రుండుఁ దరుణికి నిమ్నా,తేసిహయంబుల నిచ్చి మ.హాసత్త్వుల సుతులఁ బడసి రధిక ప్రీతిన్. భార. ఉద్యో. 3. 317.

2. పరిమాణమును దెలుపును.

మ. తలఁపం గూడునె యింత లేసిదొర లీ దైన్యంబు చుట్టబులుం, జెలులుం దిట్టరె. భార. ఉద్యో. 3. 95.

ఏహ్యము విశే. (సం. హేయం.) పవము. రోఁత పుట్టించునది.

ద్వి. మును శుక్లశోణితంబులు ముద్దగట్టి. ఘన పాపరతలైన కాంతలయుదర,ములఁజాల మలమూత్రములను నుపొంగి. యిలపయి నేహ్యపు నెలవులఁబుట్టి. నవనాధ. 4. 137. పొ. 10. పం.



ఐ తెలి. ఒకానొక యక్షరము.
(పెక్కుపట్ల తత్సమేతరపదములలోని 'ఐ' కారమునకు 'అయి' యును 'అయి' కి 'ఐ' కారమును వికల్పముగా వచ్చును. చూ. అహో బలపండితీయము. 406. పొ. ఉదా: ఐదు, అయిదు - కైదువు, కయిదువు. మొ.)

ఐ - అయి. అవ్య. 1. అగుధాతువుయొక్క క్త్వార్థక రూపము.
ఉదా: ఆకాశము స్వచ్ఛమై యున్నది.
2. చతుర్థీవిభక్త్యర్థకము లగు 'కి, కు' లు చివరఁగల పదములకు అనుప్రయుక్తమగును.

గీ. ...నేను వార లందఱును మఱచు,నట్లు సేయుదు వరునకునై కుమార. భార. ద్రో. 5. 250. (వరునకునై -వరునినిమిత్తము,)

ఆ. ధాత నిమ్న నేమిధర్మంబు నడపుట,కై సృజించె దాని నాచరించి, యుండు ... భార. శాం. 1. 209.

క. వలువకుఁ గూటికి నై నీ,చుల వేఁడం బోఁడ ...పాండు. 3. 21.

3. స్వయముగా, తనంతట తాను, మొదలగు అర్థములను తెలుపును.

క. ప నై మేల్కానునంతకు, భూనాయక వరశ్య నన్ను బోధింపకుఁడీ. భార. అను. 2. 301.

జ: ఐపోవు, ఐమూల, ఐయు, ఐవచ్చు.

ఐ సం. వి. ఐ. పుం. శివుఁడు (దీనికి తెనుఁగున వ్యస్తప్రయోగము లేదు.)

ఐంగుదము సం. విశే. (అ. ఈ. అ.) ఇంగుదీవృక్ష సంబంధమైనది, గారచెట్టుది. వి. అ. న. 1. గారపండు. 2. గారపువ్వు.

ఐందవము సం. విశే. (అ. ఈ. అ.) 1. చంద్రునకు సంబంధించినది. 2. చంద్రదేవతాకమయినది. (హవిరాది.) వి. అ. పుం. చాంద్రమాసము. న. మృగశీర్షనక్షత్రము. 2. చాంద్రాయణ వ్రతము.

ఐందవి సం. వి. ఈ. స్త్రీ. సోమరాజీలత, కారుగచ్చ (వృ. వి.)

ఐంద్రజాలికుఁడు సం. విశే. (అ. ఈ. అ.) 1. ఇంద్రజాలము చేయువాఁడు. 2. మోసకాఁడు, మాయావి.

ఐంద్రము సం. విశే. (అ. ఈ. అ.) 1. ఇంద్రదేవతాకమయినది. (హవిరాది) 2. ఇంద్రునకు

నెత్తి రింతయే, నేలిదమైతినే తమకు... కు. సం. 10. 514.

**ఏలినవాఁడు** వి. (ఏలు) ఏలిక, ప్రభువు. రాజు; యజమానుఁడు.

క. తమతమ కనియెడుతఱి జీతము గానక నవయు భటులదౌర్గత్యవిషాదము తెలిప వాని కవశ్యము నెగ్గొనరించు నతఁడు శక్రుండైనన్. భార. సభా. 1. 87, ఉద్యో. 2. 38.

**ఏలినాతఁడు** (√ఏలు) – ఏలినవాఁడు.

గీ. ...ప్రజలకు నెల్ల యెడలఁ దల్లిదండ్రియు నేలినాతండు గాఁడె. విప్ర. 5. 40.

**ఏలిక** సం. వి. అ. స్త్రీ. చిట్టేలిక, చిన్నయేలిక. (వ్య వి.)

**ఏలు** స. క్రి. (క. త. ఆళ్.) 1. (రాజ్యాదికము) పాలించు; శాసించు.

గీ. ఏలుమీ లోక మెల్ల నీ కేల రాధ, కొడుకితండనుతక్కువ కొడుకుఁగుఱ్ఱ. భార. ఉద్యో. 4. 59.

ఆ. దీనిపాలు ద్రావి మానవుల్ పదియువే, లేండ్లు జరయు రుజయు నెఱుఁగ కమర, భావమున సుఖంబు జీవింతురిట్టి దీని, నేలఁ గనినవాఁడ యొందుఁ బెద్ద. భార. ఆది. 4. 158. (ఏలు – స్వామ్యమున నుంచుకొను.)

గీ. పాశుపతదివ్యదీక్షఁ జేపట్టె గౌరి, చంచరీకాంగనాగరుచ్ఛాయ నేలు, కుటిలకోమల తరదీర్ఘకుంతలములు, మడమ లంటంగ నిడుపాటి జడలు గట్టె. హర. 4. 10. (ఇట ఔపమ్యద్యోతకము.)

2. పరిగ్రహించు, చేకొను.

చ. ... చిత్రగృహంబునముండి పోవుచున్, సొలపున నీవు నన్మరలిచూడఁ ద్రికుద్ధిగ నేలితంచు నే,వలరితిఁ గాని భావజుని కగ్గము సేయు టెఱుంగఁ గోమలి. వసు. 4. 84. (ఏలు–భర్తగాఁ గైకొను.)

క. పద్మాధరంబుల నేలిన, పద్మాతునిలీల.... దశా. 1. 80. (ఏలు–భార్యగాఁ గైకొను.)

క. అవి హర్షోత్కర్షంబున, మన మలరఁగఁ బలికి మత్స్యమనుజాధిపుఁ డనిలసుతు నేలె నాతఁడు, తనమనమున నూఁబడిల్లెఁ దదవసరమునన్. భార. విరా. 1. 227. (ఏలు–భృత్యుఁడుగాఁ గైకొను.)

జ: ఏలిక, ఏలికరాజనాలు, ఏలికసాని, ఏలినవాఁడు, ఏలినాతఁడు, ఏలుకొను, ఏలుకోటి, ఏలుబడి.

**ఏలుకము** సం. వి. అ. న. – ఏలవాలువు

**ఏలుకొను** – ఏలు.

(పాలించుకొను)

సీ. ధరణి నేకాతపత్త్రముగ నేలుకొనంగ సతతంబు రాగమంజరి తలంచు. విక్ర. 1. 167.

(వశపఱుచుకొను)

గీ. ...అట్లు నీవొక్కతవె నన్ను నేలుకొంటి, గాక మాటలిం కేటికిఁ గమలవదన. భార. విరా. 2. 365.

(కైకొను)

ఉ. ... మహోత్క దశపురిధూర్జటి శంభుఁడు భీమనాథుఁ డా,ర్యావిభుఁ డాశ్రయార్థుఁ దగునా నను నేలికొనం దలంచునా. భీమ. 3. 5.

(కాపాడుకొను)

సీ. లలితంపురతికేళి నలరింపనే కాని బంధచాతుర్య మేర్పఱుపరాదు గీ. ఈఁగ వ్రాలినఁ గందు నీయిగురుఁబోణి. కమ్మనెమ్మేను గనఁగఁబోంకమ్ము దెలిపి, యేలికొనవలె మన్మథకేళియందు. దశా. 2. 31.

**ఏలుకోటి** వి. (√ఏలు) ఏలుబడికిలోఁబడినజనము, ప్రజావర్గము.

సీ. ఏలుకోటియనంగ వెనఁగుఁ బ్రజాకోటి .... ఆం. భా. 2. 117.

**ఏలుబ(ళ్ళ)డి** వి. (√ఏలు) ఏలుట, పాలన.

(కావేరి) సీ. జలధినాయకు నేలుబడి గన్న యిల్లాలు నిఖిలపుణ్యపుఁ జాలు నిలుచు ప్రోలు. శుక. 1. 875.

వి॰ ఏలుబడిలోనున్నది.

సీ. వలిశావియేర్పాటు వడిగలదొంకుఁ బుప్పొడితిన్నెగము తెలుబడిగఁ జేసి. చంద్రా. 4. 84. (అధీనము అనిభావము.)

గీ. చక్రమేల్పడి గాఁచోలు జఘనరమకు. వసు. 2. 70. (తక్కువది అని భావము.)

ఏవ(ము) వి. (తె. ఏసమ్ — దోషము, తప్పు.) 1. జుగుప్స, రోఁత.

ఉ. ... మున్ను గొంటి మే,వ న్ననదండ యొక్క మగవాఁ డిడ...ఆము. 1. 14.

ద్వి. ఎంగిలిపా ల్ద్రావి రేవంబు లేక. బస. పు. 7. 32. పం.

2 హేయవృత్తి.

క. మీవంటిభాగవతులుం, బావనులుగఁ జేయ లేని మఱిగతి యేదీ,మావంటివారి కిఁక మా,యేవము వెనుకటిది చూడ కీడింపు కృపన్. ఆము. 6. 55.

3. అవధానము, ఎచ్చరిక, ఏకాగ్రత.

గీ. ఎచ్చరిక యెచ్చరిం పేవ యేవ పదిల,ము హావణిక పోణిమియన నొప్పు నవధాన,ము ...ఆం. భా. 1. 138.

గీ. ...పై యద్దికముగ,నేవఁ దిరుగాడువిశ్వాసు లెపుడు మాకు,జాగిలంబులు ... సారంగ. 1. 78.

(వ్యవ) వాఁ డా యేవమీఁద నున్నాఁడు.

4. రోషము, మాత్సర్యము.

సీ. రోషజుగుప్సాఖ్య లొప్పు నేవ యనంగ... ఆం. భా. 3. 46.

గీ. ఉక్కుపొడిరాల రోషంబు పిక్కటిల్ల, నొక రొకరి కేవపెట్టు వత్యుగ్రసింహ, రవములు సెలంగ సైనిక ప్రభులు దార, సిలి రుదార శిలీముఖార్చులు నటింప. విజ. వి. 3. 152.

విశే. 1. రోఁతకలిగించునది, అసహ్యమైనది.

క. నాయున్న కాము దలఁపవ, యీయొడ లిచ్చిర యిట్టియేవపుఁబందం, బోయను

ఆ. అఖిలబంధురహిత మైనరాజ్యము నేఁత, కంటె నరసిచూడఁ గలదె మేలు, ఎడరు వేచి చెఱుచు సేవకాఁ డగుపాని, కంటె మేలు మూవె కాలయముఁడు. భా. రా. యు, 2253. (ఏవకాఁడు:- ఏవమీఁదనున్నవాఁడు, జాగరూకతతో నున్నవాఁడు. అనియుఁ జెప్పవచ్చును.)

ఏవగించు అ. క్రి. (√ఏవ) 1. రోఁతపడు, అసహ్యపడు.

గీ. ...కూటిలోనఁ, దునిసి పడియున్న ప్రేల్ వుచ్చి తోయజాక్షి, యేవగింపక యుచ్ఛిష్ట మిష్టలీలఁ, దగిలి కుడుచుచున్నంత నత్తరుణిఁ జూచి. భార. ఆది, 7. 256.

2. రోషపడు.

సీ. ...అయ్యలఘుభుజుఁడు, ద్రోణభీష్ములు దనతోఁబాటి యనుపలుకున కోర్వఁ డచ్యుతార్జునులు దనకు, నెక్కుడు నా విన్న నేవగించుచునుండు...భార. కర్ణ. 2. 318.

స. క్రి. 1. పరిహరించు. విడుచు

మ. అరిగాఁ బంచమ మేవగించి నవలా లప్పేశ హిందోళమై భరి చూపన్...వసు. 1. 130.

2. తిరస్కరించు, తెగడు.

గీ. హీనకులుఁడని యితఁడు న న్నేవగించి, పలికె నాయాత్మ కది యంపములికి యయ్యె హరిశ్చ. 4. 229.

సీ లలితాకలంకకలాకలాపంబున నేరాజు రేరాజు నేవగించు. వరస. 1. 11.

ఉ. .... శిబికర్ణుల త్యాగము నేవగించు .... కావ్యా. 2. 91.

ఏవగింపు వి. (√ఏవగించు.) రోఁత.

[illegible]

గీ. ఐదుపదినేసె వెనుక ముందయ్యె జడిఁగె, వీఁగె వెన్నిచ్చె వెనుకంజవేసె ననఁగ,నోహ టించె ననంగఁ బేర్లొప్పుచుండు, సాహస పరాఙ్ముఖుండయ్యె ననుట కథన. ఆం. శే. 12.

**ఐదుమోములవేల్పు** – అయిదుమోముల వేల్పు. (√ఐదు)

**ఐదువ** – అయిదువ

సీ. పతిపత్ని యని పల్కఁబడు మగనాలు నా నైదువరా లన నైదువ యన. ఆం. భా. 2, 107,

క. పసుపుల నలుఁగిడి రైదువ, బిసరుహలోచ నలు పెండ్లిపెద్దలయ్యాజ్ఞన్. మనుచ. 5. 56

ముత్తైదువ – 1. వృద్ధసువాసిని. (చూ. అయిదువ.) 2. సువాసిని. ఆం. సం. మా. 4.

ఉ: ఐదువతనము, ఐదువత్రాడు, ఐదువరాలు.

**ఐదువతనము** – అయిదువతనము. వి. (√ఐదువ.) సువాసినీత్వము. ల. వి. 5, 46.

**ఐదువత్రాడు** – అయిదువత్రాడు. వి. (√ఐదువ.) మంగళసూత్రము, మాంగళ్యతంతువు.

క. వగవఁ బని లేదు లేమికి, మొగి నైదువ త్రాడు పదిలముగ నెపుడు మెడన్, దగులు కొని యున్నఁ జాలున్, మగఁడేలక పోడ వు లెల్ల మగువల కెందున్. అచ్చ. రా. అయో. 58. వరాహ. 4. 18.

**ఐదువరాలు** – అయిదువరాలు. వి. బ. (ఐదువ+ఆలు.) అయిదువ, సౌభాగ్యవతి.

ఉ. ఐదువరాండ్రతోఁ గదలి యాత్మమనో

ఆ. వె. బాంధవమున నైనఁ బగనైన వగనైనఁ, బ్రీతినైనఁ బ్రాణభీతినయిన, భక్తి నైన హరికిఁ బగతంత్రులై యుండు. జనులు మోక్షమునకుఁ జనుదు రధిప. భాగ. 10. పూ. 972.

గీ. అన్నమున దుగ్ధమునఁ బండ్ల నైన మూల, కోటనైనను దనుపారునీట నైన, నిత్య మును జేయునది పితృకృత్య మోపి. భార. అను. 3. 337. (ఇట పూర్వపూర్వప్రాధాన్యము కల వికల్పము.)

3. పూర్వోత్తరవాక్యములకుఁ గల విరుద్ధభావము దెలుపును.

వ. ఇట్టి సంబంధ మెవ్వరికిఁ బడయ నగు.

క. విను మైనను సాపత్న్యం,బనుదోషము కలదు... భార. ఆది. 4. 183, 184.

చ. ఎఱుఁగుదు నైన వాని సమయించుటకున్ సమయంబు గాదు.... దశా. 4. 124.

4. ఉత్కర్షమును (ఆధిక్యమును) తెలుపును.

క. ఉక్కంటి సురపతి కైనను, ద్రొక్కము ... భార. ఉద్యో. 3. 360.

గీ. పలుకుఁబూఁబోఁడి కైనను నలవి గాదు. నైష. 2. 9.

5. అపకర్షమును (హైన్యమును) తెలుపును.

శా. ....భూమిపైఁ, బేరైనం గలదే... భాగ. 8. 590.

6. నిర్ధారణము లేమిని తెలుపును. (ఈయర్థమున కిమర్థకము లగు 'ఏ, ఎవఁడు, ఎవతె' మొదలగువానితో సంబంధించి యుండును.)

క. తాన సుతుఁ డగుట తెలియం,గా నగు మును లాత్మవీర్యకలనం బెచ్చో,నైనం

**ఐపోవు** – అయిపోవు. (√ఐ)

**ఐభము** సం. విణ. (అ. ఈ. అ.) ఇభమునకు – ఏనుఁగునకు – సంబంధించినది.

**ఐభి** సం. వి. ఈ. స్త్రీ. హస్తిఘోషి యను లత. (కల్ప) గుమ్మడి, కూశ్మాండము. (విల్యమ్సు)

**ఐమూల** – అయిమూల. వి. రెండుదిక్కులకు నడుమనుండుదిక్కు, విదిక్కు.

**ఐయత్యము** సం. వి. అ. న. ఇయత్త. ఇంత యను పరిమితి.

**ఐయ్యు** – అయ్యు. (√ఐ.)

**ఐర** – అయిర వి. నేత్రరోగవిశేషము

సీ. ...అక్షిరోగవిశేష మైర యనఁగ. అం. భా. 2 127.

**ఐరకొను** – అయిరకొను. అ. క్రి. 1. చక్కఁబడు.

క. భీషణవనమున నాయు, శ్శేషవిశేషమునఁ గుళ్లి చివుకక యచ్చో, నీషద్రుజ లేక మహా,ఘో షవృషంబునకు నైరకొని కాల్వచ్చెన్. వేం. పంచ. 1. 99. (శ. ర. పా.–'ఇరవుకొని' ముద్రి.)

2. వర్ధిల్లు, పెరుఁగు.

గీ. పెట్టి ముది గ్రుడ్లువడ కుండఁ గట్టు గాచి, పొదుగుటయు నైరకొని కొన్నిపూఁటల కును, బికిలె డింభంబు లాలోన బకవిభుండు, నెండ్రి చెప్పినగతి మీల నిండవైచె. వేం. పంచ. 1. 750.

**ఐరగట్టు** – అయిరగట్టు. వి. హాలోపకరణము. అం. భా. 2. 281.

**ఐరము** సం. విణ. (అ. ఈ. అ.) 1. భూమివలనఁ బుట్టినది. 2. జలమువలనఁబుట్టినది.

**ఐరావణము** సం. వి. అ. పుం. ఐరావతము, ఇంద్రుని యేనుఁగు.

**ఐరావతము** సం. వి. అ. పుం. 1- సముద్రమునుండి పుట్టినది– ఇంద్రుని యేనుఁగు. 2. ఒకానొక పాము. 3. నారంగము. నారింజ. (వ్ర. వి.) 4. లకుచము, గజనిమ్మ. (వ్ర. వి ) 5. ఇరావతీనదీ ప్రాంతదేశము. న. 1. వంపులేకుండ నిడుపుగానున్న యింద్రధనుస్సు. 2. మరుస్థల భేదము. 3. రక్తచందనము. 4. ఒకానొక వర్షము. (దేశము.) 5. దేవయానము, అశ్విన్యాద్యాశ్లేషాన్తనవకము. (అశ్విన్యాదినక్షత్రములు మూఁడు భాగములు చేయబడినవి. అందు అశ్విన్యాద్యాశ్లేషాన్తనవకము ఐరావత మనియు. ఉత్తరమార్గమనియు దేవయాన మనియుఁ జెప్పఁబడును. ఇందు మూఁడు వీథులు కలవు. వానిలో అశ్విన్యాదిత్రికము నాగవీథి. రోహిణ్యాదిత్రికము అజవీథి. పునర్వస్వాదిత్రికము ఐరావత వీథి. మఘాదిజ్యేష్ఠాంతనవకము, జారద్గవ మనియు మధ్యమమార్గ మనియు యోగియాన మనియుఁ జెప్పఁబడును. ఇందుఁ గూడ మూఁడు వీథులు గలవు. వానిలో మఘాదిత్రికము ఆర్షభి. హస్తాది త్రికము గోవీథి. విశాఖాదిత్రికము జారద్గవి. మూలాదిరేవత్యంతనవకము. వైశ్వానర మనియు దక్షిణమార్గమనియు పితృయాన మనియుఁ జెప్పఁ బడును. ఇందుఁ గూడ మూఁడు వీథులు గలవు. అందు మూలాది త్రికము గజవీథి. శ్రవణాదిత్రికము మృగవీథి పూర్వాభాద్రాదిత్రికము వైశ్వానరవీథి.)

**ఐరావతి** సం. వి. ఈ. స్త్రీ 1. ఐరావతముయొక్క భార్య, అభ్రమువు. 2. విద్యుత్తు, మెఱుపు. 3. విద్యుద్విశేషము. 4. పంజాబునందలి రావి యనునది, ఇరావతీనది. 5. వటపత్త్రివృక్షము (వ్ర. వి.) 6. దేవయానమునందలిమూఁడవ వీథి. (చూ. ఐరావతము.)

**ఐరిణము** సం. వి అ. న. - చౌటనేలఁ బుట్టునది– ఒక విధమైనయుప్పు, పాంశులవణము.

**ఐరేని** – అయిరేని. వి. వివాహవేదికయందు నిలుపు చిత్రితజలపూర్ణఘటము. (చి. ని.) వి. ఐచ్చెన పనిచేసిన పెండ్లికుండలు. (శ. ర.)

సీ. ఐరేనిఁగొని వచ్చి రైదువల్ పాటలు పాడుచు శుభవేళ వేడుకలర. విజ. వి. 3. 395.

గీ. రిక్కరాయఁడు దమి మీఱి రేవెలందిఁ, బెండ్లియగు నని కడ యను పేరఁటాలు, మొనసి యైరేని నీటికై, ముంచుపసిఁడి, కుండ యనఁ బ్రొద్దు మున్నీటఁ గ్రుంకె

సంబంధించినది. వి. అ. పుం. 1. జ్యేష్ఠానక్షత్రము. 2. అడవియల్లము. (వృ. వి.) 3. (జ్యోతి) విష్కంభము మొదలగు ఇరువదియేడు యోగములలో నొకటి.

**ఐంద్రలుప్తికుఁడు** సం. విణ. (అ. ఈ. అ.) రోగము వలన బట్టతల అయినవాఁడు, ఇంద్రలుప్తరోగము కలవాఁడు. (వై. ని.)

**ఐంద్రవాయవము** సం. విణ. (అ. ఈ. అ.) ఇంద్రవాయువులు దేవతలుగాఁ గలది. (హవిరాది)

**ఐంద్రాగ్నము** సం. విణ. (అ. ఈ. అ.) ఇంద్రుఁడు అగ్నియును దేవతలుగాఁ గలది. (హవిరాది)

**ఐంద్రి** సం. వి. ఇ. పుం. 1. జయంతుఁడు. 2. అర్జునుఁడు. 3. వాలి. 4. మాలకాకి. – ఈ. స్త్రీ. 1. ఋగ్విశేషము. 2. తూర్పుదిక్కు. 3. జ్యేష్ఠానక్షత్రము. 4. మార్గశీర్ష పుష్యమాసముల కృష్ణపక్షాష్టమి. 5. ఇంద్రశక్తి రూపమగు దేవీమూర్తి. 6. యోగధారణాభేదము. 7. ఒక జాతిదోస. (వృ. వి.) 8. చిట్టేలకి. (వృ. వి.) 9. శచీదేవి. 10. అలక్ష్మి, దౌర్భాగ్యదేవత. 11. ఇంద్రవారుణి, పెద్దపాఁపర. (వృ. వి.)

**ఐంద్రియకము** సం. విణ. (అ. అ, యికా. అ.) – ఐంద్రియము. వి. అ. పుం. ఒకానొకరోగము.

**ఐంద్రియము** సం. విణ. (అ. ఈ. అ.) 1 ఇంద్రియములకు సంబంధించినది. 2. చక్షురాదీంద్రియగోచరము, ప్రత్యక్షము.

**ఐకకంఠ్యము** సం. వి. అ. న. ఏకకంఠత్వము, పలువురమాట యొక్కటి యగుట.

**ఐకపత్యము** సం. వి. అ. న. సార్వభౌమత్వము.

**ఐకమత్యము** సం. వి. అ. న. ఒకచే యభిప్రాయము కలిగియుండుట, ఏకమతిత్వము.

**ఐకరాజ్యము** సం. వి. అ. న. చక్రవర్తిత్వము.

**ఐకశతికుఁడు** సం. విణ. (అ. ఈ. అ.) నూటయొకటి (పదార్థములు) కలవాఁడు.

**ఐకశఫము** సం. విణ. (అ. ఈ. అ.) ఏకశఫముగల పశువులకు సంబంధించినది. (పాలు, మొ.)

**ఐకసహస్రికుఁడు** సం. విణ. (అ. ఈ. అ.) వేయునొకటి (పదార్థములు) కలవాఁడు.

**ఐకాంతికము** సం. విణ. (అ. ఈ. అ.) అవశ్యంభావి, తప్పక కలుగునది.

**ఐకాగారికుఁడు** సం. వి. అ. పుం. చోరుఁడు, దొంగ.

**ఐకాగ్రుఁడు** సం. విణ. (అ. ఈ. అ.) ఏకాగ్రచిత్తుఁడు, ఏకతానుఁడు.

**ఐకాగ్ర్యము** సం. వి. అ. న. ఏకాగ్రత్వము, వేఱొక విషయమున మనస్సు తగులకుండుట.

**ఐకాత్మ్యము** సం. వి. అ. న. ఏకాత్మత్వము. ఒక్కటే స్వరూపము కలిగియుండుట. అభేదము.

(ఐకాత్మ్యవాదము–ఆత్మలన్నియు నొక్కటియే యనెడి వాదము.)

**ఐకాధికరణ్యము** సం. వి. అ. న. సామానాధికరణ్యము. (అనేకాధేయములు) ఏకాధికరణమున నుండుట.

**ఐకాన్యికుఁడు** సం. విణ. (అ. ఈ. అ.) అధ్యయనమును పరీక్షించుకాలమున విపరీతోచ్చారణరూప మగు నొకతప్పు గలిగినపాఠకుఁడు. (శిష్యుఁడు.)

**ఐకార్థ్యము** సం. వి. అ. న. ఒక్కటే యర్థము కలిగియుండుట.

**ఐకాహికము** సం. విణ. (అ. ఈ. అ.) 1. ఏకదినసాధ్యమైనది. (యాగాది.) 2. ఏకదినవ్యాపకమయినది, ఒకదినముండునది. (జ్వరము, ఉత్సవము, మొ.)

**ఐకాహికుఁడు** సం. వి. అ. పుం. 1. దినభృత్యుఁడు, ఒకదినముకూలి చేయువాఁడు. 2 సత్కృతుఁడై యొక్కనాఁటికి అధ్యయనము చేయించు అధ్యాపకుఁడు.

**ఐక్యము** సం. వి. అ. న. 1. ఏకత్వము ఒక్కటి యగుట. 2. ఐకమత్యము. ఒరిమ.

**ఐక్షవము** సం. విణ. (అ. ఈ. అ.) చెఱకుసంబంధమయినది. వి. అ. న. 1 చక్కెర. 2. చెఱకునుండి తీసిన మద్యము.

**ఐక్షికము** సం. విణ. (అ. ఈ. అ.) 1. చెఱకు పండునది. (పొలము.) 2. చెఱకుమోపు మోచుకొనిపోవునది. (శకటాది.)

**ఐక్షుభారికుఁడు** సం. విణ. (అ. ఈ. అ.) చెఱకుల మోపు మోచికొనిపోవువాఁడు.

**ఐక్ష్వాకము** సం. విణ. (అ. ఈ. అ.) ఇక్ష్వాకుదేశమం దున్నది.

**ఐచ్ఛికము** సం. విణ. (అ. ఈ. అ.) ఇచ్ఛచొప్పున చేయఁబడునది.

**ఐడబిడుఁడు** సం. - ఐలబిలుఁడు.

**ఐడము** సం. విణ. (అ. ఈ. అ.) గొఱ్ఱెది. (ఉన్ని, మొ.)

**ఐణము** సం. విణ. (అ. ఈ. అ.) ఏణమునకు - ఇఱ్ఱికి-సంబంధించినది. (చర్మము, మొ.)

**ఐణికుఁడు** సం. విణ. (అ. ఈ. అ.) లేళ్లను వేఁటాడువాఁడు.

**ఐణేయము** సం. విణ. (అ. ఈ. అ.) ఏణికి - ఆఁడు లేడికి - సంబంధించినది. (చర్మము, మొ.) వి. అ. పుం. నల్లయిఱ్ఱి - వ. -రతిబంధభేదము.

**ఐతదాత్మ్యము** సం. వి. అ. న. ఈన రూపము గలిగియుండుట.

**ఐతరేయము** సం. వి. అ. న. - ఐతరుఁ డను ముని వలన వచ్చినది- 1. ఒకానొక ఉపనిషత్తు. 2. ఒకానొక అరణ్యకము. 3. ఒకానొక బ్రాహ్మణము.

**ఐతి** - అయితి.

**ఐతిహాసికము** సం. విణ. (అ. ఈ. అ.) 1. ఇతిహాసమునకు సంబంధించినది. 2. ఇతిహాస గ్రంథము వలన లభించినది.

**ఐతిహాసికుఁడు** సం. వి. అ. పుం. - ఇతిహాసము (పూర్వచరిత్రము) [illegible]

శా. ఐదు న్నాలుగు నాలు రెండు నిరమూఁ డశాహీణుల్ సుట్టి సంభాదించెన్. భాగ. 10. పూ. 1530.

గీ. నాలుగింటను రెండియు నాలుగింట, రెంట నైదింట మఱియును రెంట వేల్పు.... భార. శాం. 4. 222.

చూ: ఐదుకైదువులజంత, ఐదుగురు, ఐదుదాయలు, ఐదుపది గావించు, ఐదుపదిసేయు, ఐదుమోముల వేల్పు.

**ఐదుకైదువులజంత** - అయిదుకైదువులజంత. (√ఐదు.) చం. రా. 2. 99.

**ఐదుగురు** - అయిదుగురు. వ. (√ఐదు)

**ఐదుదాయలు** - అయిదుదాయలు. వి బ. (ఐదు + దాయి - దాకలి) - అయిదువిధములగు దాయలమీఁద చేయుపనులు:- వడ్రము, కమ్మరము, కంచరము, అగసాలెపని, కాసెపని -అను పంచశిల్పములు.

**ఐదుపదిగావించు**- అయిదుపదిగావించు. (√ఐదు.) స. క్రి. (ఖండించు.)

వ. రథుల విరథులం జేసియు ఘోటకంబుల విటతాటవం బొనర్చియుఁ గైదువ లైదు పది గావించియుఁ గుత్తుకలుత్తరించియు... హ. వరాహ. 2. 29.

**ఐదుపదిసేయు** - అయిదుపదిసేయు. (√ఐదు) అ. క్రి. - 1. (అయిదేసి వ్రేళ్లు గల రెండు చేతులను జోడించినయెడల పది యగును.) అంజలిచేయు, నమస్కరించు. (శ. ర.) 2. ముందుకాలు వెనుకకాలితో చేర్చిన యెడల రెంటి వేళ్లును [illegible]

(వ్యవ) వాఁడు ఒంటరిగాఁడు నీ కేమి సాహాయ్యము చేయఁ గలఁడు

వి. ఏకచరము, పంది.

సీ. క్రమ్మి యొంటరిగాని దొమ్మినొంచుయశంబు లై టివల్లెలు గూల్చు బలిమికలిమి. చంద్రా. 1. 20.

2. అసహాయశూరుఁడు.

చ. ...ఒంటరి కాండ్ర నేక మూఁకరముల గుప్పుగుప్పు మనఁగాఁ బడఁ గ్రుమ్మిరి. ఉ. రా. 7. 414.

**ఒంటరిపాటు** వి (√ఒంటరి.) ఏకాకిత్వము.

(వ్యవ) నేను ఒంటరిపాటున నుండఁగా వాఁడు నాపైఁ బడెను.

**ఒంటరీఁడు** వి. (ఒంటరి + ఈఁడు – స్వార్థమున.) ఏకవీరుఁడు, అసహాయశూరుఁ డగుబంటు.

సీ. ఒంటరి యొక్కటిఁ డొంటరిఁ డొంట్రింపు నా నేకభటునకు నామమగును. ఆం. భా. 2. 185.

చ. .... అందలమునందుఁ దగన్ జనియెన్ విభుండు క్రేవలఁదగ నొంటరీలు గొలువం గరదీప తతుల్ వెలుఁగఁగన్. శుక. 1. 281.

**ఒంటి** విశే. (√ఒండు – త. ఒండి. క. ఒంటి.) ఏకాకి, ఒంటరి, అసహాయుఁడు.

సీ. ఒంటి యనంగను వొప్పు నేకాకియై....ఆం. భా. 3. 25.

చ. అసమున మీఁదెఱుంగక మహోగ్రహావృత్తిఁ గడంగి చెచ్చెరం,బసులకుఁ గూయిగాఁ జని యొఁ కాపఁడు కౌరవసేన యెడ యొంటి సనుట యెడ.... భార. విరా. 5. 284. (ఒంటి – ఒంటియై.)

ఉ మత్తగజంబు లీల నెలమామిడిఁ గూల్చిన భంగిఁ బాండు పుత్రోత్తమ వీనిఁ గూల్చి మతఁ డొంటిగ రాజ్యము నీకుఁ జేకుఱున్. భార. కర్ణ. 2. 350. (ఒంటిగ – ఒంటి వాఁడు కాఁగా.

వి. ఏకాకిత్వము ఒంటరితనము, అసహాయత్వము.

క. ఒంటిమెయిఁ దాఁక వాము,గ్గ్కంటికి వశ మగునె కృష్ణగాండివుల .... భార. కర్ణ. 2. 85.

గీ. ఒంటి వెచ్చోటి కరుగుట యుక్తి గాదు. కాశీ. 2. 75.

చూ: ఒంటరి, ఒంటరికాఁడు, ఒంటరిపాటు, ఒంటరీఁడు, ఒంటికాఁడు, ఒంటిపడు, ఒంటిపాటు.

**ఒంటింపు** వి. (√ఒంటు) అనుకూల్యము. వీలు. (బ్రౌ)

**ఒంటికంటిగాము** వి. (√ఒండు) కుఱ్ఱుఁడు. చుక్క. (శ. ర.)

**ఒంటికంటియురుమ** వి. (√ఒండు) చర్మవాద్యవిశేషము.

వ. ....ఉరుమ యొంటికంటియురుమ.... మొదలైన హృద్యాద్యానవద్య వాద్యవిశేషంబులు. హంస 4. 29.

**ఒంటికా(గా)ఁడు** విశే (√ఒండు – త. ఒండి క్కారన్. క. ఒంటిగ, ఒంటిగాఱ.) 1. ఏకాకి, ఒంటరి, అసహాయుఁడు.

ఉ. అక్కట వీరి నందఱ మహాటవిఁ గోల్పడి యొంటికాండ్ర మై, యెక్కడఁ జూచు వార మిఁక నింటికి నేమని పోదము... పద్మ. 9. 157. విష్ణు. 1. 45.

2. అన్యుఁడు.

ఉ. ఆయతికాని కీకు మమరాలయముఖ్యము లాతఁ దర్థతృష్ణాయుతుఁడై నిశోర్వి నగునట్టికిఁ దర్దనముం దొరల్చి రాజాయత నంబుఁ జేర్చు మటి యట్టి దపథ్యము దాన నొంటిగాఁ, డేయధికారి గా వలయు నిం చుక తిన్నను వాఁడె రూపఱున్. ఆము. 4. 218. (ప్రయోగాంతరము మృగ్యము.)

3. వియోగి, విరహి.

సీ. అనురక్తి రేఁచుమాతనపాంచఁసాటోప మొంటికాండ్రకుఁ జెంపు లొనఁగు వెచట. హ. వ. 2. 80.

(హరిశ్చంద్రకథలో 'పంది' అనియు, నలకథలో 'వియోగు'అనియు నర్థము.)

వి. ఏకచరము, పంది.

గీ. క్రొవ్వి వడగొండ కైవడి గుమురుబొక్క,

యొంటిగాని మహీనాథుఁ డొదిఁగి యేయ. మనుచ. 4. 47.

**ఒంటికొమ్ముదేవర** వి. (√ఒండు) ఏకదంతుఁడు, వినాయకుఁడు. ఆం. సం. దే. 12. (ఇట్లే ఒంటి కొమ్ముదేల్పు, మొ.)

**ఒంటితలయేరు** వి. (√ఒండు) తలయొక్క యొక పార్శ్వమునకుఁ గలిగెడునొప్పి, పార్శ్వపు నొప్పి.

గీ. నెఱయఁ గుంకుడుపండ్లు వేన్నీళ్లఁ బిసికి, వాని నురుఁగెల్లఁ దల నంటి వరుస మునుఁగఁ, బాయు నీగతిఁ ద్రిదినముల్ పరఁగఁజేయ,నొంటితలయేరు మఱి చేగ కుండు నెపుడు. (చికిత్స – చి. ని.)

**ఒంటిప(వ)డు** అ. క్రి. (√ఒంటి) తోడు లేకుండు, అసహాయుఁడగు.

గీ. ...అభిమన్యు వీరుని సతని తమ్ముఁ, గుఱ్ఱ లను గర్ణు నాఱడి గోలుపోయి, యొంటి వడితి మనియుఁ గడు నుమ్మలంపు,మాట లాడుదు ?రిజనుల్ మఱుఁగుచుండ. భా. ఆశ్ర. 2. 15.

మ. తనవా రెల్లరు వోవ నొంటిపడి భీతస్వాం తుఁడై ....కేయూర. 8. 257.

**ఒంటిపాటు** వి. (√ఒంటిపడు) ఒంటరిగానుండుట, ఏకాంతస్థితి,

చ. అటు జగదేక సుందరికి నైయతివేషముఁ బూని వచ్చినాఁడఁట తనచేయుభాగ్య మున నప్పువుఁబోఁడియె చెంత నేవ సే, యుట కని వచ్చియుండు నఁట యొక్కొ.క పట్టున నొంటిపాటు నొ,నఁట యతఁ డెప్పు డెప్పు డను టబ్బురమే మదిఁ దత్తఱించు చున్. విజ. ౩. 2. 146.

సీ. ఒంటిపాటు గఁ జూచి యింటిచాయకు నేనె చేరఁ దీసిన నేమి చేయఁ డయ్యె. గంధ. 208, (కన్ – కాఁగా.)

**ఒంటియడుగుకత్తెర** వి. (√ఒండు) మల్లబంధ విశే షము.

వ. ....ఒంటియడుగుకత్తెర సర్పబంధకత్తెర... మొదలుగాఁ గల పదిరెండు పరువడులు. ప్రబంధ. 78.

**ఒంటీలు** వి. బ. (√ఒంటు) కర్ణభూషణములు, ఒంట్లు.

సీ. చన్నారి చెలువంపుఁజికిలి యొంటీలపొంకము కివిగా భుజాగ్రముల నెరయ. ముకుంద. 1. 50. పూ. కే. పం.

**ఒంటు** అ. క్రి. (త. ఒణ్ణు. క. ఒఁటు.) అనుకూ లించు, సరిపడు, గిట్టు; అత్తు. (చూ. ఒంటు కొను.)

మ. కకుబంతాంతరధాత్రిపై నిది మొదల్గా సర్వకాలంబు న,త్తకుఁ గోడంద్రకునొంట కుండెడును ముగ్ధ నాతనూజాత నూ,రక భర్జింపక యేలుకొండు మునివర్యా... వరాహ. 2. 150.

సీ అటు మొన్న భార్గవజటికి శౌవకమౌని కొకవాదుమై నొంటకుండఁ జేసె. కువల. 2. 80.

స. క్రి. అంటు, తాఁకు.

రగడ. కమలము లంటుచుఁ గలువల నొంటు చు, మలసె నుదారము మలయసమీరము. శశాం. 2. 118.

వి. గ్రామసమూహము. (శ. ర.)

బ. (ఒంటులు, ఒంట్లు.) కర్ణభూషణములు.

సీ. హురుముంజిముత్యాల యొంటులచకచకల్ తళుకుఁ జెక్కులయందుఁ దాండవింప. చం. రా. 2. 61.

సీ. ....కట్టాణి యొంట్లు...రా. వి. 1. 85.

జః ఒంటనివాఁడు, ఒంటమి, ఒంటింపు, ఒంటీలు, ఒంటుకొను.

**ఒంటుకొను** స. క్రి. (√ఒంటు) కలియు.

గీ. ఒంటిపాటున నవ్వాలుఁగంటి నంటి, యొంటు కొనఁ జూచి యోహో యయుక్త మనుచుఁ, దలఁచు...శశాం. 2. 89.

**ఒంపె(టియ)** వి. (సం. ఉష్ట్రి. త. ఒట్టై. క. ఒంపె. తు. ఒంటె.) లొట్టిపిట్ట,

సీ. ...ఒంటె యనఁగను లొట్టియ యనఁగను లొట్టెనాఁగ, లొటిపిట యనఁగను లొటి పిట్ట యనఁగను లొట్టిపిట్ట యనఁ గన్పట్టు నుష్ట్రము. ఆం. భా. 2. 265.

**ఒంట్రింపు** వి. అసహాయశూరుఁడైన బంటు.

సీ. ఒంటరియొక్కటీఁ డొంటరీఁ డొంట్రింపు

నంత. అచ్చ. రా. అయో. 12. నీలా. 3. 79.

ఐరేనికడవలు. (కుండలు.) అం భా. 3. 86.

**ఐరణ్యము** నం. వి. అ. న - వ్రణమునకు హిత మయినది - వ్రణమును మాన్పు నొక లేపన ద్రవ్యము.

**ఐలబిలుఁడు** నం. వి. అ. పుం. - ఇలబిలకొడుకు- కుబేరుఁడు.

**ఐలము** నం. విశ (అ. ఈ. అ.) భూసంబంధ మయి నది. వి. అ. న. అన్నరాశి.

**ఐలారము**—అయిలారము. వి. మూలికావిశేషము. ('ఉబ్బులకుపయోగించువేరు'అని శ్రౌ.)

**ఐలుఁడు** నం. వి. అ. పుం. 1. అంగారకుఁడు. 2. పురూరవుఁడు.

**ఐలేయము** నం. వి. అ. పుం. — ఏలవాలువు

**ఐలేయుఁడు** నం. — ఐలుఁడు.

**ఐవచ్చు** — అయివచ్చు. అ. క్రి. (√ఐ.) అచ్చి వచ్చు, అం. భా. 3. 94.

**ఐశము** నం. విశ. (అ. ఈ. అ.) 1. ఈశునకు- శివునకు - సంబంధించినది. 2. పతికకు సంబం ధించినది.

**ఐశానము** నం. విశ. (అ. ఈ. అ.) ఈశానునకు సంబంధించినది.

**ఐశాని** నం. వి. ఈ. స్త్రీ. పూర్వోత్తరదిక్కు, తూర్పు నకు ఉత్తరమునకు నడిమిమూల.

**ఐశి** నం. వి. ఈ. స్త్రీ. 1. దుర్గ. 2 ప్రబ్వి.

**ఐశ్వరము** నం. విశ. (అ. ఈ. అ.) 1. ఈశ్వరునకు సంబంధించినది. వి. అ. న. నాలుగుమూరల ప్రమాణము.

**ఐశ్వర్యము** నం. వి. అ. న. 1. ప్రభుత్వము,నియం తృత్వము, పాలకత్వము. 2. విభూతి. (ఇది 8 విధములు - 1. అణిమ. 2. మహిమ. 3. గరిమ. 4. లఘిమ. 5. ప్రాప్తి. 6. ప్రాకామ్యము. 7. ఈశత్వము. 8. వశిత్వము ) 3. సంపద.

**ఐషమస్తనము** నం. విశ. (అ. ఈ. అ.) ఈ సంవ త్సరపుది.

**ఐషమస్త్యము** నం విశ. (అ. ఆ. అ.) ఈసంవత్సర పుది.

**ఐషీకము** నం. విశ. (అ. ఈ. అ.) ఇషీకకు సంబం ధించినది. వి. అ. న. 1-ఇషీక. 2. సంస్కృత భారతమున సౌప్తికపర్వమందలి యవాంతర పర్వము.

**ఐష్టికము** నం. విశ. (అ. ఈ అ.) 1. ఇష్టికి సంబం ధించినది. 2. ఇష్టినిగూర్చి చెప్పునది. (గ్రం థము)

**ఐహలౌకికము** నం. విశ. (అ. ఈ. అ.) ఇహలోక సంబంధమయినది. (వ్యతి. పారలౌకికము.)

**ఐహికదర్శి** నం. విశ. (న్. నీ. న్.) ఇహలోక వ్యాపారమందు దృష్టిగలవాఁడు.

**ఐహికము** నం. విశ. (అ. ఈ. అ.) ఇహలోక సం బంధమయినది. 2. ఇచ్చటిది. వి. అ. న. ఇహ లోకవ్యాపారము, ఇహలోకవృత్తి.

# ఒ

**ఒ**[1] ఒకానొక యక్షరము.

**ఒ**[2] ఓ. చూ. అవ్య. (త. ఒ.) 1. ప్రశ్నార్థకము.

క. పవమునకును నీకును బాంధవము గలదొ యతఁడు నిన్ను దయ రక్షింపఁగ, సవినయ వృత్తిని బ్రదికితొ, చెవులకు నిం పెసఁగ నిజము చెప్పుము నాకుఁ. భార. శాం. 3. 384.

2. శాశ్వర్థకము.

మ. అని కైవం బిటి నిన్నుఁ బాసి చనునో ప్రాణంబు ప్రాణంబుగా, నిను మన్నింపఁడొ నీ మనోరథముల న్నెయ్యంబుతోఁ జేయఁ డో, చనవు ల్నీవలె నెవ్వ రేఁ గనిరొ నీ సౌభాగ్య మింతంతయే, నినుఁ బోలంగల రబ్జగంధు లన వింటే యెందు పాంచాలికీ. పారి. 2, 25. దశా. 7. 1. 84.

3. సందేహమును దెలుపును.

క. విహరింప మానవాకృతి,స్వహితంబుగ మహికి వచ్చిఁ జనుదెంచిన వ,ద్మహితుఁడొ హిమ

కరుఁడొ శచీగృహమేధియొ కాక యితఁడు కేవలనరుఁడే. భార. విరా. 1. 215. నీలా. 1. 40.

4. ఏమో, సంభావన (ఊహ)ను దెలుపును.

క. అకన్నియవెత చూడఁగ,లేక నఖజనులె యుమ్మలించుచు నెపుడుఁ, నాకు వినిపింతు రొక తఱి, నీ కేఁ జెప్పుదునొ యనుచు నృపకులతిలకా. కళా. 7. 87.

చ. నియమవిచిత్రభంగి మహనీయుఁడు భూమి విభుండు మిత్రులే,తయును నమిత్రులేత యుఁ బ్రతాపగుణంబున నీతిఁ జారదృష్టి యును విచారదృష్టియు నచే పరిపంథి మహీశు లట్ల త,ద్భయమున భేత్ప్రతా గుణము వాసెనొ కాక విరుద్ధధర్మముల్. నైష. 1. 52. (ఇట ఉత్ప్రేక్షావాచకము.) ఆము. 5. 152.

5. అప్రాచుర్యమును దెలుపును.

సీ. భసిత మెన్నఁడొ కాని ప్రతిదినంబు నలందు మలయజంబుఁ గురంగమదముఁ గూర్చి.

గీ. ఎన్నఁడొ పిశాచులను గాని యుందుము ఖుల,నెల్ల కాలంబుఁ దలఁచు భీమేశ్వరుండు. భీమ. 1. 115. (ఎన్నఁడొకాని - ఎప్పుడో ఒకప్పుడు కాని.)

6. ప్రార్థనాదులను దెలుపును

(అజ్ఞ)

క. పాతాళమునకుఁ జనరో,వాతాళము లేచటి కేని వలసినయెడకున్, భూతము లే,గరొ యని య,త్యాతతగతిఁ జాటి రవని వధిపతి దూతల్. కాశీ 5. 274.

**కినిసెనొలేదోయాలోన** – కినిసియు కినియక మునుపే, కినిసినవెంటనే.

క. అదారి నత్త కినిసినొ,లేదో యాలోన నుమ్మ లి చుచు నే నిం,కేదియుఁ జెప్పిన నిక్కము, గాదేకద యనుచు గోపకామిని యేడ్చెఁ. శుక. 2. 571.

**ఒంకె(కియ)** వి. (సం. వంక్యాం క. ఒంకి. వంకి.) చిలుకకొయ్య (శ. ర.)

**ఒంజలి** వి. పని, కార్యము.

గీ. అక్కజంబు పని, యొంజలియు తోలి యనఁ గార్య మొనరు...పాం. ని. మావ. 28.

**ఒంజిలి** – ఒందిలి. (క. ఒంజల్.)–ప్రా.

**ఒంటనివాఁడు** విశ. (√ఒంటు) గిట్టనివాఁడు.

సీ. ఒంటనివారిపై నోర్వజాలనివారు లేని నేరంబు కల్పించిరేని. విప్ర. 5. 40.

వి. శత్రువు.

సీ. ...వైరి. గీ. మనును వొంటనివాఁడన మూర్తుఁడనఁగఁ, బగతుఁ డనఁ బగ అనఁ బగవాఁ డనంగ. ఆం. భా. 2. 185.

**ఒంటమి** వి. (√ఒంటు)వైరము, పగ.

గీ. ...వేర,మనఁగఁ బగటన నొంటమి యనఁ బగ యన, నొప్పమి యనంగఁ గంటు నా నొప్పు వైర,ము. ఆం. భా. 1. 184.

క. ఒంటమిని లేనియొంటర, మింటరములు పలుకుటుచితమే యర్థరథుం,డంటి నను నేమి తక్కువ,గంటి చెపుమ...భార ఉద్యో. 4 237.

శ్లో. పితామహ యథేష్టం మాం వాక్శరై రుప కృంతసి. అనాగసం సదా ద్వేషా దేవ మేవ పదేపదే, సం. భార. ఉద్యో. 168. 11.

**ఒంటరమింటరములు** వి. బ. ఎక్కువతక్కువ మాటలు, పరుషవచనములు. భార. ఉద్యో. 4. 237. (చూ. ఒంటమి)

**ఒంటరి** విశ. (ఒంటి+అరి) ఏకాకి, అసహాయుఁడు. (వ్యవ) వాఁడు ఒంటరిగా వెళ్లుచున్నాఁడు.

వి. 1. అసహాయశూరుఁ డైనబంటు, ఏకవీరుఁడు. ఆం. భా. 2. 185.

గీ. ...పులులఁ బొడిచిననాఁటి పాములను దొంటి, యొంటిజగడంబు శెకఁకు లిం పొసఁగ నడచె,డాక నరపాలువెంట నొం టరులమూక. రా. వి 2. 57.

మ. ... పువ్వుఁదీఁ,గెగుదెన్ దా నలరాచ యొంటరి కదున్ గేరించుచుఁ జిమ్మెనఁ. యయా. 5. 74.

2. ఒకానొకకులమువాఁడు.

**ఒంటరికా(గా)ఁడు** విశ. (√ఒంటరి - స్వార్థమున 'కా') ఏకాకి.

నా నేరభటునకు నామ మగును. ఆం. భా. 2. 185.

**ఒంట్లు** వి. బ. (√ఒండు) అంకెలు. (శ. ర.)

**ఒండు** వి. వి. – ఒకఁడు. (త. ఒన్ఱు. క. ఒందు. తు. ఒంటి. మ. ఒన్ను. కు. రొండి.)

ఈ శబ్దమునకు నన్నయభట్టారకుని కవిత్వమందును అంతకుఁ బూర్వము పుట్టిన కొన్ని శిలాశాసనములందును 'అన్యము' అను నర్థము మాత్రము కనఁబడుచున్నది. తరువాతి కవులు 'ఒకటి' అను నర్థమం దీశబ్దమును వాడిరి. దీని సజాతీయ శబ్దములకు కర్ణాటాది భాషలలో 'ఒకటి' అను నర్థము మాత్రమే యగపడుచున్నది. మఱియు నీ శబ్దము 'ఒక్క' శబ్దమునకుఁ బర మయినప్పుడు 'ఒక్కొండు' అయి క్రమముగా 'ఒకొండు, ఒక్కండు, ఒకండు, ఒక్కఁడు, ఒకఁడు' ఇత్యాది రూపములనొంది 'ఒకటి' అను నర్థమున అమహదర్థక ప్రథమైక వచనరూపముగా వ్యవహరింపఁ బడుచుండెను. ప్రథమేతరవిభక్తులందు వచ్చు 'ఒక్కొంటికి, ఒక్కంటికి, ఒకంటికి' ఇత్యాద్యౌపవిభక్తిక రూపములయందలి 'ఒక్కొంటి' మున్నగునవి 'ఒక్కొటి' మున్నగు అమహదర్థక ప్రథమైక వచనరూపములుగాను పూర్వరూపములైన 'ఒక్కొండు' మున్నగునవి మహదర్థక ప్రథమైకవచనరూపములుగాను ఇటీవల మాఱి యిప్పుడును అరీతినే వ్యవహరింపఁ బడుచున్నవి. 'ఒక్కొండు, ఒక్కండు' ఇవి అమహదర్థక రూపములుగానున్నపుడు 'ఒక్కొరుఁడు, ఒక్కరుఁడు' అనునవి పుంవాచకములును 'ఒక్కొరిత, ఒక్కరిత' అనునవి స్త్రీవాచకములుగను ఉండి యిప్పుడుగూడ నట్లే వాడుకలోనున్నవి.

1 అన్యము.

మధ్యా. త్రినయనసుతు న్డొండుసోటు మెచ్చక తివిరి యున్నెలవ, యనఘుండు నేకొని ... శా. ప. 2. 4.

క. ఈ వ్యాధి యొంటఁ దీఱదు, దివ్యౌషధయుక్తమైన దివిజవనంబుఁ, హవ్యాశన భక్షింపు మ,హావ్యాధిశమంబు దాన నగు నీ కనినన్. భార. ఆది. 8. 248.

ఉ. ...మీ,రొండువిధంబు సేయ టిది యుక్తమె బ్రహ్మనియుక్తి యుండఁగఁ. భార. ఆది. 2. 87.

క. ...ఎ,వ్వానికి మోక్షంబునకుం,దాన తెరువు తెరవు లొండ్లు దలఁపం గలవే. భార. శాం. 6. 163. హరి. ఉ. 7. 81.

2. ఏకము, ఒకటి (ఈ యర్థమున బహువచనము లేదు.)

ఆ. ఒంటికంబ మొప్పనింటివాకిళులు దొమ్మిదియు నెఱయ మూసి నిదుర వోదు. భాం. ఆశ్ర. 4. 17.

సీ. ఒంటికాలనె నిల్చి యూర్ధ్వమూరుతిములం జిగురు టెక్కలుజేకు లెగయుచు ద నైవ 1. 98.

చ. మనమున కొండు రెండు మఱుమంత్రములన్ సరిపోవఁ జెప్పినన్. ఆము. 4. 66.

శా. ఓవాచంయమిచంద్ర సంద్రములు నేఁడొండైన వేళన్... దశా. 1. 237. (ఒండగు – ఏకమగు, కలియు.)

జ: ఒంటి, ఒంటికంటిగాము, ఒంటికంటియురుము, ఒంటికొమ్ముదేవం, ఒంటితలయేఱు, ఒంటియడుగుకత్తెర, ఒండొండ, ఒండొండు, ఒండొక, ఒండొకఁడు, ఒండొకరుఁడు, ఒండొరుఁడు, ఒండొరువుఁడు.

**ఒండె** అవ్య. ద్రు. (త. ఒన్ఱు.) పక్షాంతరమును దెలుపును.

వ. ...వలను గలవారలం బంచి కౌంతేయ మాద్రేయులను దమలో విరక్తులగునట్లుగాఁ జేయింత మొండె నతిలలిత ప్రమదాజనంబులఁ బ్రత్యేకంబ యేవురకుం బ్రయోగించి ద్రౌపదివలన విరక్తిఁ బుట్టింత మొండె నేవురకు నొక్కతియ యాలగుట కష్టంబు...భార. ఆది. 8. 22.

సీ. ఆయంబున దు నాలవభాగ మొండె మూఁడవభాగ మొండె నం దర్థ మొండె. భార. సభా. 1. 46.

చ. ...అప్పురుషసింహులు భూరితపోనిధుల్ మనం,బునఁ గలుషించి రేనియుఁ దపోమహిమన్ మిము నిర్దహింతు రొం,డె నతు

భీకాస్త్ర శక్తిని వడిం దునుమాడుదు రాజ
నందఱన్. భార. అర. 5. 368.

సీ. అలమట నెడి యొంటె నిలువదు చిత్తంబు
మూర్ఛిల్లి వెడఁబాసి పోవదొంటె. కు. సం.
5. 580.

జ: ఒంటేని.

**ఒండేని (ఒండెనేని)** – ఒండె. **అవ్య.** (ఒండెఁ + ఏని)
(పక్షాంతరమును దెలుపును.)

మ. అనుషంగంబున నొండె నొండెను విషా
రాపేక్ష నొండేని ధర్మనిరాసంబున నొం
డెఁ దీవ్ర భయ సంత్రాసార్థ మొండేని
నన్యనియోగంబున నెవ్వఁడే మునుఁగు
గంగాంభః ప్రవాహంబునన్, ఆముఁ డాతం
డును బుండరీక నయనా శాసించుఁ బాపౌఘ
ముల్. కాశీ. 5. 45.

ఉ. భావములో నదంభ యగు భక్తి సంతస
మందుఁ దొండెనొండే విధియింపుఁ డిప్పుడు
కడిందిగ దండము తప్పు గర్గెనేని విరహా
నలంబునకు నింకిట నేమియు నోర్వలేఁ
జుఁడీ. నైష. 4. 118.

సీ. అనుమతి నిచ్చిరో యావేల్పు లొండేని
బలిమిఁ దేకొనియెనో పాడి దొలఁగి. పారి.
1. 86.

గీ. అష్టమీభానువాసరంబందు నొండె,నొండెనే
ని చతుర్దశి నిందుభక్తిఁ,బూజఁ గావించి
యెవ్వఁడే భూమి నున్న,దుర్గ సేవింప దురి
తంబు దొలఁగు నంద్రు. భీమ. 6. 72.

**ఒండొండ అవ్య.** (ఒండు + ఒండు + అ.) వరుసగా; యథాక్రమముగా; క్రమక్రమముగా.

గీ. భవ్యభోజ్యలేహ్యంబులు పానకములు,
మున్నుగాఁ గలయోగిరంబులు సమృద్ధి,
వెలయఁ గొనివచ్చె నొండొండ వివిధము
లును కాశీ. 4. 118.

గీ. ఉసులుగొనుటకు శరము లొండొండ పఱ
పఁ, ద్రుంచె నాతనివిలు మాగధుండు పేర్చి
హరి. ఉ. 2. 66.

గీ. మాయురే తోయనిధిలోన మకరమీన, కర్క
టక రాసు లొండొండ గగనమకర, మీన
కర్కటరాసుల మించు వేడ్కఁ, గౌగిలించె
సజాతీయ గౌరవమున. దశా. 1. 190.

క. పాండవులవిభవ మది యా,ఖండలువిభ
వంబుకంటెఁ గడు మిక్కిలి యై,యొండొండ
పెరిఁగి దిక్కులు,నిండెఁ దదీయ ప్రతాప
నిర్మల రుచితోన్. భార. సభా. 2. 104.

**ఒండొండు వ. కొ.** (ఒండు + ఒండు.) పరస్పరము
అన్యోన్యము.

సీ. ధర్మవిదుండవై ధర్మార్థకామంబు లొం
డొంటి బాధింపకుండ నుచిత, కాల విభక్త
ముల్ గాఁ జేసి...భార. సభా. 1. 25.

ఆ. క్షత్త్రియమునకుఁ బుట్టఁగా బట్టు బ్రహ్మంబు,
బ్రాహ్మణునకు యోని రాజు గాన, నుభయ
వర్ధనంబు నొండొంటి విడువమి, వెలుఁగు
రెండు మాయు విడిచెనేని. భార. శాం.
2, 814. ఆం. భా. 8. 68.

**ఒండొక¹ వ.** (ఒండు + ఒక) మఱియొక, వేఱొక.

ఉ. ...కుం,భాండుఁడు మంత్రివర్యుఁ డసురా
ధిపు నక్తఁ జూచి నేఁడు నీ,వొండొక
చందమై మిగుల నుబ్బెదు వచ్చిన మేలు
చెప్పుమా. ఉ. హరి. 5. 25.

క. నీ పుణ్యతనువువలనన, యీపుత్రకుఁ డుద్భ
విల్లి యొంతయు నొప్పున్, దీపంబువలన
నొండొక,దీపము పుట్టించినట్లు తేజం బెసఁ
గన్. భార. ఆది. 4 89.

**ఒండొక² – కొండొక అవ్య.** ఇంచుక, ఇంచు
కైనను.

శా. అన్నం బొండొక లేదు చల్ది యది వి న్నర్థ్వ
శ్రమారూఢతే,మ్మన్నం బెచ్చెద...పాండు.
4. 176.

వ. ...తొలంగఁ ద్రోవరానితేమికి నొండొక
యుపాయంబు మదిం దోఁపమికిం గొండొక
చింతించి ధీరతావధీరితమందరుండగు పురం
దరుండు ధైర్యం బవలంబించి ... విక్ర.
2. 188.

**ఒండొకఁడు వ.** (ఒండు + ఒకఁడు) 1. ఇతరుఁడు.

గీ. మాత్రసంచి తలాడగా మార్గవేది,నొక్కఁ డార్యులు గీత లొండొకఁడు దా ను,భావి తంబులుగాఁ దోడి బ్రాహ్మణౌఘ, ముఖ సుపోకకుఁ జదువఁ బరున్న వేళ. ఆము. 2. 74. ఆం. శే. 71.

2. ఇతరము, మఱియొకటి. (ఈ యర్థమున బొపవిభక్తికము. చూ. ఒకఁడు 1.)

**ఒండొకరుఁడు** — ఒండొరుఁడు. చూ.

గీ. అంతకంతకు నుత్సాహ మతిశయిల్లి, యుల్లమునఁ బల్లవింపఁగ నొండొకళ్లఁ, బిలిచికొనుచును దమతమపేరు వాడి,కొనుచు దేవాసురులు దుగ్ధవనధిఁ జేరి. దశా. 2. 183.

**ఒండొరుఁడు** — ఒండొగువుఁడు, ఒండొకరుఁడు. న. (ఒండు+ఒరుఁడు.) అన్యోన్యము, పరస్పరము. (ప్రథమైకవచనాంతమునకు మాత్రము ప్రయోగము కనఁబడ లేదు.)

వ. అని యిట్లు గంగావనువు లొండొరులు సమయంబు చేసికొని చనిరి. భార. ఆది 4. 181

మ. పరమాస్త్రైక విశారదుల్ బలయుతుల్ పాంచాలకౌంతేయు లొం,డొరులఁ మార్కొని యేయునప్పుడు .... భార. ఆది. 6. 85.

క ఒండొరులకు రక్షకులై,యుండుదురు ... భార. శాం. 2. 200.

క. అని యొండొరులు వచించుచుఁ, గనఁగ... దశా. 1. 194.

చ. పరువడి నొండొరుం జెనఁగి పట్టుచుఁ ద్రోచుచు నీడ్చుచుఁ బర,స్పర జయకాంక్షులైన బకపాండవవీరుల పాదఘట్టనఁ... భార. ఆది. 6. 296.

ఉ. ఒండొరు కేతువుల్ దునిమి...నిశాంతవిస్ఫు రత్కాండచయంబు లొండొరులకాయము లఁ వడి గ్రుచ్చి...భార. కర్ణ. 1. 108.

**ఒండొరువుఁడు** — ఒండొరుఁడు.

క. ఇరువురు నొండొరువులఁ గడు,నురుచిరముగఁ జూచు వాఁడిచూడ్కులు దవకున్, శరములు గాఁగొని యేసెను,మరుఁ డయ్యిరువుర మనోభిమానచ్యుతి గాన్. భార. ఆది. 4. 146.

చ. అరదముమీఁద మున్ పొలుచునాఁతఁడొ యిప్పటియాతఁడో దివా,కరుఁ డను నంది యంబు భుజగంబుల చిత్రములందుఁ బుట్టి యొం,డొరువులతోడ వారు కడు నొప్పు నఁ బల్కఁగ... భార. శాం. 6. 608

క. రెండుబలంబులవారలు, నొండొరువులకంటెఁ జాల నుక్కు మిగిలి యొం,డొండ కడంగుచు నుజ్జ్వల,చండస్థితి నొప్పిరపుడు జగతీనాథా. భార. భీష్మ. 1. 118

**ఒందించు** స. క్రి. (√ఒందు) ఒందఁజేయు.

దండకము... గుజ్జుప్రోయాలికిన్ సజ్జకంబైన యందంబు నొందింపవే... పారి. 3. 88.

ఆ. అందు ముదిమి నొకటి యపనయించు. నొకటి చాల సిరుల నొందించు నని చెప్పి, యిచ్చి యనుప నిలకు వచ్చె నృపతి. విక్ర. 2. 153.

**ఒందిక** — పొందిక. వి (√ఒందు) ఒద్దిక.

సీ. కలశపాథోరాశికన్యకారత్నంబు నొందికతోఁ గూడియున్నవాని. వి. పు. 5. 79. (శ. ర. పాఠము - ఒద్దికతో అని ముద్రి)

**ఒందిలి** — ఒంజిలి. వి దుఃఖము, (చూ. ఒందిలిపడు) విశే. దుఃఖతుఁడు.

సీ. ...ఎవ్వనిమీఁద వాకనుగ్రహబుద్ధి వొడము నాఘునునివిత్త, మంతయుఁ గ్రమమున నపహరించిన వాఁడు ధనహీనుఁ డగుచు సంతాప మంద,విడుతురు బంధు లవ్విధమున నొందిలియై చేయునది లేక యఖలకార్య, భారంబు ఉడిగి....భాగ. 10 ఉ. 1284.

జ: ఒందిలిపడు.

**ఒందిలిపడు** అ. క్రి (√ఒ దిలి) దుఃఖపడు, వ్యాకులత నొందు.

వ. సహోదరహితులై యొందిలిపడి యునికిం జేసి వసుదేవమానులు దీనికిం బ్రతివిధానంబు నేరక చిక్కువడుదురు. హరి. ఉ. 1. 88.

**ఒందు** — పొందు అ. క్రి. (త. ఒష్టు. క. ఒందు.)

1. కలుగు, అగు.

మ. అనిలం బప్పురిఁ గౌరచిత్తముల కత్యా
నంద మొందంగ నందిని యన్నేటితరంగ
లం బెనఁగుచున్. భార. ఆది 8, 79.

సీ. విమలశస్త్రజలవహ్నివిమతతస్కరబాధలొంద
వెన్నఁడు...హరి. పూ. 4. 67.

2. ఒప్పు. (ఈ యర్థమునఁ గొన్నిపట్ల వాక్యాలంకారముగా నుపయోగింపఁబడును.)

ఉ. ...వారలఁ బంపి తెచ్చి నాఁ గొందఁగ
వండి పెట్టుము రసోత్కట మానవమాంస
ఖండముల్. భార. ఆది. 6. 186.

సీ. అందు ఋచీకున కొందంగ జమదగ్ని యను
ముని పుట్టె... భార. ఆది. 3. 70. హరి.
ఉ. 3. 163.

వ. క్రి. 1. పడయు, పొందు.

ఉ. చెందుచు నుండుఁ బుణ్యములు సేసి సుర
త్వము మర్త్యకర్ముఁడై, యొందు నర
త్వముఁ దురితయోగమునఁ బశుకీటభావ
ముఁ, బొందు...భార. శాం. 5. 607,
విరా. 1, 138.

2. చేరు

గీ. నగరిపుసమానుఁ డీరీతి నగరి కరిగి, సింధు
రము డిగ్గి గాంధారి సింధు కుఱు, కాశ
ముఖ్యుల ననిపి ప్రకాశవృత్తి,శాంతి మగు
నాత్మకేళీనిశాంత మొంది వసు. 3. 92.

ఉ. మచ్చిక రెట్టిగాఁగఁ దనమందిర మొంది...
కేయూర. 3. 274.

3. తాఁకు, స్పృశించు.

గీ. అపుడు పద్మాక్షుఁ డవ్వీరూపాతునకు ధ,
రాతలము జానుపాణిశిరఃబు లొంద,
మ్రొక్కి...భార. ద్రో. 5. 409.

మ. అని యిట్లగ్నివిశేషపమంబు లగుదుష్టాలాప
ముల్ వీనులొందినఁ జిత్తం బెరియంగ...
హరి. పూ. 2. 178.

4. (రతియందు) కలియు, కూడు.

క. గురిపెందఁ జైత్రుఁ డొందఁగఁ, గరములు
కన్ మావి యవుడుకఱచిన నునువా, తెర
మీఁదఁ గానవగు వలు,వరుప యనన్ నవలు
పల్లవము పై మొనసెఁ. పారి. 3. 48.

అందమొందు - అందముకలిగియుండు, ఒప్పు.

క. తననీచయోని వడు చేరని సకళత్రముసు
మమపదారాధన కొందిన విష్ణుకమఠ
రూపమొ, యనఁ దగి మీఁగాళు లగజ
కందం బొందుఁ. కు. సం. 3. 288.

మఱపొందు - విస్మృతమగు.

గీ. జడసముత్సాహి వగుటకు జడధి సాక్షి,
వామనుఁడ వగుటకు బలీశ్వరుఁడు సాక్షి,
మందమతి పౌటు నది మఱపొందెఁ గాక,
సరవిఁ జేర్కొనఁ దరమె నీసటలు కృష్ణ.
జై. భా. 1. 126.

జ: ఒందించు, ఒందిక.

ఒక - ఒక్క, న. వృత్తియందుఁ బ్రత్యయము లోపించినరూపము. ఒకండున్, కొండొక అను నవి విశేషప్రయోగములు. (సం. ఏకః ప్రా. ఏకో.) 1. ఏకార్థకము,

చ. మతజలపూరితంబులగు నూతులు నూఱిటి
కంటె సూనృత వ్రత యొకబావి మేలు...
భార. ఆది. 4. 98.

2. సామాన్యము, సాధారణము.

క. నరుఁ డొకరథికుని యనుమతిఁ, దొం
దలఁచునె మనుజనేన సురబలమైన, నైరలిచి
కొని విచ్చలవిడి. నరుగుం దనవలచినెడకు
నది యట్లుండెన్. భార. ద్రో. 4. 147.

ఆ. యోగబలము లేని యొకభంగియోగి బల్
ద్రోపు లేని మీను నేపు లేని మృగము వలయు
నురియుఁ దెగిపోవ నుఱకంగ,లేనియట్ల
భవములోన నడఁగు భార. శాం. 5. 578.

3. అన్యము, వేఱైనది.

గీ. ... భీము, డెచట నున్నాఁడు నాయెడ
లెట్లు ప్రాణసహితమై యుండు నతఁ డొక
చందమైన, నేమిగతిఁ బోదు నక్కట
యెఱుఁగఁ జెపుమ. భార. భీష్మ. 2. 365.
(ఒక చందమైన - మరణించిన)

ఆ. నీవి దేమి చెప్పు నేఁ డొకలాగునఁ, గాని
పించుచున్నదాన వబల. కళా. 7. 218.
(ఎప్పటి యట్లు గాక వేఱువిధముగా అని భావము.)

4. ఒకానొక (అనిర్దేశమును దెలుపును).

క. విలువిద్య నొరులు నీ కగ్గలముగ లేకుండ నిన్నుఁ గఱపుదు నని మున్, పలికితిరి నాక కాదీ, త్రిలోకముల కధికుఁ జూచితిమి యొక యెఱుకున్. భార. ఆది. 5. 259.

5. అనిర్వాచ్యము.

సీ. మగమీల నగఁజాలు తెగ గీలుకొను వాలుఁ గనుఁగవ కొకవింత కాంతి యొదవె. పారి. 1. 158.

6. గణనీయము, ఎంచదగినది.

ఉ. వేలుపుఱేని గెల్చు టొక విక్రమమే బలిదైత్య వల్లభా. దశా. 2. 423.

7. కొన్నిపట్ల వాక్యాలంకారముగా నుపయుక్తము.

శా. ...ఇం కొక కొంత సేపునకు ... ఆము. 5. 59.

గీ. క్రొంచ మొక కొన్ని గ్రుడ్డులు గాంచె మింట ... ఆము. 4. 179.

సీ ....చంచు లొకించు కాకుంచితముగ. నైష. 1. 98.

క. క్రుయ్యదొకయించు కైనన్. భాగ. 9. 577.

8. కొంత. (ఈయర్థము 'ఒకవడి' అనుచోటనే కనఁబడుచున్నది.)

క. ఊరికిఁ బోయెద మే మని, పూరితబాష్పాతుఁ డగుచుఁ బోయిన విప్రుం, డూరక యొకపడి నిలిచి య,గారంబున కేఁగి లజ్జ గదిరినమదితోన్. కేయూర. 3. 237.

క. ప్రకృతికరంబుల నిరువురు, నొకవడి పోరాడి యుడిగి...హరి. ఉ. 10. 176.

ఒకందున్ - ఒక చోటను.

క. ... ఈ, వ్రీడావతీకదంబక, చూడామణి వంటిదానిఁ జూడ మొకందున్. రసిక. 2. 67.

ఒకకాలమున్ - ఏకాలమందును, ఎప్పుడును. (ఇది ఈ యర్థమందు వ్యతిరేకార్థముతోఁ గూడి యుండును.)

చ. ... నరేంద్ర యప్డు సంగర మతిఘోర మయ్యె నొక కాలము వట్టివి మూడ మెయ్యదన్. భార. ద్రో. 3. 117.

ఉ. కన్నులు చిత్తజాతుఁ డొక కాలము నేయని పుష్పబాణముల్. కాశ. 4. 46.

ఇట్లే 'ఒకనాఁడును' ను. భార. ఆది. 4. 114.

ఒకకుత్తుకగు - ఏకగ్రీవము కలవారగు, ఒక మాట కలవారగు, ఐకమత్యము కలిగియుండు.

గీ. అందునది భూతిఁ దొలుత నీయనుఁగు భార్య, యందుకొనువాఁడ వీవు నన,ంతరమున, బాలుమగఁడును నొకకుత్తుకైనఁ గాక, యిట్టిధర్మంబు మిన్నక యేల కలుగు. హం. 2. 60.

ఒకపూఁట కొకపూఁటకు - పూఁటపూఁటకు, అంతకంతకు, క్రమక్రమముగా.

సీ. పార్వతీప్రాణేశభక్తియుఁ గూఁకట్లు వెలసి నానాఁటికి వృద్ధిఁబొంద, వారికులాచారవాసనాశాస్త్యంబు లొక పూఁట కొకపూఁట కుడిగిపోవ. కాశ. 4. 23.

ఒకమరికొకమరి - ఒకసారికంటె నొకసారి, అంతకంతకు, క్రమక్రమముగా.

క. ఒకమరికొకమరి కించి, ద్వికచారుణపద్మపత్త్రివీథివిగళ,న్మకరందధారగతిఁ దన, ముకుళితనేత్రమున బాష్పములు ఘన మైనన్. కాశ. 8. 107.

ఒకవేళ :—పక్షాంతరమును దెలుపును

ఉదా: వాఁడు రేపు వచ్చెదనన్నాఁడు. ఒకవేళ రానిచో మన మేమి చేయవలయును.

జ: ఒకఁడు, ఒకట, ఒకటి, ఒకత, ఒకతి, ఒకతుక, ఒకతె, ఒకప్రొద్దు, ఒకరిత, ఒకరితి, ఒకరితె, ఒకరుఁడు, ఒకరువుఁడు, ఒకర్త, ఒకర్తి, ఒకర్తు, ఒకర్తుక, ఒకర్తె, ఒకానొక, ఒకొ, ఒకొత, ఒకొతి, ఒకొతుక, ఒకొతె, ఒకరిత, ఒకొరితి, ఒకొరితె, ఒకొర్త, ఒకొర్తి, ఒకొర్తు, ఒకొర్తుక, ఒకొర్తె, ఒక్క, ఒక్కఁడు, ఒక్కట, ఒక్కటి, ఒక్కత, ఒక్కతి, ఒక్కతుక, ఒక్కతె, ఒక్కప్రొద్దు, ఒక్కరిత, ఒక్కరితి, ఒక్కరితె, ఒక్కరుఁడు, ఒక్కర్త, ఒక్కర్తి, ఒక్కర్తు, ఒక్కర్తుక, ఒక్కర్తె, ఒకొ్క[1], ఒకొ్కట, ఒకొ్కటి, ఒకొ్కఁడు, ఒకొ్కత, ఒకొ్కతి, ఒకొ్కతుక, ఒక్కతె, ఒకొ్కరిత, ఒకొ్కరితి,

ఒక్కొరితె, ఒక్కొరుఁడు, ఒక్కొర్తె, ఒక్కొర్తి, ఒక్కొర్తు, ఒక్కొర్తుక, ఒక్కొర్తె.

**ఒకఁడు** – ఒక్కఁడు. వి. (ఇది అమహదర్థమున ద్వితీయావిభక్తికము :– మహన్మహదర్థక బహు వచనములు 'ఒకరు, ఒకండ్రు, 'ఒకరు' ఏక వచనార్థమునఁ గూడ తఱచుగా వచ్చును. ఉదా: ఆస్త్రీపురుషులిద్దఱలో దీని నొకరికిమ్ము –సం. ఏకః) 1. ఒకటి.

శా. ధీరత్వం బొకఁడున్ సహాయముగ రాధేయుండు దివ్యాస్త్రసం,చారోల్లాసము సూపె.... భార. ద్రో. 5. 326.

మ. తరుణత్వత్వత్ప్రసూనబాణపంచకమునం దైక్యా బలాశ్రేణి త,ద్వగసందోహము యుష్మదాత్మకజరద్బాణం బొకంట వైచెన్,ద్వరఁ గావించితివి...ఆము. 4. 80.

క. మన కొకటం బాపము రా,కునికిఁ గత మైన పలుకు లొండెను గలుగున్. భార. ఉద్యో. 3. 80.

గీ. ఒకట నైనను వారియం దొకరిలోని, చిదుర పాలును బోలండు...భార. ఉద్యో. 2. 161.

చ. ఒకటను మేలు నేయని సుయోధనుఁ డమ్మెయి దేవపూజ్యుడై, సకల సుఖానుభూతియు నజస్రము పెంపు వహింప.... (ఒకటన్ – ఒకవిషయమునను.) భార. స్త్రీ. 25.

2 ఒక పురుషుఁడు, ఏకాకి, ఒంటరి.

క. ఎల్లరు మెచ్చని మత్కృతి, యల్లంబున మెచ్చుఁ గాక యొకఁ డుష్టకులం, బొల్లని పల్లవితామ్రము,గొల్లలుగాఁ బొగడ నొక్క కోయిల లేదే. కవిక. పీఠి. 30.

గీ. వచ్చి యరదంబు డిగ్గి తద్ద్వారసీమ,దారుకుని మంద నియమించి తాన యొకఁడు, కమలనాభుండు కక్ష్యాంతరములు గడచి. పారి. 1. 105.

3. అన్యుఁడు.

(వ్యవ) వాఁడు ఒకనిమాట వినఁడు.

4. ఏకీభూతుఁడు, కలిసినవాఁడు,

ఉ. అగ్గణముఖ్యులోడ నొకఁడై సరి నా చెలికుల్ ధరించి తా,దిగ్గన వచ్చె శంకరుఁడు దెప్పర మైనవడిం జెమర్చుచున్. హర. 1. 21.

ఒకరొకరు – ఒక్కొక్కరు,

క. వెకలిచి యిచ్చినఁ జాలుం, బ్రకటితదోశ్శక్తి బెండువలెఁ దెచ్చెద మే, మొకరొకరమె యని దైత్య, ప్రకరమ్ములు మదము మీఱి పలుకఁగ వించున్. దశా. 2. 168. (ప్రత్యేకముగా అని అర్థము.)

**ఒకట** – ఒక్కట. అవ్య. ప్రా. (√ఒక) (ఏక కాలమున, ఒక్కమాఱుగా.)

గీ. ...కృష్ణుండు నాలుగుతూపు లొకట,నేసి చేసె యుగ్యంబుల నిలఁ బడంగ. హరి. ఉ. 1. 120.

**ఒకటి** – ఒక్కటి. వి. (√ఒక. సం. ఏకః. చూ. ఒండు.)

1. ఏకము, ఏకత్వసంఖ్యాకము.

ఆ. కంచె తాలిబొట్టు కమ్మలు కడియంబు, లొక్కవన్నె చీర యొకటి రెండు, వీడియములెకాని విభవము ల్గలిగియు, వలవకుండు దైత్యవరపురంధ్రి. దశా. 4. 58.

చ. చెలువయు నంత నందొకటిచే జనితాధర పీడయై... కళా. 5 27. (ఒకటిచే – ఒక దుఃఖముచేత.)

2. ఒకసంగతి, ఒకవిషయము.

గీ. అనుఁగు చెలికాఁడ యొకటి నిన్నడిగి తెలియ, వలయు నని యుండుదును .... కళా. 7. 6.

గీ. కలవి మామూఁక నిప్పింతుఁ దొలఁగుఁడొకటి,యాఁడుదానిఁ జే నంటకుఁ డనుచు ...ఆము 6. 77. (ఒక సంగతి వినుఁడు అని భావము.)

3. అన్యము, భిన్నము, వేఱు.

ఉదా: వాఁడు చెప్పినది యొకటి చేసినది యొకటి.

క. వల దిటువలెఁ గయ్యాళితి, పలుకులు పలుకంగ నింత పదరం దగునే, తలపోసి చూడ

తెన్నఁగ, నెలఁతా రత్నాంగి యొకటి నీ వొక్కటియే. సారంగ. 2. 109.

4. సమానము.

ఉదా: ఈవిలో తండ్రియు కొడుకును నొకటియే.

**ఒకటికి** — మూత్రవిసర్జనమునకు.

సీ. ఒకటికి నెల వియ్య నుఱికి చీఁకటిదాఁకఁ బములగాపరుల వెంబడిన పోదు. హంస. 3. 142. (ఇట్లే ఒంటికి.)

**ఒకటియగు** — 1. ఏకమగు.

(వ్యవ) అన్నయు తమ్ముఁడును ఒకటియైనారు.

2. అన్యథాయగు.

క. అతఁడొకటియైన నేనే,గతిఁ బోదుం జెపుమ యెల్ల కార్యంబులలో, నతనికిఁ దోడ్పడఁ బోవుట,యతి ముఖ్యము దానిఁ జేయు మనఘ విచారా. భాం. ద్రో. 3. 287. (చచ్చు - అని భావము.)

**ఒకత** — ఒకతె.

క. నీ వొకత వేల యిలఁ బడి,వేపుర నే వలచి పట్ట వెదకిన నడ్డం,బై వచ్చి వలదు నా నిం,దేవాఁడు మగండు... భార. విరా. 2. 256. శుక. 3. 344.

**ఒకతి** — ఒకతె.

**ఒకతుక** — ఒకతె

**ఒకతె** న. ఏ. — ఒకత, ఒకతి, ఒకతుక. (ఇది 'ఒక' శబ్దము యొక్క మహత్యర్థకరూపము.) ఒక స్త్రీ; అన్యస్త్రీ.

సీ. అదివోయి యెంతసేపయ్యెఁ జూచితె తోడుకొనివత్తు నేనంచుఁ జనియె నొకతె. కళా. 7. 148.

(వ్యవ) ఒకతెను పిలువఁగా ఒకతె వచ్చినది.

**ఒకప్రొద్దు** - ఒకప్రొద్దు. (√ఒక.)

ఆ. కొట్టగించ నోరఁ గొఱికియు నొక ప్రొద్దు, తెలియుచుకొన్న విధము కొలఁది లైన, నిరులు నమ్మి నీదు శ్రీపాదచింతన,మఱచి నాఁడ కెంత మందమతిని. కుచేల. 3. 52.

**ఒకరిత** న. ఏ. — ఒకరితి, ఒకరితె, ఒకర్తు, ఒకర్తి, ఒకర్తు, ఒకర్తుక, ఒకర్తె. (ఇది మహత్యర్థక రూపము — √ఒక.) ఒక స్త్రీ; అన్యస్త్రీ.

గీ. వీణ వాయింపఁ బొగడంగ విరులు గట్ట, నేర్పువట్టిది యొకరిత నియత యోర్తు. కాశీ. 5. 316.

**ఒకరితి** - ఒకరిత.

**ఒకరితె** - ఒకరిత.

**ఒకరుఁడు** — ఒకరువుఁడు. న. (√ఒక — సం. ఏకః. ఒకరులు, ఒకళులు, ఒకళ్లు - ఇవి మహత్యర్థకములు కూడనగును — వీనికి ఏక వచనార్థమందును ప్రయోగములు గలవు.)

1. ఒక పురుషుఁడు; ఒకానొకఁడు.

చ. కలఁ డొకరుండు పేరుకొనఁగాని కులంబు మదీయభక్తుఁడు... ఆము. 6. 3.

క. ఏవేళఁ జూచినం దన. శ్రీవాకిటఁ బగటివేళ శివయోగివరుల్, వేవేలసంఖ్య లుండెద, రావేళ నొకళ్లు లేమి యద్భుతమయ్యెన్. హర. 2. 38.

2. అన్యుఁడు.

చ. ఒకరుని చేతి ప్రోవును దదున్నతిప్రాపును గాంచి యెల్ల వెం,టకును గొఱంత లేక పొగడం దగు సంపద నొంది...భార. ఉద్యో. 2. 77.

చ. ...మౌనులు శాపమిచ్చి రి,తని కొకరుండు పేర్కొనినదాఁక స్వశక్తి యెఱుంగకుండఁ గన్. ఉ. రా 5. 35.

శా. నాచేతం దొలుమేన నిష్ఠురగతిఁ నానా విషాదోన్నమ,ద్వైచీదుస్తర మైన పుత్ర విరహార్తిం ద్రోవఁబడ్డా రొక,ళ్లిచందఁబున నిప్పుడా ఫలము నా కేతెంగులం దప్పునే. భా. రా. అయో. 30.

3. ఒంటరి, ఏకాకి.

చ. అరుదుగ విక్రమార్క వసుధాధిప చంద్రుఁడు కీర్తిచంద్రికల్, ధరఁ బరఁగింప దిగ్విజయతత్పరుఁడై యొకరుండు వింధ్యభూ,ధరమున కేఁగి...విక్ర. 2. 2.

**ఒకళ్లొకళ్లు** - ఒకరొకరు

వ. మీమీధనువుల బాణంబులు సంధించి నా పంచినయప్పుడ యుప్పతిలఁ దెగవేయుం డే నొకళ్లొకళ్లన పంచెద నని ముందఱ ధర్మ

నందము విలిచి ... భార. ఆది. 5. 248.
(ఒక రొకరిని అని అర్థము.)

చ ... ఒకళ్లొకళ్ల కై, యెదురుగ వచ్చి వచ్చి యొక యుద్దలు ముద్దియ లొత్తిరివ్విభున్. నైష. 3. 86. (ఒకతెకొకతె యొకతె - అని భావము)

**ఒకరువుఁడు** - ఒకరుఁడు. (వి. 'ఒకరువులు' - ఇది మహత్త్వర్థకముకూడ నగును — ఇందలి 'వు. రువు.క.కవు.' లోపించి 'ఒకరుఁడు, ఒకఁడు, ఒవువుఁడు, ఒరుఁడు' అను రూపములు క్రమముగా నేర్పడినవి.)

**ఒకర్త** - ఒకరిత.

**ఒకర్తి** - ఒకరిత.

**ఒకర్తు** - ఒకరిత.

సీ. చక్రవర్తినొకర్తు సక్కనికువలయంబుల ముంచి యివి నీకుఁ బోలు ననియె. ఉ. రా. 3. 215. కాశీ. 5. 316.

**ఒకర్తుక** - ఒకరిత.

**ఒకర్తె** - ఒకరిత.

గీ. జాలుసిగ కేల నొత్తుచు జాలువాఱెఁబుంగు దుప్పటివలెవాటుకొంగు జాఱఁజీర కెంగేలఁ బూన నెచ్చెలి యొకర్తె, యంబుజాక్షి దరుఁ దంతిపురంబు వెడలె. దశా. 3. 144.

**ఒకానొక** వి. (√ఒక - వృత్తియందు ప్రత్యయము లోపించినరూపము. దీనికి ప్రత్యయము చేర్చునపుడు మహదర్థమున 'ఒకానొకఁడు' మొదలగు రూపములును, మహత్త్వర్థమున 'ఒకానొకత' మొదలగురూపములును, అమహదర్థమున 'ఒకానొకఁడు, ఒకానొకటి' యను రూపములును సిద్ధించును.) నిర్దేశములేమిని దెలుపును.

గీ. మది నొకానొకయెడ రోష మొదవెనేని, నేర్పు గల దూతి యొకరీతిఁ దేర్పవలయు. శుక. 1. 255.

మ. ...ఒకానొక మరున్నారీశిరోరత్నమున్. మనుచ. 2. 25.

**ఒకానొక్క** - ఒకానొక

క ...అలలనామణి కాగ, యొక్కొక నొకానొక్క వేళ...పాటలన్ దగ నేర్పున్ శుక. 1. 433.

**ఒకో¹** - ఒక్కొ¹. చూ. (√ఒక.)

**ఒకో²(కో)** - ఒక్కొ². అవ్య. 1. ప్రశ్నార్థకము.

గీ. ...ఆరాజనందనుండు, దీని యావలిదెస నొకో ద్విజకుమారవరులయూ రని యడుగంగ. మార్క. ?. 66.

2. ఏమో, కాఁబోలు, (ఊహను దెలుపును.)

క. ...దీనున్.... శరణుచొరఁగఁ గూల్చుట కడుఁగీడు... అను కణ్వవాక్యములు తలఁపరొకో. ఆము. 3. 50.

చ. ...కర్ణుఁడు పుట్టె సూర్యమండల మొకో భూతలంబున బెడంగయి దీప్తిసహస్రకంబుతో, వెలిఁగెడు నా నిజద్యుతి సవిస్తరలీల వెలుంగు చుండఁగన్. భార. ఆది. 6. 26. (ఇట ఉత్ప్రేక్షావాచకము.)

3. కాక్వర్థకము.

శా. ఘంటాకర్ణునిమించుకర్మమొకో నాకర్మంబు మౌనీంద్రులన్, దుంటల్ సేయఁడె మాన్పి యీఁడె భగవంతుం డట్టి (శ్రీ). ఆము 6. 58.

4. సందేహమును దెలుపును.

క. ఈ మేలు వ్రజ కొనర్చిన, యామహిమకు నెలవు గొంతియగ్రతనయుఁడో, భీముఁడొకొ తమ్ముఁగుట్ట లొ,కో మఱి యెవ్వరొకొ తలఁపు కొలఁదికి మీఱా. భార. ద్రో. 2. 229.

**ఒకోఁడు** - ఒకఁడు.

**ఒకొట** - ఒకట.

**ఒకొటి** - ఒకటి.

**ఒకొత** - ఒకొతె.

**ఒకొతి** - ఒకొతె.

**ఒకొతుక** - ఒకొతె.

**ఒకొతె** వి. ఏ. - ఒకొత, ఒకొతి, ఒకొతుక. (√ఒకో¹) ఏకస్త్రీ; అన్యస్త్రీ.

**ఒకొరిత** వి. ఏ. - ఒకొరితి, ఒకొరితె, ఒకొర్త, ఒకొర్తి, ఒకొర్తు, ఒకొర్తుక, ఒకొర్తె. (√ఒకో¹) ఒక స్త్రీ; మఱియొక స్త్రీ.

**ఒకొరితి** - ఒకొరిత.

**ఒకొరితె** - ఒకొరిత.

**ఒకొరుఁడు** — ఒకరుఁడు.

**ఒకొరువుఁడు** — ఒకరుఁడు.

**ఒకొర్త** - ఒకొరిత.

**ఒకొర్తి** - ఒకొరిత.

**ఒకొర్తు** - ఒకొరిత

**ఒకర్తుక** — ఒకొరిత.

**ఒకొర్తె** - ఒకొరిత.

**ఒక్క** - ఒక. (√ఒక).

(ఏకార్థకము)

సీ. కడకు వెళ్లఁగ నొక్క కడనుండి... అము. 2 58.

(ఏకీభూతము.)

చ ఉడుగక యొండొరుం జఱచి యొక్క బలంబున దేవదానవుల్, వడిగొని వార్ధి నిట్లు దరువన్ దరువన్.... భార. ఆది. 2. 15.

(కేవలార్థకము)

ఉదా : ఒక్క బియ్యముతో సంతర్పణము సాగునా?

సీ. ఇఁక నొక్క యేమె కాదిల మఱి యెవ్వాఁడు నెఱుఁగఁడు.... అము. 8 24.

(అన్యము)

ఉ. వీరును వారుఁ బోలెఁ బృథివీవర మాగురు లొక్కచోటికిన్, రారు...పరమ. 2. 60.

(అనిర్వాచ్యమైనది.)

సీ. జాళువాజిగిజిరాసరిపెణల మెఱుంగు చిలుక తాళికి నొక్కసిరి యొసంగ. శుక. 1. 160.

(ఒకానొక - నిర్దేశముతేమివి దెలుపును.—)

వ. సింగపుఁబల్ల నమ్రుబ్రోక యక్కడ నొక్క మఱుంగున డాఁచి.... కళా. 8. 82.

(ఇది:-పెట్ట, పెట్టునన్, మాటు, మొగిన్, ఉమ్మడి, సరి, సారి, ఊఁకునన్ మున్నగుశబ్దములకుఁ బూర్వము ప్రయుక్తమై వానితోఁ గలిసి యుగపదర్థక మగును.)

ఒక్క పెట్ట.

చ. ...పాండవసైన్య మొక్క పెట్ట పరఁగి ...భార. ద్రో. 5. 98.

ఉ. అందును నిందుఁ జేయఁగల యట్టి భటుల్ దలపడ్డ సైన్యముల్, గ్రందుగ నొక్క పెట్ట తమకంబునఁ బోరుట చూచి కైకసీ, నందనుఁడు ... నిర్వ. 4. 47.

ఒక్కపెట్టునన్.

ఉ. ....మగుత్తులు బి ట్టెదిరించి యద్రిశృంగ ద్రుమసంఘముల్ గురిసి కాఱియపెట్టిర యొక్క పెట్టునన్. ఉ. రా 4. 327.

ఒక్కమాటు.

ఉ. ...తన్నఘురాధరామృతా, క్రాంతిఁ సోద్ధతిం దన మొగంబులు నాలుగు నొక్కమాటు యత్యతముఁ దత్తఱిల్లఁగ. శా. 5. 14.

ఒక్కమొగిన్.

ఉ. ... పర్వతము లొక్కమొగిన్ గదలెన్ మహోల్కముల్, మొత్తము గట్టిరాలె ... నిర్వ. 2. 98.

ఒక్క యుమ్మడిన్, ఒక్కుమ్మడిన్.

చ, కడఁగి సుయోధన ప్రభృతి కౌరవవీరులు భీష్ముతోన బె ట్టడరిన భీమముఖ్యు లగు నక్కడి యోధులు నొక్కయుమ్మడిన్, వడిఁ దలపడ్డ ...భార. భీష్మ. 2. 131.

శా. .... బహుసంతు శ్రేణితో దోర్బలాహంకారంబునఁజేరి రప్పురి నిశాటాధ్యక్షు లొక్కుమ్మడిన్. ఉ. రా. 1. 292.

ఒక్కసరి.

క. ...తరుచరరక్షో, వీరు లిటు లనుచుఁ బోగడిరి. సారెకు బహువార్ధు లొక్కసరి మోయు రహిన్. ఉ. రా. 5. 796.

ఒక్కసారి,

గీ. ధవళ కేతన రుచులు ఛత్రముల రుచులు, చామరంబుల రుచు లొక్కసారి నిగిడి, మెండుకొని వెండికొండపై నిండ....ఉ. రా 2. 881.

ఒక్కూఁకునన్.

ఉ. ప్రాఁకుదమా త్రికూట శిఖరంబులమీఁదికి నెల్ల వారు నొక్కూఁకున నంచు... భా. రా. యు. 280.

ఉ. తాఁకి భుజావిజృంభణము దర్పము నేర్పును నేర్పడంగ నొక్కూఁకున వేయి చేతుల

మహోగ్రశరావళి పింజ పింజతోఁ, దాఁ
కఁగ నేసినన్. భాగ. 10. ఉ. 436.

(వాక్యాలంకారముగా నుపయుక్తము.)

మ. మది నొక్కింతుక శంక లేక సమరోన్మా
దంబునం బేర్చు....పారి. 5. 17.

సీ. ...ఎద నహంకార మొక్కింతయేని, లేదు
... భార. శాం. 5. 32.

ఒక్కంత - సమానము.

క. సంతోషామృతసుఖతృప్తాంతుం డగునేని
నట్టివాఁడు గృహంబుం, గాంతారదేశ
మును నొక్కంతగ నిశ్చింతవృత్తి నషో
భ్యుఁ డగున్. భారం. శాం. 6. 387.

క. విను పృథివియును సరస్వతి,యును గోవును
దాననిధికి నొక్కంతలుగా, వినియుండుదు
వీనిం బో,లినదాతవ్యములు నొండు లే వని
విందున్. భార. అను. 2. 411.

ఒక్కఁతగ - 1. ముక్కముక్కలుగా.

ఉ. అంతటఁ బోక మూఁడు నిశితాస్త్రము
లుద్ధతి నేయఁ జాప మొ,క్కంతగఁ ద్రుంచి
యశ్వనివహంబుల నొంచి...జై. భా.
2. 68.

2. ఏకముగా.

ద్వి. పాటించి మణిఫణాపంక్తులచేత, హాటక
గిరిఁ గప్పె నపుడు శేషుండు, నన్ని వాయు
వుల నొక్కంతగాఁ గూర్చి, పన్నగవరుఁ
గరువలి కాఁకుటయును. రం. రా. ఉ. 10.
పా. 12. పం.

3. ఒక్కమాఱుగా, యుగపదర్థకము.
ఆం. భా. 3. 80.

ఒక్కరూపు - సమానము.

క. కౌరవులకుఁ బాండవులకు, నారయ నే
నొక్క రూప... భార. ఉద్యో. 1. 41.

ఒక్కొకఁడు - ఒక్కఁడొకఁడు.

చ. పొలయక నిత్య మొక్కొకని పూనికివోలె
వధించి నేమమున్, బలిమియు నేర్పడం గడఁ
గి భైరవపూజ యొనర్చు నుగ్రుఁడై.
భార. సభా. 1. 118.

ఒక్కొక్కరుఁడు - ఒక్కఁడొక్కఁడు.

వ. ...గాంధారికి నొక్కొక్క దివసంబున
నొక్కొక్కరుండుగాఁ గ్రమంబున.. నూర్వు
రు కొడుకులు పుట్టిరి... భార. ఆది. 5. 107.

ఒక్కొక్కొరుఁడు - ఒక్కొక్కరుఁడు,

క. మాయం దొక్కొక్కొళ్లకు,రియార్థముఁ
దాల్చి శుభ చరిత్రుండై దీ,ర్ఘాయుష్యం
దష్టమవసు, వాయతభుజుఁ డుండు నీకు
నాత్మోద్భవుఁడై. భార. ఆది. 4. 130.
(ప్రతివాని యొక్క అని అర్థము.)

ఒక్కఁడు - ఒకఁడు. వి. (√ఒక్క - చూ. ఒందు-
అనుహాదర్థమున ఔపవిభక్తికము. బ. 'ఒక్కరు,
ఒక్కండ్రు'. ఇవి మహత్త్వర్థకములు గూడ
నగును. 'ఒక్కరు' ఏకవచనార్థమునఁగూడ
తఱచుగా వచ్చును. ఉదా: సీతారాములలో
నొక్కరికిది యిమ్ము.)

(ఒకటి)

సీ. ...నీనాలుక యొక్కఁ డయ్యె. ఆ. ప్రయ్య
వలయు నూఱు ప్రయ్యలు గాఁగ వ,క్లైనఁ
గాని చాల వతనిఁ బొగడ. భార. సభా.
2. 41.

సీ. వరరథ మొక్కండు వారణ మొక్కండు
తురంగముల్ మూఁడు కాల్వురును నేవు,రు
...భార. ఆది. 1. 80.

సీ. భల్ల మొక్కంటను విల్లు ద్రుంచుటయును
...హరి. ఉ. 4. 21.

సీ. భల్లి మొక్కట వానివిల్లు ద్రుంచుటయును
...హరి. ఉ. 1. 124.

(అభిన్నము, ఏకీభూతము; సమానము.)

చ. ... అ,హవభరు లైన భోజులును నంధక
వీరులు నొక్కఁడై దెసల్, సెవుడుపడంగ
నార్చి...భార. మౌ. 30.

ఉ. ... అ,య్యెద్దఱ పాదఘట్టితమహీరవ
మున్ విని చూప తెల్లనుం,దద్దయు భీతి
వచ్చుటకిఁ దారెడ గల్గఁగఁ బాటి రొక్కఁ
డై.... భార. ఆది 6. 297.

సీ. వీరలపలుకులు వేల్పులమతమును నొక్కండ
భార. ఆది. 7. 254.

(ఒక పురుషుఁడు)

సీ. ఆదినారాయణుం డాయె నొక్కఁడ బ్రహ్మ
లేఁడు మహేశుండు లేఁడు...ఆము. ౪. 10.
(ఒకానొకఁడు — నిర్దేశము లేమిని దెలుపును.)
గీ. స్థాణు వొక్కండు మగవాఁడు దలఁక కుమి
యఫల మొనఁగె నట్టి కినియక పద్మవదన,
వదనసుంc గూర్మి నొసఁగ నీవలదె పుష్ప,
మైన నను మాడ్కి నుమిసిన నలరెఁ
బోగడ. ఆము. 5. 129, 2. 71.
(అన్యార్థకము.)
వ. ...మఱియు నెన్నియేని విచిత్రంబులు గని
వచ్చినాఁడ నది యొక్కరితోడం జెప్పెడు
నంతఁక హృదయంబు వేగిరపడుచున్నది
...కళా. 2. 140.

**ఒక్కట** — ఒకట. అవ్య. ద్రు (√ఒక్క) 1. ఏక
కాలమున, ఒకమాఱుగా.
సీ. ద్రోణుండు మఱి పృషతున కుద్భవించిన
ద్రుపదుండు నొక్కటఁ దొడఁగి యిష్ట,
సఖులయి వేదముల్ సదివి....భార. ఆది.
7. 5.
గీ పాండు సుతులు శిఖండియుఁ జండశక్తి,
మెఱయ నొక్కటఁ జైపడ్డ ... భార.
భీష్మ. 1. 58.
మ. ...రాహుకేతువులయట్టు ద్రోత్తమాంగంబు
లొక్కట ఖండి చెను ..హర. 6. 127.
2. కూడ, కలిసి.
వ. ...దానితో నొక్కటఁ జని చని. భార.
ఆది. 3. 87.
వ. ...నలుండు దవదేవి నాశ్వాసించుచు నొక్క
టఁ జని... భార, అర. 2. 75.
3. ఏకత్ర, ఒకచోట.
గీ. ఒప్పు నేకత్రతుల్యమై యొక్కట నన. ఆం.
భా. 8. 79.
గీ. కడఁగి భక్షింప నొక్కటఁ గలసి యాడు,
చున్న యెలుకలపిల్లల యొందు సహజ,
వైరివర్గంబులయు సహవాస మపుడు,
మాచి...భార. ఆది. 4. 28.

**ఒక్కటి** — ఒకటి. వ. ఏ. (√ఒక్క—చూ. ఒండు.)
1. ఏకము.
(క) ఏక సంఖ్యాకము.
వ. ... ఒక్కనాఁడు పెక్కు మృగంబుల నెగచి
యొక్కటి నేనియు నేయం గానక ...
భార. ఆది. 5. 48.
(చ) అభిన్నము, ఏకీభూతము.
క. దేవా సురవరు లొక్కటి యైవచ్చినఁ జిక్కు
పఱచు నాహవమున నా దేవవ్రతుఁడు ...
భార. భీష్మ. 1. 51.
2. స్థిరమైనది.
క. నామన నొక్కటి యయ్యెను, నీ మన సా
రఁగ భుజింపు నీకే నధిక, ప్రేమమున
సమర్పించితి, నామే నిదె పుణ్యగతికి నమఁ
బుచ్చుపనా భోజరా. 6. 62.
(వ్యవ) వారందఱును ఒక్కటి మేమందఱ
మును ఒక్కటి.
3. అన్యము, వేఱు.
క. నెలఁతా రత్నాంగి యొకటి నీ వొక్కటియే
సారంగ 2. 109.
ఒక్కటిచేయు — ఏకము చేయు, కలుపు.
ద్వి. అచటికి నేతెంచి యని మాన్పి వారి,
నుచిత వాక్యమ్ముల నొక్కటిచేసి. రం.
రా. ఉ. 68. పొ. 9. పం.
వ. మంచి మూరుతమ్మున నాల్గురగల నొక్కటి
చేయఁ దలంచి... 8, 89.

**ఒక్కత** — ఒక్కతె.
(ఒక స్త్రీ)
ఉ. ...ఒక్కతన్, బాలికఁ దొల్లి యేవురకు
భామినిఁగా సృజియించి... భార. ఆది.
7. 211.

**ఒక్కతి** — ఒక్కతె.
వ. తొల్లి గౌతముండయిన జటిలుఁ డనుఋషి
కూఁతురు తపఃప్రభావంబున నేడ్వురు ఋ
షులకు నొక్కతియ భార్య యయ్యె.
భార. ఆది. 7, 251.

**ఒక్కతుక** — ఒక్కతె.

**ఒక్కతె** — ఒక్కత, ఒక్కతి, ఒక్కతుక. వ. ఏ.
('ఒక్క' శబ్దముయొక్క మహత్త్వార్థక రూపము.)
ఒకస్త్రీ; అన్యస్త్రీ. భార. ఆది. 8. 318.

**ఒక్కప్రొద్దు** — ఒకప్రొద్దు వి. (√ఒక్క)—ఒకప్రొ
ద్దుండెడి యుపవాసము — ఉపవాసము.

గీ. ఒక్కప్రొద్దుండి సిలయేట నుదకమాడి,
సాధసాధ్యుఁడు తండెయు నైజ మైన, చతు
రలంకారములు దాల్చి సహజభక్తి, నాత్మ
జునిఁ జూచి కై సేయు మన్న నతఁడు.
కాళ. 3. 37

సీ. తుదలేని యొక్క ప్రొద్దులచేతఁ గొన్నాళ్లు
ఘోరతపంబులఁ గొన్నినాళ్లు. శశాం. 2. 136.

**ఒక్కరిత** — ఒక్కరితి, ఒక్కరితె ఒక్కర్త, ఒక్కర్తి, ఒక్కర్తు, ఒక్కర్తుక, ఒక్కర్తె. న. ఏ. ('ఒక్క' యొక్క మహత్వార్థక రూపము.)
ఒక స్త్రీ; అన్యస్త్రీ
శా. నే నిర్మించిన కామినీమణులలో నీ టొందు
నీలాలకన్, నే నిం కొక్కరితన్ సృజింతు
....ఉ. రా. 5. 24.

**ఒక్కరితి** — ఒక్కరిత.

**ఒక్కరితె** — ఒక్కరిత.

**ఒక్కరుఁడు** — ఒకరుఁడు. (√ఒక్క - బ. ఒక్కరులు ఒక్కటులు, ఒక్కట్లు - ఇవి మహత్వార్థకములు గూడ నగును.)
(ఒక్క పురుషుఁడు)
చ. వింటుఁడు సూచుచుండ నిను వేపురముం
దట నట్లు ద్రోవ నొక్కరుఁడును గాదు
గూడ దనఁ గల్గెనె పోటరు లైనభర్త లే,
పురుగల రంటి.... భార. విరా. 2. 257.
గీ. తరుణి యేపురకంబె నొక్కరుఁడ భర్త.
యగుట లగ్గు.... భార. సభా. 2. 246.
(ఏకాకి, ఒంటరి.)
మ. ... ఒక్కరుఁడున్ గోవులలోనఁ జొచ్చు
బలుసింగంబొక్క నా నట్లు సొచ్చి గయం
భార నవేక వీర శిరముల్ చెండాడె నుద్దం
డుఁడై. భార. ద్రో. 2. 138.
(అన్యుఁడు)
శా. ....మీ. రింకం బోయి వరింపుఁ డొక్క
రుని భోగేచ్ఛన్ నివారించితిఁ. మనుచ.
6. 79.

ఒక్కొక్కరుఁడు — ఒక్కొక్కఁడు, ఒక్కఁ
డొక్కఁడు.
వ. ... ఇయ్యష్టమపుత్రుండు వసువులయం
దొక్కొక్కళ్ల చతుర్థాంశంబులు దాల్చి సకల
ధర్మమూర్తియయి పుట్టినవాఁడు... భార. ఆది.
4. 153. (ప్రతివాని యొక్క అని భావము.)
వ. ...గాంధారికి నొక్కొక్కరుండుగాఁ గ్రమం
బున... నూర్వురు కొడుకులు పుట్టిరి.
భార. ఆది. 5. 107.

ఒక్కరొకళ్ళు — ఒక్కరొకరు.
సీ. పడఁతు లొక్కరొకళ్లపైఁ జల్లు జలబిందు
లొడలు సోఁకినఁ బోక యొర్చియొర్చి.
ప్రభా 2. 108. (ఒక్క రొకళ్లపై — ఒకరి
మీఁద నొకరు).

**ఒక్కరుపుఁడు** — ఒకరుఁడు.

**ఒక్కర్త** — ఒక్కరిత.

**ఒక్కర్తి** — ఒక్కరిత.

**ఒక్కర్తు** — ఒక్కరిత.
(అన్యస్త్రీ.)
విక్ర. 5. 59.

**ఒక్కర్తుక** — ఒక్కరిత.
(అన్యస్త్రీ)
యయా. 4 100.

**ఒక్కర్తె** — ఒక్కరిత.

**ఒక్కసికొక్క** వి. బాల క్రీడావిశేషము.
సీ. గడ్డెనబోడి యొక్కసికొక్క బరిగాయపో
టు గిరవగింజ బొంగరములు. హంస.
3. 146

**ఒక్కాస్తి** విశే. ఒక్క పరిమాణముగలది.
గీ. ఉచిత నిజభాషణంబుల నొంటియొంటి,
హస్తమునఁ బూని యొక్కాస్తి బెస్తబిడ్డ,
లందలము నిల్పి రవనిపాలాగ్రసీమ రా.
వి. 2, 44.

**ఒక్కెఱ** క్రి. విశే. ఆకస్మికముగా.
క. వెఱచఱవ నీరిలో నొక్కెఱగా నొక
మొసలి చూడ్కికి నగోచరమై, పఱతెంచి
కుంభసంభవు, చిఱుతొడ వడిఁ బట్టుకొనియె
....భార. ఆది 5. 256.
చ. వఱలఁగ రాముఁ డంత ననవద్యుఁడు
వచ్చి బహు ప్రలాపరై,యఱచుచు నున్న
తల్లిని గృతాంతవశస్థితుఁ దైవతంత్రి
నొక్కెఱ చని తీవ్రశోక పరిఖేదహతుం
డయి...భార. అర. 8. 158.

**ఒక్కొ**[1] -- ఒక.

(ఏకార్థకము.)

సీ. ఆ రాజహంసుపై నడరించె మృదుజలా ర్ద్రానిలం బొక మానసాభిరామ, యామో హనాగ్రణి కలరు లందిచ్చె నొక్కొలకా నిభాత్యంత కోమలాంగి. వసు. 5. 84.

ఒక్కొమొగిఁ - ఒక్క మొగిన్.

(ఒక్కమాఱుగా.)

మ. ....వాయువందనుఁడు... రారాజు సైన్యంబు లొక్కొ మొగిన్ బెల్లగిలంగ బెట్టడరె నక్రోధాంతరంగంబుతోఁ. భార. కర్ణ. 2. 857.

**ఒక్కొ**[2] (**కొ**) - ఒకో[2].

(ఊహను దెలుపును.)

క. శంకరనిభుఁ డగువి ప్రుభ,యంకరకోపాగ్ని యొక్కొ యనుచును జాతా,తంకుఁ డయి ...భార. ఆది. 1. 112.

సీ. ప్రళయకాలాఖిలభైరవోదగ్రత నూకరాకృతిఁ బొడసూపె నొక్కొ. గీ. అనఁగ... విక్ర. 2. 125. (ఇట ఉత్ప్రేక్షావాచకము.)

(సందేహమును దెలుపును.)

సీ. అనుకూలవతి నాదుమనసులో వర్తించుకుల కాంత మది నెంత కుందునొక్కొ. మనుచ. 2. 17.

(ప్రార్థనమును దెలుపును.)

చ. ...దీనికిన్ విష,వ్యాపగతమైన జీవ మది వచ్చు నుపాయము సేయ రొక్కొ నా,తప ము ఫలంబు నధ్యయనదానఫలంబులు నిత్తు వారికిన్. భార. ఆది. 1 149.

**ఒక్కొఁడు** - ఒకఁడు. (√ఒక్కొ[1] - చూ. ఒండు అమహదర్థమున బౌపవిభక్తికము బ ఒక్కొరు, ఒక్కొండ్రు. ఇవి మహత్వర్థకములు గూడ నగును )

(ఒకటి)

క. పాండవులవలనికి డొ,క్కొండును లే దధిప సీదుకొడుకులు ధరణీ,మండల మంతయు గ్రమింగిరి... భార. స్త్రీ. 1. 88.

(ఒక పురుషుఁడు)

స్రగ్ధర. ...చేతి కాఁటం, గ్రూరేష్వాసంబు లే దొక్కొఁడు గలుగునె తద్యోఁ యుద్ధంబు సైసఁగ. రాఘవ. 2. 106. (రామాయ ణార్థమున)

**ఒక్కొట** - ఒకట. (√ఒక్కొ[1].)

(ఏక కాలమున, ఒక్కమాఱుగా)

క. ఇట పాండవకౌరవు లొ,క్కొట నందఱు గురునసుజ్ఞఁ గొని మృగయాలం,పటులై వనమున కరిగిరి... భార. ఆది. 5. 288. అర. 1. 305.

(ఏక ముఖముగా, ఒకటిగాఁ గూడి.)

క. ఇట నవ్వరూథినియు నొక్కొటఁ గలి పయ సఖులు దమ్ముఁ గొలిచినదువఁగా. మనుచ. 3. 73.

**ఒక్కొటి** - ఒకటి (√ఒక్కొ[1])

(ఏకము)

సీ. హరిహరబ్రహ్మమహానుభావంబు లొక్కొ టిగాఁగఁ గరఁగిన గుటిక యనఁగ. గీ. భానుబింబంబు పూర్వాద్రిపై వెలింగె. భార. విరా. 2. 240.

**ఒక్కొత** - ఒక్కొతె.

**ఒక్కొతి** - ఒక్కొతె.

**ఒక్కొతుక** - ఒక్కొతె.

**ఒక్కొతె** - ఒక్కొత, ఒక్కొతి, ఒక్కొతుక. న. ఏ. ('ఒక్కొ[1]' యొక్క మహత్వర్థకరూపము.) ఏకస్త్రీ; అన్యస్త్రీ.

**ఒక్కొరిత** -- ఒక్కొరితి, ఒక్కొరితె, ఒక్కర్తు, ఒక్కొర్తి, ఒక్కొర్తు, ఒక్కొర్తుక, ఒక్కొర్తె, న. ఏ ('ఒక్కొ[1]' యొక్క మహత్వర్థకరూపము.) ఏకస్త్రీ; అన్యస్త్రీ.

**ఒక్కొరితి** - ఒక్కొరిత.

**ఒక్కొరితె** - ఒక్కొరిత.

**ఒక్కొరుఁడు**-ఒకరుఁడు (√ఒక్కొ[1] — బ ఒక్కొరులు, ఒక్కొరులు, ఒక్కొళ్లు— ఇవి మహాత్వర్థకములు గూడ నగును.)

సీ. వాతాపి యను దైత్యవరు గ్రమింగి యజీర్ణించుకొనఁడె భూదేవుఁ డొక్కొరుఁడు గనిని. భార. అర. 5. 20.

**ఒక్కరువు(డు** – ఒకరు(డు.

**ఒక్కర్త** – ఒక్కరిత.

**ఒక్కర్తి** – ఒక్కరిత.

**ఒక్కర్తు** – ఒక్కరిత.

**ఒక్కర్తుక** – ఒక్కరిత.

**ఒక్కతె** – ఒక్కరిత.

**ఒగరు** వి. (సం. తువరః. క. ఒగరు, ఒగర్. త. తువర్.) షడ్రసములలో నొకటి, కషాయ రసము.

సీ. జిగి కందకుండ లేఁజిగురాకు గొని వచ్చి యొగరెల్లఁ బుచ్చి యిం పొసఁగకున్న. విక్ర 5. 172.

మ. ఒగరెక్కం గడుఁ లేఁతలై మృదువులై యోగ్యంబులై యున్న యా,చిగురాకుల్ ...చిత్రభా. 2. 100.

విశే. ఒగరైనది, కషాయమైనది.

వ. కోవెల లొగరుంజిగురు లుమియం గని. యయా. 4. 18.

**ఒగరుచు(ర్చు)** స. క్రి. ఒగరు కలది యగు, ఒగరెక్కు.

సీ. ...గొం తొగర్చ....అము. 2. 53.

**ఒగి** అవ్య. క్రి. 1. యథాసంఖ్యముగా.

క. ఆరాజీవజముఖబా,హూరుపదంబుల జనించి రొగి బ్రాహ్మణ ధా,త్రీరమణ వైశ్య శూద్రులు .... మార్క. పీఠి. 27.

క. కుడి యెడమ మధ్యవాడుల,కుడురాజాసన త్రిమూర్తులొగి దైవంబుల్. కాశీ. 2. 122.

2. క్రమముగా

మధ్యాక్కర. తన జనకుండు నన్నుప్రదాత యును భయత్రాత యును ననఁగ నింతు లకు ముప్పురొగిన గురువులు. భార. ఆది. 4. 48.

శ్లో. శరీరకృత్ప్రాణదాతా యస్య చాన్నాని భుంజతే క్రమేణైతే త్రయో ప్యుక్తాః పితరో ధర్మశాసనే. సం. భార. ఆది. 93. 25.

3. చక్కఁగా, లెస్సఁగా. ఆం భా 3. 67.

ఆ. దారసంగ్రహంబు ధరణీశ రతిపుత్ర, ఫలము శీలవృత్తఫలము శ్రుతము, దత్త భుక్తఫలము ధనము వేదము లగ్ని,హో త్రఫలము లనియు నొగి వెలుంగు. భార. సభా. 1. 51.

4. కొన్నియెడల వాక్యాలంకారముగా నుపయుక్తము.

గీ. ఒగి నిరాయుధహస్తుఁడై యొక్కరుండు, కాలయవనునికడ కేఁగి.... వి. పు. 5. 18, 6. 328.

క. ప్రతికించి యసంబుఁగన్న బల్లిదున కొగిన్. నీలా. 1. 22.

**ఒగుడు** వి. జొన్నమున్నగు వానియొక్క యెండిన యాకు.

గీ. గాలిఁ బోయెడి యొగుడాకుగతిఁగరంబు, తూలి పోయెడి నెమ్మేనితోడఁ జనుచు. కుచేల. 2. 7. (వ్రా. పాఠము – 'వరుగాకు' ముద్రి.)

(వ్యవ) ఆయెద్దు ఒగు డొలుచుకొని తిని దంటు పాఱవేసినది. (వ్రా)

జ: ఒగుడుకఱచు,

**ఒగుడుకఱచు** స. క్రి. (√ఒగుడు) కృశించు. శ. ర.

**ఒగ్గము** వి ఓదము, అవపాతము.

(ఏనుఁగులోనగువానిని బట్టునపు డవి పడుటకై త్రవ్వి మీఁద తేలికైన కఱ్ఱలను కంపలను కప్పి యా పైని కొంచెము మట్టి పఱచి నేల మట్టముగాఁ జేసిన వల్లము.)

క. ఒగ్గములు ద్రవ్వి పడు మని, యెగ్గడు పెనుఁదెరల వలల మరలు మృగములన్, దగ్గఱి చంపెడు వేడుక,వెగ్గలమై చిత్తమందు వెం టాడింపన్. భాగ 1. 454

**ఒగ్గాళము** విశే. ఉగ్రము. భయంకరము

సీ. కటికియొగ్గాళంపు గంటకత్తెర వట్టి మిసిమింతులును గాక మ్రింగువారు. క్రీడా. 142.

(ప్రయోగాంతరము లేదు.)

**ఒగ్గు** స. క్రి. 1. పెట్టు; అడ్డముగాఁ బెట్టు; అడ్డముగాఁ జాఁచు.

ఆ. ఆ నెలంత మెడకు వడ్డంబుగా మెడ, యొగ్గె వృద్ధసతి యనూనకృపను. 3. 119.

ఉ. ...గదల్, ద్రిప్పుట లెత్తి వేయుటలు దీవ్ర గతిం బయి దాఁటి పోవుటల్, దప్పఁ దొలంగుటల్ బహువిధంబుల నొంచుట లార్చి ద్రేసినం, జిప్పలువాఱ నొగ్గుటలుఁ జెల్లఁగ నిద్దఱుఁ బోరి రుద్ధతిన్. భా, రా. యు. 711.

గీ. పఱు నిలుపఁ గే లొగ్గుట యుచ్చకంబు, మత్తకరిఁ గెరలించుట మాయచేఁత, కొండ నెదిరించి తగరు డీకొనుట కడిమి, కాన నధిపుని యెడ మేలు దాన మండ్రు. కవిక 2. 37.

2. పట్టు, ఘటించు.

చ. తొడఁబడ నమ్మ యక్క యని తూలుచు దీనత దోయి లొగ్గుచున్, వడమఱి తేఱఁ దేఱ నల వాక్యము లెన్నక .... ఆము. 2 59.

3. (వినుటకు చెవిని) అభిముఖము చేయు, శ్రవణము చేయు.

చ. ఉవిద తదుక్తి కంతఁ జెవియొగ్గక పోఁజెనఁ గన్ ...ప్రభా. 5. 41

శా. ఆ మాటల్ చెవి యొగ్గి తా వినియెనా... పారి, 1. 33.

సీ. నిజదేశ బహువర్ణనీయ విచిత్రముల్ చెవులొగ్గు వారితోఁ జెప్పువారు. శుక. 3. 199. (చెవులొగ్గు – శ్రద్ధతోవిను)

సీ. ... తేకవుఁ డెంకిపడియచోఁ గర్ణ మొగ్గి. ఆము 4. 181.

4. (పందెము) వేయు, ఒడ్డు.

సీ. పందె మొగ్గినఁ గూఁడఁ బగఱఁ గెల్చు కటారి యిది దీనివగ నిశ్చయింపఁ గలిగె. కువల. 2. 45

5. (వల, బోను, మొ.) పఱచు, ఒడ్డు, పన్ను.

క. మచ్చులిడి యురులు బోనులు, వచ్చట వెస నొగ్గి చనిన...విక్ర. 5. 212.

6. నిల్పు.

ఆ. అటుల నా కుచేలుఁ డత్యంతమును లేమి కలిమియును సమంబుగాఁ దలంచి, దైవ ఘటన దోఁచి తన కర్మమున మనసొగ్గి యుండు జ్ఞానయుక్తుఁ డగుచు కుచేల. 3. 22.

అ. క్రి. (√ఒఱగు?) 1. వ్రాలు, ప్రవణమగు.

ఉ. ... నేను సన్న్యసిచె యొక్క చే తపోత హాన్ మన సొగ్గదు కేళిపై ... మనుచ. 3. 99.

క. దిగ్గజకుంభస్తనిపై, నొగ్గినభావంబు నూఁది యుడుపతి యుండెన్. శశాం. 2. 109.

2. సిద్ధపడు.

గీ. జన్నిదము లమ్మి గ్రహశాంతి జపముఁ జేసి, శవములను మోచి దుర్దానసమితి కొగ్గి, వచ్చునాదాయములు గ్రాసవాసములకుఁ, గాఁగ దినములు గడపె నకాలమునను. హంస. 2. 152.

గీ. రమణుఁ డిటు రమ్మనినఁ బునారతికి నొగ్గు దశా. 3. 39.

ఉ. అక్కట దిక్కుటీర నటదాహవతేజులు రాజు లెల్ల వి, ల్లెక్కిడలేకయుండ ద్విజుఁ డెక్కడ కార్ముకకర్మ మెక్కడ, మ్మక్కయితఁడు విప్రకుల మాఱడి పెట్టె నటంచుఁ గొందఱే యుక్కునలేక యిట్టిపని కొగ్గునె యం చొకకొంద ఱాడఁగన్. పాంచా. 2. 49.

3. ఒప్పు, ఇష్టపడు.

గీ. మానుమీ మోహ మని తెల్పి మానవేంద్రుు, చిత్త మొగ్గించి యేకమాటఁ జేసి రాచ, కొమిరె నిదురించుతఱి మందసమున నుంచి వీడు వెడలించుకొని తెచ్చువేళ నెదుట. శుక. 1. 374.

చ. అని వచియించు తైర్థికున శావనజాయత పత్త్రినేత్ర యిట్లను నవయౌవనంబున రతాస్థదొలంగి కులాబ్జగంధి పైఁ, గనికర మింత లేక తిరుగ న్మనసొగ్గసటోయి. నీకు ...హంస. 1. 628,

4. లోనగు, వశమగు.

చ. చెఱగొని పోయి యాత్మపురిఁ జేర్చి దశాననుఁ డాసరేఁగి కిడ్పఱిచిన సీతఁ దెచ్చుకొని భావజుత్రిక్కుల కొగ్గి యొగ్గు సిగ్గ

ఋఁగళ కూడినాఁ డినకులేశ్వరుఁడు... ఉ. రా. 6. 210.

మనసొగ్గు — ఒప్పు, ఇష్టపడు.

క. అని చెలి పుడుకలు విబిచినఁ, గనుఁగొని యది క్రొత్తగుమ్మ గావున మన సొఁగ్గిన వదియును నేనొక్కనిఁ, గొనివచ్చెద నూరి శైటిగుడికడ కనుచున్. శుక. 1, 442.

జ: ఒగ్గుబల్ల.

**ఒగ్గుబల్ల** వి (√ఒగ్గు) తటిమెన పట్టెడు కొయ్యకు ఆధారమైనబల్ల. (బ్రౌ.)

**ఒచ్చెము** — ఒచ్చెము (శ. ఒచ్చయ.) (వ్యాజము, కపటము.)

ద్వి చలికొండకూఁతు నొచ్చముతేని ప్రేమ, తళుకొత్తకొత్తవామాంకతలముపై నునిచి. నవనాథ. 1. 10 పొ. 9. పం.

(అవమానము)

గీ. పెండ్లియాడుదునని కడుఁ జేర్మితోడ, నిట్లు గైనేసి తుది నింత యెడరు నొంది, యున్న నాకు కీయొచ్చ మొగల కేమి, కారణము నిల్వఁ డెవ్వాగుఁ గాంచవలదు హరి ఉ 3. 105.

ఒచ్చపడు — అపమానపడు.

గీ. సిగ్గుపడి రొచ్చపడిరి ఋస్సియిసియైరి, శాంతుని చేత మునులు బృందారకులును. హరి. 3. 10.

**ఒచ్చెము** — పొచ్చెము. వి. (శ. ఒచ్చెయ) 1 అవమానము మానహాని.

క. అది విదురు చెప్పినట్టిద, తుదిఁ గృష్ణుఁడు పాండునుతులతో వే అగు నే, పదనే యీగికి నిచ్చిన, బెదర రనరె యొచ్చె మైనఁ బిమ్మట పగరే. భార. ఉద్యో. 3, 163.

శ్లో. మంస్యత్యథోశకో రాజన్ భయాదర్చతి మా మితి, అవమానశ్చ యత్ర స్యాత్ క్షత్రియస్య విశాంపతే, న తత్కుర్యా ద్వుధః కర్యం. సం. భార. ఉద్యో. 88. 3, 4.

చ. ....మానినికిం దనుఁ దాన కాచికో, లోద విన దావఁ జేసి సభ నొచ్చెము దక్కినఁ కాండు వందనుల్, బ్రదికిరిగాక యయ్యో దరు రాచకొమారుల కోర్చునట్టిదే. భార. ఉద్యో. 1. 348. (సం. భార. ఉద్యో. 29. 41, 42.) భాగ. 10. ఉ. 290.

2. తప్పు, దోషము.

ఉ. ఒచ్చెము లేనిచో వెదకు నొచ్చెములు ... దుష్కవి...విప్ర. 1. 14.

3. కొఱంత, లోపము; భంగము.

గీ. అధ్వరారంభ మిం తొప్పునయ్య దక్ష, శివునిఁ దోడ్తెని యొక్క యొచ్చెంబ కాని. కాశి. 7. 57.

సీ. తనవారి యొచ్చెంబుఁ దానె తీర్పఁగఁ జాలఁ డొరుల యొచ్చెముఁ దీర్పఁ నోపు నెవఁడు. రామలిం. 73.

క. మచ్చరమునఁ గన్నెటికి, మ్మొచ్చెము గన నెవ్వ రిటుల నొనరించి రొకో ఉ. రా. 1. 184.

4. వ్యాజము, కపటము.

గీ. అంత నొచ్చెంబు లేని నెయ్యమునఁ గూడి, యున్న పతిఁ బాసి తెగువ లేకున్నదాన. కు సం. 5. 572.

విణ. అనుచితము.

ఉ. ...నైజ మగుహీనత గల్గినఁ జెప్ప టొచ్చెము, ద్దామత గల్గె నేని యుచితం బయియుం డదు నెప్పికొంట. నైష. 4 54.

ఒచ్చెముపట్టు — తప్పుపట్టు, అవమానపఱచు.

సీ. విక్రమార్కుని నైన వెఱఁ గొందఁగాఁ జేయుఁ జండతరాఖిలసాహసములు. గీ. భర తముని నైన నొచ్చెంబు పట్టుచుండు, వివిధ నర్తన చాతుర్యవిక్రమముల...అప్పురివారుపములు. విక్ర. 1. 87.

**ఒచ్చెల(ల్ల)** — ఓ చెల్ల. అవ్య. సంతాపము ఆశ్చర్యము మున్నగువానిని దెలుపును.

మ. సచ్చరితానువర్తనము సాధుజనంబులు సమ్మతింపఁగా, వచ్చువు బ్రహ్మచర్యము ప్రయత్నమునం జరియించుచుండి నేఁ, డొచ్చెల శూద్రభామినికి నువ్విళులూరి పథంబు దప్పఁగా, వచ్చునె.... విక్ర. 150. భోజరా. 5. 58.

క. అమ్మగఁ బ్రయాగలోపల, విచ్చలవిడిఁ దవదు మేను విడిచినమఖం, బొచ్చెల్ల యేమి చెప్పుదుఁ, జెచ్చెరఁ గను నిష్టకామ్యసిద్ధి ధరిత్రిన్. భోజరా. 1. 182.

**ఒజ్జ** — ఓజె², వి. (సం. ఉపాధ్యాయః. ప్రా. ఉపజ్ఝాఓ.)

1. గురువు, ఉపాధ్యాయుఁడు; ఉపాధ్యాయురాలు; ఉపాధ్యాయునివంటివాఁడు (వంటిది).

చ. అపగతదోషుఁ డైనసిరియాళకుమారకుఁ డొజ్జయింటిలో, లిపి పఠియింపఁగా... హం. 2. 70.

సీ. వంచనామతిఁ బ్రాడ్వివాకు లై వటువు లొజ్జల కొప్పగించిరి చదువులెల్ల. మనుచ. 3. 129.

సీ. ఎవ్వనిచారిత్ర మెల్లలోకములకు నొజ్జయై వినయంబు నేఱుపు గఱపు. భార. విరా. 2. 191. (ఒజ్జ — ఒజ్జ వంటిది.) హరి. పూ. 1. 8

సీ. పడఁతుల కీపుణ్యభామ యొజ్జ. కేయూర. 1. 86.

2. పురోహితుఁడు; ఋత్విక్కు.

మ. చెలికత్తెల్ చిఱునవ్వు చెక్కులపయిం జెల్వొంద వీక్షింప నొజ్జలు మంత్రంబులు సెప్పఁ బ్రెగ్గడ...కలశీకంటక మెత్తి యా దలపయిన్ సంధించె సీమంతముల్. శివరా. 2. 59. విక్ర. 4 127.

ఆ. భక్ష్య భోజ్య లేహ్య పానీయములమీఁద, సదములోని విప్రజనులమీఁద, వెగడుపడఁగఁ జాటి వెఱపింత మొజ్జలు, తత్ప్రయోగ విధులు దప్పి పలుప. భార. ఆది. 2. 130.

**ఒజ్జలపుచ్చకాయ** — ఒజ్జలు తాము పుచ్చకాయ యను దినుచుండియుఁ బరులకుఁ దినఁగూడదని చేసెడి యుపదేశము; ఆ యుపదేశము వంటిది.

శా. ఆహా యొజ్జలపుచ్చకాయవిత మౌరా వేయు నిం కేటికిన్. శశాం. 4. 181.

చ. వయసునఁ గంటి కిం పయినవాని రమించుట న్యాయ మింతి కట్లయె మగవాఁడుఁ జక్కనిమిటారికి దక్కి రమింపఁగా వలెన్, నయమిది న్యాయశాస్త్రముల నమ్మక మొజ్జలపుచ్చకాయ యానయవిదుఁ డౌ గురుండు మదనత్వర నగ్రజు భార్యఁ గూడఁడే. దశా. 7. 1. 81. కళా. 1. 8.

జ: ఒజ్జనము ఒజ్జబంతి, ఒజ్జఱికము, ఒజ్జసాని.

**ఒజ్జనము** వి. (√ఒజ్జ) ఒజ్జతనము.

సీ. ...నాపసాని, యొజ్జన మొనరింప నుచిత క్రమంబునఁ బుణ్యాంగనల్ గడఁ బ్రోలు చొచ్చి. కళా. 7. 83.

**ఒజ్జబంతి** వి. (√ఒజ్జ) విద్యార్థులు చూచి వ్రాఁత వ్రాయుటకై ఉపాధ్యాయుఁడు వ్రాసెడు పంక్తి, మేలుబంతి, ఒరవడి

సీ. తనకులాచారవర్తన వైష్ణవాచారపర్యాయముల కొజ్జబంతి గాఁగ. పాండు 1. 20

**ఒజ్జఱికము** — ఒజ్జనము.

ఉ. చిత్తరుబొత్తరుల్ నడ భజించి రసజ్ఞ జిగి నీలికాసె దళ్కొత్తెడు పాత్రకత్తియల కొజ్జఱికంబు వహించి కోపాలుందత్తలు నైనఁ గాదనెదునైపుణి మార్గవిధంబు దేశియున్, జెత్తము కేలఁబూని వినిపింపఁగ నోపుదు రిందు నట్టువల్. చం. రా. 3 64.

**ఒజ్జసాని** వి. (ఒజ్జ) ఉపాధ్యాయుని భార్య, గురుని భార్య.

ద్వి. చపలాత్ముఁ డా యొజ్జసాని కిట్లనియె. ద్వి. హరిశ్చ. ఉ. 1030.

గీ. ....తనరు నుపాధ్యాయ భార్య యొజ్జ, సాని యన...అం. భా. 2. 107.

**ఒజ్ఝ** — ఒజ్జ

ఉ. అఝ్ఝషలోచనల్ పలుకునప్పుడు విప్రులు హోమవేళ మీ, రొజ్ఝలు రండు రెండు సమిదుత్కర మీయవధాని బ్రహ్మ యీ, యఝ్ఝములోని యాపనస యన్న వసిష్ఠులు మీరు శ్రౌతముల్, దఝ్ఝరె యంచుఁ బంచుకొని రందఱు వేల్పుచు ద్రవ్యదక్షిణల్. పాంచా 4. 26. (ప్రయోగాంతరము లేదు.)

**ఒట్టు** అ. క్రి. 1. జనించు; కలుగు.

ఉ. అట్టినృపాలకీటముల నాజి నెదుర్పఁగ లేని వానియట్లొట్టిన భీతిమై నిటు పయోధిశరణ్యుఁడవై తివి.... భాగ. 10. ఉ. 253.

క. పెట్టినవానికిఁ గలిమియుఁ, బెట్టనిమనుజునకు లేమి పెంపగుచుండున్, బెట్టుటయుఁ బెట్టకుండుట, యొట్టిన తన సుకృతదుష్కృతోన్నతి చేతన్. శేష. 3. 245.

2. ప్రజ్వలించు, మండు.

ఉ. పెట్టనికోట నీకు హరి భీముఁడు నర్జునుఁడున్ రణంబునం, దొట్టినమంట లాకొలఁది యోధుల సాత్యకియున్ విరాటుఁడున్. భారం. ఉద్యో. 1. 307.

ఉ. ...తత్ప్రతిహారపాలకుం, డొట్టినమంట పోలెఁ గడు నుగ్రతఁ జేర్చిన... నిర్వ. 4. 54.

చ. ఎఱిఁగి యెఱింగి మృత్యువు పయిం జను దెంచునె యెట్టివాఁడు ని,ట్లుఱక సురాసురాదులకు నొట్టిన చిచ్చగుచున్న నన్నునెత్తుఱఁగున నోర్వవచ్చు నొకో ... భా. రా. యు. 789.

వ. క్రి. 1. ఉంచు, పెట్టు.

ఉ. ఇట్టిది క్రూరకర్మ మని యింతుక కొంకక లక్కయింటఁ జిచ్చొట్టితి... భార. శల్య. 2. 134.

ఉ. కట్టిరి సన్నపుం దముపుఁగావి కటీతటి మేని తీఁగపై, నొట్టిరి కమ్మపుప్పొడి. విక్ర. 4. 160. (ఇట 'చల్లు' అని భావము)

2. దహించు, కాల్చు.

క. ...పెనుమంటలయం, దొట్టుదు రొడళ్లు వలియన్. మట్టుదు రప్పాపచిత్తు మత్తుం బెలుచన్. భాగ. 3. 988.

3. నం. క్రి. త్రాగు.

చ. తెరువులు మెట్టుచున్ వనలఁ దేనియ యొట్టుచుఁ గూర్కి దిట్టుచున్. బహుళ. 2. 27.

వి. (క, తె. ఒట్టు.) శపథము, ప్రతిజ్ఞ; శాపము.

గీ. నలువు మెఱయఁగఁ బెద్దలనాఁటనుండి, మున్ను దమయింట దాఁకొని యున్ననిన్ను మూలదేవర వి శ్లేత్తఁజాలు మేటి, కిత్తుఁ దపశశ్చె వంచు నొట్టిడుక యతఁడు. అచ్చ. రా. బాల. 129.

క. ఒట్టిడుకొంటివి గద నీ, కెట్టిరహస్యంబు దాఁప నే వని.... ప్రభా. 1. 128.

క. ఎట్టిపదార్థము లబ్బిన, నొట్టిడిన ట్లంటపోవ నొల్లక మదిలో, గట్టియగు దిట్టతనమది, యిట్టలముగ ధృతి యనంగ నెందును బరఁగున్. కావ్యా. 1. ఉల్లా. 107.

ఒట్టుగొను — ఒట్టుపెట్టుకొను.

సీ. ...భ్రష్టశూద్రాదులకును, బితృదేవభోజ్యముల్ పెట్టినఁ దల్లితోఁబుట్టువు పేరఁ దానొట్టుగొన్న...గీ అతఁడు తా నచ్చు నృపతికి శతపణములు. విజ్ఞా. ప్రా. 60.

ఒట్టుపెట్టు — శపించు.

అ. ....గర్వంబు గిర్వంబు, మడుపనైతి నేని నొట్టుపెట్టు. దశకు 6. 54.

**ఒడఁగూడు** అ. క్రి. 1 కలియు, కూడు.

క. ... పాండుతనయులు వినయాన్వితులు గుమారక్రీడాంతులయి యొడఁగూడి ధార్తరాష్ట్రులతోడన్. భారం. ఆది. 5. 163.

గీ దొరకుఁ గులనాశనం బనుదూఱు మేలె, పాండవులతోడ నొడఁగూడి బ్రదుకవయ్య. భార. ఉద్యో. 3. 341. (ఒడఁగూడి - మైత్రి కలిగి. కలసి మెలసి) కాశ. 1. 158.

2. సిద్ధించు, కలుగు, లభించు, ప్రాప్తించు.

చ. ...వరూథితోడ నవరూథికి సజ్జనుతోడఁ గష్టదుర్జనునకు నెవ్విధంబునను సఖ్యము దా నొడఁగూడ నేర్చునే. భార. ఆది. 5. 204.

సీ. ...ఈదివస మతిక్రమింప, కుండంగఁ బోక యె ట్లొడఁగూడు నిన్నాగభవన మెపాటబెల్వడఁగఁ బోలు. భార. ఆది. 1. 114.

క. ఆచారపరత వేకువ, లేచి పఠింపుము కుమారశేఖర్షభ యీ, శ్రీచింతామణి మంత్రము, ప్రాచీపతిముఖుఁడవై శుభం బొడఁగూడున్. సైష. 6. 30.

క. ఒడఁగూడినసామ్రాజ్యము, వదలువ దిగఁ ద్రావిచనిన నళులజములు నిజ్.గడుఁ జేద

మననువాఁడని, చెడనాడుదురు ... భార.
శాం. 1. 117.
గీ. అర్థి గొడఁగూడె రత్నాకరాహ్వయంబు.
కాశీ. 3. 117.
3. వర్తిల్లు, ఉండు.
క. నడవడి యనుమున్నిటం,గడవం బెట్టంగ
నోడ కరణిం దగి తా,నొడఁగూడు వనిన
సత్యము, గడచినగుణ మింక నొండు గలదే
యరయన్ భార. ఉద్యో. 2. 39.
4. ప్రోగుపడు. సంఘీభవించు.
క. అమవస గావున నేఁడ,క్కమలజుఁ గొలు
వఁగ మహర్షిగణములు పితృసంఘములును
బోదురు బ్రహ్మాం,డమువం గలవార లం
దొడఁగూడంగాన్. భార. ఆది. 5. 66
5. పొలగు, అనుకూలమగు.
సీ. ...ఇఁదలఁ గొనిపోయి తేని వత్తుఁ. గీ.
గూర్చుకొని పోవ నీ కొడఁగూడె నేని,
యట్లు గాకున్న విచ్చేయు మథవ... హర.
2. 176. (ప్రయోగాంతర ముకనఁబడదు.)
వ. క్రి. పొందు.
క. తనమూ డగుధనదదిశాం,గన నిమఁ దొడఁ
గూడఁ బోక గని యామ్యదిశాం. గన
నొచ్చి...కు సం. 4. 442.
ఆః ఒడఁగూర్చు.

ఒడఁగూర్చు స. క్రి. (√ఒడఁగూడు.) ఒడఁగూడఁ
జేయు
1. కూర్చు.
గీ. గిరిజ నొడఁగూర్చి వరదుచే వరము
వడయ,నోపుఁబో మ్మని సమ్మి యే నున్న
చోట,నెట్టివిడుమర వచ్చె ... కు. సం.
5. 552.
2. లభింపఁజేయు.
క. అపదఁ గడవం బెట్టఁగ,నోపి శుభం బైన
దాని నొడఁగూర్పను మా,కీపుట్టువునకుఁ
బాండు,క్ష్మాపాలుఁడు నిన్నుఁ జూపి
చనియె మహాత్మా. భార. ఉద్యో. 3. 6.
గీ. ఈప్సితార్థంబు లొడఁగూర్చు నిదిలతాంగి.
పారి. 1. 53.
3. సిద్ధపఱచు, అమర్చు.
సీ. అఁకొని యొడఁగూర్చి యన్నంబు దశి
యకు వచ్చినఁ గుడువని వానిఠంగి. భార.
శాం. 1. 64.
సీ. దేవకార్యంబు దూపదిపాదు లొడఁగూర్చి...
హర. 2. 128.
4. చేర్చు, ప్రోగుచేయు.
గీ. అచట నచ్చట నున్న కావ్యాగమములఁ,
జెలఁగి సత్కవి సౌకర్యసిద్ధికొఱకు, నొక్క
చోటనె యొడఁగూర్చి నుత్సహించి. సత్క
వావర్తి విశ్వేశ చక్రవర్తి. కావ్య 1. 9.
5. సిద్ధింపఁజేయు, నెఱవేర్చు.
క. స్వాగతమే మీ యిద్దఱ, యాగమన బునకు
హేతు వగుకోర్కి యను,ద్వేగంబున నెటిఁ
గి పుఁడు, వేగమ యొడఁగూర్తు నెల్లవిధ
ముల దానిన్, భార. ద్రో. 2. 362.
మ. ...వేఁడు మభీష్టం బొడఁగూర్తు ... ఉ
త్త. 2. 203. విశ. వి. 2. 175
6. కలిగించు.
(కీచకుఁడు) క. చిడిముడిపడుచు నెదుగుసవఁ
గడఁగుచు...దుర్విలాసం. బొడలికి నొడఁ
గూర్చుచుండ...భార. విరా 2. 114.

ఒడఁబడిక వి. (√ఒడఁబడు) 1. సమ్మతి. అంగీ
కారము.
క. ఏకైకము నోదరన్నా,తొకులు ననుబద్ధము
లకు నొగి నేత్వాత్మా,నీకము వకు లగుఁ
గొందఱు,గై కొందురు వృద్ధివకులు కవు
లొడఁబడికన్. కావ్యా. 7. 72.
గీ. కాశి పుట్టించు దాని కవ్వృథికులెల్ల,నొడఁ
బడిక మీఁదనే మిన్నక లొనఁగి రవుడు.
శుక. 4. 7.
2. అంగీకారసూచక మగుపత్రము.
(వ్యవ) వ్యవహారము పరిష్కరించుకొని వారు
ఒడంబడికలు వ్రాసికొన్నారు.

ఒడఁబడు అ. క్రి. (క. ఒడంబడు, ఒడబడు. త.
ఉడన్పడు.) 1. అనుమతించు, ఒప్పుకొను.
చ. ఎడపక యర్ఘ్య మచ్యుతున కిచ్చితి మిచ్చిన
దిని కిం దొడఁబడ మని దుర్జనత్వమునఁ
బల్కెడు వీరులమస్తకంబుపై. విడియొద

వంచుఁ దాఁ బరఁగ మెత్తె నథన్ సహ దేవుఁడు...భార. సభా. 2. 30.

క. ...మేను వెలిగ వట వో, నొడఁబడ వని వలికె బ్రాహ్మణోత్తముఁడు. భార. శాం 4. 189.

2. సంతోషించు.

క. ...భక్తికి, నొడఁబడి యాయమకు ముక్తి యొసఁగవె రుద్రా. శివ. సా. 486.

మాలిని... ధర్మతనూజుఁడు... అమ్మునినాథ వరేణ్యునకుఁ వినయమ్మున మ్రొక్కి సమున్నత పీఠమ్మున నుంచి యథావిధి పూజ లొడంబడఁ జేసి...భార. ఆది. 8. 91.

3. వాక్యాలంకారము.

చ. ...నేఁడు పన్నగమునోరికి వీరికి నొక్కలంకెగా, నొడఁబడ నేల చేసె విధి యోడక నేయుఁగదయ్య క్రౌర్యముల్. భాగ. 10. పూ. 478.

స. క్రి. సహించు, ఓర్చు.

ఉ. ....విధాత నిర్దయుఁ డొడంబడునే కడు మేలివస్తువుల్, పెక్కుదినంబు లున్కి.... భార. ద్రో. 2. 240.

ఱ: ఒడఁబడిక, ఒడఁబఱుచు. ఒడఁబాటు.

**ఒడఁబఱుచు(ర్చు)** స. క్రి. (√ఒడఁబడు) ఒడఁబడఁజేయు, ఒప్పించు, ఆమోదింపఁజేయు

వ. అమ్మొఱకుల నెమ్మొయినైనను.

క. ఒడఁబఱిచి మాకు వారికిఁ, బుడమి సగము గాఁగఁజేసి పొందిపొసఁగి యుండెడునట్టి తెఱఁగు సేయుట కడు మేలు .... భార. ఉద్యో. 3. 77, 78.

ద్వి. అడుగులఁ బడి సిరియాలుండు దపసి, నొడఁబర్చి యింటికి వడి నేఁగుదెంచి. బస. పు. 4. 389. పం.

**ఒడఁబాటు** వి. (√ఒడఁబడు.) 1. సమ్మతి, ఒప్పుదల, అంగీకారము.

క. అనుచు నొడఁబాటు లేకున్నను నయ్యుత్తరుని నొగల నడుకొన నిడి తా, నును రథ మెక్కి రథికుఁ డయి, చనియె నరుఁడు జమ్మి చేరం సమ్మదలీలన్. భార. విరా. 4. 84.

2. సంధి.

ఆ. మేలు గాఁగ నీకుఁ బోలినట్లయిన నం, దఱికి మేము వారు నర్థిఁ బొందియుండునట్లు గాఁగ నొడఁబాటు గావింపు, మెల్లభంగి మనకు నిదియ లెస్స. భార. ఉద్యో. 3. 33.

క. అనినను వెండియు నొడఁబా, టునకుఁ బోరని దానికిం గొడుకుతోడఁ గడుం, గినిసి ధరణీశ్వరుం డిట్లనుఁ గొలువున నున్నవార లందఱు వినఁగన్. భార. ఉద్యో. 2. 288.

**ఒడగోలుగొను** స. క్రి. (ఒడమె? ఒడలు?+కోలు+కొను) అడగోలుగొను, అపహరించు.

వ. మనుష్యుండు పుట్టినకోలె నిడుములంబడి గడించినయొడమి పుడమిఁ జేఁ దలిగి గడియ తడవులోన నొడగోలుగొన శక్తుం డగునట్లు గృహాగతుం డగు నతిథి తిరస్కృతుం డై యతనిపూర్వార్జితసుకృతంబు లన్నియు నపహరింపంజాలు... భోజరా. 3. 124.

**ఒడచూఱ** వి. (ఒడమె? ఒడలు? +చూఱ) కొల్ల, దోఁపుడు.

ద్వి. ఒట్టినసొమ్మెల్ల నొడచూఱ గాఁగఁ, ఒట్టి లేదనుసర్వభక్షకులారి. ద్వి. పరమ. 4. 321. పా.

**ఒడదోలు** వి. (ఒడలు+తోలు?–'వడదోలు' శ. ర. ప్రా. 'ఒడదోలు చి. ని. ఇంకనువిచార్యము.) వేఁటకాండ్రు తొడుగుకొను తోలు కవచము.

సీ. మెడను బుక్కల పేరు మేటి తామరలునాఁ దోలుదుప్పటి యొడదోలు గాఁగ. కాశ. 4. 178.

గీ. చల్లడంబులు నొడదోళ్లుఁ జలిదికూళ్ల, చిక్కములు ... దాల్చి .. భిల్లవరులు. వరాహ. 4. 72.

క. ఒడదోళ్లును ముప్పిళ్లును, వడిదంబులు .... గెడలున్ ధరియించి భటులు కెలఁకులఁ గొల్వఁగ. భల్లా. 3. ఆ. ('వడదోలు' అని 'గెడ'. క్రింది శ. ర పా.)

**ఒడపి** వి. గండి, రంధ్రము.

క. జుఱుజుఱు కని నెత్తురు వెలి, కుఱుకుచు రొద సేయ నటిత యొడపిని యూర్పుల్,

పఱువ మిడిగ్రుడ్లు వడఁకఁగఁ, గొఱ ప్రాణముతోడఁ దన్నిఁకొను నమ్మొదవున్. ఆము. 3. 23.

**ఒడమె(మి)** వి. (క. ఒడమె. త. ఉడై మై.) 1. ధనము, సొమ్ము; సంపత్తు.

ఆ. ఒడమె లేనివాఁడు నడపినఁ గను నహు, షోక్తి వినమె దాని నూఁద వలదె. భార. శాం. 1. 49

(ప్రాఁత ప్రతిపాఠము.)

క. ఒడమెయన సొమ్మనంగా, విడిముడియన రొక్కమనఁగ విత్తంబునకున్, బుడమిని నామములగు...ఆం సం. స్థా. 30.

గీ. పడఁతు లేపునఁ బద్మినియొడమి యెల్లఁ, జూఱగొని...కు. సం. 9. 290.

2. నగ, భూషణము.

సీ. ఒడమెలు సొమ్ములు తొడవు లనఁగఁ జెల్లు భూషణాఖ్యలు... సాం. ని. మా. 48.

**ఒడయఁడు** వి. (క. ఒడెయ — స్వామి, ప్రభువు. త. ఉడై యవన్ - స్వామి - ఉడై — ఐశ్వర్యము, స్వామ్యము.) 1. ప్రభువు, రాజు.

గీ. శేషజనకు కొడయనిఁ జేయవచ్చు, వాసుదేవుని మనుమని వజ్రదేవు. భార. మౌ. 38.

ద్వి. పెనుపొందు నప్పురిపై రేమి దేవ, యొనరంగ నేలెడియొడయఁ డెవ్వాఁడు. ద్వి. హరిశ్చ. ఉ. 121. పొ. 7. పం.

ఉ. ఆత్రి జోగివేల్పుటొడయం డెద నాతని మెచ్చి...అచ్చ. రా. బాల. 126. (జోగివేల్పు టొడయఁడు — మునీంద్రుఁడు.)

2. పతి, భర్త.

సీ. తదనురూపంబుగాఁ దత్సఖీజనములు నీయూరఁ బేరును నెమ్మి నడిగి, రడిగి యాతఁ డొడయఁ డగు మాన్యపాత్మజకని కార్య గతి దేరనాడి నన్ను. గీ. మరలఁ బనిచిరి... భోజరా 3. 261.

విశే. 1. స్వామి, యజమానుఁడు.

క. కాంచి హర్షించి శబలి, యంచున్ బిలుచుటయు నొడయఁ డరుదెంచినవాఁడంచు నది దూడతోఁ బను, దెంచి తనువు మూర్కొనంగ ద్విజుఁ డిం పొదవన్. ఉ. రా. 6. 359.

2. శ్రేష్ఠుఁడు.

గీ. ...దైత్యేంద్రుదాడి, కోడి దివి వీడి శచిఁ గూడి యుర్విఁ జేరె, నడుగుచూపరిజడదారి యొడయనింటి, కోడికోడిగముల వేల్పు ప్రోడ యపుడు. దశా. 5. 26.

ఒడయదేవర - జంగముదేవర, జంగమయ్య.

ద్వి. ఒడయదేవళ్లు లక్షోపలక్షలును, నరుగు దెంతురుగాని యందొక్కరైనఁ, దిరిగియుఁ జూఁడరా దివ్యపీఠంబు. ప్రభు. 21. పొ 16, 17- పం.

**ఒడయుఁడు** — ఒడయఁడు.

(స్వామి, యజమానుఁడు.)

ఆ. .. గృహ, యుక్తుఁ డోషధులకు నొడయుఁ డగుట. భార. శాం. 5. 312. (గృహయుక్తుఁడు - గృహస్థు)

(అధికారి)

సీ. ఋతుమతి గాక శుద్ధతయుఁ గల్గినయింతి కన్య తత్పరిణయకరణమునకు, నొడయులు విను తల్లియును దండ్రియును...భార. అను. 5. 285.

(ప్రభువు)

గీ. యువతి మండలముల కొడయుఁడవు గమ్మ జై. భా. 5. 117. (శ. ర. పా.)

జ: ఒడయురాలు.

**ఒడయురాలు** విశే. (√ఒడయుఁడు.) స్వామిని, యజమానురాలు.

సీ. .... తల్లిదండ్రులును బాంధవజనులును, గారు నిన్నిగికిఁ గర్తలు విను నీవ యొడయురాలవు నీకు నుజ్జ్వలాంగి. భార. అర. 7. 337. (స్వతంత్రురాలవు - అని భావము.)

**ఒడలిచూపొడయఁడు** వి. (√ఒడలు)-ఒడలి నిండ కన్నులుగలవాఁడు — సహస్రాక్షుఁడు, దేవేంద్రుఁడు ఆం. సం. దేవ. 17. అచ్చ. రా. కిష్కిం. 41. (ఇట్లే. ఒడలిచూపుల ఱేఁడు. పె. శకుం. 2. 214.)

**ఒడలు** వి. దే. (క. ఒడల్. త. ఉడల్.) దేహము.

గీ. ...అప్పర్వతమునఁ, బడినపడిఁ జేసి కాలకు నొడలు దాఁకి, యాతఁడంబ రా లెల్ల నుగ్గయ్యెఁ జూవె. భార. ఆది. 6. 281.

క. పగవారియింటఁ గుడిచిన నగుఁ దమ కను మాన మమృత మైనను దారుం, బగతునికుఁ గుడువఁ బెట్టఁగఁ దగ దొడళుల కెప్పు డె వ్విధము వాటిలునో. భార. ఉద్యో. 3. 224.

చ. ఒడలను బ్రాణముల్ గలుగ నూరక యుం డుదు రే త్రిగర్తులు ...భార. ద్రో. 1. 248.

శా. ఈ నెంతేఁ గడుఁ జాల హెచ్చఁగ నొడ ళ్లంతేఁ జెమర్పంగ...పరమ. 2. 182.

మ. ...ఒడల్. తిరమే... మనుచ. 2. 65.

లయగ్రాహి ... మీయునికి చింత కొడ లై యునికి దోఁచెన్. కళా. 4. 163. (ఇట ఆస్పదము అని భావము.)

ఒడలెత్తు – దేహముధరించు, జన్మమెత్తు, పుట్టు.

ఉ ఈయఖిలాండసృష్టి నొడలెత్తినధన్యుల నెల్ల నేను నీ,కై యిదె....శా,లా యిటు చిత్ర విన్యాసనలక్ష్యులఁ జేసితి... హరి. ఉ. 7. 115.

జ: ఒడలిచూపొడయఁడు.

**ఒడి¹** వి. 1. బాలకాదులను గూర్చుండఁబెట్టుట కనుకూలముగ మంచిన తొడల పై భాగము, ఉత్సంగము.

సీ. తమకించి యొడి నుంచి తమ్మిఁ బోలిన మోము జిగిదక్క మోములు చేర్చి చేర్చి. ఉ. రా 4. 217.

2. ఒడిసైఁగట్టుకొనుబట్ట, వస్త్రపుటి ఆం. భా. 2 158.

ఉ. చి చ్చొడిఁ గట్టినట్టు చెడుసింహసటాటచ్ఛ లూడ్చు పూన్కికిన్, కొచ్చమదాంధు పోల్కిఁ దనకూంత రావణుమీఁదఁ బావఁ గా, వచ్చెఁ గదా మధుండు...ఉ. రా. 4. 128. కుక. 3. 179.

3. పశుయోని.

ఉదా:ఆవునకు ఒడిజారినది. నేఁడో రేపో దూడ వేయును. (వ్యా).

జ: ఒడిఁబ్రాలు, ఒడికట్టు.

**ఒడి²** వి. (√ఒడియు¹) ఒడుపు.

క. కడు వెఱఁగంది మురాంతకుఁ,డొడి దప్పిన పామువోలె నుండఁగ మఱి దా, నొడిసెల కొన్నల కాడెడి, పడువుఁ గొం డ్రుండు జాలవైచెం బెలుచన్. ఉ. హరి. 3. 103.

**ఒడిఁబ్రాలు** వి. బ. (√ఒడి¹) మంగళార్థము నూతన వధువునకు నొడిలోఁ గట్టు బియ్యము.

ఇట్లే – ఒడిబియ్యము.

ద్వి కదుమించు నపరంజికమ్మి తోఁపులును, నొడిబియ్యమిడి.... ద్వి. పరమ. 5. 483.

బా.

**ఒడికట్టు** అ. క్రి. (√ఒడి¹) ఒడిపట్టు, (నిందాదులు) వచ్చిన రానిమ్మని భరింప సిద్ధపడు.

క. ...నిందకు నొడికట్టితివు నీచచరిత్రా. భా. రా. యు. 1835.

క. అడవులఁ బదునాల్గేఁడులు, గోడిచెల కొడి గట్టి సాఁకుకొంటిని మమ్మా.బడలిక నివు డిజ్జగడపుఁ, బుడమిం బవళించి నిదుర వోయితొ తండ్రీ. అచ్చ రా. యు 893.

వి. 1. ఒడి ప్రదేశమునఁ గట్టుకొనెడు కట్టు.

(జంగమవేషవర్ణనము ) సీ కుట్టిన చెంగావి గుడ్డల యొడికట్టుఁ బొంకపుఁ దామ్రతా టంకములును. కాశ. 4. 54.

2. (క ఒడి – నడుము) ఒడ్డాణము. (శ. ర.)

ఒడికట్టుబియ్యము – ఒడిఁబ్రాలు.

**ఒడికము** విశే. 1. మనోహరము, ఇంపైనది.

చ. కుడిచినపిమ్మటం గుసుమకోమల విస్తృత సంస్తరంబుగా, నొడికపుసెజ్జ సేసి ప్రియుఁ డొయ్యన నందు శయింప ... భార, అర. 5. 11.

సరసిజవృత్తము. కప్పఁగఁ దోలున్ గొప్పన జాలుగా గమివినుకుల యొడికములగు నరు లున్. యయా. 2. 46.

ఉ ...వ, న్నెలఁగ బావమీని హేళనిం బరిఁ గానవియట్లుగాఁగ మేన్, గాజియవెట్టి తైన నొడికంబుగ నందుదు నెల్లకూర

లున్ భార. విరా. 1. 77. (ఇట 'రుచ్యము' అని భావము.)

క. సంబుద్ధి విడిచి మునుగల సంబంధం బెడలకుండ సప్తవిభక్త్యాడంబర మడరించిన నొడి, కంబగు సద్దళి యనంగఁ గవులకుఁ జెప్పన్. కావ్యా. 4. ఉల్లా. 21. (ఇట 'శ్రావ్యము' అని భావము.)

2. నేర్పరి.

సీ. గజపతినరపతిక్ష్మాధవు లంపిన యొడికంపు రాయబారు లొక్క వంక. తపతీ. 1. 14.

3. ఇది సందర్భమును బట్టి 'యుక్తము' మున్నగు మఱికొన్ని యర్థముల నిచ్చును.

చ. ...నేల నొడికంబుగ నేఁగినమాడ్కి నాహరుల్, చనియెడు నంబుపూరము శిలాసదృశంబుగఁ జేయు నావుడున్. ఉ. హరి. 2. 48. (ఇట 'అప్రతిహతముగా' అని భావము.)

ఉ. ....ఒకింత యారఁగటన్, గాయము డయ్యనీక యొడికంబుగ నన్నము వెట్టు...ఉ. రా. 1. 200. (ఇట 'తృప్తికరముగా' అని భావము.)

చ. గవుసెన దీసి... మెట్టు లొడికంబుగ నొత్తి స్వరంబు లన్నియున్, సవురు వహింప.... ఉ. రా. 6. 124.

వి. 1. మనోజ్ఞత, ఇంపు, అందము.

చ. ....మెఱుంగులకట్లదండయుం, గనుఁగవఁ గల్గు తేఁటి యొడికంబును సంది కడెంబు మించన, వ్వనిత యువాంతరంగమృగవాగుర యై మెలఁగున్ గృహంబునన్. శుక. 3 105.

2. ఉపాయము, నేర్పు.

చ. ఒడికముతోఁ బ్రయత్నమున నొక్క మహాశిలఁ గొండమీఁదికిన్, గడపఁగ భార మచ్చటిది గ్రక్కున భూమికి డిగ్గఁ ద్రోవఁగాఁ, గడు సులభంబ....నా. పంచ. 1. 107.

3. ప్రేమము, వాత్సల్యము,

క. తనయఁ గని గారవంబున, ననుదినమును సావధానవై యొడికమునం, బెనిచి ... దశకు. 5. 13.

**ఒడికారము** వి. ఉద్రేకము.

రగడ. కా రనకే యొడికారపుఁగింకమ... యయా 4. 25. (ఇది యింకను విచార్యము-అని శ. ర.)

**ఒడిత్రాడు** వి. (√ఒడి²) వేఁటాడుటకుఁ దగిన సాధన విశేషము.

వ. .... జిగురుఁగండెలుఁ దీపుఁద్రాళ్లు నొడిత్రాళ్లుఁ దలముళ్లుగొని...కాశీ. 3. 46.

**ఒడిదామర** వి. వృక్ష విశేషము (శ. ర.)

**ఒడిదారము** వి. (శ. ఒడి - నడుము.) స్త్రీల మొలనూలు.

ద్వి. మొనపి సౌన్నాటంకముల యొడిదార, మునకుఁ గాఁదగదె యమ్ముద్దియ చీర.... ద్వి. కో. భాగ. 10. స్కం. (శ. ర.)

సీ. చెలువంపు నెఱికకుచ్చెలలపైఁ బచ్చరా మొగపుల యొడిదారములు వొసంగ. రఘునాథ రామాయణము. 2. 109.

**ఒడిపిలి** వి. ఒకవిధమగు బియ్యము (ఆహారవిశేషము-అని బ్రౌ. శ. ర.)

క. ఓలింగమ విను నివ్వరి, ప్రాలును నొడిపిళ్ళు గునుకుఁ బ్రాలును వెదురుం, బ్రాలును నవరపు మెకముల, పాలును గల వచట నీకుఁ బాయసమునకున్. కాశీ. 3. 67.

ద్వి. అడవుల మనుఁబిల్ల కడు మంచిపాలు, నొడిపిలి పాసెంబు నుడుప నేతులును. బస. పు. 3. 660. పం.

**ఒడియించు** స. క్రి. (√ఒడియు¹) ఒడియఁ జేయు. (లాగించు, తీయించు)

సీ. ఇదె నాదువిభునిచే నీవదాన్యవగ బు నొడియించుకొని యేఁగుచున్నదాన. పారి. 4. 58.

గీ. ఎనఁగు నొడియించె ననఁగఁ దీయించె ననుట. ఆం. భా. 3. 182.

**ఒడియు¹** స. క్రి. 1. హఠాత్తుగాఁ బట్టుకొను.

గీ. పడ కతఁడు వానిముందల నొడిసి తిగిచి, పుడమిఁ బడఁ ద్రోచి బలిమి మక్కడఁగఁ బట్టి. జై. భా. 3. 118,

సీ. ఘోరగృధ్రము సుకుమారబాలాంగనఁ

బట్టుగతి నొడియంగఁ బాయుకరణి. భార. విరా. 2. 128.

గీ. అళిరావళి నమ్మనుజాళనుండు, లీల మృగ దంశకము మశ కాలి నొడిసి, చప్పరించు విధంబున వాతదీర్ఘ, దంష్ట్రికలఁ జప్పరించి రౌద్రమునఁ గెరలి. మనుచ. 4. 112.

2. (క. త. ఒడి.) విదారించు, చీల్చు; నశింపఁ జేయు.

క. నాకభిముఖమై క్రమ్మఱఁ, గాక మొఱ్ఱడి యంగ రాక గనుఁగొని కిన్కం, గాకుత్స్థా న్వయనాథుఁ డిషీకము మంత్రించి వైచెఁ జెవ్వఁటికాకిన్. భా రా. సుం. 818.

సీ. భోగభాగాభోగభాగన ర్ఘ్యచింత్నరత్నదీప్తు లు లమిస్రంబు నొలియ. దశా. 1. 206.

గీ. ఇంద్రజాలంబు పన్నక యెటుల నొడియ, వచ్చు ననిమిషబలముల....దశా. 2. 409.

అ. క్రి. ఒడువు వేసికొనియుండు, (పట్టు కొనుట, కొట్టుట, మొదలగువానికి) వీలు చూచుచుండు, కాచికొనియుండు.

వ. జుట్టునట్టువపిట్టలు కటిఁగలువ తెలవ లను తలంపు బెంపున ఒడల కొడియ వడివడిం దీవయుయెవ్వల లూఁగుమగువల...యయా. 4. 18.

పీ. కొన్ని జాగిలములు కోలాగ్రమున నిల్వ నొక కొన్ని వెనుక కాలికిని నొడియు. రా. వి. 8. 66.

ద్వి. కడఁకతో నొకదుష్టకాకంబు కాల,నొడి యుచు గాసి నేయుచు నున్నఁ జూచి. రం. రా. అయో. 121. పొ. 11. పం.

జ: ఒడి[1], ఒడిగ్రాడు, ఒడియించు, ఒడుపరి, ఒడుపు.

ఒడియు[2] – వడియు. అ. క్రి. (క. ఒడి.) 1. కాఱు.

ద్వి. ....నిర్ఝరవృత్తివిషము, లుడుగక ముఖ మున నొడియ ... ద్వి హరిశ్చ. పూ. 1979.

2. వ్యాపించు,

క. నెలవొడిచెం జెంగలువలు,వలి విడిచెం జక్ర వాక నయనోదకముల్, జలజల వడిసె న్వెన్నెల, జిలజిల దిక్కులకు నొడిసెఁ జీఁకటు లెడసెన్. రంగా. 3. 187.

ఒడిసె(సియ) వి. ఒకానొకచెట్టు.

వ. ....కొడిసెల నొడిసెల నందుగుల నిందు గుల...పి. శకుం. 2. 14.

ఒడిసెగర్ర వి. బిళ్లరోగము (గ్రా).

ఒడిసెప్రాలు వి. బ. వన్యధాన్యవిశేషము.

వ. ....ఒడిసెప్రాలు దూసరిబియ్యంబు నివ్వరి వడ్లు గునుకు లూద లాదిగాఁ గలుగు వన్య ధాన్యంబులు...పి. శకుం 8. 12.

ఒడిసెల వి. ఱాలు విసరివేయుటకై నడుమ పర్వులు పఁబడిన చిన్న చిక్కముగల త్రాడు, తేపణి.

సీ. ....ఒనరుదంచనముల నొడిసెలలను,జాలంగ నెందున సవరించుట... గీ ఓలిఁగర్జంబుగా నెల్ల యోధులకును. జెప్పి .... హరి. ఉ. 2. 15.

ఉ. .... పిట్టలన్, జెంచెతలార్చి వ్రేయుదురు చిత్రముగా నొడిసెళ్ల బావాబమూ, లాంచిత దీధితుల్ చిఱుతయైన గనుంగవమీఁదఁ బర్వఁగన్. కాళ. 8. 10.

చ ఒడిసెలరాతిచందమున నుర్వడి సింగిణికోల వాలుకై,వడిలగు డాఁకటం బఱచువై ఖరి ....సారంగ. 1. 93.

జ: ఒడిసెలకాఁడు.

ఒడిసెలకాఁడు వి. (√ఒడిసెల) ఒడిసెల వేయు వాఁడు.

సీ. ... ఈఁకెల నెలకట్టియలను వ్రేయుఁ డొడిసెలకాండ్రను నొడ్డుఁ డెందు. హరి. ఉ. 1. 83.

ఒడుచు స క్రి. (√ఒడు? పొడుచు?) 1 ఓడించు, జయించు, గెలుచు

గీ. మదముఁ గామంబుఁ గ్రోధంబు మత్సరంబు, లోభమును మోహమును నను లోనిసహజ, వైరివర్గంబు నొడిచిన నాఁడ యొడుచు, నక్రమంబున వెలుపవియహితతతుల. భార. ఆది. 8. 206.

క. కడు వధికుతోడఁ దొడరివఁ, డొడిచిన నొడి చినను బురుషుపురుషగుణం బేర్పడుఁ గాక హీను నొడుచుట,కడిఁదియె పౌరుషము

దానఁ గలుగునె చెపుమా. భార. సభా. 1. 128.

సీ. త్రైలోక్యభస్మసాత్కరణదీక్షాదక్షరూక్షాక్షశుక్షణిరూఢి నొడిచి ... దశా. 2. 211.

(ఇట ఔపమ్యవాచకము)

2. అడఁచు, నశింపఁజేయు.

సీ. ...పుణ్య, పాపసంబంధంబుల నోపి బంధింపగఁ బడక మనోవృత్తి నొడిచి... భార. ఆది. 5. 60.

క. ...మార్తాండోదయమున యజ్ఞతటాకోదకమునఁ గ్రుంకి మనుజుఁ డొడుచు నఘంబుల్. భీమ 6. 32.

3. పెఁద్రోచు, తీసివేయు.

సీ. ఇతకుండచాంచల్య మిల నసంటులజాడ్య మొడిచి యారెండింటిఁ దా నొకటిఁజేసి. అహల్యా 2. 11.

4. బాధించు, నొంచు

సీ. సురుచిరోరులు గని కరులు బెగ్గిలఁజేయుఁ గేశ పాశముఁ గని కేకు లొడుచు. భా. రా. అర. 2. 803.

5. వధించు, చంపు.

వ. ... ఇద్దురంతకాంతారంబునం గల మృగసంతానంబు నొడిచి బహునైవ్యసమేతుండై మన యాశ్రమంబున కరుదెంచిన వాఁడు. పె. శ. కుం. 2. 118.

6. బలాత్కారముగా గ్రహించు; అపహరించు.

తే. ... అశక్తినీంజాతుఁ, డొడిచికొనియెనె మొఱకుచే మున్నతియ్య, పండు వెస నాఁచికొనిన నేర్పరియుఁ బోలె, భార. ద్రో. 5. 243. అర. 1. 55.

గీ. విశ్వనాథుండు దేహళివిఘ్నరాజు, గనని మొగసాల నధికారిగా నొనర్చెఁ, గాశిఁ జొరనీఁడు తనముద్ర గాని యేరి, ముక్తినిధి నెవ్వఁ డొడుచునో మోస మనుచు. కాశీ. 5. 57. (చి. ని. పా.)

7. గ్రహించు, తెలియు.

వ. ప్రసంగవాక్యంబుల నింగితంబు నొడిచికొని ధరణీశుండు దానిం గారవించి... కేయూర. 4. 120.

**ఒడుదొడుకు** వి.ణ. 1 విషమము, నిమ్నోన్నతము. (నేల)

వ ...అడవికడ కొత్తికొని నడచి యొడుదొడుకగుడు...మనుచ. 4. 115.

2. కష్టముకలది (స్థితి).

(వ్యవ) వానిస్థితి మిక్కిలి ఒడుదొడుకుగా నున్నది.

వి. 1. విషమత్వము, నిమ్నోన్నతత్వము 2. కష్టస్థితి.

క. తరుణీమణిజఘనమునకు, దొరగాక తృణంబు పూని తుద లేక వసుంధర యొడుదొడుకులఁ బడిమహీధరములు చుట్టుపడి తావు దరలక యుండెన్. రసిక. 2. 98.

(పై రెండర్థములకు నిదే యుదాహరణము)

**ఒడుపరి** విణ (ఒడుపు + అరి) టక్కరి.

ద్వి. ఎడపరుల్ మదపతు లేవఁ బుట్ట, లొడుపరులు...పండితా. పురా. 116 పొ.

**ఒడుపు** వి. (√ఒడియు¹) 1. పట్టుకొనుట మొదలగు వానికి అనుకూలమగుస్థితి. వీలు.

(శ్యేనము) వ. అప్పటికి నొడుపు దప్పి తొలంగి యొక్కడకేనియుం బోయె. కాశీ. 6. 293.

వ. ... అబ్జాలపాదంబును నభ్రాంతలం బెఱింగి యెగసియుం దప్పఁ గ్రుంగియు దాఁటుకొనియుం దనమీఁద వ్రాలు కేలుదోయి యొడుపు దప్పించుకొనియె. నైష. 2, 46.

ద్వి. ఒడుపు దప్పినయట్టియురగంబపోలెఁ, దడయక వచ్చిన తనపూన్కిఁ దప్పి. ద్వి. హరిశ్చ పూ. 466.

(వ్యవ) పెద్దపులి మేఁకకై ఒడుపు వేసికొనియున్నది.

2. టక్కు, మాయ, (చూ. ఒడుపరి).

**ఒడ్డగ** వి. రెండిట్టికొమ్ములు జత చేసి యేర్పఱచిన ఆయుధవిశేషము.

సీ. జింక కొమ్ములు రెండు చేర్చి యల్లు లమర్చి డాకేలఁబూన నొడ్డ గవఁ బొడువ, సంగతి గలయది సింగోట యనఁగను దివిదారి కొమ్ము నాఁదేజరిల్లు ఆం. భా 2. 206.

**ఒడ్డగించు** స. క్రి. (√ఒడ్డగిల్లు) అతిశయింపఁజేయు.

(నృత్యవర్ణనము) ద్వి...అందియలు గదల్చు చును, నోహో యనుచు గతు లొడ్డగించు చును. పండితా. పర్వ. 371. పొ.

**ఒడ్డగిల్లు(లు)** అ. క్రి. 1. ఒఱగు, వ్రాలు.

గీ. దొడ్డవయిసున శీతాంశుఁ డొడ్డగిల్లె. భీమ 2. 46.

ఉ. రాజతనూజసేనలధరంబున మేదినియొడ్డ గిల్లినన్, భూతము లెల్ల ఁ జెల్లొరగి పొల్పు వహించె.. భోజరా 4. 79.

ద్వి చుక్కలుడుల్లె శేషుడు భీతిల్లె, దిక్కులు ద్రెళ్లె నద్రివి యొడ్డగిల్లె, రం. రా. యు. 818. పొ. 7. పం

2 స్రవించు.

క. బిడ్డఁడు మ్రొక్కినఁ దల్లులు, జడ్డన నంక ముల నునిచి చన్నులతుదిఁ బా,లొడ్డగిలఁ బ్రేమభరమున, జడ్డువడం దడిపి రశ్రుజలముల ననఘా. భాగ. 1. 260.

శ్లో. తాః పుత్ర మంక మారోప్య స్నేహస్నుత పయోధరాః. సం భాగ. 1. 11. 30.

3. అతిశయించు.

క. ... అపు డప్పలభుక్కుల కన్యవన్యఫల భుక్కులకును, గల వయ్యెనందుఁ బై కొని గెలుపునఁ గపివీరు లొడ్డగిల దొరఁకొనినన్. రామా. 9. 54.

జ: ఒడ్డగించు.

**ఒడ్డగెడవు** విశ. ఒకప్రక్క క్రిందికి కొఱగి మఱి యొక ప్రక్క పైకి లేచినది, తలక్రిందైనది. విపర్యస్తము.

అ. పుడమి యెల్ల నొడ్డగెడ పయి గజవాజి, యుతముగాఁ గడంగి యుగ్రమృత్యు, ముఖము సొరఁగఁ దివురు మూర్ఖత మానుటల. యధికమైన పుణ్య మనఘ చరిత భార. ఉద్యో. 3. 288.

ఆ. కెడసె హయము లొడ్డగెడవయ్యె రథములు, చాఁపకట్టువడియె సామజములు. భార. భీష్మ. 2. 165

సీ. తన పెండ్లిఁ జూడంగ దక్షిణదిక్చరాచర భూతములు హిమశైలమునకుఁ, జనుదేర నుత్తరాశాభూమి గ్రుంగి దక్షిణభూమి కడు నొడ్డగెడవు గాఁగ. కాశ. 1. 108. భీమ. 2 7. భార. భీష్మ. 3. 320.

**ఒడ్డణము - ఒడ్డాణము.** వి. (క. ఒడ్డణ.) ఒడ్డాణము, కాంచి.

సీ. ...ఒడ్డాణంబు కమరి యొడ్డణ మనఁ గాంచి వెలయు. అం. భా. 2 150.

సీ. పదివన్నియలకోట పసిడి యొడ్డణముగా సౌధశృంగము లురోజములు గాఁగ. దశా. 3. 116.

**ఒడ్డనము** వి. (√ఒడ్డు¹.) 1. (జూదమున) ఒడ్డిన వస్తువు.

గీ. వాహనంబులు సాలెలు వాఁడిశరము, లూర్జితాతము లనువులె యొడ్డనములు, గాఁగఁబోరెదు నీద్యూతకర్మమందు, నెనఁగ జయమును నవజయ మెవ్వఁ డెఱుఁగు. భాగ. 6. 416.

2. వ్యూహము.

సీ. నాగరథాశ్వసన్నాహ మొనర్పక యొడ్డనంబులు దీర్చక. . భార. సభా. 2. 147.

క. అనురూపము లగు మారొడ్డనముల్ ప్రస్ఫురితములు దృఢంబులుగాఁ దీర్చినఁ గాక తెఱంగగునే. . భార. భీష్మ. 2. 26. అం. భా. 2. 210.

3. (సం. అడ్డనమ్) కేడెము; ఒకరకము కేడెము

చ. అనువున నద్భుతంబు లగు నాక్రమణంబుల వాని నెల్ల నొడ్డనమున వాఁగి యాఁగి సుదృఢంబగు ఖడ్గముచేతఁ గొన్ని తుత్తుని యలు సేయుచుఁ...హరి. ఉ. 7. 206.

క. పలకలు నొడ్డనములుఁ గత్తులములు పసి శక్తికుంతతతియుం గొని... కు. సం. 11. 640.

**ఒడ్డరి** విశ. (ఒడ్డు¹ + అరి) ఆశపెట్టువాఁడు.

ఉ. నన్నడకించి యొడ్డరితనంబున నాదగు విద్య నీవు గై,కొన్న సహింప నేర్తు నె... భోజరా. 2. 166.

**ఒడ్డాణము - ఒడ్డియాణము.** వి. (సం. ఓడ్యాణం. క. ఒడ్యాణ. త. ఒడ్డియాణం.) స్త్రీలు యోగులు మొదలైనవారు నడుమున ధరించెడి స్వర్ణాదిమయమగు పట్ట.

ఉ. శోణితశేఖరుఁ జూడ నొకకొమ్మ పడిం బలితెంచి యుల్లస,ద్వేణీభరంబుతో మొగ పుఁ దీఁగె పలగ్నమునం దమర్చి యొడ్డాణము తీఁగెగా నిడి మెడఁ...కళా. 8. 189.

సీ. బణేయ మైనయొడ్డాణంబు లవణిచే వక్కళించినపొట్ట మక్కళించి. మనుచ. 1. 59.

సీ. ఘనచక్రవర్తి యిచ్చిన ప్రవాళంబులయొడ్డాణము ధరించు నొక్క. వేళ. భీమ. 1. 116.

ఒడ్డాణము — ఒడ్డియాణము

2. ఆసనవిశేషము

శివయో 2. 74. (చూ. గొడ్డగము)

**ఒడ్డారము** వి. (√ఒడ్డు¹–త.ఒడ్డారం) 1 పంతము, పోటి.

సీ. ....అవ్వధూటి, కేవలధవళంబు నా విని యొడ్డారమునకు నేనదె నల్లఁదనము కలె

గీ. వెనుకదెస వన్న వాదయ్యె .... భార. అను. 1. 193.

వ. ... మనకు నక్కసెలియు ద్ర బిడ్డలకు నొడ్డారంబు లేమిటికి నేకకార్యపరత్వం బున నడ్డంబు లేక బ్రదుకుదము ... భాగ. 8. 182. బహు 2. 67. ఉ. రా. 3. 246.

2. ప్రతిఘటనము, ఎదురెత్తు.

వ. చుఱుకుమినుకు జేని కొడుకుకడకుం జని నయ భయరసంబు లొలుకం బలుకు పలికి నం గనక వినక రాక యొడ్డారంబు లొడ్డె నేవి... మన్నిశితవిషమాశుగ విషంబునకు నొప్పింతు ననుము రామా. 6. 42.

3. వక్రోక్తి, వంకరమాట.

సీ. ఒడ్డార మం చన నొఱగొడ్డె మనఁగను నడుగునా వక్రోక్తియడరుచుండు. అం. భా 1. 118.

**ఒడ్డారించు** అ. క్రి. (√ఒడ్డారము) ప్రతిఘటించు.

సీ వలయొడ్డారించె నీపాపఁ డిటు పాప మడిసెఁ గటాయని యడలువారు. నృసిం. 4. 28.

వ. ఇట్లు తనకు నొడ్డారించి యడ్డంబు వచ్చిన నిర్జరేంద్రాదుల నిర్జించి. భాగ. 10. ఉ. 218.

క. బిడ్డలు వెఱతురె నీ కఱ,గొడ్డెంబులు సేయ కెల్లకోదండ్రుడును మ్రా,ఱొడ్డారింపక నడతురె, యొడ్డము గాకున్నదే మృగేశుఁ యింటన్. భాగ 8. 467.

మ. ....రాచబిడ్డలనుస్ వెల్వడొం ల్దుంమ్ము నకు నొడ్డారించి క్రొవ్వాఁడిబాఁ,కులతోఁ గ్రుమ్మెనలాడ సాగిరి...రంగా. 8. 218.

**ఒడ్డిక** వి పాత్రవిశేషము.

మ. గరిఁ జెల్ గిండ్లును దట్ట లొడ్డికలు గంగాళాలు పిరంగాండ్లు...వరాహ. 4. 112.

**ఒడ్డియాణము** – ఒడ్డాణము.

గీ. కత్తెరల నొడ్డియాణము లత్తిరించి. ప్రబంధ. 789 పండితా. పర్వ 344.

**ఒడ్డి** వి. పారావతభేదము, ఒకజాతిపావురము

సీ. పారావతం బగుఁ బావురాయి యనఁగ... తద్భేదములు గాను దనరుచుండును.. ఒడ్డి కూకి బకదారి దూఁబారు లనంగ ... అం. భా. 2. 89.

క. మేలైనలకోరి లొడ్డిలుం బదటిలు పల్లటీ ల్పక్కువలుఁ ... అనెడు పేరులం దగిన పావ్రములఁ. సాంగ. 1. 117.

జ: ఒడ్డిఁడు².

**ఒడ్డిఁడు¹** వి. (ఒడ్డె+ఈఁడు) ఓడ్రదేశపురాజు.

వ. .... గడుసుఁదనంబునం దనకు మొండొడ్డిన యొడ్డిని పై బలంబుల విడియించె...కళా. 8. 78.

**ఒడ్డిఁడు²** వి. (ఒడ్డి+ఈఁడు–స్వార్థమున) ఒడ్డివ గతి గల పావురాయి, పారావతవిశేషము.

సీ. ఘనమైన కండక్రొవ్వునఁ బాఱుతెంచిన యొడ్డిని పెనులావు లూడఁదన్ని. హై. భా. 1. 45.

(ఇట 'ఓడ్రదేశపురా' జనియు నర్థాంతరము కలదు.)

**ఒడ్డు¹** స. క్రి. (క. త. ఒడ్డు.) పందెముగాఁ బెట్టు.

గీ. ఈతఁ డొడ్డినధనరాసు లెవ్వియైనఁ, బోఁడిగా నీకు నీఁ గలవాఁడ నేను. భార సభా. 2. 174.

చ. ఉదుటున నట్లు తన్మహిపుఁ డొడ్డిన యొడ్డు జయించి...రాఘవ. 2. 16.

2. వైచు, పడవేయు.

ఉ. దట్టముగాఁ ధరాధరవితానము లొడ్డుచు మీఁద బ్రాఁకులుఁ, మట్టలు వైచి కప్పుచు భా. రా. యు 272.

3. (వల. మున్నగునవి) ఒగ్గు, పఱచు, పన్ను.

సీ. ... నిత్యమును మృగంబుల కురు లొడ్డి వేకువ వచ్చి యెక్కమాలఁడు .... భార. శాం. 8. 203. వరాహ. 3. 103.

4 పేర్చు. అమర్చు.

సీ. విను మట్టిధృతరాష్ట్రతనయులు గారె యీ యొడ్డినమొనలో నున్నవారు. భార. భీష్మ 1. 1[illegible].

వ. ..మృగయుం డొకఁడు వల యొడ్డి సంఘటించిన కాలిబోనులం బడి. మనుచ. 4. 87.

5. అడ్డముగాఁ బెట్టు; పెట్టు.

ఉ. పాఱఁడు లేచి దిక్కులకు బాహువు లొడ్డఁడు బంధురాజిలోఁ, దూఱఁడు... భాగ. 7 194

సీ నికటద్రుమస్థిత నీలకంఠంబులు పురు లొడ్డి వానలఁ బిలుచు మాన్ప. కాశ. 3. 69

మ. అనికిం దారిచి తోడు తెచ్చుకొని మిమ్మడ్డంబుగా నొడ్డుచున్, దనమై నోఁకక యుండఁగాఁ దిరిగెడుఁ దవ్వై జరాసంధుఁడు. హరి. ఉ. 1. 111.

6. (దానాదికము పుచ్చుకొనుటకుహస్తాదికము) చాఁచు, పట్టు.

గీ. అనిన నాతఁడు భయ మంది యాత్మలోన, నొరులయీగికి నకట చే యొడ్డకుండు, నట్టి నా కిది వలసెనే యనుచుఁ గరము సాఁచె నవ్విప్రు డెనకు నిశ్చయముతోడ. భార. శాం. 4. 158.

మ. అమరారాతి కరాతతోజ్ఝితపవిప్రాంతః కణశ్రేణికిం, గమలాధీశ్వరుఁ డొడ్డె ఖండితదివౌకస్స్వామిజిహ్మస్తమున్... హస్తమున్. భాగ. 8. 611.

7. ఆఁపు, అడ్డగించు.

సీ. సుంపథం బొకవేళ నోలి వాలినఁగాని ఊరి జాఁగరై యఱచేత నొడ్డు..., గీ...ఖండోజి ధీరుని ధైర్యలక్ష్మి ఘటికా. 1. 50.

8. (చెవి) ఒగ్గు

క. జిలిబిలియెలుఁగులు ఘంటానిలయములోఁ దెలఁగుటయు ముని ప్రభుఁ డచ్చో, నిలిచి చెవి యొడ్డి విని...మార్క. 1. 48.

క. ...విహగ విభునియాలాపంబుల్; వినితోఁ జెవి యొడ్డి... విక్ర. 5. 216.

9. ప్రయోగించు.

ఉ. ఏ నలరమ్ము లొడ్డఁ బరమేశ్వరుచిత్తము గౌరి చిత్తముం, దాన కరంగి ... కు. సం. 4. 425.

వి. (క. త. ఒడ్డు. ప్రా. ఊడిఅం, ఆహుడం.)

1. పందెముగాఁ బెట్టినసొమ్ము.

గీ. శకునిజూదంబు దీనియ చొప్పకొ యనంగ, గెలుపు నాయది కా నొడ్డు గిలుబ నేర్చి, యెల్లఁ బిడికిళ్ల విడిపించి యేనకొందు. ద్వా. 10. 83.

2. వ్యూహము. ఒడ్డనము.

ఉ. తెక్కలు సించి కంఠమున తెకులు వాపి శిరంబు వ్రచ్చి వేఁ, రుక్కునఁ గ్రౌంచచందమగు నొడ్డు గలంగఁగఁ జేసి... భార. భీష్మ. 2. 80.

వ. ఇక్కడ భారద్వాజుఁడు పద్మవ్యూహంబు గావించినం గౌంతేయాగ్రజు ననుమతి నభిమన్యుం డయ్యొడ్డు భేదించి .. భార. ద్రో. 1. 394.

3 అడ్డు, ప్రతిబంధము.

క. ...కావలివారల, యొడ్డు గడచి పురుటిసాల యొయ్యన వెడలెన్. భాగ. 10. పూ. 140.

గీ. నాఁడు నేఁడును దమ కీడు లేఁ డటంచు, గొడ్డలాడుదు రొండొరు లొడ్డు లేక. రా. వి. 1. 54.

4. తీరము

క. అడ్డముపోయిన మంత్రుల, జడ్డిగములు ద్రుంచె భటుల సందడి మాన్పెన్, దొడ్డ చలంబున నీ కెదు రొడ్డి విజృంభించె నవలియొడ్డున నధిపా. ఉ. రా. 3. 287.

సీ. ఒడ్ల పైఁ బాఱుచు నుండిన నది పెంపు దూలిపోవును స్వల్పకాలమునను. రామలిం. 86.

ఒక్కయొడ్డువన్–ఒక్కమాఱుగా.

మ. ...ఒక్కయెుడ్డువ శాఖాంబుఝరంబు లుప్పతిలెఁ బోటుం బాటు గా నెంతయుఁ మనుచ. 3. 186.

ఒడ్డుమూపు – ఎదురొ్కను.

గీ. ఒకరథమె చాలుఁ గనకాద్రి కొడ్డుచూప. దశా. 1. 89.

వఱ్ఱొడ్డు–ప్రవాహములోఁ బడి కొట్టుకొనిపోవు.

సీ. ...కాన యంతయు జలమయంబైన బెగ్గిలి యన్నరాధముండు. గీ. వేగ వఱ్ఱొడి యల్లన వెడలి మిఱుత, నొక వనస్పతి బొంప మై యున్న దానిఁ, జెంది... భార. శాం. 3. 307. (ప్రాఁతప్రతిపాఠము)

సీ. కన్నీరువఱ్ఱొడ్డి కాంతి యంతయుఁ గుంది వెలఁది నీకనుఁగవ విన్నవయ్యె. భార. విరా. 2. 156. (ప్రాఁతప్రతిపాఠము – కన్నీరు వఱ్ఱొడ్డి – కన్నీటిప్రవాహములోఁ బడి కొట్టుకొనిపోయి) మార్క. 5. 280.

జ: ఒడ్డనము ఒడ్డరి. ఒడ్డాణము, ఒడ్డారించు, ఒడ్డుకొను

**ఒడ్డు²** విశే. పెద్దది; విశాలమైనది; అధికము.

వ. పయోధిగన్న బిడ్డలు బోని యొడ్డు చెలువుల చేతను... భీమ. 1. 109.

ద్వి ఒడ్డుబొమ్మలు దొడ్డయూరులు బిగువు, టొడ్డియాణము లిన్నయుంగరంబులును. పండితా. పర్వ. 344.

సీ. కాంచిత క్రీడ కంగము పంపుసేయమి నొడ్డుగా నిట్టూర్పు లొలయఁ బొగులు. మనుచ. 3. 128.

వి. వైశాల్యము, వెడలుపు; స్థౌల్యము.

వ. వలువకు రాజధానియైన మనస్వతీనగరంబు దనకు మణికిరీటంబుగా మెఱయు మేరు నగరాజంబునకు రెడ్డిగంబును బోలె నొడ్డునం బదివేల యోజనంబులు పొడవున ముప్పదివేల యోజనంబులు నైచుట్టి వచ్చి... వరాహ. 10, 114.

క. ఒడ్డును బొడవును రూపును, దొడ్డతనముఁ గలిగి ప్రజ్ఞతో మెలఁగనియా, బిడ్డను గనుకంటెను సతి గొడ్డైనను మే లనంగఁ గుందుట గలిగెన్. ద్వా. 3. 187.

ఆ. ఒడ్డు పొడుగు గలిగి గడ్డంబు పొడుగైన, దానగుణము లేక దాత యగునె. వేమన. 2. 180.

**ఒడ్డు³** న. (బ. ఒడ్డులు, ఒడ్లు) అన్యుఁడు; అన్యులు. (ఈయర్థమున ఏకవచనమందుఁ బ్రయోగము కనఁబడలేదు.)

ఉ. ... చుల్కనివృత్తి దుర్జనుం, డొక్కనిఁ బొచ్చి క్రిందుపడు నొడ్లకుఁ గీడొనరింపఁగల్గినన్. మనుచ. 3. 50.

ఉ. .. నృపాలుఁడు... ఏ, యోజ విదగ్ధుడై పలుకు నొడ్డులకుం దగ దట్లు సేయఁగన్. భార. విరా 1. 123.

ఉ. ఉత్పలగంధి నన్నుడుగు మొడ్లనుబంపుము గల్లుదేర.. భార. విరా. 2. 98.

**ఒడ్డుకొను** అ. క్రి. (√ఒడ్డు¹) తప్పుకొను.

గీ. ...విడియ, మైనఁ బండైన నాచేతఁ గాని వేఱ, యొకరిచే నంప దే నెంత యొడ్డుకొనిన. దశా. 8. 268.

ఉ. ప్రేటున కెత్తినట్టి ప్రతివీరునికత్తికి నొడ్డుకొంట యెచ్చోటను గల్గినట్టిది .. కళా. 8. 70.

**ఒడ్డువిడుపు** వి. బాలక్రీడావిశేషము.

సీ. ..ఊఁదుఁ గ్రోవు లొడ్డువిడుపు నెట్టుడు గాయ విండ్లమ్ములాటలు పులిజూదములు.. హంస. 3. 146. ప్రబంధ. 9. 15.

**ఒడ్డె(డ్డియ)** వి. (సం. ఓడ్రాః. క. ఒడ్డ, త. ఒడ్డన్.) 1. ఓఢ్రదేశస్థుడు. 2 మట్టిపనిచేయునొక జాతి

ఉదా: ఒడ్డెవాఁడు, ఒడ్డెది

జ: ఒడ్డీఁడు¹.

**ఒడ్డెనపని** వి. అలంకారవిశేషము.

ద్వి. ఒత్తులు గాజులు నొడ్డెనపనులు, గపుడసరాలు బంగారుకడెములు. ప్రభులిం. 4. 148. పా. 16. పం.

**ఒడ్డోలగము** వి. (ఒడ్డు² + ఓలగము.- క. ఒడ్డోలగ త. ఒడ్డోలకం.) పేరోలగము. నిండుకొలువు

సీ. ఆస్థానసంజ్ఞలై యలరు నోల, గీ. గమ్ము కొలు వన నది మించి కానిపింపఁ;బోలుఁ బేరోలగమ్ము నొడ్డోలగ మన. ఆం. భా.

2. 171. భార విరా. 5. 204. రా. వి 3. 88. దశా. 7. 31.

**ఒత్తగిలు(ల్లు)** అ. క్రి. (√ఒత్తు) 1. ప్రక్కకొఱగు; చేరఁబడు.

గీ. ఒత్తగిలి యూఁద...కవిక. 4. 48.

మ. అలరుఁ శయ్యకుఁ జేరి యొత్తగిలి సయ్యాటంబునఁ గవ్విగుబ్బలు ఱొమ్మొత్తఁగఁ బ్రాణనాథుకటిపైఁ బాదంబు కంఠంబునన్. వలకేల్ గ్రుచ్చి కవుంగిలించి...దశా. 3. 77. మనుచ. 5. 67.

గీ. ... రతిదేవిపాలిండ్ల నొత్తగిలిన, యించువిలుకాని వ్రాసినా రిడుపువందు. నైష. 7. 150.

2. తొలఁగు.

సీ. వనదిగ్వ్యక్త కిన్క వతఁ బుడిగ్గి యొత్తగిలఁ జేవలగొమదంటతనము దశా. 3. 141.

గీ. మానినీయుతఁ గాంచి యస్మద్విరోధి, జవనయనవాశ్వకులతోడ సభ్రమించి, యెత్తివచ్చిన యపుడు మే మొత్తగిలుట, రావువంశంబు దుష్కీర్తిపాపుఁ గనుట. రంగా. 2. 236.

3 చెదరు. చలించు

ఉ అత్తగిలాయతాతులు ప్రియం బగునమ్మని నాథురూపు వస్;చొత్తినరీతి నెమ్మనము లందుఁ జెలంగఁగఁ బంచబాణుచేఁ, జిత్తములొత్తగిల్లి వలుచింతలఁ జేద్వడి . పద్మ 3. 148.

4. అంటుకొను.

సీ భ్రమాణంబు నీచమై కన్నులు తెల్లనై యుదరంబు వీఁపుతో నొత్తగిల్లి. కాశీ. 6. 41.

క. అంగన యొక్కొకమణి యు,త్తుంగమణిస్తంభయష్టితో నొత్తగిలన్. కాశీ. 4. 209.

**ఒత్తడము - ఒత్తుడు.** వి. (√ఒత్తు - క. ఒత్తడ.) రాపిడి, ఒత్తుడు ఒత్తుట; పీడనము.

సీ. తారహారముల యొత్తడ మెఱుంగఁగ రాని పరిరంభముల ప్రేమపరవశంబు. కవిరా. 2. 165.

సీ. ...క్రుక్కు డదుము డొత్తడ మ్మొత్తునాఁ పీడనమ్ము విరాజిల్లు... అం. భా. 1. 150.

**ఒత్తడి** వి. (√ఒత్తు.) 1. రాపిడి. సమ్మర్దము.

వ. ఒండొరుల యొత్తడిం బొడిపొడియై. మనుచ. 5. 71.

2. ఒత్తుడు, బాధ.

సీ. పగలు నొత్తడి నోర్వఁ బాడి మిక్కిలివారి సిరి చేటుగల దైనతెలిపి గాంచి. అచ్చ. భా. 1. 10. పొ.

వ పెంపు గలవారియొత్తడిఁ బడియు మేటి మానిసి వెలయు. అచ్చ. భా. 2. 81. పొ.

3. తఱుచుఁదనము.

సీ. ఒడికంపునరిగ యొత్తడిసరంబున మించుమిసిమిక త్తెవుఁగెంపు మేలివాగె. చంద్రా. 2. 69. (శ. ర. పా.) విక్ర. 1. 83.

**ఒత్తరము** వి. (క. ఒత్తర.) ఉద్రేకము.

వ. ... అప్పుడమితేఁడు వెడందవాఁడి తూపుల నతని కాళ్లు కత్తిరించి యయ్యత్తరము నొత్తరముం గుఱుచపఱిచిన ... రామా. 6 174. (శ. ర. పా.)

విశ. ఉద్రిక్తము, ఉద్రేకించినది.

వ. ఇత్తెఱంగున నొత్తరంబై జగత్తు లుత్తలపడ నొత్తివచ్చిన యత్తెరమ్రోలఁ గోసలేశ్వరకుమారుండు .. రామా. 8. 178.

జ: ఒత్తరించు

**ఒత్తరించు** స. క్రి. (√ఒత్తరము - సం. ఉత్సా. ప్రా. ఒత్తరఇ. క. ఒత్తరిసు )1 అతిక్రమించు, మించు.

సీ. వితతవీరాగ్రహావేశాతిదర్పితచిత్తులై యొండొరు నొత్తరించు,నుగ్రమహోద్ధతి నుద్భటాటోపతీవ్రములగు సమరవిభ్రమము లంగ,సంగతంబులు గాగ .. భార. శల్య. 2. 267.

సీ. కరమూలముల జిగి గడలొత్తి వల్లిక్కుచోపొంత కాంతుల నొత్తరింపఁ, దూఁగాడు హారవంక్తుల దీప్తి వెలవెల్ల నగు దీపరుచులను నతకరింప. హరి. పూ. 3. 167.

2. వెడలఁగొట్టు, త్రోయు

వ. ఇట్లు మధుసూదనుం డేయుసాయకంబులు.. చరణంబులు తొలిచియుఁ జఠ్యంబు లొలిచియు బాహుదండంబులు గత్తరించియు

బయల్లకు నొత్తరించియు బలుగండలు
చెండియు ..ఉ. హరి. 1. 148.

3. ఉద్రేకపఱచు.

చ ...వచ్చినవివరంబు విన్నపముచేసి కుళింద
కుఁ బట్ట రాజుచే, ననుమతుఁడై యమా
త్యుఁడు రహస్యము చిత్తము నొత్తరింపఁ
గన్.

ఆ. తమక మినుమడింప దక్షముతోడుత నాఱు,
యోజనముఁ బయన మొక్కనాఁడె, తెంలి
...జై. భా. 8. 58, 59.

**ఒత్తి** అవ్య. (√ఒత్తు) గట్టిగా.

(క) నిర్బంధపూర్వకముగా.

క. అనుడు విదురుఁ డాతని కిట్లను నిమ్మెయి
నన్ను నొత్తియడిగినఁ జెప్పఁ, జను మన్న
రూపు సెప్పెద,విను మవధానంబుతోడ
విమల విచారా. భార. ఉద్యో. 2 51.

ఉ. ...పుష్పంధయ మీయధీశువకుఁ బాదము
లం బడి యొత్తి చెప్పవే. భాగ. 10. పూ.
1468

(చ) దృఢముగా.

గీ. అనుచు నిబ్బంగి నొత్తి చెప్పినను వినియు,
నుత్తరము లేక యూరక యున్నఁ జూచి.
నైష. 5. 146.

(ట) హృదయపూర్వకముగా.

ఉ. అత్తఱి భీష్మముఖ్యు లగు నచ్చటి వృద్ధ
జనంబు లెల్ల నో, రెత్తక యూరకుండిరి
మహీశ్వరుచిత్త మెఱుంగ కుక్కిఁ దా,
నొత్తి కుమారులం గినియనోపఁడ యక్కట
....భార. ఉద్యో 1. 346.

**ఒత్తియాడు** స. క్రి. (ఒత్తి + ఆడు) నొవ్వనాడు.
దూషించు.

వ. ...చెలికత్తియల మొత్తంబుల నొత్తియాడు
చు...నీలా. 2. 118.

చ. గురుకుచగుబ్బచన్నుఁగవ ... జిగిజాళవుఁజి
వ్వుల నొత్తియాడుఁ దా, మరవిరి మొగ్గ
గుత్తిఁ బలుమాఱును జేకుమడంచు నెంత
యున్. చంద్రా 2. 122. (ఇట ఔపమ్య
వాచకము)

**ఒత్తిలి** అవ్య. (√ఒత్తిలు?) 1. బిగ్గరగా, గట్టిగా.

ఉ. అందఱివార లెల్లను జయంబునఁ బొంగు
చుఁ బేరెలుంగులం, దండ చెలంగఁగాఁ బలుక
నార్వఁగ నొత్తిలి నవ్వ సాకసం, బందిన
యట్టి క్రమోంత విని యక్కడ వోవఁగ
నుల్కి రప్డు...భార. సౌ. 1. 5.

క. ఒత్తిలి పొగడుచు సురలు వి,యత్తలమున
నుండి మెచ్చి యలరులవానల్, మొత్తము
లై కురిసిరి...భాగ. 1. 508.

క. ...దిశావలయ మ్రదువ దేవాంతకుపై,
నొత్తిలి యార్చుచుఁ గడఁగె మ,రుత్తన
యుఁడు సముత్పరుషరోషం బెసఁగన్. భా.
రా. యు. 997.

2. మఱిమఱి, మాటిమాటికి.

(దుష్యంతుఁడు). సీ. వనితయూర్పుల వాడి
వత్తలైన పయోజముకుళంబు లొత్తిలి
మూరుకొనుచు. పి. శకుం 3. 209.

**ఒత్తిలు(ల్లు)** – ఒత్తగిలు.

(తప్పుకొను)

(శ్లేష్మము.) క. కుత్తుకకు నడ్డపడు మూ,రొ
త్తిలి పోనీక యాఁగు నూర్ధ్వశ్వాసం, బెత్తఁ
గఁ జేయును...భార. అశ్వ 1. 178

(స్థానభ్రంశము నొందు)

చ. తపనహిమాంశు లొత్తిలిరి తారలు డుల్లెఁ
బయోఘు లింకె ని,ట్లపరమితంబుగా
మొరయు నాజి నిశానినదంబుడంబునన్.
రంగా. 3. 54.

**ఒత్తు** స. క్రి. (త. త ఒత్తు.) 1. అణఁచు; అదుము;
నొక్కు.

సీ. ...అవనిఁ బెట్టియొత్తిన బెగ్గలం బొందక
యొండొరు బలువిడి నొత్తుచు నలవు మిగిలి.
భార. విరా. 2 347.

2 (పల్లు, గోరు మున్నగువానితో) నొక్కు.

గీ.. ధనదసుతుఁ డమ్మాటకుఁ దరుణిమోవి,
దంతశిఖ నొత్తె నత్తఱిఁ దనరుతమిని. కళా
1. 90. నైష, 1. 101.

గీ. పాలచేఁపున గిలిగింత వాఱుటయును, మెత్త
మెత్తన నఱచేత నొత్తికొనుచు. హం. 2. 95.

చ. తలోదరి మది గాఢమై తగిలె దర్పకుఁ డ
చ్చున నొత్తినట్లయై. భాగ. 10. ఉ. 330.

3. నిర్బంధించు.

ఉ. నీ కెనవచ్చు రాజన్యమణిన్ ధర నెందును గంటిమే నృపానీకము వించునుండ నుతు నిం దగుపల్కుల నంత యొత్తుదే. భార. శల్య. 2. 370.

4. పీడించు, బాధపెట్టు; కొట్టు.

గీ. తొలుత మూఁడుపాయంబులు గొలువ కున్నఁ, దుదిఁ గదా విక్రమోద్యోగ మదియు రిపుఁడు, మత్తుఁడై యున్న నొరు చేత నొత్తఁబడిన, వీత బలుఁడైనఁ ఇను నంౘడు నీతివిదులు. భా. రా. యు. 77.

సీ. గడి నున్నవానితోఁ దొడరుచుండుట యొప్పు నూరకుండిన నతం డొత్తఁ జూచు. నీతి. 84.

ఉ. ఒత్తితి శత్రుభూపతుల నుగ్రరణంబున భూమిఁ ద్రెళ్లఁగా మొ రా. సుం. 49.

5. ఆక్రమించు, అన్యాయముగా వశపఱచు కొను.

వ. కొందఱు కొందఱ నివేశనంబు లధికాభి లాషంబున నొత్తికొనుట కారణంబుగా వివాదంబు పుట్టిన సహదేవుఁడు కలియు గంబు ప్రవేశించుటం జేసి కాదె యిట్టివి పుట్టెడు నని తలంచి నవ్వి వరనాథునకుం జెప్పిన. భార. మహా. 19.

6. దూఱు, నిందించు.

గీ. ఎలమిఁ గోమల మగుతావ వేర్పు డెంత, తనదు తీవ్రత్వమని తీవ్రధాము నొత్తుఁ,దన కుఁ బ్రతి లేక దక్కులు దాఁకి వెలుఁగుఁ, దారకామరు ఘోరప్రతాపవహ్ని. కు. సం. 10. 528.

7. త్రోయు

ఉ. మక్కళించినకావుమంజిల్ల పెంజెర లుంగ రంబులఁ బట్టి యొత్తువారు. నైష. 6. 108.

సీ జిగిపెండ్రుకలకప్పు జిష్ణునీలమహాంధకార పం క్తుల నైనఁ గడకు నొత్తు. పరమ. 2. 37.

8. అద్దు

ఉ. ...బుజ్జవ మొప్పఁ బాదములఁ బుప్పొడి యొత్తె విదర్భకన్యకున్. నైష. 2. 140.

9. (పాదాదులు) పట్టు. పిసుకు.

గీ. శ్రీకుచాలిప్తచందనాంచిత కరాబ్జ, తల ములను నద్దులొత్తెనత్సలత మెఱసి. భాగ. 10. ఉ. 1017.

సీ. కుచకుంభమర్దనక్రూరకర్మంబైన కరము పాదము లొత్తి కరుణవడసె నైష. 7. 192. హరి. 7. 121.

10. తుడుచు.

గీ. కన్నుఁగవ నశ్రుజలములు గ్రమ్ముదేరఁ, బాణితలమున నొత్తి యాద్రోణతనయుఁ, డిట్టులను ...భార. ద్రో. 5. 334.

11. సవరించు, దిద్దు; తీర్చు.

మ. ... ఆకర్ణికాంతరి ధమ్మిల్లముఁ జక్క నొత్తఁడు...భాగ. 8. 96.

గీ. జాలుసిగ కేల నొత్తుచు...దశా. 3. 144.

గీ. వంక యొత్తినమన్మథువాలురమ్ముఁ, లోలె నెమ్మేను చక్కనై పొలుపు మిగిలెఁ, గుజ్జకు,. హరి. పూ 9 35.

ఉ. . . బొఁ,గా దని వంక లొత్తఁ దిలకంబు లె రాజులచిత్తవృత్తముల్. విక్ర. 3. 48.

12. (శంఖము మున్నగునవి) ఊఁదు.

ఉ. శాంతనవుండు నప్డు నిజశంఖము కౌరవ రాజసైన్యముల్, సంతస మంద నొత్తుచు ననభ్రమలీల నెదుర్కొనంగ ... భార. విరా 5. 164.

ఉ ఒత్తిరిశంఖకాహళము లూఁదిరి శృంగక వంశకాండముల్. కాశీ 6. 145. భార ఉద్యో. 4. 191.

13. వాయించు.

సీ. కిసలయాధర యొర్తు కిన్నర మీటంగ లోల లోచనయొర్తు తాళ మొత్త. వాల్మీకి. 3. 121.

14. పరిశోధించు, పరిశీలించు.

ద్వి. మాటనందులు పట్టి మన సొత్తి చూడ, నేటికి వనుడు... ద్వి. హరిశ్చ పూ 1400, 467.

15 ఇది కొన్ని తుమున్నంత క్రియలకు అను ప్రయుక్తమై ప్రేరణార్థము నిచ్చును.

చ. మును వెనుకేనియుం గనక మోసమునం గడుఁ గార్యభంగ మౌ,నవశ మనొత్తిపోవి

పదమంచుఁ దలంపక కన్యకామణిన్, వనధి
పరీతయై పొదలువాహినిలో నొకమందసం
బునం, దునిచి రయంబునన్ వెడలనొత్తుట
నీతి యటంచుఁ దెల్పినన్. శుక. 1. 370.

అ. క్రి. 1. హెచ్చు, అధికమగు.

ఉ. ఉల్లము ప్రక్కలైకలఁగ నొత్తినమూర్ఛ
వహించి ధారణిం, ద్రెల్లిన ... జై. భా.
7 50. కాళ. 3. 155.

2. బిగ్గరగా ఉచ్చరించు, కేకవేయు.

క. దీవించి యతనివదనముఁ, జేవెలుఁగిడి
చూచి యేమి చెప్పెదు చెప్పుమా,యేవీనుల
వినఁ గావున, నీ వొత్తుచుఁ జెప్ప చెప్పె
దేని మహాత్మ్యా. హరి. 2. 49.

శా. అత్తవ్వంగి సమస్తదిక్కులను బర్యాగ్ని క్ర
మంబొప్పఁగా,నొత్తెం బిన్నికుమార రారి
యని యత్యుచ్చైఃప్రచ్ఛతిం జీరవం, జిత్తం
బుంగన వచ్చె బాలుఁడు మహాశ్రీఘ్రప్రచా
రంబునన్, దత్తద్వ్యంజనపాక గంధ్యవ
యవస్థానప్రపాతానంబుతోన్. హరి. 2. 134.

3. ఒరసికొనివచ్చు, పైఁబడు.

సీ. పటు లెత్తుకొని యొత్తు కటినైన మోటాస
పడి యేయఁ బొడుతు నీపాదమాన.
మనుచ. 4. 34.

క. పగవా రొత్తినయప్పుడ,జగ మెఱుఁగఁగ
డెగుట యొండె నైరణ యొండెన్,దగుఁ
గాక మిగుల వగచుచు,మగవాఁడై మగువ
వగిది మడియుట దగునే. ద్వా. 8. 119.

4. గ్రుచ్చుకొను, ఒత్తుకొను.

సీ. ...శుచివరార్ఘ్యశయనతలంబున శయనించి
యును నిద్రవోనియది దప్పిఁ బొంది
కటిక. ఆ. నేలఁ గండ్లు లొత్త నిద్రవోయిన
యది భార. ఆది 6. 178.

గీ. హంసతూలికపాన్పు పై యలరు మొగ్గ,
యొత్తు నునుమేనుగల్గు నీలోత్పలాక్షి హర.
4. 12.

5. నొక్కులువడు.

సీ. మెత్తనిపాన్పున మేనొత్తు సుఖ నేఁడు
తనువు సేర్చినవాఁడు దర్భశయ్య. భా.
రా. అయో. 256.

6. బయలుదేఱు, కలుగు.

సీ. సమ్మదంబునఁ గామిజనుల చిత్తంబులు
చిగురొత్తఁదరులందుఁ జిగురు లొత్తె. కు.
సం. 4. 445.

ఉ. దాని మొగంబుఁ గన్న జడదారులకైన
విరాళియొత్తదే. నీలా. 2. 26.

7 ఒఱగు, వ్రాలు.

చ. గరువున గొత్తఁ జెంగలువకచ్చు ఘటించిన
మౌళిఁ జుట్టెఁ జెం,దిరిక చెఱంగునఁ బసిఁడి
తీఁగెలు నించినవిల్లుపాగ...మనుచ. 5. 58.
(ప్రయోగాంతరము లేదు.)

వి. 1. అదుముడు, నొక్కుడు.

సీ. చేదోయియొత్తునఁజేసి నెత్తురులైన యవయ
వంబులు నోర సవరించియు నైష. 3. 5
అం. భా. 1 150.

2. ఒత్తుకొనుటవలనఁ గలిగినముద్ర, నొక్కు.

గీ. యోగివంద్యుని సందిటియొత్తులకును గడి
తకేయూరరత్నములు కారణముగాఁగఁ,
దలఁపుదురుగాని రమ కుపధాన మగుటఁ,
గొప్పవిరులొత్తు చెఱుఁగరు కొంతయైన.
దశా. 3. 148.

3. బాధ.

(విష్ణుఁడు) సీ. ఉత్తరవృత్తలోకోత్తరతమజాతు
నొత్తఱంజేయునమత్తరతుఁడు. రా. వి.
1, 82.

4. తుడుపు.

ఉ. పుట్టుగు దెల్పుకొన్నగతిఁ బూని సఖుం
డని చూడ వచ్చినన్,వట్టిప్రియంబు లాడి
వరివంటక మించుక పెట్టెఁ గాని నా,యొ
ట్టిన లేమిఁ జూచి తడియొత్తులదోవతియైన
నీఁడ యే,పట్టునఁ బేదవారలకు బాంధవు
లెక్కడివారు చూడఁగన్. పద్మ. 10. 246.

5. దట్టము, సాంద్రత.

వ. మట్ట లెత్తికొని యొత్తు గల పొదరుటడ
వులు చొరంబాఱు పిడికడిలికదుపు ...
మనుచ. 4 87.

బ. మురుగులవంటి హస్తాభరణవిశేషము.

ద్వి. ముత్తెంపుఁ జేరులు ముంగామురములు,

నొత్తులు గాజులు నొడ్డెనపములు. ప్రభులిం. 4. 143. పొ. 16. వం. శుక. 2. 832.

విశే. 1. దట్టము.

ఉ. ఒత్తుగ మౌళిఁ బింఛములు నుత్పలపత్త్రము కర్ణపాళి నా,యత్తము చేసి వేణుధరుఁడై హరి నాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్. గంధ. 231.

2. అధికము.

ఉ. ఒత్తుగ మాంసమున్ మడుఁగుటొగిరమున్ ఘృతశర్కరాదులుఁ, గుత్తుకబంటిగా మెసఁగి.. హరిశ్చ. 1. 140.

అడుగులకు మడుఁగు(డ్గు) లొత్తు. (చూ. అడుగు'.)

గీ. అడుగులకు మడ్గు లొత్తెడు నవని యనఁగఁ, బదనఖజ్యోత్స్న ముందటఁ బర్వ.... వరాహ. 4 95.

సీ. రమణి నాశాంధవరాంహాంసాళి నీ యడుగుల కేవేళ మడుఁగు లొత్తు. సాంబ. 2. 202.

అంట్లొత్తు – అంట్లుత్రొక్కు.

సీ. అంట్లొత్తుపదమున నంట్లొత్తు నెలమిఁ గాన్పించు లేఁగొమ్మలు వంచి వంచి. కళా. 4 78.

ఒత్తుదెచు (స్వార్థము – తెచు) - అదుము, నొక్కు.

(పార్వతీమేనకలు) గీ. ఉరుకుచాగ్రంబు లొండొంటి నొత్తుదేర, నెదురు కౌఁగిలింపఁగ నమవెట్లుఁ గాక, కెలనికొఱగుచుఁ గుచతటుల్ బలిమి నొత్త. కు. సం. 9. 84?

జ: ఒత్తగిలు, ఒత్తడము, ఒత్తడి, ఒత్తి, ఒత్తియాడు, ఒత్తుకమ్మి, ఒత్తుకాఁడు, ఒత్తుకొను, ఒత్తుకొల్లు, ఒత్తుడు, ఒత్తురేకు, ఒత్తువడు, ఒత్తొరవు.

**ఒత్తుకమ్మి** వి. (√ఒత్తు) బొద్దులకు ప్రక్కలను కమ్మివలె నేర్పఱచెడు తదవయవవిశేషము (శ. ర.)

**ఒత్తుకాఁడు** వి. (√ఒత్తు)నుతిపోయువాఁడు.

వ. ...అతండును గుణధ్వని తంత్రీనాదంబుగా వాయింపఁగా రొత్తుకాఱుగా గాండీవంబు వీణగా వినోదంబు సలిపె భార. విరా. 5. 78.

ఉ. కొండము మీఁది కెత్తుకొని దోర్యుగళంబున నఁ బాటిగించుచున్, గండమదాంబుధారలకుఁ గ్రమ్మెడుతుమ్మెద లొత్తుకాఱుగాఁ, గొండలజేనికూర్మిసుతకుం బ్రియ మొందఁగ నాడు చున్నవే,దండముఖుండు నవ్య కవితారసమూర్తుల మాకు నీవుతన్. పద్మ. 1. 6.

**ఒత్తుకొను** స. క్రి. (√ఒత్తు). 1. ఆక్రమించుకొను, వశపఱచుకొను.

క. వారు దెసలొత్తి కొనియు ధ,రా రాజ్యం బిచ్చి పోయిరా పోరా తా,రారణ్యపీడఁ బడియును, రారాజుం జెఱుకుఁ బాపరామన మెఱుఁగన్. భార. ఉద్యో. 2. 204.

చ. తమతమన్నత్తు లొత్తుకొని దైత్యుల నిల్పనఁ దూలియాడు నే.మములఁ బయోధికింజనియె మాధవుఁ డద్రికిఁ జేరె నీశుఁడు.... కు. సం. 10. 584.

2. అద్దుకొను.

(ప్రసూనదామము) గీ. కన్నుఁగవ నొత్తికొనుచు వక్షంబు చేర్చి, కంఠమున వైచి యవల నుత్కంఠఁ జనుచు. దశా. 2. 18.

అ. క్రి 1. అతిశయించు.

వ. గోపిక లోపికలులేని చిత్తంబుల నొత్తిన తత్తఱంబు లొత్తుకొన నుదారంబు లగు శృంగారంబులతో నిండ్లు వెడలి ... భాగ. 10. పూ 185.

2. త్రోసికొను, చొచ్చుకొను.

వ. మనుజాళియు వట్లట్ల వెనుక వెనుక కడుగిడుచు వడ్డంబుగా నడవికడ కొత్తికొని నడచి యొదుదొడుకగుడు.... మనుచ. 4. 115.

క. ఒత్తికొనుచు రానీఁజన, దెత్తినరోగముల రిపుల నింద్రియముల నుత్పత్తిసమయములఁ జెఱుపక...భాగ. 10. పూ. 167.

**ఒత్తుకొల్లు** వి. దే. (√ఒత్తు ) ఒత్తుమేకు, గుచ్చుకొను ముల్లు, కంటకము.

ఉ. ఈయసురేంద్రు గెల్చుటకు నీ వొకరుండును దక్క లేఁడు నా,రాయణ మూఁడు లోక ములు నమ్ముఁడు వేల్పుల యొత్తుకొట్టు నేఁ, డాయత శక్తి మైఁ బెటికి తప్రతిఘాత విభూతి యెన్నఁడుం, బాయక యుండ నిచ్చి కడుభవ్యునిఁ జేసితి దేవతావిభుఁడా. హరి. పూ. 4. 179. (కంటకము వలె బాధ కుఁడని భావము.)

**ఒత్తుడు** వి. (√ఒత్తు.) 1. అదుముడు, పీడనము,

ఉ. ....ఎవ్వతెఁ, బెట్టినవాఁడవో హృదయ పీఠిక దానికి నొత్తుడొఁజుమీ. కవిక. 4. 151.

2 కాగితములోనగునది వ్రాయునపుడు మెత్త నకై దాని క్రింద నుంచుకొనఁబడు కాగితము లోనగునది. (వ్య. ర.)

**ఒత్తురేకు** వి. (√ఒత్తు) చెవికమ్మలు మున్నగు ఆభ రణములలో రత్నముల కాంతి నధికము చేయు టకై అడుగున వేసెడిరేకు.

**ఒత్తువడు** అ. క్రి. (√ఒత్తు) సమ్మర్దము నొందు, పీడితమగు.

గీ. ఒత్తువడి కాంచనాదిధాతూచ్చయముల, రసము జొబ్బిల....హరి. పూ. 7. 17.

**ఒత్తెడుపిల్లి** వి. గంధమార్జాలము, పునుఁగుపిల్లి

సీ. ...పునుగుఁ గి. బిల్లి యొత్తెడుపిల్లి నాఁ బేర్పు వెలయు, గంధిలమునకు .... సాం. ని. తిర్య. 82.

**ఒత్తోరవు** వి. (√ఒత్తు) ఒత్తుడు, సంపీడనము, పీడ నము: బాధ.

క. అత్తఱి మృగఖచరాదుల,చిత్తము లనిఁ జూచు వేడ్కఁ జిడిముడివడఁగా,నొత్తోర వున నిరు దెఱఁగుల, నుత్తమవీరులును దాఁకి నుంకింపంగన్. భార. భీష్మ. 1 151.

సీ. ప్రజఁ దల్లిదండ్రులపగిదిఁ బాలింపుదే పరు లొత్తోరవు లేక బ్రదుకునట్లు. విక్ర. 4. 7.

సీ. ...బ్రాహ్మణులకు మన్నన గల్గియుండు నే యే మర్థి నొసఁగినట్టి,వృత్తులు సెల్లునే యొత్తర వొందులవలనఁ బుట్టదుగదా... భార. ఉద్యో. 1. 278.

**ఒదరు** అ. క్రి. (క. ఒదఱు.) 1. ప్రేలు, వాఁగు, వదరు.

గీ. ఒదరి విరహుల నులికింప నోపెఁ గాని, యిరులకలిమి బయల్లింద యేఁగెడు నళి, సారికల శంకగొలుపంగఁ జాలవయ్యె, నూర్జితము లైన ఘన కాలగర్జితములు కవిక. 6. 17.

2. విజృంభించు, అదరు.

సీ. వలఁతులై నిగిడెడువలుఁదతొండములచే నొదరి చేసాఁచుమృత్యువులువోలె ... అ. అదరి దిగ్గజంబు లమ్మహాభాగునిఁ, బొదివి పొడుచ నడుచ నదుమఁ దొడఁగె. నృసిం. 4. 46.

స. క్రి. నిందించు.

వ దుర్యోధనుండు విదురుం దూలనొదరి ప్రాతి కామి యనువానిం బిలిచి... భార. సభా. 2 205.

శ్లో. ధిగస్తు క్షత్తా మితి బ్రువాణః స భార. సభా 69. 18. కు. సం. 8. 138.

**ఒదరుచు(ర్చు)** స. క్రి. (√ఒదరు?) ఊడఁదీయు.

ఉ. కంటకముల్ పదాగ్రములఁ గాఁడ నొద ర్చిన నొప్పిఁగూయిడన్. ఆము. 3. 33. ('కాఁడఁగ దూసిన' అని పాఠాంతరము. ప్రయోగాంతరము లేదు.)

**ఒదలు – పొదలు** అ. క్రి. వర్ధిల్లు.

గీ అనిన నాచంద్రమౌళి వాక్యముల భంగి, భూరి నియమముతో నభిచారహోమ, మొదలఁ గావింప నగ్ని యథోచితముగఁ, దెలఁగి దక్షిణవలమాన శిఖల వెలిఁగె. భాగ. 10. ఉ. 632. వ్య. ర. పా. ('ఒనరఁ గావి ప' ముద్రి.)

**ఒదవు** అ. క్రి. (తెం. ఉద్భవః. క. ఒదవు, ఒదగు) 1. కలుగు; పుట్టు, జనించు.

క. ఒదవెడుతృషపెల్లిదమున, వదనము వఱు వట్టువట్టె...భార. విరా. 2. 88.

సీ. లోనిజొంపము పవలుమ బెముఁజీఁకటి నొద వి చి పొదలంగ నొప్పుదాని భార. విరా. 1. 162.

క. బకదనుజాంతకదనుజాం, తకజనములఁ బన్న గాశనరథంబు నిరుత్సుకత డిగి పార్థునప మూర్ధకళేబర మెదుటఁ గని రొదవుశోక మునన్ జై. భా. 7. 120.

క. యదుతుర్వసులను పుత్రకు, లుదయించిరి దేవయానకున్నతమతులై, ముద మొదవఁగ శర్మిష్ఠకు, నొదవిరి ద్రుహ్యానుపూరు లుత్తములగుచున్ వి. పు. 6. 171. దశా. 1. 19.

2. ఉద్గమించు, బయలువెడలు.

గీ. ఒదవువృత్రుగాత్రమున బుద్బుదము లెసఁగి, పుట్టకొక్కులై యవి జనభోజ్యభావ, మొంది... భార. శాం. 4. 433.

చ. అది మదిఁ దోఁచువేడుక బయల్పడనీయక వేఁడికంటినీ, రొదవఁగ మోము వాంచ... శుక. 2. 184.

3. లభించు, దొరకు.

(కుక్క మాంసము చూచి విశ్వామిత్రుఁ డను కొన్న మాటలు.)

క. ఇది దప్పు నిప్పు డియ్యెడ, నొదవదు ప్రాణంబు గావ నొండొకఁడు... భార. శాం. 3. 286.

సీ. ...నేనేన్నాళ్ల నుండియు గుడువఁ గూఁ డొదవ కునికి. గీ. వేఁడి యగుదాఁక నోరువ... పాండు 4. 153.

4. ఉపయోగపడు, ఉపయోగించు.

సీ. .... అఁకటి కొదవు సస్యము కుటుంబి. మనుచ. 1. 66.

సీ. నఫల మీతురగంబుజన్మంబు ధర్మజుం డొనరించు క్రతువున కొదవెఁ గాన జై. భా. 8. 17. ప్రభా. 1. 111

5 వచ్చు.

గీ. ముదియ మతి దప్పి నోరికి నొదవినట్లు, పలుకు వెడఁగులమాటలు పాటి యగునె. భార. ఉద్యో. 4. 243.

క. ....బెట్టిదముమ బెండును వగుపలు, కొదవదు నీనాలుకకు నయోన్నత యెపుడున్. భార. ఉద్యో. 1. 363.

6. మురగు.

క. చదువక పెద్దలగోష్ఠికి, నొదవక ధర్మంబు తెలుఁగ కూఁటక మిగులన్, జదివినవారై యొలుకలు, పదివేలు నటింతు రుర్విఁ బండితమానుల్. హరి. ఉ. 9. 44.

క. ఇది యంతయుఁ దగఁ గనుఁగొని, మది నిస్సారంపువిద్య మరగక బంధచ్ఛిదఁ జేయు నాత్మవిద్యకు, నొదవఁ దొడఁగినాఁడ నుడుగ నుద్యమ మెట్లున్. నృసిం. 4. 16.

7. వర్ధిల్లు, పెరుఁగు.

ద్వి. నగరిలో నామేఘనాదుఁడు నంతనొగి నాఁడు నాఁటికి నొదవంగ నచట. రం. రా. ఉ. 9. పొ. 14. పం.

చ. ఒదవెడు జవ్వనంబు వెలి కొత్తఁగఁ బయ్యెద సిగ్గుఁ గూడి బిట్టదుమఁగ శ్వేత తోట దిగనాఁకకు మీఱను లేక వతపుం జదువనఁ బ్రక్కలన్నెఱసి చప్పటలై మఱి లావు గూడఁ జైఁ, బొదలె నన గఁ బిక్కటిలెఁ బొల్తుక చన్నులు నాఁడు నాఁటికిన్. అము 5. 21. (ఒదవెడు – వృద్ధిపొందుచున్న. ప్రాఁతప్రతివ్యాఖ్య.)

8. నెఱవేఱు.

క. అలఁతులకు దైవయత్నము, బలవంతంబైన నెల్ల పనులొదవు మహాబలుల కది లేక యుండినఁ, బలుకులు వేయేల కడమ వడు సర్వంబున్. వేం. పంచ. 3. 381. ('ఒదగు' ముద్రి)

9. ఒప్పు.

చ. కదలనిక్రొమ్మెఱుంగుపొడ గల్గినశారద నీరదం బొకో, యిది యని సంశయించుచు మహీపతు లెల్లను మీఁదు చూడఁగా, నొదవు పిశంగ జూటముచు నుజ్జ్వలదేహ మెలర్పఁ దోఁచె నారదుఁడు...హరి. ఉ. 5. 10.

గీ. మిత్త్రుదేహంబునొద్దవ మేదినికి మహోప కారమై నీ మేను నొదవుఁగాక, యనుచు శార్ఙ్గిశార్ఙ్గచ్యుత సునిశితాస్త్రజాలములఁ గప్పె నతని నాభీలలీల. హరి. ఉ. 6. 2[illegible]0.

వ. క్రి. (త. ఉదవు.) ఇచ్చు.

సీ. ముదితకై యరణమేని నొదవినశామారి ... దశా. 8. 61. అచలా 1. 26.

జ: ఒదవుబడి.

**ఒదవుబడి** వి. (√ఒదవు) ఉపయోగము.

**విణ.** ఉపయుక్తము. (శ. ర.)

**ఒదికిలు** అ. క్రి. ప్రక్కకొఱఁగు. ఒత్తిగిలు. (ఇది 'చదికిలు' వంటిది.)

(ఓడ) సీ. కడల వే నొదికిలఁబడుచు భారంబు నఁ బలకలు నొగలుచుఁ బగులుచున్న. దశకు 10. 63.

చ. ఒదికిలి పాన్పుపైఁ బతికి నొయ్యన కేలు దలాఁపి చేసి....ఉ. హరి. 5. 204.

**ఒదివిరిప్రాలు** వి. బ. ధాన్యవిశేషము. శ. ర. (తండులవిశేషము?)

సీ. ...క్రొత్తగోనియల బియ్యము వడ్లు నెమిలివడ్లు,నొదివిరిప్రాలును నొసరంగఁ బోసి చాఁపలు మంచములు మీఁద బలియఁగట్టు. హరి. పూ. 6. 21.

**ఒదుఁగు** అ. క్రి. (క. ఒదుగు.) 1. ముడిఁగియుండు సంకుచితావయవుఁడగు: నమ్రుఁడగు.

గీ. అచట శంబళి శంబళి యను జనములఁ, గదియఁజాలఁ దొలఁగుచు నొదుఁగుచుండె. భా. రా. బాల. 593.

చ. గొరిజలఁ ద్రొక్కనం బ్రిదిలి కుండలిభర్త యొదుంగ...నృసిం. 3. 86.

ద్వి. అది యిది యేల నీ వావధూమణికి, నొదుఁగుచు దాసివై యుండంగవలయు. రం. రా. అయో. 90. పొ. 4. పం.

2. తొలఁగు: వెనుకకు తొలఁగు; వెనుదీయు.

సీ. ఆదోసకారి సన్న్యాసి దవ్వులఁ గాంచి యోలంబునకు దారి యొదిఁగి యుండు. నైష. 7. 130.

చ. శినిమనుమండు వర్ధనుజు శీఘ్రము నాలుగు నారసంబులన్, వెనుక కొదుంగఁజేసి పటువిక్రమ మొప్పఁగ ..భార. భీష్మ. 2. 228.

క. పలినవానిధనంబులు, వాలురు బంధువులుఁ దారు బ్రదికినదినముల్, వ్రేలారిచి తింద్రా తని, యోలము గని పిదప భీతి నొదుఁగుదురాటిన్. భార. విరా. 4. 257, ద్రో. 1. 3£9.

3. లీనమగు.

క. మొదలఁ గలిగించి జగములఁ, బదిలంబుగ నునిచి వానిఁ బదపడి తనయం, దొదిఁగించి మఱియు నెమ్మెయి,నుదాగతి నడపుచిన్న యునిఁ గొలుతు హరున్. భార. శాం. 6. 414, 4. 243.

4. దాఁగియుండు.

చ. ...ఇ,వ్విధమునఁ బన్ని నీ వనృత విక్రమముం బ్రకటించుకంచు నం,బుధినడుమైన నీ పురికిఁ బోయి యొదుంగుము చాల మేలగుఁ. నిర్వ. 7. 20.

చ. అదటున నిల్లు చొచ్చి యమృతాశనుఁ డొక్కఁడు దల్పమూలయం, దొదిఁగినఁ దన్ను నీడ్వఁ బద మూరకె వచ్చెద వంచు నాలుగే, న్పదములు వెంటఁ బోయి కల పం బిడె తెచ్చెద నుండు మంచుఁ దా,సద నము చేరి తల్పుగదె సాఁచె నొకానొక కాంత నేర్పునన్. దశా. 4. 46.

వి. ఒదుఁగుట. (చూ. ఒదుఁగుపడు.)

**ఒదుఁగఁబడు** – ఒదుఁగు.

(ముడుఁగు)

ఉ అంటలు గట్టి చెల్కలకు నాంధ్రుడును బిడ్డలుఁ గూరిఁ గోయఁ బోఁ, గంటకముల్పదాగ్రములఁ గాఁడ నొదర్చిన నొప్పిఁ గూయిడన్, గఁటికి నిద్ర గాన కొదుఁగంబడి వేఁగెద మిందు....ఆము. 3. 33.

**ఒదుఁగఁజాఱు** – ఒదుఁగు.

(తొలఁగిపోవు)

చ. తలఁకెడువానికిన్ మగఁడ తానకె నన్నడకించువాఁ డిసీ, వలుకకు భీతు నట్లొదుఁగఁ జాఱునె శూరుఁడు...భార. విరా. 5. 25.

చ. వలికిన బ్రాహ్మణుం డొదుఁగఁజాఱక నిల్చి...భార. అను. 3. 261,

**ఒదుఁగుపడు** – ఒదుఁగు (ఒదుఁగు+పడు.)

(అణఁగిపోవు.)

గీ. వాగభీషణబాణ ప్రయోగములను, భీమ నరవరచేష్టలు బెండువడఁగఁ, దదనుజుల సత్ప్రతాపంబు లొదుఁగువడఁగఁ, గట్టు వటిచెఁ బల్మెఱు వాజి ఘనులు వొగడ. రాఘవ. 4. 126.

(తొలఁగు)

క. ఒదుఁగుపడ యోజనత్రయము దళం బగు
విమత సైన్యముల నీక్షిం, మద మడఁచి
...జై. భా. 5. 58.

జ: ఒదుఁగుపాటు.

**ఒదుఁగుపాటు** వి. (√ఒదుఁగుపడు.) ఒదుఁగుపడుట, తొలఁగుట. (శ. ర.)

**ఒదుగు(వు)** అ. క్రి. 1. అధికమగు, సమృద్ధమగు.

గీ. అఘమొకింత యొనర్చిన వది యొకవుడు,
గాలములు గొట్టు నాటి దుఃఖములు దెచ్చు
నొదుగఁజేసినఁ దలయేరు మొదలు గాఁగఁ,
గలుగు తెవుళుల వేదన గడలుకొలుపు.
మార్క. 2. 87.

శ్లో. స్వల్పం పాపం కృతం పుంసా దేశకాలోప
పాదితం, పాదన్యాసకృతం దుఃఖం కంటకో
త్థం ప్రయచ్ఛతి, తత్ప్రభూతతరం స్థూలం
శంకుకీలక సంభవం, దుఃఖం యచ్ఛతి తద్వ
చ్ఛ శిరోరోగాది సంభవం. సం. మార్క.
13. 41, 42.

చ. ...లంతెకు,స్తన మొదువంగఁ బుచ్చికొని
నాథుని మూఁపునఁ దాల్చి చెచ్చెఁ న్.
మార్క. 3. 164.

శ్లో. ...శుల్క మాదాయ చాధికం,స్కంధే భ
ర్తారం మారోప్య...సం. మార్క. 15. 21.

2. పొదువు, క్రమ్ము.

సీ. పొడముం పావేశమున వచ్చునరోమ్మకుల్లొదివి
నాలుకకు రాకుండఁ గ్రుక్కి. మనుచ.
3. 97.

స. క్రి పట్టుకొను.

ద్వి. ఉరఁ బడి తూఁగాడుచున్న సారంగి, కరణి
జాతినెవి గదియ డాకేల,నొదువుచు నం
దమ నొకచేతఁ బట్టి. ద్వి. హరిశ్చ. పూ.
1682.

వి. అధికము; సమృద్ధము.

క. ఉల్లసిలునలర్కాళ మొదుగుగఁ గొమ
చున్. అము. 4. 195.

వి. (సంగీ) సంగతులు పలుకుట.

శా. ఖౌరా రాగము బాపురే యొదుగు
తాయంబుల్ బళీ ... వాల్మీకి. 3. 136.
(ప్రయోగాంతరము మృగ్యము)

జ: ఒదుగుబడి.

**ఒదుగుబడి** వి. (√ఒదుగు) – సంగీ – సంగతులు పలికెడు శక్తి.

(వ్యవ) అతనికంఠములో ఒదుగుబడి లేదు.

**ఒద్ద** వి. లి. అవ్య. సమీపము, చాపు, దగ్గఱ.

క. క్రకచా వికచాద్భుతి నొద్దకుఁ గ్రమ్మఱ
నరుగుదెంచెదవు కులకాంతా, నికట
మకటా యసహ్యం, బోకొ సత్యముఁ జెప్పు
మనిన నుదచరుఁ డనియెన్ వేం. పంచ.
4. 48. కళా. 2. 45.

సీ ఇచ్చకం బిగురొత్తఁ బచ్చి దేరఁగఁ బల్కు
ముద్దిడరా యని యొద్ది కరుగు. హంస.
2. 104.

గీ. ఒక్కపుణ్యాశ్రమంబున యొద్దియేట,
విడిసి దివసప్రవర్తనవిధులు నడపి, భార.
ఉద్యో. 3. 146.

**ఒద్ది** వి. (త. ఒది.) ఒకానొక చెట్టు.

వ. ... రేలల జాలల నొద్దుల మద్దుల విరుగుల
నిరుగుల...పి. శకుం. 2. 14.

సీ. కలుజువ్వి వావిలి గండువావిలి యేఱుమద్ది
మద్దియుమ నేలొద్ది యొద్ది. హంస. 4. 11.

**ఒద్దిక** వి. (క. ఒద్దికె. త. ఒద్దికై) 1. విధము, పోలిక.

వ. పూఁదేనియల జలకం బాడుతోఁపు వేలుపు
చానకు దిద్దినదిద్దంపుఁబసుపుముద్దలయొద్ది
కందగు పెద్దనిమ్మపండ్లును .... యయా.
4. 13.

2. ఒకవస్తువునకు సరిగా తూఁగెడు రాయి మొదలగునది, ప్రతిమానము.

సీ. తొలునాఁడు కోధ్యునిఁ దులఁదూచి
యాతని యెత్తుగనొద్దిక లెల్ల దాఁచి.
విజ్ఞా. వ్యవ. 117. (శ. ర. పా. – చూ.
యాజ్ఞ. 2. 100.)

3. ప్రేమము, అనురాగము; మైత్రి, చెలిమి.

సీ. కలశపాథోరాశి కన్యకారత్నంబు నొద్ది
కతోఁ గూడి యున్నవాని. వి. పు. 5 79.
అని. 2. 87.

సీ. నెయ్యము...నెయ్యమి సంగడి యొద్దిక....

అనఁ. గీ బరఁగుచుండును మిత్రభావంబు ...ఆం. భా. 2. 186.

4. వినయము, నమ్రత.

సీ. ఒకపైఁడి ప్రతిమ యొద్దికతోడ గండూష మొనరింపఁ గాళాంజిఁ గొనుచు వచ్చె. దశా. 7. 320. చిత్రభా. 4. 17.

*విణ* అనుకూలము.

క. మద్దెలసద్దున నీతని,నిద్దుఁమ జెల్లఁ బోవ నేర్పు మెఱయ నే,నిర్దముగ దేశిఁ గొని యెద, నొద్దికగా నుండుఁ డనుచు నొనరిచి సఖులఁ. వాల్మీకి 3. 123.

క. ముద్దులగుమ్మకు నయ్యెడఁ, బ్రొద్దులవెల నొరఁగఁ జెలిమిపొలఁతులు దమలోఁ, గద్దయు వేడుక నొండొరు,లొద్దికయై పలికి రప్పుడుచితంపునుడుల్. ఇందు. 3. 4.

**ఒనగూడు** *అ. క్రి.* (కొన్ని ప్రతులయందు సబిందుకముగ ముద్రింపఁబడి యున్నది. కాని అవి నిర్ధారక ప్రయోగములు కాకపోవుటచేత శ. ర. చి, ని. మతానుసారముగా నిర్బిందుక రూపము గ్రహింపఁబడినది) 1. సిద్ధించు, నెఱవేఱు.

క. ఈతెఱఁగున దశకంఠుఁడు, ధాతవరంబు నను గామితము లొనగూడన్ భ్రాతృసమేతంబుగ శ్లేష్మాతకవనమునకుఁ జనియె సంతోషమునన్. ఉ. రా. 2. 209.

ఉ. భారత మర్థితో వినిన భక్తిఁ బఠించిన శ్రీయు నాయువున్, భూరియశంబును ప్రమదమున్ దృఢవిద్యయుఁ గల్గు వారి కే, కోరిక లైన వేగ మొనగూడు ... భార. స్వ. 90.

2. ప్రాప్తించు.

ద్వి. మనకు జయం బనుమానంబు లేదు, ఒనగూడు నిఁకఁ దడయుట గా దటంచు. రం. రా. యు. 340. పొ. 18 పం.

క. చెప్పంగా రాని దొడ్డచే టొనగూడెన్. నీలా. 2. 53.

3. జనించు, కలుగు.

మ. ....లోఁదాల్చి యూఁదనిఁబోడన్ బుల కాంకురంబు లొనగూడం గట్టివాయింతివే, చని....సారంగ. 2. 93.

4. కూడు, కలియు.

క. తనపేరు కుచేలుండఁట, జనసన్నుత మీకుఁ బాల్యసఖుఁడఁట మీతో, నొనగూడి చదివినాఁడఁట,మును మీరెఱుంగుదురఁట మురకంసారీ. కుచేల. 2. 56.

5. (రతియందు) కలియు

ద్వి. ఉండితి నిన్నాళ్ళు నొక రీతి నింక,నుండుకే గలి వాని నొనగూడ కింతి. ద్వి. పరమ. 5. 420. పా

ఈ: ఒనగూర్చు.

**ఒనగూర్చు** *స. క్రి.* (√ఒనగూడు) ఒనగూడఁ జేయు.

1. సిద్ధింపఁజేయు, నెఱవేఱఁ జేయు.

గీ. తన్ను వినఁ దన్నుఁ జేరెఁ గన్నఁ దను నెఱిఁగిన,వారియఘములఁ గడతేర్చి వాంఛితములఁ, గరుణ నొనగూర్చు బంధమోక్షముల కతఁడె, కర్త సుమ్మని బలిదైత్యభర్త యనిన. ఉ. రా. 4. 27.

2. కలుగఁజేయు, జనింపఁజేయు.

సీ. పసిఁడిసలాకకుఁ బరిమళం బొనగూర్చి గరువంపు వెన్నెలఁ గరఁగకున్న. విక్ర. 5. 172.

3. కూడఁబెట్టు, ప్రోగుచేయు.

(ద్రవ్యమును) ఉ. ఇట్టొనగూర్చి వైశ్యునకు నిచ్చి ...ఆము. 6. 70.

క. చనిరి పురంపవిధమార్గంబున సద్ద్విజలీలలు నడపుచు మాధుకరాశన మొనగూర్చుచు నపుడుప,వనసంతతి యలరఁజేసె వారల యాత్మన్. రాఘవ. 2. 47.

4. చేర్చు, కూర్చు, కలుపు.

క. అని నిశ్చయించి సొద పేర్చి నితేకున్ సుతులఁ దండ్రిఁ జేర్చి పాలుతాళం,బొనగూర్చి తాను దఱియఁగ, వనితారూపంబు మాని వారదుఁ డగుచున్. వరాహ. 9. 106. (ఇట 'అంటించు' అనిభావము)

ఉ. విత్తరి యొర్తు ముత్తియపుఁ జేరు వలగ్నమునన్నటించి కే,ల్గుత్తపుఁజున్నుదోయి నొన

గూర్చిరయంబునఁ జూడ వచ్చె రాత్రో
త్తము...వసు. 6. 14.

చ. చని యది యొక్క నాఁ డరిదిజంగము
రాలయి శిష్యుఁగాఁగఁ గై కొనుచుఁ
బ్రవీణుఁ దెచ్చి యొనఁగూర్చనఁ జెచ్చు
తమిన్ శశిప్రభా, వనరుహపత్త్ర నేత్ర
యను వాఁడును వేడుక మీఱఁ గేళికిం,
జనుపడి సౌఖ్య మొందిరి... శుక. 2. 51.

ఒనరారు అ. క్రి. (ఒనరు+ఆరు) ఒప్పు.

క. అని తెల్పి యమ్మొలంతుక, పనిఁబూనిచి
పంపఁ బంపవజ్జకు వారల్, సని యచటి
చెట్లనీడల, నొనరారఁగ మెలఁగుచుండి
రోరిమి వెలయన్. అచ్చ. రా. అర. 124.

క. ....ఈ,చక్కనిపావఁడు నీకుఁ,డక్కెం బో
యల్లుఁడై దిటం బొనరారఁగ. అచ్చ. రా.
బాల. 185.

ఒనరించు - ఒనరుచు. స. క్రి. ఒనరఁజేయు.

1 గావించు, చేయు.

మ. ....అ,చ్చపలాక్షిమడికి న్వివాహ మొనరిం
చం గార్యమూహించుచున్. శుక. 1. 363.

చ. అతని నతిప్రతాపు ననిలాత్మజుఁ గానఁగ
వచ్చి చేదిభూ,పతి శిశుపాలుఁ డెంతయును
భక్తిపరుం డయి రాజసూయ ము,న్నతి
నొనరింప మన్న యమనందముయత్న
మెఱింగి రత్నకో,ఖితధనరాసు లిచ్చెఁ గడు
ప్రీతిసమన్వితుఁడై ముదంబునన్. భార.
సభా. 1. 242.

2. రచియించు.

గీ. అట్టినై షధసత్కావ్య మాంధ్రభాష, ననఘ
యొనరింపు నా పేర నంకితముగ. నైష.
1. 16.

3. నిర్మించు.

గీ. వరము వడసినయాదైత్యవరులు దమకుఁ,
బురము లొనరింప దానవపూజ్యు మయుని,
వేఁడికొనుటయు....భార. కర్ణ. 1. 262.

4. ఏర్పఱుచు, నియమించు.

క. ....పితృపితామహక్రమమునవ,చ్చిన విప్రుల
మంత్రులఁ గా,నొనరించితె కార్యసంప్ర
యోగము పొంకెన్. భార. సభా. 1. 26.

క. ఇతని సమయింప నయ్యు,త్యుతుఁడు నను
బనిచె నాకు నొనరించినపాలితఁ డని తలంచి
మొగ ము,గ్రత నొందఁగ శక్తి మీఁదఁ
గనుదోయొలయక. భార. శల్య. 1. 278.

5. ఇచ్చు. సమర్పించు.

సీ. తాంబూల మొనరించె నంబి మాధవునకు...
హంర. 2. 67.

ఉ. ...విశేషవస్తునం, భావన లెల్ల నిచ్చియులు
పా లొనరించి పురంబు చేరినన్. శుక.
1. 309.

వ. ....దేవదేవునకు అఖండరత్న దీపం బొన
రించె. (1055) దశా. 4. 677.

6. సిద్ధపఱుచు, సిద్ధముచేయు.

క. ముదమునఁ గృష్ణుఁడు గుంతీ,సదనమునకుఁ
జనియె నపుడు సమ్మదమున న,వ్విదురుం
డోగిర మొనరిం,చెదనని త న్నడుగ నట్ల
చేయుండనుచున్. భార. ఉద్యో 3 181.

7. ఒనగూర్చు, చేయించు.

వ. ధర్మతనయానుమతంబున సంజయునకు
సపరివారంబుగా సముచితప్రకారంబున
మజ్జన భోజనంబు లొనరించి మాల్యాను
లేప నాద్యుపచారంబులు చేయించి....భార.
ఉద్యో. 1. 380.

ఒనరిక వి. (√ఒనరు.) పొందిక, పొంకము.

ద్వి. ఒనరికతోట నాయువిదను గూడి,యనుభ
వించెద....రం. రా. సుం. 252. పా. 13.
పం. (చి. ని. - 'ఒనర దుర్బుద్ధి'ముద్రి.)

విశే. ఇంపైనది, మనోజ్ఞము.

ద్వి. అకలంక కేయూరహారజాలములు, నొన
రికలై యొప్పు నొకపాద మూఁది,యున
కోటికోటుల హెచ్చుతేజమున. ద్వి. పరమ.
218. పా.

ఒనరు - పొదరు. అ. క్రి. 1. కలుగు.

క. యాగంబునందు శ్రద్ధా,యోగము గలయ
కుచి శ్రద్ధ యొనరనికుచి పు,ణ్యాగమ నం
పదఁ దుల్యులు,గా గణుతించిరి నిరూపకత
నమరవరుల్. భార. శాం. 5 247.

ఆ. ....పతికిఁ బుత్రులకును,మనుమలకు హితంబ

యొనర వడతు. భార. ఉద్యో. 2. 158, విక్ర. 4. 61.

2. ఒప్పు. (ఇది 'ఒప్పు' వలెనే కొన్ని యెడల వాక్యాలంకారముగా నుండును.)

క. మనుజులు నిద్రాళయులై, యొనరనతఁడి నాల్గు దిక్కులోఁగిఁ జూచుచు వేఁచని భామిని యింటికి ముదమునఁ జతురుఁడు నిచ్చ దాని ముచ్చటఁ దీర్చుఁ. హంస. 3. 167.

క. ఒనరుఁ త్రయోదశపర్వం, బనఁగా....అను శాసనికపర్వమిలఁ. భార. ఆది. 1. 59.

క. ....నామేల్కనునంతకు మండక యునుఁ, డొనరఁగ నస్త్రాది కేగ నోడఁడె చెపుమా. భార. ఆది. 2. 159.

3. ఇంపగు, రుచించు.

క. వడి విడువక యివ్వడువున, నుడుపతిమకుటుండు చెవుల కొనరనినుడుగుల్, నొడివిన నేనయ్యిరువుర, యడుగులఁబడి కాశివెడలి యరిగెదు వేఁన్. భీమ. 2. 154

4. పొసఁగు, సరిపడు.

గీ. తత్త దవయవవాక్య తాత్పర్య భేదములు మహావాక్యతాత్పర్యమునకు నొనరఁ, బలుక నేర్చుట బహుతపఃఫలము గాదె. ప్రభా. 2. 8.

గీ. ...ఇదియు నదియు, నొనరు చెట్లొకొ... కళా. 4. 162.

విశే ఇంపైనది.

సీ. నలిఁ దదానయనంబునకుఁ బంప దానిఁ జేయంగ నబ్బక దానవాంతకుండు, రామ భద్రుండు గరంబు దూరంబుగా నరిగి యంతటను చామరలుద్దృష్టి. గీ. కొనరుగై కొని పౌలస్త్యఘన నియుక్త,తచ్చమూరుదర్ప మడంచి.... రాఘవ. 3. 95. (భారతార్థమున – దృష్టికొనరు - కంటి కింపైన వానిని–'చామర' అనుదానికి విశేషణము.)

వి. 1. ఇంపు. రాఘవ. 3. 95 (రామాయణార్థమున – మరలుదృష్టి కొనరుగై కొని –మరలుట కిష్టపడి)

2. అనుకూల్యము.

(వ్యవ) ఆ గ్రామమునకు నీటియొనరు లేదు.

జ: ఒనరాగు, ఒనరించు, ఒనరిక, ఒనరుచు, ఒనరుపడు, ఒనర్పు, ఒనపెట్టు,

**ఒనరుచు(ర్చు) – ఒనరించు** వ. క్రి. (√ఒనరు)

1. చేయు, కావించు, ఆచరించు.

మ. ....వాత్సల్య మేపారఁగాఁ, జదు రొప్పం బరిచుంబనం బొనరుచుం జంచూపుటాగ్రంబునన్. నైష. 8. 191.

క. దీనికి సదృశముగా మఱి,యే నేమి యొనర్తు నీకు నిష్టం బనినన్, మామగ నాతోఁ జెలిమి మహీనుతముగఁ జేయు మిదియ యిష్టము నాకున్. భార. ఆది. 6. 50. వి. పు 2, 388.

2. రచించు.

సీ. వరరసంబులయందు నవ్యకావ్యంబులు కవిజనంబులు మెచ్చఁగా నొనర్చె. విక్ర. 1. 50

3. నిర్మించు, కట్టు.

శా. ....ముఖలక్ష్మీకి న్ముకురమై రంజిల్లఁ జేఁ బట్టికిన్, మాణిక్యాయతనం బొనర్చె గిరియాత్మ శ్రీప్రభావంబునఁ. వసు. 3. 84.

4. ఏర్పఱచు, నియమించు.

క. మద్దెలసద్దున నీతని, నిద్దురమెల్లఁ బోవ నేర్పు మెఱయ నే,నిద్దముగ దేశిఁ గొని యొద, నొద్దికగా నుండుఁ డనుచు నొనరిచి సఖులఁ. వాల్మీకి. 3. 122.

5. ఘటించు, పెట్టు.

సీ. కనకవల్లి యొనర్పు కర్పూరతిలకంబు.... నైష. 2. 141.

సీ. మురువైన చక్కని మొగముట్టు సవరించి నవరత్నమయఖలీనం బొనర్చి, వచ్చమూర్ఖ పుటంపుఁ బల్లంబు ఘటియించి .... సారంగ. 1. 81.

గీ. అలర బ్రాహ్మముహూర్తంబునందుఁ దవయుఁ, దుద్భవించుట నిశఁతు మహోన్నత గతి, భూరిసామ్రాజ్యవిభవంబుఁ బూని వెలయు,నని యజాఖ్య యొనర్చె నిజాత్మజునకు. ఇందు. 2. 18.

6. ఇచ్చు, అర్పించు.

క. మునివరుఁ డైన యగస్త్యుఁడు, సనుదెంచిన శతముఖుండు సమ్మతి నుచితా,సన మిడి యర్ఘ్యముఁ బాద్యము, నొనరిచి యిట్లనియె సవినయోక్తి నతనితోన్. భార. ఉద్యో. 1, 199.

7. నెఱవేర్చు.

చ. ....మీర లే.తదభిమతం బొనర్చు టుచితంబు మహాత్మక సిద్ధ శేఖరా కళా. 5. 116.

8 కూర్చు.

సీ. ఇందిరావిభు గొల్లయిల్లాండ్రఁ దగిలించి రజనీకు గురుతల్పరతి కొనర్చి. విక్ర. 5. 11.

**ఒనరుపడు** అ. క్రి. (√ఒనరు) పొందుపడు (శ.ర.)

**ఒనర్పు** వి. (√ఒనర్చు) ఒప్పు.

చ. .. ప్రవాహముపైఁ బ్రవాహముల్, వలువుగఁ దోఁచె మేలనుచు నాథుఁడొనర్పుగఁ బల్క నవ్వనప్పులుకులకుల్కులాఁడి నను భవ్యకవిత్వధురీణుఁ జేయుతన్. భోజనుతా. 1. 6 ('చమత్కారముగా' అని భావము)

**ఒనవెట్టు** అ. క్రి. (ఒనరు+పెట్టు – శ. ర. - ఇది 'కొను' తోఁ గలిసియే కనఁబడుచున్నది.) పొంచియుండు.

సీ. ఓగిఁ లంబు హరింప నొనవెట్టుకొనియైన వేగు వంతకుఁజేసె జాగరంబు. కాశీ. 4. 133

ద్వి. అని నేయు తలఁపొకో యటుగాక యున్న, నొనవెట్టుకొని యేల యున్నాఁడ విచట. రం. రా. ఉ. 14". పొ. 6. పం.

వి. పొంచియుండుట.

సీ. ఒనవెట్టు నాఁగను దనరును పొంచడము... ఆం. భా. 3. 30.

**ఒప్పందము** వి. (√ఒప్పు – క. తు. ఒప్పంద. త. ఒప్పందం.) అమ్మెడివాఁడును కొనెడివాఁడును సరకు వెల మున్నగువాని గుఱించి చేసికొనెడు ఒడంబడిక. (బ్రౌ. శ. ర. – ఒప్పన్నము.వా.)

**ఒప్పగించు** – అప్పగించు. (సం. అర్పణం. ప్రా. ఒప్పెయి. త. ఒప్పయిను. ఒప్పిను.)

(అర్పించు, ఇచ్చు.)

క. అని విన్నవించి తాఁ దెచ్చిన కానుక లొప్పగించి చెంచులదొర నిల్చిన ... చంద్రా. 2. 44.

సీ. వంచనామతిఁ బ్రాడ్వివాకులై పటువులొజ్జల కొప్పగించిరి చదువులెల్ల. మనుచ. 3. 129. (ఒజ్జలకొప్పగించిరి:- మఱచి పోయిరి అని భావము.)

(అధీనముచేయు, వశపఱుచు)

ద్వి. అనవుడు సుగ్రీవ యాత్మలో నింత,యను మానపడ నేల యకట నావలనఁ,దప్పు లేశము లేదు దాయకు నిన్ను, నొప్పగింతునె వినుమొకమాట తెలియ రం. రా కిష్కిం. 309. పొ. 14, 15. పం.

ఉ. .. ముచ్చిలఁ బట్టి యోషధీ.పాలున కొప్పగించె....ఆము 2, 63.

(చదివినపాఠమును కంఠస్థము చేసికొని గురువుల యెదుట మరలఁ జదివి వినిపించుట.)

ఉదా: వాఁడు పాఠము తిన్నగా ఒప్పగించినాఁడు. శిష్యునొద్దనుండి గురువు పాఠమును ఒప్పగించు కొన్నాఁడు – శిష్యుఁడు అప్పగింపఁగా వినినాఁడు.

జ: ఒప్పగింత.

**ఒప్పగింత** – అప్పగింత. (√ఒప్పగించు) శ. ర.

**ఒప్పన** – ఒప్పనము.

జ: ఒప్పనచేయు.

**ఒప్పనచేయు** – ఒప్పనముచేయు (√ఒప్పన)

(అర్పించు)

ఉ. కప్పము లెల్లఁ దెచ్చి మదిఁగప్పెడుభీతి దొలంగ నమ్రులై, యొప్పన సేసి రాన్పవతు లుజ్జయినీపతికిం గ్రమంబునన్. ద్వా. 7. 28.

(వశము చేయు.)

(నక్షత్రకుఁడు.) క. .... ఒప్పనచేసె మహీశు వీరబాహునకు...హరిశ్చ. 5. 4.

**ఒప్పనము** – అప్పనము. వి. అర్పణము.

సీ. ఒఱఁ గత్తి వెఱికి నీ కొప్పన మిదె యంచు నత్తికిఁ గత్తిచేయెత్తి మ్రొక్కి. కళా. 8. 119.

విశ. అర్పితము.

ఉ. ....ఈధనంబు నీ కోపటవ త్రతల్ప యిదె యొప్పనమయ్యె నటంచుఁ బల్కి....పరమ. 4. 45.

జః ఒప్పనము చేయు.

**ఒప్పనముచే(సే)యు** – అప్పనచేయు. స. క్రి. (ఒప్పనము + చేయు) 1. ఇచ్చు అర్పించు.

వ. కామధేనువును వరుణున కొప్పనంబు సేసిరి ... హర. 6. 94.

2. వశముచేయు.

వ. పాశనిబద్ధంబగు నమ్మకరంబు నతని కొప్ప నంబుచేసి ... కాశీ. 4. 68,

**ఒప్పనితనము** వి. (√ఒప్పు) అపచారము, తప్పు.

క. ...ఇ,ప్పని మనవారల యొప్పని,తనమున మూఁడె నని వంతఁ దలపోయకుఁడీ. భార. మౌ. 12.

**ఒప్పనివాఁడు** వి. (√ఒప్పు) శత్రువు.

గీ. జ్ఞాతినాశనమునఁ గాదె సకలదేవ,తలు ప్రవ ర్ధన మొందుట ధనము లడఁచి,పొడిచి యొప్పని వారఁజేఁబుచ్చికొనక, యడఁగి యుండగఁ జేరునే యంద్రు బుధులు. భార. శాం. 1. 54.

ఉ ఒప్పదె కూడిమన్కి మన కొప్పనివారల యుక్కు దక్కఁగన్. భార. ఉద్యో. 1, 371.

**ఒప్పమి** వి. (√ఒప్పు.) 1 కీడు, కష్టము, ఆపద.

క. మన్ననమానిసివై నీవున్నం గడుమేల కాక యొప్పమిగలదే. భార. విరా. 1. 288.

ఉ. ఇప్పుడుపేక్ష నేసి కృప యేమియు లేక విహీ నవృత్తి,వా,రొప్పమిఁ బొందఁ జూచు టిది యొప్పునె.... భార. ఉద్యో. 1. 371.

సీ. పురుడించి మన మొక్కపూఁపున వలయెత్తి గగనభాగమునకు నెగసి చనిన...ఇప్పు డీ యొప్పమి దప్పు ... నా పంచ. 2. 9. భార. అను. 4. 420.

2. తప్పు, దోషము.

సీ అవధరింపుము మీ మహాన్వయంబున మహీ విభులయం దొప్పమి వెదకి రైన,గానము ...భార. ఆశ్ర. 1. 98. కళా. 4, 106.

3. పరాభవము.

ఉ. అప్పుడు నీవుఁ గర్ణుఁడును నాడినమాటలు గొల్వులోపలం, జెప్పెదువట్టివే కులము శీలముఁ గల్గిన పుణ్యకాంత క,ట్లొప్పమి సేయుచెల్లఁ గని యున్న జనంబులు వించు నుండఁగాఁ,దపొ్వకయింత లే దనువిధంబది నీక చనుం గుమారికా. భార. ఉద్యో. 3. 368.

4 వైరము.

గీ. పగ యన,నొప్పమి యనంగఁ గంటు నా నొప్పు వైరము అం. భా. 1. 184.

**ఒప్పము**[1] వి. (√ఒప్పు – క. ఒప్ప. త. ఒప్పమ్. – మెఱుఁగు.)

1. ఒప్పు, అందము.

చ. నుతనవయౌవనద్యుతి తనుద్యుతిచేన్ మెఱుఁ గీఁగఁ దత్తనూ,ద్యుతి మణిభూషణద్యుతుల కొప్పముతో మెఱుఁగీఁగ .... కు. సం. 8. 56.

క. తొడవులు దొడుగుచుఁ బువ్వులు,ముడుచు చుఁ దిలకంబు లొప్పముగఁ బెట్టుచుఁ బో, ల్పడరఁగఁ బూఁతలు పూయుచు, మడుఁ గులు గట్టుచుఁ గడంగి మగువలు ప్రీతిన్. దశకు. 10, 7.

2. మెఱుఁగు.

ద్వి. పసిఁడి జెక్కుల డాలు భాను భానువుల, పసలకు మించ నొప్పము వెట్టుచుండ. అ. మ. క. 5. 281. పా. 23. పం.

క. తప్పక వల్లను బ్రాలును, ముప్పిరిగొనఁ దగిన శబ్దములు మెఱుఁగెక్కన్, జెప్పిన కవితాచాతురి, యొప్పము వెట్టినపసిండి యొఱపున మెఱయుణ. ద్వా. 4. 192.

**ఒప్పము**[2] వి. (త. ఒప్పమ్ – 1. ఆజ్ఞ 2. చేవ్రాలు.) 1. ఆజ్ఞ. అనతి.

ఉ. ఒప్పము చెల్లఁ జేసితిఁ బయోనిధి వేష్టిత భూమి నంతటణ. రఘునాధరామాయణము. 2. 49.

2. సాక్షులు మొదలగువారు చేయుచేవ్రాలు.

ద్వి. స్వరుచిమ యొడఁబడి సవరించిపత్త్ర, మగయ నిందుల వత్త్రహస్తు నొప్పంబు, ఆరంగపతిసాక్షులగువారి యొప్ప, మారంగ పతి యంచు నపుడు వ్రాయించి. ద్వి. పరమ. 7. 546. పా. 18. 19 పం.

సీ. చెవిదండఁ జేరి నిల్చిన వ్రాయసమువారి

ముదలకమ్మల కొప్పములు లిఖించి. కువల. 2 9

**ఒప్పర** వి. విరూపుఁడు, కురూపి.

సీ. ధరలోనఁ గలుగు నొప్పర మిండలకు నెల్ల మొదలు నాఁ జాలిన మూర్తివాని. దశకు. 5. 40.

వ. అగ్రగణ్యమనభిరూపాణాం. సం. దశకు. 2. 90 పా. (ప్రయోగాంతరము లేదు.)

**ఒప్పరగించు** స. క్రి. ఒప్పగించు.

క. ఒప్పించె నొప్పగించెను, నొప్పరగించె నన మూఁడు నొక యర్థంబౌ. అం. భా. 3. 151.

**ఒప్పరము** వి. జలనిర్గమము, తూము.

సీ. తూవరాణ పుటమ్ముతూ మొప్పరము జల దారియం చనఁగను దనరును జలనిర్గమము ...అం. భా. 1. 154.

**ఒప్పరికము** వి (సం ఉపేక్షా.) ఉపేక్ష. (శ. ర.) జ: ఒప్పరికించు.

**ఒప్పరికించు** స. క్రి. (√ఒప్పరికము.) ఉపేక్షించు.

సీ. అదరి పోరాడక యన్నియ తాహిణు లొప్పరికించెనే యొకనిఁ గలన. భార. భీష్మ. 1. 58.

ఉ. ....ద,ర్పోన్నతిఁ బట్టికొంచుఁ జన నూరక చూచెద విట్లు నీకు నే మున్నొకయొగ్గు నేసి తినె ముందట దుర్దశ నొంద స్వామివై, యున్న మునీంద్ర నన్ను నిటు లొప్పరి కింపఁగ నీకుఁ జాడియే. భా రా. బాల. 145. (చూ. 147.)

చ. కొడుకులఁ గానరే నృపు లకుంఠిత తేజుల వెందు నిమ్మెయిం,జెడుతెరు వైనచోఁ దగవు సెప్పక యొప్పరికించి చూతురే .... భార. ఉద్యో. 2. 10.

**ఒప్పారు** అ. క్రి. (ఒప్పు + ఆరు) - ఒప్పు.

శా. ఆరూఢస్థితి నెల్లదేశములు నొప్పారుం బ్రకాశంబుగన్. భార. అర. 4. 313. కాశీ. 1. 39.

**ఒప్పించు**[1] - ఒప్పగించు.

(అర్పించు, ఇచ్చు.)

మ. గజతాఘోటక హాటక ప్రముఖముల్ గప్పంబు లొప్పించుచున్, విజితారాతులు మ్రగ్గ. .హరి. పూ. 1. 16.

(తనుత్రాణము) క. తెప్పించి తొడుగు మీవని, యొప్పించిన నిట్టునట్టు నొఱపలుగా మైఁ, గప్పికొని యాబృహన్నల... భార. విరా. 4. 39.

(వశపఱుచు)

క. ...నీమది రతి,కొప్పించెదొ నన్నుమరువ కొప్పించెదవో. సమీర. 3. 226.

గీ. విమఁడు నే యజ్ఞశర్మ నీవిష్ణుశర్మ, చేత నొకవృత్తిఁ గొంటి నాక్షేత్ర మిపుడు, దున్న నందొకని హేప మున్నఁ దన్నుఁ,బిలిచి కై కొను మన్న నొప్పించుకొనఁడు జై. భా. 8. 207. (ఇట 'పుచ్చుకొను' అని భావము.)

(చేర్చు, కూర్చు.)

సీ. కొమ మేని కొప్పించి సుమముల నుడికించి చెంద విభ్రమ మతిచిఱు యొకతె. చంద్రా. 4. 165.

**ఒప్పించు**[2] స. క్రి. (√ఒప్పు) ఒప్పుకొనఁజేయు, సమ్మతింపఁ జేయు.

క. ఇప్పు డొక మాట చెప్పవె,తప్పక యో యొప్పులాఁడి తప్పు నొడువులన్. నొప్పిం చెదొ నీమది రతి,కొప్పించెదొ నన్ను మరువ కొప్పించెదవో. సమీర. 3. 226.

**ఒప్పిదము** వి. (√ఒప్పు) 1. అందము, చక్కఁదనము.

సీ. కాళ్ల యొప్పిద మూఁడుక ట్టనుజ్జ్వలము నేయంగ సంకుల బాహు లంద మెడల. భార. విరా. 1. 228.

2 విధము.

చ. ఉచితసమగ్ర బోధుఁ డగుయోగి నిశ్చల దీపరూపసం, పద సుఖసుప్తభంగి ఘనపంక్తులు లేని వియత్తలంబు నొ,ప్పిద మొదవున్ ...భార. శాం. 6. 119.

వ. . . చౌదంతి యొప్పిదంబున నంబరగవీ లలామంబుపొందున... చం. రా. 3. 25.

3. వేడుక, ఉత్సవము.

గీ. పెండ్లికని పిల్వఁ బంచినఁ బ్రియముతోడ,
నేఁగుదెంచితి మిన్నాళ్లు నెల్లయొప్పిదము
లఁ జూచితి మియ్యెడఁ దడవుగాఁగ, నిలు
వఁ దీఱదు పోయి రావలయు మాకు. భార.
ఉద్యో. 1. 42.

4. (పురాదులకుఁజేయు) అలంకారము.

చ. ... ఒప్పిదము లొనర్పఁబంచిరి గభీరవిభూ
తి యెలర్ప వీటికిన్ హరి. ఉ. 3. 158.

విశే. 1. యోగ్యము. తగునది.

క. ... దేవపితృపూజనంబులకాలంబులఁ బతి
శుభమందుటఁ దత్ఫలంబుగాఁ గోరు
టొప్పిదము సతికి శివా. భార. అను.
5. 296.

2. ఒప్పునది. మనోహరము.

క. విదితంబై యుద్యోగము. మొదలుగఁ బదు
నొకఁడు పర్వముల నెంతయు నొప్పిదమై
యేనవపర్వం.బిది నా నుద్యోగపర్వ మి
మ్మగు సభలన్. భార. ఆది. 1. 43.

**ఒప్పు** అ. క్రి. (క. త. ఒప్పు.) 1. తగు. కూడు.
ఉచితమగు.

ఉ. ... ఆహవ మొప్పదు ధర్మమూర్తితో ...
భార. ఉద్యో. 2. 165.

2. ఒప్పిదమగు. శోభిల్లు. ప్రకాశించు.

క. తను వొప్పెడునది యౌవన,మును నూతన
మిట్టి నీకుఁ బోలఁడీ యోగం,బున నింత
చొరవయెమ్మెయిఁ, బనుపడియెం జెపుమ
దాఁపఁ బనిలేదింక. భార. శాం. 6. 187.

మ. సకలాంగంబులు నిక్కి దీపకలికాస్తంభం
బులై యుండ్రు పాయక చూడామణు
లొప్ప రాజసుని శుద్ధాంతంబులన్ శేషవా,
సుకి కర్కోటక తక్షక ప్రముఖ చతుశ్శ్రోత్ర
బృందారకుల్. హర. 3. 5. దశా. 1. 84.

3 ప్రశస్తమగు. ఉత్తమమగు.

గీ. దీనికంటెను నొప్పెడివాని నొక్క,లతఁ
మొదవుల నిచ్చెద నతఁయముగ. భార.
ఆది. 7. 100.

అ. క్రి. స. క్రి. ఒప్పుకొను. అంగీకరించు.

చ. చంచలనేత్ర యిట్లు వవసంగతి కొప్పుటఁ
గాంచి మౌని దాఁ,గొంచక పట్టెఁ బైచెఱఁ
గు.. కళా. 3. 32.

సీ. వెలయొప్ప కవలఁ బో విఱుచుమోవియుఁ
గోప మొదవెడు చూపు మోమోటఁ ద్రిప్ప.
ఆము. 2 32.

వి. చక్కఁదనము. అందము; కాంతి. శోభ.

సీ. తనయొప్పెదురఁ గన్నఁ దగిలి యెవ్వరి
కైన మలఁగి క్రమ్మఱఁ జూడవలయు
వాఁడు భార. విరా. 2. 208.

మ. ...అవ్విభునొప్పు వర్ణ్యదకుఁ గామావేశ
ముం జేసినన్. వనితారూపముఁ దాల్చి
పొందె నతనిన్.. భార. అను. 1. 44.

గీ. ధరణిఁ బడియుండియును నొప్పు దఱుఁగ
కున్న. యన్న రేశ్వరుఁ గనుఁ గొని ...
భార. శల్య. 2. 399.

2. విధము. రీతి.

ఉ. ... చిప్పిలి వేడి నెత్తురులు జేగుఱుచేఱులు
కొండనుండి జాలొప్పునఁ గాఱ ... కాశ.
2. 56 నిర్వ. 10 29.

3. గుణము. (వ్యతి. - తప్పు.)

క. ... తప్పొప్పు మదిఁ. భావించి దిద్దకుండను
దేవానాం ప్రియుల మ్రొక్కి తెలుతుఁ గుక
వులన్. రాఘవ. 1. 5.

4. సుందరవస్తువు.

వ. మయుండు లోకంబులం గలయొప్పులం
దెల్ల నుత్తమసారంబులు దిలప్రమాణంబు
లాహరించి... భార. అను. 4. 425.

5. సమ్మతి, అంగీకారము.

గీ. గంధమాల్యాదివాసనల్ గ్రమ్ముదేరఁ.
దోడుకొని వచ్చి రప్పు డాలోయజాతి.
సరసుఁడున్నట్టి కేళికాసదనమునకు. బలి
మిచే నొప్పు చేతను బద్మముఖులు అని.
1. 110. (శ. ర. పా. - 'నేర్పుచేతను'
ముద్రి.)

విశే. 1. విశ్వాసపాత్రము 2. సమ్మతము.

ఆ. అని పలికి భవద్వరాత్మకు నామాట,
యొప్పగుట కొకగుఱుతొసఁగు మనియె.
నిచ్చెఁ దత్ప్రతిప్రహిత మైనవమ్మికం, యుంగ
రంబు నతికి నుబ్బు మెఱయ. రాఘవ.

4. 20. (రామాయణార్థమున 'విశ్వాస పాత్రము' అనియు భారతార్థమున 'సమ్మతము' అనియు అర్థములు..)

3. మంచిది, యుక్తమైనది.

క. ఒప్పగునో తప్పగునో, యిప్పటికిం దోఁచు కార్యమిది. . ఉ. హరి. 4. 130.

ఉ. తప్పిది చెప్పరాదు కవితాసమయంబున కొప్పు గాదు నీ,విప్పగిది వ్రచింపఁ దగునే యన...కాశ. 3. 159.

జ: ఒప్పందము, ఒప్పనితనము. ఒప్పనివాఁడు, ఒప్పమి, ఒప్పము¹ ఒప్పారు, ఒప్పించు², ఒప్పదము, ఒప్పుకొను². ఒప్పుకోలు, ఒప్పుమిగులు, ఒప్పులకుప్ప, ఒప్పులాఁడి.

**ఒప్పుకొను¹** న. క్రి. స్వీకరించు, గ్రహించు, అప్పగించుకొను.

ఆ. ఒప్పుకొనుము వీని నుర్వీశ యని సుతు; నిచ్చి గంగ చనిన...భార. ఆది. 4. 168.

వ. ఇక్ష్వాకుమారుండు మేరుగిరిశృంగంబును బోలె నా కెత్తికొన నశక్యం బయ్యె వీని నొప్పుకొను మనిన విని బృహద్రథుండు ముదితహృదయుం డయి దాని కిట్లనియె. భార. సభా. 1. 151.

(శ్లో. బృహద్రథసుతస్తేయం మయా దత్తః ప్రగృహ్యతాం. సం. భార. సభా. 17. 62.)

**ఒప్పుకొను²** అ. క్రి. (ఒప్పు.) సమ్మతించు.

సీ. కుటిల మానసుఁ డతికుద్రుండు కేవలజఠర పూరకుఁడు మార్జాలజాతి, బెడిదుండు వీని నమ్మెడి తెఱం గెయ్యది యొద్దికిఁ జనఁ జిత్తమొప్పు కొనదు. వేం. పంచ. 3. 122.

**ఒప్పుకోలు** వి. (√ఒప్పుకొను²) ఒప్పుకొనుట, సమ్మతించుట. అం. భా. 1. 104.

**ఒప్పుమిగులు** అ. క్రి. (√ఒప్పు) ఒప్పారు.

సీ. ఎవ్వండు వరయోగిహృదయాబ్జమునఁ బరంజ్యోతిస్స్వరూపుఁడై యొప్పు మిగులు. దశా. 2 71.

ఇశ్లే: ఒప్పుమీఱు — ఉ. రా. 2. 42.

ఒప్పుమెఱయు — భార. విరా. 2. 52.

ఒప్పెసఁగు - భార. భీష్మ. 1. 24. విక్ర. 8 86.

**ఒప్పులకుప్ప** వి. (√ఒప్పు) 1. అందములప్రోగు, సౌందర్యరాశి: సుందరి.

ఉ. పువ్విలుకానితోడ సరిపోలెడు చక్కని వాఁడు భూమిలో,నెవ్వఁడు చెప్పఁడా యనుచు నిష్టవయస్యలఁ గూర్చి యాత్మలో, నువ్విళు లూరుచుం బలుకు నొప్పుల కుప్ప సలుండు గాక యొం,డెవ్వఁ డనంగ మెచ్చుఁ దరళేక్షణ నెయ్యము లియ్యకొ మెట్టిదో నైష. 1. 75.

ఉ. ... ఓ,యొప్పులకుప్ప నీ వలిగి యుండెడి కారణమేమి తెల్పవే. సారంగ. 2. 199.

ఉ. అప్పుడు వచ్చి వహ్ని తనయాకృతితో ధరణిజఁ దెచ్చి యీ, యొప్పులకుప్ప సాధ్వి. ఉ. రా. 6 214.

2. బాలికా క్రీడావిశేషము.

'ఒప్పులకుప్ప, ఒయ్యారిభామ' అనిపాడుచు ఆడెడు ఒకయాట.

**ఒప్పులాఁడి** వి (ఒప్పులు + ఆఁడి.) సుందరి.

వ. ... అచ్చరయొప్పులాఁడులెక్కప్పు కొప్పులం జుట్టిన వేల్పుఁజెట్టు పూదండల దండితవంబున ..ఉ. రా. 4. 163.

వ. ...కులుకు వలి చన్నులఁ దలిరు మను మోవులు నలరు పెనుఁదావులఁ గలయొప్పులాఁడులు తమకప్పు పెన్నెఱులకు జోడుగా కివి వెలవెల నయ్యెఁ జూడుం డని తెలిపెడు వడువున వెలిచామరంబులు వైవ...ఉ. రా. 5. 249.

**ఒబ్బట్లు** - బొబ్బట్లు. వి. బ. (క. ఒబ్బట్టు,ఒబ్బిట్టు.) భక్ష్యవిశేషము.

వ. ...గారెలు బూరెలు మండెంగ లంగరొల్లెలు మణుఁగుఁబువ్వులు పేణీ లొబ్బట్లు కడియపుటట్లు... ప్రబంధ. 112.

సీ. కలవంటకములు బూరెలుఁ దేవెతోలలు చాఁపట్లు మండెంగ లొబ్బట్లు వడలు. కళా. 7, 81.

**ఒబ్బిడి** వి. 1. బాగు.

ద్వి. వాఁడిమిమై ములువాఁడిచట్టునను, శాఁడి యొబ్బిడి సేయుశానయుఁ గొట్టి. అ. మ. క. 1. 89, పా. 18. పం. (ఒబ్బిడి చేయు—చక్కఁ జేయు.)

2. పంటనుఱిపిడి. (శ. ర.)

3. పొదువు.

(వ్యవ.) ఆ మెదగ్గఱ ఒబ్బిడి లేదు.

ఒబ్బిడియగు – చక్కఁబడు.

(వ్యవ) పనులన్నియు ఒబ్బిడియయినవి.

**ఒమ్మచ్చు** వి. (ఒమ్మ + అచ్చు.) మణులను పొదుగుటకు బంగారుతోఁ జేసెడు పీఠస్థానము. (బ్రౌ. శ. ర.)

**ఒమ్మిక** వి. (√ఒమ్ము.) 1. పొలుపు, అందము.

వ. శ్రీకారంబుల జోకయుఁ దొమ్మిదింటి లెక్కల యొమ్మికయు మోదుగువిరులసిగులను బోసరించి వాని వఁయు బ్రుతిశమ్ములిక లును ... పాండు. 8. 179. ప్రబంధ. 52.

2. పొందిక.

ద్వి. సమ్మదంబునఁ బర్ణశాల గావించి, యొమ్మిక గురుల నందునిచినవాఁడ. రం. రా. అయో. (చి. ని.) ఆం. భా. 2. 186.

**ఒమ్ము** అ క్రి. ఒప్పు, సరిపడు.

ఉదా: ఈనీళ్లు నాకు ఒమ్మలేదు. (బ్రౌ.)

విశే. (-హొమ్ము) స్థూలము, పెద్ద. ఆం. భా. 3. 20.

సీ. ఒ మ్మైన బరవుగోతమ్ములు ద్రొబ్బిన యొమ్ముల గాయమ్ము లెమ్మె మీఱ. శశాం. 2. 13.

క. కురులో యొమ్మగు తుమ్మెద,గఱులో చకచకితకాంతి గనునీలపురా సరులో యిుందీవరపున్, విరులో యిరులో యనంగ వెలఁదికి నమరున్. అహల్యా. 2. 67.

వి. స్థౌల్యము, బలుపు. (బ్రౌ.)

ఒమ్మివచ్చు – అచ్చివచ్చు.

ఉదా: పశువులు ఇతనికి ఒమ్మిరాలేదు. (బ్రౌ.)

జ: ఒమ్మచ్చు, ఒమ్మిక.

**ఒయారము** – ఒయ్యారము, ఓయారము. వి. 1. విలాసము; సౌందర్యము.

చ. పెనిమిటియైన వెన్నుఁ డొగిఁ ప్రేముడి నిచ్చినఁ బుట్టు గ్రుంకుగ, ట్లను తన రెండు చేతుల నొయారము మీఱఁగ నేలకొమ్మ దా,ల్చినపవడ. పుఁజుట్టలుఁగుఁ జందమును బలెఁ జూడ నొప్పెనం,తను దగఁ దూర్పు నన్ వెనుకఁ దమ్ముల విందుమ బందమూమ యున్. యయా. 5. 30.

ఉ. అంచితలీల రంభ మునియగ్రమునన్ విహరించె నెంతయుఁ, మించు నొయారమున్ గులుకు నెన్నడయుఁ... పొల్పుమీఱఁగఁ. కళా. 8. 17. ఆం. భా. 1. 189.

గీ. రతివిధంబునఁ గడునొయారముఁ బొదలి. చంద్రా. 4. 193.

2. విధము.

(మాయావిమానము.) వ. ఒక్కయెడఁ జుక్క తెగిపడ్డ విధంబున డిగ్గుచు నొక్కచోటం బుట్టచెండువడువున నుప్పరంబునకుం బోవుచు నొక్కవంక జీను దిగవైచిన కప్పలి చొప్పునఁ గదలక నిల్చుచు నొక్కవరి బైరి డేగయొయారంబునం దిక్చ్రక్రచారంబుఁ జూపుచుఁ బోయి.. కువల. 4. 92.

విశే. సవిలాసము.

ఉ. ... మజ్జనం,బై పువుఁజప్పరమ్మున నొయారముగాఁ గయిసేసి రాజలీ,లాపరతంత్రుఁడై కలకల న్నగుచుండెడు సవ్యసాచి నిం ద్రోపల రోచిః జూచి తలయూఁచి యులూచి రసోచితంబుగఁ. విజ. వి. 1. 63.

ఉ. దాని జగానిగారము దాని యొయారపుఁ దక్కుఁ జూపులున్. నీలా. 2. 23.

జ: ఒయారి.

**ఒయారి** – ఒయ్యారి, ఓయారి. విశే. (√ఒయారము.) ఒయారముగలది.

(మనోహరము; చక్కనిది.)

గీ వయసువాఁడును మిగులశా గయినవాఁడు, నన్నిట నొయారియై యుండునట్టివాఁడు, దైవగతి నొంటిపాటునఁ దగిలె నేని, యోజ చెడి పైకొనదె యొట్టియువిదయైన. సారంగ 2. 9.

సీ. చిన్ని క్రొన్నెల వెన్ను వెన్నొనల్ల నొయ్యారి యలఁతికస్తురి రేక లనువుమీఱ. అచ్చ. రా. బాల. 87.

సీ. వేలువుఁబూఁబోండ్ల గెలి సేయు నొయ్యారి చెలువలు దగవీర మలహారియును...బంగారు వీరణములు ... కదఁగి మ్రోయింప ... మయా. 4 159.

వి. విలాసముగలస్త్రీ, స్త్రీ.

శా. ఏమే పల్కవు మోహనాంగి యిటు లేలే యల్క చిత్రాంగి నిన్నే మంటిం గలకంఠి నావలన దప్పేమే యొయారి యయో, నామీఁదన్ దయ లేదటే చెలి నను న్మన్నింపవే కోమలీ. సారం. 2. 210.

ఒయ్యన – ఒయ్యన. అవ్య. క్రి 1 మెల్లఁగా.

గీ. అట్టియాలోను కడురయం బారఁ జొచ్చి, యొయ్యఁ దలయంపిదిక్కున నొదిఁగి యుండె హరి. ఉ 2. 126.

చ. విసరువాలోచనామణినిఁ జెండివిన్నియఁ జేఁ పుడువ్వటన్, మునుఁ గొనరింపుఁడీ... విసవిసఁ బోక యొయ్యన నడపింపుఁడు .. పాంచా. 4. 21.

మ. ... నిజంబడుగం జూచెద నంతయుం దెలియ నొయ్యం జెప్పరా నావుడున్.

చ. అనిలజుఁ డోరి రావణుఁడ యల్లన నేటికి బెట్టు చెప్పెదన్, విను...రామా. 6. 231. 232.

సీ అంతఁ బులోముఁడా వింతరక్కనుఁ డగ్ని హోత్రగృహంబున కొయ్య వచ్చి. భార. ఆది. 1. 129.

2. ఇది కొన్ని చోట్ల వాక్యాలంకారముగా నుపయుక్తమై 'ఒప్పిదముగా' మొదలగు అర్థము లిచ్చును.

గీ. ప్రాణబాంధవుఁ డైన యప్పడు రాజు, నభ్ర మార్గంబునం దొయ్య ననుచరింప, నశ్రు ధారా ప్రవాహంబు యవధిగాఁగ, దైన్య మందుచు మరలె వైదర్భిచూడ్కి. నైష. 2. 100

ఒయ్యొయ్యన్ – మెల్లమెల్లఁగా; క్రమక్రమముగా.

మ. ఇతఁడే నైషధుఁ డంచు నొండొరులతో నేకాంత మొయ్యొయ్య నాశతమన్యు ప్రముఖామరుల్ మునుకుచుా దర్పించి రుత్కంఠతోన్, నైష 3. 42.

గీ. తారమైదీఁగ వికచలోధ్ర ప్రసూన, పాండురచ్ఛాయ నొయ్యొయ్యఁ బలుకఁబాఱె. కాశీ. 4. 206.

ఒయ్యన – ఒయ్య. (క. ఒయ్యనె. త. ఒయ్యెణ.) (తిన్నగా)

సీ. ఒకనాడు నారదుఁ డొయ్యనఁ గంసుని యింటికిఁ జనుదెంచి...భాగ. 10. పూ. 62.

(మెల్లఁగా)

క. ... బలం బేర్పడ విల్లు వంప నోపక, యుడిగిరి నృపసుతులు గొంద ఱొయ్యన లజ్జన్. భార. ఆది 7. 176.

(కొన్ని చోట్ల వాక్యాలంకారముగా నుపయుక్తమై 'ఒప్పిదముగా' మొదలగు అర్థము లిచ్చును.)

చ. ... అనృపమణిభాగ్యలక్ష్మీకరణిం దరుణీమణి వచ్చె నొయ్యనన్. వసు. 6. 23.

ఒయ్యనొయ్యనా – మెల్లమెల్లఁగా; క్రమక్రమముగా.

ఉ. ... వెనుఁజేటు దప్పెననుచుం దివి కేగితి మొయ్యనొయ్యనన్. ప్రభా. 1, 91.

గీ. మగువ మొగమున కెనగాగ మిగులఁ బొగిలి తొగల చెలికాఁడు పదియాఱుతునియలయ్యె, నిరుల కిర వగునెత్తమ్మివిరి దలంచి, యొయ్యనొయ్యన వేమాఱు వ్రయ్యలయ్యె సిలా 2 21.

ఒయ్యొయ్యనా – మెల్లమెల్లగా: క్రమక్రమముగా,

మ. వడు మొయ్యొయ్యనఁ దోరమయ్యెఁ బన రెన్ నాభీతలం బంగముల్, జడనొందెా.. కమనీయదౌహృదపరిశోభంబునం బొల్చెా. హరి. ఉ. 3 180.

ఒయ్యాళిక వి. (ఒయ్య+అఁక?) నిరోధము.

గీ. ఇట్లు కోలాహలంబుగాఁ బెట్టఁ బెట్టి, పీఁకనందఱ నశట నొయ్యాళిక చేసి, ముమ్మర

మ్మైన యారివేరమ్ము మదికిఁ బుట్ట నతఁ
డేఁగెఁ దలవరికొట్టమునకు. వై. జ. 4. 66.

**ఒయ్యారము** – ఒయారము, వి. (క. తు. ఒయ్యార. త. ఒయ్యారమ్.) విలాసము.

క. ఆ రాజు నిజపురం బగు, నారాయణవనముఁ జేరి నానాజనముల్, గారవమునఁ గనుఁగొన నొయ్యారంబున రాజవీథి యందుఁ జరింపన్. కాళ. 1. 31.

విశే. 1. సవిలాసము గలది.

వ. పురారి యొయ్యారంపునిలుకడ నిలిచి వలకేల వాలమ్ముఁ ద్రిప్పుచు. హర. 7. 49.

మ. ...మేనొయ్యారమై వ్రాలఁగా, జలకంబార్చె లతాంగి యొర్తు యదువంశస్వామికి న్వేడుకన్. పారి. 2. 11.

2. అప్రయత్నముగా సంభవించునది, యాదృచ్ఛికము.

మ. ఒకమా ఱెవ్వని పేరు గర్ణములలో నొయ్యారమై సోఁకినన్, సకలాఘంబులుఁ బల్లటిల్లి తొలఁగునన్ ... భాగ. 9. 142.

3. మనోజ్ఞము.

సీ. హారముల్ మెఱయ నొయ్యారంబులుగ గ్రుచ్చి యందంద వింతగా వలవరింతు. భార. విరా. 1. 107.

('ఒయ్యరము' అనురూపాంతము ఒక్కచోటఁ గానిపించుచున్నది.)

ఉ. ...చెక్కుఁగవకెంపుపెంపొదవ మోర మెఱుంగు దోమిన ట్లున్నది పోఁగకన్దళుకుటొయ్యార మే మనవచ్చునై ననీ, చిన్నది తుంటవింటిదొర చిల్కయ ముద్దులు మూటగట్టెడిన్. మృ. వి. 2. 60.

జ: ఒయ్యారి.

**ఒయ్యారి** – ఒయారి విశే. (√ఒయ్యారము) 1. సుందరుఁడు.

శా. .. మునీంద్ర మాకు నెపుడున్ జేతోభవుం గన్న యొయ్యారిన్ శౌరి వరించు వేడుకలు మల్లాడున్ మనోవీథులన్. వరాహ. 9. 38.

2. నిపుణుఁడు, నేర్పరి.

సీ. త్రయ్యంతవాసనా గ్రహబుద్ధి నొయ్యారి యొయ్యారిరామానుజయ్యగారు. పాండు. 1. 42.

వి. విలాసము గల స్త్రీ; స్త్రీ.

గీ. అన్ను లతకూన యొయ్యారి యతివ వెలఁది ....గరిత యన భామినీసమాఖ్యలగు సాంబ సాం. ని. మాన. 20.

సీ. ... కలిమి యొయ్యారి నోములఫలంబు ... ఉ. రా. 1. 80.

**ఒర** వి. (క. ఒరె. త. ఉరై.) 1 పరీక్షార్థము ఒరగంటిమీఁద గీచెడుగీటు.

సీ. ఒఱ వైనకటికటి నొరకునచ్చు పదారు వన్నె దుప్పటి వింతవన్నె మీఱ దశా. 5. 46.

(యజ్ఞవరాహవర్ణనము.) సీ. పుత్తడికొండ మూఁపురి మనునొరగంట నొరకురా రాపాడు నొక్కమాటు. భాగ. 3 415.

2. సామ్యము.

క. శృంగారము ముఖ్యం బగు, నంగియు నంగములు దలఁప నష్టరసములున్, సాంగమగు నేని, డంకము, బంగారము తోడి యొర ప్రబంధము వొందున్. పి. శకుం. 1. 25.

3. ఆలోచన.

చ. ద్రవిణము నొవ్వఁ గొంట నొర ద్రాబలతో నిడుచుంట భూమి గొం, తవలికి నిచ్చుచుంట ... భూధవుఁడు ... తనయం దివి మామ్పుకోఁ దగున్. ఆము. 4 248.

ఒరప(వ)ట్టు – రాపిడి పెట్టు.

చ. ప్రమదవనంబునం బ్రియసఁఖుల రత్నకృతంబులైనకుట్టిమములఁ జుట్టుకోటలఁ దటిన్మయకుడ్యములన్ బరస్పరం, భ్రమద మహాస్వరూపమునఁ బజ్జయు దవ్వెఱుంగ నీని వి.భ్రమముల నాముధర్మ నొరవట్టు విధాతృపురిని కేతముల్. కకు. 8. 18. (ఔపమ్యవాచకము.)

సీ. ఎఱపట్టు తెరవెట్టు నొరపట్టు చిఱుచట్టు పలుజక్కదొర వెక్కి ప్రబలువాఁడు. అచలా. 1. 62.

ఒరపెట్టు – 1. బంగారము గీచి గీటు పెట్టు.

వ. ...నికషపాషాణపట్ట నిభంబయినవక్షస్థలం బునం దన పసిండిటెక్క లొరవెట్టుచందం బున...నైష. 2. 85.

2. సంఘర్షించు; మించు.

సీ. పులుఁగురాయనిచట్టువలవన్నె నొరవెట్టు పొంబట్టుజిలుఁగుఱెంటెంబుతోడ. మనుచ. 6. 102.

ఒరవచ్చు - పాటివచ్చు.

ఉ. ...వదార్వవన్నెపసిండితోడ నొరవచ్చునృపాలుని యంగకంబులన్. నైష. 6. 50. భార. భీష్మ. 2. 381.

జ: ఒరకొను, ఒరగట్టు, ఒరగడుగు, ఒరగల్లు.

**ఒరకొను** స. క్రి. (ఒర+కొను) ఒరపెట్టు; పరీక్షించు.

సీ. వంటక మొనరించి వరుసతో నిప్పులు బొగ్గులుగా నార్చి ప్రోవుచేసి. క్రమ్మఱ నొరకొన్న గవ్వల కమ్మించి సమ్మదంబునఁ జల్లచముచు నిలిచి. గీ. వెంవు భక్తియు బెరయంగ వేడ్కతోడఁ, గుడువఁబెట్టిన ... దశకు. 10. 105.

(ఒరకొన్నగవ్వలకు — ప్రశస్తమైనగవ్వలకు.)

**ఒరగట్టు** వి. (ఒర+కట్టు.) చుట్టగా చుట్టి కట్టిన వస్త్రపుకట్టు.

సీ. ఒరగట్టువంచెలు బెరసుఁబచ్చడములుఁ గారొక్కన్నలోవంక కఱియొడళ్లు. నీలా. 3. 49. (శ. ర, పా. 'ఒరుగట్టు' ముద్రి.)

**ఒరగడుగు** వి. (ఒర+కడుగు) రెండవసారి బియ్యము కడిగిన నీరు. (శ, ర.)

**ఒరగల్లు** వి. దే. (ఒర+కల్లు.) బంగారు మున్నగునవి ఒరపెట్టెడుఱాయి. గీటురాయి. నికషము

సీ. పుత్తడికొండ మూఁపుర మనునొరగంట నొరకు రా రాపాడు నొక్క మాటు భాగ. 3. 415.

ద్వి. విద్దెల కొరగల్లు వితరణం బిల్లు. ప్రభు. 2. 27. పా. 16. పం. (విద్దెలకొరగల్లు — విద్యాపరీక్షాస్థానము.) ఆం. భా 2. 299.

**ఒరగాలు¹** వి. దే. (క ఒర్. త. ఒరు — ఒకటి.) ఒంటికాలు.

ద్వి. ఇంక నెట్లని యాత్మఁ గొంగక మనను, బింకంబు వదలక పృథుసాహసమున, నొరగాల నేఁగుచు నొకకొంతదవ్వు, పొరిఁ బరుగెత్తుచు భువిఁ గొంతదవ్వు. పండితా. పురా. 132. పా.

ద్వి. నెక్కొన నొరగాల నిలుచుచుఁ జనుచు. బస. పు. 3. 1120. పం.

సీ. చే సంకు పట్టుచుఁ జిదురుప త్వెదకుచు నొరగాల దేవుచు సులిశిపడుచు. దశకు. 6 157.

(దీనిని శకటరేఫముతో అప్పకవి గ్రహించినాఁడు)

సీ. ఒఱలుట విలపించు టొఱవదేహం బొఱగాల నుండుట యొఱ కత్తిమూఁత. అప్ప. 2. 197.

**ఒరగాలు²** వి. దే. (ఒరగు+కాలు.) కుంటికాలు.

క. కప్పకు నొరగా లైనను, పప్పమునకు రోగమైన సతి తులు వైనగా,ముప్పున దరిద్రుఁడైనను, దప్పదు మఱి దుఃఖ మగుట తథ్యము సుమతీ. సు. శ. 27.

**ఒరుగు** అ. క్రి. 1. వంగు.

గీ. ...ఎడమ కొక్కింత యొరగ నిడినధమ్మిల్లవలయంబు నడుగునందు. ఆము. 5. 38.

2. వ్రాలు; పడు.

చ. ... కొఱవు లై యొరగంబడెఁ గొన్ని భూజముల్. ఆము. 5. 126.

క. గడగడ వడఁకుచు మున్నీరడరెడు నెమ్మేను దాల్చి యన్నెఱజేజే,యడుగులపై నొరగెఁ దన. యడు గసలును జిప్పప్రోవునై కనఁబడఁగన్. అచ్చ. రా. యు. 75. ఉ. హరి. 1. 58.

గీ ...పుడమి జేఁడు, తెలిసి గదగొన్న రిపుశక్తి దిగచివైచి, మఱియొరగి క్రమ్మఱం దేఱి యురక నిలిచి. కళు. 2. 147. (మూర్ఛపడు' అని భా.)

3. కూలు, చచ్చు.

సీ. శార్దూలకబళుండు నచ్చె దుర్జయుఁ డేఁగె శత మాయుఁ డొరగెను సమస్త వక్ర,నాసుండు ...మొ రా సుం. 159.

4 పోవు, నశించు.

క. ...కృప, యొరగిన చిత్తముల వార లొం డొరుకోడక.

క. ...చీరుడము వీరిఁ బట్టి యుదరముల్.

వ. అనుచుండ. కేయూర. 3 323, 324, 325.

వి. 1. ఒరగుదిండు.

సీ. ఒక్కకే లొరగుపై నునిచి యేకాంతంబుఁ దెలుపుచుఁ గూర్మి నెచ్చెలులు సనఁగ. శుక. 1. 321. చంద్రా. 3. 68.

2. లోపము.

సీ. భట్టి యుగంధర ప్రముఖులకృత్యంబు లొరగు లొత్తెడుమంత్రు లొక్కవంక. రాజ. చ. 1. 11.

3. వంపు. (శ. ర.)

విశ. వంకరైన నది. (శ. ర.)

ఒరగుపాగ — వంకపాగ.

సీ. వాలుగుమంజిముక్యాల యొరగుపాగ మెఱుంగు నొసలబొత్తరిబొట్టు మునుఁగు వేయ. సారంగ. 1. 79.

జ: ఒరగాలు[2].

**ఒరచాలుదుక్కి** వి. చాలు తేలికగాఁ బాఱిన దుక్కి. (శ. ర.)

**ఒరపదను** వి. కొంచెముతడి. (శ. ర.)

**ఒరపిడి** వి. (√ఒరపు) రాయిడి.

క. అన్నలుఁ దమ్ములుఁ గలుగుట, యున్నతుఁ జేయు నృపు నెంత యొరపిళ్లయినన్, మన్ననయు నీగియును సంపన్నంబులు గాఁగ వారిఁ బాటించుటయున్. భార. శాం. 2. 356.

**ఒరవు** వి. (√ఒరయు.) సంఘర్షణము, రాపుడు; అదుముడు.

సీ. మెండు మీఱెడుబండికండుల యొరవునఁ జిలువలరేకిమీఁదు దలలు ముడువ. అచ్చ. రా. యు. 184.

**ఒరయిక** వి. (√ఒరయు.) 1. స్పర్ధ.

సీ. ఉరమెక్కుసిరితోడ నొరయిక శిరమెక్కు మహి యన హరినీలమకుట మొవర. చంద్రా. 1. 71.

2. సంఘర్షణము.

చ. సరసిజసంభవుండు పురసారసగేహినికి బ్రవచించు నచ్చెరు వగు నీలపుంగుళుపు చెక్కిన మేలిపసిండిముద్దుటుంగర మన మింటితో నొరయికన్ గనుపట్టెడు గోపురస్ఫుర ద్గురుతరశాతకుంభరుచిగుంఫితసాలము నీట మీటుగన్. చంద్రా. 1. 8.

**ఒరయు** స. క్రి. 1. రాచు, సంఘర్షణము చేయు.

క. రావణుఁడు వచ్చి నన్నుం ద్రోవ యడిగె నేను జెప్ప దోస్సృల మెసఁగఁగ, వేవేగ నన్నొసి కొని, నాంవాసనమీపపథమునం బోవు నెడన్. భా. రా. కిష్కిం. 713. ఉ. రా. 2. 147.

సీ. ప్రవహించు నేవీటిపశ్చిమప్రాకార మొరసి గంగమ్మ సాగరముకొమ్మ. కాశీ. 1. 58.

2. గోఁకు.

శా. జేటం జేటముగా నిభంబు కరిణిం బ్రేమంబుతోఁ జేరి..క్రీఁగోట న్మే నొరయున్. కు. సం. 1. 100.

3. ఎదుర్కొను, డీకొను.

సీ. కండక్రొవ్వునఁ గన్ను గానక పందులు బిరుదేనుఁగుల నైన నొరయఁ జూచు. సారంగ. 1. 68.

చ. ... నినొ్నరసి శాఙ్రెనరాక కదా నిలింప భూజములు వహించు దుర్యశము షట్పద కోకిలకైతవంబునన్. ఆము. 1. 43.

4. (పరీక్షార్థము బంగారు మున్నగువవి శాతి పై) గీటుపెట్టు.

సీ. యోగార్థసాధన ముల్లం బుపాసించి పరమత గాంగేయ మొరసి చూచి. కాశీ. 4. 187.

చ. ఒరసిరి నిన్నుఁ దక్క నికషోపలధారల వన్నెఁ గానరు. ఉ. హరి. 5. 11.

5. పరీక్షించు.

ద్వి. అడుగు లొత్తుచు నున్న వతనిమనంబు, నొరయ మాయానిద్ర నొంది రేయెల్లఁ, జరణసేవ యొనర్చు జననాథుఁ జూచి. ద్వి. హరిశ్చ. ఉ. 1601.

గీ. అడిగితిమి గాని యెవ్వండ వైన నేమి ... ఒక్క భిక్షుకుఁగా నిన్ను నొరయ నేల. హర. 2. 51.

6. పరిశీలించు, విచారించు.

క. నరపతి భృత్యుల( దొడవుల,నొరసి తగిన
నెలవు లందు నునుపక యున్నన్, జరణం
బున( జూడామణి,శిరమున నందియయు(
బెట్టు చెలువము గాదే. నా. పంచ. 1. 130.

7. పొరయు, పొందు; చేరు.

సీ. దరి లేని భంగపా టొరయ(డావం తైన
బహుజీవనసమృద్ధి( బరిఢవిల్లి. పె. శకుం.
1 41.

సీ. జాహ్నవేయ క్షేత్ర పదము నుల్లంఘించి
డుంఠిరాట్తీర్థోపకంఠ మొరసి. గీ. భవతి
భిక్షాం ప్రదేహి యన్నలుకు పలికి కాశీ.
6. 127.

అ. క్రి. 1. స్పర్ధచేయు; మార్కొను

సీ. ఉమరోమరాజితో నొరసి కీడ్పడినచంద
మున భూపాహులు తలలు వంప. వరాహ.
6. 46.

గీ. లలితకాశ్మీరభవనమాలంభకర్మ,పాటలంబైన
నీముఖాబ్జంబుతోడ,నొరయు( గాక భవ
త్కేళియోగ్యమైన,పొడుపుగుబ్బలి( బొడ
తెంచు పూర్ణవిధు(డు. నైష. 5. 48.
(ఇట ఔపమ్యద్యోతకము.)

2. రాచు, సంఘర్షించు.

చ. ...నితంబచక్రములతో నెఱివాలు మెఱుం
గు(గప్పు(జె,న్నడ లొరయంగ( దర్గగన
శైవలినిం దగ( జొచ్చి ఠందఱుఁ. పారి.
4. 28.

3. (రాపిడివలన నొక్కుడువడు.

సీ. గురివెందపూసవే రొరయ నందిట( గట్టి
...నీలా. 1. 81. (నందిఠొ యొరయఁగా:—
అని యన్వయము.)

జ: ఒరపిడి, ఒరవు, ఒరయిక, ఒరయుగడ,
ఒరసికొను.

ఒరయుగడ — ఒరయిక.

(రాపిడి; కష్టము.)

క. కోపించి మరల వెలువడ(, ద్రోపించె సురారి
బలిమి ధూర్జటి నీళ్లన్, మోపించె విష్ణు(
బనులకా, గాపించెను మీకు నొరయుగడ
దాపించెన్. కు. సం. 4. 881.

ఒరలు — దొరలు. అ. క్రి.

(దొర్లు)

చ. ...దుఃఖపరంపర నిద్ర లేక తా,నొరలుచు
లేచుచుకా వనట నొందుచు( గన్నులు సాము
మూయుచున్, భా. రా. కిష్కిం. 375.

గీ. ఒరలుమదకరు లుర్విపై( బొరలుహరులు,
విఱుగుతేరులు బల మేది యొఱగు భటులు.
ఉ. రా. 8. 177.

ఒరవడి వి. విద్యార్థులకు అక్షరములు కుదురుటకై
గురువు మున్నుగువారు వ్రాసిన మేలుబంతి.
(వ్యవ) నాకు గురువుగారు ఒరవడి పెట్టినారు.
ఒరవడి వ్రాయు — ఒరవడి చూచివ్రాయు.
(వ్యవ) పిల్లవా(డు ఒరవడి వ్రాయు
చున్నా(డు.

ఒరవు వి. విధము.

ద్వి. నెఱయ( బాయసముపై నె య్యొల్కి
నట్టి, యొరవు నాకయ్యె నాయొడయ
రమేశ. పండితా పురా. 181.

ఒరసికొను స. క్రి. (√ఒరయు) రాచికొను;
అంటు.

వ. కొన్నివాసరంబులకు( గుంభసంభవుండు
గోదావరి నొరసికొనుచు నాంధ్ర దేశమున
నరుగునప్పుడు. కాశీ. 8. 18.

వ. మాతలిసారథికం బైనయారథంబు నక్షత్ర
మండలం బొరసికొనుచు జని. హర. 7. 116.

ఒరసికొనుపోవు — (రాపిడివలన) నొక్కుడు
పడు; పుండుపడు.

(వ్యవ) దారము బిగించి కట్టినందువలన న
దిలి ఒరసికొనిపోయినది. చెమ్మనేల( దిరుగుట
వలన వ్రేళ్లు ఒరసికొనిపోయినవి.

ఒరను వి. పోలిక (ఉపమావాచకము.)

క. దొరయు గెడ జో పోలిక, సరి సంగడి
యుద్ది యీడు సాటి పగిది నా(, గరణి
యన( జాడ్పు చందం,బొరసు పరుసు నాగ
మవమ కొప్పున్ జెప్పన్. కావ్యా. 5. 16.

ఒరిగ వి. మ్రొక్కు, నమస్కారము.

సీ. జోతలు కైటభాసురగర్వహరునకు నొరిగ
బ్రహ్మాండభాండోదరునకు. దుశ్శాం.

1. 123. (శ. ర. పా. 'ఒరిగె' ముద్రితము. ఇంకను విచార్యము.)

**ఒరిగట్టు** అ. క్రి. మార్కొను.

సీ. దేవాసురోగ్రాజి...,ఉగ్రుఁడై జమునికి నొరగట్టి తన కెందు మాఱు లేదను కేతుమాలి యితఁడు. కు. సం. 11. 670. ('ఒరగిట్ట' వ్రాఁత ప్రతి. ఇంకను విచార్యము.)

**ఒరిజ** వి. ఏనుఁగుయొక్క మెడగొలుసు, కలాపకము.

సీ. వనుల నోదాలఁ ద్రోవక దేవకరఁ బట్టి యొరజ వైవక యెక్కునుదుటుఁదనము రా. వి. 8. 46.

సీ. గళలిప్తకస్తూరికారేఖ లొరిజలు నునుఁ జెక్కులజవాది మొనపుమదము. గీ. . .అంగ సంభవుమదపుటేనుఁగు లనఁగ, వఱలుదురు వీటఁ బణ్యలావణ్యవతులు. చంద్రా. 1. 32. ప్రబంధ. 58.

**ఒరిమ** వి. 1. మైత్రి; ఒద్దిక.

సీ. దుగ్ధాబ్ధికన్యక తోడికోడలు గాఁగ నొరిమ మైనుంట నీ కొప్పుఁ గాదె, నైష. 8. 126.

చ. కని తను రాజు లెన్న కొనఁగాఁ జెమఁ బొఁజులతో సిరిఁగరా, యనికడ కేఁగి మాటలనె యాయనఁ దేలిచి తెచ్చి మల్లికున్, మనుకువ సంటు చేసి యొరిమం గడు మెచ్చులు గొన్న మేటి నే,మని పొగడంగ వచ్చు నవునౌ నిఁక ఫాలిలుభానరాయనిన్. యయా. 1. 51.

2. దయ.

సీ. కిరులారం వరదరిహరులారఁ కైలనిర్ఝరులారం కాపాడుఁ డొరిమతోడ. ఉ. హరిశ్చ. 2. 185.

3. ఆసక్తి.

(గీ. ఒరిమ నొండొంటిఁ బూచు సాధరణము లును, విమలహారినీలమణివిభాపీఠములు. నైష. 6. 61.

గీ. పొం దొరిమ పొత్తు గాఁము పొందిక యనఁ, బరఁగుచుండును మిత్త్రిభావంబు.... ఆం. భా. 2. 186. – 'ఒరిమె' అని, ముద్రి. ప్రౌ. పా. కాని ఎదంతమనుటకు నిర్ధారక ప్రయోగములు లేవు.)

జ: ఒరిమిఁడి.

**ఒరిమిఁడి** విజ (ఒరమ+ఇఁడి.)-మైత్రిలేనివాఁడు -ద్వేషి.

ద్వి. మఱియు దుష్కులుఁ డని యొరిమిఁడి విప్రు, లఱతోడ శివనాగమయ్య నిందింప. పండితా. దీక్షా. 73. పొ.

**ఒరిమిక** వి. – ఒరిమ.

(వినయము)

క. ఒరిమికయు బత్తియున్ మదిఁ, గరి మల రఁగఁ బూజఁ జేసెఁ గన్నియ... అచ్చ. రా. అర. 121.

**ఒరుఁడు** న. 1. అన్యుఁడు. (బ. ఒరులు - చూ. ఒకరువుఁడు.)

క. నరునకు నాకుందఁక్కఁగ,నొరులకు మీరూపు నూప కున్నది...భార. విరా. 1. 176.

క. ధరణిఁ గల రాజు లిట నెవ్వరు వచ్చిన వారు లేరు వైదర్భియొరున్, వరియింప నంత ధర్మే,తర చరితయె...భార. అర. 2. 184. అము. 2. 40.

2. ఒక్కఁడు.

సీ. ఘనుఁడు గదాయుద్ధమునను భీముఁడు బల దేవుని కొరునకు దిగుడు కాని. దశా. 8. 150.

**ఒరుదల** వి. (ఒరు+తల- శ. ర.) కొండెకాని తనము, పైశున్యము.

ఉ. ...ఒరుం డొరుదలన్ వినిపించినమాట డెందముం, జెంద ముదంబు దక్కి చెడఁజేయుఁడు....అము. 2. 40.

విజ. కొండెకాఁడు.

సీ. ఒరుదలగా వచ్చి యొగి మఱుంగుపడంగఁ జెవినిల్లు గట్టుక చెప్పి రేని. గీ. పదర కధిపతి తెలియంగఁ గాడి యగును. విప్ర. 5. 40.

జ: ఒరుదలకాఁడు.

**ఒరుదలకాఁడు** విజ. (√ఒరుదల) కొండెకాఁడు, పిశునుఁడు.

క. మొదలనె యొరుదలకానిం, బెదరంగా నాద కాత్మఁ జింతింపు పదిం,బదిగ ప్ముష

యేని మఱివిడు ముదస్తుఁగాఁ గాక యుండ
నొక్క మతమునన్. అము. 4 220.

**ఒరుదలే(లయే)రు** వి. (ఒరు+తల+ఏరు)–ఒంటి తలయేరు

వ. పొగడవిత్తులు చనుఁబాలనూఱి నస్యము మఱుముక్కున వేయ నొరుదలయేరులును రెండు ముక్కులవేయఁ దలనొప్పులును మానును చికి. (చి. ని.)

క. ంవివారపు రేపకడన్, సవమగు తిలజంబు మాఱు నాసికలోనన్, బ్రవసి ప నస్యమిడి నను, నివసించిన యొరుదలేరు నిజముగఁ బోవున్. చికి. (చి. ని.)

**ఒరుము** అ. క్రి. (క. ఒమ్ము.) చుఱుకగు.

క. శరనిధి మును గ్రోలినని, న్పంజలములు గురిసి మేఘ భావ బఱి య, క్కరములు కరములెకా జగి, నొరమె నవన్ రవియు మెఱసెనుడిగెన్ మొయిలున్. అము. 4. 171.

గీ. పరంగుఁ జుఱుక య్యెన నుమాట యొరిమె ననఁగ. అం. భా. 3. 94.

**ఒరువుఁడు** న — ఒకరువుఁడు. (చూ.)
(ఇతరుఁడు)

ఆ. ...శోషి దివిరి యొరువు, లనుభవింపఁ దెచ్చికొనిన మాంసము దొంటి, పుట్టువున హరించినట్టి నీచు. భార. అను. 5. 99, 89.

**ఒఱ** వి. (త. ఉఱై. తు. ఒరె) 1. ఖడ్గాదికోశము, ప్రత్యాకారము.

క. ఉఱుముక పిడుగులు పడియెడు, వఱకులు వాపోవఁ దొచ్చె వాహిని కెదురై, యొఱలందు వాయుధంబులు, విఱిగి పడందొడఁగెఁ బుట్టె విపరీతంబుల్. జై. భా. 8 188.

ద్వి. అఱకడంబునఁ గాంత నమువుగా నునిచి, యొఱ వాయఁ బెఱికి మహోగ్రంబుగాఁ గఁ, గరమునఁ బూనినఖడ్గ ప్రకాశ, మరుదుగాఁ గందివ్వె యై త్రోవఁ జూప, నసహాయ శూరుఁడై యరుగు చున్నంత, ద్వి. హరిశ్చ. పూ. 1853 – 1857.

(వ్యవ) సులోచనముల యొఱ.

2. మూతియొఱ.

మ. కలయన్ నీలమయంపుఁదల్లి యొఱదాఁకం దేటనీ రొప్పు ర. థ్యలకూపంబుల... అము. 1. 57, 2. 66.

**ఒఱక(కా)టము** వి. 1. విషమస్థితి.

ద్వి. మెఱయ నీతఁడు వోవ మీఁదటఁ జాల, నొఱకటంబున నొత్తురొగిఁ బ్రజ లెల్ల. ద్వి. భాగ. 1. (శ. ర.)

విశే. విషమము.

(వ్యవ) ఈ నేల ఒఱకటముగా నున్నది.

**ఒఱకము** వి. 1. పల్లము; క్రింది ప్రదేశము.

క. ఒఱకం బిది మెర కిది యని, యెఱుఁగఁగ రాకుండఁ జేసె నిరులు ధరిత్రిన్. సురా, 99.

గీ. ఎన్నఁడును నేగి లేనట్టియుమ్మహోశ్మ, శానమున య. దుఁ గాఁపున్న జంతువులకు, నేటి నాకంబు పున్నియం బెడలినప్పు, డొఱకమునఁ గూలవలయుఁ గిలూడినట్లు. కాశీ. 2. 45. (ఇట 'క్రిందిలోకము' అనిభావము.)

2. ఇబ్బంది, కష్టము.

గీ. అతిథి పంక్తికి రాకున్న నారగింపఁ, దొంటి నొకనాఁడుఁ బలి యెట్టి యొఱకమునను. కాశీ. 7. 166.

విశే. నిట్టనిలువైనది.

(వ్యవ) గోదావరి యొడ్డు ఒఱకముగా నున్నది

**ఒఱగద్దము** వి. (ఒఱవ+గడ్డ.) సంకటము.

విశే విషమము (శ. ర.)

**ఒఱగు(వు)** — ఒరగు. అ. క్రి. (క. ఒఱగు. త. ఒల్గు.) (వంగు, వ్రాలు; వ్రేలఁబడు; పడు)

సీ. క్రముకంబులును వంఖర్జూరనికరంబు నొగిఁ బండి వానిపై నొఱగియుండు. కు. సం. 7. 930.

సీ. తనయార్పు చెలుఁగునఁ దలఁకువైరులు వొంగ నొఱలుచు నేలకు నొఱగ నేఁడు. భార. భీష్మ. 1. 47.

క. అఱకడ నిడి ప్రాఙ్ముఖుఁడై, పఱచి జలధి లోనఁ బదలఁ బాఱెడు నెడఁ జె, య్వఱి దప్పి నిలువఁ జాలక, యొఱగిన గాలవుని డించె నొక గిరిమీఁదఁ. భార. ఉద్యో. 3. 310.

ద్వి. తఱిగినకదళీచందంబున నేల,నొఱగిచేష్టలు దక్కి యెయ్యనఁ దెలిసి ద్వి. హరిశ్చ. ఉ. 1846.

(ఒక పక్షమునకు వ్రాలు. పక్షపాతము వహించు.)

ఆ. .. దండింపఁ దగునెడ, ననుగుణవృద్ధిఁ మాచరింపు, మొఱగఁ బలికి తేని నుండదు ప్రజదేగఁ,గనిన పులుఁగు పిఁడు కరణిఁ జెదరు. భార. శాం. ౨. 374

వి. 1. వంపు. (చూ. ఒఱగుపోవు.)

2. ఒఱగుదిండు, అనుఁగువిళ్ల.

ఒఱగ(వ)ఁబడు – ఒఱగు, వ్రాలు.

చ. కలమము లుండుఁ బండి యొఱగంబడి ... అము. 1. 67.

(రాముఁడు) చ. ...ప్రాణమర్మముల్ వదలి శరాంగయష్టి నొఱవంబడ... జై. భా. 6. 230.

జ: ఒఱగుదిండు, ఒఱగుపోవు; ఒఱగువిళ్ల.

**ఒఱ(ర)గుదిండు** వి. – ఒఱగువిళ్ల.

సీ. రతిదేవి జిగిమించు రారాపుఁజమదోయి నొఱగుదిండులు సేయు నొఱపులాఁడ. సుద. 5. 50.

**ఒఱగుపోవు** అ (కి. (ఒఱగు+పోవు) వంగు, వంగిపోవు; వక్రరియగు.

సీ. కొంగ మెడయు నిడుగూనివీఁపు నొఱగుపోయినరొండియు బొక్కబొమ్మ. హరిశ్చ. 4. 168.

**ఒఱ(ర)గువిళ్ల** వి. (√ఒఱగు) ఒఱగుదిండు. ప్రగ్రీవము. (శ. ర.)

**ఒఱగొడ్డెము** – వఱగొడ్డెము. వి. మర్యాద మీఱిన మాట.

సీ. పైక మీఁజాలక బాకీ కటాయించి యొఱగొడ్డెములఁ బల్కుచుండినామొ. రంగా. 2. 171. భాగ. 1. 312. ద్వి. హరిశ్చ. ఉ. 1404.

**ఒఱటు** విశ. (శ. ఒఱటు.) మొఱకు.

గీ. ఉసులు విరియును వొల్లకిట్లొఱటుచాకి, యాదిదేవుని దెస వినయంబు దక్కి, యిహపరమ్ములు లేక యిట్లేఁగె... హరి. పూ. 9. 13.

ఆ. అలుబిడ్డలొఱటులై లేమిఁ గుందుచుఁ, దెవులుచేతఁ బడుచు నవయుజనులు,మున్ను క్రోధలోభముల నాస్తికతఁ బర,పీడనంబు సేసి వేర్చినారు. భార. అను. 5, 98.

**ఒఱపరి** విశ. (ఒఱపు+అరి) అందగాఁడు.

చ ఒఱపరిఁ గన్నఁ గూడఁ జను నూరక నన్నలు వాఱ నాడుఁ ద,త్తఱపడు బోటిఁ బిల్చెడు విధంబున నొత్తిలి పల్కు...జార. ధారణిన్. జై. భా. 8, 28.

చ. ఒఱపరి వౌదు నీ పయిన నొక్కత శౌర్యమి నన్నొకప్పు డే,మఱక భజించు నీతరుణి ...దీనిమాయకు,న్వెఱతుము గాక లేక కను వి దగు నిం దగులంగఁ జెల్లదే. చం. రా. 5. 58.

**ఒఱపిఁడి** విశ. (ఒఱపు + ఇఁడి.) అయోగ్యుఁడు.

క. వెఱవకు నెమ్మది నుండుము, పెఱవారల బుద్ధి నాత్మఁ బెట్టునె యనఘుం,డొఱపిఁడి చాడ్పున నామది,నఱమర లే దొండు నమ్ము మనియె నరేంద్రా. విక్ర. 8. 101. దశకు. 8. 4.

**ఒఱపు** వి. 1. సౌందర్యము; శోభ, ఒప్పు; విలాసము.

ద్వి. ఎఱసంజఁ గనువిచ్చు నెఱ్ఱదామరల, యొఱపు నెల్లిదమాడుచున్న పాదములు. ద్వి. పరమ. 1. 15. పా.

గీ. మకరకుండల మాణిక్యమండనంబు, లొఱపు వాటిల్లఁ గిలించె నొక్క యువిద. రామా. 4. 107.

క ఒక్కతె భయశోకంబుల వెక్కుచు మెయిఁ గలవిలాసవిభ్రమలతుమ్మల్, దక్కుటయును నొక యొఱపై, నెక్కొన ధరణీశు నెదుర నిలిచి వినీతిన్. మనుచ. 4. 69.

2. విధము, రీతి: మార్గము, పద్ధతి.

క. కడపడక కూలుగొడుగులుఁ, బడగలుఁ జామరలుఁ గలయఁబడి మూర్ఛితులై, పడియెడు వారలకును ము,న్నొడఁగూడెడు

మెత్తపఱపు నొఱపు వహించున్. కవిక. 2. 159. కు. సం. 3. 313.

సీ ఎవ్వనిచారిత్ర మెల్లలోకములకు నొజ్జయై వినయంబు నొఱపు గఱపు. భార. విరా 2. 191.

3. నేర్పు. నైపుణ్యము.

క. పెఱవారలుఁ దమ మెలఁగుడు, తెఱఁగుల దొరకొన్న వింతతెరువుల నేర్పుల్, మెఱయుచుఁ బతి చిత్తము గొన, నొఱపు గలిగి మాన్యవృత్తి నుండుదురు దగన్. భార. విరా. 2. 21.

4. కల్పన.

చ అనుచుఁ దదీయనైపుణగుణాళి విరాళి గొనంగఁ జెప్పఁగా, విని యిటువంటి వెన్నఁడును విన్నది కన్నది లేదు మున్ను దా, లును గణుతింప నీయొఱపులో నిజమో తెలియంగఁ జెప్పుమా. విక్ర. 8. 48.

5. ప్రతాపము.

గీ మదురుగోడల మెఱపు వాల్మగల యొఱపు ...తనరి వెలుఁగొందు నాప్రోలు ధరణి యందు రసిక. 1. 86.

6. తాపము; బాధ.

గీ. బాలతమకాంతితో సాటిపోలఁగోరి, పృథ్వి ననల ప్రవేశంబు పెక్కుమార్లు చేసి యొఱపులఁబడెఁ గాని వీనమైనఁ, బోలఁగాఁ జాలదయ్యె జాంబూనదంబు. రసిక. 2. 105.

క. అఱపొఱడు కుఱుచ చేతులు, నొఱవశరీరంబుఁ గలిగి యొరులకుఁ జూడం, గొఱగా కుండియు మన్మథు, నొఱపులఁ బడియెడు నితండు యువతీప్రీతిన్. భార. అర. 2. 184.

7. ఉపాయము.

గీ. శక్రుతేరై నవడవంగఁ జాలువాఁడ, నొఱపు సెప్పుదు రథికు నేమఱఁగనీను. భార. కర్ణ. 1. 314. (శ. ర. ప్రాంత ప్రతిపాఠములు.)

గీ. పిలిచి యీఁబోవ చెవ్వారుఁ దొలఁగ వాడి, పడుచు నొల్లమి లోకంబు పాడిగాదె, భాస్కరానిలస్వర్లోకపతులు దగిన, యొఱపు చెప్పిరి గాని తా రొల్లరైరి. నా. పంచ. 3. 267.

విశే. 1. ఒప్పైనది, ఇంపైనది; ప్రకాశించునది. (మాయామృగవర్ణనము.) ద్వి. తఱుచు వజ్రములతోఁ దడఁబడు తొడలు, మెఱుఁగుఁ బచ్చలడాలు మీఱుగొరిసెలు. నొఱపువెన్నెలఁ గాయు నుదరంబుఁ గలిగి, వెఱచినగతి దిశల్ వీక్షించి కొనుచు. ద్వి. హరిశ్చ. పూ. 671.

క. నెఱిఁ జదువు లెన్ని చదివియు, నెఱుఁగరు జడమతులు శివుని నిట్టిద కాదే, యెఱుఁగునె వంటకములచవి, యొఱపుగ మఱి యందమెలఁగుచుండెడిదర్వుల్. శివ. సా. 289. (ఇట వాక్యాలంకారముగా నుపయోగింపఁబడినది.)

2. యుక్తము.

క. మొన లొఱపుగఁ దీర్చికొనుఁడు, దనతవ వాహనము లాయుధము లెల్లజనం, బును ననువు సేసికొనుఁడో పినయంతయుఁ గాచి కొనుఁడు బెదరక పనులన్. భార విరా. 4. 89.

చ. ఎఱుఁగరు గాక లోకమున నెవ్వరికైనను మేలు సేయఁగా, నొఱపగు నాశ్రమంబున సమున్నత మైనగృహస్థధర్మముం, బఱగడ వైచి గోఁచి గొని పాఱెడుపొల్లకు ముక్తి గల్గునే, పఱిగల నేఱినం గొలుచు పాఁతఱకుం గలదే తలంపఁగన్. ఉ. హరి. 4. 48.

3. విశాలము, పెద్దది.

(అశ్వవర్ణనము.) క. ఒఱపగు నురమును బిఱుఁదును, నెఱిదోఁకయు...చూడఁ దగు నాహరికిన్. భాగ. 8. 256.

సీ. ఒఱపైనకటితటి వొరకు వచ్చువదాఱు వన్నె దువ్వటి వింతవన్నె మీఱ. దశా. 5. 46.

ఒఱపుమీఱు — ఒప్పు.

సీ. తొలుదొల్తఁ బండుటాకులు రాలి నవలెత్తి యొండురెండిపురుల నొఱపుమీఱ. గీ... ధరిత్రీయువతి....నవవసంతాగమమున. కృ. శ. కుం. 1. 71.

జ: ఒఱపరి, ఒఱపిఁడి, ఒఱపుకాఁడు, ఒఱపు లాఁడి ఒఱపులాఁడు.

**ఒఱపుకాఁడు** వి**శే.** (√ఒఱపు) అందగాఁడు.

గీ. పొలుపు మీఱంగఁ దృణరాజఖూరుపంముల, యగ్రముల నున్న ఖంగలయాసవంబు, గొడిచికొని తెచ్చుచున్నట్టియొఱపుకాఁడు. విక్రమాఢ్యుండు వారుణీవిక్రయుండు. సురా. 57. (ఇట వ్యతిరేకలక్షణచే 'మోట వాఁడు' అభిప్రాయము.)

**ఒఱపులాఁడి** వి**శే.** (ఒఱపులు+ఆఁడి.) సౌందర్యవతి, అంతకర్తె. వి. సౌందర్యవతి యగుస్త్రీ; స్త్రీ.

వ. అత్తఱి వియత్తలంబు హత్తిలాఁగెత్తు మెఱపుటొఱపులాఁడినర్తనచమత్కృతికి నచ్చెరువడి. ...చం. రా 6. 64.

**ఒఱపులాఁడు** వి**శే.** (ఒఱపులు+ఆఁడు.) అందగాఁడు.

సీ. రతిదేవిజిగిమించురారాపుఁజనుదోయి నొఱగుదిండులు సేయు నొఱపులాఁడ సుద. 5. 50.

ఒఱపెంతు వి. నూతియొఱ. (బ్రౌ.)

**ఒఱలు** అ. క్రి. (క. ఒఱలు, ఒఱల్.) 1. అోలు, విలపించు; అఱచు; ధ్వనిచేయు.

గీ. ....వృషభాంకుఁడు....చంపె నాదైత్యు నొఱలంగఁ జంక నిఱికి. కాశీ. 6. 163.

క. నెఱి దప్పంబడి పెల్లుగ, నొఱలెడినంజాఱి కరులయులి వఖిమన్యుం,డఱిముఱిఁ బడుటకు వగమదిఁ, బఱిగొన నిల పెలుచ వఱచు భంగిఁ జెలంగెన్. భార. ద్రో. 2. 182.

మ. ...ఓ దేవ నీ,యఱకా లుద్ధతి రాహుమండలము బ్రహ్మాండంబుతో నొత్తినం, గుఱుగుఱ్ఱం చెడసంది బిట్టొఱలు నక్షోరాహినీయంఘ్రికిన్, గిఱుచెప్పైనవిధంబు నామనములోఁ గిలించినట్లయ్యెడున్. నైష. 8. 125.

2. కలఁతనొందు, క్షోభపడు.

క. ....దా,నవురాంధ్రువలుకుపలుకుల్, చెవిఁ దాఁకి చుఱుక్కుమనినఁ జిత్తం బొఱలన్.

అ. అడలు నిలుపలేక యాయమ్మ వాయెత్తి, దుఃఖపడఁ దొడంగెఁ దోఁటలోన. రామా. 6. 141, 142.

**ఒఱవ** వి**శే.** 1. వక్రము; వికృతము.

ఆ. ...పంగు నొఱవగఁ గాలునే,విఱిచి సాధుజనులఁ బఱిచినాఁడు. భార. అను. 5. 100.

క. అఱపొఱదు కుఱుచ చేతులు,నొఱవశరీరంబుఁ గలిగి యొరులకుఁ జూడం,గొఱ గాకుండియు మన్మథు,నొఱపులఁ బడియెడు నితండు యువతి ప్రీతిన్. భార. అర. 2. 184.

2. తాఱుమాఱు, వ్యత్యస్తము.

క. తెప్పించి తొడుగు మీ వని,యొప్పించిన నిట్టునట్టు నొఱవలుగా మైఁగప్పికొనియా బృహన్నల,యప్పుడు నగిపించె నచటియబలాజనమున్. భార. విరా. 4. 39.

జ: ఒఱగడ్డము.

**ఒఱ్ఱబీజము** మి. వి. (ఒఱ్ఱ+బీజము.) ఒక ప్రక్కబీజము వాఁచు వ్యాధివిశేషము. (శ. ర.)

**ఒఱ్ఱ** వి**శే.** కటువు, కారమైనది.

సీ. ఒకకొన్ని ద్రబ్బెడ లొకకొన్ని కాలింపు లొకకొన్నివిధముల యొఱ్ఱ చేరులు ... పాండు. 4. 184.

వి. కారము, కటుత్వము (ఉదా. ఈ కూరలో ఒఱ్ఱ యెక్కువగానున్నది.)

గీ. అవపచ్చళ్ళు చవిచూచి రాదరమునఁ, జుఱ్ఱు మని మూర్ధములు దాఁకి యొఱ్ఱఁదనము, పొగలు వెడలింప నాసికాపుటము లందు. నైష. 6. 180. (యొఱ్ఱదనము, అపముద్రి.)

శ్లో. నరాజి కారార్ద్రనుఖోజి తత్రకైః, ముఖేన సీత్కారకృతాదధద్ధధి,ధుతోత్తమాంగైః కటుభావపాటవా, దశాండకండూయిత మూర్ధకాలుభిః. సం. నైష. 16. 78.

జ: ఒఱ్ఱన.

**ఒఱ్ఱకపిండ** వి. కచ్చుర. (వ్య. వి.) (శ. ర.)

**ఒఱ్ఱన** వి**శే.** (√ఒఱ్ఱ-శ. ఉక్తైవృతనం.)కటువు, కారముగలది.

చ. చిలువ సుధాంశుధరుల చెల్వపుఁగ్కటి కావిఁ దీయనై, వలపుల నందుతత్ప్రియుల వక్త్రవిషజ్వలనోష్మ నొజ్జనై, వెలువడి తద్గుణద్వితయవేధఁ జమీ యన బ్రమానుపట్టు టల్, తలిరులు పుట్టుటల్ గలుగఁ దార్కొనెఁ జందన శైలవాతముల్. ఆము. 5. 107.

వి. ఒజ్జఁదనము, కాఁపు. (శ. ర.)

**ఒజ్జు** విశ. గొప్పది, పెద్దది. (శ. ర.)

జ: ఒజ్జుబీజము.

**ఒట్టె(ట్టీయ)** విశ. లొంగనిది. (అపు. మొ.)

ద్వి. ఒట్టెయై తన క్రేపు నొల్లకపోవు, కుట్టికి తేఁగ పైఁ గూర్మిఁ బుట్టంతు. నవనాథ. 1. 40. పా. 3. పం.

**ఒలపక్షము** మి వి. పక్షపాతము.

క. ఖలవృత్తి మత్తనూజల, నొలపక్షము చేసి వరున లోఁగక కోకా, కులితలఁగాఁ జేసి వచంచల చిత్తుఁడ చెడు మటంచు శపయించుటయున్. వరాహ 7, 50.

**ఒలయించు** స. క్రి. (√ఒలయు) ఒలయఁజేయు. (కలిగించు.)

క. ఒలసి మనోవాక్కాయంబుల ద్రోహభావమఖిలభూతముల యెడం, గలిమి విను శీల మదిమే,లొలయించును దాన నల్ల మూన్నము పుత్రా. భార. శాం. 3. 147.

(నిగుడ్చు)

సీ. ప్రాక్సపత్నిఁ గరంచుభర్తఁ జూచి ప్రతీచి యొలయించు వేఁడి నిట్టూర్పుగమియొ. కృ. శకుం. 1. 30.

**ఒలయు** – పొలయు. అ. క్రి. 1. ప్రవేశించు, చొచ్చు.

క. వారిజనాభుని తేజం, బారాత్తముని యాత్మయం దొలయఁగ ఘోరారిజయ హేతుభూత,స్ఫారవికాస మయి యతని భావం బలరెన్. హరి. పూ. 2. 80.

క. సతిబుతువిష్కరనంబును, బతికేతో బీజ మందఁ బరతోకసమా,గతుఁడై నయట్టి జీవుం, డతిఁ యమున వాయుభూతుఁడై యం దొలయున్. మార్క. 2. 52,

2. వ్యాపించు, ప్రసరించు.

సీ. సామంత మండనోద్దామ మాణిక్యాంశు మండలం బొలసి యీరెండ గాయ. మనుచ. 1. 12. హంస. 5. 370,

3 వీచు, విసరు.

క. మృగమదసౌరభ విభవ.ద్విగుణిత ఘనసార సాంద్ర వీటీ గంధ,స్థగితేతం పరిమళమై, మగువపొలుపు దెలుపువొక్కమారుత మొల సెన్. మనుచ. 2. 24. ఆము. 5 103.

4. అతిశయించు.

గీ. దర్వ మొలయ నాలీఢపాదమున నిల్చి, మండలీకృతచాపుఁడై మన్మథుండు. నైష. 2. 119.

5. కలుగు, జనించు, సంభవించు.

ఆ. ... సునిష్ఠమై నుపవాస,మున్న వివిధ శుభము లొలయునండ్రు. భార. అను. 4. 147.

సీ ....మాంసములచవి మఱగినవారికి మూన వశమె, యట్లుగాకయు సుకాంక్షునకు బల మొలయు నధ్వరశాంతుఁ డుల్లసిల్లు. భార. అను. 4. 304.

శా. శోణీనాయక యెంత తామసగుణస్థుండైన చో సద్గుణ,శ్రేణి నిర్మించినవారిపొం దొలసి నన్ జేకూరుఁ దద్భావముల్. ఉ. రా. 2. 282.

6. సంచరించు, తిరుగు.

గీ. చిలుకగుంపులు గండుఁగోయిలలగములు, నొలయఁ జాలక చెట్లనె యొదుఁగఁ జొచ్చె. చిత్రభా. 3 103.

7. ఉన్ముఖమగు, ఇష్టపడు.

సీ. చెప్పిన విని యుధిష్ఠిరుఁడు ప్రస్థానంబునకు మది యొలయ నన్నరునితోడ. భార. మహా. 4.

8. ఉండు, వర్తిల్లు.

సీ ఒకయింతి కెదురుగా వొలసినాఁ డొక్కడ నన్యోన్యముఖములై యంత్రము లొప్పె. భాగ. 10. పూ. 1028.

9. వ్రాలు, పడు.

చ. పరిసర చంపక ప్రసవపంక్తులఁ బుట్టినవెట్ట వాసనల్, గరిమము లై పయింబొరయ గా సిలివచ్చుమదాళిసీపర..పరిలు భవత్పదాబ్జ ములపై నొలసెన్ దము నొంచుచంపకో, త్కరముల నీజిగిన్ గెలిచి కావఁగదే యని మ్రొక్కు కై పడిన్. ఉ. రా. 6. 43.

10. వ్రేలాడు.

వ. .... దుశ్శాసనకరాకృష్టవికీర్ణ వేణీభరంబు వెనువెంట నొలయం బాంచాలి పంచపర్వ తంబులు నడిమినదియుంబోలెఁ బతులనడుమ భయవ్యాకులితచిత్తయైన.... భార. అర. 1. 107.

11. కలయు, కూడు.

గీ. ఒలసి నీపుత్రు లెల్ల నొండొరులతోడ, నె ట్లొడంబడి యుండుదు రట్లు చేయ, వలయు ...భార. సభా. 2. 181.

క. అలఘులు రైభ్యభరద్వాజులు దమలో సుహృదులై విశుద్ధతపోని,శ్చలితమతు లివ్వ నంబున, నొలసి తపం బొప్పఁ జేయుచుం డిరి నెమ్మిన్. భార. అర. 3. 153.

12. స్ఫురించు, తోఁచు.

(సూతాత్మజుఁడు)క. మనమునఁ గుంతీవాక్యం, బున నొలసిన నేయుటుడిగిపోయి కదిసి న, వ్వున మెం మొప్ప... భార. ద్రో. 4. 288.

గీ. మోక్షపరులు శుచిస్థానముగఁ బ్రశంస, నే యుదురు విజనత్వవిశేష మెఱిఁగి, కాన నింపై శ్మశానంబు మానసమున, నొలసెఁ గావున నయ్యెడ ననికి గలిగె భార. అను. 4 437.

13. ఒప్పు, ప్రకాశించు.

సీ. తూలుతీఁగెలవెంటఁ దూఁగుతేఁటులు వోలె వసదువెన్నడుముల నారు లొలయ, ఉ. హరి. 5. 276.

సీ. శివుఁ డుకారేశ్వర శ్రీమహాదేవుఁ డై దాత్మస్వరూపంబుఁ దాల్చి యొలసె. కాశీ. 6. 251.

వ. క్రి. 1. కదియు, సమీపించు.

గీ. ఒలసినను నెట్టనరునైనఁ గులము దెలియఁ, బ్రభుత నెడి వల్లవుఁడు వేదవడిన నేర... వలఁతు లస్మద్మముఖులు. అము. 1. 60. వావిళ్ల. పా—'పొలసినను యెట్టి' వేదము. పా.)

2. పొందు.

ఆ. సహజకఠిన కోశ సంవృద్ధితోడన, చాలవృద్ధి నొందువారికేళ, ఫలముమాడ్కిఁ గోశ పంజరంబున జంతు, వుండి దానితోన యొలయు వృద్ధి. మార్క. 2. 55.

మధ్యా. తిలలందుఁ దైలంబు కాష్ఠములయం దుఁ దిరముగా నగ్ని,గలుగు టెఱిఁగి యుపాయపూర్వమునఁ గడఁగి తత్సిద్ధి, యలయక యుత్సాహవంతుఁడు వడయున ట్లనుత్సాహ, మొలసి దైవపరుఁ డది వడ యంగను నోపునె యెందు. భార. అర. 1. 284.

3. తాఁకు; స్పృశించు.

చ. ...అంప పెన్నెలగతి మూగతిన్ వెనుకఁ జిక్కక మానదు తప్పిదారి వెన్నొలసినఁ దారు వెన్నెఱుఁగ కుండుట నొత్తెము పాదికోటకంచు...అము 2. 27.

చ. కొలువున కేఁగి రామనృపకుంజరుపాద యుగంబు మస్తకం, బొలయఁగ మ్రొక్కి ఉ. రా 7. 172.

4. అభిలషించు, కోరు.

గీ. ...వసిష్ఠుండు దానిఁ దలఁచి,కడుఁ బ్రశాంతాత్ముఁ డయ్యు రాక్షసవినాశ మొలసి మనుమని వారింపకుండె నంత. భార. ఆది. 7. 149.

ఉ: ఒలయించు.

**ఒలవి** వి. ఔన్నత్యము, ఎత్తు

(సేతువు) ద్వి ... మలయ సువేలాచలముల, యొలవి నెంతయుఁ జూడ నొప్పు వహించి. రం. రా. యు. 816. పా. 18. పం (ప్రయోగాంతరము లేదు.)

**ఒలవు** అవ్య. మిక్కిలి.

చ. చెలువ య దేమి యూమగువ చిత్రము వందు నృసింహాభూవరుం, గలయ లిఖించు

వేళఁ బులకంబులుఁ గ్రొంకెమరుం దలి
ర్పఁగా,నొలవు వడంకుచున్నది సముజ్జ్వల
మైన నృపాలరూపమున్,వలపులు రేఁచు
చున్న రతి వల్లభురూపని భీతిఁ జెందెనో.
వ:స 2. 148. (ప్రయోగాంతరము లేదు.)

**ఒలి** వి. (√ఒలుచు) ఒలువు, దోఁపుడు, అపహారణము.

క. మొలకలు రాజకుమారులు, తలిదండ్రులు లేని వారు దయ కర్తలు భూ,తలమునఁ గల ప్రజలందఱు, నొలిచిన నొలి వాడె దరు...జై. భా. 1. 63.

**ఒలికి(ల్కి)** వి. చితి, సొద; చితిపేర్చెడుచోటు, కాడు, శ్మశానము.

ద్వి. అత్తఱిఁ గమరుఁగం పడర దిక్కులను, మొత్తమై నిగుడు క్రొంబొగల నంతంత, మండునొల్కులఁ జేరి ... ద్వి. హరిశ్చ. ఉ. 1623.

ద్వి. ఒలికిలోపలిబూది ... ద్వి. హరిశ్చ. ఉ. 2276.

ఆ. ఊరి మండనొల్లఁ డొలుకులలోఁ గాని, యెనసి హాయము నెక్కఁ డెద్దుఁగాని, చెలువ యేమి చెప్ప సిగ్గయ్యెడును నాకు, వెఱ్ఱివాఁడు శివుని వినవె చెపుమ. వీర. 2. 274.

ఊ: ఒలకులమిట్ట.

**ఒలికించు** స. క్రి. (√ఒలుకు) ఒలుకఁ జేయు. (క్రక్కు)

సీ. వటువిషం బొలికించుపాములతో నైనఁ జెలఁగి యుంపుఁగఁ జెల్మి సేయవచ్చు. మొ. రా. యు. 1. 25.

**ఒలిదామర** వి. (ఒలి+తామర.) ఒకానొకచెట్టు. (శ. ర.)

**ఒలియు** అ. క్రి. (త. ఉరి) 1. (చర్మము. మొ.) ఊడివడు.

క. వదలక పెనఁగి పదుండ్రం, బదియేవుర నొక్కపెట్ట పట్టి ధరిత్రిన్, జెదరఁ బడవైచి పవనజుఁ డదయుం డయి వీఁపు లొలియ వందఱ నీడ్చున్. భార. ఆది. 5 165.

2. (చర్మము, మొ.) ఊడు. (చూ. ఒలుచు.)

ఊ: ఒలి, ఒలిదామర, ఒలుచు, ఒలువు

**ఒలుకు(ల్కు)** అ. క్రి. (త. ఒళుకు.) 1. స్రవించు, కాఱు.

మ. ... మహాదేవా ని,ర్గత సాంద్రారుణపూర మొక్క మొగి నొల్కన్ ... భార. ఆది. 2. 24.

గీ. ఉచ్చిపోయిన యేటుల నొలుకుశోణి,త మున సర్వాంగకంబులుఁ దడిసి .... భార. ఉద్యో. 4. 321.

2. వెడలు, వెలువడు; కనఁబడు, వ్యక్తమగు.

గీ. వదనముల మంట లొలుకంగ ముదిసినట్టి, జంబుకంబులు కొఱవిదయ్యంబులట్లు, బెట్టు రాత్రులు కూఁతలఁ బెట్టుచుండు. వి. పు. 2 48.

క. వెయ్యాఱులు తనయుడిగవు, టొయ్యారులు గొలువఁ జెలువ మొలకఁగఁ గొలువై ...సాం,గ 1. 136.

3. రాలు; చిందు, చెదరు.

చ. ...పలికె లతాంగి లేవగవుపల్కులఁ గప్రపుఁబల్కు లొల్కఁగన్. దశా. 7. 1, 107.

చ. కలశతనూజ యచ్చెరువు కాశిక యం దొక శంభులింగమున్, దిలలను నక్షతంబులమ ధీనిదియొక్కఁడు పూజచేసి పో,నొలికినవాని మేయుటకు నోలిఁ బ్రదక్షిణ మాచరించి చి, ట్టెలుక శరీరముం దొఱఁగ కెక్కెనుబో రజతాద్రికూటమున్. కాశీ. 6. 257

4. తొలఁకు, తొనఁకు.

చ. .. శంఖ మొత్తినన్.

చ. చినిఁగె దిశల్ నభం బవిసెఁ జిందఱ వందఱయై గ్రహస్థితుల్, చనియె వియజ్ఝరం బొలికె...శశి. 2. 132, 133.

స. క్రి. 1. చల్లు.

వ. మునివరుండు హుంకారంబున రాక్షసు వారించి వానిపయి మంత్రపూతంబు లైన కమండలుజలంబు లొలికిన.... భార. ఆది. 7. 125.

(విరటుఁడు.) గీ. ... విప్రులును వనితా జనంబు, నేసలొలుక సింహాసనాసీనుఁ డయ్యె. భారం. విరా. 5. 232.

2 వెలువడఁ జేయు.

ఉ. ఎవ్వఁడు పెల్చఁబ ల్కొలుకు నెంతయు నమ్మునితారకంబుల, దెవ్వనిరూపు దోఁపదు ...వారనాయుషుల్. మార్క. 3. 352.

వి ఒలుకుట. (చూ. ఒలుకులువాఱు)

ఒలుకుఁబప్పు – ఒలుపుఁబప్పు. (శ. ఒళకు)

మ. ...చిక్కుడుబట్టల్ మొదలైన శాకములు నొల్కుంబప్పు లొడ్డింపఁగన్. రా. వి. 2. 100.

జః ఒలికించు ఒలుకులువాఱు.

**ఒలుకులమిట్ట** వి. (√ఒలికి) కాడు. (శ ర.)

**ఒలుకులువాఱు** అ. క్రి. (√ఒలుకు) ఒలుకు.

వ. ఎదుటఁ జిత్ర శిలాతలంబున బ్రహ్మావర్త సం బొలుకులువాఱ నతినియతిం దపంబు సలుపు చున్న సత్యతపునిం గని...వరాహ. 12. 43.

**ఒలుచు(ల్చు)** స. క్రి. √ఒలియు–(చర్మము, బట్ట, పొట్టు, మొ) ఊడఁదీయు, ఊడుచు;

ఉ. ...శివదూషకునాలుక గోసి యుప్పు నిం, పుండు...దురాత్మచర్మపట మొల్వఁడు ....కు. సం. 2. 217.

గీ. అన్నదమ్ములు నెత్తంబులాడి సతులఁ, దలలు వట్టి సభాస్థలంబులకు నీడ్చి, చీర లొలిపింతురే...భార. ఉద్యో. 3 367.

ఆ. ...రాజుఁ బెద్దదొరలుఁ, జీర లొలువఁ బడిరి...భార. విరా. 5. 222. (చీరలొలువఁబడు – ఒలువఁబడినచీరలు కలవారగు.)

సీ. ...ఒలిచినపప్పు సద్యోఘృతంబు. ఘటికా. 2. 16.

2. (మనుష్యులను) దోఁచు; (ధనాదులను) అపహరించు.

సీ. ...వారలవాయి గొనక యప్పులుకులన్ని యును రజ్జులుగఁ గొనుచుఁ, జాములనచట నచ్చట నొల్చుకొనఁగ నాలోకించి యవ్వీర లోక వరుఁడు గీ. గాండివం బెక్కువెట్టి... భార. మౌ. 185.

గీ. సాతుఁ గూడి చనంగఁ దస్కరులు దాఁకి, నలుగురం బట్టి ధన మెల్ల నొలిచికొనిరి. కాశీ. 7. 250.

3. పెఱుకు, పెల్లగించు.

చ. ఖరతర వజ్రతుండములు కన్నుల నొల్వఁగ నార్తి నొందుచున్, బరవనితాధనావహుల పైఁ దమకంబునఁ జూడ్కు లిడ్డదు,ష్పు రుషు లఖర్వదుఃఖములఁ బొందుదురు ... మార్క. 5. 90.

ఒలఁబడు. (ఒలువన్+పడు) – ఒలుచుకొనఁబడు, అపహరింపబడు; దోఁపుడుపోవు.

సీ. ఒలఁబడ్డ నెపమునఁగలతేనిసిరిఁ జెప్పి చుట్టలపై దాడివెట్టువారు. ఆము 6. 85. ('ఒలివడ్డ' అని శ. ర. వ్రాఁతప్రతి.)

**ఒలువ** వి. కవిత్వదోషములలో నొకటి.

ద్వి. తలవిరు పసమగ్రత శిథిలబంధ, మొలువ బంధంబు గ్రామ్యోక్తి కంటకము. పండితా. దీక్షా. 5. పా. (ఒలువ బద్ధంబు, వ్రాఁత ప్రతిపాఠము.)

**ఒలుపు(ల్పు)** వి. (√ఒలుచు) ఒలుచుట

ఒలుపు(ల్పు)ఁబప్పు - పొట్టుతీసినపప్పు, చాయపప్పు.

వ. ....ఒలుపుంబప్పు మాఱిణ్డును...(108ల. ద. శా. 1114.

ఉ. ...చిఱుతొండనంబి దై,వాఱెడుభక్తిఁ బెట్టు శివభక్తుల కర్థిఁ జతుర్విధాన్నముల్, తారని యొల్పుఁబప్పునుఘృతంబును దియ్యని పాయసంబులున్. హర. 2. 41. (ఇట 'ఒలుపుపప్పుతో వండినసూపము' అని భావము.)

**ఒలె** – ఒల్లె. వి. చీర, బట్ట, వస్త్రము.

సీ. ....దుద్దు పెట్లకుఁ గాఱుచునె యొలె ల్లైవమవారు. ఆము. 6. 77.

**ఒల్లఁబాటు** వి. (శ. ఒల్లామై – ఒల్లమి+పాటు. అని శ. ర.) ఒల్లమి. అపేక్షింపమి; ఉపేక్ష, నిరసనము.

అ. ...నాకు, నీవు చెప్పు మేది నీప్రాణముల యందు,నొల్లఁబాటు నీకు వొలయఁజేసె. మార్క. 8. 60.

మ. ...పుణ్యాపుం,జనికిం దప్పుఁగఁ గాయుచుఁజ మెలఁగఁగా శామిమ్మెయిం బోయె శేఁ,

దును నుల్లంబున నొల్లఁబాటొలసె నెట్లుం
బూని యుమ్మెపయుఁ. హరి. ఉ. 6. 182.
వి. అనపేక్షితము, ఉపేక్షితము.
సీ. యాగాదిదుర్లభం బైనదేవత్వంబు నీకొల్లఁ
బాటయ్యె నేఁడు చూడ. నైష. 4. 74.
సీ. ఒడల రోగంబు లే దొల్లఁబా టెట్లు నీ
కయ్యెఁ బ్రాణము లన్న హరిణి యనియె.
మార్క. 5. 88

**ఒల్లఁబుచ్చు** స. క్రి. (√ఒల్లఁబోవు) ఒల్లఁబోవఁ
జేయు.
(మూర్ఛిల్లఁ జేయు.)
ఆ. ఒక్కమాటు గముల నొక్కటఁ జెండాడు,
నొక్కమాటు సురల నొల్లఁబుచ్చు, వీర
భద్రుఁ డమ్మ వే ఱెవ్వరని పోల్పవచ్చు
నతని పోల్పవచ్చుఁగాక. వీర. 4. 182.

**ఒల్లబోఁక** వి. (√ఒల్లఁబోవు) అనాదరము.
ద్వి. మెల్లనఁదా వచ్చి మెచ్చి నా కీక, యొల్లఁ
బోకలు సేసె నొల్లఁబో నిన్ను. రం. రా.
అర. 154 పు.

**ఒల్లఁబోవు** అ. క్రి. (ఒల్లమి+పోవు. శ. ర.)
1. మూర్ఛిల్లు; (దుఃఖభయాదులచే) వైక
ల్యము నొందు.
ఆ. అడ్డపడి గురుండు దొడ్డనారసము వక్షంబు
దూఱ నేయ సవ్యసాచి, యొల్లఁబోయి తెలి
సి పెల్లేసె నక్కుంభజన్మమీఁద నిశితసాయ
కములు. భార. ద్రో. 3. 63.
చ. ....కులిశ ప్రహతాచల రాజశృంగముఁ.
బలెనతఁ డొల్లబోయి యిలపైఁ బడియెన్
బడియ న్నిశాచరుల్. ఉ. రా. 3. 248.
గీ. ఇట్లు ప్రార్థించి పాంచాలి యెట్టకేని,
సింహబలు మందిరం బల్లఁ జేర నరిగి,
యొల్లఁబోవుచు బెబ్బులి యున్నపొదరు,
సొచ్చు లేడిచందంబునఁ జొచ్చుటయును.
భార. విరా. 2. 112.
శా. ... వెడలె నుర్వీజాతచిత్తంబు రాఁ, గిల్లం
జేయుచు రామభూవిభుఁడు సాకేతంబు
సాకేతమై, యొల్లంబోవఁగఁ జూచు పౌర
సుజనవ్యూహంబు లాహా యనన్. చంద్రా.
1 24.

2. వాడు, మ్లానమగు.
గీ. మెండు మీఱినపగటి పేరెండ దాఁకి, యొల్లఁ
బోయిన లేబొండుమల్లెపొదల. ఆము.
2. 56.

**ఒల్లగిల్లు(లు)** అ. క్రి. పోవు, తొలఁగు.
మ. పతిచూపున్ సతిచూడ్కియుఁ సముగతిం
బ్రస్ఫీతరాగంబులై, ధృతి వాయం బయి
లోట యొల్లగిల నుద్వేగం బఱన్ హ్రీపరి,
చ్యుతి వాటిల్లఁ బరస్పరాంగములపై
నొందొండ బ్రాఁకంగ...హరి. ఉ. 3. 85.

**ఒల్లన** క్రి. విశే. ప్రయో. (త. ఒల్లైన – వడిగా) 1.
తిన్నగా, బుజువుగా.
క. వల్లవకాంతలు దనకథ, లెల్లను బాడంగ
నీరజేక్షణుఁ డంతన్, వల్లవబలసంయుతుఁ
డై, యొల్లన గోష్ఠంబు సేరె నుర్వీనాథా.
భాగ. 10. పూ. 9. 27.
2. వడిగా. వేగముగా.
ద్వి. చల్లనిజలము లచ్చటిగుంటఁ ద్రావి,
యొల్లన మరలి యాయుర్వీరుహంబు, నీడఁ
గొండొక సేపు నిద్రించి... ద్వి. హరిశ్చ.
ఉ. 1803.
3. అధికముగా, మిక్కిలి.
వ. ...చెడిపజవరాంద్రం గని తమజవరాంద్ర
నెదలం దలంచి యొల్లన నుల్లంబులు దల్ల
డిల్ల నున్నఁ గని సౌమ్యసిలం బాఱు తెరు
వరులును....నీలా. 3. 10. వరాహ. 4. 11.

**ఒల్లమి** వి. (√వలచే.) 1. ఇచ్ఛగింపకుండుట.
వ. భ్రూవల్లరివేల్లనవి కారంబు చూచి యప్ప
ల్లవాధర యితని నొల్లమి యెఱింగి....
నైష. 5 38
క. అ తఱి దల దుఃఖ గడుఁ, వింతలు సింగా
రములు ప్రవీణతఁ జెలు లా, కాంతకుఁ
జేసిరి లజ్జా, కాంతత నొల్లమి నటింపఁ
గాఁ దమబలిమిన్. కళా. 7 9.
2. అనాదరము.
ఉ. ఒక్కొకవేళఁ బద్మముఖు లొల్లమి సేయు
దు రొక్క వేళఁ బెన్మక్కువ నాదరిం
తురు తుచ్ఛచేష్టలుల్ జనవాంఛ్ర చిత్తముల్.
మనుచ. 3. 69.

3. రోంత.

క. కూరిమి విఱిగినసతిపై, నేరమి దో మగతి విషయనిస్పృహమతియై, కోరిక లుడిగిన వానికి, నూరక విశ్వంబుమీఁద నొల్లమి పుట్టున్. కవిక. 5. 151.

**ఒల్లియ**(ల్లె) వి. వస్త్రము, బట్ట; చీర.

ఉ. శృంగము లేని నీలగిరి చెల్వువఁ గ్రీడి కిరీటహీనుఁ డయ్యుం గమసట్లు వెల్లతలయొల్లియ మౌళి దృఢ బుగా నను,ర్చె గురునాథ ....భార. కర్ణ. 2. 327 (తలయొల్లియ—తలగుడ్డ, పాగ)

గీ. పలిపయొంటొల్లెతో మఁస్థలులఁ గూర్కు. ప్రియల...అము. 2. 61.

**ఒల్లెంత** వి. మత్స్యవిశేషము (శ. ర.)

**ఒల్లెవాటు** – వల్లెవాటు. (శ. ర.)

**ఒలువు** – ఒలుపు

చ. చిరముగ నొల్వువడ్డ నరసింహునిక ం బెను బెద్దపే శిరం,బురలఁగ నాటువడ్డ జలజో దృవు కంఠెను బెద్దవే... కు. సం. 4. 432. (ప్రయోగాంతరము మృగ్యము.)

**ఒళగు** – ఒళవు[1] వి. (క. ఉగు) వీణాదండము, ప్రవాళము.

ఆ. చారుమౌర్వి లేని చాపదండమునోజ, లలితతంత్రి లేనియొళగుఁబోలె. భా. రా. అర. 2. 255.

**ఒళవరి** విశే. (ఒళవు[2] + అరి) మర్మజ్ఞుఁడు. (శ.ర.)

**ఒళవు**[1] – ఒళగు

ఆ. తివిచి చూడ లేదె గవుసెన యొన్నండు, నొళవు దుమ్ము గప్పియొప్పు దాఁగి, తంత్రు లూడి విన్నఁదన మొందె నిది యేమి, మహతి యున్న యునికి మౌని చంద్ర. కకు 2 45. చంద్రికా 2. 95.

**ఒళవు**[2] వి. 1. మర్మము, రహస్యము.

వ. ...ఇయ్యొళవు సకియలకుం జెప్పకు మని రాచిల్కకుఁ బ్రియంబు సెప్పుచు ... విజ. వి. 2. 200.

2. రహస్యవార్త.

సీ. నునుమోవిపై కెవి మును బింబనికురంబముల కేఁగురాచిల్క కొళవులియ్య...గీ. అచటికేతెంచె నొక చకోరాయతాక్షి. కువల. 4. 136.

జ: ఒళవరి.

**ఒళ్లు** – ఒడలు, వి. దే. శరీరము, మేను.

ఉ. అలని చెక్కు లేఁ జెమట లప్పటికిం బొడమంగ నిక్కు చొ,ప్పారని మేని ముత్పులక లగ్గలమై యుదయింప బ్రామనుపా,టాలని చూడ్కి వెండియును నన్నున పోల రతాంతతాంత యొ,ళ్లారక మున్న వచ్చి యొకయంగన చూచె నరేంద్రచంద్రునిన్. కవిక. 5. 156. (శ ం. పా.)

(చంద్రోపాలంభము) ఉ. ... ఒళ్లు పెద్దవాఁ డెక్కటి దేవి మిండఁ డనుటెల్ల యథార్థము పాండురాంగకా. రా. వి. 4. 55.

ఉదా : చెడఁద్రాగి వాఁడు ఒంటిమీఁద గుడ్డ ఉన్నది లేనిది యెఱుఁగకుండ మన్నాఁడు. వానికి తిన్న అన్నము ఒంటఁబట్టుటలేదు.

**ఒళ్లుపెట్టు** అ. క్రి. (ఒళ్లు + పెట్టు) బలియు.(శ. ర.)

**ఒవ్వమి** వి. (√ఒవ్వు[1].) 1. గిట్టమి, ద్వేషము.

ఉ. ఎవ్వతనేని ధాత సృజియించెఁ దగన్ మగవానిఁగాఁగ నా,కొవ్వమిఁజేసి యట్టినిను నుగ్గలి నేయఁగ నొల్ల నావయిం,గ్రొవ్వెసలారఁ నీవు శరకోటి వెసం బరఁగించితేని నే,నవ్వుదుఁ గావి కోపము మనంబునఁ బుట్టదునూ శిఖండినీ. భార. భీష్మ. 3. 322.

క. ఒవ్వమిఁ గొంపులకుఁ గడు,దవ్వయి మఱి విప్రవేషధారులమయి మ,మ్మెవ్వరు నెఱుంగకుండఁగ, నివ్విధమున మన్న నెట్టు లెఱిఁగిరి కిరిల్. భార. ఆది. 7. 217.

2. దోషము, తప్పు.

ఉ. నవ్వులు గావు నేఁడు వదనంబున విన్నఁదనంబు హేతుకం,బెవ్విధి సంభవించె నిటు లెవ్వరు నీ కహితమ్ము చేసి రే,యొవ్వమి లేదు నావలన నొక్కయెడన్నము నుజ్జగించి నీ,విప్పవవీథి నివ్వటిల నేమి కతంబు నితంబినీమణీ. కృ. శకుం. 2 85

**ఒవ్వు**[1] – ఓవు. అ. క్రి. (క. ఒప్పు – దీనికి వ్యతిరే

కార్థమునసే ప్రయోగములుగలవు.) అనుకూ లించు, సరిపడు. గిట్టు.

సీ. ...కూర్చువా రొవ్వఁడుండు వా రని తనకు నెవ్వరును గల్గక త్రివర్గేచ్ఛ యొవ్వనిచేత నీడ విడువఁ, గీ. బడు...భార. అశ్వ. 1. 203.

ఉ ఒవ్వనివారు నవ్వ మహిమోదధి ధర్మ సుతుండు దీనికి,న్నెవ్వగఁ బొంద... భార. విరా. 2. 286. (ఒవ్వనివారు—పగవారు)

**ఒప్పు²** అ. క్రి. చెడు, పాడగు

గీ. పాడువు నిడుదయు నై కడుఁబొలుచు నితని, ముక్కుతుద యంతయును గడు నొక్కువడియెఁ, గుసుమముకుళసన్నిభర దాంకురము లింత,కంది యొప్పెడునే దైవ ఘటన యకట. మార్క. 1. 256.

**ఒప్పు³** వి వరి మొదలగు వాని పన. (గ్రా.)

**ఒసఁగు, ఒసవు** స. క్రి. 1. ఇచ్చు.

ఆ. అఖిలరత్న పూర్ణ యగువసుంధర యెల్ల, నొసఁగి తేని యొసఁగు యోగ్యశాలి, యుక్తి లేని వాని కొసఁగకుమీ విద్య, తగిన పాత్ర మైనఁ దడయకిమ్ము. భార. శాం. 6. 66.

ఉ ...పిన్నబిడ్డలన్. వెన్నుఁడు మెచ్చి యెన్నఁ డొసవెజ వరముల్ వినువంటివారికిఁ. వి. పు. 2. 50.

సీ. .. డాచేత మణికమండలు వొసంగి. పారి. 5. 56.

2. అర్పించు.

గీ పాక మొనరించి వడ్డింప భవునకొసఁగి, కుడుతు...హరి. 2. 53.

క. ... పరలోకసుఖా,దరపరితం జనిన తల్లి దండ్రుల కొసఁగెన్, గురుభక్తి నిగుడు కొడు కతి,కరుణామతి గంగ నస్థి గయఁ బిండంబున్. పాండు. 2. 26.

3. కలిగించు; భావించు, చేయు.

సీ. తనబాహుపీఠంబు ధరణీభృత్కమఠాహిసా మజంబులకు విశ్రాంతి యొసఁగ నైష. 5. 3.

వ. ప్రావృషేణ్య పయోవాహగర్జాగంభీరం బై నప్వరంబున నింద్రకీలగిరిగహ్వరంబులు ప్రతిధ్వని యొసఁగ....హర. 7. 49.

4. అధీనముచేయు ఒప్పగించు.

క. మొన యంగవకా కటకట, మొనయం గన కాద్రిదరుఁడె ముదిత నువవనా,తనువవనా హతి కొసఁగక, తనువవనా మదన నీయుదం చిత కరుణా. వసు 3 176.

వి. 1. ఈవి.

(నేమ)కా...మేయొసఁగుఁ దపి...అము 6. 87.

2. బహుమానము, కానుక.

గీ. ...అబ్రపడుమఁ,జూచి సామాజికులు తమ సొమ్ము లెల్ల, నొసఁగులుగ నైవ నడు పుచు నొప్పు మీఱ,రుక్మిణీసుతుండు మాయా నిరూఢి మెఱసి. ప్రభా. 4. 101.

సీ. జక్కిడిగతుల నొసంగు లంది. ప్రబంధ. 110.

క. అని వాని నరిది యొసఁగుల,నినిపి గృహంబు నకు వచ్చి... చంద్ర. 2. 14.

**ఒనపరి** విశ. సుందరి; సుందరుఁడు, సుందరము, మనోహరము; విలాసవంతము.

క. నీ కాయొనపరి దగు నని,కై కోఁ జని విగ్ర హై తి భరుఁ డంత మదీ,యాకృతిఁ గనలి బలాన్వితుఁ,డై కదలి తదీయవిశిఖహతిఁ బడె నమడున్. చం. రా. 5. 54. నైష. 6. 133.

క. ఒనపరి వడకలు మృదుసా, రసవిసరవిజేత లగు కరంబులు గంధో,ల్లసనము కొమ్ములు నమ..గ.. గ సుమాస్త్రనిమదవు చేసఁగుల గతిఁ దెలువల్. వేం పంచ. 4. 143.

ద్వి. యోగవాగలు మెట్టి యొకపాద మూఁది, బాగుగా నొనపరికాగు నటించు, నా దేవ దేవుని నానందమూర్తి, మోదంబుతోఁ జిత్తమున నిల్పి మ్రొక్కి. ద్వి. హరిశ్చ. ఉ. 136.

జ: ఒసపరికాఁడు, ఒనపరితనము.

**ఒనపరికా(గా)ఁడు** విశ. (ఒనపరి + కాఁడు.) విలాసవంతుఁడు; సుందరుఁడు.

సీ. చివురువాతెఱ రచ్చనేయుఁబో వేఱొరి
యొనపరి గాని పల్లొత్తుకెంపు. వేం. పంచ. 3. 2?9.

**ఒనపరితనము** వి. (√ఒనపరి.) అందము, చక్కఁదనము.
లయవిభాతి .. నొనలిపయి ముంగురులయొనపరితనంబునకు దెసలఁ బరువెత్తన్ ... బహుళా. 2. 55

**ఒసి** — ఓసి.
సీ ....ఒసి యోసి యనఁగఁ జేటి. గీ. భాది సంబోధనార్థమై యలరుచుండు. ఆం. భా. 3 72.

**ఒసుకు** వి. మత్స్యగ్రహణసాధనము
ది ఒసుకు గొరక పుణుకు సొక్కు లెసఁగుచుండు హంస. 4. 184.

**ఒసులు** అ. క్రి 1. సడలు.
(వ్యవ) కీళ్లు ఒసిలిపోయినవి.
2. తొలఁగు.
ద్వి. దెసదిక్కు నీవన నొసిలిపోవంగ, నసమాన మీకిది యర్హమే దేవ. పండితా. పురా. 150. పొ.
(వ్యవ) బట్ట ఒసిలిపోయినది.

**ఒహో** అవ్య. — ఓహో.
(ఆశ్చర్యార్థకము.)
ది, ఎంతదయగలవాఁడో సర్వేశ్వరుండో, హో యటంచును నిష్ఠతో నుండునంత. దశా. 1. 169.
(పిలుచుటయం దుపయుక్తము)
క. అతటిని వేత్రహస్తు లొ హోతుం బురుఁడా యటంచు నుచ్చైస్స్వరం ముద్ఘోషింపఁబడ్డ... కళా. 2. 72.
ఉ. వచ్చితి యింక నెదుఁ జనవచ్చు నొహో నిలు పారిజాతపాటచ్చరి...పారి. 5. 8. భాగ. 8. 371.

**ఒహోహో** — ఓహోహో అవ్య ప్రశంసాదులను దెలుపును.
(ప్రశంస)
క. ఎలనవ్వొలయఁగ నాతఁడు,కలయఁగ నవి చుట్టిపట్టి గంభీరపుఁ జే,తెలుఁ గొప్ప నొహోహో యని,పలుమఱు నెగురంగ వైచి పట్టుచు వేడ్కన్. ప్రభా. 1. 108

# ఓ

**ఓ** ఉభ. ఒకానొక యక్షరము.

**ఓ** అవ్య. (క. త. ఓ.) 1. సంబోధనము దెలుపును. (ఇది సంబోధ్యవాచకమునకు ముందే ప్రయోగింపఁబడును.)
ఉ. ఓనదయాత్మ సంయమి కులోత్తమ ... వరాహ. 7. 75.
(క్రిందికొన్ని యర్థములందు 'ఓ' — ఒ°.)
2. ప్రార్థనాదులను దెలుపును.
(క.) ప్రార్థనము.
ఉ. ఓ జనకాత్మజా దశరథేశ్వరుకోడల రాము భార్యఁ జూం,డో జములార యడ్డపడరో సురలార సురారికంచు... భా. రా. యు. 41.
(చ.) ఆజ్ఞ.
క. పాతాళమునకుఁ జనరో, వాతావను లెచటికేని వలపినయెడకున్, భూతము లేఁగరో యని య,త్యాతతగతిఁ జాటఁ బని నధిపతి దూతల్. కాశీ. 5. 274.
3. దేనినైనను విక్రయించుటకు చేయు ప్రకటనమును తెలుపును.
సీ. ఒక సుధాఘుటి నెత్తి ముంచి చల్లోచల్ల యంచును వనవీథి కరిగె నొకతె. దశా. 8. 1?5. విజ. వి. 3. 41.
4. ఆర్తిని దెలుపును.
గీ. ఒక్కదనుజాధముండు మొఱ్ఱో యనంగ, నమ్మఁ జెలఁగొనిపోయెడు నన్నలాన. భార. అర. 5. 177. (శ. ర. ప్రాంతప్రతిపాఠములు.)
5. పిలిచినపుడు మాఱుపలుకుటయం దుపయుక్తము.
క. వినుదఁట జీవులమాటలు, నమదఁట చనరాని చోట్ల శరణార్థుల కో, యనుదఁట

పిలిచిన సర్వముం గనుఁగొట సందేహమయ్యెఁ
గరుణావార్ధి. భాగ. 8. 91.

గీ. ఒకతె రూపసి గాకున్న నోసి యన్న,నో
యనెడు మాత్రమున కైన మండవలయు.
శుక. 3. 345.

శా. ఓ నావే ... దేవకీనందనా. ఉ. హరి.
2. 129. (ఓనావే — ఓయనివలుకవే.)

6. అప్రాచుర్యమును దెలుపును.

సీ. నృశరంకరుండ మాలిక లెన్నఁడో కాని ధరి
యించుఁ గప్లోరదామ మెపుడు. భీమ.
1. 115.

7. సందేహమును దెలుపును.

చ. అవనితలంబు వ్రస్సెనొ హిమాచలశృంగము
వ్రయ్యలయ్యెనో, శ్రవణవిదారణం బయిన
శబ్దము దా నిదియేమి యొక్కో భైరవ
మయి వించె...భార. సభా. 1. 212.

మ. .... ఆర్యామహాదేవియున్ నను రక్షింప
నెఱుంగునో యెఱుఁగదో నాభాగ్యమెట్లున్న
దో. భాగ. 10, పూ. 175.

8. ప్రశ్నమును దెలుపును,

చ. ...సమరంబె యొనర్చెదవో యిదేల యం,
చిపుడు జితోస్మి యంచు వచియించెదవో యి
దియేమి వాపుడున్. ఉ. రా. 4. 42.
దశా. 1. 67.

9. ఏమి. (కిమర్థకము.)

సీ. ఓ యన నేమి నా నొప్పుఁ గిమర్థంబు ...
ఆం. భా. 3. 70.

10. ఇత్వర్థకము.

మ. గృహసమ్మార్జనమో జలాహరణమో ...
నృపాగారి వాదము లేల లేరె యితరుల్ నీలీల
కుం బాత్రముల్. ఆము. 2. 91.

11. ఊహను దెలుపును.

వ. పరమోపకారియైన యీ బ్రాహ్మణునకు
నేమి ప్రియము సేయ సమకూరునో యని
చింతించు చున్నచో...భార. ఆది. 6, 240.

పీ. దీనివందులఁ దేనెసోనలు గూడియో మాధవ
శయ్యార్ధి మధుర మయ్యె. వరాహ.
12. 42. ఆము. 4 144.

12. ఆక్షేపమును దెలుపును.

ఉ. ఓ సరిపోయె నిల్వెడలకుండ నయో నను
రాణివానిఁగాఁ, జేసితో ... వేం పంచ.
1. 246.

13. నిరసనమును దెలుపును.

(వ్యవ) ఎవఁడో ఏమో అన్నాఁడని వీఁడు గడ
గడలాడుచున్నాఁడు.

14. పరిమాణాతిశయమును గాని సంఖ్యా
బాహుళ్యమును గాని తెలుపును. (ఈయర్థ
మున 'ఎంత, ఎన్ని' అను సర్వనామ
ములతోఁ గూడియే యుండును.)

శా. ప్రారంభించిన వేదపాఠమునకుఁ బ్రత్యూ
హమౌ నంచునో, యేరా తమ్ముఁడ నన్నుఁ
జూడఁ జనుదే వెన్నాళ్లనోయుండి చ, తూ
రాజీవయుగంబు వాఁచె నినుఁ గన్గో కున్కి
...పాండు. 3. 88.

మ ....నిన్నుఁ గని యెన్నాళ్లో కదా యంచు
వచ్చితివా యన్న కిరీటి కూర్మ కలదా
చెల్లెండ్రపై నంచు. . విజ వి. 2. 126.

(వ్యవ) వాఁ డెంతో దూరమున నున్నాఁడు.
వాఁ డెంత దూరముననో యున్నాఁడు.
నేనెన్ని తీర్థములనో సేవించితిని.
నే నెన్నో తీర్థములను సేవించితిని,

15. తుశబ్దార్థకము.

శా. ధేను గ్రాసము మాన్ప దోస మని సందే
హించినన్ సత్యమెం, తే నష్టం బగు నైన
నేమి మఱియున్ విత్తంగ యామంబులో,
నౌవన్నన్ ముసు లెల్ల మిక్కిలియుఁ నేఁ
డాఁ కొందు రీ ధేనువుం,దానో మానము
దప్ప మేసినది యింతం దోలెదన్ మెల్ప
నన్. వరాహ. 10. 39. (తానో — తాన
న్ననో.)

16. ఎట్లు, ఏమి మొదలగుపదములతోఁ గూడిన
వాక్యములం దుపయుక్తము,

క. ... ఎమ్మెన్మె,వ్రాలెదనోరిపు లెట్టులు, గూలె
దరో చూడు వాఁడుఁ గురుబల మెదురే.
భార ద్రో. 2. 350.

క. ... పృథా,సూనుల నెట్లు జయించెద,నో
నమ్ముము బాణలంబును గలితవంబున్.
భార. శల్య. 1. 22.

(వ్యవ) వాఁ డేమి చేసినాఁడో చెప్పుము.

17. ఒక. (ఒకశబ్దమున కియాదేశము ఈ క్రింది ప్రయోగమునందే కన్పడుచున్నది.)

శా. ఓ రాత్రిం గనురెప్ప వేయక మహోద్యోగంబునం దీరితా, ధౌరంధర్యము పూనుమానవునకుం దాత్పర్యవృత్తి న్సదాచారం బె ట్లొనరింప వచ్చు.... కాశీ. 5. 189. (ఓ రాత్రిని – ఒకరాత్రి యందైనను అని భావము.)

**ఓ** సం. వి. ఓ. పుం. బ్రహ్మ. (దీనికి తెనుఁగున వ్యస్తప్రయోగము లేదు.)

**ఓంకారము** సం. వి. అ. పుం. ఓమ్ అను ప్రణవాక్షరము.

**ఓండ్ర** వి. గాడిదకూఁత. (చూ. ఓండ్రపెట్టు)

జ: ఓండ్రపెట్టు ఓండ్రించు.

**ఓండ్రపెట్టు** – ఓండ్రించు. (√ఓండ్ర) అ. క్రి. (గాడిద) కూయు ఓండ్రించు.

క. మెండుగ నుత్థాపించిన, దండము గమనమున కెగ్గు దలఁపఁగ వీనుల్, బెండువడ నోండ్రపెట్టుచు, దుండగపుఖరంబు దన కెదుర్పఁబతేరన్. వేం. పంచ. 3. 58.

**ఓండ్రించు** అ. క్రి. – ఓండ్రపెట్టు. (శ. ర.)

**ఓఁక** వి. కరిమర్దము, పుల్లకలివె. (వృ. వి.)('వాకకాయ, వాకపండు' అని వాడుక.)

సీ. ఉదకంబు లూఱుట యోఁక పం డ్లేఱుక యేఱువసీమలో నేఱు దాఁటి. అప్ప. 2. 197.

జ: ఓఁకలివె.

**ఓఁకలివె** వి. (ఓఁక+కలివె.) పుల్లకలివె, ఓఁక. (వృ. వి.) (శ. ర.)

**ఓకణము** సం. వి. అ. పుం. – ఓకోదని.

**ఓకణి** సం. వి. ఇ. పుం. – ఓకోదని.

**ఓకము** సం. వి. అ. న. 1. ఇల్లు. 2. ఆశ్రయము, పట్టు. పుం; పక్షి.

**ఓకర** - ఓకిలి. వి. (సం. ఉద్గారః. ప్రా. ఒగ్గార. క. ఓకరికె. త. ఓంగారి.) 1. ఓకరింత, వమనము.

సీ. ఓకర బలిసెఁ జిట్టములనందడి మించెఁ గలఁకవాఱెఁ గపోలఫలకయుగళి. వేం. పంచ. 5. 6.

2. రోఁత. (శ. ర.)

జ: ఓకరించు, ఓకరింత.

**ఓకరించు** – ఓకిలించు అ. క్రి. (√ఓకర - క. ఓకరిసు.) 1. వమనము చేసికొను. 2. రోఁతపడు. (శ. ర.)

**ఓకరింత** వి. (√ఓకరించు) 1. ఓకరించుట, వమనము. 2. రోఁత. (శ. ర.)

**ఓకస్సు** సం. వి స్. న. 1. ఇల్లు, 2. ఆశ్రయము, పట్టు.

**ఓకిలి** – ఓకర. వి. (త. ఓక్కాళం.) 1. డోఁకు.

క. లోకములోపల మాయా, వ్యాకులచిత్తమున నన్ను నగములు గనరా, లోకింపఁ దలుచు వారికి, నోకిల్లికచు నెపుడు యోగం బనినన్. శివయోగసారము. 1 (చి. ని.)

2. రోఁత. (శ. ర.)

జ: ఓకిలించు, ఓకిలింత.

**ఓకిలించు** – ఓకరించు. అ. క్రి. (√ఓకిలి.) డోఁకు వమనము చేసికొను.

(భూతసమితి) సీ. పలలఖండంబులు పడఁతుక లిచ్చుచో నొల్లఁ బెట్టకు మని యోకిలించు. భా. రా. యు. 2216.

చ. సుదతిరో చూచితే వెస నశోకపుఁ గొమ్మదె నీవు దన్నఁ దు,మ్మెదరొద నోకిలింపుచు నమేయపికధ్వని బెట్టు మూల్గుచున్. చంద్రా. 4. 219.

అ. క్రి. స. క్రి. ఏవగించు, రోయు.

వ. అఖిల శౌచవిరహత్వంబున నెల్లరోఁతలకు నెల్లయై భృత్యు లవమానింపం బరిజను లపహసింప బాంధవులు ముక్కువిఱువం బుత్రులు వేసరం గళత్రం బోకిలింప నివి మొదలుగా వార్ధకదుఃఖంబు లనేకంబు లనుభవించి యంతమీఁద నత్యంతదుస్సహం బైనమరణం బనుభవించు ... కవిక. 5. 110.

చ. మనమున నోకిలించి...ఉ. హరి. 3. 14.

సీ. నాకలోకసుఖంబు నోకిలింపఁదుగదా కాశి లోపలఁ జావఁ గలిగినతఁడు. రుక్మాం. క. 55. (ఓకిలింపఁడు - ఓకిలింపనైన ఓకిలించుటకు అర్హమనియైన ఎంచఁడు.)

**ఓకిలింత** వి. (√ఓకిలించే - త. ఓక్కాళిప్పు. 1. ఓకరింత, డోఁకు,

ద్వి. ఓరున రాక బిట్టోకిలిం తొదవ,నోం మద్య పుఁగంపు మూల్కొనఁ బలికె. ద్వి. హరిశ్చ. ఉ. 1402.

చ. ...ఓకిలింతలు పొడనూపె వెల్మిడిఁ దినన్ మనసయ్యెఁ బయోజగంధికిన్. పె. శకుం. 3. 57

2. రోఁత, ఏవ. (శ ర.)

**ఓకు** వి. దుర్భిణి, దూరదర్శనయంత్రము. (బ్రౌ. మిశ్రనిఘంటువు.)

**ఓకుఁడు** నం. వి. అ. పుం. నృపలుఁడు, శూద్రుఁడు.

**ఓకులము** నం. వి. అ. పుం. సగముకాలిన గోదుమ రొట్టె.

**ఓకోదని** నం. వి. ఈ. స్త్రీ - ఆశ్రయమును తిను నది (బాధించునది) - కేశకీటము, పేను.

**ఓక్కణి** నం. - ఓకోదని.

**ఓక్యము** నం. విశే. (అ. ఆ. అ.) ఓకమునకు (నివాసమునకు) హితమైనది.

**ఓగాత్యము** విశే. అమంగళము. (శ. ర. వా.)

**ఓగితము** విశే. (నం. యుక్తమ్.) అర్హము, తగినది, పాత్రము

సీ. అటలు పసిబిడ్డయాటలై పెంపటి యొరుల యాటలఁ బడ నోగితముగ. గీ. అసుర చిత్తంబు గానఁగ వలవిగాక, సిగ్గువోయితి యచ్చర చెలువలెల్ల. నృసిం. 2. 90. (ఒరులయాటలఁబడనోగితముగ - పరుల నిందలు పడుటకు పాత్రము కాఁగా.)

ఉ. హాటగదేకవీర భవదంఘ్రికరాబ్జము లెందుఁ బోయె నే,రాజులు నోర్వలేనిబలుచిక్కను నోర్చినయట్టినీవు ని,స్తేజము నొంది యల్పు నిగళం గొలుమాలిన ప్రుక్కి మీఁద సీ, యోజ వనాథుపాటువడ నోగిత మైతె మదీయ వల్లభా. భోజరా. 5. 288.

**ఓగిరము** - ఓయిరము, ఓరెము, ఓవిరము. వి. (నం. ఆహారః త. ఓగర.) అన్నము, ఆహారము.

సీ. జీవితేశ్వరుఁడు డించినయోగిరంబులు గుత్స నేయక భుక్తిగొనుట తగవు. కాశీ. 2. 75.

సీ. ...యాగహవిర్భాగ మోగిరంబు. హర. 5. 19.

**ఓగు** వి. (వ్యతి బాగు) 1. కీడు

(వ్యవ) బాగోగులు.

2. ఒట్టు, శపథము. (పూర్వశాసనము లందు మాత్రమే యీ యర్థము కనఁబడుచున్నది)

వ. ఏము శ్రీపరాంతక దేవనిం గాగ ఓరిం (ఒరుని) గొలిచితిమేని మాయార్ణి వాని కిచ్చినవారము ఈ మార్గణము భీమేశ్వర మహాదేవసన్నిధిని సత్యముసేసి యోగుం గొంటిమి. దశా. 4. 1271, 1269, 1270.

విశే. 1. కీడైనది.

(వ్యవ) ఆపని ఓగైనది బాగైనది కూడ తెలియదు.

2. దుష్టుఁడు,

ఆ. ఉత్తమునికడుపున నోగు జన్మించి, వాఁడు చెఱుచు వానివంశ మెల్లఁ, జెఱకువెన్ను పుట్టి చెఱుపదా తీపెల్ల, విశ్వదాభిరామ. వేమన. 2. 2.

ది. ఓగు నోగు మెచ్చు నొనరంగ నజ్ఞాని, భావమిచ్చి మెచ్చుఁ బండితులు. వేమన. 1. 88.

జః ఓగులవాఁడు, ఓగులోడుచు.

**ఓగులవాఁడు** విశే. (√ఓగు;) అధముఁడు, నీచుఁడు.

గీ. పోరఁ దన కోడి పాఱునీహారరోచిఁ, బట్టుకొని పోయి దానవప్రభుఁడు పితికి,వారి కెల్లను నోగులవానిఁ గాఁగ, నుగముపై జీది నిట్టియచ్చొత్తి విడిచె. కు సం. 4. 87.

**ఓగులోడుచే** అ. క్రి. (√ఓగు)దేవురించు, దైన్యము నొందు (శ. ర.)

**ఓఘము** నం. వి. అ. పుం 1. సమూహము. 2. ప్రవాహము. 3. పరంపర. 4. ద్రుతనృత్యాదికము. 5. ఉపదేశము. 6. ఆధ్యాత్మికతుష్టిభేదము,సన్న్యసించి చిరకాలము సమాధియందుండుటవలనఁ గలుగు సంతుష్టి.

**ఓచేవాఁడు** వి. దుష్టుఁడు, దుష్టురాలు.

సీ. ఓగు దూబర తిండి యోచేవాఁ డవలక్షణము లాఁడు....హంస. 5. 118. (ఓచవాడు అని క్రొత్త ప్రతి పా.)

**ఓచెల – ఓచెల్ల.** అవ్య. (ఓ+చెలియల.) ఆశ్చర్య సంతాపాదులను దెలుపును (ఆశ్చర్యము.)

మ. కలుచం గోశబిలంబు వెల్వడి యదభ్రఖడ్గాహిపై వచ్చునోఁ, జలనం బించుక లేక యాతనిరిపుక్ష్మాపాల సంఘాత మో, చెల హస్తాంబురుహాంగుళీమయమహాసిద్ధౌషధీ వల్లి హా, చలముల్ మేసి భుజించు జా గళిసతన్ సంగ్రామరంగంబునన్. నైష. 5. 157.

**ఓచెల్ల** అవ్య. (ఓ+చెల్లెల) సంతాపాదులను దెలుపును)

(సంతాపము.)

క. ఓ చెల్ల విం హీణీవధ, మేచతురత నీకు.... మనుచ, 3. 86.

ఆ. అడుగ దలఁచి కొంచెము డిగితి వోచెల్ల. దాత పెంపు సొంపుఁ దలఁప వలదె. భాగ. 8. 568.

**ఓజ'** వి. (సం. ఓజస్, క. ఓజె.) 1. శోభ, కాంతి, వికాసము.

ఉ రాజనిభాస్య యోర్తు నవరత్న కిరీటము సంఘటించె ని, ర్వ్యాజమనోజ్ఞ మైనమహి వల్లభమూర్ధమునందు నప్పుడా, రాజముకల్ప శాఖకది రత్నమయం బగుపువ్వుగుత్తి పే, రోజ వహించి కన్నులకు నుత్సవముం బొనరించె నంతయున్. నైష. 6. 52.

వ. దర్పణంబుల దర్పంబును సరోజంబుల యోజయు సుధాకలశంబుల విలసనంబును ...పాండు 3. 179.

2. ఉత్సాహము.

గీ వేసి యూరెంటిఁ దునియలు నేసి యెలుఁగు. సూపి యేనుంద పెలి పేల నాపగాత, నూజుఁ బొదువుడు మీరని యోజఁ దెప్పె, శక్రతనయుండు దనయోధజనుల కెల్ల. భార. భీష్మ 3. 407.

మ. సంలికుం దెంతయు నోజ దున్ను వెడ సీరాగ్రంబునం బొంది ప్రాణు లనేకంబులు సచ్చు హింస యది యానో కాదో...భార. అర. 5 57. (శ. ర. ప్రాంతప్రతి పా.)

3. మహిమ, గొప్పతనము

ఉ. ...తాపసులు రాజఋషీంద్రుఁ డటంచుఁ బల్కఁగాఁ, దేజము నొంది యాహారిణ దేహమునందలి ప్రీతిఁ జేసి నా, యోజ సెడంగ నేఁ జెడితి యోగిజనంబులలోన జేలనై. భాగ. 5. 1. 116.

4. పద్ధతి, రీతి, విధము, పోలిక.

ఉ. రాజగృహంబుకంటె నభిరామముగా నిలు గట్టఁగూడ దే, యోజ నృపాలుఁ డాకృతికి నొప్పగు వేషము లాచరించు...ఒద్దులకుం ద గ దట్లు సేయఁగన్. భార. విరా. 1. 123

ఉ. రాజుల కెందు నాయఁ బరాక్రమజీవన వృత్తి దక్క నొం, డోజ నిషిద్ధ మంద్రు మునులు...భార. ఉద్యో. 4. 14.

క. రాజోచితధర్మంబుల, యోజ విశదభంగిఁ జెప్పితి...భార. శాం. 4 3.

క. తేజోధనుఁ డగునరుఁ డు, ద్రాజిగతి నడుమ మెఱసి బడబాగ్ని దనంబై జలనిధిఁ ద్రెక్కొని యెడు, నోజం గురుబలము పేర్చి యుడిపెం దోడ్తోన్. భార. విరా 5 58.

మ. ...మహాశనిపాతంబునఁ గూలు నీలగిరి యోజన్ వ్రాలె వాఁ డుర్వరిజ. ఉ రా. 2. 100.

5. క్రమము, యుక్తమార్గము

క. ఓజ సెడి నడుచుభక్తుల, నోజకు రాఁజేయ శివుఁడ యొడయఁడు... శివ. పా. 211.

గీ. మావటీఁ డల్ల నల్లన మదగజంబు, విచ్చతో గూడ నోజకుఁ దెచ్చినట్లు, యోగవిద్యా పరుండును నొయ్య నొయ్య, నమపుతోఁ గూడఁ బవనంబు నాఁగవలయు. మార్క. 8. 318.

6. పాడి, నీతి, ధర్మము, తగవు

గీ. రాజవై నేఁడు కడవట నోజమాలి, తెచ్చుకొంటివి పాయనితిట్టు రట్టు, నకట యుఁక్తనై న హా తెప్పినట్లు చేసి, దేవతాచార్యు

నకుఁ దారఁ దిరుగనిమ్ము. వరాహ. 7. 26.

ద్వి. అదరిపాటున నొంటి నరిగితివేని,ముదిత నీపైఁ జాల మోహింపఁగలదు, ఓజ గా దని నీవె యోసరతేని. రాజుతోఁ జెప్పి వై రిమ్ము ఘటించు ద్వి. సారంగ. 1. 17. పా. 14. పం. ఘటికా. 2. 107.

7 కౌశలము, నేర్పు.

వ. మఱియు ననేక గతులయోజలు మెఱయుచుఁ గొండొక సేపు విరాటునకు వినోదంబు సలిపి... భార. విరా 2. 18.

క. రాజునకుఁ దియ్య మెసఁగెడు, పూజావచనముల నెయ్యపుంబలుకులఁ జే,రోజమెయి బంధుమిత్రాప్తస,మాజములకు మేలములఁ గుమారులకుఁ దగన్.

వ. ఇంపు పుట్టించుచు. భార. ఉద్యో. 3. 179, 180

8. భయము, వెఱపు.

చ. ...మృగాక్షి నీ వకట హీనపరాక్రము రాము గీముఁ జె,ప్పెద విటు మాడు నన్నుచుఁ బిట్టు నిజాకృతితోడ నిల్చె ని,ర్వది భుజశాఖలుం బదిశిరంబులు నోజయొవర్పఁ జూడ్కి-కిన్.

వ. ఇట్లు నిలిచి తనదుభయంకరాకారంబునకు మూర్ఛం బొందిం పుడమిఁబడియున్న జనక తనయం బోదివి పట్టి. భా. రా. అర. 2, 105, 106.

9. ఆజ్ఞ.

గీ. వానరేంద్రులఁ బంపుము వలను గాఁగ, నుదయవేళకుఁ జనుదేర నోజచేసి. భా. రా. యు. 1681

10. ప్రకృతి, స్వభావము.

ఆ. ఒడలిగుణము వేఱ యోజ వేఱ. వేమన. 1. 140.

సీ. పసుఁగు మేఁకపో తెనుపోతు మానిసి మొన లిట్టి గుఱ్ఱము పసుల ఱేఁడు, కివియుఁ దేజుఁ కాడియు మగంటిమి కాల్మి వడి కల్మి యుడివోనికడఁది మేలు... గీ. ... ఎక్కువజ్ఞ నోజలు...ఒప్ప గట్టులగొంగ యగ్గిజమ్ముఁడు తొలివేల్పు పడమటిసామి గాలి,దాగ కాఁడును నెలతాల్పు మూఁగి కొలువ. అచ్చ. రా. యు. 681. సారంగ. 2. 119.

11. వివిధి, విస్మృతి.

క. ఈజంబూద్వీపమునకు, యోజనములు లక్ష యొప్పు నుదధియు నంతే,యోజన్ శాక ద్వీపం,బీజంబూద్వీపమునకు నినుమడి విరివిన్. వరాహ. 10. 166.

జ; ఓజగొను, ఓజగొల్పు, ఓజపడు. ఓజపఱుచు.

**ఓజ²** – ఒజ్జ వి. (క. ఓజ) ఉపాధ్యాయుఁడు, గురువు.

సీ. శకునిఁ జూచితె మురసంహార యితఁడు మాయాజాలములకు నాఁ డోజ సకల, మాయలు నీచేత మడిసె... భార. స్త్రీ. 2. 186.

గీ. ఈతుఁ దగువారిపైఁ గోపమే ఘనంబు, గాక యబలలపై పట్టి కాఁక పుట్టి, రాజవై యీవు విరహాగ్ని రాఁజవైతి,నోజవై తెగడింపఁ బయోజవైరి. రా. వి. 4. 49.

జ: ఓజబంతి,

**ఓజగొను** అ. క్రి. (√ఓజ¹.) సిద్ధించు.

చ. ...శితగిరీశ్వరుపాలి కేఁగి మ,త్సరిణయ కార్యమోజగొనఁ బల్కి రయంబున రండు క్రమ్మఱన్. కు. సం. 7. 918,

**ఓజగొల్పు** స. క్రి. (√ఓజగొను.) ప్రేరేచు, పురికొల్పు.

వ. అని తలయిండ్లన పాయం బలికి నిజవందనల బుజ్జగించి వెలయాలికేనంబు లలవడ నోజ గొల్పుచు...కు, సం. 8. 141.

**ఓజపడు** అ. క్రి. (√ఓజ¹) సరివడు, పొసఁగు, చక్కఁబడు.

వ. ...ప్రియంవద మృదూక్తులం దత్ప్రకారంబు విరహవికారంబగా నిశ్చయించి తన్ముఖంబునం దెలియక ప్రయోజనం బోజపడ నేర దని యనసూయ శకుంతలం దగ్గఱి... పి. శకుం. 3. 56.

**ఓజపఱుచు** స. క్రి. (√ఓజపడు) 1. చక్కఁబఱుచు.

గీ. అవధరింపుము మాపంత మధిప యేము, వదల కీ బాలు శిక్షించువారి మింక, నొయ్య నొయ్యనఁ దెలివికి నోజపఱిచి, వెట్టిఁ దేర్తుము మాటలు వేయు నేల. నృసిం. 4. 56. (తెలివికిఁదెచ్చి—అని భావము.)

2. ఒనర్చు, చేయు, నిర్మించు.

సీ. పసిఁడికుంభంబులమిసిమి యంతయుఁ గూర్చి యొగిఁ జన్నుఁగవ గాఁగ నోజపఱిచి. పద్మ. 2. 9.

**ఓజబంతి** - ఒజ్జబంతి. వి. (√ఓజ²) ఒరవడిబంతి. విద్యార్థులు చూచి వ్రాయుటకై ఉపాధ్యాయుఁడు పైని వ్రాయు మచ్చుతుదములపంక్తి, మేలుబంతి, మేలుబంతివంటిది, ఆదర్శము

గీ. ...విలసిల్లు ననుపమజాత్యధర్మపరత నృపపంక్తికిఁ దోజబంతి యనఁగ. నరస. 1. 38.

సీ. ఏమంత్రిదాతృత్వ మినతనూభవకల్ప భూజాత మేఘుల కోజబంతి. వైజ. 1. 26.

సీ. ...ఉవిదల కీభామ యోజబంతి చిత్రభా. 1. 41.

**ఓజము** సం. విణ. (అ. ఆ. అ.) — జ్యోతి - విషమము, బేసి. (రాశి, మొ). వి. - ఓజస్సు.

**ఓజస్వంతుఁడు** సం. విణ. (త్. స్వతీ. త్.) ఓజస్సు కలవాఁడు.

**ఓజస్వి** సం. విణ. (న్. నీ. న్.) - ఓజస్వంతుఁడు.

**ఓజస్సు** సం. వి. స్. న. 1. బలము. 2. వీర్యపుష్టి, ధాతుపటిమ. 3. జ్ఞానేంద్రియముల పటుత్వము. 4. అవష్టంభము, అవలంబము. 5. ఉత్సాహము. 6. దీప్తి, ఎండ. 7. శస్త్రాది కౌశలము. 8. (అలం) ఒకానొక కావ్యగుణము. (రచనలో దీర్ఘసమాసము లుండుట)

**ఓజించు** స. క్రి. (సం. యుజిర్) యోజించు, సంఘటించు, సమకూర్చు.

శా. సర్వశ్రీఁ దనపేరివాఁ డగుటచే సంతుష్టచేతస్కుఁడై, సర్వజ్ఞత్వము రాజశేఖరతయున్ శంభుత్వముఁ విశ్వనాథోర్వీభర్తకు విశ్వనాథుఁడు శివుం డోజించెఁ గాకున్న నీ దుర్వారప్రతిభాతిభాగ్యశుభదస్తుత్యత్వముల్ గల్గునే. కావ్యా. 1. 5. (ప్రయోగాంతరము కనఁబడలేదు.)

**ఓజిష్ఠుఁడు** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలిఓజస్సు కలవాఁడు.

**ఓజీయుఁడు** సం. విణ. (స్. యసీ. స్.) — ఓజస్వితరుఁడు - 1. ఇద్దఱిలో నెక్కువబలము కలవాఁడు. 2. ఇద్దఱిలో నెక్కువకాంతిగలవాఁడు

**ఓజు** వి. (క. ఓం - శిల్పి.) 1 శిల్పి.

ద్వి. ఒడిసెలకాండ్రను నోజులనెల్ల బస. పు. 3. 511. పం. (ప్రాఁత ప్రతి – 'ఓజులవారి' అని క్రొత్త ప్రతి)

సీ. ....పనివాని పేరుగా భాసీలు నో జన.... ఆం. భా. 2. 282

2. శిల్పుల పేర్ల తుదినివచ్చు బిరుదాంకము. (శర్మ. వర్మ. వంటిది.)

ఉదా. కామోజు, లింగోజు. మొ.

వ. శిలవోజు పెట్టినఅఖణ్డవతిఁ లోహదణ్డు దివియ... దా. శా. 1369.

**ఓట** — ఓటమి, ఓటము, ఓటు¹. వి. (√ఓడు - త. ఓడల్.) 1 భయము.

(శత్రుజంతువులు వచ్చినప్పుడు ముని తత్ద్రూపములు కుక్కకు నిచ్చుట.)

సీ. ఒక మత్తకరిఁ జూచి యోటమై నొదిఁగిన నుద్ధతకరిఁ జేసి యొసఁగె జయము. భార. శాం. 3. 93. మనుచ. 2. 39.

2. కొంకు, సంకోచము.

ఉ. ఓట యొకింతయేనియు సుయోధను చిత్తము నందు లేదు నీ మాటలఁ బోవునే దురభిమానము యెక్కుడు పూనుఁగాక.... భార. ఉద్యో. 3. 104.

3. వినయము

ఆ. మాటపొం దెఱింగి యోటమైనల్లన. చేరి కౌరవేంద్రు చిత్తవృత్తికనుగుణంబు గాఁగ నానతుం డగుచుఁ బ్రార్థించి యడుగకున్నఁ దెలుఁగుపడదు. భార. ఉద్యో. 1. 21.

4. అపజయము.

చ. ....మీ, కొనఁగఁ బన్నిదంపు గెలుపోటులు
దీర్పఁగ నిప్పు డేను జెప్పినదియ చాలు...
ప్రభా. 3. 63.

ద్వి. శివమంత్ర లేఖయు జినమంత్ర లేఖ, తవిలి
కావేరి మధ్యంబున వైవ, నేటఁ బోయిన
పత్త్రి మోటపత్త్రంబు. నేటికి నెదురెక్కి-
వది నిజంబనివ. బస. పు. 6. 196. పం.
(ప్రాఁతప్రతి పా.)

**కండ** వి. (√ఓట) పిఱికిక-డ, భయము.
సీ. అజశిరోదళనుఁ డన్నదరు లేదేనియుఁ
గాలారి యను నోటకండ లేక. కు. పం.
4. 417.

**కాఁడు** విశే. (√ఓట) ఓటకలవాఁడు.
శుక. 1. 83.

**మి** — ఓటమి. (√ఓడు) వి. ఓడుట
(అపజయము.)
క. గెలుపును నోటమియును వనిఁ గలుగవె
యెడ పెట్టి యెట్టి ఘనులకు.... భార. ద్రో.
4; 289.
(భంగము, అవమానము.)
క. కావున నీయోటమి నీ, కే వెరవునఁ బాయునది
యధికుఁడు కానే, కావించు తుణము పలుక
క, నీ వుండిన నే మెఱుఁగమె నెయ్యము
కొలఁదుల్. కళా. 7. 207.
(భయము.)
క. ఓటమితో నెల్లప్పుడు, పాటవమునఁ బనులు
చేసి బాలురతో నే, యాటలకుఁ బోక యొక
జం, జాటంబును లేక భక్తి నలుపుదు నవఘా.
భాగ. 1. 104.

**ము** — ఓటు. వి. (త. ఓట్టం) ఓడుట.
వ. దురోదరపరాయణుం డై నయన్నారాయ
ణుండు గెలుపు నోటంబును సరిగా నద్దేవీ
ద్వయంబుతో వినోదించు ... ఉ. హరి.
3. 156.
మహో(స... నా. యికలం గందర్పుఁ డోడం జె
ఱఁగి తఱిమి పీఁ పేసె నా. అము. 5. 9.

**ఱు** — ఓటాఱు. అ. క్రి. 1. పరాజయము
నొందు ఓడిపోవు.
ఉ. ఇంతకు మున్న నీజనకుఁ డెంతయు నోటఱి
పాఱె నీవు నా, పొంతకు వచ్చి బింక మెట
నోవగు వంచు... భార. ద్రో. 2. 99.
2. భయపడు.
ఉ. ...వే, కప్పెళరాశి సూతుఁడు దెగన్ హరు
లోటఱి ద్రెళ్లువాఱ గన్. భార. ద్రో.
4. 125.
గీ. అధిపతియు వస్త్రగురుఁడుఁ బెరగ్గలికలఁ,
దఱుమఁ జతురంగములుఁ బేర్చి యుఱక
వారి, మొనలతోఁ దాఁకి గాండీవముక్త వి
శిఖ, శిఖలవేఁడిమి కోటఱి చెదరి పఱచె.
భార. ద్రో. 5. 138.
3. నిస్సత్త్వమగు.
గీ. వల్లియలు వైచి యోఁ ముల్ పెల్లుద్రవ్వి,
కార్చి వేసరి యుఱు లొగ్గి తఱిసి డయ్యఁ,
దోలి యోటఱి పోనీక దొడ్డి నాఁగి, పొడువ
నడువమ నలుదెస పొంచి యోడి హరి.
పూ. 7. 138.

**ఓటువ(ప)డు** అ. క్రి. (√ఓటు.) 1. భయపడు.
వ. ...లుంటాకులం దోలి యోటవడకుండ
సార్థవాహులఁ గడపి పుచ్చి ... కాశీ.
4. 64
2. అవమానపడు.
గీ. మధురలాలసపాటపై మదిని దవకు, నింత
వేడుక గలిగిన నేకతమున, సతతమును వింటి
గాక యిట్లతఁడు నిమ్ను, నోటపఱచుట
దగునె నీ కోర్వఁ దగునె. కళా. 7. 206.

**ఓటాఱు** — ఓటఱు. అ. క్రి. (ఓట + అఱు - ఓటచే
అఱు.) నిస్సత్త్వుఁడగు.
క. వే లొక విలు గొని యెమ్ముల, గిఱ మె
ఱుఁగు నారసములు గిఱికొలిపిన నో, టాఱి
మెయిం ద్రొన్నెత్తురు, వాఱ నతఁడు దేరి
మీఁదఁ బడి మూర్ఛిల్లెన్. భార. ద్రో.
5. 138.
క. కిమ్మీరమర్దమునిచే, నిమ్మెయి నోటాఱఁ
జెక్కు లేటులు వడి దర్ప మ్మొడలి మూర్ఛ
మునిఁగియుఁ, గ్రమ్మఱఁ గురువాదుఁ డెట్లు
గడఁగెనో యనికిన్, భార. భీష్మ. 2. 406.

**ఓటాఱుచే(ర్చు)** స. క్రి. (√ఓటాఱు) ఓడించు.

సీ. దట్టించి పారిజాతము దెచ్చె లోహితప్రాద
మున వరుణునోటార్చె... ఉ హరి. 2. 64.

**ఓటిలు(ల్లు)** అ. క్రి. (√ఓట) సంకోచించు, జంకు.
ద్వి. తన్ని యంతటఁ బోక తనవీటిలోన,
మన్నఁ జంపుదు నని యోటిల కాదె. రం.
రా. యు 300. పా. 12. పం.

**ఓటిల్లుచిందఱ** వి. బాలక్రీడావిశేషము
గీ. చిక్కనాళిల్ల లోటిల్లు చిందఱాది,యైన
శైశవ క్రీడావిహారసరణి. కాశ. 8. 88.

**ఓటు**[1] - ఓట. (చూ. ఓటుపడు, మొ.)

**ఓటు**[2] అవ్య. ప్రశ్నమును దెలుపును.
(క) ఆక్షేపముతోఁగూడిన ప్రశ్నము.
గీ. ...కాను మరలి, వదనమార్గంబు వెలువడి
వచ్చి నగుచు,నో నిశాట నీయాఁకలి యుడిగె
నోటు. భా. రా. సుం 49.
(చ) కాకువుతోఁగూఁడిన ప్రశ్నము.
మ. గయ కేలా యరుగంగ మానవులకుం గాశీ
పురివాహినీ, త్రయవేణిపులినంబులందు నిడ
రాదా తల్లినిం దండ్రినిం బ్రియమాతా
మహులం బితామహులనుం బేర్కొంచుఁ
బిండాన్నముల్, గయికో రోటు ప్రియంబు
తోడఁ బితరుల్ స్వర్గముల్ సాఁచుచున్.
కాశీ. 6. 278.

**ఓటుచేయు** స. క్రి. (√ఓటు[1]) భంగపఱచు.
ఆ. పొన్న పువ్వు దీటు పోల్చు లోకులమాట,
నోటు చేసి వేల్పుబోటి నాభి, విస్తరిల్లె
నపుడు వెడఁదబావిని బోల్చు, నేర్పు
కాంద్రమాట నేటు చేసి. రసిక. 6. 100.
(అసత్యముచేయు-అని భావము )

**ఓటువ(ప)డు** అ. క్రి. (ఓటు[1]+పడు.) 1. అపజ
యమునొందు, ఓడిపోవు.
వ. ...ప నోటువడితేని నఖిలమహీరాజ్యంబు
నీయది నీ వోటువడితేని దమయంతినాయది
యని పలికి....భార. అర. 2. 228.
ఆ. .... మన్మథార్తు వన్ను, నొడిచి తిందు
రాత్రి యుద్ధంబు చేసి కా,మోపభోగ
నిరతుఁ డోటు వడఁడె భార. ఆది, 7. 62,
వరాహ. 8. 82.
2. లోనగు, లొంగు, వశమగు.
వ. మఱియును బ్రియాలాపంబులు పలుకు
గోమాయువుమృదుమధుర భాషణంబులకు
నోటువడి గార్దభం బిట్లనియె వా. వ.చ.
4. 98.
వ. ...అమ్మహీపతిరూపయౌవన సౌందర్య
విలాసంబుల కోటువడి మహానురాగంబున
వానిన చూచుచున్నంత. భార ఆది.
4. 145 భాగ.8. 100.
3. అచ్చెరువడు. భ్రమపడు. నిశ్చేష్టితుఁడగు.
ఉ. ...ఉదగ్రత వారలు సోరఁ వారిదో,ర్లీ
లలు సూచి రోటువడి రెండు బలంబుల
యోధవీరులున్ భార. శల్య. 1. 321.
స. క్రి. (ద్యూతాదులందు) కోలుపోవు, పోఁ
గొట్టుకొను
గీ. మున్ను దన్నోటువడి మఱి నన్ను నోటు,
వడియెనో నన్ను ము న్నోటువడి విభుండు,
గ్రన్నఁదన్నోటువడియెనో యన్న నాకు,
తెలుఁగఁ జెప్పుము...భార. సభా. 2. 209.
ఉ. ఎల్లధనంబు నోటువడి తిందుకుశేశ్వర
....భార. సభా. 2. 194.

**ఓటుపఱుచు** స. క్రి. (√ఓటుపడు.) ఓడించు,
జయించు.
గీ. లాటభూపాల ముఖ్యుల నోటుపఱిచె.
రామన. 1 7.
క. నడలం దొడలం గుబ్బల,నడరఁగ నిన్నోటు
పఱిచె నని డెందమునన్,గడు నలుగక
యేనుంగురో, పడఁతుక తెలుఁ గిప్పుడెలుక
పలుపుము నాకున్. అచ్చ. రా అర.
90. (ఇట ఔపమ్యమును తెలుపును.)

**ఓటుపాటు** వి. (√ఓటుపడు ) ఓటుపడుట
(లొంగుట.)
గీ. మొనసి నిశితాస్త్రములు వానిముఖము
నిండ, దీటుకొలిపిన వాఁ డోటుపాటు లేక,
తోన గదిసిన...అధ్యా. యు. 184 పా.

**ఓటుపుచ్చు** స. క్రి. (√ఓటుపోవు) ఓటుపఱచు,
ఓడించు.
వ. ....రావణుం డింద్రుభంగించె పాలకాశను
వోటుపుచ్చి వంతకుఁ బఱపె... భా. రా.
యు; 890.

ఒటపో(వో)వు స. క్రి. (ఒటు¹+పోవు) ఒటు పడు, కోల్పోవు.

సీ. అని యనుజాదంబునందుఁ బ్రాణ. గీ. మోటు వోయె ... భార. స్త్రీ. 2. 186 (వ్రాఁతప్రతులపాఠము. అని. శ. ర. — ఒటుపడియె. అనిముద్రి.)

ఒటించె న. క్రి. మోసపుచ్చు.

మ. కవు లోట్రింతురుగాక చందురుఁడె వక్త్రంబు బజ్జయుగ్మంబె కన్గప బంగారుసలాక సైన దియె త్వక్కాంసాస్థిరూపంపు మేను విత ర్కింపఁగ.. మల్ల. శృం. 46.

("కింత్వేవం కవిభిః ప్రతారితమనాః" అను మూలమునుబట్టి యీ యర్థము నిర్ణయింపఁ బడినది. ప్రయోగాంతరము లేదు.)

ఒడ వి. (సం. హోడః. ప్రా. జేడో, ఉేడో. త. ఓడం. క. ఓడ) నావ, పడవ.

ఉ. నెట్టన ధర్మనందనుఁడు నిన్నవలంబము నేసి యోడతోఁ, గట్టినయోడవోలె గత గౌరవుఁ డైకడుఁ దూలె.... భార. సభా. 2. 40.

ఉ. ... ఓడలు బండ్లవచ్చు బండ్లోడల వచ్చు ప్రభా. 1. 94. రామా. 2. 60

జః ఓడంగి, ఓడకూలీ, ఓడపసుపు, ఓడపోఁక, ఓడబేహారి, ఓడరేవు, ఓడవాఁడు.

ఓడంగి వి. (√ఓడ) 1. ఓడవాఁడు, పడవవాఁడు 2. దోనెకు లోతట్టువేసెడు దూలము.(శ. ర.)

ఓడకూలి వి. (√ఓడ) ఆతరము, రేవు.

ఆ. తరిగమునకుఁ బణము పురుషున కరపణ, మాఁడుదాని కైన నందు సగము, వ్రేఁగు ముట్టునందు వ్రేఁగువిడుపునను, నోడకూలి గొమట యుచితమండ్రు. విజ్ఞా. ప్రా. 86.

ఓడపసుపు వి. (√ఓడ)— ఓడమీఁదఁదెచ్చిన పర దేశపు పసుపు — ఒకరకపు పసుపు

(కేదారగౌరీ వ్రతవర్ణన.) ఉ. పోఁకలు పాకు లోడపసుపున్ గుడము న్మఱి గంధమాత్ర లం,తే కొమరారువపూపములు నెన్నిదినంబుల కన్ని నిల్పుచున్. ఉ. హరిశ్చ. 4. 66.

ఓడపోఁక వి. (√ఓడ) - ఓడమీఁదఁదెచ్చిన పర దేశపు పోఁక - ఒకవిధమైన పోఁక.

రగడ. తీని నలభర్జూరములఁ బురుడింపు నల్లవె యోడపోఁకలు, శుక. 1. 188.

ఓడబేరము వి. (√ఓడ) ఓడమీఁద సరకులు గొని పోయి చేయు వాణిజ్యము.

చ. అటువలె విష్ణుదాసుఁడు హిరావళి గొల్వఁగ నోడబేరమందుటకుఁ జనంగ ... హంస. 1. 118.

అ. ఓడబేర మాడ వేడుక నే నేఁగి,నదియు మొదలు శుభమె యందఱకును. హంస. 1. 349.

ఓడబేహారి వి. (√ఓడ) ఓడవర్తకుఁడు, ఓడమీఁ దసరకులు గొనిపోయి వాణిజ్యము చేయు వాఁడు.

సీ. అతనికి గీతాదిగతు లెల్ల వినిపించు నవ్వేళ నోడ బేహారి యొకఁడు. నైష. 4. 22.

ఓడరేవు వి. (√ఓడ) సముద్రమందుఁ గాని నది యందుఁగాని ఓడలు నిలుచు రేవు.

చ. ...పరాశరుఁ డన్మునీంద్రుఁ డయ్యతివఁ దలోదరిం గనియె నయ్యమునానదియోడ రేవునన్. భార. ఆది. 3. 86.

ఓడవము సం. వి. అ పుం. ఋషభ(రి)పంచమ(ప) వర్జితమై శేషించినపంచస్వరములతోఁగూడిన రాగము.

ఓడవాఁడు వి. (√ఓడ) ఓడ నడపువాఁడు, నావి కుఁడు.

సీ. మాలిమి కాఁ డనఁ టీలికాఁ డన నోడవాఁ డన నావికాహ్వయము చెలఁగు. ఆం. భా. 1. 158.

ఓడి సం. వి. ఈ. స్త్రీ. నీవారధాన్యము.

ఓడించె — ఓర్చు¹.(√ఓడు.)అపజయమునొందించు.

సీ. ... గాండీవధరుఁడు ... పుళిందావనీశ్వరు నోర్చి ప్రతివింధ్యుఁ డనువాని నోడించి యశ్రమమున. భార. సభా. 1. 228.

ఓడిక వి. (√ఓడు — త. ఓడై) ప్రవాహము.

క. పడాకుపొన్నకొమ్మలఁ, గ్రోడా డెడు నడవి గౌరుకొండములు మోద, క్రీడఁ దవరు

చాడ్పునఁ బై నోడిక లయి పువ్వుఁదేనె
లురలఁగ నొప్పెన్. హరి. పూ. 7. 117.
మనుచ. 4. 68. జై. భా. 6. 85

**ఓడిక** సం. వి. అ. స్త్రీ. — ఓడి.

**ఓడిగిల్లు(లు)** అ. క్రి. (√ఓడు.) 1. ప్రవహించు.
గీ. ఉదక మున్నతభూమిపై నుండ లేక, పల్లమునకోడిగిల్లి నపగిది నతఁడు.కదలెఁ దీర్ఘాంతరమునకుఁ గాశినుండి. కాశీ. 3. 101.
2. పాఱు, పరుగెత్తు.
(ప్రభాతవర్ణనము) సీ. ఒక్కింతవెన్నెల యార్చితీసినభంగి నుదధిశుదిశకుపై యోడిగిలియె. వి. శకుం. 3. 202.
క. ...వెన్నెల పడమట దిక్కునకున్, బలపలనై యోడిగిలఁగఁ బలపల వేగెన్. జై. భా. 1 186. (శ. ర. పా.)
3. స్రవించు, కాఱు.
సీ. బ్రహ్మరంధ్రము మోవఁబాటి యయ్యింద్రియద్రవ మోడిగిల్లె నేత్రములలోన. కాశీ. 4 174.

**ఓడినక్క** వి. ఒకజాతినక్క. పొట్టినక్క. (శ. ర.)

**ఓడు** అ. క్రి. (క. త. ఓడు — పాఱిపోవు) 1. (యుద్ధాదులందు) పరాజితుఁడగు, అపజయము నొందు.
క. ... అయ్యర్జునుఁ జూచి వీని విడువుము, యని నోడినవాని హీను నయశోవీర్యున్ భార. ఆది. 7. 46.
గీ. తత్త్వనిర్ణయవాదంబు తరమె నీకు,నోడితేనియుఁ బట్టి మొత్తు యనంగ, లింగమును గట్టకుడుగము... ఆము 4 60.
రగడ. కాదల్లయది పుల్లకం కేళి పన్నిదము, 'మోదుగోడిన నీదు ముత్యాలజన్నిదము. మనుచ. 3. 84.
2. భయపడు, వెఱచు.
ఉ. భయప్రపన్నుఁడై, యున్న హలుకాళను న్విజయుఁ డోడకు మంచును మారుతాస్త్రము,త్యున్నతచిత్తుఁ డేసె ... భార. ఆది. 8. 276.
క. ...ఉడిగింతును సర్పయాగ మోడకుఁడింకన్. భార. ఆది, 2. 221. మార్క. 8. 158.
3. కొంకు, సంకోచించు, వెనుదీయు.
మ. అని ప్రార్థించినఁ జంప నోడి కృపతో నా వేఁటకుం బోయె.... మై. 2. 142.
ఉ. ...కృష్ణమా,కొడుకుల దేల రా రనుచు గోపిక లెల్లను బల్క నేత్రియన్, నోడివెద నేఁడు పన్నగము నోరికి వీరికి నొక్కలంకెగా, నోడఁబడ నేల చేసె విధి యోడక సేయుఁ గదయ్య క్రౌర్యముల్. భాగ. 10. పూ. 476.
4. లొంగు, వశుఁడగు.
ఉ. పాడియు సత్యముం గలరు పాండుతనూజులు నీదు పుత్రులు,పాపడికి నోడర తెలుఁగు పాపము సేయఁగఁ జూచి తీవు వక్కిడటు సేయ కేలుడుగు గెల్వదె ధర్మువు.... భార. భీష్మ. 2. 260.
5. పాఱు, పరుగెత్తు.
మ. వెఱచి నిమీలితాతులయి వెన్క కొదంగెదు పువ్వుఁబోఁడులన్, వెఱవకుఁ డోడకుం డనుచు....హరి. పూ. 8. 46.
6. స్రవించు, కాఱు.
(వ్యవ) తలచమురు మెడమీఁదికి ఓడుచున్నది. వాఁడు స్నానము చేసి తుడుముకొనకుండనే నీళ్లోడుచు వచ్చినాఁడు.
స. క్రి. (ద్యూతాదులందు) కోల్పోవు. పోఁగొట్టుకొను.
సీ. ఓడినధన మింక నాడినం గాని యేఁ బెట్టఁ జూపొ మ్మని పెనఁగువారు. దశకు. 5. 65.
వ. నీతనయుండు గుణనిధి చెత్తంబున నోడిన విత్తంబునకై యాయంగుళీయకంబు నాకిచ్చె... కాశీ. 4. 100.
వి. (వృత్తియందుమాత్రమే ఔపవిభక్తికము గాఁ గనవచ్చుచున్నది) 1. కుండలో నగువాని తూఁటు,బీఁట.
ఉ. ...అణిముత్యముల్, పుట్టెడు తామ్రపర్ణి మటిపుట్టక యున్నదె యోటిగుల్లయున్. ప్రబంధ. 679.
ఉదా. ఓటికుండ.
2. ఓటికుండ.

ద్వి ఓడువఁ బోసినయుదకంబు లట్లు బస. పు 7. 376. పం.

క. చూడఁగ శిపథకునిఁ గని,వేడుకఁ గొని యాడఁదేని వృథ యాతనిమి.థ్యాడంబర దేవార్చన, యోడువఁ బోసినజలంబుయుక్తి మహేశా. శివ. సా. 154. పండితా. దీక్షా. 68. పా.

విశే. ఓటిఁ, బీఁటలువాఱినది. పగిలినది.

ద్వి మద్దెల యల రంగమధ్యంబునందు, నుద్ద విడని నేల నోడుగా వైచి,యూరు వెడలి పోయె నొక్కెడ మాయ. ప్రభు 2. 48. పా. 2. పం.

సా అంచుఓడన్న కంచమంతయు ఓడన్నట్లు.

జ: ఓట, ఓటకండ, ఓటకాఁడు, ఓటమి, ఓటము, ఓటలు. ఓటపడు. ఓటాలు, ఓటిలు, ఓటు', ఓటుచేయు ఓటుపడు, ఓటుపఱుచు, ఓటుపాటు ఓటుపుచ్చు, ఓటుపోవు, ఓడించు, ఓడిక, ఓడిగిల్లు, ఓడుపడు, ఓడుపఱుచు, ఓడుబిళ్ల ఓడుసేయు, ఓర్పు'.

ఓడుపడు అ. క్రి. (√ఓడు.) పగులు. (చూ. ఓడు పఱచు.)

ఓడుపఱుచు స. క్రి. (√ఓడుపడు) చిల్లులుపడఁ జేయు; పగులఁగొట్టు.

(నరకాసుండు సైనికులు స్వర్గమును బాడు చేయుట.)

వ. ....పగులనడిచిన పట్టెలుం బైఁబడం దిగిచిన పెట్టెలు నోడుపఱచిన చిందంబులును. ఉ. హరి. 1 ఆ.

ఓడుబిళ్ల(ల్ల) వి (√ఓడు) ఇంటిపైఁ గప్పెడు పెంకు.

ద్వి. ఈడుజోడును లేనియింద్రనీలముల, యోడుబిళ్లలచేత నొప్పుమాళిగల. అ. మ క. 3. 178. పా. 18. పం.

సీ. ....నీలపు గవాక్షములఁ గెంపు,టోడు బిళ్లల కప్పు లుదిరిబంగరుబద్రవిటంకుల పచ్చల దంబుమీఱు,తిన్నెలు....శకాం. 4. 170

సీ. ... పిల్లి కన్రనతనంపుబిగియోడుబిళ్లలు .... అచ్చ. రా. అయో. 4.

ఓడుసేయు స. క్రి. (√ఓడు.) తూఁటులుపడునట్లు చేయు, చిల్లులువోఁజేయు.

చ. ...బలఘుస్నరు నమ్ముల నోడు సేసిని,ట్టల మగు డప్పి సోలుటయు దాని దశాననవంద నుండు వి,చ్చలవిడిఁ బట్టి కట్టి జయశంఖముఁ బట్టఁగఁ బంచి యార్చుచున్ నిర్వ. 6. 144.

ఓడ్యాణనము సం. వి. అ. న. ఆసనవిశేషము.

శ్లో. జాలంధరౌడ్యాణనమూలబంధాన్ ,జల్పంతి కంఠోదరపాయుమూలాన్ యోగతారావలి 5.

ఓడ్యాణము సం. వి అ. న. 1 భూషావిశేషము.

శ్లో. విచిత్రౌడ్యాణబంధేన కటిశోభాం విధాయచ. హాలాస్యమాహాత్మ్యము.26.అధ్యా.

2. ఆసనవిశేషము.

శ్లో. ఓడ్యాణజాలంధరయోగబంధైః,రు న్నిద్రితాయాముఁగాంగనాయాం, ప్రత్యఙ్ముఖ త్వాత్ప్రవిశన్సుషుమ్నాం, గమాగమౌ ము చతి గంధవాహః. యోగతారావలి. 6.

ఓడ్రము సం. వి. అ. పుం. 1. ఉత్కలదేశము, ఒడ్డె దేశము (ఒరిస్సా) 2. జపావృక్షము. దాసనము (వృ. వి.) ('ఓడ్రము' అని కొందఱు.)

ఓడ్రపుష్పము సం. వి. అ. పుం. దాసనము(వృ.వి.) (త్రి. ని. — 'ఓడ్రపుష్పము' అని కొందఱు)

ఓడ్రుఁడు సం. వి. అ. పుం. ఓడ్రదేశస్థుఁడు. (ఓడ్రుఁడు — అని కొందఱు)

ఓతప్రోతము సం. విశే. (అ. ఆ. అ.) 1. అడ్డముగాను నిలువుగాను నేయఁబడినది. 2 వలు ప్రక్కల విస్తరించినది.

ఓతము సం. విశే. (అ. ఆ. అ.) అడ్డముగా నేయఁబడినది.

ఓతువు సం. వి. ఉ. పుం. పిల్లి.

ఓదనపాకి సం. వి. ఈ. స్త్రీ. నీలఝింటిక, ఒక యోషధి

ఓదనము సం. వి. అ. పుం. న. అన్నము, వంటకము.

వ. మేఘము పుం. కడుగు.

శ్లో. ఓదనస్త్వన్త్రీయామయం, అశ్నోక్తి బంతు

మేఘే స్యాత్, కాంజికే తు పుమానయమ్. (కే. ని.)

**ఓదనాహ్వయ** సం. వి. అ. స్త్రీ. పెద్దముత్తవపులగము. (వ్య. ని.)

**ఓదని** సం. వి. ఈ. స్త్రీ. బల, ముత్తవపులగము. (వ్య. ని.)

**ఓదనోదనిక** సం. — ఓదనాహ్వయ.

**ఓదము** వి. (సం. అవపాతః ప్రా. ఓవ.) ఏనుఁగు మున్నగు మృగములను బట్టుకొనుటకై త్రవ్వెడు గొయ్యి. అవపాతము.

క. వల యురి యోదము గాలము,గలిగి గదా మృగముఁ బక్షి గజము ఝషము దగులు వట్టుదు రట్టుల తజ్ఞులు విజ్ఞానంబుకలిమిఁ జూతురు పురుషున్. భార. శాం. 4. 181.

గీ. వల్లియలు వైచి యోదముల్ వెల్లు ద్రవ్వి. హరి. పూ. 6. 128.

వ. ....ఇవ్వలవ్వలనుండి యెడ త్రెవ్వకుండఁ ద్రవ్విన యోదంబులం బడి క్రొవ్వఱక మవ్వంబు నివ్వటిల్లం బట్టువడిన చివ్వంగులును... ఉ. హరి. 4. 29

ద్వి. ...కాలుఁ దనురేకుఁ దనులులాయముఁ బట్టితేఁ, గొఱవుగాఁ ద్రవ్విన యోదంబు లనఁగ, నెఱసినపరిఖల నెలకొన్నదావి. రం. రా. యు. 338. పా. 1. వం.

**ఓదారుచే(ప్పు)** స. క్రి. ఊరార్చు, ఆశ్వాసించు.

**ఓదె(దియ)** వి. కోఁతకోసి చేనియందక్కడక్కడ నుంచెడు కొన్ని మున్నగువాని పెన్ను పోఁచల ప్రోగు, చిన్నపన.

(అతికాయుఁడు) క. ఇరుఁగెలఁకులకవులుం దన, శరముల నోదెలు వడఁగఁ జనియెడు సమరో, ద్ధురుఁడఁట యేఁడి రఘువరుఁ, డరుదేరుఁడు చూడుఁ దేయుఁ డనుచుం బెలుచన్. రామా. 8. 166. (ఓదెలువడు-ఓదెలుగాపడు.) అం. భా. 2. 287.

ఓదెపాటుచేయు - ఓదెగాపడునట్లుచేయు.

గీ. కావునిలువవె శేషాశగణము నెల్ల, నట్టి పట్టున కరిగి నీ వరుల నోదెపాటుచేసితి వనుట యేపాటి తలఁప, సమరనిశ్శంక రఘునాథసాహసాంక విజ. వి. పీఠి. 44.

జ: ఓదెకొంగ, ఓరుకొఱుకు.

**ఓదెకొంగ** వి. (ఓదె+కొంగ) ఒకజాతికొంగ. (ఇది కోఁతకాలములో ఆహారమునకై ఓదెల దగ్గఱ తిరుగుచుండును. బ్రౌ.)

**ఓదెకొఱుకు** — ఓదెకొంగ. (బ్రౌ.)

**ఓద్మము** సం. వి. అ. పుం. తడుపుట.

**ఓనామాలు** వి. బ. విద్యారంభమునందు పిల్లలచేఁ దొలుత వ్రాయించు 'ఓం నమఃశివాయ'మున్నగు అక్షరసముదాయమునకు వాడుకపేరు. (సామాన్యముగా 'ఓనమాలు' అందురు.)

సీ. నన్నయ్యవారి లోనామాలు దిద్దుకొమ్మని వచోఁ గడుపునొప్పనుచు నేడ్చు. హంస. 8. 141.

**ఓనికట్టు** వి. కొండలనడిమి గొందిదారి. (శ. ర.)

**ఓపమి** వి. (√ఓపు) అసామర్థ్యము.

క. పాపనిపోయినకాలఁ గే,నోపి యరసి చక్కఁ బెట్టకున్నను జనులా రోపింతురు నాపై నొక, యోపమి యటుగానఁ జింత నొందఁగ వలసెన్. హరి. ఉ. 8. 14.

**ఓపిక — ఓపు** వి. (√ఓపు — త. ఓర్పు) 1. క్షమ, తాలిమి, ఓరిమి; విసుగులేమి.

ఉ. ఓపిక లేక చచ్చినమహోరగముఁ గొని వచ్చి కోపినై, తాపసుమూఁపుపై నిశిత దారుణ చిత్తుఁడ మత్తుఁడన్ ... భాగ. 1. 500.

ద్వి. అపుణ్యవాహినియందవగాహ, మోపికఁ గావించి యుచితాహ్నికములఁ, గ్రమమునఁ దీర్చి... ద్వి. హరిశ్చ. ఉ. 44.

2. శక్తి, సామర్థ్యము.

సీ. కోల్పులి నయిన నుక్కునఁ బట్టి మీసాల నుయ్యాల లూఁగెడు నోపికలును విక్ర. 1. 77.

సీ. లావు సత్తి సత్తువ బల్మి పేఁచ మోపికయన వెలయు శక్తి. ఆం. భా. 2. 2[illegible]1

**ఓపు** అ. క్రి. 1. చాలు, సమర్థమగు.

ఉ. ...కావున విప్రుఁడోపు నో,పం డతికాంతుఁ డయ్యుఁ గరపాలుఁడు కావము గ్రమ్మఱిం పఁగన్. భార. ఆది. 1. 100.

ఆ. గాడ్పుచూలి పిఱుఁదు గావంగ నర్జును, నోర్వ నమరులైన నోప రాజి. భార. ఆది. 8. 28.

2. ఇష్టపడు.

ఉ అక్కట యేను వేడ్కపడి యానెడు నాసవ మర్థిఁ దేరఁగా, నొక్కనికృష్టుఁ బంచుటకు నోపక చెప్పిన దీని నీవు గో, నెక్కఁగఁ జేసి నిన్ను వతిహీనవిధాననియుక్తఁ జేఁతగా,ని క్కముయమ్మలించి తిది నెయ్యముతియ్యము కల్మియే సఖి. భార. విరా. 2. 98.

3. ఇదితుమున్నంతముల కనుప్రయుక్తమై తద్ధర్మ్యాద్యర్థకమగును.

(భవిష్యత్తునకు)

సీ. ధరణీశ ముదిసి తెంతయు నివ్వు నీకుమ గొడుకొక్కఁ డుండ నాకొడుకు నాతి,వతి యుంపనని యున్నవాఁడు మీకుల మింకఁ దెగనోపుఁ బృథివికి దిక్కులేక. గీ. యుండ నోపు నకట పితృపిండవిధులు. నిలువఁబడ నోపు నిది గడు వెగులు పుట్టె. మార్క. 8. 148. (తెగనోపు – తెగును.)

(సంభావన – ఊహ – కు.)

సీ. రాజనామమునకు భాజనంబై మహోద్భుత చరిత్రుండగు పురుషుఁడొకఁడు, గలిమికి మూలంబు ఘన విశేషము గల్గనోపుఁ గౌర వకులదీప జనన. భార. శాం. 2. 197. కల్గనోపు – ఉండవచ్చును.)

వ. ....ఇది యేటితపం బున్మాదంబు గానోపు.... ఆము. 6. 157. (కానోపు –కానవచ్చును.)

వ ప్ర. అ. ప్ర. సహించు, ఓర్చు, సైఁచు.

సీ, క్రొవ్విరు లెసఁగి పూగొలలమో పోవక నవకంపుతేఁదీఁగె నెపులునట్లు. కు. సం. 8. 9.

గీ. ఎన్నఁడును మున్ను వారలయేపు నోపఁ, గాన మెట్లు సముద్రంబులోన బుట్టి,సైనఁ గొన్నంత గొముఁగాక వారి గెల్వ, మాకు శక్యంబె చవిగానిమాట లేల. భార. భీష్మ. 2. 282.

శా. ఓయయ్యా దయసెయవే యవధి యే నో పంగదే హింసకున్. మనుచ. 5. 20.

సీ. బాదబాతేపపాపమున కోపక కాక యా ర్యాగ్ని నైనఁ జల్లార్పలేదె. వసు, 4. 22.

వి. – ఓపిక.

(బలము, శక్తి.)

ఉ. ...అన్నపైఁ,దప్పుఘటించి నీవు నొకకాలి మి గల్గినవాఁడవై నెపం,బొప్పినఁ జెల్లె నీదు నిలుపోవును జూతముగాక యిచ్చటన్. భార. విరా. 5. 98.

శ్లో. యోత్ససే హి మయా సార్థ మత్ర పశ్యా మి తే బలం. సం. భార. విరా. 58. 56.

ఓపలేనిది – నిండుచూలాలు.

(వ్యవ) ఆమె ఓపలేనిది గనుక ఏపనియుఁ జెప్పవలదు.

నిలుపోఁమి – నిలుపఁజాలమి, తాళలేమి.

మ. ...సీ, నిడువాబుంగడకంటఁ జూడు మను చు న్నిలోప్పమిం బైచెఱం, గొడియం జేవిరి దమ్మిఁ ద్రేయుటనునై యుంకించి బం కించినన్ పారి. 1. 119.

జ: ఓపమి, ఓపిక

ఓపె – ఓమె. అవ్య. (ఓ+అపె.) ఓసి (స్త్రీసంబో ధనమందువయుక్తము.)

సీ. ఓమె యోపె యనంగ నొప్పు స్త్రీసంబోధ నార్థమై. ఆం. భా. 8. 72.

ఓమటి వి అన్నము

సీ. ...అన్నఁబు వెలయుచుండు. బువ్వ యోమ టి కూడు బోనము వంటకం బోరె మోగి రమునా...ఆం. భా. 2 257.

ఓమనగాయలు వి. బ. ఓమనగుంటలాడుట కుప యోగించు గింజలు మొదలగునవి.

వ. ఇట్లతివృద్ధులు శిథిలబుద్ధులునగు జనయిత్రీ జనయితలన్ .... క్రొత్తయగు మచ్చికం గచ్చువదలక గోము బోలని యోమనగాయ లంగా నోముచు. పాండు. 2. 25 (ఓమన గాయలంగానోము – ఓమనగాయలవలె

చేతులలోఁ బెట్టుకొని యాడించుచు పెంచు, మిక్కిలి ప్రేమతోఁ బోషించు.)

**ఓమనగుంటలు** వి. బ. బాలికా క్రీడావిశేషము.

మ. ...గిరనంగింజ లోమనగుంటల్ కనుమూసి గంత నలుగంబాలాటలో నైన ఖేలనముల్ మీఱఁగ బొట్లతో నలరె బాలారత్న మెల్ల ప్పుడున్. కళా. 6 202.

సీ. మఱి యాడియాడి తామరి కెంపుఁబీఁటపై నోమనగుంటల నుజ్జగించి. యయా. 3. 149.

**ఓమనపీఁట** వి. ఓమనగుంటలాడుపీఁట. (శ. ర.)

**ఓమము** వి. దీపకము, ఒకానొక అంగడిదినుసు. ('వాము' అనివాడుక)

సీ. చెంగల్వకోష్టును జీలకఱ్ఱపిప్పలియును మంచి యోమపుఁబొట్టు మ్రానిపసుపు. అప్ప. 2. 481.

**ఓము** స. క్రి. (త. ఓంబు. క. ఓవు.) 1. రక్షించు, కాపాడు, పోషించు.

సీ. ఎపుడు సంధ్యలయందు నిలువెళ్ల నీకనన్నో మెడు తల్లి యెం తొఱలునో కొ... మనుచ. 2. 17.

క. ఆనందము సజ్జననిచ,యానందమునఁ జూచి బ్రహ్మ హైరణ్యధరో,ద్యానమ్ములఁ గల ఫలములఁ, దేనెఁ దను వోమికొనుచుఁ దిరుగు మటన్నన్. ఉ. రా. 5. 148.

2. దాఁచు, గోపనము చేయు.

సీ. నేరంబు లోమెడువియతికానికి గట్టి మీఁ గడ గానుక గాఁగ నిచ్చు శుక 2. 557.

3. సంస్కరించు, బాగుచేయు.

సీ. ... శత్రుఘ్నుండు విమలవసన, గంధ మాల్యా మూల్యకమనీయభూషణ ప్రతతి నన్నల వలంకృతులఁ జేసెఁ, గూర్మిఁ గోడలిఁ దోడి కోడండ్రతోఁ గూడి యొడ లోమి కౌసల్య యుపచరించె. రామా. 8. 246.

సీ. అంగకంబులబాగు లరసి యోమఁ దొడంగె ...కళా. 6. 203.

4. (పురుడు) పోయు పోసికొను.

సీ. నేలయు నింగియుఁ దాళముల్ వాయింప ....ఏనుంగుపురు డోమ...కు. సం. 8 185. (ఇట అసాధ్యకార్యకరణమును దెలుపును.)

చ. ....కుఱుసూపుఁ జీరతో, నెలపురు డోమె నంత ధరణీవర కాంత యొకింత వింతగఁ. ఇందు. 2. 14.

5. వహించు, తాల్చు.

గీ. అని యుదగ్రహాలగ్రహ వ్యగ్రుఁ డైన, యన్న మాటలు సభవారి లన్నిమాట, లేమి చవి గామియును దాల్మి యోమి భక్తజన కుశలకామి యల యదుస్వామి కనియె. విజ వి. 3. 166.

గీ. ఒఱపు గలచందురునిచంద మోము మోము. అని. 2. 25.

6. అనుగ్రహించు.

రగడ. ఓమియోమితమధ్య నీపద ముంచు ముంచు నశోకవాసన. వసు. 3. 149. (ప్రయోగాంతరము లేదు.)

**ఓమె** — ఓపె. (ఓ+అమె.) స్త్రీసంబుద్ధియం దుపయుక్తము.

గీ. ఓమె యేమె యిదేమేమె లేవు యేమె. మేఘపుష్పంబుఁ దే వంచు మేలమాడ. నైష. 6. 114. అం. భా. 3. 72.

**ఓయన** — ఒయ్యన. అవ్య. ప్రు. తిన్నగా, ఋజువుగా.

క. ఈయగ్ని దేవుఁ డనురకు, నోయనఁ జెప్పుట యు విని మహోగ్రాకృతితో, నాయనుర నన్ను నూకర, మై యప్పుడ యెత్తుకొని రయంబునఁ జనుచోన్. భార ఆది. 1. 183.

**ఓయలపాట** వి. స్త్రీలు పాడెడి యొకానొక శృంగారపుపాట,

ఆ. ఎలమిఁ జిలుకపిండు దొలుమేనఁ జేసిన, తపము పండఁ బండెఁ దరువనంబు, లువిద కింపు మిగుల నోయలపాటలు, పాడ మధుమదమునఁ దారి నలులు. కు. సం. 4. 446.

**ఓయారము** — ఒయారము.

విశే. (సవిలాసము.)

క. అయ్యగన క్రేఁగన్నుల, యోయారంపుఁ గలికి చూపుటురులం బడినం, గాయజునిచిత్త మైనను, గాయజసంతాపవహ్నిఁ గరఁగక యున్నే. వి.క. 5. 171.

జ: ఓయారి.

ఒయారి — ఒయారి. (√ఓయారము.)

ఓయి(యీ) అవ్య. (సం. అయి క. ఓయ్. త. ఓయి.) 1. పురుషసంబోధనము నందుపయుక్తము.

ఉ. ఓయిదయావిహీనమతి యూరక యాపని బిడ్డఁ గొట్టఁగాఁ,జే యెటు లాడె ... మనుచ. 4 87.

గీ. సంగతియె యోయి యనుమంత రింగణాపు. అము 4. 80. పార గ 2. 123.

శా. శైనేయాత్మజుఁ డామురారినుతు సాశంకంబుగాఁ జూచియో,యీ నిట్టూరుపు లేల పెల్లడరె...చంద్ర. 5. 26.

2. సంప్రార్థనంబునఁ గ్రియలకు అనుప్రయుక్తము. (ఇది ఎదాదులలోనిది.)

క. వినవోయి యింద్ర దైవం,బనుకూలంబైనఁ గలుగు నన్నిశుభంబుల్. దశా. 2. 419.

క. నీయిచ్చయె మిన్నక పో,వోయి మునిప్రవర...అము 2 93.

3. సమాపకక్రియలతుదిని వచ్చి కొన్నిచోట్ల ప్రశ్నమును దెలుపును.

(వ్యవ) వాఁడు వచ్చెనోయి—వాఁడు వచ్చెనా? చేయుచున్నాఁడోయి — చేయుచున్నాఁడా? ఇంతటితో ముగియునోయి — ముగియునా?

ఓయిరము — ఓగిరము. వి. (సం. ఆహారః) అన్నము.

గీ. అన్ని మనలోన నొక్కరుఁడౌనొ కాఁడొ, చేయదే మారుతము మన చెప్పినట్లు, వరుణుఁ డెవ్వరివాఁడు మువ్వురును లేక, యాయితంబగు చెప్పంగ నోయిరంబు. కాశీ. 5. 297.

ఓర[1] వి. (క. ఓర, ఓరె) 1. అంచు.

వ. ...చెంగలువకావులడగ్గఱఁ గుంకుమనీటకే కాకూరియోర వట్టి వట్టివేళ్లచప్పరంబుల నీడ ప్రీడాభరంబు బీడిచికొనిపోవ నివ్విధంబున

క. అఘునుని కాసి మంజి,రాఘోషము మెఱయ నరిగె నంతఃపురికిన్. విజ. వి. 2. 200, 201

2. మేర, మర్యాద.

ఆ. ఓర లేక దొరలు పోరికిఁ జొచ్చిరి, కడిఁది మగలుఁ బేరుగలుగువారు, నడరిముట్టఁ గవిసిరి...నిర్వ. 8. 15.

మ. కలరే రాజులలో మదీయకర చక్ర క్రీడ పైరింపఁ బెద్దల భీష్మాదుల ధిక్కరింపఁ దగ దెత్తంజాల రికెద్దువో.రలువో నాడకు గోపవీరు నోరుపేరం జీరవే విక్రమా, ధ్యులలో నేనును వాసుదేవుఁడ నతండుకా వాసుదేవుండటే. ఉ. హరి. 3. 12.

3. ప్రక్క, వైపు.

సీ. ఒకయోరఁ బటుచారణకుమార పఠితంబు లోకదండ నలిమండలికలగాన,ము...వసు. 2 7.

4. క్రేగంటిచూపు, అపాంగవీక్షణము.

చ. ...అవ్విభుండు న,వ్వొదవెడు మోముతో నతని నోరఁబువాఱఁగఁ జూచు .... భార. అను. 1. 281.

సీ. తొలఁగి వెంటనె యోరఁ దకుకొత్తఁగనుఁ గొనుఁ గన్గొని వానిఁ జెంగటికిఁ బిల్చు. శశాం. 2 77.

విజ. 1 పెడగాలి గిసది.

ఉ. పోరఁ బగ ద్దమార్గమునఁ జొచ్చినసన్నని గాలి యొక్క యం,భోరుహపత్త్రనేత్రి నునుఁబొంకపుఁడన్నులమీఁది సన్నపుం, జీర చెఱంగువాయగిలఁ జేసిన విశ్వధరాతలేశ్వరుం, డోర యొగిర్చెఁ జాపభయ మొంది నిజాననచంద్ర బింబమున్. నైష. 3. 89.

శ్లో. ...అపర్ణం, దధార విర్యగ్వలితం విలక్షః పం నైష 6. 18.

2. ప్రక్కకుతొలఁగినది.

చ. ... శంకరుముద్దుమఱందికుఱ్ఱరై, మను

తన భాగధేయమహిమంబున మిన్నులు ముట్టి వచ్చు ధన్యుని నతనిన్ భజించి నది యున్ వినయంబున నోరయై చనన్. వసు. 2. 109.

3. అడ్డమైనది, తిరశ్చీనము.

సీ. కంటికిఁ జే యోర గా నిల్పి కన్గొని యన్న న్న యెంతది వ్వనెడు వారు. సారంగ. 1. 122.

4 కొంతమూయఁబడినది.

చ. కిలకిల నవ్వు మోవి పలుకెంపుల దీటుఁ గుచంబు లోరగా, వెలువడఁ బైఁటవేయు ...హంస. 1. 217.

మ. ఒకనేత్రాంబుజ మొక్కగల్ల మొకచ న్నొయ్యారపుఁ జీల వీథికిఁ దోఁపఁగ దలు పోరగా నొక పురంధ్రీరత్న మీక్షించె రాజకిశోరంబు...మనుచ. 5. 69.

అవ్య. సాచి. అడ్డముగా.

సీ. ఓర నా సాచవ్యర్థ మొప్పును ... అం. భా. 8. 72.

జః ఓరకన్ను, ఓరకొప్పు, ఓరగచ్చు, ఓరగట్టు. ఓరగించు, ఓరగిల్లు, ఓరచూపు, ఓరచ్చులు, ఓరతలపాగ. ఓరపడు, ఓరపయఁట, ఓర పాక, ఓరపాటు, ఓరపార, ఓరమోము. ఓరవాకిలి, ఓరవుచ్చు, ఓరవోవు. ఓరసించు, ఓరసింపు, ఓరసిల్లు, ఓరనేయు.

**ఓర²** వి. (సం. హోరా) అహోరాత్రము (చూ. ఓరంతప్రొద్దు.)

**ఓరల్దిద్దు** వి. న. క్రి. (√ఓర¹) వంకలుదిద్దు, తప్పులు దిద్దు. రఘు 1 6

**ఓరంతప్రొద్దు** వి. (ఓర² + అంత + ప్రొద్దు) అహో రాత్రము; ఎల్లప్పుడు.

సీ. అతన మచ్చకయున్నసైనను శివరాత్రి యోరంతప్రొద్దును నుపవసించె. కాశీ. 4. 183.

సీ. ఏను బోయినజాడ యెఱుఁగక నాతల్లి దండ్రులు మది నెత్త తల్లడిలుచు,నుండు దురో నన్ను నోరంతప్రొద్దును నెత్తి పెంచిన దాది యెంత వగచు, చుండునో...భోజరా. 4. 120.

మ. ...బ్రహ్మమిత్త్రిందు శ్రీ,మ్యూలకున్ గం టను వత్తిఁ బెట్టుకొని యాయుర్వేద మో రంత ప్రొద్దులఁ జెప్పఁగా...మనుచ. 5. 7.

గీ. మఱియుఁ గోపించి వలసినమాడ్కి నుండు వారిజాక్షులఁ దగినట్లు గారవించి, రతి సుఖంబులఁ జొక్కు నోరంత ప్రొద్దు, నజుఁడు మన్మథరాజ్యాసి హాసనమున. కాశీ. 2. 18.

ద్వి. ఉన్నతోన్నతబుద్ధి నోరంతప్రొద్దు నన్ను గాచుటకుఁ గాననభూములందు, నిద్రవో వెన్నఁడు నేఁ డట్లు దీర్ఘ,నిద్ర పోవుట నీకు సితియే త ద్రి ... రా యు. 493. పా. 11. పం.

**ఓరకన్ను** వి. జా. – ఓరచూపు (√ఓర¹)

సీ. ఓరకంటనె కాని తేఱి చూడవుగదా యల కళానిధినైన నలంగమన. కవిరా 3. 98.

**ఓరకొప్పు** వి. (√ఓర¹) వంకకొప్పు.

సీ. గమకించుచమరివాలము లోనఁ గీలించి యుప్పొంగ నోరకొప్పు దిద్ది వై జ. 4. 30.

**ఓరగచ్చె** వి. (ఓర¹ + కచ్చె) ప్రక్కకొదిఁగించిన కాపీనము.

సీ. చని చని యోరగచ్చగఁ జేసి నిలుచుండి కాల్మడి విడుచుఁ దక్కక చెలంగి. భల్లా 8. ఆ. (శ. ర.)

**ఓరగట్టు** వి. (√ఓర¹ – త. ఒరక్కట్టై – ప్రక్క ఊఁత.) ఆధారము.

సీ. ...కాముని కతఁ డోరఁగట్టు కాఁడె. దశకు. 7. 60. (అధికుఁడు–అనిభావము.)

మూ. భువన మిదం సనాథీకృతం యద్దేవేఽపి కుసుమధన్వని నేద్భుశీ వపుశ్రీః సన్ని ధత్తే. సం. దశకు. 3. 144. పా.

**ఓరగించు** స. క్రి. (√ఓర¹) 1. ప్రక్కకొరగునట్లు చేయు.

ద్వి. బోరున నెగయుచుఁ బొంగుచుఁ గొమ్ము లోరగించుచు మలయుచు వంగికొనుచు బస. పు. 5. 480. పం.

2 నిరాకరించు.

గీ. ప్రాణనాయకమిత్త్రిలు ప్రాణసఖులు, గాఁగ మది నెంచి విభునకుఁ గానివారి, నోరగింపుచుఁ గనుఁగొని యుర్వి మనిన. మానినీమణు లార్య సమ్మత విచార. సానందో. 3. ఆ. 52.

**ఓరగిల్లు(లు)** అ. క్రి. (√ఓర¹) 1. ఒఱగు. 2. ఒదుఁగు, తొలఁగు.

గీ. కల్గుభూపాలకోటి మొగ్గరము లెల్లఁ, గలఁగఁ దిరుగుడువడ నోరగిలఁగఁ జెల్లఁ, గిల్లఁ దల్లడపడ రణక్రీడ సల్పె. భార. భీష్మ. 1. 268.

**ఓరచూపు** వి. (√ఓర¹) ప్రక్కచూపు, కడగంటి చూపు.

గీ. ఓరచూపుల విటచిత్తమూఁగులాడ, బాహుకుళలతఁ జక్కనిమోహనాంగి, పాట పాడుచుఁ గూర్చుండి ఱోటిమీఁదఁ, బిండి రుబ్బంగఁ గన్నులపండు వయ్యె. వీథి. 50.

**ఓరచ్చెలు** వి. బ. (ఓర¹+అచ్చెలు) కాలిమడమలు చెడుచోట ఎత్తుగాచర్మము వేసికుట్టినమోట పని చెప్పులు. (గ్రా)

క. మొలనీలికాసెయును బద, ములనోరచ్చులు ధరించి ముదముదలిర్పన్, సెలగోలయుములు బంతియు, బలపము గత్తియును బూని పటు సాహసియై. హరిశ్చ. 5. 111.

**ఓరడి** వి. స్పర్థ, సంఘర్షము.

చ. ఉడుగక యుద్ధతోక్కనన నోరడిఁ దోరఁగ ...చమ. 1. 75.

**ఓరణము** వి. ఒకజాతిడేగ.

సీ. తెక్కతాఁకున సుక్క నిక్క ప్రక్కలు నొక్క ముఱక కల్లేటి నోరణంబు. మనుచ. 4. 68

గీ. సాళువము గిద్ద లగుడు వేసడము కురుజు, బాజు జలకట్టె జాలియ వైల యణుజు, నోరణంబును నాదిగాఁ బేరువడిన, వేఁట డేగల గిఱి కొన విడిచి కడిమి. హరిశ్చ. 2. 220.

సీ. సాళ్వము జాలె వేసడము డేగ లగుడు బైరి కణసరంబు నోరణంబు, జలకట్టెగిద్ద చెంచడమన శ్యేవభేదములు .... ఆం. భా. 2. 90.

**ఓరతలపాగ** వి. (√ఓర¹) ఒక ప్రక్కకు నొరగు నట్లు చుట్టు పాగ.

సీ. తళుకుబంగరు చెఱుంగుల యోరతలపాగ... దశా. 10. 112.

**ఓరపడు** అ. క్రి. (√ఓర¹) ప్రక్కకుఒరగు; ఒరగు (చూ. ఓరపాటు.)

**ఓరపయఁట** వి. (√ఓర¹) ప్రక్కకొదిఁగిన పైఁట, తొమ్మునగముగప్పినపైఁట

ఉ. కమ్మజనవాదివాసనలు గ్రమ్మఁగ నోరపయంట జాఱగా, నెమ్మొలు మీఱ నగ్గురుని యింతి.... శశాం. 2. 73.

**ఓరపాక - మోరపాక, దోరపాక.** వి. (ఓర¹) పంచనుదూలములులేక గోడపైనుండి ప్రక్కకు దింపి రాడుల యాధారమునఁ గట్టినశాల.

సీ. దోరపాకనఁగను నోరపాకనఁగను బాదలి యంచనఁ బరఁగుచుండు, భిత్త్యధఃకృత గృహోభిధ...ఆం. భా. 2. 16.

**ఓరపాటు** వి. (√ఓరపడు) ప్రక్కకుఒరగుట; ఒరగుట.

ఉ. అందున నొచ్చి పంక్తిముఖుఁ డగ్గి గదాహతి మాణిభద్రుమౌళిం దిలకించి కొట్టనఁ జలించి యతం డలమౌళి యోరపాటొందెఁ దదాదిగాఁ రఘుకులోత్తమ యాయన పార్శ్వమౌళినాఁ, జెందె నభిఖ్య.... ఉ. రా. 3. 40.

(మౌళియోరపాటు - మౌళియొక్క యోర పాటు)

**ఓరపారలు** వి. బ. (√ఓర¹) 1. లోపము, కొఱఁత.

గీ. సత్కవీంద్రులు రచియించి చదువు పద్య, సమితియం దోరపారలు చక్క దిద్ది, ప్రౌఢి గనిపింపఁ జేయు భూపాలు కొలువు, ప్రజల కవ్వేళఁ గన్నులపండువయ్యె. కువ. 2. 9.

క. ఆ పట్టణంబులోపలఁ, బూపట్టున దంతు వాయచూడామణి రే, ఖాపట్టభద్రుఁడై విరి, నే పట్టున నోరపార లింతయు లేకన్.

హంస. 2. 11. ('ఓరపార మింతయు' ము|| ది.)

2. అరమర, భేదము.

సీ. ఒండొరుమదులలో నోరపారలు లేక ప్రావు దాపునపైన బలిమి చెలిమి. సుద. 4. 67.

**ఓరమోము** వి. (√ఓర²) పెడమొగము(ప్రాయికముగా వైముఖ్యమును సూచించును.)

శా. ...వా శ్రీహరి,యంచున్ బ్రాహ్మణుఁ డోరమో మిడి...మనుచ. 2. 68.

**ఓరవాకిలి** వి. **దే.** (ఓర¹+వాకిలి) సగము తెఱచి యుండు గుమ్మము, అర్ధవివృతమైనగృహద్వారము.

సీ. తలుపు గిట్టినకుండఁ దఱిమి కొంచెంబైన యోరవాకిట దేహ మొయ్యఁ జొనిపి. కాశీ. 4. 121.

విశే. 1. సగము తెఱవఁబడినది.

ద్వి. ...లోన,నున్న పక్వాన్నాదు లువిదకుఁ గాన, రాకుండఁ దలు పోరవాకిలి చేసి. పండితా. పురా. 96. పొ.

2. సగముతెఱవఁబడిన గుమ్మముకలది

చ. ...తా నొకఁడ వేగ నగారము నొచ్చి యోరవా. కిలియయి యున్న తల్లలితకేళి నిశాంతముఁ జేరి యచ్చటన్. శుక. 2. 220.

**ఓరవుచ్చు** స. క్రి. (√ఓర వోవు) ఓరవోవఁజేయు. (ప్రక్కకుత్రిప్పు.)

వ. ... మిమ్ముం గడగంటం జూచుచు నెమ్మొగం బోరవుచ్చుచు నటఁ గడచి యప్పుడఁతి యెట్లు చనియె మీరెట్లు సహించితిరి ... నైష. 7. 103.

**ఓరవోవు** అ. క్రి. (ఓర¹+పోవు.) 1. ఒరగు.

గీ. అతనిఁ గాంచితి నతఁ డశ్రు లడర వడలు, చూడ్కి నామోము చక్కఁగాఁ జూడ కోర, వోవఁ జూచుచు దీనతఁ బొంది యునికి, గని మనంబున శోకంబు గదుర నేను. భార. శల్య. 2. 9. బస. పు. 6. 563. పం

2. వక్రమగు?

సీ. ...పొలఁతిఁకన్నొమ లోరవోని విండ్లు. చంద్రా. 6. 128.

3. ప్రక్కకుఁ బోవు, తొలఁగు

చ. కదిసిన నోరవోయి...వాసిష్ఠ. 1. 7.

**ఓరసించు** స. క్రి. (ఓర¹) తప్పుకొను.

చ. అన విని యానృపాలకనయామణి వార్ధిగుఱించి వేడ్కతోఁ, జనెడునదీవతంస మొకశైలము త్రోవ వసింపనోరసిం,చినగతి నానృపుం గడచి శీఘ్రగతిన్ మఱి వేఱ యొక్కరాట్తనయుని చెంత నిల్వఁగ ముదం బలరంగ సునంద యిట్లనెఁ ఇందు. 5. 148.

**ఓరసింపు** వి. (ఓరసించు) పెడగాఁద్రిప్పెడి (మోము యొక్క) త్రిప్పు

సీ. విడిచియు విడఁ జాల కెడతాఁకు సిగ్గుమోమోరసింపులయింపు దాఁ సింప. అని 3. 95.

**ఓరసిల్లు(లు)** - ఓసరిల్లు అ. క్రి. (√ఓర¹ - వం. అపస్ర ప్రా. ఒసర.) అసనరిల్లు, తొలఁగు.

క. మగువలు మగ లని యెఱుఁగడు, మృగములఁ గోరసిలఁ డేమి మిడిమేల మితం,డగపడు నని తలఁచితిమి...రామా. 2. 113.

**ఓరసేయు** స. క్రి (√ఓర¹) ప్రక్కకువంచు, ప్రక్కకొరగించు.

ద్వి. ఒకపడ గించుక యోరసేయుటయు, నక లంక మగు వాయు వందులఁ జొచ్చి. రం. రా. ఉ. 10. పొ. 21. పం.

**ఓరి(రీ)** అవ్య. నీచమిత్త్రపురుష సంబోధనమందుపయుక్తము. (ఆమ్రేడితము-ఓరోరి)

ఉ. ఓరి దురాత్ములార...విక్ర. 2. 286.

శా. ఓరీ బ్రాహ్మణధూర్త...ఉ. హరి. 4. 167. శుక. 2. 71.

చ. నట లిట మాను రోరి హరి సర్వమయుండటె యంచు...పారి. 3. 33.

క నోరిననిమండకేనో,రోరియకట... అము. 6. 82.

**ఓరిమి(ర్మి)** వి. (ఓర్చు²) క్షమ, సహనము, సైరణ.

గీ. కోరి యోరిమి నోరెంబు గుడువ వేమి. నీలా. 2. 83.

రు¹ వి. గోడలకును అరుఁగులకును క్రింది భాగ నఁదీర్చి పెట్టు ఎఱ్ఱమట్టిపట్టె.

ఉ. ముత్తెపుఁజాలగమ్పునుపుల్ జిగికెంపు మెఱుంగుటోరులున్ ... పుత్తడియిండ్ల తీర్పులును బొందులవిందు లొనర్చు నప్పురిన్. ముకు ద. 1. 26. పా. 8 పం.

ఓరుతీర్పు – ఓరులుపెట్టు

సీ. ఓరుతీర్చెను గుంకుమోరుపంకిల రేఖ సొగ సూన నొక సూనసురుచిరాంగి. ఇందు. 5. 20. (ఇట్లే ఓరుతీయు. వా.)

రు² – హోరు. వి. గాలివీచుట మున్నగువాని యందగు ధ్వనికనుకరణము. (చూ. ఓరుగాలి) జ: ఓరుగాలి.

రుఁగల్లు వి. దే. (క. ఓర్ – ఏకము) పురవిశేషము, ఏకశిలానగరము.

శా. ఓరుఁగంటిపురంపు సౌధములపై నొప్పారెడిన్. క్రీడా. 65. ఆం. భా. 2. 11.

రుగాలి వి. (ఓరు¹ + గాలి) హోరుమనివీచుగాలి, పెద్దగాలి.

సీ. ఒచ్చెమేమి యొనర్చె నోరుగాలికి దీప మెరగలి కడ వేమి యొగ్గొనర్చె. రామలిం. 68.

సా. ఓరుగాలిలో దీపము పెట్టి దేవుఁడా నీ మహిమ యన్నట్లు,

రెము – ఓగిరము.

సీ. మలమల మాఁడుచు మానసం బెరియఁగఁ బట్టెఁ డోరెము మాకుఁ బెట్టుమనుచు భాగ. 10. ఉ 966.

సీ. నీతల్లి లచ్చమ్మ నే సంతసిల నోరెములు వెట్టుఁ బుడమి వేల్పులకు నెల్ల. అచ్చ. రా. బాల. 15.

ర్చు¹(రుచు) – ఓడించే. స. క్రి. (√ఓరు) ఓడఁ జేయు.

(జయించు)

ఆ. పరశురాముఁ డొండె హరుఁడొండె నరుఁ డొండెఁ, గాక యొరులు గలరె కర్ణు నోరం. బలిమి భీముఁ డొండె బలదేవుఁ డొండెఁ గా,కొరులు నరులు శల్యు నోర్వఁ గలరె. భార. ఆది. 7. 208.

గీ. నీవు మీతండ్రి యట్లన నిఖిలదనుజ, పతుల నోర్వుము దీనిచే ఖాండవేయ. హర. 7. 154.

జ: ఓర్చు¹.

ఓర్చు²(రుచు) స. క్రి. అ. క్రి. సహించు, సైఁచు, తాళు.

సీ. ధనువునా అంగంబులను బరిణతులు దాఁ కోర్తురు పరులకు నోర్వరాని, కోల్తల గలరు... భార. ఉద్యో. 4. 257. కళా. 8. 224.

క. చేరి ప్రణమిల్లి నేరిచి, నేంత నే నడుచుకొన్న నేరము దయ మీ,రోరుచుకొనుఁడు శశాం. 4. 27. (క్షమించు అని భావము.)

ఉ. ఓరి దురాత్ములార దళితోత్పలలోచన నేల యీ క్రియన్,ఘోరకశాభిఘాతములఁ గుందఁగఁ జేసెద రింత కోర్తురే, యారయఁ బుష్పకోమలలు... విక్ర. 2. 286.

(దమయంతి దేవదూతికతో నన్నమాటలు)

సీ. హరియాజ్ఞలంఘించి నాతురోచ్చారపారుష్య భారమున కోరుచునె జిహ్వ. నైష. 8. 150.

సీ. ఏ వేఁడుటకు నీవు బుతు వేల చెప్పెద వువిద మే మందాఁక నోర్వఁగలమె. ఆము 2. 21.

అ. క్రి. 1. సమకట్టు, సిద్ధపడు,

ఉ. ఈదురుపాయ మగ్గురుఁడొ యింద్రుఁడొ రుద్రుఁడొ నీకుఁ జెప్పెదా,మోదరుఁ డింత పాపమున కోర్వఁగఁ జేయునె నిన్ను నర్జునా. భార. ద్రో. 4. 268.

ఉ. అన్నయుఁ దమ్ములుం దమకు నయ్యనగం బిల వేఁడి కాన కి,ట్లున్నమ వారి మాఱొ్క మట కోర్చితి నేనొకబ్రాహ్మణుండనే. భార. ద్రో. 5. 82.

సీ. పాండుసూనులతోడి పగ కోర్చె నెవ్వనియుత్సాహ మూఁది మయోధనుండు. భార. కర. 1. 21.

2. ఓపు, చాలు, సమర్థమగు

క. సేనాధిపత్యమును దగఁ, బూనెద నను మార్కొనంగఁ బురుషుల నుర్వింగావఁ గిరీటికి నొక్కనికే నోర్వ నతండు శరము లెక్కు డెఱుంగున్. భార. ఉద్యో. 4. 149.

సీ. ఓర్చునాఁగలి గూర్చి యొకకొండ్ర యెత్తిన ఫణిరాజుతలగుట్టు బయలు పడదె. కళా. 1. 129.

చూ: ఓరిమి, ఓర్పరి, ఓర్పు², ఓర్వమి.

**ఓర్త** – ఓర్తు. (ఒకర్త యొక్క రూపాంతరము.)

**ఓర్తి** – ఓర్తు. (ఒకర్తి యొక్క రూపాంతరము.)

**ఓర్తు** – ఓర్త, ఓర్తి, ఓర్తుక. న. వి. (ఒకర్తు యొక్క రూపాంతరము – త. ఒరుత్తి) ఒక స్త్రీ; అన్య స్త్రీ.

సీ. పుష్పలావిక యోర్తు బూమెక త్తియ యోర్తు గంధవాహిని యోర్తొకర్తె లంజె కాశీ. 5. 816.

గీ ....ఓర్తోర్తు దియ్యమెక్కఁ, గూడికొని రహస్యక్రియాకుశల లగుచు. కేయూర. 3. 345.

(ఓర్తోర్తు – ఒకతెయు నొకతెయు, ఇద్దఱును.)

క. మునుచెప్పినదియ యుత్తమ, వెనుకటిదే హీనగాఁగ వివరింతురు పద్మిని చిత్రిణి శంఖిని హస్తిను లన నోర్తోర్తుకంటె స్త్రీజాతులకున్. కళాశాస్త్రము. 1. 6. ('ఓర్తుకంటె నోర్తు' అని యన్వయము.)

క. కొలఁదికి మీఱిన నెవ్వగ, నలఁదురి నానావిధంబులైన తమతలంపులగతి నోర్తోర్తునకుం, దెలియ విలాపములు సేయ తెఱఁగెట్లనినన్. నిర్వ. 5. 101. ('ఓర్తునకుఁ దెలియునట్లు ఓర్తు' అనియన్వయము.)

**ఓర్తుక** – ఓర్తు. (ఒకర్తుక యొక్క రూపాంతరము)

**ఓర్పరి(రుపరి)** విశే. (√ఓర్చు²) క్షమావంతుఁడు, శాంతుఁడు.

*సీ. వరఁగును క్షంత యోర్పరి యనఁ దాలిమి కాఁడన...ఆం. భా. 3. 11.*

ఉ. ఓర్పరియందు సత్యవిభవోజ్జ్వలునందు రసజ్ఞశీలలన్, నేర్పరియందు భోగముల నెక్కొను చక్కనివానియందు...కూర్పదురింతు లొక్కయెడఁ గూర్తురె వీనిని నేటికూరుముల్. ప్రబంధ. 657.

**ఓర్పు¹(రుపు)** వి. (√ఓర్చు¹) పరాజయము నొందించుట, ఓడించుట.

గీ. ఓర్పుగలవారలామీఁద దర్పితారి, యోర్పు గలవారు రాజకందర్పులార. పాంచా. 4. 52.

**ఓర్పు²(రుపు)** – ఓరిమి. వి. (√ఓర్చు² – త. ఓర్పు) క్షమ, సహనము, సైరణ.

గీ. ఓ ర్పొకయింతలేని వికచోత్పలలోచనచిత్తవీథిఁ జల్లార్పఁగ నీలనీరదకుభాంగుఁడు వేసనుదెంచె....పారి. 1. 212.

**ఓర్వ(రువ)మి** వి. (ఓర్చు²) 1. ఈర్ష్య.

సీ. ...ఓర్వమి యీరసం బనఁగను నీరస యన
గీ. నీను నామీఁద నాఁ దగు నీర్ష్య.... ఆం. భా. 1. 184

2. సహింపమి, సైఁపమి.

క. మాటలు వేయును నేటికి, హాటకధాన్యాది వివ పదార్థములయెడం, జేటున కోర్వమి తుది: బరిపాటించిన శంభుభక్తిపథము మునీంద్రా, భీమ. 5. 148.

**ఓల¹** వి. (త. ఓలమ్. క. ఓలు.) 1. జలక్రీడాసమయమున 'పట్టుకోచూతము' అని యితరునిఁ బేరేఁచుటకై యుపయోగించునట్టిశబ్దము.

సీ. ఒండొరుఁ బేర్కొని యోలయో లని రేఁచి యదటున జల్లులి గాడియాడి. హరి. పూ. 6. 96.

సీ. ఒక్కింత మునుఁగుచు గ్రక్కున లేచుచు, లీల నీఁదుచు నోలయోలయనుచు. పరమ. 4. 107.

గీ. జలవిహృతికాలశబ్దంబు వెలయు నోల, యన... ఆం. భా. 1. 122.

*2. జలక్రీడ, జలవిహారము.*

సీ. తామంగోలను కందర్పునియోలకు వనిత నీవదనలావణ్యరసము. కళ. 3. 78.

ఓలయిడు, ఓలలిడు, ఓలపెట్టు(బె)ట్టు-ఓలశబ్దము ప్రయోగించు.

క. అలిరేణి యొకతె యొకతో, య్యాలిపై నోలయిడి పలచి యంబుజషండంబునడుమ డాఁగె...ఒనిక. 4. 75.

గీ. ఓలలిడి పట్టనఁగిన నొయ్య నీట, మునిఁగి దవ్వుల తెతురు ముదితలు...యయా. 3. 64. కువల. 3. 132.

చ. తనముఖ మంబుజాత మని దండడి మూవు నలి వ్రజంబుతోఁ, బెనఁగువిదగ్ధ మోల నొక తేల సతిం గని యోలఁ బెట్టి పిల్చిన నది దమ్ముఁ బట్ట నని చేరినఁ దేఁటులదాని మూవికొం,డనుచును గ్రుంకిపోయి చదురాలయి నవ్వుచు లేచె నొక్కెడన్. కు. సం. 9. 287.

సీ. ఈఁత నేర్తు నటంచు నెఱుఁగవా నామీఁద నోలఁ బెట్టటు వోయె దుఁడు మనుచు. ఉ. రా. 6. 80.

జ: ఓలగందము, ఓలచెంగనాలు, ఓలలనాడు, ఓలలాట, ఓలలాడు. ఓలలార్చు. ఓలాడు ఓలార్చు.

ఓల[2] వి. వ్యాజము, నెపము.

గీ. ... ఓల నెపంబు సాకనంగ వ్యాజంబమరు...సాం. ని. మాన. 22.

ఓలగందము వి. (ఓల[1]+గందము) స్నానముచేయునపుడు పూసికొనుటకుపయోగించు పరిమళవంతమగు నొకవిధమైన పసుపు, పూఁతపసుపు; పసుపు.

సీ. అనుదినంబును బ్రాతరారంభవేళల నోలగందమ్ముతో నుదకమాడి. కాశీ. 3. 212.

సీ. పరిపాటలోష్ఠబింబములు తేనియతోలన్ తమ కాంతి యోలగందంపుఁబసుపు. గీ. గాఁగ సౌభాగ్య వివిధమంగళపదార్థ, వర్గములు గ్రంతనదమభావంబు దోఁచె. నైష. 6. 68.

సీ. ఓలగంధపుబొట్టు నుపరిభాగంబుపై సిందూరతిలకంబుఁ బొందుపఱచి. క్రీడా. 1. 134.

ఓలగమగు - ఓలగముండు

వ. .... కొలువుకూటంబున .... ఓలగంబై .... దశా. 1. 14.

ఓలగము వి. (క. ఓలగ. త. ఓలక్కం) 1. కొలువుకూటము, ఆస్థానమండపము.

క. ....తుంబురునారద, గానరసంబభవునోలగంబునఁ బర్వెన్ కు సం. 9. 285. వసు. 1. 15.

క. భ్రాజితమణిభూషాంబరం, రాజివలన సమవిభావిరాజితులగుటన్, భోజుని యోలగమునఁ గవిరాజుల రాజులను దెలియరాదెవ్వరికిన్. భోజరా. 2 55

2. సభ. (చూ. ఓలగమగు, ఓలగముండు)

3. సేవ, కొలువు.

ఉత్సాహ. కానలో మృగంబు లోలగంబు సేయనుండున మ్మౌనిమండలేశ్వరుండు మనలఁగూడుజాడలేదు...రామా. 2. 76.

జ: ఓలగమగు, ఓలగముండు, ఓలగించు.

ఓలగముండు అ. క్రి. (√ఓలగము) కొలువుండు, కొలువుతీర్చియుండు; సభగూర్చుకొనియుండు

గీ. భానుఁడుదయాద్రిపైనున్న పగిది రత్న, ఖచిత సింహాసనంబుపైఁ గడుముదమున, నాత్మ తేజంబు దిక్కుల నాక్రమింప,నోలగంబుండె సకల నేత్రోత్సవముగ. చిత్రభా. 3. 114.

(ఇశ్లే. పేరోలగముండు, మొ.)

వ. పాకశాసనుండు బృందారకులు పరివేష్టింపఁ బేరోలగంబుండి. హర. 3. 37.

(కృష్ణదేవరాయలు) వ. ... నిండోలగంబుండి ...ఆము. 1. 18.

ఓలగించు. స. క్రి. (√ఓలగము - క. ఓలగిసు) కొలుచు, సేవించు.

సీ. సంతుష్టమానసస్వాహాస్వధాకాంత లుభయపార్శ్వంబుల నోలగింప. గీ. ...అవలు నీ

మించి యావిభుం డనియె నిట్లు. చిత్రభా. 4. 63.

సీ. యోగీంద్రవంద్యుఁ డయ్యును నుగ్రసేనుని నోలగించిననాఁటి యొచ్చ మొకటి. జై. భా. 1. 44.

గీ. ఉపనిషత్తులు బోటులై యోలగింప. మమచ 1. 5.

అ. క్రి. సభదీర్చు.

సీ. జాతినీలపుఁదాళిచాకచక్యప్రభల్ కస్తూరి నెఱివూఁతఁ గుస్తరింప, సొగసునూర్యపటంపు సురెవాలు మైతళుక్కుహొంబట్టుదట్టిపై నోలగింప. సారంగ. 1. 79. (ఒప్పియుండు. అని భావము.)

**ఓలచెంగనాలు** వి. బ. (√ఓల¹) అపజయము.

సీ. అపజయసంజ్ఞయై యలరు బన్నము విఱుగోటమి యోడుట యోలచెంగనాలు ... అం. భా. 2. 224.

**ఓలమానగొను¹** (ఓలము¹ + అన + కొను) అ. క్రి. స క్రి. (మఱుఁగున) ప్రవేశించు; (రహస్యస్థలము) చొచ్చు.

గీ. ఎదురుగద్దియ డిగ్గి పృథ్వీశతనయ, యవనికాంతరమున నోలమానగొనియె. నైష. 4. 97.

వ. ఇట్లు పేరెలుంగునం బెదరిన మదవకలహంస కామినీ కామనీయకంబున నమ్మత్తకాశిని తోరంబగు కరవీరంపుటీరం బోలమానగొని. కృ శకుం. 2. 48.

**ఓలమానగొను²** అ. క్రి. (ఓలము² + అన + కొను) దేహము నపేక్షించు; యుద్ధమునకు వెనుదీయు; వెనుదీయు.

చ. మునుమునఁ దాఁగసిల్లి తన మొగ్గరపుం బలుమానుసుల్ గడున్, వెనుకకు నోలమానగొని వీఁగినఁ గ్రమ్మఱఁ గూడఁ గట్టి ...రంగా. 8. 82.

వ. నీలుం డతిరథుం డితనికి సహదేవునకుఁ దెగని పగయైయుండు దానం జేసి యాలంబున నోలమానగొనండు. భార. ఉద్యో. 4. 123.

అ. దొరలు వెన్ను దన్ని పురికొల్పి యిరువురుఁ, జేరి చూచుచుండఁ దెలఁగి యుభయ, బలముఁ బోటులాడఁ జలమున నొక్కింత, యోలమానగొనక యోలి నార్చి. నిర్వ. 4. 60.

గీ. ఆహవోన్ముఖతకు నోలమానగొనక, పిఱుతివియ కిడఁబో కనఁ జేళ్లు దనరు. అం. తే. 14.

క. అతిథి నినుఁ గోరె నేనియు, మతిఁ గింకిరి పడక యోలమానగొనక నీవతనికిఁ బ్రియంబు సల్పుము, సతికిం బతిపనుపునేయఁ జను నెల్లదియున్. భార. అను. 1. 68.

**ఓలము¹** – ఓలిమి. వి. 1. రహస్యస్థానము, మఱుఁగుచోటు.

క. జనములు నూచుచునుండఁగ, జనదు మలము మూత్రమును విసర్జింపఁగ నప్పను లకు శౌచాచరణం, బునకు వనశ్యంబు నోలములు గావలయుఁ. భార. అను. 3. 282.

క. దూరగ్రామంబునఁ బని, పే రొక్కటి చెప్పి కపట వేశలమ్మదుభా.పారసమునఁ దేల్చి గృహద్వారము వీడుకొని పోయి తగు నోలమునన్.

మ. పగలెల్లన్ వెలి నిల్చి రాతిరరుదౌభంగిన్ స్వగేహంబునట్టుగమీఁదన్ వసియించి. కేయూర. 8. 288, 289.

2. చాటు, మాటు, మఱుఁగుపాటు; దాఁపరికము.

గీ. భావజన్మనిపూనికి పారమెద్దు, నన్ను బంటుగా నేలుము నలినవదన, యింక నీసిగ్గుతెర యోల మేల నీకు. భాం. విరా. 2. 118.

చ. వననిధినీటనిల్చి ఖగవల్లభుతో నొకకూర్మముఖ్యుఁ డిట్లనియె మదీయబంధునివహంబులు దేవరవాతఁ ద్రుంగె నేనిచ్చి నాఁడ నిప్పటికి నాకుఁ దొలంగినఁ బోదు నీకు నాకు నొకటి పన్నిదంబు సమకూరునె యోలముమాని చెప్పుమా. కేయూర. 3. 56. శు. సం. 11. 624.

విశ. 1. మఱుఁగైనది, రహస్యమైనది.

సీ. ఇయ్యోల మగుచోటనిందాఁకఁ దెలుపుండు గాఢంబుగా నన్నుఁ గౌఁగిలించె. భాగ. 10. పూ. 1033.

2. గంభీరము, లోఁతైనది.

చ. సుదతులనున్న క్రొవ్వెదలఁ జొచ్చెనొ కాంతల రోమరేఖలం, దొదిఁగెనొ పుష్ప కోమలల యోలపునాభుల లీనమయ్యెనో, ముదితల చూడ్కిఁ జేరెనొకొ ముగ్ధలరెప్ప లలోన డాఁగెనో,వెదకిన లేకపోయె నథి వృద్ధతమంబు విధూదయంబునన్. కవిక. 4. 181.

ఓలముకొను – చాటుచేసికొను

వ. ఇట్లెట్టకేనియుం బరమేశ్వరావాసంబు సొత్తెంచి దహనాంబకు దృష్టిఁ దప్పించి కెలనం దమాలలతా వేష్టితాశోకసహకారంబు నోలంబుగొని త్రినయనుం గనుగొని .... కు. సం. 5. 494.

జ: ఓలమాసగొను¹, ఓలిమి.

**ఓలము²** వి. దేహము.

శా. ఓలంబాసకు నేక మత్స్యముతో నుప్పొంగి పెక్కుడులున్, లీలాకారమునన్ గొలంకు నడుమ న్మిట్టాడునక్రంబుతోఁ, జాలంగయ్యము చేసి చిక్కినమదస్తంభేభస్వామి మై, కేలం బట్టి నిమిర్చినట్టిహరికై కృష్ణాంబుభృన్మూర్తికై. అష్ట. 4. 320.

జ: ఓలమాసగొను².

**ఓలము** సం. విశ. (అ. అ. అ.) తడిసినది. వి. అ. పుం. కంద, సూరణము (వృ. వి.)

**ఓలలనాడు** – ఓలాడు.

క. కలలోనఁ గన్నరూపముఁ, గలలోవన కౌఁగిలింపఁ గంటిఁ బిదప నో,లలనా నీపలుకులనో,లలనాడితిఁ గాని పతిఁ దలంప నెఱుంగన్. ఉ. హరి. 5. 107.

**ఓలలాట** వి. (√ఓలలాడు) ఓలలాడుట, జలక్రీడ

సీ. పడఁతు లొక్కరొకళ్లపైఁ జల్లుజలబిందు లొడలు సోఁకినఁ బోక యోర్చియోర్చి, యోలలాటలతమి నొండొరుఁ దఱుము చెల్వలడాక కులుకక మెలఁగి మెలఁగి. ప్రభా. 2. 106.

**ఓలలాడు** – ఓలాడు అ. క్రి. (ఓలలు+అడు.) జలక్రీడచేయు, ఈఁదు; స్నానము చేయు.

క. ... కొలనన్, గేళీలాలసగతి డిగి,యాళీ నివహంబు లోలలాడెడు వేళన్. మనుచ. 8. 85.

గీ. అప్రమేయుండు విష్ణుండు నాదికాల,బుద్ధి సర్వంబు మానసంబునఁ దలంచి,యోగ నిద్రానుభవకేళి నోలలాడె, నింద్రియార్థాస్తరణభుజగేంద్రశయ్య. వరాహ. 7. 11.

గీ. ...సంభృతోత్సాహలీల, నుబ్బి భూతబేతాళంబు లోలలాడ, నిట్టలంబగు నెత్తురుటేఱు పఱపె, భార. ద్రో. 1. 146.

వ. తుల్యభాగతోయంబుల మునుఁగుదము కణ్వవాహిని నవగాహింతము కొంతేయంబున నోలలాడుదము. భీమ. 6. 106.

**ఓలలార్చు** – ఓలార్చు, స. క్రి. (ఓలలాడు) ఓలలాడించు, (జలాదులందు) విహరింపఁజేయు, స్నానమాడఁజేయు.

వ. రక్తనదీప్రవాహంబు భవదీయ సేనామధ్యంబునం బఱపి బేతాళక్రవ్యాదాది భూతంబుల నోలలార్చె....భార. భీష్మ. 2. 166.

ఆ. ...వసుమతికి, భక్తినోలలార్చి భగవత్ప్రపన్నుఁగాఁ, జేసి.... ఆము. 4. 5.

(కృష్ణుని) సీ. గంగఁ గాటుకకొండ గవ్వ నొప్పిదము దళ్కొత్తనావులపాల నోలలార్చి. పాండు. 2. 109. (అభిషేకించు అని భావము.)

**ఓలాకు** వి. 1. అలయిక, శ్రమము. 2. వ్యాకులత, క్షోభము. (చూ. ఓలాకుపడు.)

జ: ఓలాకుపడు.

**ఓలాకుపడు** అ. క్రి. (√ఓలాకు) 1. అలయు, శ్రమపడు.

వ. తరుణతరుణీజనంబులు..వినోదంబుల నదటు

మీఁటి కడచి చనం బఁగ్వాంధజరఠ ప్రముఖులు క్రుస్సి యోలాకుపడ నెడనెడం గావలితగువారు నడపింప.. పారి. పూ. 6. 22.

2. శోభపడు, వ్యాకులపడు.

వ. సుశర్మయు .... గోగణంబులయగపాటూహించి జతనంబుతో నడచుచుండియు వెసఁ గుందక వేగిరంపుఁబయనంబు లయ్యును బ్రజల నోలాకుపడనీక ... వేగులవారివలన విరాటు తొట్టులున్నయెడ యెఱింగి కదుపులం గార్చిచ్చుచందంబునం బొదివి వెలిచిన. భార. విరా. 3 131.

**ఓలాడు** – ఓలలాడు, ఓలలనాడు. (ఓల¹ + ఆడు.)

అ. క్రి. (జలాదులందు) విహరించు, జలకమాడు.

గీ. అలసి చెమటలు వాయ నోలాడఁ దలఁచి. యయా. 3. 54.

ను. కురనెం బువ్వులవాన చూపఱులచూడ్కుల్ వేడ్క నోలాడఁగా. రాజ. చ. 1. 88.

**ఓలార్చు రుచు)** – ఓలలార్చు. న క్రి. (√ఓలాడు) ఓలాడఁజేయు. (జలాదులందు) విహరింపఁజేయు.

దఁడ...సౌఖ్యవారాశి నోలార్పవే .... పారి. 8. 38.

శా. ఒయ్యం జేరఁగ వచ్చి మాశివుని నే నోలార్చెదం గానఁ దే,వయ్యా యితురసంబుతుమెఁ డనుచుం బ్రార్థించి నేమించినన్. హర. 2. 7. (ఇట – అభిషేకించు అని భావము.)

**ఓలి¹** వి. సం. ఆళిః. ప్రా. ఓలీ–ఇది తృతీయాంతముగానే ప్రయోగములందుఁ గనఁబడుచున్నది.)

1. వరుస, క్రమము.

గీ. ఒగి వరుస యోలి సారిదినా నోజనాఁగఁ, గ్రమమునకు నాఖ్యలు...ఆం. శే. 16.

(చంద్రోపాలంభము.) ఉ. ఎందఱో, వేలుపులోలిమై ననుభవించిన రెండవయావిషంబు ని,ర్మాలము గాక యున్నయది ముద్దియ పాంథులపాప మెట్టిదో. వై ష. 2. 121.

ఉ. అమ్మెయిఁ బాపముల్ వోలియునంతకు దుఃఖములంది కీట,జ,న్మమ్ములఁ బక్షియోనులఁ గ్రమంబునఁ బొంది మృగత్వమానుష,త్వమ్ముల నోలిఁ బొందుదురు....భార. అను. 5. 172

2. వాక్యాలంకారముగా నుపయోగింపఁ బడి కొన్నిపట్ల సందర్భానుసారముగా 'బాగు. సంపూర్ణత' మున్నగు నర్థములనిచ్చును.

గీ. ఏల మ్రింగితి వాతాపి నిల్వలు నిల, నేల ద్రోచితి ఒవినుండి యోలి నహుషు. కాశీ. 2 157.

గీ. వాఙ్మనసగోచరేతరాద్వైత రాగ. జలధి నపు డోలిఁ దేలి రాజన్యమౌళి, ఘనతరాశ్చర్యశాలియై...వసు 2. 69 (ఓలిన్:- బాగుగా అని భావము.)

గీ. స్త్రీలు దుర్జనగోష్ఠి వర్జించి కులము. శీలమును గొల్ల పుచ్చక యోలి భర్త్రు,వశత వర్తించిరేని వై వస్వతాల,యంబుఁ జొరక ప్రవేశింతు రమరపురిని. జాహ్నవి. 8. 79. (ఓలిన్:– నిండుగా అని భావము.)

**ఓలి²** వి. ఉంకువ, కన్యాశుల్కము.

ఆ. ఓజమాలుపొలఁతి యోలిమూటలు చేటు, పోటు కెడలుబంటు కూటిచేటు, పనికిమాలు కొత్తు ఒత్తెంబుచేటురా. వేమన. 2. 17. ఆం. భా 2. 179.

సా. ఓలి తక్కువ యని గ్రుడ్డిదానిని బెండ్లియాడిన నెలకు మూఁడావము లగును

**ఓళిగ** – వోళిగ. వి. భక్ష్యవిశేషము, బొబ్బట్టు. (శ. ర.)

**ఓలిమి** – ఓలము¹. వి. చాటు, మఱుఁగు.

గీ. మఱుఁగు చాటోల మోలిమి మాటు మూఁత, యనఁగ వ్యవధానమౌ .. ఆం. భా. 1, 76.

**ఓల్లము** సం. – ఓలము. (మే ని.)

**ఓవము** – ఓదము. వి. ఏనుఁగు మున్నగువానిని బట్టు కొనుటకై త్రవ్వినగోయి, అవపాతము

గీ అనుచుఁ బలుకుచు నట వీరు లటవి కిటుల, వలలు ఘటియించి నరగ నోవములుద్రవ్వి.

బోను లమరించి తెరలెత్తి పోఁగువాఱి,
చుట్టియునుకుల మెకములఁ జోవుపెట్ట. రా. వి. 3. 58.

సీ. ఎలయించి నేల్పు ఱేఁ డెక్కు నేమఁగు నైన, నోవంబులోపలఁ ద్రోవఁ గలము. వరాహ. 4. 75.

**ఓవరి** వి. (సం. అపవరకః ప్రా. ఓవరి అ. క. ఓవరి.) 1. లోపలిగది, గర్భాగారము; ఇల్లు.

ద్వి. చంద్రశాలలఁ గేళిసౌధవీథికలఁ, జంద్రకాంతశిలావిశాలవేదికల, గాజుటోవరుల బంగరు పడుకిండ్ల. రం. రా. బాల. 83. పా. 11. పం.

ఉ. ఓవరిలోన గొంది దెస నున్నవి యెన్ని యెయెన్నఁ బెద్దబా...డావలి .... హరి. పూ. 5. 216.

క. నఁ పతివ్రముఖసర,త్సరిసరమున నోల మైన పట్టున నావు,మ్కరికకు నేకత మొక యో,వరి గలుగుట నందుఁ జని యవారిణ నచ్చోన్. దశకు. 7. 100.

2. చంద్రశాల, శిరోగృహము.

ఉ. ఆపురి మించుటోవరుల నాడు మెలంతల గాన మాధురిన్, బ్రాపితజీవలయ్యును దదగ్రమణిప్రతిమల్ నిమేషము.ప్రాపలి శాదివై కృతముఁ దాల్పవు ప్రాంతపరిభ్రమత్క్రియా,మాపతిబింబనిర్గళదమందసుధారసధారఁ దోఁగుటకా. హ. వ. 1. 8.

సీ. ఓవరిపైని నీకునికిఁ గావించిరే బజగెడి యని దూఱు భావగారు శుక. 3. 204.

కేఁగెయోవరి — లతాగృహము.

వ. పల్లవసముల్లసితం బగు సహకారంబునీడ మవ్వంపుఁదీఁగెయోవరిం బుప్పొడి నొప్పెడి యరఁగుమీఁద...పి. శకుం. 3. 40

**ఓవిరము** — ఓగిరము.

వ. వంగేశ్వరదేవరకూం బరివారదేవతలకూ ...మాపటిఓవిరం బియ్యగా. ఈ ఓవిరాల పప్పునకుం బెసలు మా. 8. ఈ ఓవిరాలకు బెయి సోలలు. 8. 1173. దుర్గి. శా.

**ఓవు** — ఒప్పు. అ. క్రి. సరిపడు, గిట్టు, అనుకూలమగు.

ఉ. ఓవరవైశ్యవంశగలశోదధిచారుహిమాంశు రేఖనీ,వోవనివారిముందఱ నయో మగనిం గడశాలఁ ద్రోచి నేఁ,డీవనుభేళునిం గలయ నెంచితివెల్లు...శుక. 1. 70.

**ఓషణము** నం. వి. అ. పుం. కటురసము, కారము.

**ఓషణి** నం. వి. ఈ. స్త్రీ. శాకభేదము (వ్య. వి.)

**ఓషధి** నం. వి. ఇ. ఈ. స్త్రీ 1. ఫలించినతోడనే నశించెడి వరి అరఁటిచెట్టు, మొ. 2. మందున కుపయోగించుమొక్క తీఁగ, మొ. 3. దీపము వలె వెలుఁగు తృణజ్యోతి, జ్యోతిష్మతి. (వ్య. వి.)

**ఓషధిధరుఁడు** నం. వి. అ. పుం. 1. మందుమూలి కలమ్మువాఁడు. 2. వైద్యుఁడు.

**ఓషధిప్రస్థము** నం. వి. అ. పుం. హిమాలయమందలి యొకానొక పెద్దపట్టనము.

**ఓషధీశుఁడు** నం. వి. అ. పుం. చంద్రుఁడు (ఇట్లే ఓషధిపతి, ఓషధినాథుఁడు, మొ.)

**ఓషము** నం. వి. అ. పుం. కాల్చుట.

**ఓష్ఠకుఁడు** నం. విశే. (అ. స్త్రీ. ఆ.) పెదవులను అలంకరించుకొనువాఁడు.

**ఓష్ఠజాహము** నం. వి. అ. న. పెదవియొక్క మూలము.

**ఓష్ఠపుష్పము** నం. వి. అ. పుం. బంధూకము, మంకెన చెట్టు. న. మంకెనపువ్వు.

**ఓష్ఠప్రకోపము** నం. వి. అ. పుం. ఒకవిధమగు పెదవిరోగము.

**ఓష్ఠము** నం. వి. అ. పుం. — ఉష్ణాహారముచేతఁ గాఁదునది — పెదవి.

**ఓష్ఠి** నం. వి. ఈ. స్త్రీ. — ఓష్ఠతుల్యమగు ఫలముల నిచ్చునది — బింబిక, దొండతీఁగ.

**ఓష్ఠ్యము** నం. విశే. (అ. అ. అ.) 1. పెదవులయందున్నది. 2. పెదవులయందుఁ బుట్టునది. (ప, ఫ, బ, భ — మొ.)

**ఓష్ఠ్యము** నం. విశే. (అ. అ. అ.) నులివెచ్చనైనది,

ఇంచుక వేఁడిమైనది, వి. అ. పుం. ఇంచుక వేఁడి, నులివెచ్చన.

**ఓసరించు** స. క్రి. (√ఓసరు.) 1. తొలఁగఁజేయు, అపసరిల్లఁజేయు.

ద్వి. పొంగి చిమ్ముటుకఁగఁ బోవుచుఁ జీర, కొంగోసరించు పెన్వెంగలియట్ల చెల్లుఁ బొమ్మని సన్న్యసింపఁ బోవుచును,నిల్లప్పగించు నయ్యెబ్బందియట్ల. బస. పు. 8. 1140. పం.

గీ. సారె జంకించె దేటికే సాంసాటి. యేల మేనోసరించెదే యిగురుఁబోఁడి. దశా. 9. 285.

2. విడుచు, త్యజించు; విసర్జించు.

గీ. మలినవర్తనుఁడును సుధాలలితమూర్తి, మించి వర్తించుమతిలేని మేదకుండు, మౌని వర్యులఁ జదివించు మట్టినీడఁ, బంచముఖు వీట మే నోసరించె నేని. పాండు. 1. 101. (మేనోసరించు - చచ్చు, మరణించు.)

గీ. ముటపముల నుజ్జగించినముగుదనడుపుఁ, గలికి చూపుల వీడ్కొన్నకన్నుఁగవయుఁ, జిఱునగవు నోసరించినచిగురుమోవి, యింతి మది భీతి వెలుపలి కెఱుక సేయ. ఉ. హరి. 1. 57.

ఉ. ...ఈ,దాసరి నోసరింపవలదా సరివేశ్యలు నవ్వకుండఁగన్. వైజ. 3. 94.

క. అని యిట్లు దేవతా ప్రార్థన మాపాదించి గురులఁ బ్రణుతించి పురాతనకవుల నెంచి దుష్కవి, జనపశువుల నోసరించి సమ్మద మొదవన్. నిరం. 1. 10.

అ. క్రి. 1. ఓసరిల్లు, అపసరిల్లు, తొలఁగు; అంతరించు, పోవు.

వ. తడసినఁ గర్జంబు దప్పు నితనికి నోసరించి పోవలయు... భార. ద్రో. 4. 12.

వ. భయంకరంబగు వతి సంకులంబున సామజ వాజిరథంబుల యుపవడికి నోసరింపని కాలుబలంబులు... భార. భీష్మ. 1, 267. కు. సం. 4. 457.

శా. ...కూర్కులు సందడించె వడ చండించెన్ మృదామోదముల్,గాంచెన్ వాతెఱ యోసరించెఁ ద్రిదశుల్ నానాఁటికిన్ బోటికిన్. విజ. వి. 2. 36.

2. విముఖుఁడగు, ఇష్టపడకుండు.

చ. ఘనుఁ డతఁ డేఁగుదెంచి సరిగద్దియ ముండ నగారి శైలభం,దనకథ చారణాళి పొగడన్ నిజసన్నుతి కోసరించు నే,ర్పునఁ దలవంచి పీఠతటరూఢమణిన్ బొటవ్రేల మీటు.... వసు. 1. 122.

**ఓసరింత** వి. (√ఓసరించు) ఓసరిల్లుట.

(ఎడతెఱపి)

చ. వలపులరాజువేడబమొ వారలయద్భుత మోహాభారమొ. తెలియదు నిచ్చలున్ దనివి దీరని ముచ్చట లోసరింత లే,కల రెడి కౌఁగిలింత లెడ లన్నది విన్నది లేని కూర్మలున్, గలఁకలు గానికూటములుఁ గల్గిరమించిర మించి రర్వురున్. ఉ. రా. 6. 165.

**ఓసరిల్లు(లు)** అ. క్రి. (√ఓసరు.) 1. ఒదుఁగు, అపసరిల్లు, తొలఁగు; (పని మొదలగువాని నుండి) తప్పుకొను.

క. ఓసరిలి పఱచుమృగముల,నేనియు డాసిన మృగముల నెగచి భుజాసిన్, ద్రేసియుఁ జంపెను మృగయా,వ్యాసక్తి నపారఘోర వన్యమృగాళిన్. భార. ఆది. 4. 18.

సీ. ఎదురుగాఁ జనుదెంచు నిందీవరాక్షుల కొయ్యనఁ దెరు విచ్చి యోసరిల్లు. నైష. 3. 64.

గీ. ... చొచ్చెఁ బ్రీతిసఖుఁడుఁ దానును రథ ఘోటకకటకంటి, యూథ సంబాధముల కొయ్య నోసరిలుచు, మందగతి నోరుగల్లు గోవిందశర్మ. క్రీడా. 132.

గీ. అరయ నిది యెంతపని యైన నయ్యెఁ గాని, యోసరిలవచ్చునే మన కొడయఁడైన బ్రాహ్మణుఁడు కోరి చెప్పినపముల కెల్లఁ,బూని వేగంబ యరుగక మానరాదు. హరిశ్చ. 5. 22.

2. తగ్గు.

గీ. ఓసరిలెఁ దగ్గెఁ దఱిఁగె నా నొప్పు దక్కు-వాయె ననుమాట....ఆం. భా. 3. 95.

**ఓసరు** – ఓసరిల్లు. అ. క్రి. (సం. అపసృ. ప్రా. అవసరఇ. క. ఓసరిసు, ఓసర.) తొలఁగు, అపసరిల్లు.

ద్వి. అదిరిపాటున నొంటి వరిగిరి వేని, ముదిత నీపైఁ జాల మోహింపఁగలదు, నోజ గాదని నీవె యోసరితేని, రాజుతోఁ జెప్పి వైరమ్ము ఘటించు. ద్వి. సారంగ. 1. 17. పా. 14. పం.

జ: ఓసరించు, ఓసరింత, ఓసరిల్లు.

**ఓసి(సీ)** అవ్య. నీచమిత్రస్త్రీసంబోధనమున నుప యుక్తము.

ఉ ఓసి దురాత్మురాల...మనుచ. 4. 82.

ఉ. ఓసి యిదేమి యీ నడత యెప్పుడు సాధ్వి వటంచు నమ్మితిౕ. కళా. 4. 14.

శా ఓసీ నీకొఅగామియే యిది ... కళా. 3. 216.

**ఓహటము** వి. వెనుదీయుట. (శ. ర. చ. ని. చూ. ఓహటించు.

జ: ఓహటించు, ఓహటిలు.

**ఓహటించు** – ఓహటిలు. అ. క్రి (√ఓహటము.)

1. వెనుదీయు.

గీ. ఆహవంబునయందు నీ వోహటించి, పోవ నడివచ్చు నడికంటెఁ జావు మేలు. భార. స్త్రీ. 2. 33.

చ. నెప మిడి యోహటించి యిటు నీవు దొలంగినఁ బోవవచ్చునే, కుపితమనస్కుఁడై నరుఁడు గూల్పఁ గ్రమంబున దొడ్డ లెల్లఁ జన్నపిదప నెట్లుఁ జచ్చెదు...భార. ఉద్యో. 4. 249. ఆం. శే 12.

2. జంకు, భయపడు.

ఆ. మర్మభేదులైన మార్గణంబుల కోహటించి సిగ్గుఁ జలము డిగ్గఁ ద్రావి, యెల్లజనులుఁ జూడఁ బొల్లఁదనంబున, కొర్చి యక్కుమారుఁ డోడి పాఱె. భార. కర్ణ. 1. 188.

చ. నగరి సమీపమైన నర నాథునిసన్నిధి కోహటించి నెమ్మొగము వివర్ణతం బొరయ మోసల నల్లన తేరు డిగ్గి నెవ్వగ దలకొన్న వేఁగడరి వ్రాలుగతిం దలవాంచి యేఁగె సౌమ్యగుణవిభాసి లక్ష్మణకుమారకుఁ డా నృపుఁ డున్నచోటికిన్. నిర్వ. 9. 69.

3. ఓడు.

గీ. నవసమాగమ వేళ నయ్యవసరమున, మవి ద లజ్జాభరంబున కోహటించి, యెదుపడి నేసె వలరాజునంతవాఁడు, నరయ నెవ్వాని సొమ్ము జయాపజయములు. వైజ. 7. 168.

సీ. ఓహటించె ననంగ నోడె నంచును దోఁచు ...ఆం. భా. 3. 67.

**ఓహటిలు(ల్లు)** – ఓహటించు అ. క్రి. 1. భయపడు. జంకు.

(శివునిఁగూర్చి పార్వతి యన్నమాట.) క. అకటా పదుగురలోఁ బదునొకఁ డైతి వి దేమి నాథ యొనరఁగ మునిపా, యకుని తపస్థితి వేఱొక, టికి వ్రజితి దాన నోహటిల నేమిటికిన్. చంద్రా. 3. 185.

2. ముక్కు, జలయు.

క. తాపసనాథుఁడు వలికినఁ, దాపసనాథుఁ డగు రాజతనయుఁడు ముంతే, మోపి మొగ మెత్తి నెమ్మన, మోపిక లే కోహటిల్లి యునురను రనుచున్. సారంగ. 3. 134.

3. రూపఱు, లయమందు.

గీ. కంతుఁడును నీవిధుండు నొక్కంత వారు, సఖ్యమీయిద్దఱకు నొప్పు సదృశు లగుట, ముదిత యొక్కండు హరుని వెన్నుదుటి కంట, నొకఁడు కంసారి కుండికంట నోహటిలిరి. వైజ. 8. 179.

శ్లో. స్థానే విధో ర్వామదనస్య సఖ్యం, సకంథు నేత్రే జ్వలతి ప్రవీనః, అయం లయం గచ్ఛతి దర్శభాజి, భాస్వన్మయే చతుషి దాది పుంసః. సం. వైష. 22. 89.

**ఓహరిసాహరి** అవ్య. ద్రు. అహమహమికతో, సాహంకారముగా.

వ. ...ఉభయబలంబులుం బురికొని యోహరి
సాహరిం బెనంగుచుండె ... భార. ద్రో.
3. 140.

ఉ. మత్తగజంబులీలఁ జెలుమామిళ వేంకట
రామ శౌరి పు, త్రోత్తముఁ డైన
రామవిభుఁ డోహరి సాహరి శత్రుకోటిపైఁ
గత్తి జరినదూసి యెనకం బెనఁగన్ జళి
పింప...కృ. శకుం. 1. 80.

ఉ. అహరిఁ జూచి వేలుపు లహంకరణంబుల
దైత్య సేనతో, నోహరిసాహరిం బెనఁగ
...వరాహ. 6. 114.

సీ. ఓహరిసాహరి నుయ్యాల చేరుగా వెనుకొం
చుఁ దెలుచుఁ బెనఁగుచెడలు. భార.
విరా. 3. 164.

ఉ. ఓహరిసాహరిం బ్రథమ మొత్తెడుధారల
గాడ్పు లేటవా,ల్గా హతి నిడ్చ ... ఆము.
4. 93. (ఎడతెగక, అవిచ్ఛిన్నముగా –
అని భావము)

క. పురికొనుచుం దెరలుచు నో,హరిసాహరి
నొక్కచోట నలవడు నొకచో, విరియు
నొకచోటఁ దిరుగుం, దిరుగక యొకచోట
రెండు తెఱఁగులు నొచ్చున్. భార. భీష్మ
2. 173.

(గుంపులుగుంపులుగా- అని భావము.)

వి. అహమహమిక.

సీ. అహమహమిక పేరు రహికెక్క నోహరి
సాహరి యనఁగను...అం. భా. 2. 221.

**ఓహా** - ఓహో. (చూ. ఓహోహో.)
బ. ఓహోహో.

**ఓహో** - ఓహా. అవ్య. (సం. అహో. క. త.
ఒహో)

1. సంబోధనమునందువచ్చును

క. ...ఓ,హో తతక క్రమ్మఱు మని,యాత
తభయుఁ గ్రమ్మఱించె నాస్తికుఁ డెడఁ.
భార. ఆది. 2. 234.

శా. ఓహో నామొఱ యెవ్వరున్ విననియట్లు
న్నారొకం డైన మీ,నాహోదర్ప మెలర్పఁ
దాఁకఁదగదే.. భా. రా. అర. 2. 109.

2. పిలుపునకు మాఱుపలుకుటయం దుపయో
గింపఁబడును.

సీ. పిలువకుండఁగ నైనఁ బలుకు నోహోయని
బయలూఁతగొనఁ జూచుఁ బాఱుఁ జూచు.
కవిక. 4. 161.

3. ఆశ్చర్యప్రశంసాదులనుదెలుపును.
(ఆశ్చర్యమునకు)

శా. ఓహో విస్మయ మంచు నే మనసులో
నూహింపనమ్మౌని భూ,యోహుంకారము
చేసినఁ....వరాహ. 9. 140.

(ప్రశంసకు)

క. ఓహో యనువారును బహు,భావవిరా
మోదములకుఁ దలయూఁచుచుఁ దా,రాహా
యనియెడువారలు, నై హేమమయాస
నముల నధివసియించన్. వరాహ. 10. 4.

(అధిక్షేపమునకు)

మ. కడుఁ జోద్యం బిది పంచభూతపరిపాక
ప్రాప్తచైతన్య మీ,యొడలే యాత్మను
సత్యవాదులఁట యోహో నాస్తికుల్
దేహముం, బడఁ గానాత్మయు వేఱయుండు
నని దబ్బర్లాడు వారాస్తికుల్, పుడమిం
బూజ్యులు నైనవారలఁట యీ బొంకుల్
వినం బోలునే. ప్రబోధ. 2. 32.

హ. ...కామశా,స్త్రోపాధ్యాయిని నా వచిం
చెదవు మే లోహో త్రయీధర్మముల్,
పాపంబుల్ రతిపుణ్యమంచు ... మనుచ.
2. 64.

బ: ఓహోరె, ఓహోహో.

**ఓహోరె(రే)** అవ్య. (ఓహో+రె.) బహి, ఆశ్చర్య
ప్రశంసాదులను దెలుపును.

మత్త. ధార తప్పక చెప్ప నేర్తు వుదారవాక్య
తుటత్వ మో,హోరె నాఁగఁ బ్రబంధ
మొక్కటి యొక్క- నాఁటనె.. సమీర
1. 15.

సీ. చల్లనై యోహోరె యుల్లాసిత మొసంగె
స్ఫురితవిస్ఫూర్తి భావురె స్ఫురించె.
సమీర. 6. 218.

శా. ఔరా మీటు ఖళీరె కంపిత మహో యాం
దోళితస్ఫూర్తి యో,హోరే మూర్ఛన
శాపురే శ్రుతులు మే లుల్లసితప్రౌఢి ....
చంద్ర. 1. 127.

ఓహోహో - ఓహోహో. అవ్య. (ఓహో + ఓహో) ఆశ్చర్యాదులను దెలుపును.

మ. ...శూన్యమనస్కు(డై ధనమదాంధుల్ మెచ్చ( గే ల్మోడ్చు భూ,జము( డో హోహో వృథా విడంబ మగు తృష్ణం జేసి యేయే విధే,లనముల్ సల్పునో కో యి( కన్...మల్ల. వై రా. 4.

ఉ. మోహాకరస్తనోచ్చలనముల్ గనిపింప(గ వేసవిన్ బ్రసా. గేహవిలాసినుల్ పసి(డి గిండ్ల జలం(బులు దేర( కాంధులో,హోహో లసత్పయోధరము లున్నతపుంగలశంబు లం(గభూ, దాహము దీర్చికొందుము గదా దయచేసిన నం(ద్రు నవ్వుచున్. కవిరా. 4. 14.

ఓహోహో - ఓహోహో. అవ్య (ఓహో + ఓహో) ఆశ్చర్యసంతాపప్రశంసాదులను దెలుపును.

శా. ఓహోహో యిది యేమి యంచు సభలోనున్నట్టిదైత్యాధిపుల్, హాహాకారము నం గలంగుచును...దశా. 4. 172.

# ఔ

ఔ ఉభ. ఒకానొక యక్షరము.

(పెక్కు పట్ల తత్సమేతరపదములలోని 'ఔ' కారమునకు 'అవు'ను, 'అవు' నకు ఔకారమును వికల్పముగా వచ్చును చూ. ఆహోబల పండితీయము. 406 పా ఉదా. ఔను, అవును – కౌను, కవును.)

ఔ – అగు

అ క్రి. (అవు)

మ. ... హింసయదియౌనో కాదో ... భార. అర. 5. 57.

అవ్య. ద్రు. (అట్లే)

ఉ. పర్వతసార్వభౌముసుతపై ననురాగము సంప్రరూఢమై,శర్వునిచిత్తవృత్తి కొనసాగుచునుండుట కానవచ్చుటం,బూర్వపు( దప్పు( జేసి వెఱ( గొందుచున్నయనంగు( డెంతయున్, నిర్వృతి( జెందె నౌ( దవదునీతిఫలించి తనంబు పండెవగా. హర 4. 44 (అది సహజమే - అని భావము

(ప్రశంసను దెలుపును)

చ ...భట్టహర్షునికవితామగుంభములు నోమరి పోతులు కొందఱయ్య ఔ,నని కొనియాడ నేర రది యట్టిద.. నైష 1. 17.

ఔలెండు – అగులెండు. (చూ. అగు - ఔను + లెండు.) సరేలెండు. (ఇది వ్యతిరేక లక్షణచే అసమ్మతిని దెలుపును.)

శా. ఔ లెం దేమిటిమాట హా పయనమా హాస్యానకుం బల్కుటో. శశాం. 2. 182.

క. ఔ లెండ యేటిమాటలు, మేలే యిది బ్రదికినట్టిమీ(దట(గద యా,జోలి...శుక. 2. 150

ఔలెమ్ము(లే) - అగులెమ్ము (చూ. అగు - ఔను + లెమ్ము) ఏది యెట్లయినను గానిమ్ము:– అను నర్థము నిచ్చును.

మ ఇది భోజాత్మజ కిచ్చినం గినుకతో నేమంచు నూహించునో,మది సాత్రాజితి దాని కేనిపుడు ప్రేమన్ బంపినన్ దీని నె,ల్లిదముం జేసిన జాడ దోంచునో కో యౌలె మ్మిందునే నుస్కి( జెల్లదు,హో యేరికి( బంప(గానను చు లీలన్ రుక్మిణీకాంతకున్.

చ కను గవ( బిన్ననవ్వు దొల(క న్మునినాథుని కన్నుసన్న ని,చ్చిన...పారి. 1. 54. 55.

జ: ఔ(గదే, ఔ(గా, ఔ(గాక, ఔ(గాదను, ఔ(బొమ్ము, ఔగాములు, మొ.

ఔ నం వి. ఔ. పుం. అనంతుడు, శేషుడు.. స్త్రీ. విశ్వంభర, భూమి.

**ఔఁగదే** – అగు(వు)ఁగదే.

సీ. ఔఁగదే లావణ్యమౌఁగదే మాధుర్యమౌఁ గదే సతినవయౌవనంబు. భాగ. 8. 305.

**ఔఁగా** – అగు(వు)ఁగా.

**ఔఁగాక** – అగు(వు)ఁగాక.

(అంగీకారమునుదెలుపును.)

క. అనవుడు వందఱు నౌఁగా,కని సంతస మంద నధిపుఁ డభిషేకించెన్, జను లెల్ల సంప్రమోదం,బునఁ బొందఁగ నప్పు డతి విభూతిం బ్రభులన్. భారం. ఉద్యో. 4. 141

**ఔఁగాదను** – అగు(వు)ఁగాదను

(ఆలోచించు)

ఉ. యాదవసింహ నాతలఁపు నప్పుఁడు వారల పాటొకింత యౌఁ,గా దనుదాఁక లేదు గలఁకంబడఁ బొచ్చె...ప్రభా. 1. 83.

(విమర్శించు.)

క. అన్నపటుమీఁద రాజవు,ని న్నౌఁ గాదనుట నాదు నేరమి యైనం గన్నది యనకున్నను విన,కున్నను గపట మది మనకు నొండొ రులయెడన్. రాఘవ. 4. 103.

**ఔఁగు** – అవుఁగు. వి. భక్ష్యవిశేషము.

మ. ఇడి రమ్మౌనికి .... కుడుముల్ గారెలు బెల్లమండెఁగలు నౌఁగు ల్కమ్మచాఁపట్లు ...రామా. 2. 115.

**ఔఁబొమ్మ** – అవుఁబొమ్మ.

**ఔకాఁపు** – అవుకాఁపు. వి. అద్దెకాఁపురము. (శ. ర.)

**ఔకు** – అవుకు.

**ఔక్షకము** సం. వి. అ. న. ఉక్షముల (ఎద్దుల) సమూహము

**ఔక్షము** సం. విణ. (అ. ఈ. అ.) ఎద్దులసంబంధ మయినది.

**ఔగాములు** – అగు(వు)గాములు.

(సత్యాసత్యములు.)

(ప్రొత్తరంభమాట) క. అన నయ్యంగన నా కేమన నో రున్నయది మీర లనినంతయుఁ జెల్లున మీ కౌగాములు దెల్ప నుపాయం బొకటి గానఁబడు నందాఁకన్. కళా. 3. 180.

(సుఖదుఃఖములు)

వ. ఏకాంగుల నిరువదినలుగుర నిలిపి యా యందఱయౌగాములు విచారించుచుం దమ వారై యుండునట్లుగా యతి ముఖ్యుల నిద్దఱఁ బట్టంబుగట్టి....పరమ. 5. 341.

(యుక్తాయుక్తములు, మంచిచెడ్డలు.)

వ. నే నతనియతిదైన్యాతిభారంబు భావించి కారుణ్యపరవశత్వంబు నొందినదాననై తక్కిన యౌగాములు లెక్క సేయక. ప్రభా. 4. 2.

**ఔగ్ర్యము** సం. వి. అ. న. ఉగ్రత్వము, భయం కరత్వము, క్రూరత్వము.

**ఔఘళము** – అవఘళము, అవుఘళము.

వి. (అతిశయము, పెంపు.)

గీ. ఔర కరవాఁడి చూపుల యౌఘళంబు. పాండు. 1. 117.

**ఔచితి** సం. వి. ఈ. స్త్రీ. – ఔచిత్యము.

**ఔచిత్యము** సం. వి. అ. న. ఉచితత్వము. యుక్తత్వము.

**ఔజసము** సం. వి. అ. న. బంగారు. (వై. ని.)

**ఔజసికుఁడు** సం విణ. (అ ఈ. అ.) ఓజస్సుతోఁ బ్రవర్తిల్లువాఁడు, ఓజస్సుకలవాఁడు. (బల వంతుఁడు, శూరుఁడు, మొ.)

**ఔజస్యము** సం. వి. అ. న. ఓజస్సు.

**ఔజు**[1] – అవుజు[1]

**ఔజు**[2] – అవుజు[2].

**ఔజ్జ్వల్యము** సం. వి అ న ఉజ్జ్వలత్వము. తళతళ మనుజిగి.

**ఔడవము** సం. విణ. (అ. ఈ. అ.) ఉడువులకు (నక్షత్రములకు) సంబంధించినది. వి. అ. పుం. (సంగీ) అయిదుస్వరములు గలరాగము, ఓడ వము.

**ఔడు** – అవుడు. వి. (సం. ఓష్ఠః. శ. అవుడు)

పెదవి అధరము.

ఆ. అలిగి యోడు గఱచి యాఁకటి వెలుచన, నిలువలేక ... భార. ఆది. 6. 291.

శ్లో. త్రిశిఖాం భ్రుకుటిం కృత్వా, సందశ్య దశనచ్ఛదం. సం. భా. ఆది 177. 31.

గీ. తనబలము నేలపాలైనయునికిఁ జూచి, యలిగి యనరణ్యభూపాలుఁ డౌడుగఱచి. ఉ. రా. 3. 162.

2. దంతము, పల్లు.

సీ. ....అలరు దంతంబు వే రౌడనంగ అం. శే. 4~.

ద్వి. అదె గవాక్షుం డనునతఁ డాలమునకుఁ, ద్రిదశారి యౌడులు దీఁటుచున్నాఁడు. రం. రా. యు 380. పొ. 25. పం.

**ఔడుంబరము** సం — ఔదుంబరము.

**ఔడుపము** సం. విశే (అ. ఈ అ ) ఉడుపసంబంధ మయినది

**ఔడుపికుఁడు** సం విశే. (అ. ఈ. అ.) 1. ఉడుపముచేత దాఁటువాఁడు. 2 ఉడుపముమీఁద తీసికొనిపోవువాఁడు.

**ఔడ్రుఁడు** సం. వి అ. పుం 1. ఓడ్రదేశపువాఁడు. 2. ఓడ్రదేశపురాజు (ఔడ్ధ్రుఁడు. అని కొందఱు.)

**ఔత్కట్యము** సం. వి. అ న. ఉత్కటత్వము.

**ఔత్కృష్ట్యము** సం. వి. అ. న. ఉత్కృష్టత్వము.

**ఔత్తరపథికుఁడు** సం. విశే. (అ. ఈ. అ.) ఉత్తర పథమునఁబోవువాఁడు

**ఔత్తరము** సం. విశే. (అ. ఈ. అ.) 1. ఉత్తర దిక్కునను న్నది 2. తర్వాతిది. 3. తరింపఁ జేయునది.

**ఔత్తరాహుఁడు** సం. విశే. (అ. ఈ అ.) ఉత్తర కాలమునఁ గాని ఉత్తరదేశమునఁ గానియున్న వాఁడు.

**ఔత్తానపాది** సం. వి. అ. పుం - ఉత్తానపాదుని కొడుకు - ధ్రువుఁడు.

**ఔత్తానపాదుఁడు** సం. వి. అ. పుం.- ఔత్తానపాది.

శ్లో. ధ్రువస్యౌత్తానపాదస్య బ్రహ్మర్షీణాం తథై వచ. సం. భార. అను. 6. 15.

**ఔత్పత్తికము** సం. విశే. (అ. ఈ. అ.) 1. ఉత్పత్తిచేతఁగలిగినది, స్వభావమువలనఁగలిగినది. 2. నిత్యము. (శబ్దార్థసంబంధము, మొ )

**ఔత్పాతికము** సం. విశే. (అ. ఈ. అ.) ఉత్పాతమును గలిగించునది. అశుభమునుసూచించునది.

**ఔత్పాదము** సం. విశే. (అ. ఈ. అ.) ఉత్పాదమును (పుట్టుకను) గూర్చి చెప్పునది,

**ఔత్సంగికము** సం. విశే. (అ. ఈ. అ.) ఒడిలోఁ దీసికొనిపోవునది. ఒడిలోఁబెట్టికొని తీసికొని పోవునది.

**ఔత్సము** సం. విశే. (అ. ఈ. అ.) ఉత్సమునందు (సెలయేటను) పుట్టినది.

**ఔత్సర్గికము** సం. విశే. (అ. ఈ అ.) 1 సామాన్యవిధికి సంబంధించినది. 2. విడుచునది, త్యజించునది. 3. స్వాభావికము, సహజము. (విల్యమ్సు.)

**ఔత్సుక్యము** సం. వి. అ. న. 1. ప్రియస్మరణాదులచేతఁగాలవిలంబము నోర్వలేమి, ఉత్సుకత్వము ఉత్కంఠ. 2. తీవ్రేచ్ఛ.

**ఔదంచనము** సం. విశే. (అ. ఈ. అ.) ఉదంచనమునకు (మూఁకుడు మున్నగువానికి) సంబంధించినది

**ఔదకము** సం. విశే. (అ ఈ. అ.) ఉదకసంబంధ మయినది.

**ఔదనికుఁడు** సం. విశే. (అ. ఈ. అ.) వంటవాఁడు, సూపకారుఁడు,

**ఔదపానము** సం. విశే (అ. ఈ. అ.) 1. ఉదపానము (నూయి మొదలగువాని) నుండి వచ్చునది (పన్ను, మొ.) 2 ఉదపానసంబంధ మయినది.

**ఔదయికము** సం. విశే (అ. ఈ అ.) 1. ఉదయకాలమున నున్నది, ఉదయకాలమందైనది. 2. అభివృద్ధి ప్రయోజనముగాఁ గలది, అభివృద్ధికి హేతువయినది.

**ఔదరికుఁడు** సం. విశే. (అ. ఈ. అ.) పొట్టపోసి

కొనుటయే ప్రయోజనముగాఁ గలవాఁడు, తిండియందే యాసక్తి గలవాఁడు.

**ఔదల** – అవుదల వి. (ఔ+తల) తల; ముందల.

సీ. ఔదలఁజదలేటి లేఁదరఁగలు జాలుఁడగు చందమామ నుయ్యాలలూఁప. హరి. ఉ. 6. 34.

సీ. కలుకులై పెరిఁగిన కురులు వెంట్రుకలతోడ బట్టయౌదలఁ గావిపాగ యమర. నైష. 7. 93.

మ. తలవంపుల్ ఘటియించి తిందలకుఁ గాంతా యింక నీ కేల యౌదల వంపన్. ఉ. రా. 1. 191.

సీ. ఔదల ముందల యన శిరోగ్రము మీఱు... ఆం. భా. 2. 145.

సీ. పెంపారు బలునెమ్మిపించె మౌదలఁ బూని నీలా. 1. 81.

ఔదలఁదన్ను – తలఁదన్ను; అధఃకరించు, మించు.

మ. ... వా,రలడోలాచలనోచ్చలచ్చరణముల్ త్రైవిష్టపస్త్రీలనౌదలఁ దన్నం జనునట్లు మించె... కళా. 1. 54.

ఔదలమోపుడించు – కార్యభారమును దొలఁగించు. రామా. 6. 75.

**ఔదశ్వితము** నం. విశే. (అ. ఈ. అ.) మజ్జిగతోఁ జేయఁబడినది. (భక్ష్యాది.)

**ఔదశ్విత్కము** నం. – ఔదశ్వితము.

**ఔదస్థాముఁడు** నం. విశే. (అ. ఈ. అ.) ఉదకమందు నిలుచుండుటకు నలవాటుపడినవాఁడు.

**ఔదార్యము** నం. వి. అ. న. – ఉదారత్వము – 1. దాతృత్వము. 2. మహత్త్వము, గొప్పతనము. 3. (అలం) ఒకానొక కావ్యగుణము.

**ఔదాసీన్యము** నం. వి. అ. న. – ఉదాసీనత్వము – 1. ఉపేక్ష, తాటస్థ్యము. 2. రాగనివృత్తి, వైరాగ్యము.

**ఔదాస్యము** నం. – ఔదాసీన్యము.

**ఔదు** – అవుదు. వి. నీటికాలువ.

వ. వలిమించు క్రొమ్మించుటౌదు లీఁది యీఁది, మనుచ. 3. 28.

**ఔదుంబరము** నం. విశే. (అ. ఈ. అ.) ఉదుంబర సంబంధమయినది. (ఫలాది) వి. అ. న. 1. కుష్ఠభేదము. 2. రాగి.

**ఔద్గాత్రము** నం. వి. అ. న. ఉద్గాతృత్వము; ఉద్గాతయొక్క విహితకృత్యము.

**ఔద్దాలకము** నం. వి. అ. న. పుట్టతేనె.

**ఔద్ధతి** నం. వి. ఈ. స్త్రీ. – ఔద్ధత్యము.

**ఔద్ధత్యము** నం. వి. అ. న. ఉద్ధతి.

**ఔద్ధారికము** నం. విశే. (అ. ఈ. అ.) విభాగకాలమందు జ్యేష్ఠునకుఁ దక్కినవారుకులకంటెఁ గొంత యెక్కువగా పైతృకధనమునుండి యిచ్చు ద్రవ్యము, ఉద్ధారము. మను. 9. 150.

**ఔద్భిజ్జము** నం. విశే. (అ. ఈ. అ.) 1. ఉద్భిజ్జ సంబంధమయినది. 2. ఉద్భిదము. (తరుగుల్మాది.) వి. అ. న. పాంశులవణము, చౌటియుప్పు.

**ఔద్భిదము** నం. విశే. (అ. ఈ. అ.) 1. ఉద్భిద సంబంధమయినది. 2. భూమిని భేదించుకొని వచ్చునది. (తరుగుల్మాది.) వి. అ. న. 1. పాంశులవణము, చౌటియుప్పు. 2. ఊటనీరు, లోఁతునుండి భూమిని పెకల్చుకొని పెద్ద ధారగా వెడలివచ్చు జలము.

**ఔధసము** నం. విశే. (అ. ఈ. అ.) ఊధస్సునందలిది, పొదుఁగులోనిది. (పాలు.)

**ఔధస్యము** నం. వి. అ. న. – పొదుఁగునఁ బుట్టినది – ఊధస్యము, పాలు.

ఔనటే – అగునటే.

సీ. ఔనటే నై వేద్య మాయెనా యన నాయెననక పదార్థమ్ములునుచు నేర్పు. దశా. 6. 33.

**ఔనె(నే)** – అగునె.

గీ. అనిన విని సోమయాజి కోపాగ్రహమునఁ, దత్తఱించుచు వడి సోమిదమ్మఁ బలికె, నౌనె సత్పుత్రజనయిత్రి యౌనె సాధ్వి, యౌనె సూనృతభాషిణి యౌనె దేవి. కాశీ. 4. 106.

శా. ఔనే యోనిదురాత్మురాల ... దశా. 6. 88. (దీనికి ఆమ్రేడితరూపము-ఔనౌనే-నె)

శా. ఔనౌనే వెలయాల...దశా. 7. 1. 79.

**ఔనౌఁగదే** – ఔఁగదే. అవ్య. అపుర (ప్రశంసావాచకము.)

మ. అమరేంద్రాదులు మౌళికంపములతో నౌనౌఁగదే బాపురే, కమలాహా శరణంచు... భాగ. 8. 203.

**ఔన్నతి** సం. వి. ఈ. స్త్రీ. - ఔన్నత్యము.

**ఔన్నత్యము** సం. వి. అ. న. 1. ఉన్నతి, ఎత్తు. 2. గొప్పతనము.

**ఔపకర్ణికము** సం. విణ. (అ. ఈ. అ.) కర్ణములకు దాపున నున్నది. చెవులవఱకు వ్యాపించినది. (ఉదా: ఔపకర్ణికలోచనః – భట్టి.)

**ఔపకారిక** సం. - ఔపకార్య

**ఔపకారికము** సం. – ఔపకార్యము.

**ఔపకార్య** సం. వి. అ. స్త్రీ. 1 గుడారము, డేరా. 2. రాజగృహము.

**ఔపకార్యము** సం. విణ. (అ. ఈ అ.) 1. గుడారమునకు సంబంధించినది. 2. గుడారము నందలిది. 3. రాజగృహసంబంధమయినది. 4. రాజగృహమందున్నది.

**ఔపగ్రస్తికుఁడు** సం. వి. అ. పుం. 1. గ్రహణకాల సూర్యుఁడు. 2. గ్రహణకాలచంద్రుఁడు.

**ఔపగ్రహికుఁడు** సం. – ఔపగ్రస్తికుడు.

**ఔపచారికము** సం. విణ. (అ ఈ. అ.) 1. ఉపచారహేతుకమైనది. గౌణము. (వ్యతి. - ముఖ్యము.) 2. ఉపచారము ప్రయోజనము గాఁగలది.

**ఔపచ్ఛందసికము** సం. వి. అ. న. ఒకానొక మాత్రావృత్తము.

**ఔపదేశికము** సం. విణ. (అ. ఈ. అ.) 1. ఉపదేశముచేత ప్రాప్తమైనది. (ద్రవ్యము, మొ.)

**ఔపద్రష్ట్రిక్యము** సం. వి. అ. న. ఉపద్రష్టృత్వము.

**ఔపధర్మ్యము** సం. వి. అ. న. 1. అపకృష్టధర్మము. 2. కుత్సితసిద్ధాంతము, పాషండమతము.

**ఔపధికుఁడు** సం. విణ. (అ. ఈ. అ.) మోసకాఁడు, కపటముగలవాఁడు.

**ఔపధేయము** సం. విణ. (అ. ఈ అ.) ఉపధి (బండి కన్ను)గా నుపయోగింపఁబడునది. వి. అ. న. రథాంగము, చక్రము. (సిద్ధాంతకౌముది.)

**ఔపనాయనికము** సం. విణ. (అ. ఈ. అ) 1. ఉపనయనము ప్రయోజనముగాఁ గలది. 2. ఉపనయనమునకు యుక్తమయినది.

**ఔపనిధికము** సం. విణ. (అ. ఈ అ.) ఉపనిధి ప్రయోజనముగాఁ గలది. (భూషణాది.) వి. అ. న. ఉపనిధి, ఇల్లడ, న్యాసము.

**ఔపనిషత్కుఁడు** సం. విణ. (అ. ఈ. అ.) ఉపనిషద్ధర్మము నుపదేశించి జీవించువాఁడు

**ఔపనిషదము** సం. విణ. (అ. ఈ. అ.) 1. ఉపనిషత్తులయందలిది. 2. ఉపనిషత్తులచే బోధింపఁబడినది. (బ్రహ్మము) 3. ఉపనిషత్తులవలనఁ గలిగినది. 4. ఉపనిషత్సంబంధమయినది. 5. ఉపనిషద్వ్యాఖ్యాన మగునది. (గ్రంథము) 6. ఉపనిషత్తును తెలిసినది.

**ఔపపత్తికము** సం. విణ. (అ. ఈ. అ.) 1. ఉపపత్తి గలది యుక్తియుక్తము. 2. యుక్తము, తగినది.

**ఔపపాతికుఁడు** సం. విణ. (అ. ఈ. అ.) ఉపపాతకము చేసినవాఁడు.

**ఔపమ్యము** సం. వి. అ. న, ఉపమ, పోలిక.

**ఔపయికము** సం. విణ. (అ. ఈ. అ.) న్యాయముతోఁ గూడినది, యుక్తము. వి. అ. పుం, న. ఉపాయము.

**ఔపరాజికము** సం. విణ. (అ. ఈ. అ.) ఉపరాజునకు సంబంధించినది, రాజప్రతినిధికి సంబంధించినది.

**ఔపరిష్టము** సం. విణ. (అ. ఈ. అ.) మీఁద నున్నది, పైనున్నది.

**ఔపరోధికము** సం. విణ. (అ. ఈ. అ.) ఉపరోధము ప్రయోజనముగాఁ గలది, ఉపరోధనిమిత్తమైనది. వి. అ. పుం. పీలుదండము, గోఁగుకఱ్ఱ.

ఔపలము సం. విణ. (అ. ఈ. అ.) 1. ఱాతిది. 2. ఱాలనుండి వచ్చునది. (పన్ను, మొ.)

ఔపవస్తము సం. వి. అ. న. ఉపవాసము. వస్తు.

ఔపవస్త్రము సం. విణ. (అ. ఈ. అ.) ఉపవస్త్ర సంబంధమయినది. వి. అ. న. ఉపవస్త్రము.

ఔపవాస్యము సం. వి. అ. న. ఉపవాసము.

ఔపవాహ్యము సం. విణ. (అ. ఈ. అ) స్వారి చేయుటకుఁ దగినది. (గుఱ్ఱము బండి లోనగు నది) వి. అ. పుం. రాజెక్కెడి యేనుఁగు రథము, మొ.

ఔపవిభక్తికము సం. వి. అ. పుం. 1. (ఆంధ్ర వ్యాక.) ఉపవిభక్తి. ద్వితీయాద్యేకవచనములు పరమైనపుడు వచ్చెడు ఆగమాదేశరూప మైన 'ఇ, టి, తి' మొ. 2 ఉపవిభక్తులు చేర్పఁబడు ప్రాతిపదికము. (కాలు, నీరు, నేయి, మొ.)

ఔపశ్లేషికము సం. విణ. (అ. ఈ. అ.) 1. కౌఁగిలింతచేఁ గలిగినది. 2. ఏకదేశసంబంధము కలది. (ఆధారవిశేషము — చూ. అందు').

ఔపసర్గికము సం. విణ. (అ. ఈ. అ.) అరిష్ట సూచకమైనది. (గ్రహదోషాది) వి. అ. పుం. సన్నిపాతరోగవిశేషము.

ఔపస్థానికుఁడు సం. విణ. (అ. ఈ అ.) సేవచేసి జీవించువాఁడు.

ఔపస్థానుఁడు సం. విణ. (అ. ఈ. అ.) - ఉపస్థాన శీలుఁడు — 1. ఉపాసకుఁడు. 2. సేవకుఁడు.

ఔపస్థికి సం. వి. ఈ. స్త్రీ. వ్యభిచారవృత్తిచే జీవించుస్త్రీ.

ఔపస్థ్యము సం. వి. అ. న. ఉపస్థవ్యాపారము, సురతము; సురతసుఖము.

ఔపహారికము సం. విణ. (అ. ఈ. అ.) ఉపహారార్థమైనది. (ద్రవ్యము.)

ఔపాధికము సం. విణ. (అ. ఈ. అ.) ఉపాధికృతమైనది, ఉపాధివలనఁ గలిగినది.

ఔపాధ్యాయకము సం విణ. (అ. యికా. అ.) ఉపాధ్యాయునివలన లభించినది.

ఔపానహ్యము సం. విణ. (అ. అ. అ.) చెప్పులు చేయుట కుపయోగించునది. (తోలు, మొ.)

ఔపాసనము సం. విణ. (అ. ఈ. అ.) 1. గృహ్యాగ్నికి సంబంధించినది. 2. ఉపాసనకు సంబంధించినది. వి. అ. పుం. గృహ్యాగ్నియందు ప్రాతస్సాయంకాలములలో చేయుహోమము.

ఔబలము — అవుబలము. వి. మల్లక్రియావిశేషము. సీ. దండ పైదప్పనఁ దప్పు గ్రేళ్లుఱికినఁ దల చుంచుఁగొన్న నౌబలముగొన్న. ద్వా. 7. 60. (ప్రాఁతప్రతి.)

ఔమకము సం. విణ. (అ. మికా. అ.) ఉమావికారమైనది, అగిసెచెట్టువలనఁ గలిగినది. (నార, మొ.)

ఔమము సం. విణ. (అ. ఈ. అ.) 1 - ఔమకము. 2 ఉమకుసంబంధించినది.

ఔమీనము సం. విణ. (అ. అ. అ.) ఉమలు (అగిసెలు) పండునది (పొలము)

ఔర(రా) - అవ్యం.

(ప్రశంసను దెలుపును.)

గీ. కటకపురిఁ గాల్చె గజరాజు కలఁగి పాఱఁ, ద్రోఁకచి చ్చన నౌర నీదురవగాహ ఖేలదుగ్రప్రతాపాగ్ని కృష్ణరాయ అము. 1. 86.

(ఆశ్చర్యమును దెలుపును.)

గీ. గౌరి యందుఁ గుమారుని గనియె సోముఁ, డౌర యచ్చెరు వని జనులనఁగ ... దశా. 1. 25.

శా. ....ఔరా యెంత సౌఖ్యప్రదం, బై కన్పట్టిన దీర్ఘలంబు...ఉ. రా. 4. 166.

ఆమ్రేడితమున - ఔరౌర(రా)

శా. .. ఔ, రౌరా మైసిరి...శశాం. 3. 28.

ఉ. ... ఔ, రౌర విచిత్రమైనపురుగన్బెనటంచుఁ దెలంగుచున్నెడన్. ఉ. రా. 5 . 218.

ఔరగము సం. విణ. (అ. ఈ. అ.) ఉరగసంబంధమయినది, పాముది. వి. అ. న. - ఉరగదేవతాకము — అశ్లేషానక్షత్రము.

**ఔరభ్రకము** నం. వి. అ. న. ఉరభ్రసమూహము, గొఱ్ఱెలమంద.

**ఔరభ్రము** నం. విశే. (అ. ఈ. అ.) ఉరభ్రసంబంధమయినది, గొఱ్ఱెది. నం. వి. అ. న. గొఱ్ఱె మాంసము పుం. న. ఉన్నివస్త్రము, కంబళి.

**ఔరభ్రికుఁడు** నం. విశే. (అ. ఈ అ.) ఉరభ్రముల (గొఱ్ఱెల) వలన బ్రదుకువాఁడు.

**ఔరసము** నం. విశే. (అ. ఈ. అ.) 1. ఉరస్సునఁ బుట్టినది. 2. ఉరస్సంబంధమయినది.

**ఔరసి** నం. వి. ఈ. స్త్రీ. ధర్మపత్నియందుఁ బుట్టిన కూఁతురు.

**ఔరసికము** నం. విశే. (అ. ఈ. అ.) - ఉరస్సువంటిది - ముఖ్యము.

**ఔరసుఁడు** నం. వి. అ. పుం. ధర్మపత్నియందుఁ బుట్టినకొడుకు.

**ఔరస్యము** నం. విశే. (అ. ఆ. అ.) ఉరస్సునందుఁ బుట్టినది. (అక్షరము)

శ్లో. హకారం పంచమైర్యుక్తమంతస్థాభిశ్చ సంయుతం, ఔరస్యం తం విజానీయాత్ కంఠ్యమాహురసంయుతమ్ శిక్షా. 16.

**ఔరస్యుఁడు** నం. - ఔరసుఁడు.

**ఔరు** - అవురు.

ఉ. హాళికు లెన్నఁడుం దెగనియారులచేలును జౌకుమళ్లునుం,గా లలినేరుసాగిరి... ఆము. 4. 124.

**ఔరుసౌ(అవు)రు** - అవురుసవురు.

చ. ...చీఁకటి యౌరుసౌరుగాఁ, గుముదము నిద్రవోఁ బొడువుఁగొండపయిఁ దవి యొప్పె...కాశీ. 1. 125.

**ఔరుసౌ(సవు)రుపడు** - అవురుసవురుపడు. అ. క్రి. ఊగించు, వశించు.

సీ. ధర్మశాస్త్రాభ్యాసకాత్పర్యమున నైన సంస్కార మెల్లౌరుసౌరుపడియె. శివరా. 2. 109.

**ఔర్జిత్యము** నం. వి. అ. న. ఊర్జితత్వము.

**ఔరకము** నం. విశే. (అ. క్లీ. అ.) - ఔర్ణము.

**ఔర్ణము** నం. విశే. (అ. ఈ. అ.) ఊర్ణామయము, ఉన్నిది (కంబళాది).

**ఔర్ధ్వకాలికము** నం. విశే. (అ. ఈ. అ.) ఊర్ధ్వకాలమందలిది, తరువాతికాలపుది.

**ఔర్ధ్వదేహము** నం. విశే. (అ. ఈ. అ.) ఊర్ధ్వదేహమునకు సంబంధించినది. (కర్మము.)

**ఔర్ధ్వదేహికము** నం. విశే. (అ. ఈ. అ.) ఊర్ధ్వదేహప్రాపకమయినది, మరణానంతరము చేయఁబడునది. (కర్మము. మొ) వి. అ. న. ఉత్తరక్రియ.

**ఔర్ధ్వదైహికము** నం. - ఔర్ధ్వదేహికము.

**ఔర్వము** నం. విశే. (అ. ఈ. అ.) 1. ఔర్వునికి సంబంధించినది. 2. ఉర్వికి సంబంధించినది. వి. అ. పుం. బడబాగ్ని. న. పాంశులవణము.

**ఔర్వరము** నం. విశే. (అ. ఈ. అ.) ఉర్వరకు (భూమికి) సంబంధించినది.

**ఔర్వవ్రతి** నం. వి. న్. పుం. జలాహారనియమము గలవాఁడు. (వై. ని.)

**ఔర్వశము** నం. విశే. (అ. ఈ. అ.) ఊర్వశీసంబంధమయినది.

**ఔర్వశేయుఁడు** నం. వి. అ. పుం. - ఊర్వశీ పుత్రుఁడు-1. అగస్త్యుఁడు. 2. ఆయువు. (పురూరవుని కొడుకు.)

**ఔర్వుఁడు** నం. వి. అ. పుం. భృగువంశీయుఁ డగు నొకానొకమహర్షి. (ఇతని క్రోధమునుండి పుట్టిన అగ్నియే బడబాగ్ని)

**ఔల** - అవుల.

వి. (అవతలిప్రదేశము.)

ద్వి. సారథి రథ మౌలఁ జనఁ దోల నదియు, దారుణధ్వనితోడ ధరఁ గ్రుంగఁబడియె. రం. రా. యు. 452. పొ. 29. సం.

(వరుసయందు అనంతరము.)

గీ. కలరు స్వాధీనపతికయు ఖండితయును, ప్రోషిత ప్రియయును విరహోత్కంఠికయు,

నౌల నభిసారికయుఁ గలహాంతరితయు, సంప్రవాసిని వాసకసజ్జికయును. కావ్యా. 8. 56.

**ఔలూకము** సం. విశే. (అ. ఈ. అ.) ఉలూకసంబంధమయినది. వి. అ. న. ఉలూకముల (గ్రుడ్లగూబల) గుంపు.

**ఔలూక్యుఁడు** సం. వి. అ. పుం. కణాదుఁడు. (ఉలూకుని కొడుకు, వైశేషికదర్శనస్థాపకుఁడు.)

**ఔలూఖలము** సం. విశే. (అ. ఈ. అ.) 1. ఉలూఖలసంబంధమైనది. 2. ఱోటదంపఁబడినది. 3. ఱోటనున్నది.

**ఔల్బణ్యము** సం. వి. అ. న. ఉల్బణత్వము.

**ఔశనము** సం. వి. అ. న. ఉశనసునిచే దృష్టమగు సామము.

**ఔశనసము** సం. విశే. (అ. ఈ. అ.) 1. ఉశనసునకు సంబంధించినది. 2. ఉశనసునివలనఁ గలిగినది. 3. ఉశనసునిచే రచింపఁబడినది. వి. అ. న. 1. ఉశనసునిచే రచింపఁబడిన రాజనీతిశాస్త్రము. 2. ఉశనసునిచే రచితమగు నొకయుప పురాణము. (ఉశనసుఁడు—శుక్రుఁడు) 3. ఉశనసునిచే దృష్టమగు సామము, ఔశనము.

**ఔశీనరుఁడు** సం. వి. అ. పుం —ఉశీనరుని కొడుకు— శిబిచక్రవర్తి.

**ఔశీరము** సం. విశే. (అ. ఈ. అ.) 1. ఉశీరమునకు సంబంధించినది. 2. ఉశీరమువలనఁ బుట్టినది. వి. అ. న. – ఉశీరము (వట్టివేరు)తోఁ జేయఁబడినది. — 1. శయ్య. 2. పీఠము. 3. లేపనద్రవ్యము. 4. చామరము. 5. దండము, కఱ్ఱ.

**ఔషణము** సం. వి. అ. న. 1. కటురసము, కారము. 2 – ఊషణము.

**ఔషణశౌండి** సం. వి. ఈ. స్త్రీ. సొంటి.

**ఔషధము** స్త్రీ. సం. విశే. (అ. ఈ. అ.) ఓషధి సంబంధమయినది, ఓషధులవలనఁ గలుగునది. (అన్నాది) వి. అ. న 1. ఓషధి. 2. ఓషధుల సమూహము. 3. మందు.

**ఔషధీయము** సం. విశే. (అ. అ. అ.) ఔషధసంబంధమయినది.

**ఔషరకము** సం. వి. అ. న. చౌటియుప్పు.

**ఔషరము** సం. విశే. (అ. ఈ. అ.) చౌటినేలకు సంబంధించినది. వి. అ. న. 1. చౌటియుప్పు. 2. అయస్కాంతభేదము, ఒకజాతి సూదంటుఱాయి.

**ఔషసము** సం. విశే. (అ. ఈ. అ.) ఉషస్సునకు సంబంధించినది; ఉషస్సునందలిది.

శ్లో. ఔషసాతపభయాత్. సం. కిరా. 9 11.

**ఔషసి** సం. వి. ఈ. స్త్రీ. వేకువ, ప్రభాతము. (విల్యమ్సు.)

**ఔషసికము** సం. విశే. (అ. ఈ. అ.) ఉషస్సునందుఁ బుట్టినది.

**ఔషసికుఁడు** సం. విశే. (అ. ఈ. అ.) ఉషస్సున (ప్రభాతమున) తిరుగువాఁడు.

**ఔషికము** సం. – ఔషసికము. (విల్యమ్సు)

**ఔషికుఁడు** సం. – ఔషసికుఁడు. (విల్యమ్సు)

**ఔష్ట్రికము** సం. విశే. (అ. ఈ. అ.) ఉష్ట్రముల నుండి కలుగునది. (పాలు, మొ) వి. అ. న. ఉష్ట్రములసమూహము, ఒంటెలగుంపు.

**ఔష్ట్రము** సం. విశే. (అ. ఈ. అ.) 1. ఉష్ట్రమునకు సంబంధించినది. 2. ఉష్ట్రములు మిక్కిలి గాఁగలది. (దేశము.) వి. అ. న. ఒంటెపాలు.

**ఔష్ణము** సం. విశే. (అ. ఈ. అ.) 1. ఉష్ణసంబంధమయినది. 2. ఉష్ణము, వేఁడిది. వి. అ. న. ఉష్ణత, వేఁడిమి.

**ఔష్ణ్యము** సం. వి. అ. న. ఉష్ణత, వేడిమి,

**ఔష్మ్యము** సం. వి. అ. న. తాపము, వేడిమి.

**ఔసు** - అవుసు. వి. 1. సొగసు. 2. ఒయ్యారము.

ఱ: ఔసుకాఁడు,

**ఔ(అవు)సుకాఁడు** విశే. (√ఔసు) 1. సొగసుకాఁడు.

సీ. .... ఎమ్మెకాఁ డౌసుకాఁ డవ సొగసైన వాఁడు. పాం. ని. మూవ. 8.

2. విలాసవంతుఁడు.

శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటువు

ప్రథమసంపుటము

సంపూర్ణము.

—o—

